# జనత పిక్చర్సు

గాంధీనగర్, : : విజయవా



అందజేయు మరొక మహత్తర సాంఘిక చిత్రం

# పరివర్తన



విడుదలకు సిద్ధముగానున్న చిత్రాలు :

ఆంధ్రుల అభిమాన చిత్రంగా పేరొంది రష్యా ప్రభుత్వం
ప్రదర్శనకు ఎన్నుకోబడ్డ చిత్రం

## పల్లెటూరు



చక్కటి సాంఘిక చిత్రం

## పుట్టిల్లు



సూర్యకుమారి నటించిన

## మరదలు పెళ్ళి



వివరాలకు సంప్రదించండి

# ఆంధ్రదర్శిని



సంపాదకవర్గం:

యస్. వి. నరసయ్య

కె. యస్. రెడ్డి

జి. రాధాకృష్ణమూర్తి

ఎ. కె. ఆర్. బి. కోటేశ్వరరావు

రాలు





విశాలాంధ్ర ప్రచురణాలయం,

కింగ్‌హాంపేట పోస్టు, :: విజయవాడ.

# ప రి చ య ం



"ఆంధ్ర దర్శిని" ని తెలుగు ప్రజలకు అందజేయగలిగినందుకు సంతోషిస్తున్నాం.

భాషా రాష్ట్రం కావాలన్న ఆంధ్రుల చిరకాలవాంఛ ఈడేరింది. విశాలాంధ్ర నినాదంకూడా క్రమంగా ఊపునందుకొంటోంది. ఈ పరిస్థితుల్లో ఆంధ్ర దేశాన్ని గూర్చిన సమగ్ర సమాచారం వీరికూర్చి ఆంధ్ర ప్రజల కందించటం తన కర్తవ్యంగా ఎంచి "ఆంధ్ర దర్శిని" ప్రచురణకు విశాలాంధ్ర ప్రచురణాలయం పూనుకొన్నది.

దీనికి కావలసిన సమాచార సేకరణలో సంపాదకులు ఎన్నో పరిమితులకు లోబడి పని చేయవలసి వచ్చింది.

నిన్నటివరకూ ఉమ్మడి రాష్ట్రంలో ఉండటంచేత, ఆంధ్ర రాష్ట్రం గూర్చిన అనేక విషయాలు ప్రత్యేకంగా లభించే అవకాశం లేదనేది అందరూ ఎరిగినదే. దొరికినంతవరకైనా, కలగాపులగంగానూ, అస్పష్టంగాను ఉన్నాయి.

కొన్ని విషయాలకు సంబంధించిన సమాచారంగాని, వివరాలు గాని లభించలేదు. ఉదాహరణకు ఆంధ్రలో వ్యాపారం చేస్తున్న ఆంధ్రేతర బ్యాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, అవి మన రాష్ట్రంలో చేస్తున్న వ్యాపారం వివరాలు లభించలేదు.

ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలకు సంబంధించిన వివరాలు లభించలేదు. అందుచేత అనంతపురం, కర్నూలు జిల్లాల క్రింద ఇవ్వబడిన వివరాలలో, పై తాలూకాల వివరాలు కలసిలేవు. తగునన్నచోట్లమాత్రం, ఆంధ్ర రాష్ట్రావతరణకు పూర్వమున్న బళ్లారి జిల్లా అంచనాలలో మూడవ వంతు, ఈ మూడు తాలూకాల స్థాల

మైన అంచనాలుగా స్వీకరించబడ్డాయి. ఇట్టి అంచనాలు వాస్తవానికి దగ్గరగా ఉంటాయని అనుకున్న చోట్లనే ఈ పద్ధతి అవలంభించబడింది.

ప్రభుత్వ ప్రచురణలు, వివిధ సంస్థలు ప్రచురించిన అనేక గ్రంథాలు, మా విజ్ఞప్తి ననుసరించి వివిధ సంస్థలు తమ కార్యకలాపాలనుగూర్చి పంపిన వివరాలు, "ఆంధ్ర దర్శిని" లో ఇవ్వబడిన వివరాలకు ఆధారాలు. ఇవి అత్యావసరం మనుకొన్న చోట్ల మాత్రమే ఉదహరించబడ్డాయి.

తెలంగాణాకు సంబంధించిన సమాచారం కొద్దిగానే ఇవ్వబడింది. గ్రంథ విస్తరణభీతి, కాలపరిమితులే ఇందుకు కారణం. ఈ భాగాన్ని వ్రాసి పంపిన మిత్రులు శ్రీ ఎస్. వి. కె. ప్రసాద్, శ్రీ అనంతరెడ్డి గార్లకు మా కృతజ్ఞత.

ఇతర వ్యాసాలు పంపిన రచయితలకు, ఆంధ్రదేశ పటాన్ని వ్రాసి ఇచ్చిన శ్రీ కృష్ణమూర్తిగారికి మా అభినందనాలు.

విషయ సేకరణలోను, పుస్తక ప్రచురణలోను అనేక విధాల సాయపడిన పెద్దలకు, మిత్రులకు, "ఆంధ్ర దర్శిని" ని ముద్రించి ఇచ్చిన సాహిణి ప్రెస్‌వారికి మా అభినందనాలు.

"ఆంధ్ర దర్శిని" ని పాఠకులు సానుభూతితో పరిశీలించి, ఆదరించి, భవిష్యత్తులో ఇట్టి ప్రయత్నాలకు మమ్ము ప్రోత్సహిస్తారని ఆశిస్తాం.

విజయవాడ,
25–4–1954.

ఇట్లు,
విశాలాంధ్ర ప్రచురణాలయం.



# అభినందనలు



మానవ మేధస్సును వృద్ధిపొందించి, ఉన్నతాశయాలను పురికొల్పి, కార్యోన్ముఖులుగా చేయగలదే ఉత్తమ సాహిత్యం. తేటపదాల్లో, సూటిగా సత్యాన్ని చెప్పి మానవ కళ్యాణానికి బాటలు చూపడమే దాని పరమావధి.

మా "పీపుల్సు పబ్లిషింగ్ హౌస్" స్థాపించబడిన నాటి నుండీ యీ సాహిత్యాన్ని పాఠకలోకానికందిస్తూ వచ్చింది. మనదేశం, మన ప్రజలు, మన సమస్యలు వగైరాల్లో వాస్తవాన్ని పుస్తకాలద్వారా మీ కందిస్తూ వచ్చింది; ముందుకు మార్గాన్ని చూపింది. కళలు, సారస్వతం, విజ్ఞాన, తత్వశాస్త్రాలు మొదలగు విషయాలపై పుస్తకాలు ప్రచురించింది. రష్యా, చైనా, తదితర ప్రజాతంత్ర దేశాలలో జరుగుతున్న అభ్యున్నతిగురించి నిరంతరం తెలియజేస్తూ వచ్చింది.

మన దేశంలో అభ్యుదయ సాహిత్యానికి సేవచేస్తున్న ఒకే ఒక పెద్ద సంస్థ మాదేనని తెలియ జేయడానికి గర్వపడు తున్నాం.

ఈ కృషిలో మాకు నిరంతరం సహకారాన్ని యిచ్చి, ప్రోత్సహించిన మీకు అభినందనా లందజేస్తున్నాము. ఇకముందు కూడా మీ సహకారంతో మా యీ ఉత్తమ కృషిని కొనసాగించగలమని తెలియజేయడానికి సంతసిస్తున్నాము.

పీపుల్సు పబ్లిషింగ్ హౌస్,

190-B ఖేత్వాడీ మెయిన్‌రోడ్, బొంబాయి - 4.

# విషయ సూచిక

★

# ప్రకటనల సూచిక



# సవరణలు

| పేజీ నంబరు | కాలం నంబరు | పేరా నెం. | లైను నంబరు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 32 | 2 | | 5 | 16 వ శతాబ్ది ఆఖరున యోగి వేమన ఉద్భవించాడు | 18 వ శతాబ్దంలో ఉద్భవించాడు |
| 34 | 2 | | | 1480 యోగివేమన నిర్యాణం | సుమారు 1750 ప్రాంతంలో నిర్యాణం |
| 175 | 1 | | 1 | ముఠాదారుల హక్కులు సముచిత మవటంవల్ల | ముఠాదారుల హక్కులు సంకుచిత మవటంవల్ల |
| 377 | "రోడ్లు" పేరాలో | | | ఆంధ్రలో రోడ్ల పొడవు 60 % | ఆంధ్రరోడ్ల పొడవు 6% |
| 523 | 2 | | | ఉప్పుటేరును అభివృద్ధిచేస్తే మరొక | ఉప్పుటేరును అభివృద్ధిచేస్తే |
| 524 | 2 | | | తుంగభద్ర హై లెవెల్ కాలువను...160 అడుగుల ఎత్తున డాము నిర్మించితే | దీనిని వదలివేసి "తుంగభద్ర హైలెవెలు కాలువను ప్రవ్వితే" అని చేర్చుకోవాలి. |
| 525 | 1 | | | ఇందులో చాలభాగం... సాగు కాగలదు. | దీనిని వదలివేసి "గండికోట రిజర్వాయరుకు కడప-కర్నూలు కాలువగాని, సిద్ధేశ్వరం ప్రాజెక్టు కాలువగాని నీటిని సప్లయి చేయగలదు" అని చదువుకోవాలి. |
| 435 | 1 | | 3,4,5,6 | "ఒకరకం రంగు మొదలైనవి కప్పలాంటి ... రెండో రకం...పోలి ఉంటుంది." | "ఒకరకం యాంఫిబోలు అనే ఖనిజం జాతికి చెందినది; రెండోది సర్పెంటీను జాతికి చెందినది". |
| ,, | 1 | | 8 | "పాము చర్మాన్ని పోలిన" | ఈ భాగాన్ని వదలివేసి చదువుకోవాలి. |
| ,, | 1 | | 12 | "సర్పాకృతిలో" | ,, |

| పేజీ నంబరు | కాలం నంబరు | పేరా నెం. | లైను నంబరు | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 435 | 2 | | 14,15,16 | "స్తైదాన ... పారలుగాను" | "భూమిలోని నిగూఢ శక్తుల ప్రభావంచే ఉద్భవించు పగుళ్ళతో పొరలుగాను" |
| 437 | | | | బ్రాకెట్టుక్రింద 2వ పేరాలో "లోహం" అన్నచోట్ల | "ఖనిజం" అనిచదువుకోవాలి. |
| ,, | 2 | 2 | | బెరైల్ | బెరిల్ |
| 438 | 1 | 2 | | డా॥ ఎం. ఎస్. కృష్ణా | డా॥ ఎం. ఎస్. కృష్ణన్ |
| 439 | 1 | 1 | | గనులు | రాళ్లు |
| 439 | | | | రాగిక్రింద డా॥ యం. యస్. కృష్ణా బదులు | డా॥ యం. యస్. కృష్ణన్ అని ఉండాలి. |
| ,, | 1 | 3 | 15, 16 | గోగులవద్ద ; పల్లి | గోగులపల్లి వద్ద |
| ,, | 2 | 4 | 8 | కృష్ణా డెల్టా | కృష్ణానదీ లోయ |
| 440 | 1 | 3 | 2 | సల్ఫేట్లే | సిలికేట్లే |
| ,, | 1 గార్నెట్ క్రింద | | 1 | మిశ్రమ లోహం | దీనిని వదలివేయాలి. |
| 441 | ఇనుము క్రింద | | 4 | చావలి | చాబలి |
| ,, | కైనైట్, సిలిమనైట్ క్రింద | | | చాలా గట్టివి | ఎక్కువ ఉష్ణోగ్రత సహించ గలవు |
| 442 | సీసము-వెండి క్రింద | | 2 | గలీనా | గెలీనా |
| 443 | 1 | ఆఖరి పేరా | 1 | డెల్టాలో | నదీ లోయలో |
| ,, | 2 | | 1 | పెంకు | గుల్ల |
| 444 | 1 | 2 | 8 | గారవిడి | గరివిడి |
| ,, | 1 | 3 | 2 | ,, | ,, |
| ,, | 2 | 2 | 7 | అల్కాలీల | అల్కాలీలు |
| ,, | 2 | 2 | 8 | అల్కాలీమట్టి | వదలివేసి చదువుకోవాలి |
| 445 | 1 | ఆఖరిమాట | | సిద్ధాత్రం | సిద్ధాట్ |
| 446 | 2 | స్టియటైటు-టాల్కు-క్రింద | 7 | జులేకలువ | జూలెకాలువ |
| ,, | 2 | ,, | 14 | గంగధార, నల్లూరు | గంగాధర నల్లూరు |

# క్యాలెండరు — 1954

| | జనవరి | | | | | ఫిబ్రవరి | | | | | మార్చి | | | | | ఏప్రిల్ | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదివారము | 31 | 3 | 10 | 17 | 24 | ... | 7 | 14 | 21 | 28 | ... | 7 | 14 | 21 | 28 | ... | 4 | 11 | 18 | 25 |
| సోమవారము | ... | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | ... | 1 | 8 | 15 | 22 | 29 | ... | 5 | 12 | 19 | 26 |
| మంగళవారము | ... | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | ... | 2 | 9 | 16 | 23 | 30 | ... | 6 | 13 | 20 | 27 |
| బుధవారము | ... | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | ... | 3 | 10 | 17 | 24 | 31 | ... | 7 | 14 | 21 | 28 |
| గురువారము | ... | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | ... | 4 | 11 | 18 | 25 | ... | 1 | 8 | 15 | 22 | 29 |
| శుక్రవారము | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | ... | 5 | 12 | 19 | 26 | ... | 2 | 9 | 16 | 23 | 30 |
| శనివారము | 2 | 9 | 16 | 23 | 30 | 6 | 13 | 20 | 27 | ... | 6 | 13 | 20 | 27 | ... | 3 | 10 | 17 | 24 | ... |

| | మే | | | | | జూన్ | | | | | జులై | | | | | ఆగస్టు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదివారము | 30 | 2 | 9 | 16 | 23 | ... | 6 | 13 | 20 | 27 | ... | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | 29 |
| సోమవారము | 31 | 3 | 10 | 17 | 24 | ... | 7 | 14 | 21 | 28 | ... | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | 30 |
| మంగళవారము | ... | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | 29 | ... | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | 31 |
| బుధవారము | ... | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | 30 | ... | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | ... |
| గురువారము | ... | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | ... | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | ... |
| శుక్రవారము | ... | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | ... | 2 | 9 | 16 | 23 | 30 | 6 | 13 | 20 | 27 | ... |
| శనివారము | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | ... | 3 | 10 | 17 | 24 | 31 | 7 | 14 | 21 | 28 | ... |

| | సెప్టెంబరు | | | | | అక్టోబరు | | | | | నవంబరు | | | | | డిశంబరు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదివారము | ... | 5 | 12 | 19 | 26 | 31 | 3 | 10 | 17 | 24 | ... | 7 | 14 | 21 | 28 | ... | 5 | 12 | 19 | 26 |
| సోమవారము | ... | 6 | 13 | 20 | 27 | ... | 4 | 11 | 18 | 25 | 1 | 8 | 15 | 22 | 29 | ... | 6 | 13 | 20 | 27 |
| మంగళవారము | ... | 7 | 14 | 21 | 28 | ... | 5 | 12 | 19 | 26 | 2 | 9 | 16 | 23 | 30 | ... | 7 | 14 | 21 | 28 |
| బుధవారము | 1 | 8 | 15 | 22 | 29 | ... | 6 | 13 | 20 | 27 | 3 | 10 | 17 | 24 | ... | 1 | 8 | 15 | 22 | 29 |
| గురువారము | 2 | 9 | 16 | 23 | 30 | ... | 7 | 14 | 21 | 28 | 4 | 11 | 18 | 25 | ... | 2 | 9 | 16 | 23 | 30 |
| శుక్రవారము | 3 | 10 | 17 | 24 | ... | 1 | 8 | 15 | 22 | 29 | 5 | 12 | 19 | 26 | ... | 3 | 10 | 17 | 24 | 31 |
| శనివారము | 4 | 11 | 18 | 25 | ... | 2 | 9 | 16 | 23 | 30 | 6 | 13 | 20 | 27 | ... | 4 | 11 | 18 | 25 | ... |

ప్రాచీనకాలం నుండి క్రీ. పూ. 300 వరకు వివిధ తెగలు, వివిధ దశలలో ఈ ప్రాంతములో జీవించి ఉండేవని స్థూలంగా చెప్పవచ్చు. అయితే స్పష్టమైన చరిత్ర రచన కవసరమైన సామగ్రి మాత్రం లేదు.

## వివిధ తెగల పరిణామక్రమం

ఉత్తర హిందూస్థానంనుంచి వచ్చిన ఆంధ్రులు, ప్రాచీనులైన నాగ, యక్ష తెగలతో కలిసిపోవటం ప్రారంభించారు. బృహత్కథను రచించిన గుణాఢ్యుడు, నాగజాతికి చెందిన తండ్రికీ, ఆంధ్రులలోని బ్రాహ్మణకన్యకూ ఉద్భవించినవాడు. వివిధ తెగలు సమ్మిశ్రణముపొంది నూతనజాతి ఏర్పడటం ప్రారంభమయింది.

ఇంతేకాదు. పైఠాన్ దక్షిణ మహారాష్ట్ర ప్రాంతాలు పీఠభూములు. దిన దినాభివృద్ధి చెందే జనసంఖ్యకు తగిన ఆహార పదార్థాలు అక్కడ లభించవేవు. పత్తిపంట నాటి ప్రధాన పంటగా ఉండేది. ఆహారపదార్థాల కొరతవల్ల, ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళటం తరచు జరిగేది. రాజులతోపాటు దండు వెళ్ళిన సైనికులు సారవంతమైన నూతన ప్రాంతాలలో స్థిరపడిపోయేవారు. ఒక్కొక్కప్పుడు కుటుంబాలతో సహా, వలసవెళ్ళటం జరిగేది.

వలస వెళ్ళినవారు, సైనికులుగా వెళ్ళినవారు తిరిగిరావటం అరుదుగా ఉండేది. తండ్రులు, భర్తలు, పుత్రులు సంవత్సరాల తరబడి దూరప్రాంతాల్లో ఉండటం, తత్ఫలితంగా కుటుంబ జీవితంలో గలిగే ఒడుదుడుకుల వర్ణనలు, శాలివాహన గాథా సప్తశతినిండా విస్తారంగా ఉన్నవి.

## 'ఆంధ్రపథ' శబ్ద ప్రయోగం

ఈ పరిణామ క్రమంలో దక్షిణ మహారాష్ట్ర ప్రాంతంలోని ఆంధ్రులు, కృష్ణా గోదావరి తీరాలవెంబడి నడిచి నేటిఆంధ్ర దేశాన్నంతా ఆక్రమించారు. ప్రాచీనులైన నాగ, యక్షతెగలతో సంపూర్ణంగా లీనమైనారు. నేటి తెలంగాణా, సర్కారులు, రాయలసీమ ప్రాంతాలలో వీరు స్థిరపడ్డారు. మహాభారతయుద్ధంతో ప్రారంభమైన ఈ వలస, శాతవాహన రాజుల కాలముతో అంతమైంది. వివిధ తెగల సమ్మేళన ఫలితంగా ఏర్పడిన ఆంధ్ర ప్రజ ఒక సుస్థిర ప్రాంతంలో నివసించసాగారు. క్రీ. శ. 250 నాటి పల్లవ శాసనంలో మొట్టమొదటి సారిగా 'ఆంధ్ర పథము' అనుమాట వ్యవహరించబడ్డది.

ఒకే ప్రాంతంలో సుస్థిరంగా నివసించనారంభించిన ప్రజలే, క్రమంగా ఒక జాతిగా ఏర్పడగలిగారు. ఆంధ్రుల ఈ జాతీయతకు పరిణామం శాతవాహన రాజుల కాలంలో జరిగింది.

ఈ పరిణామానికి సహాయపడ్డ బలవత్తర కారణం మరొకటి వుంది. మహాభారత యుద్ధకాలంనుండీ, బుద్ధుని కాలం వరకు (క్రీ॥ పూ॥ 1500–550 వరకు) బానిస సమాజం విచ్ఛిన్నం కాసాగింది. బానిస రాజులమధ్య అంతఃకలహాలు, నాగజాతి ప్రజలతిరుగుబాట్లు, బ్రాహ్మణ నిరంకుశత్వంపై దండెత్తి, సమానత్వ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన బౌద్ధమతం—ఇవన్నీకూడా ఈ పరిణామానికి సహాయపడ్డవి. చంద్రగుప్తమౌర్యుని కాలానికి (క్రీ॥పూ॥ 300) 'వ్యవసాయంలో బానిస విధానం ఉండకూడదు' అనే నిషేధం ఏర్పడ్డది. కౌటిల్యుని అర్థశాస్త్రంలో

జాతివారు తెలుగుభాషను మాట్లాడేవారు. తమిళభాషవలెనే, తెలుగుకూడా ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాష. ప్రత్యేకమైన వాక్య రచనా పద్ధతి, విభక్తి ప్రత్యయాలు, ధాతుమూలాలమూలలు కలిగిన స్వతంత్ర భాష.

వింధ్య పర్వత ప్రాంతాలనుండి వచ్చి చేరిన ఆర్యుల భాష దేశభాషపై; దాని అపభ్రంశరూపమే పైశాచి. ఈ పైశాచిలోనే గుణాఢ్యుడు తన బృహత్కథను రచించాడు. పైశాచిభాష, [illegible] భాషా కుటుంబానికి చెందిన భాష. తెలుగు భాషలోని వాక్యరచనా పద్ధతి, పైశాచిలోని వాక్యరచనా పద్ధతికి సన్నిహిత సంబంధ మున్నది. కనుకనే దేశభాషను అతిత్వరలో, తెలుగుభాష సంలీనం చేసుకో గలిగింది. దేశభాష నశించింది.

తెలుగు, [illegible], ప్రాకృతము కూడా ప్రవేశించింది. ఇది శాతవాహనుల రాజభాష. శాసనాలు, గ్రంథాలు, [illegible] వ్యవహారాలు అన్నీ ఈ భాషలోనే జరిగేవి. ఈ ప్రాకృతభాషయొక్క ఒక రూపమైన పాళీభాషలో బౌద్ధమత గ్రంథాలన్నీ రచించబడ్డాయి.

ఈ మూడుభాషలతోపాటు సంస్కృత భాష మరొకవైపు ప్రవేశించింది. కుంతల శాతకర్ణి ఆస్థాన పండితుడైన సర్వవర్మ, కాతంత్ర వ్యాకరణమును రచించి, 6 నెలలలో సంస్కృత భాషను రాజుకు నేర్ప గలిగాడని, గుణాఢ్యుని కథద్వారా తెలుస్తున్నది.

సంస్కృత, ప్రాకృతభాషలు రెండూ ఒకే భాషాకుటుంబానికి చెందినవి. ఈ రెంటికీ గల భేదం గ్రాంథికవ్యావహారిక భాషలకు గల భేదం మాత్రమే. కనుకనే ఆంధ్ర దేశంలో ప్రాకృతాన్ని అతిత్వరగా తొలగించి సంస్కృతం ఆ స్థానాన్ని ఆక్రమించింది. ఇక్ష్వాకురాజులవరకు (క్రీ.శ. 250) శాసనాలు ప్రాకృతంలో రచించబడ్డవి. అనంతరం వచ్చిన పల్లవరాజుల కాలం నుండి, సంస్కృతమే ఆంధ్రదేశంలో రాజభాష అయింది. అంతకుముందున్న బౌద్ధమతం, దానితోపాటు ప్రాకృతం – ఈ రెంటికీ రాజాదరణ నశించి హీనయానమతం, దాంతో సంస్కృతభాష ప్రవేశించినది.

## ఆంధ్రభాషలో గ్రంథరచన

క్రీ.శ.300 నుండి 650 వరకు సంస్కృత భాషే రాజభాషగా ఉంది. ప్రజాభాష అయిన తెలుగుకీ రాజభాష అయిన సంస్కృతానికీ ఘర్షణ సాగుతూనే ఉంది. మొట్టమొదట తెలుగు శాసనం వేంగీచాళుక్యుల కాలంలో క్రీ.శ. 650 లో రచించబడ్డది. తెలుగులో సీసపద్య రచనకూడా అప్పటికి ఏర్పడ్డది. విష్ణుకుండిన రాజైన మాధవవర్మ (క్రీ.శ. 450 లో) వ్రాసిన జనాశ్రయ ఛందోవిచ్ఛిత్తి అను సంస్కృత గ్రంథంలో తెలుగుపద్య రచన వాడుకలో ఉన్నట్లు ఉదహరించబడ్డది. నాగార్జున కొండ శాసనాల్లో(250) తెలుగుమాటలు మాత్రం ప్రవేశించగలిగినవి.

ఆంధ్రభాషా వికాసం శాంతంగా ఒడుదుడుకులు లేకుండా జరగలేదు. తెలుగుభాష రాజాస్థానాల్లో ప్రవేశించి, శాసనాల్లోను గ్రంథాల్లోను చోటుపడటానికి ఎంతో కాలం పట్టింది. బహుశా అనేక జానపద గ్రంథాలు ఆనాడు తెలుగులో రచించబడి ఉండవచ్చు. కాని ఈనాడు అవి లభించటంలేదు. శాతవాహన రాజ్య పతనానంతరం ఆంధ్ర

ఆంధ్ర ప్రజలనుభవిస్తున్న బాధలను వీరు స్వయంగా చూచారు. ఉత్తర హిందూస్థానంలో అప్పటికే మహమ్మదీయ దండయాత్ర ముంచుకువస్తున్నది. ఈ ప్రమాదాన్నుండి రక్షించుకోవాలంటే, ఆంధ్రులందరినీ ఒకే సుస్థిర ప్రభుత్వం క్రిందికి తీసుకురావటం అవసరమని గుర్తించారు. 300 సంవత్సరాలపాటు ఆంధ్రదేశాన్నంతటినీ పరిపాలించారు. వ్యవసాయము, వర్తక వాణిజ్యాలు, ఓడ వ్యాపారము, సాహిత్యము, శిల్పకళ - అన్నీ మహోజ్జ్వలంగా వికసించినవి. కులభేదాలను కొంత వరకు పరిష్కరించటానికి కూడ వీరు ప్రయత్నించారు. అప్పుడప్పుడే తల ఎత్తుతున్న వెలమ, రెడ్డి, కమ్మ - కులాల మధ్య ద్వేషాలు పెరగకుండా గణపతి దేవుడు ఎంతో కృషిచేశాడు. విదేశ దండయాత్రలనుండి ఆంధ్రప్రజల స్వాతంత్ర్యాన్ని రక్షించిన రుద్రమ, ప్రతాపరుద్రుడు, గన్నారెడ్డి - ఆంధ్ర వీరులుగా పేరుపొందారు.

కాకతీయుల సుస్థిరపరిపాలన మాత్రమే కాక, ఆంధ్రుల ఐక్య సంస్కృతీ పరిణామానికి సహాయపడ్డ మరి రెండు ఉద్యమాలుకూడా ఈకాలంలో తలయెత్తినవి.

## కులవిభేదాల నిరసన

కన్నడ దేశంలో బసవయ్య నాయకత్వాన ప్రారంభమై, కుల విభేదాలపై ధ్వజమెత్తిన వీర శైవమతం ముదటిది. మూఢ మతభక్తి ఈ ఉద్యమానికి ప్రాతిపదిక ఐనప్పటికీ, కులవిద్వేషాలు, హెచ్చు తగ్గులతో సమాజం విచ్ఛిన్నమౌతున్న ఈ దశలో, శివభక్తి ప్రధానమని, కుల భేదాలు అప్రధానమని ఈ ఉద్యమం ప్రచారం చేసింది. ప్రజాసామాన్యానికి కరమయ్యే అచ్చ తెలుగుభాషలో, ద్విపద ఛందస్సులో, నాటి సమాజ జీవితాన్ని ప్రతిబింబించే అనేక గ్రంథాల రచనకు, ఈ మతావేశం కారణమైంది. కష్టసమయంలో ప్రజలకు సేవచేసే సాంప్రదాయాన్ని, ఈ ఉద్యమం ప్రవేశపెట్టింది. విదేశ దండయాత్రలనుండి దేశాన్ని రక్షించుకోవలసినప్పుడు, ప్రజలు, సైనికులుగా చేరవలెనని ప్రోత్సహించింది. కాకతీయుల సుస్థిర ప్రభుత్వానికి ఈ ఉద్యమం ఎంతో సహాయపడ్డది. హిందూమతంలోని బ్రాహ్మణాధిక్యతపైన ప్రజాసామాన్యానికిగల తీవ్ర నిరసనను ఈ ఉద్యమం ప్రతిబింబించింది. ఆంధ్రప్రజలలో ఐక్య సంస్కృతి నిర్మాణానికి దేశం నలుమూలలా వ్యాపించిన ఈ ఉద్యమం ఎంతో గానో సహాయపడ్డది.

## ఐక్య సంస్కృతీ నిర్మాణానికి దోహదం

రెండవ ఉద్యమం, మేధావివర్గంలో నుండి పుట్టింది. దీనికి కవిబ్రహ్మ తిక్కన ప్రారంభకుడు. నన్నయభట్టు ప్రారంభించిన మహాభారత రచనను తిక్కన పూర్తి చేశాడు. అచ్చ తెలుగు పదజాలాన్ని విశేషంగావాడి ప్రజాభాషకు ప్రోత్సాహమిచ్చాడు. వందలాది శిష్యులను తయారు చేశాడు. వీరందరూ సంస్కృత గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేసేపనికి పూనుకున్నారు. ఈ 300 సంవత్సరాలలోను కొన్ని వందల తెలుగు కావ్యాలు ఏర్పడ్డవి. అంతే కాదు; నెల్లూరువాడైన తిక్కన, ఓరుగల్లువెళ్ళి అక్కడ తన గ్రంథ రచనలు పూర్తిచేశాడు. శివకేశవుల తేగా

దాన్ని పరిష్కరించి హరిహరనాథునికి తన గ్రంథం అంకితం చేశాడు. మత విభేదాలకు, ప్రాంతీయ విభేదాలకు అతీతమైన ఐక్యసంస్కృతీ నిర్మాణానికి సహాయపడ్డాడు. సంస్కృత వాఙ్మయంలోని గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేసి ఆంధ్ర వాఙ్మయాన్ని పరిపుష్టం చేయటంలో తిక్కనకవి, ఆయన శిష్యులు ఎంతో సహాయపడ్డారు.

కాకతీయుల సుస్థిర ప్రభుత్వం, వీరశైవ ఉద్యమం, తిక్కన సాహిత్య కృషి – ఈ మూటి ఫలితంగా, క్రీ. శ. 1350 నాటికి ఆంధ్రజాతికి, ఒకేరకమైన సంస్కృతి, మానసిక చిత్తవృత్తి ఏర్పడ్డది. జాతి సమగ్ర పరిణామానికి అవసరమైన మూడవలక్షణం కూడా సమకూడింది.

కాకతీయయుగం తర్వాత, ఆంధ్రదేశం తిరిగి రాజకీయంగా విచ్ఛిన్నమైంది. మహమ్మదీయుల దండయాత్రకు గురి అయింది. తిరిగి ఆంధ్రదేశం రాజకీయఐక్యత సాధించటానికి, మొదట విజయనగర రాజులు, ఆ తర్వాత గోల్కొండ నవాబులు కృషిచేశారు.

క్రీ. శ. 1400 నుండి 1500 వరకు ఆంధ్రదేశంలో ఎక్కువభాగం విజయనగర పాలనక్రింద ఉన్నది. ఈ సామ్రాజ్యం, ఆంధ్ర, కన్నడ, తమిళ ప్రాంతాలన్నిటిలోను వ్యాపించినప్పటికీ, ఆంధ్ర భాషకు, సంస్కృతికి, జాతి వికాసానికి ఈ రాజుల కాలంలో ప్రత్యేక ప్రోత్సాహం ఇవ్వబడ్డది. 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్న ఆత్మాభిమానంతో తెలుగు సాహిత్యం ముందుకు సాగింది. కేవలం సంస్కృత కావ్యాల తర్జుమాతో సంతృప్తిపడక, ఆంధ్రకవులు స్వతంత్ర కావ్యరచన కుపక్రమించారు.

వర్తక వాణిజ్యాలు వృద్ధిచెందాయి. కృష్ణరాయల పరిపాలనకు పుట్టినిల్లు అయిన రాయలసీమ ప్రాంతం సుభిక్షమై రతనాల సీమ అన్న పేరు సంపాదించింది. ఆంధ్ర సంస్కృతి, భాష, దక్షిణదేశానికి సైతం వెళ్ళి తంజావూరు, మధుర ప్రాంతాలలో వేరూనింది. కృష్ణరాయల కాలంలో ఆంధ్రదేశానికివచ్చిన విదేశ చరిత్రకారులు దేశ సంపదను వేనోళ్ళ పొగిడారు. ఒక నూరు సంవత్సరాల పైచిలుకు తెలుగు ప్రజలు మహమ్మదీయ దండయాత్రలను తట్టుకొని తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొన్నారు.

క్రీ. శ. 1500–1630 వరకు గోల్కొండ నవాబుల పరిపాలనలో ఆంధ్రదేశం తిరిగి ఐక్యమైంది. విజయనగర రాజ్యం నశించి గోల్కొండ రాజ్యం వృద్ధిచెందేకాలంలో హిందూ–మహమ్మదీయ కలహాలు, అంతర్యుద్ధాలు కొంత ప్రజ్వరిల్లినా త్వరలోనే ఇవి సమసిపోయినవి. మతాలు వేరయినా, తాము ఆంధ్రులమేనని గోల్కొండ నవాబులు భావించారు. తెలుగు భాష, సంస్కృతులను ఆదరించారు. హిందువులు మహమ్మదీయులు ఒకరిప్రక్కన ఒకరు శాంతంగా జీవిస్తూ, స్పర్ధలుమాని, విభిన్న సంస్కృతులను సమన్వయం చేసుకునే సుసాంప్రదాయం గోల్కొండ నవాబుల కాలంలో ఏర్పడ్డది. వీరిలో ఆఖరువాడైన తానీషా కాలంలో ఈ సుసాంప్రదాయం పరాకాష్ఠను అందుకున్నది.

## ఔరంగజేబు దండయాత్ర

1635 లో మొగలు పాదుషా ఔరంగజేబు దక్కనును జయించటంతో ఆంధ్రు

లకు దుర్దినాలు ప్రారంభమైనవి. హిందూ-ముస్లిం కలహాలు ప్రజ్వరిల్లినవి. మొగలు బంట్లు ప్రజాసామాన్యంపై జరిపిన అత్యాచారాలకు మితంలేదు. ఔరంగజేబు ప్రతినిధిగానే అసఫ్‌జాహీ వంశం ప్రారంభమైంది. నాటినుండి నేటివరకు అసఫ్‌జాహీ వంశస్థులైన ఈ నైజాం ప్రభువులు ఆంధ్ర ప్రజలలో తింపులు పెట్టి, ద్వేషాలు రెచ్చగొట్టి నిరంకుశ పరిపాలన సాగిస్తూనే ఉన్నారు.

గాలికి వాన తోడైనట్లు ఈ నైజాం రక్కసులకు తోడు, 17 వ శతాబ్దినుండీ ఇంగ్లీషువారు ప్రవేశించారు. తెలంగాణా మిగతా ప్రాంతంనుండి వేరుపడ్డది. ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక అవరోధాలను, ఈ దుష్ట కూటమి ఉద్దేశపూర్వకంగా సృష్టించింది.

అసఫ్‌జాహీ వంశ పరిపాలన, ఆంధ్ర దేశమంతటా వ్యాపించింది. మొదట ఆక్రమించినవారు, ఆ తర్వాత ఇంగ్లీషువారు, ఆంధ్రదేశంపై పెత్తనం సంపాదించ సాగారు. పరాయి సామ్రాజ్యవాదుల ఆధిపత్యాన్ని, నైజాం ఈషణ్మాత్రమైనా ఎదిరించిన పాపాన పోలేదు. తన స్వంత అధికారము, ఆస్తి, నిలిస్తే చాలునన్న స్వార్థబుద్ధితో, మొదట్లో సర్కారు జిల్లాలను, ఆతర్వాత దత్త మండలాలను ఇంగ్లీషువారికి ధారాదత్తం చేసాడు.

1875 లో సిపాయి తిరుగుబాటు అని వ్యవహరించబడుతున్న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగింది. నైజాం, బ్రిటిషువారికి నమ్మినబంటుగా వ్యవహరించి, తిరుగుబాటును అణచివేయుటలో బ్రిటిష ప్రభుత్వానికి సహాయపడ్డాడు. ఆంధ్రదేశానికి మాత్రమే గాక, యావద్భారతదేశానికి ద్రోహిగా నిరూపించుకున్నాడు.

అంధకార బంధురమైన ఆంధ్రప్రజా జీవితంలో, తిరిగి ఆశాకిరణమో అన్నట్లు 16 వ శతాబ్ది ఆఖరున యోగి వేమన ఉద్భవించాడు. గుంటూరుజిల్లా కొండవీడులో సామాన్య రైతుకుటుంబంలో ఉద్భవించి, జీవితంలోని కష్టసుఖాలు, ఒడుదుడుకులు అనుభవించి, అపారమైన లోకానుభవాన్ని గడించాడు. కుల, మత, విద్వేషాలతోను, మోసము, అవినీతి, దౌర్జన్యముతోను సతమతమవుతున్న ఆంధ్ర ప్రజలను మేలుకొలుపులు పాడాడు.

కాపువానికెంత కర్మతుడైనను
పాపరాశి కొంత పరిసిపోవు
కవనమెరుగనట్టి వెర్రిజీవులుగాన
విశ్వదాభిరామ వినురవేమ.

అమాయకులైన గ్రామాంగ ప్రజ, అగ్రవర్ణాలవారి మధ్యస్థులకు లోనైపోయిన దన్న నగ్నసత్యాన్ని, యోగి వేమన బహిరంగం చేశాడు. కుల, మత విభేదాల కతీతమైన సమాజము ఎప్పుడో ఒకప్పుడు రాగలదన్న ఆశాభావాన్ని సైతం వేమన వెలిబుచ్చాడు.

ఐతే వేమన సంఘసంస్కరణ ప్రచారానికి కాలం అప్పటికింకా పరిపక్వం కాలేదు. కనుకనే ఆయన శిష్యులు, వేమనలోని సంస్కరణ ధోరణిని వదలివేసి, తాత్త్వికధోరణిని మరింత వికృతంగా పెంచి, వేమనను ఒక యోగిగా మార్చారు. ఆ సమకాలీన ప్రజలు గుర్తించనప్పటికీ, ఆంధ్రలో నవయుగోదయానికి, వేమన వైతాళికుడని చెప్పటంలో ఎట్టి సందేహం లేదు.

## ఆధునిక యుగపురుషుడు
## వీరేశలింగం

1853 నుండి 1953 వరకు, ఆంధ్రుల చరిత్రలో ఆధునిక ఘట్టము. ఈ నూరు సంవత్సరాల చరిత్రను రూపొందించిన మహాశక్తులు నాలుగు. (1) కందుకూరి వీరేశలింగంగారి ఆధ్వర్యాన ప్రారంభమైన సంఘ, భాషాసంస్కరణోద్యమము (2) 1913 లో బాపట్ల ఆంధ్రమహాసభలో ప్రారంభమైన ప్రత్యేక రాష్ట్రోద్యమము (3) 1920 తో ప్రారంభమైన కాంగ్రెసు ఉద్యమము (4) 1935 నుండి ప్రారంభమైన కమ్యూనిస్టు ఉద్యమము.

1848 లో గోదావరిజిల్లాలో ఒక బీద బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన వీరేశలింగంగారు తెలుగు, సంస్కృత, ఆంగ్ల భాషలలో సామాన్య పాండిత్యాన్ని సంపాదించి, ఒకబడిపంతులుగా తన జీవితాన్ని ప్రారంభించాడు. అతిబాల్య వివాహాలు, తత్ఫలితంగా ఏర్పడిన బాలవితంతువుల హృదయవిదారకగాథలు, అగ్రవర్ణమని భావించబడే బ్రాహ్మణకులంలోని అవినీతి, లంచగొండితనం వీరేశలింగం గారిలో తీవ్రసంచలనాన్ని కలిగించాయి. బెంగాలులో రాజారామమోహనరాయి ప్రారంభించిన సంఘ సంస్కరణోద్యమాన్ని ఆంధ్రలో కొనసాగింప నిశ్చయించాడు. వితంతు వివాహాలను స్వయంగా చేయించాడు. స్త్రీల విద్యాభ్యాసానికి స్కూళ్ళను స్థాపించాడు. ఉద్యోగస్థుల లంచగొండితనాన్ని ధైర్యంగా తూర్పారబట్టి, ఒకరిద్దరు జడ్జీలపై అధికారులు చర్యతీసుకునేటట్లు చేసాడు. వేశ్యాలంపటత్వము, సర్వసామాన్యమైన హుందాతనంగా భావించబడుతున్న ఆరోజులలో ఈ దురాచారానికి వ్యతిరేకంగా తీవ్రప్రచారంచేసి నైతిక పునరుజ్జీవనానికి మార్గదర్శకుడైనాడు.

తన సంఘ సంస్కరణోద్యమానికి భాషను ఒకసాధనంగా స్వీకరించి తెలుగులో నూటికిపైగా వచన గ్రంథాలను వ్రాసాడు. నవల, నాటకము, ప్రహసనము, విజ్ఞానశాస్త్రము, ఆత్మకథ, చరిత్ర మొదలైన బహువిధ సాహిత్యరూపాలకు మార్గదర్శకుడై గద్యవాఙ్మయబ్రహ్మ అన్న సార్థకనామాన్ని సంపాదించాడు.

ఇంతేగాక, తాను నమ్మిన ఉద్యమానికి యావజ్జీవము సేవచేయటంతోపాటు గ్రంథరచనద్వారా తాను సంపాదించిన కొన్నిలక్షల ఆస్తిని ప్రజాహిత సంస్థలకు దానంచేసి, ఆంధ్రచరిత్రలో అపూర్వమైన త్యాగసాంప్రదాయాన్ని ప్రారంభించాడు.

తనదేహము, తనగేహము
తనకాలము, తనధనంబు, తనవిద్య, జగజ్జనులకె వినియోగించిన
ఘనుడీ వీరేశలింగ కవి జనులారా

అన్న సూక్తికి స్ఫూర్తిని సాధించాడు.

వీరేశలింగం ప్రారంభించిన భాషా సంస్కరణోద్యమాన్ని, గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు గారలు మరింత ముందుకు తీసుకు వెళ్లారు. చరిత్ర పరిశోధన శాఖను శ్రీకొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారలు కొనసాగించారు.

## ప్రత్యేక రాష్ట్రోద్యమం

1913 లో బాపట్లలో ప్రారంభమై, ఆంధ్రమహాసభ పేరుతో, ప్రత్యేకరాష్ట్రం కొరకు సాగినమహోద్యమం, ఆంధ్రులలో

నిద్రాణమైయున్న జాతీయ భావాలను మేలుకొల్పింది. భాషాప్రయుక్త రాష్ట్ర వాదాన్ని భారతదేశంలో ముట్టమొదటగా ప్రతిపాదించిన వారు ఆంధ్రులు. భారతజాతి, ఒకే అఖండమైన జాతికాదు. ప్రత్యేక నాగరికత సంస్కృతులు కలిగిన వివిధజాతుల సమ్మేళనం. ఈ వాస్తవ విషయాన్ని గుర్తించినప్పుడే భారత జాతీయైక్యత, ఐచ్ఛికమైన, సుస్థిర పునాదులపై నిర్మించ బడుతుంది. ఈ చిన్న సత్యాన్ని అస్పష్టంగానైనప్పటికీ మొట్టమొదట బైటపెట్టిన వారు ఆంధ్రులు. ఈ ఉద్యమానికి చిహ్నమే ఆంధ్ర మహాసభ. ప్రత్యేక రాష్ట్ర సాధనతో ఆంధ్రమహాసభ లక్ష్యాలలో ఒకటి నేటికి సాధింపబడ్డది. కాని విశాలాంధ్ర స్థాపన పూర్తి ఐనప్పుడే సంపూర్ణలక్ష్యం సిద్ధించినట్లవుతుంది.

1920 లో ప్రారంభమైన కాంగ్రెసు సహాయ నిరాకరణోద్యమం, సామ్రాజ్య వ్యతిరేక పోరాట భావాలను, ఏదో ఒక రూపంలో దేశమంతటా ప్రచారం గావటానికి ఒక సాధనగా ఉపయోగపడ్డది. భారతదేశ స్వాతంత్ర్య సంపాదనలో ఒక భాగంగానే, ప్రత్యేక రాష్ట్రాన్ని సాధించుకోవలెనన్న విశాల దృక్పథం కూడా ఒకటి కలిగింది.

కాని పై మూడు ఉద్యమాలలోను ఒక బలహీనత ఉన్నది. వీరేశలింగం సంస్కరణోద్యమముగాని, ఆంధ్ర మహాసభ సందేశమైన ప్రత్యేక రాష్ట్రోద్యమం గాని, పట్టణ మేధావుల పరిమితిని ఎన్నడూ దాటనేలేదు. అసంఖ్యాకులైన గ్రామీణ ప్రజానీకము ఈ ఉద్యమాలకు దూరంగానే ఉంటూవచ్చారు.

1920 లోను, ఆతరవాత 1930లోను, సాగిన కాంగ్రెసు ఉద్యమం, స్వాతంత్ర్య సందేశాన్ని కొంతవరకు గ్రామసీమలకు కొనిపోయిన మాట వాస్తవము. కాని, జాతీయ పోరాటం ఆశయాలలోనేమి, పోరాట పద్ధతులలోనేమి, ప్రజా విస్తృతిలోనేమి, పెట్టుబడిదారీవర్గం సృష్టించిన పరిధులను దాటకుండా, కాపాడుతూ వచ్చిన గాంధీవాదం, అడుగడుగునా, జాతీయోద్యమ విస్తృతికి ఆటంకంగానే ఉంటూ వచ్చింది. అంతేకాదు. వీరేశలింగ సంస్కరణోద్యమాన్ని ప్రత్యేక రాష్ట్రోద్యమాన్ని జాతీయోద్యమంతో జోడించటంలోకూడా కాంగ్రెసు నాయకత్వం పూర్తిగా విఫలమైంది.

1935 లో ప్రారంభమైన కమ్యూనిస్టు ఉద్యమం సర్వసమగ్ర నూతన యుగోదయానికి చిహ్నం. భారతదేశమే ఒక వలసదేశం. అందులో ఆంధ్రదేశం మరొక వలసదేశము. ఇట్టి ఆంధ్రదేశంలోని ప్రజోద్యమాలకు, అంతర్జాతీయ కార్మికోద్యమ సిద్ధాంతమైన మార్క్సిస్టు సిద్ధాంతంతో అభేద్యమైన సంబంధం కలిగింది. భగీరథుడు గంగానదిని భూలోకానికి తెచ్చినట్లు, మానవమేధస్సు నేటివరకు సృష్టించిన సిద్ధాంతాలలోకల్ల మహోన్నతమైన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని, ఆంధ్రలోని రైతు, కూలీ ప్రజాసామాన్యము యొక్క నిత్యజీవిత సమస్యలకు, రాష్ట్ర, దేశస్వాతంత్ర్య సమస్యలకు సాధన మార్గంగ కమ్యూనిస్టుపార్టీ స్వీకరించింది.

ఇదే సరియైన పంథా అన్న విషయాన్ని ఆధునిక చరిత్ర గమనమే నిరూపిస్తున్నది.

నేడు మనం ప్రత్యేకంగా రాష్ట్రాన్ని సాధించుకున్నాము. విశాలాంధ్ర స్థాపన

తక్షణ లక్ష్యంగా ఆంధ్రజాతి పురోగ మిస్తున్నది.

ఈ నాలుగు ఉద్యమాలు పుట్టి, పెరిగి విస్తరించటానికి కనువైన ఆర్థిక పరిస్థితులు కూడా గత నూరుసంవత్సరాల్లో క్రమంగా ఏర్పడుతూవచ్చాయి. కృష్ణ, గోదావరినదులకు ఆనకట్టలు కట్టటంలో డెల్టా భూములు సస్యశ్యామలమైనవి. మద్రాసు-కలకత్తా, మద్రాసు-బొంబాయి రైలుమార్గాలు ఏర్పడటం, చిన్నచిన్న పరిశ్రమలు ఏర్పడటం జరిగింది. రైత్వారీ సెటిల్‌మెంటు ఫలితంగా రైతుకు భూమిపై స్థిరపడిన హక్కు, ఆంధ్రలోని ప్రజోద్యమాల కన్నిటికీ, రైతాంగం వెన్నెముకగా ఉండగల స్తోమతను కలిగించింది.

కాని భూస్వామ్య విధానాన్ని పూర్తిగా రద్దుచేసి, రాష్ట్రీయ పరిశ్రమలకు పూర్తిప్రోత్సాహాన్ని, రక్షణనుఇచ్చి నూతన ప్రజాతంత్ర ఆర్థిక విధానాన్ని అమలుజరిపినప్పుడే ఆంధ్రప్రజల సమగ్ర వికాసము సాధ్యము కాగలదు. విశాలాంధ్రలో ప్రజారాజ్యస్థాపన జరిగినప్పుడే ఆంధ్రుల చారిత్రక పరిణామం పరాకాష్ఠకు వచ్చి, సమగ్ర జాతీయావిర్భావము జరుగగలదు.

# నవయుగ ఫిలిమ్స్

విజయవాడ -- గుంతకల్లు

సమర్పించు కానుకలు

భరణీ వారి

## చక్రపాణి

భానుమతి

నాగేశ్వరరావు..సియస్.ఆర్

నవయుగ వారి

## జ్యోతి

సావిత్రి..శివరావు

వరలక్ష్మి

సాహు వారి

## మయూర్ పంఖ్

సుమిత్రాదేవి

కిశోర్ సాహు

పి.యన్.ఫిలిమ్సు వారి

## గోల్కొండ ఖైదీ

ప్రేమ్ నాథ్

బీనారాయ్

హిందీ చిత్రాలు

## బూట్ పాలిష్ * భాగ్యవాన్

## అంగారే * దోస్త్

# ఆంధ్రచరిత్రలోని ముఖ్యఘట్టాలు

| | |
|---|---|
| క్రీ॥ పూ॥ 322 | మెగాస్తనీసు కళింగ దేశ రాక |
| ,, 260 | అశోకుని కళింగ దండయాత్ర |
| ,, 220 | శాతవాహన రాజ్య స్థాపన |
| ,, 184 | మౌర్యరాజ్యపతనం |
| ,, 171 | ఖారవేలుడు సింహాసన మెక్కుట |
| క్రీ॥శ॥ 19_24 | హాల శాతవాహనుని పాలన, గాథా సప్తశతి రచన |
| ,, 77 | ప్లినీ అనే విదేశీ యాత్రికుని కాలం |
| ,, 78 | శాలివాహన యుగ ఆరంభం |
| ,, 130 | టాలెమీ భూగోళరచన |
| ,, 225 | శాతవాహన పాలన అంతం |
| ,, 225_277 | ఇక్ష్వాకు వంశపాలన |
| ,, 234 | పల్లవరాజ్యస్థాపన |
| ,, 270_290 | బృహత్పలాయనుల పరిపాలన |
| ,, 300_420 | శాలంకాయనవంశ పరిపాలన |
| ,, 336 | సముద్రగుప్తుడు సింహాసన మెక్కుట |
| క్రీ॥ శ॥ 343 | వేంగి దేశంపై సముద్రగుప్తుని దండయాత్ర |
| ,, 350_440 | వాశిష్ఠీవంశ కళింగ పాలన |
| ,, 375_500 | ఆనంద గోత్రికుల రాజ్యం |
| ,, 440_485 | మాఠర వంశ కళింగ పాలన |
| ,, 450_611 | వేంగీదేశంలో విష్ణుకుండినుల వంశపాలనా కాలం |
| ,, 497 | గాంగవంశ స్థాపన |
| ,, 550 | పశ్చిమ చాళుక్యరాజ్య స్థాపన |
| ,, 614 | కుబ్జవిష్ణువర్ధనుడు సింహాసన మెక్కుట, తూర్పుచాళుక్యవంశపాలన ప్రారంభం |
| ,, 625 | పల్లవరాజ్య పతనం |
| ,, 634_35 | రెండవ పులకేశి - కొల్లేరుకోట యుద్ధం |
| ,, 640 | హ్యుయన్ సాంగ్ ఆంధ్రదేశ పర్యటన |
| ,, 649 | మొదటి తెలుగుశాసనం- నరసారావుపేట తాలూకాలోని విప్పర్లలో |

| | | |
|---|---|---|
| క్రీ॥ శ॥ | 848-892 | గుణగ విజయాదిత్యుని పరిపాలన |
| " | 892-918 | మొదటి చాళుక్య భీమరాజు పాలన, పంచారామాల నిర్మాణం |
| " | 945 | మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుని పాలన ప్రారంభం, రాజమహేంద్రవర నిర్మాణం |
| " | 973 | కళ్యాణి చాళుక్య రాజ్య స్థాపన |
| " | 1022 | రాజరాజ నరేంద్రుని పరిపాలనారంభం |
| " | 1040 | రాజరాజ నరేంద్రునికి నన్నయచే ఆంధ్ర మహాభారత కృతిసమర్పణ |
| " | 1050 | పండిత మల్లికార్జునుని జననం |
| " | 1117 | వరంగల్లు రాజధానిగా కాకతీయ బేతరాజు పరిపాలనారంభం |
| " | 1176-82 | పల్నాటి యుద్ధం |
| " | 1198 | కాకతీయ గణపతిదేవుని పరిపాలనారంభం |
| " | 1212-13 | కోస్తా ఆంధ్ర కాకతీయుల స్వాధీనం |
| " | 1230 | తిక్కన సోమయాజి జననం |
| " | 1262 | రుద్రమదేవి సింహాసనాధిష్ఠానం |
| " | 1294 | కాకతీయ ప్రతాపరుద్రుని పరిపాలనారంభం |
| " | 1303 | దక్కన్‌పై అల్లావుద్దీన్ మొదటిదండయాత్ర |
| క్రీ॥ శ॥ | 1309 | వరంగల్లుపై మాలిక్కాఫర్ ముట్టడి |
| " | 1323 | కాకతీయరాజ్యపతనం, ప్రతాపరుద్రుని మరణం |
| " | 1324 | కొండవీటి రెడ్డిరాజ్య స్థాపన |
| " | 1325 | ఢిల్లీసుల్తానులపై ముసునూరి ప్రోలయనాయకత్వమున ఆంధ్రమందలి దేశవాసుల తిరుగుబాటు. |
| " | 1336 | విజయనగర రాజ్య స్థాపన |
| " | 1337 | మహమ్మద్ బిన్ తుగ్లక్ పాలనకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజల తిరుగుబాటు |
| " | 1347 | బహమనీ రాజ్యస్థాపన |
| " | 1400 | శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర, కాశీఖండ రచన |
| " | 1424 | కొండవీటి రెడ్డిరాజ్య పతనం |
| " | 1438 | బమ్మెర పోతన భాగవత రచన |
| " | 1480 | తూరంగి [illegible] నిర్మాణం |
| " | 1510 | కృష్ణదేవరాయల పట్టాభిషేకం |
| " | 1512 | గోల్కొండ రాజ్య స్థాపన |
| " | 1514-15 | కృష్ణదేవరాయల ఆంధ్రదేశ జైత్రయాత్ర |
| " | 1535 | తంజావూరులో విజయనగర రాజ్యస్థాపన |
| " | 1539 | మధురలో విజయనగర రాజ్యస్థాపన |

క్రీ॥ శ॥ 1565 తల్లికోటయుద్ధం, విజయనగర రాజ్యపతనం
„ 1572 గోల్కొండ నవాబులచే సర్కారుజిల్లాల ఆక్రమణ
„ 1611 మచిలీపట్టణంలో ఇంగ్లీషువారు ఫ్యాక్టరీని నెలకొల్పుట
„ 1628 భీమునిపట్నం, జగన్నాథపురం (కాకినాడ)లో డచ్చి ఫ్యాక్టరీల నిర్మాణం
„ 1639 మద్రాసులో కోట నిర్మాణానికి ఇంగ్లీషువాళ్ళు చంద్రగిరిరాజావద్ద అనుమతిపొందుట
„ 1669 మచిలీపట్టణంలో ఫ్రెంచి వ్యాపారం ప్రారంభం
„ 1682 విశాఖపట్టణంలో ఇంగ్లీషుఫ్యాక్టరీ స్థాపన
„ 1687 ఔరంగజీబుచే గోల్కొండ రాజ్య ఆక్రమణ
„ 1724 నైజాం నవాబుల పరిపాలనా ప్రారంభం.
„ 1753 కోస్తాజిల్లాలు ఫ్రెంచివారి వశమగుట
„ 1757 బొబ్బిలియుద్ధం
„ 1758 చందుర్తిలో ఫ్రెంచివారికీ, ఇంగ్లీషువారికి యుద్ధం
„ 1759 కర్నల్‌ఫోర్డుచే మచిలీపట్టణం ఆక్రమణ

క్రీ॥ శ॥ 1766 కోస్తా జిల్లాలను (గుంటూరు మినహా) ఇంగ్లీషువారికి శాశ్వత కౌలుకిస్తూ నైజాం నవాబు ఒప్పందం
„ 1788 గుంటూరుజిల్లాను ఇంగ్లీషు వారికి నైజాం నవాబుఇచ్చివేయుట
„ 1800 నైజాంనవాబు కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలను ఇంగ్లీషువారికి స్వాధీనం చేయుట
„ 1801 ఆర్కాటు నవాబుచే నెల్లూరుజిల్లా ఇంగ్లీషువాళ్ళకు దానం
„ 1806 బందరులో సిపాయిల తిరుగుబాటు
„ 1806 మద్రాసులో తెలుగు గ్రంథ ప్రచురణ
„ 1823 నైజాం నవాబుకు 116.5 లక్షల రూపాయల నిచ్చి ఉత్తర సర్కారుజిల్లాలపై అతనికున్న హక్కులను ఇంగ్లీషువారు కొనివేయుట
„ 1835 మొదటి తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు ప్రచురణ
„ 1845-48 విశాఖపట్టణం జిల్లా, గోలకొండ ఏజన్సీ ప్రజల చారిత్రాత్మక తిరుగుబాటు

క్రీ॥శ॥ 1848 యుగపురుషుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారి జననం

„ 1851 గోదావరి ఆనకట్ట నిర్మాణం

„ 1855 కృష్ణ ఆనకట్ట నిర్మాణం

„ 1855 గురజాడ అప్పారావు

„ 1857 గోలుకొండ ఏజెన్సీ ప్రజల ద్వితీయ బ్రిటిషు వ్యతిరేక పోరాటం

„ 1877 బకింగ్‌హాం కాలువ నిర్మాణం

„ 1879–80 ద్వారబంధాల చంద్రయ్య నాయకత్వాన రంపపితూరీ

„ 1886 ఆంధ్రలో (విశాఖపట్టణం) మొదటి గ్రంథాలయ స్థాపన

„ 1891 గోలుకొండ ఏజెన్సీ ప్రజల తృతీయ పోరాటం

„ 1902 విశాఖ పట్టణంలో మొదటి వైద్య పాఠశాల స్థాపన

„ 1906 విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి స్థాపన

„ 1908 బందరులో ఆంధ్రమహాసభ

„ 1908 బొంబాయినుంచి ఆంధ్రపత్రిక (వారపత్రిక) ప్రారంభం

„ 1912 కొమర్రాజు లక్ష్మణరావుగారిచే ఆంధ్ర విజ్ఞానసర్వస్వ ప్రచురణ

క్రీ॥ శ॥ 1913 బాపట్లలో ఆంధ్ర మహాసభ సంస్థాపన

„ 1915 ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ విశాఖపట్టణ ఆంధ్ర మహాసభ

„ 1915 మహాకవి గురజాడ అప్పారావుగారి నిర్యాణం

„ 1919 వీరేశలింగం పంతులుగారి నిర్యాణం

„ 1920 తెలంగాణాలో జనసంఘం స్థాపన

„ 1921 చీరాల–పేరాల పోరాటం

„ 1921 భారతదేశంలో ప్రప్రథమంగా పల్నాడు, పెదనందిపాడులలో పన్నుల నిరాకరణోద్యమం

„ 1921 పల్నాటి వీర హనుమంతు హత్య

„ 1922 అల్లూరి సీతారామరాజు నాయకత్వాన మన్యం ప్రజల తిరుగుబాటు

„ 1923 ఆంధ్ర బ్యాంకు స్థాపన

„ 1923 కాకినాడలో అఖిల భారత కాంగ్రెసు సమావేశం

„ 1926 ఆంధ్ర విశ్వ విద్యాలయ ప్రతిష్ఠాపన

„ 1927 ఆంధ్ర నాటక కళా పరిషత్ స్థాపన

„ 1928 ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ స్థాపన

| | |
|---|---|
| క్రీ॥శ॥ 1928 | మద్రాసులో ఆంధ్ర వాణిజ్యమండలి ప్రారంభం |
| ,, 1930 | హెచ్. యం. రెడ్డి గారిచే తొలి తెలుగు చిత్రం నిర్మాణం |
| ,, 1930 | జోగిపేటలో మొదటి తెలంగాణా ఆంధ్ర మహాసభ |
| ,, 1938 | ఆంధ్రలో రైతాంగ యాత్ర |
| ,, 1933 | విశాఖపట్నం హార్బరు నిర్మాణ ప్రారంభం |
| క్రీ॥శ॥ 1934 | ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ పుట్టుక: నిషేధం |
| ,, 1934 | ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టు పార్టీ పుట్టుక |
| ,, 1952 | అక్టోబరు 19 న ఆంధ్ర రాష్ట్ర సాధనకై శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఉపవాస దీక్షారంభం. |
| ,, | 58 దినాల ఉపవాసానంతరం డిశంబరు 15 న శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆహుతి |
| ,, 1953 | ఆంధ్రరాష్ట్ర అవతరణ |



# ఆంధ్రుల భాషా రాష్ట్రోద్యమం

ఒకే భాష, ఒకే సంస్కృతి, ఒకే చరిత్ర కలిగిన ప్రజలు ప్రత్యేక రాష్ట్రం క్రింద ఉండాలనే సూత్రాన్ని అనుసరించి, సుదీర్ఘకాలం, నలభై ఏళ్లు నడచినది ఆంధ్రరాష్ట్రోద్యమం.

ఎన్నో ఒడుదుడుకులను. తట్టుకునీ, పట్టినపట్టు విడువక, ఒకే దృష్టితో, ఒకే లక్ష్యంతో, యింటా బైటా ఉన్న వ్యతిరేకతను, సాగివచ్చిన కుట్రలను ఎదిర్చి, కార్యాన్ని సాధించినది ఆంధ్ర రాష్ట్రోద్యమం.

భారతప్రజల భాషారాష్ట్ర వాంఛకు ఉద్యమ స్వరూపమిచ్చింది, ఉత్తేజపరచింది, మార్గదర్శియైంది ఆంధ్రరాష్ట్రోద్యమం.

ఆంధ్రలో భాషారాష్ట్ర ఉద్యమం 1947 వరకూ జాతీయోద్యమంలో అంతర్భాగంగానే సాగింది. దానికి నాయకత్వం వహించినవారు ఇంచుమించు దీనికీ నాయకత్వం వహిస్తూవచ్చారు. 1947 తర్వాతనే యిది ఒక ప్రత్యేక ఉద్యమంగానూ, ఆ పిమ్మట ప్రజా ఉద్యమంగానూ రూపొందింది.

## ప్రారంభ దశ

ఈ శతాబ్దం ఆరంభంలో ఆంధ్ర జాతీయ వికాసం ప్రారంభమైంది. ఈ వికాసానికి మూల పురుషుడు, మార్గదర్శి శ్రీ వీరేశలింగం. ఆయన సమకాలికులు గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి, కొమర్రాజు లక్ష్మణరావు తెలుగు ప్రజలకు నూతన విజ్ఞాన పథాలు త్రొక్కి చూపారు.

సమాజంలో ఉన్న దురాచారాలు, అవినీతి, అన్యాయాలపై యుద్ధం ప్రకటించాడు; సంఘ సంస్కరణను ఒక మహోద్యమంగా సాగించాడు శ్రీ వీరేశలింగం.

అందరికీ అర్థమయ్యే భాషలోనే బోధన, రచన సాగాలి. అదే సజీవమైన, సాంఘిక ప్రయోజనమైన భాష అని వ్యావహారిక భాషాపోరాటాన్ని నడిపాడు శ్రీ గిడుగు రామమూర్తి.

విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలిని స్థాపించి, శాస్త్రము, చరిత్ర మొదలగు వాటిలో విరివిగా గ్రంథాలను ప్రచురించి తెలుగుదేశమంతటా విజ్ఞాన చంద్రికలను వెదజల్లాడు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు.

తెలుగు ప్రజలలో వీరు రగుల్కొల్పిన చైతన్యమే ఆంధ్రలో స్వదేశీ ఉద్యమానికీ, యితర రాజకీయ ఉద్యమాలకీ పునాది అయింది.

బెంగాలు విభజన దేశ ప్రజలను కొరడాతో కొట్టినట్లయింది. "వందేమాతరం - మందే రాజ్యం" యుద్ధ నినాదమైంది. స్వదేశీ ఉద్యమం ఝుంఝూమారుతంవలె రేగింది.

బిపిన్‌చంద్రపాల్ అరెస్టుకు అసమ్మతిగా కాకినాడ కళాశాలలో సమ్మెచేసి, చదువుకు స్వస్తి చెప్పి వచ్చిన ముట్నూరి కృష్ణారావుగారు బందరులో "కృష్ణాపత్రిక"ను స్థాపించారు. బొంబాయిలో "ఆంధ్ర పత్రిక"ను స్థాపించారు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు. ఇవి రెండూ ఆంధ్రులలో నూతన రాజకీయ భావాలను నూరిపోశాయి.

సభలలోనూ, సమావేశాలలోనూ మాతృభాషనే వాడాలని నిశ్చయించుకుని తెలుగులోనే జరపడం ప్రారంభించారు.

1907- 1908 లో బందరులో ఆంధ్రా కాన్ఫరెన్సు జరుపబడింది. దానికి నిజాం సంస్థానంలోని ఆంధ్రులుగూడా ఆహ్వానింపబడ్డారు. ఆంధ్రజాతి నంతటినీ ఒకే పంచకు తీసుకురావాలనే ఆశయంతో ఈ కాన్ఫరెన్సు జరుపబడినా, మతసంస్కరణ సామాజిక పునరుద్ధరణ ఆశయ పరిధిలోనే యిది జరుపబడింది.

కాని, యిది త్వరలోనే రాజకీయ రూపాన్ని తీసుకుంది.

ఇలా తెలుగు - జాగృతి చోచ్చుకు పోతున్న రోజులవి.

ఈ పరిస్థితులలో బెంగాలును విభజించిన లార్డు కర్జనుపోయి లార్డు హార్డింజి రాజ ప్రతినిధిగా వచ్చాడు. వందేమాతరం ఉద్యమాన్ని చూచి, బెంగాలు సమస్యను పరిష్కరించడం అవసరమని గుర్తించాడు.

విభజనకు పూర్వం నేటి బీహారుగూడా బెంగాలు రాష్ట్రంలోనే ఉండేది. హార్డింజి బీహారీలను వేరుచేస్తూ, నేటి బెంగాల్ రాష్ట్రాన్ని ఏర్పరుస్తూ, 12-11-1911 న ఒక ప్రకటన చేశాడు.

బీహారీలనుగూర్చి అతను తన ప్రకటనలో యిలా చెప్పాడు : "ఇంతవరకూ బెంగాల్ రాష్ట్రంలో చేర్చబడి,హిందీ భాషమాట్లాడే బీహారీలను విడదీసి, ప్రత్యేక పాలనలో ఉంచడం అత్యంత ఆవశ్యకమని నాకు స్పష్టమవుతోంది. ఇంతవరకూ వీరు జోడు సరిపోని బెంగాలీలతో ఒక్కకాడిని కట్టివేయబడి యుండడంచేత వారి అభివృద్ధికి తగిన అవకాశాలు లేకుండా పోయాయి. అదేగాదు : కొన్ని సంవత్సరాలనుంచి విడిపోతేగాని తాము అభివృద్ధిగాలేమనే గాఢవిశ్వాసం వారిలో ప్రబలింది. వారి కోర్కెను తీర్చకపోతే, త్వరలో అది ఆందోళనకు కారణమవుతుంది. కాబట్టి అందుకు ఇదే సరైన సమయం."

ఈ ప్రకటన, అప్పటికే ఆంధ్రయువకుల రక్తనాళాలలో చొచ్చి, హృదయ సంచలనం గావిస్తున్న జాతీయోద్యమంతోబాటు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గావించటం అత్యావశ్యకమనే భావాన్ని ప్రబోధించింది.

మొట్టమొదటిసారిగా ఈ భావానికి నిర్దిష్టస్వరూప మిచ్చింది 1908 లో గుంటూరులో స్థాపించబడిన యువజన సాహితీసమితి.

ఉమ్మడి మద్రాసురాష్ట్రంలో తెలుగువారి పరిస్థితి తీసికట్టుగా ఉంది. వారికి ఆత్మగౌరవ స్థానం లభించే అవకాశం కనబడడంలేదు. రాష్ట్రంలో నాలుగు ప్రదేశాలనుండి ఎన్నుకోబడి, రాష్ట్రపాలనలో ఇంగ్లీషు భాష రానివారు పాల్గొనడానికి సాధ్యంగాదని స్పష్టమవుతున్నది. అంతేగాదు: ఇట్టి పరిస్థితుల్లో జన సామాన్యం రాష్ట్రపాలనా వ్యవహారాల్లో సరైన పాత్ర వహించడం అసంభవం ...

ఈ పరిస్థితులకు పరిష్కార మార్గం మద్రాసు రాష్ట్రాన్ని భాషాప్రయుక్తంగా విభజించడమేనని యువజన సాహితీ సమితి సభ్యులు కొంతమంది నిర్ణయానికి వచ్చారు.

ఆంధ్ర జిల్లాలను చెన్నరాష్ట్రంనుండి విడదీసి, ప్రత్యేక రాష్ట్రంగా నిర్మించాలనీ, రాష్ట్రానికైన హైకోర్టు, రెవిన్యూ బోర్డు మొదలైనవన్నీ ప్రత్యేకంగా ఏర్పడాలనీ, అందుకు తగిన ఆందోళన సాగించాలనీ నిర్ణయించుకున్నారు.

1911లోనే శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ, శ్రీ చల్లా గురునాథం గార్లు విశాలాంధ్ర మ్యాపును ఒకదానిని తయారుచేసి అచ్చు వేయించారుకూడా.

## ఆంధ్రమహాసభ వాంఛా నిర్వచన

కొన్నాళ్లు రాష్ట్ర ప్రచారం చేసి తరువాత రాజకీయ సభలలో తీర్మానింపజేయాలని ఉద్దేశించబడింది.

1912 లో కృష్ణాజిల్లా కాంగ్రెసు సభ నిడదవోలులో జరిగింది. ఈ సభలోనే భాషారాష్ట్ర విభజనను గూర్చిన తీర్మానం మొట్టమొదటిసారిగా ప్రవేశపెట్టబడింది. కాని, జిల్లా సభ సమావేశాల్లో రాష్ట్ర విషయాలను చర్చించే, జిల్లాసభలో ఈ తీర్మానానికి తావులేదనే కారణంతో అది చర్చకే రానీయలేదు.

కాని, ఆ సభకు వచ్చిన వారిలో, జిల్లా సభలుగాక, మొత్తం ఆంధ్ర జిల్లాలకన్నిటికీ ఒకసభ ఉండడం అవసరమనే భావం కలిగింది. అదే ఆంధ్రమహాసభ రూపం తీసుకుంది.

1913 లో ఆంధ్రమహాసభ మొదటి సమావేశం జరిగింది.

ఆ సమావేశంలో భాషారాష్ట్ర తీర్మానము ప్రతిపాదించబడింది. కాని, దీనికి తీవ్రమైన వ్యతిరేకం రావడంవల్ల, ఒక రాజీ తీర్మానం మాత్రమే చేయబడ్డది.

"పరిపాలనా సౌష్ఠవంకోసం, ప్రజా శ్రేయోభివృద్ధి నిమిత్తం భాషలననుసరించి, రాష్ట్ర విభాగం చేయడం ఎప్పటికయినా అవసరమని ఆంధ్రులలో కొందరు అభిప్రాయ పడుతున్నట్లు, అందువల్ల ఈ రాజధానిలోని తెలుగు జిల్లాలనొక ప్రత్యేక రాష్ట్రంగా చేయుటకు ప్రభుత్వం వారిని కోరవచ్చునా ? అన్న విషయాన్ని గూర్చి ప్రజాభిప్రాయాన్ని నిర్ధారణచేసి, రాబోవు మహాసభకు నివేదించాలి" అని ఆ తీర్మానం.

ప్రజాభిప్రాయ నిర్ధారణకై తెలుగు జిల్లాలన్నిటా విరివిగా ప్రచారం జరిగింది. దీని ఫలితంగా మరు సంవత్సరం నాటికే, బెజవాడ (1913) లో జరిగిన సమావేశంలో ఆంధ్రరాష్ట్రం "వాంఛనీయమని" తీర్మానించబడింది.

1914 లో విశాఖలో జరిగిన మూడవ ఆంధ్ర మహాసభా సమావేశంలో ఆంధ్ర రాష్ట్రం "వాంఛనీయ"దశనుండి "రాష్ట్ర నిర్మాణం అవశ్యంగాను ప్రభుత్వంవారు త్వరగా రాష్ట్రనిర్మాణం గావింపవలసినది" అనే స్థాయి నందుకున్నది.

ఇచ్చట ఒక ముఖ్య విషయాన్ని పేర్కొనక తప్పదు. ఇంతవరకూ మద్రాసు నగరం ఆంధ్రరాష్ట్రానికి రాజధానిగా పనికి రాదనే ప్రచారం జరుపబడ్డది. తరువాత మధ్యలో మద్రాసు నగరం రాజధానిగ కోరబడినా, అరిగి (1920) మహానందిలో ప్రకాశంగారి అధ్యక్షతను జరిగిన సభలో దీని ప్రసక్తిలేకుండానే, భాషారాష్ట్ర తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడింది.

దేశాన్ని భాషాప్రాతిపదికపై పునర్నిర్మించాలని కోరుతూ 1916 లో ఆంధ్ర మహాసభ భారత జాతీయ కాంగ్రెసుకు ఒక విజ్ఞాపనపత్రాన్ని అందజేసింది.

దీని కనుగుణ్యంగా ఆంధ్రకు ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెసు కమిటీని ఏర్పరచాలని 1917 కలకత్తా కాంగ్రెస్ మహాసభలో కోరబడింది.

అనీబిసెంటు, గాంధీజీ దీన్ని వ్యతిరేకించారు. కాని, తిలక్ సహాయంతో ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెసుకమిటీ తీర్మానం నెగ్గింది.

దీనితో ప్రత్యేక రాష్ట్రాందోళనకు బలం చేకూరింది.

## మాంటెగ్ - ఫర్డ్ సంస్కరణలు

భారత రాజ్యాంగాన్ని సంస్కరించడానికి మాంటెగ్యూ, చెమ్స్‌ఫర్డులు 1917లో భారతదేశానికి వచ్చారు. ప్రత్యేకరాష్ట్రాన్ని కోరుతూ ఆంధ్ర ప్రముఖులు రాయబారం వెళ్ళారు.

1918 లో సామ్రాజ్య శాసనసభలో ఆంధ్రరాష్ట్రాన్ని ప్రత్యేకించాలనే తీర్మానం ప్రప్రథమంగా ప్రవేశపెట్టబడింది. ఇదే కోరికను పునరుద్ఘాటిస్తూ లండనుకు రాయబారం నడుపబడింది.

ఈ ఆందోళన ఫలితంగా మాంటెగ్-ఫర్డ్ రిపోర్టు (1918) లో భాషారాష్ట్రవాంఛ న్యాయమైనదేనని అంగీకరించబడింది.

“రాష్ట్ర శాసనసభల్లో అత్యధిక సంఖ్యాకులు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణానికి అంగీకరిస్తూ తీర్మానిస్తే, ప్రభుత్వం అందుకు అంగీకరించవచ్చు” అని 1919 ఇండియా చట్టం 52 (ఎ) సెక్షన్ క్రింద రాష్ట్ర విభజనకు అవకాశం కల్గించబడింది.

## శాసనసభల్లో తీర్మానాలు

ఈ అవకాశం ప్రోద్బలంతో రాష్ట్ర కేంద్ర శాసనసభల్లో పలుసార్లు ఆంధ్ర రాష్ట్ర తీర్మానం ప్రవేశ పెట్టబడింది; అంగీకరించబడింది.

రెండుసార్లు (1922, 1927) కేంద్ర శాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సంబంధించిన తీర్మానాన్ని అంగీకరించింది.

1927 మార్చి 19 న మద్రాసు శాసనసభలో ప్రత్యేక రాష్ట్ర తీర్మానం అధిక సంఖ్యాకులచే అంగీకరించబడింది. అదే సంవత్సరం స్టేట్ కౌన్సిల్ లోకూడ ఒక తీర్మానం చేయబడింది. 1927 లో చేసిన తీర్మానంపై ప్రభుత్వ మవలంబించిన తాటస్థ్యాన్ని విమర్శించడానికి 1928 లో మద్రాసు శాసనసభలో తెచ్చిన కోత తీర్మానంకూడా నెగ్గింది.

మరల 1928-47 ల మధ్య మూడు సార్లు మద్రాసు శాసనసభలో యిట్టి తీర్మానం ఆమోదింపబడింది.

అయినా రాష్ట్రం రాలేదు. తాము ఏర్పరచుకున్న రాజ్యాంగ సూత్రాలనే బ్రిటీషుప్రభుత్వం కాలదన్నింది.

శాసన సభల్లోనేగాక, బయట కూడా ఆనాటి కానాడు రాష్ట్రాందోళనకు బలం చేకూరుతూ వచ్చింది.

ఈ ఉద్యమంలో భాగంగానే వచ్చిన ఆంధ్ర విశ్వకళాపరిషత్తు కోరిక మటుకు 1926 లో సాధించబడింది.

1928 లో లక్నోలో జరిగిన అఖిలపక్ష మహాసభ ఆంధ్రరాష్ట్రమును వెంటనే ఏర్పరచాలని తీర్మానించింది. 1929 లో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు కన్వెన్షన్ కూడ ఈలాంటి తీర్మానాన్నే ఆమోదించింది.

1928 లో అఖిలపక్ష మహాసభ నిర్ణయానుసారం వెలువడిన నెహ్రూ నివేదిక ఆంధ్రరాష్ట్రవిభజన అత్యవసరమని నొక్కి చెప్పింది.

## సైమన్ కమిషన్

1928 లో బ్రిటిష్ ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణల విచారణకై సైమన్ కమిషన్‌ను మన దేశానికి పంపింది.

నూతన రాజ్యాంగంలో ఆంధ్ర రాష్ట్రానికి అవకాశం కల్పించమని, ఆ సమయంలో ఆందోళన చేయబడింది.

కాని, ఆ రోజులలో స్వరాజ్యం కావాలన్న కాంక్ష బలపడి యావద్భారత దేశం సైమన్ కమిషన్ను బహిష్కరించింది. స్వాతంత్ర్య సమరంలో ఎప్పుడూ ముందంజలోనున్న ఆంధ్రదేశంగూడా సైమన్ కమిషన్ను బహిష్కరించింది. "సైమన్ తిరిగిపో" అన్న నినాదం యావదాంధ్రలో మారుమ్రోగింది.

ఆంధ్రలోని ఉద్యమ తీవ్రతను జూచి, వీళ్ళను అణచివుంచాలనే కుట్రతో సైమన్ కమీషన్ ప్రత్యేక రాష్ట్ర సమస్యను తన రిపోర్టులో ఎటూ తేల్చకుండా గాలికి వదిలి వేసింది.

ఇది చాలదన్నట్లు 1930 ఆగస్టు 11 న బ్రిటిషు ప్రభుత్వానికి ఒక మెమో పంపుతూ మద్రాసు ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్ర విభజన చేయవద్దని గట్టిగా హెచ్చరించింది.

అందుకనే 1930, 1931 లలో లండనులో జరిగిన రౌండు టేబుల్ సభలప్పుడు రాయబారాలు నడిపి, ఆందోళన చేసినా లాభంలేకపోయింది.

కాని, ఒకప్రక్క ఆంధ్రరాష్ట్రం నిరాకరిస్తూనే, మరొకప్రక్క అదే సూత్రాలపై కోరబడిన ఒరిస్సా, సింధు రాష్ట్రాలను ఏర్పరుస్తూ, సామ్రాజ్యవాదులు తమ కుటిలనీతి చాతుర్యాన్ని ప్రదర్శించుతున్నారు.

## కాంగ్రెసు వాగ్దానాలు

ఆ రోజుల్లో బ్రిటిషు ప్రభుత్వం రాష్ట్ర వాంఛను తిరస్కరిస్తున్నా, భారతజాతీయ కాంగ్రెసుమాత్రం భాషాప్రయుక్తరాష్ట్ర సిద్ధాంతాన్ని ఆమోదిస్తూ, విభజన ఆవశ్యకమనే ఉగ్గడిస్తూ వచ్చింది.

1936 ఎన్నికల ప్రణాళికలో, తాము అధికారంలోకివస్తే భాషాప్రాతిపదికపై రాష్ట్రాలను ఏర్పరుస్తామని వాగ్దానంగూడా చేసింది.

1937 లో కాంగ్రెసు ప్రభుత్వాలు వివిధ రాష్ట్రాల్లో అధికారంలోకి రావటంతో రాష్ట్రవాంఛ మళ్ళీ పెల్లుబికింది. అదే ఏడున ఆంధ్ర మహాసభ రజతోత్సవం జరుపుకుంది. కాంగ్రెసు అధికారంలోకి వచ్చింది గాబట్టి, తన వాగ్దానాన్ననుసరించి ఆంధ్రరాష్ట్రాన్ని తక్షణం ఏర్పరచాలని ఆందోళన తీవ్రతరమైంది. అదే సమయాన మహారాష్ట్రులు, కన్నడిగులు, వగైరా కూడ ప్రత్యేక రాష్ట్రానికి కాంగ్రెసుపై వత్తిడి తేవడం మొదలుపెట్టారు.

1937 అక్టోబరు 25 న జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతను కలకత్తాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో ఆంధ్రరాష్ట్ర తీర్మానం మరొకసారి ఏకగ్రీవంగా ఆమోదించబడింది. భాషా ప్రయుక్తంగా రాష్ట్రాలను వెంటనే విభజించడానికి కాంగ్రెసు మంత్రివర్గాలు తీవ్రంగా ప్రయత్నించాలనీ, అందుకను

గుణ్యమైన తీర్మానాలను శాసనసభల్లో నెగ్గించాలనీ నిర్ణయించబడింది.

## రాజాజీ పాత్ర

ఈ తీర్మానానుసారం 1938 మార్చి 30, 31 తేదీలలో మద్రాసు శాసనసభల్లో "ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ ప్రాంతాలను భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజించాలి" అని ఇండియా కార్యదర్శిని కోరుతూ ప్రవేశపెట్టబడిన అనధికార తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

కాంగ్రెసు ఆదేశానుసారం రాష్ట్ర ప్రభుత్వమే యీ తీర్మానాన్ని ప్రతిపాదించవలసింది. కాని, అప్పుడు ప్రధానమంత్రిగా నున్న రాజగోపాలాచారిగారు అందుకంగీకరించలేదు. అందువల్ల అనధికారంగానే తీర్మానాన్ని ప్రవేశపెట్టవలసి వచ్చింది.

అప్పటి మద్రాసు గవర్నరు ఆ తీర్మానానికి సుముఖత చూపెట్టాడు. మద్రాసు నగరంలోనే ఆంధ్ర రాష్ట్రానికీ, తమిళ రాష్ట్రానికీ రాజధాని ఏర్పరచి, రెంటికీ ఒకే గవర్నరు ఉండవచ్చునన్న అభిప్రాయాన్ని వెల్లడించాడు.

దానితో ఆంధ్రరాష్ట్రం సిద్ధించినట్లే అంతా అనుకున్నారు.

కాని, వారి ఆశలు అడియాశలయ్యాయి. ప్రత్యేకరాష్ట్రానికి విముఖుడైన రాజాజీ, శాసనసభా తీర్మానానుసారం తీవ్రమైన చర్యలు తీసుకోవలసిందిపోయి, విభజన అసలు పనికిరాదని ఇండియా కార్యదర్శికి రహస్య 'నోటు' పంపించాడు.

ఆయన సలహా ప్రకారం ఇండియా కార్యదర్శి, రాష్ట్ర విభజనను నిరాకరించాడు.

అనాడు కాంగ్రెసు మంత్రివర్గంలో ప్రకాశంగారుకూడా ఉన్నారు; అయినా దీనిపై మౌనం వహించారు.

## శ్రీబాగ్ ఒడంబడిక

రాయలసీమ వెనుకబడిన ప్రాంతం. చదువు సంధ్యలలోనూ, ఉద్యోగాలలోనూ, ఆర్థికంగానూ రాయలసీమ సర్కారు జిల్లాల ప్రాంతంకన్నా ఎంతో అడుగునపడి ఉంది.

దీనికున్న అసలు కారణం మరుగుపరచి, రాయలసీమలోని భూస్వామ్య వర్గాలు, యితర ప్రతీపశక్తులు, అచ్చటి మధ్య తరగతి ప్రజలు, విద్యాధికులలోను ఉన్న అసంతృప్తిని ఉపయోగించుకుని, సర్కారు జిల్లాలపై అనుమానాలను, అపోహలను కల్గించారు.

సర్కారు ప్రాంతంనుండి అచ్చటకు వెళ్ళిన ఉద్యోగస్థులు, సర్కారాంధ్ర కాంగ్రెసు నాయకులు, యితరుల ప్రవర్తన కూడా ఇందుకు కొంత తోడ్పడింది.

1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం స్థాపించినపుడు, దాని కేంద్రం ఎక్కడ ఉండాలా అనే విషయంపై తర్జన భర్జనలు జరిగాయి.

మొదట ఆ కేంద్రం బెజవాడలో వుంది. కాని, అది గుంటూరులో ఉండాలని కొందరూ, రాజమండ్రిలో ఉండాలని మరికొందరూ, వివాదాలుపడి చివరకు ఒక మూలనున్న విశాఖపట్టణానికి తరలించి వేశారు. ఇది రాయలసీమవాసులకు ఎంతో దూరం, యిబ్బందికూడా. దీనిపై వారు కోపించి, తమ ప్రాంత కళాశాలల నన్నిటినీ మద్రాసు విశ్వవిద్యాలయంలోనే ఉంచేట్టు చేశారు.

సర్కారు వాసులపైనున్న అనుమానాలూ, అసంతృప్తులూ హెచ్చయాయి. ఆంధ్రరాష్ట్రోద్యమాన్ని గూడా అనుమానంతో చూడ్డం ఎక్కువయింది. ఆంధ్రరాష్ట్రమొస్తే సర్కారువారిదే పైచేయి అవుతుందనీ, తమకు న్యాయం జరగదనే భయం ఒకప్రక్క, ఆంధ్రరాష్ట్రం లోటు రాష్ట్రంగా ఉంటుందనీ, అందువల్ల వెనుకబడివున్న రాయలసీమాభివృద్ధికి తగినంత ఆర్థికస్తోమత ఉండదనే భయం మరొకప్రక్క వారిని పీడించుతూవచ్చింది.

పరస్పర అపోహలు, ద్వేషభావం ఆంధ్రుల ఐక్యతకు గొడ్డలిపెట్టువంటివి. ఈ అనైక్యతను ఉపయోగించుకుని ప్రతిపక్షులు ఆంధ్రరాష్ట్ర వాంఛకు సున్నా చుట్టడానికి వీలుంటుంది.

ఈ ప్రమాదాన్నుంచి ఉద్యమాన్ని కాపాడి, రాష్ట్రసిద్ధికి మార్గం సుగమం చేయడానికని రాయలసీమ నాయకులు, సర్కారు నాయకులు 1937 నవంబరు 14 వ తేదీన మద్రాసులో "శ్రీబాగ్" అనే యింట్లో ఒక ఒప్పందానికి వచ్చారు.

అదే శ్రీ బాగ్ ఒడంబడిక. ఆ ఒడంబడికలోని ప్రధానాంశాలు యివి :

1. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం ఏర్పడినపుడు ఆంధ్ర విశ్వ విద్యాలయంక్రింద విశాఖపట్టణం, అనంతపూరులలో రెండు విశ్వవిద్యాలయ కేంద్రాలుంచాలి.

2. రాయలసీమలో మేజరు ప్రాజెక్టుల నిర్మాణానికి మొదటి పదిసంవత్సరాల్లోనూ ప్రిఫరెన్సు యివ్వాలి.

3. రాజధాని, హైకోర్టులలో రాయలసీమ ఏది కోరుకుంటే అది అక్కడ వుంచాలి. రాజధాని, హైకోర్టు, విశ్వవిద్యాలయ కేంద్రం - మూడు మూడుచోట్ల ఉండాలి.

4. జనాభా ప్రాతిపదికమీద గాక, జిల్లాలకు సమాన ప్రాతినిధ్యం అనే సూత్రంమీదనే శాసనసభ ఏర్పరచాలి.

ఈ ఒప్పదం కుదిరాక 1938 జనవరిలో ఆంధ్ర సౌహార్ద సంఘం అనే పేరుతో ఆంధ్ర ప్రాంతాల్లో పర్యటించి ఈ ఒడంబడికపట్ల ఒక విధమైన మూజువాణీ ప్రజామోదం పొందారు.

కాని, శ్రీబాగు ఒడంబడిక రాయలసీమవాసులలోనున్న అనుమానాలనివృత్తికీ, అసంతృప్తుల ఉపశమనానికీ కొంత వరకు తోడ్పడి ఉండవచ్చు. కాని, ఈ ఒడంబడిక ప్రజాస్వామిక సూత్రాలకే విరుద్ధం.

ఒక ప్రాంతం మరొక ప్రాంతంకన్నా వెనుకబడి ఉండడంవల్ల, శాశ్వత కరువు కాటకాలకు గురియవుతూ రావటంవల్ల ఆ ప్రాంతం ఆర్థిక విషయాలలో, ప్రాజెక్టుల నిర్మాణ విషయంలో ప్రాధాన్యతను, "హామీ"లను కోరవచ్చు కాని, వెనుకబడి ఉండడంపేరిట మొత్తం జాతి శ్రేయస్సుకు విరుద్ధమైన కోర్కెలను కోరడంగానీ, వాటిని "యివ్వడం"గానీ, జాతికే నష్టం; పొరబాటు.

రాజధాని, హైకోర్టువగైరాలు మొత్తం దేశానికీ,ప్రజలకూ సంబంధించిన సమస్యలు. అవి మొత్తం శ్రేయస్సు దృష్ట్యానే తీరుమానమవ్వాలి.

జిల్లా నిష్పత్తిపై ప్రాతినిధ్యం అనే అంశంకూడ ప్రజాస్వామిక సూత్రాలకే భిన్నం.

ఈలాటి ఒడంబడికలు చేసుకోవటమే తప్పు. తరువాత చరిత్ర దీనినే రుజువు చేసింది.

శ్రీబాగు ఒడంబడిక ఆంధ్రుల మధ్య పూర్తి ఐక్యతనుగానీ, శాశ్వత ఐక్యతను గానీ సాధించలేదు. తర్వాత కాలంలో కొన్ని రాజకీయ పార్టీల నాయకులు, ముఖ్యంగా కాంగ్రెసు అధిష్టానవర్గాలచేతలు మాటలవల్లరాయలసీమ-సర్కారువిభేదాలు పెరుగుతూ వచ్చాయి.

ఈ పార్టీల నాయకులు స్వప్రయోజనాలకై తమ మధ్య వచ్చిన కీచులాటలలో ప్రజలను చీల్చడానికి ప్రయత్నించారు. కొంతవరకు జయించగలిగారు.

రాను, రానూ ఈ ఒడంబడిక ఎంత ప్రజాతంత్ర విరుద్ధమో స్పష్టమవుతూ వచ్చింది. దీనిపై "ఆంధ్ర పత్రిక" ఈ విధంగా వ్యాఖ్యానించింది.

"ఈ ఒడంబడికను తయారుజేసిన నాయకులు ఏ విధమైన రాజకీయ పరిజ్ఞానాన్ని గాని, దూర దృష్టిని గాని ప్రదర్శించలేదనే మేము మొదట్నుంచీ అభిప్రాయపడు తున్నప్పటికీ, ఆ ఒడంబడికను రద్దు చేయాలనిగాని, ఆ ఒడంబడికను త్రోసి రాజ నాలనిగాని, ఈనాటికీ మేము సూచించ లేదు." (సంపాదకీయం : 8-11-53)

ప్రతిసారీ రాయలసీమ మహాజనసభ నాయకులూ, కాంగ్రెసు అగ్రనాయకులూ ఈ ఒడంబడికను అడ్డం వేసుకుని శిఖండి యుద్ధం చేస్తూ వచ్చారు.

కాని, తీరా ఆంధ్రరాష్ట్రం సిద్ధించాక ఏ నాయకుడైతే ఈ ఒడంబడికను నెత్తి మీద పెట్టుకుని ఊరేగాడో, వారే దీన్ని భగ్నంచేశారు.

ఇంతవరకూ భాషారాష్ట్రాన్ని వెంటనే ఏర్పాటు చేయాలని కోరుతూ వచ్చిన కాంగ్రెసు 1938 లో ధోరణి మార్చింది. కేంద్రంలో కాంగ్రెసుకు అధికారం రాగానే ఈ సమస్య పరిష్కరించబడు తుందని "వాగ్దాన" మిచ్చింది. (వర్కింగు కమిటీ తీర్మానం – 1938)

స్వాతంత్ర్య సాధన ప్రథమ సమస్య; రాష్ట్రసాధన రెండవ శ్రేణికి చెందిన

సమస్య; ప్రథమ సమస్యకే ముందు ప్రాధాన్యమివ్వాలి; దాని తర్వాతనే తక్కినవి; అందువల్ల తక్కిన సమస్యలన్నీ వేచి ఉండాలి-అనే సిద్ధాంతాన్ని లేవదీసింది.

తరువాత 1941 లో విశాఖపట్టణంలో జరిగిన 23 వ ఆంధ్రమహాసభలో అన్ని త్యాగాలూ చేసి, రాష్ట్ర నిర్మాణాన్ని సిద్ధింపజేయాలనే తీర్మానం చేయబడింది.

"ఇంతకాలం ఆంధ్రులు తీవ్రముగా ఆందోళన గావించుటకు మహాసభలు జరిపి అనేక ప్రయత్నములు చేసినను ప్రభుత్వము వారు అంగీకరింపక చెడచెవిని పెట్టుచుండుటవలన, మరల శాసనసభా కార్యములు సాగినపుడు అందరి ఆంధ్ర శాసన సభ్యులు రాష్ట్ర నిర్మాణమునకు చలయు కృషికి ఎట్టి ఆటంకములువచ్చినను వానిని తొలగించి, అప్పటికి సాధ్యముగానియెడల ఆంధ్ర శాసనసభ్యులును, తక్కిన ఆంధ్ర ప్రజలును గూడ అన్ని విధముల త్యాగము గావించి రాష్ట్ర నిర్మాణము సిద్ధింపజేయవలెను" అని ఆ తీర్మానపు సారాంశం.

## క్విట్ ఇండియా జె. వి. పి. రిపోర్టు

రెండవ ప్రపంచ యుద్ధం ఒక ప్రక్క, క్విట్ ఇండియా ఉద్యమం ఒక ప్రక్క సాగుతున్న రోజుల్లో రాష్ట్రోద్యమం మందకొడిగా నడిచినా, ఆందోళన ఆరకుండానే సాగింది.

1946 లో ఎన్నికలు వచ్చాయి. ఆంధ్ర రాష్ట్ర వాంఛ ఎన్నిక ప్రణాళికాంశంగా ముందుకొచ్చింది. ఆంధ్ర కమ్యూనిస్టులు దున్నేవాడికే భూమి అనే నినాదంతో పాటు విశాలాంధ్ర సాధన కూడా ఒక ప్రాథమిక అంశంగా తీసుకున్నారు. అతి విస్తృతమైన ప్రచారం గావించారు. ప్రజల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక ప్రయోజనాల కన్వయించి రాష్ట్రావసరాన్ని వివరించారు.

మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెసు మరల అధికారంలోకి వచ్చింది. 1947 ఏప్రిల్ 18 న భాషారాష్ట్రాలపై ఒక తీర్మానాన్ని ప్రతిపాదించింది. భారత రాజ్యాంగాన్ని తిరిగి తయారుచేసేటప్పుడు దేశాన్ని భాషాప్రయుక్తంగా పునర్విభజించడం ముఖ్యంగా ఆంధ్ర, కర్ణాటక, తమిళ, కేరళ రాష్ట్రాలను ఏర్పరచడం అవసరమనీ ఈ సమస్యను రాజ్యాంగ నిర్ణయసభ తీసుకోవాలనీ, అందుకు అవసరమయిన సరిహద్దు సంఘాలను నియమించాలనీ తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించబడింది.

ఈవిధంగా మొత్తం దక్షిణ భారతదేశమంతా భాషారాష్ట్రాలుగా విభజింపబడాలని కోరబడింది.

ఈకాలంలోనే భారతదేశం యావత్తూ బ్రహ్మాండమైన ప్రజా వెల్లువతో ఊగిపోయింది. బ్రిటిషు ప్రభువులపై ద్వేషంతో అట్టుడికినట్లు ఉడికిపోయింది.

దేశమంతటా మున్నెన్నడూలేని ప్రజా సమరాలు చెలరేగాయి. ప్రభుత్వోద్యోగుల సమ్మెలు, పోలీసు సమ్మెలు, ఐ. ఎన్. ఎ. పోరాటాలు, నావికుల తిరుగుబాటు జరిగాయి.

ప్రత్యక్షపాలన యిక సాగదని బ్రిటిషు ప్రభుత్వం గ్రహించింది.

1947 ఆగస్టు 15 న "స్వరాజ్య" ప్రదానం జరిగింది. కాంగ్రెసుపార్టీ కేంద్రంలో అధికారానికి వచ్చింది.

దీనితో రాష్ట్రవాంఛ మరొకసారి ప్రజ్వలించింది. కాంగ్రెసుపార్టీ ఇన్నాళ్లూ చేస్తూవచ్చిన వాగ్దానాలను అమలు పర్చమని ఆందోళన అధికమైంది. "ముందు స్వాతంత్ర్యం, తర్వాత రాష్ట్రం" అన్న కాంగ్రెసు నాయకులు, తీరా స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, ధోరణి మార్చారు. సరి క్రొత్త వాదనలను లేవదీశారు.

భాషా రాష్ట్రాలుగా విభజించడం దేశాన్ని ముక్క చెక్కలు చేయడమనీ, భాషారాష్ట్రవాంఛ భారతీయ ఐక్య భావానికి విఘాతమనీ, ఇదొక దురభిమాన పూరితమైన కోర్కెయనీ వాదించడం మొదలుపెట్టారు.

తాము క్రొత్తగా అధికారంలోకి వచ్చామనీ, దేశంలో ఎన్నో ప్రధాన సమస్యలున్నాయనీ, "ముందుసమస్యలు ముందనీ" పటేల్, నెహ్రూ మొదలగువారు ఆటంకాలు కల్గించ జూచారు.

దీనితో అలజడి, ఆందోళన హెచ్చయింది. నూతన రాజ్యాంగంలో ప్రత్యేక రాష్ట్రానికి అవకాశం కల్గించాలని అన్ని ప్రక్కలనుంచీ వత్తిడివచ్చింది. ఈ ఒత్తిడికి తట్టుకోలేక, భాషా ప్రయుక్త రాష్ట్రవిభజనలోని మంచిచెడ్డలను,సాధ్యాసాధ్యాలను విచారించి నివేదించడానికిగాను కాంగ్రెసుప్రభుత్వం థార్ కమిషన్ను నియమించింది.

థార్ కమీషను వచ్చినపుడు "మద్రాస్ మాకే రావాలని" ప్రకాశంగారు పట్టు పట్టడం, ఆంధ్రరాష్ట్ర విభజన అనర్థకమంటూ రాయలసీమ మహాసభాధ్యక్షుడుగా శ్రీ నీలం సంజీవరెడ్డి విజ్ఞాపన యివ్వడం, అసలే భాషారాష్ట్రాలకు వ్యతిరేకమైన థార్కు మంచి అవకాశం లభించింది. సరిగాని లెక్కలు తయారుచేసి ఆంధ్ర రాష్ట్రం స్వయంపోషకంగాదని తేల్చి ఆంధ్రరాష్ట్ర విభజన పనికిరాదని నివేదించింది. థార్ కమీషన్ భారతదేశాన్ని భాషాప్రయుక్తంగా ఎన్నడూ విభజించనే రాదనికూడా సిఫార్సు చేసింది.

ఈ నివేదిక కాంగ్రెసువాదులలోనే తీవ్రమైన అసంతృప్తిని కల్గించింది. 1948 డిసెంబరు 18 న జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీలో భాషారాష్ట్ర సమస్యపై చాలా తీవ్రమైన తర్జన, భర్జనలకు కారణమైంది. ఘాటుగా సాగిన ఈ చర్చలను జూచి, కాంగ్రెసు అగ్రనాయకులు మరొక విచారణ సంఘాన్ని వేయవలసి వచ్చింది.

జవహర్లాల్ నెహ్రూ, సర్దార్ వల్లభాయిపటేల్, భోగరాజు పట్టాభి సీతారామయ్యాగారలు ఈ సంఘంలోని సభ్యులు.

మరో నాల్గు నెలల తర్వాత (1949 ఏప్రిల్ 5 న) జరిగిన అ. భా. కా. క. సమావేశంలో వీరు తమ నివేదికను సమర్పించారు. అదే జె. వి. పి. రిపోర్టు.

ఈ కమిటీ కూడ్నెల్లవరకూ భారత దేశాన్ని భాషాప్రయుక్తంగా విభజించడం వాయిదా వేయాలని అభిప్రాయ పడినా, ఆంధ్రరాష్ట్ర విభజనమాత్రం అవసరమని సిఫార్సు చేసింది. కాని, ఆంధ్రులు మద్రాస్ నగరం సంగతి పట్టుపట్టగూడదని చెప్పింది.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం 1949 నవంబరు 11న విజయవాడలో సమావేశమై ఈ రిపోర్టును అంగీకరించింది.

ఒక ప్రక్క దీనిని అంగీకరిస్తూనే, మరో ప్రక్క తాత్కాలిక రాజధానిని మద్రాసులో పెట్టుకోనివ్వాలనీ,మద్రాసును

చీఫ్ కమిషనర్ రాష్ట్రం చేయాలనీ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంకోరింది.

## మరొకసారి ఆశాభంగం

1949 నవంబరు 16 న కాంగ్రెసు వర్కింగ్ కమిటీ జె. వి. పి. రిపోర్టుమేరకు ఆంధ్రరాష్ట్రం తక్షణం నిర్మించబడాలని తీర్మానించింది. కేంద్ర ప్రభుత్వం ఈ నిర్ణయాన్ని అంగీకరిస్తూ, 1950 జనవరి 26 వ తేదీకి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం సాధ్యమౌతుందేమో తెలియజేయమనీ, అందుకవసరమైన కర్మకాండనంతా నడపమనీ మద్రాసు ప్రభుత్వానికి వ్రాసింది.

మద్రాసు ప్రభుత్వం విభజన సంఘాన్నొకదాన్ని ఏర్పాటుచేసింది. అవసరమైన కర్మకాండనంతా జరిపింది. నిర్వివాద ప్రాంతాలైన 11 జిల్లాల, 3 తాలూకాలతో ఆంధ్రరాష్ట్రాన్ని ప్రత్యేకించవచ్చునని సిఫార్సు చేసింది.

కాని, విభజనసంఘంలో సభ్యులైన ప్రకాశంగారు మెజారిటీ నిర్ణయంతో ఏకీభవించక, మద్రాసు భవిష్యత్తు నిర్ణయమయే వరకూ ఉమ్మడిరాష్ట్ర ఆస్తి, అప్పుల విభాగం తేల్చరాదన్నారు. మద్రాసు నగరం క్రింద ఆంధ్ర రాష్ట్రానికివ్వాలని సూచించిన కోటి రూపాయల నష్టపరిహారం చాలా తక్కువ మొత్తమన్నారు. మిగతా మద్రాసు రాష్ట్రంలోని విద్యుచ్ఛక్తి స్కీములక్రింద ఆంధ్ర రాష్ట్రానికి 20 కోట్ల రూపాయలు ముందరా యివ్వాలన్నారు.

అప్పుడు మద్రాసులో సమావేశమైన (4-1-1950) ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం శాశ్వత రాజధాని రాయలసీమలో ఉండాలని తీర్మానించింది.

తాత్కాలిక రాజధాని మద్రాసులో ఉండాలనే అంశంపై తమిళులు ఏమాత్రం అంగీకరించలేదు.

స్వతహాగా కాంగ్రెసు ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి విముఖం. రాజధానిపై ఆంధ్ర కాంగ్రెసు నాయకులకూ, తమిళ కాంగ్రెసు నాయకులకూ వచ్చిన పేచీ కేంద్ర ప్రభుత్వానికి ఒక అవకాశాన్ని యిచ్చింది. దీనిని అవకాశంగా తీసుకుని రాష్ట్ర నిర్మాణానికే స్వస్తిచెబుతూ, కేంద్ర కాంగ్రెసు ప్రభుత్వం జనవరి 16 న ఒక ప్రకటన జారీచేసింది.

రాష్ట్రం వచ్చేసింది అని అనుకుంటున్న ఆంధ్ర ప్రజలకు ఈ ప్రకటన తీరని ఆశాభంగం కలిగించింది.

## జనరల్ ఎన్నికలు

1951 చివరిలో దేశమంతటా జనరల్ ఎన్నికలు జరిగాయి. మొదటిసారిగా వయోజనుల కందరికీ ఓటింగు హక్కు యివ్వబడింది.

అన్ని పార్టీలూ తమ ఎన్నికల ప్రణాళికలలో ఆంధ్రరాష్ట్ర సాధన ఒక అంశంగా ప్రకటించాయి.

అప్పుడే, నాల్గేండ్ల రహస్య జీవితానంతరం, కమ్యూనిస్టుపార్టీ బహిరంగంగా వచ్చింది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును అతి ప్రధానాంశంగా, తక్షణ సమస్యగా ప్రజల ముందుంచింది.

"మద్రాసు రాష్ట్రాన్ని మార్పుచేసి, దాని స్థానే భాషా ప్రయుక్త రాష్ట్రాలను నిర్మించడం, వెను వెంటనే ఆంధ్ర జిల్లాలను విడదీసి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పరచడం.

"హైదరాబాదు సంస్థానాన్ని రద్దుచేసి అందలి తెలుగు జిల్లాలను, ప్రాంతాలను, తెలంగాణా ప్రజాభీష్టాన్ననుసరించి, ఆంధ్ర జిల్లాలకు జతపర్చి, హైదరాబాదును ముఖ్య పట్టణంగా నిర్ణయించి, "విశాలాంధ్ర ప్రజా రాజ్య నిర్మాణం" కోరుతూ, కమ్యూనిస్టు పార్టీ తనఎన్నికల ప్రణాళికలో పేర్కొంది.

ఏ ఇతర పార్టీ చేయనంత విస్తృతంగా, దీర్ఘంగా ప్రచారం కమ్యూనిస్టుపార్టీ ఈ సమస్యపై చేసింది.

కాంగ్రెసు తరఫున ఎన్నికల ప్రచారమునకై వచ్చిన నెహ్రూ ఆంధ్రులభాషారాష్ట్ర వాంఛను విమర్శిస్తూ మాట్లాడాడు. ఇది ప్రజలలో తీవ్రమైన అసంతృప్తికి దారితీసింది. నెహ్రూ ప్రసంగాలను ఎదుర్కొంటూ "నెహ్రూకు నూటిప్రశ్నలు" అనే కమ్యూనిస్టుపార్టీ కరపత్రం 40,000 ఒక్కత్రుటిలో ఖర్చయాయంటే, ఆంధ్రులు రాష్ట్రాన్ని ఎంతగాఢంగా వాంఛిస్తున్నారో ద్యోతకమౌతుంది.

ఎన్నికల్లోపాలకపార్టీ అయిన కాంగ్రెసు పార్టీ ఘోరపరాజయం పొందింది.

అప్పటికి ఏండేండ్లుగా కాంగ్రెసు ప్రభుత్వాలు పాలించుతున్నా, ఆంధ్ర రాష్ట్రం రాకపోవడం, పదేపదే తమ వాగ్దానాలను భగ్నపరచుతూ రావడం, ఎన్నికలలో నెహ్రూ ప్రసంగాలూ – ఇవన్నీ కాంగ్రెస్ పరాజయానికి గల కారణాలలో ఒకటి యని చెప్పక తప్పదు.

దీనికి విరుద్ధంగా కమ్యూనిస్టుపార్టీ ఎన్నికలలో అఖండ విజయాన్ని సాధించింది.

ఆ కాలంలోనే కమ్యూనిస్టుపార్టీ "నిర్వివాద ప్రాంతాలైన 11 జిల్లాల మూడు తాలూకాలతో సత్వరమే రాష్ట్ర మేర్పరచాలి" అని నినాదమిచ్చింది. వివాదగ్రస్త సమస్యలను ముడిపెడితే, రాష్ట్రం వాయిదా పడుతూవచ్చింది. అందువల్ల ఈ నినాదం ఆచరణ యోగ్యమైంది. చివరకు రాష్ట్రంకూడా ఈ ప్రాతిపదికపైనే ఏర్పడింది.

మద్రాసు శాసనసభలో కాంగ్రెసు పార్టీకి వ్యతిరేకంగా కమ్యూనిస్టులు, ప్రజాపార్టీవారు, స్వతంత్రులు కలిసి ఐక్య ప్రజాతంత్ర సంఘటనను నిర్మించారు. దానికి ఒక కనీస కార్యక్రమాన్ని రూపొందించారు.

భాషాప్రాతిపదికపై రాష్ట్రాలను ఏర్పరచటంకూడా ఆ కార్యక్రమంలో ఒక భాగంగా చేర్చారు.

## అఖిలపక్షశాసనసభ్యులసభ

ఆంధ్ర ప్రజలకు జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టడానికి ఆంధ్రులందరినీ ఒకే త్రాటిపై నడిపించాలనీ, ఐక్యత నిర్మించి, తగు కార్యక్రమం వేసుకొని ఆంధ్రరాష్ట్రం సాధించడానికి యిది మంచి తరుణమనీ, ఆంధ్రమహాసభ 1952 జులై 27 న మద్రాసులో అఖిలపక్ష ఆంధ్ర శాసనసభ్యుల సమావేశాన్ని ఏర్పరచింది.

ఈ సమావేశానికి కాంగ్రెసు శాసనసభ్యులెవ్వరూ హాజరు కారాదని ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుడు సంజీవరెడ్డిగారు నిషేధించారు. అయినా, రాష్ట్ర నిర్మాణాన్ని గాఢంగా వాంఛించిన ముగ్గురు, నలుగురు కాంగ్రెసు శాసనసభ్యులు హాజరయారు.

ప్రజాపార్టీ నాయకులు ప్రకాశం, విశ్వనాథంగార్లుకూడా ఈ సమావేశానికి రాలేదు.

పార్టీ పార్టీగా కమ్యూనిస్టు శాసన సభ్యులందరూ ఈ సమావేశంలో పాల్గొ

శ్నారు. ఆంధ్రరాష్ట్ర సాధనకై ఒక బలమైన అండగా నిలచారు.

ఈ అఖిలపక్ష సభ ఆంధ్రప్రజలందరినీ సమీకరించి, ఆంధ్రోద్యమాన్ని ఉధృతం చేయడానికి నిర్ణయించింది. ఇందుకు క్రింది ముఖ్యసూత్రాలతో తీర్మానించింది.

1. వివాదం లేని ప్రాంతాలతో, అనగా 11 జిల్లాల 3 తాలూకాలతో, వెంటనే ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలని ఆందోళన చేయాలి.

2. మద్రాసునగరంలాంటి వివాదగ్రస్తమైన సమస్యలను ప్రజాభిప్రాయాన్ని సేకరించడంద్వారా పరిష్కరించుకోవాలి.

3. ఆంధ్రమహాసభలో విరివిగా సభ్యులను చేర్పించి, జాతీయ సంస్థగా అభివృద్ధి చేయాలి.

4. ఆంధ్రదేశమంతటా, ముఖ్యంగా రాయలసీమలో, విరివిగా ప్రచారం సాగించి విశాలమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించాలి.

5. సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరే అన్ని పక్షాలను, సంస్థలను, గ్రూపులను, ప్రముఖులను సమీకరించి, ఒక వేదికపైకి తెచ్చే అఖిలపక్ష మహాసభలు ఏర్పాటు చేయడానికి కృషిచేయాలి.

ఈనిర్ణయానుసారంగా 1952 సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టునాయకులు గుంటూరు, నెల్లూరు జిల్లాలలో ప్రచారం సాగించారు.

ఇచ్చట మరొకవిషయం పేర్కొనాలి. ఈ అఖిలపక్ష శాసనసభ్యుల సమావేశానికి ముందు శ్రీ సంజీవరెడ్డిగారి ప్రోత్సాహంతో రాయలసీమకు చెందిన కాంగ్రెసు స్వతంత్ర శాసన సభ్యులు 21 మంది ప్రధాని నెహ్రూకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని వాయిదా వేయాలని కోరుతూ ఒక విజ్ఞప్తిని పంపారు. మద్రాసు జిల్లా కాంగ్రెసు నాయకుల ప్రోత్సాహంతో కొంతమంది ఊరేగింపు జరిపి, "మద్రాసులేని ఆంధ్ర రాష్ట్రం వద్దు" అని నినాదాలు ఇచ్చారు. అఖిలపక్ష సమావేశకర్తలను దూషిస్తూ కరపత్రాలను పంచారు.

## స్వామి సీతారాం నిరశన వ్రతం

సంజీవరెడ్డిగారి ధోరణి కొంతమంది ఆంధ్ర కాంగ్రెసు వాదుల్లోకూడా అసంతృప్తిని కల్గించింది.

మరో ప్రక్క కాంగ్రెసు నాయకుడు స్వామి సీతారాం ఆంధ్రరాష్ట్ర సాధనకై సత్యాగ్రహం ప్రారంభించారు. ఆగస్టు 15, 1952 న ఆయన నిరశనవ్రతం పూనారు. 35 రోజులు ఏకధాటిగా సాగిన ఈనిరశన వ్రతం కాంగ్రెసు ప్రభుత్వ నాయకుల మనస్సును మార్చలేకపోయింది. చివరకు స్వామిసీతారాం తమవ్రతాన్ని మానివేశారు.

కాని, యితర పద్ధతుల సత్యాగ్రహాన్ని కొనసాగించారు. కోర్టులలోనూ, ప్రభుత్వ కార్యాలయాలలోనూ తెలుగు భాషనే వాడాలని నినాదా లివ్వడం, పికెటింగు చేయడం, రైళ్లలో టిక్కెట్టు లేకుండా ఎక్కడం, మద్రాసులో కోటముందు నిరశన వ్రతం చేయడం కొనసాగించారు.

అంతవరకూ రాష్ట్రాన్ని వ్యతిరేకిస్తూ వచ్చిన సోషలిస్టులు ఈ సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

కాని, ఈ సత్యాగ్రహోద్యమం ఆశించిన ఫలితాల్ని సాధించలేకపోయింది. ఇది ప్రజానీకాన్ని అంతగా ఆకర్షించలేకపో

యినా, రాష్ట్ర సమస్యను మరల నలుగురి నోళ్ళల్లో పడేటట్లు చేసింది.

ఈ కాలంలో విద్యార్థులు గణనీయమైన ఆందోళన జరిపారు. కాలేజీలు, హైస్కూళ్ళలోనూ, ఊరూరా సభలు ప్రదర్శనలు జరిపి రాష్ట్ర సమస్య ముందుకు రావడానికి తోడ్పడ్డారు.

## కమ్యూనిస్టుల విస్పష్ట ప్రకటన

1952 అక్టోబరులో ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ సత్వర రాష్ట్ర స్థాపనకై ఒక తీర్మానం చేసింది. అఖిలపక్ష శాసన సభ్యుల సమావేశ నిర్ణయాల కనుగుణ్యంగా చేయబడిన ఈ తీర్మాన సారాంశమిది :

1. మద్రాసు అసెంబ్లీలోనూ, కౌన్సిలులోనూ, ఆంధ్రనుంచి ఎన్నుకోబడిన కమ్యూనిస్టుపార్టీ సభ్యులంతా తెలుగు భాషలోనే మాట్లాడాలి. ఇతర పక్షాలకు చెందిన ఆంధ్ర శాసనసభ్యులను నచ్చచెప్పి వారుకూడా తెలుగులోనే మాట్లాడేటట్లు ప్రోత్సహించాలి.

2. మద్రాసు అసెంబ్లీలోనూ, కౌన్సిలులోనూ వివాదరహితమైన ప్రాంతాలతో అనగా 11 జిల్లాల తాలూకాలతో వెంటనే ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలని కోరుతూ తీర్మానాన్ని ప్రవేశపెట్టాలి. ఇతర ప్రజాస్వామ్య వాదులందరి తోడ్పాటుతో తీర్మానాన్ని గెలిపించడానికి కృషి చేయాలి.

3. మునిసిపాలిటీలు, పంచాయతీలు వగైరా స్థానిక సంస్థల్లో అదే విధంగా సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేయించాలి.

4. సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ పార్లమెంటులోని ఆంధ్రసభ్యుల ద్వారా లక్షలకొలదీ తెలుగుప్రజల సంతకాలతో పిటీషన్లు భారత రిపబ్లిక్ అధ్యక్షునికి అందజేయాలి.

ఈ తీర్మానానుసారం ఆంధ్ర కమ్యూనిస్టు శాసనసభ్యులు, ఐక్యసంఘటనలోని స్వతంత్రసభ్యులు తెలుగులోనే ఉపన్యసించడం, ప్రశ్నించడం ప్రారంభించారు. రాష్ట్ర విభజన న్యాయమైన ఆంధ్రకోర్కె పూర్తిగా నెరవేరు వచ్చేవరకూ అదే విధంగా కొనసాగించారు.

## సజీవ ప్రజా నినాదం

శాసనసభలో ప్రవేశించినది మొదలు ఆంధ్ర కమ్యూనిస్టు సభ్యులు, ఐక్య సంఘటనలోని స్వతంత్ర సభ్యులూ ప్రత్యేక రాష్ట్రావసరాన్ని పదేపదే నొక్కిచెబుతూ వచ్చారు. ప్రతి అవకాశాన్ని ఉపయోగించుకొని, ఉమ్మడి మద్రాసు రాష్ట్రంవల్ల ఎన్ని అనర్థాలు వాటిల్లుతున్నాయో వివరిస్తూ చేస్తూ వచ్చారు.

బడ్జెటు చర్చల సందర్భాల, ఇతర సమయాలలోనూ, విద్యుచ్ఛక్తి, ప్రాజెక్టులు, పరిశ్రమలు, ఉద్యోగాలు మొదలైన అనేక విషయాలలో ఆంధ్రులకు ప్రత్యేకంగా జరిగిన, జరుగుతున్న అన్యాయాన్ని ఐక్య ప్రజాతంత్ర సంఘటన సభ్యులు అంకెలతోసహా నిరూపించి, ప్రజలదృష్టికి తెస్తూ వచ్చారు. ఈ అన్యాయాన్ని అరికట్టుకోవటానికి ఎదిరిస్తూ వచ్చారు. కొన్ని తీర్మానాలను ప్రతిపాదించారు:

ఇవన్నీ ప్రజల ఆంధ్రరాష్ట్ర చైతన్య స్థాయిని పెంచడానికి తోడ్పడ్డాయి.

ఇదే సమయంలో రాజాజీ మంత్రివర్గం ఆంధ్రప్రజలకు తీరని అపకారం చేసే కార్యం చేయ సంకల్పించింది.

అదే-అన్ని పక్షాలు, అన్ని సంస్థలు కోరుతున్న తెలుగుభూమిని బంగారుభూమిగా రూపొందించే నందికొండ ప్రాజెక్టును ప్రక్కకునెట్టి కృష్ణాజలాలను తమిళ దేశానికి తరలించుకుపోయే కృష్ణా - పెన్నా ప్రాజెక్టును-పంచవర్ష ప్రణాళికలో చేర్పించే ప్రయత్నం.

కృష్ణా - పెన్న ప్రాజెక్టు అటు రాయలసీమకూ, ఇటు సర్కారు ప్రాంతాలకూ, తెలంగాణాకూ - మొత్తం విశాలాంధ్రకు ఘోర ప్రమాదాన్ని కలిగిస్తుంది.

కృష్ణా-పెన్న ప్రాజెక్టుకు వ్యతిరేకంగానూ, నందికొండ ప్రాజెక్టును పంచవర్ష ప్రణాళికలో చేర్పించమని కోరుతూ ఆంధ్రదేశమంతటా బ్రహ్మాండమైన ప్రచారం సాగింది. ఒక మహోద్యమంగా పరిణమించింది. ఆంధ్ర ప్రజల అవసరాలు తీర్చుకుంటూ తెలుగు నదుల్లోంచి ఒక్క నీటిబొట్టు కూడా పరాయి ప్రాంతాలకు తరలించడానికి వీలులేదని ఆంధ్రదేశం ప్రతిన బట్టింది.

ఈ ఉద్యమం ఆంధ్ర ప్రజల్ని, రాయలసీమ సర్కారు ఆంధ్రుల్ని సన్నిహితపర్చింది.

రాష్ట్రమే ఉంటే ఈ అన్యాయం ఉండేది కాదుగదా అనే వాస్తవాన్ని ప్రజానుభవంగా మార్చింది.

రైతు, కూలీ, కార్మికవర్గాలను మొత్తంగా కదిల్చి, రాష్ట్రోద్యమంలోకి తెచ్చింది.

ఆంధ్రరాష్ట్ర వాంఛను సజీవమైన యావదాంధ్ర ప్రజానినాదంగా మార్చింది.

## అమరజీవి శ్రీరాములు

మొత్తం మీద 1952 వ సంవత్సరం ఆంధ్రరాష్ట్రోద్యమ చరిత్రలో అతి ముఖ్యమైనది. రాష్ట్రానికై పోరాటం ఎన్నడూ లేనంత విస్తృతి, ఉగ్రరూపం తీసుకుంది. అప్పటికీ పాలకులు దిగిరాలేదు.

ఈ తరుణంలో గాంధీజీ అనుచరులలో ఒకరైన పొట్టి శ్రీరాములుగారు అక్టోబరు 19న రాష్ట్ర సాధనకై ఆమరణాంత నిరశన వ్రతం ప్రారంభించారు.

దీనితో అసలే మండుతున్న అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. నిరశనతో దీక్షలో [illegible] కొద్దీ, ఆంధ్రప్రజల్లో ఆగ్రహావేశాలు అధికమౌతూ వచ్చాయి. సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణం చేసి శ్రీరాములుగారి ప్రాణాలను రక్షించాలని ఆందోళన ప్రారంభమైంది.

[illegible] ఆంధ్ర కాంగ్రెసు కమిటీ మాత్రం నిరశనవ్రతాన్ని ఆక్షేపించింది. కాంగ్రెసు కమిటీలుగాని, నాయకులుగాని సానుభూతి తెలుపరాదని, ఆందోళనలో పాల్గొనరాదని తీర్మానించింది.

నవంబరు గడిచి, డిసెంబరు ప్రారంభమయేసరికి ఆంధ్ర దేశమంతా ఉడికిపోవడం ప్రారంభించింది.

ఆంధ్రదేశంలోని అన్ని పట్టణాలలోను శ్రీ పొట్టి శ్రీరాములు ప్రారంభించిన ప్రాయోపవేశదీక్షకు సానుభూతిని, కేంద్ర ప్రభుత్వవైఖరియెడ నిరసనగా తెలుపుతూ హర్తాళ్లు గావించారు.

విద్యార్థులు దాదాపు అన్ని హైస్కూళ్ళలోనూ, కళాశాలలలోనూ సమ్మెలు గావించి ఆంధ్రరాష్ట్ర సాధనా పోరాటంలో తమ సముచిత పాత్రను నిర్వహించారు

కమ్యూనిస్టులు, ఐక్యసంఘటనలోని స్వతంత్రులు, కొద్దిమంది ప్రజా పార్టీ వారు వాకవుట్ చేశారు. కాని, కాంగ్రెసు పార్టీవారుగాని, ప్రజాసోషలిస్టు, కృషికార్ లోక్ పార్టీ వారుగాని వాకవుట్‌లో చేర తిరస్కరించారు.

హైదరాబాదు శాసనసభమాత్రం ఈ నిరాహార దీక్షయెడ సానుభూతి తెలుపుతూ సభ వాయిదా వేసింది. తక్షణం ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది.

డిశంబరు ఆరంభం నుంచే విద్యార్థులు అనేక ప్రాంతాలలో సమ్మెలు చేశారు. అక్కడక్కడ హర్తాలులు జరిగాయి; రైళ్ళు ఆపివేయబడ్డాయి.

ఆంధ్రదేశమంతటా చెలరేగుతున్న ఆందోళన, పార్లమెంటులోనూ, అసెంబ్లీలోనూ వినిపిస్తున్న దీని ప్రతిధ్వని ఇండియా ప్రభుత్వానికి తగిలాయి.

డిశంబరు 9 న ప్రధాని నెహ్రూ "మద్రాసు నగరంతో ప్రమేయం లేకుండా ఆంధ్రులంతా నిర్వివాద ప్రాంతాలతో రాష్ట్రం యిమ్మని కోరితే" ఆంధ్ర రాష్ట్రం యేర్పరచడానికి ఇండియా ప్రభుత్వానికి అభ్యంతరం లేదని ప్రకటించాడు.

ఒక్క కమ్యూనిస్టు పార్టీ మినహా మరే పార్టీ ఈ ప్రకటనను హర్షించలేదు; నిర్వివాద ప్రాంతాలతో వెంటనే రాష్ట్రం ఏర్పాటు చేయాలని నెహ్రూను ఒత్తిడి చేయలేదు.

నెహ్రూ అస్పష్ట ప్రకటన శ్రీరాములు గారి ప్రాణాలను రక్షించలేదు. డిశంబరు 15 అర్ధరాత్రి, 58 రోజుల కఠోర నిరశన వ్రతం తర్వాత, ఆంధ్ర యోధుడు శ్రీరాములుగారు అసువులను బాశారు.

## ప్రజా విజృంభణ

దీనితో ఆంధ్రుల క్రోధాగ్ని కట్టలు తెగింది. పల్లెపట్టెనా, వాడవాడనా, ఆంధ్రదేశం, రాయలసీమ, కోస్తా, తెలంగాణా విభేదం లేకుండా రాష్ట్ర నినాదాన్ని ప్రతిధ్వనించింది.

రాష్ట్రంలోని పట్టణాలన్నీ సంపూర్ణ హర్తాళు ప్రకటించాయి. కొన్ని పట్టణాలు రెండు, మూడు రోజులు హర్తాళు చేశాయి. లక్షల కొలది ప్రజలు వీధులలోకి వచ్చారు. రైళ్ళ రాకపోకలూ, ఆఫీసులూ అన్నింటినీ బందుచేశారు. కలకత్తా మెయిలు, ఢిల్లీ ఎక్స్‌ప్రెస్ పూర్తిగా నిలచిపోయాయి. ఆంధ్రదేశానికి సంబంధించి సంతవరకు ప్రభుత్వ వ్యవహారం స్తంభించి పోయింది. విద్యార్థులు, కార్మికులు, మధ్య తరగతి ప్రజలు ప్రదర్శనలు చేశారు.

ఆ మరుసటి దినమే విజయవాడలో 144వ సెక్షన్ ప్రయోగింపబడింది. అనకాపల్లి, రాజమండ్రి, తాడేపల్లిగూడెం, నెల్లూరు, విశాఖపట్టణాల్లో కాల్పులు జరిగాయి. మొత్తం 12 మంది వరకు కాల్పుల మూలంగా తమ అసువులు బాశారు. నెల్లూరులో కాల్పులకు గురైన మృతవీరుల భౌతిక దేహాలను 60 వేలమందితో పుర వీధులలో వూరేగించారు. వాల్తేరు స్టేషన్ సమీపంలో జరిగిన కాల్పులలో ఒక స్త్రీ తక్షణం మరణించింది. 8 మందికి ప్రమాదకరమైన గాయాలు తగిలాయి. దీనికి సానుభూతిని తెలుపుతూ కార్మికులంతా సమ్మె చేశారు.

కాకినాడ టౌన్‌హాల్లో శ్రీరాములు గారి నిర్యాణమును గూర్చి సంతాపసభ జరుపుటకు చేరిన సుమారు 10 వేల మంది

కృషికార్ లోక్‌పార్టీ తిరుపతి ఆంధ్ర దేశ రాజధానికి అనువైనదని సూచించింది. మద్రాసును తాత్కాలిక రాజధానిగానే ఉంచాలన్నది

రాష్ట్రావతరణ తేదీకై ఆందోళన జరిగింది. మార్చి 25 న నెహ్రూ ఒక ప్రకటన చేశారు. అక్టోబరు 1 న ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుతుందనీ, రాజధానిని మద్రాసులో ఉంచే సమస్యే లేదనీ, ఆంధ్ర ప్రాంతంలో ఎక్కడ ఉండాలో అన్నది ఆంధ్ర శాసన సభ్యులే నిర్ణయించుకోవాలనీ నెహ్రూ ఆ ప్రకటనలో స్పష్టం చేశారు.

కాంగ్రెసు పార్టీ నాయకులలో కొందరు రాష్ట్రం వద్దన్నా, వారిలో మరికొందరు, ప్రజా - సోషలిస్టు నాయకులూ మద్రాసు సమస్యతో మెలిక వేసినా, లోక్‌పార్టీ నాయకులు "ప్రత్యేక రాష్ట్రం వద్దు. ఉమ్మడి పరిపాలనా విధానమే చాలు" అని ప్రకటించినా, ప్రజలు తమ సంకల్పాన్ని ధారపోసి, నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్ర రాష్ట్రాన్ని సాధించుకున్నారు.

## రాజధాని సమస్య

నెహ్రూ ప్రకటన ప్రకారం ఆంధ్ర శాసనసభ్యులే రాజధాని స్థల నిర్ణయాన్ని చేయాలి.

ఆ ప్రకారం 1953 జూన్ 5 న, దీని ప్రత్యేక సమావేశం జరిగింది.

రాజధాని స్థల నిర్ణయంలో స్థానికాభిమానాలకు తావివ్వరాదు. అందరికీ అందుబాటులో ఉండే స్థలాన్నే ఎంచుకోవాలి. ఆంధ్ర దేశానికి నడిబొడ్డులోనున్న విజయవాడ - గుంటూరులు రాజధానికి అన్ని విధాలా అనువైనచోటు అని కమ్యూనిస్టుపార్టీవారు ప్రకటించారు.

అన్ని దినపత్రికలూ ఇదే వైఖరిని తీసుకున్నాయి. పట్టువిడుపులు లేని ఆందోళన జేశాయి.

అయినప్పటికీ జూలై మొదటివారంలో హోరాహోరీగా జరిగిన చర్చల తర్వాత రాజధాని కర్నూలులో ఉండాలనే తీర్మానం నెగ్గింది.

జూలై 25 న ఆంధ్రరాష్ట్ర బిల్లు చర్చకు వచ్చింది. ఆ అదనులో విజయవాడ - గుంటూరులోనే రాజధానిని ఏర్పాటు చేయాలనే సవరణ, తిరుపతిలో ఉండాలనే సవరణ తేబడ్డాయి. విశాఖనుంచి వచ్చిన కాంగ్రెసు సభ్యులు విశాఖ పట్టణాన్ని సూచిస్తూ సవరణ తెచ్చారు. తిరుపతి, విశాఖ సవరణలు వీగిపోవటంతో, మొత్తం కమ్యూనిస్టులు, లోకదళ ఐక్య ప్రజాకాంగ్రెసు సంఘటనలోనున్న స్వతంత్రులు, నలుగురు ప్రజా సోషలిస్టులు, తొమ్మిదిమంది లోక్‌పార్టీవారు విజయవాడ - గుంటూరుకు ఓటు చేశారు. కాని ఆంధ్రేతరులు (ఈ సమస్యపై) ఓటు చేయరాదన్న "పెద్ద మనుషుల ఒడంబడిక" విరుద్ధంగా విజయనగరం రాజా కూటమి తమిళ సోషలిస్టులచేత ఓటు చేయించుకుని టెక్నికల్‌గా సవరణను ఓడించామనిపించుకున్నారు.

## అక్టోబరు ఒకటవ

1953 అక్టోబరు ఒకటిన తాత్కాలిక రాజధాని నగరం కర్నూలులో, భారత ప్రధాని నెహ్రూ ఆంధ్రావతరణ మహోత్సవాన్ని జరిపారు.

ఆంధ్ర దేశమంతా పండుగ స్వరూపాన్ని తీసుకుంది. ప్రతి ఊరూ, ప్రతి

యిల్లూ ప్రత్యేక అలంకారాలతో కళ కళ లాడాయి: తెలుగు ప్రజలు, ఎన్నాళ్లెప్పట నున్నా, చిరకాలవాంఛితం తీరినందుకు విజయానందోత్సాహాలతో ఉప్పొంగి పోయారు.

యావద్భారత ప్రాముఖ్యంగల ఈ విజయంతో ఒక ఘట్టం ముగిసింది; మరో ఘట్టం ఆరంభమైంది.



ఆంధ్రరాష్ట్ర అవతరణతో ముక్కోటి ఆంధ్రుల ఆశయమైన విశాలాంధ్ర నిర్మాణంలో ఒక ముఖ్యభాగం సాధించబడింది. సంపూర్ణాశయసిద్ధికి మార్గం సుగమమైంది.

నిజాం సంస్థానాన్ని రద్దుచేసి, నాటి మద్రాసురాష్ట్రంలోని ఆంధ్రప్రాంతాన్ని, తెలంగాణానూ, యితర రాష్ట్రాలలోని ఆంధ్ర ప్రాంతాలనూ కలిపి, హైదరాబాదు ముఖ్యపట్టణంగా విశాలాంధ్రను స్థాపించాలనే నినాదాన్ని ప్రప్రథమంగా లేవనెత్తిన రాజకీయపార్టీ కమ్యూనిస్టుపార్టీయే.

1946 లో జరిగిన ఎన్నికల సందర్భంలో, తెలంగాణాపోరాట ప్రారంభంలో ఈ నినాదం నిర్దిష్టరూపంలో యివ్వబడింది.

ప్రస్తుత ఆంధ్రరాష్ట్రప్రాంతంలో జరిగినట్లే, తెలంగాణా ప్రాంతంలో కూడా విశాలాంధ్ర సాధనకై ఎంతో ఆందోళన, ఎన్నో పోరాటాలు జరిగాయి.

నిజాం రాష్ట్రాంధ్రోద్యమం దీనికి మొదటి మెట్టు.

## తెలంగాణాంధ్రోద్యమం

శతాబ్దాలుగా నిజాం ఫ్యూడల్ వ్యవస్థ క్రింద నలిగి, నీరసించి, కృశించిపోయింది తెలంగాణాలోని ఆంధ్రజాతి. నూటికి ముగ్గురకు మించని అక్షరాస్యులతో, పౌరసత్వహక్కులు శూన్యమై, తెలుగు భాష, సాహిత్యాలు శిథిలావస్థలోనున్న కాలంలో తెలుగువారిలో "మేమూ ఆంధ్రులమే" అనే భావాన్ని, ఏదో విధంగా కల్గించడమే ఒక ముఖ్య కర్తవ్యమైంది.

ఈ కర్తవ్య నిర్వహణకు కొంతమంది హైదరాబాదు నగర ఆంధ్ర ప్రముఖులు కలిసి 12-11-1921 న ఆంధ్ర జనసంఘమనే సంస్థను స్థాపించారు. దీని ప్రభావంతో సంస్థానంలోని అనేక స్థలాలలో ఆంధ్ర జనసంఘాలు స్థాపించబడ్డాయి.

వీటి నన్నిటినీ సమన్వయపరచి, ఎక్కువ క్రమబద్ధంగానూ, సమర్థతతోనూ పని సాగించడానికి ఒక కేంద్ర సంఘం అవసరమనే భావం కలిగింది. ఈ వివిధ సంఘాల ప్రతినిధులు హనుమకొండలో సమావేశమై 1-4-1923న ఆంధ్రజన కేంద్ర సంఘాన్ని స్థాపించారు.

ఆంధ్ర భాషోద్ధరణ, కరపత్రాలు, పుస్తకాలు, ఉపన్యాసాలద్వారా విజ్ఞానం వ్యాపింపచేయడం; గ్రంథాలయాలు, పఠనా మందిరాలు, పాఠశాలలను స్థాపించడం; వ్యాయామం, కళలను ప్రోత్సహించటం — యివీ ఈ కేంద్రసంఘం యొక్క ప్రధానాశయాలుగా నిర్ణయించబడ్డాయి.

రాజధాని నగరంనుండి జిల్లా, తాలూకాల ప్రధాన స్థలాలవరకేగాక పల్లెటూళ్ల

హైదరాబాదుసంస్థానాన్ని విచ్ఛిన్నంచేసి, విశాలాంధ్రను ఏర్పరచాలనే నినాదమివ్వబడింది. దేశముఖులు దౌర్జన్యంగా, అక్రమంగా ఆక్రమించుకున్న తమ భూములను తిరిగి యిచ్చివేయాలని డిమాండు చేయబడింది.

ప్రజోద్యమాన్ని అణచడానికి దేశముఖులు తమ గూండా సైన్యాల నుపయోగించారు.

ప్రజారక్షణదళాలను ఏర్పరచుకొని ప్రజలు ప్రతిఘటించారు. దేశముఖుల గూండా సైన్యం ప్రజల ధాటికి నిలువనందున, నిజాం ప్రభుత్వం రిజర్వ్ పోలీసులను పంపింది. అదీ విఫలమవడంతో, ప్రభుత్వం సైన్యాన్నే దింపింది.

ప్రజలపై ఎన్నో ఘోరాలు జరుపబడ్డాయి. గ్రామాలకు గ్రామాలు మట్టు నేయబడ్డాయి.

వేలాది ప్రజలను విపరీతంగా కొట్టడం, స్త్రీలను అవమానపరచడం, చెరచడం ఒక అమానుష హింసాకాండ జరుపబడింది. వందలకొలదిగా అరెస్టు చేయబడ్డారు. ప్రారంభంలో జరిగిన ఒకటి, రెండు పోరాటాల్లోనే 22 మంది స్త్రీ, పురుషులు బలిగొనబడ్డారు. కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభలు నిషేధించివేయబడ్డాయి.

ఈ పోరాటంలో కడవెండి (1946 జూలై), బాలేముల (26-10-46), పాతసూర్యాపేట (15-11-46) ఘర్షణలు మూడూ మూడు మైలురాళ్ళు.

## సంగం

కమ్యూనిస్టుపార్టీ, ఆంధ్రమహాసభల నాయకత్వంక్రింద ప్రజలు వీరోచితంగా నిలబడ్డారు.

స్త్రీలు, పురుషులూ, పిల్లలూ, పెద్దలూ.. ప్రజ యావత్తూ రంగంలోకి దూకింది; ప్రతిఘటించింది. ఒక గ్రామంపై మిలటరీదాడి జరిగితే, చుట్టుపక్కల గ్రామస్థులందరూ సహాయానికి వచ్చేవారు. పురుషులు కర్రలు, వడిశలలూ తీసుకొని పోరాడుతుంటే, స్త్రీలు వరసను నిలబడి రాళ్ళు అందించడం, నీళ్ళు అందించడం మొదలైన సహాయం చేసేవారు. పురుషులు లేకపోతే, గ్రామాలను స్త్రీలే రక్షించుకున్న ఘటనలెన్నో ఉన్నాయి.

ప్రజలు ఆంధ్రమహాసభను "సంగం" అని పిలచేవారు. సంగం ఉపయోగం గ్రహించిన ప్రజలు, తమంతట తామే సంగాన్ని విస్తృతం చేయమొదలెట్టారు. ప్రక్క గ్రామాలకువెళ్ళి, సంగాన్ని నెలకొల్పి, సభ్యత్వాన్ని చేర్పించేవారు.

సంగం అంటే ప్రజలకు అత్యంత ప్రేమ, విశ్వాసం ఏర్పడింది. ప్రతి గ్రామం ఒక "యుద్ధ రంగం" అయిన ఆ రోజుల్లో, రెండు నెల్లల్లోనే సుమారు 500 గ్రామాలకు ప్రాకింది.

నల్లగొండ జిల్లా అంతటా ఈ ప్రతిఘటన సాగింది. ప్రభుత్వం జిల్లా అంతటా "మార్షల్ లా" ను ప్రయోగించింది.

మితిమీరిన దౌర్జన్యాలనుంచి, కనబడితే కాల్చివేసే మిలిటరీ శాసనాలనుంచి తమ్ము తాము రక్షించుకోడానికి ప్రజలు గూడా ఆయుధాలను చేపట్టడం ప్రారంభించారు. భూస్వాములు అక్రమంగా తమనుంచి గుంజుకున్న భూములను తిరిగి స్వాధీనపరచుకోవడం, బంజరు భూములను భూమిలేని కూలీలకు, పేద రైతులకు పంచిపెట్టడం ప్రారంభమైంది.

భాషారాష్ట్ర సమస్యను భూసమస్యతో మేళవించి, తెలంగాణా ఉద్యమం సాగింది. ఇది ఆ ఉద్యమ విశిష్ట లక్షణాలలో అతి ప్రధానమైనది. 1947 కే, ఒక జిల్లాకే పరిమితమైన ఉద్యమం, తెలంగాణా వ్యాపితరూపం తీసుకుంది.

తరతరాలుగా "నీబాంచను" (నీ బానిసను) అనే తెలంగాణా రైతు-కూలీ తల యెత్తి తిరిగాడు.

కమ్యూనిస్టుపార్టీ కల్గించిన నూతన చైతన్యంతో నూతన జీవితం ప్రారంభించ యత్నించాడు. వయసుమళ్ళిన రైతు పలక చేబట్టాడు. సంస్కార మెరుగని ఆటవిక జాతి స్త్రీ సహితం కొన్ని సాంఘిక మార్పులను చవిచూడగల్గింది.

"నూతన గ్రామంలో నూతన మానవునికి" నాంది ప్రస్తావన జరిగింది.

## 1947 ఆగస్టు 15 పిమ్మట

1947 ఆగస్టు 15 : ఇండియన్ యూనియను ఏర్పడింది. బ్రిటిషు సామ్రాజ్యవాదులతోనూ, పాకిస్తాన్ ప్రభుత్వవర్గాలతోనూ కుట్రపన్ని, నిజాం నవాబు ఇండియను యూనియనులో చేరడానికి నిరసించాడు.

నిజాం యూనియన్‌లో చేరాలని కోరుతూ సంస్థానంలో బ్రహ్మాండమైన ఆందోళన రేగింది.

సంస్థాన కాంగ్రెసుకూడా నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా, ఇండియన్ యూనియనులో చేరమనీ, బాధ్యతాయుత పరిపాలనను ప్రవేశపెట్టమనీ సత్యాగ్రహం ప్రారంభించింది.

నిజాం మిలిటరీ, ఇత్తెహాదుల్ ముస్లిమీను రజాకారు గూండాలు (కాసిం రజ్వీ నాయకత్వాన) గ్రామాలమీదబడి, దారుణ భీభత్సకాండను ప్రారంభించారు. ఊళ్ళకు ఊళ్ళు దోపిళ్ళు చేయడం, ప్రజలను అనేక విపరీత క్రూర హింసలకు గురిచేయడం, ప్రజలనూ, కమ్యూనిస్టుపార్టీ కార్యకర్తలను కాల్చివేయడం, స్త్రీలను చెరచడం పరిపాటయి పోయింది.

కాంగ్రెసు నాయకత్వం హైదరాబాదు సంస్థానాన్ని వదిలి యూనియన్ పట్టణాలలో మకాం పెట్టింది.

ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టుపార్టీ తెలంగాణా వ్యవసాయ కూలీ, రైతు యువకులతో దళాలు ఏర్పరచి, శత్రువు నుండి ఆయుధాలు గుంజుకొని, రజాకారు మూకలతోనూ, నిజాం మిలిటరీతోనూ ఢీకొంది.

ఈ పరిస్థితుల్లో భారత కాంగ్రెసు ప్రభుత్వం నిజాం నవాబుతో యథాతథ ఒడంబడిక చేసుకుంది. నవాబుకు ఆయుధాలనుకూడ సరఫరా చేస్తూ వచ్చింది.

ఈ ఒడంబడిక ధైర్యంతో రజాకారు మూకలు మరీ విజృంభించిపోయాయి. ఒకే గోర్టాన ఈ మూకలు 88 మంది ప్రజలను నిలువునా కాల్చివేశారు! దాదాపు 2,500 మంది కార్యకర్తల, ప్రజల ప్రాణాలు నిలువునా తీశారు. ఎన్నో గ్రామాలు తగులబెట్టారు.

తమ యిండ్లూ, భూములూ, తమ ప్రాణాలూ, స్త్రీల మానాలూ రక్షించుకోడానికి తెలంగాణా ప్రజ ధైర్యసాహసాలతో పోరాడింది.

ఏకొద్దిమందో ముస్లింమతావేశపరులూ, దేశముఖు, జాగీర్దారీవర్గాలా అండమీదే నిలచిఉన్న రజాకారు, మిలటరీ మూకలు ప్రజల ధాటికి నిలువలేకపోయాయి.

నల్లగొండ, వరంగల్లు, కరీంనగరం, మెదకు, వగైరాలలోని 3,000 గ్రామాలలో నిజాం పరిపాలనకు స్వస్తిచెప్పబడింది. ప్రజలందరూ ఎన్నుకున్న పంచ కమిటీలు పనిచేయ సాగాయి. కవుళ్లు, అప్పుల బకాయీల వసూలు ఆగిపోయింది.

ఒక పరిమితిభూమిని మినహాయించి, భూస్వాముల తక్కిన భూమిఅంతా రైతు కూలీలకు పంచిపెట్టబడింది. అన్యాయాక్రమిత భూములు తిరిగి వారి నిజ యజమానులకు వప్పచెప్పబడ్డాయి. బంజర్లు, అడవి కొట్టి క్రొత్తభూములూ సాగులోకి తేబడ్డాయి. ఇలా సుమారు పదిలక్షల ఎకరాలు పంచబడ్డాయి. తెలంగాణా చరిత్రలో మొదటి పర్యాయం సామాన్య ప్రజానీకమంతా కడుపునిండా రెండుపూటలా తిండీ తినగలిగారు.

ఈ ప్రజా విజయాలను గ్రామదళాలు పదివేలమందీ, రైతాంగ గెరిల్లా సాయుధ దళాలు రెండువేలమందీ రాత్రింబవళ్ళు రక్షిస్తుండేవారు.

మద్రాసుప్రాంత ఆంధ్రప్రజానీకమంతా తెలంగాణా ప్రజాపోరాటానికి బాసటగా నిలబడింది. నిజాంనవాబు వంశాధికారం నశించాలి, హైద్రాబాదు సంస్థానం రద్దు కావాలి, విశాలాంధ్రలో ప్రజారాజ్యం ఏర్పడాలనే నినాదాలు ముక్కోటి ఆంధ్రుల నినాదా లయ్యాయి

ఇలా తెలంగాణాలో సాగిన నిజాం - రజాకారు వ్యతిరేక పోరాటం "విశాలాంధ్ర-చైతన్యానికి" దోహదమిచ్చింది.

## "పోలీసు చర్య"

**1948** సెప్టెంబరు 13 న ఇండియన్ యూనియన్ సైన్యాలు హైద్రాబాదు సంస్థానంలోకి ప్రవేశించాయి. రజాకారు బారినుండి, కమ్యూనిస్టుల బారినుండి ప్రజలను రక్షించడానికే ఈ చర్య అని భారత ప్రభుత్వం ప్రకటించింది.

యూనియన్ సైన్యాలు ముందునా, గెరిల్లా దళాలు వెనుకా ఉండీ, మధ్యన పడడంతో నిజాం మిలిటరీ, రజాకారు మూకలు చెల్లాచెదురైపోయాయి. 5 రోజులలో భారత సైన్యాలు హైదరాబాదులో ప్రవేశించాయి.

ప్రజలాశించినట్లు నిజాం ప్రభువు గద్దె దిగలేదు. పైగా అతని పరిపాలనాధికారం గుర్తించబడింది. అతను రాజప్రముఖు అయ్యాడు. సంవత్సరానికి కోటిరూపాయల భరణం, వందలకోట్ల విలువగల తన ఆస్తికి హామీ లభించాయి. భారత ప్రజానీకంలో యిది తీవ్ర అసంతృప్తిని కల్గించింది.

మరోప్రక్క తెలంగాణా ప్రజలపైన, కమ్యూనిస్టులపైన యూనియన్ సైన్యాలు దాడులు ప్రారంభించాయి. వాటిఅండలో, ప్రజాఉద్యమానికి జంకి ఊరు విడిచి పోయిన భూస్వాములు, దేశముఖులు తిరిగి గ్రామాలకు రావడం ప్రారంభించారు. ప్రజలకు పంచిన భూములను తిరిగి బలవంతంగా స్వాధీన పరచడం ప్రారంభమైంది.

వీటిని రైతులు, వారి దళాలు ప్రతిఘటించడం మొదలు పెట్టారు.

1951 అక్టోబరువరకూ ఈ రైతాంగ గెరిల్లా ప్రతిఘటన సాగింది.

మూడేళ్ళు సాగిన ఈ పోరాటాన్ని అణచడానికి భారత కాంగ్రెసు ప్రభుత్వం 50 వేల మంది సైన్యాన్ని, సాయుధ పోలీసులు, హోంగార్డులు, కోయా దళాలు వగైరా ఉపయోగించింది. సంవత్సరానికి 10 కోట్లు ఖర్చు చేసింది.

ఈ మూడేళ్ళలో 10 వేల గ్రామాలు సైనిక, వగైరా దాడులకు గురయ్యాయి. దాదాపు 15 లక్షల మంది ప్రజలు తీవ్ర నిర్బంధానికి, హింసలకు గురయ్యారు. 1,500 మంది కమ్యూనిస్టు నాయకులు, ప్రజా కార్యకర్తలు కాల్చివేయబడ్డారు. అడవులలో తెలంగాణాదళాలకు ప్రజాసహాయం లేకుండా చేయడానికని, అడవులలో నివసించే కోయ గ్రామాలపై అతి తీవ్రమైన నిర్బంధ విధానం ఉపయోగించబడింది. ఈ నిర్బంధ విధానంలో వేలకొలది కోయలు చంపబడ్డారు. వెయ్యి కోయ గూడాలు తగులబెట్టబడ్డాయి. 2 లక్షల మంది నిర్బంధ క్యాంపులలో ఖైదు చేయబడ్డారు. తగిన తిండి, తగిన సౌకర్యాలు లేక, ఈ క్యాంపులలో సుమారు 10 వేలమంది అంటువ్యాధులకు గురయి, బలిఅయ్యారు.

ఇన్ని తీవ్రచర్యలు జరిగినా, రైతుల స్వాధీనంలోనున్న భూమంతా భూస్వాములు గుంజుకోలేక పోయారు. రైతాంగ దళాలు నిర్మూలించబడలేదు. దళాలు క్రొత్త ప్రాంతాలకు తరలిపోయాయి. చివరకు ప్రభుత్వం ప్రారంభించిన రాయబారాలను పురస్కరించుకుని జనరల్ ఎన్నికల నాటికి ఈ ఉద్యమం విరమించబడింది.

ఈ చారిత్రాత్మక పోరాటంలో ప్రజలు, వారినాయకులు చూపించిన ఓరిమి, సాహసము, కార్యదీక్ష మరపురానివి. ఇన్నాళ్లు, ఒకే ధాటిగా, యింత విస్తృతంగా జరిగిన పోరాటం భారతదేశంలో మరేదీ లేదు.

1951 చివరకు జనరల్ ఎన్నికలు వచ్చాయి. కమ్యూనిస్టుపార్టీకూడా ఎన్నికలలో పాల్గొంది. మద్రాసు, ఆంధ్ర జిల్లాలలోవలె, తెలంగాణాలోగూడ కాంగ్రెసు ఘోరపరాజయం పొందింది. నల్గొండ జిల్లాలో ఒక్క సీటుగూడా గెల్చుకోలేక పోయింది. కమ్యూనిస్టుపార్టీ అఖండ విజయాన్ని సాధించి, తెలంగాణాలో మొదటి రాజకీయపార్టీగా ముందుకు వచ్చింది.

## ఆంధ్రులకు అన్యాయం

కాంగ్రెసు ప్రధానాధిపతులు ఆంధ్ర రాష్ట్రానికి వ్యతిరేకులైతే, విశాలాంధ్రకు గూడ వ్యతిరేకులు. యావదాంధ్రజాతి ఐక్యంగా పురోగమించడానికి వారు అడ్డంకులను కల్పిస్తూవచ్చారు.

రెండేళ్ళక్రితం హైదరాబాదు పోస్టలు సర్కిలును ఎందులో కలపాలి అనే సమస్య వచ్చింది. నాయకులతోసహా అన్ని వర్గాల ఆంధ్రులూ విజయవాడ సర్కిలులో కలపమని కోరారు. పోస్టలు శాఖామంత్రి అంగీకరించి వాగ్దానం చేశారు. కాని, ఆఖరు నిమిషంలో పడీ చప్పుడు లేకుండా హైదరాబాదు సర్కిలును నాగపూరు సర్కిలులో కలిపివేశారు.

మరొకసారి, రైల్వేల పునర్విభజన వచ్చినప్పుడు సాధ్యమైనంతవరకూ తెలుగు ప్రాంతాన్నంతా ఒకేజోనుగా పెట్టకపోగా,

మీర్ మహమ్మదాలీఖాన్, మొదలగువారు విశాలాంధ్ర వాంఛను ప్రకటించారు.

కాంగ్రెసువారిలోనే రామానందతీర్థ కూడా దీనిని బలపరుస్తూ ప్రకటనలు చేశారు.

1953 సెప్టెంబరు 26, 27 తేదీలలో జరిగిన తెలంగాణాంధ్ర మహాసభ సదస్సు హైద్రాబాదు విచ్ఛిత్తి కావాలనీ, విశాలాంధ్ర ఏర్పడాలనీ విస్పష్టమైన రీతిలో తీర్మానించింది.

## ఆంధ్ర రాష్ట్రావతరణ తరువాత

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తర్వాత విశాలాంధ్ర సమస్య మరీ ముందుకు వచ్చింది. భాషారాష్ట్ర సమస్య మొత్తంగానే ఉధృతరూపం తీసుకుంది.

హైద్రాబాదును విచ్ఛిన్నం చేసి, సంయుక్త మహారాష్ట్ర, ఐక్యకర్ణాటక రాష్ట్రాలను నిర్మించాలని ఆందోళన తీవ్రతరమైంది.

ఈ ఆందోళనను తట్టుకోవడానికి భారత ప్రభుత్వం రాష్ట్ర పునర్నిర్మాణ కమీషన్ను నియమించింది. ఈ అదను చూచి తెలంగాణా కాంగ్రెసు నాయకులు, కొందరు సోషలిస్టు నాయకులు విశాలాంధ్ర వ్యతిరేక ప్రచారం ప్రారంభించారు.

హైద్రాబాదు ప్రధానమంత్రి నేతృత్వంలో కొందరు కాంగ్రెసువాదులు, తెలంగాణా వెనుకబడి ఉన్నందున ఆంధ్రరాష్ట్రంతో వాటు విలీనం చేయరాదనే సాకుతోనూ, హైద్రాబాదు సంస్థాన విభజన కనీసం పది సంవత్సరాలవరకైనా వాయిదా వేయాలని ఆందోళన మొదలుపెట్టారు.

కొన్ని నెలల క్రితమే హైద్రాబాదులో "విశాలాంధ్ర మహాసభ" సమావేశం జరిగింది. దీనికి ముగ్గురు ఆంధ్ర మంత్రులు హాజరయ్యారు. కాని, హైద్రాబాదు ఆంధ్ర మంత్రులొక్కరూ హాజరుగాలేదు.

ఈ సమావేశంలో ఆంధ్ర మంత్రి కడప కోటిరెడ్డిగారు, రాయలసీమవలె తెలంగాణా కూడా వెనుకబడి ఉందనీ, విశాలాంధ్ర వస్తే, ఈ రెండు వెనుకబడిన ప్రాంతాలు కలసి, సర్కారు జిల్లాలను "అదుపు"లో ఉంచవచ్చునీ ఉపన్యసించారు.

మరొకప్రక్క ప్రజా - సోషలిస్టులు "స్వతంత్ర తెలంగాణా" నినాదాన్ని లేవనెత్తారు. కాని, హైద్రాబాదు రాష్ట్రంలోనూ, ఆంధ్రరాష్ట్రంలోనూ వారిలో వారికే ఈ విచ్ఛిన్నకర నినాదంపై వచ్చిన వ్యతిరేకతను చూచి వెనుక్కుతగ్గారు.

ఈ విషయంపై ఒక నిర్ణయానికి రావడానికై ఆంధ్ర ప్రజా-సోషలిస్టులు, హైద్రాబాదు ప్రజా - సోషలిస్టుల సంయుక్త సమావేశం 1954 మార్చి 22 న కర్నూలులో జరిగింది.

ఈ సమావేశం విశాలాంధ్ర నిర్మాణానికి అంగీకరించింది. కాని, తెలంగాణాంధ్రుల అనుమానాలు సహేతుకమైనవేననీ, అందుకని వారికి "కొన్ని హామీలు" అవసరమనీ తీర్మానించింది.

## విశాలాంధ్రకమ్యూనిస్టుపార్టీ

కమ్యూనిస్టుపార్టీ ఒక్కటే మొదటి నుంచీ విశాలాంధ్ర నిర్మాణాన్ని కోరుతూ వచ్చింది. ఇందుకు మహోద్యమాలను, చారిత్రాత్మక పోరాటాలను నడిపింది. సాటిలేని త్యాగాలను చేసింది.

ఈ మధ్యకాలంలోగూడా ఇదే నినాదాన్ని పునరుద్ఘాటిస్తూ వచ్చింది.

ఆంధ్రకమ్యూనిస్టుకమిటీ తణుకు రాష్ట్ర మహాసభలో విశాలాంధ్ర నిర్మాణం జరగాలని తీర్మానించింది.

1954 మార్చి 6, 7 తేదీల్లో హైద్రాబాదులో జరిగిన సమావేశంలో విశాలాంధ్ర కమ్యూనిస్టు సమన్వయకమిటీ సత్వర విశాలాంధ్రనుకోరుతూ తీర్మానించింది.

50 వేల సభ్యత్వం గల అఖిలహైద్రాబాదు ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు మహాసభ ఏప్రిల్ 12, 13 తేదీలలో హైద్రాబాదులో జరిగింది. ఈమహాసభలో హైద్రాబాదు రాష్ట్ర విభజన వెంటనే జరగాలనీ, విశాలాంధ్ర, ఐక్య కర్ణాటక, సంయుక్త మహారాష్ట్రల నిర్మాణం జరగాలని తీర్మానించబడింది. భాషారాష్ట్ర నిర్మాణం జరగాలనే ముసుగులో జాతీయ విరోధాలనూ, ప్రజాఐక్యత విచ్ఛిన్నాన్ని కలుగజేస్తున్న వ్యతిరేక శక్తుల చర్యలు ఖండించబడ్డాయి. విశాలాంధ్ర నిర్మాణానికి కార్మికులంతా కృషిచేయాలని తీర్మానించబడింది.

ఏప్రిల్ 18 వ తేదీన సమావేశమైన అఖిలభారత భాషారాష్ట్రాల మహాసభ కార్యవర్గం హైద్రాబాదు రాష్ట్ర విచ్ఛిత్తికి నైజాంనవాబును ఒప్పించే నిమిత్తం ఒక 'దేశవ్యాపిత ఆందోళన' ప్రారంభించడానికి నిర్ణయించింది. హైద్రాబాదు విచ్ఛిత్తి, నైజాంనవాబు తొలగింపు తప్పనిసరిగా దేశంలోని రాజప్రముఖుల వ్యవస్థ రద్దుకు దారి తీయగలదని కార్యవర్గం తన తీర్మానంలో పేర్కొన్నది.

అలాగే హైద్రాబాదు కార్పొరేషను ఏప్రిల్ 14వ తేదీన సమావేశమై హైద్రాబాదురాష్ట్రాన్ని భాషాప్రయుక్తంగా విభజించి, హైద్రాబాదు ముఖ్యపట్టణంగా విశాలాంధ్ర నేర్పాటు చేయాలని తీర్మానించింది. ఆంధ్ర దేశ ఆర్థికాభివృద్ధికి తెలుగు భాషాప్రాంతమంతా ఒకే పరిపాలన క్రిందకురావడం అత్యంతావశ్యకమనిగూడా కార్పొరేషన్ తీర్మానంలో పేర్కొనబడింది.

రోజురోజుకూ విశాలాంధ్రోద్యమం నూతన బలాన్ని పొందుతూ, ముందుకు పోతోంది.

కాని, కాంగ్రెసు ప్రభుత్వాధినేతలకు హైద్రాబాదు రాష్ట్రాన్ని విభజించడం ఇష్టంలేదని రోజురోజుకూ స్పష్టమవుతూంది.

ఆంధ్ర రాష్ట్రావతరణోత్సవ సందర్భంలో కర్నూలులో మాట్లాడుతూ, భారత ప్రధాని నెహ్రూ, విశాలాంధ్ర నినాదం సామ్రాజ్యవాద మనస్తత్వంతో కూడుకుని ఉన్నదని ఆరోపించాడు.

రాష్ట్ర పునర్విభజన కమీషన్ను నియమిస్తూ, ప్రభుత్వం రాష్ట్రాల పునర్నిర్మాణానికి కొన్ని షరతులను తగిలించింది. భాషేగాక, నాగరికత, ఆర్థిక స్థిరత్వం, పరిపాలనా సౌలభ్యం అనే అంశాలను గూడా తీసుకునే, రాష్ట్ర పునర్విభజన జరుగగలదని ప్రకటించింది.

అంతేగాక, ఈమధ్య కల్యాణిలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు మహాసభ అంగీకరించిన తీర్మానం పై అంశాలతో బాటు "భారతదేశ భద్రత" అనే అదనపు షరతునుగూడా చేర్చింది.

హైద్రాబాదు విభజన మొత్తం రాజప్రముఖు వ్యవస్థకే దెబ్బ. విశాలాంధ్ర నిర్మాణం రెండు బలీయమైన ప్రజోద్యమాలనూ ఏకంచేసి, ఒక మహోద్యమాన్ని తయారుచేస్తుంది.

ఇదే భారత కాంగ్రెసుప్రభుత్వ విశాలాంధ్ర వ్యతిరేకతలోని ఆంతర్యం.

కాని, ఆంధ్రరాష్ట్రం సాధించిన ప్రజ విశాలాంధ్రనుగూడా సాధించగలదు.



పట్నం, బారువ (శ్రీకాకుళంజిల్లా), భీముని పట్నం (విశాఖజిల్లా), కాకినాడ (తూర్పు గోదావరిజిల్లా), నరసాపురం (పశ్చిమ గోదావరిజిల్లా), మచిలీపట్నం (కృష్ణాజిల్లా), నిజాంపట్నం, ఓడరేవు (గుంటూరుజిల్లా) మొదలైన మైనరు ఓడరేవులున్నాయి. వీటిలో విశాఖపట్నం స్వాభావికమయిన ఓడరేవు. పెద్ద పెద్ద ఓడలు తీరంవరకు రావటానికి వీలున్నది. మిగతా రేవుల వద్ద ఓడలు తీరానికి దూరంగా ఆగవలసిందే !

తీరము లోతయినది కాకపోవటంచేత, ఒక విశాఖ మినహాయించి మరే రేవువద్ద తీరానికి ఓడలు రావటానికి వీలులేదు.

## కొండలు-అడవులు

ఉత్తరాన విశాఖజిల్లా - ఒరిస్సా సరిహద్దునుండి దక్షిణాన నెల్లూరుజిల్లా - మద్రాసు సరిహద్దువరకూ, తూర్పుకనుమల శ్రేణి ఒకటి ఉన్నది. ఇవి పశ్చిమ కనుమలంత ఎత్తయినవికావు. ఒక శ్రేణిగాకాక, చెదురుగా కొండలు, గుట్టలుగా మాత్రమే ఉన్నవి. వీటి సగటు ఎత్తు 3,500 అడుగులు.

ఈ కనుమలు శ్రీకాకుళంజిల్లాలో అనంతగిరివద్ద ప్రారంభించి పాతపట్నం తాలూకాగుండా దక్షిణాన "గూడెం" వరకు వ్యాపించి ఉన్నాయి. వీటిలోని మహేంద్రగిరిఎత్తు 5000 అడుగులు. పాల కొండలు, గోలుకొండలుఎత్తు 4,000 అడుగులు. ప్రకృతి దృశ్యాలకు పేరుపొందిన "డాల్ఫిన్సునోస్"అనే కొండ వీటిలోనిదే. ఇది విశాఖపట్నంరేవువద్ద ఉన్నది.

ఉభయగోదావరిజిల్లాలలో ఉన్న పాపి కొండలు, దూమకొండల ఎత్తు 3,000 అడుగులు.

విశాఖ - గోదావరి జిల్లాలలో వ్యాపించి ఉన్న ఈ కనుమల ప్రాంతంలో ఉన్న అడవులు "మన్యం" అడవులు అని పిలువబడుతున్నాయి. ఇవి రాష్ట్రంలో కెల్ల పెద్దఅడవులు. వీటిలో మద్ది, ఏగిస, టేకు, వెదురు మొదలైన కలప, చింత పండు, కుంకుడుకాయలు, తేనె, మైనము ఇత్యాది అటవీసంపద లభ్యమవుతుంది.

కృష్ణాజిల్లాలో బెజవాడ, మొగల్రాజ పురం కొండలున్నాయి. గుంటూరు జిల్లాలో గరికొండ, నాగార్జునకొండ, బెల్లంకొండ, మంగళగిరికొండ, కొండవీడు కొండ, కోటప్పకొండ, వినుకొండ, చేమకూర్తి కొండలు ఉన్నాయి. అనంతపురం జిల్లాలో పెనుకొండ, మల్లప్పకొండ, మదకసిరికొండలు, కడపజిల్లాలో శేషాచలం, పాలకొండలు ఉన్నాయి. కర్నూలు జిల్లాలోని నల్లమలకొండలు, ఈ ప్రాంతపుకొండలలోకెల్ల ఎత్తయినవి. ఈ ప్రాంతంలోనే "నల్లమల" అడవులున్నాయి. "మన్యం" అడవుల తర్వాత పెద్దఅడవులు ఇవే! కర్నూలు - నెల్లూరు జిల్లాల సరిహద్దున యర్రమల, వెలిగొండలు ఉన్నాయి. చిత్తూరుజిల్లాలో తిరుపతి కొండలు, అవులపల్లి కొండలు, ఏనుగపల్లమ్మకొండ ఉన్నాయి.

## నదులు

వివిధజిల్లాలలో ప్రవహిస్తున్న నదులు, వాటి పొడవు మైళ్ళలో:

### ఉభయ విశాఖలు

1 బాహుద (65). 2. ఉత్తర మహేంద్ర తనయ (25), 3. బెండిగడ్డ (15), 4. వరహాలగడ్డ (15), 5. గరుబుల గడ్డ (14), 6. వంశధార (140), 7. నాగా

నది (లాంగుల్య (90), 8. పెద్దగడ్డ (22) 9. కంచివలస (23), 10. వెల్లిమర్ల (65), 11. గోస్తని (60), 12. గంభీరంగెడ్డ (15), 13. వరదగెడ్డ (24), 14. కర్జూరపుగెడ్డ (14), 15. శారద (60), 16. వరాహ (44), 17. తాండవ (46).

## తూర్పు గోదావరి

1. పంప (32), 2. ఏలూరు (65), 3. గోదావరి (937), దీని ఉపనదులు: శబరి, సీలేరు.

## పశ్చిమ గోదావరి

యెర్రకాలువ, దీని ఉపనదులు: జైనేరు, ప్రలివాగు, ఒల్లేరు.

## కృష్ణా జిల్లా

1. ఉప్పుటేరు (30), 2. తమ్మిలేరు (68), 3. బుడమేరు (35), 4. కృష్ణానది (775), 5. మునేరు, 6. నక్కలవాగు, (52) 7. బగ్గువాగు (65), 8. కొంచేము (55)

## గుంటూరు జిల్లా

1. గుండ్లకమ్మ - 145;

## నెల్లూరు జిల్లా

1. పాలేరు - (68) 2. మన్నేరు-(75) 3. పిల్లవాగు (26) 4. పైడేరు(20) 5. పెన్న (370) 6. ఉప్పుటేరు (55) 7. స్వర్ణముఖి (99) 8. కాళంగి (40)

## చిత్తూరు

1. అరణి, 2. పాయిని, (పాలారు ఉపనది)

## అనంతపురం

1. మరువంక 2. చిత్రవతి.

## కడప

1. చెయ్యేరు, దీని ఉపనదులు; ప్రలంగేరు, పుంచు, బహుద, మందలి, పాపాఘ్ని, సగిలేరు, కుందేరు.

## కర్నూలు

1. తుంగభద్ర, 2. హగరి.

వీటిలో గోదావరి, కృష్ణ, తుంగభద్ర, నదులుమాత్రం పశ్చిమకనుమలలో పుట్టి బంగాళాఖాతంలో పడుతున్నాయి. ఇది ఆంధ్రలో ప్రవహించే నదులలో పెద్దది. పశ్చిమకనుమలలో వర్షం అధికంకనుక, వీటి ప్రవాహ జల పరిమితి ఇతరనదులకంటె ఎంతో అధికం. మిగిలిన నదులన్నీ తూర్పు కనుమలలో పుట్టి బంగాళాఖాతంలో కలుస్తున్నాయి. అందుచేత వీటి పొడవు తక్కువ.

## గోదావరి

ఇది పశ్చిమ కనుమలలోని నాసిక్ కు సమీపంలోనున్న "త్రయంబకం" వద్ద పుట్టి గోదావరిజిల్లాలలో 225 మైళ్ళు ప్రవహించి, రెండుపాయలుగా చీలి బంగాళాఖాతంలో కలుస్తున్నది. వీటిలో ఒక పాయ, "గౌతమీగోదావరి" యానాం వద్దను, "వశిష్టగోదావరి" నరసాపురం వద్దను బంగాళాఖాతంలోపడుతున్నాయి. నది మొత్తం పొడవు 937 మైళ్ళు. 1852 లో, ధవళేశ్వరంవద్ద ఈ నదిపై ఆనకట్ట నిర్మించబడింది.

## కృష్ణ

ఇది బొంబాయి రాష్ట్రంలోని మహాబలేశ్వరంవద్ద పుట్టి, ఆంధ్రలో సుమారు రెండువందలమైళ్ళు ప్రవహించి కృష్ణాజిల్లాలోని "హంసలదీవి"వద్ద బంగాళా

భాగంలో కలుస్తున్నది. నది మొత్తం పొడవు 775 మైళ్ళు. దీనిపై విజయవాడ వద్ద 1852-55 సంవత్సరాలలో పెద్ద ఆనకట్ట నిర్మించబడింది. దీని ప్రధాన ఉపనదులు తుంగభద్ర, మూసీ, భీమ, ఘటప్రభ, మలప్రభ ఇత్యాదులు.

## పెన్నానది

ఇది మైసూరులోని "నందిదుర్గ" కొండలలో పుట్టింది. ఈనది ఆంధ్రలో ప్రవేశించిన తర్వాత, అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరుజిల్లాలలో ప్రవహించి నెల్లూరు జిల్లాలోని ఊటుకూరు వద్ద బంగాళా ఖాతంలో పడుతున్నది. జయమంగళి, చిత్రవతి, పాపఘ్ని, సగిలేరు మొదలగునవి దీని ఉపనదులు. నది మొత్తం పొడవు 370 మైళ్ళు.

## తుంగభద్ర

మన నదుల ఉపనదులలో కెల్ల, తుంగభద్ర చాల పెద్దది. ఇది పశ్చిమకనుమలలోని దక్షిణకనరా - మైసూరుల సరిహద్దులో ఉన్న "వరాహ" పర్వతాలలో పుట్టి, కర్నూలుజిల్లాలో కృష్ణానదిలో కలుస్తున్నది. హగరి, దీని ఉపనదులలో పెద్దది. దీనికి బళ్ళారి జిల్లాలోని మల్లాపురంవద్ద ఆనకట్ట నిర్మించబడింది.

## వంశధార

తూర్పు కనుమలలో పుట్టి బంగాళా ఖాతంలో కలిసే ఆంధ్రనదులలో కెల్ల ఈనది పెద్దది. ఇది ఒరిస్సాలో పుట్టి శ్రీకాకుళం జిల్లాలో 80 మైళ్ళు ప్రవహించి, కళింగపట్టణం వద్ద బంగాళా ఖాతంలో కలుస్తున్నది.

## నాగావళి

ఇది శ్రీకాకుళం జిల్లాలోకెల్ల పెద్దనది. ఒరిస్సాలోని "నియమగిరులు"లో పుట్టి శ్రీకాకుళం జిల్లాలో 70 మైళ్ళు ప్రవహించి "మోపసుబందరు" వద్ద బంగాళా ఖాతంలో పడుతున్నది. వొట్టిగెడ్డ, జంఝావతి, స్వర్ణముఖి, వేగవతి దీని ఉపనదులలో కొన్ని.

## సరస్సులు

ఆంధ్రలోని సరస్సులలోకెల్ల పశ్చిమగోదావరి జిల్లాలోని కొల్లేరు సరస్సు పెద్దది. ఇది మంచినీటి సరస్సు. తమ్మిలేరు, బుడమేరు దీనిలో కలుస్తున్నాయి.

ఇవికాక కొండకర్ల ఆవ, కొమరవోలు ఆవ, తలతంపర, దమయంతి సరస్సు, జగన్నాథ సాగరం మొదలైన చిన్న చిన్న సరస్సు లున్నాయి.

## నేలలు

ఆంధ్రలో మూడు రకాల నేలలున్నాయి: 1. డెల్టాప్రాంత ఒండ్రుమట్టి భూములు, 2. ఎర్రనేల, 3. రేగడినేల. వీటిలోని వివిధ పదార్థాల కలయికమీదను, అవి నీటిని పీల్చుకోవటం, పైరు పెరుగుదలకు కావలసిన తేమను అట్టిపెట్టగలిగిన శక్తి మీదను ఈ వివిధ తరగతుల నేలల వ్యవసాయోపయోగం ఆధారపడి ఉంటుంది.

ఒండ్రుమట్టి నేలలు: ఇవి ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలలో వరుసగా గోదావరి, కృష్ణా, పెన్నానదుల డెల్టా ప్రాంతాలలో విస్తృతంగా ఉన్నాయి. ఈ నేల చాల సారవంతమైనది. నదులు ప్రతి సంవత్సరం క్రొత్తఒండ్రును తెస్తాయి కనుకను, నీటి

గాఢత్వం ఉంటుంది కనుకను, ఈ నేల ఉత్పత్తిశక్తి అధికం.

## రేగడి నేల

ఈ రకం నేల రాయలసీమ జిల్లాల్లో, కర్నూలు జిల్లాలోను, కోస్తా ప్రాంతంలోను ఉంటాయి, కృష్ణాజిల్లాలో అధికంగా ఉంది. గుంటూరు జిల్లా మొత్తం భూమిలో నూటికి 90 పాళ్ళు, కృష్ణాలో నూటికి [illegible] పాళ్ళు, కర్నూలులో నూటికి 60 పాళ్ళు నల్లరేగడ నేలే! ఆంధ్రలోని నల్లరేగడి భూముల్లో, పై మూడు జిల్లాల్లోనే నూటికి సుమారు 90 పాళ్ళ భూమి ఉన్నది.

ఈ నేల, ఎర్రనేలవలె కాక, తేమను ఎక్కువకాలం అట్టిపెట్టగలదు కనుకను, మొక్కలకు కావలసిన పోషక పదార్థం ఎర్రనేలలోకంటె అధికంగా ఉంటుంది కనుకను, ఎర్రనేల ఉత్పత్తిశక్తికంటె, వీటి ఉత్పత్తిశక్తి అధికం.

## ఎర్ర నేల

శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి జిల్లాల్లో సముద్రతీరముల పొడవునా ఈ నేల వ్యాపించి ఉంది. కృష్ణాజిల్లాలో కూడా కొంత ఉన్నది. గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో, రేగడినేల, ఎర్రనేల రెండూ కలిసిన [illegible] నేలలు కూడా ఉన్నాయి.

దీని లక్షణాలు, రేగడినేల లక్షణాలకు పూర్తిగా వ్యతిరేకం. త్వరగా నీటిని పీల్చుతాయి. త్వరగా ఆరిపోతాయి. ఇందులో మొక్కల పెంపకానికి కావలసిన పోషక పదార్థం తక్కువ.

## అధికతమ ఉష్ణోగ్రత 1891 - 1940 సంవత్సరాల సగటు

| జిల్లా | జనవరి °F | ఫిబ్రవరి °F | మార్చి °F | ఏప్రెల్ °F | మే °F | జూన్ °F | జూలై °F | ఆగస్టు °F | సెప్టెంబరు °F | అక్టోబరు °F | నవంబరు °F | డిసెంబరు °F | సం॥ సగటు °F |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం, విశాఖపట్నం | 80.6 | 83.5 | 87.1 | 89.6 | 92.0 | 91.6 | 89.0 | 89.1 | 88.4 | 87.6 | 84.0 | 80.7 | 86.9 |
| తూర్పుగో॥, పశ్చిమగో॥ | 81.1 | 85.6 | 91.8 | 96.1 | 99.2 | 96.8 | 90.3 | 89.7 | 89.8 | 87.9 | 83.1 | 80.5 | 89.3 |
| కృష్ణా | 83.0 | 86.1 | 90.5 | 94.2 | 99.5 | 98.2 | 92.1 | 91.3 | 90.5 | 88.6 | 84.8 | 82.6 | 90.1 |
| గుంటూరు | 87.2 | 92.4 | 99.4 | 101.5 | 106.9 | 99.6 | 93.1 | 92.9 | 93.7 | 91.5 | 87.1 | 85.8 | 94.3 |
| నెల్లూరు | 85.2 | 89.4 | 94.3 | 99.4 | 104.2 | 101.4 | 96.9 | 96.0 | 94.7 | 90.7 | 85.3 | 83.7 | 93.4 |
| కర్నూలు | 88.4 | 93.5 | 100.0 | 103.6 | 104.5 | 97.1 | 91.6 | 90.5 | 90.0 | 90.6 | 87.9 | 86.4 | 93.7 |
| కడప | 88.1 | 94.3 | 100.9 | 104.8 | 105.6 | 99.9 | 95.6 | 94.7 | 93.6 | 92.6 | 87.7 | 86.0 | 95.3 |
| అనంతపురం | 86.2 | 92.1 | 98.2 | 98.4 | 100.1 | 92.3 | 90.8 | 93.1 | 91.8 | 91.5 | 89.3 | 85.7 | 92.5 |
| చిత్తూరు | 80.7 | 86.4 | 92.5 | 92.3 | 94.5 | 88.3 | 85.6 | 88.5 | 87.9 | 86.8 | 82.1 | 80.7 | 87.2 |

## అల్పతమ ఉష్ణోగ్రత 1891 - 1940 సంవత్సరాల సగటు

| జిల్లా | జనవరి °F | ఫిబ్రవరి °F | మార్చి °F | ఏప్రిల్ °F | మే °F | జూన్ °F | జూలై °F | ఆగస్టు °F | సెప్టెంబరు °F | అక్టోబరు °F | నవంబరు °F | డిశంబరు °F | సం॥ సగటు °F |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం, విశాఖపట్నం | 67.4 | 70.6 | 74.6 | 78.2 | 81.4 | 80.7 | 78.8 | 78.6 | 78.4 | 76.5 | 72.4 | 67.9 | 75.5 |
| తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి | 66.4 | 69.7 | 73.5 | 78.5 | 81.7 | 80.9 | 78.4 | 78.3 | 78.1 | 75.9 | 71.6 | 66.4 | 74.9 |
| కృష్ణా | 66.0 | 68.6 | 72.3 | 77.7 | 81.7 | 80.7 | 78.1 | 77.9 | 77.6 | 86.0 | 71.2 | 66.5 | 74.5 |
| గుంటూరు | 61.7 | 69.1 | 75.6 | 79.2 | 84.2 | 82.0 | 78.7 | 78.4 | 77.3 | 73.8 | 67.7 | 61.9 | 74.1 |
| నెల్లూరు | 67.5 | 69.8 | 72.9 | 77.4 | 81.8 | 82.3 | 79.9 | 79.4 | 78.2 | 75.9 | 71.9 | 68.4 | 75.5 |
| కర్నూలు | 61.6 | 66.0 | 72.0 | 79.0 | 81.0 | 77.5 | 75.1 | 74.3 | 74.0 | 71.7 | 65.9 | 60.8 | 71.6 |
| కడప | 65.7 | 69.6 | 74.8 | 80.9 | 83.2 | 80.5 | 78.1 | 77.5 | 76.5 | 74.5 | 69.9 | 65.7 | 74.7 |
| అనంతపురం | 63.4 | 62.6 | 68.5 | 77.5 | 77.9 | 74.8 | 74.2 | 73.6 | 74.1 | 72.2 | 68.8 | 60.6 | 70.7 |
| చిత్తూరు | 59.2 | 61.3 | 67.4 | 71.5 | 73.7 | 72.5 | 71.7 | 73.5 | 71.2 | 69.6 | 65.3 | 58.6 | 68.0 |

నైరుతిఋతుపవనాలవల్ల నెలల్లో కలిగే వర్షపాతం [అంగుళాలలో]

| జిల్లా | జూన్ | జులై | ఆగస్టు | సెప్టెంబరు | మొత్తం | వర్షింపబడే రోజులు 1951_52 |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం (మైదానం) | 5.1 | 6.4 | 7.5 | 7.9 | 26.0 | 22.9 |
| విశాఖపట్నం | 4.5 | 4.8 | 5.6 | 7.3 | 22.2 | 28.4 |
| కృష్ణా గోదావరి } ఏజన్సీప్రాంతం | 6.3 | 11.9 | 10.1 | 8.9 | 37.0 | 41.0 |
| కృష్ణా గోదావరి } మైదానప్రాంతం | 5.0 | 6.9 | 6.2 | 6.9 | 25.0 | 34.3 |
| పశ్చిమగోదావరి | 5.1 | 7.8 | 7.1 | 7.0 | 27.0 | 31.9 |
| కృష్ణా | 4.4 | 7.0 | 6.5 | 6.2 | 24.1 | 34.7 |
| గుంటూరు | 3.3 | 4.6 | 4.9 | 5.7 | 18.5 | 27.7 |
| కర్నూలు | 2.6 | 3.8 | 4.0 | 5.3 | 15.7 | 23.9 |
| అనంతపురం | 2.1 | 2.2 | 3.3 | 5.3 | 12.9 | 11.3 |
| కడప | 2.4 | 3.2 | 4.0 | 5.0 | 14.6 | 13.5 |
| నెల్లూరు | 1.6 | 2.6 | 2.9 | 4.1 | 11.2 | 14.5 |
| చిత్తూరు | 2.4 | 3.0 | 4.1 | 5.4 | 14.9 | 15.2 |

సెప్టెంబరు నెలాఖరుకు ఈ పవనాలు [illegible], [illegible] నిరసించిపోయి, ఈశాన్య ఋతుపవనాలు [illegible] వర్షాకాలాన్ని [illegible] ప్రారంభమవుతాయి. ప్రక్క పేజీలో [illegible] చేస్తుంది.

## ఫిబ్రవరి మేనెలలమధ్యకాలంలో పడేవర్షం (అంగుళాలలో)

| జిల్లా | ఫిబ్రవరి | మార్చి | ఏప్రిల్ | మే | మొత్తం వర్షపాతం | వర్షంకురిసిన రోజులు 1951-52 |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం (మైదానప్రాంతం) | 0.7 | 0.6 | 1.1 | 2.7 | 5.1 | 9.7 |
| విశాఖపట్నం | 0.7 | 0.6 | 1.0 | 2.6 | 4.9 | 9.0 |
| తూర్పు గోదావరి ఏజన్సీప్రాంతం | 0.5 | 0.7 | 1.6 | 2.4 | 5.2 | 6.0 |
| తూర్పు గోదావరి మైదానప్రాంతం | 0.4 | 0.4 | 0.7 | 1.9 | 3.4 | 5.9 |
| పశ్చిమగోదావరి | 0.4 | 0.4 | 0.7 | 1.8 | 3.3 | 5.4 |
| కృష్ణా | 0.4 | 0.4 | 0.7 | 1.3 | 3.0 | 6.2 |
| గుంటూరు | 0.4 | 0.3 | 0.6 | 1.6 | 2.9 | 6.8 |
| నెల్లూరు | 0.3 | 0.3 | 0.5 | 1.4 | 2.5 | 5.7 |
| కర్నూలు | 0.2 | 0.2 | 0.7 | 1.4 | 2.5 | 7.5 |
| అనంతపురం | 0.2 | 0.2 | 0.8 | 2.0 | 3.2 | 6.3 |
| | 0.1 | 0.2 | 0.7 | 1.6 | 2.6 | 7.1 |
| | 0.4 | 0.4 | 1.0 | 2.4 | 4.2 | 7.9 |

ప్రక్క పేజీలోని టేబులు, సంవత్సర వర్షం, వర్షంకురిసే రోజులను వ్యక్తపరు ...ంలో, వివిధ పవనాలవల్ల పడే ...స్తుంది.

1951 సం॥లో పడినవర్షం (అం॥లలో)

| జిల్లా | సం॥లో సగటున పడేవర్షం | 1951-52 సం॥లో కురిసిన వర్షం: కురిసిన మొత్తం వర్షం | వర్షం కురిసిన రోజులు | నైరుతి ఋతు పవనాలవల్ల జూన్-సెప్టెం | ఈశాన్యఋతు పవనాలవల్ల అక్టో-జనవరి | ఫిబ్రవరి నుండి మే వరకు |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | | | | | | |
| (మైదానాలు) | 42.6 | 41.8 | 53.5 | 27.8 | 7.5 | 6.5 |
| విశాఖపట్నం | 39.0 | 41.5 | 49.4 | 26.8 | 7.7 | 7.0 |
| తూర్పుగోదావరి : | | | | | | |
| ఏజన్సీప్రాంతం | 49.7 | 54.9 | 54.4 | 44.4 | 4.9 | 5.6 |
| మైదానప్రాంతం | 41.8 | 45.2 | 54.2 | 30.2 | 8.4 | 6.6 |
| పశ్చిమగోదావరి | 40.7 | 41.5 | 48.4 | 33.1 | 5.1 | 3.3 |
| కృష్ణా | 37.0 | 35.2 | 49.4 | 27.6 | 4.2 | 3.4 |
| గుంటూరు | 32.4 | 26.8 | 43.4 | 16.2 | 3.4 | 7.2 |
| నెల్లూరు | 35.5 | 32.6 | 32.8 | 9.8 | 9.9 | 12.9 |
| కర్నూలు | 24.2 | 31.6 | 38.9 | 12.8 | 5.4 | 13.4 |
| అనంతపురం | 22.4 | 15.0 | 24.1 | 7.1 | 2.2 | 5.7 |
| కడప | 27.1 | 21.0 | 30.1 | 6.7 | 4.9 | 9.4 |
| చిత్తూరు | 33.7 | 24.6 | 34.2 | 10.8 | 5.2 | 8.6 |

ఆంధ్రలో పడేవర్షం ఈ త్తరజిల్లాలలో 45-50 అంగుళాలనుండి, దక్షిణానికిపోను పోను 20 కి తగ్గిపోతున్నది. శ్రీకాకుళం, విశాఖ,తూర్పుగోదావరి జిల్లాలలో 40-45 అంగుళాలు, ఏజన్సీ, కొండప్రాంతాలలో 50 అంగుళాలవరకూ, వర్షింపడుతుంది. ఇందులో పడే మొత్తం వర్షంలో ఒక్క నైరుతి ఋతుపవనాలవల్లనే మూడింట రెండు వంతులు వర్షింపడుతున్నది.

పశ్చిమగోదావరి, కృష్ణా, నెల్లూరు జిల్లాలలో 35-40 అంగుళాలవర్షం పడుతున్నది. నెల్లూరుజిల్లాలోమాత్రం మొత్తం పడేవర్షంలో మూడింట రెండువంతులు ఈశాన్య ఋతుపవనాలవల్లనే కలుగుతున్నది. గుంటూరు, చిత్తూరుజిల్లాలలో 30-35 అంగుళాలవరకు వర్షంపడుతున్నది. ఇందులో గుంటూరులో పడే మొత్తం వర్షంలో మూడింట రెండువంతులు నైరుతి ఋతుపవనాలవల్లను, చిత్తూరులో పడే మొత్తం వర్షంలో సగం నైరుతి ఋతు పవనాలవల్లను, మిగతాసగం ఈశాన్య ఋతుపవనాలవల్లను కలుగుతున్నది.

ఏ ఒక్క ప్రాంతంలోను ప్రతి సంవత్సరం కావలసినంత వర్షం పడుతుందనే గ్యారంటీలేదు. శ్రీకాకుళం, విశాఖపట్నం, గోదావరి, నెల్లూరు జిల్లాలలో కొంతభాగంలోఒక్కొక్కసారి

వందల మైళ్ళు, ఒక్కొక్కప్పుడు అనావృష్టి కలగటం సామాన్యం.

ఇక మిగిలిన ప్రాంతంలో గుంటూరు జిల్లాలోని మెట్ట తాలూకాలలో, నెల్లూరులోని కొన్ని తాలూకాలలో, అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో అనావృష్టి సామాన్యం.

భూ విభజనా వివరాలు

ప్రభుత్వ అంచనాల ప్రకారం, 1951-52 సంవత్సరంలో, ఆంధ్ర రాష్ట్రం మొత్తం వైశాల్యంలో (గ్రామ [illegible] తాలూకాలు వదిలి) నూటికి 20 శాతం అడవులకిందను, నూటికి 12.6 పాళ్ళు సాగుకు పనికిరాని బంజరు కిందను, నూటికి 8.3 పాళ్ళు సాగుకు యోగ్యమైన బంజరుకిందను వున్నది. ఇదే సంవత్సరంలో పంట పండించబడిన విస్తీర్ణం మొత్తం వైశాల్యంలో నూటికి 38.2 పాళ్ళు మాత్రమే.

ప్రక్క పేజీలో యిచ్చిన పట్టిక వివిధ జిల్లాలలో భూమి ఏ విధంగా విభజించబడి వున్నది తెలియజేస్తుంది.

## భూవిభజనా వివరాలు (1951 - 52)

| జిల్లా | విస్తీర్ణం (చ॥మై॥) 1 | విస్తీర్ణం (ఎకరాలు) 2 | అడవులు (ఎకరాలు) 3 | మొత్తం విస్తీర్ణంలో ఎంతశాతం 4 | సాగుకు లాయక్ గాని బంజరు (ఎకరాలు) 5 |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 3,888.96 | 24,88,931 | 5,55,243 | 22.3 | ... |
| విశాఖపట్నం | 5,178.78 | 33,14,434 | 15,23,932 | 46.0 | 3,02,875 |
| తూర్పుగోదావరి | 5,682.13 | 36,36,573 | 8,64,855 | 23.8 | 7,54,544 |
| పశ్చిమగోదావరి | 3,014.77 | 19,31,842 | 1,16,485 | 6.0 | 1,79,505 |
| కృష్ణా | 3,498.73 | 22,36,805 | 2,57,047 | 11.5 | 2,58,092 |
| గుంటూరు | 5,771.45 | 36,93,743 | 4,68,862 | 12.7 | 3,75,095 |
| నెల్లూరు | 7,959.67 | 50,94,191 | 4,73,222 | 9.3 | 17,50,640 |
| కర్నూలు | 7,836.29 | 50,15,222 | 16,60,142 | 33.1 | 2,68,397 |
| అనంతపురం | 6,706.45 | 42,92,129 | 4,52,794 | 10.6 | 3,84,480 |
| కడప | 5,928.95 | 37,94,524 | 11,56,865 | 30.5 | 1,69,678 |
| చిత్తూరు | 5,889.52 | 37,69,290 | 5,22,721 | 13.9 | 9,34,700 |
| బళ్ళారి తెలుగు తా॥లు | 2,061.00 | ... | ... | ... | ... |

| జిల్లా | మొత్తం విస్తీర్ణంలో ఎంతశాతం 6 | సాగుకు లాయక్కైన బంజరు (ఎకరాలు) 7 | మొత్తం విస్తీర్ణంలో ఎంతశాతం 8 | మొత్తం పంటభూమి 9 | మొత్తం విస్తీర్ణంలో ఎంతశాతం 10 |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | ... | 2,26,374 | 9.1 | 8,07,502 | 34.9 |
| విశాఖపట్నం | 9.1 | 90,213 | 2.7 | 8,09,337 | 24.4 |
| తూర్పుగోదావరి | 20.7 | 4,04,463 | 11.1 | 10,56,649 | 29.1 |
| పశ్చిమగోదావరి | 9.3 | 2,18,440 | 11.8 | 9,78,952 | 50.7 |
| కృష్ణా | 11.5 | 1,33,653 | 6.0 | 12,72,521 | 56.9 |
| గుంటూరు | 10.1 | 92,652 | 2.5 | 20,75,191 | 56.2 |
| నెల్లూరు | 34.4 | 11,267 | 0.2 | 13,83,110 | 27.2 |
| కర్నూలు | 5.4 | 4,62,345 | 9.2 | 21,67,943 | 43.2 |
| అనంతపురం | 9.0 | 4,24,638 | 9.9 | 21,86,204 | 51.1 |
| కడప | 4.5 | 6,43,240 | 16.9 | 10,08,007 | 26.6 |
| చిత్తూరు | 24.8 | 4,34,689 | 11.5 | 7,62,817 | 20.3 |
| బళ్ళారి తెలుగు తా॥లు | ... | ... | ... | ... | ... |

# జనాభా

ఆంధ్రరాష్ట్ర జనాభా, 1951 సంవత్సర జనాభా లెక్కల ప్రకారం రెండు కోట్ల ఐదులక్షలు. మొత్తం భారతదేశ జనాభాలో 18వ వంతు. వీరిలో పురుషులు కోటిమూడులక్షలు. స్త్రీలు ఒక కోటి రెండులక్షలు.

గుంటూరు జిల్లాలో అన్నిజిల్లాలలో కంటే జనాభాఅధికం. రెండవదిగా తూర్పు గోదావరిని చెప్పవచ్చు. అన్ని జిల్లలకన్న తక్కువజనాభా ఉన్నజిల్లా కడప.

క్రిందిటేబులు, జిల్లాలవారీ జనాభా, స్త్రీ పురుష విభజనను తెలుపుతుంది :

| | మొత్తంజనాభా | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| 1. శ్రీకాకుళం | 21,23,136 | 10,34,910 | 10,88,226 |
| 2. విశాఖపట్నం | 20,72,698 | 10,23,192 | 10,49,506 |
| 3. తూర్పుగోదావరి | 24,14,808 | 12,06,483 | 12,08,325 |
| 4. పశ్చిమగోదావరి | 16,97,727 | 8,48,990 | 8,48,737 |
| 5. కృష్ణ | 17,79,484 | 9,03,872 | 8,75,612 |
| 6. గుంటూరు | 25,49,996 | 12,91,745 | 12,58,251 |
| 7. కర్నూలు | 12,70,843 | 6,43,594 | 6,27,249 |
| 8. అనంతపురం | 13,61,556 | 7,01,242 | 6,60,314 |
| 9. కడప | 11,61,731 | 5,95,060 | 5,66,671 |
| 10. నెల్లూరు | 17,95,632 | 9,02,794 | 8,92,838 |
| 11. చిత్తూరు | 18,10,377 | 9,24,592 | 8,85,785 |
| 12. బళ్ళారి (3 తాలూకాలు) | 4,69,813 | 2,37,251 | 2,32,552 |
| మొత్తం | 2,05,07,801 | 1,03,13,725 | 1,01,94,066 |

జిల్లాలవారీ, *ప్రాంతాలవారీ గత 30 సంవత్సరాలలో జనాభా పెరుగుద శాతం ఇలా వుంది :

| జిల్లా | పెరుగుదల (+) తరుగుదల (–) శాత<br>1941–'51 | 1931–'41 | 1921–'3 |
|---|---|---|---|
| (1) ఏజన్సీ ప్రాంతం : | + 9.4 | + 8.1 | +14. |
| శ్రీకాకుళం | – 4.9 | + 5.4 | +15. |
| విశాఖపట్నం | + 9.5 | + 2.0 | + 9. |
| తూర్పుగోదావరి | +11.4 | +13.2 | +21. |
| పశ్చిమ గోదావరి | +11.4 | +12.3 | +13. |
| (2) మైదాన ప్రాంతం : | +10.6 | +11.3 | + 9. |
| శ్రీకాకుళం | + 5.7 | + 9.2 | + 8. |
| విశాఖపట్నం | +13.5 | +12.9 | +11. |
| తూర్పుగోదావరి | +20.8 | +16.2 | +17. |
| పశ్చిమగోదావరి | +18.5 | +15.1 | + 9. |
| కృష్ణా | +17.4 | +16.5 | +11. |
| గుంటూరు | + 4.1 | +10.7 | + 9.4 |
| నెల్లూరు | +10.4 | + 8.9 | + 7. |
| (3) డెల్టా ప్రాంతం : | + 18.3 | + 12.5 | + 15. |
| తూర్పుగోదావరి | +14.2 | +10.3 | +12. |
| పశ్చిమగోదావరి | +15.4 | +12.3 | +18. |
| కృష్ణా | +24.7 | +14.5 | +17. |
| గుంటూరు | +19.5 | +13.1 | +15.7 |
| (4) కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | + 12.4 | + 10.8 | + 10.3 |
| కడప | +10.0 | +11.3 | + 6.9 |
| కర్నూలు | + 6.7 | +11.9 | +11.8 |
| అనంతపురం | +16.8 | +11.5 | + 9.9 |
| చిత్తూరు | +10.8 | +12.8 | + 9.4 |

* ప్రాంతం : Natural Division కు "ప్రాంతం" అని వాడాము. 1951 జనాభా లెక్కలలో ఆ ప్రాంతీయ పరిస్థితులు, ప్రజల స్థితిగతులనుబట్టి వివిధ జిల్లాలను కలిపి "ప్రాంతాలుగా" (Natural Divisions) విభజించారు. ఈవిధంగా

రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలలోను చ॥ మై॥ కు జనసమ్మర్దం పెరుగుతూనే ఉంది. కాని, డెల్టా ప్రాంతాలలో పెరిగిన పరిమాణంలో రాష్ట్రంలోని మరే ప్రాంతంలోను జనసమ్మర్దం పెరగటంలేదు. కడప, కర్నూలు, బళ్ళారి అనంతపురం జిల్లాల ప్రాంతంలో 1931 సంవత్సరంలో జన సమ్మర్దం చదరపు మైలుకు 139 ఉన్నదల్లా 1951 కి 191 కు; శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి జిల్లాల ఏజన్సీ ప్రాంతంలో 1931 లో చదరపు మైలుకు 92 గా ఉన్న జనసమ్మర్దం 1951 కల్లా 106 కు; శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల మైదాన ప్రాంతంలో 1931 లో చదరపు మైలుకు 297 గా ఉన్న జనసమ్మర్దం 1951 కల్లా 402 కి పెరిగితే, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాల డెల్టా ప్రాంతంలో 1931 లో 503 గా ఉన్న జనసమ్మర్దం 776 కి పెరిగింది.

---

విభజింపబడినదే దక్కన్ డివిజన్. ఇందులో కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాలు నాలుగు కలిసిఉంటాయి. (1951 లో ప్రత్యేకాంధ్ర ఏర్పడలేదుకనుక, ఈ సందర్భంలో బళ్ళారి జిల్లాలోని మూడు తెలుగు తాలూకాలు కాక, జిల్లా అంతా చేరిఉన్నదని గమనించాలి.)

చిత్తూరు జిల్లాను "దక్షిణ మదరాసు డివిజన్"లో చేర్చివేశారు. ఈ డివిజన్‌లో ఒక్క చిత్తూరు తప్ప, మిగతావన్నీ తమిళ జిల్లాలే.

ఈ అధ్యాయంలో "జిల్లా-ప్రాంతాల" వారీ వివరాలు ఇవ్వబడిన పట్టికలలో, మొదట "కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం" వివరాలనిచ్చి, క్రింద ఈ ప్రాంతంలోని మూడు ఆంధ్ర జిల్లాల వివరాలు ఇవ్వబడ్డాయి. ఈ జిల్లాక్రిందే చిత్తూరుజిల్లా వివరాలనుకూడా ఇవ్వడం జరిగింది. కనుక, పాఠకులు దక్షిణ మదరాసు డివిజన్‌లోని నాలుగు జిల్లాలలో ఒకటైన బళ్ళారిజిల్లాను వదలి, దానిస్థానే చిత్తూరుజిల్లాను చేర్చామని అర్థంచేసుకోకూడదు.

ఆలూరు, ఆదోని, రాయదుర్గంతాలూకాల వివరాలు ఈ అధ్యాయంలో ఎచ్చటా చేర్చబడలేదు.

జిల్లాల-ప్రాంతాలవారీ జనసమ్మర్దం పెరుగుదల వివరాలను కిందిపట్టిక వివరిస్తుంది:

| జిల్లా | జనసమ్మర్దం (చ॥ మైలుకు) | | | |
|---|---|---|---|---|
| | 1951 | 1941 | 1931 | 1921 |
| **(1) కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాల ప్రాంతం** | **191** | **170** | **153** | **139** |
| కడప | 196 | 178 | 160 | 150 |
| కర్నూలు | 161 | 151 | 135 | 121 |
| అనంతపురం | 203 | 174 | 156 | 142 |
| చిత్తూరు | 305 | 275 | 244 | 223 |
| **(2) ఏజన్సీ ప్రాంతం** | **79** | **72** | **67** | **58** |
| శ్రీకాకుళం | 106 | 112 | 106 | 92 |
| విశాఖపట్నం | 67 | 61 | 60 | 54 |
| తూర్పుగోదావరి | 68 | 61 | 54 | 44 |
| పశ్చిమగోదావరి | 176 | 153 | 137 | 121 |
| **(3) మైదాన ప్రాంతం** | **402** | **664** | **327** | **297** |
| శ్రీకాకుళం | 610 | 577 | 528 | 486 |
| విశాఖపట్నం | 757 | 667 | 591 | 530 |
| తూర్పుగోదావరి | 672 | 556 | 478 | 409 |
| పశ్చిమగోదావరి | 389 | 328 | 285 | 260 |
| కృష్ణా | 324 | 276 | 237 | 213 |
| గుంటూరు | 293 | 282 | 255 | 233 |
| నెల్లూరు | 226 | 205 | 188 | 175 |
| **(4) డెల్టా ప్రాంతం** | **766** | **656** | **583** | **508** |
| తూర్పుగోదావరి | 1,012 | 886 | 803 | 713 |
| పశ్చిమగోదావరి | 777 | 673 | 600 | 508 |
| కృష్ణా | 638 | 512 | 447 | 379 |
| గుంటూరు | 761 | 637 | 563 | 487 |

### కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం ప్రాంతం

ఈ ప్రాంతపు జనసమ్మర్దం, 1931 లో చ॥ మైలుకు 139 ఉంటే, 1951 లో 191 కి పెరిగింది. ఇచ్చట ఏ ఒక్క తాలూకాలోను 450 కి మించి జనసమ్మర్దంలేదు. ఈ ప్రాంతపు జనాభాలో 12.5% మంది 300–450 జనసమ్మర్దమున్న ప్రాంతంలోను, 21.8% మంది 200–300 జనసమ్మర్దమున్న ప్రాంతంలోను నివసిస్తున్నారు. 52.9% మంది 150–200 జనసమ్మర్దమున్న ప్రాంతంలో నివసిస్తున్నారు. 12.5% మంది 100–150 జనసమ్మర్దమున్న ప్రాంతంలో నివసిస్తున్నారు.

### ఏజన్సీ ప్రాంతం

శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయ గోదావరిజిల్లాల్లో ఏజన్సీ లున్నాయి. ఈ ప్రాంతీయ జనాభాలో నూటికి 60 మంది చదరపు మైలుకు 100 కంటె తక్కువ జనసమ్మర్దమున్న ప్రాంతంలోనే నివసిస్తున్నారు. ఏ తాలూకాలోను జనసమ్మర్దం చదరపు మైలుకు 200 లకు మించిలేదు. పశ్చిమ గోదావరి ఏజన్సీ ప్రాంతంలో జనసమ్మర్దం అధికమని చెప్పబడే ప్రాంతంలో చదరపు మైలుకు 176 మంది మాత్రం నివసిస్తున్నారు. తరువాతి చదరపు మైలుకు 106 జనసమ్మర్దంతో శ్రీకాకుళంజిల్లా ఏజన్సీ ప్రాంతం రెండవస్థానాన్ని ఆక్రమిస్తున్నది. విశాఖ, తూర్పుగోదావరి ఏజన్సీలలో చ॥ మైలుకు 67 కు మించి ఎచ్చటా జనసమ్మర్దంలేదు.

### మైదాన ప్రాంతం

ఈ ప్రాంతపు జనసమ్మర్దం చదరపు మైలుకు 402. ఈ ప్రాంతపు జనాభాలో 20%, 300 కంటె తక్కువ జనసమ్మర్దం కల ప్రాంతంలో నివసిస్తున్నారు. మొత్తం ఈ ప్రాంతవైశాల్యంలో 45% భూభాగంలో జనసమ్మర్దం 300 కంటె తక్కువ. ఈ ప్రాంతపు మొత్తం జనాభాలో 22% మంది మాత్రమే ఇచ్చట నివసిస్తున్నారు. 11.6% భూభాగంలో జనసమ్మర్దం 750 కంటె అధికము. మైదాన ప్రాంతంలో నివసించే మొత్తం జనాభాలో 25.7% మంది ఈ ప్రాంతంలోనే నివసిస్తున్నారు.

విశాఖజిల్లాలో జనసమ్మర్దం (757) ఇతర మైదాన ప్రాంత జిల్లాలకన్న అధికం. 672 జనసమ్మర్దంతో తూర్పుగోదావరి రెండవస్థానాన్ని, 610 జనసమ్మర్దంతో శ్రీకాకుళం మూడవస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాలలోని మెట్ట భూములలో జనసమ్మర్దం ఇంతకంటె చాల తక్కువ.

### డెల్టా ప్రాంతం

రాష్ట్రంలోకెల్ల జనసమ్మర్దం ఈ ప్రాంతంలో అధికం. ఈ ప్రాంతంలోని ఏ తాలూకాలోను జనసమ్మర్దం చదరపు మైలుకు 300 లకు తక్కువలేదు. ఈ ప్రాంతంలోని జనాభాలో 66% మంది చదరపు మైలుకు 750 కి పైబడిన జనసమ్మర్దం గల ప్రాంతాలలో నివసిస్తున్నారు.

ఈ ప్రాంతంలోకెల్లా తూర్పుగోదావరి జిల్లా డెల్టా ప్రాంతంలో జనసమ్మర్దం (1,012) అత్యధికం. కృష్ణా డెల్టా ప్రాంతం (638) లో ఇతర డెల్టా ప్రాంతాలన్నిటి కన్న జనసమ్మర్దం తక్కువ.

# జనన మరణాలు *

రాష్ట్రంలోని ప్రతి వెయ్యిమంది జనాభాకు, ఎన్ని జననాలో ఈ రేటు ఎలా మారుతున్నదో క్రిందిపట్టిక తెలియ జేస్తుంది.

| సంవత్సరం | ప్రతి వెయ్యిమందికి ఎన్ని జననాలు |
|---|---|
| 1931 | 35.4 |
| 1936 | 35.5 |
| 1941 | 34.8 |
| 1946 | 34.0 |
| 1950 | 31.2 |

నోటు: ఈ అంచనాలు, అవిభాజ్య మదరాసు రాష్ట్రానికంతకూ సంబంధించినవి. ఈ ఉపశీర్షిక క్రింద ఇవ్వబడిన అంచనాలన్నీ అవిభాజ్య మదరాసురాష్ట్రానివే.

15_45 సంవత్సరాల వయస్సుగలిగిన స్త్రీలలో ప్రతి వెయ్యిమందికి నాల్గు సంవత్సరాలలోపు పిల్లలు ఎందరున్నారో క్రింది పట్టిక తెలియచేస్తుంది:

| దశవర్షం | ప్రతివెయ్యిమంది స్త్రీలకు (15_45 సంవత్సరాల మధ్య వయస్సున్న) ఎందరు పిల్లలు |
|---|---|
| 1901 | 559 |
| 1911 | 568 |
| 1921 | 521 |
| 1931 | 606 |
| 1941 | 561 |
| 1951 | 522 |

1931 సంవత్సరం తర్వాత సంతానం కనగలిగిన వయస్సుగలిగిన స్త్రీలకు పిల్లల నిష్పత్తి క్రమంగా తగ్గిపోతున్నది. ప్రసవాల నికర ప్రమాణం పడిపోయినకాలంలో, ఈ రేటుకూడా తగ్గిపోతున్నది.

గత 20 సంవత్సరాలలో మరణపు రేటు (ప్రతివెయ్యిమంది జనాభాకు) :

| | | | |
|---|---|---|---|
| 1931 | 23.7 | 1941 | 23.1 |
| 1935 | 23.7 | 1945 | 23.4 |
| 1940 | 22.5 | 1950 | 19.9 |

ప్రతివెయ్యి జననాలకు, ఎన్ని శిశుమరణాలు సంభవిస్తున్నాయో, దిగువపట్టిక తెలియచేస్తుంది :

| | |
|---|---|
| 1921__30 | 177.5 |
| 1931__40 | 177.0 |
| 1941__50 | 153.6 |

1931 - 1950 సంవత్సరాల మధ్య కాలంలో ప్రతి వెయ్యికాన్పులలో ఎందరు బాలింతలు మరణిస్తున్నారో క్రింద వివరించబడింది :

| | |
|---|---|
| 1931__35 | 8.2 |
| 1936__40 | 8.6 |
| 1941__45 | 9.1 |
| 1946__50 | 7.1 |

* వివరాలకు "ప్రజారోగ్యం" అధ్యాయం చూడండి.

# వలస

ఉన్న ప్రాంతంలో బ్రతుకు కష్టమై, పని దొరక్కపోవటం, ఇతర ప్రాంతాలకు తరలి పోవడం, చదువు, ఉద్యోగం, వైద్యసహాయం కోసం ఇతర ప్రాంతాలకు వెళ్ళటం సామాన్యంగా కనుపిస్తున్నది. జనాభా లెక్కలలో ఒక జిల్లాలో పుట్టిన వారు ఏపనిమీద ఇతర జిల్లాలకు వెళ్ళిపోయినా, (ఆడపిల్లలు తల్లిగారి జిల్లా నుండి, అత్తవారి జిల్లాకు వెళ్ళినా) వారిని వలసపోయిన వారిగా పరిగణించారు. 1951 జనాభా లెక్కల ప్రకారం వలస వచ్చినవారి సంఖ్య, ఆయా జిల్లాల-ప్రాంతాలలో పుట్టిన ప్రతి వందమంది జనాభాకు ఎంతమందో దిగువ పొందుపరచబడిన పట్టిక తెలియజేస్తుంది:

| జిల్లా - ప్రాంతం | వలస వచ్చినవారు జిల్లా జనాభాలో ఎంత శాతం | వలసవచ్చిన పురుషులు జిల్లా మొత్తం పురుష జనాభాలో ఎంత శాతం | వలస వచ్చిన స్త్రీలు జిల్లా స్త్రీ జనాభాలో ఎంత శాతం |
|---|---|---|---|
| 1. కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 6 | 5 | [illegible] |
| కడప | 3 | 3 | 4 |
| కర్నూలు | 5 | 4 | 5 |
| అనంతపురం | 7 | 6 | 9 |
| చిత్తూరు | 6 | 5 | 7 |
| 2. ఏజన్సీ ప్రాంతం | 4 | 5 | 4 |
| శ్రీకాకుళం | - | - | - |
| విశాఖపట్నం | 3 | 4 | 2 |
| తూర్పుగోదావరి | 6 | 6 | 5 |
| పశ్చిమగోదావరి | 7 | 9 | 4 |
| 3. మైదానాలు - డెల్టా | 4 | 4 | 4 |
| శ్రీకాకుళం | 1 | 1 | 1 |
| విశాఖపట్నం | 2 | 2 | 2 |
| తూర్పుగోదావరి | 4 | 4 | 4 |
| పశ్చిమగోదావరి | 6 | 6 | 7 |
| కృష్ణా | 9 | 9 | 10 |
| గుంటూరు | 3 | 4 | 3 |
| నెల్లూరు | 3 | 3 | 3 |

ఈవిధంగా వలసపోయినవారు రాష్ట్ర జనాభాలో నూటికి ఐదుగురు ఉన్నట్లు తేలుతున్నది. ఏజెన్సీప్రాంతాలలో రాకపోకల అభివృద్ధినిబట్టి, మలేరియాలాంటి జబ్బుల నిరోధాన్నిబట్టి ఆ ప్రాంతాలకు ప్రజలు వలసపోవటం ఆధారపడిఉన్నది. అందుచేత వలసవచ్చినవారు ఈ ప్రాంతంలో చాల తక్కువగా ఉంది.

విశాఖజిల్లాలో ఉన్న సింధియా నౌకా నిర్మాణకేంద్రం, విశాఖపట్నం ఇవి వలస వచ్చేవారిని ఆకర్షిస్తున్నాయి.

మెట్టప్రాంతాల గ్రామీణ జనాభా కరువుకాటకాలు, నిరుద్యోగంవల్ల, బాగా పంటలుపండే డెల్టాప్రాంతాలకు వలస పోతున్నారు. విజయవాడ - గుంటూరు ప్రాంతంలో రాష్ట్రంలోకెల్లా అధికంగా పరిశ్రమ లుండటం, ఈ నాలుగుజిల్లాలలో వరియూ పొగాకు పండించబడుతూ ఉండటంవల్ల ఈ ప్రాంతానికి అధిక సంఖ్యాకులు వలసపోతున్నారు. ఈవిధంగానే కర్నూలుజిల్లాలో నిర్మాణంలోఉన్న తుంగభద్ర ప్రాజెక్టువద్ద పని దొరుకుతుందని కడప, కర్నూలు, అనంతపురంప్రాంతం ప్రజలు వలసపోతారు. వీటన్నిటినిబట్టి వలసపోయేవారిలో అత్యధిక సంఖ్యాకులు పని వెతుక్కుంటూ పోయే కరువుబాధితులు, నిరుద్యోగులే అని తేలుతున్నది.

క్రిందిపట్టిక 1951 జనాభా లెక్కల ప్రకారం వివిధ జిల్లాలకు వలసవచ్చినవారు ఏ యే జిల్లా, ప్రాంతం, రాష్ట్రం, దేశంనుండి వచ్చారో తెలియచేస్తుంది

| జిల్లా-ప్రాంతం | ఆ జిల్లాలో పుట్టినవారు | ఈ ప్రాంతపు జిల్లాలో పుట్టి ఈ జిల్లాకు వలసవచ్చినవారు | రాష్ట్రంలో ఇతర ప్రాంతంలో పుట్టి ఈ జిల్లాకు వలసవచ్చినవారు | పొరుగు రాష్ట్రం నుండి వలస వచ్చినవారు | భారతదేశంలోని పలు ప్రాంతాలనుండి వలసవచ్చినవారు | పాకిస్థాన్ నుండి వలసవచ్చినవారు | ఇతర దేశాల నుండి |
|---|---|---|---|---|---|---|---|
| కడప | 11,24,442 | 13,347 | 20,983 | 2,197 | 98 | 31 | 14 |
| కర్నూలు | 12,12,383 | 31,692 | 14,634 | 11,582 | 259 | 136 | 49 |
| అనంతపురం | 12,64,046 | 32,169 | 30,250 | 33,894 | 362 | 92 | 71 |
| చిత్తూరు | 16,97,972 | 41,747 | 56,747 | 13,182 | 117 | 87 | 307 |
| ఏజన్సీప్రాంతం | | | | | | | |
| శ్రీకాకుళం | 54,095 | 11 | 1 | 27 | ... | ... | ... |
| విశాఖపట్నం | 1,74,832 | 2,052 | 1,595 | 1,620 | 3 | ... | 3 |
| తూర్పుగోదావరి | 1,96,149 | 2,839 | 2,789 | 4,651 | 1,342 | 2 | 4 |
| పశ్చిమగోదావరి | 90,610 | 3,906 | 1,870 | 859 | ... | ... | ... |
| మైదాన ప్రాంతం | | | | | | | |
| శ్రీకాకుళం | 20,53,710 | 6,340 | 343 | 7,867 | 331 | 25 | 203 |
| విశాఖపట్నం | 18,58,140 | 22,502 | 3,533 | 3,795 | 2,144 | 581 | 1,521 |
| తూర్పుగోదావరి | 21,18,463 | 77,353 | 4,290 | 2,465 | 1,168 | 274 | 957 |
| పశ్చిమగోదావరి | 14,96,578 | 96,749 | 1,353 | 4,292 | 491 | 6 | 390 |
| కృష్ణా | 16,15,042 | 1,12,433 | 11,947 | 36,858 | 619 | 382 | 332 |
| గుంటూరు | 24,61,607 | 63,498 | 13,959 | 9,467 | 426 | 8 | 138 |
| నెల్లూరు | 17,38,820 | 19,336 | 34,800 | 1,149 | 159 | 8 | 178 |

# జనాభా - వృత్తి విభజన

జనాభా వృత్తి, విభజనకు సంబంధించి వివరాలను పరిశీలించేముందు ఒక్క విషయం గమనించాలి. 1951 సంవత్సరంలో వృత్తి విభజనమీద తీసిన లెక్కల్లో, సెంటు పొలం వున్నవారిని కూడా భూకామందుగానే పరిగణించారు. ఒకరికి నామమాత్రపు పొలం వుంటే, అతడు వ్యవసాయకూలీగానో, లేక ఇతరుల పొలాన్ని కౌలుకు తీసుకొని సేద్యంచేస్తుంటే వానినికూడా భూకామందుగా జనాభా లెక్కలు చూపిస్తున్నాయి. కనుక 1931 జనాభా లెక్కల ప్రకారం, వ్యవసాయంపై ఆధారపడి జీవించే జనాభాలో నూటికి 39 మందిగావున్న భూకామందులు 1951 జనాభా లెక్కలలో 58 కి పెరిగినట్లు కనుపిస్తుంది. 1931లో 42.9మందిగావున్న వ్యవసాయకూలీలు 1951 లో 28.3 కు తగ్గినట్లు కనిపిస్తున్నది. ప్రభుత్వం నియమించిన అనేక విచారణకమిటీ రిపోర్టులు, కొందరువ్యక్తులు జరిపిన విచారణలు వ్యవసాయకూలీ, కౌలుదార్ల సంఖ్య క్రమంగా పెరుగుతున్నట్లు తెలియజేస్తున్నాయి. కనుక వ్యవసాయకూలీల సంఖ్య తగ్గి భూకామందులసంఖ్య పెరిగిందికాబట్టి వ్యవసాయకూలీలంతా భూములు సంపాదించగలిగారని, ఆ భూములపైనే - కూలీ మానివేసి - జీవిస్తున్నారని అర్థం చేసుకోకూడదు.

1951 లో తీసిన జనాభా లెక్కల ప్రకారం మొత్తం జనాభాలో వ్యవసాయంపై ఆధారపడేవారు నూటికి 70.6 మంది. వ్యవసాయేతరవృత్తులు-వ్యాపారం, రవాణా, తదితర వృత్తులు - పై జీవించేవారు నూటికి 29.4 మంది ఉన్నారు.

స్వంతసాగుచేసే భూకామందులు, వారిపై ఆధారపడి జీవించేవారు కలిసి రాష్ట్ర జనాభాలో నూటికి 42 మంది; కౌలుదారులు (స్వంతభూమి ఉన్నవారు, లేనివారు కలిసి), వారిపైఆధారపడినవారు కలిసి 6.5 మంది; వ్యవసాయకూలీలు, వారిపై ఆధారపడినవారు 18.5 మంది; స్వంతభూములుండి, వ్యవసాయం స్వంతంగా చేయక, కౌలుకు ఇచ్చి, దానిపై వచ్చే కౌలుతో జీవించేవారు, వీరిపై ఆధారపడేవారు కలిసి 2.5 మంది; వ్యవసాయేతర ఉత్పత్తులలో పాల్గొనేవారు వారిపైఆధారపడేవారు, 10 మంది; వ్యాపారం చేసేవారు, వారిపై ఆధారపడేవారు, 5 మంది; రవాణాలో పనిచేసేవారు, వారిపై ఆధారపడేవారు, 1; ఇతర సేవ, వృత్తి పనులు చేసేవారు, వారిపై ఆధారపడేవారు 14.5మంది.

వ్యవసాయంపై జీవించే జనాభాలో నూటికి 58 మంది భూకామందులు, 10.2 మంది కౌలుదార్లు, 28.3 మంది వ్యవసాయ కూలీలు, 3.5 మంది భూముల మీదవచ్చే కౌలుతో జీవించేవారు.

వ్యవసాయేతర వృత్తులపై ఆధారపడే జనాభాలో నూటికి 33.6 మంది వ్యవసాయేతర ఉత్పత్తిలో (Non-Agricultural Production) పాల్గొనేవారు, నూటికి 18 మంది వ్యాపారం చేసేవారు, 4.4 మంది రవాణాశాఖలలో పనిచేసేవారు, మిగతా 44 మంది ఇతర పనులు, వృత్తులు చేసుకొనేవారు.

వివిధ జిల్లాలు - ప్రాంతాలలో మొత్తం జనాభాలో నూటికి ఎంతమంది వ్యవసాయమే వృత్తిగా జీవిస్తున్నారో క్రింది పట్టీలో వివరించబడింది. (వివిధ తరగతులలో, ఆయా వృత్తులు చేసేవారిలో, ఏపనీచేయక పనిచేసేవారిపై ఆధారపడినవారు కలసి ఉన్నారు.):

| ప్రాంతం - జిల్లా | స్వంతసాగుచేసే భూస్వాములు | కౌలుదార్లు (భూమి ఉన్నవారు, లేనివారు) | వ్యవసాయ కూలీలు | స్వంత సాగు చేయక తమ భూములు కౌలు కిచ్చేవారు |
|---|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 46.49 | 5.10 | 13.81 | 2.67 |
| కడప | 46.45 | 3.78 | 12.25 | 2.32 |
| కర్నూలు | 42.16 | 3.20 | 15.37 | 3.92 |
| అనంతపురం | 48.04 | 7.55 | 14.27 | 1.92 |
| చిత్తూరు | 52.85 | 8.20 | 12.23 | 1.94 |
| ఏజన్సీ ప్రాంతం | 62.84 | 8.26 | 18.23 | 0.73 |
| శ్రీకాకుళం | 59.51 | 8.86 | 27.12 | 0.08 |
| విశాఖపట్నం | 78.50 | 7.59 | 9.48 | 0.32 |
| తూర్పుగోదావరి | 62.17 | 8.15 | 16.99 | 0.75 |
| పశ్చిమగోదావరి | 37.14 | 9.43 | 32.11 | 1.63 |
| మైదాన ప్రాంతం | 41.00 | 7.33 | 21.86 | 2.11 |
| శ్రీకాకుళం | 43.82 | 10.62 | 20.28 | 1.87 |
| విశాఖపటణం | 43.12 | 10.22 | 14.07 | 0.98 |
| తూర్పుగోదావరి | 25.88 | 7.33 | 31.38 | 2.26 |
| పశ్చిమగోదావరి | 33.67 | 7.53 | 34.18 | 2.31 |
| కృష్ణ | 41.45 | 4.20 | 25.97 | 2.65 |
| గుంటూరు | 44.13 | 2.50 | 23.24 | 2.62 |
| నెల్లూరు | 42.03 | 4.37 | 23.15 | 3.00 |

| ప్రాంతం - జిల్లా | స్వంతసాగుచేసే భూ ఖామందులు | కౌలుదార్లు (భూమి ఉన్నవారు, లేనివారు | వ్యవసాయ కూలీలు | స్వంత సాగు చేయక తమ భూములు కౌలు కిచ్చేవారు |
|---|---|---|---|---|
| **డెల్టా ప్రాంతం** | **30.62** | **8.38** | **24.74** | **3.08** |
| తూర్పుగోదావరి | 21.19 | 11.20 | 30.62 | 3.94 |
| పశ్చిమగోదావరి | 27.58 | 12.31 | 28.16 | 3.68 |
| కృష్ణా | 34.74 | 4.99 | 19.59 | 2.34 |
| గుంటూరు | 38.57 | 5.27 | 20.80 | 2.42 |

రాష్ట్రం మొత్తం జనాభాలో నూటికి ఎంతమంది వ్యవసాయేతర వృత్తులపై జీవిస్తున్నారో కిందపట్టిక వివరిస్తుంది: (వివిధ తరగతులలో ఆయా వృత్తిచేసే వారితో వారిపై ఆధారపడి జీవిస్తున్న వారుకూడా చేర్చబడ్డారు).

| జిల్లా - ప్రాంతం | వ్యవసాయేతర ఉత్పత్తి | వ్యాపార | రవాణా | ఇతరపనులు, వృత్తులు |
|---|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలప్రాంతం | 8.77 | 5.23 | 1.27 | 16.66 |
| కడప | 10.38 | 4.84 | 1.00 | 18.98 |
| కర్నూలు | 8.92 | 5.16 | 1.09 | 20.18 |
| అనంతపురం | 8.26 | 5.44 | 1.80 | 12.72 |
| చిత్తూరు | 6.37 | 4.12 | 0.94 | 13.35 |
| **ఏజన్సీ ప్రాంతం** | **3.67** | **1 79** | **0.32** | **4.9** |
| శ్రీకాకుళం | 2.27 | 0.89 | ... | 1.27 |
| విశాఖపట్నం | 1.43 | 0.80 | 0.02 | 1.86 |
| తూర్పుగోదావరి | 4.09 | 1.90 | 0.60 | 5.35 |
| పశ్చిమగోదావరి | 7.70 | 3.90 | 0.45 | 7.64 |
| **మైదానప్రాంతం** | **11.30** | **4.89** | **1.23** | **0.28** |
| శ్రీకాకుళం | 10.00 | 4.30 | 0.44 | 8.67 |
| విశాఖపట్నం | 12.96 | 4.40 | 2.21 | 12.04 |
| తూర్పుగోదావరి | 12.26 | 7.11 | 1.76 | 12.02 |
| పశ్చిమగోదావరి | 8.19 | 4.45 | 1.56 | 8.11 |

| జిల్లా - ప్రాంతం | వ్యవసాయేతర ఉత్పత్తి | వ్యాపారం | రవాణా | ఇతరపనులు, వృత్తులు |
|---|---|---|---|---|
| కృష్ణా | 7.85 | 4.54 | 0.45 | 12.89 |
| గుంటూరు | 10.57 | 5.59 | 0.68 | 10.67 |
| నెల్లూరు | 12.49 | 4.73 | 1.34 | 8.89 |
| **డెల్టాప్రాంతం** | **10.18** | **6.50** | **1.80** | **14.70** |
| తూర్పుగోదావరి | 12.03 | 6.76 | 2.06 | 12.20 |
| పశ్చిమగోదావరి | 9.04 | 5.67 | 1.47 | 12.09 |
| కృష్ణా | 9.79 | 7.35 | 2.44 | 18.76 |
| గుంటూరు | 9.81 | 6.21 | 1.26 | 15:66 |

పనిచేసేవారిపై ఆధారపడేవారు

వీరిని రెండుగా విభజించారు. (1) ఏమీ సంపాదించనివారు; (2) కొద్దో గొప్పో సంపాదించుతూ, పనిచేసేవారి మీద ఆధారపడి జీవించేవారు.

వ్యవసాయంపై జీవించే మొత్తం జనాభాలో నూటికి ఎంతమంది (1) స్వయం పోషకులు, (2) ఏమీ సంపాదించక, సంపాదించేవారిపై ఆధారపడిన వారు, (3) కొద్దో గొప్పో సంపాదిస్తూ, అదిచాలక సంపాదించేవారిపై ఆధారపడినవారు ఉన్నారో, దిగువ పట్టిక వివరిస్తుంది:

| వివరం | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక సంపాదించేవారిపై ఆధారపడినవారు | కొద్ది సంపాదించి చాలక సంపాదించేవారిపై ఆధారపడినవారు |
|---|---|---|---|
| ఆంధ్రరాష్ట్రం | 26.5 | 66.5 | 7.0 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం ప్రాంతం | 27.0 | 67.0 | 6.0 |
| కృష్ణా, గుంటూరు, నెల్లూరు, ఉభయగోదావరి, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలు | 26.0 | 66.0 | 8.0 |

కింద పొందుపరచబడిన పట్టిక, వ్యవసాయంపై జీవించే వివిధ తరగతుల మొత్తం జనాభాలో, ఈ మూడుతరగతుల వారు నూటికి ఎందరో, జిల్లాల-ప్రాంతాల వారీగా వివరాలు తెలియజేస్తుంది:

| జిల్లా - ప్రాంతం | స్వయం పోషకులు | ఏమీ సంపాదించక, సంపాదించేవారిపై ఆధారపడిన వారు | తాము సంపాదించేది చాలక సంపాదించే వారిపై ఆధారపడినవారు |
|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలప్రాంతం | 27 | | |
| కడప | 28 | 68 | 4 |
| కర్నూలు | 25 | 70 | 5 |
| అనంతపురం | 28 | 66 | 6 |
| చిత్తూరు | 26 | 69 | 5 |
| ఏజన్సీ ప్రాంతం | 28 | 64 | 8 |
| శ్రీకాకుళం | 29 | 59 | 12 |
| విశాఖపట్నం | 33 | 63 | 4 |
| తూర్పుగోదావరి | 24 | 66 | 10 |
| పశ్చిమగోదావరి | 26 | 64 | 10 |
| మైదానప్రాంతం | 26 | 66 | 8 |
| శ్రీకాకుళం | 22 | 67 | 11 |
| విశాఖపట్నం | 25 | 64 | 11 |
| తూర్పుగోదావరి | 27 | 65 | 8 |
| పశ్చిమగోదావరి | 26 | 65 | 9 |
| కృష్ణా | 26 | 67 | 6 |
| గుంటూరు | 28 | 68 | 4 |
| నెల్లూరు | 28 | 64 | 8 |

క్రిందిపట్టిక, వ్యవసాయంపై జీవించే జనాభాలో నూటికి ఎందరు స్వయంపోషకులో, ఎందరు సంపాదించేవారిపై ఆధారపడ్డారో తెలియచేస్తుంది:

| ప్రాంతం | భూకామందులు | | | కౌలుదారులు | | | వ్యవసాయ కూలీలు | | | కౌలుకిచ్చేవారు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | తాము సంపాదించేది చాలక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | తాము సంపాదించేది చాలక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | తాము సంపాదించేది చాలక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక, సంపాదించే వారిపై ఆధారపడేవారు | తాము సంపాదించేది చాలక, సంపాదించే వారిపై ఆధారపడేవారు |
| ఆంధ్ర * | 24 | 69.5 | 6.5 | 24 | 67.5 | 8.5 | 31.5 | 60.5 | 8.0 | 29.5 | 65.5 | 5.0 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 25 | 69.0 | 6.0 | 25 | 68.0 | 7.0 | 32.0 | 62.0 | 6.0 | 29.0 | 65.0 | 6.0 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 23 | 70.0 | 7.0 | 23 | 67.0 | 10.0 | 31.0 | 59.0 | 10.0 | 30.0 | 66.0 | 4.0 |

* కింది రెండు ప్రాంతాల సగటు. ముందువచ్చే పట్టికలన్నింటిలోనూ ఈ రెండు ప్రాంతాల సగటే, "ఆంధ్ర"కు ఇవ్వబడ్డాయి.

వ్యవసాయేతర వృత్తులపై జీవించే వారిపై ఆధారపడినవారు, (3) తా
వివిధ తరగతుల మొత్తం జనాభాలో సంపాదించేచాలక, స్వయం పోషకి
నూటికి ఎంతమంది (1) స్వయంపోషకులు, మీద ఆధారపడేవారు ఉన్నారో క్రిం
(2) ఏమీ సంపాదించక, సంపాదించే పట్టిక తెలియజేస్తుంది:

| జిల్లా – ప్రాంతం | స్వయం పోషకులు | ఏమీ సంపాదించక, సంపాదించేవారిపై ఆధారపడినవారు | తాము సంపాదించే చాలక సంపాదిం[చే] వారిపై ఆధారపడినవారు |
|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 28 | 68 | 5 |
| కడప | 25 | 72 | 3 |
| కర్నూలు | 27 | 69 | 4 |
| అనంతపురం | 28 | 66 | 6 |
| చిత్తూరు | 27 | 69 | 3 |
| ఏజన్సీప్రాంతం | 30 | 62 | 8 |
| శ్రీకాకుళం | 29 | 62 | 9 |
| విశాఖపట్నం | 31 | 59 | 10 |
| తూర్పుగోదావరి | 29 | 63 | 8 |
| పశ్చిమగోదావరి | 30 | 63 | 7 |
| మైదానప్రాంతం | 27 | 67 | 6 |
| శ్రీకాకుళం | 24 | 66 | 10 |
| విశాఖపట్నం | 25 | 68 | 7 |
| తూర్పుగోదావరి | 27 | 68 | 5 |
| పశ్చిమగోదావరి | 27 | 68 | 5 |
| కృష్ణా | 28 | 67 | 5 |
| గుంటూరు | 28 | 68 | 4 |
| నెల్లూరు | 29 | 65 | 6 |

వ్యవసాయేతర వృత్తులపై జీవించే, వివిధతరగతుల జనాభాలో నూటికి యెంతమంది (1) స్వయంపోషకులో (2) ఏమీ సంపాదించక, సంపాదించేవారిపై ఆధారపడినవారో (3) కొద్దిగాసంపాదిస్తూ అది చాలక సంపాదించేవారిపై ఆధారపడుచున్నారో క్రింది టేబులు వివరిస్తుంది:

| ప్రాంతం | వ్యవసాయేతర ఉత్పత్తి | | | వ్యాపారం | | | రవాణా | | | ఇతరవృత్తులు-ఉద్యోగాలు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక సంపాదించేవారిపై ఆధారపడినవారు | కొద్దిగా సంపాదించేవారైనా, అదిచాలక సంపాదించేవారిపై ఆధారపడినవారు | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక సంపాదించేవారిపై ఆధారపడినవారు | కొద్దిగా సంపాదించేవారైనా, అదిచాలక సంపాదించేవారిపై ఆధారపడినవారు | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక సంపాదించేవారిపై ఆధారపడినవారు | కొద్దిగా సంపాదించేవారైనా, అదిచాలక సంపాదించేవారిపై ఆధారపడినవారు | స్వయంపోషకులు | ఏమీ సంపాదించక సంపాదించేవారిపై ఆధారపడినవారు | కొద్దిగా సంపాదించేవారైనా, అదిచాలక సంపాదించేవారిపై ఆధారపడినవారు |
| ఆంధ్ర ... | 27 | 66.0 | 7.0 | 26 | 70.5 | 3.5 | 25.5 | 70.5 | 4.0 | 28.5 | 66.5 | 5.0 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 27 | 67.0 | 6.0 | 26 | 71.0 | 3.0 | 25.0 | 71.0 | 4.0 | 29.0 | 66.0 | 5.0 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 27 | 65.0 | 8.0 | 26 | 70.0 | 4.0 | 26.0 | 70.0 | 4.0 | 28.0 | 67.0 | 5.0 |

# గ్రామీణ జనాభా

ఆంధ్ర గ్రామీణ జనాభా 1951 జనాభా లెక్కలప్రకారం 1,69,49,939. గ్రామాలు 17,215.

సగటున ప్రతి గ్రామంలో నివసించే జనాభా వివిధప్రాంతాలలో ఒకమాదిరిగా లేదు. ఏజన్సీ ప్రాంతములో గ్రామసగటు జనాభా చాలతక్కువ (153); శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల మైదాన ప్రాంతంలో గ్రామసగటు జనాభా 1,085; కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి డెల్టా ప్రాంతంలో గ్రామ సగటు జనాభా అత్యధికం (2,130); కడప, కర్నూలు, అనంతపురం ప్రాంతంలో ఈసగటు 1,245.

శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల మైదాన ప్రాంతంలో మొత్తం జనాభాలో నూటికి 87 వంతులు; ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాల డెల్టాప్రాంతంలో నూటికి 76 వంతులు; కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం ప్రాంతంలో నూటికి, 84 వంతులు; ఏజన్సీ ప్రాంత జనాభా అంతా గ్రామీణ జనాభాయే.

కిందిపట్టిక, వివిధ ప్రాంతాలలో గ్రామీణ జనాభా, మొత్తం జనాభాలో ఎంతశాతమో, గ్రామసగటుజనాభా ఎంతో, గ్రామీణ జనసమ్మర్దంఎంతో వివరిస్తుంది:

| జిల్లా - ప్రాంతం | మొత్తం జనాభాలో గ్రామీణ జనాభా ఎంత శాతం ? | గ్రామ సగటు జనాభా | జనసమ్మర్దం చ॥ మై॥కు 1951లో |
|---|---|---|---|
| కడప, కర్నూలు, అనంతపురం బళ్ళారిజిల్లాల ప్రాంతం | 83.6 | 1,245 | 162 |
| కడప | 88.4 | 1,198 | 175 |
| కర్నూలు | 84.2 | 1,276 | 138 |
| అనంతపురం | 83.7 | 1,357 | 173 |
| చిత్తూరు | 90.6 | 861 | 279 |
| ఏజన్సీ ప్రాంతం | 100 | 153 | 79 |
| శ్రీకాకుళం | 100 | 128 | 106 |
| విశాఖపట్నం | 100 | 93 | 67 |
| తూర్పుగోదావరి | 100 | 202 | 68 |
| పశ్చిమగోదావరి | 100 | 760 | 176 |

| జిల్లా - ప్రాంతం | మొత్తం జనాభాలో గ్రామీణ జనాభా ఎంత శాతం? | గ్రామ సగటు జనాభా | జనసమ్మర్దం చ॥మైళ్లకు 1951లో |
|---|---|---|---|
| **మైదాన ప్రాంతం** | **87.1** | **1,085** | **355** |
| శ్రీకాకుళం | 90.8 | 715 | 562 |
| విశాఖపట్నం | 83.9 | 1,258 | 642 |
| తూర్పుగోదావరి | 74.7 | 1,759 | 526 |
| పశ్చిమగోదావరి | 92.4 | 1,652 | 367 |
| కృష్ణా | 93.7 | 1,347 | 307 |
| గుంటూరు | 88.4 | 1,843 | 268 |
| నెల్లూరు | 88.7 | 1,020 | 201 |
| **డెల్టా ప్రాంతం** | **67.4** | **2,130** | **629** |
| తూర్పుగోదావరి | 82.1 | 2,624 | 887 |
| పశ్చిమగోదావరి | 76.1 | 2,017 | 634 |
| కృష్ణా | 74.0 | 1,526 | 493 |
| గుంటూరు | 73.7 | 2,753 | 596 |

వివిధ ప్రాంతాలలో, ఆ ప్రాంతీయ గ్రామీణ జనాభాలో నూటికి ఎందరు 5000 మించిన, 5000 - 2000 మధ్య, 2000 - 500 మధ్య, 500 కన్న తక్కువ జనాభాగల, నాలుగురకముల గ్రామాలలో, నివసిస్తున్నారో దిగువ పట్టిక తెలియచేస్తుంది :

| ప్రాంతం | 5000కు పైబడిన జనాభా గల గ్రామాలలో | 5000_2000 మధ్య జనాభావున్న గ్రామాలలో | 2000_500 మధ్య జనాభా గల గ్రామాలలో | 500 లకన్న తక్కువ జనాభావున్న గ్రామాలలో |
|---|---|---|---|---|
| 1. కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 6.2 | 39.3 | 48.9 | 5.6 |
| 2. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి జిల్లాల ఏజన్సీ ప్రాంతం | 5.1 | 7.6 | 23.1 | 64.2 |
| 3. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల మైదాన ప్రాంతం | 6.2 | 39.5 | 46.1 | 8.2 |
| 4. ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల డెల్టా ప్రాంతం | 20.9 | 51.3 | 26.5 | 1.3 |
| ఆంధ్ర * | 9.6 | 34.4 | 36.2 | 19.8 |

* పై నాలుగు ప్రాంతముల సగటు.

వివిధ ప్రాంతాలలోని మొత్తం వివిధ తరగతుల గ్రామాలలో నివసిస్తు గ్రామీణ జనాభాలో నూటికి ఎంతరు, న్నారో క్రిందిపట్టికజిల్లాలవారీ వివరిస్తుంది:

| జిల్లా - ప్రాంతం | 5000 కు మించిన జనాభాగల గ్రామాలలో | 5000 - 2000 మధ్య జనాభాగల గ్రామాలలో | 2000 - 500 మధ్య జనాభాగల గ్రామాలలో | 500 లకు తక్కువ జనాభాగల గ్రామాలలో |
|---|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 6 2 | 39.3 | 48.9 | 5.6 |
| కడప | 8.8 | 40.6 | 43.6 | 7.0 |
| కర్నూలు | 4.1 | 39.2 | 52.7 | 4.0 |
| అనంతపురం | 2.5 | 45.8 | 47.0 | 4.7 |
| చిత్తూరు | 4.1 | 31.0 | 53.3 | 11.6 |
| ఏజన్సీప్రాంతం | 5.1 | 7.6 | 23.1 | 64.2 |
| శ్రీకాకుళం | ... | ... | 10.9 | 89.1 |
| విశాఖపట్నం | 3.9 | 1.3 | 16.5 | 78.3 |
| తూర్పుగోదావరి | ... | 5.8 | 25.8 | 68.4 |
| పశ్చిమగోదావరి | 20.8 | 27.4 | 36.5 | 15.3 |
| మైదానప్రాంతం | 6 2 | 39 5 | 46.1 | 8 2 |
| శ్రీకాకుళం | 3.0 | 26.1 | 53.9 | 17.0 |
| విశాఖపట్నం | 7.4 | 38.3 | 49.6 | 4.7 |
| తూర్పుగోదావరి | 14.5 | 52.1 | 31.0 | 2.4 |
| పశ్చిమగోదావరి | 7.0 | 59.3 | 30.8 | 2.9 |
| కృష్ణా | 6.4 | 36.9 | 52.9 | 3.8 |
| గుంటూరు | 4.5 | 62.1 | 31.4 | 2.0 |
| నెల్లూరు | 6.3 | 34.0 | 49.7 | 10.0 |
| డెల్టాప్రాంతం | 20.9 | 51.3 | 26.5 | 1.3 |
| తూర్పుగోదావరి | 24.8 | 54.3 | 20.6 | 0.3 |
| పశ్చిమగోదావరి | 16.9 | 52.1 | 29.5 | 1.5 |
| కృష్ణా | 13.7 | 41.8 | 41.0 | 3.5 |
| గుంటూరు | 27.2 | 56.4 | 16.1 | 0.3 |

1921_1951 సంవత్సరాల మధ్య గ్రామీణ జనాభా పెరుగుదల శాతం కాలంలో, రాష్ట్ర మొత్తం జనాభా, ఇలావుంది :

| వివరం | 1941_'51 | 1931_'41 | 1921_'31 |
|---|---|---|---|
| * మొత్తం జనాభా | 14.4 | 11.6 | 10.0 |
| * గ్రామీణ జనాభా | 9.5 | 9.3 | 8.5 |

* అవిభాజ్య మదరాసురాష్ట్ర సరాసరి అంచనాలే, ఆంధ్రకు అంచనాలుగా ఇవ్వబడ్డాయి.

పై అంచనాలనుబట్టి, రాష్ట్రజనాభా పెరుగుదల పరిమాణంలో, గ్రామీణ జనాభా పెరుగుదల లేదని తేలుతున్నది. ఈ పరిణామానికి ప్రధానకారణం, నేటి జమీందారీ ఆర్థికవ్యవస్థ.

రాష్ట్రంలో సేద్యం చేయబడుతున్న భూమిలో చాలభాగం, జనాభాలో అల్పసంఖ్యాకులుగా ఉన్న జమీందారులు, భూస్వాముల చేతుల్లో వుంది. మన్నె రైతు చేతిలో ఉన్న భూమి కుటుంబపోషణకు చాలినంతది కాకపోవడం, దీనికి తోడు, గ్యారంటీ నీటిపారుదల సౌకర్యాలు లేక, తరచూ కలుగుతూండే వర్షాభావం వల్ల, పంటలుపోవడం, కుటుంబం గడవక అప్పులుచేయటం, క్రమంగా ఈబుణ భారం పెరిగి, ఉన్న యకరం భూమిని అమ్ముకొని పొట్ట చేతబుచ్చుకొని పట్నాలకో, డెల్టా ప్రాంతాలకో వలస పోతున్నాడు. కౌలుదారులూ, పేదరైతులవలె పొట్ట గడవక, కూలీ చేసుకునేందుకు పట్నాలకు, డెల్టా ప్రాంతాలకు వలసపోతున్నారు. గ్రామీణ ప్రజలలోకెల్ల నిత్యదరిద్రులైన వ్యవసాయకూలీలు, ఈ పరిస్థితులలో, వలసపోయేవారిలో ప్రథములుగా తయారైనారు. గ్రామీణ ప్రాంతాలనుండి వలసపోయే వారిలో ఈ మూడుతరగతులవారే అత్యధికులు.

పట్నాలలో విద్యా, వైద్య, తదితర సౌకర్యాలుంటాయి కాబట్టి, కొందరు పల్లెలనుండి పట్నాలకు వలసపోతున్నారు.

1941_51 సంవత్సరాలమధ్య వివిధ పట్నాల జనాభా పెరుగుదల నూటికి 40 పాళ్ళనుండి 88 పాళ్ళవరకు ఉన్నది. దీనినిబట్టి గ్రామీణప్రజ, ఉన్న ఊరిలో తిండిగడవక, పొట్టచేతబట్టుకుని పట్టణ ప్రాంతాలకు ఎంత పెద్దయెత్తున వలస వస్తున్నది స్పష్టమవుతున్నది.

ఈ పరిణామ ఫలితంగానే గ్రామీణ జనాభా పెరుగుదల, మొత్తంరాష్ట్ర జనాభా పెరుగుదల కన్నతక్కువగావుంది.

గ్రామీణ జనాభా పెరుగుదల వివిధ ప్రాంతాలలో, జిల్లాలలో ఇలా 1921-51 సంవత్సరాల మధ్యకాలంలో ఉంది:

| జిల్లా ప్రాంతం | జనాభా పెరుగుదల (+) తరుగుదల (-) (శాతం) | | |
|---|---|---|---|
| | 1941-'51 | 1931-'41 | 1921-'31 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం, జిల్లాల ప్రాంతం | +9.1 | +7.1 | +10.3 |
| కడప | + 8.1 | +10.2 | + 7.4 |
| కర్నూలు | + 3.8 | + 3.1 | +10.5 |
| అనంతపురం | +11.8 | + 9.9 | +12.0 |
| చిత్తూరు | + 7.2 | +12.2 | + 8.8 |
| ఏజన్సీ ప్రాంతం | +9.4 | +8.2 | +14 9 |
| శ్రీకాకుళం | — 4.9 | + 5.4 | +15.8 |
| విశాఖపట్నం | + 9.5 | + 2.0 | + 9.8 |
| తూర్పుగోదావరి | +11.4 | +13.2 | +21.1 |
| పశ్చిమగోదావరి | +14.4 | +12.3 | +13.0 |
| మైదాన ప్రాంతం | + 7.8 | +10.0 | +9.7 |
| శ్రీకాకుళం | + 5.5 | + 7.6 | + 8.8 |
| విశాఖపట్నం | + 8.9 | +12.5 | +10.4 |
| తూర్పుగోదావరి | +12.8 | +14.8 | +23.3 |
| పశ్చిమగోదావరి | +17.3 | +14.7 | + 6.6 |
| కృష్ణా | +17.1 | +16.4 | +11.6 |
| గుంటూరు | + 1.0 | + 8.9 | +10.1 |
| నెల్లూరు | + 8.3 | + 7.2 | + 5.7 |
| డెల్టా ప్రాంతం | +11 6 | + 8.3 | +15.7 |
| తూర్పుగోదావరి | +10.0 | + 6.6 | +11.9 |
| పశ్చిమగోదావరి | + 8.8 | + 6.4 | +22.4 |
| కృష్ణా | +15.4 | +10.6 | +14.4 |
| గుంటూరు | +12.8 | + 9.9 | +15.0 |

# పట్టణ జనాభా

రాష్ట్రజనాభాలో 31,77,833 మంది లలో, జిల్లాలలో, నూటికి ఎంతమంది *పట్టణాలలో నివసిస్తున్నారు. 1951 పట్టణవాసులు, పట్టణ సగటు జనాభా, జనాభాలెక్కల ప్రకారం వివిధ ప్రాంతా జనసమ్మర్దం వివరాలు :

| జిల్లా - ప్రాంతం | పట్టణ సగటు జనాభా | మొత్తం జనాభాలో పట్టణవాసులు ఎంతశాతం? | జనసమ్మర్దం చ॥మైలుకు 1951 లో |
|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 16,507 | 16.4 | 1,723 |
| కడప | 14,914 | 11.6 | 2,101 |
| కర్నూలు | 14,301 | 15.8 | 1,210 |
| అనంతపురం | 15,825 | 16.3 | 1,728 |
| చిత్తూరు | 12,095 | 9.4 | 2,900 |
| మైదాన ప్రాంతం | 17,879 | 12.9 | 3,429 |
| శ్రీకాకుళం | 11,924 | 9.2 | 3,582 |
| విశాఖపట్నం | 27,714 | 16.1 | 11,734 |
| తూర్పుగోదావరి | 27,642 | 25.3 | 3,644 |
| పశ్చిమగోదావరి | 11,967 | 7.6 | 1,459 |
| కృష్ణా | 14,867 | 6.3 | 2,115 |
| గుంటూరు | 12,221 | 11.6 | 1,097 |
| నెల్లూరు | 16,969 | 11.3 | 6,705 |
| డెల్టా ప్రాంతం | 23,225 | 23.6 | 3,211 |
| తూర్పుగోదావరి | 19,917 | 17.9 | 2,857 |
| పశ్చిమగోదావరి | 17,074 | 23.9 | 2,747 |
| కృష్ణా | 34,035 | 26.0 | 4,001 |
| గుంటూరు | 26,249 | 26.3 | 3,343 |

* ఐదువేల జనాభాకు తగ్గకుండా ఉండి, పట్టణంలో ఉండే విద్యా, వైద్యా, వినోద సౌకర్యాలు, సంవత్సరం పొడవునా ప్రజల నిత్యజీవితావసరాలు అమ్మబడే "శాల్తబజారు", ఉన్నవాటిని పట్నాలుగా పరిగణించారు.

వివిధతరగతుల పట్టణాల్లో. పట్టణ వాసులలో నూటికి ఎంతమంది నివసిస్తున్నారో దిగువ పట్టిక తెలియ చేస్తుంది.

| ప్రాంతం - జిల్లా | 20 వేలకు మించిన జనాభావున్న పట్టణాలలో | 10-20 వేల మధ్య జనాభావున్న పట్టణాలలో | 5000-10,000 జనాభావున్న పట్టణాలలో | 5 వేలకు తక్కువ జనాభావున్న పట్టణాలలో |
|---|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం, జిల్లాల ప్రాంతం | 53.1 | 23.5 | 23.4 | |
| కడప | 55.2 | 17.3 | 27.5 | ... |
| కర్నూలు | 46.7 | 16.4 | 36.9 | ... |
| అనంతపురం | 48.8 | 34.9 | 16.3 | ... |
| చిత్తూరు | 37.8 | 26.8 | 30.8 | 4.6 |
| మైదాన ప్రాంతం | 55.1 | 28.8 | 15.1 | 1.0 |
| శ్రీకాకుళం | 48.6 | 18.9 | 28.9 | 3.6 |
| విశాఖపట్నం | 70.6 | 17.7 | 11.7 | ... |
| తూర్పుగోదావరి | 68.1 | 31.9 | ... | ... |
| పశ్చిమగోదావరి | ... | 100.0 | ... | ... |
| కృష్ణా | ... | 100.0 | ... | ... |
| గుంటూరు | 37.2 | 36.2 | 26.6 | ... |
| నెల్లూరు | 49.8 | 27.7 | 20.3 | 2.2 |
| డెల్టాప్రాంతం | 65.9 | 23.3 | 10.8 | ... |
| తూర్పుగోదావరి | 62.5 | 22.7 | 14.8 | ... |
| పశ్చిమగోదావరి | 52.8 | 28.7 | 18.5 | ... |
| కృష్ణా | 79.7 | 16.7 | 3.6 | ... |
| గుంటూరు | 66.4 | 25.2 | 8.4 | ... |

### జనాభా పెరుగుదల

**1941-1951** సంవత్సరాల మధ్య కాలంలో, పట్టణ జనాభా నూటికి 38 పాళ్లు పెరిగింది. కడప, కర్నూలు, అనంతపురంజిల్లాల ప్రాంతంలో నూటికి 33.2 పాళ్ళు, మైదానప్రాంతంలో 33.8పాళ్ళు, డెల్టాప్రాంతంలో 46.9 పాళ్ళు పెరిగింది.

క్రింది టేబులు, 1921–1951 సంవత్సరాల పట్టణజనాభా పెరుగుదలను, తెలియ మధ్యకాలంలో జిల్లా - ప్రాంతాలవారీ చేస్తుంది.

| ప్రాంతం—జిల్లా | పట్టణజనాభా పెరుగుదల(+) తిరుగుదల (–) 1941–51 శాతం | 1931–41 శాతం | 1921–31 శాతం |
|---|---|---|---|
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలప్రాంతం | +33.2 | +41 3 | +10 0 |
| కడప | +26.8 | +22.5 | +2.0 |
| కర్నూలు | +25.9 | +149.6 | +38.3 |
| అనంతపురం | +51.1 | + 24.8 | – 4.4 |
| చిత్తూరు | +65.9 | + 22.9 | +19.8 |
| మైదాన ప్రాంతం | +33.8 | +23.4 | +11.5 |
| శ్రీకాకుళం | + 7.9 | + 27.9 | + 6.9 |
| విశాఖపట్నం | +45.7 | + 15.6 | +19.4 |
| తూర్పుగోదావరి | +52.7 | + 22.4 | – 3.9 |
| పశ్చిమగోదావరి | +36.0 | + 21.9 | +83.9 |
| కృష్ణా | +22.8 | + 16.7 | + 8.8 |
| గుంటూరు | +35.7 | + 31.6 | + 1.4 |
| నెల్లూరు | +30.3 | + 27.1 | +27.1 |
| డెల్టాప్రాంతం | +46.9 | +35.1 | +16.9 |
| తూర్పుగోదావరి | +38.9 | + 38.7 | +19.0 |
| పశ్చిమగోదావరి | +42.6 | + 46.2 | – 2.0 |
| కృష్ణా | +62.1 | + 33.3 | +37.1 |
| గుంటూరు | +43.5 | + 26.1 | +18.7 |

నోటు: పట్టణజనాభా త్వరితగతిని పెరగటానికి కారణం, గ్రామాలనుండి–ముఖ్యంగా మెట్టప్రాంతాలనుండి–ప్రజలు వలసరావటం కారణమని "గ్రామీణ ప్రజలు" శీర్షికలో వివరించబడింది. వలస రావటానికిగల కారణాలుకూడా వివరించబడ్డాయి.

రాష్ట్రజనాభా పెరుగుదల 1941–51 సంవత్సరాల మధ్య నూటికి 14 పాళ్ళు మాత్రమే వుంటే, కొన్ని ముఖ్యపట్టణాల జనాభా నూటికి 88 పాళ్ళవరకూ కూడా పెరిగింది. కొన్ని ముఖ్య ఆంధ్రపట్టణాల జనాభా 1921–51 సంవత్సరాల మధ్య కాలంలో, ఎంత త్వరితగతిని పెరిగిందో క్రింది పట్టిక తెలియచేస్తుంది:

| పట్టణం | 1951 జనాభా | జనాభా పెరుగుదల శాతం ? 1941–51 | 1931–41 | 1921–31 |
|---|---|---|---|---|
| విజయవాడ | 1,61,198 | 87.0 | 42.6 | 36.8 |
| గుంటూరు | 1,25,255 | 49.8 | 28.3 | 35.3 |
| విశాఖపట్టణం | 1,08,042 | 53.8 | 22.6 | 28.2 |
| రాజమండ్రి | 1,05,276 | 41.2 | 17.4 | 18.1 |
| కాకినాడ | 99,952 | 33.0 | 13.9 | 23.6 |
| ఏలూరు | 87,213 | 34.4 | 13.2 | 25.0 |
| నెల్లూరు | 81,480 | 44.7 | 22.7 | 27.9 |
| మచిలీపట్నం | 77,953 | 31.8 | 3.9 | 29.6 |
| విజయనగరం | 67,104 | 29.7 | 15.8 | 13.7 |
| కర్నూలు | 60,222 | 33.1 | 25.3 | 26.5 |
| తెనాలి | 58,116 | 43.0 | 17.5 | 48.9 |
| ఒంగోలు | 53,583 | 51.2 | 0.6 | 17.9 |
| అనంతపురం | 31,952 | 48.7 | ... | ... |
| కడప | 37,438 | 32.5 | ... | ... |
| చిత్తూరు | 38,894 | 39.7 | ... | ... |

# నివాసవసతులు

జనాభా (మొత్తంరాష్ట్రజనాభా) క్రమంగా పెరుగుతూ ఉంటే, (రాష్ట్రంలో) గృహ వసతులుమాత్రం పెరగటంలేదు. అందుచేత ఒక్కొక్క ఇంటిలో ఉండే జనాభా పెరుగుతున్నది కాని, ఇండ్లుమాత్రం పెరగటంలేదు. తత్ఫలితంగా జనసామాన్యం అనారోగ్యకరమైన ఇరుకు ఇండ్లలో ఉండవలసి వస్తున్నది.

ప్రక్కపేజీలో పొందుపరచిన పట్టిక, క్రమంగా ఒక ఇంటిలో ఉండేజనాభా ఎలా పెరుగుతున్నదో తెలియచేస్తుంది:

| ప్రాంతం | ఒక ఇంటిలో ఉండే జనాభా (అంకెలు వ్యక్తులు) | | | |
|---|---|---|---|---|
| | 1921 | 1931 | 1941 | 1951 |
| ఆంధ్ర ... | 4.8 | 4.8 | 4.9 | 5.4 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 4.8 | 4.9 | 4.9 | 5.5 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 4.8 | 4.7 | 4.8 | 5.2 |

గ్రామాల్లోకూడా, ఇండ్లలో ఇంత వత్తిడి కనిపిస్తున్నది. దీనికితోడు, పట్టణాలలోని ఇండ్లకంటె, గ్రామాలలోని ఇండ్లు చాలహీనస్థితిలో ఉన్నాయి. ప్రాంతాలవారీ ఈ జనాభా ఎలా పెరుగుతున్నదో కింది పట్టిక తెలియచేస్తుంది:

| ప్రాంతం | ఒక ఇంటిలోఉండే జనాభా పెరుగుదల (అంకెలు వ్యక్తులు) | | | |
|---|---|---|---|---|
| | 1921 | 1931 | 1941 | 1951 |
| ఆంధ్ర ... | 4.8 | 4.8 | 4.9 | 5.2 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలప్రాంతం | 4.8 | 4.8 | 4.9 | 5.3 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 4.8 | 4.7 | 4.8 | 5.1 |

## పట్టణాలలో పెరుగుదల

| ప్రాంతం | ఒక ఇంటిలో నివసించే జనాభా పెరుగుదల (అంకెలు వ్యక్తులు) | | | |
|---|---|---|---|---|
| | 1921 | 1931 | 1941 | |
| ఆంధ్ర ... | 5.1 | 5.1 | 4.9 | 6.5 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 5.0 | 5.1 | 4.9 | 6.5 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 5.2 | 5.1 | 4.9 | 6.4 |

పట్టణాలకు వలసవచ్చేవారి సంఖ్య అధికంగా ఉండటంవల్ల, ఇంటిలో జనం వత్తిడి, పల్లెప్రాంతాలలోని ఇండ్లలో కంటె ఎక్కువ. ప్రతిసంవత్సరం క్రొత్తగా ఇండ్లు కట్టబడుతున్నా, వలస వచ్చేవారి సంఖ్య అధికం కనుక, ఇది జనం వత్తిడిని ఏవిధంగాను తగ్గించలేక పోతున్నాయి. పట్టణాలలో "గృహవసతి సమస్య వలసవచ్చేవారి సంఖ్య అధికం కావటంవల్ల ... విషమంగా ఉంది. ఈ సమస్య ఇంకా పరిష్కరింపబడవలసి వున్నది" అని మదరాసు "సెన్సస్ కమిషనర్" జనాభా లెక్కల రిపోర్టులో వ్రాశాడు.

పట్టణాలలో అనేకమంది గృహవసతి లేక, చెట్లకిందో, రోడ్డుప్రక్కనో కాలం గడుపుతున్నారు. వీరిలో చాలమంది కూలి కార్మికులు. పెద్ద అద్దెరేటును భరించలేక ఈ విధంగా కాలం గడుపుతున్నారు. కొందరుఅనాధులు, బిచ్చగాళ్ళుఈవిధంగా కాలం గడుపుతున్నారు. 1951 సంవత్సర జనాభా లెక్కల ప్రకారం దిగువ పట్టణాల్లో గృహవసతి లేనివారి సంఖ్య వివరం :

| పట్టణం | | గృహవసతిలేని వారి సంఖ్య |
|---|---|---|
| విజయవాడ | ... | 2,948 |
| గుంటూరు | ... | 1,734 |
| విశాఖపట్టణం | ... | 1,382 |
| రాజమండ్రి | ... | 305 |

కింది పట్టిక, వివిధ జిల్లాలలో-ప్రాంతాలలో ఒక్కొక్క ఇంటిలో నివసించే జనాభా ఎలా పెరుగుతున్నదో సూచిస్తుంది:

| ప్రాంతం - జిల్లా | మొత్తం జనాభా ఒక్కొక్క ఇంటిలో ఎందరుంటున్నారు | | | | గ్రామీణ జనాభా ఒక్కొక్క ఇంటిలో ఎందరుంటున్నారు | | | | పట్టణ జనాభా ఒక్కొక్క ఇంటిలో ఎందరుంటున్నారు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1951 | 1941 | 1931 | 1921 | 1951 | 1941 | 1931 | 1921 | 1951 | 1941 | 1931 | 1921 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 5.5 | 4.9 | 4.9 | 4.8 | 5.3 | 4.9 | 4.8 | 4.8 | 6.5 | 4.9 | 5.1 | 5.0 |
| కడప | 5.5 | 5.2 | 4.8 | 4.8 | 5.4 | 5.0 | 4.8 | 4.8 | 6.3 | 4.6 | 4.9 | 4.9 |
| కర్నూలు | 5.2 | 5.0 | 4.8 | 4.8 | 5.1 | 4.8 | 4.8 | 4.8 | 6.8 | 7.2 | 5.3 | 5.1 |
| అనంతపురం | 5.7 | 4.9 | 4.9 | 4.9 | 5.6 | 5.0 | 4.9 | 4.9 | 6.4 | 4.1 | 5.1 | 5.0 |
| చిత్తూరు | 5.7 | 5.4 | 5.3 | 5.3 | 5.7 | 5.4 | 5.3 | 5.3 | 6.6 | 5.2 | 5.3 | 5.0 |
| ఏజన్సీ ప్రాంతం | 5.2 | 5.2 | 4.6 | 4.4 | 5.2 | 5.7 | 1.6 | 4.4 | ... | ... | 4.2 | ... |
| శ్రీకాకుళం | 4.1 | 7.6 (శ్రీకాకుళం, విశాఖపట్నం) | 4.7 (శ్రీకాకుళం, విశాఖపట్నం) | ... | 4.1 | 7.6 (శ్రీకాకుళం, విశాఖపట్నం) | 4.7 (శ్రీకాకుళం, విశాఖపట్నం) | ... | ... | ... | 4.2 | ... |
| విశాఖపట్నం | 5.6 | | | | 5.6 | | | | ... | ... | ... | ... |
| తూర్పుగోదావరి | 5.3 | 4.8 (తూర్పు, పశ్చిమ గోదావరి) | 4.8 (తూర్పు, పశ్చిమ గోదావరి) | ... | 5.3 | 4.8 (తూర్పు, పశ్చిమ గోదావరి) | 4.8 (తూర్పు, పశ్చిమ గోదావరి) | ... | ... | ... | ... | ... |
| పశ్చిమగోదావరి | 5.0 | | | | 5.0 | | | | ... | ... | ... | ... |

| ప్రాంతం_జిల్లా | మొత్తం జనాభా ఒక్కొక్క ఇంటిలో ఎందరుంటున్నారు | | | | గ్రామీణ జనాభా ఒక్కొక్క ఇంటిలో ఎందరుంటున్నారు | | | | పట్టణ జనాభా ఒక్కొక్క ఇంటిలో ఎందరుంటున్నారు | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1951 | 1941 | 1931 | 1921 | 1951 | 1941 | 1931 | 1921 | 1951 | 1941 | 1931 | 1921 |
| మైదాన - డెల్టా ప్రాంతాలు | 5.3 | 4.8 | 4.8 | 4.9 | 5.1 | 4.8 | 4.7 | 4.9 | 6.4 | 4.9 | 5.1 | 5.2 |
| శ్రీకాకుళం | 4.9 | 4.6 | 4.2 | 4.4 | 4.9 | 4.6 | 4.1 | 4.3 | 5.1 | 4.6 | 4.5 | 4.8 |
| విశాఖపట్నం | 5.0 | | | | 4.8 | | | | 7.2 | | | |
| తూర్పుగోదావరి | 5.6 | 5.1 | 5.1 | 5.1 | 5.3 | 5.1 | 5.0 | 5.1 | 6.7 | 5.1 | 5.7 | 5.6 |
| పశ్చిమగోదావరి | 6.0 | 5.1 | 5.3 | ... | 5.2 | 5.0 | 5.1 | ... | 6.2 | 5.1 | 5.8 | ... |
| కృష్ణా | 5.5 | 4.9 | 5.0 | 4.8 | 5.3 | 4.9 | 4.9 | 5.3 | 6.6 | 4.9 | 5.5 | 5.8 |
| గుంటూరు | 5.2 | 4.8 | 4.9 | 5.1 | 5.0 | 4.8 | 4.9 | 5.1 | 6.1 | 5.0 | 5.1 | 5.2 |
| నెల్లూరు | 5.3 | 4.8 | 4.8 | 4.9 | 5.2 | 4.9 | 4.8 | 5.0 | 6.5 | 4.7 | 4.8 | 4.6 |

జనాభా పెరుగుదల, ఇండ్ల పెరుగుదల 1921—51 సంవత్సరాల మధ్యకాలంలో ఇలా ఉంది:

| ప్రాంతం | 1921—31 | | 1931—41 | | 1941—51 | |
|---|---|---|---|---|---|---|
| | (అ) | (ఆ) | (అ) | (ఆ) | (అ) | (ఆ) |
| ఆంధ్ర ... | 11.1 | 12.3 | 11.4 | 19.9 | 12.8 | 2.7 |
| కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 10.1 | 9.7 | 11.1 | 8.5 | 12.4 | 0.8 |
| శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 12.1 | 14.8 | 11.7 | 31.2 | 13.2 | 4.6 |

నోటు: (అ) నూరు చదరపుమైళ్ళకు జనాభా పెరుగుదల శాతం.
(ఆ) నూరు చదరపుమైళ్ళకు ఇండ్ల పెరుగుదల శాతం.

పై వివరాలు, గత 10 సం॥లలో పెరుగుదల పరిమాణంకంటె ఎంత అధి జనాభా పెరుగుదల పరిమాణం, ఇండ్ల కమో తెలియచేస్తున్నాయి.

ఒక్కొక్కయింటిలో ఎన్ని కుటుంబాలు కాపురముంటున్నాయో కింది వివరాలు, తెలియచేస్తాయి:

| ప్రాంతం | గ్రామీణ ప్రాంతం | | పట్టణ ప్రాంతం | |
|---|---|---|---|---|
| | ఒక్కొక్క ఇంటిలో నివసించే కుటుంబాల సంఖ్య | ఒక్కొక్క కుటుంబంలోని వ్యక్తుల సంఖ్య | ఒక్కొక్క ఇంటిలో నివసించే కుటుంబాల సంఖ్య | ఒక్కొక్క కుటుంబంలోని వ్యక్తుల సంఖ్య |
| ఆంధ్ర ... | 1.1 | 4.7 | 1.3 | 4.8 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 1.1 | 4.8 | 1.2 | 5.0 |
| శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 1.1 | 4.5 | 1.4 | 4.6 |

పై అంచనాలనుబట్టి, గ్రామాలలోని కుటుంబ జనసంఖ్యకన్న, పట్టణాలలోని కుటుంబజనసంఖ్య అధికమని తేలుతున్నది. పట్టణాలలో నివసించేవారిలో అధిక సంఖ్యాకులైన మధ్యతరగతి, కార్మికపక్షాలకు సంబంధించినవారు హెచ్చు అద్దెలు చెల్లించుకోలేక, ఇతర కుటుంబాలవారితో కలిసి, ఒకే ఇంటిలోని ఒక భాగంలో కాపురముండటం జరుగుతున్నది.

## కుటుంబాల పరిమితి

1951 జనాభా లెక్కలలో కుటుంబాలను వాటిలోని జనసంఖ్యనుబట్టి నాలుగు తరగతులుగా విభజించారు. (1) ముగ్గురు, అంతకన్న తక్కువ జనాభాఉన్న కుటుంబాలు: చిన్నవి; (2) 4–6 గురుగల కుటుంబాలు: మధ్యరకం; (3) 7–9 గురుగల కుటుంబాలు: పెద్దవి; (4) తొమ్మిదిమందికి మించి ఉన్నకుటుంబాలు : మరింతపెద్దవి.

గ్రామీణప్రాంతంలో నూటికి, ఎన్ని కుటుంబాలు, ఈనాలుగుతరగతులకు చెందినవి ఉన్నాయో కిందిపట్టిక తెలియచేస్తుంది :

| ప్రాంతం | కుటుంబ సగటు జనాభా | చిన్నవి | మధ్యరకం | పెద్దవి | మరింత పెద్దవి |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 4.7 | 37.0 | 42.0 | 17.5 | 3.5 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం. | 4.8 | 35.0 | 41.0 | 20.0 | 4.0 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలప్రాంతం. | 4.5 | 39.0 | 43.0 | 15.0 | 3.0 |

పట్టణప్రాంతంలో నివసించే కుటుంబ తరగతులకు చెందినవో కిందిపట్టిక తెలియ జాలలో నూటికి ఎన్ని కుటుంబాలు నివస చేస్తుంది:

| ప్రాంతం | కుటుంబ జనాభా సగటు | చిన్నవి | మధ్యరకం | పెద్దవి | మరింత పెద్దవి |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 4.8 | 35.5 | 42.0 | 18.0 | 4.5 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 5.0 | 31.0 | 44.0 | 21.0 | 4.0 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 4.6 | 40.0 | 40.0 | 15.0 | 5.0 |

ఒక్కొక్క ఇంటిలో ఎన్ని కుటుంబాలు చెందినవున్నాయో, వాటిజనాభా ఎంతో కాపురముంటున్నాయో, నూటికి ఎన్ని వాటి జిల్లాలవారీ వివరాలు 123, 124 కుటుంబాలు పైనాలుగు తరగతులకు పేజీలలోని పట్టికలలో యివ్వబడ్డాయి:

| ప్రాంతం - జిల్లా | ఒక్కొక్క ఇంటిలో ఎన్ని కుటుంబాలున్నాయి | కుటుంబ జనాభా | చిన్నవి | | మధ్యరకం | | పెద్దవి | | మరింత పెద్దవి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | కుటుంబాలు | మొత్తం జనాభా | కుటుంబాలు | మొత్తం జనాభా | కుటుంబాలు | మొత్తం జనాభా | కుటుంబాలు | మొత్తం జనాభా |
| **కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం** | **1.1** | **4.8** | **35** | **78** | **41** | **202** | **18** | **151** | **4** | **44** |
| కడప | 1.1 | 4.8 | 37 | 79 | 36 | 181 | 20 | 156 | 6 | 65 |
| కర్నూలు | 1.1 | 4.6 | 35 | 78 | 46 | 221 | 17 | 133 | 3 | 26 |
| అనంతపురం | 1.1 | 4.9 | 33 | 71 | 42 | 211 | 21 | 160 | 4 | 47 |
| చిత్తూరు | 1.1 | 5.0 | 34 | 76 | 45 | 223 | 15 | 121 | 6 | 71 |
| **ఏజన్సీ ప్రాంతం** | **1.1** | **4.6** | **29** | **63** | **54** | **255** | **14** | **106** | **2** | **37** |
| శ్రీకాకుళం | 1.0 | 3.9 | 30 | 60 | 60 | 260 | 10 | 70 | ... | ... |
| విశాఖపట్నం | 1.1 | 4.7 | 19 | 35 | 65 | 307 | 17 | 126 | ... | ... |
| తూర్పుగోదావరి | 1.1 | 4.5 | 35 | 83 | 48 | 215 | 13 | 92 | 4 | 63 |
| పశ్చిమగోదావరి | 1.2 | 5.0 | 43 | 91 | 38 | 210 | 14 | 105 | 4 | 91 |
| **మైదానాలు - డెల్టాప్రాంతం** | **1.1** | **4.5** | **39** | **87** | **42** | **206** | **15** | **115** | **4** | **43** |
| శ్రీకాకుళం | 1.1 | 4.9 | 23 | 78 | 47 | 231 | 16 | 123 | 4 | 53 |
| విశాఖపట్నం | 1.1 | 4.0 | 49 | 93 | 36 | 180 | 13 | 102 | 2 | 22 |
| తూర్పుగోదావరి | 1.2 | 4.3 | 42 | 102 | 43 | 204 | 12 | 98 | 3 | 33 |
| పశ్చిమగోదావరి | 1.2 | 4.4 | 40 | 89 | 40 | 188 | 16 | 118 | 4 | 45 |
| కృష్ణా | 1.1 | 4.7 | 35 | 85 | 44 | 216 | 17 | 133 | 3 | 33 |
| గుంటూరు | 1.1 | 4.5 | 39 | 87 | 43 | 212 | 14 | 105 | 4 | 48 |
| నెల్లూరు | 1.1 | 5.0 | 33 | 75 | 43 | 208 | 18 | 140 | 6 | 72 |

| ప్రాంతం - జిల్లా | ఒక్కొక్క ఇంటిలో ఎన్ని కుటుంబాలున్నాయి | కుటుంబ జనాభా | చిన్నది | | మధ్యరకం | | పెద్దది | | మరింత పెద్దది | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | కుటుంబాలు | మొత్తం జనాభా | కుటుంబాలు | మొత్తం జనాభా | కుటుంబాలు | మొత్తం జనాభా | కుటుంబాలు | మొత్తం జనాభా |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాలప్రాంతం | 1.2 | 5.0 | 30 | 72 | 44 | 222 | 21 | 159 | 4 | 49 |
| కడప | 1.2 | 4.5 | 36 | 100 | 55 | 291 | 9 | 64 | ... | ... |
| కర్నూలు | 1.3 | 4.3 | 43 | 102 | 43 | 215 | 13 | 98 | 2 | 19 |
| అనంతపురం | 1.3 | 6.0 | 17 | 29 | 46 | 226 | 29 | 225 | 9 | 111 |
| చిత్తూరు | 1.3 | 4.5 | 38 | 88 | 47 | 224 | 12 | 98 | 3 | 38 |
| ఏజన్సీ ప్రాంతం | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| శ్రీకాకుళం | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| విశాఖపట్నం | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| తూర్పుగోదావరి | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| పశ్చిమగోదావరి | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| మైదానాలు - డెల్టాప్రాంతం | 1.4 | 4.6 | 39 | 88 | 40 | 195 | 16 | 125 | 5 | 57 |
| శ్రీకాకుళం | 1.1 | 4.3 | 59 | 144 | 22 | 111 | 15 | 122 | 4 | 48 |
| విశాఖపట్నం | 1.5 | 5.1 | 25 | 67 | 53 | 265 | 18 | 136 | 3 | 39 |
| తూర్పుగోదావరి | 1.5 | 4.4 | 43 | 99 | 42 | 200 | 12 | 94 | 4 | 48 |
| పశ్చిమగోదావరి | 1.4 | 4.8 | 45 | 104 | 28 | 143 | 21 | 163 | 6 | 69 |
| కృష్ణా | 1.4 | 4.5 | 38 | 84 | 44 | 216 | 15 | 120 | 3 | 35 |
| గుంటూరు | 1.3 | 4.5 | 40 | 78 | 42 | 205 | 11 | 86 | 7 | 79 |
| నెల్లూరు | 1.2 | 4.8 | 35 | 91 | 44 | 204 | 17 | 139 | 4 | 44 |

# స్త్రీ పురుష జనాభా

1951 సంవత్సరంలో, రాష్ట్ర జనాభాలో 1,01,94,066 స్త్రీలు, 1,03,13,725 పురుషులు. 1921-51 సంవత్సరాల మధ్యకాలంలో ప్రతి వెయ్యి మంది పురుషులకు స్త్రీలు ఎందరున్నారో దిగువ పట్టిక తెలియచేస్తుంది:

| ప్రాంతం | ప్రతి వెయ్యిమంది పురుషులకు స్త్రీలు | | | |
|---|---|---|---|---|
| | 1921 | 1931 | 1941 | 1951 |
| ఆంధ్ర ... | 988 | 986 | 983 | 980 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 960 | 961 | 959 | 959 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 1,016 | 1,011 | 1,006 | 1,001 |

విశాఖపట్టణం, శ్రీకాకుళం జిల్లాలలో మాత్రం స్త్రీ జనాభా పురుష జనాభా కన్న అధికం; శ్రీకాకుళంలో వెయ్యి మంది పురుషులకు 1,054 మంది, విశాఖపట్టణంజిల్లాలో 1,031 మంది స్త్రీలు ఉన్నారు (1951 లో).

ఏడు జిల్లాలలో మాత్రం స్త్రీల సంఖ్య పురుషులకన్న తక్కువ. ప్రతి వెయ్యిమంది పురుషులకు ఈ జిల్లాల్లో స్త్రీలు:

అనంతపురం 942; కడప 952; చిత్తూరు 958; కృష్ణా 969; గుంటూరు 974; కర్నూలు 975; నెల్లూరు 989.

1951 సంవత్సర జనాభా లెక్కల ప్రకారం గ్రామీణ, పట్టణ జనాభాలో, ప్రతి వెయ్యిమంది పురుషులకు స్త్రీల సంఖ్య:

| ప్రాంతం | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా |
|---|---|---|
| ఆంధ్ర ... | 981 | 978 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 960 | 952 |
| శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 1,001 | 1,003 |

వ్యవసాయ - వ్యవసాయేతర వృత్తుల లకు స్త్రీల సంఖ్య 1951 లో ఇలా జనాభాలో ప్రతి వెయ్యిమంది పురుషు ఉంది :

| ప్రాంతం | వ్యవసాయ వృత్తులలో స్త్రీ జనాభా | వ్యవసాయేతర వృత్తులలో స్త్రీ జనాభా |
|---|---|---|
| ఆంధ్ర ... | 988 | 963 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 965 | 945 |
| శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 1,010 | 981 |

వ్యవసాయ వృత్తులవారు, పల్లెల్లోనే వారిలో అధిక సంఖ్యాకులు. పల్లెల్లోనే వారిలో [illegible] జనాభా కనక, సామాన్యంగా స్త్రీలు గ్రామాల్లోనే ఉంటారు. అందుచేత, గ్రామాల్లో [illegible] స్త్రీల నిష్పత్తి, పట్టణ ప్రాంతంలోని నిష్పత్తికన్న అధికం.

వివిధ వ్యవసాయవృత్తుల జనాభాలో ప్రతి వెయ్యిమంది పురుషులకు స్త్రీ సంఖ్యను కింది పట్టిక తెలుపుతుంది :

| ప్రాంతం | ప్రతి వెయ్యిమంది పురుషులకు స్త్రీలు: అన్ని తరగతుల వ్యవసాయ వృత్తులవారు | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 988 | 965 | 781 | 1,033 | 1,202 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 965 | 940 | 593 | 1,032 | 1,130 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 1,010 | 990 | 968 | 1,034 | 1,274 |

నోటు : 1. భూస్వామందులు; 2. కౌలుదారులు; 3. వ్యవసాయకూలీలు; 4. కౌలు పుచ్చుకొనేవారు.

వ్యవసాయేతర వృత్తులవారిలో, ప్రతి స్త్రీలున్నదీ కింది పట్టిక తెలియ వెయ్యిమంది పురుషులకు ఎందరు చేస్తుంది:

| ప్రాంతం | మొత్తం వ్యవసాయేతర జనాభా | వ్యవసాయేతర వృత్తుల జనాభా 5 | 6 | 7 | 8 |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 953 | 931 | 998 | 948 | 973 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 945 | 902 | 971 | 9 4 | 962 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లల ప్రాంతం | 981 | 959 | 1,025 | 961 | 983 |

నోటు: 5. వ్యవసాయేతర ఉత్పత్తి పనులు చేసేవారు; 6. వ్యాపారస్తులు; 7. రవాణాలో పనిచేసేవారు; 8. ఇతరపనులు – వృత్తులు చేసుకొనేవారు.

వ్యవసాయవృత్తిలో ఉన్న ప్రతి లో, ఎందరు స్వయంపోషకులైన స్త్రీలు వెయ్యిమంది స్వయంపోషకులయిన పురుషు న్నదీ, కింది పట్టిక తెలియచేస్తుంది:

| ప్రాంతం | వ్యవసాయ వృత్తి జనాభాలో స్త్రీలు | సొంతదారు | కౌలుదారు | వ్యవసాయ కూలీలు | భూస్వాములు |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 216 | 172 | 143 | 430 | 564 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 282 | 204 | 165 | 518 | 482 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లల ప్రాంతం | 210 | 140 | 101 | 312 | 646 |

వ్యవసాయ వృత్తులవారిలో కొద్దిగా సంపాదిస్తూ, అవిచాలక, సంపాదించే ఇతరులపై ఆధారపడుతున్న ప్రతి వెయ్యి మంది పురుషులకు, ఈ విధంగా ఇతరులపై ఆధారపడుతున్న స్త్రీలు ఎందరున్నదీ కిందిపట్టిక తెలియచేస్తుంది:

| ప్రాంతం | మొత్తం వ్యవసాయ జనాభా | స్వంత దారులు | కౌలు దారులు | వ్యవసాయ కూలీలు | భూస్వాములు |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 1,230 | 1,064 | 1,286 | 1,559 | 904 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 1,117 | 1,034 | 1,296 | 1,370 | 889 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 1,342 | 1,093 | 1,276 | 1,747 | 919 |

వ్యవసాయ వృత్తులవారిలో ఏమీ సంపాదించక, సంపాదించేవారిపై ఆధారపడిన ప్రతి వెయ్యిమంది పురుషులకు, ఈవిధంగా ఆధారపడుతున్న స్త్రీలు ఎందరున్నారో కిందిపట్టిక తెలియచేస్తుంది :

| ప్రాంతం | మొత్తం వ్యవసాయ జనాభా | స్వంత దారులు | కౌలు దారులు | వ్యవసాయ కూలీలు | భూస్వాములు |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 1,563 | 1,563 | 1,552 | 1,526 | 1,732 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాలప్రాంతం | 1,470 | 1,488 | 1,456 | 1,374 | 1,688 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెలూరుజిలాల ప్రాంతం | 1,655 | 1,638 | 1,647 | 1,678 | 1,776 |

వ్యవసాయేతర వృత్తుల జనాభాలో పోషకులకు, ఎందరు స్వయంపోషకులైన ప్రతి వెయ్యిమంది పురుష స్వయం స్త్రీలున్నారో కిందిపట్టిక తెలియచేస్తుంది:

| ప్రాంతం | మొత్తం వ్యవసాయేతర జనాభా | వ్యవసాయేతర ఉత్పత్తులు చేసేవారు | వ్యాపారస్తులు | రవాణాలో పనిచేసేవారు | ఇతరవృత్తులు, ఉద్యోగాలు చేసేవారు |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 188 | 131 | 172 | 25 | 246 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 228 | 145 | 171 | 30 | 309 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | 148 | 116 | 173 | 19 | 183 |

వ్యవసాయేతర వృత్తుల జనాభాలో, తాము సంపాదించేది చాలక, సంపాదించే వారిపై ఆధారపడ్డ ప్రతి వెయ్యిమంది పురుషులకు, ఎందరు ఈవిధంగా ఆధార పడిన స్త్రీలున్నారో కిందిపట్టిక తెలియ చేస్తుంది :

| ప్రాంతం | మొత్తం వ్యవసాయేతర జనాభా | వ్యవసాయేతర ఉత్పత్తులు చేసేవారు | వ్యాపారం చేసేవారు | రవాణాలో పనిచేసేవారు | ఇతర వృత్తులు, ఉద్యోగాలు చేసేవారు |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 1,055 | 1,141 | 581 | 600 | 1,197 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | 1,080 | 1,149 | 534 | 640 | 1,249 |
| శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 1,039 | 1,132 | 628 | 660 | 1,144 |

వ్యవసాయేతర వృత్తుల జనాభాలో ఎందరు ఈ విధంగా ఇతరులపై ఆధార ఏమీ సంపాదించక సంపాదించేవారిపై పడిన స్త్రీలున్నారో గుర్తుపట్టిక తెలియ ఆధారపడిన ప్రతి వెయ్యమంది పురుషులకు చేస్తుంది :

| ప్రాంతం | మొత్తం వ్యవసాయేతర వృత్తుల జనాభా | [illegible] చేసేవారు | వ్యాపారం చేసేవారు | [illegible] పని చేసేవారు | ఇతరులకు [illegible] చేసేవారు |
|---|---|---|---|---|---|
| ఆంధ్ర ... | 1,667 | 1,678 | 1,715 | 1,931 | 1,620 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 1,542 | 1,546 | 1,677 | 1,868 | 1,475 |
| శ్రీకాకుళం, విశాఖ, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 1,792 | 1,810 | 1,812 | 1,993 | 1,744 |

## వివాహితులు - అవివాహితులు

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో నూటికి ఎందరు వివాహితులు, అవివాహితులు, విధవలు, విడాకులిచ్చినవారు ఉన్నారో ఈ పట్టిక తెలియజేస్తుంది :

| ప్రాంతం | పురుషులు | | | | స్త్రీలు | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | అవివాహితులు | వివాహితులు | విధవలు | విడాకులిచ్చినవారు | అవివాహితులు | వివాహితులు | విధవలు | విడాకులిచ్చినవారు |
| ఆంధ్ర ... | 50 | 45 | 5 | ... | 38 | 47 | 15 | 1 |
| కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | 52 | 42 | 6 | ... | 41 | 44 | 14 | 1 |
| శ్రీకాకుళం, విశాఖ, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | 48 | 48 | 4 | ... | 35 | 49 | 15 | 1 |

రాష్ట్రంలో పట్టుకోత్యా విడాకులిచ్చిన వారు నామమాత్రం. అవివాహితులలో పురుషులకన్న స్త్రీలే అధికం. వైధవ్యం సంప్రాప్తించిన వారిలో స్త్రీలే అధికంగా కనిపిస్తున్నారు. [illegible] స్త్రీ పునర్వివాహాలు జరగకపోబట్టి, విధవరాండ్రసంఖ్య అధికంగా ఉన్నది.

గత 30 సంవత్సరాలలో అవివాహితులసంఖ్య ఎలామారుతున్నదో కింది పట్టికలో చూపించబడింది.

| సంవత్సరం | ఆంధ్ర | | కడప, కర్నూలు, అనంతపురం జిల్లాల ప్రాంతం | | శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతం | |
|---|---|---|---|---|---|---|
| | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు |
| 1921 | 35 | 52 | 36 | 54 | 34 | 50 |
| 1931 | 35 | 52 | 38 | 55 | 32 | 48 |
| 1941 | 38 | 54 | 40 | 56 | 35 | 51 |
| 1951 | 39 | 50 | 41 | 52 | 36 | 48 |

వివిధ ప్రాంతాలలో వివాహితుల సంఖ్యలో ఈ నిష్పత్తి, ఎలావున్నదో కింది నూటికి ఎంతమందో, గత 30 సంవత్సరాల [illegible] :

| సంవత్సరం | ఆంధ్ర | | కడప, కర్నూలు, అనంతపురం జిల్లాల ప్రాంతం | | శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | |
|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 1921 | 43 | 44 | 39 | 41 | 46 | 47 |
| 1931 | 44 | 46 | 39 | 42 | 48 | 49 |
| 1941 | 42 | 44 | 38 | 41 | 45 | 47 |
| 1951 | 46 | 47 | 43 | 44 | 48 | 49 |

వివిధ ప్రాంతాలలో విధవలు, విడాకు నూటికి ఎందరో కింది పట్టికలో వివరించ లిచ్చినవారు కలసి, జనాభాలో ఉండింది:

| సంవత్సరం | ఆంధ్ర | | కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | | శ్రీకాకుళం, విశాఖ, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | |
|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 1921 | 6 | 21 | 7 | 23 | 4 | 19 |
| 1931 | 5 | 16 | 6 | 20 | 4 | 19 |
| 1941 | 5 | 19 | 6 | 19 | 4 | 18 |
| 1951 | 5 | 16 | 6 | 15 | 4 | 16 |

వివాహితులలో, వివిధ వయస్సుల వారు, వెయ్యింటికి ఎంతమందో కింది పట్టిక తెలియచేస్తుంది:

| వయస్సు విభజన | ఆంధ్ర | | కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాల ప్రాంతం | | శ్రీకాకుళం, విశాఖ, తూర్పు గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం | |
|---|---|---|---|---|---|---|
| | 1951 | 1941 | 1951 | 1941 | 1951 | 1941 |
| | | | **పురుషులు** | | | |
| 0–14 సంIIలు | 14 | 14 | 10 | 8 | 17 | 19 |
| 15–34 సంIIలు | 415 | 440 | 413 | 426 | 417 | 454 |
| 35–54 సంIIలు | 432 | 427 | 442 | 446 | 422 | 408 |
| 55 సంIIలకుపైన | 140 | 120 | 135 | 120 | 144 | 119 |
| | | | **స్త్రీలు** | | | |
| 0–14 సంIIలు | 50 | 90 | 36 | 69 | 63 | 110 |
| 15–34 సంIIలు | 595 | 646 | 599 | 669 | 591 | 623 |
| 35–54 సంIIలు | 292 | 240 | 290 | 241 | 293 | 239 |
| 55 సంIIలకుపైన | 64 | 25 | 75 | 21 | 53 | 28 |

దీనినిబట్టి, బాల్య వివాహాలు తగ్గిపోయినట్లు తెలుస్తున్నది.

# వ యో వి భ జ న

కింది పట్టిక, వివిధ ప్రాంతాలలోని ప్రజల వయోవిభజన ప్రతి నూరుమందికి ఎలా ఉన్నదీ ఇవ్వబడింది :

| వయస్సు | ఆంధ్ర | | కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి, జిల్లాల ప్రాంతం | | శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, జిల్లాల ప్రాంతం | |
|---|---|---|---|---|---|---|
| | 1951 | 1941 | 1951 | 1941 | 1951 | 1941 |
| సం॥లోపు | 3 | 2 | 3 | 2 | 3 | 3 |
| 0_4 సం॥ | 9 | 10 | 9 | 10 | 9 | 10 |
| 5_14 సం॥ | 24 | 27 | 25 | 27 | 24 | 26 |
| 15_34 సం॥ | 33 | 34 | 33 | 34 | 33 | 34 |
| 35_54 సం॥ | 22 | 20 | 21 | 20 | 22 | 20 |
| 55 సం॥ పైన | 9 | 7 | 9 | 7 | 9 | 7 |

గత 30 సంవత్సరాలలో ఈ వయోవిభజనా అంచనాలు :

| వయస్సు | ప్రతి వందమందిలో | | | |
|---|---|---|---|---|
| | 1921 | 1931 | 1941 | 1951 |
| 0_9 సం॥ | 26 | 26 | 27 | 24 |
| 10_19 సం॥ | 20 | 21 | 22 | 22 |
| 20_29 సం॥ | 17 | 18 | 17 | 17 |
| 30_39 సం॥ | 14 | 14 | 14 | 13 |
| 40_49 సం॥ | 10 | 10 | 10 | 11 |
| 50_59 సం॥ | 7 | 6 | 6 | 7 |
| 60 అంతకు పైన | 6 | 5 | 4 | 6 |

నోటు : ఈ అంచనాలు, అవిభాజ్య మదరాసు రాష్ట్రానివి.

# అక్షరాస్యత*

రాష్ట్రంలో నూటికి 15 మంది మాత్రమే అక్షరాస్యులు. కడప, కర్నూలు, అనంతపురం జిల్లాల ప్రాంతంలో అక్షరాస్యులు 14.3. స్త్రీలలో అక్షరాస్యులు 5.5, పురుషులలో అక్షరాస్యులు 22.7. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాల ప్రాంతంలో అక్షరాస్యులు 15.7. అక్షరాస్యులయిన పురుషులు 22.1, స్త్రీలు 8.9

రాష్ట్రంలో, మొత్తం గ్రామీణ జనాభాలో నూటికి 11.7 మంది, పట్టణ జనాభాలో నూటికి 29.2 మంది అక్షరాస్యులు. కడప, కర్నూలు, అనంతపురం జిల్లాల ప్రాంతంలో, గ్రామీణ ప్రాంతాల అక్షరాస్యులయిన పురుషులు నూటికి 19.4, స్త్రీలు 3.9. పట్టణ నాభాలో అక్షరాస్యులయిన పురుషులు నూటికి 40.8, స్త్రీలు 13.7. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల గ్రామీణ జనాభాలో అక్షరాస్యులయిన పురుషులు 18.6, స్త్రీలు 6.5. పట్టణ నాభాలో పురుషులు 40.4, స్త్రీలు 20.9.

అక్షరాస్యులయిన ప్రతి వందమంది వయోవిభజన 1951 ప్రకారం ఇలా ఉన్నది:

| వయస్సు | ప్రతి వందమందిలో |
|---|---|
| 5—9 సం॥ | 15 |
| 10—14 ,, | 13 |
| 15—24 ,, | 19 |
| 25—34 ,, | 17 |
| 35—44 ,, | 14 |
| 45—54 ,, | 11 |
| 55—64 ,, | 7 |
| 65—74 ,, | 3 |
| 75 సం॥లు, అంతకన్న పైన | 1 |

ఆధారం : అవిభాజ్య మదరాసు రాష్ట్ర అంచనాలు.

* విద్యావిషయిక వివరాలను "విద్య" అధ్యాయం చూ

కింది పట్టిక, ఒక్కొక్క జిల్లాలోని వివరాలను తెలియచేస్తుంది (1951 సం॥ విద్యాలయాలు, అక్షరాస్యతా లెక్కలు):

| | ఉన్న మొత్తం విద్యాలయాలు | ఎంత మందికి ఒక విద్యాలయం | అక్షరాస్యులు నూటికి ఎంతమంది |
|---|---|---|---|
| కడప | 1,163 | 999 | 16.8 |
| కర్నూలు | 1,180 | 1,077 | 12.5 |
| అనంతపురం | 892 | 1,526 | 14.6 |
| చిత్తూరు | 1,209 | 1,497 | 11.6 |
| శ్రీకాకుళం | 1,767 | 1,202 | 9.3 |
| విశాఖపట్నం | 1,114 | 1,561 | 9.3 |
| తూర్పుగోదావరి | 1,885 | 1,281 | 17.9 |
| పశ్చిమగోదావరి | 1,718 | 988 | 21.1 |
| కృష్ణా | 1,903 | 935 | 21.4 |
| గుంటూరు | 2,788 | 915 | 17.3 |
| నెల్లూరు | 1,602 | 1,080 | 14.6 |

# భాషా విభజన

రాష్ట్రంలో నూటికి 82 మంది మాతృభాష తెలుగు. భాషా ప్రాతిపదికపైననే, 1953 అక్టోబరులో ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటు చేయబడింది.

వీరుకాక తమిళం, మళయాళం, హిందూస్థానీ - ఉరుదు, కన్నడం, ఒరియా, లంబాడీ, ఖోండ్ మొదలైన భాషలు మాట్లాడేవారు కూడా ఉన్నారు.

రాష్ట్రంలోని ప్రతి వందమందిలోను, వివిధ మాతృభాషలవారు 1951 లో ఈ విధంగా ఉన్నారు:

మాటాడే జనాభా

| మాతృభాష | రాష్ట్రం | కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురంజిల్లాల ప్రాంతం | శ్రీకాకుళం, విశాఖ, ఉభయ గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరుజిల్లాల ప్రాంతం |
|---|---|---|---|
| తెలుగు | 82.12 | 70.33 | 93.90 |
| తమిళం | 0.65 | 0.94 | 0.37 |
| మళయాళం | 0.80 | 0.10 | 0.05 |
| కన్నడం | 8.25 | 16.49 | 0.02 |
| హిందూస్థానీ-ఉర్దూ | 6.40 | 9.87 | 2.93 |
| ఒరియా | 0.57 | ... | 1.13 |
| హిందీ | 0.23 | 0.31 | 0.16 |
| లంబాడీ | 0.52 | 1.00 | 0.12 |
| ఇంగ్లీషు | 0.01 | 0.01 | 0.01 |
| ఇతర భాషలవారు | 1.10 | 0.88 | 1.31 |

మాతృభాషలవారి జనాభా విభజన వివిధ జిల్లాలలో 1951 సం|| జనాభా లెక్కల ప్రకారం ఇలా ఉన్నది. (పట్టిక 137,138 పేజీలలో):

| జిల్లాలు 1 | తెలుగు 2 | తమిళం 3 | మళయాళం 4 | కన్నడం 5 | ఉరుదు 6 | హిందుస్థానీ 7 | ఒరియా 8 |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 18,95,014 | 1,604 | 387 | 29 | 11,966 | | 1,18,028 |
| విశాఖపట్నం | 19,91,689 | 1,727 | 991 | 384 | 12,803 | | 40,050 |
| తూర్పుగోదావరి | 23,38,459 | 2,877 | 608 | 435 | 21,860 | 658 | 2,111 |
| పశ్చిమగోదావరి | 16,47,308 | 1,908 | 490 | 589 | 22,979 | 1,022 | 786 |
| కృష్ణా | 16,79,530 | 5,728 | 1,279 | 768 | 76,655 | 528 | 1,239 |
| గుంటూరు | 23,59,100 | 6,145 | 1,664 | 397 | 1,64,474 | 1,952 | 358 |
| నెల్లూరు | 16,41,350 | 33,119 | 1,369 | 858 | 1,08,934 | | 66 |
| కడప | 10,06,250 | 3,149 | 623 | 11,368 | | 1,26,983 | 12 |
| కర్నూలు | 10,87,425 | 3,646 | 479 | 9,209 | | 1,52,071 | |
| అనంతపురం | 10,73,739 | 11,004 | 2,071 | 1,32,660 | | 1,04,580 | 4 |
| చిత్తూరు | 13,34,531 | 3,28,679 | 7,218 | 21,833 | | 1,00,121 | |
| ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలు | 25,147 | 9,788 | 553 | 2,25,858 | | 37,986 | 70 |
| మొత్తం | 1,80,79,542 | 4,99,374 | 17,732 | 4,04,388 | 4,19,671 | 5,25,901 | 1,62,724 |

| జిల్లాలు | మరాఠీ 9 | హిందీ 10 | లంబాడి 11 | కోయ 12 | సవర 13 | జటపు లేక ఖోండ్ 14 |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 120 | 5,626 | | 30 | 56,227 | 23,973 |
| విశాఖపట్నం | 533 | 2,602 | | | 6 | 5,330 |
| తూర్పుగోదావరి | 366 | 1,190 | 14 | 44,749 | 1 | |
| పశ్చిమగోదావరి | 250 | 1,320 | 610 | 19,812 | | |
| కృష్ణా | 667 | 1,834 | 8,705 | | | |
| గుంటూరు | 715 | 3,804 | 7,510 | 247 | | |
| నెల్లూరు | 778 | 6,320 | 6 | 2 | | |
| కడప | 4,662 | 3,473 | 2,692 | | | |
| కర్నూలు | 5,676 | 3,194 | 5,800 | | | |
| అనంతపురం | 7,282 | 4,310 | 19,384 | | | |
| చిత్తూరు | 5,036 | 3,951 | 6,760 | | | |
| ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలు | 4,622 | 1,561 | 7,460 | | | |
| మొత్తం | 30,707 | 39,185 | 58,941 | 64,840 | 56,234 | 29,303 |

లంబాడీలు వెనుకబడిన జాతులుగా పరిగణించబడుతున్నారు. వీరు అనంతపురం, కర్నూలు, కృష్ణా, గుంటూరు జిల్లాలలో అధికం.

కోయ, సౌర (సవర), ఒటుపు (ఖోండ్), ఇవి కొండజాతుల భాషలు. మా ఏజన్సీ అడవులలోనే (మన్యం) అత్యధిక సంఖ్యాకులు నివసిస్తున్నారు.

ఎరుకల, యేనాది జాతులవారు వెనుకబడిన జాతులుగా పరిగణించబడుతున్నారు. వీరి ప్రధాన వృత్తి తట్టలు, బుట్టలు అల్లి అమ్మటం. వీరి భాషకు లిపిలేదు. వీరిలో అధికసంఖ్యాకులు గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో ఉన్నారు.

## మతం

ఆంధ్రలో చెప్పదగినవి హిందూమతం, మహమ్మదీయ, క్రైస్తవ మతాలు. అత్యధిక సంఖ్యాకులు హిందువులు.

క్రింది సెన్ససు పట్టిక, 1951 సంవత్సరంలో, రాష్ట్ర జనాభాలో, పై మూడు ప్రధానమతాలవారి, జిల్లావారీ వివరాలు తెలియజేస్తుంది.

| జిల్లా | హిందువులు | ముస్లింలు | క్రిస్టియనులు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 21,04,964 | 8,894 | 9,210 |
| విశాఖపట్నం | 20,35,709 | 26,625 | 10,095 |
| తూర్పుగోదావరి | 23,33,448 | 33,577 | 47,360 |
| పశ్చిమగోదావరి | 15,64,551 | 34,147 | 98,998 |
| కృష్ణా | 15,03,472 | 57,992 | 1,77,607 |
| గుంటూరు | 19,84,375 | 2,09,276 | 3,56,039 |
| నెల్లూరు | 15,46,946 | 1,43,866 | 1,04,750 |
| కడప | 8,50,047 | 1,55,408 | 56,227 |
| కర్నూలు | 9,92,840 | 1,86,004 | 91,832 |
| అనంతపురం | 12,01,226 | 1,46,068 | 13,499 |
| చిత్తూరు | 16,79,832 | 1,11,358 | 18,532 |
| ఆదోనీ, ఆలూరు, రాయదుర్గం తాలూకాలు | 3,63,770 | 45,437 | 4,686 |
| మొత్తం | 1,81,61,180 | 11,58,652 | 9,88,835 |

# జిల్లాల చరిత్ర - భూగోళం

## పరిచయం

పరిపాలనా సౌలభ్యంకోసం ఆంధ్రరాష్ట్రం నేడు పదకొండుజిల్లాక్రింద విభజింపబడింది. నేటి జిల్లాలు బ్రిటిష్‌వారిచే ఏర్పాటుచేయబడినవైనా, ఆయా ప్రాంతాలకు ఎంతో చరిత్ర ఉంది. ఎన్నో చారిత్రాత్మక సంఘటనలు యీ జిల్లాలలో జరిగాయి.

జిల్లాలలోని చారిత్రాత్మక సంఘటనలూ, స్థలాలు తీసుకొని ఆప్రాంత చరిత్ర సంగ్రహ్యంగా వివరించ జిల్లాచరిత్రలో ప్రయత్నించబడింది.

అలానే జిల్లా భూగోళంలో జిల్లా నైసర్గిక పరిస్థితులు, సాగు సౌకర్యాలు, మేజరు మైనరు ఇరిగేషను, ఆహార ఆహారేతర పంటల వివరాలు, రోడ్లు, వైద్యశాలలు, జనాభా మున్నగునవి తాలూకా వివరాలతో యివ్వబడ్డాయి. 1951 సం॥ జనాభా లెక్కలలోని వివరాలే యిందుకు మూలాధారం.

# శ్రీకాకుళం జిల్లా

## చరిత్ర

ఆంధ్రజిల్లాలన్నిటిలోను ఆఖరున యేర్పాటు చేయబడ్డ జిల్లా శ్రీకాకుళం జిల్లా. 1950 జూలైలో విశాఖజిల్లానుండి విడదీయబడి ప్రత్యేకజిల్లాగా యేర్పాటు చేయబడింది.

గోలుకొండ నవాబులు ఆంధ్రదేశాన్ని పాలించిన కాలంలో పరిపాలనా సౌకర్యం కోసం కోస్తా ఆంధ్రదేశాన్ని అయిదు సర్కారులుగ విభజించారు. అందులో శ్రీకాకుళం సర్కారు ఒకటి. సర్కారు పరిపాలకుడైన ఫౌజుదారు శ్రీకాకుళంలో వుండేవాడు. మొగలాయి చక్రవర్తుల, హైదరాబాదు నవాబుల పాలనలోకూడ యిదేపద్ధతి కొనసాగింది. శ్రీకాకుళం సర్కారులో నేటి విశాఖ, శ్రీకాకుళం సర్కారు జిల్లాలేగాక, గంజాం జిల్లాలోని కొన్ని ప్రాంతాలుకూడ కలిసివుండేవి. సర్కారు జిల్లాలు యింగ్లీషువారి స్వాధీనమైనప్పుడు శ్రీకాకుళం సర్కారును విశాఖ, గంజాం జిల్లాలుగ విభజించారు. ఒరిస్సారాష్ట్రం యేర్పడ్డప్పుడు విశాఖ జిల్లాలోని కొన్ని తాలూకాలు ఒరిస్సా రాష్ట్రంలో కలపబడ్డాయి. గంజాంజిల్లాలోని అయిదు తెలుగుతాలూకాలు విశాఖ జిల్లాలో కలపబడ్డాయి. 1950 లో విశాఖ జిల్లానుండి శ్రీకాకుళంజిల్లా విడదీయబడింది.

ప్రాచీనకాలంలో శ్రీకాకుళంజిల్లా కళింగరాజ్యంలో అంతర్భాగం. క్రీ. పూ. 4వ శతాబ్దంనాటికే కళింగరాజ్యం బలవత్తరమైన నాగరకరాజ్యం. కటక్ నుండి పిఠాపురంవరకు గల ప్రాంతమంతా కళింగ దేశంగానే వ్యవహరించబడింది. క్రీ. పూ. 437 నుండి 336 వరకు నందరాజులు, తరువాత మౌర్యులు కళింగాన్ని పాలించారు. స్వతంత్రత ప్రకటించిన కళింగరాజులను అదుపులోకి తెచ్చేందుకు అశోకుడు క్రీ. పూ. 225 లో కళింగదేశంపై దండయాత్ర చేసాడు. యుద్ధంలో జరిగిన అపారమైన జననష్టాన్నిచూచి అశోకుడు పశ్చాత్తాపంచెంది యుద్ధాన్ని విరమించి వెనక్కు మరలాడు. బౌద్ధమతాన్ని స్వీకరించి దాని వ్యాప్తికి తోడ్పడ్డాడు.

### కళింగపట్నం రేవు

నందుల కాలంలోజైనమతం, మౌర్యుల కాలంలో బౌద్ధమతం కళింగదేశంలో వ్యాప్తిచెందాయి. జైనమతంకళింగామ్నుండే ఆంధ్రదేశానికి వ్యా-
న్నుండి బౌద్ధమతం, సింహళం మొదలైన తూర్పుదేశాలకు వ్యాపించింది. బౌద్ధమతం నందులపాలనకు ముందే కళింగ దేశంలో ప్రవేశించింది. విజయుడనే కళింగ రాజు 700 మంది బౌద్ధభిక్షువులతో బుద్ధుని

ఆస్తికలను తీసుకుని కళింగతీరపు రేవులో ఓడయెక్కి సింహళం వెళ్ళాడని బౌద్ధ గ్రంథాలు తెలుపుతున్నాయి.

కళింగదేశం సారవంతమైన దేశం కాక పోవుటవల్ల ఆ కాలంలో కళింగప్రజలు జీవనోపాధికై తూర్పుదేశాలకు వలస వెళ్ళేవారు. బౌద్ధమతం యీ వలసలను ప్రోత్సహించింది. కళింగపట్నం మొదలైన ఓడరేవులనుండి ప్రజలు ఓడలెక్కి బర్మా, ఇండోనేషియా మొదలైన దేశాలకు వలస వెళ్ళారు. జీవనోపాధికై విశాఖ, శ్రీకాకుళం ప్రాంతాలనుండి ప్రజలు బర్మాకు మొన్న మొన్నటివరకూ వలసవెళ్ళారు. కళింగపట్నం రేవు నేడు చిన్నరేవుగా వున్నా, ప్రాచీనకాలంలో ప్రఖ్యాతి పొందిన రేవుపట్టణం. గంగవంశపురాజుల పాలనలో మంచి ఉచ్ఛస్థితిలో వుండేది. తూర్పు దేశాలతో వ్యాపారం జరిపే కేంద్రంగా వుండేది.

## శాలిహుండాం బౌద్ధస్థూపాలు

కళింగపట్నం రేవుకు మూడుమైళ్ళ దూరంలో శాలిహుండాం అనేచోట కొండమీద బౌద్ధారామంవుంది. ఈబౌద్ధారామంపేరు 'కటహారామం'. ఈ ఆరామం యిప్పుడు శిధిలమైవుంది. శాలిహుండాం కొండమీదవున్న చైత్యం, యితరచోట్ల మాదిరిగా గుండ్రంగా గాకుండా అర్ధచంద్రాకారంలో వుంది. దీని వెనుక వలయాకారంలో మహా చైత్యముంది. దీని పైభాగమంతా ఇటుకలతో కప్పబడివుంది. ఆరామంలో పాలరాతితో నిర్మించబడ్డ కుండం ఒకటివుంది. ఇక్కడ 12 స్థూపాలున్నవి. స్థూపాకారంలో వున్నాయి. ఒక్క స్థూపం మాత్రం ఎనిమిదిగదులు గలిగి పద్మాకారంలో వుంది.

కళింగపట్నం రేవులో విదేశీ యాత్రీకులు దిగి 'కటహారామం' చేరుకునేవారు. కొండపై శిధిలాలను పరిశీలించితే ఒకప్పుడు యిది కోటగా వున్నట్లు కనబడుతుంది. ఉచ్ఛదశలో వున్నప్పుడిక్కడి ఆరామం కళింగపట్నం రేవుకే కనబడుతూ వుండేది. అక్కడనుండి చూసినప్పుడు యీ కొండ "తాబేలు" ఆకారంలో కనబడుటవల్ల శాలిహుండాంకొండకు "కూర్మాద్రి" అనే పేరు వచ్చిందట.

శాలిహుండాం కొండకు ఎదురుగా వంశధారానదికి అవతల ఒడ్డున "వనితా మండలం" అనే గ్రామముంది. శాలిహుండాం నుండి వనితామండలం వెళ్ళడానికి వంశధారనదిపై ఒక రాతివంతెన వుండేది. దాని చిహ్నాలు నేటికీ కనబడుతున్నాయి. శాలిహుండాం కోటగా వున్నప్పుడు వనితా మండలంలో అంతఃపుర స్త్రీలు వుండటం చేత గ్రామానికి వనితామండలం అనే పేరువచ్చినట్లుగ స్థానికంగా చెప్పుకుంటారు. శాలిహుండాం క్రీ. శ. 8, 9 శతాబ్దాల వరకు ఉచ్ఛదశలోవుండేదని చరిత్రకారుల అభిప్రాయం.

మౌర్యసామ్రాజ్యం పతనదశలో నున్న కాలంలోశాతవాహనులు ఆంధ్రరాజ్యాన్ని స్థాపించారు. శాతవాహనులు స్వతంత్ర రాజ్యం స్థాపించిన కొంతకాలానికి క్రీ. శ. 183 ప్రాంతంలో ఖారవేలుడనే రాజు కళింగంలో స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించాడు. ఇతనిరాజ్యం మన తెలుగు దేశంలో గోదావరి వరకు వ్యాపించింది.

## కళింగ నగరం

ఖారవేలుని రాజధాని కళింగ నగరం. పర్లాకిమిడికి దగ్గరగావున్న ముఖలింగమే ఆనాటి కళింగనగరం. రాజులు మారినా

ఏడవ శతాబ్దం వరకు ముఖలింగం రాజధానిగా వుంటూవచ్చింది.

ఇక్కడ అనేక బౌద్ధ, జైన విగ్రహాలు దొరికాయి. ఖారవేలుడు జైనమతాభిమాని. జైనమత ప్రవక్త వర్ధమాన మహావీరుడు స్వయంగావచ్చి కళింగదేశంలో మతప్రచారం చేశాడట. జైనమతం కళింగదేశంనుండే ఆంధ్రకు వ్యాపించింది.

క్రీ. శ. 7 వ శతాబ్దంలో మనదేశంలో సంచారంచేసిన హ్యూయిన్ త్సాంగ్ కళింగ దేశాన్ని చూచి ఓఢ్రదేశానికి దక్షిణంగా కళింగదేశం వున్నదని, కళింగ రాజధాని నగరమైన ముఖలింగం మూడుమైళ్ళ వైశాల్యం కలిగివుందని వ్రాశాడు. జైన, బౌద్ధమతాలకు సమానాదరణ లభించింది. నూరు బౌద్ధారామాలు, నూరు హిందూ దేవాలయాలు వున్నవనీ, బౌద్ధ ఆరామాలలో పదివేలమంది విద్యార్థులున్నారనీ, కళింగదేశ ప్రజలు నాగరికతకలవారనీ వ్రాశాడు.

కళింగ రాజధానియైన ముఖలింగంలో మధుకేశ్వరస్వామిదేవాలయంమీద చెక్కబడ్డ చిత్రాలలో కొన్నినరబలిని సూచించే చిత్రాలున్నవి. జైనమత కాలంలో నరబలులు జరిగేవి. శ్రీకాకుళంజిల్లాలో మొన్నమొన్నటివరకు నరబలి జరుగుతుండేది. ముఖలింగం శిల్పాలలో ఏనుగుల వేటకు సంబంధించిన దృశ్యాలు, మల్లయుద్ధ దృశ్యాలు వున్నవి.

ఖారవేలుని తరువాత శాతవాహనులు కళింగదేశాన్ని జయించారు. ఖారవేలుడు, శాతవాహనరాజు శ్రీ శాతకర్ణి సమకాలికులు. శాతవాహనుల కాలంలో కళింగ, ఆంధ్రదేశాల ప్రజల ఐక్యత ఏర్పడింది. ఒకరి సంస్కృతిపై మరొకరి సంస్కృతి ప్రభావం పడింది. మన జాతీయ పరిణామంలో మార్పువచ్చింది. కళింగులు, శాతవాహనుల కంటె ప్రాచీనులు. కళింగులు, శాతవాహనులు, నాగులు మొదలైన ప్రాచీన తెగల సమ్మిశ్రాభివృద్ధివల్ల నేటి ఆంధ్రజాతి, ఆంధ్ర సంస్కృతి రూపొందింది.

## సముద్రగుప్తుని దండయాత్ర

శాతవాహనుల రాజ్యపతనానంతరం కళింగదేశంలో చిన్నరాజ్యాలు తలెత్తాయి. క్రీ. శ. 343 లో సముద్రగుప్తుడు దండెత్తి వచ్చిన కాలంలో కళింగదేశాన్ని నలుగురు రాజులు పాలించుచుండేవారు. మహేంద్రగిరిని - సోంపేట ప్రాంతంలోని వున్న గిరికొత్తూరు ప్రాంతాన్ని-స్వామి దత్తుడనే రాజు, శ్రీకాకుళంజిల్లాలోని ఆముదాలవలస ప్రాంతాన్ని (హేరండపల్లి) దమనుడనే రాజు పాలించుతుండేవారు. వీళ్ళే వంశపురాజులో, ఎవరి రాజ్యంలో ఎంత భాగముండేదో స్పష్టంగా తెలియదు.

క్రీ. శ. 350 ప్రాంతంలో మాఠరవంశీయులు, తూర్పు గోదావరిజిల్లాలోని పిఠాపురం రాజధానిగా చేసుకొని శ్రీకాకుళ ప్రాంతాన్ని షుమారు వంద సంవత్సరాలు పరిపాలించారు. మాఠరవంశం తరువాత కళింగాన్ని వాసిష్ఠవంశంవారు పాలించారు. వీరికి మొదట రాజధాని తూర్పు గోదావరిలోని పిఠాపురమే అయినప్పటికీ, శాలంకాయనులు పిఠాపుర ప్రాంతాన్ని జయించడంవల్ల వారి రాజధానిని శ్రీకాకుళం దగ్గర సింగుపురానికి, టెక్కలి సమీపంలోనున్న వర్ధమానపురానికి, ఆతరువాత సిరిపురానికి మార్చుకున్నారు.

విష్ణుకండినులు విజృంభించి క్రీ. శ. 485 ప్రాంతంలో వాసిష్ఠవంశజులనుండి

దక్షిణకళింగాన్ని జయించారు. విశాఖ జిల్లాలో కొంతభాగం వారి క్రిందకు పోయిందన్నమాట. శ్రీకాకుళం జిల్లా మాత్రం వాసిష్ఠిరాజుల క్రిందగాని, మరొక వంశకళింగ రాజుల క్రిందగాని వుంది.

## గంగవంశపు పరిపాలన

క్రీ. శ. 497 ప్రాంతంలో గంగవంశం వారు కళింగంలో అధికారంలోకి వచ్చారు. అప్పటినుండి క్రీ. శ. 1437 లో కపిలేంద్ర గజపతులు అధికారంలోకి వచ్చేవరకు గంగరాజులే కళింగాన్ని ఏలారు. ఇరుగు పొరుగు రాజ్యాలరాజులకు, గంగవంశం వారికి తరచు యుద్ధాలు జరుగడంవలన, కళింగదేశంలో గంగవంశపు పరిపాలనకు మధ్యమధ్య అంతరాయం కలుగుతూ వచ్చింది. తూర్పు చాళుక్యరాజులు క్రీ.శ. 7వ శతాబ్దంలో కొంతకాలం కళింగదేశాధిపత్యం వహించారు. కుబ్జవిష్ణువర్ధనుని శాసనాలు చీపురుపల్లిలో దొరికాయి. క్రీ. శ. పదవ శతాబ్దాంతంవరకు అధికారంలో వున్న గంగవంశపురాజులను పూర్వగాంగులనీ, ఆతరువాత పాలించిన గాంగులను అర్వాచీనగాంగులని అంటారు. ఈ రెండు శాఖలవారూ, మైసూరు కోలారు ప్రాంతం నుండి వచ్చి కళింగలో రాజ్యస్థాపించిన తూర్పు గంగవంశానికి చెందినవారే.

గంగవంశంవారు బారువసమీపంలో గల మహేంద్రగిరి కొండలమీదవున్న గోకర్ణస్వామి భక్తులు. గోకర్ణస్వామి శైవ దేవుడు. ఈ ఆలయాన్ని నిర్మించినవారే. వీరిలో కొద్దిమంది మాత్రమే మహానదినుండి గోదావరి వరకుగల త్రికళింగదేశాన్ని పాలించగలిగారు. మిగతారాజులు కళింగ దేశంలో కొంతభాగాన్ని మాత్రమే ఏలగలిగారు.

## దంతపురం రాజధాని

గంగవంశపు రాజుల మొదటిరాజధాని దంతపురం. శ్రీకాకుళం స్టేషనుకు సమీపంలో ములగాలవలస గ్రామంప్రక్కన వున్న దంతవక్త్రునికోట అనే దిబ్బయే దంతపురమని గుర్తించబడింది. దంతవక్త్రుని కోటలో ప్రాచీనకాలపు శిధిలాలు చాల కనబడుతున్నాయి. బుద్ధుడు మరణించాక అతని ఎడమపంటికొంతాన్ని బౌద్ధభిక్షువులు యిక్కడకు తెచ్చి దానిపై స్థూపాన్ని నిర్మించడంవల్ల దీనికి దంతపురమనిపేరు వచ్చిందని చెబుతారు. బుద్ధుని శరీరావశేషాలను పాతిపెట్టి వాటిపై స్థూపాలు నిర్మించడం బౌద్ధుల ఆచారం. శ్రీకృష్ణుడు చంపిన దంతవక్త్రుడనే రాక్షసుని కోట దంతపురంలో వుండేదని పురాణగాథకూడ ఒకటి ప్రచారంలోవుంది.

## కూర్మాలయం

క్రీ. శ. 570-580 ప్రాంతంలో పాలించిన హస్తివర్మ అనే గంగరాజుకాలంలో రాజధాని దంతపురంనుండి ముఖలింగమనే కళింగనగరానికి మార్చబడింది. దంతపురం కంటె ముఖలింగం శత్రోర్ష్ణపెతి సంబుతు సుఖరక్షణీయంగా ఉండుటవల్ల అలా చేసివుంటాడు. శ్రీకాకుళానికి సమీపమున గల శ్రీకూర్మదేవాలయం గంగవంశపు రాజులకాలంలో నిర్మించబడ్డదే. విష్ణువు దశావతారాలలో కూర్మావతారం ఒకటనీ, కూర్మావతారరూపంలోనున్న విష్ణువుకు యీ దేవాలయం నిర్మించబడ్డదనీ పురాణగాథ. తాబేలు ఆకారంలోనున్న దేవుడికి కట్టబడ్డదేవాలయం ఇదితప్ప ఆంధ్రంలోనే కాదు; మనదేశంలో మరెక్కడాలేదు. ఇండోనేషియాలో కూర్మాలయంఉన్నది.

దాన్ని నిర్మించింది వలస వెళ్ళిన కళింగులే. పూరీ జగన్నాథాలయంకూడ గంగవంశపు రాజుల నిర్మాణమే. వీటినిబట్టి మొదట్లో గంగవంశపురాజులు శైవమతాభిమానులని, తరువాత గంగరాజులు వైష్ణవమతాభిమానులని తెలుస్తున్నది.

## గజపతివంశ పాలన

క్రీ. శ. 1431 సంవత్సరంలో నాల్గవ భానుదేవుడనే గంగవంశపురాజు మరణించగానే అతనిమంత్రి ప్రతాపరుద్ర కపిలేశ్వర గజపతి అనే బిరుదుతో రాజ్యాన్ని స్వాధీనం చేసుకొని ఒరిస్సా గజపతి వంశాన్ని స్థాపించాడు. ఇతని రాజధాని కటకం. ఇతని వంశీయులు క్రమక్రమంగా కోస్తా ఆంధ్రను జయించి నెల్లూరువరకు అధికారాన్ని విస్తరింప చేశారు. కపిలేంద్రదేవు మనుమడైన ప్రతాపరుద్ర గజపతి పాలించుచున్న కాలంలో విజయనగర శ్రీకృష్ణదేవరాయలు దక్షిణదేశ దండయాత్రకు బయలుదేరాడు. ప్రతాపరుద్ర గజపతి, సైన్యాన్ని సమకూర్చుకొని కృష్ణానదివద్ద రాయలను ఎదిరించాడు. కాని కృష్ణరాయల సైన్యంముందు గజపతి సేనలు నిలవలేక పోయాయి. కృష్ణరాయలు కోస్తాజిల్లాలన్నిటిని జయించి కటకంపై దండెత్తగా ప్రతాపరుద్ర గజపతి తనకుమార్తెను రాయలకిచ్చి వివాహం చేసి సంధిచేసుకున్నాడు.

ప్రతాపరుద్ర గజపతి అనంతరం అతని కొడుకులు యిద్దరు 1541 వరకు, ఆ తరువాత ప్రతాపరుద్ర గజపతి మంత్రి గోవిందదేవు, అతని సంతానం 1560 వరకు విజయనగర రాజులకు లోబడి పరిపాలించారు. 1560 లో ముకుందహరిశ్చంద్రుడనే తెలుగు రాజు గోవిందదేవు కుమారులను హత్య చేసి రాజ్యాన్నాక్రమించుకున్నాడు. తళ్ళికోట యుద్ధానంతరం 1568 నాటికి గోల్కొండ నవాబుల అధికారం శ్రీకాకుళంజిల్లా దాటి గంజాం జిల్లాలో కొంతవరకు వ్యాపించింది.

## శ్రీకాకుళం సర్కారు

గోల్కొండ నవాబుల కాలంలో శ్రీకాకుళం ఫౌజ్‌దారు విశాఖ, శ్రీకాకుళం ప్రాంతాన్ని పాలించుతుండేవాడు. 1686 లో మొగలాయి చక్రవర్తి ఔరంగజేబు గోల్కొండ రాజ్యాన్ని జయించి దక్కను సుబా యేర్పరచాడు.

తర్వాత నైజాం నవాబుల అసఫ్‌జా వంశస్థాపకుడైన నిజాముల్ ముల్క్ దక్కను సుబేదారుగ నియమించబడ్డాడు. అతని పాలనక్రింద కోస్తా ఆంధ్ర అయిదు సర్కారుల క్రింద విభజించబడింది. 'శ్రీకాకుళం సర్కారు' అప్పుడేర్పరచబడింది. శ్రీకాకుళం సర్కారులో విశాఖ జిల్లాకూడ చేర్చబడింది. అన్వారుద్దీన్ అనే అతను శ్రీకాకుళం మొదటి ఫౌజ్‌దారు. శ్రీకాకుళం, ఫౌజ్‌దారు కార్యస్థానం.

ఔరంగజేబు మరణించగా నిజాముల్ ముల్క్ స్వతంత్రం ప్రకటించాడు. నిజాముల్ ముల్క్ 1748 లో మరణించగా అతని వారసులలో సింహాసనానికై తగాదాలు వచ్చాయి.

అప్పటికే విశాఖపట్నం, భీమునిపట్నం మొదలైన రేవుస్థలాలవద్ద ఫ్యాక్టరీలు స్థాపించుకొని వ్యాపారం సాగిస్తున్న ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు నైజాం సింహాసనానికై వచ్చిన తగాదాలలో జోక్యం కల్పించుకున్నారు. స్వీయరక్షణ, వ్యాపార రక్షణల పేరిట విదేశీ వ్యాపారస్థులు కొంత సైన్యాన్ని పోషించుకొని కోటలనుకూడ కట్టు

కున్నారు. ఈ సైనికబలంతోనే వాళ్ళు ఆంధ్ర రాజకీయాలలో, భారతరాజకీయాలలో జోక్యం కల్గించుకున్నారు.

### ఫ్రెంచివారిచే సర్కార్ల ఆక్రమణ

ఫ్రెంచిసేనాని బుస్సీ, సలాబత్ జంగ్‌ను బలపరచి అతనిని నైజాముగ ప్రకటించాడు. ఫ్రెంచి సైనిక ఖర్చులకని చెప్పి శ్రీకాకుళం సర్కారు మొదలుకొని, కొండపల్లి సర్కారువరకు గల నాలుగు జిల్లాలను 1753లో ఫ్రెంచివారు సలాబత్ జంగ్ నుండి వ్రాయించుకున్నారు.

ఈ నాలుగు సర్కారులు సలాబత్ జంగ్ కట్టపెట్టినంత సులభంగా ఫ్రెంచివారివశం కాలేదు. శ్రీకాకుళం ఫౌజ్‌దారు జాఫర్ అలీ తన అధికారం పోతున్నదని చెప్పి, సర్కార్లను ఫ్రెంచివారికి దఖలుపరచ నిరాకరించాడు. అప్పుడు ఫ్రెంచివారు విజయనగరం రాజా సహాయంతో ఆక్రమించుకున్నారు.

### ఫ్రెంచివారికి విజయనగరం రాజా మద్దతు

విజయనగరంరాజా ఆ రోజులలో శ్రీకాకుళం, విశాఖజిల్లాలలో చాల భాగాన్ని ఆక్రమించుకొని బలవంతుడయ్యాడు. గోల్కొండ నవాబులు ఆంధ్రదేశాన్ని ఏలుతున్నకాలంలో షేర్ మహమ్మద్‌ఖాన్ శ్రీకాకుళం ఫౌజుదారుగ వుండేవాడు. శ్రీకాకుళం సమీపంలోగల షేర్ మహమ్మద్ పురం యితని పేర నిర్మించబడినదే. ఆతనికాలంలో నిర్మించబడ్డ మసీదు యిప్పటికీ వున్నది. విజయనగరం రాజా, బొబ్బిలిరాజుల పూర్వీకులు 1652 లో షేర్ మహమ్మద్‌ఖాన్ వద్ద విశాఖ శ్రీకాకుళం జిల్లాలలో కొన్ని ప్రాంతాలను కౌలుకు పుచ్చుకొని సైనికబలంతో యిష్టమొచ్చినట్లు శిస్తు వసూలు చేసి ప్రజలను పీడించుకొతిన్నారు. నవాబుకు మీరు కొద్దిగా పేష్కసు చెల్లించేవారు. బుస్సీ 1753 లో సర్కార్లను వ్రాయించుకున్న తరువాత రాజమండ్రి, మచిలీపట్టణం సర్కార్లలోని అరాజక పరిస్థితిని చక్కదిద్దడానికి వెళ్ళగా, విజయనగరంరాజా విజయరామరాజు, అతని తమ్ముడు ఆనందరాజు కలసి విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో స్వైరవిహారం సాగించారు. శ్రీకాకుళం, కసింకోట, విశాఖపట్టణం పట్టణాల ప్రక్కల వున్న నవాబుల "హవేలీ" భూములదక్క, రెండుజిల్లాలలో చాల భాగాన్ని ఆక్రమించారు. రాజమండ్రి సర్కారులోకూడ కొంతభాగాన్ని ఆక్రమించారు. విజయనగరంరాజా దురాక్రమణ ఎంత అన్యాయంగా సాగిందంటే అంతకుముందు రాజు యిచ్చిన అగ్రహారాలను, ఈనాములనుకూడ ఆక్రమించుకున్నాడు.

విజయనగరంవారికి, బొబ్బిలివారికి మొదటినుండి పచ్చిగడ్డి వేస్తే భగ్గుమనేది. శ్రీకాకుళం, రాజమండ్రి సర్కారులను ఫౌజుదారుయిచ్చిన కౌలుకంటె తక్కువ కౌలుకిస్తామని చెప్పి ఫ్రెంచివారు విజయనగరంరాజాను లోబరుచుకున్నారు. గజపతి విజయరామరాజు సైన్యాల సహాయం తీసుకొని ఫ్రెంచివారు శ్రీకాకుళం ఫౌజుదారు జాఫర్ ఆలీని తరిమివేశారు. 1754 జులైలో బుస్సీ, యిబ్రాహింఖాన్ అనే అతనిని శ్రీకాకుళం ఫౌజుదారుగ నియమించాడు. ఇతను ఫ్రెంచివారికి చెల్లించ

వలసిన కప్పం చెల్లించలేదు. ఈ సమయం కనిపెట్టి విజయనగరంరాజా హైదరాబాదులోనున్న బుస్సీకి బంగారాన్ని లంచంగాపంపి, బుస్సీని దండె త్తిరమ్మని ఆహ్వానించాడు. పదివేల సైన్యంతో వెళ్ళి విజయనగరంరాజా, బుస్సీని దోవలో కలుసుకొని తన గర్భశత్రువైన బొబ్బిలిపై దాడి చేసి నాశనం చేయవలసిందిగా ప్రార్థించాడు.

## బొబ్బిలి యుద్ధం

బొబ్బిలిరాజా తనక్రింద వున్న ఎస్టేటును వదిలివేస్తే అతనికి యింకొక ప్రాంతంలో అంత ఎస్టేటు యిస్తానని, బుస్సీబొబ్బిలి రాజా రంగారావుకు కబురు పంపాడు. బొబ్బిలి రంగారావు దాన్ని అవమానంగా పరిగణించి అంగీకరింప నిరాకరించాడు. దానితో బొబ్బిలియుద్ధం ప్రారంభమైంది. బొబ్బిలియుద్ధం 1757 జనవరి 24 తేదీన జరిగింది.

24 వ తేదీ తెల్లవారుఝామున బుస్సీ, విజయనగరం సైన్యాలు బొబ్బిలికోటను ముట్టడించాయి. బుస్సీ ఫ్రెంచిసైన్యంలో 500 మంది సైనికులు, విజయనగరంరాజా సైన్యంలోపదివేలమంది సైనికులువున్నారు. బొబ్బిలి రంగారావుకు 250 మంది సైనికులు మాత్రమే వున్నారు. ఫ్రెంచివారికి నవీన ఆయుధాలున్నవి.

మధ్యాహ్నం రెండు గంటలయ్యేసరికి బొబ్బిలి రక్షణశ్రేణులన్నీ ఛేదించబడి సైనికులు చాలమంది మరణించారు. దాని మీదట రంగారావు సైనిక ముఖ్యులను సమావేశపరచి కోటను రక్షించుకునే పరిస్థితి లేదనీ, బొందిలో వూపిరి ఉన్నంత వరకు పోరాడటమే మిగిలిన మార్గమని చెప్పాడు. కోటలో రక్షించబడుతున్న ఆడపడుచులకు మానభంగం జరగకుండేందుకుగాను ఆడవాళ్ళందరినీ చంపివెయ్యవలసింగా ఆజ్ఞాపించాడు. బొబ్బిలి సైనికులు కోటలోవున్న ఆడవాళ్ళందరినీ పెద్దలు పిల్లలు అనే విచక్షణలేకండా పొడిచి చంపేశారు. ఆఖరుకు పాలుత్రాగే పసిపిల్లలను కూడ విడవకుండా చంపేశారు. వాళ్ళందరినీ కోటమధ్యలోనే దహనం చేశారు. స్త్రీలందరినీ చంపి చచ్చిన సైనికులు, చావగా మిగిలిన బొబ్బిలివీరులు ధైర్యంగా తుదిక్షణంవరకు పోరాడారు. రంగారావు తుపాకిగుండు తగిలి మరణించాడు. బొబ్బిలివీరులు ప్రాణంవిడుస్తూ కూడ శత్రువును చంపి మరీ ప్రాణం విడిచారనీ, బొబ్బిలివీరులు చూపిన శౌర్య ప్రతాపాలను, వీరత్వాన్ని భారతదేశంలో మరెక్కడా చూడలేదని బొబ్బిలియుద్ధంలో పాల్గొన్న "లా" అనే ఫ్రెంచి సేనాధికారి వర్ణించాడు.

రెండురోజులు గడిచాక రంగారావు సైనికులు అర్థరాత్రివేళ విజయనగరం రాజా శిబిరంలో ప్రవేశించి నిద్రించుచున్న విజయరామరాజునుచంపి పగతీర్చుకొన్నారట. మరికొందరు విజయరామరాజును చంపినది బొబ్బిలిసైనికులు కారని, బొబ్బిలి సంస్థానానికి చెందిన రాజం అనేకోట రక్షణాధికారి అయిన తాండ్రపాపయ్య అనే అతనుచంపాడని చెపుతారు. తాండ్ర పాపయ్య చంపాడనే కథ అధికప్రచారంలో వున్నది. ఈ నాటికీ బుర్రకథ రూపంలో ప్రచారంలోవుంది. బొబ్బిలి యుద్ధంలో రంగారావుకొడుకు చిన్న రంగారావుమాత్రం హత్య చేయబడలేదు. అతడే తరువాత రాజాగా ఇంగ్లీషువారిచే గుర్తించబడ్డాడు.

బొబ్బిలి యుద్ధంలో శిథిలమైన కోట బొబ్బిలి పట్నంలో పడమరవైపున కనబడుతుంది. రంగారావు జ్ఞాపకార్థం రంగారావు చావడి నిర్మించబడింది.

బొబ్బిలియుద్ధానంతరం బుస్సీ విశాఖపట్నం, గంజాం మొదలైన ప్రాంతాలు ఆక్రమించుకున్నాడు.

## ఆంధ్రకు విజయనగరంరాజు ద్రోహం

విజయరామరాజు హత్యానంతరం అతని తమ్ముడుకొడుకు ఆనంద గజపతిరాజు, ఫ్రెంచివారియేర్పాట్లతో అసంతృప్తి చెంది సర్కారులను ఆక్రమించుకొంటే తాను సహాయపడతానని చెప్పి యింగ్లీషువారితో రాయబారాలు జరిపాడు. క్లైవు కలకత్తానుండి కల్నల్ ఫోర్డునాయకత్వాన సైన్యాలు పంపాడు. ఫోర్డు 1758 అక్టోబరు 20 నాటికి విశాఖపట్నం చేరుకున్నాడు. విజయనగరంరాజు ఇంగ్లీషువారికి సైనికసహాయమిచ్చి ఆంధ్రదేశానికి విద్రోహం చేశాడు. ఇంగ్లీషువారికి ఫ్రెంచివారికి 1758 డిసెంబరు 9 వ తేదీన చందుర్తివద్ద (తూర్పుగోదావరిజిల్లా) యుద్ధం జరిగింది. ఫ్రెంచివారు ఓడిపోయారు. ఫ్రెంచివారికి కట్టబెట్టిన సర్కారులను సలాబత్ జంగ్ ఇంగ్లీషువారికి కట్టబెట్టాడు. 1766 నవంబరు 12వ తేదీన ఇంగ్లీషువారికి నైజాముసవాబుకు జరిగిన సంధిప్రకారం నవాబు గుంటూరుమినహా నాలుగు సర్కారు జిల్లాలను ఇంగ్లీషువారికి శాశ్వతంగా యిచ్చేటట్లు, ఇంగ్లీషువారు నవాబుకు సైనికరక్షణ, ఏటా తొమ్మిది లక్షల రూపాయలు యిచ్చేటట్లు ఒప్పందం చేసుకున్నారు. ఈ సంధి తరువాత ఇంగ్లీషువారికి నైజాంనవాబుకు జరిగిన యుద్ధాలలో నైజాం నవాబు ఓడిపోగా ఇంగ్లీషువారు ఏటా యివ్వవలసిన తొమ్మిదిలక్షల ధనాన్ని రద్దు చేస్తూ, నైజాంనవాబు యింగ్లీషువారితో 1768 లో తిరిగి క్రొత్తసంధి చేసుకున్నాడు.

శాతవాహనరాజులకాలంలో ఒకటిగా వున్న తెలంగాణ, యూనియన్ ఆంధ్ర ప్రజలు, మధ్యలో కొన్ని అవాంతరాలు వచ్చినా, కాకతీయుల కాలంనాటినుండి తిరిగి ఏకాధిపత్యంక్రింద ఏకఖండంలో నివసించసాగారు. కాని, యీవిశాలాంధ్ర ప్రజానీకంమధ్య బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, నైజాంనవాబు కలసి తెలంగాణా, యూనియన్ ఆంధ్ర అనే కృత్రిమమైన అడ్డుగోడను నిర్మించారు. విశాలాంధ్ర యేర్పడ్డ రోజున అడ్డుగోడ కూలిపోయి ఆంధ్రులమంతా ఒకే రాష్ట్రంలో వుంటాము.

## శ్రీకాకుళంజిల్లా విభజన

శ్రీకాకుళం సర్కారు తమవశమైన తరువాత ఇంగ్లీషువారు సర్కారును మూడు డివిజనులుగా విభజించారు. శ్రీకాకుళం, కసింకోట డివిజనులను విశాఖజిల్లాకి దగ్గరలో వున్నవని చెప్పి విశాఖజిల్లాలో చేర్చారు. ఇచ్ఛాపురం డివిజనును పాత గంజాంజిల్లాలో కలిపారు. 1802 లో శ్రీకాకుళం డివిజను విశాఖజిల్లానుండి వేరుపర్చబడి పాతగంజాంజిల్లాలో చేర్చబడింది.

1936 ఏప్రిల్ ఒకటవ తేదీన ఒరిస్సా రాష్ట్రంయేర్పాటు చేయబడ్డప్పుడు విశాఖ జిల్లాలోని కొన్ని తాలూకాలను ప్రభుత్వం గంజాం, కోరాపుట్టు జిల్లాలలో చేర్చింది. ఇచ్ఛాపురం, టెక్కలి, నరసన్న

పేట, శ్రీకాకుళం, పాతపట్నం తాలూకాలను గంజాంజిల్లానుండి విడదీసి విశాఖ జిల్లాలో చేర్చింది. 1950 లో శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం, టెక్కలి, నరసన్నపేట, శ్రీకాకుళం, పాతపట్నం, బొబ్బిలి, సోంపేట, చీపురుపల్లి, పార్వతీపురం తాలూకాలతో యేర్పాటు చేయబడింది.

## కొర్రవానివలస తిరుగుబాటు

శ్రీకాకుళంజిల్లా సాలూరుతాలూకా కొండజాతిప్రజలు ఇంగ్లీషుప్రభుత్వానికి వ్యతిరేకంగా, స్థానిక అధికారుల దోపిడీకి వ్యతిరేకంగా 1900 మేలో తిరుగుబాటు చేసారు. ఈ తిరుగుబాటుకు సాలూరు తాలూకా కొర్రవానివలస గ్రామం కేంద్రం. కొర్రామల్లయ్య అనే కొండదొర తిరుగుబాటుకు నాయకత్వం వహించాడు.

కొర్రా మల్లయ్య 1900 ఏప్రిల్‌లో స్వామివలె నటించి ఒక నెలరోజులలో నాలుగు అయిదు వేలమంది ఏజన్సీ ప్రజలను తన చుట్టూ సమీకరించాడు. అధికారులు పెడుతున్న యిబ్బందులనుండి బయటపడాలనే వాంఛయే వారి సమీకరణకు కారణం. తమ బాధలకు అధికారుల దోపిడీకి కారణం బ్రిటిషుప్రభుత్వమేనని వాళ్ళు గ్రహించారు. కొర్రా మల్లయ్య వెనుకబడిన కొండజాతిప్రజలను సమీకరించడానికి స్వామి వేషం ధరించాడు. తాను పంచపాండవుల స్వరూపమన్నాడు. తన కొడుకు సాక్షాత్తు విష్ణుస్వరూపమన్నాడు. బ్రిటిషువారిని తరిమి వెయ్యాలని చెప్పి కొండజాతిప్రజలను సాయుధుల చేసాడు. తుపాకుల ఆకారములో చెక్కబడ్డ వెదురుగొట్టే వారి ఆయుధాలు. వారందరికీ డ్రిల్లు నేర్పాడు.

అది మే 1వ తేదీ. పోలీసు పెంటపై దాడి చేయడానికి వస్తున్నామని తిరుగుబాటుకు సంసిద్ధులై, కొండజాతిప్రజలు అధికారులకు కబురు పంపారు. అధికారులు యిద్దరు పోలీసులను పరిస్థితి చూచిరమ్మని పంపారు. కొండజాతిప్రజలు ఆ పోలీసు లిద్దరిని యమపురికి పంపారు. అదనపు పోలీసు బలగం వచ్చింది. తిరుగుబాటు సాగిస్తున్న ప్రజలు వారిని ప్రతిఘటించారు.

మే 7వ తేదీన జిల్లా మేజిస్ట్రేటు జయపూర్, పార్వతీపురం, విశాఖపట్నం మొదలైన ప్రాంతాలనుండి రిజర్వుపోలీసును దించాడు. ప్రజలు ప్రతిఘటించారు. రిజర్వు పోలీసుచేసిన కాల్పుల ఫలితంగా పదకొండుమంది ప్రజలు చనిపోయారు. 60 మందిని అరెస్టుచేసి పోలీసులను హత్యచేశారని కేసులు పెట్టి ఇంగ్లీషుప్రభుత్వం యిద్దరిని ఉరితీసింది. మల్లయ్య జైలులోనే మరణించాడు.

# భూగోళం

ఆంధ్రరాష్ట్ర ఉత్తరపు చివరన ఉన్నదే శ్రీకాకుళంజిల్లా. 1950వ సంవత్సరంలో విశాఖజిల్లాను రెండుగా విభజించి, ఉత్తరభాగానికి శ్రీకాకుళంజిల్లా అనిపేరు పెట్టారు. ఇది 18°20'-19°10' ఉత్తర అక్షాంశరేఖలమధ్యనూ, 83°5', 84°50' తూర్పు రేఖాంశరేఖలమధ్యను ఉన్నది.

దీనికి ఉత్తర పశ్చిమ సరిహద్దులుగా ఒరిస్సా రాష్ట్రము, తూర్పున బంగాళాఖాతము, దక్షిణాన విశాఖపట్నంజిల్లా సరిహద్దులుగా ఉన్నాయి.

ప్రక్కపేజీలోని పట్టికలో ప్రభుత్వం పరిపాలనాసౌలభ్యంకొరకు జిల్లాను విభజించి ఏర్పాటుచేసిన రెవెన్యూడివిజన్లు, వాటి క్రింద ఉండే తాలూకాలు, వాటివిస్తీర్ణం, తాలూకాల పరిపాలనా కార్యస్థానాల వివరాలు పొందుపరచబడ్డాయి.

పార్వతీపురం, పాలకొండ, సాలూరు తాలూకాలలో కొంతభాగం పర్వత ప్రాంతం. ఈ ప్రాంతాన్నే ఏజన్సీ ప్రాంతం అని అంటారు. కొండజాతుల ప్రజలే ఇచ్చట నివసించే వారిలో అధిక సంఖ్యాకులు. ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి, నరసన్నపేట, శ్రీకాకుళం, చీపురుపల్లి తాలూకాలు (సముద్ర)తీరాన్ని ఆనుకొని ఉన్నాయి.

జిల్లాను భౌగోళిక పరిస్థితులబట్టి పర్వత ప్రాంతం, మైదానప్రాంతం అని రెండు భాగాలుగా విభజించవచ్చు. పాలకొండ, పార్వతీపురం, సాలూరు తాలూకాలలోని ఏజన్సీ ప్రాంతమూ, పాతపట్నం, సోంపేటతాలూకాలలోని కొంతభాగమూ "పర్వతప్రాంతం" లోనికి వస్తాయి. మిగిలిన ప్రాంతం అంతా "మైదానప్రాంతం" లోకి వస్తుంది. తీరప్రాంతితాలూకాలలో చాలభాగం ఇసుకనేల.

తూర్పుకనుమలు, ఈజిల్లాలో సముద్రతీరానికి సమాంతరముగా జిల్లా ఈశాన్యమూలనుండి నైరుతీమూలకు వ్యాపించి ఉన్నాయి.

## నదులు

ఈ జిల్లాలోని నదులన్నీ తూర్పుకనుమలలోపుట్టి బంగాళాఖాతంలో కలుస్తున్నాయి. కనుమలు సముద్రతీరానికి దగ్గర వటంచేత, ఈ జిల్లాలోని అన్నినదుల పొడవు బహుతక్కువ!

ఈ జిల్లాలో ప్రవహించే నదులలో వంశధార, నాగావళి ముఖ్యమైనవి. వంశధారానది ఒరిస్సా రాష్ట్రంలోని తూర్పు కనుమలలో పుట్టి, జిల్లాసరిహద్దుల దాటి పాతపట్నం తాలూకాలో ప్రవేశిస్తున్నది. అచ్చటినుండి నరసన్నపేట, శ్రీకాకుళం తాలూకాల మధ్యగా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తున్నది.

నాగావళి నది కూడ, ఒరిస్సాలోని తూర్పుకనుమలలో పుట్టి,జిల్లా సరిహద్దుల దాటి పార్వతీపురం తాలూకాలో ప్రవేశిస్తున్నది. నది కొంత దూరం పాలకొండ తాలూకాలో ప్రవహించి, తర్వాత శ్రీకాకుళం, చీపురుపల్లి తాలూకాలకు మధ్య సరిహద్దుగా ప్రవహించి బంగాళాఖాతంలో పడుతున్నది. నది, క్రిందకు ప్రవహించిన తర్వాత "లాంగుల్య" అని పిలవబడుతున్నది.

| రెవెన్యూ డివిజన్ పేరు | రెవెన్యూ డివిజన్ కార్యస్థానం | రెవెన్యూ డివిజన్‌లోని తాలూకాలు | | తాలూకా విస్తీర్ణం చ॥ మైళ్ళు | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|---|
| టెక్కలి | టెక్కలి | శ్రీకాకుళం | | 227 | శ్రీకాకుళం |
| | | నరసన్నపేట | | 200 | నరసన్నపేట |
| | | సోంపేట | | 212 | సోంపేట |
| | | పాతపట్నం | | 463 | పాతపట్నం |
| | | ఇచ్ఛాపురం | | 87 | ఇచ్ఛాపురం |
| | | టెక్కలి | | 287 | టెక్కలి |
| పార్వతీపురం | పార్వతీపురం | పార్వతీపురం | ఏజన్సీ | 294 | పార్వతీపురం |
| | | | మైదానం | 296 | |
| | | పాలకొండ | ఏజన్సీ | 146 | పాలకొండ |
| | | | మైదానం | 348 | |
| | | బొబ్బిలి | | 391 | బొబ్బిలి |
| | | చీపురుపల్లి | | 462 | చీపురుపల్లి |
| | | సాలూరు | ఏజన్సీ | 69 | సాలూరు |
| | | | మైదానం | 422 | |

బొబ్బిలి తాలూకా నుండి ప్రవహించే స్వర్ణముఖి, నాగావళి నదిలో కలుస్తున్నది. ఇచ్ఛాపురం తాలూకాలో ప్రవహిస్తున్న బాహుదా; సోంపేట, పాతపట్నం, తాలూకాలలో ప్రవహిస్తున్న మహేంద్రతనయ; సాలూరు తాలూకాలో ప్రవహిస్తున్న వేదవతి జిల్లాలో ప్రవహిస్తున్న ఇతర నదులలో ఎన్నదగినవి.

## అడవులు

ప్రక్క పేజీలోని పట్టికలో జిల్లాలోని వివిధ తాలూకాలలో ఉన్న అడవుల వివరాలు పొందుపరచబడ్డాయి.

జిల్లాలో మొత్తం 238.93 చదరపు మైళ్ళ విస్తీర్ణం గల అడవులున్నాయి (1951). ఇందులో 64.50 చ. మై. రిజర్వు అడవులు. 174 చ. మై. విస్తీర్ణం గల అడవులు – ఇంతవరకూ వివిధ ఎస్టేటుల క్రింద వున్నవి – ప్రభుత్వ అధీనంలోకి వచ్చాయి.

టెక్కలి తాలూకాలో అడవులు చెదురుగా ఉన్నాయి. పైగా ఇవి చిన్నవి కూడా. అందుచేత ఇవి వంట చెరుకును మాత్రమే సప్లయి చేయగలుగుతున్నాయి. సోంపేట తాలూకాలోని పర్వత ప్రాంత మంతటా, సాలూరు, పార్వతీపురం, పాలకొండ, బొబ్బిలి తాలూకాలలోను అడవులున్నాయి. సాలూరు అడవులలో,

| తాలూకా | రిజర్వ్ అడవులు (చ. మైళ్ళు) | ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకున్న అడవులు (చ. | మొత్తం అడవులు (చ. మైళ్ళు) |
|---|---|---|---|
| ఇచ్ఛాపురం | ... | ... | ... |
| టెక్కలి | ... | 7.10 | 7.10 |
| సోంపేట | ... | 74.94 | 74.94 |
| పాతపట్నం | ... | ... | ... |
| పార్వతీపురం | ... | 27.42 | 27.42 |
| పాలకొండ | 64.50 | ... | 64.50 |
| సాలూరు | ... | 19.92* | 19.92 |
| బొబ్బిలి | ... | 33.93 | 33.93 |
| శ్రీకాకుళం | ... | ... | ... |
| నరసన్నపేట | ... | ... | ... |
| చీపురుపల్లి | ... | 11.12 | 11.12 |
| మొత్తం | 64.50 | 174.43 | 238.93 |

వంట చెరుకులభిస్తుంది. చీపురుపల్లి తాలూకాలోని ఎస్టేట్ అడవులు, పర్వత ప్రాంతంలో చెదురుగా ఉన్నాయి.

### శీతోష్ణస్థితి - వర్షపాతం

ఏప్రిల్ నుండి జూన్ మాసమువరకూ మండువేసవి. సోంపేట, ఇచ్ఛాపురం, శ్రీకాకుళం తాలూకాలలో మాత్రం ఇవి తీరము నానుకొని ఉన్నాయి) వేసవిలో ఎండలు జిల్లాలోని ఇతర ప్రాంతాలలో కంటె కొంచెం తక్కువ. మిగిలిన అన్ని తాలూకాలలో ఎండలకాలం మండు టెండలు, శీతాకాలం విపరీతపు చలి.

నైరుతీ ఋతుపవనాలవలన, ఈశాన్య ఋతుపవనాలవలన ఈ జిల్లాలో వర్షం పడుతుంది. ప్రక్క పేజీలోని పట్టికలో వివిధ తాలూకాలలో సంవత్సరంలో పడే సగటు వర్షపాతమూ, వర్షం పడే దినాలు ఇవ్వబడ్డాయి.

### సాగు సదుపాయాలు

జిల్లాలో 8,535 మైనరు ఇరిగేషన్ ప్రాజెక్టులక్రింద 2,66 వేల ఎకరాలు, మేజరు ఇరిగేషన్ ప్రాజెక్టులక్రింద 89 వేల ఎకరాలు సాగవుతున్నది.

జిల్లాలో ప్రవహిస్తున్న నాగావళి, లాంగుళ్య, వంశధారా, బాహుదా నదుల నీరు జిల్లాలో సాగుకు (Irrigation ప్రధానంగా ఉపయోగపడుతున్నది. పార్వతీపురం తాలూకాలోని తోటపల్లి వద్ద నాగావళి నదికి ఆనకట్ట కట్టబడింది. నాగావళి, దీని ఉపనది స్వర్ణముఖీ నదీ

*సాలూరు ఎస్టేటు అడవులు మినహాయించబడ్డాయి.

| తాలూకా | సగటు వర్షపాతం (అంగుళములు) | సంవత్సరంలో వర్షం కురిసే రోజులు |
|---|---|---|
| ఇచ్ఛాపురం | 45.31 | 54.30 |
| టెక్కలి | 40.54 | 50.30 |
| సోంపేట | 46.02 | 54.80 |
| పాతపట్నం | 49.93 | 69.20 |
| పార్వతీపురం | 48.13 | 70.50 |
| పాలకొండ | 47.57 | 64.50 |
| సాలూరు | 43.75 | 61.90 |
| బొబ్బిలి | 43.05 | 63.50 |
| శ్రీకాకుళం | 39.42 | 49.60 |
| నరసన్నపేట | 39.34 | 48.00 |
| చీపురుపల్లి | 41.10 | 54.80 |

జలాలు ముఖ్యంగా పాలకొండ, శ్రీకాకుళం తాలూకాలలోను, కొంత వరకు పార్వతీపురం తాలూకాలోను సాగుకు ఉపయోగపడుతున్నాయి. వంశధారా నదీజలాలచేత పాతపట్నం, శ్రీకాకుళం తాలూకాలలో సాగుచేయబడుతున్నది. బాహుదానది, ఇచ్ఛాపురం తాలూకాలో సాగుకు సాయపడుతున్నది.

160 వ పేజీలోని పట్టిక, వివిధతాలూకాలలో మైనరు, మేజరు ఇరిగేషన్ ప్రాజెక్టు క్రింద ఎంత సాగవుతున్నదో వివరిస్తుంది.

మైనరు ఇర్రిగేషన్ అంతా ప్రధానంగా చెరువులపై ఆధారపడివుంది. ఈమధ్య ప్రభుత్వ ఆధీనంలోనికి వచ్చిన ఎస్టేటు ప్రాంతాలలో ఉన్న చెరువులు చాల అధ్వాన్నస్థితిలో ఉన్నట్లు ప్రభుత్వ రిపోర్టులు తెలియచేస్తున్నాయి.

ఆహారపంటలలో వరి ప్రధానమైన పంట. సాలుకు సుమారు నాలుగు లక్షల ఎకరాలలో ఈ పంట పండించబడుతున్నది. మెట్ట పంటలలో ప్రధానమైన రాగి, జొన్న, సజ్జ, పప్పు ధాన్యాలు ఏటా 1,75 వేల ఎకరాలలో పండించబడుతున్నాయి. వేరుశనగ ప్రధాన వ్యాపార పంట. సాలుకు సుమారు 1,43 వేల ఎకరాలలో పండించబడుతున్నది.

1945_46 వ సంవత్సరంలో ఏయే పంటలు ఎన్నిఎకరాలలో పండించబడింది ప్రక్కపేజీలలోనిపట్టికల్లో వివరించబడింది. ఈ అంచనాలు కొంత పాతవైనా, వివిధ తాలూకాల పంట వివరాలకు సంబంధించిన తాజా వివరాలు లభించనందునను, సాలుకు వివిధజిల్లాలలో పండించబడేవివిధ పంటభూముల విస్తీర్ణాన్ని స్థూలంగానైనా చిత్రిస్తాయనుకనూ ఇవిఇవ్వబడ్డాయి: —

# తాలూకావారీ పంటల వివరాలు (1)

| తాలూకా | వరి (ఎకరాల్లో) మాగాణి (1) | వరి (ఎకరాల్లో) మెట్ట (2) | జొన్న (ఎకరాల్లో) (3) | సజ్జ (ఎకరాల్లో) (4) | రాగి (ఎకరాల్లో) మాగాణి (5) | రాగి (ఎకరాల్లో) మెట్ట (6) | కొర్ర (ఎకరాల్లో) (7) | వరిగ (ఎకరాల్లో) మాగాణి (8) | వరిగ (ఎకరాల్లో) మెట్ట (9) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఇచ్ఛాపురం | 13,755 | 2,175 | 6 | 710 | 1,143 | 2,996 | ... | ... | 5 |
| టెక్కలి | 10,600 | 8,080 | 60 | 420 | 3,600 | 365 | ... | ... | ... |
| సోంపేట | 14,469 | 8,032 | ... | 2,716 | 764 | 5,080 | 90 | ... | ... |
| పాతపట్నం | 57,658 | 8,565 | 630 | 841 | 7,456 | 5,767 | 161 | 40 | ... |
| పార్వతీపురం | 9,496 | 436 | 4,151 | 5,025 | 447 | 6,273 | 184 | ... | 574 |
| పాలకొండ | 44,284 | ... | 6,565 | 845 | 20,975 | ... | ... | ... | 185 |
| సాలూరు | 89,946 | 1,534 | 5,889 | 924 | 3,996 | 9,754 | 186 | ... | 1,734 |
| బొబ్బిలి | 50,000 | 2,805 | 405 | 440 | 7,000 | 676 | 154 | ... | 112 |
| శ్రీకాకుళం | 53,032 | 2,455 | 2,264 | 907 | 3,535 | 3,376 | 2 | ... | ... |
| నరసన్నపేట | 35,188 | 8,170 | 1,038 | 1,270 | 1,997 | 4,856 | 189 | ... | 22 |
| చీపురుపల్లి | 15,308 | 2,350 | 2,515 | 19,807 | 23,405 | 5,563 | 952 | ... | 72 |
| మొత్తం | 3,93,736 | 44,602 | 23,523 | 33,905 | 74,318 | 44,706 | 1,918 | 40 | 2,704 |

## తాలూకా సాగీ పంటల వివరాలు (2)

| తాలూకా | సామలు | మొక్కజొన్న (ఎకరాల్లో) | | శనగలు (ఎకరాల్లో) | పెసలు (ఎకరాల్లో) | కందులు (ఎకరాల్లో) | మినుములు (ఎకరాల్లో) | ఉలవలు (ఎకరాల్లో) |
|---|---|---|---|---|---|---|---|---|
| | | మాగాణి | మెట్ట | | | | | |
| | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) |
| ఇచ్ఛాపురం | 365 | ... | ... | ... | 3,201 | 484 | 642 | 1,818 |
| టెక్కలి | ... | ... | ... | ... | 1,520 | 960 | 89 | ... |
| సోంపేట | 973 | ... | 8 | ... | 1,434 | 1,446 | 324 | 1,251 |
| పాతపట్నం | 298 | 63 | ... | ... | 10,640 | 366 | 4,328 | 8,593 |
| పార్వతీపురం | 750 | ... | 248 | 12 | 1,418 | 591 | 270 | 5,462 |
| పాలకొండ | 4,350 | ... | 39 | ... | 4,378 | 1,142 | 1,538 | 8,300 |
| సాలూరు | 904 | ... | 108 | ... | 29,038 | 642 | 2,552 | 16,786 |
| బొబ్బిలి | 600 | ... | 30 | ... | 610 | 300 | 602 | 2,800 |
| శ్రీకాకుళం | 1,196 | ... | 117 | ... | 25,998 | 270 | 507 | 5,790 |
| నరసన్నపేట | 1,590 | ... | 148 | ... | 14,453 | 398 | 154 | 3,597 |
| చీపురుపల్లి | 1,532 | 88 | ... | ... | 2,510 | 1,417 | 2,560 | 13,210 |
| మొత్తం | 12,558 | 151 | 698 | 12 | 95,200 | 8,016 | 13,566 | 67,607 |

## తాలూకావారీ పంటల వివరాలు (3)

| తాలూకా | చెరకు (ఎకరాల్లో) | | వేరుశనగ (ఎకరాల్లో) | నువ్వులు (ఎకరాల్లో) | | ప్రత్తి (ఎకరాల్లో) | పొగాకు (ఎకరాల్లో) | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మాగాణి (18) | మెట్ట (19) | (20) | మాగాణి (21) | మెట్ట (22) | (23) | మాగాణి (24) | మెట్ట (25) |
| ఇచ్ఛాపురం | ... | ... | ... | 21 | 818 | ... | 59 | ... |
| టెక్కలి | 60 | ... | 6,430 | 621 | ... | 2 | ... | 105 |
| సోంపేట | 166 | 11 | 23 | 104 | 1,084 | ... | ... | 199 |
| పాతపట్నం | 873 | ... | 12,963 | 4,164 | 1,286 | 167 | 527 | ... |
| పార్వతీపురం | 1,095 | ... | 6,434 | 263 | 1,324 | 641 | 2,268 | ... |
| పాలకొండ | 5,723 | ... | 33,840 | 19,600 | ... | ... | 580 | ... |
| సాలూరు | 3,550 | 139 | 30,528 | 2,294 | 1,025 | 3 | 555 | ... |
| బొబ్బిలి | 2,000 | 770 | 3,920 | 3,500 | 540 | ... | ... | 2,739 |
| శ్రీకాకుళం | 104 | ... | 13,229 | 855 | 323 | 23 | 28 | ... |
| నరసన్నపేట | 66 | ... | 14,871 | 848 | 591 | 27 | 14 | 17 |
| చీపురుపల్లి | 13 | ... | 20,450 | 4,363 | 3,519 | ... | 1,425 | ... |
| మొత్తం | 13,650 | 920 | 1,42,688 | 36,633 | 10,510 | 863 | 5,456 | 3,060 |

| తాలూకా | మొత్తం ఇరిగేషన్ ప్రాజెక్టులు | వీటి ఆయకట్టు (ఎకరాలలో) | మేజరు ఇరిగేషను ప్రాజెక్టుల ఆయకట్టు (ఎకరాలలో) |
|---|---|---|---|
| ఇచ్ఛాపురం | 275 | 12,658 | 6,322 |
| టెక్కలి | 600 | 15,000 | ... |
| సోంపేట | 1,200 | 39,000 | ... |
| పాతపట్నం | 1,618 | 70,025 | ... |
| పార్వతీపురం | 763 | 14,049 | 2,101 |
| పాలకొండ | 1,045 | 26,567 | 25,120 |
| సాలూరు | 707 | 12,953 | ... |
| బొబ్బిలి | 842 | 20,664 | ... |
| శ్రీకాకుళం | 631 | 35,025 | 36,335 |
| నరసన్నపేట | 591 | 16,293 | 16,293 |
| చీపురుపల్లి | 263 | 4,665 | 3,251 |
| మొత్తం | 8,535 | 2,66,902 | 89,423 |

## రహదార్లు - రోడ్లు

జిల్లాలో 843 మైళ్ళ రోడ్లున్నాయి. ఇందులో జాతీయ రహదార్లు 134 మైళ్ళు, రాష్ట్ర రహదార్లు 38 మైళ్ళు, జిల్లా ప్రధాన రహదార్లు 438 మైళ్ళు, ఇతర జిల్లా రహదార్లు 130 మైళ్ళు, మునిసిపల్ రోడ్లు 42 మైళ్ళు, గ్రామ రోడ్లు 103 మైళ్ళు. వీటి తాలూకావారీ వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో వివరించబడ్డాయి:

ఈ జిల్లాలోని రోడ్లు, ఉత్తరాన ఒరిస్సా రాష్ట్రాన్ని, దక్షిణాన విశాఖ జిల్లాను కలుపుతున్నాయి. తాలూకాలలో రహదారీ సౌకర్యాలు తగినంతగా లేవు. ఉన్నంతవరకైనా, రోడ్లు చక్కని స్థితిలో లేవు.

## రైల్వేలు

జిల్లాలో 147 మైళ్ళ బ్రాడ్ గేజి రైలును, 21 మైళ్ళ నారోగేజి రైలును ఉన్నాయి. ఈ రోడ్లు తూర్పు రైల్వే జోను లో ఉన్నాయి. చీపురుపల్లి, శ్రీకాకుళం, నరసన్నపేట, టెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాలగుండా, మదరాసు - కలకత్తా రైలుమార్గం పోతున్నది. టెక్కలి తాలూకాలోని నౌపడానుండి బయలు దేరిన 'నారోగేజి' రైలుమార్గం, పాతపట్నంమీదుగా ఒరిస్సాలోని పర్లాకిమిడి, గునుపూరులకు పోతున్నది. విజయనగరం

| తాలూకా | జాతీయ రహదార్లు (మైళ్ళలో) | రాష్ట్ర రహదార్లు (మైళ్ళలో) | జిల్లా ప్రధాన రహదార్లు (మైళ్ళలో) | ఇతరజిల్లా రహదార్లు (మైళ్ళలో) | గ్రామ రోడ్లు (మైళ్ళలో) | మొత్తం (మైళ్ళలో) |
|---|---|---|---|---|---|---|
| ఇచ్ఛాపురం | 10 | ... | 8 | 3 | 4 | 25 |
| టెక్కలి | 28 | ... | 36 | 18 | 8 | 90 |
| సోంపేట | 22 | ... | 25 | ... | 9 | 56 |
| పాతపట్నం | ... | ... | 93 | 9 | 5 | 107 |
| పార్వతీపురం | ... | 16 | 62 | 8 | 17 | 103 |
| పాలకొండ | ... | ... | 52 | 16 | 4 | 72 |
| సాలూరు | 21 | ... | ... | 31 | 17 | 69 |
| బొబ్బిలి | 7 | 22 | 34 | 18 | 10 | 91 |
| శ్రీకాకుళం | 10 | ... | 78 | 5 | 8 | 101 |
| నరసన్నపేట | 14 | ... | 28 | ... | 4 | 46 |
| చీపురుపల్లి | 22 | ... | 22 | 22 | 17 | 83 |
| మొత్తం | 134 | 38 | 438 | 130 | 103 | 843 |

నుండి రాయపూరు పోయే బ్రాడ్ గేజి లైను సాలూరు, బొబ్బిలి, పార్వతీపురం తాలూకాలగుండా పోతున్నది. సాలూరు 'ఘాట్ ఏజన్సీ'కి బొబ్బిలి, శ్రీకాకుళం 'ఘాట్ ఏజన్సీ'కి శ్రీకాకుళం రోడ్డు దగ్గరి రైల్వేస్టేషన్లు. నరసన్నపేటకు దగ్గరి రైల్వే స్టేషను నాల్గు మైళ్ళ దూరంలోఉన్న తిలారు. తాలూకా పరిపాలనా కేంద్రాలయినపాలకొండ, నరసన్నపేటలకు ఎటువంటి రైలుసౌకర్యాలు లేవు.

### జ నా భా

జిల్లా జనాభా 1941 జనాభా లెక్కల ప్రకారం 20,13,698 గా ఉన్నదల్లా 1951 కి (జనాభా లెక్కల ననుసరించి) 21,23,136 కు పెరిగింది. గత పదిసంవత్సరాలలో నూటికి 5.4 పాళ్ళు పెరిగినట్లు తెలుస్తున్నది. జనసమ్మర్దం చదరపు మైలుకు 546 ఉన్నది. 3,052 గ్రామాలు, 16 పట్టణాలు* ఉన్నాయి. వీటి తాలూకావారీ వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో వివరించబడ్డాయి:

జనాభాలో 19,32,351 మంది గ్రామీణులు, 1,90,785 మంది పట్టణవాసులు. జిల్లాలోఉన్న మొత్తం ఇండ్లు 4,34,976. వీటిలో 3,97,476 గ్రామీణ ప్రాంతంలోను, 37,500 పట్టణప్రాంతంలోనువున్నాయి. 163వ పేజీలోని పట్టిక, వీటి తాలూకావారీవివరాలతెలియచేస్తుంది.

* కనీసం ఐదువేలు జనాభాగలిగి నిర్దుష్టమైన పట్టణ వాతావరణం ఉన్నవి పట్టణాలుగా పరిగణించబడ్డాయి.

| తాలూకా | జనాభా 1941 | జనాభా 1951 | పెరుగుదల శాతం (—తరుగుదల) | గ్రామాలు | పట్టణాలు | జనసాంద్రత చ. మై. (1951) |
|---|---|---|---|---|---|---|
| ఏజన్సీ ప్రాంతం | | | | | | |
| పార్వతీపురం | 35,524 | 32,071 | — 9.7 | ... | ... | 109 |
| పాలకొండ | 16,105 | 17,714 | 10.0 | ... | ... | 121 |
| సాలూరు | 5,323 | 4,349 | —18.3 | ... | ... | 63 |
| మైదానప్రాంతం | | | | | | |
| ఇచ్ఛాపురం | 74,876 | 78,761 | 5.2 | 48 | 1 | 905 |
| టెక్కలి | 1,63,702 | 1,66,186 | 1.5 | 309 | 2 | 611 |
| సోంపేట | 1,21,080 | 1,30,444 | 7.7 | 250 | 3 | 615 |
| పాతపట్నం | 2,01,315 | 2,03,542 | 1.1 | 439 | ... | 440 |
| పార్వతీపురం | 1,46,983 | 1,60,183 | 9.0 | 440 | 2 | 541 |
| పాలకొండ | 2,64,611 | 2,81,278 | 6.3 | 419 | 3 | 808 |
| సాలూరు | 1,45,974 | 1,52,232 | 4.3 | 283 | 1 | 361 |
| బొబ్బిలి | 2,46,437 | 2,62,748 | 6.6 | 237 | 1 | 672 |
| శ్రీకాకుళం | 1,70,112 | 1,89,389 | 11.3 | 183 | 1 | 834 |
| నరసన్నపేట | 1,49,879 | 1,51,634 | 1.2 | 151 | 1 | 758 |
| చీపురుపల్లి | 2,71,777 | 2,92,605 | 7.7 | 293 | 1 | 633 |
| శ్రీకాకుళం జిల్లా | 20,13,698 | 21,23,136 | 5.4 | 3,052 | 16 | 546 |

నోటు: మొదటి మూడుతాలూకాలలోని ఏజన్సీప్రాంత గ్రామాలుకూడా క్రింద ఆయాతాలూకాలకు (మైదాన ప్రాంతం) యివ్వబడిన గ్రామాలలో ఇవ్వబడ్డాయి.

జిల్లాలోని మైదానప్రాంతపు జనాభా పెరుగుదల నూటికి 5.7 పాళ్ళు. వివిధ తాలూకాలలోను మైదాన ప్రాంత జనాభా నూటికి 1.1 (పాతపట్నం తాలూకా) నుండి 11.3 (శ్రీకాకుళం తాలూకా) వరకు ఉన్నది.

ఈజిల్లా ఇతర ఆంధ్రజిల్లాల కన్నింటి కన్న వెనుకబడివుంది. జిల్లాతూర్పునఉన్న సముద్రతీర ప్రాంతంలోను, పడమరనున్న ఏజన్సీ ప్రాంతంలోను మలేరియా ప్రబలంగా ఉంటుంది. దీనికితోడు ఇటు పరిశ్రమలు లేకపోగా పంటలుకూడా స్వయం సమృద్ధిగాపండటంలేదు. కరువు వచ్చి ప్రజలు వలసపోవటం చాలసామాన్యం. అందుచేత రాష్ట్రజనాభా పెరుగుదల సగటు 1941-51 సంవత్సరాలమధ్య నూటికి 14 పాళ్ళుంటే యీ జిల్లాలో 5.4 పాళ్ళు మాత్రమే ఉన్నది.

| తాలూకా | తాలూకాలోని మొత్తం ఇండ్లు | గ్రామీణ ప్రాంతంలోని ఇండ్లు | పట్టణ ప్రాంతంలోని ఇండ్లు | మొత్తం జనాభా | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా |
|---|---|---|---|---|---|---|
| ఇచ్ఛాపురం | 18,850 | 16,180 | 2,670 | 78,761 | 67,371 | 11,390 |
| సోంపేట | 31,070 | 25,526 | 5,544 | 1,30,444 | 1,07,375 | 23,069 |
| పార్వతీపురం | 40,691 | 35,855 | 4,836 | 1,92,254 | 1.67,569 | 24,685 |
| పాతపట్నం | 42,117 | 42,117 | ... | 2,03,542 | 2,03,542 | ... |
| టెక్కలి | 34,866 | 32,073 | 2,793 | 1,66,186 | 1,52,813 | 13,373 |
| సాలూరు | 33,072 | 27,666 | 4,406 | 1,56,581 | 1,32,176 | 24,405 |
| బొబ్బిలి | 55,725 | 51,458 | 4,267 | 2,62,748 | 2,39,646 | 23,102 |
| పాలకొండ | 60,527 | 55,015 | 5,512 | 2,98,992 | 2,70,141 | 28,851 |
| శ్రీకాకుళం | 38,749 | 34,555 | 4,194 | 1,89,389 | 1,65,177 | 24,212 |
| నరసన్నపేట | 31,229 | 29,430 | 1,799 | 1,51,634 | 1,42,071 | 9,563 |
| చీపురుపల్లి | 49,080 | 47,601 | 1,479 | 2,92,605 | 2,84,470 | 8,135 |
| మొత్తం | 4,34,976 | 3,97,476 | 37,500 | 21,23,136 | 19,32,351 | 1,90,785 |

పాతపట్నం తాలూకా నుండి ఒరిస్సా రాష్ట్రంలో వరి బాగా పండే పర్లాకిమిడి (గంజాంజిల్లా) ప్రాంతానికి ప్రజలు వలస పోవుట మామూలు. 1941 వ సంవత్సరంలో జనాభా లెక్కలు తీసిన తర్వాత వరుసగా నాలుగు సంవత్సరాలు వర్షాభావంవల్ల, పంటలు పోవటంచేత, టెక్కలి తాలూకా జనాభా పశ్చిమ బెంగాల్‌కు, ముఖ్యంగా కలకత్తా, ఖరగ్ పూరు పట్టణాలకు, అస్సాం రాష్ట్రానికి వలస పోయారు.

పార్వతీపురం, సాలూరు ఏజన్సీ ప్రాంత జనాభా వరుసగా నూటికి 9.7 పాళ్లు, 18.3 పాళ్ళు తగ్గిపోయింది. పాలకొండ ఏజన్సీప్రాంత జనాభా నూటికి 10 పాళ్ళు పెరిగింది. ఈ మూడుతాలూకాల మైదాన ప్రాంత జనాభా వరుసగా నూటికి 9,4.3, 6.3 పాళ్ళు పెరిగింది.

## ప్రజలు - వృత్తులు

జిల్లా మొత్తం జనాభాలో 1951 వ సంవత్సర జనాభా లెక్కల ప్రకారం 16,36,451మంది వ్యవసాయవృత్తులమీద, 4,85,685 మంది వ్యవసాయేతర వృత్తుల మీద ఆధారపడి జీవిస్తున్నారు.

వ్యవసాయవృత్తులవారిలో 9,38,882 మంది భూఖామందులు.వీరిపై ఆధారపడిన వారు (dependents) 2,24,618 మంది. కౌలుదార్లు,వారిపైఆధారపడినవారు 4,34,143 మంది. వ్యవసాయకూలీలు, వారిపై ఆధారపడినవారు, 38,808 మంది. తమ భూముల కౌళ్ళ కిచ్చేవారు, వారిపై ఆధారపడినవారు ఉన్నారు.

వ్యవసాయేతర వృత్తులవారిలో (ఆయా తరగతులవారిలో వారిపై ఆధార పడే జనాభా కూడాకలిపి) 2,08,026 మంది వ్యవసాయేతర ఉత్పత్తులమీద, 89,339 మంది వ్యాపారంమీద, 9,195 మంది రవాణాల పనులమీద, 1,79,125 మంది ఇతర వృత్తులు, ఉద్యోగాలమీద ఆధార పడుతున్నారు.

వీటి తాలూకావారీ వివరాలు ప్రక్క పేజీలోనిపట్టికలో పొందుపరచబడ్డాయి.

దీని ప్రకారం మొత్తం జిల్లామైదాన ప్రాంత జనాభాలో నూటికి 43.82 మంది స్వంతంగా తమభూములనుసాగుచేసేవారు, 10.62 మంది కౌలుదార్లు, 20.28 మంది వ్యవసాయకూలీలు, 1.87 మంది స్వంత భూముల కౌలుకిచ్చేవారు, 10.00 మంది వ్యవసాయేతర వృత్తులు చేయుకొనేవారు, 4.30 మంది వ్యాపారస్థులు, 0.44 మంది రవాణా పనిచేసేవారు, 8.67 మంది ఇతర వృత్తులు ఉద్యోగాలు చేసేవారు ఉన్నారు.

ఏజన్సీప్రాంతం మొత్తం జనాభాలో, నూటికి 59.51 మంది స్వంతభూములను సాగుచేసేవారు, 8.86 మంది కౌలుదార్లు, 27.12 మంది వ్యవసాయకూలీలు, 0.08 మంది స్వంతభూముల కౌలుకిచ్చేవారు, 2.27 మంది వ్యవసాయేతర ఉత్పత్తిలో పాల్గొనేవారు, 0.89 మంది వ్యాపారం చేసేవారు, 1.27 మంది ఇతర వృత్తులు ఉద్యోగాలు చేసేవారు ఉన్నారు.*

* పైన వివరించిన అన్నివర్గాల ప్రజలలోను, వారిపై ఆధారపడిజీవించే జనాభా కలిసి ఉన్నారు.

| తాలూకా | వ్యవసాయ వృత్తులు | | | | వ్యవసాయేతర వృత్తులు | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | భూస్వాములు, వారిపై ఆధారపడినవారు | కౌలుదారులు, వారిపై ఆధారపడినవారు | వ్యవసాయ కూలీలు, వారిపై ఆధారపడినవారు | సాగుచేయని భూస్వాములు, వారిపై ఆధారపడినవారు | వ్యవసాయేతర ఉత్పత్తిదారులు, వారిపై ఆధారపడినవారు | వ్యాపారులు, వారిపై ఆధారపడినవారు | రవాణా పనివారు, వారిపై ఆధారపడినవారు | ఇతర వృత్తులు, సేవకులు, వారిపై ఆధారపడినవారు |
| ఇచ్ఛాపురం | 34,976 | 5,649 | 16,172 | 1,884 | 12,181 | 3,408 | 648 | 6,846 |
| టెక్కలి | 87,588 | 9,814 | 24,885 | 2,729 | 19,826 | 6,525 | 1,815 | 12,998 |
| సోంపేట | 68,534 | 5,543 | 19,121 | 2,322 | 14,548 | 6,282 | 648 | 13,446 |
| పాతపట్నం | 62,029 | 30,483 | 68,211 | 6,296 | 18,346 | 6,999 | 247 | 10,931 |
| పార్వతీపురం | 67,674 | 13,755 | 34,044 | 2,973 | 14,095 | 9,443 | 816 | 17,383 |
| పాలకొండ | 1,15,902 | 35,046 | 59,934 | 7,789 | 28,445 | 9,925 | 573 | 24,664 |
| సాలూరు | 71,809 | 16,396 | 32,506 | 1,473 | 13,906 | 7,995 | 1,170 | 16,941 |
| బొబ్బిలి | 1,32,204 | 21,254 | 41,761 | 2,541 | 27,246 | 11,916 | 850 | 24,976 |
| శ్రీకాకుళం | 62,549 | 26,076 | 37,005 | 5,302 | 23,558 | 9,869 | 1,718 | 23,312 |
| నరసన్నపేట | 56,644 | 24,948 | 32,418 | 4,403 | 14,616 | 6,191 | 236 | 12,178 |
| చీపురుపల్లి | 1,56,761 | 30,857 | 53,369 | 2,051 | 23,026 | 10,303 | 477 | 15,761 |
| మొత్తం | 9,38,882 | 2,24,618 | 4,34,143 | 38,808 | 2,08,026 | 89,339 | 9,195 | 1,79,125 |

నోటు : ఇందులో ఏజన్సీ ప్రాంత జనాభాను చేర్చలేదు.

## వైద్య సౌకర్యాలు

1951 వ సంవత్సరపు ప్రభుత్వ అంచనాల ప్రకారం జిల్లాలో గల వైద్య శాలలు 42 పనిచేస్తున్నాయి. ఇందులో 8 ప్రభుత్వంచేత, 18 స్థానిక సంస్థలచేత, 4 ప్రైవేటు సంస్థలచేత నడుపబడుతున్నాయి. తాలూకాలవారీ వైద్య శాలల వివరాలు దిగువ పట్టికలో ఇవ్వబడ్డాయి:

| తాలూకా | ఆసుపత్రులు | | | పడకలు | డిస్పెన్సరీలు | | |
|---|---|---|---|---|---|---|---|
| | ప్రభుత్వ | స్థానిక సంస్థల | ప్రైవేటు | | ప్రభుత్వ | స్థానిక సంస్థల | ప్రైవేటు |
| ఇచ్ఛాపురం | ... | 1 | ... | 14 | ... | 1 | ... |
| టెక్కలి | 1 | ... | ... | 14 | 1 | 3 | 1 |
| సోంపేట | ... | ... | 1 | 51 | 1 | 2 | ... |
| పాతపట్నం | ... | ... | .. | ... | ... | ... | 3 |
| పార్వతీపురం | 1 | 1 | ... | 25 | ... | ... | 3 |
| పాలకొండ | 1 | 2 | ... | 39 | 1 | 1 | ... |
| సాలూరు | ... | 1 | ... | 8 | ... | ... | 2 |
| బొబ్బిలి | ... | 1 | 1 | 12 | ... | ... | 4 |
| శ్రీకాకుళం | 1 | ... | 2 | 97 | ... | 3 | ... |
| నరసన్నపేట | ... | ... | ... | ... | 1 | ... | ... |
| చీపురుపల్లి | ... | 1 | ... | 124* | ... | 1 | 3 |
| మొత్తం | 4 | 7 | 4 | 384 | 4 | 11 | 16 |

## పరిశ్రమలు

ఇచ్ఛాపురం, సోంపేట, పాతపట్నం, పాలకొండ, సాలూరు తాలూకాలలో పెద్ద పరిశ్రమలే లేవు. టెక్కలి తాలూకాలో 348 కార్మికులతో పనిచేసే 8 జీడి పప్పు ఫాక్టరీలు, 586 మంది పనిచేసే 6 ఉప్పుకొఠార్లు ఉన్నాయి. బొబ్బిలి తాలూకాలో మొత్తం 622 మంది కార్మికులు పనిచేస్తున్న 2 పంచదార ఫాక్టరీలున్నాయి. బొబ్బిలి తాలూకా సీతానగరంలో నూనె ఫాక్టరీలున్నాయి.

* ఇందులో 120 పడకలు సాలూరు మిషన్ కుష్ఠురోగుల ఆస్పత్రిలోనివి

## తాలూకావారీ కుటీర పరిశ్రమలు : వాటిలో పనిచేసే కార్మికులు (1)

| పరిశ్రమ పేరు | ఇచ్ఛాపురం, సోంపేట | | టెక్కలి | | పాతపట్నం | | పార్వతీపురం | | పాలకొండ | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పరిశ్రమల సంఖ్య (1) | పనిచేసే కార్మికులు (2) | పరిశ్రమల సంఖ్య (3) | పనిచేసే కార్మికులు (4) | పరిశ్రమల సంఖ్య (5) | పనిచేసే కార్మికులు (6) | పరిశ్రమల సంఖ్య (7) | పనిచేసే కార్మికులు (8) | పరిశ్రమల సంఖ్య (9) | పని చేసే కార్మికులు (10) |
| పత్తిఫ్యాక్టరీలు, ప్రెస్‌లు | — | — | — | — | — | — | — | — | — | — |
| నేతపరిశ్రమ | 584 | 2,580 | 850 | 2,561 | 1,200 | 5,022 | 736 | 2,682 | 1,440 | 3,963 |
| తాళ్ళు వేయటం | 296 | 1,108 | — | — | — | — | 27 | — | — | — |
| నూనెమిల్లులు | 76 | 317 | 66 | 235 | 57 | 273 | 22 | 105 | 146 | 536 |
| పొగాకు | 89 | 349 | 15 | 45 | — | — | 3 | 56 | 33 | 118 |
| చెప్పులుకుట్టటం | 7 | 21 | — | — | — | — | — | 9 | — | — |
| లోహపరిశ్రమ | 8 | 28 | 8 | 20 | 1 | 7 | 36 | — | — | — |
| కుండలుచేయటం | 225 | 742 | 54 | 162 | 91 | 422 | 32 | 104 | 101 | 362 |
| తట్టలు, బుట్టలు అల్లటం | 180 | 656 | 25 | 68 | 18 | 71 | — | 89 | 84 | 308 |
| బెల్లంచెయ్యటం | — | — | — | — | — | — | — | — | 36 | 168 |
| చాపలు అల్లటం | — | — | — | — | — | — | — | — | — | — |
| ఖద్దరు చెయ్యటం | — | — | — | — | — | — | — | — | — | — |
| బుట్టలు | — | — | — | — | — | — | — | — | — | — |
| గొడుగులు చెయ్యటం | — | — | — | — | — | — | — | — | 46 | 236 |

## తాలూకావారీ కుటీర పరిశ్రమలు : వాటిలో పనిచేసే కార్మికులు (2)

| పరిశ్రమ పేరు | సాలూరు | | బొబ్బిలి | | శ్రీకాకుళం | | నరసన్నపేట | | చీపురుపల్లి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పరిశ్రమల సంఖ్య (11) | పనిచేసే కార్మికులు (12) | పరిశ్రమల సంఖ్య (13) | పనిచేసే కార్మికులు (14) | పరిశ్రమల సంఖ్య (15) | పనిచేసే కార్మికులు (16) | పరిశ్రమల సంఖ్య (17) | పనిచేసే కార్మికులు (18) | పరిశ్రమల సంఖ్య (19) | పనిచేసే కార్మికులు (20) |
| పత్తిఫ్యాక్టరీలు ప్రెస్‌లు | 5 | 29 | — | — | — | — | — | — | 22 | 62 |
| నేతపరిశ్రమ | 656 | 2,378 | 1,565 | 6,355 | 1,127 | 4,173 | 643 | 2,047 | 1,454 | 5,187 |
| తాళ్ళు నేయటం | — | — | — | — | — | — | 17 | 28 | — | — |
| నూనెమిల్లులు | — | — | 86 | 356 | 53 | 169 | 64 | 212 | 20 | 98 |
| పొగాకు | — | — | — | — | — | — | — | — | — | — |
| చెప్పులు కుట్టటం | 16 | 68 | 5 | 27 | — | — | — | — | — | — |
| లోహపరిశ్రమ | 5 | 14 | 33 | 101 | 11 | 62 | 6 | 17 | — | — |
| కుండలు చేయటం | 56 | 212 | 79 | 350 | 84 | 253 | 20 | 90 | 45 | 185 |
| తట్టలు బుట్టలు అల్లటం | 52 | 182 | 21 | 76 | 17 | 63 | — | — | 11 | 34 |
| బెల్లం చెయ్యటం | 3 | 10 | 35 | 216 | — | — | — | — | — | — |
| చాపలు అల్లడం | 37 | 97 | 128 | 419 | 8 | 34 | — | — | 25 | 140 |
| ఫర్నిచరు చెయ్యటం | 10 | 39 | — | — | 4 | 18 | — | — | — | — |
| బుట్టలు | — | — | 26 | 106 | 15 | 48 | 5 | 12 | — | — |
| గొడుగులు చెయ్యటం | — | — | — | — | — | — | 2 | 6 | — | — |

# విశాఖపట్నం జిల్లా

## చరిత్ర

విశాఖజిల్లాను శ్రీకాకుళం, విశాఖ జిల్లాలుగ విభజించక పూర్వం భారతదేశంలోని జిల్లాలన్నిటిలోకి పెద్ద జిల్లా. ఇప్పుడు మద్రాసురాష్ట్రంలోని జిల్లాలన్నిటిలోను అవిభజ్య విశాఖ జిల్లాలోనే ఎక్కువజనాభా వుండేది. 1950జూలైలో పరిపాలనా సౌలభ్యంకోసం పెద్దదైన విశాఖజిల్లా శ్రీకాకుళం, విశాఖ జిల్లాలుగవిభజించబడింది.

ఒకప్పుడొక ఆంధ్రరాజు కాశీవెళ్తూ విశాఖపట్టణం తీరంలో మకాం చేసాడట. అక్కడి ప్రకృతిదృశ్యం, ఆహ్లాదకరమైన వాతావరణంచూసి ఆంధ్రరాజు ముగ్ధుడై తన యిష్టదేవత అయిన "వైశాఖ" పేరట అక్కడొక దేవాలయం కట్టించాడు. అప్పటినుండి ఆ ప్రాంతం వైశాఖపట్టణం అని పిలవబడింది. సముద్రం కోస్తాను కోసివేయడంవల్ల 'వైశాఖదేవాలయం' యిప్పుడు కనబడటంలేదు. ఆంగ్లేయుల నోట వైశాఖ-వైజాగ్ అయి విశాఖపట్నంగా రూపాంతరం పొందింది. పొరుగున్న శ్రీకాకుళంజిల్లావలెనే విశాఖపట్నం జిల్లా, ప్రాచీనకాలంలో కళింగరాజ్యంలో భాగంగా వుండేది. కళింగులు, శాతవాహనులు, పల్లవులు, అశ్మకులు, వాలకులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు మొదలైన అనేక తెగల మిశ్రమాన్నుండే ఆంధ్రజాతి అభివృద్ధి చెందిందని చరిత్రకారులఅభిప్రాయం. అశ్మకులు తెలంగాణలోను, కళింగులు శ్రీకాకుళం, విశాఖ జిల్లాల్లోను మిగతా వారు సర్కారు, రాయలసీమ జిల్లాల్లోను వ్యాపించారు. ఈ తెగల నుండే నేటి ఆంధ్రజాతి అభివృద్ధిచెందింది.

నందవంశపురాజులు, మౌర్యవంశపు రాజులు పాలించినకాలంలో జరిగిన జైన, బౌద్ధమత వ్యాప్తిఫలితంగా విశాఖజిల్లాలో కొన్ని జైన, బౌద్ధక్షేత్రాలు వెలిశాయి. సంకరం, రామతీర్థం క్షేత్రాలు ఆకాలం నాటివే.

### బొజ్జన్నకొండ

'సంకరం' అనే గ్రామం అనకాపల్లికి ఒకటిన్నర మైలు దూరంలో వుంది. ఇక్కడి కొండను బొజ్జన్నకొండ అనిపిలుస్తారు. బొజ్జన్నకొండను తొలిచి ఒక బౌద్ధగుహాలయం, ఆరామము నిర్మించబడ్డాయి. ఈ బౌద్ధగుహాలయంలో రెండు అంతస్తులున్నవి. పైకి ఎక్కడానికి శిథిలావస్థలో వున్న మెట్లువున్నవి. క్రింది అంతస్తులోకి ప్రవేశించగానే పద్మాసనం వేసుకున్న ధ్యానముద్రలోవున్న బౌద్ధవిగ్రహం కనపడుతుంది. ఈ విగ్రహానికి ప్రక్కనే నగ్నంగా వున్న ఒక పెద్ద బౌద్ధవిగ్రహం వుంది. ఆలయం మధ్యలో నాలుగు అడుగుల ఎత్తుగల బౌద్ధస్థూపంవుంది. పైఅంతస్తులోని ఆలయంలోకి వెళ్ళగానే పద్మాసనంలో వున్న పెద్ద బుద్ధుని విగ్రహం

కనబడుతుంది. ఈ విగ్రహానికి రెండు ప్రక్కలా రెండు చిన్న విగ్రహాలున్నవి. ఈ మూడు విగ్రహాలు దూరానికికూడ కనబడతవి. ఆలయంలో నాలుగు ప్రక్కలా బౌద్ధవిగ్రహాలు చిన్నవి, పెద్దవి చెక్కబడి వున్నాయి.

బొజ్జన్నకొండ అనేక చిన్నకొండల సముదాయం. కొన్ని కొండల శిఖరాలు బౌద్ధస్తూపాల ఆకారంలో చెక్కబడ్డవి. స్తూపాలు చాల పెద్దవి.

ప్రతి సంక్రాంతికి శంకరంలో ఉత్సవాలు జరుగుతాయి. గ్రామస్థులు వారి గొడ్లను బొజ్జన్నకొండవద్దకు తోలుకువెళ్ళి క్రింద అంతస్తులోవున్న స్తూపంచుట్టూ ఎనిమిదిసార్లు ప్రదక్షిణ చేయించుతారు.

ఈ కొండమీద ఈరినమ్మ అనే దేవత వుంది. ఈరినమ్మ పిల్లలను తినేసేదట. అందుకని సంక్రాంతి ఉత్సవాలకు వచ్చిన స్త్రీలు దేవతమీద కోపంతో తలా ఒక రాయి విసరి వెళతారు. అందువల్ల ఈరినమ్మ రాళ్ళలో మునిగి వుంటుంది.

## రామతీర్థం

విశాఖజిల్లా విజయనగరంతాలూకాలో ఈ రామతీర్థం మరొక బౌద్ధక్షేత్రం. ఇది జైనక్షేత్రంకూడా. రామతీర్థాన్ని ఆరామతీర్థం అనికూడా అంటారు. విజయనగరానికి ఎనిమిదిమైళ్ళదూరంలో వుంది.

ఇక్కడ "బోడికొండ"మీద జైనతీర్థంకరుల విగ్రహా లున్నవి. కొండశిఖరందగ్గర చెడిపోయిన జైనవిగ్రహం వుంది. దాని ప్రక్కన 'గురుభక్తునికొండ' అనే కొండ వుంది. దానిమీద కొన్ని గుర్తుపట్టడానికి వీలులేని శాసనా లున్నాయి. దుర్గకొండ మీదకూడ కొన్ని జైన శిథిలాలు కనబడతాయి. చాళుక్య విమలాదిత్యునికాలపు శాసనం ఒకటుంది.

చిన్నచిన్న బౌద్ధస్తూపాలు, ఆరామాలు కొన్ని చెల్లాచెదరుగా కనబడతవి. కొండ చాలనిట్టనిలువుగా వుండటంవల్ల ఎక్కడం కష్టం. ఇక్కడి బౌద్ధస్తూపాలకళా సాంప్రదాయాన్నిబట్టి చూస్తే బౌద్ధమతం ఆఖరి రోజులలో చెక్కబడిన స్తూపాలవలే కనబడుతున్నాయి. రామతీర్థం జైన, బౌద్ధ మతాలకు కేంద్రమైంది.

## సర్వసిద్ధి నిర్మాణం

శాతవాహనుల తరువాతవిశాఖజిల్లాలో చిన్న రాజ్యాలు వెలిశాయి. ఎలమంచిలి ప్రాంతాన్ని కుబేరుడనే రాజు పాలించాడు. ఇతని రాజ్యాన్ని దేవరాష్ట్రం అనేవారు. దమనుడనే రాజు ఆముదాలవలస ప్రాంతాన్ని పాలించాడు. దీన్ని పేరిండుపల్లి అని పిలిచేవారు. కుబేరుడు, దమనుడు ఏ వంశపు రాజులో తెలియడం లేదు.

మాఠరి, వాసిష్ఠి, విష్ణుకుండిన వంశాల పాలన తరువాత విశాఖజిల్లా అయిదవ శతాబ్దం చివరిభాగంలో తూర్పు గంగ వంశపు రాజులచే జయించబడింది. ఏడవ శతాబ్దారంభంలో తూర్పు చాళుక్యవంశ స్థాపకుడైన కుబ్జవిష్ణువర్ధనునిరాజ్యం విశాఖ జిల్లాలోకి విస్తరించింది. ఇతని కొడుకైన జయసింహవల్లభునికి సర్వసిద్ధి అనే బిరుదు వుంది. సర్వసిద్ధి గ్రామం ఇతనిపేరట నిర్మించబడింది.

## భీమునిగద

సర్వసిద్ధికి నాలుగుమైళ్ళ దూరంలో ఉప్పలం అనే గ్రామం ఉంది. ఇక్కడి మాలపల్లెలో ఒక పెద్ద రాతిబండ వుంది.

దాన్ని 'భీమునిగిద' అని స్థానికులు చెప్తుంటారు. నరభక్షకుడైన బకాసురుని చంపడానికి భీముడు వెళ్ళాడు. ఆకలిగొన్న బకాసురుడు కోపంతో ఆలస్యంగా ఎందుకొచ్చావని భీమునిమీద మండిపడ్డాడు. దంతధావనకు ముఖం పుల్ల ఒకటి యిమ్మని బకాసురుడు ఆజ్ఞాపించాడట. దానిమీదట భీముడు దగ్గరలోని ఒక తాటిచెట్టును పీకి బకాసురుడుమీదకి విసిరాడు. బకాసురుడు భయపడి పారిపోయాడట. అప్పుడు భీముడు పారిపోతున్న బకాసురునిపైకి గిద విసిరాడట. ఆ గిద భూమిలో దిగబడి పోయిందని, రాతిబండే ఆ గిద అని చెప్తుంటారు. ఉప్పలందగ్గిర పోలవరం అనే చోట భీముడు బకాసురుని చంపేశాడట.

## ఓడరేవు "దిమిల"

కళింగదేశాన్ని మొదట్లో పాలించిన తూర్పుచాళుక్యరాజుల శాసనాలవల్ల సర్వసిద్ధి తాలూకాలో 'దిమిల' అనే ప్రాచీన ఓడరేవు ఒకటి ఉండేదని తెలుస్తున్నది. దిమిలగ్రామం యలమంచిలికి పదమున్నర మైళ్ళ దూరంలోవుంది. పూర్వం యిది ప్రసిద్ధమైన ఓడరేవు. ఓడరేవు వ్యాపారానికి కేంద్రం. బంగాళాఖాతంలో ప్రయాణం చేసే ఓడల రాకపోకలకు గుర్తు తెలియడం కోసం దిమిలలో పెద్ద దీప స్తంభాలుండేవి. దీప స్తంభాలనుండి యీ గ్రామానికి దిమిల అనే పేరు వచ్చింది. దిమిలలో నగ్నేశ్వర స్వామి దేవాలయంవుంది. దిమిలప్రక్కన తమవుపల్లి అనే గ్రామంలో 'సముద్ర దేవుని' గౌరవార్థం రత్నాకరస్వామి ఆలయం నిర్మించబడింది. మన పూర్వులు సూర్యుడిని, చంద్రుడిని దేవుడుగా కొల్చినట్లే సముద్రాన్నికూడ దేవుడిగా కొల్చారు.

## చాళుక్యుల, కాకతీయుల దండయాత్రలు

అనంతవర్మ చోడగంగ అనే గంగవంశపు రాజు పాలించుతున్న కాలంలో (1078-1150) కంచినుండి ఆంధ్రదేశాన్ని పాలించిన మొదటి కుళోత్తుంగచోళుడు విశాఖజిల్లాపై రెండుసార్లు దండెత్తి వచ్చాడు. ఇతని తమిళశాసనం సింహాచలం దేవాలయంలో వుంది.

1213 లో కాకతీయ గణపతిదేవుడు కోస్తా ఆంధ్రపై దండెత్తి గంజాంజిల్లా అస్కా వరకుగల ప్రాంతాన్ని జయించాడు. సింహాచలం వరకుగల ప్రాంతం కాకతీయుల పాలనలో కొంతకాలం వున్నది. సింహాచలానికి ఎగువ ప్రాంతంపై కాకతీయుల అధికారం నామమాత్రమే అయింది.

[illegible] భానుదేవుడనే గంగవంశపు రాజు కాలంలో కళింగాన్ని పాలించడానికి 16 మంది సామంతులను నియమించాడు. వీరు కళింగ నాయకులకు సామంతులుగా వివిధ ప్రాంతాలను పాలించేవారు. విశాఖజిల్లా ఎలమంచిలి (సర్వసిద్ధితాలూకా) ప్రాంతాన్ని, తూర్పు చాళుక్య వంశానికి చెందిన కొంతమంది రాజులు 13 వ శతాబ్దం ప్రారంభంనుండి 14 వ శతాబ్దంలో అర్ధ శతాబ్దానికంటె ఎక్కువకాలం పాలించారు.

## సామంతరాజ్యాలు

ఇదేకాలంలో యింకా అనేక చిన్న సామంతరాజ్యాలుండేవి. వీరవల్లి తాలూకా చోడవరం ప్రాంతాన్ని మత్స్యవంశపు రాజులు పాలించారు. వీరి రాజధాని చోడవరానికి పదిమైళ్ళ దూరంలో గల 'వడ్డాది' అనే గ్రామం. "జంతరునాడు" అనబడే శృంగవరపుకోట తాలూకాను

మురక్షివంశపు రాజులు, పాలకొండ తాలూకాను, వీరఘట్టం రాజధానిగా పల్లవులు పరిపాలించారు. కొప్పులరెడ్డి రాజులు నర్సీపట్నం తాలూకాలో కొంతభాగం, సర్వసిద్ధి తాలూకా పంచధార్ల వరకు పాలించారు. కొండవీటిరెడ్డి రాజైన అనవేమారెడ్డి 1372 లో కొప్పుల రాజ్యాన్ని, ఎలమంచిలి రాజ్యాన్ని జయించాడు. కుమారగిరిరెడ్డి, కాటయవేమారెడ్డి కాలంలో యీ చిన్న రాజులందరినీ జయించి రెడ్డి రాజ్యాన్ని విస్తరింపచేశాడు. అప్పటి నుండి విశాఖపట్నంజిల్లాలో రెడ్డిరాజుల పాలన సాగింది.

## కృష్ణదేవరాయల జయస్తంభం

కొండవీటి పతనానంతరం విశాఖపట్నం గజపతుల పాలనలోకి పోయింది. 1515లో కళింగదేశంపైన జైత్రయాత్ర చేసిన విజయనగరరాజు కృష్ణదేవరాయలు తన కళింగదేశ విజయగాథలను వర్ణిస్తూ భీమునిపట్నం తాలూకా పొట్నూరులో జయస్తంభాన్ని వేయించాడు. ఈ జయస్తంభం తాడి ఎత్తు ప్రమాణంలో వుండేదట. కాని ఆ జయస్తంభం యిప్పుడు కనబడటంలేదు. కాని యిక్కడ అనేక శిల్పాలు వృషభలాంఛనం గల బంగారపు నాణాలు దొరికాయి.

కృష్ణదేవరాయలు విజయయాత్ర చేసి వప్పుడు సర్వసిద్ధి తాలూకాలో యలమంచిలికి 3 మైళ్ళ దూరంలో నున్న రాయవరం అనేచోట ముకాం వేశాడట. అందువల్ల ఆ గ్రామానికి రాయవరం అనే పేరు వచ్చిందని చెబుతారు. రాయవరంలో రాయల విజయాన్ని గూర్చి వివరించుతూ ఒక పెద్ద రాతిశాసనం వుంది. దాన్ని 'గాథబండ' అని పిలుస్తారు.

కృష్ణదేవరాయలు కటకంమీదదండెత్తటానికి ముందు సింహాచలం వెళ్లి అచ్చటి స్వామిని దర్శించి కొన్ని గ్రామాలను దానంచేశాడు. సింహాచలం అప్పటికి నాలుగువందల సంవత్సరాలక్రితం నుండి అంటే పదకొండవ శతాబ్దంనాటి నుండి ప్రసిద్ధిపొందిన పుణ్యక్షేత్రం. సింహాచల క్షేత్రంలో కనబడుతున్న శాసనాలలో ప్రాచీనమైనది మొదటి కులోత్తుంగచోళుని (1098-99) కాలం నాటిది.

## సింహాచల దేవాలయం

సింహాచలం విశాఖపట్టణానికి ఉత్తరంగా పది మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడ నృసింహస్వామి దేవాలయం వుంది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చంపబోగా విష్ణువు నరసింహావతారమెత్తి హిరణ్యకశిపుని చంపి ప్రహ్లాదుని రక్షించాడనీ, ప్రహ్లాదుడే నరసింహస్వామిపై భక్తితో యీ ఆలయాన్ని నిర్మించాడనీ ఐతిహ్యం. సింహాచలం పుణ్యక్షేత్రమవడంచేత యీ ప్రాంతాన్ని జయించిన రాజులనేకమంది ఇక్కడి దేవాలయాన్ని దర్శించి శాసనాలు వేయించారు. వెలనాటి చోళుడైన మూడవగొంకరాజు నృసింహస్వామికి బంగారపు తొడుగు చేయించాడు. మొదటి నరసింహుడనే గంగరాజు దేవాలయపు ముఖమంటపాన్ని, నాట్యమంటపాన్ని, గర్భాలయాన్ని దానిపై గోపురాన్ని కట్టించాడు. విష్ణుపురాణంలోని దృశ్యాలు దేవాలయంలో చక్కగా చిత్రించబడ్డాయి. 96 స్తంభాలు గల కళ్యాణమంటపంలో చైత్రమాసంలో దేవుడిని ఊరేగించుతారు. దేవాలయం లోపల కృష్ణదేవరాయల విజయ శాసనాలుకూడ వున్నవి. కృష్ణదేవరాయలు

యిచ్చిన నగలు కొన్ని యిప్పటికీ దైవాభరణాలలో వున్నవి. సింహాచల దేవాలయం శిల్పకళకకూడ ప్రసిద్ధికెక్కినది. నిగనిగలాడుతున్న నల్లరాతిమీద చెక్కబడ్డ శిల్పం నిన్ననో మొన్ననో చెక్కబడ్డట్లుగ వుంటుంది.

కృష్ణదేవరాయలు విజయయాత్ర చేసి వెళ్ళాక తిరిగి గజపతులు పాలించుతుండగా గోల్కొండ నవాబులు దండెత్తి 1568 లో విశాఖపట్నంప్రాంతాన్ని వారిరాజ్యంలో కలుపుకన్నారు.

## అనకాపల్లి సైనికకార్యాలయం

గోల్కొండనవాబులు విశాఖపట్నం జిల్లాను శ్రీకాకుళం సర్కారులో చేర్చారు. శ్రీకాకుళం ఫౌజుదారు సైనిక ప్రధాన కార్యాలయం అనకాపల్లిలో వుండేది. గోల్కొండ నవాబులు పాలించుతున్న కాలంలోనే డచ్చి, ఇంగ్లీషు, ఫ్రెంచి వ్యాపారస్థులు విశాఖ జిల్లా కోస్తాలో వ్యాపారకేంద్రాలు స్థాపించుకున్నారు.

## భీమునిపట్నం రేవు

డచ్చివారు గోల్కొండ నవాబుల అనుమతిపొంది 1628 లో భీమునిపట్నం రేవువద్ద ఒక ఫ్యాక్టరీ, ఒకకోట నిర్మించారు. 1754 లో ఫ్యాక్టరీని మహారాష్ట్రులు నాశనం చేయగా ఆ ప్రాంతాన్ని ఫౌజుదారువద్ద కౌలుకు పుచ్చుకన్న విజయనగరం రాజావద్ద డచ్చివారు కౌలుపట్టాపొంది కోటను, ఫ్యాక్టరీని పునరుద్ధరించుకున్నారు. బట్టలు వుతికే మూడు చాకిరేవులు నిర్మించారు. ఇంగ్లీషువారికి - డచ్చివారికి 1781-1824 మధ్య యుద్ధాలు జరిగినప్పుడు భీమునిపట్నంకోట, ఫ్యాక్టరీ ఇంగ్లీషువారి - డచ్చివారిమధ్య చేతులు మారుతూవచ్చాయి. 1824 మార్చిలో ఇంగ్లీషు వారికి - డచ్చివారికి మధ్యజరిగిన సంధననుసరించి భారతదేశంలోని డచ్చి స్థావరాలన్నీ ఇంగ్లీషువారికి అప్పగించబడ్డప్పుడు భీమునిపట్నం ఫ్యాక్టరీ, కోట ఇంగ్లీషువారి వశమయ్యాయి.

ఇప్పుడా కోట, ఫ్యాక్టరీ శిధిలమయ్యాయి. "కోటదిబ్బ" అనేచోట పూర్వం కోట, "ఒళందభూములని" పిలచే ప్రాంతంలో డచ్చివారి చాకిరేవులు వుండేవి. డచ్చిజెండా ఎగిరిన జెండాకర్ర యిప్పటికీ నిలచివున్నది. జెండాకర్రకు సముద్రానికి మధ్య యిప్పుడు కొన్ని డచ్చి సమాధులు వున్నాయి.

చిట్టివలసలో తయారయ్యే గోనెసంచులు, ఆ ప్రాంతంలో పండే నువ్వులు వగైరా నువ్వుగింజలు (?), నేతబట్టలు భీమునిపట్నం నుండి యెగుమతి చేయబడేవి. పూర్వం విదేశీ బట్టలదిగుమతి కొంత వుండేది. కాని యిప్పుడు భీమునిపట్నం ఎగుమతిరేవు మాత్రమే. మైనరురేవు. ఒకప్పుడిక్కడ ఏడు యూరపు వ్యాపారపు కంపెనీలుండేవి. ఆ కంపెనీల కార్యాలయాలున్న యిళ్ళను నేటికీ ఆ కంపెనీల పేరులతో పిలుస్తున్నారు.

## విశాఖపట్నం రేవు

ఇంగ్లీషువారు గోల్కొండ నవాబుల కాలంలోనే విశాఖపట్నం రేవువద్ద వ్యాపారం ప్రారంభించారు. 1862 అక్టోబరులో ఈస్టు ఇండియాకంపెనీ ప్రతినిధులు శ్రీకాకుళం ఫౌజుదారును అభ్యర్థించి విశాఖపట్నంలో కొంతప్రాంతాన్ని కౌలుకు తీసుకన్నారు. దీన్ని డచ్చివారు వ్యతిరేకించారు కాని లాభంలేకపోయింది.

కూడ సముచితమవడంవల్ల వారుకూడ కొన్ని సందర్భాలలో తిరుగుబాట్లలో పాల్గొన్నారు. ఏజెన్సీ అధికారుల అక్రమాలకు, ముఠాదారుల, కంట్రాక్టర్ల దోపిడీకి వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటుచేసారు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని గజగజలాడించారు.

## చారిత్రాత్మక పోరాటం

1845 లో గోల్కొండ ఏజన్సీప్రజలు ప్రభుత్వ విధానాలకు నిరసనగా శిస్తులు చెల్లించనిరాకరించారు. ముఠాదారులుకూడ యీపోరాటంలోపాల్గొన్నారు. ప్రభుత్వ సైన్యాలను, పోలీసులను ప్రతిఘటించడానికి బారికేడ్ల నిర్మించారు. మూడు సంవత్సరాలపాటు గెరిల్లాపోరాట పద్ధతులద్వారా గోల్కొండప్రజలు వీరోచితంగా పోరాడి బ్రిటీషుప్రభుత్వాన్ని సంక్షోభపచేసారు. సైన్యాలు ఒక్క అడుగుకూడముందుకి వేయలేకపోయాయి. ఆంధ్రదేశ స్వాతంత్ర్యాన్ని హరించిన బ్రిటిషువాళ్ళను ఏకధృక్పథంగా యింత దీర్ఘకాలం ఎదిరించిన పోరాటాలుగాని, బ్రిటీషువాళ్ళను ఓడించిన పోరాటంగాని మరొకటి లేదంటే అతిశయోక్తి కాదేమో! ఆంధ్రజాతి గర్వించదగ్గ పోరాటం

బ్రిటీషుప్రభుత్వం మూడు సంవత్సరాలయ్యాక సాలెవచ్చి, తిరుగుబాటుదార్లందరికీ ఎట్టి శిక్షలు విధించబడవని ప్రకటించాకనే తిరుగుబాటు ఉపసంహరించబడింది.

## రంపపితూరీ

1857 లో సిపాయివిప్లవం భారత స్వాతంత్ర్య పోరాటానికిప్రథమమెట్టుగా పరిగణించబడుతున్నది. ఆ సైనిక తిరుగుబాటు ప్రభావం మన గోల్కొండ ఏజెన్సీ ప్రజలపైకూడ పడి అదే సంవత్సరంలో మరొక తిరుగుబాటు చేశారు. ప్రభుత్వం సైనికబలంతో తిరుగుబాటును అణచివేసింది.

రక్కసకంపలాగ తయారైన ఏజెన్సీ అధికారుల, ముఠాదారుల దోపిడీకి వ్యతిరేకంగా 1879లో రంప తిరుగుబాటు చేసారు. పోలీసులు తిరుగుబాటు నాయకుడైన వీరయ్యదొరను కాల్చి చంపారు. ఈ తిరుగుబాటు తరువాత ప్రభుత్వం తిరుగుబాటు కేంద్రాలైన దుట్చర్తి, గుడేము మురాలను తూర్పు గోదావరి ఏజెన్సీలో కలిపింది. కొండజాతి ప్రజలను అణచడానికి బ్రిటీషుప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధవహించింది. ప్రత్యేక అధికారులను నియమించింది. తిరుగుబాటుదార్లను పట్టించలేని ముఠాదారుల 'ముఠాలను రద్దు' చేస్తామని ప్రకటించింది.

1886 లో గూడెం తాలూకాలో మళ్ళీ తిరుగుబాటుచేసి ప్రజలు గూడెం, చింతపల్లి పోలీసు స్టేషనులను తగులబెట్టారు. 1891 మే 23వ తేదిన రెండు వందలమంది ప్రజలు కృష్ణదేవిపేట పోలీసు స్టేషనును తగులబెట్టి పోలీసులను హతమార్చారు. ముఠాదారులలో ఒక్కరు గాకపోతే ఒక్కరైనా ప్రభుత్వానికి సమాచారం అందించడంలేదని, చెప్పి, ప్రభుత్వం అనేకమంది ముఠాదారులను నిరంకుశంగా తొలగించింది.

## సవర విప్లవం

1922 ఫిబ్రవరిలో జరిగిన 'సవరుల విప్లవం' ప్రఖ్యాతమైనది. సవరులు పర్లాకిమిడి అడవులలో వుండే కొండజాతి ప్రజలు. అడవిమిండెలు, గెడ్డి ఉచితంగా తీసుకునే హక్కు యివ్వవలసిందిగ

సవరులు ప్రభుత్వాన్ని కోరారు. బ్రిటిషు ప్రభుత్వం ససేమీ అంగీకరించలేదు. సవర ప్రజలంతా ఏకమై ప్రతీకారానికి పూనుకున్నారు. ఆవూరాలనుండి ఈవూరాలకు అడవిని తెగనరికి నరిలారు. ప్రభుత్వం సైనికబలాన్ని పంపి క్రూరంగా సవరులను అణచివేసింది.

1922 ఆగష్టులో అల్లూరి సీతారామరాజు నాయకత్వాన ప్రారంభమైన మన్యం ప్రజలసంఘటిత తిరుగుబాటులో గోండ ప్రజలుకూడ పాల్గొన్నారు. గూడెం తాలూకా పెద్దవలసలో సీతారామరాజు నాయకత్వాన ప్రజలు మెరుపుదాడి చేసేసరికి తిరుగుబాటు అణచడానికి వచ్చిన ఆంగ్ల సేనాను లిర్వురూ కాలికి బుద్ధిచెప్పారు. సేనానుల గతే యిలావుంటే సైన్యాల సంగతి వేరే చెప్పాలా.

అదనపు సైన్యాలను తెప్పించి ప్రభుత్వం ప్రజల పోరాటాన్ని అణచివేసింది.

## విశాఖపట్నంజిల్లా విభజన

1936 లో ఒరిస్సా రాష్ట్రం యేర్పరచబడ్డప్పుడు విశాఖజిల్లానుండి కోరాపుట్, జయపూర్, పాడువా, పొట్టంగి, మల్కనగిరి, నౌరంగపూర్, గుణపురం, బిసంకటక్, రాయఘడ్ తాలూకాలు కోరాపుట్టు జిల్లాలో చేర్చబడ్డవి. మరికొంత తెలుగుప్రాంతం గంజాంజిల్లాలో మిగిల్చివేయబడింది. గంజాంజిల్లానుండి 5 తాలూకాలు విశాఖపట్నంజిల్లాలో చేర్చబడ్డవి.

# భూగోళం

**జిల్లా కార్యస్థానము :-** విశాఖపట్నం. విస్తీర్ణం 5,179 చదరపు మైళ్ళు. జనాభా 20,72,698.

1950 సంIIనకు పూర్వం విశాఖపట్నం జిల్లాగావున్న ప్రదేశాన్ని శ్రీకాకుళం, విశాఖపట్నం అనే పేర్లతో రెండు జిల్లాలుగా విభజించడం జరిగింది. పాత జిల్లాలోని దక్షిణభాగం సగం నేటి విశాఖపట్నం జిల్లాగా యేర్పాటు చేయబడింది. ఈ జిల్లాకు ఉత్తరమున ఒరిస్సా రాష్ట్రం, శ్రీకాకుళంజిల్లా, తూర్పున బంగాళాఖాతం, దక్షిణమున తూర్పు గోదావరి జిల్లా, బంగాళాఖాతము, పశ్చిమమున ఒరిస్సారాష్ట్రం సరిహద్దులుగా నున్నవి.

జిల్లా రెండు రెవిన్యూ భాగాలక్రింద, 9 తాలూకాల క్రింద విభజింపబడింది. వీటిలో గూడెం తాలూకా పూర్తిగా యేజెన్సీ ప్రాంతం. శృంగవరపుకోట, గోలుగొండ, వీరవల్లి తాలూకాలలో యేజెన్సీ మైదాన ప్రాంతాలున్నాయి.

క్రింది పట్టిక రెవిన్యూ డివిజన్లు, తాలూకాల విభజనను, వాటి విస్తీర్ణతను, కార్యస్థానాలను తెలియచేస్తుంది:

| రెవిన్యూ డివిజను పేరు | రెవిన్యూ డివిజను కార్యస్థానం | రెవిన్యూ డివిజనులోని తాలూకాలు | తాలూకా విస్తీర్ణం చII మైళ్లలో | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| విజయనగరం | విజయనగరం | భీమునిపట్నం | 337 | భీమునిపట్నం |
| | | విజయనగరం | 359 | విజయనగరం |
| | | శృంగవరపుకోట | 282 | శృంగవరపుకోట |
| | | ఏజెన్సీ మైదానప్రాంతం | 375 | |
| | | విశాఖపట్నం | 196 | విశాఖపట్నం |
| నరసీపట్నం | నరసీపట్నం | గోలుగొండ | 188 | నరసీపట్నం |
| | | ఏజెన్సీ మైదానప్రాంతం | 328 | |
| | | గూడెం (ఏజెన్సీ) | 1,869 | చింతపల్లి |
| | | సర్వసిద్ధి | 347 | ఎలమంచిలి |
| | | వీరవల్లి | 261 | చోడవరం |
| | | ఏజెన్సీ మైదానప్రాంతం | 253 | |
| | | అనకాపల్లి | 304 | అనకాపల్లి |

అడవులు ప్రస్తుతం ప్రభుత్వాధీనంలోనికి తేబడ్డాయి. ఇవి కాక 1951 లెక్కల ప్రకారం 92.40 చ. మైళ్ళ విస్తీర్ణంగల్గిన అడవులు యెస్టేట్ల క్రింద, 32.59చ. మైళ్ళ విస్తీర్ణంగల్గిన అడవులువ్యక్తుల అధీనంలోను వున్నాయి.

క్రింది పట్టిక తాలూకావారీ అడవుల విభజనను తెలియచేస్తుంది :

| తాలూకా | రిజర్వ్ అడవులు (చ. మైళ్లలో) | ప్రభుత్వం ఆధీనంలోకి తీసుకొన్న అడవులు చ. మైళ్లలో) | ఎస్టేట్ల అధీనంలోనే వున్న అడవులు (చ. మైళ్లలో) | ప్రైవేటు అడవులు (చ. మైళ్లలో) | మొత్తం అడవులు (చ. మైళ్ళలో |
|---|---|---|---|---|---|
| గూడెం | 208.07 | -- | 71.25 | 7.67 | 286.99 |
| శృంగవరపుకోట | – | 109.10 | — | — | 109.10 |
| వీరవల్లి | — | 10.16 | 15.28 | — | 25.44 |
| గొలుగొండ | 117.58 | 6.25 | 5.87 | 21.30 | 151.00 |
| విజయనగరం | — | 58.07 | — | — | 58.07 |
| భీమునిపట్నం | – | 15.45 | — | 3.62 | 19.07 |
| విశాఖపట్నం | – | 49.39 | — | ... | 49.39 |
| [illegible] | — | 38.00 | — | — | 38.00 |
| సర్వసిద్ధి | 23.12 | 2.96 | — | — | 26.08 |
| | 348.77 | 289.38 | 92.40 | 32.59 | 763.14 |

గూడెం తాలూకాలోని రిజర్వుఅడవులలో కలప, వంటచెరకు, వెదురు సమృద్ధిగా లభ్యమవుతాయి. గోలుగొండ తాలూకాలోని అడవులలో కొద్దిసాయిలో కలపదొరికినా, వెదురు, వంటచెరకుకు పనికివచ్చే చెట్లు హెచ్చుగా కానవస్తాయి. ప్రభుత్వాధీనములోకి వచ్చిన గోలుగొండ, సర్వసిద్ధి, శృంగవరపుకోట, చీడివల్లి, అనకాపల్లి, విశాఖపట్నం, భీమునిపట్నం తాలూకాలలోని అడవులలో వంటచెరకుకుపనికివచ్చేసబ్బుసచెట్లుహెచ్చుగా కనిపిస్తాయి. గూడెం తాలూకాలో యింకా యెస్టేట్లక్రిందనే కొనసాగుతున్న అడవులలోమాత్రం చక్కటివెదురు, కలప వున్నవి.

## శీతోష్ణస్థితి - వర్షపాతము

ఏప్రిల్, మే, జూన్ మాసములు యీ జిల్లాకు వేసవికాలం. జిల్లాలోని కొంత ప్రదేశాలలో శీతోష్ణస్థితులు కొంత చల్లగా ఉంటాయి. జిల్లాలోని ఏజన్సీ ప్రదేశాలలో యితరచోట్లకన్న వర్షపాతం అధికం. సముద్రతీరంలోని తాలూకాలలోని శీతోష్ణపరిస్థితులు సమశీతలంగా హాయిగా ఉంటాయి.

సంవత్సరంలో సాలుసరి వర్షపాతం, ఆయా ప్రాంతాలలోని వర్షపుదినాలు, యీక్రింద తాలూకావారీగా క్రిందయివ్వబడుతున్నాయి:

| తాలూకా | సాలుసరి సంవత్సర వర్షం - అంగుళాలలో | సంవత్సరంలోని వర్షపు దినాలు |
|---|---|---|
| గూడెం | 40.75 | 65.6 |
| శృంగవరపుకోట | 45.38 | 64.0 |
| చీడివల్లి | 42.16 | 54.7 |
| గోలుగొండ | 44.00 | 65.4 |
| విజయనగరం | 41.12 | 55.5 |
| భీమునిపట్నం | 36.69 | 49.2 |
| విశాఖపట్నం | 37.10 | 49.4 |
| అనకాపల్లి | 39.16 | 51.8 |
| సర్వసిద్ధి | 34.91 | 50.2 |

## సాగు సదుపాయాలు

### గూడెం తాలూకా

తాలూకా కొండలు, గుట్టలతో నిండి వుంది. కనుక సాగు సౌకర్యాలు చాలా తక్కువ. ఈ తాలూకాలో 81 మైనరు ఇరిగేషను వర్క్సు వున్నాయి. వీటిక్రింద 1,554.39 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నాయి. వర్షాధారంపై చెరువులు నింపి సాగుచెయ్యటగాని, అనువైనచోట్ల

ఇచ్చట ప్రవహించే నదులనీటిని వినియోగించుకొని సాగుచెయ్యటంగాని జరుగుచున్నది.

## శృంగవరపుకోట తాలూకా

వర్షాధారంపై ఆధారపడే చెరువుల సాయంతోనూ, గోస్తనీనది కాలువలతోనూ యీ తాలూకాలో సాగుచెయ్యబడుతున్నది. తాలూకాలో 1,754 మైనరు యిరిగేషనువర్కులు గలవు. వీటిక్రింద 55,326 ఎకరాలు సాగుచేయబడుతున్నట్లు 1951 సం॥ ప్రభుత్వ లెక్కలు తెలియజేస్తున్నాయి. ఇచ్చట 54 మేజరు ఇరిగేషను వర్కులు ఉన్నాయి. వీటిక్రింద 35,663.53 ఎకరాలు సాగుక్రింద వున్నాయి.

## వీరవల్లి తాలూకా

ఈ తాలూకాలో నాగావళి నీళ్ళతోనూ, వర్షాధారంపై ఆధారపడే చెరువులతోనూ సాగు కొనసాగించబడుతున్నది. 837 మైనరు ఇరిగేషనువర్కులక్రింద యీ తాలూకాలో 32,418.08 ఎకరాలు, 34 మేజరు ఇరిగేషను వర్కుల క్రింద 23,865.82 ఎకరాలు సాగుక్రింద వున్నాయి.

## గొలుగొండ తాలూకా

ఈ తాలూకాలోని ముఖ్యసాగు సమపాయం చెరువులద్వారానే. రెండు చిన్న ఇరిగేషన్‌ప్రాజెక్టులు నిర్మాణంలో ఉన్నవి. మరిరెండు పరిశీలనలో ఉన్నవి. ఇచ్చట 528 మైనరు ఇరిగేషను వర్కుల క్రింద 15,643.18 ఎకరాలు సాగులో ఉన్నాయి. ఈతాలూకాలో 4,602.69 ఎకరాలు 29 మేజరు ఇరిగేషను వర్కుల క్రింద సాగుచేయబడుతున్నాయి.

## విజయనగరం తాలూకా

ఈ తాలూకాలోని నెల్లిమర్ల గ్రామం వద్ద చంపావతీ నదిపై చిన్న ఆనకట్ట కట్టబడింది. దీనిక్రిందకూడ సాగుబడి కలదు. ఇక మిగతా సాగంతా వర్షాధారంపై ఆధారపడిన చెరువులక్రింద కొనసాగేదే. ఈ తాలూకాలో 809 మైనరు ఇరిగేషను వర్కులు ఉన్నాయి. వీటిక్రింద 23,264.80 ఎకరాలు సాగు అవుతాయి. ఇదిగాక 28 మేజరు ఇరిగేషను వర్కులు కూడ కలవు. వీటిక్రింద 17,185.09 ఎకరాలు సాగుబడిచెయ్యబడుతున్నాయి.

## భీమునిపట్నం తాలూకా

గోస్తనీనదిపై యీ తాలూకాలో ఒక ఆనకట్ట నిర్మాణంలో ఉన్నది. దీనిక్రింద 1,065 ఎకరాలవరకు సాగు అవుతుంది. గంభీరంగెడ్డ అనే చోట ఒక రిజర్వాయరు నిర్మించాలనే సూచనకూడ ఉన్నది.

గోస్తని, చంపావతీ నదుల నీళ్ళతోనూ, వర్షాధారంపై ఆధారపడే చెరువులతోనూ యీ తాలూకాలో సాగుచెయ్యబడుతున్నది. ఇచ్చట 603 మైనరు ఇరిగేషను వర్కులక్రింద 17,132.78 ఎకరాలు, 26 మేజరు ఇరిగేషను వర్కుల క్రింద 25,405.72 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నాయి.

## విశాఖపట్నం తాలూకా

ఈ తాలూకాలో 173 మైనరు ఇరిగేషనువర్కులు, 6 మేజరుఇరిగేషనువర్కులు ఉన్నాయి. మైనరు ఇరిగేషనువర్కుల క్రింద 5,492.80 ఎకరాలు; మేజరు ఇరిగేషనువర్కులక్రింద 1,939.53 ఎకరాలు సాగు చెయ్యబడుతున్నాయి.

| పంటు | | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | [illegible] (ఎకరములు) | మొత్తం (ఎకరములు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 33,471 | 50,078 | 37,340 | 2,153 | 29,300 | 26,665 | 42,158 | 8,216 | 50,000 | 2,83,381 |
| | మెట్ట | — | — | 1,730 | — | 1,100 | — | — | — | — | 2,430 |
| జొన్న | | 2,982 | 3,066 | 12,189 | — | 6,320 | 312 | 6,546 | 3,974 | 1,998 | 37,387 |
| సజ్జ | | 23,475 | 30,069 | 33,913 | 6,163 | 7,400 | 7,658 | 12,467 | 3,017 | 8,520 | 1,32,682 |
| రాగి | | 13,450 | 13,627 | 12,742 | 2,014 | 30,300 | 5,190 | 6,804 | 4,921 | 6,974 | 96,022 |
| కొఱ్ఱ | | 580 | 573 | 3,589 | 216 | — | — | 1,346 | 471 | 302 | 7,074 |
| వరిగ | | 350 | 248 | 2,609 | — | 450 | — | — | 212 | 1,668 | 5,537 |
| మొక్కజొన్న | | 372 | 306 | 48 | — | 1,390 | — | — | 59 | 230 | 2,405 |
| శనగలు | | 126 | 30 | 240 | — | — | — | — | 64 | — | 460 |
| పచ్చపెసలు | | 670 | 4,200 | 12,583 | — | 5,780 | 143 | 1,819 | 456 | 13,426 | 39,077 |
| కందులు | | 658 | 1,764 | 526 | — | 3,050 | 218 | 80 | 47 | 5,220 | 11,563 |
| మినుములు | | 265 | 1,139 | 3,418 | — | 3,560 | 205 | 521 | 1,051 | 1,912 | 12,071 |
| ఉలవలు | | 2,082 | 9,918 | 8,111 | 665 | 7,750 | 2,318 | 4,591 | 3,064 | 10,583 | 49,082 |
| చెరకు | | 2,706 | 2,235 | 2,201 | — | 80 | — | 4,013 | — | 684 | 11,919 |
| వేరుశనగ | | 2,044 | 1,408 | 4,167 | 415 | 22,400 | 17,603 | 8,453 | 12 | 50,570 | 1,07,072 |
| నువ్వులు | | 2,690 | 13,586 | 2,500 | 108 | 18,300 | 445 | 7,980 | 1,752 | 5,745 | 73,106 |
| ప్రత్తి | | 398 | 58 | 1,086 | — | 400 | — | 491 | — | 1,245 | 3,644 |
| పొగాకు | | 984 | 2,435 | 2,304 | 10 | 1,740 | 960 | — | 306 | 890 | 10,175 |

## రహదారులు

రోడ్లు: జిల్లా మొత్తంలో 1,041 మై॥ పొడవుకలిగిన రోడ్లు కలవు. ఇందులో 129 మైళ్ళు జాతీయ రహదారులక్రింద: 414 మైళ్ళు జిల్లాబోర్డు అధీనంలోని ముఖ్య రహదారులక్రింద: 89 మైళ్ళు యితర జిల్లాబోర్డు రహదారులక్రింద, 262 మైళ్ళు గ్రామ రహదారులక్రింద; 147 మైళ్ళు మ్యునిసిపల్ రోడ్లక్రింద విభజింపబడి ఉన్నవి. గ్రామరహదారులుగ పేర్కొనబడినవి నిజానికి మట్టిరోడ్లు. ఇవి వేసవి కాలంలో మినహా సరిగా వాహనపోకలకు తోడ్పడవు.

మ్యునిసిపల్ రోడ్లను మినహాయించి, జిల్లాలోని రహదారుల, తాలూకావారీ వివరాలు యీ పై పట్టికలో యివ్వబడ్డాయి.

| తాలూకా | జాతీయ రహదారులు (మైళ్ళలో) | ప్రధాన జిల్లా రహదారులు (మైళ్ళలో) | ఇతర జిల్లా రోడ్లు (మైళ్ళలో) | గ్రామ రోడ్లు (మైళ్ళలో) | వెరసి (మైళ్ళలో) |
|---|---|---|---|---|---|
| గూడెం | — | 74 | — | — | 74 |
| శృంగవరపుకోట | — | 45 | 17 | 41 | 103 |
| వీరవల్లి | — | 33 | 32 | 43 | 108 |
| గొలుగొండ | — | 73 | — | 29 | 102 |
| విజయనగరం | 21 | 44 | 7 | 27 | 99 |
| భీమునిపట్నం | 33 | 54 | — | 26 | 113 |
| విశాఖపట్నం | 25 | 29 | 5 | 22 | 81 |
| అనకాపల్లి | 22 | 41 | 17 | 30 | 110 |
| సర్వసిద్ధి | 28 | 21 | 11 | 44 | 104 |
| మొత్తం | 129 | 414 | 89 | 262 | 894 |

## రైలు మార్గాలు

జిల్లాలో మొత్తం 127½ మైళ్ళ బ్రాడుగేజి రైలుపాట కలదు. ఈ జిల్లాలోని వాల్తేరు స్టేషను దక్షిణరైల్వేకు, తూర్పురైల్వేకు అంతిమస్థానం. కనుక జిల్లాలో ఉన్న మొత్తం రైలుపాటలో 58½ మైళ్ళు దక్షిణ రైల్వే క్రిందా, 69 మైళ్ళు తూర్పు రైల్వే క్రిందా విభజించబడి ఉన్నది.

ఈ జిల్లాగుండా మద్రాసు - కలకత్తా రైలుమార్గం పోవుచున్నది. సర్వసిద్ధి, అనకాపల్లి, శృంగవరపుకోట, విజయనగరం, విశాఖపట్నం, భీమునిపట్నం తాలూకాలగుండా యీ మార్గం వేయబడింది.

మెయినులైనుపై ఉన్న వాల్తేరుతో చిన్న బ్రాంచి లైనుద్వారా విశాఖపట్నం కలపబడింది. విజయనగరంనుండి

రాయపూరుకు మరొక బ్రాంచి రైలు కలదు. శ్రీకాకుళంజిల్లాలోని బొబ్బిలి మీదుగా యీబాట వేయబడింది.

## జనాభా పెరుగుదల

గత పది సంవత్సరాలలోనూ జిల్లా జనాభా నూటికి 13.1 వంతున పెరిగింది.

క్రింది పట్టిక తాలూకావారీ జనాభా వివరాలు, 1941 జనాభా సంఖ్యతో పోల్చి ఎలా పెంపుదల పొందిందీ తెలియ జేస్తాయి:

జిల్లా మొత్తం జనాభా 3,219 గ్రామ, పట్టణాలలో, 4,05,513 ఇండ్లలో నివ సిస్తున్నారు. ఇందులో 3,62,905 ఇండ్లు గ్రామాలలోనూ, 42,608 ఇండ్లు పట్ట ణాలలోనూ ఉన్నవి.

జిల్లా మొత్తం జనాభా అయిన 20,72,698 మందిలో 17,67,840 మంది

| తాలూకా | 1941 జనాభా | 1951 జనాభా | పెరుగుదల శాతం | గ్రామాలు | *పట్టణాలు |
|---|---|---|---|---|---|
| విశాఖజిల్లా | 18,32,246 | 20,72,698 | 13.1 | 3,208 | 11 |
| ఏజెన్సీ: | | | | | |
| గూడెం | 1,02,098 | 1,09,521 | 7.3 | 1,419 | ... |
| శృంగవరపుకోట | 32,231 | 38,649 | 19.9 | ... | ... |
| వీరవల్లి | 7,344 | 7,340 | –0.1 | ... | ... |
| గోలుగొండ | 22,812 | 24,595 | 7.5 | ... | ... |
| | | | (క్రింది సంఖ్యలు తాలూకా లోని ఏజెన్సీ కలిపినమొత్తం | | |
| మైదానాలు: | | | | | |
| శృంగవరపుకోట | 1,74,958 | 1,87,108 | 7.3 | 646 | 1 |
| విజయనగరం | 32,231 | 38,649 | 19.9 | 184 | 1 |
| భీమునిపట్నం | 2,20,046 | 2,32,619 | 5.7 | 176 | 1 |
| వీరవల్లి | 2,59,460 | 2,80,654 | 8.2 | 246 | 2 |
| విశాఖపట్నం | 1,61,287 | 2,31,907 | 43.8 | 72 | 1 |
| గోలుగొండ | 1,77,713 | 1,97,132 | 10.9 | 178 | 2 |
| అనకాపల్లి | 2,02,520 | 2,29,835 | 13.5 | 144 | 2 |
| సర్వసిద్ధి | 2,14,264 | 2,41,933 | 12.9 | 143 | 1 |

* కనీసం 5 వేలు, అంతకు మించి జనాభాగల్గి – నిర్దిష్టమైన పట్టణ వాతావరణం కున్న పట్టణాలు మాత్రమే యిచ్చుట చేర్చుటమైనది.

గ్రామాలలోనూ, 3,04,858 మంది పట్టణాలలోనూ నివసిస్తున్నారు. జిల్లా జనాభాలో షుమారుగా ప్రతి 6 గురిలో ఒకరు పట్టణాలలో నివసిస్తున్నారు.

తాలూకావారీ పట్టణ, గ్రామీణ జనాభా సంఖ్యలు–ఇండ్ల వివరాలు మున్నగునవి యీ క్రిందిపట్టికలో యివ్వబడ్డాయి:

సంవత్సరాలలో యీ పట్టణ జనాభా 70,243 నుండి 1,08,042 కు అభివృద్ధి చెందింది. ఈ సంఖ్య 1941 సం॥ జనాభా సంఖ్యకన్న 37,799 హెచ్చు. ఈ పెంపుదల మూలంగానే తాలూకా జనాభా పెరుగుదల గత 1941 సం॥ జనాభాతో పోల్చిన 43.8 శాతం పెంపు చూపుచున్నది.

| తాలూకా | తాలూకా లోని మొత్తం ఇండ్లు | గ్రామాలలోని ఇండ్లు | పట్టణాలలోని ఇండ్లు | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|
| గూడెం | 18,714 | 18,714 | ... | 1,09,521 | ... | 1,09,521 |
| శృంగవరపుకోట | 43,819 | 42,232 | 1,587 | 2,17,034 | 8,723 | 2,25,757 |
| విజయనగరం | 53,245 | 44,236 | 9,009 | 2,24,301 | 67,104 | 2,91,405 |
| భీమునిపట్నం | 44,978 | 43,079 | 1,899 | 2,22,142 | 10,477 | 2,32,619 |
| వీరవల్లి | 62,812 | 58,156 | 4,656 | 2,65,758 | 22,236 | 2,87,994 |
| విశాఖపట్నం | 35,149 | 24,211 | 10,938 | 1,23,865 | 1,08,042 | 2,31,907 |
| గొలుగొండ | 46,800 | 41,430 | 5,370 | 1,94,148 | 27,579 | 2,31,727 |
| అనకాపల్లి | 48,909 | 41,723 | 7,186 | 1,81,175 | 48,660 | 2,29,835 |
| సర్వసిద్ధి | 51,087 | 49,124 | 1,963 | 2,29,896 | 12,037 | 2,41,933 |
| జిల్లా మొత్తం | 4,05,513 | 3,62,905 | 42,608 | 17,67,840 | 3,04,858 | 20,72,698 |

గత పది సంవత్సరాలలోని జనాభా పెరుగుదలగమనించిన తాలూకాకు తాలూకాకు అనేక ఎగుడుదిగుడులు కన్పిస్తాయి. మైదానప్రాంతాలలో సగటున జనాభా అభివృద్ధి 13.5 శాతం ఉంది. ఏజన్సీ ప్రదేశాలలో 9.5 శాతం మాత్రమేఉంది. విశాఖపట్టణం ఆంధ్రదేశానికి ప్రధాన ఓడరేవయి ఉండుటచేత, నౌకా నిర్మాణ పరిశ్రమ మున్నగు పరిశ్రమలు యిచ్చట కేంద్రీకరింపబడి ఉండుటచేత గత పది

సముద్రతీరతాలూకాలయిన అనకాపల్లి, విశాఖపట్నం, సర్వసిద్ధి తాలూకాలలో కొంత సాగుసౌకర్యాలు, వర్తక వ్యాపారాలు అభివృద్ధిచెంది ఉండుటచేత కొంత ఆర్థిక స్థిరత్వాన్ని కల్గివున్నాయి. కనుకనే ఇతర ఆంధ్రజిల్లాలలోని సగటు జనాభా అభివృద్ధితో సమానంగా యీ ప్రాంతాలలో జనాభా పెరుగుదల కన్పించుతుంది.

మిగతా ప్రదేశాలలో జనాభా పెరుగుదలలో ఏజన్సీలకు, మైదాన ప్రదేశాలకు వ్యత్యాసం కన్పించదు. జిల్లాలో జమీందారీ భూస్వామ్య దోపిడీ విపరీతంగా ఉండుటచేత, ఏజన్సీ ప్రాంతాలలోని ప్రజలయెడ ప్రభుత్వం ఎట్టి శ్రద్ధ చూపకపోవుటచేత, యీ ప్రాంతాలలో మరణాలు హెచ్చుగావున్నాయి. జిల్లాలోని మరణాలలో సగటున నూటికి 43 మంది ఒక్క జ్వరములవల్లనే మరణిస్తున్నారని గుర్తించిన యీ ప్రదేశాలలోని జనాభా తగినంతగా ఎందుకు పెంపొందలేదో స్పష్టమవుతుంది. ఇక వీరవల్లితాలూకా జనాభా అయితే గత 10 సం॥లో పెరుగుదల లేకపోగా, ఉన్నదానిలోనె మొరికి పడ్డది. శృంగవరపుకోటలోని ఏజన్సీ ప్రాంతం ఇతర మైదానప్రాంతాలకన్న హెచ్చు జనసంఖ్య అభివృద్ధిని (19.9%) చూపుతుంది. దీనికి ప్రధానకారణం అచ్చట ప్రభుత్వంచే ప్రారంభింపబడిన "అరకు వాలీస్కీము." దీనివలన బయటినుండి అనేకమంది కార్మికులు, ప్రజలు వలస వచ్చారు. కాఫీ, జనుము, టీ మున్నగు వాటిని పెంచ ఇచ్చట ప్రయత్నాలు చెయ్యబడుతున్నాయి. కనుక ఇచ్చట యీ పెరుగుదలచూచి యీప్రాంత ఏజన్సీ ప్రజల జీవన పరిస్థితులు ఇతరచోట్లకన్న భిన్నమైనట్లుగా భ్రమింపగాదు.

## వైద్యం

జిల్లామొత్తంపై 1951 సం॥ లెఖ్ఖల ప్రకారం ఉన్న మొత్తం ఆస్పత్రులు 17. ఇందులో 13 ప్రభుత్వంచేత, 4 స్థానిక సంస్థలచేత నిర్వహింపబడుతున్నాయి. వీటిలోని మంచాలసంఖ్య 1,117. ఇదిగాక 29 వైద్యశాలలు గ్రామాలలో ఉన్నాయి. తాలూకావారీ ఆస్పత్రుల, వైద్యశాలల పరిస్థితులను క్రిందిపట్టిక తెలియజేస్తుంది :

| తాలూకా | ఆస్పత్రులు | | మంచాల సంఖ్య | వైద్యశాలలు (Dispensary) | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రభుత్వం | లోకల్ ఫండు | | గవర్నమెంటు | లోకల్ ఫండు | గ్రామీణ వైద్యశాలలు |
| గూడెం | — | — | 2 | 3 | — | — |
| శృంగవరపుకోట | 2 | 1 | 40 | 1 | 1 | 2 |
| వీరవల్లి | — | 1 | 22 | 1 | 1 | — |
| గొలుగొండ | 1 | — | 17 | — | 2 | 2 |
| విజయనగరం | 3 | 1 | 121 | 2 | 1 | 3 (ప్రైవేటు కూడకలిపి) |
| భీమునిపట్నం | 1 | — | 16 | — | 1 | 1 (ప్రైవేటు) |
| విశాఖపట్నం | 5 | — | 885 | — | — | 3 |
| అనకాపల్లి | 1 | — | 6 | — | 1 | 3 |
| సర్వసిద్ధి | — | 1 | 8 | — | — | 1 |
| | 13 | 4 | 1,117 | 7 | 7 | 15 |

విశాఖపట్నంలోని "కింగ్ జార్జిఆస్పత్రి" మనరాష్ట్రంలోని ఆస్పత్రులన్నింటిలోనికి పెద్దది. 800 మంది రోగుల నిల్వఉంచ మంచాలు ఉన్నవి. ఇందులో రేడియం చికిత్సా అవకాశాలుకూడ అభివృద్ధిచేయబడ్డాయి. ఇలానే విశాఖపట్నం, ప్రభుత్వ నిర్వహణా యంత్రంలో డివిజనలు కేంద్రమవుటచేత రైల్వే ఆస్పత్రి, పోలీసు ఆస్పత్రి మున్నగునవి నిర్మింపబడ్డాయి. కాని వీటన్నింటిలోనూ ప్రజలకు ప్రవేశం లేదు. జిల్లాలోని వైద్యశాలల సంఖ్యను గమనించిన ప్రభుత్వం ఎంత శ్రద్ధ ఆరోగ్య రక్షణకు చూపుతున్నది స్పష్టం అవుతుంది.

## పరిశ్రమలు

భారతదేశంలోని ఒకే ఒక నౌకా నిర్మాణ స్థానం యీ జిల్లాలోని విశాఖపట్నంలో ఉన్నది. కాల్టాక్సు నూనె శుద్ధి కర్మాగారంకూడ యిచ్చట నిర్మించబడుతున్నది. రాష్ట్రంలోని 4 జనపనార మిల్లులలో ఉన్న పెద్ద రెండు మిల్లులూ (చిట్టివలస, నెల్లిమర్ల)కూడ యీజిల్లాలోనే ఉన్నవి.

కాని అనేక తాలూకాలలో - శృంగరపుకోట, వీరవల్లి, గొలుగొండలలో - పెద్దపరిశ్రమలుగా చెప్పుకొనదగినవి లేనేలేవు. మిగతా ప్రదేశాలలోని ముఖ్య పరిశ్రమల వివరాలు, అందులో పని చేయు కార్మికులు మున్నగు వివరాలు యిచ్చట యివ్వబడ్డాయి:

| తాలూకా | పరిశ్రమల సంఖ్య | పనిచేయువారి సంఖ్య |
|---|---|---|
| **విజయనగరం తాలూకా:** | | |
| నూనె మిల్లులు | 22 | 364 |
| జనపనార మిల్లు | 1 | 2,139 |
| చర్మపరిశ్రమ | 18 | 475 |
| లోహపరిశ్రమ | 11 | 198 |
| **భీమునిపట్నం తాలూకా:** | | |
| జనపనారమిల్లు - ప్రెస్సులు | 2 | 3,000 |
| **విశాఖపట్నం తాలూకా:** | | |
| రవాణా - నౌకానిర్మాణ పరిశ్రమతోసహా | 3 | 3,933 |
| **అనకాపల్లి తాలూకా:** | | |
| నూనెమిల్లులు | 6 | 169 |
| పంచదార ఫ్యాక్టరీ | 1 | 145 |
| **సర్వసిద్ధి తాలూకా:** | | |
| పంచదార ఫ్యాక్టరీ | 1 | 119 |

# తూర్పుగోదావరి జిల్లా

## చరిత్ర

ఆంధ్రభాషలో మొదటి మహాకావ్యమని మనం గర్వించే ఆంధ్ర మహాభారత రచన కొనసాగింది రాజమహేంద్రవరంలోనే. ఆంధ్రభారత కృతిపతి రాజరాజనరేంద్రుడు రాజమహేంద్రాన్నుండే ఆంధ్రదేశాన్ని పాలించాడు. రాజమహేంద్రవరం నేటికీ తూర్పుగోదావరి జిల్లాలో ప్రధాననగరం. రాజమహేంద్రవరం రాజధానిగా పాలించిన చాళుక్య రాజులకాలంలో తెలుగుభాషకు గౌరవం, ఆదరణలభించి వికసించింది.

కాంగ్రెసునాయకులంతా బందిపోటులని ఖండించుతూ బ్రిటిషు ప్రభుత్వానికి తాళంవేసినప్పటికీ, బ్రిటిషుప్రభుత్వాన్ని ఏకాంతంగా పోరాడి గజగజలాడించిన మన్యం రైతుల చారిత్రికపోరాటాలకు కేంద్రమైన రంప ఏజన్సీ తూర్పుగోదావరిజిల్లాలోనిదే. తూర్పుగోదావరిజిల్లా చారిత్రికంగానూ, పౌరాణికంగానూ ప్రసిద్ధమైనది. తూర్పుగోదావరిజిల్లా ప్రాచీన కాలంలో రెండురాజ్యాలకు కేంద్రమవడంవల్ల, ద్వంద్వపరిపాలనకు లోనైంది. పిఠాపురంవరకుగల ప్రాంతం కళింగ దేశంలో భాగమైతే, పిఠాపురానికి దక్షిణపుభాగం వేంగీరాజ్యంలో భాగంగా వుండేది. క్రీ. పూ. నాల్గవ శతాబ్దంలో నందరాజులక్రింద, తరువాత మౌర్యుల క్రిందకుపోయి, శాతవాహనుని కాలంలో (క్రీ. పూ. 3 శతాబ్దం) శాతవాహనుల రాజ్యభాగమైంది. క్రీ. శ. రెండవశతాబ్దంలో ఖారవేలుడనే కళింగరాజు, క్రీ.శ. నాల్గవశతాబ్దంలో మహేంద్రుడనేరాజు పిఠాపురం రాజధానిగా జిల్లాను పరిపాలించారు. ఈ రాజులిద్దరికీ మధ్య శాతవాహనులు, ఇక్ష్వాకులు తూర్పుగోదావరిని కొంతకాలం పాలించారు.

### బౌద్ధస్తూపాలు

క్రీ. పూ. రెండుమూడు శతాబ్దాల నాటి బౌద్ధస్తూపాలు రాజోలుతాలూకా ఆదుర్రులో దొరికాయి. ఆ కాలపు నాణాలు, మట్టిపాత్రలుకూడ దొరికాయి. ఈ స్తూపాలు మౌర్యులకాలంనాటివో, శాతవాహనుల కాలంనాటివో అయి వుంటాయి. రాజమండ్రిదగ్గర కాపవరం కొండలలో కొన్ని గుహలు, చెఱువులు వున్నవి.

### ద్వంద్వపరిపాలన

క్రీ. శ. నాలుగు, అయిదు శతాబ్దాలలో తూర్పుగోదావరిజిల్లాలో ద్వంద్వ ప్రభుత్వాలు సాగాయని, కొంతభాగం శాలంకాయనులక్రింద, కొంతభాగం

మాఠరరాజుల క్రింద వుండేదని తెలుస్తున్నది.

అయిదవ శతాబ్దం రెండవ అర్థ పాదంలో విష్ణుకుండినరాజులు శాలంకాయన, మాఠరరాజులను ఓడించి ఆంధ్ర, కళింగదేశాల రెండింటికీ అధిపతులయ్యారు. విష్ణుకుండినుల పాలన సుమారు నూటయాభై యేళ్ళు సాగింది. అయితే యీ కాలమంతటిలోను తూర్పుగోదావరిజిల్లా పూర్తిగా విష్ణుకుండినుల అధీనంలోనే వుండనుకోరాదు. క్రీ. శ. 455 ప్రాంతములో పల్లవరాజైన మూడవ సింహవర్మ ఆంధ్ర, కళింగదేశాలపైకి దండెత్తి విజయయాత్ర చేసాడు. కళింగంలో మాఠరుల తరువాత వాసిష్ఠీవంశంవారు అధికారానికి వచ్చారు. వీరి రాజధాని పిఠాపురము. వాసిష్ఠీ వంశీకులు విష్ణుకుండినులకు సామంతులుగ వుంటూ, తిరుగుబాటుచేసి స్వతంత్రం స్థాపించుకున్నారు. అయిదవ శతాబ్దం చిట్టచివర కాలంలో గాంగ వంశంవారు కళింగంలో అధికారంలోకి వచ్చారు. కళింగగాంగులకు రాజధాని పిఠాపురంకాదు. విష్ణుకుండినులకు, కళింగగాంగులకు జరిగిన యుద్ధాలలో తూర్పుగోదావరిజిల్లా చేతులుమారుతూ వచ్చింది. విష్ణుకుండినుల కాలంలో గోదావరి ఉపనదియైన తుల్యభాగనదిని 'దలివాయి' నది అనీ, రామచంద్రపురం, రాజోలు, కాకినాడ తాలూకాలకు కలిపి "గుద్రవార విషయ"మని పిలవబడేవి.

## చాళుక్యుల పాలన

క్రీ. శ. ఏడవ శతాబ్ద ప్రారంభంలో బాదామి రాజధానిగా రాజ్యమేలుతున్న పశ్చిమ చాళుక్యరాజు రెండవ పులకేశి రాజ్యవిస్తరణకై మహోత్సలాన్ని జయించి కళింగముపై దండెత్తి పిఠాపురి దుర్గాన్ని ఆక్రమించుకున్నాడు. అభేద్యమని ప్రతీతిచెందిన పిఠాపురదుర్గం చాళుక్యులకు పట్టుబడటంతో విష్ణుకుండినుల గుమ్మంపై పులకేశి నిలచినట్లయింది. ఆంధ్రదేశం చాళుక్యుల వశమైంది.

రెండవ పులకేశి ఆంధ్ర, కళింగదేశాలను జయించి పృథ్వీస్పృవరాజు ఇంద్రవర్మ అనే అతనిని ఆంధ్రలో తన ప్రతినిధిగ నియమించి రాజధానికి వెళ్ళాడు. పులకేశి తిరిగి వెళ్ళినపిమ్మట ఆంధ్రదేశంలో అల్లరులు చెలరేగాయి. అల్లరుల నణచి ఆంధ్రలో స్థిరపరిపాలన నెలకొల్పడానికి పులకేశి తన తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుని ఆంధ్రకు పంపుతాడు. ఈకుబ్జవిష్ణువర్ధనుడు ఆంధ్ర వచ్చేసరికి పిఠాపురం రాజధానిగా పృథ్వీమహారాజనే ఒకరాజు చుట్టుప్రక్కల ప్రాంతాన్ని పాలించుచుండేవాడు.

కుబ్జవిష్ణువర్ధను డతనిని ఓడించి పిఠాపురాన్ని తనరాజధానిగా చేసుకని ఆంధ్రదేశాన్ని పాలించాడు. ఇతని రాజ్యం ఉత్తరాన విశాఖజిల్లానుండి దక్షిణాన పాకనాడువరకు వ్యాపించి వుండేది. కుబ్జవిష్ణువర్ధనుని కాలంనుండి ఆంధ్రను పాలించిన రాజులను తూర్పు చాళుక్యరాజు లంటారు. అంతకుముందు ద్వంద్వ పాలనక్రింద వుంటూవచ్చిన తూర్పుగోదావరిజిల్లా తూర్పు చాళుక్యుల కాలంలో ఒకే రాజుల పాలనక్రింద వుండిపోయింది.

## చాళుక్య భీమనగం

తూర్పు చాళుక్యులలో 10వ శతాబ్ద ప్రారంభంలో మొదటి చాళుక్య భీమరాజనే శూరుడుండేవాడు. మొదటి చాళుక్య భీమరాజు తనపేర యీజిల్లాలో

చాళుక్య భీమవరమనే పట్టణాన్ని నిర్మించి, ఒక దేవాలయాన్ని ప్రతిష్ఠాపన చేశాడు. ఈ భీమవరం యిప్పుడు సామర్లకోటలో కలిసిపోయింది. ఈ చాళుక్య భీమరాజే రామచంద్రపురం తాలూకాలోని ద్రాక్షారామందేవాలయాన్ని నిర్మించాడు. ఈ రెండు దేవాలయాలను భీమేశ్వరాలయాలని అంటారు.

సుబ్రహ్మణ్యేశ్వరుడు తారకాసురుడనే రాక్షసుడిని చంపినప్పుడు తారకాసురుని మెడలో నున్న పెద్ద శివలింగం అయిదుముక్కలై ఆంధ్ర దేశంలో అయిదుచోట్ల పడిందని పురాణ గాథ. ఈ అయిదు ప్రదేశాలను పంచారామాలు అంటారు. ఇందులో రెండు తూర్పుగోదావరి జిల్లాలోనే వున్నవి. ఇవి చాళుక్య భీమవరం, ద్రాక్షారామం. మిగిలినవి గుంటూరుజిల్లా అమరావతి, పశ్చిమ గోదావరిజిల్లా పాలకొల్లు, అయిదవ దెక్కడపడిందో తెలియదు.

చాళుక్య భీమవరం (సామర్లకోట)లో భీమేశ్వరాలయంముందున్న భీమగుండం చెరువులో స్నానంచేస్తే పుణ్యమని భక్తులు చెప్తారు. భీమవరంలోని భీమేశ్వరాలయంలోను, నారాయణస్వామి ఆలయంలోను ప్రాచీన శిలాశాసనాలు ముప్పై (30) దొరికాయి. వీటిలో అతిప్రాచీనమైన శాసనం క్రీ. శ. 1087 నాటిది. నారాయణస్వామి ఆలయానికి రాజమహేంద్రవరపు రెడ్డిరాజులలో ఒకడైన కాటయవేమారెడ్డి కొన్నిదానాలు చేసినట్లు యీ శాసనాలవల్ల తెలుస్తున్నది.

## సప్తగోదావరి

ద్రాక్షారామాన్నిగూర్చి చెప్పనవసరం లేదు. దాన్ని దక్షిణకాశీ అంటారు. ఇక్కడ దేవాలయంముందున్న చెఱువులో సప్తగోదావరీ జలము ఉండటంవలన భక్తులిచ్చట నీటిని అతిపవిత్రముగా భావిస్తారు.

గోదావరిని కాశ్యపుడు, అత్రి, గౌతమి, వశిష్ట, భరద్వాజ, విశ్వామిత్ర, జమదగ్ని అనే సప్తఋషులు శివుని జటాయువునుండి భూలోకంలోకి తెచ్చారని ఇది ఏడుగోదావరి పాయలనీ పురాణాలలో చెప్పబడింది.

ద్రాక్షారామం చెఱువులో ఈ ఏడు నదుల నీరు ఉండటంవలన దీనికి 'సప్తసాగరము'ని పేరువచ్చింది. 'ద్రాక్షారామ' సప్తసాగరంలో స్నానంచేస్తే పై ఏడునదులలో స్నానంచేసినంత పుణ్యమని దైవ భక్తుల నమ్మకం. హాలుడనే శాతవాహన రాజు సింహళరాజకన్యయైన లీలావతిని సప్తగోదావరీ క్షేత్రమైన ద్రాక్షారామంలో వివాహం చేసుకున్నాడని "లీలావతి" అనే ప్రాకృత కావ్యంవల్ల తెలుస్తున్నది. హాలుడు క్రీ. శ. మొదటి శతాబ్దంలో ఆంధ్రదేశాన్ని పరిపాలించాడు. దాన్నిబట్టి ద్రాక్షారామం రెండువేల సంవత్సరాలక్రితమే పుణ్యక్షేత్రమని తెలుస్తున్నది. ఆ కాలంలో ద్రాక్షారామంపేరు 'దాకరేమి' అని వుండేది. 'దాకరేమి' ద్రాక్షారామానికి ప్రాకృతరూపమని భాషాకోవిదుల అభిప్రాయం. ద్రాక్షారామం మొదటినుండీ శైవక్షేత్రంకాదు. కాలక్రమేణ శైవక్షేత్రమైవుంటుంది. క్రీ. శ. పదవశతాబ్దం నుండి అంటే దేవాలయ నిర్మాత మొదటి చాళుక్య భీమరాజు కాలంనుండీ ద్రాక్షారామఆలయంలో శాసనాలు కనిపిస్తున్నాయి.

వ్యాసు డిక్కడ గానిచెట్టును, లింగాన్ని ప్రతిష్ఠాపించాడని చెబుతారు. ద్రాక్షారామం అసలుపేరు దక్షారామం. అంటే దక్షుడున్న స్థలమని పేరు. శివుని మామగారైన దక్షుడిక్కడ యజ్ఞంచేసి శివుని అవమానించగా శివునికి కోపంవచ్చి తన చెమటనుండి వీరభద్రుని సృష్టించి అతనిచేత దక్షుని చంపించాడట. ద్రాక్షారామం పవిత్ర స్థలమగుటచే ఆంధ్రదేశాన్ని యేలిన రాజు లనేకమంది యిక్కడ పుణ్యకార్యాలు చేసారు. ఇచ్చటి ఆలయానికి దానధర్మాలుచేసారు. శాసనాలు వేయించారు. అవి ఇప్పటికీ కనబడుతున్నవి.

## 'పాదగయ' పిఠాపురం

ఇక్కడనే పిఠాపురం ప్రాశస్త్యాన్ని గూర్చికూడ చెప్పాల్సివుంటుంది. ఇక్కడ 'కుక్కుటేశ్వరాలయం' వున్నది. ఈ ఆలయం ముందున్న కొలనుకు 'పాదగయ' అని పేరు. గయాసురుడనే రాక్షసుడు యీ ప్రాంతాన్నొకప్పుడు పాలించాడట. ఈ రాక్షసు డెంతటి మహాకాయుడంటే గయలో తలపెట్టిపడుకుంటే పిఠాపురంలో పాదాలుండేవి. గయాసురుడు అలా నిద్రపోతుండగా శివుడతనిని సంహరించాడట. కుక్కుటేశ్వరాలయం ముందున్న కొలనుకు 'పాదగయ' అనిపేరు. పిఠాపురంలోనే పద్మాసనం వేసుకున్నట్లుగావున్న మూడు పెద్ద విగ్రహాలున్నాయి. ఇవి జైన విగ్రహాలో లేక బౌద్ధ విగ్రహాలో గుర్తుపట్టడం కష్టంగావుంది.

## రాజమహేంద్రపుర నిర్మాణం

ఈ భీమేశ్వరాలయాలు నిర్మించిన మొదటి చాళుక్య భీమరాజు తరువాత మొదటి అమ్మరాజ విష్ణువర్ధనుడు (క్రీ.శ. 918-925) రాజ్యానికి వచ్చాడు. రాజమహేంద్రవర నగరాన్ని నిర్మించిన చాళుక్యరాజు యితడే. అమ్మరాజుకు 'రాజమహేంద్రుడనే' బిరుదువుంది. అందువల్లనే అతను నిర్మించిన నగరానికి రాజమహేంద్రవరమనే పేరు వచ్చింది.

ఇతని కాలంలో వేంగీరాజ్యానికి రాష్ట్రకూటులనుండి, దాయాదులైన చాళుక్యులనుండి ప్రమాదం వచ్చింది. వీరి వలన వచ్చిన కల్లోలాలన్నిటినీ అణచివేసి పరాక్రమాన్ని చాటుకోవడంవల్ల అమ్మరాజ విష్ణువర్ధనునికి 'మహేంద్రుడనే' బిరుదు వచ్చింది. అప్పటివరకు వేంగీరాజ్యానికి రాజధానిగ వుంటున్న వేంగి నగరం సమతల మైదానంలో వుంది. తన కాలంలో వచ్చిన అనుభవాన్ని పురస్కరించుకొని అమ్మరాజు శత్రు దాడులనుండి రాజ్యాన్ని రక్షించుకోడానికి ఎత్తయిన ప్రదేశంలో రాజధానివుండటం మంచిదని చెప్పి, గోదావరికి ఉత్తరాన రాజమహేంద్రవరం కోటను నిర్మించాడు. ఇతని కాలంనుండీ తూర్పు చాళుక్యులకు రాజమహేంద్రవరం రాజధానిగ వుంది. ఆంధ్రులకు చిరపరిచితుడైన రాజరాజ నరేంద్రుడు అమ్మరాజ విష్ణువర్ధనుని తరువాత, ఒకవంద సంవత్సరాలకు రాజ్యానికి వచ్చాడు. ఇతని తల్లి చోళరాజుల కూతురు. అందువల్ల యితని తండ్రి విమలాదిత్యుడు రాజరాజనరేంద్రునికి మామగారి పేరు పెట్టాడు. రాజరాజనరేంద్రుని తండ్రి కాలంలోనే చోళ - చాళుక్య సంబంధా లేర్పడ్డాయి.

### మహాభారత ఆంధ్రీకరణ

రాజరాజ నరేంద్రుని ఆస్థానకవిగా వున్న నన్నయభట్టు సంస్కృత మహాభారతాన్ని తెలుగులోకి అనువదించాడు. తెలుగు కవిత్వానికి చాళుక్యరాజులు మంచి ప్రోత్సాహమిచ్చారు. అంతకు ముందు తెలుగు కన్నడ భాషలకు లిపి ఒకేమాదిరిగా ఉండేది. కాని తూర్పు చాళుక్యుల కాలంలో తెలుగులిపి గుండ్రని అక్షరాల రూపం పొందింది. నన్నయభట్టు ఆంధ్రమహాభారత రచన తరువాతనే తెలుగుభాషలో సంస్కృత ప్రభావం ఎక్కువైందని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఈతని ఆస్థానంలోనే పావులూరి మల్లన, మహావీరాచార్యుడు వ్రాసిన గణిత శాస్త్రాన్ని తెనిగించాడు. ఇదే తెలుగులో మొదటి గణితశాస్త్రం. రాజరాజ నరేంద్రుడు పావులూరి మల్లనకు పిఠాపురం సమీపమందలి నవఖండవాడ గ్రామాన్ని అగ్రహారంగా యిచ్చాడు. నన్నయభట్టుకి భారత రచనలో తోడ్పడిన నారాయణభట్టుకు నందమపూడి, చీదివాత్యుడి వేదవిద్వాంసునికి కోరుమిల్లి గ్రామాన్ని అగ్రహారంగా రాజరాజనరేంద్రుడు యిచ్చాడు.

రాజరాజనరేంద్రుని తరువాత అతని కుమారుడు రాజేంద్ర చోళుడు రాజ్యానికి వచ్చాడు. రాజేంద్రచోళుడే కాంచీపుర, వేంగి రాజ్యాలకు రాజయ్యాడు. రెండు రాజ్యాలకు అధిపతి అయ్యాక కులోత్తుంగచోళుడని పేరుపెట్టుకున్నాడు. ఇతని కాలంనుండీ ఆంధ్రదేశం కాంచీపురాన్నుండి పాలించబడింది. ఆంధ్ర దేశంలో చాళుక్య చోళ యువరాజులు ప్రతినిధులుగావుంటూ వుండేవారు. ఆంధ్రలో చాళుక్య చోళరాజుల ప్రతినిధులకు ద్రాక్షారామం రాజధాని.

### పేరూరు ద్రావిడులు

చాళుక్య చోళ రాజ కుమారులు అరవవారగుటచే వారితోపాటు వారి నాశ్రయించుకొని వుండే అరవబ్రాహ్మణులు ఆంధ్రదేశానికి వచ్చి అగ్రహారాలు సంపాదించి స్థిరపడ్డారు. పేరూరు ద్రావిడులు, ఆరామద్రావిడులనే వారిప్పుడు వచ్చిన వారే. ఆ కాలంలో ఆంధ్రదేశానికి అరవసంపర్కం కలిగింది.

అమలాపురానికి అయిదు మైళ్ళ దూరంలో వున్న పేరూరు యిప్పటికీ అగ్రహారమే. పేరూరు ద్రావిడులు తంజావూరు జిల్లా కుంభకోణందగ్గర 'వలంగిమాన్' అనే గ్రామాన్నుండి ఆంధ్రకు వలసవచ్చారు. మొదట్లో పదిహేను కుటుంబాలు 'ర్యాలి' గ్రామానికి వచ్చారట. వీరు చోళ చాళుక్యరాజుల ప్రాపకంతో ఏనుగుమట్టిరాలిగినంత ప్రదేశాన్ని అగ్రహారంగా పొందారట. పేరూరుగ్రామం అప్పుడే అరవ బ్రాహ్మలకు వచ్చింది. జనాభా పెరిగినతరువాత వారిలో కొందరు [illegible], విశాఖజిల్లాలకి వలస వెళ్ళారు.

అమలాపురం తాలూకా ర్యాలిలో యిప్పటికీ 'అరవవీధి' అని ఒకటి వుంది. ర్యాలిలో చరిత్ర ప్రసిద్ధిచెందిన చాళుక్యులనాటి జగన్మోహినీ విగ్రహముంది. రాక్షసులకు, దేవతలకు, సముద్రమథనంలో పుట్టిన అమృతాన్ని పంచుకోడంలో వివాదమేర్పడగా మహావిష్ణువు జగన్మోహినీ వేషంలో వచ్చి రాక్షసులను మోసపుచ్చుతాడు. ర్యాలిలోని జగన్మోహినీ విగ్రహం

విష్ణువు జగన్మోహిని వేషాన్ని సొగసుగా చిత్రించుతున్నది. వెనుకనుండి చూస్తే మోహినిగాను, ముందునుండిచూస్తే విష్ణువుగాను కనబడేటట్లు యీ విగ్రహం చెక్కబడింది. ఈవిగ్రహం నూతనంగా చెక్కబడినదానివలె నల్లగ నిగనిగలాడుతుంటుంది. ర్యాలిలోని విష్ణువు కాలి బొటనవ్రేలినుంచి నీరు చిమ్ముతుండటాన్ని చెప్పుకొంటారు. ర్యాలీ అమలాపురానికి 20 మైళ్ళ దూరంలో వుంది.

పేరూరుశివాలయ [illegible] వున్న చెరువులో నీడనుచూసే, అర్జునుడు మత్స్యయంత్రాన్ని భేదించి ద్రౌపదిని చేపట్టాడని చెబుతారు. అమలాపురం తాలూకా పాంచాలదేశమట.

## ఘటికాస్థానాలు

చోళ చాళుక్యరాజైన వీరచోడుడు అరవదేశాన్నుండి 536 మంది బ్రాహ్మణులను తెప్పించి పిఠాపురానికి దగ్గరిలో వున్న 'వీరచోడ చతుర్వేద మంగళం' అనే గ్రామాన్ని అగ్రహారంగాయిచ్చాడు. ఇక్కడ ఘటికాస్థాన ముండేదట. ఆ ఘటికాస్థానంలో వేదాంతము, వ్యాకరణం మొదలైన శాస్త్రవిషయాలను బ్రాహ్మణులు విద్యార్థులకు బోధించేవారట.

కుళోత్తుంగచోడుడు ఆంధ్రంలో తన రాజ్యానికి రక్షణగా వుంటారని చెప్పి తనను విశ్వాసంతో కొలచిన సేవకులను మండలేశ్వరులుగా నియమించాడు. ఈ మండలేశ్వరులు వివిధ ఆంధ్రప్రాంతాలను కాంచీపుర సామంతులుగ పాలించారు. ఇట్టి మండలేశ్వరులలో ముఖ్యులు వెలనాటి చోడులు. ఈ మండలేశ్వరులంతా ఎవరికి వీలుచిక్కినప్పుడు వారు స్వతంత్రత ప్రకటించుకొనేవారు. బలవంతుల రాజ్యాలేర్పడినప్పుడు వారికి సామంతులుగ వుండేవారు.

## పండితారాధ్యుడు

వెలనాటి చోడులు 12 వ శతాబ్దంలో ఆంధ్రదేశాన్ని పాలించారు. శైవ పండితత్రయంలోని మల్లికార్జున పండితుడు వెలనాటిచోడుల కాలంలోని వాడే. మల్లికార్జున పండితుడు ద్రాక్షారామంలో జన్మించాడు. రెండవ వెలనాటిచోడుని రాజధానియైన చందవోలు వెళ్ళి అక్కడ బౌద్ధపండితులను వాదములో ఓడించాడు. మల్లికార్జున పండితుని కాలంనాటికి బౌద్ధమతం గుంటూరు జిల్లాలో కొనవూపిరితో ఉండేది. మల్లికార్జున శిష్యుడొకడు బౌద్ధభిక్షువుని హత్య చేశాడు. రాజు అతనిని శిక్షించబోగా మల్లికార్జున పండితుడు నేరాన్ని తనపై వేసుకొని శిక్షగా తన రెండుకళ్ళు పీకి వేసుకోగా శివుడు అతని భక్తికి మెచ్చుకొని నాలుగుకళ్ళు యిచ్చాడని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరిత్రలో వ్రాశాడు. పండితారాధ్యుడు వ్రాసిన శివతత్త్వసారం శతకశాస్త్రగ్రంథాలకు ప్రాతిపదిక అని చెబుతారు. తూర్పుగోదావరి జిల్లా పీఠిక్రిందకూడా కొంతకాలంవుంది. 12 వ శతాబ్దం చివరికాలంలో పిఠాపుర ప్రాంతంలో తూర్పు చాళుక్యవంశీయుడైన విష్ణువర్ధన మల్లపరాజు పాలించేవాడు. వేంగిదేశంపై దండెత్తివచ్చిన కాకతీయ రుద్రమదేవ మహారాజు మల్లపరాజును మిత్రుడుగా గుర్తించాడు. పృథ్వీశ్వరుడనే వెలనాటి చోడరాజు మల్లపరాజు రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడట.

వెలనాటిచోడుల చివరికాలంలో క్రీ. శ. 1183 ప్రాంతంలో అరాజకం ప్రబలి వెలనాటివారికి సామంతులుగా వున్న మండలేశ్వరులు స్వతంత్రత ప్రకటించుకన్నారు. అట్టివారిలో హైహయ వంశీయులు ఒకరు. వారు కోనలో, అమలాపురం తాలూకాను పాలించారు. తూర్పుగోదావరి జిల్లాలో చిన్న చిన్న రాజ్యాలేర్పడ్డాయి. క్రీ. శ. 1225 నాటికి ఆంధ్రదేశము కాకతీయుల వశమైంది. మండలేశ్వరులంతా కాకతీయులకు సామంతులైనారు. కాకతీయులు 14 వ శతాబ్ద ప్రారంభించవరకు రాజ్యంచేశారు. కాకతీయ ప్రతాపరుద్రుడు తూర్పు గోదావరి జిల్లాను పాలించడానికి పెద్ద మల్లరాజు, చిన్న మల్లరాజులను నియమించాడు. కాని వారిద్దరూ దుష్పరిపాలన చేస్తుండడంవల్ల ప్రతాపరుద్రుడు వారిని తొలగించి స్వంతంగా పాలించాడు.

## ముస్లిం దండయాత్రలు

1323 లో మహమ్మద్ తుగ్లక్ దండయాత్రతో కాకతీయుల రాజ్యం పతనమైంది. ఆంధ్రదేశం ఢిల్లీసుల్తానుల వశమైంది. తుగ్లక్ రాజమండ్రి ప్రాంతాన్ని పాలించడానికి ఒక ప్రతినిధిని నియామించాడు. సాలార్ ఉన్నీ అనే అతనితో రాజమండ్రి దేవాలయాన్ని మసీదుగ మార్పించాడు.

కాని ఢిల్లీసుల్తానుల పాలన అట్టేకాలం సాగలేద. ఢిల్లీపాలననుండి ఆంధ్రదేశాన్ని విడిపించడానికి ఆంధ్రలో పెద్ద జాతీయ వుద్యమం ప్రారంభమైంది. కాకతీయులకు సామంతులుగ వున్న మండలేశ్వరులంతా 1325 లో ముసునూరి ప్రోలయనాయకని నాయకత్వాన తిరుగుబాటుచేసారు. ప్రోలయ నాయకుడు భద్రాచలం తాలూకా రేకపల్లిలో సైన్యాన్ని సమకూర్చుకని ఢిల్లీసుల్తానుల ప్రతినిధులపై యుద్ధంచేసి పారద్రోలాడు. ఈకాలంలోనే ఆంధ్రలో కొండవీడు, కోరుకొండ, రేచెర్లరాజ్యాలు ఏర్పడ్డాయి. తూర్పుగోదావరిలో చిన్న రాజ్యాలు వెలిసాయి. వీరంతా కొండవీటి రెడ్డిరాజులకు లోబడే పరిపాలించుతు డేవారు. వీలు చిక్కినప్పుడు స్వతంత్రంగకూడ వ్యవహరించేవారు. కొండవీటిరెడ్డి రాజ్యం 1324 నుండి 1424 వరకు సాగింది.

## రామాయణ గాథలు

మండలేశ్వరుల తిరుగుబాటుకు నాయకత్వం వహించిన ముసునూరి ప్రోలయ నాయకుని రాజధాని భద్రాచలంతాలూకాలోని రేకపల్లి. రేకపల్లె అంటె రెక్కల గ్రామం అని అర్థం. రావణుడు సీతను పర్ణశాలనుండి ఎత్తుకపోయినప్పుడు జటాయువు అడ్డుతగలగా రావణుడు దాని రెక్కలును నరికివేస్తాడు. ఆ రెక్కలు యీ రేకపల్లెలో పడ్డవట. అందువల్ల రేకపల్లె అని పేరువచ్చింది. భద్రాచలానికి 28 మైళ్ళదూరంలోవుంది.

రామాయణంగాథలోని ఘటనలు యీ భద్రాచలం తాలూకాలోనే జరిగాయి. రాముడు, సీత వనవాసంచేసిన పర్ణశాల భద్రాచలం తాలూకాలోనేవుంది. జటాయువు సీతాపహరణ వార్తను రామునికి అందచేసి ప్రాణాలు విడిచినగ్రామం శ్రీరామగిరి, యీ తాలూకాలోనేవుంది. శ్రీరాముడు జటాయువుకు యిక్కడ దహనసంస్కారాది క్రియలు చేసాడట. రాముడు మాయాలేడిని చంపినది మసక

'గోదావరి నావిగేషనువర్క్సు' కోసం పగులగొట్టివేశారు.

కాటయవేముని తరువాత రాజమహేంద్రవరం రాజ్యం కొంతకాలం రెడ్డిరాజుల ఆధీనంలోనే వుంది. 15వ శతాబ్దం మొదటి అర్థభాగంలో ఒరిస్సా రాజైన కపిలేశ్వరగజపతి రాజమహేంద్రవర రాజ్యాన్ని జయించి కళింగరాజ్యంలో కలిపాడు. తిరిగి కృష్ణదేవరాయలు జయించేవరకు తూర్పుగోదావరి ఒరిస్సా గజపతులక్రింద వున్నది.

## గోల్కొండ పరిపాలన

16 వ శతాబ్దంలో కృష్ణదేవరాయలు కోస్తాప్రాంతాన్నంతా జయించాక, తల్లికోట యుద్ధంలో విజయనగర రాజ్యం పతనం అయ్యేవరకు తూర్పుగోదావరిజిల్లా విజయనగర రాజ్యంలోవుంది. 1571 లో తూర్పుగోదావరిజిల్లాను గోల్కొండ నవాబులు జయించారు.

గోల్కొండనవాబులలో సం॥ 1658–1687 ల మధ్యపాలించిన అబుల్ హసన్ కుతుబ్ షా కాలంలో అక్కన్న మాదన్నలనే తెలుగువారు మంత్రులుగావుండేవారు. వీరి మేనల్లుడు కంచర్లగోపన్న. ఇతడు భద్రాచల ప్రాంతానికి నవాబులక్రింద తహసీల్దారుగ వుంటూ భద్రాచలంలో ప్రభుత్వ బొక్కసంలోని డబ్బుతో రామాలయాన్ని కట్టించి పదకొండు సంవత్సరాల జైలుశిక్ష అనుభవించాడు. గోపన్నను, భక్తరామదాసు అని నేడు అంటున్నారు. రామలక్ష్మణులు ప్రత్యక్షమై నవాబుకు చెల్లించాల్సిన డబ్బు చెల్లించి విడిపించారని ఒకకథ ప్రచారంలోవుంది.

గోల్కొండ నవాబుల పాలనక్రింద తూర్పుగోదావరిజిల్లా, రాజమండ్రి సర్కారులో చేర్చబడింది. రుస్తుంఖాన్ అనే అతను రాజమండ్రి ఫౌజుదారులలో ప్రముఖుడు.

17 వ శతాబ్దంలో గోల్కొండ రాజ్యం మొగలాయిల వశమైనతరువాత నైజాంనవాబులు ఆంధ్రదేశ పాలకులయ్యారు. 1748 లో నైజాంనవాబు వారసులలో వచ్చిన తగాదాలలో ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు జోక్యం కల్గించుకున్నారు. ఆంధ్ర దేశాధిపత్యానికై ఇంగ్లీషువారికి, ఫ్రెంచివారికి 1758 లో తూర్పుగోదావరిజిల్లాలో చందుర్తివద్ద యుద్ధంజరిగింది.

## చందుర్తి యుద్ధం

కల్నల్ ఫోర్డు సేనలు 1758 సెప్టెంబరు 3 వ తేదీన పిఠాపురాన్ని చేరుకునేసరికి ఫ్రెంచిసైన్యాలు పిఠాపురానికి నాలుగు మైళ్ళదూరంలోనున్న 'గొల్లప్రోలు' అనే గ్రామంలో సమీకరించబడ్డాయి. డిసెంబరు 6 వ తారీఖున కల్నల్ ఫోర్డు నాయకత్వానల ఇంగ్లీషు సేనలు, వారికండగా వచ్చిన విజయనగరం మహారాజా సేనలు గొల్లప్రోలుకు దగ్గిరనున్న చేబ్రోలు గ్రామాన్ని ఆక్రమించుకున్నాయి. డిసెంబరు 10 వ తేదీన తెల్లవారుఝామున ఇంగ్లీషు సేనలు చేబ్రోలు దగ్గిరవున్న చందుర్తిగ్రామాన్ని ఆక్రమించాయి. అప్పటివరకు గొల్లప్రోలులో మకాం వేసిన ఫ్రెంచిసేనలు, కదలి వోదులపెంట అనే గ్రామంవెళ్ళబోగా చందుర్తి సమీపంలో చందుర్తి – చేబ్రోలులమధ్య ఆంగ్లేయులపాడు అనేచోట 10 వ తేదీన యుద్ధంజరిగింది. ఫ్రెంచివారు ఓడిపోయారు. ఈ చందుర్తియే ఇంగ్లీషు వారి నోట కాండూరు ఐంది.

చందుర్తిలో ఓడిపోయిన ఫ్రెంచివారు రాజమండ్రికి తిరోగమించగా కల్నల్ ఫోర్డు సేనలనుపంపి వారిని రాజమండ్రినుండి తరిమివేశాడు. ఫ్రెంచివారు మచిలీపట్టణానికి తిరోగమించి రాజమండ్రిని తిరిగి స్వాధీనంచేసుకున్నారు. 1759 నవంబరు 11 న ఫ్రెంచిసేనలు కాకినాడ వెళ్ళాయి. కాకినాడ అప్పటికింకా డచ్చివారి క్రిందనేవున్నది. ఫ్రెంచిసేనలు డచ్చి ఫ్యాక్టరీలో తలదాచుకోగా ఇంగ్లీషువారు ముట్టడించి ఫ్రెంచివారిని తరిమివేశారు. ఆంధ్రదేశంలో ఫ్రెంచివారి అధికారం అడుగంటింది. ఆంధ్ర కోస్తాజిల్లాలను 1766 లో నైజాంనవాబు ఇంగ్లీషువారికి కట్టబెట్టాడు.

కంపెనీ పరిపాలన

హుస్సేన్ అలీఖాన్ అనే అతను తూర్పుగోదావరిజిల్లాను నైజాంనవాబుల క్రింద కౌలుకు పుచ్చుకున్నాడు. అతని కౌలు 1769 లో అంతమవడంతో యీ జిల్లా ఇంగ్లీషువారి స్వాధీనమైంది. ఇంగ్లీషువారు తూర్పుగోదావరి జిల్లాను మచిలీపట్టణం కంపెనీ సలహాసంఘం పాలనక్రింద వుంచారు.

1794 లో కంపెనీ సలహాసంఘం పాలనరద్దయి కలెక్టర్లపాలన వచ్చింది. తూర్పుగోదావరిజిల్లా కాకినాడ, రాజమండ్రి కలెక్టరేటులుగ విభజించబడి 1802 లో తిరిగి కలిపివేయబడి రాజమండ్రిజిల్లా ఏర్పాటు అయింది. 1859 లో గోదావరిజిల్లా అయింది. గోదావరిజిల్లాకు కాకినాడ కార్యస్థానం చేయబడింది.

భద్రాచలం తాలూకాను నైజాం 1860 లో ఇంగ్లీషువారికి యిచ్చాడు. 1874 వరకు ఈతాలూకా మధ్యప్రదేశ్ లోని దిగువగోదావరీజిల్లాలో భాగంగా వుండేది. అప్పుడు భద్రాచలంతాలూకా భద్రాచలం, రేకపల్లి అని రెండు తాలూకాలుగ వుండేది. 1874 లో యీ రెండు తాలూకాలను ఒకటిగా చేర్చి గోదావరి జిల్లాలో కలిపారు. 1881 లో గోల్గొండ ఏజెన్సీ, విశాఖపట్టణం జిల్లానుండి గోదావరిజిల్లాకు మార్చబడింది.

1881 నాటికి గోదావరిజిల్లా పెరిగిపోయి ఒక జిల్లాకలెక్టరు పరిపాలన నిర్వహించడం కష్టమని భావించబడింది. 1904 లో ఒక్క పోలవరం డివిజను తప్ప గోదావరికి దక్షిణానవున్న భాగమంతా కృష్ణాజిల్లాలో చేర్చబడింది.

1904 తరువాత తూర్పుగోదావరి జిల్లాలో పెద్ద మార్పులేమీ జరగలేదు. పోలవరం డివిజనుమాత్రం పశ్చిమగోదావరి జిల్లాకు మార్చబడింది. అంతకుమించి తూర్పుగోదావరిజిల్లాలో పెద్ద మార్పులేమీ లేవు.

డచ్చి టంకశాల

బ్రిటిషువారి పాలనలోను, అంతకు ముందు వచ్చిన డచ్చివర్తకుల కాలంలోను తూర్పుగోదావరి జిల్లాలో కొన్ని ఫ్యాక్టరీలు నెలకొల్పబడ్డవి. క్రీ. శ. 1628 లో డచ్చివారు కాకినాడలో ఒక పేటగవున్న జగన్నాథపురంలో ఒక ఫ్యాక్టరీని నెలకొల్పారు. జగన్నాథపురం ప్రక్కనవున్న గొల్లపాలెం, గుండవరంలుకూడ డచ్చివారి ఫ్యాక్టరీక్రిందనే వుండేవి. ఇక్కడ డచ్చివారికి టంకశాల వుండేది. నిజాం నవాబు, ఢిల్లీపాదుషాలు యిచ్చిన ఫర్మానాల ననుసరించి డచ్చివారు ఈ ప్రాంతంలో అధికారం పొందారు.

1781 లో డచ్చివారికి ఇంగ్లీషువారికి వచ్చిన యుద్ధాలలో జగన్నాథపురంలోని ఫ్యాక్టరీ యుద్ధకేంద్రమైంది. డచ్చివారు ఓడిపోయారు. ఇంగ్లీషువారు ఈ ప్రాంతాన్ని తిరిగి 1784 లో డచ్చివారికి యిచ్చివేశారు. ఫ్రెంచి విప్లవకాలంలో జగన్నాథపురం ప్రాంతాన్ని ఇంగ్లీషువారు తిరిగి ఆక్రమించుకున్నారు-కాని 1818 లో తిరిగి డచ్చివారికి ఇచ్చివేయబడింది. 1824లో డచ్చివారికి ఇంగ్లీషువారికి జరిగిన సంధి ననుసరించి భారతదేశంలోని డచ్చి స్థావరాలన్నీ ఇంగ్లీషువారికి ఇచ్చివేయబడ్డాయి. అప్పుడు జగన్నాథపురంకూడ ఇంగ్లీషువారి వశమైంది. జగన్నాథపురంలో కొన్ని డచ్చివారి సమాధులు కనబడతాయి.

## ఓడ రేవులు

కాకినాడకు పదిమైళ్ళదూరంలో కోరంగి అనే గ్రామముంది. కోరంగి ఒకప్పుడు పెద్ద ఓడరేవు. అక్కడ నౌకలు నిర్మించేవారట. ప్లినీ భూగోళంలో కోరంగి ఒక అగ్రముగ పేర్కొన బడ్డది.

కాలక్రమమున కోరంగివద్ద సముద్రం మెరకవేసి రేవు పనికిరాకుండాపోయింది. ఇప్పుడు కోరంగి గ్రామం సముద్రానికి దూరంగావుంది. 1789 లో మద్రాసు ప్రభుత్వం భూగోళ శాస్త్రజ్ఞుడుగావున్న టాపింగ్ అనే ఆయన కోరంగి వెళ్ళిచూచి అక్కడిరేవుకు ఫ్రెంచి, డచ్చి, పోర్చుగీసు, ఇంగ్లీషు నావలు వచ్చేవనీ దొంగల బాధ విపరీతంగా వుందని వ్రాశాడు.

ఇప్పుడు కోరంగి చిన్న గ్రామం. ఇంగ్లీషువారి సమాధులు, బంగళాల శిధిలాలు కనబడుతాయి. ఇప్పుడు కోరంగి అనే గ్రామాన్ని 1759 లో వెస్టుకాట్ అనే ఇంగ్లీషువర్తకుడు కట్టించాడని, పాతకోరంగి అంతకుముందే నిర్మించబడిందని తెలుస్తున్నది. 1839 లో పెద్ద తుపాను వచ్చి గ్రామం కొట్టుకుపోయిందట.

కోరంగిలో 1877-78 లో 8లక్షల 22 వేల రూపాయల నౌకా వ్యాపారం జరిగింది. 1884-85 లో 33 వేలకు పడిపోయింది. కోరంగిరేవు పాడైపోయిన తరువాతనే కాకినాడరేవు, ఇంజరంరేవు ప్రాముఖ్యతలోనికి వచ్చాయి.

కోరంగి ప్రక్కనే తాళ్ళరేవు అనే గ్రామం వుంది. ఇదికూడ ఒకప్పుడు నౌకా రేవుగావుండేదట. తాళ్ళరేవులో నౌకల మరమ్మతు, నౌకలు నిర్మించడం కొంత కాలం సాగిందట. 1802 లో ఇబెంజర్ రోబక్ అనే ఇంగ్లీషువర్తకుడు చాల డబ్బు ఖర్చుచేసి తాళ్ళరేవులో ఒక 'డ్రైడాక్' నిర్మించాడట. ఇక్కడ పెద్దపెద్ద ఓడలు మరమ్మతు చేయబడేవట. హె. యం. యస్. అల్బట్రాస్ అనే ఓడ యితర ఓడలు యీ 'డ్రై డాక్' లోనే బాగుచేయబడ్డవి. తాళ్ళరేవుకూడ మెరకేసి రేవు పనికిరాకుండాపోయింది. ఇక్కడ ఓడరేవును గుర్తుచేసే చిహ్నాలేమీ కనబడవు. అయితే కోరంగి రేవులో తాళ్ళరేవు నౌకాకేంద్రం చెడిపోయాక కూడ ఓడలు చాలకాలంవరకు బాగు చేయబడుతుండేవట.

ఇంజరం అనే గ్రామం యానాంకు సమీపంలో కాకినాడకు పదిహేనుమైళ్ళ దూరంలో వుంది. ఇంజరంలో 1708 లో తూర్పు ఇండియాకంపెనీవారు ఒక ఫ్యాక్టరీని నెలకొల్పి ఎత్తివేసి, తిరిగ

1722 లో నెలకొల్పారు. ఇక్కడ ఫ్యాక్టరీలో ఇండియాలోకెల్ల నాణ్యమైన, మేలైన లాంగ్ క్లాత్ (Long cloth) తయారయ్యేదని 18 వ శతాబ్దారంభంలో ఇండియా పర్యటించిన కాప్టెన్ హామిల్టన్ వ్రాశాడు. 1757లో బుస్సీ ఇంజరంఫ్యాక్టరీని ఆక్రమించాడు. చందుర్తి యుద్ధంలో ఫ్రెంచివారు ఓడిపోవడంతో ఇంజరం, అక్కడి ఫ్యాక్టరీ తిరిగి ఇంగ్లీషువారికి చిక్కాయి. 1829 వరకు ఇంజరంలోని తూర్పుఇండియా కంపెనీవారి బట్టలమిల్లు పనిచేసింది. తరువాత ఫ్యాక్టరీ ఎత్తివేయబడింది. ఇంజరం నౌకా వాణిజ్యంకూడ పడిపోయింది.

యానాంలో 1750 లో ఫ్రెంచివారు ఒక ఫ్యాక్టరీ నెలకొల్పారు. ఫ్రెంచివారు అప్పటి పాలకులైన ఢిల్లీ పాదుషాలనుండి యీ ప్రాంతాన్ని 1752 లో సంపాదించారు. 1793 నుండి 1815 వరకు మధ్యలో ఒకటిరెండు సం||లు తప్పితే బ్రిటిషువారి అధీనంలోనేవుండేది. 1815 లో యానాం ఫ్రెంచివారికి అప్పగించబడింది. అప్పటినుండి ఇప్పటివరకు ఫ్రెంచివారి అధీనంలోనే వుంటున్నది.

నీలపల్లి కోరంగి గౌతమీ నదుల సంగమస్థానంవద్ద ఉన్నది. నీలపల్లి యానాంకు దగ్గరలోవున్న గ్రామం. తూర్పు ఇండియా కంపెనీవారు నీలపల్లిలో 1751 లో ఒక బట్టలమిల్లు స్థాపించారు. ఆ రోజులలో నీలపల్లికూడ ఒక చిన్న ఓడరేవుగ వుండేది. నీలపల్లి శివారు గార్డ్ పేటలో 1854 లో ఒక ఫ్రెంచి యింజనీరు ఒక బియ్యపు మిల్లును స్థాపించాడట. అంతకుపూర్వం యీ మిల్లు నీలిమందు ఫ్యాక్టరీగా వుండేదట. తరువాత ఈబియ్యపుమిల్లును ఇంగ్లీషు వ్యాపారస్థులు కొన్నారు. ఈ మిల్లులో వందమంది కార్మికులు పనిచేసేవారట. ఇక్కడ మిల్లులో మరపట్టబడ్డ బియ్యం కాకినాడకు పడవలలో ఎగుమతి అయ్యేది. ఇప్పుడు నీలపల్లి కుగ్రామం.

కాకినాడ ఓడరేవు కోరంగి, ఇంజరం రేవులు మెరకవేసి పాడైపోయాక అభివృద్ధిలోకి వచ్చింది. 1861 అమెరికను స్వాతంత్ర్యసంగ్రామకాలంలో గుంటూరులో తయారైన పత్తిబేళ్ళు (pressed cotton) కాకినాడరేవునుండి విదేశాలకుఎగుమతి చేయబడేవి. తరువాత కాకినాడలో ఇంగ్లీషువారు కొన్ని పీచు పరిశ్రమలు కూడా స్థాపించారు.

### 'రంపపితూరీ' 1879

తూర్పు గోదావరిజిల్లాలో మన్యం రైతులు చరిత్రాత్మకపోరాటాలుజరిపారు. వాటిలో 1879 'రంపపితూరీ', 1922 లో 'మన్యం తిరుగుబాటు' ముఖ్యమైనవి.

తూర్పుగోదావరిజిల్లాలో భద్రాచలం, నూగూరు, చోడవరం, యల్లవరం తాలూకాలు అడవిమయం. వీటిని ఏజెన్సీ ప్రాంతాలనీ, మన్యంప్రాంతం అనీ అంటారు. ఇది ఆర్థికంగాను, సాంఘికంగాను వెనుకబడినప్రాంతం. మన్యం రైతులు ముఠాదారులు, మన్నెదొరలనే భూస్వాముల దోపిడీక్రింద నలిగిపోతుంటారు.

ముఠాదారులుభూస్వాములు. వీరిక్రింద కొన్ని గ్రామాలుంటాయి. వీరు ప్రభుత్వానికి కొంత పేష్కస్ చెల్లిస్తూ, భూముల మీద రైతులవద్దనుండి అధికశిస్తులు వసూలు చేసి, వడ్డీవ్యాపారంద్వారా యితర రకాలుగాను దోపిడీ చేస్తుంటారు.

తమక్రింద గ్రామాల్లోని భూములను సాగుచేసే రైతులు, తమదగ్గరే వడ్డీలకు డబ్బు పుచ్చుకోవాలని బాధిస్తుంటారు. ముఠాదారులకు యిష్టం లేనప్పుడు రైతులను భూములనుండి యిష్టమొచ్చినట్లు తొలగిస్తారు. ఇంతేగాకుండా రైతులు ముఠాదారులకు, ప్రభుత్వోద్యోగులకు వెట్టిచాకిరీ చేయాలి. వెట్టిచాకిరీ చేయ నిరాకరించితే పోలీసుల దౌర్జన్యం.

ఏజెన్సీ అడవులలో అధికభాగం రిజర్వు అడవు లవడంవల్ల ఆ అడవులనుండి రైతులు అవసరమైనంతగా కట్టెలు, తేనె, దుంపలు వగైరా తెచ్చుకోడానికి వీలు లేదు. కదిలితే మెదిలితే కేసులు; అధికార్ల లంచగొండితనానికి మితి లేదు. ఏజెన్సీలో చింతపండు, కట్టెలు, తేనె వగైరా కొనడానికి వచ్చే వర్తకులవద్ద లంచాలుమేసిన అధికార్లు వర్తకుల దోపిడీని బలపరుస్తుంటారు.

మన్యం రైతులు యీ ముఠాదార్ల, అధికార్ల దోపిడీకి, అక్రమాలకు వ్యతిరేకంగా అనేక తిరుగుబాట్లు లేవదీశారు. 1858, '61, '62 లలో రంపచోడవరం తాలూకాలో కొన్ని తిరుబాట్లుజరిగాయి. 1879 లో రంపచోడవరం తాలూకాలోని రంపముఠాలో రైతుల పెద్ద తిరుగుబాటు జరిగింది. దీన్నే 'రంపపితూరీ' అంటారు. ప్రధానంగా రైతులే తిరుగుబాటులో పాల్గొన్నా, కొద్దిమంది ముఠాదారులుకూడ పాల్గొన్నారు.

రంపచోడవరంలో ప్రారంభమైన పితూరీ ప్రభావం, భద్రాచలం తాలూకాలోనేగాక యితరజిల్లాలలోని ఏజన్సీ ప్రాంతాలపైకూడ పడింది. అక్కడకూడ తిరుగుబాట్లు వచ్చాయి.

## అడ్డతీగల దాడి

రంపలో ద్వారబంధాల చంద్రయ్య, పులిచింత సాంబయ్యలు, భద్రాచలం తాలూకాల్లోని రేకపల్లెలో అంబుల్ రెడ్డి, తమ్మన్నదొరలు తిరుగుబాట్లకు నాయకత్వాలు వహించారు. రంపచోడవరం తాలూకాలో ద్వారబంధాల చంద్రయ్య నాయకత్వాన రైతులు 1879 ఏప్రిల్ లో అడ్డతీగల పోలీసుస్టేషన్ ను తగులపెట్టి పోలీసులను ముప్పుతిప్పలుపెట్టి మూడు నెలవుల నీళ్ళు త్రాగించారు. అడ్డతీగల పోరాటం ప్రసిద్ధమైనది. రైతుల తిరుగుబాటు నణచటానికి దేశంలో వివిధ ప్రాంతాలనుండి బ్రిటిషుప్రభుత్వం సైన్యాలను సమీకరించి, తిరుగుబాటును అణచివేయగలిగింది. ద్వారబంధాల చంద్రయ్య నాయకత్వానగల 79 మంది 1879 నవంబరులో అరెస్టుచేయబడ్డారు. 1880 ఫిబ్రవరిలో చంద్రయ్యను సైనికులు కాల్చిచంపారు. పులిచింత సాంబయ్య 1879 ఏప్రిల్ లోనే అరెస్టు చేయబడ్డాడు. ఇకపోతే రేకపల్లెలో అంబుల్ రెడ్డి 1879 నవంబరులోను, తమ్మనదొర 1880 నవంబరులోను అరెస్టు చేయబడ్డారు. అంబుల్ రెడ్డి నాయకత్వాన తిరుగుబాటుదార్లు 1879 జూలై 10 వ తేదీన వడ్డిగూడెం పోలీసుస్టేషను తగుల పెట్టారు. రాజమండ్రినుండి పోలీసులు ఒకస్టీమరులో బయలుదేరి వస్తుండగా దారిలోనే అంబుల్ రెడ్డి నాయకత్వాన వున్న రైతులు అస్టీమరును పట్టుకున్నారు. సెప్టెంబరులో అంబుల్ రెడ్డి నాయకత్వాన సాగుతున్న పోరాటం అణచబడగా, 1880 అక్టోబరులో తమ్మన్న

దొర నాయకత్వాన రేకపల్లిలో తిరుగుబాటు జరిగింది.

1879 రంపపితూరీలో సైనికులకు, రైతులకు అనేక గెరిల్లాయుద్ధాలు జరిగాయి. ఎంతో సైనికబలంతోగాని బ్రిటిషు ప్రభుత్వం రైతులను అణచలేక పోయింది.

తిరుగుబాట్లను అణచివేశాక బ్రిటిషు ప్రభుత్వం రైతులను తృప్తిపరచడానికి రంపమునసబ్ దారును పదవినుంచి తొలగించి అరెస్టుచేసి జైలులో పెట్టింది. కాని అతని ముఠాలోని గ్రామాలను పితూరీ సమయంలో బ్రిటిషు అధికారులకు అండగావుండి, రైతుపోరాటానికి ద్రోహం చేసిన చోడవరం మున్సబుకు యిచ్చింది. తిరుగుబాటులో పాల్గొన్న ముఠాదారుల ముఠాలు రద్దుచేయబడ్డాయి. బ్రిటిషు తొత్తులకు ఆ ముఠాలు కట్టబెట్టబడ్డాయి. ముఠాదారీ విధానంద్వారా బ్రిటిషుప్రభుత్వం ఏజెన్సీప్రాంతంలో ఒక జోహుకుం వర్గాన్ని తయారుచేసుకున్నది. కాని రైతులను సంతృప్తి పరచలేకపోయింది.

## మన్యం తిరుగుబాటు

సైనికబలంతో 1879 లో అణచివేయబడ్డప్పటికీ, అసంతృప్తితో కుములుతున్న మన్యం రైతులు అల్లూరి సీతారామరాజు నాయకత్వాన 1922 జనవరిలో విజృంభించి ముఠాదార్ల, లంచగొండి ప్రభుత్వాధికార్ల, వర్తకుల దోపిడీకి, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేశారు.

1922 తిరుగుబాటుకు పూర్వం 1916, 1917 సంవత్సరములలో 'లాగరాయి పితూరీ' జరిగింది. ఈ సందర్భంలో మొట్టాడం వీరయ్య అనే 'గూడెం' ముఠాదారు ముఠా గ్రామాలను ప్రభుత్వం వశపర్చుకొన్నది. ఇతనికి ప్రభుత్వం ప్రవాస శిక్ష విధించింది. వీరయ్య విజయనగరంలో ప్రవాసశిక్ష అనుభవించుతూ ఒకసారి రహస్యంగా తన గూడెం ముఠాకు తిరిగివచ్చి, రహస్య జీవితం గడుపుతూ పోలీసులకు పట్టుబడ్డాడు. పోలీసులు వీరయ్యనుఅరెస్టుచేసి రాజవొమ్మంగి స్టేషనులో నిర్బంధించారు. 1922 జనవరిలో సీతారామరాజు నాయకత్వాన 'పితూరీ' ప్రారంభమైనప్పుడు సీతారామరాజు 1922 ఆగస్టులో రాజవొమ్మంగి పోలీసుస్టేషనుపై దాడిచేసి వీరయ్యను విడిపించాడు. వీరయ్య అప్పటినుండీ పోరాటం అణచబడేవరకు అల్లూరి సీతారామరాజు క్రింద పితూరీకి ఉపనాయకుడుగాపనిచేసాడు. ఇతనేగాక సీతారామరాజుకు గాముగంటం దొర; గాము మల్లుదొర అనే గాము సోదరులు యిద్దరూ రెండు భుజాలులాగా పనిచేసారు. వీరిలో గాముమల్లుదొర యిప్పటికినీ జీవించి ఉన్నాడు, ఇప్పుడు పార్లమెంటు సభ్యులు.

ఈ పోరాటాన్నణచడానికి బ్రిటిషు అధికారులు ఎక్కడెక్కడనుండో సైన్యాలు దించారు. మలబారు స్పెషలు పోలీసును ప్రయోగించి మన్యం ప్రజలను నానాహింసల పాల్జేసారు. ఎందరో రైతులు తుపాకిగుండ్ల కెర అయ్యారు.

సైన్యాలు, పోలీసులు ఆయుధాలు ప్రయోగించుతూంటె మన్యం రైతులు కూడ ఆయుధాలుప్రయోగించే పోలీసులను, సైన్యాలను ఎదుర్కొనక తప్పలేదు. సీతారామరాజు, గాము సోదరుల నాయకత్వాన మన్యం రైతులు అనేక పోలీసు

స్టేషనులపై దాడిచేసి ఆయుధాలు సంపాదించారు.

## మన్యం రైతుల దుస్థితి

మన్యం దొరల, ఏజన్సీ అధికారుల దోపిడీని, అక్రమాలనుయెదిరించి పోరాడిన మన్యం రైతులను బ్రిటిషు అధికారుల్లా మాదిరిగానే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు నాయకిత్వం కూడా దోపిడిగాండ్రని నిందించింది. ఇప్పటి మన ఆంధ్ర ముఖ్యమంత్రి ప్రకాశంగారు ఆనాడు ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో మన్యం రైతులను "బందిపోటు"లని నిందించుతూ ప్రకటనచేసారు. ఆంధ్ర జాతీయోద్యమానికి ఆనాడు నాయకత్వం వహించుతున్న కాంగ్రెసే మన్యం రైతులపోరాటం పట్ల యిట్టి వ్యతిరేకవైఖరి అవలంబించడం వల్ల మన్యం రైతులు ఏకాకులై పోరాడవలసి వచ్చింది. బ్రిటిషువారికి మన్యం రైతుల పోరాటాన్ని అణచడం కొంతవరకు తేలికైంది.

మన్యం రైతుల పోరాటాలు దారుణంగా సైనికబలంతో అణచివేయబడ్డవి. మన్యంరైతుల పరిస్థితి యిప్పటికీ అధ్వాన్నంగానేవుంది. ముఠాదారీ దోపిడీకి వ్యతిరేకంగా మన్యం రైతులు యింకా పోరాటాలు సాగిస్తూనే వున్నారు.

జిల్లా కార్యస్థానం కాకినాడ. విస్తీర్ణం 5,682 చ॥ మై॥. జనాభా 24,14,808.

తూర్పుగోదావరిజిల్లాకు ఉత్తరమున విశాఖపట్నంజిల్లా, ఒరిస్సా, మధ్య ప్రదేశ్ రాష్ట్రాలు; తూర్పున,దక్షిణమున బంగాళాఖాతము; పశ్చిమమున హైదరాబాదు సంస్థానము; పశ్చిమగోదావరి జిల్లా సరిహద్దులుగా నున్నవి.

జిల్లా 5 రెవిన్యూ శాఖల క్రింద, 12 తాలూకాలక్రింద విభజింప బడింది. వీటిలో నూగూర్, భద్రాచలం, రంపచోడవరం, యల్లవరం తాలూకాలు యేజన్సీ తాలూకాలు. పెద్దాపురం, పిఠాపురం, తుని, రామచంద్రపురం, కాకినాడ, రాజోలు, అమలాపురం, రాజమండ్రి తాలూకాలు మైదానప్రాంతాలు.

క్రింది పట్టిక రెవిన్యూ డివిజన్లు, తాలూకాల విభజనను, వాటి విస్తీర్ణతను, కార్యస్థానాలను తెలియజేస్తుంది.

నూగూరుతాలూకా, జిల్లాకువాయువ్యమూలగా కొసగా మధ్య ప్రదేశ్, హైదరాబాదు సంస్థానాలలోనికి చొచ్చుకొని వున్నది. భద్రాచలం తాలూకా కూడ మధ్యప్రదేశ్, ఒరిస్సా హైదరాబాదు సంస్థానముల నానుకొని యున్నది. భద్రాచలం తాలూకాకు తూర్పుగా రంపచోడవరం, రంపచోడవరం తాలూకాకు తూర్పుగా ఎల్లవరంతాలూకా

| రెవిన్యూ డివిజను పేరు | రెవిన్యూ డివిజను కార్యస్థానం | రెవిన్యూ డివిజను లోని తాలూకాలు | తాలూకా విస్తీర్ణం చ. మైళ్ళలో | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| భద్రాచలం | భద్రాచలం | భద్రాచలం | 911 | భద్రాచలం |
| | | నూగూరు | 593 | నూగూరు |
| రాజమండ్రి | రాజమండ్రి | రాజమండ్రి | 378 | రాజమండ్రి |
| | | రామచంద్రపురం | 289 | రామచంద్రపురం |
| | | రంపచోడవరం | 710 | చోడవరం |
| పెద్దాపురం | పెద్దాపురం | పెద్దాపురం | 602 | పెద్దాపురం |
| | | తుని | 183 | తుని |
| | | పిఠాపురం | 138 | పిఠాపురం |
| | | ఎల్లవరం | 850 | ఎల్లవరం |
| అమలాపురం | అమలాపురం | అమలాపురం | 353 | అమలాపురం |
| | | రాజోలు | 291 | రాజోలు |
| కాకినాడ | కాకినాడ | కాకినాడ | 384 | కాకినాడ |
| | | | 5,682 | |

ఉన్నది. రాజమండ్రితాలూకా గోదావరినదికి యెడమప్రక్క, డెల్టాపైభాగంలో వున్నది. తుని, పిఠాపురం, కాకినాడ, అమలాపురం, రాజోలు తాలూకాలు సముద్రతీరమునవున్నవి. కాకినాడ తాలూకాకు పశ్చిమంగాను, రాజమండ్రి తాలూకాకు దక్షిణంగాను రామచంద్రపురం తాలూకావున్నది.

ఏజన్సీ తాలూకాలైన నూగూరు, భద్రాచలం, రంపచోడవరం, ఎల్లవరములలో కొండజాతుల ప్రజలు నివసిస్తున్నారు.

జిల్లా వైశాల్యంలో దరిదాపు సగభాగం తూర్పుకనుమల క్రింద వున్నది. ఏజన్సీ ప్రదేశమంతటనూ వ్యాపించివున్న తూర్పుకనుమలు, జిల్లాకు ఉత్తరభాగమున గోదావరినదివరకు వ్యాపించి యున్నవి.

అమలాపురం, రాజోలుతాలూకాలు; కాకినాడ, రామచంద్రపురం, రాజమండ్రి తాలూకాల్లోని కొన్నిభాగాలు డెల్టాప్రాంతాలు.

తుని, పిఠాపురం, పెద్దాపురం తాలూకాలు; రాజమండ్రి, కాకినాడ, రామచంద్రపురం తాలూకాలలో కొన్ని ప్రాంతాలు మెట్ట ప్రదేశాలు.

## నదులు

జీవనదియైన గోదావరి ఈ జిల్లానుండి ప్రవహించుచున్నది. బొంబాయి సమీపంలోని త్రియంబకమనుచోట పుట్టి, హైదరాబాదు సంస్థానముగుండా ప్రవహించి, నూగూరు తాలూకా వాయువ్య మూలనుంచి జిల్లాలో ప్రవేశిస్తున్నది. నూగూరు తాలూకాకు పశ్చిమ సరిహద్దుగాను, భద్రాచలం తాలూకాకు పశ్చిమ దక్షిణ సరిహద్దుగానూ ప్రవహిస్తూ నూగూరు, భద్రాచలం తాలూకాల్లోని కొండలనుంచి ప్రవహించే ప్రవాహాలను తనలో కలుపుకొనుచున్నది. రంపచోడవరం,పశ్చిమగోదావరి యేజెన్సీల మధ్యగా ప్రవహించి రాజమండ్రికి సమీపంలో మైదానంలోకి ప్రవహిస్తున్నది. రాజమండ్రికి దిగువున ధవళేశ్వరంవద్ద గౌతమీ గోదావరి, వశిష్టగోదావరి అని రెండు భాగములుగా చీలుతున్నది. తూర్పుగా ప్రవహించే పాయను గౌతమి గోదావరి అని, పశ్చిమముగా ప్రవహించే పాయను వశిష్ట గోదావరి అని అందురు. ధవళేశ్వరంవద్దనే నదికి ఆనకట్ట కట్టబడింది.

రామచంద్రపురం, కాకినాడ తాలూకాల దక్షిణ సరిహద్దుగా గౌతమి గోదావరి ప్రవహిస్తూ యానాంవద్ద బహు ముఖాలుగా చీలి సముద్రంలో కలుస్తున్నది.

రాజోలు తాలూకా పశ్చిమ సరిహద్దుగా వశిష్టగోదావరి ప్రవహించి నరసాపురం సమీపమున అంతర్వేదివద్ద సముద్రంలో కలియుచున్నది.

వశిష్టగోదావరి సముద్రంలో కలియుటకు ముందు వైనతేయమను పాయ చీలి, రాజోలు తాలూకా తూర్పు సరిహద్దుగా ప్రవహించి, దక్షిణభాగాన్నికూడ చుట్టు వచ్చి యీ ప్రదేశాన్ని వొక లంకగా జేయుచున్నది.

జిల్లాలో పేర్కొనవలసిన మరొకనది ఏలేరు. ఎల్లవరం తాలూకాలోని ఎల్లవరముకు ఈశాన్యదిశగా కలిసే మూడు ప్రవాహాల సంగమమే ఏలేరు. వీరవరం సమీపంలో యీ ప్రవాహాలు తిరిగి అనేకంగా చీలుతాయి. ఇందులో పశ్చిమంగా

ప్రవహించేశాఖ ఏలేరు అన్న పేరుతోనే పిఠాపురం తాలూకా పశ్చిమ సరిహద్దుగా ప్రవహించి, కాకినాడ తాలూకాలో ప్రవేశించి చిక్కవోలు ముఠుగులో కలిసి సముద్రమును చేరుతున్నది. ఏలేరుపాయలు మరో రెండు పిఠాపురం తాలూకాగుండా ప్రవహించి ఉప్పాడవద్ద సముద్రములో కలుస్తున్నది.

## అడవులు

జిల్లాలో 3 వ భాగం అడవులక్రింద వున్నది. వీటివిస్తీర్ణం 1,989.11 చ. మైళ్ళు.

ఇందులో 1,880.48 చ. మైళ్ళు అటవీ శాఖ యాజమాన్యముక్రింద వున్నది. అటవీశాఖ యాజమాన్యము క్రిందవున్న అడవులలో 391 చ. మైళ్ళు రిజర్వు అడవులలో కలపకుండా విడిగావుంచబడ్డాయి. మిగిలిన 1,489.48 చ. మైళ్ళు రిజర్వు అడవులక్రింద వున్నవి. గత 2-3 సంవత్సరాలుగా 85.33 చ. మైళ్ళు విస్తీర్ణంగల అడవిభాగం యెస్టేట్లనుండి స్వాధీనం చేసుకోబడింది. 23.30 చ. మైళ్ళ విస్తీర్ణంగల అడవిమాత్రం వ్యక్తుల అధీనములో వున్నది.

ఎల్లవరం, రాజమండ్రి, రంపచోడవరం తాలూకాల్లోని రిజర్వు అడవులలో శ్రేష్టమైన కలప, వెదురు లభ్యమౌతుంది. పెద్దాపురం తాలూకాలోని అడవులలో వంటచెరకు, వెదురు దొరకుతుంది. పిఠాపురం ప్రాంతంలో యెస్టేట్లనుండి స్వాధీనపరచుకున్న అడవులు చిన్నచిన్న పొదలు మాత్రమే.

తాలూకావారీ అడవులవిభజనను క్రింది పట్టిక సూచిస్తుంది:

| తాలూకా | రిజర్వు అడవులు చ. మైళ్ళు | ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న యెస్టేటు అడవులు చ. మైళ్ళు | స్వాధీనం చేసుకొనని ప్రైవేటు అడవులు చ. మైళ్ళు | మొత్తం అడవుల విస్తీర్ణం చ. మైళ్ళు |
|---|---|---|---|---|
| రంపచోడవరం | 128.70 | ... | 10.70 | 139.40 |
| ఎల్లవరం | 288.80 | ... | 1.50 | 290.30 |
| రాజమండ్రి | 30.50 | ... | 3.10 | 33.60 |
| పెద్దాపురం | 50.28 | ... | 5.50 | 55.78 |
| పిఠాపురం | 11.03 | ... | ... | 11.03 |
| తుని | ... | 15.00 | ... | 15.00 |
| రామచంద్రపురం | ... | ... | ... | ... |
| కాకినాడ | 91.60 | 4.70 | ... | 96.30 |
| రాజోలు | ... | ... | ... | ... |
| అమలాపురం | 13.60 | 64.60 | 2.50 | 70.70 |
| | 1,880.48 | 85.33 | 23.30 | 1,989.11 |

## శీతోష్ణస్థితి, వర్షపాతము

జూన్ నెలలో నైరుతీ ఋతుపవనాలతో వర్షఋతువు ప్రారంభమై 3 నెలలు వుంటుంది. సెప్టెంబరు, అక్టోబరు మాసములలో వుక్కబోసే వాతావరణం వుంటుంది.

ఈశాన్య ఋతుపవనాల వర్షాలు అక్టోబరుతో ప్రారంభమౌతాయి. ఈ కాలంలో సముద్రతీరపు తాలూకాలలో, లోపలిభాగంలోని తాలూకాలకన్న వర్షం అధికంగా పడుతుంది. కాని నైరుతీ ఋతుపవనాల ద్వారా సముద్రతీరంలోని తాలూకాలకన్న జిల్లా లోపలిభాగంలోని తాలూకాలకే అధికవర్షం వుంటుంది. ఏప్రిల్ నుండి జూన్ వరకు వేసవికాలం.

క్రిందిపట్టిక తాలూకావారీగా సగటు వర్షపాతాన్ని, వర్షపు దినాలను తెలియచేస్తుంది :

## సాగు సదుపాయాలు

గోదావరినది జలాలతో రాజోలు, అమలాపురం, రామచంద్రపురం, కాకినాడ తాలూకాలు; రాజమండ్రి తాలూకాలో కొంతభాగం సాగుక్రింద వున్నది.

గోదావరినది, నైరుతి ఋతుపవనముల వలన కలిగే వర్షాల మూలంగా అధిక నీటిని పొందుతున్నది. ఆయకట్టు నీటి అవసరాన్ని తీర్చుటకు స్థానికంగాకూడా వర్షాలుపడటం అవసరం. ఇది కాక జిల్లాలో కొండవాగులక్రింద, చెరువుల క్రింద, - సెలయేళ్ళక్రింద, మురుగు నీటితోనూ కొద్దిస్థాయిలో సాగుచేయబడుచున్నది.

పెద్దాపురం, రాజమండ్రి తాలూకాల్లో కొద్ది చెరువులు అడవివాగుల నీటిచే నింపబడుతున్నాయి. మిగతా చెరువులు వర్షాలపై ఆధారపడేవే.

| తాలూకా | సాలుసరి వర్షము (అంగుళాలలో) | సాలుసరి వర్షపు దినాలు |
|---|---|---|
| నూగూరు | 58.06 | 72.1 |
| భద్రాచలం | 42.76 | 59.5 |
| రంపచోడవరం | 47.13 | 59.8 |
| ఎల్లవరం | 51.01 | 64.2 |
| రాజమండ్రి | 41.32 | 55.9 |
| పెద్దాపురం | 38.62 | 52.9 |
| పిఠాపురం | 36.73 | 46.9 |
| తుని | 37.20 | 47.9 |
| రామచంద్రపురం | 42.39 | 52.8 |
| కాకినాడ | 42.18 | 51.7 |
| రాజోలు | 44.12 | 53.9 |
| అమలాపురం | 46.69 | 53.4 |

రాజమండ్రి తాలూకాలో 534 ఎకరాల సాగుచేస్తున్న ఊటకాలువలున్నవి. పోలవరంపంపింగ్ స్కీముద్వారా రాజోలు తాలూకా, పోలవరం ఐలెండ్ ప్రాజెక్టు ద్వారా అమలాపురం తాలూకా సాగు క్రిందకు తేబడ్డాయి.

రాజమండ్రి తాలూకాలో, పెద్దాపురం తాలూకాలో వర్షాలపై ఆధారపడే చెరువులద్వారా కొంత భూమి సాగుచేయబడుచున్నది. పెద్దాపురంలోని ఏలేరునది క్రింద 17,221 ఎకరాలు సాగుక్రింద వున్నవి. మరొక 356 ఎకరాలు వూటకాలువల క్రింద సాగుచేయబడుచున్నాయి.

తుని, పిఠాపురం తాలూకాలు సాగు సౌకర్యాలు కలవికావు. పేరుకుమాత్రం అచ్చటచ్చట మైనరు ఇర్రిగేషన్ వర్క్సు కలవు. రాజోలు, అమలాపురం తాలూకాల్లో కొబ్బరితోటలు పెంచుటకు నూతినీరు వుపయోగిస్తారు.

జిల్లాలోని మైనర్, మేజరు యిర్రిగేషన్ ఆయకట్టు వివరాలు, మైనర్ యిర్రిగేషన్ వర్క్సు సంఖ్య మున్నగునవి తాలూకాలవారీగా క్రిందిపట్టికలో యివ్వబడినాయి.

## ఆహార - వ్యాపారపంటలు

వరి ప్రధానమైన ఆహారపంట. ఇది రామచంద్రపురం, అమలాపురం, కాకినాడ, రాజోలు తాలూకాల్లో విరివిగా పండించబడుచున్నది. భద్రాచలం, నూగూరు తాలూకాల్లో, యితర ప్రదేశాల్లో స్వల్పంగా జొన్న పండించ బడుతున్నది. మొక్కజొన్న, సజ్జ, రాగి, కొర్ర, వరిగ, తైద మున్నగుపంటలు కూడా అక్కడక్కడ పండించబడుతున్నవి.

| తాలూకా | మైనర్ ఇర్రిగేషన్ వర్క్సుల సంఖ్య | మైనర్ యిర్రిగేషన్ వర్క్సుల క్రింద నున్న ఆయకట్టు (ఎకరాలలో) | మేజర్ యిర్రిగేషన్ ఆయకట్టు (ఎకరాలలో) |
|---|---|---|---|
| నూగూరు | 16 | 382 | |
| భద్రాచలం | 3 | 60 | |
| రంపచోడవరం | 6 | 231 | |
| ఎల్లవరం | 112 | 2,915 | |
| పెద్దాపురం | 379 | 14,704 | |
| రాజమండ్రి | 463 | 16,158 | 2,24,307 |
| రామచంద్రపురం | 47 | 1,473 | |
| కాకినాడ | 46 | 1,337 | |
| రాజోలు | ... | ... | 1,11,716 |
| అమలాపురం | ... | | 92,650 |
| మొత్తం | 1,052 | 37,650 | 4,28,673 |

కోనసీమప్రాంతంలో కొబ్బరితోటలు విరివిగా పెంచబడుతున్నాయి. ఆంధ్ర రాష్ట్రంలో కొబ్బరితోటల పెంపకమునకు ఇది ప్రధానకేంద్రం. ఇచ్చటనుండి కొబ్బరికాయ, పీచు, నూనె, కురిడీలు వివిధ ప్రాంతాలకు ఎగుమతులు చెయ్యబడుతున్నాయి.

పెసలు, కందులు, మినుములు, శనగలు, ఉలవలు జిల్లాలో పండించబడుతున్నాయి. మిర్చి, శనగ, వేరుశనగ, నువ్వు, ప్రత్తి, పొగాకు విరివిగా పండించే వ్యాపార పంటలు. సం॥ర సగటు వుత్పత్తి సంఖ్యలకు దగ్గరగా నున్న 1940 41 సం॥రపు తాలూకావారీ పంటల వుత్పత్తి వివరాలు ప్రక్కపేజీలోని పట్టికలో చూపబడ్డాయి.

| పంట | | [illegible] (ఎకరాలు) | ధర్మవరం (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 3,198 | 1,734 | 1,210 | 3,718 | 39,105 | 58,425 | 28,000 | 22,790 | 1,43,985 | 1,19,667 | 83,823 | 1,24,105 | 6,42,973 |
| | మెట్ట | 6,499 | 8,367 | 1,526 | 2,705 | 15,109 | 7,637 | 707 | ... | 3,262 | 7,782 | 6,837 | 2,343 | 72,624 |
| జొన్న | | 10,282 | 38,015 | 6,604 | 2,471 | 7,891 | 6,351 | 943 | 950 | 1,377 | 48 | 8,792 | 1,982 | 1,00,629 |
| సజ్జ | | ... | 46 | 3,221 | 6,240 | 6,544 | 21,620 | 948 | 11,259 | 27 | 166 | 7 | 14 | 52,050 |
| రాగి | | 56 | 145 | 2,369 | 3 | 5,060 | 6,343 | 705 | 30 | 400 | 1,553 | 864 | 441 | 17,969 |
| చెరకు | | ... | 1 | ... | 14 | 158 | 5,553 | 623 | 275 | 3,460 | 713 | 408 | 43 | 11,259 |
| వేరుశనగ | | ... | ... | 51 | 6 | 220 | 376 | 928 | 798 | 2 | 12 | 14 | 1 | 3,476 |
| నువ్వు | | 3,025 | 928 | 2,705 | 3,142 | 15,409 | 10,411 | 879 | 5,929 | 6,470 | 1,394 | 5,673 | 3,766 | 59.7?1 |
| ప్రత్తి | | ... | 7 | ... | ... | 86 | 5,664 | 1,493 | 905 | 104 | ... | 1 | ... | 8,260 |
| పొగాకు | | 697 | 1,439 | 1,190 | 156 | 5,649 | 1,679 | 212 | 1,278 | 1,971 | 225 | 5,545 | 1,834 | 24,602 |

## రహదారులు

జిల్లాలో 1,808 మైళ్ళ పొడవుగల రోడ్లు వున్నాయి. ఇందులో 165 మైళ్ళు మునిసిపల్ రోడ్లు, 10 మైళ్ళుపబ్లిక్ వర్క్సు డిపార్టుమెంట్ రోడ్లు. జిల్లాలో 69 మైళ్ళు జాతీయరహదార్లు, 21 మైళ్లు రాష్ట్రీయ రహదార్లు, 784 మైళ్ళు ప్రధానమైన జిల్లా రహదార్లు వున్నాయి.

మునిసిపల్, పబ్లిక్ వర్క్సు రహదార్లు మినహాయించి మిగతా వాటిని తాలూకావిభజన క్రిందిపట్టికలో మైళ్ళలో యివ్వబడింది:

## రైళ్ళు

ఈ జిల్లాగుండా $79\frac{1}{2}$ మైళ్ళ రైలు బాట పోవుచున్నది. కలకత్తా-మద్రాసు రైలుమార్గం-గోదావరి (రాజమండి)నుంచి తునివరకు-రాజమండ్రి, రామచంద్రపురం, కాకినాడ, పిఠాపురం, తుని తాలూకాల గుండా పోవుచున్నది. మెయిన్ లైనుకు జిల్లా కార్యస్థానమైన కాకినాడను కలుపుతూ సామర్లకోట - కాకినాడలమధ్య ఒక బ్రాంచిలైను వున్నది. రాజమండ్రి, కాకినాడ, పిఠాపురం, తుని తాలూకా కేంద్రాలకు మాత్రము రైలుసౌకర్యాలున్నాయి. హైదరాబాదు సంస్థానంలోని 'డోర్నకల్', భద్రాచల ప్రాంతానికి దగ్గరరైల్వే కేంద్రం.

| తాలూకా | జాతీయ రహదార్లు | రాష్ట్రీయ రహదార్లు | ప్రధానమైన జిల్లా రహదార్లు | జిల్లా రోడ్లు ఇతరములు | గ్రామ రోడ్లు | మొత్తం రోడ్లు |
|---|---|---|---|---|---|---|
| నూగూరు | ... | ... | 63 | ... | ... | 63 |
| భద్రాచలం | ... | ... | 69 | ... | ... | 69 |
| రంపచోడవరం | ... | ... | 43 | ... | ... | 43 |
| ఎల్లవరం | ... | ... | ... | ... | ... | ... |
| రాజమండ్రి | ... | 10 | 69 | 107 | 11 | 197 |
| పెద్దాపురం | 2 | ... | 150 | 61 | 16 | 229 |
| పిఠాపురం | 16 | ... | 33 | 19 | 21 | 89 |
| తుని | 16 | ... | 19 | 28 | 9 | 72 |
| రామచంద్రపురం | 18 | 3 | 100 | 41 | 73 | 235 |
| కాకినాడ | 17 | 8 | 68 | 44 | 41 | 178 |
| రాజోలు | ... | ... | 98 | 71 | 59 | 22 |
| అమలాపురం | ... | ... | 72 | 22 | 136 | 230 |
| | 69 | 21 | 784 | 393 | 366 | 1,636 |

ఏజెన్సీ ప్రాంతాల్లో కనీస రహదారి సౌకర్యాలుకూడ లేవని పైపట్టిక స్పష్ట పరుస్తోంది.

## జనాభా విస్తీర్ణం

గత 10 సంవత్సరాల్లోనూ జిల్లా మొత్తం జనాభా నూటికి 16 మంది చొప్పున పెరిగింది.

ఈ క్రిందిపట్టికలో తాలూకావారీగా జనాభా వివరాలు యివ్వబడ్డాయి. 1941 జనాభా సంఖ్యలతో పోల్చియేవిధంగా పెంపొందించే పట్టిక తెలియచేస్తుంది.

జిల్లామొత్తం జనాభా 1836 గ్రామల్లోనూ పట్టణాల్లోనూ, 4,36,570 యిళ్ళలో నివసిస్తున్నారు. ఇందులో 3,68,147యిళ్ళు గ్రామాల్లోనూ, 68,423 యిళ్ళు పట్టణాల్లోనూ వున్నాయి.

జిల్లామొత్తం జనాభాయైన 24,14,808 మందిలో 19,54,662 మంది గ్రామాల్లోనూ, 4,60,146 మంది పట్టణాల్లోనూ నివసిస్తున్నారు. జిల్లా జనాభాలో సుమారు ప్రతి 6 గురులోనూ ఒకడు పట్టణంలో నివసిస్తున్నాడు.

| తాలూకా | జనాభా 1941 | జనాభా 1951 | 1941 సం॥ జనాభాపై పెరుగుదల శాతం | గ్రామాలు | * పట్టణములు |
|---|---|---|---|---|---|
| తూర్పుగోదావరిజిల్లా | 20,76,840 | 24,14,808 | 16.3 | 1,816 | 20 |
| నూగూరు | 30,463 | 35,366 | 16.1 | 146 | ... |
| భద్రాచలం | 69,634 | 77,620 | 11.5 | 327 | ... |
| రంపచోడవరం | 36,235 | 40,273 | 11.1 | 232 | ... |
| ఎల్లవరం | 50,214 | 54,525 | 8.6 | 323 | ... |
| రాజమండ్రి | 2,52,572 | 3,21,984 | 27.5 | 80 | 2 |
| పెద్దాపురం | 2,50,465 | 2,87,764 | 14.9 | 197 | 3 |
| పిఠాపురం | 1,24,555 | 1,47,070 | 18.1 | 46 | 2 |
| తుని | 95,607 | 1,16,971 | 22.3 | 48 | 1 |
| రామచంద్రపురం | 3,08,159 | 3,46,056 | 12.3 | 112 | 5 |
| కాకినాడ | 2,96,495 | 3,55,502 | 19.9 | 100 | 2 |
| రాజోలు | 2,79,029 | 3,14,910 | 12.9 | 103 | 2 |
| అమలాపురం | 2,53,412 | 3,16,767 | 18.1 | 102 | 3 |

* కనీసం 5 వేలు, అంతకంటెఎక్కువ జనాభాకల్గి స్పష్టమైన పట్టణ వాతావరణాన్ని గల్గిన పట్టణాలను పట్టికలో చేర్చటమైనది.

తాలూకావారి పట్టణ, గ్రామీణజనాభా సంఖ్యలు, యిండ్ల వివరాలు క్రింది పట్టికలలో యివ్వబడ్డాయి:

| తాలూకా | నివసించే యిండ్లు | | | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|
| | తాలూకా మొత్తం | గ్రామాలలో | పట్టణాలలో | | | |
| నూగూరు | 6,235 | 6,235 | ... | 35,366 | ... | 35,366 |
| భద్రాచలం | 14,208 | 14,208 | ... | 77,620 | ... | 77,620 |
| రంపచోడవరం | 8,127 | 8,127 | ... | 40,273 | — | 40,273 |
| ఎల్లవరం | 10,935 | 10,935 | — | 54,525 | ... | 54,525 |
| రాజమండ్రి | 53,546 | 37,147 | 16,399 | 2,02,740 | 1,19,244 | 3,21,984 |
| పెద్దాపురం | 53,960 | 45,283 | 8,677 | 2,38,418 | 49,346 | 2,87,764 |
| పిఠాపురం | 27,841 | 21,308 | 6,533 | 1,12,896 | 34,174 | 1,47,070 |
| తుని | 23,413 | 19,795 | 3,618 | 98,595 | 18,376 | 1,16,971 |
| రామచంద్రపురం | 61,315 | 51,400 | 9,915 | 2,89,192 | 56,864 | 3,46,056 |
| కాకినాడ | 57,168 | 43,608 | 13,560 | 2,27,370 | 1,28,132 | 3,55,502 |
| రాజోలు | 59,227 | 57,236 | 1,993 | 3,02,348 | 12,562 | 3,14,910 |
| అమలాపురం | 60,593 | 52,865 | 7,728 | 2,75,319 | 41,448 | 3,16,767 |
| | 4,36,570 | 3,68,147 | 68,423 | 19,54,662 | 4,40,146 | 24,14,808 |

తాలూకావారీ జనాభా పెరుగుదలను గమనించిన ఏజెన్సీ తాలూకాలైన ఎల్లవరం, రంపచోడవరం, భద్రాచలం, నూగూరు తాలూకాల్లో యితర ప్రదేశాల కన్న జనాభా పెరుగుదల శాతం తక్కువగా వున్నట్లు తెలుస్తుంది. గత 10 సంవత్సరాల్లో యీ ప్రదేశాల్లోకూడ నూటికి 10-12 చొ॥న జనాభా పెరిగినా, కొండప్రజల జనాభామాత్రం పెరుగుదల లేకపోగా తగ్గిపోయింది.

* కొండజాతిప్రజల జనాభా తాలూకావారీ లభ్యంకాలేదు. కాని వీరి జనాభా క్షీణత ఏ పరిమాణంలో జరుగుతున్నదీ, గుర్తించాలన్న 1941, 1951 సం॥ల కొండజాతి ప్రజల జనాభా లెఖల పోల్చి చూచిన చాలు. 1941 సం॥రం కన్న 1951 సం॥లో ఆంధ్రరాష్ట్రంలో వీరి జనాభా 31,261 మంది తక్కువ. కాని ఏజెన్సీలలోని మైదాన ప్రాంతాలలో మటుకు గత 10 సం॥లో జనాభా నూటికి 50 చొ॥న వృద్ధిచెందారు. ఈ ప్రాంతాలలో చౌకగ లభించే అటవీ సంపద మూలంగానూ, నూతనంగా ప్రారంభించిన వర్జీనియా పొగాకు ఉత్పత్తి కని వలస వచ్చిన డెల్టావాసుల వత్తిడిని యీ పరిమాణం సూచించుతున్నది.

రాజమండ్రి తాలూకా అన్ని తాలూకాలకన్న హెచ్చు పెరుగుదల శాతాన్ని సూచిస్తోంది. దీనికి ముఖ్య కారణం గత 10 సంవత్సరాల్లో రాజమండ్రి పట్టణ జనాభాలో వచ్చిన అభివృద్ధే. జిల్లాకు ప్రధాన వ్యాపార కేంద్ర మగుటచేత 1941-51 సంll మధ్య 30,712 మంది జనాభా అభివృద్ధి అయింది. యిదేవిధంగా జిల్లా కార్యస్థానమైన కాకినాడ పట్టణ జనసంఖ్యకూడ గత 10 సంవత్సరాలలో 24,812 మంది జనాభా అభివృద్ధిఅయింది.

తుని, పిఠాపురం తాలూకాలుకూడ తగిన సంఖ్యలో జనాభా పెరుగుదలను సూచించాయి. అమలాపురం, రాజోలు తాలూకాలు ఫలవంతమైన ప్రదేశాలైనా 12,13 శాతము అభివృద్ధి మాత్రమే సూచిస్తున్నాయి. దీనికి ప్రధాన కారణం, యిచ్చటవున్న జనాభా వత్తిడి ఫలితంగా అనేకమంది యీ ప్రాంతాలనుండి యేజెన్సీ తాలూకాలకు; తుని, పిఠాపురం మున్నగు క్రొత్త సాగు ప్రదేశాలకు వలస పోవుటయేనని 1951 సంllపు జనాభా లెక్కలు సూచిస్తున్నాయి.

## వైద్యం

జిల్లా మొత్తంమీద 1951 వ సంllపు లెక్కల ప్రకారం 9 ప్రభుత్వ ఆసుపత్రులు, 2 లోకల్ ఫండ్ ఆసుపత్రులు, 56 గ్రామీణ వైద్యాలయాలు వున్నాయి. ఏజన్సీ ప్రాంతాల్లో గోకవరం, నాకోటి నగరం అనే చోట్ల 3 వైద్యశాలలు స్థాపించాలని నిర్ణయించినా యివి యెప్పుడూ మూయబడే వుంటాయి.

క్రింది పట్టిక తాలూకావారి ఆసుపత్రుల వివరాలను, అందులోని పెడ్డుల సంఖ్యను తెలియ చేస్తుంది :

| తాలూకా | ఆసుపత్రులు | | పెడ్డుల సంఖ్య | వైద్యశాలలు | | |
|---|---|---|---|---|---|---|
| | గవర్నమెంటు | లోకల్ ఫండ్ | | గవర్నమెంట్ | లోకల్ ఫండ్ | గ్రామాలు |
| నూగూరు | 1 | ... | 6 | 1 | ... | ... |
| భద్రాచలం | 1 | ... | 12 | ... | ... | ... |
| రంప చోడవరం, ఎల్లవరం | ... | ... | ... | 2 | 3 | ... |
| రాజమండ్రి | 1 | ... | 90 | ... | 6 | 1 |
| పెద్దాపురం | 1 | ... | 8 | 1 | 4 | 4 |
| పిఠాపురం | ... | 1 | 12 | ... | ... | 2 |
| తుని | 2 | ... | 22 | ... | .... | 2 |
| రామచంద్రపురం | 1 | ... | 7 | ... | 4 | 5 |

| తాలూకా | ఆసుపత్రులు | | బెడ్డుల సంఖ్య | వైద్యశాలలు | | |
|---|---|---|---|---|---|---|
| | గవర్నమెంటు | లోకల్ ఫండ్ | | గవర్నమెంటు | లోకల్ ఫండ్ | గ్రామాలు |
| కాకినాడ | 1 | ... | 310 | 1 | 5 | 3 |
| రాజోలు | ... | 1 | 16 | ... | ... | 4 |
| అమలాపురం | 1 | ... | 22 | ... | 2 | 6 |
| | 9 | 2 | 505 | 5 | 24 | 27 |

ఇది కాక రాజమండ్రిలో క్షయరోగ వైద్యశాల, స్త్రీల మిషన్ ఆస్పత్రి కలవు. రామచంద్రపురంలో 165 మంచములతో కుష్టురోగుల వైద్యశాల మిషన్ వారిచే నడపబడుతున్నది.

## పరిశ్రమలు

ఏజన్సీ ప్రదేశంలోనూ, తుని తాలూకాలోనూ ఫ్యాక్టరీ చట్టంక్రింద వచ్చే పరిశ్రమలు లేవు. జిల్లాలో పేర్కొనవలసిన పరిశ్రమలు: రాజమండ్రి లోని కాగితపుమిల్లు, పందలపాకలోని నూలుమిల్లులు, పిఠాపురం, సామర్లకోట లలోని పంచదార ఫ్యాక్టరీలు.

క్రిందిపట్టిక తాలూకావారీగా పరిశ్రమలను, అందులో పనిచేస్తున్నవారిసంఖ్యలను 1951 సం॥లో నున్నట్లు తెలియచేస్తుంది:

| పరిశ్రమ పేరు | ఫ్యాక్టరీల సంఖ్య | పనివారల సంఖ్య |
|---|---|---|
| రాజమండ్రి తాలూకా | | |
| కాగితపుమిల్లు | 1 | 472 |
| పండ్ల నిల్వ | 1 | 81 |
| ప్రింటింగు | 4 | 101 |
| ఇంజనీరింగు | 15 | 784 |
| ఆహారం | 7 | 215 |
| పుగాకు | 3 | 3,365 |
| లోహ పరిశ్రమ | 24 | 400 |
| అల్యూమినియం | 94 | 1,747 |
| పెద్దాపురం తాలూకా | | |
| సిల్కుమిల్లు | 6 | 234 |

| పరిశ్రమ పేరు | ఫ్యాక్టరీలసంఖ్య | పనివారల సంఖ్య |
|---|---|---|
| **పిఠాపురం తాలూకా** | | |
| బియ్యపుమిల్లులు | 8 | 112 |
| పంచదార ఫ్యాక్టరీ | 1 | 500 |
| **అమలాపురం తాలూకా** | | |
| బియ్యపు మిల్లులు | 12 | 144 |
| **రామచంద్రపురం తాలూకా** | | |
| బియ్యపుమిల్లులు | 24 | 337 |
| పుగాకు | 3 | 2,812 |
| నూలు మిల్లులు | 2 | 461 |
| ఇటుక, పెంకు | 4 | 126 |
| **కాకినాడ తాలూకా** | | |
| బియ్యంమిల్లులు | 30 | 406 |
| పంచదార | 1 | 836 |
| నూనెమిల్లులు | 4 | 105 |
| కంచుగోత | 8 | 104 |
| ఇంజనీరింగ్ | 10 | 300 |
| బండ్ల నిర్మాణం | 3 | 129 |
| పుగాకు | 2 | 207 |
| పీచు | 18 | 467 |
| పెంకు | 5 | 196 |
| **రాజోలు తాలూకా** | | |
| బియ్యపు మిల్లులు | 9 | 101 |

# పశ్చిమగోదావరి జిల్లా

## చరిత్ర

ఈ జిల్లా 1925 లో ప్రత్యేక జిల్లాగా యేర్పడింది. అంతకు ముందు యీ జిల్లా నేటి కృష్ణా, తూర్పుగోదావరి జిల్లాలలో కలసివుండేది. 1859 లో పశ్చిమగోదావరి ప్రాంతము గోదావరి జిల్లాలో భాగంగా వుండేది. 1874 లో భద్రాచలం తాలూకా, 1881 లో గోలుగొండ ఏజన్సీ ప్రాంతము గోదావరి జిల్లాలో కలపబడ్డాయి. దానితో జిల్లా పెద్దదై పరిపాలనాభారం పెరిగింపని చెప్పి 1904లో బ్రిటిష్ ప్రభుత్వం గోదావరినదికి ఉత్తరాన ఉన్న భాగాన్ని తూర్పుగోదావరిజిల్లాగాచేసి, గోదావరికి దక్షిణాన ఉన్న భాగాన్ని కృష్ణా జిల్లాలో కలిపింది. అయితే తూర్పు గోదావరిజిల్లాను, పశ్చిమగోదావరిజిల్లా ఏర్పడేవరకు గోదావరిజిల్లా అనే పిలుస్తుండేవారు. 1904 లో గోదావరిజిల్లా యేర్పాటు చేయబడ్డప్పుడు పోలవరం తాలూకా కృష్ణాజిల్లాకు మార్చబడలేదు. గోదావరిజిల్లాలోనే వుంచబడింది.

కృష్ణాజిల్లాలోని కొన్ని తాలూకాలను, గోదావరి జిల్లాలోని పోలవరం తాలూకాను కలిపి పశ్చిమగోదావరి జిల్లాగా ఏర్పాటు చేయాలని 1925 ఏప్రిల్ 15వ తేదీన ప్రభుత్వం ఉత్తరువు జారీ చేసింది. అప్పటినుండి పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి అనే జిల్లాలు యేర్పడ్డవి.

పశ్చిమగోదావరిజిల్లా యిటీవలవరకూ కృష్ణాజిల్లాలోనూ, గోదావరిజిల్లాలోనూ కలిసియుండుటవలన పశ్చిమగోదావరిజిల్లా చరిత్ర చాలవరకు ఆ జిల్లాలనుపోలివుంది. పశ్చిమగోదావరి, తూర్పుగోదావరివలె కళింగదేశంలో భాగంకాదు. పశ్చిమగోదావరి వేంగిదేశములోభాగంగావుండేది. గోదావరినది కళింగ, వేంగిదేశాలను వేరుపరిచింది.

### ప్రొలూరు ఓడరేవు

క్రీ. పూ. మూడవ శతాబ్దంనుండి షుమారు నాలుగున్నర శతాబ్దములవరకు పశ్చిమగోదావరి ప్రాంతం ప్రథమాంధ్ర రాజ్యమైన శాతవాహన రాజ్యంలో భాగంగా వుండేది. శాతవాహనుల కాలంలో గోదావరీ ముఖమునందు ప్రొలూరు అనే రేవుపట్టణమొకటి వుండేదని టాలెమీ అనే భూగోళ శాస్త్రజ్ఞుని వ్రాతలనుబట్టి తెలుస్తున్నది. టాలెమీ ఆంధ్రదేశప్రాంతంలో అనేక రేవులను పేర్కొన్నాడు. అయితే ప్రొలూరు ఎక్కడవున్నదీ తెలియడం లేదు. ఒక విషయంమాత్రం చెప్పవచ్చును. శాతవాహనుల కాలమున చైనా, బర్మా, సయాం, రోము మొద

త్యాం దేశాలతో వ్యాపార సంబంధాలు కొనసాగించుచున్న ఆంధ్ర వాణిజ్య కేంద్రాలలో యీ పశ్చిమగోదావరి ప్రాంతంలోని ప్రాలూరు అనే రేవు వుండేది. ప్రాలూరు సముద్రగర్భంలోకి పోయి అంతర్థానమై యుండవచ్చును. ప్రాలూరు అనగా ధాన్యపు కొఠారు అని అర్థం.

## గుంటుపల్లి బౌద్ధారామం

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరుతాలూకాలో గుంటుపల్లిలో శాతవాహనుల నాటి బౌద్ధసంఘారామం వుంది. గుంటుపల్లి కామవరపుకోటకు ఆరు మైళ్ళ దూరంలోవుంది. ఇది క్రీ.పూ 3వ శతాబ్దానికిచెందిన గుహాలయం, సంఘారామం. క్రీ.పూ. రెండవశతాబ్దంలో యీ సంఘారామములో "సూయజ్ఞనాథుడు"నే శ్రమణకుడు బౌద్ధమతాన్ని బోధించాడని అక్కడ దొరికిన శాసనాలనుబట్టి తెలుస్తున్నది. ఇక్కడ ఏకశిలా నిర్మితమైన పెద్దస్తూపమువుంది. స్తూపంమీద అర్ధచంద్రాకారముగ ఒక "వార్మిక", దానిపైన ఒకఛత్రాకారంలో ఒకకప్పు వుండేవట. అదియిప్పుడు నాశనమైంది. ఇక్కడ బౌద్ధభిక్షువులు వుండటానికి ఆరామాలు వున్నవి.

గుంటుపల్లి బౌద్ధారామంలో పూజా పురస్కారాల చిహ్నాలేమీ కనబడక పోవడంవలన, ఈగుహలు హీనయానానికి చెందిన బౌద్ధఆరామమని చరిత్రకారులూహించుచున్నారు. మహాయానములో విగ్రహారాధనవుంది.

శాతవాహనుల తరువాత పశ్చిమగోదావరీ ప్రాంతాన్ని అర్ధశతాబ్దంవరకు సూర్యవంశీకులమనిచెప్పుకున్న ఇక్ష్వాకులు పాలించారు. ఇక్ష్వాకులు, శాతవాహనులకు సామంతులుగా ఉంటూ, శాతవాహనరాజ్యం దుర్బలమైన సమయాన్ని కనిపెట్టి విజృంభించి వుంటారని చరిత్రకారుల యూహ.

## బృహత్ఫలాయనుల పాలన

ఇక్ష్వాకుల తరువాత కృష్ణా గోదావరి నదులమధ్య ప్రాంతంలో అధికారానికి వచ్చినవారు బృహత్ఫలాయనులు. బృహత్ఫలాయనులు క్రీ.శ. మూడవశతాబ్దాంతమున రాజ్యపాలన చేసారు. బృహత్ఫలాయనుల పరిపాలన అట్టేకాలం సాగలేదు. 20 సంవత్సరాలలోనే ముగిసి పోయింది. బృహత్ఫలాయనుల తరువాత అధికారానికి వచ్చిన ఆనంద గోత్రీకులైన కందర రాజులుకూడ యిరవై సంవత్సరాలకంటె ఎక్కువకాలం పాలించలేదు.

క్రీ. శ. నాల్గవశతాబ్ద ప్రారంభమున శాలంకాయనులు వేంగి దేశాధిపతులయ్యారు. వీరు షుమారు ఒక శతాబ్దం పాటు వేంగిదేశాన్ని పాలించారు. శాలంకాయనులకు రాజధాని వేంగినగరం. వేంగి నగరము యిప్పటినుండి 500 సంవత్సరాల వరకు ఆంధ్రను పాలించిన రాజులకు రాజధానీ నగరంగావుంది. తూర్పుచాళుక్య రాజైన మొదటి అమ్మరాజు, వేంగీరాజ్య రాజధానిని రాజమహేంద్రవరానికి మార్చినతరువాత వేంగి నగరప్రాముఖ్యత పోయింది.

## వేంగి నగరం

వేంగినగరం ఏలూరుకు సమీపాన వున్నది. వేంగి ఆరోజులలో మహానగరం. గొప్ప విద్యాకేంద్రం. ఆచార్య

దిఙ్నాగుడనే సుప్రసిద్ధ బౌద్ధాచార్యుడు వేంగినగర సమీపంలో ఒక బౌద్ధాలయంలో అవసానకాలాన్ని గడిపాడట.

శాలంకాయన రాజులు చిత్రరథస్వామి ఆరాధకులు. చిత్రరథస్వామి అంటె సూర్యుడు. శాలంకాయనులు బౌద్ధమతాన్ని, హిందూమతాన్ని కూడ ఆదరించారు. శాలంకాయన రాజులు వేంగి నగరంలో చిత్రరథస్వామి ఆలయమనే పెద్ద దేవాలయాన్ని నిర్మించారు. నేడు ఆదేవాలయపు శిథిలాలు మాత్రమే కనబడతాయి.

విద్యాపీఠముగ, రాజధానీ నగరంగా ప్రసిద్ధి చెందిన వేంగినగరం కాలక్రమాన రూపుమాసిపోయింది. దాని స్థానంలో పెదవేగి, చినవేగి అనే చిన్నపల్లెలు వెలిశాయి. పెదవేగియే ప్రాచీనకాలపు వేంగినగరమని చెబుతారు. శాలంకాయనుల కాలంలో ప్రాలూరు రేవు ఉచ్ఛస్థితిలో ఉన్నది.

వేంగినగరాన్నిబట్టే కృష్ణా గోదావరుల మధ్యప్రదేశానికి వేంగిదేశమనీ, వేగి దేశమనీ పేరు వచ్చింది. మధ్యలో విష్ణుకుండినులకు దక్క తూర్పు చాళుక్యులకు చాల కాలంవరకు వేంగి నగరమే రాజధాని. క్రీ. శ. పదవ శతాబ్దం ప్రారంభంలో మొదటిఅమ్మరాజు విష్ణువర్ధనుని కాలంలో తూర్పు చాళుక్యుల రాజధాని వేంగినగరాన్నుండి రాజమహేంద్రవరానికి మార్చబడింది. అప్పటి నుండి తరువాత రెడ్డి రాజుల కాలంవరకు రాజమహేంద్రవరమే రాజధానిగ వున్నది.

శాలంకాయనరాజు హస్తివర్మ పశ్చిమ గోదావరీ ప్రాంతాన్ని పాలిస్తున్న కాలంలోనే సముద్ర గుప్త చక్రవర్తి ఆంధ్రదేశంపై దండెత్తి వచ్చాడు. హస్తివర్మ పల్లవరాజైన విష్ణుగోపవర్మ మొదలైన రాజులతో కలసి సముద్రగుప్తుని దండయాత్రను ఎదుర్కొన్నాడు. ఇతడ నేక శత్రురాజులను జయించినట్లు పెదవేగి శాసనంలో పేర్కొనబడ్డది.

## విష్ణుకుండినుల రాజధాని

శాలంకాయనుల రాజ్యాన్నంతం చేసి, విష్ణుకుండినులు ఆంధ్రదేశంలో అధికారంలోకి వచ్చారు. విష్ణుకుండినులు నూటయాభై సంవత్సరాలవరకు పరిపాలన చేసారు. మధ్యలో ఒకసారి పల్లవరాజు మూడవసింహవర్మ దండెత్తి దిగ్విజయయాత్ర చేసినప్పటికీ అది స్వల్పకాలం మాత్రమే. కాని పల్లవులవత్తిడి అనేది వుండటం మూలాన కాబోలు క్రీ. శ. 530-540 ప్రాంతంలో రాజ్యంచేసిన రెండవ విక్రమేంద్రవర్మ అనే విష్ణుకుండినరాజు తన రాజధానిని అమరావతి నుండి దెందులూరు గ్రామానికి మార్చాడు. దెందులూరు ఏలూరు-రాజమండ్రి రైలు మార్గంలో వున్న స్టేషను. వేంగి, దెందులూరులలో అనేక ప్రాచీన శివాలయ శిథిలాలు కనబడతాయి. విష్ణుకుండినులు శైవ మతాభిమానులు.

విష్ణుకుండినుల కాలంలో గోదావరి తీరంలో బ్రాహ్మణులు చాల అగ్రహారాలను పొందారు.

రెండవ విక్రమేంద్రవర్మ కాలంలో కళింగరాజులు పశ్చిమగోదావరి ప్రాంతాలపై దండెత్తివచ్చారు. కాని విక్రమేంద్రవర్మ వారిఆటలు సాగనివ్వలేదు. క్రీ. శ. ఏడవ శతాబ్దారంభంలో మూడవ మాధవవర్మ అనే విష్ణుకుండిన రాజు రాజ్యం చేస్తున్నకాలంలో చాళుక్యరాజైన రెండవ

పులకేశి ఆంధ్రదేశంపై దండెత్తివచ్చాడు. అప్పుడు మూడవ మాధవవర్మకు రెండవ పులకేశికి కొల్లేటి వెనువుదుర్గము వద్ద యుద్ధం జరిగింది. ఆయుద్ధంలోనే మాధవ వర్మ మరణించాడు.

## నిడదవోలు దుర్గం

క్రీ. శ. 611 ప్రాంతంలో విష్ణుకుండిన రాజ్యాన్నంతా మందించి చాళుక్యులు వేంగి దేశాన్ని హస్తగతం చేసుకున్నారు. వేంగిదేశాన్ని పాలించిన చాళుక్యులకు వేంగీ చాళుక్యులనీ, తూర్పు చాళుక్యులనీ పేరు. ప్రథమ తూర్పుచాళుక్యరాజైన విష్ణువర్ధనుని రాజధాని వేంగీనగరమే. తూర్పు చాళుక్యుల కాలంలో పశ్చిమగోదావరి జిల్లాలోని నిడదవోలు ఒక దుర్గంగా వుండేది.

మొదటి చాళుక్య భీమరాజు కాలంలో (క్రీ. శ. 918) రాష్ట్రకూటులు వేంగిదేశంపై దండెత్తి రాగా చాళుక్య భీముడు నిడదవోలు దుర్గాన్నాధారం చేసుకుని రాష్ట్రకూటులను పారద్రోలాడు. ఈ మొదటి చాళుక్యభీముడే పాలకొల్లులోని దేవాలయాన్ని నిర్మించాడు. ఇదికూడ పంచారామాల్లో ఒకటి. దీన్ని క్షీరారామం అంటారు.

## పెనుగొండ

పెనుగొండ వైశ్యులకు కేంద్రం. పెనుగొండలో వాసవికన్య అను అందమైన వైశ్యకన్య వుండేదట. ఆమె తండ్రి పేరు కుసుమసెట్టి. రాజమహేంద్రవరం రాజధానిగా ఆంధ్రదేశాన్ని ఆ కాలంలో పరిపాలించుతున్న చాళుక్యచక్రవర్తి రాజరాజ విష్ణువర్ధనుడు వాసవికన్యను బలవంతాన పట్టుకుని వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో పెనుగొండపై దాడి చేశాడు. కుసుమసెట్టి తన కూతురును విష్ణువర్ధనునికిచ్చి వివాహము చెయ్య నిరాకరించుతాడు. వాసవికన్య మానాన్ని రక్షించుకోడానికై చితిపేర్చుకుని అందులో పడి చచ్చిపోతుంది. అప్పటినుండి ఆమె వైశ్యకులదేవతగా పరిగణించబడుతున్నదని కన్యకాపురాణంలో చెప్పబడింది.

పెనుగొండలో 602 గోత్రాల వైశ్యులుండేవారు. వాసవికన్య ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోడానికి అగ్నిలో దూకి చచ్చిపోయినప్పుడు ఆమెతోపాటు 102 గోత్రాలకు చెందిన పెద్దలుకూడా అగ్నిలో దూకి చచ్చిపోయారు. మిగతా గోత్రాలవారు భయపడి పారిపోయారు. వాసవికన్యతోపాటు మరణించిన పెద్దల గోత్రాలవారు మాత్రమే శుద్ధమైన వైశ్యులుగ గుర్తించబడిరి. మిగతా గోత్రాలవారు వెలివేయబడ్డారు.

ఆ కాలంలో వైశ్యులు "నాకరం" అనే వర్తక సంస్థలను నిర్మించుకునేవారు.

తూర్పు చాళుక్యుల కాలంలో పెనుగొండ జైనకేంద్రం. అక్కడొక జైన మఠం ఉండేదట. లంకలకోడేరు, బొండాడలుకూడ జైన కేంద్రాలు.

తూర్పు చాళుక్యుల తరువాత 14వ శతాబ్దం ప్రారంభంవరకు వెలనాటి చోడులు పశ్చిమగోదావరి ప్రాంతాన్ని పాలించారు. మధ్యలో 1118 నుండి 1135 వరకు పశ్చిమచాళుక్యరాజైన ఆరవ విక్రమాదిత్యుడు ఆంధ్రదేశాన్ని పాలించాడు. ఇతని కాలంలో ఆంధ్రదేశానికి కన్నడ సంపర్కం పెరిగింది.

రాజనే చోడరాజువంశీకుడు పాలించుచుండేవాడు. ఇతని రాజధాని భీమవరం. తణుకు తాలూకాను, కృష్ణాజిల్లాలో కొంతభాగాన్ని సూర్యవంశపురాజయిన తమ్మరాజు పాలించుచుండేవాడు. ఈ సూర్యవంశపు రాజులకు నూజివీడు తాలూకాలోని నూరవరం రాజధాని. ఈ తమ్మరాజుకొడుకు ఉండ్రాజనే. ఆయన కాలంలో తణుకు తాలూకాలోని ఉండ్రాజవరం, భీమవరం తాలూకాలోని ఉండి గ్రామం నిర్మించబడ్డట్లుగ చరిత్రకారు లూహించుచున్నారు. నిడదవోలు ప్రాంతాన్ని చాళుక్యవంశీకులు పాలించేవారు.

కొండవీటి రెడ్డిరాజు అనపోతారెడ్డి విశాఖపట్టణం జిల్లావరకు జయించి ఆంధ్ర కోస్తాప్రాంతాన్ని కొండవీటి రాజ్యంలో కలిపివేశాడు. కాని అనపోతారెడ్డి ప్రతి సంవత్సరం శత్రువులతో పోరాడ వలసి వచ్చింది. చోడభక్తిరాజు నూరవరం పాలకుల స్నేహితుడు. భక్తిరాజు నూరవరంవద్ద అనపోతారెడ్డిని ఓడించాడు. దానివలన కృష్ణాగోదావరీ నదులమధ్య ప్రాంతాన్ని రెడ్డిరాజులు కోల్పోగా, అనవేమారెడ్డి తిరిగి కోస్తా ఆంధ్రపై ఆధిపత్యాన్ని నెలకొల్పుతాడు. రాజమహేంద్రవరం రెడ్డిరాజులకు, కొండవీటి రాజులకు మధ్య జరిగిన యుద్ధాలలో యీప్రాంతం చేతులు మారుతూవచ్చింది.

కొండవీటిరెడ్డిరాజ్యం క్రీ.శ. 1424లో పతనమైంది. కొండవీటి రెడ్డిరాజుల కాలంలో ఏలూరులో ఒక కోటవుండేది. ఆకోట యిప్పుడు శిథిలమై పోయింది. ఆ శిథిల ప్రదేశంలో ఏలూరు మున్సిపల్ హైస్కూలు, పోలీసుస్టేషను, వగైరా ప్రభుత్వ ఆఫీసులున్నవి.

## బ్రిటిషు ఆక్రమణ

కొండవీటి రెడ్డిరాజుల అనంతరం మిగతా ఆంధ్రదేశమువలెనే పశ్చిమగోదావరిజిల్లాకూడ విజయనగర రాజ్యంలో చేరిపోయింది. 1565లో తళ్ళికోట యుద్ధానంతరం ఆంధ్రదేశం గోల్కొండ నవాబుల ఆధిపత్యంలోను, 1687 తరువాత ఢిల్లీ మొగలాయిల ఆధిపత్యంలోనుఉన్నది. ఆంధ్రదేశం మొగల్‌చక్రవర్తుల దక్కను సుబాలో భాగమయింది. ఈ సుబాలో ఏలూరు సర్కారు ఒకటి. 1724లో దక్కను సుబేదారు, నేటి నిజాం నవాబుల మూలపురుషుడైన నిజాముల్‌ముల్కు ఆసఫ్‌జా స్వతంత్రం ప్రకటించి నైజాము రాజ్యాన్ని యేర్పాటుచేసినందువల్ల పశ్చిమగోదావరిజిల్లా ఇతర సర్కారులతోపాటు తెలంగాణాతో కలిసి నైజాం పాలనలో వుండేది. నిజాముల్‌ముల్కు ఆసఫ్‌జా మరణానంతరం సింహాసనానికి ఏర్పడిన తగాదాలలో ఫ్రెంచివారు, ఇంగ్లీషువారు జోక్యంకల్గించుకొని, ఫ్రెంచివారు సలాబత్‌జంగ్‌ను నవాబుగ చేసినప్పుడు పశ్చిమగోదావరి జిల్లాను, యితర సర్కారు జిల్లాలను సలాబత్‌జంగ్ ఫ్రెంచివారికి ధారపోసాడు. తరువాత విజయనగరం రాజా సాయంతో ఇంగ్లీషు సేనాని కల్నల్ ఫోర్డు ఫ్రెంచివారి నోడించగా సలాబత్‌జంగ్ సర్కారు జిల్లాలను ఇంగ్లీషువారికి ధారాదత్తం చేసాడు. అప్పటినుండి తెలంగాణా, తక్కిన ఆంధ్రదేశం నుండి విడిపోవడం జరిగింది.

**మాధవాయిపాలెం ఓడ రేవు**

గోల్కొండ నవాబుల కాలంలో డచ్చివారు 1628 లో నరసాపురంలో ఒక యినప కార్ఖానాను పెట్టుకున్నారు. నరసాపురానికి దగ్గరలోవున్న మాధవాయి పాలెంలో ఇంగ్లీషువారు 1677 లో ఒక ఫ్యాక్టరీ పెట్టుకున్నారు. మాధవాయి పాలెం ఆ రోజులలో పెద్ద ఓడరేవు. ఇక్కడ పెద్ద పెద్ద ఓడలు మరామత్తు చేయబడేవట.

## భూ గో ళం

**జిల్లా** కార్యస్థానం ఏలూరు. విస్తీర్ణం 3,015 మైళ్ళు. జనాభా 16,97,727.

పశ్చిమ గోదావరి జిల్లాకు దక్షిణమున బంగాళా ఖాతము, కృష్ణాజిల్లా సరిహద్దులుగా వున్నవి. ఉత్తరమున హైదరాబాదు సంస్థానం, పశ్చిమాన కృష్ణాజిల్లా, తూర్పున తూర్పుగోదావరిజిల్లా దీని సరిహద్దులు.

1925 వ సంవత్సరంలో పాత కృష్ణా జిల్లాను విడగొట్టడం ద్వారా యీ జిల్లా యేర్పాటు చేయబడింది. ఈ జిల్లాలోని ఏజెన్సీ తాలూకాయైన పోలవరం 1942 సంవత్సరంలో తూర్పుగోదావరి జిల్లా నుండి విడగొట్టబడి దీనిలో కలపబడింది.

జిల్లా 4 రెవిన్యూ భాగములు క్రింద, 8 తాలూకాల క్రింద విభజింపబడింది. క్రింది పట్టిక రెవిన్యూ డివిజనుల, తాలూకాల విభజనను, తాలూకాల విస్తీర్ణతను, నాటి కార్యస్థానాలను తెలియచేస్తుంది:

| రెవిన్యూ డివిజను పేరు. | రెవిన్యూ డివిజను కార్యస్థానం | రెవిన్యూ డివిజనులోని తాలూకాలు | తాలూకా విస్తీర్ణం చ. మైళ్ళలో | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| ఏలూరు | ఏలూరు | ఏలూరు | 510 | ఏలూరు |
| | | చింతలపూడి | 418 | చింతలపూడి |
| కొవ్వూరు | కొవ్వూరు | కొవ్వూరు | 391 | కొవ్వూరు |
| | | పోలవరం | 551 | పోలవరం |
| భీమవరం | భీమవరం | భీమవరం | 292 | భీమవరం |
| | | తాడేపల్లి<br>గూడెం | 360 | తాడేపల్లి<br>గూడెం |
| నరసాపురం | నరసాపురం | నరసాపురం | 279 | నరసాపురం |
| | | తెణుకు | 214 | తెణుకు |
| | | మొత్తం | 3,015 | |

తూర్పుకనుమలలో భాగమైన కొండలతో, గుట్టలతో నిండివుండే పోలవరం తాలూకాను జిల్లాలో ప్రత్యేకభాగంగా యెంచవచ్చు. చింతలపూడి తాలూకా, తాడేపల్లిగూడెం, కొవ్వూరు తాలూకాలు, ఏలూరు తాలూకా ఉత్తరభాగాలు మెట్ట భూములు. గోదావరీ, కృష్ణానదీ జలాలతో సాగుచేయబడే ప్రాంతాన్ని డెల్టాగా యెంచవచ్చు.

నరసాపురం ప్రాంతంలో సముద్ర తీరంలో సేద్యానికి పనికిరాని భూములు, చిన్నచిన్న అడవులు కన్పిస్తాయి.

ఏలూరు తాలూకాకు దక్షిణంగా సారవంతమైన కృష్ణా, గోదావరి డెల్టా భూములను విడగొట్టుతూ కొల్లేరు సరస్సుగలదు. చుట్టుపట్ల డెల్టా మురుగంతా దీనిలోకి చేరుకుంటుంది. ఉప్పుటేరుద్వారా కొల్లేటి సరస్సు సముద్రంతో కలుపబడింది. మొత్తం మురుగునీరంతా పోవుటకు ఉప్పుటేరు సరిపోదు కనుక కొల్లేరు సరస్సు సమీపంలోని భూములు హెచ్చుభాగం ముంపుతో వుండటం జరుగుతూంది.

మెట్ట భూములుకూడ, చింతలపూడి తాలూకాలో కన్పించే గుట్టలు మినహాయిస్తే చక్కటి మైదానాలే.

డెల్టా ప్రాంతం కనుచూపుమేరకు యెటుచూచినా పచ్చగా కనుల పండువుగా కన్పిస్తుంది.

## నదులు

జీవనదియైన గోదావరినది తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలకు సరిహద్దుగా ప్రవహిస్తున్నది.

చింతలపూడి, ఏలూరు తాలూకాలకు పశ్చిమ సరిహద్దుగా ప్రవహించే తమ్మిలేరు, చింతలపూడి తాలూకా వుత్తరభాగంలో ప్రవహించి కొవ్వూరు తాలూకా పశ్చిమసరిహద్దునసాగే యెర్రకాలువ, బైనేరునది, కొవ్వాడ కాలువ, పోలవరం తాలూకాలోని జలలేరు, కొవ్వూరు తాలూకాలోని గాళ్ళుమడుగు, ఏలూరు తాలూకాలోని గుండేరు జిల్లాలోని చిన్న నదులు. ఇవి వ్యవసాయావసరాలకు తోడ్పడే చెరువులకు నీరు పెట్టుటకు వుపయోగపడుతున్నాయి.

## అడవులు

జిల్లాలో 384.30 చ॥ మైళ్ళ విస్తీర్ణం గలిగిన అడవులున్నాయి. ఇందులో 178.7 చ॥ మైళ్ళ విస్తీర్ణం రిజర్వు అడవులక్రిందను, 205.6 చతురపు మైళ్ళ విస్తీర్ణం యెస్టేటు అడవులక్రిందను వున్నది. ఇందులో 98.5 చ. మై. విస్తీర్ణం గలిగిన అడవులను, ఎస్టేట్లనుండి ప్రభుత్వం స్వాధీనంచేసుకొన్నది. 107.1 చ. మై. విస్తీర్ణం గలిగిన యెస్టేటు అడవులు (1951 మార్చినాటి పరిస్థితి) యింకా ప్రభుత్వ అధీనంలోకి రావలసియున్నది. తాలూకావారీ అడవుల పరిస్థితిని ప్రక్కపేజీలోని పట్టిక తెలియచేస్తుంది.

| తాలూకా | రిజర్వు అడవులు చ. మైళ్ళు | ప్రభుత్వాధీనానికి వచ్చిన యెస్టేటు అడవులు (చ. మైళ్ళు) | ప్రభుత్వాధీనానికి రాని ఎస్టేటు అడవులు (చ. మైళ్ళు) | మొత్తం (చ. మైళ్ళు) |
|---|---|---|---|---|
| పోలవరం | 104.20 | 70.1 | 105.6 | 279.90 |
| చింతలపూడి | 39.60 | 6.6 | ... | 46.20 |
| కొవ్వూరు | ... | 0.20 | ... | 0.20 |
| ఏలూరు | 5.20 | 21.60 | ... | 26.80 |
| తాడేపల్లిగూడెం | 13.10 | ... | ... | 13.10 |
| భీమవరం | 14.60 | ... | 1.5 | 15.10 |
| నరసాపురం | 2.00 | ... | ... | 2.00 |
| మొత్తం | 178.70 | 98.5 | 107.1 | 384.30 |

పోలవరం తాలూకాలోని రిజర్వు ఫారెస్టులో వెదురు, వంటచెరుకు, కలప దొరుకుతుంది. చింతలపూడి, కొవ్వూరు, ఏలూరు తాలూకాలలోని ఎస్టేటు అడవులు గుబ్బలు, పొదలుతో మాత్రమే నిండివున్నాయి. భీమవరంలోని అడవులు తోపులు మాత్రమే.

## శీతోష్ణస్థితి

జూన్, సెప్టెంబరు నెలల మధ్య నైరుతి ఋతుపవనములవల్ల జిల్లాలో ప్రధానమైన వర్షాలు కురుస్తాయి. అక్టోబరు, నవంబరు నెలల మధ్య ఈశాన్య ఋతుపవనం నుండి చెదరుగా వానలు పడతాయి.

డిశంబరు, జనవరి నెలలలో పోలవరం తాలూకా మిగతా ప్రాంతంకన్న శీతలంగా వుంటుంది.

సంవత్సరంలో సగటున ఆయా తాలూకాలకు యెన్ని వర్షపు దినాలుండేదీ, యెంతెంత వర్షాలు పడేదీ ప్రక్కపేజీలోని పట్టిక తెలియచేస్తుంది:

## సాగు సదుపాయాలు

గోదావరి, కృష్ణా డెల్టాలనుండి సప్లయి చేయబడే నీటితో జిల్లాలో ప్రధానంగా సాగుచేయబడుతున్నది. మెట్ట తాలూకాలలో వర్షాలపై ఆధారపడే చెరువుల సాయంతోనూ, చిన్నచిన్న ప్రవాహాలచే నింపబడే చెరువునీళ్ళతోనూ అచ్చటచ్చట సాగుచేయబడుతున్నది. సముద్ర తీరంలో గొట్టపుబావుల ద్వారా మెట్ట సేద్యం జరుగుతున్నది. కొవ్వూరు, తాడేపల్లిగూడెం, ఏలూరు తాలూకాలలోని మెటభూములకు, చింతలపూడి తాలూకాలకు నీటి సౌకర్యాలు లేవు. తాలూకా వారీ నీటిసప్లయి సౌకర్యాలు క్రింద యివ్వబడ్డాయి:

### పోలవరం తాలూకా

బైనేరు అనే కొండవాగు, వర్షాలపై ఆధారపడే చెరువులు యీ తాలూకా

| తాలూకా | సాలుసరి వర్షపాతం అంగుళాలలో | సాలుసరి వర్షపు దినాలు |
|---|---|---|
| పోలవరం | 44.46 | 59.0 |
| చింతలపూడి | 40.62 | 53.3 |
| కొవ్వూరు | 39.42 | 55.7 |
| ఏలూరు | 36.91 | 51.4 |
| తాడేపల్లి గూడెం | 38.72 | 51.9 |
| తణుకు | 41.55 | 54.3 |
| భీమవరం | 38.22 | 51.6 |
| నరసాపురం | 43.36 | 54.9 |

లోని జలాధారాలు. మిర్చి, పొగాకు, పండ్లతోటలు యీ నీటి ఆధారంతో పెంచబడుతున్నాయి.

## చింతలపూడి తాలూకా

తమ్మిలేరు, ఎర్రకాల్వ, జల్లేరులనుంచి సంవత్సరమంతా నీరు పారుతూనే వుంటుంది. లోతయిన లోయగా ఉన్న ప్రాంతం నుండి యిది ప్రవహించుటచేత సాగుచేయటానికి యీ జలాలు వుపయోగపడటంలేదు. తమ్మిలేరుపై లక్షా 50 వేల రూపాయల ఖర్చుతో ఒక ఆనకట్ట నిర్మించాలనే ప్రణాళికను ప్రభుత్వం అంగీకరించింది. దీని ఫలితంగా కొంత భాగం నీరు సాగుకు తోడ్పడవచ్చు. తాలూకాలో వర్షాధారంతో సాగుకు తోడ్పడే చెరువులు కలవు. నూతి నీళ్ళతో పొగాకు పండించబడుతున్నది.

## కొవ్వూరు తాలూకా

తాలూకాలో కొంత భాగం గోదావరీ నదీజలాలతో సాగు చేయబడుతున్నది. ఎర్రకాల్వ, వాళ్ళ మడుగు నీళ్ళు కొంత సాగుకు వుపయోగపడుతున్నాయి. కొన్ని చెరువులు, నూతులు కూడ సాగుకు వుపయోగపడేవిగలవు.

## ఏలూరు తాలూకా

తాలూకాలో నేడు సాగు అవుతున్న భూములు కృష్ణా, గోదావరి నదీజలాలపై ఆధారపడివున్నాయి. కాని ఈ తాలూకా కృష్ణా డెల్టాకు, గోదావరీ డెల్టాకు చిట్టచివర నుండుటచేత నీటి కొరతతో సాగు పడటం జరుగుతున్నది. గుండేరు, తమ్మిలేరులద్వారా కొన్ని చెరువులు యీ తాలూకాలో నింపబడుతాయి. ఇవి సేద్యానికి తోడ్పడుతున్నాయి. కొల్లేరు సరస్సు నుండి నీటిని ఇంజనులతో తోడి పంటలు పండించబడుతున్నాయి కూడా. ప్రయివేటు నూతుల క్రింద, వర్షాధారంపై ఆధారపడే చెరువుల క్రింద అక్కడక్కడా కొద్దిపాటి సేద్యం కొనసాగుతున్నది.

## తాడేపల్లి గూడెం తాలూకా

తాలూకాలో డెల్టా క్రింద ఉన్న భాగం గోదావరీ నదీజలాలచేత సాగు చేయబడుతున్నది. మెట్ట ప్రాంతాలలో వర్షాలచే నిండే చెరువులు, నూతులు

ఉన్నాయి. వీటి క్రింద చేయబడే సాగు స్వల్పం.

### భీమవరం తాలూకా

తాలూకా అంతా గోదావరిడెల్టాలోని భాగమే. యనమదుర్రు, ఉప్పుటేరుల ముంపుల మూలంగా తాలూకాలో కొన్ని ప్రాంతాలు బాధపడటం జరుగుతున్నది. యనమదుర్రుముంపుపోగొట్టుటకు కొన్ని ఏర్పాట్లు చెయ్యబడ్డాయి. ఉప్పుటేరు ముంపునుగూర్చి ఎట్టి చర్యలూ తీసుకొనబడలేదు.

### తణుకు తాలూకా

గోదావరి డెల్టా క్రింద ఈతాలూకా సాగుచేయబడుతున్నది. నరసాపురంకాల్వ, గోస్తనినది, వేల్పూరు కాలువ, అత్తిలి కాలువ, బ్యాంక్ కెనాలు యీ తాలూకాలో ప్రధానమైన కాల్వలు. "ఎనమదుర్రు" ద్వారా యీ తాలూకా డెల్టా మురుగు బయటకు పోతుంది. ఈ తాలూకాలో భాగంగా ఉన్న గోదావరిలంకలు గోదావరి వరదల సమయంలో మునిగి పోతుంటాయి. కానూరు లంకలో 3,334 ఎకరముల సాగుక్రిందకు తెచ్చే స్కీము షుమారు 11 లక్షల రూపాయల ఖర్చుతో నిర్మింపబడుతున్నది.

### నరసాపురం తాలూకా

గోదావరిజలాలతోనే యీ తాలూకాలో సేద్యం చెయ్యబడుతున్నది. తాత్కాలికంగా పనికివచ్చే భావులు, దొరువుల సహాయంతో మెట్టపైరులుగూడ పండింపబడుతున్నాయి. తాలూకాలోని లంకభూములు గోదావరి వరదల కాలంలో మునిగిపోతాయి.

తాలూకాలోని మైనరు యిర్రిగేషను వర్కులు, వాటిక్రింద తాలూకావారీగా ఆయకట్టు విస్తీర్ణం, మేజరు ఇర్రిగేషను క్రింద తాలూకావారీ సాగవుతున్న భూమి వివరాలు క్రింది పట్టికలో యివ్వబడ్డాయి:

| తాలూకా | మైనరు ఇర్రిగేషను వర్కుల సంఖ్య | మైనర్ ఇర్రిగేషను క్రింద ఆయకట్టు (ఎకరాలలో) | మేజరుఇర్రిగేషను క్రింద-ఆయకట్టు (ఎకరాలలో) |
|---|---|---|---|
| పోలవరం | 152 | 5,672.17 | 30,077 |
| చింతలపూడి | 357 | 12,908.82 | ... |
| కొవ్వూరు | 120 | 4,218.72 | 3,750 |
| ఏలూరు | 260 | 12,702.72 | 1,09,658 |
| తాడేపల్లిగూడెం | 87 | 3,397.26 | 1,25,644 |
| భీమవరం | ... | ... | 1,98,700 |
| తణుకు | | ... | 1,47,453 |
| నరసాపురం | | ... | 1,50,601 |
| మొత్తం | 976 | 38,899. | 7,45,883 |

### ఆహార వ్యాపార పంటలు

జిల్లాలో ప్రధానమైన ఆహారపంట వరి. జొన్న, సజ్జ, రాగి, కొర్ర, వరిగ, మొక్కజొన్న పండింపబడుతున్నాయిగాని పెద్దయెత్తునమాత్రం కాదు. నరసాపురం, తణుకు తాలూకాలలో కొబ్బరితోటలు; చింతలపూడి, నరసాపురం తాలూకాలలో అరటి, బత్తాయి మొదలైన తోటలు విస్తారంగా వున్నవి.

జిల్లా పంటల వుత్పత్తిలో 1948-'49లో పండిన పంట సగటు పంటగా తీసుకోబడింది. వివిధపంటల 1948-'49 సం॥పు తాలూకావారీ వుత్పత్తి వివరాలు ప్రక్కపేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి.

### రహదారులు - రోడ్లు

జిల్లా మొత్తంపై 1,172 మైళ్ళు పొడవుగల రోడ్లు గలవు. ఇందులో 40 మైళ్ళు జాతీయ రహదార్లక్రింద, 47 మైళ్ళు రాష్ట్రీయ రహదార్లక్రింద, 515 మైళ్ళు ప్రధానమైన జిల్లారోడ్లక్రింద, 110 మైళ్ళు యితర విశేషమైన జిల్లారోడ్ల క్రింద, 348 మైళ్ళు గ్రామ రోడ్లక్రింద, 95 మైళ్ళు మునిసిపల్ రోడ్లక్రింద; 17 మైళ్ళు పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు రోడ్లక్రింద విభజించబడి యున్నది.

తాలూకావారీగా రోడ్ల విభజన ఈ క్రింది పట్టికలో చూపబడినది. మునిసిపల్, పబ్లిక్ వర్క్సురోడ్లు యిందులో చేర్చబడలేదు.

| తాలూకా | జాతీయ రహదార్లు (మైళ్ళు) | రాష్ట్రీయ రహదార్లు (మైళ్ళు) | ప్రధానమైన జిల్లా రోడ్లు (మైళ్ళు) | యితర విశేషమైన జిల్లా రోడ్లు (మైళ్ళు) | గ్రామ రోడ్లు (మైళ్ళు) | మొత్తం (మైళ్ళు) |
|---|---|---|---|---|---|---|
| పోలవరం | — | 15 | 18 | — | — | 33 |
| చింతలపూడి | — | — | 59 | 9 | 34 | 102 |
| కొవ్వూరు | — | — | 103 | — | 41 | 144 |
| ఏలూరు | 20 | 32 | 82 | 25 | 51 | 210 |
| తాడేపల్లిగూడేం | 7 | — | 69 | 14 | 54 | 144 |
| భీమవరం | — | — | 58 | 11 | 73 | 142 |
| తణుకు | 13 | — | 62 | 41 | 61 | 177 |
| నరసాపురం | — | — | 64 | 10 | 34 | 108 |
| మొత్తం | 40 | 47 | 515 | 110 | 348 | 1,060 |

| పంట | | చోడవరం (ఎకరాలు) | భద్రాచలం (ఎకరాలు) | కొవ్వూరు (ఎకరాలు) | ఏలూరు (ఎకరాలు) | తాడేపల్లిగూడెం (ఎకరాలు) | నర్సాపురం (ఎకరాలు) | తణుకు (ఎకరాలు) | భీమవరం (ఎకరాలు) | మొత్తం (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 20,717 | 20,290 | 21,214 | 1,11,787 | 1,79,599 | 1,17,494 | 1,01,654 | 1,36,242 | 7,08,997 |
| | మెట్ట | — | 1,449 | 20,925 | 6,698 | 68 | — | 6,203 | 347 | 35,710 |
| జొన్న | | — | — | — | 4,527 | 4,891 | 259 | 1,245 | 745 | 12,667 |
| సజ్జ | | 867 | 3,043 | 2,492 | 713 | 1,924 | — | — | 16 | 9,055 |
| రాగి | | 519 | 2,323 | 332 | 1,473 | 529 | 5 | 51 | 716 | 5,948 |
| మొక్కజొన్న | | — | — | 35 | — | 4 | 5 | 319 | — | 363 |
| శనగ | | — | — | 2,530 | — | 771 | 18 | 424 | — | 3,743 |
| చెరకు | | — | — | 18 | 19 | 389 | 1,020 | 4,831 | 1,433 | 7,710 |
| వేరుశనగ | | 695 | 3,288 | 5,298 | 2,093 | 914 | 938 | 5,499 | 1,805 | 21,030 |
| నువ్వులు | | 6,096 | 3,966 | 11,215 | 3,775 | 16,571 | 284 | 17,755 | 3,956 | 63,618 |
| ప్రత్తి | | — | — | 137 | — | — | — | 2 | — | 139 |
| పొగాకు | | — | — | 14,687 | 2,164 | 1,024 | — | 3,733 | — | 21,608 |

## రైలు మార్గాలు

121½ మైళ్ళ రైలుబాట పశ్చిమ గోదావరి జిల్లాగుండా పోవుచున్నది. ఇందులో 107¾ మైళ్ళు బ్రాడ్ గేజి, 13¾ మైళ్ళు మీటర్ గేజి.

కలకత్తా - మద్రాసు రైలుమార్గం ఏలూరు, తాడేపల్లిగూడెం, కొవ్వూరు తాలూకాలగుండా పోవుచున్నది. నిడదవోలునుండి బ్రాడ్ గేజి బ్రాంచిలైను ఒకటి నిడదవోలు, కొవ్వూరు, నరసాపురం తాలూకాలను కలుపుచున్నది. ఈ లైను తణుకు, భీమవరం తాలూకాల గుండా పోవుచున్నది.

భీమవరంనుండి మీటర్ గేజి బ్రాంచిలైను వొకటి గుడివాడ వరకు పోవుచున్నది. పోలవరం, చింతలపూడి, తాలూకాలు మినహా మిగతా తాలూకాలన్నిటికి రైలు మార్గం కలదు. జిల్లా కార్యస్థానమైన ఏలూరునుండి (చింతలపూడి, పోలవరం తాలూకాల కార్య స్థానములను మినహాయించి) అన్ని తాలూకా కార్య స్థానములకు రైలుసదుపాయంగలదు.

## జనాభా విస్తీర్ణం

గత 10 సంవత్సరాల్లో జిల్లాజనాభా తాలూకావారీగా యే యే విధంగా అభివృద్ధి చెందిందీ ప్రక్కపేజీలోని పట్టిక తెలియచేస్తుంది. జిల్లామొత్తం సంఖ్యలు పట్టికకు మొదట్లోయివ్వబడ్డాయి.

| తాలూకా | జనాభా 1941 | జనాభా 1951 | 1941 సంII జనాభాపై పెరుగుదలశాతం | గ్రామాలు | * పట్టణాలు |
|---|---|---|---|---|---|
| పశ్చిమగోదావరి | 14,65,111 | 16,97,727 | 15.9 | 789 | 20 |
| ఏజన్సీ | | | | | |
| పోలవరం | 85,023 | 97,245 | 14.4 | 128 | ... |
| మైదానాలు | | | | | |
| చింతలపూడి | 85,741 | 1,00,187 | 16.8 | 84 | ... |
| కొవ్వూరు | 1,79,803 | 2,14,522 | 19.3 | 92 | 2 |
| ఏలూరు | 2,14,912 | 2,60,599 | 21.3 | 126 | 1 |
| తాడేపల్లిగూడెం | 1,90,382 | 2,17,123 | 14.0 | 98 | 2 |
| భీమవరం | 2,02,363 | 2,36,092 | 16.7 | 85 | 4 |
| తణుకు | 2,47,609 | 2,78,186 | 12.3 | 91 | 7 |
| నరసాపురం | 2,59,278 | 2,93,773 | 13.3 | 85 | 4 |

జిల్లా మొత్తం జనాభా 809 గ్రామల్లోనూ, పట్టణాల్లోనూ 3,15,982 ఇండ్లలో నివసిస్తున్నారు. ఇందులో 2,62,642 యిండ్లు గ్రామాల్లోనూ, 53,340 యిండ్లు పట్టణాల్లోనూ వున్నాయి.

16,97,727 మంది మొత్తం జనాభాలో, 13,66,458 మంది గ్రామాల్లో వున్నారు. 3,31,269 మంది పట్టణాల్లో నివసిస్తున్నారు. సగటున జిల్లాజనాభాలో ప్రతి ఐదుగురిలో ఒకడు పట్టణంలో నివసిస్తున్నాడు. తాలూకావారీ పట్టణ గ్రామీణ జనాభా సంఖ్యలు, యిండ్ల వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో పొందుపరచబడ్డాయి.

1941 జనాభా సంఖ్యలపై జిల్లా జనాభా సగటు పెరుగుదల 15.9 శాతమున్నది. ఇందులో యేజెన్సీ ప్రాంతమైన పోలవరం తాలూకాలో జనాభా పెరుగుదల 14.9 శాతముక్రింద చూపబడినది. దీనిని అచ్చటి కొండజాతుల జనాభా అభివృద్ధిక్రింద తీసుకోరాదు. పోలవరం మెట్టప్రాంతంలో ప్రారంభించిన తోటలు, పుగాకు మున్నగువాటి సేద్యం మూలంగా మైదానప్రాంత జనాభా యిచ్చటకు ఆకర్షింపబడ్డారు. అదేవిధంగా చింతలపూడి తాలూకాకుకూడ కొత్తభూముల సేద్యానికి అనేకమంది వలసవచ్చారు.

ఏలూరు, భీమవరం, కొవ్వూరు తాలూకాలు జిల్లాలోకెల్ల హెచ్చు జనాభా

* కనీసం 5 వేలు, అంతకు పైగా జనాభా కలిగి స్పష్టమైన పట్టణ వాతావరణాన్ని కల్గియున్నవాటినే యీ పట్టికలో చేర్చుటమైనది.

| తాలూకా | నివసించే యిండ్లు | | | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|
| | తాలూకా మొత్తం | గ్రామాల్లో | పట్టణాల్లో | | | |
| పోలవరం | 19,333 | 19,333 | ... | 97,245 | ... | 97,245 |
| చింతలపూడి | 18,666 | 18,666 | ... | 1,00,187 | ... | 1,00,187 |
| కొవ్వూరు | 38,929 | 34,841 | 4,088 | 1,90,587 | 23,935 | 2,14,522 |
| ఏలూరు | 47,303 | 34,011 | 13,292 | 1,73,386 | 87,213 | 2,60,599 |
| తాడేపల్లిగూడెం | 41,241 | 37,714 | 3,527 | 1,95,046 | 22,077 | 2,17,123 |
| భీమవరం | 43,345 | 33,904 | 9,441 | 1,78,834 | 57,258 | 2,36,092 |
| తణుకు | 51,757 | 39,657 | 12,100 | 2,03,987 | 74,199 | 2,78,186 |
| నరసాపురం | 55,408 | 44,516 | 10,892 | 2,27,186 | 66,587 | 2,97,773 |
| మొత్తం | 3,15,982 | 2,62,642 | 53,340 | 13,66,458 | 3,31,269 | 16,97,727 |

పెరుగుదలను సూచిస్తున్నాయి. ఇందులో భీమవరం, ఏలూరు తాలూకాల పెరుగుదల ఆయా పట్టణాల పెరుగుదల మూలంగా వచ్చినదే. గత 10 సంవత్సరాల్లో ఏలూరులో 22,302మంది జనాభా, భీమవరంలో 9,879 మంది జనాభా పెరిగింది.

తణుకు, నరసాపురం తాలూకాలు యితర తాలూకాల కన్న చదరపు మైలుకు హెచ్చు జనసాంద్రతను కల్గియున్నాయి. గత 10 సం॥లో యీ ప్రాంతాలనుండి చింతలపూడి, పోలవరం మున్నగు ప్రదేశాలకు వలసపోవటం గమనించదగిన సంఖ్యలో జరిగింది. అందుచేత జనాభా పెరుగుదలశాతం యిచ్చట యితర తాలూకాలకన్న తక్కువవున్నట్లు కన్పించుతుంది. ఈ తాలూకాల్లో పెరిగిన జనాభాలో ప్రధానభాగం ఆ తాలూకా ముఖ్య పట్టణ పెరుగుదలను ఆధారం చేసుకొని వున్నది.

## వైద్యం

జిల్లాలో వైద్యసౌకర్యాలుఅతిస్వల్పం. 95 మంచాలతో జిల్లా ఆస్పత్రి ఏలూరులో కలదు. ఇచ్చట మెటర్నిటీ అసిస్టెంట్ల శిక్షణకూడా గలదు. తాలూకావారీ ప్రభుత్వ,లోకల్ ఫండ్ ఆసుపత్రుల పట్టిక, వాటిలోని మంచముల సంఖ్య ప్రక్క పేజీలో యివ్వబడినాయి :

| తాలూకా | ఆసుపత్రి ఉన్న ఊరు | నిర్వహణాధికారం | మంచములు |
|---|---|---|---|
| పోలవరం | పోలవరం | గవర్నమెంట్ వైద్యశాల | 4 |
| ,, | జంగారెడ్డిగూడెం | ,, | |
| ,, | జీలుగుమిల్లి | ,, | |
| ,, | కన్నపురం | గ్రామీణ వైద్యశాల | |
| ,, | కోయిలగూడెం | మిషన్ ఆసుపత్రి | |
| ,, | హుకుంపేట | ఆయుర్వేద వైద్యశాల | |
| చింతలపూడి | చింతలపూడి | లోకల్ ఫండ్ వైద్యశాల | (అత్యవసరమైన మంచాలు మాత్రం) |
| కొవ్వూరు | కొవ్వూరు | తాలూకా ఆసుపత్రి | |
| | నిడదవోలు | లోకల్ ఫండ్ ఆసుపత్రి | 95 |
| ఏలూరు | ఏలూరు | జిల్లా ఆసుపత్రి | |
| | పెద్దపాడు (గుండుగొలను) | గ్రామీణ వైద్యాలయాలు | |
| తాడేపల్లిగూడెం | తాడేపల్లిగూడెం | లోకల్ ఫండ్ ఆసుపత్రి | |
| | గణపవరం<br>చేబ్రోలు | గ్రామీణ వైద్యాలయాలు | 11 |
| భీమవరం | భీమవరం | తాలూకా గవర్నమెంటు ఆసుపత్రి | |
| | ఆకివీడు<br>భీమవరం | మిషన్ ఆసుపత్రులు | |
| | ఉండి<br>జక్కవరం<br>కోనేటివాడ | గ్రామీణ వైద్యాలయాలు | 30 |
| తణుకు | తణుకు | తాలూకా గవర్నమెంటు ఆసుపత్రి | |
| | తణుకు | కుష్ఠురోగ వైద్యశాల | |
| | ఖండవల్లి<br>పెనుమంట్ర<br>పెనుగొండ<br>దువ్వ | గ్రామీణ వైద్యశాలలు | |
| | అత్తిలి | జిల్లాబోర్డు ఆసుపత్రి | |

| తాలూకా | ఆసుపత్రి ఉన్న చోటు | నిర్వహణాధికారం | మంచములు |
|---|---|---|---|
| నరసాపురం | నరసాపురం | గవర్నమెంటు ఆసుపత్రి | 30 |
| | ” | గోసానాని ఆసుపత్రి | |
| | ” | మిషన్ ఆసుపత్రి | 160 |
| | ఆచంట | జిల్లాబోర్డు ఆసుపత్రి | |
| | జిన్నూరు | గ్రామీణ వైద్యశాలలు | |
| | మచ్చిపుర | | |
| | కోడ్డపట్ల | | |
| | యలమంచిలి | | |
| | పాలకొల్లు | గవర్నమెంటు ఆసుపత్రి | |

జిల్లాలో ప్రధానంగా పేర్కొనవలసిన పరిశ్రమలు ఏలూరులో నేవున్నాయి. ఏలూరులో జనపనారమిల్లు, తణుకు తాలూకాలో రెండు పంచదార ఫ్యాక్టరీలు, జిల్లాలో ఫాక్టరీ చట్టం క్రింద నమోదైన ప్రధాన పరిశ్రమలు, వాటిలో పనిచేసే వారి సంఖ్య క్రింది పట్టికలో యివ్వబడ్డాయి :

| తాలూకా | పరిశ్రమ | ఫ్యాక్టరీల సంఖ్య | పనిచేసేవార సంఖ్య |
|---|---|---|---|
| పోలవరం | పుగాకు | 1 | 124 |
| కొవ్వూరు | పుగాకు | 8 | 4,572 |
| | బియ్యంమిల్లులు | 7 | 208 |
| ఏలూరు | బియ్యంమిల్లులు | 30 | 821 |
| | జనపనారమిల్లు | 1 | 1,140 |
| | తోళ్ళ పరిశ్రమ | 11 | 431 |
| తాడేపల్లిగూడెం | బియ్యంమిల్లులు | 21 | 915 |
| భీమవరం | బియ్యంమిల్లులు | 22 | 631 |
| తణుకు | బియ్యంమిల్లులు | 17 | 587 |
| | పెట్టెల నిర్మాణం | 9 | 263 |
| | పంచదార ఫ్యాక్టరీలు | 2 | 1,250 |

# కృష్ణా జిల్లా

## చరిత్ర

ఎన్ని జిల్లాలగుండా కృష్ణానది ప్రవహించుటలేదు! కాని కృష్ణా జిల్లాకు మాత్రమే యీనది తన పేరు ఇచ్చుకున్నది. ఈ జిల్లాకిదొక్కటే గాదు ప్రత్యేకత. అనేక ప్రత్యేకతలు-చారిత్రక ప్రత్యేకత లున్నవి.

ప్రథమాంధ్ర రాజ్యాన్ని స్థాపించిన శాతవాహనుల ప్రథమ రాజధాని కృష్ణా జిల్లాలోని శ్రీకాకుళం. కృష్ణానది ఒడ్డున వున్నది. తూర్పుదేశాలతో వర్తక వ్యాపారాలు సాగించిన భారతీయులలో మొదటివారు ఆంధ్రులు, కళింగులు. ఆంధ్రుల ప్రథమ ఖండాంతర వాణిజ్య కేంద్రాలయిన ఘంటసాల, గూడూరు రేవులు యీ జిల్లాలోనివే. కృష్ణానదీ ముఖద్వార సమీపాన వున్నవే.

క్రీ. పూ. మూడవ శతాబ్దం చివర భాగంలో అశోకుని మరణానంతరం శాతవాహనాంధ్రులు మౌర్య సామ్రాజ్యాన్ని ధిక్కరించి స్వతంత్రరాజ్యాన్ని స్థాపించారు. శ్రీకాకుళాన్ని రాజధానిగా చేసుకుని రాజ్యాన్ని పాలించారు. శ్రీకాకుళం కృష్ణానది ఒడ్డున వున్నది. ఒకప్పటి రాజధానీ నగరం నేడు కుగ్రామంగా నిలచివున్నది. విజయవాడకు యిరవైమైళ్ళ దూరంలో వుంది. శాతవాహనుల కాలంలో నిర్మించబడిన ఆంధ్రవిష్ణువు దేవాలయం నేటికీ నిలిచివుంది.

### ఆంధ్రవిష్ణువు దేవాలయం

ఆంధ్రవిష్ణువు దేవాలయాన్నిగూర్చి బ్రహ్మాండ పురాణంలో ఒక కథ వుంది. ఈ కథ ననుసరించి శాతవాహనులకు ముందు యీ ప్రాంతాన్ని పాలించుచున్న నిశుంభుడనే నాగరాజును ఆంధ్రవిష్ణువు అనే శాతవాహనాంధ్ర వీరుడు సంహరించి రాజ్యాన్ని స్థాపించాడట. తరువాత వచ్చిన శాతవాహన రాజులు ఆంధ్రవిష్ణువు నొక వీరునిగను, అవతారమూర్తిగను పరిగణించి శ్రీకాకుళంలో ఆంధ్రవిష్ణువు పేరిట దేవాలయం నిర్మించి వుండవచ్చు. వీరారాధన ఆ రోజులలో మతంలో భాగంగానే వున్నట్లు కనబడుతున్నది. శ్రీకాకుళం కొద్ది సంవత్సరాల వరకు మాత్రమే రాజధానిగ వున్నది. తరువాత ధాన్యకటకం రాజధాని అయింది. శ్రీకాకుళం యిప్పుడు వైష్ణవ క్షేత్రం.

### నాగరాజులు

శాతవాహన వంశస్థాపకుడైన శాతవాహనుడీ ప్రాంతంలో రాజ్యం నెలకొల్పక పూర్వము యక్షరాజైన కుబేరకుడు కృష్ణాజిల్లాలో కొంత ప్రాంతాన్ని

పరిపాలించుచుండేవాడని శాసనాలవల్ల తెలుస్తున్నది. యక్షరాజు కుబేరుడు, శాతవాహనుని తండ్రి సపకర్ణ యనే రాజునకు సమకాలికుడైవుండాలి. యక్షులు ఆంధ్రదేశంలో నేడు లెక్కలవబడుచున్న తెగనాటికి పూర్వీకులని చరిత్రకారుల వ్రాత. నాగ గాధలను బట్టి చూస్తే యక్షులకు పూర్వమే సర్పారాధకులైన నాగులనే ద్రావిడ జాతివారు యీ ప్రాంతాన్ని పాలించినట్లుగ తెలుస్తున్నది.

## విదేశ వ్యాపారం : ఓడ రేవులు

శాతవాహనులు క్రీస్తుకి పూర్వం రెండు వందల సంవత్సరాలు, క్రీస్తు తరువాత రెండువందల సంవత్సరాలకు పైగాను ఆంధ్రదేశాన్ని పరిపాలించారు. శాతవాహన రాజుల కాలంలో ఆంధ్రలో నౌకా వ్యాపారం అభివృద్ధి చెందింది. గౌతమీ పుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణి విదేశ వ్యాపారానికి గొప్ప ప్రోత్సాహమిచ్చాడు. ఈ రాజు క్రీ. శ. 174_203 మధ్య పరిపాలించాడు. క్రీ. శ. రెండవ శతాబ్దంనాటికే ఆంధ్రదేశం యీ జిల్లాలోని ఘంటసాల, గూడూరు, అవనిగడ్డ రేవుల ద్వారా విదేశవ్యాపారం సాగించుచుండేది. ఘంటసాల, గూడూరు ఓడ రేవుల నుండి నూలు బట్టలు, అద్దకపు బట్టలు, అతిసన్నని రవసెల్లాలు, వజ్రములు; రోము, ఇటలీ, బర్మా, చైనా, సయాం, తూర్పు సముద్రతీర దేశాలకు ఎగుమతి అవుతుండేవి. ఆనాడు దేశంలో వర్తకం రెండు ప్రధాన మార్గాలగుండా జరుగుతుండేదట. అందులో ఒక రాజమార్గం, బందరు నుండి హైద్రాబాదు మీదుగా శాతవాహనులు కొంత కాలం రాజధానిగ వున్న మహారాష్ట్రంలోని పైఠాన్ నగరం, నాసిక్ నగరాలమీదుగ పశ్చిమ తీరపు రేవుపట్టణమైన బ్రోచ్ నగరాన్ని కలుపుతుండేదట.

పైనా ప్రాంతదేశాల సంబంధాలకు ఆంధ్రదేశం పునాది వేసింది.

పెరిప్లస్, టాలెమీ అనే పాశ్చాత్యుల రచనలను బట్టి మచిలీపట్టణము, ఘంటసాల, గూడూరు, నౌకా వ్యాపార కేంద్రములుగ వున్నట్లు తెలుస్తున్నది. పాశ్చాత్యులకు మనదేశపు పేర్లు కొత్త అగుటచేత ఘంటసాలను 'కోంట కొస్సైల', గూడూరును 'కొడ్డూర' అని, కృష్ణా ముఖద్వార ప్రదేశాన్ని 'మసోలియా' అని, కృష్ణానదిని 'మైసోలస్' అని పేర్కొన్నారు. ఇటీవలి కాలంలోనే ఘంటసాలయందు క్రీ. శ. రెండవ శతాబ్దము నాటి రోము చక్రవర్తుల నాణెములు దొరికాయి. ఘంటసాల ఆనాడు మహానగరం. 13 వ శతాబ్దంవరకు ఘంటసాల రేవు మహా ప్రఖ్యాతిలో వుండేది. తూర్పు చాళుక్యుల కాలంలో కూడ యిది పెద్ద ఓడరేవు పట్టణం.

## బౌద్ధ స్తూపాలు

శాతవాహనులకు ముందే ఆంధ్రదేశంలో బౌద్ధమతం వ్యాపించింది. శాతవాహనుల కాలమున బౌద్ధమతం బాగా పాతుకుపోయింది. బౌద్ధమతవ్యాప్తి చిత్రలేఖనము, శిల్పాల అభివృద్ధికి పెద్ద ప్రోత్సాహమిచ్చింది. ఆంధ్రదేశంలో ఆకాలాన నిర్మించబడ్డ స్తూపాలు నేటికీ కుప్పతిప్పలుగా కనబడతవి. జగ్గయ్యపేట, నందిగామ, గుంటుపల్లి, గుడివాడ, ఘంటసాలలలో స్తూపాలు కనబడతవి.

నాగార్జునుని కాలంలో ఘంటసాలలో పెద్దబౌద్ధారామముండేది. నాగార్జునకొండ శాసనములో యిది 'కంటకశైల' సంఘారామముగ పేర్కొనబడింది. క్రీ. శ. మొదటి శతాబ్దంనాటి బౌద్ధస్తూపమొకటి యిక్కడ వున్నది. ఇంతటి పెద్ద చక్కని స్తూపము దక్షిణదేశంలోనే లేదంటారు. క్రీ. పూ. మూడవశతాబ్దంనాటి కాలభైరవ సరస్వతీ విగ్రహమొకటి వుంది. ఈ విగ్రహంలో ఆంధ్రుల శిల్పచాతుర్యము ఉట్టిపడుతుంటుంది. ఈ శిల్పాన్ని ముహంజదారో శిల్పాన్ని పోలివదని చారిత్రికుల అభిప్రాయం.

ఆంధ్రుల వ్యాపారంతోపాటు బౌద్ధమతంకూడ విదేశాలకు ప్రాకింది. బౌద్ధులు అత్యంత పవిత్రస్థలమైన అమరావతినుండి, యితర సంఘారామములనుండి బౌద్ధులు గూడూరు (కోడూరు) రేవునుండి సిలోను, సుమత్రాద్వీపాలకు, బర్మా, మలయా మొదలైన దేశాలకు వెళ్ళుతుండేవారట.

వాణిజ్యవ్యాపారాన్ని, శిల్పాన్ని దివ్యంగా పోషించిన శాతవాహన రాజ్యం క్రీ. శ. మూడవ శతాబ్దం మధ్యభాగంలో పతనమైంది. అప్పుడు కృష్ణాప్రాంతం అర్ధశతాబ్దకాలం ఇక్ష్వాకుల పాలనలో వుంది. నాల్గవశతాబ్దంమధ్యలో పల్లవులు రంగంలోకి వచ్చారు. కృష్ణకు దక్షిణాన పల్లవుల రాజ్యంలో వుండగా, కృష్ణకు ఉత్తరాన చిన్నచిన్న స్వతంత్ర రాజ్యాలు వెలిశాయి.

## బృహత్పలాయనుల రాజధాని

ఈ స్వతంత్రరాజులలో బృహత్పలాయనులొకరు. బృహత్పలాయన రాజ్యాన్ని స్థాపించిన జయవర్మ రాజధాని దివితాలూకాలోని కోడూరుగ్రామం. ఆరోజులలో ఈప్రాంతం "కూడూరు హారమని" వ్యవహరించబడేది. ప్రాచీన కాలపు పరిపాలక విభాగములలో కొన్నిటికి "హారము" లనిపేరు. 'కూడూరు హారమనగా' కూడూరు ముఖ్యపట్టణంగా గల ప్రాంతమని అర్థం. ఈ కూడూరే దివితాలూకాలోని నేటికోడూరు. ఇక్కడ ప్రాచీనశిథిలాలు విస్తారముగా బయటపడుతున్నాయి.

బృహత్పలాయన రాజ్యం యిరవై సంవత్సరాలు మాత్రమే సాగింది. పల్లవుల బలహీనత నాధారముగచేసికొని దామోదరవర్మ అనే ఆనంద గోత్రీకరాజు కృష్ణకు ఉభయతీరములందున్న ప్రదేశాన్నాక్రమించాడు. ఇతని పరిపాలన స్వల్పకాలం మాత్రమే సాగినది. నాల్గవ శతాబ్ద ప్రారంభమున శాలంకాయన రాజులు ఆనంద గోత్రీకుల నణచి, వారి యధీనమున నున్న కృష్ణకు ఉత్తరాన వున్న భాగాన్ని ఆక్రమించారు. శాలంకాయనులు కృష్ణా-గోదావరీ ప్రాంతాన్నంతా జయించి వేంగిరాజధానిగా ఒక శతాబ్దం రాజ్యపాలన చేశారు.

క్రీ. శ. 5 వ శతాబ్దం మొదటి అర్ధభాగంలో శాలంకాయనుల అధికారాన్ని అంతమొందించి రాజ్యాన్ని హస్తగతం చేసుకున్నవారు విష్ణుకుండినులు. ఏడవ శతాబ్దం మొదటి భాగందాకా వీరు పరిపాలించారు. వీరికి గుంటూరు జిల్లాలోని అమరావతి, పశ్చిమగోదావరి జిల్లాలోని వేంగి, దెందులూరు గ్రామం ప్రధాన రాజధానులుగ వున్నప్పటికీ, విజయవాడ కూడ కొంతకాలం రాజధానిగ వున్నట్లు తెలుస్తున్నది.

## కనకదుర్గ గుడి

విష్ణుకుండిన రాజులలో కడపటివాడైన మూడవ మాధవవర్మ గొప్ప చక్రవర్తి. ధర్మబుద్ధి గలవాడని ప్రతీతి. జనాశ్రయుడని బిరుదు వుండేది. మాధవవర్మ న్యాయబుద్ధిని గూర్చి ఒక కథ చెబుతారు. ఒకప్పుడీతని కుమారుడు ఒక పేదరాలి కుమారుని పైగుండా రథం పోనిచ్చి వాని మరణానికి కారకుడయ్యాడు. పేదరాలు మాధవవర్మతో మొరపెట్టుకొనగా మాధవవర్మ న్యాయవిచారణ చేసి తన కుమారునికి మరణదండన విధించాడట. మంత్రులు, మిత్రులు వలదన్నను మాధవవర్మ మరణదండనను ఖాయపరిచాడట. ఆ సమయంలో బెజవాడ యింద్రకీలాద్రిపై వేంచేసివున్న కనకదుర్గ మాధవవర్మ న్యాయవర్తనకు సంతసించి మాధవవర్మ కొడుకుని, పేదరాలి కొడుకుని తిరిగి బ్రతికించిందట. మల్లికార్జునస్వామి బెజవాడలో కనకవర్షం కురిపించాడట. ఇదే మల్లేశ్వరాలయం. కనకదుర్గగుడిని గూర్చి ఇంకొకకథ ప్రచారంలో వుంది. ఒక గ్రామంలో ఏడుగురు బ్రాహ్మణ సోదరులుండేవారు. వారికి కనకమ్మ అనే చెల్లెలు వుండేది. కనకమ్మ శీలాన్ని గూర్చి అన్నదమ్ములు అనుమానించి ఆమెను చంపడానికి నూతిలోపడ వేశారు. అప్పటినుండి ఆమెకు ప్రజలు ఒక దేవాలయం కట్టించి ఒక శక్తిగా కొలవడం ప్రారంభించారు. ఈ కథలో సత్యాసత్యాలేమైనప్పటికీ బెజవాడలోని కనకదుర్గ కొండపైన, మొగల్రాజపురంలోను గుహాలయాలను తొలిపించినది విష్ణుకుండిన రాజులే. విష్ణుకుండినుల కాలానికి బౌద్ధమతము పూర్తిగ క్షీణదశలోవుంది. విష్ణుకుండినులు హిందూమతం మీద మాధవవర్మకెంతోను అధికార గర్వంతోను, అశ్వమేధాలతో ఆగక నరమేధాన్ని కూడ చేసారు. విష్ణుకుండిన రాజులు బౌద్ధుల దేవాలయాలను శైవ, వైష్ణవ దేవాలయాలుగ మార్చారు. బౌద్ధుల పద్ధతిలో కొండలను తొలిపించారు. ఇంద్రకీలాద్రి, మొగల్రాజపురం గుహాలయాలు వారు తొలిపించినవే.

## ఇంద్రకీలాద్రి గుహాలయం

ఇంద్రకీలాద్రిపైనే అర్జునుడు తపస్సు చేసి పాశుపతాస్త్రాన్ని పొందాడని పురాణగాథ. ఇంద్రకీల పర్వతాన్నే కనకదుర్గ కొండ అనికూడాఅంటున్నారు. ఇక్కడి గుహాలయాలను అక్కన్న మాదన్న గుహలని పిలుస్తారు. ఈ గుహలను అక్కన్న మాదన్నలు నిర్మించినట్లు ఒక కల్పితకథ ప్రచారమై ఆపేరే నిలచింది. వాస్తవానికి ఈ గుహలు విష్ణుకుండినులనాటివి. అక్కన్న మాదన్నల ప్రధాన కార్యాలయం విజయవాడలో వుండేది. ఇక్కడి గుహాలయం మూడు భాగాలుగా విభజించబడింది. ఒక్కొక్క భాగంలోపల గర్భగృహము, ఒక అర్ధమండపము వున్నవి. ఈ మూడుగదులు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు అర్పించబడ్డవి. ఈ గుహాలయంలో చాల భాగం శిథిలమైంది. ఒక్క గుహాలయం మాత్రం చెడకుండా నిల్చివుంది.

బెజవాడ దగ్గిర మొగల్రాజపురంలోని గుహాలయాలలో మూడు భాగాలుగ వున్నవి. శివతాండవ గుహాలయంలో నటరాజ విగ్రహం వుండేది. ఒక వినాయకుని విగ్రహం, శక్తివిగ్రహం, శైవ శృంగి భృంగుల విగ్రహాలు వుండేవి. రాళ్ళ కొరకై కొండను బ్రద్దలుకొట్టడంవలన

యీ విగ్రహాలు చీటలువారాయి. గుహాల గూలుకూడా చీటలు బోయాయి.

చాళుక్యచక్రవర్తి రెండవ పులకేశి, విష్ణుకుండినరాజు మాధవవర్మను ఓడించి వేంగిదేశాన్ని జయించి క్రీ. శ. 618 లో తనకు తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనుని పాలకునిగ నియమించుటతో కృష్ణా జిల్లా ప్రాంతం వేంగీ చాళుక్యుల రాజ్యంలో చేరింది. వేంగీ చాళుక్యులు ఆంధ్రదేశాన్ని నాలుగున్నర శతాబ్దాలకాలం పాలించారు. కుబ్జవిష్ణువర్ధనుని రాజ్యం ఉత్తరాన విశాఖనుండి దక్షిణాన పాకనాడు వరకు వ్యాపించింది.

## బెజవాడ జైన, బౌద్ధాలయాలు

చాళుక్యుల కాలమున బౌద్ధమతము అడుగంటుతున్నప్పటికీ జైనమతానికి కొంత పట్టుదొరికింది. చాళుక్యుల ఆదరణయే దానికి కారణం. కుబ్జవిష్ణువర్ధనుని భార్య అయ్యామహాదేవి బెజవాడలో 'నడుంబి బసతి' అనే జైనాలయాన్ని కట్టించింది. కుబ్జవిష్ణువర్ధనుడు క్రీ. శ. 618 నుండి 633వరకు రాజ్యంచేశాడు. క్రీ.శ.714లో అధికారానికి వచ్చిన మూడవ విష్ణువర్ధనుడు యీ 'నడుంబిబసతి'కి ముసినికొండ గ్రామాన్ని దానంచేసాడు. ఈ బసతిలోని జైనాచార్యులు కాపురూరిశాఖకు చెందినవారు.

ఆ రోజులలో బెజవాడ జైన, శైవ మతాలకు కేంద్రంగావుండేది. బెజవాడలో రెండవ అమ్మరాజు (క్రీ. శ. 945_970) జైనమతాభిమానియైన చామకాంబ అనే ఆమె ప్రోత్సాహముచే సర్వలోకాశ్రయ జినాలయాన్ని నిర్మించడమేగాక, దాని కనేక దానాలుచేశాడు. గుణగవిజయాదిత్యుని సేనానియైన పండరంగని మునిమనుమడైన దుర్గరాజు బెజవాడలోనే కటకాభరణ జైనాలయాన్ని కట్టించాడు. 'నరేంద్రమృగరాజ' బిరుదాంకితుడైన రెండవవిజయాదిత్యుడనే(క్రీ.శ.770_806) చాళుక్యరాజు బెజవాడలోనే సమస్త భువనాశ్రయ శైవ దేవాలయాన్ని కట్టించాడు. రెండవ అమ్మరాజు దీనికికూడ దానంచేసాడు. కాలముఖ శైవశాఖకు చెందినవారే దేవాలయానికి స్థానాపతులు. కాలముఖ శైవుల ప్రధానకేంద్రం బెజవాడలోనే వుండేది.

సర్వలోకాశ్రయ జైన పీఠానికి, సమస్త భువనాశ్రయ శైవ పీఠానికి చెందినవారికి మధ్య మతకలహాలు చెలరేగి అనేకపాతాలు జరిగేవట.

## యుద్ధమల్లుని శాసనం

యుద్ధమల్లుని బెజవాడ శాసనమని చెప్పబడే శాసనమీతూర్పు చాళుక్య రాజులనాటిదే. యుద్ధమల్లుడు క్రీ. శ. 927_934 మధ్య వేంగి రాజ్యాన్ని పాలించాడు. యుద్ధమల్లుని శాసనాన్నిబట్టి ఆ రోజులలో గుంటూరుజిల్లా చేబ్రోలు నుండి బెజవాడవరకు ఒక పెద్ద యాత్ర ఏటా జరిగేదట. ఏటా జరిగిన ఆ యాత్రలలో వచ్చిన ఒక భక్తుడు బెజవాడలోని కుమారస్వామి ఆలయాన్ని కట్టించాడని తెలుస్తున్నది.

తూర్పు చాళుక్యుల పాలన అంతమై 12వ శతాబ్దంలో కృష్ణాజిల్లా వెలనాటి చోడుల రాజ్యంలో చేరిపోయింది. వెలనాటి చోడులు చోళ చాళుక్యుల సామంతులు. వెలనాటి చోడులకాలం

లోనే విజయవాడలో శైవ పండితత్రయం లోని శ్రీపతి పండితుడు ఉండేవాడు.

వెలనాటిచోడుల కాలంలో ప్రబలిన అరాజకాన్ని అవకాశంగా తీసుకొని విజయవాడ, గుడిమెట్ల రాజధానులుగ చాగి వంశంవారు కృష్ణాజిల్లాలో కొంత ప్రాంతాన్ని పాలించారు. ఇది 12 వ శతాబ్దాంతంలో కాకతీయులవశమైంది. మహమ్మద్ బిన్ తుగ్లక్ సైన్యాల ధాటి ముందు 1323లో కాకతీయరాజ్యం పతనమైంది. ప్రతాపరుద్రుడు ఢిల్లీసుల్తానుల ఖైదీ అయ్యాడు.

## కొండపల్లి కోట

కాకతీయుల అనంతరం ఢిల్లీ సుల్తానుల పారద్రోలి స్వతంత్ర రాజ్యాలు స్థాపించినవారిలో రెడ్డిరాజులు ముఖ్యులు. కృష్ణాజిల్లా రెడ్డిరాజుల రాజ్యభాగమైంది. కొండపల్లిలో నిర్మించబడ్డ దుర్గం, కొండవీటి రాజ్యస్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి కట్టించినదే. సంగమ వంశంలో కడపటి రాజైన విరూపాక్ష దేవరాయలు పాలించుతున్న కాలంలో ఒరిస్సా గజపతులు విజృంభించి కొండపల్లి దుర్గాన్ని ఆక్రమించి దానిని వారిరాజ్య దక్షిణపు పొలిమేరగా చేసుకున్నారు.

కృష్ణదేవరాయలు 1515 లో ఉత్తరాంధ్రదేశ విజయయాత్రకు బయలుదేరి కృష్ణానది ఒడ్డున యుద్ధానికి తలపడిన ఒరిస్సాగజపతుల నోడించాడు.

అప్పుడే కృష్ణదేవరాయలు కృష్ణానాటి విజయవాడను దర్శించి అచ్చటి దేవాలయాలకు దానాలుచేశాడు. శాతవాహనుల ప్రథమరాజధాని నగరమైన శ్రీకాకుళంవెళ్ళి, కృష్ణదేవరాయలు ఆంధ్రవిష్ణు దేవుని దర్శించాడు. ఆంధ్రవిష్ణుదేవుని సందర్శించినప్పుడు భగవంతుడు కృష్ణదేవ రాయలకు కలలోకనబడి "ఆముక్త మాల్యద" అనే మహాప్రబంధాన్ని వ్రాయమని ఆదేశించాడట.

విజయవాడనుండి రాయలు పయనమై కొండపల్లి దుర్గాన్ని స్వాధీనం చేసుకొని, ఆంధ్రదేశాన్నంతటినీ జయించి విజయ నగరానికి తిరిగివెళ్ళాడు. కృష్ణదేవ రాయలు అల్లుడు అళియరామరాయల కాలంలో రామరాయలు - బహమనీ రాజ్యాన్ని కూలద్రోసి స్వతంత్రులైన గోల్కొండ, బీజాపురం మొదలైన సుల్తానులకు మధ్య 1565 లో జరిగిన చరిత్ర ప్రసిద్ధిగన్న తళ్ళికోటయుద్ధంలో రామరాయలు మరణించాడు. విజయ నగర సామ్రాజ్యానికి పరాఘాతం తగిలింది. ఆంధ్రదేశానికి మణిపూసగవున్న రాజ్యం రాలిపోయింది.

## గోల్కొండ నవాబులపాలన

అంతట కోస్తాప్రాంతం క్రమంగా గోల్కొండ నవాబుల వశమైంది. మొదటి గోల్కొండనవాబు కులీకుతుబ్ షా - ఖమ్మంమెట్టును కార్యస్థానముగ చేసికొని తనపాలను ప్రతికూలిస్తున్న రాజులకు మధ్య యుద్ధంజరిగింది. కొండపల్లి దుర్గం కులీకుతుబ్ షా వశమైంది. అప్పుడు సీతాపతిరాజు కొండపల్లి పాలకుడైన రామచంద్రగజపతిని కులీకుతుబ్ షా పైకి పురికొల్పాడు. వీరిద్దరికీ పెనుగంచిప్రోలువద్దయుద్ధంజరిగింది. కాని లాభంలేకపోయింది. కొండపల్లిదుర్గం కులీకుతుబ్ షా వశమైంది. కొండపల్లిదుర్గం దక్కనులోని ఒక సర్కారుకు కార్యస్థానమయింది.

ఖదే కొండపల్లి సర్కారు. 70 సం||ల పాటు యుద్ధాలు చేసిగాని గోల్కొండ నవాబులు కోస్తా ప్రాంతాన్నంతటినీ జయించలేక పోయారు.

ఇంతలోనే ఢిల్లీపాదుషా ఔరంగజేబు దండెత్తివచ్చి 1687 లో గోల్కొండ రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్నాడు. తెలుగుదేశ పాలనను దక్కను సుబేదారుకు అప్పగించాడు.

### బందరులో ఇంగ్లీషువారి ఫ్యాక్టరీ

గోల్కొండ నవాబులు పాలించుతున్న కాలంలోనే వారివద్ద ఫర్మానాలు పొంది ఇంగ్లీషువారు ఆంధ్రదేశంలో వ్యాపారం ప్రారంభించారు. 1611 లో తూర్పుఇండియా కంపెనీవారు బందరులో ప్రథమంగా ఆంధ్రలో ఫ్యాక్టరీ స్థాపించారు. ఇది ఇండియాలో వారు స్థాపించిన రెండవ ఫ్యాక్టరీ. బందరు ప్రాచీనకాలంనుండి ప్రసిద్ధికెక్కిన ఓడరేవు. ప్రసిద్ధిపొందిన మస్లినులు ఎగుమతి అవుతుండేవి. మస్లిను అనే ఇంగ్లీషుపదం మచిలీపట్టణం పేరుమీదుగా వచ్చింది. 1614 లో డచ్చివారు, 1669లో ఫ్రెంచివారు మచిలీపట్టణంలో వ్యాపారం ప్రారంభించారు.

అక్కన్న మాదన్నల అనుమతితో 1641 లో మద్రాసులో ఫ్యాక్టరీని నెలకొల్పుకునేవరకు ఇంగ్లీషువారికి బందరు ముఖ్యకేంద్రంగా వుండేది. ఔరంగజేబు గోల్కొండరాజ్యాన్ని ఆక్రమించి నప్పుడు బందరులోని ఇంగ్లీషువారిఫ్యాక్టరీని కూడ ఆక్రమించాడు. కాని తరువాత ఇంగ్లీషు వారితో సంధిచేసుకుని వదలివేశాడు.

### కంపెనీ ప్రధానకార్యాలయం

ఔరంగజేబుకాలంలో దక్కను పాలనకు నియమించబడిన సుబేదారు నిజాం ఉల్ ముల్క్ 1748 లో స్వతంత్రుడై అసఫ్‌జా వంశాన్ని స్థాపించాడు. ముల్క్ మరణానంతరం వారసత్వపు తగాదాలు రావడం, సర్కారు జిల్లాలు ఫ్రెంచివారినుండి ఇంగ్లీషువారి వశమవడం, యితర జిల్లాల చరిత్రలలో వివరించబడింది. ముజఫర్ జంగ్ - నాజర్ జంగ్ ల మధ్య తగాదాలలో నాజర్ జంగ్ బందరులోని ఫ్రెంచి ఫ్యాక్టరీని, ఫ్రెంచి ఉద్యోగులను బందీలుగ పట్టుకోగా డూప్లే పాండుచేరి నుండి సైన్యాలుపంపి బందరులోని ఫ్యాక్టరీని ఫ్రెంచివారి స్వాధీనంలోకి తెచ్చుకున్నాడు. కల్నల్ ఫోర్డు మచిలీపట్టణాన్ని 1759 ఏప్రిల్ లో పట్టుకున్నాడు.

ఇంగ్లీషువారు ఫ్రెంచివారిని ఓడించి సర్కారులను నైజాం నవాబునుండి రాబట్టుకున్నారు. గోల్కొండ నవాబుల కాలం నుండి కృష్ణాజిల్లా కొండపల్లి సర్కారుగా వ్యవహరించబడింది. కొండపల్లి సర్కారు నైజాం నవాబులకాలంలో ముస్తఫానగర్ సర్కారు అని పిలవబడేది. ఫౌజుదారు కొండపల్లి ఖిల్లాలో వుండేవాడు. సర్కారు 1766 లో ఇంగ్లీషువారి వశమయ్యాక సర్కారు జిల్లాలను పాలించిన తూర్పు ఇండియా కంపెనీ సలహా సంఘ ప్రధాన కార్యాలయం మచిలీపట్టణంలో స్థాపించబడింది.

### కృష్ణాజిల్లా పరిణామం

1794లో మచిలీపట్టణంలోని కౌన్సిలు రద్దుచేయబడి జిల్లాలపాలన కలెక్టరుకు అప్పగించబడింది. 1859 లో రాజమండ్రీ, మచిలీపట్టణం, గుంటూరు జిల్లాలు కలిపివేయబడి కృష్ణా, గోదావరిజిల్లాలుగ విభజించబడ్డవి. ఉప్పుటేరు, తమ్మిలేరు ఈ రెండుజిల్లాలకు సరిహద్దుగ నిర్ణయించ

బడ్డాయి. కృష్ణాజిల్లాకు మచిలీపట్టణం కార్యస్థానము అయింది. 1904 లో కృష్ణా జిల్లానుండి గుంటూరుజిల్లాను విడదీసి పశ్చిమగోదావరి ప్రాంతాన్ని కృష్ణా జిల్లాలో కలిపారు. 1925 లో కృష్ణాజిల్లా నుండి పశ్చిమగోదావరి విడదీయబడింది.

కృష్ణాజిల్లాలో బందరు, దివి, గుడివాడ, విజయవాడ, కైకలూరు, గన్నవరం, నందిగామ, తిరువూరు, నూజవీడు అనే తొమ్మిది తాలూకాలున్నవి.

మచిలీపట్నంలో సిపాయీలు బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా 1706 లో తిరుగుబాటు చేసారు. ఇంగ్లీషు పాలకులు సిపాయీలను తలపాగలు తీసేసి టోపీలు పెట్టుకోమని నిర్బంధించారు. కాని సిపాయీలు తాము అదివరకునుండి ధరించుతున్న తలపాగాలను తీసివెయ్య నిరాకరించారు. సిపాయీలు నాలుగు రోజుల పాటు తిరుగుబాటు చేయగా ప్రభుత్వం తుపాకులతో తిరుగుబాటును అణచివేసింది. కాల్పులలో ఆరుగురు సైనికులు చనిపోయారు. జాతీయ స్వతంత్ర పోరాటంలో యీజిల్లా కూడ ముందంజవేసింది.

# భూగోళం

**జిల్లా** కార్యస్థానం మచిలీపట్నం. వైశాల్యం 3,499 చ. మై. జనాభా **17,79,484.**

కృష్ణాజిల్లాకు ఉత్తరమున హైదరాబాదు సంస్థానం, పశ్చిమగోదావరిజిల్లా; తూర్పున బంగాళాఖాతము, పశ్చిమ గోదావరిజిల్లా; దక్షిణమున బంగాళాఖాతము; పశ్చిమమున గుంటూరుజిల్లా సరిహద్దులుగా యున్నది.

1950 లో హైదరాబాదు పోలీసు చర్యానంతరం కృష్ణాజిల్లాలో భూభాగాలై హైదరాబాదు సంస్థానంచే చుట్టుముట్టబడివున్న 9 గ్రామాలు (లింగగిరి, సర్వారం, కలవపల్లి, లక్కవరం, అమ్మవరం, గనగలంద, ములుగుమాడ, రొంపిమల్ల, మల్లవరం) హైదరాబాదులో కలిపివేయబడ్డాయి. దీనికి ప్రత్యామ్నాయంగా కృష్ణాజిల్లా భూభాగంచే చుట్టివేయబడి యున్న యీ క్రింది హైదరాబాదు సంస్థాన గ్రామాలు కృష్ణాజిల్లాలో కలపబడ్డాయి. కొడవటికల్లు, ఉస్తేపల్లి, పరిటాల, గని ఆత్కూరు, మోగులూరు, [illegible], గానుగపాడు, బూరివంచ, మల్లవల్లి, పుల్లపాడు. జిల్లా 4 రెవిన్యూ విభాగాల క్రింద, 9 తాలూకాల క్రింద విభజింపబడివున్నది. క్రింది పట్టిక రెవిన్యూ, తాలూకాల విభజనను, తాలూకాల విస్తీర్ణతను, వాటి కార్యస్థానాలను తెలియజేస్తుంది:

| రెవిన్యూ డివిజను పేరు | రెవిన్యూ డివిజను కార్యస్థానం | రెవిన్యూ డివిజనులోని తాలూకాలు | తాలూకా విస్తీర్ణం చ. మైళ్ళు | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| విజయవాడ | విజయవాడ | విజయవాడ | 436 | విజయవాడ |
| | | నందిగామ | 679 | నందిగామ |
| | | తిరువూరు | 430 | తిరువూరు |
| నూజివీడు | నూజివీడు | నూజివీడు | 335 | నూజివీడు |
| | | గన్నవరం | 295 | గన్నవరం |
| గుడివాడ | గుడివాడ | గుడివాడ | 230 | గుడివాడ |
| | | కైకలూరు | 286 | కైకలూరు |
| | మచిలీపట్నం | బందరు | 343 | మచిలీపట్నం |
| | | దివి | 465 | అవనిగడ్డ |

బందరు, దివి తాలూకాలకు సముద్ర తీరం కలదు. జిల్లాలో మిట్టభూములు, డెల్టా అనే నూల విభజన చేయవచ్చు. బందరు, దివి, గుడివాడ, కైకలూరు, గన్నవరం, విజయవాడ తాలూకాలు డెల్టాభాగంక్రిందకు వస్తాయి. మిగిలిన మూడు తాలూకాలు మిట్టభూములు. కృష్ణాజిల్లాలోని డెల్టాభూములన్నీ కృష్ణానది నీటిచేత సాగుచేయబడుతున్నాయి. మిగితా మెట్టభూములు చక్కని పీఠభూమిలోని మైదానభాగమే. కొండపల్లి కొండలు, తిరువూరు తాలూకాలోని జమ్మలవాయిదుర్గం కొండలు, బెజవాడలోని ముగల్‌రాజపురం కొండలు జిల్లాలోని ప్రధాన కొండలు. నందిగామ, గన్నవరం, నూజివీడు తాలూకాలలో అక్కడక్కడ చిన్న గుట్టలు కానవస్తాయి.

కైకలూరు తాలూకాకు ఉత్తరాన, పశ్చిమగోదావరి జిల్లాలోని ఏలూరు తాలూకాకు దక్షిణంగాను 150 మైళ్ళ విస్తీర్ణం గల్గిన పల్లపు భూమిగలదు. దీనిని కొల్లేరుసరస్సు అంటారు. చుట్టుప్రక్కల డెల్టాప్రాంతాల మురుగంతా వర్షాకాలంలో యిచ్చటకు చేరుతుంది. వేసవిలో దాదాపు యెండిపోతుంది.

డెల్టాభాగం దాదాపు అంతా చదరంగా వుంటుంది. సముద్రతీర ప్రాంతాలలో సేద్యానికి పనికరాని బీడుభూములు అక్కడక్కడ కన్పిస్తాయి.

## నదులు

కృష్ణానది, దాని వుపనదియైన మునేరు జిల్లాలోని ప్రధాననదులు. పశ్చిమ కనుమల్లో పుట్టిన కృష్ణానది బొంబాయి, హైదరాబాదు సంస్థానముల గుండా ప్రవహించి, కర్నూలుజిల్లాలో ఆంధ్రలో ప్రవేశిస్తుంది. కర్నూలు, గుంటూరు జిల్లాల గుండా ప్రవహించి కృష్ణాజిల్లా వాయువ్య మూలగా కృష్ణాజిల్లాలో ప్రవేశిస్తున్నది. కృష్ణా, గుంటూరు జిల్లాల పశ్చిమ సరిహద్దుగా ప్రవహించి హంసలదీవివద్ద బంగాళాఖాతంలో కలియుచున్నది.

నందిగామ తాలూకాలో ఉత్తరము నుండి దక్షిణమునకు ప్రవహించే మునేరు కృష్ణలో కలియుచున్నది.

తమ్మిలేరు తిరువూరు, నూజివీడు తాలూకాల తూర్పు సరహద్దున ప్రవహించి పశ్చిమగోదావరి జిల్లాలో ప్రవేశించుచున్నది.

బుడమేరు విజయవాడ, గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాలగుండా ప్రవహించి కొల్లేరు సరస్సులో కలుస్తున్నది.

## అడవులు

జిల్లాలో చెప్పుకోదగ్గ అడవులు లేవు. 295 చ. మై. విస్తీర్ణం గలిగిన రిజర్వు అడవులు మాత్రమే వున్నాయి. క్రింది పట్టిక జిల్లాలోని రిజర్వుఅడవుల, తాలూకాల విస్తీర్ణత తెలియపరుస్తుంది:

| తాలూకా | రిజర్వు అడవి చ. మైళ్ళలో |
|---|---|
| నందిగామ | 60.83 |
| విజయవాడ | 56.17 |
| తిరువూరు | 24.74 |
| నూజివీడు | 30.03 |
| గన్నవరం | 10.94 |
| బందరు | 44.15 |
| దివి | 68.29 |
| మొత్తం | 295.15 |

## శీతోష్ణస్థితి, వర్షపాతము

ఏప్రిల్ నుండి జూన్ వరకు అత్యధిక ఉష్ణోగ్రత వుంటుంది. జూలై నుండి వర్షఋతువు ప్రారంభమై నవంబరు, ఫిబ్రవరుల మధ్యకాలంలో శీతోష్ణపరిస్థితులు అనుకూలంగావుంటాయి. సంవత్సరంలో సగటున ఆయా తాలూకాలకు ఎన్నివర్షపు దినాలు వుండేదీ, ఎన్ని అంగుళాల వర్షం పడేదీ క్రింది పట్టిక తెలియచేస్తుంది:

ప్రాంతాల్లోని పంటలకు నూతులుకూడ స్వల్ప [illegible] కొల్లేరు సరస్సు, వుప్పుటేరు జలాలతో సాగుకూడ చేయడం జరుగుతోంది. సముద్రప్రాంతాల్లో మెట్టపైరుల పోషణకు చిన్న చిన్న గుంటలు త్రవ్వి నీరు పోయడం జరుగుతోంది.

### నందిగామ తాలూకా

పుల్లంపల్లివద్ద మునేరుపై కట్టబడిన ఆనకట్ట యీ తాలూకాలోని ప్రధాన నీటి

| తాలూకా | సాలుసరి వర్షపాతం * (అంగుళాల్లో) | సాలుసరి వర్షపు దినాలు |
|---|---|---|
| నందిగామ | 32.02 | 47.3 |
| విజయవాడ | 35.66 | 52.3 |
| తిరువూరు | 37.98 | 51.2 |
| నూజివీడు | 39.28 | 56.2 |
| గన్నవరం | 35.34 | 50.7 |
| కైకలూరు | 36.79 | 50.7 |
| గుడివాడ | 36.40 | 51.6 |
| బందరు | 39.60 | 35.3 |
| దివి | 40.89 | 50.4 |

### సాగు సదుపాయాలు

కృష్ణానది నీటిచే జిల్లాకు ప్రధాన నీటి సాకర్యాలు కల్పించబడ్డాయి. విజయవాడ వద్ద నిర్మింపబడ్డ ఆనకట్టనుండి డెల్టా అంతటా కాలువలు వ్యాపించియున్నాయి. మునేరు, బుడమేరు, తమ్మిలేరు కూడ కొద్దిగా సాగుకు తోడ్పడుతున్నాయి. మెట్ట తాలూకాల్లో అక్కడక్కడ చెరువులు కూడ కన్పిస్తాయి. తోటలకు, మెట్ట

వనరు. ఇచ్చటనుండి పల్లకాలువలు బయలుదేరి నీటిని సాగుకు కొనిపోతున్నాయి. ఇదికాక చెరువులు, బావులపైన ఆధారపడి మాగాణిచేయటంకూడ జరుగుతున్నది.

### విజయవాడ తాలూకా

సాగయ్యే భూములు కృష్ణకాలువల మీద ఆధారపడి ఉన్నాయి. కృష్ణానది నుండి నీటిని తోడి గుంటుపల్లి, ఆ చుట్టు

* ఒక అంగుళము = 2 దుక్కుల వర్షము.

| తాలూకా | మైనరు ఇర్రిగేషన్ వనరుల సంఖ్య | మైనరు ఇర్రిగేషను క్రింద ఆయకట్టు (ఎకరాలలో) | మేజరు ఇర్రిగేషను క్రింద ఆయకట్టు (ఎకరాలలో) |
|---|---|---|---|
| నందిగామ | 107 | 8,437.10 | 33,347 |
| విజయవాడ | 48 | 1,937.86 | 71,177 |
| తిరువూరు | 386 | 20,026.34 | 31,947 |
| నూజివీడు | 79 | 3,760.70 | 59,638 |
| గన్నవరం | 24 | 2,998.15 | 98,780 |
| కైకలూరు | ... | ... | 1,13,881 |
| గుడివాడ | ... | ... | 1,21,957 |
| బందరు | ... | ... | 96,787 |
| దివి | ... | ... | 1,22,803 |
| మొత్తం | 644 | 45,160.15 | 7,50,317 |

ఎకరాలలో ఉలవలూ పండించబడుచున్నాయి.

వ్యాపార పంటలలో ప్రధానమైనవి వేరుసెనగ. లక్షన్నర ఎకరాలవరకూ యీపంట క్రింద ఉన్నది.

ప్రక్క పేజీపట్టికలోని తాలూకావారీగా ఏఏ పంట, యెంత వైశాల్యంలో పండించబడుతున్నది వివరిస్తున్నది. గత సంవత్సరాలలో 1946-47 సంవత్సరపు పంటలు సగటు పంటల ఉత్పత్తికి సమీపంగా ఉన్నట్లు ఎంచబడింది. కనుక 1946-47 సంవత్సర పంటల వైశాల్యం తెలియజేయు పట్టిక ఇచ్చుట యివ్వబడింది.

| పంట పేరు | | దివి (ఎకరాలు) | బందరు (ఎకరాలు) | గుడివాడ (ఎకరాలు) | కైకలూరు (ఎకరాలు) | విజయవాడ (ఎకరాలు) | నందిగామ (ఎకరాలు) | తిరువూరు (ఎకరాలు) | గన్నవరం (ఎకరాలు) | నూజివీడు (ఎకరాలు) | జిల్లా (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 1,20,146 | 88,670 | 1,21,222 | 1,07,015 | 50,306 | 24,722 | 24,471 | 96,719 | 15,386 | 6,48,657 |
| | మెట్ట | 613 | 3,731 | 80 | 65 | 3,063 | 1,105 | ... | 141 | 110 | 8,908 |
| జొన్న | | 2,651 | 415 | 18 | 22 | 29,569 | 1,08,211 | 54,014 | 5,820 | 8,592 | 2,09,312 |
| సజ్జలు | | ... | 48 | ... | ... | 2,121 | 8,607 | 3,874 | 320 | 1,068 | 15,948 |
| మొక్కజొన్న | | 1,994 | 32 | 77 | 14 | 1,513 | 553 | 1,128 | 666 | 43 | 6,020 |
| వరిగ | | 102 | 20 | ... | 35 | 129 | 2,074 | 42 | 12 | ... | 2,414 |
| పెసలు | | 14,713 | 1,551 | 7,082 | 85 | 5,356 | 7,024 | 2,786 | 8,068 | 23 | 46,688 |
| కందులు | | 394 | 23 | 49 | 2 | 1,335 | 3,859 | 76 | 338 | 381 | 6,457 |
| మినుములు | | 6,747 | 282 | 6,058 | 7 | 11,969 | 108 | 103 | 7,793 | 31 | 33,098 |
| శనగలు | | 610 | 3 | 66 | 5 | 1,270 | 1,610 | 89 | 747 | 20 | 4,420 |
| ఉలవలు | | 1,085 | 730 | 290 | 317 | 4,745 | 5,354 | 2,917 | 2,695 | 5,569 | 23,702 |
| మిర్చి | | 1,547 | 1 | 227 | 4 | 4,107 | 6,958 | 1,433 | 2,975 | 180 | 17,433 |
| చెరకు | | 11 | ... | 130 | ... | 749 | ... | ... | 2,733 | ... | 3,623 |
| వేరుశనగ | | 11 | 1,630 | 34 | 1,591 | 15,478 | 91,729 | 23,664 | 8,554 | 13,319 | 1,56,010 |
| నువ్వులు | | 1,902 | 299 | 202 | 157 | 581 | 71 | 868 | 440 | 221 | 4,791 |
| ప్రత్తి | | 393 | ... | ... | 1 | 12 | 1,435 | 11 | 6 | ... | 1,858 |
| పొగాకు | | 1,075 | ... | 12 | 5 | 9,805 | 7,407 | 1,115 | 1,756 | 2,341 | 16,856 |

## రహదారులు

జిల్లా మొత్తంలో 1,474 మైళ్ళ నిడివిగల రోడ్లుకలవు. ఇందులో 94 మైళ్ళు జాతీయరహదార్లుగాను, 78 మైళ్ళు రాష్ట్రీయ రహదార్లుగాను, 446 మైళ్ళు ప్రధానమైన జిల్లారోడ్లుగాను, 208 మైళ్ళు ఇతరవిధమైన జిల్లారోడ్లుగాను, 454 మైళ్ళు గ్రామ రోడ్లుగాను, 192 మైళ్ళు మ్యునిసిపల్ రోడ్లుగాను, 2 మైళ్ళు పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు రోడ్లుగాను విభజింపబడి ఉన్నవి.

మ్యునిసిపల్, పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు రోడ్లను మినహాయించి, మిగతా వాటి తాలూకావారీ విభజన పై పట్టికలో వివరించబడింది.

బందరు, విజయవాడ, దివి, కైకలూరు, నూజివీడు, నందిగామ, తిరువూరు తాలూకాలలో రహదారివసతులు చాలా తక్కువగా ఉన్నట్లు క్రిందిపట్టిక స్పష్టంచేస్తుంది.

| తాలూకా | జాతీయ రహదారులు (మైళ్ళు) | రాష్ట్రీయ రహదారులు (మైళ్ళు) | ప్రధాన జిల్లా రోడ్లు (మైళ్ళు) | ఇతర జిల్లా రోడ్లు (మైళ్ళు) | గ్రామ రోడ్లు (మైళ్ళు) | మొత్తం (మైళ్ళు) |
|---|---|---|---|---|---|---|
| నందిగామ | 49 | ... | 30 | 43 | 16 | 138 |
| విజయవాడ | 28 | 12 | 52 | 18 | 61 | 171 |
| తిరువూరు | ... | ... | 70 | 32 | ... | 102 |
| నూజివీడు | ... | ... | 48 | 4 | 35 | 87 |
| గన్నవరం | 17 | 16 | 54 | 13 | 106 | 175 |
| కైకలూరు | ... | ... | 48 | 37 | 32 | 117 |
| గుడివాడ | ... | 29 | 56 | 21 | 91 | 197 |
| బందరు | ... | 19 | 34 | 25 | 59 | 137 |
| దివి | ... | 2 | 54 | 13 | 106 | 175 |
| మొత్తం | 94 | 78 | 446 | 208 | 454 | 1,280 |

## రైళ్ళు

జిల్లాలో మొత్తం $132\frac{1}{4}$ మైళ్ళ రైలు బాట కలదు. ఇందులో $77\frac{1}{4}$ మైళ్ళు మీటరుగేజి. 55 మైళ్ళు బ్రాడ్ గేజి.

ఆంధ్రదేశంలోకెల్ల ప్రధాన రైల్వే కూడలి అయిన విజయవాడ యీ జిల్లాలోనిదే. ఇచ్చట మద్రాసునుండి వచ్చిన బ్రాడ్ గేజి రైలుమార్గం కలకత్తా - విజయవాడ, ఢిల్లీ - విజయవాడ మార్గముల క్రింద చీలుతుంది.

బందరు - విజయవాడ మీటరుగేజి రైలు గుడివాడనుండి చీలి, భీమవరం

వద్ద నిడదవోలు - నరసాపురం రైలును కలుపుతున్నది.

జిల్లాలోని 9 తాలూకాలలో విజయవాడ, నూజివీడు, గన్నవరం, గుడివాడ, కైకలూరు, బందరు తాలూకాలకు మాత్రమే రైలు సదుపాయం కలదు. దివి, నందిగామ, తిరువూరు తాలూకాలలో ఎట్టి రైలుమార్గము లేదు.

## జనాభా విస్తీర్ణం

గత పది సంవత్సరాలలో యేయే తాలూకాలో యెంతెంత జనాభా వృద్ధి చెందిందో, మున్నగు వివరాలు క్రింద ఇచ్చిన పట్టిక తెలియజేస్తుంది. పట్టికకు ప్రథమంలో జిల్లా మొత్తానికి సంబంధించిన సంఖ్యలు యివ్వబడ్డాయి.

| తాలూకా | జనాభా | | 1941 సం॥ జనాభాపై పెరుగుదల శాతం | గ్రామాలు | * పట్టణాలు |
|---|---|---|---|---|---|
| | 1941 | 1951 | | | |
| కృష్ణాజిల్లా | 14,50,321 | 17,79,484 | 22.7 | 962 | 12 |
| నందిగామ | 2,04,547 | 2,39,639 | 17.2 | 164 | 1 |
| విజయవాడ | 2,48,024 | 3,56,572 | 43.8 | 105 | 3 |
| తిరువూరు | 1,06,434 | 1,21,860 | 16.5 | 86 | ... |
| నూజివీడు | 89,974 | 1,07,227 | 19.2 | 76 | 1 |
| గన్నవరం | 1,63,815 | 1,98,579 | 21.2 | 117 | 1 |
| కైకలూరు | 99,645 | 1,19,940 | 20.0 | 97 | ... |
| గుడివాడ | 1,72,410 | 1,98,940 | 15.4 | 108 | 2 |
| బందరు | 1,79,778 | 2,18,982 | 21.8 | 113 | 2 |
| దివి | 1,87,494 | 2,18,089 | 16.3 | 96 | 2 |

* కనీసం 5 వేలు, అంతకంటె యెక్కువ జనాభా గల్గి, స్పష్టమైన పట్టణ వాతావరణం కల్గిన పట్టణములనే యీ పట్టికలో చేర్చటం జరిగింది.

జిల్లా మొత్తం జనాభా 974 పట్టణాలలోనూ, గ్రామాలలోనూ 3,23,870 ఇండ్లలో నివసిస్తున్నారు. ఇందులో 2,67,401 ఇండ్లు గ్రామాలలో ఉన్నాయి. 56,469 ఇండ్లు పట్టణాలలో ఉన్నాయి.

17,79,484 మంది మొత్తం జనాభాలో 14,09,392 మంది గ్రామాలలోనూ, 3,70,092 మంది పట్టణాలలోనూ నివసిస్తున్నారు. జిల్లా జనాభాలో ప్రతి నలుగురిలో ఒక్కడు పట్టణంలో ఉంటున్నాడు.

తాలూకావారీ ఇండ్ల సంఖ్య, పట్టణ, గ్రామీణ జనాభా వివరాలు ప్రక్క పేజీలోని పట్టిక తెలియజేస్తున్నది.

| తాలూకా | నివసించే ఇండ్లు | | | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|
| | తాలూకా మొత్తం | గ్రామాలలో | పట్టణాలలో | | | |
| నందిగామ | 43,946 | 41,592 | 2,354 | 2,26,808 | 12,831 | 2,39,639 |
| విజయవాడ | 58,165 | 31,422 | 26,743 | 1,78,747 | 1,77,825 | 3,56,572 |
| తిరువూరు | 21,298 | 21,298 | ... | 1,21,860 | ... | 1,21,860 |
| నూజివీడు | 19,426 | 16,647 | 2,779 | 90,323 | 16,904 | 1,07,227 |
| గన్నవరం | 37,857 | 35,629 | 2,228 | 1,84,152 | 14,427 | 1,98,579 |
| కైకలూరు | 22,951 | 22,951 | ... | 1,19,596 | ... | 1,19,596 |
| గుడివాడ | 36,173 | 30,618 | 5,555 | 1,56,892 | 42,048 | 1,98,940 |
| బందరు | 40,984 | 26,934 | 14,050 | 1,29,393 | 89,589 | 2,18,982 |
| దివి | 43,070 | 40,310 | 2,760 | 2,01,621 | 16,468 | 2,18,089 |
| మొత్తం | 3,23,870 | 2,67,401 | 56,469 | 14,09,392 | 3,70,092 | 17,79,484 |

జిల్లా జనాభా గత పది సంవత్సరాలలోనూ నూటికి 22.7 చొప్పున అభివృద్ధి చెందింది. ఇందులో మాగాణి ప్రాంతాలలో సగటు జనాభా 24.7% చొప్పున, మెట్ట ప్రాంతాలలో 17.4% చొప్పున అభివృద్ధి చెందింది.

విజయవాడ తాలూకా జనాభా గత 10 సం॥లలో నూటికి 43.8 చొ॥ పెరిగింది. ఇంత పెరుగుదలకు ప్రధాన కారణం విజయవాడపట్టణం ఇందులో చేర్చబడి ఉండుటయే. విజయవాడ పట్టణజనాభా 1941-51 సం॥ మధ్య కాలంలో దరిదాపు రెట్టింపయింది. మొత్తం తాలూకా జనాభాలో ఈపట్టణ జనాభా సుమారు సగం. విజయవాడ రాష్ట్ర కేంద్రంగా పెంపొందుటచేత యింత త్వరితగతిని పెరుగుతోంది.

నూజివీడు, కైకలూరు తాలూకాలలో యితర రెండు తాలూకాలకన్న (దివి, గుడివాడ) అధికశాతంలో జనాభా వృద్ధి చెందుటం జరిగింది. దీనికి ప్రధానకారణం, ఆ తాలూకాలలోనికి యీ పది సంవత్సరాలలో యితర ప్రదేశాలనుండి వలస వచ్చి స్థిరపడ్డవారి జనాభాయేనని, 1951 సంవత్సరం జనాభా లెక్కలు తెలుపుతున్నాయి. నూజివీడు తాలూకాలో విరివిగా అడవులకొట్టి అనేక ఎకరముల భూమి నూతనంగా సేద్యంక్రిందకు తేబడిందని, ఆ భూముల ఆక్రమణకు వలసవచ్చిన కుటుంబాలు తగిన సంఖ్యలో ఉన్నట్లు 1951 జనాభా లెక్కలలో రిజిష్టరు చేయబడ్డది.

## వైద్యం

ప్రజా అవసరాల దృష్ట్యా జిల్లాలోని వైద్య సదుపాయాలు బహు స్వల్పం.

ప్రభుత్వంచే నిర్వహించబడే జిల్లా ఆస్పత్రి 192 మంచాలతో బందరులో కలదు. తర్వాత పెద్ద ఆస్పత్రి 59 మంచాలతో విజయవాడలో కలదు.

ఇవికాక నూజివీడు, విజయవాడ, ఉయ్యూరు మున్నగు ప్రదేశాలలో మిషన్ ఆస్పత్రులు నడుపబడుతున్నాయి.

జిల్లాలోని ప్రభుత్వ, లోకల్ ఫండు ఆస్పత్రుల పట్టిక, వాటిలో ఉన్న మంచాల సంఖ్య 1951 సం॥లో ఉన్న విధంగా క్రింద ఇవ్వబడింది:

| తాలూకా | ఆసుపత్రి వున్నవూరు | నిర్వహణాధికారం | మంచాలు |
|---|---|---|---|
| బందరు | బందరు | గవర్నమెంటు ఆసుపత్రి | 192 |
| | పెడన<br>బంటుమిల్లి | లోకల్ ఫండ్ ఆసుపత్రులు | |
| | [illegible] | గ్రామీణ వైద్యాలయం | |
| విజయవాడ | విజయవాడ | గవర్నమెంటు ఆసుపత్రి | 59 |
| | మైలవరం | లోకల్ ఫండు ఆసుపత్రి | |
| | కొండపల్లి<br>నిడమానూరు<br>తోట్లవల్లూరు | గ్రామీణ వైద్యాలయాలు | |
| గుడివాడ | గుడివాడ | గవర్నమెంట్ ఆసుపత్రి | 19 |
| | ముదినేపల్లి<br>పామర్రు | లోకల్ ఫండ్ ఆసుపత్రులు | |
| | గుడ్లవల్లేరు<br>కొండపాడు | గ్రామీణ వైద్యాలయాలు | |
| నందిగామ | నందిగామ | గవర్నమెంట్ ఆసుపత్రి | 8 |
| | [illegible] | ” | 8 |
| | జగ్గయ్యపేట | లోకల్ ఫండ్ ఆసుపత్రి | 4 |
| | కంచికచర్ల | గ్రామీణ వైద్యాలయం | |
| నూజివీడు | నూజివీడు | గవర్నమెంట్ ఆసుపత్రి | 8 |
| | గొల్లపల్లి | గ్రామీణ వైద్యాలయం | |
| దివి | అవనిగడ్డ | లోకల్ ఫండ్ ఆసుపత్రి | 4 |
| | పెదకళ్ళేపల్లి<br>ఘంటసాల | ” | |
| | పెదపూడి<br>నాగాయలంక | గ్రామీణ వైద్యాలయాలు | |

| తాలూకా | ఆసుపత్రి వున్నవూరు | నిర్వహణాధికారం | మంచాలు |
|---|---|---|---|
| కైకలూరు | కైకలూరు | లోకల్ ఫండ్ ఆసుపత్రి | 4 |
| | మంగపల్లి<br>శనికల్లి<br>తుమ్మిడి | గ్రామీణవైద్యాలయాలు | |
| తిరువూరు | తిరువూరు | లోకల్ ఫండ్ ఆసుపత్రి | 4 |
| | విస్సన్నపేట | ,, | |
| గన్నవరం | గన్నవరం | లోకల్ ఫండ్ వైద్యశాల | |
| | ముదునూరు<br>మానికొండ<br>వేగూరు | గ్రామీణ వైద్యాలయాలు | |

గన్నవరం తాలూకాలోని కేసరపల్లిలో 16 మంచాలుగల ప్రయివేటు కుష్ఠరోగుల వైద్యశాల గలదు.

## పరిశ్రమలు

జిల్లాలో చెప్పదగిన పరిశ్రమలు — ఉయ్యూరులోని పంచదార ఫ్యాక్టరీ, విజయవాడలోని ఆంధ్ర సిమెంటుకంపెనీ, వసంతా సబ్బుల ఫ్యాక్టరీ, బందరులోని ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ.

ఆంధ్రదేశంలోకెల్ల పెద్ద ఎలక్ట్రిక్ థర్మల్ స్టేషను, పెద్ద రైల్వే కేంద్రం యీ జిల్లా (విజయవాడ) లోనే కలవు.

తిరువూరు, కైకలూరు తాలూకాలలో పెద్ద పరిశ్రమల క్రింద లెక్కింపబడే ఏ కర్మాగారంగాని, ఫ్యాక్టరీగాని లేవు. ఇతర తాలూకాలలోని పరిశ్రమ వారీ వివరాలను 1951 లెక్కల ప్రకారం యీ పట్టిక తెలియజేస్తుంది :

| తాలూకా | * పరిశ్రమలు | ఫ్యాక్టరీల సంఖ్య | పరిశ్రమలలో పనిజేయు వారి సంఖ్య |
|---|---|---|---|
| దివి | బియ్యం మిల్లులు | 9 | 108 |
| బందరు | బియ్యం మిల్లులు | 19 | 414 |
| | ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ | 2 | 600 |
| గుడివాడ | బియ్యం మిల్లులు | 26 | 917 |
| గన్నవరం | పంచదార ఫ్యాక్టరీ | 1 | 761 |
| | బియ్యం మిల్లులు | 9 | 206 |
| విజయవాడ | బియ్యం మిల్లులు | 17 | 597 |
| | నూనె మిల్లులు | 9 | 295 |
| | పొగాకు | 3 | 1,544 |
| | అచ్చు ప్రెస్సులు | 17 | 223 |
| | అల్యూమినం | 13 | 268 |
| | ఇంజనీరింగు (జనరల్) | 15 | 478 |
| | మోటారు రిపేరింగ్ | 11 | 187 |
| | సిమెంటు | 1 | 598 |
| నూజివీడు | బియ్యం మిల్లులు | 4 | 117 |
| నందిగామ | బియ్యం, నూనె మిల్లులు | 15 | 484 |

* ఫ్యాక్టరీ చట్టం క్రింద వచ్చేవి మాత్రమే చేర్చబడ్డాయి.

# గుంటూరు జిల్లా

## చరిత్ర

పల్నాటి వీరగాథలను విని ఒళ్ళు పులకరించని ఆంధ్రుడు, చీరాల-పేరాల సామ్రాజ్యవాద వ్యతిరేక సమరాన్ని చూచి ఉత్తేజితుడు కాని ఆంధ్రుడు వుండడు. ఆంధ్రులకు అమరకీర్తిని తెచ్చిన అమరావతీ స్తూపము, బుద్ధుని తరువాత బుద్ధుడంతటివాడని ప్రఖ్యాతి గాంచిన నాగార్జునుడు నివసించిన నాగార్జున కొండ గుంటూరు జిల్లాలోనివే. ఎన్నో ఆంధ్ర రాజ్యాలకు రాజధానీనగరమైన ధాన్యకటకం, అమరావతి ప్రక్కనున్న ధరణికోటయే. ఆంధ్రను యేలిన ఆంధ్రరాజ్యవంశాలు, ఆంధ్రజాతీయోద్యమానికి ఆయువుపట్టయిన ఉద్యమాలు గుంటూరుజిల్లానుండి తలెత్తి ముందునకు సాగినవే. గుంటూరుజిల్లా ప్రాచీనకాలము నుండీ ఆంధ్ర రాజకీయ, సాంస్కృతిక కేంద్రముగ ఉంటూ వచ్చిన దన్న అతిశయోక్తి కాదు.

మౌర్యులను ధిక్కరించి ప్రథమాంధ్ర రాజ్యాన్ని స్థాపించిన శాతవాహనులు నాలుగున్నర శతాబ్దములపాటు పరిపాలించినది ధాన్యకటకంనుండే. క్రీ. పూ. రెండవ శతాబ్దంనాడు ఆంధ్ర రాజధానీ నగరమై విలసిల్లిన ధాన్యకటక నగరం నేడు కుగ్రామమై ధరణికోటగ కృష్ణఒడ్డున నిలచివున్నది.

ధాన్యకటకం చరిత్ర, అమరావతి చరిత్ర అవిభాజ్యమైనవి. ధాన్యకటకం చరిత్రయే అమరావతి చరిత్ర, అమరావతి చరిత్రయే ధాన్యకటకం చరిత్ర.

### అమరావతి బౌద్ధస్తూపం

సత్తెనపల్లి తాలూకాలో గుంటూరుకు యిరవైమైళ్ళదూరంలో అమరావతివుంది. అమరావతికి పడమటిదిక్కున అరమైలు దూరంలో ధాన్యకటకం వుంది. పూర్వము ఈ రెండు గ్రామాలకు ధాన్యకటకమనే పేరుండేది. చాలకాలంవరకు యీ పేరనే పిలువబడేది. తరువాతి అమరేశ్వరుని దేవాలయాన్నిబట్టి తూర్పుభాగానికి అమరావతి అనే పేరు వచ్చింది. ఈ దేవాలయం అతి ప్రాచీన మైనది. పడమటి భాగాన వున్న ధాన్యకటకం కాలక్రమమున ధరణికోట అయింది. అమరావతి పంచారామాలలో ఒకటి.

అమరావతీ స్తూపమని ప్రసిద్ధిచెందిన బౌద్ధస్తూపం, యిప్పటి అమరావతిలో దొరకుటవలన దానికి అమరావతి స్తూపమనే పేరు వచ్చింది. అమరావతి స్తూపం రెండువేల సంవత్సరాలనాటి ఆంధ్ర ప్రజల జీవితానికి, సంస్కృతికి చిహ్నం. స్తూపపు రాళ్ళమీదగల మౌర్యలిపినిబట్టి యిది క్రీ. పూ. రెండవ శతాబ్దంలో

నిర్మించబడి యుండవచ్చని చరిత్రకారులూహించుచున్నారు. అమరావతీ స్తూప శిల్పము శాతవాహనకాలపు ఆంధ్రుల కళాకౌశల్యానికి మహోన్నత శిఖరము. అమరావతి స్తూపము ఏక కాలమున నిర్మించబడినది కాదు. దానికనేకమైన మార్పులు, చేర్పులు జరిగినవి. బౌద్ధాచార్యుడు నాగార్జునుని కాలంలో స్తూపం చుట్టూను పాలరాతితో 'శ్రీపీఠి' అనే ప్రాకారం నిర్మించబడింది. స్తూపాలమీద బౌద్ధజాతకకథలు రమ్యంగా చిత్రించబడ్డవి. ఈ చిత్రాలు ఆంధ్రశిల్ప ఔన్నత్యాన్ని చాటుతున్నవి.

## ప్రాచీన విశ్వవిద్యాలయం

క్రీ. శ. 174-203 మధ్యకాలంలో పాలించిన గౌతమీపుత్రయజ్ఞశ్రీ శాతకర్ణికి ఆచార్య నాగార్జునుడు సమకాలికుడని పరిశోధకులూహించుచున్నారు. అశోకచక్రవర్తిపంపిన మహాదేవుడనే బౌద్ధాచార్యుడు స్థాపించిన చైత్యక సాంప్రదాయానికి అమరావతి ప్రధానపీఠం. నాగార్జునుని కాలంలో అమరావతి బౌద్ధ విశ్వవిద్యాలయమై వాసికెక్కింది. ఆ కాలంలో విదేశాలనుండి వచ్చే యాత్రికులతో అమరావతీ విశ్వవిద్యాలయం, కిటకిటలాడి పోయేదట. ఇదే మొదటి ప్రాచీనాంధ్ర విశ్వవిద్యాలయం. ఇక్కడ వివిధ బౌద్ధ సాంప్రదాయాలకు, శాఖలకు చెందిన బౌద్ధభిక్షువులు నివసించుటకు ప్రత్యేక సంఘారామము లుండేవట. క్రీ. శ. 7వ శతాబ్దంలో హ్యూ-యున్-త్సాంగ్ అనే చైనాయాత్రికుడు దర్శించిన నాటికి అమరావతి క్షీణదశలో వుంది. అప్పటికే అమరావతిలో వందల హిందూ దేవాలయాలు నిర్మించబడ్డవంటే హిందూ మత ప్రాబల్యం ఎంతగా పెరిగిపోయిందో తెలుసుకోవచ్చు. హ్యూ-యిన్-త్సాంగ్, అమరావతి సంఘారామంలో అప్పటికి మిగిలివున్న బౌద్ధ భిక్షువుల సాయంతో, మహా సాంఘికుల 'అభిధర్మ గ్రంథాన్ని' అధ్యయనం చేసి, వారికి మహాయాన ధర్మగ్రంథాలను, బోధించాడట.

## నాగార్జున కొండ

బౌద్ధమత కాలంలో ఆంధ్రదేశమున అనేక సంఘారామాలు, గుహాలయాలు, స్తూపాలు వెలిశాయి. అట్టివాటిలో నాగార్జునకొండ ప్రసిద్ధి చెందినది. ఇది పల్నాడుతాలూకాలో మాచెర్లకు పదిహేను మైళ్ళ దూరంలో ఉంది. బౌద్ధ మతంలో మాధ్యమికవాద మహాప్రవక్తగా చెప్పబడే నాగార్జునుడు తన అవసాన కాలాన్ని నాగార్జునకొండలో గడిపాడు. నాగార్జునుడు నివసించుటవలన నాగార్జున కొండకు బౌద్ధులు శ్రీపర్వతమని గౌరవ నామకరణం చేశారు. ఇది అమరావతి కంటె పెద్దబౌద్ధారామము. నాగార్జున కొండవద్ద మూడు సంఘారామాలు, ఆరు చైత్యాలయాలు, అనేకస్తూపాలు బయటపడ్డవి. క్రీ. శ. మూడు, నాలుగు శతాబ్దములనాటి ఆంధ్రకళాసంస్కృతికి నాగార్జునకొండ నిదర్శనం.

## చైనాతో సాంస్కృతిక సంబంధాలు

నాగార్జునకొండ అతివిశాలమై, చుట్టూ కొండలచే ఆవరించబడి స్వాభావికమైన కోటవలె కనబడుతుంది. కొండదిగువన శిలాప్రాకారాలు, బురుజులు కొన్ని కనబడినవి. ఇవి విజయనగర రాజులకాలం నాటివని చరిత్రకారులు చెబుతున్నారు.

నాగార్జున కొండలో చూడవలసిన చిత్రం, మెచ్చదగిన చిత్రం నాగరాజు బుద్ధుని ఒక తుఫాను నుండి పడగవిప్పి రక్షించుతున్న చిత్రం. ఈచిత్రంలో శిల్ప ప్రతిభ పరాకాష్ఠ చెందింది. కప్పినుడనే రాజు బుద్ధుని దర్శనార్థమై వెళ్ళి ఆతురతతో ఎదురుచూస్తున్న దృశ్యం, బుద్ధుడు వస్తున్నాడని వినగానే పరుగుపై వెళ్తున్న దృశ్యం మనోహరమైనవి. చందవోలు, భట్టిప్రోలులలో కొన్ని బౌద్ధస్తూపాలు దొరికాయి. భట్టిప్రోలులో పాలరాతిభరణిలో బుద్ధుని అవశేషం దొరికింది.

పల్లవరాజైన శివస్కందవర్మ నాగార్జున కొండ, విజయపురి, బౌద్ధనగరాలను ధ్వంసంచేసాడు. పల్లవరాజులు గుంటూరుజిల్లాలోని బౌద్ధారామాలను వైష్ణవ ఆలయాలుగ మార్చారు.

విష్ణుకుండిన రాజైన గోవిందవర్మ అమరావతీ స్తూపాన్ని ధ్వంసంచేసాడు. బౌద్ధభిక్షువుల అధీనంలో వున్న అమరావతీ స్తూపాన్ని బ్రాహ్మణులు దౌర్జన్యంగా ఆక్రమించుకొని ధ్వంసంచేసి, అమరేశ్వరాలయాన్ని నిర్మించారని చైనా యాత్రికుడు హ్యు-యున్-త్సాంగ్ వ్రాతలనుబట్టి తెలుస్తున్నది.

ఇక్ష్వాకుల కాలంలో తెనాలి, రేపల్లె తాలూకాలకు కనకరాష్ట్రం అని పేరుండేది. ఇక్ష్వాకు రాజైన వాసిష్ఠపుత్రశాంతమూలుని బావమరిది ధనక రాష్ట్రాన్ని పాలించేవాడట. గుంటూరు జిల్లాలోని వినుకొండ, నర్సరావుపేట, బాపట్ల, ఒంగోలు తాలూకాలను; కర్నూలు జిల్లా, నెల్లూరు జిల్లాలో కొంత భాగం కలిపి పూగినాడని పిలువబడేది. ఇదే పాకనాడయింది.

## పల్లవనాడు

ఇక్ష్వాకుల నోడించి కృష్ణానదికి దక్షిణాన వున్న తెలుగుదేశాన్ని పల్లవులు ఆక్రమించుకున్నప్పుడు గుంటూరు జిల్లా పల్లవుల రాజ్యంలో చేరిపోయింది. పల్లవులు తెలుగువారేనని, పల్లవుల జన్మస్థానం గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా యేనని చరిత్రకారులలో ఒకవాదనవుంది. ఈ వాదన నిజమైతే, పల్లవులు శాతవాహనుల క్రింద ఉద్యోగ ధర్మాన పల్నాడు నుండి బయలుదేరి అరవదేశం పోయి, శాతవాహనరాజ్యం పతనమయ్యాక కంచిరాజధానిగ రాజ్యంస్థాపించివుండాలి.

పల్లవులు క్రీ. శ. మూడవ శతాబ్దంలో రాజ్యం స్థాపించి ఏడవ శతాబ్దంలో కొంత కాలంవరకు పాలించారు. పల్లవులకు కంచీపురం రాజధాని అయితే, ధాన్యకటకం ఉపరాజధాని.

శివస్కందవర్మ అనే పల్లవరాజు నాగార్జునకొండ, విజయపురిలోని బౌద్ధ స్తూపాలను ధ్వంసం చేయించాడు. బౌద్ధ భిక్షువులను తరిమివేసాడు. ఇతనికాలంలో ధ్వంసంచేయబడగా మిగిలిన దేమైనా వుంటే శంకరాచార్యులు నాశనం చేయించాడు. నాగార్జునకొండవద్ద శిథిలమైన శైవాలయం యిప్పుడు కనబడుతుంది. పల్లవులు వైష్ణవ మతాభిమానులు.

పల్లవులు గుంటూరు జిల్లానుండి అటు దక్షిణానకర్నూలువరకు పాలించినప్పటికీ, యీ ప్రాంతంపై వారి అధికారం నిరాటంకంగా కొనసాగినదని చెప్పడానికి వీలులేదు. ఆనందగోత్రికులనే కందరరాజులు, విష్ణుకుండిన రాజులు వారితరువాత అధికారంలోకి వచ్చిన చాళుక్యులు, చోళులు - పల్లవుల అధి

కారాన్నధిక్కరిస్తూ ఆంధ్రదేశాన్ని ఆక్రమించుకోడానికి ప్రయత్నాలు చేసారు.

## చేజెర్ల గాథ

క్రీ. శ. నాల్గవశతాబ్ది ప్రారంభంలో దామోదరవర్మ అనే ఆనందగోత్రీకరాజు పల్లవులను పారద్రోలి గుంటూరు జిల్లాలో కొంతభాగాన్ని పాలించాడు. ఆనందగోత్రీకులనే కందరరాజులంటారు. వీరి రాజధాని నర్సారావుపేట తాలూకాలోని చేజెర్లగ్రామం. చేజెర్లను ఆకాలంలో కపోత కందరపురం అనేవారు. ఇక్కడ కపోతేశ్వరాలయమువుంది. శిబిచక్రవర్తి డేగచే తరుముబడుతున్న పావురాన్నిచూచి జాలిపడి, దాన్ని రక్షించడానికిగాను డేగకు తన తొడలోని మాంసాన్నికోసి యిచ్చాడని పురాణకథ వుంది. శిబిచక్రవర్తి తొడమాంసంకోసి యిచ్చినది కపోత కందరపురములోనేనని తెలుస్తాను.

## విష్ణుకుండినపురం

కాని పల్లవులు కందారరాజులను ఓడించి సామంతులుగా చేసుకున్నారు. కందారరాజుల తరువాత విష్ణుకుండినులు విజృంభించి పల్లవులనుండి కొంత ఆంధ్రదేశాన్ని జయించి పాలించారు. విష్ణుకుండినుల జన్మస్థానము వినుకొండ. వినుకొండకే విష్ణుకుండినపురమని పేరు. శాతవాహనుల కాలంలో వినుకొండనుండి హైదరాబాదు వరకు ఒక రాజమార్గం వుండేది. ఆమార్గం, ఆకాలంలో వ్యాపారానికి పనికొచ్చిన ప్రధానమార్గం. దీన్నిబట్టి వినుకొండ వ్యాపారకేంద్రంగ వుండివుండాలి. విష్ణుకుండిన పురిలో తలెత్తిన రాజులవడం వల్ల ఆరాజులకు విష్ణుకుండినులని పేరు వచ్చింది. గుండ్లకమ్మనదికి ఆరోజులలో బ్రహ్మకుండి అని పేరు. విష్ణుకుండినులు శివభక్తులగుటవలన విష్ణుకుండినుల కాలముననే బౌద్ధక్షేత్రమైన అమరావతి శైవక్షేత్రముగా - అమరేశ్వరక్షేత్రముగా - మారివుంటుందని చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు. క్రీ. శ. 458-488 ప్రాంతంలో పరిపాలన చేసిన రెండవ మాధవవర్మకు ధాన్యకటకం రాజధాని. రెండవ మాధవవర్మ తనతండ్రికాలంలో పల్లవులాక్రమించిన భాగాన్ని తిరిగి జయించాడు. క్రీ. శ. 530-540 మధ్య రాజ్యం చేసిన విష్ణుకుండిన రాజు రెండవ విక్రమేంద్రవర్మ తన రాజధానిని ధాన్యకటకం నుండి వెంగిపురానికి మార్చాడు.

కట్టకడపటి విష్ణుకుండిన రాజైన మూడవమాధవవర్మ పరిపాలించుతున్న కాలంలో, పశ్చిమచాళుక్య రాజ్యస్థాపకుడైన రెండవ పులకేశి ఆంధ్రదేశాన్ని జయించి చాళుక్యుల అధికారాన్ని నెలకొల్పాడు.

## ఉండవల్లి గుహాలయం

గుంటూరుతాలూకా ఉండవల్లిలో విష్ణుకుండినుల కాలపునాటి నాలుగు అంతస్తుల గుహాలయము వున్నది.

ఉండవల్లి, విజయవాడకు 3 మైళ్ళ దూరంలోవుంది. ఈ గుహాలయంలో నాలుగు అంతస్తు లున్నాయి. అయిదవ అంతస్తులో చెక్కబడ్డ ఆలయం పూర్తికాలేదు. ఇది బౌద్ధ గుహాలయమని అంటారు. ఇక్కడ తెలుగు లిపిలో వున్న ప్రాచీనకాలపు శాసనాలు వున్నవి.

తూర్పు చాళుక్యుల కాలంలోనే ఇక్కడ అనంతశయనాలయం నిర్మించబడింది. ఈ ఆలయంలో పూజా పునస్కా

రాలు జరిగినట్లు రెడ్డిరాజుల 14 వ శతాబ్ది శాసనాలవల్ల తెలుస్తున్నది. ఒరిస్సా గజపతుల శాసనాలుకూడ కొన్ని వున్నవి.

రెండవ అంతస్తులోని ఆలయంలో నృసింహస్వామి విగ్రహముంది. ఈ విగ్రహం పదహారు స్తంభాలతో కూడిన మంటపంలో వున్న గర్భాలయంలో వుంది. మంటప స్తంభాల పైఅంచులో పరుగెత్తుతున్న కుందేళ్ళ బొమ్మలున్నాయి. మూడవ అంతస్తులోని మంటప స్తంభాల మీద విష్ణువు బొమ్మలు, ఏనుగులు, సింహాలు చెక్కబడివున్నాయి. ఇక్కడనే శేషతల్పంమీద పడుకొనివున్న విష్ణువు విగ్రహం పెద్దది వుంది. ఈ విగ్రహం పొడవు 17 అడుగులు. బ్రహ్మ, లక్ష్మి, నారదుడు మొదలైన వారి విగ్రహాలున్నవి.

## విద్యాపీఠాలు

మొదట్లో రెండవ పులకేశి ప్రతినిధియై, తరువాత స్వతంత్రుడై, తూర్పు చాళుక్య వంశ స్థాపకుడైన కుబ్జవిష్ణువర్ధనుడు (617-633) పాలించుచున్న కాలంలో తూర్పు చాళుక్యరాజ్యం పాకినాటివరకును వ్యాపించుటవలన గుంటూరుజిల్లా చాళుక్యరాజ్యంలో భాగమైపోయింది. చాళుక్యుల కాలంలోనే హూ-యున్-త్సాంగ అమరావతిని సందర్శించాడు.

చాళుక్యుల కాలంలో అమరావతి వంటి విశ్వవిద్యాలయాలు లేవు. ఘటికాస్థానాలనే చిన్న చిన్న విద్యాపీఠాలు యేర్పడ్డాయి. అగ్రహారాలతో పోషించబడే బ్రాహ్మణులచే ఘటికాస్థానాలు నడుపబడేవి. జయసింహవల్లభుడనే రాజు గండేఋపాటివిషయంలో విద మరియు గ్రామాన్ని దానం చేసాడు. గండేఋపాటి విషయం అంటే గుంటూరు, రేపల్లె తాలూకాలు. బ్రాహ్మణులకివ్వబడ్డ అగ్రహారలలో వారికి సర్వహక్కు భుక్తాలుండేవి. నర్సారావుపేట తాలూకా విప్పర్లగ్రామంలో చాళుక్యులకాలంలో వ్రాయబడిన మొట్టమొదటి తెలుగు శాసనం దొరికింది. ఒంగోలువద్ద ధర్మవరంలో గుణగవిజయాదిత్యునికాలంనాటి (క్రీ.శ.848-892) తెలుగుపద్యంలో వ్రాయబడిన మొదటి శాసనం దొరికింది. దీన్నిబట్టి నన్నయభట్టుకు ముందే తెలుగులో పద్యరచన వుందని తెలుస్తున్నది. ధర్మవరం తూర్పు చాళుక్యులకాలంలో జైనమత కేంద్రం.

## రాజధాని చందవోలు

వేంగిచాళుక్యుల రాజ్యం 12 వ శతాబ్ది ప్రారంభంలో అంతంకాగానే, వారి సామంతులు వెలనాటి-చోడులు గుంటూరు జిల్లా తెనాలితాలూకా చందవోలు గ్రామాన్ని రాజధానిగా చేసుకుని, 13 వ శతాబ్దారంభంలో కాకతీయుల దండయాత్ర ప్రమాదం వచ్చేవరకు నెల్లూరు, గుంటూరు తదితరకోస్తా జిల్లాలను పాలించారు. చందవోలు ఆ రోజులలో వైభవంతో తులతూగింది. గుంటూరుజిల్లా ఆ రోజులలో వెలనాడు, పాకనాడులుగా విభజించబడింది. పాకనాడులో, నెల్లూరు జిల్లాలోని కొంతభాగం కలసి వుండేది. ఆనాటి పరిపాలక విభాగములకు "నాడు" అనే పేరుండేది.

వెలనాటి చోడులు పరిపాలన ప్రారంభించిన కాలంలోనే పశ్చిమ చాళుక్య చక్రవర్తి ఆరవ విక్రమాదిత్యుడు దండెత్తి వచ్చి ఆంధ్రదేశాన్ని ఆక్రమించి 1118

నుండి 1135 వరకు పాలించాడు. ఇతని కాలంలోనే ఆంధ్రదేశానికి కన్నడ సంపర్కం పెరిగింది. అప్పుడు వచ్చిన కన్నడ కుటుంబాలలో కొన్ని కొండవీడు ప్రాంతంలో స్థిరపడ్డాయి.

రెండవ గొంకిరాజు కాలంలో వెలనాటి చోడులు ఆరవ విక్రమాదిత్యుని తరిమివేసి తిరిగి ఆంధ్రదేశాన్ని తమ స్వాధీనంలోకి తెచ్చుకొన్నారు. అప్పటి నుండి వెలనాటి చోడులు తెలుగు చోడులని పేరు పెట్టుకొన్నారు. వీరి రాజ్యానికి అనేక ప్రక్కలనుండి స్వతంత్ర రాజుల దండయాత్రలు వచ్చుటచే వీరి రాజ్యం ప్రధానంగా గుంటూరు, నెల్లూరు జిల్లాలకే పరిమితమై వుండేది.

వెలనాటి చోడుల కాలంలో ప్రభుత్వం దుర్బలమవగా ఆంధ్రలో అనేక చిన్న చిన్న సామంత రాజ్యాలు తలెత్తాయి.

గుంటూరుజిల్లాలో 12వ శతాబ్దాంతంలో నాలుగు చిన్నరాజ్యాలు తలెత్తాయి. ధరణికోట రాజధానిగా కోట వంశీకులు, నర్సారావుపేట తాలూకాలోని కొణిదెన రాజధానిగా కొణిదెన చోడులు, పల్నాడు ప్రాంతంలో హైహయులు, కొండవీడు ప్రాంతంలో కమ్మ నాయకులు చిన్నచిన్న రాజ్యాలు స్థాపించారు. వీరంతా వెలనాటి చోడుల ఆధిపత్యాన్ని నామమాత్రంగా అంగీకరిస్తూ స్వతంత్రులవలె వ్యవహరించారు. కుమార సంభవ రచయిత నన్నెచోడుడు కొణిదెన చోడులలోనివాడు.

## పల్నాటి యుద్ధము

మనం వీరగాథలుగ చెప్పుకునే పల్నాటి యుద్ధం యీ కాలంలో జరిగింది. క్రీ. శ. 1176నుండి1182 వరకు పల్నాడు తాలూకా కారెంపూడిలో జరిగింది. ఆ కాలంలో యేర్పడిన చిన్న రాజ్యాల మధ్య తరచు యుద్ధాలు జరుగుతుండేవి. పల్నాడులో హైహయులు రాజ్యాన్ని స్థాపించారు. గురజాల రాజధానిగ పాలించిన నలగామరాజు హైహయ వంశీయుడే. నలగామరాజుకు మలిదేవరాజు మొదలైన సవతి తమ్ములుండేవారు. దాయాదుల మధ్య రాజ్యాధికారానికై జరిగిన కుటుంబ కలహమే పల్నాటియుద్ధం.

నలగామరాజుకు మంత్రి బ్రహ్మనాయుడు. బ్రహ్మనాయుడు దాయాదుల కలహాలలో మలిదేవరాజు పక్షం వహించి మాచెర్ల ప్రాంతాన్ని మలిదేవరాజుకు యిప్పించాడు. బ్రహ్మనాయుడు మలిదేవరాజుతోపాటు మాచెర్లకు వెళ్ళిపోయాడు.

బ్రహ్మనాయుడు వెళ్ళిపోయాక నలగామరాజు నాగమ్మ అనే స్త్రీని మంత్రిగా నియమించుకున్నాడు. ఈమెనే నాయకురాలంటారు. ఈమె తాంత్రికురాలు. నాగమ్మ దాయాదుల మధ్య రగులుతున్న కలహాగ్నిలో ఆజ్యంపోసింది. కక్షలు ఎగదోసింది. నాగమ్మ బ్రహ్మనాయుడని కవ్వించి కోడిపందెములోకి దించి ఓడించింది. కోడిపందెం వేసే ముందు చేసుకున్న ఒప్పందాన్ననుసరించి బ్రహ్మనాయుడు, మలిదేవరాజాదులు గడువు ప్రకారం యేడేళ్ళు వీరు మేడపిలో అరణ్యవాసం చేశారు. గడువు ముగిసాక మాచెర్ల రాజ్యం తమకిమ్మని మలిదేవరాజు, బ్రహ్మనాయుడుకోరంగా నాగమ్మ నలగామరాజులు నిరాకరించారు. ఈ నిరాకరణకు నాగమ్మ ప్రోత్సాహంవుంది.

డైన జాయప సేనాని చెల్లెళ్ళిద్దరిని వివాహం చేసుకున్నాడు. కిమ్మనాడంటే తెనాలి, రేపల్లె తాలూకాలు. ఈ జాయప, గణపతి దేవునికి గజసైన్యాధ్యక్షుడయ్యాడు. ఇతడు గొప్ప నాట్యశాస్త్ర ప్రవీణుడేగాక "నృత్తరత్నావళి" అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఈ కాకతీయ గణపతి ఆస్థానంలోనే తిక్కన మహాభారతం 15 పర్వాలు అనువదించాడు.

## ప్రసూతి వైద్యశాల

అప్పటికే ఆంధ్రదేశంలో ప్రబలుతున్న శైవమతానికి కాకతీయుల కాలంలో మరింత ప్రోత్సాహం లభించి, దానిపని మూడుపూవ్వు లారుకాయలైనది. ఆ కాలంలో ఆంధ్రదేశంలో శైవమఠాలు వెలిశాయి. వాటినే గోళకీ మఠాలంటారు. గోళకీ మఠాలకు సంబంధించిన పెద్దగురువు విశ్వేశ్వరాచార్యుడు. ఇతడు గణపతి దేవునికి గురువు. విశ్వేశ్వరాచార్యుడు ఆంధ్రలో ఏర్పరచిన మూడు ప్రధాన గోళకీ మఠాలలోను గుంటూరు జిల్లా మందడం గ్రామంలోని మఠం ఒకటి. రుద్రమదేవి రాజ్యానికి వచ్చిన రెండు సంవత్సరాల తరువాత క్రీ. శ. 1264 వెలగపూడి, మందడం అనే గ్రామాలను మందడం గోళకీ మఠానికి అగ్రహారంగా యిచ్చివేసింది. గోళకీమఠం శైవవిద్యాపీఠమైంది.

మఠానికి రుద్రమదేవి యిచ్చిన అగ్రహారపు ఆదాయంలో కొంత భాగం 'మందడం' గ్రామంలో ప్రసూతి వైద్యశాల నిర్వహణకు వినియోగించబడేదట. ఏడువందల సంవత్సరాలక్రితమే ప్రసూతి వైద్యశాల ఆవశ్యకతను గుర్తించి రుద్రమదేవి పోషించడం ముదావహమైన విషయం.

## అద్దంకి ప్రాముఖ్యం

ఢిల్లీరాజు అల్లావుద్దీన్, సేనలను పంపి కాకతీయులనోడించి ఆంధ్రను స్వాధీనం చేసుకున్నప్పటికీ, ఒకటి రెండేళ్ళలోనే ముసునూరి నాయకులు, కొండవీటి రెడ్డి రాజులు ఢిల్లీ పాలనను ధిక్కరించి స్వతంత్ర రాజ్యాల్ని స్థాపించారు. 1324 లో ప్రోలయ వేమారెడ్డి, ఒంగోలు తాలూకాలో గుండ్లకమ్మ నది ఒడ్డునవున్న అద్దంకి రాజధానిగ కొండవీటిరెడ్డి రాజ్యాన్ని స్థాపించాడు. కొండవీటిరెడ్డి రాజ్యం క్రీ. శ. 1424 వరకు సాగింది. ప్రోలయ

వేమారెడ్డి కాలంలో నిర్మించబడినవే బెల్లంకొండ, చందవోలు, ధరణికోట, వినుకొండ, కొండవీడుదుర్గాలు. నన్నయ, తిక్కనలు అనువదించగ మిగిలిన అరణ్యపర్వాన్ని అనువదించిన ఎఱ్ఱాప్రగడ, ప్రోలయవేమారెడ్డి ఆస్థానములోనివాడు. 11వ శతాబ్దంలో ప్రారంభమై 14వ శతాబ్దంనాటికి రెడ్డిరాజుల ఆదరణతో మహాభారత ఆంధ్రీకరణ పూర్తి అయినది.

ప్రోలయ వేమారెడ్డి కుమారుడైన అనపోతారెడ్డి కొండవీటి రాజ్యరాజధానిని అద్దంకినుండి నర్సారావుపేట తాలూకాలోని కొండవీడుకు మార్చాడు. కొండవీడున ఉండేరాజ్యానికి కొండవీటి రాజ్యమని పేరు వచ్చింది. విజయనగరరాజుల ప్రమాదాన్నుండి రక్షించుకోడానికే రాజధానిని కొండవీటికి మార్చాడు.

## మోటుపల్లి రేవు

మోటుపల్లిరేవు వ్యాపారం అభివృద్ధి కావడానికి అనపోతారెడ్డి చర్యలు తీసుకున్నాడు. మోటుపల్లి బాపట్లతాలూకాలోని ప్రసిద్ధిగాంచిన రేవుపట్టణము. ఘంటసాల, గూడూరు రేవుల ప్రభ తగ్గిన తరువాత మోటుపల్లి ప్రాముఖ్యానికి వచ్చింది. కాకతీయుల కాలంలో మోటుపల్లి రేవును సందర్శించిన మార్కోపోలో అనే విదేశీయాత్రీకుడు మోటుపల్లి రేవునుండి, సాలీడు దారమంతటి సన్నని దారంతో నేసిన మల్లుసెల్లాలు ముదళైన బట్టలు విదేశాలకు ఎగుమతి అగుతున్నట్లు వ్రాశాడు. గుంటూరు జిల్లాలో ప్రత్తి బాగా పండేది. అందువల్ల ఇక్కడ బట్టల పరిశ్రమ బాగావుండేది. పల్నాడులో నూలు వడికే పరిశ్రమ ఎక్కువగా వుండేది. ఈ జిల్లాలో రోము నాణాలు కనబడటంవల్ల మోటుపల్లి రేవునుండి రోం నగరంతో ఎగుమతి దిగుమతులు జరుగుతుండేవని తెలుస్తున్నది. మోటుపల్లిలో వజ్రాలగనులు వుండేవని నికోలో డీ కాంటాఅనే విదేశీయాత్రీకుడు వ్రాశాడు.

మోటుపల్లి ఓడరేవులో ఢిల్లీ సుల్తానుల దండయాత్రలవల్ల, విపరీతమైన సుంకాలవల్ల అనపోతారెడ్డి కాలంనాటికి మోటుపల్లి ఓడరేవు వ్యాపారము క్షీణించగా అనపోతారెడ్డి 1358 లో మోటుపల్లిలో ఒక శాసనం వేయించాడు. ఈ శాసనంలో అన్యాయమగు పన్నులను రద్దుచేస్తానని, న్యాయమైన దిగుమతి సుంకాలు మాత్రమే విధించబడతాయని, మోటుపల్లి రేవునుండి వ్యాపారం చేసే వారికందరికీ రక్షణ యివ్వబడుతుందని హామీనిస్తూ అనపోతారెడ్డి ప్రకటన చేశాడు. ఈ శాసనం తమిళభాషలో కూడ వ్రాయించబడటాన్నిబట్టి చూస్తే, ఈ రేవుకు తమిళదేశాన్నుండికూడ వర్తకులు వచ్చి ఎగుమతి, దిగుమతులు చేస్తుండేవారని తెలుస్తుంది.అంత ప్రసిద్ధిగన్న మోటుపల్లి నేడు చిన్నపల్లెటూరుగ కాంతి విహీనమై వున్నది. ఈ కాలంలోనే అవచి తిప్పయశెట్టి అనే ఆంధ్రవర్తకుడు విదేశాలతో వ్యాపారంచేస్తుండేవాడు.

## శ్రీనాథుడు

ఈ రెడ్డిరాజులలో ఒకడైన పెదకోమటి వేమారెడ్డి కాలంలో (1402.1420)నే శ్రీనాథకవి వుండేవాడు. పెదకోమటి వేమారెడ్డి ఇతనిని ఆదరించి విద్యాధికారిగా నియమించాడు. తరు

రాజ్యంలో గుంటూరు ఒక ప్రత్యేక సర్కారు. దానికి మురతజానగరు అనిపేరు. 1765 లో సర్కారు జిల్లాలు నైజాంచే ఇంగ్లీషువారి కివ్వబడ్డప్పుడు గుంటూరు జిల్లా మినహాయించబడింది. గుంటూరు జిల్లా 1765లో బసలత్ జంగ్ అనే అతని జాగీరుగా వుండేది. 1778 లో మద్రాసు ప్రభుత్వం దానిని రెండేళ్ళపాటు కౌలుకు పుచ్చుకని వదలివేసింది. 1788 లో గుంటూరుజిల్లా ఇంగ్లీషువారికి ఇవ్వబడింది.

బ్రిటిషువాళ్ళు గోల్కొండ నవాబుల కాలంలోనే రేపల్లె తాలూకాలోని నిజాం పట్నంలో 1621లో ఒక ఫ్యాక్టరీ స్థాపించారు. నిజాంపట్నం రేవుపట్టణంగా కూడ వుండేది. కొత్తపట్నంకూడ ఒకప్పటి రేవుపట్టణము. బకింగ్ హాం కాలువ, మద్రాసుకు రైలుమార్గం ఏర్పడ్డాక యీ రేవుపట్టణాల ప్రాముఖ్యం తగ్గిపోయింది.

గుంటూరుజిల్లా, 1788లో ఇంగ్లీషువారి వశమైనప్పటి నుండి 1794 వరకు, మచిలీపట్టణం నుండి కంపెనీ సలహా సంఘంచే పాలించబడింది. 1794 లో సలహా సంఘాన్ని రద్దుచేసి జిల్లా కలెక్టరను నియమించినప్పుడు మొదట గుంటూరుజిల్లా ప్రత్యేక జిల్లాగా ఏర్పాటుచేయబడింది.

కాని 1859 లో గుంటూరుజిల్లా కృష్ణా జిల్లాలో చేర్చబడింది.

1904లో తిరిగి గుంటూరుజిల్లా ప్రత్యేకంగా యేర్పాటు చేయబడింది. అంతకు పూర్వము నెల్లూరుజిల్లాలోని ఒంగోలు తాలూకాను, కృష్ణాజిల్లాలోని కొన్ని తాలూకాలను విడదీసి 1904 లో గుంటూరుజిల్లా యేర్పాటుచేయబడింది. దీనిలో తొమ్మిది తాలూకాలున్నాయి.

## జాతీయపోరాటాలు

గుంటూరుజిల్లా స్వాతంత్ర్య పోరాటాలలో ముందంజవేసింది. 1921 లో పన్నుల నిరాకరణ ఉద్యమం భారతదేశంలో మొట్టమొదటి సారిగా గుంటూరు జిల్లా పెదనందిపాడులో ప్రారంభమైంది. పల్నాటి వీరహనుమంతుడు (కన్నెగంటి హనుమంతు) పుల్లరి కట్టనిరాకరించినందుకు బ్రిటిషుప్రభుత్వం కాల్చిచంపింది. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి నాయకత్వాన చీరాల - పేరాల ప్రజలసహాయ నిరాకరణోద్యమం బ్రిటిషుప్రభుత్వ పునాదులను కదల్చింది.

# భూగోళం

**జిల్లా** కార్యస్థానం గుంటూరు. వైశాల్యం 5,771 చదరపు మైళ్ళు. జనాభా 25,49,996.

గుంటూరు జిల్లాకు ఉత్తరమున హైదరాబాదు సంస్థానం, కృష్ణాజిల్లా; తూర్పున బంగాళాఖాతం, కృష్ణాజిల్లా; దక్షిణమున నెల్లూరుజిల్లా; పశ్చిమమున కర్నూలు, నెల్లూరుజిల్లాలు, హైదరాబాదు సంస్థానం సరిహద్దులుగా ఉన్నాయి.

జిల్లా తొమ్మిది తాలూకాలక్రింద, నాలుగు రెవెన్యూ విభాగాలక్రింద విభజింపబడింది. క్రింది పట్టిక రెవెన్యూ, తాలూకాల విభజనను, వాటి కార్యస్థానాలను, తాలూకాల వైశాల్యమును తెలియజేస్తుంది :

ఒంగోలు, బాపట్ల, రేపల్లె తాలూకాలకు సముద్రతీరం ఉన్నది. జిల్లాను స్థూలంగా మూడు విభాగాలు చెయ్యవచ్చు—డెల్టా, నాతిమిట్టల భూభాగం, నల్లరేగడి భూములు.

తెనాలి, రేపల్లె తాలూకాలు మొత్తంగా, బాపట్ల తాలూకాలోని అధికభాగం, గుంటూరు తాలూకాలో కొంతభాగం డెల్టాక్రిందకు వస్తాయి.

తూర్పుకనుములు, వాటి మారుమూల ఉన్న దక్షిణ, పశ్చిమ పల్నాడుతాలూకా; కొండలు, గుట్టలు ఉన్న సత్తెనపల్లి తాలూకా పశ్చిమభాగం; గుంటూరు తాలూకాలో అచ్చటచ్చట కన్పించే కొండలు ఉన్న భాగం; నర్సరావుపేట తాలూకాలోని కొండవీటి కొండల ప్రాంతం; ఒంగోలుతాలూకాలోని [illegible] కొండల ప్రదేశం; వినుకొండలో

| రెవెన్యూ డివిజను పేరు | రెవెన్యూ డివిజను కార్యస్థానం | రెవెన్యూ డివిజను లోని తాలూకాలు | తాలూకా వైశాల్యం చ॥ మైళ్ళు | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| నర్సరావుపేట | నర్సరావుపేట | నర్సరావుపేట | 716 | నర్సరావుపేట |
| | | వినుకొండ | 644 | వినుకొండ |
| | | పల్నాడు | 1,041 | గురజాల |
| గుంటూరు | గుంటూరు | గుంటూరు | 541 | గుంటూరు |
| | | సత్తెనపల్లి | 718 | సత్తెనపల్లి |
| తెనాలి | తెనాలి | తెనాలి | 324 | తెనాలి |
| | | రేపల్లె | 297 | రేపల్లె |
| ఒంగోలు | ఒంగోలు | ఒంగోలు | 820 | ఒంగోలు |
| | | బాపట | 670 | బాపట |
| | | మొత్తం | 5,771 | |

విడివిగాఉన్న గుట్టల ప్రదేశాలు - రాతి మిట్టల భాగం క్రిందకు వస్తవి.

జిల్లాలోని మిగతాభాగాలు నల్లరేగడి బయళ్ళు. ఈ బయళ్ళు సముద్రతీరాన ఉన్నాయి. కాని తీరంవెంట అనేక మైళ్ళ వెడల్పున యిసుకమేటలు యీ బయళ్ళనుకప్పివేసినవి. బాపట్ల తాలూకాలోని యిసుకభూములు ఉన్న ప్రదేశంలో చాలాభాగం చెట్లు చామలతో అడవులక్రింద ఉన్నాయి.

## నదులు

గుంటూరు జిల్లాలో ప్రవహించే ముఖ్యనది కృష్ణానది. ఇది బొంబాయి రాష్ట్రంలోని మహాబలేశ్వరంవద్ద పుట్టి, హైదరాబాదు సంస్థానంగుండా ప్రవహించి, కర్నూలు-హైదరాబాదు సంస్థాన సరిహద్దుగా ప్రవహించి, పల్నాడు తాలూకా నైఋతి (South - Western) దిశలో గుంటూరు జిల్లాలోనికి ప్రవేశిస్తున్నది. కృష్ణాజిల్లా హైదరాబాదు సంస్థానాలనుండి గుంటూరుజిల్లాను వేరు చేయుచు సరిహద్దుగా చాలా దూరం ప్రవహిస్తున్నది.

ఈ జిల్లాలో ప్రవహించే మరొక నది గుండ్లకమ్మ. కర్నూలు జిల్లాలోని కంభం చెరువునుండి ప్రారంభమై వినుకొండ, ఒంగోలు తాలూకాలగుండా ప్రవహిస్తున్నది.

ఒంగోలు తాలూకాలోని దక్షిణ భాగంగుండా ముసీనది ప్రవహిస్తున్నది. ఇది నెల్లూరు జిల్లానుండి ప్రవహిస్తున్నది.

నాగిలేరు వినుకొండ తాలూకాలోని కొండలలో పుట్టి, పల్నాడు తాలూకాగుండా ఉత్తరదిశగా ప్రవహించి కృష్ణానదిలో కలుస్తున్నది.

చంద్రవంక కూడ పల్నాడు తాలూకాలో ఉత్తరదిశగా ప్రవహించి కృష్ణానదిలో మిళితమవుతున్నది.

## అడవులు

జిల్లాలో చెప్పుకోదగ్గ అడవులు లేవు. నల్లమల అడవుల కొనలు పల్నాడు, సత్తెనపల్లి తాలూకాలలో కానవస్తాయి. అవి కూడ దట్టమైన అడవులుగా పరిగణించ వీలులేదు. ఇవి ప్రయివేటు అడవులుగానున్నవి చెట్లు, గుబురులుమాత్రమే.

ప్రక్కపేజీలోనిపట్టిక జిల్లాలోనిరిజర్వు అడవుల, ప్రయివేటు అడవుల తాలూకావారీ వైశాల్యాన్ని చూపిస్తుంది:

| తాలూకా | రిజర్వు అడవి చ॥ మైళ్ళు | ప్రయివేటు అడవి చ॥ మైళ్ళు | మొత్తం వైశాల్యం చ॥ మైళ్ళు |
|---|---|---|---|
| పల్నాడు | 224.67 | 30.15 | 357.82 |
| సత్తెనపల్లి | 121.63 | 2.61 | 124.24 |
| గుంటూరు | 6.83 | ... | 6.83 |
| తెనాలి | ... | ... | ... |
| వినుకొండ | 170.01 | 14.57 | 184.58 |
| నర్సారావుపేట | 44.66 | 2.82 | 47.48 |
| బాపట్ల | 20.69 | ... | 20.69 |
| రేపల్లె | 33.86 | ... | 33.86 |
| ఒంగోలు | 5.47 | ... | 5.47 |
| మొత్తం | 727.82 | 53.15 | 780.97 |

## శీతోష్ణ పరిస్థితులు

డెల్టా తాలూకాలు మినహా మిగతా ప్రదేశం వేసవిలో చాలా వేడిగా ఉంటుంది. సముద్ర తీర ప్రాంతాలు తరుచుగా తుఫానుల వాతబడుతూ ఉంటాయి. సంవత్సరంలో సగటున ఆయా తాలూకాలకు ఎన్ని వర్షపు రోజులు ఉండేదీ, ఎన్ని అంగుళాల వర్షం పడేదీ క్రింది పట్టిక తెలియజేస్తుంది:

| తాలూకా | సంవత్సర సగటువర్షం * అంగుళాలలో | సంవత్సరంలో సగటు వర్షపు దినాలు |
|---|---|---|
| పల్నాడు | 26.30 | 41.3 |
| సత్తెనపల్లి | 30.40 | 46.8 |
| గుంటూరు | 34.55 | 50.8 |
| తెనాలి | 36.39 | 52.4 |
| వినుకొండ | 26.32 | 41.3 |
| నర్సారావుపేట | 29.62 | 46.5 |
| బాపట్ల | 34.46 | 37.4 |
| రేపల్లె | 38.16 | 52.0 |
| ఒంగోలు | 32.83 | 43.3 |

* ఒక అంగుళం = 2 ముక్కాల వర్షం.

### సాగు సదుపాయాలు

విజయవాడవద్ద కృష్ణానది నుండి గుంటూరుజిల్లా వైపున నిర్మించబడ్డ బకింగ్‌హాం కాల్వ జిల్లాలోని ప్రధాన నీటి సప్లయి సాధనం. దీని పిల్లకాల్వల ద్వారా తెనాలి, రేపల్లె, గుంటూరు, బాపట్ల, ఒంగోలు తాలూకాలలో వేల ఎకరాలు సాగు చేయబడుతున్నాయి. ఇంకా అచ్చటచ్చటా సముద్రతీర ప్రాంతాలలో ఊటకాల్వలుగూడ వ్యవసాయానికి తోడ్పడుతున్నాయి. వర్షాధారంతో నిండే చెరువులూ, చిన్న ప్రవాహాలచే నింపబడే చెరువులు కూడ అచ్చటచ్చట ఉండి, సాగుకు తోడ్పడుతున్నాయి.

### పలనాడు తాలూకా

నాగులేరుక్రింద కొద్దిభాగం సాగు అవుతున్నది. కొండవాగులు, చెరువులపై కూడ ఆధారపడ్డ వ్యవసాయం ఉంది. కాని [illegible] నీటివసతులు లేక ఋతుపవనాలు సకాలంలో వర్షించనిసంవత్సరమల్లా కరువు తప్పదు.

### సత్తెనపల్లి తాలూకా

చెరువులు మినహా మరే సాగు సదుపాయాలూ లేవు. వర్షాలు సకాలంలో పడకపోయినా కరువు ప్రత్యక్షం అవుతుంది.

### గుంటూరు తాలూకా

ఈ తాలూకాలో సాగుక్రింద వున్న భూములో కృష్ణ ఆయకట్టుద్వారా నీరు సప్లయి చేయబడుతున్నది. కనుక యిది [illegible] ఆయకట్టు. మిగతా ప్రాంతంలో అచ్చటచ్చటా చెరువులు వున్నాయి. మెట్ట ప్రాంతంలో ప్రధానంగా వ్యాపారి పంటల అభివృద్ధి జరుగుతున్నది.

### తెనాలి తాలూకా

ఈ తాలూకాకు సంపూర్ణంగా కృష్ణ ఆయకట్టుక్రింద నీరు సప్లయి చేయబడుతున్నది. ఇది [illegible] ఆయకట్టు. జిల్లాకు

ధాన్యాగారంగా యీ తాలూకాను యెంచవచ్చు.

## వినుకొండ తాలూకా

గుండ్లకమ్మ నదీజలాలు తోడుకొని కొద్దిభాగం సాగుచేయబడుతున్నది. సాగుకు యితర సాధనాలల్లా చెరువులు మాత్రమే. సకాలంలో వర్షాలు లేకపోయిన కరువుకు గురిఅయ్యే తాలూకాలలో వినుకొండ ఒకటి.

## నర్సారావుపేట

చెరువులక్రింద సాగయ్యే కొద్దిభాగం మినహా మరే నీటి సదుపాయాలు లేవు. వర్షాలు సకాలంలో లేని సంవత్సరాలలో కరువు తప్పదు.

## బాపట్ల తాలూకా

తాలూకాలో తగినంతభాగం కృష్ణానది నీటితో [illegible] నీటివసతి కల్గివున్నది. సముద్రతీర ప్రదేశాలలో కొంత ఊట కాల్వల ద్వారా సాగుకు తీసుకొని రాబడింది.

## రేపల్లె తాలూకా

ఈ తాలూకాలోని డెల్టా సంపూర్ణంగా కృష్ణానది నీటితోనే సాగుచేయబడుతున్నది.

## ఒంగోలు తాలూకా

కొద్దిభాగం మాత్రం కృష్ణా పశ్చిమ బ్యాంకు కాల్వక్రింద సాగుచేయబడుతున్నది. మైనరు ఇరిగేషను చెరువుల ద్వారాయీతాలూకాలో 1,900ఎకరాలు సాగుక్రింద ఉన్నాయి. సముద్రతీరంలో ఊటకాల్వలు ఎన్నో ఉన్నాయి. ఇవి 2,500 ఎకరాలకు నీరు సప్లయిచేస్తాయి.

తాలూకావారీగా మేజరు మైనరు ఇరిగేషను వనరుల క్రింద సాగు అయ్యే భూమివరాలు క్రింది పట్టిక చూపుతుంది.

| తాలూకా | మైనరు ఇరిగేషను వనరుల సంఖ్య | మైనరు ఇరిగేషను వనరుల క్రింద ఉన్న ఆయకట్టు (ఎకరాలలో) | మేజరు ఇరిగేషను వనరుల క్రింద ఉన్న ఆయకట్టు (ఎకరాలలో) |
|---|---|---|---|
| పల్నాడు | 63 | 3,472.97 | 1,054.91 |
| సత్తెనపల్లి | 29 | 1,388.00 | 674.97 |
| గుంటూరు | 50 | 2,578.27 | 4,669.00 |
| తెనాలి | 1 | 23.00 | 1,52,982.00 |
| వినుకొండ | 49 | 3,230.00 | 2,638.79 |
| నర్సారావుపేట | 49 | 3,380.00 | ... |
| బాపట్ల | ... | ... | 1,32,560.00 |
| రేపల్లె | ... | ... | 1,25,030.00 |
| ఒంగోలు | 36 | 1,926.00 | 1,650.59 |
| మొత్తం | 277 | 15,998.24 | 4,21,260.26 |

### ఆహార, ఆహారేతరపంటలు

జిల్లాలో ప్రధానమైన ఆహారపంట వరి. జొన్న, వరిగకూడ విరివిగానే పండించబడుతున్నాయి. రాగి, కొర్ర, మొక్కజొన్న కొద్దిభాగాలలో మాత్రం పండించబడుతున్నాయి. ప్రత్తి, వేరుశనగ, పొగాకు, పసుపు ముఖ్యమైన ఆహారేతరపంటలు.

గుంటూరు తాలూకా పొగాకు ఉత్పత్తికి, తెనాలి తాలూకా పసుపు ముఖ్య కేంద్రాలు. ఒంగోలు, బాపట్ల, రేపల్లె తాలూకాలలోని సముద్రతీరంలో సరివి చెట్లు విరివిగా పెంచబడుతున్నాయి.

వివిధతాలూకాలలో ఏయే పంటక్రింద ఎంతభూభాగం సేద్యం చేయబడుతున్నది ప్రక్కపేజీలోని పట్టిక పొందుపరుస్తుంది. గతసంవత్సరాలలో జిల్లాలో అటుపోట్లు లేకుండా పంటపండిన సంవత్సరంగా 1945_46 సం॥ తీసుకొనబడింది. కనుక జిల్లాపంటల విభజనగూర్చిన అంచనాలు 1945_46 సంవత్సరపు అంకెలే యివ్వబడ్డాయి.

### రహదారులు

జిల్లాలో మొత్తం 1659 మైళ్ళ రోడ్లు ఉన్నాయి. ఇందులో 99 మైళ్ళ గ్రాండ్ ట్రంకురోడ్డు, 108 మైళ్ళ ట్రంకు రోడ్డు, 803 మైళ్ళ మేజరు జిల్లాబోర్డు రోడ్లు, 140 మైళ్ళ యితర జిల్లాబోర్డు రోడ్లు, 169 మైళ్ళ మ్యునిసిపల్ రోడ్లు, 8 మైళ్ళ పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు రోడ్లు ఉన్నాయి. దరిదాపుగా అన్నిరోడ్లు చాలా అధ్వాన్నపుస్థితిలోనే ఉంటాయి. వర్షాకాలంలో డెల్టాప్రాంతాలలోని రోడ్లలో చాలాభాగం నీటిలో మునిగి ఉంటాయి. డెల్టా ప్రాంతాలయిన తెనాలి, బాపట్ల, రేపల్లె తాలూకాలలో యితరతాలూకాలకన్న రోడ్లప్రమాణం హెచ్చుగా ఉన్నది.

ఈ జిల్లానుండి పోయే బకింగ్‌హాం కాల్వ, నీటిప్రవాహానికి ప్రధానమైన రహదారి. కృష్ణాపశ్చిమకాల్వ, కొమ్మమూరు కాల్వకూడ రాకపోకలకు, సరకుల ఎగుమతి, దిగుమతులకు పనికివస్తవి.

జిల్లాలో 295½ మైళ్ళ రైలుబాట ఉన్నది. ఇందులో 133½ మైళ్ళు బ్రాడ్ గేజి. 162 మైళ్ళు మీటరుగేజి.

మద్రాసు_కలకత్తా; మద్రాసు_డిల్లీ బ్రాడ్‌గేజి మార్గం ఒంగోలు, బాపట్ల, తెనాలి, గుంటూరు తాలూకాల ద్వారా పోవుచున్నది. మరొక బ్రాడ్ గేజి బ్రాంచిలైను తెనాలి ద్వారా గుంటూరు, రేపల్లెలను కలుపుతున్నది. గుంటూరు, సత్తెనపల్లి, నర్సరావుపేట, వినుకొండ తాలూకాలగుండా విజయవాడ గుంతకల్లు మీటరుగేజి లైను పోవుచున్నది. మరొక మీటరుగేజి బ్రాంచిలైను సత్తెనపల్లి, పల్నాడులగుండా గుంటూరు_మాచెర్లలను కలుపుతున్నది.

జిల్లాలోని అన్నితాలూకా కేంద్రాలు, జిల్లా కేంద్రం రైలు మార్గాలు కల్గి ఉన్నాయి.

### జనాభా - విస్తీర్ణం

తాలూకావారీ భూవిస్తీర్ణం, గత 10 సంవత్సరాలలో జనాభా ఏఏతాలూకాలో ఏ తారతమ్యంలో వృద్ధిచెందినదీ మొదలైన వివరాలు 275 పేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి. జిల్లాసగటు లెక్కలు మొదటయిచ్చి, తర్వాత తాలూకావారీగా లెక్కలుయివ్వబడ్డాయి

| పంట పేరు | | పల్నాడు (ఎకరాలు) | సత్తెనపల్లి (ఎకరాలు) | గుంటూరు (ఎకరాలు) | తెనాలి (ఎకరాలు) | వినుకొండ (ఎకరాలు) | నరసరావుపేట (ఎకరాలు) | బాపట్ల (ఎకరాలు) | రేపల్లె (ఎకరాలు) | ఒంగోలు (ఎకరాలు) | జిల్లా మొత్తం (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 3,178 | 1,211 | 32,782 | 1,49,968 | 4,344 | 4,515 | 1,22,918 | 97,564 | 8,819 | 4,25,365 |
| | మెట్ట | 166 | 1,157 | 13,146 | ... | 8 | 422 | 6,698 | 576 | 4,080 | 26,253 |
| జొన్న | మాగాణి | ... | ... | ... | ... | 381 | 560 | ... | ... | 2,639 | 3,580 |
| | మెట్ట | 35,637 | 60,864 | 55,799 | 3,210 | 22,022 | 78,729 | 41,772 | 1,246 | 77,517 | 3,76,796 |
| సజ్జలు | మాగాణి | 70 | ... | ... | ... | 463 | 64 | ... | ... | 1,331 | 1,928 |
| | మెట్ట | 54,943 | 31,848 | 2,265 | 29 | 50,708 | 41,745 | 523 | 19 | 17,083 | 1,99,163 |
| రాగి | మాగాణి | 146 | 41 | 34 | 9 | 2,257 | 732 | 7 | 107 | 3,445 | 6,778 |
| | మెట్ట | ... | ... | ... | 50 | 134 | 506 | 3,039 | 644 | 2,629 | 7,002 |
| కొర్ర | మాగాణి | ... | ... | ... | ... | 388 | ... | ... | ... | 73 | 461 |
| | మెట్ట | 25,949 | 11,384 | 379 | 8 | 24,007 | 17,254 | 436 | ... | 5,523 | 84,933 |
| వేరుశెనగ | మెట్ట | 34,911 | 64,402 | 53,387 | 3,586 | 11,126 | 50,253 | 11,628 | 2,815 | 31,322 | 2,63,412 |
| నువ్వులు | „ | 9 | 13 | 12 | 432 | 729 | 503 | 7 | 333 | 146 | 2,184 |
| దూది | „ | 26,532 | 3,087 | 67 | 60 | 12,408 | 2,830 | 52 | ... | 1,483 | 46,519 |
| వరిగ | „ | 945 | ... | ... | ... | 577 | ... | ... | ... | 12,387 | 13,909 |
| మొక్కజొన్న | „ | 19 | 1,042 | 5,718 | 3,362 | ... | 273 | 1,136 | 355 | 679 | 12,584 |
| పెసలు | „ | 2,264 | 1,414 | 1,132 | 7,433 | 1,238 | 1,421 | 3,320 | 4,287 | 1,458 | 23,967 |
| ఉలవలు | „ | 2,325 | 2,292 | 2,306 | 371 | 343 | 144 | 251 | 85 | 119 | 8,286 |
| మినుములు | „ | 4 | 524 | 1,008 | 17,549 | 3 | 44 | 430 | 7,044 | 142 | 26,748 |

| తాలూకా | విస్తీర్ణం చ॥ మైళ్ళు | జనాభా 1941 | జనాభా 1951 | 1941 నుంచి జనాభా పెరుగుదల శాతం | గ్రామాలు | * పట్టణాలు |
|---|---|---|---|---|---|---|
| గుంటూరుజిల్లా | 5,771 | 22,77,283 | 25,49,996 | 12.0 | 927 | 25 |
| పల్నాడు | 1,041 | 1,92,309 | 1,92,776 | 0.2 | 86 | 3 |
| సత్తెనపల్లి | 818 | 2,34,345 | 2,46,029 | 3.7 | 130 | 2 |
| గుంటూరు | 541 | 3,66,193 | 4,42,073 | 20.7 | 118 | 3 |
| తెనాలి | 324 | 2,99,129 | 3,57,839 | 19.6 | 96 | 5 |
| వినుకొండ | 644 | 1,14,094 | 1,16,365 | 2.0 | 73 | 1 |
| నర్సరావుపేట | 716 | 2,25,912 | 2,66,400 | 4.5 | 106 | 2 |
| బాపట్ల | 670 | 3,35,283 | 4,03,509 | 20.3 | 102 | 4 |
| రేపల్లె | 297 | 1,66,278 | 1,91,010 | 14.9 | 57 | 2 |
| ఒంగోలు | 820 | 3,11,740 | 3,33,995 | 7.1 | 159 | 3 |

* కనీసం 5 వేలు అంతకుమించిన జనాభాగల్గిన, స్పష్టమయిన పట్టణపు గుణగణాలుకల్గిన పట్టణమునే యీ పట్టికలో చేర్చబడినది.

## పరిశ్రమలు

జిల్లాలోని చెప్పుకోదగ్గ పెద్ద పరిశ్రమలలో—ఐ. యల్. టి. డి., పొగాకు కంపెనీలు, (గుంటూరు, చీరాల, పర్చూరు, చిలకలూరిపేట, తాడికొండ) తాడేపల్లి కృష్ణా సిమెంటు ఫ్యాక్టరీ, తాడేపల్లి, గుంటూరు నూనె ఉత్పత్తి ఫ్యాక్టరీలు, కాకానిలోని హేమలతా టెక్స్టయిలు మిల్లు, గుంటూరులోని జనపనార మిల్లు మున్నగునవి.

క్రింది పట్టిక 1951 జనాభా లెక్కల నాటికి తాలూకావారీగా ఏఏ ప్రధాన పరిశ్రమలు ఉన్నదీ, అందులో ఎందరు కార్మికులు పనిచేస్తున్నదీ, మున్నగు వివరాల తెల్పుతుంది :

| తాలూకా | పరిశ్రమ పేరు | ఫ్యాక్టరీల సంఖ్య | ఆ పరిశ్రమల క్రింద ఉద్యోగం చేయువారి సంఖ్య |
|---|---|---|---|
| పల్నాడు | దూదిమిల్లులు | 6 | 187 |
| సత్తెనపల్లి | నూనె మిల్లులు | 9 | 208 |
| | పొగాకు | 1 | 468 |
| గుంటూరు | నూనెల ఉత్పత్తి | 15 | 800 |
| | పొగాకు | 92 | 9,986 |
| | నూలుమిల్లు | 1 | 366 |
| | జనపనార మిల్లు | 1 | 736 |
| | సిమెంటు | 1 | 763 |
| తెనాలి | నూనె మిల్లులు | 8 | 203 |
| | పసుపు పాలిష్ మిల్లులు | 5 | 112 |
| * నర్సారావుపేట | నూనె మిల్లులు | 10 | 373 |
| | పొగాకు | 42 | 2,303 |
| | దూది ప్రెస్సులు | 2 | 206 |
| | ఆముదపు నూనె మిల్లులు | 13 | 191 |
| బాపట్ల | జీడిపప్పు పరిశ్రమ | 6 | 292 |
| | పొగాకు | 19 | 7,204 |
| ఒంగోలు | పొగాకు | 5 | 3,052 |
| | మొత్తం | 236 | 27,540 |

* ఫ్యాక్టరీ చట్టం క్రిందికి వచ్చే ఫ్యాక్టరీలుమాత్రమే యిందులో యివ్వబడ్డాయి.

## గోపాల్ దర్వాజ

కర్నూలు పట్టణ పరిసర ప్రాంతం బిజాపూర్ రాజ్యంలో చేరినప్పటికీ, కర్నూలు పట్టణం విజయనగర రామరాజు మనుమడైన గోపాలరాజు ఆధీనంలోనే వుండేది. గోపాలరాజు పరిపాలించుచున్న కాలంలో, బిజాపూర్ సుల్తానుల తరఫున అబ్దుల్ వాహాబ్ ఖాన్ కర్నూలు కోటను ముట్టడించాడు. గోపాలరాజు వాహాబ్ ఖాన్ లకు తీవ్రమైన యుద్ధం జరిగింది. శత్రువుల బలంముందు తట్టుకోలేక, గోపాలరాజు కర్నూలుకోట ఈశాన్యంనుండా పారిపోయాడు. గోపాలరాజు పారిపోయిన దర్వాజాకు గోపాలదర్వాజా అని పేరు వచ్చింది. కర్నూలుకోట శిథిలమైనప్పటికీ గోపాలదర్వాజా నేటికీ నిలచివుంది.

## [illegible]

కర్నూలు, బీజాపూర్ సుల్తానుల పక్షమున పాలించిన ఆదిల్షాయి కాలంలోనే అబ్దుల్ వాహాబ్ ఖాన్ ను కర్నూలుకు మండలాధిపతిగా నియమించారు. వాహాబ్ ఖాన్ కర్నూలు ప్రధానమార్గం మీదనున్న కమానులను కట్టించాడు. ఆ కమానుల (ద్వారాలు) దగ్గరవున్న దేవాలయం మసీదుగా మార్చబడింది. కమానులు, మసీదు యిప్పటికీవున్నవి. అబ్దుల్ వాహాబ్ ఖాన్ బ్రతికి వుండగానే క్రీ.శ. 1618 లో గోరీకట్టించుకున్నాడు. ఈ గోరీ హంద్రీనదిమీద వుంది. దీన్ని "గుమ్మట" అని పిలుస్తారు. చాల ఎత్తైన ప్రదేశంలోవుంది. కర్నూలులో యేమూల నుంచైనా కనబడుతుంది.

## కర్నూలు నవాబులు

క్రీ.శ. 1687 లో ఔరంగజేబు దక్కనుపై దండెత్తివచ్చాడు. ఔరంగజేబు సేనానులలో ఒకడైన గాజుద్దీన్ కర్నూలును జయించాడు. కొంతకాలం అయ్యాక కర్నాటకయుద్ధంలో ఔరంగజేబుకు ఎక్కువగా తోడ్పడిన దావూద్ ఖాన్ అనే పఠాన్ సేనానికి, కర్నూలు జాగీరుగా యివ్వబడింది. దావూద్ ఖాన్ వంశంవారే కర్నూలు నవాబులు. కర్నూలు జిల్లా యీ నవాబుల పాలనక్రింద 1839 వరకూ వుంది. వీరిక్రింది జాగీర్దారులే బంగినపల్లె నవాబులు.

హిమాయత్ ఖాన్ అనే నవాబు కాలంలో 1741 లో మహారాష్ట్రులు కర్నూలుజిల్లాపై దండెత్తివచ్చారు. మహారాష్ట్రులు చూపిన దౌర్జన్య కృత్యాలను గుర్చిన మరాఠీ కథలు నేటికీ ప్రచారంలో వున్నవి.

## ఫ్రెంచి-ఇంగ్లీషు దండయాత్రలు

1748 లో నిజాం ఉల్ ముల్క్ మరణానంతరం నైజాం సింహాసనానికై వచ్చిన వారసత్వతగాదాలలో కర్నూలు నవాబు కూడా జోక్యం చేసుకున్నాడు. కర్నూలు నవాబు హిమాయత్ ఖాన్ నాజర్ జంగ్ ను జింజీవద్ద చంపేశాడు. 1751 మార్చి 15 వ తేదీన ఫ్రెంచి సేనాని బుస్సీ, సలాబత్ జంగ్ లు కలసి దాడిచేసి కర్నూలు కోటను పట్టుకున్నారు. కర్నూలు నవాబులు లొంగిపోయారు.

1755 లో మైసూరు పాలకుడైన హైదరాలీ కర్నూలుపైకి దండెత్తి వచ్చాడు. కర్నూలునవాబు మునావర్ ఖాన్ కు, మిస్కీన్ ఖాన్ అనే గురువు వుండే

# భూగోళం

కార్యస్థానం నంద్యాల. వైశాల్యం 7,836 చ. మై. జనాభా 12,70,843.

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని కర్నూలులో ఏర్పర్చటంతో, ఇంతవరకు జిల్లా కార్యస్థానంగా ఉంటున్న కర్నూలు నుండి, జిల్లా ఆఫీసులు నంద్యాలకు మార్చబడ్డాయి.

ఈ జిల్లాకు ఉత్తరమున గుంటూరు జిల్లా, తెలంగాణా (హైద్రాబాద్); తూర్పున గుంటూరు, నెల్లూరు జిల్లాలు; దక్షిణమున కడప, అనంతపురం జిల్లాలు; పశ్చిమమున బళ్ళారి జిల్లా సరిహద్దులుగా ఉన్నవి. కర్నూలుజిల్లా 120 మైళ్ళ పొడవు, 70 మైళ్ళ వెడల్పున విస్తరించి ఉంది.

ప్రభుత్వ నిర్వహణకొరకు జిల్లా మూడు రివెన్యూ భాగముల క్రింద (కర్నూలు, నంద్యాల, మార్కాపురం) తొమ్మిది తాలూకాల క్రింద విభజించబడింది. బంగనపల్లె సంస్థానం ఒక సబ్ తాలూకాగా కోయిలకుంట్ల తాలూకాకు కలపబడింది.

రివెన్యూ తాలూకాల విభజన, కార్యస్థానాలు, వాటి విస్తీర్ణం మున్నగు వివరాలు ఈ క్రింది పట్టికలో చూపబడ్డాయి.

| రివెన్యూ డివిజన | రివెన్యూ డివిజను కార్యస్థానం | రివెన్యూ డివిజను లోని తాలూకాలు | తాలూకా వైశాల్యం (చ. మైళ్ళు) | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| కర్నూలు | కర్నూలు | కర్నూలు | 641 | కర్నూలు |
| | | పత్తికొండ | 743 | పత్తికొండ |
| | | నందికొట్కూరు | 1,092 | నందికొట్కూరు |
| | | డోన్ | 836 | డోన్ |
| నంద్యాల | నంద్యాల | నంద్యాల | 664 | నంద్యాల |
| | | కోయిలకుంట్ల | 573 | కోయిలకుంట్ల |
| | | బంగనపల్లి | 256 | బంగనపల్లి |
| | | సిరివెళ్ళ | 613 | ఆళ్లగడ్డ |
| మార్కాపురం | మార్కాపురం | మార్కాపురం | 1,366 | మార్కాపురం |
| | | కంభం | 1,048 | గిద్దలూరు |
| | | జిల్లా వైశాల్యం | 7,836 | |

ఎర్రమల కొండల పశ్చిమ భాగంలో పుట్టి 'కుందు' నది నంద్యాల, కోయిలకుంట్ల సిరివెళ్ళ తాలూకాల గుండా ప్రవహించి కడపజిల్లాలో ప్రవేశిస్తున్నది. చివరకు యీ కుందునది పెన్నలో కలియుచున్నది. 'పాలేరు' నది నందికొట్కూరు తాలూకా దక్షిణ భాగంలో ప్రవహించి నంద్యాల తాలూకాలో కుందునదిలో కలుస్తున్నది.

సిరివెళ్ళ తాలూకాలో 'వక్కిలేరు' నది దక్షిణంగా ప్రవహించి కడపజిల్లాలో ప్రవేశిస్తున్నది.

నల్లమల కొండలలో పుట్టిన 'గుండ్లకమ్మ' నది కంభం, మార్కాపురం తాలూకాల గుండా ప్రవహించి మార్కాపురం తాలూకాలోని ముప్పాళ్ళ క్షేత్రం వద్ద గుంటూరుజిల్లాలో ప్రవేశిస్తున్నది. మార్కాపురం తాలూకాలో 'కంభేరు', 'మన్నేరు' అనే రెండు ఉపనదులు గుండ్లకమ్మలో కలియుచున్నవి.

నల్లమల, ఎర్రమల కొండలలోను, జిల్లాలోని మరికొన్ని యితర ప్రాంతాలలోను అనేక ప్రవాహాలు (Thermal springs) ఉన్నవి. వీటిలో కొన్నింటి నుండి వేడినీరు వస్తున్నది. మరికొన్నింటి నుండి రాసాయనిక గుణాలు కల్గిన నీరు కూడ లభిస్తున్నది.

## అడవులు

జిల్లాలో సుమారు 3వ వంతు 2,602.88 చ|| మై|| వైశాల్యంగల ప్రదేశం అడవుల క్రిందనున్నది. నల్లమల, ఎర్రమల కొండల చుట్టూ వున్న అడవులు విశాలవంతమైన అడవులు. వీటిలో కలప, వంట చెరకు, వెదురు, మున్నగునవి విరివిగా లభ్యమవుతాయి. మార్కాపురం తాలూకాలోని దట్టమైన అడవులలో మంచి గంధపు తోపులు కన్పిస్తాయి. ఈ అడవులు చక్కని పచ్చిక కల్గివున్నాయి.

క్రింది పట్టికలో తాలూకావారీ అడవుల విభజన చూపబడింది:

| తాలూకా | రిజర్వు అడవులు చ. మైళ్ళు | ఎస్టేట్ల నుండి స్వాధీనం చేసుకొన్న అడవులు. చ. మైళ్ళు | మొత్తం అడవులు చ. మైళ్ళు |
|---|---|---|---|
| కర్నూలు | 18.59 | ... | 18.59 |
| నందికొట్కూరు | 473.81 | ... | 473.81 |
| మార్కాపురం | 650.29 | ... | 650.29 |
| పత్తికొండ | 33.54 | ... | 33.54 |
| డోన్ | 162.19 | ... | 162.19 |
| నంద్యాల | 297.35 | ... | 297.35 |
| కంభం | 661.04 | ... | 661.04 |
| బనగానపల్లె (సబ్ తాలూకా) | ... | 37.26 | 37.26 |
| కోయిలకుంట్ల | 58.23 | ... | 58.23 |
| సిరివెళ్ళ | 210.58 | ... | 210.58 |
| మొత్తం | 2,565.62 | 37.26 | 2,602.88 |

### శీతోష్ణస్థితి - వర్షపాతము

ఏప్రిల్, మే మాసాల్లో యీ జిల్లాలో సంవత్సరంలో తక్కిన నెలల్లోకన్న ఎండ తీక్ష్ణం. నైఋతి ఋతుపవనాలు, ఈశాన్య ఋతుపవనాల ద్వారా యీ జిల్లాకి వర్షాలు లభిస్తాయి. నల్లమల కొండలకి పశ్చిమంగా వున్న ప్రాంతానికి నైఋతి ఋతుపవనముద్వారానూ, తూర్పున వున్న ప్రాంతానికి ఈశాన్య ఋతుపవనము ద్వారానూ వర్షాలు పడుతవి.

నైఋతి ఋతుపవనపువర్షాలు జూన్‌లో ప్రారంభమై సెప్టెంబరు వరకు కొనసాగుతాయి. సెప్టెంబరు నుండే ఈశాన్య ఋతుపవనపు వర్షాలు కూడ ప్రారంభమవుతాయి. కాని నైఋతి ఋతుపవనాలవల్లనే జిల్లాకు అధికవర్షం కలుగుతుంది.

డోన్ తాలూకా దక్షిణ భాగం, నందికొట్కూరు తాలూకాలోని శ్రీశైల ప్రాంతం జిల్లాలోకల్ల శీతలంగా వుండే ప్రదేశాలు. ఈ ప్రదేశాలు సముద్రమట్టం కన్న చాలా ఎత్తున వుండటమువల్ల యిట్టి అనుకూల శీతోష్ణపరిస్థితులు కల్గివున్నాయి.

ప్రక్కపేజీలోని పట్టికలో తాలూకావారీ సంవత్సర సగటు వర్షపాతం, సగటు వర్షపుదినాలు యివ్వబడ్డాయి:

| తాలూకా | మైనరు ఇరిగేషను వర్క్సు సంఖ్య | మైనరు ఇరిగేషను క్రింద సాగు (ఎకరములు) | మేజరు ఇరిగేషను క్రింద సాగు (ఎకరములు) |
|---|---|---|---|
| కర్నూలు | 32 | 1,047.56 | 4,641 |
| నందికొట్కూరు | 16 | 902.76 | 6,330 |
| మార్కాపురం | 93 | 3,887.00 | 1,111 |
| పత్తికొండ | 87 | 2,166.99 | ... |
| డోన్ | 90 | 2,844.70 | ... |
| నంద్యాల | 32 | 2,892.67 | 10,539 |
| కంభం | 91 | 3,759.15 | 7,625 |
| బంగనపల్లి | ... | ... | ... |
| కోయిలకుంట్ల | 47 | 1,529.49 | 1,725 |
| సిరివెళ్ళ | 38 | 2,189.89 | 10,330 |
| మొత్తం | 526 | 22,041.32 | 42,301 |

### ఆహారపంటలు – వ్యాపారపంటలు

జిల్లాలోని ప్రధాన ఆహారపంటలు జొన్న, కొర్ర, వరిగ, వరి. కర్నూలు - కడప కాలువక్రింద మైనర్ యిరిగేషన్ పనులక్రింద 64 వేల యకరాలు సాగు చేయబడుతోంది. 4 లక్షల 50 వేల యకరాలవరకు జొన్న పండింపబడుతోంది. 4 లక్షల 18 వేల యకరాల్లో కొర్ర, సుమారు 1 లక్ష యకరాలలో వరిగ పండించబడుతున్నాయి.

వ్యాపార పంటలలో ముఖ్యమైనవి ఉలవ, వేరుశనగ, ప్రత్తి. 5½ లక్షల యకరాల్లో వేరుశనగ, 60 వేల యకరాలలో ఉలవ, 87 వేలయకరాలలో ప్రత్తి పండించబడుతున్నవి.

సక్రమ వర్షపాతం వున్న సంవత్సరాల్లో, జిల్లాలో తాలూకావారీగా యేయే పంటలు సగటున యెన్ని యెకరాల్లో పండించబడేవి మున్నగు వివరాలు యీ ప్రక్కపేజీలోనిపట్టికలో యివ్వబడ్డాయి.

### రహదారులు

జిల్లామొత్తంలో 1,312 మై॥ పొడవుగల రోడ్లున్నవి. ఇందులో 54 మైళ్ళు జాతీయ రహదార్ల క్రింద, 324 మైళ్ళు రాష్ట్రీయ రహదార్ల క్రింద, 537 మైళ్ళు ప్రధాన జిల్లాబోర్డు రోడ్లక్రింద, 306 మైళ్ళు యితర జిల్లాబోర్డు రోడ్లక్రింద, 33 మైళ్ళు గ్రామ రోడ్ల క్రింద, 56 మైళ్ళు మునిసిపల్ రోడ్ల క్రింద విభజించబడి వున్నవి.

సరిహద్దు జిల్లాల్లో వున్న బళ్ళారి, గుత్తి, తాడిపత్రి, ప్రొద్దుటూరు, బద్వేలు,

| పంట | | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | మొత్తం (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 4,856 | 16,649 | 6,187 | 1,730 | 2,725 | 14,162 | 7,373 | 3,363 | 7,328 | 64,373 |
| | మెట్ట | 193 | 2,365 | 34 | 968 | 471 | 1,514 | 1,291 | 509 | 3,806 | 11,151 |
| జొన్న | | 88,987 | 68,193 | 18,037 | 51,781 | 38,630 | 56,229 | 14,728 | 74,388 | 36,845 | 4,47,818 |
| సజ్జ | | 2,619 | 64 | 18,931 | 19,994 | 7,141 | 94 | 14,011 | 100 | 248 | 63,202 |
| రాగి | | 19 | 58 | 13,658 | 75 | 53 | 19 | 6,142 | 74 | 132 | 20,235 |
| కొర్ర | | 60,095 | 58,688 | 39,869 | 84,795 | 68,798 | 15,553 | 41,488 | 30,155 | 18,580 | 4,18,021 |
| వరిగ | | 982 | 14,141 | 12,961 | 500 | 1,878 | 12,189 | 20,735 | 10,241 | 24,952 | 98,579 |
| సామలు | | 62 | 2 | 5 | 6 | 273 | 10 | 38 | ... | 132 | 528 |
| మొక్కజొన్న | | 29 | 7 | ... | 366 | 7 | 8 | ... | 3 | 1 | 421 |
| పచ్చపెసలు | | 155 | 549 | 130 | 379 | 738 | 1,114 | 31 | 970 | 1,204 | 5,270 |
| శనగలు | | 3,799 | 2,564 | 276 | 1,637 | 1,353 | 2,687 | 3,660 | 5,640 | 929 | 22,545 |
| కందులు | | 6,005 | 4,218 | 3,821 | 6,043 | 9,769 | 2,327 | 718 | 2,083 | 1,788 | 36,772 |
| మినుములు | | 11 | 1,340 | 1 | 20 | ... | 677 | 163 | 7 | 467 | 2,686 |
| ఉలవలు | | 1,667 | 7,685 | 12,646 | 4,057 | 6,659 | 3,024 | 17,536 | 2,292 | 2,995 | 59,561 |
| చెరకు | | 74 | ... | ... | 13 | 4 | 74 | 463 | ... | 1 | 629 |
| వేరుశనగ | | 10,372 | 78,321 | 163 | 1,04,935 | 88,162 | 44,788 | 11,803 | 48,526 | 68,809 | 5,48,579 |
| నువ్వులు | | 19 | 61 | 120 | 141 | 412 | 128 | 179 | 125 | 218 | 1,403 |
| ప్రత్తి | | 4,325 | 2,789 | 6,016 | 21,112 | 4,019 | 11,317 | 2,291 | 23,982 | 11,123 | 86,874 |
| పొగాకు | | 12,912 | 10,183 | 224 | 1,056 | 2,782 | 4,181 | 37 | 865 | 431 | 32,669 |
| మిర్చి | | 4,088 | 3,286 | 1,331 | 2,159 | 2,843 | 1,844 | 3,697 | 1,458 | 4,018 | 24,724 |

పట్టణాలకు సరాసరి రోడ్లు వున్నాయి. నందికొట్కూరు, కోయిలకుంట్ల, సిరివెళ్ళ, బంగనపల్లి తాలూకాల్లో రోడ్ల పరిస్థితి మరీ అన్యాయంగావున్నది. ఉన్న రోడ్లలో అనేకం కరువు పనుల క్రింద వేయబడిన వగుటచేత, వాటి నిర్వహణ సక్రమంగా లేక, రాకపోకలకు సౌకర్యాన్ని కలుగ చేయుటకు బదులు అసౌకర్యాన్నే ఎక్కువగా కలుగచేస్తున్నాయి.

మునిసిపల్ రోడ్లు మినహాయించి తాలూకా వారీ రోడ్ల నిడివి వివరాలను క్రింది పట్టిక తెలియజేస్తుంది:

## రైలు మార్గాలు

జిల్లా మొత్తంలో 165½ మై॥ రైలు మార్గం యీ జిల్లాగుండా పోవుచున్నది. ఇందులో 5½ మై॥ పొడవు గల బ్రాడ్ గేజి, 160 మై॥ పొడవుగల మీటర్ గేజి మార్గాలున్నాయి.

బొంబాయి - మద్రాసు రైలుమార్గం (బ్రాడ్ గేజ్) పత్తికొండతాలూకా కొస నుండి పోవుచున్నది. మార్కాపురం, కంభం, నంద్యాల, డోన్, పత్తికొండ తాలూకాల మధ్యగుండా బందర్-హుబ్లీ (మీటర్ గేజి) రైలుమార్గం పోవుచున్నది. పై రెండు, దక్షిణ రైల్వేలో భాగాలే.

ద్రోణాచలము (డోన్)నుంచి సికింద్రాబాద్‌ను కలుపు మీటర్ గేజి రైలుమార్గం కలదు. ఇది సెంట్రల్ రైల్వే శాఖ. కర్నూలు పట్టణం యీ శాఖ ద్వారానే యితర ప్రదేశాలతో కలపబడుచున్నది.

బంగనపల్లి సబ్ తాలూకా, సిరివెళ్ళ, కోయిలకుంట్ల, నందికొట్కూరు తాలూకాల్లో రైలుమార్గాలు లేనేలేవు.

| తాలూకా | జాతీయ రహదారులు (మైళ్ళు) | రాష్ట్రీయ రహదారులు (మైళ్ళు) | ప్రధాన జిల్లా రోడ్లు (మైళ్ళు) | ఇతర జిల్లా రోడ్లు (మైళ్ళు) | గ్రామ రోడ్లు (మైళ్ళు) | మొత్తం (మైళ్ళలో) |
|---|---|---|---|---|---|---|
| కర్నూలు | 54 | 53 | 47 | 58 | 3 | 215 |
| నందికొట్కూరు | ... | 49 | 17 | 36 | 7 | 109 |
| మార్కాపురం | ... | 58 | 42 | 12 | ... | 112 |
| పత్తికొండ | ... | 27 | 75 | 40 | ... | 142 |
| డోన్ | ... | ... | 48 | 22 | 3 | 73 |
| నంద్యాల | ... | 49 | 43 | 54 | 7 | 153 |
| కంభం | ... | 39 | 63 | 29 | 1 | 132 |
| బంగనపల్లి | ... | ... | 64 | 5 | 2 | 72 |
| కోయిలకుంట్ల | ... | 18 | 107 | 14 | 9 | 148 |
| సిరివెళ్ళ | ... | 34 | 81 | 36 | 1 | 132 |
| మొత్తం | 54 | 327 | 587 | 306 | 33 | 1,257 |

## జనాభా

1941-51 సం॥ల మధ్యకాలంలో జిల్లా జనాభా నూటికి 6.7 చొప్పున పెరిగింది. కర్నూలు-కడప కాలువ క్రింద తగిన మేరలో సాగయ్యే సిరివెళ్ళ, నంది కొట్కూరు, నంద్యాల తాలూకాల్లో జిల్లా సగటు అభివృద్ధిని దాటి, జనాభా పెరుగుదలకనిపిస్తుంది. బంగినపల్లి, కోయిల కుంట్ల ప్రాంతాల్లోవున్న జనాభాయే క్షీణించింది. పత్తికొండ, డోన్ తాలూకా ల్లోని జనాభా వ్యాప్తి కూడ నామ మాత్రమే. దీనికి ప్రధానకారణం, తరుచు యీ ప్రాంతాల్లో పొడసూపే కరువు కాటకాలు, అంటువ్యాధులు.

ప్రక్కపేజీలోని పట్టికలో తాలూకా వారీజనాభా వివరాలు, పెరుగుదల శాతం, తాలూకావిస్తీర్ణం మున్నగు వివరాలు తెలుపబడ్డాయి.

జిల్లా మొత్తం జనాభా 2,40,602 యిళ్ళలో నివసిస్తున్నారు. ఇందులో 2,11,202 యిళ్ళు పల్లెప్రాంతాల్లోనూ, 29,402 యిళ్ళు పట్టణాల్లోనూ వున్నవి. అనగా పల్లెల్లోవున్న ప్రతి 6 యిండ్లకు, పట్టణాల్లో 1 యిల్లు మాత్రమే ఉన్నది. జిల్లా జనాభాయైన 12,70,843 మందిలో 10,70,625 మంది గ్రామాల్లోనే నివసిస్తున్నారు. 2,00,218మంది మాత్రమే పట్టణాలలో నివసిస్తున్నారు. అనగా మొత్తం జనాభాలో ప్రతి 6గురులో ఒకరు మాత్రమే పట్టణాల్లో నివసిస్తున్నారు.

297వ పేజీలోని క్రిందిపట్టిక, తాలూకా వారీయిండ్ల సంఖ్యను, గ్రామీణ పట్టణ జనాభాను తెలియచేస్తుంది.

## వైద్య సదుపాయాలు

ఈ జిల్లా అంటువ్యాధులకు చాల కాలంగా కేంద్రంగా ఉంటున్నా, యీ జిల్లాలో తగిన వైద్యసదుపాయాలు పెంపొందించబడలేదు. ఉన్న ఆసుపత్రుల సంఖ్య 10. వీటిలో 355 మంది రోగులను మాత్రమే వుంచడానికి సదుపాయాలున్నాయి. ఉచితంగా మందులిచ్చి పంపే వైద్యశాలలు 1951 లెక్కల ప్రకారం 45 మాత్రమే వున్నాయి.

| తాలూకా | 1941 సంవత్సర జనాభా | 1951 సంవత్సర జనాభా | పెరుగుదల శాతం | తాలూకా విస్తీర్ణం చ. మైళ్ళు | తాలూకాలోని గ్రామాల సంఖ్య | తాలూకాలోని పట్టణాల సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| కర్నూలు | 1,77,273 | 1,98,288 | 11.90 | 641 | 91 | 3 |
| నందికొట్కూరు | 1,37,644 | 1,49,738 | 8.80 | 1,092 | 103 | 2 |
| మార్కాపురం | 1,27,601 | 1,38,120 | 8.20 | 1,366 | 99 | 1 |
| పత్తికొండ | 1,26,879 | 1,26,922 | 0.03 | 747 | 69 | 2 |
| డోన్ | 1,22,857 | 1,27,234 | 3.60 | 836 | 75 | 1 |
| నంద్యాల | 1,11,911 | 1,25,393 | 12.00 | 664 | 76 | 1 |
| కంభం | 1,51,824 | 1,63,845 | 7.90 | 1,048 | 95 | 2 |
| బనగానపల్లె | 44,592 | 43,447 | -2.60 | 256 | 140 | 2 |
| కోయిలకుంట్ల | 93,469 | 93,132 | -0.40 | 573 | | ... |
| సిరివెళ్ళ | 96,791 | 1,04,724 | 8.20 | 613 | 91 | ... |
| జిల్లా మొత్తం | 11,90,842 | 12,70,843 | 6.70 | 8,736 | 839 | 14 |

| తాలూకా | మొత్తం ఇండ్ల సంఖ్య | గ్రామాలలోని ఇండ్ల సంఖ్య | పట్టణాలలోని ఇండ్ల సంఖ్య | 1951 తాలూకా జనాభా | 1951 తాలూకా గ్రామీణజనాభా | 1951 తాలూకా పట్టణ జనాభా |
|---|---|---|---|---|---|---|
| కర్నూలు | 31,333 | 23,911 | 7,422 | 1,98,288 | 1,21,641 | 76,647 |
| నందికొట్కూరు | 29,190 | 25,375 | 3,815 | 1,49,738 | 1,28,682 | 21,056 |
| మార్కాపురం | 26,522 | 24,417 | 2,105 | 1,38,120 | 1,26,326 | 11,794 |
| పత్తికొండ | 25,197 | 21,923 | 3,274 | 1,26,922 | 1,08,669 | 18,253 |
| డోన్ | 25,125 | 23,741 | 1,384 | 1,27,234 | 1,19,363 | 7,871 |
| నంద్యాల | 24,833 | 19,382 | 5,451 | 1,25,393 | 92,049 | 33,344 |
| కంభం | 31,159 | 27,652 | 3,507 | 1,63,845 | 1,46,282 | 17,563 |
| బనగానపల్లె | 27,590 | 25,141 | 2,442 | 43,447 | 36,515 | 6,932 |
| కోయిలకుంట్ల | | | | 93,132 | 86,374 | 6,758 |
| సిరివెళ్ళ | 19,653 | 19,653 | ... | 1,04,724 | 1,04,724 | ... |
| మొత్తం | 2,40,602 | 2,11,202 | 29,400 | 12,70,843 | 10,70,625 | 2,00,218 |

క్రింది పట్టికను పరిశీలించిన జిల్లాలోని వైద్యసౌకర్యాలు యెంత హీనస్థితిలో వున్నవీ స్పష్టమౌతుంది:

| తాలూకా | ఆస్పత్రులు: ప్రభుత్వం | ఆస్పత్రులు: లోకలు బండు, ప్రయివేటు | మంచాల సంఖ్య | వైద్యశాలలు: ప్రభుత్వ | వైద్యశాలలు: లోకల్ బోర్డు | వైద్యశాలలు: గ్రామీణ వైద్యాలయాలు |
|---|---|---|---|---|---|---|
| కర్నూలు | 1 | 1 | 174 | 2 | 3 | 3 |
| నందికొట్కూరు | 1 | ... | 6 | ... | 2 | 3 |
| మార్కాపురం | 1 | ... | 8 | 1 | 1 | 1 |
| పత్తికొండ | ... | ... | ... | 1 | 1 | 3 |
| డోన్ | ... | ... | 6 | 1 | 2 | 1 |
| నంద్యాల, బనగానపల్లె | 2 | 1 | 151 | 3 | 6 | ... |
| కంభం | ... | 3 | 4 | ... | 3 | ... |
| కోయిలకుంట్ల | ... | ... | 2 | 2 | 1 | 1 |
| సిరివెళ్ళ | ... | ... | 4 | ... | 2 | 2 |
| జిల్లామొత్తం | 5 | 5 | 355 | 10 | 21 | 14 |

## పరిశ్రమలు

జిల్లాలో పెద్ద పరిశ్రమగా చెప్పుకోదగినదిలేదు. వున్న నూనె మిల్లులు, పరిశ్రమలు అంత పెద్దవికావు. వున్నవాటిలో చెప్పుకోదగినది, కర్నూలులో వున్న చిన్నా వనస్పతి ఫ్యాక్టరీ. జిల్లాలో సమృద్ధిగావున్న ఖనిజాల ముడిసరుకు అక్కడక్కడ త్రవ్వబడుతున్నది. కాని ఒక పరిశ్రమగా అభివృద్ధి చెందలేదు.

ప్రక్కపేజీలోని పట్టికలో తాలూకావారీ వున్న పరిశ్రమలు, వాటిలోవుద్యోగం చేస్తున్న వారిసంఖ్య మున్నగు వివరాలు తెలుపబడ్డాయి.

| తాలూకా | పరిశ్రమ | ఫ్యాక్టరీల సంఖ్య | ఉద్యోగం చేస్తున్నవారి సంఖ్య |
|---|---|---|---|
| కర్నూలు | నూనె మిల్లులు, ప్రత్తి ప్రెస్సులు | 6 | 607 |
| నందికొట్కూరు | ప్రత్తి, నూనెమిల్లులు | 6 | 145 |
| మార్కాపురం | పలకల ఫ్యాక్టరీ | 8 | 128 |
| పత్తికొండ | నూనె, ప్రత్తిమిల్లులు | 13 | 268 |
| నంద్యాల | నూనె మిల్లులు | 12 | 246 |
| | ప్రత్తి ప్రెస్సులు | 2 | 213 |
| డోన్ | నూనె, వేరుశనగ మిల్లులు | 14 | 439 |

(నోటు: ఆంధ్రరాష్ట్ర నిర్మాణంతో బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు తాలూకాలు కర్నూలుకు కలుపబడ్డాయి. కాని వాటివివరాలు లభించక పోవుటచేత పాత కర్నూలు జిల్లావివరాలు మాత్రమే యిచ్చట ఇవ్వటం జరిగింది.)

వుని ఓడించిన కరికాల చోళుని వంశీకులమని చెప్పుకున్నారు. తెలుగు చోడులు ఆంధ్రులే. వీరు పశ్చిమచాళుక్యులకు సామంతులుగ వుండేవారు. కాలక్రమాన వీరు పాకనాడు, కమ్మనాడు మొదలైన ప్రాంతాలకు వ్యాపించి చాళుక్యులకు సామంతులుగ కొన్నిప్రాంతాలను పరిపాలించుతూ వుండేవారు. నెల్లూరు చోడుల మూలపురుషుడైన బిజ్జన, కళ్యాణి చాళుక్య చక్రవర్తి మొదటి సోమేశ్వరునికి సామంతుడు. నెల్లూరు చోడులకు, విక్రమసింహపురి చోడులని పేరువుంది.

విక్రమ సింహపురి చోడులు, కంచి నుండి పరిపాలించిన చోళులకు సామంతులుగ వుంటూ నెల్లూరుజిల్లాను పరిపాలించారు. విక్రమసింహపురి చోడులలో ముఖ్యులు తిక్కరాజు, మనుమసిద్ధిరాజు.

తిక్కరాజుకాలంలో పాండ్యరాజులు చోళరాజ్యంపైకి దండెత్తిరాగా, తిక్కరాజు వారిని ఓడించి రాజరాజచోళుని సింహాసనంమీద కూర్చుండబెట్టాడు. అందువల్ల తిక్కరాజుకు 'చోళస్థాపనాచార్య' అనే బిరుదువచ్చింది.

తిక్కరాజు కొడుకు మనుమసిద్ధిరాజు. ఇతని మంత్రి కవిబ్రహ్మ తిక్కన, సేనాని ఖడ్గతిక్కన. ఖడ్గతిక్కన, కవితిక్కనకు పెదతండ్రి కొడుకు. వారు 13వ శతాబ్దంలోనివారు. ఖడ్గతిక్కన వీరుడుగాను, తిక్కన కవిబ్రహ్మగాను, మనుమసిద్ధి యిట్టివారి పోషకుడుగాను ప్రసిద్ధులయ్యారు.

మనుమసిద్ధిరాజు నెల్లూరును పాలించుతున్న కాలంలో జటవర్మ అనే పాండ్యరాజు, మనుమసిద్ధిని పాలద్రోలి నెల్లూరు రాజ్యాన్ని ఆక్రమించుకున్నాడు. అప్పుడు కవితిక్కన కాకతీయ గణపతిదేవుని వద్దకు వెళ్ళి నెల్లూరు రాజ్యాన్ని విమోచన చేయవలసిందిగ అర్థించాడు. నెల్లూరు జిల్లాలో రాజ్యాన్ని విస్తరింప చేసుకోడానికి యీ అవకాశం ఉపయోగపడుతుందని చెప్పి, కాకతీయ గణపతిదేవుడు 1212-13 లో సైన్యంతో వచ్చి పాండ్యులను తరిమివేసి కొంతరాజ్యాన్ని తాను వుంచుకొని, మిగతా భాగాన్ని గణపతిదేవుడు మనుమసిద్ధిరాజుకు యిచ్చాడు.

## కాటమరాజు

మనుమసిద్ధిరాజు రాజ్యం చేస్తున్న కాలంలో పశువుల పుల్లరి విషయమై మనుమసిద్ధికి, కాటమరాజుకి వివాదమేర్పడి తీవ్రమైన యుద్ధం జరిగింది. కనిగిరి తాలూకా ఎఱ్ఱగడ్డపాడును కాటమరాజు పాలించుచుండేవాడు. ఎఱ్ఱగడ్డపాడులో ఒక సంవత్సరం వర్షాలు పడక, పైర్లు ఎండిపోయాయి. పంటలు పండలేదు. ఎఱ్ఱగడ్డపాడు యాదవులప్పుడు తమ పశువులను మనుమసిద్ధిరాజు సీమలో మేపుకున్నారు. మనుమసిద్ధిరాజు పుల్లరి కట్టమంటే యాదవులు కట్ట నిరాకరించారు. మనుమసిద్ధి పుల్లరివిషయమై అన్నంభట్టును కాటమరాజు వద్దకు రాయబారం పంపాడు. రాయబారం విఫలమైంది. దానిమీదట కాటమరాజుకు మనుమసిద్ధిరాజుకు యుద్ధం జరిగింది. ఈ యుద్ధం పాలేటి ఒడ్డున పంచలింగాల కొండవద్ద జరిగింది. నాయకులు రాజ్యాధిపతులు కొందరు కాటమరాజుపక్షం, కొందరు మనుమసిద్ధిరాజుపక్షం వహించి యుద్ధంలో పాల్గొన్నారు.

మార్కండేయ పురాణం వ్రాసిన మారన, తిక్కన శిష్యుడు. దండికవి వ్రాసిన దశకుమార చరిత్రను తెనిగించిన కేతన తన రచనను తిక్కన సోమయాజికి అంకితం చేశాడు. కేతన మితాక్షర వ్యాఖ్యానాన్ని, పద్యకృతిగా తెనిగించాడు. సుమతీశతకం వ్రాసిన బద్దెన యీ కాలపువాడే.

## కృష్ణాపట్నం

మనుమసిద్ధిరాజు తరువాత అతని కుమారుడు రెండవ తిక్కరాజు రాజ్యం చేశాడు. ఇతని కాలంలో కాకతీయులకు సామంతులుగా వున్న నాగరాజులు నెల్లూరుజిల్లాలో కొన్ని ప్రాంతాలను పరిపాలించారు. రుద్రమదేవి కాలంలో నాగదేవుడనే నాగరాజు, గూడూరు తాలూకా ప్రాంతాన్ని పాలించడానికి నియమించబడ్డాడు. దక్షిణ ప్రాంతాన్ని ఇంకొక నాగరాజు పాలించాడు. త్రిలోచన పల్లవుల వంశీయులమని చెప్పుకొన్న తెలుగు పల్లవులు తెలుగు చోడులు, కాకతీయులకు సామంతులుగా నెల్లూరుజిల్లాలో కొంత ప్రాంతాన్ని పాలించారు. రుద్రమదేవి తరువాత రాజ్యానికి వచ్చిన ప్రతాపరుద్రుని కాలంలో నెల్లూరుజిల్లా పూర్తిగా కాకతీయుల వశమైంది.

13వ శతాబ్దంలో నెల్లూరుజిల్లాలో కృష్ణాపట్నం అనే రేవుపట్నం వుండేది. దాన్ని 'కొల్లిగుణ్ణ' లేక 'మనుమగోపాల పట్టణ'మని పిలిచేవారు. పశ్చిమ దేశాలనుండి వచ్చిన అనుయాయులనుండి వర్తకులు కృష్ణాపట్నంలో నివసించేవారని ఆ కాలపు శాసనాలవల్ల తెలుస్తున్నది. విదేశీవర్తకులే వినువంకరలనుండి అయితే, దేశీయవర్తకుల సంగతి ఏమి చెప్పాలి?

## కందుకూరు రాజ్యం

14వ శతాబ్దంలో కాకతీయరాజ్యం ఢిల్లీ సుల్తానుల దండయాత్రల ఫలితంగా పతనమైంది. ఆంధ్రదేశంలో స్వతంత్ర రాజ్యాలు యేర్పడి ఢిల్లీ పాలనకు స్వస్తి జరిగింది. కొండవీటి రెడ్డి రాజ్యాన్ని జయించిన ప్రోలయ వేమారెడ్డి నెల్లూరు జిల్లాలో చాలా భాగాన్ని జయించాడు. రాజ్య విస్తరణలో తనకు తోడ్పడిన అన్నదమ్ములను ప్రోలయ వేమారెడ్డి కొన్ని ప్రాంతాలకు అధిపతులుగా నియమించాడు. ప్రోలయ వేమారెడ్డి కనిష్ఠ సోదరుడైన మల్లారెడ్డి కందుకూరు ప్రాంతానికి అధికారిగా నియమించబడ్డాడు.

ప్రోలయ వేమారెడ్డితాతలకు నెల్లూరు జిల్లాలోని కోవూరు, నెల్లూరు, గూడూరు తాలూకాలు రెడ్ల పూర్వ నివాస స్థలము. అక్కడనుండే రెడ్లు యితర ప్రాంతాలకు వ్యాపించారు.

మల్లారెడ్డిని, వేమారెడ్డి కందుకూరు ప్రాంత పాలకునిగా నియమించినప్పటి నుంచి రెడ్డిరాజ్య పతనంవరకు కందుకూరు ప్రాంతాన్ని మల్లారెడ్డి వంశీయులే పరిపాలించారు. మల్లారెడ్డి మనుమడైన శ్రీగిరిరెడ్డి 1398 ప్రాంతంలో రాజ్యానికి వచ్చాక, కొండవీటిని ధిక్కరించి స్వతంత్రంగా పరిపాలించాడు.

1343 ప్రాంతంలో విజయనగర రాజులు కనిగిరి, కందుకూరు, ఉదయగిరి తాలూకాల ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. శ్రీగిరిరెడ్డి 1404లో విజయనగర రాజ్యంపై దండెత్తి ఉదయగిరిసీమను స్వాధీనం చేసుకున్నాడు. ఉదయగిరిసీమ, కందుకూరు రెడ్డిరాజ్యంలో కొద్ది

గుండ్లకమ్మ పొదిలి తాలూకాకు పశ్చిమ సరిహద్దుగానూ, దర్శి తాలూకాకు తూర్పు సరిహద్దుగానూ ప్రవహిస్తున్నది.

'కూటమన్నేరు' అనే చిన్న ప్రవాహం ఆత్మకూరు తాలూకా నుండా ప్రవహిస్తున్నది. అనంతసాగరం చెరువుకు దీని ద్వారా నీటిసౌకర్యం జరుగుతున్నది.

రాపూరు తాలూకా దక్షిణ సరిహద్దులో కాళంగి అనే ప్రవాహం, వెంకటగిరి తాలూకాలో వెంకటగిరి అనే చిన్న ప్రవాహం కూడ కలవు.

## అడవులు

జిల్లా వైశాల్యంలో 1,187.33 చ॥ మైళ్ళు అడవుల క్రింద ఉన్నది. ఇందులో 749.93 చ॥ మై॥ రిజర్వు అడవులు. 145 చ॥ మై॥ నూతనంగా ప్రభుత్వం స్వాధీనం చేసుకొన్న అడవులు. 270.40 చ॥ మై॥ ప్రభుత్వం ఇంకా ఎస్టేట్ల నుండి స్వాధీనం చేసుకొనని అడవులు.

తాలూకావారీ వివరాలను ఈ క్రింది పట్టిక తెలియజేస్తుంది :

కనిగిరి, ఉదయగిరి, రాపూరు తాలూకాలలోని రిజర్వు అడవులలోని చెట్లు

| | రిజర్వు అడవులు (చ॥ మై॥) | నూతనంగా స్వాధీనం చేసుకొన్న అడవులు (చ॥ మై॥) | ఇంకా స్వాధీనం చేసుకొనని అడవులు (చ॥ మై॥) | ఇతర అడవులు (చ॥ మై॥) | మొత్తం (చ॥ మై॥) |
|---|---|---|---|---|---|
| దర్శి | ... | ... | 7.20 | 5.0 | 12.20 |
| పొదిలి | ... | ... | 36.80 | 1.0 | 37.80 |
| కనిగిరి | 70.86 | 93.07 | 1.40 | ... | 165.33 |
| కందుకూరు | 47.20 | 27.45 | ... | ... | 74.65 |
| ఉదయగిరి | 203.96 | 24.48 | 10.00 | ... | 238.44 |
| కావలి | 44.74 | ... | ... | ... | 44.74 |
| ఆత్మకూరు | 105.17 | ... | ... | ... | 105.17 |
| కోవూరు | 20.00 | ... | ... | ... | 20.00 |
| రాపూరు | 159.00 | ... | ... | 16.0 | 175.00 |
| నెల్లూరు | 28.00 | ... | ... | ... | 28.00 |
| గూడూరు | 21.00 | ... | ... | ... | 21.00 |
| వెంకటగిరి | ... | ... | 176.00 | ... | 176.00 |
| సూళ్ళూరుపేట | 50.00 | ... | 39.00 | ... | 89.00 |
| మొత్తం | 749.93 | 145.00 | 270.40 | 22.0 | 1,187.33 |

వంటచెరకుకు మాత్రం పనికివస్తాయి. కాని కనిగిరి తాలూకాలోని ఎస్టేటు అడవులలో, పై ప్రదేశాలలోకంటె మంచి వంటచెరకు లభ్యమవుతుంది. చక్కటి పచ్చిక కూడ దొరుకుతుంది. సముద్ర తీరంలోని కావలి, గోవూరు అడవులలో మాత్రం సరివిచెట్లు విస్తారంగా వున్నాయి. వెలిగొండ్ల అడవులలో కలపకు పనికి వచ్చే చెట్లు అచ్చటచ్చటా వున్నాయి. సూళ్ళూరుపేట తాలూకాలో సరివి చెట్లతోపాటు, ఎల్లకాలం పచ్చగా వుండే కుంకుడుచెట్లు విస్తారంగా కనిపిస్తవి. దర్శి, పొదిలి, కందుకూరు తాలూకాలలోని ఎస్టేటు, ప్రయివేటు అడవులలో కూడ నాసిరకపు వంటచెరకకు పనికి వచ్చే చెట్లు విస్తారంగా కనిపిస్తవి.

## శీతోష్ణ పరిస్థితులు

శీతోష్ణ పరిస్థితులలో యీ జిల్లా, మిగత ఆంధ్రజిల్లాలకన్న మెరుగు. వాతావరణం పొడిగానూ, ఆరోగ్యకరంగానూ వుంటుంది. నైరుతీ ఋతుపవనాల వల జూన్ మాసంమధ్యనుండి వర్షాలు ప్రారంభమవుతాయి. పడమటి గాలులు ప్రారంభించినా యీ ఋతువులో తగినంత వర్షం పడదు. నైరుతీ ఋతుపవనాలవల్ల జిల్లా దక్షిణభాగంకన్న, ఉత్తరభాగంలో హెచ్చు వర్షాలు పడతాయి. ఈశాన్య ఋతుపవనాలవల్ల సామాన్యంగా వర్షాలు అక్టోబరులో ప్రారంభమయి డిసెంబరు, జనవరి మాసాలవరకూ కురుస్తవి.

సంవత్సరంలో సగటున కురిసే వర్షం, వర్షపు దినాల మొత్తం తాలూకావారీగా క్రిందిపట్టికలో యివ్వబడ్డాయి :

## సాగు సదుపాయాలు

### దర్శి తాలూకా

జిల్లాలోని కరువు తాలూకాలలో ఇది ఒకటి. కొద్ది చెరువులు మినహా, సాగుకు పనికివచ్చే నీటివనరులు శూన్యం.

| తాలూకా | సగటు సంవత్సర వర్షపాతం అం॥ లో | సంవత్సర వర్షపు దినాలు |
|---|---|---|
| దర్శి | 25.12 | 26.1 |
| పొదిలి | 25.98 | 37.1 |
| కనిగిరి | 26.65 | 38.6 |
| కందుకూరు | 33.05 | 42.8 |
| ఉదయగిరి | 32.62 | 42.8 |
| కావలి | 38.50 | 41.9 |
| ఆత్మకూరు | 30.16 | 38.9 |
| కోవూరు | 38.90 | 43.6 |
| రాపూరు | 38.50 | 45.4 |
| నెల్లూరు | 39.83 | 44.9 |
| గూడూరు | 36.43 | 43.6 |
| వెంకటగిరి | 39.29 | 45.1 |
| సూళ్ళూరుపేట | 44.67 | 48.3 |

1949 సం॥ వరదలమూలంగా, ఉన్న చెరువులకట్టలుకూడ తెగిపోయినవి. వీటిని మరమ్మతు చేయించిన దిక్కు కన్పించలేదు. అక్కడక్కడ నూతుల క్రింద కొంత జొన్నపంట పండించబడుతున్నది.

### పొదిలి తాలూకా

ఇదికూడ కరువు తాలూకాయే. వర్షాధారంపై ఆధారపడ్డ చెరువులు మినహా మరే సాగు సదుపాయాలూ లేవు. తాలూకాలో ఉన్న 42 మైనరు ఇరిగేషను వర్క్సులో 19 పనికిరాని స్థితిలో వున్నాయి. దీనికి తోడు 1949 వరదలతో మరికొన్ని చెరువుల గట్లకు గండ్లు బడ్డాయి. సరిగా వర్షాలుపడని సంవత్సరమల్లా తాలూకాలో కరువే.

### కనిగిరి తాలూకా

మన్నేరు నదీ జలాలతో నింపబడే మోపాడు రిజర్వాయరుక్రింద యీ తాలూకాలో 4,228 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నాయి. కొమ్మలేరు నీటితో జాజిపురం ప్రాజక్టు క్రింద 700 ఎకరముల వరకు గూడా యీ తాలూకాలో సాగుచెయ్యబడుతున్నాయి. ఇవి గాక 2 మేజరు ఇరిగేషను, 8 మైనరు ఇరిగేషను చెరువులు కూడ కలవు. అక్కడక్కడా బావుల క్రింద పండ్ల తోటలు కలవు. తాలూకాలో అత్యధిక భాగం మెట్ట. కనుక సకాలంలో వర్షాలు పడని సంవత్సరమల్లా కరువువాత తప్పదు.

### కందుకూరు తాలూకా

కుమ్మరేరు, పందివాగుల నీళ్ళతో నిండే మాచవరం, మోపాడు చెరువులు, గుడికలేరు నీళ్ళతో నిండే పొన్నలూరు చెరువు, మన్నేరు నుండి కాల్వ ద్వారా నీళ్ళను తీసుకొను కారేడు చెరువు ఈ తాలూకాలో ఉన్న నీటి వనరులు. తాలూకా మొత్తంలో మేజరు, మైనరు ఇరిగేషను వనరుల క్రింద 18 వేల ఎకరాల వరకూ సాగుచెయ్యబడుతున్నది. 49 వరకూ మైనరు ఇరిగేషను వర్క్సు కలవు. అయినా వర్షాధారంపైననే యీ తాలూకా ప్రజలు ఆధారపడి వున్నారు. వర్షాలు లోపించిన, కరువుబాధ ఇచ్చుటా తప్పదు.

### ఉదయగిరి తాలూకా

తాలూకాలో సాగు క్రింద నున్న భూమిలో 5% మాత్రమే జలాధారాల వల్ల సాగవుతున్నవి. నందవనం చెరువు, ఉన్న నీటివనరులలో ముఖ్యమైనది. దీనికి నీరు బొగ్గేరు నుండి సప్లయి చేయబడుతున్నది. ఇది గాక మోపాడు ప్రాజక్టు క్రింద యీ తాలూకాలో 4 గ్రామాల లోని భూమి సాగుచేయబడుతున్నది. ఇవి కూడ ప్రాజక్టు కాల్వలకు చిట్టచివర ఉన్నాయి. ఇక మిగిలిన జలాధారాలల్లా వర్షాలపై ఆధారపడే చెరువులే. కనుక యీ ప్రాంతంలో కరువు సర్వసామాన్యంగా వుంటూ వస్తున్నది.

### కావలి తాలూకా

మోపాడు ప్రాజక్టు క్రింద నాలుగు గ్రామాలు, సంగం ప్రాజక్టు క్రింద రెండు గ్రామాలు యీ తాలూకాలో సాగు చెయ్యబడుతున్నాయి. వర్షాధారంపై నిండే చెరువులపై ఆధారపడి, ఇతర గ్రామాలలో సాగు చేస్తున్నారు. కాని సముద్రతీరంలో కూరగాయలు, మిర్చి మున్నగునవి దొరువులు త్రవ్వి, వాటి నీటితో పెంచబడు తున్నాయి. కనుక

వర్షాలు సకాలంలో పడని సంవత్సరాలలో యీ ప్రాంతంలో కూడ కరువు ప్రత్యక్షం.

### ఆత్మకూరు తాలూకా

పెన్నానీటితో యీ తాలూకాలోని స్వల్పంగా సాగు కొనసాగించబడుతున్నది. ఇచ్చట పెన్న ఆయకట్టుకు తోడు, పెద్దచెరువులుకూడ ఉన్నాయి. కోటమనేరు వాగుకు అడ్డుకట్టలు వేసి అనంతసాగరం చెరువు ఏర్పరచబడింది. దీని క్రింద ఆయా గ్రామాలలో 3,250 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నాయి. బొగ్గేరు నుండి నీరు ఆత్మకూరు చెరువుకు పంపబడుతున్నది. దీనిక్రింద 2,500 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నాయి. వీరిపేరు నది నుండి నీటిని తీసుకొని, అనుమసముద్రం చెరువుక్రింద వెయ్యి ఎకరాలు సాగు చెయ్యబడుతున్నాయి. కావలి చెరువు క్రింద యీతాలూకాలో 2,000 ఎకరాలు, మహిమలూరు చెరువుక్రింద 2,300 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నాయి.

సిలిచెరువు 2,200 ఎకరాలకు నీటిని సప్లయిచేస్తున్నది.

పెన్న, వీరిపేరుల నుండి యీ తాలూకాలో అయిలు ఇంజనులద్వారా నీటిని తోడి, అచ్చటచ్చటా సాగుచేయటం కూడ జరుగుతున్నది.

ఇంకా తాలూకాలో అచ్చటచ్చటా చెరువులు విస్తారంగానే ఉన్నాయి. కాని యివన్నీ వర్షంపై ఆధారపడేవే! మాతుల క్రింద కొన్నిచోట్ల మెట్ట పంటలు పండించబడుతున్నాయి. కాని తాలూకాలోని మెట్టప్రాంతాలకు వర్షాలు సకాలంలో లేని సంవత్సరమల్లా కటకటే!

### కోవూరు తాలూకా

ఈ తాలూకా మొత్తం పెన్న ఆయకట్టుక్రింద ఉన్నది. సంగంనుండి ప్రారంభమయ్యే కలిగిరి కాల్వ, పెన్న ఆనకట్ట నుండి కలిగిరి రిజర్వాయరుకు నీటినికొనిపోతున్నది. ఈ రిజర్వాయరు క్రింద యీ తాలూకాలో 83,400 ఎకరాలు సాగు క్రింద ఉన్నవి. దువ్వూరు కాల్వ నీటి సప్లయిక్రిందకూడ కొంత సాగుచెయ్యబడుతున్న.

పైడేరు, మాల్దేవి కాల్వలకు కలిగిరి రిజర్వాయరునుండే నీరు లభ్యమవుతున్నది. చాలా గ్రామాలకు నీటిని సప్లయిచేయు అలూరు చెరువుకు పైడేరు కాల్వనుండే నీరు అందుతున్నది.

### రాపూరు తాలూకా

తాలూకాలో అచ్చటచ్చట నున్న చిన్న చెరువులు మినహా, మరే జలాధారం లేదు. ఇదికూడా వర్షాధారాలే. కనుక వర్షాలు సకాలంలో పడని సంవత్సరమల్లా కరువు ప్రత్యక్షమే.

### నెల్లూరు తాలూకా

పెన్న ఆయకట్టుక్రింద సాగయ్యే తాలూకాలలో ఇదిఒకటి. సంగం, నెల్లూరు రెండు ఆనకట్టలవల్ల యీ తాలూకాకు నీరు దొరుకుతుంది. సంగం ఆనకట్ట కాల్వ ద్వారా నెల్లూరు చెరువు నింపబడుతున్నది. దీనిక్రింద 12,000 ఎకరాలు సాగుచెయ్యబడుతున్నవి.

నెల్లూరు ఆనకట్టనుండే బయలుదేరు జఫర్ సాహెబ్ కాల్వ 34 వేల ఎకరాలకు, సర్వేపల్లి కాల్వ 32,300 ఎకరాలకు నీటిని అందించుచున్నవి. సర్వేపల్లికాల్వ, సర్వేపల్లి రిజర్వాయరుకు కూడ నీటిని

సప్లయిచేయుచున్నది. ఈ రిజర్వాయరు క్రింద 11,380 ఎకరముల ఆయకట్టు వున్నది.

సత్రకు సాగుసదుపాయాలు లేని ప్రాంతంకూడ తాలూకాలో కొంతభాగం వుంది. ఇక్కడచోట్ల చెరువులు, నూతుల క్రింద మెట్టపంటలు పండించబడు తుంటాయి. కాని వర్షాలు సకాలంలో లేనప్పుడు యీ ప్రాంతాలకు ఇబ్బందులు తప్పవు.

### గూడూరు తాలూకా

ఇచ్చట అనేక చెరువులు వున్నాయి. కాని అత్యధికం వర్షాధారంపై నిండే చెరువులే.

కోట కొత్తపాలెం వద్దనున్న పినాకి చెరువుకు, మరికొన్ని చిన్న చెరువులకు వల్లకాల్వ నుండి నీరు అందించబడు తున్నది (వల్లకాల్వ - స్వర్ణముఖి నదీ పాయ). వెంకటగిరి, రాపూరు కొండల అడి కట్టల నుండి చెన్నూరు, గోగూరు చెరువు లకు కూడ నీరు సప్లయి చేయబడుతున్నది. ఇదిగాక 1,198 ఎకరాల సాగుకు తోడ్పడు 13 ఊటకాల్వలు యీ తాలూకాలో వున్నవి. మొత్తం 35000 ఎకరాలకు నీటి సదుపాయాలు వున్నాయి. కాని సకాలంలో వర్షాలు లేకపోయినా, ఇందులో అధికభాగం సాగుకావు.

### వెంకటగిరి తాలూకా

జిల్లాలోని పేదతాలూకాలలో ఇది ఒకటి. వర్షాలతో నిండే చెరువులే తాలూకాలోని జలాశయాలు. అక్కడక్కడా మెట్టపైరులు, నూతుల క్రింద పండించబడుతున్నవి. తరుచు కరువు కాటకాలు యీ తాలూకాలో ప్రత్యక్ష మవుతూంటాయి.

### సూళ్ళూరుపేట తాలూకా

చిన్న చెరువులన్నీ వర్షాధారాలే! అక్కడక్కడా సాగుకు తోడ్పడే నూతులు ఉన్నాయి. శ్రీహరికోట లంకలో మాత్రం ఊటచెరువులు ఉన్నాయి. వీటిక్రింద రెండుపంటలు పండించబడు తుంటాయి. తరుచు తాలూకా కరువు వాత బడుతూనే వుంటుంది.

జిల్లాలోని మైనరు, మేజరు ఇరిగేషను సదుపాయాలు (తాలూకావారీ వివరాలతో), వాటిక్రింద ఎంతెంత సాగు చేయబడుతున్నదీ మున్నగునవి, ప్రక్క పేజీలోని పట్టిక తెలియజేస్తుంది.

### ఆహార-ఆహారేతర పంటలు

జిల్లాలోని ప్రధానమైన ఆహార పంటలు వరి, జొన్న. వ్యాపారపంటలలో వేరుశనగ, ప్రత్తి ముఖ్యమైనవి.

4 లక్షల 12 వేల ఎకరాలలో వరి, 4 లక్షల ఎకరాలలో జొన్న పండించ బడుతున్నది. కోవూరు, నెల్లూరు తాలూకాలు జిల్లాలో ప్రధాన వరి ఉత్పత్తి స్థావరాలు. కందుకూరు, కనిగిరి, కావలి, ఆత్మకూరు, రాపూరు తాలూకాలలో జొన్న విస్తారంగా పండించబడుతున్నది.

1941-51 సం॥ల మధ్యలో 1942-43 సంవత్సరంలో మాత్రం జిల్లాఅంతటా సరిఅయిన ప్రమాణంలో వర్షాలు సక్రమంగా పడుటవల్ల పంటలు పండాయి. కనుక వర్షాలు సకాలంలో ఉంటే జిల్లాలో ఏయే పంట ఎంతెంత విస్తీర్ణంలో పండించబడుతుందో అర్థం చేసుకొనుటకు లెక్కలు తోడ్పడుతాయి.

| తాలూకా | మైనరు ఇరిగేషను వర్క్సు సంఖ్య | మైనరు ఇరిగేషను వర్క్సు క్రింద సాగయ్యే ఎకరాలు | మేజరు ఇరిగేషను వర్క్సు క్రింద సాగయ్యే ఎకరాలు |
|---|---|---|---|
| దర్శి | 138 | 6,045 | 744 |
| పొదిలి | 42 | 1,954 | 1,244 |
| కనిగిరి | 9 | 712 | 7,282 |
| కందుకూరు | 49 | 2,812 | 15,002 |
| ఉదయగిరి | 39 | 2,093 | 2,434 |
| కావలి | 34 | 3,045 | 18,118 |
| ఆత్మకూరు | 59 | 4,168 | 16,241 |
| కోవూరు | 9 | 405 | 1,01,460 |
| రాపూరు | 76 | 4,443 | 3,245 |
| నెల్లూరు | 42 | 2,983 | 79,473 |
| గూడూరు | 43 | 4,660 | 29,569 |
| సూళ్లూరుపేట | 29 | 1,904 | 823 |
| వెంకటగిరి | 201 | 12,465 | 1,312 |
| మొత్తం | 770 | 47,689 | 2,76,947 |

కనుక ప్రక్క పేజీలోని పట్టీలో పంటలు ఉత్పత్తి సంవత్సరానికి చేసినదానిన్ని 1942-43 సం॥ ఉత్పత్తి సంఖ్యలు, తాలూకా వారీ వివరాలతో యివ్వబడ్డాయి.

### రహదారులు

సరిహద్దులలో నున్న ముఖ్య కేంద్రాలకు యీజిల్లానుండి రహదారులున్నాయి. మద్రాసుకు, చిత్తూరు జిల్లాలోని చంద్రగిరికి, కడప జిల్లాలోని బద్వేలుకు, గుంటూరుజిల్లాలోని ఒంగోలుకు, కర్నూలు జిల్లాలోని కంభంకు సరాసరి మార్గాలు వున్నాయి. జిల్లా మొత్తంలో 1,408 మైళ్ళ రోడ్లు. ఇందులో 186 మైళ్ళ జాతీయ రహదారులు, 102 మైళ్ళ రాష్ట్రీయ రహదారులు, 671 మైళ్ళ ప్రధాన జిల్లా రోడ్డు రోడ్లు, 321 మైళ్ళ ఇతర జిల్లా బోర్డు రోడ్లు, 129 మైళ్ళ గ్రామరోడ్లు, 44 మైళ్ళ మ్యునిసిపల్ రోడ్లు, 5 మైళ్ళ పబ్లిక్ వర్క్సు రోడ్లు వున్నవి.

అడవులలో ఉన్న గ్రామాలకు, పల్లె ప్రాంతాలకు సరి అయిన రహదారులే లేవు. ప్రక్క పేజీలోని పట్టికలో మ్యునిసిపల్, పబ్లిక్ వర్క్సు రోడ్లను మినహాయించి ఏయే తాలూకాలలో ఎన్ని మైళ్ళ పొడవున, ఏయే రోడ్లు ఉన్నదీ వివరించు లెక్కలు ఇవ్వబడ్డాయి:

| పంట | | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | [illegible] (ఎకరాలు) | మొత్తం (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 2,619 | 2,441 | 3,088 | 16,058 | 3,741 | 39,136 | 22,941 | 1,00,115 | 6,415 | 1,06,943 | 36,082 | 21,229 | 20,595 | 3,81,403 |
| | మెట్ట | ... | ... | 139 | 5,082 | ... | ... | 247 | 10 | 2,155 | ... | 7,154 | ... | 16,312 | 31,099 |
| జొన్న | మాగాణి | 5,727 | ... | 1,643 | 594 | 527 | 2 | 145 | ... | 8 | ... | 10 | ... | 12 | 8,668 |
| | మెట్ట | 87,013 | 25,098 | 43,843 | 88,719 | 37,943 | 39,724 | 69,635 | 909 | 40,717 | 2,865 | 12,525 | 6,240 | 123 | 3,95,354 |
| సజ్జలు | మాగాణి | 5,500 | 4,863 | 17,634 | 5,924 | 13,391 | 2,359 | 5,807 | 223 | 3,676 | 258 | 3,278 | 3,872 | 468 | 67,253 |
| | మెట్ట | 12,596 | 7,282 | 4,997 | 7,914 | 985 | 396 | 1,960 | 46 | 985 | ... | 333 | ... | 32 | 37,526 |
| రాగి | మాగాణి | 6,973 | 4,612 | 17,669 | 4,138 | 12,851 | 3,036 | 2,008 | 2,052 | 1,666 | 1,868 | 3,182 | 2,837 | 1,734 | 71,626 |
| | మెట్ట | ... | 4,488 | 1,042 | 1,896 | 339 | 976 | 542 | 305 | 604 | 149 | 199 | ... | 129 | 10,669 |
| చెరుకు | | ... | ... | 13 | ... | 15 | ... | ... | 4 | ... | ... | ... | .. | ... | 32 |
| వేరుశనగ | | 6,101 | 56 | 87 | 9,535 | 94 | 214 | 1,371 | 99 | 972 | 314 | 229 | 54 | 72 | 19,198 |
| నువ్వులు | | 450 | ... | 167 | 155 | 117 | 114 | 419 | 6 | 587 | 163 | 827 | 430 | 233 | 3,669 |
| ప్రత్తి | | 13,500 | 4,843 | 8,065 | 2,078 | 1,357 | 175 | 533 | ... | 422 | ... | ... | ... | 1 | 30,974 |

| తాలూకా | జాతీయ రహదారులు (మైళ్ళు) | రాష్ట్ర రహదారులు (మైళ్ళు) | ప్రధాన జిల్లా రోడ్లు (మైళ్ళు) | ఇతర జిల్లా రోడ్లు (మైళ్ళు) | గ్రామ రోడ్లు (మైళ్ళు) | మొత్తం రోడ్లు (మైళ్ళు) |
|---|---|---|---|---|---|---|
| దర్శి | ... | ... | 39 | 11 | 5 | 55 |
| పొదిలి | ... | 40 | 21 | 23 | ... | 84 |
| కనిగిరి | ... | ... | 52 | 27 | 5 | 84 |
| కందుకూరు | 24 | ... | 72 | 20 | 10 | 126 |
| ఉదయగిరి | ... | 25 | 79 | ... | 1 | 105 |
| కావలి | 17 | ... | 69 | 52 | 15 | 153 |
| ఆత్మకూరు | ... | 19 | 32 | 55 | 6 | 112 |
| కోవూరు | 20 | 18 | 54 | 41 | 15 | 148 |
| రాపూరు | ... | ... | 65 | 20 | 9 | 94 |
| నెల్లూరు | 23 | ... | 44 | 26 | 31 | 124 |
| గూడూరు | 16 | ... | 41 | 20 | 12 | 89 |
| వెంకటగిరి | ... | ... | 55 | 20 | 8 | 83 |
| సూళ్ళూరుపేట | 36 | ... | 48 | 6 | 12 | 102 |
| మొత్తం | 136 | 102 | 671 | 321 | 129 | 1,359 |

## కాల్వలు

జిల్లా ఆ చివరి నుండి యీ చివరి వరకూ బకింగ్‌హాం కాల్వ సముద్ర తీరానికి సమీపంగా పోతున్నది. దీనిపై సంవత్సరంలో అధిక భాగం పడవలలో వంటచెరకు, ఇతర సరకులూ అటూ-ఇటూ రవాణా చేయబడుతుంటాయి.

## రైల్వే

జిల్లా మొత్తంలో 192¼ మైళ్ళ నిడివి గల్గిన రైలుబాట ఉన్నది. ఇందులో 132¾ మైళ్ళు బ్రాడ్ గేజి, 59½ మైళ్ళు మీటరు గేజి.

మద్రాసు - కలకత్తా బ్రాడ్ గేజి మార్గం సూళ్ళూరుపేట, గూడూరు, నెల్లూరు, కోవూరు, కావలి, కందుకూరు తాలూకాలమీదుగాపోవుచున్నది. విజయవాడ-గుంతకల్లు మీటరుగేజి మార్గం జిల్లా యొక్క ఉత్తరకొన గుండా పోవుచున్నది.

జిల్లాలోని రైల్వేకూడలి గూడూరు. గూడూరునుండి మీటరుగేజి బ్రాంచిలైను రేణిగుంటకు పోవుచున్నది. ఈ మార్గం వెంకటగిరి, గూడూరు తాలూకాలగుండా పోవుచున్నది.

## జనాభా

జిల్లా జనాభా గత జనాభా లెక్కల నుండి (1941) మొన్నటి జనాభా లెక్కలనాటికి (1951) నూటికి 10.4 చొప్పున అభివృద్ధి చెందింది. క్రింది పట్టిక తాలూకావారీ జనాభా వివరాలను, గత 10 సంవత్సరాలలో ఏయే తాలూకాలో ఏ శాతంలో జనాభా వృద్ధిచెందిందీ మున్నగు వివరాలను తెలియజేస్తుంది:

| తాలూకా | 1941 సం॥ జనాభా | 1951 సం॥ జనాభా | 1941 సం॥ పై పెరుగుదలశాతం | గ్రామాలు | *పట్టణాలు |
|---|---|---|---|---|---|
| దర్శి | 1,13,062 | 1,18,826 | 5.1 | 75 | ... |
| పొదిలి | 86,600 | 96,000 | 10.9 | 110 | ... |
| కనిగిరి | 1,49,752 | 1,63,958 | 9.5 | 183 | 1 |
| కందుకూరు | 1,87,808 | 2,01,316 | 7.2 | 160 | 1 |
| ఉదయగిరి | 1,09,803 | 1,18,685 | 8.1 | 131 | 1 |
| కావలి | 1,18,951 | 1,36,362 | 14.6 | 78 | 1 |
| ఆత్మకూరు | 1,20,752 | 1,31,845 | 9.2 | 114 | ... |
| కోవూరు | 1,61,312 | 1,88,835 | 17.1 | 87 | 3 |
| రాపూరు | 82,400 | 88,512 | 7 4 | 108 | ... |
| నెల్లూరు | 2,12,945 | 2,61,258 | 22.7 | 113 | 1 |
| గూడూరు | 1,01,219 | 1,12,337 | 11.0 | 110 | 1 |
| వెంకటగిరి | 81,120 | 81,980 | 1.1 | 151 | 1 |
| సూళ్ళూరుపేట | 1,00,172 | 95,718 | -4.4 | 141 | 2 |
| జిల్లా మొత్తం | 16,25,896 | 17,95,632 | 10.4 | 1,561 | 12 |

* ఉదయగిరి మినహాయించి 5 వేలు-అంతకు పైబడి జనాభాగల్గిన, నిర్దిష్టమైన పట్టణ లక్షణాలు గల్గిన పట్టణాలు మాత్రమే యిందులో చేర్పు చేయబడ్డాయి.

జిల్లా మొత్తం జనాభా 17,95,632 మంది 1,573 గ్రామ, పట్టణాలలో నివసిస్తున్నారు. జిల్లా మొత్తంలో 3,38,013 ఇండ్లున్నాయి. ఇందులో 3,06,833 ఇండ్లు గ్రామాలలోనూ, 31,181 ఇండ్లు పట్టణాలలోనూ ఉన్నాయి.

జిల్లా గ్రామీణ జనాభా 15,91,993. పట్టణజనాభా 2,03,639, అనగా ప్రతి 8 మందిలో ఒక్కరుమాత్రమే పట్టణాలలో నివసిస్తున్నారు.

క్రిందిపట్టిక తాలూకావారీ ఇండ్ల వివరాలను, గ్రామీణ, పట్టణ వివరాలను తెలియజేస్తుంది:

జిల్లా జనాభా, గత రెండు జనాభా సంఖ్యలమధ్య నూటికి 10.4 చొప్పున పెరిగినా, కోవూరు, నెల్లూరు తాలూకాలే యీ అభివృద్ధికి ప్రధాన కారణం. జిల్లాలోకెల్ల కోవూరు సాంద్రవంతమైన తాలూకా. తాలూకా గ్రామీణజనాభా పెరుగుదలను మాత్రమే తీసుకొన్న, 1941-51 సం॥ల మధ్య యీ ప్రదేశంలో నూటికి 22.7 చొప్పున పెరుగుదల కన్పించుతుంది. తాలూకా, గ్రామ, పట్టణాల జనాభా అభివృద్ధి మొత్తంగా తీసుకొన్న 17.1 % మాత్రమే.

| తాలూకా | మొత్తం ఇండ్ల సంఖ్య | గ్రామాలలో ఇండ్ల సంఖ్య | పట్టణాలలో ఇండ్ల సంఖ్య | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|
| దర్శి | 21,283 | 21,283 | ... | 1,18,826 | ... | 1,18,826 |
| పొదిలి | 16,815 | 16,815 | ... | 96,000 | ... | 96,000 |
| కనిగిరి | 29,050 | 27,621 | 1,429 | 1,55,637 | 8,321 | 1,63,958 |
| కందుకూరు | 39,763 | 37,497 | 2,266 | 1,89,409 | 11,907 | 2,01,316 |
| ఉదయగిరి | 21,751 | 21,027 | 724 | 1,14,290 | 4,395 | 1,18,685 |
| కావలి | 24,791 | 22,368 | 2,423 | 1,20,846 | 15,516 | 1,36,362 |
| ఆత్మకూరు | 24,024 | 24,024 | ... | 1,31,845 | ... | 1,31,845 |
| కోవూరు | 36,760 | 32,269 | 4,491 | 1,60,306 | 28,529 | 1,88,835 |
| రాపూరు | 17,547 | 17,547 | ... | 88,512 | ... | 88,512 |
| నెల్లూరు | 49,389 | 38,970 | 10,419 | 1,79,778 | 81,480 | 2,61,258 |
| గూడూరు | 22,129 | 18,695 | 3,434 | 92,281 | 20,056 | 1,12,337 |
| వెంకటగిరి | 15,994 | 12,595 | 3,399 | 64,604 | 17,376 | 81,980 |
| సూళ్ళూరుపేట | 18,717 | 16,122 | 2,595 | 79,659 | 16,059 | 95,718 |
| మొత్తం | 3,38,013 | 3,06,833 | 31,181 | 15,91,993 | 2,03,639 | 17,95,632 |

తాలూకావారీ జనాభా అభివృద్ధి సంఖ్యలలో, నెల్లూరు తాలూకా గత పది సంవత్సరములలో నూటికి 22.7 చొప్పున వృద్ధి చెందినట్లు కన్పించుచున్నది. ఇందులో జిల్లా కార్యస్థానమైన నెల్లూరుపట్టణ అభివృద్ధికూడ కలసి ఉండుటచేత యింత పెరుగుదల కన్పిస్తుంది. 1941-51 సం॥ మధ్య నెల్లూరుతాలూకా జనాభా అభివృద్ధి 48,213 మంది. ఇందులో ఒక్క నెల్లూరు పట్టణంలోనే 25,165 మంది పెరిగారు.

తూర్పుభాగంలోఉన్న వెంకటగిరి, రాపూరు, ఉదయగిరి, కనిగిరి, దర్శి తాలూకాలు సహజమయిన సౌభాగ్యాలు కూడ కల్గిలేవు. ఇచ్చట జనాభా అభివృద్ధి స్వల్పమే. పైగా కరువు సంవత్సరాలలో యీ ప్రాంతాలనుండి ఇతర చోట్లకు వలసలుకూడ పోతూఉంటారు.

ఇక సూళ్ళూరుపేట తాలూకాలో ఉన్న జనాభాయే క్షీణించింది. 1941 లో 1,00,172 మంది ఉన్న జనాభా 1951 కి 95,716 కు క్షీణించింది. వెంకటగిరి తాలూకా గత 10 సం॥ లో 81,120 నుండి 81,980 కి - 860 మంది మాత్రమే పెరిగారు.

సక్రమ జీవనవసతులు యీ ప్రదేశాలలో లోపించడం, ఉన్న సరివితోటల పెంపకంకూడ భుక్తికి తోడ్పడకపోవుటచేత యీ ప్రదేశాలనుండి చాలాజనాభా మదరాసుకు; చెంగల్‌పట్టు జిల్లాలోని వివిధ ప్రాంతాలకు; గూడూరు, రాపూరు మైకాగనుల ప్రదేశాలకు వలసపోయారు. సూళ్ళూరుపేట తాలూకాలోని జనాభా క్షీణతకు సముద్ర తీర ప్రాంతాలలో విరివిగా తిరిగే మలేరియా కూడ ఒక కారణంగా గుర్తించాలి. ఇచ్చట వైద్య సదుపాయాలు పూర్తిగా శూన్యం. కనుక మలేరియా అవిచ్ఛిన్నంగా చెలరేగుతూ ఉంటుంది.

## వైద్యం

జిల్లాలోని వైద్యసౌకర్యాలు బహు స్వల్పం. 504 మంది రోగులను అట్టిపెట్టి చికిత్స చేయగల 14 ఆస్పత్రులున్నాయి. ఇందులో ఒక్క జిల్లా ఆసుపత్రిలోనే 421 మంది రోగుల నుంచవచ్చు. మిగతా వన్నీ నామమాత్రమే. మందులిచ్చి పంపే వైద్యశాలలు 68 మాత్రమే ఉన్నాయి. ప్రక్కపేజీలోని పట్టికను గమనించిన తాలూకావారీ యీ వైద్యసదుపాయాలు ఎంత అన్యాయంగాఉన్నదీ బోధపడుతుంది.

## పరిశ్రమలు

మైకా మినహా జిల్లాలో చెప్పుకోదగ్గ పరిశ్రమలేవీ. 47 బియ్యం మరలు కోవూరు, నెల్లూరు తాలూకాలలో ఉన్నాయి. కనిగిరి కొండలలోని రాతి నుండి ప్రశస్తమైన రోడ్డురోళ్లు ఎగుమతికి తయారు చెయ్యబడుతున్నాయి. పొదిలి తాలూకాలోని రాయవరం, కేతగుడి అగ్రహారంలో పలకల తయారీకి పనికివచ్చే పదార్థం త్రవ్వబడి మార్కాపురంకు పంపబడుతున్నది. గూడూరు, రాపూరు తాలూకాలు మైకా గనులకు ప్రసిద్ధి. కావలి తాలూకాలోని దిండిగం, గుడ్లదోనలలోకూడ మైకా ఉన్నది.

| తాలూకా | ఆస్పత్రులు | | మంచాల సంఖ్య | వైద్యశాలలు | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రభుత్వం | లోకల్ ఫండు | | ప్రభుత్వం | లోకలు ఫండు | గ్రామవైద్యశాలలు |
| దర్శి | ... | ... | ... | ... | 2 | 3 |
| పొదిలి | ... | ... | 4 | ... | 1 | 2 |
| కనిగిరి | 1 | ... | 8 | ... | 2 | 1 |
| కందుకూరు | 1 | ... | 8 | 1 | 2 | 3 |
| ఉదయగిరి | 1 | ... | 8 | ... | 1 | 4 |
| కావలి | 1 | ... | 11 | ... | 7 | 2 |
| ఆత్మకూరు | 1 | ... | 4 | ... | 2 | 1 |
| కోవూరు | ... | 2 | 12 | 1 | 4 | 1 |
| రాపూరు | ... | ... | ... | ... | 2 | 2 |
| నెల్లూరు | 5 | ... | 421 | ... | 7 | 6 |
| గూడూరు | 1 | ... | 18 | ... | 2 | 4 |
| వెంకటగిరి | ... | 1 | 8 | ... | ... | 1 |
| సూళ్లూరుపేట | ... | ... | 2 | ... | 3 | 1 |
| మొత్తం | 11 | 3 | 504 | 2 | 35 | 31 |

తాలూకావారీ ముఖ్య పరిశ్రమల జాబితా, అందులో ఉద్యోగులయినవారి సంఖ్య యీ క్రింద యివ్వబడింది :

| తాలూకా | పరిశ్రమ | ఫ్యాక్టరీల సంఖ్య | ఉద్యోగంలో ఉన్నవారి సంఖ్య |
|---|---|---|---|
| కోవూరు | బియ్యం మరలు | 23 | 391 |
| నెల్లూరు | ,, | 24 | 370 |
| ,, | పింగాణీ | 1 | 96 |
| గూడూరు | మైకా | 85 | 1,071 |
| ,, | పింగాణీ | 1 | 80 |

# కడప జిల్లా

## చరిత్ర

కడప జిల్లా పేరు చెప్పగానే చాళుక్యులు గుర్తుకొస్తారు. ఆంధ్రదేశాన్ని సుదీర్ఘకాలం పరిపాలించి, ఆంధ్రభాషా వికాసానికి, ఆంధ్రప్రజల స్థిరజీవనానికి చాళుక్యులు ఎంతో తోడ్పడ్డారు. చాళుక్యుల ప్రాచీన నివాసస్థలం కడపజిల్లా. ప్రాచీనకాలంలో కడపజిల్లాకు హిరణ్యరాష్ట్రమనే పేరుండేదని శాసనాలవల్ల తెలుస్తున్నది.

క్రీ. శ. మూడవశతాబ్దంలో ఆంధ్రదేశం పరిపాలించిన ఇక్ష్వాకురాజుల, నాగార్జునకొండ శాసనాలలో ఖండచలికిరెమ్మణక అనే అతను, హిరణ్యరాష్ట్రంలో మహాతలవర పదవిలో నియమించబడినట్లుగా పేర్కొనబడింది. ఖండచలికిరెమ్మణక అనగా రెమ్మణకుడనే అతను ఖండచలికి కుమారుడనిగాని, మనుమడనిగాని అర్థం. చలికి, చలుకి, చల్కి అనే రూపాంతరాలు పొంది, చాళుక్యగా మారిందని చరిత్ర పరిశోధకులు నిర్ధారణ చేసారు. దీనినిబట్టి ఖండచలికి అంటే స్కందచాళుక్యుడని అర్థం. ఆంధ్రచరిత్ర పరిశోధకులకు మార్గదర్శి అయిన కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు చాళుక్యులు కర్షకులైన వెల్లాల తెగవారని నిర్ధారణ చేసారు.

క్రీ. శ. మూడవశతాబ్దంలో కడప జిల్లాలో నివసించిన చాళుక్యులు మహారాష్ట్ర ప్రాంతానికి పోయి, క్రీ. శ. అయిదవ శతాబ్దంనాటికి రాజ్యం స్థాపించారు. ఏడవ శతాబ్దంలో ఆంధ్రదేశాన్ని జయించారు.

### విష్ణువర్ధనుని జననం

పశ్చిమ చాళుక్యవంశ మూలపురుషులలో ఒకడైన విజయాదిత్య చక్రవర్తి, తెలుగు చోడులందరూ తమ వంశకర్తగా చెప్పుకునే కరికాల చోళుడు, అయిదవ శతాబ్దంలో కృష్ణకు ఉత్తరాన ఉన్న ఆంధ్రదేశాన్ని జయించాలని ప్రయత్నించిన త్రిలోచనపల్లవుని ఎదిరించి పోరాడారు. విజయాదిత్యునికి, త్రిలోచనపల్లవునికి కడపజిల్లా జమ్మలమడుగు ప్రాంతంలో యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో చాళుక్య విజయాదిత్యునికే జయం లభించింది. కాని విజయాదిత్యుడు యుద్ధంలో చనిపోయాడు. అందువల్ల కడపజిల్లాలో చాళుక్యుల పరిపాలన నెలకొనలేదు.

గర్భవతియైన విజయాదిత్యుని భార్య, జమ్మలమడుగు తాలూకా పెద్ద ముడియం అగ్రహారంలో విష్ణుభట్ట సోమయాజి యింట్లో రక్షణ తీసుకొంది. ఆమెకు విష్ణువర్ధను డనే కొడుకు పుట్టాడు. విష్ణువర్ధనుడు పెద్దవాడైన తరువాత తల్లివద్ద

నుండి నిజ వృత్తాంతం తెలుసుకొని, కడప జిల్లాలోని చాళుక్య గిరివద్దకు వెళ్ళి దేవుని వద్ద వరాలు పొంది, పెద్ద సైన్యాన్ని సమకూర్చుకొని రాజ్యాన్ని సాధించినట్లు ఒక కథ ప్రచారంలో వుంది.

## పాండవగుళ్ళు

పెద్దముడియం గ్రామంలో దొరికిన శాసనాలనుబట్టి కడపజిల్లా, చాళుక్యుల పాలన క్రిందకు రావడానికిముందు, పల్లవుల రాజ్యంలో అంతర్భాగంగా వున్నట్లు తెలుస్తున్నది. పల్లవులకు ముందు కడప జిల్లా చరిత్ర స్పష్టంగా తెలియడంలేదు. కడపజిల్లాలో చాలచోట్ల చిన్నచిన్న రాతిగృహాలు కనబడుతున్నవి. వీటిని స్థానికంగా పాండవగుళ్ళు అని పిలుస్తారు. చరిత్రకు అందని కాలంలోకూడ జమ్ములమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలలో ప్రజలు నివసించేవారని పాండవగుళ్ళు తెలుపుతున్నవి. పెద్దముడియం గ్రామంలో ఆటవిక ప్రజలు ఉపయోగించిన పనిముట్లు కొన్ని దొరికాయి.

## చోళ రాజ్యం

చాళుక్య విజయాదిత్యుడు, త్రిలోచన పల్లవుని ఓడించినప్పటికీ కడపజిల్లా చాళుక్యులవశం కాలేదు. కాని అదేకాలంలో కరికాల చోళుడు, త్రిలోచనపల్లవుని ఓడించి చోళరాజ్యాన్ని కడపజిల్లాలోకి విస్తరింపచేసాడు. కడపజిల్లాలో దొరికిన కైఫీయతులలో కరికాల చోళుని ప్రజోపయోగ కార్యాల ప్రశంస వుంది. కరికాల చోళుడు, ఓడిపోయిన త్రిలోచన పల్లవుని చేత కావేరి ఆనకట్ట నిర్మాణానికై మట్టి తట్టలు మోయించాడట. తెలుగు చోళులంతా కరికాల చోళుని తమవంశకర్తగా చెప్పుకొన్నారు.

క్రీ. శ. 640 ప్రాంతంలో ఆంధ్ర దేశ సంచారం చేసిన చైనాయాత్రికుడు హూ-యున్-త్సాంగ్ వ్రాతలనుబట్టి కడపజిల్లా తెలుగు చోళుల రాజ్యంలో భాగంగావుండేదని తెలుస్తున్నది. కడప జిల్లా జమ్ములమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలు మొదలైన ఉత్తరప్రాంతం, ఆకాలంలో రేనాడుగా వ్యవహరించ బడింది. తెలుగుచోళుల పాలన క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దం చివరిభాగంలో రాష్ట్రకూటుల దండయాత్రవల్ల అంతమైంది. రాష్ట్రకూటులు కడపజిల్లాను పాలించినట్లు కనబడదు.

## బాణరాజులు

తెలుగు చోళుల అంతంతో కడపజిల్లా ఏకచ్ఛత్రాధిపత్యం క్రిందలేదు. అనేక చిన్న రాజ్యాలు ఏర్పడ్డాయి. రాయచోటి తాలూకా ఎనిమిదవ శతాబ్దం నుండి వైదుంబరాజుల పాలనక్రింద వుంది. తొమ్మిదవ శతాబ్దారంభంలో కడపజిల్లా కొంతభాగంలో బాణరాజుల అధికారం వెల్లింది. పదవ శతాబ్దం ప్రారంభంలో చోళుల ప్రాబల్యం పెరిగింది. బాణ రాజులు, చోళులకు సామంతులయ్యారు. ఇదే కాలంలో రాష్ట్రకూటులు విజృంభించి కడపలో పులివెందుల, జమ్ములమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలను ఆక్రమించారు. వైదుంబులు, రాష్ట్రకూటులు అధికారంలోకి వచ్చాక వారికి సామంతులయ్యారు. పదవశతాబ్దం చివరికాలంలో వైదుంబులు ప్రబలులై ఉత్తరాన కమలాపురం తాలూకాలో కొంతభాగాన్ని ఆక్రమించారు.

కాని వైదుంబులు కొద్దికాలంలోనే చోళులకు సామంతులవవలసి వచ్చింది. చోళులకు లోబడి వైదుంబరాజులు పదకొండు, పన్నెండు శతాబ్దాలలో "ఇరుగల్లూరు నాడు" అని పిలవబడిన పులివెందుల తాలూకాను పరిపాలించారు. చోళులకు సామంతులుగ వుంటూ తెలుగుచోడులు జమ్మలమడుగు తాలూకాను, సిద్ధవటం తాలూకాను, బద్వేలు తాలూకాను పరిపాలించారు. ఈ ప్రాంతాన్ని పాలించిన తెలుగు చోళులకు పొత్తపి రాజధాని అవడంవల్ల, వీరికి పొత్తపి చోడులని పేరు వచ్చింది. పొత్తపి రాజంపేటకు 15 మైళ్ళ దూరంలోవుంది. జమ్మలమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలను పాలించిన తెలుగు చోళులకు రేనాటి చోడులని పేరు.

## పేరగండూరు తగాదా

కడపజిల్లాలో పొత్తపి రాజధానిగాగల ప్రాంతం పశ్చిమ పాకనాడులో భాగం. నెల్లూరును పాలించిన తెలుగుచోడరాజుల రాజ్యం, కొంతకాలం పొత్తపినాడులోకి కూడ విస్తరించినట్లుగ కనబడుతున్నది. నెల్లూరును 13 వ శతాబ్దంలో పరిపాలించిన మనుమసిద్ధిరాజు కాలంలో, కడప జిల్లా పేరగండూరు గ్రామంలో కౌలుదార్లకు భూస్వాములకు తగాదా వచ్చింది.

పొత్తపినాడులో పేరగండూరు అనే గ్రామాన్ని త్రిలోచనపల్లవుడు బ్రాహ్మణులకు అగ్రహారంగా యిచ్చాడు. సకిలి కోడూరు అనే గ్రామంలో కలహాలు తీవ్రమవడంవల్ల కొంతమంది గ్రామస్థులు పేరగండూరుకు వలస వచ్చారు. ఇనంబ్రోలు అనే మరో గ్రామంలో ప్లేగు రావడంవల్ల, ఆ గ్రామవాసులు కూడా పేరగండూరుకు వలసవచ్చారు. ఇనంబ్రోలు గ్రామస్థులు, తాము సాగుచేసే పొలంలో పండిన పంటనంతను కట్టుబడిగా చెల్లించే పద్ధతిమీద అగ్రహారీకుల భూములను కౌలుకు తీసుకన్నారు. కొంత కాలమైన తరువాత కరువు రాగా, భూస్వాములైన అగ్రహారీకులు పేరగండూరు గ్రామాన్ని విడిచిపెట్టిపోయారు. కరువు నివారణ అయిన తరువాత, బ్రాహ్మణులు తిరిగివచ్చి తమకు యివ్వవలసిన కట్టుబడిని యివ్వవలసిందిగ కోరారు. ఇనంబ్రోలు వాసులందుకు నిరాకరించారు. పేరగండూరు గ్రామం పేరు కోడూరుగ మార్చివేశారు. అగ్రహారీకులు మనుమసిద్ధిరాజు సహాయాన్ని అభ్యర్థించారు. భూములు అగ్రహారీకులవేనని రాజు తీర్పుయిచ్చాడని నందలూరు శాసనంవల్ల తెలుస్తున్నది.

పేరగండూరు గ్రామం రాజంపేటకు యీశాన్యమూలగా 12 మైళ్ళ దూరంలో వున్న పెంగలూరుగా గుర్తించబడింది. ఈ గ్రామంలోని భూములు ఇటీవలివరకు బ్రాహ్మణ శ్రోత్రియందార్ల క్రిందనే వుండేవి. పెనగలూరు దగ్గరనేవున్న ఇందలూరు గ్రామం ఇనంబ్రోలు గ్రామంగా భావించబడుతున్నది.

## కాకతీయ రాజ్యం

13 వ శతాబ్దంలో పాండ్యరాజులు తన రాజ్యంపై దండెత్తిరాగా, రాజ్యరక్షణకు మనుమసిద్ధి, కాకతీయ గణపతిదేవుని సహాయం కోరాడు. కాకతీయ గణపతిదేవుడు పాండ్యరాజులను పారద్రోలి, మనుమసిద్ధికి కొంత రాజ్యమిచ్చి కొంత తన రాజ్యంలో కలుపుకన్నాడు. గణపతిదేవునుండి కాకతీయ సింహాసనాన్ని బలత్కారంగా ఆక్రమించుకున్న అంబదేవుడు, క్రీ. శ. 1268 నుండి కడప జిలాలో

హిందువులను ఆకర్షించేందుకుగాను నేక్నామ్‌ఖాన్, నేక్నామాబాద్‌లో ముస్లిం మసీదు సమీపంలోనే ఆంజనేయ స్వామి దేవాలయాన్ని నిర్మించేందుకు అంగీకరించాడు. హిందూ ముస్లింల పట్ల సమాన వైఖరి అవలంబించాడు. దీనితో పాత కడప గ్రామాన్నుండి ప్రజలు వచ్చి నేక్నామాబాద్‌లో స్థిరపడసాగారు. నేక్నామాబాద్‌లో స్థిరపడ్డ వారెక్కువ మంది పాతకడపనుంచి వచ్చిన వారవడం వల్ల నేక్నామాబాద్‌ను కడపఅనే పేరుతో పిలిచారు. కొంతకాలం తర్వాత కడప అనేపేరే ఎక్కువ ప్రచారంలోకివచ్చి, నేక్నామాబాద్ పేరు అడుగున పడిపోయింది. పూర్వంనుండీ కడప అనిపిలువ బడుతున్న గ్రామం పాతకడప అయింది. కడప,తిరుపతివరకు వ్యాపించిన ఒంటిమిట్ట కొండ ముందు నిర్మించబడ్డ గ్రామం అవడంవల్ల ఒంటిమిట్టకు గడపమాదిరిగా వుంటుంది. గడపఅనేపదంనుండే కడపఅనే పేరువచ్చిందని చెబుతారు. కృప అనే పదంనుండి కడప వచ్చిందని ఇంకోవాదన వుంది. 18వ శతాబ్దంవరకు శాసనాలలో కడప పేరు "కృప" అని పేర్కొనబడింది.

## గండికోట, కడప నవాబులు

1687 లో గోల్కొండ రాజ్యాన్ని ఔరంగజేబు జయించేవరకు కడప గోల్కొండ నవాబుల పాలనక్రిందనే వుంది. గండికోట నవాబులు, కడప నవాబులు గోల్కొండ రాజ్య ప్రతినిధులుగా కడపజిల్లాను పరిపాలించారు. గండికోటలో మీర్‌జుమ్లా అనే అతను మొదటి నవాబుగా నియమించబడ్డాడు. మీర్‌జుమ్లా గండికోటలోని కోటను మరమ్మత్తు చేయించాడు. మీర్‌జుమ్లా నిర్మించిన రాచగాది యిప్పుడు ట్రావెలర్స్ బంగళాగా ఉపయోగపడుతున్నది. అబ్దుల్ నబీఖాన్ అనే అతను మొదటి కడప నవాబుగా నియమించబడ్డాడు. 1714 లో కడపను పరిపాలించిన నవాబు కూడా అబ్దుల్ నబీఖాన్. ఇతనిని రెండవ నబీఖాన్ అంటారు. ఇతడు గండికోటలోను, గుర్రంకొండలోను సైనిక కేంద్రాలు స్థాపించి కొంతసైన్యాన్ని వుంచాడు.

ఈ నవాబులు ఎవ్వరూ పాలెగాళ్లను అణచి శాంతిని స్థాపించలేకపోయారు. ఈ పాలెగాళ్లు విజయనగరప్రభువులకాలంలో కొంతసైన్యాన్ని వుంచుకొని రాజులకు సైనిక సేవచేసేవారు. విజయనగరరాజులకాలపు పాలెగాళ్లలో మట్లవంశపు పాలెగాళ్లు ముఖ్యులు. వీరు 17 వ శతాబ్దంలో సిద్ధవటంలో కోటను నిర్మించారు. విజయనగరరాజ్య పతనానంతరం యీపాలెగాళ్లు తమ సైనికబలంతో యిష్టమొచ్చినట్లు దోచుకుంటూ ప్రజలను నానా అవస్థలు పెట్టేవారు. పాలెగాళ్లు స్వతంత్రులుగా వ్యవహరించుకొంటూ కేంద్రాధికారాన్ని సాగనివ్వలేదు. దేశంలో అరాజకం వ్యాపించింది. బ్రిటిషు పాలన వచ్చేవరకు పాలెగాళ్లను అణచే కేంద్రాధికారం లేకపోయింది.

1740 మేలో మహారాష్ట్రులు కడప కోటపై దండెత్తి వచ్చారు. అబ్దుల్ నబీఖాన్ ఓడిపోయాడు. రక్షణకొరకు భార్యాబిడ్డలను గండికోట కోటకు పంపాడు. అబ్దుల్ నబీఖాన్ తిరిగి మహారాష్ట్రులతో యుద్ధం చేసాడు. కాని తిరిగి ఓడిపోయాడు. లక్షన్నర రూపాయలు యిచ్చి

మహారాష్ట్రులతో సంధి చేసుకున్నాడు. నైజాం నవాబు 1743లో సైన్యసమేతుడై దక్షిణ ప్రాంతానికి వచ్చాడు. మహారాష్ట్రులకు పెనుగొండ యిచ్చి వారివద్ద నుండి తిరుచునాపల్లి పుచ్చుకునే పద్ధతి మీద మహారాష్ట్రులతో నైజాం నవాబు 1743లో సంధి చేసుకున్నాడు. కాని నైజాం నవాబు యింటికి తిరిగి వెళ్ళేసరికి మహారాష్ట్రులు మళ్ళై పునుండి దండెత్తి వచ్చారు. కడపజిల్లా మూడు సంవత్సరాలు మహారాష్ట్రులకు, ముస్లిం సైన్యాలకు మధ్య యుద్ధరంగంగా మారింది. 1746 మేలో ఆర్కాటు నవాబు, కర్నూలు కడప నవాబులు కలసి మహారాష్ట్రులను ఓడించారు.

## ముజఫర్ జంగ్ హత్య

1748లో నైజాం నవాబు చనిపోయినప్పుడు నైజాం నవాబు రెండో కొడుకు నాజర్ జంగ్, కూతురు కొడుకైన ముజఫర్ జంగ్ ల మధ్య సింహాసనానికై తగాదా వచ్చింది. ఫ్రెంచివాళ్ళు ముజఫర్ జంగ్ ను బలపర్చారు. నాజర్ జంగ్, కడప, కర్నూలు నవాబుల సాయంతో జింజీమీద దండయాత్రచేసి కోటనుఆక్రమించాడు. ముజఫర్ జంగ్ నుబలపరచిన ఫ్రెంచివాళ్ళు జింజీ కోటను ఆక్రమించుకున్నారు. నాజర్ జంగ్ నుచంపడానికి కుట్రపన్నిన ఫ్రెంచివారు అకస్మికంగా ముజఫర్ జంగ్ కు సహాయంయివ్వడం మానుకున్నారు. ముజఫర్ జంగ్ పోరాడి లాభంలేదని నాజర్ జంగ్ కు లొంగిపోయాడు. నాజర్ జంగ్ జింజీ కోటను తిరిగి స్వాధీనంచేసుకుందామని వెళ్తూ దోవలో కడపనవాబుకు సలాం చేశాడు. కడప నవాబు తిరిగి సలాం చేయలేదు. కడపనవాబు తనను చూడలేదని చెప్పి తిరిగి సలాంచేయడానికి నాజర్ జంగ్ లేవగానే తుపాకులతో కాల్చి వేయబడ్డాడు. నాజర్ జంగ్ చంపబడ్డది కడపలోనే.

ముజఫర్ జంగ్ ను ఫ్రెంచివాళ్ళు నైజాముగా ప్రకటించారు. ఫ్రెంచివారి సాయంతో పట్టంకట్టుకోడానికి హైద్రాబాదు వెళ్తున్న ముజఫర్ జంగ్ ను రాయచోటి తాలూకా లక్కిరెడ్డిపల్లి కొండల వద్ద కడప, కర్నూలు నవాబులు కలసి చంపేశారు.

కడప నవాబులలో ఆఖరివాడైన అబ్దుల్ ఆలంఖాన్ పాలించుతుండగా, 1757 లో మహారాష్ట్రులు కడపజిల్లాపై తిరిగి దండయాత్రచేసారు. కడప నవాబు ఓడిపోయి గుర్రంకొండ ప్రాంతాన్ని మహారాష్ట్రులకుయిచ్చి వారితో సంధి చేసుకున్నాడు.

## గుర్రంకొండ గవర్నరు

1766 లో హైదరాలీ దండయాత్ర చేసి గుర్రంకొండ ప్రాంతాన్ని మహారాష్ట్రులనుండి స్వాధీనం చేసుకున్నాడు. కాని యీ ప్రాంతం మహారాష్ట్రుల స్వాధీనంకాగా 1774 లో హైదర్ కొడుకు టిప్పుసుల్తాన్ గుర్రంకొండ ప్రాంతాన్ని తిరిగి జయించాడు. గుర్రంకొండకు మీర్ సాహెబ్ ను గవర్నరుగా చేసాడు. కడప నవాబు ఆలంఖాన్ తనకు యివ్వవలసిన సైనికసహాయాన్ని యివ్వడం లేదనిచెప్పి, టిప్పుసుల్తాన్ 1779 లో కడపజిల్లాలో చాలభాగాన్ని ఆక్రమించుకున్నాడు.

కడపనవాబు పారిపోయి సిద్ధవటం కోటలో దాక్కున్నాడు. ఇది తెలుసుకుని టిప్పుసుల్తాన్, సిద్ధవటం కోటపై దాడిచేసి

కడపనవాబును పట్టుకుని శ్రీరంగపట్నానికి ఖైదీగా పంపాడు. కడపనవాబు శ్రీరంగపట్నంలోనే చనిపోయాడు.

టిప్పుసుల్తాన్ కడపలో జయించిన భాగాలకు మీర్ సాహేబ్‌ను గవర్నరుగ నియమించాడు. మీర్ సాహెబ్, అతని కొడుకు కమాలుద్దీన్ ఖాన్ కడపజిల్లాలో అరాచకానికి కారకులైన పాలెగార్లను కొంతవరకు అణచివేసారు. 1792 లో జరిగిన శ్రీరంగపట్నం సంధిననుసరించి ఇంగ్లీషువాళ్ళు కడపజిల్లాను నైజాముకు యిచ్చి, మైసూరు మొదలైన ప్రాంతాలను తాము తీసుకన్నారు.

### రైత్వారీ విధానం

నైజాంనవాబు రక్షణకు ఇంగ్లీషువాళ్ళు సైన్యాన్ని పెంచారు. సైనికఖర్చుల క్రింద ఇంగ్లీషువాళ్ళకు 1800 లో ఇతర రాయలసీమజిల్లాలతోపాటు కడపజిల్లానుకూడ యిచ్చేశాడు. అందువల్ల రాయలసీమ జిల్లాలకు దత్తమండలాలని పేరువచ్చింది.

ఇంగ్లీషువాళ్ళు దత్తమండలాలను ఒకే జిల్లాగాచేసి వాటిపరిపాలనకు సర్ థామస్ మన్రోను కలెక్టరుగ నియమించారు. పాలెగార్లను అణచేందుకు మన్రోకు సైన్య సహాయంకూడ యివ్వబడింది. రైత్వారీ విధానాన్ని మన్రో మొదట రాయలసీమలోనే ప్రవేశపెట్టాడు.

1807 లో దత్తమండలాలను కంథం, బళ్ళారి అనే రెండు జిల్లాలుగ విభజించారు. కడప, కంథంజిల్లాలో చేర్చబడ్డది. మరుసటి సంవత్సరంలో కడప, బళ్ళారిజిల్లాలో చేర్చబడింది. బళ్ళారి జిల్లాకు కడపజిల్లాలోని సిద్ధవటం కార్యస్థానంగా చేయబడింది. మదనపల్లె సబ్ డివిజన్‌లో రాయచోటి, కదిరి, మదనపల్లె, వాయల్పాడు తాలూకాలు; జమ్మలమడుగు సబ్‌డివిజన్‌లో జమ్మలమడుగు, ప్రొద్దుటూరు తాలూకాలు చేర్చబడ్డవి. పుల్లంపేట, బద్వేలు, సిద్ధవటం తాలూకాలు సిద్ధవటం సబ్‌డివిజన్‌లో చేర్చబడ్డవి. కడపతాలూకా, జిల్లా అధికారి క్రిందనే వుండేది.

1888 లో పుల్లంపేట తాలూకా ఆఫీసును, పుల్లంపేట నుండి రాజంపేటకు మార్చారు. పుల్లంపేట తాలూకా పేరు రాజంపేట తాలూకాగా మార్చారు.

1910 అక్టోబరులో కదిరితాలూకా అనంతపురంజిల్లాలో చేర్చారు. 1911 లో మదనపల్లె, వాయల్పాడు తాలూకాలను చిత్తూరుజిల్లాలో చేర్చారు.

## భూగోళం

కార్యస్థానం కడప. జనాభా 11,61,731. విస్తీర్ణం 5,929 చ. మైళ్ళు.

కడపజిల్లాకు ఉత్తరమున కర్నూలు జిల్లా, తూర్పున నెల్లూరుజిల్లా, దక్షిణమున చిత్తూరుజిల్లా, పశ్చిమమున అనంతపురం జిల్లా సరిహద్దులుగా వున్నవి. జిల్లా రెండు రెవెన్యూ డివిజనుల క్రింద (రాజంపేట, జమ్మలమడుగు), 9 తాలూకాల క్రింద విభజింపబడింది. తాలూకాలన్నింటిలో రాజంపేట, రాయచోటి తాలూకాలు వైశాల్యంలో చాల పెద్దవి. ఇతర తాలూకాలకన్న దరిదాపు రెట్టింపు వున్నవి.

ఏ యే తాలూకాలు, యే యే రెవెన్యూ డివిజనుగా విభజింపబడింపీ, వాటి విస్తీర్ణం, కార్యస్థానాలు మున్నగు వివరాలు క్రింది పట్టికలో పొందుపరచబడ్డాయి:

సరిహద్దుగాను, రాయచోటి తాలూకాకు ఉత్తర సరిహద్దుగాను 'పాలకొండలు' లేక 'శేషాచలంకొండలు' పోతున్నాయి. ఉత్తరమునవున్న నల్లమల కొండలతో

| రెవెన్యూ డివిజను | రెవెన్యూ డివిజను కార్యస్థానం | రెవెన్యూ డివిజనులోని తాలూకాలు | తాలూకా వైశాల్యం (చ. మైళ్ళు) | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| రాజంపేట | రాజంపేట | రాజంపేట | 1,038 | రాజంపేట |
| | | రాయచోటి | 1,103 | రాయచోటి |
| | | సిద్ధవటం | 608 | సిద్ధవటం |
| | | కడప | 510 | కడప |
| జమ్మలమడుగు | జమ్మలమడుగు | జమ్మలమడుగు | 613 | జమ్మలమడుగు |
| | | బద్వేలు | 757 | బద్వేలు |
| | | ప్రొద్దుటూరు | 430 | ప్రొద్దుటూరు |
| | | పులివెందుల | 569 | పులివెందుల |
| | | కమలాపురం | 303 | కమలాపురం |
| | | జిల్లా వైశాల్యం | 5,929 | |

నైసర్గిక పరిస్థితులనుబట్టి జిల్లాను మూడుభాగములక్రింద విభజించవచ్చు. (1) జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెందుల, కమలాపురం, కడపతాలూకాలు. ఈ భూభాగము నల్లరేగడి నేల. (2) కొండభూమిగానున్న రాయచోటి తాలూకా ప్రదేశం. (3) బద్వేలు, సిద్ధవటం, రాజంపేట తాలూకాల ప్రాంతం. ఈప్రాంతం జిల్లాకు తూర్పుదిశగా చుట్టూ కొండలచేత లోయవలె మూయబడివుంది.

## కొండలు-గుట్టలు

కర్నూలుజిల్లానుంచి వచ్చే వెలిగొండ కొండలు జిల్లాకు తూర్పు సరిహద్దుగా వున్నవి. రాజంపేట తాలూకా పశ్చిమ భాగంనుండి కడప తాలూకాకు దక్షిణ

ఒక గుట్టల వరుస శేషాచలం కొండలను కలుపుచున్నది. బద్వేలు, సిద్ధవటం, రాజంపేట తాలూకాల్లో చిన్న చిన్న గుట్టలు మధ్య మధ్య వున్నవి.

జమ్మలమడుగు తాలూకాలో పశ్చిమ భాగంలో 'గండికోట కొండలు' కన్పిస్తాయి. ఇవికాక రాయచోటి, పులివెందుల, కమలాపురం, జమ్మలమడుగు, తాలూకాల్లో అప్రధానమైన గుట్టలున్నవి.

## నదులు

జిల్లాలోని ప్రధాన నది పెన్న. వర్షపు నీరంతా వివిధ ముఖాలుగా పెన్నలోకి చేరుతుంది. చిత్రావతి, పాపాఘ్ని, కుందు, చెయ్యేరు మున్నగు చిన్న నదులన్నీ పెన్నలో కలుస్తాయి.

మైసూరు సంస్థానంలో పుట్టిన పెన్నా నది అనంతపురం జిల్లాగుండా ప్రవహించి, జమ్మలమడుగు తాలూకాలో ప్రవేశిస్తున్నది. అనంతపురం జిల్లాలోని ధర్మవరం తాలూకానుండి ప్రవహించివచ్చే చిత్రావతీనది జమ్మలమడుగు తాలూకాలో పెన్నలో కలుస్తోంది. పెన్నానది జమ్మలమడుగు పట్టణానికి పశ్చిమ దిశనుండి తూర్పుదిశగా ప్రవహిస్తూ, అచ్చటనుండి ఆగ్నేయదిశగా తిరిగి ప్రొద్దుటూరు - కమలాపురం తాలూకాల సరిహద్దుగా ప్రవహిస్తున్నది. తర్వాత కడప, సిద్ధవటం తాలూకాల గుండా పారి నెల్లూరుజిల్లాలో ప్రవేశిస్తున్నది.

పాపాఘ్ని నదికూడ మైసూరు సంస్థానంలోనే పుట్టి అనంతపురం, చిత్తూరు జిల్లాలకు సరిహద్దుగా ప్రవహించి, రాయచోటి తాలూకాలో ప్రవేశిస్తున్నది. తర్వాత కమలాపురం, కడప తాలూకాల సరిహద్దుగా ప్రవహించి కమలాపురం పట్టణానికి 2 మైళ్ళ దూరంలో పెన్నలో కలియుచున్నది. కమలాపురం, పులివెందుల తాలూకాల్లో ప్రవహించే "మొగమురేరు", "పాపాఘ్ని"కి ప్రధానమైన ఉపనది. చిత్తూరుజిల్లాలో పుట్టే 'చెయ్యేరు' రాయచోటి తాలూకాలో ప్రవేశించి 'బాహుదా నది' యని పిలువబడుతున్నది. ఉత్తరదిశగా శేషాచలం కొండలగుండా ప్రవహించి సిద్ధవటం తాలూకాలో పెన్నలో కలియుచున్నది. 'బాహుదా' నదికి 'పింఛనది', 'మాండవ్యనది' (రాయచోటి తాలూకా), 'పుల్లంగి', 'గుంజన' (రాజంపేట తాలూకా) మున్నగునవి ఉపనదులు లేక ప్రవాహాలు. కర్నూలు జిల్లా నుంచి ప్రవహిస్తున్న కుందునది ప్రొద్దుటూరు తాలూకాగుండా ప్రవహించి పాపాఘ్ని పెన్నానదిని కలిసే ప్రదేశానికి దగ్గరలోనే పెన్నలో కలుస్తున్నది.

నల్లమల కొండలలో పుట్టిన 'సగిలేరు' దక్షిణముగ బద్వేలు, సిద్ధవటంతాలూకాల గుండా ప్రవహించి, 'చెయ్యేరునది' పెన్నలోకలిసే ప్రదేశానికి కొద్దిగా ఎగువన పెన్నలో కలియుచున్నది.

పెన్నలో కలిసే యీ నదులన్నీ బహు నీరసమైనవి. వర్షపు దినాలలో మాత్రం చుట్టుపట్ల ప్రాంతంలోని వర్షపు నీటిని తీసుకొనివచ్చి పెన్నలో కలుపుతాయి. ఇతర సమయాలలో చిన్నప్రవాహాలుగా మాత్రమే మిగిలివుంటాయి.

## అడవులు

జిల్లాలో 1,838.80 చ. మై॥ అడవుల క్రింద వున్నది. ఇందులో 1,798.94 చ. మై॥ రిజర్వు ఫారెస్టులుగాను, 39.86 చ. మై॥ ప్రయివేటు అడవులుగాను వున్నవి. ఈ రిజర్వు అడవులు ప్రధానంగా వంట చెరకుకు, కొద్దిగా కలపకు పనికి వస్తాయి.

తాలూకావారీ వివిధ రకముల అడవుల విస్తీర్ణత ప్రక్కపేజీలోని పట్టికలో పొందుపరచబడింది.

## శీతోష్ణస్థితి - వర్షపాతం

సంవత్సరంలో మార్చి నుండి మే వరకు జిల్లాలో వుష్ణోగ్రత హెచ్చుగావుంటుంది. ఈ మాసాల్లో 106° నుండి 110° వరకు కూడ వుష్ణోగ్రత వుంటుంది. జిల్లా సముద్ర తీరానికి చాలా దూరంలో వుండుటచే నైఋతిఋతుపవనములవల్లగాని, ఈశాన్య ఋతుపవనములవల్లగాని తగినంత వర్షాన్ని

| తాలూకా | రిజర్వ్ అడవులు (చ. మై.) | ప్రయివేటు అడవులు (చ. మై) | మొత్తం అడవుల వైశాల్యం (చ. మై.) |
|---|---|---|---|
| జమ్మలమడుగు | 74.42 | 5.06 | 79.48 |
| ప్రొద్దుటూరు | 137.76 | ... | 137.76 |
| బద్వేలు | 346.12 | 12.70 | 358.82 |
| పులివెందుల | 44.85 | ... | 44.85 |
| కమలాపురం | 0.56 | ... | 0.56 |
| కడప | 137.80 | 2.76 | 140.56 |
| సిద్ధవటం | 308.13 | 4.05 | 312.18 |
| రాజంపేట | 426.00 | 10.79 | 436.79 |
| రాయచోటి | 323.30 | 4.50 | 327.80 |
| జిల్లా మొత్తం | 1,798.94 | 39.86 | 1,838.80 |

పొందటంలేదు. జిల్లాలో పడే వర్షంలో ఈశాన్య ఋతుపవనాలకన్నా నైరుతి ఋతుపవనాలే అధికభాగాన్ని యిస్తున్నాయి. రాయచోటి తాలూకా, మైదానాలకన్న 1000 నుండి 1500 అడుగులవరకు యెత్తున వుండుటచేత, యితర ప్రదేశాలకన్న యిచ్చట 5 డిగ్రీలవరకు వేడి తక్కువ వుంటుంది.

ఈ ప్రక్కపేజీలోని పట్టికలో తాలూకాలవారీ సగటు సంవత్సర వర్షపాతం, సంవత్సర వర్షపు దినాలు యివ్వబడ్డాయి.

## సాగు సౌకర్యాలు

జిల్లాలో సాగుకు తోడ్పడే ప్రధానమైన నీటివనరు కర్నూలు-కడప కాలువ. 'సుంకేసుల' వద్ద తుంగభద్రపై కట్టబడిన ఆనకట్టద్వారా దీనికి నీరు లభిస్తోంది. ఈ కాలువ మొత్తం పొడుగు 190 మైళ్ళు. జమ్మలమడుగు తాలూకాలో (కడప జిల్లాలో) కర్నూలు - కడప కాలువ 137 వ మైలు నుంచి ప్రవేశిస్తుంది. ప్రొద్దుటూరు, కడప తాలూకాలగుండా ప్రవహించి పాత కడప చెరువులో ఈ కాలువ అంతమౌతుంది. పెన్నపై కట్టిన అక్విడెక్ట్ ద్వారా, కర్నూలు-కడప కాలువ నీరు దిగువ ప్రాంతాలకు తీసుకెళ్ళబడుతున్నది.

నదీ ప్రవాహాలకు అడ్డుకట్టలు వేయుట ద్వారా, వర్షాలపై ఆధారపడ్డ చెరువులసహాయంతోనూ, బావులక్రింద కూడా అచ్చటచ్చట సాగుచేయబడుతోంది.

## జమ్మలమడుగు తాలూకా

ఈ తాలూకాలో 27 వూట కాలువలు, 4 నదులనుండి నీరు తీసుకొనే

| తాలూకా | సగటు సంవత్సర వర్షపాతం (అంగుళములు) | సంవత్సర సగటు వర్షపు దినాలు |
|---|---|---|
| జమ్మలమడుగు | 20.50 | 37.0 |
| ప్రొద్దుటూరు | 24.76 | 39.4 |
| బద్వేలు | 25.41 | 41.1 |
| పులివెందుల | 23.30 | 36.2 |
| కమలాపురం | 24.79 | 38.6 |
| కడప | 31.37 | 46.5 |
| సిద్ధవటం | 32.47 | 47.2 |
| రాజంపేట | 32.43 | 44.1 |
| రాయచోటి | 25.64 | 41.6 |

కాలువలు వున్నవి. ఇవి పెన్నా, చిత్రావతి నదులనుంచి నీరుతీసుకుంటాయి. ఇతర సాగునీటి ఉపాయాలన్నీ వర్షాధారాలే.

## ప్రొద్దుటూరు తాలూకా

తాలూకాలోని ప్రధాన సాగువసతి కర్నూలు - కడప కాలువ. ఇచ్చట 13 వేల ఎకరాలవరకు మైనర్ యిరిగేషన్ వసతులవల్ల సాగవుతుంది. ఇతర త్రా 13 చెరువులున్నాయి. ఇవి నీటికోసం కాలువలమీద, వర్షాలమీద ఆధారపడుతున్నాయి. వీటివల్లకూడా కొంత సాగు జరుగుతోంది.

## బద్వేలు తాలూకా

సగిలేరు నదినుండి 9 మై. పొడవుగల కాలువద్వారా 9 చెరువులకు నీరు సప్లయిచేయబడుతోంది. వీటిలో ముఖ్యమైనది పోరుమామిళ్ళ చెరువు. ఇది కాక 6 చిన్న ప్రవాహాలనుండి నీరు తీసుకొను కాలువలు, వర్షంపై ఆధారపడే అనేక చెరువులు కలవు. వీటన్నింటిలోకీ పెద్దది బద్వేలు చెరువు. ఇది జిల్లాలోనున్న చెరువులన్నింటిలోకీ పెద్దది. మంచి వర్షాలవల్ల చెరువు పూర్తిగానిండితే దానిక్రింద 5 వేల యకరాల్లో 2 పంటలు పండుతాయి. కాని పూడికతీయక ప్రస్తుతం చాల తక్కువనీరు నిలవ వుంటోంది.

## పులివెందుల తాలూకా

తాలూకాలో 72 మైనర్ యిరిగేషన్ వసతులున్నాయి. ఇందులో 46 ప్రవాహాలనుండి నీరు తీసుకునే కాలువలు. 7 నదులనుండి నీటిని సాగుకు తీసుకు వచ్చేవి. మిగిలినవి వర్షాలపై ఆధారపడే చెరువులు. వర్షాలు సరిగా పడని సంవత్సరాల్లో కరువు యీ ప్రాంతంలో ప్రత్యక్షమౌతూ వుంటుంది.

### కమలాపురం తాలూకా

కర్నూలు - కడప కాలువ క్రింద కొద్దిభాగం మాత్రమే సాగవుతోంది. తాలూకాలో చిన్న ప్రవాహాలనుండి నీరు తీసుకుని సాగుచేసే కాలువలు 21, నదుల నుంచి నీరు తీసుకునే కాలువలు 7, వర్షాలపై ఆధారపడే చెరువులు 14 వున్నాయి. సాగువసతుల విషయంలో గంగిరెడ్డిపల్లి ఫిర్కా, తాలూకాలోని యితర ప్రదేశాల కన్న చాల వెనుకబడివుంది.

### కడప తాలూకా

కర్నూలు - కడపకాలువ అంతం యీ తాలూకాలోనే. కనుక దీని క్రింద సాగయే భూములకు సరిగా నీరు అందక పోవటం తరుచు జరుగుతూ వుంటుంది. తాలూకాలో చిన్న ప్రవాహాలనుండి నీరుతీసుకునే కాలువలు 12, నదుల నుండి నీరు తీసుకనేవి 25, వర్షాలపై ఆధారపడే చెరువులు 30 వున్నవి.

### సిద్ధవటం తాలూకా

95 వర్షాలపై ఆధారపడే చెరువులు, చిన్నప్రవాహాలనుండిగాని నదులనుండిగాని నీరుతీసుకునే కాలువలు 7 యీ తాలూకాలో వున్నాయి. ఇచ్చట అక్కడక్కడ మంచి ఊటగల బావులుకూడ పడతాయి. వీటిక్రింద వ్యాపారపంటలు పండిస్తారు. సాగువసతుల దృష్ట్యా వంటిమిట్టఫిర్కా తాలూకాలోని యితర ప్రదేశాలకన్న వెనకబడివుంది.

### రాజంపేట తాలూకా

తాలూకాలోని నీటివసతులన్నీ ప్రధానంగా వర్షాలపై ఆధారపడే వుంటాయి. 47 చెరువులు, 33 నదుల నుండి నీరు తీసుకునే కాలువలు, 20 చిన్న ప్రవాహాల నుండి నీరుతీసుకునే కాలువలు వున్నాయి. వర్షాలు లేని సంవత్సరం తప్పక కరువు ప్రత్యక్షం.

### రాయచోటి తాలూకా

తాలూకాలో లెక్కకు 1,058 మైనర్ యిరిగేషన్ వసతులున్నా, యివన్నీ వర్షాలపై ఆధారపడ్డవే. వర్షాలు పడని సంవత్సరంలో తాలూకాలోని నదులకు, ప్రవాహాలకు నీరు వుండదు. కనుక కరువు ప్రత్యక్షంఅవుతుంది. తాలూకామొత్తంలో, 145 ప్రవాహాల నుంచి నీరు తీసుకునే కాలువలు, 178 ఏరు, వ్రసనదుల నుంచి నీరు తీసుకునే కాలువలు వున్నాయి. మిగిలినవి వర్షాధారపు చెరువులు.

తాలూకాలోని మైనర్ యిరిగేషన్ వసతులు, వాటిపై యెంతెంత భూమి ఆధారపడి వున్నదీ, మేజర్ యిరిగేషన్ సాగు మున్నగు వివరాలు ప్రక్కనేటి పట్టికలో యివ్వబడ్డాయి.

### ఆహారపంటలు - వ్యాపారపంటలు

జిల్లాలోని ప్రధానమైనఆహారపంటలు జొన్న, వరి, కొర్ర మొదలైనవి. సుమారు 2 లక్షల 60 వేల యకరాలలో జొన్న పండింపబడుతున్నది. మేజర్, మైనర్ యిరిగేషన్ వసతులక్రింద వర్షాలున్న సంవత్సరంలో 1 లక్షా 36 వేల యకరాలలో వరి పండింపబడుతున్నది.

వ్యాపార పంటలలో ప్రధానమైనది వేరుశనగ. ఇది 2 లక్షల 36 వేల యకరాల్లో పండింపబడుతున్నది. 43 వేల యకరాలవరకు ఉలవల సేద్యంలో వుంది. ప్రత్తిపంటక్రింద 42 వేల యకరాలు వున్నాయి.

| తాలూకా | మైనరు ఇరిగేషను వసతుల సంఖ్య | మైనరు ఇరిగేషను వసతుల క్రింద సాగయ్యే భూమి (ఎకరములు) | మేజరు ఇరిగేషన్ వసతుల క్రింద సాగయ్యే భూమి (ఎకరములు) |
|---|---|---|---|
| జమ్మలమడుగు | 58 | 3,540.20 | 3,172.65 |
| ప్రొద్దుటూరు | 14 | 1,174.23 | 13,365.29 |
| బద్వేలు | 108 | 6,515.66 | 8,707.85 |
| పులివెందుల | 72 | 2,603.02 | ... |
| కమలాపురం | 41 | 2,799.15 | 2,440.96 |
| కడప | 63 | 4,079.51 | 28,342.00 |
| సిద్ధవటం | 98 | 4,684.00 | 2,831.25 |
| రాజంపేట | 100 | 6,603.42 | 9,587.00 |
| రాయచోటి | 1,058 | 8,609.26 | 761.48 |
| జిల్లా మొత్తం | 2,323 | 40,608.45 | 69,208.48 |

సక్రమంగా వర్షాలున్న సంవత్సరంలో, తాలూకాలవారీగా పంట భూములలో యే యే పంటలు, యెన్నెన్ని ఎకరాలలో పండింపబడేవీ ప్రక్కపేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి. ఈఅంచనాలు 1949-'50 సంవత్సరానికి సంబంధించినవి.

### రహదారులు

జిల్లా మొత్తంలో 1,022 మైళ్ళపొడవు గల రోడ్లు వున్నాయి. ఇందులో 159 మైళ్ళు రాష్ట్రీయ రహదార్లక్రింద; 565 మైళ్ళు ప్రధాన జిల్లాబోర్డు రోడ్లక్రింద, 207 మైళ్ళు యితర జిల్లాబోర్డు రోడ్లక్రింద, 50 మైళ్ళు గ్రామరోడ్లక్రింద, 41 మైళ్ళు మునిసిపల్ రోడ్లక్రింద విభజించబడి వున్నాయి.

తాలూకావారీ వివిధ తరగతుల రోడ్లు యెంతెంత నిడివివున్నదీ (మునిసిపల్ రోడ్లు మినహాయించి) ప్రక్క పేజీలోని పట్టిక తెలుపుతుంది.

| పంట | | జమ్ములమడుగు (ఎకరాలు) | ప్రొద్దుటూరు (ఎకరాలు) | బద్వేలు (ఎకరాలు) | పులివెందుల (ఎకరాలు) | కమలాపురం (ఎకరాలు) | కడప (ఎకరాలు) | సిద్ధవటం (ఎకరాలు) | రాజంపేట (ఎకరాలు) | రాయచోటి (ఎకరాలు) | జిల్లా మొత్తం (ఎకరాలు) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 7,700 | 20,000 | 20,400 | 1,800 | 6,800 | 22,100 | 7,400 | 30,800 | 19,200 | 1,36,200 |
| | మెట్ట | 700 | 300 | ... | 100 | 100 | 200 | ... | 300 | ... | 1,700 |
| జొన్న | | 56,400 | 41,900 | 13,000 | 58,000 | 34,700 | 25,200 | 7,200 | 7,200 | 4,900 | 2,58,500 |
| సజ్జ | | 300 | 1,100 | 5,100 | 1,500 | 200 | 2,400 | 9,500 | 17,500 | 60,200 | 97,800 |
| రాగి | | 3,000 | 6,000 | 11,200 | 2,100 | 2,000 | 6,100 | 6,900 | 9,100 | 4,200 | 50,600 |
| కొర్ర | | 18,600 | 9,500 | 13,500 | 38,500 | 12,600 | 6,000 | 800 | 2,300 | 2,600 | 1,04,400 |
| వరిగ | | 10,500 | 9,800 | 7,700 | 2,600 | 3,300 | 200 | 1,000 | 4,300 | 1,500 | 40,900 |
| సామలు | | 200 | 2,200 | 800 | ... | ... | ... | ... | 200 | ... | 3,400 |
| పచ్చపెసలు | | 2,800 | 900 | ... | 200 | 600 | 100 | ... | 100 | ... | 4,700 |
| కందులు | | 1,800 | 1,100 | 400 | 2,000 | 900 | 100 | 100 | ... | 2,000 | 9,000 |
| మినుములు | | ... | ... | ... | ... | ... | 100 | ... | 100 | ... | 200 |
| శనగలు | | 2,300 | 300 | 300 | 2,600 | 300 | 200 | ... | ... | ... | 6,000 |
| ఉలవలు | | 2,800 | 4,000 | 12,300 | 4,300 | 2,300 | 4,200 | 2,800 | 2,900 | 7,500 | 43,000 |
| మిర్చి | | 1,000 | 40 | 600 | 1,600 | 500 | 100 | 100 | 200 | 1,000 | 5,500 |
| చెరకు | | ... | 100 | ... | ... | 100 | ... | ... | ... | 100 | 300 |
| వేరుశనగ | | 23,500 | 30,500 | 1,600 | 53,000 | 37,900 | 18,900 | 1,000 | 1,200 | 69,300 | 2,36,900 |
| నువ్వులు | | 200 | 100 | 100 | 200 | ... | 400 | 500 | 1,800 | 100 | 3,400 |
| ప్రత్తి | | 25,900 | 4,600 | 900 | 8,200 | 2,300 | 200 | ... | ... | 100 | 42,000 |
| పొగాకు | | 200 | ... | ... | ... | ... | ... | ... | 900 | 300 | 1,400 |

| తాలూకా | జాతీయ రహదారులు (మైళ్ళు) | రాష్ట్ర రహదారులు (మైళ్ళు) | ప్రధాన జిల్లా రోడ్లు (మైళ్ళు) | ఇతర జిల్లా రోడ్లు (మైళ్ళు) | గ్రామ రోడ్లు (మైళ్ళు) | మొత్తం (మైళ్ళు) |
|---|---|---|---|---|---|---|
| జమ్మలమడుగు | ... | 16 | 53 | ... | 8 | 77 |
| ప్రొద్దుటూరు | ... | 49 | 48 | 5 | 5 | 107 |
| బద్వేలు | ... | 32 | 78 | ... | 4 | 114 |
| పులివెందుల | ... | ... | 104 | 17 | 1 | 122 |
| కమలాపురం | ... | ... | ... | 21 | 5 | 26 |
| కడప | ... | 29 | 61 | 42 | 10 | 142 |
| సిద్ధవటం | ... | ... | 31 | 54 | 3 | 88 |
| రాజంపేట | ... | ... | 86 | 25 | 7 | 118 |
| రాయచోటి | ... | 33 | 104 | 43 | 7 | 187 |
| మొత్తం | ... | 159 | 565 | 207 | 50 | 981 |

## రైల్వే

జిల్లా అంతటా 121¼ మైళ్ళ పొడవుగల బ్రాడ్ గేజి రైలుమార్గం పోవుచున్నది. దక్షిణ రైల్వేయొక్క మద్రాసు-బొంబాయి మార్గంలోని యిది భాగమే. రాజంపేట, సిద్ధవటం, కడప, కమలాపురం, జమ్మలమడుగు తాలూకాలగుండా యీ రైలు మార్గం పోవుచున్నది. ప్రొద్దుటూరు, బద్వేలు, పులివెందుల, రాయచోటి తాలూకాలకు రైలుమార్గం లేదు.

రాజంపేట, కడప, కమలాపురం తాలూకాల కార్యస్థానాలకు, జిల్లా కేంద్రమైన కడపకు మాత్రమే రైలుమార్గము కలదు.

## జనాభా

జిల్లా జనాభా 11,61,731. గత పది సంవత్సరాల్లోనూ నూటికి 10 చొప్పున వృద్ధిచెందింది. తాలూకావారీ జనాభా వివరాలు ఈ ప్రక్కపేజీలోని పట్టికలో ఇవ్వబడ్డాయి.

| తాలూకా | 1941 సం॥ జనాభా | 1951 సం॥ జనాభా | 1941 సం॥ జనాభా పెరుగుదల శాతం | తాలూకా విస్తీర్ణం చ. మైళ్ళు | తాలూకాలోని పట్టణాలు | తాలూకాలోని గ్రామాలు |
|---|---|---|---|---|---|---|
| జమ్మలమడుగు | 1,15,572 | 1,22,277 | 5.8 | 613 | 1 | 124 |
| ప్రొద్దుటూరు | 1,22,814 | 1,45,154 | 18.2 | 430 | 1 | 77 |
| బద్వేలు | 1,03,273 | 1,08,711 | 5.3 | 757 | 1 | 140 |
| పులివెందుల | 1,03,487 | 1,10,794 | 7.1 | 569 | 1 | 92 |
| కమలాపురం | 72,372 | 75,588 | 4.4 | 303 | 1 | 64 |
| కడప | 1,24,820 | 1,47,389 | 18.1 | 510 | 1 | 108 |
| సిద్ధవటం | 69,412 | 75,704 | 9.1 | 606 | ... | 80 |
| రాజంపేట | 1,75,606 | 1,85,942 | 5.9 | 1,038 | 2 | 126 |
| రాయచోటి | 1,69,151 | 1,90,172 | 12.4 | 1,103 | 1 | 118 |
| మొత్తం | 10,5 ,507 | 11,61,731 | 10.0 | 5,929 | 9 | 929 |

తాలూకావారీ జనాభా పెరుగుదలను గమనిస్తే ప్రొద్దుటూరు, కడప తాలూకాలను మినహాయించి మరెచ్చటా అంత అభివృద్ధి కనిపించదు. ప్రొద్దుటూరు, కడపతాలూకాల జనాభా పెరుగుదలకు ప్రధాన కారణం, యీ రెండు పట్టణాలకు క్రమంగా పెరుగుతున్న ప్రాముఖ్యం అనేక మంది ఆకర్షింపబడటమే. గత 10 సంవత్సరాలలో ప్రొద్దుటూరు పట్టణ జనాభా 35.8 శాతము, కడప పట్టణ జనాభా 32.5 శాతము పెరిగింది. జిల్లాలో తరచుగా పొడచూపే కరువు కాటకాల మూలంగా అనేకమంది జీవనోపాధికై తుంగభద్ర ప్రాజెక్టు పనులకు బళ్ళారికి వలసపోవటం కూడ జరిగింది.

జిల్లా జనాభా, మొత్తం 2,10,986 యిళ్ళలో నివసిస్తున్నారు. ఇందులో 1,89,565 ఇళ్ళు గ్రామాల్లోనూ, 21,421 ఇళ్ళు పట్టణాల్లోనూ వున్నవి. జిల్లాలో సగటున ప్రతి యింటిలోను 5 గురు నివసిస్తున్నారు.

జిల్లా మొత్తం జనాభా అయిన 11,61,731 మందిలో 10,27,502 మంది గ్రామాల్లో నివసిస్తున్నారు. 1,34,229 మంది పట్టణాల్లో నివసిస్తున్నారు. మొత్తంజిల్లాలో, పట్టణాల్లో నివసించే జనాభాలో సగం మంది ప్రొద్దుటూరు, కడపపట్టణాల్లోనే వున్నారు. జిల్లాలో నివసించే జనాభాలో ప్రతి 8 మందిలో సగటున ఒకరు మాత్రమే పట్టణాల్లో నివసిస్తున్నారు.

తాలూకావారీ ఇండ్లసంఖ్య, జనాభా సంఖ్య, గ్రామపట్టణాల్లోవున్న యిండ్లు, జనాభా మున్నగు వివరాలు ప్రక్కపేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి.

| తాలూకా | తాలూకాలోని మొత్తం ఇండ్లు | గ్రామాలలోని ఇండ్లు | పట్టణాలలోని ఇండ్లు | తాలూకా మొత్తం జనాభా 1951 | గ్రామజనాభా | పట్టణ జనాభా |
|---|---|---|---|---|---|---|
| జమ్మలమడుగు | 22,241 | 20,286 | 1,955 | 1,22,277 | 1,09,753 | 12,524 |
| ప్రొద్దుటూరు | 24,771 | 19,510 | 5,261 | 1,45,154 | 1,08,530 | 36,624 |
| బద్వేలు | 20,594 | 19,319 | 1,275 | 1,08,711 | 1,01,626 | 7,085 |
| పులివెందుల | 20,622 | 19,152 | 1,470 | 1,10,794 | 1,03,196 | 7,598 |
| కమలాపురం | 13,280 | 12,118 | 1,162 | 75,588 | 68,935 | 6,653 |
| కడప | 25,080 | 19,586 | 5,494 | 1,47,389 | 1,09,951 | 37,438 |
| సిద్దవటం | 13,899 | 13,899 | ... | 75,704 | 75,704 | ... |
| రాజంపేట | 35,510 | 32,500 | 3,010 | 1,85,942 | 1,70,290 | 15,652 |
| రాయచోటి | 34,989 | 33,195 | 1,794 | 1,90,172 | 1,79,517 | 10,655 |
| జిల్లామొత్తం | 2,10,986 | 1,89,565 | 21,421 | 11,61,731 | 10,27,502 | 1,34,229 |

## వైద్య సదుపాయాలు

జిల్లాలోని ఆసుపత్రుల సంఖ్య 3. వీటిలో 134 రోగులను నిల్వవుంచి చికిత్స చేయటానికి వీలుకలదు. ఇందులో కడపలోని జిల్లా ఆస్పత్రిలో 101 మందికి చికిత్సకు అట్టిపెట్టే సదుపాయాలున్నాయి. ఇక మిగిలిన 8 తాలూకా కేంద్రాలలో కలిపి 33 మంచాలు మాత్రమే వున్నాయి.

జిల్లా మొత్తంలో మందు యిచ్చి పంపే ఆసుపత్రులు 14 మాత్రమే. రాయచోటి, సిద్దవటం, కమలాపురం, పులివెందుల, బద్వేలు తాలూకాల్లో రోగులను అట్టిపెట్టి చికిత్సచేసే ఆసుపత్రులు లేనేలేవు.

ప్రక్క పేజీలోని పట్టికలో తాలూకా వారీగావున్న వైద్య చికిత్సా సదుపాయాలు యివ్వబడ్డాయి.

| తాలూకా | ఆస్పత్రులు | | | వైద్యశాలలు | | |
|---|---|---|---|---|---|---|
| | గవర్నమెంటు | లోకలు ఫండు | మంచాల సంఖ్య | గవర్నమెంటు | లోకలు ఫండు | గ్రామీణ వైద్యశాలలు |
| జమ్ములమడుగు | ... | ... | 2 | ... | 1 | ... |
| ప్రొద్దుటూరు | 1 | ... | 17 | 1 | ... | ... |
| బద్వేలు | ... | ... | 2 | 1 | 1 | .. |
| పులివెందుల | ... | ... | ... | ... | 2 | ... |
| కమలాపురం | ... | ... | ... | ... | ... | 2 |
| కడప | 1 | ... | 101 | ... | ... | 1 |
| సిద్ధవటం | ... | ... | ... | ... | 1 | ... |
| రాజంపేట | 1 | ... | 12 | ... | ... | 3 |
| రాయచోటి | ... | ... | ... | ... | 1 | ... |
| జిల్లా మొత్తం | 3 | ... | 134 | 3 | 5 | 6 |

## పరిశ్రమలు

జిల్లాలో చెప్పుకోదగ్గ పరిశ్రమలు ఏమీ లేవు. పులివెందుల మున్నగు ప్రాంతాల్లో రాతినార, ముగ్గురాయి మున్నగు ఖనిజములు లభ్యమగుచున్నా పరిశ్రమలు అభివృద్ధి చెందలేదు. ఉన్న పరిశ్రమల్లో జమ్ములమడుగు తాలూకాలో 6 ప్రత్తి [illegible], [illegible]. వీటిలో 105 మంది పనిచేస్తున్నారు. ప్రొద్దుటూరు తాలూకాలో 294 మంది పనిచేస్తున్నారు. 6 ప్రత్తి [illegible] మిల్లులు ఉన్నాయి.

# అనంతపురం జిల్లా

## చరిత్ర

రాయలసీమ రతనాలసీమ. ఇది నేటి కథగాది. నాటి గాథ. పాలకులఅక్రమ, ప్రకృతి తీరకన్న రతనాలసీమను రాళ్ళసీమగా మార్చాయి. వజ్రకరూరు వజ్రాలు; లేపాక్షి, పెనుకొండ కళాపెన్నిధులు; రతనాలసీమ వారి ప్రాభవాన్ని ఆంధ్రప్రజలకు గుర్తు చేస్తున్నాయి. వజ్రకరూరు, లేపాక్షి, పెనుకొండ, అనంతపురం జిల్లాలోని చారిత్రిక ప్రదేశాలు. రాయలసీమ జిల్లాలో అనంతపురం జిల్లాకు ప్రత్యేక చరిత్ర వుంది.

ప్రాచీనకాలపు చరిత్రకు సంబంధించిన చారిత్రకాధారాలు కొన్ని అనంతపురం జిల్లాలో లభించాయి. రాతియుగపు ప్రజలు జీవించిన రాతిగుహలు అనేకం అనంతపురం జిల్లాలో బయటపడ్డాయి. కళ్యాణదుర్గం తాలూకా ముదిగల్లు, బెలదుల బెట్ట గ్రామాలలోను; అనంతపురం తాలూకా మాల్యవంతం; హిందూపురం తాలూకాలోని కొండాపురం, పూలేటిల లోను; గుత్తి తాలూకా వేల్పుమడుగు, గిరవకొండ, వజ్రకరూరు మొదలైన ప్రదేశాలలోను రాతిగుహలు అనేకం బయటపడ్డాయి.

రాతియుగపు పనిముట్లుకూడ దొరికాయి. కొండలను తొలచిన గుహాలలో గుంపులు గుంపులుగా జీవించిన రాతియుగపు మనుషులు కొండపైన కూర్చుని పనిముట్లను అరగదీసి నునుపుచేసేవారు. ఏదైన ప్రదేశంలో కూర్చోవడంవలన వారికి గ్రహములరాకపోకలు తెలుస్తుండేవి.

### అశోకుని శిలా శాసనం

రాతియుగం తరువాత అశోకునికాలం దాకా గల అనంతపురంజిల్లా చరిత్రను తెలుసుకోడానికి తగిన ఆధారాలు లభ్యం కావడంలేదు. క్రీ. పూ. మూడవ శతాబ్దంలో అనంతపురంజిల్లా మౌర్య సామ్రాజ్యంలో చేరిఉన్నట్లు శాసనాలవల్ల తెలుస్తున్నది.

అశోకుని శిలాశాసనం ఒకటి గుత్తికి ఏడుమైళ్ళ దూరంలో వున్న "ఎర్రగుడి" అనే గ్రామంలో దొరికింది. అశోకుని తరువాత, క్రీ. శ. 3వ శతాబ్దంలో పల్లవులు అధికారంలోకి వచ్చేవరకు అనంతపురంజిల్లా చరిత్ర తెలియడం లేదు.

క్రీ. శ. 3వ శతాబ్దంలో తెలుగుదేశాన్ని పాలించిన పల్లవుల అధికారం అనంతపురం జిల్లాలోకికూడ విస్తరించింది.

ప్రత్యక్షమవడంవలన కదిరి అనే పేరు వచ్చిందని ఆ కథ సారాంశం. ఆలయం వెనుక భృగుమహర్షి ఒక కొలను సృష్టించి అందులో స్నానంచేయడంవలన, ఆ కొలనుకు భృగుతీర్థమనే పేరు వచ్చిందని చెబుతారు. కదిరి పురాణ ప్రఖ్యాతి గాంచిన ప్రాచీన క్షేత్రం. ఆంధ్రులకు, కన్నడిగులకు కదిరి పుణ్యక్షేత్రం.

1829 లో శ్రీపట్టై శ్రీనివాసరాయడు అనే ఆయన నృసింహస్వామి ఆలయ మంటపంమీద రామాయణ గాథలను చిత్రించాడు. వీటిలో చాలభాగం యిప్పుడు చెరిగిపోయాయి. ప్రతి సంవత్సరమూ ఫాల్గుణమాసంలో 15 రోజులపాటు కదిరిలో ఉత్సవాలు జరుగుతాయి.

పశ్చిమ చాళుక్యుల రాజ్యాన్ని కూలద్రోసి అధికారంలోకి వచ్చిన సేవణ హొయిసల బళ్ళాలుడు హేమావతిలోని దొడ్డేశ్వర దేవాలయానికి కొన్ని దానాలు చేశాడు. హేమావతిలో ప్రస్తుతం దొడ్డేశ్వరాలయం వున్నది.

## మహమ్మదీయుల దండయాత్ర

అల్లావుద్దీన్ ఖిల్జీ సేనలు దక్షిణంపై దండెత్తి వచ్చినప్పటికీ, విజయనగరరాజ్య స్థాపనవరకు హిందూపురం, మడకశిర తాలూకాలు హొయిసలశాఖకు చెందిన వారి పాలనక్రిందనే వున్నది. ఆంధ్ర ప్రజలు తిరుగుబాటుచేసి ఢిల్లీ సుల్తానుల పరిపాలనను ధిక్కరించారు. విజయనగర రాజ్యం, కొండవీటి రెడ్డిరాజ్యం మొదలైన రాజ్యాలు ఏర్పడ్డాయి. అనంతపురం జిల్లా రెండు శతాబ్దాలపాటు విజయనగరం రాజుల పాలనక్రింద వుంది.

విజయనగర రాజులు గుత్తి, పెనుకొండలలో కోటలు నిర్మించారు. లేపాక్షి, పెనుకొండ దేవాలయాల చిత్రలేఖనం శిల్పం విజయనగరం రాజ్యంలో విలసిల్లిన కళా నైపుణ్యానికి తార్కాణాలు.

## లేపాక్షి చిత్రాలు

లేపాక్షి హిందూపురం తాలూకాలోని గ్రామం. హిందూపురానికి తొమ్మిది మైళ్ళ దూరంలో వుంది. లేపాక్షిలో వీరభద్రేశ్వరాలయం, దానికి ఎదురుగా పెద్ద నంది వున్నది. వీరభద్రేశ్వరాలయాన్నే నేడు లేపాక్షి దేవాలయం అని చెబుతున్నారు.

ఈ దేవాలయాన్ని శ్రీకృష్ణదేవరాయలు పెనుకొండలో కోశాధికారిగ పని చేసిన విరూపన్న నిర్మించాడు. విరూపన్నకు ఒక రోజున అకస్మికంగా వీరభద్ర విగ్రహం దొరికిందట. దానికి విరూపన్న దేవాలయాన్ని కట్టించాడు. కాని వీరభద్రేశ్వరాలయ నిర్మాణం సంపూర్తి చేయలేకపోయాడు.

లేపాక్షి దేవాలయానికి మంటపము, మహామంటపము,కళ్యాణమంటపాలున్నవి. మహామంటపం అరవై ఆరు స్తంభాలతో నిర్మించబడ్డది. స్తంభాలపైన అనేకమంది గాయకుల, గాయకీగాంధర్వ యొక్క చిత్రాలు రమణీయంగా చెక్కబడ్డాయి. మహామంటపం పైకప్పులోపలి భాగంమీద రామాయణ, మహాభారత గాథలు చక్కగా చిత్రించబడ్డాయి. వీరభద్ర, శివ, విష్ణ్వాలయాల ముఖమంటపాలపై రామాయణ, భారత కథలు చిత్రించబడ్డవి. వీరభద్రస్వామి దేవాలయపు గోడలమీద పార్వతీపరిణయం, శివతాండవం, శివుని జటనుండి ప్రవహించు గంగానది మొదలైన చిత్రాలు, అద్భుతమైన రంగులలో మనోహరంగా చిత్రించబడ్డవి. ఎరుపు,

నీలం, పసుపుపచ్చ, ఆకుపచ్చ రంగులలో చిత్రాలు చిత్రించబడ్డాయి. అనేకమంది చిత్రకారుల ప్రశంసలందుకున్నాయి. అనంతపురం జిల్లాలో ఆర్థిక దారిద్ర్యమున్నది గాని కళాదారిద్ర్యం మెచ్చుటా లేదు.

లేపాక్షి చిత్రాల ప్రాశస్త్యాన్ని ఆంధ్ర దేశానికి తెలియజేసింది కీ. శే. అడవి బాపిరాజుగారు. హంపీతో ప్రారంభమైన విజయనగర కాలపు ఆంధ్రకళ, లేపాక్షిలో పరిపక్వస్థితి వచ్చిందని బాపిరాజుగారు చెప్పారు.

లేపాక్షి దేవాలయం ముందు 15 అడుగుల ఎత్తుగల నందీశ్వరుని విగ్రహముంది. దాన్ని శిల్పులు అరగంటలో చెక్కారని చెప్పుకుంటారు. భోజనాలు రావడం ఆలస్యమై మధ్యకాలాన్ని వృథా పోనివ్వదలచుకొని శిల్పులు నందీశ్వరుని చెక్కారట.

రాజు అనుమతి లేకుండానే విరూపన్న ఖజానాలో నుంచి డబ్బును లేపాక్షి దేవాలయ నిర్మాణానికి ఖర్చుపెట్టాడు. దాని మీదట కృష్ణదేవరాయలకు కోపం వచ్చి విరూపన్న రెండు కళ్ళను పీకించేశాడట. విరూపన్న కళ్ళు పీకించాక మరణించడం వల్లగానీ, లేక కృష్ణరాయల పోషణ లేకి గాని వీరభద్రేశ్వరాలయ నిర్మాణం అసంపూర్తిగా వదలి వేయబడింది.

## తాడిపత్రి దేవాలయాలు

విజయనగర రాజుల కాలంలో రామలింగనాయుడు, తాడిపత్రి ప్రాంతాలకు పాలకుడుగ నియమింపబడ్డాడు. రామలింగ నాయుడు (1509-30) తాడిపత్రిలోని చింతలరాయని దేవాలయం నిర్మించాడు. ఇక్కడి విగ్రహం ఒక చింతచెట్టు క్రింద దొరకడంవల్ల చింతలరాయస్వామి అయ్యాడని చెబుతారు. ఇక్కడి దేవాలయపు గోడలమీదకూడ రామాయణ, మహాభారత గాథలు చెక్కబడ్డవి. దేవుడికి రాతిరథంవుంది. 40 స్తంభాల మంటపం శిల్పం చక్కగా వుంటుంది. పెన్నానదియేటిగట్టునఉన్న రామలింగేశ్వరాలయ శిల్పం ఎన్నదగినది.

## గగన మహాలు

పెనుకొండ విజయనగర రాజ్యానికి ఉపరాజధాని. వేసవి ముకాం. పెనుకొండ ఆరోగ్యమైన ప్రదేశమవడంవల్ల రాజులు వేసవికాలంలో ఇక్కడ మకాం చేసేవారు.

ఇప్పటి గగనమహాలు కృష్ణదేవరాయలు నిర్మించిన వసంతభవనం. ఒక్క కర్రముక్క లేకుండా పూర్తిగా ఇటుకలతోనే నిర్మించబడింది. గగనమహాలు ప్రక్కనే రామాలయం, శివాలయం, ఎదురుగా జైనదేవాలయం ఉన్నవి. ప్రాకారానికి నాలుగువైపుల హనుమదాలయము, గణపతి ఆలయాలు కనబడతాయి. రామాలయం గోడలపై రాతికి వన్నె మారకుండా మనోహరమైన రామాయణగాథలు, శ్రీకృష్ణలీలలు, శివలీలలు చెక్కబడ్డవి. తినదూడ రసం క్రింద పడిపోగా కన్నీరుకారుస్తున్నట్లుగ చెక్కబడ్డ ఆవుచిత్రం చూపరుల మనస్సును కరిగించుతుంది. పాలు త్రాగుతున్న లేగదూడను మెడత్రిప్పి నాలుకతో నాకుతూ వాత్సల్యం ఒలకబోస్తున్న ఆవుబొమ్మ కూడ ఎన్నదగినది.

శివాలయం సింహద్వారం పూర్తిగా శిథిలమైపోయింది. శివాలయానికి ఉత్తరాన గోడమీద చెక్కబడ్డ పెద్దపెద్ద

అవకాశంగా తీసుకుని మహారాష్ట్ర సేనానులలో ఒకడైన మురారిరావు 1746 లో గుత్తి, తాడిపత్రి, పెనుకొండ ప్రాంతాలను స్వాధీనం చేసుకున్నాడు. పాలెగాళ్ల వద్దనుండి కప్పం వసూలు చేశాడు. గుత్తికోట మురారిరావు కార్యస్థానము. ఈ కోట నేటికీ నిలిచివున్నది.

## గుత్తిపై హైదరాలీ దాడి

1761 లో హైదరాలీ రాజ్య విస్తరణకై కన్నడ ప్రాంతాన్నుండి తెలుగు దేశంపైకి దండెత్తాడు. అనంతపురంజిల్లా అతనికి స్వాధీనమైన మొదటి తెలుగు జిల్లా. హైదరాలీ మొదట పెనుకొండ, మడకశిర దుర్గాలను స్వాధీనం చేసుకొని గుత్తి దుర్గంపైకి దాడిచేశాడు. మురారిరావుకు-హైదరాలీకి తీవ్రమైన యుద్ధం జరిగింది. అయిదువారాలు హోరాహోరీగా పోరాడినప్పటికీ గుత్తికోట హైదరాలీవశం కాలేదు. గుత్తికోట లోపలివారికి బయటనుండి వెళ్ళే నీటి సప్లయిని బంద్ చేయనంత కాలం దుర్గాన్ని పట్టుకోవడం ఎవరికీ సాధ్యపడదు. అయిదువారాల యుద్ధకాలంలోను అనేకమంది చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలు గుత్తికోటలో రక్షణకై తల దాచుకున్నారు. ఇదే సమయంలో కోటకువచ్చే నీటి సప్లయి తెగిపోయింది. కోటలోపలివారు యిరుకున పడ్డారు. హాహాకారాలు చేశారు. మురారిరావు హైదరాలీతో సంధికై రాయబారిని పంపవలసివచ్చింది.

12 లక్షల రూపాయలు యిచ్చేటట్లయితే సంధికి అంగీకరించుతానని హైదరాలీ మురారిరావు పంపిన రాయబారితో చెప్పాడు. కాని మురారిరావు పంపిన రాయబారి అనుభవజ్ఞుడు కాకపోవడంవలన సంభాషణ సమయంలో కోటలోకి నీటి సప్లయి బంద్ అయిందనీ, అందువలననే మురారిరావు సంధికి దిగజారివలసి వచ్చిందనీ అసలు రహస్యం కాస్తా బయటపెట్టాడు.

మురారిరావును పీడించడానికి కీలకం తెల్సుకున్న హైదరాలీ సంధిచేసుకో నిరాకరించాడు. రాయబారిని తిరగ గొట్టాడు. రాయబారి పట్టుకొచ్చిన డబ్బును పంపివేశాడు. మూడు రోజులు గడచింది. మంచినీటి కరువుకు కోట లోపలివారు తట్టుకోలేక పోతున్నారు. మంచినీళ్ళు కావలసినవారు మురారిరావు నాయకత్వాన నిరాయుధులై వచ్చి మంచి నీళ్ళు తీసుకెళ్ళవచ్చని, తాను శాంతి పతాకంపైకాల్పుదం మినహా మరేటి హాని కలిగించనని హైదరు మురారిరావుకు కబురుపంపాడు. మురారిరావు హైదరుకు లొంగిపోయాడు. మురారిరావును హైదరు కోపాలా అనే చోటుకు ఖైదీగా పంపగా అక్కడ చనిపోయాడు.

## మైసూరు యుద్ధాలు

గుత్తి దుర్గపతనంతో అనంతపురంజిల్లా హైదరాలీ స్వాధీనమైంది. పాలెగాళ్లు హైదరాలీకి కప్పం కట్టడానికి అంగీకరించారు. హైదరాలీ అనంతరం అతని కొడుకు టిప్పుసుల్తాన్ అధికారంలోకి వచ్చాడు. ఇతనికాలంలో ఇంగ్లీషువారు మైసూరునుఆక్రమించుకునేందుకై మూడు సార్లుయుద్ధాలుచేశారు. టిప్పుసుల్తానునుండి జయించిన రాజ్యాన్ని సమానంగా పంచుకునే షరతుపైన మహారాష్ట్ర పీష్వాలు, నైజాం నవాబులు ఇంగ్లీషు సామ్రాజ్య వాదుల దురాక్రమణకు సిద్ధమయ్యారు.

1792 లో జరిగిన రెండవ మైసూరు యుద్ధంలో టిప్పుసుల్తాన్ ఓడిపోయాడు. తన రాజ్యంలో సగ భాగం శత్రువుల కివ్వడానికి టిప్పు సమ్మతించాల్సివచ్చింది. అనంతపురంజిల్లాలో కొంత భాగం నైజాం నవాబు వాటాకు వచ్చింది. అనంతపురం జిల్లాలో అధికభాగం అప్పుడు బళ్ళారి జిల్లా తాడిమర్రి, తాడిపత్రి తాలూకాల క్రింద వుండేది. ఈ తాలూకాలు నైజాంకు యివ్వబడ్డవి. 1799 లో మూడవ మైసూరు యుద్ధంతో, అనంతపురం జిల్లాలోని మిగతాభాగంకూడ నైజాం నవాబు స్వవశమైంది.

1799 లో గవర్నరు జనరలైన వెలస్లీ సైనిక సహకార పద్ధతి ప్రవేశపెట్టాడు. ఈ పద్ధతి ప్రకారం సంస్థానాధిపతుల రక్షణకు ఇంగ్లీషువాళ్ళు కొంత సైన్యాన్ని ఆ సంస్థానాలలో వుంచుతారు. ఆ ఇంగ్లీషు సైన్యానికయ్యే ఖర్చులన్నీ ఆ సంస్థానాధిపతి భరించాలి. తాము దురాక్రమణ చేసిన మన భారతదేశ భూభాగాలను సైనికంగా కాపాడుకునేందుకు, ఆ దురాక్రమణలో తమకు తోడ్పడ్డ సంస్థానాధిపతులను రక్షించుతూ, వీలుచిక్కినప్పుడు వారిని కూడ కబళించడానికి సైనిక సహకార పద్ధతి ఇంగ్లీషువాళ్ళకు ఒక ఆయుధంగా పనికివచ్చింది.

## దత్తమండలాలు

మహారాష్ట్రులనుండి వస్తున్న దాడులను తట్టుకోలేక నైజాం నవాబు యీ సైనిక సహకార పద్ధతిని అంగీకరించాడు. ఇంగ్లీషు కాపుదల సేనల ఖర్చుల క్రింద నైజాం నవాబు కడప, కర్నూలు, బళ్ళారి, అనంతపురం జిల్లాలను 1800 సం|| లో ఇంగ్లీషువారికి ధారాదత్తం చేసాడు. అందువల్లనే యీ జిల్లాలకు దత్తమండలాలని పేరు వచ్చింది.

ఇంగ్లీషువాళ్ళ వశమయిన తరువాత యీ దత్తమండలాలన్నిటినీ కలిపి ఒకేజిల్లా చేసి, ఒకే కలెక్టరు పరిపాలన క్రింద వుంచారు. నాలుగు జిల్లాలను నలుగురు సబ్ కలెక్టర్ల పరిపాలన క్రింద వుంచారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో రైత్వారీ విధానాన్ని ప్రవేశపెట్టిన సర్ థామస్ మన్రో, దత్తమండలాలకు మొదటి కలెక్టరుగా నియమించబడ్డాడు. మన్రో ప్రధాన కార్యాలయం అనంతపురంలో వుండేది. అనంతపురం జిల్లా, ఆంధ్రరాష్ట్ర విభజన తరువాత బళ్ళారి నుండి విడదీయబడి అనంతపురం జిల్లాలో కలుపబడ్డ రాయదుర్గం తాలూకాతోసహా మన్రో ప్రత్యక్షపాలన క్రింద వుండేది. 1807లో దత్తమండలాలన్నీ కలిపి బళ్ళారి, కడప అనే రెండు జిల్లాలుగా విభజించబడ్డవి. అనంతపురం జిల్లా బళ్ళారిజిల్లాలో భాగంగా వుండేది.

## ప్రత్యేక జిల్లా ఏర్పాటు

తిరిగి 1882 లో బళ్ళారిజిల్లా బళ్ళారి, అనంతపురం జిల్లాలుగా విభజించబడ్డది. అనంతపురంజిల్లా ప్రత్యేకంగా యేర్పాటయింది.

అనంతపురం జిల్లా ఇంగ్లీషువాళ్ళ వశమయ్యేనాటికి అనంతపురం, నడిమిదొడ్డి, కమ్మలపాడు, తరిమెల ప్రాంతాలలో పాళెగాళ్లు పరిపాలించుతుండేవారు. ఇంగ్లీషు పాలకులు పాళెగాళ్లకు కొంత నష్టపరిహారమిచ్చి వారి ఆధీనంలో వున్న గ్రామాలనుకూడ స్వాధీనం చేసుకున్నారు.

1804 లో నైజాం నవాబుల వంశానికి చెందిన బసాలత్ జంగ్ కొడుకు కర్రిల్-

జిల్లా-కోశా ఆదోని, గుత్తి దుర్గాలను పట్టుకోవాలని చేసిన యత్నాలు భగ్నమయ్యాయి. దీనితరువాత ఇంగ్లీషు పాలన స్థాపింపబడింది.

### యోగి వేమన

అనంతపురం జిల్లా కదిరి తాలూకా కటారుపల్లి గ్రామంలో వేమన సమాధి ఉన్నది. వేమన 18వ శతాబ్దంలోనివాడు. గుంటూరుజిల్లాలో జన్మించాడు. జీవితంలో ఎక్కువకాలం రాయలసీమలోనే గడిపి అనంతపురం జిల్లాలో దేహాన్ని చాలించాడు.

అనాటి సమాజంలో వ్యాపించిన అవినీతిని తీవ్రంగా విమర్శించాడు. మతం పేరిట జరుగుతున్న మోసాన్ని, నీతి బాహ్యతను నిశితంగా విమర్శించాడు. సులభమైన శైలిలో ప్రజానీకంయొక్క హృదయాలకు హత్తుకనే విధంగా పద్యాలు వ్రాశాడు. ఇవే వేమనశతకంలోని పద్యాలు. వేమన మరణించిన తరువాత అనేకపద్యాలు చేర్చబడి వేమన పద్యాలుగా చెలామణి అవుతున్నాయి.

## భూగోళం

కార్యస్థానం అనంతపురం. జనాభా 13,61,556. విస్తీర్ణం 6,706 చ. మైళ్ళు.

అనంతపురం జిల్లాకు ఉత్తరమున బళ్ళారి, కర్నూలు జిల్లాలు; తూర్పున చిత్తూరుజిల్లా; దక్షిణమున మైసూరు రాష్ట్రము; పశ్చిమమున మైసూరురాష్ట్రము సరిహద్దులుగా నున్నవి.

పరిపాలనా సౌలభ్యంకొరకు జిల్లాను 9 తాలూకాలక్రింద, 2 రెవెన్యూ డివిజనులక్రింద (అనంతపురం, పెనుకొండ) విభజింప బడింది.

తాలూకాలన్నింటిలో కదిరి (1157 చ.మై.) పెద్దది. దీనికి హిందూపురం, మడకశిర తాలూకాలకు సుమారు 3రెట్లు; తాడిపత్రి, పెనుకొండ తాలూకాలకు దాదాపు రెట్టింపు వైశాల్యం గలదు.

ఈ ప్రక్కపేజీలోనిపటములో రెవెన్యూ డివిజనులవారీగా విభజింపబడ్డ తాలూకాలు, వాటి కార్యస్థానాలు చూపబడ్డాయి.

ప్రకృతి పరిస్థితుల దృష్ట్యా జిల్లాను 3 భాగములక్రింద విభజింపవచ్చును. (1) ఉత్తర తాలూకాలైన గుత్తి, తాడిపత్రి నల్లరేగడి భూములు. (2) కళ్యాణదుర్గం, అనంతపురం, ధర్మవరం, పెనుకొండ, కదిరితాలూకాలు, జిల్లాలోని కేంద్ర తాలూకాలు. ఎర్రభూములతో, చెట్లు చేమలు లేక యీ ప్రాంతమంతా నిర్జీవంగా కన్పిస్తుంది. (3) హిందూపురం, మడకశిర తాలూకాలు, మైసూరు పీఠభూమి వరకు వ్యాపించివున్న యెత్తైన భూమిపై వున్నవి.

గుత్తి, తాడిపత్రి తాలూకాలు దక్షిణ దిశకు వాలియున్నవి. కనుక యీప్రాంతపు

| రివెన్యూ డివిజను పేరు | రివెన్యూ డివిజను కార్యస్థానం | రివెన్యూ డివిజను లోని తాలూకాలు | తాలూకా వైశాల్యం (చ॥ మైళ్ళు) | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| అనంతపురం | అనంతపురం | అనంతపురం | 926 | అనంతపురం |
| | | గుత్తి | 896 | గుత్తి |
| | | తాడిపత్రి | 641 | తాడిపత్రి |
| | | కళ్యాణదుర్గం | 821 | కళ్యాణదుర్గం |
| పెనుకొండ | పెనుకొండ | పెనుకొండ | 682 | పెనుకొండ |
| | | ధర్మవరం | 736 | ధర్మవరం |
| | | కదిరి | 1,157 | కదిరి |
| | | హిందూపురం | 430 | హిందూపురం |
| | | మడకశిర | 417 | మడకశిర |
| | | | 6,706 | |

వరకు పురిగొంతా పెన్నానదిలోకి పోవుచున్నది. జిల్లాలోని పశ్చిమభాగంలోనున్న గుత్తి, కళ్యాణదుర్గం తాలూకాలలో మధ్యభాగం ఉత్తరమునకు వాలియున్నది. జిల్లాలో మిగిలిన ప్రదేశమంతా దక్షిణమునుండి ఉత్తరమునకు వాలియున్నది.

## కొండలు - గుట్టలు

జిల్లాలో పేర్కొనదగినవి 'ముచ్చుకోట' కొండలు. ఇవి 35 మైళ్ళపొడవున గుత్తి పట్టణము ఉత్తరభాగంనుండి ప్రారంభమై తాడిపత్రి తాలూకా దక్షిణ కొసవరకు పోవుచున్నవి. ఈ కొండలు అచ్చటచ్చట 7 మైళ్ళ వెడల్పును కల్గియున్నవి. ఇవి గుత్తి, తాడిపత్రి, అనంతపురం తాలూకాల్లో కన్పిస్తాయి.

'నాగసముద్రం కొండలు' అనే మరొకవరుస గుత్తి తాలూకా పశ్చిమభాగంనుండి ప్రారంభమై దక్షిణముగ గుత్తి, అనంతపురం, ధర్మవరం తాలూకాల గుండా 50 మైళ్ళ పొడవున వ్యాపించి వున్నవి. ఈ నాగసముద్రం కొండలు, దక్షిణమునకు పోయిన కొలదీ యెత్తు తగ్గుతూ, అచ్చటచ్చట చిన్నగుట్టల స్వరూపాన్ని తీసుకొనుచున్నవి.

'మల్లప్పకొండ' అనే మరొకవరుస ధర్మవరంలో పుట్టి మైసూరు సంస్థానంలోనికి పోవుచున్నది.

'పెనుకొండ కొండలు' ధర్మవరం తాలూకా దక్షిణభాగంలో ప్రారంభమై పెనుకొండ, హిందూపురం తాలూకాల గుండా వ్యాపించి మైసూరు సంస్థానంలో ప్రవేశిస్తున్నవి.

'మడకసిర కొండలు' మడకసిర తాలూకాను ఉత్తర, దక్షిణభాగములక్రింద విభజించుచున్నవి.

దక్కను పీఠభూములలో సామాన్యంగా గమనించేటట్లు యీ జిల్లాలో కూడ

| తాలూకా | రిజర్వు ఫారెస్టు (చ. మైళ్ళు). |
|---|---|
| గుత్తి | 59.65 |
| తాడిపత్రి | 71.45 |
| కళ్యాణదుర్గం | 44.67 |
| అనంతపురం | 72.77 |
| ధర్మవరం | 44.52 |
| పెనుకొండ | 119.67 |
| కదిరి | 214.66 |
| మడకశిర | 33.95 |
| హిందూపురం | 37.51 |
| మొత్తం | 698.84 |

## శీతోష్ణస్థితి – వర్షపాతము

మార్చి, ఏప్రిల్, మే నెలల్లో జిల్లాలో బాగా వేడిగావుంటుంది. జూన్ మాసంలో నైరుతీ ఋతుపవనాలు ప్రారంభం అవగానే ఉష్ణోగ్రత క్రమంగా తగ్గుతుంది. జిల్లా సముద్రతీరానికి చాలా దూరంగావుండుట వల్లా, పీఠభూమి ప్రదేశంపై వుండుట వల్లా వాతావరణం చాలా పొడిగావుంటుంది.

ఆంధ్రరాష్ట్రంలోకెల్లా తక్కువ వర్షం పడే జిల్లా యిదే. క్రింది పట్టికలో తాలూకా వారీ సంవత్సరి సగటు వర్షపాతము, సాలుసరి వర్షపు దినాలు యివ్వబడ్డాయి.

## సాగుసదుపాయాలు

జిల్లాలో చెప్పుకోదగ్గ సాగువసతులు లేవు. ఎగువ పెన్నారు ప్రాజెక్టు, కముద్వతి ప్రాజెక్టులనిర్మాణం పూర్తిఅయితే, కొన్ని సదుపాయాలుయేర్పడతాయి. పెన్నానది మినహాయిస్తే ఉన్ననదులన్నీ బాగా వర్షం కురిసినప్పుడు ప్రవాహాలుగా ఉధృతంగా ప్రవహిస్తాయి. వర్షాలు లేనప్పుడు వీటిలో నీరు వుండదు. ఈ నదుల్లో వేటికీ ఆనకట్టలు లేవు. అచ్చటచ్చట ఇసుకలో అడ్డు

| తాలూకా | సగటు వర్షపాతం అంగుళాలలో | సాలుసరి వర్షపు దినాలు |
|---|---|---|
| గుత్తి | 21.37 | 38.4 |
| తాడిపత్రి | 21.88 | 37.2 |
| కళ్యాణదుర్గం | 20.17 | 30.7 |
| అనంతపురం | 24.36 | 34.6 |
| ధర్మవరం | 20.82 | 32.4 |
| పెనుకొండ | 24.50 | 38.1 |
| కదిరి | 23.04 | 37.0 |
| మడకశిర | 21.70 | 32.8 |
| హిందూపురం | 23.18 | 39.9 |

| పంట | | గుత్తి (ఎకరాలలో) | తాడిపత్రి (ఎకరాలలో) | కళ్యాణదుర్గం (ఎకరాలలో) | అనంతపురం (ఎకరాలలో) | ధర్మవరం (ఎకరాలలో) | పెనుకొండ (ఎకరాలలో) | కదిరి (ఎకరాలలో) | మడకశిర (ఎకరాలలో) | హిందూపురం (ఎకరాలలో) | మొత్తం (ఎకరాలలో) |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 8,371 | 7,490 | 15,131 | 21,160 | 22,193 | 19,079 | 18,229 | 9,159 | 16,920 | 1,38,092 |
| | మెట్ట | 85 | 405 | ... | ... | ... | 19 | 231 | 272 | 261 | 1,273 |
| జొన్న | | 77,679 | 59,893 | 55,021 | 43,129 | 17,781 | 9,667 | 12,936 | 11,649 | 5,581 | 2,93,336 |
| సజ్జ | | 18,816 | 835 | 22,152 | 9,491 | 2,671 | 13,447 | 82,327 | 1,474 | 21,195 | 1,72,408 |
| రాగి | | 495 | 680 | 9,411 | 7,667 | 9,340 | 12,582 | 12,487 | 21,387 | 19,739 | 93,778 |
| కొఱ్ఱ | | 1,27,197 | 64,711 | 35,039 | 64,602 | 16,584 | 6,337 | 13,129 | 29,046 | 7,104 | 3,64,949 |
| వరిగ | | 46 | 1,643 | 1,235 | 5,213 | 1,343 | 3,437 | 576 | 18,391 | 881 | 32,767 |
| సామలు | | 8 | ... | 8,275 | 8,302 | 23,785 | 6,809 | 14,176 | 771 | 4,720 | 66,846 |
| మొక్కజొన్న | | 84 | ... | ... | 11 | 12 | ... | ... | ... | 98 | 205 |
| పచ్చపెసలు | | 1,914 | 151 | 1,143 | 2,822 | 1,110 | 117 | 570 | 68 | 1 | 7,896 |
| కందులు | | 12,466 | 6,629 | 8,577 | 14,813 | 4,152 | 543 | 5,333 | 6,507 | 6,600 | 60,611 |
| మినుములు | | 3 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 3 |
| శనగలు | | 4,113 | 2,247 | 529 | 2,097 | 553 | 638 | 49 | 268 | 456 | 10,950 |
| ఉలవలు | | 3,536 | 2,126 | 35,242 | 39,305 | 43,686 | 24,198 | 36,248 | 18,237 | 14,882 | 2,17,460 |
| మిర్చి | | 2,060 | 1,151 | 475 | 902 | 843 | 1,159 | 2,652 | 1,128 | 2,577 | 12,947 |
| చెఱకు | | 11 | 393 | 12 | 6 | 99 | 1,579 | 704 | 51 | 4,271 | 7,126 |
| వేరుశనగ | | 95,478 | 49,949 | 30,864 | 63,434 | 24,343 | 19,403 | 69,332 | 15,964 | 24,486 | 3,93,257 |
| నువ్వులు | | 712 | 34 | 7,501 | 11,653 | 14,892 | 969 | 1,071 | 53 | 2 | 36,867 |
| ప్రత్తి | | 43,821 | 30,233 | 5,028 | 4,930 | 3,111 | 368 | 584 | 28 | 19 | 88,122 |
| | | | | | | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |

### రైల్వే

252½ మైళ్ళ రైలు మార్గం జిల్లాలో వుంది. ఇందులో 61 మైళ్ళు బ్రాడ్ గేజి, 191½ మైళ్ళు మీటర్ గేజి. మద్రాసు - బొంబాయి పోయే బ్రాడ్ గేజి మార్గం తాడిపత్రి, గుత్తి తాలూకాలగుండా పోవుచున్నది. మీటర్ గేజి మార్గం గుంతకల్లునుంచి గుత్తి, అనంతపురం, ధర్మవరం, పెనుకొండ, హిందూపురం తాలూకాలగుండా బెంగుళూరు పోవుచున్నది. ధర్మవరంనుంచి మరొక మీటర్ గేజి బ్రాంచిలైను కదిరి తాలూకా గుండా చిత్తూరు జిల్లాలోకి పోవుచున్నది.

అనంతపురం జిల్లాలోని గుంతకల్ ఆంధ్రరాష్ట్రంలోని ప్రధాన రైల్వే కూడలులలో ఒకటి. గుంటూరు - హుబ్లీ మార్గానికి, మద్రాసు-బొంబాయి మార్గానికి యిది కూడలి. ఇచ్చటినుంచి బెంగుళూరు మీటర్ గేజి రైలుమార్గంకూడ ప్రారంభమౌతున్నది.

కళ్యాణదుర్గం, మడకశిర తాలూకాల్లో రైలుమార్గంలేదు. ఈ రెండు తాలూకాల కేంద్రాలు మినహాయిస్తే తక్కిన తాలూకా కార్యస్థానాలు, జిల్లా కార్యస్థానం రైలుమార్గాలతో కలుపబడ్డాయి.

### జనాభా

గత పది సంవత్సరాలలోనూ జిల్లా జనాభా 11,66,225 నుంచి 13,61,556కు వృద్ధిచెందింది. సగటున నూటికి 16.7 చొప్పున యీ పది సం॥లో జనాభా పెరిగింది. [illegible] మైలుకి జనాభా 858

| తాలూకా | తాలూకాలోని మొత్తం ఇండ్లు | గ్రామాలలోని ఇండ్ల సంఖ్య | పట్టణాలలోని ఇండ్ల సంఖ్య | మొత్తం జనాభా | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా |
|---|---|---|---|---|---|---|
| గుత్తి | 37,505 | 25,749 | 11,756 | 2,14,851 | 1,44,938 | 69,913 |
| తాడిపత్రి | 24,339 | 19,549 | 4,790 | 1,32,794 | 1,05,431 | 27,363 |
| కళ్యాణదుర్గం | 19,967 | 18,866 | 1,101 | 1,18,394 | 1,10,231 | 8,163 |
| అనంతపురం | 27,133 | 23,357 | 3,776 | 1,64,703 | 1,32,751 | 31,952 |
| ధర్మవరం | 20,848 | 18,171 | 2,677 | 1,14,812 | 1,00,109 | 14,703 |
| పెనుకొండ | 22,230 | 19,114 | 3,116 | 1,23,349 | 1,05,245 | 18,104 |
| కదిరి | 41,117 | 37,795 | 3,322 | 2,19,112 | 1,98,758 | 20,354 |
| మడకశిర | 20,436 | 19,350 | 1,086 | 1,20,209 | 1,13,641 | 6,568 |
| హిందూపురం | 26,058 | 23,131 | 2,927 | 1,53,332 | 1,28,894 | 24,438 |
| జిల్లా మొత్తం | 2,39,633 | 2,05,082 | 34,551 | 13,61,556 | 11,39,998 | 2,21,558 |

## వైద్య సదుపాయాలు

జిల్లాలోని వైద్యసౌకర్యాలు చాలా స్వల్పం. మొత్తం 19 వైద్యశాలలుగాని, అస్పత్రులుగాని ఉన్నాయి. ఇందులో రోగులను చేర్చుకొని చికిత్స చేయగల్గిన అస్పత్రులు 8. వీటిలో 198 మంది రోగులను నిల్పి ఉంచుకొగల్గిన సౌకర్యం మాత్రమే ఉంది. జిల్లా అవసరాలదృష్ట్యా యీ సంఖ్య నామమాత్రం మాత్రమే. మందు లిచ్చి పంచే వైద్యాలయాలు 111 మాత్రమే ఉన్నాయి.

తాలూకా వారీ వైద్యసౌకర్యాలు, రోగుల చికిత్సకై అస్పత్రులలో ఉన్న మంచాలసంఖ్య మున్నగు వివరాలు యీ ప్రక్కపేజీలోని పట్టికలోయివ్వబడ్డాయి.

| తాలూకా | ఆస్పత్రులు | | మంచాల సంఖ్య | వైద్యశాలలు | | |
|---|---|---|---|---|---|---|
| | గవర్నమెంటు | లోకలు ఫండు | | గవర్నమెంటు | లోకలు ఫండు | గ్రామీణ వైద్యశాలలు |
| గుత్తి | 1 | ... | 22 | ... | 3 | 1 |
| తాడిపత్రి | 1 | ... | 8 | ... | 1 | ... |
| కళ్యాణదుర్గం | ... | ... | 4 | ... | 1 | ... |
| అనంతపురం | 2 | ... | 120 | 1 | ... | ... |
| ధర్మవరం | ... | ... | 4 | ... | 1 | ... |
| పెనుకొండ | 1 | ... | 8 | ... | 1 | ... |
| కదిరి | 1 | ... | 4 | ... | 1 | ... |
| మడకశిర | 1 | ... | 4 | ... | 1 | ... |
| హిందూపురం | 1 | ... | 24 | ... | | ... |
| జిల్లా మొత్తం | 8 | ... | 198 | 1 | 9 | 1 |

## పరిశ్రమలు

జిల్లా పారిశ్రామికంగా చాలా వెనుకబడిఉంది. కళ్యాణదుర్గం, ధర్మవరం, పెనుకొండ, మడకశిర తాలూకాలలో చెప్పుకోదగ్గ పరిశ్రమలు లేనేలేవు. ఉన్న పరిశ్రమలు తాలూకావారీగా ఎలా విభజింపబడి ఉన్నవో క్రిందిపట్టిక తెలియజేస్తుంది:

| తాలూకా | పరిశ్రమ | ఫ్యాక్టరీల సంఖ్య | ఉద్యోగుల సంఖ్య |
|---|---|---|---|
| గుత్తి | ప్రత్తి మరలు, ప్రెస్సులు | 21 | 626 |
| తాడిపత్రి | ప్రత్తి మరలు, వేరుసెనగనూనె మిల్లులు | 7 | 178 |
| అనంతపురం | వేరుశనగనూనె మిల్లులు | 16 | 358 |
| కదిరి | బీడీ ఫ్యాక్టరీలు | 9 | 171 |

# చిత్తూరు జిల్లా

## చరిత్ర

చిత్తూరుజిల్లా 1911 లో ప్రత్యేక జిల్లాగా యేర్పడింది. మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు కడపజిల్లానుండి; పుంగనూరు, కుప్పం తాలూకాలు మైసూరు జిల్లానుండి; తిరుత్తణితాలూకా, చెంగల్పట్టు జిల్లానుండి; మిగతా తాలూకాలు ఉత్తర ఆర్కాటు జిల్లానుండి విడదీసి చిత్తూరు జిల్లాను యేర్పాటు చేసారు.

ఈ విధంగా నాలుగు జిల్లాలనుండి విడదీయబడ్డ ప్రాంతాలతో యేర్పాటైన జిల్లా అవడంవలన చిత్తూరుజిల్లా చరిత్ర ఆ జిల్లాల చరిత్రతో పెనవేసుకొని ఉన్నది. చిత్తూరుజిల్లా చరిత్ర వివరంగా తెలుసుకోడానికి తగిన ఆధారాలు కనబడ లేదు.

క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దంలో చిత్తూరు జిల్లా పల్లవులరాజ్య అంతర్భాగంగా వుండేది. కొంత కాలమైన తరువాత చోళులు యీ ప్రాంతాన్నాక్రమించుకొని చోళరాజ్యంలో కలుపుకున్నారు. చోళులు యీ ప్రాంతాన్ని దీర్ఘకాలం పరిపాలించారు. ప్రసిద్ధిచెందిన కాళహస్తీశ్వరాలయాన్ని క్రీ. శ. 12 వ శతాబ్దంలో రాజేంద్ర చోళుడనే చోళ రాజు కట్టించినట్లుగ శాసనాలవల్ల తెలుస్తున్నది. రాజేంద్రచోళుడు, చోళ-చాళుక్య వంశానికి చెందినవాడు. కంచి నుండి ఆంధ్రదేశాన్ని పాలించాడు.

### కాళహస్తి

కాళహస్తి దేవాలయంలోని ఈశ్వరుడికి శ్రీకాళహస్తీశ్వరుడని పేరు. శ్రీ కాళహస్తీశ్వరుడనే పేరు ఎలా వచ్చిందీ తెలియచేసే ఒక ఇతిహాస గాథ ప్రచారంలో వుంది. శ్రీ అంటే సాలె పురుగు. కాళమనగా పాము. హస్తిఅంటే ఏనుగు. సాలెపురుగు, పాము, ఏనుగు స్నేహంగా వుండేవట. ఈ మూడూ కలసి ఈశ్వరుడిని గూర్చి తపస్సు చేసాయట. శివుడు ప్రత్యక్షమై మీకేం కావాలో కోరుకోమనగా, తాము శివుని రూపం పొందేటట్లు వరమివ్వమని అడిగాయి. అప్పుడు యీ మూడు జీవులూ కలసి యేర్పడిన శివలింగానికి కాళహస్తీశ్వర స్వామి అనే పేరువచ్చింది. ఇక్కడి శివలింగాన్ని పవిత్రంగా యెంచటంవల్ల అర్చకులుకూడ తాకరట. లింగానికి అడుగున సాలెపురుగుమాదిరి ఒక ఆకారం వుంది. లింగానికి పైన అయిదు ముఖాలను పాముఅనీ, లింగం మధ్యభాగంలో కనబడే తెల్లటి పట్టీలను ఏనుగు దంతాలనీ చెబుతారు. ఇక్కడ శివరాత్రికి పెద్ద ఉత్సవాలు జరుగుతాయి.

కాళహస్తీశ్వరాలయానికి దక్షిణపు వైపున బ్రహ్మాలయం వుంది. దేశంలో ఇక్కడ తప్పితే మరెక్కడా బ్రహ్మకు ఆలయాలు లేవట. శివుడుండే ప్రదేశం కైలాసం గనుక శివుడిని పూజించటానికి బ్రహ్మదేవుడు కూడ కాళహస్తి వచ్చే వాడట. బ్రహ్మ గారి హస్తం నిర్మించబడ్డ ఆలయమే బ్రహ్మాలయం.

కాళహస్తీశ్వరాలయాన్ని గూర్చి మరొక కథ ప్రచారంలో వుంది. కన్నప్ప అనే బోయవానికి అడవిలో తిరుగుతూ వుండగా కాళహస్తీశ్వరలింగం కనిపించిందట. కన్నప్ప శివలింగాన్ని అతిభక్తితో పూజించే వాడట, ఒకసారి శివుని రెండు కళ్ళు చెడిపోగా, కన్నప్ప తన కళ్ళు పెరికి ఆ కళ్ళ స్థానంలో వుంచాడని చెబుతారు.

## సువర్ణముఖి

సువర్ణముఖీనది కాళహస్తీశ్వరాలయానికి దగ్గరలో ప్రవహిస్తోంది. ఈ నదికి మొగలేరని పేరుంది. పూర్వకాలంలో నదికి రెండు ప్రక్కలా మొగలి పొదలుండేవి. అందువల్ల సువర్ణముఖికి మొగలేరు అనే పేరు కూడ వచ్చింది.

అగస్త్యుడు మందాకినిని గూర్చి తపస్సు చేసి భూలోకానికి తెచ్చినదియే సువర్ణముఖి అని పురాణగాథ. ఒకనాడు అగస్త్యుడు చంద్రగిరి కొండలపై తపస్సు చేసుకొంటుండగా, సువర్ణముఖి చంద్రగిరి కొండలే మునిగేటట్లుగా పొంగిందట. అగస్త్యుడికి కోపంవచ్చి యీ నది భూమట్టం క్రింద ప్రవహించాలని శపించాడనీ, సువర్ణముఖిలో ఎక్కువ నీరు లేకపోవ టానికి కారణమిదేనని చెబుతారు.

## సాళువ వంశ పాలన

కాళహస్తీశ్వరాలయాన్ని నిర్మించిన రాజేంద్రచోళుని చోళవంశ పరిపాలన 13 వ శతాబ్దంతో అంతమైంది. చోళుల తరువాత చిత్తూరును కొంతకాలం విజయనగర సాళువ రాజులకు మూలపురుషులైన వారు, మరికొంతకాలం యాదవులు పరిపాలించారు. సాళువ రాజులలో ఒకడైన అక్కరాజు కూతురు పద్మావతిని తిరుపతి వెంకటేశ్వర్లు పెళ్ళిచేసుకొన్నాడని చెప్పుకుంటారు. కొంతకాలమయ్యాక 1324 ప్రాంతంలో అల్లావుద్దీన్ సేనలు దండెత్తి వచ్చినప్పుడు యీ ప్రాంతం కూడ ఢిల్లీ సుల్తానుల కైవశమైంది. కాని ఢిల్లీ సుల్తానుల పాలనను ధిక్కరించి హరిహర బుక్క రాయలు విజయనగర రాజ్యాన్ని స్థాపించి నప్పుడు, చిత్తూరుజిల్లా ఆ రాజ్యంలో కలిసిపోయింది. పుత్తూరు తాలూకా కార్వేటినగరం, కాళహస్తి జమీందార్లు విజయనగర రాజులకు సామంతులుగ వుంటూ చిత్తూరుజిల్లాలో కొన్ని ప్రాంతా లను పాలించారు. కాళహస్తి జమీందారు పరిపాలన ఒకప్పుడు ఉత్తర ఆర్కాటు, చెంగల్పట్, నెల్లూరుజిల్లాల లోకి కూడ వ్యాపించింది.

## తిరుపతి

తిరుపతి దేవాలయం విజయనగర రాజుల కాలంలో ఉచ్ఛస్థితికి వచ్చింది. సాళువనరసింహరాజు, దేవాలయంచుట్టూ ప్రాకారపు గోడలు కట్టించాడు. తిరుపతి దేవాలయం అతిప్రాచీన దేవాలయాలలో ఒకటి. ఆదిశేషుని తలపైన యీ ఆలయం వున్నదని చెబుతారు. ఏడుకొండలు

దాటితేగాని వెంకటేశ్వరాలయానికి వెళ్ళడానికి వీలుపడదు. అందువల్ల వెంకటేశ్వరునికి ఏడుకొండల వెంకటేశ్వరుడని పేరు వచ్చింది.

పూర్వకాలంనుండీ పల్లవులు, చోళులు, పాండ్యులు, బళ్ళాలు, విజయనగరరాజులు ముదలైన అనేక వంశాల రాజులు తిరుపతి దేవునికి దానాలు చేస్తూ వచ్చారు. అందువల్ల తిరుపతిదేవుడు ఆంధ్రలోని దేవుళ్ళందరిలోకి ధనికుడయ్యాడు. ఈ దేవుని విమానం బంగారు రేకులతో కప్పబడి వున్నది. రెండవగోపురం ముందర ధ్వజస్తంభము, బలిపీఠంకూడ బంగారు రేకులతో కప్పబడి ఉన్నవి. తిరుపతి వెంకటేశ్వరునికి, అతని భార్య పద్మావతికి వజ్రకిరీటాలున్నవి. బంగారు ఆభరణాల సంగతి చెప్పనవసరంలేదు. దేవునిని చూడటానికి బంగారపు ద్వారంగుండా వెళ్ళాలి. ఈ ఆలయంలో రామానుజాచారి చేసిన ఏర్పాటు ననుసరించే పూజా పునస్కారాలు జరుగుతున్నాయి. అందువల్ల తమిళ మంత్రాలతో పూజ జరుగుతున్నది. తిరుపతి పట్టణం రామానుజాచారి కాలంలో ఏర్పడిందని అంటారు.

వేయిపడగల ఆదిశేషువుకి, వాయువుకి ఎవరు బలవంతులో తేల్చుకోవాలని పోటీ జరిగిందట. అప్పుడు ఆదిశేషువు మేరు పర్వతంలోని కొన్ని కొండలను నెత్తిమీద మోయగా, వాయువు తన గాలితో ఆ కొండలను క్రింద పడగొట్టాడని, అవే తిరుపతి కొండలని ఇతిహాసగాథ. ఇక్కడి దేవాలయానికి ముందున్న 'స్వామిపుష్కరిణి' కోనేరులో స్నానం పవిత్రమని భక్తుల నమ్మకం. ఇక్కడి వేయి స్తంభాల మంటపం, గాలిగోపురం, చూడదగ్గవి. దేవాలయానికి మూడు ప్రాకారాలున్నాయి. ఇక్కడి దేవుడిని శైవులు, వైష్ణవులుకూడ పూజించుతారు. మొదటిప్రాకారం దాటగానే కనబడే పడికావలిగోపురంలోపల తిరుమలరాయ మంటపంవుంది. ఇక్కడ కృష్ణదేవరాయలు అతని ఇద్దరుభార్యల విగ్రహాలు, వెంకటపతిరాయల విగ్రహం, తిరుమలరాయడు అతని భార్యల విగ్రహాలు ఉన్నవి. అక్బరుమంత్రి తోడరుమల్లు, అతని భార్యల విగ్రహాలుకూడ వున్నవి.

## చంద్రగిరి కోట

విజయనగరరాజ్యపతనానంతరం రామరాయల తమ్ముడు తిరుమలరాయడు, పెనుకొండ రాజధానిగా చేసుకొని కొంతకాలం పరిపాలించాడు. 1572 లో పెనుకొండ, గోల్కొండ నవాబుల వశంకాగా శ్రీరంగరాయలు చంద్రగిరికి పారిపోయి దాన్ని రాజధానిగ చేసుకొని పరిపాలించాడు. చంద్రగిరిలోనికోట క్రీ.శ 1000లో యాదవరాజైన ఇమ్మడి నరసింహుడు కట్టించాడు. ఇతడు నారాయణవనం రాజధానిగ పాలించిన యాదవరాజులలో ఒకడు. విజయనగరరాజులు ఆ కోటను కట్టుదిట్టం చేశారు. గుర్రంకొండలోని కోట విజయనగర రాజ్య ఉచ్ఛస్థితిలో నిర్మించబడింది.

మూడవ శ్రీరంగరాయలు రాజ్యం చేస్తున్న కాలంలోనే అతనివద్ద అనుమతి పొంది, మద్రాసులో ఇంగ్లీషువాళ్ళు కోట కట్టుకున్నారు. మద్రాసులో ఇంగ్లీషువారి కోట నిర్మాణం ఆంధ్రలోను, దక్షిణాదిన ఇంగ్లీషు వాలన స్థిరపడటానికి తోడ్పడింది.

1646 లో చిత్తూరుజిల్లా గోల్కొండ నవాబులవశమైంది. గోల్కొండనవాబుల క్రింద కడప నవాబు మదనపల్లి, వాయల్పాడు, పుంగనూరు తాలూకాలను పరిపాలించాడు. జిల్లాలోని మిగతా తాలూకాలను ఆర్కాటునవాబుపరిపాలించాడు.

గోల్కొండ రాజ్యపతనానంతరం చిత్తూరు జిల్లాను కర్నాటక నవాబులు పరిపాలించారు. 1758 లో ఆర్కాటు నవాబు తమ్ముడైన అబ్దుల్ వాహెబ్ ఖాను చంద్రగిరికోటనుండి పాలించాడు. చంద్రగిరిరాజుల కోటలు, భవనాలు యిప్పటికీ వున్నాయి.

మహారాష్ట్రులు, వారితరువాత మైసూరు పరిపాలకుడైన హైదరాలీ చిత్తూరుప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు. మహారాష్ట్రులు, ఆర్కాటు నవాబైన దోస్తు ఆలీఖాన్‌ను దామాల్ చెరువు కనుమ దగ్గర చంపేశారు.

మైసూరు యుద్ధాలలో హైదరాలీని ఇంగ్లీషువాళ్ళు ఓడించారు. 1792 లో జరిగిన శ్రీరంగపట్నం సంధి ప్రకారం మదనపల్లి, వాయల్పాడు, చంద్రగిరి తాలూకాలు నైజాం నవాబుకు, మిగతా తాలూకాలు ఆర్కాటు నవాబుకు ఇంగ్లీషువాళ్ళు యిచ్చారు.

సైనిక సహకార పద్ధతి ననుసరించి బ్రిటిషు సైన్యాల ఖర్చుక్రింద యివ్వవలసిన ఖర్చులక్రింద, నైజాం నవాబు ఇతర రాయలసీమ జిల్లాలతోపాటు చిత్తూరుజిల్లానుకూడ ఇంగ్లీషువారికి 1801 లో కట్టబెట్టాడు.

చిత్తూరు ఉత్తర ఆర్కాటు జిల్లాకు కార్యస్థానంగా వుండేది. కొంతకాలం ఆ ప్రాంతానికి తీవ్రమైన జాడ్యం ప్రబలగా ఇంగ్లీషువాళ్ళు ఉత్తర ఆర్కాటుజిల్లా కార్యస్థానాన్ని చిత్తూరునుంచి వెల్లూరుకి మార్చారు. 1874 దాకా చిత్తూరు, కంపెనీ సేనల కార్యస్థానంగా వుండేది.

1911 లో చిత్తూరుజిల్లా ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది.

# భూగోళం

జిల్లా కార్యస్థానం చిత్తూరు. వైశాల్యం 5,890 చ. మై. జనాభా 18,10,377.

చిత్తూరుజిల్లాకు ఉత్తరమున అనంతపురం, కడప, నెల్లూరుజిల్లాలు; తూర్పున చంగల్‌పట్టుజిల్లా; దక్షిణమున ఉత్తర ఆర్కాటుజిల్లా; పశ్చిమమున మైసూరు సంస్థానం సరిహద్దులుగా ఉన్నది.

చిత్తూరుజిల్లాలో అంతర్భాగమైన 8 గ్రామాలు, 1950కి పూర్వం మైసూరు సంస్థాన అధీనంలో వుండేవి. ఈ గ్రామాలు — కరకొప్ప, బొమ్మప్ప, రెడ్డిహళ్ళి, గొళ్ళహళ్ళి, బోసిపేట, చిన్నాగొడ్డి, కోడివర గాలకొప్ప, కొయ్యంగట్ల హరివానపల్లి — 1950 లో చిత్తూరుజిల్లాలోని పలమనేరు తాలూకాలో కలుపబడ్డాయి.

జిల్లా పరిపాలనా సౌలభ్యంకోసం తొమ్మిది తాలూకాలుగాను, రెండు

రెవెన్యూ డివిజనుల క్రింద విభజింపబడి ఉన్నది. రెవెన్యూ డివిజన్లు, తాలూకాలు, వాటి కార్యస్థానాలు మున్నగు వివరాలు క్రింది పట్టికలో యివ్వబడ్డాయి.

## నైసర్గిక పరిస్థితి

జిల్లాను స్థూలంగా (1) మైదాన ప్రదేశాలు, (2) కొండలు, ఎత్తైనభూములు క్రింద విభజించవచ్చు.

తూర్పు కనుమలు యీ జిల్లానుండి పోవుచున్నవి. ఇవి మైసూరు రాష్ట్రంలో కనుగుండినుండి ప్రారంభమయి, పలమనేరు, పుంగనూరు తాలూకాలగుండా వ్యాపించి; తర్వాత చిత్తూరు, చంద్రగిరి తాలూకాలను ఒకదానినుండిమరొకదానిని వేరుచేస్తూ తిరుపతివరకూ వ్యాపించినవి. తిరుపతి అనంతరం మమందూరు కొండలు తూర్పుకనుమలను అనేకచీలికలక్రింద చీల్చినవి. ఈ చీలికలే కాళహస్తి తాలూకా వరకూ వ్యాపించి, తర్వాత నెల్లూరు జిల్లాలో ప్రవేశిస్తున్నవి. తూర్పు కనుమలకు పశ్చిమముగానున్న పలమనేరు, పుంగనూరు, మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు ఉన్న ప్రదేశం పీఠభూమి. ఇది సముద్రపు మట్టమునకు 2,000 నుండి 2,500 అడుగులవరకూ ఎత్తుగానున్నది. ఈ పీఠభూమి మైసూరు సంస్థానంలోకి వ్యాపించినది.

పీఠభూమి తాలూకాలైన మదనపల్లి, పుంగనూరు, వాయల్పాడు, కాళహస్తి, పుత్తూరు, తిరుత్తని తాలూకాలలో అనేక కొండలు, గుట్టలు ఉన్నవి. మదనపల్లి

| రెవెన్యూ డివిజను పేరు | రెవెన్యూ డివిజను కార్యస్థానం | రెవెన్యూ డివిజనులోని తాలూకాలు | తాలూకా వైశాల్యం (చ. మైళ్ళు) | తాలూకా కార్యస్థానం |
|---|---|---|---|---|
| మదనపల్లి | మదనపల్లి | మదనపల్లి | 836 | మదనపల్లి |
| | | వాయల్పాడు | 802 | వాయల్పాడు |
| | | పుంగనూరు | 648 | పుంగనూరు |
| | | పలమనేరు | 720 | పలమనేరు |
| చంద్రగిరి | చంద్రగిరి | చంద్రగిరి | 548 | చంద్రగిరి |
| | | కాళహస్తి | 615 | కాళహస్తి |
| | | పుత్తూరు | 564 | పుత్తూరు |
| | | చిత్తూరు | 778 | చిత్తూరు |
| | | తిరుత్తని | 379 | తిరుత్తని |
| | | | 5,890 | |

తాలూకాలోని అశ్వకొండలు (4100 అ. ఎత్తు), పుత్తూరు తాలూకాలోని నగరి కొండలు వీనిలో ముఖ్యమైనవి.

## నదులు

జిల్లాలో ఉత్తర భాగంలో ఉన్న నదులు ఉత్తర దిశగా ప్రవహిస్తున్నవి. దక్షిణ భాగంలోని నదులు దక్షిణ, తూర్పు దిశలలో ప్రవహిస్తున్నవి.

మైసూరు సంస్థానములో పుట్టిన పాపాఘ్నినది మదనపల్లితాలూకా పశ్చిమ కొననుండి అనంతపురం జిల్లాలోనికి ప్రవహించుచున్నది.

మదనపల్లి తాలూకాలోని అశ్వ కొండల్లో పుట్టి బాహుదానది, ఉత్తర దిశగా వాయల్పాడు తాలూకా గుండా ప్రవహించి, కడపజిల్లాలో ప్రవేశించి పెన్నా నదిలో కలియుచున్నది.

మదనపల్లి తాలూకాలోనే పెద్దేరు, చిన్నేరు అనే మరి రెండు చిన్న నదులు కూడ గలవు.

పుంగనూరు తాలూకాలోని అవులపల్లి అడవులలో పింఛానది పుట్టుచున్నది. ఇది ఉత్తరదిశగా పుంగనూరు, వాయల్పాడు తాలూకాల గుండా ప్రవహించి, కడప జిల్లాలో బాహుదా నదిలో కలియుచున్నది.

పలమనేరు తాలూకాలో దక్షిణ దిశగా ప్రవహించే కౌండిన్యనది ఉత్తర ఆర్కాటు జిల్లాలో ప్రవేశించి, అచ్చటనే పాలార్ నదిలో కలియుచున్నది.

మైసూరు సంస్థానము నుండి వచ్చే పాలార్ నది, ఉత్తర ఆర్కాటుజిల్లాలో ప్రవేశించే ముందు పలమనేరు తాలూకా దక్షిణ భాగంలో ప్రవహిస్తున్నది.

తూర్పు కనుమలలో పుట్టిన పోనీనది దక్షిణ దిశగా చిత్తూరు తాలూకాలో ప్రవహించి, ఉత్తర ఆర్కాటు జిల్లాలో ప్రవేశించి పాలార్ నదిలో కలియుచున్నది. పోనీ నది చిత్తూరు తాలూకాలో ప్రవహించునప్పుడు, చిత్తూరునది, బహుదానది, గొడ్డువంక అనే మూడు ఉపనదులు కలియుచున్నవి. అరణి నది, పుత్తూరు తాలూకాలో తూర్పు దిశగా ప్రవహించి చెంగల్పట్టు జిల్లాలో ప్రవేశిస్తున్నది. పుత్తూరు, తిరుత్తని తాలూకాలలో ప్రవహించే నగరీనది కూడ చెంగల్పట్టు జిల్లాలోనే ప్రవేశించి కుశస్థలి నదిలో కలియుచున్నది.

స్వర్ణముఖి, చంద్రగిరి తాలూకాలోని అవిసెపల్లి గ్రామసమీపంలో పుట్టి, కాళహస్తి తాలూకాగుండా ప్రవహించి నెల్లూరు జిల్లాలో ప్రవేశిస్తున్నది. చంద్రగిరి తాలూకాలో ప్రవహించే కళ్యాణినది దీనికి ఉపనది.

పేరుకు యిన్ని నదులున్నా, సంవత్సరములో అత్యధికభాగము వీటిలో నీరు వుండదు. ఒక్క వర్షాకాలంలో మాత్రమే ఈ నదులలో నీరు లభిస్తుంది.

## అడవులు

జిల్లాలో మూడవవంతు వైశాల్యం పైబడి అడవుల క్రిందనే వున్నది. అడవుల క్రింద వున్న 2,355.70 చ॥మై॥ వైశాల్యములో, 818.32 చ॥మై॥ రిజర్వు అడవుల క్రిందను, 699.33 చ॥మై॥ ప్రభుత్వం స్వాధీనముచేసుకున్న ఎస్టేటు అడవుల క్రిందను, 838.05 చ॥ మైళ్ళు ప్రభుత్వాధీనములోకి రాని ఎస్టేటు అడవుల క్రిందను ఉన్నవి.

క్రిందిపట్టికలో యేయే తాలూకాలలో, ఎంతెంత వైశాల్యము కలిగిన అడవులు వున్నవీ, వాటి విభజన మున్నగువివరాలు ఇవ్వబడ్డాయి:

లైన మదనపల్లి, వాయల్పాడు, పుంగనూరు, పలమనేరు తాలూకాలలో మొత్తం పడేవర్షంలో అధికభాగం నైరుతి ఋతుపవనముల మూలముననే లభిస్తున్నది.

| తాలూకా | రిజర్వు ఫారెస్టు (చ. మైళ్ళు) | ప్రభుత్వం స్వాధీనపరచుకున్న ఫారెస్టులు (చ. మైళ్ళు) | ప్రభుత్వం స్వాధీనపర్చని ఫారెస్టులు (చ. మైళ్ళు) | మొత్తం (చ. మైళ్ళు) |
|---|---|---|---|---|
| మదనపల్లి | 173.37 | ... | ... | 173.37 |
| వాయల్పాడు | 134.04 | ... | 56.25 | 190.29 |
| చంద్రగిరి | 231.08 | 10.00 | 29.00 | 270.08 |
| కాళహస్తి | ... | 52.03 | 221.16 | 273.19 |
| పుంగనూరు | ... | ... | 400.00 | 400.00 |
| చిత్తూరు | 105.47 | 74.46 | 100.00 | 279.93 |
| పుత్తూరు | ... | 314.04 | 11.33 | 325.37 |
| తిరుత్తని | ... | 149.60 | 20.31 | 169.91 |
| పలమనేరు | 174.36 | 99.20 | ... | 273.56 |
| మొత్తం | 818.32 | 699.33 | 838.05 | 2,355.70 |

మదనపల్లి తాలూకాలోని రిజర్వు అడవులు గుబురుగా పెరిగివుంటవి. ఇందులో వంటచెరకు, కొన్నిపాటి కలప దొరుకుతుంది. అశ్వకొండలలో మంచి గంధపు చెక్క లభ్యమవుతుంది. వాయల్పాడు, చంద్రగిరి, కాళహస్తి, చిత్తూరు, తిరుత్తని తాలూకాలలోని రిజర్వుఅడవులు దట్టమైన అడవులుమాత్రంకావు. ఇందులో కొన్ని భాగాలలో సంవత్సరమంతా చెట్లు పచ్చగానే వుంటవి.

## శీతోష్ణస్థితి - వర్షపాతం

జిల్లాకు నైరుతి ఋతుపవనములనుండి, ఈశాన్య ఋతుపవనములనుండి వర్షము లభ్యమవుతుంది. శీతలభూమి తాలూకా

ఈ పవనములవల్ల పడే వర్షాలు జూన్ నుండి సెప్టెంబరు మాసములలోగా పడును.

జిల్లా సముద్రతీరమునకు దూరముగా నుండుటచేత, జిల్లాలో ప్రవేశించే వర్షపు పవనములు చాలభాగము నీరసించియే వుంటాయి. కనుకనే ఈ జిల్లాలో సాలుసరి వర్షపాతం తక్కువ.

ప్రక్కపేజీలోని పట్టికలో తాలూకా వారి వర్షపాతం, వర్షపు దినములు ఇవ్వబడ్డాయి.

జిల్లాలోని వాయల్పాడు, మదనపల్లి, పలమనేరు, పుంగనూరు తాలూకాలున్న భూభాగం ఎత్తైన శీతలభూమి ప్రదేశమై వుండుటచేత, సంవత్సరము

| తాలూకా | సాలుసరి వర్షపాతం (అంగుళాలలో) | సాలుసరి వర్షపు రోజులు |
|---|---|---|
| మదనపల్లి | 28.32 | 47.8 |
| వాయల్పాడు | 30.52 | 47.0 |
| చంద్రగిరి | 33.76 | 46.5 |
| కాళహస్తి | 43.13 | 49.4 |
| పుంగనూరు | 29.33 | 41.2 |
| చిత్తూరు | 34.71 | 48.5 |
| పుత్తూరు | 35.32 | 49.9 |
| తిరుత్తని | 39.16 | 51.9 |
| పలమనేరు | 32.58 | 49.9 |

అంతటా చక్కని శీతోష్ణ పరిస్థితులు ఉంటాయి. ఈ శీతోష్ణ పరిస్థితి చాల ఆరోగ్యమైనదికూడా. ఏ కాలములోను వేడి 95 డిగ్రీలు దాటి ఉండదు. మైదాన ప్రాంతాలయిన చంద్రగిరి, తిరుత్తని, పుత్తూరు, కాళహస్తితాలూకాలలో ఎండ పైతాలూకాలకన్న తీవ్రముగానే ఉంటుంది. అయినా భరించరాని పరిస్థితిలో ఉండదు.

## సాగు సదుపాయాలు

పెద్ద ఇరిగేషన్ వసతులేవీ యీ జిల్లాలో లేవు. నీటి సౌకర్యంతో పండించే పంటలన్నీ ప్రధానంగా వర్షాధారమే. ఈ వర్షాధారంపై ఆధారపడే చెరువులద్వారానూ, చిన్న చిన్న నదులపై నిర్మించిన అడ్డుకట్టల సాయంతో నిల్వ ఉంచగల్గిన నీటితోనూ పండించబడుతున్నది. కొన్ని చోట్ల నూతుల సహాయంతోకూడ సాగు చేయబడుతున్నది. కనుకనే జిల్లాలో అత్యధికభాగంలో తరుచు క్షామం పొడచూపుతుంటుంది.

## మదనపల్లి తాలూకా

పెద్దతిప్పసముద్రం చెరువు, రంగసముద్రంచెరువు, కందుకూరు చెరువు, చిన్నతిప్ప సముద్రం చెరువు అనే నాలుగు పెద్దచెరువులు కలవు. ఈ చెరువులక్రింద ఆయకట్టుకు చాలావరకు నీరు అందుతూనే ఉంటుంది. తాలూకాలోని ఇతరచెరువులలో మాత్రం నీటికొరత ఎల్లప్పుడూ ఉంటూనే వుంటుంది. బావులు మాత్రం చాలా ఉన్నాయి. కాని సరియైన వర్షాలులేక కరువుకాటకాలు నిత్యం యీప్రాంతంలో ప్రత్యక్షమవుతూనే ఉంటాయి.

## పుంగనూరు తాలూకా

కరువుతాలూకాలలో ఇది ఒకటి. వర్షాధారమైన చెరువులు, ప్రయివేటు

బావులు మాత్రమే యిచ్చటవున్న సాగు సౌకర్యాలు.

## పలమనేరు తాలూకా

తాలూకాలోని తూర్పుభాగంలో కొన్ని ప్రదేశాలు కౌండిన్యనదీజలాలతో సాగుచెయ్యబడుతున్నాయి. ఇంకా కొన్ని చెరువులూ, బావులు కూడా సాగుకు తోడ్పడతాయి. అయినా వర్షాలులేని సంవత్సరం యివేవీ గ్యారంటీ నీటివనరులుగా నిల్వలేవు. కనుక తరచు క్షామం వస్తూనే వుంటుంది.

## వాయల్పాడు తాలూకా

వర్షాధారమైన చెరువులు, బావులు మాత్రమే యీ తాలూకాలోని నీటి వనరులు. కనుక వర్షాలు సరిగాపడనిసంవత్సరం కరువు ప్రత్యక్షమే.

## చంద్రగిరి తాలూకా

స్వర్ణముఖి, కళ్యాణి నదులనుండి త్రవ్వబడ్డ ఊటకాల్వల ద్వారా కొంత భూభాగం సాగులోవున్నది. ఈ కాల్వల ద్వారా నీటిక్రింది ఆయకట్టుకు మాత్రం సమృద్ధిగా నీరు లభ్యమవుతుంది. వీటికి సహాయకారిగా తాలూకాలో కొన్ని మంచి ఊటగల బావులు, చిన్నచిన్న చెరువులు కలవు.

## కాళహస్తి తాలూకా

స్వర్ణముఖీ నదినుండి కాల్వల ద్వారా తాలూకాలో అనేక చెరువులకు నీరు సప్లయి చేయబడుతున్నది. వర్షాలు పడిన సంవత్సరాలలో యిందుమూలమున యీ చెరువులకు నీటి కరువు వుండదు. అయినా మంచి సంవత్సరంలో యీ తాలూకాలో మొత్తం సాగయ్యే భూమి 39 వేల యకరాలు మాత్రమే.

## పుత్తూరు తాలూకా

అరణి, నగరి నదుల నీటితో కొంత సాగుచెయ్యబడుతున్నది. వర్షాధారంపై ఆధారపడ్డ చెరువులు చాలా ఉన్నాయి. 24 వేల యకరాలవరకూ మేజరు, మైనరు ఇరిగేషను వర్కుల క్రింద యీ తాలూకాలో (వర్షాలు సరిగా ఉన్న సంవత్సరంలో) సాగు చెయ్యబడుతున్నది.

## తిరుత్తని తాలూకా

కుశస్థలీ, నగరీ నదీజలాలతో కొంత భూమి సాగుచెయ్యబడుతున్నది. చెరువులు, బావుల క్రింద కూడ కొంతసేద్యం జరుగుతున్నది. కాని వర్షాలు లేని సంవత్సరంలో కరవు ప్రత్యక్షం.

## చిత్తూరు తాలూకా

ప్రయివేటు బావులు, వర్షాధారమైన చెరువులు మాత్రమే యీ తాలూకాలో నీటి వనరులు. వర్షాలు సకాలంలో లేని యెడల యీ బావులూ, చెరువులూ సాగుకతోడ్పడవు. తాలూకా మొత్తంలో షుమారు 29 వేల యకరాలు వివిధ రకముల నీటి సదుపాయాలు కల్గిఉన్నాయి.

జిల్లా మొత్తంలో 7,622 మైనరు ఇరిగేషను వర్కులు, 122 మేజరు ఇరిగేషను వర్కులు ఉన్నాయి. మైనరు ఇరిగేషను వర్కులలో దరిదాపు అన్నీ వర్షాధారాలే. వీటన్నింటి క్రిందా సక్రమంగా వర్షాలు ఉన్న సంవత్సరంలో రెండున్నర లక్షల ఎకరాలు సాగుచేయబడుతవి.

ప్రక్కపేజిలోని పట్టికలో తాలూకా వారీ సాగుసౌకర్యాల వివరాలు ఇవ్వబడ్డాయి.

| తాలూకా | మైనరు ఇరిగేషను వనరుల సంఖ్య | మైనరు ఇరిగేషను క్రింద విస్తీర్ణం (ఎకరాలు) | మేజరు ఇరిగేషను వనరుల సంఖ్య | మేజరు ఇరిగేషను క్రింద నేల (ఎకరాలు) |
|---|---|---|---|---|
| మదనపల్లి | 1,274 | 25,093 | 13 | 6,935 |
| వాయల్పాడు | 1,807 | 24,605 | 4 | 972 |
| చంద్రగిరి | 357 | 7,184 | 5 | 1,645 |
| కాళహస్తి | 273 | 32,513 | 8 | 6,826 |
| పుంగనూరు | 1,304 | 29,745 | 13 | 3,711 |
| చిత్తూరు | 875 | 25,520 | 31 | 3,574 |
| పుత్తూరు | 366 | 21,040 | 13 | 3,712 |
| తిరుత్తని | 441 | 32,947 | 31 | 13,490 |
| పలమనేరు | 925 | 18,469 | 4 | 1,017 |
| మొత్తం | 7,622 | 2,17,116 | 122 | 41,882 |

## ఆహార-ఆహారేతర పంటలు

జిల్లాలోని ప్రధాన ఆహారపంట వరి. రెండున్నర లక్షల ఎకరాలలో వరి పండించబడుతున్నది. రాగి, సజ్జ కూడా ముఖ్యమైన ఆహారపంటలు. లక్షా 42 వేల ఎకరాలలో రాగి పండించబడుతున్నది. సజ్జ లక్షా 39 వేల ఎకరాలలో పండించబడుతున్నది.

ఆహారేతర పంటలలో అత్యంత ప్రధానమైనది వేరుశనగ. రెండులక్షల 23 వేల ఎకరాలలో ఇది పండించబడుతున్నది.

జిల్లాలో అప్పుడప్పుడూ పండ్లతోటలు కూడ కానవస్తాయి. చీనీ, నిమ్మ, ద్రాక్ష, మామిడి విస్తారంగా పెంచబడుతున్నాయి. చిత్తూరు తాలూకాలో ఇతర తాలూకాలకన్న తోటలు విస్తారంగా వ్యాపిస్తాయి.

తాలూకావారీ పంటలవిభజన ప్రక్క పేజీలోని పట్టికలో యివ్వబడింది. గత 10 సం॥ పాటు తక్కువ 1949-50 సం॥ సక్రమంగా పంటలు పండిన సంవత్సరంగా తీసుకోబడింది. ఆ సంవత్సరంలో ఏయే పంటక్రింద ఎంత భూమి ఉన్నదీ పట్టికలో యివ్వబడ్డది.

## రహదారులు

ప్రక్కనున్న జిల్లాలన్నిటితోనూ, మైసూరు సంస్థానంతోనూ సంబంధాలు పెట్టుకొంటో ఏర్పడే రోడ్లు జిల్లాయందంతటా 1,728 మైళ్ళ పొడుగున విస్తరించి ఉన్నాయి. ఇందులో 43 మైళ్ళు మ్యునిసిపల్ రోడ్లు. వీటిని మినహాయించి, మిగతా వాటి తాలూకావారీ వివరాలు 368వ పేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి.

| పంట | | మదనపల్లె ఎకరాలలో | వాయల్పాడు ఎకరాలలో | చంద్రగిరి ఎకరాలలో | కాళహస్తి ఎకరాలలో | పుంగనూరు ఎకరాలలో | చిత్తూరు ఎకరాలలో | పుత్తూరు ఎకరాలలో | తిరుత్తని ఎకరాలలో | పలమనేరు ఎకరాలలో | మొత్తం ఎకరాలలో |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వరి | మాగాణి | 15,500 | 36,800 | 23,100 | 50,200 | 14,900 | 42,800 | 13,100 | 25,600 | 15,300 | 2,36,300 |
| | మెట్ట | 4,400 | 300 | 600 | ... | ... | 600 | 5,100 | 2,500 | 900 | 14,400 |
| జొన్న | | 10,100 | 3,600 | 2,700 | ... | ... | 9,800 | 2,800 | 1,500 | 3,400 | 33,800 |
| సజ్జ | | 49,000 | 50,500 | 7,400 | 100 | 4,400 | 5,900 | 10,800 | 5,800 | 5,000 | 1,38,900 |
| రాగి | | 28,100 | 5,100 | 4,100 | 1,100 | 25,800 | 13,000 | 11,800 | 9,700 | 44,000 | 1,41,700 |
| కొఱ్ఱ | | 1,200 | 300 | 100 | ... | ... | 100 | 400 | 500 | ... | 2,600 |
| వరిగ | | 4,500 | 3,300 | 400 | ... | ... | 4,400 | 1,200 | 600 | 900 | 15,300 |
| సామలు | | 1,400 | ... | ... | ... | 2,400 | 100 | ... | ... | 9,700 | 13,600 |
| పచ్చపెసలు | | 100 | 100 | 100 | ... | ... | 100 | ... | ... | ... | 400 |
| కందులు | | 2,100 | 500 | 200 | ... | ... | 900 | 500 | 500 | 700 | 5,400 |
| మినుములు | | 300 | ... | ... | ... | ... | ... | 100 | 100 | ... | 500 |
| ఉలవలు | | 14,400 | 3,100 | 700 | ... | 800 | 2,400 | 1,000 | 400 | 6,400 | 29,100 |
| మిర్చి | | 1,500 | 900 | 200 | ... | 200 | 900 | 300 | ... | 1,300 | 5,300 |
| వేరుశనగ | | 53,200 | 58,300 | 10,100 | 1,200 | 23,400 | 44,200 | 6,100 | 5,500 | 21,400 | 2,23,400 |
| నువ్వులు | | 200 | 100 | 900 | ... | ... | 300 | 1,600 | 1,400 | 100 | 4,600 |
| పొగాకు | | 200 | ... | ... | ... | ... | ... | ... | ... | 100 | 300 |

| తాలూకా | జాతీయ రహదారి (మైళ్ళు) | రాష్ట్ర రహదారి (మైళ్ళు) | ప్రధాన జిల్లా రోడ్లు (మైళ్ళు) | ఇతర జిల్లా రోడ్లు (మైళ్ళు) | గ్రామ రోడ్లు (మైళ్ళు) | మొత్తం రోడ్లు (మైళ్ళు) |
|---|---|---|---|---|---|---|
| మదనపల్లి | ... | 35 | 12 | 138 | 35 | 220 |
| వాయల్పాడు | ... | 22 | 68 | 98 | 47 | 235 |
| చంద్రగిరి | ... | 12 | 76 | 45 | 34 | 167 |
| కాళహస్తి | ... | ... | 60 | 30 | 65 | 155 |
| పుంగనూరు | 4 | 22 | 32 | 58 | 27 | 143 |
| చిత్తూరు | 36 | 25 | 45 | 65 | 76 | 247 |
| పుత్తూరు | ... | ... | 64 | 41 | 45 | 150 |
| తిరుత్తని | ... | ... | 73 | 22 | 75 | 170 |
| పలమనేరు | 14 | 5 | 65 | 27 | 87 | 198 |
| | 54 | 121 | 495 | 524 | 491 | 1,685 |

## రైల్వే

233½ మైళ్ళ నిడివిగల రైలుబాట జిల్లాలో ఉన్నది. ఇందులో 68¼ మైళ్ళు బ్రాడుగేజి. 165¼ మైళ్ళు మీటరుగేజి. మద్రాసు - బొంబాయి; మద్రాసు - బెంగుళూరు బ్రాడుగేజి రైలుమార్గాలు యీ జిల్లాగుండా పోవుచున్నవి. ఇందులో మద్రాసు - బొంబాయిరైలు తిరుత్తని, పుత్తూరు, చంద్రగిరి తాలూకాలగుండాను; మద్రాసు - బెంగుళూరురైలు పలమనేరు తాలూకా దక్షిణభాగమునుండీ పోవుచున్నది.

చిత్తూరు, చంద్రగిరి, కాళహస్తి తాలూకాలగుండా గూడూరు-కాట్పాడి మీటరుగేజి బాట పోవుచున్నది. పాకాల ధర్మవరం మీటరుగేజి రైలుమార్గంకూడ చంద్రగిరి, పుంగనూరు, వాయల్పాడు, మదనపల్లి తాలూకాలగుండా పోవుచున్నది.

జిల్లాలోని రైలుమార్గం అంతా దక్షిణ రైల్వేలోని భాగమే.

## జనాభా

1941-51 జనాభా లెక్కల కాలంలో, జిల్లా జనాభా 16,33,209 నుండి 18,10,377 కు పెరిగింది. అనగా గత 10 సం॥లోను జిల్లా జనాభా సగటున నూటికి 10.8 చొప్పున వృద్ధిచెందింది. కాని 1931-41 సం॥ జనాభా అభివృద్ధి నూటికి 12.8 చొప్పున ఉంది.

తాలూకావారీ విభజనను గమనించిన మదనపల్లి, వాయల్పాడు, పుంగనూరు

చిత్తూరు తాలూకాల జనాభా అభివృద్ధి యితర తాలూకాలకన్న మెరుగుగా ఉన్నది. దీనికి ప్రధానకారణం యీ తాలూకాలు జిల్లాకు పశ్చిమదిశగా ఉండటంవల్ల, నైరుతీ ఋతుపవనాల మూలంగా లభించే వర్షాలు వీటికే దక్కుతున్నవి. ఆ విధంగా మిగతా ప్రదేశాల కన్న యిచ్చట బ్రతుకుతెరువు మార్గం కొంత తేలిక అయింది. కాని మిగతా తాలూకాలు ఈశాన్య ఋతుపవనాల పైననే ఆధారపడుతున్నవి. ఇచ్చట సకాలంలో వర్షాలు లేక వలసలు జాస్తి అవటం_ముఖ్యంగా మైసూరు సంస్థానం లోని కోలారుకు పోవటం_వర్షాలు లేని సంవత్సరాలలో జరుగుతుంటుంది. కనుకనే కాళహస్తి, తిరుత్తని, పుత్తూరు, చంద్రగిరి తాలూకాలలో జనాభా అభివృద్ధి నామమాత్రమే. చంద్రగిరిపట్టణ జనాభా అభివృద్ధిలో గత 10 సం॥ జనాభా అభివృద్ధి 10.2%గా చూపించబడ్డా, గ్రామీణ జనాభా పరిస్థితిని విడిగా గమనించిన యీ అభివృద్ధి 2% మాత్రమే. ఇక పుత్తూరు తాలూకా గ్రామీణ జనాభా లెక్కలనే గమనించిన 1941-51 సం॥ మధ్యకాలంలో 1931-41 సం॥ జనాభా కన్న నూటికి 1.1 చొప్పున జనాభా తగ్గింది.

క్రింది పట్టికలో తాలూకావారీ జనాభా, పెరుగుదల శాతం, గ్రామ పట్టణ వివరాలు మున్నగునవి పొందుపర్చబడ్డవి.

జిల్లా జనాభా 2,202 గ్రామాలలోనూ, పట్టణాలలోనూ నివసిస్తున్నట్లు 1951 జనాభా లెక్కలలో అంచనా వేయబడ్డది. ఈ గ్రామాలలోనూ, పట్టణాలలోనూ 3,50,292 ఇండ్లు కలవు. అనగా సగటున ఇంటికి 6 గురు చొప్పున నివాస ముంటున్నారు.

మొత్తం 3,50,293 ఇండ్లలో 2,90,764 ఇండ్లు గ్రామాలలోనూ, 59,528 ఇండ్లు పట్టణాలలోనూ ఉన్నాయి.

| తాలూకా పేరు | జనాభా 1941 | జనాభా 1951 | జనాభా పెరుగుదల శాతం | గ్రామాలు | పట్టణాలు |
|---|---|---|---|---|---|
| మదనపల్లి | 1,73,591 | 1,97,289 | 13.7 | 113 | 1 |
| వాయల్పాడు | 1,66,643 | 1,90,097 | 14.1 | 126 | 1 |
| చంద్రగిరి | 1,49,726 | 1,65,195 | 10.3 | 265 | 3 |
| కాళహస్తి | 1,29,734 | 1,36,910 | 5.5 | 383 | 1 |
| పుంగనూరు | 1,34,487 | 1,47,398 | 9.6 | 105 | 1 |
| చిత్తూరు | 3,01,187 | 3,40,717 | 13.1 | 374 | 1 |
| పుత్తూరు | 2,18,016 | 2,30,088 | 5.5 | 176 | 2 |
| తిరుత్తని | 2,18,057 | 2,32,941 | 6.8 | 336 | 2 |
| పలమనేరు | 1,41,761 | 1,69,739 | 19.7 | 324 | 2 |
| జిల్లా మొత్తం | 16,33,202 | 18,10,377 | 10.8 | 2,202 | 14 |

జిల్లా జనాభా 18,10,377 మందిలోనూ 16,41,043మంది గ్రామాలలోనూ, 1,69,334 మంది పట్టణాలలోనూ నివసిస్తున్నారు. మొత్తం జిల్లా జనాభాలో షుమారుగ పదిమందిలో ఒకరు మాత్రమే పట్టణాలలో నివసిస్తున్నారు.

క్రింది పట్టికలో గ్రామీణ, పట్టణ జనాభా, గ్రామాలలోని, పట్టణాలలోని ఇండ్ల సంఖ్య వివరాలు మున్నగునవి ఇవ్వబడ్డాయి.

## వైద్య సౌకర్యాలు

జిల్లా మొత్తంలో రోగుల నిల్వ ఉంచి చికిత్సచేయగల్గిన ఆస్పత్రులు 6 మాత్రమే ఉన్నవి. వీనిలో 210 మందిని మాత్రమే నిల్వ ఉంచే సౌకర్యాలు గలవు. 32 మాత్రమే వైద్యశాలలు ఉన్నాయి.

చిత్తూరు జిల్లాలో వైద్యశాలల నెలకొల్పు తోడ్పడే చక్కటి శీతోష్ణపరిస్థితులు కలిగిన ప్రదేశం విరివిగావుంది. అయినా మదనపల్లిలోని మిషను క్షయ ఆస్పత్రి మినహా, యీప్రదేశంలో ఏ పెద్ద చికిత్సాలయం ఏర్పాటుబడలేదు. కనీసం జిల్లా ప్రజలకు అనువైన వైద్యసదుపాయాలను అందించే వైద్యాలయాలు కూడ కరువే!

ప్రక్కపేజీలోని పట్టికలో తాలూకావారీ వైద్యాలయాల (1951) వివరాలు పొందుపర్చబడ్డాయి.

| తాలూకా | మొత్తం ఇండ్ల సంఖ్య | గ్రామాలలోని ఇండ్ల సంఖ్య | పట్టణాలలోని ఇండ్ల సంఖ్య | మొత్తం జనాభా | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా |
|---|---|---|---|---|---|---|
| మదనపల్లి | 31,593 | 29,475 | 2,118 | 1,97,289 | 1,81,147 | 16,142 |
| వాయల్పాడు | 33,909 | 32,911 | 998 | 1,90,097 | 1,84,049 | 6,048 |
| చంద్రగిరి | 30,309 | 24,630 | 5,679 | 1,65,198 | 1,32,240 | 32,960 |
| కాళహస్తి | 23,790 | 20,885 | 2,905 | 1,36,910 | 1,18,989 | 17,921 |
| పుంగనూరు | 23,977 | 22,401 | 1,576 | 1,47,398 | 1,36,114 | 11,284 |
| చిత్తూరు | 94,507 | 55,668 | 38,839 | 3,40,717 | 3,01,823 | 38,984 |
| పుత్తూరు | 45,031 | 42,733 | 2,298 | 2,30,088 | 2,15,532 | 14,556 |
| తిరుత్తని | 38,890 | 35,937 | 2,953 | 2,32,941 | 2,14,812 | 18,129 |
| పలమనేరు | 28,286 | 26,124 | 2,162 | 1,69,739 | 1,56,339 | 13,400 |
| జిల్లా మొత్తం | 3,50,292 | 2,90,764 | 59,528 | 18,10,377 | 16,41,043 | 1,69,334 |

| తాలూకా | ఆస్పత్రులు | | | వైద్యశాలలు | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రభుత్వం | లోకలు ఫండు | మంచాల సంఖ్య | ప్రభుత్వం | లోకలు ఫండు | గ్రామీణ వైద్యశాలలు |
| మదనపల్లి | 1 | ... | 40 | ... | ... | 4 |
| వాయల్పాడు | ... | ... | ... | ... | 4 | 2 |
| చంద్రగిరి | 1 | ... | 33 | ... | 1 | 2 |
| కాళహస్తి | 1 | ... | 16 | ... | ... | 1 |
| పుంగనూరు | ... | 1 | 4 | ... | 1 | 1 |
| చిత్తూరు | 1 | ... | 95 | ... | ... | 5 |
| పుత్తూరు | ... | ... | ... | ... | 3 | 1 |
| తిరుత్తని | ... | ... | 4 | 1 | 1 | 2 |
| పలమనేరు | 1 | ... | 18 | ... | 1 | 2 |
| | 5 | 1 | 210 | 1 | 11 | 20 |

## పరిశ్రమలు

జిల్లాలో చెప్పుకోదగిన పెద్ద పరిశ్రమలు ఏవీ లేవు. ఫ్యాక్టరీచట్టంక్రింద వచ్చేపరిశ్రమలు 1951 సం॥కి 22 మాత్రం యీ జిల్లాలో ఉన్నాయి. ఇందులో 14 చిన్నచిన్న లోహపరిశ్రమా కార్యాగారాలు. వీటిలో 899 మందికి జీవనం గడుస్తున్నది. ఈ 14 ఫ్యాక్టరీలూ చంద్రగిరి తాలూకాలోనివే.

గంధపుచెక్కనూనె, రాసాయనిక పరిశ్రమకు చెందిన 6 ఫ్యాక్టరీలు పలమనేరు తాలూకాలో ఉన్నాయి. వీటిలో 103 గురు ఉద్యోగంలో ఉన్నారు.

# ఆంధ్రరాష్ట్రం - భారతదేశం

ఆంధ్రదేశ వైశాల్యం 63,417 చ. మైళ్ళు. మొత్తం భారతదేశ వైశాల్యం, (12,21,064 చ. మై.) లో 20 వ వంతు. బెల్జియం, హాలెండు, డెన్మార్కు దేశాలకు నాలుగురెట్లు; స్కాట్లెండ్, ఐర్లండు, బల్గేరియా, గ్రీసు దేశాలకు రెండురెట్లున్నది. నాటి మదరాసురాష్ట్ర వైశాల్యంలో సగంకంటె కొంచెం తక్కువ. హైదరాబాదు సంస్థానం వైశాల్యంలో నాలుగింట మూడుపాళ్లు, మైసూరు సంస్థానానికి రెండురెట్లు ఉన్నది.

## జనాభా

ఆంధ్రరాష్ట్ర జనాభా, 1951 లో 2,05,07,801. భారతదేశ మొత్తం జనాభాలో—జమ్మూ కాశ్మీరు, అస్సాం లోని కొండజాతుల ప్రాంతంకూడా కలిపి (36 కోట్ల 81 లక్షలు) - ఆంధ్రరాష్ట్ర జనాభా 18 వ వంతు.

“ఎ” తరగతి రాష్ట్రాలలో వైశాల్యం, జనాభా, జనసమ్మర్దం విషయాలలో ఆంధ్ర ఏ స్థానాన్ని ఆక్రమిస్తున్నదీ, క్రింది పట్టిక వ్యక్తం చేస్తున్నది.

## వర్షపాతం

నైరుతి ఋతుపవనాలవల్ల (జూన్ - సెప్టెంబరు) కలిగే వర్షపాతంలో భారతదేశంలోని మరే ప్రాంతంలోకంటె “మలబారు-దక్షిణకెనరా” ప్రాంతంలో అత్యధిక వర్షం (100.3 అం) పడుతున్నది. దీని

| రాష్ట్రం పేరు | వైశాల్యం (వేలచ.మై.) | ఎన్నో స్థానం | జనాభా లక్షల్లో | ఎన్నో స్థానం |
|---|---|---|---|---|
| మధ్యప్రదేశ్ | 1,30 | 1 | 2,10 | 4 |
| ఉత్తరప్రదేశ్ | 1,28 | 2 | 6,30 | 1 |
| బొంబాయి | 1,11 | 3 | 3,60 | 3 |
| అస్సాము | 85 | 4 | 90 | 9 |
| బీహారు | 70 | 5 | 4,00 | 2 |
| ఒరిస్సా | 60 | 7 | 1,50 | 7 |
| ఆంధ్ర | 63 | 6 | 2,05 | 6 |
| పంజాబు | 37 | 8 | 1,30 | 8 |
| పశ్చిమబెంగాల్ | 31 | 9 | 2,50 | 5 |

తర్వాత కొంకన్ (93.7 అం॥), పశ్చిమ బెంగాలు హిమాలయ పర్వతప్రాంతం (79.5 అం॥), తెలంగాణ (70.9 అం॥), అస్సాం (మణిపూరు త్రిపురతోసహా) (61.7 అం॥)వరుసగా రెండవ, మూడవ, నాల్గవ,ఐదవ స్థానాలనాక్రమిస్తున్నాయి.

భారతదేశంలోకెల్లా తక్కువ వర్షం పడే ప్రాంతాలలో ఆంధ్రరాష్ట్రం ఒకటి. సముద్రతీర ప్రాంత జిల్లాలలో (19.8 అం॥) కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు జిల్లాల ప్రాంతంలో (15.3 అం.) వర్షం పడుతున్నది.

## నదులు

ఆంధ్రలోని నదులన్నీ కలసి యేటా 15 కోట్ల ఎకరపు టడుగుల నీటిని సముద్రంలో పోస్తున్నాయి. భారతదేశంలో ఒక్క బ్రహ్మపుత్రానది తప్ప, మిగతా నదులన్నీ కలసి యేటా సముద్రంలో పోసే నీటిలో ఇది 15% ఉంటుంది. మదరాసు రాష్ట్రంలోని నదులు, ఒరిస్సాలోని నదులు యేటా సముద్రంలో పోసే నీరు ఆంధ్ర నదులు యేటా సముద్రంలో పోసే నీటి పరిమాణంలో వరుసగా 13%, 80% ఉంటుంది.

## వ్యవసాయం

భారతదేశ మొత్తం వైశాల్యంలో (81,10 లక్షల ఎకరాలు) (1948 లో) పంటలు పండించ బడుతున్న భూమి (24,40 లక్షలఎకరాలు) నూటికి 30పాళ్లు. ఆంధ్రలో పంటలు పండించబడుతున్న భూమి (1951 లో) మొత్తం రాష్ట్ర వైశాల్యంలో 40%.

భారతదేశపు మొత్తం పంట భూమిలో సాగుచేయబడుతున్న (Irrigated)భూమి (4,80 లక్షల ఎకరాలు) 20%. ఆంధ్రలోని మొత్తం పంట భూమిలో, సాగు చేయబడుతున్న భూమి (70 లక్షల ఎకరాలు) 41%; భారతదేశంలో సాగుచేయబడుతున్న భూమిలో 15%.

ఇదే విధంగా పాకిస్తాన్‌లో 67%, ఈజిప్టులో 77%, జపాన్‌లో 46% సాగు చేయబడుతున్నది.

## ఆహార ధాన్యాలు

భారతదేశంలో ఆహార ధాన్యాలు (పప్పు దినుసులు మినహాయించి) 1948-49లో 16,77 లక్షల ఎకరాలలో పండించబడ్డాయి. ఇది మొత్తం పంట భూమిలో 69%. ఆంధ్రలో 101 లక్షల ఎకరాలలో ఆహార పంటలు పండించబడుతున్నాయి. ఈభూమి వైశాల్యం, మొత్తం పంట భూమి వైశాల్యంలో 60%; భారతదేశంలో ఆహార పంటలు పండించబడుతున్న భూమి వైశాల్యంలో 6%.

## కాయధాన్యాలు

ఆంధ్రలో 17 లక్షల ఎకరాలలో కాయధాన్యాలు పండించబడుతున్నాయి. ఈ విస్తీర్ణం భారతదేశంలో కాయధాన్యాలు పండించబడుతున్న భూమి విస్తీర్ణం (4,75 లక్షల ఎకరాలు)లో సుమారు 4%.

## నూనెగింజలు

భారతదేశంలో 2,60 లక్షల ఎకరాలలో నూనెగింజలు పండించబడుతున్నాయి. ఇది, దేశపు మొత్తం పంట భూమిలో 9%. ఆంధ్రలో నూనెగింజలు పండించబడుతున్న విస్తీర్ణం (27 లక్షల ఎకరాలు), భారతదేశంలో నూనెగింజలు పండించబడుతున్న భూవిస్తీర్ణంలో 10%.

## చెరకు

ఆంధ్రలో 1,34 వేల ఎకరాలలో ఏటా చెరకు పండించబడుతున్నది. ఈ భూ విస్తీర్ణం భారతదేశంలో చెరకు పండించబడుతున్న భూ విస్తీర్ణం లో (41,38 వేల ఎకరాలు) నూటికి మూడు పాళ్ళు.

## మిర్చి

భారతదేశంలో 14,64,000 ఎకరాలలో ఏటా 3,45 వేల టన్నుల మిరపకాయలు పండించబడుతున్నాయి. ఆంధ్రలో మిరపకాయలు పండించే భూ విస్తీర్ణం (2,70 వేల ఎకరాలు) భారతదేశంలో మిరపకాయలు పండించే భూ విస్తీర్ణంలో 18 %, పంటలో 31 % ఉన్నది.

## పొగాకు

ఆంధ్రరాష్ట్రంలో సాలుకు 3,365 వేల ఎకరాలలో 1,10 వేల టన్నుల పొగాకు (నాటు-వర్జీనియా) పండించబడుతున్నది. ఈ పంట భారతదేశపు మొత్తం పొగాకు పంటలో 44 %. ఆంధ్రలో పండే పొగాకు పంటలో ఒక గుంటూరు జిల్లాలోనే 60 % పండించబడుతున్నది.

## ప్రత్తి

1951-52 సంవత్సరంలో 540 వేల ఎకరాలలో 69 వేల బేళ్ళు (392 పౌనులు ఒక బేలు) ప్రత్తి పండించబడింది. ఈ పంట పండించబడిన విస్తీర్ణం, పండిన పంట, భారతదేశంలో ప్రత్తి పండించబడిన భూ విస్తీర్ణం, పంటలో వరుసగా 3.33 %, 3.19 % ఉంటుంది.

## అడవులు

భారత దేశంలో ఉన్న అడవుల విస్తీర్ణం 1,82,539 చదరపు మైళ్ళు. ఇది భారత దేశ మొత్తం వైశాల్యంలో 19 %.

ఆంధ్రలో ఉన్న రిజర్వు అడవుల విస్తీర్ణం 10,357 చదరపు మైళ్ళు. ఈ విస్తీర్ణం భారతదేశంలోని రిజర్వు అడవుల వైశాల్యం(99,476 చ. మై.) లో 10 %.

## కాగితం ఉత్పత్తి

భారత దేశపు కాగితపు ఉత్పత్తి (సాలుకు 1,31 వేల టన్నులు) లో ఆంధ్రా పేపరు ఉత్పత్తి (784 టన్నులు) నూటికి ఒక్క పాలు కంటే కూడా తక్కువ.

ఆంధ్రలో ఉన్న పేపరు మిల్లు ఒక్కటే. ఒక్కటి ఆంధ్రా పేపరు మిల్లు-రాజమండ్రి. దాని ఉత్పత్తి శక్తి (3,660 టన్నులు) భారత పేపరుమిల్లులన్నిటి ఉత్పత్తి శక్తి (137 వేల టన్నులు) లో నూటికి నాలుగు పాళ్ళు.

## ఖనిజాలు

ఆంధ్రలో తీయబడుతున్న వివిధ ఖనిజాలు భారతదేశంలో తీయబడే మొత్తం ఖనిజ పరిమాణంలో ఎన్నో వంతో ప్రక్క పేజీలోని పట్టిక వివరిస్తుంది.

## విద్యుచ్ఛక్తి

ఆంధ్రదేశపు విద్యుదుత్పత్తి శక్తి 1952-53 సంవత్సరంలో 33,121 కిలోవాట్లు. 1951 లో భారతదేశపు టుత్పత్తి శక్తి 20 లక్షలకిలోవాట్లు. భారతదేశపు టుత్పత్తి శక్తిలో ఆంధ్రరాష్ట్రపు టుత్పత్తి శక్తి నూటికి ఒక్కపాలుకన్న కొంచెం అధికం.

| ఖనిజం పేరు | ఆంధ్ర 1949 ఉత్పత్తి (టన్నుల్లో) | భారతదేశం 1949 ఉత్పత్తి (టన్నుల్లో) | భారతదేశ ఉత్పత్తిలో ఆంధ్ర ఉత్పత్తి శాతం |
|---|---|---|---|
| ఆస్బెస్టాస్ | 76 | 146 | 52.0 |
| బాక్సైట్ | 21,096 | 21,118 | 99.8 |
| కాల్సైట్ | 1,558 | 2,188 | 71.0 |
| క్రోమైట్ | 5,142 | 19,416 | 27.0 |
| మైకా | 19,492 * (Cwts) | 1,36,308♦ (Cwts) | 14.0 |
| మాంగనీసు | 63,355 * | 4,51,034♦ | ... |

ఆంధ్రలో నందికొండ, పులిచింతల, రామపాదసాగరం తదితర ప్రాజెక్టులవద్ద విద్యుదుత్పత్తి కేంద్రాలను నిర్మించినప్పుడు అవి ఉత్పత్తి చేయగలిగిన విద్యుత్ పరిమాణం, భారతదేశపు ప్రస్తుతపు ఉత్పత్తి శక్తిలో నాల్గవవంతుకంటె కొంచెం అధికంగా ఉంటుంది.

1951 లో భారతదేశపు విద్యుదుత్పత్తి శక్తి 5 లక్షల కిలోవాట్లకన్న కొంచెం తక్కువ. పై ప్రాజెక్టులన్నీ నిర్వహించబడిననాడు ఆంధ్ర ఉత్పత్తి చేయగలిగిన జలవిద్యుత్ సుమారు 6, 50 వేల కిలో వాట్లు. ఇది ప్రస్తుతపు భారత జల విద్యుదుత్పత్తి శక్తికన్న లక్షన్నర కిలోవాట్లు అధికం.

తల 1కి 1950 లో వినియమవుతున్న విద్యుత్ వివిధ దేశాలలో ఎన్ని యూనిట్లున్నది దిగువ పట్టిక వివరిస్తుంది.

| దేశం పేరు | యూనిట్లు |
|---|---|
| కనడా | 3,410 |
| యునైటెడ్ స్టేట్సు | 2,560 |
| బ్రిటన్ | 1,110 |
| నార్వే | 5,308 |
| జపాన్ | 542 |
| ఇండియా | 14 |
| మదరాసురాష్ట్రం | 19 |
| ఆంధ్రరాష్ట్రం | 4† |

## బ్యాంకులు

1952 సంవత్సరంలో ఆంధ్రబ్యాంకింగు వ్యాపారం భారతదేశ బ్యాంకింగు వ్యాపారంలో ఎంత శాతమో ప్రక్కపేజీలోని పట్టిక వివరిస్తుంది.

* 1951 సంవత్సరపు అంచనాలు.
♦ 1947 సంవత్సరపు అంచనాలు.
Cwts – హండ్రెడు వెయిట్లు.
† 1952-53 సంవత్సరంలో

## జాయింట్ స్టాక్ బ్యాంకులు

| వివరం | భారతదేశం | ఆంధ్ర | భారతదేశంలో ఆంధ్రస్థానం |
|---|---|---|---|
| బ్యాంకుల సంఖ్య | 534 | 7 | 1.2% |
| పెట్టుబడి-మూలధనం (లక్షల రూ. లలో) | 74,25 | 59 | 0.8% |
| డిపాజిట్లు (లక్షల రూ. లలో) | 9,56,69 | 5,40 | 0.6% |
| 1952 లో కోపరేటివు బ్యాంకులు ("ఏ", "బి" తరగతులు) | | | |
| బ్యాంకుల సంఖ్య | 445 | 24 | 5% |
| పెట్టుబడి-మూలధనం (లక్షల రూ. లలో) | 20,71 | 1,64 | 7.9% |
| డిపాజిట్లు (లక్షల రూ. లలో) | 1,05,66 | 7,44 | 7.0% |

### రోడ్లు

1948 లో భారతదేశంలో ఉన్న రోడ్ల పొడవు, 2,46 వేల మైళ్ళు (మునిసిపల్ రోడ్లు కాక). ఆంధ్రలో వీటి పొడవు (మునిసిపల్ రోడ్లు కాక) 13,909 మైళ్ళు. భారతదేశ రోడ్లపొడవులో ఆంధ్ర రోడ్లపొడవు 6.0%.

ప్రతి నూరు చదరపుమైళ్ళ భూవిస్తీర్ణానికి, ఆయాదేశంలోవున్న రోడ్లశాతం: బ్రిటన్‌లో 202 మైళ్ళు; ఫ్రాన్సులో 184 మైళ్ళు; అమెరికాలో 103 మైళ్ళు; జర్మనీలో 95 మైళ్ళు; ఇటలీలో 89 మైళ్ళు; సిలన్‌లో 70 మైళ్ళు; ఇండియాలో 22 మైళ్ళు; ఆంధ్రలో 22 మైళ్ళు.

మోటార్లు, మోటారు సైకిళ్ళు, లారీలు మొదలైన బండ్లు, దేశంలోని ప్రతివెయ్యి చదరపు మైళ్ళ విస్తీర్ణానికి, వివిధ దేశాలలోను, ఆంధ్రలోను ఇలా ఉన్నాయి: ఫిలిప్పైన్సు 650; మలయా 850; సిలన్ 1,300; ఇండియా 250 కన్న కొంచెం తక్కువ; ఆంధ్రరాష్ట్రం 222.

### కాలువలు

ఆంధ్రరాష్ట్రంలోని నదీకాలువలలో, 1,200 మైళ్ళ పొడవునా, పడవలు ప్రయాణించేయ వీలవుతుంది. దేశంలోని మరే రాష్ట్రంలోను, పడవలు పోయేటైన కాలువల పొడవు ఇంతలేదు.

దేశంలోని వివిధ రాష్ట్రాలలో పడవలు పయనించ వీలయిన కాలువల మొత్తం పొడవు (మైళ్ళలో):

ఆంధ్ర 1,200; అస్సాం 920; పశ్చిమ బెంగాలు 777; ఉత్తరప్రదేశ్ 745; బీహారు 715; మదరాసు 500; ఒరిస్సా 287.

భారతదేశంలోని పడవలు ప్రయాణం చేయ వీలయిన కాలువల పొడవు

(5,144 మైళ్ళు)లో ఆంధ్ర కాలువల పొడవు 23.3% ఉన్నది.

### రైలు మార్గాలు

ఆంధ్రలో ఉన్న మొత్తం రైలుమార్గం పొడవు 2,090 మైళ్ళు. ఇది మొత్తం భారతదేశంలోని రైలుమార్గాల పొడవు (34,079 మైళ్ళు)లో నూటికి 16.3 వంతులు మాత్రం!

### జనన - మరణాలు

భారతదేశంలో 1941-'50 సంవత్సరాల మధ్యకాలంలో సగటున సాలుకు జననాలు ప్రతివెయ్యిమందికి జనాభాకి 40.

దేశంలో ఇతర ప్రాంతాలకంటె, మధ్య భారతదేశంలో (మధ్యప్రదేశ్, మధ్య భారత్, హైదరాబాదు, భోపాల్, వింధ్య ప్రదేశ్) శిశుజననపు రేటు (44) అత్యధికం. ఆంధ్రదేశంలో ఈ రేటు (33) దేశంలోకెల్లా తక్కువ (Lowest in India).

భారతదేశపు మరణాల రేటు (1941-50 సం॥ మధ్య) ప్రతి వెయ్యి మందికి జనాభాకు 27. ఆంధ్రలో ఈ రేటు 22.

దేశంలోకెల్లా ఈ రేటు మధ్యభారత దేశంలో (34) అత్యధికం. అత్యల్పం దక్షిణ భారతదేశం (21-22). (మదరాసు, తిరువాన్కూరు కొచ్చిన్ సంస్థానం, మైసూరు, కూర్గు; ఈ ప్రాంతంలో ఆంధ్రకూడా చేరి ఉన్నది.)

### విద్య

భారతదేశంలో 1949-50 సంవత్సరంలో అన్నిరకాల విద్యాలయాలలో చదువుతున్న విద్యార్థులు, విద్యార్థినులు కలిసి 2,36,35,880. ఆంధ్రలో 1948-49 సంవత్సరంలో చదువుతున్న విద్యార్థినులు, విద్యార్థుల మొత్తం 1,75,920. ఇది భారతదేశపు మొత్తం విద్యార్థి, విద్యార్థినులలో నూటికి 1.4 పాళ్ళు.

వివిధ రాష్ట్రాలలో జనాభా, విద్యార్థి విద్యార్థినుల సంఖ్యతో పోల్చితే ఏ రాష్ట్రం ఏ స్థానాన్ని ఆక్రమిస్తుందో దిగువ పట్టిక తెలియచేస్తుంది:

| రాష్ట్రం | జనాభా (సంఖ్య వేలలో) | ఏ స్థానం ఆక్రమిస్తున్నది | విద్యార్థి-విద్యార్థినుల మొత్తం (సంఖ్య వేలలో) | ఏ స్థానం ఆక్రమిస్తున్నది |
|---|---|---|---|---|
| బొంబాయి | 3,60,00 | 3 | 40,50 | 1 |
| ఉత్తరప్రదేశ్ | 6,30,00 | 1 | 32,53 | 2 |
| మదరాసు | 3,65,00 | 2 | 29,77 | 3 |
| పశ్చిమబెంగాల్ | 2,50,00 | 4 | 19,59 | 4 |
| ఆంధ్ర | 2,05,00 | 5 | 17,59 | 5 |
| మైసూరు | 90,75 | 8 | 9,30 | 6 |
| హైదరాబాదు | 1,86,55 | 6 | 6,74 | 7 |
| ఒరిస్సా | 1,50,00 | 7 | 6,16 | 8 |

వివిధ తరగతుల విద్యాలయాలలోని చేయబడిందో దిగువ పట్టిక తెలుపు
విద్యార్థి 1 కి సంవత్సరానికి ఎంతఖర్చు తుంది :

| విద్యాలయం వివరం | విద్యార్థి 1కి సంవత్సరానికి ఖర్చుచేయబడినడబ్బు (రూపాయలలో) | | | |
|---|---|---|---|---|
| | భారతదేశం | | ఆంధ్ర * | |
| | 1945-'46 | 1948-'49 | 1945-'46 | 1948-'49 |
| ప్రాథమిక పాఠశాల | 11.9 | 18.1 | 14.2 | 19.4 |
| సెకండరీ పాఠశాల | 39.7 | 54.0 | 50.2 | 62.8 |
| యూనివర్సిటీ, సైన్సు, ఆర్ట్సుకాలేజీలు | 290.4 | 324.7 | 312.0 | 270.8 |
| ట్రెయినింగు కాలేజీలు | 768.6 | 707.9 | 1,090.6 | 1,755.7 |
| ఇంజనీరింగు కాలేజీలు, టెక్నికల్ కాలేజీలు | 926.9 | 1,181.5 | 704.4 | 917.8 |
| మెడికల్ కాలేజీలు, వెటర్నరీ కాలేజీలు | 786.8 | 996.8 | 774.1 | 648.3 |
| ఎగ్రికల్చరల్ కాలేజీలు ఫారెస్టు కాలేజీలు | 1,440.9 | 1,455.9 | 1,926.8 | 829.4 |
| కమర్షియల్ కాలేజీలు | 96.6 | 94.7 | ... | ... |
| లా కాలేజీలు | 133.8 | 169.9 | 202.2 | 171.3 |

వివిధ రాష్ట్రాలలో వివిధ రకాల త్సరానికి ఎంత ఖర్చు చేయబడుతున్నదో
విద్యాలయాలలో, విద్యార్థి 1కి సంవ ప్రత్యేకించిన పట్టిక వివరిస్తుంది.

* అవిభాజ్య మద్రాసు సగటుసంఖ్యలే ఆంధ్ర సగటుసంఖ్యలుగా ఇవ్వబడ్డాయి.

| విద్యాలయాల వివరం | పశ్చిమ బెంగాల్ (1) | | బీహారు (2) | | బొంబాయి (3) | | మధ్యప్రదేశ్ (4) | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1945 -'46 | 1948 -'49 | 1945 -'46 | 1948 -'49 | 1945 -'46 | 1948 -'49 | 1945 -'46 | 1948 -'49 |
| ప్రాథమిక పాఠశాలలు | 6.0 | 11.8 | 7.9 | 12.6 | 19.7 | 28.2 | 15.7 | 21.4 |
| ఉన్నత పాఠశాలలు | 36.1 | 47.0 | 26.2 | 32.6 | 66.8 | 103.0 | 34.3 | 45.8 |
| యూనివర్సిటీ, ఆర్ట్సు, సైన్సు కాలేజీలు | 261.0 | 254.1 | 239.0 | 231.8 | 339.1 | 339.1 | 295.2 | 361.8 |
| టీచర్సు ట్రైనింగు కాలేజీలు | 580.6 | 701.6 | 656.8 | 796.2 | 702.4 | 850.3 | 386.7 | 552.2 |
| ఇంజనీరింగు, టెక్నికలు కాలేజీలు | 977.9 | 742.6 | 571.3 | 951.8 | 1,056.5 | 1,855.3 | 3,972.3 | 4,016.2 |
| మెడికల్ కాలేజీలు, వెటర్నరీ కాలేజీలు | 654.2 | 987.1 | 858.2 | 601.3 | 529.1 | 869.4 | ... | 1,218.4 |
| అగ్రికల్చర్ కాలేజీలు, ఫారెస్ట్రీ కాలేజీలు | ... | ... | 2,160.7 | 1,521.2 | 418.1 | 794.7 | 408.3 | 786.4 |
| కామర్సు కాలేజీలు | 15.7 | 28.3 | ... | ... | 160.7 | 196.1 | 158.0 | 136.4 |
| లా కాలేజీలు | 87.2 | 141.4 | 108.3 | 85.7 | 164.7 | 231.3 | 74.0 | 115.6 |

| విద్యాలయాల వివరాలు | ఒరిస్సా (5) 1945 –'46 | ఒరిస్సా (5) 1948 –'49 | పంజాబు (6) 1945 –'46 | పంజాబు (6) 1948 –'49 | ఉత్తరప్రదేశ్ (7) 1945 –'46 | ఉత్తరప్రదేశ్ (7) 1948 –'49 | ఢిల్లీ (8) 1945 –'46 | ఢిల్లీ (8) 1948 –'49 |
|---|---|---|---|---|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 9.1 | 11.3 | 16.6 | 23.4 | 7.2 | 10.4 | 30.6 | 33.5 |
| ఉన్నతపాఠశాలలు | 35. 8 | 43.0 | 30.7 | 43.0 | 48.5 | 58.6 | 55.1 | 63.0 |
| యూనివర్సిటీ, ఆర్ట్సు, సైన్సు కాలేజీలు | 257.5 | 621.4 | 273.4 | 323.5 | 311.1 | 411.2 | 372.9 | 392.2 |
| టీచర్సు ట్రైనింగ్ కాలేజీలు | 886.2 | 825.6 | 489.3 | 779.3 | 1,099.9 | 368.0 | ... | 1,458.9 |
| ఇంజనీరింగు, యితర టెక్నికల్ కాలేజీలు | ... | ... | 778.3 | 1,079.0 | 1,816.4 | ... | ... | 5,617.6 |
| మెడికల్ కాలేజీలు, వెటర్నరీ కాలేజీలు | 2,504.1 | 2,415.1 | 784.0 | 1,115.0 | 1,527.4 | 3,552.9 | 9,048.5 | 2,219.2 |
| ఎగ్రికల్చరల్ కాలేజీలు, ఫారెస్ట్రీ కాలేజీలు | ... | ... | 791.6 | 701.4 | 1,216.9 | 1,402.9 | 13,691.8 | 7,578.8 |
| కమర్షియల్ కాలేజీలు | ... | ... | 240.6 | 119.1 | ... | ... | ... | ... |
| లా కాలేజీలు | | | 191.9 | 821.7 | ... | ... | ... | ... |

| పంట | విస్తీర్ణము వేల ఎకరములు | ఉత్పత్తి టన్నులు (లక్షలు) | టన్ను 1కి ధర (రూ.) | మొత్తపు పంట విలువ (రూ. లక్షలు) |
|---|---|---|---|---|
| ధాన్యం | 42,84.00 | 28.00 | 223.75 | 61,84 |
| గోధుమ | ... | 0.01 | 374.82 | 5 |
| జొన్నలు | 25,76.00 | 5.20 | 217.76 | 11,37 |
| సజ్జలు | 8,94.00 | 2.00 | 209.32 | 4,45 |
| మొక్కజొన్న | 27.00 | 0.10 | 241.17 | 29 |
| రాగి | 5,93.00 | 2.30 | 209.32 | 4,83 |
| కొఱ్ఱ | 1,23.00 | 1.30 | 188.91 | 2,46 |
| వరిగలు | 2,63.00 | 0.50 | 164.68 | 80 |
| ఇతరములు | 5,50.00 | 0.90 | 185.00 | 1,70 |
| శనగలు | 1,05.00 | 0.20 | 393.45 | 74 |
| పెసలు | 3,56.00 | 0.30 | 521.01 | 1,79 |
| కందులు | 1,85.00 | 0.20 | 452.77 | 86 |
| మినుములు | 1,50.00 | 0.20 | 551.70 | 93 |
| ఉలవలు | 8,27.00 | 0.66 | 423.75 | 2,47 |
| ఇతరములు | 56.00 | 0.03 | 468.34 | 14 |
| వేరుశనగలు | 22,85.00 | 8.60 | 586.73 | 50,38 |
| కొబ్బరికాయలు | 83.00 | * | 1,576.45 | 3,22 |
| నువ్వులు | 3,45.00 | 0.40 | 966.69 | 3,91 |
| ఆముదము | 1,64.00 | 0.10 | 682.02 | 82 |
| చెరకు | 1,27.00 | 3.50 | 568.84 | 20,14 |
| ప్రత్తి | 5,86.00 | 0.70 | 2,153.13 | 2,72 |
| కాఫీ | 0.20 | * | 3,559.09 | 1 |
| పొగాకు | 3,35.00 | 1.10 | 1,877.28 | 20,71 |
| తమలపాకులు | 0.40 | * | (ఎ)24.60 | 7 |
| మిరపకాయలు | 2,69.00 | 1.10 | 2,146.76 | 22,87 |
| ఉల్లిపాయలు | 29.00 | 1.20 | 131.68 | 1,63 |
| బంగాళాదుంప | 0.01 | * | 423.39 | 1 |
| పలురకముల పండ్లు | 2,75.00 | * | (బి)306.00 | 7,45 |
| అరణ్య సంపద | ... | * | ... | 11,44 |
| | | | | 2,40,10 |

* లెక్కలు లేవు. (ఎ) వెయ్యి 1కి ధర మాత్రము. (బి) ఎకరం 1కి పండిన పంట.

తెలుసుకొనవచ్చును. ఈ విలువలుకూడ 1950-51 లో ఉన్న ధరల ననుసరించి కట్టబడెను:

| | | |
|---|---|---|
| 1. మైకా (కాకి బంగారం) | రు 1,73.60 | లక్షలు |
| 2. మేంగనీసు | 4.20 | ,, |
| 3. ఇనుము(కాకిరాయి) | 1.00 | ,, |
| 4. బెరైటీస్ | 8.00 | ,, |
| 5. ఆస్బెస్టాస్ | 0.20 | ,, |
| 6. జిప్సం | 1.20 | ,, |
| 7. స్టీటైట్ | 0.27 | ,, |
| 8. పలకలు | 0.16 | ,, |
| 9. ఇతరములు | 11.37 | ,, |
| మొత్తం | రు 2,00.00 | లక్షలు |

షుమారు సాలుసరి ఒకటికి రెండు కోట్ల రూపాయలు విలువగల ఖనిజములు మన రాష్ట్రమునుండి ఇతర రాష్ట్రములకుగాని, విదేశములకుగాని ఎగుమతి అగుచున్నది. మన రాష్ట్రమునుండి ఈ ఎగుమతులు ఇంకా బాగా పెంచవచ్చును.

## పారిశ్రామిక ఉత్పత్తి

ఇదియే గాక మన రాష్ట్రమునందు ఈ దిగువ పట్టీ చూపబడిన విధమున పారిశ్రామిక సంపదకూడా ఉత్పత్తి అగుచున్నది:

| | | |
|---|---|---|
| 1. సిమెంటు | రు. 1,40 | లక్షలు |
| 2. పంచదార | 2,46 | ,, |
| 3. పంచదార బెల్లం | 29 | ,, |
| 4. సిగార్లు | 11 | ,, |
| 5. రసాయనము | 41 | ,, |
| 6. వస్త్రములు (మిల్లు) (Power looms etc.) | 51 | ,, |
| 7. సాదా వస్త్రాలు | 5 | ,, |
| 8. ఇంజనీరింగు పనిముట్లు | 1,28 | లక్షలు |
| 9. గోగునార - సంచులు | 3,57 | ,, |
| 10. గిన్నెలు వగైరా (Metal Factories) | 78 | ,, |
| 11. కాగితపు అట్టలు | 3 | ,, |
| 12. విద్యుత్తు మరలు | 10,27 | ,, |
| 13. సబ్బు | 3 | ,, |
| 14. తోళ్ళు (Tanning) | 1,96 | ,, |
| 15. వనస్పతి | 11,66 | ,, |
| | రు. 34,76 | లక్షలు |

ఇదియే గాక మన రాష్ట్రమునందు షుమారు మూడు లక్షల చేతి మగ్గములు గలవు. వీటిపై షుమారు రు. 55 కోట్ల విలువ గల గుడ్డ ఉత్పత్తి అగుచున్నది. ఇంకను కుటీర పరిశ్రమల వలనను, చేతి పనుల వలనను అనేకము ఉత్పత్తియగుచున్నది.

కావున మనరాష్ట్రమున వ్యవసాయ, పారిశ్రామిక, ఖనిజ సంపదలనుండి సాలు 1 కి షుమారు 285 కోట్ల రూపాయలు విలువగల వస్తువులు ఉత్పత్తియగుచున్నది. ఇట్లు ఉత్పత్తి చేసిన వస్తువులలో, కొన్ని మన రాష్ట్రములోనే ఉపయోగింపబడుచున్నవి. కొన్ని ఇతర రాష్ట్రములకును, మరికొన్ని ఇతర దేశములకును పంపబడుచున్నవి.

## విదేశీ ఎగుమతులు

ఆంధ్రరాష్ట్రము నుండి ముఖ్యముగా ఎగుమతియగుచున్న సరకులు ఏవనగా — 1. పొగాకు, 2. వేరుశనగ నూనె 3. ఆముదము, 4. Niger seed, 5. బెల్లం, 6. ఉల్లిపాయలు, 7. మిరపకాయలు, 8. పసుపు, 9. మైకా, 10. మేంగనీసు, 11. బెరైటీసు,

ఈ దిగుమతులు, ఎగుమతులే కాకుండ, మన రాష్ట్రమునందు ఉత్పత్తిఅయ్యే సరకులలో చాలభాగము, మన రాష్ట్రములోనే ఖర్చు అగుచున్నది. వీటిలో ముఖ్యముగా బియ్యము, జొన్నలు మొదలగు తిను బండారములలో చాలాభాగము మన రాష్ట్రములోనే విక్రయము అగుచున్నది.

మన రాష్ట్రంలో పండే అన్ని సరకులలోను ఎగుమతులుపోను, మిగిలిన రు.225కోట్లవిలువగలవస్తువులు, రాష్ట్రమునందునే ఖర్చు అగుచున్నవని తెలుపవచ్చును. విక్రయపు పన్నువలన, మన రాష్ట్రంలో షుమారు సాలు 1కి 200 కోట్ల రూపాయల విలువగల వ్యాపారము నడుచుచున్నట్లు తెలియుచున్నది.

ఆంధ్రరాష్ట్రము, భారతదేశపు వైశాల్యములో 20వ వంతు ఆక్రమించినది. A రాష్ట్రములలో 6వదిగను, అన్నిరాష్ట్రములలో 8 వదిగను వైశాల్యమున ఉన్నది. మద్రాసు, పంజాబు, పశ్చిమ బెంగాలు, ఒరిస్సాలకంటె ఇది పెద్దది. జనసంఖ్యలో ఇది 7వ రాష్ట్రమగుచున్నది. ప్రభుత్వమునకు వచ్చు ఆదాయము పట్టిక చూచినచో, ఇది A రాష్ట్రములలో 7వదిగను, అన్నిటిలోను 8వదిగను ఉన్నది. వ్యాపారములలోకూడా ఇది మిగతా రాష్ట్రములలో అగ్రస్థానము నలంకరించుచున్నది. విశాలాంధ్ర వచ్చినచో అన్నివిషయముల ఆంధ్ర అగ్రస్థాన మాక్రమించునని నమ్మవచ్చును. ఆంధ్రులు తమలో గల అంతఃకలహములకు స్వస్తి చెప్పి తావులివ్వక, రాష్ట్రపు ఆర్థిక అభివృద్ధికి ప్రయత్నము చేసిన, రాష్ట్రము తెచ్చుకొనుటదానికి సార్థకత యుండును. రాజకీయ స్వాతంత్ర్యము, ఆర్థిక అభివృద్ధికి మార్గం మాత్రమే; లేనిచో రాష్ట్రస్వాతంత్ర్యం నిష్ఫలమే.



HOW WONDER SOLVENT "S-100"

in **Sulekha** Special

FOUNTAIN PEN INK

## PROTECTS YOUR PEN

**SULEKHA INK**
WITH
'S-100' SOLVENT

Sulekha

1. Prolongs the life of rubber sack keeping it smooth and elastic.
2. Washes the feeder thoroughly and perfectly clean.
3. Protects the tip of the nib from any acid action and keeps it clean and bright.
4. Removes all possibilities of formation of sediment, mould or flakes within the ink fluid.

## HELPS SMOOTH WRITING

1. The tip of the nib is kept moist ready-to-start even when kept open for a reasonably long time, while the writing dries quickly on the paper.
2. The ink flows from the pen with equal freedom at all times and climates and at any places from cold Darjeeling to the hot region of Rajputana—the solvent contains an anti-freezing ingredient keeping the ink perfectly fluid even at the freezing point.
3. The wonderful flow of Sulekha has no parallel in the world—an achievement of this solvent.

SOLVENT "S-100" is A VITAMIN IN PEN-FOOD

**SULEKHA WORKS LIMITED, CALCUTTA-32.**
**Manufacturers of Quality Ink & Stationary Products**
**Branches: DELHI, BOMBAY, MADRAS.**

# రహదారులు

రోడ్లు, రైలుమార్గాలు, కాలువలు ఆంధ్రలోని ప్రధాన రహదారులు. రోడ్లు, రైలుమార్గాలు, ప్రధానరవాణా ప్రయాణ మార్గాలుగా ఉపయోగపడుతున్నాయి.

హైవేస్ డిపార్టుమెంటువారి లెక్కల ప్రకారం, 1950-51 సంవత్సరంలో ఆంధ్రలోని మొత్తం రోడ్ల పొడవు 13,867 మైళ్ళు. ప్రతి వంద చదరపు మైళ్ళ వైశాల్యానికి 22.6 మైళ్ళ రోడ్డు ఉన్నది. ఇదేపరిమితికి, భారతదేశంలో 22 మైళ్ళరోడ్డు ఉన్నది.

జిల్లాలవారీగా, రోడ్ల పొడవు వివరాలు :

| | | |
|---|---|---|
| శ్రీకాకుళం | 986 | మైళ్ళు |
| విశాఖపట్నం | 894 | ,, |
| తూర్పుగోదావరి | 1,625 | మైళ్ళు |
| పశ్చిమగోదావరి | 1,060 | ,, |
| కృష్ణా | 1,275 | ,, |
| గుంటూరు | 1,495 | ,, |
| నెల్లూరు | 1,358 | ,, |
| కర్నూలు | 1,248 | ,, |
| అనంతపురం | 1,260 | ,, |
| కడప | 981 | ,, |
| చిత్తూరు | 1,685 | ,, |

ఇందులో సిమెంటురోడ్లు 87 మైళ్ళు, తారురోడ్లు 272 మైళ్ళు, కంకరరోడ్లు 10,898 మైళ్ళు, మట్టిరోడ్లు 3,709 మైళ్ళు.

వీటి సర్కిలువారీ వివరాలు మార్చి 1951 సంవత్సరం నాటికి ఇలావున్నాయి:

| సర్కిలు పేరు | సిమెంటు రోడ్డు | తారు రోడ్డు | కంకర రోడ్డు | మట్టి రోడ్డు | మొత్తం రోడ్లు |
|---|---|---|---|---|---|
| 1. విజయనగరం | ... | ... | 64 | ... | 64 |
| 2. ఉత్తర విశాఖపట్నం | 1 | ... | 838 | 125 | 964 |
| 3. దక్షిణ విశాఖపట్నం | 8 | 46 | 865 | 122 | 1,041 |
| 4. కాకినాడ | 7 | 35 | 689 | 282 | 1,013 |
| 5. రాజమండ్రి | 3 | ... | 476 | 308 | 787 |
| 6. ఏలూరు | 4 | 19 | 754 | 395 | 1,172 |
| 7. కృష్ణా | 20 | 46 | 696 | 710 | 1,472 |

* ఈ అధ్యాయంలో ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాల వివరాలు చేర్చబడలేదు.

| సర్కిలు పేరు | సిమెంటు రోడ్లు | తారు రోడ్లు | కంకర రోడ్లు | మట్టి రోడ్లు | మొత్తం రోడ్లు |
|---|---|---|---|---|---|
| 8. గుంటూరు | 19 | 6 | 522 | 392 | 939 |
| 9. ఒంగోలు | ... | 1 | 574 | 158 | 733 |
| 10. అనంతపురం | 1 | 31 | 1,147 | 122 | 1,321 |
| 11. చిత్తూరు | 1 | 68 | 953 | 706 | 1,728 |
| 12. కడప | 9 | 7 | 943 | 63 | 1,022 |
| 13. కర్నూలు | 3 | ... | 1,053 | 247 | 1,303 |
| 14. నెల్లూరు | 11 | 13 | 1,324 | 59 | 1,407 |
| మొత్తం పొడవు | 87 | 272 | 10,898 | 3,709 | 14,966 |

మొత్తంరోడ్లలో మార్చి 1951 సంవత్సరం నాటికి 6,365 మైళ్ళు హైవేస్ డిపార్టుమెంటువారి అధీనంలోను, 7,502 మైళ్ళు జిల్లాబోర్డుల అధీనంలోను, 42 మైళ్ళు పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు వారి అధీనంలోను, 1,057 మైళ్ళు మునిసిపాలిటీల అధీనంలోను ఉన్నవి.

* ఈ సర్కిలువారీ వివరాలు ఇలా ఉన్నాయి:

| * సర్కిలు పేరు. | తారు సిమెంటు వేసిన రోడ్లు | కంకర వేసిన రోడ్లు | కాంక్రీటు సిమెంటు వేసిన రోడ్లు | మట్టి రోడ్లు | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. విజయనగరం | 64 | ... | ... | ... | 64 |
| 2. ఉత్తర విశాఖపట్నం | 528 | 394 | ... | 42 | 964 |
| 3. దక్షిణవిశాఖపట్నం | 490 | 404 | ... | 147 | 1,041 |
| 4. కాకినాడ | 259 | 579 | 10 | 165 | 1,013 |
| 5. రాజమండ్రి | 435 | 352 | ... | ... | 787 |
| 6. ఏలూరు | 499 | 561 | 17 | 95 | 1,172 |
| 7. కృష్ణా | 436 | 839 | 2 | 195 | 1,472 |
| 8. గుంటూరు | 281 | 481 | 8 | 169 | 939 |
| 9. ఒంగోలు | 379 | 354 | | | 733 |
| 10. అనంతపురం | 569 | 691 | ... | 61 | 1,321 |

* ఇవి ప్రభుత్వ పరిపాలనా సౌలభ్యంకోసం ఏర్పరచబడిన "సర్కిల్సు" మాత్రమే కాని, జిల్లాలు కావు.

| సర్కిలు పేరు | [illegible] | [illegible] | [illegible] | [illegible] | మొత్తం |
|---|---|---|---|---|---|
| 11. చిత్తూరు | 735 | 950 | ... | 43 | 1,728 |
| 12. కడప | 424 | 557 | ... | 41 | 1,022 |
| 13. కర్నూలు | 662 | 586 | ... | 55 | 1,303 |
| 14. నెల్లూరు | 604 | 754 | 5 | 44 | 1,407 |
| | 6,365 | 7,502 | 42 | 1,057 | 14,966 |

1951 వ సంవత్సరంలో, రాష్ట్రంలో 8,59,235 ఎద్దుబండ్లు తిరిగాయి. ఈ రోడ్లమీద 1,316 మోటారు సైకిళ్ళు, వీటిజిల్లావారీ వివరాలు ఇలా 3,350 బస్సులు, 4,421 లారీలు, ఉన్నాయి: 4,867 కార్లు తదితర మోటారుబండ్లు,

| జిల్లా | మోటారు సైకిళ్ళు | ట్రాక్టర్లు | బస్సులు | లారీలు | కార్లు తదితర | ఎద్దుబండ్లు |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 96 | 5 | 204 | 303 | 373 | 76,225 |
| విశాఖపట్నం | 178 | 14 | 341 | 453 | 1,063 | 63,536 |
| తూర్పుగోదావరి | 342 | 1 | 308 | 313 | 541 | 70,756 |
| పశ్చిమగోదావరి | 107 | 4 | 390 | 205 | 389 | 61,906 |
| కృష్ణా | 114 | 45 | 459 | 664 | 641 | 70,462 |
| గుంటూరు | 118 | 7 | 450 | 858 | 479 | 1,24,333 |
| నెల్లూరు | 40 | ... | 292 | 310 | 495 | 94,045 |
| కడప | 25 | ... | 190 | 321 | 107 | 64,230 |
| కర్నూలు | 46 | 3 | 192 | 188 | 155 | 1,04,225 |
| అనంతపురం | 55 | ... | 163 | 360 | 195 | 67,949 |
| చిత్తూరు | 82 | 12 | 293 | 314 | 245 | 42,947 |
| బళ్ళారి (మూడుతాలూకాలు) | 43 | 3 | 68 | 132 | 187 | 18,631 |
| | 1,316 | 94 | 3,350 | 4,421 | 4,867 | 8,59,235 |

రాష్ట్రంలో 1952 సంవత్సరంలో, (ఆలూరు, ఆదోని, రాయదుర్గం విభాగాలు 627 రూట్లమీద, 1,909 బస్సులు తిరి ఇందులో చేర్చబడలేదు) క్రింది పట్టికలో గాయి. వీటి జిల్లావారీ వివరాలు యివ్వబడ్డాయి :

| జిల్లా | బస్సు రూట్ల సంఖ్య | తిరిగే బస్సులు |
|---|---|---|
| శ్రీకాకుళం | 43 | 107 |
| విశాఖపట్నం | 45 | 119 |
| తూర్పుగోదావరి | 48 | 196 |
| పశ్చిమగోదావరి | 47 | 225 |
| కృష్ణా | 36 | 296 |
| గుంటూరు | 55 | 226 |
| నెల్లూరు | 97 | 193 |
| కడప | 46 | 129 |
| కర్నూలు | 45 | 121 |
| అనంతపురం | 67 | 104 |
| చిత్తూరు | 91 | 193 |
| | 620 | 1,909 |

క్రిందిపట్టిక 25 బస్సులకు పైబడి అవి నడిపే బస్సుల వివరాలను తెలియ నడుపుతున్న ట్రాన్సుపోర్టు కంపెనీలు, చేస్తుంది :

| కంపెనీ పేరు | బస్సులు | స్పేర్ బస్సులు |
|---|---|---|
| 1. టి. అంతయ్య, అనకాపల్లి | 32 | 4 |
| 2. యస్. ఆర్. ఎల్. ఎస్. టి. కంపెనీ లిమిటెడ్, విశాఖపట్నం | 36 | 4 |
| 3. విజయానంద మోటారు సర్వీసు కంపెనీ లిమిటెడ్, విజయనగరం | 26 | ... |
| 4. రామదాసు మోటారు ట్రాన్సుపోర్టు కంపెనీ లిమిటెడ్, కాకినాడ | 28 | 4 |
| 5. శౌరయ్య బ్రదర్సు, నరసారావుపేట, గుంటూరుజిల్లా | 26 | 2 |
| 6. ఆంధ్ర మోటారు సర్వీసు లిమిటెడ్, గుంటూరు | 27 | 1 |

| కంపెనీ పేరు | బస్సులు | స్పేర్ బస్సులు |
|---|---|---|
| 7. నటరియా మోటారు సర్వీసు, నెల్లూరు | 56 | 5 |
| 8. చిత్తూరు మోటారు ట్రాన్స్‌పోర్టు కంపెనీ, చిత్తూరు | 32 | 6 |
| 9. స్టార్ ట్రాన్స్‌పోర్టు లిమిటెడ్, కర్నూలు (under dissolution) | 27 | ... |

రోడ్లమీద 1950-51 సంవత్సరంలో ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం రు 4,35,64,795. ఖర్చుచేయబడిన ధనం రు. 3,54,55,223. ఈ ఆదాయవ్యయాల జిల్లావారీ వివరాలను క్రిందిపట్టిక తెలియచేస్తుంది:

| జిల్లా పేరు | రోడ్లపై వెచ్చించిన ఖర్చు మొత్తం (రూపాయల్లో) | రోడ్లపై వచ్చిన ఆదాయం (రూపాయల్లో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 20,86,744 | 46,2,2647 |
| విశాఖపట్నం | 21,37,344 | ... |
| తూర్పుగోదావరి | 39,64,516 | 77,99,848 |
| పశ్చిమగోదావరి | 44,63,263 | 48,19,170 |
| కృష్ణా | 43,74,651 | 50,48,135 |
| గుంటూరు | 58,22,337 | 78,53,781 |
| నెల్లూరు | 30,04,235 | 38,97,134 |
| కర్నూలు | 21,76,308 | 30,59,897 |
| అనంతపురం | 12,85,625 | 22,36,972 |
| కడప | 17,96,382 | 22,95,412 |
| చిత్తూరు | 23,43,818 | 23,27,799 |
| | 3,54,55,223 | 4,35,64,795 |

## రైలు మార్గాలు

ఆంధ్రలో మొత్తం రెండువేల మైళ్ళ రైలుమార్గమున్నట్లు అంచనా వేయబడుతున్నది. ఇది మొత్తం భారతదేశంలోని రైలు మార్గంలో నూటికి 16 పాళ్ళు ఉంటుంది. ఆంధ్రదేశ వైశాల్యంలో ప్రతి వంద చదరపు మైళ్ళకు మూడు మైళ్ళ రైలుమార్గమున్నది.

ఇందులో 891.75 మైళ్ళ బ్రాడ్‌గేజి, 829.5 మైళ్ళ మీటరుగేజి రైలు *. వీటి జిల్లాలవారీ వివరాలు (1951సం॥) ప్రక్కపేజీలో ఇవ్వబడ్డాయి.

* ఇందులో శ్రీకాకుళంజిల్లా, ఆదోని, ఆలూరు, రాయదుర్గంతాలూకాలలోని రైలుమార్గం కలుపబడలేదు.

| జిల్లా | బ్రాడ్ గేజి | మీటరు గేజి |
|---|---|---|
| శ్రీకాకుళం | ... | ... |
| విశాఖపట్నం | 127.50 | ... |
| తూర్పుగోదావరి | 79.50 | ... |
| పశ్చిమగోదావరి | 107.75 | 13.75 |
| కృష్ణా | 55.00 | 77.25 |
| గుంటూరు | 133.25 | 162.00 |
| నెల్లూరు | 132.75 | 59.50 |
| కర్నూలు | 5.50 | 160.00 |
| కడప | 121.25 | ... |
| అనంతపురం | 61.00 | 191.50 |
| చిత్తూరు | 68.25 | 165.50 |
| బళ్ళారి 3 తా॥ లు* | ... | ... |

వాల్తేరు, విజయవాడ, గుంతకల్లు ఆంధ్రలోని ప్రధాన రైల్వే కేంద్రాలు.

మదరాసు-కలకత్తా బ్రాడ్ గేజి రైలు మార్గం, దక్షిణాన నెల్లూరు జిల్లానుండి, ఉత్తరాన విశాఖజిల్లావరకు వ్యాపించి ఉన్నది. మచిలీపట్నం - మార్మగోవా మీటర్ గేజి రైలు ఆంధ్రలో కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాల గుండా పోతున్నది. మదరాసు — బొంబాయి బ్రాడ్ గేజి రైలుమార్గం చిత్తూరు, కడప, అనంతపురం (పూర్వపు) బళ్ళారి ఆంధ్ర ప్రాంతం గుండా పోతున్నది.

ఇవికాక గూడూరు, తెనాలి, నిడదవోలు, సామర్లకోట, విజయనగరం, నౌపడా, రేణిగుంట, పాకాల, ధర్మవరం, గుంటూరు, గుడివాడ, భీమవరం మున్నగు కేంద్రాల నుండి పెద్ద రైళుల ఉపశాఖలు పోతున్నాయి.

కాలువలు

ఆంధ్రలో సుమారు 1200 మైళ్ళు పడవల ప్రయాణానికి అనువయిన కృష్ణా, గోదావరి, తుంగభద్ర నదుల కాలువలున్నాయి. ఇందులో పడవలు పోవటానికి వీలైన కృష్ణాకాలువల పొడవు 620 మైళ్ళు. ఇందులో ఒక్క బకింగ్ హాం కాలువపొడవే సుమారు 200 మైళ్ళున్నది. గోదావరి కాలువల పొడవు 493 మైళ్ళు. కడప-కర్నూలు కాలువపొడవు 75 మైళ్లు.

గోదావరి కాలువలలో సంవత్సరంలో పదకొండు నెలలు పడవలు తిరగటానికి వీలున్నది. 493 మైళ్ళ పొడవునా, 90 టన్నుల పరిమాణము (Capacity) గల పడవలు తిరగవచ్చు. కాలువలమీద సరుకు రవాణా చార్జీలు, రైళ్ళు, మోటార్లమీద రవాణాకంటె కూడా చాలతక్కువ. ఉదాహరణకు కాకినాడ రేవునుండి రాజమండ్రికి ఒక బస్తా బియ్యం పడవలో తెస్తే, రవాణా చార్జి అణా అవుతుంది. ఈ బస్తానే ఏ రైలుమీదో, లారీమీదో రవాణా చేస్తే చార్జి పావలావరకు అవుతుంది. అందుచేత, యీ డెల్టాప్రాంతం నుండి ఎగుమతి, దిగుమతులు చాలవరకు ఈ కాలువలద్వారానే జరుగుతున్నాయి. సామర్లకోట - ఏలూరుకాలువ కాకినాడ రేవును, ఏలూరు పట్టణాన్ని కలుపుతున్నది. కృష్ణానదినుండి వచ్చే ఏలూరు కాలువ, ఏలూరు - గోదావరి కాలువలో కలుస్తున్నది. ఇందువల్ల

* వివరాలు లభించలేదు

గోదావరి డెల్టానుండి, కృష్ణా డెల్టాకు పడవలు పయనించ వీలుకలుగుతున్నది.

కృష్ణా కాలువలలో సంవత్సరంలో పదకొండు నెలలు పడవలు తిరగ వీలవుతుంది. కృష్ణాడెల్టా ప్రాంత ఎగుమతి-దిగుమతులలో చాలభాగం ఈ కాలువల ద్వారా జరుగుతున్నది.

బకింగ్‌హాం కాలువ ప్రత్యేకంగా పడవ ప్రయాణానికే ఉద్దేశింపబడింది. దీని మొత్తం పొడవు 258 మైళ్ళు. ఇది 196 మైళ్ళు పోయి, మదరాసును చేరి, అక్కడినుండి దక్షిణంగా మరి 62 మైళ్ళ వరకు పోతున్నది. కృష్ణా డెల్టాకు సంబంధించిన "కొమ్మమూరు కాలువ", బకింగ్‌హాము కాలువను, గోదావరి డెల్టా కాలువలతో కలుపుతున్నది. ఇందువల్ల మదరాసులో బయలుదేరిన పడవలు సరాసరి కాకినాడరేవువరకు, నాలుగు వందలమైళ్ళు పోగలుగున్నవి. ఇదేవిధంగా రాజమండ్రిలో బయలుదేరిన పడవలు భద్రాచలానికి - దాదాపు మధ్యప్రదేశ్ సరిహద్దుకు (118 మైళ్ళు) పోవడానికి అవకాశం ఉన్నది.

ఈ కాలువలమీద ముఖ్యంగా రవాణా అయ్యే సరుకులు: వరిధాన్యం, ఉప్పు, నూనెగింజలు, ఆహారధాన్యాలు, చిల్లరసరుకులు, పొగాకు, వంటచెరకు, కలప, వెదురు, తోళ్ళు, నూనెలు, పంచదార, బెల్లం, ఇటుక, పెంకులు, సున్నం, బొగ్గు, రాక్షసిబొగ్గు మొదలైనవి.

1948-49 సంవత్సరంలో వివిధ కాలువలమీద రవాణా అయినసరుకు **17,52,783** టన్నులు. దీనివిలువ రు. **42,14,51,571.** ఈ కాలువలమీద ప్రయాణం చేసినవారి సంఖ్య 8,78,555 మంది.

ఇదేసంవత్సరంలో ఈ కాలువలమీద తిరిగిన మొత్తం పడవల సరుకు మోయగలిగినశక్తి 14,71,997 టన్నులు. పడవలు మొదలైనవాటిద్వారా ప్రభుత్వానికివచ్చిన ఆదాయం రు. **6,11,113**లు.

కాలువలవారీ వివరాలు ప్రక్క పేజీలో పొందుపరచబడ్డాయి.

## కృష్ణారోడ్డు రెగ్యులేటర్ బ్రిడ్జి

1954 వ సంవత్సరం, ఫిబ్రవరి 13 వ తేదీన, కృష్ణారోడ్డు రెగ్యులేటరు బ్రిడ్జికి శంకుస్థాపన జరిగింది.

నిర్మించబోయేరోడ్డు పొడవు 4,014 అడుగులు, వెడల్పు 24 అడుగులు ఉంటుంది. దీనివల్ల లక్షఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కలగటమేకాక, గుంటూరు - విజయవాడ నగరాలు కలిసి ఆంధ్రలో ఒక "బడా పెట్టు" నగరం అవతరించే అవకాశం కలుగుతున్నది. ఆంధ్రను రెండుగా విభజిస్తున్న కృష్ణానదిమీద వంతెన నిర్మాణంవల్ల ఆంధ్ర వాణిజ్యవ్యాపారాల పెంపుదలకు ఎంతగానో ఉపయోగపడుతుంది.

యుద్ధవ్యూహంలోకూడా దీనికి ప్రధానస్థానం ఉన్నది. ఆంధ్ర జాతీయ జీవనంలో ఒకప్రత్యేకస్థానాన్ని వహిస్తుంది.

బ్రిడ్జినిర్మాణం మూడు సంవత్సరాలలో పూర్తిఅవుతుందని, నిర్మాణానికి రెండుకోట్ల తొంభైఐదు లక్షల రూపాయలు ఖర్చవుతుందని అధికారుల ప్రస్తుతపు అంచనాలు తెలియచేస్తున్నాయి.

| కాలువల వివరాలు | 1948-49లో తిరిగిన మొత్తం పడవల సరుకు మోయగల శక్తి (టన్నులలో) | రవాణా అయిన సరుకు (టన్నులలో) | రవాణా అయిన సరుకు విలువ (రూపాయలలో) | ప్రయాణీకులు | పడవ పన్నులు మొదలైన వాటిద్వారా 1948-49 లో వచ్చిన ఆదాయం (రూపాయలలో) |
|---|---|---|---|---|---|
| గోదావరి కాలువలు | 7,72,855 | 7,26,261 | 21,74,31,386 | 5,31,806 | 1,85,423 |
| కృష్ణా కాలువలు | 6,98,076 | 6,98,644 | 13,93,61,414 | 1,98,768 | 2,41,974 |
| బకింగ్‌హామ్ కాలువ | ... | 3,26,357 | 6,33,85,240 | 1,46,937 | 1,71,698 |
| దుమ్ముగూడెం కాలువ | 1,066 | 1,521 | 12,73,531 | 1,044 | 11,505 |
| కర్నూలు - కడప కాలువ | ... | ... | ... | ... | 513 |
| | 14,71,997 | 17,52,783 | 42,14,51,571 | 8,78,555 | 6,11,113 |

# రేవు పట్టణాలు

ఆంధ్రకు విశాలమైన సముద్రతీరం ఉంది. మన పూర్వచరిత్రను పరిశీలిస్తే నౌకా వ్యాపారంలో ఆంధ్రులు చాలా ముందంజ వేశారని స్పష్టమవుతుంది.

క్రీ. పూ. రెండవ శతాబ్దంలోనే ప్లినీ, టాలెమీ అనే విదేశ వ్యాపారస్తులు ఆ కాలంనాటి ఆంధ్ర ఓడరేవుల గూర్చి ప్రశంసిస్తూ వ్రాశారు. చరిత్ర ప్రసిద్ధిగాంచిన 'మస్లిన్' బట్ట మచిలీపట్నం నుండే విరివిగా ఎగుమతి చేయబడేది. మచిలీపట్నంపంకే 'మస్లిన్' అనే పదం వాడుకలోనికి వచ్చిందని చరిత్రకారుల అభిప్రాయం. భారతదేశంలో ప్రథమంలో విదేశ వ్యాపారాన్ని ప్రారంభించినవారు ఆంధ్రులేనని చరిత్ర తెలుపుతున్నది.

శ్రీకాకుళం జిల్లాలోని కళింగపట్నం, తూర్పుగోదావరి జిల్లాలోని ఇంజరం, పశ్చిమ గోదావరి జిల్లాలోని ప్రాలూరు (ఇది నేడు భూగర్భంలో కలిసిపోయింది), కృష్ణాజిల్లాలోని గూడూరు, ఘంటసాల, గుంటూరుజిల్లాలోని మోటుపల్లి మొదలగు రేవుపట్టణాలనుంచి రోమ్, చైనా, లంక, ముఖ్యంగా తూర్పు దేశాలతో వ్యాపారం ఎక్కువగా జరిగేదనీ; మస్లిను గుడ్డలు, వజ్రాలు, గోనెసంచులు వగైరా ఎగుమతి జరిగేవనీ; మోటుపల్లి రేవులో రెడ్డిరాజుల కాలంలో సుగంధద్రవ్యాలు దిగుమతిఅయ్యేవనీ చరిత్రకారులు తెలియచేస్తున్నారు.

కాకినాడవద్ద కోరంగిలోనూ, కళింగదేశంలోని చిలకసరస్సువద్ద ఓడలు బాగు చేసేవారని కూడా తెలుస్తోంది.

పై రేవులనుంచి ఇటీవల 15వ శతాబ్దంవరకూ కూడా వ్యాపారం ఉచ్ఛదశలో ఉండేది.

ఆ తరువాతి కాలంలో బహదతీకీములు, తెల్లవాళ్ళు మన ఆంధ్ర భూభాగంలో అడుగుపెట్టారు. బ్రిటిష్‌వారు 1611 సంవత్సరంలో, ఫ్రెంచివారు 1614 సంవత్సరంలో మచిలీపట్నంవచ్చి మకాం పెట్టారు. 1629 లో డచ్చివారు భీమునిపట్నం వచ్చి తిష్టవేశారు. వ్యాపారం జోరుగా సాగింది.

తరువాత 200 సంవత్సరాల బ్రిటిష్ పరిపాలన కాలంలో చాలా రేవులు మూలపడ్డాయి; కొన్ని నామరూపాలు కూడా లేకుండా పోయాయి.

బ్రిటిష్ పరిపాలకుల వ్యాపార అవసరాల దృష్ట్యా, తీరంలోని ఇతర రేవుల మూలపెట్టి వ్యాపారం ప్రధానంగా మద్రాసు రేవుకు మళ్ళించబడింది. 600 మై॥ సముద్రతీరం ఉన్న ఆంధ్ర దేశంలో ఏ ఒక్క ఓడరేవు అభివృద్ధిచెందకపోవటం చేతనే, నేటికీ ఆంధ్రదేశ ఎగుమతులలో

60% మద్రాసు రేవు నుండి జరుగుతున్నాయి.

పెద్దవీ, చిన్నవీ నేడు ఆంధ్రదేశంలో ఏడు ఓడరేవులున్నా, ఇవన్నీ ఆంధ్రలో పండే ఆహార, వ్యాపార పంటలు ఎగుమతి చేయుటకు, ఖనిజాల తీసుకొనిపోవుటకు మాత్రమే ఉపయోగించబడుతున్నాయి గాని, వీటి నుండి దిగుమతి వ్యాపారం మాత్రం జరగ లేదు.

ఆంధ్రలోని వివిధ రేవుపట్టణాల గూర్చి వివరాలు క్లుప్తంగా క్రింద యివ్వబడ్డాయి:

## కళింగపట్నం

ఇది శ్రీకాకుళంజిల్లాలో వుంది. కళింగ దనే పూర్వరాజు పరిపాలించుటచేత దీనికి యీ పేరు వచ్చింది. జిల్లా కేంద్రం అయిన శ్రీకాకుళం పట్టణానికి కళింగపట్నం 16 మైళ్ళ దూరంలో ఉంది.

తీరానికి అరమైలు లేక ముప్పావు మైలు దూరంలో స్టీమర్లు వచ్చి నిలువవచ్చు. చిన్న పడవలు కూడా ఉంటాయి.

తీరాన్నుంచి, ఓడతో కమ్యూనికేషన్ సౌకర్యాలున్నాయి. తుఫాను సమయంలో ప్రమాదాన్ని సూచించే ఏర్పాట్లు కూడా చేయవచ్చు. 64 అడుగుల ఎత్తుగల లైట్ హౌసు వుంది.

రేప్లే అండ్ కంపెనీవారి గోడౌన్లు వున్నాయి. ఈ రేవు ముఖ్యంగా జనపనార ఎగుమతిచేయుటానికి ఉపయోగపడుతోంది. 1949—51 సంవత్సరాల మధ్య రు. 40,71,940 ల విలువగల జనపనార కలకత్తాకు ఎగుమతి చేయబడింది.

## భీమునిపట్నం

ఇది విశాఖపట్నం జిల్లాలో వుంది. సెప్టెంబరు, ఏప్రియల్ నెలల మధ్య మామూలు సైజులో వుండే స్టీమర్లన్నీ ఈ రేవులోకి వస్తాయి.

తీరానికి 11 మైళ్ళ దూరాన వుండగానే కనపడే లైట్ హౌస్ ఒకటి వుంది. రేవులో సిగ్నలింగ్ స్టేషన్ ఉంది.

ఈ రేవులో నిలిచే స్టీమరులన్నిటినుంచి మైనర్ పోర్టు ఫండు చట్టంక్రింద మూడు రకాల చార్జీలు వసూలు చేస్తారు.

ప్రయివేటు పార్టీలకు చెందిన గోడౌన్లు వున్నాయి. రేప్లే అండ్ కంపెనీవారు ఇక్కడ వ్యాపారం చేస్తున్నారు. 25 చిన్న పడవలు వారికే రిజిస్టరుఅయివున్నాయి.

ఈ రేవుకూడా కేవలం ఎగుమతులకే వినియోగపడుతోంది. జనపనార, గోగునార, చర్మ సంబంధమైన వస్తువులు ఎగుమతి అవుతాయి. 1950-51 లో రు. 9,89,004 ల విలువగల వస్తువులు ఎగుమతి చేయబడ్డాయి.

## విశాఖపట్నం

ఇది కృత్రిమమైన హార్బరు. 300 అడుగుల వెడల్పున ఒక కాలువ త్రవ్వబడింది. ఆ కాలువగుండా ఓడలు హార్బరులోకి వస్తాయి. ఆధునిక రేవులో ఉండవలసిన హంగులన్నీ ఉన్నాయి. రైల్వేస్టేషను నుంచి నేరుగా హార్బరులోకి రైలుమార్గం వేయబడింది.

ఈస్టుయిండియా కంపెనీ కాలంలోనే దీనిని అభివృద్ధిచేయ పథకాలు తయారు చేయబడ్డాయి. కోస్తా ఆంధ్రజిల్లాలలో విరివిగా దొరికే ఫలసాయాన్ని తేలికగా

తీసుకొనిపోవచ్చునని ఆ రోజులలో యీ పథకం ఆలోచింపబడ్డది.

కాని తర్వాత కంపెనీవారి దృష్టి మద్రాసుపై దొర్లింది. కనుక 1925 ప్రాంతంలోనే హార్బరు నిర్మాణం ఆరంభింపబడి, 1933 లో ఓడల రాకపోకలు ప్రారంభమయ్యాయి.

కేంద్రప్రభుత్వ రైల్వేబోర్డు యాజమాన్యంలో ఈ పోర్టు ఉంది. స్థానికంగా పోర్టు అడ్మినిస్ట్రేటరు అధికారి. రేవును అభివృద్ధి చేయటానికి, వ్యాపారాన్ని పెంపొందించటానికి, స్థానికంగా వివిధ సంస్థల ప్రతినిధులతో కూడిన ఒక సలహా సంఘంకూడా వుంది.

ఇక్కడ ఓడలు నిర్మించే షిప్‌యార్డు కూడా వుంది. దీనిని సింధియా కంపెనీ వారు స్థాపించారు. కేంద్రప్రభుత్వం దీనిని తీసుకొంది. ఇప్పుడు దీనిని హిందూస్థాన్ షిప్‌యార్డు అని పిలుస్తారు.

ఈ రేవువల్ల విశాఖపట్టణానికికూడా ప్రాముఖ్యత ఏర్పడింది. ఇక్కడ నావికా కేంద్రంకూడావుంది. త్వరలో నూనె పరిశుద్ధ కర్మాగారంకూడా నిర్మించనున్నారు.

ఈ రేవునుంచి ముఖ్యంగా మాంగనీసు, బొగ్గు, వగైరా ఎగుమతి చేయబడుతాయి. 1950-51 లో దిగుమతులు, ఎగుమతులు ఈ క్రింది విధంగా వున్నాయి:

### ఎగుమతులు

| | టన్నులు |
|---|---|
| 1. బంకర్ బొగ్గు | 1,10,498 |
| 2. బొగ్గు | 4,883 |
| 3. మాంగనీసు | 6,25,481 |
| 4. వేరుశనగనూనె | 6,287 |
| 5. ఇతర వస్తువులు | 1,31,320 |
| | 8,78,469 |

### దిగుమతులు

| | టన్నులు |
|---|---|
| 1. ఆహారధాన్యాలు | 33,543 |
| 2. గోనె సంచులు | 760 |
| 3. యంత్ర సామగ్రి | 1,870 |
| 4. Fuel Oil | 23,876 |
| 5. ఇతర వస్తువులు | 7,285 |
| | 67,334 |

### కాకినాడ

ఇది తూర్పుగోదావరి జిల్లాలో వుంది. తీరానికి 5 మైళ్ళ దూరంలో స్టీమర్లు ఆగుతాయి. అక్కడ నుంచి చిన్న పడవలలో ఎగుమతి, దిగుమతులు జరగటానికి ఒక కాలువ వుంది. ఈ కాలువ సముద్రంలో ప్రవేశించేచోట యెప్పుడూ మట్టితో పూడిపోతూంటుంది. కనుక ఎప్పుడూ మట్టి త్రవ్వే డ్రెడ్జరుపయోగిస్తారు.

ఇదివరకు నాలుగు లైట్ హౌస్‌లుండేవి. ప్రస్తుతం కాకినాడకు 4 మైళ్ళ దూరంలో వక్కలపూడివద్ద ఒక్కటి వుంది.

ఇక్కడ అనేక విదేశవ్యాపార కంపెనీలున్నాయి. 1902-03 లో 160 లక్షల రూపాయల వ్యాపారం జరిగిందంటే ఎంత వ్యాపారం జరిగేదో ఊహించవచ్చు. ప్రత్తి, బియ్యం, నూనెగింజలు, పీచు మొదలైనవి ఫ్రాన్సు, హాలండ్, బ్రిటన్, జపాన్, ఇతర యూరోపియన్ దేశాలకు ఎగుమతి అయ్యేవి.

1950-51 లో మొత్తం దిగుమతులు 1543 టన్నులు; ఎగుమతులు 63,633 టన్నులున్నాయి. [illegible], ధాన్యాలు, పొగాకు, పీచు, ఆముదం, ఎముకలపొడి వగైరా ఎగుమతి అయ్యాయి.

### నరసాపురం

ఇది పురాతనమైన సహజమైన రేవు. 3,4 మైళ్ళ దూరంలో స్టీమర్లువచ్చి నిలువవచ్చు. కాకినాడపోర్టు ఆఫీసరు పర్యవేక్షణక్రింద ఈ రేవు ఉంది. కాని వ్యాపారం ప్రస్తుతం ఏమీ జరగటంలేదు. 1951-52 లో 56 టన్నుల సరుకులు ఎగుమతి చేయబడ్డాయి.

### మచిలీపట్నం

ఇది కృష్ణాజిల్లాలో ఉంది. హార్బరు లేదు. సముద్రంలో ఓడలు నిలుస్తాయి. పూర్వం ఇది ప్రసిద్ధిచెందిన ఓడరేవు. రేవుకూ స్టీమరుకూ మధ్య చిన్నపడవలు తిరుగుతాయి. చిన్నపడవలలో సామాను ఎక్కించడానికి, దించటానికి ఆరు జెట్టీలున్నాయి.

ఒక లైట్ హౌస్ ఉంది. 3 లక్షల బస్తాలుపట్టే గోడౌన్లు ఉన్నాయి.

ప్రస్తుతం ఈ రేవునుంచి పెద్దగా వ్యాపారం జరగటంలేదు. 1950-51 లో 15,213 టన్నుల సరకులు ఎగుమతి అయ్యాయి. ఇటీవల కాకిరాయి (ముడి ఇనుము) ఎగుమతి చేస్తున్నారు.

ఈరేవు సంవత్సర ఆదాయం. 20,000 రు.
" ఖర్చు 18,000 రు.

### నిజాంపట్నం

పరిశీలనకోసం ఈ పట్టణం రేవుగా ప్రకటించబడింది. తీర ప్రాంత వ్యాపారం కోసం ఉద్దేశింపబడింది. ఆగస్టు 1950 నుంచి ఇది రేవుగా పనిచేస్తోంది.

విశాఖపట్నంతప్ప మిగతా రేవులన్నీ చాలచిన్నవి; తగిన సౌకర్యాలుకూడా లేనివి.

నిజంగా ఆంధ్రదేశంలోని ఖనిజసంపదను, ఇతర పంటలను వినియోగించుకొని పరిశ్రమలనే స్థాపించినట్లయితే ఓడరేవులు లేని కొరతను మనం ఎదుర్కోవలసి వస్తుంది. కాబట్టి, ఆంధ్రదేశ సంపదలను అభివృద్ధిచేయటంతోపాటు, ఈ రేవుపట్టణాలనుకూడ అభివృద్ధి చేయటానికి ఆంధ్రప్రభుత్వం, ఆంధ్రప్రజలు కృషి చేయాల్సివుంది.

# బ్యాంకులు

భారతదేశంలో పాశ్చాత్య పద్ధతిని బ్యాంకింగు వ్యాపారం, తూర్పు ఇండియా కంపెనీవారు వచ్చిన తర్వాత 18 వ శతాబ్దంలో ప్రారంభించబడింది. ఇంతకు పూర్వం అప్పటి భారతీయ వ్యాపార రీతిగతులకు అనువైనపద్ధతిని వడ్డీ వ్యాపారం జరుగుగా ఉండేది.

కాని, 16 వ శతాబ్దంలో తూర్పు ఇండియా కంపెనీవారు భారతదేశంలో వ్యాపారం మొదలుపెట్టడం, దినదినాభివృద్ధి చెందుతూ ఉన్న వారి వ్యాపారానికి తగిన బ్యాంకింగు పద్ధతి అప్పటికి భారత దేశంలో లేకపోవటంవల్ల, బ్రిటీషు ప్రభుత్వం 18 వ శతాబ్దంలో పాశ్చాత్య బ్యాంకింగు పద్ధతిని భారత దేశంలో ప్రవేశపెట్టింది. ఈ ఉద్దేశ్యంతోనే కలకత్తా, బొంబాయి నగరాలలో 18 వ శతాబ్దంలో ఏజన్సీ హౌసెస్ ప్రారంభించబడ్డాయి. ఇవి తమ కరెన్సీ నోట్లను కూడా ప్రవేశపెట్టాయి. 19 వ శతాబ్ద మధ్యకాలంలో వచ్చిన సంక్షోభంలో ఈ ఏజన్సీ హౌసెస్ చిక్కుకొని తీవ్రంగా నష్టపడ్డాయి.

వీటి తర్వాత మూడు ప్రెసిడెన్సీ బ్యాంకులు ప్రారంభించబడ్డాయి. మొదటిది బెంగాలులో 1806వ సంవత్సరంలోను, రెండవది 1840లో బొంబాయిలోను, మూడవది 1843 లో మదరాసులోను ప్రారంభించబడ్డాయి.

1862 వ సంవత్సరానికి పూర్వం ఇవి ప్రభుత్వ అజమాయిషీ క్రింద ఉంటూ, కరెన్సీ నోట్లను కూడా చలామణీ చేస్తూ, ముఖ్యంగా తూర్పు ఇండియా కంపెనీ వ్యాపారస్తులకు అప్పులిస్తూ వుండేవి.

1862 వ సంవత్సరంలో ప్రభుత్వం వీటి స్వంత నోట్ల చలామణీ అధికారాన్ని తొలగించి, ప్రభుత్వఏజంట్లుగా కరెన్సీ మారక వ్యాపారాన్ని కొనసాగించే అవకాశం కల్పించింది. ఈ ఈ బ్యాంకుల బ్రాంచీలున్న పట్టణాల లోని ఖజానాలపై ఆధిపత్యాన్ని, ప్రభుత్వ నిల్వధనాన్ని తమ వ్యాపారానికి యథేచ్ఛగా ఉపయోగించుకొనేందుకు కూడా అనుమతించింది. నాలుగు సంవత్సరాల తర్వాత 1876 లో చేయబడిన ఒక చట్టం ప్రకారం వీటి కరెన్సీ వ్యాపారం హక్కు తొలగించబడటమే కాక, వీటి వ్యాపారం తీవ్రంగా పరిమితం చేయబడింది. 1920 లో మూడు బ్యాంకులు కలుపబడి ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియాగా ఏర్పాటు చేయబడేవరకు వీటిపై ఈ నియమాలు అమలు జరుపబడ్డాయి.

బ్యాంకింగు వ్యాపారాన్ని స్థిరమైన పునాదులపై పెట్టాలనే ఆశయంతో

ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియా అక్టు 1920 ప్రకారం, పై మూడు ప్రెసిడెన్సీ బ్యాంకులు కలిపి ఇంపీరియల్ బ్యాంకు ఆఫ్ ఇండియా అను పేరుతో కొత్త బ్యాంకు ఒకటి ప్రారంభించబడింది. తరువాత 14 సంవత్సరాలు - రిజర్వు బ్యాంకు స్థాపించబడేటంతవరకూ - ప్రభుత్వ ధనాన్ని తన జాగ్రత్తలో ఉంచే అధికారం, ప్రభుత్వానికి కావలసిన ధనాన్ని వసూలుచేయటం, ప్రభుత్వం ఇతరులకు చెల్లించవలసిన ధనాన్ని చెల్లించుతూ ఉండేఅధికారమూ ఈ బ్యాంకుకే ఉండేది.

రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా 1935 వ సంవత్సరం ఏప్రిలు ఒకటవ తేదీన ప్రారంభించబడింది.

ఇది దేశంలోని ద్రవ్య మారకాన్ని (Currency control), వెండిబంగారం మార్కెట్టును కంట్రోలు చేస్తుంది. విదేశీ ద్రవ్య మారకాన్ని (Foreign exchange) కూడా కంట్రోలు చేస్తుంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు నిర్ణీత కాలపరిమితిపై అప్పులు ఇస్తుంది. రెండవ షెడ్యూలు క్రిందవచ్చే ప్రతి బ్యాంకు, విధిగా ఈ బ్యాంకులో ఒక నిర్ణీత మొత్తాన్ని డిపాజిట్ గా ఉంచాలి. ఇవి రిజర్వు బ్యాంకు చేసే ముఖ్యమైన పనులలో కొన్ని.

ఇది 1949 వ సంవత్సరం, జనవరి ఒకటవ తేదీన జాతీయం చేయబడింది.

1906 వ సంవత్సరంవరకూ చాలా తక్కువ బ్యాంకులు ఉన్నాయి. వీటి మూలధనం తక్కువ కావటంవల్ల, వీటి వ్యాపార పరిమితికూడా చాల తక్కువ. స్వదేశీ ఉద్యమం భారత బ్యాంకింగ్ అభివృద్ధికి దోహదం చేసింది. దీనిఫలితంగా ఐదులక్షల రూపాయల పెట్టుబడి-మూల ధనంతో చేస్తున్న బ్యాంకుల డిపాజిట్ల ధనం 1906 - 1913 సంవత్సరాల మధ్య కాలంలో దాదాపు రెట్టింపుకు (రు. 8 కోట్లనుండి రు. 18 కోట్లవరకు) పెరిగింది.

ఈ దశలోనే ఆంధ్రుల ప్రథమ బ్యాంకు "బ్యాంక్ ఆఫ్ బాపట్ల" గుంటూరు జిల్లా బాపట్లలో 1902 వ సంవత్సరం, జనవరి 15 వ తేదీన ప్రారంభించబడింది.

1913 వ సంవత్సరంలో కొన్ని బ్యాంకులు దివాలా తీయటంవల్ల భారత బ్యాంకింగ్ వ్యాపారంలో కొంత అలజడి కలిగినా, ప్రథమ ప్రపంచయుద్ధకాలంలో మరలా అభివృద్ధి కావటం ప్రారంభించింది. 1913-1924 సంవత్సరాల మధ్య కాలంలో 161 బ్యాంకులు దివాలా తీసినప్పటికీ, భారతీయ బ్యాంకింగ్ వ్యాపారం అభివృద్ధి అవుతూనేవుంది. దేశంలోని అన్ని బ్యాంకుల (దేశీయ-విదేశీయ బ్యాంకులన్నింటి) డిపాజిట్ల ధనంలో, భారతీయ జాయింట్ స్టాక్ బ్యాంకుల డిపాజిట్ల ధనం 1914 సంవత్సరంలో నూటికి ఇరవై పాళ్ళున్నదల్లా, 1920 వ సంవత్సరానికి నూటికి 32 పాళ్ళకు పెరిగింది.

ఈ దశలోనే 1923 వ సంవత్సరం నవంబరు 20 వ తేదీన ఆంధ్ర బ్యాంకు మచిలీపట్నంలో ప్రారంభించబడింది. తర్వాత 7-8 సంవత్సరాలు, ఆర్థిక సంక్షోభంలోపడి ప్రపంచం కొట్టుమిట్టాడుతున్న రోజుల్లో - 1929 వ సంవత్సరం ఏప్రిల్ నాల్గవ తేదీన భారతి లక్ష్మి బ్యాంకు, నాన్ షెడ్యూలు బ్యాంకుగా మచిలీపట్నంలో ప్రారంభించబడింది.

తర్వాత పదిసంవత్సరాలు ఆంధ్రులు కొత్తబ్యాంకులను ప్రారంభించలేదు.

1939 నుండి నేటివరకూ ఐదు నాన్ షెడ్యూలు బ్యాంకులు ప్రారంభించబడ్డాయి.

1916-17 సంవత్సరంనుండి క్రమంగా కో ఆపరేటివ్ బ్యాంకులు, భూమి తనఖా బ్యాంకులు, అగ్రికల్చరల్ క్రెడిట్ సొసైటీలు ప్రారంభించబడ్డాయి.

భారతదేశ బ్యాంకింగు వ్యాపారంతో పోల్చిచూస్తే ఆంధ్రబ్యాంకింగు వ్యాపారం ఎంతగా వెనుకబడివుందో క్రింద పొందుపరచబడిన పట్టిక తెలియచేస్తుంది :

భారతదేశంలోని మొత్తం జాయింట్ స్టాక్ బ్యాంకుల్లో, ఆంధ్రబ్యాంకులు 1.2%, పెట్టుబడి-మూలధనంలో 0.8%, డిపాజిట్లలో 0.6% మాత్రమే !

ఆంధ్రదేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందకపోవటంవల్ల వాణిజ్య వ్యాపారాలు, వీటినిర్వహణలో అత్యంత సహకారియైన బ్యాంకింగు వ్యాపారం అభివృద్ధికాలేదు.

రాష్ట్రంలో జమీందారులు, పెద్దపెద్ద భూస్వాములు పెట్టుబడులు పెట్టగలిగిన వారున్నప్పటికి, వీరికి పరిశ్రమలు స్థాపించాలి, పెంపొందించాలి అనేదృష్టిలేదు. భూములు కొనటం, వ్యవసాయంపై పెట్టుబడులు పెట్టడం, వడ్డీవ్యాపారం సాగించటం మొదలగువాటిపై వీరు ఎక్కువశ్రద్ధ చూపిస్తున్నారు. అందుచేత, దేశంలో పరిశ్రమలు అభివృద్ధి కావటం, దీనికవసరమయిన అధునాతన పద్ధతులపై వాణిజ్య వ్యాపారాలు, వీటికి వెన్నెముకయిన బ్యాంకింగు వ్యాపారం అభివృద్ధి చెందటం జరగలేదు. విశాలాంధ్రలోఉన్న ప్రధాన పరిశ్రమలు తెలంగాణా ప్రాంతంలో ఉన్నాయి. విశాలాంధ్ర నిర్మాణం జరిగిననాడు, ఈ పరిశ్రమలమూలంగా పెరిగే వ్యాపారనిర్వహణకు అత్యావశ్యకమయిన బ్యాంకింగు వ్యాపారం ద్విగుణీకృతశక్తితో అభివృద్ధికావటానికి ఎంతైనా అవకాశం ఉంది.

ఉన్న కొద్దిబ్యాంకులు నడుపుతున్న వారికికూడా ఇరుగుపొరుగు రాష్ట్రాలలో వ్యాపారంకాని, పరిశ్రమలుకాని లేకపోవటంవల్ల, వీటిని పెద్దగా అభివృద్ధి చేద్దామనికాని, పరాయి రాష్ట్రాలలో వీటి బ్రాంచీలను పెట్టి వ్యాపారం చేద్దామనే శ్రద్ధకాని లేదు. అందుచేత ఆంధ్ర బ్యాంకులలో వీటికి

| బ్యాంకుల స్వభావం | బ్యాంకుల సంఖ్య | పెట్టుబడి మూలధనం (లక్షల రూ. లలో) | డిపాజిట్ల ధనం (లక్షల రూ. లలో) |
|---|---|---|---|
| **భారతదేశ బ్యాంకులు** | | | |
| షెడ్యూలు బ్యాంకులు | 91 | 60,36 | 8,91,97 |
| నాన్ షెడ్యూలు బ్యాంకులు | 443 | 13,89 | 64,72 |
| **ఆంధ్ర బ్యాంకులు** | | | |
| షెడ్యూలు బ్యాంకులు | 2 | 44 | 5,03 |
| నాన్ షెడ్యూలు బ్యాంకులు | 5 | 15 | 37 |

ఈ ఏడు బ్యాంకుల మొత్తం పెట్టుబడిమూలధనం 1952 సంవత్సరం డిసెంబరు 31 వ తేదీన రు. 59,87,000. వీటి డిపాజిట్ల ధనం రు. 5,40,46,000. అన్ని బ్యాంకుల బ్రాంచీలు కలిసి మొత్తం 89 ఉన్నాయి.

మొత్తం ఆంధ్ర జాయింట్ స్టాక్ బ్యాంకుల మొత్తం పెట్టుబడి-మూలధనంలో నూటికి 60.5 పాళ్ళున్నది. డిపాజిట్ల ధనం మొత్తం అన్ని బ్యాంకుల డిపాజిట్ల ధనంలో నూటికి 86.5 పాళ్ళున్నది. దీనినిబట్టి ఆంధ్ర బ్యాంకులు చేసే మొత్తం వ్యాపారంలో నూటికి 60-70 పాళ్ళు, ఒక్క ఆంధ్రా బ్యాంకే చేస్తున్నట్లు తెలుస్తున్నది. భారత లక్ష్మీ బ్యాంకు ఇతర నాన్ షెడ్యూలు బ్యాంకులు అన్నీ కలసి చేసే వ్యాపారం చాల తక్కువనే చెప్పాలి.

## ఆంధ్ర జాయింట్ స్టాక్ బ్యాంకులు

### ఆంధ్రా బ్యాంకు లిమిటెడ్

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య గారిచే, 1923 వ సంవత్సరం నవంబరు 20 వ తేదీన కృష్ణాజిల్లా మచిలీపట్నంలో (బందరు) లక్షరూపాయల మూలధనంతో, నాన్ షెడ్యూలు బ్యాంకుగా ప్రారంభించబడింది.

1934 సంవత్సరానికి దాని పెట్టుబడి పదిలక్షల రూపాయలకు పెంచబడింది. డిపాజిట్ల ధనం రు. 15 లక్షలకు పెరిగింది. రాష్ట్రంలో ఏడు బ్రాంచీలు తెరువబడ్డాయి.

1929 తర్వాత వచ్చిన ఆర్థికమాంద్యం, దానికితోడు 1938 లో తిరువాన్కూరు నేషనల్ అండ్ క్విలాన్ బ్యాంకు దివాలాతీయటం, ప్రజలలో బ్యాంకులపై విశ్వాసం తగ్గటం ఫలితంగా చాల బ్యాంకులు దెబ్బతిన్నాయి. కొన్ని బ్యాంకులు వ్యాపారాన్నే మానివేశాయి. దీనికి యుద్ధప్రభావం తోడుకావటంతో అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. ఈ క్లిష్టపరిస్థితులలో ఆంధ్రాబ్యాంకు డిపాజిట్లు 50% పడిపోయాయి. ఈ దెబ్బను తట్టుకొని 1943 నాటికి బ్యాంకు బయటపడగలిగింది. ఇదే సంవత్సరంలో షెడ్యూలు బ్యాంకు హోదా పొందింది. అప్పటినుండి బ్యాంకు త్వరితగతిని అభివృద్ధి కాజొచ్చింది.

1948 సంవత్సరానికి రు. 25 లక్షల పెట్టుబడితో, నాలుగుకోట్ల రూపాయల డిపాజిట్ల ధనంతో, 44 బ్రాంచీలతో ఆంధ్రా బ్యాంకు వ్యాపారం చేస్తున్నది.

బ్యాంకుయొక్క వ్యాపార స్థితి
(1953 జూన్ 30 నాటికి)

| | |
|---|---|
| అనుమతిపొందిన మూలధనం | రు. 1,00,00,000 |
| జారీచేసిన మూలధనం | రు. 50,00,000 |
| చందా చేసిన మూలధనం | రు. 48,99,000 |
| చెల్లించబడిన మూలధనం | రు. 25,00,000 |
| రిజర్వుఫండు, మరియు ఇతర రిజర్వులు | రు. 12,03'000 |
| డిపాజిట్లు (1-10-53 నాటికి) | రు. 5,50,00,000 మించినది |
| అమలులో ఉన్న వ్యాపారం మొత్తం | రు. 6,60,00,000 మించినది |

బ్యాంకుయొక్క ప్రధాన కార్యస్థానం మచిలీపట్నం, కృష్ణాజిల్లా.

బ్రాంచీలు

(1) 322-23 లింగిచెట్టివీధి, మదరాసు 1; (2) 77 కన్నోరిరోడ్డు, మైలాపూరు, మదరాసు 4; (3) 87 పాండిబజారు, త్యాగరాయనగర్, మదరాసు 17; (4) 1,9 మెయిన్ బజారు, పేట, కర్నూలు; (5) అమలాపురం, (6) అనకాపల్లి, (7) అరండల్ పేట, గుంటూరు; (8) బాపట్ల, (9) భీమవరం, (10) చీరాల, (11) ఏలూరు, (12) గవర్నరుపేట, విజయవాడ, (13) గుడివాడ, (14) గూడూరు, (15) గుంటూరు, (16) కాకినాడ, (17) నరసారావుపేట, (18) నెల్లూరు, (19) ఒంగోలు, (20) పాలకొల్లు, (21) రాజమండ్రి, (22) శ్రీకాకుళం, (23) తెనాలి, (24) తుని, (25) విజయవాడ, (26) విశాఖపట్నం. (27) విజయనగరం సిటీ, (28) ఆముదాలవలస, (29) అనంతపురం, (30) భట్టిప్రోలు, (31) బళ్ళారి, (32) చల్లపల్లి, (33) కడప, (34) దుగ్గిరాల, (35) గాంధీనగర్, విజయవాడ, (36) గొల్లప్రోలు, (37) ఇచ్ఛాపురం, (38) జగ్గయ్యపేట, (39) కొత్తపేట, తెనాలి, (40) మహా (39) రాణీపేట, విశాఖపట్నం, (41) నరసన్నపేట, (42) నిడదవోలు, (43) పామర్రు, (44) పార్వతీపురం, (45) పెడన, (46) పెద్దాపురం, (47) పెనుకొండ, (48) పిఠాపురం, (49) రామారావుపేట, కాకినాడ, (50) సాలూరు, (51) సామర్లకోట, (52) తిరుపతి, (53) వినుకొండ.

లండన్ ఏజంట్లు:
బార్క్లేస్ బ్యాంకు లిమిటెడ్,
ఫిష్ పాండ్ బ్రాంచి, 168, ఫిన్‌చర్చ్‌స్ట్రీట్
లండన్, ఇ. సి. 3.

డైరెక్టర్ల బోర్డు ఛైర్మన్:
యస్. ఆర్. వై. శివరామప్రసాద
బహదూర్.

మేనేజింగ్ డైరెక్టరు:
తాడేపల్లి శ్రీరాములు.

జనరల్ మేనేజరు:
యేలేశ్వరపు కృష్ణమూర్తి.

## భారతలక్ష్మి బ్యాంకు లిమిటెడ్

ఇది, 1929వ సంవత్సరం ఏప్రిల్ 22వ తేదీన శాస్త్రుల పట్టాభిరామయ్యగారిచేత, 15 వేల పెట్టుబడితో (పెయిడప్ కాపిటల్) మచిలీపట్నంలో నాన్ షెడ్యూల్డు బ్యాంకుగా ప్రారంభించబడింది. ఆంధ్రుల రెండో షెడ్యూల్డు బ్యాంకు, రెండో పెద్దబ్యాంకు.

తర్వాత వచ్చిన ఆర్థిక సంక్షోభంవల్ల బ్యాంకి వ్యాపారం అంతగా అభివృద్ధి కాలేదు. కాని యుద్ధానంతరం నెమ్మదిగా పెరగటం ప్రారంభించింది. దీని పెయిడప్ కాపిటల్ 1943 లో రు. 73,625గా ఉన్నదల్లా, 1948 నాటికి రు. 5,75,000కు పెంచబడింది. 1943 లో రు. 4,33,000గా ఉన్న డిపాజిట్లధనం 1948 ఆఖరుకు రు. 47,75,000 కు పెరిగింది. 1946 లో షెడ్యూల్డు బ్యాంకు హోదానుపొందింది.

1952 వ సంవత్సరాంతానికి బ్యాంకు వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. | 7,00,000 |
| రిజర్వుఫండు | రు. | 95,000 |

| | |
|---|---|
| డిపాజిట్లు | రు. 35,05,000 |
| అమలులో నున్న వ్యాపారం | రు. 79,09,000 |

రిజిష్టరు కార్యస్థానం :
మచిలీపట్నం, కృష్ణాజిల్లా;
కేంద్రకార్యస్థానం : మదరాసు.

### బ్రాంచీలు

(1) బొబ్బిలి, (2) కాకినాడ, (3) కావలి, (4) గూడూరు, (5) గుడివాడ, (6) గవర్నరుపేట, విజయవాడ (7) నరసాపురం, (8) నూజివీడు (9) రామారావుపేట, కాకినాడ, (10) రాజోలు (11) మచిలీపట్నం, (12) విజయవాడ (13) విశాఖపట్నం.

డైరెక్టరుబోర్డు ఛైర్మన్:
శ్రీ ప. వి. రాఘవరెడ్డి;
మేనేజింగ్ డైరెక్టరు :
శ్రీ వి. వెంకటరత్నం

### బ్యాంక్ ఆఫ్ చిత్తూరు

ఇది నాన్ షెడ్యూలు బ్యాంకులలో కెల్ల పెద్దది. 1946వ సంవత్సరం, సెప్టెంబరు 30 వ తేదీన చిత్తూరులో ప్రారంభించబడినది. ఇంకా షెడ్యూలుబ్యాంకు హోదాను పొందలేదు.

1952 వ సంవత్సరాంతానికి, బ్యాంకు వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. 5,00,000 |
| రిజర్వు ఫండు | రు. 37,000 |
| డిపాజిట్లు | రు. 2,22,000 |

కేంద్ర కార్యస్థానం : చిత్తూరు.

బ్రాంచీలు : కాళహస్తి, మదనపల్లి.



### బ్యాంక్ ఆఫ్ బాపట్ల

ఆంధ్రులచేత ప్రారంభించబడిన ప్రథమ బ్యాంకు. 1902 వ సంవత్సరం జనవరి 15వ తేదీన ప్రారంభించబడింది. నాన్ షెడ్యూల్ బ్యాంకు. 1952వ సంవత్సరానికి వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించిన మూలధనం | రు. 85,000 |
| రిజర్వు ఫండు | రు. 25,000 |
| డిపాజిట్లు | రు. 1,23,000 |

దీనికి రాష్ట్రంలో ఎచ్చటా బ్రాంచీలు లేవు.

### కాకినాడ రాధాస్వామి బ్యాంకు

ఇది 1943వ సంవత్సరం మే 4వ తేదీన ప్రారంభించబడింది. ఇది నాన్ షెడ్యూలు బ్యాంకు.

1952వ సంవత్సరానికి వ్యాపారస్థితి:

| | |
|---|---|
| చెల్లించబడినమూలధనం | రు. 1,75,000 |
| రిజర్వు ఫండు | ........ |
| డిపాజిట్లు | రు. 6,83,000 |

దీనికి రాష్ట్రంలో ఎచ్చటా బ్రాంచీలు లేవు.

### రాయలసీమ బ్యాంకు – బళ్ళారి

ఇది 1939వ సంవత్సరం నవంబరు 25వ తేదీన ప్రారంభించబడింది. ఇంకా నాన్ షెడ్యూలు బ్యాంకుగానే ఉంది.

1952వ సంవత్సరానికి వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. 3,75,000 |
| రిజర్వు ఫండు | ........ |
| డిపాజిట్లు | రు. 13,75,000 |

దీని ప్రధాన కార్యస్థానం బళ్ళారి

బ్రాంచీలు : (1) ఆదోని, (2) అనంతపురం, (3) చిత్తూరు, (4) గుత్తి, (5) కర్నూలు, (6) రాయదుర్గం, (7) తిరుపతి,

(8) మదరాసు (141 అదియప్ప నాయకెన్ వీధి, జి. టి. మదరాసు) (9) బళ్ళారి.

డైరెక్టర్ల బోర్డు ఛైర్మన్:
శ్రీ హెచ్. సీతారామరెడ్డి.

### విజయా కమర్షియల్ బ్యాంకు
### విజయవాడ

ఇది 1943వ సంవత్సరం ఫిబ్రవరి రెండవ తేదీన ప్రారంభించబడింది. నాన్ షెడ్యూల్డు బ్యాంకుగా పరిగణించబడుతున్నది. ప్రస్తుతం యిది లిక్విడేషన్‌లో ఉన్నది.

1952వ సంవత్సరాంతానికి వ్యాపార స్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. | 2,35,000 |
| రిజర్వు ఫండు | రు. | 35,000 |
| డిపాజిట్లు | రు. | 13,51,000 |

దీని ప్రధాన కార్యస్థానం విజయవాడ.

బ్రాంచీలు: (1) విజయవాడ, (2) ఏలూరు, (3) మంగళగిరి, (4) ఒంగోలు, (5) తెనాలి.

## ఆంధ్రేతర జాయింట్ స్టాక్ బ్యాంకులు

### ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

ఇది 1921వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఆంధ్రలో వ్యాపారం చేస్తున్న బ్యాంకులన్నింటికన్న ఎక్కువ వ్యాపారాన్ని చేస్తున్నది.

1952వ సంవత్సరం డిశంబరు 31వ తేదీన ఉన్న వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. | 5,62,50,000 |
| రిజర్వులు | రు. | 6,35,00,000 |
| డిపాజిట్లు | రు. | 2,05,85,07,000 |

డైరెక్టర్ల బోర్డు ఛైర్మన్: హెచ్. ఐ. వస్టన్; మేనేజింగ్ డైరెక్టర్: సర్ రాడ్రిక్ కే.ఎస్. హాగ్.

దీనికి దేశవ్యాప్తంగా 1952వ సంవత్సరానికి 410 బ్రాంచీలున్నాయి. ఆంధ్రలో దాని బ్రాంచీలు: (1) ఆదోని (2) అనంతపురం (3) బాపట్ల (4) భీమవరం (5) కడప (6) ఏలూరు (7) గుడివాడ (8) గుంటూరు (9) కర్నూలు (10) మచిలీపట్నం (11) నంద్యాల (12) నెల్లూరు (13) పాలకొల్లు (14) రాజమండ్రి (15) రేపల్లె (16) విజయవాడ (17-18) విశాఖపట్నం (19) విజయనగరం.

పే ఆఫీసులు: 1. అనకాపల్లె 2. అమలాపురం 3. అవనిగడ్డ 4. ద్రాక్షారామం 5. పిడుగురాళ్ల 6. గణపవరం 7. గుడ్లవల్లేరు 8. మండపేట 9. నరసరావుపేట 10. నరసాపురం 11. రామచంద్రపురం 12. రేపల్లె 13. సామర్లకోట 14. శ్రీకాకుళం 15. తాడేపల్లిగూడెం 16. తాడిపత్రి 17. టెక్కలి 18. తెనాలి 19. [illegible].

### ఇండియన్ బ్యాంకు లిమిటెడ్

ఇది 1907వ సంవత్సరం మార్చి 5వ తేదీన మదరాసులో ప్రారంభించబడింది. 1952వ డిశంబరు 31వ తేదీకి, దీని వ్యాపార వివరాలు:

| | | |
|---|---|---|
| చెల్లించబడినమూలధనం | రు. | 55,33,000 |
| రిజర్వులు | రు. | 70,00,000 |
| డిపాజిట్లు | రు. | 20,17,33,000 |

1952 లో దీనిక్రింద పనిచేస్తున్న మొత్తం బ్రాంచీలు 77. ప్రధాన కార్య స్థానం మదరాసు.

ఆంధ్రలో దీని బ్రాంచీలు: 1. గుంటూరు 2. కాకినాడ 3. నెల్లూరు 4. రాజమండ్రి 5. విజయవాడ 6. విజయ నగరం.

సబ్ ఆఫీసులు: 1. భీమవరం 2. గవర్నరుపేట, విజయవాడ 3. గుంటూరు - బజారు, గుంటూరు 4. గుడివాడ 5. నరస రావుపేట 6. పాలకొల్లు 7. పొన్నూరు 8. రేపల్లె 9. తాడేపల్లిగూడెం 10. తణుకు 11. తెనాలి.

## సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా

ఇది 1911 వ సంవత్సరం డిశంబరు 21 వ తేదీన బొంబాయిలో ప్రారంభించ బడింది.

1952 వ సంవత్సరాంతానికి ఉన్న వ్యాపార స్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించబడిన మూల ధనం | రు. | 3,14,54,000 |
| రిజర్వులు | రు. | 3,99,08,000 |
| డిపాజిట్లు | రు. | 1,22,11,97,000 |

డైరెక్టర్ల బోర్డు ఛైర్మన్:
సర్. హోమీ మోడీ;

మేనేజింగ్ డైరెక్టర్:
హెచ్. సి. కెప్టెన్

దీనికి దేశం మొత్తంమీద 1952 నాటికి 275 బ్రాంచీలున్నాయి. ప్రధాన కార్య స్థానం బొంబాయి.

దీని ఆంధ్ర బ్రాంచీలు: (1) ఆదోని (2) విజయవాడ. పే ఆఫీసులు: (1) భీమ వరం (2) కడప (3) ద్రోణాచలం (4) ఏలూరు (5) గుంతకల్లు (6) గుంటూరు (7) కాకినాడ (8) కర్నూలు (9) నంద్యాల (10) రాజమండ్రి (11) తాడేపల్లిగూడెం.

## కెనరా ఇండస్ట్రియల్ అండ్ బ్యాంకింగ్ సిండికేట్ లిమిటెడ్

ఇది 1925 వ సంవత్సరం అక్టోబరు 20వ తేదీన ఉడిపిలో ప్రారంభించబడింది.

1952 వ సంవత్సరాంతానికి వ్యాపార స్థాయి:

| | | |
|---|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. | 25,11,000 |
| రిజర్వులు | రు. | 11,00,000 |
| డిపాజిట్లు | రు. | 4,01,07,000 |

దీని ఆంధ్ర బ్రాంచీలు:
1. ఆదోని 2. కడప 3. ప్రొద్దుటూరు 4. జమ్మలమడుగు 5. అనంతపురం 6. హిందూపురం 7. తాడిపత్రి 8. కర్నూలు 9. నంద్యాల 10. విజయ వాడ 11. గుంటూరు.

ఛైర్మన్ ఆఫ్ బోర్డు ఆఫ్ డైరక్టర్సు:
డా॥ టి. యమ్. ఏ. పాయ్

ప్రధాన కార్యస్థానం ఉడిపి,
దక్షిణ కనరాజిల్లా, మదరాసు స్టేట్

## కెనరా బ్యాంకింగ్ కార్పొరేషన్

ఇది 1906 వ సంవత్సరం మార్చి 12వ తేదీన ఉడిపిలో (మదరాసు స్టేట్) ప్రారంభించబడింది.

1952 వ సంవత్సరాంతానికి వ్యాపార స్థాయి:

| | | |
|---|---|---|
| చెల్లించబడినమూలధనం | రు. | 20,00,000 |
| రిజర్వులు | రు. | 10,00,000 |
| డిపాజిట్లు | రు. | 2,75,13,000 |

డైరెక్టరుబోర్డు ఛైర్మన్:
డా॥ యు. సంవరరాంపాయి

ప్రధానకార్యస్థానం: ఉడిపి, దక్షిణ కనరా జిల్లా, మదరాసు స్టేటు.
ఆంధ్రలో దీని బ్రాంచీలు:
1. చిత్తూరు, 2. రాయదుర్గం.

### వైశ్యబ్యాంకు-బెంగుళూరుసిటీ

ఇది 1930 మార్చి 20వ తేదీన మైసూరులో ప్రారంభించబడింది. 1952వ సంవత్సరాంతానికి చెల్లించబడిన మూలధనం: రు. 11,88,000; రిజర్వులు: రు. 2,10,000; డిపాజిట్లు: రు. 65,48,000.
డైరెక్టర్లబోర్డు ఛైర్మన్:
శ్రీ డి. యస్. వి. శ్రీనివాసచెట్టి.

ప్రధానకార్యస్థానం: బెంగుళూరుసిటీ, మైసూరు.
దీని ఆంధ్రబ్రాంచీలు: 1. హిందూపురం 2. మార్కాపురం 3. కదిరి.

బ్యాంక్ ఆఫ్ మైసూరు, అనే బెంగుళూరు బ్యాంకుకు చిత్తూరుజిల్లా మదనపల్లిలోను, ప్రీమియర్ బ్యాంక్ ఆఫ్ ఇండియా అనేబ్యాంకుకు నెల్లూరులోను ఒక్కొక్క బ్రాంచీ ఉన్నాయి.

ఆంధ్రలో రిజర్వుబ్యాంకు శాఖలేదు. కనుక, దీని ఏజంటుగా ఆంధ్రలో ఇంపీరియల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా వ్యవహరిస్తున్నది.

## కోపరేటివు బ్యాంకులు

జాయింట్ స్టాక్ బ్యాంకుల వ్యాపారంకంటె, కోపరేటివు బ్యాంకుల వ్యాపారం పెద్దగా అభివృద్ధి చెందకపోయినా కొంచెం మెరుగనే చెప్పవచ్చు. భారత కోపరేటివు బ్యాంకులలో ఆంధ్రదేశపు కోపరేటివు బ్యాంకుల స్థానమేమిటో దిగువ పొందుపరచబడిన పట్టిక తెలియచేస్తుంది:

| బ్యాంకుల వివరం | సంఖ్య | పెట్టుబడి-మూలధనం, ఇతరనిధులు (రూపాయల్లో) | డిపాజిట్లు (రూపాయల్లో) |
|---|---|---|---|
| **భారతదేశంలో కోపరేటివు బ్యాంకులు (1951-52)** | | | |
| రు. 5 లక్షలు - అంతకు మించిన పెట్టుబడి కలవి | 90 | 13,27,00,000 | 79,26,00,000 |
| రు ఒక లక్ష-5 లక్షల మధ్య పెట్టుబడి కలవి | 355 | 7,44,00,000 | 26,40,00,000 |
| | 544 | 20,71,00,000 | 1,05,66,00,000 |
| **ఆంధ్రలో (1951-52)** | | | |
| రు. 5 లక్షలు-అంతకు మించిన పెట్టుబడి కలవి | 14 | 1,38,67,000 | 6,35,06,000 |
| ఒకలక్ష-5లక్షలమధ్య పెట్టుబడికలవి | 10 | 25,62,000 | 1,09,60,000 |
| | 24 | 1,64,29,000 | 7,44,66,000 |

భారతదేశపు కోఆపరేటివు బ్యాంకుల మొత్తం పెట్టుబడిలో ఆంధ్ర బ్యాంకుల పెట్టుబడి నూటికి 7.9 పాళ్ళు, డిపాజిట్ల ధనంలో ఆంధ్ర బ్యాంకుల డిపాజిట్లు నూటికి ఏడుపాళ్ళు ఉన్నవి. ఒక స్టేట్ బ్యాంకు, 14 సెంట్రలు బ్యాంకులు ("ఏ" తరగతి), 9 ఇతర బ్యాంకులు ("బి" తరగతి) కలిసి మొత్తం 24 బ్యాంకులు రాష్ట్రంలో పని చేస్తున్నాయి.

## ఆంధ్ర కోఆపరేటివు స్టేట్ బ్యాంకు

రాష్ట్రావతరణానంతరం 1953వ సంవత్సరం అక్టోబరు మాసంలో మదరాసు స్టేట్ కోఆపరేటివు బ్యాంకునుండి విడదీయబడింది. దీని కేంద్ర ఆఫీసు విజయవాడలో ఏర్పాటు చేయబడింది.

| | | |
|---|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. | 10,20,000 |
| మొత్తం రిజర్వులు, ఇతర నిధులు కలిసి | రు. | 23,70,000 |

ఇది, కోఆపరేటివు సెంట్రలు బ్యాంకు లన్నింటికీ నామమాత్రపు వడ్డీ రేటుకు– $2\frac{1}{2}\%$- అప్పుల నిస్తుంది. ఫిక్సెడ్ డిపాజిట్లను తీసుకుంటుంది. అన్నిరకాల బ్యాంకింగు వ్యాపారము చేస్తుంది.

ప్రెసిడెంటు :

శ్రీ ని. వెంకటరత్నం

కార్యదర్శి : . .

శ్రీ టి. యస్. కృష్ణారావు

## విజయవాడ కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్

ఇది 1918వ సంవత్సరం డిసెంబరు రెండవ తేదీన ప్రారంభించబడింది. ఇది "ఏ" క్లాసు బ్యాంకు.

1952–53వ సంవత్సరాంతంలో బ్యాంకు వ్యాపార స్థితి :

| | | |
|---|---|---|
| సంఘ సభ్యులు : సంఘాలు | | 487 |
| వ్యక్తులు | | 202 |
| చెల్లించిన షేరు ధనం | రు. | 9,15,980 |
| డిపాజిట్లు– ఋణాలు | రు. | 94,59,100 |
| సంఘాలకు, డిపాజిటర్లకు అప్పులు, కాషు క్రెడిట్లు | రు. | 97,83,957 |
| వర్కింగు కాపిటలు | రు. | 1,05,85,542 |
| నికర లాభం (గతసం॥) | రు. | 1,66,546 |

దీని కేంద్ర కార్యస్థానం: విజయవాడ. కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలో దీని బ్రాంచి ఉన్నది.

బ్యాంకు ప్రెసిడెంటు :

శ్రీ శ్రీ॥ పాలడుగు రాఘవయ్య

బ్యాంకు ప్రథమ ప్రెసిడెంటు :

దివాన్ బహదూర్

డా. జానకిరామయ్య పంతులు

విజయవాడ, గన్నవరం, నందిగామ, నూజివీడు, తిరువూరు తాలూకాలలోని పరపతి సంఘాలకు ఇది ప్రధానంగా పెట్టుబడి పెడుతున్నది.

## కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్ – నెల్లూరు

ఇది 1918వ సంవత్సరం జనవరి 11వ తేదీన డిస్ట్రిక్టు బ్యాంకింగు యూనియన్ లిమిటెడ్ అనుపేర ప్రారంభించబడింది. ఇపుడు దీని పేరు "కోఆపరేటివు సెంట్రలు బ్యాంకు–నెల్లూరు"గా మార్చబడింది. ఇది "ఏ" క్లాసు బ్యాంకు.

30—6—1953వ తేదీన బ్యాంకు వ్యాపార స్థితి :

| | |
|---|---|
| సంఘ సభ్యులు : సంఘాలు | 896 |
| వ్యక్తులు | 63 |

| | | |
|---|---|---|
| చెల్లించిన షేరు ధనం | రు. | 4,45,958 |
| డిపాజిట్లు-ఋణాలు | రు. | 59,84,643 |
| బ్యాంకు ఇచ్చిన అప్పులు | రు. | 40,25,806 |
| రిజర్వు ఫండ్సు | రు. | 2,44,353 |
| ఇతర రిజర్వులు | రు. | 1,61,687 |
| గత సంవత్సర పు లాభం (30-6-1952) | రు. | 50,700 |

బ్యాంకు ప్రథమ ప్రెసిడెంటు :
శ్రీ యస్. చెంగయ్య పంతులు

ప్రస్తుతపు ప్రెసిడెంటు :
శ్రీ ఆర్. దశరథరామి రెడ్డి

మొదటి వేతన కార్యదర్శి :
శ్రీ ఖండవల్లి కృష్ణారావు

ప్రస్తుతపు కార్యదర్శి :
శ్రీ వరదాచార్యులు

## రామచంద్రపురం కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు-లిమిటెడ్

ఈ బ్యాంకు 1919 వ సంవత్సరం డిశంబరు 7వ తేదీన తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురంలో 85 మంది సభ్యులతో (వ్యక్తులు, సంఘాలు) రు. 17,400 లతో ప్రారంభించబడింది. ఇది 'ఏ' క్లాసు బ్యాంకు.

1952-53 సంవత్సరంలో బ్యాంకు వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| సంఘసభ్యులు : సంఘాలు | | 219 |
| సభ్యులు | | 90 |
| చెల్లించిన షేరుధనం | రు. | 1,89,450 |
| రిజర్వుల మొత్తం | రు. | 3,33,524 |
| డిపాజిట్లు-ఋణాలు | రు. | 35,00,000 |
| సంఘాలకు, డిపాజిట్లకు అప్పులు | రు. | 40,00,000 |
| వర్కింగ్ కాపిటలు | రు. | 43,20,000 |
| ఈసంవత్సరానికిలాభం | రు. | 51,060 |

ఈ బ్యాంకుకు, రెండు స్వంతభవనా లున్నాయి. ప్రస్తుతం బ్యాంకు స్వంత గ్రంథాలయంలో ఇప్పటికి ఉన్న గ్రంథాల సంఖ్య 3,071. వీటికోరకు వెచ్చించిన మొత్తం నేటివరకు రు. 14,508.

శ్రీ కె. రామచంద్రరావుగారు బ్యాంకు ప్రథమ ప్రెసిడెంటు; ప్రస్తుతపు ప్రెసిడెంటు: శ్రీ బి. వెంకటరత్నం. వేతన కార్యదర్శి శ్రీ యస్. వి. యస్. సుబ్బారావు.

## అనంతపురం డిస్ట్రిక్టు కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు-అనంతపురం

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951-52వ సంవత్సరంలో దీని వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. | 4,55,000 |
| రిజర్వు, ఇతరనిధులు | రు. | 2,04,000 |
| డిపాజిట్లు - ఋణాలు | రు. | 46,13,000 |
| సంఘాలకు - డిపాజిట్లకు ఇచ్చినఅప్పులు | రు. | 44,59,000 |
| ఈ సం॥ లో వచ్చినలాభం | రు. | 37,000 |

దీనికి బ్రాంచీలులేవు.

## చిత్తూరు డిస్ట్రిక్టు కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు - చిత్తూరు

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951-52వ సంవత్సరంలో దీని వ్యాపారస్థితి :

| | | |
|---|---|---|
| చెల్లించిన షేరుధనం | రు. | 6,01,000 |
| రిజర్వులు, ఇతర నిధుల మొత్తం | రు. | 2,42,000 |
| డిపాజిట్లు-ఋణాలు | రు. | 29,29,000 |
| సంఘాలకు, డిపాజిట్లకు ఇచ్చినఅప్పులు | రు. | 31,43,000 |
| ఈ సం॥లో వచ్చినలాభం | రు. | 53,000 |

బ్రాంచీలు లేవు.

### కడప డిస్ట్రిక్టు కోపరేటివు సెంట్రల్ బ్యాంకు – కడప

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951–52వ సంవత్సరంలోని వ్యాపారస్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. 4,83,000 |
| రిజర్వులు – ఇతర నిధుల మొత్తం | రు. 2,07,000 |
| డిపాజిట్లు–ఋణాలు | రు. 41,75,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చినఅప్పులు | రు. 44,87,000 |
| ఈ సం॥లో వచ్చినలాభం | రు. 46,000 |

దీనికి బ్రాంచీలు లేవు.

### గుంటూరు డిస్ట్రిక్టు కోపరేటివు సెంట్రల్ బ్యాంకు–గుంటూరు

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951–52వ సంవత్సర వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. 4,68,000 |
| రిజర్వులు–ఇతర నిధుల మొత్తం | రు. 4,46,000 |
| డిపాజిట్లు–ఋణాలు | రు. 7,10,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చిన అప్పు | రు. 62,47,000 |
| ఈ సం॥లో వచ్చినలాభం | రు. 61,000 |

### కృష్ణా కోపరేటివు సెంట్రలు బ్యాంకు–మచిలీపట్నం

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951–52వ సంవత్సరంలో వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. 4,14,000 |
| రిజర్వులు–ఇతరనిధుల మొత్తం | రు. 4,37,000 |
| డిపాజిట్లు – ఋణాలు | రు. 61,06,000 |
| సంఘసభ్యులకు, డిపాజిటర్లకు ఇచ్చినఅప్పులు | రు. 53,43,000 |
| ఈసం॥లో వచ్చినలాభం | రు. 46,000 |

### శ్రీకాకుళం కోపరేటివు సెంట్రల్ బ్యాంకు–శ్రీకాకుళం

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951–52లో వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. 5,15,000 |
| రిజర్వులు – ఇతరనిధుల మొత్తం | రు. 1,71,000 |
| డిపాజిట్లు – ఋణాలు | రు. 19,59,000 |
| సంఘసభ్యులకు, డిపాజిటర్లకు ఇచ్చినఅప్పులు | రు. 22,79,000 |
| ఈసంవత్సరంలో వచ్చినలాభం | రు. 16,000 |

### శ్రీ కోనసీమ కోపరేటివు సెంట్రల్ బ్యాంకు–అమలాపురం

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951–52 సంవత్సరం వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. 2,53,000 |
| రిజర్వులు – ఇతర నిధులు | రు. 3,35,000 |
| డిపాజిట్లు–ఋణాలు | రు. 38,13,000 |
| సంఘాలకు – డిపాజిటర్లకుఇచ్చినఅప్పులు | రు. 34,64,000 |
| ఈ సంవత్సరంలో వచ్చిన లాభం | రు. 59,000 |

### విజయనగరం కోపరేటివు సెంట్రల్ బ్యాంకు–విజయనగరం

ఇది "ఏ" క్లాసు బ్యాంకు. 1951–52వ సంవత్సరంలో వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. 9,62,000 |
| రిజర్వులు – ఇతర నిధులు | రు. 4,75,000 |
| డిపాజిట్లు – ఋణాలు | రు. 89,41,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకుఇచ్చినఅప్పులు | రు. 75,66,000 |
| ఈ సం॥లోవచ్చినలాభం | రు. 1,33,000 |

### వెస్టుగోదావరి డిస్ట్రిక్టు కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకు—ఏలూరు

ఇది "ఏ" తరగతి బ్యాంకు. 1951-52 వ సంవత్సరంలోని వ్యాపార స్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. | 5,17,000 |
| రిజర్వు—ఇతరనిధుల మొత్తం | రు. | 2,64,000 |
| డిపాజిట్లు - ఋణాలు | రు. | 50,15,000 |
| సంఘాలకు, డిపాజిట్లకు ఇచ్చిన అప్పులు | రు. | 47,88,000 |
| ఈ సంవత్సరంలో వచ్చిన లాభం | రు. | 76,000 |

### విజయనగరం కోఆపరేటివు టౌను బ్యాంకు—విజయనగరం

ఇది "ఏ" తరగతి బ్యాంకు. 1951-52వ సంవత్సరంలో వ్యాపార స్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. | 3,91,000 |
| రిజర్వు - ఇతర నిధులు | రు. | 1,45,000 |
| డిపాజిట్లు - ఋణాలు | రు. | 12,03,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చిన అప్పులు | రు. | 14,86,000 |
| ఈ సంవత్సరంలో వచ్చిన లాభం | రు. | 20,000 |

### ఆదోని కోఆపరేటివు బ్యాంకు, ఆదోని

ఇది "బి" తరగతి బ్యాంకు. 1949-50వ సంవత్సరంలో ఈ బ్యాంకు వ్యాపార స్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. | 95,000 |
| రిజర్వు - ఇతరనిధులు | రు. | 11,000 |
| డిపాజిట్లు-ఋణాలు | రు. | 2,86,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చిన అప్పులు | రు. | 3,60,000 |
| ఈ సం॥లో వచ్చిన లాభం | రు. | 5,000 |

### చిత్తూరు కోఆపరేటివు టౌను బ్యాంకు—చిత్తూరు

ఇది "బి" తరగతి బ్యాంకు. 1951-52వ సంవత్సరపు వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. | 1,76,000 |
| రిజర్వులు - ఇతరనిధులు | రు. | 2,65,000 |
| డిపాజిట్లు - ఋణాలు | రు. | 16,34,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చిన అప్పులు | రు. | 13,58,000 |
| ఈ సం॥లో వచ్చిన లాభం | రు. | 18,000 |

### హిందూపురం కోఆపరేటివు టౌను బ్యాంకు, హిందూపురం

ఈ బ్యాంకు 1919 వ సంవత్సరంలో 120 మంది సభ్యులతో రు. 2,344 పెట్టుబడితో హిందూపురంలో (అనంతపురం జిల్లా) ప్రారంభించబడింది. ఇది "బి" తరగతి బ్యాంకు.

1953 లో బ్యాంకు వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| సభ్యులు | | 1,674 |
| చెల్లించినషేర్ల ధనం | రు. | 91,190 |
| డిపాజిట్లు - ఋణాలు | రు. | 4,11,303 |
| రిజర్వుఫండు | రు. | 31,889 |
| సంఘాలకు, సభ్యులకు ఇచ్చిన అప్పులు | రు. | 3,70,668 |
| ఈసంవత్సరపు లాభం | రు. | 8,627 |

బ్యాంకు ప్రెసిడెంటు:
రావుసాహెబ్ టి. జయశీర్తి,
సెక్రటరి: శ్రీ యస్. గురుమూర్తి.

### కాకినాడ కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకు - కాకినాడ

ఇది "బి" తరగతి బ్యాంకు. 1951-52వ సంవత్సరపు వ్యాపారస్థితి:

| | | |
|---|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. | 1,60,000 |

| | |
|---|---|
| రిజర్వు - ఇతరనిధుల మొత్తం | రు. 1,99,000 |
| డిపాజిట్లు_ఋణాలు | రు. 17,80,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చినఅప్పులు | రు. 17,39,000 |
| ఈ సంవత్సరంలో వచ్చిన లాభం | రు. 36,000 |

కర్నూలు డిస్ట్రిక్టు కోపరేటివ్ బ్యాంకు - కర్నూలు

ఇది "బి" తరగతిబ్యాంకు. 1951-52వ సంవత్సరపు వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. 1,81,000 |
| రిజర్వులు_ఇతరనిధులు | రు. 1,87,000 |
| డిపాజిట్లు_ఋణాలు | రు. 22,87,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకుఇచ్చినఅప్పులు | రు. 22,36,000 |
| ఈసంవత్సరపు లాభం | రు. 16,000 |

మదనపల్లి కోపరేటివ్ టౌను బ్యాంకు_మదనపల్లి

ఇది "బి"తరగతి బ్యాంకు. 1951.52వ సంవత్సరంలో దీని వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. 1,43,000 |
| రిజర్వులు_ఇతర నిధులు | రు. 43,000 |
| డిపాజిట్లు_ఋణాలు | రు. 3,44,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకు ఇచ్చినఅప్పులు | రు. 4,65,000 |
| ఈ సంవత్సరంలో వచ్చిన లాభం | రు. 9,000 |

రాజమండ్రి కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు - రాజమండ్రి

ఇది "బి"తరగతి బ్యాంకు. 1951-52వ సంవత్సరంలో దీని వ్యాపార స్థితి :

| | |
|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. 2,22,000 |
| రిజర్వులు_ఇతర నిధులు | రు. 1,58,000 |
| డిపాజిట్లు_ఇతర నిధులు | రు. 25,96,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకుఇచ్చినఅప్పులు | రు. 20,57,000 |
| ఈ సంవత్సరపు లాభం | రు. 41,000 |

తాడేపల్లిగూడెం కోపరేటివ్ బ్యాంకు_తాడేపల్లిగూడెం

ఇది "బి" తరగతి బ్యాంకు. 1951-52 సంవత్సరపు వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించిన షేర్ల ధనం | రు. 1,11,000 |
| రిజర్వులు | రు. 1,000 |
| డిపాజిట్లు_ఋణాలు | రు. 13,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకుఇచ్చినఅప్పులు | రు. 12,0,000 |
| సంవత్సరంలోవచ్చినలాభం | రు. 4,000 |

తిరుపతి కోపరేటివ్ అర్బను బ్యాంకు - తిరుపతి

_ఇది "బి"తరగతి బ్యాంకు. 1951-52వ సంవత్సరపు వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్లధనం | రు. 1,90,000 |
| రిజర్వులు - ఇతరనిధులు | రు. 1,33,000 |
| డిపాజిట్లు - ఋణాలు | రు. 11,00,000 |

| | |
|---|---|
| సంఘాలకు_డిపాజిటర్లకు ఇచ్చినఅప్పులు | రు. 9,98,000 |
| ఈసం॥లో వచ్చినలాభం | రు. 20,000 |

విశాఖపట్నం కోఆపరేటివ్
టౌను బ్యాంకు_విశాఖపట్నం

ఇది "అర్బను తరగతి బ్యాంకు. 1951-52 వ సంవత్సరపు వ్యాపార స్థితి:

| | |
|---|---|
| చెల్లించిన షేర్లు ధనం | రు. 1,87,000 |
| రిజర్వులు_ఇతర నిధులు | రు. 71,000 |
| డిపాజిట్లు_ఇతర నిధులు | రు. 5,53,000 |
| సంఘాలకు, డిపాజిటర్లకుఇచ్చిన అప్పులు | రు. 6,53,00 |
| ఈ సంవత్సరంలో వచ్చిన లాభం | రు. 14,000 |

# ఆంధ్రలో సహకారోద్యమం

**శ్రీ ఖండవల్లి కృష్ణారావు,** బి. ఏ., ఎం. ఎల్. ఏ.

సహకారోద్యమం మన దేశంలో, ప్రధానంగా రైతులకు అప్పులను యే నిర్బంధంలేకుండా, నాక వడ్డీతో యిచ్చేటకు సహకార సంఘాలు స్థాపించి పనిచేసే వుద్యమంగా యేర్పడింది.

ఇంగ్లీషువారి కోపిష్టి విధానంలో రైతులు అప్పులపాలై వారి భూములు కోల్పోవలసిన పరిస్థితి యెక్కువగాయేర్పడింది. దేశంలో వచ్చిన కరువులతో రైతులు బికారులయ్యే పరిస్థితి తీవ్రమయింది. ఆంధ్రలో 1833లో గుంటూరు కరువు, 1854 లో ఉత్తరజిల్లాల్లో కరువు, 1876-78 లో ధాత కరువు—యీ కరువులు రైతులను కృంగదీసినవి. హెచ్చువడ్డీలు, నిర్బంధ షరతులతో అప్పులు తెచ్చుకొని భూములు పోగొట్టుకోవడం తీవ్రమయింది.

ఈ పరిస్థితి మూలంగా దేశంలో నలుమూలలా రైతాంగ తిరుగుబాట్లు వచ్చాయి. 1855 లో సంతాల్ పరగణా లోని తిరుగుబాటు, 1859-60 సం॥లో నీలి ఆకును పండించే రైతుల తిరుగుబాటు, 1875 లో దక్కను రైతుల తిరుగుబాటు కొన్ని వుదాహరణలు మాత్రమే. ఆంధ్ర దేశంలో వచ్చిన యిట్టి తిరుగుబాట్లే ఏజెన్సీ పితూరీలని పిలువబడుతున్నాయి. ధనస్వాముల, వడ్డీవ్యాపారస్థుల క్రూరమైన దోపిడికి వ్యతిరేకంగా బయలుదేరిన అసంతృప్తి యీ తిరుగుబాట్ల స్వరూపం తీసుకుంది.

ఈ రైతు పోరాటాలవల్లనే కొన్ని చట్టాలను ప్రభుత్వం తర్వాత చేయవలసి వచ్చింది. ఇందులో ముఖ్యమైనవి, 1878 లో చేసిన రైతుల వుపకరణాలు జప్తు చేయకూడదనే చట్టం, తక్కావీ అప్పులు ప్రభుత్వమే యిచ్చు చట్టం 1880-84, సహకార సంఘాల చట్టం (1904) మున్నగునవి.

1904 లో సహకార సంఘాల చట్టం యేర్పాటు చేయకముందే మనరాష్ట్రంలో నిధులు, ఫండులు అనే పేరుతో కొన్ని అప్పులిచ్చే సంస్థలు యేర్పడ్డాయి. అవి నాకవడ్డీలతో, ముఖ్యంగా పట్టణ ప్రజలకు, అక్కడక్కడ రైతులకు అప్పులు యిచ్చేవి. ఇవి కంపెనీ ఆక్టు ప్రకారం రిజిష్టరు చేయబడి వ్యవహరించేవి. అందువల్ల, నిర్బంధాలులేక సరసమైన వడ్డీలతో రైతులకు అప్పులిచ్చే అవసరాన్ని తీర్చుటకు సహకార సంఘాలు యేర్పడవలసి వచ్చింది. 1904లో సహకార సంఘాలచట్టం యేర్పడినతర్వాత కొన్ని తెలుగుజిల్లాలలో కొందరు రైతులు, ప్రజానాయకులు

సహకార సంఘాలు, గ్రామీణ సహకార సంఘాలేర్పరచారు. కాని, 1904 చట్టం వల్ల అన్నివిధాలైన సహకార సంఘాలు యేర్పాటుచేయుటకు వీలు కల్గడంలేదనే కారణంచూపి 1912 లో తిరిగి మరొక చట్టం ప్రభుత్వం యేర్పాటుచేసింది. ఆంధ్రరాష్ట్రంలో 1914 నుంచే యెక్కువగా సహకార సంఘాలు యేర్పాటు చేయబడ్డాయి.

రాష్ట్ర సహకార బ్యాంకు, లోకుల నుండి డిపాజిట్లను తెచ్చి ఆడబ్బును గ్రామ, పట్టణాలలోని సహకారసంఘాలకు అప్పులిచ్చేది. రాష్ట్రబ్యాంకునుండి అప్పులు తీసుకున్న సంఘాలు ఆ మొత్తాలను తమ సభ్యులకు మాత్రమే అప్పులిస్తూ వుండేవి.

1917 నుండి జిల్లా కేంద్ర సహకార బ్యాంకులు ఆంధ్రదేశంలో ప్రతి జిల్లాలోనూ యేర్పాటు చేయబడ్డాయి. ఈ బ్యాంకులు లోకులనుండి డిపాజిట్లు తీసుకుని, ఆవిధంగా వచ్చిన డిపాజిట్ల మొత్తాన్ని ఆయా జిల్లాలలోనున్న సహకార పరపతి సంఘాలకు అప్పులు యిచ్చుటకే ప్రధానంగా యేర్పడ్డాయి. 1917 కు ముందు రాష్ట్ర సహకార బ్యాంకు గ్రామాలలోని సహకార సంఘాలకు యేవిధంగా రాష్ట్ర వ్యాపితంగా అప్పులను యిచ్చేదో, ఆవిధంగానే ఆంధ్రలోని జిల్లా కేంద్ర బ్యాంకులు తమ తమ జిల్లాలలోని సంఘాలకు అప్పులు యిచ్చేవి.

ఈ జిల్లా బ్యాంకులు యిప్పుడు ఆంధ్రరాష్ట్రంలో 15 వున్నాయి. తూర్పు గోదావరిజిల్లాలో 4 బ్యాంకులు, కృష్ణా జిల్లాలో 2 బ్యాంకులు, మిగిలిన జిల్లాలలో జిల్లా 1కి వొకటి చొప్పున వున్నాయి.

సహకారోద్యమ పుట్టుక చూస్తే యీ బ్యాంకులుగాని, గ్రామ పరపతి సంఘాలుగాని రైతు పోరాటాల ఫలితంగా వచ్చాయని తెలుస్తుంది. మన రైతులు వ్యవసాయం సాగించాలంటే అనివార్యంగా అప్పులు తెచ్చుకోవాలి. రైతులు అప్పులు తెచ్చుకునేందుకు అప్పిచ్చేవారికి గులాములుగా వుండాలనే పరిస్థితి పూర్వం యెక్కువగా వుండేది. ఈ బంధన విముక్తికే రైతులు పోరాడేరు. ఈ సహకార సంఘాలలో తిరిగి అట్టి నిర్బంధాలు లేకుండా స్వేచ్ఛగా అప్పులు వచ్చేమార్గం యేర్పరచుట సహకార పరపతి సంఘం యొక్క ప్రధాన లక్ష్యం. ఈ ప్రధాన సూత్రాన్ని ఆచరణలో వుంచేందుకు సహకార సంఘాల నిర్మాణంలోనూ, కేంద్ర సహకార బ్యాంకుల నిర్మాణంలోనూ ప్రజాతంత్ర పరిపాలన అత్యంత ప్రధానమైన విషయం. ఈ ప్రజాతంత్ర పరిపాలనపైననే సహకారోద్యమాభివృద్ధి ఆధారపడి వుంటుంది.

ఇక మన రాష్ట్రంలో యేర్పాటుబడిన గ్రామ సహకార పరపతి సంఘాల పరిపాలనపై అంతిమాధికారం సంఘ సర్వసభ్యసభకు వుంటుంది. ఈ సభయొక్క నిర్ణయాలకు, సంఘ నిబంధనలకు లోబడి పంచాయితీదార్లు సంఘ వ్యవహారాలు నడపాలి. ఈ సంఘ పంచాయితీదార్లను ప్రతి సంవత్సరం సంఘ సర్వసభ్యసభ యెన్నుకోవాలి. జిల్లాలోని గ్రామ సంఘములు, జిల్లాలోని యితర సహకార సంఘములు, జిల్లా కేంద్ర బ్యాంకుకు ప్రతినిధులను ప్రతి సంవత్సరం యెన్నుకుంటాయి. ఇలా యెన్నుకోబడిన ప్రతినిధులు, జిల్లా కేంద్ర బ్యాంకుల వ్య

వాటాదార్లు కలిసి బ్యాంకుల సర్వసభ్య సమావేశం అవుతుంది. ఈ సర్వసభ్య సమావేశమే కేంద్ర బ్యాంకుల పరిపాలనపై సర్వాధికారం చలాయిస్తుంది.

కేంద్ర బ్యాంకుల అధికారవర్గమును పై చెప్పిన సంఘ ప్రతినిధులు, వ్యక్తి వాటాదార్లు యెన్నుకుంటారు. అందువల్ల, అప్పులు తీసుకొనే అర్హులగు గ్రామ పరపతి సంఘ సభ్యులకే జిల్లా కేంద్ర బ్యాంకు పరిపాలనపై అధికారం చలాయించే అవకాశం సూత్రప్రాయంగా వుంది.

గ్రామాలలోని సంఘాలపై తనిఖీ సాగించేందుకు, సంఘ సభ్యులలో సహకార విద్య ప్రచారం సాగించేందుకు సహకార తనిఖీ యూనియన్లు వున్నాయి. ఈ యూనియన్ల సర్వసభ్యసభ, అనుబంధ సంఘాల సమావేశమే. ఈ ప్రతినిధులే యూనియన్ పాలకవర్గాన్ని యెన్నుకుంటారు. ఈ విధంగా సంఘాలపై తనిఖీలో కూడ, సహకారసంఘ సభ్యుల ప్రజాతంత్ర పరిపాలన సూత్రప్రాయంగా వుంది. 1928-29లో ఆంధ్ర జిల్లాలలో 158 యూనియన్లు వుండేవి. అప్పుడు చెన్నరాష్ట్రంలో వుండిన యూనియన్లు మొత్తం 440. ఇప్పుడు చెన్నరాష్ట్రంలో వుండిన యూనియన్లు మొత్తం 268 మాత్రమే.

పైన చెప్పిన సహకార పరపతి సంఘాలు, కేంద్ర బ్యాంకులు, యూనియన్లేకాక, సహకారసంఘ సభ్యుల జిల్లా తనిఖీ సంస్థగా పని చేసేందుకు 1934-35 వరకు జిల్లా ఫెడరేషన్లుకూడ వుండేవి. అవికూడా జిల్లాలోని అందరు సహకారసంఘ సభ్యుల ప్రజాతంత్ర పరిపాలన అనే సూత్రాన్ని ఆధారంగా పని చేసేవి.

ఇంతేగాక ప్రతి జిల్లాలోను సహకార వుద్యమం ప్రజా వుద్యమంగా వుండి, సహకారుల అభిప్రాయాలు, ఆశయాలు వ్యక్తం చేయడానికి జిల్లా సహకార మహాసభలు, తాలూకా సహకార మహాసభలు జరుగుతూ వుండేవి.

ఈవిధంగా సహకారోద్యమం ఒక ప్రజావుద్యమంగా అభివృద్ధి కావడం 1917 సం॥ మొదలయి 1930 వరకు కొనసాగింది.

కాని 1929 లో మన దేశంలో ఆర్థిక మాంద్యం ప్రారంభమైంది. దీనితో రైతులు పండించే పంటల ధరలు విపరీతంగా పడిపోవటంతో చిన్న రైతులకు సహకార సంఘాల అవసరం మరింత యెక్కువైంది. పరిస్థితుల దృష్ట్యా సహకార సంఘాల సంఖ్య సభ్యత్వం యీ కాలంలో యెంతో పెరగవలసింది. కాని యీ దట్టి యిబ్బందికాలంలోనే చిన్నకారు రైతులకు అప్పులివ్వటం తగ్గించబడింది. ఈ పద్ధతి 1929-30 సం॥ ప్రారంభించబడింది. దీని పర్యవసానంగా కొద్దిమంది, పెద్ద మొత్తాలు సహకార సంఘాలద్వారా అప్పులు తీసుకోవడం కూడా యీ కాలంలో ప్రారంభమైంది.

1928-29 సంవత్సరంలో ఆంధ్ర జిల్లాలలో మొత్తం 3,891 గ్రామపరపతి సంఘాలుండేవి. ఈ సంఘాల్లో మొత్తం సభ్యులు 2,19,335 మంది వుండేవారు. 1928-29 సంవత్సరంలో అప్పులు రు. 1,18,40,000 లు యివ్వబడ్డాయి.

కాని ఆర్థికమాంద్యం వచ్చి, రైతుల పరిస్థితులు తారుమారైన కాలంలో

1928-29 నుండి 1936-37 సం॥ల మధ్య ఆంధ్ర జిల్లాలలో సంఘాల సంఖ్య 3,891 నుండి 3,389కి తగ్గింది. సభ్యుల సంఖ్య 2,19,335 నుండి 1,73,500 వరకు తగ్గింది. సంవత్సరానికి యిచ్చిన మొత్తం అప్పు రు. 1,18,40,000 నుండి రు. 23,19,000 లకు తగ్గిపోయింది. సహకార సంఘాల్లో సభ్యులకు అప్పులు అవసరమైన వారికిందరికీ యివ్వడం యీ ఆర్థిక మాంద్యపు దినాలలో చాలవరకు అరికట్టబడింది.

మద్రాసు రాష్ట్రానిలో 1927-28 సం॥లో 6,62,589 మంది గ్రామ సహకార పరపతిసంఘాల్లో సభ్యులుగా వుండే వారు. ఆ సంవత్సరంలో 2,00,166 మందికి అప్పు లివ్వబడ్డాయి. అనగా రమారమి ప్రతి ముగ్గురు సభ్యులలో ఒకరికి మాత్రం అప్పులు యిచ్చారు. కాని 1933-34 సంవత్సరంలో గ్రామ పరపతిసంఘాలలో మొత్తం సభ్యుల సంఖ్య 5,97,606 గురు. కాని యీ సంవత్సరంలో 68,810 మందికి మాత్రం అప్పులు యివ్వబడ్డాయి. అనగా రమారమి ప్రతి 8 మంది సభ్యులకు ఒక్కరికిమాత్రం అప్పులు గ్రామ పరపతి సంఘాల ద్వారా యిచ్చారు.

ఇంకేగాక యీ కాలంలో చిన్న రైతులకు తక్కువ మొత్తాల అప్పులను విరివిగా యివ్వడం క్రమేపీ తగ్గుతూ, కొద్దిమంది రైతులకు హెచ్చు మొత్తాలను ఇచ్చేపోకడ కన్పించింది. చెన్న రాష్ట్రంలో 1920-21 లో గ్రామ సంఘాలు 1,18,361 మందికి 88 లక్షల రూపాయలు అప్పులు యిచ్చి వుండగా, 1933-34 లో 68,810 మందికి మాత్రమే 92 లక్షల రూపాయలు అప్పుగా యివ్వబడ్డాయి.

1932 లో అప్పుడున్న శాసనసభచేత అంగీకరించబడిన సహకార సంఘ చట్టం యీ విధానాన్ని తీవ్రతరంచేయ మరింత తోడ్పడింది. ఇంతవరకు సహకార సంఘాల నిర్వాహణలో స్వాతంత్ర్యప్రాయంగానైనా వున్న ప్రజాతంత్ర పరిపాలనకు, యీ చట్టం స్వస్తి చెప్పింది. నిరంకుశ అధికారుల పెత్తనం ప్రవేశపెట్టబడింది.

1932 సహకార చట్టం ప్రకారం నూతనంగా ఏర్పడిన సహకార భూమి తనఖా బ్యాంకులుగాని, చేనేత సహకార సంఘాలుగాని, స్టోర్సు సంఘాలుగాని, ఆది ఆంధ్ర సహకార సంఘాలుగాని ఈ యూనియనుకు అనుబంధ సంస్థలుగా వుండవు; వుండవలసిన అవసరం లేదు.

పై విధానాన్ని తీవ్రతరం చేయుటకు 1932 సంవత్సరంలో సహకార సంఘాల చట్టాన్ని అప్పుడున్న ప్రభుత్వం శాసనసభలో ఆమోదింపచేసింది. ఈ చట్టంవల్ల ప్రవేశపెట్టిన నిబంధనలవల్ల, సహకార సంఘాలు ముందు చెప్పినట్లు స్వాతంత్ర్యప్రాయంగానైనా ప్రజాతంత్ర పరిపాలనను పాటించడం మానివేసి, నిరంకుశ అధికారుల, ప్రభుత్వముల గుమాస్తాల ఆధారం క్రింద పనిచేసే విధంగా మారిపోయాయి. అందువల్లనే తీవ్రమైన మార్పులు సహకార సంఘాలలో వచ్చాయి. జిల్లా ఫెడరేషన్లు ఎత్తివేయబడ్డాయి. ఇంతేకాదు; సహకార సంఘములపై తనిఖీ చేయడానికి ప్రజాతంత్ర పరిపాలనా పద్ధతులతో సహకార తనిఖీ యూనియన్లు వున్నాయని చెప్పాను. ఆర్థిక మాంద్యం వచ్చిన తరువాత సంఘాలు యిచ్చే అప్పుల వ్యాపారం చాలా క్షీణిం

చింది. అందువల్ల యూనియన్ల ఆదాయం చాలవరకు తగ్గింది. దీనివల్ల యూనియన్ల కార్యకలాపాలు స్తంభించాయి.

కొన్ని యూనియన్లు సమాప్తం చేయబడ్డాయి. 1928-29 లో మద్రాసు రాజధానిలో 440 యూనియన్లు వుండేవి. వీటికి అనుబంధ సంఘాలు అప్పుడు 1,23,831. కాని 1952 జూన్ ఆఖరున మద్రాసు రాజధానిలో వున్న యూనియన్లు 268. వీటికి యిప్పుడు 11,422 సంఘాలు అనుబంధ సంఘాలు.

బ్యాంకుల అనుమతితో మాత్రమే జిల్లా, తాలూకా సహకార సభలు జరపాలని యీ చట్టంలో నిర్ణయింపబడింది. సహకార సంఘాల చరిత్రలో పేరుగాన్న వక్కం పైన కూర్పొవటరితో, సహకార మహాసభలు నిర్వహించినట్లుగా గత 20 సంవత్సరముల నుండి నిలిచిపోయాయి.

ఈ చట్ట ఫలితంగానే సహకార వుద్యమంలోని ప్రజాతంత్ర పరిపాలనకు పట్టుకొమ్మలుగావున్న యూనియన్ల ప్రాముఖ్యత విస్మరించబడింది. అవి నామమాత్రంగా తయారు చెయ్యబడ్డాయి. కనుకనే 1928-29-1952 సంవత్సరముల మధ్యలో యూనియనుల సంఖ్య 440 నుండి 268 కి దిగజారింది. సహకార సంఘాల సంఖ్య 12,383నుండి 11,422 కు తగ్గింది.

ఏ ప్రజాతంత్ర సూత్రాలపై సహకార సంఘాలు నిర్మింపబడ్డాయో, ఆ సూత్రాలకు భిన్నమయిన రూల్సు క్రమంగా సహకార సంఘాలలో అమలు జరుప ప్రారంభింపబడ్డాయి. కేంద్ర జిల్లా బ్యాంకులను, రాష్ట్రబ్యాంకులను, గ్రామ పట్టణ సహకార సంఘాలనుండి వేరు పర్చటం జరుగుతూ వచ్చింది. సహకార సంఘాలు ఆదిలో నిర్మింపబడ్డప్పుడు నిర్ణయించినట్లు, ప్రతిసంఘము కేంద్ర జిల్లా బ్యాంకు డైరెక్టర్లను ఎన్నుకునే పద్ధతి పోనే, బాగా పనిచేస్తూ వున్నాయని ప్రభుత్వ సహకార అధికారులచే ఆమోద ముద్రను పొంది, వారిచే 'ఎ, బి' క్లాసు సంఘాలుగా నిర్ణయించబడిన సంఘాలు మాత్రమే కేంద్ర జిల్లా బ్యాంకు డైరెక్టరుల నెన్నుకొనునట్లు నిర్ణయింపబడింది. ఈమార్పుల ఫలితంగా కేంద్ర జిల్లా బ్యాంకులు ఘూస్వాములు, వారికి అనుకూలంగా వుండే సహకార శాఖ అధికారుల యిష్టాల కూటమిగా మాత్రమే తయారయ్యాయి.

గోదావరి వచ్చిన తర్వాతనే మన రాష్ట్రంలో సహకార స్టోర్సులు విరివిగా యేర్పడ్డాయి. కాని మొదటి ప్రపంచ యుద్ధానికి ముందే కొన్ని పట్టణాలలో స్టోర్సులు యేర్పడ్డాయి. సరుకు పెరుగుతూవుంటే సక్రమమైన ధరలకు బియ్యంమొదలగు వస్తువులు సరఫరా చేయడానికే యీ స్టోర్సులను పట్టణవాసులు పట్టణాలలో యేర్పరిచారు. కాని ప్రభుత్వం యీస్టోర్సుల అభివృద్ధికి నిరోధాలు కల్పించింది. నాలాస్టోర్సులు క్షీణించాయి. ప్రభుత్వం తన చెప్పుచేతలలో వుండి పనిచేసే సంఘాలనే ప్రోత్సహించింది. ప్రజల ప్రజాతంత్రంక్రింద పనిచేసే స్వతంత్ర సంఘాలను ప్రోత్సహించకపోగా, వాటిని పూర్తిగా నాశనం చెయ్యడానికకూడా పూనుకుంది. మన రాష్ట్రంలోని పట్టణాలలో 1904 నుండి స్టోర్సులు బొత్తిగాఅభివృద్ధికాలేదు. కాని యుద్ధకాలంలో జీవితావసర వస్తువులపై కంట్రోళ్ళు మొదలగునవి వచ్చాయి.

అప్పుడే యీ వస్తువుల వ్యాపారం చేయడానికి స్టోర్సులను ప్రభుత్వం యేర్పాటు చేసింది. చాల నిర్బంధ నిబంధనలతో యీ స్టోర్సులను రిజిస్టరుచేశారు. జిల్లాస్టోర్సు డైరక్టర్లు కొన్ని సంవత్సరాల వరకు ప్రభుత్వము నియమించినవారై వుండాలని; యీ స్టోర్సు కార్యదర్శులు, మేనేజర్లు మునిసిపాలిటీలకు కమీషనర్లు వుండేటట్లు ప్రభుత్వ అధికార్లు వుండాలని; పైనుండి క్రిందివరకు ప్రభుత్వ అధికార్ల పెత్తనం క్రింద వుండేటట్లు యీ జిల్లాస్టోర్సులను యేర్పాటుచేశారు.

ప్రభుత్వ కంట్రోళ్ళు యెన్నాళ్ళుయినా వుంటాయోఅన్నాళ్ళే యీ స్టోర్సులుఅధికార కంట్రోలు వస్తువుల వ్యాపారం చేయవలసి, కంట్రోళ్ళు పోయినతరువాత యీ స్టోర్సులు ఆ వస్తువులలో వ్యాపారంచేయకూడదని ప్రభుత్వ అధికార్లు శాసించారు. కంట్రోళ్ళు కొంతవరకు తీసేస్తారని అనుకున్నప్పటినుండి కొత్తస్టోర్సులను రిజిష్టరు చేయుటను కూడా నిలుపుదలచేశారు. ప్రభుత్వ అధికార్లు అభ్యుదయ భావాలుగల డైరక్టర్లుగల స్టోర్సులకు కోటా సరుకులను యివ్వటం నిలుపుదలచేసి, అట్టి స్టోర్సులను స్తంభింపచేశారు.

1949-50 సంవత్సరంలో ప్రాథమిక సహకార స్టోర్సులు ఆంధ్రజిల్లాలలో 662 వుండినవి. వాటి సభ్యులసంఖ్య 1 లక్ష 27 వేల మంది. ఈ స్టోర్సులు అమ్మిన సరుకుల విలువ 397 లక్షల రూపాయలు.

కాని 1951-52 సంవత్సరం వచ్చేసరికి ప్రాథమికస్టోర్సులు ఆంధ్రజిల్లాలలో 573కి తగ్గాయి. వాటి సభ్యులసంఖ్య 1 లక్ష 2 వేలకు తగ్గింది. ఇంక యీ స్టోర్సులు అమ్మిన సరుకుల ఖరీదు 377 లక్షలకు తగ్గింది. కాని చిత్తూరు, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, గుంటూరు, కర్నూలు, విశాఖ, శ్రీకాకుళం జిల్లాలలో స్టోర్సులు 1949-50 లో అమ్మిన సరుకల విలువకన్న, 1951-52 సంవత్సరంలో అమ్మిన సరుకల విలువ 63 లక్షల రూపాయలు తగ్గింది. ఈ తగ్గుదల ఆహారపదార్థాల అమ్మకంలో చూస్తే పై చెప్పిన జిల్లాలలో 1949-50 లో అమ్మిన అమ్మకంకన్న 1951-52 లో అమ్మకం 43 లక్షల రూపాయలు తగ్గుదల కనిపిస్తుంది. 1952-53 లో ప్రభుత్వం డీ కంట్రోలు విధానాన్ని అమలులో పెట్టింది. అప్పటినుండీ ప్రభుత్వం, యీ స్టోర్సులు డీకంట్రోలు చేయబడ్డ ఆహార పదార్థాల వ్యాపారం నిలుపుదల చేయాలని శాసించింది. అందువల్ల 1952-53 లో స్టోర్సుల వ్యాపారం చాల క్షీణించింది.

ప్రభుత్వం ఆహారపదార్థాల సేకరణ, కంట్రోలు, పంపిణీ పెత్తనం వహియిస్తూ వున్నన్నాళ్ళే ప్రభుత్వంయొక్క తాబేదార్లుగా స్టోర్సులు పనిచేయాలనీ, ప్రభుత్వం వాటిపై కంట్రోళ్ళు, పంపిణీ వదలుకున్నప్పుడు స్టోర్సులు ఆ రకా వ్యాపారాలు చేయకూడదని ప్రభుత్వం శాసిస్తూంది.

డీ కంట్రోలు వచ్చిన తర్వాత ఆహార పదార్థాల ధరలు మితిమీరి పెరిగిపోయాయి. కాని యిదే సమయంలో సహకార స్టోర్సులు ప్రజలకు సరసమైన ధరలకు నికార్సుఅయిన సరుకులు అమ్మవలసిన విధి వుంది. ధరలు పెరిగిపోతూ, సామాన్య ప్రజలు తమ జీవితావసరాలు కొనుక్కోలేనంత హెచ్చుధరలు వున్నప్పుడే, సామాన్య ప్రజలకు నిత్య జీవితావసర…

వస్తువులను సరసమైన ధరలకు అందచేయుటకు మద్రాసులోని ట్రిప్లికేన్ అర్బన్ కోపరేటివ్ స్టోర్సు యేర్పరచబడింది. కాని 1952 నుండి డీకంట్రోలు వల్ల, ఇతర పరిస్థితులవల్ల జీవితావసర వస్తువులధరలు హెచ్చుతూవుంటే, ప్రజాతంత్ర పద్ధతులతో స్టోర్సు పై విధమగు సాంఘికావసరాన్ని తీర్చుటకు మారు, వారు అంతకు ముందు చేస్తున్న వ్యాపారాన్ని వదులుకొని వారి విద్యుక్త ధర్మానికి స్వస్తి చెప్పడం జరుగుతూంది. అందువల్ల ప్రభుత్వం సహకార స్టోర్సులు సామాన్య ప్రజల అవసరాలను తీర్చే సంఘాలుగా అభివృద్ధి కానిచ్చుటలేదు.

ప్రభుత్వ ఆదుపాజ్ఞలకు లోబడి యెంత వ్యాపారము మెట్టి వ్యాపారము చేయ వీలుంటుందో, అంత వ్యాపారమే అట్టి వ్యాపారమే సహకార, జిల్లా సహకార హోల్‌సేల్ స్టోర్సులు చెయ్యాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ విధానం వల్ల సహకార హోల్‌సేల్ స్టోర్సు వ్యాపారం, కంట్రోలు సడలిననాటినుండి క్రమేపీ క్షీణించింది. కంట్రోలు ఆర్డర్లలో మార్పుల ననుసరించి, యీ స్టోర్సుల వ్యాపారం ఎలా ఎగుడు దిగుడుగా జరిగిందీ యీ క్రిందిపట్టికనుండి తెలుస్తుంది:

(మద్రాసు రాష్ట్రంలోని అన్ని సహకార జిల్లా హోల్‌సేల్ స్టోర్సులు సం॥పు అమ్మకాలయొక్క విలువలు లక్షల రూపాయలలో.)

1946-47: రు. 1,945; 1947-48: రు. 1,628; 1948-49: రు. 2,513; 1949-50: రు. 1,842; 1951-52: రు. 1,924.

ఆంధ్రలో 9 జిల్లా హోల్ సేల్ స్టోర్సులు ఉన్నాయి. ఈ సందర్భంలో ఈ క్రింది హోల్‌సేల్ స్టోర్సుల వ్యాపారాల పడుదుడుకులు గమనించదగినది. (సొంవత్సరికి అమ్మకపు మొత్తం లక్షల రూ||లో)

| | 1946-47 | 1947-48 | 1948-49 | 1949-50 | 1951-52 |
|---|---|---|---|---|---|
| కృష్ణా | 25.18 | 10.24 | 30.18 | 36.79 | 20.38 |
| విజయనగరం | 107.20 | 101.78 | 42.12 | 39.68 | 24.37 |

ఈవిధంగా స్టోర్సుల, సహకార సంఘాల వుద్యమం కూడా ప్రభుత్వ నియంత్రిత్వమునకు లోనై అభివృద్ధిలేక క్షీణిస్తూంది.

సహకార వుద్యమాభివృద్ధికి ప్రజాతంత్రం, ప్రజలందరకు సహకార వుద్యమంలో పాల్గొనటం, దానికి పూర్తి అవకాశము కల్గివుండుట - యిది ప్రాణప్రాయువువంటిది. అట్టి ప్రజాతంత్రం లోపించి ప్రభుత్వ అధికారవర్గపు, భూస్వామ్యవర్గపు నియంత్రిత్వపు వత్తిడి క్రింద పనిపతి ఉద్యమం, స్టోర్సు ఉద్యమం నలిగిపోతున్నందువలనే సహకారోద్యమం అభివృద్ధి కావడంలేదు.

అట్టి ప్రజాతంత్రం, ప్రజావుద్యమ కార్యకలాపాలవల్లనే భవిష్యత్తులో సహకారోద్యమం అభివృద్ధి చెందవీలున్నది. అందుకు ప్రజాతంత్రవాదు లెల్లరును పూనుకొనుటవారి విద్యుక్త విధి.



## 1951–52 సంవత్సరంలో జిల్లా కోఆపరేటివ్ హోల్ సేల్ స్టోర్సుల వ్యాపారస్థితి (1)

| స్టోర్సు పేరు | | 1952 సం॥ జూన్ 30వ తేదీకి ఉన్న సభ్యుల సంఖ్య (1) | చెల్లించబడిన వాటాధనం (1952 సం॥ జూన్ 30వ తేదీకి) (2) | రిజర్వులు (1952 సం॥ జూన్ 30 వ తేదీకి) (3) | ఈ సంవత్సరాంతానికి తెచ్చిన అప్పులు: సెంట్రల్ బ్యాంకునుంచి వేల రూపాయలు (4) | ప్రభుత్వం నుంచి వేల రూపాయలు (5) | ఇతర ఋణాలు వేల రూపాయలు (6) | మొత్తం తెచ్చిన అప్పు వేల రూపాయలు (7) | 1952 జూన్ 30 వ తేదీకి వర్కింగ్ కాపిటలు వేల రూపాయలు (8) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అనంతపురం కోఆపరేటివ్ హోల్‌సేల్ స్టోర్సు | | 759 | 1,15 | 1,04 | 3,61 | 14 | ... | 3,75 | 5,94 |
| చిత్తూరు | ,, | 397 | 98 | 3,13 | ... | 19 | ... | 19 | 4,30 |
| కడప | ,, | 341 | 1,01 | 53 | 8,42 | 26 | ... | 8,68 | 10,22 |
| తూర్పుగోదావరి | ,, | 453 | 92 | 37 | 3,96 | ... | 7 | 3,96 | 5,32 |
| పశ్చిమగోదావరి | ,, | 143 | 42 | 1 | 2,72 | ... | ... | 2,72 | 3,15 |
| గుంటూరు | ,, | 1,466 | 1,66 | 2,25 | 5,14 | 11 | ... | 5,25 | 9,16 |
| విజయవాడ | ,, | 619 | 1,01 | 64 | 13,61 | ... | ... | 13,61 | 15,26 |
| కర్నూలు | ,, | 443 | 1,36 | 92 | 7,27 | 56 | 1,84 | 7,83 | 11,95 |
| నెల్లూరు | ,, | 398 | 1,42 | 70 | 14,82 | 4 | ... | 14,86 | 16,98 |
| విజయనగరం | ,, | 505 | 1,39 | 1,50 | 7,68 | 33 | ... | 8,01 | 10,90 |

## 1951_52 సంవత్సరంలో జిల్లా కోఆపరేటివు హోల్‌సేల్ స్టోర్సుల వ్యాపార స్థితి (2)

| స్టోర్సు పేరు | ఈ సం॥ ఆఖరుకి నిల్వ సరుకుల విలువ (వేల రూ॥లలో) | 1951_52 లో అమ్మకం | | | | నికరలాభం వేల రూ॥లలో | నికర నష్టం వేల రూ॥లలో |
|---|---|---|---|---|---|---|---|
| | | సభ్యులకు అమ్మినవి వేల రూ॥లలో | ఇతరులకు వేల రూ॥లలో | సర్కారుకు వేల రూ॥లలో | మొత్తం అమ్మకం వేల రూ॥లలో | | |
| | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) |
| అనంతపురం కోఆపరేటివు హోల్‌సేల్ స్టోర్సు | 56,91 | 62,36 | ... | 1,23 | 63,59 | 1,02 | ... |
| చిత్తూరు ,, | 70,70 | 1,03,29 | 27 | 2,60 | 1,06,16 | 64 | ... |
| కడప ,, | 44,36 | 42,61 | 46 | 6,31 | 49,38 | ... | 42 |
| తూర్పుగోదావరి ,, | 25,41 | 9,70 | 8,67 | 8,93 | 27,30 | 5 | ... |
| పశ్చిమగోదావరి ,, | 10,44 | 4,95 | 3,68 | 1,97 | 10,60 | 6 | ... |
| గుంటూరు ,, | 57,26 | 26,76 | 20,93 | 10,31 | 58,00 | 59 | ... |
| విజయవాడ ,, | 24,08 | 8,04 | 1,34 | 11,00 | 20,38 | 9 | ... |
| కర్నూలు ,, | 72,62 | 52,49 | 61 | 22,88 | 75,98 | 54 | ... |
| నెల్లూరు ,, | 52,89 | 30,07 | 7,62 | 23,09 | 60,78 | 50 | ... |
| విజయనగరం ,, | 22,04 | 6,43 | 45 | 17,49 | 24,37 | 12 | ... |

## 1951–52 సంవత్సరంలో పనిచేస్తున్న ప్రైమరీ రిటైలు కోఆపరేటివ్ స్టోర్సుల వ్యాపారస్థితి (1)

| సర్కిలు పేరు | 1952 జూన్ 30 న పనిచేస్తున్న సొసైటీలు (1) | వీటి బ్రాంచీలు (2) | సగటు సభ్యత్వము (వేలలో) (3) | 1952 జూన్ 30 న చెల్లించిన మూలధనం (వేల రూ॥ లలో) (4) | 1952 జూన్ 30 న చేసికొన్న రిజర్వులు (వేల రూ॥ లలో) (5) | సెంట్రల్ బ్యాంకుల నుండి తెచ్చిన అప్పులు (వేల రూ॥ లలో) (6) | సభ్యులనుండి తెచ్చిన అప్పులు (వేల రూ॥ లలో) (7) | సహకారేతర సంఘాలనుండి తెచ్చిన అప్పులు (వేల రూ॥ లలో) (8) | సంవత్సరంలో అమ్మకాలు (వేల రూ॥ లలో) (9) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అనంతపురం | 42 | 42 | 9 | 90 | 2,32 | 1,40 | 1,76 | ... | 6,38 |
| చిత్తూరు | 26 | ... | 11 | 1,30 | 1,25 | 92 | 1,29 | ... | 4,76 |
| కడప | 64 | 89 | 7 | 1,05 | 49 | 1,45 | 64 | 2 | 3,65 |
| రాజమండ్రి | 47 | 1 | 14 | 1,75 | 60 | 1,00 | 8 | ... | 3,43 |
| కాకినాడ | 41 | 13 | 9 | 1,39 | 39 | 64 | 12 | 5 | 2,59 |
| పశ్చిమ గోదావరి | 64 | 14 | 9 | 1,75 | 28 | 97 | 8 | ... | 3,08 |
| గుంటూరు | 32 | 7 | 6 | 1,54 | 74 | 97 | 25 | ... | 2,90 |
| బాపట్ల | 58 | ... | 11 | 2,78 | 48 | 76 | 11 | ... | 4,13 |
| విజయవాడ | 33 | 38 | 7 | 2,05 | 59 | 81 | 17 | ... | 3,62 |
| మచిలీపట్నం | 12 | 15 | 4 | 1,07 | 49 | 1,12 | 9 | 1 | 2,78 |
| కర్నూలు | 52 | 84 | 8 | 1,09 | 1,62 | 15 | 6 | 23 | 3,15 |
| దక్షిణ నెల్లూరు | 26 | ... | 4 | 1,09 | 21 | 89 | 9 | 2 | 2,30 |
| ఉత్తర నెల్లూరు | 23 | 44 | 3 | 1,12 | 91 | 1,17 | 11 | 14 | 3,45 |
| విశాఖపట్నం | 37 | 42 | 11 | 1,17 | 92 | 95 | 25 | ... | 3,29 |
| శ్రీకాకుళం | 36 | ... | 9 | 1,04 | 55 | 1,73 | 21 | 1 | 3,44 |

## 1951–52 సంవత్సరంలో పనిచేస్తున్న ప్రైమరీ రిటైల్ కోఆపరేటివ్ స్టోర్సుల వ్యాపారస్థితి (2)

| సర్కిలు పేరు | సంవత్సరంలో కొన్న సరుకు విలువ (వేల రూ. లలో) | సంవత్సరంలో అమ్మకం విలువ (వేల రూ. లలో) | అమ్మిన వివిధ సరుకులు | | | నికర లాభం | | నికర నష్టం | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | ఆహార పదార్థాలు (వేల రూ. లలో) | బట్టలు (వేల రూ. లలో) | ఇతరాలు (వేల రూ. లలో) | లాభం వచ్చిన సంస్థలు | వచ్చిన లాభం (వేల రూ. లలో) | నష్టం వచ్చిన సంస్థలు | వచ్చిన నష్టం (వేల రూ. లలో) |
| | (10) | (10) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) |
| అనంతపురం | 55,12 | 59,56 | 52,40 | 3,12 | 4,04 | 9 | 20 | 33 | 37 |
| చిత్తూరు | 28,11 | 32,01 | 25,15 | 1,25 | 5,51 | 17 | 53 | 25 | 40 |
| కడప | 49,51 | 40,84 | 30,33 | 10,31 | 20 | 7 | 2 | 36 | 83 |
| రాజమండ్రి | 10,73 | 11,31 | 8,33 | 1,41 | 1,57 | 6 | 7 | 39 | 65 |
| కాకినాడ | 12,75 | 13,21 | 9 | 9,55 | 3,57 | 5 | 2 | 30 | 45 |
| పశ్చిమగోదావరి | 14,61 | 16,04 | 10,42 | 2,82 | 1,80 | 8 | 3 | 62 | 1,02 |
| గుంటూరు | 15,07 | 15,90 | 15,00 | 60 | 30 | ... | ... | ... | ... |
| బాపట్ల | 11,84 | 13,58 | 43 | 27 | 12,88 | 7 | 2 | 51 | 91 |
| విజయవాడ | 34,70 | 37,31 | 30,27 | 2,75 | 4,29 | 6 | 8 | 27 | 80 |
| మచిలీపట్నం | 16,43 | 17,21 | 12,52 | 2,50 | 2,09 | ... | ... | 17 | 33 |
| కర్నూలు | 25,49 | 28,13 | 25,85 | 1,60 | 68 | 5 | 22 | 35 | 69 |
| దక్షిణ నెల్లూరు | 11,12 | 11,52 | 6,54 | 83 | 4,15 | 4 | 1 | 20 | 49 |
| ఉత్తర నెల్లూరు | 34,57 | 36,99 | 29,13 | 3,24 | 4,56 | 11 | 41 | 12 | 30 |
| విశాఖపట్నం | 32,36 | 35,50 | 28,57 | 3,07 | 3,86 | 9 | 40 | ... | ... |
| శ్రీకాకుళం | 8,78 | 9,92 | 5,80 | 1,22 | 2,90 | 2 | 1 | 34 | 2,30 |

# ఇన్స్యూరెన్సు

భారతదేశంలో ఇన్స్యూరెన్సు వ్యాపారం 1829 ప్రాంతంలో ప్రారంభించబడింది. దేశంలోని పెద్ద కంపెనీలలో ఒకటైన ఓరియంటల్ లైఫ్ ఇన్స్యూరెన్సు కంపెనీ 1874 లోను, ఎంపైర్ ఆఫ్ ఇండియా కంపెనీ 1896 లోను ప్రారంభించబడ్డాయి.

ఇంతకాలం క్రితమే ఇన్స్యూరెన్సు వ్యాపారం ప్రారంభించబడినా, దేశంలో జాతీయభావం పెంపొందడం ప్రారంభించేవరకు యీ వ్యాపారంలో ఎట్టి అభివృద్ధి లేదు. దీనికితోడు దేశంలో ఈ వ్యాపారం క్రొత్త కావటం, ప్రజలకు దీని స్థిరత్వంపై విశ్వాసం కలగకపోవటం కూడా ఒక కారణమైంది. జాతీయోద్యమం అభివృద్ధి అయిన తర్వాతనే ఇన్స్యూరెన్సు వ్యాపారం పెరుగ ప్రారంభించింది.

ఇప్పటికున్న వ్యాపారాభివృద్ధి అంతా గత యాభై సంవత్సరాలలో సాధించబడిందే! ఇపుడు వ్యాపారం చేస్తున్న పెద్ద కంపెనీలలో చాలభాగం 1900 - 1912 సంవత్సరాల మధ్య కాలంలో ప్రారంభించబడినవే! 1920-21 వరకూ, ఈ వ్యాపార రంగంలో విదేశ పోటీ మూలంగా తగినంతఅభివృద్ధిలేకపోయినా, అప్పటికి ఉధృతరూపంలోఉన్న సహాయ నిరాకరణోద్యమం ఇన్స్యూరెన్సు వ్యాపారానికి ఒక ఊపు నిచ్చింది.

దాదాపు ఈదశలోనే 1925 వ సంవత్సరంలో ఆంధ్రుల మొదటి ఇన్స్యూరెన్సు కంపెనీ-ఆంధ్రఇన్స్యూరెన్సుకంపెనీ ప్రారంభించబడింది. తర్వాత పదిసంవత్సరాలకు 1935 లో హిందూస్తాన్ ఐడియల్ ఇన్స్యూరెన్సు కంపెనీ - ఆంధ్రుల రెండవ కంపెనీ-ప్రారంభించబడింది.

ఇప్పటికీ భారతదేశ ఇన్స్యూరెన్సు వ్యాపారం తగినంత అభివృద్ధి కాలేదనే చెప్పాలి. 1951 వ సంవత్సరానికి దేశంలో నూటికి మూడు కుటుంబాలు మాత్రమే లైఫ్ ఇన్స్యూరు చేసినట్లు తెలుస్తున్నది. మిగిలిన 97 కుటుంబాలకు ఇట్టి రక్షణలేదు.

ఇన్స్యూరెన్సు వ్యాపారాభివృద్ధి ప్రజల జీవన ప్రమాణ అభివృద్ధిమీద ప్రధానంగా ఆధారపడి ఉన్నది. నేడు అత్యధిక సంఖ్యాకులు, తాము సంపాదించేది రెండుపూటల తిండికి చాలని స్థితిలో, ఇన్స్యూరు చెయ్యటం ఎలాగూ సాధ్యం కాదు. క్రమంగా జీవనప్రమాణం పడిపోతూంటే ఇన్స్యూరెన్సు వ్యాపారం కూడా మందకొడిగా జరుగుతున్నది.

ఈ పరిస్థితులలో ఆంధ్ర ఇన్స్యూరెన్సు వ్యాపారం మరింత అట్టడుగున ఉన్నది. భారతదేశంలో 1951 వ సంవత్సరంలో 115 భారతీయ కంపెనీలు వ్యాపారం చేస్తుంటే, ఆంధ్ర కంపెనీలు రెండు

మాత్రమే రంగంలో ఉన్నాయి. వీటి కొత్త వ్యాపారం సుమారు రు. 2,50 లక్షలుంటే, దేశంలోని ఇతర కంపెనీలు రు. 116 కోట్లవరకూ కొత్త వ్యాపారం చేస్తున్నాయి. 1951 వ సంవత్సరంలో వీటి వ్యాపారం రు. 667 కోట్లు. ఇందులో ఆంధ్ర కంపెనీల వ్యాపారం రు.11 కోట్లకు మించదు.

దేశంలో 107 కంపెనీలు అగ్ని, నౌకా, తదితర రకాల వ్యాపారం చేస్తున్నాయి. ఇందులో ఆంధ్ర కంపెనీలు రెండే! 1951 వ సంవత్సరంలో వీటి ప్రీమియమ్ రాబడి మొత్తం రు. 13 కోట్లు. ఆంధ్ర లోని రెండు కంపెనీల ప్రీమియమ్ రాబడి అరులక్షల రూపాయలు మాత్రమే!

## ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ

ఇది 1925 లో, మచిలీపట్నంలో ప్రారంభించబడింది. ఉన్న రెంటిలోను ఇది పెద్ద కంపెనీ. మొదట లైఫ్ ఇన్సూరెన్సు మాత్రం చేస్తూవుండేది. కొంత కాలంగా అగ్నిప్రమాద మొదలైన వివిధ రకాల వ్యాపారాన్ని చేస్తున్నది.

శ్రీ యల్. సుబ్బారావు డైరెక్టర్ల బోర్డు ఛైర్మన్. శ్రీ పి. పార్థసారథి నాయుడు మేనేజింగు డైరెక్టరు.

1951వ సంవత్సరం డిశెంబరు 31వ తేదీకి కంపెనీ వ్యాపారస్థితి :

| | |
|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. 4,99,975 |
| ఇతర రిజర్వులు | రు. 2,15,000 |

| | |
|---|---|
| జీవితభీమా | రు. 1,60,73,278 |
| ఇతర భీమా | రు. 1,66,538 |
| నికరలాభం | రు. 14,347 |

కేంద్ర కార్యాలయం మచిలీపట్నం, కృష్ణాజిల్లా.

బ్రాంచీలు, సబ్ ఆఫీసులు:

మదరాసు, ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, నాగపూరు, సికింద్రాబాదు, బరంపురం, అనంతపురం, ఎర్నాకుళం, బెంగుళూరు, దిబ్రుఘర్, బెల్గాం, జెమ్షెడ్పూరు, పాట్నా, అలహాబాదు, విశాఖపట్నం, విజయవాడ, గుంటూరు, రాజమండ్రి, అహమ్మదాబాదు.

హిందుస్థాన్ ఐడియల్
ఇన్సూరెన్సు కంపెనీ

ఇది 1935 లో మచిలీపట్నంలో ప్రారంభించబడింది. ఇది జీవిత, అగ్ని ప్రమాద తదితర విధాలైన భీమావ్యాపారం చేస్తుంది.

శ్రీ సి. రామనాథబాబు మేనేజింగు డైరెక్టరు. శ్రీ యస్. రామాచార్ జనరల్ మేనేజరు.

1951వ సంవత్సరం, డిశంబరు 31 వ తేదీన కంపెనీ వ్యాపారస్థితి:

| | |
|---|---|
| చెల్లించబడిన మూలధనం | రు. 6,05,608 |
| రిజర్వులు_ఇతర నిధులు | రు. 86,381 |
| జీవిత భీమా | రు. 22,11,747 |
| ఇతర భీమా | రు. 69,225 |
| లాభం | రు. 34,584 |

రిజిష్టర్డు కార్యాలయం: మచిలీపట్నం (కృష్ణాజిల్లా). కేంద్ర కార్యాలయం, 32/33 లింగిచెట్టి స్ట్రీట్, మదరాసు_1.

జగత్సేవా మ్యూచువల్
ప్రావిడెంటు ఇన్సూరెన్సు
కంపెనీ

ఈ కంపెనీ మచిలీపట్నంలో 1947వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ప్రస్తుతం ఆంధ్రలో వెయ్యిరూపాయలకు తక్కువ పట్టాలు జారీచేయు భీమాకంపెనీలు లేవుకనుక, సామాన్యప్రజల కందుబాటులో ఉండేట్లు వందనుండి వెయ్యి రూపాయలవరకూ పట్టాలు జారీచేయుటకు అవకాశం కల్పించబడింది. కంపెనీకి

వచ్చే లాభాన్నంతటినీ పట్టాదార్లకే పంచి ఇస్తారు.

ఈ కంపెనీ త్వరితగతిని అభివృద్ధి అవుతున్నది. 1953వ సంవత్సరంలో ఈ కంపెనీ సుమారు పదులక్షల రూపాయల వ్యాపారాన్ని పూర్తిచేసింది. భారత దేశంలో వున్న 94 ప్రావిడెంటు కంపెనీలలో ఈ కంపెనీ మూడవ లేక నాల్గవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

ఇట్టి భీమా కంపెనీ ఆంధ్రలో ఇది ఒక్కటే!

# ఖనిజ సంపద

ప్రొఫెసర్ సి. మహదేవన్
యం. ఏ., డి. యస్‌సి., యఫ్. ఏ. యస్‌సి., యం. ఏ. ఐ. యం. ఇ., యఫ్. యన్. ఐ.,
(ఆంధ్ర విశ్వవిద్యాలయ భూగర్భ పరిశోధనశాఖ ప్రధాన ఆచార్యులు)

## ఆస్బెస్టాస్

దీనినే రాతినార అంటారు. ఇది చక్కటి పీచులాగా ఉంటుంది. ఈ ఖనిజం రెండురకాలు. ఒకరకం రంగు ముదరైనది కప్పలాంటి భూ జలచరాల చర్మాన్ని పోలిఉంటుంది. రెండోరకం పాముచర్మాన్ని పోలి ఉంటుంది. ఆంధ్రరాష్ట్రంలో దొరికే రాతినార నిలవలు, పాము చర్మాన్ని పోలిన క్రిసోటైల్ (chryosotile) తరగతికి చెందినవి. ఈ ఖనిజం ప్రధానంగా మెగ్నీషియంయొక్క సిలికేటు ద్రావణం. క్రిసోటైల్ పొరలు సర్పాకృతిలో, కంపల్లి మెగ్నీషియం సున్నపురాతిలో, డోలరైటు రాతి పలకల సంస్పర్శవల్ల ఉత్పన్నమవుతున్నాయి.

కడపజిల్లా: లింగాల (14°30′ : 78° )- బ్రాహ్మణపల్లి (14°25′ : 78°21′) ప్రదేశంలో రాతినార విరివిగా దొరుకుతుంది. లోపటనూతుల (14°30′ : 78°5′) సమీపంలోనూ, తాళ్ళపల్లి- బలమువారిపల్లి (14°20′ : 78°23′30″), కంపల్లి (14°22′30″ : 78°27′30″), ఎర్రంపల్లి (14°28′3″ : 78°33′), రాజాపాలెం (14°26′ : 78°31′) సమీపంలోనూ ఈ గని ప్రదేశాలు కలవు.

కర్నూలుజిల్లా: మల్కాపురం (15°21′ : 77°59′), చినమల్కాపురం (15°22′ : 77°58′30″), గోపాలపురం (15°49′ : 78°4′) వద్ద కూడా ఈ గనులు ఉన్నాయి.

అనంతపురంజిల్లా: వెంగనపల్లి (14°58′ : 77°48′) సమీపంలో రాతినార పొరలున్నట్లు తెలియవస్తోంది.

## బారైట్

దీనినే తెలుగులో ముగ్గురాయి అంటారు. ముంగిళ్ళలో ముగ్గులు పెట్టడానికి ఎక్కువగా దీనిని ఉపయోగిస్తారు. ఇది బేరియంయొక్క సల్ఫేటు. మైదాన ప్రదేశాలలో అక్కడక్కడావుండే అగాధాలలో పొరలుగాను, సున్నపురాయి డోలమైట్ల స్థానంలో గుట్టలుగాను దొరుకుతుంది. ఈ రెండురకాల బారైట్ కంపల్లిలో దొరుకుతున్న సున్నపురాయి రూపంలోగాని, సున్నపురాతి పొరల లోపలగాని రాయలసీమలో లభ్యమౌతున్నది.

అనంతపురం, కర్నూలు, కడప జిల్లాలలో శాస్త్రీయ నారకే ప్రదేశాల పట్టి క్రింద యివ్వబడింది:

## అనంతపురం జిల్లా

| | అక్షాంశరేఖ ° | ′ | ″ | రేఖాంశరేఖ ° | ′ | ″ |
|---|---|---|---|---|---|---|
| ముదిగుబ్బ | 14 | 21 | 0 | 77 | 59 | 0 |
| సెరిజంపల్లి | 14 | 32 | 30 | 78 | 1 | 0 |
| దాడితోల | 14 | 35 | 30 | 77 | 58 | 30 |
| ఎల్లుట్ల | 14 | 40 | 0 | 77 | 54 | 30 |
| మడునుపల్లి | 14 | 42 | 30 | 77 | 54 | 0 |
| నోసలేడు | 14 | 46 | 30 | 77 | 54 | 30 |
| ఓబులాపురం | 14 | 47 | 0 | 77 | 54 | 30 |
| వెంకటాంపల్లి | 14 | 47 | 30 | 77 | 50 | 0 |
| ముచ్చుకోట | 14 | 51 | 0 | 77 | 52 | 30 |
| సంజీవపురం | 14 | 48 | 30 | 77 | 54 | 30 |
| తలుపుల | 14 | 54 | 0 | 77 | 49 | 30 |
| నుదికపల్లి | 14 | 56 | 30 | 77 | 48 | 0 |
| చింతలచెరువు | 14 | 59 | 30 | 77 | 46 | 0 |
| గోనాపురం | 15 | 0 | 30 | 77 | 48 | 30 |
| కొండంపల్లి | 14 | 2 | 30 | 77 | 47 | 0 |
| క్రిష్టిపాడు | 15 | 4 | 0 | 77 | 46 | 30 |
| లక్ష్మపల్లి | 15 | 7 | 0 | 77 | 49 | 30 |

## కర్నూలు జిల్లా

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| నల్లమేకలపల్లి | 15 | 7 | 30 | 77 | 47 | 0 |
| బోయనపల్లి | 15 | 8 | 30 | 77 | 49 | 30 |
| నారాయణపురం | 15 | 9 | 30 | 77 | 47 | 0 |
| పెద్దపాయ | 15 | 10 | 0 | 77 | 50 | 30 |
| రంగాపురం | 15 | 14 | 0 | 77 | 50 | 0 |
| రామాపురం | 15 | 17 | 0 | 77 | 52 | 0 |
| కొచ్చెరువు | 15 | 19 | 0 | 77 | 51 | 30 |
| చంద్రపల్లి | 15 | 20 | 30 | 77 | 49 | 0 |
| కమలాపురం | 15 | 21 | 0 | 77 | 56 | 0 |
| కొటపలి | 15 | 22 | 30 | 78 | 2 | 30 |
| కలపల | 15 | 23 | 30 | 77 | 58 | 30 |
| అంబాపురం | 15 | 23 | 0 | 78 | 5 | 30 |
| రహిమాన్‌పురం | 15 | 24 | 0 | 78 | 3 | 0 |
| బసనాపురం | 15 | 24 | 30 | 78 | 38 | 0 |
| గుంటుపల్లి | 15 | 25 | 30 | 78 | 3 | 0 |
| కొముగూరి కొట్టాల | 15 | 26 | 0 | 78 | 5 | 0 |
| తాపసికొండ | 15 | 27 | 30 | 78 | 3 | 30 |
| బలపాలపల్లి | 15 | 27 | 30 | 78 | 6 | 30 |
| పాపసాని కొట్టాల | 15 | 27 | 30 | 78 | 5 | 0 |
| కొలుమలపల్లి | 15 | 28 | 30 | 78 | 8 | 0 |
| జనపాల చెరువు | 15 | 28 | 30 | 78 | 9 | 30 |
| ముసలయ్య చెరువు | 15 | 29 | 30 | 78 | 4 | 0 |
| గట్టిమానికొండ | 15 | 32 | 0 | 78 | 11 | 0 |
| కాకినుడుగు | 15 | 46 | 30 | 77 | 9 | 0 |

## కడప జిల్లా

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| రాజంపేట | 14 | 4 | 0 | 79 | 39 | 30 |
| చిన్నన్న గారిపల్లి | 14 | 20 | 0 | 78 | 22 | 0 |
| ఒడిపెంట | 14 | 20 | 0 | 78 | 19 | 0 |
| రాగిగారిపల్లి | 14 | 21 | 0 | 78 | 19 | 0 |
| పెబ్బర | 14 | 21 | 30 | 78 | 16 | 0 |
| పాలగాల | 14 | 22 | 0 | 78 | 41 | 0 |
| కొత్తపల్లి | 14 | 22 | 0 | 78 | 21 | 30 |
| పెత్సవారిపల్లి | 14 | 22 | 30 | 78 | 15 | 0 |
| తంపల్లి | 14 | 22 | 30 | 78 | 27 | 30 |
| నంబిపల్లి | 14 | 22 | 30 | 78 | 24 | 30 |
| తంగేడుపల్లి | 14 | 23 | 0 | 78 | 29 | 0 |
| మిట్టమీదపల్లి | 14 | 25 | 30 | 78 | 44 | 0 |
| సీమలపెంట | 14 | 26 | 0 | 78 | 35 | 30 |
| తప్పులపల్లి | 14 | 26 | 0 | 78 | 31 | 30 |

| | అక్షాంశరేఖ | రేఖాంశరేఖ |
|---|---|---|
| | ° ′ ″ | ° ′ ″ |
| రాజాపాలెం | 14 26 0 | 78 31 0 |
| ఇప్పట్ల | 14 32 0 | 78 4 30 |
| కర్నపాపయపల్లి | 14 32 0 | 78 4 30 |
| పర్ణపల్లి | 14 34 0 | 77 58 30 |

నెల్లూరుజిల్లా నర్రవాడకు (14°54′: 79°26′) తూర్పున మూడుమైళ్ళలో ముగ్గు రాయి ఉన్నట్టు తెలుస్తోంది. ఆంధ్ర విశ్వ విద్యాలయంవారు యిక్కడ పరి శోధనను సాగించి వ్యాపారదృష్ట్యా ఈ గనులు ఎక్కువ లాభదాయకం కావని తేల్చారు.

## బాక్సైటు

ఇది అల్యూమినియంయొక్క హైడ్రాక్సైడు. ఇనుము, మాంగనీసు, ఒక్కొక్క ప్పుడు సిలికా, టిటేనియాలతో కలిసి కూడా ఉంటుంది. ఒకటి విడిచి ఒకటిగా వర్ష, వేసవికాలాలు వచ్చే చోట, ఉన్న ప్రదేశాలలో ఇది యేర్పడుతుంది.

విశాఖపట్నం, గోదావరిజిల్లాల్లోని తూర్పు కనుమలలో ఈ లోహం దొరుకు తుంది. ఈ లోహం ఉందని అనుమా నించబడిన తావులలో పరిశోధన సాగించ వలసి వుంది.

## కట్టడపు రాయి

కాలం, వాతావరణాలను తట్టుకొని గట్టితనం, ఆకర్షణీయమైన రంగు, ఆకృతి గలిగి చెక్కుటకు వీలైన రాయి కట్టడపు రాయిగా ఎక్కువ ఉపయోగ పడు తుంది.

ఇలాంటి రాతిశిలాంశాలు దాదాపు ఆంధ్రరాష్ట్రంలోని అన్ని జిల్లాలలోనూ కలవు. నెల్లూరు, చిత్తూరుజిల్లాలలో నల్ల రాయి, పలకరాయి విస్తారంగా దొరుకు తుంది. సర్కారు జిల్లాలలో కొండ రాయి, రాయలసీమలో ప్రసిద్ధికెక్కిన కడపనాపరాయి, పశ్చిమ గోదావరి జిల్లాలో యిసుకరాయి, పల్నాడులో సున్నపురాయిదొరుకుతోంది. గుంటూరు-మాచెర్ల రైలుమార్గం చేరువలో రెంట చింతల, పిడుగురాళ్ళ, దాచేపల్లి ప్రాంతా లలో సుందరమైన చలువరాయి వివిధ వర్ణాలలో లభ్యమవుతోంది.

## బెరైల్

ఇది బెరీలియంయొక్క సిలికేటు. పరి శ్రమలలో చాలా విలువైన ఖనిజం. ఈ అణు యుగంలో దీనికి ఎక్కువ ప్రాముఖ్యత వచ్చింది. అణువు విభజనం చే ప్రయోగాలలో యిది ఎంతో ఉప యుక్తమవుతుంది.

గూడూరుప్రాంతం బెరైల్ ఖనిజానికి ఎక్కువ ప్రసిద్ధికెక్కింది. ఇది విశాఖ జిల్లా కురుపం జమీలోకూడా లభ్యమవు తుంది. ఇటీవల శ్రీకాకుళంజిల్లా ఆంధ్ర జమీలో బెరైల్‌ని కనుగొన్నారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ భూగర్భ పరి శోధనశాఖ కృషివల్లనే ఆంధ్ర, కురుపం జమీలలో బెరైల్ బయటపడింది.

## క్రోమైట్

ఇది క్రోమియం ఖనిజములలో ముఖ్య మైనది. ఇది క్రోమియం, యినుములయొక్క ఆక్సైడు.

కృష్ణాజిల్లాలోని కొండపల్లి (16°37′: 80°32′30″) చుట్టూ ఉన్న కొండలలో క్రోమైట్ నిలవలు చిన్న చిన్నవి చాలా ఉన్నాయి. ఈ ఖనిజం పొరలుగానూ, బిళ్ళల రూపంలోనూ దొరుకుతోంది.

నాలుగు పొరలు కనిపించాయి. అందులో 4½ అడుగుల మందంగల పొర ఒకటి మాత్రమే పనికివస్తుంది. ఇరకారు గనులు, గొట్టం దిగిన లోతు (186 అ.) కంటే మందమైనవి. అందువల్ల యింకా ఎక్కువ లోతుగ మంచిరకం పొరలు లభ్యం కావచ్చు. చింతలపూడి ఇసుకరాతి గుట్టల కింద బొగ్గు ఉన్నట్లు తెలుస్తుంది. ఇందువల్ల బేదదనూరు, చింతలపూడి మధ్య ప్రదేశంలో పరిశోధనలు సాగించాల్సిన అవసరమెంతైనా ఉంది.

## రాగి (Copper)

ఆధునిక ప్రపంచంలో అత్యంతావసరమైన లోహాలలో రాగి ఒకటి.

నెల్లూరు జిల్లాలోని యెఱ్ఱపల్లి (14°59'30'' : 70°36'30''), గరిమిన పెంట (14°59'30' : 79°33') సమీపంలో 13 వ శతాబ్దంనుంచికూడా అప్పుడప్పుడూ రాగి తవ్వుతూనే ఉన్నారు. కాని 20 - 60 అడుగుల లోతువరకే పరిశోధనలు సాగాయి. కొంతమంది బ్రిటిష్ శాస్త్రజ్ఞులు ఈ ప్రదేశం పరిశోధించి గొట్టాలు దింపడానికి అనువైన ప్రదేశాలు సూచించారు. డా|| యం.యస్.కృష్ణ తిరిగి యీ ప్రదేశమంతా పరిశోధించి, పూర్వపు ఫలితాలే యిప్పుడూ వస్తే అనుకూలమైన చోట్ల గొట్టాలు దింపడం మంచిదని భావిస్తున్నారు. ఈ జిల్లాలో పామూరు, నరసింహాపురం (15°0'30'' : 79°30'), గోగులవద్ద; పల్లి (15°15''30 : 79°29'30'') కడప జిల్లా జంగమరాజపల్లెవద్ద; అనంతపురం జిల్లా ముడిగుబ్బవద్ద; కర్నూలుజిల్లాలో గని, గజ్జలకొండవద్ద రాగి గనులున్న సూచనలు కానవస్తున్నాయి. ఈ ప్రదేశాలు యింకా పరిశోధనలు చేయవలసి ఉంది. ఆంధ్ర విశ్వవిద్యాలయ భూగర్భ పరిశోధక శాఖ వారు గుంటూరుజిల్లాలోని అగ్నిగుండాల వద్ద జరిపిన పరిశోధనల ఫలితంగా ప్రశస్తమైన రాగి అక్కడ దొరుకుతుందని తెలుస్తోంది.

## కోరండం (Corumdum)

ఈ ఖనిజం అల్యూమినియం యొక్క ఆక్సైడు. మంచి మందపాటి కనికలుగా దొరుకుతుంది. ఇది లోహాలను మెరుగు పెట్టడానికి కూడా ఉపయోగపడుతుంది.

కోరండం, అనంతపురంజిల్లాలోని ఆత్మకూరు, దండువారిపల్లి, పరమతీయల్లి, పసలూరు, రెడ్డిపల్లి, సిద్ధరాంపురం, తిమ్మాపురం, పునిగి, మునిరేవు, ఓబులాపురం ప్రాంతాలలో దొరుకుతుంది.

## వజ్రాలు (Diamonds)

ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన కోహినూరు, కింబర్లీ పిట్టు, ది నైజాం మొదలైన వజ్రాలకు ఉత్పత్తిస్థానం కృష్ణాడెల్టా.

అనంతపురంజిల్లాలోని లత్తవరం (14°55 : 77°16'), గడేహొత్తూరు (పెద హొత్తూరు 15°0':77°18'), గంజికుంట (15°0'30'':77°23'), వజ్రకరూరు 15°1':77°23'), బసినేపల్లి (15°1': 77°26'), కంగానపల్లి (15°11':77°32 30''), ములకలపెంట (15°12':77°31'), ఉప్పరపల్లి (15°13':77°37'), జొన్నగిరి (15°14': 77°34'), గుడిఅనంతపురం, పగిడిరాయి (15°16':77°35'30''), పెరవలి (15°17': 77°30'), గిరికట్ల (15°17'30'':77°33'), తుగ్గలి (15°18':77°33') ప్రాంతాలలోనూ; కడపజిల్లా చెన్నూరు (14°34':78°29'), కొండపేట (14°33'30'':78°50'), గుల

విశాఖపట్నంజిల్లాలోని సాలూరు (18°31′:83°16′), కాశీపురం (18°13′:83°11′), కీసర, మరుపల్లి(18°21′:83°19′) గ్రాఫైటు దొరికే ముఖ్యప్రదేశాలు. ఇటీవల ఆంధ్రవిశ్వవిద్యాలయ భూగర్భశాఖ వారు శ్రీకాకుళంజిల్లా ఆంధ్రజమీలో మంచి గ్రాఫైటు నిలవలు కనుగొన్నారు. నర్సీపట్టణానికి 9 మైళ్ళలో నాసిరకం గ్రాఫైటు దొరుకుతుంది.

తూర్పు గోదావరిజిల్లా ఎర్రవరం తాలూకాలోని కోదాడ, వెలగలపల్లి, మరుపాలెంవద్ద; చోడవరం డివిజనులోని సీతపల్లి, గొల్లగూడెం, రామన్నపాలెం వద్ద; భద్రాచలండివిజనులోని పులికొండ, రాచకొండ, సూత్రికొండ ప్రాంతంలోనూ గ్రాఫైట్ ఉన్నది.

పశ్చిమగోదావరిజిల్లా జంగారెడ్డిగూడెం సమీపంలోని నాగులపాలెంవద్ద గ్రాఫైట్ తవ్వుతున్నారు. విశాఖపట్నం, గోదావరిజిల్లాల కొండ ప్రాంతాలలో పెద్దగ్రాఫైట్ నిలవలు దొరకవచ్చు.

### జిప్సం (Gypsum)

ఇది కాల్షియంయొక్క హైడ్రసు సల్ఫేటు. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ సిమెంటు తయారుచేయుటకు జిప్సం ఉపయోగపడుతుంది.

నెల్లూరుజిల్లా నాయుడుపేట (13°42′:80°1′) సమీపంలో జిప్సం దొరుకుతుంది. డా॥ బి. సి. రాయి 20 చ. మైళ్ళ విస్తీర్ణం పరిశీలించి, అడుగులోతు తవ్వితే చదరపుమైలుకు 10 వేలటన్నుల జిప్సం లభిస్తుందని అంచనా వేశారు. గుంటూరుజిల్లాలోని సంతరావూరు (15°48′:80°16′), కొత్తపట్నం (15°26′30″:80°8′30″) ప్రాంతాల సముద్రపు రొచ్చులో జిప్సం విరివిగా దొరుకుతుందని తెలుస్తోంది.

### ఇనుము

ఇనుము ఆక్సైడులుగా, హైడ్రసు ఆక్సైడులుగా, కార్బొనేటు, సల్ఫైడులుగా లభిస్తుంది.

కడపజిల్లాలోని చావలి, పడగలపల్లి, పెండ్లిమర్రి, మంటపంపల్లివద్ద ముడియినుము దొరుకుతుంది. కర్నూలుజిల్లాలోని వెల్దుర్తి (15°34′:77°56′), రామల్లకోట (15°34′:78°30′) ప్రాంతంలో మంచిరకం ముడియినుము లభిస్తుంది.

నెల్లూరు - గుంటూరు సరిహద్దులలో చాలాచోట్ల ముడియినుము నిలవలున్నాయి. తమ్మవరంకొండ, మణికేశ్వరం, అద్దంకి, సింగరాయకొండ, వెంపరాల ప్రాంతాలలోని నిలవలు అతిముఖ్యమైనవి. విశాఖపట్నంజిల్లాలోని చిత్రి, [illegible], [illegible], నర్సీపట్నం ప్రాంతాలలోకూడా ముడియినుము దొరుకుతుంది.

కృష్ణా, గుంటూరుజిల్లాలలో తీర ప్రాంతాలలోని జగ్గయ్యపేట, [illegible]కోట సమీపంలో ఎర్ర 'కాకీరాయి' విరివిగా దొరుకుతుంది. ఇందులో నూటికి 64 పాళ్ళు యినుము ఉంది. ఈ కాకీరాతిని పోతపోసి ఎక్కువగా ఎగుమతి చేస్తున్నారు.

### కైనైట్, సిలిమనైట్ (Kyanite & Sillimanite)

ఈ ఖనిజాలు రెండూ అల్యూమినియం యొక్క ఆక్సైడులు. చాలా గట్టివి.

నెల్లూరుమైకాప్రాంతంలో కొద్దిపాటి కైనైట్ నిలవలు కనిపిస్తున్నాయి.

ఈ జిల్లాలోని చుండి సత్రం చుట్టుపక్కల విస్తారంగా పరిశోధనలుసాగిస్తే ఈఖనిజం బైటపడవచ్చు.

సిలిమనైట్ విశాఖపట్నం జిల్లా రెల్లి సమీపంలో పుష్కలంగా దొరుకుతుంది. ఆంధ్ర విశ్వవిద్యాలయం భూగర్భపరిశోధన శాఖవారి కృషి ఫలితంగానే యిక్కడ యీ ఖనిజం బైటపడింది.

## సీసము - వెండి

సీసముయొక్క అతిముఖ్యమైన ఖనిజం గలీనా. ఇది సీసముయొక్క సల్ఫైడు.

రాయలసీమలోని కొల్లూరు (14°36':78°45'), నాగసానిపల్లె (14°42':78°49'), జంగమరాజుపల్లె (14°46':78°53'), కోయిలకుంట్ల (15°13':78°19'), బసవాపురం (15°24':78°38') ప్రాంతాలలో పూర్వం ఈ ఖనిజాన్ని తవ్విన చిహ్నాలు కనిపిస్తున్నాయి. గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా కారంపూడిసమీపంలోకూడా యిట్టి చిహ్నాలే గోచరిస్తున్నాయి. భూమిలోని బాగా లోతున యింకా యీ ఖనిజం నిలువలు ఉన్నాయేమో తెలుసుకునేందుకు గట్టిగాలు దింపి పరిశీలించవలసి ఉంది.

## సున్నపురాయి, డోలమైట్ (Limestone and Dolomite)

ఈ రకం ఖనిజాలు కూడా సున్నము, మెగ్నీషియాల యొక్క కార్బొనేట్లతో ప్రధానంగా కూడి ఉంటాయి.

విశాఖపట్నం జిల్లాలోని నిలగలకుంట, జొర్రా, కొండకర్ల (18°58':82°16') ల వద్ద స్ఫటిక రూపంలో సున్నము; అరకుడా, గుప్తేశ్వరంవద్ద డోలమైటు దొరుకుతాయి.తూర్పుపశ్చిమగోదావరిజిల్లాలలోని చర్ల (18°4'30":80°49'30"), భూమన్నలంక, మద్దుకూరు, పంగిడి, దేవరపల్లి (17°2':81°35'), కాజేరు, (17°2':81°47'), కుంతిమూరు (17°2'30":81°48') ప్రదేశాలలో సున్నపురాయి లభిస్తుంది. కృష్ణాజిల్లాలోని కొండపల్లి (16°37':80°33'), జేతవాలు (16°53'30":80 6'), చింతపల్లి (16°42:80°9')వద్ద; గుంటూరుజిల్లా పిడుగురాళ్ళ, దాచేపల్లివద్ద సున్నపు అచ్చులు ఉన్నాయి.

ఈ రెండుజిల్లాలలోని బెల్లంకొండ, ముక్త్యాల, గుడిపూడి, పులిచింతల, వుద్దలూరు, కోనంకి, దాచేపల్లె, కేసనపల్లి, సీతారామపురం ప్రాంతాలలోకూడా ఈ ఖనిజం దొరుకుతుంది. కనిగిరి చుట్టుప్రక్కల కొండవీటిపనపల్లి(15°36':79°31'), చుండి, పెదఅలికిట్ల, యిస్కలగూడెం, పెనుగోడు వద్ద సున్నపురాయి దొరకవచ్చును. నెల్లూరుజిల్లా కావలి-ఉదయగిరి రోడ్డు పక్కన 35 వ మైలురాయి దగ్గరకూడా సున్నపురాయి లభ్యమౌతుంది.

కడప, కర్నూలు జిల్లాలలో వేంపల్లె వద్ద డోలమైటిక్ సున్నపురాతి క్వారీలు, నర్సీవద్ద మామూలు సున్నపురాతి క్వారీలు ఎక్కువగా ఉన్నాయి. జమ్ములమడుగు వద్ద సున్నపు అచ్చులు లభిస్తాయి. సున్నం ఎక్కువగా ఉన్న క్వారీలు తలమంచి (14°54':77°49'30"), చంద్రపలి (15°12':30°77'49") లో ఉన్నాయి. కడపజిల్లా నర్సి, ఎర్రగుంట్ల, చంగలమర్రి లోను; కర్నూలు జిల్లాలో కర్నూలు, జేసంచర్ల, కలుగోట్ల, పాణ్యాం, నంద్యాల వద్దనూ విస్తారంగా సున్నపురాయి దొరుకుతోంది. అనంతపురంజిల్లా లోని ఉప్పలపాడులో (16°6':77°54') గట్టిసున్నపురాయిఉంది. బాగా విగుసుకుపోయిన

నున్నపే కంకర. ఇది కృష్ణా, గుంటూరు జిల్లాలలో ఈ కిందిచోట్ల దొరుకుతుంది:

| | అక్షాంశరేఖ | | | తులాంశరేఖ | | |
|---|---|---|---|---|---|---|
| | ° | ' | '' | ° | ' | '' |
| మంగళగిరి | 16 | 25 | 45 | 80 | 34 | 0 |
| చేబ్రోలు | 16 | 12 | 0 | 80 | 2 | 0 |
| ప్రత్తిపాడు | 16 | 16 | 0 | 80 | 20 | 0 |
| బుడవాడ | 15 | 51 | 0 | 80 | 9 | 0 |
| వెంకయ్యలపాడు | 15 | 55 | 0 | 80 | 13 | 0 |
| పెదకాకాని | 16 | 20 | 30 | 80 | 29 | 30 |
| నెక్కల్లు | 16 | 29 | 30 | 80 | 26 | 30 |
| సిరిపురం | 16 | 24 | 0 | 80 | 18 | 0 |
| పెదక్కాపాడు | 16 | 28 | 0 | 80 | 15 | 30 |

నర్సరావుపేటదగ్గర మొలమంద వద్దకూడా దొరుకుతుంది:

కంకర నెల్లూరుజిల్లాలో ఈ కింది చోట్ల విస్తారంగా దొరుకుతుంది:

| | అక్షాంశరేఖ | | | తులాంశరేఖ | | |
|---|---|---|---|---|---|---|
| | ° | ' | '' | ° | ' | '' |
| దర్శి | 15 | 46 | 36 | 79 | 41 | 0 |
| బట్టువారిపల్లె | 15 | 38 | 0 | 79 | 32 | 30 |
| నందిపాలెం | 15 | 35 | 30 | 79 | 35 | 0 |
| తలమెల్ల | 15 | 35 | 30 | 79 | 43 | 30 |
| ఎవవల్లి | 15 | 25 | 0 | 79 | 32 | 30 |

పామూరు, దూపుగుంట్ల చెరువు ఒడ్డున కూడా కంకర లభిస్తుంది.

ఉప్పుటేరు డెల్టాలో కంకర బహుగట్టి శిలారూపంలో ఈకిందిచోట్లదొరుకుతుంది:

| | అక్షాంశరేఖ | | | తులాంశరేఖ | | |
|---|---|---|---|---|---|---|
| | ° | ' | '' | ° | ' | '' |
| జానకమ్మపేట | 15 | 1 | 0 | 79 | 51 | 0 |
| పెదపావని | 15 | 0 | 30 | 79 | 49 | 0 |
| ముత్యాలపాడు | 14 | 59 | 30 | 79 | 48 | 30 |
| కొమ్మి | 14 | 58 | 0 | 79 | 46 | 0 |
| ఆదిమూర్తిపురం | 14 | 58 | 0 | 79 | 41 | 0 |

పెంకురూపంలో నున్నపురాయి ఈ కింది ప్రదేశాలలో లభిస్తుంది:

| | అక్షాంశరేఖ | | | తులాంశరేఖ | | |
|---|---|---|---|---|---|---|
| | ° | ' | '' | ° | ' | '' |
| మింజూరు సమీపంలో పులికాట్ చెరువుఒడ్డున | 11 | 46 | 0 | 80 | 5 | 0 |
| అతకనతిప్ప | 13 | 43 | 0 | 80 | 7 | 30 |
| వేనాడు | 13 | 38 | 0 | 80 | 7 | 0 |
| తిడ | 13 | 35 | 30 | 80 | 2 | 30 |
| ఇరకం | 13 | 34 | 0 | 80 | 9 | 0 |
| సూళ్ళూరుపేట | 13 | 42 | 0 | 80 | 1 | 0 |

కడప, కర్నూలుజిల్లాలు : నందవరం, పాలకూరువద్ద విశాలమైన ప్రదేశాలలో కంకర దొరుకుతుంది.

మాల్యాపురం – కంభం మండలంలో ముఖ్యంగా మాల్యాపురం, పెదఓబనాయుని పాలెంవద్ద పెద్దపెద్దకంకరరాళ్లున్నాయి. ఇక్కడ దొరికే కంకర కన్నుకరిమున్ను లాంటిది. కాలిస్తే సున్నములభిస్తుంది.

గోరాచలం సమీపంలోని బుగ్గసపల్లి వద్ద (15°22'30'':77°53'30'') సున్నపురాతి నిలవలు విస్తారంగా ఉన్నాయి.

అనంతపురంజిల్లా : కోన ఉప్పలపాడు (15°6':77°54') సమీపంలోని కొండలమీద గట్టి సున్నపురాయి చాలా విస్తారంగా దొరుకుతుంది. కంకర నిలవలు దాడికొట్ల (14°35'30'':77°58')కు వాయవ్యంగానూ, చిలవారిపల్లికి (14°37'30'':77°54') తూర్పునా గలవు.

## మాంగనీసు (Manganese)

ఇనుము, ఉక్కు పరిశ్రమలకు అవసరమైన ముఖ్య ఉపలోహాల్లో మాంగనీసు

ఒకటి. ఇనుము, ఉక్కు, ఉక్కు మిశ్రలోహాల తయారీకి యిది ఉపయోగిస్తుంది. మాంగనీసు ఖనిజాలు ప్రధానంగా మాంగనీసుయొక్క ఆక్సైడులు.

విశాఖపట్నం జిల్లా : కోడూరు (18°16'30'':83°33') వద్ద విస్తారంగా మాంగనీసు నిలవలు ఉన్నాయి. గారివీడి దగ్గరనించి సదానందపురంవరకు మూడు మైళ్ళ పొడవున ఈ నిలవలు కలవు. గర్భాం మాంగనీసు గనులు భారతదేశంలోని మాంగనీసు గనులలోకల్లా పెద్దవి.

ఈ కింది ప్రాంతాలలో మాంగనీసు నిలవలు కలవు: గారివీడు, కోడూరు, దేవద, సదానందపురం, శివరం, పేరపి, యితకర్లపూడి, ములగాం, గోవిందాపురం, గర్భాం, కోటకర్ర, గదసం, ఆవగూడెం, అయితమ్మవలస, గోశ్నంది, బొండపల్లి, గర్రాజుచీపురుపల్లి, పెరుమలి, రామభద్రాపురం, కాండూరు, చింతలవలస, తోనాం, గడవవలస, లక్ష్మీపురం, విమ్మలవలస, సర్వేశ్వరపురం, విజయరామపురం, బాటువా, విశ్వనాథపురం, చెట్లపురం, రావివలస, బైదాపల్లి, చిన్నరావ్యాం, కొత్తవలస, చోక్కరపాలెం, వేదులవలస, గుమ్మడం, ముక్కునరసన్నపేట, రేగటి, దన్నానపేట, గునపం, పాలవలస, దగ్గివలస, కొండపాలెం, విజాంధోరవలస, ఉత్తరాయవలస.

కర్నూలు జిల్లా : రుద్రవరం (15°14':78°40'), నందవరం (15°22':78°20'), బంగనపల్లి (15°19':78°35'), నాగిరెడ్డిపల్లె (15°9':78°35').

## మాగ్నెసైట్ (Magnesite)

ఇది మెగ్నీషియంయొక్క కార్బొనేటు. మెగ్నీషియంతయారీకి కావలసిన ఖనిజం.

కర్నూలుజిల్లా ముద్దవరం (15•30':78•6') సమీపంలో స్టియటైట్‌తో కలిసి మాగ్నెసైట్ దొరుకుతుంది. ఈ నిలవలను యింకా సరిగా పరిశోధించలేదు.

## అభ్రకం (Mica)

ఉలిపిరి కాగితంలా ఉండే ఖనిజ సమూహాన్ని అభ్రకంఅంటారు. మైకాలు ఆల్కలీల, ఆల్కలీ మట్టి, యినుము యొక్క అల్యూమినోసిలికేట్లు. వీటిలో యితర లోహాలు కూడా కలిసిఉంటాయి.

విశాఖపట్నం జిల్లా: ఫ్లొగొపైట్ రకం మైకా, కుడియ (18°7':82°4'), మాజిగూడెం (18°12':82°54'), మాసిగూడెం (18°12':82°53'), మంద్రగూడెం (18°10':82°54'), కోతిగూడ (18°17':83°3') వద్ద; మాస్కొవైట్ రకం చింతలదానిమెట్ట, కురుపం జమీలోని బోడికొండలవద్ద లభిస్తుంది.

పశ్చిమ గోదావరిజిల్లా : అంకన్నగూడెం(17°18':81°14'30''), కొవ్వూరుపాడు (17°11':81°32'), ధనిమెట్ట, నందిగూడెం (17°9'30'':81°30'), పోచవరం (17•9':81°39').

కృష్ణాజిల్లా : జమ్మలవాయిదుర్గం (16°57'30'':80°35'30''), లక్ష్మీపురం గ్రామం, తిరువూరు (17°7':80°37'), కమ్మరికుంట్ల (16°51':80°40'), గొల్లమందల (16°59':80°40'30''), గంపలగూడెం (17°0':80°30'30''), గోసవీడు.

నెల్లూరుజిల్లా : ఈ జిల్లాలోని అభ్రకపు ప్రాంతం ఇంగ్లీషు 'వి' (V) ఆక్షరం

రంలా ఉంది. కోణం వొజ్జలికి దక్షిణం గానూ, ఒకభుజము ఉత్తరంగా నెల్లూరు వైపుకు, రెండవది వాయువ్యంగా సైదాపురం, ఉదయగిరుల మధ్యగా వ్యాపించి ఉంది. ఈగనుల సమూహం పొడవు 60 మైళ్ళు, వెడల్పు 15 మైళ్ళు. ఈ కింది చోట్లకూడా విరివిగా అభ్రకం తీస్తున్నారు. ఇది అక్షాంశరేఖ, 14°4'—14°24', తులాంశరేఖ 79°44'—79°48' మధ్యన ఉన్నది. వోదూరు, పత్తెరగుంట, చెన్నూరు, మంగలపురం, తూర్పుపూండ్ల, సైదాపురం, జోగిపల్లి, చాగనం, తెల్లబోడు, పూటుకూరు, కుమ్మరితాలుపూరు, కలిచేడు, దేగపూడి, యిరికుర్తి, మనుపూరు.

చిత్తూరుజిల్లా: మదనపల్లి తాలూకు పత్రిసమీపంలోకూడా అభ్రకం దొరుకుతుందని తెలుస్తోంది.

## రంగులు (Mineral Pigments)

ఇనపమట్టి, అంబరు, సియెన్నా, యినుముయొక్క ఎర్ర ఆక్సైడు ఖనిజాలు మన రాష్ట్రంలో ఎక్కువగా దొరుకుతాయి.

ఎర్ర, ఆకుపచ్చ యినపమట్టి తూర్పు గోదావరిజిల్లా కాటేరు, కుంతమూరువద్ద; పశ్చిమ గోదావరిజిల్లా దుద్దుకూరు, ద్వారకా తిరుమల (16°57':81°15'30") వద్ద; గుంటూరుజిల్లాలో మాచెర్ల, బసిరెడ్డిపల్లి (15°47':79°35'30") వద్ద లభిస్తుంది.

ఇనుముయొక్క ఆక్సైడులు రంగులకు ఉపయోగించేవి కడపజిల్లా చావలి (14°30':78°36'), మంటపంపల్లి (14°19':79°5'), ఎర్రగుంట్లకోట (13°57'30":79°16'30"), నందిమండలం (14°26':78°31'30"), మిత్తామిదపల్లి (14°25'30":78°44'), సిద్ధాత్రం (14°26':78°35') వద్ద దొరుకుతాయి. కర్నూలుజిల్లాలో గుట్టుపల్లి (15°25'30":78°3'), వెల్దుర్తి (15°33':77°56'), రామల్లకోట (15°34':78°0'34"), పుల్లగుమ్మి (15°37':78°2'), కృష్ణాపురం (15°35'30":78°2'30"), చేతంచర్ల (15°27':78°9'), అంబాపురం (15°23':78°5'30") వద్దకూడా యివి లభిస్తాయి.

## సహజవాయువులు
## (Natural gases)

నదులలో కొట్టుకొనివచ్చిన వండ్రు క్రింద పాతుకొనిఉన్న పదార్థం నుండి ఉత్పన్నమయే సహజ హైడ్రోకార్బను వాయువు తూర్పు గోదావరిజిల్లా తాటిపాకవద్ద (16°31':81°32'), కృష్ణాజిల్లా కోన (16°5':81°7') వద్ద దొరుకుతాయని తెలుస్తోంది.

## ఫాస్ఫేటులు (Phosphates)

ఫాస్ఫేటు ఖనిజాలలో అపటైటు ఎక్కువగా దొరుకుతుంది. వ్యాపార దృష్ట్యా చాలా ముఖ్యమైనది. ఇది కాల్షియంయొక్క ఫాస్ఫేటు. ఫ్లోరిన్‌తో గాని, క్లోరిన్‌తో గాని, లేక రెంటితోనూ గాని కలిసిఉంటుంది.

నెల్లూరుజిల్లా మైకాగనులలో అపటైటు దొరుకుతుంది. కాని యిక్కడ తరుచు దొరకడం అనుమానాస్పదమే. విశాఖపట్నంజిల్లాలో ఎక్కువ మాంగనీసు కలిసిన కోడురైట్ రాయితో కలిసి అపటైట్ దొరుకుతుంది. గర్భాం (18°22':83°28'), దేవద (18°15':83°35'), రామభద్రాపురం (18°30':83°17') మైకాగనులలో లభిస్తుంది. కాశీపట్నం

(18°13':83°7') సమీపంలోని ఒక కొండ మీద అపటైటు నిలవలు కనిపించాయి. కాని యీ ఖనిజమును సంపాదించే యత్నం యింతవరకు జరగలేదు.

### సిలికా, ఇసుకలు
### (Silica & Sands)

గాజుతయారీకి కావలసిన స్వచ్ఛమైన సిలికా నెల్లూరు జిల్లా పాలమని, తాళ్ళపాడు, తాలప్పరం, గొడ్డల దిన్నె, కంకటాని ప్రాంతాలలోను; గుంటూరు జిల్లా నాగార్జునకొండ వద్దను విస్తారంగా దొరుకుతుంది.

గాజు యిసుక నిలవలు ఎక్కువగా గుంటూరుజిల్లా చీరాల (15°54:80°12') వద్ద ఉన్నాయి. నాసిరకం గాజు సామగ్రి చేయడానికి యిది ఉపయోగిస్తుందని డా॥ ఆత్మారాం అంటున్నారు. కాని ఈ నిలవలను పూర్తిగా పరిశోధిస్తే మంచిరకం గాజు యిసుక దొరకవచ్చు.

గంజాం, శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలలో సముద్రతీరం వెంట స్థానికంగా దొరికే నల్ల యిసుకలో మొనజైట్, జిర్కాన్, సిలిమనైట్, యిల్మనైట్, మాగ్నటైటు మొదలగు ఖనిజాలు ఉన్నాయి. విశాఖపట్నం జిల్లాలో సముద్రతీరం వెంట 120 మైళ్ళు పరిశోధించి ఆంధ్ర విశ్వవిద్యాలయ భూగర్భ పరిశోధన శాఖ యీ విషయం తేల్చింది.

### పలకరాయి

బహు మెత్తని మట్టి బిగుసుకపోయి బహు పల్చటిపొరలుగా ఏర్పడుతుంది. ఈ పొరలే పలకరాయి.

చినవోబినపల్లి (15°33':79°11') నుండి అనంతవరం (15°47':79°22') వరకు 24 మైళ్ళ విస్తీర్ణంలో పలకరాయి నిలువల సమూహముంది. మధ్యభాగం నెల్లూరు జిల్లాలోనూ, తక్కిన ప్రాంతం కర్నూలుజిల్లాలోనూ ఉంది. చినఓబాయనిపల్లి, నసీరుసాహేబు పల్లి, (15°38':79°16'), తుమ్మలచెరువు (15°39'40'':79°17'20''), కంటకంపల్లి (15°40'30'':79°18'), రాయవరం (15°43':79°18'45''), మల్లవేట(15°49':79°22'30''), నాగసముద్రపల్లి (15°44':79°19') వద్దకూడా ఎక్కువగా పలకరాయి కొడుతున్నారు.

### స్టియటైటు, టాల్క్

రంగులు, రబ్బరు, సబ్బు, పరిమళ ద్రవ్యముల పరిశ్రమలలో యివి ఉపయుక్తమవుతాయి.

స్టియటైటు ఎక్కువగా అనంతపురం జిల్లా జంగమరెడ్డిపల్లి (14°41'30'':77°54'30''), కన్నెపూడి (14°45'30'':77°51'30'') జూలేకలువ (14°50':77°48'), తబ్బా (14°54:77°49'), చంద్రపల్లి (15°13':77°49') వద్ద దొరుకుతుంది. కర్నూలుజిల్లా ముద్దవరం, మునిల చెరువు, బలపలపల్లివద్ద కూడా తవ్వుతున్నారు. నెల్లూరు జిల్లా యడవల్లి (15°28':79°32'30'') వద్ద; సాగనిదగ్గర; చిత్తూరుజిల్లా పాతూరు, గంగధార, నల్లూరు వద్ద కొద్దిగా లభిస్తోంది.

### గంధకం, పైరైట్లు
### (Sulphur and Pyrites)

గంధకం మూలరూపంలోను, సల్ఫైడు, సల్ఫేటు రూపంలోనూ దొరుకుతుంది.

ఇది ఎక్కువగా ఇనుము యొక్క సల్ఫైడు, పైరైట్లనించి తయారు చేయబడుతోంది.

స్వచ్ఛమైన లోహం కృష్ణా జిల్లా కోనలో ఉన్నట్లు తెలుస్తుంది. కాని ఇటీవల చేసిన పరిశోధనలవల్ల యిక్కడ తీయడం ఆర్థికంగా లాభదాయకంకాదని తేలింది. కడప, కర్నూలు జిల్లాలలో సున్నపురాతితో కలిసి పైరైట్లు కొన్ని పొరలలో దొరుకుతాయి.

నోటు : ఈ వ్యాసంలోని సమాచారం ఇండియా ప్రభుత్వ భూగర్భ పరిశోధన శాఖవారు ప్రచురించిన గ్రంథాలనించి, ముఖ్యంగా డా॥ యం. యస్. కృష్ణా ఇటీవల రచించిన "మద్రాసురాష్ట్ర ఖనిజసంపద" అనే వ్యాసంనుంచి, నా "ఆంధ్రరాష్ట్ర ఖనిజసంపద స్థూలస్వరూపం" అనే వ్యాసంనించీ, ఆంధ్ర విశ్వవిద్యాలయ భూగర్భ పరిశోధనశాఖ అధ్యాపకులు, విద్యార్థులు రచించిన ముద్రితాముద్రిత రచనలనించీ తీసుకోబడింది.

ఈ సమాచారము సేకరించడంలో నాకెంతో సహాయంచేసిన శ్రీ ఏ. ఏ. జీ. శర్మగారికి నా కృతజ్ఞతా వందనాలు.

— వ్యాసకర్త

# పరిశ్రమలు

పరిశ్రమల విషయంలో ఆంధ్రదేశం చాలా వెనుకబడిఉంది. ప్రక్కనే ఉన్న తెలంగాణాలో కొన్ని పరిశ్రమలు అభివృద్ధిచెందినా మొత్తం ఆంధ్రజాతి అవసరాల దృష్ట్యా నేటిపరిస్థితి ఏరూపంలోనూ సంతృప్తి చెందవలసినదికాదు. తెలంగాణమునుండి యూనియన్ ఆంధ్ర వేరుగా ఉండుటచేత, యూనియన్ ఆంధ్ర పారిశ్రామికంగా పర్రభూమివలె ఉన్నది. తెలంగాణా, ఆంధ్ర అనే కృత్రిమ విభజన మూలంగా తెలుగుగడ్డమీదనే ఉన్న బొగ్గు (సింగరేణి) మున్నగు అత్యవసర ఖనిజాలను, యూనియన్ ఆంధ్రలోని పరిశ్రమలు కావలసినంతగా ఉపయోగించుకొనలేక పోవటం జరుగుతున్నది.

1953 వ సంవత్సరం, డిశంబరు నెలాఖరుకు, రాష్ట్రంలో ఫాక్టరీచట్టం క్రిందకువచ్చే ఫాక్టరీలు, పరిశ్రమలవారీ ఈ విధంగా ఉన్నాయి:

| వివరం | ఫాక్టరీల సంఖ్య |
|---|---|
| 1. ప్రత్తి ప్రెస్సులు | 69 |
| 2. జనపనార, తదితర ప్రెస్సులు | 52 |
| 3. నిల్వ ఆహారాలు | 2 |
| 4. బియ్యం మరలు, ఇత్యాదులు | 483 |
| 5. బేకరీలు | 11 |
| 6. పంచదారమిల్లులు, రిఫైనరీలు | 9 |
| 7. పంచదార బిళ్ళలు, చాకొలెట్లు, పిప్పరమెంట్లు తయారుచేసే ఫాక్టరీలు | 5 |
| 8. ఆయిలుమిల్లులు (తినడానికి పనికొచ్చేనూనెలు) | 311 |
| 9. వనస్పతి | 2 |
| 10. జీడిపప్పు ఫాక్టరీలు | 24 |
| 11. వీటికి సంబంధించిన ఇతర ఫాక్టరీలు | 162 |
| 12. డ్రింకుషాపులు | 5 |

| విషయం | ఫ్యాక్టరీల సంఖ్య |
|---|---|
| 13. బీడీలు | 56 |
| 14. చుట్టలు | 12 |
| 15. వీటికి సంబంధమైన ఇతర ఫ్యాక్టరీలు | 334 |
| 16. ప్రత్తి మిల్లులు | 19 |
| 17. జూట్ మిల్లులు | 5 |
| 18. సిల్కు మిల్లులు | 10 |
| 19. కంబళ్ళ నేత | 4 |
| 20. లేసు అల్లిక | 4 |
| 21. అద్దకం | 4 |
| 22. కొబ్బరిపీచు | 10 |
| 23. రెడీమేడ్ వస్త్రాలు, షర్టులు | 15 |
| 24. కర్ర, కొయ్య | 35 |
| 25. వడ్రంగం కార్ఖానాలు | 23 |
| 26. కాగితము, కాగితపు ఉత్పత్తులు | 2 |
| 27. ముద్రణాలయాలు, ప్రచురణాలయాలు | 100 |
| 28. తోళ్ళ పదును | 48 |
| 29. రబ్బరు, దీని సంబంధమైన ఉత్పత్తి | 3 |
| 30. రసాయనాలు, రసాయనాలతో చేయబడిన పదార్థాలు | 12 |
| 31. తినటానికి పనికిరాని నూనెల ఉత్పత్తి | 3 |
| 32. అగ్గిపెట్టెలు | 1 |
| 33. మందులు | 6 |
| 34. రంగులు, వార్నిషులు | 5 |
| 35. సబ్బులు | 2 |
| 36. దీని సంబంధమైన ఇతర ఫ్యాక్టరీలు | 4 |
| 37. పెట్రోలు, కిరసనాయిలు | 11 |
| 38. లోహేతర ఖనిజోత్పత్తులు (ఇటుకలు, పెంకులు, ఇత్యాదులు) | 21 |
| 39. కుండలు, కప్పులు, సాసర్లు | 10 |
| 40. రాళ్ళు మలచటం, గాజుపొడి ఇత్యాదులు | 23 |
| 41. లోహపరిశ్రమలు | 25 |
| 42. యంత్రపరిశ్రమ (విద్యుత్ పరికరములు మినహా) | 82 |

| వివరం | ఫ్యాక్టరీల సంఖ్య |
|---|---|
| 43. ఇంజనీరింగు | 7 |
| 44. రవాణా | 54 |
| 45. విద్యుదుత్పత్తి - సరఫరా | 14 |
| 46. గ్యాసు ఉత్పత్తి - సరఫరా | 2 |
| 47. వాటర్ వర్క్సు | 6 |
| 48. హోటళ్ళు, విశ్రాంతిభవనాలు | 381 |
| 49. ఇతరాలు | 122 |
| మొత్తం | 2,610 |

ఫ్యాక్టరీ చట్టంప్రకారం, 1954 వ సంవత్సరం జనవరి మాసాంతానికి ఉన్న ఫ్యాక్టరీల జిల్లాలవారీ వివరాలు :

| జిల్లా | ఫ్యాక్టరీలసంఖ్య |
|---|---|
| శ్రీకాకుళం | 116 |
| విశాఖపట్టణం | 189 |
| తూర్పుగోదావరి | 406 |
| పశ్చిమగోదావరి | 266 |
| కృష్ణా | 362 |
| గుంటూరు | 613 |
| నెల్లూరు | 165 |
| కర్నూలు | 230 |
| కడప | 76 |
| అనంతపురం | 162 |
| చిత్తూరు | 126 |
| మొత్తం | 2,711 |

పరిశ్రమల అభివృద్ధికి జాయింటుస్టాకు కంపెనీలసంఖ్య, వాటిపెట్టుబడులు గీటురాయిగా ఎంచబడుతున్నవి.

ఈ రూపంలో ఆంధ్రలో ఎన్ని జాయింటుస్టాకు కంపెనీలు ఉన్నవీ, వాటిలోని పెట్టుబడులు పరిశీలించిన,

యూనియన్ ఆంధ్ర పారిశ్రామికంగా ఎంత వెనుక బడిఉన్నదో స్పష్టమవుతుంది.

1953 సం॥ ఏప్రిల్ ఒకటవ తేదీకి మొత్తం యూనియన్ ఆంధ్రలో 492 కంపెనీలు, జాయింటుస్టాకు కంపెనీలుగా రిజిష్టరయి ఉన్నాయి. ఇందులో 335 ప్రయివేటు లిమిటెడ్ కంపెనీలు, 157 పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలు. ఈ కంపెనీలన్నింటికీ చెల్లించిన మూలధనం 4,28,98,000 రూపాయలు. ఇందులో 1,37,07,000 రూపాయలు ప్రయివేటు లిమిటెడ్ కంపెనీలలోనూ, 2,92,91,000 రూపాయలు పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలలోనూ పెట్టుబడి పెట్టబడింది.

క్రింద ఇచ్చిన పట్టికలో ఆంధ్రదేశంలోని ఏయే పరిశ్రమలలో ఎంతెంత పెట్టుబడులు పెట్టబడిందీ, ఎన్ని జాయింటు స్టాకు కంపెనీలు యీ పెట్టుబడులు పెట్టిందీ మున్నగు వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో తెలియచెయ్యబడ్డాయి:

క్రింద పట్టికలో యిచ్చిన మొత్తాలలో పాత మద్రాసు రాజధానిలో రిజిష్టరయి, ఆంధ్రదేశంలో వ్యాపారాన్ని కొనసాగిస్తున్న పెట్టుబడులు మాత్రమే ఉన్నవి. రాష్ట్రం బయట రిజిష్టరయిన కంపెనీల పెట్టుబడులు ఇందులో ఇమిడి లేవు. 1953 ఏప్రిల్ ఒకటవ తేదీ లెఖ్ఖల ప్రకారం యీ పెట్టుబడుల మొత్తం షుమారుగా

| పరిశ్రమ విధానం | కంపెనీల సంఖ్య | పెట్టుబడులు: ప్రకటితమైన మూలధనం (రూపాయలు) | వాటా ధనం (రూపాయలు) | చెల్లించిన మూలధనం రు. అ. పై. |
|---|---|---|---|---|
| బ్యాంకులు, అప్పులు, ఇన్సూరెన్సు | 68 | 98,99,145 | 22,59,579 | 11,18,532- 4-0 |
| రవాణా, రహదారులు | 40 | 96,60,000 | 44,65,480 | 34,46,421- 0-0 |
| వ్యాపారం, ఉత్పత్తి | 269 | 8,91,02,233 | 2,40,84,626 | 1,19,44,592-13-6 |
| మిల్లులు - ప్రెస్సులు | 31 | 1,59,55,850 | 95,87,490 | 85,87,562- 8-0 |
| టీ-ఇతరతోటలు, కంపెనీలు | 1 | 25,00,000 | 2,18,390 | 1,16,195- 0-0 |
| గనులు, క్వారీలు | 16 | 34,10,000 | 15,80,800 | 12,76,050- 0-0 |
| పానీయాలు | 1 | 4,80,000 | 4,80,000 | 4,80,000- 0-0 |
| చెరకు (బెల్లంతో సహా) | 5 | 1,17,00,000 | 57,75,850 | 57,32,916- 0-0 |
| హోటల్లు, సినిమాహాల్లు, ఇతర వినోదాలు | 41 | 1,19,40,000 | 25,80,550 | 18,77,038- 0-0 |
| ఇతర కంపెనీలు | 20 | 32,15,000 | 5,09,049 | 4,18,668- 0-0 |
| | 492 | 15,78,72,228 | 5,15,41,814 | 4,29,97,976- 1-6 |

4 కోట్ల 30 లక్షలు ఉండునని అంచనా వేయబడింది.

ఇదిగాక అనేక పారిశ్రామిక సంస్థలు— ముఖ్యంగా బ్రిటిషు, మార్వాడీ, గుజరాతీ సంస్థలు - తమ కంపెనీలను బొంబాయి, కలకత్తాలలో రిజిస్టరుచేసి, వాటిఫ్యాక్టరీలను మాత్రం యిచ్చట ఆంధ్రలో నెలకొల్పటం జరుగుతున్నది. ఆంధ్రలోని రెండు ప్రధాన జనపనార మిల్లులు [చిట్టివలస, నెల్లిమర్ల], కర్నూలు వనస్పతి ఫ్యాక్టరీ, మంగళగిరిలోని ఎ. సి. సి. సిమెంటుఫ్యాక్టరీ మున్నగునవి ఈ తరగతిలోకి వస్తాయి. ఇట్టి సంస్థలు (బయటి రాష్ట్రాలలో రిజిస్టరై ఆంధ్రలో పరిశ్రమలనుడుపుతున్న జాయింట్ స్టాక్ కంపెనీలు) ఆంధ్రలో పెట్టిన పెట్టుబడులు - ఎంత పరిమితంగా అంచనావేసినా - సుమారు రు. 125-150 లక్షలవరకూ ఉంటాయి.

ఈ అంచనాప్రకారం సుమారు మొత్తం ఆరుకోట్ల రూపాయలవరకూ (4,30 లక్షలు మద్రాసు, ఆంధ్రలలో రిజిస్టరయిన కంపెనీల పెట్టుబడి; $1\frac{1}{4}$ నుండి $1\frac{1}{2}$ కోట్ల రూపాయలు ఇతర రాష్ట్రాలలో రిజిస్టరయిన కంపెనీల పెట్టుబడులు) ఆంధ్రలోని వివిధ పరిశ్రమలలో పెట్టుబడి పెట్టబడినట్లు భావించవచ్చు.

క్రింది పట్టికలో మద్రాసు - ఆంధ్ర రాష్ట్రాలలో రిజిస్టరయిన జాయింటు స్టాకు కంపెనీలు ఆంధ్రలో ఏయే జిల్లాలలో ఎంతెంత పెట్టుబడిని పెట్టిందీ, ఇందులో పబ్లిక్ లిమిటెడ్, ప్రయివేటు లిమిటెడ్ కంపెనీలలో ఎంతెంత ఉన్నదీ మున్నగు వివరాలు యివ్వబడ్డాయి:

| జిల్లా | కంపెనీలు | | | చెల్లించిన మూలధనం (వేల రూపాయలలో) | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రయివేటు | పబ్లిక్ | మొత్తం | ప్రయివేటు కంపెనీలు | పబ్లిక్ కంపెనీలు | మొత్తం |
| శ్రీకాకుళం - విశాఖ | 47 | 19 | 66 | 12,33 | 62,98 | 75,31 |
| తూర్పుగోదావరి | 49 | 14 | 63 | 25,35 | 16,33 | 41,68 |
| పశ్చిమగోదావరి | 32 | 14 | 46 | 5,15 | 36,58 | 41,73 |
| కృష్ణా | 68 | 31 | 99 | 29,89 | 86,09 | 1,15,98 |
| గుంటూరు | 40 | 30 | 70 | 12,69 | 33,86 | 46,55 |
| కర్నూలు | 14 | 1 | 15 | 74 | 1,95 | 2,69 |
| కడప | 11 | 4 | 15 | 1,40 | 14 | 1,54 |
| అనంతపురం | 11 | 19 | 30 | 4,38 | 5,67 | 10,05 |
| నెల్లూరు | 43 | 6 | 49 | 29,68 | 5,59 | 35,27 |
| చిత్తూరు | 14 | 13 | 27 | 9,84 | 18,50 | 28,34 |
| బళ్ళారి (మూడోవంతు) | 6 | 6 | 12 | 5,62 | 25,22 | 31,84 |
| మొత్తం | 335 | 157 | 492 | 1,37,07 | 2,92,91 | 4,28,98 |

క్రింది పట్టికలో ఇవ్వబడిన, మన రాష్ట్రంలోని పారిశ్రామిక పెట్టుబడులతోను, యావద్భారతదేశ పారిశ్రామిక పెట్టుబడులతోను, ఆంధ్ర పారిశ్రామిక పెట్టుబడులను పోల్చిచూస్తే, పారిశ్రామికంగా ఆంధ్ర యెంత వెనుకబడి వున్నదో వ్యక్తమవుతుంది.

మనకు ఉన్న పరిశ్రమలలో ముఖ్యమైనవి — రెండు సిమెంటు ఫాక్టరీలు, నాలుగు జనపనార మిల్లులు, ఒక్క నౌకా నిర్మాణ కేంద్రం, ఒక్క పేపరుమిల్లు, పంచదార ఫాక్టరీలు, ఐదు నూలు మిల్లులు, ఎనిమిది వనస్పతి- రిఫైన్డు ఆయిల్ ఫాక్టరీలు, రెండు సబ్బుల ఫాక్టరీలు. ఇవిగాక చిన్నచిన్న ఫాక్టరీల స్వరూపంలో అనేకం ఉన్నాయి. వీటన్నిటినీ కలిపి లెక్కించినా మన పారిశ్రామిక సంస్థల సంఖ్య (Industrial establishments) 36-37 వందలు దాటి వుండదు.

పరిశ్రమవారీ వివరాలు — ఎన్ని ఫాక్టరీలు, వాటి పెట్టుబడి, ఉత్పత్తి శక్తి, అవి ఉత్పత్తిచేసే సరుకు విలువ మున్నగునవి క్రింద ఇవ్వబడ్డాయి (ప్రతి ఫాక్టరీ లేక పరిశ్రమ విషయంలోనూ వీలయినంతవరకూ తాజా సమాచారం యివ్వటానికి ప్రయత్నించబడింది):

| వివర | రిజిస్టరయిన కంపెనీలు | పెట్టిన పెట్టుబడి (రూ|| లలో) |
|---|---|---|
| భారతదేశం | 23,000 | 575 కోట్లు |
| పరిశిష్ట మద్రాసురాష్ట్రం | 3,000 | 63 కోట్లు |
| ఆంధ్రరాష్ట్రం | 3500 | 6 కోట్లు |

## సిమెంటు

ఉన్న సిమెంటు ఫాక్టరీలు రెండు. 1. తాడేపల్లి (గుంటూరుజిల్లా) అసోసియేటెడ్ సిమెంటు కంపెనీ లిమిటెడ్ వారి ఫాక్టరీ; 2. విజయవాడలోని ఆంధ్ర సిమెంటు కంపెనీ లిమిటెడ్. ఇందులో తాడేపల్లి ఫాక్టరీ రోజుకు 200 టన్నుల సిమెంటును ఉత్పత్తి చేయగలదు. ఆంధ్ర సిమెంటు కంపెనీ ఫాక్టరీ మొదట దినమునకు 100 టన్నులు మాత్రం ఉత్పత్తి చేయగల యంత్రాలతో ప్రారంభించబడింది. తర్వాత దినమునకు 300 టన్నులవరకూ ఉత్పత్తిశక్తి పెంచబడింది.

ఈ ఫాక్టరీలకు కావలసిన సిమెంటు రాయి కృష్ణా, గుంటూరు జిల్లాలలోని క్వారీలనుండి తెప్పించుకొనబడుతున్నది. జిప్సం — తిరుచునాపల్లిజిల్లానుండి; బొక్సయిటు-బెల్గాంప్రాంతంనుండి దిగుమతి

చేసుకొనబడుతున్నది. ఆంధ్రలో యీ రెండు ఖనిజాలు కూడ సమృద్ధిగా ఉన్నాయి. వీటిని వినియోగించుకొనగల్గితే, మన సిమెంటు పరిశ్రమ త్వరితగతిని అభివృద్ధి చెందుతుంది.

### ఆంధ్ర సిమెంటు కంపెనీ లిమిటెడ్
### విజయవాడ

ఈ ఫ్యాక్టరీ 1936 లో డి. యస్. నరసరాజుగారిచే ప్రారంభింపబడింది. అప్పటి మూలధనం 15 లక్షల రూపాయలు మాత్రమే. తర్వాత మరొక 38 లక్షల రూపాయల మూలధనం చేర్చి, ఫ్యాక్టరీ ఉత్పత్తి శక్తిని దినమునకు 100 టన్నులనుండి 300 టన్నులకు పెంచారు.

1951-52 సంవత్సరంలో ఉన్న పెట్టుబడి వివరాలు:

| | |
|---|---|
| అనుమతింపబడ్డ పెట్టుబడి | రు. 1,00,00,000 |
| చందా వేయబడిన మూలధనం | రు. 55,00,000 |
| చెల్లించిన మూలధనం | రు. 53,68,524 |
| నిల్వలు | రు. 5,43,068 |
| లాభం | రు. 4,48,366 |

డైరక్టర్ల సంఖ్య 10.

శ్రీ వి. రామకృష్ణ – అధ్యక్షుడు.
ఉత్పత్తిశక్తి – 300 టన్నులు (దినమునకు).
క్వారీలు :

జగ్గయ్యపేట, రావిరాల (కృష్ణాజిల్లా); నడికుడి (గుంటూరుజిల్లా).

### కృష్ణా సిమెంటు వర్కుస్, తాడేపల్లి

అసోసియేటెడ్ సిమెంటు కంపెనీ – బొంబాయిచే నడుపబడుతున్న 14 ఫ్యాక్టరీలలో యిది ఒకటి. 1939 సం॥ నవంబరు మాసంనుండి ఉత్పత్తి ప్రారంభించింది. ప్రస్తుతపు ఉత్పత్తిశక్తి సంవత్సరమునకు 90,000 టన్నులు. నూతన యంత్రాలు అమర్చి ఉత్పత్తిశక్తి నేటికన్న రెట్టింపుకు పైగా పెంచాలని ఆలోచనలు ఉన్నవి. 1956 సంవత్సరమునకు యీ యంత్ర నిర్మాణం పూర్తిఅవుతుందని అంచనా.

1951-52 సంవత్సరానికి ఉన్న పెట్టుబడుల అంచనా వివరాలు

| | |
|---|---|
| అనుమతింపబడ్డ పెట్టుబడి | రు. 16,00,00,000 |
| చందా వేయబడిన మూలధనం | రు. 10,58,13,200 |
| చెల్లించిన మూలధనం | రు. 10,56,43,350 |
| నిల్వలు | రు. 76,00,000 |
| లాభాలు | రు. 1,07,45,710 |

[ఇది అసోసియేటెడ్ సిమెంటుకంపెనీ– బొంబాయివారి పెట్టుబడులు – లాభాలు– నిల్వలు.]

క్వారీలు :

పిడుగురాళ్ళ వద్దనున్న సీతారాంపురం, నంబూరువద్దనున్న కాజ (గుంటూరుజిల్లా).

కృష్ణా సిమెంటు కంపెనీ సరకు "ఎ. సి. సి." అన్న పేర ఆంధ్ర, మద్రాసు, ఒరిస్సాలలో అమ్మబడుతున్నది.

ఆంధ్ర సిమెంటు కంపెనీ సరకు "దుర్గాబ్రాండు" అన్న పేర విడుదల చేయబడుతున్నది.

# పంచదార

రాష్ట్ర మొత్తంలో 10 పంచదార ఫాక్టరీలు ఉన్నాయి. ఇందులో రెండు శ్రీకాకుళంజిల్లాలోనూ, మూడు విశాఖ జిల్లాలోనూ, రెండు తూర్పుగోదావరిజిల్లాలోనూ, రెండు పశ్చిమగోదావరిజిల్లాలోనూ, ఒకటి కృష్ణా జిల్లా లో నూ ఉన్నాయి. ఇవి గాక కృష్ణాజిల్లాలోని చల్లపల్లిలో ఒకటి, చిత్తూరుజిల్లాలో ఒకటి నిర్మాణంలో ఉన్నవి.

నిర్మింపబడి పనిచేస్తున్న పది ఫాక్టరీలు దినమునకు 4,225 నుండి 4,375 టన్నులవరకును చెరకును గానుగాడగల శక్తి (Crushing Capacity) ని కల్గి ఉన్నవి. నిర్మాణములో ఉన్న రెండు ఫాక్టరీలు షుమారుగా దినమునకు వెయ్యి టన్నులవరకూ గానుగాడగలవు.

ఉన్న ఫాక్టరీలలో దినమునకు 75 టన్నుల నుండి వెయ్యి టన్నులవరకూ చెరకును గానుగాడగల శక్తిగల్గిన వివిధ పరిమితుల యంత్రాలు అమర్చబడ్డాయి. ఇందులో కృష్ణాజిల్లాలోని ఉయ్యూరులోని ఫాక్టరీ అన్నింటికన్న పెద్దది. ఇది దినమునకు 850 టన్నుల నుండి 1,000 టన్నుల వరకూ చెరకును గానుగాడగలదు. విశాఖపట్నంలోని ఏటికొప్పాక ఫాక్టరీ అన్నింటికన్నా చిన్నది. ఇది దినమునకు 75 టన్నుల చెరకును మాత్రమే గానుగాడగలదు.

భారతదేశంలోని పంచదార ఫాక్టరీలు సంవత్సరంలో (1952-53) సగటున 113 దినాలు పనిచేసినవి. ఆంధ్రలోని ఫాక్టరీలు యీ సంవత్సరంలో సగటున 89 రోజులు మాత్రమే పనిచేసినవి. భారతదేశంలో గానుగాడే ప్రతి 100 టన్నుల చెరకు నుండి 9.97 టన్నుల పంచదార సగటున దిగుబడి చెయ్యబడుతుండగా, ఆంధ్రలో 9.38 టన్నులు మాత్రమే దిగుబడి చెయ్యబడుతున్నది. మైసూరులో 11.37 టన్నులు, హైద్రాబాదులో 10.60 టన్నులవరకూ దిగుబడి ఉన్నది.

ఆంధ్రకు సంబంధించినంత వరకూ ఫాక్టరీల సగటు పనిరోజులు 1951-52 కన్న 1952-53 లో చాలా తగ్గినవి. 1951-52 లో 151 సగటు పనిరోజులు ఫాక్టరీలు ఆడగా, 1952-53 కు యీ సంఖ్య 89 కి దిగజారింది.

గత సంవత్సరాలలో ఫాక్టరీవారీగా గానుగాడిన చెరకు, అందునుండి ఉత్పత్తి చేయబడిన పంచదార మున్నగు వివరాలు 458 వ పేజీలోని పట్టికలలో యివ్వడ్డాయి:

మనకున్న ఫాక్టరీలలో, ఉయ్యూరు సామర్లకోటలలో మాత్రమే పంచదార చేయగా మిగిలే చెరకు పిప్పి, పాంగు, మడ్డి మున్నగు వాటినుండి స్పిరిట్, పవర్ కిరోసిన్, సోడా గ్యాసు మున్నగునవి తయారు చేస్తున్నారు. అనకాపల్లి ఫాక్టరీలో కూడ వీటినుండి కొన్ని మందులు మున్నగు రాసాయనిక పదార్థాల ఉత్పత్తి చేస్తున్నారు. కాని పంచదార తయారవగా మిగిలే పిప్పి, పాంగు, మడ్డి మున్నగు వాటినుండి తెల్లకాగితం మొదలు అనేక రాసాయనిక ద్రవ్యాలు, ఎరువులు, గ్యాసు మున్నగు వాటివరకు తయారు చేయవచ్చు. ఈ పరిశ్రమకు మరింత అధిక సాఫల్యాన్ని సాధించటానికి అట్టి

## గానుగాడిన చెరకు (వేల మణుగులలో)

| ఫాక్టరీ | 1948-49 | 1949-50 | 1950-51 | 1951-52 |
|---|---|---|---|---|
| బొబ్బిలి | 478 | 172 | 769 | 1,229 |
| సీతానగరం | 1,066 | 668 | 916 | 709 |
| అనకాపల్లి | 652 | 296 | 829 | 1,493 |
| ఏటికొప్పాక I | 202 | 169 | 205 | 262 |
| " II | ... | ... | ... | 21 |
| పిఠాపురం | ... | ... | 710 | 2,301 |
| సామర్లకోట | 757 | 959 | 1,651 | 1,597 |
| తణుకు | ... | ... | ... | 337 |
| ఉయ్యూరు | 2,572 | 2,644 | 4,649 | 5,839 |
| మొత్తం | 5,727 | 4,908 | 9,729 | 13,788 |

## ఉత్పత్తిచేసిన పంచదార (మణుగులలో)

| ఫాక్టరీ | 1948-49 | 1949-50 | 1950-51 | 1951-52 | 1952-53 |
|---|---|---|---|---|---|
| అనకాపల్లి | 66,323 | 26,723 | 78,185 | 26,723 | 66,323 |
| బొబ్బిలి | 49,534 | 14,365 | 78,339 | 1,10,315 | 88,586 |
| ఏటికొప్పాక I | 18,057 | 14,780 | 20,236 | 23,965 | 4,473 |
| " II | ... | ... | ... | 1,582 | 43,882 |
| పిఠాపురం | ... | ... | 63,877 | 1,82,475 | 1,41,598 |
| సామర్లకోట | 76,34 | 92,750 | 1,61,085 | 1,37,163 | 1,50,057 |
| సీతానగరం | 1,18,4274 | 73,527 | 97,496 | 72,619 | 62,616 |
| తణుకు | ... | ... | ... | 31,027 | 82,301 |
| ఉయ్యూరు | 2,35,958 | 2,62,855 | 4,67,517 | 5,25,431 | 4,90,113 |
| మొత్తం | 5,64,643 | 4,85,000 | 9,66,735 | 11,10,750 | 11,29,949 |

ఉపపదార్థముల (Byproducts) ఉత్పత్తి ప్రారంభించటం అత్యవసరం.

ఆంధ్రలోని పంచదార ఫ్యాక్టరీల ఉత్పత్తి, పెట్టుబడుల వివరాలు ఫ్యాక్టరీ వారీగా యీ క్రింద యివ్వబడ్డాయి.

### శ్రీ రామా షుగర్సు అండ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

#### బొబ్బిలి (శ్రీకాకుళం జిల్లా)

ఈ ఫ్యాక్టరీ అధిపతులు: బొబ్బిలి, వెంకటగిరి రాజాలు, మరి ఇతరులు.

దినమునకు 450 టన్నుల చెరకును గానుగాడగలదు. ఫ్యాక్టరీకి చేరువనున్న రైల్వే స్టేషను బొబ్బిలి (తూర్పు రైల్వే). చేరువనున్న స్టీమరు స్టేషను విశాఖపట్నం.

### శ్రీ రామా షుగర్సు అండ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

#### సీతానగరం (శ్రీకాకుళం జిల్లా)

ఈ ఫ్యాక్టరీ దినమునకు 300 టన్నుల చెరకును ఆడగలదు. దీనికి చేరువ నున్న రైల్వేస్టేషను సీతానగరం (తూర్పు రైల్వే). చేరువనున్న స్టీమరు స్టేషను విశాఖపట్నం.

### ది విశాఖపట్నం షుగర్ అండ్ రిఫైనరీ లిమిటెడ్

#### తుమ్మపాల (అనకాపల్లి - విశాఖజిల్లా)

ఈ ఫ్యాక్టరీ ప్రస్తుతం కాంతిలాల్ అండ్ సేట్ లిమిటెడ్ — బొంబాయి వారిచే నిర్వహింపబడుతున్నది. ఈ సంస్థ 1935 సంవత్సరంలో ప్రారంభింపబడింది. తుమ్మపాలలో కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు పెట్టుబడులతో ప్రారంభింపబడిన, శ్రీరామకృష్ణ కో-ఆపరేటివ్ ఇండస్ట్రియల్ అండ్ క్రెడిట్ సొసైటీవారి ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకొనుటకు ఈ సంస్థ ఉద్దేశించబడింది. 1941 లో యీ కంపెనీ, ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకొన్నది. 1942 అక్టోబరు నుండి మేనేజిమెంటుకూడ కాంతిలాల్ అండ్ సేట్ లిమిటెడ్ చేత నిర్వహించబడుతున్నది.

| | |
|---|---|
| ఈ సంస్థ అనుమతి పొందిన పెట్టుబడి | రు. 15,00,000 |
| చందా వేయబడిన పెట్టుబడి | రు. 7,50,000 |
| చెల్లించిన మూలధనం | రు. 7,48,266 |

ఈ ఫ్యాక్టరీ దినమునకు 400 టన్నుల చెరకును ఆడగలదు. 1951-52 సంవత్సరంలో 54,552.7 టన్నుల చెరకును ఆడింది.

ఫ్యాక్టరీలో చెరకు పిప్పి, పొంగు మున్నగువాటినుండి రసాయన పదార్థాలు, సారా, ఫినాయిలు, సోడా గ్యాసు మున్నగునవి తయారుచేయబడుతున్నాయి. చేరువనున్న రైలుస్టేషను అనకాపల్లి (దక్షిణ రైల్వే). స్టీమరుస్టేషను విశాఖపట్నం.

### ఏటికొప్పాక షుగర్ ఫ్యాక్టరీ I

#### ఏటికొప్పాక (విశాఖపట్నంజిల్లా)

ఏటికొప్పాక కో-ఆపరేటివ్ అండు అగ్రికల్చరల్ సొసైటీ లిమిటెడ్ వారిచే పై ఫ్యాక్టరీ నిర్వహించబడుతున్నది. ఇందులో దినమునకు 75 టన్నుల చెరకును ఆడుదురు. నరిసీపట్నంరోడ్డు (దక్షిణ రైల్వే) యీ ఫ్యాక్టరీకి చేరువలోఉన్న రైలుస్టేషను. చేరువలోని స్టీమరు స్టేషను విశాఖపట్నం.

### ఏటికొప్పాక షుగర్ ఫ్యాక్టరీ II
నార్లపూడి (విశాఖపట్నం జిల్లా)

ఈ ఫ్యాక్టరీకూడ ఏటికొప్పాక కో-ఆపరేటివ్ అండు అగ్రికల్చరల్ సొసైటీ లిమిటెడ్ వారిచే నిర్వహించబడుతున్నది. ఇది 1951-52 సంవత్సరంలో పనిచెయ్యలేదు. దినమునకు 600 టన్నుల చెరకు ఆడగలదు. చేరువలో ఉన్న రైలుస్టేషను నరిసీపట్నంరోడ్డు. విశాఖపట్నం, చేరువలోని స్టీమరుస్టేషను.

### కిర్లంపూడి షుగర్ మిల్సు లిమిటెడ్
కిర్లంపూడి (తూర్పుగోదావరిజిల్లా)

ఈ కంపెనీ 1944 లో ప్రారంభించబడింది. 1952 జూన్ 30వ తేదీకి ఈ కంపెనీ పెట్టుబడి వివరాలు:

| | |
|---|---|
| అనుమతిపొందిన మూలధం | రు.25,00,000 |
| చందా వేసిన మూలధనం, చెల్లించిన మూలధనం | రు.17,45,775 |

కుబేరా షుగర్ మేనేజర్సు లిమిటెడ్, యీ ఫ్యాక్టరీ మేనేజిమెంటు బాధ్యతల నిర్వహిస్తున్నది. ఈ ఫ్యాక్టరీ తూర్పుగోదావరిజిల్లాలోని కిర్లంపూడివద్ద (సామర్లకోటకు 10 మైళ్ళు) నిర్మింపబడింది. ఇది దినమునకు 600 టన్నుల చెరకును గానుగ ఆడగలదు. దీని సమీప రైల్వే స్టేషను పిఠాపురం. కాకినాడ, చేరువలో ఉన్న స్టీమరు స్టేషను.

### డక్కన్ షుగర్ అండ్ అబ్కారీ కంపెనీ లిమిటెడ్
సామర్లకోట (తూర్పుగోదావరిజిల్లా)

ఆంధ్రదేశంలో బ్రిటిష్ పెట్టుబడితో నడుపబడు ఫాక్టరీలలో ఇది ఒకటి. ఈ కంపెనీ 1897లో ప్రారంభింపబడింది. పెట్టుబడి వివరాలు 1952 మే నెల 31 వ తేదీన యీ విధంగా ఉన్నాయి:

| | |
|---|---|
| అనుమతిపొందిన, చందా వేసిన, చెల్లించిన మూలధనం | రు. 26,92,000 |

పది లక్షల రూపాయలవరకూ నిధులున్నాయి. ఈ పెట్టుబడితోనే సామర్లకోట ఫ్యాక్టరీతోబాటు, మద్రాసు రాష్ట్రంలోని పుగలూరులోకూడ మరొక ఫ్యాక్టరీ నడుపబడుతున్నది.

సామర్లకోట ఫాక్టరీ దినమునకు 500 టన్నుల చెరకును ఆడగలదు. ఇచ్చట చెరకు పిప్పి మున్నగు వాటినుండి పిప్పరమెంట్లు మున్నగునవి తయారు చేస్తారు. ప్రశస్తిగాంచిన "ప్యారీ పిప్పరమెంట్లు", "స్వీట్సు" ఇచ్చట తయారు చెయ్యబడేవే. సోడా గ్యాసు మున్నగునవికూడ ఇచ్చట తయారు చేస్తారు.

ప్యారీకంపెనీ, యీ ఫ్యాక్టరీ మేనేజిమెంటును నిర్వహించుచున్నది.

దీనికి సమీప స్టీమరు స్టేషను కాకినాడ. సామర్లకోట రైలుస్టేషనునుండే ఫ్యాక్టరీ ఎగుమతి, దిగుమతులు జరుగుతాయి.

### ఆంధ్ర షుగర్సు లిమిటెడ్
తణుకు (పశ్చిమ గోదావరిజిల్లా)

రంగారావు అండ్ కంపెనీ యీ ఫ్యాక్టరీ మేనేజిమెంటును నిర్వహిస్తున్నది. ఇందులో దినమునకు 600 టన్నుల చెరకును ఆడగలరు. దీనికి చేరువలోని స్టీమరు స్టేషను విశాఖపట్నం. రైలు స్టేషను తణుకు.

### గోదావరి షుగర్సు అండ్ రిఫైనరీస్ లిమిటెడ్
తణుకు (పశ్చిమ గోదావరిజిల్లా)

ఎడ్‌కో లిమిటెడ్ — మద్రాసు యీఫాక్టరీ నిర్వహణ బాధ్యతల కొనసాగిస్తున్నది. ఈ ఫాక్టరీ దినమునకు 200 టన్నుల చెరకును గానుగఆడగలదు. దీనికి సమీప స్టీమరు స్టేషనువిశాఖపట్నం.

### ఉయ్యూరు షుగర్ ఫాక్టరీ
ఉయ్యూరు (కృష్ణాజిల్లా)

కె. సి. పి. లిమిటెడ్ కంపెనీ, యీ ఫాక్టరీ యజమానులు. ఈ సంస్థ పంచదార మిల్లును నిర్మించాలనే ఉద్దేశ్యంతో 1941 లో ప్రారంభించబడింది. దీని పెట్టుబడి వివరాలు :

1952 సంవత్సరం జూన్ 30వ తేదీకి—

| | |
|---|---|
| అనుమతింపబడిన పెట్టుబడి | రు. 22,00,000 |
| చందా చేయబడిన, చెల్లించిన మూలధనం | రు. 16,68,090 |
| 1952 సంవత్సరం లాభం | రు. 16,45,598 |

ఇది ఆంధ్రలోని పంచదార ఫాక్టరీలలో కెల్ల పెద్దది. దినమునకు 850 నుండి వెయ్యిటన్నుల వరకూ చెరకును గానుగ ఆడగలదు. ఈ ఫాక్టరీలోని చెరకు పిప్పి మున్నగువాటినుండి సోడా గ్యాసును తయారుచేయుటకు కృష్ణా ఇండస్ట్రియల్ కార్పొరేషను;మందులు, స్పిరిట్ మున్నగునవి తయారుచేయుటకు ఆల్ఫ్రెడ్ హెర్బర్ట్ అండ్ కంపెనీ (ఇండియా) లిమిటెడ్ - కె.సి.పి.అధీన సంస్థలుగాఉన్నవి.

చెరకు పిప్పి నుండి తెల్లకాగితాన్ని కూడ తయారుచేసే యంత్రాలను యీ సంస్థచేత స్థాపింప చేయాలనే ఆలోచనలు ఉన్నాయి.

## జనపనార మిల్లులు

మనరాష్ట్రంలో ఉన్న మిల్లులు నాలుగు. ఇందులో విశాఖపట్నంజిల్లాలోని చిట్టివలస, నెల్లిమర్ల మిల్లులు బ్రిటీషు పెట్టుబడితో నిర్మించి నడపబడుతున్నవి. ఏలూరుమిల్లు స్థానిక పెట్టుబడితో నిర్మించబడినా గుజరాతీ కంపెనీచే సేడు నిర్వహించబడుతున్నది. గుంటూరు మిల్లు గుజరాతీ పెట్టుబడిదార్లచేతనే నడుపబడుతున్నది. ఉన్నవి నాలుగేమిల్లులైనా ఇవి ఆంధ్ర పరిశ్రమలలో చాలా ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమించాయి. రాష్ట్రం మొత్తంలో సాలుకు షుమారు 35 కోట్ల రూపాయల విలువగలిగిన సరకులు వివిధ ఫాక్టరీలలో ఉత్పత్తి అవుతున్నట్లు అంచనా వేయగా, యీ నాల్గు మిల్లులలోనూ షుమారున్నరకోట్ల విలువగల్గిన సరకు ఉత్పత్తి చేయబడుతున్నది. ఫాక్టరీవారీ వివరాలు :

### చిట్టివలస జూట్‌మిల్లు
చిట్టివలస (విశాఖపట్నం జిల్లా)

ఈకంపెనీ 1926లో ప్రారంభింపబడింది. 1951 సం॥ డిశంబరు నాటికి యీకంపెనీ

| | |
|---|---|
| అనుమతిపొందిన పెట్టుబడి, | |
| చందా చేసిన ,, | రు. 15,05,000 |
| చెల్లించిన మూలధనం | |
| నిల్వలు | రు. 36,25,000 |
| లాభం | రు. 17,92,133 |

1953 డిశంబరులో కంపెనీ నిల్వల నుండి రు. 20,10,000 లను పెట్టుబడుల క్రింద మార్చి, మొత్తం కంపెనీ మూలధనాన్ని రు. 35,15,000 లకు పెంచారు.

మొత్తం మగ్గాలు 500. ఇందులో 376 మగ్గాలు గోనెల నేతకు, 124 గోనె గుడ్డ నేతకు ప్రత్యేకింపబడ్డాయి.

ఇది ఆంధ్రలోని మిల్లులన్నింటికన్న పెద్దది. మేక్‌లియాడ్ అండ్ కంపెనీ - కలకత్తా దీనిని నిర్వహిస్తున్నది.

### నెల్లిమర్ల జూట్‌మిల్లు
### నెల్లిమర్ల (విశాఖపట్నం జిల్లా)

1939 లో యీ కంపెనీ ప్రారంభింపబడింది. 1952 జూన్ నాటికి యీ కంపెనీ పెట్టుబడి వివరాలు:

| | |
|---|---|
| అనుమతించిన పెట్టుబడి | రు. 15,00,000 |
| చందా చేసిన, చెల్లించిన మూలధనం | రు. 12,50,000 |
| నిల్వలు | రు. 36,50,000 |
| లాభం | రు. 1,38,364 |

1953 డిశంబరులో కంపెనీ అనుమతింపబడిన పెట్టుబడి రు. 31,25,000 లకు పెంచబడింది. కంపెనీ నిల్వలనుండి రు. 18,75,000 లను చెల్లించిన మూలధనంగా మార్చి మొత్తం పెట్టుబడి పెంచబడింది.

మొత్తం మగ్గాలు 316. ఇందులో పంచుల నేతకు 261, గోనెగుడ్డ నేతకు [illegible]

మిలు మేనేజింగు ఏజంట్లు మేక్‌లియాడ్ అండ్ కంపెనీ-కలకత్తా.

### శ్రీ భజరంగ్ జూట్ మిల్సు
### లిమిటెడ్, గుంటూరు

| | |
|---|---|
| అనుమతింపబడిన పెట్టుబడి | రు. 15,00,000 |
| చందా చేసిన, చెల్లించిన మూలధనం | రు. 12,50,000 |

ఈ ఫ్యాక్టరీ దినమునకు 15 టన్నుల వరకూ సరకు ఉత్పత్తి చేయగలదు. సంవత్సరపు ఉత్పత్తి విలువ షుమారు రు. 48,00,000. మేనేజింగు ఏజంట్లు: శ్రీ హనుమాన్ ఇన్‌వెస్టుమెంట్సు కంపెనీ లిమిటెడ్ - కలకత్తా.

### శ్రీ కృష్ణా జూట్ మిల్సు
### లిమిటెడ్, ఏలూరు

1904 లో యీ కంపెనీ శ్రీ మోతే నారాయణరాజు, మోతే సుబ్బారావు గార్లచేత ప్రారంభింపబడింది. 1907లో 87 మగ్గాలతో పని ప్రారంభించబడి క్రమంగా 116 మగ్గాలకు (2,512 కదుర్లు) పెంచబడింది. 8 గం|| పని దినంలో 10 టన్నులసరకును ఉత్పత్తి చేయగలదు. ప్రస్తుతం దినమునకు రెండుషిఫ్టులు పని సాగుతున్నది. ప్రతి 8 గంటల పనిదినమునకు 6 టన్నుల ఉత్పత్తి జరుగుచున్నది.

1907 నుండి 1930 వరకూ నిరాటంకంగా నడచి 1930-34 సం||లలో యీ మిల్లు మూసివేయబడింది. 1934, 1935 సం||లో తిరిగి పనిచేయటం ప్రారంభించి 1936 నుండి 1939 వరకూ తిరిగి మూసివేయబడింది. 1939 నుండి మరల పని కొనసాగుచున్నది.

ప్రస్తుతం ఈస్టు ఇండియా కమర్షియల్ కంపెనీ - కలకత్తా వారిచే అద్దెకు తీసుకొనబడి ఫాక్టరీ కొనసాగించబడు తున్నది.

| | |
|---|---|
| ఫాక్టరీ-అనుమతి పొందిన పెట్టుబడి | రు. 5,00,000 |
| చందా వేసిన పెట్టుబడి | రు. 4,94,500 |
| చెల్లించిన మూలధనం | రు. 4,51,840 |
| నిల్వలు | రు. 11,070 |

## నూలు మిల్లులు

ఆంధ్రలో బట్టలమిల్లులు లేవు. ఉన్న ఆరూ నూలుమిల్లులే. ఇందులోనూ సర్వ సామాన్యంగా తయారయ్యేది 20 వ నంబరునూలు. సగటున యీ ఆరుమిల్లులలో 43,35,000 పౌనులనూలు ఉత్పత్తి చేయబడునని అంచనా వేయబడుతున్నది.

ఉన్ననూలు మిల్లులు, వాటి కదుర్ల సంఖ్య క్రింద ఇవ్వబడినది:

| | |
|---|---|
| 1. ఆదోని కాటన్ మిల్స్ లిమిటెడ్, ఆదోని | 2,000 |
| 2. హేమలతా టెక్స్‌టయిల్స్ లిమిటెడ్, గుంటూరు | 12,000 |
| 3. రాయలసీమ మిల్స్ లిమిటెడ్, ఆదోని | 12,000 |

(మరొక 6,000 కదుర్లు కలపటానికి యత్నాలు జరుగుతున్నవి).

| | |
|---|---|
| 4. శ్రీ రామచంద్రా స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్, పందలపాక | 7,044 |
| 5. శ్రీ సత్యనారాయణ స్పిన్నింగుమిల్స్, రాజమండ్రి | 5,504 |
| 6. కో-ఆపరేటివ్ స్పిన్నింగు మిల్స్, గుంతకల్లు | 11,000 |

ఉన్న మిల్లులలోకెల్ల హేమలతా మిల్స్-గుంటూరు, రాయలసీమ మిల్స్-ఆదోని, కో-ఆపరేటివు స్పిన్నింగ్ మిల్స్-గుంతకల్లు పెద్దవి.

### రాయలసీమ మిల్సు లిమిటెడ్
### ఆదోని

అనుమతించిన పెట్టుబడి రు. 30,00,000

| | |
|---|---|
| చందా వేసిన, చెల్లిం చిన మూలధనం | రు. 22,07,391 |
| 1951 సం॥లో లాభం | రు. 3,68,763 |

ఈ కంపెనీ 1945 సం॥లో ప్రారంభింపబడింది. 1950 మే 22 నుండి మిల్లు పని చేయడం ప్రారంభమయింది. 20,26 నెంబర్ల నూలు తయారు చేయబడుతున్నది. రాయలసీమ డెవలప్‌మెంటు కార్పొరేషన్-ఆఫీసు, దీని మేనేజింగు ఏజంట్లు.

### హేమలతా టెక్స్‌టయిల్సు లిమిటెడ్, గుంటూరు

1947 లో యీ కంపెనీ ప్రారంభింపబడింది. సుదర్శనం అండ్ కంపెనీ, యీ ఫ్యాక్టరీ మేనేజింగు ఏజెంట్సు.

| | |
|---|---|
| అనుమతింపబడిన పెట్టుబడి | రు.50,00,000 |
| చందా వేసిన పెట్టుబడి | రు. 20,00,000 |
| చెల్లించిన మూలధనం | రు. 17,52,188 |

20,32,40 నెంబరు నూలు యిచ్చట తీయబడుచున్నది.

### కో-ఆపరేటివ్ స్పిన్నింగు మిల్సు గుంతకల్లు

ఇది సహకారసంస్థల పెట్టుబడితో ప్రారంభింపబడిన నూలు మిల్లు. 1951 సం॥లో యీ కంపెనీ రిజిష్టరు చేయబడి, 1954 ఫిబ్రవరి 8న ప్రారంభింపబడినది. దీని అనుమతించిన పెట్టుబడి రు.45,00,000. ఇందులో సగ భాగం చేనేత పారిశ్రామికుల ప్రాథమిక సహకార సంఘాలు తమ వంతు పెట్టుబడులుగా వాటాలు కొన్నవి. 15½ లక్షల రూపాయలను రాష్ట్ర సహకారసంఘం పెట్టుబడి పెట్టింది.

ప్రస్తుతం 11,024 కదుర్లతో నిర్మాణం పూర్తి చేయబడింది. 24,000 వరకూ కదుర్ల సంఖ్యను పెంచ అనువైన వసతులతో ఫ్యాక్టరీ నిర్మించబడ్డది. 1954 సం॥ అంతమునకు మిల్లులోని కదుర్ల సంఖ్య 20,000 వరకు పెంచ ప్రయత్నాలు చేయబడుతున్నాయి.

ప్రస్తుతం ఇచ్చట నెలకు 500 బేళ్ళ నూలు ఉత్పత్తి అవుతుంది (రెండు షిఫ్టులలో). మొత్తం సామగ్రి అంతా అమర్చిన తర్వాత యీ ఉత్పత్తి 850 బేళ్ళకు వృద్ధిచెందుతుంది.

ఇచ్చట తయారయ్యే నూలు అంతా ఆంధ్ర చేనేత సహకార సంస్థలద్వారా కార్మికులకు అందించబడుతుంది.

## నూనె మిల్లులు

ఆంధ్రలో నూనెగింజలు సమృద్ధిగా ఉత్పత్తి అవుతున్నవి. అయినా షుమారు 225-250 నూనెమిల్లులు మాత్రమే ఉన్నట్టు అంచనా వేయబడుతున్నది. వీటిలో అత్యధికభాగం చాలా చిన్నమిల్లులే.

వనస్పతి, వెజిటబుల్ ఆయిల్ మిల్సు ఎనిమిది ఉన్నవి. వీటిలో డాల్డా తయారు చేయుటకు. నూనెలు శుద్ధిపరచి పరిశ్రమల వినియోగానికి అవసరమైన పద్ధతుల్లో తయారు చేయుటం జరుగుతున్నది.

రేలీ అండ్ కంపెనీ అనే విదేశ వ్యాపారసంస్థ చాలవరకూ ఆంధ్రదేశంలో నూనెమిల్లుల పెట్టి, నూనె గింజలకొని, నూనె ఆడించి ఇతర రాష్ట్రాలకు, విదేశాలకు యీ సరకును ఎగుమతి చేస్తూ, ఒకరకంగా ఇది నూనెగింజల మార్కెటును

కూడ కంట్రోలు చేస్తున్నది. దీని ప్రభావం కర్నూలు, అనంతపురం, చిత్తూరు, కడప జిల్లాలలో విశేషంగా కానవస్తుంది. వీటిలో ప్రధానఫాక్టరీలకు సంబంధించిన భోగట్టా క్రింద యివ్వబడింది.

### ఈస్టు కోస్టు ఫుడ్ ప్రోడక్ట్సు లిమిటెడ్

ఈ కంపెనీ 1946 లో గుంటూరులో ప్రారంభించబడింది. దీని ఫాక్టరీ గుంటూరుజిల్లాలోని తాడేపల్లిలో ఉన్నది. ఇచ్చట వనస్పతి, నూనెల శుద్ధంచేయటం మున్నగునవి చేస్తారు. ఒక్క వనస్పతినే అయితే దినమునకు 10 టన్నులు తయారు చేయగలదు. నూనె శుద్ధిచేయటమైన 51 టన్నుల వరకూ పనిచేయగలదు.

1952వ సంవత్సరం మార్చి 31వ తేదీకి అనుమతింపబడిన పెట్టుబడి రు. 25,00,000
చందాచేసిన, చెల్లించిన మూలధనం } రు. 20,91,950

### హిందూపూరు వెజిటబుల్ ఆయిల్సు అండ్ రిఫైనరీస్ లిమిటెడ్

1946 లో యీకంపెనీ ప్రారంభించబడింది. అనంతపురం జిల్లాలోని హిందూపూరులో ఫాక్టరీ కట్టబడింది. డి. బి. సెట్టి అండ్ కంపెనీ దీని మేనేజింగు ఏజంట్లు. 1952 సంవత్సరం మార్చి 31 వ తేదీకి—

అనుమతించబడిన పెట్టుబడి రు. 10,00,000
చందాచేసిన, చెల్లించిన మూలధనం రు. 3,64,650

### వెజిటాల్సు లిమిటెడ్

1945 లో యీ కంపెనీ ప్రారంభించబడింది. చిత్తూరులోని యీ కంపెనీ ఫాక్టరీ 1950 జూలై 29 న ప్రారంభింపబడింది. ఇది వనస్పతి అయిన దినమునకు 10 టన్నులు; నూనెను పరిశుభ్రంచేయుట అయిన 15 టన్నులు చేయగలదు.

1951 సంవత్సరం, మార్చి 31వ తేదీకి అనుమతింపబడిన పెట్టుబడి రు. 12,00,000
చందాచేసిన, చెల్లించిన మూలధనం రు. 8,53,666

ఖల్సార్ అండ్ కంపెనీ వీరి మేనేజింగు ఏజంట్లు.

### తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్

ఇది కర్నూలులోని పెద్దకంపెనీ ఫాక్టరీ. ఆంధ్రలోకల్ల పెద్ద ఫాక్టరీ. వనస్పతి అయిన దినమునకు 40 టన్నులు; నూనెను శుద్ధిచేయటమయిన 60 టన్నులు చేయగలదు.

ది కాటన్ ఏజంట్సు లిమిటెడ్ - బొంబాయి యీ కంపెనీ మేనేజింగ్ ఏజంట్లు.

1951వ సంవత్సరం సెప్టెంబరు 31వ తేదీకి అనుమతింపబడిన పెట్టుబడి రు. 1,00,00,000
పిలచిన మూలధనం రు. 40,00,000
చందాచేసిన, చెల్లించిన మూలధనం. రు. 30,58,950

### విశాఖపట్టణం వెజిటబుల్ ఆయిల్ ప్రొడక్ట్సు లిమిటెడ్

ఈ కంపెనీ 1946 లో బొబ్బిలిరాజా ఆధ్వర్యాన ప్రారంభింపబడింది. వీరి

ఫాక్టరీ శ్రీకాకుళంజిల్లాలోని శీతానగరంలో కలదు. దినమునకు 10 టన్నుల వనస్పతి, 5 టన్నుల నూనెను శుద్ధం చేయటం ఇచ్చట జరుగుతుంది.

1952 సం॥ జూన్ 30 వ తేదీకి

| | |
|---|---|
| అనుమతించిన పెట్టుబడి | రు. 18,00,000 |
| పిలచిన పెట్టుబడి | రు. 14,00,000 |
| చందావేసిన, చెల్లించిన మూలధనం | రు. 13,81,662-8-0 |

ఈ కంపెనీ మేనేజింగు ఏజంట్లు :
శ్రీ రామా షుగర్సు అండ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ - బొబ్బిలి

ఆంధ్ర వెజిటబుల్ ఆయిల్ కంపెనీ

ఇది విజయవాడలోని ఫాక్టరీ. ఇచ్చట దినమునకు 30 టన్నుల నూనెను శుద్ధం చేయగలరు. వనస్పతిని తయారు చేయు పరికరాలు అమర్చిలేవు.

రాధాకృష్ణా ఆయిల్ మిల్సు లిమిటెడ్

ఈ ఫాక్టరీ అనంతపురం జిల్లాలోని పామిడిలో నిర్మించబడింది. ఇచ్చట దినమునకు 10 టన్నుల నూనెను శుద్ధపర్చగలరు.

వెజిటబుల్ ఆయిల్ కంపెనీ లిమిటెడ్

ఈ కంపెనీ ఫాక్టరీ గుంటూరులో కలదు. దినమునకు 10 టన్నుల నూనెను ఇచ్చట పరిశుద్ధం చేయవచ్చు.

# పింగాణీ పరిశ్రమ

మనకు పింగాణీ పరిశ్రమకు కావలసిన రేగడి ఆంధ్ర జిల్లాలలో సమృద్ధిగా ఉన్నా ఈ పరిశ్రమ అభివృద్ధి చెందలేదు. గత 25 సంవత్సరాలలో యీ పరిశ్రమ ప్రారంభమున 12-13 కంపెనీలు ప్రారంభింపబడ్డా, అందులో 3 మాత్రమే నేడు పనిచేయుచున్నవి. ఇందులో ప్రధానమైనది గూడూరులోని గవర్నమెంటు ఫాక్టరీ.

ఇచ్చట సంవత్సరమునకు 120 టన్నుల పింగాణీ సరుకు ఉత్పత్తి చేయవచ్చు. ప్రస్తుతం ఫాక్టరీ మొత్తం ఉత్పత్తి శక్తితోనే కొనసాగింపబడుతున్నది.

ఈ ఫాక్టరీ నిర్మాణం 1948 లో ప్రారంభింపబడి, 1949 ఏప్రిల్ 1వ తేదీన ఉత్పత్తి ప్రారంభింపబడింది. ఈ ఫాక్టరీ పెట్టుబడి ప్రారంభంలో రు. 4,40,435. ప్రస్తుతం అరుగుదలక్రింద లోటును మినహాయించగా, ఫాక్టరీకిమ్మతు రు. 3,34,592 గను; ఫాక్టరీలోని సరకుల విలువలు రు. 2,12,054 గను అంచనా వేయబడుతున్నది.

పింగాణీ పరిశ్రమలో విద్యార్థులకు, యితరులకు శిక్షణ యిచ్చుటకు కూడ యీ ఫాక్టరీ ఉద్దేశింపబడింది. మరొక 10 లక్షల రూపాయల ఖర్చుతో అదనపు యంత్రాల నిర్మించి, నూతన వస్తువుల కూడ తయారుచేయాలనే పథకం కూడ ఆలోచనలో ఉన్నది.

ఫాక్టరీలో తయారయ్యే సరకులో షుమారు సగభాగం పైబడి, ఇరుగు పొరుగు రాష్ట్రాలకు ఎగుమతి చేయబడుతున్నది.

ఈ ఫాక్టరీకి కావలసిన ముడి పదార్థాలలో – జిప్సం, ఫెల్స్పార్ (Felspar) మున్నగునవి స్థానికంగాను; పింగాణీ మట్టి తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాల నుండి; ఇతర అవసరాలు కొచ్చిన్, తిరువాన్కూరు నుండి దిగుమతి చేసుకొనబడుతున్నాయి.

# సబ్బుల పరిశ్రమ

ఆంధ్రదేశంలో ఉన్న రెండు సబ్బుల ఫాక్టరీలలో విజయవాడ సమీపంలోని వసంతా సోప్‌వర్క్సు లిమిటెడ్ ఒకటి. కుటీర పరిశ్రమగా అనేకచోట్ల సబ్బుల ఉత్పత్తి జరుగుతున్నా, శాస్త్రీయ పద్ధతులపై సబ్బును తయారుచేయు ఫాక్టరీ ఆంధ్రలో ఇది ఒకటి. ఈ ఫాక్టరీలో వారమునకు 6 నుండి 8 టన్నుల టాయిలెట్ సబ్బు, 25 టన్నుల బట్టల సబ్బు ఉత్పత్తి చేయవచ్చు. దీని పెట్టుబడి వివరాలు:

అనుమతిపొందిన పెట్టుబడి రు. 10,00,000
చెల్లించిన మూలధనం రు. 3,91,200

రు. 1,21,220 ప్రభుత్వం యీ ఫాక్టరీకి అప్పు యిచ్చింది.

రెండవ సబ్బు ఫాక్టరీ తుంగభద్ర ఇండస్ట్రీస్‌కు సంబంధించినది.

# కాగితపు పరిశ్రమ

భారతదేశంలో 1851 సం॥ లోనే మొట్టమొదటి పేపరుమిల్లు ప్రారంభించబడితే, ఆంధ్రలో 1920 లో మాత్రమే ఒకటి "కర్నాటిక్ పేపరుమిల్లు" అనే పేరుతో ప్రారంభించబడింది. ఇదే, ఇప్పుడు "ఆంధ్రా పేపరుమిల్లు" అనుపేర వ్యవహరించబడుతున్నది. భారతదేశంలోని మిల్లులన్నింటికంటె ఇది చిన్నదని చెప్పవచ్చు. ఇది ప్రస్తుతం ఆంధ్ర ప్రభుత్వ యాజమాన్యమున నడుపబడుతున్నది.

ఈ పేపరుమిల్లు దినానికి పది టన్నుల కాగితాన్ని తయారుచేయగలదు. 1949—50 సంవత్సరంలో దీనిలో మొత్తం 784 టన్నుల కాగితం ఉత్పత్తి చేయబడింది.

బాదామీ కాగితం, తెల్లకాగితం, రేపరుపేపరు తదితర విధములయిన పేపరు ఇచ్చట తయారు చేయబడుతున్నది. ఇచ్చట తయారయ్యే పేపరులో అత్యధిక భాగం ప్రభుత్వ అవసరాలకు వినియోగించబడుతున్నది.

దీనిలో 500 మంది కార్మికులు పని చేస్తున్నారు. పేపరు ఉత్పత్తికి కావలసిన వెదురు, గడ్డి గోదావరి ఏజన్సీ అడవులనుండి సప్లయి అవుతున్నది.

# నౌకా పరిశ్రమ

విశాఖపట్నంలో నౌకా నిర్మాణ కేంద్రమున్నది. ఇది ప్రకృతిసిద్ధమయిన డాక్‌యార్డు. 1920వ సంవత్సరంలోనే సింధియా నావిగేషన్ కంపెనీ వారు విశాఖపట్టణంలో నౌకానిర్మాణ కేంద్రాన్ని ప్రారంభించాలని ప్రయత్నించారు. కాని, బ్రిటిష్ ప్రభుత్వ సవతితల్లి ప్రేమవల్ల ఇది సాధ్యంకాలేదు. చివరకు 1941 జూన్ 21వ తేదీన వాల్‌చంద్ హీరాచంద్ అనే గుజరాతీ పారిశ్రామికుడు "సింధియా నౌకా నిర్మాణ కేంద్రాన్ని" ప్రారంభించాడు.

320—500 అడుగులపొడవుగల 5,000—15,000 వేల టన్నుల నౌకలను నిర్మించవీలయ్యే మూడు "బెర్తు" లున్నాయి. 590 అడుగుల పొడవువున్న నాల్గవ "బెర్తు", చిన్న పడవల నిర్మాణానికి సరిపడ "బెర్తు" నిర్మాణంలో ఉన్నాయి. డాక్‌యార్డు వైశాల్యం 56 ఎకరాలుంటుంది.

యుద్ధపరిస్థితులవల్ల 1941లో నిర్మాణ కేంద్రం ప్రారంభించబడినా, 1946 సంవత్సరం దాకా నౌకానిర్మాణం సాధ్యం కాలేదు. ఇచ్చట మొట్టమొదట నిర్మించబడిన "యస్. యస్. జలఉష" అనే నౌకను 1948 లో నెహ్రూ జలప్రవేశం చేయించాడు. 1951వ సంవత్సరాంతానికి 8,000 టన్నుల (W. d.) నౌకలు ఎనిమిది, 480 టన్నుల ప్రయాణానికి ఉపయోగించే చిన్న నౌక నిర్మించబడ్డాయి. 8,000 టన్నుల నౌకలు రెండు, 7,000 టన్నుల నౌక ఒకటి ప్రస్తుతం నిర్మాణంలో ఉన్నాయి.

గత ఐదు సంవత్సరాలలో నిర్మించ బడిన నౌకల నిర్మాణానికి అయిన ఖర్చు సుమారు 65 లక్షలు. ఈ నౌకలనే, బ్రిటన్‌లో నిర్మించేట్లయితే అయ్యే ఖర్చు రు. 45-55 లక్షలుంటుంది. ఈ విపరీత నష్టానికి గురవుతూ కంపెనీ మూత పడే స్థితికి వచ్చింది. పరిశ్రమను రక్షించేందుకు భారతప్రభుత్వం 'సబ్సిడీ' ఇవ్వ అంగీకరించింది. అయినప్పటికీ, సింధియా కంపెనీ పరిశ్రమను నిర్వహించలేకపోవటంవల్ల, కేంద్ర ప్రభుత్వం ప్రధానభాగస్వామినిగా 1952 వ సంవత్సరం జనవరి 21 వ తేదీన చేరింది. మొత్తం చెల్లించబడిన మూల ధనం రు. 3,09,90 వేలలో మూడింట రెండువంతుల వాటా తీసికొని, కంపెనీ పేరును "హిందూస్థాన్ షిప్‌యార్డు లిమిటెడ్"గా మార్చారు. మిగిలిన మూడవ వంతువాటా సింధియాకంపెనీవారికున్నది.

నౌకా నిర్మాణానికి కావలసిన సాంకేతిక సహాయం నిమిత్తం, 1953 వ సంవత్సరం జూలై 15 వ తేదీన ఒక ఫ్రెంచి కంపెనీ (Soctete Anonyme des Ateliers et Chantiers de la Loire, Paris) అనే నౌకా పరిశ్రమ కంపెనీతో ఒడంబడిక చేసుకున్నారు. దీని ప్రకారం ఈ కంపెనీవారు, నౌకా నిర్మాణంలో తోడ్పటమేగాక భారతీయులకు శిక్షణ కూడా ఇస్తారు.

పంచవర్ష ప్రణాళిక కోటా ప్రకారం, ఈ కేంద్రం 1955-56 సంవత్సరానికి లక్ష టన్నుల నౌకలను నిర్మించాలి.

భారతదేశంలో నౌకా కేంద్రం ఇది ఒక్కటే. ఈ పరిశ్రమలో సుమారు 3,750 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

ఇచ్చట హార్బరు కూడా ఉన్నది. హార్బరు వర్క్‌షాప్‌లో సుమారు 400 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

## పొగాకు పరిశ్రమ

భారతదేశ వర్జీనియా పొగాకుపంటలో నూటికి 90 పాళ్ళు ఆంధ్ర పండిస్తున్నది. కాని ఒక్క సిగరెట్టు ఫాక్టరీకూడాలేదు. ఉన్నదల్లా, 15–16 "రిడ్రయింగ్ ఫాక్టరీలు" మాత్రం. ఆంధ్ర దేశంలోని ఏ ఇతర పరిశ్రమలో కన్నా, పొగాకు పరిశ్రమలో ఎక్కువమంది కార్మికులు పనిచేస్తున్నారు.

ఆంధ్రదేశంలోని వర్జీనియా పొగాకు వ్యాపారమంతా ఐ. యల్. టి. డి. కంపెనీ, బ్రిటిషు ఇండియా టొబాకో కంపెనీ (బి.ఐ.టి.) అనే బ్రిటిషుకంపెనీల చేతుల్లో ఉంది.

ఈ కంపెనీలు మనపొగాకును విరివిగా కొని విదేశాలకు ఎగుమతి చేయటమే గాక, బొంబాయి, కలకత్తా, మాంఘీరు, బెంగుళూరు, సికిందరాబాదు మొదలగు కేంద్రాలలోని సిగరెట్ ఫాక్టరీలకు తీసికొనిపోతున్నారు.

## ఖనిజ పరిశ్రమ

నేడు రాష్ట్రంలో అనేక ఖనిజాలు — మైకా, మాంగనీసు, క్రోమైట్, ముడి ఇనుము ఇత్యాదులు త్రవ్వబడుతున్నాయి. కాని, వీటి సంబంధమైన పరిశ్రమ ఒక్కటి కూడా నేడు ఆంధ్రలో లేదు. దాదాపు ఈముడిపదార్థాలన్నీ ఇంగ్లండు,అమెరికా, జపాన్ మొదలైన దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

ఆయా ప్రాంతాల ఖనిజాల నుపయోగించే వివిధ పరిశ్రమలను, ఆయాప్రాంతాలలో స్థాపించవచ్చు. దీనికి త్వరలో లభించబోయే మాచ్ ఖండ్, తుంగభద్ర స్కీముల విద్యుత్ యెంతేనిసాయపడుతుంది.

## ఫౌంటెన్ పెన్నుల పరిశ్రమ

ఫౌన్‌టెన్ కలాల పరిశ్రమ ఇంకా పెద్ద పరిశ్రమగా అభివృద్ధి చెందలేదు. రాజమండ్రి, భీమవరం, తెనాలి,గుంటూరు మొదలగు పట్టణాలలో కొన్ని కంపెనీలున్నాయి. వీరిలో అనేకులు ఎబొనైట్ కడ్డీలు, సెల్యులాయిడ్ గొట్టాలు, పాళీలు దిగుమతి చేసుకుంటున్నారు. అన్ని కంపెనీలు కలిసి దినానికి 200-250 కలాలను తయారుచేస్తున్నట్లు అంచనా వేయబడుతున్నది.

### రత్నం పెన్‌వర్క్స — రాజమండ్రి

ఇది 1932వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఆంధ్రలో మొట్టమొదట ప్రారంభించిన కంపెనీ అని చెప్పవచ్చు. దీనిలో 20మందికార్మికులుపనిచేస్తున్నారు. తయారయిన కలాలలో 'ముప్పాతిక పాళ్ళు ఆంధ్రలోనే అమ్మబడుతున్నాయి. మిగతావి, ఇతర రాష్ట్రాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

### శాస్త్రి పెన్ వర్క్స్, తెనాలి

ఈ కంపెనీ, 1942 వ సంవత్సరంలో ప్రారంభించబడింది. కలముల తయారీకి కావలసిన "ఎబొనైడ్ రాడ్సు", "ట్యూబులు" ఇతర దేశాలనుండి దిగుమతి చేసుకోబడుతున్నాయి.

తయారయిన సరుకులో నూటికి 60 పాళ్ళు ఆంధ్రలోను, మిగతా 40 పాళ్ళు ఇతర రాష్ట్రాలలోను అమ్మబడుతున్నాయి.

## ఇంజనీరింగు పరిశ్రమ

యుద్ధకాలంలో యంత్రాల, యంత్రభాగాల దిగుమతులు పూర్తిగా తగ్గిపోవటం చేత, ఉన్నవే రిపేరు చేయించుకోవలసిన స్థితి వచ్చింది. అప్పుడే ఆంధ్రలోయంత్రాల బాగుచేసేవి; చిన్న చిన్న యంత్ర భాగాలను; బస్సులకు, లారీలకు కావలసిన "చార్‌కోల్ గాస్‌ప్లాంట్సు" ఇత్యాదులు చేసే చిన్న చిన్న కార్ఖానాలు అనేకం ప్రారంభించబడ్డాయి. 1948 ప్రభుత్వ అంచనాల ప్రకారం ఆంధ్రలో ఇట్టి కార్ఖానాలు 30 మాత్రమే ఉన్నాయి.

యుద్ధానంతరం నెమ్మదిగా దిగుమతులు రావటంతో, ఈ కార్ఖానాలుకూడ మూత పడటం ప్రారంభించాయి. ఉన్న కొద్ది కూడా, దాదాపు మూతబడే స్థితిలో ఉన్నాయి.

### ఆంధ్ర సైంటిఫిక్ కంపెనీ, మచిలీపట్నం

ఈ కంపెనిని శ్రీ వేమూరి విశ్వనాథం, వీరి మిత్రబృందం కలిసి 1927 లో ప్రైవేటు కంపెనీగా, మచిలీపట్నంలో ప్రారంభించారు.

ఈ ఫాక్టరీలో శాస్త్ర వస్తువులు (Scientific instruments) తయారు చేయబడుతున్నాయి.

1937 వ సంవత్సరంలో జాయింట్ స్టాక్ కంపెనీగా రిజిష్టరుచేయబడింది. మదరాసు, మైసూరు, ఆంధ్ర, తిరువాన్కూరు విశ్వవిద్యాలయాలకు శాస్త్ర వస్తువుల సప్లయిచేస్తున్నది. ఉత్తర భారత దేశంలో కూడా, ఈ కంపెనీ సరుకులు అమ్మబడుతున్నాయి.

### నేషనల్ కెమికల్సు లిమిటెడ్ మచిలీపట్నం

మచిలీపట్నంలో ఫాక్టరీ నిర్మించి రసాయన పదార్థాలు ముఖ్యమైనవి తయారు చేయాలనే ఉద్దేశ్యంతో, ఈ కంపెనీ 1943 వ సంవత్సరంలో మదరాసులో ప్రారంభించబడింది. 1944 వ సంవత్సరం నుండి, ఈ ఫాక్టరీ అనేకరకాల రసాయన పదార్థాలను తయారుచేస్తున్నది.

1951 వ సంవత్సరం జూన్ 30 వ తేదీనాటికి ఈ కంపెనీ చెల్లించిన మూల ధనం రు. 8,77,875.

దీని రిజిష్టర్డు ఆఫీసు : 4, బ్లాకర్సు రోడ్డు, మౌంటురోడ్డు మదరాసు-2.

కేంద్ర కార్యాలయం: ఫాక్టరీ, మచిలీపట్నం.

డైరెక్టరుబోర్డు చైర్‌మన్ :
శ్రీ ఎస్. టి. జి. వరదాచారి.

## సౌత్ ఇండియన్ రీసర్చి ఇన్స్టిట్యూట్, విజయవాడ

ఇది 1950 వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఈ ఇన్‌స్టిట్యూట్ వివిధ రకాల మందులను తయారుచేస్తున్నది.

వీరి లేబొరేటరీకి "ఎయిర్ కండిషనింగ్" చేశారు. అధునాతన పద్ధతులతో లేబొరేటరీ నిర్మాణానికి ప్రయత్నాలు చేస్తున్నారు.

ఇన్‌స్టిట్యూట్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ జి. సుబ్బరాజు, యం. యస్. (కాలిఫోర్నియా) etc.

## బెజవాడ మెటల్ అండ్ స్టీల్ ఇండస్ట్రీస్ లిమిటెడ్, విజయవాడ

ఈ సంస్థ 1946వ సంవత్సరం ఆగస్టులో ప్రైవేటు లిమిటెడ్ కంపెనీగా పడమట (కృష్ణాజిల్లా)లో ప్రారంభించబడింది.

అప్పటికి ప్రపంచసంగ్రామం ముగిసినా, యంత్రాలదిగుమతి ధారాళంగా లేక యీ సంస్థకొన్ని చిక్కులకెదుర్కొనవలసివచ్చినా, విద్యుత్ సాయంతో నికెల్ ప్లేటింగు చేసిన గృహ నిర్మాణానికి అవసరమైన గడియలు, హాండిల్సు, మడతబందులు మొదలైనవి ఇత్తడితో చేయటం ప్రారంభించారు.

క్రమేపి, పరిశ్రమ అభివృద్ధి అయి, ఇప్పుడుఅధునాతన యంత్ర పరికరాలతో, అన్నిరకాల అల్యూమినియం పాత్ర సామాగ్రి విరివిగా ఉత్పత్తి చేస్తున్నారు. స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్ర సామాగ్రి చేయటానికి కావలసిన ఏర్పాట్లు ఈ సంస్థ చేస్తున్నది. రేకులు తయారుచేయటానికి కావలసిన "రోలింగు మిల్లును" ఏర్పాటు చేయటానికికూడా ప్రయత్నిస్తున్నది.

దీని ఉత్పత్తి ఆంధ్రలోనే గాక, ఒరిస్సా, హైదరాబాదు సంస్థానాలలో కూడా అమ్మబడుతున్నది.

1954 జనవరి నాటికి ఈ సంస్థ యొక్క :

| | |
|---|---|
| అనుమతించబడిన మూలధనం | రు. 5,00,000 |
| జారీచేయబడిన మూలధనం | రు. 3,00,000 |
| చందాకట్టబడిన మూలధనం | రు. 1,96,700 |

దీని మేనేజింగ్ ఏజంట్లు :
బెజవాడ కమర్షియల్ కార్పొరేషన్.



# కుటీర పరిశ్రమలు

ఆంధ్ర పారిశ్రామికంగా వెనుకబడి ఉండటంచేత, నేటికీ రాష్ట్ర ప్రజా జీవితంలో కుటీర పరిశ్రమలు ప్రధాన స్థానాన్ని వహిస్తున్నాయి. మన కుటీర పరిశ్రమలు చాల పురాతనమైనవే కాక, అంతర్జాతీయ ఖ్యాతినికూడా పొందాయి.

పురాతన గ్రీకు, రోము చక్రవర్తుల కాలంనుండీ, ఇంగ్లండు పారిశ్రామిక విప్లవం తర్వాత మిల్లు బట్టల పరిశ్రమ అభివృద్ధి చెందేవరకూ, పాశ్చాత్యుల సమ్మోహితుల చేసిన భారతీయ చేనేత పరిశ్రమలో ఆంధ్ర పరిశ్రమ ఒక భాగస్వామిని. దేశమంతటా పేరు పొందిన 'కలంకారీ' అద్దకం ఆంధ్రుల పరిశ్రమ. ఆంధ్రులకు గర్వకారణమయిన అనేక పరిశ్రమలలో, పోషించే నాధుడులేక కొన్ని నశించిపోయాయి. మరి కొన్ని యంత్రోత్పత్తి సరుకులతో పోటీ చేయలేక నీరసించి పోతున్నాయి.

1951 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం, వివిధ రకాల చేతిపనులమీద ఆధారపడి జీవించేవారి సంఖ్య సుమారు ఐదు లక్షలు. వీరిలో ఒక్క చేనేత పరిశ్రమలోనే పనిచేసే వారి సంఖ్య మూడున్నర లక్షలు.

ఆంధ్ర జిల్లాలలో 1951 సం॥లో ఉన్న వివిధ కుటీర పారిశ్రామిక కేంద్రాలు వాటిలో పనిచేస్తున్న కార్మికుల సంఖ్య ప్రక్క పేజీలోని పట్టికలో పొందుపరచబడ్డాయి.

శ్రీకాకుళంజిల్లా, ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలు మినహా, ఆంధ్రలో ఉన్న కుటీర పరిశ్రమల కేంద్రాలు 1,61,746. ఇందులో చేనేత, తత్సంబంధమైన పరిశ్రమ కేంద్రాలు 1,11,104. ఇతర పరిశ్రమల కేంద్రాలు 50,642. ఈ పరిశ్రమలలో రోజల్లా పని చేసేవారు (Whole timers) 4,58,136 మంది. రోజులో కొద్ది కాలము (Part timers) మాత్రమే పని చేసేవారు 49,517 మంది.

కొంత కాలంమాత్రమే పనిచేసేవారిని (Part timers) మినహాయించినా, శ్రీకాకుళంజిల్లా మినహా మిగతా పది జిల్లాలలోని మొత్తం జనాభాలో, కుటీర పరిశ్రమలలో పనిచేసేవారు నూటికి ముగ్గురు. పనిచేసేవారిపై 4.5 గురు గల కుటుంబం ఆధారపడుతున్నదని అంచనావేస్తే, ఈ పరిశ్రమపై జీవించే వారి సంఖ్య సుమారు 25 లక్షలు ఉంటుంది. మొత్తం రాష్ట్ర జనాభాలో (శ్రీకాకుళంజిల్లా, ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకా మినహాయించి) వీరు నూటికి సుమారు 15 మంది.

| జిల్లా | చేత పరిశ్రమ | | | | తదితరాలు | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఉత్పత్తి కేంద్రాల సంఖ్య (No. of Establishments) | పూర్తి కాలం పనిచేయువారు (Whole timers) | కొంతకాలం మాత్రమే పనిచేయువారు (Part timers) | మొత్తం | ఉత్పత్తి కేంద్రాల సంఖ్య | పూర్తి కాలం పనిచేయువారు (Whole timers) | కొంతకాలం మాత్రమే పనిచేయువారు (Part timers) | మొత్తం |
| శ్రీకాకుళం | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| విశాఖ | 8,394 | 24,549 | 1,912 | 25,461 | 6,525 | 20,561 | 1,282 | 21,843 |
| తూర్పుగోదావరి | 16,051 | 42,567 | 3,271 | 45,838 | 8,839 | 24,887 | 2,445 | 27,332 |
| పశ్చిమగోదావరి | 7,756 | 20,987 | 1,270 | 22,257 | 4,641 | 11,745 | 2,358 | 14,102 |
| కృష్ణా | 6,869 | 22,990 | 1,163 | 24,153 | 4,787 | 13,513 | 1,632 | 15,145 |
| గుంటూరు | 21,744 | 64,029 | 4,940 | 68,969 | 7,917 | 22,684 | 1,947 | 24,631 |
| కర్నూలు | 9,552 | 23,434 | 7,494 | 30,528 | 3,689 | 9,698 | 834 | 10,532 |
| కడప | 8,691 | 32,013 | 1,000 | 33,013 | 2,127 | 6,955 | 316 | 7,271 |
| అనంతపురం | 7,755 | 24,460 | 1,676 | 26,136 | 3,667 | 10,348 | 1,423 | 11,771 |
| నెల్లూరు | 13,113 | 35,719 | 3,178 | 38,897 | 2,667 | 7,563 | 1,231 | 8,794 |
| చిత్తూరు | 11,177 | 26,948 | 4,167 | 31,115 | 5,783 | 12,486 | 5,978 | 18,464 |
| మొత్తం | 1,11,104 | 3,17,696 | 30,071 | 3,46,367 | 50,642 | 1,40,440 | 19,446 | 15,9,885 |

## చేనేత పరిశ్రమ

ఇది రాష్ట్రప్రజల జీవనంలో అత్యంత ప్రధానమైన గృహ పరిశ్రమ. ఆంధ్రరాష్ట్రం మొత్తంలో ప్రభుత్వ లెఖ్ఖల ప్రకారం 3,05,920 చేనేత మగ్గాలు ఉన్నాయి. ఆంధ్ర గ్రామాలలో చేనేతమగ్గంలేని గ్రామమే అరుదు. 14-15 లక్షల జనాభా వీటిపై ఆధారపడి తమ జీవనాన్ని గడుపుతున్నారు.

మిల్లు బట్ట పోటీతోనూ, నూలు, రంగులు చౌకగా లభ్యం కాకపోవుట చేతను లక్షలాది చేనేత కార్మికులు నిరుద్యోగంలో బాధపడుతున్నారు. సంవత్సరానికి 25 కోట్ల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని అంచనా.

క్రింది పట్టికలో జిల్లావారీ చేనేత సొసైటీల సంఖ్య, మగ్గముల సంఖ్యా మున్నగు వివరాలు యివ్వబడ్డాయి:

మన రాష్ట్రంలో 20-60 నెంబరుల నూలు సామాన్యంగా నేయబడుతున్నది. నూటికి 5-6 మగ్గాలు మాత్రమే ఇంతకు మించిన నెంబర్ల సన్ననూలుతో నగిషీ గుడ్డలు నేస్తున్నాయి.

### రాష్ట్రంలోని ప్రధాన చేనేత కేంద్రాలు

విశాఖపట్నం జిల్లా: అనకాపల్లి, చీపురుపల్లి; శ్రీకాకుళం; తూర్పు గోదావరిజిల్లా: మండపేట, రాజమండ్రి, పెద్దాపురం,

| జిల్లా | చేనేత సొసైటీల సంఖ్య | చేనేతసొసైటీల ఆధీనంలోని మగ్గాల సంఖ్య | చేనేత సొసైటీలకు దూరంగా ఉన్న మగ్గాల సంఖ్య | మొత్తం మగ్గాల సంఖ్య |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 30 | 4,784 | 16,805 | 21,589 |
| విశాఖ | 34 | 6,952 | 15,430 | 22,382 |
| తూర్పుగోదావరి | 104 | 26,106 | 7,480 | 33,586 |
| పశ్చిమగోదావరి | 56 | 13,971 | 4,609 | 18,580 |
| కృష్ణ | 47 | 4,378 | 8,956 | 13,334 |
| గుంటూరు | 113 | 17,603 | 30,404 | 48,007 |
| కర్నూలు | 56 | 5,781 | 9,195 | 14,976 |
| కడప | 51 | 5,480 | 28,752 | 34,232 |
| అనంతపురం | 13 | 2,035 | 18,724 | 20,759 |
| నెల్లూరు | 60 | 4,255 | 17,967 | 22,222 |
| చిత్తూరు | 53 | 13,998 | 15,750 | 29,757 |
| ఆదోని, ఆలూరు, రాయదుర్గం తా॥ | 9 | 2,975 | 23,521 | 26,496 |
| మొత్తం | 626 | 1,08,318 | 1,97,602 | 3,05,920 |

ఉప్పాడ, జగ్గంపేట; పశ్చిమ గోదావరి జిల్లా: పాలకొల్లు, భీమవరం; కృష్ణాజిల్లా: నందిగామ, విజయవాడ, పెడన, బందరు; గుంటూరు జిల్లా: చీరాల, వేటపాలెం, మంగళగిరి, పేటేరు, ఫిరంగిపురం; బళ్ళారి జిల్లా: ఆదోని, రాయదుర్గం, ఎమ్మిగనూరు; కర్నూలు జిల్లా: కోడుమూరు, కర్నూలు, పత్తికొండ, నంద్యాల; కడప జిల్లా: జమ్మలమడుగు, పుల్లంపేట, ప్రొద్దుటూరు, మాధవరం; నెల్లూరుజిల్లా: బుచ్చిరెడ్డిపాలెం, ఎల్లాయపాలెం వెంకటగిరి; అనంతపురంజిల్లా ఉరవకొండ, తాడిపత్రి, ధర్మవరం పెనుగొండ, మడకశిర; చిత్తూరుజిల్లా: గ్రేమ్సుపేట, కాళహస్తి, మదనపల్లి, తిరుపతి, నగరి, నారాయణవరం మొదలగునవి.

చీరలు, ధోవతులు, చొక్కాగుడ్డలు, తుండుగుడ్డలు ముఖ్యంగా నేయబడుతున్నాయి.

## నూలు వడకుట

నూలు వడకట తీరిక కాలంలో చిన్న రైతులు, వ్యవసాయ కూలీలు పనిచేసే పరిశ్రమ. పనిచేసేవారు దాదాపు అంతా స్త్రీలే.

ఈ పరిశ్రమ ముఖ్యంగా గుంటూరు, నెల్లూరు, కృష్ణా, కర్నూలు జిల్లాలలో ఉన్నది.

8-40 నంబర్ల వరకూ నూలు తీయబడుతున్నది. విశాఖజిల్లా కొండూరులోను, శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళంలోను నగిషీ నూలు తీయబడుతున్నది.

దాదాపు నశించిపోయిన యీ పరిశ్రమ జాతీయ ఉద్యమ అభివృద్ధితో (విదేశ వస్తు బహిష్కరణ) మళ్ళీ ప్రాణం పోసుకున్నది. ఖాదీ సంఘాలు పెట్టబడ్డాయి. తర్వాత వచ్చిన కాంగ్రెసు మంత్రివర్గాలు వీటికి ధనసహాయం కొద్దో గొప్పో చేస్తూవచ్చాయి.

దీనికి దేశీయ మార్కెట్టే శరణ్యం. మిల్లు నూలుతో పోటీకి తట్టుకోలేక అభివృద్ధి చెందలేదు. త్వరితగతిని ఈ పరిశ్రమ క్షీణించి పోతున్నది.

## అద్దకపు పరిశ్రమ

చేనేత పరిశ్రమతో పుట్టి అద్దకపు పరిశ్రమ కూడా అభివృద్ధి చెందుతూ వచ్చింది. రసాయన రంగులు రాక పూర్వం, పరిశ్రమకు కావలసిన రంగులు రావటానికి, వివిధ దేశవాళీ రంగులను నిర్ణీతపాళ్ళలో కలపటంలో ప్రత్యేక నిపుణత కావలసి ఉండేది. అందుచేత ఇది కొన్ని కులాల వారికి వారసత్వ వృత్తిగా ఉంటూ వచ్చింది. రసాయన రంగులు వచ్చిన తర్వాత, ఈ అద్దకంపని చాల సులువు అయిపోయింది. పరిశ్రమ అభివృద్ధిస్థాయిని బట్టి అనేకమంది ఈ వృత్తిని అవలంబించ ప్రారంభించారు.

అద్దకం రెండు విధాలు: ఒకటి చెక్క అచ్చులతో అద్దటం; రెండవది, కుంచెతో రంగు వెయ్యటం, లేక కలాలతో రంగులు వెయ్యటం. దీనినే కలంకారీ అద్దకం అంటారు.

ఈ చెక్క అచ్చు అద్దకం పరిశ్రమ ప్రధానంగా కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఉన్నది.

మదరాసు చేనేత సహకార సంఘం వారిచేత ఆంధ్రలో నిర్వహించబడుతున్న రెండు అద్దకపు ఫాక్టరీలలో ఒకటి చీరాలలోను, రెండవది రాజమండ్రిలోను ఉన్నది. ఇది చేనేత సహకార సంఘలలో పనిచేసే కార్మికులకు రంగునూలు సప్లయి చేస్తున్నది.

ఒకప్పుడు 'కలంకారీ అద్దకం' ప్రధానంగా కృష్ణాజిల్లాలోని మచిలీపట్నంలో ఉండేది. ఇప్పుడు ఇది ఒక పరిశ్రమగా మాత్రం లేదు. కొన్ని కుటుంబాలవారు మాత్రమే ఈ వృత్తితో పొట్ట పోసుకుంటున్నారు.

## లేసు అల్లిక

పశ్చిమగోదావరిజిల్లా పాలకొల్లు, నర్సాపూరు తాలూకాలలోను; తూర్పు గోదావరిజిల్లా ముమ్మిడివరంలోను; కృష్ణాజిల్లాలో కొన్ని ప్రాంతాలలోను ఈ పరిశ్రమ ఉన్నది. ఒక్క గోదావరి జిల్లాలలోనే ఈ పరిశ్రమలో సుమారు రెండువేలమంది పనిచేస్తున్నారు. పని చేసేవా రందరూ స్త్రీలే.

కొందరు వ్యాపారస్థులు "డైమండ్" దారాన్ని కొని లేసు అల్లిస్తున్నారు. దీనిలో ముఖ్యంగా టేబిల్ క్లాత్ అంచులు, కిటికీల తెరలు, ఇత్యాదులు తయారు చేయబడుతున్నవి. ఇచ్చట తయారయిన సరుకు అంతా అమెరికా, ఇంగ్లండు, ఆస్ట్రేలియా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నది.

ప్రస్తుతం అల్లిక వస్తువులకు, దేశీయ మార్కెట్టులో డిమాండు అధికమవుతున్నది.

## పట్టు పరిశ్రమ

ఒకప్పుడు ఆంధ్రదేశం ఈ పరిశ్రమకు ప్రసిద్ధి చెందినది. కాని, నేడు పట్టు పరిశ్రమ ఒకటి రెండు కేంద్రాలలో తప్ప ఒక పరిశ్రమగా మాత్రం లేదు.

పశ్చిమగోదావరిజిల్లా నర్సాపూరు, పాలకొల్లు తాలూకాలలో ఈ పరిశ్రమ ఒకప్పుడు చాల ఉచ్ఛదశలో ఉన్నదట. నేడు అచ్చట ఈ పరిశ్రమ పూర్తిగా అంతరించిపోయింది.

కృష్ణాజిల్లా జగ్గయ్యపేట, షేర్ మహమ్మదు పేటలలో ప్రస్తుతం నామమాత్రంగా వున్న పరిశ్రమ, ఆదరించే నాథుడులేక అంతరించే స్థితికి వచ్చింది.

[illegible]లోను, తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి, పెద్దాపురంలలో మాత్రం ఈ పరిశ్రమ వున్నది. ఇచ్చట ఉత్పత్తి అంతా దేశీయ మార్కెట్టులోనే అమ్మబడుతున్నది. ఇయ్యమంది కార్మికులు పనిచేసే పెద్దాపురం పట్టు ఫాక్టరీలో తయారైనసరుకు అమ్మకంగాక నిల్వ వుండిపోయిన కారణంగా, ప్రస్తుతం

(సెప్టెంబరు, 53) మూసివేయ బడినది. ప్రభుత్వం శ్రద్ధ వహిస్తే ఈ పరిశ్రమను అభివృద్ధిచేయడానికి ఎంతో అవకాశం వున్నది.

## ఉన్ని పరిశ్రమ

ఉన్నితో కంబళ్ళు, తివాసీలు నేయబడుతున్నాయి.

కంబళ్ళు ముఖ్యంగా అనంతపురం, బళ్ళారి, కర్నూలు, కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలలో నేయబడుతున్నాయి. పశ్చిమ గోదావరిలోని తాడేపల్లిగూడెం, బళ్ళారిజిల్లాలోని హర్పనహళ్లి, రాయదుర్గం, ఇసకపల్లి కొన్ని ముఖ్య కేంద్రాలు.

దీనికి కావలసిన ఉన్నిని ఆయా ప్రాంతాలలోని గొర్రెలకాపరుల దగ్గరే కొంటారు. ఒక్కొక్క గొర్రెనుండి ప్రతిసారి సుమారు 8-12 ఔన్సులు, సంవత్సరానికి సుమారు 4-6 పౌనులు వున్ని తీయబడుతున్నట్లు అంచనా వేయబడింది.

కంబళ్ళనేత చాల పురాతన పద్ధతులలో జరుగుతున్నది. ఇది మొరటుగా వుండుటవలన, ఇతరదేశాలలో వీటికి మార్కెట్టు లేదు.

ఇందులో రెండవది, తివాసీల నేత. ఇది ముఖ్యంగా పశ్చిమగోదావరిజిల్లాలోని ఏలూరు, తాడేపల్లిగూడెం ప్రాంతపు గ్రామాలలోను, కృష్ణాజిల్లాలోని మచిలీపట్నంలోను నేయబడుతున్నది. ఈ పరిశ్రమ ఒక నిర్మాణపద్ధతిలో నడుపబడుతున్నది.

వీటి నేతకు కావలసిన ముడిసరుకు కొంతభాగం స్థానికంగా కొనబడుచున్నది. కాన్పూరు, అంబూరులనుండి కూడ మేలు రకమయిన ఉన్ని దిగుమతిచేయబడుతున్నది.

ఇవి రకరకాల డిజైనులలో తయారు చేయబడుతున్నాయి. మొగల్-పర్షియన్ డిజైనులనుండి, 20 వ శతాబ్దపు పాశ్చాత్యుల అభిరుచులకు నచ్చెడి డిజైనులవరకు తయారు చేయబడుతున్నాయి.

ఇవి, చాలభాగం అమెరికా, ఆస్ట్రేలియా దేశాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులో వున్న కో-ఆపరేటివ్ సొసైటీ, ఒక మదరాసు కంపెనీద్వారా విదేశీ ఆర్డరు బుక్ చేసి, తివాసీలు నేసి సప్లయి చేస్తున్నది.

ఈ పరిశ్రమ ఒక్క పశ్చిమగోదావరి జిల్లాలోనే సుమారు వెయ్యిమందికి జీవనోపాధి కల్పిస్తున్నది. ఈ జిల్లాలో సుమారు 400 మగ్గాలు, కృష్ణాజిల్లాలో 100 మగ్గాలు వున్నట్లు మదరాసు ప్రభుత్వ కార్యదర్శి యస్. వై. కృష్ణస్వామి అంచనావేశారు.

## పీచు పరిశ్రమ

ఆంధ్రదేశంలో కొబ్బరి పీచు, తాటి పీచు పరిశ్రమలు వున్నాయి.

కొబ్బరిపీచు పరిశ్రమ తూర్పుగోదావరి, విశాఖజిల్లాలలో వున్నది.

ఇప్పటతీయబడినపీచు దాదాపుఅంతా రాష్ట్రమార్కెట్టులోనే అమ్మబడుతున్నది. ఈపీచుతో వ్యవసాయానికి, ఇతర గృహపరికరాలకు వుపయోగపడే తాళ్ళు పేస్తారు.

చెప్పదగిన పీచుపరిశ్రమ తాటిపీచు పరిశ్రమ. తాటిపీచు పశ్చిమగోదావరి, విశాఖ జిల్లాలలో పెద్దయెత్తున తీయబడుతున్నది. తూర్పుగోదావరిజిల్లాలో కాకినాడ, పెద్దాపురం తాలూకాల్లో కొద్దిగా తీయబడుతున్నది. ఈ పీచును శుభ్రపరచి, చిక్కుతీసి, రంగువేయటం కుటీరపరిశ్రమగా కాకినాడ, ఎలమంచిలి, అనకాపల్లి పట్నాలలో వున్నది. ఈ విధంగా శుభ్రపరచిన పీచులో చాలభాగం విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది. ఎగుమతి అయ్యే పీచు అంతా కాకినాడ రేవునుండి పోతున్నది.

ఈ పీచుతో ఎట్టి వస్తునిర్మాణంగాని ఇచ్చట జరగటంలేదు.

## చేతి కాగితము
## (Hand made Paper)

చేతి కాగితపరిశ్రమ మొగలు చక్రవర్తుల కాలంనుండి 19 వ శతాబ్దంవరకూ చాల వ్యాప్తిలో వుండేది. చైనావారి నుండి కాగితము చేయుటను నేర్చుకొన్న మొగలు యాత్రికులు దీనిని భారతదేశంలో ప్రవేశపెట్టారు.

ఈ పరిశ్రమ సంస్థానాలలో ఒకప్పుడు చాలా అభివృద్ధి దశలో వుండేది. ఇచ్చట గరుకు కాగితం (Rough Paper) చేయబడుతూ ఉండేది. బొంబాయినుండి మిల్లు మీద తయారైయిన కాగితం దిగుమతి అయ్యేవరకూ ఈ పరిశ్రమ అభివృద్ధి మార్గాన్నే వుండేది. మిల్లు కాగితంతో పోటీచేయలేక క్రమంగా నిరసించిపోయి, సుమారు 35 సంవత్సరాల క్రితం అసలు నామరూపాలు లేకుండానే పోయింది.

తర్వాత అఖిలభారత గ్రామీణ పరిశ్రమల సంఘం ఈ పరిశ్రమను పునరుద్ధరించే ఉద్దేశ్యముతో 1938 లో కొందరికి వార్ధాలో తర్ఫీదు యిచ్చింది. పారిశ్రామికాభిమానులు కొందరు వీరి సహాయంతో రాజమండ్రిలో ఈ పరిశ్రమను ప్రారంభించారు. ప్రభుత్వం 1940_41 సంవత్సరంలో బళ్ళారిజిల్లా ఆదోని, అనంతపురం జిల్లా కృష్టిపాడు, చిత్తూరు జిల్లా వెంకటపల్లిలోని విద్యాలయాలలో దీనిని (చేతికాగితం చేయటాన్ని) ఒకపాఠ్యభాగముగా ప్రవేశపెట్టారు.

విజయవాడ, కర్నూలు జిల్లా గాజులపల్లి, కడపజిల్లాలోని [illegible]గ్గి-ఈప్రదేశాలలో కాగిత ఉత్పత్తి కేంద్రాలను తెరిచారు. ప్రస్తుతం విజయనగరం, శ్రీకాకుళం, నందిగామ, చెన్నారామపాలెం, కడప, గుంటూరులలోని చేతికాగిత కో_ఆపరేటివ్ సొసైటీలలో చేతి కాగితాన్ని తయారు చేస్తున్నారు. కాగితం చేయుటకు వరిగడ్డి, జనుము, చిత్తుకాగితం, పాతగోనెసంచులు, గుడ్డలు ఉపయోగించబడుచున్నవి.

ఈకాగితం మిల్లుకాగితంతో పోటీచేయలేకపోవుటచేత అభివృద్ధి చెందటంలేదు.

## లోహ పరిశ్రమ

కంచు, యిత్తడి, రాగి, ప్రధానంగా మన లోహపరిశ్రమలో ఉపయోగించబడుతున్న లోహాలు.

వీటితో ప్రధానంగా పాత్రలు చెంబులు, కంచాలు, గ్లాసులు, తదితర పాత్రలు చేయబడుతున్నాయి.

ఇది ఒక గృహపరిశ్రమగా రాదాపు రాష్ట్రమంతటా వున్నది. కొన్ని పట్టణాలలో చిన్నచిన్న కార్ఖానాల స్థాయిలో కూడా వున్నది.

ఇట్టి కేంద్రాలలో ప్రధానమైనవి: చిత్తూరు జిల్లాలోని కాళహస్తి, సత్రవద; కడపజిల్లాలోని నోనిపెంట; తూర్పుగోదావరిజిల్లాలోని రాజమండ్రి, ధవళేశ్వరం, సామర్లకోట, పెద్దాపురం; పశ్చిమ గోదావరి జిల్లాలోని పెనుగొండ, పాలకొల్లు, కృష్ణాజిల్లాలోని రమణక్కపేట, మైలవరం విజయవాడ; విశాఖజిల్లాలోని పార్వతీపురం, బొబ్బిలి, అనకాపల్లి మొదలగునవి.

ఒక్క చిత్తూరుజిల్లా కాళహస్తిలో మాత్రం ఫాక్టరీ స్థాయిలో, యంత్ర సహాయంతో పరిశ్రమ కొనసాగించబడుతున్నది.

## వడ్రంగము (కొయ్య చెక్కడము)

గుంటూరు, కృష్ణాజిల్లాలలో కొయ్య చెక్కడపు పనులు విస్తారంగా జరుగుతున్నాయి. రాజమండ్రి, గుంటూరు, విజయవాడ వంటి పట్టణాలలో కుర్చీలు, బల్లలు, (Furniture) ఇత్యాదులు తయారుచేసే కార్ఖానాలు వున్నాయి.

నర్సారావుపేట (గుంటూరు జిల్లా)లో చేసే (Camp furniture) మడత మంచాలు, మడత కుర్చీలు చాల ప్రసిద్ధి చెందాయి. కిటికీ మదరాసు, హైదరాబాదు, రాయలసీమ జిల్లాలలో మంచి డిమాండు వున్నది.

ఇది కాక ప్రతి గ్రామంలోను, వ్యవసాయపు పనిముట్లు చేసే చెక్కడపు పనులు జరుగుతున్నాయి. ఇది కొన్ని కులాలవారివారసత్వవృత్తిగా అనాదినుండి ఉంటూ వస్తున్నది. వీరు వస్తువులను అమ్మకంకొరకని ముందుగా చేయక, తమ ఆసాముల అవసరమును బట్టి, వారు ఖర్చులు ఇస్తే పనిముట్లు తయారుచేస్తున్నారు. ఈవిధంగా కుటీరపరిశ్రమగా, వడ్రంగం ప్రతి గ్రామంలోను ఉన్నది.

ఎడ్లబండ్లు, టాంగాలు, గుర్రపుబండ్లు చేయడంలో అనంతపురంజిల్లా సర్వత్ర పేరుపొందినది.

## దువ్వెనల పరిశ్రమ

చిత్తూరుజిల్లా కాళహస్తి తాలూకాలోని కొత్తపేట, వాయలపాడుతాలూకాలోని శేషాచలంలో దువ్వెనల తయారీ జరుగుచున్నది. సంవత్సరంలో ఇప్పుడు 10 వేల రూపాయల విలువగలిగిన దువ్వెనలు తయారుచేయుచున్నట్లు అంచనా వేయబడుతున్నది.

## పేము అల్లకము

నెల్లూరు జిల్లా ఇందుకూరు పేటలోను, తూర్పుగోదావరిజిల్లా రాజమండ్రిలోను యీ పరిశ్రమ పెద్ద ఎత్తున కొనసాగించబడుతున్నది. గుంటూరు, తూర్పుగోదావరి, విశాఖపట్నం జిల్లాలలో కూడ కుటీర పరిశ్రమగా ఉన్నది.

దీనికి కావలసిన పేము నెల్లూరుజిల్లా ఇందుకూరుపేట నుండి; నర్సీపట్నం ఏజన్సీలోని పెద్దవలస, పర్లాకిమిడి ప్రాంతం నుండి; గుంటూరుజిల్లా చీరాల ప్రాంతంనుండి సప్లయి చేయబడుతున్నది.

ఈ పేము 'మలక్కా' పేమంత మెత్తదనం, మెరుగు కలిగివుండదు. అందుచేత, నగిషీ పనులకు 'మలక్కా' పేము దిగుమతి చేయబడుతున్నది.

పేముతో కుర్చీలు, ఊయ్యాలలు, బుట్టలు మున్నగునవి చేయబడుతున్నవి. ఇది స్థానిక అవసరాలకే వినియోగపడుతున్నాయి.

## రాతిపాత్రలు - బొమ్మలు

ఆంధ్రదేశంలో, 'స్టీటైట్' ఖనిజానికి సంబంధించిన సబ్బురాయి (Sope stone) తో రాతిచిప్పలవంటి పాత్రలు, విగ్రహాలు, ఆట వస్తువులు, సిరాబుడ్లు, వక్కపుకాయలు చేయబడుతున్నాయి.

ఈ పరిశ్రమ నెల్లూరుజిల్లా రాపూరు తాలూకాలోని సైదాపేట, గుంటూరు జిల్లా వినుకొండ తాలూకాలోని కొప్పుకొండ, పల్నాడు తాలూకాలోని దుర్గి గ్రామాలలో వున్నది.

## గాజుల పరిశ్రమ

పూర్వం ఈ పరిశ్రమ అనంతపురం, కర్నూలు, బళ్ళారి, నెల్లూరు, చిత్తూరు, కృష్ణా, విశాఖపట్నం జిల్లాలలో ఉచ్ఛదశలో ఉండేది. ఆ కాలంలో అనంతపురంజిల్లా గుత్తూరు (దానినే గాజుల గుత్తూరు అనికూడా పిలుస్తారు) గ్రామంలోనే 700మంది ఈపరిశ్రమలో పనిచేసేవారట. కాని యిప్పుడు ఒక్క కుటుంబం వారు మాత్రమే ఈ పని చేస్తున్నారు.

విశాఖపట్నం, చిత్తూరు జిల్లాలలో ఈ పరిశ్రమ కుదుమకపోకుండా అలాగే వుంది. విశాఖపట్నంలో సుమారు 40 కుటుంబాల వారు, సంవత్సరానికి పదివేల రూపాయల ఖరీదుచేసే గాజులు తయారుచేస్తున్నట్లు అంచనా వేయబడింది.

చిత్తూరు జిల్లాలో కాళహస్తి, పాపానాయుడుపేట, మద్దిరేవు, పిల్లమూడు ఈ పరిశ్రమకు ప్రధాన కేంద్రాలు. ఇచ్చట సాదా గాజులు చేయబడుతున్నాయి. విశాఖ జిల్లాలో తయారయిన గాజులు ఆజిల్లాలోనే అమ్మబడుతూంటే, చిత్తూరు జిల్లాలో చేయబడిన గాజులు ఇతర జిల్లాలకు కూడా ఎగుమతి చేయబడుతున్నాయి.

ఈ పరిశ్రమకు కావలసిన ముడి పదార్థం (Black glass) విశాఖ జిల్లా, కొంత చిత్తూరుజిల్లా కాళహస్తినుండి, మరి కొంత యితర రాష్ట్రాల నుండి తెప్పించుకుంటున్నది. చిత్తూరు జిల్లా మాత్రం ఆ జిల్లాలో దొరికే ముడిపదార్థాన్నే వాడుకొంటున్నది.

నగిషీ గాజుల దిగుమతి మూలంగా ఈ మన గాజుల పరిశ్రమ అభివృద్ధి కాకపోగా, దినదినం క్షీణించిపోతున్నది. జనాభాలో అత్యధిక సంఖ్యాకులయిన పేద తరగతి ప్రజలు, హెచ్చుధరలిచ్చి ఆ నగిషీ

గాజులు కొనలేరు కనుక ఈ పరిశ్రమ సమసిపోలేదు.

గాజు (glass) పరిశ్రమకు అవసరమయిన 'చౌడు మన్ను' అనంతపురం, కర్నూలు జిల్లాల్లో విపరీతంగా దొరుకుతున్నా, మనకు ఒక్క గాజు ఫ్యాక్టరీ కూడా లేదు. గాజు పరిశ్రమ అభివృద్ధి చెందితే, గాజుల తయారీకి కావలసిన గాజును సప్లయిచేయ నవకాశం ఉంటుంది. అప్పుడు దిగుమతి అయిన 'నగిషీ' గాజులతో పోటీచేసి నిల్వగలిగిన స్థితి, మన గాజులపరిశ్రమకు చేకూరుతుంది.

## మూసల పరిశ్రమ

లోహాలను కరుగుటకు మూస లవసరం. మనకు కావలసిన మూసలలో చాలభాగం విదేశాలనుండే దిగుమతి చేసుకుంటున్నాం.

తూర్పుగోదావరి జిల్లాలోని రాజమండ్రి, నవకేశ్వరం, అంగర, గొల్లమంగాడ, కాకినాడ, తాపేశ్వరం పట్నాలలో మూసలు చేయబడుతున్నాయి. ఆంధ్రంలో మరెచ్చటా ఈ పరిశ్రమ లేదు.

వేడికి తట్టుకోగలగడంలో, విదేశీ మూసలకు ఇవి ఏవిధంగాను తీసిపోవు. కాని విదేశీ మూసలు వాడగలిగినన్నిసార్లు వీటిని వాడటానికి వీలులేదు. మూసలు చేయటంలో ఇంకా కొంత అభివృద్ధి అవసరం.

మూసలు చేయుటకు కావలసిన 'గ్రాఫైటు' పశ్చిమగోదావరిజిల్లాలోని జంగారెడ్డిగూడెంలో (ఇది రాజమండ్రికి 50 మైళ్ళు) దొరుకుతున్నది. ఈ ప్రాంతంలో యీ ఖనిజపు గనులు ఇంకా వున్నాయి.

ఈ పరిశ్రమను అభివృద్ధి చేసేందుకు కావలసిన అవకాశాలన్నీ మన కున్నాయి.

## ఆటవస్తువులు

ఆంధ్రదేశంలో ఆటవస్తువులు మట్టితోను, లేలిక చెక్కతోను తయారు చేయబడుతున్నాయి. ప్రశస్తమయిన ఆటవస్తువులు, బొమ్మలు కృష్ణాజిల్లాలోని కొండపల్లి; చిత్తూరుజిల్లాలోని తిరువానాము; విశాఖజిల్లాలోని ఏటికొప్పాక; కడపజిల్లా ఒట్టిగుంట దగ్గరలోనున్న లక్ష్మిగారి పల్లిలో చేయబడుతున్నాయి.

కొండపల్లి బొమ్మలు చేయుటకు "తెల్లపొనికి" కర్ర ఉపయోగించబడుతున్నది. ఏటికొప్పాకలో "అంకుడు" కర్ర ఉపయోగించబడుతున్నది.

పిల్లలు ఎప్పుడూ బొమ్మలు కొంటూ వుంటారు కనుక వీటికి సంవత్సరం పొడుగునా అమ్మకాలు వుంటాయి. తిరునాళ్ళలలో, పండుగ రోజులలో వీటి ఖర్చు విపరీతం. దేశ విఖ్యాతిగాంచిన కొండపల్లి బొమ్మలు బెంగాలు, పంజాబు, మధ్యప్రదేశ్ లలోకూడా విపరీతంగా అమ్మబడుతాయి.

## కొమ్ము చెక్కడములు

ఈ పరిశ్రమ ఒక్క విశాఖజిల్లాలో మాత్రమే ఉన్నది.

ఇచ్చట ఫోటో ఫ్రేములు, నగిషీ చెక్కడములు, వివిధ దేవతా ప్రతిమలు, పక్షులు, జంతువుల ప్రతిరూపాలు, చెస్ బోర్డులు, పుస్తకాల కేసులు, వాచ్ కేసులు, సిగరెట్ కేసులు, ఇత్యాదులు చేయబడుతున్నాయి.

ఇందుకు ఉపయోగించే ముడిపదార్థం—గొర్లకొమ్ము, తాబేలుబొచ్చెలు, గంధకపు చెక్క, దుప్పికొమ్ములు.

ఈ చెక్కడముల ధరలు అధికమగుట చేత ఖర్చు చాల తక్కువ. ఆదరించే దిక్కు క్రమంగా తగ్గిపోతున్నది కనుక పరిశ్రమే అంతరించే ప్రమాదం లేక పోలేదు.

## బీడీలు - చుట్టలు

ఈ పరిశ్రమ ముఖ్యంగా కర్నూలు, చిత్తూరు, బళ్ళారి జిల్లాలలోను; పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరులోను వున్నది.

దీనికి కావలసిన పొగాకు ఆయా ప్రాంతాలలో పండించబడుతున్నది.

ఈ పరిశ్రమ సుమారు 20-25 వేల మందికి పని కల్పిస్తున్నది.

బీడీలు-చుట్టలు పూర్తిగా చేతితోనే (ఎట్టి యంత్రసాయం లేకనే) చేయబడు తున్నది. ఈపరిశ్రమలో పనిచేసే కార్మికులలో నూటికి 38-40 మంది 6-16 సంవత్సరాల పసివారు. ఏ ఇతర పరిశ్రమలోను ఇంతమంది (ఈ దామాషాలో) పిల్లలు పని చేయటం జరిగటంలేదు.

పొగాకు పండించటంలో ప్రథమ స్థానాన్ని వహిస్తున్న ఆంధ్రదేశంలో ఉన్న పొగాకు పరిశ్రమ ఇది!.

## పలకల పరిశ్రమ

ఇది కర్నూలుజిల్లా కంభం, మార్కాపూరులలో సాగించబడుతున్నది. పలకలకు వుపయోగించే పదార్థమే బలపాలు చేయటానికికూడా వుపయోగిస్తారు కనుక, పలకలు చెయ్యటంతోపాటు బలపాలు చేయటంకూడా జరుగుతున్నది. పైగా, ఇచ్చట గోరిక రాయి బలపాలు చేయుటకు శ్రేష్టమయినది.

ప్రతి సంవత్సరం సుమారు లక్షరూపాయల విలువచేయు బలపాలు యిచ్చట తయారు చెయ్యబడుతున్నాయి.

## తోళ్ళ పరిశ్రమ

ఆంధ్రలో తోళ్ళు విరివిగాలభిస్తున్నా యీ పరిశ్రమ ఇంకా కుటీర పరిశ్రమ స్థాయిలోనే ఉంది. రాష్ట్రంలో సాలుకు ఆవుచర్మాలు 13 లక్షలు, గేదె చర్మాలు 11లక్షలు, మేకచర్మాలు 11లక్షలు, గొర్రె చర్మాలు 25 లక్షలు లభ్యమవుతున్నాయి.

ఇవన్నీ మదరాసు రాష్ట్రానికి, విదేశాలకు ఎగుమతి అవుతున్నాయి.

చర్మాలను ఊనే తోళ్ళ కార్ఖానాలు (Tanneries) ప్రస్తుతం రాష్ట్రంలో 40 ఉన్నట్లు అంచనా వేయబడుతున్నది. విజయనగరం, ఏలూరు, విజయవాడ, గుంటూరు, ఆదోని, కడప, రాజమండ్రి ప్రధాన కేంద్రాలు.

రాష్ట్రంలోని వివిధ కేంద్రాలలో సుమారు 4,500 మంది పనిచేస్తున్నట్లు అంచనా వేయబడుతున్నది.

## ఉప్పు పరిశ్రమ

ఇది కుటీరపరిశ్రమ కాకపోయినా గ్రామీణ పరిశ్రమగానే వున్నది. శ్రీకాకుళం జిల్లాలోని నౌపడానుండి, నెల్లూరు జిల్లాలోని పాకాల వరకు ఉన్న సముద్ర తీరంలో అనేకచోట్ల ఉప్పు ఉత్పత్తి చేయబడుతున్నది. 18 ఫాక్టరీల చేత 7,332 ఎకరములలో యీ ఉత్పత్తి జరుగుతున్నది. సగటున ఎకరమునకు 31 టన్నులు ఉత్పత్తి జరుగుతున్నది. పాకాలలో మాత్రం ఎకరమునకు 72 టన్నులవరకూ ఉప్పు తయారుచేయబడ్డది.

నేడు ఆంధ్రలో సగటున సంవత్సరమునకు 225 వేల టన్నుల ఉప్పు తయారుచేయబడుతున్నది.

శ్రీకాకుళం జిల్లాలోని నౌపడా, పూండి, కళింగపట్నం; నెల్లూరు జిల్లాలోని తడ, కృష్ణాపట్నం, ఇస్కపల్లి, పాకాల ముదలైనవి ఆంధ్రలోని ప్రధాన ఉప్పు ఉత్పత్తి కేంద్రాలు.

ఉప్పు ఆంధ్రనుండి ఒరిస్సా, ఉత్తర ప్రదేశాలకు కూడ ఎగుమతి చేయబడుతున్నది.



# విద్యుచ్ఛక్తి

విద్యుదుత్పత్తిలో ఆంధ్రరాష్ట్రం ఎంతో వెనుకబడిఉంది. కృష్ణా, గోదావరీ, తుంగభద్రా నదులు రాష్ట్రంలో ప్రవహిస్తున్నప్పటికీ, ఒక్క జల విద్యుదుత్పత్తి కేంద్రంకూడా (Hydro-electric system) ఆంధ్రలో నిర్మించబడలేదు. ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న మచ్ఖండ్, తుంగభద్ర స్కీములు (ఇప్పటికి అధికార్లు చెబుతున్న దాన్నిబట్టి) 1955-57 సంవత్సరాలలోగాని పవరును సప్లయి చేయలేవు.

ఇంతవరకూ ఆంధ్ర, థర్మలు పవరును మాత్రమే ఉత్పత్తి చేస్తున్నది. ఉత్పత్తి చేయబడుతున్న పవరు (1952-53లో) 769.20 యూనిట్లు.

రాష్ట్రంలో 1952-53వ సంవత్సరంలో 15 థర్మలు పవరు స్టేషన్లు ఉన్నాయి. వీటిలో మూడు స్టీములోను, 13 డీజిల్ ఇంజన్లలోను నడపబడుతున్నాయి.

ఈ థర్మలు స్టేషన్లను పరిపాలనా సౌలభ్యంకోసం, ప్రభుత్వం "ఆంధ్రా పవరుసిస్టం", "రాయలసీమ పవరుసిస్టం" అని రెండు గ్రూపులక్రింద విభజించింది.

ఆంధ్ర పవరు సిస్టం క్రింద ఉన్న థర్మలుస్టేషన్లు; విశాఖపట్నం, విజయవాడ (ఈ రెండూ స్టీమ్ థర్మల్ స్టేషన్లు), కాకినాడ, నరసరావుపేట, శ్రీకాకుళం, రాజమండ్రి, ఒంగోలు.

రాయలసీమ పవరు సిస్టం క్రింద ఉన్న స్టేషన్లు : నెల్లూరు (స్టీమ్ థర్మల్ స్టేషను), కర్నూలు, అనంతపురం, ప్రొద్దుటూరు, కడప నంద్యాల, తాడిపత్రి, తిరుపతి, కాళహస్తి.

మైసూరు, మదరాసుల నుండి కొన్న పవరును పంచేందుకు అనంతపురం జిల్లా హిందూపురం, చిత్తూరు జిల్లా మదనపల్లిలలో రెండు కేంద్రాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఇవికూడా రాయలసీమ పవరు సిస్టం క్రిందనే పనిచేస్తున్నాయి.

1951-52వ సంవత్సరంలో ఈ రెండు సిస్టంలక్రింద ఉన్న విద్యుత్ ప్రవాహపు లైనుల పొడవు ఈ విధంగా ఉన్నది :

| సిస్టం పేరు | హైటెన్షన్ లైనులలో మైళ్ళలో | లో టెన్షను లైనులు మైళ్ళలో | మొత్తం పొడవు మైళ్ళలో |
|---|---|---|---|
| ఆంధ్రా పవరు సిస్టం | 836 | 454 | 1,290 |
| రాయలసీమ పవరు సిస్టం | 318 | 333 | 651 |
| మొత్తం | 1,154 | 787 | 1,941 |

1952-53వ సంవత్సరంలో ఈ స్టేషన్లు ఉత్పత్తిచేసిన విద్యుత్. ఇతర రాష్ట్రాల నుండి కొన్న విద్యుత్ వివరాలు :

| స్టేషను పేరు | ఉత్పత్తిశక్తి (కిలోవాట్లు) | లోడ్ (కిలోవాట్లు) | ఉత్పత్తి (లక్షల యూనిట్లలో) |
|---|---|---|---|
| థర్మల్ స్టేషన్లు (స్టీమ్) | | | |
| 1. విశాఖపట్నం | 7,950 | 4,500 | 1,92.16 |
| 2. విజయవాడ | 13,000 | 9,487 | 4,77.17 |
| 3. నెల్లూరు | 5,000 | 1,225 | 47.36 |
| డీసిల్ స్టేషన్లు | | | |
| 1. కాకినాడ | 1,882 | 910 | 6.12 |
| 2. రాజమండ్రి | 802 | 620 | 5.39 |
| 3. శ్రీకాకుళం | 250 | 124 | 2.36 |
| 4. నరసన్నపేట | 20 | 22 | 0.36 |
| 5. ఒంగోలు | 170 | 136 | 2.06 |
| 6. నరసారావుపేట | 170 | 90 | 0.47 |
| 7. కర్నూలు * | 807 | 360 | 12.56 |
| 8. కడప | 885 | 270 | 8.95 |
| 9. అనంతపురం | 495 | 235 | 6.47 |
| 10. ప్రొద్దుటూరు | 170 | 124 | 3.37 |
| 11. నంద్యాల | 470 | 180 | 2.96 |
| 12. తాడేపల్లి | 470 | 75 | 1.44 |
| 13. మదనపల్లి | 580 | ... | ... |
| | 33,121 | ... | 7,69.20 |
| మైసూరువద్ద కొన్న పవరు | ... | 2,052 | 1,03.16 |
| మొత్తం | 33,121 | 2,90,410 | 8,72.36 |

* రాజధాని కర్నూలులో ఏర్పాటు చేసిన తర్వాత కర్నూలు థర్మలు స్టేషను ఉత్పత్తి పెంచబడింది. అంచనాలు 1953 వ సంవత్సరం మార్చి మాసాంతానికి ఉన్నవి కనుక యీ పెరుగుదల ఇందులో చేర్చబడలేదు.

1951-52 వ సంవత్సరంలో రాష్ట్రములో ఉత్పత్తి చేయబడుతున్న 5,60.79 లక్షల యూనిట్ల వరకు, 1952-53 వ సంవత్సరానికి 8,72.36లక్షల యూనిట్లకు పెరిగింది. ఇదిచాలక, గత కొన్ని సంవత్సరాలాగా కొంటున్నట్లే, మైసూరులోని జాగ్ జల విద్యుత్ కేంద్రంనుండి, శివసముద్రం జలవిద్యుత్ కేంద్రంనుండి 103.16 లక్షల యూనిట్ల వరకు కొనబడింది. ఆంధ్రదేశ వినిమయ నిమిత్తం, ఈ సంవత్సరంలో 8,72.36 లక్షల యూనిట్ల వరకు సప్లయి చేయబడినట్లు తెలుస్తున్నది.

రాష్ట్రంలోని అన్ని థర్మలు స్టేషన్లు కలిసి చేసే ఉత్పత్తిలో, ఒక్క విజయవాడ స్టేషనే నూటికి 62 పాళ్ళు ఉత్పత్తి చేస్తున్నది. విజయవాడ, విశాఖపట్నం, నెల్లూరు థర్మలు స్టేషన్లు మూడు కలిసి, మొత్తం ఉత్పత్తిలో నూటికి సుమారు 93 పాళ్ళు ఉత్పత్తిచేస్తున్నాయి.

## వినిమయం

మొత్తం రాష్ట్రంలో వినిమయమవుతున్న వరకులో 13.3% ఇతర రాష్ట్రాల నుండి కొనబడిందే !

1951-52 వ సంవత్సరంలో, మన రాష్ట్రంకంటె పరిశిష్ట మదరాసురాష్ట్రం పదమూడుకోట్ల వరకును (72,99,70,000 యూనిట్లు) ఉత్పత్తిచేసింది. తోటి రాష్ట్ర జనాభా మనిషి 1కి సగటున 24 యూనిట్ల వరకును ఉత్పత్తిచేస్తూంటే, ఆంధ్ర మనిషి1కి 2.7 (1951-52సం॥లో) యూనిట్లే ఉత్పత్తి చేస్తున్నది. ఈ సగటు 1952-53 కు 3.7 యూనిట్లకు మాత్రం పెరిగింది. భారతదేశంలో సగటున జనాభా మనిషి1కి 14 యూనిట్లు, తోటి మదరాసు రాష్ట్రంలో 19 యూనిట్లు వినిమయమవుతుంటే, ఆంధ్రలో 4.3 యూనిట్లు మాత్రమే వినిమయమవుతున్నది.

1951-52వ సంవత్సరంలో వినిమయమవుతున్న విద్యుత్తు ఏయే ఖాతా క్రింద ఎన్నిపాళ్ళు వాడబడుతున్నదో, మదరాసు రాష్ట్రంతో పోల్చితే మన స్థానం ఏమిటో ప్రక్క పేజీలోని పట్టిక తెలియచేస్తుంది.

పారిశ్రామికాభివృద్ధికి, అధికోత్పత్తికి పనిచేసే కార్మికులకు ఆరోగ్యకరమైన వాతావరణం ఫాక్టరీలో ఉండడానికి విద్యుత్ చాల అవసరం. కాని వినిమయమవుతున్న మొత్తంవిద్యుత్తులో, మదరాసు నూటికి 62 పాళ్ళ విద్యుత్ పరిశ్రమల నిర్వహణకు వాడుతూంటే, ఆంధ్ర 44 పాళ్ళు మాత్రమే ఇందుకు వినియోగిస్తున్నది. వ్యవసాయంలో కూడా ఎక్కువ విద్యుత్ వినియోగించబడటంలేదు. ఉదాహరణకు, మదరాసు రాష్ట్రంలో 1951-52 వ సంవత్సరంలో 60,657 కిలోవాట్ల లోడ్ గల 14,712 పంపుసెట్లు వాడబడుతూంటే ఆంధ్రలో 3,097 కిలోవాట్ల లోడ్ గల పంపుసెట్లు 831 మాత్రమే వాడబడుతున్నాయి.

విద్యుత్ సప్లయి చేయబడుతున్న గ్రామాలు కూడా చాలకొద్ది. 1951-52వ సంవత్సరంలో మదరాసు రాష్ట్రంలో 1,218 గ్రామాలకు విద్యుత్ సప్లయిచేయబడుతూంటే, ఆంధ్రలో 195 గ్రామాలకు మాత్రమే సప్లయి చేయబడుతున్నది. మొత్తం ఆంధ్రలో ఉన్న గ్రామాలలో (17 వేలు) నూటికి సగటున ఒక్క గ్రామానికి మాత్రమే విద్యుత్ సప్లయి చేయబడుతున్నది.

| వినియోగించబడే పద్ధతి | మొత్తం ఉత్పత్తిలో నూటికి ఎన్నిపాళ్ళు *ఆంధ్ర | మద్రాసు రాష్ట్రం |
|---|---|---|
| పరిశ్రమలకు | 43.54 | 62.0 |
| వ్యవసాయానికి | 10.02 | 13.5 |
| ఇండ్లకు (Domestic consumption) | 25.30 | 10.0 |
| వ్యాపారంలో | 12.20 | 7.0 |
| వీధి దీపాలు | 2.78 | 2.5 |
| ఇతరత్రా వినియోగం | 6.16 | 5.0 |
| | 100.00 | 100.0 |

ఈ విధంగా వివిధ జిల్లాలలో 1951-52వ సంవత్సరంలో విద్యుత్ సప్లయి చేయబడుతున్న గ్రామాలు :

| | | గ్రామాలు |
|---|---|---|
| శ్రీకాకుళం జిల్లా | | 14 |
| శ్రీకాకుళం తాలూకా | | 3 |
| చీపురుపల్లి | ,, | 6 |
| పాలూరు | ,, | 3 |
| బొబ్బిలి | ,, | 1 |
| పార్వతీపురం | ,, | 1 |
| విశాఖపట్నం జిల్లా | | 31 |
| విశాఖపట్నం తాలూకా | | 11 |
| అనకాపల్లి | ,, | 3 |
| వీరవల్లి | ,, | 1 |
| భీమునిపట్నం | ,, | 9 |
| విజయనగరం | ,, | 7 |

| | | గ్రామాలు |
|---|---|---|
| కృష్ణాజిల్లా | | 54 |
| నూజివీడు తాలూకా | | 11 |
| విజయవాడ | ,, | 21 |
| గన్నవరం | ,, | 20 |
| బందరు | ,, | 2 |
| గుంటూరుజిల్లా | | 18 |
| గుంటూరు తాలూకా | | 12 |
| ఒంగోలు | ,, | 1 |
| నర్సారావుపేట | ,, | 1 |
| తెనాలి | ,, | 1 |
| బాపట్ల | ,, | 3 |
| తూర్పుగోదావరి జిల్లా | | 25 |
| కాకినాడ తాలూకా | | 4 |
| పెద్దాపురం | ,, | 1 |
| పిఠాపురం | ,, | 4 |
| రామచంద్రపురం | ,, | 7 |

* ఇవి ఉజ్జాయింపుగా చేసిన అంచనాలే కనుక, అక్షరాల కూడవు. స్థూలమైన స్వరూపాన్ని మాత్రం చిత్రిస్తాయి.

| | గ్రామాలు |
|---|---|
| రాజమండ్రి తాలూకా | 8 |
| అమలాపురం ,, | 1 |
| పశ్చిమగోదావరిజిల్లా | 23 |
| ఏలూరు తాలూకా | 23 |
| నెల్లూరుజిల్లా | 3 |
| కర్నూలుజిల్లా | 2 |
| కర్నూలు తాలూకా | 2 |
| కడపజిల్లా | 4 |
| అనంతపురంజిల్లా | 1 |

| | గ్రామాలు |
|---|---|
| కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరుజిల్లాల ప్రాంతంలోని ఇతర గ్రామాలు | 18 |
| పవరు సప్లయి చేయబడుతున్న మొత్తం గ్రామాలు | 193 |

## ఆదాయ వ్యయాలు

ఈ థర్మల్ స్టేషన్ల నిర్వహణలో అవుతున్న ఖర్చు, వచ్చే ఆదాయం 1951-52 వ సంవత్సరంలో ఎలా ఉన్నదీ క్రింది పట్టిక తెలియచేస్తుంది (అంకెలు లక్షలరూపాయలు):

| థర్మల్ స్టేషను | మొత్తం పెట్టుబడి | మొత్తం ఆదాయం | ఖర్చు | నష్టము | లాభము |
|---|---|---|---|---|---|
| 1. విశాఖపట్నం | 79.28 | 13.59 | 13.59 | ... | ... |
| 2. విజయవాడ | 141.36 | 19.06 | 19.06 | ... | ... |
| 3. కాకినాడ | 19.89 | 6.22 | 6.32 | 0.10 | ... |
| 4. కర్నూలు | 4.83 | 1.98 | 1.82 | ... | 0.16 |
| 5. కడప | 8.67 | 1.77 | 1.80 | 0.03 | ... |
| 6. అనంతపురం | 5.74 | 1.00 | 1.13 | 0.13 | ... |
| 7. గూడూరు | 0.77 | 0.17 | 0.25 | 0.08 | ... |
| 8. రాజమండ్రి | 10.65 | 2.81 | 3.90 | 1.09 | ... |
| 9. నెల్లూరు | 61.88 | 3.01 | 5.76 | 2.75 | ... |
| 10. ఒంగోలు | 2.62 | 0.25 | 0.46 | 0.21 | ... |
| 11. నర్సారావుపేట | 1.96 | 0.37 | 0.65 | 0.28 | ... |
| 12. సాలూరు - | | | | | ... |
| పార్వతీపురం | 0.27 | 0.30 | 0.20 | ... | 0.10 |
| 13. శ్రీకాకుళం | 1.22 | 0.50 | 0.64 | 0.14 | ... |
| 14. ప్రొద్దుటూరు | 3.59 | 0.56 | 0.68 | 0.12 | ... |
| మైసూరువద్దకొన్న విద్యుత్ | | | | | ... |
| 1. రాయలసీమ జిల్లాలు | 80.03 | 8.54 | 6.97 | ... | 1.57 |
| 2. హిందూపురం | .3.63 | 0.68 | 0.52 | ... | 0.16 |
| | | 60.81 | 63.75 | 4.93 | 1.99 |

ఒక్క కర్నూలు, సాలూరు, పార్వతీపురం స్టేషన్లు తప్ప మిగతావన్నీ నష్టం మీదే నడుపబడుతున్నట్లు తేలుతున్నది. మైసూరువద్దనుండి కొన్న పవరు అమ్మటం వల్ల మాత్రం రు. 1,99 వేలు లాభం వస్తున్నది.

# జలవిద్యుదుత్పత్తి స్కీములు

ఆంధ్రలో జల విద్యుదుత్పత్తికి ఎన్నో అవకాశాలు ఉన్నాయి. పెద్ద నదీ ప్రాజెక్టులవద్ద ఆయా ప్రాజెక్టులనుండి వెళ్ళే కాలువలమీద జలవిద్యుదుత్పత్తి చేయవచ్చు.

జల విద్యుదుత్పత్తి స్కీములను మూడు రకాలుగా విభజించవచ్చు.

1. హై హెడ్ స్కీములు (300 అడుగులకు పైన), 2. మీడియమ్ హెడ్ స్కీములు (300-50 అడుగులమధ్య), 3. లో హెడ్ స్కీములు (50-10 అడుగుల మధ్య).

## హై హెడ్ స్కీములు

నదులు పర్వత ప్రాంతంలో ప్రవహించేటప్పుడు జలపాతాలు ఏర్పడతాయి. 300 అడుగులకు తగ్గని జలపాతాల పాయంలో విద్యుత్ ఉత్పత్తి చేస్తారు. వీటినే హై హెడ్ స్కీము లంటారు.

ఆంధ్రదేశంలో పశ్చిమకనుములంతటి ఎత్తయిన పర్వతాలు లేవు. పైగా మన నదులు మైదానప్రాంతంలో పారుతుండటమువల్ల జలపాతాలు ఏర్పడే అవకాశం లేదు. అందువల్ల ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దులో మాత్రం ఒకటి రెండు స్కీములకు అవకాశమున్నది. అంతకుమించి ఆంధ్రలో ఇట్టి స్కీములకు అవకాశం లేదు.

## మీడియం హెడ్ స్కీములు

నదులకు రిజర్వాయర్లు నిర్మించి, విద్యుదుత్పత్తికి కావలసిన ఎత్తుకు రిజర్వాయరు నీటిమట్టాన్ని పెంచుతారు. ఈ రిజర్వాయర్ల నుండి, జలపాతాలు కల్పించి (300-50 అడుగులు) విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తారు. వీటినే మీడియమ్ హెడ్ స్కీములు అంటారు. ఈ స్కీముల నిర్మాణానికి ఆంధ్రలో ఎంతో అవకాశం ఉన్నది. ఇరిగేషన్ కొరకు నిర్మించే రిజర్వాయర్లను, విద్యుదుత్పత్తి స్కీములతో జోడించి నిర్వహించకపోతే, లాభదాయకంగా నిర్వహించటం వీలుపడదని సాంకేతిక నిపుణుల అభిప్రాయం.

## లో హెడ్ స్కీములు

నదుల ప్రధానకాలువలమీద విద్యుదుత్పత్తికి 50-10 అడుగుల ఎత్తువరకూ ఉండే చిన్న జలపాతాల కల్పిస్తారు. మీడియం హెడ్ స్కీముల విద్యుత్ ఉత్పత్తిలో వచ్చే లోటుపాట్లను సర్దటమే వీటి ప్రధాన ఉపయోగము. ఉత్తర ప్రదేశ్‌లో గంగానది కాల్వల మీద ఈ స్కీములక్రింద జలవిద్యుదుత్పత్తి జరుగుతున్నది.

రాష్ట్రంలో వివిధ తరగతి ఉత్పత్తి స్కీముల కింద ఎంత జల విద్యుత్‌ను ఉత్పత్తిచేయ వీలున్నదో దిగువ పట్టిక వివరిస్తుంది :

కిలోవాట్లు అధికం! పై స్కీములన్నీ నిర్వహించబడిననాడు, జల విద్యుదుత్పత్తిలో ఆంధ్ర ప్రథమస్థానాన్ని అలంకరిస్తుందంటే అతిశయోక్తి కాదు.

| స్కీము | | విద్యుత్ ఉత్పత్తి అంచనా (కిలోవాట్లలో) |
|---|---|---|
| **హై హెడ్ స్కీములు** | | |
| మచ్‌ఖండ్ | ... | 1,02,000 |
| సీలేరు | ... | 1,66,000 |
| **మీడియమ్ హెడ్ స్కీములు** | | |
| తుంగభద్ర | ... | 44,000 |
| రామపాదసాగరం | ... | 1,55,000 |
| నందికొండ | ... | 1,00,000 |
| **లో హెడ్ స్కీములు** | | |
| నందికొండ, సిద్ధేశ్వరం ప్రాజెక్టుల కాలువలు, కృష్ణా, గోదావరి కాలువలవల్ల | ... | 1,00,000 |
| మొత్తం | ... | 6,67,000 |

పై వివరాలవల్ల, ఆంధ్రదేశంలో 6.7 లక్షల కిలోవాట్ల జలవిద్యుత్‌ను ఉత్పత్తిచేయ వీలున్నదని తెలుస్తున్నది. ఇది, ప్రస్తుతపు భారతదేశ విద్యుదుత్పత్తి శక్తిలో నాల్గవవంతు కంటె కొంచెం అధికం.

1951 వ సంవత్సరంలో, భారతదేశ జలవిద్యుదుత్పత్తిశక్తి ఐదులక్షల కిలోవాట్ల కన్న కొంచెం తక్కువ. పైన ఉదహరించిన స్కీములన్నీ నిర్వహించబడిన నాడు ఆంధ్ర ఉత్పత్తి చేయగలిగిన జలవిద్యుత్, భారతదేశపు ప్రస్తుతపు జల విద్యుదుత్పత్తిశక్తికంటె లక్షన్నర

ఈ స్కీములలో మచ్‌ఖండ్, తుంగభద్రా స్కీములే ప్రస్తుతం నిర్మాణంలో ఉన్నాయి.

## మచ్‌ఖండ్ స్కీము

విశాఖపట్టణానికి 125 మైళ్ళదూరంలో ఆంధ్ర-ఒరిస్సారాష్ట్రాల సరిహద్దున మచ్‌ఖండ్ నదికి ఏర్పడిన "డుడుమా" జలపాతంవద్ద ఒక జల విద్యుదుత్పత్తి కేంద్రం నిర్మించబడుతున్నది. ఇది హై హెడ్ స్కీము.

ఈ స్కీము, అన్ని నిర్మాణదశలు దాటిన తర్వాత 1,02 వేల కిలోవాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేయగలదు.

ఇది ప్రథమ దశలో 51,000 కిలోవాట్ల విద్యుత్‌ను మాత్రమే ఉత్పత్తి చేస్తుంది. 1955 జూలైలో ఉత్పత్తి ప్రారంభించబడుతుందని అధికారులు చెబుతున్నారు. ఇచ్చట ఉత్పత్తి అయ్యే విద్యుత్ ఆంధ్రవాటా 70%, ఒరిస్సావాటా 30%.

ఈ స్కీము అన్ని నిర్మాణదశలు దాటేసరికి రు. 14,55 లక్షల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయబడింది.

ఇచ్చట ఉత్పత్తి అయ్యే విద్యుత్ శ్రీకాకుళం, విశాఖపట్నం, ఉభయగోదావరులు, కృష్ణా, గుంటూరుజిల్లాలకు సప్లయి చేయబడుతుంది. ఈ పవరు సరఫరా కొరకు 290 మైళ్ళ పొడవున 132 కె.వి. డబుల్ సర్క్యూట్ లైను, వివిధ కేంద్రాలలో సబ్ స్టేషన్లు నిర్మించబడుతున్నాయి.

## తుంగభద్ర స్కీము

నిర్మాణంలో ఉన్న రెండవస్కీము తుంగభద్రస్కీము. ఇది హొస్పేటవద్ద ఆనకట్టమీదఒకటి, దానికి 15 మైళ్ళదిగువున ప్రధాన పంట కాలువమీద ఒకటి, రెండు పవరు స్టేషన్లు నిర్మించ బడుతున్నాయి.

ఈ రెండు పవరు స్టేషన్లు నిర్మించబడే స్థలం మైసూరులోనే ఉంది. ప్రథమ దశలో 36,000 కిలోవాట్ల విద్యుత్‌ను, ఈ రెండు స్టేషన్లు ఉత్పత్తి చేస్తాయి. 1957వ సంవత్సరం మార్చిలో ఉత్పత్తి ప్రారంభించబడుతుందని చెప్పబడుతున్నది. ఈ పవరు కడప, కర్నూలు, అనంతపురం, ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలకు సప్లయి చేయబడుతుంది. ఈ పవరు సరఫరా కొరకు, 66–11 కె. వి. వోల్టేజి కలిగిన 750 మైళ్ళపొడవున హైటెన్షన్ లైను, 22 సబ్ స్టేషన్లు నిర్మించబడుతున్నాయి. ఈ స్కీము పూర్తి నిర్వహణకు ఎనిమిదికోట్ల రూపాయలు ఖర్చవుతుందని అంచనా వేయబడుతున్నది. ఈ స్కీము కింద ఉత్పత్తి అయిన విద్యుత్తులో 80% ఆంధ్ర వాటా, 20% మైసూరువాటా.

# ధర్మల్ స్టేషన్లు*

## విశాఖపట్నం పవరు సిస్టం

ఇది 1938—39 వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలో లోడ్ 820 కిలోవాట్లు; ఉత్పత్తి 17,80,000 యూనిట్లు; ఆదాయం రు. 85 వేలు.

1951-52 వ సంవత్సరానికి లోడ్ 4,500 కిలోవాట్లకు, ఉత్పత్తి 1,59,60 వేల యూనిట్లకు, ఆదాయం రు. 13,59 వేలకు పెరిగింది. ఈ సంవత్సరంలో ఉన్న వినియోగదార్లు 3,092. కనెక్టెడ్ లోడ్ 15,224 కిలోవాట్లు.

ఈ సిస్టం క్రింద ఉన్న విద్యుత్ ప్రవాహపు లైనులు సింగిల్ సర్క్యూట్ వి 278.5 మైళ్ళు; డబుల్ సర్క్యూట్ వి 13.3 మైళ్ళు.

* క్రింద ఇవ్వబడిన వివరాలకు, సంవత్సరం ఉదహరించని చోట, ఆయా అంకనాలు 1951-52వ సంవత్సరానివిగా పరిగణించాలి.

మొత్తం 5,200 కె. వి. ఏ. శక్తిగల ట్రాన్స్‌ఫార్మరు స్టేషన్లు మూడున్నాయి; 2,620 కె. వి. ఏ. శక్తిగలిగిన డిస్ట్రిబ్యూషన్ ట్రాన్స్‌ఫార్మర్స్ 51 ఉన్నాయి. చిట్టివలస సబ్ స్టేషన్లో 1,500 కె.వి.ఏ. శక్తి గలిగిన రెండు ట్రాన్స్‌ఫార్మర్లు ఉన్నాయి.

ఈ సిస్టం చిట్టివలస జనపనారమిల్లులకు, విశాఖపట్నంలోని ఇండియన్ ఆక్సిజన్ అండ్ ఎసిటలీన్ కంపెనీకి పవరు సప్లయి చేస్తున్నది.

మొత్తము 172 కిలోవాట్ల కనెక్టెడ్ లోడ్‌తో 29 వ్యవసాయ కనెక్షన్లు (Agricultural Connections), మొత్తం 1,322 కిలోవాట్ల కనెక్టెడ్ లోడ్‌తో 78 గ్రామీణ పరిశ్రమల కనెక్షనులు ఉన్నాయి.

## విజయవాడ సిస్టం

ఇది 1938-39వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలో లోడ్ 530 కిలోవాట్లు; 1939-40 వ సంవత్సరంలో ఉత్పత్తి 46,80 వేల యూనిట్లు; ఆదాయం రు. 1,89 వేలు.

1951-52 వ సంవత్సరానికి లోడ్ 8,309 కిలోవాట్లకు, ఉత్పత్తి 3,09 లక్షల యూనిట్లకు, ఆదాయం రు. 19,06 వేలకు పెరిగింది. ఈ సంవత్సరంలో ఉన్న వినిమయందార్లు (Consumers) 2,608; కనెక్టెడ్ లోడ్ 19,923 కిలోవాట్లు.

ఈ సిస్టంకింద ఉన్న విద్యుత్ ప్రవాహపు లైనులు: 684 మైళ్ళ సింగిల్ సర్క్యూట్ లైనులు, 5.8 మైళ్ళ డబుల్ సర్క్యూట్ లైను.

మొత్తం 11,950 కిలోవాట్లున్న తొమ్మిది హైటెన్షన్ సబ్‌స్టేషన్లు ఉన్నాయి. 134 డిస్ట్రిబ్యూటింగ్ ట్రాన్స్‌ఫార్మర్లు ఉన్నాయి. వీటి మొత్తం శక్తి (Aggregate Capacity) 7,220 కె. వి. ఏ.

658 వ్యవసాయ కనెక్షన్లు ఉన్నాయి. వీటి మొత్తం కనెక్టెడ్ లోడ్ 2,299 కిలోవాట్లు. 130 గ్రామీణ పరిశ్రమల కనెక్షన్లు ఉన్నాయి. వీటి మొత్తం కనెక్టెడ్ లోడ్ 1,338 కిలోవాట్లు.

## కాకినాడ సిస్టం

ఇది 1940-41వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలో పీక్ లోడ్ 325 కిలోవాట్లు; ఉత్పత్తి 7,70 వేల కిలోవాట్లు, ఆదాయం రు 47 వేలు. 1951-52 వ సంవత్సరానికి లోడ్ 1,020 కిలోవాట్లకు, ఉత్పత్తి 23,60 వేల యూనిట్లు (విజయవాడ స్టేషన్ నుండి కొన్న 9,41 వేల యూనిట్లు ఇందులో చేర్చబడలేదు.) ఆదాయం రు. 6,22 వేలకు పెరిగింది.

ఈ సంవత్సరంలో మొత్తం 5,565 కనెక్షన్లున్నాయి. వీటి కనెక్టెడ్ లోడ్ మొత్తం 4,138 కిలోవాట్లు. 261 మైళ్ళ సింగిల్ సర్క్యూట్ విద్యుత్ ప్రవాహపు లైనులు ఈ సిస్టంకింద ఉన్నాయి. 55 డిస్ట్రిబ్యూషన్ ట్రాన్స్‌ఫార్మర్లు ఉన్నాయి. వీటి మొత్తంశక్తి 3,240 కె. వి. ఏ.

ఈ సంవత్సరాంతానికి ఉన్న వ్యవసాయ కనెక్షన్లు 40; వీటి కనెక్టెడ్ లోడ్ మొత్తం 230 కిలోవాట్లు. 87 గ్రామీణ పరిశ్రమల (Rural

Industries) కనెక్షన్లు ఉన్నాయి. వీటి మొత్తం కనెక్టెడ్ లోడ్ 993 కిలోవాట్లు.

శ్రీకాకుళం సిస్టం

1951 వ సంవత్సరంలో ఇది ప్రభుత్వ అధీనంలోనికి వచ్చింది. దీని ఉత్పత్తిశక్తి, 1952-53 వ సంవత్సరంలో 250 కిలోవాట్లు. 1951-52 వ సంవత్సరంలో రు. 14,116 లు నష్టం వచ్చింది. దీనికింద 14 మైళ్ళ లోటెన్షన్ లైను ఉన్నది. ఒక వ్యవసాయ కనెక్షను ఉన్నది. దీని కనెక్టెడ్ లోడ్ 4 కిలోవాట్లు.

నరసన్నపేట సిస్టం

1951వ సంవత్సరం, జూలై మాసంలో ప్రభుత్వ అధీనంలోకివచ్చింది. 2.5 మైళ్ళ పొడవుగల లోటెన్షనులైను ఈ సిస్టంకింద ఉన్నది.

ఒంగోలు సిస్టం

1951వ సంవత్సరం ఏప్రిల్ 16వ తేదీన ప్రభుత్వ అధీనంలోకి వచ్చింది. అప్పటికి ఈ స్టేషను పనిచేయుటంలేదు. 1.75 మైళ్ళ హైటెన్షను లైన్లు, 14.5 మైళ్ళ లోటెన్షను లైన్లు ఈ సిస్టంకిందఉన్నాయి. 1951-52వ సంవత్సరంలో రు. 21,841 లు నష్టం వచ్చింది.

నరసారావుపేట సిస్టం

1951 వ సంవత్సరం ఏప్రిల్ 29 వ తేదీన ఇది ప్రభుత్వ అధీనంకిందకువచ్చింది. దీని 1952-53 వ సం॥పు ఉత్పత్తిశక్తి 170 కిలోవాట్లు. 1951-52 వ సంవత్సరంలో రు. 27,823 లు నష్టం వచ్చింది.

నెల్లూరు సిస్టం

ఇది 1950 వ సంవత్సరం అక్టోబరు 30వ తేదీన ప్రారంభింపబడింది. 1951-52వ సంవత్సరంలో పీక్‌లోడ్ 750 కిలోవాట్లు. 26,50 వేల యూనిట్ల విద్యుత్ ఉత్పత్తి చేయబడింది.

ఈ సంవత్సరంలో 2,131 కనెక్షన్లు ఉన్నాయి. వీటి కనెక్టెడ్‌లోడ్ 1,309 కిలోవాట్లు. ఈ సిస్టంకింద 10.5 మైళ్ళ హైటెన్షనులైనులు, 63.5 మైళ్ళ లోటెన్షను లైనులుఉన్నాయి. ఆరువ్యవసాయ కనెక్షన్లు ఉన్నాయి. వీటి మొత్తం కనెక్టెడ్ లోడ్ 13 కిలోవాట్లు.

కర్నూలు సిస్టం

ఇది 1947-48వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలో ఉన్న పీక్‌లోడ్ 140 కిలోవాట్లు; ఉత్పత్తి 3,30 వేల యూనిట్లు; ఆదాయం 68 వేల రూపాయలు. 1951-52 వ సంవత్సరంలో పీక్‌లోడ్ 360 కిలోవాట్లు; ఉత్పత్తి 10,67 వేల యూనిట్లు; ఆదాయం రు. 1,98 వేలు; లాభం రు. 15,718.

ఈ సంవత్సరాంతానికి 1,318 కనెక్షన్లు ఉన్నాయి. వీటి కనెక్టెడ్‌లోడ్ మొత్తం 929 కిలోవాట్లు.

ఈ సిస్టంకింద ఉన్న విద్యుత్ వాహక లైనుల పొడవు 33 మైళ్ళు. ఉన్న ట్రాన్స్‌ఫార్మర్లు నాలుగు. వీటి మొత్తం శక్తి 275 కె. వి. ఏ.

కడప సిస్టం

ఇది 1948-49 వ సంవత్సరంలో ప్రభుత్వ యాజమాన్యం క్రిందకు వచ్చింది. 1951-52వ సంవత్సరంలో దీని పీక్‌లోడ్ 200 కిలోవాట్లు; ఉత్పత్తి 7,60 వేల యూనిట్లు; ఆదాయం రు. 1,77 వేలు, ఈ సంవత్సరంలో వచ్చిన నష్టం రు. 2,583 లు.

# కార్మికులు

**1954** ఫిబ్రవరిలో ఆంధ్ర ప్రభుత్వ కార్మికశాఖ తయారుచేసిన అంచనాల ననుసరించి ఆంధ్రదేశంలో 2,26,760 మంది పారిశ్రామిక కార్మికులున్నారు. ఫాక్టరీ చట్టంక్రిందకు వచ్చే కార్మికులు మాత్రమే లెక్కకు తీసుకోబడ్డారు. ఆంధ్రరాష్ట్రపు జనాభా 205 లక్షలు. అధికారుల అంచనాలనుబట్టి ప్రతి 100 మంది ఆంధ్ర ప్రజలలోను ఒక్కడు మాత్రమే పారిశ్రామిక కార్మికుడు. ఆంధ్రలో పారిశ్రామిక కార్మికులు యింత తక్కువగా వుండటానికి కారణం ఆంధ్ర దేశం పారిశ్రామికంగా వెనుకబడి వుండటమే.

పదిమందికంటె ఎక్కువమంది కార్మికులు పనిచేసే ఫాక్టరీలు, పరిశ్రమలు మాత్రమే ఫాక్టరీ చట్టంక్రిందకు వస్తాయి. ఫాక్టరీ చట్టంక్రిందకు రాని పరిశ్రమల కార్మికులుకూడ చాలమంది వున్నారు. 1951 జనాభా లెక్కల ననుసరించి కుటీర పరిశ్రమపై బ్రతుకుతున్నవారి సంఖ్య 20,500. వీరు ఒంటరి ఒంటరిగా గాని, ఇద్దరు ముగ్గురుగాగాని పనిచేస్తుండటంవల్ల వీరు ఫాక్టరీచట్టం క్రిందకురారు. ఇలాగే ఫాక్టరీ చట్టంక్రిందకు రాని పారిశ్రామిక కార్మికులు మరో లక్షమందిదాకా వుంటారు. ఆంధ్రరాష్ట్ర ట్రేడ్ యూనియన్ వారి అంచనాల ప్రకారం పారిశ్రామిక కార్మికులు 3 లక్షల 38 వేలమంది వున్నారు. ఈ అంచనాలనుబట్టి చూసినా ఆంధ్రలో పారిశ్రామిక కార్మికుల సంఖ్య చాల తక్కువేనని చెప్పాలి.

ఫాక్టరీ చట్టంక్రింద రిజిష్టరు చేయబడ్డ సంస్థలలో పనిచేసే కార్మికులు ఆంధ్ర ప్రభుత్వ లేబరు డిపార్టుమెంటు అంచనాల ప్రకారం, 1954 వ సంవత్సరం ఫిబ్రవరి మాసాంతానికి వివిధ జిల్లాలలో ఎంతమంది వున్నారో క్రింది పట్టిక వివరిస్తుంది:

| జిల్లా పేరు | కార్మికుల సంఖ్య |
|---|---|
| శ్రీకాకుళం | 7,500 |
| విశాఖపట్నం | 21,330 |
| తూర్పుగోదావరి | 31,410 |
| పశ్చిమగోదావరి | 21,770 |
| కృష్ణా | 30,200 |
| గుంటూరు | 75,100 |
| నెల్లూరు | 8,240 |
| కర్నూలు | 14,100 |
| కడప | 2,800 |
| అనంతపురం | 8,640 |
| చిత్తూరు | 5,630 |
| మొత్తం | 2,26,760 |

1951 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం ఎంతమంది కార్మికులున్నదీ ఆంధ్ర రాష్ట్ర ట్రేడ్ యూనియన్

కాంగ్రెసువారి అంచనాల ప్రకారం ఎందరు కార్మికులు వివిధ పరిశ్రమలలో పనిచేస్తున్నదీ దిగువ పట్టికలో వివరించబడింది :

| పరిశ్రమ | 1951 జనాభా లెక్కల ప్రకారం | ట్రేడ్ యూనియన్ అంచనాల ప్రకారం |
|---|---|---|
| పొగాకు | 15,700 | 1,25,000 |
| జనపనార | 14,000 | 8,000 |
| ఇంజనీరింగు | 3,200 | 5,000 |
| పంచదార | 3,125 | 7,500 |
| విద్యుచ్ఛక్తి | 2,800 | 1,500 |
| హార్బరు | ... | 2,400 |
| నౌకా నిర్మాణం | ... | 2,000 |
| లోహ పరిశ్రమ | 21,800 | 4,000 |
| ప్రత్తి, నూనె, బియ్యం మిల్లులు | ... | 20,000 |
| రసాయన పరిశ్రమలు | 1,500 | ... |
| కట్టు పరిశ్రమ | 30,500 | ... |
| ముద్రణాలయాలు | 3,028 | 2,000 |
| తోళ్ళపరిశ్రమ | 30,600 | 5,000 |
| సిమెంటు | ... | 2,500 |
| నూలు మిల్లులు | ... | 3,500 |
| గనులు | ... | 60,000 |
| మోటారు కార్మికులు | ... | 20,000 |
| ప్రెసింగు | 10,325 | 2,000 |
| పి. డబ్ల్యు. డి. వర్కుషాపు | ... | 2,500 |
| రైల్వే | ... | 31,000 |

ఈ కార్మికులలో కొన్నిరకాల పరిశ్రమలలో పనిచేసేవారికి సంవత్సరం పొడుగునా పని దొరకదు. ఆంధ్రలో ఎక్కువ మంది కార్మికులు పనిచేస్తున్న పొగాకు పరిశ్రమలో, కార్మికులకు సగటున సంవత్సరంలో ఆరు నెలలు మాత్రమే పని దొరుకుతుంది. కొద్దిచోట్ల 8 నెలలు పని దొరుకుతుంది. కొన్నిచోట్ల 3 నెలలకు మాత్రమే పని దొరుకుతుంది. పంచదార పరిశ్రమలో కూడ కొన్నిచోట్ల యిదే

పరిస్థితి. బియ్యపు మిల్లుల కార్మికులకు కొద్ది నెలలు మాత్రమే పని. వీరంతా సీజనల్ కార్మికుల క్రిందకు వస్తారు.

ఈ సీజనల్ కార్మికులకు సీజన్ (పని కాలం) అయిపోగానే పని పోతుంది గనుక తిరిగి సీజన్ ప్రారంభమైనప్పుడు, లోగడ పనిచేసిన వారినే పనిలోకి తీసుకోవాలనే నిబంధన లేదు. వీరిలో కొంత మంది మాత్రమే పర్మనెంటు కార్మికుల క్రింద పరిగణించబడుతున్నారు. బియ్యపు మిల్లులలో పనిచేసే కార్మికులలో ఇంజన్ డ్రైవర్లు, మెషిన్ మెన్‌లవంటి టెక్నికల్ కార్మికులు మినహా, మిగతా కార్మికులలో ఏ ఒక్క కార్మికునికి ఏ ఒక్క ఫాక్టరీలోను దీర్ఘకాలపు సర్వీసు లేదు. పొగాకు, పంచదార పరిశ్రమలలో తాత్కాలిక కార్మికులకు యిదే గతి. కొన్ని పంచదార ఫాక్టరీలలో తాత్కాలిక కార్మికులు నోటీసు లేకుండా తొలగించబడుతున్నారు. ప్రభుత్వ విద్యుచ్ఛక్తిశాఖ మొదలైన వాటిల్లో పనిచేసే కార్మికులు, పది సంవత్సరాలు సర్వీసు చేసినవారు కూడా, తాత్కాలిక కార్మికుల క్రిందనే పరిగణించబడుతున్న వుదాహరణలున్నవి. వీరి ఉద్యోగానికి ఎట్టి రక్షణ లేదు. ఏ క్షణానైనా నిరుద్యోగి అయ్యే ప్రమాదమున్నది.

## జీతాలు

### పొగాకు పరిశ్రమ

పొగాకు పరిశ్రమలో జీతాలు రెండు పద్ధతుల మీద యివ్వబడుతున్నాయి - ఒకటి పనిచేసిన కాలాన్నిబట్టి, రెండవది చేసిన పనినిబట్టి. పొగాకు కార్మికులలో నూటికి 95 మంది స్త్రీలే. వీరిలో గ్రేడింగు, స్ట్రిప్పింగు (కాడలు తీసే పని) పనులు చేసే కార్మికులు రోజుకు 8 అణాల నుండి రూపాయివరకు సంపాదిస్తున్నారు (1946). గుంటూరు మొదలైన పెద్ద పెద్ద ఫాక్టరీలలో ఒక పౌను కాడలు తీసినందుకు స్ట్రిప్పరుకు రు. 0-1-1 నుండి రు. 0-2-0వరకు గిట్టుతున్నదనీ, యీ పద్ధతిలో ఎన్ని పౌనుల కాడలు తీస్తే అంత కూలి అని చెప్పబడుతున్నప్పటికీ, ఏ స్ట్రిప్పరుకుకూడా రోజుకు రూపాయికి మించి కూలి గిట్టకుండా యజమానులు చూస్తూ వుంటారని డా॥ వి. వి. నారాయణస్వామి నాయుడు విచారణలో బైటపడింది.

పొగాకు కార్మికుల స్థితిగతులనుగూర్చి 1946 లో విచారణ చేసిన డాక్టరు వి. వి. నారాయణస్వామినాయుడు, వారి రిపోర్టులో ఇంకా ఇలా వ్రాశారు: "స్ట్రిప్పర్లకు యిచ్చే కూలిని నిర్ణయించడంలో, స్ట్రిప్పర్ల కూలి గ్రేడింగు పనిచేసే కార్మికుల రోజు కూలిని మించకుండా వుంచాలనే ఉద్దేశ్యంతో యజమానులు స్ట్రిప్పర్ల కూలిరేటు నిర్ణయిస్తున్నారు. ఈ కూలి 15 అణాలకు తగ్గకుండానూ, ఒకరూపాయికి మించకుండానూ యజమానులు జాగ్రత్త తీసుకుంటున్నారు. ఈ కూలి నిర్ణయం జీతాల నిర్ణయసూత్రాలన్నింటికీ పూర్తిగా విరుద్ధము... ఒకే రకమైన పనికి ఒకే రకమైన జీతాలు యివ్వాలనే సూత్రానికి విరుద్ధము. ఎక్కువ పని

అమలుజరగడంలేదనేది, పైన వివరించబడ్డ కార్మికుల జీతాల పట్టికే తెలియజేస్తున్నది. ఆంధ్ర ప్రభుత్వ విద్యుచ్ఛక్తి శాఖలో పనిచేసే సాధారణ కార్మికుడు యీ రోజున తెచ్చుకుంటున్న నెలజీతం రు. 18 మాత్రమేనని తెలుసుకున్న, ప్రభుత్వంచే నిర్వహించబడుతున్న పరిశ్రమలలోకూడా 'జీవనప్రమాణపు పెరుగుదలనుబట్టి జీతాల పెరుగుదల' అనే సూత్రం అమలు జరుగుటలేదని తెలుస్తుంది. ప్రభుత్వమే యిలా వ్యవహరించడంతో ప్రయివేటు యజమానుల సంగతి చెప్పనవసరంలేదు.

కార్మికులకిచ్చే జీతాలు 'జీవనవ్యయ ప్రమాణా'న్ననుసరించి పెరగకపోవడం వల్ల, వారు పొట్టగడవడంకోసం అప్పులు చేయక తప్పటంలేదు.

[illegible]మిల్లు కార్మికుల పరిస్థితులపై కేంద్రప్రభుత్వం తరఫున విచారణచేసిన శ్రీ బి. పి. అడార్కరు తన రిపోర్టులో ఒక్కొక్క కార్మికునికి సగటున రు. 50 నుండి రు. 100 అప్పులు వున్నాయనీ, రూపాయికి నెలకు అణా చొప్పున వడ్డీ చెల్లిస్తున్నారనీ వ్రాశారు. "జీతాలు పెరిగిన నిష్పత్తిలో కూలీ పెరగకపోవడమే ఈ అప్పుల పెరుగుదలకు కారణము"న్నారు.

శ్రీ అడార్కరు మైకాగని కార్మికుల పరిస్థితులపై ప్రభుత్వంతరఫున విచారణ చేసి, మైకా కార్మికుల జీతాలు వారి కుటుంబపోషణకు తగినట్లుగా లేకపోవడం వలన చాలమంది కార్మికులు అప్పుల పాలయ్యారని వ్రాశారు. ఈ అప్పులు రెండు రకాలు: యజమానులవద్ద అప్పుగా పుచ్చుకున్న అప్పు; తిండిగింజలు మొదలైన ఆహారపదార్థాలకొరకై కొట్లలో చేసిన అప్పు. ఒక్కొక్క కుటుంబానికి షుమారు రు. 100 నుండి రు. 150 వరకు అప్పు వుంటుందని 1946 లో అడార్కరు అంచనావేశారు. 1946 తరువాత జీవనవ్యయప్రమాణం పెరిగిందేకాని తగ్గలేదు. జీతాలు మాత్రం పెరగలేదు. కనుక అప్పులభారం ఇంకా పెరిగివుండాలి.

అప్పులభారంనుండి కార్మికులకు విముక్తికల్పించాలంటే, కనీసకూలిచట్టాన్ని (Minimum wages Act) అమలుపరచాలని, కూలీరేట్లు హెచ్చించాలని శ్రీ అడార్కరు సిఫారసు చేశారు. కనీస కూలీ చట్టం ఒక్క మైకా కార్మికుల విషయంలోనేగాక, యింకా అనేక పరిశ్రమల కార్మికుల విషయంలోకూడ అమలుజరుపబడటంలేదు.

ఇతర పరిశ్రమలలోని కార్మికులుకూడ యిదేవిధంగా అప్పులపాలై బాధపడుతున్నారు. ఇటీవల నిరుద్యోగం కూడ ప్రబలమవడంతో కార్మికులస్థితి మరీ అధ్వాన్నమైంది.

## కార్మిక శాసనాలు

ప్రభుత్వం చేసిన ఫాక్టరీలచట్టం, గనుల చట్టం మొదలైన చట్టాలేవీ సక్రమంగా అమలు జరుపబడటంలేదు. అమలు జరుపబడుతున్న పరిశ్రమలలోనైనా అవి అధికారుల [illegible] విధంగా అమలు జరుపబడుతున్నది.

మైకాగని కార్మికుల స్థితిగతులను గూర్చి ప్రభుత్వం తయారుచేయించిన రిపో

ఆరోగ్య విషయాలలోనూ, పని గంటలవిషయంలోనే గాక ప్రావిడెంటు ఫండు, శలవులవిషయంలోకూడ కార్మిక చట్టాల నిబంధనలను యజమానులు ఉల్లంఘించు తున్నారు. కొన్నిచోట్ల పనిలోకి ఆలస్యంగా వచ్చారనో, మరోతప్పుచేసారనో చెప్పి కార్మికులకు యజమానులు జరిమానాలువిధించడంకూడ జరుగుతున్నది.

## కార్మిక వివాదాలు

కార్మికులకు - యజమానులకు మధ్య 1952 లో ఏఏ సమస్యలపై వివాదాలు ఏర్పడింది యీ క్రింది పట్టిక తెలియజేస్తున్నది. (ఈ పట్టిక 1952 లో కార్మిక వివాదాలనుగూర్చి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించిన రిపోర్టు నుండి ఉదహరించబడ్డది.)

### 1952 లో కార్మిక వివాదాలు

| లేబరు ఆఫీసు | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] | [illegible] |
|---|---|---|---|---|---|---|---|---|---|
| అనంతపురం | 44 | 144 | 8 | 1 | 3 | 17 | 1 | 28 | 216 |
| గుంటూరు | 81 | 91 | 6 | ... | 9 | 209 | 3 | 95 | 494 |
| విజయవాడ | 158 | 72 | 35 | 10 | 4 | 9 | 1 | 67 | 356 |
| విశాఖపట్నం | 95 | 43 | 3 | 3 | ... | 31 | ... | 85 | 260 |
| మొత్తం | 378 | 250 | 52 | 14 | 16 | 266 | 5 | 275 | 1,326 |

(కార్మిక వివాదాల చట్టం పనిచేస్తున్న విధానంపై 1947 లో ప్రభుత్వం ప్రచురించిన రిపోర్టు)

## కార్మిక సంఘాలు

కార్మికులకు - యజమానులకు మధ్య యేర్పడిన వివాదాన్ని ప్రభుత్వ కార్మిక శాఖ పరిష్కరించలేనప్పుడు, వాటిని వారు పారిశ్రామిక కోర్టుకు పంపుతారు. ఈ పారిశ్రామిక కోర్టు యిచ్చిన తీర్పును తమకు అనుకూలంగా లేనప్పుడు యజమానులు అమలుపరచడంలేదు. అందువల్ల యజమానులు పారిశ్రామిక కోర్టు యిచ్చిన తీర్పులను తప్పనిసరిగా అమలు జరపాలనేది, ట్రేడ్‌యూనియన్ల ప్రధాన కోర్కెలలో ఒకటిగా వుంది.

రిజిష్టరు చేయబడ్డ కార్మికసంఘాల వివాదాలను మాత్రమే ప్రభుత్వం పారిశ్రామిక కోర్టు (ఇండస్ట్రియల్ ట్రిబ్యునల్)కు పంపుతుంది. రిజిష్టరుకాని కార్మిక సంఘాల వివాదాలను పారిశ్రామిక కోర్టు విచారణకు పంపడమా లేదా అనేది ప్రభుత్వ యిష్టాయిష్టాలమీద [illegible] పడి వుంటుంది.

యజమానులు, కార్మికులు సమాన హోదాలో కూర్చుని వివాదాలను పరిష్కరించుకోవచ్చునని ప్రభుత్వ కార్మికశాఖ వర్ణించే సూత్రం. ఈ సూత్రం [illegible] వుండిపోయింది. ఏదైనా వివాదం యేర్పడినప్పుడు కార్మికసంఘం తన ప్రతినిధులను యజమానులవద్దకు పంపితే, యజమానులు ఆ కార్మిక సంఘాన్ని, దాని ప్రతినిధులను గుర్తించక నిరాకరించి సంప్రదింపులు జరపని ఘటనలు ఉన్నాయి.

రాజ్యాంగచట్టంలో కార్మికుల సంఘ నిర్మాణహక్కు గుర్తించబడ్డప్పటికీ యజమానులు సంఘంలో చేరిన కార్మికులను వేధించడం, వేధింపును లెక్కచేయకుండా కార్మికుడు యూనియన్‌లో చేరితే ఏదో ఒక మిష పెట్టి యజమానులు కార్మికులను తొలగించడం జరుగుతున్నది.

బీడీ, [illegible], తోళ్ళ కార్మికుల స్థితిగతులపై విచారణచేసి డాక్టరు వి. వి. నారాయణస్వామి నాయుడు తయారు చేసిన రిపోర్టులో, యజమానులు కార్మికుల సంఘనిర్మాణాన్ని యేవిధంగా అరికట్టుతున్నదీ యిలా తెలియజేయబడింది:

"అనేకచోట్ల కార్మిక సంఘంలో చేరితే యజమానులు ఎక్కడ పనినుంచి తొలగిస్తారోనని కార్మికులు భయపడుతున్నారు. రాయలసీమలోను, మద్రాసునగరంలోను అనేకమంది బీడీకార్మికులు నాముందు సాక్ష్యం యిచ్చినందుకు వారిని యజమానులు పనినుంచి తొలగించకుండా చూడమని కోరారు." (రిపోర్టు - పేజీ 43).

## స్త్రీ కార్మికులు

స్త్రీ కార్మికులు పురుష కార్మికులతో సమానమైన పనిచేసినప్పటికీ వారికి తక్కువ వేతనాలు యివ్వబడుతున్నవి. బియ్యపు మిల్లులలో రోజుకూలి పురుష కార్మికునికి రు. 0-8-4 యిస్తుంటే, స్త్రీ కార్మికులకు రు. 0-7-6 మాత్రమే యిస్తున్నారు (1946). మైకా గనులలో రోజుకూలి మగవారికి ఎనిమిదణాలనుండి

రూపాయివరకు యిస్తుంటే (1946), స్త్రీ కార్మికులకు ఎనిమిదిఅణాలనుండి 0-12-0 మాత్రమే యివ్వబడుతున్నది. తోళ్ళ పరిశ్రమలో తక్కువకూలి గిట్టే పనులలో మాత్రమే స్త్రీ కార్మికులు నియమించ బడుతున్నారు. హొగాకు పరిశ్రమలో పురుషులు ఎక్కువకూలి వచ్చే మేస్త్రీలుగాను, ప్యాకింగు, చెక్కలు కట్టడం మొదలైన పనులలోను నియమించబడు తున్నారు. స్త్రీ కార్మికులు గ్రేడింగు మొదలైన పనులలో నియమించబడు తున్నారు. 1947 అంచనాల ననుసరించి, మగమేస్త్రీలకు 1-4-0 యివ్వబడుతుంటే ఆడమేస్త్రీలకు 1-2-0 మాత్రమే యివ్వ బడింది.

హొగాకు పరిశ్రమ కార్మికులలో ఎక్కువమంది స్త్రీలే గనుక వారి జీతాలు పెంచనవసరంలేదని, వారి కుటుంబాలలో మగవాళ్ళు సంపాదించుతున్నారు గాబట్టి ఆడవాళ్ళ సంపాదన లోటుపూర్చడానికే అనే వాదనను డాక్టర్ నారాయణస్వామి నాయుడుగారు ఖండించారు. కుటుంబ

ఆదాయంలో స్త్రీ కార్మికుల సంపాదన కూడ ప్రధానమైనదేననీ, వారు పురుషులతోపాటు సమానమైనపని చేస్తున్నప్పుడు, వారితోపాటు సమానజీతాలను పొందే హక్కు స్త్రీకార్మికులకు వున్నదనీ, కనుక వారి జీతాలు పెంచాలనీ డాక్టర్ నారాయణస్వామినాయుడు సిఫారసు చేసారు.

"నేను స్త్రీలు, సూపరువైజర్ల కనుసన్నల క్రింద అనారోగ్య వాతావరణంలో, రోజుకు 8 గంటల చొప్పున విశ్రాంతి లేకుండా పనిచేసే స్త్రీ కార్మికులను, రోజులో కొద్దికాలం మాత్రమే పనిచేసే కార్మికులుగ (పార్టుటైము కార్మికులు) పరిగణించడం ఘోరం. స్త్రీ కార్మికులలో చాలమంది మూడు నుండి అయిదు మైళ్ళ దూరం నడిచి హాజరౌతూ తిరిగి అంతదూరం నడచిపోతున్నారు. స్త్రీ కార్మికులు వారి కాలంలో ఎక్కువ గంటలను ఇంటిబయటనే గడుపుతున్నారు. అందువల్ల స్త్రీ కార్మికులను పూర్తికాలం పనిచేసే కార్మికులుగ లెక్కవేయక పోవడం హాస్యాస్పదమే కాగలదు. వారికి ప్రస్తుతమిస్తున్న జీతాలు ఆరోగ్యాన్ని, పనినిపుణతను నిలబెట్టుకునేటట్లుగ లేవు" అని డాక్టరు నారాయణస్వామి నాయుడు (రిపోర్టు 106 పేజీ) వ్రాశారు. చాల పరిశ్రమలలో స్త్రీ కార్మికులకు ప్రసూతిసౌకర్యాలు కల్పించాలని ప్రభుత్వ రిపోర్టులే తెల్పుతున్నాయి. ప్రసవించుగుందని తెలియగానే యజమానులు స్త్రీ కార్మికులను పని నుండి తొలగించుతూ వుండడం చాల సామాన్యం.

## బాల కార్మికులు

కార్మికులకు ఇస్తున్న జీతాలు చాలక పోవడం వలన వాళ్ళ పిల్లలను కూడ పనుల్లోకి పంపుతున్నారు. చదువుకోవలసిన వయస్సులోనే పిల్లలు కార్మికులుగ మారిపోతున్నారు. మైకా గనులలోను, బీడీ, చుట్టల పరిశ్రమలలోను పిల్లలు కార్మికులుగా తీసుకోబడుతున్నారు. బాల కార్మికులు (Child Labour) ఎక్కువగా బీడీ, చుట్టల పరిశ్రమలలో వున్నారు. వీరికిచ్చే జీతాలు చాల స్వల్పంగాను, నామమాత్రంగాను వున్నాయి. బీడీపరిశ్రమలో రోజల్లా కష్టపడి పనిచేసిన పిల్లలకు నాలుగు అణాలుకూలి యివ్వబడుతున్నది. "ఇటువంటి దుర్భరమైన పరిస్థితులలో పిల్లలతో పనిచేయించడం యేనాగరిక జాతి సహించరాని విషయం. కార్మిక సంఘాలు పిల్లలతో పనిచేయించే పద్ధతిని నిషేధించాలని కోరుతున్నది. పిల్లలకు హానికరమైన వ్యాపారం పొగాకులకాని, బీడీ పరిశ్రమ కాదు" అని డాక్టర్ నారాయణస్వామి నాయుడు రిపోర్టులో (46వ పేజీ) వ్రాశారు.

పారిశ్రామిక కార్మికుల స్థితి గతులను గూర్చి క్లుప్తంగా తెల్పాలంటే వారికి పెరిగిపోతున్న జీవితవ్యయ ప్రమాణానికి అనుగుణ్యంగా జీతాలుయివ్వబడటంలేదు. కనీసవేతనాల చట్టంకూడ అమలు జరపడంలేదు. ధరలు పెరిగి, జీతాలు పెరగక పోవడంవలన కార్మికులు అప్పులబాధలకు గురి అవుతున్నారు. ఉద్యోగ రక్షణ లేదు.

ఫాక్టరీలలో యజమానులు ఫాక్టరీ నిబంధనల ననుసరించి కార్మికుల రక్షణకై తీసుకోవలసిన కనీసచర్యలు తీసుకోక పోవడంవలన అనేకవ్యాధులకు గురిఅవుతున్నారు. కార్మికుల వైద్యవసతి, గృహవసతి చాలహీనంగా వున్నాయి. స్త్రీ కార్మికుల పరిస్థితి మరీ అధ్వాన్నంగా వున్నది.

యజమానులు, పారిశ్రామిక కోర్టు యిచ్చిన తీర్పులు తమకు అనుకూలంగా లేకపోతే అమలుజరుప నిరాకరిస్తున్నారు. కార్మికసంఘాలను గుర్తించ నిరాకరించుతున్నారు.

ప్రభుత్వవిచారణ కమిటీలే కార్మికుల పరిస్థితుల అభివృద్ధికి అనేక సిఫారసులను 1946–47లోనే చేసినప్పటికీ, నేటికీ అవి యేవీ అమలుపరచబడటం లేదు.



# నదులు - ప్రాజెక్టులు

మన ఆంధ్రరాష్ట్రంలో ఉన్నన్ని నదులు, మన ఉపయోగానికి తయారుగా ఉన్నంతగా మరే ఇతర రాష్ట్రానికీ లేవు. గోదావరి, కృష్ణా, పెన్నానదులు ఆంధ్ర దేశంగుండా జీవనాడుల్లా ప్రవహిస్తున్నాయి.

ఆంధ్రదేశ సహజసౌందర్యాన్ని ఈ నదులు పెంపొందిస్తున్నాయి.

అయినా, తెలుసుకోవాల్సిన విషయమేమిటంటే, ఈ నదీజలాల్లో అత్యధిక భాగం వృథాగా సముద్రములోకి పోతున్నాయి. మన భూములను బంగారు భూములుగ మార్చటానికి జలాలు కడలి పాలవుతున్నాయి. ఒక్కొక్కప్పుడు వరదలైపారి నష్టం కల్గిస్తున్నాయి కూడా.

ఈ నదీజలాలకు ముకుతాళ్లు బిగించి, మనపంట పొలాలవైపు త్రిప్పుకొని, ఆ జలాలను మానవ సౌభాగ్యానికి, సౌఖ్యానికి వినియోగపడేలా చేసుకోవటం మన చేతిలోనే ఉంది.

పరప్రభుత్వం పరిపాలన చేస్తున్న రోజుల్లో వేళ్లమీద లెక్కింపదగ్గ ప్రాజెక్టులు ఆనకట్టలు నిర్మించారు. అవికూడా అనేక ప్రాంతాలలో తరుచు కరువు కాటకాలు చెలరేగుతుండుటచేత విధిలేక కట్టాల్సి వచ్చింది.

1947లో కాంగ్రెసు ప్రభుత్వం అధికారంలోకివచ్చింది. ఉమ్మడిరాష్ట్రంలో మనకు అన్యాయం జరిగింది. ఆంధ్రప్రజల పట్ల ఉమ్మడిరాష్ట్ర ప్రభుత్వం సవతితల్లి ప్రేమచూపించింది. ఫలితంగా మన ఆంధ్ర జిల్లాల్లో జరగవలసిన ప్రాజెక్టులనిర్మాణం జరగకుండా పోయింది.

నేడు ఆంధ్రరాష్ట్రంఏర్పడింది. రాష్ట్ర జలసంపదల వినియోగంపైనే ఆంధ్రుల పునరభివృద్ధి ఆధారపడివుంది. కనుక మన నదులు, వాటి నీటి పారుదల పరిమాణం, వాటిపై నిర్మించబడిన ప్రాజెక్టులు, భవిష్యత్తులో నిర్మాణానవకాశమున్న ప్రాజెక్టులు మున్నగు వివరాలు ఇచ్చట పరిశీలిద్దాం.

## శ్రీకాకుళంజిల్లా

శ్రీకాకుళంజిల్లాలో బాహుద, ఉత్తర మహేంద్రతనయ, వెంపిగెడ్డ, వరహాలుగెడ్డ, గడిబాలుగెడ్డ, వంశధార, నాగావళి, పెద్దగెడ్డ, కండివలస అనే 9 నదులున్నాయి. వీటిలో నాగావళి, వంశధార ముఖ్యమైన నదులు.

నాగావళినది: ఇది రాయగడ్డ తాలూకాలో కలహాండి ఎస్టేటులోని ఎత్తయిన పర్వతాల్లో పుట్టి, శ్రీకాకుళంవద్ద మఫజ్ బందరు అనేచోట సముద్రంలో కలుస్తున్నది. నది పొడవు 130 మైళ్ళు. మొదటి 60 మైళ్ళు ఒరిస్సాలో ప్రవహిస్తుంది. ఈ నది ప్రవాహ పరిమితి సంవత్సరంలో

20 నుంచి 30 లక్షల ఎకరపు టడుగులు. వొట్టిగెడ్డ, జంజావతి, స్వర్ణముఖి, వేగవతి అనే చిన్న నదులు ఈ నదిలో కలుస్తాయి.

1909 లో తోటపల్లివద్ద ఈ నదిపై ఒక రెగ్యులేటరు నిర్మించారు. ఈ నది నుంచి 22 మైళ్ళ పొడవున ప్రవహించే కాలువక్రింద 28 వేల ఎకరాల భూమి సాగవుతుంది. ఇంకా 14 చిన్న కాలువలు త్రవ్వబడ్డాయి. వీటిక్రింద 42 వేల ఎకరాలు సాగవుతోంది. ఈ భూమి అంతా పాలకొండ, పార్వతీపురం తాలూకాల్లో ఉంది.

వంశధారనది: ఇది జిల్లాలోని నదు లన్నిటిలోనూ పెద్దది. ఇది ఒరిస్సాలో ని జయపూర్ స్టేటులో పుట్టి పాతపట్నం, శ్రీకాకుళం తాలూకాలగుండా 140 మైళ్ళ దూరం ప్రవహిస్తున్నది. ఈ నది ప్రవాహ ప్రమాణం పెన్నానదితో సరిసమానంగా వుంటుంది. ఈ నదికి 2½-3 లక్షల ఎకరాల వ్యవసాయానికిసమృద్ధిగా తోడ్పడ గల ప్రవాహ ప్రమాణంవున్నా, నేటా నీరు వృథాగా సముద్రంలోకి పోతోంది. అక్కడక్కడవున్న 7కాల్వలక్రింద 50వేల ఎకరాలుమాత్రం సాగులో వున్నాయి. ఈ భూమి శ్రీకాకుళం తాలూకాలోనూ, పర్లాకిమిడీ ఎస్టేటులోనూ వున్నాయి.

బాహుదానది: ఇది ఇచ్ఛాపురం తాలూకాలో ప్రవహిస్తోంది. ఈ నది పొడవు 65 మైళ్ళు. ఈ నది 8 పాయలుగా చీలి ప్రవహిస్తున్నది. వీటి క్రింద 57 గ్రామాలలో 4,500 ఎకరాల భూమి సాగవుతోంది.

ఈ మహేంద్రతనయానది 25 మైళ్ళ పొడవు. చెండిగెడ్డ 15 మైళ్ళు, గరిబులు గెడ్డ 14 మైళ్ళు, పెద్దగెడ్డ 22 మైళ్ళు, కందివలస 23 మైళ్ళు ప్రవహిస్తున్నాయి.

## విశాఖపట్నం జిల్లా

ఈ జిల్లాలో నెల్లిమర లేక చంపావతి, గోస్తనీ, గంభీరాంగెడ్డ, నారవగెడ్డ, కర్జరపు గెడ్డ, శారద, వరహా, తాండవ అనే 8 నదులున్నాయి.

గోస్తనీనది: ఇది అనంతగిరి పర్వతాల్లో పుట్టి 60 మైళ్ళు ప్రవహించి, భీముని పట్నంవద్ద సముద్రంలో కలుస్తోంది.

కురపల్లి, గోలిపల్లి అనేచోట్ల ఆనకట్టలు నిర్మించబడ్డాయి. ఇదికాక మరో పది చిన్నకాలువలుకూడా త్రవ్వబడ్డాయి. మొత్తం ఈనదినీటితో 17,612 ఎకరాల భూమి సాగవుతూంది.

శారదానది: ఇది మాడుగుల్లు పర్వతాల్లో పుట్టి, అనకాపల్లి, సర్వసిద్ధి, వీరవల్లి, తాలూకాలగుండా ప్రవహించి వాత్రాడ వద్ద సముద్రంలోకలుస్తున్నది. ఈనదినుంచి కొండకిరల అనే మంచినీటి చెరువులోకి నీరు వెళ్లుతుంది. ఈనదిపై ఎనిమిది ఆనకట్టలు నిర్మించబడ్డాయి. 9,700 ఎకరాలు సాగవుతూంది.

వరహానది: ఇది గోలుగొండ పర్వతాల్లో పుట్టి, శారదానది సముద్రంలో పడేచోటికే సముద్రంలో కలుస్తోంది. ఈ నది కూడా కొమరవోలు అనే మంచినీటి చెరువుకు నీరు సప్లయి చేస్తున్నది. ఈనదిపై 8 ఆనకట్టలున్నాయి. ఈనదిక్రింద 12,300 ఎకరాల భూమి పండించబడుతూంది.

పై రెండునదుల క్రింద పండే భూమి గోలుగొండ, సర్వసిద్ధితాలూకాల్లోవుంది.

తాండవనది: ఇది గూడెం ఏజన్సీ ప్రాంతంలోని తూర్పు కనుమల్లో పుట్టి, 56 మైళ్లు ప్రవహించి పెంటకోటవద్ద సముద్రంలో కలుస్తోంది. ప్రస్తుతం యీనది క్రింద 15 వేల యకరాలు సాగవుతోంది. మరికొన్ని చోట్ల రిజర్వాయర్లు నిర్మించితే మరో 8 వేల ఎకరాలు సాగవుతుంది.

నెల్లిమర్ల లేక చంపావతీ నది: ఇది గోలుగొండ కొండల్లో పుట్టి శృంగవరపుకోట, విజయనగరం, భీమునిపట్నం తాలూకాలగుండా 65 మైళ్ళు ప్రవహించి కోనాడ ఉప్పు ఫాక్టరీవద్ద సముద్రంలో కలుస్తోంది.

గంభీరాంగడ్డ 15 మైళ్ళు, నారవగడ్డ 24 మైళ్ళు, కన్నెరపుగడ్డ 14 మైళ్ళ పొడవు వున్నాయి. ఇవి చిన్ననదులు.

## తూర్పుగోదావరిజిల్లా

ఈ జిల్లాలో గోదావరి, ఏలేరు, పంప అనే మూడు నదులున్నాయి.

గోదావరీనది: దీనికే 'దక్షిణగంగ' అని కూడ పిలుస్తారు. దక్షిణభారతంలోకల్లా గోదావరీనదియే పెద్దది. మొత్తం భారతదేశంలో చూచుకొంటే, గోదావరినది రెండవస్థానం ఆక్రమిస్తుంది. బొంబాయి రాష్ట్రంలోని నాసిక్ వద్ద త్రియంబకం అనే చోట పుట్టి 700 మైళ్ళు ప్రవహించి, పర్ణశాల అనే చోట ఆంధ్రదేశంలో ప్రవేశించి, 225 మైళ్ళు పోయి, సముద్రంలో కలుస్తున్నది. గోదావరీనది పాపికొండలకు 25 మైళ్ళ దూరంలో గౌతమీ గోదావరి, వశిష్ట గోదావరి అని రెండు పాయలుగా చీలుతుంది. ఈ రెండు పాయలుకూడా పోనుపోను అనేకపాయలుగా చీలి సెంట్రల్ డెల్టాను అనేక లంకలుగా చేసినవి. గౌతమీగోదావరి, తూర్పుగోదావరి జిల్లాలోని యానాంవద్దనూ; వశిష్టగోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలోని నరసాపురంవద్దను సముద్రంలో కలుస్తున్నాయి.

ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ గోదావరికి శబరి అనేది ముఖ్యమైన ఉపనది.

పాపికొండలవద్ద గోదావరీనది రెండు ఎత్తయిన కొండలమధ్యగా 2-3 వందల గజాల వెడల్పు మాత్రమే వుంది. ఇక్కడ ప్రకృతి చిత్రం చాల రమణీయంగా ఉంటుంది. రానురాను ధవళేశ్వరం వచ్చేసరికి నది వెడల్పు విపరీతంగా పెరుగుతుంది.

నైరుతి ఋతుపవనాలు ప్రారంభమయిన తరువాత - అంటే జూన్ మధ్యకాలంనుంచి గోదావరీ నదికి నిండుగా నీరు రావటం ప్రారంభిస్తుంది. సెప్టెంబరు ఆఖరువరకూ నది పూటుగా వుంటుంది. తరువాత నీటిమట్టం తగ్గటం ప్రారంభిస్తుంది.

1,15,000 ఎకరాల భూవిస్తీర్ణంలో - అంటే ఇంగ్లండు, స్కాట్లండు కూడా కలుపుకొంటే ఎంత వుంటుందో అంతకన్నా ఎక్కువ భూవిస్తీర్ణంలో పడేవర్షపు నీరు గోదావరీ నదిగుండా ప్రవహిస్తుంది.

గోదావరీనదికి అటు పోట్లు జాస్తి. ప్రవాహం బాగా వున్న సంవత్సరంలో ప్రవాహపరిమితి 13½ కోట్ల ఎకరపుటడుగులుంటుంది. ఈ పరిమితి ఒక్కొక్క సంవత్సరం 1 కోటి 5 లక్షల ఎకరపు టడుగులకు తగ్గుతుంది. కాని సగటున సంవత్సరంలో 8½ కోట్ల యకరపు టడుగుల

ప్రవాహ పరిమితి వుంటుందని అంచనా వేయబడింది. కాని, ఎట్టి పరిస్థితుల్లోనూ 5½ కోట్ల ఎకరపు టడుగుల నీరు సాగుకు లభిస్తుంది. ఇందులో 2½ కోట్ల ఎకరపు టడుగుల నీరు ఆంధ్ర భాగంగా నిర్ణయించబడింది.

గోదావరీనదినీటితో ప్రస్తుతం 11లక్షల ఎకరాలు సాగవుతోంది (మొదటి పంట 8,20,000, రెండవ పంట 3 లక్షల ఎకరాలు).

ఏలేరు: ఈ జిల్లాలో గోదావరి తర్వాత చెప్పుకోదగ్గ నది ఏలేరు. రంప, గోల్కొండ, జగంగా అనే పర్వతాల్లో పుట్టిన మూడు నదుల కలయికయే యీ ఏలేరునది. ఈ నదిపొడవు 65 మైళ్ళు.

వీరవరంవరకూ ఒకే నదిగా ప్రవహించి, అక్కడనుంచి అనేక పాయలుగా చీలుతుంది. కొన్ని పాయలు కాకినాడ వద్దను, మరికొన్ని ఉప్పాడవద్దను సముద్రంలో కలుస్తాయి.

పంపానది: దీని పొడవు 32 మైళ్ళు మాత్రమే.

## పశ్చిమగోదావరి జిల్లా

ఎర్రకాల్వ: ఇది ఈ జిల్లాలో ముఖ్యమైననది. దీనికి బైనేరు, పులివాగు, జల్లేరు అనే ఉపకాలువలున్నాయి. మొత్తం నది పొడవు 60 మైళ్ళు.

ఈ నది వరంగల్ జిల్లాలోని తూర్పు కనుమలలో పుట్టింది. ఈ నదికి హఠాత్తుగా వరదలు వస్తుంటాయి. ఈ నదినే దిగువ భాగంలో ఎనమదురు కాల్వ అని కూడా పిలుస్తారు.

ఈ నది క్రింద మొత్తం తొమ్మిదివేల ఎకరాలభూమి సాగవుతోంది. కొవ్వూరు, తాడేపల్లి గూడెం తాలూకాల గుండా యీ నది ప్రవహిస్తోంది.

## కృష్ణా జిల్లా

ఈ జిల్లాలో కృష్ణానది, ఉప్పుటేరు (తమ్మిలేరు, బుడమేరు), నక్కవాగు, వగరువాగు, రొంపేరు (మునగు) అనేనదులున్నాయి.

కృష్ణానది: ఈజిల్లాలో ముఖ్యమైన నది. బొంబాయి రాష్ట్రంలోని మహాబలేశ్వరం వద్దపుట్టి, 520 మైళ్ళదూరం ప్రవహించి, కర్నూలు జిల్లాలోని సిద్ధేశ్వరంవద్ద ఆంధ్ర దేశంలో ప్రవేశించి, 250 మైళ్ళదూరం ప్రవహించి సముద్రంలో కలుస్తున్నది. ఇందులో సిద్ధేశ్వరంనుంచి నందికొండవరకు గల 120 మైళ్ళ దూరం అడవి ప్రాంతం లోను, అక్కడనుంచి 35 మైళ్ళ దూరం లోగల పులిచింతలవరకూ కొండలప్రాంతం లోను ప్రవహించి, తర్వాత 40మైళ్ళలో గల విజయవాడ రెండు కొండల మధ్యగల 4000 అడుగుల వెడల్పువున్న లోయలో ప్రవహించుచున్నది. తిరిగి 40 మైళ్ళ మైదాన ప్రాంతంలో ప్రవహించి పులిగడ్డ వద్ద పాయలై 15 మైళ్ళు పారి సముద్రంలోకి పారుతోంది. పులిగడ్డవద్ద చీలిన పాయకు, అసలునదికి మధ్యనున్న భాగమే దివిసీమ.

ఈనదికూడా గోదావరివలెనే నైరుతి ఋతుపవనాల ప్రారంభంలో, అంటే జూన్ నుంచి అక్టోబరులమధ్య. పూటుగా వుంటుంది. వరదలు వస్తాయి.

ఈనది కృష్ణా గుంటూరు జిల్లాలకు సరిహద్దుగా ఉంటుంది,

ఈ నదికి విజయవాడ వద్ద ఆనకట్ట నిర్మించి, అనేక కాలువలలోకి నీటిని మళ్లించి, వ్యవసాయానికి ఉపయోగపడేలా చేస్తున్నారు.

కృష్ణలోనికి మునియేరు అనే ఉపనదీ నందిగామ తాలూకా గుండా ప్రవహిస్తున్నది.

కృష్ణానది ప్రవాహంలో అనేక లంకలు ఏర్పడుతాయి. ఇటువంటి లంకలలో సారవంతమైన పంటలు పండుతాయి.

విజయవాడవద్ద ఆనకట్ట అధికారులు వేసిన అంచనాలనుబట్టి, సాలీనా కృష్ణా నదిలో 3,94 లక్షల ఎకరపు టడుగులనీరు ఖాయంగా ప్రవహించగలదని నిర్ణయించబడింది. ఇందులో నూటికి 47 వంతులు ఆంధ్రకు కేటాయించబడింది.

ఈ నదిపై ఆంధ్రకు సంబంధించినంత వరకూ విజయవాడలో ఉన్న దొక్కటే ఆనకట్ట. దీనిక్రింద పదిలక్షల ఎకరాలు సాగవుతున్నది.

ఉప్పుటేరు : కొల్లేరు సరస్సునుంచి సముద్రానికి నీరు మోసేది ఉప్పుటేరు. కృష్ణా, గోదావరి మధ్యగల లోయ ప్రాంతం 150 చదరపు మైళ్ళ మేరలో పారే నీరు చేరి కొల్లేరు సరస్సు అయింది. ఈ నది పొడవు 30 మైళ్ళు. వరదలకు ఈ నదికి పెట్టింది పేరు. పంట పొలాలను ముంచెత్తుతూంటుంది.

తమ్మిలేరు : తూర్పు కనుమల్లో పుట్టి, కొల్లేరులోపడే నదినే తమ్మిలేరు అంటారు. ఇది 68 మైళ్ల పొడవు వుంటుంది. ఇది ఏలూరు, నూజివీడు తాలూకాలమధ్య సరిహద్దుగా వుంటుంది.

బుడమేరు : బుడమేరు ముంపు పచ్చిం స్వరం అయుదు.

35 మైళ్ళు పొడవు. తూర్పు కనుమల్లో పుట్టి, కొల్లేరు సరస్సులో పడుతుంది. ఇది బెజవాడ తాలూకాలో వుంది. ఈ ముంపును అరికట్టడానికి అనేక స్కీములు, అనేక సంవత్సరాలనుంచి ఆలోచనలో వున్నాయి.

ఇదిగాక నక్కవాగు 52 మైళ్ళు, …రువాగు 65 మైళ్ళు, రొంపేరు 55 మైళ్ళు …డవు వున్నాయి.

## గుంటూరు జిల్లా

ఈ జిల్లాలో గుండ్లకమ్మ, ముసీ - రెండునదు లున్నాయి.

గుండ్లకమ్మ : ఇది కంభం చెరువువద్ద ప్రారంభమై వినుకొండ, ఒంగోలు తాలూకాలగుండా 145 మైళ్ళు ప్రవహిస్తుంది. ఈ నది పెద్దగా వ్యవసాయానికి ఉపకరించటంలేదు. కావల్సిన రైతులు దీనినీరు తోడుకొంటూరు.

ముసీనది : ఇది జిల్లాలోని దక్షిణ భాగంగుండా ప్రవహిస్తుంది. 70 మైళ్ళ పొడవు వుంది. ఇదికూడా పెద్దగా వ్యవసాయాని కుపకరించటంలేదు.

నాగులేరు : ఇది పల్నాడు తాలూకాలో వుంది. వినుకొండలోని నాయకురాలి కనుమవద్ద కొండల్లో పుట్టింది. ఈ నదిపై కొన్ని రాతి డాములు నిర్మించారు

## నెల్లూరు జిల్లా

ఈ జిల్లాలో పాలేరు (68 మైళ్ళు), మన్నేరు (75 మైళ్ళు), పిల్లివాగు (26 మైళ్ళు), పైడేరు (20 మైళ్ళు), పెన్న (370 మైళ్ళు), ఉప్పుటేరు (55 మైళ్ళు), స్వర్ణముఖి (99 మైళ్ళు), కళంగి (40 మైళ్ళు) అనే నదు లున్నాయి.

**పెన్నానది:** దీనినే 'ఉత్తరపినాకిని' అనికూడా పిలుస్తారు. జిల్లాలోని నదులన్నింటిలోనూ పెన్నానదియే ముఖ్యమైనది.

ఈ నది మైసూరు రాష్ట్రంలోని నందిదుర్గ పర్వతాల్లో పుట్టి అనంతపురం, కడప మండలములగుండా ప్రవహించి, సోమశిలవద్దనున్న వెలికొండల నడుమ నుండి నెల్లూరుజిల్లాలో ప్రవేశించి, వూటుకూరువద్ద సముద్రములో కలియుచున్నది. దీని పొడవు 370 మైళ్ళు. ఇందులో 25 మైళ్ళు మైసూరులో ప్రవహిస్తున్నది.

ఈ నది చాల ఎత్తయిన ప్రదేశం నుండి ప్రవహించుచున్నది. ఈ నది ఆంధ్రదేశంలో ప్రవేశించే స్థలం సముద్ర మట్టంకన్నా రెండువేల అడుగుల ఎత్తున వున్నది.

ఈ నదిలో నీటి ప్రవాహం తక్కువ. సంగంవద్ద తీసుకొన్న కొలతల ప్రకారం 20-30 లక్షల ఎకరపు టడుగుల నీటిని మాత్రమే వ్యవసాయానికి ఉపయోగించవచ్చును.

ఈ నది నీటివల్ల షుమారు 2 లక్షల ఎకరాల భూమి సాగవుతోంది.

**స్వర్ణముఖి:** దీని నిడివి 99 మైళ్ళు. త్రిపాతి పర్వతాల్లో పుట్టింది. రేణిగుంట వద్ద రాళ్ళకాల్వ అనే చిన్ననదివచ్చి దీనితో కలుస్తున్నది. పులికాట్ సరస్సుకు కొంచెం ఉత్తరంగా సిద్ధసారంవద్ద సముద్రంలో కలుస్తున్నది. ఈ నదికి వరదలు చాల అరుదు. ఈ నదినుంచి కొన్ని చెరువులకుకూడా నీరు సప్లయి అవుతున్నది.

**తుంగభద్ర:** ఇది పేరుకు కృష్ణ యొక్క ఉపనది అయినా, ఆంధ్రదేశ వ్యవసాయ అవసరాల దృష్ట్యా చాల ప్రాముఖ్యమైనది. సముద్ర మట్టానికి వెయ్యి అడుగుల పైభాగాలలో వుండే ప్రదేశాలకు నీరు అందించాలంటే యీనది ఒక్కటి మాత్రమే తోడ్పడుతుంది.

హగిరి అనేది తుంగభద్రకు ముఖ్యఉపనది. బళ్ళారి జిల్లాలో వుంది.

అలాగే పెన్నకు కూడా కుందేరు, సగిలేరు అనే ముఖ్యమైన ఉపనదులు వచ్చి కలుస్తాయి.

సగిలేరు కర్నూలుజిల్లా నల్లమల అడవుల్లో పుట్టి, బద్వేలు తాలూకాలో ఉత్తరకోనను ప్రవేశించి, బద్వేలు, సిద్ధవటం తాలూకాలగుండా ప్రవహించి పెన్నానదిలో పడుతున్నది.

సుప్రసిద్ధ ఆంధ్రుడు, సెంట్రల్ వాటర్ అండు పవర్ కమిషన్‌లో ప్రముఖ ఇంజనీరు అయిన శ్రీ కె.ఎల్.రావుగారు యీ నదుల గురించి వ్రాస్తూ, ఆంధ్రదేశంలోని నదీజలాలతో కోటి ఎకరాలను అదనంగా సాగులోకి తీసుకొని రావచ్చునని అన్నారు.

అయితే యీనదులపై ప్రాజెక్టులు నిర్మించిననాడే పైవిధంగా ఉపయోగించుకోవటానిక్కాని, విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేసుకోవటానిక్కాని సాధ్యపడుతుంది.

ఇందుకుగాను ఆంధ్రదేశములో ప్రస్తుతం ఉన్నప్రాజెక్టు లేమిటో, ఇకముందు కట్టవలసినవి ఏమిటో స్థూలంగా పరిశీలించాలి.

# ప్రస్తుతం ఆంధ్రలోవున్న ప్రాజెక్టులు - రిజర్వాయర్లు

నాగావళి: 1909 లో తోటపల్లివద్ద రెగ్యులేటరు నిర్మించబడింది. 22 మైళ్ళ పొడవు గల దీని కాలువ 28 వేల ఎకరాలు సాగుచేస్తుంది. 18 లక్షల ధన వ్యయంతో నిర్మించబడింది.

శ్రీకాకుళం మైనరు రివరు సిస్టం: వంశధార, లాంగుల్యా; గరువుల గడ్డ అనే చిన్న నదులపై కట్టబడిన ఆనకట్టల మూలంగా 67 వేల ఎకరాలు సాగవుతున్నాయి.

గోదావరి డెల్టా: ధవళేశ్వరం వద్ద ఆనకట్ట నాలుగు భాగాలుగా వుంది—ధవళేశ్వరం సెకన్ 4,839 అడుగులు, ర్యాలి సిస్టమ్ 2,859 అడుగులు, మద్దూరు సెక్షన్ 1,550 అడుగులు, వద్దేశ్వరం సెక్షన్ 2,601 అడుగులు. తూర్పు డెల్టాలో 450 చ. మైళ్ళకు, మధ్య డెల్టాలో 500 చ. మైళ్ళకు, పశ్చిమ డెల్టాలో వెయ్యి చ. మైళ్ళకు నీరు సరఫరా చేయబడుతున్నది.

ఈ కాలువల్లో సంవత్సరానికి 11 నెలలు బోట్లు తిరుగుతాయి. సమృద్ధిగా వ్యాపారం కూడా సాగుతుంది.

మధ్య డెల్టాలో యీ నదిపై గన్నవరం వద్ద అక్విడెక్టుకూడ నిర్మించబడింది. ఈ అక్విడెక్టును 8 నెలల్లో నిర్మించగలిగారు.

పోలవరం: అర్నంపల్లి లాకుకు అర మైలు దూరంలో బయలుదేరి వృద్ధగౌతమీ మీదుగా వెళ్ళి పోలవరంద్వీపాన్ని సాగు చేస్తున్నది. దీని క్రింద యీ జిల్లాలో 17½ వందల ఎకరాలు సాగవుతున్నాయి.

కృష్ణ ఆనకట్ట: గోదావరి ఆనకట్టను నిర్మించిన సర్ ఆర్థర్ కాటనే యీ ఆనకట్టను కూడా నిర్మించాడు. దీని పొడవు 6 ఫర్లాంగులు. తూర్పు డెల్టాలో 1,160 చ. మైళ్ళు, పశ్చిమ డెల్టాలో 950 చ. మైళ్ళు సాగుఅవుతాయి. తూర్పుడెల్టాలో ఏలూరుకాలువ గోదావరికి కలుపబడింది. పశ్చిమ డెల్టాలో కొమ్మమూరు కాలువ బకింగ్‌హాం కాలువలో కలుస్తోంది. ఈ కాలువలు వ్యవసాయానికి, సరుకుల రవాణాకు కూడా ఉపయోగిస్తున్నాయి. 1935లో పులిగడ్డ వద్ద అక్విడెక్టు కట్టబడి కృష్ణ తూర్పు కాలువ, నదిమీదుగా దివిసీమకు తీసుకొనిపోబడింది. ఈ నిర్మాణం జరిగేవరకు దివిసీమలో పంపింగ్ స్కీము మాత్రమే వుండేది. ప్రస్తుతం దివిసీమకు యీ కాలువద్వారా నీరు సప్లయి అవుతున్నది. ఈ అక్విడెక్టు ఇండియాలో వున్న అన్నిటికంటె పొడవైనది. 16 అడుగుల వెడల్పుగల రోడ్డు, 4 అడుగుల వెడల్పుగల కాలిబాటకూడా వున్నాయి.

ఈ కాలువ లన్నిటిలోనూ సంవత్సరానికి పది మాసాలు నీరుంటుంది. కాగా రవాణా సౌకర్యాలకుకూడా ఎక్కువగా ఉపయోగిస్తున్నాయి.

ఈ కాలువలక్రింద 9,30,000 ఎకరాలు సాగవుతున్నాయి (తూర్పు కాలువ మినహాయించి). ఈ నిర్మాణానికి 2.23 కోట్ల రూపాయలు వెచ్చించబడ్డాయి.

మునియేరు ప్రాజెక్టు: ఈ ప్రాజెక్టు 300 చ. మైళ్ళకు ఉపయోగపడుతూంది,

పోలంపల్లివద్ద యీ నదిపై నిర్మించిన ఆనకట్ట ఫలితంగా 26 వేల ఎకరాలు సాగవుతున్నాయి. మరో 2,800 ఎకరాలు సాగవటానికి సౌకర్యాలు పెంచబడ్డాయి.

పెన్నానది కాలువలు: ఈ నదిపై సంగంవద్ద, నెల్లూరువద్ద రెండు ఆనకట్టలు నిర్మించబడి వున్నాయి. సంగంవద్ద ఎడమవైపున త్రవ్వబడ్డ రెండు కాలువలు దువ్వూరు, కనిగిరి చెరువులకు; తూర్పుకు త్రవ్విన కాలువ నెల్లూరు చెరువుకు నీరు సరఫరా చేస్తున్నాయి. కనిగిరి చెరువు గత మద్రాసురాష్ట్రంలోని అన్ని చెరువులకన్నా పెద్దది.

నెల్లూరు ఆనకట్టనుంచి కుడివైపుకు త్రవ్విన కాలువ జిల్లాలోని అనేక చెరువులకు, ముఖ్యంగా సర్వేపల్లి చెరువుకు నీరు సరఫరా చేస్తున్నది. సంగం ఆనకట్ట ఎత్తు ఇటీవలనే ఒకఅడుగు పెంచబడింది. మొత్తం సాగవుతున్న భూమి 1,67,500 ఎకరాలు.

సగిలేరు ప్రాజెక్టు: సగిలేరునది సంవత్సరానికి 20 దినాలు మాత్రమే పారుతుంది. కలాసపాడువద్ద ఒక ఆనకట్ట నిర్మించి, ఆ నీటి నంతటినీ పది మైళ్ళ దూరానవున్న పోరుమామిళ్ళ చెరువులోనికి ప్రవహింపచేశారు. ఈ పదిమైళ్ళ కాలువనుంచి మధ్య మధ్య చిన్న కాలువలు త్రవ్వి కలాసపాడు, పెండ్లిమర్రి, పిడుగుపల్లె, అక్కిసెట్టిపల్లె చెరువులకు నీరు సరఫరా చేస్తున్నారు. ఈ నిర్మాణానికి 4½ లక్షల రూపాయలు ఖర్చు చేయబడ్డాయి. ఇది 1907లో నిర్మించబడింది.

మోపాడు ప్రాజెక్టు: మన్నేరు నదికి 70 అడుగుల ఎత్తున మట్టి కట్టలతో రిజర్వాయరు నిర్మించారు. 12,500 ఎకరాల సాగుకు అవసరమైన నీరు సప్లయి అవుతూంది. 24 లక్షలు ఖర్చుచేసి నిర్మించారు.

సుంకేశులఆనకట్ట: కర్నూలుకు 15 మైళ్ళ దూరంలో 1838లో నిర్మించారు. ఇక్కడ నుంచి త్రవ్విన కర్నూలు - కడప కాలువ క్రింద మొదట 2½ లక్షల ఎకరాల సాగుకు సరిపడు నీటిని కొనిపోయేటందుకు త్రవ్వబడింది. కాని మరమ్మతులు సరిగా చేయకపోవుటచేత ప్రస్తుతం లక్షఎకరాలు మాత్రమే సాగవుతున్నాయి. కుందూనదిపై సంతజూటూరు, రాజోలివద్ద ఆనకట్టలు కట్టి కర్నూలు-కడప కాలువకు నీటిని సప్లయి చేస్తున్నారు. ఈకాలువ క్రింద ముఖ్యంగా మెట్ట పంటలు పండించ బడుతున్నాయి.

తుంగభద్ర ప్రాజెక్టు: బళ్లారి జిల్లాలోని మల్లాపురం వద్ద మద్రాసు, హైదరాబాదు ప్రభుత్వాలు సమిష్టిగా 160 అడుగుల ఎత్తున, 7,942 అడుగులు పొడవున నిర్మించిన డాముఇది. ఈ రిజర్వాయరులో 29 లక్షల ఎకరపు టడుగుల నీరు నిల్వచేయవచ్చు. రెండువైపులా కాలువలున్నాయి. లోలెవెల్ కాలువక్రింద 2½ లక్షల ఎకరాలు సాగవుతున్నాయి. ఇందులో లక్షయకరాల భూభాగం మైసూరుకు దత్తం చేసిన బళ్లారి జిల్లాలో ఉంది.

ఈవిధంగా మన నదుల్లో ప్రవహిస్తున్న 15 కోట్ల ఎకరపు టడుగుల జల ప్రవాహంలోను మనకుఅయితే 2 కోట్ల

కన్నా ఎక్కువ వినియోగించుకో లేక పోతున్నాం. 1కోటి 70 లక్షల ఎకరాల పంట భూమిలో, నిజానికి పైనదుల మూలంగా 27లక్షల ఎకరాలకు మాత్రమే గ్యారంటీ నీటి సదుపాయాలున్నాయి.

కాబట్టి మన నీటివనరులను వినియోగం చేసుకోవాలంటే ఎన్నో ప్రాజెక్టులు నిర్మించాల్సివుంది. మళ్లీ శ్రీ కె. ఎల్. రావుగారినే ఉదహరించాలంటే 200కోట్ల రూపాయలు ఖర్చుచేసి 43 ప్రాజెక్టులు నిర్మించాల్సిన అవసరం ఉంది.

## నిర్మించవలసిన ప్రాజెక్టులు

### శ్రీకాకుళం, విశాఖజిల్లాలు

వంశధార: నదిపై మదనపురంవద్ద 65అడుగులఎత్తునమట్టితో ఒకడామునిర్మించవచ్చు. ఈరిజర్వాయరులో 4½ లక్షల ఎకరపు టడుగులనీరు నిల్వచేయవచ్చు. శ్రీకాకుళం జిల్లాలో 2-2½ లక్షల ఎకరాలకు కావలసిన నీరులభ్యమగుటయేగాక 50 వేల ఎకరాల్లో రెండవపంటకు నీటిని, ప్రస్తుతం సాగులోఉన్న 20వేల ఎకరాలకు సక్రమంగా నీటిసప్లయిని ఈప్రాజెక్టు గ్యారంటీ చేస్తుంది.

శ్రీకాకుళం జిల్లాలో నాగావళి పై నందివాడవద్ద ఆనకట్ట నిర్మించిన, 14 వేల ఎకరాలకు నూతనంగాను, ఆరువేల ఎకరాల నేటి ఆయకట్టుకు గ్యారంటీ నీటి సప్లయి జరుగుతుంది.

ఆదేనదికి తోటపల్లివద్ద కడికాల్వను త్రవ్వితే ఆరువేల ఎకరాలకు నీరు సప్లయి అవుతుంది.

జంఝావతి నదిపై రిజర్వాయరు కట్టినట్లయితే, 14 వేల ఎకరాలకు నూతనంగా నీటిని సరఫరా చేయవచ్చు. ప్రస్తుతం సాగులో నున్న 15 వేల ఎకరాలకు నీటి పారుదలను గ్యారంటీ చేయవచ్చు.

కందివలస వద్ద వేగావతిపై ఆనకట్ట నిర్మించినట్లయిన 15 వందల ఎకరాలకు నీరు అందచేయవచ్చు. నేడు సాగవుతున్న నాలుగువేల యకరాలకు నీరు శాశ్వతంగా సప్లయి చేయవచ్చు.

మామిడిపల్లి గెడ్డపై ఆనకట్ట కట్టిన, నూతనంగా 5 వేల ఎకరాలకు, నేడు సాగవుతున్న 2 వేల యకరాలకు నీరు సరఫరా అవుతుంది.

తాటపూడివద్ద గోస్తనీ నదిపై రిజర్వాయరు నిర్మించాలి. ఈ నిర్మాణం వల్ల నూతనంగా 7 వేల ఎకరాలకు, ఇపుడు సాగవుతున్న ఆరువేల ఎకరాలకు నీరు అందుతుంది.

బోయపాలెం వద్ద రిజర్వాయరు నిర్మాణం ఫలితంగా ప్రస్తుతం సాగవుతున్న 4 వందల యకరాలకే కాక అదనంగా వెయ్యి యకరాలకు నీరు సప్లయి అవుతుంది.

శారదపై గాడిగుమ్మివద్ద రిజర్వాయరు కట్టిన, 3 వేల ఎకరాలు కొత్తగా సాగవుతుంది. ఇపుడు సాగవుతున్న 70 ఎకరాలకు నీటి సప్లయి జరుగుతుంది.

అదే నదిపై గింటవ వద్ద రిజర్వాయరు నిర్మించిన 4,500 ఎకరాలకు నీరు అందుతుంది.

తిరిగి అదే నదిపై తులి రైల్వే వంతెన వద్ద మరో రిజర్వాయరు కట్టినట్లయితే 10 వేల ఎకరాలు నూతనంగా సాగులోకి వస్తాయి. ప్రస్తుతం సాగవుతున్న 15 వేల ఎకరాలకు నీరు గ్యారంటీగా సప్లయి అవుతుంది.

శారదా నదిపై రైవాడవద్ద రిజర్వాయరు నిర్మించాలి. ఫలితంగా నేడు సాగవుతున్న 6 వేల ఎకరాలకేగాక, నూతనంగా మరో 6 వేల ఎకరాలకు నీరు సరఫరా అవుతుంది.

అడ్డరుగడ్డపై సురిపాడువద్ద ఆనకట్ట కట్టాలి. ఫలితంగా నూతనంగా 1,500 ఎకరాలకు, ఇదివరకే సాగులోనున్న 300 ఎకరాలకు నీరు బాగా సరఫరా అవుతుంది.

సీతానగరంవద్ద ఆనకట్ట: (నాగావళి-స్వర్ణముఖి) నిర్మాణం జరిగిన పక్షంలో నూతనంగా 2,300 ఎకరాలకు, ప్రస్తుతం సాగవుతున్న 1,700 ఎకరాలకు నీరు సమృద్ధిగా అందుతుంది.

జటిగడ్డ పై రిజర్వాయరు నిర్మించినట్లయితే 7 వేల ఎకరాలు కొత్తగా సాగులోకి వస్తాయి. ఈవరకే సాగవుతున్న 3 వేల ఎకరాలకు నీరు పుష్కలంగా లభిస్తుంది.

## ఉభయ గోదావరులు

గోదావరినదిపై పోలవరంవద్ద ఒకమైలు పొడవునా, 190 అడుగులు ఎత్తునా ప్రాజెక్టు నిర్మించబడుతుంది. దీనినే రామపాదసాగర్ ప్రాజెక్టు అంటారు. ఈ ప్రాజెక్టు నిర్మాణంద్వారా ఏర్పడే రిజర్వాయరు ప్రమాణం మద్రాసు రాష్ట్రంలోని మెట్టూరు రిజర్వాయరుకు 8-9 రెట్లు, బక్రా రిజర్వాయరుకు 2 రెట్లకు పైబడి ఉంటుంది.

ఈ నదికి రెండువైపులా త్రవ్వబడే కాలువలకింద ఉభయ గోదావరులు, విశాఖపట్నం జిల్లాలలో 5 లక్షల ఎకరాల రెండవపంటతో కలుపుకొని మొత్తం 13 లక్షల 40 వేల ఎకరాల వరకూ సాగవుతాయి. అంతేకాక ప్రస్తుతం కృష్ణా, గోదావరీనదుల ఆయకట్టుక్రింద ఉన్న భూములలో 10 లక్షల ఎకరాలవరకూ రెండవపంటకు నీరు లభిస్తుంది.

డామ్ ఎత్తు 40-50 అడుగులకు పరిమితంచేసి ప్రాజెక్టు నిర్మించాలనే వాదనకూడా వుంది. ఈ విధంగాచేసినప్పుడుకూడా విశాఖ, గోదావరులలోని మెట్ట ప్రాంతాలలో 5 లక్షల ఎకరాలకు నీరు అందించవచ్చు. అంతేగాక, నేటి గోదావరి డెల్టాకు 1-2 లక్షల ఎకరాల వరకూ రెండవపంటకు నీరు సమృద్ధిగ సప్లయి చేయవచ్చు. ఈ పరిమితమైన ప్రణాళిక ప్రకారం రు. 25 కోట్లు ఖర్చు అవుతుంది.

శబరి నదిపై 100 అడుగుల ఎత్తున మట్టితో డామ్ నిర్మించబడవచ్చు. రెండవ పంట సమృద్ధిగా పండించవచ్చు. ఈ ప్రాజెక్టును సులువుగా నిర్మించవచ్చు. 6-9 కోట్ల రూపాయల ఖర్చు అవుతుంది.

వైనేరు నదిపై రిజర్వాయరు నిర్మించిన 7,700 ఎకరాలు అదనంగా సాగులోకి వస్తుంది.

ఎర్రకాల్వపై రాజవరంవద్ద ఆనకట్ట కట్టాలి. 3,000 ఎకరాలు అదనంగా సాగవుతుంది.

పంపానదిపై రిజర్వాయరు నిర్మాణం జరగాలి. 1వ పంట క్రింద 2వేల ఎకరాలు, 2వ పంట క్రింద వెయ్యి ఎకరాలు నూతనంగాసాగులోకి రావటమేగాక, ప్రస్తుతం సాగులోనున్న 8 వేలఎకరాలకు గ్యారంటీ నీటి సప్లయి జరుగుతుంది.

తాండవ రిజర్వాయరు కట్టినట్లయిన, దానిలో నిల్వచేసే నీటితో 10 వేల ఎకరాలు మొదటిపంట, 4 వేల ఎకరాలు రెండవపంట అదనంగా పండించవచ్చు. నేడు సాగవుతున్న 15 వేల ఎకరాలకు నికరంగా నీరు అందుతుంది.

తొర్రగడ్డ పంపింగుస్కీము అమలు జరిపినట్లయితే అదనంగా 13 వేల ఎకరాలకు నీరు అందచేయవచ్చు.

గోదావరి ఆనకట్ట షట్టర్ల ఎత్తు ఇంకా 3-5 అడుగులు పెంచిన, మరో 75 వేల ఎకరాలకు నీరు సప్లయి అవుతుంది.

ఏలేరు రిజర్వాయరు నిర్మాణమే గనుక పూర్తి అయినట్లయితే, 36వేల ఎకరాల్లో రెండవ పంటకు నీరు లభ్యమవుతుంది. 15 వేల ఎకరాల రెండవ పంటతో కలుపుకొని, ప్రస్తుతం సాగులోనున్న 80 వేల యకరాలకు నీరు నికరంగా సప్లయి అవుతుంది.

ఎర్ర కాల్వపై అప్పల రాయుడు గూడెంవద్ద మరో రిజర్వాయరు కనుక నిర్మాణం చేసినట్లయితే 46వేల ఎకరాలు నూతనంగా సాగులోకి తీసుక రావచ్చు. 8 వేల యకరాల నీటి ఆయకట్టుకు నీటి సప్లయి గ్యారంటీ చేయవచ్చు.

## కృష్ణా జిల్లా

ప్రస్తుతం కృష్ణ ఆనకట్ట పైనుండి నీరు పారిపోయి వ్యర్థం అయిపోతోంది. నేటి ఆనకట్టకు ఎగువన 59అడుగుల దూరంలో రెగ్యులేటరు నిర్మించబడుతుంది. ఇందువల్ల మరో లక్ష ఎకరాలు అదనంగా సాగులోకి తీసుక రావచ్చు.

రెగ్యులేటరుతో పాటు రోడ్డు బ్రిడ్జి కూడా నిర్మించబడుతుంది. ఫిబ్రవరి 13వ తేదీన ఈ రోడ్డు రెగ్యులేటరు బ్రిడ్జికి శంకుస్థాపనచేశారు. దీనివల్ల మద్రాసుకు రాకపోకలు ఎంతో సులభమవుతాయి. దాని కయ్యే ఖర్చు 2.95 కోట్లు.

బుడమేరు ప్రాజెక్టు నిర్మాణం జరిగినట్లయితే, ముంపు నుంచి వేల ఎకరాలను కాపాడవచ్చు. 15 వేల ఎకరాలను సాగు చేయవచ్చు.

ఉప్పుటేరును అభివృద్ధి చేసినట్లయితే మరో 25 వేల యకరాలకు నీరు అందచేయవచ్చు.

తమ్మిలేరు ప్రాజెక్టు నిర్మాణం వల్ల 10 నుండి 20 వేల ఎకరాలకు నీటిని సరఫరా చేయవచ్చు.

కృష్ణానదిపై పులిచింతలవద్ద 150 అడుగుల ఎత్తున డామ్ నిర్మించవచ్చు. దీనినే పులిచింతల ప్రాజెక్టు అంటారు. దీనిప్రమా

ణం $37\frac{1}{2}$ లక్షల ఎకరపుటడుగులు. ఈ ప్రాజెక్టు నిర్మాణంలోని ప్రధానఆశయం నందికొండ ప్రాజెక్టునకు దిగువనున్న నీటిని నిల్వచేయుటయే. ఇందువల్ల 8 లక్షల ఎకరాలను కొత్తగా సాగుచేయుటయే కాక రెండుమూడులక్షల ఎకరాలవరకు రెండవ పంటకు నీరు యివ్వవచ్చు. ఈ భూమిని నందికొండ ప్రాజెక్టువల్లకూడా సాగుచేయవచ్చు. కాని పులిచింతలవల్ల యీ మేర సాగుఆయితే, నందికొండ నీటిని మరీ దిగువన ఉన్న మరికొన్ని కొత్త ప్రదేశాలకు అందంచే అవకాశం వుంది.

కృష్ణానదికి హైదరాబాదు వైపున నందికొండ వద్ద, ఆంధ్రరాష్ట్రం వైపున గుంటూరు జిల్లాలోని మాచెర్లవద్ద 375 అడుగుల యెత్తున కాంక్రీటు డామ్ నిర్మించాలి. ఈ ప్రాజెక్టు రిజర్వాయరులో నిల్వచేయగల నీటి ప్రమాణం 92 లక్షల యకరపు టడుగులు. తెలంగాణా, యూనియను ఆంధ్రలలో త్రవ్వబడే కాలువల క్రింద 35 లక్షల ఎకరాలు సాగుకాగలదు. ఇందులో 27 లక్షలు యూనియన్ ఆంధ్రదేశంలోనూ, 8 లక్షలు తెలంగాణాలోనూ సాగవుతాయి.

నందికొండ కాలువ సుమారు 180 - 200 మైళ్ళ పొడవువుండి, సోమశిలకు దిగువన ఒకటి-రెండుమైళ్ళదూరానపెన్నలో కలుస్తుంది. కృష్ణా డెల్టాలో రెండవ పంటకు నీరు అందించి, యెగువ భాగంలో కొత్తగా భూములను సాగు క్రిందకు తెస్తుంది.

ఈ ప్రాజెక్టు ప్రపంచంలోని గొప్ప ప్రాజెక్టులలో ఒకటిగా పేర్కొనబడుతున్నది. ఆంధ్ర భాగపు నిర్మాణ ఖర్చు 80 కోట్ల రూపాయలు. అయితే క్రమంగా కట్టుకోవచ్చు.

గుండ్లకమ్మ నదిపై తంగిరాలవద్ద రిజర్వాయరు నిర్మాణం చేయాలి. 30 వేల ఎకరాలు నూతనంగా సాగులోకి వస్తాయి.

## నెల్లూరు జిల్లా

పెన్నానది పై సోమశిలవద్ద నూరు అడుగుల ఎత్తున డామ్ నిర్మించటంవల్ల అదనంగా పెన్నానదిలో ఉన్న నీటినంతా ఉపయోగించుకోవచ్చు. నెల్లూరుజిల్లాలో రెండు, మూడు లక్షల ఎకరాలకు రెండవపంటకు నీటిని సరఫరా చేయగలదు. ఖర్చు 9 కోట్లు. దీని ఎత్తు నిర్ణయించటంలో కడపజిల్లాలో పెన్న క్రింద సాగయ్యేభూములు నష్టపడకుండా జాగ్రత్తలుతీసుకొనటం అవసరం.

## అనంతపురం జిల్లా

తుంగభద్ర హైలెవెల్ కాలువను, హాస్పేటకు మూడుమైళ్ళ దూరంలో తుంగభద్రపైన 160 అడుగుల ఎత్తున డాక్ నిర్మించేతే అనంతపురం, బళ్ళారి, కర్నూలు, కడప జిల్లాలలో చాల ప్రాంతానికి ఇరిగేషన్ వనరులు ఏర్పడగలవు. ఈ కాలువ ఒక్కటి మాత్రమే గుంతకల్లు, తాడిపత్రి పులివెందుల మున్నగు ప్రాంతాలకు నీటిని సరఫరా చేయగలదు. దిగువను చిన్న చిన్న అడ్డుకట్టలు కట్టి యీ నీటిని ఉరవకొండ ప్రాంతానికి కూడా పంపవచ్చు. గండికోట ప్రాజెక్టుకుకూడా నీటిని సప్లయి

చేయవచ్చు. మొత్తం 2-3 లక్షల ఎకరాలను సాగులోకి తీసుకొని రావచ్చు.

చెన్నరాయలగుడి రిజర్వాయరు నిర్మాణంవల్ల 1,200 ఎకరాలు మొదటి పంట క్రింద, 400 ఎకరాలు రెండవపంట క్రింద అదనంగా సాగవుతాయి.

ఎగువపెన్నారు ప్రాజెక్టు కట్టినట్లయితే 6 వేల ఎకరాలు సాగులోకి వస్తాయి.

భైరవానితిప్ప ప్రాజెక్టు నిర్మాణంతో 8 వేల ఎకరాలు సాగుచేయవచ్చు.

### కడప జిల్లా

గండికోట ప్రాజెక్టు పెన్నా నదిపై జమ్ములమడుగుకు 2 మైళ్ళ ఎగువన నిర్మితమవుతుంది. 55 అడుగుల ఎత్తుగల యీ ప్రాజెక్టు 15 లక్షల ఎకరపుటడుగుల నీటిని నిలువచేస్తుంది. జమ్ములమడుగుకు, కడప జిల్లాలోని తదితర ప్రాంతాలకు లక్షన్నర ఎకరములకు నీటినిస్తుంది. ఇందులో చాల భాగం సిద్ధేశ్వరం కాలువనుంచి, లేదా కర్నూలు - కడప కాలువనుంచి సాగు కాగలదు.

కర్నూలు-కడప కాలువను వెడల్పు చేయుటంద్వారా కర్నూలు - కడప జిల్లాలకు 1-1½ లక్షల ఎకరాల సాగుకు ఉపకరించవచ్చు. ఈకాలువక్రింద 2½ లక్షల ఎకరాలు సాగు కావలసిఉంటే, మేటలు వేయటంవలన, ఇపుడులక్ష యకరాలు మాత్రమే సాగవుతున్నది. తగు మార్పులు చేస్తే రెండేండ్లలోపునే గండికోట ప్రాజెక్టుక్రింద సాగుకావలసిన భూములకు నీటిని సరఫరా చేయవచ్చు.

దిగువసగిలం ప్రాజెక్టు కట్టినట్లయితే 3 వేల ఎకరాలను సాగులోకి తీసుకొని రావచ్చు.

### చిత్తూరు జిల్లా

కల్యాణి రిజర్వాయరు కట్టడంవల్ల నిల్వచేయగలిగే నీటితో 200 ఎకరాల మొదటి పంట, 800 ఎకరాల రెండవ పంట పండించవచ్చు.

### కర్నూలు జిల్లా

గాజులదిన్నె ప్రాజెక్టు నిర్మించడం ద్వారా 5,000ఎకరాల్లో మొదటిపంటకు, 3000 ఎకరాల్లో రెండవ పంటకు కావలసిన నీరు లభ్యమవుతుంది.

సిద్ధేశ్వరం ప్రాజెక్టును కృష్ణానదిలో తుంగభద్రానది కలిసే చోటుకు దిగువగా, 10 మైళ్ళలోవున్న సిద్ధేశ్వరంవద్ద 3,250 అడుగుల పొడవున 90 - 130 అడుగుల ఎత్తున నిర్మించాలి. ఎత్తు అంతకు మించితే కర్నూలు పట్టణం మునిగిపోయే ప్రమాదం వుంది.

నీటిని ప్రక్క కాలువల ద్వారాగాని, లేదా పెద్ద గొట్టాల ద్వారా గాని 4 మైళ్ళ దూరం తీసుకొని వెళ్ళి,కుందేరుకు రెండు వైపులా కాలువలను త్రవ్వి వాటికి పెట్టవచ్చు. కర్నూలు - కడప కాలువ క్రింద సాగవుతున్న భూములను ఆనుకొని ఉన్న భూములకు యీ కాలువలు నీటిని సరఫరా చేయగలవు. ఈ కొత్త కాలువల క్రింద 3 లక్షల ఎకరాల వరకూ సాగు కాగలదు. ఇందులో మూడింట ఒకవంతు మాగాణి పంట, రెండు వంతులు

మెట్ట పంటలు పండించవచ్చు. ఈ ప్రాజెక్టులో ఉన్న సౌకర్యం అల్లా కర్నూలు, కడప జిల్లాలలోని కాటక ప్రాంతాలకు నీరు సరఫరా అయి, అవి సస్యశ్యామలం కాగలవు. దీని మూలమున కుందేరుకు నీరు బాగా సరఫరా అయి, దానినుంచి పెన్నకు నీరు చేరి, పెన్నకు దక్షిణంగా 4 లక్షల ఎకరాలు సాగు కాగలదు.

ఈ 43 ప్రాజెక్టులూ నిర్మించుకుంటే తెలుగుగడ్డ సస్యశ్యామల మవుతుంది. శ్రీకాకుళం, విశాఖ జిల్లాలు వెనకబడి వుండవు; రాయలసీమ జిల్లాలు కరువుతో కృంగిపోవాల్సిన పనీ లేదు. మనం కడుపునిండా తిని, ఇతర రాష్ట్రాలకు ఇంత పంపించవచ్చు.

మొత్తం కోటి ఎకరాలను అదనంగా సాగులోకి తీసుకొనిరావచ్చు. 50 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని కూడా ఉత్పత్తి చేసుకోవచ్చు.

"ఒడలు తెలియని పరవశంబున
కదలిపోరదు నదుల జలముల
తెలుగు పొలముల మరలజేసీ
నిలుపుకొందము లక్ష్మి నింటను
పాడరా తెలుగువాడా"

—కొండేపూడి



# వ్యవసాయం

చలసాని వాసుదేవరావు

ఆంధ్రరాష్ట్రంలో అత్యధిక సంఖ్యాక ప్రజానీకానికి వ్యవసాయమే జీవనాధారం. ఆంధ్ర జిల్లాల మొత్తం జనాభా 2 కోట్ల 4½ లక్షలు. *

ఈ జనాభాలో గ్రామాలలో నివసించేవారు 1 కోటి 73 లక్షలు—అంటే మొత్తం జనాభాలో నూటికి 84 అన్నమాట. ప్రధానంగా వ్యవసాయంపై జీవించేవారు 1 కోటి 45 లక్షలు—అంటే మొత్తం జనాభాలో నూటికి 71 మంది, గ్రామ జనాభాలో నూటికి 83 మంది అన్నమాట.

ప్రక్క పేజీలోని పట్టికలో 1951 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం, వివిధజిల్లాలలోని జనాభాలో ఎందరు వ్యవసాయమే వృత్తిగా జీవిస్తున్నారో వివరిస్తుంది.

ఈ విధంగా మన రాష్ట్రంలోని అత్యధిక ప్రజానీకానికి వ్యవసాయమే ప్రధాన వృత్తి గావడమే గాకుండా, వ్యవసాయం మీద ఆధారపడిన జనాభా క్రమక్రమంగా పెరుగుతూ వచ్చింది. ఈ క్రింది అంకెలు యీ విషయాన్ని నిరూపిస్తాయి:

| సంవత్సరం | ఒక ఎకరంపై ఆధార పడిన జనాభా |
|---|---|
| 1911 | 288 |
| 1921 | 313 |
| 1931 | 315 |
| 1941 | 346 |
| 1951 | ... |

('ఆంధ్ర ప్రజలు—సిరిసంపదలు' పేజీ 18)

## వ్యవసాయ జనాభా వర్గీకరణ

1951 సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం వ్యావసాయిక జనాభాను నాలుగు తరగతులుగా విభజించడం జరిగింది. ఆ తరగతులు ఏవంటే (1) పూర్తిగా స్వంత

* ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలకు ప్రత్యేకంగా సంఖ్యా వివరాలు లేవు. అందుచేత ఈ ప్రాంతపు జనాభా మొత్తం (విభజనకు పూర్వం) బళ్ళారి జిల్లాలో మూడవవంతు ఉంటుందని అంచనావేసి పైలెక్కలు తయారుచేయబడ్డాయి. ఈ అధ్యాయంలో ఇవ్వబడిన ఈ ప్రాంతానికి సంబంధించిన వివిధ అంచనాలను ఇదే విధంగా బళ్ళారి జిల్లాలో మూడవవంతు విడదీసి ఇవ్వబడ్డాయి.

| జిల్లా | మొత్తం జనాభా | గ్రామాలలో నివసించే వారి జనాభా | మొత్తం జనాభాలో గ్రామ జనాభా శాతం | వ్యవసాయంపై ప్రధానంగా ఆధారపడే వారి జనాభా | మొత్తం జనాభాలో వ్యవసాయ జనాభా శాతం | గ్రామీణ జనాభాలో వ్యవసాయ జనాభా శాతం |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 21,23,136 | 19,32,351 | ... | 16,36,451 | ... | ... |
| విశాఖపట్నం | 20,72,698 | 17,67,840 | ... | 14,67,120 | ... | ... |
| తూర్పుగోదావరి | 24,14,808 | 19,54,662 | ... | 16,59,730 | ... | ... |
| పశ్చిమగోదావరి | 16,97,727 | 13,66,458 | ... | 12,44,876 | ... | ... |
| కృష్ణా | 17,79,484 | 14,09,392 | ... | 11,56,245 | ... | ... |
| గుంటూరు | 25,49,996 | 20,48,075 | ... | 17,72,833 | ... | ... |
| నెల్లూరు | 17,95,632 | 15,91,993 | ... | 13,02,784 | ... | ... |
| (ఎ) కోస్తాజిల్లాల మొత్తంజనాభా | 1,44,33,481 | 1,20,70,771 | 84.0 | 1,02,40,039 | 71 | 84 |
| కడప | 11,61,731 | 10,27,502 | ... | 7,52,795 | ... | ... |
| కర్నూలు | 12,70,843 | 10,70,625 | ... | 8,21,555 | ... | ... |
| అనంతపురం | 13,61,556 | 11,39,998 | ... | 9,77,407 | ... | ... |
| చిత్తూరు | 18,10,377 | 16,41,043 | ... | 13,61,681 | ... | ... |
| బళ్ళారి (మూడవవంతు) | 4,14,508 | 3,24,724 | ... | 2,92,534 | ... | ... |
| (బి) రాయలసీమ జిల్లాల మొత్తం జనాభా | 60,19,015 | 52,03,892 | 86.5 | 42,05,972 | 70 | 81 |
| మొత్తం ఆంధ్రరాష్ట్ర జనాభా | 2,04,52,496 | 1,72,74,663 | 84.0 | 1,44,46,011 | 71 | 84 |

భూమి కల్గిగాని లేక ప్రధానంగా స్వంత భూమి కల్గియున్నట్టిగాని భూకామందులు, వారిపై ఆధారపడినవారు (Cultivators of land wholly or mianly owned and their dependents), (2) స్వంతభూమి అసలే బొత్తిగా లేనట్టి లేదా వున్నా, అట్టి ఆస్తి ప్రధానంగానట్టి వ్యవసాయదారులు, వారిపై ఆధారపడిన, వారు(Cultivators cf land wholly or mainly unowned and their dependents), (3) వ్యవసాయ కూలీలు, వారిపై ఆధారపడినవారు (Cultivating Labourers and their dependents), (4) తమ భూములను స్వంతసాగు చేయని భూకామందులు, మక్తాలు, కౌలు శిస్తులు మీదవచ్చే ఆదాయంపై ఆధారపడినవారు (Non-cultivating owners of land, agricultural rent receivers, and their dependents).

ఆంధ్రరాష్ట్రంలో వ్యావసాయిక జనాభా యీ క్రింది విధంగా విభజింపబడినట్లు 1951 జనాభా లెక్కలు తెల్పుతున్నాయి:

| | | |
|---|---|---|
| I | స్వంత భూములు కల్గిన భూకామందులు | 83,73,682 |
| II | స్వంత భూములు లేని కౌలుదార్లు | 14,77,945 |
| III | భూములులేని వ్యవసాయ కూలీలు | 40,96,985 |
| IV | స్వంత వ్యవసాయం చేయని భూకామందులు | 4,97,400 |

పై లెక్కలను బట్టి స్వంత భూమి కల్గిన భూకామందులు, మొత్తం వ్యవసాయంపై ఆధారపడిన జనాభాలో దాదాపు నూటికి 61½ వరకూ వున్నారు. స్వంతభూములు లేనట్టికౌలుదార్లు నూటికి పది మందికి పై చిల్లర వున్నారు. సెంటు భూమికూడ లేకుండా కేవలం రెక్కల మీద ఆధారపడి జీవించే వ్యవసాయ కూలీలు నూటికి 28 మంది వరకు వున్నారు. జిల్లాలవారీగా యీ లెక్కలు ప్రక్క పేజీలోని పట్టికలో వున్నాయి.

అయితే యీ లెక్కలు గ్రామాల్లోని నేటి పూర్తి పరిస్థితులను తెల్పడంలేదు. స్వంతభూములు కల్గిన భూకామందులు నూటికి 61½ మంది వున్నారంటే, వీరందరూ తమ స్వంత భూమిమీదవచ్చే ఆదాయంతోనే జీవితాన్ని గడుపుకుంటున్నారని చెప్పడానికి వీలులేదు. కుంటో, సెంటో స్వంతభూమి కల్గిన నిరుపేదలైన భూకామందులు చాలమంది వున్నారు. వాస్తవానికి అట్టివారు ప్రధానంగా తమ స్వంతభూమిపై వచ్చే ఆదాయంతోనే జీవించడంలేదు. ప్రధానంగా వ్యవసాయకూలీ వృత్తిగాని లేదా మరో పనిగాని చేసుకుంటూ జీవిత యాత్ర నడిపేవారు అట్టివారిలో అనేక మంది వున్నారు అందుచేత 1951 జనాభా లెక్కలప్రకారం తేల్చబడిన స్వంత భూకామందులందరూ ప్రధానంగా తమ భూమిపైవచ్చే ఆదాయంతోనే జీవించుతున్నవారు కాదు. ఈ తరగతిలో స్వంత భూమి కొద్దిగా వుండి ప్రధానంగా ఆభూమిపై కుటుంబపోషణజరగక, ప్రధానంగా కూలివృత్తి చేసుకొనే వ్యవసాయ కూలీలుగూడ చేర్చబడ్డారు. అందుచేత 1951 జనాభా లెక్కలప్రకారం స్వంత భూమి కల్గిన భూకామందుల సంఖ్య

| జిల్లా | స్వంత భూములుకల్గిన భూస్వామందులు | స్వంతభూములు లేని కౌలుదార్లు | భూములులేని వ్యవసాయ కూలీలు | స్వంత వ్యవసాయం చేయని భూస్వామందులు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 9,38,882 | 2,24,518 | 4,34,143 | 38,808 |
| విశాఖపట్నం | 9,57,595 | 2,07,077 | 2,83,355 | 19,093 |
| తూర్పుగోదావరి | 6,37,780 | 2,30,302 | 7,17,814 | 73,834 |
| పశ్చిమగోదావరి | 4,96,717 | 1,91,082 | 5,00,931 | 56,148 |
| కృష్ణా | 6,49,586 | 85,115 | 3,78,516 | 43,028 |
| గుంటూరు | 10,47,822 | 1,02,393 | 5,58,649 | 63,969 |
| నెల్లూరు | 7,54,657 | 78,447 | 4,15,720 | 53,960 |
| కోస్తాజిల్లాల మొత్తం | 54,83,039 | 11,18,934 | 32,89,128 | 3,48,840 |
| కడప | 5,39,659 | 43,914 | 1,42,239 | 26,983 |
| కర్నూలు | 5,35,817 | 40,629 | 1,95,265 | 49,864 |
| అనంతపురం | 6,54,211 | 1,02,745 | 1,94,343 | 25,108 |
| చిత్తూరు | 9,56,796 | 1,48,384 | 2,21,412 | 35,089 |
| బళ్ళారి | 2,04,159 | 23,239 | 54,599 | 10,537 |
| రాయలసీమజిల్లాలమొత్తం | 28,90,642 | 3,58,911 | 8,07,858 | 1,47,581 |
| ఆంధ్రరాష్ట్రం మొత్తం | 83,73,681 | 14,77,845 | 40,96,986 | 4,96,421 |

హెచ్చుగానూ, వ్యవసాయకూలీల సంఖ్య తక్కువగానూ తేల్చబడింది. కొద్దిగా స్వంతభూమి వున్నప్పటికీ ప్రధానంగా వ్యవసాయకూలి పనిచేసుకొంటూ జీవించే నిరుపేదలైన భూఖామందులనుగూడ వ్యవసాయకూలీలుగా పరిగణించితే, 1951 జనాభా లెక్కలలో చూపినట్లుగా వ్యవసాయకూలీల సంఖ్య నూటికి 28 వంతులు గాకుండా నూటికి 40-50 మధ్య వుండేది. వ్యవసాయకూలీల స్థితిగతులను, వేతనాలను గూర్చి విచారించేందుకు కేంద్ర ప్రభుత్వం నియమించిన విచారణకమిటీ, వ్యవసాయ జనాభావర్గీకరణమునుగూర్చి, ఆ పద్ధతి ననుసరించి తయారుచేసిన అంచనాలు యీ విషయాన్నే తెల్పుతున్నాయి. ప్రధానంగా వ్యవసాయకూలీ వృత్తిమీద ఆధారపడి, కొద్దిగా స్వంతభూమి కల్గిన నిరుపేదలను కూడ భూఖామందులలో లెక్కించకుండా, ఆకమిటీ వ్యవసాయకూలీలుగానే గుర్తించింది. అందుచేత 1951 జనాభా లెక్కలలో తెల్పబడినట్లుగా కాకుండా, స్వంతభూమికల్గిన భూఖామందులసంఖ్య తక్కువగానూ, వ్యవసాయకూలీల సంఖ్య హెచ్చుగానూ ఆకమిటీ రిపోర్టులో యివ్వబడింది. ఆకమిటీ రిపోర్టులో యివ్వబడిన వ్యవసాయ జనాభా వర్గీకరణమే వాస్తవానికి దగ్గరలోవుందని చెప్పవచ్చును. ఆకమిటీ విచారణ ప్రకారం ఆంధ్రజిల్లాలలో వ్యవసాయ జనాభా వర్గీకరణ యీ క్రిందివిధంగా వుంది:

1వ జోన్ (సర్కారుజిల్లాలు) లో విచారించబడిన మొత్తం వ్యవసాయ కుటుంబాలు: 4,425 లో

| | |
|---|---|
| (అ) స్వంతభూమికల్గిన భూఖామందులు | 1,554 |
| (ఆ) వ్యవసాయ కూలీలు | 2,555 |
| (ఇ) కౌలుదార్లు | 316 |

పై లెక్కలనుబట్టి వ్యవసాయ జనాభాలో భూఖామందులు సుమారుగా నూటికి 35 వంతులున్నూ, వ్యవసాయ కూలీలు నూటికి 57 నుండి 58 వరకూ వున్నట్టు తేలుతోంది.

2వ జోన్ (రాయలసీమజిల్లాలు) లో విచారింపబడిన మొత్తం వ్యవసాయ కుటుంబాలు 1,654. అందులో:

| | |
|---|---|
| (అ) భూఖామందులు | 580 |
| (ఆ) వ్యవసాయ కూలీలు | 1,016 |
| (ఇ) కౌలుదార్లు | 58 |

ఈ జోన్‌లో భూఖామందుల కుటుంబాలు నూటికి 35 వంతులున్నూ, వ్యవసాయ కూలీల కుటుంబాలు నూటికి 60 వంతులకుపైగా వున్నట్లు తేలుతూంది.

కాబట్టి ఆంధ్రజిల్లాలలో స్థూలంగా వ్యవసాయ జనాభా వర్గీకరణ, యీ క్రింది విధంగా వుందని చెప్పవచ్చును:

| తరగతి | వ్యవసాయ జనాభాలో శాతం |
|---|---|
| (అ) ప్రధానంగా స్వంత భూములపై ఆధారపడిన భూఖామందులు | 40-35 |

| తరగతి | వ్యవసాయ జనాభాలో శాతం |
|---|---|
| (అ) ప్రధానంగా వ్యవసాయ కూలివృత్తి మీద ఆధారపడిన వ్యవసాయకూలీలు (భూమి లేనట్టి, భూమి కల్గినట్టి) | 50–55 |
| (ఇ) కౌలుదారులు | 7–8 |
| (ఈ) స్వంతసాగు చేయని భూఖామందులు | 3–2 |
| | 100–100 |

గత 50 సంవత్సరాలలో వ్యవసాయ జనాభా వర్గీకరణ యెలా మారుతూ వచ్చిందో యీక్రింది పట్టిక తెల్పుతుంది :

పోషణకు చాలీచాలని ఆదాయం వచ్చే పేద రైతులు. మద్రాసురాష్ట్రంలోని భూఖామందుల క్షేత్రాలను, ప్రక్కపేజీలోనిపట్టికలో యీక్రిందితరగతులుగా విభజించి, మద్రాసుప్రభుత్వం ప్రచురించింది:

ప్రక్కపేజీలో యివ్వబడిన లెక్కలను బట్టి కుటుంబ పోషణ కూడ జరగనట్టి చిన్న భూఖామందులు,మొత్తంభూ ఖామందులలో అధికసంఖ్యాకులుగా వున్నట్లు తెలుస్తోంది. కాని పెద్ద భూస్వాముల చేతులలో భూమి ఏవిధంగా కేంద్రీకరింపబడింది తెలియడంలేదు. 1350వ ఫసలీ (1940సంవత్సరం)లో మద్రాసు రాష్ట్రంలోని రైతువారీ ప్రాంతంలోని భూఖామందుల క్షేత్రాలను, వాటిపై చెల్లించబడే శిస్తులనుబట్టి మద్రాసుప్రభుత్వం వివిధ తరగతులుగా విభజించింది. కొలదిమంది

| వ్యవసాయ జనాభా తరగతి వివరం | 1901 (ప్రతి వంద మందికి) | 1911 (ప్రతి వంద మందికి) | 1921 (ప్రతి వంద మందికి) | 1931 (ప్రతి వంద మందికి) | 1951 (ప్రతి వంద మందికి) |
|---|---|---|---|---|---|
| స్వంతభూములుకల్గిన భూఖామందులు | 50.3 | 44.9 | 43.0 | 42.4 | 61.5 |
| స్వంతసాగు చేసేవారు | 48.4 | 42.6 | 38.1 | 39.0 | 58.0 |
| కౌలుకిచ్చేవారు | 1.9 | 2.3 | 4.9 | 3.4 | 3.5 |
| కౌలుదార్లు | 15.2 | 21.1 | 25.3 | 13.6 | 10.2 |
| వ్యవసాయ కూలీలు | 34.5 | 34.0 | 31.7 | 42.9 | 28.3 |
| మొత్తం | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 |

(ఆయా సంవత్సరాల జనాభా లెక్కలనుండి)

## భూఖామందుల క్షేత్రాల వర్గీకరణ

స్వంత భూములు కల్గిన భూఖామందులలో నూటికి ఏభైమందికిపైగా కుటుంబ భూస్వాముల చేతులలో భూమి ఎలా కేంద్రీకరించబడివుందో ఆలెక్కలు కొంతవరకు ప్రక్కపేజీలోని పట్టిక 2. తెల్పుతుంది.

| క్షేత్రం విస్తీర్ణం | అట్టి క్షేత్రం కలిగినవారి సంఖ్య (భూఖామందుల లో నూటికి) |
|---|---|
| 2 ఎకరాల లోపు | 29.8 |
| 2—5 ఎకరాల మధ్య | 46.7 |
| 5—10 ,, | 12.2 |
| 10—15 ,, | 4.8 |
| 15—25 ,, | 3.1 |
| 25—50 ,, | 1.8 |
| 50—100 ,, | 0.9 |
| 100—200 ,, | 0.4 |
| 200—300 ,, | 0.2 |
| 300—500 ,, | 0.1 |
| 500—1000 ,, | ... |
| | 100.0 |

(1951 జనాభా రిపోర్టు మద్రాసురాష్ట్రం - వాల్యూమ్ మూడు, 1 వ భాగం)

| ఎంత శిస్తు చెల్లించేది | మొత్తం పట్టాదారుల సంఖ్య | పట్టాదారులకింద ఉన్న మొత్తం భూమి (ఎకరాలలో) | సగటున పట్టాదారులభూమి (ఎకరాలలో) |
|---|---|---|---|
| 1 రూపాయి లోపు | 14,65,575 | 9,28,778 | 0.63 |
| 1 రూపాయిపైనా 10 రూ. ల లోపు | 36,52,536 | 1,03,26,170 | 2.83 |
| 10 రూ. ల పైనా 30 ,, | 11,56,992 | 75,85,557 | 6.56 |
| 30 ,, 50 ,, | 2,34,949 | 26,50,477 | 11.28 |
| 50 ,, 100 ,, | 1,20,102 | 24,05,432 | 20.03 |
| 100 ,, 250 ,, | 44,949 | 17,83,712 | 39.68 |
| 250 ,, 500 ,, | 9,973 | 7,93,800 | 79.59 |
| 500 ,, 1000 ,, | 2,079 | 5,35,175 | 199.76 |
| 1000 రూపాయల పైన | 2,069 | 6,30,403 | 304.54 |
| | 66,89,824 | 2,76,39,504 | 4.13 |

(Source: Monograph of Rural problems in Madras, Page 67)

పై లెక్కల ప్రకారం మద్రాసు రాజధానిలోని రైత్వారీ ప్రాంతంలో మొత్తం పట్టాదారులు దాదాపు 67 లక్షల మంది వున్నారు. వీరి క్రిందవున్న మొత్తం భూమి 2కోట్ల 76లక్షల ఎకరాలకుపైగా వుంది. అయితే పదిరూపాయలలోపు శిస్తుచెల్లించే చిన్న పట్టాదారుల సంఖ్య 51 లక్షలకు పైగావుంది. అంటే మొత్తం పట్టాదారుల సంఖ్యలో నూటికి 76 వంతులకు పైగా వుందన్నమాట. అయినప్పటికీ యీచిన్న పట్టాదారుల క్రిందవున్న మొత్తం భూమి ఒకకోటి పన్నెండు లక్షలు ఎకరాలు. అంటే మొత్తం పట్టాదారుల భూమిలో సుమారు నూటికి 40 వంతులు మాత్రమే వుంది. మరోవైపున రు. 100-లు పైగా శిస్తుచెల్లించే పట్టాదారులు 60 వేల మంది వున్నారు. అంటే మొత్తం పట్టాదారులలో వీరు దాదాపు నూటికి ఒకరుగూడా లేరు. అయినప్పటికి వీరిక్రింద మొత్తముభూమిలో సుమారు నూటికి 14 వంతులదాకా వుంది. ఈవిధంగా ప్రభుత్వం ప్రకటించిన అసంపూర్ణమైనట్టి లెక్కలనుబట్టి భూస్వాముల చేతులలో భూమి బాగా కేంద్రీకరించబడి వున్నట్లు తెలుస్తోంది.

ఆంధ్రజిల్లాలకు ప్రత్యేకంగా భూఖామందుల క్షేత్రాల గూర్చిన వర్గీకరణ లెక్కలు ప్రకటించలేదు. మద్రాసురాష్ట్ర ఉమ్మడిప్రభుత్వం యిటీవల ధాన్యసేకరణ కోసం మాగాణి ప్రాంతాలకు ప్రత్యేకంగా కొన్ని లెక్కలను తయారుచేసింది. వాటిని బట్టి కొంతవరకు ఆంధ్రప్రాంతాలలోని భూఖామందుల వర్గీకరణను గూర్చి స్థూలంగా తెలుసుకొనవచ్చును. ఆ లెక్కలు యీ క్రిందివిధంగా వున్నాయి:

| క్షేత్రం విస్తీర్ణము | ఆ తరగతికి చెందిన క్షేత్రాల మొత్తం భూమి (ఎకరాలలో) | మొత్తం భూమిలో శాతం |
|---|---|---|
| 1 ఎకరంలోపు | 6,63,520 | 14.4 |
| 1-5 ఎకరాలమధ్య | 15,93,680 | 35.1 |
| 5-10 ,, | 7,44,040 | 16.0 |
| 10-25 ,, | 6,30,080 | 13.7 |
| 25-50 ,, | 4,16,240 | 9.0 |
| 50 ఎకరాలపైన | 5,43,840 | 11.8 |
| | 45,91,400 | 100.0 |

(From Paper read by B. Viswanath, on "Development of Agriculture in Andhra State" at Delhi Simposium)

ఈ లెక్కలలో వివిధ తరగతుల క్రింద యివ్వబడిన ఆయా భూఖామందుల క్షేత్రాలక్రింద భూమి ఎంతెంత వుందో లెక్కయివ్వబడినప్పటికి, ఆయా తరగతి క్షేత్రాలను కల్గిన ఆయా భూఖామందుల సంఖ్యలు యివ్వబడలేదు. అందుచేత యీ లెక్కల వలనకూడ భూఖామందుల క్షేత్రాల వర్గీకరణ సరిగ్గా తేలడంలేదు.

1929-30 సంవత్సరాలలో కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో రైతాంగ పరిస్థితులను గూర్చి విచారణ గావించిన రీసెటిల్‌మెంటు విచారణకమిటీ నివేదిక (ఆరోగ్యస్వామి మొదలియారు కమిటీ నివేదిక), ఆంధ్ర జిల్లాల డెల్టా గ్రామాలలో వున్న వాస్తవ పరిస్థితిని కొంతవరకు వ్యక్తపర్చుతోంది. కృష్ణా, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలోని భూఖామందుల క్షేత్రాల గూర్చి పైన తెల్పిన నివేదికలో యీక్రింది పట్టికలలో భోగట్టా యివ్వబడింది:

ఈ లెక్కలనుబట్టి తేలేదేమిటి? కృష్ణా జిల్లాలో 5 ఎకరాల లోపు భూఖామందులు మొత్తం భూఖామందుల సంఖ్యలో నూటికి 63.2 మంది వున్నారు. అయినా వాళ్ళక్రింద మొత్తం సాగు భూమిలో నూటికి 15.2 వంతులు మాత్రమే వుంది. 20 ఎకరాలకుపైబడిఉన్న భూఖామందుల సంఖ్య నూటికి 7.7 మాత్రమే వుంది. కాని, వారిక్రిందఉన్న మొత్తం భూమి మాత్రము నూటికి 41.4 వంతులు వుంది. 25 ఎకరాలకు పైనవున్న భూఖామందుల సంఖ్య నూటికి 5 వంతులు మాత్రమే. కాని వారిక్రింద వున్న భూమిమాత్రం నూటికి 34.4 వంతులు వుంది.

## కృష్ణా జిల్లా

| క్షేత్రం విస్తీర్ణం | 'ఈ' గ్రూపుకు సంబంధించిన భూఖామందుల సంఖ్య (శాతం) | 'ఈ' గ్రూపుకు చెందిన భూఖామందులక్రింద వున్న మొత్తం భూమి (శాతం) |
|---|---|---|
| 1 ఎకరం, అంతకులోపు | 23.3 | 1.4 |
| 5 ఎకరాలు ,, | 39.9 | 13.8 |
| 10 ఎకరాలు ,, | 17.7 | 16.5 |
| 15 ,, ,, | 6.7 | 16.4 |
| 20 ,, ,, | 4.7 | 10.5 |
| 25 ,, ,, | 2.4 | 7.0 |
| 30 ,, ,, | 1.3 | 4.7 |
| 50 ,, ,, | 2.8 | 17.3 |
| 80 ,, ,, | 0.7 | 5.3 |
| 80 కి పైన ,, | 0.5 | 7.1 |
| | 100.0 | 100.0 |

## తూర్పు, పశ్చిమ గోదావరిజిల్లాలు

| క్షేత్రం విస్తీర్ణం | భూఖామందుల సంఖ్య (శాతం) | | భూఖామందుల క్రింద వున్న మొత్తం భూమి (శాతం) | |
|---|---|---|---|---|
| | పశ్చిమ గోదావరి | తూర్పు గోదావరి | పశ్చిమ గోదావరి | తూర్పు గోదావరి |
| 1 ఎకరం, అంతకులోపు | 24.3 | 46.0 | 1.3 | 7.1 |
| 5 ఎకరాలు,అంతకులోపు | 39.1 | 39.5 | 11.4 | 28.7 |
| 10 ,, ,, | 15.3 | 7.6 | 13.0 | 16.4 |
| 15 ,, ,, | 7.0 | 2.7 | 10.3 | 10.9 |
| 20 ,, ,, | 3.5 | 1.2 | 7.1 | 6.5 |
| 25 ,, ,, | 2.8 | 0.7 | 7.2 | 5.0 |
| 30 ,, ,, | 1.5 | 1.4 | 5.2 | 4.2 |
| 50 ,, ,, | 3.4 | 0.6 | 15.3 | 7.1 |
| 80 ,, ,, | 2.0 | 0.1 | 14.4 | 3.0 |
| 80 కి పైన ,, | 1.0 | 0.2 | 13.9 | 10.9 |
| | 100.0 | 100.0 | 100.0 | 100.0 |

భూస్వాముల చేతుల్లోవున్న భూమి కేంద్రీకరణ, తూర్పుపశ్చిమ గోదావరి జిల్లాలలో మరీ కన్పించుతుంది. పశ్చిమగోదావరి జిల్లాలో 5 ఎకరాల లోపు రైతాంగం సంఖ్య నూటికి 63.4 వంతులు; కాని వారి క్రిందవున్న భూమి మాత్రం నూటికి 12.7 వంతులుమాత్రమే. అంటే కృష్ణా జిల్లాలో కంటె కూడ తక్కువఅన్నమాట. అదేవిధంగా 25 ఎకరాలపైన ఉన్న భూఖామందుల సంఖ్య నూటికి 8 మాత్రమే అయినా, వారిక్రింద వున్నభూమి నూటికి 49 వంతులు వరకు వుంది. అంటే కృష్ణా జిల్లాలో కంటె భూస్వాముల చేతుల్లోభూమి కేంద్రీకరణ జాస్తిఅన్నమాట. ఈభూమి, కేంద్రీకరణ తూర్పు గోదావరి జిల్లాలో యింకా యెక్కువ కన్పించుతుంది. 5 ఎకరాలలోపు రైతాంగం సంఖ్య నూటికి 86 వంతుల వరకు వున్నది. వారి చేతిక్రింద వున్న భూమి నూటికి 35 వంతులు మాత్రమే. సగటున యీతరగతిభూమి కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలతో పోల్చి చూచినప్పుడు కొంచెం ఎక్కువ భూమి వున్నప్పటికీ కొలదిమంది భూస్వాముల చేతుల్లోనే మాత్రం కేంద్రీకరింపబడి వున్నది. 25 ఎకరాలకు పైనవున్న భూఖామందులు నూటికి 2.3 వంతులు మాత్రమే వున్నప్పటికీ, వీరి క్రింద వున్న భూమి మొత్తం నూటికి 25 వంతుల వరకు వుంది.

ఈ విధంగా 1930 వ సంవత్సరపు రీ సెటిల్‌మెంటు విచారణ లెక్కల ప్రకారం యీ మూడు జిల్లాలలో భూమి

కేంద్రీకరణ ఎలా ఏర్పడిందో స్పష్టంగా తేలుతున్నది. ఇచ్చట చూడాల్సింది అభివృద్ధి అయిన యీ డెల్టా గ్రామాలలోనే ఇలాంటి భూమి కేంద్రీకరణ ఉంటే, రాయలసీమ, నెల్లూరు, శ్రీకాకుళం, విశాఖపట్నం లాంటి ప్రాంతాలలో భూమి కేంద్రీకరణ ఇంకా ఎక్కువగా ఉన్నదనే దానిలో సందేహం ఉండనవసరంలేదు. ఆ ప్రాంతాల సరైన లెక్కలు ఇంతవరకు చేయబడలేదు.

గమనించాల్సిన మరో విషయం ఏమంటే ఆరోగ్యస్వామి మొదలియారు కమిటీ లెక్కలు 1930 సంవత్సరానికి సంబంధించినవి. ఆ తరువాత ఒక మహా ఆర్థిక సంక్షోభం రావటం, రెండవ ప్రపంచ యుద్ధం జరగటం, యుద్ధానంతరం ధరలు విపరీతంగా పెరగటం, వీటన్నిటి ఫలితంగా తప్పకుండాయింకా భూమి కేంద్రీకరణ హెచ్చివుంటుందనడంలో సందేహం లేదు. అయితే దాన్ని గూర్చిన సరియైన భోగట్టా యింతవరకూ సేకరించబడలేదు.

వ్యవసాయంపై జీవించేవారి సంఖ్య వృద్ధిపొందుతూ వుండటం, సాగులోకి తేబడే భూమి పెద్దగా పెరగకపోవడం, సాగు అవుతున్న భూమి సహితం హెచ్చుగా భూస్వాముల చేతులలో ఒకవైపున కేంద్రీకరించబడి వుండడం, మరోవైపున కష్టించి పనిచేసే పేదరైతులకు, వ్యవసాయ కూలీలకు కుటుంబ పోషణకు సహితం భూమి లభించకపోవడం, సాగు భూమికి తగిన నీటి వనరులు, ఎరువు వనరులు లేకపోవడం — వీటన్నిటి ఫలితంగా క్రమ క్రమేణా మనిషి 1కి సాగుచేయబడే భూమి విస్తీర్ణం తగ్గడం, వ్యవసాయోత్పత్తి కుంటుబడి వుండడం జరుగుతోంది. ఈ విషయాలను యీ క్రింది అంకెలు స్పష్టపరుస్తాయి:

| సంవత్సరం | మనిషి 1కి సగటున (మద్రాసురాష్ట్రంలో) సాగుచేయబడుతున్న భూమి విస్తీర్ణం |
|---|---|
| 1911 | 78 సెంట్లు |
| 1921 | 79 ,, |
| 1931 | 78 ,, |
| 1941 | 69 ,, |
| 1951 | 56 ,, |

("ఆంధ్ర ప్రజలు – సిరి సంపదలు" పేజీ 18)

ఈ విధంగా సాగు భూమి క్రమ క్రమేణా తరుగుతూ వచ్చింది. దీనికి కారణం భూమి కొరతగాదు. సాగులాయకు బంజరు భూములు మన రాష్ట్రంలో వున్నాయి. అదేవిధంగా పెద్ద భూస్వాముల స్వాధీనంలో వుండి పడావుగావున్న భూములుకూడ లక్షలాది వున్నాయి.

ఇక సగటు వ్యవసాయోత్పత్తి యెలా తగ్గుతూవచ్చిందో చూద్దాం. 1943-44—1949-50 సంవత్సరాల మధ్యకాలంలో ఎకరానికి సగటున పండిన వరి, జొన్న పంటలను ప్రక్కపేజీలోని పట్టిక వివరిస్తుంది:

| సంవత్సరం | సగటున ఎకరానికి పంట | |
|---|---|---|
| | వరిపంట (164 పౌనుల బస్తా) | జొన్నపంట (230 పౌనుల బస్తా) |
| 1943_44 | 1,508 | 560 |
| 1944_45 | 1,532 | 600 |
| 1945_46 | 1,389 | 504 |
| 1946_47 | 1,496 | 493 |
| 1947_48 | 1,385 | 522 |
| 1948_49 | 1,372 | 538 |
| 1949_50 | 1,276 | 542 |

("ఆంధ్ర ప్రజలు-సిరిసంపదలు" పేజీ 21)

ఇలాగే చెరుకునగ, ప్రత్తి, పొగాకు మున్నగు వ్యాపారపంటలు కూడా (సగటున ఎకరానికి పండే పంట) తగ్గిపోయాయని యీ దిగువ పొందుపరచిన పట్టీ తెలియచేస్తోంది:

ఈ విధంగా పంట క్రమంగా తగ్గుతూ ఉండటంచేత మన్నెం రైతు క్రమంగా అప్పులపాలవుతున్నాడు. ఇదివరకే అప్పుపడి ఉన్నవారికి అప్పుభారం మరింత పెరుగుతున్నది. 1946 లో డాక్టరు బి. వి. నారాయణస్వామి నాయుడు జరిపిన విచారణలో 1939 లో ఉన్న ఋణభారం 1945వ సంవత్సరానికి వివిధ వర్గాలకు పెరుగుతున్నదో, తరుగుతున్నదో ప్రక్క పేజీలోని మొదటి పట్టికలోని విధంగా వివరించారు.

రుణభారంతీర్చలేక బీదరైతులు, కౌలుదార్లు ఉన్న కుంటో సెంటో భూస్వామికో, వడ్డీవ్యాపారస్తునికో అమ్మి, వ్యవసాయకూలీలుగా తయారవుతున్నారు. ఈ వృత్తివల్ల పొట్టగడవక కొంతమంది పని వెతుక్కుంటూ పట్టణాలకు ఎగబ్రాకుతున్నారు. ఈ విధంగా భూస్వామ్యవ్యవస్థ ఆంధ్రరైతాంగ మూలుగల పీల్చడమేకాక, వ్యావసాయిక అభివృద్ధికి ప్రధాన ఆటంకంగా తయారైంది.

| పంట పేరు | ఎకరానికి పండిన సగటు పంట | | |
|---|---|---|---|
| | 1939_40 (పౌనులలో) | 1940_41 (పౌనులలో) | 1949_50 (పౌనులలో) |
| చెరుకునగ | 1,070 | ... | 925 |
| ప్రత్తి | 91 | ... | 86 |
| పొగాకు | ... | 909 | 540 |
| ఆముదాలు | ... | 228 | 199 |
| నువ్వులు | ... | 291 | 262 |

("ఆంధ్ర ప్రజలు - సిరిసంపదలు" పేజీ 23)

| వర్గం | రుణం పెరుగుదల (+) తరుగుదల (—) |
|---|---|
| 25 ఎకరాలకు (మెట్ట, మాగాని కలిపి) పైబడిఉన్న భూస్వాములు | — 39.9 |
| 25-5 ఎకరాలమధ్య | — 24.6 |
| 5 ఎకరాలలోపు | — 12.3 |
| కౌలుదార్లు | + 4.1 |
| వ్యవసాయకూలీలు | + 45.1 |

## భూమి ఉపయోగం

ఆంధ్రజిల్లాలలోవున్న మొత్తంభూమి యేలా వుపయోగపడుతున్నదో యీ క్రింది పట్టిక తెలుపుతుంది :

| వివరం | భూమిది స్థిరం ఎకరాలలో |
|---|---|
| సాగుచేయబడుతున్న భూమి | 1,54,67,362 |
| పడావులు (Current Fallows) | 22,19,000 |
| ఇతర పడావులు | 22,56,000 |
| సాగుకు లాయకయిన బంజర్లు | 35,61,000 |
| సాగుకు లాయకుగాని బంజర్లు | 77,87,100 |
| అడవులు | 78,18,000 |
| వనములు | 4,98,000 |
| శాశ్వత గోభూములు, ఇతరపచ్చికబయళ్ళు | 6,58,000 |
| మొత్తం భూమి | 3,99,64,462 |

ఉంది. అంటే నేడు సాగవుతున్న భూమిలో దాదాపు సగంవరకూ యీ తరగతి భూమి వుందన్నమాట.

ఇక సాగులోవున్న భూమికి వున్న నీటి వసరులు అంతంతమాత్రమే! సాగు

పై పట్టికలోని వివరాలనుబట్టి మొత్తం భూమిలో సాగుభూమి నూటికి 38 వంతులు మాత్రమేనని తేలుతున్నది. పడావులుగా పడిఉన్నభూమి, నూటికి 11.2 వంతులువరకూవుంది. సాగుకు లాయకైన బంజరుభూమి, పడావుగాఉన్న భూమికలిపి 80 లక్షల ఎకరాలవరకూ

భూమిలో అత్యధికభాగానికి ఎట్టి నీటివసరులు లేక కేవలం వర్షంపైనే ఆధారపడవలసివున్నది. రాష్ట్రం మొత్తంమీద కృష్ణా, గోదావరిలాంటి ప్రాజెక్టుకాల్వల క్రింద, చెరువుల క్రిందగాని, బావులు, ఊటకాలువలు, తదితర జలాశయాల క్రిందగాని సేద్య నీటివసతులు కల్గిన భూమి ఆంధ్ర

రాష్ట్రంలో దాదాపు 45 లక్షల ఎకరాలు మాత్రమే! అంటే మొత్తం సాగుభూమిలో దాదాపు నాలుగవ వంతు భూమికి మాత్రమే సేద్యపునీటి సౌకర్యాలు ఉన్నాయన్నమాట. ఈ 45 లక్షల ఎకరాల మాగాణి (తరి) భూమిలోకూడా కృష్ణా, గోదావరి, పెన్నా ప్రాజెక్టుల్లాంటి గ్యారంటీనీరు సప్లయిగావించే ప్రాజెక్టుల కింద సాగుచేయబడుతున్న భూమి వివరాలు :

| నీటివనరులు | నీటివల్ల సాగయ్యేభూమి (ఎకరాలలో) |
|---|---|
| గోదావరీడెల్టా | 12,06,865 |
| కృష్ణాడెల్టా | 9,87,615 |
| పెన్నాడెల్టా | 1,98,118 |
| కర్నూలు-కడపకాలువ (తుంగభద్రనీరు) | 81,354 |
| మొత్తం | 24,73,952 |

ఇది మొత్తం రాష్ట్రంలో నీటిపారుదలకింద సాగుచేయబడుతున్న భూమిలో సగం మాత్రమే !

తతిమ్మా తరిభూమిఅంతా గ్యారంటీ నీటిసప్లయిలేని చెరువులు, బావులు మున్నగునాన్ గ్యారంటీ నీటిసప్లయి మాత్రమే కల్గిన భూములు.

రాయలసీమ మొత్తం జిల్లాలన్నింటిలో తరి భూమి ఎనిమిదిలక్షల ఎకరాలు మాత్రమే. ఇందులోకూడా కర్నూలు - కడప కాలువలాంటి గ్యారంటీ నీటి సప్లయి కలిగిన తరిభూమి రెండులక్షల ఎకరాలు మాత్రమే ! తతిమ్మా సాగు భూమి అంతా ప్రధానంగా వర్షాధారం వలననే సాగవుతోంది. తత్ఫలితంగా రాయలసీమ ప్రాంతం శాశ్వత కరువు ప్రాంతంగా వుండిపోతోంది.



# ఆహార పంటలు

ఆంధ్రలో ఏటా 1,24 లక్షల ఎకరాలలో ఆహార ధాన్యాలు పండించబడుతున్నాయి. ఇందులో 1,07 లక్షల ఎకరాలలో కాయధాన్యాలు (వరి, జొన్న, సజ్జ, వరిగె ఇత్యాదులు), 16 లక్షలఎకరాలలో పప్పుధాన్యాలు పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో ప్రభుత్వ పైరువారీ లెక్కల ప్రకారం వివిధ జిల్లాలలో కాయధాన్యాలు, పప్పుధాన్యాలు ఎంతెంత పండించబడుతున్నాయో దిగువ పట్టికలో వివరించబడింది :

| జిల్లా | ఆహారధాన్యాలు పండించబడిన విస్తీర్ణం (ఎకరాలలో) | | |
|---|---|---|---|
| | కాయ ధాన్యాలు | పప్పుధాన్యాలు | మొత్తం |
| శ్రీకాకుళం | 6,95,858 | 1,53,825 | 8,49,683 |
| విశాఖపట్నం | 6,67,812 | 1,39,604 | 8,07,416 |
| తూర్పుగోదావరి | 8,60,342 | 1,48,028 | 10,08,370 |
| పశ్చిమగోదావరి | 9,61,749 | 75,241 | 10,36,990 |
| కృష్ణా | 8,65,748 | 2,29,899 | 10,95,647 |
| గుంటూరు | 14,29,272 | 1,74,717 | 16,03,989 |
| నెల్లూరు | 12,19,858 | 1,05,212 | 13,25,070 |
| కర్నూలు | 13,15,140 | 1,42,943 | 14,58,083 |
| కడప | 7,36,175 | 50,924 | 7,87,099 |
| అనంతపురం | 10,96,844 | 2,49,325 | 13,46,169 |
| చిత్తూరు | 4,85,945 | 28,337 | 5,14,282 |
| బళ్ళారి (½) | 4,57,715 | 59,990 | 5,17,705 |
| మొత్తం | 1,07,92,458 | 15,58,045 | 1,23,50,503 |

దిగువ పట్టికలో, 1951–52 వ సంవత్సరంలో పంటలు పండించబడిన మొత్తం భూమిలో, నూటికి ఎన్ని ఎకరాలలో ఆహార ధాన్యాలు పండించబడ్డాయో వివరించ బడింది :

| జిల్లా | వరి | జొన్న | సజ్జ | రాగి | కొర్ర | మొత్తం కాయ ధాన్యాలు | పప్పు ధాన్యాలు* |
|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 43.9 | 1.5 | 1.1 | 8.7 | 0.1 | 58.6 | 8.7 |
| విశాఖపట్నం | 28.6 | 3.6 | 14.5 | 9.5 | 1.3 | 60.1 | 6.8 |
| తూర్పుగోదావరి | 52.7 | 3.2 | 3.3 | 1.3 | 0.3 | 64.5 | 6.1 |
| పశ్చిమగోదావరి | 71.9 | 3.5 | 0.4 | 0.3 | ... | 76.2 | 1.3 |
| కృష్ణా | 42.2 | 9.8 | 0.8 | 0.3 | ... | 63.1 | 13.5 |
| గుంటూరు | 19.8 | 19.1 | 6.6 | 0.5 | 2.5 | 60.8 | 6.5 |
| నెల్లూరు | 23.8 | 30.5 | 7.8 | 6.3 | 2.8 | 81.5 | 1.9 |
| కర్నూలు | 4.0 | 26.2 | 2.8 | 0.7 | 20.1 | 59.4 | 4.0 |
| కడప | 6.7 | 29.5 | 10.8 | 5.0 | 11.4 | 68.5 | 1.8 |
| అనంతపురం | 4.0 | 15.9 | 7.4 | 4.0 | 13.8 | 49.0 | 3.5 |
| చిత్తూరు | 15.6 | 5.7 | 18.7 | 15.4 | 0.7 | 59.9 | 1.5 |
| బళ్ళారి ($\frac{1}{3}$) | 1.5 | 26.3 | 4.5 | 0.9 | 17.9 | 51.3 | 3.4 |
| | 26.2 | 14.6 | 6.6 | 4.4 | 7.1 | 62.7 | 4.9 |

# కాయధాన్యాలు

ఆంధ్రలో పండించబడుతున్న కాయ ధాన్యాలలో (Cereals) వరి, జొన్న, మొక్కజొన్న, సజ్జ, వరిగె, కొర్ర, రాగి ముఖ్యమైనవి. 1951–52 వ సంవత్సరంలో ఇవి 1,07,92,458 ఎకరాలలో పండించ బడ్డాయి.

## వరి

ఇది మన ప్రధాన ఆహారపంట. ప్రతి సంవత్సరం, 40–45 లక్షల ఎకరాలలో సుమారు 27–28 లక్షల టన్నుల ధాన్యం పండించబడుతున్నది. ప్రక్క పేజీలో పొందుపరచబడిన పట్టికలో, వివిధజిల్లాల లోని వరిపంటవివరాలు ఇవ్వబడ్డాయి :

* ఉలవలు మినహా మిగతా పప్పుధాన్యాలు.

| జిల్లా | వరి పండించబడిన ఎకరాలు | పండిన ధాన్యం టన్నులలో | బియ్యంగా అంచనా* టన్నులలో |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 5,20,867 | 2,84,130 | 1,90,360 |
| విశాఖపట్నం | 3,17,997 | 1,68,830 | 1,13,110 |
| తూర్పుగోదావరి | 7,02,886 | 5,33,400 | 3,55,370 |
| పశ్చిమగోదావరి | 9,07,238 | 6,67,180 | 4,47,010 |
| కృష్ణా | 6,93,924 | 5,02,830 | 3,36,900 |
| గుంటూరు | 4,65,193 | 3,17,430 | 2,12,680 |
| నెల్లూరు | 3,55,879 | 1,34,210 | 89,920 |
| కర్నూలు | 87,465 | 43,290 | 29,000 |
| కడప | 72,432 | 35,180 | 23,570 |
| అనంతపురం | 90,544 | 42,790 | 28,670 |
| చిత్తూరు | 1,26,941 | 43,560 | 29,190 |
| బళ్ళారి (½) | 12,171 | 8,053 | 5,397 |
| | 43,53,537 | 27,80,883 | 18,61,177 |

కొన్ని జిల్లాలలో రెండు పంటలు, మరికొన్ని జిల్లాలలో మూడు పంటలు కూడా పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో, రాష్ట్రంలో మొదటి పంట 38 లక్షల ఎకరాలలోను, రెండవ పంట 5,51 వేల ఎకరాలలోను, మూడవ పంట 4,450 ఎకరాలలోను పండించబడింది. మొదటి పంట 2,40 వేల టన్నులు, రెండవ పంట 3,35 వేల టన్నులు పండింది (పై పట్టికలో మూడు పంటలు పండించబడిన భూమి విస్తీర్ణం, పండిన పంట కలిపి ఇవ్వబడ్డాయి).

పండే పంటలో నూటికి 65 పాళ్ళు ఒక్క ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే పండుతున్నది.

ఎకరానికి సామాన్యంగా 1,345 పౌనుల నుండి, 1,900 పౌనుల వరకూ పండుతుంది. 1951-52 వ సంవత్సరంలో 745 పౌనులనుండి 1,700 పౌనులవరకూ పండించబడింది. డెల్టా ప్రాంతంలో 1,500 - 1,600 పౌనుల మధ్య పంట పండుతున్నట్లు ప్రభుత్వ అంచనాలు తెలియచేస్తున్నాయి.

## జొన్న

ప్రతి సంవత్సరం 27-30 లక్షల ఎకరాలలో సుమారు 480-500 వేల టన్నుల జొన్నలు పండించబడుతున్నాయి. ప్రక్క పేజీలోని పట్టికలో 1951—52 వ సంవత్సరపు జొన్న పంట వివరాలు ఇవ్వబడ్డాయి:

* వడ్లను బియ్యంగా చేసినప్పుడు, 33% బరువుతగ్గుతుందని అంచనా వేయబడింది. ఇవి ఈ రేటున వేయబడిన అంచనాలు.

| జిల్లా | పంటపండించ బడిన ఎకరాలు | పండినపంట (టన్నుల్లో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 17,329 | 4,350 |
| విశాఖపట్నం | 40,257 | 10,660 |
| తూర్పుగోదావరి | 75,180 | 18,130 |
| పశ్చిమగోదావరి | 44,120 | 11,060 |
| కృష్ణా | 1,47,905 | 39,060 |
| గుంటూరు | 4,48,597 | 1,01,000 |
| నెల్లూరు | 4,56,138 | 92,400 |
| కర్నూలు | 5,81,044 | 1,11,820 |
| కడప | 3,17,000 | 35,840 |
| అనంతపురం | 3,56,023 | 36,000 |
| చిత్తూరు | 46,400 | 7,320 |
| బళ్ళారి | 2,34,680 | 37,287 |
| మొత్తం | 27,64,673 | 5,04,927 |

రాష్ట్రంలో ఈసంవత్సరంలో 27,64 వేల ఎకరాలలో ఐదు లక్షల టన్నుల జొన్న పండించబడింది. పంటలో నూటికి 80 పాళ్ళు గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్ళారి జిల్లాల లోనే పండించబడుతున్నది.

సామాన్యంగా ఎకరానికి 455 పౌనుల నుండి 931 పౌనుల వరకూ జొన్నలు పండించ బడుతున్నాయి. 1951–52 వ సంవత్సరంలో 232 పౌనుల నుండి 598 పౌనుల వరకు పండించబడింది.

శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో 500 పౌనుల నుండి 598 పౌనుల వరకూ పండించ బడింది. కర్నూలు, కడప, అనంతపురం జిల్లాలలో 232 పౌనుల నుండి 464 పౌనుల వరకు మాత్రమే పంట పండింది.

## సజ్జ (కంబు)

సామాన్యంగా ప్రతి సంవత్సరం 11 లక్షల ఎకరాలలో 2,50 వేలటన్నుల సజ్జలు పండించబడుతున్నాయి. 1951–52 వ సంవత్సరంలో 10,82 వేల ఎకరాలలో 2,03 వేల టన్నుల సజ్జలు పండించ బడ్డాయి. జిల్లాలవారీ పంట వివరాలు ప్రక్కపేజీలోని పట్టికలో ఇవ్వబడ్డాయి.

ఎకరానికి సామాన్యంగా, 452 పౌనుల నుండి 1,155 పౌనులవరకూ సజ్జపంట పండించబడుతున్నది. 1951–52వ సంవత్సరంలో 248 పౌనులనుండి 809 పౌనుల వరకూ పండించబడింది. రాష్ట్రంలోకల్లా,

| జిల్లా | పంట పండించబడిన విస్తీర్ణం (ఎకరాలలో) | పండిన పంట (టన్నుల్లో) |
|---|---|---|
| శ్రీకాకుళం | 13,560 | 3,400 |
| విశాఖపట్నం | 1,61,247 | 40,430 |
| తూర్పుగోదావరి | 44,468 | 11,270 |
| పశ్చిమగోదావరి | 4,465 | 1,070 |
| కృష్ణా | 11,287 | 2,540 |
| గుంటూరు | 1,55,690 | 35,530 |
| నెల్లూరు | 1,16,111 | 41,910 |
| కర్నూలు | 62,353 | 14,830 |
| కడప | 1,55,966 | 17,560 |
| అనంతపురం | 1,65,258 | 11,830 |
| చిత్తూరు | 1,51,556 | 16,790 |
| బళ్ళారి | 39,674 | 6,563 |
| మొత్తం | 10,81,635 | 2,03,723 |

ఎకరానికి పండినపంట నెల్లూరుజిల్లాలో అధికం (809 పౌనులు). శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, కర్నూలు జిల్లాలలో 500 పౌనులనుండి, 568 పౌనులవరకూ పండించబడింది. కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాలలో 160 పౌనులనుండి 370 పౌనులవరకూ పండించబడింది.

## రాగి

ప్రతి సంవత్సరం సుమారు 5,50 వేల ఎకరాలలో 270.280 వేల టన్నుల రాగి పండించబడుతున్నది. 1951-52 వ సంవత్సరంలో, రాష్ట్రంలో 6,42 వేల ఎకరాలలో 2,22 వేల టన్నుల పంట పండించబడింది. ప్రక్కపేజీలోని పట్టికలో 1951-52వ సంవత్సరపు రాగిపంట వివరాలు పొందుపరచబడ్డాయి :

సామాన్యంగా ఎకరానికి 696 పౌనుల నుండి, 1,183 పౌనులవరకూ రాగి పండించబడుతుంది. 1951-52 వ సంవత్సరంలో 473 పౌనులనుండి 1,128 పౌనులవరకూ పండించబడింది. రాష్ట్రంలో కెల్లా ఎకరానికి పండినపంట కర్నూలు జిల్లాలో అధికం. తర్వాత ఒక్క గుంటూరు జిల్లాలోమాత్రం 1,115 పౌనులు పండింది. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణాజిల్లాలలో 724-810 పౌనులపంట పండింది. అనంతపురంజిల్లాలో 678పౌనులు, కడపజిల్లాలో 788 పౌనులు, చిత్తూరు జిల్లాలో 473 పౌనులు పండించబడింది.

| జిల్లా | జొన్న | | జొన్న | |
|---|---|---|---|---|
| | పంట పండించబడిన విస్తీర్ణం (ఎకరాలలో) | పండినపంట (టన్నులలో) | పంట పండించబడిన విస్తీర్ణం (ఎకరాలలో) | పండినపంట (టన్నులలో) |
| శ్రీకాకుళం | 1,03,108 | 37,290 | 1,542 | 330 |
| విశాఖపట్నం | 1,05,741 | 37,340 | 14,085 | 2,830 |
| తూర్పుగోదావరి | 17,839 | 5,910 | 4,374 | 1,160 |
| పశ్చిమగోదావరి | 3,357 | 1,090 | 584 | 150 |
| కృష్ణా | 3,811 | 1,230 | 713 | 180 |
| గుంటూరు | 11,105 | 5,590 | 59,013 | 14,230 |
| నెల్లూరు | 94,899 | 8,380 | 41,319 | 7,750 |
| కర్నూలు | 16,649 | 47,360 | 4,44,223 | 48,590 |
| కడప | 63,184 | 22,210 | 1,22,739 | 7,670 |
| అనంతపురం | 89,101 | 20,950 | 3,09,003 | 24,140 |
| చిత్తూరు | 1,25,304 | 26,470 | 5,890 | 630 |
| బళ్ళారి (1/3) | 7,666 | 1,907 | 1,59,170 | 19,897 |
| మొత్తం | 6,41,764 | 2,21,727 | 11,62,655 | 1,27,557 |

## జొన్న

రాష్ట్రంలో సామాన్యంగా, సాలుకు 15 లక్షల ఎకరాలలో 1,87 వేలటన్నుల జొన్న పండించబడుతున్నది. 1951-52 వ సంవత్సరంలో 11,63 వేల ఎకరాలలో 1,27 వేల టన్నుల పంట పండించబడింది.

పై పట్టికలో జిల్లాలవారీపంట వివరాలు పొందుపరచబడ్డాయి:

సామాన్యంగా ఎకరానికి 350 పౌనుల నుండి 700 పౌనులవరకూ ఈ పంట పండించబడుతుంది. 1951-52 వ సంవత్సరంలో 140 పౌనులనుండి 595 పౌనుల వరకూ పండించబడింది. ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలలో మాత్రమే 540-590 పౌనులమధ్య పంట పండింది.

## వరిగ

సామాన్యంగా ప్రతి సంవత్సరం 3,40 వేల ఎకరాలలో 68 వేల టన్నుల పంట పండించబడుతున్నది. 1951-52 వ సంవత్సరంలో 2,82 వేల ఎకరాలలో 2,82 వేల టన్నుల వరిగ పండించబడింది. జిల్లాలవారీ పంట వివరాలు ప్రక్కపేజీలోని పట్టికలో వివరించబడ్డాయి.

| జిల్లా | వరిగ — పంట పండించబడిన విస్తీర్ణం (ఎకరాలలో) | వరిగ — పండిన పంట (టన్నులలో) | సామలు — పంట పండించబడిన విస్తీర్ణం (ఎకరాలలో) | సామలు — పండిన పంట (టన్నులలో) |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 3,412 | 750 | 10,608 | 1,850 |
| విశాఖపట్నం | 6,192 | 1,550 | 12,649 | 2,260 |
| తూర్పుగోదావరి | 1,920 | 620 | 5,843 | 1,250 |
| పశ్చిమగోదావరి | 805 | 230 | ... | ... |
| కృష్ణా | 1,961 | 530 | 15 | ... |
| గుంటూరు | 24,403 | 6,480 | 40 | 10 |
| నెల్లూరు | 1,34,078 | 23,340 | 2,578 | 320 |
| కర్నూలు | 24,805 | 3,600 | 840 | 120 |
| కడప | 27,221 | 2,190 | 9,519 | 680 |
| అనంతపురం | 48,284 | 3,770 | 36,538 | 2,610 |
| చిత్తూరు | 7,949 | 870 | 16,636 | 1,300 |
| బళ్ళారి (1/8) | 147 | 30 | 1,725 | 223 |
| మొత్తం . | 2,81,177 | 43,960 | 96,991 | 10,623 |

సామాన్యంగా ఎకరానికి 500 పౌనుల నుండి, 800 పౌనులవరకూ పంట పండించబడుతున్నది. 1951-52 వ సంవత్సరంలో 175 పౌనులనుండి 720 పౌనులవరకు పండించబడింది. ఒక్క తూర్పుగోదావరి జిల్లాలోమాత్రమే ఎకరానికి 720 పౌనులు పండించబడింది.

### సామలు

1951-52 వ సంవత్సరంలో 97 వేల ఎకరాలలో 10 వేల టన్నులు పండించబడింది. పై పట్టికలో జిల్లాలవారీ పంట వివరాలు ఇవ్వబడ్డాయి.

## పప్పుధాన్యాలు

రాష్ట్రంలో పండించబడే పప్పుధాన్యాలలో (Pulses) శనగ, మినుము, కంది, పెసర, ఉలవ ముఖ్యమైనవి. ప్రతిసంవత్సరం సుమారు 17 లక్షల ఎకరాలలో పప్పుధాన్యాలు పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో 15,58,045 ఎకరాలలో ఇవి పండించబడ్డాయి.

## శనగలు

సాలుకు 90 వేల ఎకరాలలో 17,800 టన్నుల శనగలు పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో 76,673 ఎకరాలలో 11,343 టన్నులు పండించబడింది. ఈ పంట ముఖ్యంగా మెట్ట తాలూకాలలో పండించబడుతున్నది. 1951-52వ సంవత్సరంలో వివిధ జిల్లాల శనగపంట వివరాలు క్రింది పట్టికలో వివరించబడ్డాయి:

సామాన్యంగా ఎకరానికి 500 పౌనుల పంటపండుతుంది. 1951-52 వ సంవత్సరంలో 250 పౌనులనుండి 425 పౌనుల వరకూ పండించబడింది.

## మినుములు

ప్రతిసంవత్సరం సామాన్యంగా 1,34 వేల ఎకరాలలో 16 వేల టన్నుల మినుములు పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో 1,57 వేల ఎకరాలలో 18 వేల టన్నుల మినుములు పండించబడ్డాయి. వివిధజిల్లాలలో ఈ సంవత్సరపుపంట వివరాలు క్రింది పట్టికలో వివరించబడ్డాయి.

సామాన్యంగా ఎకరానికి 105 పౌనుల నుండి 400 పౌనుల వరకూ పండించబడుతున్నది. 1951-52 వ సంవత్సరంలో 63 పౌనులనుండి 320 పౌనుల వరకూ పండించబడింది.

| జిల్లా | శనగలు | | మినుములు | |
|---|---|---|---|---|
| | పండించబడిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | పండిన పంట (టన్నుల్లో) | పండించబడిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | పండిన పంట (టన్నుల్లో) |
| శ్రీకాకుళం | 304 | 50 | 13,208 | 1,200 |
| విశాఖపట్నం | 878 | 150 | 12,735 | 1,160 |
| తూర్పుగోదావరి | 5,403 | 1,030 | 29,539 | 3,080 |
| పశ్చిమగోదావరి | 1,406 | 270 | 2,651 | 260 |
| కృష్ణా | 3,358 | 530 | 42,168 | 6,020 |
| గుంటూరు | 6,654 | 1,260 | 51,952 | 5,700 |
| నెల్లూరు | 955 | 170 | 920 | 80 |
| కర్నూలు | 35,323 | 5,130 | 3,115 | 370 |
| కడప | 7,645 | 850 | 57 | ... |
| అనంతపురం | 10,767 | 1,200 | 11 | ... |
| చిత్తూరు | 146 | 20 | 1,099 | 70 |
| బళ్ళారి (½) | 3,834 | 683 | 86 | 3 |
| మొత్తం | 76,673 | 11,343 | 1,57,542 | 17,943 |

మొత్తం రాష్ట్రపు పంటలో నూటికి 80పాళ్ళు ఒక్క ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరుజిల్లాలలోనే పండించబడింది.

## పెసలు

సాలుకు 3,29 వేల ఎకరాలలో 36 వేల టన్నుల పెసలుపండించబడ్డాయి. 1951-52 వ సంవత్సరంలో 3,85 వేల ఎకరాలలో 39 వేల టన్నుల పెసలు పండించబడ్డాయి. జిల్లాలవారీ పంట వివరాలు క్రింది పట్టికలో వివరించబడ్డాయి:

సామాన్యంగా ఎకరానికి 250 నుండి 300 పౌనులవరకూ పెసర పండుతున్నది. 1951-52 వ సంవత్సరంలో 69 పౌనుల నుండి 285 పౌనుల వరకూ పండింది.

ఒక్క కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే రాష్ట్రపు పెసర పంటలో నూటికి 50 పాళ్ళు పండించబడింది.

## కందులు

సామాన్యంగా ప్రతి సంవత్సరం 2,05 వేల ఎకరాలలో 20 వేలటన్నుల కందులు పండించబడుతున్నాయి. 1951-52వ సంవత్సరంలో 1,97 వేల ఎకరాలలో 18,500 టన్నులు పండించబడ్డాయి. జిల్లాలవారీ పంట వివరాలు క్రింది పట్టికలో వివరించబడ్డాయి:

సామాన్యంగా ఎకరానికి 200పౌనుల నుండి 500 పౌనులవరకు ఈ పంట పండుతుంది. 1951-52వ సంవత్సరంలో 150 పౌనులనుండి 368 పౌనులవరకూ పండించబడింది.

| జిల్లా | పెసలు | | కందులు | |
|---|---|---|---|---|
| | పండించబడిన భూమివిస్తీర్ణం (ఎకరాలలో) | పండిన పంట (టన్నుల్లో) | పండించబడిన భూమివిస్తీర్ణం (ఎకరాలలో) | పండినపంట (టన్నుల్లో) |
| శ్రీకాకుళం | 78,651 | 8,260 | 5,800 | 760 |
| విశాఖపట్నం | 43,271 | 4,170 | 9,824 | 1,340 |
| తూర్పుగోదావరి | 29,481 | 3,020 | 13,554 | 1,910 |
| పశ్చిమగోదావరి | 2,143 | 210 | 5,738 | 940 |
| కృష్ణా | 1,27,386 | 16,210 | 5,678 | 860 |
| గుంటూరు | 66,117 | 4,640 | 27,796 | 3,270 |
| నెల్లూరు | 11,875 | 1,110 | 5,470 | 340 |
| కర్నూలు | 7,855 | 790 | 41,739 | 3,630 |
| కడప | 4,380 | 320 | 6,474 | 440 |
| అనంతపురం | 7,150 | 220 | 57,085 | 3,500 |
| చిత్తూరు | 249 | 20 | 6,406 | 710 |
| బళ్ళారి (½) | 6,855 | 327 | 12,308 | 823 |
| మొత్తం | 3,85,413 | 39,297 | 1,97,952 | 18,523 |

మొత్తం రాష్ట్రపు పంటలో నూటికి 50 పాళ్ళు గుంటూరు, కర్నూలు, అనంతపురం జిల్లాలలోనే పండుతున్నది.

### ఉలవలు

సామాన్యంగా ప్రతి సంవత్సరం 852 వేల ఎకరాలలో 70 వేల టన్నుల ఉలవలు పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో 6,67 వేల యెకరాలలో 41,700 టన్నులు పండించబడింది. జిల్లాలవారీ పంట వివరాలు క్రింది పట్టికలో ఇవ్వబడ్డాయి.

సామాన్యంగా ఎకరానికి 200 పౌనులు పండుతుంది. 1951-52 వ సంవత్సరంలో 90నుండి 180పౌనులవరకూ పంటపండింది.

పైవి కాక ఇతర పప్పు ధాన్యాలు 73 లక్షల ఎకరాలలో 1951-52 వ సంవత్సరంలో పండించబడ్డాయి. జిల్లాలవారీవివరాలు క్రిందిపట్టికలోఇవ్వబడ్డాయి.

| జిల్లా | ఉలవలు | | ఇతర పప్పు ధాన్యాలు |
|---|---|---|---|
| | పండించబడిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) | పండినపంట (టన్నులలో) | పండించబడిన భూమి విస్తీర్ణం (ఎకరాలలో) |
| శ్రీకాకుళం | 50,498 | 3,970 | 5,284 |
| విశాఖపట్నం | 63,623 | 4,830 | 9,273 |
| తూర్పుగోదావరి | 65,933 | 5,300 | 4,118 |
| పశ్చిమగోదావరి | 59,144 | 4,490 | 4,159 |
| కృష్ణా | 27,563 | 1,970 | 23,746 |
| గుంటూరు | 20,789 | 1,580 | 1,408 |
| నెల్లూరు | 76,770 | 5,140 | 9,222 |
| కర్నూలు | 54,452 | 3,650 | 459 |
| కడప | 31,570 | 1,270 | 798 |
| అనంతపురం | 1,70,572 | 6,850 | 3,740 |
| చిత్తూరు | 16,355 | 580 | 4,082 |
| బళ్ళారి (1/8) | 30,017 | 2,143 | 6,891 |
| మొత్తం | 6,67,286 | 41,773 | 73,180 |

## కూరగాయలు

ప్రతి సంవత్సరం సుమారు 60 వేల ఎకరాలలో కూరగాయలు పండించబడుతున్నాయి. 1951-52 వ సంవత్సరంలో 58 వేల యెకరాలలో వివిధ కూరగాయలు

పండించబడ్డాయి. జిల్లాలవారీ వివరాలు దిగువ పట్టికలో ఇవ్వబడ్డాయి. ఇందులో వుల్లిపాయలు పండించబడిన భూవిస్తీర్ణం కూడ కలిసి ఉన్నది.

| జిల్లా | కూరగాయలు పండించబడిన భూవిస్తీర్ణం (ఎకరాలలో) |
|---|---|
| 1. శ్రీకాకుళం | 5,830 |
| 2. విశాఖపట్నం | 9,957 |
| 3. తూర్పుగోదావరి | 8,150 |
| 4. పశ్చిమగోదావరి | 6,463 |
| 5. కృష్ణ | 3,849 |
| 6. గుంటూరు | 3,370 |
| 7. నెల్లూరు | 2,255 |
| 8. కర్నూలు | 2,604 |
| 9. కడప | 8,398 |
| 10. అనంతపురం | 4,761 |
| 11. చిత్తూరు | 1,118 |
| 12. బళ్ళారి (½) | 1,735 |
| మొత్తం | 58,490 |

## పండ్లతోటలు

1951-52 వ సంవత్సరంలో అరటి, నిమ్మ, మామిడి, ఇత్యాది పండ్లతోటలు 2,17వేల ఎకరాలున్నాయి. వీటి జిల్లావారీ వివరాలు దిగువపట్టికలో ఇవ్వబడ్డాయి:

| జిల్లా | అరటి | నిమ్మ, నారింజ తత్సంబంధమైనవి | మామిడి | మొత్తం పండ్లతోటలు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 3,576 | 1,409 | 14,990 | 19,975 |
| విశాఖపట్నం | 1,357 | 412 | 18,037 | 19,806 |
| తూర్పుగోదావరి | 5,695 | 5,991 | 26,689 | 38,375 |
| పశ్చిమగోదావరి | 6,679 | 1,850 | 14,496 | 23,025 |
| కృష్ణ | 698 | 1,073 | 24,120 | 28,633 |
| గుంటూరు | 1,390 | 2,993 | 1,895 | 9,122 |
| నెల్లూరు | 877 | 1,956 | 6,189 | 9,022 |
| కర్నూలు | 354 | 2,481 | 5,190 | 8,382 |
| కడప | 241 | 8,153 | 14,166 | 22,510 |
| అనంతపురం | 75 | 1,118 | 6,180 | 7,323 |
| చిత్తూరు | 444 | 815 | 28,423 | 30,322 |
| బళ్ళారి (½) | 321 | 12 | 713 | 1,045 |
| మొత్తం | 21,707 | 28,263 | 1,61,038 | 2,17,540 |

# వ్యాపార పంటలు

ఆంధ్ర రాష్ట్రంలో 1951-52 వ సంవత్సరంలో 43 లక్షల ఎకరాలలో వ్యాపార పంటలు (ఆహారేతర) పండించబడ్డాయి. మొత్తం పంట భూమిలో ఇది దాదాపు నాలుగవ వంతు. జిల్లాలవారీ వ్యాపార పంటలు పండించబడిన విస్తీర్ణపు వివరాలు దిగువ ఇవ్వబడ్డాయి :

| జిల్లా | వ్యాపార పంటలు పండించబడిన విస్తీర్ణం | మొత్తం పంట భూమిలో శాతం |
|---|---|---|
| శ్రీకాకుళం | 2,73,981 | 23.1 |
| విశాఖపట్నం | 2,23,817 | 20.3 |
| తూర్పుగోదావరి | 2,18,178 | 16.3 |
| పశ్చిమగోదావరి | 1,55,137 | 12.3 |
| కృష్ణా | 3,43,732 | 22.9 |
| గుంటూరు | 5,96,384 | 25.4 |
| నెల్లూరు | 1,43,086 | 9.6 |
| కర్నూలు | 6,98,120 | 31.5 |
| కడప | 2,32,452 | 21.6 |
| అనంతపురం | 8,28,196 | 37.0 |
| చిత్తూరు | 2,29,367 | 28.3 |
| బళ్ళారి (½) | 3,51,889 | 39.5 |
| | 42,94,339 | |

"1951-52వ సంవత్సరపు సీజన్ అండ్ క్రాప్ రిపోర్టు" ప్రకారం, వివిధ వ్యాపార పంటలు పండించబడుతున్న భూమివిస్తీర్ణం, ఈ సంవత్సరపు పంట భూమిలో ఎంత శాతమో ప్రక్క పేజీలోని పట్టిక తెలియచేస్తుంది:

ఆంధ్రలో పండించబడుతున్న వ్యాపార పంటలలో నూనె గింజలు, పొగాకు, పత్తి, మిరపకాయలు, పసుపు ముఖ్యమైనవి.

## పొగాకు

17వ శతాబ్దం ప్రారంభంలో పొగాకు పంటను పోర్చుగీసువారు ఇండియాకు 'దిగుమతి చేశారు'. మొట్ట మొదట పొగాకు పండించబడిన ప్రదేశం దక్షిణ ఆఫ్రికా అని చెప్పబడుతున్నది. ఆంధ్రలో ప్రస్తుతం విరివిగా పండించ బడుతున్న వర్జీనియా పొగాకు 1925 నుండి భారత దేశంలో పండించబడుతూ ఉంది.

పొగాకు పండించటంలో ప్రపంచంలో భారతదేశం మూడవ స్థానాన్ని వహిస్తున్నది. ప్రథమ ద్వితీయస్థానాలు వరుసగా అమెరికా, చైనా ప్రజా రిపబ్లిక్ లవి. ఆంధ్రలో పొగాకు పంట పండించబడుతున్న భూమివిస్తీర్ణం,అవిభాజ్యమదరాసు రాష్ట్రపు పొగాకు పంట భూమిలో నూటికి 80 పాళ్ళు ఉన్నవి. భారతదేశ పొగాకు పంటలో నూటికి 44 పాళ్ళు ఆంధ్రదేశం ఒక్కటే పండిస్తున్నది.

| జిల్లా | వేరుశనగ | నువ్వులు | ఆముదం | ప్రత్తి | పొగాకు |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 6.8 | 2.4 | ... | ... | 0.4 |
| [illegible] | 8.4 | 6.9 | 0.1 | 0.3 | 0.6 |
| తూర్పుగోదావరి | 0.4 | 6.1 | 0.2 | 0.2 | 2.3 |
| పశ్చిమగోదావరి | 1.4 | 5.7 | 0.3 | | 2.7 |
| కృష్ణా | 8.4 | 0.8 | 0.1 | 0.3 | 2.1 |
| గుంటూరు | 8.5 | 0.1 | 1.0 | 1.5 | 5.2 |
| నెల్లూరు | 1.3 | 0.6 | 3.1 | 2.1 | 0.2 |
| కర్నూలు | 22.9 | 0.1 | 1.3 | 6.3 | 0.3 |
| కడప | 14.9 | ... | 0.4 | 4.4 | |
| అనంతపురం | 27.8 | 1.8 | 1.8 | 4.6 | 0.1 |
| చిత్తూరు | 25.2 | 0.5 | 0.3 | ... | 0.2 |
| బళ్ళారి | 18.3 | 0.3 | 0.4 | 19.4 | 0.1 |
| | 12.0 | 2.3 | 0.8 | 4.3 | 1.3 |

1951-52 వ సంవత్సరంలో ఆంధ్ర జిల్లాలలో పొగాకు పండించబడిన భూమివిస్తీర్ణము, పంట ప్రక్కపేజీలోని పట్టికలో వివరించబడ్డాయి :

ప్రభుత్వ అంచనాల ప్రకారం సాలుకు సుమారు ఇరవైకోట్ల ఖరీదుచేసే పొగాకు ఆంధ్రలో పండించబడుతున్నది. 1951-52వ సంవత్సరంలో 2,44 వేల ఎకరాలలో 76 వేల టన్నుల పంట పండించబడింది.

పొగాకులో 50 రకాలున్నాయి. కాని, మనరాష్ట్రంలో మాత్రం రెండు రకాలు పండించబడుతున్నాయి. అవి 1. వర్జీనియా, (Nicotiana Tabacum) 2. నాటుపొగాకు (Nicotiana Rustica). 1951-52 వ సంవత్సరంలో ఆంధ్రలో పండించబడిన వర్జీనియాపొగాకు పంట, మొత్తం రాష్ట్రపు పొగాకుపంటలో సగానికి పైగానే ఉంది. ఈరకంపొగాకు, కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలలోనే పండించబడుతున్నది. 1951-52 వ సంవత్సరంలో పండిన పంటవివరాలు క్రింది పట్టికలో యివ్వబడ్డాయి:

| జిల్లా | పంట టన్నుల్లో |
|---|---|
| తూర్పుగోదావరి | 4,560 |
| పశ్చిమగోదావరి | 6,940 |
| కృష్ణా | 6,050 |
| గుంటూరు | 19,360 |
| మొత్తం | 36,910 |

మొత్తం పొగాకు పంటలో గుంటూరు జిల్లాయే నూటికి 60 పాళ్ళు పండిస్తున్నది.

ఆంధ్రజిల్లాలలో ఎకరానికి 650పౌనుల నుండి 2,250 పౌనులవరకూ పండించ

| జిల్లా | వర్జీనియా (ఎకరాలలో) | కొన్ని ఇతర రకాలు (ఎకరాలలో) | మొత్తం పొగాకు పంట పండించబడిన ఎకరాలు | పండినపంట (టన్నులలో) |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | ... | 4,646 | 4,646 | 1,560 |
| విశాఖపట్నం | ... | 7,178 | 7,178 | 2,340 |
| తూర్పుగోదావరి | 17,017 | 13,568 | 30,585 | 9,410 |
| పశ్చిమగోదావరి | 23,103 | 10,891 | 33,904 | 11,320 |
| కృష్ణా | 22,586 | 8,995 | 31,581 | 9,180 |
| గుంటూరు | 72,277 | 50,589 | 1,22,866 | 37,430 |
| నెల్లూరు | ... | ... | 3,597 | 1,780 |
| కర్నూలు | ... | 5,699 | 5,699 | 1,240 |
| కడప | ... | 261 | 261 | 160 |
| అనంతపురం | ... | 219 | 2,197 | 720 |
| చిత్తూరు | ... | 1,790 | 1,790 | 570 |
| బళ్ళారి ($\frac{1}{3}$) | ... | 580 | 580 | 147 |
| మొత్తం | 1,34,983 | 1,06,133 | 2,44,890 | 75,857 |

బడుతున్నది. ఎకరానికి పండే పంట, వివిధజిల్లాలలో ఇలా ఉంది: తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలు 1,750 పౌనులు, చిత్తూరుజిల్లా 1,100పౌనులు, శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు 650 పౌనులు. సగటున సుమారు ఎకరానికి 1,457 పౌనులు పండించబడుతున్నదని అంచనా వేయబడింది. భారతదేశపు ఎకరా పంట 760 పౌనులే. పశ్చిమజర్మనీలో 2,352 పౌనులు పండించబడుతున్నది.

ఈ పొగాకు పంటనంతటినీ ఉపయోగించేందుకు ఆంధ్రలో ఒక్క సిగరెట్టుఫ్యాక్టరీ కూడాలేకపోవటంవల్ల దాదాపు వర్జీనియా పొగాకు అంతా ఇతరదేశాలకు ముఖ్యంగా బ్రిటన్‌కు ఎగుమతి చేయబడుతున్నది.

## నూనెగింజలు

ఆంధ్రలో పండించబడే ప్రధాన నూనెగింజలు వేరుశనగ, నువ్వులు, ఆముదం గింజలు. 1951-52 వ సంవత్సరంలో వివిధజిల్లాలలో పండించబడిన పంట వివరాలు ప్రక్క పేజీలోనిపట్టికలో వివరించబడ్డాయి. మొత్తం 26,90,000ఎకరాలలో వేరుశనగ, నువ్వులు, ఆముదాలు పండించబడ్డాయి. ఈ పంటలు, వాటివిలువ ఈ విధంగా అంచనా వేయబడ్డాయి :

| | టన్నులు | విలువ సుమారు (రూ॥ లలో) |
|---|---|---|
| వేరుశనగ (పప్పు) | 5,71,410 | 51,42,69,000 |
| నువ్వులు | 38,700 | 3,09,60,000 |
| ఆముదాలు | 11,300 | 11,25,000 |

| జిల్లా | వేరుశనగకాయలు | | నువ్వులు | | ఆముదాలు | |
|---|---|---|---|---|---|---|
| | పంటపండించబడిన ఎకరాలు | పండినపంట టన్నుల్లో | పంటపండించబడిన ఎకరాలు | పండినపంట టన్నుల్లో | పంటపండించబడిన ఎకరాలు | పండినపంట టన్నుల్లో |
| శ్రీకాకుళం | 83,000 | 39,400 | 29,000 | 3,900 | 1,200 | 100 |
| విశాఖపట్నం | 95,000 | 42,800 | 75,000 | 9,600 | 700 | 100 |
| తూర్పుగోదావరి | 5,500 | 2,200 | 80,000 | 10,200 | 2,000 | 200 |
| పశ్చిమగోదావరి | 18,500 | 6,900 | 72,000 | 8,600 | 4,300 | 400 |
| కృష్ణా | 1,33,000 | 49,900 | 12,000 | 1,400 | 1,600 | 200 |
| గుంటూరు | 2,00,000 | 80,000 | 2,600 | 300 | 23,000 | 1,800 |
| నెల్లూరు | 18,000 | 7,700 | 8,500 | 900 | 36,000 | 3,400 |
| కర్నూలు | 5,00,000 | 1,87,500 | 1,200 | 100 | 28,800 | 1,700 |
| కడప | 1,60 000 | 56,000 | 3,000 | 200 | 5,000 | 300 |
| అనంతపురం | 5,90,000 | 2,06,500 | 42,000 | 2,900 | 47,000 | 2,700 |
| చిత్తూరు | 2,05,000 | 71,800 | 3,500 | 300 | 2,500 | 200 |
| ఆలూరు,ఆదోని,రాయదుర్గం తాలూకాలు | 1,97,000 | 65,600 | 2,300 | 300 | 2,500 | 200 |
| మొత్తం | 22,05,000 | 8,16,300 | 3,31,100 | 38,700 | 1,54,600 | 11,300 |

భారతదేశంలో పండించబడుతున్న వేరుశనగ పంటలో ఆంధ్ర సుమారు నాల్గవవంతు పండిస్తున్నది.

మన రాష్ట్రంలో నూనెగింజల ఎకరా పంట 850 పౌనులనుండి 900 పౌనుల వరకూ ఉంటుంది. భారతదేశంలో కొన్ని రాష్ట్రాల్లో ఎకరానికి వెయ్యిపౌనులనుండి 1,200పౌనులవరకూ పండించబడుతున్నది.

మిరపకాయలు

రాష్ట్రంలో ప్రతి సం॥ సుమారు 2,50వేలఎకరాలలో రు.20_22కోట్లవిలువ చేసే మిరప పండించబడుతున్నది.

1950_51 వ సంవత్సరంలో 2,69 వేల ఎకరాలలో 1,06 వేల టన్నుల పంట పండించబడింది. దీని విలువ 22,87 లక్షల రూపాయలుగా అంచనా వేయబడింది.

1950_51వ సంవత్సరంలో 2లక్షలఎకరాలలో 77వేల టన్నుల మిరపకాయలు పండించబడ్డాయి. జిల్లాలవారీ పంటవివరాలు ప్రక్క పేజీలోని మొదటిపట్టికలో ఇవ్వబడినవి. సామాన్యంగాఎకరానికిపండే పంట 750పౌన్లనుండి, 2,003 పౌన్లవరకూ ఉంటుంది. 1951_52వ సంవత్సరంలో ఎకరానికి 578_1,800 పౌనులమధ్య పండింది.

భారతదేశంలో సాలుకు సామాన్యంగా 15 లక్షల ఎకరాలలో 3_3½ లక్షల టన్నుల పంట పండించబడుతున్నది. ఆంధ్రలో మిరప పండించబడే భూమి వైశాల్యం భారతదేశపు మిరపపంట పండించబడే భూమి వైశాల్యంలో నూటికి 18పాళ్ళు, పండించబడినపంటలో 31 పాళ్ళు ఉంటుంది.

పత్తి

ఆంధ్రలో ఏటా ఐదు లక్షల ఎకరాలలో 65_70 వేల బేళ్ళ పత్తి [illegible] విలువ సుమారు రెండుకోట్లరూపాయలు_ పండించబడుతున్నది.

1951_52 వ సంవత్సరంలో వివిధ ఆంధ్రజిల్లాలపత్తిపంట వివరాలు క్రింది పట్టికలో ఇవ్వబడ్డాయి :

ఇదే సంవత్సరంలో భారతదేశంలో మొత్తం 1,62 లక్షల ఎకరాలలో 31,34 వేల బేళ్ళ పత్తి పండించబడింది. భారతదేశపు పత్తి పంట భూమి, పంటలలో ఆంధ్ర పంటభూమి, పంట, వరుసగా 3.33%, 2.19%.

రాష్ట్రంలో పండే పంటలో నూటికి 75_80 పాళ్ళు కడప, కర్నూలు, అనంతపురం (ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలతో సహా) జిల్లాలలోనే పండించబడుతున్నది.

| జిల్లా | పండించబడిన ఎకరాలు | పండిన పంట బేళ్ళు (బేలు=392 పౌనులు) |
|---|---|---|
| శ్రీకాకుళం | 845 | 110 |
| విశాఖపట్నం | 3,026 | 380 |
| తూర్పుగోదావరి | 3,001 | 570 |
| పశ్చిమగోదావరి | 11 | ... |
| కృష్ణా | 3,973 | 750 |
| గుంటూరు | 34,764 | 6,520 |
| నెల్లూరు | 31,129 | 5,840 |
| కర్నూలు | 1,40,244 | 17,890 |
| కడప | 47,429 | 4,600 |
| అనంతపురం | 1,03,104 | 10,000 |
| చిత్తూరు | 27 | ... |
| బళ్ళారి (⅓) | 1,73,143 | 22,083 |
| మొత్తం | 5,40,696 | 68,743 |

| జిల్లా | మిరపకాయలు | |
|---|---|---|
| | పండించబడిన ఎకరాలు | పండిన పంట టన్నులలో |
| శ్రీకాకుళం | 7,079 | 5,180 |
| విశాఖపట్నం | 5,910 | 4,640 |
| తూర్పుగోదావరి | 24,442 | 11,130 |
| పశ్చిమగోదావరి | 12,405 | 3,950 |
| కృష్ణా | 12,961 | 5,420 |
| గుంటూరు | 69,148 | 18,520 |
| నెల్లూరు | 12,567 | 3,930 |
| కర్నూలు | 34,959 | 10,110 |
| కడప | 6,160 | 3,580 |
| అనంతపురం | 11,889 | 7,970 |
| చిత్తూరు | 7,237 | 1,210 |
| బళ్ళారి (1/8) | 5,911 | 2,323 |
| మొత్తం | 2,10,668 | 77,963 |

ఆంధ్రలో పండించబడుతున్న వివిధరకాల పత్తి, వాటివిలువ ఈవిధంగా ఉంది :

| ఏరకం పత్తి | పండించబడిన ఎకరాలు | పండిన పత్తి (392 పౌనుల బేళ్ళలో) | విలువ రూపాయలలో |
|---|---|---|---|
| 1. చిన్నపత్తి, (Short Staple) | | | |
| శ్రీకాకుళం | 845 | 110 | |
| విశాఖపట్నం | 2,013 | 300 | |
| | 2,858 | 410 | 1,00,450 |
| 2. వరంగల్లుపత్తి, కాకినాడపత్తి | | | |
| విశాఖపట్నం | 1,013 | 80 | |
| తూర్పుగోదావరి | 3,001 | 570 | |
| పశ్చిమగోదావరి | 11 | ... | |

| ఏరకం పత్తి | పండించబడిన ఎకరాలు | పండిన పత్తి (392 పౌనుల బేళ్ళలో) | విలువ రూపాయలలో |
|---|---|---|---|
| కృష్ణా | 3,973 | 750 | |
| గుంటూరు | 34,764 | 6,520 | |
| నెల్లూరు | 31,129 | 5,840 | |
| | 73,891 | 13,760 | 33,71,200 |
| 3. వైట్, రెడ్ నార్తరన్సు | | | |
| కర్నూలు | 1,08,322 | 13,800 | 42,22,800 |
| 4. విదేశీ పత్తి | | | |
| కర్నూలు | 31,922 | 4,090 | |
| అనంతపురం | 34,902 | 3,400 | |
| కడప | 47,429 | 4,600 | |
| చిత్తూరు | 27 | ... | |
| బళ్ళారి | 89,421 | 11,443 | |
| | 2,03,701 | 23,533 | 90,80,796 |
| 5. ముంగేరి పత్తి | | | |
| అనంతపురం | 68,202 | 6,600 | |
| బళ్ళారి (⅓) | 83,722 | 10,640 | |
| | 1,51,924 | 17,240 | 47,81,775 |
| | 5,40,696 | 68,743 | 2,15,57,021 |

ఆంధ్రలోని పంటలో అత్యధికభాగం చిన్నపత్తి (Short staple Cotton) అని తేలుతున్నది.

## చెరకు

ప్రతి సంవత్సరం 1,20_1,30 వేల ఎకరాలలో 3,50_3,70 వేల టన్నుల చెరకు (in terms of gur) పండించబడుతున్నది.

1952_53 వ సం॥లో వివిధ ఆంధ్ర జిల్లాల చెరకుపంట వివరాలు ప్రక్క పేజీ లోని మొదటిపట్టికలో వివరించబడ్డాయి.

సగటున ఎకరానికి 5,800 పౌనుల నుండి, 8,500 పౌనులవరకూ చెరకుపండుతుంది. 1951_52 వ సంవత్సరంలో 9,300 పౌనులనుండి, 5,000 పౌనుల వరకూ పండించబడింది. కృష్ణాజిల్లాలో ఎకరానికి 9,320 పౌనులు, పశ్చిమగోదా

| జిల్లా | చెరకు | | పసుపు |
|---|---|---|---|
| | చెరకు పండించబడిన ఎకరాలు | పండినపంట * ఎకరాలలో | పండించబడిన ఎకరాలు |
| శ్రీకాకుళం | 20,320 | 50,670 | 726 |
| విశాఖపట్నం | 36,710 | 81,900 | ... |
| తూర్పుగోదావరి | 23,430 | 76,690 | 2,312 |
| పశ్చిమగోదావరి | 14,900 | 56,770 | 3,104 |
| కృష్ణా | 7,570 | 31,510 | 5,571 |
| గుంటూరు | 990 | 3,630 | 11,236 |
| నెల్లూరు | 580 | 1,150 | 381 |
| కర్నూలు | 370 | 660 | 1,304 |
| కడప | 1,050 | 2,230 | 4,943 |
| అనంతపురం | 9,590 | 17,010 | 50 |
| చిత్తూరు | 21,170 | 54,320 | 67 |
| బళ్ళారి | 4,120 | 9,470 | ... |
| మొత్తం | 1,40,800 | 3,89,010 | 29,694 |

వరిజిల్లాలో 8534 పౌనులు, తూర్పుగోదావరిజిల్లాలో 7,619 పౌనులు, గుంటూరు జిల్లాలో 8,227 పౌనులు పండించబడింది. మిగతా జిల్లాలలో ఎకరానికి పండినపంట చాల తక్కువ. 4_5 పౌనులకమించిలేదు.

భారతదేశంలో, సాలుకు సుమారు 44_45 లక్షల ఎకరాలలో చెరకపండించబడుతున్నది. ఆంధ్రలో చెరకుపండించబడే భూమి విస్తీర్ణం, ఇందులో నూటికి మూడుపాళ్ళు మాత్రమే ఉన్నది.

అవిభాజ్య మదరాసు రాష్ట్రంలో మొత్తం చెరుకపంట నూరు టన్నులు అనుకుంటే వినియోగం ఈవిధంగాఉండేది :

| | | |
|---|---|---|
| బెల్లం చేయటానికి | | 77.3% |
| పంచదార ఉత్పత్తికి | | 8.5% |
| విత్తనానికి | | 8.0% |
| చెరకు రసం, చెరకుగడలుగా వినియోగం | } | 6.2% |
| | మొత్తం | 100.0 |

## పసుపు

సాలుకు 30_35 వేల ఎకరాలలో పసుపు పండించబడుతున్నది. ఇందులో సుమారు 25 వేల ఎకరాలలో నీటి పారుదలవల్ల పండించబడుతున్నది.

1951_52 వ సంవత్సరంలో, వివిధ జిల్లాలలో పసుపుపంట పండించబడిన

* పండినపంట (in terms of gur)

భూమి వివరాలు పై పట్టికలో వివరించబడ్డాయి.

ఎకరానికి పండేపంట 3,000-5,000 పౌనులమధ్య ఉంటుంది. సాలుకుఆంధ్రలో 63-64 వేల టన్నుల పసుపు పండుతుందని అంచనా వేయబడుతున్నది.

గుంటూరుజిల్లాలోని దుగ్గిరాల పసుపు పంటకు ప్రధాన కేంద్రం.

పసుపుపంట చాలకాలంగా విదేశాలకు ఎగుమతి చేయబడుతూ వుంది. 1805 వ సంవత్సరంలో, తూర్పుఇండియా కంపెనీ వారు1,052 పౌన్లు ఖరీదుచేసే(422 Cwts) పసుపును ఎగుమతి చేశారట ! అరేబియా, పర్షియా,పాకిస్తాన్, అమెరికా, బ్రిటన్‌లకు మన దేశంనుండి పసుపు నేడు ఎగుమతి చేయబడుతున్నది.

## ఉల్లిపాయలు

ఏటా 30 వేల ఎకరాలలో సుమారు 1,40-1,50 లక్షల రూపాయలు విలువచేసే 1,00-1,05వేల టన్నుల ఉల్లిపాయలు పండించబడుతున్నట్లుఅంచనా వేయబడుతుంది.

1951-52 వ సంవత్సరంలో వివిధ జిల్లాలలో పండించబడిన ఉల్లిపంట వివరాలు దిగువ పట్టికలో వివరించబడ్డాయి :

| జిల్లా | పండించబడిన ఎకరాలు | పండినపంట టన్నులు |
|---|---|---|
| 1. శ్రీకాకుళం | 2,183 | 10,530 |
| 2. విశాఖపట్నం | 3,816 | 17,990 |
| 3. తూర్పుగోదావరి | 2,860 | 8,680 |
| 4. పశ్చిమగోదావరి | 1,698 | 6,440 |
| 5. కృష్ణా | 539 | 1,790 |
| 6. గుంటూరు | 2,727 | 16,440 |
| 7. నెల్లూరు | 255 | 1,090 |
| 8. కర్నూలు | 1,003 | 3,430 |
| 9. కడప | 6,506 | 27,230 |
| 10. అనంతపురం | 2,945 | 11,830 |
| 11. చిత్తూరు | 515 | 1,240 |
| 12. బళ్ళారి (1/3) | 797 | 3,413 |
| మొత్తం | 25,844 | 1,10,103 |

సామాన్యంగా ఎకరానికి ఆరువేల పౌనులనుండి 15,000 పౌనులవరకూ పండించబడుతున్నది. ఈ సంవత్సరంలో ఎకరానికి మూడువేల పౌనులనుండి 13,500 పౌనులవరకూ పండించబడింది.

ఆంధ్ర నుండి సాలుకు సుమారు 30 లక్షల రూపాయల విలువగల ఉల్లిపాయలు యెగుమతి చేయబడుతున్నాయి.

ఇంతవరకూ కొన్ని ముఖ్య పంటల వివరాలు మాత్రమే పేర్కొనబడ్డాయి. ఇవి కాక కొబ్బరి, గోగునార, జనపనార, ధనియాలు మొదలైన వ్యాపార పంటలు కూడా పండించబడుతున్నాయి.

# పశుసంపద

"పాడి - పంటలు"లలో "పాడి" ముందుగా పేర్కొనబడుతున్నదంటే ఆంధ్రజాతీయ జీవనంలో, ఈ పాడికి మూలమైన పశుసంపద ఎంత ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తున్నదో వ్యక్తమవుతుంది. "ప్రపంచంలోని చాల దేశాలలో ఆవులు, గోడెలు, పాలకు, మాంసానికి వినియోగించుకోబడుతున్నాయి. కాని, భారతదేశంలో మాత్రం పాలం చిన్న దూడలకు, బండ్లు లాగడానికి ప్రధానంగా ఉపయోగింప బడుతున్నాయి. ఎద్దే లేకపోతే, ఈదేశంలో వ్యవసాయం చేయటమే దుస్సాధ్యం. పండిన పంటను ఇంటికి చేరవేయడం అంతకన్న కష్టం" అని 1926వ సంవత్సరంలో వ్యవసాయపరిస్థితులపై విచారణ జరిపిన "రాయల్ కమిషన్" చెప్పిన మాటలు ఆంధ్రదేశానికి అక్షరాల అనువర్తిస్తాయి. ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫ్ ఎగ్రికల్చరల్ రిసర్చి, ఇతర సంస్థలు జరిపిన విచారణలో, మొత్తం వ్యవసాయంమీద పెట్టబడుతున్న పెట్టుబడిలో, పశువులశ్రమ విలువ నూటికి 15-25 పాళ్ళుఉంటుందని మాజీ మద్రాసు ప్రభుత్వకార్యదర్శి కృష్ణసామి(1944-45వ సంవత్సరంలో) అంచనా వేశారు.

ప్రస్తుతపు ఆంధ్ర ప్రభుత్వ పశుశాఖ ఆఫీసరు (Livestock Development Officer) డాక్టరు బషీర్ అహమక్ షిరాజీ ప్రస్తుత ఆంధ్రలో పశువులవలన వస్తున్న ఆదాయాన్ని ఈవిధంగా అంచనా వేశారు :

| వివరం | విలువ కోట్ల రూ. లలో |
|---|---|
| వ్యవసాయోత్పత్తుల రవాణాలో పశువుల శ్రమ విలువ | 1.5 |
| పొలందున్నటం, ఇత్యాది వ్యవసాయపు పనులలో పశువుల శ్రమ విలువ | 13.0 |
| పశువు లిచ్చే పాలు, పాలతో తయారు చేయబడే పదార్థాల విలువ | 3.5 |
| తోళ్లు ... | 0.2 |
| ఎరువులు ... | 5.0 |
| మొత్తం | 23.2 |

ప్రభుత్వ అంచనాల ప్రకారం, 1951-52వ సంవత్సరంలో మొత్తం పశుసంతతి (ఆవులు, గోడెలు, ఎద్లు, గేదెలు, దున్నపోతులు, గొర్రెలు, మేకలు, గుర్రాలు, గాడిదలు, పందులు) 1,99,34,014 ఉన్నవి. వీటిజిల్లావారీ వివరాలు : శ్రీకాకుళం 20,63,019, విశాఖపట్టణం16,50,281,తూర్పుగోదావరి 15,52,132, పశ్చిమగోదావరి 14,24,089, కృష్ణ16,58,898; గుంటూరు23,89,603,

కర్నూలు 17,76,019, అనంతపురం 24,18,914, కడప 17,78,235, నెల్లూరు 28,03,976, చిత్తూరు 28,13,769, బళ్ళారి (మూడోవంతు) 4,18,848.

ఇదే సంవత్సరంలో, రాష్ట్రంలో 22,866 ఆబోతులు, 29,75,244 ఎద్దులు, 23,63,298 ఆవులు, 19,89,382 దూడలు, 9,49,259 దున్నపోతులు, 22,82,682 గేదెలు, 16,91,245 దూడలు, 68,78,914 గొర్రెలు, 28,52,771 మేకలు, 43,458 గుర్రాలు, 1,17,847 గాడిదలు, 5,78,063 పందులు ఉన్నాయి.

ప్రక్క పేజీలో పొందుపరచబడిన పట్టిక, 1951-52వ సంవత్సరంలో వివిధ జిల్లాల ఆవులు, కోడెలు, వీటి సంతతి వివరాలను తెలియచేస్తుంది :

దిగువపట్టిక, వివిధజిల్లాలలో గేదెలు, దున్నలు, వీటి సంతతికి చెందినపశుగణం, 1951-52వ సంవత్సరంలో ఎంతఉన్నదో తెలియచేస్తుంది :

| జిల్లా | దున్నపోతులు | 3 సం॥ పైబడిన దున్నపోతులు | 3 సం॥ లకు పైబడిన పాలిచ్చే గేదెలు | 3 సం॥ లకు పైబడిన ఎండిపోయిన గేదెలు | దూడలు |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 15,896 | 1,78,266 | 95,355 | 26,891 | 98,977 |
| విశాఖపట్నం | 1,174 | 1,28,223 | 1,29,721 | 10,691 | 1,00,829 |
| తూర్పుగోదావరి | 1,422 | 99,431 | 1,68,265 | 13,300 | 1,44,061 |
| పశ్చిమగోదావరి | 800 | 98,406 | 1,96,863 | 13,446 | 1,49,207 |
| కృష్ణా | 901 | 77,589 | 2,99,201 | 15,251 | 2,30,267 |
| గుంటూరు | 1,120 | 1,02,456 | 3,58,331 | 16,704 | 3,10,435 |
| కర్నూలు | 1,429 | 22,930 | 2,01,485 | 5,939 | 1,23,433 |
| అనంతపురం | 1,753 | 25,989 | 1,06,618 | 3,822 | 86,111 |
| కడప | 2,466 | 54,843 | 1,76,080 | 10,285 | 1,25,692 |
| నెల్లూరు | 1,210 | 1,05,555 | 2,69,607 | 12,253 | 2,13,413 |
| చిత్తూరు | 2,436 | 31,178 | 1,12,690 | 7,815 | 87,400 |
| బళ్ళారి (మూడవవంతు) | 538 | 3,248 | 31,231 | 838 | 21,420 |
| | 31,145 | 9,18,114 | 21,45,447 | 1,37,235 | 16,91,245 |

| జిల్లా | 3 సంవత్సరాలకు పైబడినఆబోతులు | మూడుసంవత్సరాలకు పైబడిన కోడెలు-ఎడ్లు | మూడుసంవత్సరాలకు పైబడిన పాలిచ్చే ఆవులు | మూడుసంవత్సరాలకు పైబడిన ఎండిపోయిన ఆవులు | దూడలు | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 2,606 | 2,73,502 | 2,30,098 | 27,164 | 2,64,218 | 7,97,588 |
| విశాఖపట్నం | 1,789 | 2,57,171 | 1,64,568 | 9,944 | 1,23,848 | 5,57,320 |
| తూర్పుగోదావరి | 928 | 3,11,222 | 2,33,587 | 13,322 | 2,22,983 | 7,82,049 |
| పశ్చిమగోదావరి | 622 | 2,47,642 | 1,85,410 | 8,423 | 1,74,182 | 6,16,279 |
| కృష్ణా | 665 | 2,09,977 | 1,64,851 | 12,362 | 1,60,333 | 5,48,188 |
| గుంటూరు | 736 | 2,32,511 | 1,43,428 | 11,240 | 1,57,679 | 5,45,594 |
| కర్నూలు | 836 | 2,07,808 | 1,26,475 | 5,913 | 1,06,366 | 4,47,398 |
| అనంతపురం | 4,543 | 3,00,563 | 1,74,593 | 10,739 | 1,53,877 | 6,44,315 |
| కడప | 2,694 | 1,85,395 | 1,04,521 | 13,777 | 1,01,375 | 4,07,762 |
| నెల్లూరు | 1,086 | 2,57,859 | 2,69,910 | 11,951 | 2,11,962 | 7,52,768 |
| చిత్తూరు | 4,845 | 4,08,074 | 3,36,717 | 60,163 | 2,77,104 | 10,86,903 |
| బళ్ళారి (మూడవవంతు) | 1,516 | 83,520 | 42,076 | 2,066 | 35,455 | 1,64,633 |
| | 22,866 | 29,75,244 | 21,76,234 | 1,87,064 | 19,89,382 | 73,50,790 |

క్రిందిపట్టిక 1951-52వ సంవత్సరంలో వివిధజిల్లాలలో గొర్రెలు, మేకలు ఎన్నిఉన్నదీ తెలియచేస్తుంది :

| జిల్లా | గొర్రెలు | మేకలు |
|---|---|---|
| శ్రీకాకుళం | 5,55,220 | 2,33,766 |
| విశాఖపట్నం | 3,70,983 | 2,77,644 |
| తూర్పుగోదావరి | 1,17,449 | 1,57,875 |
| పశ్చిమగోదావరి | 1,63,585 | 1,24,166 |
| కృష్ణా | 2,72,634 | 1,46,034 |
| గుంటూరు | 7,09,351 | 2,18,656 |
| కర్నూలు | 6,57,205 | 2,66,531 |
| అనంతపురం | 11,67,787 | 3,30,074 |
| కడప | 7,07,761 | 2,50,806 |
| నెల్లూరు | 10,25,758 | 3,66,616 |
| చిత్తూరు | 10,02,797 | 4,22,664 |
| బళ్ళారి (మూడవవంతు) | 1,28,384 | 57,939 |
| | 68,78,914 | 28,52,771 |

క్రింది పట్టిక 1951-52 వ సంవత్సరంలో వివిధ జిల్లాలలో గుర్రాలు, గాడిదలు, పందులు ఎన్నిఉన్నదీ తెలియచేస్తుంది :

| జిల్లా | గుర్రాలు | గాడిదలు | పందులు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 3,962 | 6,162 | 50,893 |
| విశాఖపట్నం | 3,967 | 8,406 | 61,348 |
| తూర్పుగోదావరి | 6,306 | 4,632 | 57,298 |
| పశ్చిమగోదావరి | 5,406 | 1,628 | 64,141 |
| కృష్ణా | 3,530 | 2,165 | 63,074 |
| గుంటూరు | 4,933 | 5,361 | 1,16,648 |
| కర్నూలు | 4,395 | 20,198 | 25,064 |
| అనంతపురం | 2,843 | 23,243 | 26,359 |
| కడప | 2,262 | 20,842 | 19,436 |
| నెల్లూరు | 4,083 | 12,309 | 40,372 |
| చిత్తూరు | 716 | 9,584 | 49,580 |
| బళ్ళారి (మూడవ వంతు) | 1,055 | 3,317 | 3,850 |
| | 43,458 | 1,17,847 | 5,78,063 |

ఆంధ్రలో పశువుల సంఖ్య అధికమే. కాని వీటిలో అత్యల్ప సంఖ్యలోవున్న ఒక్క ఒంగోలు జాతి పశువులు తప్ప మిగతావన్నీ నాసిరకమే! ఇంత పశు సంతతి ఉన్నప్పటికీ, వీటివల్ల లభించే పాలు, ఇతర దేశాలలో పశువులు ఇచ్చే పాలతో పోల్చితే చాల తక్కువ.

1940 వ సంవత్సరంలో "సోవియట్ యూనియన్‌తో సహా యూరప్ ఖండంలో ఉన్నన్ని పాలు ఇస్తున్న పశువులు భారత దేశంలో ఉన్నాయి. కాని ఇవన్నీ ఇచ్చే పాలు, యూరప్ పశువులు ఇస్తున్న పాలలో నూటికి 20 పాళ్ళు మాత్రమే! భారతదేశంలోఉన్న పాలిచ్చే పశువుల సంఖ్యలో నూటికి ఆరుపశువులు మాత్రమే కెనడాలో ఉన్నాయి. కాని భారత దేశం ఉత్పత్తి చేస్తున్న పాలలో నూటికి 25 వంతుల పాలను కెనడా దేశం ఉత్పత్తి చేస్తున్నది."

వ్యాధులనుండి రక్షణ, జాతిఅభివృద్ధికి కావలసిన చర్యలు తీసుకోబడకపోవడం వల్ల వీటి ఉత్పత్తి శక్తి తగ్గిపోతున్నది. క్రమంగా నీరసించిపోతున్నాయి.

ఒంగోలు జాతి

ఇది, భారత పశుజాతికే తలమానిక మైన జాతి. ఈ జాతి ఆవులు ఇతర జాతు లన్నింటికంటె పాలు అధికంగా ఇవ్వక పోయినా, కోడెలు, ఎద్దు భారీగా మంచి శరీరపుష్టి గలిగి, బరువును లాగగల శక్తి కలిగివుంటాయి.

ఈ జాతి ప్రపంచ ఖ్యాతి నార్జించింది. యూరప్, అమెరికా, ఫిలిప్పైన్సు, వెస్టిండీస్‌కుకూడా – 1923 లో ఎగుమతులు నిషేధింపబడేవరకూ – ఎగుమతి చేయ బడుతూ ఉండేది.

ఈజాతి గుంటూరు, నెల్లూరు జిల్లాలలో గుండ్లకమ్మ – ఆలూరు నదుల మధ్య ప్రాంతంలో ఉన్నాయి. కందుకూరు, అద్దంకి ప్రాంతాలలో ఈజాతి పశువుల పెంపకం జరుగుతున్నది. ఈప్రాంతపు నల్లనేల (Black Soil) లో విరివిగా లభించే 'చెంగలి గడ్డి', జొన్న దంటు వీటి శరీర సౌష్టవానికి తోడ్పడు తున్నవి.

ఈజాతి అభివృద్ధికి ప్రభుత్వం తగినంత శ్రద్ధతీసికోవడం లేదు. 1927వ సంవత్సరంలో పశువుల శాఖకు సంబంధించిన ఆఫీసరు జరిపిన విచారణలో ఈప్రాంతంలో 93 వేల ఆవులు ఉన్నట్లు, కనీసం వీటికి నెయ్యి ఆబోతులయినా ఉండవలసింది 670 మాత్రమే ఉన్నాయని వ్రాశారు. దీని తరువాత, ప్రభుత్వంచే నెల్లూరుజిల్లా చింతలదీవిలో 1918 నుండి, ఈజాతి అభివృద్ధికని ప్రారంభించబడిన పశువుల "ఫారం" 1932లో ఎత్తివేయబడింది. ఈ మధ్యనే ఇది తిరిగి ప్రారంభించబడింది. ఈజాతి పశువుల అభివృద్ధికి ప్రస్తుతం ప్రభుత్వం చేస్తున్నకృషి అత్యల్పం!

తర్వాత చెప్పదగినది "పుంగనూరు" జాతి. ఈజాతిపశువు, ఒంగోలుజాతి పశువంత భారీది కాకపోయినా, దానికంటె ఎక్కువ పాలు ఇస్తుంది. ఇది సుమారు ఈతకు సగటున ఐదువేలపౌనుల పాలిస్తుంది. దీనికి, ఒంగోలుజాతి పశువుకు వలె పోషణలో ప్రత్యేక శ్రద్ధ తీసికో నవసరం లేదు. అందుచేత, యీ జాతి పశువులు "పేద వాడి పశువులు"గా చెప్పబడుతున్నవి. జాతి రక్షణకు, అభివృద్ధికి ప్రత్యేకశ్రద్ధ తీసికొనబడకపోవటం చేత, ఈ జాతి దాదాపు నశించిపోయింది.

ఇదికాక "సింధీ" ఆవులజాతి అభివృద్ధికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి.

"తీసికట్టు"కు కారణం

మన పశుజాతి కాలక్రమేణా నీరసించి పోతున్నది. ఈ తీసికట్టుకు ప్రధాన కారణాలు నాలుగు: (1) పశువులకు పుష్టికరమైన ఆహారం లేకపోవటం, (2) జాతి అభివృద్ధికి కావలసిన మంచి జాతి ఆబోతులు, దున్నపోతులు, చాలినన్ని లేకపోవటం, (3) వివిధ రోగాలు, అంటువ్యాధుల నుండి రక్షణ తగినంత లేకపోవటం (4) రైతుల బీదతనం.

"పశువులకు సరియైన పోషణ లభించనంతకాలం, వీటి సంతతిని అభివృద్ధిచేయ సాధ్యపడదని" 1926లో వ్యవసాయ స్థితిగతులపై విచారణజరిపిన రాయల్ ఎంక్వయిరీ కమిషన్ అభిప్రాయపడింది.

కొన్ని ప్రాంతాలలో పశువుల మేతకు లోటు లేకపోయినా, కడప, కర్నూలు, అనంతపురం, చిత్తూరు జిల్లాలలో వర్షాభావం సామాన్యం కనుక, మేత కరువు ప్రజలకు తిండికరువులాగే తయారైంది. దీనికితోడు పశువులకు వేయబడుతున్న మేతయినా, పుష్టికరమైనది కాదు. ఇదయినా, పశుపోషణకు చాలినంత పరిమాణంలో లభించటంలేదు.

సంపూర్ణ ఆరోగ్యము కలిగి ఆరు వందల పౌనులు బరువున్న పశువుకు రోజుకు 13 పౌనులు గడ్డి, ముప్పావుపౌను తెలకపిండి, పత్తిగింజలు, చిట్టు, తౌడు పదార్థాలు పెట్టాలి. కాని, మదరాసు రాష్ట్ర "పశువుల మేత - మేపకం కమిటీ" (Provincial Fodder and Grazing Committee) వారి అంచనాలప్రకారం (అవిభాజ్య చెన్న రాష్ట్రంలో) పశువు ఒకటికి సగటున తొమ్మిది పౌనుల గడ్డి, అరపౌను తెలకపిండి, పత్తిగింజలవంటి పోషక పదార్థాలు పెట్టబడుతున్నాయి.

పశువులకు వేసే గడ్డిలో పిండి పదార్థాలు - కొవ్వు పదార్థాలు (Carbohydrates and fats), మాంసకృత్తులు (Proteins) 10 : 1 నిష్పత్తిలో ఉండాలి. ప్రస్తుతం మన పశువులకు లభ్యమవుతున్న మేతలో నూటికి తొంభై పాళ్ళు వరిగడ్డిలాంటి ఎండుమేత! ఇందులో పై పోషక పదార్థాల నిష్పత్తి 40 : 1 ఉంటుంది.

అందుచేత, లభించే కొద్ది ఆహారంలో కూడా, పశువులకు కావలసిన పోషక పదార్థం అత్యల్పంగా మాత్రమే లభిస్తున్నది.

రెండవ కారణం, జాత్యభివృద్ధికి అవసరమైన మేలుజాతి ఆబోతులులభించక పోవటం. ప్రతి వంద ఆవులకు, ఒక ఆబోతు ఉండాలని పశుశాఖ నిపుణుల అభిప్రాయం. కాని, 1949-50వ సంవత్సరంలో ప్రభుత్వలెక్కల ప్రకారం కావలసిన ఆబోతులలో నూటికి 2½ పాళ్ళు, దున్నపోతులలో నూటికి ఒక పాలు మాత్రమే ఉన్నాయి.

మూడవకారణం: వివిధరకాల జబ్బులనుండి, పశువుల రక్షించటానికి కావలసిన ఏర్పాట్లు లోపించటం. రాష్ట్రంలో ఉన్న పశువైద్యశాలలే చాలతక్కువ. ఉన్నవయినా, తాలూకా ముఖ్యపట్టణాలలో, జిల్లా ముఖ్యపట్టణాలలో ఉండటంవల్ల గ్రామసీమలలోని రైతులకు

ఇది ఏవిధంగాను అందుబాటులో లేవు. పైగా, ఉన్నపశువైద్యులైనా (Veterinary Assistant Surgeons) చాలినంతమంది లేరు. ప్రతి 25,000 పశువులకు ఒక వైద్యుడు ఉండాలని, పశు ఆరోగ్యశాఖా నిపుణుల అభిప్రాయం. కాని 1950లో ఆంధ్రలో ఉన్నపశువుల సంఖ్యకు, పై పరిమితి ప్రకారం ఉండవలసిన పశువైద్యులలో నూటికి 20_22 మంది మాత్రమే ఉన్నారు.

ప్రతి 25,000 పశువులకు బ్రిటన్‌లో 8.7, ఫ్రాన్సులో 5.5, జర్మనీలో 9.6, హాలెండులో 7.1, స్విట్జర్‌లెండ్‌లో 10.9మంది పశువైద్యులు(Veterinary Surgeons)ఉంటే, ఆంధ్రలో ప్రస్తుతం, సుమారు 0.34 మంది మాత్రమే ఉన్నారు.

నాలుగవ కారణం: రైతులలో అధిక సంఖ్యాకులకు వైద్యసహాయం పొందటానికి కావలసిన ఆర్థిక స్థోమత లేకపోవటం.

ఈ నాలుగు ముఖ్య కారణాలవల్ల, ఆంధ్రలో పశువుల సంఖ్య అధికంగా ఉన్నా, వాణిజ్యంలో, శక్తిసామర్థ్యాలలో నీరసించిపోతున్నాయి.

## పాడి

ఇందుచేతనే, విదేశీ ఆవులు ఇచ్చే పాలకంటె ఆంధ్రదేశపు ఆవులు ఇచ్చే పాలు ఎంతో తక్కువ :

| దేశం పేరు | | ఒక ఈతలో ఇచ్చే పాలు (పౌనులలో) |
|---|---|---|
| హాలెండు | ... | 7,559 |
| డెన్మార్క్ | ... | 7,005 |
| స్విట్జర్‌లెండు | ... | 6,496 |
| బ్రిటన్ | ... | 5,576 |
| జపాన్ | ... | 5,857 |
| జర్మనీ | ... | 5,305 |
| న్యూజీలెండ్ | ... | 5,118 |
| అమెరికా | ... | 4,126 |
| ఆస్ట్రేలియా | ... | 3,463 |
| భారతదేశం | ... | 753 |
| ఆంధ్ర * | ... | 532 |

ఆంధ్రలోని ఆవులలోకెల్ల, ఒంగోలు జాతి ఆవులు ఎక్కువ పాలిస్తాయి. (ఆంధ్రలో పెంచబడుతున్న "సింధీ" మొదలైన జాతుల ఆవులు దీనికన్న ఎక్కువ పాలిస్తున్నప్పటికి, అవిఆంధ్రేతర ప్రాంతం నుండి తీసుకొనిరాబడ్డాయి. ఒంగోలు జాతి ఆంధ్ర ప్రాంతంలోనిది. ఇది ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలో ఉన్న వివిధ జాతుల ఆవులకన్న ఎక్కువ పాలిస్తుంది).

ఇది ఈతకు, సుమారు 2,500 పౌనుల పాలిస్తాయని అంచనా వేయబడుతున్నది. చింతలదీవి 'ఫారం'లోని ఆవులు 3,300_4,000 పౌనుల పాలిచ్చినట్లు రికార్డు చేయబడింది. 1939 లో "ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫ్ ఎగ్రికల్చరల్ రీసర్చి" వారు ఒంగోలు ప్రాంతంలో 610 ఒంగోలుజాతి ఆవులపాలను వారం రోజులు కొలిచి, అది సగటున రోజుకు

* అవిభాజ్య మదరాసు అంచనాలే "ఆంధ్ర" అంచనాలుగా ఇవ్వబడ్డాయి.

4.64 పౌనులు, ఈతకు 1,236 పౌనుల పాలు యిస్తాయని, ఈ తకు సగటున 9.54 నెలలు పాలు ఇస్తాయని తేల్చారు.

దీనిని బట్టి 'ఫారం'లో మంచి మేత పెట్టి పెంచబడిన మేలుజాతి ఆవులు, మామూలుగా గ్రామాలలో పెంచబడు తున్న ఆవులకంటె ఎక్కువ పాలిస్తాయని తేలుతున్నది.

ఎక్కువ పాలిచ్చే జాతి ఆవులు మన రాష్ట్రంలో లేకపోవటంచేత, ప్రభుత్వం 'సింధీ' జాతిఆవుల పెంపకాన్ని ప్రోత్సహించ పూనుకన్నది. ఇది దేశంలోని వివిధ జాతుల ఆవులలోకెల్ల ఎక్కువ పాలిచ్చే జాతి. హోసూరు (బళ్ళారి జిల్లా) 'ఫారం'లో పెంచబడిన ఆవులు యీతకు 4,137 పౌనులు, దినానికి సగటున 12 పౌనులు పాలిచ్చాయి.

## గేదెలు

రాష్ట్రంలో ఆవుపాడికన్న, గేదపాడి అత్యధికం. రాష్ట్రంలో పశువులు సంవత్సరంలో ఇచ్చే మొత్తంపాలు — 2,80 లక్షల మణుగులలో — ఒక్క గేదెలే 1,40 లక్షల మణుగుల (మణుగు = 82⅔ పౌనులు) పాలిస్తున్నాయి. మిగతావి, ఆవులు, మేకలు కలసి ఇస్తున్నాయి.

1939లో "ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫ్ ఎగ్రికల్చరల్ రీశర్చి" వారు ఒంగోలు ప్రాంతంలో సేకరించిన లెక్కల ప్రకారం ఆవులు, గేదెలు సగటున ఇచ్చే పాల వివరం ఇలా ఉన్నది :

| వివరం | ఆవు | గేద |
|---|---|---|
| దినానికి ఇచ్చేపాలు | 4.64 పౌ॥ | 6.53 పౌ॥ |
| ఈతకు ఇచ్చేపాలు | 1,236 పౌ॥ | 1,903 పౌ॥ |
| ఈతకు పాలిచ్చేకాలం | 9.54 నెలలు | 11.30 నెలలు |

గేదెపాలలో వెన్న - కొవ్వు పదార్థం నూటికి 7-9 పాళ్ళు ఉంటుంది. కాని ఆవుపాలలో ఈ శాతం 4-5 పాళ్ళు మాత్రమే ఉంటుంది.

గేదెలు ఆవుల కంటె ఎక్కువ పాలు, ఎక్కువ కాలం ఇస్తాయి కనుకను, గేద పాలలో వెన్న అధికంగాఉన్నది కనుకను మన రాష్ట్రంలో- దేశంలోకూడా అధికులు గేదెపాడి చేస్తున్నారు. రాష్ట్రంలోని పాలిచ్చే గేదెలలో సగంకంటె అధికం, కోస్తా జిల్లాలలోనే ఉన్నాయి.

రాష్ట్రంలోని గేద జాతులలో పర్లాకిమిడి గేదెలు ఎక్కువ పాలిస్తాయి. ఇవి సగటున ఈతకు 2,500పౌనుల పాలిస్తాయి.

1923లో గుంటూరు 'లాంఫారం'లో ఢిల్లీ గేదెల (ముర్రా గేదెలు) పెంపకాన్ని ప్రభుత్వం ప్రారంభించింది. ఇవి ఈతకు సగటున 4,800పౌనులు పాలిస్తాయని యీ "ఫారం" అధికారులు అంచనావేశారు. ఈ ఫారంలో పెంచబడిన యీ జాతి

గేదెలలో కొన్ని యీతకు 9,610 పౌనుల పాలు, దినానికి సగటున 18.9 పౌనులు ఇచ్చాయట. ఇది ఎక్కువ పాలిస్తుందని ప్రభుత్వం యీ జాతి పెంపకాన్ని ప్రోత్సహిస్తున్నది.

## పాలు

పాలుకు రాష్ట్రంలో పశువులు 2,84 లక్షల మణుగులు (మణుగు 82 $\frac{2}{7}$ పౌనులు) పాలిస్తున్నట్లు మాజీ మద్రాసు ప్రభుత్వ కార్యదర్శి శ్రీ కృష్ణసామి (1945-46వ సంవత్సరంలో) అంచనా వేశారు. ఇందులో గేదెలు 1,40 లక్షల మణుగులు, ఆవులు 1,35 లక్షల మణుగులు, మేకలు ఎనిమిది లక్షల మణుగులు, పాలిస్తున్నాయి.

సంవత్సరానికి ఎకరం వైశాల్యంలో ఎన్ని పాలు ఉత్పత్తి చేయబడుతున్నాయో చూస్తే (శ్రీ కృష్ణసామి అంచనాల ప్రకారం) గుంటూరు, కృష్ణా జిల్లాలలో 137 పౌనులు; నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో 63 పౌనులు అని తేలింది.

రాష్ట్రంలో లభ్యమవుతున్న పాలలో నూటికి 95 పాళ్ళు పెరుగు, వెన్నగా తయారు చేయబడుతున్నాయి. ఇతరత్రా వీటి వినియోగం, ఎలా ఉందో దిగువ పట్టిక తెలియచేస్తుంది♦:

| వివరం | మొత్తం పాలఉత్పత్తిలో ఎంత శాతం | పాలతో తయారుచేయు సరుకులలో ఎంత శాతం |
|---|---|---|
| తాగటానికి వినియోగించబడుతున్నపాలు | 32.00 | ... |
| నెయ్యి తయారు చేయటానికి | 52.00 | 76.47 |
| పెరుగు ,, | 15.00 | 22.06 |
| వెన్న ,, | 0.60 | 0.88 |
| కోవా ,, | 0.20 | 0.29 |
| ఐస్ క్రీమ్ ,, | 0.15 | 0.22 |
| మీగడ ,, | 0.05 | 0.08 |
| మొత్తం | 100.00 | 100.00 |

రాష్ట్రంలో అత్యధిక సంఖ్యాకులు పాలు-ప్రధాన పోషక పదార్థాన్ని తీసికోగల స్థితిలో లేరు.

1950వ సంవత్సరంలో మదరాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖవారు జరిపించిన విచారణలో, వివిధ ఆదాయాలుకల కుటుంబాలు దినానికి ఎన్ని ఔన్సుల పాలు పాలరూపంలో కాని, కాఫీ, టీల రూపంలో కాని వినియోగిస్తున్నదీ ప్రక్క పేజీలోని పట్టిక తెలియచేస్తుంది:

♦ అవిభజ్య మదరాసు అంచనాలు.

| ఆదాయాలవారీ కుటుంబ విభజన | దినానికి వినియోగించే పాలు (ఔన్సులలో) |
|---|---|
| 1. నెలకు రు. 50_అంతకన్న తక్కువ ఆదాయంవచ్చే కుటుంబాలు | 1.47 |
| 2. నెలకు రు. 50_100 ఆదాయంవచ్చే కుటుంబాలు | 1.82 |
| 3. నెలకు రు. 100_200 ఆదాయంవచ్చే కుటుంబాలు | 1.87 |
| 4. నెలకు రు. 200 లకు పైబడి ఆదాయంవచ్చే కుటుంబాలు | 3.45 |

ఆరోగ్యసూత్రాల ప్రకారం, వ్యక్తి దినానికి పది ఔన్సులపాలు త్రాగవలసి ఉండగా, నెలకు రు. 200లు ఆదాయం వచ్చే కుటుంబాలవారు కూడా ఈపరిమితి పాలను తీసికోలేక పోతున్నారు. రాష్ట్రములో సగటున మనిషి 1కి. 3.6ఔన్సుల పాలు వినియోగించుతున్నట్లు అంచనా వేయబడింది. ఈసగటు భారతదేశానికి 6.6 ఔన్సులు.

## కోళ్ళు, బాతులు

రాష్ట్రంలో, 1951_52 సంవత్సరంలో 77,92,109 కోళ్ళు, 2,68,163 బాతులు ఉన్నాయి. క్రిందిపట్టిక, వివిధజిల్లాలలో ఉన్న కోళ్ళు బాతులసంఖ్యను వివరిస్తుంది:

| జిల్లా | కోళ్లు | బాతులు | మొత్తం |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 8,75,931 | 40,190 | 9,16,121 |
| విశాఖపట్నం | 12,42,287 | 36,870 | 12,79,157 |
| తూర్పు గోదావరి | 7,06,216 | 35,509 | 7,41,725 |
| పశ్చిమ గోదావరి | 5,13,799 | 64,983 | 5,78,782 |
| కృష్ణా | 6,45,581 | 36,381 | 6,81,962 |
| గుంటూరు | 7,34,760 | 12,895 | 7,47,655 |
| కర్నూలు | 3,57,703 | 2,550 | 3,60,253 |
| అనంతపురం | 4,06,017 | 2,757 | 4,08,774 |
| కడప | 5,78,761 | 4,045 | 5,82,806 |
| చిత్తూరు | 9,20,371 | 5,341 | 7,97,072 |
| నెల్లూరు | 7,70,613 | 26,459 | 9,25,712 |
| బళ్ళారి (మూడవ వంతు) | 40,070 | 183 | 40,253 |
| | 77,92,109 | 2,68,163 | 80,60,272 |

# అడవులు

ఆంధ్రదేశంలో దక్షిణాన తిరుపతి నుంచి, వుత్తరమున శ్రీశైలంవరకు - శేషాచలం కొండలు, పాలకొండలు, నల్లమల అడవులు వ్యాపించి వున్నాయి. వెలికొండ అడవులు గుంటూరు-నెల్లూరు జిల్లాలను, కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాల నుంచి వేరుపరుస్తున్నాయి. విశాఖపట్టణం, ఉభయ గోదావరులలో ఏజన్సీ అడవులు వ్యాపించివున్నాయి. నల్లమల, ఏజన్సీఅడవులే ఆంధ్రదేశపు అడవులలోకెల్లపెద్దవి.

1947 - 48 లెక్కల ప్రకారం 72,49 వేల యకరాలు అడవుల క్రింద వున్నవి. 1950-51వ సంవత్సరపు ప్రభుత్వలెక్కల ప్రకారం వీటివైశాల్యం 82,92,916 ఎకరాలు. ఇందులో 66,23 వేల ఎకరాలు ప్రభుత్వాధీనంలోని రిజర్వు ఫారెస్టు.

వివిధ జిల్లాలలో వ్యాపించి వున్న ఫారెస్టు వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో వివరించబడ్డాయి.

అంటే మొత్తందేశవైశాల్యములో అడవులున్న విస్తీర్ణం 18.29%; అందులో రిజర్వుఫారెస్టు 14.16%. పైపట్టికలో చూపబడినట్లుగా 1,354.8 చ|| మైళ్ళ ఎస్టేటు ఫారెస్టు, జమీందారీ విధానం రద్దుతో పాటు ప్రభుత్వ ఫారెస్టుశాఖ క్రిందికి తీసుకోబడింది. ఇంకా 1,333.25చ|| మైళ్ళ అడవి స్వాధీనపర్చుకో బడలేదు. నల్లమల, ఏజన్సీ అడవులు, నైజాం సంస్థానంలోని తెలంగాణా జిల్లాలలోనికి కూడ విస్తరించి ఉన్నాయి. కాని నేటి రాజ్యాంగ విభజనతో, ఆంధ్ర అడవులలోనికలప ఇచ్చటి అవసరాల తీర్చేందుకు సరిపోక, యితర చోట్లనుండికూడ దిగుమతి చేసుకొన వలసి వస్తున్నది. ప్రక్కనున్న తెలంగాణ అడవులనుండి కొన్నిదిగుమతులున్నా, ఆంధ్రకు మధ్యప్రదేశ్ నుండి కూడా విరివిగా కలప దిగుమతి అవుతున్నది. తెలంగాణాలోని మిగులు కలపను మొత్తం ఆంధ్రకు పంప గలిగినప్పుడు, మనం కలపఅవసరాలకొరకు మరేయితర రాష్ట్రంవైపు ఎదురుచూడ వలసిన పనిఉండదు.

పాలకొండ, శేషాచలం అడవులలో రక్తచందనం (Red Sanders) లభ్యమవుతుంది. ఇది పెద్దగా పెరగదు. ఒకప్పుడు దీనిని మధ్యప్రాచ్య దేశాలకు కూడా ఎగుమతిచేసేవారట! సంగీత వాయిద్యాల తయారీకి వుపయోగించబడుతుంది. తిరుపతివద్ద అమ్మే కొయ్యబొమ్మలు దీనితో నే తయారు చేస్తారు. దీనిని ఇండ్ల ముఖద్వారముల క్రింద చక్కని నగిషీచెక్కించి వాడతారు.

గంపెపుచెక్క చిత్తూరు జిల్లాలోని పలమనేరు రిజర్వు ఫారెస్టులో దొరకుతుంది. ఆంధ్రదేశమంతటా దీన్ని అభివృద్ధిచేయాలని కృషి జరిగిందికాని ఒక్క మదనపల్లి తాలూకా, అనంతపురం జిల్లాలోని కొన్ని భాగాల్లో మాత్రమే యీకృషి విజయవంతమయింది.

| జిల్లా పేరు | రిజర్వు ఫారెస్టు (చ. మైళ్ళు) | ప్రభుత్వ స్వాధీనంలోకి వచ్చిన ఎస్టేటు ఫారెస్టు (చ. మైళ్ళు) | స్వాధీనపర్చుకోబడిన ఎస్టేటు ఫారెస్టు (చ. మైళ్ళు) | స్వంత అడవులు (చ. మైళ్ళు) | మొత్తం (చ. మైళ్ళు) |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 232.23 | ... | ... | ... | 232.23 |
| విశాఖపట్నం | 348.77 | 289.38 | 92.40 | 32.59 | 763.14 |
| తూర్పుగోదావరి | 1,880.48 | 85.33 | 23.30 | ... | 1,989.11 |
| పశ్చిమగోదావరి | 178.70 | 98.50 | 107.10 | ... | 384.30 |
| కృష్ణా | 295.15 | ... | ... | ... | 295.15 |
| గుంటూరు | 727.82 | ... | ... | 53.15 | 780.97 |
| నెల్లూరు | 794.93 | 145.00 | 271.40 | 22.00 | 1,187.33 |
| కర్నూలు | 2,565.62 | 37.26 | ... | ... | 2,602.88 |
| కడప | 1,798.94 | ... | ... | 39.86 | 1,838.80 |
| అనంతపురం | 698.84 | ... | ... | ... | 698.84 |
| చిత్తూరు | 818.32 | 698.33 | 839.05 | ... | 2,355.70 |
| మొత్తం | 8,639.80 | 1,354.80 | 1,333.25 | 147.60 | 13,128.45 |

నోటు : ఇందులో ఆలూరు, రాయదుర్గం, ఆదోని తాలూకాలు కలపబడలేదు.

వెదురు అన్ని జిల్లాలలోనూ లభ్యమవుతుంది. ఇసికలపగానూ, వంటచెరకుగానూ కూడా వినియోగించ బడుతున్నది. విశాఖ, గూడెం ఏజన్సీలలో వెదురు సమృద్ధిగా వున్నా, తగినంతగా దీనిని వినియోగించుకొనుటలేదు. గోదావరి జిల్లాలోగూడ వెదురు పుష్కలంగా దొరకుతుంది.

పచ్చగడ్డి అన్ని అడవుల్లోనూ దొరుకుతుంది. వర్షాకాలంలో నెల్లూరు,గుంటూరు జిల్లాలనుంచి పశువుల్ని మేతకొరకు రాయలసీమ అడవులకు తోలుతారు. అలాగే గోదావరి జిల్లాలనుండిగూడ దాపున వున్న అడవి ప్రాంతాలకు తోలుతారు. పూర్వంనుంచి యిది జరుగుతూనే వుంది.

ఈ పచ్చికబయళ్ళే కాకుండా, పేపరు తయారు చేయడాని కవుసరమైనబొ తగడ్డి, నల్లమల అడవిలో విశేషంగాదొరుకుతుంది.

తీరప్రాంతాన పెంచబడుతున్న సర్వి చెట్లు వంటచెరకుగా మిక్కిలిఉపయోగం. వీటి పెంపకాభివృద్ధికి కృషిజరుగుతోంది. కాని తగువిధంగా పెంచబడలేదు.

ఇచ్చటలభించే తంగేడుబెరడు, దక్షిణ ఇండియాకు తోలు పరిశ్రమలకొరకై ఎగుమతిచేయబడుతోంది. చిత్తూరు, కడప, నెల్లూరుజిల్లాలనుండి కలప, వంటచెరకు మద్రాసుకు ఎగుమతి చేయబడుతున్నవి.

ప్రభుత్వానికి ప్రతి సంవత్సరం ఫారెస్టు డిపార్టుమెంటునుండి ఖర్చులు పోను రు. 25 లక్షలకు పైగా ఆదాయం వస్తున్నది. 1950-51 సంవత్సరపు ప్రభుత్వ లెక్కల ప్రకారం ఆదాయ వ్యయాలు యిలా వున్నాయి:

మొత్తం ఆదాయంలో దాదాపు సగభాగం బొగ్గు, వంటచెరకు అమ్మకం ద్వారా వస్తున్నది. ఇది ఎక్కువగా దిగువ గోదావరి, దక్షిణకడప, నెల్లూరు జిల్లాలలో లభ్యమవుతోంది. వీన్నానేక రెట్లు పెంచగల అవకాశాలున్నాయి.

తరువాత వెదురు అమ్మకంద్వారా ఎక్కువ ఆదాయం లభించుతోంది. ఇది ఎక్కువగా ఎగువ, దిగువ గోదావరులలోనూ, పశ్చిమ కర్నూలులోను దొరుకుతోంది. వెదురు అమ్మకంద్వారా వచ్చే ఆదాయం రు.9,71,477

కలప అమ్మకంద్వారా రు. 6,64,857 వస్తోంది. ఇది ముఖ్యంగా ఎగువగోదావరి, పశ్చిమకర్నూలు జిల్లాలనుండి లభ్యమవుతోంది. అన్నింటికన్నా తక్కువఫలసాయం వచ్చేది గంధపు చెట్లనుండి. దీనిపై సంవత్సరానికి 1,254 రూ॥లు మాత్రమే ఆదాయం వస్తోంది.

వివిధ పద్దులకింద వచ్చే ఆదాయ వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి:

| డివిజన్ | ఆదాయం (రూపాయల్లో) | వ్యయం (రూపాయల్లో) |
|---|---|---|
| విశాఖపట్నం | 2,98,595 | 1,30,084 |
| ఎగువ గోదావరి | 5,43,099 | 1,52,897 |
| దిగువ గోదావరి | 8,34,235 | 1,77,199 |
| గుంటూరు | 2,99,185 | 2,05,026 |
| తూర్పు కర్నూలు | 2,50,453 | 1,50,971 |
| పశ్చిమ కర్నూలు | 7,91,254 | 1,59,707 |
| అనంతపురం | 2,93,055 | 1,73,205 |
| బళ్ళారి | 2,03,789 | 1,88,241 |
| చిత్తూరు | 2,27,967 | 1,74,424 |
| ఉత్తర కడప | 2,07,673 | 1,42,421 |
| దక్షిణ కడప | 3,87,166 | 1,57,426 |
| నెల్లూరు | 5,71,965 | 3,97,911 |
| మొత్తం | 49,08,436 | 22,09,512 |

నోటు: ఈ ఆదాయంలో కేవలం అటవీ సంపద ద్వారా వచ్చిన మొత్తాలే గాకుండా, కేంద్ర ప్రభుత్వ సబ్సిడీలాంటి యితర మొత్తాలు కూడ కలుపబడ్డాయి.

| డివిజను | గంధపుచెక్క అమ్మకంవల్ల (రూపాయలలో) | కలప అమ్మకం వల్ల (రూపాయలలో) | ఫ్యూయల్, వంట చెరకు అమ్మకంవల్ల (రూపాయలలో) | వెదురు అమ్మకం వల్ల (రూపాయలలో) | పచ్చిక బయళ్ళ గుత్తల అమ్మకం వల్ల (రూపాయలలో) | ఇతర అమ్మకాల వల్ల (రూపాయలలో) | ఇతర అమ్మకాల వసూళ్ళ వల్ల (రూపాయలలో) | మొత్తం డివిజను ఆదాయం (రూపాయలలో) |
|---|---|---|---|---|---|---|---|---|
| విశాఖపట్టణం | 834 | 16,903 | 46,788 | 1,68,543 | 6,077 | 31,613 | 652 | 2,71,410 |
| ఎగువగోదావరి | 162 | 2,36,360 | 10,328 | 2,04,380 | 4,306 | 68,142 | 4,288 | 5,27,968 |
| దిగువగోదావరి | 20 | 59,497 | 4,96,211 | 2,15,615 | 8,412 | 22,876 | 10,514 | 8,13,745 |
| గుంటూరు | ... | * 5,275 | 1,19,316 | 6,054 | 44,336 | 34,679 | 388 | 2,10,048 |
| తూర్పుకర్నూలు | ... | 71,378 | 38,517 | 56,200 | 31,360 | 34,018 | 2,239 | 2,33,712 |
| పశ్చిమకర్నూలు | 72 | 2,48,786 | 1,30,750 | 2,68,719 | 19,341 | 57,380 | 28,327 | 7,53,375 |
| అనంతపురం | 44 | 10 | 9,738 | 1,730 | 21,430 | 73,401 | 430 | 1,06,783 |
| బళ్ళారి* | 113 | 15,765 | 34,709 | 1,829 | 40,450 | 47,683 | 65 | ,140,614 |
| చిత్తూరు | ... | 6,432 | 1,17,751 | 12,906 | 20,954 | 29,423 | 846 | 1,88,222 |
| ఉత్తరకడప | 7 | ... | 1,21,183 | 15,911 | 26,299 | 5,594 | 1,371 | 1,70,365 |
| దక్షిణకడప | 2 | 4,438 | 2,33,395 | 18,990 | 17,181 | 85,780 | 1,856 | 3,62,642 |
| నెల్లూరు | ... | 103 | 3,72,437 | ... | 23,226 | 34,194 | 1,714 | 4,31,674 |
| మొత్తం ఆదాయం అయిటంవారీ(రూ॥లలో) | 1,254 | 6,64,857 | 17,31,123 | 9,71,477 | 2,63,365 | 5,24,783 | 55,39౮ | 42,12,249 |

నోటు : ఇందులో జిల్లాలుగా ఉదహరింపబడిన డివిజనులు, ఆయా జిల్లాల రెవెన్యూ డివిజన్ల సరిహద్దులకు పరిమితమైలేవు-ఫారెస్టు శాఖవారు పరిపాలనా సౌలభ్యంకోసం ఏర్పరచిన డివిజన్లుగా మాత్రమే పరిగణించాలి. *బళ్ళారి డివిజన్ మొత్తంగా తీసుకోబడింది. ఆంధ్ర - ఆంధ్రేతర భేదం పాటించబడలేదు.

# మద్యనిషేధం

ఆంధ్రలో మద్యనిషేధచట్టం, ప్రప్రథమంగా 1946 వ సంవత్సరంలో కొన్ని జిల్లాలలోమాత్రం అమలు జరుపబడింది. క్రమంగా, ఈ చట్టాన్ని 1948 వ సంవత్సరానికి రాష్ట్రవ్యాపితంగా అమలు పరచారు.

1946 అక్టోబరు ఒకటవ తేదీనుండి అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, జిల్లాలలోను; 1947 వ సంవత్సరం అక్టోబరు ఒకటవ తేదీనుండి గుంటూరు నెల్లూరు జిల్లాలలోను; 1948 వ సంవత్సరం అక్టోబరు ఒకటవ తేదీనుండి కృష్ణా, పశ్చిమగోదావరి, తూర్పు గోదావరి, విశాఖ (అప్పటికి శ్రీకాకుళంజిల్లా విభజన జరుగలేదు) జిల్లాలలోను మద్యనిషేధ చట్టం అమలుపరచబడింది.

"ప్రజలు, త్రాగుడుకు అలవాటుపడి చెడిపోతున్నారని, సంపాదించింది కాస్త త్రాగుడుకు ఖర్చుచేసి, ఆర్థికంగా దెబ్బ తింటున్నారని, మద్యనిషేధంవల్ల వీరిని త్రాగుడు మాన్పించి 'బాగు' చేయవచ్చునే" వాదనతో కాంగ్రెసుమంత్రివర్గం మద్యనిషేధచట్టాన్ని అమలు జరిపింది. ప్రభుత్వం, కల్లుగీతమీద బ్రతుకుతున్న సుమారు మూడులక్షల కుటుంబాలవారికి పనులు చూపించలేక పోవటంవల్ల వీరు నిరుద్యోగులైనారు.

ఈ చట్టం అమలుజరుపబడక పూర్వం కల్లు, సారాయి, గంజాయి, నల్లమందు ఇత్యాది మత్తుపదార్థాలమీద 1945-46 వ సంవత్సరంలో ప్రభుత్వానికి ఆంధ్రజిల్లాలలో వచ్చిన ఆదాయం పదుకోట్ల ఆరవై లక్షల రూపాయలు. 1946-47 వ సంవత్సరంలో, ప్రభుత్వ ఎక్సైజు డిపార్టుమెంటు పరిపాలనా నివేదికలోనిలెక్కలప్రకారం, వివిధజిల్లాలలోను వీటిమీద వచ్చిన ఆదాయం, ఆ శాఖ నిర్వహణకు అయిన ఖర్చు వివరాలు ప్రక్కలోని పట్టికలో యిలా ఉన్నాయి :

1946-47 వ సంవత్సరంలో ప్రభుత్వానికి రు. 5,05,67,378 లు ఆదాయం వస్తే, ఎక్సైజు శాఖా నిర్వహణకు రు. 17,96,814 మాత్రమే ఖర్చు చేయబడింది. ప్రభుత్వానికి రు. 4,87,70,564 మిగులుతున్నది.

ప్రభుత్వం మద్యనిషేధ చట్టాన్ని అమలుపరచటానికి సిబ్బందినిపెంచి, డబ్బు ఖర్చుచేసి విశ్వప్రయత్నాలుచేస్తున్నప్పటికీ ఫలితం కనుపించటంలేదు. అనేకచోట్ల ఈ చట్టాన్ని అతిక్రమించి సారాయి తయారుచేయటం, కల్లుగీయటం ఇత్యాదులు సంవత్సరానికి సంవత్సరం అధికమవుతున్నట్లు ప్రభుత్వ అంచనాలే తెలియచేస్తున్నాయి.

మద్యనిషేధ ఫలితాలను విచారించటానికి ప్రభుత్వం నియమించిన కమిటీ

| జిల్లా | ఆదాయం (రూపాయల్లో) | వ్యయం (రూపాయల్లో) | మిగులు (రూపాయల్లో) |
|---|---|---|---|
| శ్రీకాకుళం } విశాఖపట్టణం } | 80,70,622 | 2,61,022 | 78,09,600 |
| తూర్పుగోదావరి | 82,45,129 | 2,01,687 | 80,43,442 |
| పశ్చిమగోదావరి | 51,18,043 | 1,24,106 | 49,93,937 |
| కృష్ణా | 69,00,765 | 1,63,755 | 67,37,010 |
| గుంటూరు | 51,26,531 | 1,81,625 | 49,44,906 |
| నెల్లూరు | 23,22,567 | 1,54,100 | 21,68,467 |
| కర్నూలు | 45,27,602 | 2,89,079 | 42,38,523 |
| కడప | 18,72,458 | 1,06,853 | 17,65,605 |
| అనంతపురం | 39,34,240 | 1,32,616 | 38,01,624 |
| చిత్తూరు | 30,84,869 | 1,35,569 | 29,49,300 |
| బళ్ళారి (మూడోవంతు) | 13,64,552 | 46,402 | 13,18,150 |
| మొత్తం | 5,05,67,378 | 17,96,814 | 4,87,70,564 |

ఆంధ్రరాష్ట్ర కిల్లగీత కార్మిక సంఘం వారు సమర్పించిన నివేదికలో, దొంగ సారాయిని ఎంత విరివిగా తయారుచేస్తున్నారో ఇలా వివరించారు :

"రహస్యంగా కృత్రిమసారా తయారు చేయటం యీనాటికి విస్తృతమైన గృహ పరిశ్రమగా రూపొందింది....... ఈనాడు రహస్యబట్టీలు దామాషాన గ్రామానికి 15-16 వరకు తయారయ్యాయి.

"మేము సేకరించిన భోగట్టానుబట్టి ఉదాహరణకు 25 వేల జనాభా గల ఒక పట్టణంలో యీ విధంగా రహస్య సారా తయారుచేయబడుతున్నది:

"3 పెద్ద కంపెనీలు-ఒకదానికి రు. 60 వేలు, మిగిలిన రెంటికి ఒక్కొక్కదానికి రు. 40 వేలు చొప్పున పెట్టుబడి. వీరు చిన్నచిన్న యంత్రాలను, పెద్ద పెద్ద లోహపు బట్టీపాత్రలను ఉపయోగించి యంత్రం ఒకటికి 10 గాలనుల సారా తయారుచేస్తున్నారు. ఇది గాక మరొక 42 చిన్న బట్టీలున్నాయి. వీరు ఒక్కొక్కరు కనీసం రెండు గాలనులు ఉత్పత్తి చేస్తారు. ఇదే పరిస్థితి యించుమించు ఆంధ్రరాష్ట్రం అంతటా ఉన్నదనటంలో సందేహం లేదు."

ప్రభుత్వం ప్రకటించిన మద్యనిషేధ చట్ట అతిక్రమణ కేసులు క్రమంగా పెరుగుతున్నాయి. ప్రక్కపేజీలోని పట్టికలో 1950-51, 1951-52 సంవత్సరాల వివరాలు ఇవ్వబడ్డాయి :

| జిల్లా | రిపోర్టు చేయబడిన కేసులు | |
|---|---|---|
| | 1950 - '51 | 1951 - '52 |
| శ్రీకాకుళం | 2,181 | 3,104 |
| విశాఖపట్నం | 6,798 | 6,061 |
| తూర్పు గోదావరి | 3,440 | 2,904 |
| పశ్చిమ గోదావరి | 3,892 | 4,653 |
| కృష్ణా | 4,015 | 3,489 |
| గుంటూరు | 4,903 | 4,571 |
| నెల్లూరు | 942 | 1,504 |
| కర్నూలు | 3,692 | 5,304 |
| కడప | 3,377 | 4,019 |
| అనంతపురం | 3,169 | 4,115 |
| చిత్తూరు | 2,986 | 4,172 |
| బళ్ళారి (మూడోవంతు) | 1,232 | 1,654 |
| మొత్తం | 40,627 | 45,550 |

1949-50 వ సంవత్సరంలో 34,281 కేసులు రిజిస్టరయితే, 1950-51వ సంవత్సరానికి ఇది 40,627 కి, 1951-52 వ సంవత్సరానికి 45,550 కి పెరిగాయి.

ఉద్యోగులలంచగొండితనంవల్ల నూటికి 90 కేసులు మాఫీచేయబడతాయి. పట్టుబడే పదికేసులు, అదనపు లంచాల నివ్వ నిరాకరించిన వారిపై బనాయించబడినవే నని ఆంధ్రరాష్ట్ర కల్లుగీత కార్మికుల సంఘం, రామమూర్తి కమిటీకి సమర్పించిన నివేదికలో వివరించింది. కనుక ప్రభుత్వం ప్రకటించిన కేసులసంఖ్య, జరుగుతున్న "నేరాల"లో నూటికి పదిమాత్రమే నన్న మాట.

ఈవిధంగా, చట్టం అతిక్రమణ ఎక్కువయిన కొలదీ, ప్రభుత్వానికి చట్టంఅమ



జరుపబడకపూర్వం ఎక్సైజు పన్నువల్ల వచ్చే రు. 5,60 లక్షలు పోవటమే కాక, సంవత్సరానికి సంవత్సరం ఆశాఖకువచ్చే ఆదాయంకంటె అధిక మొత్తాలను ఖర్చు చేయవలసి వస్తున్నది.

1951-52 వ సంవత్సరంలో ఎక్సైజు శాఖకు వచ్చిన ఆదాయం, అయినఖర్చు, లోటువివరాలను ప్రక్క పేజీలోని పట్టిక వివరిస్తుంది :

ఆంధ్రరాష్ట్రావతరణతో, ప్రభుత్వ లోటు బడ్జెట్ ను ఎలా పూడ్చటమా, పంచవర్ష ప్రణాళికకు కావలసిన ధనాన్ని ఎలా సమకూర్చాలా అనే సమస్యపైకి వచ్చింది. మద్యనిషేధ చట్టాన్ని రద్దుచేయడటంవల్ల రు. 5-6 కోట్ల ఆదాయాన్ని సంపాదించవచ్చునే

| జిల్లా పేరు | నికరాదాయము (రూపాయల్లో) | వ్యయం (రూపాయల్లో) | లోటు (—) మిగులు (+) (రూపాయల్లో) |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 1,61,504 | 3,13,964 | — 1,52,460 |
| విశాఖపట్నం | 4,36,631 | 3,32,677 | + 1,03,954 |
| తూర్పుగోదావరి | 4,23,430 | 5,00,805 | — 77,370 |
| పశ్చిమగోదావరి | 1,79,355 | 3,02,725 | — 1,23,370 |
| కృష్ణా | 91,869 | 4,85,068 | — 3,93,199 |
| గుంటూరు | 1,58,676 | 3,716 | + 1,44,960 |
| నెల్లూరు | 79,074 | 5,836 | + 73,238 |
| కర్నూలు | 26,493 | 4,12,953 | — 3,86,460 |
| కడప | 34,733 | 3,52,537 | — 3,18,804 |
| అనంతపురం | 14,174 | 3,67,457 | — 3,53,283 |
| చిత్తూరు | 34,777 | 3,106 | + 31,671 |
| బళ్ళారి (మూడోవంతు) | 10,235 | 1,10,478 | — 1,00,243 |
| మొత్తం | 16,50,951 | 31,91,322 | —15,40,371 |

అభిప్రాయానికి ఎక్కువ ప్రాబల్యం కలగటంవల్ల, ప్రభుత్వం శ్రీ కోంగి రామ రామమూర్తిగారి అధ్యక్షతన ఒక విచారణ కమిటీని నియమించింది.

ఈ కమిటీ, "మద్య నిషేధం అమలు పూర్తిగా, స్పష్టంగా అపజయం పొందినట్లు కావలసినంత సాక్ష్యాన్ని" సేకరించింది. త్రాగుడు పెరగడం, దొంగసారా తయారీ, కల్లుగీతను అరికట్టవలసిన ప్రభుత్వ సిబ్బందిలో లంచగొండితనం వ్యాపించటం, ఇత్యాది తాము కనుగొన్న విషయాలను వారి రిపోర్టులో వివరించిన కొన్ని భాగాలు గమనింపదగ్గవి :

"గ్రామసులనుంచి, ఇతర పెద్దలనుంచి లభించిన సాక్ష్యం ప్రాతిపదికగా, మద్య నిషేధానికి పూర్వం త్రాగుడుకు అలవాటు పడిన వాళ్ళలో నాటికి 50 పాళ్ళ నుంచి 100 పాళ్ళవరకు ఇప్పుడు త్రాగుతూనే వున్నారని యీ సంఘం కనుగొన్నది. త్రాగుడు, కార్మిక వర్గం నుంచి ఇప్పుడు క్రింది మధ్యతరగతికి కూడా వ్యాపించినట్లు, ఇప్పుడు స్త్రీలు, పిల్లలు, బ్రాహ్మణులు, క్షత్రియులు కూడా త్రాగుడు నేర్చినట్లు, ఇప్పుడు వీరంతా త్రాగుతున్న సరుకు పూర్వపుసరుకుకంటె ఆరోగ్యానికి ఎక్కువ విషతుల్యమైనట్లు యీ సంఘం కనుగొన్నది.

"మద్యనిషేధం అమలు పూర్తిగా స్పష్టంగా అపజయం పొందినట్లు ఈ సంఘందగ్గర కావలసినంత సాక్ష్యంవుంది. ఈ అపజయానికి ముఖ్యకారణం మద్య

నిషేధానికి ప్రజాభిప్రాయం అనుకూలంగా లేకపోవడమే. ఈ సంఘం దర్శించిన అన్ని గ్రామాలలోను, ఒక్క వ్యక్తి కూడా మద్యనిషేధానికి అనుకూలంగా ఒక్క మాటకూడ చెప్ప లేదు. మద్య నిషేధం వాస్తవంగా మద్యాన్ని నిషేధించడంలో పూర్తిగా వ్యర్థమయినది.

"నీరానుంచి, తీపికల్లునుంచి తాటిబెల్లం చేసే సహకార సంఘాల లెక్కలను యీ సంఘం పరిశీలించింది. బెల్లం కోసం గీయబడుతున్న కల్లులో అత్యధిక భాగం, (తాగడానికి (పుల్లకల్లుగా) ఉపయోగించబడుతున్నట్లు ఈసంఘం కనిపెట్టింది. ఈ సంఘాల లెక్కలనుబట్టి, ప్రజల సాక్ష్యాలనుబట్టి చూస్తే యీసహకార సంఘాల ఇన్‌స్పెక్టర్లు అన్ని ప్రభుత్వ నిబంధనలను వ్యర్థం చేసినట్లు కనిపిస్తుంది. సహకార శాఖ, మద్యనిషేధశాఖ, పోలీసు శాఖలలో పరిపాలనా వ్యవస్థ పూర్తిగా భగ్నమై పోయింది. మద్యనిషేధం విషయంలోను, తాటిబెల్లపు సహకార సంఘాల విషయంలోను భగ్నమైన ప్రభుత్వశాసనం, తక్కిన విషయాలలో కూడా భగ్నమై పోగల ప్రమాదం కలదు.

"ఈ మూడు శాఖలలోను అవినీతి, లంచగొండితనం నగ్నతాండవం చేస్తున్న దందే అతిశయోక్తి ఏమీకాదు. మద్య నిషేధాన్ని బలంగా అమలు జరపడానికి కొన్ని సూచనలను యీ సంఘం పరిశీలించింది. మంచి సిబ్బందిని ఎంచుకోవడం, నమ్మకంగా పనిచేసే వారికి మంచి బహుమతులు ఇవ్వడం, పరిశీలనకు, దాడులకు జీపుకార్లను ఇవ్వడం, సిబ్బందిని ఎక్కువ చెయ్యడం, నేరస్థులకు ఇంకా కఠినమైన శిక్షలు వెయ్యడం, సాముదాయిక జరిమానాలు వెయ్యడం మొదలైన పద్ధతులను ఈ సంఘం పరిశీలించింది.

ఈ విషయంలో ప్రజాభిప్రాయాన్ని సేకరించింది. ప్రజలు అనుకూలంగా లేక పోతే యీపద్ధతులేవీ పనిచెయ్యవని, కఠిన శిక్షలకు పేదలే గురిఅవుతూ భాగ్యవంతులు తప్పించుకుంటూ వుంటారని గ్రహించింది.

నూటికి నూరు పాళ్ళు విఫలమైన మద్యనిషేధ చట్టాన్ని రామమూర్తి కమిటీ సూచనప్రకారం సడలించడమా లేదా అనే విషయంలో ఆంధ్ర ప్రభుత్వం ఇంకా ఒక నిర్ణయానికిరాలేదు. ప్రముఖ కాంగ్రెసు నాయకులు శ్రీ సంజీవ రెడ్డి, గోపాలరెడ్డిగార్లవంటివారు ఈ రిపోర్టును పూర్తిగా వ్యతిరేకిస్తున్నారు. దీని భవిష్యత్తు ఏమిటో కాలమే నిర్ణయించవలసి ఉన్నది.



# వైద్యసహాయము - ఆరోగ్యము

ఆంధ్ర ప్రజలకు, ఆరోగ్యభాగ్యం అబ్బలేదు. ఏ ఇతరదేశంలోకంటే, శిశు బాలింత మరణాలరేటు మనరాష్ట్రంలో అత్యధికం. సాధారణ మరణపురేటుకూడా అధికమే! ఉన్నవైద్య సౌకర్యాలుకూడా చాలతక్కువ! ఉన్న వైద్యవిద్యావకాశాలూ తక్కువే!

వ్యాధులు ప్రబలటానికి, అకాల మరణాలకు మూలం ఆహారలోపం. నూటికి 90 మంది శరీర పోషణకు కావలసిన సంపూర్ణాహారాన్ని తీసికోవటం లేదని ప్రభుత్వ విచారణలలోనే తేలింది.

1950 లో మదరాసు ప్రభుత్వం, వివిధ తరగతుల ప్రజలు తీసికొనే ఆహార వివరాలపై కొన్ని తమిళజిల్లాలతోపాటు అనంతపురం, గుంటూరు, కర్నూలు, నెల్లూరు, విశాఖపట్టణంజిల్లాల్లో విచారణ జరిపించింది. అనాధ శరణాలయాలు, విద్యార్థివసతిగృహాలుకూడా ఈ విచారణ లోకి వచ్చాయి.

ఈ విచారణసంఘం నెలకు రు. 200 నుండి రు. 50 ల వరకు ఆదాయంవచ్చే 964 కుటుంబాలను (అవిభాజ్య మదరాసు రాష్ట్రంలో) విచారించి వివరాల సేకరించింది. క్రిందిపట్టికలో ఈ కుటుంబాలవారి ఆదాయాల వివరాలు ఉన్నాయి:

అన్నికుటుంబాలవారు అధికంగా బియ్యము, జొన్నలు, రాగులు, సజ్జలు మొదలైన కాయధాన్యాలను (Cereals) ప్రధానంగా తింటున్నట్లు ఈ కమిటీ తేల్చింది. ఆరోగ్యశాస్త్రజ్ఞులు సూచించినట్లు సంపూర్ణాహారాన్ని (Balanced diet) ఏ తరగతివారూ తీసికోవటం లేదు.

ప్రతివ్యక్తి దినానికి మూడుఔన్సుల పప్పుదినుసులు తినాలని శాస్త్రవేత్తల సూచనైతే, 1 వ తరగతి కుటుంబాలలో మనిషి ఒక 2.73 ఔన్సులు, 2 వ తరగతి కుటుంబాలలో 1.74 ఔన్సులు, 3వ తరగతిలో 1.88 ఔన్సులు, 4 వ తరగతిలో 1.03 ఔన్సులుమాత్రమే తీసికొంటున్నారు.

| ఆదాయం | తరగతి | కుటుంబాలు |
|---|---|---|
| నెలకు రు. 200 లకు పైబడి ఆదాయంవచ్చే కుటుంబాలు | 1 | 164 |
| నెలకు రు. 100 - 200 లు ఆదాయం వచ్చే కుటుంబాలు | 2 | 195 |
| నెలకు రు. 50-100 లు ఆదాయం వచ్చే కుటుంబాలు | 3 | 300 |
| నెలకు రు 50-అంతకంలోపు ఆదాయంవచ్చే కుటుంబాలు | 4 | 305 |

సంపూర్ణాహార సూత్రం ప్రకారం, మనిషి 1 కి రోజుకు నాలుగు ఔన్సుల ఆకుకూరలను తీసుకోవాలి. వీరిలో 115 కుటుంబాలవారు అసలు ఆకుకూరలనే తీసుకోవటంలేదు. కాయకూరలను కూడ తగిన పాళ్ళలో తీసికొనటంలేదు.

పాలు, పాలతో చేయబడిన పదార్థాల వినిమయంకూడా చాల తక్కువే. దినానికి మనిషి 1కి పదిఔన్సుల పాలు తీసికోవాలని ఆరోగ్య సూత్రాలు చెబుతున్నాయి. కాని, పై కుటుంబాలలో ఏ ఒక్క కుటుంబంవారూ ఈపరిమాణంలో పాలు తీసికోవటంలేదు. 1 వ తరగతివారు 3.45 ఔన్సులు, 2 వ తరగతివారు 1.87 ఔన్సులు, 3 వ తరగతివారు 1.82 ఔన్సులు, 4 వ తరగతివారు 1.47 ఔన్సులు మాత్రమే పాలుతీసికొంటున్నట్లు తేలింది. నీదకుటుంబాలవారిలో (4) 305 కుటుంబాలలో నూటికి 52 కుటుంబాల వారు (160 కుటుంబాలు) అసలు పాలే తీసికోవటంలేదు.

నెలకు రు. 200 ఆదాయం వచ్చేకుటుంబాలవారు కూడా నిర్ణీత పాళ్ళలో శాస్త్రజ్ఞులు నిర్ణయించిన సంపూర్ణాహారాన్ని తీసుకోలేక పోతున్నారంటే, రాష్ట్రంలోని అశేష ప్రజానీకి జీవన ప్రమాణ స్థాయిఏమిటో సులభంగా ఊహించవచ్చు.

## మరణాలు

ఆహారలోపంవల్ల, ప్రజల శరీరశక్తి సన్నగిల్లి, వ్యాధినిరోధకశక్తి నీరసించటంచేత, వేలమంది ప్రజలు అత్యల్పవయస్సులోనే, అనేక రకాలవ్యాధులకు బలైపోతున్నారు.

1951వ సంవత్సరం, ఆరోగ్యశాఖవారి అంచనాల ప్రకారం, ఆంధ్రరాష్ట్రంలో 330 వేలమంది వివిధవ్యాధులవల్ల మరణించినట్లు తేలింది.

జిల్లాలవారీ మరణాలసంఖ్య ప్రక్క పేజీలోని పట్టికలో ఇలా వుంది :

గత పది సంవత్సరాలలో (1942_51) ప్రతి వెయ్యిమంది జనాభాకు ఎంతమంది చనిపోతున్నారో దిగువపట్టిక వివరిస్తుంది:

| సంవత్సరం | మరణపు రేటు |
|---|---|
| 1942 | 23.1 |
| 1943 | 26.1 |
| 1944 | 26.6 |
| 1945 | 23.4 |
| 1946 | 20.3 |
| 1947 | 20.9 |
| 1948 | 18.7 |
| 1949 | 17.4 |
| 1950 | 19.9 |
| 1951 | 16.9 |

ఇతర దేశాలలోకంటె, మరణపు రేటు మన రాష్ట్రంలో అధికమని దిగువ పట్టిక తెలియచేస్తుంది:

| దేశం | ప్రతి వెయ్యిమంది జనాభాకు మరణాలు |
|---|---|
| కెనడా | 9.6 |
| అమెరికా | 10.6 |
| జర్మనీ | 12.3 |
| బ్రిటన్ | 12.2 |
| ఆస్ట్రేలి | 17.6 |
| భారతదేశం | 21.2 |
| ఆంధ్ర | 22.0* |

* గత పది సంవత్సరాల సగటు.

| జిల్లా | | మరణాల సంఖ్య | ప్రతి వెయ్యి మంది జనాభాకు ఎన్ని మరణాలు | గత ఐదు సంవత్సరాలలో ఈ రేటు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | | 42,610 | 20.54 | 20.64 |
| విశాఖపట్టణం | | 36,196 | 17.41 | 20.53 |
| తూర్పు గోదావరి | ఏజన్సీ | 3,803 | 18.20 | 20.29 |
| | మైదానాలు | 30,090 | 13.57 | 18.23 |
| పశ్చిమ గోదావరి | ఏజన్సీ | 1,955 | 19.95 | 21.88 |
| | మైదానాలు | 26,556 | 16.52 | 19.71 |
| కృష్ణా | | 25,238 | 14.08 | 18.76 |
| గుంటూరు | | 39,616 | 15.49 | 18.52 |
| నెల్లూరు | | 27,583 | 15.31 | 17.26 |
| కర్నూలు | | 29,139 | 18.16 | 23.23 |
| కడప | | 15,644 | 13.42 | 16.14 |
| అనంతపురం | | 23,999 | 17.54 | 21.12 |
| చిత్తూరు | | 24,331 | 13.41 | 15.25 |
| బళ్ళారి (మూడో వంతు) | | 6,598 | 15.86 | 23.66 |
| మొత్తం | | 3,27,358 | 16.39 | 19.66 |

**1951** వ సంవత్సరంలో మరణించిన వారిలో వివిధ వయస్సులవారు ఎందరో జిల్లాలవారీ వివరాలను ప్రక్క పేజీలోని పట్టికలు తెలియచేస్తాయి:

ఈ సంవత్సరం మరణించిన 3,30 వేల మందిలో 73 వేల మంది సంవత్సరం దాటని శిశువులు. అంటే మొత్తం మరణించినవారిలో నూటికి 22 మంది సంవత్సరంకూడా నిండకుండానే మరణిస్తున్నారన్న మాట. 1950 లో ఈ రేటు 20.4%. మరణిస్తున్నవారిలో నూటికి 54 మంది 30 సంవత్సరాల లోపువారే!

రాష్ట్రంలో వస్తున్న ముఖ్య వ్యాధుల్లో జ్వరాలు, రక్త విరోచనాలు, వాంతులు-భేదులు, ఊపిరితిత్తుల సంబంధమైన వ్యాధులు, మలేరియా, క్షయ ఇత్యాదులు. మరణించిన వ్యక్తి సరిగ్గా ఏ వ్యాధి వల్ల మరణించాడో ప్రభుత్వ లెక్కలలో మనకు లభించదు. ఆకలి మరణాలు సంభవిస్తున్నట్లు పత్రికలలో చూస్తుంటాం. కాని కంచుకాగడా వేసి వెతికినా ఈ "వ్యాధి" ప్రభుత్వ రికార్డులలో కనుపించదు. ఇటువంటి మరణాలన్నీ సామాన్యంగా "జ్వరాలు, రక్త

| జిల్లా | సంవత్సరం లోపు | | 1 – 5 సంవత్సరాల మధ్య | | 5 – 10 సంవత్సరాలమధ్య | |
|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| శ్రీకాకుళం | 4,370 | 3,970 | 3,340 | 3,075 | 1,139 | 1,074 |
| విశాఖపట్నం | 3,920 | 3,577 | 2,632 | 2,612 | 837 | 789 |
| తూర్పుగోదావరి { మైదానాలు | 3,510 | 2,871 | 2,251 | 2,121 | 691 | 665 |
| తూర్పుగోదావరి { ఏజన్సీ | 287 | 249 | 281 | 221 | 92 | 77 |
| పశ్చిమగోదావరి { మైదానాలు | 3,372 | 3,797 | 1,863 | 2,009 | 573 | 572 |
| పశ్చిమగోదావరి { ఏజన్సీ | 235 | 187 | 165 | 144 | 37 | 46 |
| కృష్ణా | 3,578 | 3,045 | 1,954 | 1,896 | 539 | 547 |
| గుంటూరు | 5,149 | 4,447 | 3,367 | 2,245 | 865 | 940 |
| నెల్లూరు | 2,751 | 2,560 | 2,373 | 2,346 | 627 | 615 |
| కర్నూలు | 2,851 | 2,560 | 2,373 | 2,346 | 627 | 615 |
| కడప | 1,505 | 1,421 | 1,379 | 1,344 | 420 | 388 |
| అనంతపురం | 3,367 | 2,831 | 2,076 | 2,050 | 753 | 759 |
| చిత్తూరు | 3,277 | 2,575 | 4,192 | 1,600 | 639 | 540 |
| బళ్ళారి (మూడోవంతు) | 437 | 336 | 254 | 242 | 224 | 447 |
| | 38,609 | 34,426 | 25,800 | 24,251 | 8,063 | 8,074 |

| జిల్లా | 10-15 సంవత్సరాల మధ్య | | 15-20 సంవత్సరాల మధ్య | | 20-30 సంవత్సరాలమధ్య | |
|---|---|---|---|---|---|---|
| | పురుషులు (8) | స్త్రీలు (9) | పురుషులు (10) | స్త్రీలు (11) | పురుషులు (12) | స్త్రీలు (13) |
| శ్రీకాకుళం | 1,303 | 1,205 | 1,736 | 1,778 | 1,108 | 1,267 |
| విశాఖపట్నం | 839 | 819 | 989 | 1,110 | 994 | 1,170 |
| తూర్పుగోదావరి { మైదానాలు | 467 | 493 | 593 | 553 | 835 | 977 |
| తూర్పుగోదావరి { ఏజన్సీ | 90 | 69 | 120 | 117 | 150 | 142 |
| పశ్చిమ గోదావరి { మైదానాలు | 409 | 357 | 347 | 461 | 628 | 961 |
| పశ్చిమ గోదావరి { ఏజన్సీ | 32 | 26 | 38 | 42 | 83 | 82 |
| కృష్ణా | 314 | 376 | 312 | 424 | 536 | 932 |
| గుంటూరు | 490 | 512 | 504 | 652 | 1,005 | 1,395 |
| నెల్లూరు | 438 | 380 | 343 | 430 | 789 | 967 |
| కర్నూలు | 388 | 353 | 363 | 441 | 634 | 915 |
| కడప | 272 | 253 | 182 | 285 | 424 | 714 |
| అనంతపురం | 556 | 754 | 696 | 805 | 602 | 778 |
| చిత్తూరు | 582 | 757 | 812 | 786 | 587 | 698 |
| బళారి (మూడోవంతు) | 154 | 193 | 202 | 29 | 171 | 206 |
| | 6,334 | 6,547 | 7,237 | 7,913 | 8,546 | 11,204 |

| జిల్లా | | 30-40 సంవత్సరాల మధ్య | | 40-50 సంవత్సరాల మధ్య | | 50-60 సంవత్సరాల మధ్య | |
|---|---|---|---|---|---|---|---|
| | | పురుషులు (14) | స్త్రీలు (15) | పురుషులు (16) | స్త్రీలు (17) | పురుషులు (18) | స్త్రీలు (19) |
| శ్రీకాకుళం | | 1,767 | 1,821 | 1,919 | 1,676 | 1,269 | 1,049 |
| విశాఖపట్నం | | 1,406 | 1,282 | 1,597 | 1,206 | 1,267 | 1,005 |
| తూర్పుగోదావరి | మైదానాలు | 954 | 1,015 | 1,476 | 1,215 | 1,061 | 852 |
| | ఏజన్సీ | 120 | 132 | 280 | 215 | 175 | 145 |
| పశ్చిమగోదావరి | మైదానాలు | 682 | 833 | 903 | 783 | 903 | 764 |
| | ఏజన్సీ | 77 | 74 | 99 | 60 | 75 | 51 |
| కృష్ణ | | 662 | 767 | 786 | 616 | 751 | 585 |
| గుంటూరు | | 1,064 | 1,244 | 1,289 | 959 | 1,343 | 1,054 |
| నెల్లూరు | | 873 | 926 | 1,079 | 872 | 1,174 | 833 |
| కర్నూలు | | 699 | 753 | 871 | 682 | 886 | 588 |
| కడప | | 447 | 592 | 644 | 534 | 733 | 470 |
| అనంతపురం | | 670 | 883 | 932 | 772 | 793 | 621 |
| చిత్తూరు | | 870 | 1,053 | 1,203 | 963 | 866 | 716 |
| బళ్ళారి (మూడోవంతు) | | 212 | 274 | 287 | 233 | 198 | 161 |
| | | 10,503 | 11,649 | 13,365 | 10,786 | 11,494 | 8,894 |

| జిల్లా | 60 సంవత్సరాలకు పైబడినవారు | | మరణించినవారి మొత్తం | | మరణించిన స్త్రీ, పురుషుల మొత్తం |
|---|---|---|---|---|---|
| | పురుషులు (20) | స్త్రీలు (21) | పురుషులు (22) | స్త్రీలు (23) | (24) |
| శ్రీకాకుళం | 3,635 | 4,034 | 21,586 | 21,024 | 42,610 |
| విశాఖపట్నం | 3,906 | 4,294 | 18,387 | 17,809 | 36,196 |
| తూర్పుగోదావరి మైదానాలు | 3,560 | 3,930 | 15,428 | 14,692 | 30,120 |
| తూర్పుగోదావరి ఏజన్సీ | 427 | 411 | 2,022 | 1,781 | 3,803 |
| పశ్చిమగోదావరి మైదానాలు | 3,604 | 3,740 | 13,284 | 13,272 | 26,556 |
| పశ్చిమగోదావరి ఏజన్సీ | 211 | 191 | 1,052 | 903 | 1,955 |
| కృష్ణా | 3,355 | 3,059 | 12,987 | 12,251 | 25,238 |
| గుంటూరు | 5,201 | 4,891 | 20,277 | 19,339 | 39,616 |
| నెల్లూరు | 4,095 | 3,576 | 14,485 | 13,095 | 27,580 |
| కర్నూలు | 2,167 | 2,097 | 11,859 | 11,280 | 23,139 |
| కడప | 1,871 | 1,766 | 7,857 | 7,767 | 15,624 |
| అనంతపురం | 1,731 | 1,570 | 12,176 | 11,823 | 23,999 |
| చిత్తూరు | 2,254 | 2,161 | 12,582 | 11,749 | 24,331 |
| బళ్ళారి (మూడోవంతు) | 274 | 464 | 3,425 | 3,174 | 6,599 |
| | 36,291 | 36,184 | 1,67,407 | 1,59,959 | 3,27,366 |

విరోచనాలు-భేదులు" వ్యాధుల్లో చేర్చబడుతూ ఉండటం సామాన్యం. ఒకప్పుడు మదరాసు ప్రభుత్వ కార్యదర్శిగా పని చేసిన శ్రీ కృష్ణసామి "భారతదేశంలో వచ్చే ఏ వ్యాధితో ఒక వ్యక్తి మరణించినా గ్రామ రికార్డులలో సామాన్యంగా జ్వరంతో మరణించినవారి సంఖ్యలో చేర్చబడతాడు" అని వ్రాశాడు.

1951వ సంవత్సరంలో వివిధ వ్యాధులవల్ల మరణించినవారిసంఖ్య జిల్లాల వారీ వివరాలు ప్రక్క పేజీలలో పొందుపరచబడిన పట్టికలలో ఇవ్వబడ్డాయి:

ఈ సంవత్సరం మరణించిన వారిలో "జ్వరాల" వల్ల మరణించినవారే 1,02 వేలమంది; మొత్తం మరణాలలో దాదాపు మూడవవంతు. ప్రతి వెయ్యిమంది జనాభాకు యీ "జ్వరాల"తో చనిపోయేవారి శాతం 5.19; గత ఐదు సంవత్సరాల సగటు 6.75%.

మలేరియావల్ల చనిపోయినవారు కూడా జ్వరాలతో చనిపోయినవారిలో నమోదు చేయబడటం సామాన్యం. అందుచేతే, మలేరియావల్ల చనిపోతున్న వారి సంఖ్య అధికమైనా, ప్రభుత్వ అంచనాల ప్రకారం 1951వ సంవత్సరంలో 2,600 మంది మాత్రమే మరణించినట్లు తేలుతున్నది. మనదేశంలో మలేరియాను గూర్చి విచారణ జరిపిన శింటన్ (What Malaria Costs India) అనే గ్రంథములో "కలరా, మసూచి, ప్లేగు వ్యాధులన్నీ కలిసి కలుగచేస్తున్నంతనష్టాన్ని భారతదేశానికి ఒక్క మలేరియా కలుగచేస్తున్నది" అని వ్రాశాడు.

వీటి తర్వాత అధికమరణాలకు కారణమైన వ్యాధులు ఊపిరితిత్తులకుసంబంధించిన వ్యాధులు(Respiratory Diseases). వీటివల్ల 1951వ సంవత్సరంలో 24 వేల మంది మరణించారు. మరణపు రేటు 1951లో 1.35; గత ఐదు సంవత్సరాల సగటు 1.49. పట్టణ ప్రాంతంలో యీ వ్యాధివల్ల ప్రతి వెయ్యిమంది జనాభాకు మరణించినవారు 3.18; గ్రామీణ ప్రాంతంలో 1.15. "ఇండ్లలో జనసమ్మర్దం అధికంగా ఉండటం, నివాస వసతి చాల దారుణంగా ఉండటంవల్ల పట్టణాలలో యీ రేటు అధికంగాఉంది" అని 1951వ సంవత్సరపు (అవిభాజ్య) మదరాసు రాష్ట్రపు ఆరోగ్యశాఖాధికారి సాంవత్సరిక నివేదికలో వ్రాశారు.

రక్త విరోచనాలు — భేదులు (Dysentry and Diarrhoea)వల్ల 1951వ సంవత్సరంలో 18 వేల మంది మరణించారు. ఈ సంవత్సరపు మరణపు రేటు 0.93; గత ఐదుసంవత్సరాలసగటు 1.14.

మసూచివల్ల 1951వ సంవత్సరంలో 8,500 మంది చనిపోయారు. ఈ చనిపోయిన వారిలో 1-5 సంవత్సరాల వయస్సుగల పసిబిడ్డలు నూటికి 65 మంది ఉన్నారు.

కలరా, మసూచివలె ప్రతిసంవత్సరం జిల్లాలో ఏదోఒకమూల విలయతాండవం చేస్తూనేవుంది. 1951వ సంవత్సరంలో ఈవ్యాధివల్ల రాష్ట్రంలో నాలుగు వేల మంది చనిపోయినట్లు తేలింది.

ఆహారలోపంవల్ల వచ్చే వ్యాధులలో క్షయఒకటి. ఈవ్యాధికి చికిత్స పొందినవారు1949లో 25,505;1950లో 45,637; 1951లో 34,900.

| జిల్లా | కలరా | | | మసూచి | | | జ్వరాలు (మలేరియాతిప్ప). | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | మరణాలు | ప్రతి వెయ్యి మంది జనాభాకు ఎన్ని మరణాలు | గత 5 సం॥ల సగటు రేటు | మరణాలు | ప్రతి వెయ్యి మంది జనాభాకు ఎన్ని మరణాలు | గత 5 సం॥ల సగటు రేటు | మరణాలు | ప్రతి వెయ్యి మంది జనాభాకు ఎన్ని మరణాలు | గత 5 సం॥ల సగటు రేటు |
| | (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) |
| శ్రీకాకుళం | 605 | 0.29 | 0.01 | 1,586 | 0.76 | 0.03 | 18,093 | 8.72 | 9.70 |
| విశాఖపట్టణం | 40 | 0.02 | 0.64 | 452 | 0.22 | 0.05 | 14,412 | 6.93 | 9.03 |
| తూర్పుగోదావరి { మైదానాలు | 318 | 0.14 | 0.25 | 405 | 0.18 | 0.22 | 8,583 | 3.87 | 5.43 |
| తూర్పుగోదావరి { ఏజన్సీ | 44 | 0.21 | 0.37 | 46 | 0.22 | 0.36 | 1,469 | 7.03 | 9.92 |
| పశ్చిమగోదావరి { మైదానాలు | 131 | 0.08 | 0.22 | 461 | 0.29 | 0.10 | 6,528 | 4.06 | 5.15 |
| పశ్చిమగోదావరి { ఏజన్సీ | 16 | 0.18 | 0.32 | 38 | 0.39 | 0.16 | 699 | 7.13 | 6.77 |
| కృష్ణా | 51 | 0.03 | 0.24 | 637 | 0.36 | 0.24 | 6,923 | 3.86 | 5.29 |
| గుంటూరు | 246 | 0.10 | 0.14 | 2,026 | 0.79 | 0.33 | 11,633 | 4.55 | 5.64 |
| నెల్లూరు | 899 | 0.50 | 0.30 | 486 | 0.27 | 0.13 | 6,338 | 3.52 | 4.24 |
| కర్నూలు | 244 | 0.19 | 0.25 | 864 | 0.68 | 0.32 | 8,587 | 6.74 | 10.20 |
| కడప | 903 | 0.77 | 0.32 | 695 | 0.30 | 0.19 | 5,512 | 4.73 | 7.34 |
| అనంతపురం | 272 | 0.20 | 0.14 | 494 | 0.36 | 0.17 | 6,324 | 4.62 | 5.38 |
| చిత్తూరు | 464 | 0.26 | 0.16 | 337 | 0.19 | 0.18 | 5,596 | 3.08 | 3.48 |
| బళ్ళారి (మూడో వంతు) | 54 | 0.13 | 0.12 | 63 | 0.15 | 0.16 | 1,596 | 3.84 | 6.86 |
| మొత్తం | 4,287 | 0.22 | 0.25 | 8,590 | 0.37 | 0.19 | 1,02,293 | 5.19 | 6.7 5 |

| జిల్లా | మ లే రి యా | | | రక్తవిరోచనాలు - భేదులు | | | ఊపిరితిత్తుల సంబంధమైన వ్యాధులు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | మరణాలు | ప్రతి వెయ్యిమంది జనాభాకు మరణాలు | గత 5 సంll ల సగటు రేటు | మరణాలు | ప్రతి వెయ్యి మంది జనాభాకు మరణాలు | గత 5 సంll ల సగటు రేటు | మరణాలు | ప్రతి వెయ్యి మంది జనాభాకు మరణాలు | గత 5 సంll ల సగటు రేటు |
| | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) |
| శ్రీకాకుళం | 197 | 0.09 | ... | 2,046 | 0.99 | 0.98 | 1,931 | 0.93 | 0.79 |
| విశాఖపట్నం | 173 | 0.08 | ... | 1,627 | 0.78 | 1.13 | 1,901 | 0.91 | 1.04 |
| తూర్పు గోదావరి { మైదానాలు | 256 | 0.12 | ... | 1,921 | 0.87 | 1.04 | 2,400 | 1.08 | 1.72 |
| తూర్పు గోదావరి { ఏజన్సీ | 51 | 0.24 | ... | 306 | 1.46 | 1.15 | 364 | 1.74 | 1.21 |
| పశ్చిమ గోదావరి { మైదానాలు | 138 | 0.09 | ... | 1,549 | 0.96 | 1.35 | 2,490 | 1.55 | 2.01 |
| పశ్చిమ గోదావరి { ఏజన్సీ | 41 | 0.42 | ... | 85 | 0.87 | 0.75 | 296 | 3.02 | 2.61 |
| కృష్ణా | 208 | 0.12 | ... | 1,180 | 0.66 | 1.08 | 2,556 | 1.42 | 1.96 |
| గుంటూరు | 166 | 0.06 | ... | 1,911 | 0.75 | 1.07 | 3,385 | 1.32 | 1.69 |
| నెల్లూరు | 472 | 0.26 | ... | 1,595 | 0.89 | 1.04 | 1,623 | 0.90 | 1.18 |
| కర్నూలు | 434 | 0.34 | ... | 937 | 0.74 | 1.08 | 1,393 | 1.09 | 1.33 |
| కడప | 117 | C.10 | ... | 618 | 0.53 | 0.79 | 809 | 0.69 | 0.94 |
| అనంతపురం | 211 | 0.15 | ... | 1,865 | 1.36 | 1.63 | 1,842 | 1.35 | 1.36 |
| చిత్తూరు | 128 | 0.07 | ... | 2,006 | 1.10 | 1.34 | 2,360 | 1.30 | 1.21 |
| బళ్ళారి (మూడవవంతు) | 76 | 0.18 | ... | 450 | 1.08 | 1.47 | 677 | 1.55 | 1.77 |
| మొత్తం | 2,668 | 0.17 | ... | 18,096 | 0.93 | 1.14 | 24,027 | 1.35 | 1.49 |

1950 వ సంవత్సరపు ఆరోగ్య శాఖా రిపోర్టులో ఆరోగ్య శాఖ డైరెక్టరు, "చికిత్సానిమిత్తం వైద్యశాలలకు వచ్చేవారి సంఖ్య చూస్తే క్షయవ్యాధి ప్రబలంగా సోకుతున్నట్లు తెలుస్తున్నది" అని వ్రాశారు. పైఅంచనాలలో "యె" తరగతి వ్యాధివచ్చినవారికి ప్రభుత్వ వైద్యశాలలలో వైద్యం చేయరు కనుక, అది వ్యాధి ప్రబలతను, వాస్తవికపరిమాణంలో తెలియ చేయడంలేదు.

ప్రజల ఆరోగ్య స్థితిగతులు ఇంత దారుణంగా ఉంటే, ఉన్న వైద్యశాక ర్యాలు హీనంగా ఉన్నాయి. సుమారు 64 వేల చదరపు మైళ్ళ వైశాల్యం, 205 లక్షల జనాభావున్న మన రాష్ట్రంలో, అన్నిరకాల వైద్యశాలలు కలిపి 727 మాత్రమే ఉన్నాయి.

క్రింది పట్టిక 1951 వ సంవత్సరంలో జిల్లాలవారీ ఎన్ని వైద్యశాలలున్నదీ, చదరపుమైలుకు ఎన్ని వైద్యశాల లున్నదీ, ఎంతమంది జనాభాకు ఒక వైద్యశాల ఉన్నదీ వివరిస్తుంది.

రాష్ట్రంలో సగటున 87 చదరపు మైళ్ళకు, 28 వేల జనాభాకు ఒక్క వైద్యశాల ఉన్నట్లు తేలుతున్నది. ఉన్న వైద్యశాలలలో సగానికి పైగా దేశీయ గ్రామీణ వైద్యశాలలు. వీటిలో ఎట్టి అధునాతన పరికరాలుగాని, ఆఖరికి

| జిల్లా | వైద్యశాలలు: ప్రభుత్వ వైద్యశాలలు | వైద్యశాలలు: స్థానిక వైద్యశాలలు | వైద్యశాలలు: మొత్తం | సగటున ఎంత మందిజనాభాకు ఒక వైద్యశాల | సగటున ఎన్ని చ. మైళ్ళకు ఒక వైద్యశాల |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం } | 71 | 15 } | 105 | 39,962 | 86 |
| విశాఖపట్నం } | | 19 } | | | |
| తూర్పు గోదావరి | 42 | 36 | 78 | 30,961 | 73 |
| పశ్చిమ గోదావరి | 21 | 35 | 56 | 30,321 | 54 |
| కృష్ణా | 28 | 79 | 107 | 16,635 | 32 |
| గుంటూరు | 29 | 74 | 103 | 24,757 | 56 |
| నెల్లూరు | 29 | 50 | 79 | 22,735 | 100 |
| కర్నూలు | 34 | 21 | 55 | 23,100 | 142 |
| కడప | 17 | 23 | 40 | 29,050 | 148 |
| అనంతపురం | 21 | 28 | 49 | 28,375 | 137 |
| చిత్తూరు | 25 | 13 | 38 | 47,631 | 155 |
| బళ్ళారి (మూడవ వంతు) | 7 | 10 | 17 | 33,530 | 121 |
| | 324 | 403 | 727 | 28,473 | 87 |

మందుల సప్లయికాని సరిగా లేకపోవటం లోకవిదితం. ఇవి నామమాత్రపు వైద్య శాలలుగా తయారైనాయి.

చిత్తూరు జిల్లాలో 48 వేల జనాభాకు, 155 చదరపుమైళ్ళ వైశాల్యానికి ఒక్క వైద్యశాల ఉన్నది. రాష్ట్రంలోకెల్ల తక్కువ వైద్యశాలలున్నది ఈజిల్లాలోనే. కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలో 137-148 చదరపుమైళ్ళకు మాత్రమే ఒక్క వైద్యశాల ఉన్నది. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి జిల్లాలలో వైద్యశాలలు దగ్గరదగ్గరిగా ఉన్నట్లు కనుపించినా, 30-40 వేల జనాభాకు మాత్రమే ఒక్క వైద్యశాల ఉంది.

ఉన్న వైద్యశాలలలో నయినా తగినన్ని 'బెడ్సు' ఉన్నాయా అంటే అవీలేవు. క్రింది పట్టికలో ప్రభుత్వ లెక్కల ప్రకారం వివిధ జిల్లాలలోని వైద్యశాలలలో 1951వ సంవత్సరంలో ఎన్ని 'బెడ్సు' ఉన్నది వివరించబడింది:

రాష్ట్రంలో మొత్తం 6,983 బెడ్సు ఉన్నట్లు తేలింది. సగటున ప్రతి మూడు వేల జనాభాకు ఒక్క బెడ్ ఉన్నది. అనంతపురం, కడప, తూర్పుగోదావరి, నెల్లూరు జిల్లాల్లో నాలుగు - ఐదువేల జనాభాకు ఒక్కటి మాత్రమే ఉన్నది.

| జిల్లా | వివిధ వైద్యశాలలలో ఉన్న బెడ్సు | | | సగటున ఎంత మందిజనాభాకు ఒక బెడ్ |
|---|---|---|---|---|
| | పురుషులకు | స్త్రీలకు | మొత్తం | |
| శ్రీకాకుళం, విశాఖపట్నం | 790 | 684 | 1,474 | 2,914 |
| తూర్పుగోదావరి | 340 | 271 | 611 | 3,953 |
| పశ్చిమగోదావరి | 231 | 260 | 491 | 3,458 |
| కృష్ణా | 332 | 435 | 767 | 2,320 |
| గుంటూరు | 574 | 834 | 1,408 | 1,811 |
| నెల్లూరు | 115 | 340 | 455 | 3,517 |
| కర్నూలు | 153 | 203 | 356 | 2,794 |
| కడప | 158 | 75 | 233 | 4,987 |
| అనంతపురం | 152 | 78 | 230 | 5,922 |
| చిత్తూరు | 559 | 276 | 835 | 1,966 |
| బళ్ళారి (మూడోవంతు) | 61 | 62 | 123 | 3,816 |
| మొత్తం | 3,465 | 3,518 | 6,983 | 2,935 |

1951 లో ఈ వైద్యశాలలలో పనిచేస్తున్న డాక్టర్లు, నర్సులు, మంత్రసానులు జనాభాతో పోల్చితే ఇలా ఉన్నారు:

| | |
|---|---|
| అలోపతీ వైద్యంలో తరిఫీదు పొందిన డాక్టర్లు | ప్రతి 25,600 మంది జనాభాకు ఒక్కరు |
| అన్నిరకాల వైద్య పట్టాలు పొందిన డాక్టర్లు | ప్రతి 18,500 మంది జనాభాకు ఒక్కరు |
| నర్సులు : | ప్రతి 30 వేల మంది జనాభాకు ఒక్కరు |
| మంత్రిసానులు : | ప్రతి 57 వేల మంది జనాభాకు ఒక్కరు |

పై అంచనాలనుబట్టి ప్రజల ఆరోగ్య రక్షణకు కావలసినంత వైద్యసిబ్బంది కూడా లేదని తెలుస్తున్నది.

ఈ స్థితిలో వైద్యసిబ్బందిని తయారు చేసేందుకు మనకున్న వైద్యకళాశాలలు రెండు మాత్రమే. ఒకటి విశాఖపట్టణం లోను, రెండోది గుంటూరులోనూ ఉన్నాయి. గుంటూరులో ఉన్నది స్వయంసంపూర్ణ మైన కళాశాల మాత్రం కాదు. అది పేరుకే కళాశాల అనేది జగమెరిగిన సత్యం. దేశీయ వైద్య కళాశాలలు మన రాష్ట్రంలో ఇంతవరకు ప్రారంభించబడ లేదు.

## శిశుజననాలు

1951 వ సంవత్సరంలో శిశుజననాలు 5,70 వేలు (1950లో 6,14 వేలుమాత్రం). సగటున ప్రతివెయ్యిమంది జనాభాకు శిశు జననాలు 1951లో 28.87; గత ఐదు సంవ త్సరాలకు సగటు రేటు 31.29.

ప్రక్కపేజీలోని పట్టిక వివిధ జిల్లా లలో 1951 వ సంవత్సరపు శిశుజనన వివరాలను తెలియచేస్తుంది :

కొన్ని ముఖ్యదేశాల శిశుజననపు రేటు కంటె, ఆంధ్రదేశములో శిశుజననపు రేటు అధికమని దిగువ పట్టిక తెలియచేస్తుంది:

| దేశ | ప్రతి వెయ్యి మంది జనాభాకుశిశుజననాలు |
|---|---|
| కెనడా | 20.3 |
| అమెరికా | 17.3 |
| జర్మనీ | 20.3 |
| బ్రిటన్ | 15.3 |
| ఆస్ట్రేలియా | 17.7 |
| జపాన్ | 27.0 |
| భారతదేశం | 33.0 |
| ఆంధ్ర (1951) | 28.9 |

## శిశుమరణాలు

మన రాష్ట్రంలో శిశుజననపు రేటుకు వలె మరణపు రేటు కూడా అధికమే! 1951 వ సంవత్సరంలో ప్రతివెయ్యి శిశు జననాలకు శిశుమరణాలు 118.6. 1950వ సంవత్సరంలో ఈరేటు 158.

| జిల్లా | | మరణాలు | ప్రతి వెయ్యి మంది జనాభాకు మరణాల రేటు | గత పది సంవత్సరాల సగటు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | | 59,553 | 28.70 | 32.18 |
| విశాఖపట్నం | | 55,382 | 29.15 | |
| తూర్పుగోదావరి | మైదానాలు | 46,492 | 20.97 | 28.73 |
| | ఏజన్సీ | 5,445 | 26.12 | 28.57 |
| పశ్చిమగోదావరి | మైదానాలు | 41,558 | 25.85 | 30.39 |
| | ఏజన్సీ | 2,825 | 28.83 | 31.97 |
| కృష్ణా | | 51,414 | 28.69 | 33.47 |
| గుంటూరు | | 76,652 | 29.97 | 31.61 |
| నెల్లూరు | | 48,277 | 26.79 | 27.74 |
| కర్నూలు | | 45,159 | 35.45 | 31.97 |
| కడప | | 30,736 | 26.37 | 28.22 |
| అనంతపురం | | 44,729 | 35.62 | 37.74 |
| చిత్తూరు | | 47,907 | 26.40 | 28.65 |
| బళ్ళారి (మూడవ వంతు) | | 14,693 | 35.31 | 35.56 |
| | | 5,70,822 | 28.87 | 31.29 |

మనరాష్ట్రపు శిశుమరణపు రేటు విదేశాలలో కంటె ఎంత అధికమో దిగువ పట్టిక తెలియ చేస్తుంది:

| దేశం | మరణపు రేటు (ప్రతి వెయ్యి జననాలకు) |
|---|---|
| 1. కెనడా | 61.0 |
| 2. అమెరికా | 22.0* |
| 3. బ్రిటన్ | 32.0♦ |
| 4. ఆస్ట్రేలియా | 38.0 |
| 5. జపాన్ | 114.0 |
| 6. భారతదేశం | 167.0 |
| 7. ఆంధ్ర | 118.6„ |

మన రాష్ట్రపు శిశుమరణం రేటు అమెరికాకు ఐదు రెట్లు, బ్రిటన్‌కు సుమారు నాలుగు రెట్లు, కెనడాకు రెండు రెట్లు!

* 1948 సం॥ అంచనాలు ♦ 1949 సం॥ అంచనాలు „ 1951 సం॥ అంచనాలు

1951 వ సంవత్సరంలో 73 వేల మంది సంవత్సరం లోపు శిశువులు చనిపోయారు. వీరు మొత్తం శిశుజననాలలో సుమారు 13%. చనిపోతున్న శిశువులలో 22 వేల మంది – మొత్తం శిశుమరణాలలో 30% వారం నిండకుండానే చనిపోతున్నారు. దిగువ పట్టికలో, వివిధ వయస్సులవారి శిశువులు ఎందరు చనిపోతున్నారో వివరించబడింది:

| జిల్లా | | నెలలోపు వయస్సు | 1–6 నెలల వయస్సు | 6–12 నెలల వయస్సు | మొత్తం సంవత్సరం నిండని బిడ్డలు |
|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | | 3,403 | 1,814 | 3,195 | 8,412 |
| విశాఖపట్నం | | 3,192 | 1,669 | 2,636 | 7,497 |
| తూర్పుగోదావరి | మైదానాలు | 4,144 | 1,145 | 1,722 | 6,381 |
| | ఏజన్సీ | 293 | 69 | 174 | 536 |
| పశ్చిమగోదావరి | మైదానాలు | 3,101 | 1,528 | 1,540 | 6,169 |
| | ఏజన్సీ | 184 | 120 | 118 | 422 |
| కృష్ణా | | 3,411 | 1,547 | 1,665 | 6,623 |
| గుంటూరు | | 5,221 | 2,081 | 2,294 | 9,596 |
| నెల్లూరు | | 3,125 | 1,055 | 1,368 | 5,548 |
| కర్నూలు | | 2,869 | 1,199 | 1,348 | 5,411 |
| కడప | | 1,239 | 701 | 986 | 2,926 |
| అనంతపురం | | 4,020 | 866 | 1,312 | 6,198 |
| చిత్తూరు | | 4,371 | 573 | 908 | 5,852 |
| బళ్ళారి (మూడవవంతు) | | 1,203 | 233 | 325 | 1,757 |
| | | 39,776 | 14,600 | 19,591 | 73,328 |

మరణిస్తున్న శిశువులలో నూటికి 50మందికి పైగా (53%) నెల నిండకుండానే మరణిస్తున్నారు.

## బాలింత మరణాలు

శిశుమరణాలకువలె బాలింతల మరణాలు కూడా మన రాష్ట్రంలో అధికమే!

1951 వ సంవత్సరంలో 3,439 మంది బాలింతలు మరణించారు. ప్రతి వెయ్యి కాన్పులకు 6.43 మంది మరణించినట్లు తేలుతున్నది.

1951 వ సంవత్సరంలో, వివిధ జిల్లాలలో సంభవించిన బాలింతల మరణాలు ప్రక్క పేజీలోని పట్టికలో పొందుపరచబడ్డాయి:

| జిల్లా | | బాలింతల మరణాల సంఖ్య | ప్రతి వెయ్యికాన్పులకు ఎన్నిమరణాలు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | | 267 | 4.46 |
| విశాఖపట్నం | | 271 | 4.87 |
| తూర్పుగోదావరి | మైదానాలు | 265 | 5.64 |
| | ఏజన్సీ | 44 | 8.07 |
| పశ్చిమగోదావరి | మైదానాలు | 310 | 7.40 |
| | ఏజన్సీ | 30 | 10.56 |
| కృష్ణా | | 337 | 6.49 |
| గుంటూరు | | 373 | 4.82 |
| నెల్లూరు | | 316 | 6.47 |
| కర్నూలు | | 278 | 6.09 |
| కడప | | 224 | 7.24 |
| అనంతపురం | | 403 | 8.23 |
| చిత్తూరు | | 256 | 5.30 |
| బళ్ళారి (మూడవవంతు) | | 65 | 4.39 |
| | | 3,439 | 6.43 |

ఇతరదేశాలతో పోల్చిచూస్తే బాలింతల మరణాలు మన రాష్ట్రంలో ఎంత అధికమో వ్యక్తమవుతుంది.

| దేశం | ప్రతి వెయ్యి కాన్పులకు మరణించిన బాలింతలు |
|---|---|
| 1. డెన్మార్కు | 2.6 |
| 2. నార్వే | 2.8 |
| 3. బ్రిటన్ | 1.0 |
| 4. స్విట్జర్లండు | 4.4 |
| 5. న్యూజిలెండ్ | 4.8 |
| 6. దక్షిణాఫ్రికా | 4.9 |
| 7. జర్మనీ | 5.1 |
| 8. ఆస్ట్రేలియా | 5.5 |
| 9. అమెరికా | 1.2 |
| 10. జపాన్ | 2.8 |
| 11. ఆంధ్ర | 6.4 |

డాక్టరు లక్ష్మణస్వామి మొదలియారు, ఇంత అధికంగా సంభవిస్తున్న బాలింతల మరణాలకు కారణాలను, ప్రభుత్వ పనుపున విచారణ జరిపి, తయారుచేసిన నివేదికలో ఇలా వివరించారు ;

"బాలింతల మరణాలు ఇంకా అధిక మవుతూనే ఉన్నాయి. ఆహారలోపం వల్ల, గర్భిణీ స్త్రీలకు వచ్చే రక్తహీనత (Anaemia of pregnancy) అనేక మందిమరణానికి కారణమని తేలింది. గర్భిణీ కాలంలో తర్ఫీదు పొందిన మంత్రసానుల సహాయం, సలహాలు పొందే అవకాశం లేకపోవటం; గాలి, వెలుతురు ధారాళంగావచ్చే విశాలమైన ఇండ్లలో గర్భవతి నివసించే అవకాశం లేకపోవటం కూడా అధిక మరణాలకు కారణం. *

## మాతా శిశు సంరక్షణ

శిశుమరణాలు, బాలింత మరణాలు ఇంత అధికంగా ఉంటే, మాతా శిశు సంరక్షణాశ్రద్ధ మరింత హీనంగా ఉందని ప్రక్కపేజీలోని పట్టిక తెలియచేస్తుంది:

1,01 లక్షల స్త్రీ జనాభా ఉన్న మన రాష్ట్రంలో మొత్తం 1951 వ సంవత్సరంలో వివిధ సంస్థలచేత నిర్వహించబడుతున్న మాతా శిశు సంరక్షణా కేంద్రాలు 141 మాత్రం! ప్రతి 450 చ|| మైళ్ళకు మాత్రమే ఒక్క కేంద్రం ఉంది!

ఈ కేంద్రాలలో లోకలు బోర్డులచేత నిర్వహించబడుతున్న కేంద్రాలలో మాత్రమే 27 మంది ఉమన్ మెడికలు ఆఫీసర్లు పనిచేస్తున్నారు.

సగటున ప్రతి 21 వేల కాన్పులకు ఒక్క ఉమన్ మెడికలు ఆఫీసరున్నట్లు తేలుతున్నది. ఇంత తక్కువగా ఉన్న వీరయినా "అత్యవసర కాన్పు కేసులు చూడ్డంకోసం గ్రామాలకు పోవాలంటే, తగిన రవాణా సౌకర్యాలు లేకపోవటం వల్ల అది సాధ్యం కావటంలేదు" అని 1950 సంవత్సరపు ఆరోగ్యశాఖా రిపోర్టులో, ఆరోగ్య శాఖా డైరెక్టరు శ్రీ టి. లక్ష్మీనారాయణ వ్రాశారు. ఈవిధంగా ఉన్న కొద్దిపాటి నిపుణుల సాయం ఆపత్సమయాలలోకూడా లభ్యం కావటంలేదు.

ప్రతి హెల్తు విజిటరు, ప్రసవించిన తల్లుల ఆరోగ్యం, కిండర్ గార్డెన్ స్కూలు వయస్సు వరకూ వారి బిడ్డల పెంపకం, ఆరోగ్య విషయాలలో శ్రద్ధతీసికోవలసి ఉన్నది. ఇట్టి హెల్తు విజిటర్లు 1951వ సంవత్సరంలో వివిధ కేంద్రాలలో పని చేస్తున్నవారు, మొత్తం 32మంది మాత్రమే ఉన్నారు. సగటున ప్రతి రెండువేల చదరపుమైళ్ళకు, ప్రతి 19 వేల కాన్పులకు ఒక హెల్తు విజిటరున్నట్లు తేలుతున్నది.

మంత్రసానులను–వీరినే మెటర్నిటీ అసిస్టెంట్సు అంటారు. వీరు కాన్పులు చేయించాలి. 1951వ సంవత్సరంలో ఉన్న మొత్తం కేంద్రాలలో పనిచేస్తున్న మంత్రసానులు 233 మంది.

ప్రతి మంత్రసాని, సంవత్సరంలో మూడు - నాలుగు మైళ్ళ ప్రాంతంలో ఉండే 4–5 వేల జనాభాను చూడగలిగితే చాలని ప్రభుత్వ ఉద్దేశ్యం.

కాని, 1951 వ సంవత్సరంలో, సగటున ప్రతి 273 మైళ్ళకు, 88 వేల జనాభాకు ఒక మంత్రసాని ఉన్నట్లు తేలుతున్నది. 1951 వ సంవత్సరంలో జరిగిన కాన్పుల ప్రకారం చూస్తే ప్రతి 2,500

---

* ఈ విచారణ మదరాసులో జరుపబడ్డా, అధిక మరణాలకు వీరు చూపిన కారణాలు ఆంధ్రకు కూడా అనువర్తిస్తాయి.

## 1951 లో నిర్వహించబడుతున్న మాతా శిశుసంరక్షణాలయాలు, సిబ్బంది

| జిల్లా | నిర్వహించబడుతున్న కేంద్రాలు: ప్రభుత్వంచే | | లోకలు బోర్డులచే | | ఉమన్ మెడికల్ ఆఫీసర్లు: ప్రభుత్వ కేంద్రాలలో | | లోకలుబోర్డుల కేంద్రాలలో | | హెల్తు విజిటర్లు: ప్రభుత్వ కేంద్రాలలో | | లోకలు బోర్డుల కేంద్రాలలో | | మంత్రసానులు: ప్రభుత్వ కేంద్రాలలో | | లోకలుబోర్డుల కేంద్రాలలో | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో |
| శ్రీకాకుళం, విశాఖపట్నం | ... | ... | 6 | 5 | ... | ... | 2 | 1 | ... | ... | 4 | ... | ... | ... | 22 | 5 |
| తూర్పుగోదావరి | ... | ... | 10 | 6 | ... | ... | 4 | 1 | ... | ... | 2 | 1 | ... | ... | 20 | 6 |
| పశ్చిమగోదావరి | ... | 1 | 4 | 21 | ... | ... | 2 | 2 | ... | ... | 1 | 2 | ... | 2 | 12 | 23 |
| కృష్ణా | ... | ... | 8 | 9 | ... | ... | 3 | 1 | ... | ... | 2 | 5 | ... | ... | 19 | 9 |
| గుంటూరు | ... | ... | 5 | 9 | ... | ... | 2 | 1 | ... | ... | 2 | ... | ... | 6 | 17 | 9 |
| నెల్లూరు | ... | ... | 1 | 4 | ... | ... | ... | ... | ... | ... | 1 | .. | ... | ... | 5 | 3 |
| కర్నూలు | ... | 6 | 2 | 2 | ... | ... | 1 | ... | ... | ... | 1 | 2 | ... | 6 | 7 | 4 |
| అనంతపురం | ... | ... | 4 | 8 | ... | ... | 2 | 1 | ... | ... | 2 | 2 | ... | ... | 11 | 8 |
| కడప | ... | ... | 2 | 5 | ... | ... | 1 | ... | ... | ... | 1 | 1 | ... | ... | 5 | 5 |
| చిత్తూరు | ... | ... | 3 | 20 | ... | ... | 2 | 1 | ... | ... | 2 | 1 | ... | ... | 9 | 20 |
| మొత్తం | ... | 7 | 45 | 89 | ... | ... | 19 | 8 | ... | ... | 18 | 14 | ... | 14 | 127 | 92 |

కాన్పులకు ఒక్క మంత్రసాని ఉన్నట్లు తేలుతున్నది. "హెల్తు సర్వే అండ్ డెవలప్‌మెంటుకమిటీ" సిఫార్సు ప్రకారం, ఒక్కొక్క మంత్రసాని సంవత్సరంలో వంద కాన్పులు చేయించాలి. ఈసిఫార్సు ప్రకారం, ఆంధ్రలో వీరి సంఖ్యను వెంటనే 25 రెట్లకు పెంచవలసి ఉంటుంది.

1950 వ సంవత్సరపు ఆరోగ్యశాఖా రిపోర్టులో, "గ్రామసీమలలో మాతా శిశుసంరక్షణ కేంద్రాలు చాలినన్ని లేక పోవడంచేత, శిశుమరణాలు అధికంగా సంభవిస్తున్నాయి... హెల్తువిజిటర్లుఒకటి రెండుసార్లు వెళ్ళి శిశువును చూడటం మాత్రమే జరుగుతున్నది. కాని, శిశువు పెద్దవాడై స్కూలుకు వెళ్ళే వయస్సు వచ్చేవరకు, ఒక నియమితపద్ధతి ప్రకారం వాళ్ళ ఆరోగ్యాన్నిగూర్చి తీసుకోవలసినంత శ్రద్ధ తీసుకోబడటంలేదు....... (ప్రస్తుతం) సంభవిస్తున్న అధికబాలింతల మరణాలకు కారణాలను విచారిస్తే, ప్రసవ కాలంలో నిపుణులైన మంత్రసానుల సహాయం అందచేయటానికి మాతాశిశు సంరక్షణా కేంద్రాలలోని సిబ్బందిని (మంత్రసానులు) పెంచటం అత్యవసరం" అని తేలింది.

1951 వ సంవత్సరంలో సగటున ప్రతి వెయ్యికాన్పులకు గ్రామసీమలలో 6.92, పట్టణాలలో 58.97 కాన్పులకు తరిఫీదుపొందిన మంత్రసాని సహాయం లభిస్తున్నది. రాష్ట్రంలో సగటున 15.85 కాన్పులకు ఈ సహాయం లభిస్తున్నది.

1951 వ సంవత్సరంలో సగటున ప్రతి వెయ్యికాన్పులకు గ్రామసీమలలో 10.05, పట్టణాలలో 10.68, రాష్ట్రంలో 2.52 మెటర్నిటీ బెడ్సు ఉన్నాయి.

## ప్రజారోగ్యం – పారిశుధ్యం

ఏటా మసూచి, కలరా మొదలైన అంటువ్యాధులు రావడం, అనేకవేల మందిని పొట్టపెట్టుకోవటం సామాన్య విషయం. ఇట్టిస్థితిలో ప్రజారోగ్య రక్షణకు ఉన్న సిబ్బంది ఎంత తక్కువో ప్రక్కపేజీలోని పట్టిక వ్యక్తపరుస్తుంది.

వాక్సినేటర్లు, శానిటరీ ఇన్‌స్పెక్టర్లు కలసి 513 మంది 1951 వ సంవత్సరంలో ఉన్నారు. మసూచినుండి రక్షణకు టీకాలు వేయటం, కలరా ఇనాక్యులేషన్లు చేయటం వీరి పని. వీరు జనాభాలో ప్రతి 40 వేలమందికి ఒక్కరున్నారు. ఈ సిబ్బందిలోటు మూలంగానే, మసూచినుండి రక్షణకు ప్రజలందరికీ టీకాలు వేయవలసి ఉండగా, నూటికి 20 మందికి మాత్రమే వేయటం జరిగిందని 1950 ఆరోగ్యశాఖా రిపోర్టులో వ్రాయబడింది.

ప్రజారోగ్యం ఇంత హీనంగా ఉంటే, ఆరోగ్య రక్షణకు ప్రభుత్వంచూపే శ్రద్ధ మరింత హీనంగాఉంది. 1954-55 వ సంవత్సరపు బడ్జెట్‌లో రు. 1,01,46 వేలు మాత్రమే కేటాయించబడింది. అంటే మొత్తం బడ్జెట్‌లో నూటికి రెండు పాళ్ళు మాత్రమే వైద్యానికి, వైద్య విద్యకు ఖర్చు చేయబడుతున్నది. దీని ప్రకారం మనిషి 1కి ఖర్చు చేయబడేది అర్ధరూపాయిమాత్రం !

ఇందులో వైద్యవిద్యకు ఖర్చుచేయబడేది రు. 5,48 వేలు.

ప్రజారోగ్యానికి (Public health) కేటాయించబడింది, రు. 55,14 వేలు. మనిషి 1కి ఖర్చు చేయబడేది రు. 0.3 మాత్రం.

## 1951 వ సంవత్సరంలో ఉన్న ఆరోగ్య సిబ్బంది

| జిల్లా | అంటువ్యాధుల సిబ్బంది | | హెల్తు ఇన్స్పెక్టర్లు | | శానిటరీ ఇన్స్పెక్టర్లు | | వ్యాక్సినేటర్లు | | ఇతర సిబ్బంది | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో | గ్రామాలలో | పట్టణాలలో |
| శ్రీకాకుళం | 27 | ... | 14 | ... | 1 | 9 | 36 | 1 | 5 | 2 |
| విశాఖపట్నం | ... | ... | 11 | ... | 1 | 22 | 36 | 10 | 12 | 3 |
| తూర్పుగోదావరి | 1 | ... | 15 | ... | 1 | 25 | 51 | 20 | 6 | 19 |
| పశ్చిమగోదావరి | 11 | ... | 11 | ... | 2 | 24 | 29 | 6 | 24 | 1 |
| కృష్ణా | ... | ... | 11 | ... | 1 | 24 | 29 | 10 | 21 | 9 |
| గుంటూరు | ... | ... | 19 | ... | 11 | 12 | 34 | 2 | 15 | 7 |
| నెల్లూరు | 5 | ... | 19 | ... | 5 | 7 | 40 | 3 | 18 | ... |
| కర్నూలు | 6 | ... | 18 | ... | ... | 8 | 27 | 5 | 8 | 8 |
| కడప | ... | ... | 10 | 1 | 1 | 7 | 19 | 4 | 5 | 9 |
| అనంతపురం | 5 | ... | 11 | ... | ... | 8 | 28 | 6 | ... | ... |
| చిత్తూరు | 21 | ... | 11 | ... | 1 | 5 | 20 | 3 | ... | 14 |
| బళ్ళారి | ... | ... | 3 | ... | 2 | 7 | 7 | 3 | ... | 5 |
| మొత్తం | 76 | ... | 153 | 1 | 26 | 158 | 356 | 73 | 114 | 77 |

# విద్య

విద్యా విషయాలలో ఆంధ్రదేశం చాల వెనుకబడి ఉంది. ప్రజలలో నూటికి 14_15 మంది మాత్రమే అక్షరాస్యులు. పురుషులలో నూటికి 21మంది, స్త్రీలలో ఏడుగురు మాత్రమే అక్షరాస్యులు. కిందిపట్టిక వివిధ జిల్లాలలోని జనాభాలో ఎంత శాతం అక్షరాస్యులో తెలియజేస్తుంది:

గత పది సంవత్సరాలలో మన ప్రజలలో అక్షరాస్యుల సంఖ్య నూటికి నాలుగుకు దాటి పెరగలేదు. ప్రజలను "అక్షరాస్యుల" చేయటంలో ప్రభుత్వ 'కృషి' ఇందులో బైటపడుతున్నది.

నేటి ఈ సామాజిక వ్యవస్థలో విద్య కూడా కలవారి గుత్తసొమ్ముగా తయారవుతున్నది. విద్యాభివృద్ధికి పెద్ద మొత్తాల కేటాయించి ప్రజలకు విద్య గరపటం ప్రభుత్వ ధర్మం. ఈ ధర్మ నిర్వహణకు ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నం శూన్యమనే చెప్పాలి. తత్ఫలితంగా విద్యా

| జిల్లా | పురుషులలో అక్షరాస్యుల శాతం | స్త్రీలలో అక్షరాస్యుల శాతం | మొత్తం జనాభాలో అక్షరాస్యుల శాతం |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 14.7 | 4.5 | 9.6 |
| విశాఖపట్టణం | 14.3 | 3.8 | 9.0 |
| తూర్పుగోదావరి | 25.4 | 11.4 | 18.4 |
| పశ్చిమ గోదావరి | 28.0 | 14.0 | 21.0 |
| కృష్ణా | 27.6 | 15.2 | 21.4 |
| గుంటూరు | 25.4 | 8.8 | 17.1 |
| నెల్లూరు | 19.5 | 5.4 | 12.5 |
| కర్నూలు | 23.9 | 6.7 | 15.3 |
| కడప | 23.1 | 4.6 | 13.9 |
| అనంతపురం | 22.6 | 5.5 | 14.0 |
| చిత్తూరు | 10.9 | 5.3 | 8.1 |
| బళ్ళారి (మొత్తం) | 22.0 | 5.2 | 13.6 |
| | 21.5 | 7.5 | 14.5 |

లయాలలో ప్రవేశించటం అంటే, అత్యధిక ధన వ్యయంతో కూడుకొన్న పనిగా తయారయింది. చదివే విద్యార్థి విద్యకు అవుతున్న ఖర్చులో అత్యధిక పాలు భరించవలసి వస్తున్నది. 1950-51 వ సంవత్సరంలో మొత్తం ఒక్కొక్క విద్యార్థికి అవుతున్న మొత్తం ఖర్చులో, ఆయా విద్యాలయాల నిర్వహిస్తున్న సంస్థలు, ప్రభుత్వం ఎంత శాతాన్ని భరిస్తున్నదీ, విద్యార్థి జీతం చెల్లించుట ద్వారా ఈ ఖర్చులో ఎంత శాతాన్ని భరిస్తున్నదీ కింది పట్టిక తెలియచేస్తుంది :

కళాశాలా విద్యాదశలో (ఉన్నత విద్యాదశలో), ఆయావిద్యాలయాల నిర్వహణా ఖర్చులో విద్యార్థులతే జీతాలు చెల్లించటంద్వారా, నూటికి 61 వంతుల ఖర్చును భరిస్తున్నారు. ఇందులో ప్రభుత్వం భరించే ఖర్చు 21.8 వంతులు మాత్రమే ! ఇదేవిధంగా సెకండరీ విద్యాలయాల నిర్వహణలో విద్యార్థులు నూటికి 55 వంతుల ఖర్చును భరిస్తుంటే, ప్రభుత్వం 27 వంతుల ఖర్చును మాత్రమే భరిస్తున్నది. ఆఖరుకు, ప్రాథమికవిద్యాలయాల నిర్వహణా ఖర్చుకుకూడా, విద్యార్థులు తృణమో ఫణమో చెల్లించుకోక తప్పటంలేదు.

| వివరం | ప్రభుత్వ భాగం % | స్థానిక సంస్థల భాగం % | విద్యార్థుల జీతాలు % | ఇతర విరాళాలు % | మొత్తం ఖర్చు సగటు ఒక్కొక్క విద్యార్థికి (రూ.లలో) |
|---|---|---|---|---|---|
| కళాశాలలు | 21.8 (రు.46.3) | 0.3 (రు. 0.7) | 60.8 (రు.129.1) | 17.1 (రు. 36.2) | 100.0 |
| సెకండరీ పాఠశాలలు | 27.2 (రు.16.7) | 10.9 (రు. 6.7) | 55.2 (రు.33.8) | 6.7 (రు. 4.1) | 100.0 (రు. 61.3) |
| ప్రాథమిక పాఠశాలలు | 67.8 (రు.16.4) | 25.6 (రు. 6.2) | 1.2 (రు. 0.3) | 5.4 (రు. 1.3) | 100.0 (రు. 24.2) |
| బేసిక్ పాఠశాలలు | 58.8 (రు.11.2) | 41.0 (రు. 8.7) | 5.5 (రు. 0.1) | 5.7 (రు. 1.2) | 100.0 (రు. 21.2) |

నోటు: బ్రాకెట్లలో ఇవ్వబడిన మొత్తాలు, ఆయా విద్యాలయాలలో, ఆయా సంస్థలు ఒక్కొక్క విద్యార్థికి ఖర్చుపెట్టే మొత్తం.

ప్రస్తుతం 'కలవారి' గుత్తసొమ్ముగా విద్య ఎలాతయారైందో కిందిపట్టిక తెలియచేస్తుంది. (ఈపట్టికలో 1950-51వ సంవత్సరంలో) ఆయా విద్యాలయాలలో విద్యనభ్యసిస్తున్న మొత్తం విద్యార్థులు, వారికుటుంబ ఆదాయాలవారీ, మొత్తం విద్యార్థులలో ఎంతశాతమో వివరించబడింది!

| కోర్సు | రు. 6000లు ఆపైనసంవత్సర ఆదాయం కలవారు | రు. 6000-2500 మధ్య సంవత్సర ఆదాయం కలవారు | రు. 2500-751 మధ్య సంవత్సర ఆదాయం కలవారు | రు. 750 లోపు సంవత్సర ఆదాయం కలవారు |
|---|---|---|---|---|
| కళాశాలల్లో (బాలురు) | 8% | 22% | 46% | 24% |
| కళాశాలల్లో (బాలికలు) | 15% | 24% | 40% | 21% |
| ఇంజినీరింగ్ | 13% | 27% | 46% | 14% |
| వైద్యం | 22% | 30% | 32% | 16% |
| సెకండరీవిద్యాలయాలు | 4% | 16% | 40% | 40% |
| ప్రాథమిక పాఠశాలలు | 1% | 3% | 17% | 79% |

సమాజంలో అత్యధికుల ఆదాయం (నూటికి 85-90 కుటుంబాల ఆదాయం) సుమారు సాలుకు రు. 750 ఉంటుంది. ప్రాథమిక పాఠశాలలలో ఈకుటుంబాల నుండి వచ్చినవిద్యార్థుల శాతం 79 వరకూ ఉందికాని, సెకండరీవిద్యాలయాలకు వచ్చేటప్పటికి వీరి శాతం 40 కి క్షీణించింది. ఉన్నతవిద్యకు(కళాశాలకు) వచ్చేటప్పటికి 23 కు; వృత్తి కళాశాలలకు వచ్చేటప్పటికి 14 - 16 కు వీరి శాతం దిగజారింది.

రు. 2,500, ఆపైన ఆదాయంగల కుటుంబాల నుండి వచ్చే బాల బాలికల సంఖ్య, ప్రాథమికపాఠశాలలలో నూటికి 4 పాళ్ళే! కాని సెకండరీ పాఠశాలలలో వీరి సంఖ్య నూటికి 20 పాళ్లకు; కళాశాలల్లో 30-40 పాళ్ళకు; వృత్తికళాశాలల్లో 40-50 పాళ్ళకు పెరిగింది.

ఈ పరిస్థితుల్లో, సంవత్సరాలు గడచినా, విద్యార్థులసంఖ్య పెరగటంలేదంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

1950 - 51 వ సంవత్సరంలో అన్ని రకాలవిద్యాలయాలుకలిపి మొత్తం18,762 నిర్వహించ బడుతున్నాయి. 1949-50 వ సంవత్సరంలో ఉన్నవాటికంటె ఈ సంవత్సరం 500 విద్యాలయాలు పెరిగాయి. ఈ విద్యాలయాలలో విద్యనభ్యసిస్తున్న మొత్తం విద్యార్థులు18,02,742. 1949-50 సంవత్సరపు విద్యార్థుల సంఖ్యతో పోల్చిచూస్తే, 1950-51సంవత్సరంలో సుమారు 50 వేల మంది విద్యార్థులు మాత్రమే అదనంగా విద్యాలయాలలో ప్రవేశించారు.

మొత్తం రాష్ట్ర జనాభాలోని పురుషులలో ప్రతినూరుమందిలో పదకొండుగురు, స్త్రీలలో ఆరుగురు-సగటున మొత్తంజనాభాలో ఎనిమిదిమంది మాత్రమే 1950-51వ సంవత్సరంలో వివిధ విద్యాలయాలలో విద్యనభ్యసిస్తున్నారు.

ప్రక్క పేజీలోని పట్టిక జిల్లాలవారీ, (1950 - 51) వివరాలను తెలియ చేస్తుంది.

కృష్ణా, గుంటూరు, పశ్చిమ గోదావరి జిల్లాలలో, వివిధ విద్యాలయాలలో చదువుతున్న విద్యార్థుల శాతం ఇతర జిల్లాల శాతం కంటె అధికం! అక్షరాస్యుల సంఖ్యలోకూడా ఈ జిల్లాలదే పైచేయి. అనంతపురం, విశాఖపట్టణంజిల్లాలు చాలా వెనుకబడి ఉన్నాయి.

# ప్రాథమిక విద్య

1950-51 వ సంవత్సరంలో రాష్ట్రంలో 16,936 ప్రాథమిక పాఠశాలలున్నాయి. వీటిలో 511 ప్రభుత్వంచేత, 6,632 జిల్లాబోర్డులచేత, 172 గ్రామ పంచాయితీలచేత, 485 మునిసిపాలిటీలచేత, 9,126 ప్రైవేటు సంస్థలు, వ్యక్తులచేత నిర్వహించబడుతున్నాయి. దిగువ పట్టిక ఈ పాఠశాలల జిల్లాలవారీ వివరాలను తెలియజేస్తుంది.

ఈ పాఠశాలలలో 1950-51 వ సంవత్సరంలో 9,28 వేల విద్యార్థులు, 5,62 వేల విద్యార్థినులు-మొత్తం 14,91 వేల విద్యార్థి విద్యార్థినులు- విద్య నభ్యసిస్తున్నారు. ఈ విద్యాలయాలలో

| జిల్లా | ప్రాథమిక పాఠశాలలు | | | | | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తం పాఠశాలలు | ప్రభుత్వ నిర్వహణలోనివి | జిల్లాబోర్డుల నిర్వహణలోనివి | గ్రామ పంచాయితీల నిర్వహణలోనివి | మునిసిపాలిటీల నిర్వహణలోనివి | ప్రైవేటు సంస్థల నిర్వహణలోనివి |
| శ్రీకాకుళం | 1,702 | 2 | 356 | 2 | 9 | 1,333 |
| విశాఖపట్టణం | 1,057 | 6 | 539 | 5 | 52 | 455 |
| తూర్పుగోదావరి | 1,803 | 111 | 760 | 6 | 68 | 858 |
| పశ్చిమగోదావరి | 1,553 | 47 | 578 | 15 | 40 | 873 |
| కృష్ణా | 1,770 | 48 | 587 | 12 | 64 | 1,059 |
| గుంటూరు | 2,566 | 33 | 593 | 4 | 64 | 1,872 |
| నెల్లూరు | 1,470 | 90 | 560 | 25 | 24 | 771 |
| కర్నూలు | 1,199 | 28 | 611 | ... | 29 | 531 |
| కడప | 1,058 | 12 | 460 | 3 | 30 | 553 |
| అనంతపురం | 833 | 58 | 543 | 13 | 43 | 176 |
| చిత్తూరు | 1,115 | 27 | 600 | 85 | 17 | 386 |
| బళ్ళారి (మొత్తం) | 810 | 49 | 445 | 2 | 45 | 259 |
| మొత్తం | 16,936 | 511 | 6,632 | 172 | 485 | 9,126 |

| జిల్లా | మొత్తం విద్యాలయాల సంఖ్య | మొత్తం విద్యార్థులు | | | మొత్తం రాష్ట్రం జనాభాలో విద్యార్థుల శాతం | | |
|---|---|---|---|---|---|---|---|
| | | విద్యార్థులు | విద్యార్థినులు | మొత్తం | విద్యార్థులు | విద్యార్థినులు | మొత్తం |
| శ్రీకాకుళం | 1,760 | 1,06,029 | 48,138 | 1,54,167 | 10.2 | 4.4 | 7.2 |
| విశాఖపట్నం | 1,287 | 89,811 | 36,609 | 1,26,420 | 8.8 | 3.5 | 6.1 |
| తూర్పుగోదావరి | 2,173 | 1,38,212 | 83,960 | 1,22,172 | 11.4 | 6.9 | 9.2 |
| పశ్చిమగోదావరి | 1,738 | 1,13,156 | 73,703 | 1,86,859 | 13.3 | 8.7 | 11.0 |
| కృష్ణా | 1,920 | 1,23,682 | 77,071 | 2,00,753 | 13.7 | 8.8 | 11.3 |
| గుంటూరు | 2,813 | 1,85,016 | 1,02,265 | 2,87,281 | 14.3 | 8.1 | 11.3 |
| నెల్లూరు | 1,661 | 1,00,486 | 49,149 | 1,49,635 | 11.1 | 5.5 | 8.3 |
| కర్నూలు | 1,263 | 71,001 | 31,707 | 1,02,708 | 11.0 | 5.0 | 8.1 |
| కడప | 1,162 | 67,986 | 27,265 | 95,251 | 11.4 | 4.8 | 8.2 |
| అనంతపురం | 897 | 60,157 | 21,931 | 82,088 | 8.6 | 3.3 | 6.1 |
| చిత్తూరు | 1,212 | 87,827 | 34,534 | 1,22,361 | 9.5 | 3.9 | 6.8 |
| బళ్ళారి (మొత్తం) | 876 | 51,778 | 21,269 | 73,047 | 8.2 | 3.5 | 5.9 |
| మొత్తం | 18,762 | 11,95,141 | 6,07,601 | 18,02,742 | 10.8 | 5.6 | 8.2 |

చదువుతున్న విద్యార్థులు 1951 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం వున్న పురుష జనాభాలో 8.6% విద్యార్థినులు. స్త్రీ జనాభాలో 5.1% మొత్తం రాష్ట్ర జనాభాలో ఈ విద్యార్థి విద్యార్థినులు 6.9% మాత్రమే. ప్రక్క పేజీలోని పట్టిక ఈ వివరాలను, జిల్లాల వారీ వివరిస్తుంది.

ఒక్క గుంటూరు జిల్లాలోనే 2,34 వేల మంది విద్యార్థి విద్యార్థినులు ప్రాథమికపాఠశాలలలో చదువుతున్నారు. కడప, కర్నూలు, అనంతపురం, విశాఖ జిల్లాలలో ఎచ్చటా 87-98 వేలకు మించి విద్యార్థులు లేరు.

1951 వ సంవత్సరపు జనాభా లెక్కలప్రకారం ఆంధ్రలో 17,215 గ్రామా లున్నాయి. ఇందులో 14,328 గ్రామాలలో రెండు వేలు-అంతకు మించిన జనాభా ఉంది. 1950-51 వ సంవత్సరపు లెక్కల ప్రకారం 16,936 ప్రాథమిక పాఠశాలలు ఆంధ్ర జిల్లాల్లో నిర్వహించబడుతున్నాయి (ఈ సంవత్సర విద్యాశాఖా రిపోర్టు ప్రకారం). ఈ అంకెలనుచూచి, ఏ మూడువందల గ్రామాలలో మాత్రమే ప్రాథమిక పాఠశాలలు లేవని, మిగతా గ్రామా లన్నిటిలోను పాఠశాలలు ఉన్నాయని భావించరాదు. పెద్ద పెద్ద గ్రామాలలో, పట్టణాలలో, ఒకటికి మించి పాఠశాలలు ఉంటాయికనుక, పాఠశాలలు లేని గ్రామాల సంఖ్య ఇంకా అధికంగానేఉన్నది. 607 వ పేజీ లోని పట్టికను పరిశీలించితే, ఈ విషయం మరింత స్పష్టమవుతుంది. (ఇందులో గ్రామాలుమాత్రమే, 1941వ సంవత్సరపు జనాభా లెక్కలవి; పాఠశాలలు, ఆయా గ్రామాలలో 1950-51 వ సంవత్సరంలో ఉన్నవి) :

రెండువేలు-అంతకులోపుజనాభాఉన్న గ్రామాలు 1941 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం 14,354 ఉన్నాయి. ఇందులో 1950-51 వ సంవత్సరంలో 4,799 గ్రామాలలో, ఒక్క ప్రాథమిక పాఠశాలకూడా లేదని తేలుతున్నది. మరొక రకంగా చెప్పాలంటే రెండువేలు-అంతకులోపు జనాభా ఉన్న మొత్తం గ్రామాలలో నూటికి 33 గ్రామాలలో ఒక్క ప్రాథమిక పాఠశాలకూడా లేదు! ఈ అంచనాల ప్రకారం మనరాష్ట్రంలో ఉన్న ప్రతి నాలుగు గ్రామాలకు ఒక్క గ్రామంలోనైనా, ప్రాథమికవిద్యాలయం ఒక్కటికూడా లేదని అంచనా వేయ వచ్చు.

ఇదీ మన ప్రాథమిక విద్యాస్థితి! 1960 వ సంవత్సరానికి దేశమంతటా ఉచితనిర్బంధ ప్రాథమిక విద్యను, బాల బాలికలకు 14 సంవత్సరములు నిండే వరకూ అమలుజరుపుతామని భారత రాజ్యాంగచట్టంలో పొందుపరచబడింది. ఇప్పటికి నూటికి 25 గ్రామాలలో ప్రాథ మిక పాఠశాలలేలేవు. ఇక రానున్న ఆరుసంవత్సరాలలో ఈ గమ్యాన్ని ఎలా చేరుకుంటారో, ఈ గ్రాజును ఎలా గౌర వించబోతున్నారో ఊహకందటంలేదు.

1945-46 వ సంవత్సరంలో బ్రిటిష్ ఎడ్వయిజర్ల పాలనలోనే ఉచితనిర్బంధ విద్యావిధానమని ఒక ప్రణాళిక ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలోనే 220 గ్రామాలతో ప్రారంభించి, 1946-47కు 389 గ్రామాలకు విస్తరింప

| జిల్లా | ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థుల మొత్తం | 1951 సం॥ పురుష జనాభాలో వీరి శాతం | ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థినుల మొత్తం | 1951 సం॥ స్త్రీజనాభాలో వీరి శాతం | ప్రాథమిక పాఠశాలల్లో చదువుతున్న మొత్తం విద్యార్థి విద్యార్థినులు | 1951 సం॥జనాభాలో బాల బాలికల శాతం |
|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 94,632 | 9.1 | 47,437 | 4.4 | 1,42,069 | 6.7 |
| విశాఖపట్నం | 66,411 | 6.5 | 32,209 | 3.1 | 98,620 | 4.8 |
| తూర్పుగోదావరి | 1,00,547 | 8.3 | 75,908 | 6.3 | 1,76,455 | 7.3 |
| పశ్చిమగోదావరి | 83,742 | 9.9 | 67,946 | 8.0 | 1,51,688 | 8.9 |
| కృష్ణా | 89,834 | 9.9 | 71,764 | 8.2 | 1,61,602 | 9.0 |
| గుంటూరు | 1,39,732 | 10.8 | 94,823 | 7.5 | 2,34,555 | 9.2 |
| నెల్లూరు | 80,283 | 8.9 | 45,564 | 5.1 | 1,25,847 | 7.0 |
| కర్నూలు | 57,390 | 8.9 | 30,102 | 4.8 | 87,492 | 6.9 |
| కడప | 55,179 | 9.3 | 25,379 | 4.5 | 80,558 | 6.9 |
| అనంతపురం | 47,753 | 6.8 | 20,540 | 3.1 | 68,293 | 5.0 |
| చిత్తూరు | 71,230 | 7.7 | 31,684 | 3.6 | 1,02,914 | 5.7 |
| బళ్ళారి (మొత్తం) | 41,492 | 6.6 | 19,591 | 3.2 | 61,083 | 5.0 |
| మొత్తం | 9,28,225 | 8.6 | 5,62,947 | 5.1 | 14,91,176 | 6.9 |

| జిల్లా | 1941 జనాభా లెక్కల ప్రకారం రెండు వేలు, అంతకు తక్కువ జనాభా ఉన్న గ్రామాల మొత్తం సంఖ్య | 1941 సంవత్సర జనాభా లెక్కల ప్రకారం, వివిధ గ్రామాలలో 1950-51 లో ఒక్క ప్రాథమిక పాఠశాలకూడా లేని గ్రామాలు | | | | రెండు వేలు అంతకు తక్కువ జనాభాగలిగి, ఒక్క పాఠశాలకూడా లేని గ్రామాలు మొత్తం (ప్రక్క నాలుగు కాలంల మొత్తం) |
|---|---|---|---|---|---|---|
| | | 2,000-1,000 జనాభాగల గ్రామాలు. | 1,000-500 జనాభాగల గ్రామాలు | 500-200 జనాభాగల గ్రామాలు | 200 లోపు జనాభాగల గ్రామాలు | |
| శ్రీకాకుళం | 2,417 | 40 | 131 | 447 | 441 | 1,059 |
| విశాఖపట్నం | 1,035 | 14 | 86 | 130 | 120 | 350 |
| తూర్పుగోదావరి | 980 | 22 | 18 | 17 | 409 | 466 |
| పశ్చిమగోదావరి | 795 | ... | 5 | 36 | 27 | 68 |
| కృష్ణా | 1,052 | 9 | 24 | 30 | 40 | 103 |
| గుంటూరు | 1,204 | 4 | 15 | 78 | 22 | 119 |
| నెల్లూరు | 1,684 | 9 | 142 | 242 | 251 | 644 |
| కర్నూలు | 717 | ... | 49 | 40 | 47 | 136 |
| కడప | 829 | 4 | 16 | 113 | 89 | 222 |
| అనంతపురం | 997 | 47 | 83 | 108 | 153 | 391 |
| చిత్తూరు | 1,808 | 34 | 111 | 382 | 345 | 872 |
| బళ్ళారి (మొత్తం) | 836 | 29 | 98 | 171 | 71 | 369 |
| మొత్తం | 14,354 | 212 | 778 | 1,794 | 2,015 | 4,799 |

నోటు : 1950-51 వ సం॥పు మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖ రిపోర్టు ఆధారంతో తయారుచేయబడ్డాయి.

చేశారు. కాని 1947-48 వ సంవత్సరంలో కాంగ్రెసు ప్రభుత్వం యీ సంఖ్యను 327కు తగ్గించటమేకాక, పేదవిద్యార్థులకు మధ్యాహ్నం భోజనంపెట్టే ఏర్పాటును కూడా రద్దుచేసింది. 1946-47 నుండీ కూడా, ఈ కేంద్రాలు తగ్గుతున్నాయని దిగువపట్టిక తెలియచేస్తుంది:

కాని స్కూలుకు హాజరయ్యేవారు మాత్రం ఉండరు.

1949-50వ సంవత్సరపు విద్యాశాఖా రిపోర్టు ఈ సత్యాన్ని అంగీకరిస్తున్నది. 1948-49 వ సంవత్సరంలో నిర్బంధ విద్యా కేంద్రాలలో 88.8% మంది బాలురు, 77.8% మంది బాలికలు పాఠ

| జిల్లా | నిర్బంధ విద్యా కేంద్రాలు | | |
|---|---|---|---|
| | 1945-46 | 1946-47 | 1947-48 |
| ఉభయ విశాఖలు | 23 | 22 | 31 |
| తూర్పు గోదావరి | 16 | 15 | 20 |
| పశ్చిమ గోదావరి | 13 | 16 | 13 |
| కృష్ణా | 16 | 17 | 17 |
| గుంటూరు | 67 | 68 | 47 |
| నెల్లూరు | 17 | 30 | 40 |
| కర్నూలు | 9 | 47 | 36 |
| కడప | 14 | 30 | 34 |
| అనంతపురం | 8 | 45 | 21 |
| చిత్తూరు | 31 | 64 | 50 |
| బళ్ళారి (మొత్తం) | 6 | 35 | 18 |
| మొత్తం | 220 | 389 | 327 |

నడుస్తున్న కేంద్రాలలో నయినా, విద్యా వయస్కులయిన బాలబాలికలలో, నూటికి 70-80 మందివరకూ హాజరవు తున్నట్లు, ప్రభుత్వపు రిపోర్టులు చిత్రిస్తున్నాయి. కాని, ఇది దొంగలెక్కలనిఅంతా ఎరిగిందే! ప్రభుత్వాధికారుల నిర్బంధ చర్యలనుండి తప్పించుకొనేందుకు స్థానికంగా ఉండే ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు, గ్రామంలోని బాలబాలికలను రిజిష్టరులో చేర్పించటం జరుగుతున్నదే

శాలలకు హాజరయ్యారట! కాని 1949-50 వ సంవత్సరంలో ఈసంఖ్య, బాలురలో 77.8% కు, బాలికలలో 72.1% కు క్షీణించింది. ఈ సంవత్సరంలో ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో పిల్లలను బడికి పంపనందుకు, 1,50 వేల మంది తల్లిదండ్రులకు నోటీసులు జారీ చేయబడ్డాయి. 50,000 ప్రాసిక్యూషన్‌లు అమలుజరపబడ్డాయి. పిల్లలను పంపని తల్లిదండ్రులు చెల్లించిన జరిమానాలు

సుమారు పదివేల రూపాయలని 1949_50 మదరాసు విద్యాశాఖా రిపోర్టులో పేర్కొనబడింది. దీనినిబట్టి నిర్బంధ ప్రాథమిక విద్యను మన ప్రభుత్వం దండ ప్రయోగంతో అమలుజరుప చూస్తున్నట్లు అర్థమవుతుంది. గత నాలుగు సంవత్సరాలలో తాము యీ పద్ధతుల ద్వారా 'సాధించిన' దాన్ని చూచే, ప్రభుత్వం 1948_49 సంవత్సరం తర్వాత నిర్బంధ ప్రాథమిక విద్యా విస్తరణను తాత్కాలికంగా ఆపుచేసింది.

విద్యాబోధన అన్యాయంగా ఉండటానికి ఒక ప్రధాన కారణం, ఉపాధ్యాయునికి, ప్రతి విద్యార్థి చదువును గూర్చి ప్రత్యేక శ్రద్ధతీసికొనేందుకు వీలులేకుండా ఎక్కువమంది విద్యార్థులనుఅప్పగించటం. కింది పట్టికలో సగటున ట్రెయినింగు అయిన ప్రతి ఉపాధ్యాయుడు సగటున ఎందరు విద్యార్థులకు పాఠాలుచెప్పవలసి వస్తున్నదో వివరించబడింది :

| జిల్లా | సగటున ఒక్కొక్క ఉపాధ్యాయుడు పాఠాలు చెప్పే విద్యార్థులు |
|---|---|
| 1. శ్రీకాకుళం | 34 |
| 2. విశాఖపట్నం | 34 |
| 3. తూర్పుగోదావరి | 29 |
| 4. పశ్చిమగోదావరి | 29 |
| 5. కృష్ణా | 31 |
| 6. ఉత్తర గుంటూరు | 44 |
| 7. దక్షిణ గుంటూరు | 30 |
| 8. కర్నూలు | 33 |
| 9. అనంతపురం | 33 |
| 10. కడప | 33 |
| 11. నెల్లూరు | 31 |
| 12. చిత్తూరు | 35 |
| 13. బళ్లారి | 35 |

ఏ జ న్సీ

| | |
|---|---|
| 1. విశాఖపట్నం | 47 |
| 2. తూర్పుగోదావరి | 30 |
| 3. పశ్చిమగోదావరి | 30 |

సగటున ఒక్కొక్క ఉపాధ్యాయుడు 29_47 మంది విద్యార్థులకు విద్యాబోధన చేయవలసి వస్తున్నది.

దీనికి తోడు ఉపాధ్యాయునికి ఇవ్వబడే జీతం మరీ తక్కువ కావటంవల్ల కుటుంబం గడవక, ఇతర పనులు చేసుకుంటూ (ప్రెవేట్లు, కరిణీకాలు ఇత్యాదులు) విద్యాబోధనా విషయంలో శ్రద్ధ వహించటంలేదు. తత్ఫలితంగా నేటి ప్రాథమిక విద్య 'తమాషా'గా మాత్రమే తయారైంది.

ప్రస్తుతం, ఈవిద్యా విధానంలో ఉన్న అధ్వాన్న పరిస్థితులమూలంగానే, మొదటి సంవత్సరంలో చేరిన విద్యార్థులు రెండవ సంవత్సరంలో మానుకోవడం, రెండవ సంవత్సరంలో చేరినవారు మూడవ సంవత్సరంలోనూ, ఇలా వరుసగా విద్యకు తిలోదకాలివ్వటంజరుగుతున్నది. ఒకటవ

తరగతి నుండి ఐదవ తరగతి వరకూ ప్రాథమిక విద్యాదశ. ఈఐదు సంవత్సరాల విద్య పూర్తి అయితేనే, ఒకరు అక్షరాస్యులుగా పరిగణించబడాలి.

మనరాష్ట్రంలో జరుగుతున్నది ఏమిటో చూద్దాం. 1946_47వ సంవత్సరంలో మొత్తం ఉమ్మడి మదరాసురాష్ట్రంలో 12,22,775 మంది బాల బాలికలు ఒకటవ తరగతిలో చేరారు. వీరు తమవిద్యను వదలకుండా కొనసాగిస్తే 1950_51 వ సంవత్సరానికి ఐదవ తరగతిలోకి చేరాలి. కాని 1950_51 వ సంవత్సరంలో ఐదవ తరగతిలో 4,61,686 (దాదాపు మూడవవంతు) మంది మాత్రం ఉన్నారు. మిగతా 7,61,089 మంది, మధ్యలో తమవిద్యకు తిలోదకాలిచ్చారు.

మరొక విధంగా ఈవిషయాన్ని చెప్పాలంటే 1946_47 వ సంవత్సరంలో ఒకటవ తరగతిలో చేరిన ప్రతి నలుగురు బాలురు, నలుగురు బాలికలలో 1950_51 వ సంవత్సరానికి ఐదవ తరగతిలో ఇద్దరు బాలురను, ఒక్క బాలికను మాత్రమే చూడగలం. అంటే, ప్రాథమిక పాఠశాలల్లో చేరే బాలురలో 50%, బాలికలలో 25% మందిని మాత్రమే అక్షరాస్యులుగా పరిగణించాలి.

ఈ నికృష్ట పరిస్థితులపై, వ్యాపిస్తున్న అసంతృప్తిని 'చిటికెలో' పరిష్కరించాలనే, రాజాజీ "నూతన విద్యావిధానం" పేరఒక (అ) విద్యావిధానాన్ని ప్రవేశపెట్టారు. ఈఒంటిపూట బడులవల్ల, ప్రస్తుతం తల్లిదండ్రులకు సాయంగా పనులకు వెళ్ళే పిల్లలలో చాలమందిని, మొత్తంమీద విద్యాలయాలకు వెళ్ళే వయసున్న బాలబాలికలలో అత్యధిక సంఖ్యాకులను పాఠశాలలకు వచ్చేటట్లు చేయ వచ్చని వీరి వాదం.

ఈ (అ) విద్యా విధానాన్ని ఆంధ్ర ప్రభుత్వం కూడా అమలు జరుపుతున్నది. కాని, వీరు ఆశించిన ఫలితాలు మాత్రం రావడం లేదు. లోగడ విద్యాలయానికి వస్తున్న విద్యార్థులనే రెండు గ్రూపులుగా విభజించి, ఒక గ్రూపుకు ఉదయం, రెండవ గ్రూపుకు సాయంకాలం అటెండెన్సు వేయడం, రెండు గ్రూపుల పిల్లల్ని రెండు పూటలా రానివ్వటం అన్నిచోట్లా జరుగుతున్నది. ఈవిధానం అమలు పరచిన తర్వాత, విద్యార్థులు ఎక్కువ మంది హాజరవుతున్నట్లు ప్రభుత్వానికి చూపాలి. కనుక రానివారి పేర్లనుకూడా హాజరుపట్టీలలో వ్రాయటం, ఇన్‌స్పెక్టరు స్కూలుకు వచ్చిన రోజు, పిల్లల తల్లిదండ్రులను బతిమాలి, వారినితీసికొచ్చిపాఠశాలలలో కూర్చో బెట్టడం జరుగుతున్నది. గ్రాంటు కోసం తిప్పలుపడే ఎయిడెడ్ స్కూలు టీచర్ల సంగతి, వాళ్ళ స్కూళ్ళ సంగతి జగమెరిగిన విషయం.

ఈ (అ) విద్యా విధానం వల్ల పిల్లలకు చదువు రాకపోగా, ఉపాధ్యాయులు తమ జీతంలో ఎటువంటి పెరుగుదల లేకుండానే, ఇప్పుడు ఒక గంట అదనంగా పనిచేయ వలసివస్తున్నది.

ఇట్టి దుష్ఫలితాలకు దారితీస్తున్న, ఈ నూతన (అ) విద్యా విధానాన్ని రద్దు చేయాలనే వాదానికి క్రమంగా బలం చేకూరుతున్నది.

# సెకండరీ విద్య

1951 వ సంవత్సరంలో ఆంధ్రలో 538 సెకండరీ పాఠశాల లున్నాయి. వీటిలో 2,31,200 విద్యార్థీ విద్యార్థినులు విద్యనభ్యసిస్తున్నారు. ఈ పాఠశాలలలో 481 బాలురకు, 57 బాలికలకు సీట్లు ప్రత్యేకించబడ్డాయి. బాలుర పాఠశాలల్లో 1951 లో 2,03,242 మంది బాలురు, 15,284 మంది బాలికలు — మొత్తం 2,18,773 మంది విద్య నభ్యసిస్తున్నారు.

బాలికలపాఠశాలలలో 12,279 మంది బాలికలు, 138 మంది బాలురు మొత్తం 12,417 మంది చదువుతున్నారు.

ప్రక్కపేజీలోని పట్టికలో, వివిధ జిల్లాలలో ఈ పాఠశాలల సంఖ్య, వీటిలో చదువుతున్న బాలబాలికల వివరాలు పొందుపరచబడ్డాయి.

ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో 1950-51 లో నిర్వహించబడుతున్న ప్రతి నూరు సెకండరీ పాఠశాలలలోనూ 50 ప్రైవేటు సంస్థలచేత, 35 జిల్లా బోర్డుల చేత, 8 మునిసిపాలిటీలచేత, 7 మాత్రమే ప్రభుత్వంచేత నడుపబడుతున్నాయి. కాని ఆంధ్రలో ఒక జిల్లా బోర్డులచేతనే, మొత్తం సెకండరీ పాఠశాలలలో 55-60% వరకూ నిర్వహించబడుతున్నట్లు అంచనా వేయవచ్చు.

1950-51 వ సంవత్సరంలో 90 సెకండరీ విద్యాలయాలు (కొత్తవి) ప్రారంభింపబడ్డాయి. వీటిలో ఒకటి మునిసిపాలిటీచేత, మరొకటి ప్రైవేటు వ్యక్తులచేతా ప్రారంభించబడ్డాయి. ఒక్క జిల్లాబోర్డులే మిగతా 88 ని ప్రారంభించాయి. 1950-51 వ సంవత్సరంలో ప్రారంభించబడిన ఈ విద్యాలయాలను కూడా లెక్కలోకితీసికొంటే, ఆంధ్రలో ప్రస్తుతం 600 సెకండరీ విద్యాలయాలు ఉన్నట్లు స్థూలంగా అంచనా వేయవచ్చు. ఈ పాఠశాలలలో చదువుతున్న బాలబాలికల సంఖ్య సుమారు 3-3.20 లక్ష లుంటుందని అంచనా వేయవచ్చు. ఈ అంచనాప్రకారం ఆంధ్ర జనాభాలో ప్రతి 200 మందిలో ముగ్గురుమాత్రమే సెకండరీ విద్యను అభ్యసిస్తున్నట్లు తేలుతున్నది. రాష్ట్రంలో ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాలు ఇతర ఆంధ్ర జిల్లాలకన్న ముందున్నాయి. కాని రాయలసీమజిల్లాలు, విశాఖపట్నం జిల్లా వెనుకబడి ఉన్నాయి. విశాఖ, ఉభయ గోదావరి జిల్లాల ఏజన్సీప్రాంతం మరింత వెనుకబడి ఉన్నది. ఈ ప్రాంతపు జనాభాలో ప్రతి వెయ్యిమందికీ ఒక్కరు మాత్రమే సెకండరీ విద్య నభ్యసించేవారు కనిపిస్తారు.

1950-51 లెక్కల ప్రకారం పురుషులలో ప్రతి100 మందికి ఇద్దరు, స్త్రీలలో ప్రతి 400 మందికి ఒక్కరు మాత్రమే సెకండరీ విద్య నభ్యసిస్తున్నవారు కనిపిస్తారు.

రాష్ట్రంలో సెకండరీ విద్యాలయాలు తగినన్ని లేకపోవటంచేత, సెకండరీ విద్య అభివృద్ధి చెందటంలేదు. పాఠశాల స్వగ్రామానికి చేరువగాఉంటే, విద్యార్థులు అధిక సంఖ్యలో చేరటానికి వీలుంటుంది. కాని విద్యాలయాల కొరత మూలంగా చదువ కోరిన విద్యార్థి పొరుగూరిలో మకాంపెట్టి చదవవలసి

| జిల్లా | మొత్తం విద్యాలయాలు | మొత్తం విద్యార్థులు | బాలుర పాఠశాలలు: పాఠశాలల సంఖ్య | బాలుర పాఠశాలలు: విద్యార్థులు | బాలుర పాఠశాలలు: విద్యార్థినులు | బాలుర పాఠశాలలు: మొత్తం విద్యార్థులు | మొత్తం పురుష జనాభాలో విద్యార్థుల శాతం | బాలికల పాఠశాలలు: పాఠశాలల సంఖ్య | బాలికల పాఠశాలలు: విద్యార్థినులు | బాలికల పాఠశాలలు: విద్యార్థులు | బాలికల పాఠశాలలు: మొత్తం విద్యార్థినులు | మొత్తం స్త్రీ జనాభాలో విద్యార్థినుల శాతం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 28 | 10,083 | 27 | 9,591 | 369 | 9,960 | 0.92 | 1 | 123 | ... | 123 | 0.45 |
| విశాఖపట్నం | 24 | 13,388 | 20 | 11,924 | 643 | 12,567 | 1.16 | 4 | 814 | 7 | 821 | 0.13 |
| తూర్పుగోదావరి | 57 | 28,381 | 53 | 24,854 | 2,458 | 27,312 | 2.06 | 4 | 1,069 | ... | 1,069 | 0.29 |
| పశ్చిమగోదావరి | 53 | 26,009 | 48 | 22,995 | 1,848 | 24,843 | 2.70 | 5 | 1,166 | ... | 1,166 | 0.35 |
| కృష్ణ | 77 | 33,367 | 71 | 28,799 | 3,175 | 32,194 | 3.18 | 6 | 1,173 | ... | 1,173 | 0.49 |
| గుంటూరు | 111 | 41,940 | 101 | 36,889 | 2,629 | 39,518 | 2.86 | 10 | 2,364 | 58 | 2,422 | 0.39 |
| నెల్లూరు | 46 | 16,988 | 39 | 14,202 | 1,220 | 15,422 | 1.57 | 7 | 1,500 | 6 | 1,506 | 0.30 |
| కర్నూలు | 28 | 13,048 | 25 | 11,808 | 647 | 12,482 | 1.83 | 3 | 556 | ... | 556 | 0.19 |
| కడప | 28 | 11,045 | 25 | 9,964 | 436 | 10,400 | 1.67 | 3 | 631 | 14 | 645 | 0.18 |
| అనంతపురం | 25 | 10,964 | 22 | 9,863 | 490 | 10,353 | 1.40 | 3 | 604 | 7 | 611 | 0.16 |
| చిత్తూరు | 36 | 15,972 | 31 | 13,838 | 1,152 | 14,990 | 1.49 | 5 | 982 | ... | 982 | 0.24 |
| బళ్ళారి | 25 | 10,075 | 19 | 8,515 | 217 | 8,732 | 1.35 | 6 | 1,297 | 46 | 1,343 | 0.24 |
| మొత్తం | 538 | 2,31,200 | 481 | 2,03,242 | 15,284 | 2,18,773 | 1.89 | 57 | 12,279 | 138 | 12,417 | 0.28 |

రావటంవల్ల, ఆర్థికసోమత లేనివారు చాలించుకోవటం జరుగుతున్నది. ప్రస్తుతం రాష్ట్రంలో సగటున 38 వేల జనాభా కలిగిన ప్రాంతానికి ఒక్క సెకండరీ పాఠశాల ఉంది. పైగా రాష్ట్రంలోని మొత్తం పాఠశాలలలో ఒక్క కృష్ణా, గుంటూరు జిల్లాలలోనే మూడింట ఒక పాలు ఉన్నాయంటే ఇక ఇతర జిల్లాల స్థితి ఊహించవచ్చు.

సెకండరీ విద్య, పెద్ద ఆర్థికభారంతో కూడుకొన్న సమస్యగా తయారవటంతో, యీ విద్యాలయాలలోకూడా పైతరగతికి పోయిన కొలదీ విద్యార్థులు పలుచబడుతున్నారు. మదరాసు ప్రభుత్వ అంచనాల ప్రకారం, ఒకటవ ఫారంలోచేరిన బాలురలో సుమారు 50 మంది, బాలికలలో 33 మంది మాత్రమే ఆరవ ఫారం వరకూ విద్య కొనసాగిస్తున్నారు. మిగతావారు మధ్యలోనే జారిపోతున్నారు.

ఈపాఠశాలలలో ట్రెయినింగుపొందిన ఉపాధ్యాయులు కొరతగా ఉన్నారు. పనిచేస్తున్న ప్రతి వందమంది ఉపాధ్యాయులలో 20 మంది వరకూ ట్రెయినింగు కానివారే! దీనికితోడు క్లాసులోని విద్యార్థుల సంఖ్యను 45 వరకూ పెంచటానికి ప్రభుత్వం అనుమతించటంతో, ఉపాధ్యాయుడు క్లాసులోని విద్యార్థులపై వ్యక్తిగత శ్రద్ధ తీసికొనే అవకాశం లేకపోతున్నది.

వీరికిచ్చే జీతాలు చాలకపోవటంచేత భుక్తికోసం ట్యూషన్లు చెప్పుకోవటంతో బడిలో చదువు చెప్పటం తప్పుబడటం, సమర్థులైనవారు ఉద్యోగాలే వదలి ట్యుటోరియల్ కాలేజీలు ప్రారంభించటం జరుగుతున్నది.

వీటన్నిటి ఫలితంగా సెకండరీ విద్యా పరిస్థితి కూడా క్రమంగా దిగజారుతున్నది.

## ఉన్నత విద్య

1953వ సంవత్సరానికి ఆంధ్రలోఉన్న కళాశాలలు 30 (Arts and Science Colleges). వీటిలో 26 ఆంధ్ర యూనివర్శిటీకి, నాలుగు మదరాసు యూనివర్శిటీకి అనుబంధించబడి ఉన్నాయి. వృత్తికళాశాలలు తొమ్మిది ఉన్నాయి. వీటిలో ఎనిమిది ఆంధ్ర యూనివర్శిటీకి, ఒకటిమదరాసు యూనివర్శిటీకి అనుబంధించబడి ఉన్నాయి.

ప్రక్క పేజీలోని పట్టిక 1950-51 వ సంవత్సర విద్యాశాఖా రిపోర్టు ప్రకారం ఆంధ్రలో ఉన్న కళాశాలలు, వాటిలో చదువుతున్న విద్యార్థినీ విద్యార్థుల సంఖ్యను తెలియచేస్తుంది :

గత రెండు దశాబ్దాలుగా ఆంధ్రులకు ప్రత్యేక విశ్వవిద్యాలయమున్నా, ఆంధ్రదేశం పారిశ్రామికంగా అభివృద్ధిచెందకపోవటంవల్ల ఉన్నతవిద్య తగినంతగా అభివృద్ధి చెందలేదు. ఇక వృత్తి విద్యను గూర్చి చెప్పపనిలేదు.

మనకున్న వృత్తికళాశాలలు: రెండు వైద్యకళాశాలలు (గుంటూరు, విశాఖపట్నం); రెండు ఇంజినీరింగు కళాశాలలు (అనంతపురం, కాకినాడ); ఒక వ్యవ

| జిల్లా పేరు | కాలేజీలు | | | విద్యార్థి విద్యార్థినులు | | |
|---|---|---|---|---|---|---|
| | ప్రభుత్వ కళాశాలలు | ప్రైవేటు కళాశాలలు | మొత్తం | విద్యార్థులు | విద్యార్థినులు | మొత్తం |
| శ్రీకాకుళం | ... | ... | ... | ... | ... | ... |
| విశాఖపట్నం | ... | 5 | 5 | 2,354 | 151 | 2,505 |
| తూర్పుగోదావరి | 1 | 1 | 2 | 2,204 | 171 | 2,375 |
| పశ్చిమగోదావరి | ... | 3 | 3 | 1,569 | 62 | 1,631 |
| కృష్ణా | ... | 4 | 4 | 2,389 | 108 | 2,497 |
| గుంటూరు | 1 | 3 | 4* | 2,955 | 219 | 3,174 |
| నెల్లూరు | ... | 1 | 1 | 1,090 | 81 | 1,171 |
| కర్నూలు | ... | 1 | 1 | 506 | ... | 506 |
| కడప | 1 | ... | 1 | 196 | ... | 196 |
| అనంతపురం | 1 | ... | 1 | 861 | 56 | 917 |
| చిత్తూరు | ... | 2 | 2 | 715 | 10 | 725 |
| మొత్తం | 4 | 20 | 24 | 14,839 | 858 | 15,697 |

* ఇందులో ఒకటి మహిళాకళాశాల.

సాయకళాశాల (బాపట్ల); నాలుగు ఉపాధ్యాయుల ట్రెయినింగు కళాశాలలు (విజయనగరం, రాజమండ్రి, గుంటూరు); ఒక 'లా' కళాశాల (విశాఖపట్టణం); ఒక వ్యాయామ విద్యా కళాశాల (విజయవాడ). వీటిలో గుంటూరులోని మెడికలు కాలేజీ, అనంతపురంలోని ఇంజినీరింగు కాలేజీలు స్వయం సంపూర్ణమైనవి కావు. *

మన విశ్వవిద్యాలయం యెడల ప్రభుత్వం చూపిన సవతితల్లిప్రేమ యీ అధ్వాన్న పరిస్థితులకు చాలవరకూ కారణం. ప్రత్యేకరాష్ట్రం ఏర్పడిన తర్వాతనయినా వెటర్నరీ, అటవీ కళాశాల మున్నగు అనేక విషయాలకు సంబంధించిన వృత్తి కళాశాలలు ప్రారంభించబడలేదు. ఉన్న కళాశాలలు, విశ్వవిద్యాలయంకూడా ఆర్థికంగానూ, శాస్త్రవస్తు పరికరాల కూర్చుకోవటంలోనూ చాల ఇబ్బందులకు లోనుకావలసి వస్తున్నది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు మన విశ్వవిద్యాలయం యెడల చూపిన పక్షపాతి

* కాలేజీలకు సంబంధించిన అదనపు సమాచారానికి (ఆంధ్ర) యూనివర్సిటీ అధ్యాయం చూడండి.

వైఖరిని యూనివర్సిటీ కమిషన్ రిపోర్టులో ఇవ్వబడిన దిగువ అంచనాలు తెలియచేస్తాయి :

| విశ్వవిద్యాలయం | విశ్వవిద్యాలయ ఆదాయంలో గవర్నమెంటు ఇచ్చిన గ్రాంటు శాతం | | |
|---|---|---|---|
| | 1946-47 | 1947-48 | 1948-49 |
| అలీఘర్ | 35.7 | 52.5 | 52.0 |
| అలహాబాద్ | 52.9 | 72.6 | 26.8 |
| ఢిల్లీ | 52.4 | 66.7 | 71.6 |
| అన్నామలై | 47.6 | 58.1 | 44.1 |
| మదరాసు | 23.4 | 27.1 | 33.7 |
| ఆంధ్ర | 20.4 | 37.4 | 16.1 |

ఈ కారణంగా విశ్వ విద్యాలయ విద్య (University Education) నభ్యసించగోరే విద్యార్థులు విపరీతమైన ఆర్థిక ఇబ్బందులకు గురి కావలసి వస్తున్నది. తత్ఫలితంగా ఉన్నత విద్య తగినంతగా అభివృద్ధి కావడంలేదు.

గత మూడు-నాలుగు సంవత్సరాలలో కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలలో కొన్ని ప్రయివేటు సంస్థలు, వ్యక్తుల ప్రోత్సాహంతో కొన్ని కళాశాలలు ప్రారంభించబడ్డాయి. కాని రాయలసీమ జిల్లాలలో ఒక్క చిత్తూరు జిల్లా మినహా, జిల్లా కొక కళాశాలకన్న అధికం లేవు. ఇందువల్ల, ఉన్నత విద్య ఈ ప్రాంతంలో చాల వెనుకబడిఉన్నది. ఈ లోపాన్ని సవరించటానికనే చిత్తూరులో ఒక విశ్వ విద్యాలయాన్ని ప్రారంభించాలని, ఈ ప్రాంతంలో వెంటనే ఆంధ్ర యూనివర్సిటీ అయినా పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులను ప్రారంభించాలని ఆందోళనజరుగుతున్నది. దీని ఫలితంగానే తిరుపతిలో ఎఫిలియేటింగ్, రెసిడెన్షియల్ విశ్వ విద్యాలయాన్ని ప్రభుత్వం ప్రారంభించే యేర్పాట్లు చేస్తున్నది.

ఈ ప్రాంతంలో వెంటనే ఒక మెడికల్ కాలేజీని ప్రారంభించటం, అనంతపురం ఇంజినీరింగు కాలేజీని స్వయంసంపూర్ణమైనదానినిగా పునర్నిర్మించటం అవసరం.

రాష్ట్రంలో అనేకఖనిజాలు విరివిగా లభ్యమవుతున్నాయి. వాటి తవ్వకం

తదితర కార్యక్రమాల నిర్వహించగల నిపుణులను తయారు చేసేందుకు, ఒక మైనింగు అండ్ మెటలర్జీకాలేజీని వెంటనే ప్రారంభించటం అవసరం. అలాగే ఒక ఫారెస్టుకళాశాల, పశువైద్యకళాశాలలను కూడా ఆంధ్రలో ప్రారంభించటం అవసరం. దేశంలో ప్రవహిస్తున్న జీవనదులకు ఆనకట్టలు కట్టి, భూములను సస్యశ్యామలంగా చేసేందుకు, రాష్ట్రంలోని సహజ సంపదలను తగినరీతిగా ప్రజలకు ఉపయోగపడునట్లు చేయుటకు ఈసాంఘిక, విద్యావిధాన పరిధిలోనే వివిధ వృత్తి కళాశాలలను ప్రారంభించడం, ఉన్నతవిద్యను ప్రోత్సహించటం ప్రభుత్వ విద్యుక్త ధర్మం.

# అనుబంధము

## 1950_51 లో కనబడుతున్న కొన్ని విద్యాలయాలు

| జిల్లా | ట్రయినింగు స్కూళ్ళు | | టెక్నాలజీ, పోలీటెక్నిక్ విద్యాలయాలు | ఇండస్ట్రియల్ స్కూళ్ళు | కమర్షియల్ స్కూళ్ళు | ఆర్ట్సు క్రాఫ్ట్సు | షెడ్యూల్డు తరగతులకై ప్రత్యేకంగా నడుపబడుతున్న ప్రాథమిక పాఠశాలలు | కొండజాతుల వారికి ప్రత్యేకంగా నడుపబడుతున్న ప్రాథమిక పాఠశాలలు |
|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషులకు | స్త్రీలకు | | | | | | |
| శ్రీకాకుళం | 2 | ... | ... | ... | ... | ... | 17 | 2 |
| విశాఖపట్నం | 1 | 1 | ... | ... | 6 | ... | 27 | ... |
| తూర్పుగోదావరి | 3 | 3 | 1 | ... | 15 | ... | 507 | 1 |
| పశ్చిమగోదావరి | ... | 2 | ... | 1 | 8 | ... | 428 | 2 |
| కృష్ణా (తూర్పు) | 2 | 4 } | 1 | ... | 8 | ... | 172 | ... |
| కృష్ణా (పశ్చిమ) | 2 | } | | | 4 | .. | 35 | ... |
| గుంటూరు (ఉత్తర) | 2 | 6 } | ... | 3 | 7 } | 2 | 85 | 1 |
| గుంటూరు (దక్షిణ) | 3 | } | | | 6 } | | 245 | 1 |
| నెల్లూరు | 3 | 2 | ... | ... | 2 | 1 | 275 | ... |
| కర్నూలు | 3 | 3 | ... | ... | 2 | ... | 115 | 27 |
| కడప | 1 | 1 | ... | ... | 1 | ... | 56 | ... |
| అనంతపురం | 1 | 1 | ... | ... | 3 | ... | 67 | 6 |
| చిత్తూరు | 1 | 2 | ... | ... | 5 | 1 | 37 | 7 |
| | 24 | 25 | 2 | 4 | 67 | 4 | 2,066 | 47 |

# ఆంధ్ర విశ్వవిద్యాలయం

## ఏ. హనుమంతరావు

ఏకభాష, నాగరికత, సంస్కృతి కలిగి ఒకే భూభాగంలో నివసిస్తున్న ఆంధ్రులు, ప్రత్యేక రాష్ట్రం కావాలని 1913 లో ఆందోళన ప్రారంభించారు. భారత స్వాతంత్ర్య సమరంలో అంతర్భాగంగానే ఆంధ్రోద్యమం పురోగమిస్తే, ఆంధ్రోద్యమంలో అంతర్భాగంగా ఆంధ్ర విశ్వవిద్యాలయోద్యమంకూడా సాగింది. ప్రత్యేక విశ్వవిద్యాలయంలేని ప్రత్యేక రాష్ట్రం దీపంలేని యిల్లులా వుంటుంది. ఆంధ్రప్రాంత విజ్ఞాన వికాసానికీ, ఆంధ్ర సాహితీసౌష్టవానికీఒక ప్రత్యేక విశ్వవిద్యాలయం కావాలని కోరటం సహేతుకమైనదని అప్పటి ప్రభుత్వంచేత, విద్యాధికారుల చేత అతి శీఘ్రకాలంలోనే గుర్తింపజేయటంలో ఆంధ్రులు కృతకృత్యులయారు.

అప్పటికి 4 భాషా ప్రాంతాలను కృత్రిమంగా కలిపి ఏర్పరచిన మద్రాసు రాష్ట్రానికి ఒకే విశ్వవిద్యాలయం ఉండేది. ఆంధ్ర, తమిళ, కన్నడ, మళయాళీ ప్రాంతాల నుండి వచ్చిన విద్యార్థులకు విద్యాబోధన చేయటంలో, పరిపాలనా నిర్వహణలో వస్తున్న చిక్కుల మూలంగానూ, ఆంధ్రులు ప్రత్యేక విశ్వవిద్యాలయం కోసం చేస్తున్న ఆందోళన ఫలితంగానూ, మద్రాసు రాష్ట్రంలోని ప్రతి భాషా ప్రాంతానికి ఒక విశ్వవిద్యాలయం వుండాలని 1920సంవత్సరంలో మద్రాసు విశ్వవిద్యాలయ సెనేటు తీర్మానించింది.

ఒక సంవత్సరం పిమ్మట మద్రాసు ప్రభుత్వం ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపన విషయమై నివేదిక తయారుచేయటానికి శ్రీ ఎల్. ఎ. గోవిందరాఘవయ్యర్ అధ్యక్షతక్రింద ఒక కమిటీ ఏర్పాటు చేసింది. శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి ఈ కమిటీలో సభ్యులు.

అంతకుముందు 1919 లో ప్రాంతీయ విశ్వ విద్యాలయాలేర్పడాలని శాడ్లర్ కమిటీ చేసిన సూచనను పైకమిటీ అనుసరిస్తూ, విశిష్ట సాహిత్య, సంస్కారసభ్యతలకు నిలయమైన తెలుగు ప్రాంతానికి ఒక విశ్వవిద్యాలయం అవసరమని సిఫారసు చేసింది.

కాని ప్రభుత్వం ఈ సిఫారసు నమలుపరచక జాగుచేసింది. తిరిగి 1923 లో ఆర్. ఎమ్. స్టాథామ్ ఆంధ్ర ప్రాంతానికి ప్రత్యేక విశ్వవిద్యాలయావశ్యకతను మరోసారి పునరుద్ఘాటిస్తూ రిపోర్టు సమర్పించాడు; ఆంధ్రప్రజల ఆందోళన మరింత తీవ్రమవ్వటంతో ప్రభుత్వం గుర్తించక తప్పిందికాదు.

చిట్టచివరకు మద్రాసుశాసన సభలో విశ్వవిద్యాలయ బిల్లును, అప్పటి విద్యా

శాఖామాత్యుడు సర్ ఎ.పి. పాత్రో ప్రవేశ పెట్టాడు. బిల్లు నెగ్గి 1926 ఏప్రియల్ 26 న చట్టరూపంగా మద్రాసు గెజిట్‌లో ప్రచురింపబడింది. గంజాం, విశాఖపట్టణం, తూర్పు, పశ్చిమగోదావరులు, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, బళ్ళారి, అనంతపురం, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో ఈ చట్టం అమలులోకి వచ్చింది.

అప్పటి మద్రాసు గవర్నరు లార్డ్ గోషిన్ ఛాన్సెలరుగాను, బొబ్బిలి రాజా ప్రో-ఛాన్సెలరుగాను, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి వైస్-ఛాన్సెలరుగాను, శ్రీ సి. డి. యస్. చెట్టి రిజిష్ట్రారుగాను నియమితులైనారు.

ఆంధ్రోద్యమపు తొలి విజయంగా ఆంధ్ర విశ్వవిద్యాలయం అవతరించింది.

1926 ఆగస్టు 30 వ తేదీన విజయవాడలో సెనేట్ ప్రథమ సమావేశం జరిగింది. విశ్వకళా పరిషత్తు ముద్రికను, ఆంధ్రుల సంస్కృతీ సాంప్రదాయాలు, భవిష్యదాశయాలు ప్రతిబింబించే తీరున, సి. ఆర్. రెడ్డి గారి సూచనల మేరకు, శ్రీ అబ్బూరి రామకృష్ణారావు గారి సాయంతో సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ కౌతా రామమోహనశాస్త్రి గారు తయారు చేశారు.

1927-28 లో అందాక అమల్లోవున్న ఆర్ట్సు, సైన్సు, ట్రయినింగ్, వైద్యశాఖలు గాక గణితం, భౌతిక, రసాయన, వృక్ష, జంతు, భూగర్భ శాస్త్రాలలో డిగ్రీ కోర్సులు ప్రవేశ పెట్టుటకు ఏర్పాట్లు జరిగాయి.

అప్పటికి అనంతపురం, రాజమండ్రి, విజయనగరం, బందరు నోబుల్ కాలేజీలు ఫస్ట్‌గ్రేడ్ కళాశాలలు; విశాఖపట్నంలోని మెడికల్ కాలేజీ; పర్లాకిమిడి, బరంపురం, విశాఖపట్నం, కాకినాడ, గుంటూరు, నెల్లూరు, మదనపల్లిలోని సెకండ్ గ్రేడ్ కళాశాలలు; కొన్ని ఓరియంటల్ కళాశాలలు అనుబంధ సంస్థలుగా ఉండేవి.

1927 డిసెంబరు 5 వ తేదీన నూతన విశ్వవిద్యాలయ పట్ట ప్రదాన మహోత్సవం జరిగింది. ఆచార్య సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు స్నాతకోపన్యాసం చేశారు.

1928 మార్చి 8వ తేదీన సెనేట్ సమావేశంలో శ్రీ సి. ఆర్. రెడ్డిగారు మరో 3 సంవత్సరాలు వైస్ - ఛాన్సెలరుగా ఎన్నుకోబడినారు.

ఈ పరిస్థితిలో రెండు వివాదాలు చెలరేగాయి. ఆనర్సు, పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులను కేంద్రీకరించటం విషయంలో అరితేరిన అధ్యాపకవర్గమూ, అన్ని అవకాశ ప్రోత్సాహాలు కల కేంద్రంలోనే పై కోర్సు లుండటం మంచిదని సెనేట్ తీర్మానించింది.

విశ్వ విద్యాలయ కేంద్ర కార్యస్థానం విషయమై అప్పటి ముఖ్యమంత్రి సుబ్బరాయన్, కేంద్రం విశాఖపట్నంలో ఉండాలని సూచించారు. సి. ఆర్. రెడ్డిగారు, కడప కోటిరెడ్డిగారు ఇందుకు సుముఖులు. ఇతర రాయలసీమ ప్రతినిధులు ఇందుకు సమ్మతించనందువల్ల కడప, కర్నూలు, చిత్తూరు, బళ్ళారి, అనంతపురం జిల్లాలను ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి తొలగించటానికి మద్రాసు కౌన్సిలు తీర్మానించింది. రాయలసీమప్రాంతం విడిపోకుండా సిండికేటుచేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. రాయలసీమ విద్యాలయాలు, మద్రాసు విశ్వ విద్యాలయానికి అను

బంధించ బడ్డాయి. ఆంధ్రోద్యమంలో చీలికలు కలగటానికి ఇది భూమిక అయింది.

5-9-1930 న వాల్తేరులో 'హోటల్ సెసిల్' భవనంలో విశ్వ విద్యాలయ కార్యాలయం పనిచేయడం ప్రారంభించింది.

విశ్వ విద్యాలయ ఫౌండేషన్ నిధికి 27 లక్షలు; భవన నిర్మాణానికి, ఇతర పరికరాలు కొనటానికి 7½ లక్షలు; సాంవత్సరిక విరాళంగా 1½ లక్షలరూపాయలు ప్రభుత్వం మంజూరుచేసింది.

1930-31 సంవత్సరాల్లో ఉప్పు సత్యాగ్రహంపట్ల ప్రభుత్వ మవలంబించుతున్న దమననీతికినిరసనగా, శ్రీ సి. ఆర్. రెడ్డిగారు తమ వైస్ ఛాన్సెలర్ పదవికి రాజీనామా యివ్వగా, ఆస్థానంలో ఆచార్య రాధాకృష్ణన్‌గారిని 1931 లో నియమించారు.

వీరి ఆధ్వర్యాన పరిషదభ్యుదయానికి చాల కృషి జరిగింది.

అంతవరకూ ఆంధ్రదేశంలో ఏ రెండు మూడు కళాశాలల్లోనో మాత్రమే బి. ఎ. లేక బి. ఎస్ సి. డిగ్రీని సంపాదించడాని కవకాశముండేది. ఎమ్. ఎ., ఎమ్.ఎస్ సి. పట్టములకొరకు మద్రాసో, కాశీయో, కలకత్తాయో పోవలసి యుండేది. కాని 1932 లో శ్రీ రాధాకృష్ణన్‌గారి హయాములో, తొలిసారిగా ఆంధ్రవిశ్వవిద్యాలయం ఆధ్వర్యంక్రింద బి. ఏ. ఆనర్సు., బి. ఎస్ సి. ఆనర్సు కోర్సులు ప్రవేశపెట్టబడ్డాయి. శాస్త్ర విషయాల్లోను, భౌతిక, రసాయన శాస్త్రాల్లోను, టెక్నాలజీలోను ఆనర్సు కోర్సులు మొదలుపెట్టబడ్డాయి. బి.ఎస్ సి ఆనర్సు పూర్తిచేసిన విద్యార్థులు, శాస్త్ర పరిశోధనలద్వారా ఎమ్. ఎస్ సి. ఆనర్సు పట్టమును, పిహెచ్. డి. పట్టమును పొందడాని కవకాశాలేర్పరుపబడ్డాయి. దూరప్రాంతాలకు పోనవసరం లేకుండా ఆంధ్రదేశంలోనే వుంటూ ఉన్నతశాస్త్ర విద్యను పొందటానికి అవకాశమేర్పడింది.

కామర్సులో ఆనర్సు కోర్సు ప్రవేశపెట్టబడింది. భారతదేశంలో ప్రప్రథమంగా ఆంధ్రలోనే.

వీరి హయాములోనే 1931-33 ల మధ్య ఆర్ట్సు కాలేజీ, సైన్సు టెక్నాలజీ కాలేజీభవనాలు, హాస్టలు భవనాలు నిర్మించబడ్డాయి.

20 మార్చి 1936 వ తేదీన సి. ఆర్. రెడ్డిగారు తిరిగి వైస్-ఛాన్సెలరుగా సెనేట్ చే నియమితులైనారు.

ఇక్కడనుంచి 1941 వరకూ విశ్వ విద్యాలయం పరుగులుతీస్తూ ముందుకు సాగింది. కొత్తకోర్సులు ప్రవేశపెట్టడం, నూతనభవనాలు నిర్మించటం కేవలం శ్రీ రాధాకృష్ణన్‌గారి గుత్తాధికారం కాదని నిరూపించటాని కన్నట్లుగా, ఈకాలంలోకూడ టెక్నాలజీ వర్కుషాపుకు, హాస్టల్సుకు, హాస్పిటల్సుకు నూతనభవనాలు నిర్మించబడ్డాయి. జంతు, వృక్ష శాస్త్రాల్లో కొత్తకోర్సులు ప్రారంభించబడ్డాయి.

రాయలసీమ విద్యాలయాలు మన నుండి విడిపోవటం, దురదృష్టకరమైన విషయమయినా, కొత్తగా కొన్ని కాలేజీలు -హిందూ కాలేజీ, మచిలీపట్నం, ఎస్. ఆర్. ఆర్. కాలేజీ విజయవాడ, హిందూ కాలేజీ గుంటూరు అనుబంధించబడటంతోను, అప్పటికే అనుబంధించబడియున్న కొన్ని కళాశాలల స్థాయిని పెంచ

టంతోనూ విశ్వవిద్యాలయానికి భౌతికంగా లోటు పూడ్చబడింది. కాని ఆంధ్ర గడ్డపైనున్న కొన్ని కళాశాలలు మననుంచి విడిపోయాయే అన్న దిగులు అలాగే ఉండిపోయింది.

1940 ప్రాంతాలకు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు బోధనావిషయంలోనూ, పరిశోధనలోనూ ఉచ్చదశ నందుకొంది. పరిషతు ప్రథమ శ్రేణిలో నిల్చున్నది.

ఇంతలో రెండవ ప్రపంచ యుద్ధ జ్వాలలు భారతదేశంలో కూడా అలముకొన్నాయి. విశాఖపట్నంలో జపాను ఫాసిస్టులు బాంబులు వేశారు. సైనిక కార్యకలాపాలకోసం పరిషత్తు భవనాలను మిలిటరీ వశపరచుకోవటం వల్ల, 1942 ఏప్రియల్‌లో గుంటూరుకు తాత్కాలికంగా మార్చబడింది. ఈ ఒడు దుడుకుల ప్రవాస జీవితంలో పరిషత్తు అనేక ఇబ్బందుల నెదుర్కోవలసి వచ్చింది. అయినా, అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగుతూనే వచ్చాయి. విశ్వవిద్యాలయంలో, అనుబంధ కళాశాలల్లో కొత్తకోర్సులు ప్రవేశపెట్ట బడ్డాయి. మరికొన్ని కొత్త కళాశాలలు అనుబంధించ బడ్డాయి.

ఈ యుద్ధకాలంలోను, 1942లో ఉత్తేజితులైన విద్యార్థులు సెప్టెంబరు 1942లో సమ్మె సాగించారు.

యుద్ధానంతరం కేంద్ర కార్యస్థానం 1946 జనవరిలో వాల్తేరుకు తిరిగి వచ్చింది.

1949 నాటికి న్యాయ, రసాయన శాస్త్రకళాశాలలు వాల్తేరులో పని చేయటంప్రారంభించాయి.

సి. ఆర్. రెడ్డిగారు మైసూరు విశ్వవిద్యాలయానికి ప్రో-ఛాన్సలర్‌గా నియమితులై వెళ్లిపోగా, శ్రీ వి. యస్. కృష్ణ గారు ఆయనస్థానంలో నియమించబడ్డారు. మరి రెండు సంవత్సరాలలోనే శ్రీ రెడ్డిగారు దివంగతులైనారు. అదే సంవత్సరంలో ప్రో-ఛాన్సెలరుగా ఉన్న జయపూర్ మహారాజాగారు కూడా మరణించారు. విశ్వవిద్యాలయ చరిత్రలో వీరిద్దరి పాత్ర అతిప్రాముఖ్యమైనది. ఒకరు ఉదారంగా విరాళా లివ్వటంలోను, మరొకరు సంవత్సరాల పరిపాలన కొనసాగించటం ద్వారానూ, విశ్వవిద్యాలయ చరిత్రలో మరువలేనివ్యక్తులుగా నిలుస్తారు.

ప్రస్తుతం తెనుగు, ఇంగ్లీషు భాషల్లో; చరిత్ర, ఆర్థిక, రాజకీయ, తత్వ, గణిత, రసాయన,భౌతిక, వృక్ష, జంతు, భూగర్భ, పరికరోత్పత్తి, ఇత్యాది పరిశోధనశాఖల్లో విరివిగా కృషి జరుగుతున్నది.

1928 లో 6,516 పుస్తకాలతో ప్రారంభమైనలైబ్రరీ నేటికి 55 వేల పుస్తకాలకు పెరిగింది. లిఖిత పుస్తక భాండాగారంలో 2 వేల తాళపత్ర గ్రంథాలున్నాయి. తంజావూరు సరస్వతిమహాలులోని అముద్రితాంధ్ర వాఙ్మయగ్రంథాలు చాలవరకు వ్రాయించి తెప్పించబడ్డాయి.

శాస్త్ర పరిశోధనలకు ఈ విశ్వవిద్యాలయంలో మొదటి నుండి చాల ప్రాధాన్యత యిచ్చారు. ముఖ్యంగా భౌతిక, రాసాయనిక శాస్త్రాలలో ఇక్కడ జరిగిన ప్రాముఖ్యమైన పరిశోధనల ఫలితంగా భారతదేశంలోని పరిశోధనా కేంద్రాల్లో ఒక ప్రముఖస్థానాన్నాక్రమించ గలిగింది.

భౌతిక శాస్త్రంలో గ్రూపుల సిద్ధాంతమును రామన్ ఎఫెక్టును అన్వయించటంలోనూ, ఆకర్షణ శబ్ద తరంగముల

గురించి, డైలెక్ట్రిక్స్ గురించి పరిశోధనలు జరిగాయి. మొదటి రెండు విషయాల్లో పరిశోధన మన విశ్వవిద్యాలయాన్ని భారత దేశంలో ప్రథమ స్థానానికి తీసుకపోయింది.

రసాయనికశాస్త్రంలోను, మొక్కల లోని రంగు పదార్థములను పరిశీలించటం లోను, ఫొటో కెమిస్ట్రీలోను, అపురూప పదార్థముల పరిశీలనలోను పరిశోధనలు జరిగాయి. అతి తక్కువగా లభించే పదార్థములను, రసాయనికంగా విశ్లేషించగలగటం మన విశ్వవిద్యాలయం లోని ప్రత్యేకత.

పారిశ్రామిక ఉపయోగం గల విషయాలపై కూడా పరిశోధనలు జరిగాయి. మద్రాసు ప్రభుత్వం పారిశ్రామిక శాఖకు అనేక సలహాలను విద్యాలయ రసాయనికశాఖ ఇవ్వటంజరిగింది. ప్రభుత్వం, ఎనలిటికల్ అండ్ పెస్కింగు పరిశోధనాలయం నెలకొల్పటంలో కూడా చాల సహాయపడింది.

టెక్నాలజీ శాఖలో పంచదార తయారీకోర్సును, భారతదేశంలో మొదటి సారిగా మన విశ్వవిద్యాలయం ప్రవేశ పెట్టింది. ఫార్మసిటిక్స్ కోర్సుకూడా ప్రత్యేకంగా ప్రవేశపెట్టబడింది. ఈ శాఖ లోని కోర్సులకు ఆంధ్రేతరులు, దూర ప్రాంతాలవారు అనేకమంది వస్తుంటారు. ఈశాఖలో మన విశ్వవిద్యాలయం ప్రత్యేకంగా చేస్తూన్న కృషిని భారత ప్రభుత్వం పరిగణించి 7,70,000 ల రూపాయల గ్రాంటు ఇచ్చింది.

ఆంధ్రదేశంలో భూగర్భంలో దాగియున్న అనేక ఖనిజాలను విశ్వవిద్యా విద్యార్థులు పరిశీలించి, మన సహజ సంపదలను ప్రజలదృష్టికి తీసుకవచ్చారు. మొత్తం 5 వేల చదరపుమైళ్ళ భూభాగంలో ఈ పరిశోధన జరిగింది. పరిశోధనాభిలాషులైన శ్రీ సి. మహదేవన్‌గారు ఈ శాఖకు ఆచార్యత్వం వహించటం ఈ పరిశోధనకు తోడ్పడింది. భారతప్రభుత్వ భూగర్భ పరిశోధకశాఖ ఖనిజాల కోసం అన్వేషణ సాగించేవారిలో అనేక మంది, మన విశ్వవిద్యాలయ పట్టభద్రులవటం మనకెంతో గర్వకారణం.

భారత పరమాణుశక్తి సంఘ ఆధ్వర్యాన జరుగుతున్న ఎలక్ట్రికల్ కృషిని సాగిస్తున్న వారిలో చాలమంది, ఆంధ్ర విశ్వవిద్యాలయ రసాయనిక పరిశోధనా కేంద్రంలో తరఫీదు పొందినవారే అయి వుండటం మనకు మరింత గర్వకారణం.

అలాగే స్టాటిస్టిక్స్, రేడియో ఔషధాల పరిశోధనాలయాల్లో మన విశ్వవిద్యాలయ పట్టభద్రు లెంతోమంది పని చేస్తున్నారు.

అనేకరంగాల్లో ఈ విధంగా గణనీయమైన కృషిజరిగి, కేవలం ఆంధ్రోపయోగాలకేగాక, అఖిల భారతావసరాలకోసం కృషిచేసి ప్రఖ్యాతిగాంచింది.

విశ్వవిద్యాలయ పురోగమనపు టడుగుజాడల్లోనే పరిషద్గ్రంథమాలకూడా నడిచింది. ఆపరకవిత్రయ కృత ద్విపద భారతంలాంటి ప్రాచీన గ్రంథం మొదలు కొని ఆంధ్ర, సంస్కృత భాషలచరిత్రలు, ఆంధ్రదేశ ఖనిజసంపదలు, కాంతి ప్రసారం-రామన్ ఎఫెక్ట్ (Scattering of Light And Raman Effect) లాంటి ఆధునిక విజ్ఞానశాస్త్రగ్రంథాల వరకూ ప్రచురించింది.

ఇన్ని జరిగినా, ధనాభావంవల్ల విశ్వవిద్యాలయం తలపెట్టిన కొన్ని శాఖల్లో పనులే ప్రారంభం కాలేదు. విద్యార్థులకు వసతి సౌకర్యాలు పూర్తిగా లభించే అవకాశం కనుచూపు మేరలో లేదు. ఆంధ్రాభిమానంతో, పరిశోధనాభిలాషగల ఉపాధ్యాయులకు సరియైన జీతాలు లేవు. పరిశోధనలు జరపటానికి వలయు పరికరాలు కూడా తగినన్ని లేవు.

దీనికి కారణం లేకపోలేదు. పెరిగే బిడ్డకు పుష్టికరమైన ఆహారం యివ్వకపోతే బిడ్డ ఎలా ఈసురోమంటూ వుంటుందో, అలా విశ్వవిద్యాలయం బాల్య, కౌమార, యౌవనదశలలో ప్రభుత్వ సహాయం బొత్తిగా పరిమితంగా ఉంటూ వచ్చింది. విశ్వవిద్యాలయ ఖర్చుల్లో 5 వ వంతు మాత్రమే ప్రభుత్వం ఇస్తూంది. వైస్-ఛాన్సెలర్ డాక్టర్ వి. ఎస్. కృష్ణ చెప్పినట్లు ఆర్థికమాంద్యం ముమ్మరంగా ఉన్న రోజుల్లో ఎంత గ్రాంటు ఇచ్చిందో ఈనాటికీ అంతే ఇస్తూంది. అంతేకాదు. మనకు ప్రత్యేకరాష్ట్రం, ప్రత్యేకప్రభుత్వం లేనందున మద్రాసు రాష్ట్రంలో మన విశ్వవిద్యాలయానికి గ్రాంటు ఇచ్చే సందర్భంలో చిన్న చూపుచూడటం జరిగింది. గత సంవత్సరం బడ్జెటుచూస్తే అన్నామలై యూనివర్శిటీకి రు. 22,17,800, మద్రాసు యూనివర్శిటీకి రు. 8,31,500 లు ఇస్తే, మన యూనివర్శిటీకి రు. 4,63,100 లు మాత్రమే కేటాయించటం జరిగింది.

ప్రభుత్వం ఇంతపక్షపాతం చూపినా, ఉదారమైన విరాళాలు విరివిగా రావటం వల్ల, ఇన్నాళ్ళూ మన విశ్వవిద్యాలయం కాలక్షేపం చేస్తూ వచ్చింది.

ప్రారంభ దినాన్నే బొబ్బిలిరాజా, సంస్కృతాంధ్ర విద్యలకొరకు లక్ష రూపాయలిచ్చారు. 1933-34 లో జయపూర్ మహారాజా శ్రీవిక్రమదేవవర్మగారు 50 వేల రూపాయలు, మరుసటి సంవత్సరానికి 75 వేల రూపాయలు, ఆటు తర్వాత 15 లక్షల మొత్తం అయ్యేవరకూ ప్రతి సంవత్సరం లక్ష రూపాయలు దానం చేశారు. ఆ తరువాత తిరువాన్కూరు మహారాజా, నైజాం నవాబు, తదితరులు కూడా పెద్ద మొత్తాలు విరాళాలిచ్చారు.

ఇప్పుడు ఈ జమీందార్ల విరాళాలు కూడా ఆగిపోయాయి. ఆంధ్ర మహాజనులు పూనుకొని, ప్రభుత్వంద్వారా అవసరమైనంత ఆర్థిక సహాయం సంపాదించు కొన్నప్పుడే ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇతోధికంగా అభివృద్ధి చెందగల్గుతుంది.

మన విశ్వవిద్యాలయానికి పాతిక సంవత్సరాలు నిండాయి. తరతరాలు విలసిల్లవలసిన విశ్వవిద్యాలయానికి పాతికేళ్ళు నిండటం అంత బ్రహ్మాండం కాకపోయినా, మన ఆంధ్రజాతి విశ్వవిద్యాలయరజతోత్సవాన్ని గత జనవరి 1953లో పరమానందంగా జరుపుకొంది. తెలుగు పత్రికలన్నీ ప్రత్యేక సంచికలు ప్రచురించాయి. ఒకనాటి విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సెలరు, నేటి భారత ప్రభుత్వ ఉపాధ్యక్షులుఅయిన సర్వేపల్లి రాధాకృష్ణన్ గారు ఈ ఉత్సవాలకు అధ్యక్షత వహించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం రజతోత్సవం జరుపుకొనేనాటికి 22 ఆర్ట్సు, సైన్సు కళాశాలలు, ఆరు వృత్తి కళాశాలలు అనుబంధ కళాశాలలుగా పనిచేస్తున్నాయి. మొత్తం 18 వేలమంది విద్యార్థులు విద్యా

ఖ్యానం చేస్తున్నారు. మద్రాసు గవర్నరు శ్రీప్రకాశ ఛాన్సెలరుగాను, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రో-ఛాన్సెలరుగాను, శ్రీ వి. ఎస్. కృష్ణగారు వైస్-ఛాన్సెలరుగాను, శ్రీ కూర్మా వేణుగోపాలస్వామిగారు రిజిస్ట్రారుగాను వున్నారు.

రజతోత్సవ సందర్భంలో వైస్-ఛాన్సెలర్ మాట్లాడుతూ "ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడనున్న శుభ సమయంలో రాయలసీమ కళాశాలలు మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధించబడియున్నాయని, ఇవి త్వరలోనే ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధించబడాలనేమన ఆశయం నెరవేరి, సాంస్కృతికఐక్యత సాధించబడుతుందని ఆశిస్తున్నానని అన్నారు.

"విద్యార్థులు, ఉపాధ్యాయులు ఒకే చోట జీవించవలెననే ఆశయం ఇప్పటికీ పూర్తిగా నెరవేరలేదని, విశాఖపట్టణంలో నాకా కళాశాల స్థాపించవలెననే ఆశయం కూడా ఇంకా సఫలం కాలేదని, మాతృభాషలోనే విద్యాబోధన జరగవలెనన్న ప్రధాన ఆశయం కూడా ఇంకా నెరవేరవలసి యున్నదని" అన్నారు.

40 సంవత్సరాలుగా కలలు కంటున్న ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఆంధ్ర ప్రభుత్వంఅధికారంలోఉంది. పైఆశయాలన్నీ సఫలీకృతమైననాడే మనసంస్కృతి, మనవిద్య రాణిస్తాయి. ఆంధ్రజాతి అభివృద్ధికి, ఆంధ్ర దేశ పురోగమనానికి తోడ్పతుంది.

ఈ ఆశయాలు నెరవేటానికి ఆంధ్ర ప్రభుత్వం కృషి చేసేలా చేయాల్సిన బాధ్యత ఆంధ్ర ప్రజానీకంపై ఉంది.

# యూనివర్సిటీ కాలేజీలు

యూనివర్సిటీ ఆధ్వర్యాన నాలుగు కాలేజీలు వాల్తేరులో నిర్వహించ బడుతున్నాయి.అవి: 1. యూనివర్సిటీ కాలేజి ఆఫ్ ఆర్ట్సు అండ్ సైన్సు, 2. జె. వి. డి. కాలేజి ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీ, 3. ఎర్నిస్టన్ కాలేజి ఆఫ్ నాచురల్ సైన్సెస్, 4. యూనివర్సిటీ కాలేజి ఆఫ్ లా.

## యూనివర్సిటీ కాలేజి ఆఫ్ ఆర్ట్సు అండ్ కామర్సు

ఇందులో బి. యె. ఆనర్సు, యం.యె. (ఆనర్సు) పిహెచ్. డి. డిగ్రీ పరీక్షలకు, విద్యాబోధనకు, వివిధ విషయాలలో పరిశోధన చేయడానికి అవకాశాలు ఉన్నాయి.

ఇది 1931లో ప్రారంభించ బడింది. ఇందులో చరిత్ర, రాజకీయాలు, ఆర్థిక సాంఖ్యిక, తత్వ, గణితశాస్త్రాలు, తెలుగు ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లీషు,వాణిజ్య విద్యా విషయాలు బోధించ బడుతున్నాయి.

చరిత్ర, రాజకీయాల డిపార్టుమెంటు 1931లోనే ప్రారంభించ బడింది. ఈ శాఖలో శ్రీయుతులు డా॥ లంకసుందరం, హిరేంద్రనాధ ముఖర్జీ, వి. కె. ఆర్. వి. రావు ఇత్యాది ప్రముఖులు అధ్యాపకులుగా పనిచేశారు.

1934లో చరిత్రలోను, ఆర్థిక శాస్త్రంలోను,'పాస్ కోర్సు'లను ప్రారంభించారు.

1946-47 లో ఈ డిపార్టుమెంటు హిస్టరీ అండ్ పాలిటిక్సు డిపార్టుమెంటు, ఎకనామిక్సు, సోషియాలజీ డిపార్టుమెంటు అని రెండు రెండు డిపార్టుమెంటులుగా విడగొట్టబడింది.

ఈ డిపార్టుమెంటు అధ్యాపకులు తయారుచేసిన అనేక పరిశోధనా గ్రంథాలు యూనివర్శిటీ ప్రచురించింది.

## ఎకనమిక్సు, సోషియాలజీ డిపార్టుమెంటు

ఈ రెండు శాఖలలోను, పరిశోధనకు ప్రోత్సాహం లభిస్తున్నది. ఈ శాఖ అధ్యాపక సభ్యులు కొందరు తయారుచేసిన పరిశోధనా గ్రంథాలు అనేకం ప్రచురించ బడ్డాయి. ప్రస్తుతం, విద్యార్థులు ఈ శాఖలో అధికంగా చేరుతున్నారు. ట్యూటర్సుతో పాటు వీరుకూడా పరిశోధనలు చేస్తున్నారు.

## తత్వశాస్త్రశాఖ

ఈ శాఖ 1932 లో డా॥ రాధాకృష్ణన్ గారు వైస్ ఛాన్సెలరుగా ఉన్న కాలంలో ప్రారంభించబడింది. శ్రీ శైలేశ్వరసేన్, హుమయూన్ కబీరు మున్నగు ప్రముఖులు ఈ శాఖలో పనిచేశారు. ఈ శాఖ అధ్యాపకులు అనేక వ్యాసాలు, గ్రంథాలు వ్రాశారు.

1933 లో బి. యే. 'పాస్' డిగ్రీ కోర్సులు ప్రారంభింపబడ్డాయి. కాని అనతికాలంలోనే మూసివేయబడ్డాయి.

ప్రస్తుతం, బి. యే. ఆనర్సు, ఎం. ఏ. ఆనర్సు,పిహెచ్.డి.కోర్సులు ఉన్నాయి.

శ్రీ సేన్ గారు అనువదించి సంపాదించిన (edited) "వివర్ణ ప్రమేయ సంగ్రహం" యూనివర్శిటీ ప్రచురించింది.

## గణితశాస్త్రశాఖ

ఈ శాఖ 1932జూన్ లో (డా॥రాధాకృష్ణన్ గారు వైస్ ఛాన్సెలరుగా ఉన్నపుడు) ప్రారంభించబడింది.

1937-38 లో యం. యే. (ఆనర్సు) రిశర్చిడిగ్రీ రద్దుచేయబడి, 1945 లో ఎగ్జామినేషన్ - కమ్-రిశర్చి డిగ్రీ గా పునరుద్ధరించబడింది.

ఫిజిక్సు డిపార్టుమెంటుయొక్క మాథమాటికల్ ఫిజిక్సు సెక్షను బి. యస్‌సి. ఆనర్సు, మాథమాటిక్సు డిపార్టుమెంటు గా 1946 లో విడదీయబడింది.

1946 నుంచి 1951 వరకూ, బి. యే. ఆనర్సు, బి. ఎస్‌సి. ఆనర్సుకు కంబైండు క్లాసులు జరుగుతూ ఉండేవి. కాని, సిలబస్ తిరిగి తగినవిధంగా వ్రాయబడేవరకు కంబైండ్ క్లాసులు జరగరాదని శ్రీ కె.వి. రావు ప్రభృతుల కమిటీ సిఫార్సుచేసింది.

ఈ శాస్త్రంమీద దాదాపు 75 పరిశోధనాగ్రంథాలు యూనివర్శిటీ(1951కి) ప్రచురించింది.

## తెలుగు శాఖ

ఈ శాఖ 1931 జూన్ లోనే బి. యే. ఆనర్సు క్లాసులకు తెలుగుభాష బోధించేందుకు ప్రారంభించబడింది. మొదట చరిత్రలోను, తెలుగులోను విద్యాబోధన ప్రారంభమైంది. ఈశాఖ తదితర శాఖల వలె, డిగ్రీకోర్సులకు విద్యాబోధనతో పాటు, పరిశోధనకుకూడా వీలుకల్గచేసింది. బి. యే. ఆనర్సు క్లాసులకు తెలుగుబోధన, యం. యే. ఆనర్సు,

పిహెచ్. డి. రిసర్చి కోర్సులకు చదివే వారికి సాయపడటం (Guiding) చేస్తుంటేది.

ఈ శాఖకు సంబంధించిన అనేక పరిశోధనా వ్యాసాలు, గ్రంథాల ప్రచురణను యూనివర్శిటీ అజమాయిషీ చేస్తుంది.

తంజావూరు సరస్వతి మహల్ లైబ్రరీలోని తెలుగు ప్రాచీన గ్రంథాలన్నింటినీ కాపీ చేసేనిమిత్తం, 1938 లో యూనివర్శిటి ఒక ప్రత్యేకశాఖను ప్రారంభించింది. ఈశాఖ దాదాపు అన్ని తెలుగు గ్రంథాలను కాపీచేసి యూనివర్శిటీలో భద్రపరచింది. వీటిలో ముఖ్యమైనవాటిని ప్రచురించటానికి యూనివర్శిటీ పూనుకొన్నది. మొదటి ప్రచురణ "ద్విపద భారతం"తో ప్రారంభమైంది. 1943 లో మొదటి సంపుటం, 1950 లో రెండు, మూడు, నాలుగు సంపుటాలు వెలువడ్డాయి. ముద్రణ ఇంకా సాగుతున్నది.

తంజావూరులోని తెలుగు వ్రాతప్రతుల కాపీ చేయటం త్వరలో ముగుస్తుంది. వీటితోపాటు పెక్కు తాళపత్రిగ్రంథాలు కూడా సేకరించబడి, లైబ్రరీలో భద్రపరచ బడుతున్నాయి. వీటిని వివిధ తరగతులుగా విభజించి రేటలాగు ప్రచురించే ఏర్పాట్లు జరుగుతున్నాయి.

## ఫ్రెంచి, జర్మన్ భాషల శాఖ

ఉన్నత విద్యనభ్యసించే విద్యార్థులకు ఇతర భాషల పరిచయం అవసరమనే అభిప్రాయంతో కీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఈ కోర్సుల ప్రారంభించారు. ఈ భాషల చదవటం, చదవకపోవటం విద్యార్థుల ఇష్టంమీదే ఆధారపడుతుంది. విధిగా చదవాలనే నియమం లేదు.

1942 వరకూ, ఇవి ఇంగ్లీషు శాఖ అంతర్భాగంగా ఉండేవి. 1942 లో ఇంగ్లీషు ఆనర్సు కోర్సులు ప్రారంభించాక దీన్ని "మోడరన్ యూరోపియన్ లాంగ్వేజెస్" శాఖగా విడతీశారు.

## ఇంగ్లీషు శాఖ

1932 లో ఈ శాఖ ప్రారంభించబడింది.

ఇంగ్లీషు ఆనర్సుకోర్సులు ప్రారంభించాలని మొదటినుండి ప్లాను ఉన్నప్పటికీ, 1945-46 లోనే ఈ డిగ్రీ కోర్సు ప్రారంభించబడింది.

## కామర్సు శాఖ

ఈ శాఖ 1934 లో ప్రారంభింపబడింది. ప్రస్తుతం ఆనర్సు, పోస్టుగ్రాడ్యుయేటు కోర్సుల- పి హెచ్. డి వరకు - మీద ప్రత్యేక శ్రద్ధ తీసికోబడుతున్నది. 'పాస్' డిగ్రీ కోర్సులకు చదివేవారు, ఇన్సూరెన్సు, రవాణా, కరెన్సీ, ఎక్స్ఛేంజి ఇత్యాది విషయాలమీద స్పెషల్ స్టెడీ చేసేందుకు; పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులు చదివేవారికి ఎడ్వాన్సుడు ఎక్కౌంటెన్సీ, కరెన్సీ, ఇన్‌కంటాక్సు, ట్రేడ్ పాలసీ ఇత్యాది విషయాలపై స్పెషల్ స్టెడీ చేసేందుకు అవకాశాలు కల్పించబడ్డాయి.

## జె. వి. డి. కాలేజీ ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీ

ఈకాలేజీ 1932 లో ప్రారంభించబడింది. దీనిలో ఫిజిక్సు, మాథమాటికల్ ఫిజిక్సు, అప్లయిడ్ ఫిజిక్సు, జియాలా

ఫిజిక్సు, కెమిస్ట్రీ, టెక్నాలజీ, ఫార్మసీ శాఖలున్నాయి.

### ఫిజిక్సు

విశ్వవిద్యాలయంలో ప్రారంభించబడిన శాస్త్ర విజ్ఞానశాఖలలో మొట్టమొదటిది ఫిజిక్సు(పదార్థ విజ్ఞానశాస్త్రం). ఈశాఖ, బాల్యదశలో అనుభవజ్ఞులయిన సర్ సి.వి. రామన్‌గారి మార్గదర్శకత్వం (Guidance) లభించటం వల్ల, త్వరిత గతిని అభివృద్ధి చెంది, దేశ ప్రఖ్యాతిగన్న రిసర్చి కేంద్రంగా నేడు పరిగణింపబడుతున్నది.

ప్రస్తుతం దిగువ ఉదహరించిన రిసర్చి బ్రాంచీలున్నాయి: 1. తేజః ప్రసారంపై రామన్ ఎఫెక్టు ప్రభావం. 2. స్ఫటికాలు, వాయు పదార్థాలపై రామన్ ఎఫెక్టు ప్రభావం. 3. వర్ణపట పరిశీలన - ముఖ్యంగా పరమాణు వర్ణపట పరిశీలన.

శ్రీ సూరిభగవతం-ప్రస్తుతం హైదరాబాదు విశ్వవిద్యాలయవైస్-ఛాన్సెలరుగా పని చేస్తున్నారు - శ్రీ విస్సా అప్పారావుగార్లు ఈశాఖ అధిపతులుగా కొంత కాలం పని చేశారు.

ప్రస్తుతం అల్ట్రాసోనిక్సు (Ultra-sonics), డైలెక్ట్రిక్సు (Dielectrics), వైర్‌లెస్ అండ్ ఇనాస్ఫెరిక్స్ (Wireless and Inospherics), థియరీ ఆఫ్ కాంప్లెక్సు స్పెక్ట్రా ఆఫ్ ఆటమ్సు (Theory of Complex Spectra of Atoms) ఇత్యాది అనేక విషయాలపై, రిసర్చి చేసేందుకు అవకాశాలున్నాయి.

### మాథమాటికల్ ఫిజిక్సు శాఖ

1943లో ఫిజిక్సులో ఒక శాఖగా ఈ సబ్జెక్టు (విషయం) ప్రారంభించబడి, 1946లో ప్రత్యేక శాఖగా రూపొందించబడింది. 1950 నుండి డాక్టరు మీనాక్షిసుందరంగారు అధిపతిగా ఉంటున్నారు.

### డిపార్టుమెంట్ ఆఫ్ అప్లయిడ్ ఫిజిక్సు

ఇది 1946లో ఫిజిక్సు శాఖనుండి వేరుపరచబడి, ప్రత్యేక శాఖగా రూపొందించబడింది.

1937లో ఫిజిక్సుశాఖ అధ్వర్యాన శాస్త్రవస్తు పరికరాలను తయారుచేసే సెక్షనును ప్రారంభించారు. ప్రథమంలో ఆ డిపార్టుమెంటుకు కావలసిన కొన్ని ప్రాథమికావసరాలు తీర్చటమే దీని పని.

1939 కి దీనిని అభివృద్ధిచేసి అప్లయిడ్ ఫిజిక్సులో పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులను ప్రారంభించారు. 1946లో దీనిని ఫిజిక్సుశాఖనుండి విడదీసి ఒక ప్రత్యేక శాఖగా ఏర్పాటుచేశారు. దీనిఅభివృద్ధికి విశేషకృషి జరుగుతున్నది.

### జియోఫిజిక్సు డిపార్టుమెంటు

1949 జులైలో వాతావరణశాస్త్రం (Meteorology), సాగరశాస్త్రం (Oceanography)పాఠ్యవిషయాలుగా ఈ శాఖ ప్రారంభించబడింది. 1949 సెప్టెంబరులో భూమి భౌతిక శాస్త్రం (Physics of The Earth) ప్రారంభించబడింది. ప్రథమంలో ఫిజిక్సులో భాగంగా ప్రారంభించబడిన ఈ శాఖ 1949 డిశంబరు 8 వ తేదీన ప్రత్యేక శాఖగా విడదీయబడింది.

### డిపార్టుమెంట్ ఆఫ్ కెమిస్ట్రీ

1932 జులైనుండి, కెమిస్ట్రీ శాస్త్రబోధనా తరగతులు ప్రారంభించబడ్డాయి.

ఈశాఖలో కెమిస్ట్రీ ఆనర్సు, కెమికల్ టెక్నాలజీ ఆనర్సు కోర్సులు ఉన్నాయి. 1937 లో యం. యస్‌సి. కెమిస్ట్రీ డిగ్రీకోర్సు కూడా ప్రారంభించబడింది.

మైక్రో బయలాజికల్ కెమిస్ట్రీ, కెమిస్ట్రీ ఆఫ్ ప్లాంట్ పిగ్‌మెంట్సు, కెమిస్ట్రీ ఆఫ్ హోర్మోన్సు అండ్ కోమెరిన్సు, ఫొటో కెమిస్ట్రీ ఇత్యాది అనేక విషయాలపై రిశర్చికి అవకాశాలున్నాయి.

ఈ శాఖక్రింద మంచి మైక్రోకెమికల్ ఎనలిటికల్ లాబొరేటరీ ఉన్నది. ఎనాలిసిస్‌కు శాంపిల్సు దేశం నలుమూలలనుండి వస్తుంటాయి. శాంపిలు పంపే సంస్థలలో ముఖ్యమైనవి: తిరువాన్కూరు విశ్వ విద్యాలయం, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు బెంగుళూరు, సెంట్రల్ లాబొరేటరీస్ ఫర్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిశర్చి హైదరాబాదు, ది ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సుగర్ టెక్నాలజీ కాన్పూరు, పబ్లిక్ హెల్తు లాబొరేటరీ తిరువాన్కూరు.

## డిపార్టుమెంట్ ఆఫ్ టెక్నాలజి

ఇంటరు ప్యాసయిన విద్యార్థులకు పంచదార టెక్నాలజీలో (Sugar Technology) బి. యస్ సి. ఆనర్సు డిగ్రీ కోర్సులను 1933 లో ప్రారంభించారు. దీనిని 1938 లో బి. యస్‌సి. ఆనర్సు కెమికల్ టెక్నాలజీ కోర్సుగా మార్చారు.

## డిపార్టుమెంట్ ఆఫ్ ఫార్మసీ

1952 లో ఇది ఒక ప్రత్యేక శాఖగా ఏర్పాటుచేయబడింది. దీనిలో బి. యస్‌సి. ఆనర్సు, యం. యస్‌సి. డిగ్రీ కోర్సు లున్నాయి.

## డిపార్టుమెంట్ ఆఫ్ స్టాటిస్టిక్సు

స్టాటిస్టిక్సు, మాథమాటిక్సు, ఎకనమిక్సు, కామర్సు, వాతావరణ శాస్త్రం ఆనర్సు కోర్సులలో బోధించబడుతున్నవి. 1951 జూలై నుండి యం. యస్ సి. కోర్సు ప్రారంభించబడింది. ఈ శాఖ 1952 లో ఒక ప్రత్యేకశాఖగా ఏర్పాటు చేయబడింది.

## ఎర్స్కిన్ కాలేజీ ఆఫ్ నాచురల్ సైన్సెస్

## డిపార్టుమెంటు ఆఫ్ జియాలజి

1941వ సంవత్సరంలో యీ శాఖ ఏర్పాటు చేయబడింది. 1945 నుండి ప్రొఫెసరు మహాదేవన్ ఈ శాఖకు అధిపతిగా పనిచేస్తున్నారు.

## డిపార్టుమెంట్ ఆఫ్ బోటనీ

1946 లో ఈ శాఖ ప్రారంభించబడింది. ఈ శాస్త్రంలో ఆనర్సుకోర్సు లున్నాయి. ఈ శాఖ ఇంకా బాల్యదశలోనే ఉంది. దీని అభివృద్ధికి కృషిజరుగుతున్నది.

ఆంధ్రలోనగిరికే విధిధ వృక్షజాతులను పెంచే ఉద్యానవనాన్ని ఏర్పాటుచేయటానికి ఈ శాఖ ప్రయత్నిస్తున్నది.

## డిపార్టుమెంట్ ఆఫ్ జూఆలజీ

1946 లో ఈ శాఖ ప్రారంభించబడింది. ఆనర్సు, యం. యస్‌సి. కోర్సులు ఈ శాస్త్రంలో ఉన్నాయి.

## లా కాలేజీ

1945 సంవత్సరంలో ఈకాలేజీ మదిలీపట్నంలో ప్రారంభించబడింది. 1949 తరువాత ఈకాలేజీవాల్తేరుకు మార్చబడింది.

1950 నుండి యం. యల్., డి. యల్. కోర్సులు కూడా ప్రారంభించ బడ్డాయి.

బి. యల్. క్లాసులో భూస్వామ్య హక్కులను గురించిన ప్రత్యేక పాఠ్యవిషయాన్ని 1951 జూన్‌లో రద్దుచేసి, దాని స్థానే "అంతర్జాతీయ న్యాయశాస్త్రానికి సంబంధించిన ప్రధానసూత్రాలు" ప్రవేశ పెట్టబడ్డాయి. దక్షిణ భారత కళాశాలలలో ప్రథమంగా అంతర్జాతీయ న్యాయ సూత్రాలను పాఠ్యవిషయంగా చేసింది ఆంధ్ర విశ్వవిద్యాలయమే!

# అనుబంధ కళాశాలలు

## I ఆర్ట్సు, సైన్సు కళాశాలలు

### మిసెస్ ఎ. వి. ఎన్. కళాశాల, విశాఖపట్నం

ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆవిర్భవించక మునుపే 1860 లో వెర్నాక్యులర్ పాఠశాలగా ప్రారంభించబడి, సెకండరీ కళాశాలగా అభివృద్ధి అయింది. మొదట 'హిందూ కళాశాల' అని పిలువబడేది. 1892లో రాజా అంకితం వెంకట నరసింహారావుగారు భూరివిరాళమివ్వగా, కళాశాలను వారి సతీమణి నామాంకితమొనర్చారు. 1944 లో మొదటి తరగతి కళాశాలగామార్చబడింది. నేడు ఈకళాశాలలో 1042 మంది విద్యార్థులు, వివిధ తరగతుల్లో వివిధ విషయాల్లో శిక్షణ పొందుతున్నారు.

### మహారాజా వారికళాశాల, విజయనగరం

1879 లో శ్రీ విజయరామ గజపతి కాలంలో సెకండ్ గ్రేడ్ కళాశాలగా నెలకొల్పబడి, రెండు సంవత్సరాల్లో మొదటిగ్రేడు కళాశాలగా రూపొందింది. 1950 లో ట్రయినింగు కాలేజీ కూడా అనుబంధ సంస్థగా ప్రారంభమైనది. ప్రఖ్యాత విద్వాంసుడు శ్రీ చంద్రశేఖర శాస్త్రిగారు ప్రప్రథమ కళాశాలాధ్యక్షులు.

డాక్టర్ ఎ. ఎల్. నారాయణగారు నేటి కళాశాలాధ్యక్షులు. 1041 బాలురు, 54 మంది బాలికలు విద్యాభ్యాసం చేస్తున్నారు. 59 మంది అధ్యాపకులున్నారు.

### పిఠాపురం రాజావారి కళాశాల, కాకినాడ

1852లో కాకినాడలో మాధ్యమిక పాఠశాలగా ప్రారంభించబడింది. 1884లో సెకండ్ గ్రేడ్ కళాశాలగాను, 1926లో మొదటి గ్రేడ్ కళాశాలగాను మార్చబడింది. పిఠాపురం మహారాజా వారు ఈ కాలేజీకి మొదట ట్రస్టీగా, తరువాత ప్రొప్రయిటరుగా నిర్వహించారు. 1953లో ప్రభుత్వం యీ కళాశాలను తన ఆధీనం చేసుకొంది. ఇప్పుడు ఈ కాలేజీని 'పి. ఆర్. గవర్నమెంటు కళాశాల' అని పిలుస్తారు. సర్ ఆర్. వెంకటరత్నం నాయుడుగారు 15 సంవత్సరాలు కళాశాల అధ్యక్షపదవి నిర్వహించి

కళాశాలను సర్వతోముఖాభివృద్ధికి తెచ్చారు.

ప్రస్తుత అధ్యక్షులు శ్రీ ఎ. ఎస్. త్యాగరాజాగారు. బాలబాలికల సంఖ్య 1740. అధ్యాపకులసంఖ్య 89. 1953-54 బడ్జెటు ప్రకారం ఆదాయం రు 3,00,681 లు.

## ఆంధ్ర క్రిష్టియన్ కాలేజీ, గుంటూరు

వెర్నాక్యులర్ పాఠశాలగా 1842లో ప్రారంభింపబడి, 1852 నాటికి సెకండు గ్రేడు కళాశాలగా రూపొందింది. 1926లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు కను బంధించబడింది. 1934 లో బి. ఎస్‌సి. కోర్సు, 1950 లో బి. ఇడి. కోర్సు ప్రారంభించబడ్డాయి. కళాశాల ప్రథమాధ్యక్షులు డాక్టర్ వుల్ఫ్. ఇది క్రిస్టియన్ మిషన్ వారిచే ప్రారంభించబడింది.

16 మంది విద్యార్థులతో ప్రారంభించబడిన ఈ కళాశాలలో ఈనాడు మొత్తం 1381 మంది విద్యార్థులున్నారు. మొత్తం 80 మంది అధ్యాపకులున్నారు. నేటి కళాశాలాధ్యక్షుడు డాక్టర్ టి. ఎస్. పాలస్. కళాశాల విస్తీర్ణం 30 ఎకరాలు.

## శ్రీవెంకటగిరి రాజావారికళాశాల, నెల్లూరు

1875లో పాఠశాలగా ప్రారంభించబడి, 1920జూలైలో సెకండుగ్రేడ్ కాలేజీగా రూపొందింది. 1926లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తుకు అనుబంధ కళాశాలగాచేరి, 1944లో మొదటిగ్రేడు కళాశాలగా అభివృద్ధిచెందింది.

## హిందూ కళాశాల, మచిలీపట్నం

1856లో సర్ ఎ. శేషయ్యగారు ఆంగ్ల-తెలుగు పాఠశాలగా ప్రారంభించారు. ఆరోజుల్లో క్రైస్తవ మత ప్రచారకులదాడి విద్యార్థులపై ఎక్కువగా ఉండటంవల్ల, మత విషయాలలో జోక్యం లేకుండా హిందూ విద్యార్థులకు విద్య గరపే నిమిత్తం ఈపాఠశాల నెలకొల్పబడింది. 1928లో సెకండుగ్రేడ్ కళాశాలగా, 1934 లో మొదటిగ్రేడు కళాశాలగా అభివృద్ధినొందింది.

## హిందూకళాశాల, గుంటూరు

1860లో జిల్లాపాఠశాలగా ప్రారంభింపబడి, 1906 లో హైస్కూలుగా, 1935లో సెకండ్‌గ్రేడు కళాశాలగా దినదినాభివృద్ధి గాంచుతూ విద్యాకేంద్రమయింది. 1938లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తుకనుబంధ కళాశాలగాచేయబడింది.

1935లో 53 మంది విద్యార్థులు, ఏడుగురు ఉపాధ్యాయులుంటే ఇప్పుడు 1400 మంది విద్యార్థులు, 115 మంది అధ్యాపకులున్నారు. ప్రారంభంనుంచి శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావుగారు అధ్యక్షులుగా పని చేశారు. నేటి అధ్యక్షులు శ్రీ వి. సుబ్బారావుగారు.

## శ్రీ రాజా రంగయ్యప్పారావు, చుండూరు వెంకటరెడ్డి కళాశాల, విజయవాడ

1937 లో రాజా రంగయ్యప్పారావు గారి వీలునామా ప్రకారం స్థాపించారు. ముందుగా సెకండుగ్రేడు కళాశాలగా ప్రారంభమై, 1942 లో మొదటిగ్రేడు కళాశాలగా మారింది. ఆ తరువాత

చుండూరు వెంకటరెడ్డిగారు 1946 లో నిర్వహణకు ముందుకు వచ్చారు.

ప్రారంభంలో 46 మంది విద్యార్థు లుంటే నేడు 1300 మంది విద్యార్థు లున్నారు.

## స్త్రీల కళాశాల, గుంటూరు

గుంటూరు పురపాలకసంఘ కృషి ఫలితంగా 1946 లో స్త్రీలకు ప్రత్యేక కళాశాలగా నెలకొల్పబడింది. మొదటి అధ్యక్షురాలుగా శ్రీమతిసరోజినీశేషగిరిగారు కళాశాల ఔన్నత్యానికి కృషిసల్పారు. నేటి అధ్యక్షురాలు శ్రీమతి డామోరన్ సతిగారు.

వయోజనుల అక్షరాస్యతకు కృషి చేసేందుకై, సాంఘిక సేవాసమితి కాలేజీలో స్థాపించబడింది.

## పశ్చిమగోదావరి భీమవరం కళాశాల, భీమవరం

పశ్చిమగోదావరిజిల్లా వాసులు తమ జిల్లా కొక కళాశాల ఉండాలనే కోర్కెతో చేసిన కృషి ఫలితంగా 1945 లో సెకండ్ గ్రేడ్ కళాశాలగా ప్రారంభించబడింది.

మామిడిపూడి వెంకటరంగయ్యగారు ప్రథమ అధ్యక్షులు. ప్రస్తుతం ఇ. లక్ష్మీకాంతరావుగారు అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు. బాలబాలికల సంఖ్య 1344. ఉపాధ్యాయుల సంఖ్య 72.

## శ్రీ రామలింగారెడ్డి కళాశాల, ఏలూరు

1945 లో ఈ కళాశాల వెలసింది. ఏలూరు పురపాలక సంఘం, ఇతర ప్రముఖులు ఈ కళాశాల అభివృద్ధికి దోహదం చేశారు. ప్రభుత్వం 50 వేల రూపాయలను మంజూరు చేసింది.

## ఆంధ్ర జాతీయ కళాశాల, మచిలీపట్నం

ఆనాటి విద్యా విధానంపట్ల అసమ్మతిగా, జాతీయాభిమానం పొంగులువారగా 1907లో కోపల్లె హనుమంతరావు, ముట్నూరు కృష్ణారావు, కొత్త శ్రీ రామశాస్త్రిగార్ల కృషి ఫలితంగా ఈకళాశాల అవతరించింది. జాతీయోద్యమంతోపాటు, ఈకళాశాలకూడా ఒడుదుడుకుల్లో పడింది.

1947 తరువాత నిలద్రొక్కుకుంది. 1949 లో ఇంటర్, తరువాత బి. ఎ. తరగతులు ప్రారంభించబడ్డాయి. శ్రీ వరదాచారి గారు నేటి కళాశాలాధ్యక్షులు.

## గుడివాడ కళాశాల, గుడివాడ

స్థానిక ప్రజానీకం అభిలాష ఫలితంగా 1950లో బి. ఎ. తరగతి ప్రారంభమైంది. ప్రస్తుతం తాత్కాలిక భవనంలో కళాశాల వుంది. 1953-54 సం॥లో విద్యార్థుల సంఖ్య 814. విద్యార్థులు 774 - విద్యార్థినులు 40.

## నరసాపురం కళాశాల, నరసాపురం

1852లో ఆంధ్ర-ఆంగ్లభాషా విద్యాలయంగా జె. ఎస్. బైలిక్ చే స్థాపించబడి, 1920లో శ్రీ ఎర్రమిల్లి నారాయణమూర్తి గారి అవిరళ కృషితో హైస్కూలుగా రూపొందింది, చివరకు 1949లో కాలేజీగా అవతరించింది. శ్రీ వంగూరి సుబ్బారావు గారు కళాశాలాధ్యక్షులు.

### ఊటుకూరి రామయ్యశ్రేష్ఠి కళాశాల, చీరాల

1951 జూలై 2వ తేదీన చీరాలలో సెకండుగ్రేడ్ కాలేజీగా స్థాపించబడింది. ఆర్ట్సు, సైన్సు విషయాలు బోధింపబడు తున్నాయి. డాక్టరు టి. రామారావుగారు అధ్యక్షులు.

### కావలి కళాశాల, కావలి

1951 జూలై 1వ తేదీన పి. వి. రాజమన్నారుగారి ప్రారంభోత్సవంలో ఈ కళాశాల వెలిసింది. చరిత్ర, వాణిజ్యం బోధిస్తూ, ఇంటర్ తరగతులు నడుపు తున్నారు. 104 మంది విద్యార్థులతో ప్రారంభమైంది. ఎం. రామానుజరావు నాయుడుగారు అధ్యక్షులు.

### శ్రీ సుబ్బారాయుడు అండ్ నారాయణ కళాశాల, నర్సారావుపేట

జూన్ 22, 1950 న 200 మంది విద్యార్థులతో యీ కళాశాల ప్రారంభమైంది.

శ్రీ పి. రంగనాయకులుగారు అధ్యక్షులుగా పనిచేస్తున్నారు.

### గవర్నమెంటు ఆర్ట్సు కాలేజ్, శ్రీకాకుళం

శ్రీకాకుళం ఒక జిల్లాగా ఏర్పడిన తరువాత, కళాశాల కూడా అవసరమని భావించి దీనిని నెలకొల్పారు. తాత్కాలికంగా బొనుపోలు భవనంలో నడుస్తోంది. 1951 ఆగస్టు1న ప్రారంభమైంది. మొదటి సంవత్సరం తరగతి ఏర్పాటు చేయబడింది. జనాబ్ ఎ. ఎస్. ఖల్ల్ ఉల్లా అధ్యక్షులు.

### కోనసీమ భానోజీ రామర్సు కళాశాల - అమలాపురం

కోనసీమ కేంద్రమైన అమలాపురంలో 1951 లో స్థాపించబడింది. గోదావరి అవలి గట్టున ఉన్న 3 తాలూకాల విద్యార్థులకు ఉపకరిస్తూంది. మొదటి గ్రేడు కళాశాల.

512 మంది విద్యార్థులున్నారు. ఉపాధ్యాయుల సంఖ్య 31. శ్రీ పి. రామచంద్రరావుగారు కళాశాలాధ్యక్షులు.

### తెనాలి కళాశాల, తెనాలి

1951 జూలై 22 న ప్రారంభించబడింది. తెనాలి పురపాలక సంఘం లక్ష రూపాయల విరాళం ఇచ్చింది. ప్రస్తుతం ఆర్ట్సు తరగతులే నడుపబడుతున్నాయి.

### పాములపాటి బుచ్చినాయుడు కళాశాల, నిడుబ్రోలు

శ్రీ బుచ్చినాయుడుగారి కృషితో యీ కళాశాల ఏర్పడింది. ప్రస్తుతం 'ఆర్ట్సు'లోనే విద్యాబోధనజరుగుతున్నది. డాక్టర్ ఐ. ఎస్. పీటరుగారు కళాశాలాధ్యక్షులు.

### ఆర్ట్సు కాలేజి, రాజమండ్రి

1873 లో నెలకొల్పబడింది. 1877లో మొదటి గ్రేడ్ కళాశాలగా మారింది. ఆంధ్రలోని పురాతన విద్యా సంస్థల్లో ఒకటి.

కొత్త భవనాలు నిర్మించబడుతున్నాయి.

## II మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధించబడిన

## ఆంధ్ర కళాశాలలు

### గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల, అనంతపురం

1916లో 'సీడెడ్ డిస్ట్రిక్ట్సు కళాశాల' అనే పేరుతో లార్డ్ పెంట్‌లాండ్ కృషితో సెకండ్ గ్రేడు కళాశాలగా ప్రారంభ మైంది. 1918 లో మొదటి గ్రేడుగా మారింది. 1946 నుంచి పై పేరుతో పిలువబడుతూంది. తొలి కళాశాలాధ్యక్షులు శ్రీ ఎస్. ఇ. రంగనాథన్ గారు. ప్రస్తుతం ఆర్. హెచ్. పి. హార్ల్‌మన్ గారు అధ్యక్షులుగా వ్యవహరిస్తున్నారు.

మొదట మద్రాసు, తరువాత ఆంధ్ర, తిరిగి మద్రాసు విశ్వవిద్యాలయాలకు అనుబంధింప బడింది.

విద్యార్థుల సంఖ్య 2103, ఉపాధ్యాయుల సంఖ్య 57.

### ఉస్మానియా కాలేజీ, కర్నూలు

1895లో ఒక ఉపాధ్యాయునితో ప్రారంభించబడిన ఈ పాఠశాల, క్రమ క్రమంగా అభివృద్ధి చెంది, 1920లో ఒక యింటర్ కళాశాలగా పరిణామం చెందింది. 1947లో కళాశాలగా ప్రకటించబడింది. నైజాం నవాబు 2 లక్షల రూపాయల విరాళం ఇచ్చాడు.

మార్హీ మహమద్ సాహెబ్ బహదూర్ గారు అధ్యక్షులు.

అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషలు నేర్పుతారు.

737 మంది విద్యార్థులు, 44 మంది అధ్యాపకులు ఉన్నారు.

### గవర్నమెంటు ఆర్ట్సు కళాశాల, కడప

జూలై 1948లో 64 మంది విద్యార్థులతో, సెకండరీ గ్రేడు కళాశాలగా ప్రారంభమైంది.

1951లో మొదటి గ్రేడు కళాశాలగా మారింది.

ప్రస్తుతం 454 మంది విద్యార్థులు, 26 మంది ఉపాధ్యాయులు ఉన్నారు. వి. హాబిబుల్లా గారు అధ్యక్షులు.

### థియొసాఫికల్ కాలేజి, మదనపల్లి.

### వెంకటేశ్వర దేవస్థాన కళాశాల, తిరుపతి.

## వృత్తి కళాశాలలు

### ఆంధ్ర మెడికల్ కాలేజీ, విశాఖపట్నం

ఈ కాలేజీ 1923 జూలైలో విశాఖపట్నం మెడికల్ కాలేజీ అన్న పేర ప్రారంభించబడింది. మొదట ఈ కాలేజీ మదరాసు యూనివర్శిటీకి అనుబంధించబడింది. 1926 లో మాత్రమే, ఆంధ్రా యూనివర్శిటీకి అనుబంధించబడింది.

1927 వ సంవత్సరంలో జనరల్ మెడికల్ కౌన్సిలు పర్యవేక్షణ జరిపి,

యం. బి., బి. యస్. డిగ్రీకోర్సులను గుర్తించ నిరాకరించింది. ఏదోవిధంగా 1928 వ సంవత్సరంలో మొదటి జట్టు డిగ్రీలను పొందింది. 1928 లో మెడికల్ ఎడ్యుకేషన్ కమిటీ ఈ కాలేజీని ఎత్తి వేయాలని శిఫార్సు చేసినప్పటికీ అలాగే ఉంటూ వచ్చింది. 1934 వరకు మొదటి రెండు పరీక్షలు, 1935 వరకూ ఫైనలు యం. బి., బి. యస్. పరీక్షలు మద్రాసులో జరుపబడుతూ ఉండేవి. కాని 1935 నుండి అన్ని పరీక్షలు కాలేజీలోనే జరిపే ఏర్పాట్లు చేయబడ్డాయి.

1935 లో తిరిగి మెడికల్ కౌన్సిలు తరఫున ఇన్స్పెక్షను జరిగింది. కాని రికగ్నిషన్ మాత్రం రాలేదు. 1935_36 సంవత్సరంలో తిరిగి కాలేజీ మూతబడే ప్రమాదం వచ్చినప్పుడు, దీన్ని నిలపడానికి డాక్టరు రాధాకృష్ణన్ విశేషంగా తోడ్పడ్డారు. చివరకు డా|| సి. ఆర్. రెడ్డిగారి విశేష కృషివల్ల 1941 లో రికగ్నిషన్ వచ్చింది.

1949 నుండి, గుంటూరు మెడికల్ కాలేజీలో మొదటి సంవత్సరం ప్యాసయిన విద్యార్థులను, ఈ కాలేజీలో మూడవ తరగతిలో (Third year class) చేర్చుకొంటున్నారు.

ఈ కాలేజీ 1949 లో రజితోత్సవం జరుపుకొన్నది.

75 విద్యార్థినులకు, 204 విద్యార్థులకు సరిపడే వసతిగృహాలున్నాయి.

1951 వ సంవత్సరానికి, 17 గురు ప్రొఫెసర్లు, ఎనిమిదిమందిఉపన్యాసకులు, 20 మంది అసిస్టెంట్లు, పదిమంది డిమాన్‌స్ట్రేటర్లు పనిచేస్తున్నారు. 384 మంది విద్యార్థులు, 100 మంది విద్యార్థినులు చదువుతున్నారు. 1951 వరకు మొత్తం 778 మందికి ఈ విద్యాలయం వైద్య విద్యలో తరిఫీదు ఇచ్చింది.

యం.బి.,బి.యస్.పరీక్షలకు విద్యార్థుల తయారు చేయడంతోపాటు, నూరుమంది విద్యార్థులకు శానిటరీ ఇన్‌స్పెక్టర్సు కోర్సు లోను, పదిమందికి ఫార్మసీ కోర్సులోను శిక్షణ ఇవ్వబడుతున్నది.

### గుంటూరు మెడికల్ కాలేజీ, గుంటూరు

ఇది 1946 జులైలో ప్రారంభించ బడింది. 1947లో ఆంధ్రవిశ్వవిద్యాలయా నికి అనుబంధించబడింది.

1950 వరకు ప్రీ రిజిస్ట్రేషన్, మొదటి సంవత్సరం క్లాసులకు మాత్రం, పరీక్షలు ఇచ్చుట జరుపబడుతూ ఉండేవి. ప్రీ రిజిస్ట్రేషను క్లాసులు రద్దయిన తర్వాత, మొదటి సంవత్సరం పరీక్షలు మాత్రమే జరుపబడుతున్నాయి.

ఈకాలేజీ భవననిర్మాణానికి, హాస్పిటలు, ఇతర అవసర నిర్మాణాలకు 150 ఎకరాల స్థలం కొన్నారు.

### గవర్నమెంటు ట్రెయినింగు కాలేజీ, రాజమండ్రి

గోదావరి జిల్లాబోర్డు మామూలు ఎలిమెంటరీ ట్రెయినింగు స్కూలును ప్రారంభించింది. ఏడు సంవత్సరాల తర్వాత ఇది సెకండరీగ్రేడ్ స్కూలుగా అభివృద్ధి చేయబడింది. 1892లో ఈ స్కూలును ప్రభుత్వం తన యాజమాన్యంక్రిందకు తీసికొని, 1894 నుండి యల్. టి. క్లాసులను ప్రారంభించింది.

1926 వరకూ, ఈ కాలేజీ మదరాసు విశ్వవిద్యాలయానికి అనుబంధించబడి ఉంది. ఆంధ్ర యూనివర్శిటీ 1926లో ప్రారంభించబడగానే, ఈ కాలేజీని దీనికి అనుబంధింప చేశారు. అప్పటినుండి బి. యిడి. కోర్సుకూడా ప్రారంభించబడింది.

సెకండరీ ట్రెయినింగు పొందిన విద్యార్థులకు, గ్రాడ్యుయేట్ ట్రెయినింగు ఇచ్చేందుకు తక్కువకాలం కోర్సులు కూడా ఈ విద్యాలయంలో ప్రారంభించబడ్డాయి. 1948లో పండిట్సు ట్రెయినింగు సెక్షను కూడా ప్రారంభించబడింది.

## సెంట్ జోసఫ్సు మహిళా ట్రెయినింగు కాలేజీ, గుంటూరు

ఇది మహిళలకు బి. యిడి. డిగ్రీ కోర్సులో ట్రెయినింగు యిచ్చేందుకు ఆంధ్రలో ప్రారంభించబడిన ప్రథమ ట్రెయినింగు కాలేజీ. 1946లో ప్రారంభించబడింది. బి. యిడి. కోర్సుకు విద్యాబోధన జరుగుతున్నది.

## వ్యవసాయ కళాశాల, బాపట్ల

1945 వ సంవత్సరంలో ప్రారంభించబడింది. 439 ఎకరాల పొలం, 'ఫారం' కొరకు కాలేజీకి సమీపంలో కొన్నారు.

వ్యవసాయ శాస్త్రంలో బి. యస్ సి. డిగ్రీ కోర్సులకు శిక్షణ గరపబడుతున్నది. దిగువ శాఖలకు సంబంధించిన సిద్ధాంతం, ఆచరణా పద్ధతులు బోధించబడుతున్నాయి.

(1) వ్యవసాయం, (2) అగ్రికల్చరల్ బోటనీ, (3) అగ్రికల్చరల్ కెమిస్ట్రీ, (4) అగ్రికల్చరల్ ఎన్టమాలజీ, (5) అగ్రికల్చరల్ ఇంజనీరింగు, (6) ఎనిమల్ హైజీన్.

చేరిన ప్రతి విద్యార్థి విధిగా కాలేజీ హాస్టలులోనే ఉండాలనే నిబంధన ఉన్నది.

శ్రీ జి. వెంకటనారాయణ, బి.ఎస్ సి., గారు ప్రిన్సిపాలు. 1953-54 సంవత్సరంలో 236 మంది విద్యార్థులు, ఒక్క విద్యార్థిని చదువుతున్నారు.

## ఆంధ్ర ఇంజనీరింగు కళాశాల, కాకినాడ

1947 లో స్థాపించబడింది. మొత్తం, ప్రతి విద్యార్థికి 4 సంవత్సరాల శిక్షణ ఇవ్వబడుతుంది. ఈ కాలేజీ గత 6 సంవత్సరాలుగా యుద్ధకాలంలో మిలిటరీవారు వేసిన తాత్కాలిక షెడ్సులోనే వుంటూంది. ప్రస్తుతం అదిపూర్తిగా అనివాస యోగ్యమై, కప్పులు మీద పడేలా ఉన్నాయి. నూతన భవన నిర్మాణానికి అంచనాలు తయారయ్యాయిగాని ఆర్డరు రాలేదు.

సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ శాఖలలో తయారయిన ఇంజనీర్లు దేశంలో అనేకచోట్ల పనిచేస్తున్నారు.

ఈ సంస్థ పరిపూర్ణత్వం పొందటానికి ఇంకా చాలా కృషి చేయాల్సిన అవసరం ఉంది.

## ఇంజనీరింగు కళాశాల, అనంతపురం

ఇది మదరాసు విశ్వవిద్యాలయానికి అనుబంధించబడి వున్నది.

### ఆంధ్ర ఫిజికల్ ట్రెయినింగు కాలేజీ, విజయవాడ

ఆంధ్రలో ప్రప్రథమంగా ప్రారంభించబడిన వ్యాయామ కళాశాలఇదే. ఇది 2-8-1952వ తేదీన ప్రారంభించబడింది.

వ్యాయామ కళాశాల స్థాపించే విషయంలో తీసుకోదగు చర్యలు నిర్ణయించే నిమిత్తం, 14-4-1952న వివిధజిల్లాబోర్డులు, ఇతర ప్రముఖ వ్యక్తుల సమావేశం ఒకటి జరిగింది. మాగంటి శివరామదాసుగారు అధ్యక్షులుగా, అన్ని తెలుగు జిల్లాలనుండి ప్రతినిధులతో 28-4-1952న ఒక కమిటీ ఏర్పాటు చేయబడింది.

ఈ కమిటీ అభ్యర్థన వివరకు ఈ కాలేజీ ప్రారంభించటానికి ప్రభుత్వం అనుమతించింది. ఈ విషయంలో శ్రీ వెన్నా సూర్యనారాయణగారు విశేషంగా కృషిచేశారు.

ఈ కళాశాలలో : (1) గవర్నమెంటు సర్టిఫికేట్, హైయ్యరుగ్రేడు; (2) గవర్నమెంటు సర్టిఫికేట్, లోయరు గ్రేడు కోర్సులు ఉన్నాయి.

ప్రథమ సంవత్సరంలో (1952 - 53) 135 మంది విద్యార్థులు చేరారు.

కాలేజీ మొదటి ప్రిన్సిపాలు శ్రీ మె. కె. సింగు, బి.యె., డి. పి. యిడి., యం. యస్. (చికాగో). వీరు ఈ సంవత్సరం రాజీనామా పెట్టారు.

1953 - 54 సంవత్సరంలో 140 మంది విద్యార్థులు ఈ కళాశాలలో విద్యనభ్యసిస్తున్నారు.

## ప్రాచ్య కళాశాలలు

ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అనుబంధించబడిన ప్రాచ్య కళాశాలలు తొమ్మిది ఉన్నాయి.

### విజయనగర సంస్కృత కళాశాల

దీనిని 1860 లో సర్ విజయరామ గజపతి రాజు గారు ప్రారంభించారు. 1911 లో మదరాసు విశ్వవిద్యాలయం, ప్రాచ్య పరీక్షల ప్రారంభించినపుడు ఈ కళాశాలలో న్యాయ, వ్యాకరణ, శిరోమణి, విద్వాన్ కక్ష్యలు నెలకొల్పబడ్డాయి. 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నెలకొల్పబడటంతో ఈ కళాశాల, ఆ విశ్వ విద్యాలయం కిందకు వచ్చింది.

ఇచ్చట వేదాధ్యయనంజరుపడుతున్నది. ఇటీవల జ్యోతిషంకూడా ప్రారంభించారు.

### కోట లక్ష్మయ్యనాయుడు సంస్కృత కళాశాల, తెనాలి

ఇది మొదట కొల్లూరులో పాఠశాలగా ప్రారంభించబడింది. 1910 లో తెనాలికిమార్చబడింది. 1912లోమదరాసు విశ్వవిద్యాలయం, కళాశాలగా దీన్ని గుర్తించింది.

### నారసింహ సంస్కృత కళాశాల, చిట్టిగూడూరు

1923వ సంవత్సరం జూలై లో ప్రారంభించబడింది. జాతి, కుల, మత, వివక్షత

లేకుండా అందరికీ ప్రవేశావకాశం కల్పించబడింది.

### వేద, సంస్కృతపాఠశాల, నెల్లూరు

1926 వ సంవత్సరంలో ప్రారంభించబడింది. ప్రస్తుతం నూరుమంది విద్యార్థులు చదువుతున్నారు.

### ఆంధ్ర మహిళా సంస్కృత పాఠశాల, రాజమండ్రి

రాజమండ్రి వైశ్య సదనానికి అనుబంధ కళాశాలగా ఇది 1931 లో ప్రారంభించబడింది. దీనిలో ప్రాచ్య పరీక్షలకే కాక, దక్షిణ భారత హింది ప్రచార సభ పరీక్షలకు కూడా విద్య గరపబడుతున్నది.

### వాడ్రేవు భోగమ్మ వేద, సంస్కృత కళాశాల, కొవ్వూరు

ఇది 1912వ సంవత్సరం అక్టోబరుమాసములో ప్రారంభించబడింది. ఈ కళాశాల విద్వాన్, శిరోమణి కోర్సులను మదరాసు విశ్వవిద్యాలయం గుర్తించింది. 1926 లో ఆంధ్ర యూనివర్శిటీ ప్రారంభించబడగానే ఉభయ భాషాప్రవీణ, విద్యాప్రవీణ కోర్సులను గుర్తించింది.

### శ్రీ శారదా నికేతనం, గుంటూరు

1922లో ఉన్నవ లక్ష్మీనారాయణ దంపతులచే ప్రారంభించబడింది. దీనిలో సంస్కృతం, హిందీ, తెలుగు, కుట్టుపని, లెక్క, సంగీతం మున్నగువాటిలో బాలికలకు శిక్షణ ఇవ్వబడుతున్నది. దీనిలోని వివిధ కోర్సులు ఆంధ్ర, మదరాసు విశ్వవిద్యాలయాలు గుర్తించాయి.

60 మంది విద్యార్థినులకు సరిపడే వసతి గృహమున్నది.

### భావన్నారాయణ సంస్కృత కళాశాల, పొన్నూరు

భావన్నారయణ దేవాలయ ధర్మకర్తలు, ఈ కాలేజీని 1950 లో ప్రారంభించారు. ఈ కళాశాలలోని సాహిత్య, విద్యాప్రవీణ, భాషాప్రవీణ కోర్సులు ఆంధ్ర విశ్వ విద్యాలయంచేత గుర్తించబడ్డాయి.

### మహారాజ సంగీత కళాశాల, విజయనగరం

1919 సం॥ ఫిబ్రవరి 5 వ తేదీన సర్ విజయరామగజపతిరాజుగారు దీనిని ప్రారంభించారు. ఇది మదరాసు రాష్ట్రంలో ప్రారంభించబడిన మొదటి సంగీత కళాశాల.

ఈ కాలేజీ ప్రారంభించబడినప్పటి నుండీ శ్రీ ద్వారం నాయుడుగారు, వయొలిన్ ప్రొఫెసరుగా పనిచేస్తూ వచ్చారు. 1936 లో వీరు కాలేజీ ప్రిన్సిపాలుగా నియమించబడ్డారు.

ఈ కళాశాలలో ఫిడేలు, వీణ, మృదంగం, భరతనాట్యం, గాత్రసంగీత (Vocal) విద్యలలో శిక్షణ ఇవ్వబడుతున్నది.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ సిండికేట్ సభ్యులు

ఎక్సఫిషియో మెంబర్లు

1. డాక్టరు వి. యస్. కృష్ణ బి. ఏ. (ఆక్స్ఫర్డ్).. పిహెచ్. డి. (వియన్నా) వైస్ ఛాన్సెలర్.

2. శ్రీ యస్. గోవిందరాజులు నాయుడు, బి. యె., బి. యల్., etc., డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్ర.

3. శ్రీ వి. కె. రావు, ఐ. సి. ఎస్., ఫైనాన్సు, కమర్షియల్ టాక్సుసు శాఖ కార్యదర్శి, గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్ర.

సెనెట్ రిప్రజెంటెటివులు

(11-12-1953 నుండి)

1. డాక్టరు లక్కరాజు సుబ్బారావు, బి. యె., బి. యల్., కాకినాడ.

2. శ్రీ యం. ఆర్. అప్పారావు, యం. యే., యం. యల్. యే. నూజివీడు.

3. డాక్టరు బొడ్డపాటి తిరుమలరావు, యల్. యమ్. యస్., యల్. ఆర్.సి.పి.యస్; (etc) విశాఖపట్టణం.

4. శ్రీ బి. వి. శ్రీహరిరావునాయుడు బి. యె., బి. యల్., ఇన్‌స్పెక్టరు జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషను (రిటైర్డు) మదరాసు.

5. శ్రీ కందాళ సర్వేశ్వరశాస్త్రి బి. యే., బి. యల్., వాల్తేరు.

ఎకడమిక్ కౌన్సిలు

రిప్రజెంటెటివులు

(2-12-1953 నుండి)

1. డాక్టరు యస్. యన్. గనశాయత్ యం. బి., బి. యస్., డి. ఓ., ఆంధ్ర మెడికల్ కాలేజీ, విశాఖపట్నం.

2. డాక్టరు యె. యన్. నారాయణ్ యం. యే, డి. యస్‌సి., యఫ్. ఐ. సి, విజయనగరం యం. ఆర్. కాలేజీ ప్రిన్సిపాలు.

3. శ్రీ వి. సుబ్బారావు, బి. యె. (ఆనర్సు)., హిందూకాలేజీ ప్రిన్సిపాలు, గుంటూరు.

ఛాన్సలర్ చేత

నామినేటు చేయబడినవారు

(17-11-1953 నుండి)

1. విశాఖపట్టణం జిల్లా కలెక్టరు.

2. డాక్టరు యం. వి. కృష్ణారావు, బి. యె., యం. బి.,బి. యస్., మదరాసు.

3. జనాబ్ మహమద్ రఫీయుద్దీన్ అహమద్ అన్సారీ, బి. యే., బి. యల్., పబ్లిక్ ప్రాసిక్యూటర్, నెల్లూరు.

## ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యులు

1. శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేది, ఆంధ్ర గవర్నరు, ఛాన్సలర్.

2. శ్రీ బి. గోపాలరెడ్డి, ప్రో-ఛాన్సలర్, నెల్లూరు.

3. డాక్టరు వి. యస్. కృష్ణ బి. యె. (ఆక్సన్); పి. హెచ్. డి. (వియన్నా); వైస్-ఛాన్సలర్, వాల్తేరు.

4. శ్రీ యస్. గోవిందరాజులు నాయుడు, బి. యే, యల్ యల్. బి. (ఆనర్సు); డైరెక్టర్, ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్, గవర్నమెంటు ఆఫ్ ఆంధ్ర.

5. లెఫ్టినెంటు కలనల్ రామమూర్తి యమ్. బి., బి. యస్., యఫ్. ఆర్. సి. యస్., డైరెక్టర్ ఆఫ్ మెడికల్ సర్వీసు, గవర్నమెంటు ఆఫ్ ఆంధ్ర.

6. శ్రీ కె. సుబ్రహ్మణ్య నాయుడు, డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ అండ్ కామర్సు, గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్ర.

7. శ్రీ యమ్. కాంతిరాజు, డైరెక్టర్ ఆఫ్ అగ్రికల్చర్ అండ్ ఫిషరీస్, గవర్నమెంట్ ఆఫ్ ఆంధ్ర.

8. ప్రొఫెసర్ రంగధామరావు, యం. యే., డి. యస్ సి. (మదరాసు); డి. యస్‌సి. (లండన్); యూనివర్సిటీ కాలేజీల ప్రిన్సిపాలు, ప్రొఫెసరు.

9. డాక్టరు సి. భాష్యకర్లరావు, యం. యస్ సి. (బెన్); యల్.టి (మదరాసు); పి హెచ్. డి. (లండన్); డిప్. కామ్ (బర్మింగ్ హామ్); గవర్నమెంటు ట్రయినింగు కాలేజీ ప్రిన్సిపాలు, రాజమండ్రి.

10. సిస్టర్ మేరీ స్టానిస్ లాస్, బి. యే., యల్. టి., సెంట్ జోసఫ్స్ మహిళా ట్రయినింగు కాలేజీ, గుంటూరు.

11. డాక్టరు యమ్. డి. అనంతాచారి, యమ్. డి., ఆంధ్రా మెడికల్ కాలేజీ ప్రిన్సిపాలు, విశాఖపట్నం.

12. డాక్టర్ మిసెస్ సారా కె.శాస్త్రి, యమ్. బి., బి. యస్., డి. జి. ఓ., పి హెచ్. డి., గుంటూరు మెడికల్ కాలేజీ ప్రిన్సిపాలు.

13. శ్రీ జి. వెంకట నారాయణ, బాపట్ల అగ్రికల్చరల్ కాలేజీ ప్రిన్సిపాలు.

14. ప్రొఫెసర్ ఆర్. నటేశన్, బి. యి., కాకినాడ ఇంజనీరింగు కాలేజీ ప్రిన్సిపాలు.

15. శ్రీ యె. యస్. త్యాగరాజు, యం. యే., పిఠాపురంరాజా కాలేజీ ఆఫీషియేటింగు ప్రిన్సిపాలు, కాకినాడ.

16. రావు సాహెబ్ డాక్టరు టి. యస్. పాలస్, యమ్. యే., యల్ యల్. డి., గుంటూరు క్రిష్టియన్ కాలేజీ ప్రిన్సిపాలు.

17. డాక్టరు యమ్. కాశీనాథ శాస్త్రి, యమ్. యే., డి. యస్ సి. మచిలీపట్నం హిందూ కాలేజీ ప్రిన్సిపాలు.

18. శ్రీ కె. సచ్చిదానందంపిళ్ళె యమ్. యే., యల్. టి., నెల్లూరు వి.ఆర్. కాలేజీ ప్రిన్సిపాలు.

19. శ్రీమతి టి. వసుంధర, బి. యే., (ఆనర్సు) (మదరాసు); బి. యస్‌సి. (ఆనర్సు) (లండన్); యల్. టి. రాజమండ్రి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీ ప్రిన్సిపాలు.

20. శ్రీ వి. యస్. సోమయాజీ, బి. యస్‌సి. (ఆనర్సు); విశాఖపట్నం మిసెస్ యే. వి. యన్. కాలేజీ ప్రిన్సిపాలు.

21. డాక్టరు యె.యల్. నారాయన్ యమ్. యే., డి. యస్‌సి., యఫ్. ఐ. పి., విజయనగరం మహారాజాస్ కాలేజీ ప్రిన్సిపాలు.

22. శ్రీ యమ్. రాఘవాచార్యులు, యమ్. యస్. సి., విజయవాడ యస్. ఆర్. ఆర్. అండ్ సి. వి. ఆర్. కాలేజీ ప్రిన్సిపాలు.

వాల్తేరు జె. వి. డి. కాలేజీ ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీలో కెమికల్ టెక్నాలజీకి హెడ్ ఆఫ్ ది డిపార్టుమెంటు, ప్రొఫెసరు.

44. ప్రొఫెసరు యస్. రంగస్వామి, యమ్. యే., పిహెచ్. డి., డి. ఫిల్ etc., వాల్తేరు జె. వి. డి. కాలేజీ ఆఫ్ సైన్సు అండ్ టెక్నాలజీలో ఫార్మసీ ప్రొఫెసరు.

45. ప్రొఫెసరు జి. గోపాలరావు, యమ్. యస్ సి., డి. యస్ సి., (అలహాబాదు); ఎ. ఐ. సి. (లండన్)., పై కాలేజీలో కెమిస్ట్రి ప్రొఫెసరు.

46. ప్రొఫెసరు బి. హెచ్. యస్. వి. రాఘవరావు, యమ్. యె., పిహెచ్. డి. (లండన్)., పై కాలేజీలో కెమిస్ట్రి ప్రొఫెసరు.

47. ప్రొఫెసరు సి. మహదేవన్, యమ్. యె., డి. యస్ సి., యఫ్. ఎ. యస్ సి., వాల్తేరు ఎర్స్కిన్ నాచురల్ సైన్సు కాలేజీలో జియాలజీ ప్రొఫెసరు.

48. ప్రొఫెసరు జె. వెంకటేశ్వర్లు, యమ్. యస్ సి., డి. యస్ సి., పిహెచ్. డి. (కాంటబ్)., పై కాలేజీలో బాటని ప్రొఫెసరు.

49. ప్రొఫెసరు పి. యన్. గణపతి, యమ్. యస్ సి., డి యస్ సి., యూనివర్సిటీ కాలేజీలో జూఆలజీ ప్రొఫెసరు.

50. ప్రొఫెసరు సైలేశ్వర సేన్, యం. యె.; డి. లిట్., డి. ఫిల్., యూనివర్సిటీ ఆర్ట్సు అండ్ కామర్సు కాలేజీలో ఫిలాసఫీ ప్రొఫెసరు.

51. ప్రొఫెసరు జి. వెంకటరావు, యం. యె., యల్. యల్. బి., పై కాలేజీలో హిస్టరీ ప్రొఫెసరు.

52. ప్రొఫెసరు యన్. శ్రీనివాసన్ యం. యే. (ఆనర్సు) (మదరాసు); బి. యస్ సి. (ఎకనామిక్సు), (లండన్); యూనివర్సిటీ కాలేజీలలో ఎకనామిక్సు ప్రొఫెసరు.

53. ప్రొఫెసరు హెచ్. కె. దత్తా, యం, యె., యూనివర్సిటీ ఆర్ట్సు అండ్ కామర్సు కాలేజీలో అక్టింగు ప్రొఫెసరు.

54. ప్రొఫెసరు కె. ఆర్. శ్రీనివాస అయ్యంగారు, యం.యె., డి.లిట్., పై కాలేజీలో ఇంగ్లీషు ప్రొఫెసరు.

55. ప్రొఫెసరు జి. జె. సోమయాజి, విద్వాన్, యం. యె., యల్. టి., పి.ఓ.యల్., యూనివర్సిటీ కాలేజీలలో తెలుగు ప్రొఫెసరు.

56. ప్రొఫెసరు యస్. వెంకటరామన్ బి. ఎ., యం. యల్., యూనివర్సిటీ కాలేజీలో ప్రొఫెసరు ఆఫ్ 'లా'.

57. శ్రీ వి. కె. రావు, ఐ. సి. యస్; ఆంధ్ర ప్రభుత్వ ఫైనాన్సు శక్రెటరీ.

58. శ్రీ. ఏ. యల్. గవాన్, ఐ. సి. యస్, విశాఖపట్నంజిల్లా కలెక్టరు.

59. డాక్టరు యం. వి. కృష్ణరావు, బి. ఏ., యం. బి., బి. యస్., 50, IV మైన రోడ్డు మదరాసు – 20.

60. జనాబ్ మహమద్ అన్సారీ, బి. యె., బి. యల్., పబ్లిక్ ప్రాసిక్యూటరు, నెల్లూరు.

61. డాక్టరు యస్. యన్. గనతాయక్, యం. బి., బి.యస్.,డి.ఓ., ఆంధ్ర మెడికలు కాలేజీ, విశాఖ పట్నం.

62. ప్రొఫెసరు యస్. రాధాకృష్ణన్ యం. ఏ. (ఆనర్సు); డి. లిట్ (ఆంధ్ర);

ఆనరరి యల్ యల్. డి. (అలహాబాదు); యఫ్. బి. ఏ., భారత రిపబ్లిక్ ఉపాధ్యక్షులు.

63. డాక్టరు లక్కరాజు సుబ్బారావు, బి. యే., బి. యల్., కాకినాడ.

64. హిజ్ హైనెస్ శ్రీ పద్మనాభదాస వంచిపాల శ్రీ బలరామవర్మ కులశేఖర, కిరీటపతి, మన్నెసుల్తాన్, మహారాజరాజ రామరాజ బహదూర్ షంషేర్ జంగ్, నైట్ గ్రాండ్ కమాండర్ ఆఫ్ ది మోస్టు ఎమినెంట్ ఆర్డరు ఆఫ్ ది ఇండియన్ ఎంపైర్, ఆనరరీ డి. లిట్. (ఆంధ్ర); మహారాజ ఆఫ్ తిరువాన్కూరు.

65. హర్ హైనెస్ మహారాణి సేతు పార్వతీబాయి ఆఫ్ తిరువాన్కూరు, ఆనరరీ డి. లిట్ (ఆంధ్ర); త్రివేంద్రం.

66. శ్రీ యార్లగడ్డ రామనాధబాబు, కారంచేడు, గుంటూరు జిల్లా.

67. శ్రీ ముళ్ళపూడి హరిశ్చంద్ర ప్రసాద్, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా.

68. శ్రీ వై. అబద్ధయ్య, బి. యే., గుంటూరు.

69. డాక్టరు బి. తిరుమలరావు, యమ్. యస్., యఫ్. ఆర్. సి. పి. యస్. etc., విశాఖపట్టణం.

70. శ్రీ ఆర్. సుబ్బయ్య, బి.యస్‌సి. (ఆనర్సు); చీరాల వి. యస్. ఆర్. కాలేజి వైస్ ప్రిన్సిపాలు.

71. శ్రీ కొల్లిపర వెంకట రమణయ్య బి. యే., బి. యల్., ప్లీడరు మచిలీపట్నం

72. శ్రీ పి. వి. సుబ్బారావు బి.యే., బి. యల్., వేజెండ్ల, గుంటూరుజిల్లా.

73. శ్రీ యస్. సి. కృష్ణయ్య, యం. యె., యల్. టి., 14, గిరి రోడ్డు మదరాసు-17.

74. శ్రీ యం. ఆర్. అప్పారావు, యం. యే., యం. యల్. ఏ., ఉయ్యూరు జమీందారు, నూజివీడు, కృష్ణాజిల్లా.

75. శ్రీ వి. సీతాపతిరావు, బి. యే., బి. యల్., అడ్వొకేట్, రాజమండ్రి.

76. శ్రీ ఎ. వెంకటరామయ్య, బి. యస్ సి. (ఆనర్సు); బి. యిడి., రాజమండ్రి ఆర్ట్సు కాలేజీలో అసిస్టెంటు లెక్చరర్.

77. శ్రీ జొన్నాల విశ్వనాథశాస్త్రి, యం. యే., మండపలి, మదరాసు.

78. శ్రీ వి. రామలింగేశ్వరరావు, బి. యల్., ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా.

79. శ్రీ గొంటి పురుషోత్తం, యం. యే., విశాఖపట్నం.

80. శ్రీ సుందేశ్ తులసిదాసు, బి.యె., బి. యల్., రిటైర్డు సబార్డినేట్ జడ్జి, మదరాసు.

81. శ్రీ పక్కలంక శ్రీ వెంకటేశ్వరరావు, యం. యస్ సి., హెడ్ ఆఫ్ ది జూఆలజీ డిపార్టుమెంటు, విశాఖపట్నం.

82. శ్రీ కందాల సర్వేశ్వరశాస్త్రి, బి. యె., బి. యల్., వాల్తేరు.

83. శ్రీ వి. సర్వేశ్వరరావు, యం. యె., యూనివర్శిటీ కాలేజిలో ఎకనామిక్స్ లెక్చరరు.

84. శ్రీ వి. నారాయణరావు, యం. యే., కాకినాడ పి. ఆర్. కాలేజీలో హిస్టరీ లెక్చరరు.

85. శ్రీ పి. సుబ్బారావు, యం. యే., సర్ సి. ఆర్. ఆర్ కాలేజీలో హెడ్ ఆఫ్ ది మేథమాటిక్స్ డిపార్టుమెంటు, ఏలూరు.

86. శ్రీ సి. వి. కే. రావు, యం. యల్. యే. కాకినాడ.

87. శ్రీ టి. నాగిరెడ్డి, యం. యల్. యే. అనంతపురం.

88. శ్రీ పులుపుల వెంకటశివయ్య, యం. యల్. యే. వినుకొండ.

89. శ్రీ యం. నరసింహారావు, యం. యే., యల్. టి., గన్నవరం బోర్డు హైస్కూలు హెడ్ మాస్టరు.

90. శ్రీ యే. రామకృష్ణరావు, యం. యే, యల్. టి. రేపల్లె బోర్డు హైస్కూలు హెడ్ మాస్టరు.

91. ఎ. వి. యన్. జగ్గారావు, మునిసిపల్ కౌన్సిలరు, విశాఖపట్నం.

92. శ్రీ ఆర్. యల్. నరసింహం, జిల్లాబోర్డు ప్రెసిడెంటు, శ్రీకాకుళం.

93. శ్రీ యం. ఉపేంద్రశర్మ, యం. యే., గుంటూరు హిందూ కాలేజీ లెక్చరరు.

94. శ్రీ మల్లంపల్లి వీరేశ్వర శర్మ, భాషాప్రవీణ, చిట్టిగూడూరు నరసింహ సంస్కృత కళాశాల.

95. మహమ్మద్ అబ్దుల్ సత్తారు. మున్షి - ఇ - ఫజిల్, గుంటూరు ఎ. సి. కాలేజి.

96. శ్రీ ఉభయభాషా ప్రవీణ, గంగాధర పాండా, సీనియర్ ఒరియా భాషా పండితులు, యస్. ఆర్. యస్. యం. బోర్డు హైస్కూలు, మందసా, శ్రీకాకుళం జిల్లా.

97. శ్రీ సి. అన్నారావు, బి. యె., కమీషనర్, తిరుపతి దేవస్థానం, తిరుపతి.

98. దివాన్ బహదూర్ బి. వి. శ్రీహరిరావు నాయుడు, బి. యె., బి. యల్. ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్ (రిటైర్డు), మదరాసు-17.

99. శ్రీ సి. ప్రసాదరావు, యఫ్. సి. యె., ఛార్టర్డు ఎక్కౌంటెంటు, యూనివర్సిటీ కాలజీ, వాల్తేరు.

100. కలనల్ టి. వి. రాజన్, బి.యే., బి. కామ్. (ఎడింబరో)., జిల్లా ఛీఫ్ ఎక్జిక్యూటివ్ ఆఫీసరు, న్యూఢిల్లీ.

101. శ్రీ పి. రామస్వామినాయుడు, యం. యే. (ఆనర్సు); జిల్లా బోర్డు మెంబరు, శ్రీకాకుళం.

102. శ్రీ యం. నరసన్న, బి.యే., రాజమండ్రి.

## ఛాన్సలరుచేత నామినేటు చేయబడ్డ సభ్యులు

103. శ్రీ యల్.బుల్లయ్య,యం.యే., బి. యిడి., డివిజనల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు; అనంతపురం.

104. శ్రీ బి. శేషన్న, బి. యే., బి యిడి., ఆంధ్రప్రభ ఆఫీసు, మదరాసు.

105 శ్రీ వి. యస్. కేశవరావు, బి. యే., ఒంగోలు.

106. శ్రీ యం. వి. గంగాధరశివ, రాయచోటి, కడప జిల్లా.

107. శ్రీ రామకృష్ణదేవ్, జయపూర్ రాజా, జయపూర్, ఒరిస్సా.

108. ఉభయ భాషా ప్రవీణ ఉటుకూరు లక్ష్మీకాంతమ్మ, చీరాల(గుంటూరు జిల్లా).

109. శ్రీమతి బి. నవరత్నవీరాస్వామి యం. యె., అసిస్టెంటు ఉమన్సు వెల్ఫేర్ ఆఫీసరు, కడప.

110. జనాబ్ సయ్యద్ అహమద్, యం. యె., మునిసిపల్ కమిషనరు, భీమునిపట్నం, విశాఖపట్నంజిల్లా.

111. శ్రీ క. రా జ మ న్నా రు. యం. యే., బి. యిడి., రాజమండ్రి గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలో తెలుగు లెక్చరరు.

112 శ్రీ బి. యస్. సంజీవరెడ్డి, యె. ఐ. యస్. యం., యం. యస్‌సి. (కొలరాడో)., జియోఫిజిస్టు, మైనింగుఇంజనీరు, బేతంచెర్ల, కర్నూలుజిల్లా.

113. శ్రీ జి. హరిసర్వోత్తమరావు, యం. యే., గోపాలపురం, మదరాసు-6

114. శ్రీ యస్. సుబ్బరాయుడు శాస్త్రి, యస్. యస్. యన్. కాలేజీ కరస్పాండెంటు, సెక్రెటరీ,నరసరావుపేట.

115. శ్రీ పా ము ల పా టి బుచ్చి నాయుడు,నిడుబ్రోలు.

116. జిల్లెళ్ళ వెంకటభానోజీరావు మూర్సు, లాండు లార్డు, పేరూరు, తూర్పుగోదావరి జిల్లా.



# వ్యాయామ కళ


## శ్రీ కొల్లి రంగదాసు చౌదరి

(డైరెక్టర్, స్వేచ్ఛానగర్ ప్రకృతి చికిత్సాలయం)


ప్రాచీన కాలం నుండి ఆంధ్రదేశంలో వ్యాయామ కళ ఒక ఉత్తమ కళగా పరిగణింపబడుతున్నది. శాలివాహన రాజులు వ్యాయామ కళను పోషించినట్లు చరిత్రను బట్టి తెలుస్తున్నది. శ్రీకృష్ణ దేవరాయల పోషణ క్రింద వ్యాయామ కళ బహుళ వ్యాప్తి చెందింది. కృష్ణదేవరాయలు ప్రతిదినము శ్రద్ధగా వ్యాయామం చేసేవారు. వారు వ్యాయామం చేసిన పరికరాలు నేటికీ హంపి, విజయనగర శిథిల నగరాలలో చూడవచ్చు.

ప్రాచీన కాలంలో రాజులు, జమీందారులు, పెద్ద పెద్ద భూస్వాములు వ్యాయామకళను పోషించేవారు. ఇప్పుడు పోషణలేక ఆంధ్రలో వ్యాయామ కళకు అంతగా ప్రోత్సాహం లభించడంలేదు.

మన రాష్ట్రంలో చాలమంది పురాతన పద్ధతులలో తాలింఖానాలను స్థాపించి, వ్యాయామ కళావ్యాప్తికి తోడ్పడుతున్నారు. ఈ తాలింఖానాలలో దండేలు, బస్కీలు మాత్రం నేర్పుతారు. దండేలు, బస్కీలలో శరీర బరువునకు యితర రకాలైన బరువునుగాని, శక్తిగాని జోడించడానికి వీలులేకపోవడంవల్ల శరీరసౌష్ఠవం, బలమూ పెంపొందడానికి వీలులేదు. కాని ఓర్పుమాత్రం అద్భుతంగా అభివృద్ధి చెందుతుంది. బలమూ, శరీర సౌష్ఠవమూ, ఓర్పు, పెరగడానికి బార్ బెల్ వ్యాయామం తోడ్పడినట్లు యేదీ తోడ్పడదు. దీనికి సాటిలేదు. ఇది విదేశీయ విధానం కాని, దేశీయ విధానం కాదనే దురభిప్రాయం చాలమందిలో వుంది. కాని యీ విధానం భారత, చైనా దేశాలలో వేల సంవత్సరాల నుండి అమలులో వుంది. విజయనగర ప్రాంతంలోని ప్రతి తాలింఖానాలోను కానవచ్చే సంగడీలతో చేసే వ్యాయామం, బార్ బెల్ వ్యాయామాన్ని పోలినదే. ఈ సంగిడీలను మెడమీద వుంచుకుని గుంజీలు తీయడం ద్వారా శరీర బలాన్ని పెంపొందించుకోవచ్చు. అంతర్జాతీయ ప్రఖ్యాతిగాంచిన గామా, ఇమాం బక్షు మొదలైన భారతీయ మల్లయుద్ధ విశారదులు, ఈ సంగిడీల వ్యాయామంతోనే బలాన్ని పెంపొందించుకొన్నారు. యూరపు దేశీయులు, అమెరికావారు ఈ విధానాన్ని మన దేశాన్నుండి గ్రహించి శాస్త్రీయపద్ధతులలో అభివృద్ధిచేసారు. ఇదే బార్ బెల్ విధానం. ప్రస్తుత మీ విధానమంత ఉచ్ఛస్థితిలో ఏ విధానమూ లేదు. ఈ విధానం అభివృద్ధి చెందిన కొలది, మిగతా విధానాలు క్షీణించుచున్నవి. మనదేశంలోని యువకులుకూడ ఈ విధానాన్ననుసరించి తమ శరీరసౌష్ఠవాన్ని, ఆరోగ్యాన్ని పెంపొందించుకుని దేశసౌభాగ్యానికి తోడ్పడుదురుగాక!

## కోడి రామమూర్తి

మన ఆంధ్రలో వ్యాయామ కళాభివృద్ధికి తోడ్పడిన వారిలో ప్రథములు కీ॥ శే॥ కోడిరామమూర్తిగారన్న యెంత మాత్రము అతిశయోక్తి కాజాలదు. వీరు షుమారు 1880వ సంవత్సరములో విజయనగరమునకు సమీపమునన్నున్న వీరిఘట్టమను గ్రామములో జన్మించారు. వీరు మూడవ ఫారమ్ వరకు చదివి, మద్రాసు వెళ్ళి, సైదాపేటలోనున్న డ్రిల్ మాష్టర్ల (వ్యాయామ) కళాశాలలో వ్యాయామ విద్యనభ్యసించి, పరీక్షలో ఉత్తీర్ణులై ఆ కాలేజిలోనే వ్యాయామకళ అధ్యాపకులుగా కుదిరారు. ఆ సమయంలో వీరికి తుని మహారాణి కొలువులో పనిచేయుచున్న పొట్టిపంతులు గారితో స్నేహము కుదిరింది. అప్పుడు మద్రాసు, ముష్టియుద్ధమునకు పేరెన్నిక గన్నది. రామమూర్తి నాయుడుగారికి కూడా ముష్టియుద్ధములో ఆసక్తి కలిగి, దానిని బహుళ ప్రయాసతో అభ్యసించి, పోటీలలో పాల్గొని విజయము పొందారు. ముష్టియుద్ధ పోటీలలో జయించినప్పుడెల్ల పొట్టి పంతులుగారి వద్దకు వెళ్ళి చెప్పుచుండెడివారు. పొట్టిపంతులుగారు, నాయుడుగారితో యూరప్ ఖండములో యూజెన్ శాండో యను ప్రఖ్యాత జర్మన్ బలాఢ్యుడు బలప్రదర్శనములు చేయుచున్నాడని, అటువంటి వానికంటె మిన్నయైన బలప్రదర్శనములు చేసిన పేరుప్రఖ్యాతులు పొందగలవని చెప్పారు. ఆ మాటలతో నాయుడు గారికి యెంతయో ఉత్సాహం కలిగి, ఆ బలప్రదర్శనలన్నియు శ్రద్ధతో పరిశ్రమ చేసి, ప్రతి బలప్రదర్శనము నందును శాండోను మించిపోగలిగారు.

ఒకనాడు వీరు పొట్టి పంతులుగారి వద్దకు వెళ్ళి, యీ అద్భుత ప్రదర్శనము లన్నియు వారి యెదుట ప్రదర్శించి వారి మెప్పును బడసిరి. ఈ ప్రదర్శనములు చూచిన తర్వాత నాయుడుగారిపై పొట్టి పంతులుగారికి యెంతయో ప్రేమ కలిగి, చిన్న సర్కస్ నడుపుటకు వారికి తుని మహారాణీగారిచేత సహాయము చేయించిరి. పొట్టి పంతులుగారు తనతో వచ్చిన యెడల, యీ సర్కస్ నడుపుదునని చెప్పగా పంతులుగారు అందుల కంగీకరించిరి.

ఒకనాడు వీరు ఒక గ్రామములో ఉండగా తుపాను వచ్చినది. ఏనుగు త్రెంచుకొని నాయుడుగారున్న గుడారము పడిపోగా దానిని త్రొక్కుచూ పారిపోయెను. ఈ దృశ్యమును చూచి పొట్టి పంతులుగారు నాయుడుగారుచనిపోయెనని భయపడి ఆ గుడారము వద్దకు వెళ్ళగా, నాయుడుగారు రొమ్ములో నొప్పిగానున్నదని చెప్పుచూ యెదురుగా వచ్చిరి. ఏనుగు త్రొక్కుట వల్లనే యిది సంభవించినదని గ్రహించి, అప్పటినుండి రొమ్ముమీద ఏనుగును యెక్కించుకొని అను బలప్రదర్శనమును చేయుట ప్రారంభించిరి.

వీరు ఈవిధముగా యీ చిన్న సర్కస్‌తో పర్యటన చేయుచుండగా, యూజెన్ శాండో బలప్రదర్శనము లిచ్చుటకు మన దేశము వచ్చారు. 1907వ సంవత్సరములో శాండో మద్రాసు వచ్చి, ఇండియాలో యెవరైనను తనతో పోటీచేసి జయించిన యెడల గొప్ప బహుమానం యివ్వగలనని ప్రకటించారు. నాయుడుగారు ఆసవాలునుఅంగీకరించగా, శాండో

గారు తోకగ్గుూడించి మనదేశ పర్యటన మానుకొని, యూరప్ ఖండమునకు తిరోగాములైరి. తర్వాత నాయుడు గారు యూరప్ పర్యటనకు బయలుదేరి మొదట ఇంగ్లండు వెళ్ళారు. అక్కడ నాయుడు గారు సవాల్ చేయగా, ఇంగ్లండులోకెల్ల బలాఢ్యులైన థామస్ యించ్, ఎక్సర్డు ఈస్టన్ అనువారలు కొరిసవాలును అంగీకరించి, తర్వాత రామమూర్తిగారి అమోఘ బలమును గుర్తించి పలాయనం చిత్తగించారు.

వీరు యూరప్ ఖండమంతయు పర్యటన చేసి, అక్కడ బలాఢ్యులందరిని జయించి అఖండ కీర్తితో భారతదేశమునకు తిరిగివచ్చిరి. ఒకప్పుడు వీరి సర్కస్ ప్రపంచములోకెల్ల గొప్పదిగా పరిగణింప బడినదన్న, వీరుదానిని ఎంత అభివృద్ధి చేసిరో మనం తెలుసుకోవచ్చును. నాయుడుగారు వారిజీవితంలో కొన్ని లక్షలు సంపాదించి, అందులో యెక్కువ భాగము ధర్మము చేశారు. వీరుచివరిదశలో ఆరోగ్యమును కోల్పోయి, తిండికికూడా జరుగుట కష్టమైనది. ఆసమయములో ఆంధ్ర దేశమునకేకాక హిందూదేశ మంతటికి అఖండ కీర్తిని చేకూర్చిన యీ మహా వ్యక్తిని పోషించుటకు ఆంధ్రదేశములో ఒక్కరూ లేకపోయారు. వీరు పడు బాధలు తెలుసుకొని, మాలవ్యాగారు వీరిని బెనారస్ పిలిపించి, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయములో గౌరవ వ్యాయామ అధ్యాపకులుగా నియమించి, వారికి కావలసిన వసతులన్నియు కల్పించారు. వీరు చివరదశయంతయు అచ్చటనే గడపి షుమారు 1938 వ సంవత్సరములో పరమపదించారు. వీరితర్వాత వీరి శిష్యులు మన ఆంధ్రదేశములో పలుతావుల వ్యాయామశాలలు స్థాపించి, పూర్వపద్ధతులతో వ్యాయామ కళను పెంపొందించుటకు కృషి చేయుచున్నారు.

## కోళ్ళ సీతారామయ్యనాయుడు

రామమూర్తిగారి శిష్యులలోముఖ్యులు శ్రీ కోళ్ళ సీతారామయ్య నాయుడుగారు. వీరు 1895 వ సంవత్సరములో కాకినాడ సమీపమునున్న తాళ్ళరేవులో జన్మించారు. వీరు భారతదేశములో అనేక వ్యాయామ క్రీడలలో పాల్గొని, జయము పొంది ఆంధ్రులకు గౌరవము చేకూర్చారు. వీరు పలు ప్రదేశములందు బలప్రదర్శనములు యిచ్చి, వ్యాయామ కళను వ్యాప్తి చేయుటలో చాలా కృషిచేసినారు. ప్రస్తుతము తూర్పు గోదావరిజిల్లా రెడ్ క్రాస్ పశువైద్యకేంద్రం, హరిజన వసతిగృహము మొదలగు ధర్మసంస్థలకు అధ్యక్షులుగా నుండి ప్రజాసేవ చేయుచున్నారు.

వీరువ్యాయామకళాభివృద్ధికియెంతయో తోడ్పడుచున్నారు. వీరి వయస్సు ప్రస్తుతము 58 సంవత్సరములు ఉన్నప్పటికి, వీరు యిప్పటికి కూడా యెంతయో బలముగాను, ఆరోగ్యవంతులుగాను ఉన్నారు. వీరు యిప్పటికి కూడా రెండు కాయల నాపుట, రోడ్ రోలర్ ను రొమ్ము మీద పోనిచ్చుట మొదలైన బలప్రదర్శనములను సునాయాసముగా చేయగలరు.

కోడిరామమూర్తి గారి శిష్యులలో శ్రీ కోళ్ళ సీతారామయ్య నాయుడు గారి తర్వాత పేర్కొనదగ్గవారు పైడిరాజు గారు. వీరు విజయనగర వాస్తవ్యులు. వీరు రామమూర్తినాయుడుగారుచేసిన బల ప్రదర్శనములలో ఏనుగును ఆపుట,

రోడ్ రోలర్‌ను రొమ్ముమీదగా పోనిచ్చుట మొదలగు బల ప్రదర్శనములు చేయుచూ భారతదేశమంతటా పర్యటన చేసి, ఆంధ్రులకు అఖండగౌరవము చేకూర్చారు. వీరు ప్రస్తుతము విజయనగరంలో వ్యాయామ శాలను స్థాపించి వ్యాయామ కళాభివృద్ధికి కృషిచేయుచున్నారు.

శ్రీ రామమూర్తినాయుడుగారి తర్వాత ఇతర రాష్ట్రములలో ఆంధ్రులకు గౌరవము చేకూర్చిన బలాఢ్యుడు శ్రీ బులుసు రామజోగరావుగారు. వీరు మనదేశములో అనేక చోట్ల బలప్రదర్శనమొసచ్చి ఆంధ్రుల కనలేని గౌరవము చేకూర్చారు.

కుస్తీలో మన ఆంధ్రులకు పేరుతెచ్చిన వారు ఏలూరు వాస్తవ్యులు పాటోలు వీరవెంకయ్యగారు. ప్రస్తుతము వీరి వయస్సు షుమారు 90 సంవత్సరములు. ఇప్పటికీ కూడా వీరు బలముగాను, ఆరోగ్యముగాను వున్నారు. వీరు పంజాబు వస్తాదులను ఎందరనో జయించి ఆంధ్రుల కెంతయో పేరు తెచ్చారు. వీరు చాలా కాలమునుండి ఏలూరులోఒక వ్యాయామ శాలను నడపుచూ వ్యాయామ కళాభివృద్ధికి యెంతయో తోడ్పడుచున్నారు.

శ్రీ కమ్ముల అప్పన్నగారు ఏలూరులో స్త్రీల కొకటి, పురుషుల కొకటి రెండు వ్యాయామ శిక్షణాలయాలు నడుపుచున్నారు. వీరు కూడా వ్యాయామకళ కెంతయో తోడ్పడుచున్నారు.

శ్రీ అవనిగడ్డ పాండురంగారావుగారు బెజవాడ సమీపమున నున్న పటమటలంక వాస్తవ్యులు. వీరి వయస్సు షుమారు 30సంవత్సరములు.ఉత్సాహముగల యువకులు. వీరు స్వగ్రామములో వ్యాయామ శాలను స్థాపించి అనేకమంది యువకులను తయారు చేయుచున్నారు. వీరు బరువులు తేపుటలో ఆంధ్రదేశం పోటీలలోను, అఖిలభారత పోటీలలోను అనేకమంది వస్తాదులతో పాల్గొన్నారు. ఆంధ్రదేశ పోటీలలో వీరికి అనేకసారులు ప్రథమ స్థానము లభించినది. వీరు ప్రస్తుతము అఖిలభారత వెయిట్ లిఫ్టింగ్ పోటీలకు తయారగుచున్నట్లు తెలియుచున్నది.

శ్రీ గ్రే వీరరాఘవ గుప్తగారు చాలా సంవత్సరములనుండి వ్యాయామ కళాభివృద్ధికి పాటుబడుచున్నారు. వీరు వైశ్యులలో వ్యాయామకళను వ్యాప్తి చేయుటకు యెంతయో కృషి చేసినారు. వీరు గుంటూరులో వ్యాయామశాలను స్థాపించి, వ్యాయామ వ్యాప్తికి కృషి చేయుచున్నారు.

## శాస్త్రీయ పద్ధతులు

పైన వుదహరించిన వారిలో యెక్కువ మంది పురాతన పద్ధతులతోనే వ్యాయామ కళను ప్రచారము చేయుచున్నారు. నేను ఆంధ్రలో ప్రప్రథమంగా శాస్త్రీయ పద్ధతులతో, అత్యధిక బలమును, శరీర సౌష్ఠవమును చేకూర్చు బార్ బెల్ వ్యాయామమును ప్రవేశపెట్టాను.

1932 వ సంవత్సరం నా స్వగ్రామమైన అప్పికట్లలో ఆధునిక పరికరములతో వ్యాయామ శాలను స్థాపించాను. అచ్చట రాకపోకలకు తగు సౌకర్యములు లేనందున, యీ వ్యాయామశాలను 1946 వ సంవత్సరములో బెజవాడశాలూరా కంకిపాడునకు 1½ మైళ్ళలో స్థాపించి నడుపుచున్నాను. 1936 వ సంవత్సరములో దండమూడి రాజగోపాలరావు నావద్దకు యీ కళను అభ్యసించుటకు వచ్చారు.

చేను, రాజగోపాల్ మనదేశమంతయు పర్యటనచేసి ప్రదర్శనములిచ్చి శ్రీ మహాదేవదేశాయి, ఘనశ్యామదాస్‌బిర్లా, రాయ్‌సాదరి, రాయప్రోలు సుబ్బారావు మొదలగు ప్రముఖులచే యోగ్యతా పత్రములను పొందినారు. వీరు చేసిన శిలప్రదర్శనములు ఎవ్వరును చేయజాలరైరి. 1946 వ సంవత్సరములో బెంగుళూరులో జరిగిన అఖిలభారత వెయిట్ లిఫ్టింగ్ (బరువులు ఎత్తు) పోటీలలో పాల్గొని ప్రథమ స్థానము పొంది, మనదేశములో బలాఢ్యుడుగా రాజగోపాల్ పరిగణింపబడ్డారు. తిరిగి 1952 వ సంవత్సరములో మద్రాసులో జరిగిన అఖిల భారత ఒలింపిక్ పోటీలలో బరువులు లేపుటయందు హెవీవెయిట్ క్లాసులో పాల్గొని మొత్తం 780 పౌనులు లేపి ప్రథమ స్థానాన్ని పొందారు. 780 పౌనులు లేపి 1944 వ సంవత్సరములో మహమ్మద్ నబీచే సాధింపబడిన అఖిలభారత రికార్డు 767 పౌనులను అధిగమింప గలిగారు.

శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారి తర్వాత భారతదేశమందెల్ల బలాఢ్యులుగా పరిగణింపబడి, ఆంధ్రదేశమునకు అఖండ కీర్తిగౌరవములను సంపాదించిన యువకుడు దండమూడి రాజగోపాల రావుగారేనని చెప్పుటలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు. 1948 వ సంవత్సరములో లండన్‌లో జరిగిన అంతర్జాతీయ ఒలింపిక్ పోటీలకును, 1952 వ సంవత్సరములో ఫిన్‌లెండ్‌లో జరిగిన అంతర్జాతీయ ఒలింపిక్ పోటీలకును భారతప్రతినిధిగా పంపబడిన ఆంధ్రదేశమునకెంతయో కీర్తి, గౌరవములు తెచ్చారు.

## ఆసియా రికార్డు

ప్రస్తుతము ఆసియా ఖండమందెల్ల ప్రఖ్యాతి గాంచిన కామినేని ఈశ్వర రావుగారు, 1952 వ సంవత్సరములో మద్రాసులో జరిగిన అఖిలభారత ఒలింపిక్ పోటీలలో ప్రథమంగా పాల్గొని క్లీన్ అండ్ జర్క్ విధానములో 305 పౌనులు లేపి అఖిలభారత రికార్డును నెలకొల్పారు.

1952వ సంవత్సరము జూన్ మాసములో కలకత్తాలో ఏర్పాటు చేయబడిన ఫిన్‌లెండ్‌కు పంపు సెలక్షను పోటీలలో పాల్గొని ఒలింపిక్ పోటీలలో ప్రయోగించు మూడు విధానములలోను, మొత్తం బరువు లేపుటలోను 4 రికార్డులు స్థాపించిరి. ఇచ్చట వీరు మొత్తం 815 పౌనులు లేపి రాజగోపాలరావుగారు 1952 వ సంవత్సరములో స్థాపించిన రికార్డును అధిగమించిరి. అందువల్ల అఖిలభారత ఒలింపిక్ ఎసోసియేషన్‌వారు హెవీ వెయిట్ క్లాసులో పాల్గొనుటకు వారి స్వంత ఖర్చులతో ఫిన్‌లెండు పంపిరి. ఇంత కొద్దికాలము వ్యాయామము చేసి ఇంత బరువును లేపినవారు ప్రపంచములో ఎవ్వరును లేరన్న అతిశయోక్తి కాజాలదు. శ్రీ కోడి రామమూర్తి నాయుడుగారి తర్వాత అంతర్జాతీయ పోటీలలో ఆంధ్ర రాష్ట్రమునకేగాక, యావత్ భరత ఖండమునకు పేరుప్రఖ్యాతులు తేగల యువకుడు ఇతనే కాగలడు. ఇతని వయసు 27 సంవత్సరములు. ఎంతయో అభివృద్ధి చెందవలసిన యువకుడు. ప్రస్తుతము యితను లేపునంత బరువు ఆసియా ఖండములో నెవ్వరును లేపలేరేమో! 1953వ సంవత్సరము డిశంబరు 27 వ తారీఖున వణుకూరు

గ్రామములో చైనా సంస్కృతీ రాయబారివర్గమువారి యెదుట 330 పౌనులు క్లీన్ అండ్ జర్కు చేసి అఖిలభారత రికార్డును అధిగమించిరి. లోగడ రికార్డు యితను స్థాపించినదే 310 పౌనులు. ఇట్టి అభివృద్ధికి రాగల యువకునకు ప్రోత్సాహ మెంతయు అవసరము.

1951 వ సంవత్సరములోనే మా వ్యాయామ కళాశాలలో శ్రీ వేములపల్లి గోపాలకృష్ణమూర్తిగారు ఎంతో పట్టుదలతో వ్యాయామమును చేసి శరీరపు 145 పౌనులనుండి 190 పౌనులవరకు పెంచుకొని బలమును కూడా యెంతో పెంపొందించుకొనిరి. వీరు 1952 వ సంవత్సరములో మద్రాసులో జరిగిన అఖిలభారత ఒలింపిక్ పోటీలలో మిడిల్ హెవీ వెయిట్ క్లాసులో ప్రథములుగా వచ్చి, ఆంధ్రరాష్ట్రమునకెంతయో కీర్తి గౌరవములను చేకూర్చిరి. అఖిలభారత పోటీలలో పాల్గొనుట వీరికి యిది ప్రథమ ప్రయత్నమయినప్పటికి, క్లీన్ అండ్ జర్కులో 230 పౌనులు చేసి అఖిలభారత రికార్డును స్థాపించిరి.

అఖిలభారత శరీరసౌష్టవ పోటీలలో అనేకసారులు పాల్గొని వీరి ఎత్తుతరగతిలో ప్రథములుగా జయము పొందిన ఆంధ్ర యువకులు శ్రీ ఆర్. జనార్దనరావుగారు. వీరు 1952వ సంవత్సరం మద్రాసురాష్ట్ర వెయిట్ లిఫ్టింగ్ ఎసోసియేషన్ వారు యేర్పాటుచేసిన "మిస్టర్ మద్రాస్" పోటీలో పాల్గొని జయముపొంది "మిస్టర్ మద్రాస్" బిరుదును, ఎవర్ రోలింగ్ కప్పునుబడసి ఆంధ్రరాష్ట్రమునకెంతయో కీర్తి చేకూర్చారు. అంతకుముందు కలకత్తాలో "మిస్టర్ హెర్క్యులస్" బిరుదు పొందారు. వీరు బందరు వాస్తవ్యులు.

గుడివాడలో ఆంధ్ర ఫిజికల్ కల్చర్ యిన్‌స్టిట్యూట్ అను పేరున, అధునిక పరికరములతో ఖాదర్ మొహిద్దీన్ అనే ఆయన ఒక వ్యాయామ కేంద్రాన్ని స్థాపించి వ్యాయామ వృద్ధికి తోడ్పడుచున్నారు.

శాస్త్రీయ వ్యాయామము మన దేశములోను, రాష్ట్రములోను, రష్యా, అమెరికాలలోవలె వ్యాప్తి చెందవలయునన్న ప్రజాప్రభుత్వ సహాయ మెంతయు అవసరము. మన ప్రభుత్వము వ్యాయామావశ్యకతను గుర్తించి ప్రజల ఆరోగ్యములు పెంపొందించుటకు, యీ కళావ్యాప్తికి తప్పక తోడ్పడగలదని ఆశించుచున్నాను.



# ఆంధ్ర పత్రికలు

శ్రీ నాదెళ్ళ విజయభాస్కరరావు

ఆధునిక కాలంలో పత్రిక లావశ్యకతను వివరించవలసినపని ఏమాత్రం లేదు. ఆధునిక యంత్రాలభివృద్ధి యవడంతో పాటు, పత్రికానిర్వహణలోకూడా రోజురోజుకు అనేకమార్పులు జరుగుతూవచ్చాయి.

క్రీ. శ. 1885 సంవత్సరంలో తెలుగు టైపులు కనుగొనబడ్డాయి. ఆ సంవత్సరంలోనే శ్రీ. శ్రీ. కందుకూరి వీరేశలింగంగారు స్వంతంగా అచ్చుయంత్రాన్ని నెలకొల్పి "వివేకవర్ధని" అనే ఒక వారపత్రికను ప్రకటించారు. ఈ పత్రిక ముఖ్యంగా సంఘ సంస్కరణావశ్యకతను గూర్చి ప్రచారంచేస్తూ వచ్చేది. "హాస్యవర్ధని" అనే మరొక పత్రికనుగూడా అదే సంవత్సరంనుంచి పంతులుగారు రాజమహేంద్రవరంనుండి నడిపారు. ఈ పత్రికలద్వారా సాంఘికంగా వెనుకబడివున్న ప్రజానీకానికి వెలుగునిచ్చి ఎంతో సేవ చేశారు. 1886 లో ఎ. పి. పార్థసారధి నాయుడుగారు "ఆంధ్రప్రకాశిక" అనే వారపత్రికనుస్థాపించి, 25 సంవత్సరాలు వరుసగా ప్రభుత్వ విధానాలను తీవ్రంగా ఖండిస్తూ ప్రజాభిమానాన్ని పొందారు. తదుపరి గట్టుపల్లి శేషాచార్యులుగారు స్థాపించిన "శశిరేఖ" ఆంధ్రోద్యమానికెంతగానో తోడ్పడింది. 1886 లో శేషాచలపతిరావుగారు స్థాపించిన "దేశాభిమాని" పక్ష, వార, ద్వైవార పత్రికల దశలు దాటి దినపత్రికగాగూడ కొంతకాలం కొనసాగింది. ఇది గుంటూరునుంచి వెలువడేది. ఇవేగాకుండా 19 వ శతాబ్దంలో శ్రీ. శ్రీ. కొక్కొండ వెంకటరత్నం, చిలకమర్తి లక్ష్మీనృసింహంగారిలాంటి పెద్దలు పెక్కుమంది అనేక పత్రికలను స్థాపించి, జాతీయ సాంఘికోద్యమాలకు మిక్కిలి చేయూత నిచ్చారు.

20 వ శతాబ్దం ప్రారంభంనుండి జాతీయోద్యమాని కండదండగానూ, నవ్యాంధ్ర సాహిత్య ప్రచారానికి నాందీ ప్రస్తావనగానూ, వ్యావహారికభాషా ప్రచారంకొరకు అనేక పత్రికలు ప్రారంభించబడ్డాయి. భాషాసంబంధమైన వాదోపవాదాలుగూడా పత్రికలలో తీవ్రంగా సాగుతుండేవి. వ్యావహారికభాషా ప్రచారానికి గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు "తెలుగు" అనే పత్రికను స్థాపించారు. వారివాదాన్ని ఖండించడం కొరకు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు "వజ్రాయుధం" అనే పత్రికను కొంతకాలం కొనసాగించారు. ఈ రెండువాదనలకు మధ్యస్థంగా వుంటూ, కాశా శ్రీరామ శాస్త్రిగారు "శారద" అనే మాసపత్రికను నెలకొల్పారు. అలాగే విశ్వనాధ సత్యనారాయణ,

కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు "జయంతి" అనే పత్రికను కొంతకాలం నడిపారు. కీ. శే. కొంపెల్ల జనార్దనరావు గారు నవ్యసాహిత్య రచనలకు ప్రోత్సాహమిస్తూ "ఉదయిని" అనే మాసపత్రికను నడిపారు. ఇవిగాకుండా కుల, మత, ప్రాంతీయ పత్రికలు గూడా యీ కాలంలో అనేకం వెలువడ్డాయి.

## దినపత్రికలు

1908లో బొంబాయినుంచి వారపత్రికగా వెలువడిన ఆంధ్రపత్రిక, 1914లో కీ. శే. కాశీనాథుని నాగేశ్వర రావుగారి సంపాదకత్వాన మద్రాసునుంచి దినపత్రికగా వెలువడటం ఆరంభమైంది. ఆంధ్ర దినపత్రికలలోకెల్ల యింత సుదీర్ఘ కాలం నుంచి వెలువడుతూ మనగలిగింది యిది ఒక్కటే. ఈ పత్రికద్వారా నాగేశ్వర రావుగారు ఆంధ్రోద్యమానికేగాక, సారస్వతానికి కూడ అశేష కృషిచేశారు. ఈ దినపత్రికతోపాటు ముఖ్యాంగంగా చేసుకుని ఆంధ్రపత్రిక (వారపత్రిక)ను, ఆంధ్ర సాహితీ రంగంలో పేరెన్నికగన్న మాస పత్రికయైన "భారతి"ని వీరు స్థాపించారు. కీ. శే. చల్లా శేషగిరి రావుగారు యీపత్రికకు చాలాకాలం సంపాదకులుగా పనిచేసిరి. ప్రస్తుతం శివలెంక శంభు ప్రసాద్ గారు సంపాదకత్వం వహిస్తూ యీ మూడు పత్రికలు నిర్వహిస్తున్నారు.

1939 సంవత్సరములో శ్రీ ఖాసా సుబ్బారావుగారి సంపాదకత్వాన "ఆంధ్ర ప్రభ" స్థాపించబడింది. తదుపరి శ్రీ న్యాయపతి నారాయణ మూర్తిగారు దానిసంపాదకత్వము వహించిరి. ప్రస్తుతం శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు సంపాదకులుగా వుంటున్నారు. వీరు యీ పత్రికాభివృద్ధికెంతో కృషిచేశారు. అనతి కాలంలోనే యీపత్రిక ఎక్కువ ప్రచారంలోకి పోయింది.

ఆంధ్ర పత్రికా ప్రపంచంలో 'ప్రజాశక్తి' దినపత్రికస్థాపన ఒక నూతన శకానికి ప్రారంభం. ఇంతవరకూ ముఖ్యమైనపత్రికలన్నీ వ్యక్తుల అధీనంలో ఉండటం - వారు ప్రధానంగా ధనికులై యుండటం; కనుక ధనిక వర్గానికి వ్యతిరేకమయిన వార్తలకు, రచనలకు పత్రికలలో స్థానం లేక పోవటం జరుగుతూ వచ్చింది. ఈ స్థితిలో ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ ఆధ్వర్యాన, శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారి సంపాదకత్వాన 1945 లో విజయవాడ నుండి యిది ప్రారంభించబడింది. ఒక ఉద్యమ బాధ్యతపై నిర్వహింపబడిన ప్రథమ ఆంధ్ర దినపత్రిక ఇదే.

1936 లో ప్రారంభింపబడి 1939 లో నిషేధింపబడ్డ "నవశక్తి" - 1941 లో ప్రారంభింపబడ్డ 'ప్రజాశక్తి' వారపత్రికా దీనికి పునాదులు ఏర్పరచాయి. 1948వ సంవత్సరంలో ప్రభుత్వనిషేధంతో "ప్రజాశక్తి" మూతబడ్డా తిరిగి 1951 లో వార, ద్వైవార పత్రికగా కొనసాగి, 1952 లో "విశాలాంధ్ర" అన్న పేర దినపత్రికగా వెలువడటం ప్రారంభమయింది. ఆంధ్ర రాష్ట్రము నుండి ప్రకటించబడుతున్న ఒకే ఒక దినపత్రిక ఇది. ప్రస్తుతం శ్రీ. మోటూరు హనుమంతరావుగారు

ప్రధాన సంపాదకులుగానూ, శ్రీకింభంపాటి సత్యనారాయణ, కాట్రగడ్డ రాజగోపాల రావుగార్లు సంపాదకవర్గ సభ్యులుగాను వుంటున్నారు.

## ఇతర పత్రికలు

ప్రస్తుతం దాదాపు అన్నిరంగాల్లోనూ, దైనిక, వార, పక్ష, మాసపత్రికలు తెలుగులో వెలువడుతున్నాయి. అన్నింటి కంటె మాసపత్రికలు విరివిగా వెలువడు తున్నాయి. రాజకీయ, సాంఘిక, సాహిత్య, సినిమా, నాట్య, చిత్రకళ, ఒకటేమిటి! సర్వరంగాల్లోనూ పత్రికలు వెలువడు తున్నాయి. ప్రాంతీయ, కుల, మత పత్రికలు కూడా వెలువడుతున్నాయి.

ప్రస్తుతం వెలువడే వారపత్రికలలో ముట్నూరు కృష్ణారావుగారిచే స్థాపించ బడిన 'కృష్ణాపత్రిక', వెంకట్రామనాయుడు గారి 'జమీన్ రైతు', శ్రీ సా సుబ్బారావుగారి సంపాదకత్వాన వెలువడే 'తెలుగు స్వతంత్ర', నార్ల వెంకటేశ్వర రావుగారి సంపాదకత్వాన వెలువడే 'ఆంధ్రప్రభ', శంభుప్రసాద్ గారి 'ఆంధ్ర పత్రిక' ముఖ్యమయినవి. కృష్ణాపత్రిక 1902 లోనే ప్రారంభించబడి ఇప్పటికీ నిర్విఘ్నంగా కొనసాగుతోంది. మొదట కీ.శే. ముట్నూరి కృష్ణారావుగారి సంపాద కత్వాన వెలువడేది. తదనంతరం శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారి సంపాదకత్వాన వెలువడింది. ప్రస్తుతసంపాదకులు కమలాకర వెంకట్రావుగారు. ఇంత దీర్ఘకాలం నిర్విఘ్నంగా కొనసాగించబడుతున్న వార పత్రిక ఇది ఒక్కటే. నెల్లూరు నుంచి వెలువడే 'జమీన్ రైతు', పత్త్యారి రామాచార్యులు గారి సంపాదకత్వాన వెలువడే 'సాధన' పత్రికలు కూడా దీర్ఘకాలం నుండి కొనసాగించబడుతున్నాయి. నేడు దాదాపు 75 వారపత్రికలు ప్రకటింప బడుతున్నాయి.

పక్ష పత్రికలలో అన్ని రంగాలకు సంబంధించిన పత్రికలున్నాయి. పక్షపత్రికలలో చిత్రగుప్త దీర్ఘకాలంనుంచి వెలువడుతోంది. ప్రస్తుతం కొన్ని పిల్లల పత్రికలు వెలువడుతున్నాయి.

వాటిలో మద్రాసునుండి వెలువడు "బాల", "చందమామ" పత్రికలు విశేష ప్రచారంలో ఉన్నాయి. ఒక్క తెలుగులోనే కాకుండా మొత్తం 7 భారతీయభాషలలో చందమామ ప్రకటింప బడుతోంది.

నాగేశ్వరరావుగారిచే స్థాపించ బడి సాహితీపరులలో విశేష ప్రచారంలో నున్న "భారతి" కూడా మాసపత్రికే. అన్ని పత్రికలకంటే మూడు పత్రికలే విశేష ప్రచారంలో నున్నా, దాదాపు 110 పత్రికలు వెలువడుతున్నాయి.

సినిమారంగాన్ని గూర్చి చిత్రసీమ, రూపవాణి, సినిమా; ఆధ్యాత్మికవాదం, మతాన్నిగూర్చి దివ్యజ్ఞానదీపిక, గీతా వాణి మొదలయిన పత్రికలు; వైద్యాన్ని గూర్చి హానిమన్ హోమియోపతి; వివిధ సంఘాలకు చెందిన కిసాన్, మోటారు ట్రాన్స్‌పోర్టు, స్కౌటర్, సహకారం, పి. అండ్. టి. మజ్దూర్, ఉపాధ్యాయ, విద్యార్థి, వర్కరులాంటి పత్రికలు వెలువడుతున్నాయి.

ఈ కాలంలో వర్గ, ప్రజా సంఘాలచే నిర్వహింపబడే పత్రికలు ఎక్కువగా వున్నాయి. ప్రతి పత్రిక తన తన సంఘ లేక వర్గ ఆశయ సాధనకోసం పోరాడుతున్నది. ఈ పత్రికలు ఆయా సంఘ లేక వర్గాలకు చెందిన జన సామాన్యాన్ని ఎక్కువ ఆకర్షించుచున్నాయి. వీటిలో ఆ వర్గాలయొక్క కోర్కెలు, వాటిని సాధించుకోవలసిన విధానాలు, ప్రభుత్వ విధానాల్లో జరగవలసిన మార్పులు మొదలుగాగల విషయాలు వివరించ బడుతున్నాయి. ఇలాంటి వర్గాశయాలకోసం పోరాడే పత్రికలలో 'విశాలాంధ్ర' దినపత్రిక ముఖ్యమైనది.

ఇవేగాకుండా అనేక సంస్థల చేత నిర్వహింపబడే పత్రికలు; స్కూలు, కాలేజీ విద్యార్థులచేత నిర్వహింపబడే పత్రికలు అనేకం వున్నాయి. కాని అవి ఆయా కాలేజీ లేక సంస్థల వరకు మాత్రమే పరిమితమై వున్నాయి. కొన్ని ప్రదేశాల్లో యివి ఇంగ్లీషు, తెలుగు రెండు భాషల్లోనూ నడుపబడుతున్నాయి. అర్ధసంవత్సర, సాంవత్సరిక పత్రికలుగా యివి నడపబడుతున్నాయి.

గత 30 సంవత్సరములలో ఆంధ్ర దేశంలోని పత్రికల సంఖ్య ఏవిధంగా వృద్ధిచెందినదీ యీ క్రింది పట్టిక తెలియచేస్తుంది :

ఆంధ్రదేశంలోని పత్రికలు

| | దిన | వార | పక్ష | మాస | త్రైమాసిక | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1920 | 1 | 11 | ... | 20 | 6 | 38 |
| 1930 | 2 | 20 | ... | 18 | 7 | 47 |
| 1940 | 2 | 35 | ... | 88 | 59 | 184 |
| 1952 | 3 | 77 | 32 | 108 | 21 | 241 |

పత్రికా నిర్వహణలోనూ, రచనలోనూ ఎన్నో మార్పులు వచ్చాయి. పత్రికా నిర్వహణ నానాటికి అభివృద్ధి చెందుతోంది. కొన్ని పత్రికలు అస్థిరత్వ పరిస్థితులలోనే ఒడుదుడుకులతో కొనసాగుతూ వచ్చినవి.

"ఆంధ్ర భారతి", "ఆంధ్రవార్త", "ఆంధ్రప్రజ", "శశిరేఖ", "జనవాణి" దినపత్రికలుగా ప్రారంభమై కొంతకాలం తరువాత ఆగిపోయాయి. 'జనవాణి' శ్రీ తాపీ ధర్మారావుగారి సంపాదకత్వాన 1936 లో ప్రారంభమైనది. కాని యుద్ధ ప్రారంభంలోనే ఆగిపోయింది. ఆంధ్ర కమ్యూనిస్టుకమిటీ పత్రికయైన "ప్రజాశక్తి" ని 1948 లో ప్రభుత్వం నిషేధించింది. "జన్మభూమి", "దేశాభిమాని", "విజయప్రభ", "ప్రజాపత్రిక" దినపత్రికలుగూడ ప్రచురితమై కొలదికాలానికేమూసివేయబడ్డాయి.

సాహితీసమితివారి "సాహితి", "సఖి", ముద్దుకృష్ణగారి "జ్వాల", "ప్రజాబంధు", "ఆనందవాణి", "కాగడా" మున్నగు పత్రికలు; తెలికచర్ల వెంకటరత్నం గారి

సంపాదకత్వాన వెలువడిన "ప్రతిభ" (నవ్య సాహిత్యానికి విశేష సేవ చేసింది.), ఆంధ్రసారస్వత పత్రికయైన 'ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక', 'ఆంధ్ర భూమి', 'ప్రబుద్ధాంధ్ర' పత్రికలు కొంతకాలానికి ఆపివేయబడ్డాయి.

తరువాత కాలంలో యువజనాభ్యున్నతికి పాటుపడిన 'నవయుగ', ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘ మాసపత్రిక 'ఆంధ్రవనిత', సోషలిస్టులచే నడుపబడిన 'సోషలిస్టు', అభ్యుదయ సాహిత్యం కొరకు కృషిచేసిన 'అభ్యుదయ', మార్క్సిస్టు సిద్ధాంత పత్రికయైన 'జనత', అతివాద రాజకీయ భావాలను ప్రచారం చేసిన 'సందేశం', సాహిత్యరంగంలో కృషిచేసిన 'ఉదయిని', 'జ్వాల', ఆంధ్ర కాంగ్రెసు కమిటీచే నడుపబడిన 'కాంగ్రెసు' మొదలగు పత్రికలు కూడ కొంతకాలము వెలువడి ఆగిపోయాయి.

## తెలుగు పత్రికా రచయితలు

పత్రికా రచనలో అనేకమంది పేరెన్నిక గన్నారు. తమ తమ పత్రికలను నూతన పద్ధతులపై నడిపి ఆంధ్ర దేశానికి ఒక క్రొత్తదనాన్ని చూపిన వారనేకులున్నారు. కీ. శే. చల్లా శేషగిరి రావు (ఆంధ్ర పత్రికా సంపాదకులు), కీ. శే. ముట్నూరు కృష్ణారావు (కృష్ణా పత్రిక వ్యవస్థాపకులు), కీ. శే. చల్లా జగన్నాథం (ఆంధ్ర పత్రిక, ప్రభ), కీ. శే. న్యాయపతి నారాయణమూర్తి (వాహిని, ప్రభాతము, ఆంధ్రప్రభ) శ్రీ తాపీధర్మారావు నాయుడు (సమదర్శిని, జనవాణి, కొరడా, కాగడా సంపాదకులు) శ్రీ నార్ల వెంకటేశ్వర రావు (ఆంధ్రప్రభ సంపాదకులు) డి. యస్. గుప్త (ఆంధ్ర జ్యోతి, ప్రజామాత), కీ. శే. గూడవల్లి రామబ్రహ్మం (ప్రజామిత్ర సంపాదకులు), ఎస్. జి. ఆచార్య (చిత్రగుప్త, చిత్రాంగి ప్రజాబంధు పత్రికా సంపాదకులు), శ్రీ నల్లా వెంకట్రామ నాయుడు (జమీన్ రైతు సంపాదకులు), శ్రీ పప్పూరి రామాచార్యులు (సాధన సంపాదకులు), శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు (నవశక్తి, ప్రజాశక్తి, విశాలాంధ్ర సంపాదకులు), కాట్రగడ్డ రాజగోపాలరావు (విశాలాంధ్ర), శ్రీ మోటూరు హనుమంతరావు (విశాలాంధ్ర), శ్రీకంఠం పాటి సత్యనారాయణ (విశాలాంధ్ర), శ్రీ తుమ్మల వెంకట్రామయ్య (విశాలాంధ్ర) ఇట్టివారిలో కొందరు. వీరుగాక యింకా అనేకమంది పేరుగాంచిన విలేఖరులు, రచయితలు తెలుగు పత్రికా చదువరులకు చిరపరిచితులే.

## ఆంగ్ల పత్రికలలో ఆంధ్రులు

ఒక తెలుగుపత్రికా రచనలోనేగాక, ఆంగ్ల పత్రికారచనలోగూడా అనేక మంది ఆంధ్రులు ఖ్యాతి గడించారు.

కీ॥ శే॥ చిర్రావూరి యజ్ఞేశ్వరచింతామణి గారు 1909 లో మాలవ్యా మొదలగు వారిచే స్థాపించబడిన "లీడరు" పత్రికకు సంపాదకులుగా వుండి ప్రముఖ సంపాదకులుగా గుర్తింపబడ్డారు. 1921 లో ప్రకాశంగారి సంపాదకత్వాన "స్వరాజ్య" పత్రిక నడుపబడింది. ఆంగ్ల పత్రికారచనలో మన్ననలబడసిన ఖాసా సుబ్బారావుగారు "ఫ్రీప్రెస్", "ఇండియన్ ఎక్స్‌ప్రెస్", "ఇండియన్ ఫైనాన్సు" పత్రికలకు సంపాదకులుగా పనిచేశారు. ప్రస్తుతం ఇంగ్లీషు స్వతంత్రకు సంపాదకులుగా నున్నారు. ఇలా గే

కుందూరు ఈశ్వరదత్తు, కీ॥ శే॥ సి. వై. చింతామణి, కీ॥ శే॥ కోటంరాజు పున్నయ్య గార్లు; కోటంరాజు రామారావుగారు, చావలి వెంకట హనుమంతరావుగారు, ప్రస్తుతం అఖిలభారత పత్రికా రచయితల సంఘాధ్యక్షులైన చలపతిరావుగారు, జి. వి. కృపానిధిగారు ఆంగ్లపత్రికా రచనలో పేరుగన్నారు. ఇంకా అనేకమంది ఆంధ్రులు సమకాలిక ఇంగ్లీషు పత్రికలలో పనిచేస్తున్నారు.

1952 వ సంవత్సరంలో ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వీటి సంపాదకులు ఇత్యాది వివరాలు ప్రక్క పేజీలలోని పట్టికలలో పొందుపరచబడ్డాయి. *

* ఈ పట్టిక ముఖ్యంగా 1952వ సంవత్సరపు ప్రభుత్వ అంచనాల ఆధారంతో తయారుచేశాం. మాకు చేరిన సమాచారం ఆధారంతో, 1954 జనవరి - ఫిబ్రవరి మాసాల నాటికి వెలువడుతున్న కొన్ని పత్రికలనుకూడా చేర్చాం. (సం.)

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (1)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| **దినపత్రికలు** | | | |
| ఆంధ్రపత్రిక | తంబుచెట్టి స్ట్రీటు మదరాసు - 1 | శివలెంక శంభుప్రసాద్ | శివలెంక శంభుప్రసాద్ |
| ఆంధ్రప్రభ | మౌంట్ రోడ్డు మదరాసు-2 | నార్ల వెంకటేశ్వరరావు | ఎక్స్‌ప్రెస్ పేపర్సు లిమిటెడ్ |
| విశాలాంధ్ర | విజయవాడ | కాట్రగడ్డ రాజగోపాలరావు | కాట్రగడ్డ రాజగోపాలరావు |
| **వారపత్రికలు** | | | |
| అఖండభారత్ | రాజమండ్రి | బి. వి. కె. డి. ప్రసాదరావు | బి. వి. కె. డి. ప్రసాదరావు |
| ఆంధ్రప్రభ | ఓల్డు మద్రాసుక్లబ్, మౌంటురోడ్, మద్రాసు-2 | నార్ల వెంకటేశ్వరరావు | ఎక్స్‌ప్రెస్ పేపర్సు లిమిటెడ్ |
| ఆంధ్ర ప్రతిభ | కాకినాడ | బి. సత్యనారాయణ | బి. సత్యనారాయణ |
| ఆంధ్రపత్రిక | 6-7 తంబుచెట్టివీధి, మద్రాసు-1 | శివలెంక శంభుప్రసాద్ | యస్. శంభుప్రసాద్ |
| ఆంధ్ర కేసరి | మచిలీపట్నం | పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి | పెనుమర్తి లక్ష్మీపతిశాస్త్రి |
| ఆంధ్రశ్రీ | బకింగుహాంపేట, విజయవాడ | ప్రకాశచంద్ర శతపథి | ప్రకాశచంద్ర శతపథి |
| భారతీయ వైశ్య | విజయవాడ-1 | అన్నవరపు సుబ్బారావుగుప్త | అన్నవరపు సుబ్బారావుగుప్త |
| భారతజ్యోతి | కడప | సి. రామకృష్ణ | సి. రామకృష్ణ |
| ప్రతిన్యూస్ | జ్యూపిటర్ (ప్రింటింగ్ వర్క్సు), నెల్లూరు | మిస్టర్ పి. పీర్ ఖాన్ | యస్. బలరామరెడ్డి |

1952 సం॥ ప్రభుత్వలెక్కల ప్రకారం ప్రచురించ బడుతున్న కొన్నిపత్రికలు, వాటి వివరాలు (2)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
| --- | --- | --- | --- |
| ...వాణి | 82/9 పాండిబజార్, త్యాగరాయనగర్, మద్రాసు | పి. శ్రీహరిరావు | పి. శ్రీహరిరావు |
| ...జావాణి | గుంటూరు | వి. రంగయ్య | వి. రంగయ్య. |
| ...తవాది | ఏలూరు | ఐ. సత్యనారాయణ | జి. శేషగిరిరావు |
| ...వవాక్యం | కాకినాడ | పి. వి. భయంకరాచార్యులు | పి. వి. భయంకరాచార్యులు |
| ...సాన్ రైతు | నెల్లూరు | నెల్లూరు వెంకట్రామానాయుడు | నెల్లూరు వెంకట్రామా నాయుడు |
| ...్వల | కర్నూలు | టి. కె. రామచంద్రశర్మ | టి. కె. ఆర్. శర్మ |
| ...ంగ | సోంపేట | డి. ఆదినారాయణ | డి. ఆదినారాయణ |
| ...మజీవి | రాజమండ్రి | సి. యస్. ఆచార్య | సి. యస్. ఆచార్య |
| ...ష్టాపత్రిక | మచిలీపట్టణం | కమలాకరం వెంకట్రావు | ఆర్. డి. యల్. నరసింహమూర్తి |
| ...ర్కెట్టు రిపోర్టు | ఆదోని | ఆర్. బి. భాటియా | వి. జి. భాటియా |
| ...త్సేవ | 25 ఎ. తంబుచెట్టివీధి, మద్రాసు - 1 | ఐ. యస్. రావు | ఐ. యస్. రావు |
| ...త్సేవ | విజయనగరం | పి. సుబ్బారావు | పి. సుబ్బారావు |
| ...త్ర | రాజమండ్రి | కె. యస్. ప్రకాశరావు | కె. యస్. ప్రకాశరావు |
| ...కోదయం | శ్రీకాకుళం | టి.వి. శివరావు | టి. వి. శివరావు |
| ...ప | తాడేపల్లిగూడెం | వై. సూర్యనారాయణమూర్తి | వై. సూర్యనారాయణమూర్తి |
| ...జావాణి | ఏలూరు | యస్. చలపతిరావు | యస్. చలపతిరావు |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (3)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| ...ంకోల | విజయవాడ | బండి బుచ్చయ్య | బండి బుచ్చయ్య |
| ...జీవన | 2 ఎ. అన్నామలై చెట్టి రోడ్, పురుషవాకం, మద్రాసు | బి. యస్. మూర్తి | శ్రీమతి బి. ఆదిలక్ష్మీమూర్తి |
| ...భారతి | రాజమండ్రి | ఐ. బాలయ్య | ఐ. బాలయ్య |
| ...ంచజన్యం | రాజమండ్రి | డి. కృష్ణమూర్తి | డి. కృష్ణమూర్తి |
| ...గతి | సామర్లకోట | డి. వెంకటరామశాస్త్రి | డి. వెంకటరామశాస్త్రి |
| ...భాత్ | రాజమండ్రి | బి. రామలింగం | బి. రామలింగం |
| ...జావాణి | కాకినాడ | టి. యస్. శర్మ | టి. యస్. శర్మ |
| ...జ | కాకినాడ | సి. కె. రావు | సి. కె. రావు |
| ...మజ్యోతి | రాజమండ్రి | పి. సూర్యప్రకాశరావు | పి. సూర్యప్రకాశరావు |
| ...రాయలసీమ పత్రిక | తిరుపతి | కె. నరసయ్య | కె. నరసయ్య |
| ...రాయలసీమదర్శిని | హిందూపూరు | చలమంతూరు వెంకటరామప్ప | సి. హెచ్. వి. రామప్ప |
| ...సాధన | అనంతపురం | పప్పూరు రామాచార్యులు | పప్పూరు రామాచార్యులు |
| ...ంతి | మచిలీపట్నం | వై. లక్ష్మీపతి | వై. లక్ష్మీపతి |
| ...సంస్కారిణి | నర్సాపురం | సూర్యనారాయణ | పి. సూర్యనారాయణ |
| ...రాడికల్ హ్యూమనిస్టు | తెనాలి | అవుల గోపాలకృష్ణమూర్తి | అవుల గోపాలకృష్ణమూర్తి |
| ...జాగృతి | విజయవాడ | బి. వెంకటరత్నం | బి. వెంకటరత్నం |

1952 సం॥ ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (4)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| తెలుగు స్వతంత్ర | 2 బ్రాడీస్ రోడ్, మైలాపూర్, మద్రాసు | ఖాసా సుబ్బారావు | ఖాసా సుబ్బారావు |
| తెలుగు ప్రేమప్రచారక్ | కాకినాడ | యల్. నరసింహం | యల్. నరసింహం |
| త్రిలిజ్గ | 490 తిరువత్తియుర్ హైరోడ్, వాషర్‌మన్‌పేట, మద్రాసు | వావిళ్ళ వెంకటేశ్వర్లు | వి. వెంకటేశ్వరశాస్త్రులు |
| ఉత్తరాంధ్ర శ్రీకాకుళం | శ్రీకాకుళం | జి. వి. రామమూర్తి | జి. వి. రామమూర్తి |
| వనితావిహార్ | రాజమండ్రి | శ్రీమతి డి. సత్యవతి | శ్రీమతి డి. సత్యవతి |
| వాహిని | 155 ఘనయినగర్, మద్రాసు-10 | జి. ఉమామహేశ్వరరావు | జి. ఉమామహేశ్వరరావు |
| విశాఖ పత్రిక | విశాఖపట్టణం | విన్నకోట దుర్గారావు | వి. దుర్గారావు |
| యోగశక్తి | గుంటూరు | జి. కృష్ణయ్య | జి. కృష్ణయ్య |
| ఆర్థిక సమత | పటమట (వయా) విజయవాడ | లవణం | లవణం |
| విజయవాణి | బకింగుహాంపేటపోస్టు, విజయవాడ | మల్లెల శ్రీరామమూర్తి | మల్లెల శ్రీరామమూర్తి |
| వారపత్రిక | సోంపేట, శ్రీకాకుళంజిల్లా | డి. ఆదినారాయణ | డి. ఆదినారాయణ |
| దేశసేవ | బకింగుహాంపేట, విజయవాడ | బోడపాటి రామలింగేశ్వరప్ప | బి. రామలింగేశ్వరప్ప |
| కృషి | విజయవాడ | డాక్టరు కె. వి. రెడ్డి | డాక్టర్ కె. వి. రెడ్డి |
| పిలుపు | కర్నూలు | పి. డబ్లియు. నాయుడు | పి. డబ్లియు. నాయుడు |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (రి)

| పత్రికలు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| తెలుగు జనత | విజయవాడ | చల్లా బ్రహ్మానందం | జి. వి. యల్. నరసింహారావు |
| నగారా | గుంటూరు | ప్రతాప రామసుబ్బయ్య | ప్రతాప రామసుబ్బయ్య |
| **పక్షపత్రికలు** | | | |
| ఎడ్వర్టైజర్ | విజయనగరం | కె. శ్రీనివాసరావు | కె. వి. నరసింగరావు |
| చిత్రగుప్త | 6 లాయర్ చిన్నతంబి మొదలి వీధి, మద్రాసు-1 | యన్. మునుస్వామి మొదలియార్ | యల్. మునుస్వామి మొదలియార్ |
| చిత్రలోకం (1952) | 12 కుమారప్ప మొదలివిధి మద్రాసు-1 | ఎ. వి. కృష్ణమూర్తి | పి. పాండురంగం |
| క్రైస్తవవాణి | కాకినాడ | ఇ. ఐ. శామ్యూల్ | ఇ. ఐ. శామ్యూల్ |
| సినీ శేకన్ | మోహన్ ప్రింటింగువర్క్సు, నెల్లూరు | యస్. సుబ్బారావు | యస్. సుబ్బారావు |
| సినీతార | 163 ఎ. రాయపేట హైరోడ్డు, మదరాసు | కె. మహాదేవసింగు | కె. మహాదేవసింగు |
| మజ్దూర్ | విజయవాడ | శంకర కృష్ణమూర్తి | శంకర కృష్ణమూర్తి |
| నవ్యప్రభ | ఒంగోలు | సి. హెచ్. యస్. శాస్త్రి | కస్తూరి నారాయణశాస్త్రి |
| పౌరవాణి | విజయవాడ | కె. సత్యనారాయణమూర్తి | కె. సత్యనారాయణమూర్తి |
| రాయబారి | త్యాగల్లు | ఆర్. జి. జర్మన్ | ఆర్. జి. జర్మన్ |
| శ్రీమతి | రాజమండ్రి | యం. వి. యస్. సూర్యనారాయణమూర్తి | యం. వి. యస్. సూర్యనారాయణమూర్తి |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (6)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| సుదర్శిని | రాజోలు | డి. నరసింహరాజు | డి. నరసింహరాజు |
| జై భారత్ | 38 మూంట్ రోడ్, మద్రాసు - 2 | కె. అప్పారావు | కె. అప్పారావు |
| వెలుగు | నెల్లూరు | వై. రాఘవరావు | బి. రామయ్య |
| విజయి | విజయనగరం | జి. సూర్యనారాయణమూర్తి | జి. సూర్యనారాయణమూర్తి |
| యోగధర్మ | కొవ్వూరు | ఆర్. మహదేశ్వరశర్మ | బి. నరసింహమూర్తి |
| యోధధ్వని | 2 రిథర్డన్ రోడ్, వేపేరి, మద్రాసు | కల్నల్ యెస్. యమ్మ డేవిస్ | సాల్వేషన్ ఆర్మీ |
| స్వతంత్ర భారత్ | 12 కుమరప్ప మేస్త్రీవీధి, మద్రాసు - 1 | ఏ. బి. కృష్ణమూర్తి | పి. పాండురంగం |
| బృందావని | మచిలీపట్నం | కుప్పా వెంకట్రామశాస్త్రి | కుప్పా వెంకట్రామశాస్త్రి |

## మాసపత్రికలు

| | | | |
|---|---|---|---|
| ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య | ఏలూరు | యం. వెంకట్రామన్ | ఇ. వెంకయ్య |
| ఆంధ్ర వైద్యసమ్మేళన పత్రిక | ఏలూరు | యస్. సుబ్రహ్మణ్యశాస్త్రి | టి. సూర్యనారాయణ |
| ఆంధ్రజ్యోతి | 23 ఆర్కాటురోడ్, కోడంబాకం, మద్రాసు | కె. చక్రపాణి | బి. యస్. గుప్త |
| అంజలి | 103 ఆర్మీనియన్ వీధి, మద్రాసు - 1 | యం. ఇ. యస్. గోపాల్ | యం. ఇ. యస్. గోపాల్ |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (7)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| ఆరోగ్యమణి | 20 బిచ్చారు ముత్తయ్యముదలిస్ట్రీట్, వేపెరి, మద్రాసు | ఎ. శేషగిరిరావు | ఎ. శేషగిరిరావు |
| బాల | 38 సన్లీవాల్స్ గార్డెన్సురోడ్, మద్రాసు | యస్. రాఘవరావు | యస్. రాఘవరావు |
| బైబిల్ రీడింగు ఫెలోషిప్ | 18 చర్చిరోడ్, వేపెరి, మద్రాసు | విస్సుమూరి జోసెఫ్ | క్రిస్టియన్ లిటరేచరు సొసైటీ |
| బొమ్మరిల్లు | కాకినాడ | కె. రాజారావు | కె. రాజారావు |
| చందమామ | 2-3 ఆర్కాటురోడ్, కోడంబాకం, మద్రాసు | చక్రపాణి | నాగిరెడ్డి |
| చంద్రిక | 302 లింగిచెట్టివీధి, మద్రాసు | ఒ. శ్రీనివాసన్ | ఒ. శ్రీనివాసన్ |
| చిత్రసీమ | 82 8 పాండిబజార్, త్యాగరాయనగర్, మద్రాసు-17 | యస్. పి. రాధాకృష్ణన్ | యస్. పి. రాధాకృష్ణన్ |
| చిల్డ్రన్స్ ఫ్రెండ్ | 18 చర్చిరోడ్, వేపెరి, మద్రాసు | మిసెస్ సుభాషిణీ ఫిలిప్స్ | క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ |
| దేశసేవ | 12 చిదంబరస్వామి 3వ వీధి, కోసపేట, మద్రాసు | ఎ. ఎస్. మూర్తి | ఎ. యస్. మూర్తి |
| దేశసేవ | విజయవాడ | బి. రామలింగం | బి. రామలింగం |
| దేశసేవ | రాజమండ్రి | బి. రామలింగం | బి. రామలింగం |
| ఢంకా | 6 సంకురామన్ చెట్టివీధి, మద్రాసు - 1 | బి. టి. నరసింహాచారి | బి. టి. నరసింహాచారి |
| దివ్యజ్ఞానదీపిక | నిడదవోలు | పి. యస్. కుటుంబశాస్త్రి | సి. హెచ్. శ్రీరామమూర్తి |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (8)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| దివ్యజ్ఞానదీపిక | విజయవాడ | తడిమేటి సూర్యకుటుంబశాస్త్రి | తడిమేటి సూర్యకుటుంబశాస్త్రి |
| గీతావాణి | కోయిలకుంట్ల | యస్. శ్రీ రామకృష్ణానంద | యస్. శ్రీ కాంతం |
| గీతావాణి | వేదవ్యాస ప్రెస్, చిత్తూరు | యం. శ్రీకాంతం | గీతాప్రచారిణీ సమితి, అళ్ళగడ్డ |
| గాస్పెల్ ఇల్యూమినేటర్ | విజయవాడ | పాస్టర్ బి. యం. శామ్యూల్ | వి. యం. శామ్యూల్ |
| గ్రామపంచాయతి | మామూరు | యన్. సత్యనారాయణ | యన్. సత్యనారాయణ |
| గ్రామోద్ధరణ | విజయవాడ | బి. పూర్ణచంద్రరావు | బి. పూర్ణచంద్రరావు |
| గ్రామోద్యోగి | విజయవాడ | బి. యస్. యన్. రావు | కొసరాజు వెంకటరత్నం |
| గృహలక్ష్మి | కేసరికుటీరం, వెస్టుకాట్ రోడ్, రాయపేట, మద్రాసు | సి. సి. పున్నయ్య | కేసరి కుటీరం లిమిటెడ్ |
| గుండుసూది | 26 గోడౌన్ స్ట్రీట్, మద్రాసు | కె. రాధాకృష్ణన్ | కె. రాధాకృష్ణన్ |
| హానిమన్ హోమియోపతి | రాజమండ్రి | యం. కృష్ణారావు | యం. కృష్ణారావు |
| జాయింటు ఫ్రంట్ | నెల్లూరు | టి. జి. యల్. వై. రామయ్య | ప్రభాత ప్రెస్, నెల్లూరు |
| కథాంజలి | 32 కృష్ణప్పనాయకన్ టాంక్ రోడ్, మద్రాసు-1 | ఎ. యన్. రాఘవాచార్ | ఎ. యన్. రాఘవాచార్ |
| మెసెంజర్ ఆఫ్ ట్రూత్ | 18, చర్చి రోడ్, వేపేరి, మద్రాసు | రివరెండ్ ఆర్. డి. ఇసూరి | క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ |
| మోహిని | 16 సంకురామచెట్టివీధి మద్రాసు-1 | పి. శీతారామయ్య | పి. శీతారామయ్య |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (9)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| మోక్షసాధని | గుంటూరు | వై. రామబ్రహ్మం, రంగాంజనేయులు & కె. వి. నర్సయ్య | రామబ్రహ్మం, ఎ. చలపతి & రామకృష్ణయ్య |
| నవీనవిద్య | విజయవాడ | వి. రామకోటయ్య | వి. రామకోటయ్య |
| పాపాయి | 18 వెంకటస్వామి మొదలి స్ట్రీట్ మద్రాసు-1 | డాక్టరు అప్పారావు | డాక్టరు అప్పారావు |
| ప్రగతి | భీమవరం | డి. సూర్యప్రకాశరావు | డి. సూర్యప్రకాశరావు |
| ప్రారంభవిద్య | పవరుపేట, ఏలూరు. | నోరి రామశర్మ | ఇ. వెంకటరావు, ఇ. వెంకట్రామయ్యపంతులు |
| పి. అండ్ టి. మజ్దూర్ | విశాఖపట్నం | బి. మహాదేవయ్య | బి. మహాదేవయ్య |
| పి. అండ్ టి. మజ్దూర్ | విజయవాడ | టి. భావనారాయణ | పి. అండ్ టి. వర్కర్సు యూనియన్ |
| రూపవాణి | 16 సంకురామ శెట్టివీధి, మద్రాసు-1 | పి. సీతారామయ్య | పి. సీతారామయ్య |
| సహకారం | రాజమండ్రి | నరసింహదేవర సత్యనారాయణ | యస్. కృష్ణయ్య |
| శారద | రాజమండ్రి | యస్. పార్వతీశం | యస్. పార్వతీశం |
| సర్వోదయ | మారుటేరు | బి. గోవిందరెడ్డి | బి. గోవిందరెడ్డి |
| స్పెక్టేటర్ | చంద్రికా ప్రెస్, గుంటూరు | జి. కృష్ణమూర్తి | జి. కృష్ణమూర్తి |

## 1952 సం॥ ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న పత్రికలు, వాటి వివరాలు (10)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| శైవప్రకాశిక | శ్రీ శైవమతపీఠం, విజయవాడ | యం. సుబ్రహ్మణ్యశర్మ | యం. సుబ్రహ్మణ్యశర్మ |
| పౌరసూరుపత్రిక | రాజమండ్రి | క. విజయరత్నం | క. విజయరత్నం |
| శ్రీరామరాజ్యం | పెదకల్లపల్లి | టి. కృష్ణమూర్తి | టి. కృష్ణమూర్తి |
| శ్రీరామకృష్ణప్రభ | శ్రీ రామకృష్ణమఠ్, మైలాపూర్, మద్రాసు | రతిఙానంద, వి. కృష్ణారావు | ామకృష్ణమఠ్, మైలాపూ మద్రాసు |
| శ్రీవైష్ణవ పత్రిక | పెంటపాడు | వి. రాఘవాచార్యులు | వి. కృష్ణమాచార్యులు |
| స్వార్థప్రకాశిని | రాజమండ్రి | అర్. క. డేవిడ్ | అర్. క. డేవిడ్ |
| సంభాషిణి | గుంటూరు | యల్. వెంకటేశ్వర్లు | యల్. వెంకటేశ్వర్లు |
| సూర్యప్రభ | 53 గోవిందప్పనాయక్ వీధి, మద్రాసు - 1 | డాక్టరు అప్పారావు | డాక్టరు అప్పారావు |
| తెలుగుసినిమా | 15 నీలకంఠ మెహతా వీధి, త్యాగరాయనగర్, మద్రాసు | సి. సాంబశివరావు | సి. వెంకట్రామయ్య |
| తెలుగు | త్యాగరాయనగర్, మద్రాసు | ఐ. వెంకటేశ్వరరావు | క. వి. నాగభూషణం |
| తెలుగుపోస్టుమన్ హెరాల్డ్ | రాజమండ్రి | పి. యస్. ప్రకాశరావు | పి. యస్. ప్రకాశరావు |
| తిరుమలై తిరుపతి దేవస్థానం మన్త్లీ బులిటెన్ | తిరుమలై తిరుపతి దేవస్థాన్ ప్రెస్, తిరుపతి | సి. అన్నారావు | సి. అన్నారావు |
| తీజీవి | కాకినాడ | ఓ. గాబ్రియేల్ | ఓ. గాబ్రియేల్ |

## 1952 సంవత్సరం ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (11)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| ఉపాధ్యాయ | విజయవాడ | సి. హెచ్. లక్ష్మయ్య | ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయసంఘం |
| వాణిజ్యవాణి | వసంత ప్రెస్, నెల్లూరు | కె. వి. కృష్ణమూర్తి | కె. వి. కృష్ణమూర్తి |
| విశ్వశ్రీ | అలమూరు, తూ. గో. జిల్లా | పి. రామమూర్తి | పి. రామమూర్తి |
| విలేజి పంచాయతీ జర్నల్ | 187 రాయపేట హైరోడ్, మద్రాసు | యస్. సత్యనారాయణ | మెడ్రాస్ ప్రావిన్షియల్ యూనియన్ ఆఫ్ పంచాయత్ బోర్డ్సు |
| వినోదిని | 33 క్రాస్ స్ట్రీట్, మద్రాసు | ఆర్. రంగనాయకమ్మాళ్ | పి. యస్. వేణుగోపాలస్వామి నాయుడు |
| వైద్యరాజన్ | విజయవాడ | డాక్టర్ కవిరాజు మోహన్ | డాక్టరు కవిరాజు మోహన్ |
| యదార్థభారతి | వ్యాసాశ్రమం | డి. జి. వెంకటస్వామి | మలయాళస్వాములువారు |
| యోగసాధన | అలమూరు | నరసింహదేవర జనార్దనశాస్త్రి | యస్. జనార్దనశాస్త్రి |
| నవ్వులు - పువ్వులు | రాజమండ్రి | యస్. బాలయ్య | యస్. బాలయ్య |
| విద్యార్థి | ఏలూరురోడ్డు, విజయవాడ - 2 | పరుచూరి కోటేశ్వరరావు | ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ |
| మహార్షి ప్రకాశిని | విజయవాడ - 2 | పాస్టరు వి. యం. సామ్యేలు | పాస్టరు వి. యం. సామ్యేలు |
| దివ్యజీవనము | 10,860 కిరణ భద్రపురం, రాజమండ్రి | స్వా. శ్రీ వెంకటేశ్వరరావు | స్వా. శ్రీ వెంకటేశ్వరరావు |

## 1952 సంవత్సరం ప్రభుత్వ లెక్కలప్రకారం ప్రచురించబడుతున్న కొన్ని పత్రికలు, వాటి వివరాలు (12)

| పత్రిక పేరు | చిరునామా | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|
| మోక్ష సాధని | శ్రీ రామనామక్షేత్రం, అగ్రహారం, గుంటూరు | రాగం ఆంజనేయులు కందుకూర్తి వెంకటనరసయ్య | శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘం |
| కిన్నెర | 16 నోన్స్ స్ట్రీట్, మద్రాసు - 1 | పందిరి మల్లికార్జునరావు | పందిరి మల్లికార్జునరావు |
| ఆంధ్రమహిళ | ఆంధ్రమహిళాసభ 24ఎ. లజ్ చర్చిరోడ్ మైలాపూర్, మద్రాసు - 4. | శ్రీమతి చన్నిఘంటమ్మ | ఆంధ్ర మహిళాసభ |
| తెలుగు విద్యార్థి | మచిలీపట్నం | కొల్లూరి కోటేశ్వరరావు | కొల్లూరి కోటేశ్వరరావు |
| సినిమా | చందమామ పబ్లికేషన్సు, మద్రాసు | చక్రపాణి | చందమామ పబ్లికేషన్స్ |
| గ్రంథాలయ సర్వస్వం | పటమట (వయా) విజయవాడ | ప. నాగభూషణం | ఆంధ్ర గ్రంథాలయ సంఘం |
| యువక | విజయవాడ | డి. ఆర్. చల్లాన్ | డి. ఆర్. చల్లాన్ |
| భారతి | మౌంట్ రోడ్, మద్రాసు | శివలెంక శంభుప్రసాద్ | శివలెంక శంభుప్రసాద్ |
| అమృతలేఖ | విజయవాడ | కలగాని ఆంజనేయశాస్త్రి | కలగాని ఆంజనేయశాస్త్రి |
| రామదర్శనం | రామతీర్థ సేవాశ్రమం, పిడుగురాల | స్వామి కేశవతీర్థ | శ్రీ రామతీర్థ సేవాశ్రమం, పిడుగురాల |

# 1952 సంవత్సరం ప్రభుత్వ లెక్కలప్రకారం ఉన్న విద్యాలయ పత్రికలు, వాటి వివరాలు (1)

| పత్రిక పేరు | | ప్రచురితమయ్యే స్థలం | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|---|
| ఆంధ్ర జాతీయ కళాశాల | సాంవత్సరికపత్రిక | మచిలీపట్నం | యం. శివరామయ్య | యం. శివరామయ్య |
| ఆంధ్ర పోలిటెక్నిక్ స్టూడెంట్సు అసోసియేషన్ మాగజైన్ | ” | కాకినాడ | సి. సీతారామచంద్ర | సి. సీతారామచంద్ర |
| ఆంధ్ర మెడికల్ కాలేజి మాగజైన్ | అర్థ సంవత్సర పత్రిక | విశాఖపట్నం | డి. సుభూషణం | డి. సుభూషణం |
| ఆంధ్ర యూనివర్సిటీ స్టూడెంట్సు మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | విశాఖపట్నం | వి. పట్టాభిరామయ్య | వి. పట్టాభిరామయ్య |
| బాలభారతి | మాసపత్రిక పత్రిక | బోర్డు హైస్కూలు, పుంగనూరు | | బి. దేశికాచారి |
| గవర్నమెంటు ట్రైనింగు స్కూలు మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | మచిలీపట్నం | డి. సత్యనారాయణమూర్తి | డి. సత్యనారాయణమూర్తి |
| గవర్నమెంటు గరల్సు హైస్కూలు మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | రాజమండ్రి | యస్. రాజాంబాళ్ | యస్. రాజాంబాళ్ |
| గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | రాజమండ్రి | జి. యస్. యస్. ఆచార్య | జి. యస్. యస్. ఆచార్య |
| గుంటూరు మెడికల్ కాలేజి మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | గుంటూరు | | గుంటూరు మెడికల్ కాలేజి స్టూడెంట్సు అసోసియేషన్ |

## 1952 సంవత్సరం ప్రభుత్వ లెక్కలప్రకారం ఉన్న విద్యాలయ పత్రికలు, వాటి వివరాలు (2)

| పత్రిక పేరు | | ప్రచురితమయ్యే స్థలం | సంపాదకులు | అధిపతులు |
|---|---|---|---|---|
| హిందూకాలేజీ హైస్కూలు మాగజైన్ | అర్ధ సంవత్సర పత్రిక | మచిలీపట్నం | యం. రామయ్య | యం. రామయ్య |
| హిందూకాలేజీ మాగజైన్ | ,, | మచిలీపట్నం | W. W. G. K. గోఖలే | W. W. G. K. గోఖలే |
| జర్నల్ ఆఫ్ డిస్ట్రిక్టు రీసర్చి సొసైటీ | మాసపత్రిక | రాజమండ్రి | ఆర్. సుబ్బారావు | ఆర్. సుబ్బారావు |
| మున్సిపల్ హైస్కూలు మాగజైన్ | అర్ధసంవత్సర పత్రిక | విజయనగరం | క. రామదాసు | క. రామదాసు |
| నర్సాపూర్ కాలేజీ మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | నర్సాపురం | బి. సుబ్బారావు | టి. క. రామానుజాచార్యులు |
| ప్రతిభ | మాసపత్రిక | బోర్డు హైస్కూలు, పేరేరు | | యన్. వెంకటరామిరెడ్డి |
| హైస్కూలు మాగజైన్ | అర్ధసంవత్సర పత్రిక | హైస్కూలు ప్రెస్, గుంటూరు | జె. డి. సెఫీయస్ | జె. డి. సెఫీయస్ |
| పి. ఆర్. స్కూలు మాగజైన్ | ,, | కాకినాడ | పి. నరసింహారావునాయుడు | పి. నరసింహారావునాయుడు |
| R. R. B. H. హైస్కూలు మాగజైన్ | సాంవత్సరిక పత్రిక | పిఠాపురం | ఆర్. వి. సీతారామశాస్త్రి | ఆర్. వి. సీతారామశాస్త్రి |
| స్కూలు మాగజైన్ | మాసపత్రిక | విజయవాడ | పి. వి. రామానుజరావు | పి. వి. రామానుజరావు |

# ప్రచురణాలయాలు

## శ్రీ నాదెళ్ళ విజయభాస్కరరావు

"భాషా సేవకు కవి ఎంత ముఖ్యుడో ప్రకాశకుడుకూడా అంత అవసరమైన వాడే."

1806 నుంచే తెలుగు పుస్తకాలను అచ్చువేయటం ప్రారంభమైంది. కాని అప్పటికి ముద్రణ ఇంత అందంగా వుండేదికాదు. 1830 వరకు అది అభివృద్ధి గాలేదు.

1812 లో వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు "ఆది సరస్వతీనిలయ ముద్రాక్షరశాల" అనే పేరుతో ముద్రణాలయాన్ని స్థాపించి అంతకు పూర్వ ముపయోగించబడే కాగితాలు, అచ్చు వగైరాలను అభివృద్ధి చేశారు. వారు వ్రాసిన మనుచరిత్ర, టీక దానిలోనే ముద్రించారు. తదుపరి వారికుమారుడు ముద్రణాలయాన్ని అభివృద్ధి పరిచారు.

1852 లో సి. పి. బ్రౌన్ నూతన పద్ధతులపై ఆంధ్ర నిఘంటువు ప్రచురించినారు. ఈయనే 1829 లో వేమన శతకమును ఇంగ్లీషులోకి అనువదించారు.

1855 లో చిన్నయసూరిగారిచే "బాలవ్యాకరణము", "నీతిచంద్రిక" వ్రాయబడి నేటికీ ప్రచారంలో నున్నాయి. అకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు (1860-1916) అనేక గ్రంథాలను ప్రచురించారు. భారతము (పదమూడు పర్వాలు), నైషధాగ్రక్రీ కిరణము (అసంపూర్ణం) వంటి గ్రంథాలను ప్రచురించారు.

20 వ శతాబ్ది ప్రవేశమునాటికి అనేక మార్పులు జరిగాయి. సంఘ, భాషా సారస్వత సంస్థానాలలోనూ వ్యాసమం నానాట అభివృద్ధి అవుతోంది.

20 వ శతాబ్ది ప్రారంభంనాటికే అనేకమంది కవులచే పలు గ్రంథాలు వ్రాయబడి ప్రకటింపబడ్డాయి. వీరేశలింగం పంతులుగారు హిందూసంఘములో ప్రబలంగావున్న దురాచారాలను ఎదిరించి పోరాడారు. బాల్యవివాహము, వితంతు వివాహ నిషేధము, రండాముండనము, వృద్ధవివాహం, విగ్రహారాధన మొదలగు ఆచారాలను ఆయన హేయ్యముగా భావించి, వాటికి వ్యతిరేకంగా అనేక గ్రంథాలను వ్రాసి ప్రచురించారు. దానితో అప్పటివరకు సాగుతూ వస్తున్న పుస్తక ప్రచురణలోనే నూతన మార్పు వచ్చింది. ఇలానే చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు ఆకాలంలో దేశభక్తిని పురికొల్పే గ్రంథాలను, చారిత్రిక గ్రంథాలను వ్రాశారు. ఇప్పటివరకు తెలుగు గ్రంథాలన్నింటిని ప్రచురించగల్గిన ప్రచురణాలయ మాటూ

శేమ. కొమర్రాజు లక్ష్మణరావుగారిచే 'విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి' అనే ఒకసంస్థ 1905లో స్థాపించబడింది. ఈ సంస్థ ఆంధ్రభాషకు చాలా సేవచేసింది. వివిధ విషయాలపై సిద్ధహస్తులైన వారిచే పుస్తకాలు వ్రాయించి ప్రకటించింది. చిలుకూరి వీరభద్రరావు గారిచే ఆంధ్రుల చరిత్ర, వేమూరి విశ్వనాథశాస్త్రి గారిచే రసాయన శాస్త్రం, మంత్రిప్రగడ సాంబశివరావు గారిచే పదార్థ విజ్ఞానశాస్త్రం, డాక్టరు లక్ష్మీపతి గారిచే ఆరోగ్యవిషయాలపైన, డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారిచే అర్థశాస్త్రం వ్రాయించి ప్రకటించింది. ఈసంస్థ చందాదారులను చేర్పించి, సంవత్సరానికి కొన్ని వందల పేజీలు లభించేటట్లుచేసి విజ్ఞాన ప్రచారం చేసింది. ఇతేగాకుండా అనేకనవలలు,ఇతర గ్రంథాలను కూడా ఈసంస్థ ప్రకటించింది.

1911 లో పిఠాపురం మహారాజా, జయంతి రామయ్య పంతులుగారు, వేదం వేంకటరాయశాస్త్రిగారు 'ఆంధ్ర సారస్వత పరిషత్తు' అనే సంస్థ నేర్పరచి గ్రాంథిక భాషాప్రచారానికి తీవ్రంగాకృషి చేశారు. రోజురోజుకు గ్రామ్యభాషాప్రచారం ఎక్కువౌతోంది.గురజాడఅప్పారావు, గిడుగురామమూర్తిపంతులుగార్లు వ్యావహారిక భాషా ప్రచారానికి తీవ్రంగా పూనుకున్నారు. 1911 లోనే గిడుగు రామమూర్తి పంతులుగారు బరంపురం మొదలు మద్రాసు వరకుగల ప్రదేశంలో పర్యటించి, వ్యావహారికభాషకు ప్రయోగాలను సేకరించడానికి ప్రతి కళాశాలలోను పరిశోధకుల సంఘాల నేర్పరిచారు. ఇలాంటి ప్రచారాన్ని ఎదుర్కోడానికే 'ఆంధ్రసారస్వత పరిషత్తు' కృషిచేసింది.

కొంతకాలం క్రిందట రాజమహేంద్రవరంలో 'ఆంధ్రచంద్రిక పరిశోధక మండలి' అనుపేరుతో ఒక సంస్థ స్థాపించబడింది. శ్రీయుతులు రాళ్ళబండి సుబ్బారావు, భావరాజు వెంకట కృష్ణారావు, మారేమండ రామారావు గారలు యీ సంస్థ నిర్వాహకులలో ముఖ్యులు.

బందరులో 'ఆంధ్ర భాషాభివర్ధని గ్రంథమాల' అనేది 1908 లో స్థాపించబడింది. వివేకానందస్వామి జీవిత చరిత్ర మొదలుగాగల గ్రంథాలను వ్రాసి ప్రకటించారు. కాని యీ గ్రంథమాల ఎక్కువ కాలం మనలేకపోయింది. "ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల" మొదట అయ్యగారి నారాయణమూర్తిగారి సంపాదకత్వాన స్థాపించబడింది. తరువాత నిడదవోలు రామచంద్రారెడ్డిగారి ఆధిపత్యంక్రిందకు పోయింది. ఈ గ్రంథమాల వెంకటపార్వతీశ్వర కవులు వ్రాసిన అనేక గ్రంథాలను ప్రకటించింది. అనేక నవలలను ప్రకటించి యీ గ్రంథమాల ఖ్యాతిని గడించింది. ఈ గ్రంథమాల ప్రకటించిన నవలలలోఅత్యధికభాగం ఆంగ్ల, బెంగాలీ, కన్నడ భాషలనుంచి పరివర్తనాలే. తెలుగులోవున్న నవలలలో అధికభాగం యీ గ్రంథమాల ప్రకటించినవే.

'రామవిలాస గ్రంథమాల' అనే మరియొక గ్రంథమాల పిఠాపురంవద్ద చిత్రాడలో వంగూరి సుబ్బారావుగారి ఆధిపత్యాన ప్రారంభమై ఎన్నదగిన నవలలను ప్రకటించింది.

అద్దేపల్లిలక్ష్మణస్వామిగారి ఆధిపత్యాన 'సరస్వతీ గ్రంథమండలి' స్థాపించబడింది. దానిచేత కొన్ని నవలలు ప్రకటింపబడ్డాయి.

కొన్ని సంవత్సరాలతర్వాత నాగేశ్వర రావుగారు 'ఆంధ్రగ్రంథమాల'ను వర్తక పద్ధతిమీద నడుపుట ప్రారంభించారు. దీనికి అంతకుపూర్వం నడపబడే గ్రంథ మాలకు చాలా భేదమున్నది. వెనుకటి గ్రంథమాలలు జనాదరణపై ఆధారపడి వుండేవి. ఈగ్రంథమాల "పండితారాధ్య చరిత్రము", "బసవపురాణము" వంటి గ్రంథాలు ప్రచురించింది.

'సాహితీ సమితి' మొదట తెనాలిలో 1918_19 మధ్యకాలంలో స్థాపించబడింది. అప్పటి రోజుల్లో ఈనాడున్న పత్రికలు గాని, గ్రంథమాలలుగాని లేవు. ఈ సంస్థ నవ్యసాహిత్యానికి కేంద్రమైంది. ఎక్కువగా ఖండ కావ్యాలు యీ సమితిలో ప్రచురించబడుతూ వుండేవి. దీనిలో తల్లావఝల శివశంకరశాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, నోరి నరసింహశాస్త్రి, కొమాండూరి కృష్ణమాచార్యులు మొదలుగా గల వారి గ్రంథాలు ప్రచురించబడుతూండేవి. ఈ సమితికి తల్లావఝల శివశంకరశాస్త్రిగారు అధ్యక్షులుగా వుండేవారు. 1936 లో 'నవ్యసాహిత్య పరిషత్తు' స్థాపించబడింది. ఈ పరిషత్తు నవ్య సాహిత్య రచనలన్నిటిని ప్రచురిస్తూ వుండేది.

తర్వాత ముఖ్యంగా పేర్కొనదగింది అభ్యుదయ రచయితల సంఘం. మారిన ఆశయాలతో బయలుదేరి, అనేక మంది యువ రచయితలను ప్రోత్సహించి, వారిచే అనేక అభ్యుదయ గ్రంథాలను వ్రాయించింది. 'అభ్యుదయ' అనే ఒక సాహిత్య పత్రిక కూడా నడుపబడింది. వీరేశలింగం, గిడుగు, గురజాడ మొదలుగా గల వారి గ్రంథాలను విరివిగా ప్రచారంలోకి తెచ్చింది. ఆంధ్రదేశంలో వున్న అభ్యుదయ రచయితల నందరిని సమైక్య పరచి, వారిచే అనేక అభ్యుదయగ్రంథాలు వ్రాయించి ప్రకటించ ప్రోత్సహించింది.

1942 సంవత్సరంలో స్థాపించబడిన 'ప్రజాశక్తి ప్రచురణాలయం' దాదాపు 300గ్రంథాలను ప్రకటించింది. అభ్యుదయ సాహిత్యానికి కేంద్రమయింది. అనేక మార్క్సిస్టు రాజకీయ గ్రంథాలే గాక వివిధ విషయాలపై గ్రంథాలనుకూడా ప్రకటించింది. చరిత్ర, ఆరోగ్యసూత్రాల మీద, వైద్యగ్రంథాలు, శాస్త్రీయ, అభ్యుదయ సాహిత్య గ్రంథాలు అనేకం ప్రచురించబడ్డాయి. 1948 లో ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీని నిషేధించడం మూలంగాను, ప్రచురణాలయ గ్రంథాలను స్వాధీనం చేసుకోవడం మూలంగాను మూసివేయబడింది. ఈ ప్రచురణాలయం వీరేశలింగంగారి, గురజాడవారి గ్రంథాలను విశేష ప్రచారంలోకి తెచ్చింది. మరల కమ్యూనిస్టుపార్టీపై నిషేధం రద్దయిన తరువాత 'విశాలాంధ్ర ప్రచురణాలయం' 1953 జనవరిలో ప్రారంభించబడింది. ఇప్పటికి దాదాపు 65 గ్రంథాలను ప్రకటించింది.

ప్రస్తుతము ప్రచురణాలయాలు చాలా కలిగాయి. దాదాపు ప్రతి పట్టణంలోనూ చిన్నదో, పెద్దదో ప్రచురణాలయం వుంది. వివిధప్రచురణాలయాలు వివిధ విషయాలపై పుస్తకాలను ప్రకటించు తున్నాయి. సామర్లకోటలోని కళాకేళి ప్రచురణలు, రాజమండ్రిలోని విశ్వ సాహిత్యమాల, చేరంచర్లలోని ప్రగతి ప్రచురణాలయం, విజయవాడలోని

'ఆదర్శ గ్రంథమండలి', 'విశాలాంధ్ర ప్రచురణాలయం' ముఖ్యంగా మార్క్సిస్టు, రాజకీయ, సాహిత్య, నవలా గ్రంథాలను ప్రకటించుతున్నాయి. అలాగే మద్రాసులోని 'కల్చరల్ బుక్స్ లిమిటెడ్', హైదరాబాదులోని 'ఆంధ్రసారస్వత పరిషత్తు' చారిత్రిక, సాహిత్య మరి అనేక యితర గ్రంథాలను ప్రకటించుతున్నాయి. పాఠ్య గ్రంథాలను ప్రకటించే గ్రంథమాలలనేకం వున్నాయి. వేంకట్రామ అండ్ కో, ఓరియంటల్ పబ్లిషింగ్ హౌస్, ఆంధ్ర విశ్వ విద్యాలయం, విజయవాడలోని మారుతీ రామా అండ్ కో, కడపలోని రాయలుఅండ్ కో, ఏలూరులోని రామా అండ్ కో మొదలగు ప్రచురణాలయాలు ముఖ్యంగా పాఠ్యగ్రంథాలను ప్రకటించుతున్నాయి. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో పరిశోధనకు సంబంధించిన గ్రంథాలు, చారిత్రిక, శాస్త్రీయ గ్రంథాలు ప్రకటించుతున్నారు. అలాగే వివిధరంగాలలో వివిధ గ్రంథమాలలు ప్రత్యేక కృషి చేస్తున్నాయి. 'దేశకవితా గ్రంథమండలి' (విజయవాడ) శరత్ సాహిత్యాన్ని ప్రకటించుతోంది. మద్రాసులోని 'రామకృష్ణ మఠం' మత గ్రంథాలను ప్రకటించుతోంది. సంగంజాగర్లమూడిలోని కొత్త భావయ్య చౌదరిగారు చారిత్రిక గ్రంథాలను ప్రచురించుతున్నారు. పటమట లోని (విజయవాడ) ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్సు, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘములు గ్రంథాలయ వాఙ్మయము, వయోజన విద్యకుపకరించే పుస్తకాలు ప్రకటించుతున్నాయి. సుందరం గ్రామోద్యోగీయ కళాశాలవారు (గుడివాడ) గ్రామోద్యోగ గ్రంథాలు ప్రకటించుతున్నారు. పిల్లల సాహిత్యాన్ని కూడా అనేక గ్రంథమాలలు ప్రకటించుతున్నాయి. 1947 లో మద్రాసులో ఏర్పడిన తెలుగు భాషాసమితి, తెలుగు విజ్ఞాన సర్వస్వమును ప్రకటించడానికి ప్రయత్నించుతోంది. ఇటీవల హైదరాబాదులో ఆంధ్ర చంద్రికా గ్రంథమాల అనే సంస్థ ఏర్పడి రాజకీయ, జాతీయ, చారిత్రిక గ్రంథాలను ప్రచురించుతోంది. ఇలాగే అనేక గ్రంథమాలలు వెలువడి ఆంధ్ర భాషలో ఉద్గ్రంథాలను ప్రకటించాలని కృషి చేస్తున్నాయి.

1954 జనవరిలో విశాలాంధ్ర ప్రచురణాలయంవారు, 'పుస్తక ప్రపంచం' అనే పత్రిక నొకదానినికూడా ప్రారంభించారు. ఇది నిత్యమూ ప్రచురితమవుతున్న అనేక పుస్తకాల సమాచారాన్ని పాఠకులకు అందించుతుంది. ఇటువంటి పత్రిక, ప్రచురణాలయాలచే ప్రారంభించబడడం ఇదే ప్రథమం. ఇది ఆంధ్ర ప్రచురణాలయాల అభివృద్ధికి ఒక శుభసూచన.

కొన్ని ప్రచురణాలయాల చిరునామాలు, వారు ప్రచురించే గ్రంథాల వివరించే పట్టికలు, ప్రక్క పేజీలో పొందుపరచబడ్డాయి:

## ఆంధ్రదేశంలోని కొన్ని ప్రచురణాలయాలు, వాటి వివరాలు (I)

| ప్రచురణాలయం పేరు | అడ్రసు | ఏ సం॥రం స్థాపించబడింది | ప్రొప్రయిటరు పేరు | ఏరకం పుస్తకాలు ప్రకటించబడుతాయి | ప్రచురించిన పుస్తకాల సంఖ్య |
|---|---|---|---|---|---|
| జయనికేతనమ్ | తాడేపల్లి గూడెం | 1930 | ముద్దా విశ్వనాథం | పాఠ్యగ్రంథాలు | 12 |
| బుక్ మన్స్ | మద్రాసు-7 | | జయనికేతనంకు సోదరసం | | 3 |
| సుందరం గ్రామోద్యోగీయ శకాశాల | గుడివాడ; సబ్ ఆఫీసు: విజయవాడ | 1925 | సుందరం గ్రామోద్యోగీయ శకాశాల | గ్రామోద్యోగ గ్రంథాలు | 6 |
| కళాకేళి ప్రచురణలు | సామర్లకోట | 1948 | రాంషా | అభ్యుదయ సాహిత్యం | 22 |
| జయభారత్ పబ్లిషింగ్ హౌస్ | 12, ఫ్రాంకిస్ జోసెఫ్ స్ట్రీట్ పి. బి. నెం. 1514, మద్రాసు | 1950 | గోపాలుని వెంకట నరసింహారావు | పాఠ్యగ్రంథాలు (ఇంగ్లీషు, తెలుగు, హిందీ, తమిళం | 18 |
| అరుణోదయ ప్రచురణాలయం | అమృతలూరు, (వయా) తెనాలి | | కొత్తపల్లి రంగారావు | సాహిత్యం, రాజకీయాలు | 11 |
| ప్రగతి పబ్లికేషన్సు | పోతవరం, అమ్మనబ్రోలు, ఒంగోలుతాలూకా | 1924 | భూషన్‌బాబు, ఎ. కె. రెడ్డి, టి. వి. రత్నం | సాహిత్య గ్రంథాలు | 4 |
| యం. యస్. ఆర్. మూర్తి అండ్ కో॥ | విశాఖపట్నం | 1946 | యం. వెంకటరామయ్య | పాఠ్య గ్రంథాలు | |
| విజాపురీ గ్రంథమాల | పాలకొల్లు | 1929 | కవిభూషణ ఆంధ్ర శేషగిరిరావు | గద్య, పద్య, నవల, నాటకాలు | 4 |
| ది ఓరియంట్ పబ్లిషింగ్ కంపెనీ | హెడ్ ఆఫీసు: తెనాలి | 1925 | యం. సుబ్రహ్మణ్యశర్మ, కె. శివరావు | పాఠ్యగ్రంథాలు, పిల్లల పుస్తకాలు | 300 |

## ఆంధ్రదేశంలోని కొన్ని ప్రచురణాలయాలు, వాటి వివరాలు (2)

| ప్రచురణాలయం పేరు | అడ్రసు | ఏసంగరం స్థాపించబడినది | ప్రొప్రయిటరు పేరు | ఏరకం పుస్తకాలు ప్రకటించబడుతాయి | ప్రచురించిన పుస్తకాల సంఖ్య |
|---|---|---|---|---|---|
| దర్శ గ్రంథమండలి | విజయవాడ (1950వరకు కృష్ణాజిల్లా ఎలమర్రులో వుండేది). | 1931 | గద్దె లింగయ్య | రాజకీయ, సాహిత్యగ్రంథాలు | 60 |
| ంధ్ర గ్రంథాలయ ట్రస్టు | పటమటలంక (వయా) బెజవాడ | 1946 | గొమ్మా సీతారామయ్య, మేనేజింగ్ ట్రస్టీ | గ్రంథాలయ పుస్తకాలు, వయోజనవిద్య, వ్యవసాయ పుస్తకాలు | 12 |
| ంధ్రదేశ గ్రంథాలయసంఘం | పటమట, కృష్ణాజిల్లా | 1914 | పాలకవర్గము | గ్రంథాలయ వాఙ్మయము | 23 |
| గ్రంథాలయ పుస్తకశాల | పటమట, కృష్ణాజిల్లా | 1944 | ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు | గ్రంథాలయాలకు, వయోజన విద్యకు ఉపకరించునవి | 9 |
| ల్చరల్ బుక్స్ లిమిటెడ్ | మిరిన్ సాహెబ్ స్ట్రీట్, మౌంట్ రోడ్, మద్రాసు-1. | 1940 | | సాంస్కృతిక ప్రచురణలు, పిల్లలపుస్తకాలు, అపూర్వ గ్రంథాలు | 50 |
| ఓరియంట్ లాంగ్ మన్స్ లిమిటెడ్ | 36ఎ. మౌంట్ రోడ్, మద్రాసు-2, కలకత్తా, బొంబాయి, ఢాకా, న్యూఢిల్లీ, విజయవాడ | 1948 | యస్. ఆర్. శ్రీనివాసన్ (మేనేజరు) | విద్యావిషయిక గ్రంథాలు | |
| రామకృష్ణ మఠం | మైలాపూరు మద్రాసు-4 | 1897 | | మతగ్రంథాలు | 34 |

## ఆంధ్రదేశంలోని కొన్ని ప్రచురణాలయాలు, వాటి వివరాలు (3)

| ప్రచురణాలయం పేరు | అడ్రసు | ఏ సంవత్సరం స్థాపించబడినది | ప్రొప్రయిటరు పేరు | ఏరకం పుస్తకాలు ప్రకటించబడుతాయి | ప్రచురించిన పుస్తకాల సంఖ్య |
|---|---|---|---|---|---|
| హిందూ ధర్మశాస్త్ర గ్రంథ నిలయం | కపిలేశ్వరపురం తూ. గో. జిల్లా | . | చాగంటి శేషయ్య | చరిత్ర, న్యాయశాస్త్రం, నవలలు | 18 |
| ఆంధ్ర విశ్వవిద్యాలయం | వాల్తేరు | 1926 | ఆంధ్ర విశ్వవిద్యాలయం | పాఠ్యగ్రంథాలు, చరిత్ర, శాస్త్రీయ, న్యాయ, వేదాంత, సాహిత్య, విమర్శ గ్రంథాలు | 48 |
| ప్రభు అండ్ కో., | కొత్తపేట, గుంటూరు | | బి. వి. హనుమంతరావు | విద్యావిషయాలు (తెలుగు, ఇంగ్లీషు, హిందీ) | 20 |
| సీతారామనామ సంకీర్తన మందిరము | శ్రీరామనామక్షేత్రం గుంటూరు | 1926 | | ఆధ్యాత్మిక గ్రంథాలు | 15 |
| బి. వి. అండ్ సన్సు | రామారావుపేట, కాకినాడ | 1950 | బి. వెంకటేశ్వర్లు | సాహిత్య గ్రంథాలు | 25 |
| ఆంధ్ర సారస్వత పరిషత్తు | రాంకోటి, హైదరాబాద్ | 1943 | | చరిత్ర, విజ్ఞానము, సాహిత్యము, రాజకీయాలు | 16 |
| విశ్వ సాహిత్య మాల | రాజమండ్రి | 1935 | మహీధర జగన్మోహనరావు | అభ్యుదయ సాహిత్యం | 60 |
| సీతారాం అండ్ కో | విజయవాడ | 1942 | జె. వెంకమ్మ | పాఠ్యగ్రంథాలు | 8 |
| త్రివేణి పబ్లిషర్సు | మచిలీపట్నం | 1945 | భావరాజు నరసింహారావు | పాఠ్యగ్రంథాలు | 60 |

## ఆంధ్రదేశంలోని కొన్ని ప్రచురణాలయాలు, వాటి వివరాలు (4)

| ప్రచురణాలయం పేరు | అడ్రసు | ఏ సం॥రం స్థాపించబడినది | ప్రొప్రయిటరు పేరు | ఏరకం పుస్తకాలు ప్రకటించబడుతాయి | ప్రచురించిన పుస్తకాల సంఖ్య |
|---|---|---|---|---|---|
| మారుతీరామా & కో., | విజయవాడ | 1920 | వడాలి నారాయణరావు | విద్యావిషయిక గ్రంథాలు | 50 |
| తెలుగు భాషాసమితి | 27 యూనివర్సిటీ బిల్డింగ్స్, మద్రాసు-5 | 1947 | తెలుగు భాషా సమితి | ఆంధ్ర సర్వస్వము మొదలుగాగల గ్రంథప్రచురణాలు | |
| కొత్త భావయ్యచౌదరి | సంగం జాగర్లమూడి | | కొత్త భావయ్య చౌదరి | చారిత్రిక గ్రంథాలు | 10 |
| వెంకటేశ్వర అండ్ కో., | లోకేశ్వర్, మద్రాసు | | వి. మాధవరావు | సాంస్కృతిక, మత, పురాతన గ్రంథాలు | |
| కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు | రాజమండ్రి | | కొండపల్లి వీరవెంకయ్య | కథ, వేదాంత, జ్యోతిష్య, వైద్య ఇతర గ్రంథాలు | |
| ప్రగతి ప్రచురణాలయం | నిడమర్రు | | నిడమర్రు అశ్వనీకుమారదత్తు, ఉమామహేశ్వరరావు | రాజకీయ మార్క్సిస్టు గ్రంథాలు | 12 |
| ప్రేమ్‌చందు పబ్లికేషన్సు | కొత్తపేట, విజయవాడ | 1953 | కె. యస్. యన్. శాస్త్రి | ప్రేమ్‌చంద్ గ్రంథాలు | 1 |
| రాయలు అండ్ కో., | కడప | 1930 | జక్కా సుబ్బారాయశ్రేష్ఠి | పాఠ్య గ్రంథాలు | 68 |
| దేశకవితా మండలి | విజయవాడ | 1943 | బొందలపాటి శివరామకృష్ణ, శకుంతలాదేవి | కవిత్వం, కథ, విమర్శ, నాటకం, రాజకీయం, చరిత్ర, జీవితచరిత్ర గ్రంథాలు | 120 |
| రామా అండ్ కో., | హెడ్డాఫీసు : ఏలూరు | 1904 | ఈదర వెంకయ్యపంతులు, ఈదర పట్టాభిరామ | పాఠ్యగ్రంథాలు, భారతం, భాగవతంలాంటి గ్రంథాలు | |

## ఆంధ్రదేశంలోని కొన్ని ప్రచురణాలయాలు, వాటి వివరాలు (5)

| ప్రచురణాలయం పేరు | అడ్రసు | ఏసంIIరం స్థాపించబడినది | ప్రొప్రయిటరు పేరు | ఏరకం పుస్తకాలు ప్రకటించబడుతాయి | ప్రచురించిన పుస్తకాల సంఖ్య |
|---|---|---|---|---|---|
| ఎ. వి. రాం అండ్ కంపెనీ, | నర్సాపూరు | 1932 | అత్తిలి వెంకట్రామయ్య, | పాఠశాలల ఇతర పుస్తకాలు | 20 |
| శ్రీరామకృష్ణ పబ్లిషర్సు | బళ్ళారి | 1904 | డి. రంగాచారి | నాటకములు | 18 |
| ఆత్మారాం అండ్ కో., | అనంతపురం | 1939 | | పాఠ్య గ్రంథాలు | 22 |
| ఆంధ్రా బుక్ డిపో | రాజమండ్రి | 1908 | యం. సత్యనారాయణ & సన్సు | | 100 |
| జై. ఆర్. అండ్ సన్సు | 16/94 సత్యనారాయణపురం, విజయవాడ_2 | | | వ్యాపార గ్రంథాలు | |
| నగారా పబ్లికేషన్సు | గుంటూరు | 1953 | | అభ్యుదయ సాహిత్యం | |
| నవయుగ పబ్లిషింగ్ హౌస్ | గుంటూరు | 1952 | జి. కోటేశ్వరరావు | అభ్యుదయ సాహిత్యం | |
| విశాలాంధ్ర ప్రచురణాలయం | విజయవాడ | 1952 | కాట్రగడ్డ రాజగోపాలరావు | అభ్యుదయసాహిత్యం, వైజ్ఞానిక గ్రంథాల ప్రచురణలు, మాస్కో, పెకింగు పుస్తకములు, పత్రికల దిగుమతిదార్లు, విక్రేతలు | 65 |
| సాహితీ పబ్లికేషన్స్ | విజయవాడ | 1951 | శ్రీనివాస చక్రవర్తి | అభ్యుదయ సాహిత్య గ్రంథాలు | 16 |
| ఆంధ్ర గ్రంథమాల | మదరాసు | | శివలెంక శంభుప్రసాదు | సాహిత్య గ్రంథాలు | |
| వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు | మదరాసు | | వావిళ్ళ రామస్వామిశాస్త్రులు | సాహిత్యశాస్త్ర గ్రంథాలు | |
| వెంకటరామా అండ్ కో., | హెడ్డాఫీసు : విజయవాడ | | ఈదర వెంకటరావు | విద్యావిషయిక గ్రంథప్రచురణ, సర్వ తెలుగుపుస్తక విక్రేతలు | |

# మరికొన్ని ప్రచురణాలయాలు

1. ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘము, హిందీపుస్తక ప్రచురణకర్తలు, విజయవాడ, కృష్ణాజిల్లా.

2. శాంతినిలయ గ్రంథమాల, కాకినాడ, తూర్పుగోదావరిజిల్లా.

3. ఆనంద బోధిని, పబ్లిషర్సు, 6, లాయరు చిన్నతంబి మొదలి స్ట్రీట్, మదరాను.

4. అరుణరేఖా పబ్లికేషన్సు, నెల్లూరు.

5. ఆధునిక విజ్ఞాన కుటీరం, 22 దివాన్ రామయ్యంగారి స్ట్రీట్, మదరాను.

6. ఆంధ్రసాహిత్యపరిషత్, కాకినాడ.

7. సరస్వతీ బుక్ డిపో, పబ్లిషర్లు, విజయవాడ, కృష్ణాజిల్లా.

8. వెంట్రటలు బుక్ షాప్, పబ్లిషర్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

9. రాఘవరాం అండ్ కంపెనీ, పబ్లిషర్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

10. స్టార్ పబ్లిషర్సు, విజయవాడ.

11. కల్యాణి పబ్లిషర్సు, విజయవాడ.

12. హిందుస్థాన్ డైరీ పబ్లిషర్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

13. కవితిలక గ్రంథమాల, విజయవాడ, కృష్ణాజిల్లా.

14. వెరైటీ ఏజన్సీస్, విజయవాడ.

15. పి. ఆర్. అండ్ సన్సు, ఎద్యు కేషనల్ పబ్లిషర్సు, విజయవాడ.

16. ఆర్యవిజ్ఞాన గ్రంథమాల, విజయవాడ, కృష్ణాజిల్లా.

17. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, పబ్లిషర్సు, విజయవాడ.

18. త్రివేణి పబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ, కృష్ణాజిల్లా.

19. చిత్రకళా పబ్లికేషన్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

20. గోపీ పబ్లికేషన్సు, విజయవాడ.

21. ఉదయసాహితి పబ్లిషర్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

22. సయశ్రీ బుక్ డిపో, విజయవాడ, కృష్ణాజిల్లా.

23. విజయ పబ్లికేషన్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

24. విజ్ఞాన ప్రచురణలు, విజయవాడ.

25. ఆధ్యాత్మిక గ్రంథమండలి, విజయవాడ, కృష్ణాజిల్లా.

26. వెంకటేశ్వర పబ్లికేషన్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

27. దిగవల్లి వెంకటశివరావు, పబ్లిషర్సు, విజయవాడ, కృష్ణాజిల్లా.

28. కొమ్మరాజు వినాయకరావు, పబ్లిషరు, విజయవాడ, కృష్ణాజిల్లా.

29. జాకోబిన్ పబ్లిషర్సు, తెనాలి.

30. మోడరన్ పబ్లిషర్సు, తెనాలి.

31. సుందరరాం అండ్ సన్సు, తెనాలి, గుంటూరుజిల్లా.

32. శివరాం అండ్ కంపెనీ, బుక్ పబ్లిషర్సు, తెనాలి, గుంటూరు జిల్లా.

33. ఈస్టరన్ పబ్లిషర్సు, రేపల్లె, గుంటూరుజిల్లా.

34. గిరి అండ్ రావు, బుక్ పబ్లిషర్సు తెనాలి, గుంటూరుజిల్లా.

35. జన సాహితి, తెనాలి.

36. రావు బ్రదర్సు, బుక్ పబ్లిషర్సు, తెనాలి, గుంటూరుజిల్లా.

37. విజయ పబ్లిషింగ్ కంపెనీ, తెనాలి, గుంటూరుజిల్లా.

38. ఆంధ్ర శిల్ప కళాపరిషత్, పబ్లిషర్సు, తెనాలి, గుంటూరుజిల్లా.
39. సాధన గ్రంథమండలి, తెనాలి,
40. శారదాపీఠం, తెనాలి, గుంటూరు జిల్లా.
41. కళావాణి పబ్లికేషన్సు, గుంటూరు, గుంటూరుజిల్లా.
42. శ్రీ కాశీ కృష్ణాచార్యులు, బుక్ పబ్లిషరు, గుంటూరు.
43. శ్రీ పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు, గుంటూరు.
44. జ్యోతి ప్రచురణలు, తెనాలి.
45. నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు.
46. సాహితీసమితి, రేపల్లె, గుంటూరు జిల్లా.
47. లక్ష్మీ అండ్ కంపెనీ, ఏలూరు పశ్చిమగోదావరిజిల్లా.
48. గుండిమెడాస్, పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు, ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా.
49. రాము బుక్ డిపో, బుక్ పబ్లిషర్సు అండ్ సెల్లర్సు, రాజమండ్రి, తూర్పు గోదావరిజిల్లా.
50. కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు, పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు, రాజమండ్రి, తూర్పుగోదావరిజిల్లా.
51. శ్రీ సరస్వతీ పవర్ ప్రెస్, పబ్లిషర్సు, రాజమండ్రి, తూర్పుగోదావరిజిల్లా.
52. ఆర్యన్ బుక్ డిపో, రాజమండ్రి, తూర్పుగోదావరిజిల్లా.
53. తిరుపతి వెంకటేశ్వర పబ్లికేషన్సు, పబ్లిషర్సు, రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.
54. తిరుపతి వెంకటేశ్వర బుక్ డిపో, బుక్ పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు, రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.
55. హితకారిణీ సమాజం, పబ్లిషర్సు, రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.
56. కళాభివర్ధనీ పరిషత్, రాజమండ్రి.
57. మేడేటి సన్యాసయ్య అండ్ సన్సు, రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా.
58. సింహా బుక్ డిపో, పబ్లిషర్సు, రాజమండ్రి.
59. మధిర శివరామకృష్ణ శాస్త్రి, పబ్లిషరు, రాజమండ్రి.
60. నాళం కృష్ణారావు, పబ్లిషరు, రాజమండ్రి.
61. అభినయ ఆంధ్ర కావ్యస్థానం, బుక్ పబ్లిషర్సు, రాజమండ్రి.
62. వాణి గ్రంథమండలి, రాజమండ్రి.
63. బాలాంసు వెంకటేశ్వర్లు అండ్ సన్సు, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా.
64. యస్. అప్పలస్వామి పబ్లిషరు, రాజమండ్రి.
65. ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్, బుక్ పబ్లిషర్సు, కాకినాడ.
66. మాదిరెడ్డి జగన్నాథరావు అండ్ కంపెనీ, బుక్ పబ్లిషర్సు, కాకినాడ.
67. గుప్తా బ్రదర్సు, బుక్ పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు, విశాఖపట్నం.
68. రాధాకృష్ణ అండ్ కో., విజయవాడ.
69. జై శంకర్ అండ్ కో., విశాఖపట్నం.
70. కవితాసమితి, విశాఖపట్నం.
71. విజ్ఞానప్రకాశ, పబ్లిషర్సు, భీమవరం, పశ్చిమగోదావరిజిల్లా.

72. వాణిబుక్ డిపో, పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు, భీమవరం, పశ్చిమ గోదావరి.

73. ఎ. వి. రాం అండ్ కో, పబ్లిషర్సు, నరిసాపురం, పశ్చిమ గోదావరిజిల్లా.

74. కమలాకుటీర్, పబ్లిషర్సు, నరసాపురం.

75. సంస్కార కళాసమితి, పబ్లిషర్సు, పాలకొల్లు.

76. ప్రజాసాహితి, రాజమండ్రి.

77. ఆంధ్ర కేసరిరావు, తెలుగు పండితులు, పాలకొల్లు.

78. హిందూధర్మశాస్త్ర గ్రంథ నిలయం, కపిలేశ్వరపురం, తూర్పుగోదావరి.

79. వేగుచుక్క గ్రంథాలయం, బరంపురం, గంజాంజిల్లా.

80. యం. శేషాచలం అండు కో., బుక్ పబ్లిషర్సు, అండ్ సెల్లర్సు, మచిలీపట్నం, కృష్ణాజిల్లా.

81. ఆంధ్ర జనరల్ స్టోర్సు, బుక్ పబ్లిషర్సు అండ్ సెల్లర్సు, మచిలీపట్నం.

82. శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్నం.

83. సెంట్రల్ బుక్ హౌస్, బుక్ పబ్లిషర్సు అండ్ సెల్లర్సు, మచిలీపట్నం.

84. జనపబ్లికేషన్సు, గుడివాడ.

85. క్వాలిటీబుక్ హౌస్, గుడివాడ.

86. కవికోకిలా పబ్లికేషన్సు, నెల్లూరు.

87. వర్థమూడి రామయ్య, పబ్లిషర్సు, నెల్లూరు.

88. వివేకా పబ్లిషర్సు, నెల్లూరు.

89. జయలక్ష్మీ అండ్ కంపెనీ, నెల్లూరు.

90. ఎ. యస్. వెంకటేశ్వరరావు బ్రదర్సు, బుక్ పబ్లిషర్సు, నెల్లూరు.

91. శ్రీ కొండా శంకరయ్య, పబ్లిషర్సు, సికింద్రాబాదు.

92. రామా బుక్ డిపో, బుక్ పబ్లిషర్సు అండ్ సెల్లర్సు, సికింద్రాబాదు.

93. కొండా వీరయ్య, పబ్లిషర్సు, సికింద్రాబాదు.

94. చేగా నారాయణ సెట్టి, బుక్ పబిషర్సు, సికింద్రాబాదు.

95. అజంతా పబ్లికేషన్సు, బుక్ పబ్లిషర్సు, సికింద్రాబాదు.

96. సప్తా విజయమండలి, పబ్లిషర్సు, విజయవాడ.

97. ప్రకృతి కార్యాలయం, విజయవాడ.

98. నవభారత పబ్లిషర్సు లిమిటెడ్, బుక్ పబ్లిషర్సు అండ్ సెల్లర్సు, కర్నూలు.

99. రాజశ్రీ సాహిత్య కళాపీఠం, సికింద్రాబాదు.

100. విద్యా వనం, పబ్లిషర్సు, పామర్రు, కృష్ణాజిల్లా.

101. జె. వి. సుబ్రహ్మణ్యశర్మ, బుక్ పబ్లిషర్సు, కడప.

102. ప్రభాత ప్రచురణాసమితి, ఖమ్మంమెట్టు, హైదరాబాద్ స్టేట్.

103. చంద్రకళా జ్యోతిషాలయం, పబ్లిషర్సు, పురిటిపెంట గజపతినగరం (పి.ఓ.)

104. జయనికేతన్, బుక్ పబ్లిషర్సు, మదరాసు - 7

105. విక్టోరియా బుక్ డిపో., మైలపూరు, మదరాసు - 4

106. ప్రజాస్టాన్ పబ్లిషర్సు, మైలపూరు, మదరాసు - 4

107. అంబికా బ్రదర్సు, బుక్ పబ్లిషర్సు, మైలపూరు, మదరాసు - 4

108. వేదం వెంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్సు, లింగిచెట్టి స్ట్రీట్ మదరాసు - 1

109. యస్. వి. గోపాల్ అండ్ కో., కృష్ణప్పనాయకన్ స్ట్రీట్, మదరాసు-1.

110. జాతీయ జ్ఞానమందిరం, రాయపేట, మదరాసు - 14.

111. భాషాపోషక గ్రంథమండలి, కొల్లూరు, గుంటూరుజిల్లా.

112. గోల్కొండ పబ్లికేషన్సు, హైదరాబాదు (దక్కన్).

113. జ్యోతిష్మయి ప్రచురణాలయం, గుడివాడ, కృష్ణాజిల్లా.

114. సుబోధినీ పబ్లిషింగ్ కంపెనీ, విజయవాడ.

115. ఫన్‌లాండ్ ఏజన్సీస్, బుక్ పబ్లిషర్సు, కర్నూలు.

116. కిశోర్ పబ్లికేషన్సు, రాయపేట, మదరాసు - 14.

117. విద్వాన్ వేదం వెంకటకృష్ణశర్మ, బుక్ పబ్లిషరు, 66 సామిపిళ్ళ స్ట్రీటు, చూళై, మదరాసు.

118. శ్రీ కె. రామకృష్ణయ్య, యం.ఎ., పబ్లిషరు, ట్రిప్లికేన్, మదరాసు - 3.

119. శ్రీకృష్ణా బ్రదర్సు, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు - 1.

120. ఆంధ్ర సరస్వతీ గ్రంథమాల, 34, గోశాక్ స్ట్రీట్, మదరాసు.

121. మొక్కపాటివారు, బుక్ పబ్లిషర్సు, పిఠాపురం.

122. ఇంటింటి విజ్ఞాన మాల, 16, జోన్సు స్ట్రీట్, మదరాసు-1

123. రామకృష్ణా ప్రెస్, పబ్లిషర్సు, బళ్ళారి.

124. శ్రీ తుమ్మల శీతారామమూర్తి చౌదరి, రామమోహన గ్రంథాలయ పబ్లిషర్సు; అప్పికట్ల, గుంటూరుజిల్లా.

125. కవితాసంస్థానం, తాడేపల్లి గూడెం, తూర్పుగోదావరిజిల్లా.

126. బాజ్జాయి పబ్లికేషన్సు, 13, హాబిబుల్లారోడ్, మదరాసు-17

127. స్వతంత్ర పబ్లికేషన్సు, గుడివాడ.

128. కేలూరు శివరామశాస్త్రి, చిరివాడ, కృష్ణాజిల్లా.

129. యంపరాల సూర్యనారాయణ శాస్త్రి, పబ్లిషరు, అమలాపురం, తూ॥గో॥

130. శాంతిసాహితి, ఏలూరు.

131. కమలప్రచురణలు, మైలపూరు, మదరాసు.

132. అరుణా ఏజన్సీస్, విజయవాడ.

133. సాహితీ ప్రపంచ, విజయవాడ.

134. ఆనందబాల ప్రచురణలు, గుంటూరు.

135. సర్వోదయ ప్రచురణలు, నరసరావుపేట, గుంటూరుజిల్లా.

136. వసంతపబ్లికేషన్సు, తెనాలి.

137. శారదా పీఠం, తణుకు, ప॥గో॥

138. శశికాపీఠం, రామచంద్రపురం, తూర్పుగోదావరి జిల్లా.

139. వ్యాసశర్మ, బుక్ పబ్లిషరు, యేర్పేడు, చిత్తూరు జిల్లా.

140. రవీంద్ర పబ్లిషింగు హౌస్, తణుకు, పశ్చిమగోదావరి జిల్లా.

141. శ్రీకోదండరామా సేవాసమాజం అంగలకుదురు, గుంటూరుజిల్లా.

142. పల్లెటూరిగ్రంథమండలి, తణుకు.

143. రాజ్యలక్ష్మి బుక్ డిపో, విజయవాడ.

144. సవ్యసాచి మందిరం, పబ్లిషర్సు, [illegible], గుంటూరు జిల్లా.



# ఆంధ్ర గ్రంథాలయోద్యమము


## శ్రీ పాతూరి నాగభూషణం

కార్యదర్శి, ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం,


ఆంధ్ర యశస్సుకు కారణభూతములైన ఉద్యమాలలో గ్రంథాలయోద్యమ మొకటి. ఇప్పటికి తెలిసిన సమాచారాన్ని బట్టి 1886 వ సం॥లో విశాఖపట్నంలో ప్రారంభమైన 'శ్రీ సరస్వతీ గ్రంథాలయము' తెలుగుదేశంలోని మొదటి మంది (పబ్లిక్ లైబ్రరీ) గ్రంథాలయముగ కన్పట్టుచున్నది. దీని స్థాపకులైన శ్రీ మంతిన ఆదినారాయణమూర్తిగారొక ప్రాథమికోపాధ్యాయులు. దీనికి పిమ్మట 19 ఏండ్లలోపల సరిగా 19 గ్రంథాలయములు వెలసినట్లు తెలియుచున్నది.

ఇవి యేవనగా:—

1889 శ్రీ సరస్వతీ విలాస మందిరము, పులివెందుల, కడపజిల్లా.

1890 సి. వి. ఎస్. లైబ్రరీ, ఒంగోలు.

1895 నాలెడ్జి క్లబ్, ఉండి, భీమవరము తాలూకా.

1897 వీరేశలింగ కవి సమాజము, కనుమదవల్లి, భీమవరము తాలూకా.

1898 శ్రీ నాళము కృష్ణారావుగారు స్థాపించిన గ్రంథాలయం, (పేరుపెట్టలేదు) రాజమహేంద్రవరము.

1899 రీడింగ్ క్లబ్, కొల్లూరు, తెనాలి తాలూకా.

1900 యంగ్ మెన్స్ లిటరరీ అసోసియేషన్, గుంటూరు.

1900 వీరేశలింగ పుస్తక భాండాగారము, రాజమహేంద్రవరము.

1900 సుబ్బరాయ గ్రంథాలయము, సిద్ధాంతము, పశ్చిమ గోదావరిజిల్లా.

1901 శ్రీ విక్టోరియా పురమందిరము – సోషల్ క్లబ్ లైబ్రరీ, నూజివీడు, కృష్ణాజిల్లా.

1901 శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయము, హైదరాబాదు.

1903 శ్రీ శారదా పుస్తక భాండాగారము, నాగిరెడ్డిపల్లె, అనంతపురంజిల్లా.

1903 స్టూడెంట్సు సెల్ఫ్ ఇంప్రూవింగు సొసైటీ గ్రంథాలయం, బెజవాడ.

1904 హిందూ యువజన సమాజ గ్రంథాలయము, ఏలూరు.

1904 రాజరాజనరేంద్ర భాషా నిలయము, హనుమకొండ.

1904 విద్యార్థిసంఘ గ్రంథాలయము, నెల్లూరు.

1905 ఆర్య బాల సమాజము, పెదపాలెము, తెనాలి తాలూకా.

1905 ఆంధ్ర భాషాభివర్ధనీ పుస్తక, పత్రికా పఠనశాల, సికిందరాబాదు.

1905 మిత్రమండలి గ్రంథాలయము, బళ్లారి.

ఈ విధంగా 1905 వ సం॥ ఆఖరున తెలుగునాట మంచి గ్రంథాలయములు 20 లెక్కకు వచ్చినవి. ఇవి క్రమముగ వృద్ధియై 1913 లో 123, 1920 లో 600, 1939 లో 779, 1940 లో 840 జాబితా చేయబడినవి. విశాలాంధ్రలో నేడు వీని సంఖ్య దాదాపు 2,000 ఉండ వచ్చునని తోచుచున్నది. వీని పూర్తి లెక్కలు సేకరించుట సాధ్యముకానందున, క్రొత్తగా ఏర్పడిన ఆంధ్రరాష్ట్రంలో ప్రభుత్వాదరం పొంది వేర్వేరు యాజమాన్యాలక్రింద నున్న గ్రంథాలయముల వివరాలు మాత్రం దిగువ పొందుపరచడమైనది. ఈ లెక్కలలో విద్యాసంస్థల యాజమాన్యంలోని గ్రంథాలయాలు చేర్చలేదు:

ఆంధ్రదేశంలో వివిధ సంస్థల యాజమాన్యంక్రింద పని చేస్తున్న మంచి గ్రంథాలయాలలో ముందుగా ప్రారంభమై నేటి వరకు సజీవంగా సాగుతున్నది, హెచ్చుగా ప్రైవేటు కమిటీల యాజమాన్యంలో నున్న గ్రంథాలయాలే. వీనిలో వేలకొలది పుస్తకాలు, చాల గ్రంథాలయాలకు స్వంత భవనాలు ఉన్నవి.

వీటికి పిమ్మట లెక్కకు వచ్చునవి పంచాయతీ గ్రంథాలయాలు. ఇవి లెక్కకు మిక్కిలిగా వున్నా వీని నిర్వాహకులకు సరియైన వసతులు లేనందువలనను, నిర్వాహకుల శ్రద్ధాలోపం చేతను యివి అభివృద్ధికరంగా నడవడంలేదు.

ఆంధ్రరాష్ట్రంలోని 35 మునిసిపాలిటీలలో నేడు దిగువ 22 మునిసిపాలిటీలు

| జిల్లా | గవర్నమెంటు | జిల్లాబోర్డు | మునిసిపాలిటీ | గ్రామ పంచాయతీ | సహకార సంఘం | గ్రామ సంఘం | ప్రైవేటు కమిటీ | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 1 | ... | 2 | 13 | ... | 9 | 3 | 28 |
| విశాఖపట్నం | 1 | ... | 1 | 5 | 1 | 18 | 7 | 33 |
| తూర్పుగోదావరి | 21 | ... | 5 | 66 | 3 | 1 | 29 | 125 |
| పశ్చిమగోదావరి | ... | 35 | 1 | 45 | 3 | 5 | 21 | 110 |
| కృష్ణా | ... | ... | 5 | 41 | ... | 2 | 32 | 180 |
| గుంటూరు | ... | ... | 4 | 40 | 3 | 12 | 59 | 118 |
| నెల్లూరు | ... | ... | 1 | 36 | 1 | 51 | 15 | 104 |
| చిత్తూరు | 1 | ... | 2 | 77 | 3 | 52 | 4 | 139 |
| కడప | 1 | 1 | ... | 17 | 3 | 19 | 1 | 43 |
| అనంతపురం | 1 | 2 | 5 | 105 | 2 | 21 | 1 | 137 |
| కర్నూలు | 2 | 4 | 2 | 42 | 2 | 35 | 15 | 102 |
| మొత్తం | 28 | 42 | 28 | 487 | 21 | 225 | 187 | 1,018 |

స్వయంగా గ్రంథాలయాలను నిర్వహించుచున్నవి. సుశిక్షితులైన భాండాగారులు లేక, నిర్వహణలోపంచేత యివికూడ తగినంతగా ప్రజల కుపయోగపడడంలేదు.

శ్రీకాకుళం, పాలూరు (శ్రీకాకుళం జిల్లా).

విజయనగరం (విశాఖపట్నంజిల్లా).

కాకినాడ, పెద్దాపురం, అమలాపురం (తూర్పుగోదావరిజిల్లా).

పాలకొల్లు (పశ్చిమగోదావరిజిల్లా).

గుడివాడ, విజయవాడ,(కృష్ణాజిల్లా).

తెనాలి, గుంటూరు, చీరాల, నరసరావుపేట, బాపట్ల (గుంటూరుజిల్లా).

నెల్లూరు (నెల్లూరుజిల్లా).

చిత్తూరు, తిరుపతి (చిత్తూరుజిల్లా).

తాడిపత్రి, హిందూపురం, అనంతపురం, గుంతకల్లు (అనంతపురంజిల్లా).

కర్నూలు (కర్నూలుజిల్లా).

నేడు పశ్చిమ గోదావరిజిల్లాలో 35, అనంతపురంజిల్లాలో 2, కర్నూలుజిల్లాలో (కొత్తగా చేరిన బళ్ళారిప్రాంతాలను కలుపుకొని) 4, కడపజిల్లాలో 1 జిల్లా బోర్డులు నడుపుతున్న గ్రంథాలయాలున్నవి.

ఆంధ్ర జిల్లాలలోని కొన్ని కేంద్ర సహకారబ్యాంకులు, యితర సహకార సంఘాలు అచ్చటచ్చట గ్రంథాలయాలను నిర్వహించుచున్నవి. అధికవసతి బాగా వుండి స్థానికంగా యితర గ్రంథాలయాలు లేనితావులలో వీనినభివృద్ధి చేయుట మవసరం.

మద్యనిషేధ ప్రాంతాలలో ప్రజల కాలక్షేపంకొరకు గ్రామసంఘాల నిర్మాణాన్ని చెన్నరాష్ట్ర ప్రభుత్వం ప్రోత్సహించినది. ఇట్లేర్పడిన గ్రామసంఘాల ఆశయాలలో గ్రంథాలయ నిర్వహణం ముఖ్యంగా యెంచబడినది. ఆంధ్ర రాష్ట్రంలో 225 గ్రామసంఘాలు ప్రభుత్వామోదాన్ని పొందియుండగా, 1952-53 వ సం॥లో అన్నిజిల్లాలమీద కలిపి 98 గ్రామసంఘాల గ్రంథాలయాలకు రు. 2,450 లకు ప్రభుత్వ విరాళాలు ముట్టినవి.

ఒక్కొక్క పట్టణంలోగాని, గ్రామంలోగాని అన్ని వర్గాలు చేరి స్థాపించుకున్న సమ్మిడి మంది గ్రంథాలయాలకు తోడుగా, ప్రత్యేకవర్గాలు తమతమ ఉపయోగం కొరకు ప్రారంభించిన గ్రంథాలయాలుకూడ మనరాష్ట్రంలో కొన్ని యున్నవి. వీటిలో ముందుగా పేర్కొనదగినవి, స్త్రీల గ్రంథాలయాలు. ఆంధ్రదేశంలో మొట్టమొదటగా స్థాపించిన స్త్రీల గ్రంథాలయం గుంటూరులోని స్త్రీ సనాతనధర్మ మండలియని తెలియుచున్నది. తర్వాత క్రమంగా బరంపురం, గుంటూరు (మరియొకటి), విజయనగరం 2, కాకినాడ, గుడివాడ (కృష్ణాజిల్లా), బందరులో యివి బయలుదేరినవి. వీనిలో కొన్ని కాలవాహినిలో కలసినవి. క్రొత్తవి కొన్ని బయలుదేరినవి. ప్రస్తుతం వివిధపట్టణములలో దిగువగ్రంథాలయాలు, స్త్రీలచే స్త్రీలకొరకు నిర్వహింపబడుచున్నవి.

మహిళాసంఘం లైబ్రరీ, శ్రీకాకుళం.

బాలసరస్వతీ స్త్రీ సమాజము, తణుకు.

సాహిత్య సమితి శారదా గ్రంథాలయం, తాడేపల్లిగూడెం.

భారత మహిళామండలి, బెజవాడ.

మహాలక్ష్మి పఠన మందిరము, గుంటూరు.

శ్రీ హితైషిణీ మండలి, బాపట్ల.

అనంతపురం.

నిర్మలాదేవి గ్రంథాలయము, ఆంధ్ర మహిళాసభ, మదరాసు.

ప్రత్యేక గ్రంథాలయస్థాపనకు పూనిన మరోవర్గం మహమ్మదీయులు. వీరి మాతృభాషయగు ఉర్దూలో పుస్తకాలు, పత్రికలు సేకరించి వీరు గ్రంథాలయ సేవచేయుచున్నారు. జనసామాన్యంలో విద్యాసక్తి చాల స్వల్పముగానున్నందున వీరు బెజవాడ, గుంటూరు, నెల్లూరు, కర్నూలు వంటి కొన్ని పట్టణములలో మాత్రమే గ్రంథాలయములను స్థాపించుకో గలిగారు.

ఆంధ్ర దేశంలో హరిజనులు కూడ అక్కడక్కడ ప్రత్యేక గ్రంథాలయములను నెలకొల్పినారు. కాని వీని సంఖ్య చాల స్వల్పము. ఇవి ప్రత్యేకముగ అభివృద్ధియగుటకు తగిన అవకాశములు కూడ కనబడవు.

ఆంధ్రదేశంలోని యువజన సంఘాల వారు వివిధజిల్లాలలో 1936-41 సంవత్సరాలమధ్య తమసంఘ సభ్యులఉపయోగం కొరకు 250 గ్రామ గ్రంథాలయములను నిర్వహించినట్లు తెలియుచున్నది. ఈ గ్రంథాలయాలలో ఒక్కొక్క దానిలో వివిధ వర్గాలకు చెందిన గ్రంథాలు 50 మొదలు 200 వరకు చేర్చినారు. ఈ గ్రంథాలయాల పక్షాన పుస్తకాలు, పత్రికలు చదివి వినిపించే యేర్పాటు కూడ కొంతకాలం సాగింది.

వైశ్యుల గ్రంథాలయాలు ఆంధ్ర రాష్ట్రంలోని చాలపట్టణాలలో వెలసినవి. వీనిని స్థాపించినవారు, పోషించుచువారు వైశ్యశ్రేష్ఠులను గాంచోట్ల ఇవి అన్ని వర్గాలకు ఉపయోగపడుచున్నవి. గ్రంథాలయాలవిషయంలో ఏలూరులోని హిందూ యువజన సంఘ గ్రంథాలయం భవన దాత కీ. శే. మోతే గంగరాజుగారు, పేట పాలెములోని సారస్వతనికేతన స్థాపకులు, శాశ్వత పోషకులు నగు కీ. శే. ఊటుకూరు వెంకట సుబ్బరాయశ్రేష్ఠిగారు చూపిన త్యాగం ఆదర్శప్రాయమైనది.

ఆంధ్ర గ్రంథాలయోద్యమ వికాసానికి కారణభూతమైన ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం 1914 వ సం॥ లో స్థాపించబడినది. ఇందు నిమిత్తం 1914 ఏప్రిల్ 10వ తేదీన కీ. శే. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి అధ్యక్షతను బెజవాడలో జరిగిన ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగార మహాసభలో యీ సంఘ మేర్పాటుచేయబడినది. గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారిజిల్లాల నుండియు, హైదరాబాదు సంస్థానము నుండియు 60 గ్రంథాలయముల నుండి 200 మంది ప్రతినిధులీసభకు హాజరైరి. కీ. శే. కొమర్రాజు లక్ష్మణరావుపంతులు గారీ సంఘమునకు మొదటి అధ్యక్షులు. శ్రీయుతులు అయ్యంకి వెంకటరమణయ్య, నాళం కృష్ణారావుగార్లు కార్యదర్శులు. తదాదిగ వివిధ పట్టణములలోను, గ్రామములలోను, వందలకొలది గ్రంథాలయాల స్థాపనకీసంఘము ప్రత్యక్షముగను, పరోక్షముగాను పనిచేసినది. ఆంధ్రుల సమిష్టి వికాసమునకు పాటుబడినది. పెద్ద ఎత్తున గ్రంథాలయోద్యమ ప్రచారంకొరకు వివిధ ప్రాంతాలలో ఏటేట గ్రామ, జిల్లా, తాలూకా గ్రంథాలయ మహాసభ లను యాత్రలను, ప్రదర్శనములను

నిర్వహించినది. ప్రభుత్వ గ్రంథాలయాలకు విరాళము లిచ్చుటకు కృషిసల్పినది. స్థానిక సంస్థలు, తమతమ యేరియాలలోని గ్రంథాలయాలకు సహాయపడుటకును, స్వయముగ గ్రంథాలయములను స్థాపించి నిర్వహించుటకును, ప్రభుత్వామోదమును సంపాదించినది. ఉద్యమ నిర్వాహకులకు కావలసిన విజ్ఞానాన్ని వారి కందించే నిమిత్తం కొన్ని పుస్తకాలను ప్రచురించినది. ప్రత్యేక పత్రికలను (గ్రంథాలయ సర్వస్వము, ఆంధ్ర గ్రంథాలయము) నడపినది. గ్రంథ భాండాగారాలకు శిక్షణ తరగతులను నిర్వహించినది. గ్రంథాలయాల రిజిస్ట్రేషను, ప్రభుత్వ విరాళాలు, గ్రంథ వరణం మొదలైన విషయాలనుగూర్చి కార్యకర్తలకు సలహాలనిచ్చినది. రాయలసీమలోను, తెలంగాణములోను శాఖా కార్యాలయాలను, కోస్తా జిల్లాలలో మండల గ్రంథాలయ సంఘములను ఏర్పరచినది. కేంద్ర కార్యాలయంనిమిత్తం పటమటలంకలో ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టువారి సహాయంతో శ్రీ సర్వోత్తమ భవనమును నిర్మించుకొన్నది. నిరంతరాయమైన దీని కృషిని ప్రభుత్వం గుర్తించునట్లు చేసుకొన్నది. ఆంధ్ర రాష్ట్రంలోని జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, గ్రామ పంచాయితులు సంఘ సభ్యులుగ చేరుటకు ప్రభుత్వామోదాన్ని సంపాదించినది. గ్రంథాలయ శాసనంద్వారా యేర్పాటగు రాష్ట్ర గ్రంథాలయ కమిటీలో ప్రాతినిధ్యమును పొందినది. దీని ప్రచురణము (పత్రిక పుస్తకా)లను గ్రంథాలయాలకు ప్రభుత్వముచే సిఫారసు చేయించుకొన్నది. రెండేండ్లనుండి గ్రంథాలయ వసంతోత్సవాల నిర్వహణమునకు పూనినది. ఇంతవరకు ప్రత్యేక యేర్పాటైయున్న వయోజన విద్యాశాఖను పునర్నిర్మాణం చేస్తూ, దీనికి తోడుగా ప్రచార నిర్వహణశాఖల యేర్పాటుకు పూనుకొన్నది. ఉదారులైన గ్రంథకర్తలు, ప్రకాశకులు గ్రంథాలయాల కుచితంగా యివ్వగోరిన తమ ప్రచురణలను ఎప్పటికప్పుడు గ్రంథాలయాలకంద జేయుటకు తోడ్పడినది. గడచిన నలుబదేండ్లలో ఆంధ్ర ప్రముఖు లనేకులు దీని కార్యక్రమములలో పాల్గొని సహాయపడిరి. విజయమునకు దిగువవారు దీని పాలక వర్గముగా ఎన్నికైనారు:

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు, ఎం. ఏ.—అధ్యక్షులు; శ్రీమతి పర్సా శారదాదేవి, శ్రీయుతులు దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి, నాగినేని వెంకయ్య, చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాద మూర్తిరాజుగార్లు — ఉపాధ్యక్షులు; శ్రీ వల్లూరు కేశవరావుగారు— కోశాధిపతి; శ్రీ పాతూరి నాగభూషణంగారు – కార్యదర్శి; శ్రీయుతులు కోదాటి నారాయణరావు, ఆర్. కె. రామలింగారెడ్డి, బండి నాగేశ్వరరావు, మహారాజ జగన్మోహనరావుగార్లు - సహాయ కార్యదర్శులు; శ్రీయుతులు వి. వి. రమణ, కె. హరికృష్ణచౌదరి, తెన్నేటి రామశంకరం, నాగులపల్లి సీతారామయ్య, అడుసుమల్లి శ్రీనివాసరావు, అయ్యంకి వెంకటరమణయ్య, కొమ్మూరి సీతారామయ్య, రాగి నరసింహులు, బి. వెంకటరామారావు, వి. వీరబ్రహ్మం, కురుగంటి తిరుపతిరెడ్డి, సి. చిరంజీవులునాయుడు, కె. వీరప్పచారి, పప్పూరి రామాచార్యులుగార్లు—సభ్యులు.

ప్రభుత్వ సహాయం లేకున్నా మన ఉద్యమ నాయకులు అఖిల భారతోద్యమాన్ని ప్రారంభించి చాలకాలం దీనికి నాయకత్వం వహించినారు. మనవారు 1919 వ సం॥లో మదరాసులో ప్రథమ అఖిలభారత గ్రంథాలయ మహాసభను జరిపి, అఖిలభారత మంది గ్రంథాలయాల సంఘమును యేర్పరిచినారు. దీని పక్షాన దేశం నలుమూలల 8 మహాసభలను, కొన్ని ప్రదర్శనములను, ఆంగ్లంలో 'ఇండియన్ లైబ్రరీ జర్నల్' అను పత్రికను నడిపినారు. ఈ సంఘ కృషి ఫలితంగా బెంగాలు, మదరాసు, పంజాబు మున్నగు రాష్ట్రాలలో రాష్ట్రీయ గ్రంథాలయ సంఘము లేర్పడినవి. (తదుపరి కొంత కాలానికి, దేశంలోని ప్రముఖ గ్రంథాలయాల భాండాగారులు కలకత్తాలో సమావేశమై భారత గ్రంథాలయ సంఘమును ప్రారంభించినారు. ఇది దినదినాభివృద్ధి చెందడంతో మనం స్థాపించిన సంఘం కొంచెం మరుగునపడినదైనది.)

మన గ్రంథాలయోద్యమంలో ఇటీవలి విశేషం మదరాసు పౌర గ్రంథాలయముల శాసననిర్మాణం. 1950 సం॥ ఏప్రిల్ 1 వ తేదీనుండి యిది అమలులోకి వచ్చినది. గడచిన 3 సం॥లలో ప్రభుత్వానికి సలహా యిచ్చుటకొరకు రాష్ట్రీయ గ్రంథాలయ కమిటీయు, జిల్లాలలో కార్య నిర్వహణముకొరకు స్థానిక గ్రంథాలయ సంస్థలు యేర్పాటు చేయబడినవి. రాష్ట్ర వ్యాప్తంగా గ్రంథాలయాల డైరెక్టరు హోదాలో విద్యాశాఖ డైరెక్టరు, జిల్లాలలో స్థానిక గ్రంథాలయ సంస్థల కార్యదర్శి హోదాలో జిల్లా విద్యాశాఖాధికారులు యీ చట్ట నిర్వహణంలో ప్రధాన పాత్రను వహించినారు. జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలు, గ్రామ పంచాయితీలు తమ తమ యేరియాలలో ఆస్తి పన్ను లేదా యింటి పన్నుపై రూపాయకు 6 పైసలు వంతున వసూలు చేసి యిచ్చు సెస్సులతో, స్థానిక గ్రంథాలయ సంస్థలు జిల్లా కేంద్ర గ్రంథాలయాలను, అచ్చటచ్చట శాఖా గ్రంథాలయాలను స్థాపించుటకు మించి ఉద్యమ వ్యాప్తికి చట్టముపయోగపడినది చాల స్వల్పము. 19 సెక్షనులతో ప్రత్యేక శాసనం, 5 అధ్యాయాలతో 49 నిబంధనలు ఏర్పడినా, గ్రంథాలయాలకు ప్రభుత్వమిచ్చే విరాళాల విషయమై యిప్పటి కొక విధానమూ రూపొందలేదు. స్థానిక గ్రంథాలయ సంస్థలలో గ్రంథాలయాల ప్రాతినిధ్యము చాలినంతగా లేదు. ఈ స్వల్ప ప్రాతినిధ్యముకూడ విద్యాశాఖాధికారుల నామినేషను ద్వారా యేర్పాటు చేయబడినది.

• గ్రంథాలయ చట్టములో విధింపబడిన షరతులలో, రాష్ట్రం మొత్తానికి కేంద్ర గ్రంథాలయ నిర్మాణ మొకటి. మనము మదరాసుతో కలసియున్నప్పుడు కన్నెమరా గ్రంథాలయం మనకు కేంద్ర గ్రంథాలయముగ నుండినది. ఆంధ్రరాష్ట్ర విభజనతో యిది మదరాసులోనే ఉండిపోయినది. దీనిలో మనకు భాగముకూడ రానట్లు వినుచున్నాము. ప్రారంభంలో కొన్ని లక్షలు వెచ్చిస్తేగాని క్రొత్తగా దీనిని నిర్మాణం చేయడం సాధ్యంకాదు. స్థల నిర్ణయ విషయంలోకూడ దీనికి రాజకీయాలు అడ్డురాకుండా చూడవలసి యున్నది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం

వారి సూచనలను ప్రభుత్వం ఆమోదించే పక్షంలో, దీనిని ఆదర్శ సంస్థగా తీర్చి దిద్దుట కవకాశమున్నది.

ఆంధ్ర గ్రంథాలయోద్యమం సాధించిన కార్యాలలో ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు నిర్మాణ మొకటి. ఈ ఉద్యమానికి స్థిరమైన వసతులను కల్పించడం దీని నిర్మాతల ఉద్దేశం. పటమట లంక వాస్తవ్యులు శ్రీ కొమ్మా సీతారామయ్య గారి వితరణ మూలంగా యిది యేర్పడినది. శ్రీ సర్వోత్తమ భవననిర్మాణంతోపాటు, తెలుగులోని ఉత్తమ గ్రంథాల ప్రచారం నిమిత్తం గ్రంథాలయ పుస్తకశాల నిర్వహణము, పూజ్యులు శ్రీ గోటేటి జోగిరాజు, శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగార్ల వ్యవసాయము, వయోజన విద్యలకు సంబంధించిన గ్రంథముల ప్రచురణమునకిది పూనుకున్నది. గ్రంథాలయ పుస్తకశాలద్వారాకూడ ఉత్తమ గ్రంథములు కొన్ని ప్రకటింపబడినవి.

ఇతరత్రా ప్రకటితమైన గ్రంథాలయ వాఙ్మయంలో పాతూరివారి గ్రంథాలయ శాస్త్ర ప్రథమ పాఠములు (ప్రచురణ సేవాశ్రమం); గ్రంథాలయములు-వ్యాసావళి (ప్రచురణ: ఆంధ్ర సారస్వతపరిషత్తు); యాదగిరి లక్ష్మీవెంకటరమణగారి ధర్మ గ్రంథాలయం పత్రిక; కీ. శే. ప్రతాపరెడ్డిగారి 'గ్రంథాలయోద్యమము' (ప్రచురణ: దేశోద్ధారక గ్రంథమాల) ముఖ్యమైనవి.

మన ఉద్యమంలో వయోజన విద్యకు ప్రధాన స్థానమున్నది. గ్రంథాలయాలకు ప్రబల శత్రువైన నిరక్షరాస్యతను పారద్రోలుటకు మొదటినుండీ మన గ్రంథాలయాలు, రాత్రి పాఠశాలలను స్థాపించి నడుపుచు వచ్చినవి. ప్రజలలో విజ్ఞానమును పెంపొందించుటకు పురాణ శ్రవణము, పత్రికా పఠనము, వైజ్ఞానిక గోష్ఠులు, ప్రసంగాల నేర్పాటు చేసినవి. ఇటీవల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సమాజ విద్యా వ్యాప్తికై చేయు ప్రయత్నములకు దోహదంగా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము, వయోజన విద్యకు ప్రత్యేక శాఖను నెలకొల్పి పనిచేయుచున్నది. వయోజన విద్యా కార్యకర్తలకు తాత్కాలిక శిక్షణను నిచ్చుచున్నది. గ్రంథాలయ సర్వస్వము (సంఘ మాస పత్రిక)లో వయోజన విద్యా విషయములకు పూర్తి ప్రాతినిధ్య మొసంగుచున్నది.

ఈ విధంగా నలుబదేండ్లకు పైనుండి నడచుచున్న యీ ఉద్యమం ఆంధ్రులలో భాషాభివృద్ధికి, జ్ఞానాభివృద్ధికి కృషి సల్పుటయేగాక రాజకీయ, సాంఘిక విషయములలో ఎప్పటికప్పుడు ప్రజలను పురికొల్పి దేశభక్తి పూరితులనుగా చేసినది. ఈ ఉద్యమ కృషి ఫలితంగా దేశంలోని యువకులు, యువతులు దేశభక్తి, మానవ సేవ ప్రేరితులై అనేక ఘనకార్యములను చేయగలిగినారు. వీరేశలింగంగారి సాంఘికోద్యమము, వంగదేశ విభజన ఫలితంగా బయలుదేరిన వందేమాతరోద్యమము, అనిబిసెంటమ్మ హోంరూలు ఉద్యమము, మహాత్ముని సహాయనిరాకరణ సత్యాగ్రహ హరిజనోద్యమముల ప్రభావం గ్రంథాలయాల ద్వారానే హెచ్చుగా ప్రచారమైనట్లు మనకు ప్రత్యక్ష సాక్ష్యమున్నది. దీనికి కారణం మరేమీకాదు. ఆంధ్రపితామహులు శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు సెలవిచ్చినట్లు "ఒక్క గ్రామములో గ్రంథాలయ మున్నదంటే దేశహితం

కోరకు పరితపించే యువకహృదయమొకటి అక్కడ వుండటంచేతనే. ఐయిటికి కనబడకుండగానే యీ ఉద్యమం యింతగా వికసించడానికి అవకాశం లభించినది. కడపటకు నేడు మనం వాంఛిస్తున్న విశాలాంధ్ర నిర్మాణాన్నికూడ సాత్త్విక పద్ధతులతో సాధించగల అవకాశం గ్రంథాలయోద్యమానికే కలదన్న అతిశయోక్తికాదు.

ఆంధ్ర దేశంలోని కొన్ని ముఖ్య గ్రంథాలయాల వివరాలు, గ్రంథాలయోద్యమ ప్రస్తుత పరిస్థితిని సూచించగలవను తలపుతో ఇందు చేర్చబడినవి. మంచి గ్రంథాలయం కాకపోయినా ఆంధ్రుల విద్యాపీఠమైన ఆంధ్రవిశ్వకళా పరిషద్గ్రంథాలయ వివరములను కూడ యిచ్చుచున్నాము. 4000 పుస్తకాలకు పైన ఉన్న గ్రంథాలయముల సమాచారమును (ఇంకా చిన్న చిన్న గ్రంథాలయములు చాలా ఉన్నవి)మాత్రమిచ్చుట సేకరించడమైనది. ఒకటి రెండు గ్రంథాలయాల ముఖ్యవిషయాలు మాత్రమివ్వడమైనది.

1. ఆంధ్ర యూనివర్సిటీ లైబ్రరీ, వాల్తేరు; సభ్యులు - పురుషులు 1740, స్త్రీలు 60. పుస్తకములు మొత్తం 58,823. సం॥లో చదువబడినవి సుమారు 2 లక్షలు; దినసరి హాజరు 500. భాండాగారి శ్రీ అయ్యంకి రామకృష్ణారావుగారు బి. ఏ., యఫ్. యల్. యే., రెండేండ్లకొక పర్యాయం లైబ్రరీ డిప్లొమా కోర్సులు నడుపుచున్నారు.

2. మహారాజా సర్. జి. యన్. గజపతిరావు హిందూ పఠన మందిరము, విశాఖపట్టణము. స్థాపన 1917; పరిపాలన రిజిష్టర్డు కమిటీ; సభ్యులు- పురుషులు 285, స్త్రీలు 21; పుస్తకాలు 11,889; సం॥లో చదువబడినవి 24,786; స్వంత భవనము లక్ష రూపాయల విలువ గలది; సిబ్బంది - గ్రంథ భాండాగారితో కలిపి నలుగురు; ఆదాయము రు. 3,423 లు, వ్యయము 2,408-1-9.

3. శ్రీ శారదా గ్రంథాలయము, అనకాపల్లి; స్థాపన 1936; పరిపాలన రిజిష్టర్డు కమిటీ. సభ్యులు 212; పుస్తకాలు 7,328; సం॥లో చదవబడినవి 6,485; పత్రికలు 13; దినసరి హాజరు 54; స్వంత భవనమున్నది. సిబ్బంది - భాండాగారితో ముగ్గురు, భాండాగారి యస్.యస్.యల్.సి. ఆదాయం రు. 3,219—13—0, వ్యయం రు. 3,051—3—0.

4. శ్రీ సూర్యరాయ విద్యానంద గ్రంథాలయము, పిఠాపురము; 1915, 1917 లలో స్థాపించిన రెండు గ్రంథాలయాలు 1925 లో సమ్మిళితమైనవి. పరిపాలన రిజిష్టర్డుకమిటీ; సభ్యులు 224; పుస్తకాలు 12,350. సం॥లో చదువబడినవి 50,000 (సుమారు); దినసరి సగటు హాజరు 40; స్వంత భవనమున్నది. (విలువ రు.4 వేలు) సిబ్బంది యస్. యస్.యల్. సి. చదివిన గుమాస్తా, గౌరవభాండాగారి, మరొక చిన్న నౌకరు; ఆదాయం రు.872-7-9, వ్యయం రు.787-2-9. ఇతర కార్యక్రమాలు : మహాకవుల, ప్రవక్తల, మహాత్ముల జయంతులు, వర్ధంతులు, శారద నవరాత్రులు, వసంతోత్సవములు, జాతీయ పండుగలు జరుపుట, లిఖిత పత్రికను నిర్వహించుట.

5. శ్రీ కె. ఆర్. ఎ. కె. లైబ్రరీ, కాకినాడ; స్థాపన 1913; పరి. రిజి.కమిటీ; పుస్తకాలు 7,810; పాఠకులు 240. సం॥లో

చదు. 10,000; పత్రికలు 6; సిబ్బంది గుమాస్తాతో నలుగురు; ఆదాయం రు. 2,073, వ్యయం రు. 2,010.

6. శ్రీ ఈశ్వర పుస్తకభాండాగారము, కాకినాడ; స్థాపన 1916; పరి. రిజి. కమిటీ; పుస్త. 7,836, సం. లో చదు. 31,700; పత్రి. 31; సిబ్బంది గుమాస్తాతో నలుగురు; ఆదాయం రు. 1,750, వ్యయం రు. 1,774.

7. శ్రీ గౌతమీ లైబ్రరీ, రాజమహేంద్రవరము; స్థాపన 1898; పరి. రిజి. కమిటీ; పుస్త. 28,752. పాఠకులు ?,23; సం॥లో చదు. 5,737 స్వంత భవనమున్నది. సిబ్బంది గుమాస్తాతో నలుగురు; ఆదాయం రు.1,341, వ్యయం రు. 1,367.

8. శ్రీ రామబాలభక్త పుస్తకభాండాగారము, రాజమహేంద్రవరము; స్థాపన 1920; పరి. రిజిష్టర్డు కమిటీ. సభ్యులు_223. పుస్త. 7,313. సం॥లో చదు. 15,643, దిన హాజరు 83, స్వంత భవనము (విలువ రు. 9 వేలు). సిబ్బంది ముగ్గురు. ఆదాయం రు. 3307_8_9, వ్యయం రు. 3191. ఇతర కార్యక్రమాలు : చదరంగము ఆటలు, సారస్వత సభలు, కవుల జన్మదినోత్సవాలు, గణపతి నవరాత్రి పూజలు.

9. వై. యం. హెచ్. ఎ. సెంట్రల్ లైబ్రరీ, ఏలూరు. స్థాపన 1904. పరిపాలన ప. గో. జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి యువకుల అప్పగించినారు. సభ్యులు _ పు. 134, స్త్రీ 1, పుస్త. 9,128. సం॥లో చదు. 18,988; పాఠకులు ___ పు. 100, స్త్రీ 5, పి. 55, పత్రికలు 26, దినహాజరు 150, స్వంత భవనము (విలువ రు. 30 వేలు). సిబ్బంది మేనేజరు (యస్. యల్. సి.) తో ముగ్గురు, ఆదాయం రు. 6450_13_3. మొత్తం ఖర్చు.

10. శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాంధ్ర గ్రంథాలయము, విజయవాడ; స్థాపన 1920, పరి. రిజి. కమిటీ. సభ్యులు_186, పుస్త. 10,384, సం. లో చదు. 12,288. పత్రికలు 30, దిన హాజరు 90, స్వంతభవనం (విలువ రు. 25 వేలు). సిబ్బంది గ్రంథ భాండాగారి (సెకండరీ గ్రేడు) యిద్దరు సహాయకులు. ఆదాయం రు. 2247_1_9, వ్యయం రు. 2339_9_3. అప్పుడప్పుడు ప్రజాసంస్థల సమావేశములు గ్రంథాలయంలో జరుగుచుండును.

11. శ్రీ రామమోహన ధర్మ పుస్తక భాండాగారము, విజయవాడ; స్థాపన 1911 పరి. రిజి. కమిటీ. సభ్యులు _ 275. పుస్త. 9,472, సం॥లోచదు. 10,178, దిన హాజరు 100 కు పైన. స్వంత భవనము (విలువ రు 60 వేలు). సిబ్బంది గౌరవ భాండాగారి, గుమాస్తా, అటెండరు. ఆదా. రు. 3,328_15_2, వ్యయం రు. 2,780_13_3 సభలు, పాటకచ్చేరీలు, నాటకముల ప్రదర్శనముల కుపయోగించు ప్రత్యేకహాలు కలదు.

12. శ్రీ వెలదండ్ల హనుమంతరాయ గ్రంథాలయము, విజయవాడ. స్థాపన 1934, పరి. రిజి. కమిటీ. పుస్త. 7,317, పాఠ. 209 సం॥ లో చదు. 14,639. పత్రి. 34. సిబ్బంది గుమాస్తాతో ఐదుగురు, ఆదా రు. 4,753, వ్యయం రు. 5,027.

13. సారస్వత నికేతనము, వేటపాలెము. స్థాపన 1918, పరి. రిజి. కమిటీ. పుస్త. 19,967, సం॥ లో చదు. 16,536, గ్రంథ పాఠకులు పు. 1160

పాఠకులు 30, పత్రి. 26, దిన. హాజరు 30. స్వంత భవనం (విలువ రు 9 వేలు). గౌరవ భాండాగారి ఆం.దే.గ్రం.సంఘము వారి గ్రం. ప్రవేశిక పరీక్ష నిచ్చినారు. ఆదాయం రు 1400, వ్యయం రు 1300, ఇతర కార్య. - సాహిత్య సమావేశాలు, నాటకములు, నాటికలు.

19. ఆంధ్రేతిహాస పరిశోధక మండలి రాజమహేంద్రవరము. స్థాపన 1922, పరి. రిజి. కమిటీ. సభ్యులు 160, పు. 5000, సం॥ లో చదు. 5000, పత్రి. 82 దిన. హాజరు 14. స్వంతభవనం (విలువ రు 25 వేలు), సిబ్బంది - గౌరవ భాండాగారి, గుమాస్తా (యస్.యస్.యల్.సి.). ఆదా. సాలుసరి రు 3500, అంతా ఖర్చు. ఇతర కార్య. ఇంగ్లీషు జర్నలు తెలుగు చరిత్ర సంచికల ప్రచురణ; మ్యూజియం, శాఖలు, వస్తుప్రదర్శనముల నిర్వహణ.

20. మునిసిపల్ గ్రంథాలయము, అమలాపురము. స్థాపన 1932, సభ్యులు 300, పుస్త. 6603, సం. లో చదు. 4756, పత్రి. 32, దిన. హాజరు 180. స్వంత భవనము (విలువ రు 5 వేలు). భాండాగారి (యస్. యస్. యల్. సి.), ఆదా. రు 956, వ్యయము రు 4518.

21. మునిసిపల్ లైబ్రరీ, గుంటూరు. పుస్త. 6,170, గ్రంథ పాఠ 456, సం॥లో చదు. 53,600, పత్రి. 62. స్వంత భవన మున్నది. సిబ్బంది యిద్దరు (గుమాస్తా, అటెండరు). ఆదా. రు 150, వ్యయం రు 2,781.

22. మునిసిపల్ లైబ్రరీ, తెనాలి. స్థాపన 1929. పుస్త. 5,180, పాఠకులు 1,050, సం॥ లో చదు. 4,950, పత్రి. 22. స్వంత భవన మున్నది. సిబ్బంది 1 గుమాస్తా. ఆదా. రు 150. వ్యయం రు 2,182.

23. మునిసిపల్ లైబ్రరీ, తిరుపతి. పుస్త. 5,318, సం॥ లో చదు. 3,743. పత్రికలు 25, సిబ్బంది 1 గుమాస్తా. ఆదాయం రు 243, వ్యయం రు 2,612.

24. శ్రీ రామచంద్ర గ్రంథాలయము పోడూరు, ప. గోదావరి, స్థాపన 1914. పరి. రిజి. కమిటీ. సభ్యులు 146, పుస్త. 6277, సం॥ లో చదు. 3687, పత్రి. 21 దిన. హాజరు 31. స్వంత భవనం (విలువ రు 3650). ఆదా. రు 579-1-6, వ్యయం రు 579-1-6.

25. శ్రీ భాషాసంవర్ధిని సంఘము, అమృతలూరు, తెనాలి తాలూకా, స్థాపన 1911. పరి. 15-9-53 నుండి గుంటూరు జిల్లా లోకల్ లైబ్రరీ అథారిటీకి అప్పగించ బడినది. పుస్త. 6500. సం॥ లో చదు. 1500, గ్రం. పాఠ. పు. 50, స్త్రీ. 25, పి. 25, పత్రి. 12, దిన. హాజరు 50. స్వంత భవనము (విలువ 50 వేలు); భాండాగారి (యస్. యస్. యల్. సి).

26. శ్రీ రాజరాజనరేంద్ర గ్రంథాలయము, గోవాడ, తెనాలితాలూకా స్థాపన 1918, పరి. రిజి. కమిటీ. సభ్యులు 130; పుస్త 5289, సం॥లో చదు. 6000, (దినసరి) గ్రం. పాఠ. పు. 14, స్త్రీ. 4, పి. 2, పత్రికలు 24. స్వంతభవనము (విలువ రు 6 వేలు). సిబ్బంది: గ్రంథ భాండాగారి (మాయ్యర్ గ్రేడు). ఆదా. రు.1,000, ఖర్చు రు.1,000. ఇతర కార్య. వ. విజ్ఞానప్రచారము, వైజ్ఞానిక కార్యక్రమాలు, బాలబాలికల ఆటల పోటీల నిర్వహణ.

27. సేవాశ్రమవాణీ మందిరము, పెదపాలెము, తెనాలితాలూకా, స్థాపన 1919, మేనె. సేవాశ్రమము (రిజిష్టర్డు). పుస్తకాలు 7000 కు పైన. చుట్టుపట్టు 40 గ్రామాలకు కేంద్రగ్రంథాలయముగ పనిచేసినది. బ్యాంకు కాలువపై బోటు గ్రంథాలయములను 7 ఏండ్లపాటు సాగించినది. 1905 వ సం॥లో స్థాపించబడిన ఆర్యబాల సమాజ భవనములోనున్నది. పఠనాలయము ఆర్యబాల సమాజపక్షమునను, గ్రంథాలయం సేవాశ్రమ పక్షమునను నడుపబడుచున్నవి. మ్యాజిక్‌లాంతరు, గ్రంథాలయ సర్వస్వము, ఆరోగ్యప్రకాశిక, ఆంధ్రపత్రిక ఉగాదిసంచిక, మహాత్ముని యంగ్ ఇండియా మున్నగుపత్రికల సంపుటములు గలవు. దీనిపర్యవేక్షకులు ఆంధ్ర యూనివర్సిటీవారి లైబ్రరీడిప్లొమాపరీక్షల నిచ్చినారు.

28. శ్రీ సర్వజన విద్యాప్రదాయినీ పుస్తక భాండాగారము, సంగం జాగర్లమూడి, తెనాలితాలూకా పక్షమున బకింగ్‌హాం కాలువపై బోటుగ్రంథాలయము; గ్రంథాలయ వార్షికోత్సవ సందర్భమున ఏటేట రాష్ట్రంలోని యువకులకు వ్యాయామ, వైజ్ఞానికపోటీలు; గాంధీజయంతి, స్వాతంత్ర్య - రిపబ్లిక్ దినోత్సవాలు నిర్వహింప బడుచున్నవి. రిపబ్లిక్ దినోత్సవంనాడు స్థానిక విద్యార్థులకు ఆటపాటలలో, విద్యావిషయంలో పోటీలు ఏర్పాటుచేయబడుచున్నవి.

29. ఫ్రెండ్సు యూనియన్, మచిలీ పట్టణము పక్షమున మూడుచక్రముల సైకిల్ బండిపై సంచారగ్రంథాలయము నేర్పాటుచేసి పట్టణమంతా తిరిగి పుస్తకములను పంచుచున్నారు. ఖనిజవస్తు ప్రదర్శనశాఖ, నాటకశాఖ, క్రీడాశాఖ నిర్వహింప బడుచున్నవి.

30. శ్రీరామజయంతి గ్రంథాలయం (జగ్గాపురం, విజయనగరంతాలూకా) చుట్టుపట్టు గ్రామాలలో 2,3 తాలూకాలలో శాఖలనుస్థాపించి, యీశాఖలు నెమ్మదిగ స్వతంత్ర గ్రంథాలయాలుగ మారునట్లు కృషిచేయుచున్నారు. ఈ గ్రంథాలయ కార్యకర్త లొక్కొక్కరు ఎక్కడ నున్నా, ఎక్కడకుపోయినా తమతో కొన్ని పుస్తకాలను కొనిపోయి వానికి పాఠకులను సంపాదిస్తున్నారు. వివిధ గ్రామాలలోని ప్రజలలో విజ్ఞానమును పెంపొందించుటకు సభలను జరుపుచున్నారు. ఉద్యమ ప్రచారంకొరకు సైక్లోస్టయిల్ సహాయంతో కరపత్రములను ప్రకటించుటకై ప్రయత్నించుచున్నారు.

31. శ్రీరామచంద్రపురము (తూ.గో. జిల్లా) కో-ఆపరేటివ్ సెంట్రలు బ్యాంకు వారు తమ సాముదాయికనిధిని పూర్తిగా గ్రంథాలయం నిర్వహణకొరకు వినియోగిస్తున్నారు. వారు తాలూకా అంతటికి పుస్తకముల నందజేస్తున్నారు. సంచారి గ్రంథాలయశకటమును తయారుచేయించ ప్రయత్నములో నున్నారు. తమ గ్రంథ భాండాగారిని తమ ఖర్చుపై ఆంధ్ర యూనివర్సిటీలో లైబ్రరీ డిప్లొమా కోర్సుకు పంపించి చదివించినారు.

# ఆంధ్ర సాహిత్యం

## శ్రీ పుమ్మనేని పాపయ్య

తెలుగు భాషకు వైశిష్ట్యం, తెలుగుజాతికి గౌరవం రావడానికి భారతాంధ్రీకరణ నాంది. పంచమవేదం, ధర్మశాస్త్రం, మహాకావ్యం అయిన భారతాంధ్రీకరణ 11వ శతాబ్దంలో జరిగింది. నాటికింకనూ ఆంధ్రభాషకొక నిర్దుష్ట ప్రణాళిక లేదు. అప్పటివరకు సంస్కృత ప్రాకృతాలు రాజాదరణము పొందినవి. సంస్కృత ప్రాకృతాల మధ్య తెలుగు నలిగిపోయింది. స్వతంత్ర పండితులైన వారందరికీ తెలుగు భాషపై నిరసనేగాని అభిమానము లేదు. కాని ఏనాడైనా ఉత్తమాధికారులు ప్రజలు. పండితుల నిరసనకు, ప్రభువుల అనాదరణకు పాల్పడిన తెలుగు భాషను జీవద్భాషగా నిల్పినది ఆనాటి ప్రజలు. విజ్ఞులైన ప్రభువులు, పండితులు ఈ విషయాన్ని గమనించగలరు. కాబట్టే నాటి చాళుక్య ప్రభువులు భారతాంధ్రీకరణకు ప్రోత్సహించుట, నన్నయ కర్తవ్య నిర్వహణ కుపక్రమించుట జరిగినవి.

నాటినుంచి ఆంధ్రవాఙ్మయ వికాసం ప్రారంభమయింది. నేడు అవిచ్ఛిన్నంగా సాగిపోతోంది. ఈవాఙ్మయచరిత్రంతటిని మూడు, నాలుగు, చివరకు పది యుగాల క్రింద విభజించిన వేత్తలున్నారు. కాని సూక్ష్మ పరిశీలనవలన ద్వివిధవిభజన మేలుతరమని విజ్ఞులంగీకరింపకపోరు. ఈ రెండు యుగాలలో మొదటిది ఆంధ్ర వాఙ్మయముపై సంస్కృత వాఙ్మయ ప్రభావము ప్రసరించిన కాలము. దీనికాచార్యుడు నన్నయ. రెండవది ఆంగ్లవాఙ్మయ ప్రభావము ప్రసరించినకాలం. దీనికి ఆచార్యుడు వీరేశలింగంగారు. ఈ విభజన స్థూలమైనది మాత్రమే.

ఆంధ్రదేశపు సంస్కృత ప్రాకృత శాసనాలలోని దేశ్య శబ్దాలంవల్లా, 7వ శతాబ్దం తర్వాత లభ్యమైన తెలుగు శాసనాలవల్ల నన్నయకు పూర్వపు ఆంధ్ర భాషాస్థితి వ్యక్తమౌతుంది. నన్నయకు పూర్వపు తెలుగు సాహిత్యంకూడా శాసనాలమూలంగానే మనకు తెలుస్తుంది. వాటిలో అక్కరలు, తరువోజలు, సీసములు మొదలైన దేశీయ ఛందస్సులుకూడ కనిపిస్తున్నవి. నన్నెచోడకవి 'కుమార సంభవం'లో ప్రయోగించిన పదజాలాన్నిబట్టి, అతని భాషాప్రణాళికనుబట్టి నన్నయకు పూర్వుడని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి యభిప్రాయము. ఈ విషయమై నేటికిన్ని వాద ప్రతివాదాలు జరుగుతున్నై.

### పురాణకాలం

నన్నయ ఆదికవి ఐనా కాకున్నా అతని భాషా ప్రణాళిక విశాలమయింది.

భారతం మహేతిహాసం. దాన్ని తెలుగులోనికి తేవాలంటే భాషా ప్రణాళిక వేంచక తప్పదు. ఇది నన్నయ ఆంధ్ర భాషకుచేసిన మహోపకారం. సంస్కృత ప్రభావంతోపాటు కన్నడ ప్రభావం కూడా నన్నయ భారతంలో కన్పిస్తుంది. ఆదిపంపని కన్నడ భారత మంతకు పూర్వమే వ్రాయబడ్డది. అనేకమంది పండితులీ ఉద్యమాన్ని వ్యతిరేకించగా, నారాయణభట్టు సహాయంతో నన్నయ నిర్విఘ్నంగా కొనసాగించాడు. ఈక్రమంగా నన్నయ రెండున్నర పర్వాలు పూర్తిచేశాడు. అతని అనంతరం అతనికి సరియైన ప్రతిభావంతుడు తిక్కన. ఆ భారాన్ని తన భుజస్కంధాల మీద వేసికొని కొనసాగించాడు. ఈతడు విరాటపర్వమాదిగా పదునైదు పర్వాలు తెనిగించాడు. ఈతడు దేశికవుల జాను తెలుగు పదసంచయం, మార్గకవుల రచనారీతిని మేళవించి, శైవ వైష్ణవమత వైషమ్య నివారణకై హరిహరాంకితమొనర్చినాడు. అల్పాక్షరాలలో అనల్పార్థ రచన గావించుటీతని ప్రతిభకు నిదర్శనం. అరణ్యశేషాన్ని పూరించినవాడు ఎఱ్ఱన. భారతానికున్న ప్రాశస్త్యం దానిలోని నీతి, ధర్మం మొదలైనవి. దానిలోని నీతి, ధర్మం శాశ్వతాలు. ఇహలోక సుఖం, లోకకళ్యాణం భారతాశయం. అందువల్లనే భారతానికి విశ్వజనీనతరావడం.

తిక్కన 'నిర్వచనోత్తర రామాయణ' మను పేరి రామాయణాన్ని కూడా తెనిగించాడు. కాని భారతానికి వచ్చిన ప్రాశస్త్యం దానికి రాలేదు.

## దేశి - మార్గ కవితలు

గద్య పద్య ప్రబంధ సంస్కృత భూయిష్ఠరచన మార్గకవిత. ఇది సంస్కృత సంప్రదాయము ననుసరించిన కవిత. దేశి కవిత యనగా దేశమునకు నైసర్గికమైనదని చెప్పవచ్చు. కథావస్తువు, ఛందస్సు, భావం, భాష - దేశరీతులలో తీర్చబడింది దేశి కవిత. ద్విపదలు, యక్షగానాలు, రగడలు, గేయాలు యిత్యాదులు దేశికవితాశాఖకు సంబంధించినవి. ఇవి స్వతంత్రంగా ఏర్పాటుచేసుకొన్న ఛందస్సులు. నన్నయకు పూర్వంనుండీ దేశికవిత తెలుగు దేశాన ప్రచారంలో ఉన్నట్లు ఊహింపబడింది. నన్నయ కవిత్వము మార్గానుసారి. నన్నయ రాకతో దేశికవిత మూలకు నెట్టబడింది. పండితుల ఆదరణకు దూరమైనను ప్రజల ఆదరణకు పాత్రముగానే ఉన్నది. శైవ కవులు మాత్రము తమ మత గ్రంథములను ప్రజల యందు ప్రచారము నుద్దేశించి రచించినారు గాబట్టి, దేశి కవితా విధానాన్ని స్వీకరించారు.

ఆనాటి పండితులకు తెలుగు కవితపై నిరసన మెండు. మొదటినుండి తెలుగు సాహిత్యాన్ని పరిశీలించినప్పుడు ఈ రెండు కవితా పద్ధతులు ఒకదానిప్రక్క మరొకటి మెలగినట్లు స్పష్టము. అయితే ఈ రెండును సాధించిన అభ్యుదయంమాత్రం గణనీయం. ఆనాడు ఉత్తమ సాహిత్యం ప్రజలలో ధర్మప్రచారానికై ఉద్దేశింపబడింది. మార్గ దేశి కవితలు రెండూ ఇందుకై ఉపయోగపడ్డవే. శైవకవుల పద్ధతి ననుసరించియే ఛలికవియైన గోన బుద్ధారెడ్డి కూడా రంగనాథ రామాయణాన్ని దేశి ఛందస్సులో రచించినాడు.

## ఆంధ్ర ప్రబంధములు

అష్టాదశ వర్ణనలుగలిగి, ఏకనాయకాశ్రయమై, శృంగారవీరములలో నేదైనా ఒకటి అంగిరసముగా గలిగి అత్యాతిశాయియైన శబ్దసౌష్ఠవం గలిగిన రచనా రీతికి ప్రబంధమని పేరు. ప్రబంధమునకు ఈ అర్థము తెలుగులోనిది మాత్రమే.

ఎఱ్ఱన తాను 'ప్రబంధ పరమేశ్వరుడ' నని చెప్పుకొన్నాడు. అందువల్ల ఇతనే ప్రబంధ కవిత్వానికి మూలపురుషుడని కొందరి యభిప్రాయం. నన్నెచోడుని కుమారసంభవంలో ప్రబంధ లక్షణాలన్నీ ఉన్నాయి. దానిని తెలుగులోని మొదటి ప్రబంధం అనవచ్చు. శ్రీనాథుని కావ్యాలు ప్రబంధాలే. అయినా పెద్దన రాకతో మాత్రమే ఆంధ్రకవితారంగంలో ప్రబంధ కవిత్వానికి అగ్రతాంబూలం లభించింది. పెద్దన మనుచరిత్ర ననుసరించి, భట్టుమూర్తి వసుచరిత్ర; దాని ననుకరించి వందలాది ప్రబంధాలూ బయలుదేరాయి. అనంతర ప్రబంధ కవులలో ఎక్కువ మందికి పాండిత్యమేగాని ప్రతిభ శూన్యం. దానివల్లనే బంధకవిత్వాలూ, ప్రయోజన శూన్యమైన ద్వ్యర్థి కవిత్వాలూ పొడసూపినై. కవితలో భావం, జీవం, శూన్యం. భావనాశక్తి లేకనో మరి యెందుకోగాని "కేవల కల్పనా కథలు కృత్రిమరత్నము" లని యెంచి, పూర్వ ప్రబంధాల్లోని రేఖామాత్రమైన కథను గ్రహించి, ప్రపంచించి వర్ణనాత్మకంగా ప్రబంధీకరించారు.

ప్రబంధావిర్భావంవరకూ ప్రజాపరమైన కవిత్వం నాటితో పాలకుల పరమైంది. కవిత్వాన్ని విలాసవస్తువుగా పరిగణించారు రాజులు. విక్రయించారు పండితులు. భక్తి శృంగారమే ముచ్చటగా ఉన్నదన్నారు ఇరువురూ. "కప్పురపువీడ్యము, ఈ రౌల మంచము లేనిదే కవిత్వం రాద"న్నారు కవులు. కృష్ణరాయలు, వీరి అష్టదిగ్గజాలూ ఈ కాలానికి చెందినవారే. కృష్ణరాయలు పండితకవి, కవిపోషకుడు. ఈ కాలపు కవులలో ఎన్నదగిన గుణమొక్కటిమాత్ర మున్నది. వీరి పాండిత్యము అద్వితీయమైనది. ప్రబంధకవులలో భావనాశక్తిలో పింగళి సూరన అద్వితీయుడు. ఈతని కళాపూర్ణోదయము స్వకపోల కల్పితము. అద్భుత సన్నివేశ సంఘటితము.

ఈ రోజుల్లోకూడా "రాజుల్ మత్తులు, వారిసేవ నరకప్రాయంబు" అను కొన్న స్వాతంత్ర్య ప్రియులైన కవులు లేకపోలేదు. పోతన ఈశాఖకు చెందినవాడు. ఇతడు శ్రీనాథుని సమకాలికుడు. పోతన భాగవతాన్ని రాజాంకిత మొనర్ప నిరాకరించాడు.

## మరుగుపడిన తెలుగుకవిత

గేయాలు, రగడలు, ద్విపదలు, యక్షగానాలు, శతకాలు, స్త్రీలపాటలు మొదలైనవి ప్రజాజీవితాన్ని చిత్రించే వాస్తవమైన కవితలు. వీనినే జానపద సాహిత్యం అంటారు. పల్లెప్రజల ఆవేదనలకు, ఆలోచనలకు ఆలవాలము జానపదకవిత. ఇందులో ఎక్కువభాగం ఇప్పటికిన్నీ గ్రంథస్థం కాలేదు. ఇందుకు కారణం పండితులకు వీటిమీద ఆదరణ లేమియే గాని వీటియందు సాయిలేమి మాత్రము కాదు. ఇప్పుడిప్పుడే కొందరీ సాహిత్యాన్ని గ్రంథస్థం చెయ్యడానికి పూనుకొని పరిశ్రమ చేస్తున్నారు. ఇది శుభసూచకం.

శ్రీనాథమహాకవి విరచితమని యెంచబడుతున్న 'పలనాటి వీరచరిత్ర'

బడ్డది. నాటి మాండలిక భాషాస్థితిని తెలిసికోవడానికుపకరించేముఖ్యగ్రంథము. అందువల్ల ఇటు చరిత్రకారులకూ, అటు భాషావేత్తలకూ ఉపకరించు గ్రంథమిది.

ఈ కాలాల్లో మహారాష్ట్ర రాజులొనర్చిన ఆంధ్ర వాఙ్మయ పోషణ మరువరానిది.

## ఆంధ్ర కవయిత్రులు

ఆంధ్ర కవయిత్రుల పేర్కొనకపోతే ఆంధ్ర వాఙ్మయ చరిత్ర అసమగ్రమే అవుతుంది. కవయిత్రుల సంఖ్య యందు తక్కువైనా స్థాయిలో మాత్రము ఎక్కువే. తాళ్ళపాక తిమ్మక్క ప్రథమ కవయిత్రి. ఈమెకు ముందు కవయిత్రు లున్నారను టనేగాని వారి గ్రంథములు లభ్యమగుట లేదు. నాగాయుంభోటు కూతురు కుప్పమ్మ, ఖడ్గ తిక్కనతల్లి, భార్య మొదలైనవారు పూర్వ కవయిత్రులుగా ఊహించబడు తున్నారు. మొల్ల రామాయణానికున్న ప్రసిద్ధి మరే యితర రామాయణానికీ లేదు. ఈమె హృదయమెంత మెత్తనిదో కవనము అంతియే. వినయము ప్రశంసనీయము. ఈమె తర్వాత చెప్ప దగినది రంగాజమ్మ. తంజావూరు నాయక రాజుల కాలము కవయిత్రులకు ప్రసిద్ధి కెక్కినది. ముద్దుపళని, తరిగొండ వెంగమ్మ మొదలైనవారు మరికొందరు కవయిత్రులు.

## తెలంగాణా కవులు

తెలంగాణా కవులను గూర్చి ముచ్చటించవలసి వచ్చినప్పుడు ప్రశంసింపదగ్గ విషయం హిందూ-ముస్లిం సఖ్యత. తెలంగాణా కవులను పోషించిన నవాబులు ఆంధ్రులకు చిరస్మరణీయులు. 'తపతీ సంవరణ' కర్తయైన అద్దంకి గంగాధరకవి, గోల్కొండ నవాబైన 'మల్కిభరాం' ఆస్థానకవి. ఈతని కావ్యం 'పిల్ల వసు చరిత్ర'. పొన్నగంటి తెలగన్న తన యయాతి చరిత్రను 'అమీన్‌ఖాన్'కు అంకితంచేశాడు. ఇది ఆంధ్ర వాఙ్మయంలో మొదటి అచ్చతెనుగు గ్రంథము. చరిగొండ ధర్మన, సారంగు తమ్మయ యిత్యాదులైన తెలంగాణా కవు లనేకులు పేర్కొనదగిన వారు.

## నవ్యయుగం

ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో ఇది రెండవ యుగం. ఆవశ్యకమైన సంస్కృత విజ్ఞానాన్ని తనలో కలుపుకొని, అనావశ్యకమైన శృంఖలాలను తొలగించుకొంటున్నది ఆంధ్ర కవిత. ఇంతలోనే ఆంగ్లభాషా సంపర్కం ఏర్పడింది. అప్పటి నుంచి కొంత మంచిని గ్రహించి పుష్టి చేకూర్చుకొంటూనే వెలుగు విస్తరిస్తుంది. అభ్యుదయ పథాన గమిస్తుంది.

వీరేశలింగంగారిని యుగకర్తగా చెప్పుకోవడంలో అతిశయోక్తి లేదు. ఆనాడు నన్నయ సంస్కృత భాషా విజ్ఞానాన్ని తెచ్చి తెలుగు భాషా స్థితిని విస్తరింప చేశాడు. ఈనాడు వీరేశలింగం గారు ఆంగ్లభాషా విజ్ఞానాన్ని తెచ్చి తెలుగు భాషాస్థితిని విస్తరింప చేశారు. పంచమ వేదమైన భారతాంధ్రీకరణానికి పూనుకొని తెలుగు సారస్వత సేవ చేసినవాడు నన్నయ. నాటకం, నవల, ప్రహసనం, జీవితచరిత్ర, చిన్నకథ - ఒక టేమిటి సమస్తమైన ఆంగ్ల సారస్వత పద్ధతులను తెలుగునకు తెచ్చినవాడు వీరేశలింగం. ఇతనితర్వాత ఇప్పటివరకు వచ్చిన కవులందరూ ఇతని ననుసరించినవారే.

ఆదియుగమునందలి ప్రసిద్ధకవులు, వారికాలము, గ్రంథములు - క్రీ. శ. 11వ శతా॥ మొదలు 15వ శతా॥ వఱకు (F

| కవిపేరు | | గ్రంథము పేరు | గ్రంథవివరణ |
|---|---|---|---|
| నన్నయ | 1022-1063 | మహాభారతము | ఇతిహాసము |
| తిక్కన | 1230-1300 | మహాభారతము | ,, |
| | | నిర్వచనోత్తర రామాయణం | పద్యకావ్యము |
| ఎఱ్ఱాప్రగడ | 1280-1350 | మహాభారతము | ఇతిహాసము |
| | | నృసింహపురాణం | పురాణము |
| నన్నెచోడుడు | 1151-1170 | కుమారసంభవము | కావ్యము (ప్రబంధము) |
| పండితారాధ్యుడు | 1171 | శివతత్త్వసారము | శతకము |
| పా. సోమన | 1170-1220 | పండితారాధ్యచరిత్ర | కావ్యము (ప్రబంధము) |
| | | బసవపురాణము | ,, |
| | | వృషాధిపశతకము | శతకము |
| యథావాక్కుల అన్నమయ్య | 1241 | సర్వేశ్వరశతకము | ,, |
| రంగనాథుడు (లేక) గోనబుద్ధారెడ్డి | 1200-1276 | రంగనాథరామాయణము (ద్విపద) | ఇతిహాసము |
| కేతన | 1250-1270 | దశకుమార చరిత్రము | కావ్యము (ప్రబంధము) |
| బద్దెన | 1260-1300 | నీతిశాస్త్ర ముక్తావళి | పద్యకావ్యము |
| | | సుమతిశతకము | శతకము |
| మంచెన | 1300 | కేయూరబాహు చరిత్రము | ప్రబంధము |
| అథర్వణాచార్యులు | 1240-1300 | అథర్వణ కారికలు | సూత్రగ్రంథము |

...[illegible] ప్రసిద్ధకవులు, వారి కాలము, గ్రంథములు—క్రీ. శ. 11వ శతా॥ మొదలు 15వ శతా॥ వఱకు (౩)

| కవి పేరు | • | గ్రంథము పేరు | గ్రంథ వివరణ |
|---|---|---|---|
| ...బుద్ధుడు, విఠలరాజు | | రంగనాథోత్తరరామాయణము (ద్విపద) | ఇతిహాసము |
| ...మారన | 1250-1300 | మార్కండేయ పురాణము | పురాణము |
| ...కోట పెద్దన | 1300 | కావ్యాలంకార చూడామణి | పద్యకావ్యము |
| ...అమరేశ్వరుడు | | విక్రమసేనము | ప్రబంధము |
| ...భాస్కరుడు | 1295-1360 | భాస్కరరామాయణము | ఇతిహాసము |
| ...నాచన సోముడు | 1360 | ఉత్తరహరివంశము | ,, |
| | | వసంతవిలాసము | ప్రబంధము |
| ...[illegible] | 1400 | కవిజనాశ్రయము | పద్యకావ్యము |
| ...సింగన | 1420 | వాసిష్ఠరామాయణము | ఇతిహాసము |
| | | పద్మపురాణము | పురాణము |
| | | దశమస్కంధము (భాగవతము) | ,, |
| ...[illegible] | 1406-1422 | విక్రమార్క చరిత్రము | ప్రబంధము |
| ...అనంతామాత్యుడు | 1430 | భోజరాజీయము | ,, |
| | | రసాభరణము | అలంకారశాస్త్రము |
| ...రావిపాటి తిప్పన (త్రిపురాంతకుడు) | 1380 | చంద్రతారావళి | ,, |
| | | మదన విజయము | ,, |
| | | త్రిపురాంతకోదాహరణము | పద్యకావ్యము |

ఆదియుగమునందలి ప్రసిద్ధకవులు, వారి కాలము, గ్రంథములు—క్రీ. శ. 11 వ శతా॥ మొదలు 15 వ శతా॥ వఱకు (తి...

| కవి పేరు | | గ్రంథము పేరు | గ్రంథ వివరణ |
|---|---|---|---|
| వి. వల్లభరాయుడు | 1420 | ఖండికా శతకము | శతకము |
| వేమన | 15వ శతాబ్ది | వేమన శతకము | శతకము |
| శ్రీనాథుడు | 1400 | కాశీ ఖండము | పురాణము |
| | | హరవిలాసము | ,, |
| | | శృంగార నైషధము | ప్రబంధము |
| | | భీమఖండము | పురాణము |
| | | శివరాత్రి మహాత్మ్యము | ,, |
| | | పలనాటి వీరచరిత్ర (ద్విపద) | చారిత్రిక కావ్యము |
| | | క్రీడాభిరామము | పద్యకావ్యము |
| పోతన | 1405–1470 | భాగవతము | పురాణము |
| | | వీరభద్ర విజయము | పద్యకావ్యము |
| | | నారాయణ శతకము | శతకము |
| నిశ్శంక కొమ్మన్న | 1430–1470 | శివలీలా విలాసము | ప్రబంధము |
| గౌరనమంత్రి | 1440 | హరిశ్చంద్రోపాఖ్యానము | ద్విపద |
| | | నవనాథ చరిత్రము | ,, |
| దగ్గుపల్లి దుగ్గయ | 1480 | నాచికేతోపాఖ్యానము | ప్రబంధము |
| | | కాంచీపుర మహాత్మ్యము | ,, |

## మధ్యయుగమునందలి ప్రసిద్ధకవులు, వారి కాలము, గ్రంథములు. క్రీ. శ. 16వ శతా॥ నుండి 18వ శతాబ్దం వరకు (1)

| కవి పేరు | | గ్రంథము పేరు | గ్రంథ వివరణ |
|---|---|---|---|
| పిడుపర్తి సోమనాథుడు | 1510 | బసవ పురాణము | పురాణము |
| పిడుపర్తి బసవకవి | 1520 | ప్రభులింగలీలలు | " |
| కృష్ణదేవరాయలు | 1510_1530 | ఆముక్తమాల్యద | ప్రబంధము |
| అల్లసాని పెద్దన | 1510_1535 | స్వారోచిష మనుచరిత్ర | " |
| నంది తిమ్మన | 1510_1526 | పారిజాతాపహరణము | " |
| ధూర్జటి కవి | 1520_1530 | కాళహస్తి మహాత్మ్యము | " |
| | | కాళహస్తీశ్వర శతకము | శతకము |
| తెనాలి రామలింగకవి | 1525_1560 | ఉద్భటారాధ్య చరిత్ర | ప్రబంధము |
| | | పాండురంగ మహాత్మ్యము | " |
| | | ఘటికాచల మహాత్మ్యము | " |
| నాదిండ్ల గోపన్న | 1517-1526 | కృష్ణార్జున సంవాదము | ద్విపద కావ్యము |
| సంకుసాల నృసింహకవి | 1525 | కవికర్ణరసాయనము | ప్రబంధము |
| మాదయగారి మల్లన | 1517_1526 | రాజశేఖర చరిత్రము | " |
| చింతలపూడి యల్లకవి (రాధామాధవకవి) | 1520_1540 | రాధామాధవము | " |
| | | తారకబ్రహ్మ రాజీయము | వేదాంతము |
| కుమ్మర మొల్ల | 1526 | రామాయణము | ఇతిహాసము |
| అయ్యలరాజు రామభద్రుడు | 1530_1570 | సకల కథాసార సంగ్రహము | పద్యకావ్యము |
| దోనూరి కోనేరు కవి | 1547_1565 | బాలభాగవతము | పురాణము |
| అద్దంకి గంగాధర కవి | 1550_1580 | తపతీ సంవరణము | ప్రబంధము |

## మధ్యయుగమునందలి ప్రసిద్ధకవులు, వారి కాలము, గ్రంథములు. క్రీ. శ. 16వ శతా॥నుండి 18వ శతాబ్దం వరకు (2)

| కవి పేరు | | గ్రంథము పేరు | గ్రంథ వివరణ |
|---|---|---|---|
| పొన్నికంటి తెలగన్న | 1550_1580 | యయాతి చరిత్ర | ప్రబంధము |
| శంకరకవి | 1550_1581 | హరిశ్చంద్రోపాఖ్యానము | " |
| తెనాలి అన్నయ్య | 1565 | సుదక్షిణా పరిణయము | " |
| పింగళి సూరన | 1560 | కళాపూర్ణోదయము | " |
| | | ప్రభావతీ ప్రద్యుమ్నము. | " |
| | | రాఘవ పాండవీయము | " |
| రామరాజ భూషణుడు | 1560 | వసుచరిత్ర | " |
| | | హరిశ్చంద్రోపాఖ్యానము | " |
| మల్లారెడ్డి | 1550_1600 | షట్చక్రవర్తి చరిత్ర | " |
| మట్ల అనంతభూపాలుడు | 1570_1610 | కకుత్స్థ విజయము | " |
| కంచర్ల గోపన్న | 1674_1684 | దాశరథీ శతకము | శతకము |
| సారంగు తమ్మయ్య | 1590_1620 | వైజయంతీ విలాసము | ప్రబంధము |
| చేమకూర వెంకటకవి | 1630 | విజయ విలాసము | " |
| | | సారంగధర చరిత్ర | " |
| [illegible] కృష్ణకవి | 1690_1717 | వేదాంతసార సంగ్రహము | వచనము |
| | | మాలినీ మాధవీయము | ప్రబంధము |
| కంటి [illegible] వెంకటాచల కవి | 1690_1717 | మిత్రవిందా పరిణయం | ప్రబంధము |

మధ్యయుగమునందలి ప్రసిద్ధకవులు, వారి కాలము, గ్రంథములు. క్రీ. శ. 16వ శతా॥ నుండి 18వ శతాబ్దం వరకు (శి)

| కవి పేరు | | గ్రంథము పేరు | గ్రంథ వివరణ |
| --- | --- | --- | --- |
| సముఖము వేంకట కృష్ణప్పనాయకుడు | 1690_1717 | అహల్యా సంక్రందనము | ప్రబంధము |
| | | రాధికా సాంత్వనము | " |
| | | జైమినీ భారతము | వచనము |
| | | సారంగధర | " |
| వక్కలంక వీరభద్రకవి | 1720 | వాసవ దత్తా పరిణయము | ప్రబంధము |
| ఏనుగు లక్ష్మణకవి | 1760 | రామవిలాసము | " |
| | | ఆంధ్రనామ సంగ్రహము | పద్యకావ్యము |
| అడిదము సూరకవి | 1750 | కవిజన రంజనము | " |
| | | ఆంధ్ర చంద్రాలోకము | " |
| | | ఆంధ్ర నామశేషము | " |
| | | కవి సంశయవిచ్ఛేదము | " |
| పావులూరి మల్లన | 1750 | భద్రాద్రి రామశతకము | శతకము |
| కస్తూరి రంగకవి | 1736_61 | ఆనంద రంగరాట్ఛందస్సు | పద్యకావ్యము |
| ఆలూరి కుప్పకవి | 1765_88 | ఆచార్య విజయము | " |
| | | పరమ భాగవత చరిత్ర | " |
| | | ఇందుమతీ పరిణయము | " |
| | | రామాయణ, భాగవతములు | ప్రబంధము |
| ముద్దుపళని | 1790 | రాధికా సాంత్వనము | " |
| తరిగొండ వెంగమాంబ | 1850 | కృష్ణమంజరి | ద్విపద |

'ఆంధ్ర వాఙ్మయ సూచిక' యందు చేర్చిన ముద్రితా ముద్రిత ఆంధ్ర గ్రంథ ములపట్టికను ఇందు పొందుపరుస్తున్నాం. ఇది 1929 నాటి సమాచారం. ఇప్పటి గ్రంథముల సంఖ్య ఇంతకు చాలా ఎక్కువగా ఉంటుంది.

| విషయ భాగం | ముద్రిత | అముద్రిత |
|---|---|---|
| అర్థశాస్త్రములు | 4 | ... |
| అలంకార శాస్త్రములు | 13 | 7 |
| అవధానములు | 11 | ... |
| అశ్వశాస్త్రములు | ... | 5 |
| ఆయుస్సైన్యశాస్త్రములు | ... | 3 |
| ఇతర శాస్త్రములు, కళలు | 100 | 20 |
| ఇతిహాసములు | 78 | 31 |
| ఉపనిషత్తులు | 14 | ... |
| ఉపన్యాసములు | 51 | ... |
| కథలు | 1026 | 37 |
| కల్పములు | 72 | 2 |
| కావ్యములు | 135 | ... |
| క్రీస్తుమత గ్రంథములు | 528 | ... |
| ఖండకావ్యములు | 18 | ... |
| గణితములు | 104 | 16 |
| గేయములు | 420 | 43 |
| చరిత్రములు | 562 | 52 |
| చిత్రలేఖనములు | 5 | ... |
| ఛందశ్శాస్త్రములు | 29 | 27 |
| జీవితములు | 239 | ... |
| జ్యోతిషములు | 135 | 39 |
| ధర్మశాస్త్రములు | 61 | 7 |
| నవలలు | 513 | ... |
| నాటకములు | 1098 | ... |
| నాట్యకళ | 8 | 3 |
| నిఘంటువులు | 50 | 9 |
| నీతిశాస్త్రములు | 191 | 2 |
| పద్యము, పరిశిష్టము | 329 | ... |
| పరిశిష్ట గ్రంథములు | 1470 | 141 |
| పాశ్చాత్య శాబ్దికములు | 25 | ... |
| పురాణములు | 72 | 65 |
| ప్రశ్న శాస్త్రములు | 11 | ... |

| విషయ భాగం | అముద్రిత | అముద్రిత |
|---|---|---|
| ప్రబంధములు | 237 | 273 |
| ప్రహసనములు | 250 | ... |
| భాష, లేక సారస్వతము | 23 | ... |
| భూగోళములు | 101 | ... |
| భౌతిక శాస్త్రములు | 3 | ... |
| మంత్ర శాస్త్రములు | 7 | ... |
| మతము | 493 | 54 |
| మహాత్మ్యములు | 162 | 60 |
| యక్షగానములు | 210 | 190 |
| యోగశాస్త్రములు | 5 | ... |
| రాజకీయములు | 125 | ... |
| లక్షణము | ... | 11 |
| లా-చట్టములు | 123 | ... |
| వచనము, పరిశిష్టము | 99 | ... |
| వాస్తుశాస్త్రములు | 7 | 3 |
| విమర్శనములు | 86 | ... |
| వేదాంతములు | 525 | 171 |
| వైదిక గ్రంథములు | 5 | ... |
| వైద్యము | 358 | 29 |
| వైద్యశాస్త్రము | 20 | ... |
| వ్యాకరణములు | 61 | 18 |
| వ్యాఖ్యానములు | 12 | ... |
| వ్యాయామము | 12 | ... |
| శకునశాస్త్రము | ... | 5 |
| శతకములు | 841 | 229 |
| శ్రుతులు | 3 | ... |
| సంగీతము | 49 | 8 |
| సాంఘికములు | 139 | ... |
| స్త్రీల వాఙ్మయములు | 166 | ... |
| స్తోత్రములు | 609 | 120 |
| హాస్యకథలు | 153 | ... |
| మొత్తం | 12,256 | 1,671 |

కుటుంబా లన్నిటికీ తమ ఆడపిల్లలకు ఇంగ్లీషు నేర్పించడమనేది ఒక ఆదర్శంగా వుండేదనంటే అతిశయోక్తి కాదు. [స్త్రీలకు ఆధునిక విద్య నేర్పించడం ఆరంభం కాలేదు. వారు అప్పటికింకా 8 వ ఏటనే పెళ్ళిచేసుకొని గృహిణులుగా వుండడానికి కావలసిన శిక్షణ మాత్రమే పొందుతూ వుండేవారు.]

ప్రపంచ భాషగా అభివృద్ధిచెందిన ఇంగ్లీషు, మేధావుల మనోనేత్రాలను తెరచింది. దానివల్ల తాత్కాలికంగానే కాక భవిష్యత్తులోకూడ ప్రకాశవంతమైన అవకాశాలను చూడగల్గారు. వారి సృజనాత్మకమైన కృషి అంతా సంస్కరణ తత్వంలోనే నడిచిందిగాని, విప్లవాత్మకంగా కొనసాగలేదు. అయినప్పటికీ ఇంగ్లీషుభాషా ప్రభావంమట్టుకు మంచికే వచ్చిందని చెప్పవచ్చు. సంఘసంస్కరణలో కొత్తపద్ధతులు వచ్చాయి. ఆరోజుల్లో మనతెలుగుదేశంలో అవతరించిన మహావ్యక్తి శ్రీ కందుకూరి వీరేశలింగంగారు. తెలుగుభాషలో మొట్టమొదటిసారిగా నవలను రచించినవాడు ఆయనే. స్వీయచరిత్రను రచించిన ప్రథమపురుషుడు ఆయనే. అంతేగాక తెలుగు కవుల చరిత్ర, సంఘసంస్కరణ ఆశయంగాగల వ్యంగ్యరచనలు, ప్రహసనాలు, ప్రవేశపెట్టినది ఆయనే. మూఢనమ్మకాలను వ్యతిరేకించిన మొదటివాడు. మంచిచెడ్డలను విచారించే వివేకవంతమైన పంథాలో జీవితం నడవాలని ప్రబోధించిన ప్రథముడు. నాటక రచయితగా, పత్రికా సంపాదకుడుగా, విద్యావేత్తగా, ప్రథమ శ్రేణిలో ఉన్నవాడు. అన్నిటికంటె ఎక్కువగా, మనదేశంలో సహగమనం తొలగింపబడిన తరువాత, విధవా వివాహం అనే మహోత్కృష్ట సంస్కరణను ప్రవేశపెట్టి, దానికోసం పోరాడిన మహావీరుడు.

కాలచక్రం మరికొంత తిరిగింది. 20 వ శతాబ్దంలో 2 వ దశాబ్దం ప్రవేశించింది. అంతవరకు మన సాంఘిక నిర్మాణం ఫ్యూడల్ పద్ధతులలోనే వుంది. జీవితం తీరికగానే సాగిపోతోంది. కాని ప్రజలలో ఏర్పడిన అసంతృప్తిని వొదలగొట్టే సంఘటనలు జరగ నారంభించాయి. ప్రపంచంలో చిచ్చు చెలరేగింది. అదే ప్రథమ ప్రపంచ యుద్ధం సంభవించిన దశాబ్దం. ఆ దశాబ్దంలోనే (1915 లో) మహాకవి గురజాడ అప్పారావుగారు మరణించారు.

గురజాడ నడివయస్సులోనే మరణించారని చెప్పాలి. చనిపోయేనాటికి ఆయనకు 50 సంవత్సరాలు మాత్రమే. ఆయన మరణం ఒక్క ఆంధ్రదేశానికే కాదు, యావద్భారతదేశానికీ తీరనినష్టం. నిజానికి ఆనాడు — అంటే 1915 నవంబరు నెలలో—ప్రపంచం ఒక మహా రచయితను కోల్పోయిందనే చెప్పాలి. గురజాడ ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన గోర్కీ, ఇబ్సెన్ లాంటి రచయితలతో తులతూగే మేధావి. శూద్రకుని "మృచ్ఛకటికం" తరువాత వేయిసంవత్సరాలకు అలాంటి సృజనాత్మకమైన, వాస్తవిక దృష్టితో నాటకాన్ని ఇచ్చినవాడు గురజాడ. అదే "కన్యాశుల్కం".

గురజాడ భారతదేశంలోను, ప్రపంచంలోను ఉన్న ఉత్తమ నాటకరచయితలలో ఒకరేకాదు; ఆయన ఒక విప్లవకవికూడా. కాని ఒక దురదృష్టం ఏమిటంటే, కవిగా

ఆయన కివ్వవలసిన స్థానాన్ని గురించి భాషావాదులలో తీవ్రమైన వివాదం ఏర్పడ్డది. ఆయనకు మహాకవి అనే బిరుదు నివ్వడం తగదని కొందరు ఛాందసవిమర్శకులు అనడం విచారకరమైన విషయం. ఆయన రాసిన మహాకావ్యం ఏది? అని వారి ప్రశ్న. నిజమే. గురజాడ, మహాకావ్యమని పిలవదగినంత పెద్ద పద్యరచన ఏదీ చేయలేదు. ఈ విమర్శకుల కొలత బద్దతో చూస్తే వారిని సంతృప్తిపరిచేది గురజాడ రచనలలో కొరకవు. ఈఛాందసులను సంతృప్తిపరిచేదిగా లేవు కనుకనే మరికొందరు గురజాడ రచనలను ఉత్తమ రచనలుగాను, ఆయనను మహాకవిగా పొగడుతున్నారు. ఆయన ఇంతింతలేసి గ్రంథాలు రాసి పారెయ్యకపోవచ్చు. కాని కవిత్వపు మంచిచెడ్డలను నిర్ణయించేది గ్రంథాల లావును, పై మెరుగులనుబట్టి కాదుకదా! గురజాడ తన రచనా విధానం లోను, కవితా విషయాలలోనుకూడ విప్లవాన్ని తీసుకొచ్చాడు. కొత్తమార్గాన్ని తొక్కాడు. కవిత్వపు గాంభీర్యాన్ని లోతులను చెరనొట్టే నిబంధనలతో ఆయనకు పనిలేదు. గురజాడ ఇచ్చిన సందేశంలో వుండే శక్తి, అర్థం, ఇప్పుడిప్పుడు తెలుసుకోగలుగుతున్నాం. కాలం గడచినకొద్దీ వారి ప్రతిభ అతిశయిల్లే కవుల వర్గానికి చెందినవాడు గురజాడ.

దరిద్రనారాయణులని చిహ్నమంటూ, గోల్లాయికట్టుకుని నిరాడంబర మూర్తియై గాంధిగారు అవతరించినప్పుడు ప్రపంచమంతా ఆయన్ని ఉగ్గడించింది. కవితారంగంలో గురజాడ అలాంటి నిరాడంబర [illegible]వలంబించాడు. పూర్వకవిత్వాలలో వుండే వ్యర్థపదాడంబరపూరిత పద్ధతులక, నియమాలకు స్వస్తిచెప్పి, జానపద సాహిత్య పద్ధతులను అవలంబించి తాను చెప్పదలచుకొన్న సందేశాన్ని ప్రజలకందిచ్చాడు. గురజాడ ఒక మహాప్రవక్త. ఆయన సందేశం ఇంకా చాల విపులీకరించవలసి వుంది. కాని, అయినంతవరకు చూస్తే విమర్శకాగ్రేసరులనుకునేవారికంటె ప్రజలకే అవి బాగా అర్థమవుతున్నాయి. అందులోనే గురజాడవారి గొప్పతనం వుంది. ఆయన కవిత్వాన్ని తరచి చూచినకొద్దీ ఇంతవరకు కనుపించని కొత్త విషయాలెన్నో బైటపడుతూ వుంటాయి. ఇట్టివారు కాకపోతే మహాకవులనబడేవారింకెవరో బోధపడదు.

గురజాడవారు రచించిన చిన్న కథలనుగురించి, విమర్శలనుగురించి, లేఖలను గురించి నేను చెప్పలేదు. వాటిలో కొన్ని అముద్రిత రచనలుగానే వుండిపోయాయి. ఈ మధ్యనే అవి ప్రచురింపబడుతున్నాయి. ఆ రచనలన్నీ వాటికవే సాటి. ముఖ్యంగా చిన్న కథలు ఒక ప్రత్యేకత. ఒక సత్యాన్వేషి మనస్సు ఎలా పనిచేస్తుందో ఆ రచనలు వ్యక్తపరుస్తాయి.

కందుకూరి, గురజాడలనుగురించి చెప్పాను. తెలుగు సారస్వత చరిత్రలో 20 వ శతాబ్దపు మూర్తిత్రయం పూర్తి అవాలంటే గిడుగు రామమూర్తిగారి పేరు కూడా చెప్పాలి. తెలుగుభాషలో ఆయన ఒక మహా విప్లవాన్ని తెచ్చాడు. అదే గ్రాంధికభాషకు బదులు గ్రామ్యభాషను వాడటం. ఈ విప్లవాన్ని తీసుకురావడానికి ఆయన ఎన్ని పోరాటాలు జరిపాడో చెప్పలేం. ఇప్పుడు అవన్నీ చారిత్రిక విషయాలై పోయాయి. ఈనాడుచూస్తే

అంతా గ్రామ్యభాషాయుగంగా కనిపిస్తుంది. వార్తాపత్రికలలోను, వేదికల మీద, రేడియో ప్రసారాలలోను, సినిమాలలోను అన్నింటిలోను గ్రామ్యభాషనే వాడుతున్నారు. కాని గిడుగువారి కాలంలో అది ప్రవాహానికి ఎదురీత. గ్రామ్యభాష కోసం ఆయన ఆంధ్ర సాహిత్య పరిషత్తును ఒంటరిగా ఎదిరించి పోరాడవలసి వచ్చింది. చివరకు దాని అంతు తేల్చుకున్నాడు కూడ. ఈనాడు ఆ పరిషత్తులో దానినిగురించి తలపోసేవారు లేరు. అది ఒక పాతబడిన చారిత్రిక అంశం అయి అడుగున పడిపోయింది. గిడుగు వారు తాము ప్రవేశపెట్టిన నూతన వాదం ప్రజల మనస్సులలో మరింతగా నాటుకు పోయేవరకేగాక, అది ఫలించేవరకుకూడా జీవించి చూడగలిగారు.

1910-20 మధ్యకాలంలో ప్రపంచ సంగ్రామం, రష్యన్ మహావిప్లవం జరిగాయి. వాటి ఫలితంగానే భారత దేశంలో జాతీయపోరాటం తలఎత్తింది. అదే కాలంలో ప్రత్యేకాంధ్రరాష్ట్రం కోసంకూడ ఆందోళన ప్రారంభమైంది. ఆంధ్రభాషా ఉద్యమం మంచి ఉన్నత స్థాయిలో ఉంది. ఆంధ్ర నాటకరంగం మీద కేగాక, అఖిలభారతంగాకూడ ప్రఖ్యాతిగాంచిన కళాపూర్ణుడు బళ్లారి రాఘవాచారి ఉదయించాడు. ఆదిభట్ల నారాయణదాసు తన హరికథా కాలక్షేపాలతో ప్రజలను మంత్రముగ్ధులను చేస్తున్నాడు. విజ్ఞానచంద్రికా గ్రంథ మండలివారు శాస్త్రీయ గ్రంథాలెన్నిటినో తెలుగులో ప్రచురించసాగారు. మొట్టమొదటి తెలుగు దినపత్రిక "ఆంధ్ర పత్రిక" కాశీనాథుని నాగేశ్వరరావు గారిచే ప్రారంభింపబడింది. హైదరాబాదు రాజ్యంలోని గద్వాల, వనపర్తి సంస్థానాలలో తిరుపతి వెంకట కవులు సన్మానాలను పొందుతున్నారు. వీరిలో వెంకటశాస్త్రిగారొక మహావ్యక్తి. ఆయన ఒక సంస్థలాంటి వారు. వాడుక భాషనే ఛందోబద్ధంగా పెట్టి కవిత్వం అల్లిన ఉద్దండుడు. (ఆయన ప్రతిభను గుర్తించియే అవిభక్త మద్రాసు రాష్ట్రం ఆయనకు తెలుగు ఆస్థాన కవి పీఠాన్నిచ్చి గౌరవించింది. వెంకటశాస్త్రి గారిమన్ననే కాలధర్మం చెందారు). ఆకాలంలోనే తెలుగులో నవలలు, నాటకాలు ఎక్కువగా ముద్రించబడసాగాయి. వాటిలో ముఖ్యంగా చెప్పుకోదగినవి వీరేశలింగంగారి శిష్యుడయిన చిలకమర్తి వారివి, పానుగంటివారివి మాత్రమే. ఈనాటికీ కూడ అవే నిలిచాయి. వేదం వెంకటరాయశాస్త్రిగారి ఉత్తమనాటకం "ప్రతాపరుద్రీయం" కూడ ఆ రోజుల్లోనే వెలువడింది. శాస్త్రిగారి భాషాసేవ మరువరానిది. ఆంధ్ర, సంస్కృత ప్రబంధాలపై ఆయన రాసిన విమర్శలు తెలుగు భాషకు ప్రత్యేకాలంకారాలు.

గురజాడ మహాకవి ప్రజాకవిత్వానికి పునాదులు వేస్తున్నరోజులలోనే తెలుగు కవితా కొలనులో మరొక తామర వికసించింది. శాంతినికేతనంలో కొంత కాలం నివసించి వచ్చిన యువకుడొకడు తన గొంతెత్తి నూతన గేయాలను ఆలపించసాగాడు. ఆయనే రాయప్రోలు సుబ్బారావు. తెలుగులో భావకవిత్వానికి మూలపురుషుడు. కవి కోకిలమే అనే బిరుదాన్ని తెచ్చాడు. ప్రేమతత్త్వాన్ని భావవాదంతో మేళవించి ఆలపించాడు.

ఆయన గీతాలు భావుకులైన యువకులందర్నీ మైమరపించి నిద్రపుచ్చుతాయి. వాటిలో వుండే వ్యూహా ప్రతిభలు వారి సాకరించ సాగాయి. ఆ రోజుల్లోనే ఏర్పడిన సాహితీసమితి అనే సారస్వత సమాజానికి కూడ మూలపురుషుడు రాయప్రోలే.

1920–30 సం॥ల మధ్యకాలంలో సారస్వత సమాజాలు, సారస్వత పత్రికలు ఎక్కువగా బయలుదేరాయి. వాటిలో మొట్టమొదటిది సాహితీ సమితి. శ్రీ శివశంకరశాస్త్రి (ఇప్పుడు శివశంకరస్వామి) దానికి అధ్యక్షులు. ఈసమితి తరఫున మొదట "సాహితి" అనే పేరుతోను, ఆ తరువాత "సఖి" అనే పేరుతోను రెండు సారస్వతపత్రికలు నడపబడ్డాయి. ఇవి ఎంతో ఆకర్షవంతమైన, ప్రతిభావంతమైనరచనలతో వెలువడేవి. విశ్వనాథ సత్యనారాయణగారు కూడ కొంతకాలం సాహితీ సమితి సభ్యులుగా వుండేవారు. ఆ రోజులలోనే ఆయన "గిరికుమారుని ప్రేమగీతాలు" మొదలైన రచనలు చేశారు. "సాహితి" పత్రిక అంతరించి "సఖి" అనేపత్రిక వెలువడేసమయంలో ఆయనకి, శివశంకర శాస్త్రిగారికి పొసగలేదు. తత్పర్యవసానంగా సత్యనారాయణగారు సాహితీ సమితి నుండి విడిపోయి, "జయంతి" అనే మరొక ద్వైమాసపత్రికను స్వంతంగా నడపసాగారు. ఆరు చక్కని సంచికలు వెలువడిన తరువాత "జయంతి" నిలచిపోయింది. నూతన కావ్యరచనా పండితులలో ఒకరైన విశ్వనాథవారిప్పుడు రామాయణాన్ని రచిస్తున్నారు. కవిత్వంలో ఛాందసపద్ధతులను స్వీకరించి తెలుగు సారస్వత క్షేత్రంలో నాగలిపట్టి కొత్తపాలు వేసిన మరొక ప్రతిభాశాలి నండూరి సుబ్బారావుగారు. ఆరోజుల్లో ఆంధ్ర సారస్వత రంగంలో గాలిదుమారం రేపిన "ఎంకి పాటలు" రచించారు.

సాహితీ సమితి సభ్యులలో చాలామంది గేయ కవులయినప్పటికీ చిన్నకథలను రచించేవారు కూడా లేకపోలేదు. చింతా దీక్షితులు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు ప్రభృతులున్నారు. కాని గేయకవులే ఎక్కువ పేరులో వుండేవారు. వారిలో ముఖ్యంగా ఇంద్రచాపంలాంటి మనోహరమూర్తి మన కృష్ణశాస్త్రి. ఆయన రచనలు అపరిమితాకర్షణ శక్తికలవి. నాయనివారి రచనలలో నున్న అప్రయత్నకృతమైన ప్రౌఢగాని, వేదులవారి రచనలలోనున్న ధారాళతగాని కృష్ణశాస్త్రి రచనలో కనిపించవు. అయినాకూడా కావలసిన ప్రతిఫలమిచ్చే పరిపూర్ణ శోభతో నిండి వుంటుంది ఆయనకవిత. కాని కృష్ణశాస్త్రిగారి కవిత్వం అసలు ప్రజానీకంలోకి వెళుతుందా అనేది సందేహాస్పదం. సురజాడ పట్ల ఆయనకెంతో గౌరవభక్తులున్నప్పటికీ, కృష్ణశాస్త్రి కవులకు కవేగాని ప్రజలకు కవి కాదు.

సాహితీ సమితితోపాటు, యువ కవి మండలి, సారస్వత సమాజం, కవితా సమితి మొదలైన ఇతర సంఘాలు కూడా వుండేవి. కాని అవి యేవీ కూడా సాహితీ సమితి స్థాయిని అందుకోలేక పోయాయి. 1930 ప్రాంతాలకు ఈ చిన్న చిన్న సంఘాలన్నిటిని మించిపోయిన నవ్యసాహిత్య పరిషత్తు ఉద్భవించింది. దానితో తెలుగు సారస్వత కేంద్రంగా రూపొందించాలనే

ఆశయంతో ప్రారంభించారు. దాదాపు ఆరాయికి చేరుకొన్నట్లే కాని నిలబడలేక పోయింది.

కాశీనాథుని నాగేశ్వరరావు గారి "భారతి" పత్రిక వచ్చి ఆరోజుల్లో నడపబడుతున్న చిన్న చిన్న సారస్వత పత్రికలనన్నిటిని మింగివేసింది. "భారతి" ఈ నాటికీకూడ చక్కని సారస్వత మాసపత్రికగా నిలచివుంది. దాని నడక ఇంకా ముందకొడిగావున్నా, సారస్వత పత్రికలకుండవలసిన హుందాతనం, ఉదాత్తత్వం వున్నాయి.

ప్రస్తుతం మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా వుంటున్న పి. వి. రాజమన్నారు, ఆరోజులలో "కళ" అనే మరొక సారస్వత పత్రికను నడిపారు. కాని అది ఎక్కువకాలం సాగలేదు.

వీటన్నిటినీ మించి, కుడిపాటి వెంకటచలం గారు స్త్రీ పురుష సంబంధాలపై కాథారచనను ప్రారంభించి పెట్టుబడి దారీ వర్గాన్ని దడదడలాడించసాగారు.

సత్యాగ్రహోద్యమంలో జైలుకిపోయి వచ్చిన దేశభక్తుడు ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించిన "మాలపల్లి" అనే నవల ప్రజామన్ననలను పొందసాగింది.

మధ్యతరగతి ప్రజలలో సంచలనం బయలుదేరింది. సత్యాగ్రహోద్యమం తీవ్ర రూపం తీసుకుంటోంది. పరిపాలకులు సింహాకాండను అవలంబించారు. అప్పుడు "మా కొద్దీ తెల్లదొరతనము" అనేపాటతో ఆంధ్రదేశమంతా మారుమోగి పోయింది. దానిని రచించినవాడు గరిమెళ్ళ సత్యనారాయణగారు. ప్రభుత్వం ఆయనను జైలులో పెట్టింది. ఆపాటను నిషేధించింది.

విషాదకరమైన విషయమేమంటే 25 సంవత్సరాలకుపైగా అంటే భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడ - ఆపాటపై నిషేధం తొలగింపబడలేదు. ఇంకా విషాదకరమైన సంగతేమిటంటే, ఆరచయిత నిత్యదరిద్రంతో బాధపడి ఈ మధ్యనే అసువులను కోల్పోయాడు.

దారిద్ర్యము, మరణము, ఇవే 1930-40 మధ్యకాలంలో మనదేశాన్ని, ముఖ్యంగా ఆంధ్రదేశాన్ని గూర్చి చెప్పవలసిన మాటలు. మధ్యతరగతివారు క్రమంగా పేదవారై పోతున్నారు. నిరుద్యోగం విశ్వరూపం దాల్చి తాండవమాడుతోంది. పెట్టుబడిదారీ దేశాలన్నీ ఆర్థిక మాంద్యంలో పడి కొట్టుకులాడుతున్నాయి. ఒక్క సోవియట్ యూనియను మాత్రమే ఈ సంక్షోభం లేకుండా వుంది. ప్రణాళికాబద్ధమైన సోషలిస్టు ఆర్థిక విధానంతో ఆదేశంలోని ప్రజలందరి జీవన పరిమాణం నానాటికీ అభివృద్ధి చెందుతోంది.

ఈ పరిస్థితులలో తెలుగు రచయితలు, తమ చుట్టూ ఆవరించివున్న దారిద్ర్యాంధకారాన్నుంచి బైటపడి, రష్యాలోవున్నలాంటి మంచి పరిస్థితులు కావాలని ఆశించడం సహజంకాదా? అలాంటి కోరికలు జనించుతాయనే భయంతోనే మరొకవైపు నుంచి సోవియట్ యూనియన్‌పై నిందాపూరితమైన విష్ప్రచారం సాగింపబడింది. రష్యాను గూర్చిన సత్యం అతి జాగ్రత్తగా మరుగున పెట్టడానికి ప్రయత్నాలు జరిగాయి (ఉదా: అప్పుడు ఆంధ్రా యూనివర్సిటీ వైసుఛాన్సలరుగా వున్న కట్టమంచి రామలింగారెడ్డిగారు,

యూనివర్సిటీ లైబ్రరీలోనున్న రష్యాకు సంబంధించినపుస్తకాలన్నిటిని విద్యార్థులు చదవకుండా దాచివేశారు). రష్యాను మన కొక శత్రుదేశంగా చిత్రింప సాగారు. సరిగ్గా అప్పుడే యూరప్‌లో హిట్లరు పెనుభూతం విజృంభిస్తోంది.

ఈ సందర్భంలోనే శ్రీ శ్రీ "మహాప్రస్థానం" అనే గేయ సంపుటి వివిధ పత్రికలలో వెలువడ సాగింది. "ఆకలి మంటచే మలమలమాడే అనాథులందరు లేవండోయి" అని అంతర్జాతీయ కార్మిక గీతం మార్మ్రోగింది. అదే సమయంలో "షురూ హువాహై జంగ్ హమారా" అని భారతదేశంలో హరీంద్రుడు గర్జించాడు. "నేనొక పెనుతుఫాను" అంటూ నజ్రుల్ ఇస్లాం కవి విజృంభించాడు. ఈ యువ నినాదాలన్నీ మన తెలుగు కవుల చెవులలో ప్రతిధ్వనించాయి.

అభినవాంధ్ర కవి పండిత సమావేశం అను పేరుతో నవ్యసాహిత్య పరిషత్తు ప్రథమ సమావేశం బరంపురంలో జరిగింది. కొంపెల్ల జనార్దనరావుగారి సంపాదకత్వం క్రింద ఒక సారస్వత త్రైమాస పత్రికను నడపాలని నిర్ణయింపబడింది. కాని కొంపెల్ల "ఉదయిని" అనే ఒక స్వంత పత్రికను నడపడం, ఆయన అకాల మృత్యువువాత బడటంతో ఆ పత్రిక అంతర్ధానించిపోవడం జరిగింది. నవ్యసాహిత్య పరిషత్తువారు ఒక సంపాదకవర్గంతో "ప్రతిభ" అనే పత్రికను ప్రచురించ సాగారు.

1935-36 ప్రాంతాలలో అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం నెలకొల్పబడింది. తెలుగు రచయితలలో అగ్రగామి వర్గంవారికి అభ్యుదయ రచయితల సంఘం వైపు మొగ్గింది. అప్పటికింకా నవ్యసాహిత్య పరిషత్తు నడుస్తూనేవుంది. కొద్ది సంవత్సరాలు గడిచాక ఆంధ్రదేశంలో అభ్యుదయ రచయితలసంఘంఏర్పడింది. నవ్యసాహిత్య పరిషత్తు కార్యదర్శివచ్చి అభ్యుదయ రచయితల సంఘ సమావేశానికి అధ్యక్షత వహించాడు.

నవ్యసాహిత్య పరిషత్తు అంతరించినది.

రెండవ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. ఆంధ్రదేశంలో ఒకఅపూర్వమైన సారస్వత సంచలనం బయలుదేరింది. 1920-30 మధ్యకాలంలో సాహితీసమితి ఎంత ప్రబలంగా వుందో అలాగే 1940 తరువాత కాలంలో అభ్యుదయరచయితల సంఘం అత్యంత ప్రబలంగా వ్యాప్తి చెందింది. ప్రజానాట్యమండలి పేరుతో ఒక నాటక సమాజం బయలుదేరింది. సుంకర, వాసిరెడ్డిగార్లు రచించిన "ముందడుగు", "మాభూమి" నాటకాలను ప్రదర్శించుతూ ఆంధ్రదేశమంతటా ప్రఖ్యాతి గడించసాగింది (అందులో "మాభూమి" అనే నాటకాన్ని కాంగ్రెసుప్రభుత్వం నిషేధించింది). ఆత్రేయగారి "గుమాస్తా" (ఎన్. జి. వో.) నాటకం వాస్తవిక రచనలో కొత్త పంథాలను తొక్కింది. ఆరుద్ర, అనిసెట్టి, రమణారెడ్డి, సోమసుందర్ మొదలైన యువ రచయితలెందరో బయలుదేరి ఉత్తేజకరమైన రచనలు సాగించారు. జానపద సాహిత్యపద్ధతులలో కొత్త పోకడలు వచ్చాయి. ప్రజా హృదయాలలోకి నడక సాగించాయి.

నిద్రాణమై వున్న తెలంగాణా మేల్కొంది. కాళోజీ, దాశరథిగారలు గొంతెత్తి ఆ నూతన జాగృతిని ప్రతి

ధ్వనింపచేశారు. ఈ మధ్యనే మరణించిన సురవరము ప్రతాపరెడ్డిగారు, తెలంగాణా ఆంధ్ర సారస్వత పరిషత్తుకి మూలవిరాట్టు. దేవులపల్లి రామానుజరావు వగైరా మరికొందరు దానికి జీవం పోస్తున్నారు. తెలంగాణాలో రచయితల సాహిత్య సంఘాలు అనేకం చురుకుగా పని చేస్తున్నాయి.

ఇంతవరకు కరువుకాటకాలకు, అభివృద్ధి నిరోధకులకు నిలయమనుకునే రాయలసీమ కూడ మేలుకుంటోంది. మహోజ్వలమైన దాని చారిత్రిక స్మృతులలో నూతన స్పందనం కనుపిస్తోంది.

ఆధునిక ఆంధ్ర సాహిత్యం, కవితా రూపంలో గాకుండా, ఎక్కువగా చిన్న కథలు, నవలా రూపంలో తన ఔన్నత్యాన్ని నిలబెట్టుకుంటోంది. గురజాడ చూపినదారిని, ఈ రెండు రచనా పద్ధతులలోను తెలుగు కవిత పరిపూర్ణతను చేరుకుంటోంది.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు ఆంధ్ర ప్రజలు జాగృతులయ్యి వున్నారు. స్వాతంత్ర్య దినోత్సవంనాడు మదరాసు రేడియోలో ప్రసంగించిన తెలుగు రచయిత లందరిలోను తెలుగు ప్రజల జాగృతి ప్రతిబింబించింది. కాని మన ఆశయం ఇంకా దూరంగానే వుంది. ఎప్పటికంటెకూడ ఐక్యతను సాధించ వలసిన ఆవశ్యకత ఈనాడు ఎక్కువగా వుంది.

(శ్రీ శ్రీ వ్రాసిన ఇంగ్లీషు వ్యాసానికి అనువాదం)



# తెలుగు భాషా సమితి

ప్రాంతీయ భాషలలో వివిధ విజ్ఞాన విషయాలకు సంబంధించిన గ్రంథ రచనను ప్రోత్సహించాలనే ఆశయంతో మదరాసు ప్రభుత్వం ఇతర భాషా సమితులతో పాటు, తెలుగుభాషా సమితిని కూడా 1947 సంవత్సరం అక్టోబరు మాసంలో ప్రారంభించి ప్రోత్సహించింది. ఏటా వివిధ విజ్ఞాన విషయిక గ్రంథాలకు ఒక్కొక్కదానికి రు. 500 ల చొప్పున బహుమతుల నివ్వ నిశ్చయించింది.

ఈ సమితివారు విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి అరకొరగా విడిచి పెట్టిన "(ఆంధ్ర) తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని" తయారుచేయడానికి సంకల్పించారు.

## తెలుగు విజ్ఞాన సర్వస్వము

ఇది 12 సంపుటాలుగా తయారు చేయబడుతున్నది. సుమారు 12,000 పేజీలు ఉంటుందని అంచనా వేశారు. సంపుటం వారీ వివరాలు :

### 1. జీవశాస్త్రం

వృక్ష, జంతు, భూగర్భ శాస్త్రములు, జీవోత్పత్తి, పరిణామములు, ఉద్భిజ్జము, జంతు లక్షణము, జంతువిభాగము, భూగర్భ లక్షణములు, గనులు మొదలగునవి.

### 2. (అ) శాస్త్రీయ వైద్యము

శరీర శాస్త్రము, చికిత్సా క్రమము, శస్త్ర చికిత్స, గర్భశాస్త్ర వివరణము, రోగ నివారక సాధనములు మొదలగునవి.

### (ఆ) దేశీయ వైద్యశాస్త్రము

ఆయుర్వేదము, యూనానీ, హోమియోపతి మొదలగునవి.

### 3. గణితము, ఖగోళశాస్త్రము

అంకెల లెక్కలు, రేఖా గణితము, బీజ గణితము, భూమికొలతలు, ముక్కోణమానము, సూర్యసిద్ధాంతము మొదలగునవి.

### 4. (అ) శిల్పము, వాస్తుశాస్త్రము, యంత్రనిర్మాణము

గృహనిర్మాణము, వంతెనలు యుద్ధ సామగ్రి నిర్మాణము, విద్యుత్ సంబంధ నిర్మాణము, రేడియో, టెలిఫోను, టెలివిజను, రైల్వే, నౌకా, విమానాశ్రయములు మొదలగునవి.

### (ఆ) పారిశ్రామిక విద్య

పరిశ్రమల వర్గీకరణము. కుటీర కార్ఖానా పరిశ్రమ మొదలగునవి.

### 5. (అ) వ్యవసాయశాస్త్రము, అడవుల విద్య, పశువైద్యము

వ్యవసాయ విధానము, పనిముట్లు, పంటలు, అడవి పంటలు, పశువుల రోగములు, పాశ్చాత్య పశువైద్యము మొదలగునవి.

### (ఆ) దేశీయ పశువైద్యము

ఈ దేశములోని పశువుల రోగములు, మందులు మొదలగునవి.

### 6. లలిత కళలు, భాషలు, సాహిత్యములు, విద్యాశిక్షణము

చిత్రలేఖనము, శిల్పము, సంగీతము, నాట్యము మొదలగునవి; ప్రపంచ భాషలు, వ్యాకరణ, అలంకారాది శాస్త్రములు, విద్యాశిక్షణా పరిణామము మొదలగునవి.

### 7. మతములు, ఆధ్యాత్మిక విద్యలు, వేదాంతశాస్త్రము

హిందూమతము, తక్కిన మతములు, మనశ్శాస్త్రము, మాయావిద్య మొదలగునవి.

### 8. సాంఘిక విషయములు

(అ) మనుష్య శాస్త్రము, మానవ జాతులు, ఆదిమ నివాసులు, సంస్కృతి పరిణామము మొదలగునవి,

(ఆ) నీతి శాస్త్రము, న్యాయ శాస్త్రము, శాంతి స్థాపనము మొదలగునవి.

### 9. చరిత్ర - ప్రపంచ చరిత్ర, ఇండియాదేశ చరిత్ర, రాజనీతి

ప్రాచీన, మధ్య, నవీనయుగముల చరిత్ర, కొన్ని దేశముల చరిత్ర, రాజనీతి శాస్త్ర లక్షణము, పరిణామము, రాజనీతిలోని ఆశయములు, ఆచరణ, ప్రభుత్వ విధానము, ప్రభుత్వ వర్గములు, ఇండియా రాజనీతి.

### 10. భౌతిక విజ్ఞాన, రసాయనశాస్త్రములు

ద్రవ్యము, శక్తి - వాటి లక్షణములు, పరస్పర ప్రవృత్తి, వేడి, వెలుగు, శబ్దము, విద్యుత్తు మొదలగు శక్తుల ప్రయోజనము, పరమాణుశక్తి చరిత్ర, వివిధ ద్రవ్యముల అంతఃపరివర్తనము, రాసాయనిక, యాంత్రికముల ఉపయోగములు, ఔషధములు, వర్షము, వాయుయానము, రేడియోకు వాతావరణమునకు గల సంబంధము మొదలగునవి.

### 11. తెలుగు సంస్కృతి సంపుటము

తెలుగుదేశ, భాష, వాఙ్మయ, కళా చరిత్రములు మొదలగు తెలుగు సాంస్కృతి విశేషములు, తెలుగుజాతుల చరిత్ర, గ్రంథ క్షేత్రములు, వ్యవసాయము, వర్తక వ్యాపారములు, పరిశ్రమలు మొదలగునవి.

### 12. (అ) భూగోళశాస్త్రము

శాస్త్రపరిణామము, ప్రకృతి లక్షణముల సంబంధము, భూతలవిభాగము, రాజ్యముల విభాగము, వివిధ మండలముల వివరణము మొదలగునవి.

### (ఆ) వాణిజ్యము

ప్రాచీనాధునిక, వాణిజ్యాభివృద్ధికారణములు, పద్ధతులు, నేటి వాణిజ్య స్థితి మొదలగునవి.

### (ఇ) అర్థశాస్త్రము

శాస్త్రలక్షణము, దేశసంపదకాధారములు, ఉత్పత్తి, వ్యాప్తి, వినిమయము మొదలగునవి.

## ప్రభుత్వం తెలుగు భాషాసమితిద్వారా ఉత్తమగ్రంథాలకు అందచేస్తున్న బహుమతులు

### 1948 - 49

| | | |
|---|---|---|
| 1. పద్యరచన | శివభారతము | శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి |
| 2. సాహిత్యవిమర్శ (గద్య) | నవరస గంగాధరము<br>త్రిపురాంతకోదాహరణము | శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ<br>శ్రీ నిడదవోలు వేంకటరావు |
| 3. బాలసాహిత్యము | పిల్లల బొమ్మల భారతము<br>బాలానందము | శ్రీ మాగంటి బాపినీడు<br>డా. గిడుగు వేంకట సీతాపతి |
| 4. వ్యవసాయము | వ్యవసాయశాస్త్రము | శ్రీ గోటేటి జోగిరాజు |
| 5. చరిత్ర | ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము | శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ |
| 6. ఆరోగ్య శాస్త్రము | గ్రామారోగ్య రక్షణము | డా. కుర్పపల్లి నారాయణమూర్తి |

### 1949 - 50

| | | |
|---|---|---|
| 1. జీవిత చరిత్ర | సరోజిని | శ్రీ గొర్రెపాటి వేంకట సుబ్బయ్య |
| 2. నవల | నారాయణభట్టు | శ్రీ నోరి నరసింహశాస్త్రి |
| 3. మనశ్శాస్త్రము | మనశ్శాస్త్రము | డా. కుర్పపల్లి నారాయణమూర్తి |
| 4. కథానికలు | కాంతం | శ్రీ మునిమాణిక్యం నరసింహారావు |
| 5. తెలుగు భాషా పరిశోధనలు | తెలుగుభాష పుట్టుక, చరిత్ర | శ్రీ కోరాడ రామకృష్ణయ్య |
| 6. శరీరశాస్త్రము | రమ్యహర్మ్యము | శ్రీ ఎస్.ఎం. వేణుగోపాలనాయుడు |

### 1950 - 51

| | | |
|---|---|---|
| 1. నాటకము | గౌతమబుద్ధ | శ్రీ కొండముది గోపాలరాయశర్మ |
| 2. ఆంధ్రచారిత్రిక పురుష జీవితము | శ్రీకృష్ణ దేవరాయలు<br>అక్కన్న, మాదన్న | శ్రీ కిడాంబి రాఘవాచార్యులు<br>శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి |
| 3. విద్యుచ్ఛక్తి వినియోగములు | విద్యుచ్ఛక్తి ఉపయోగములు | శ్రీ హరి ఆదిశేషువు |

## 1950 — 51

| | | |
|---|---|---|
| 4. సహకార ఆర్థిక శాస్త్రము | సహకారార్థిక విజ్ఞానము | శ్రీ బోయినపల్లి పద్మరాజా |
| 5. ఆంధ్రదేశమందలి ఓషధులు | వనౌషధి విజ్ఞానము | డా. ఐ. వేంకటేశ్వరశర్మ |

## 1951 – 52

| | | |
|---|---|---|
| 1. కర్ణాటక సంగీత పరిణామము | కర్ణాటక సంగీత పరిణామము | శ్రీ వింజమూరి వరాహ నరసింహాచార్యులు |
| 2. చలనచిత్రనిర్మాణ ప్రదర్శన విజ్ఞానము | చిత్రజగతి | శ్రీ డి. వి. ఏ. ఆచార్య |
| 3. తెలుగు కవయిత్రుల కవిత్వసమీక్ష | ఆంధ్ర కవయిత్రులు | శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ |
| 4. వినియుక్త రసాయన శాస్త్రము | వినియుక్త రసాయన శాస్త్రము | శ్రీ హరి ఆదిశేషువు |

## 1952 – 52

| | | |
|---|---|---|
| 1. ఖండకావ్యములు | కవితాసుందరి | శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు |
| 2. తెలుగు సాహిత్యమందలి హాస్యరసము | తెలుగు హాస్యము | శ్రీ ఎమ్. సంగమేశము |
| 3. జానపదగేయసాహిత్యము | జానపదగేయసాహిత్యము | శ్రీ హరి ఆదిశేషువు |
| 4. గృహనిర్వహణ శాస్త్రము | గృహనిర్వహణ శాస్త్రము | శ్రీమతి కోడూరి లీలావతీదేవి<br>శ్రీమతి జి. బాలాత్రిపురసుందరి |
| 5. భూగోళశాస్త్రము | భూగోళశాస్త్రము | శ్రీ కె. శేషగిరిరావు |

### భాషా సమితి జరిపిన ప్రదర్శనాలు

**1951 మార్చి :** ఢిల్లీలో అఖిలభారత సాంస్కృతిక సమావేశమునందు తెలుగు భాషా సమితివారి సాంస్కృతిక ప్రదర్శనము జరిగింది.

**1951 డిసెంబరు :** మద్రాసులోని [illegible] తెలుగుపత్రికలవారి తెలుగు భాషాసమితి జరిపిన సమావేశ సందర్భంలో పత్రికల ప్రదర్శనము, సాంస్కృతిక ప్రదర్శనము జరిగాయి.

**1952 ఆగస్టు :** రాజమహేంద్రవరములో గాంధీ జయంతి ఉత్సవములందు సాంస్కృతిక ప్రదర్శనం జరిగింది.

**1953 జనవరి :** హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు సభకు కార్యక్ర

సందర్భమున ఆలంపురంలో సాంస్కృతిక ప్రదర్శనం జరిగింది.

1953 డిశంబరు : విజయవాడలో ఉత్తమ తెలుగు గ్రంథాలకు బహుమతుల నిచ్చే సందర్భంలో పత్రికల, పుస్తకాల ప్రదర్శనం జరిగింది.

## తెలుగు భాషాసమితి కార్య నిర్వాహకవర్గము

అధ్యక్షులు :

శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

ఉపాధ్యక్షులు :

శ్రీ రాజా బొప్పరాజా రామకృష్ణ రాజా

శ్రీ పూసపాటి విజయరామగజపతిరాజా

కోశాధ్యక్షులు :

శ్రీ పర్వతనేని బహ్మయ్య

కార్యదర్శులు :

శ్రీ మోటూరి సత్యనారాయణ

శ్రీ ఉప్పుటూరి ఎంబెరుమానారు

సభ్యులు

శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు

శ్రీ మాగంటి బాపినీడు

శ్రీ పసల సూర్యచంద్రరావు

శ్రీ పందిరి మల్లికార్జునరావు

శ్రీమతి క. లక్ష్మీ రఘురామ్

కార్యస్థానం :

తెలుగు భాషా సమితి, యూనివర్సిటీ బిల్డింగ్స్, చిపాక్, మదరాసు - 5



# నవయుగ మహాపురుషులు

## ఈ రా

భారతదేశంలో బ్రిటిష్ అధికారం పంధొమ్మిదో శతాబ్దం మధ్యలో వాణిజ్య రూపాన్ని వదిలిపెట్టి, ప్రత్యక్ష రాజకీయ పాలన రూపంలో బయటపడింది. భారత ప్రజలు 1857 లో బ్రిటిషు అధికారానికి చేసిన ప్రతిఘటన విఫలం కావడంతో, మనదేశంలో బ్రిటిషుపాలన సుస్థిరమైంది. ఆర్థిక జీవనంలో శిథిలమైన భూస్వామ్య వ్యవస్థతో పాటు సామ్రాజ్యవాదుల గోపిడీవిధానం భారతప్రజలను పీల్చి పిప్పి చేయసాగింది. పరిపాలన కవసరమైన దేశ భాషాజ్ఞానంలేని బ్రిటిషు ప్రభువులకు తమ పాలితులలో మధ్య ప్రభుత్వ యంత్రాన్ని నడిపేందుకు, ఆంగ్ల భాషా జ్ఞానంగల భారతీయులు అత్యవసరమై, భారతదేశంలో ఆంగ్ల విద్యను ప్రవేశ పెట్టక తప్పిందికాదు. ఈస్టిండియా కంపెనీ పాలన, తొందరముదిరి ఆసరవిల్లి అయినట్టుగా, ఆంగ్ల ప్రభుత్వంగా మారిన తరవాత ఆంగ్లవిద్య యింకా విస్తరించింది.

భూస్వామ్య వ్యవస్థనుండి విముక్తి పొంది ఎంతో ముందుకుపోగిన ఆంగ్ల, యూరోపియన్ సంస్కృతి నాగరికతల పరిచయం సంపాదించిన ఆంగ్ల విద్యావంతులైన భారతీయులకు, తమ స్వీయ భూస్వామ్య సంస్కృతి నాగరికతల అభివృద్ధినిరోధక స్వరూపం స్పష్టపడింది. తిరస్కరించగా వారిలో ఎన్నో నవ్య భావాలూ, కాంక్షలూ అంకురించి వృద్ధి చెందేయి. పాశ్చాత్యదేశాల్లో విహాం ముఖ్యంగా విస్తరించిన విజ్ఞానం మనకు లేదే అన్న ఆవేదనా, దానినంతక్కీ స్వదేశ భాషల్లోకి తీసుకవచ్చి స్వజాతిని పాశ్చాత్యులతో సమానస్థాయికి తీసుకుపోవాలన్న అభిమానమూ, పట్టుదల మన మేధావులలో కలిగేయి.

పెట్టుబడిదారీ సంస్కృతినాగరికతలకు చెందిన ఆంగ్ల పాలకులు - యీ నవ్య భావాలు భారతదేశంలో తమ ఆర్థిక రాజకీయాధికారాలకు వ్యతిరేకమైనవిగా పరిణమిస్తాయని అవగతంకాకపోవడంవల్ల - సామాజిక, సంస్కృతి రంగాలకు సంబంధించినంతవరకూ కొద్దిగానో గొప్పగానో యీ నవ్యభావాలను ప్రారంభంలో ప్రోత్సహించారు. భారత ప్రజల ఆర్థిక సాంఘిక జీవనంలో పెద్ద అడ్డుగోడగా పరిణమించిన భూస్వామ్యవ్యవస్థ ప్రాబల్యానికి బదులు, ఆంగ్ల ఆర్థిక రాజకీయాధికారానికి అనుకూలమైన పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థ ప్రవేశించడం, నవ్యభావాల వ్యాప్తికి అవసరాన్నీ, అవకాశాన్నీ కలిగించింది. ప్రప్రథమంగా ఆంగ్లపాలన దిట్టపడిన బెంగాలులో ప్రారంభమై, పంధొమ్మిదో శతాబ్దం ద్వితీయార్థంలో

యీ నవ్యభావ వాతావరణం మన ఆంధ్ర దేశంలో ఏర్పడింది. భూస్వామ్య సంస్కృతీ నాగరికతల కబంధహస్తాలను ఛేదించిన, అభ్యుదయకర భావ విజయశంఖాన్ని పూరించిన నవయుగ ప్రవక్త, మహాపురుషుడు వీరేశలింగంగారు ఉద్భవించేరు.

# నవయుగ నిర్మాత కందుకూరి వీరేశలింగం

## ( 1848 – 1919 )

వీరేశలింగం గారు ఉదయించే సరికి ఆంధ్రదేశం భూస్వామ్య సంస్కృతి నాగరికతల మౌఢ్యానికి ఆటపట్టుగా వుండేది. ముఖ్యంగా స్త్రీ, సమాజంలో అక్షరాలా బానిస; పురుషుని నిరంకుశత్వానికీ, మౌర్ఖ్యానికీ బలి పశువు. అతి బాల్యంలోనే వివాహాలు–కాటికి కాళ్ళు చాచుకొని వున్న వృద్ధులకు కూడా పెళ్ళిళ్ళు, అందువల్ల లెక్కలేనంత మంది వితంతువులు; కాని పునర్వివాహం ఎంత మాత్రం కూడదు. ఆ ఆలోచనే ఎవరికీ వుండేదికాదు. స్త్రీ విద్య – యిది సంఘ దృష్టిలో పరస్పర వైరుధ్యంగల మాట. స్త్రీకి కూడా విద్యార్హత వున్నదనుకునే వారే లేరు. స్త్రీ చదువుకోవడమంటే కులట కావడమని అప్పటి అర్థం. వీరేశలింగంగారు వర్ణించినట్టుగా 'నరమాంస విక్రయం'–అంటే కన్యా శుల్కాలు, సత్సంప్రదాయాలు కావు. వరకట్నాలు కూడా సదాచారాలే. పడుపు వృత్తి సంఘానికి అవసరమైన ఏర్పాట్లలో ఒకటి. భోగంమేళాలు కూడా అంతే. లంచగొండితనం, ఉద్యోగధర్మం. జోతిష్యం, శకునాలు వగైరా బుద్ధిజాడ్య జనితోన్మాదాలను నమ్మకుండా వుండడానికి గుండె లెవరికి వున్నాయి?

మన సాహిత్యం ప్రబంధయుగ క్షీణ దశలో పడి కొట్టుకొంటూ వుండేది. ఎంతగా అర్థంకాకుండా వ్రాస్తే అంత గొప్ప. అష్టాదశ వర్ణనలూ, శతకోటి గారడీలూ చేస్తేనే కవిత్వం. వర్తమాన జీవితానికీ, కావ్యవస్తువుగా వుండే అర్హత వుందన్నది అనూహ్యమైన విషయం. ఈ నాడున్న అనేక సాహిత్య రూపాలు–నవలలు, నాటకాలూ, విజ్ఞాన శాస్త్ర గ్రంథాలు మొదలైనవి అసలు లేవు. అవి భాషకూ ప్రజలకూ అవసరమన్నది ఎవరికీ తట్టనే తట్టేదికాదు. ఉన్న జటిల కావ్యాలైనా రాజుల సంయోగ వియోగాలను, రాణుల విరహ తాపాలను తప్పితే, అప్పటి సమాజానికి ఉపకరించే విషయాలను వేటినీ పట్టించుకొనేవికావు. సూక్ష్మంగా చెప్పాలంటే యిదీ నాటి మన సమాజంలోనూ, సాహిత్యంలోనూ వుండే పరిస్థితి. దుర్గంధభూయిష్టమైన కూపస్థమండూక స్థితి.

ఈ కుళ్ళులో కూరుకపోయిన సమాజాన్నీ సాహిత్యాన్నీ విశాల ప్రపంచం లోనికీ, ఆరోగ్యకరమైన వాతావరణం లోనికి తీసుక రావడానికి తన యావజ్జీవితాన్నీ ధారపోసి, ఆంధ్రజాతి శాశ్వత కృతజ్ఞతకు పాత్రులైన వీరేశలింగంగారు 1848 ఏప్రిల్ 16న రాజమహేంద్ర వరంలో జన్మించేరు. నాలుగేళ్ళ వయసులో తండ్రి చనిపోగా తల్లి, పెదతండ్రి పెంచి పెద్దచేసేరు. చిన్నప్పట్నుంచీ చదు

వుండో శ్రద్ధాసక్తులు, తరగతిలో ప్రథమ స్థానం మంచినడవడిగల కుర్రవాడిగా పేరుపడి బహుమతులు పొందినా, న్యాయంకోసం ప్రధానోపాధ్యాయుణ్ని ధిక్కరించడానికికూడా ఆయన జంకలేదు. పాఠాలు చెప్పడంచేతకాని ఆ ఉపాధ్యాయుణ్ని మార్పించేందుకు, విద్యార్థులను సమీకరించి సమ్మె చేయించి విద్యార్థుల ఆశయాన్ని సాధించేరు. ఈ న్యాయ చింత, యీ దీక్ష తరువాత ఆంధ్రదేశానికి ఎంతో మహోపకారం చేసేయి.

వీరేశలింగంగారు 1870 లో మెట్రిక్యులేషన్ పాసయి, మరుసటియేడు నెలకు 25 రూపాయలజీతంమీద ఉపాధ్యాయుడిగా ప్రవేశించినప్పట్నుండీ సంఘంలోని మూఢవిశ్వాసాలను నిరసిస్తూ, స్త్రీ విద్యను ప్రోత్సహిస్తూ పత్రికలలో వ్రాస్తూండేవారు. అంతేకాకుండా 1874లో ధవళేశ్వరంలో స్త్రీవిద్యకోసం బాలికా పాఠశాలను పెట్టేరు. స్త్రీకికూడా విద్య అవసరమన్నది ఏకోశానా లేని ఆ కాలానికి, యిది ఎంతటిసాహసమో వేరే చెప్పనక్కరలేదు. తన సంస్కరణ భావాలకు ప్రచార సాధనాలుగా, 1876 నుండి "వివేకవర్ధని", "హాస్యసంజీవని" అన్న పత్రికలు ప్రారంభించేరు. ఇందులో లంచగొండి మార్గాలనూ, వాటినవలంబించే ప్రబుద్ధులనూ వీధినిపెట్టి, నవ్వులపాలుచేసేరు. స్త్రీలకోసం 1883 లో 'సతీహితబోధిని' అన్న పత్రికను కొంతకాలం పెట్టేరు.

కేవలం అర్థతాత్పర్యాలు చెప్పే తెలుగుపండితుడుగా కాకుండా, ఆయన ధర్మోపదేశకుడుగా విద్యార్థులను ఉత్తేజపరిచి, వారిలో ప్రజాసేవానురక్తిని కలిగించడంవల్ల, ఆయన ఉద్యమించిన సత్కార్యాలన్నిట్లో వారు పెద్దఅండగా వుండేవారు. ఆయన న్యాయదీక్షనూ, స్వార్థరహిత జీవనాన్నీ ప్రశంసించినవారు ఆయన ఉద్యమానికి అంగబలమూ, అర్థబలమూ చేకూర్చేవారు.

సంఘాన్ని పీడించే ప్రతిచెడుగూ ఆయనకు శత్రువే. బాల్యవివాహాలు, వృద్ధవివాహాలూ, కన్యాశుల్కం, వరశుల్కాలు, పడుపువృత్తి, భోగంమేళాలు, లంచగొండితనం, మద్యపానం, అంటరానితనం, వర్ణవ్యవస్థ, స్త్రీల అవిద్య, కర్మవాదంపైని, జ్యోతిష్యంపైని, శకునాలు, దయ్యాలు మొదలైనవాటిపైని విశ్వాసం—యివన్నీ సంఘశత్రువులు, అంచేత ఆయనకు బద్ధశత్రువులు. వీటిని సమూలంగా నిర్మూలించడానికి సాగింది మహాప్రభంజనం—వీరేశలింగంగారి మహోద్యమం.

ఇవన్నీ ఒక ఎత్తు, వితంతువివాహాలకోసం ఆయనచేసినకృషి, శ్రమా యింకో ఎత్తు. శాస్త్రసాంప్రదాయాల రాక్షసపాలనలో, వితంతు వివాహం న్యాయసమ్మతమైనదేనని నమ్మినవారుకూడా, అందుకు తోడ్పడడానికి సాహసించేవారు కాదు. ఈ ఉద్యమం, ఏటికి ఎదురీత. కఠినశిలా పర్వతంగా మారిన సంఘాన్ని ఎదుర్కోవడం; చేసినవారికీ, చేసుకున్నవారికీ సంఘబహిష్కారాలు. ఇన్నిటినీ దాటి ఎవరైనా పూనుకుంటే అష్టులు మొదలుకొని ఊళ్ళో వాళ్ళందరూ వచ్చి వెక్కిరింపులు, నిర్బంధాలు, యింట్లో చావుగ పోయినట్టు ఏడుపులు, మొత్తుకోడాలు. కాని వీరేశలింగంగారు మహామేరువు. ఆయనను

కొట్టడానికి కుట్రలు జరిగేయి. ఆయన శిష్యగణాన్ని కొట్టేరుకూడా. ఆసంఘమూ, ఆసంఘపు మూర్ఖ మతపీఠాధిపతి వెలివేసే మన్నారు. మీకు నేను కూడా అదేపని చేస్తున్నానన్న జవాబువచ్చింది వీరేశలింగం గారినుండి. దుర్భాషలాడేరు, గాయాలు చేసేరు. కాని ఆయన లొంగనూ లేదు, రాజీపడనూ లేదు. మిన్ను విరిగి మీద పడినా సరే అధర్మాన్నీ, అన్యాయాన్నీ ఎదిరించవలసిందే! సద్ధర్మాన్నీ, న్యాయాన్నీ స్థాపించవలసిందే!

తన సంస్కరణోద్యమం శాస్త్ర విరుద్ధం కాదని రుజువు చేసేందుకు, సకల మత గ్రంథాలూ, శాస్త్రాలూ కూలంకషంగా మథించి, ఛాందస పండితులకు వాకట్టు చేసేరు. అతిక్లిష్టమైన పరిస్థితులలో తన చేతిమీదుగా ముప్పయ్యయిదు వితంతు వివాహాలు జరిపించేరు. వారికి గృహవసతులు, పోషణ కూడా కల్పించేరు. వితంతు శరణాలయం స్థాపించేరు. దాని నిర్వహణకు వసతులేర్పరచేరు. తను ప్రారంభించిన ప్రతి సత్కార్యమూ దీక్షగా చివరివరకూ సాగించడమే కాకుండా, వాటి సక్రమ నిర్వహణకు వసతులు ఏర్పరచడం ఆయన అలవాటు.

స్త్రీల ఉద్ధరణకు ఆయనచేసిన ఇంకో సేవ, "పతిత యువతీ సంరక్షణాలయ" స్థాపన. సంఘంలోని అసంతృప్తికరమైన రీతివల్ల అడుగుజారి, సంఘ ద్రోహానికి గురి అయిన అబలల సముద్ధరణ దీని ప్రయోజనం.

సామాజిక జీవితానికి ప్రాతిపదికగా రాజమండ్రిలో పురమందిరాన్నీ, విద్యావ్యాప్తికోసం ఉన్నతపాఠశాలనూ వీరేశలింగంగారు స్థాపించేరు. కరడు కట్టిన హిందూమతం కంటె ఉదారమైన, వర్ణవిభాగాన్ని పాటించని బ్రహ్మసమాజ వ్యాప్తికి, ఆనాటి యింకో మహోన్నత పురుషుడైన రఘుపతి వెంకటరత్నంగారితో బాటుగా కృషిచేసేరు. ఏకేశ్వరోపాసకు లయ్యారు. అవసాన దశలో జంధ్యం తీసివేసేరు.

సంఘ సంస్కరణ రంగంలో వీరేశలింగంగారు చేసినకృషితోనూ, సేవతోనూ సరితూగగలది ఆయన సాహిత్య రంగంలో చేసిన పరిశ్రమ, రచన. నిజంగా విరామం లేకుండా ఒక అర్ధశతాబ్దకాలం అహోరాత్రులూ పరమ భయంకరమైన మూఢ విశ్వాసాలతో హోరాహోరీగా పోరాడుతూ, బురదనీటిలో [illegible] కదలక మెదలక పడివున్న మన్నుపోతు లాంటి సంఘాన్ని మూలమట్టంగా కదిల్చివేస్తూ, వ్యాధిగ్రస్తమైన దుర్బలశరీరంతో, [illegible], పుట్టుకవల్లగాని ఉద్యోగంవల్లగాని యెటువంటి ప్రత్యేక ప్రాబల్యమూ రాకపోయినప్పటికీ ఆయన ఆంధ్రజాతి ఉద్ధరణకు చేసిన మహాసమరం సాటిలేనిది. ఇటువంటి మహత్కార్యాలలో తలమునకలుగా నిమగ్నులై వుండి కూడా వీరేశలింగంగారు, తనమహోద్యమ విజయ సాధనకు ఆయుధాలుగా ప్రయోగించిన అసంఖ్యాకమైన రచనలే కాకుండా, ఆంధ్ర సాహిత్యానికి ఎన్నో నవ్యరూపాలనూ, ఆంగ్ల సంస్కృత భాషల నుండి ఎన్నో మహత్తర గ్రంథాల అనువాదాలనూ ముఖ్యంగా నాటికీ నేటికీ సాటిలేని అభిజ్ఞాన శాకుంతలం ఆంధ్రీకరణనూ చేసేరు. ఎంతో పరిశ్రమ, అంతకు మించిన పరిశోధన చేసి, ఆంధ్ర కవుల చరిత్రను — ఆంధ్ర భాషకు అమూల్యాభరణమయిన

ఉద్గ్రంథాన్ని రచించేరు. పిల్లలకు వాచకాలు, వ్యాకరణమూ, నీతి పద్యాలూ మొదలుకొని, సులభ విజ్ఞాన శాస్త్రాలు మొదలుకొని, పండిత ప్రశంసల నందుకొన్న మహాకావ్యాల వరకూ వ్రాసేరు.

"తెలుగులో వచన ప్రబంధము నేనే చేసితిని; మొదటి నాటకము నేనే తెనిగించితిని; మొదటి ప్రకృతి శాస్త్రము నేనే రచించితిని; మొదటి ప్రహసనము నేనే వ్రాసితిని; మొదటి చరిత్రము నేనే విరచించితిని; స్త్రీలకై వచన పుస్తకము నేనే కావించితిని" అని స్వీయచరిత్రలో వ్రాసుకొన్నది ఆయన గ్రంథ రచన ఎంత విస్తృతంగా సాగిందో తెలియజేస్తుంది. ఆయన సాహిత్య కృషి ఫలితాలు బలమైన, విలువైన పది సంపుటాలు. సాహిత్యంలో కొత్త సత్సంప్రదాయాలను నెలకొల్పడమే గాకుండా, శైలిలో పాండిత్య ప్రదర్శనమూ, ఆంధ్ర భాషను చిత్రహింసల పాలుచేసే విచిత్ర కవిత్వాలనూ పోగొట్టి, రసవంతమూ, సులభ గ్రాహ్యమూ అయిన పద్ధతికి పునాది వేసేరు. ఇందుకు కోపించి కలబడిన ఛాందస పండితులనందర్నీ తరిమి కొట్టేరు. సాహిత్యాన్ని క్షీణ ప్రబంధ యుగం నుండి నవ్యయుగంలోనికి తీసుకవచ్చి, ఆంధ్రసారస్వతపథంలో వెలుగులు వెదజల్లేరు. వీరేశలింగంగారు స్థాపించిన సులభ భాష, జీవద్భాష అయిన వ్యావహారిక భాషకు బాటలు వేసింది. అవసాన దశకు ముందర, గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదాన్ని అంగీకరించి దాని ప్రచారానికేర్పర్చబడిన "వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమా"జానికి అధ్యక్షులయ్యేరు. వాడుక భాషకు వ్యాకరణం వ్రాయడానికి పూనుకొన్నారు కూడా. కాని కొద్దికాలానికే 1919 మే 27 న మద్రాసులో కీర్తిశేషులు కావడం వల్ల యిది సాగలేదు.

వీరేశలింగంగారి జీవితమంతా ఆంధ్ర జాతి ఉద్ధరణకు సాగిన మహోద్యమం. ఇంత మహోన్నత పురుషుడు ఆంధ్రుల చరిత్రలో మరి ఒకరు కనిపించరు. జాతికి ఒక ఆదర్శ జ్యోతిగా, ప్రతి అభ్యుదయ ఉద్యమానికి నైతిక తేజంగా వెలుగొందుతున్నారు వీరేశలింగంగారు. ఎల్లకాలాలలో మన ధ్రువతారగా వెలుగొందుతారు వీరేశలింగంగారు.

## నవయుగ మహాకవి గురజాడ అప్పారావు

### ( 1861 – 1915 )

వీరేశలింగంగారు మబ్బులు, డొంకలు నరికి సేద్యయోగ్యంగా చేసిన సాహిత్య క్షేత్రంలో నిండైన పంటలు పండించిన గురజాడ అప్పారావుగారు, విశాఖజిల్లా రాయవరం గ్రామంలో 1861 సంవత్సరం నవంబరు 30 తేదీని జన్మించారు. విద్యాభ్యాసం బాల్యంలో చీపురుపల్లిలోనూ, తరువాత పట్టభద్రతవరకూ విజయనగరం కళాశాలలోనూ జరిగింది. అక్కడనే చాలా ఏళ్ళు లెక్చరరుగా పనిచేసేరు. విజయనగర సంస్థానంలో ఉన్నతోద్యోగిగా వున్నారు.

అప్పారావుగారు తెలిసి పెద్దవారయ్యే సరికి, వీరేశలింగంగారు నాటిన సంఘ

సంస్కరణభావాలు ప్రబలమవుతూ వున్నాయి. భారతదేశంలో జాతీయ భావాలకోలాహలం సాగుతోంది. వాటి ప్రభావం ఆదర్శప్రియుడైన అప్పారావు గారిమీద పడింది. సంస్కరణభావాలు జాతీయభావాలుగా కూడా ఆయనలో పరిణతి చెందేయి. ఆంధ్ర సాహిత్యంలో సంస్కరణ భావాలకు అందమైన శాశ్వత కావ్యరూపాన్నిచ్చిందీ, జాతీయభావాలను ప్రవేశపెట్టిందీ, దేశాభిమానాన్ని రేకెత్తించిందీ ప్రథమంగా అప్పారావు గారే. ఆనాటి మన విద్యావంతులలో యీయన కున్నంతగా పాశ్చాత్య ప్రపంచ పరిచయంగలవారు చాల అరుదు. సంస్కృతాంధ్రాంగ్ల భాషలను పరిశీలనగా చదివిన పండితుడు; పాశ్చాత్య సంస్కృతీ సభ్యతల మంచిచెడ్డలను అవగతం చేసుకున్న మేధావి. భాషను పెద్దనాగరికతా సాధనం చేయాలనీ, తన ఉద్యమం ప్రజల ఉద్యమమనీ, దానిని ఎవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోకూడదనీ తీర్మానానికి వచ్చిన ఆదర్శప్రియుడు. అంతేకాదు, అప్పారావుగారు కళింగదేశ చరిత్రను పరిశోధించి గ్రంథం వ్రాయడానికి ఉద్యమించేరు. భాషాశాస్త్రంలోనూ, నాటకకళలోనూ చాలా పరిశ్రమ చేసేరు.

భూస్వామ్య యుగప్రభావం అంతరించేక, మధ్యతరగతి సంస్కృతీ నాగరికతలు నూతనసంస్కరణ భావాల వంతెన మీదుగా వచ్చిన జాతీయ భావాలుగా అప్పారావుగారిలో పరివ్యక్తమయ్యాయి. నేడు ఆంధ్రుల జాతీయగీతంగా పరిగణింపబడుతోన్న ఆయన వ్రాసిన "దేశభక్తి గీతం" యీ పరివ్యక్తతకు ఉదాహరణ. దేశాభిమానం నాకు కద్దని వట్టిగొప్పలు చెప్పుకోవద్దని, పూని ఏదైనా ఒకమేలు కూర్చి జనులకు చూపమంటారు; దేశమంటే మట్టికాదనీ, దేశమంటే మనుషులనీ ఉద్బోధిస్తారు. పాడిపంటలు పొంగిపొర్లే దారిలోపాటు పడమంటారు.

వీరేశలింగంగారిని కార్యరంగంలో కదిలించిన స్త్రీ దైన్యస్థితి, అప్పారావుగారిచేత కలంపట్టించి అమరకావ్యమైన 'కన్యాశుల్కం' వ్రాయించింది. తండ్రి ధనాశకూ, వృద్ధుని వివాహేచ్ఛకు బలియైన బుచ్చమ్మ, ఆకారణాలవల్లనే ఆత్మహత్య చేసుకున్న పూర్ణమ్మ, పతనమైపోయిన మీనాక్షి, పురుషుని నిరంకుశ పాలనలో నిక్షిప్తప్రతిమగా మారిన మెటిల్డా, గుణవంతురాలై వుండికూడా వేశ్యావృత్తిని సాగించవలసి వచ్చిన మధురవాణి నేటికీ మన హృదయాలను కలచి వేస్తున్నారు. స్త్రీ దైన్యస్థితిపైని, పురుషుని దురధికారంపైని ఆ కాలపు వ్యక్తికి యింతటి చక్కని భావాలుంటాయా అని ఆశ్చర్యం వేస్తుంది, అప్పారావుగారు తన రచనలలోనూ, లేఖలలోనూ వెల్లడించిన అభిప్రాయాలకు.

దుష్టభావాలనూ, దురభిప్రాయాలనూ, ద్రోహాలనూ, దగుల్బాజీలను తన రచనలలో బంధించి, ప్రజా న్యాయస్థానం ముందరికి యీడ్చుకవచ్చేరు అప్పారావుగారు. సహపంక్తి భోజనానికి వెనుదియ్యలేదు, మంచి అన్నది మాలఅయితే మానూ మాల అవుతానన్నారు. మతాలన్నీ మాసిపోయి జ్ఞానం ఒక్కటే నిలిచి వెలుగుతుందనీ, ఎల్లదేశాలూ ఒకటే అవుతాయనీ ఆయన విశ్వాసం.

అప్పారావుగారు వీరేశలింగంగారి సాహిత్యోద్యమానికి అభ్యుదయ సాధ

కాదు. కఠిన గ్రాంథిక శైలీసాంప్రదాయాన్ని తొలగించి సులభ శైలిని ప్రవేశపెట్టిన వీరేశలింగంగారి ప్రజాహిత దృక్పథాన్ని, అప్పారావుగారి వ్యావహారిక భాషాశైలి పెంపొందించింది. సాహిత్యం ప్రజలవద్దకు యింకా చేరువగా పోవడానికి దారి చూపింది. ప్రహసనాలు వాడుకభాషలో వ్రాసినా, యితర రచనలు వ్యాకరణ బద్ధమైన సులభశైలిలో చేసిన వీరేశలింగంగారి పద్ధతి అప్పారావుగారిని సంతృప్తి పరచలేదు. భాషను యింకా సులభతరం చేయాలి; కృత్రిమమూ, కృతకమూ అయిన గ్రాంథిక భాష పోయి సహజమూ, సజీవమూ అయిన వాడుకభాష రావాలి. వ్యాకరణయుక్తమైన సులభభాషకూడా అసహజమైనదే; నియమాలనబడే నిర్బంధాలు దానికీకూడా వున్నాయి. అందుచేత అప్పారావుగారికి స్వేచ్ఛగల సహజభాష కావాలి. అదే నిత్యజీవితంలో స్వేచ్ఛగా వ్యవహరింపబడే వాడుకభాష. ఈ వాడుకభాష ప్రజాసామాన్యాన్ని మేలుకొలుపుతుందనీ, దానివల్ల లెక్కలేనన్ని ప్రయోజనాలున్నాయనీ ఆయన విశ్వసించేరు (చూ. 'కన్యాశుల్కం' పీఠిక, రెండో కూర్పు).

ఉద్యమంగా మొదలవడానికి చాలా ముందరే వాడుకభాషకు స్థిరమైన కళారూపాన్నిచ్చేరు, వాడుకభాషలో ఉత్తమ కావ్యరచన సాధ్యమేనని నిరూపించుతూ 1897 లో 'కన్యాశుల్కం' ప్రచురించేరు.

అప్పారావుగారి చల్లనిచేయి తగలగానే కుహనా పండితులచే శపింపబడి శిలవలెగా మారిన భాష, నవజీవనంతో లేచి రమ్యమైన రూపంలో నడక సాగించింది.

అప్పారావుగారి కలం మహోపన్యాసాలివ్వదు. అక్కడక్కడ అణగిమణగి కవితకోకిల పలుకుతుంది — పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తాయి. అప్పారావుగారి కలం, వీరేశలింగంగారి కలంలాగ దుష్టసంహారం చెయ్యదు, చీల్చి చెండాడదు; అది — చెడుత్రోవను పడినవానిని నొప్పించకుండా ఒప్పించి బుద్ధిచెప్పే గురువు. ఆయన సందేశం సౌజన్యం, ఆయన అభిమానపాత్ర సౌజన్యారావు. వీరేశలింగంగారి ముఖ్యరంగం సంఘం అయితే, సాహిత్యం సంఘ సంస్కరణకు ఒక పరికరం. అప్పారావుగారి విహారభూమి సాహిత్యం, నాయికపాత్ర సంఘానిది. ఆయన వీరేశలింగంగారిలాగ, ప్రళయకాల రుద్రునిలాగ విరుచుకు పడరు. మాట, రాత, చేత — స్వభావం అంతా బహు మెత్తన. కార్య రంగంలోనికి దుమికి దుష్టులను, దుష్టభావాలను తరిమి తరిమి కొట్టడం కాదు ఆయన పని; సంఘ స్వాస్థ్యంకోసం, చేదనిపించినా అమృత సమానమైన గుళికలు తెమ్మదిగా మింగించి పరివర్తన తీసుకరావడం. అయినా ఆయన యుద్ధాలు చెయ్యక పోలేదు. ముఖ్యంగా గ్రాంథికభాషావాదులతో చాలాయుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. కాని, గిడుగు రామమూర్తి గారు గ్రాంథిక భాషా కౌరవుల పాలిట భీముడైతే, అప్పారావుగారి పద్ధతి, ధర్మరాజు పద్ధతి.

అధునాతన రూపంలో కథానికా రచనకు ఒరవడి పెట్టింది అప్పారావు గారు; పద్యం కంటె హృద్యమైన, ప్రజలకు సన్నిహితమైన గేయాన్ని సాహిత్యంలోనికి తీసుకవచ్చిందికూడా ఆయనే. 1913 లో మద్రాసు విశ్వవిద్యాలయం పెట్టిన

యావజ్జీవిత సభ్యుడుగా నియమింపబడి అభివృద్ధికరమైన విద్యావ్యాప్తికి కృషి చేసేరు. వ్యావహారికభాషా గ్రంథాలను పాఠ్య గ్రంథాలుగ నిర్ణయించడానికి వీలుందా లేదా అని చర్చించటానికి నియమింపబడిన సంఘంలో, గిడుగు రామమూర్తి గారితో బాటుగా సభ్యుడుగావుండి. ప్రజాభాషను విద్యార్థులకు పఠనీయంగా చేయడంకోసం పాటు పడ్డారు. పదవులను, ప్రజల అభిమానాన్ని రాజ గౌరవాన్ని జీవితంలో పొంది, భాషకూ, సాహిత్యానికీ ఎంతో మేలుచేసి సంఘాభ్యుదయానికి పాటుపడి అప్పారావుగారు, నవ్యసాహిత్య వాల్మీకి 1915 నవంబరు 30న కీర్తిశేషులయ్యారు.

# నవ్య వాగనుశాసనుడు గిడుగు రామమూర్తి

## ( 1863 – 1940 )

ఆంధ్ర భాషను పండితుల చెరనుండి విముక్తిచేసి, సాహిత్యాన్ని సామాన్యులకు సన్నిహితంగా తీసుకవచ్చి, సాహిత్య రచనపై పండితుల గుత్త అధికారాన్ని రద్దు చేయడమే కాకుండా, సామాన్యులకు కూడా సాహిత్య కల్పనకు అవకాశాన్ని సృష్టించిన భాషోద్ధారకుడు గిడుగు రామమూర్తి గారు. శ్రీకాకుళం జిల్లా పర్వతాల పేటలో 1863లో జన్మించారు. పన్నెండో ఏటనే పితృవియోగం. తల్లి కష్టపడి పెంచి, చదివించింది. మహాకవి గురజాడ అప్పారావుగారితో విజయనగరంలో చిన్నప్పట్నుండి స్నేహం. మెట్రిక్యులేషన్ ప్యాసయ్యేక డబ్బు లేక చదువు చాలించవలసి వచ్చింది. తరువాత కాల క్రమాన యఫ్. ఎ., బి. ఎ., ప్యాసయ్యేరు. రామమూర్తిగారు 1880లో ముప్పయి రూపాయల జీతంమీద పర్లాకిమిడిలో ఉపాధ్యాయ పదవి సంపాదించేరు. 1896లో లెక్చరరు అయి 1911 లో రిటైరయ్యారు.

రామమూర్తి గారికి మొదట ఆంధ్ర భాషలో ఆసక్తి గాని, ప్రవేశంగాని ఎక్కువగా ఉండేదికాదు. పరీక్షల కోసం చదువుకున్నది సంస్కృతం. వీరేశలింగం గారి ఉద్యమం అందరినీ ఆకర్షించినట్టుగా ఆయనను కూడా ఆకర్షించేక, వారి గ్రంథాలు చదవడం తప్పితే, 1906వరకూ రామమూర్తిగారు తెలుగు భాషనుగురించి శ్రద్ధపుచ్చుకున్నదిలేదు. కాని మొదటి నుండీ భాషాతత్వం తెలుసుకోవాలన్న ఆసక్తి బాగా వుండేది. ఈ దృష్టితోనే సవర భాషను నేర్చుకొని చాలా పరిశ్రమ చేసేరు. ఓఢ్రం, అరవం, కన్నడం, మళయాళం నేర్చుకున్నారు. శాసనాలు చదివి గాంగవంశపు రాజుల చరిత్రను పరిశోధించేరు. రామమూర్తిగారు ఆంధ్ర భాషారంగంలోనికి ప్రవేశించడానికి ముందర, పర్లాకిమిడి ప్రాంతపు అనాది జాతివారైన సవరల భాషకోసమూ, వారి అభివృద్ధి కోసమూ చేసిన కృషి అపారం. సవర–తెలుగు, తెలుగు – సవర నిఘంటువులు తయారుచేసేరు; సవరల కథలు, పాటలు సేకరించేరు; వారిని అంటరానివారన్న అభ్యంతరం లేకుండా యింట్లో పెట్టుకొని చదువు చెప్పేరు. వారికష్ట

సవరభాష నేర్చుకున్నారు; వారికోసం బడులు పెట్టేరు; వారిని అభివృద్ధి చేయవలసిన అవసరాన్ని ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చేరు. ఇన్ని చేసిన రామమూర్తి గారి దృష్టి తెలుగుభాషా శైలి సమస్య మీదికి పోవడం నడివయస్సు దాటిన తరవాత అంటే 1906 లో. అయితే యింతవరకూ ఆయన చేసిన కృషి, పరిశోధనాశక్తి, పట్టుదలనూ వారి కలవర్చింది, ఆంధ్ర భాషార్ణవ మథనానికి కవ్వంగా నిలిచింది.

కావ్యశైలి అయిన గ్రాంథిక భాష మత్తు ఎంతగా పట్టిందంటే, 1906 లో ఏట్సుదొరకు సర్వసందేహం కలిగేవరకూ నిత్య జీవనంలో వున్న వాడుకభాషకూ, కావ్యాలలోనూ, శాస్త్రగ్రంథాలలోనూ గల కృత్రిమ భాషకూ మధ్యగల అగాధం కంటపడలేదు. అప్పటికే కన్యాశుల్కం వుంది. అదేనా చమత్కార గ్రంథమని కాని, మహాకావ్యంగా, అవశ్యకమైన భాషా శైలిగా గణనలోనికి రాలేదు. ఈ పరిస్థితి రామమూర్తిగారిని భాషా రంగంలోనికి ఉరికించింది. అప్పారావు గారూ, ఏట్సు, శ్రీనివాసయ్యంగార్లు ఆయనకు అండగా నిలబడ్డారు. అప్పట్నుండీ గ్రాంథిక భాషవల్ల విద్యాబోధనకు గల చిక్కులనూ, వ్యావహారిక భాష అవశ్యకతనూ చెప్పడానికి వచ్చు చెప్పవలసిన బాధ్యత రామమూర్తిగారు స్వీకరించేరు.

ఏట్సుగారివల్ల వాడుక భాషను అంగీకరించిన ప్రభుత్వవిద్యాధికారులు, గ్రాంథిక భాషావాదుల ప్రతిఘటనకూ, కుతంత్రాలకూ లొంగి, తమ వైఖరిని మార్చుకొని గ్రాంథిక భాష మాత్రమే పఠనార్హమని నిర్ణయించేరు. ఇక పండితుల సంగతి చెప్పనే అక్కర్లేదు. వీరేశలింగంగారి సులభశైలిని ప్రతిఘటించిన దానికంటె వెయ్యిరెట్లు ఉద్ధృతంతో ప్రతిఘటన ప్రారంభించేరు. సభలు, ఖండనలు, దూషణలు దేశం అంతటా మారుమ్రోగేయి. పండితుల ప్రతిఘటన చెలరేగుతున్నకొద్దీ రామమూర్తిగారి కార్యదీక్ష గట్టిపడుతూ వచ్చింది. గ్రాంథికభాష కొమ్ములుతిరిగిన పండితులకు కూడా పట్టుపడదనీ, విద్యావ్యాప్తికి వాడుక భాష అత్యవసరమనీ నిరూపించడానికి ఆయన ఆంధ్ర భాషా పరిణామాన్ని ఆమూలాగ్రం పరిశోధించి అవగతం చేసుకున్నారు. నన్నయ నాటి నుండి కావ్య భాష ఎలా మారుతూ వచ్చిందో నిరూపించేరు. మొండి వాదనలు చేస్తున్న పండితుల గ్రంథాలనుండే లెక్కలేనన్ని తప్పులు ఏరి చూపించి వారిని నోరెత్తకుండా చేసేవారు. పండితులకే లొంగని అటువంటి భాషను పసిపిల్లల నోట్లో కుక్కడం ఎంత అన్యాయమో ఎలుగెత్తి చాటేవారు. వీరేశలింగంగారి వల్ల చావుదెబ్బ తిన్న కవిభాష, ఆంధ్ర సాహిత్యపరిషత్తు రూపంలో మళ్ళీ తలెత్తడానికి ప్రయత్నిస్తుంటే, రామమూర్తిగారు ఉన్న ప్రాణం కూడా ఎగరగొట్టేరు.

యావదాంధ్ర దేశంలోనూ ఎడతెరపి లేకుండా సభలు, సభల్లో గ్రాంథిక భాషా వాదులు చేసే అల్లరిని లక్ష్యపెట్టకుండా చేసిన ఎదురులేని వాదనలు, "బాలకవి శరణ్యం", "గద్యచింతామణి", "ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం" వంటి గ్రంథాలు, తాను నడిపిన "తెలుగు" పత్రిక, భాషాశైలి నిర్ణయాని కేర్పరచ బడ్డ సంఘంలో పోరాటం —

యిది రామమూర్తిగారి కార్యదీక్షనూ, పాండితీ ప్రకర్షను తెలియజేస్తాయి.

ఆయన 1925 లో తెనాలిలో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తు చేతకూడా-కరడుగట్టిన ఆ గ్రాంథికభాషా సంఘం చేతకూడ వాడుకభాషను అంగీకరింపచేయడం రామమూర్తిగారు ఎంతవీరుడో తెలియజేస్తుంది. తన భాషాసంస్కరణ వాదానికి వీరేశలింగంగారి సమ్మతినిపొంది, వారి అధ్యక్షతను "వర్తమానాంధ్ర భాషాప్రవర్తక సమాజాన్ని" స్థాపించేరు. వాడుకభాషకు లక్షణ రచనకు వీరేశలింగంగారిని ఉద్యుక్తులను గావించేరు. ఆయన జీవితాశయమైన వాడుకభాషను పాఠ్యక్రమంలో యీనాటివరకూ అంగీకరించని ఆంధ్రవిశ్వవిద్యాలయంనుండికూడా తన సర్వతోముఖ పాండిత్యానికి సన్మానమూ, 'కళాప్రపూర్ణ' బిరుదాన్ని పొందేరు.

రామమూర్తిగారికి సాహిత్యం, దాని వస్తువు మొదలైన వాటితో ప్రసక్తిలేదు. ఆయన జీవితలక్ష్యం, దాని శైలిని సహజంగానూ, సజీవంగానూ చేయడం, పండితుల పరిపాలననుండి సరస్వతిని విముక్తిచేయడం, ప్రజలభాషను స్థాపించడం. ఇందుకోసం రామమూర్తిగారు పండితులను చెండాడుతూవుంటే, అప్పారావుగారు వాడుకభాషను సాహిత్యంలో ప్రతిష్ఠించేరు. సమ్మోహనకరమైన 'కన్యాశుల్కం', 'ముత్యాలసరాలూ' రామమూర్తిగారి ఉద్యమానికి నైతిక బలాన్నిచ్చేయి. అప్పారావుగారు కర్కశశిలాభాషను ద్రవింపజేస్తే, రామమూర్తిగారు కర్కశశిలాభాషను గుండపిండిగా చేసిన పిడుగు.

ఆనాటి అభ్యుదయ కాముకులందరికీ వలెనే వీరేశలింగంగారు, రామమూర్తిగారికి ఆదర్శపురుషుడు. మొదటనుండీ ఆయన సంఘసంస్కారప్రియుడు; అంటరానితనానికిగాని, పాశ్చాత్యదేశానికి వెళ్ళిన వారికి ఈయింట విందుచేస్తే సంఘం విధించిన బహిష్కారానికిగాని ఆయన జడియలేదు. వితంతువివాహం జరిపించడానికికూడా జంకలేదు.

అవసానకాలంవరకూ, 1940 జనవరి 22 న మరణించేవరకూ ప్రజాభాషా స్థాపనకు కంకణంకట్టుకొని అహోరాత్రాలూ పరిశ్రమించి, వాగ్దేవిని గాలివెలుగులు సోకని పండితుల పెట్టెలలోనుండి ప్రజల మధ్యకు తీసుకువచ్చిన వీరుడు రామమూర్తిగారు. వీరేశలింగంగారి తరవాత మన భాషారంగంలో ఉద్భవించిన కర్మవీరుడు.

# నవ్యవిజ్ఞాన ప్రసారకుడు కొమర్రాజు లక్ష్మణరావు

## (1877 — 1923)

నవజీవన ఉద్యమంలో అంతర్భాగం, నవ్యవిజ్ఞాన ప్రచారం. జాతివికాసానికి అతిముఖ్యమైన అంగాలలో ఒకటయిన నవ్యవిజ్ఞానాన్ని వీరేశలింగంగారు ఆంధ్ర దిగంతాలకు పరిచయంచేసేరు. ఆయన పెంచిన మహావృక్షశాఖ నవ్యవిజ్ఞానం. ఈ నవ్యవిజ్ఞాన కాంతులను నలుమూలలా వెదజల్లినది కొమర్రాజు లక్ష్మణరావుగారు. మనకు చరిత్రజ్ఞానం, శాస్త్రవిజ్ఞానం అందుబాటులోనికి తెచ్చిన మహనీయుడు,

హిందీ గ్రంథాలు వ్రాయించేరు. దేశ చరిత్రలు, మహాపురుషుల జీవిత చరిత్రలు, పదార్థవిజ్ఞాన, రసాయన, జీవ, వృక్ష, అర్థశాస్త్రాలు, చారిత్రాత్మక నవలలూ దేశం నలుమూలలకూ చేరేవి. ఆంధ్ర హృదయంలో స్వాతంత్ర్య పిపాసను రేకెత్తించేవి, విజ్ఞానదీపాలు వెలిగించేవి. వీరేశలింగంగారి స్వీయచరిత్ర, చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర, తాను వ్రాసిన హిందూమహాయుగం, మహమ్మదీయ మహాయుగం మొదలైన యీ నాటికీ మనం పూజ్యభావంతో స్మరించే గ్రంథాలను భాషాపీఠంమీద పెట్టింది విజ్ఞాన చంద్రికా గ్రంథమాల. పాశ్చాత్య విజ్ఞానాన్నీ, చరిత్రనూ మనకు అందుబాటులోనికి తీసుకవచ్చింది. చారిత్రాత్మక నవలా రచనకు పోటీలూ, బహుమానాలూ పెట్టి ఆ సారస్వతశాఖను పోషించింది. ముఖ్యంగా చిలుకూరి వీరభద్రరావుగారిచేత వ్రాయించిన ఆంధ్రుల చరిత్ర సంపుటాలు ఆంధ్రోద్యమానికి జాతీయచైతన్యాన్నీ, ఆత్మగౌరవాన్నీ చేకూర్చేయి. ఆంధ్రులకు తమ పూర్వౌన్నత్యాన్ని తెలిపి చైతన్యవంతులను చేసేయి. మొట్టమొదటి గ్రంథమాలను, తరవాత ప్రారంభమైన అనేక గ్రంథమాలలకు మార్గదర్శకమైనదానిని, విజ్ఞానచంద్రికా గ్రంథమాలను యీవిధంగా నడిపించేరు లక్ష్మణరావుగారు. అటువంటిది ఆయన దేశాభిమానం, అటువంటిది ఆయన కార్యదక్షత. తాము బ్రతికి చెడినవారమనీ, తిరిగి పూర్వప్రౌఢౌన్నత్యాన్ని అందుకోవాలనీ పాఠకులను ప్రబోధించేయి ఆయన వ్రాసిన హిందూ మహాయుగం, శివాజీ చరిత్ర; హిందూ మహమ్మదీయ సఖ్యత ఆవశ్యకతను తెలియజేసింది మహమ్మదీయ మహాయుగం. దేశానికి అమూల్యమైన యిటువంటి గ్రంథాలను అర్పించింది లక్ష్మణరావుగారి విజ్ఞాన చంద్రిక.

విజ్ఞాన చంద్రికా గ్రంథమాల లక్ష్మణరావుగారి దేశసేవాసక్తినీ, కార్యసాధనమూ తెలియజేస్తే; ఆయన పరిశోధనా పరిశ్రమనూ, సర్వతోముఖ పాండిత్యాన్నీ చాటిచెబుతుంది విజ్ఞానసర్వస్వం. ఆయనే ఒక విజ్ఞాన సర్వస్వమని నిరూపిస్తుంది. ఎంతో అంగబలమూ, అర్థబలమూ కావలసిన కొండంతపని, బ్రహ్మాండమైన పని విజ్ఞాన సర్వస్వ ప్రచురణ. అతి నిరుత్సాహకరమైన పరిస్థితులలో, యించుమించు నిస్సహాయంగా లక్ష్మణరావు గారు యీ మహత్తర కార్యానికి పూనుకుని సాటిలేని మూడు సంపుటాలు ప్రచురించగలిగేరు. ఆయన అకాల మరణంవల్ల పూర్తి కాకుండా నిలిచిపోయిన విజ్ఞానసర్వస్వం, లక్ష్మణరావుగారు గతించి ముప్పయ్యేళ్ళు దాటినా అసమాప్తంగానే వుండిపోయింది.

విజ్ఞాన సర్వస్వంలో లక్ష్మణరావుగారి రచనలు అసంఖ్యాకం, వాటికోసం ఆయన చేసిన పరిశ్రమ అక్షరాలా అపారం. ఆయన పద్ధతి, అప్పటికే అందుబాటులోవున్న విషయాన్ని అనువాదం చెయ్యడమూ, లేకపోతే, దానిమీద అల్లుకుపోవడమూ కాదు. సంపూర్ణమైన పరిశోధన, మూలంనుండీ పెకలించిన పరిశోధన ఆయన పద్ధతి. వేదాలనుండి యీ నాటి విషయాల వరకూ, ప్రాచ్యఖండం నుండి పాశ్చాత్యఖండంవరకూ, మూలమూలనున్న శాసనాలనుండి తాళపత్రాలనుండి సరికొత్త సమాచారం వరకూ - యివీ

లక్ష్మణరావు గారి పరిశోధన పరిమితి. ఈ విజ్ఞానార్ణవ మథనంలో చరిత్ర గర్భం నుండి ఎన్నో సత్యాలు బయటపడ్డాయి. ఆయనపద్ధతులు పరిశోధనకు వరవడు లయ్యాయి.

కృత్రిమ కారణాలవల్ల ఒకరినొకరు మరచిపోయే స్థితివరకూ వచ్చిన మద్రాసు రాష్ట్రాంధ్రులకూ, తెలంగాణా ఆంధ్రులకూ మధ్య సంస్కృతీ సంబంధాలను ఏర్పరిచి, వంతెన కట్టడానికి పూనుకున్న ఆది పురుషుడు లక్ష్మణరావు గారు. ఆయన కొందరి సహాయంతో హైదరాబాదులో స్థాపించిన శ్రీకృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం, పరభాషా సంస్కృతుల ప్రవాహంలో కొట్టుకపోతున్న తెలంగాణా ఆంధ్రుల జాతీయ చైతన్యానికి ఎంతో తోడ్పడింది.

వీరేశలింగం గారు నిర్మించిన మహా సౌధానికి యింకో అంతస్తు కట్టి, దేశాభిమాన వ్యాప్తికీ, విజ్ఞాన వ్యాప్తికీ అహోరాత్రులు కృషిచేస్తూ, అతి విరుద్ధమైన పరిస్థితులలో, అతి దుర్బలమైన దేహంతో లక్ష్మణరావుగారు తన స్వల్ప వయస్సులో ఒక శతాబ్దంలో నెరవేరే మహత్తర కార్యాన్ని సాధించి 1923 జూలై 13న విజ్ఞాన సర్వస్వ రచనలో పరిశ్రమిస్తూ కీర్తిశేషు లయ్యారు.

## జాతీయోద్యమ పోషకుడు కాశీనాధుని నాగేశ్వరరావు

( 1867 — 1938 )

ఆంధ్రదేశంలో నవయుగ నిర్మాణం ప్రారంభమై, భాషారంగాల్లో పరిపక్వమై మితవాద రాజకీయ దశనుదాటి జాతీయ రాజకీయదశలో ప్రవేశించింది. ఇటువంటి బలమైన పునాదులుండడంవల్ల ఆంధ్రులలో రాజకీయ ఉద్యమవ్యాప్తి బెంగాలు లోనూ, మహారాష్ట్రంలోనూ జరిగినట్లుగా ఒడుదుడుకులు లేకుండా సహజంగా సాగిపోయింది. కార్యరంగం సేద్యయోగ్యమైన సుక్షేత్రంగా తయారైవుంది. ఈ జాతీయ రాజకీయదశకు ప్రాతినిధ్యం వహించిన కాశీనాధుని నాగేశ్వరరావు గారు కృష్ణాజిల్లా ఎలకుర్రులో 1867 మే ఒకటవ తేదీన జన్మించారు. 1885 లో బందరులో మెట్రిక్యులేషన్ పాసయ్యారు. గుంటూరులో యఫ్. ఏ. పాసయి తరవాత మద్రాసులో బి. ఏ, చదివారు.

పంటూల సుబ్బారావుగారనే ప్రతిభావంతుడు, మంచి వ్యాపారానుభవంగల సమర్థుడు ఆరోజుల్లో మద్రాసులో వుండేవారు. ఆయనతో నాగేశ్వరరావుగారికి మొదట పరిచయమూ, తరవాత చుట్టరికమూ సంభవించింది. తద్వారా నాగేశ్వరరావుగారికి వ్యాపారంలో అభిరుచి కలిగింది.

కలకత్తా వెళ్ళి వ్యాపారం చెయ్యడానికి ప్రయత్నించేరు, కాని అనారోగ్యంవల్ల విరమించుకోవలసి వచ్చింది. తరవాత బొంబాయిలో ఒక వ్యాపారివద్ద ఉద్యోగంలో ప్రవేశించేరు, అదికూడా సాగలేదు. 'విలియం అండ్ కో' అన్న మందుల కంపెనీ పెట్టారు. 1894లో అమృతాంజనం తయారుచేసేరు. ఈ నాగేశ్వరరావుగారి

విధానాన్ని ఒక తోవలో పెట్టింది. లక్షణం దించి పెట్టింది.

దేశంలో రాజకీయ భావకల్లోలం వ్యాపిస్తోంది. స్వదేశీ ఉద్యమజ్వాలలు దేశంలో వ్యాపిస్తున్నాయి. తీరికగా కూచోని చదువుకునే పుస్తకాలుమాత్రమే చాలవు. ఎప్పటికప్పుడు జరుగుతోన్న ఎన్నో విశేషాలను యీ పుస్తకాలు తాజాగా అందివ్వలేవు. దీనికి సాధనం పత్రికలే. పత్రికలున్నాయి. కాని వాటిలో ఎక్కువభాగం భాషాసాహిత్యాలకు సంబంధించినవి. వార్తాపత్రికలువుంటే అవి నిలకడగా నడవడంలేదు. పరరాష్ట్రంలోవున్నా, పత్రికా నిర్వహణకు సంబంధించని వ్యాపారం చేస్తున్నా నాగేశ్వరరావుగారిదృష్టి దీనిమీదపడింది. బొంబాయినుండి 1908 లో 'ఆంధ్ర పత్రిక' అన్న పేరుతో ఒక వారపత్రికను పెట్టి నడపడం ప్రారంభించేరు. 'ఆంధ్ర పత్రిక' వార్తాతృష్ణను తీర్చడం మాత్రమే కాకుండా, పత్రికారచనలో కొత్తతీరులు ప్రవేశపెట్టి, పాఠకులను ఆకర్షించింది.

మొదటి ప్రపంచ యుద్ధం మొదలైంది. తెలుసుకోవలసిన వార్తలతో ప్రపంచం నిండిపోయింది. బొంబాయినుండి ఎప్పటికో వచ్చే పత్రిక, అందులోనూ వారపత్రిక క్షణక్షణం కొల్లలుగా వస్తోన్న విశేషాలను తాజాగా ఎలా అందివ్వగలుగుతుంది, పాఠకుల తహతహ ఎలా తీర్చగలుగుతుంది? 'ఆంధ్రపత్రిక'ను నాగేశ్వరరావుగారు మద్రాసుకు తీసుకువచ్చేరు. వారపత్రికను దినపత్రికచేసేరు. ఇది ఆంధ్ర చరిత్రలో గొప్ప సంఘటన. ప్రపంచం ఆంధ్రుల కంటిఎదుటికి వచ్చింది. జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం, ప్రతి ఒక్క దేశహితకార్యమూ, ఆంధ్ర పత్రికలో ప్రతిబింబమవుతున్నాయి. ప్రపంచంలో, దేశంలో, రాష్ట్రంలో అనునిత్యం జరిగే విశేషాలను తెలుసుకోవడం, ఆంధ్రులకు నిత్యకృత్యం అయిపోయింది. నాగేశ్వరరావుగారి పత్రిక ఆంధ్రవికాసానికీ, దేశభక్తి ప్రబోధానికీ, ప్రపంచజ్ఞాన వ్యాప్తికీ అనుపమానమైన సేవచేసింది.

ఉత్తమ సాహిత్య పత్రికలేని కొరతను తీర్చిందికూడా నాగేశ్వరరావుగారే. సాహిత్య పత్రికలు ముఖ్యంగా, మొదలవకముందే అంతరించడం ఆంధ్రదేశంలో అప్పటికీ యిప్పటికీ అలవాటు. 'శారద' వంటి మంచిపత్రిక నిలవలేకపోయింది. నిలకడగా వుండగల సాహిత్య పత్రికను పెట్టడానికి నాగేశ్వరరావుగారు పూనుకొన్నారు. 1924 లో 'భారతి'ని స్థాపించేరు. 'ఆంధ్రపత్రిక' రాజకీయ, సాంఘికాది రంగాలకు సేవచేసినట్టుగా, 'భారతి' సాహిత్య, కళా, శాస్త్ర, పరిశోధనాది విషయాలకు ఎంతో దోహదం చేసింది, నవ్యకవిత్వానికి కూడా చోటిచ్చింది.

పత్రికా నిర్వాహకునిగా, సంపాదకునిగా గ్రంథ ప్రచురణకర్తగా నాగేశ్వరరావుగారు కార్యదక్షతను, ప్రతిభను ప్రదర్శించినట్టుగానే, ఆయన పలుగ్రంథాలకు వ్రాసిన పీఠికలు, 'భగవద్గీత'కు వ్రాసిన వ్యాఖ్యానం ఆయన ఆరితేరిన పండితుడనీ, చక్కని రచయితనీ నిరూపిస్తాయి. అంతే కాకుండా నాగేశ్వరరావుగారు కవి పండిత పోషకుడు, ఉత్తమ గ్రంథాలప్రచురణకర్త, లక్ష్మణరావుగారు ఉద్యమించి పూర్తి చేయలేక పోయిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు పూనుకొన్న భాషాభిమాని.

ఆనాడు ఆంధ్రదేశంలో సాగిన ప్రతి సదుద్యమంలోనూ, ప్రతి సత్కార్యంలోనూ, నాగేశ్వరరావుగారు ప్రముఖ పాత్రధారి. జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం, హరిజనోద్యమం, గ్రంథాలయోద్యమం - ప్రతి ఒక్కటీ నాగేశ్వరరావుగారి నాయకత్వమూ, పోషణా లేకుండా వుండేవి కావు. అన్ని ఉద్యమాలకూ ఆయన ప్రాపు. దేశోద్ధారకుడనీ, విశ్వదాత అనీ ఆయనను ఆంధ్రదేశం కీర్తించింది. 1934లో ఆయనను కేంద్ర శాసనసభకు ప్రతినిధిగా ఎన్నుకొంది. 'కళాప్రపూర్ణ' బిరుదాన్నిచ్చి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆయన విద్యనూ, సేవలనూ గౌరవించింది.

నవజీవన వికాసానికి దోహదం చేసి, కారాగార శిక్షలకు సైతం వెనుదీయకుండా తన భాగ్యాన్నీ, జీవితాన్నీ దేశసేవకు అర్పించి, నాగేశ్వరరావుగారు 1938 ఏప్రిల్ 11న కీర్తిశేషులయ్యారు.

* * *

వీరేశలింగం, అప్పారావు, రామమూర్తి, లక్ష్మణరావు, నాగేశ్వరరావు వంటివారు న్యాయంకోసం, ధర్మంకోసం పోరాడడం ఆంధ్ర ప్రజలకు నేర్పిన గురువులు. ఇందులో వీరేశలింగంగారు మహోన్నతుడైన మహాపురుషుడు. ఆయన చేసినదొక మహాయజ్ఞం. ఆ యజ్ఞగుండంలోంచి ఆంధ్రదేశం ఆవిర్భవించింది; అప్పారావు, రామమూర్తి, లక్ష్మణరావు, నాగేశ్వరరావువంటి తేజోవంతులు పుట్టి చీకట్లు పోగొట్టి సంఘానికి సంస్కృతికాంతి నిచ్చేరు.

దేశకాల పరిస్థితులు విధించిన పరిమితులలో వీరి కృషి సాగిందన్న సత్యాన్నిగాని, ఆ భౌతిక పరిస్థితులే వారి కృషిరంగాన్ని సారవంతంచేసి వుంచాయన్న సత్యాన్నిగాని వారిని స్మరించేటప్పుడు మనం విస్మరించడానికి వీలులేదు. ఆనాటి భౌతిక పరిస్థితులు, వారి మధ్యతరగతి సంస్కారం సర్వప్రజారంగంలో వారు ప్రవేశించడానికి అనుమతించనట్టుగానే పతనమవుతోన్న భూస్వామ్య వ్యవస్థ, పాశ్చాత్యవిద్యాలాభంవల్ల ఏర్పడిన కొత్త దృక్పథమూ వారికి అనుకూల వాతావరణాన్ని సృష్టించి పెట్టాయి. నేలవిడిచి ఎవరూ సాముచెయ్యలేరు; ఏకాకులుగా, నిస్సహాయులుగా ఎవరూ పోరాటాలు జయించ లేరు.

ఈ మహాపురుషులు మనకు పెన్నిధులు చేకూర్చేరు; అయినా వారి కాలానికి ఒక అర్థశతాబ్దం యివతల జీవిస్తోన్న మనకు, వారిసాధనవల్ల ఎంతో వృద్ధిలోనికి వచ్చిన మనకు వారి కృషిలో కొన్ని విషయాలు సంతృప్తికరంగా వుండకపోవచ్చు. కాని వారి కాలపు భౌతిక పరిస్థితులను, వారి మధ్యతరగతి సంస్కారాన్ని పరిగణించకుండా వారి కృషిలోని మంచి చెడ్డలను సమీక్షించడం సహేతుకంకాదు.

జాతీయోద్యమం మితవాద ధోరణి నుండి అతివాద ధోరణిలోనికి వస్తోంటే, వీరేశలింగంగారు యీ పరిణామాన్ని అవగాహన చేసుకోలేక వ్యతిరేకత చూపడం జరిగింది. బ్రిటిషు పాలన మనదేశానికి సాంఘికంగా, సాంస్కృతికంగా ఎంతో మేలుచేసిందనీ, విజ్ఞప్తులద్వారా ఒప్పించి క్రమక్రమంగా స్వపరిపాలనను పుచ్చుకోవచ్చునని ఆనాటి మన విద్యావంతుల మతం (ఆర్థిక, రాజకీయ కారణాల పరిశీలనగాని, సామ్రాజ్యవాద స్వభావాన్ని వీరు గమనించడంగాని తక్కువ). ఆనాటి

రాజకీయ వాతావరణంలో ప్రబలంగా వుండే తీవ్రజాతీయవాద ధోరణి-ఇంగ్లీషు వారిమీద కసికొద్దీ భూస్వామ్య నాగరికతను పునరుద్ధరించాలనే ధోరణి – తన యావజ్జీవితాన్నీ భూస్వామ్య నాగరికతా నిర్మూలనానికి అర్పించిన వీరేశలింగం గారిలో వెగటు పుట్టించిందన్నా, దాని అభివృద్ధికరమైన రాజకీయాంశంపట్లకూడా అనుమానం కలిగించిందన్నా ఆశ్చర్యమేమీలేదు. ఇదేవిధంగా అప్పారావు గారు ఆంగ్లేయుల ధర్మరాజ్యం ఏదో ఒరగబెడుతుందని ఆశపెట్టుకున్నారు. రామమూర్తిగారు రాజకీయాల జోలికే పోయినట్టులేదు. లక్ష్మణరావుగారు అభివృద్ధికరమైన వ్యావహారిక భాషా శైలికి వ్యతిరేకులు; యీయన గ్రాంధిక శైలి పట్టుదల, అప్పారావుగారి వ్యావహారిక శైలి పట్టుదల మూలంగా అప్పారావు గారు ఎంతో పరిశ్రమచేసి సేకరించిన కళింగదేశ చరిత్రకు సంబంధించిన ఎన్నో విషయాలు గ్రంధస్థం కాకుండా నిలిచిపోయాయి.

ఈ మహాపురుషుల పరిమితి, మధ్య తరగతి ప్రయోజనం. సంఘంలోనూ సారస్వతంలోనూ వారు చేసిన కృషిని యీ పరిమితిదృష్ట్యా చూడవలసివుంటుంది. తమ కాలపు భౌతిక పరిస్థితులకు, తమ సంస్కారానికీ చెందిన వలయాన్ని దాటి, వారు విశాలమైన ప్రజారంగంలోనికివచ్చి వుండవలసిందని ఆశించడం సరికాదు. వారు సంఘాభ్యుదయ సౌధానికి బలమైన పునాదులు వేసి వుంచారు. శ్రామిక ప్రజా బాహుళ్యం యీ నిర్మాణాన్ని పూర్తి చేస్తుంది.

అయితే యీ మహాపురుషుల కృషి ఫలితంగా భూస్వామ్య నాగరికత, జీవిత విధానం పూర్తిగా నశించిపోయాయని భావించడంపొరపాటవుతుంది. భూస్వామ్య ఆర్థికవిధానం నశించనంతకాలం దాని నాగరికతకూడా జీవించే వుంటుంది. పట్టణాల్లో మధ్యతరగతి నాగరికత ప్రబలంగా వున్నప్పటికీ, నూటికి 90 మంది నివసించే గ్రామసీమల్లో భూస్వామ్య నాగరికత, జీవిత విధానం బలంగానే వున్నాయి. ప్రజాసామాన్యం అనేక శతాబ్దాలుగా తమ రక్తనాళాల్లోనికి జీర్ణించిపోయివున్న మూఢభావాలనూ, ఛాందసాలనూ వదులుకొనలేకపోతున్నారు, భూస్వామ్య ఆర్థిక విధానం అందుకు అవకాశం కలిగించడం లేదు.

అయినా వీరు మనసాంఘిక,సంస్కృతీ క్షేత్రాల్లో నాటిన విప్లవ బీజాలు తదితర మానవ వ్యాసంగాలైన రాజకీయాది క్షేత్రాలుకు విస్తరించి, మధ్య తరగతి వారినే కాకుండా ప్రజాసామాన్యాన్ని కూడా చైతన్యానికి తీసుక వస్తున్నాయి.

వీరేశలింగం గారు సాంఘిక రంగంలో ప్రవేశపెట్టిన మూఢాచార ప్రతిఘటన, కాలక్రమాన రాజకీయరంగంలో ప్రజావ్యతిరేక విధానానికి ప్రతిఘటనగా పరిణమించింది. అంతకు ముందున్న 'మనకెందుకులే' అన్న మనఃస్థితి మార్పుచెంది చెడును ఎదిరించే తత్వము, హక్కుల కోసం పోరాడే తత్వము విద్యావంతులలోనూ, ప్రజలలోనూ వ్యాపించాయి. సాంఘిక సంస్కరణోద్యమం స్వాతంత్ర్యోద్యమానికి చేసిన గొప్ప మేలుయిది. స్త్రీకి పురుషునితో సమానత్వం ఆదర్శమైంది. స్త్రీవిద్య, వితంతు వివాహం, వృద్ధ

శైనవాటిని అంగీకరించనివారిని, సంఘంఅభివృద్ధి నిరోధకులుగా పరిగణిస్తోంది. నేటి ప్రజాఉద్యమాల్లో పురుషులతోపాటుగా స్త్రీలు కూడా విస్తారంగా పాల్గొంటున్నారు.

సాహిత్య రంగంలో కఠిన గ్రాంథిక భాషాశైలి పోయి, సులభ వ్యావహారిక భాషాశైలివచ్చింది. గారడీ కవిత్వాలు పోయిప్రజాజీవితంకవితావస్తువైంది. సాహిత్యంలో మధ్యతరగతివారు, శ్రామికులు నాయకులయ్యారు. వారి కష్టసుఖాలు కావ్యవస్తువు లయ్యాయి. వారి పురోగమనంకావ్యాదర్శమైంది. తమజీవిత సమస్యలపరిష్కారానికి ప్రజలుచేసే పోరాటాలలో సాహిత్యం వారికిప్రోత్సాహాన్నిస్తోంది. ఈప్రోత్సాహాన్ని ప్రజలు సాహిత్యంనుండి ఆశిస్తున్నారు.తమవిగాభావించి దానిని ఆదరిస్తున్నారు.

ఇంతటితో మన సాంఘిక, సాంస్కృతిక రంగాల్లో యీ మహా పురుషులు ప్రారంభించిన విప్లవం సమాప్తమైందని చెప్పడం సాధ్యం కాదు. భూస్వామ్య వ్యవస్థ భౌతిక ప్రాతిపదికను బ్రద్దలు చేయనిదే వారు ప్రారంభించిన ఉద్యమం సమాప్తం కాదు. సమాజంలో అర్థభాగంగా వున్న స్త్రీలు, యింకా పురుషులతోపాటు సమానావకాశాలను సాధించలేదు. సమాజంలో నూటికి తొంభైవంతులుగా వున్న శ్రామిక ప్రజలు నిరక్షరాస్యులుగా, ధనికుల దాసులుగా వున్నారు. విజ్ఞానాన్నంతటిన్నీ మా మాతృభాషద్వారా చదువుకోగల పరిస్థితి మనకింకా ప్రాప్తించలేదు. విద్యాబోధన యింకా కృత్రిమమైన కఠినశైలిలోనే సాగిపోతోంది.

ఈమహాపురుషులు నెలకొల్పిన సత్సాంప్రదాయాల ననుసరిస్తోన్న ప్రజోద్యమాలు, వారుపోరాడిన అక్రమాల నెదిర్చి పోరాడుతున్నాయి. వారిఆదర్శాల స్థాపనకు కృషిచేస్తున్నాయి. వాటికృషికి అభ్యుదయ కాముకులందరు అండగనున్నారు. దేశకాలపరిస్థితులు అనుకూలంగా వున్నాయి. న్యాయం, ధర్మంవాటిపక్షాన వున్నాయి.

# ఆంధ్ర కవులు, రచయితలు

కూర్పు:

## అవసరాల సూర్యారావు

[ పంథొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థంలో ప్రారంభమయిన ఆధునిక ఆంధ్రభాషా సాహిత్యాలకు మూల పురుషులు ముగ్గురు; గిడుగు, కందుకూరి, గురజాడలతో తొలకరించిన ఆధునిక ఆంధ్రవాఙ్మయం పద్య పద, గేయ, కథానికా నవలా నాటికా నాటకాది రచనలలో వింతవింత సొగసులతో పరిణామాలతో దినదిన ప్రవర్ధమాన మౌతున్నది.

నేటి కాలపు పద్య, గద్య కవితలోగల వైవిధ్యం, కావ్య వస్తురీతులలో గల ప్రభేదం, వెనకటి సారస్వతచరిత్రలో కానరానట్టిది. ఇది ఆధునికయుగ కవితావిశిష్టత. ఇట్టి విశిష్టతను చేకూర్చినది ప్రఖ్యాత ఆంధ్రకవులు, కథకులు, నవలా రచయితలు, నాటకకర్తలు, విమర్శకులు, పండితులు.

సుప్రసిద్ధులైన మన తెలుగు రచయితల జీవిత విశేషాలను అద్దంలో చంద్రున్ని చూసినట్లు సంక్షిప్తంగానైనా తెలుసుకోవడం అవసరం.

మన ఆంధ్ర రచయితల జీవితచరిత్రలను క్లుప్తంగా సాధ్యమైనంత సాకల్యముగా పాఠకులకు అందివ్వడమే యీ ప్రయత్నం—సూర్యారావు ]

### అనంతకృష్ణశర్మ రాళ్ళపల్లి

సంగీత సాహిత్యాలలో సరితూకము గల విన్నాణము వీరిసొత్తు. మంచివచనము, చక్కని పద్యరచన. అనంతపురంజిల్లా కల్యాణదుర్గం తాలూకా రాళ్ళపల్లి వీరి జన్మస్థానం. జననం: 23 జనవరి 1893 వ సంవత్సరం. మైసూరు పాఠశాలలో సంస్కృత ప్రాకృత వ్యాకరణాలు అలంకార గ్రంథాలను ఆమూలాగ్రంగా పఠించారు. 1912 వ సం॥నుంచి మైసూరు కళాశాలలో పండితులుగా ప్రఖ్యాతి నార్జించారు. ఇప్పుడు తిరుపతిలోని ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్‌లో ప్రాచ్య గ్రంథాల పరిశోధకులుగా నియమితులు. రచనలు : తారాదేవి, మీరాబాయి మొదలైన పద్యకావ్యాలు. వేమన సారస్వతోపన్యాసములు, నాటకోపన్యాసములు అనే విమర్శనాగ్రంథములు. శాలివాహన గాథాసప్తశతి, స్వర్ధాకావ్యముల భాషాంతరీకరణము. నాచనసోమనాథుడు, తిక్కనాది కవుల కవితాతత్త్వ పరిశీలన రూపక వ్యాసాలు.

చిరునామా : ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్, తిరుపతి.

### అప్పలస్వామి గోణాంకి

ఫ్రెంచి, జర్మను, ఇటాలియన్, లాటిను, ఆంగ్లాది పాశ్చాత్య భాషాపండితుడు. శ్రీకాకుళంజిల్లా ఇజ్జవరం వీరి స్వగ్రామం. విజయనగరం ఆంగ్లకళాశాలలో బి. ఏ., కాశీ విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు ఎం. ఏ., జననం: 17 సెప్టెంబరు 1909. రచనలు: భారతి, విశాలాంధ్ర, అభ్యుదయ పత్రికలలో ఆధునిక సాహిత్యంపై కొన్ని వ్యాసాలు. ఆంగ్లంలో "సాంగ్స్ అండ్ లిరిక్స్" అనే గీతికాసంపుటి. లండన్ పొయిట్రీ సంపాదకులైన శ్రీ తంబిముత్తుగారితో సహకరించి కొన్ని తెలుగుగీతాలను ఆంగ్లంలోనికి అనువదించారు. చిరునామా : విజయనగరం ఆంగ్ల కళాశాల, విజయనగరం.

### అప్పలస్వామి పురిపండా

1925 కవితాసమితి రోజులనుంచీ గేయరచనసాగిస్తున్న సాహిత్యోపాసకులు. జన్మస్థానం : శ్రీకాకుళంజిల్లా సాలూరు. హిందీ, బెంగాలీ, ఒరియా, ఉర్దూ సాహిత్యాలలో ప్రవేశం. రచనలు: మురళీధ్వని, సౌదామిని, ఆకాశవీధులు, ఉత్కళపతనం మొదలైన గేయాలు; నవ్యసాహిత్యం అనే వ్యాసావళి; వ్యావహారిక మహాభారతమనే వచనరచన. విశాఖపట్నంలో కవితాసమితి స్థాపకులలో ఒకరు. విశాఖరచయితల సంఘ అధ్యక్షుడు. చిరునామా : టౌనుహాలు రోడ్డు, విశాఖపట్నం.

### అవధాని మల్లాది

ఏకాంకిక నాటకరచయిత. శ్రీకాకుళంజిల్లా చెక్కలిలో జననం: 15వ తేదీ సెప్టెంబరు 1915. విజయనగరం ఆంగ్లకళాశాలలో బి. ఏ., రాజమహేంద్రవరంలో బి. ఇడి., బెంగాలీభాషతో పరిచయం. రచనలు : అసంపూర్ణరామాయణం, ఆంధ్రరాష్ట్రం, యవ్వనం, దిగంబరి అనే ఏకాంకికా సంపుటాలు. గాలివాన, నాపెద్దా, ఆనందోబ్రహ్మ అనే నాటకాలు. సుల్తానారజియా, ఖడ్గతిక్కన, ఓషావ్ హిందీలోనికి అనువదింపబడిన నాటికలు. వివాహంపేరిట కొన్ని

సాంఘిక వ్యాసాలు. ఉద్యోగం: సర్టిఫైడ్ హైస్కూలు హెడ్ మాస్టరుగా ప్రస్తుతం బళ్ళారిలో పనిచేస్తున్నారు. చిరునామా : జూనియర్ సర్టిఫైడ్ స్కూలు, బళ్ళారి.

## ఆచార్య ఆత్రేయ

సుప్రసిద్ధ నాటకరచయిత. నెల్లూరు జిల్లా వాస్తవ్యులు, వయస్సు సుమారు 40. రచనలు: వాస్తవం, ఈనాడు, గుమాస్తా, డాక్టర్ కొట్నీస్, విశ్వశాంతి, మొదలైన నాటకాలు; ఎవరుదొంగ, ప్రగతి, ఓటు నీకే ఇత్యాది నాటికలు; 'ఆదర్శం' మొదలైన చలనచిత్రాలకు పాటలుమాటలు.

## ఆంజనేయప్రసాద్ పోలూరి

కవి గుంటూరుజిల్లా వినుకొండతాలూకా గోకనకొండ వీరిస్వగ్రామం. విద్య బి.ఏ., బి. ఇడి., రచనలు : స్వతంత్రగీతాలు, నీడలు, కదలండి, రణభేరీ మొదలైన గేయాలు. రణచండిక అనే చారిత్రిక నవల. గుంటూరు జిల్లా వినుకొండ పాఠశాలలో ఉపాధ్యాయులు. చిరునామా అదే.

## ఆంజనేయులు కుందుర్తి

'నయాగరా' కవులలో నొకరు. గుంటూరుజిల్లా, నర్సారావుపేటతాలూకా కోటవారిపాలెం అనే గ్రామం వీరి జన్మస్థలం. జననం : 16 డిశంబరు 1922. గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో బి. ఏ; శానిసలం, మన్యవిప్లవం, నవపతాక, తరువాత, జయిస్తుంది, ఆకలియాత్ర, సాగరవిప్లవం, జగజ్జాతకం, యుగేయుగే, గోడమీదనీడలు మొదలైన గీతాలు. నవ్యకళాపరిషత్ కు కొన్నాళ్ళు అధ్యక్షులు. 40-42 లో విజయవాడ పట్టణ విద్యార్థి యూనియన్ సహాయ కార్యదర్శి. డిటెక్షన్ పద్ధతికి వ్యతిరేకంగా ప్రచారం. నవ్యసాహిత్య పరిషత్ సభ్యులు. అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధం. ఇప్పుడు గుంటూరు మార్కెటు కమిటీలో యిన్స్పెక్టర్ ఉద్యోగం. చిరునామా అదే.

## ఈశ్వరరావు సెట్టి

కథానికా రచనలో సిద్ధహస్తులు. విశాఖపట్టణం జిల్లా విజయనగరంలో జననం: 8మార్చి 1917. విజయనగరం ఆంగ్ల కళాశాలలో బి. ఏ.; వరకు విద్యాభ్యాసం మద్రాసులో 'లా' డిగ్రీ పుచ్చుకోకుండానే విద్యా విరమణ. బాంబులుపడ్డనాడు, పండు పుల్లలు మొదలైన పాతిక ముప్పై కథానికలు, మూడు నాలుగు నాటికలు, సాహిత్యాది విషయాలపై వందకుపైగా వ్యాసాలు. రేడియోలో కొన్ని రచనలు ప్రసారితము. 48-51 మధ్య విశాలాంధ్ర పక్షపత్రికకు సంపాదకత్వం. ప్రజాశక్తి దినపత్రికా సంపాదకులలో ఒకరు. ప్రారంభంనుంచీ అభ్యుదయ రచయితల ఉద్యమంలో కృషి. వృత్తి: పత్రికా రచన. ప్రస్తుతం ఢిల్లీనుండి వెలువడే తెలుగు "సోవియటు భూమి" పత్రికకు సంపాదకులు. చిరునామా : సోవియటు భూమి, 25 బారాఖంబా రోడ్డు, న్యూఢిల్లీ.

## కామేశ్వరరావు భమిడిపాటి

హాస్యనాటక రచయిత. పశ్చిమ గోదావరిజిల్లా ఆకివీడుగ్రామంలో 28ఏప్రిల్, 1897న జననం. రాజమండ్రి గవర్నమెంటు కళాశాలలో బి. ఏ. వరకు చదువు. ట్రెయినింగ్ కళాశాలలో యల్. టి; రాజమండ్రి వీరేశలింగం

ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయులుగా 1922 నుంచీ ఉద్యోగం. తరువాత 53లో హెడ్మాస్టరుగా ఉద్యోగ విరమణ. రచనలు: కాలక్షేపం, ఇప్పుడు, అన్నీ తగాదాలే, అప్పుడు, పెళ్ళిట్రయినింగు, తెడూతోడూ, అవును, నిజం, మాటవరస, గుసగుస పెళ్ళి, త్యాగరాజు ఆత్మవిచారం ఇత్యాది 23 పుస్తకాలకు పైగా. చిరునామా: రాజమహేంద్రవరం.

### కుటుంబరావు కొడవటిగంటి

సాంఘిక ప్రయోజనాన్ని ఉపలక్షించి వృత్తిగా కథానికా రచనను స్వీకరించిన రచయిత, విమర్శకుడు. గుంటూరుజిల్లా తెనాలి వీరి జన్మస్థానం. జననం: 28 అక్టోబరు 1909. గుంటూరులో ఇంటర్మీడియట్టు, విజయనగరంలో బి. ఏ., కాశీ విశ్వవిద్యాలయంలో యం. ఎస్‌సి. వొక సంవత్సరంపాటు విద్యాభ్యాసం.

బాలనాగమ్మ మొదలైన తెలుగు చిత్రాలకు సంభాషణా రచన; ఆంధ్ర వారపత్రికకు సంపాదకత్వం. బొంబాయి మెటల్ ఫ్యాక్టరీలో ఫోర్‌మెన్ ఉద్యోగం. బొంబాయిలో మెటల్ అండ్ స్టీల్ ఫ్యాక్టరీలో సూపర్‌వైజర్ పని. 48అక్టోబరులో తిరిగి ఆంధ్ర పత్రికకు సబ్ ఎడిటరు; తరువాత దినపత్రికనుండి ఆంధ్ర వారపత్రికకు బదిలీ. 1935 నవ్యసాహిత్య పరిషత్తు సభ్యత్వం. 1945 లో అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధం. కొన్నాళ్ళు 'అభ్యుదయ' పత్రికకు గౌరవసంపాదకులు. కార్యనిర్వాహకవర్గ సభ్యులు.

ముద్రితమైన కథానికా సంపుటాలు: నిలవనీరు, పెండివాడు, వరప్రసాదం, కాలభైరవుడు, కవిరాట్టు, కథాసాగరం ఆడజన్మ మొదలైనవి. వెలువడిన నవలలు: నీకేం కావాలి, కులంలేని మనిషి, మారుపేర్లు, అరుణోదయం, చదువు ఇత్యాదులు. అనువాదాలు: రష్యన్ కథలు, అతికిన ఘటం, ప్రణయరోగులు.

52 సం॥నుంచీ చందమామ పబ్లికేషన్స్ నిర్వహిస్తున్న కినిమా పత్రికకు సంపాదకులు. చిరునామా: 51 బజుల్లారోడ్డు టి. నగర్ మద్రాసు 17.

### కోదండరామశాస్త్రి ప్రయాగ

కవి, విమర్శకుడూ; తెనాలి తాలూకా కొలకలూరులో 1 జూన్ 1916 న జననం. మద్రాసు విశ్వవిద్యాలయంలో ఆంధ్ర గీర్వాణ భాషలలో విద్వాన్. 'ప్రజాశక్తి' దినపత్రికలో కొంతకాలం సంపాదకులుగా ఉద్యోగం. అభ్యుదయ పత్రికా సంపాదకులలో వొకరు. అభ్యుదయ రచయితల సంఘ కార్యవర్గ సభ్యత్వం. కొన్ని సంవత్సరాలు అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి. రచనలు: శివస్తుతి, రాగిణి, గుండె మంట మొదలుగా గల గేయాలు; ఇదంజగత్ అనే రేడియో నాటికల సంపుటి, కొన్ని కథలు, సాహిత్య వ్యాసాలు; అనువాదాలు: గోర్కీ కథలు, పల్లెపట్టు అనే చెహోవ్ కథలు, అలెగ్జి టాల్‌స్టాయ్, రష్యన్ జానపద గాథలు. ఇప్పుడు మచిలీపట్టణం, హిందూ కళాశాలలో తెలుగు పండితులు. చిరునామా: బుట్టయ్యపేట, మచిలీపట్టణం.

### కృష్ణమూర్తిశాస్త్రి శ్రీపాద

పండిత కవులు. ఎర్నగూడెం వద్ద ఉన్న దేవరపల్లి వీరి జన్మస్థానం. జననం

1866 లో. 1908లో 'గౌతమి' అనే మాసపత్రికను నడిపారు. వజ్రాయుధము, మానవసేవ, వందేమాతరం అనే పత్రికలు వీరి సంపాదకత్వాన వెలువడి విశేష ఖ్యాతిని పొందాయి. ముద్రిత గ్రంథములు కొన్ని: వేణీ సంహారము, కలభాషిణి, బొబ్బిలి యుద్ధ నాటకము, శ్రీనాథకవి రాజీయాది నాటకములు. మదరాసు ప్రభుత్వ ఆస్థానకవులుగా నియమితులు. చిరునామా: రాజమహేంద్రవరం.

## కృష్ణశాస్త్రి దేవులపల్లి

కరుణ రసవ్యంజక కవితా రచనలో లబ్ధ ప్రతిష్ఠులు. కవితలో శబ్ద సౌకుమార్యము, వింత వింత నగిషీలకు పెట్టినది పేరు. మంచి వక్త. తూర్పు గోదావరి జిల్లా, పెద్దాపురం తాలూకా, చంద్రమపాలెంలో నవంబరు 1897 లో జననం. విజయనగరం కళాశాలలో 1918 నాటికి బి.ఏ. పట్టభద్రత. బ్రహ్మసమాజ మతావలంబకులు. 1918 లో సంఘ సేవా సమితి స్థాపన, హరిజనులతో పంక్తి భోజనాదులు; గ్రామ పారిశుధ్య కార్యక్రమ నిర్వహణ. తత్ఫలితంగా కులం నుంచి వెలి; పెద్దాపురం, కాకినాడ, పిఠాపురం ఉన్నతపాఠశాలలలో ఉపాధ్యాయపదవి; కాకినాడ కళాశాలలో అధ్యాపకత్వం. 1941 లో ఉద్యోగ విరమణ. ఆంధ్ర సాహిత్య పరిషత్తు, నవ్యసాహిత్యపరిషత్తు, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం ఇత్యాది ఆంధ్రదేశ సాహితీ ఉద్యమాలతో సన్నిహితసంబంధం. 1942-43 లో నవ్యసాహిత్య పరిషత్తునకు అధ్యక్షులు. 1946 లో ఆంధ్ర అభ్యుదయ రచయితల తృతీయ మహాసభకు అధ్యక్షులు. ప్రస్తుతం వాహినీ ఫిలిమ్సుకు రచయిత. మల్లీశ్వరి మొదలగు తెలుగు చలన చిత్రాలకు మాటలు పాటలు రచించారు. కృతులు: కన్నీరు, కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి, ఋగిద్వి, మహతి, కార్తికి, ఆకలి, బదరిక ఇత్యాది కావ్యములు. శర్మిష్ఠ, విద్యాపతి, గుహుడు,దక్షయజ్ఞం మొదలైన అనేక రేడియో వ్యాసాలు; ప్రాక్పశ్చిమ సాహిత్యాలు, నన్నయభట్టు, రవీంద్ర మహాకవి, కరుణ రసము, ఊర్వశి అనే సాహిత్య వ్యాసాలు. చిరునామా: హబిబుల్లా రోడ్డు, మాంబళం, మద్రాసు.

## కృష్ణమూర్తి రాంభట్ల

రచయిత, విమర్శకుడు. జననం: తూర్పు గోదావరి జిల్లా అమలాపురం తాలూకా అనాతవరం గ్రామం. తేదీ: 24 మార్చి 1920. హైద్రాబాదు నుండి వెలువడిన 'మీజాన్' తెలుగు దినపత్రికలో కొంత కాలం సహాయ సంపాదకుడు, ప్రస్తుతం 'విశాలాంధ్ర' దినపత్రిక సంపాదకవర్గ సభ్యులు, చిత్రలేఖనం వీరి అభిమానకళ. రచనలు: జ్వాలా తోరణం ఇత్యాది కథానికలు, గేయాలు. చిరునామా: విశాలాంధ్ర కార్యాలయం, బకింగ్ హాంపేట, విజయవాడ.

## గణపతిశాస్త్రి పిలకా

ఆంధ్ర, గీర్వాణ భాషా పండితులు; కవి, విమర్శకుడు. తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా, కట్టుంగ గ్రామం జన్మస్థలం, జననం: 24 ఫిబ్రవరి 1911. విజయనగరం సంస్కృత కళాశాలలో సాహిత్య విద్యాప్రవీణ, బి. ఓ. యల్. పరీక్షలకు చదువు. 33లో రెండు

టిలోను ఉత్తీర్ణత. హిందీ, బెంగాలీ, ఫ్రెంచి భాషలలో వ్యవహార జ్ఞానం. సుమారు 8 సం॥లు రాజమహేంద్రవరం వీరేశలింగం ఉన్నత పాఠశాలలో సంస్కృతాంధ్రాధ్యాపకత్వం. 45 లో శ్రీ వి.ఆర్. చిత్రాగారి సహ సంపాదకత్వాన 'ఆంధ్రశిల్పి' పత్రికా స్థాపన. 46 నుండి 49 వరకు ఆంధ్రశిల్పి సహాయ సంపాదకత్వం. 49 నుండి 50 వరకు ఆంధ్ర దిన పత్రిక సహాయ సంపాదకులు. 50 నుండి నేటివరకు 'భారతి' సాహిత్య పత్రికకు సహాయ సంపాదకులు. ముద్రిత గ్రంథాలు: బ్రహ్మర్షి సూక్తములు, రత్నోపహారము, విభ్రాంతామరుకము ఇత్యాదికావ్యాలు. చిరునామా: భారతి, 7, తంబుచెట్టి వీధి, మద్రాసు.

## గోపీచంద్ త్రిపురనేని

కథారచయిత, విమర్శకుడు. కృష్ణాజిల్లా అంగలూరు గ్రామంలో 1910 సంవత్సరంలో జననం. ఆంగ్ల సాహిత్యాన్ని చక్కగా అవలోకనంచేసిన రచయిత. 'లా' డిగ్రీతీసుకున్నారు. కాని న్యాయవాదవృత్తి రుచింపలేదు. కొంత కాలం ఆంధ్రా రాడికల్ డెమోక్రటిక్ పార్టీ కార్యదర్శి. ముద్రితమైన వీరి కథా సంపుటాలు: భార్యల్లోనే వుంది, దేశం ఏమంయ్యేట్టు, గీతాపారాయణం, తండ్రులూ-కొడుకులూ, సరే కానివ్వండి, దేవుని జీవితం మొదలైనవి. నవలలు: పరివర్తనం, అసమర్థుని జీవయాత్ర. విమర్శనా గ్రంథాలు: పట్టాభిగారి సోషలిజం, మార్క్సిజం అంటే ఏమిటి, సోషలిస్టు వుద్యమ చరిత్ర, ప్రజా సాహిత్యం ఇత్యాదులు. ఉభయ కుశలోపరి, పోస్టు చెయ్యని వుత్తరాలు తదితర రచన లనేకం.

సాహిత్య రంగంలోనే కాక చలనచిత్ర రంగంలోకూడ కృషిసల్పారు. రైతుబిడ్డ, గృహప్రవేశం మొదలైన చలన చిత్రాలకు సంభాషణలు రచించారు. లక్ష్మమ్మ మొదలైన చిత్రాలకు దర్శకులు. ఇప్పుడు ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వ పబ్లిసిటీ ఆఫీసరుగా నియమితులు. చిరునామా: పబ్లిసిటీ ఆఫీసరు, కర్నూలు.

## గోపాలకృష్ణగోఖలే మాధవపెద్ది

కథకులు, చిత్రకారులు. గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరు గ్రామం జన్మస్థానం. జనన తేదీ 7 మార్చి 1917. బందరు జాతీయ కళాశాల, మద్రాసు ప్రభుత్వ కళాశాలలలో విద్యాభ్యాసం. 36 లో చిత్రరచనలో మొదటితరగతి డిప్లమో పొందారు. ఆంధ్రపత్రిక, ప్రజాశక్తి, ఆంధ్రజ్యోతి, చందమామ పత్రికలలో సహాయ సంపాదకులుగా ఉద్యోగాలు. సాహుకారు, పెళ్ళిచేసిచూడు, పాతాళభైరవి, చంద్రహారం చలనచిత్రాలకు అర్టుదర్శకులు. రచనలు: మూగజీవాలు అనే కథాసంపుటి; మరికొన్ని కథలు, కళలపైవ్యాసాలు. రచించిన చిత్రాలు: పావురాలజంట, మల్లమ్మదేవి, హంపికథకులు, బ్రహ్మన్న, జీవితవ్యాసంగం, జటాయువు తదితరములు. అభ్యుదయ రచయితలసంఘ సభ్యులు. ఆంధ్ర కళాకారులసంఘం, ఆంధ్రచిత్రకళాపరిషత్తు సభ్యత్వం. ఉప్పు సత్యాగ్రహం, వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు కారాగారవాసం. చిరునామా: ఆర్కాట మొదలివీధి, మదరాసు 1.

### గోపాలకృష్ణ రెంటాల

కవి. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా రెంటాల గ్రామం జన్మస్థానం. జననం 5 సెప్టెంబరు 1922. నరసరావుపేటలో విద్యాభ్యాసం, గుంటూరుకళాశాల విద్యార్థి. అభ్యుదయ రచయితల సంఘ సభ్యుడు. రచనలు: రాజ్యశ్రీ (నవల), సంఘర్షణ, ఆకలిపాటలు, సర్పయాగం (కావ్యాలు), కళ (నాటికా సంపుటి), ఆధునిక కావ్యసంపుటి కల్పన సంపాదకులలో వొకరు. చిరునామా: గాంధీనగరం, విజయవాడ.

### చినసీతారామస్వామిశాస్త్రి వజ్ఝల

సంస్కృతాంధ్ర ఛందోలంకార వ్యాకరణశాస్త్రవేత్తలు. శ్రీకాకుళంజిల్లా బొబ్బిలి తాలూకా, పాలతేరు గ్రామం జన్మస్థలం. జననం 25 జూను 1878. విజయనగరం సంస్కృత కళాశాలలో కొంతకాలం, ఆంగ్లకళాశాలలో కొంతకాలం ఉపాధ్యాయులు. 1926 లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సెనేటుసభ్యులు. కొంతకాలం ఎకడమిక్ కౌన్సిల్ సభ్యత్వం. ఓరియంటల్ ఫాకల్టీసభకు అగ్రాసనాధిపతులు. ఆంధ్రకళాపరిషత్తు ఉపన్యాసకులు. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో పండితపదవి. కొన్ని ముఖ్య రచనలు: చింతామణీ విషయపరిశోధనము, వైయాకరణ పారిజాతము, కర్ణచరిత్రము, మార్గోపదేశిక, బాలసరస్వతీయ అధర్వణ కారికావళి; సంస్కృత ప్రాకృతములతో కంటె తెలుగుభాషకు తమిళకన్నడాదిభాషలతో ఏకకుటుంబితా రూపసంబంధము కలదని ధృవపరుస్తూ యిప్పుడు 'ద్రావిడ భాషాపరిశీలనము' అనే గ్రంథాన్ని రచిస్తున్నారు. ఆంధ్రవిశ్వవిద్యాలయం వీరికి 'కళాప్రపూర్ణ' అను బిరుదాన్ని యిచ్చింది. చిరునామా : కోడుగంటివారి వీధి, విజయనగరం.

### చిరంజీవి నార్ల

కవి. కృష్ణాజిల్లా, గన్నవరంతాలూకా కాటూరులో మే 1 1925 న జననం. ఏలూరు గురుకులాశ్రమంలో విద్యాభ్యాసం. 49-50 లో ఆలిండియా రేడియోలో స్క్రిప్టురచయితగా ఉద్యోగం. ప్రకాశ్ స్టూడియో కథాశాఖలో మరి కొంత కాలం ఉద్యోగి. రచనలు : త్యాగి, తెలుగు పూలు, ఆట పాటలు, కొత్తపాటలు, పాట కథలు, పెద్దల పాఠాలు, కీలుబొమ్మ, పిల్లల నాటికలు, జాబిల్లి పాటలు. అభ్యుదయ సాహిత్యోద్యమంతో నిత్య సంబంధం. ప్రస్తుత నివాసం : కృష్ణలంక, విజయవాడ.

### జాషువా గుర్రం

కవి. గుంటూరు తాలూకా వినుకొండలో 28 అక్టోబరు 1895 న జననం. ఉభయ భాషా ప్రవీణుడు. 1919 లో గుంటూరు ట్రయినింగు స్కూలులో ఉద్యోగి. 29 నుండి 15 సంవత్సరాలు గుంటూరుజిల్లా బోర్డుపాఠశాలలో తెలుగు పండితపదవి. 42 నుండి 45 వరకు మదరాసు యుద్ధప్రచార శాఖలో ఉద్యోగం. 47 ఉద్యోగ విరమణము. రచనలు : ఫిరదౌసి, గబ్బిలము, స్వప్నకథ, కాందిశీకుడు, ముంటాజ్ మహల్, ఖండ కావ్యము మొదలయిన కావ్యములు. రుక్మిణీ కల్యాణము, తెరచాటు, వీరాబాయి యిత్యాది నాటకాలు. మొత్తంరచనలు24. తిరుపతి ఓరియంటల్ సంస్కృత కళా

శాల వారిచే మధుర శ్రీనాథ బిరుద ప్రదానం, విజయనగరం భారతీ తీర్థవారిచే కవితా విశారద, ఇంకా అనేక బిరుదాలు. చిరునామా : వినుకొండ, గుంటూరుజిల్లా.

జోగి సోమయాజులు గంటి

భాషాతత్వవేత్త. విశాఖపట్టణంజిల్లా అనకాపల్లిలో 7 అక్టోబరు 1900 న జననం. 21 లో బి. ఏ; 23 లో ఎల్.టి; 25 లో విద్వాన్; 27 లో పి. బి. యల్, 28 లో సంస్కృతంలో ఎమ్. ఏ., తమిళ కన్నడ సంస్కృతాంధ్ర ఆంగ్ల హిందీ భాషలు అభ్యస్తములు. 22_29 లో ఆనోని మునిసిపల్ ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయ పదవి. 29_33 పచ్చయ్యప్ప కళాశాల ఆంధ్రభాషాశాఖాధ్యక్షుడు;33_53ల మధ్య కాలంలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు లెక్చరరు, రీడరు, ప్రొఫెసరు; ఇపుడు ఆంధ్ర భాషాశాఖాధ్యక్షుడు. దేశభాషలలోని శాస్త్రీయ సాంకేతిక పద నిర్ణయ సభలకు మదరాసు ప్రభుత్వం తరపున సభ్యుడు, కేంద్ర శాస్త్రీయ పద నిర్ణాయక సభకు సభ్యులు. కొన్ని ముఖ్య రచనలు : ద్రావిడభాషలు: వాని స్వభావము, ఆంధ్రభాషా వికాసము, మొదలైన భాషావిషయిక గ్రంథాలు; రామచంద్రుని హంపీ యాత్ర అనే పద్య కావ్యం, ధర్మ సామ్రాజ్యమనే నవల, ఆంధ్ర భాషా విషయక వ్యాసాలు కొన్ని ఆంగ్లంలో ప్రచురితం, కాళిదాసును గురించి మరికొన్ని సారస్వత విమర్శనములు ముద్రితము.

చిరునామా : మహారాణీపేట, విశాఖ పట్నం.

దీక్షితులు చింతా____

సుప్రసిద్ధ కథానికా రచయిత. తూర్పు గోదావరిజిల్లా, రామచంద్రపురం తా॥ దంగేరు గ్రామంలో జననం 1891. రాజమహేంద్రవరంలో బి. ఏ., చెన్నపట్నంలో యల్.టి., ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలలో డిప్యూటీఇన్స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా ఉద్యోగం. రచనలు: శర్మిష్ఠ, వరూథిని, రేణుక ఇత్యాదినాటికలు; ఏకాదశి, దీక్షితుల కథలు, వటేరావు కథలు, హాస్యకథలు అనేక సంపుటాలు; ఇవి కాక వంద కథలు. వీరికథలుకొన్ని హిందీ ఆంగ్లములలోనికి అనువదింప బడ్డాయి. చిన్నపిల్లల మనస్తత్వ చిత్రీకరణలో మేటి. పిల్లలకోసం "లక్కపిడతలు" అనే గేయాలను ప్రచురించారు. సూరీ, సీత, వెంకీ, శంపాలత, లీలాసుందరి మొదలైన పెక్కు చిన్న పిల్లల కథలు వ్రాశారు. చిరునామా: నరసాపురం, పశ్చిమగోదావరి జిల్లా.

దేవీప్రసాద్ మాదిరాజు

కవి, హాస్యరచనలో సిద్ధహస్తుడు. గుంటూరు జిల్లా, బాపట్లతాలూకా సంతరావూరు స్వగ్రామం. గుంటూరు, మదరాసుల్లో విద్యాభ్యాసం. బి. ఎస్‌సి., పట్టభద్రులు. ఖమ్మంమెట్టులో ఎక్సైజ్ ఇనస్పెక్టరు ఉద్యోగం. భక్తేశ్వరి, కాంత విరహం, కాగితాల పాదుకు, రాజకీయ బోధకుడు, పండగ విహారములు, మున్నగు అనేక హాస్యరస వ్యంగ్య కృతులు. చిరునామా: ఖమ్మం మెట్టుతాలూకా.

### ధర్మారావు తాపీ

సుప్రసిద్ధ రచయిత, పరిశోధకుడు, పత్రికా సంపాదకుడు. గంజాంజిల్లా బరంపురంలో జననం : 19 సెప్టెంబరు 1887. బరంపురం విజయనగరములలో చదువు, పచ్చయప్ప కళాశాలలో బి. ఏ., పట్టభద్రులు. బరంపురం కళాశాలలో గణితశాస్త్రాధ్యాపకులు. వేగుచుక్క గ్రంథమాల స్థాపన, ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజమందిర నిర్మాణకృషి, 1916 లో విశాఖపట్టణంలో గణితశాస్త్రాధ్యాపకులు. కొండెగాడు పత్రికాస్థాపన, మద్రాసు ప్రభుత్వ కోర్టు ఆఫ్ వార్డ్సు వారి న్యూయింగ్టన్ కాలేజీలో లెక్చరరుపదవి, సమదర్శిని ద్వైవారపత్రికా నిర్వహణ, చెన్నపురిలో ఆంధ్ర సాహిత్య సమాజ స్థాపన, ఆంధ్ర విశారద బిరుదాంకితులు, 1937 లో జనవాణి దినపత్రికకు సంపాదకులు, ఆంధ్రరాష్ట్ర పత్రికా సంపాదకుల మహాసభకు ప్రథమ అధ్యక్షులు, 1940 నుంచి కాగడా వారపత్రికా నిర్వహణ, ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభకు అధ్యక్షులు, 43 లో బొంబాయిలో జరిగిన అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభాధ్యక్షులలో ఒకరు, 1949_53 లో_జనవాణి, వారపత్రికా నిర్వహణ, ఇంటింట విజ్ఞానమాల స్థాపకులలో ఒకరు. రచనలు : రాగిదబ్బ, ద్యోగానము. భిక్షాపాత్రము, ఆంధ్రతేజము, (ఖండకావ్యాలు); నవలలు : ఉషఃకాలము, క్రొత్తగాడ్పు; నాటకాలు : విలాసార్జునీయము, తప్తాశ్రుకణము, అవసన్నికోర్చైనా; వ్యాసాలు : కొత్తపాళీ, అదగజాలని [illegible]; పరిశోధనలు : దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు, ఇనపకచ్చడాలు, పెళ్ళి - దాని పుట్టుపూర్వోత్తరాలు; వ్యాఖ్యానాలు : విజయవిలాసము, పారిజాతాపహరణ భావప్రకాశిక; సినిమాలు : మాలపిల్ల, రైతుబిడ్డ, ఇల్లాలు, ద్రోహి, దీక్ష, పల్లెటూరిపిల్ల ఇత్యాది అనేకం. చిరునామా : 7 స్వామి పిళ్ళైవీధి, ట్రిప్లికేన్, మద్రాసు.

### ధర్మారావు కొల్లూరి

విమర్శకుడు. విశాఖజిల్లా విజయనగరంతాలూకా కింటాం అగ్రహారంలో జననం : 17 ఫిబ్రవరి 1905. ఆంధ్ర విశ్వవిద్యాలయ పట్టభద్రులు. రచనలు : నాకిరేవు, విశ్వరూపం, ప్రకీర్ణ వ్యాస ఖండ కావ్యకథానికాదులు. 30 నుంచి నేటివనకు బ్యాంకులో ఉద్యోగి. చిరునామా : కిప్పా, విజయనగరం.

### నరసింహశాస్త్రి నోరి

కవి, విమర్శకుడు. గుంటూరులో 6 ఫిబ్రవరి 1900లో జననం. మద్రాసు విశ్వవిద్యాలయపు బి.ఏ.,బి. యల్.,డిగ్రీ, కొద్దికాలం ఉపాధ్యాయ వృత్తి, ఇపుడు న్యాయవాద వృత్తి. రచనలు : గీతమాలిక, సమ్మతి, సోమనాథ విజయము, సంస్కృతమునుంచి దేవీ భాగవతమునకు ఆంధ్రానువాదం, రుద్రమదేవి, నారాయణభట్టు అనే చారిత్రికనవలలు, ఏకాంకికలు, కథలు, వ్యాసాలు; సాహితీ సమితి సభ్యులు, కార్యదర్శి. చిరునామా : రేపల్లె, గుంటూరుజిల్లా.

### నరసింహారావు మునిమాణిక్యం.

హాస్యకథానికా రచయిత. జననం 1898. గుంటూరుజిల్లాలో

గుంటూరులోను, విజయనగరంలోను విద్యాభ్యాసం. బి. ఏ. ఎల్. టి., భీమవరంలో కొంతకాలం, బందరు హిందూ కళాశాల ఉన్నత పాఠశాలలో మరికొంత కాలం ఉపాధ్యాయవృత్తి. సాహితీసమితి, నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘములతో సంబంధం. రచించిన నవలలు: వక్రరేఖ, తిరుమాలిగ, దీక్షితులు, కాంతం, నేనూ మా కాంతం, కాంతం కైఫీయతు, కాంతం కాపురం, మునిమాణిక్యం కథలు, రాధ బాబు, హాస్యకథలు, రుక్కుతల్లి, శరద్రాత్రులు, తల్లిప్రేమ, కథానికలు ఇత్యాది కథా సంపుటాలు. చిరునామా: భాస్కరపురం, మచిలీపట్టణం.

### నరసింహశాస్త్రి మొక్కపాటి

హాస్యరచయిత. తూర్పు గోదావరి జిల్లా కాకినాడ తాలూకా గండ్రేడులో జననం: 9 అక్టోబరు 1892. పిఠాపురం, మచిలీపట్టణం, ఎడిన్‌బరోలలో విద్యాభ్యాసం. రచనలు: బారిష్టరు పార్వతీశం, ఏకోదరులు మొదలైన నవలలు; కన్నవి, విన్నవి అనే హాస్య కథానికల సంపుటి, మొక్కుబడి నాటికా సంపుటి, మరికొన్ని కథలు, నాటికలు, వ్యాసాలు. సాహితీసమితి, నవ్యసాహిత్య పరిషత్తు సభ్యులు. చిరునామా: కొత్త అగ్రహారం, పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా.

### నరసింహశర్మ
### అయలసోమయాజుల

సంస్కృతాంధ్ర భాషా పండితుడు. శ్రీకాకుళం జిల్లా, బొబ్బిలి తాలూకా కలువరాయి జన్మస్థానం. జనన తేదీ: 8 జూన్ 1913. చిట్టిగూడూరు, విజయనగరం సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం, ఉభయభాషా ప్రవీణ. విజయనగరం, అభ్యుదయ రచయితల సంఘానికి కొంత కాలం కార్యదర్శి; రాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యనిర్వాహక సభ్యుడు. పెదపూడి సాహిత్య పాఠశాలలో అలంకార శాస్త్రాచార్యులు. ప్రస్తుతం విజయనగరం కళాశాల ఆంధ్రోపాధ్యాయులు. రచనలు: సాహిత్య కౌముది, వ్యవహార దీపిక, సాహిత్య విమర్శలు, వాఙ్సర్వము, ఇత్యాది కథానికలు. చిరునామా: కోడుగంటివారి వీధి, విజయనగరం.

### నారాయణబాబు శ్రీరంగం

అతినవ్య కవితా రీతులలో బొమ్మలను చెక్కడంలో నేర్పరి; గడుసరి. జననం: విజయనగరంలో 17 మే 1906. బాల్యం నుంచీ నాటకాలలో వేషధారణ, సంగీతశాస్త్ర పరిచయం, శ్రీశ్రీతో కలసి విశాఖపట్టణంలో కవితాసమితి నిర్వహణ, తొలుత ప్రబంధ రచన, మిణుగురులనే భావకవితా రచన, పిమ్మట తిరుగుబాటు కవిత్వం, ఆంధ్రదేశ కవితా ఉద్యమాలతో సంబంధం, ఇప్పుడు విజయనగరం రచయితల సంఘాధ్యక్షులు, అతివాస్తవిక రచనకు ఆచార్యుడు. కపాల మోక్షం, కిటికీలో దీపం, ఊరవతల, గడ్డిపరక, పండుగనాడు, తెనుగు రాత్రి, ఏముంది, ప్రాణశంఖం ఇత్యాది ఖండకృతులు. సంపంగి తోట (ఫాల్స్ నాటకానువాదం) కొన్ని కథానికలు, సాహిత్య విమర్శలు, రేడియో ప్రసంగాలు. చిరునామా: కస్పా, విజయనగరం.

## నారాయణాచార్యులు పుట్టపర్తి

కవి, పండితుడు, విమర్శకుడు. రాయలసీమలో జననం 1915. తెలుగు, మరాఠీ ప్రాకృతం, పాళీ, సంస్కృతాంధ్రాంగ్ల భాషా సంపన్నుడు. అనంతపురం, ప్రొద్దుటూరు కళాశాలలలో కొంతకాలం అధ్యాపకత్వం. రచనలు : సాక్షాత్కారము. పెనుగొండ లక్ష్మి, గాడీవాలా, పాద్యము.

## పద్మరాజు పాలగుమ్మి

సుప్రసిద్ధ కథకుడు, పాత్రపోషణలో నేర్పరి, విమర్శకుడు, కవి. పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకా తిరుపతిపురంలో జననం, 24 జూన్ 1915. రాజమహేంద్రవరం ఆర్ట్సు కళాశాలలో రసాయనశాస్త్ర పట్టభద్రుడు, కాశీ విశ్వవిద్యాలయంలో ఎం. ఎస్ సి. 39 లో కాకినాడ కళాశాలలో అధ్యాపకులు, 45 లో భీమవరం కళాశాలలో రసాయన శాస్త్రశాఖాధ్యక్షుడు. 52 నుంచి వాహినీ సంస్థకు రచయితగా ఉద్యోగం. పురిటిపాటే మొదలైన గేయాలు, కూలిజనం అనే కథల సంపుటి, సుమారు 50 కథానికలు; ప్రతిభ, ఆంధ్రపత్రికలలో సాహిత్య విమర్శలు; కొన్ని నాటికలు, నాటకాలు. 1951 లో జరిగిన ప్రపంచ కథానికల పోటీలో వీరి 'గాలివాన' అనే కథానికకు ద్వితీయ బహుమతి వచ్చింది. చిరునామా : 66 పీటర్సు రోడ్డు, మద్రాసు-6

## ప తా భి

అన్నిటా కొత్తదనాన్ని ఆకాంక్షించే నవ్యుడు. వచన పద్యాలతో ముద్దుకృరతో పద్యాల నడుం విరగకొట్టిన కవి. రచనలు : ఫిడేలు రాగాల డజను (గేయసంపుటి) చిరునామా : 26, లాయిడ్సురోడ్డు, రాయపేట, మద్రాసు-14

## పార్వతీశము ఓలేటి

మధురకవి. జననం: తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురం తాలూకా కొమరగిరి; సంవత్సరం: 1882. ధనాభిరామము, తారాశశాంకము, సువర్ణమాల అనేనాటకములు, సురస అనే నవలరచయిత. ఆంధ్రప్రచారిణి అనే గ్రంథమాల స్థాపకులు. వంగభాషలో ప్రవేశం. వెంకటపార్వతీశ్వరకవులజంటలో వీరు ఒకరు. వేంకట పార్వతీశ్వరకవుల జంటలో కృతులు : కావ్యకుసుమావళి, బృందావనం, ఏకాంతసేవ, వాల్మీకిరామాయణమునకు ఆంధ్రీకరణము. నవలలు : నీరద, నీలాంబరి, ప్రణయకోపము, శ్యామల, శకుంతల, కృష్ణకాంతుని మరణశాసనము; వంగభాషనుండి అనేక నవలల అనువాదం. చిరునామా : పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా.

## పాపయ్యశాస్త్రి జంధ్యాల

కవి. గుంటూరుజిల్లా బాపట్లతాలూకా కొమ్మూరులో 4 ఆగష్టు 1912 న జననం. డిగ్రీలు : రాష్ట్రభాషా విశారద, హిందీ భాషా ప్రవీణ, ఉభయభాషా ప్రవీణ. స్టార్ గరల్సు హైస్కూలు గుంటూరులో హిందీ పండితుడుగా 4 సంవత్సరాలు అమరావతిలో తెలుగు పండితుడుగా 4 సంవత్సరాలు, ఇప్పుడు ఆంధ్ర క్రైస్తవ కళాశాల (గుంటూరు) ఆంధ్రోపన్యాసకులు. రచనలు : ఉదయశ్రీ, విజయశ్రీ, కరుణశ్రీ మొదలగు ఖండకావ్యాలు; గద్యరచనలు : కళ్యాణ కాదంబరి, తెలుగుసీమ, ఇత్యాదులు. నవ్యసాహిత్యపరిషత్తు, సాహితీసమితి, తరువాత అభ్యుదయ

రచయితల సంఘంతో సంబంధం. సుభాషిణి పత్రికకు కొంతకాలం సంపాదకత్వం. చిరునామా : ఎ. సి. కాలేజి, గుంటూరు.

### పిచ్చేశ్వరరావు అట్లూరి

కథకుడు. కృష్ణాజిల్లా బందరు హిందూ కళాశాలలో విద్యాభ్యాసం. వయస్సు 38 సం॥రాలు. నావికాదళంలో కొంత కాలం ఉద్యోగం, జనవాణి, అభ్యుదయ మొదలైన పత్రికలలో కథానికలు, సాహిత్య విమర్శలు, ప్రేమచంద్ గోదాన్ నవలానువాదం, హిందీభాషా పరిచయం. చిరునామా: విశాలాంధ్ర ఆఫీసు, బకింగ్ హాంపేట, విజయవాడ.

### బంగారయ్య నండూరి

విమర్శకులు. తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా చెల్లూరు గ్రామంలో జననం: 20 నవంబరు 1903. మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయంలో ఆంధ్రశాఖకు కొన్నాళ్ళు అధ్యాపకులు. 1928 నుండి నేటివరకు న్యాయవాదవృత్తి. రచనలు : అభిజ్ఞానశాకుంతలము, మహాభారతము మొదలైన కావ్యనాటకములపై విమర్శనా గ్రంథములు, మరికొన్ని సాహిత్య విమర్శనలు; రాజలక్ష్మి, ఖడ్గతిక్కన, ఆంధ్రతేజము యిత్యాదినాటకములు. నన్నయ్య భట్టారకసమాజము, గౌతమీ సాహిత్య సమ్మేళనము, లలితకళాపరిషత్తు మున్నగు సంస్థలస్థాపకుడు, కార్యదర్శి. చిరునామా : రాజమండ్రి.

### బాపిరాజు బొడ్డు

కవి. ఏలూరులో జనవరి 1912 లో జననం. ఏలూరు సాహిత్యమండలికి ఉపాధ్యక్షులు. రచనలు: విపంచి, కాత్యాయని అనే ఖండకావ్యాలు, కలిక అనే కథానికా సముచ్చయం. ఉద్యోగం: వాణిజ్యం. చిరునామా : ఏలూరు.

### బైరాగి ఆలూరి

కవి. గుంటూరుజిల్లా తెనాలితాలూకా అయితానగర్ లో 1925 సంవత్సరంలో జననం. రచనలు : దివ్యభవనం, (కథల సంపుటి) కవిత, చీకటినీడలు, నూతిలో గొంతులు, త్రిశంకుస్వర్గం, హిందీభాషలో బదత్ కీగాత్ అనే ఖండకావ్యం. ఉద్యోగం: చందమామ ప్రచురణలు సహాయసంపాదకులు. చిరునామా : చందమామ పబ్లికేషన్స్ మద్రాసు 26.

### భాస్కరరావు వాసిరెడ్డి

"మాభూమి" నాటకకర్తలలో ఒకరు. కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా వీరులపాడు గ్రామం జన్మస్థలం. జననం, 2 సెప్టెంబరు 1914, విద్వాన్. రచనలు: పోతుగడ్డ (నాటకం), సమాధి (పద్య కావ్యం), సాహిత్యం - సమాజం, మరి కొన్ని అనువాదాలు; ముందడుగు, అపనింద, నాటకకర్తలలో ఒకరు. 36 లో తెనాలిలో జరిగిన యదార్థ సాహిత్య పరిషత్తు సభ్యుడు. 49-51 వరకు అఖిల భారత అభ్యుదయ రచయితలసంఘ కార్యనిర్వాహకవర్గ సభ్యుడు. రెండు సంవత్సరాలకాలం ప్రజాశక్తి దినపత్రిక, జనత పత్రికాసంపాదకవర్గ సభ్యులుగా పనిచేశారు. పల్లెటూరు, పుట్టిల్లు మొదలైన చలనచిత్రాలకు మాటలు పాటలు రచించారు. చిరునామా : వీరులపాడు, కృష్ణాజిల్లా.

### భీమన్న బోయి

కవి. తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా, మామిడికుదురు స్వస్థలం - వయస్సు 40, కాకినాడలో బి. ఏ., రాజమండ్రిలో బి. ఇడి. జనవాణి, ప్రజామిత్రలో సహాయసంపాదకుడు. తూర్పుగోదావరి జిల్లాబోర్డులో ఉపాధ్యాయ వృత్తి. ఇప్పుడు ఆంధ్రప్రభలో సహాయ సంపాదకుడు. రచనలు: మధుబాల, రాగోదయం (కావ్యాలు), పాలేరు, కూలిరాజు ఇత్యాదులు. చిరునామా : ఆంధ్రప్రభ, మౌంటురోడ్డు, మదరాసు.

### మాధవరామశర్మ జమ్మలమడక

పండితులు. గుంటూరుజిల్లా తెనాలి తాలూకా కోడితాటిపర్రు స్వగ్రామం. జననం, 17 ఏప్రియల్ 1907. విజయనగరం సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసం, సాహిత్య విద్యాప్రవీణ. 31-43 తెనాలి సంస్కృత కళాశాలాధ్యాపకులు, ఉపాధ్యక్షుడు, అధ్యక్షుడు. 43-45 నెల్లూరు సంస్కృత కళాశాలలో అధ్యాపకులు. 45 నుంచి నేటివరకు గుంటూరు ఎ. సి. కళాశాలలో సంస్కృతాంధ్రాధ్యాపకులు: రచనలు, నవరస గంగాధరము, ఆంధ్రప్రతాపరుద్రీయము, ధ్వనిసారము, కావ్యప్రకాశము, మొదలైన అలంకార శాస్త్రరచనలు. నవ్యసాహిత్య పరిషత్తు కార్యనిర్వాహకసభ్యుడు, సాహితీ సమితి సభ్యత్వం, అభ్యుదయ సాహిత్య ఉద్యమంతో సన్నిహితత్వం. చిరునామా: ఎ. సి. కాలేజి, గుంటూరు.

### మాధవశర్మ పాటిబండ

కవి, పండితుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం. ఎ. పట్టభద్రుడు. ప్రస్తుతం విజయవాడ ఆంగ్లకళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. భావకవిత్వంపై అనేక పరిశోధనా పూర్వకవ్యాసాలను రచించారు. ఉష, వీణ సాహిత్య పత్రికలకు సంపాదకత్వం వహించారు. 'బాలప్రభ' అనే పిల్లలపత్రికకు కొంతకాలం నిర్వహణ. 'ఉదయభారతి' గురుకుల నిర్వాహకులు. కృతులు: చారుణి, గిరిక పెండ్లి. చిరునామా: బాపినగర్, గుణదల, విజయవాడ.

### ముద్దుకృష్ణ

నాటకరచయిత, 'వైతాళికులు' కవితా సంపుటి సంపాదకులు. జననం, 27 ఫిబ్రవరి 1899. కాకినాడకళాశాలలో బి. ఏ., పట్టభద్రులు, మద్రాసులో 'లా' బి. ఎల్. డిగ్రీ. రచనలు అశోకం, టీకప్పులో తుపాను ఇత్యాదినాటకాలు, భీమావిలాపంలో భామాకలాపం అనేనాటికలు; నాటకరంగానుభవం. 33 లో జ్వాల పత్రికాప్రచురణ, పక్కింటి అమ్మాయి చలన చిత్రానికి మాటలు పాటలు వ్రాశారు. చిరునామా : గాంధీనగర్, విజయవాడ.

### బలరామమూర్తి ఏటుకూరు

చరిత్ర పరిశోధకులు. జననం: గుంటూరు జిల్లా ఏటుకూరు; తేది 23 ఆగష్టు 1918. గుంటూరు కళాశాలలో బి. ఏ., గత పదిహేనేళ్ళనుంచి కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలతో సంబంధం; రాయలసీమ, విశాఖ పార్టీ కార్యక్రమాలలో

పాల్గొంటూ పాఠశాల నిర్వహణ; 48-51 కడలూరులో డెటిన్యూ; చరిత్ర, తత్త్వశాస్త్రములలో మార్క్సిస్టుదృష్టితో పరిశీలనాకాంక్ష. రచనలు: ఆంధ్రుల సంక్షిప్తచరిత్ర. చిరునామా: విశాలాంధ్ర, విజయవాడ.

## రమణారెడ్డి కె. వి.

కవి, వ్యాసకర్త. నెల్లూరు జిల్లా, కోవూరుతాలూకా కేబాలలో జననం. 26 మార్చి 1926 ఆంధ్ర విశ్వ విద్యాలయంలో బి. ఎ. ఆనర్సు డిగ్రీ, ప్రస్తుతం ఒంగోలు డి.యస్.ఆర్. శర్మ కళాశాలాధ్యాపకులు. రచనలు: అడవి (కావ్య సంపుటి), మరికొన్ని ఖండకృతులు; కొంత కాలం అరుణరేఖ పత్రికా నిర్వహణ; విద్యార్థిగా విద్యార్థి దైదేమను ఉద్యమంలో పాల్గొన్నందుకు సంవత్సరకాలం ప్రవాసశిక్ష. చిరునామా: ఒంగోలు కళాశాల, ఒంగోలు.

## రాఘవాచారి సంపత్కుమార్

కవి. సంపత్ అనే పేరుతో రచనలు చేలువరిస్తూ వుంటారు. జననం: 20 అక్టోబరు 1917. కర్నూలు జిల్లా బనగానపల్లి తాలూకా 'అవుకు' గ్రామవాసులు. మద్రాసు విశ్వ విద్యాలయ ఎమ్.ఏ. పట్టభద్రులు. కాకినాడ, అనంతపురం,రాజమహేంద్రవరంకళాశాలలలో కొంతకాలం ఆంధ్రాధ్యాపకులు; ఇప్పుడు అనంతపురం కళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులు. రచనలు: శకుంతలసంచరము, మేఘ సందేశము, అనంతము, కొన్ని కథలు, వ్యాసాలు. చిరునామా: గవర్న మెంటు ఆర్ట్సు కాలేజి, అనంతపురం.

## రామకృష్ణయ్య కోరాడ

భాషా తత్త్వవేత్తలు. మచిలీపట్నం జన్మస్థలం, జననం 1891. సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషాపండితులు, 1915 లో బి. ఏ. పట్టభద్రులు, 15 లో విజయనగరం కళాశాలలో అధ్యాపక పదవి. సంస్కృత ప్రాచీనాంధ్ర భాషా స్వరూపాన్ని తెలిపినవారు, కర్ణాటక తమిళ భాషలను పరిశీలించినవారు. 1905 లో వందేమాతరం ఉద్యమంలో ప్రచారం, బెంగాల్ జాతీయోద్యమ కాలంలో కొన్ని గేయాల రచన, 1921 లో ఎం. ఏ. పరీక్షయందు తీర్ణత, 1946 వరకు మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యశాఖా ప్రధానాధ్యాపకులు. ఇపుడు తిరుపతి ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ లో పరిశోధకులు. రచనలు: ఆంధ్ర భారత కవితా విమర్శనము, కాళిదాసుని కళా ప్రతిభలు, సారస్వత వ్యాసములు, భాషోత్పత్తిక్రమము, ద్రావిడ భాషా పరిచయము, సంధి, ఇత్యాది గ్రంథములు. ఇవికాక ఆంధ్రాంగ్ల భాషలలో అనేక సారస్వత భాషా విషయిక వ్యాసాలు. చిరునామా: తిరుపతి ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, తిరుపతి.

## రామకృష్ణశాస్త్రి మల్లాది

ప్రసిద్ధకథకులు,బహుభాషాకోవిదులు సంస్కృతాంధ్ర హిందీ ఆంగ్ల భాషలలో పండితులు. జననం15 జూన్, 1905 మచిలీపట్నం. మదరాసు విశ్వవిద్యాలయ ఎమ్. ఏ. పట్టభద్రులు; రచనలు: కృష్ణదే, అనేక కథల సంపుటి; కవిమిత్రులు, తెనుగుచాటువులు, గోష్ఠీకథలు, ఇత్యాది విమర్శనా పూర్వక వ్యాసాలు; ఇవికాక సుమారు 200 కథానికలు, చిన్నకోతలు,

మొదలైన అనేక చలనచిత్రాలకు సంభాషణలను రచించారు. త్యాగరాజనగర్, 15 తిరుమూర్తివీధి, మద్రాసు.

## రామకృష్ణరావు అబ్బూరి

పద గుంభన, లావణ్యము గల కవిత. జననం 1896. పట్టభద్రులు, నాటక రంగానుభవం, విమర్శకులు. రచనలు : ఊహాగానము, పూర్వప్రేమ, మల్లికాంబ, నదీసుందరి ఇత్యాదులు. నవ్యసాహిత్య పరిషత్తు సభ్యులు. చిరునామా : "ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

## రామశాస్త్రి గోవిందు

'గోరా' అనేది వీరికి నామాంతరం. నాటికా రచయిత. కోరాపుట్టి జిల్లాలో తుసుమూర్ అనే ఉత్కళ గ్రామంలో 3 అక్టోబరు 1918 న జననం. కాకినాద కళాశాలలో విద్యాభ్యాసం. సుమారు 10 ఉద్యోగాలు. 46 లో ఇంగ్లీషు స్వతంత్రకు సహాయ సంపాదకులు. 48 నుంచి నేటివరకు తెలుగు స్వతంత్రకు సహాయ సంపాదకత్వం. దూరతీరాలు అనే నాటిక, పెలవుల్లో.........ఇత్యాదులు సుమారు 50 రేడియో నాటికలు, వ్యాసాలు, మరికొన్ని కథలు వీరి రచనలు. చిరునామా : స్వతంత్ర, 2 బ్రాడీస్ రోడ్, మైలాపూర్, మద్రాసు 4.

## రామదాసు బెల్లంకొండ

'పయోగరా' కవులలో వొకరు. గుంటూరుజిల్లా నరసరావుపేట తాలూకా పమిడిపాడులో 23 ఆగస్టు 1923 న జననం. విజయవాడ ఆంగ్ల కళాశాలలో విద్యాభ్యాసం. ఆంధ్రప్రభ దినపత్రిక, సోషలిస్టు వారపత్రికలలో సహాయ సంపాదకులుగా కొంతకాలం ఉద్యోగం. 'మరదలుపెళ్ళి' చలనచిత్రానికి సంభాషణా రచన. సహాయదర్శకులు. నవ్య సాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధం. ఆధునిక కవితా సంపుటి 'కల్పన' సంపాదకులలో వొకరు. రచనలు : నాగీతం, ఊరేగింపు మొదలైన గీతాలు; అతిథి అనే నాటకం, కొన్ని అను వాదాలు. చిరునామా: కృష్ణలంక, విజయవాడ.

## రామచంద్ర తిరుమల

భాషా పరిశోధకులు. బళ్ళారిజిల్లా, హోస్పేటతాలూకా, కమలాపురంలో, 17 జూన్ 1914 లో జననం. మదరాసు సంస్కృత కళాశాలలో సాహిత్య శిరోమణి వరకు విద్యాభ్యాసం, మద్రాసు విశ్వ విద్యాలయ, తెనుగు సంస్కృతాలలో విద్వాన్, పంజాబ్ విశ్వ విద్యాలయం హిందీ ప్రభాకర, కన్నడభాషలో పాండిత్యం, తమిళభాషలో తగినంత పరిచయం. వేటూరి ప్రభాకరశాస్త్రిగారివద్ద, ఆంధ్ర ప్రాకృతభాషా పరిశోధన. ఉద్యోగాలు: 34_38 లో మద్రాసు ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్టు లైబ్రరీలో పండిత పదవి, 38_39 తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో పండితులు, 39_42 పంజాబ్ విశ్వ విద్యాలయ లైబ్రరీలో పుస్తకాల క్యాటలాగర్ పదవి, 44_47లో తెలంగాణా, మీజాన్ పత్రికల సహాయ సంపాదకత్వం. 47 నుండి నేటివరకు ఆంధ్రప్రభ సహాయ సంపాదకులు. రచనలు: సుమతిశతకం, భారతవిజయం అనే నాటకం, గాథాసప్తశతిలో తెలుగు పదాలు, మన స్త్రీ వాచక శబ్దాలు, ఆంధ్రఛందో విశేషాలు, నవ్వి

నానుడి, తదితర వ్యాసాలు; బొబ్బిలికథ, నన్నెచోడుని కుమారసంభవం, రంగనాథ రామాయణం ఇత్యాది గ్రంథసంస్కరణ.

అభ్యుదయ రచయితల సంఘ సభ్యులు. చెన్నపురిలో భాషా సేవక సమితి స్థాపన, కార్యదర్శిగా నిర్వహణ. 29 లో సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు. 32 లో నిర్బంధం, ఏడాది కారాగార శిక్ష. 34 మద్రాసు కుట్ర కేసులో అరెస్టు, కొంతకాలం ప్రవాసం, చిరునామా: 2,583 హైక్రాఫ్ట్సరోడ్డు తిరువల్లిక్కేణి, మద్రాసు-5.

## రామశాస్త్రి దర్భా

విమర్శకులు, రచయిత. రాంషా అనే పేరుతో రచనలు వెలువరిస్తున్నారు. తూర్పుగోదావరిజిల్లా కాకినాడతాలూకా వేటపాలెం జన్మస్థలం, తేదీ 30 జూలై 1924. కాకినాడ కళాశాలలో విద్యాభ్యాసం. రచనలు: కవితలు, కథలు, మనస్తత్వాలు (కథల) కళాసాహిత్యాల సమస్యలు, ఉదయగీతాలు, కామేశ్వరి కథ, దయ్యంపట్టిన మనిషి మొదలైన అనుసరణములు; కళాకేళి స్థాపన, గ్రంథ ప్రచురణ; శాంతి ఉద్యమంతో సంబంధం; విద్యార్థి ఉద్యమంలో కృషి. చిరునామా: కళాకేళి, సామర్లకోట, తూర్పుగోదావరిజిల్లా.

## రామమోహనరావు వండూరి

రచయిత. కృష్ణాజిల్లా ఆరుగొలనులో జననం. వయస్సు పాతికేళ్ళు. ఆంధ్ర వారపత్రిక సహాయ సంపాదకులుగా ప్రస్తుతం ఉద్యోగం. చిరునామా: ఆంధ్ర పత్రిక కార్యాలయం. 7 తంబుచెట్టివీధి, మద్రాసు.

## రామమోహనరావు మహీధర

రచయిత. తూర్పు గోదావరి జిల్లా అమలాపురం తాలూకా ముంగండ వాస్తవ్యులు. సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషా పరిచయం. వయస్సు 45 సం॥లు. ప్రజాశక్తి దిన పత్రికకు కొంతకాలం సహాయ సంపాదకులు. ప్రస్తుతం విశాలాంధ్ర దినపత్రిక సంపాదకవర్గ సభ్యులు. అభ్యుదయ, నగారా, ప్రజాశక్తి మొదలయిన పత్రికలలో అనేక నాటికలు, వ్యాసాలు ప్రకటితం. 'అద్దెకొంప' అనే నాటకం పుస్తక రూపాన వెలువడ్డ నాటకం. నాడు: నేడు మొదలైన నవలానువాదములు. కొంతకాలం విశ్వసాహిత్యమాల పుస్తక ప్రచురణాలయ నిర్వహణ. చిరునామా: విశాలాంధ్ర కార్యాలయం, విజయవాడ.

## రాజశేఖరశతావధాని దుర్భాక

పండితుడు, కవి. కడపజిల్లా జమ్మలమడుగులో జననం: 18 అక్టోబరు 1888. మద్రాసు క్రిస్టియను కళాశాలలో విద్య, ప్రొద్దుటూరు డిస్ట్రిక్టు మున్సిఫుకోర్టులో కొంతకాలం లేఖకులుగా ఉద్యోగం, గాంధీ ఉద్యమ ప్రభావంవల్ల 21 లో రాజీనామా. రచనలు: శరన్నవరాత్రపద్యావళి, వీరమతీ చరిత్రము, ప్రతాపసింహ చరిత్ర ఇత్యాదులు. చిరునామా: ప్రొద్దుటూరు, కడపజిల్లా.

## రామారావు అడిదము

పండితులు. విశాఖజిల్లా పూసపాటిరేగలో జననం: 1881, విజయనగరం ఆంగ్ల కళాశాలలో ఆంధ్రాధ్యాపకులుగా ఉద్యోగం; విరమణ 1939. రచనలు: విస్మృత కళింగాంధ్ర కవులు, మణిహారం

(సంస్కృత చాటువులకు అనువాదం), పదసాహిత్యంపై సాహిత్య వ్యాసాలు. చిరునామా : సుబ్రహ్మణ్యంపేట, విజయనగరం.

## రామిరెడ్డి నారపరెడ్డి

కవి. నెల్లూరుజిల్లా కోవూరు గ్రామములో జననం : 1918. నెల్లూరు మూలపేట సంస్కృత కళాశాలలో సంస్కృత భాషాధ్యయనం, అరుణరేఖ సాహిత్య మాసపత్రికకు రెండేళ్ళు సంపాదకత్వం, రాజకీయవారపత్రికగా అరుణనిర్వహణ, అరుణరేఖా పబ్లికేషన్స్ స్థాపకులు, అభ్యుదయ రచయితల సంఘంతో సంబంధం. రచనలు : అశ్రుమాల, నా వీణ. చిరునామా : అరుణపబ్లికేషన్స్, నెల్లూరు.

## రుక్మిణీనాధశాస్త్రి జలసూత్రం

కవి, విమర్శకుడు, పేరడీలనే కావ్యరచనలో సిద్ధహస్తుడు. జననం 7 సెప్టెంబరు 1914, మచిలీపట్నం. చిట్టిగూడూరు సంస్కృతకళాశాలలో 8ఏళ్ళు సంస్కృత భాషాధ్యయనం, 37లో ఉభయ భాషా ప్రవీణ, తెల్లప్రోలు ఉదయభారతి ఆంధ్రోధ్యాపకులు, 40-46 ఆంధ్ర వారపత్రికలో సహాయ సంపాదకులు, 46 నుంచి నేటివరకు మద్రాసు ఆలిండియా రేడియోలో స్క్రిప్టు రచయిత. నవ్యసాహిత్య పరిషత్తు సభ్యులు, 46లో ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ సహాయ కార్యదర్శి. రచనలు : అక్షింతలు (పారడీలు), ఎర్రటి చీకటి (కథలు), కబురి (నాటకం), దేవయ్య స్వీయచరిత్ర, తనలో తాను; సుమారు 500 రేడియో నాటికలు. చిరునామా : 14 ఉస్మాన్ రోడ్డు మద్రాసు - 17.

## రంగాచార్యులు కిళాంబి

రచయిత, విద్యాధికులు. జననం, 22 జనవరి 1895. కలకత్తా విశ్వవిద్యాలయంలో ఎమ్. ఏ., బి. యల్. పట్టభద్రులు. 1919-21 కలకత్తా విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులు. 21-50 విజయనగరం కళాశాలలో గణితశాస్త్రాధ్యాపకత్వం. కొంతకాలం పురపాలక సంఘాధ్యక్షత. రామానుజాచార్య విద్యాసమితి నిర్వహణ. వందేమాతరం పత్రికా సంపాదకత్వం. రచనలు : అనుతోష ముఖర్జీ జూబిలీసంచికలో బమ్మెరపోతనపై ఆంగ్లవ్యాసం, 'వైఖానసధర్మప్రశ్న' సంస్కృతంనుండి ఆంగ్లంలోనికి భాషాంతరీకరణము; జాతకకథలు, ధమ్మపదము, అంబద్ధసుత్తము, కొన్ని బౌద్ధగాథలు అనేకగ్రంథాలు పాళీనుండిఆంధ్రానువాదం; గురజాడ ముత్యాలసరములు, చిన్నకథలు, కొండుభట్టీయం, మాటామంతీ మొదలైన గ్రంథాలకు ఎడిటింగ్; బోధాయన అర్థశాస్త్రము, నాగార్జునచరిత్రము, నాగపంచమీకథ, పురాతన సాంఘిక పరిస్థితులు ఇత్యాది పుస్తకరచన. పాలరి దాకర్స్ ఇన్‌స్టిట్యూట్‌లో సభ్యులుగా ఎన్నిక, అభ్యుదయ రచయితల ఉద్యమంతో సన్నిహితత్వం, సభ్యత్వం. చిరునామా : పార్క్-సైడ్ విల్లా, విజయనగరం.

## రంగనాథరావు పన్యాల

కవి. గంజాంజిల్లా, బరంపురంలో జననం: 1 జూన్ 1919. విశాఖపట్నం కళాశాలలో చదువు, 40 లో యువకవి పత్రికా నిర్వహణ. 43 నుంచి నేటివరకు ఆలిండియా రేడియో ఢిల్లీలో తెలుగు

వార్తాశాఖకు సబ్ఎడిటర్. రచనలు: అశ్రుగీతి, ప్రేమలత (ఖండకావ్యాలు); ఆద్యంతం, నీకోసం, అనూరాధ, నవ్యాల కథలు. చిరునామా : ఆలిండియా రేడియో బ్రాడ్‌కాస్టింగ్ హౌస్, న్యూఢిల్లీ.

### రంగారావు ఆవంత్స

కవి. విశాఖజిల్లా విజయనగరంలో 11 డిశంబరు 1904 జననం. రాజమహేంద్రవరంలో బి. ఇడి., సాహితీ సమితి సభ్యులు. విజయనగర పురపాలక సంఘ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులు. కృతులు: నెలవంక, ఇంద్రచాపము ఇత్యాది ఖండకావ్యాలు; సరస్వతి మొదలగు కొన్ని తైలవర్ణచిత్రాలు, రేఖాచిత్రాలు. చిరునామా: కిస్పా, విజయనగరం.

### లక్ష్మీకాంతము పింగళి

రంగురంగుల శబ్దాలతో భావాల తొలకరింతలో ప్రసిద్ధులైన పింగళి - కాటూరి కవులలో ఒకరు. జననం, కృష్ణాజిల్లా చల్లపల్లి తాలూకా చిట్టూర్పు; తేదీ 10 జనవరి 1894. మచిలీపట్నంలో బి. ఏ. నోబిలుపాఠశాలలో ప్రధానాంధ్ర పండితపదవి, మద్రాసు విశ్వవిద్యాలయంలో తెలుగు పరిశోధకశాఖ 'ఫెల్లో' పదవి, తంజావూరు సరస్వతీ మహలులో పరిశోధకులు, 30 లో ఎమ్. ఏ. డిగ్రీ. 31 లో ఆంధ్రవిశ్వవిద్యాలయ ఆంధ్రశాఖకు ఆచార్యస్థానం, ఇప్పుడు ఆలిండియా రేడియో సాహిత్య సలహాదారుగ కేంద్ర ప్రభుత్వోద్యోగులు. రచనలు:మధుర పండితరాజము, ద్విపద భారతము,రంగనాథరామాయణము ఇత్యాది కావ్యాలకు పీఠికలు; పింగళి - కాటూరి కవులకృతులు: సౌందరనందము, పౌలస్త్య హృదయము, తొలకరి. చిరునామా : ఆలిండియా రేడియో, విజయవాడ.

### లక్ష్మీనారాయణ ఉన్నవ

నవలా రచయిత, విద్యాధికులు. గుంటూరుజిల్లా వేములూరులో జననం. వయస్సు సుమారు 76.

గుంటూరు,రాజమహేంద్రవరములలో ఆంగ్ల భాషాధ్యయనం. ఐర్లండ్‌లో విద్యాభ్యాసం, బార్-ఎట్-లా డిగ్రీ పట్టభద్రులు. గుంటూరు క్రిస్టియన్ కాలేజీలో కొంతకాల ఉపాధ్యాయ పదవి, వీరేశలింగంపంతులుగారితో సంఘ సంస్కరణోద్యమంలో నిర్వహణ. ఆయనవద్ద కొంతకాలం ఉద్యోగం, బెంగాల్ విభజన ఆందోళనోద్యమంతో రాజకీయాలలో ప్రవేశం. ఉద్యోగానికిస్వస్తి. వాల్టాట్ కంపెనీలో కాషియర్ ఉద్యోగం, తరువాత ఐర్లండుప్రయాణం. ఐర్లండులో భారతీయులతో కలిసి ఉద్యమాలు, వ్యాసరచన, స్వదేశాగమనం, హోమ్‌రూలుఉద్యమంలో ప్రవేశం, అసహాయోద్యమములో న్యాయవాద వృత్తికి స్వస్తి, ఉద్యమంలో కృషి, పల్నాడులో సహాయనిరాకరణ, గురజాలలో అరెస్టు, ఉప్పుసత్యాగ్రహోద్యమంలోనూ, 1942 లోనూ మళ్ళీ కారాగారవాసం. రచనలు : మాలపల్లి, నాయకురాలు, సంగీత నాటసాని, మొదలైనవి; తిక్కన శిల్పనైపుణ్యంపై కొన్ని వ్యాసాలు. కొంతకాలం 'గుంటూరు' పత్రికానిర్వహణ. చిరునామా : శారదానికేతనం, గుంటూరు.

## లక్ష్మీకాంతమోహన్

కథకుడు. గుంటూరుజిల్లా, రేపల్లె తాలూకా, వెల్లటూరు స్వగ్రామం. జననం 1 జూలై 1922. ఆత్మబలి, పేద రాపి పెద్దమ్మ కథలు, సింహగర్జన, రామరాజ్యం నవలలు; సమ్మెపిలుపు, నాటకం; కూలీ, కాలుదారు బుర్రకథలు. రాజకీయోద్యమాలలో కృషి, 48-51 వరకు ఉపాధ్యాయ వృత్తి. చిరునామా: వెల్లటూరు, (వయా) తెనాలి, గుంటూరు జిల్లా.

## విశ్వేశ్వరరావు మల్లవరపు

కవి, జననం 1904. నవ్యసాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల ఉద్యమంతో సంబంధం. రచనలు: మధుకీల, కల్యాణ కింకిణి.

## విశ్వం విద్వాన్

కవి. విమర్శకుడు 21 అక్టోబరు 1915 జననం; అనంతపురంజిల్లా తరిమెల గ్రామం జన్మస్థలం. సంస్కృతాంధ్రాలలో మదరాసు విశ్వవిద్యాలయ విద్వాన్. కాశీ విశ్వవిద్యాలయంలో సంస్కృత ఖండ కావ్యాల పరిశోధన. రచనలు: విశికన్నె, పాపం, నా హృదయం, ఖండకావ్యాలు, అనువాదాలు, భారతీయ కవితాకల్పకం, అత్యాచారం, అబద్ధాలు, మహాశిల్పి; నవలలు: దురాక్రమణ, మానవుడు, ప్రథమ ప్రేమ, ఇత్యాదులు; కథలు: రాతలూ గీతలూ, ప్రొద్దుతిరిగింది; వ్యాసాలు, సమీక్ష, సాహిత్యమీమాంస మొదలైన తదితర అనేకరచనలు.

38-44 నవ్యసాహిత్యమాల స్థాపన, అనంతపురం జిల్లా కాంగ్రెస్, జిల్లా యువజన సంఘం తదితర సంస్థల ప్రధాన కార్యదర్శి. 45 లో హైదరాబాద్‌లోని మీజాన్ పత్రికలో సహాయ సంపాదకత్వం, 46-49 లో ప్రజాశక్తి దిన పత్రిక సహాయ సంపాదకత్వం, 49 లో నవ్యసాహితీ పత్రికా నిర్వహణ, 50-52 బాలభారత్‌లో శిశువున స్త్రీ పరిశోధన, ఇంటింటి విజ్ఞానమాల ప్రధాన సంపాదకులు, 52 నుంచి నేటివరకు ఆంధ్రప్రభ వారపత్రికకు ఎడిటర్-ఇన్‌చార్జి. చిరునామా: 66 పైక్రాఫ్ట్స గార్డెన్సు, మదరాసు 14.

## విశ్వనాథం ముద్దా

కథా రచయిత. జననం 1919. ఆంధ్ర సేవ, వాణి, ఆనందవాణి, ప్రజామిత్ర లలో సహాయసంపాదకులు, 48 నుంచి నేటివరకు చందమామ పత్రికలో ఉద్యోగం. రచనలు: ఆత్మజ్యోతి, జన్మభూమి, ప్రేమాంజలులు, తూలిక, శుభోదయము, ఛాయ ఇత్యాదులు. వ్యాస కుటీరము నే సారస్వత సంస్థా స్థాపకులు, కొన్ని గ్రంథ ప్రచురణలు. చిరునామా: చందమామ పబ్లికేషన్స్, మదరాసు.

## వీరభద్రరావు కొత్తపల్లి

విమర్శకులు. రాజమహేంద్రవరంలో 19 మే 1924 జననం. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం. ఏ., విజయనగర కళాశాలలో ఆంధ్రభాషా శాఖకు ప్రధానాధ్యాపకులు. నవ్యాంధ్ర సాహిత్యంపై కొన్ని విమర్శనాత్మక వ్యాసాలను రచించారు. మరికొన్ని కథలను ప్రకటించారు. "తత్త్వమసి" అనే వీరి రేడియో నాటిక అఖిలిండియా రేడియో నాటికా పోటీ

లలో బహుమతి వచ్చింది. చిరునామా: విజయనగరం కళాశాల, విజయనగరం.

## వెంకటచలం గుడిపాటి

ఆంధ్ర కథానికా రచనలో వొక ఊపెప్పిన స్వాప్నికుడు. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా. జననం 1894. బి.ఏ. యల్.టి., ప్రభుత్వ విద్యాశాఖలో ఉద్యోగం. 1950 నుంచి రమణాశ్రమ నివాసి. రచనలు: పద్మరాణి, చిత్రాంగి, సావిత్రి, త్యాగం ఇత్యాది నాటకాలు; వెంకటచలంగారి కథలు, కర్మ మిట్లా, కాలింది మున్నగు కథా సంపుటాలు; మైదానం, అమీనా, బ్రాహ్మణీకము దైవమిచ్చిన భార్య మొదలైన నవలలు. ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, బిడ్డాకలు, ఆనందం, స్త్రీ ఇత్యాది గ్రంథాలు. చిరునామా: రమణాశ్రమం, తిరువణ్ణామలై.

## వెంకటకృష్ణరావు గవను

రచయిత, విమర్శకులు. గుంటూరు జిల్లా తెనాలి తాలూకా కూచిపూడి గ్రామంలో జననం: 15 నవంబరు 1915. బి.ఏ. పట్టభద్రులు, మద్రాసు విశ్వవిద్యాలయానికి పి. హెచ్. డి. కోసం థీసిస్‌ను రచించారు. పత్రికా రచయిత. రచనలు: పద్య కావ్యాలు; వరూధిని, శివరాత్రి, యుగసంధ్య, కావ్యజగత్తు, కేగంటలు అనే సాహిత్య తత్వ నిరూపక గ్రంథాలు; మనీష, ఆదర్శ శిఖరాలు, తోలు బొమ్మలు అనే నాటికలు; కీలుబొమ్మలు నవల; తెలుగు లిపి సంస్కారం, ప్రజాస్వామ్యం, తత్వశాస్త్ర ప్రామాణ్యం మొదలైన వ్యాసాలు. చిరునామా: తెనాలి, గుంటూరు జిల్లా.

## వెంకటేశ్వరరావు నార్ల

ఏకాంకికా రచయిత, పత్రికా సంపాదకులు. జననం 1 డిసెంబరు 1908; బందరులో బి. ఏ., స్వరాజ్య పత్రికలోను, 36–37 జనవాణి సబ్ ఎడిటర్, 38–42 ఆంధ్ర ప్రభలో సహాయ సంపాదకులు. 42 నుంచి నేటివరకు ఆంధ్రప్రభ ప్రధాన సంపాదకులు. రచనలు: కొత్త గడ్డ (నాటికా సంపుటి), స్వదేశ సంస్థానాలు, నేటి రష్యా, అస్ట్రియా ఆక్రమణ, పాలస్తీనా, చెక్ రాజ్య విచ్ఛేదం మొదలయిన రాజకీయ గ్రంథాలు. చిరునామా: ఆంధ్రప్రభ, మౌంటురోడ్డు, మదరాసు.

## వెంకటరామనరసింహం కాకర్ల

పండితులు. శ్రీకాకుళంజిల్లా బొబ్బిలి తాలూకా సీతానగరంగ్రామంలో 25 అక్టోబరు 1914 జననం. ఎం. ఏ. పట్టభద్రులు. 1945 లో డాక్టరేటు డిగ్రీ, తంజావూరు సరస్వతీమహాలు పుస్తక భాండాగారంలో కొంతకాలం ప్రాచీన గ్రంథ పరిశోధన, ప్రస్తుతం ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర శాఖాధ్యాపకులు. రచనలు: కనకాభిషేకం, రఘునాథరాయలు (నవలలు); శిల్పికళ్ళ మూల్యాట్టు, వంచకులు (నాటికలు); సుజాత, ఉషోరాగము (కావ్యాలు); ఆంధ్రమున ప్రబంధావిర్భావము: తద్వికాసము (విమర్శనాగ్రంథము). చిరునామా: ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు.

## వెంకటసుబ్బారావు శివరాజు

కథారచయిత, 'బుచ్చిబాబు' అనే పేరుతో అనేకరచనలు ప్రచురితము. పశ్చిమగోదావరిజిల్లా ఏలూరులో జననం: జూన్ 1916. ఎమ్. ఏ. పట్టభద్రులు.

45 నుంచి నేటివరకు ఆలిండియా రేడియోలో కార్యక్రమ నిర్వాహకులుగా ఉద్యోగం. రచనలు : బుచ్చిబాబుకథలు, మేడమెట్లు, అడవికాచిన వెన్నెల, మొదలైన కథానికా సంపుటాలు. ఆత్మవంచన (నాటకం), దారినపోయే దానయ్య ఇతరనాటికలు. 52 లో వీరి 'చివరకు మిగిలేది' అనే నవల ప్రచురితము. చిత్రకారులు. చిరునామా : ఆలిండియా రేడియో, విజయవాడ కేంద్రం.

## వెంకటరామయ్య తుమ్మల

రచయిత. గుంటూరుజిల్లా తెనాలి తాలూకా కొల్లూరులో అక్టోబరు 1915లో జననం. కాశీవిద్యాపీఠ్, బెనారిస్‌లో విద్యాభ్యాసం; నవశక్తి, ప్రజాశక్తి పత్రికా సంపాదకవర్గ సభ్యులు; ఉదయిని పత్రికా నిర్వహణ; ప్రస్తుతం విశాలాంధ్ర దినపత్రికా సంపాదకవర్గసభ్యులు. రచనలు: ఎర్రజండా మొదలైన పాటలు, అనువాదాలు: మాతృహృదయం (గోర్కీ నవల), మన లెనిన్, సోవియటు కమ్యూనిష్టుపార్టీ చరిత్ర ఇత్యాదులనేకం. అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి. 48-51 మధ్య రాజకీయ సాంస్కృతికోద్యమాలలో పాల్గొన్నందుకు కారాగారవాసం. చిరునామా : విశాలాంధ్ర, బకింగ్ హాంపేట, విజయవాడ.

## వెంకటేశ్వరరావు గంగినేని

కవి. గుంటూరుజిల్లా, వినుకొండ తాలూకా, గురప్పనాయుడు పాలెంలో జననం, డిసెంబరు 1929. గుంటూరు ఆంధ్రక్రైస్తవకళాశాలలో విద్యాభ్యాసం, 51 లో 'ఉదయిని' కావ్యప్రచురణము, 52 లో ఎర్రజండాలనే మూడుభాగాల కథానికాసంపుటి (వీటిని హైదరాబాదు, అవిభక్త మద్రాసు ప్రభుత్వాలు నిషేధించాయి), 53 లో "ఆదర్శకుటుంబాలు" నవల. చిరునామా : గుడివాడ, వయా కొలకలూరు, తెనాలితాలూకా.

## వెంకటరత్నం కొనకళ్ళ

కవి. పశ్చిమ గోదావరిజిల్లా పెంటపాడు గ్రామంలో జననం, 2 సెప్టెంబరు 1909. ఉద్యోగం, జిల్లాపోలీసుఆఫీసులో. ప్రచురణాలు: ప్రతోళి (గీతాలసంపుటి), కథావళి (కథలసంపుటి). చిరునామా : ఏలూరు.

## వెంకటసుబ్బయ్య గొర్రెపాటి

రచయిత. కృష్ణాజిల్లా, దివితాలూకా ఘంటసాలలో జననం: 1 జూన్ 1898. హింది, బెంగాలీభాషల పరిచయం. 1930 లో జాతీయోద్యమంలో కారాగారవాసం. రచనలు: సరోజినీదేవి, ఘంటసాల చరిత్రము, అక్షరాభిషేకము, భట్టుమూర్తి రామరాజ భూషణుడా ? హంపి పిలుపు ఇత్యాదులు. చిరునామా : ఘంటసాల, కృష్ణాజిల్లా.

## వెంకటసుబ్బారావు పింగళి

కవి. పత్రికా సంపాదకుడు. గంజాం జిల్లా అస్కాలో జననం: 1 జూలై 1896. ఆంధ్రాంగ్లభాషలలో కృతులను వెలువరించారు. కృతులు: రూపమతి, మరికొన్ని ఖండకావ్యాలు. చిరునామా : సాహితీ ప్రెస్, విజయవాడ.

## వేంకటరావు బాలాంత్రపు

వేంకట పార్వతీశకవులలో వొకరు. తూర్పుగోదావరిజిల్లా, పెద్దాపురం

తాలూకా మల్లాము గ్రామములో జననం: 1880. ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలను 1911 లో స్థాపించారు. 1930 నాటికి ప్రచారిణి వెలువరించిన గ్రంథములు 170. చిరునామా: కొత్తఅగ్రహారం, పిఠాపురం.

## వేంకటేశ్వరరావు కాటూరి

పింగళి–కాటూరి కవులలో ఒకరు, విమర్శకులు. కృష్ణాజిల్లా, కాటూరు గ్రామములో జననం: 15 అక్టోబరు 1895. బి. ఏ. చదువుతూ 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో విద్యకు స్వస్తి, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారకసభయందిప్పుడు ఉద్యోగులు. రచనలు: భాస నాటకానువాదాలు, మరికొన్ని సాహిత్య విమర్శలు; మిగిలిన రచనలు పింగళి-కాటూరి కవులవి. చిరునామా: ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచారకసభ విజయవాడ.

## వేంకటశేషశాస్త్రి గడియారము

శివభారత కవి, అవధాని పంచానన, కవిసింహ బిరుదాంకితులు. కడప జిల్లా జమ్మలమడుగు తాలూకా నెమళ్ళదిన్నెలో జననం: 3 ఏప్రియల్ 1897. రచనలు: శివభారతము, మురారి, మల్లికామారుతము, వాస్తుజంత్రి, పుష్పబాణవిలాసము ఇత్యాది కావ్యములు. చిరునామా: ప్రొద్దుటూరు, కడపజిల్లా.

## వేంకటరాజమన్నారు పాకాల

నాటికారచయిత రాజమహేంద్రవరంలో జననం, 10 మే 1901. మదరాసు 'లా' కళాశాలలో బి. యల్. డిగ్రీ; 22 లో 'కళ' అనే పత్రికానిర్వహణ, 30 లో ఫ్రెంచిభాషలో యూనివర్సిటీ డిప్లొమా, ఇప్పుడు ప్రధానన్యాయమూర్తి; అభ్యుదయ రచయితల నాల్గవ మహాసభకు అధ్యక్షులు. రచనలు: దెయ్యాల లంక, మాతృప్రేమ, వృథాయాసం, ఏమి మగవాళ్ళు అనే నాటికలు, తప్పెవరిది అనే నాటకం, అనేక వ్యాసాలు. చిరునామా, ప్రధానన్యాయమూర్తి, మద్రాసు.

## వేంకటరమణశాస్త్రి దువ్వూరి

సంస్కృతాంధ్రభాషా పండితులు, వైయ్యాకరణులు. తూర్పుగోదావరిజిల్లా. రామచంద్రపురంతాలూకా మసకపల్లిలో జననం, 20 మే 1898. 1941 నుండి నేటి వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయ ఆంధ్ర శాఖలో పండితులుగ పనిచేస్తున్నారు. రచనలు: న్యాయదర్పణము, కలభాషిణి, సవిమర్శ వ్యాకరణము. చిరునామా: ఆంధ్ర విశ్వవిద్యాలయం, వాల్తేరు.

## వేంకటరావు నిడదవోలు

పండితులు. విశాఖజిల్లా, విజయనగరంలో జననం 10 జనవరి 1904. మదరాసు విశ్వవిద్యాలయ ఎం. ఏ. పట్టభద్రులు. మదరాసు విశ్వవిద్యాలయ ఆంధ్రశాఖాధ్యక్షులు, విద్యారత్న బిరుదాంకితులు. రచనలు: ఉదాహరణ వాఙ్మయము, తెనుగుకవుల చరిత్ర, ఆంధ్ర వచనవాఙ్మయము ఇత్యాదులు; ప్రాచీన గ్రంథసంస్కరణ సంపాదకత్వము. చిరునామా: మదరాసు విశ్వవిద్యాలయం, మదరాసు.

## వేంకటావధాని దివాకర్ల

పండితులు, పశ్చిమగోదావరిజిల్లా, భీమవరం తాలూకా, యండగండి గ్రామము జన్మస్థలం. తేది 29 జూన్ 1913. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్రభాష ప్రధాన విషయంగా బి.ఏ.ఆనర్సు డిగ్రీనిపొందారు

51 నుంచి నేటివరకు హైద్రాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆంధ్రోపన్యాసకులు. రచనలు: కొన్ని కావ్యాలు. ఆంధ్రాంగ్ల సంస్కృత నాటక విమర్శనము, వ్యాసావళి, ఆంధ్ర మహాభారత మొదటి మూడు పర్వములకును సంపూర్ణ వ్యాఖ్య. చిరునామా: ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైద్రాబాద్.

## వేంకటరమణయ్య బులుసు

పండితులు. జననం: విశాఖజిల్లా రామతీర్థంలో, తేదీ 24 డిసెంబరు 1907. విజయనగరం సంస్కృత కళాశాలలో సాహిత్యవిద్యాప్రవీణ పట్టం, కాశీ విశ్వవిద్యాలయంలో అలంకారశాస్త్ర పరిశోధన, 34నుంచి చెన్నపురి టీస్లాటుహైస్కూలులో ప్రధానాంధ్రాధ్యాపక పదవి. రచనలు: మనుచరిత్ర, ప్రౌఢవ్యాకరణం, పాండురంగ మహాత్మ్యం, విజయవిలాసం, నరసభూపాలీయ వ్యాఖ్యలు, నిర్మలానంద (నాటకం), చిత్తూరుదుర్గం(నవల), పదహారు రాత్రులు (కథలు), ఇనుపయెద్దు, పొగడదండ, కళింగదేశము, మొదలైన పరిశోధన వ్యాసాలు. చిరునామా: 33 సింగరాచారి వీథి, ట్రిప్లికేను, మద్రాసు.

## వేంకటరావు కవికొండల

కవి, కథకుడు. తూర్పుగోదావరిజిల్లా, రాజమహేంద్రవరం తాలూకా, శ్రీరంగపట్టణంలో జననం, 20 జూలై 1892. రాజమండ్రి ఆర్ట్సు కాలేజిలో బి. ఏ., 1916 లో బి. యల్., కొంతకాలం ఉపాధ్యాయ పదవి, 1916 నుండి నేటివరకు న్యాయవాదవృత్తి. రచనలు: కూలియన్నల కుటుంబము, శివరాత్రి కథ, ఆశయము, వార్త, ప్రతిధ్వనులు అనే అనేక గేయాలు, కొన్ని వందల కథానికలు. చిరునామా: రాజమండ్రి.

## శంకరశాస్త్రి భాగవతుల

కవి. 'ఆరుద్ర' అనే పేరుతో రచనలను వెలువరిస్తున్నారు. విశాఖపట్టణంలో జననం: 31 ఆగస్టు 1925. విజయనగరం కళాశాలలో విద్యాభ్యాసం. 43లో రాయల్ ఇండియన్ విమానదళంలో సాయుధ గుమాస్తా ఉద్యోగం. 48 లో ఆనందవాణి సంపాదకులు. రచనలు: 'త్వమేవాహమ్' అనే గేయ సంపుటి, మరికొన్ని గీతాలు, కొన్ని కథలూ, సాహిత్య విమర్శలు; ప్రేమలేఖలు మొదలైన చలనచిత్రాలకు మాటలు పాటలు రచించారు. చిరునామా: 10 సాబుల్లాస్ట్రీటు, మదరాసు-10

## శివశంకరశాస్త్రి తల్లావఝల

బహుభాషాపండితులు, కవి. గుంటూరు మండలం కాజగ్రామం జన్మస్థానం; జననం, 12 సెప్టెంబరు 1892. పాలి, ప్రాకృతములు, బెంగాలీ, మహారాష్ట్రి, హిందీ, సంస్కృతాది భాషలలో పాండిత్యం. సాహితీసమితి, సభాపతి కారాగారవాసం, సాహితి సచిత్రపత్రికాసంపాదకులు, ప్రతిభను ప్రతిభతో నిర్వహించిన దక్షులలో ఒకరు. రచనలు: హృదయేశ్వరి, నోణికభార్య, సహజయానపంథి, పద్మావతీ చరణచారణ చక్రవర్తి ఇత్యాది కావ్యావళి, అనేక బెంగాలీ నవలలు అనువదించారు. చిరునామా: పెదపాలెం, గుంటూరుజిల్లా.

## శివరామశాస్త్రి వేలూరి

కవి, కథకులు, శతావధాని, సంస్కృతాంధ్రాంగ్లములేకాక, బెంగాలీ, ఫ్రెంచి

మున్నగు భాషలను చక్కగా అభ్యసించి నవారు; పండితులు. కృష్ణాజిల్లా చిరివాడ గ్రామం జన్మస్థలం, జననం: 1892. ఇంజ రంలో విద్యాభ్యాసం. రచనలు: కృతక సూత్రము, ఏకావళి (ఖండకావ్యాలు), ఉపగుప్త బిడాలోపాఖ్యానము (పద్యకథ), రసగంగాధరము, ధ్వన్యాలోకము, సాహిత్యదర్పణము, మొదలైన అలంకార శాస్త్ర గ్రంథానువాదాలు, శతాధిక కథా నికలు, మహాత్మాగాంధీ జీవితము, కవి శ్వీంద్రుడివిసవలల ఆంధ్రీకరణము. చిరు నామా: చిరివాడ, కృష్ణాజిల్లా.

## శివయ్య పులుపుల

కవి. గుంటూరు జిల్లా వాస్తవ్యులు. అభ్యుదయ రచయితల ఉద్యమవ్యాప్తికి తీవ్రకృషి చేసినవారిలో ఒకరు. రచనలు: తల్లి ఒడిలోకి మొదలైన గీతాలు, భాషా సాహిత్యంపై కొన్ని వ్యాసాలు. వివరాలకు "ఆంధ్ర దర్శిని" శాసన సభ్యుల ప్రకరణము చూచునది.

## శివరామకృష్ణ బొల్లిముంత

కథానికా రచయిత. తెనాలితాలూకా చదలవాడలో జననం: 27 నవంబరు, 1920. ఉపాధ్యాయులుగా కొంతకాలం, రాజకీయజీవితం. తెలుగుప్రాణి, దేశం ఏం కావాలి అనే కథలు; మృత్యుంజయులు (నవల), బెంగాల్ కరువు బుర్రకథ. చిరునామా: జనసాహితి, తెనాలి.

## శ్రీనివాసరావు శ్రీరంగం

ఆధునికాంధ్ర కవితలో విప్లవయుగానికి నాంది ప్రస్తావనచేసిన మహాకవి. ఒక శాతాబ్దానికి, యుగానికి వైతాళికుడు. జననం, 2 జనవరి 1910. మద్రాసులో 1931 లో పట్టభద్రత. రచనలు: 'మహాప్రస్థానం' (కవితా సంపుటి), ప్రభవ, వారంవారం, ఖడ్గసృష్టి, మారుప్రోతలు, రేడియో నాటికలు, కథలు, విమర్శలు, ఇవికాక అనేకగీతాలు, చలనచిత్రాలకు పాటలు మాటలు రచించారు. చిరునామా: 10 అరుణగిరి మొదలియార్ స్ట్రీటు మండవల్లి, మద్రాసు.

## శ్రీనివాస చక్రవర్తి

రచయిత, విమర్శకుడు. కృష్ణాజిల్లా, గన్నవరం తాలూకా హనుమంతపురంలో జననం, 13 మార్చి 1911. పట్టభద్రులు. మీజాన్ పత్రికకు కొంతకాలం సహాయ సంపాదకులు, సాహితీపబ్లికేషన్సు యిపుడు నిర్వహిస్తున్నారు. రచనలు: నాట్యకళ, నటన అనే నాట్యశాస్త్రంపై గ్రంథాలు, టర్జనీవ్ గోర్కీ, చెకోవ్ రచనలకు అనువాదాలు. చిరునామా: సాహితీ పబ్లికేషన్సు, విజయవాడ.

## శ్రీకృష్ణ వేములపల్లి

కవి. గుంటూరుజిల్లా, రేపల్లెతాలూకా చేతపూడి స్వగ్రామం. జననం, 1 జూలై 1917. పట్టభద్రులు. రచనలు: తెలంగాణా, మాస్కో పొలిమేరలలో, అన్నాచెల్లెలు మొదలయిన గేయాలు. మిగిలిన వివరాలకు ఆంధ్రదర్శినిలోనిశాసనసభ్యుల జీవిత ప్రకరణము చూచునది. చిరునామా: నగారా పత్రిక, గుంటూరు.

## శేషగిరిరావు పువ్వాడ

కవి. కృష్ణాజిల్లా దివితాలూకా మొవ్వ గ్రామంలో జననం. ఉభయభాషాప్రవీణ, బి. ఓ. యల్. పరీక్షలయందు ఉత్తీర్ణుడు. రచనలు: గోవత్సవం, రాజమహాలు,

దారా (కావ్యాలు); ఆంధ్రతేజం, ఏటి వాక, జ్వాలా, నవలలు; నాటక సాహిత్య విమర్శలు; అభ్యుదయ సాహిత్యంపై వ్యాసాలు; ప్రస్తుతం మచిలీపట్నం జాతీయ కళాశాలలో పండిత పదవి. చిరునామా: భాస్కరపురం, మచిలీపట్నం.

## సత్యనారాయణ విశ్వనాధ

పండితుడు, కవి. పద్యగద్య ప్రభేదాలన్నిటిని కుడియెడమలుగ నిర్వహించగల రచయిత. కృష్ణాజిల్లా, నందమూరులో జననం, 1893; ప్రస్తుతం, విజయవాడ కళాశాలలో ఆంధ్ర భాషా శాఖకు ప్రధాన ఆచార్యులు. రచనలు: ఆంధ్రప్రశస్తి, ఆంధ్రపౌరుషము, గిరికుమారుని ప్రేమగీతాలు, ఋతుసంహారము, శ్రీమద్రామాయణ కల్పవృక్షము మొదలగు పద్యకావ్యాలు; కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెండ్లి మున్నగు ఖండకావ్యాలు; చెలియలికట్ట, వేయిపడగలు, ఏకవీర, ఇత్యాదినవలలు, నాటకాలు, నర్తనశాల, సౌప్తికప్రళయము, అనార్కలీ, వేనరాజు, త్రిశూలము, కలింగరాజ్యము, కొన్నికథలు; సాహిత్య విమర్శలు. చిరునామా: మారుతీనగరం, విజయవాడ.

## సత్యనారాయణశాస్త్రి వేదుల

సంస్కృతాంధ్ర భాషాపాండిత్యంగల చక్కనికవి. జననం, 22 మార్చి 1900. జన్మస్థలం భద్రాచలం. పట్టభద్రులు. ప్రస్తుతం పెద్దాపురం హైస్కూలులో ఆంధ్ర పండితులుగా పనిచేస్తున్నారు. రచనలు: దీపావళి, విముక్తి, మాతల్లి, ఆరాధన, ముక్తావళి (కావ్యాలు), కొన్నినాటకాలు, నవలలు, వ్యాసాలు. చిరునామా: పెద్దాపురం,తూర్పుగోదావరిజిల్లా.

## సత్యనారాయణ సుంకర

'మాభూమి' నాటకకర్తలలో వొకరు. కవి, కృష్ణాజిల్లా, విజయవాడ తాలూకా ఈడ్పుగల్లులో జననం, 1909. అలహాబాద్‌లో హిందీ విద్యాభ్యాసం. కొంతకాలం ఉపాధ్యాయవృత్తి. రచనలు: ముందడుగు, అపనింద, మాభూమి (వాసిరెడ్డి భాస్కరరావుగారితో కలసి). వీరి ప్రత్యేకరచనలు. వీరకుంకుమ, ప్రతిఫలం (నాటికాసంపుటాలు); వీరేశలింగం, కష్టజీవి, రైతువిజయం, సీతారామరాజు, రైతురక్షణయాత్ర, స్టాలిన్‌గ్రాడ్ విజయం మొదలైన బుర్రకథలు; 1930 లో ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో కారాగారవాసం. 37 లో మళ్ళీజైలు. చిరునామా: మొగల్‌రాజపురం, విజయవాడ.

## సత్యనారాయణ యండమూరి

విమర్శకులు. 'శ్రీవాత్సవ' అనేపేరున వ్యాసాలు, నాటికలు వెలువరిస్తూ వుంటారు. తూర్పుగోదావరిజిల్లా, పసలపూడి గ్రామంలో 21 మార్చి 1913 లో జననం: బి.యె.బి.ఇడి., 1939. ఆలిండియా రేడియోలో మద్రాసు కేంద్రంలో ఉద్యోగం. బంగారు పాపాయి మొదలైన పాటలను అనేకం రచించారు. చిరునామా: ఆలిండియా రేడియో, మద్రాసు.

## సంజీవదేవ్ సూర్యదేవర

ప్రాచ్య పాశ్చాత్య చిత్రలేఖన పద్ధతులను చక్కగా అవగతం చేసుకున్న కళా విమర్శకులు. జననం: గుంటూరుజిల్లా, తెనాలితాలూకా తుమ్మపూడి గ్రామంలో,

రంజిమన్న సుమారు ముప్ఫై అయిదు. సంస్కృతం, బెంగాలీ, హిందీ, ఫ్రెంచి మొదలైన భాషలతో పరిచయం. వివిధ దేశాల చిత్రలేఖనాపద్ధతులపై అనేక ఆంగ్ల వ్యాసాలను ప్రకటించారు. చిరునామా: తుమ్మపూడి, తెనాలితాలూకా.

## సీతాపతి గిడుగు

సంస్కృతాంధ్ర ఆంగ్లభాషా పండితులు, విమర్శకులు. జననం, 28 జనవరి 1885. బి. ఏ., ఎల్ టి., డాక్టరేటు డిగ్రీ పొందినవారు. 1948 నుంచి తెలుగు భాషా సమితివారి తెలుగు విజ్ఞాన సర్వస్వమునకు ప్రధాన సంగ్రహకులుగా వుంటున్నారు. రచనలు: భారతీశతకము, బాలానందము, కువలయావళినాటికకు అనువాదం, అనేక వ్యాసాలు, భాషాశాస్త్రంపై విమర్శలు. చిరునామా: 9 ఆఫీసు వెంకటాచలమొదిలి వీధి ట్రిప్లికేన్, మదరాసు-5.

## సీతారామమూర్తి తుమ్మల

తెలుగుమడికారపు సొంపురెరిగిన కవి. గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా, కావూరుగ్రామంలో జననం, 25 డిశంబరు 1901లో. ఉభయభాషాప్రవీణ, గుంటూరు జిల్లాబోర్డు పండితులు. రచనలు: ఆత్మార్పణము, రాష్ట్రగానము, ధర్మజ్యోతి, పరిగిపంట, ఆత్మకథ మున్నగు కావ్యాలనేకం. అభినవతిక్కన బిరుదాంకితులు. చిరునామా: అప్పికట్ల, బాపట్లతాలూకా.

## సుబ్బారావు రాయప్రోలు

ఆంధ్ర సారస్వతంలో భావకవిత్వపు ఉద్యమ ప్రారంభకులు. జననం: 1892. రవీంద్రుని సాన్నిధ్యంలో శాంతినికేతనంలో విద్యనభ్యసించినవారు. రచనలు: జడకుచ్చులు, తెనుగుతోట, తృణకంకణము, స్నేహలతాదేవి, స్వప్నకుమారము, కష్టకమల, ఆంధ్రావళి, లలిత, మధుకళాల, రమ్యాలోకము ఇత్యాదులు. చిరునామా : లలితకుటీరం, 44 మారేడుపల్లి, సికింద్రాబాద్.

## సుబ్బారావు నాయని

నవ్య కవులలో విశిష్టుడు. వలపు, వేదన, మాతృప్రేమ, వీరి కవితకు ఆలంబనం జననం, 1899. బి.ఏ., బి.ఇడి., కృతులు: సౌభద్రుని ప్రణయయాత్ర, ఫలశ్రుతి, మాతృగీతములు. చిరునామా: నరసారావుపేట, గుంటూరుజిల్లా.

## సుబ్బారావు నండూరి

మాపటి మాటాడి ప్రేమను షాపిరితో తెనిగించే కవి. జననం, 1895. బి. యల్. డిగ్రీ. న్యాయవాద వృత్తి, కొంతకాలం కాకినాడ కళాశాలలో అధ్యాపకులు. కృతులు : ఎంకిపాటలు. చిరునామా : ఏలూరు.

## సుబ్బారావు అనిసెట్టి

కవి. జననం 1922 గుంటూరు జిల్లా నరసారావుపేట. గుంటూరు కళాశాలలో బి. ఏ. విద్యాభ్యాసం. రచనలు : అగ్నివీణ, దివ్యగాళ్ళ పదాలు (కావ్యాలు); అనిసెట్టి కథలు, గాలిమేడలు, మాపూరు, (నాటకాలు); కొన్ని విమర్శకవ్యాసాలు, సమీక్షలు. ప్రస్తుతం చలనచిత్ర రంగంలో వీరు కృషిసల్పుతున్నారు. చిరునామా: 12/2 లేక్ వ్యూ రోడ్డు, వెస్టు మాంబళం, మదరాసు-17.

## సుబ్బారావు కొప్పరపు

బహుకాలం నుంచి ఆంధ్ర నాటక రంగంలో గణనీయమయిన కృషి సల్పిన రచయిత. వయస్సు సుమారు 50, ప్రాచీన అధునాతన నాటక రచనా పోకడలను తెలిసిన విమర్శకుడు. రచనలు: తారా శశాంకం, రోషనార, అల్లీముతా, నేటి నటుడు మున్నగునవి. చిరునామా: సత్యనారాయణపురం, విజయవాడ.

## సుబ్రహ్మణ్యశాస్త్రి శ్రీపాద

కథా రచయిత. తూర్పు గోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకా, పోలమూరులో జననం: 23 ఏప్రియలు 1891. సంస్కృతాంధ్రభాషాకోవిదుడు. 1921లో ప్రబుద్ధాంధ్ర పత్రికను స్థాపించి అనేక కథలను, విమర్శలను ప్రకటించారు. రచనలు: శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి చిన్నకథలు, ఆత్మబలి, వడ్లగింజలు, (నవలలు), రాజరాజు, శ్రీమద్రామాయణము (వ్యావహారిక వచన గ్రంథం), కొన్ని ఖండ కావ్యాలు, నాటకాలు. చిరునామా: రాజమహేంద్రవరం.

## సుబ్రహ్మణ్యశాస్త్రి పోతుకూచి

బహుభాషా పండితులు. తెనాలిలో 22 జనవరి 1920 జననం. మద్రాసు విశ్వవిద్యాలయపు ఎం.ఏ. పట్టభద్రులు. సంస్కృత, ఆంగ్ల, ఆంధ్రభాషలలో, వేదాంతశాస్త్రంలో ఎం.ఏ., జర్మన్ భాషలో డిప్లమా, ప్రస్తుతం సాగర్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరు, ఋగ్వేదంలో కవిత. రచనలు: ధ్వని, చార్వాకమత సిద్ధాంతము, సమకాలిక ఆంగ్ల నవలా సాహిత్యపోకడలు, అధునిక ఆంగ్ల నవలా సారస్వతం, [illegible] శతాధిక విమర్శలను వెలువరించారు. భరతుని నాట్య శాస్త్రమునకు వ్యాఖ్యానం రచించారు. చిరునామా: సాగర్ విశ్వవిద్యాలయం, సాగర్.



## సుబ్రహ్మణ్యం ఏల్చూరి

'నయాగరా' కవులలో నొకరు. 1920లో జననం, గుంటూరుజిల్లా నరసారావుపేట. ప్రజాశక్తి, అభ్యుదయ, ఆంధ్రపత్రికలలో అనేక కథలు, గేయాలు వ్యాసాలు ప్రకటించారు. పత్రికారచయిత. ప్రస్తుతం 'నేత' పత్రికా సహాయసంపాదకులు. చిరునామా: 'నేత' హైద్రాబాద్ (దక్కను).

## సూర్యనారాయణశాస్త్రి మల్లాది

సంస్కృత భాషా పండితులు. జననం, 20 ఫిబ్రవరి 1880. చినకడియపులంక జన్మస్థలం. ఉభయ భాషా విశారదులు. 1931-41 ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంధ్రభాషా పండితులు. రచనలు: ఆంధ్ర భాషానుశాసనము, సంస్కృత వాఙ్మయ చరిత్ర, ఆంధ్రదశ రూపకము. ఉత్తరరామ చరిత్ర (ఆంధ్రకృతి), మహాభారత విమర్శనము ఇత్యాదులు; సంస్కృత రచనలు: బ్రహ్మసూత్రార్థదీపిక, సంస్కృతభాష మున్నగునవి.

## సూర్యారావు అవసరాల

కథకుడు, కవి. జననం 1923. తూర్పు గోదావరిజిల్లా కాకినాడ తాలూకా పండూరు జన్మస్థానం. బి.ఏ. పట్టభద్రులు. కడలూరులో ఏడాదికి పైగా కారాగారవాసం, ప్రస్తుతం విశాలాంధ్ర దినపత్రికా సంపాదకవర్గ సభ్యులు. రచనలు: ఆకాశదీపాలు (కథల సంపుటి), మహాకవి గురజాడ డైరీలు, లేఖలు ఎడి

టింగ్. చిరునామా: విశాలాంధ్ర, బకింగ్‌హాంపేట, విజయవాడ.

## సూర్యారావు బొమ్మిరెడ్డిపల్లి

కథకుడు. విజయనగరంలో జననం, 20 మార్చి 1923. సాగర్ విశ్వవిద్యాలయంలో యల్. యల్ బి. 49_50 లో నెహ్రూ అభినందన గ్రంథ ప్రచురణ సహాయ సంపాదకులు. ప్రస్తుతం టాప్ వార్తా సంస్థ సంపాదకవర్గ సభ్యులు. చిరునామా: టాప్ న్యూస్ ఏజన్సీ, న్యూఢిల్లీ.

## సూరి తెన్నేటి

కథకులు, కవి. కృష్ణాజిల్లా మచిలీపట్నం కళాశాలలో విద్యాభ్యాసం, పట్టభద్రులు. ప్రస్తుతం ఆంధ్ర పత్రికా సంపాదకులలో వొకరు. రచనలు: విప్లవరేఖలు, సుబ్బలక్ష్మి కథలు, జంగిస్‌ఖాన్ (నవల), నారాణి (నాటకం). చిరునామా: ఆంధ్ర పత్రిక, 7 తంబుచెట్టివీధి, మద్రాసు.

## సోమశేఖరశర్మ మల్లంపల్లి

సుప్రసిద్ధ చరిత్ర పరిశీలకులు. జన్మస్థానం మినుమించిలిపాడు అగ్రహారంలో జననం 1891. నిరంతర పరిశోధన, జిజ్ఞాస శ్రీ శర్మగారి కలవాటు. తరువాత కే. శే. లక్ష్మణరావుగారి సంపాదకత్వమున వెలువడిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం రచనాబాధ్యత. 40_46 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చారిత్రిక పరిశోధక పండితపదవి, ప్రస్తుతం తెలుగు భాషా సమితివారి తెలుగు విజ్ఞాన సర్వస్వమునకు ప్రధాన సంగ్రాహకులుగా వున్నారు. రచనలు: ఆంధ్ర వీరులు, అమరావతి స్తూపము, చారిత్రిక వ్యాసములు, ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము రోహిణీ చంద్రగుప్తము (నవల); ఆంగ్ల గ్రంథములు: ఫర్గాటెన్ చాప్టర్ ఆఫ్ ఆంధ్రా కంట్రీ, ది హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్డమ్స్, అనేక చారిత్రిక వ్యాసములు. చిరునామా: 53 శవరణ పెరుమాళ్ళవీధి, పరశువాకం, మద్రాసు_7

## సోమయాజులు చాగంటి

కథకులు. జననం, శ్రీకాకుళం, తేదీ 30 జనవరి 1915. విజయనగరం కళాశాలలో బి. ఏ. వరకు విద్యాభ్యాసం. రచనలు: చిన్నాజీ (కథలసంపుటి), అన్నం పరబ్రహ్మం, రథయాత్ర, ఎంపు మొదలైన అనేక కథలు, కొన్ని గీతాలు, సాహిత్య విమర్శలు. చిరునామా: కస్పా, విజయనగరం.

## సోమసుందర్ ఆవంత్స

కవి. పెద్దాపురం తాలూకా శంఖవరం గ్రామం జన్మస్థానం, జననం, 1924. 1933_45 పిఠాపురం హైస్కూలులోను, కాకినాడ కళాశాలలోను, విద్యాభ్యాసం. కళాకేళి గ్రంథమాలా స్థాపకులలో వొకరు. కృతులు: వజ్రాయుధం, గోదావరి జలప్రళయం, కాహళి (కావ్యాలు); బానిసల కథలు (కథాసంపుటి); పద వాఙ్మయంపై కొన్ని సాహిత్యవ్యాసాలు. చిరునామా: కళాకేళి, పిఠాపురం.

## సోమయాజులు వావిలాల

కవి. గుంటూరుజిల్లా [illegible] జననం, 18 జనవరి 1918. బి. ఏ. గుంటూరు ఆంధ్ర క్రైస్తవకళాశాలలో ఆంధ్రోపాధ్యాయుడు. రచనలు: భారత జయఘంటా, [illegible] కథలు [illegible]

గేయాలు. చిరునామా : ఎ. సి. కాలేజీ, గుంటూరు.

## హనుమచ్ఛాస్త్రి ఇంద్రకంటి

కవి, విమర్శకుడు. విశాఖజిల్లా వీరవల్లి తాలూకా మాడుగులలో జననం, 23 ఆగస్టు 1911. ఉభయభాషాప్రవీణ. 1934 నుంచీ నేటివరకు రామచంద్రపురం సేవనర్ హైస్కూలులో సంస్కృతాంధ్ర పండితులు. ఆధునిక కవితను సమర్థిస్తూ అనేక వ్యాసాలు రచించారు. రచనలు: వ్యాసావళి (విమర్శలు); పాటల మంజరి (భావగీతాలు); హనుమచ్ఛాస్త్రి కథలు, విజయదశమి (కథా సంపుటాలు). చిరునామా : రామచంద్రపురం, తూర్పుగోదావరిజిల్లా.

## హనుమంతరావు ధవికొండ

కథకులు. జననం 4 మార్చి 1919. ఏలూరు, మచిలీపట్నంలో బి. ఏ. వరకు విద్యాభ్యాసం. 1949 _ 52 అభిసారిక పత్రికా సంపాదకులు. రచనలు : ఇల వేల్పు, లోకచరిత్ర, జ్ఞాని, గర్వభంగం ఇత్యాదులు. ప్రస్తుతం వీరు చందమామ ప్రచురణశాఖలో ఉద్యోగి. చిరునామా : చందమామ పబ్లికేషన్సు, 283, ఆర్కాటు రోడ్డు, వాడపలాని, మద్రాసు_26.

## హనుమంతరావు పిల్లలమర్రి

విమర్శకులు. గుంటూరుజిల్లా బాపట్ల తాలూకా బ్రాహ్మణకోడూరులో జననం, 31 డిశంబరు 1918. బి. ఏ. పట్టభద్రులు, తెలుగు ఎం. ఏ., ప్రస్తుతం గుంటూరు హిందూకళాశాలలో ఆంధ్రోపన్యాసకులు. రచనలు : సాహిత్యసమీక్ష, రాగరేఖలు (గేయాలు), నవ్యాంధ్ర సాహిత్య వీధులు (ద్వితీయముద్రణ); రచయితలలో వొకరు. చిరునామా : శారదాపీఠం, 79/3 పట్టాభిపురం, గుంటూరు_2

# ఆంధ్రనాటకకళా పరిణామం

శ్రీ శ్రీనివాస చక్రవర్తి బి. ఏ.

మానవుడు బాల్యదశలో తనచుట్టూ ఉన్న పెద్దలచేష్టలు, వేషభాషాదులు చూచి, నేర్చుకుంటున్నాడు. కాని ఆ చేష్టలు, వేషభాషాదులు అతనికి సహజంగా అలవడినట్టే కనిపించుతుందిగాని అనుకరిస్తున్నట్టు అనిపించదు. సామాన్యంగా ఒకరిచేష్టాదులను ఇంకొకరు అనుకరిస్తే వెక్కిరించినట్లుంటుంది. మనిషిమనిషికీ చేష్టలలో స్వరంలో విస్పష్టమైన భేదం గోచరిస్తుంది. అంటే మానవుడు తాను చూచిన చేష్టాదుల రీతినిగాక వాటి ప్రక్రియను మాత్రమే నేర్చుకుని తన స్వంతం చేసుకుని ప్రత్యేక మానవుడుగా జీవిస్తున్నాడన్నమాట. దీనినిబట్టి లోకవృత్తమునుచూచి నేర్చుకుని దానిని తనదిగా చేసుకునే శక్తి మానవుడికి స్వభావసిద్ధంగా ఉన్నదని తేలుతోంది.

పిల్లలు పదిమందిచేరి రకరకాల ఆటలు ఆడుకుంటారు. ఒకతె పెండ్లికూతురు, ఒకడు పెండ్లికొడుకు. అలాగే ఒక అమ్మాయితల్లి, తక్కినవారుఆమెసంతానం. ఈ విధంగా వారు ఆడుకుంటూ కాలక్షేపం చేస్తారు. వారు ఆడుకుంటూండగా చూస్తే వారు తమతమ పాత్రలను అతిసహజంగా నటిస్తున్నట్టనిపిస్తుంది. ఆ ఆటలలో వారు పూర్తిగా నిమగ్నులై పోతారు. ఆట మధ్యలో [illegible] ఇతర ప్రసక్తి తెస్తే 'నేనిపుడు అమ్మనే' అంటూ మాతృత్వం ఒలికించే పిల్లలను కూడా ప్రత్యక్షంగా మనం చూస్తున్నాం. ఆ సమయంలో వారు 'తల్లులు'గానే జీవిస్తున్నారు.

అయితే ఈ బాలబాలికలెవరూ భరతముని నాట్యశాస్త్రం చదివినవారు కారు. అయినా సహజంగా నటిస్తూ మానవ జీవితపు వెలుగునీడలను వ్యక్తీకరిస్తున్నారు. ఇందువల్ల మానవుడికి ఇతర మానవులుగా నటించాలనే అభిలాష, ఇతర మానవుడుగా జీవించగల శక్తి ఉందని బోధపడుతుంది. ఈ పిల్లల ఆటలను ప్రాతిపదికగా చేసుకుని ప్రపూర్ణత చేకూర్చి, తీర్చిదిద్ది, రమణీయం చేయడంలో ఆవిర్భవించినదే రూపక ప్రపంచం.

చిరుగాలికి కదలాడే చెట్లకొమ్మల కదలికలో, పురివిప్పి ఆడే నెమలిఆటలో, ఘంగు ఘంగున గంతులువేసే లేగదూడ గంతులలో ఒక లయ కనిపిస్తుంది. "ఆమె ఎంత వయ్యారంగా నడుస్తోందిరా", "వాడు కోపంతో చిందులు తొక్కుతున్నాడు", "అతను సంతోషంలో గంతులు వేస్తున్నాడు" అంటున్నాం. ఈ వయ్యారం, ఈ చిందు, ఈ గంతులలో కూడా నాట్యంగా పరిశీలిస్తే ఒక లయ పొడగట్టుతుంది.

మానవశరీర కదలికలలోనే ఒక ఆకర్షణ, రమణీయతా ఉంది. ఆవేశపూరితుడైన మానవునికి ఈ 'వయ్యారం, ఈ చిందు, ఈగంతు' ప్రకృతిసిద్ధములైనవి. స్వభావసిద్ధములైన ఈ చేష్టలకు, కదలికలకు ప్రపూర్ణత చేకూర్చి తీర్చి దిద్ది రమణీయం చేయగా ఆవిర్భవించినదే నాట్యకళ. మానవుల ఈ చేష్టాదికములను పరిశీలించి క్రోడీకరించి దానికి కళారూపమిచ్చిన ప్రప్రథమశాస్త్రవేత్త భరతముని. అందుచేతనే ఈ కళకు భరతనాట్యమని పేరు వచ్చింది. భావ, రాగ, తాళ సంయుతమైంది కాబట్టి దీనికి భరతమని పేరు వచ్చిందని కొందరి మతం.

## కురవంజి

మానవునిలోగల ఈ నాట్యకళాతృష్ణ, ఈ రూపక ప్రదర్శనాభిలాష వివిధకాలములలో, వివిధ దేశములలో వివిధరూపములు తాల్చింది. తెలుగుదేశంలో తొలి నాట్యకళారూపం కురవంజి. కురవలనే అటవికజాతివారి అడుగు అని ఈకురవంజి పదానికి అర్థం. ఈ కురవలు దక్షిణ భారతదేశంలోగల తిరుపతి, శ్రీశైలంవంటి పవిత్ర క్షేత్రాలలో యాత్రికుల వినోదార్థం నృత్యం చేస్తుండేవారు. మొదట ఈ నృత్యానికే కురవంజి అని పేరు వచ్చింది. క్రమక్రమంగా వారు ఆయా క్షేత్రాల మహాత్మ్యములను వర్ణించి చెబుతూ వచ్చారు. ప్రథమంలో ఒకరే నృత్యంచేస్తూ కథ చెప్పేవారని తోస్తుంది. ఆ తరువాత సింగి, సింగడు అనే పాత్రలు, సంస్కృత నాటకాలలోని నటీ సూత్రధారులవంటివి ప్రవేశించి పాత్రలుగా వ్యవహరించసాగాయి. ఆ పైన కథాసంధి చెప్పడానికి విదూషకుడు లాంటి కోణంగి అనే పాత్ర సృష్టించబడింది. ఈ పాత్రనే జోడి అనే వారు కూడా. ఈ మూడు పాత్రలతోనే కథంతా నడిచిపోయేదికాని ఒక్కొక్క పాత్రను ఒక్కొక్కరు నిర్వహించడమనే సంప్రదాయం కురవంజిలో ఉన్నట్లు లేదు. కొంతకాలం తర్వాత ఎరుకలసాని లేక కురవంజి అనే పాత్ర ఈ కురవంజిలో ప్రవేశించినట్లు కనిపిస్తుంది. ఈ కురవంజులు తెలుగుభాషలోనేగాక ద్రవిడభాషలన్నిటిలోనూ ఉన్నవి. జ్ఞాన కురవంజి, జీవకురవంజి, సత్యభామా కురవంజి తెలుగులో ప్రసిద్ధములైనవి. ఈ కురవంజి ఇప్పుడు ఆంధ్ర జిల్లలలోనామావశిష్టములైనా, తంజావూరు ప్రాంతంలో తెలుగువారు విరివిగా వీటిని ఆడుకున్నారు.

## యక్షగానం

కురవంజులను తిలకించిన నాగరికులకు తాముా కురవంజిలాంటివి రచించాలనీ, ఆడాలని ఉత్కంఠ కలిగింది. ఈ ప్రదర్శనములను మొదట చేపట్టినవారు జక్కులు. యక్షశబ్దభవమే జక్కుశబ్దం. జక్కులవారిచే పాడబడే ఒకవిధమైన ప్రదర్శనానికే 'యక్షగానం' అనిపేరు వచ్చింది. ఈయక్షగానం ఆంధ్రులసొత్తు. ఈ పదం సంస్కృతపదమైనా సంస్కృత వాఙ్మయంలోగానీ, ఇతరదేశభాషలలోగానీ కనిపించదు. సంగీతసుధ అనే గ్రంథంలో మాత్రం ఇదొక సంగీత విశేషంగా వర్ణించబడింది. బహుశా ఇది జక్కులవారిచే పాడబడే దేశిసంగీతానికి పేరై ఉండవచ్చు.

ఈ యక్షగానం ఎప్పుడుపుట్టిందో నిర్ధారణగా తెలియదు. మొదట ఒక జక్కుల పురంధ్రి నాట్యానికి తగినవేషం

ధరించి, తెరలోపలనించి వెల్వడి వివిధ వాయిద్యాల సహాయంతో పాడుతూ, పాటకు తగినట్టుగా అభినయిస్తూ కథ వినిపించేదని తెలుస్తోంది. అంతేగాని ఒక్కొక్క పాత్రను ఒక్కొక్కరు ధరించడమనే ఆచారం యక్షగాన దశలో రాలేదు. ప్రదర్శనారంభంలో భగవత్ప్రార్థన జరిగేది. తర్వాత గణపతి ప్రార్థన, పూర్వకవి స్తవం, కృతిభర్తవర్ణన, షష్ఠ్యంతాలు, ఆతర్వాత యక్షగానం పేరుచెప్పి కథా ప్రవేశం సూత్రధారుడు చెప్పేవాడు. కథాసంధులను సూత్రధారుడు తెల్పుతూంటే నటి గేయాలను అందుకుని పాడుతూ అభినయించేది.

ఈ యక్షగానాలలో ఎక్కువగా త్రిపుటలు, అర్ధచంద్రికలు, జంపెలు, ద్విపద, కందం మొదలైన దేశిఛందస్సులే వాడబడ్డాయి. ఇప్పటివరకు మనకు లభ్యమవుతున్న యక్షగానాలలో అతిప్రాచీనమైనది గరుడాచలం. దీనిరచయిత ఓబయమంత్రి. ఈ ఓబయమంత్రిని గురించి మనకేమీ తెలియడంలేదు. తర్వాత చెప్పుకో తగ్గది కందుకూరి రుద్రకవి సుగ్రీవవిజయం. ఈ రెండు యక్షగానాలూ ఉత్తమమైనవిగా పరిగణించబడుతున్నవి. సుగ్రీవ విజయం రచించిన రుద్రకవే కృష్ణదేవ రాయల కాలంనాటి రుద్రకవి అని పండితుల అభిప్రాయం. కృష్ణదేవరాయల కాలం ప్రబంధయుగమైనా యక్షగానాల మీద ఆదరణ తగ్గలేదు. రాయలవారి నాట్యశాలలో యక్షగానాలు ప్రదర్శింపబడేవని చారిత్రకాధారాలున్నాయి. రాయలవారికుమార్తె 'మరీచీపరిణయం' యక్షగానం రాసిందట. రాయల నాట్యశాలలో 'తాయికొండ' నాటకం ఆడబడేదనీ, ఆనాడు నాగయ్య అనే నటుడు ప్రసిద్ధికెక్కినవాడనీ శాసనాలవల్ల తెలుస్తోంది.

తంజావూరి రాజులకాలంలో యక్షగానాలకి వసంతఋతువు. రఘునాథరాయలు విజయరాఘవరాయల కాలంలో అనేక యక్షగానాలు రచించబడ్డాయి. ఇందులో విశిష్టమైనవి అపూర్వమైనవి రెండు. అంతవరకు యక్షగానాలు పురాణగాథలు ఆధారంగా రచింపబడేవి. విజయరాఘవరాయలు తన తండ్రి రఘునాథ రాయలనే నాయకునిగాచేసి 'రఘునాథాభ్యుదయం' అనే యక్షగానం రాశాడు. విజయరాఘవరాయల ప్రియురాలు రంగాజమ్మ తనప్రియుడైన విజయరాఘవరాయలనే నాయకుడుగాచేసి 'మన్నారుదాసవిలాస' మనే యక్షగానం రచించింది. ఇందులో అయిదు భాషలను ప్రవేశపెట్టింది. ఈ మన్నారుదాసవిలాసం ఆంధ్రసాహిత్యంలో ఒకరత్నం. ఈ యక్షగాన ప్రభావం చివరికి త్యాగయ్యగారిమీద, నారాయణ తీర్థులవారిమీదకూడా పడింది. త్యాగయ్యగారు ప్రహ్లాదచరిత్ర, నౌకాభంగం యక్షగానాలు రచించారు. నారాయణతీర్థులవారు పారిజాతాపహరణం రాశారు. రామదాసు చరిత్రకూడా ఈ కోవలోదే. ఇటు రాజాదరణ, ప్రజాదరణ పొందిన యక్షగానాలను లాక్షణికులుకూడా సాహిత్య శాఖగా అంగీకరించకతప్పిందికాదు. అప్పకవి దీనికి లక్షణంచెప్పడమే గాక అంబికావాదమనే యక్షగానం రచించాడట. పైన పేర్కొన్నవిగాక కిరాతార్జునీయం, గంగాగౌరీ విలాసం, ఎరుకలకేవకథ, కపోత వాక్యం, త్రిపురసంహారం, దాయదమ్రీడ,

పార్వతీపరిణయం, మృత్యుంజయ విలాసం, సౌభరిచరిత, శివపారిజాతం ముఖ్యములైన యక్షగానాలు.

### వీ ధి నా ట కం

ఒకేవటి నృత్యంచేస్తూ అభినయిస్తూ కథను వినిపించే దశనించి వివిధ పాత్రలను వివిధ వ్యక్తులు ధరించే పరిణామదశకు చెందిన యక్షగానాలనే వీ ధి నా ట కా లంటున్నాం. 13 వ శతాబ్దినాటికే ఈ వీధినాటక సంప్రదాయం బహుళ ప్రచారంలో ఉన్నట్టు పండితారాధ్య చరిత్ర నించి తెలుస్తోంది. ఈ మార్పు ఎప్పుడు వచ్చిందో చెప్పలేంగాని, ఈ రెండు సంప్రదాయాలూ చాలాకాలంవరకు ఒకదాని సరసన ఒకటి నడుస్తూనే వచ్చాయి.

ప్రదర్శన విధానంలోనేగాక రచనలో కూడా మార్పు జరిగింది. శుద్ధయక్షగానాలలో వాడబడిన త్రిపుట, జంపె మున్నగు వాటిబదులు కీర్తనలు, పాటలు, దరువులు వచ్చాయి. సూత్రధారుడు లేక హాంగు దారుడికి ప్రాధాన్యత హెచ్చింది. ప్రతి పాత్రా తన ఊరుపేరులను తెలుపుకుంటూ ప్రవేశించడం పరిపాటిఅయింది. పాత్రల సంఖ్య, కథా బాహుళ్యం హెచ్చింది. సుమారు 14 వ శతాబ్దివరకు యక్షగానాలు, వీధినాటకాలు ఎక్కువగా జక్కులవారు, గొల్లలు, యానాదులు ప్రదర్శిస్తుండేవారు. వారి నృత్యం, అభినయమూ దేశీ మయమైంది. రచనలోకూడా క్రమక్రమంగా గ్రామ్యభాష, పామరభావ చివరకి అసభ్యతకుకూడా తావిచ్చే పరిస్థితి ఏర్పడింది. అందుచేతనే శాస్త్రీయంగా ప్రదర్శించాలనే ఉద్దేశంతో సిద్ధేంద్రయోగి భామాకలాపం అనే పారిజాతహరణ నాటకం రాసి కూచిపూడి బ్రాహ్మణులకు నేర్పి ప్రదర్శింపజేశాడు. నాటినించే కూచిపూడి బ్రాహ్మణులకు కూచిపూడి భాగోతులని పేరు వచ్చింది. ఈ సిద్ధేంద్రయోగి ఏకాలపువాడో నిర్ధారణగా తెలియదు. ఇతనిచుట్టు అనేక కథలు అల్లబడ్డాయి. కాని 1506-09 వరకు విజయనగరం పాలించిన వీరనరసింహదేవరాయలవారి సమక్షంలో కూచిపూడి వారు నాటకాలాడారని మెకంజీ దొర సేకరించిన మాచుపల్లి కైఫీయతువల్ల తెలుస్తున్నది. అందువల్ల సిద్ధేంద్రయోగి 1500 లకి పూర్వపువాడనిమాత్రం నిర్ధారణ చేసుకోవచ్చు. ఈ కైఫీయతువల్ల నాట్యకళ ప్రజాశ్రేయస్సుకుఎలాతోడ్పడగలదో విశదమవుతుంది. కూచిపూడివారు దేశాటన చేస్తుండగా సంబెట గురవరాజు అనే పాలెకాపు ప్రజలపై చేస్తున్న దౌర్జన్యాలను కళ్ళారాచూచి ఆ దౌర్జన్యాలనే నాటకంగా వీరనరసింహదేవరాయలవారి ముందు ఆడారట. రాయలవారు సంగతి సందర్భములు తెలుసుకొని గురవరాజు తల తీయించినట్లు ఆ కైఫీయతులో వ్రాసి ఉంది.

ఒకటి రెండు శతాబ్దులక్రితంవరకు భామాకలాపమే ఎక్కువ వ్యాప్తిలో ఉండేది. తర్వాత ప్రహ్లాదనాటకం కూచిపూడివారు ఆడదం ప్రారంభించారు. ఆతర్వాత క్రమక్రమంగా ఉషాపరిణయం, హరిశ్చంద్ర మొదలైనవి ఆడ సాగారు. ఇటీవల వేదాంతం రామకృష్ణయ్య స్టేజీ తెరనుకట్టి స్టేజీ సంప్రదాయాలను ప్రవేశపెట్టాడు.

విజయనగర సామ్రాజ్య పతనానంతరం తంజావూరు వీధినాటకాలకి ప్రసిద్ధి కెక్కినది. తంజావూరులో ప్రభుత్వ నాటక

కాలలుండేవి. ఇప్పుడు సరస్వతీ మహల్ లైబ్రరీలో 40 దాకా వీధినాటకాలు లభ్యమవుతున్నాయి. వీటిలో భాష మరీ గ్రామ్యం. శృంగారంకూడా కొంచెం అసభ్యంగానే ఉంటుంది. ఈ నాటకాలలో ఎక్కువ వాటిని రచించింది శాషి రాజు.

కూచిపూడి వారి సంప్రదాయానికి ఈ శతాబ్దిలో ఆచార్యత్వం వహించింది ముగ్గురు - వెంపటి వెంకటనారాయణ, చింతా వెంకట్రామయ్య, వేదాంతం లక్ష్మీనారాయణ. ఇప్పుడు నాటకాలు చేసేవారంతా వీరి శిష్యపరంపరలోనివారే.

ఇటీవల వీధినాటకాలలో కొత్త యుగం ప్రారంభమైంది. ఇంతవరకు మనకు వచ్చిన వీధినాటకాలన్నీ పురాణగాథలతో నిండినవే. నేడు ఈ వీధినాటకాన్ని ఆయుధంగా చేసుకొని ప్రజాసమస్యల్ని, ప్రజాపోరాటాలను చిత్రిస్తున్నారు. సిమ్లా భాగవతం, హిట్లరు పరాభవం, పంచాయతీ ఎలక్షను, రాజధాని రగడ మొదలయినవి ఈ కోవలోనివే.

## ఈ రంగంలో పేరుపొందిన కొందరు ప్రముఖులు

ఉమామహేశ్వరరావు కొండాలి, ఉమామహేశ్వరరావు పట్టంశెట్టి, గోపాలకృష్ణయ్య కోగంటి, నాజరు షేక్, పున్నయ్య కోమారి, రాజారావు జి.

## నృత్యకళ

చతుర్విధాభినయాలలో ఒకటైన వాచికాన్ని అణచివేసి ఆంగికాభినయానికి పట్టం కట్టాలని ఆసేతుహిమాచలం పెద్ద ఉద్యమం బయలుదేరింది. ఆ ఉద్యమ ఫలితాలే మణిపూరు నృత్యం, కథాకళి. కాని ఆ ఉద్యమానికి లొంగకుండా ఎదిరించి నిలిచింది ఆంధ్రులు-ముఖ్యంగా కూచిపూడివారు. అందుచేతనే ఆనాటినించీ కూడా నాగరికులలో మయూరనృత్యం, శివతాండవంలాంటి వాచికంలేని నృత్యాలకు ప్రత్యేక స్థానం లేకపోయింది. అది నాటక సందర్భంలో ఆయా చోట్ల ప్రదర్శించడమేగాని ప్రత్యేకంగా ప్రదర్శించే సంప్రదాయం మనకి లేదు. కూచిపూడివారేమి, కళావంతులేమి యీ పద్ధతినే మొన్న మొన్నటివరకూ అనుసరిస్తూ వచ్చారు. నాటకాలాడడం, పదాలను అభినయించడం మన సంప్రదాయమని తోస్తోంది.

కథాకళి, మణిపూరు సంప్రదాయాల ప్రభావం మనమీద పడడం, సినీమాలో ఈ రెండు సంప్రదాయలకు ఎక్కువ వ్యాప్తి కావడం మూలంగా మన ఆంధ్రులు కూడా కథాకళి, మణిపూరు నృత్యాలను నేర్చుకుంటున్నారు. 50 సం|| క్రితం కూచిపూడివారు, కళావంతులు తప్ప సంసారులు పురుషులైనా, స్త్రీలైనా నాట్యం నేర్చుకోవడం గౌరవప్రదం కాదని తలచేవారు. అటువంటిదిప్పుడు అన్ని వర్గాలవారు తమ బాలబాలికలకు నాట్యం నేర్పించి ఈ కళను గౌరవిస్తున్నారు. ఈ సందర్భంలో [illegible]దంజ చేసిన వి. వి. నరసింహారావు విద్యావంతుడు. చిన్నతనంనించీ నాట్యం అభ్యసించి దానికి మనదేశంలో గౌరవస్థానం కలిగించడానికి పాటుబడిన యువకుడు. భరతం చక్కగా అభ్యసించి పదాభినయంలో కొత్త తోవ తొక్కాడు. అప్పటివరకు క్షేత్రయ్య మొదలైనవారి జావళీలనే . అభినయిస్తుండేవారు

నరసింహారావు ఎంకిపాటలు మొదలైన నవ్యకవుల భావగీతికలను కూడా అభినయించి చూపుతూ భరతనాట్యమంటే ప్రజలలో ముఖ్యంగా యువకులలో ఉత్సుకత, ఆదరణ కలిగేట్టుచేశారు. ప్రస్తుతము భరత నాట్యకళను బహుళవ్యాప్తిలోకి తీసుకురావడానికి అపార కృషి సలుపుతున్న వ్యక్తి నటరాజ రామకృష్ణ. ఈయన భరత విద్యా దురంధరుడు. ప్రతికలలో వ్యాసాల ద్వారా, ఉపన్యాసాల ద్వారా అనేకమందికి శిక్షణ గరపడం ద్వారా, ప్రదర్శనాల ద్వారా భరత నాట్యానికి పూర్వపుటౌన్నత్యం తీసుకురావడానికి పాటుబడుతు తున్నారు.

### ఈ రంగంలో ప్రస్తుతం కృషి చేస్తున్న కొందరు ప్రముఖులు

కుటుంబశాస్త్రి భాగవతుల, కృష్ణమూర్తి పసుమర్తి, తాండవకృష్ణఅయ్యంకి, నరసింహారావు పి. వి, నారాయణస్వామి వి.వి., పార్వతీశం వేదాంతం, రామకృష్ణ నటరాజ, రాఘవయ్య వేదాంతం, రాఘవయ్య పిద్దాబత్తుని, సత్యనారాయణ సువానం, సత్యనారాయణ మహంకాళి, సత్యం వెంపటి, సుబ్రహ్మణ్య శాస్త్రి పోతుకూచి, సూర్యనారాయణ శాస్త్రి లంక.

### బుర్రకథ

యక్షగాన మహా ప్రవాహంలో నీలి ప్రత్యేక శాఖగా ఏర్పడిన ప్రదర్శనా విశేషమే బుర్రకథ. కథకుడు వాయించే తంబురా బుర్రనుబట్టి ఈ పేరు వచ్చింది. ఈ బుర్రకథనే తందానపాట అని కూడా అంటారు. ఇది శుద్ధ యక్షగానం. యక్షగానంలో ఒక స్త్రీ కథ చెప్పటం పరిపాటి. బుర్రకథలో సామాన్యంగా కథ చెప్పేది పురుషుడు. ఇతడు తంబురా గాని సితారగాని పుచ్చుకుని కథ చెబుతుంటే ఇరుపక్కల ఇద్దరు స్త్రీలు గుమ్మెటాలు వాయించుతూ వంతపాడుతూ హాస్యం చెబుతారు. అందుకనే ఈ కథకులు సాధారణంగా ఇద్దరు స్త్రీలను వివాహమాడడం కద్దు. దీనిని వృత్తిగా స్వీకరించి వ్యాప్తిలోకి తెచ్చింది జంగాలు. వీరు ఊరూరా తిరుగుతూ ప్రదర్శనాలిచ్చేవారు.

యక్షగానం నుండి బుర్రకథలు ఎపుడు పుట్టాయో చెప్పలేము కాని, శ్రీనాథుని కాలానికే ఇది బాగా ప్రచారంలో ఉన్నాయని క్రీడాభిరామంవల్ల తెలుస్తోంది. మొన్న మొన్నటివరకు ఈ కథలన్నీ మంజరీ ద్విపదలో రచించబడ్డాయి. ద్విపదను 'ముదిలంజ' అని కొందరు తిట్టినా లెక్కచేయక శ్రీనాథుడంతటివాడు సైతం వీటికిగల ప్రజాదరణనుగమనించి, పల్నాటి వీరచరితం ద్విపదలో బుర్రకథగా వ్రాశాడు. ఇపుడు మనకు లభ్యమవుతున్న బుర్రకథలలో ప్రాచీనమయినదీ ఉత్తమమైనదీ పల్నాటి చరిత్ర అని తోస్తోంది.

బుర్రకథ దేశసాహితీశాఖకు చెందినది. చక్కటి జాను తెనుగులో రచితమై ప్రేక్షకులను తొందరగా ఆకర్షించి రసానుభూతి కలిగించడంలో ప్రముఖ స్థానంఅందుకుంది. వీటిలో ఎక్కువ ప్రాధాన్యం వహించేది వీరకరుణా రసములు. నేర్పరి అయిన కథకుడు కథ చెబుతూంటే ప్రేక్షకులను ఉద్రూతి ఊగిస్తుంది. 'అపుడేమన్నా

దయాశాంద్రపాపారాయుడూ' అంటూ కథకుడు చిందు తొక్కుతూంటే ప్రేక్షకులు పరవశులై వీరవిక్రమం సెరపుతారా అనిపిస్తుంది. కరుణ, వీరరసాలలో మార్గకవులెవరికీ అందని భావోన్నత్యం బుర్రకథలలో కనిపిస్తుంది. కామమ్మ తన భర్త చితిని కౌగలించుకుని 'ఎంత చల్లగ ఉన్నది నీ జాజివనము మారయ్యా' అనే భావం ఎంత కవితా తపనుచేస్తే అందుతుంది? ఈ విధంగా ద్విపదలో రచితమై ఎక్కువ ప్రజాభిమానంచూరగొన్న బుర్రకథలు పల్నాటి చరిత్ర, బొబ్బిలికథ, అరుగురు మరాటీల కథ, బాలనాగమ్మ కథ, భారత రామాయణ కథలు, కామమ్మ కథ మొదలైనవి. ఈ ద్విపద కథలను చెప్పడంలో ఈ అర్థశతాబ్దిలో పెద్దపేరు పొందింది కంటపాళ్ళ గుడ్డిజంగం.

ధేనువకొండ వెంకయ్యా మాత్యుడు రచించిన ఉత్తర గోగ్రహణంతో బుర్రకథ ఇంకోదశ అందుకుంది. ఇందులో ద్విపదలే గాక కీర్తనలు, దరువులు, కందార్థాలు మొదలైనవి వాడదంగమనించ తగ్గది. ఈ రకం బుర్రకథలను చెప్పడంలో యావదాంధ్ర విఖ్యాతిగాంచింది దొడ్డవరపు వెంకటస్వామి. నిండైన విగ్రహం, పెద్ద జరీ అంచు తలపాగా, నవరసములను ఆవిష్కరించే ముఖం. ఉత్తర గోగ్రహణ చెబుతూంటే ప్రేక్షకులు తన్మయులయేవారు.

గత 10,15 సంవత్సరాలవరకు బుర్రకథలన్నీ పురాణ సంబంధమైనవి, వీరుల సంబంధమైనవి. ప్రజాసమస్యల్ని పోరాటాల్ని తీసుకుని వాటిని బుర్రకథగా రచించిన ప్రప్రథమకవి సుంకర సత్యనారాయణ, వీరి కష్టజీవి, అల్లూరి సీతారామరాజు, వీరేశలింగం, మొదలైన కథలు ఎంతో ప్రజాదరణ పొందుతున్నాయి. ఈ వరవడినే నాజరు మొదలైన కవులు ఎన్నో బుర్రకథలు రాసి ప్రజలకు చైతన్యం కలిగిస్తున్నారు.

ప్రస్తుతం నాజరుయుగం నడుస్తోంది. కథ చెప్పడంలో నాజరు యావదాంధ్రలోనూ సాటి లేనిమేటి. కథకుడు ప్రత్యేకమైన దుస్తులు ధరించడం ఇతినితోనే ప్రారంభమైంది. వంతపాడే స్త్రీల స్థానం ఎక్కువగా పురుషులకు లభ్యమైంది. అంతేగాదు; వంతలు పూర్వం హాస్యంమాత్రమే చెప్పేవారు. ఇప్పుడు హాస్యంతోపాటురాజకీయాలుకూడాచెప్పడం పరిపాటయింది. నాజరుకు తద్వారా బుర్రకథకు చేయూతనిచ్చి బుర్రకథకు ప్రత్యేక స్థానం, గౌరవం, ప్రజాదరణ కలిగించింది ప్రజానాట్యమండలి. ఈ ఈ నాట్యమండలి సేవ అపూర్వం, అసమానం.

## ప్రస్తుతం బుర్రకథలలో పాల్గొంటున్న కొందరు ప్రముఖులు

కథకులు : ఉమామహేశ్వరరావు పట్టం సెట్టి, కృష్ణమూర్తి పి, నాజర్ షేక్, నరసింహారావు వల్లం, రాధారుక్మిణమ్మ కొండేపూడి, సూర్యకాంతం.

వంతలు : పున్నయ్య కోనూరి, పెరుమాళ్ళు మారిపనేని, వెంకటేశ్వరరావు మాచినేని, రాధాకృష్ణమూర్తి మిక్కిలినేని, రామకోటి ఏపూరి, లక్ష్మీనరసయ్య కర్నాటి, రాజమ్మ తాడి, మునీ, మంగతాయారు, శివరామకృష్ణ బి., శేషు జి.

## హరికథ

ఇది శుద్ధ యక్షగానం. బుర్రకథలోలాగా ఇందులో కథకుడు బుర్ర

వాయించడు. తాళాలు లేకపోతే చిరతలు వాయించుకుంటూ కథ చెబుతాడు. గుమ్మెటలకు బదులు మద్దెల, హార్మనీ ఉపయోగిస్తారు. ఇందులో కథకుని హరిదాసు అంటారు. హాస్యం పిట్టకథల రూపంలో ఉంటుంది. కొంతమంది కథ చెబుతూ నృత్యంకూడా చేస్తారు. ఈ శాఖకు ఆదిపురుషుడు ఆదిభట్ల నారాయణదాసు. వీరు సంగీత సాహిత్యాలలో మహాపండితులు. స్వయంగా అనేక హరికథలు రాశారు. వీరి కథలు ప్రబంధ శైలిలో బహు రమ్యంగా ఉంటాయి. వీరి తర్వాత చెప్పుకోతగ్గవారు బాలాజీదాసు. ఈయనా బహుళ గ్రంథకర్త. నేటి హరికథకులలో చాలామంది వీరి శిష్య పరంపరలోనివారే. కాని సాహిత్యపరులు ఈ శాఖకు తగిన స్థానం ఇవ్వకపోవడం శోచనీయం.

## పగటి వేషాలు

సంఘంలోని వివిధవర్గాలవారు నీతి, న్యాయం పాటించకుండా మతంపేరుతో, మూఢాచారాలపేరుతో ఇతర్లని దోచుకోవడం, మోసగించడం ప్రారంభమయిన నాడు శాంతిభద్రతలు ఉండవు. అలాంటి అన్యాయాలను ఎప్పటికప్పుడు వెలికితీసి చూపే దిక్సూచి అవసరం సంఘానికి ఎంతైనా ఉన్నది. ఆ దిక్సూచి కళాత్మకమైతే ఇంకా బాగా పనిచేస్తుంది. అటువంటి దిక్సూచిగా వెలసినవే పగటివేషాలు. సామాన్యంగా పగలే వీటిని ప్రదర్శించడం చేత వీటికి పేరువచ్చింది. కాని రాత్రిళ్ళు ప్రదర్శించే రెడ్డి, పంతులు, వకాణి వేషాలు కూడా పగటివేషాలకిందే పరిగణింపబడుతున్నాయి. వీనినే ప్రచ్ఛన్నవేషాలు, విచిత్రవేషధారణ అనికూడా అంటారు.

13వ శతాబ్దినాటికే ఈ పగటివేషాలు బహుళ ప్రచారంలో ఉన్నట్లు పండితారాధ్య చరిత్రవల్ల తెలుస్తుంది. కళింగ గంగరాజు పగటివేషాల వారితో చేరి శత్రువులను చంపాడని ఒక ఐతిహ్యం ఉంది. కాని వానికి చారిత్రికాధారాలు లేవు. 2,3 శతాబ్దుల వెనకవరకు పగటివేషాల ఆచూకీ దొరకడంలేదు. 2,3 శతాబ్దాలక్రితం మైసూరుప్రాంతంనించి పల్లవఝల వెంకట్రామయ్య అనే ఆయన మనప్రాంతాలకు సంచారంవచ్చి రేపల్లెలో ఉండిపోయి ఇక్కడివారికి పగటివేషాలు నేర్పారట. ఈ పగటివేషధారులకు కృష్ణాజిల్లా గడ్డిపాడు కేంద్రమైంది. అప్పటినించీ వీరికి గడ్డిపాడు భాగోతులు అనిపేరు వచ్చింది.

తెలుగుదేశంలో ఎన్ని వర్గాలు, మతాలు కులాలు ఉన్నాయో వారందరి భాషోచ్చారణ ఈ గడ్డిపాడువారిదే సొమ్ము. వీరు ఆంధ్రదేశమంతా తిరిగి ఎందరో జమీందార్లను ప్రజలను తమవిద్యచే మెప్పించి అగ్రహారాదులు పొందారు. తర్వాత కూచిపూడివారు, ఈతముక్కల జంగాలు ఈ విద్యను అభ్యసించి ప్రచారంలోకి తెచ్చారు. గడ్డిపాడువారు, కూచిపూడివారు కట్టే పగటివేషాలు సత్త్వగుణ ప్రధానమైనవి. సాంఘికక్షేమం ఆశించినవి. ఈతముక్కల జంగాలు శూర్పణఖలాంటి తామసవేషాలకిదిగి పగటివేషాలను భీభత్సంకిందకు మార్చారు. క్రమంగా ఈ తామసవేషాలకే ప్రాధాన్యం ఎక్కువైంది. ప్రయోజనశూన్య మవడంతో ఇది నానాటికి క్షీణించి నేడు నామమాత్రావశిష్టమైనది.

అయితే వీటివల్ల జరిగే సాంఘిక ప్రయోజనమేమిటి? పగటివేషధారులు హాస్యరసమును ఆధారంచేసుకొని ఆనాటి సంఘంలోని దురాచారాలను, దోపిడీ విధానమును, జిత్తులను నిశితంగా విమర్శించేవారు. ఉదాహరణకి: కోమటి వేషం మీద కోమట్లు ప్రజలను ఎలా మోసగించేది వెల్లడిస్తారు. రెడ్డి, పంతులు వేషాలలో రైతును ఎవరు ఏ విధంగా మోసగించేదీ బహిర్గతంచేస్తారు. దీనినంతటినీ చక్కటి హాస్యంతో జతపర్చి ఎదుటివారి మనసుకు హత్తుకునేటట్లు ప్రదర్శించేవారు. ఈ పగటివేషాలు 64. వీటిని జాతీయాలంటారు. వీటికి జాతీయాలని పేరుపెట్టడంలోనే వారిదృక్పథం జాతి క్షేమమని గోచరిస్తుంది. ఈ వేషాలమీద చెప్పే వాచకం ఇంతవరకు ముద్రితం కాలేదు.

విచిత్ర వేషధారణలో నేడు పెద్ద పేరులో ఉన్నది డా॥ చంద్రశేఖరం. ఈయన గాంధీ, నెహ్రూ, జిన్నా మొదలయిన నాయకుల వేషాలువేసి ఆంధ్రదేశమంతటా ప్రతిష్ఠ గడించుకున్నారు. ఆహార్యంలో ఆంధ్రదేశంలో ఇతనికి సాటి అయినవారులేరు. భారత సంస్కృతీ రాయబారవర్గ సభ్యుడుగా నవచైనా సందర్శించిన ప్రప్రథమ ఆంధ్ర నటుడు.

## తోలుబొమ్మలు

మానవుని రూపకల్పనా తృష్ణలోంచి జనించినవే తోలుబొమ్మలు. ఈ తోలుబొమ్మ ప్రదర్శనాలు ఆంధ్రలో నేగాక యావద్భారతంలోనూ కనిపిస్తాయి. వీటిని జింక, మేక, గొర్రె తోళ్ళతో చేస్తారు. తోళ్ళను బాగా శుభ్రముచేసి వాటిపైని బొగ్గుతో బొమ్మనురాసి కత్తిరిస్తారు. ఆభరణాదులు ద్యోతకంచేస్తానికి చిన్నచిన్న రంధ్రాలు చేస్తారు. వాటిమీద పాత్రానుగుణ్యంగా రంగులు వేస్తారు. ఇలా తయారైన బొమ్మలను తెరమీద పెట్టి వాటివెనక ఆముదపుదీపాలు పెడితే చీకటిలోఉన్న ప్రేక్షకులకు ఈ బొమ్మలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. అవయవాల కదలికలు చూపడానికి భుజాలదగ్గిర, మోచేతిదగ్గిర అతుకులుపెట్టి శాళ్ళతో కదపారు. బొమ్మ మొత్తానికి ప్రధాన సూత్రం ఉంటుంది. దానితోనే బొమ్మలను ఆడిస్తారు, నాట్యం, యుద్ధం చేయిస్తారు.

క్రీస్తుపూర్వం శాతవాహనులకాలం నించీ తోలుబొమ్మలు తెలుగునాట ప్రచారంలో ఉన్నాయి. ఆంధ్రదేశం నించే ఇవి బలి, జావా ద్వీపాలకు పాకాయి. ప్రస్తుతం తోలుబొమ్మలవాళ్ళ మాతృభాషగా మరాటీ మాట్లాడడం, వారిసంగీతంకూడా మరాటీసంగీతానికి దగ్గరగా ఉండడంవల్ల ఇవి మనకి మహారాష్ట్రంనించి సంక్రమించాయని అనుమానించవలసి వస్తోంది. కాని తణుకు తాలూకాలో అచ్చమయిన ఆంధ్రులే తోలుబొమ్మలు ఆడిస్తున్నారు.

తోలుబొమ్మలవారు ఎక్కువగా ఆడేది లంకాదహనం, మైరావణ, విరాటపర్వం. వీరు రంగనాథరామాయణం ఈ ప్రదర్శనాలలో ఉపయోగిస్తారు. పురుషపాత్రల వాచికం పురుషులు, స్త్రీపాత్రల వాచికం స్త్రీలు పఠిస్తారు. మధ్యమధ్య కేతిగాడు, బంగారక్క ప్రహసనం ఆడతారు. ఇది అసభ్యంగా ఉంటుంది. కాని ప్రజలను ఎక్కువగా ఆకర్షిస్తోంది.

ప్రస్తుతం బొమ్మలబదులు మనుషులే వేషం వేసుకుని ఛాయానాటికలు ఆడుతున్నారు. ప్రస్తుతం ఘోష్, రామకృష్ణ ఇందులో ఎక్కువకృషి చేస్తున్నారు. ఈ ఛాయానాటికలను బహుళ ప్రచారంలోకి తీసుకురావాలి.

## నాటకరంగం

'నాటకాన్తంహి సాహిత్యమ్' అని ప్రాచీన నానుడిఉన్నా మన పూర్వాంధ్ర కవులు నాటకాలజోలికి పోలేదు. నన్నయకు పూర్వమే నాటకాలు ప్రదర్శించేవారని తెలుస్తోందికాని అవి నాటకాలో యక్షగానాలో నిర్ధారణగా చెప్పలేం. 14 వ శతాబ్దంలో వినుకొండ వల్లభరాయుడు సంస్కృత ప్రేమాభిరామాన్ని అనుసరించి తెలుగులో క్రీడాభిరామం రచించాడు. ఇది దశరూపకాలలోని 'వీధి' లక్షణాలతో కూడింది. మోపూరు భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శింప బడిందట. ఇది శ్రీనాథుడే రచించి వల్లభరాయని పేరుపెట్టాడని వేటూరివారి వాదం. కర్తఎవరైనా ఆనాటిసాంఘికాచారాలు, వివిధ కళారూపాలు ఇందులో వర్ణింపబడ్డాయి. ఇదే తెలుగుసాహిత్యంలోని ప్రప్రథమ రూపకం.

1880 వరకు తెలుగువారు యక్షగానాలు, పగటివేషాలతోనే సంతృప్తి పడ్డారు. పగటివేషాలు కొంతవరకు నాటకఫక్కీలో నడుస్తాయి. ఈపగటివేషాలే మనస్టేజీనాటకాలకి ప్రాతిపదికగా ఉపయోగించాయని తలపవచ్చు. 1880 లో ధార్వాడకంపెనీవారు మన ప్రాంతాలకివచ్చి తాటాకుపాకల్లో స్టేజీనాటకాలు ప్రదర్శించారు. ఈనాటకాలుచూచి ఉత్సాహంతో యువకులు బందరు, బెజవాడ, గుంటూరు మొదలైన పట్టణాలలో నాటకసమాజాలు స్థాపించి నాటకాలాడడం ప్రారంభించారు. మన ప్రప్రథమ నాటకాలన్నీ వచనంలోనే ఉండేవి. ఒకటిరెండు పాటలుమాత్రం పాడేవారు. ఆనాడు నటనని కళారాధనగా, రంగస్థలమును పవిత్రస్థలంగా భావించేవారు. నటనావిధానం బోధించే గ్రంథాలేవీలేవు. ప్రతిసమాజం ఒక కట్టుబాటులో, ఒక ఉపాధ్యాయుని దగ్గర శిక్షణ పొందుతుండేది. తెల్లగుడ్డనే తెరగా ఉపయోగించేవారు. మద్దెల, సితారు, ఫిడేలు మనవాళ్ళకి తెలిసిన వాయిద్యాలు. ఏ పాకలోనో, పందిరిలోనో నాటకమాడేవారు. పాత్రపోషణ, రసపోషణలో నిర్దిష్టమైన అభిప్రాయాలు లేవు. రాక్షసుడివేషంవేసి పెద్దగా అరిచి హంగామా చేసేవారు. అసభ్యంగా మాట్లాడడం హాస్యంగా భావించేవారు. నటనఅంటే చేతులు ఎక్కువగా ఆడించడంగా భావించి ఆంగికాభినయానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చేవారు. వేషం మీద కోట్లూలాగూలు తొడిగేవారు. సఫేదు, అరదళంతో కోటావేసుకునేవారు. విగ్గులు సరైనవి ఉండేవికావు. నాటకప్రారంభానికి ముందు నాయకుడు, సరస్వతి వేషాలు వచ్చేవి. తర్వాత నటీసూత్రధారులు. అతర్వాత అసలు నాటకం.

1884 పార్సీ నాటకం కంపెనీ వచ్చి మళ్ళా మనదేశమంతా హిందీలోనాటకాలాడి వెళ్ళింది. ఈ సంఘటనతో మన నాటకరంగం ఇంకోదశను అందుకుంది. మన తెలుగు సమాజాలు హిందీ, తెలుగు భాషలు రెంటిలోనూ నాటకాలాడ

ప్రారంభించారు. అభినయమంటే [stain] తిప్పి గంతులు వేయడం కాదనీ, [stain] ముతో నానారసములు ఒప్పించాలనీ తెలుసుకున్నారు. ఈ కాలంలోనే బందరులో ఈవని లక్ష్మణస్వామి, తెలుగు హిందీ నాటకాలలో వేషాలు వేసి యావద్భారతకీర్తి గణించారు. వీరు పాత్రలో జీవించి రసవత్తరంగా నటించేవారట. సుమేరుసింగు, పఠాణీ, శివాజీ వీరి అభిమానపాత్రలు. గుంటూరులో మార్తిప్రసాదరావు హరిశ్చంద్ర మొదలైన వేషాలు వేసి నాటకకళని ఒక పంథాలో నడిపిస్తున్నారు.

సర్కారుజిల్లాలలో ఇలా వచన నాటకాలాడుతుంటే, రాయలసీమలో ఇంకోరకమైన నాటకాలు బయలు దేరాయి. వీటికి మూలపురుషుడు ధర్మవరం కృష్ణమాచార్యులు. ఈయన వసుధా నటుడూ, రచయిత. గద్య పద్య గేయాలతో వీరు నాటకాలు వ్రాసి ఆడేవారు. గుంటూరు మార్తిప్రసాదరావుగారు బళ్ళారి నాటకాలని సర్కారుజిల్లాలలో ప్రచారంలోకి తీసుకొచ్చారు. అంతకుముందు వచననాటకాలు రాసే కందుకూరి, చిలకమర్తి వగైరా గద్య పద్యాత్మకంగా నాటకాలు రాయడం మొదలుపెట్టారు. ఈ పద్ధతి విపరీతపడిపోయి పద్యాలుపాటలు నాటకానికి ప్రాధాన్యత వహించాయి. అప్పటివరకు నాటకాలు పురాణ కథలతో నిండి గ్రాంథికభాషలో ఉండేవి. ఈ పరిస్థితి విరుద్ధంగా వ్యావహారిక భాషలో, సాంఘిక ఇతివృత్తంతో గురజాడవారి కన్యాశుల్కం వెలువడటం విచిత్రం. నాటికీ నేటికీ కన్యాశుల్కంతో తుల్యమైన నాటకం తెలుగులో వెలువడలేదు. 1900 వరకు నాటకప్రదర్శనాలు పాకలలో జరుగుతుండేవి. ధార్వాడ, పార్శీ కంపెనీలు ధనమార్జించడం చూసి తెలుగు పెట్టుబడిదారులు నాటకశాలలు నిర్మించారు. నాటకాలద్వారా ధనమార్జించాలనే ఆకాంక్ష బయలుదేరింది.

1900–10 వరకు సంస్కృతనాటకాల అనువాదాలు ఎక్కువగా వెలువడ్డాయి. రంగస్థలం వ్యాపారసంస్థగా మారిపోయింది. అంతవరకు నటుల దృష్టి ధనార్జనవైపు మళ్ళలేదు. రాజమండ్రి గున్నేశ్వరరావు పెద్దజీతాలనిచ్చి ఎక్కడెక్కడి నటులనూ తన కంపెనీకి తీసుకువచ్చాడు. డాబుకొలిపే తెరలు, దుస్తులు ప్రవేశపెట్టాడు. బాపట్ల కాంతయ్య సంగీతదర్శకులుగా పార్శీ, హిందుస్థానీ మట్లు చెలామణిలోకి వచ్చాయి. నాటక ప్రదర్శనానికి అభినయ ప్రాధాన్యత తగ్గి సంగీతం మించిపోయే పరిస్థితికి కాంతయ్య అంకురార్పణ చేశారు. 1904 లో బందరులో జగన్మోహిని మోహన సమాజం ఏర్పడింది. ఇందులో స్త్రీ పురుషులు పాత్రలు వహిస్తుండేవారు. ఈ కాలంలోనే సురభి కంపెనీ వెలిసింది. వీరు రామాయణ భారత నాటకాలు వైరువర్ణ్య సహాయంతో అనేక అద్భుతాలు చూపుతూ ప్రదర్శించేవారు. 1910–20 మధ్యలో గున్నేశ్వరరావు కంపెనీ నమూనామీదనే మైలవరంకంపెనీ ఏర్పడింది. ఆంధ్రదేశంలోని పెద్ద పెద్ద నటులంతా పెద్ద పెద్ద జీతాలమీద ఇందులో నియోగితులైనారు. బాపట్ల కాంతయ్య సంగీత దర్శకత్వం వహించడంతో హార్మోనియం, తబలా, హిందూస్థానీమట్లు అధిక

లోకి వచ్చి సంగీతంతో నాటకరంగం హోరెత్తిపోయింది. చీటికీ మాటికీ పాటలు పాడటం, పద్యాలు చదవడం, సాగదీసి పేలవ వచనంతో ప్రేక్షకులను ఉక్కిరిబిక్కిరి చేసేవారు. యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు ప్రధాన భూమికల్ని నిర్వహించేవారు. వీరు యావదాంధ్రలోను పేరుప్రతిష్టలు గడించుకున్నారు. మైలవరం నమూనాలో పల్లె పల్లెలా నాటక సమాజాలు వెలిసినై. అయితే నటనలో, రంగాలంకరణలో వాస్తవికత కంటె ఆడంబరత్వం, కృత్రిమత్వం ఎక్కువైంది. తెనాలిలో గోవిందరాజుల, మాధవపెద్ది, స్థానం కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం, బొబ్బిలి, రోషనార ఆది నటనకి జీవం పోసారు. బందరులో ముంజులూరివారు, పింగళి సోదరులు, డి. వి. సుబ్బారావు, రాజమండ్రిలో ముప్పిడి జగ్గరాజు చక్రవర్తి ప్రదర్శనాలిచ్చి నాటక కళోద్ధరణకు పాటుబడ్డారు.

నెల్లూరులో వేదంవారు, కోరస్వామి, బందరులో వి. టి. రాఘవాచారి, నరసింహాచారి భరతముని అభినయ సంప్రదాయాలను స్టేజికి అనుగుణ్యంగా మార్చాలని ప్రయత్నించారు. తత్ఫలితంగా నెల్లూరివారి శకుంతల, బందరువారి వేణీసంహారం కళాకర్తల మన్ననల నందుకున్నవి కాని ఈ సంప్రదాయం నటలోకంలో వ్యాప్తి చెందలేదు. 1922 ప్రాంతంలో ఈ భరత సంప్రదాయాన్ని అనుసరించి పారుపల్లి సుబ్బారావు ప్రదర్శించిన రాధాకృష్ణ నాటకం పండిత పామరుల మెప్పువడసింది. రాధాకృష్ణతోనే ఈ సంప్రదాయం అంతరించింది.

1920 నాటికి బయలుదేరిన స్వదేశీ ఉద్యమ ప్రభావంవల్ల రసపుత్ర మరాఠీ వీరులచరిత్రలు నాటకాలుగా వెలసి ప్రజలలో దేశాభిమానం రేకెత్తించాయి. రసపుత్ర విజయం బ్రిటిషు ప్రభుత్వ బహిష్కరణకు గురైంది. వీరేశలింగం సాంఘికోద్యమం ఫలితంగా సాంఘికనాటకాలు స్టేజీమీద ప్రచారంలోకి వచ్చాయి. చింతామణి అశేష ఆంధ్ర జనుల ఆదరానికి పాత్రమై 'ఒక వెలుగు వెలిగింది'. ఈ కాలంలోనే పత్రికలు ఎక్కువగా వెల్వడసాగాయి. నాటక రచన మీద, నటనమీద చర్చలు, వ్యాసాలు, గ్రంథాలు వెలువడి నాటకకళ కెంతో ఉపకరించాయి. కాని రంగస్థలంమారలేదు. పది చెట్లు పిచ్చిగా చిత్రించిన తెర అడవి సీనుకింద, ఒక పెద్ద మేడ చిత్రించిన తెర అంతఃపురం కింద చలామణి అయేవి. రంగ పరికరాలు కృత్రిమంగా ఉండేవి. వస్తువులలో కొంత నాజూకుతనం, పాత్రౌచిత్యం అలవడింది.

1920లో తెలుగు నాటక రంగంలో కొత్తయుగం ప్రారంభమైంది. బళ్ళారి రాఘవ తొలిసారిగా బెజవాడలో నాటకాలాడారు. ఆయన అభినయరీతులు నటుల ప్రేక్షకుల కండ్లు తెరిపించాయి. రాఘవ నాటకరంగంలో ఒక విప్లవం లేవదీశాడు. నాటినుంచీ నేటివరకు రాఘవ ఆదర్శ నటుడై పోయాడు. ప్రజలు ప్రతి నటుని రాఘవతో పోల్చి చూచి వారివారి విలువలు కట్టడం ప్రారంభించారు. నటులు రాఘవను అనుకరించాలని యత్నించి విఫలులయారు. రాఘవ తెచ్చిన ఈ విప్లవం వల్లార్భాటానికి మూల బడ్డ సంగీత ప్రధానమైన నాటకాల

రాయబారంలాంటివి మళ్ళా పైకి తీసి ప్రజలను పెడమార్గంలో పెట్టాలని యత్నించారు. వీరు ఎంత దబ్బ చేసుకున్నా రాఘవ రేపిన విప్లవాగ్నిని చల్లార్చలేకపోయారు.

1924లో ఈ పరిస్థితులు గమనించి బి. టి. రాఘవాచార్య, గూడవల్లి రామబ్రహ్మం నటులకు శిక్షణ యిచ్చే ఉద్దేశంతో భారతముని బృందం అని ఒక నాటక కళాశాల స్థాపించారు. ఇది కొద్ది రోజులే పనిచేసినా దీని ప్రభావం చాలా మంది నటుల మీద పడింది. ఈ రోజులలోనే నాటి నటులను, ప్రదర్శనాలను విమర్శించే 'సంగీత ఇంద్రసభ' అనే ప్రహసనం వెలువడింది. తర్వాత వెలువడిన అనేక ప్రహసనాలకిదే మాతృక.

బళ్ళారి రాఘవ ఇంగ్లండు వెళ్ళి తిరిగి వచ్చిన తర్వాత మన నాటక రంగంలో పెద్ద మార్పు వచ్చింది. అప్పటివరకు పురుషులే స్త్రీ పాత్రలు ఎక్కువగా ధరించేవారు. బళ్ళారి రాఘవ స్త్రీలే స్త్రీ పాత్రలు ధరించాలనీ, నాటకరంగం జాతిని ఉద్ధరించాలనీ ప్రచారం మొదలు పెట్టారు. ఈ ఉద్యమ ఫలితంగా సంసార స్త్రీలు క్రమేపీ వేషాలు వేయడం ప్రారంభించి కొత్తదనం తీసుకువచ్చారు.

1938, 39 సంవత్సరాలలో ఏలూరులో ఆంధ్ర నాటక కళాశాల అనే పేరుతో బండారు కనకలింగేశ్వరరావు కళాశాలను స్థాపించి 38 మందికి అభినయంలో శిక్షణ ఇచ్చారు. ఈ కళాశాల ప్రభావం చాలామంది నటులపై పడింది.

మైలవరం కంపెనీ అంతరించిపోవడంతో నటులు దిక్కులేని పక్షులైపోయారు. ఒక్కొక్క పెద్ద పెద్ద నటుడు ఒక్కొక్క కంపెనీ పెట్టుకుని తంటాలు పడ్డారు. కాని ఆర్థికంగా నిలవదొక్కుకోలేకపోయారు. నటుల ఈ ఆర్థిక దుస్థితి చూసి పెట్టుబడిదారు కంట్రాక్టరు రూపంలో ప్రత్యక్షమయాడు. ఆనాటి నించీ క్రమక్రమంగా ఆంధ్ర నాటకరంగం క్షీణించి క్షీణించి కల్యావశిష్టమైపోయింది. నాటి ప్రదర్శనాలు జవరహితంగా ఉండేవి. రెండు పద్యాలు కమ్మగా పాడగలిగినవాడు మహానటుడుగా చెలామణి అయాడు. నటుల దృష్టిలో అభినయానికి ప్రాధాన్యత పోయింది. ప్రేక్షకుల అభిరుచులను చెడుతోవను పట్టించి వారి బలహీనతలను ఆస్కారం చేసుకుని ధనమార్జించడమే నటుల పరమావధి అయింది. 'చేతివాటపు యాక్షను' మిన్నుమీరింది. వన్సుమోర్లతో నాటక కళ పీక కత్తిరించుకుపోయింది. పూర్వ నాటకయుగం అంతరించింది.

## నవ్య యుగం

1920లో బళ్ళారి రాఘవ వెలిగించిన విప్లవజ్యోతిని ఆనాటి నటులందుకోలేకపోయారు. కాని 1940 తర్వాత సాంస్కృతికంగా, రాజకీయంగా దేశంలో వచ్చిన చైతన్య ఫలితంగా రాఘవ వెలిగించిన విప్లవజ్యోతిని అందుకుని ప్రజానాట్య మండలి 1945లో ఆవిర్భవించింది. ఇందులోనివారిది సాంస్కృతికంగా, రాజకీయంగా ఒకే ఆశయం. సుసంఘటిత శక్తితో నాటకరంగాన్ని సజీవం చేయడానికి ఒక పెద్ద ఉద్యమం లేవదీశారు. దీనికి కమ్యూనిస్టుపార్టీ అండగా నిలిచింది. పల్లెపల్లెనా పట్టణ పట్టణానా దీని అనుబంధశాఖ లేర్పడ్డాయి. డా॥ రాజారావు, కోడూరి అచ్చయ్య దీని సన్నాహకర్తలు. వాసిరెడ్డి, సుంకర ప్రజానాట్య

లను నాటకరూపంలో చిత్రించి ఇచ్చారు. నటులు కష్టించి సాధన చేసి ఉత్తమ ప్రదర్శనాలిచ్చి అటు కళావేత్తల, ఇటు ప్రజానీకం మన్ననల అందుకున్నారు.

ముఖ్యంగా మాభూమి నాటకం దేశమును ఉర్రూతలూగించింది. అభినయంలో రంగాలంకరణలో వాస్తవికతకు ప్రాధాన్యం చేకూర్చింది. ఫ్లాషులైట్లు మొదలగు ఆధునిక పరికరాలను ప్రచారంలోకి తెచ్చారు. స్టేజీ నాటకాలేకాక చెంచీత పాటలు, బుర్రకథలు, జముకుల కథలు, వీధినాటకాలు మొదలయిన తెలుగు జాతీయ గ్రామీణ కళలను పునరుద్ధరించి, ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ప్రజానాట్యమండలి నవ్యయుగం స్థాపించి, ఆంధ్రజాతి ముందడుగు వేయడంలో ఎంతగానో తోడ్పడింది. ప్రజానాట్యమండలిని ఒరవడిగా పెట్టుకుని బెజవాడ, రాజమండ్రి, వెంకటగిరి మొదలయినచోట్ల అనేక నాటకసమాజాలు వెలిశాయి.

1925 ప్రారంభించి నాటికారచన విరివిగా సాగుతున్నా 1944-45 వరకు నాటికలు టిక్కెట్లుపెట్టి ప్రదర్శనాలిచ్చే దశకు చేరుకోలేదు. అప్పటివరకు కాలేజీ, హైస్కూలు విద్యార్థి యువకులు వార్షికోత్సవాలలో, యువజన మహాసభలలో నాటికలు ప్రదర్శిస్తూ వాటికి గౌరవ ప్రపత్తులు చేకూర్చారు. 1945 లో మొదటిసారిగా కొప్పరపు సుబ్బారావు గారి అల్లీముబా మొదలయిన నాటికలు విజయవాడలో ప్రదర్శించారు. నాటినించీ నాటకరంగంలో కొత్తదశ ప్రారంభమై నాటికలకు బహుళప్రచారం లభించింది. 1945 లోనే కొప్పరపువారు లేవదీసిన 'లిటిల్ థియేటర్' ఉద్యమం ఫలితంగా అనేకమంది యువనటులకు నాటకకళా పరిజ్ఞానం, సక్రమ అభినయ శిక్షణా అలవడ్డాయి.

వెనకటి రంగస్థలం పూర్తిగా మారిపోయింది. నూతన నాటకాలు, నూతన రంగస్థలం ఆవిర్భవించాయి. ఒకే రంగు తెరలు ప్రేక్షకుల భావనాశక్తిని సక్రమ మార్గాన రేకెత్తిస్తున్నాయి. వేషధారణలో రంగ పరికరాలలో, నటనలో పూర్వపు ఆడంబరత్వం, డాబు, కృత్రిమత్వంపోయి వాస్తవికతకు స్థానం లభించింది.

యువ రచయితలు తమ తమ కలాలను పట్టి ప్రజాసమస్యలను నాటక, నాటికా రూపంలో చిత్రిస్తున్నారు. నేటి సంఘంలోని క్రౌర్యము, దోపిడీని, అన్యాయాలను ద్యోతకం చేస్తున్నారు. వీరి రచనలు, చక్కటి సంభాషణలు, యదార్థ సంఘటనలతో విరాజిల్లుతున్నాయి. కాని బహు కొద్ది నాటకాలలో తప్ప శిల్పం కొరవడుతోంది. రచయితలందరూ కొంచెమించుమించు ఒకేరకమైన సమస్యలను చేపట్టటంచేత, సృజనాత్మకశక్తి కొరవడడంవల్ల ఒకేరకమైనపాత్రలు, ఒకేరకమైన సంఘటనలు పునరావృత మవుతున్నాయి. ఆంధ్రప్రజాజీవితం సర్వతోముఖం ప్రతిబింబితం కావడంలేదు. చాలా నాటకాలు 'నకిలు' నాటకాలుగా తయారవుతున్నాయి.

ఇటీవల మననాటకరంగంమీద సినీమా ప్రభావం ఎక్కువగా కనిపిస్తోంది. సినీమా టెక్నిక్కును ఉపయోగించి నాటకాలు రాస్తున్నారు. సౌండుఫ్లాషులు, ఫొటో ఫ్లాషులు ఎక్కువయాయి. ఈ పద్ధతి

కింకా ప్రారంభదశలోనే ఉంది. మన రంగస్థలం పాశ్చాత్య దేశాలలోలాగా ఆధునిక పరికరాలతో సర్వసంపూర్ణంగా లేదు. ఈనూత్న పద్ధతి మననాటకరంగానికి ఎంతవరకు లాభదాయకమో వేచిచూడాలి.

1929 లో స్థాపించబడిన నాటకకళా పరిషత్తు మేల్కొని సుమారు 10 సంవత్సరాలనించీ ఏటా నాటిక, నాటక పోటీ పరీక్షలు పెట్టి యువరచయితలను, నటులను ఎంతో ప్రోత్సహిస్తున్నది.

### పూర్వనాటకాలలో ప్రసిద్ధి గాంచిన కొందరు ప్రముఖులు

శ్రీ ఆంజనేయులు పి. యస్. ఆర్.
,, కనకలింగేశ్వరరావు బందా
,, కృష్ణమాచారి కిళాంబి
,, గగ్గయ్య వేమూరి
,, గోపాలం దైతా
,, గోపాలరావు అనాపపురపు
,, గోవిందశాస్త్రి మల్లాది
,, చలపతిరావు పెద్దిభొట్ల
,, జగన్నాథం గండికోట
,, నరసింహాచారి బి. టి.
,, నరసింహారావు కె. యల్.
,, నరసింహారావు స్థానం
,, నరసింహమూర్తి పీసపాటి
,, ప్రకాశం టంగుటూరి
,, రామానుజాచార్యులు పంచాంగం
,, రంగారావు బి. బి.
,, లక్ష్మీకాంతం పింగళి
,, వరప్రసాదరావు అబ్బూరి
,, వెంకట్రామయ్య మాధవపెద్ది
,, వెంకటేశ్వర్లు పులిపాటి
,, వెంకటసుబ్బారావు గండిమెంట
,, వెంకటేశ్వరరావు కోట
శ్రీ సర్వేశ్వరశాస్త్రి రామాయణం
,, సంజీవరావు ఉప్పలూరి
,, సుబ్బారావు గోవిందరాజుల
,, సుబ్బారావు డి. వి.
,, సుబ్బారావు పారుపల్లి
,, సూరిబాబు
,, సూర్యనారాయణ మల్లాది
,, శ్రీరామమూర్తి అద్దంకి
,, శేషగిరిరావు మద్దాలి
శ్రీమతి కన్నాంబ పసుపులేటి
,, కమల సురభి
,, పద్మావతీదేవి కొమ్మూరి
,, రాజేశ్వరి
,, పూర్ణిమ

### నవీన నాటక ప్రదర్శనాలలో ప్రసిద్ధిగాంచిన కొందరుప్రముఖులు

శ్రీమతి ఉదయలక్ష్మి
,, కోటేశ్వరమ్మ
,, నిర్మల
,, బాలసరస్వతి సురభి
,, రమాదేవి
,, రాజమ్మ శాంతి
,, రాధాకృష్ణమ్మ కొండేపూడి
,, సరోజని కొప్పరపు
,, సరోజని వీరమాచనేని
,, సీతాకుమారి
,, సుశీల కలపటపు
శ్రీ అప్పయ్య కోదూరి
,, అచ్యుతరామరాజు
,, ఆత్రేయ ఆచార్య
,, కాశ్యప
,, కుటుంబరావు చదలవాడ
,, చలం
,, చంద్రశేఖరం చైతన్యం

శ్రీ జగన్నాథరావు వేదుల
,, నరసింహారావు పల్లం
,, నాగభూషణం
,, నాజరు షేక్
,, పున్నయ్య కోనూరి
,, రమణారెడ్డి
,, రాజారావు డా॥ జి.
,, రాధాకృష్ణమూర్తి మిక్కిలినేని
,, రాధాకృష్ణ కెంపటి
,, రామన్నపంతులు చిన్నకోట
,, లక్ష్మీనరసయ్య కర్నాటి

శ్రీ లక్ష్మీపెరుమాళ్ళు మారపనేని
,, లక్ష్మణరావు
,, వెంకటేశ్వరరావు కె.
,, వెంకటేశ్వరరావు మాదినేని
,, వెంకటరమణమూర్తి జె.
,, సుబ్బారావు పామర్తి
,, సోమయాజులు జె.
,, శర్మ కె. వి. యస్.
,, శంకరరావు అంకరాజు
,, శ్రీరామమూర్తి ప్రతాప



# తెలుగు సినిమా పరిశ్రమ

## శ్రీ కట్రగడ్డ నరసయ్య

ప్రజలకు విజ్ఞానం వినోదం ఇచ్చే ఉత్తమకళారూపాలలో సినిమా ఒకటి. ప్రపంచంలో నేడు లక్ష థియేటర్లు ఉన్నట్లు, రోజుకు సుమారు ఎనిమిదికోట్ల మంది ప్రజలు చలనచిత్రాలనుచూస్తున్నట్లు అంచనా వేయబడుతున్నది. అన్నిదేశాలలో చలనచిత్ర ప్రదర్శనాలు జరుగుతున్నా, 46 దేశాలలో మాత్రమే చిత్ర నిర్మాణం జరుగుతున్నది. ఈ 46 దేశాలలో అమెరికా ప్రథమస్థానాన్ని, భారతదేశం ద్వితీయ స్థానాన్ని అలంకరిస్తున్నాయి.

మనదేశంలో సాలుకు సుమారు 250 చిత్రాలు, వివిధ భాషలలో తయారవుతున్నాయి. రోజుకు 25 లక్షల మంది ప్రేక్షకులు చలనచిత్రాల చూస్తున్నారు.

ముడిఫిలిముకోసం స్టూడియోల, థియేటరుల పరికరాలు మొదలగువాటికోసం యితర దేశాలపై ఆధారపడవలసివస్తోంది. దేశంలో 60 స్టుడియోలు, 40 వేల టాకీలు వున్నాయి. 300 మంది ప్రొడ్యూసర్లు, 600 మంది డిస్ట్రిబ్యూటర్లు వున్నారు. చిత్ర నిర్మాణంలోనూ, డిస్ట్రిబ్యూషన్లోనూ, థియేటర్లలోనూ, చిత్ర నిర్మాణానికి సంబంధించిన యితర పరిశ్రమల లోనూ దాదాపు లక్షమంది పనిచేస్తున్నారు.

## ఆంధ్రలో చిత్రనిర్మాణం

మనదేశంలో ప్రప్రథమంగా 1903-వ సంవత్సరంలో ప్రదర్శించిన చిత్రం "క్రీస్తు జీవితం" (Short). 1905 తర్వాత రెండు రీళ్ళ చిత్రాలను (Shorts) బొంబాయిలో టూరింగు సినిమాలు ప్రదర్శించటం ప్రారంభించాయి. 1905-1910 సంవత్సరాల మధ్యకాలంలో విదేశాలనుండి దిగుమతిచేయబడిన చలన చిత్రాలు కొన్ని పట్టణాలలో ప్రదర్శింపటం ప్రారంభమైంది 1911 వ సంవత్సరంలో "రాజదర్బారు" అనే చిత్రం ప్రప్రథమంగా భారతదేశంలో తయారు చేయబడింది. 1913 వ సంవత్సరంలో దుంఢిరాజ్ గోవింద ఫాల్కే ప్రప్రథమ చిత్రాన్ని (Full Length హరిశ్చంద్ర మూకీచిత్రం) నిర్మించి, భారత చలనచిత్ర పరిశ్రమ పితామహుడని పేరు పొందాడు. అప్పటినుండి క్రమంగా చలనచిత్ర నిర్మాణానికి, కొన్ని కేంద్రాలలో ప్రయత్నాలు ప్రారంభమైనాయి. 1917వ సంవత్సరంలో

శ్రీ ఆర్. నటరాజన్, దక్షిణభారత దేశంలో ప్రప్రథమ మూకీ చిత్రాన్ని నిర్మించాడు.

శ్రీ ఆర్. ప్రకాష్ హాలీవుడ్ అనుభవంతో 1923 లో "భీష్మ" అనే చిత్రం నిర్మించాడు. అది భారతదేశమంతటా విజయవంతంగా ప్రదర్శించబడింది. వీరిదగ్గరే ఫొటోగ్రాఫరుగా పనిచేసిన శ్రీ రంగయ్య గారి సాయంతో శ్రీ సి. పుల్లయ్య గారు మూడురీళ్ళలో (Three reels Short) 'మార్కండేయ' చిత్రం తయారుచేశారు. శ్రీ పుల్లయ్యగారు తనే పెట్టుబడిపెట్టి, డైరక్టుచేసి యీ చిత్రం కాకినాడ పరిసరప్రాంతాలలో తయారు చేశారు. ఇందులో వీరే యమునిపాత్ర ధరించారు. తెలుగు సినిమాపరిశ్రమ 1931 కి టాకీ చిత్రాలస్థాయికి వచ్చింది. 1931 లో శ్రీ హెచ్. యం. రెడ్డిగారు భక్తప్రహ్లాద అనే మొట్టమొదటి తెలుగు టాకీ చిత్రాన్ని మదరాసులో తయారు చేశారు.

1931 వ సంవత్సరంలో ప్రారంభించబడిన తెలుగు చలనచిత్రపరిశ్రమ దినదినాభివృద్ధి చెందుతూ, 1953 ఆఖరుకు మొత్తం 235 చిత్రాలు తెలుగుసినిమారంగమే నిర్మించింది. ప్రక్క పట్టిక ఈ అభివృద్ధి క్రమాన్ని వివరిస్తుంది*:

| సంవత్సరం | విడుదలచేయబడ్డ చిత్రాల సంఖ్య |
|---|---|
| 1931 | 1 |
| 1932 | 2 |
| 1933 | 5 |
| 1934 | 3 |
| 1935 | 8 |
| 1936 | 10 |
| 1937 | 9 |
| 1938 | 11 |
| 1939 | 12 |
| 1940 | 12 |
| 1941 | 13 |
| 1942 | 11 |
| 1943 | 6 |
| 1944 | 5 |
| 1945 | 5 |
| 1946 | 9 |
| 1947 | 6 |
| 1948 | 7 |
| 1949 | 6 |
| 1950 | 19 |
| 1951 | 22 |
| 1952 | 26 |
| 1953 | 30 |

1954 మార్చి ఆఖరుకు ఏడు చిత్రాలు విడుదలైనాయి. ఇంకా సుమారు 50 చిత్రాలు నిర్మాణంలో ఉన్నాయి.

## స్టుడియోలు

తెలుగు చిత్ర నిర్మాణం 1931 వ సంవత్సరం నుండి జరుగుతున్నా, తెలుగు గడ్డమీద నేడు ఒక్క సినిమా స్టుడియో కూడా లేదు. 1930 వ సంవత్సరంలో

* అధ్యాయం చివర, సంవత్సరాలవారీ, నిర్మించబడ్డ తెలుగుచిత్రాల పేర్లు ఇవ్వబడ్డాయి.

రాజమండ్రిలోనిడమ ర్తి బసవర్సు చేతదుర్గా సినీటోన్ ప్రారంభించబడింది. ఇందులోనే సంపూర్ణరామాయణం, సత్యనారాయణ వ్రతం చిత్రాలు పుల్లయ్యగారిచే నిర్మించబడ్డాయి.తర్వాత 1937 వ సంవత్సరంలో ఆంధ్రసినీటోన్ విశాఖపట్నంలో నిర్మించబడింది. ఇందులో జయదేవ్ అనే చిత్రాన్ని కూడా నిర్మించారు. దురదృష్ట వశాత్తు ఈ రెండు స్టుడియోలు మూతబడ్డాయి. తిరిగి ఆంధ్రలో స్టుడియో నిర్మాణం గూర్చి తలపోసిన నాథుడే లేడు.

ఏ బొంబాయి, కలకత్తా నగరాలకో నటీనటవర్గంతో పోయి చిత్రాల నిర్మిస్తూ ఉండేవారు.

1950 నుండి ఆంధ్రులు, మదరాసులో స్టుడియోలు కట్టడం ప్రారంభించారు. నేడు మదరాసులో ఆంధ్రుల స్టుడియోలు ఆరున్నాయి. వీటిలో పెద్దది మదరాసులోనే కాదు ఆసియాఖండంలో కెల్ల పెద్దది వాహినీ స్టుడియో. ఇందులో ఆరు ఫ్లోర్లు (Floors) ఉన్నాయి. అధునాతన పరికరాలతో అమర్చబడిన లాబొరెటరీకూడా ఉన్నది. ప్రస్తుతం విజయా ప్రొడక్షన్సువారు అద్దెకు తీసుకొని నడుపుతున్నారు. *

## డిస్ట్రిబ్యూటర్లు

మొదట చిత్రనిర్మాతలే డిస్ట్రిబ్యూషను కూడా చూసుకొనేవారు. కాలక్రమేణా, నిర్మాతలుడిస్ట్రిబ్యూషను బాధ్యతలను డిస్ట్రిబ్యూషను వ్యాపార స్థులకు వప్పగించడం ప్రారంభించారు.

ఈ విధంగా ఆంధ్రలో ప్రారంభించబడిన మొదటి సంస్థలు మూడు: పెరెక్ట్ పిక్చర్స్ సర్క్యూట్, రాయల్ డిస్ట్రిబ్యూటింగు కంపెనీ, చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్లు. ఈ మూడు కంపెనీలు ఆంధ్రేతరులచేతనే ప్రారంభించబడ్డాయి.

1932 లో శ్రీ జి. కె. మంగరాజు గారు క్వాలిటీ పిక్చర్సు పేర మొట్టమొదటి ఆంధ్ర డిస్ట్రిబ్యూటింగుకంపెనీని, విశాఖ పట్టణంలో ప్రారంభించారు. ఆ మంగరాజుగారే నేటి పూర్ణా పిక్చర్సు లిమిటెడ్ అధిపతి.

1936 లో పారుపల్లి శేషయ్య, కురుకూరు సుబ్బారావు, గూడవల్లి రామబ్రహ్మంగార్లు చిత్ర నిర్మాణానికీ, డిస్ట్రిబ్యూషనుకు సరస్వతీ ఫిలింకంపెనీ పేరుతో విజయవాడలో ఒక కంపెనీ ప్రారంభించారు.

1950 వ సంవత్సరంవరకూ విజయవాడ, గుంతకల్లు పట్టణాలలో మాత్రమే డిస్ట్రిబ్యూషన్ కేంద్రాలు కేంద్రీకృతం కాలేదు. నంద్యాల, చిత్తూరు, విశాఖపట్నం, నెల్లూరు, భీమవరం, రాజమండ్రి లాంటి పట్టణాలలో చెదురుగా వుంటూ వుండేవి. కాని, పత్రికలలో పెట్టుబడులు పెరిగిన కొలది విజయవాడ, గుంతకల్లు, పట్టణాలు డిస్ట్రిబ్యూటింగు కేంద్రాలుగా అభివృద్ధి అయ్యాయి.

---

* ఇతర స్టుడియోల వివరాలకు అధ్యాయం చివరి అనుబంధం చూడండి.

1950 లో 21 ఉన్న కంపెనీలు, 1952 కల్లా 57 కు పెరిగాయి.

డిస్ట్రిబ్యూషను కంపెనీలలో, చమ్రియావంటి, ఆంధ్రేతర సంస్థల పెట్టుబడి సుమారు 30 కోట్ల రూపాయలుంటుందని స్థూలంగా అంచనా వేయబడుతున్నది.*

## సినిమా హాల్సు

1918 కి పూర్వం ఆంధ్రదేశంలో మళయాళీ దేశీయులు కొందరు జోస్ బయిస్కోపు పేరుతో కొన్ని టూరింగు కంపెనీలు నడిపేవారు. చలనచిత్ర ప్రదర్శనంలో ఇది చాలా ప్రాథమిక దశ. డేరాలుకూడా వుండేవి కావు. చుట్టూ గుడ్డకట్టేవారు. తెరదగ్గర చిన్న పందిరి వేసేవారు. కాబిన్ చాలా చిన్నదిగా వుండేది. ప్రొజెక్టరులో యిప్పుడు వాడే ఆర్కు లాంపు బదులుగా కార్బైడు లైటు వాడేవారు. ప్రొజెక్టరు యంత్రముతో కాక చేతితో తిప్పేవారు.

* డిస్ట్రిబ్యూటర్ల ఎడ్రసులు, ఇతర వివరాలకు అధ్యాయం చివర అనుబంధంలో చూడండి.

కెందు గ్యాసులైట్లు తెరదగ్గర కట్టేవారు. ఆట మొదలిడే సమయానికి ఆ గ్యాసు లైట్లను చీకటి అవటానికి పీపాలలోనికి దించేవారు.

1919 ప్రాంతంలో కాకినాడ కాలేజి ప్రిన్సిపాలుగా వున్న రఘుపతి వెంకటరత్నంగారి సోదరుడు వెంకయ్యగారు ఇంజను డైనమోతో నడిచే టూరింగుసినిమాను ఆంధ్రదేశంలో ప్రథమపర్యాయం ప్రదర్శించారు. వీరే 1920 లో మద్రాసులో గెయిటీ సినిమాహాలును నిర్మించారు.

1921 లో మొట్టమొదటిసారిగా విజయవాడలో శ్రీ మారుతిసినిమా శ్రీ పోతిన శ్రీనివాసరావుగారిచే స్థాపించబడింది. అది యిప్పటివరకూ వారి యాజమాన్యం క్రిందనే నడుస్తోంది.

1925 లో పి. వి. దాసుగారు బందరులో మినర్వాహాలును స్థాపించారు. అదే సమయాన మోతే కృష్ణారావుగారు ఏలూరులో పాండురంగటాకీసును, విద్వత్కృష్ణమూర్తి మూర్తయ్యగారలు రాజమండ్రిలో కృష్ణాసినిమాను స్థాపించారు. 1927 లో సి. పుల్లయ్యగారు కాకినాడలో సినిమాస్కోపుహాలును నిర్మించారు.

ఈ దశలో కొందరు గోడౌను షెడ్లను, మరికొందరు బియ్యంమిల్లుల షెడ్లను కూడా సినిమాహాలులుగా మార్చివేసిన సంఘటనలు ఉన్నాయి. ఒక మూడు సంవత్సరాలలో (1951–'53) 69 సినిమాహాల్సు వివిధపట్టణాలలో నిర్మించబడ్డాయి.

1950 వ సంవత్సరంలో ఇంతమంది జనాభాకొక సినిమాహాలు అని ప్రభుత్వం నియమితపరచటంవల్లను, టూరింగు సినిమాకు లైసెన్సులు ఇవ్వటంలో అనుసరించిన పద్ధతివల్లను సినిమాహాలు యజమానులమధ్య ప్రబలిన ఒక రకమయిన అర్థరహితమైన పోటీతత్వం కొంతవరకు అరికట్టబడింది. దీనిఫలితంగా 1950 లో రాష్ట్రంలోఉన్న 327 టూరింగుసినిమాలు 1953 కల్లా 101 కి దిగజారాయి. 1950 1953 సంవత్సరాలలో వివిధజిల్లాలలో నడుపబడుతున్న సినిమాహాలుల వివరాలు, ప్రక్క పేజీలోని పట్టికలో ఇవ్వబడ్డాయి.

ఆయా కేంద్రాలలోవచ్చే ఆదాయాన్నిబట్టి, సినిమాహాల్సు ఎ.బి.సి.డి. క్లాసులుగా విభజిస్తారు:

— పదివేల జనాభాకు తక్కువగా ఉన్న కేంద్రాన్ని 'డి' క్లాసు కేంద్రంగాను,

— 10–20 వేల మధ్య జనాభా ఉన్న కేంద్రాన్ని 'సి' క్లాసు కేంద్రంగాను,

— 20–35 వేలకుపైన జనాభా ఉన్న కేంద్రాన్ని 'బి' క్లాసు కేంద్రంగాను,

— 35 వేలకు పైగా జనాభా ఉన్న కేంద్రాన్ని 'ఎ' క్లాసు కేంద్రంగాను స్వీకరిస్తారు.

ప్రేక్షకులు, చిత్రానికి ఇచ్చే ప్రతి వందరూపాయలలో, సినిమాహాలు యజమాని, డిస్ట్రిబ్యూటరు, ప్రొడ్యూసరు ఈవిధంగా పంచుకుంటారు:

| | |
|---|---|
| టాక్సుకు | రు. 25–0–0 |
| 40% చొప్పున మిగిలిన రు. 75 లలో హాలు యజమానికి | రు. 30–0–0 |

| జిల్లా | 1950 పర్మనెంటు | 1950 టూరింగు | 1953 పర్మనెంటు | 1953 టూరింగు |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం, విశాఖపట్టణం | 16 | 45 | 36 | 12 |
| తూర్పుగోదావరి | 18 | 47 | 31 | 4 |
| పశ్చిమగోదావరి | 11 | 40 | 20 | 5 |
| కృష్ణా | 20 | 23 | 30 | 9 |
| గుంటూరు | 21 | 42 | 26 | 13 |
| నెల్లూరు | 4 | 23 | 11 | 13 |
| కడప | 5 | 26 | 7 | 9 |
| కర్నూలు | 5 | 22 | 11 | 13 |
| అనంతపురం | 9 | 25 | 10 | 15 |
| చిత్తూరు | 14 | 31 | 15 | 6 |
| బళ్ళారి | 11 | 3 | 6 (ఆదోని, రాయదుర్గ తాలూకాలు) | 2 |
| మొత్తం | 134 | 327 | 203 | 101 |

| | |
|---|---|
| మిగిలిన రు. 45 లో డిస్ట్రిబ్యూటరుకు 20% చొప్పున | రు. 9-0-0 |
| ప్రొడ్యూసరుకు | రు. 36-0-0 |
| | రు. 100-0-0 |

పైన ఇచ్చిన పంపకం కొత్తచిత్రము నాలుగువారాలు నడిచేటప్పుడు. పాతచిత్రం గాని, హిందీచిత్రం గాని అయితే హాలు వారికి టాక్సుపోను, 50% పోతుంది.

గొలుసుకట్టు సినిమాహాళ్ళ పద్ధతి (Chain of theatres) ఇతరరాష్ట్రాల్లో కంటె, ఆంధ్రలో తక్కువ. వాటివివరాలు:

1. ప్రసాద్ బ్రదర్సు సర్క్యూట్
వీరికి విశాఖపట్టణం, విజయవాడ, మచిలీపట్నం, గుంటూరు, కడప పట్టణాలలో థియేటర్లున్నాయి.

2. రాజ వెంకట్రామయ్య సర్క్యూట్
వీరికి విజయనగరం, ఏలూరు, గుడివాడ రాజమండ్రి, పట్టణాల్లో హాళ్ళు ఉన్నాయి.

3. సెలెక్టు పిక్చర్సు సర్క్యూట్
వీరికి విజయనగరం, విశాఖపట్నం, విజయవాడ, బందరు పట్టణాలలో హాళ్ళు ఉన్నాయి.

నోటు : అధ్యాయం చివర జిల్లాలవారీ సినిమా హాళ్ళు వివరాలు ఇవ్వబడ్డాయి.

### 4. నిత్యమూర్తి సర్క్యూట్

వీరికి విజయనగరం, విశాఖపట్నం, రాజమండ్రి పట్టణాలలో ప్రతి పట్టణంలోను రెండు హాళ్ళు ఉన్నాయి.

ప్రస్తుతం అమెరికానుండి వస్తున్న 3 D చిత్రాల ప్రదర్శనానికి కావలసిన పనోరమిక్ తెర, శిన్సులు ప్రసాద్ ప్రదర్శ సర్క్యూట్ కుచెందిన విజయవాడ లీలా మహల్ లో మాత్రమే అమర్చబడి వున్నాయి.

## పెట్టుబడులు

నేటికి సినిమా వ్యాపారంలో ఉన్న పెట్టుబడులను యీ విధంగా అంచనా వేయవచ్చు.

ప్రొడ్యూసర్లు (ఆంధ్ర) మొత్తం 38 మంది ఉంటారు. వీరిలో రు. 5 లక్షలు, అంతకు మించిన పెట్టుబడితో వ్యాపారం చేస్తున్నవారు ఐదుగురు మాత్రమే. మిగతా 33 మంది ఐదులక్షలు - 50 వేల రూపాయలమధ్య పెట్టుబడితో వ్యాపారం చేస్తున్నారు. వీరందరు పెట్టిన పెట్టుబడి, 1952 వ సంవత్సరాంతానికి సుమారు ఒక కోటి రూపాయలవరకూ ఉంటుంది.

రాష్ట్రంలో 57 డిస్ట్రిబ్యూషను కంపెనీలున్నాయి. పెట్టుబడులవారీ వీటి వర్గీకరణ ఇలా ఉంటుంది: రు. 20 లక్షల పెట్టుబడితో పనిచేసే సంస్థలు రెండు, రు. 10-5 లక్షలతో పనిచేసే సంస్థలు నాలుగు; 5-2 లక్షల మధ్య వ్యాపారం చేసే కంపెనీలు 14; రు. లక్షలోపు పెట్టుబడితో వ్యాపారం చేసేవి 12; ఇతర కంపెనీలు రు. 25 వేల లోపు పెట్టుబడితోనే వ్యాపారంచేస్తున్నాయి. ఈకంపెనీ లన్నీకలసి డిస్ట్రిబ్యూషన్ వ్యాపారంలో సుమారు కోటి రూపాయలు పెట్టుబడి పెట్టి ఉంటాయని స్థూలంగా అంచనా వేయవచ్చు.

ఒక్కొక్క హాలు రెండు లక్షలు రూపాయలు విలువచేసేవి 202 పర్మనెంటు థియేటర్లు, రు. 25,000 ఖరీదు చేసే పనిచేస్తున్న టూరింగుసినిమాలు 101, మూల పడివున్న టూరింగు సినిమాలు 100 వున్నాయి. వీటి అన్నిటి విలువ సుమారు రు. 4,55లక్షలవరకూ ఉంటుంది.

మదరాసులోని ఆంధ్రుల స్టుడియోలపై సుమారు 75 లక్షల రూపాయల పెట్టుబడి ఉన్నట్లు అంచనా వేయబడు తున్నది.

పైన వివరించిన అంచనాల ప్రకారం 1952 వ సంవత్సరాంతానికి ఫిలిం వ్యాపారంలో పెట్టబడిన మొత్తం పెట్టుబడులు (ఆంధ్రులవి మాత్రమే)సుమారు రు. 7,30 లక్షలుగా అంచనా వేయవచ్చు.

భారతదేశ ఫిలిం పరిశ్రమలోని పెట్టుబడులు, ఆంధ్ర ఫిలిం పరిశ్రమలోని పెట్టుబడులు ప్రక్కపేజీలోని పట్టికలో పోల్చబడ్డాయి:

భారతదేశపు మొత్తం పెట్టుబడులలో ఆంధ్ర పెట్టుబడి నూటికి పదకొండు పాళ్లు వున్నట్లు తేలుతున్నది. దేశం మొత్తంమీద

| వివరాలు | భారతదేశం సంఖ్య | భారతదేశం పెట్టుబడి | ఆంధ్రదేశం సంఖ్య | ఆంధ్రదేశం పెట్టుబడి |
|---|---|---|---|---|
| చిత్రాలు | 230 | ... | 10 | ... |
| స్టుడియోలు | 60 | 6 కోట్లు | 6 | 75 లక్షలు |
| ప్రొడ్యూసర్లు | 300 | 15 కోట్లు | 38 | 2 కోట్లు |
| డిస్ట్రిబ్యూటర్లు | 600 | | 57 | |
| హాలులు | 2000 | 36 కోట్లు | 202 | 4.55 కోట్లు |
| టూరింగులు | 600 | | 201 | |
| పనిచేసేవారు | 90,000 | ... | 6,000 | ... |
| చిత్రాల సరాసరి నిడివి | 12,000 | ... | 16,000 | ... |
| | | 57 కోట్లు | | 7.30 కోట్లు |
| ఎంటర్‌టైన్‌మెంటు టాక్సు 1949-1950 | | 6 కోట్లు | | 38.58 లక్షలు |

నోటు: ఇది 1952 వ సంవత్సరానికి స్థూలమైన అంచనాలు మాత్రమే.

వసూలయ్యే ఎంటర్‌టయిన్‌మెంటు టాక్సు (వినోదపుపన్ను) (1949-50) లో, ఆంధ్రలో వసూలయ్యేపన్ను నూటికి 15 పాళ్ళు ఉన్నది.

భారతదేశానికి దిగుమతిచేయబడిన వివిధ ఫిల్ము సామగ్రుల విలువలు:

| | |
|---|---|
| 'రా' ఫిల్ము | రు. 140 లక్షలు |
| సౌండుసామగ్రి | రు. 12 „ |
| ప్రొజెక్టర్లు | రు. 80 „ |

ఈవిధంగా దిగుమతి అయిన సరుకులమీద వసూలుచేసిన దిగుమతిపన్ను క్రింద, లాభాలపన్ను క్రింద కేంద్రప్రభుత్వానికి సుమారు ఆరుకోట్ల రూపాయలు ఆదాయం వచ్చింది. ఇందులోకూడా, ఆంధ్రనుండి వసూలైనది సుమారు 15% ఉంటుందని అంచనా వేయవచ్చు.

రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో 1952-53 వ సంవత్సరంలో వచ్చిన వినోదపుపన్ను, షోటాక్సు వివరాలు, ప్రక్కపేజీలోని పట్టికలో ఇవ్వబడ్డాయి:

ఈ టాక్సుకి లెక్కలలో ఆదాయంపన్ను, ఇతరస్థానికపన్నులు చేర్చబడలేదు. అవి సుమారు వివిధజిల్లాలలో వసూలుచేయబడుతున్న ఎంటర్‌టెయిన్‌మెంటు టాక్సు అంత ఉంటాయి.

1953 వ సంవత్సరం డిసెంబరు మొదటి తేదీన వెలువడిన ఒక ప్రభుత్వ ప్రకటన ప్రకారం రాష్ట్రంలో ఎంటర్‌టయిన్‌మెంటు టాక్సు రూపేణవచ్చే ఆదాయం

| జిల్లా | ఎంటర్ టెయిన్మెంట్ టాక్సు | షోటాక్సు | షుమారు నెట్ కలెక్షన్లు |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 1,99,472 | 10,585 | 9,97,360 |
| విశాఖపట్టణం | 4,17,337 | 26,885 | 20,86,685 |
| తూర్పుగోదావరి | 5,90,320 | 36,651 | 29,51,600 |
| పశ్చిమగోదావరి | 4,00,552 | 24,845 | 20,02,760 |
| కృష్ణా | 6,36,267 | 39,967 | 31,81,335 |
| గుంటూరు | 6,38,096 | 40,061 | 31,90,480 |
| నెల్లూరు | 2,31,579 | 13,046 | 11,57,895 |
| కడప | 1,14,485 | 7,243 | 5,72,425 |
| కర్నూలు | 1,70,931 | 10,217 | 8,54,655 |
| బళ్ళారి | 2,62,780 | 21,698 | 13,13,900 |
| అనంతపురం | 1,96,941 | 13,988 | 9,84,705 |
| చిత్తూరు | 1,26,448 | 11,350 | 6,32,240 |
| మొత్తం | 39,85,208 | 2,56,538 | 1,99,26,040 |

1952-53 సంవత్సరంకన్న, 1953-54 సంవత్సరంలో 15% తగ్గిపోయిందని వివరించబడింది. విశాఖపట్టణం జిల్లాలో 1952-53 వ సంవత్సరంలో ఈ టాక్సు వల్ల రు. 4.17 లక్షలు వసూలయితే, 1953-54 వ సంవత్సరంలో రు. 3.75 లక్షలుమాత్రమే వసూలైంది. ఈవిధంగా కలెక్షను పడిపోవడానికి మూలకారణం ప్రజల కొనుగోలుశక్తి విపరీతంగా పడిపోవడమే!

## హిందీ, ఇంగ్లీషు చిత్రాల మార్కెట్టు

హిందీ చిత్రాలకు దక్షిణదేశంలో హైదరాబాదు స్టేట్ తర్వాత, ఆంధ్ర మార్కెట్ తో పరితూగగలిగింది లేదు. కలెక్షను తమిళదేశంలో కంటె ఆంధ్రలో హెచ్చు. 1950, 1951, 1952 సంవత్సరాలలో, సంవత్సరానికి 4-5 లక్షల రూపాయల వరకూ ప్రొడ్యూసర్లకు పోతూ వుండేది. సుమారు 20 కేంద్రాలలో హిందీ చిత్రాలకు మంచి కలెక్షను వుండేది. కాని 1953 వ సంవత్సరంలో తెలుగుచిత్రాల మార్కెట్టు మాదిరే హిందీచిత్రాల మార్కెట్టు కూడా దెబ్బతిన్నది. ప్రస్తుతం సంవత్సరానికి హిందీ ప్రొడ్యూసర్లకు ఆంధ్రదేశం నుండి పోయేది సుమారు రెండులక్షల రూపాయలకి మించి వుండదని అంచనా వేయబడుతున్నది.

ఇంగ్లీషు చిత్రాలకు, ఆంధ్రలోని కొన్ని పెద్ద పట్టణాలలో మార్కెట్టు ఉంది. ముఖ్యంగా విజయవాడ, విశాఖపట్నం, గుంటూరులాంటి పట్టణాలలో చాల తరచుగాను, మరి 15 కేంద్రాలలో మ్యాటినీలుగాను ఆడబడుతున్నాయి. 1950-51 వ సంవత్సరంలో సుమారు 75 వేల రూపాయలు, మన జిల్లాలనుండి పోతున్నట్లు అంచనా వేయబడింది. కాని 1952-53 వ సంవత్సరంలో ఈ ఆదాయం లక్ష రూపాయలను మించింది. ప్రస్తుతం కొన్ని చిన్న కేంద్రాలలోకూడా ఇంగ్లీషు చిత్రాలు అప్పుడప్పుడు, ఆడుతూనే ఉన్నాయి. ఈవిధంగా మార్కెట్టు పెరగటంవల్ల, వీటికి వచ్చే ఆదాయం కూడా సహజంగా పెరిగింది. 1949-50వ సంవత్సరంలో భారతదేశంలో ఇంగ్లీషు చిత్రాలద్వారా వచ్చిన ఆదాయం రు. 38,17,610 విదేశాలకు పోయిందని ఫిలిం విచారణ కమిటీ రిపోర్టులో ఉదహరించబడింది.

దక్షిణ భారతానికి అంతటికీ ఇంగ్లీషు ఫిలిములు మదరాసునుండి సప్లయి అవుతున్నాయి.

## 16. m. m. చిత్రాలు

సినిమా ప్రదర్శనాలద్వారా విద్యాబోధన చేయాలని (Audio visual education) 1949 లో ప్రభుత్వం ఒక ఆర్డరు జారీ చేసింది. ప్రయివేటు ప్రదర్శకులకు లైసెన్సులు ఇవ్వబడ్డాయి. ఈ విధంగా లైసెన్సులు పొందినవారు ఎనిమిది మందున్నారు. వీరికి "బొంబాయిలోని ఎడ్యుకేషనల్ ఫిలిమ్సు ఆఫ్ ఇండియా" అనే ప్రభుత్వ సంస్థ చిత్రాలను సప్లయి చేస్తుంది. చిత్రాలన్నీ దాదాపు ఇంగ్లీషులోనే ఉంటవి.

1951 లో 16 m. m. ప్రొజెక్టరును ప్రతి విద్యాలయం కొనాలని ప్రభుత్వం ఆదేశించింది. కాని, చాల తక్కువ సంఖ్యమాత్రమే కొన్నాయి.

ఈ స్కీము, పనిచేయకపోవటంచేత, ప్రదర్శకులు లక్షరూపాయల వరకూ నష్టపోయారు.

# తెలంగాణాలో ఫిలిం వ్యాపారం

ఒకప్పుడు హైదరాబాదులో ఒక ఫిలిం స్టుడియో నిర్మించబడింది. కాని, అది పనిచేయటం మానివేసి చాలకాలమయింది.

హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలో మొత్తం 53 డిస్ట్రిబ్యూటరును కంపెనీలున్నాయి. వీటిలో చాల నామమాత్రపు కంపెనీలే! హైదరాబాదులోని కంపెనీలన్నీ చాలవరకూ, హిందీ చిత్రాలనే డిస్ట్రిబ్యూట్ చేస్తాయి.

గత మూడు - నాల్గు సంవత్సరాలుగా తెలుగు చిత్రాల మార్కెట్టు అభివృద్ధి అవుతున్నట్లు కూడా పెరిగాయి. మొత్తం 65 కేంద్రాలలో తెలుగుచిత్రాలు ఆడబడుతున్నాయి. సుమారు 130 వరకూ సినిమా హాల్సు ఉన్నాయి. వీటిలో 35 హాల్సు ఒక్క హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలోనే ఉన్నాయి.

### అనుబంధ పరిశ్రమలు

ఫిలిం పరిశ్రమకు అనుబంధ సంస్థలుగా లితో ప్రెస్‌లు ఆంధ్రలో పనిచేస్తున్నాయి. వీటికి విజయవాడ కేంద్రం. మద్రాసులో ఆంధ్రులచేత నిర్వహించబడుతున్న రెండు లితో ప్రెస్ లున్నాయి. వీటిలో సుమారు రెండులక్షల రూపాయల పెట్టుబడి ఉంటుంది.

ఇవికాక చేతి లితో ప్రెస్‌లు ఆంధ్రలో వందలున్నాయి. ఈమధ్య పరిశ్రమలో వచ్చిన మాంద్యంవల్ల వీరిలో చాలమంది గట్టిదెబ్బలు తిన్నారు.

## ఫిలిం సంస్థలు

1953 జనవరిలో "ఆంధ్ర ఫిలిం ఛాంబరు ఆఫ్ కామర్స్" ప్రారంభించబడింది. ఇంతవరకూ, దక్షిణ భారత ఫిలిం ఛాంబరులో ఆంధ్రులు వుండేవారు. విజయవాడ కార్యాలయ భవనానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ సి. హెచ్. పూర్ణచంద్రరావు, కార్యదర్శి శ్రీ యస్. కె. ఆర్. అయ్యంగారు.

చిరునామా: కేరాఫ్ రాజ శ్రీ పిక్చర్స్, గాంధీనగరం, విజయవాడ.

### సినీ ఎంప్లాయీస్ అసోసియేషన్

తెలుగు సినిమా పరిశ్రమలో మొత్తం ఆరువేల వరకూ పనిచేసేవారుంటారు. వీరిలో నటీనటులు, టెక్నీషియన్లు, ఆఫీసు పనివారు, రిప్రజెంటేటివులు, సినిమా హాల్సువద్ద ఉండే గేటు కీపర్లు అంతా ఉన్నారు.

ఈ పరిశ్రమలో పనిచేసే కార్మికులకు నిర్ణీతమైన జీతాలు లేవు. ఉద్యోగానికి సెక్యూరిటీ లేదు. ప్రావిడెంట్ ఫండు ఏర్పాట్లు కూడా లేవు.

వీటితోపాటు వివిధ ట్రేడ్ యూనియన్ హక్కుల కొరకు ఆందోళన చేయటానికి ఆంధ్ర సినీ ఎంప్లాయీస్ అసోసియేషన్ ప్రారంభించబడింది.

ఈ సంస్థ అధ్యక్షులు శ్రీ జె. సత్యనారాయణ, కార్యదర్శి పెండ్యాల వెంకటేశ్వరరావు.

## అనుబంధం

## మార్చి 1954 ఆఖరు వరకు విడుదలైన తెలుగుచిత్రాలు

**1931:** భక్తప్రహ్లాద.

**1932:** పాదుకా పట్టాభిషేకం, శకుంతల.

**1933:** పృథ్వీపుత్ర, రామదాసు, ఈస్టిండియా ఫిలిం కంపెనీవారి సావిత్రి, కృష్ణాఫిలిం కంపెనీవారి సావిత్రి, చింతామణి.

**1934:** అహల్య, లవకుశ, సీతాకళ్యాణం.

**1935:** కృష్ణతులాభారం, సక్కుబాయి, కుచేల, హరిశ్చంద్ర, కృష్ణలీల, అనసూయ, ప్రమీలార్జునీయం, కబీరు,

లక్ష్మమ్మకథ, స్వప్న సుందరి, సంసారం, సాయిబాబా, తిరుగుబాటు, వాలిసుగ్రీవ.

1951: ఆకాశరాజు, అగ్నిపరీక్ష, ఆడజన్మ, చంద్రవంక, దీక్ష, జీవితనౌక, మంత్రదండం, మల్లీశ్వరి, మాయపిల్ల, మాయలమారి, నిర్దోషి, నవ్వితేనవరత్నాలు, పాతాళభైరవి, పెంకిపిల్ల, పేరంటాలు, పెళ్ళికూతురు, రూపవతి, సౌదామిని, స్త్రీసాహసం, సర్వాధికారి.

1952: ఆడబ్రతుకు, ఆత్మీయంటికాపురం, ఆకలి, ఆదర్శం, చిన్నకోడలు, చిన్నమ్మకథ, ధర్మదేవత, దాసి, కాంచన, మానవతి, మరదలుపెళ్ళి, ప్రియురాలు, పెండ్లిచేసిచూడు, ప్రేమ, పల్లెటూరు, పేదరైతు, ప్రజాసేవ, రాజేశ్వరి, సాహసం, శాంతి, సంక్రాంతి, సింగారి, సవతిపోరు, టింగ్‌రంగా, ముగ్గురుకొడుకులు, సువర్ణమాల.

1953: అమ్మలక్కలు, అమరకవి, ఆపేక్ష, బ్రతుకుతెరువు, చండీరాణి, దేవదాసు, గుమాస్తా, ఇనస్పెక్టర్, జగన్మోహిని, కోడరికం, కన్నతల్లి, లక్ష్మి, మంజరి, నాతోట్లు, నాఇల్లు, ఒకతల్లి పిల్లలు, పుట్టిల్లు, పరదేశి, ప్రపంచం, పరోపకారం, పిచ్చిపుల్లయ్య, పెంపుడుకొడుకు, ప్రతిజ్ఞ, పక్కింటి అమ్మాయి, ప్రేమలేఖలు, రోహిణి, తండ్రి, వయ్యారిభామ.

1954 (మార్చిఆఖరువరకు) చంద్రహారం, అంతామనవాళ్ళే, రాజీనాప్రాణం, వద్దంటేడబ్బు, పెద్దమనుషులు, చక్రపాణి, నిరుపేదలు.

# చిత్ర నిర్మాతలు

అంజలిపిక్చర్స్: 9 31 ఎల్డామ్స్‌రోడ్, మద్రాసు 18. ప్రొ. ఆదినారాయణరావు.

అశ్వరాజు ప్రొడక్షన్స్: యునైటెడ్ కాలనీ, కోడంబాకం, మద్రాసు 24.

అన్నపూర్ణపిక్చర్సు: 34 థిగ్గిందంబార్ స్ట్రీట్టు, మద్రాసు 17. ప్రొ. మధుసూదనరావు.

ఆనంద్ ప్రొడక్షన్స్: సులివాన్ గార్డన్, మద్రాసు-4.

భరణిపిక్చర్స్: భరణిస్టుడియోస్, కోడంబాకం, మద్రాసు-26. ప్రొ. రామకృష్ణ.

బి. ఎ. సుబ్బారావు ప్రొడక్షన్స్: 8. కన్నడివీధి, మద్రాసు - 4. ప్రొ. సుబ్బారావు.

భాస్కర్ ప్రొడక్షన్స్: 15 విజయరాఘవాచారిరోడ్, మద్రాసు - 17. ప్రొ. కో. భాస్కరరావు.

జనతాప్రొడక్షన్స్: 1. సారంగపాణి స్ట్రీటు, మద్రాసు -17. ప్రొ. సి. హెచ్. నరసింహ.

జంపన అండ్ నంది ప్రొడక్షన్స్: రాయపేట, మద్రాసు - 14.

యమ్. ఆర్. ఎ. ప్రొడక్షన్స్ మిర్జాపూర్‌హౌస్, మద్రాసు - 18. ప్రొ. మిర్జాపురం జమిందారు.

నవయుగ పిక్చర్స్ లిమిటెడ్: హిందీ ప్రచారక్‌వీధి, మద్రాసు - 17.

నేషనల్ ఆర్ట్ థియేటర్: బజుల్లారోడ్, మద్రాను 17.

గోకుల్ కృష్ణా ప్రొడక్షన్స్: 1,10 ముస్తా రెడ్డివీధి, మద్రాను - 17.

అవరిండియా ఫిలిమ్స్: 58, గోపతి నారాయణస్వామిరోడ్, మద్రాను-17.

పీపుల్స్ ఆర్ట్ ప్రొడక్షన్స్: పోరూరు సోమసుందర మొదలిస్ట్రీట్, మద్రాను-17.

ప్రకాశ్ ప్రొడక్షన్సు: కోడంబాకం, మద్రాను-24. ప్రొ. కె. యస్. ప్రకాశ రావు.

ప్రతిభ ప్రొడక్షన్సు: 10 ఆలీవర్ రోడ్, మద్రాస్ 4.

ప్రసాద్ ఆర్టు పిక్చర్స లిమిటెడ్: 46 ఉస్మాన్ రోడ్, మద్రాను - 17. మే. డై. ఎ. వి. ప్రసాద్.

రాజ్యం పిక్చర్స్: నాగేశ్వరాయ నగర్, మద్రాను-4. ప్రొ. లక్ష్మి రాజ్యం.

రాగిణి ఫిలిమ్స్: 127 రాయపేట హైరోడ్, మద్రాను 14.

రోహిణీపిక్చర్స్: 8 గోపతినారాయణ స్వామి రోడ్, మద్రాను - 17. ప్రొ. హెచ్. యమ్. రెడ్డి.

శ్రీ రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీ, 1 బోగ్ రోడ్, మద్రాను-17. ప్రొ. నాగ భూషణం, కన్నాంబ.

సారధి ఫిలిమ్స లిమిటెడ్: 17 బక్కిట్ రోడ్, మద్రాను - 17. ప్రొ. వై. రామకృష్ణప్రసాద్.

శుభోదయ ప్రొడక్షన్స్: మద్రాను-18.

శోభనాచల పిక్చర్స్: లిమిటెడ్: ఆళ్వార్ పేట, మద్రాను 18.

సర్వోదయ పిక్చర్స్: 3 బోగ్ రోడ్, మద్రాను-17.

శోభా పిక్చర్సు: 22 మోతీలాల్ స్ట్రీటు, మద్రాను 17.

సాధనా ఫిలిమ్స్: 32 పారంగపాణి స్ట్రీటు, మద్రాను 17.

యునైటెడ్ ఆర్టిస్ట్సు అండ్ టెక్నిషియన్సు: రాయపేట హైరోడ్, మద్రాను 14.

వాహినీ ప్రొడక్షన్స లిమిటెడ్: కోడంబాకం, మద్రాను 26.

వినోదా పిక్చర్సు: 1 గోపాలకృష్ణ రోడ్, మద్రాను 17,

విజయ ప్రొడక్షన్స లిమిటెడ్: కోడంబాకం, మద్రాను 26.

## తెలుగు చిత్రాలు నిర్మించే ఆంధ్రేతర చిత్ర నిర్మాతలు

ఎ. వి. యమ్. ప్రొడక్షన్సు, కోడంబాకం, మద్రాను-26.

అశోకా పిక్చర్సు: మద్రాను.

అమరా ఫిలిమ్సు: 203. రాజబహాదర్ మొదలియార్ వీధి, మద్రాను-17.

జెమినీ స్టుడియో: కథడ్రల్ మద్రాను-6.

జయంతి ప్రొడక్షన్స్: 5 విజయరాం రాడ్ మద్రాను-17.

జూపిటర్ పిక్చర్స్: మంగళ విలాస్, మద్రాను 4.

కృష్ణా పిక్చర్సు: 28, అరుణాచలం చెట్టి రోడ్, మద్రాను 17.

మోడరన్ థియేటర్సు లిమిటెడ్: సేలం.

మనోహర పిక్చర్ ప్రొడక్షన్సు: 3, గార్డన్ స్ట్రీటు, మద్రాను 14.

# ఆంధ్రలో ప్రథమంగా నిర్మించబడి

## గత 34 సం॥ల నుంచి

## ఒకే యాజమాన్యంక్రింద నడుస్తున్న ఉత్తమ థియేటరు






ప్రొ॥ శ్రీ పోటిన శ్రీనివాసరావు

పెవ్ వర్క్సు, బొంబాయివారి 'ప్రవ్‌జాక్' ఫర్నిచరు అమర్చిన ఒక్కటే ఆడిటోరియం



వినోదాన్ని, విజ్ఞానాన్ని, ఉల్లాసాన్ని కలిగించు ఉత్తమ చిత్రాలను
ప్రదర్శించు ఉత్తమ థియేటర్

నాగూరు సినీప్రొడక్షన్స్: 21మండపం వీధి, మద్రాసు-10.

నరసు పిక్చర్సు సర్క్యూట్, నరసు నగరు, మద్రాసు 15.

పక్షిరాజా ప్రొడక్షన్స్: కోయంబత్తూరు.

పద్మనాథ పిక్చర్సు: 15 రామానుజం రోడ్, మద్రాసు-17.

## స్టుడియోలు

**వాహినీ స్టుడియోస్ :**

ఆర్కాట్ రోడ్డు, కోడంబాకం, మదరాసు-26, ఫోన్ : 88164, 88525. మేనేజింగ్ డైరెక్టరు: బి. నాగిరెడ్డి. ఆరుఫ్లోర్సు ఉన్నాయి.

**రోహిణీ స్టుడియో :**

కోడంబాకం, మదరాసు 26. ప్రొ. హెచ్. యం. రెడ్డి.

**స్టార్ కంబైన్సు :**

కోడంబాకం. మదరాసు-26. ఫోన్: 88506. మేనేజింగ్ డైరెక్టరు: ఎ. రామయ్య.

**శోభనాచల స్టుడియో :**

తేనాంపేట, మదరాసు - 18. ఫోన్ : 8359. మేనేజింగ్ డైరెక్టరు: రాజా సాహెబ్ ఆఫ్ మీర్జాపూరు. మూడుఫ్లోర్సు ఉన్నాయి.

**ప్రకాష్ స్టుడియో :**

కోడంబాకం, మదరాసు-26. ఫోన్ : 88580, ప్రొ. కె. యస్. ప్రకాశరావు. రెండు ఫ్లోర్సు ఉన్నాయి.

**భరణి స్టుడియో :**

సాలిగ్రామం, మదరాసు-26. ప్రొప్రైటరు, రామకృష్ణ.

## విజయవాడలోని డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలు

**పూర్ణా పిక్చర్సు లిమిటెడ్, గాంధీనగరం**

సంస్థాపకుడు శ్రీ జి. కె. మంగరాజు, మేనేజింగ్ డైరెక్టరు శ్రీ జి. కామరాజు. ఈ కంపెనీవారు ఇప్పటికి నూరు బిలిన్ కాపీ చిత్రాలను డిస్ట్రిబ్యూట్ చేశారు.

**వాహినీ పిక్చర్సు లిమిటెడ్, గవర్నరుపేట**

వాహినీ ప్రొడక్షన్సువారి చిత్రాలన్నీ వీరే డిస్ట్రిబ్యూట్ చేస్తారు. 12 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేశారు.

**చన్ద్రియాడిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ, గవర్నరుపేట**

ప్రొప్రయిటర్లు మోతీమహల్ థియేటర్సు లిమిటెడ్, కలకత్తా. జనరల్ మేనేజర్ శ్రీ సుందరలాల్ నహాతా. ఈ కంపెనీవారు యిప్పటికి దాదాపు 200 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేశారు.

**విజయ పిక్చర్సు, గాంధీనగరం**

మేనేజింగ్ పార్టనర్ పూర్ణచంద్రరావు. జనరల్ మేనేజరు, డి. సత్యనారాయణ. వీరు విజయ ప్రొడక్షన్సు, ఏ. వి. యం.

ప్రొడక్షన్సువారి చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేస్తారు. ఇప్పటికి 20 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేశారు.

నవయుగ ఫిలిమ్సు, గాంధీనగరం

మేనేజింగ్ పార్టనర్ శ్రీ కాట్రగడ్డ శ్రీనివాసరావు. జనరల్ మేనేజరు శ్రీ వి. చంద్రశేఖరరావు. వీరు 50 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేశారు.

జనత పిక్చర్సు, గాంధీనగరం

మేనేజింగ్ పార్టనర్ శ్రీ వి. గోపాలరావు, మేనేజరు డి. వెంకట్రామయ్య, 5 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేశారు.

రాజశ్రీ పిక్చర్స లిమిటెడ్, గాంధీనగరం

డైరెక్టర్ శ్రీ సుందర్‌లాల్ నహతా, మేనేజర్ శ్రీ యస్. కె. యన్. అయ్యంగార్. వీరు యిప్పటికి 50 చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేశారు.

మిత్రా డిస్ట్రిబ్యూటర్స, గాంధీనగరం

మేనేజింగ్ పార్టనర్-డాక్టర్ పి. రామచంద్రారెడ్డి. మూడు తెలుగు చిత్రాలున్నాయి. ప్రస్తుతం కొన్ని రివ్యూస్ చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేస్తున్నారు.

ప్రీమియర్ పిక్చర్స లిమిటెడ్, గాంధీనగరం

మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ కోనాలమూడి భాస్కరరావు, దాదాపు 10 చిత్రాలు వున్నాయి.

శాంతి పిక్చర్స, గాంధీనగరం

మేనేజింగ్ పార్టనర్ శ్రీ పద్మనాభరావు. 5 చిత్రా లున్నాయి.

ప్రభాత్ పిక్చర్స లిమిటెడ్ గాంధీనగరం

మేనేజింగ్ డైరెక్టరు శ్రీ కొండపల్లి వెంకటరెడ్డి. మేనేజరు శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావు, 5 చిత్రా లున్నాయి.

భారత్ పిక్చర్స, గాంధీనగరం

మేనేజింగ్ పార్టనరు శ్రీ బి. అత్తయలింగం. వీరు హిందీ చిత్రాలు డిస్ట్రిబ్యూట్ చేస్తారు.

భవానీ పిక్చర్సు, నిడదవోలు

మేనేజింగ్ పార్టనర్ శ్రీ రాఘవరావు. 5 చిత్రాలున్నాయి.

వినోదా పిక్చర్సు సర్క్యూట్, గాంధీనగరం

మేనేజింగ్ పార్టనర్ శ్రీ ఆర్. బుచ్చిబాబు, మేనేజరు శ్రీ రామమోహన్. 4 చిత్రాలున్నాయి.

నేషనల్ ఆర్ట్సు డిస్ట్రిబ్యూటర్స, గాంధీనగరం

మూడుచిత్రాలున్నాయి.

రాధాకృష్ణ ఫిలిమ్సు, గాంధీనగరం

సెలెక్టు పిక్చర్సు సర్క్యూట్, గాంధీనగరం

జనరల్ ఫిలిం డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ, గాంధీనగరం.

కుష్వీన్ పిక్చర్స కార్పొరేషన్, గవర్నరుపేట.

మహాలక్ష్మిపిక్చర్సు, గాంధీనగరం.

దుర్గాఆర్ట్సుపిక్చర్సు, గాంధీనగరం.

గీతా ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు, గాంధీనగరం.
గోకుల్ కృష్ణాఫిలిమ్స్, గాంధీనగరం
నరసు పిక్చర్సు లిమిటెడ్, గాంధీనగరం.
శ్రీనివాస ఫిలిమ్స్, గాంధీనగరం.
స్టాండర్డు పిక్చర్సు, గాంధీనగరం.
సిగల్ టాకీ డిస్ట్రిబ్యూటర్సు, గాంధీనగరం.
నారాయణపిక్చర్సు, గాంధీనగరం.
వేణుగోపాల పిక్చర్సు, గాంధీనగరం.
సిల్వర్ స్క్రీన్, గాంధీనగరం.
ఫెయిర్ ప్లే పిక్చర్సు, గాంధీనగరం.
పద్మ పిక్చర్సు, గాంధీనగరం.
శ్రీ సీతారాం పిక్చర్సు, గాంధీనగరం.
సరస్వతీ ఫిలిమ్సు, గాంధీనగరం.

గుంతకల్‌లో డిస్ట్రిబ్యూటర్సు

పూర్ణా పిక్చర్సు లిమిటెడ్, చంద్రిరయా టాకీ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ, విజయ పిక్చర్సు, నవయుగ ఫిలిమ్స్, భవానీ పిక్చర్సు, రాజశ్రీ పిక్చర్సు లిమిటెడ్, మహాత్మా పిక్చర్సు, భారత్ పిక్చర్సు, శాంతి పిక్చర్సు.

# తెలుగువారి చిత్రకళ

## శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి

అది తొలిసంజ. తరిపి వెన్నెలలోని తెలుపు ప్రదనం అనే సున్నం, చివరి చీకటి అనే కాటుక, తొలిసంజ కెంజాయ అనే జేగురు, అరవిడిచిన తామర మొగ్గలలోని పుప్పొడి అనే అరదళం, ఈ రంగులతో రేయి వైదొలగుతున్న ఆ సమయంలో జగత్తును చిత్రించడానికి ఎత్తిన కుంచెలాగ మామాగు కొడకు ఎంత పొడసూపింది అని శ్రీనాథ మహాకవి సూర్యోదయాన్ని వర్ణించాడు.

శ్రీనాథుని కాలంలో తెలుగు చిత్రకారులు సున్నం, జేగురు, కాటుక, అరదళం బొమ్మలకు రంగులుగా వాడేవారు. కాలక్రమేణా రంగులకు ఈ మూడి పదార్థాలు మారవచ్చును. తూలికలు కట్టే వ్యవహారం మారవచ్చును. కాని బొమ్మ వేసేది, గీయించేది ఆది మానవుని నుంచి ఆధునిక మానవుని వరకూ ఒకటే.

చరిత్ర కావలినాటి కళ ఎట్టిదో మనకు ఆనాటి పూసలలోనూ, నగిషీ చెక్కిన కుండ పెంకులలోనూ, పెంకు బొమ్మలలోనూ గోచరిస్తుంది.

ఏమయినా మనకు నిర్దిష్టంగా విప్పి చెప్పడానికి మిగిలిన కళాఖండాలు బౌద్ధయుగం నాటివే. అంతకు పూర్వపు కళాఖండాలన్నీ కాలగర్భంలో కలిసి పోయాయి. అయితే కరకు రాలమీద చెక్కిన శిల్పాలు కాలపు ఆటుపోటులకు తట్టుకొని ఏ కొద్దిగానో మిగిలాయి కాని చిత్రాలు మాత్రం ఒక్క అజంతా తప్ప మరెక్కడా మిగలలేదు. “శిల్పాలన్నింటికీ చిత్రమే మూలం” అని భోజ మహారాజు అన్నట్లు శిల్పకళకన్న పూర్వమే ఉద్భవించిన చిత్రకళ బౌద్ధయుగపు తొలి రోజులలో ఎలాగ ఉండేదో తెలుసుకొనడానికి వీలులేకుండా పోయింది.

కళలు కాని కవిత్వం కాని పుట్టి పెరిగి కొంత వ్యాప్తిలోకి వచ్చినమీదట వాటికి లక్షణాలను నిర్ణయించి సూత్రబద్ధం చేసి శాస్త్రాలు రచించడం పరిపాటి. మన దేశంలో చిత్రకళను శాస్త్రబద్ధం చేయడం బౌద్ధయుగారంభంలోనే మొదలైంది. క్రీస్తుశకానికి అటు ఇటుగా ఉన్న భరతముని నాట్యశాస్త్రంలో చిత్రకళా ప్రసక్తి ఉంది. వాత్స్యాయన కామసూత్రాలలో చిత్రశాస్త్రాల సంగతి ఉంది. ఆ రోజులలోనే చిత్రలక్షణం అనే గ్రంథం వెలిసింది. విష్ణు పురాణంలోనూ, వరాహమిహిరుని బృహత్సంహితలోనూ, చిత్రకళను గురించిన కొన్ని అధ్యాయాలు రచింపబడ్డాయి. గుప్తరాజుల కాలంలో శిల్పరత్నము అనే గ్రంథం తయారయింది. ధారానగర రాజాభోజుడు “సమరాంగణ సూత్రధార” అనే పేరుతో వాస్తుశాస్త్ర

గ్రంథం రచించి అందులో చిత్రకళా పద్ధతులను పేర్కొన్నాడు. సోమేశ్వర దేవుడనే చాళుక్యరాజు "మానసోల్లాసం" అనే పేరుతో ఒక చిన్న విజ్ఞాన సర్వస్వం లాంటి గ్రంథం రచించి చిత్రలక్షణాన్ని కూడా అందులో ఉల్లేఖించాడు.

ఈ శాస్త్రగ్రంథాలను పట్టి చూసినా, నాటి కావ్యాలు, నాటకాలు, ఇతర సర్వ గ్రంథాలను చూసినా చిత్రకళ మహోచ్చ స్థితిలో వుండేదని ప్రజాజీవనంలో దానికొక ప్రధానస్థానం ఉండేదని తెలుస్తుంది. పండుగలువస్తే నగర వీధులకు ఇరువైపులా తడికలతో దడులుకట్టి, ఆదడులపైన బొమ్మలుగీసి,నగరాన్ని రంగు రంగుల జెండాలతో అలంకరించేవారని "మహా ఉమ్మగ్గ జాతకం" కథలలో వర్ణింపబడింది. "నఖులు" అనే ఒక తెగ బ్రాహ్మణులు పాపు లనుభవించే నరకాన్ని, పుణ్యాత్ములు అనుభవించే స్వర్గాన్ని చిత్రించి ఊరూరా తిరిగి ఆ చిత్రాలను ప్రదర్శించేవారని "సారార్థ ప్రకాశిని" అనే బౌద్ధగ్రంథంలో ఉంది. ప్రతి నగరంలోనూ గొప్పగొప్ప "చిత్రాగారా"లు (చిత్రాగారాలు) ఉండేవని ప్రజలు పల్లెలనుంచి బండికట్టుకొని వచ్చి వాటిని చూసేవారని బౌద్ధగ్రంథాలలో వర్ణన లున్నాయి.

బౌద్ధవాఙ్మయంలో చిత్రకళా ప్రసక్తి ఇంత గొప్పగా ఉన్నప్పుడు బౌద్ధయుగంలో ఆంధ్రదేశం చిత్రకళలో ఉచ్చస్థాయి నందుకొని వుండాలి. ఆంధ్రప్రాంతంలో ఉన్నన్ని బౌద్ధావశేషాలు మరే ప్రాంతంలోనూ దొరకావు. కనుక బౌద్ధమతంతోపాటు చిత్రకళ, చిత్రకళతోపాటు శిల్పం ఇక్కడ అవారదు పారం ముట్టాయి అని చెప్పవచ్చును.

ఆంధ్రదేశంలోని అమరావతీశిల్పము ఇతర దేశాలకు వరవడి పెట్టింది. సింహళం, బర్మా, సయాం, జావా, చైనా, జపాను దేశాల కళలకు అమరావతి మేలుబంతి అయింది. అమరావతి శిల్పాలలోని రేఖాసౌష్ఠవం, భంగిమల సౌకుమార్యం దానికి సమకాలీనమైన అజంతా చిత్రాలలో గోచరిస్తుంది. అమరావతిలో పలనాటిపాలరాతినిమలిచిన చేతులే అజంతా గోడలమీద రేఖలుదిద్దాయా అనిపిస్తుంది. అందుకని అనాటి తెలుగు చిత్రకారుల కళాకౌశలాన్ని అమరావతిని అజంతానుచూసి మనం ఊహించవచ్చును.

ప్రతిజాతి కళలోనూ ఒక జాతీయత, విశిష్టత, ఒక ప్రత్యేకశైలి ఉంటాయి. అలాగే అనాటి ఆంధ్రచిత్రకారునికి ఒక ప్రత్యేకజాతీయశైలి, జాతీయతా ఉండి ఉండాలి. సాధారణంగా ఒక కళారూపానికి పనిముట్లు శైలిని నిర్ణయిస్తాయి. భావాలు జాతీయతను నిర్ణయిస్తాయి. అయినప్పుడు నాటి తెలుగుచిత్రకారుని రచనావిధానాన్ని ఊహల పోకడలను తెలుసుకొన వలసిన అవసరం ఉంది.

మానవుని అనుభవాలు కరిగి కరిగి ఊహలుగా మారుతాయి. ఊహలు ఘనీభవించి అనుభవాలుగా మారుతాయి. ఇలాగ ఊహలు అనుభవాలుగాను, అనుభవాలు ఊహలుగాను నిరంతరంగా చెందే పరివర్తనే మానవుని చరిత్ర. ఈ పరివర్తనకు దోహదం చేసేది కళ.

ప్రజల ఊహాపోహలను ఆలోచనలను మార్చడానికి బౌద్ధులు తమ ఊహలను కథలలో గాథలలో పాటలలో పదాలలో

ఆటలలో నాటకాలలో చూపించి, రాళ్లలో మలిచి, రంగులలో చిత్రించి బ్రహ్మాండమైన ప్రచారం సాగించారు. ఆతర్వాత బౌద్ధంపై పైచెయ్యిగన్న బ్రాహ్మణమతం తానుకూడా వేళ్ళూనుకొని నిలదొక్కుకోవాలంటే ఇన్ని కళారూపాలనూ చేపట్టవలసిన అవసరం ఉందని గ్రహించింది. బౌద్ధకళారూపాలను అందినంతవరకూ ధ్వంసంచేసి, వాటి స్థానే తన భావాలను ప్రతిబింబించే కళారూపాలను నెలకొల్పింది. అయితే ఈ పరిణామంవల్ల ప్రత్యామ్నాయక భావరూపంలోనే ఎక్కువ ఏర్పడిందికాని భౌతికరూపాలు అంతగా మారలేదు. కాబట్టి బ్రాహ్మణమత విజృంభణ ప్రాథమిక దశలో తయారైయిన చిత్రలక్షణ గ్రంథాలలో పేర్కొన్న చిత్రరచనా పద్ధతి బౌద్ధయుగంనాటి పద్ధతికి భిన్నం కాలేదు. అనేక సామ్రాజ్యాలు మారినా మతాలుమారినా శతాబ్దాలుగా మనదేశంలో కొయ్యనాగలిమాత్రం మారనట్లు బౌద్ధాన్ని బ్రాహ్మణమతం జయించినా చిత్రకారుల పనిముట్లు, చిత్రరచనా పద్ధతిమాత్రం మారలేదని మనం స్పష్టంగా నిర్ణయించవచ్చును.

ఈ చిత్రలక్షణ గ్రంథాల ప్రకారం చూస్తే ఆనాడు నాలుగురకాల చిత్రాలుండేవని తెలుస్తుంది. ఒకటి గోడలమీద చిత్రించే "కుడ్యచిత్రం" బట్టపైన చిత్రించినవి "చిత్రపటాలు" కొయ్యపలకలపైన అట్టలపైన చిత్రించేవి "చిత్రఫలకాలు" ఇదికాక రంగురంగుల పిండితో పెట్టే ముగ్గులు "ధూళిచిత్రాలు".

సున్నం మన్ను నార వెల్లుల్లి పెసరకట్టు అరటిపళ్ళు జిగురు మొన్నగు పదార్థాలు కలిపి ఊరవేసి దాన్ని గోడపైన పూతపూసేవారు. తోళ్ళను గుజ్జుగాగ ఉడకబెట్టి వడకట్టి తీసిన దానికి "వజ్రలేపం" అని పేరు. ఈవజ్రలేపమూ కొన్నిజిగురులూ, సున్నం, బెల్లం, పెసరకట్టు వగైరాలతో పైపూత ఇచ్చి దానికి మెరుగుపెట్టి ముందు రేఖలు గీసేవారు. పదునైన చాకుతో ఆ రేఖలను లోతుగాగీసి ఆపైన రంగులు పూసేవారు. కాలక్రమేణా బొమ్మలరంగు వెలసిపోయినా, గాలిపోయినా లోతుగీతలలో చేరిన రంగు పోయేదికాదు కాబట్టి రేఖలు చెరిగేవికావు. ఆ రేఖల ఆధారంతో తిరిగి రంగులు వేయుదానికి వీలుండేది. చిత్రపటాలకు, చిత్రఫలకాలకుకూడా ఇలాంటి పైపూతలే పూసి, ఆ తర్వాత రంగులు వేసేవారు. గేరుకు, ఇంగిలీకం, అన్నభేది, మంజిష్ఠ, గంధకాగింజలు, కొన్ని పువ్వులు, శంఖచూర్ణం, సత్తు, ఇనుము, సీసం, బంగారం, పచ్చలు, అరదళం, రంగుమన్నులు, లక్క, తేనె, మైనం, అందుగుబంక, వేపజిగురు మొదలైన వాటిని రంగులకు పయోగించేవారు.

ఈ ఎత్తు ప్రదేశాలలో లేతరంగు, లోతుగల ప్రదేశాలలో ముదురురంగు యిచ్చి వెలుగునీడలను కల్పించే క్రియకు "వర్తన" అని పేరు. చిత్రకళాచార్యులు రేఖ స్ఫుటంగా వుందా లేదా అని చూసేవారట. రసికులు వర్తన చూసేవారు. ఇతరులు వర్ణగాంభీర్యాన్ని చూసేవారు. ఈ మూడు లక్షణాలూగల చిత్రం ఉత్తమ చిత్రంగా పరిగణింపబడేది. అదికాక "కెరటాలు, మంటలు, పొగ, గాలిలో అల్లలాడే కేతనాలూ మొదలైన చైతన్య

నిరూపకాలను చిత్రించినవాడే ఉత్తమ చిత్రకారు డనిపించుకొనేవాడు.

ఏమయినా నాటిరంగులు ఒక పూత పైన ఇంకొక రంగుపూత చాలికవల్ల మాత్రమే కనబడి, రంగులోరంగు కలిసి పోయేందుకు వీలుగా వుండేవికావు. అందు కని 'వర్తన' సాధించడం చాలాకష్టతరంగా వుండేది. 'వర్తన'ను సాధించడానికి చిత్ర శాస్త్రకారులు మూడుపద్ధతులు చెప్పారు. ఒకటి "పత్రకం" అంటే లోతు చూపించ వలసినచోట ముదరరంగుతో సన్ననిగీతలు గీయడం; మరొకటి "బిందుకం" గీతలకు బదులుగా చుక్కలుపెట్టడం; మూడవది "ఐరికం" ఇది రంగును క్రమానుగతంగా అద్దడం. ఈ ఐరిక పద్ధతి కొన్ని కొన్ని చోట్ల మాత్రమే సాధ్యమయ్యేది. అందు కని చాలాభాగా వస్త్రలేపం చదునుగానే ఉండవలసి వచ్చేది. కాబట్టి నాటి చిత్రకారులు రేఖను పెంపొందించుకొని ఎత్తుపల్లాలను, కండరాల బిగిని, జిగిని రేఖలలోనే చూపించడానికి పాటుపడ వలసి వచ్చింది. పనిముట్లు కల్పించిన ఈ పరిమితులవల్ల అజంతా చిత్రాలలో రేఖా లాలిత్యం, చదునైన వస్త్రలేపం ఉంది. పనిముట్లు ఏర్పరచిన ఈ పరిమితికే "భారతీయ శైలి" అని ఆధునిక విమర్శ కులు పేరుపెట్టారు. ఆధునిక చిత్రకారులు చాలామంది ఆ శైలిలో "జాతీయత" ఉన్నదని దాన్నే ఈ రోజుల్లో అవలం బిస్తున్నారు.

అమూర్తభావాలకూ ఊహాలకూ కూడా రూపకల్పనచేయడం మానవుని అలవాటు. అయితే ఆనాటి బౌద్ధశిల్ప అమూర్తభావాలకూ ఊహాలకు ప్రత్యేకం అట్టేలేదు. ఒకనాడు తన మధ్య తిరిగిన బుద్ధునికీ, ఎక్కడో స్వర్గాలలో ఉండే బోధిసత్వులకూ అట్టే రూపభేదంకల్పించలేదు. బుద్ధుని బులిపించ వచ్చిన మారునికీ, అతని పరివారానికీ, తన మధ్యనే నడయాడే నరులకూ భేదంఎక్కువ లేదు. కాగా అలంకరణ కోసం సృష్టిం చిన వల్లికలలో బొమ్మకూ బొమ్మకూ మధ్యగల "పరస్థలాలు" అంటే ఖాళీలలో చిత్రించే మనుగుజ్జులు వింత జంతువులలో మాత్రమే కొంచెం లోకంలో కనిపించే వాటికి భిన్నంగా వుండే ఆకారాలను కల్పించారు. గాదయుగంలో ప్రజలను ప్రకృతిని తన కళకు ప్రమాణంగా తీసు కొనే "లోకదృష్టి" ఎక్కువ ప్రాధాన్యం వహించింది. కాని - సంఘంపై బ్రాహ్మణ ధర్మ ఆధిపత్యం నెలకొనడంతో కంటికి కనరాని పరలోకం పాపం, పుణ్యం ప్రధాన పాత్రలు వహిం చాయి. మనిషితల గుర్రం శరీరం గల కిన్నరులు, నానా జంతు ముఖాలు గల రాక్షసులు, అనేక శిరస్సులు బాహువులు గల దేవతలు అవతరించారు. భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం, సముద్రం, కొండలు, అడవులు, నదులు అన్నీ నిర్ణీత ఆయుధాలు వాహనాలతో మానవ రూపాలు ధరించాయి. దేవతల సరంజామా ఎక్కువ అయి కొన్ని దేవతల స్థానే సంకేతాలు, చిహ్నాలు సింహాసన మధిష్టిం చాయి. ఈ దశలో కళలకు లోకం ప్రమా ణం అనడం ప్రమాదకరమైంది. అందుకని కట్టుబాట్లు, ప్రమాణాలు, కొలబద్దలు లక్షణాలు ఏర్పడి కళకు లోకధర్మం కాక, "శాస్త్రధర్మం" అవలంబించింది.

లోకధర్మంనుంచి శాస్త్రధర్మానికి తెలుగుకళ పరివర్తనమైన దశలో వెలు వడిన శిల్పాలే మనకు ఆధారాలుగావున్నాయి.

...ంథ మన తెలుగు ఆడపడుచులకు చిత్ర కళా కౌశలం ఉగ్గుపాలతో వచ్చిందా అనిపిస్తుంది.

జాతీయోద్యమంతోపాటు ప్రారంభమైన కళా పునరుజ్జీవనంలో మనదేశంలో తిరిగి చిత్రకళాభిమానంకూడా మొలకెత్తింది. జాతీయోద్యమంలాగే ఈ ఉద్యమానికికూడా వంగదేశమే పుట్టిల్లు. ఈ ఉద్యమ ప్రభావంవల్ల యావద్భారత కళాకారులదృష్టి అజంతామీద ప్రసరించింది. భారతజాతీయకళకు అజంతా ఆదర్శంగా నిలిచింది.

రాజమండ్రి కళాశాలాధ్యక్షుడు కూల్డ్రే గారి ప్రోత్సాహంతో శ్రీ దామెర్ల రామారావు బొంబాయివెళ్ళి పాశ్చాత్య కళాసంప్రదాయాలను అభ్యసించుకొని తిరిగి వచ్చారు. పశ్చిమకళలోవుండే స్వాభావికతనూ, అజంతా రేఖామార్దవాన్నీ మేళవించి దానిలో తెలుగుదనాన్ని సంతరించి శ్రీ దామెర్ల రామారావుగారు చిత్రరచనకు ఉపక్రమించారు. కాని ఆయన చిన్నప్రాయంలోనే కీర్తిశేషుడై తెలుగుదేశానికి తీరని కొరత కల్పించారు. ఇప్పుడు శ్రీ వరదా వెంకటరత్నంగారు రామారావుగారి శైలిలో చిత్రరచన చేస్తున్నారుకాని రామారావుగారు కల్పించిన పరిశోధనాలను మాత్రం ఎవరూ అందుకోలేకపోయారు.

బందరు జాతీయ కళాశాలలో శ్రీప్రమోదకుమార ఛటోపాధ్యాయ కేవల రేఖాప్రాధాన్యంగల చిత్రకళ బోధించడం ప్రారంభించారు. ఆయనవద్ద శిక్షణ పొందినవారిలో అడివి బాపిరాజుగారు మాత్రం అటే జాతీయ కళాశాలకు అధ్యక్షత వహించి రేఖాశైలిలో కొందరికి తర్ఫీదు ఇచ్చారు.

ఈ పునరుజ్జీవనోద్యమంలో కళా రచనతోపాటు జాతీయ కళా ప్రచారం కూడా విరివిగా సాగింది. పెర్సీబ్రౌన్ రాసిన భారతీయ చిత్రకళ అనే గ్రంథాన్ని తలిశెట్టి రామారావుగారు అనువదించారు. కృష్ణా పత్రికలో శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు భారతీయ చిత్రకళ మీద వ్యాసపరంపర ప్రకటించారు. శ్రీ రాజమన్నారుగారు స్థాపించిన «కళ» అనే పత్రికలో శ్రీ సువ్వారి రామిరెడ్డిగారు అనేక వ్యాసాలు రాశారు. శ్రీ బాపిరాజుగారు దేశం ఆమూల నుంచి ఈ మూలవరకు ప్రతి నగరంలోను చిత్రకళపై ఉపన్యాసాలిచ్చారు. అనేక వ్యాసాలు కూడా రాశారు. శ్రీ సూర్యదేవర సంజీవదేవుగారు చిత్రకళా విమర్శకులలో అగ్రగణ్యులు. వీరిప్పటికీ కళా విమర్శక వ్యాసాలు రాస్తున్నారు. ఈ ప్రచార ఫలితంగా యువకులలో జాతీయ కళాభిమానం రేకెత్తింది. కాని అజంతాను, నటరాజా మున్నగు శిల్పాలను జాతీయకళకు ఆదర్శంగా పెట్టుకొనడంవల్ల, నాటి చిత్రకారులలో విషయ విస్తృతి లేకుండా పోయింది. బుద్ధుడు, శివపార్వతి, చంద్రశేఖరుడు, రతీమన్మథులు, రాధాకృష్ణులు ఇవే ప్రతి చిత్రకారునికీ చిత్రణీయ విషయాలు.

అటు మద్రాసులో శ్రీ దేవీప్రసాద రాయ్ చౌదరి అధ్వర్యానగల చిత్రకళాశాలలో చాలామంది యువకులు శిక్షణ పొందారు. శ్రీ రాయ్ చౌదరి చిత్రశిల్ప సవ్యసాచి. ముఖ్యంగా శిల్పంలో సాటిలేని మేటి. ఆయన శిల్ప అవతరంవల్ల దేహపుష్టి

శాసనాలను పరిశోధించి, వ్యాసాలు ప్రచురిస్తూ వచ్చింది.

ఆంధ్రదేశంలో పురావస్తు సంపద రక్షణకు ప్రప్రథమ కృషి 1818 లో ప్రారంభమైంది. అమరావతి స్తూపానికి చెందిన పాలరాతి పలకలను కాల్చి స్థానిక జమీందారుగారి భవననిర్మాణానికి సున్నం తయారు చేస్తూవుంటే కర్నల్ మెకంజీ గారు అడ్డుపడి వాటి రక్షణకు పూనుకొన్నారు. అప్పటికి సున్నంకాగా మిగిలివున్న పలకలు, వాటిపైనగల శిల్పాల ఆధారంతో మొత్తం మహాచైత్య స్వరూపాన్ని చిత్రించగలిగారు. మహోన్నతమైన అమరావతి స్తూపం, మహాచైత్యాల గాథలు ఇంగ్లీషు పురాతత్వశాస్త్రజ్ఞులను ఆకర్షించాయి. అందుకని అమరావతిలో దొరికిన శిల్పఫలకాలలో అధికభాగం లండనుకు తరలించబడ్డాయి.

నాటినుంచి క్రమంగా ఆంధ్రదేశంలో పురాతత్వ ప్రాధాన్యం గల ప్రదేశాలలో పరిశోధనలు ప్రారంభం అయినవి. కాని ఒక పద్ధతిప్రకారం పరిశోధనలు జరిగినది 1874 తర్వాతనుంచేనని చెప్పాలి.

ఆంధ్రదేశంలో ఆదిమ చారిత్రిక అవశేషాలు బౌద్ధమతానికి సంబంధించినవేనని చెప్పవచ్చు. అతి ప్రాచీనమైన శివాలయం భట్టిప్రోలులో ఉంది.

ఆంధ్రదేశంలో లభించిన బౌద్ధ అవశేషాలన్నీ ప్రాచీనమైనవే అయినా అవి అశోకునికి ఇటీవలివే కాని, అంతకు పూర్వపువి కావని పురాతత్వ శాస్త్రజ్ఞులు నిర్ణయించారు.

అశోకుని శిలాశాసనాలు ఎర్రగుడిపాడు, గుత్తిదగ్గర గల ఒక కొండమీద కనిపించాయి. ఈ గుత్తికొండమీద ఇప్పుడు ఒక శివాలయం ఉన్నది.

ఆంధ్రదేశంలో లభించిన శాసనాల్లోకెల్లా అతి ప్రాచీనమైనది భట్టిప్రోలు శాసనం. ఈ శాసన లిపికి దక్షిణ అశోక బ్రాహ్మీలిపి అని పండితులు నామకరణం చేశారు. ఈ లిపినుంచే తెలుగు లిపి పుట్టిందని కూడా వారంటున్నారు. ఈ శాసనం క్రీస్తుశకం 3 వ శతాబ్ది నాటిది.

ఆంధ్రదేశంలో బౌద్ధావశేషాలు అటు ఉత్తరాన శాలిహుండాం మొదలు దక్షిణాన చినగంజాం వరకూ, ఇటు తూర్పున భట్టిప్రోలు మొదలు పశ్చిమాన గుత్తి వరకూ కనిపిస్తాయి. ఇన్ని చారిత్రక ప్రదేశాలు, ముఖ్యంగా బౌద్ధయుగానికి చెందిన ప్రదేశాలు, భారతదేశంలోని మరే రాష్ట్రంలోనూ కానరావు.

రామతీర్థం, సంఘారామం, కొడవల్లి, ఆరుగోలను, గుంటుపల్లి, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, అల్లూరు, బెజవాడ, గుడివాడ, ఘంటసాల, అమరావతి, నాగార్జునకొండ, చేజెర్ల, గరికపాడు, గోలి, పెదమద్దూరు, పెదగంజాం, చినగంజాం, కనుపర్తులలో బౌద్ధావశేషాలు దొరికాయి.

ఇందులో భట్టిప్రోలు, అమరావతి, జగ్గయ్యపేట, గుంటుపల్లి స్తూపాలు క్రీస్తు పూర్వం 3 వ శతాబ్దం నాటివి అని పురాతత్వ శాస్త్రజ్ఞుల అభిప్రాయం. రామతీర్థం, సంఘారామం, గుడివాడ, ఘంటసాలలో గల చైత్య విహారాలు కూడా దాదాపు ఇదేకాలానికి చెందినవని వారు నిర్ణయించారు.

స్తూపాలలో అన్నింటికన్నా చిన్నది గోలిస్తూపం. దీని ఎత్తు 8 అడుగులు. [illegible] 60 అడుగులు. అన్నింటికన్నా

పెద్దది అమరావతి స్తూపం. దీని ఎత్తు 138 అడుగులు, ఆయతం 100 అడుగులు.

పూర్ణంగా ఉన్న స్తూపం ఇప్పుడు ఏదీ మిగలలేదు. ఈ స్తూపాలు తలకట్టులేని 'గ' అనే అక్షరం ఆకారంలో వుంటాయి. వాటి శిఖరంమీద ఒక నలుచదరపు గది లాంటిది ఉంటుంది. దానిపైన గొడుగు లాగ ధర్మచక్రం ఉంటుంది. కాని పెద గంజాం స్తూపంపైన ధర్మచక్రానికి బదులు స్వస్తిక ఉంది. ఈ గుర్తుగల స్తూపం మన దేశంలో మరెక్కడా లేదు. దీనికి ఈ ప్రత్యేకత ఎందుకు వచ్చిందో పరిశోధకులు ఎవరూ ఇంకా నిర్ణయించలేదు. మన తెలుగునాట బౌద్ధస్తూపాలూ విహారాలూ ఒకప్పుడు ఇంత విరివిగా వెలసినా మచ్చుకు ఒక్కటి కూడా నేటివరకూ మిగిలిలేదు.

నాగార్జునకొండలో అశోకుని అంతిముల విహారం వుండేదని చైనాయాత్రికుడు హుయాన్ త్సాంగ్ రాతలవల్ల తెలుస్తోంది. కాని ఇప్పుడా విహారం ఎక్కడవుండేదో కూడా తెలియరానంతగా కాలగర్భంలో లీనమైపోయింది.

ధాన్యకటకంలో పెద్ద విశ్వవిద్యాలయం ఉండేదట. 7700 మంది శ్రమణకులకు సరిపోయిన విహారాన్ని, ఆరు కళాశాలలుగల విశ్వవిద్యాలయాన్ని ధాన్యకటక నమూనామీదనే టిబెట్టు రాజధాని అయిన ల్హాసాలో నిర్మించినట్టు టిబెట్ చరిత్రకారుడు తారానాథ్ రాతలవల్ల తెలుస్తుంది. కాని ఆ విహారాలూ, ఆ విశ్వవిద్యాలయ భవనాలు ఎక్కడవుండేవో గుర్తుపట్టడంకూడా నేడు సాధ్యంకాదు.

ఒక్క ఆయాగఫలకాలమాత్రం ఒక ప్రాచీన [illegible] తెలియజేస్తాయి.

ఈ బౌద్ధచైత్యాలూ, విహారాలూ ఇంతలాగ నాశనం అవడానికి ప్రధాన కారణం మతాహంకారమనే చెప్పాలి.

కొంతమంది స్తూపాలనుతవ్వి ఆ ఇటుకలతో దేవాలయాలు కట్టించారు. ఆ దేవాలయ ధర్మకర్తలు తమ ఇళ్ళు కూడా కట్టించుకున్నారు. పాలరాతి శిల్ప ఫలకాలను కాల్చి సున్నంచేసి భవననిర్మాణానికి ఉపయోగించారు.

మరికొన్ని స్థలాల్లో బౌద్ధవిగ్రహాలకు ముక్కులూ చెవులూ చెక్కి ఆ విహారాలనే శివాలయాలుగాను, జైన ఆలయాలుగాను మార్చారు.

బౌద్ధమతం తర్వాత మనదేశంలో జైనమతం కొంతకాలం రాజ్యంచేసినట్లు కనిపిస్తుంది. జైనమతం ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు బౌద్ధస్థలాలన్నీ జైనమతస్థలాలుగా మారిపోయాయి. ఆతర్వాత జైనంపైన శైవమతం విజయంసాధించింది. కనుక జైనమత స్థలాలన్నీ శైవమతస్థలాలుగా పరిణమించాయి. ఈ పరిణామం ఒకొక్కచోట నేరుగా బౌద్ధంనుంచి శైవంలోకే జరిగి వుండవచ్చునుకూడా.

ఆంధ్రదేశంలో జైనసంప్రదాయ అవశేషాలుకూడా కొన్ని ఉన్నాయి. గోదావరిజిల్లాలోని తాటిపాక, పంచలపాక, మున్నగు తావులలో ఈ చిహ్నాలు నేటికీ గోచరిస్తాయి.

కమపర్తిలో దీపాలదిబ్బ తవ్వి తీసిన బౌద్ధ శిల్పాలతో దేవాలయాన్ని నిర్మించారు. గుంటుపల్లి, రామతీర్థం విహారాలురాతిలో మలచినవి అవడంవల్ల అక్కడ మతాలు మారినా రూపంలో పెద్దమార్పుజరగలేదు.

ఒకప్పుడు ద్రాక్షారామం ఒక బౌద్ధక్షేత్రమై ఉంటుందని కొందరు పండితు

లంటున్నారు. అక్కడ జైన అవశేషాలు కూడా కనిపిస్తాయి. ఇప్పుడుమాత్రం అది ప్రసిద్ధ శైవక్షేత్రం. రామతీర్థం ముందు కొంత కాలం జైనుల చేతుల్లో వుండి తరువాత శైవులకు సంక్రమించింది.

సింహాచలంకూడా ఒకప్పుడు బౌద్ధ క్షేత్రంగావుండి మతాలు మారుతూ చివరికి వైష్ణవ క్షేత్రమైందని పురాతత్వ శాస్త్రజ్ఞులంటున్నారు. సంఘారామంలోనూ, గుంటుపల్లిలోనూ లింగాలను ప్రతిష్ఠించారు.

అమరావతిలో అమరేశ్వరుడనే శివుడు వెలిశాడు. నాగార్జునకొండలోని పర్వత విహారం, ఆనోటా ఈనోటా పడి పలికి పారావత విహారమైంది. పారావతం అంటే పావురం కాబట్టి అక్కడ కపోతేశ్వరుడు అనే పేరుతో శివుడు తయారయాడు. శ్రీశైలం బౌద్ధవిహారం, మల్లికార్జున శివాలయంగా మారిపోయింది.

బెజవాడలోని మొగల్రాజపురం, సీతానగరం, ఉండవల్లి గుహలు అతి ప్రాచీనమైన హిందూ దేవాలయాలు అంటున్నారు కొందరు. కాని ఇవి కూడా ఒకప్పుడు బౌద్ధమత కేంద్రాలేనని కాలక్రమేణ హిందూ దేవాలయాలుగా పరిణమించాయని మరొక వాదంకూడా వుంది. "ఉండవల్లిలోని అనంతపద్మనాభవిగ్రహం మహాపరి నిర్వాణ" బుద్ధ విగ్రహమేనని అంటున్నారు.

బుద్ధుని మహాపరి నిర్వాణం అంటే చేయి దిండుగాచేసుకొని శయనించియున్న బుద్ధ విగ్రహం మనదేశంలో అరుదు. సింహళం, బర్మా, సయాం మొదలయిన ప్రాంతాలలో ఈ విగ్రహాలు ఎక్కువ. ఈ విగ్రహమే అనంతశయనం - తో అనంత పద్మనాభ విగ్రహంగా మారి వుంటుందని పురాతత్వశాస్త్రజ్ఞులంటారు.

అయితే బ్రాహ్మణ దేవతలుగల గుహా దేవాలయాలు అతి ప్రాచీనమైన యూరప ద్వారిక దేశంలోను ఎక్కడా కానరావు. ఉండవల్లి గుహలు చాలాప్రాచీనమైనవిగా కనిపిస్తున్నాయి కాబట్టి, ఇది బౌద్ధగుహా విహారమే అయివుండాలని అంటున్నారు.

మనరాష్ట్రంలోకెల్లా ప్రాచీన గుహా దేవాలయాలు నెల్లూరుజిల్లాలో కనిపిస్తాయి. ఉదయగిరిలో పల్లవులనాటి - అంటే 6-7 శతాబ్దాలనాటి గుహా దేవాలయాలున్నాయి.

ఇలాగ తెలుగునాట, ఒక మత దేవాలయం మరొక మత దేవాలయంగా పరివర్తన చెందినదే కాదు యాత్రాస్థలాలుగాను, ప్రసిద్ధదేవాలయాలుగాను మిగిలాయి కాని, తమిళనాడులో ఉన్నట్లుగా పెద్ద పెద్ద శివకేశవ ఆలయాలు ఇక్కడ స్వతంత్రంగా నిర్మింపబడలేదు.

ఇక మనరాష్ట్రంలో లభ్యమైన శాసనాలు చాలా తక్కువ. శాతవాహనులు, ఆంధ్ర చక్రవర్తులు అయినా వారి శాసనాలలో అధికభాగం మహారాష్ట్ర ప్రాంతంలో దొరికాయి. కొన్ని మైసూరులో కూడా లభించాయి.

అమరావతి, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి మున్నగు ప్రదేశాలలో బౌద్ధ విహారాలకు చేసిన దాన శాసనాలు మూడవ శతాబ్దినాటివి దొరికాయి. ఇక్కడే పల్లవ చాళుక్య కాలంనాటి శాసనాలు కూడా అంటే ఆరవ శతాబ్దినాటివికూడా దొరికాయి. నెల్లూరు,కడపజిల్లాలలో 7వశతాబ్దికి చెందిన తెలుగుశాసనాలు దొరికాయి. బెజవాడ యుద్ధమల్లుని శాసనం నన్నయకు

ముందున్న తెలుగుకవిత్వానికి మహోన్నతమైన స్థానం లభించింది.

శ్రీకాకుళంజిల్లాలోని ముఖలింగం దేవాలయంలో ఆరవ శతాబ్దికి చెందిన శాసనాలెన్నో ఉన్నాయి. ఈ దేవాలయం ఒక్కటే ఇటు దక్షిణాది దేవాలయాలకు, ఉత్తరాది దేవాలయాలకు పొత్తుకలిపే కళింగశిల్పంలో మలచబడింది.

ఆంధ్రదేశంలో ఆఖరి శాతవాహన రాజుల నాణెములు పలుచోట్ల లభించాయి. పులుమాయి, వాశిష్టీపుత్ర, యజ్ఞశ్రీ, శివశ్రీ, చంద్రశ్రీ, విజయశాతవాహన, నాల్గవ పులుమాయి రాజుల నాణెములు అమరావతి, ఘంటసాల, గుడివాడ, రామిరెడ్డిపల్లి, సంఘారామ, రామతీర్థం, మున్నగు స్థలాలలో లభించాయి. బెజవాడలోనూ, గుడివాడలోనూ మరికొన్ని తావుల్లో రోమను నాణెములుకూడా దొరికాయి. సంఘారామంలో దొరికిన నాణెములలో 9వ శతాబ్దివి సైతం ఉన్నాయి. శాలిహుండాంలో 7వ శతాబ్దివి లభించాయి.

అయినా ఇదంతా కలిసి మన భూగర్భంలో వున్న చరిత్ర సాధనాలలో శతాంశంకూడా వుండదు. ఇంతవరకూ ఆంధ్రదేశంలో శాస్త్రీయ పద్ధతులపై ఎక్కడా త్రవ్వకాలు జరగలేదు. ఒక్క శాలిహుండాంలో మాత్రం కొద్దిగా త్రవ్వకాలు సాగుతున్నాయి.

శ్రీకాకుళంవద్ద దంతవక్త్రుని కోట అనే పేరుతో ఒక ప్రదేశం వుంది. చరిత్రలో పేర్కొనబడిన దంతపురం ఇదే నని పలువురిఅభిప్రాయం. కాని అక్కడ పురాతత్వ శాఖవారు త్రవ్వకాలుమాత్రం ఏమీ సాగించలేదు.

శ్రీశైలంవద్ద చంద్రగుప్తపట్నం అనే స్థలంకూడా త్రవ్వవలసి వుంది. అక్కడ నుంచి ఎన్నో చారిత్రక ఆధారాలు బైట పడవచ్చును.

శాతవాహనుల రాజధానిగా పేరు పొందిన ధరణికోటనుకూడా ఎవరూ త్రవ్వి చూడలేదు.

కళింగపట్నంలో ఎన్నో ప్రాచీన నాణెములు దొరికాయి. ఇప్పటికీ అక్కడ అనేక దిబ్బలు కానవస్తాయి. వాటిని త్రవ్వితే అమూల్య చారిత్రక సంపద బైట పడవచ్చును.

ఒకప్పుడు మన దేశానికంతకూ పేరుగా వర్తించిన చినవేగి, పెదవేగి త్రవ్వినవారెవరూ లేరు.

సాలంకాయన, విష్ణుకుండిన రాజులకు ఇవి రాజధానీ నగరాలు. అలాగే కొందులూరుముకూడా త్రవ్వవలసి వుంది.

ఆంధ్రుల చరిత్రకు ఇంతవరకూ ఆధారభూతంగా వున్న సాధనాలలో ప్రధానమైనవి నాణ శాసనాలు; ఆతర్వాత కావ్యాలు. అంతేకాని పురావస్తు సముదాయాన్నంతటినీ ఐతిహాసికు లుపయోగించుకొనలేకపోతున్నారు. పురాతత్వ పరిశోధన మన రాష్ట్రంలో మొక్కు చెల్లించుకొనే ధోరణిలో సాగడమే ఇందుకు ప్రధానకారణం.

చిరవాంఛిత ఫలితంగా ఆంధ్ర రాష్ట్రం అవతరించింది. ఇప్పటికి ఆంధ్ర ప్రభుత్వం అయినా పురాతత్వ పరిశోధన విషయంలో శ్రద్ధవహించి ఆంధ్రుల విస్మృత చరిత్రను త్రవ్వి తీయ గలదని ఆశిద్దాం.

# కొండ జాతులు

భారత రాజ్యాంగంలో కొండజాతుల క్రింద నమోదు చేయబడిన తెగలలో చెంచు, కోయ, సవర, గోండ్, సోర (సవర), కొండదొరలు, కొండ రెడ్లు, మొదలగు తెగలవారు ఆంధ్ర జిల్లాలలో ఉన్నారు. ఇంతకాలం వరకూ కొండ జాతులుగా పరిగణించబడుతూ వచ్చిన లంబాడీ, ఎరుకల, ఏనాది తెగలను మినహాయించారు.

1951 వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రలో పైవిధంగా కొండతెగలుగా గుర్తించబడిన జనాభా, 50 లక్షలున్నది. జిల్లాలవారీ వివరాలు ఇలా ఉన్నాయి* :

| జిల్లా | జనాభా |
|---|---|
| 1. శ్రీకాకుళం | |
| ఏజన్సీ | 50,579 |
| మైదానాలు | 1,55,656 |
| 2. విశాఖపట్నం | |
| ఏజన్సీ | 1,18,790 |
| మైదానాలు | 25,246 |
| 3. తూర్పుగోదావరి | |
| ఏజన్సీ | 1,08,952 |
| మైదానాలు | 10,553 |
| 4. పశ్చిమగోదావరి | |
| ఏజన్సీ | 23,810 |
| మైదానాలు | 8,674 |
| 5. కృష్ణా | 2,779 |
| 6. గుంటూరు | 12,742 |
| 7. నెల్లూరు | 24,05 |
| 8. కర్నూలు | 10,442 |
| 9. కడప | |
| 10. అనంతపురం | 11,463 |
| 11. చిత్తూరు | 3,977 |
| 12. బళ్ళారి (½) | 251 |
| మొత్తం | 5,49,007 |

ఈ తెగలకు శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి జిల్లాలలోని ఏజన్సీ అడవులు, గుంటూరు, కర్నూలు జిల్లాలలోని నల్లమల అడవులు ప్రధాన నివాస కేంద్రాలు.

| జిల్లా | జిల్లా మొత్తం జనాభాలో కొండజాతుల జనాభాశాతం |
|---|---|
| 1. శ్రీకాకుళం | |
| ఏజన్సీ | 93.4 |
| మైదానాలు | 5.6 |

* 1951వ సంవత్సరపు జనాభా లెక్కలలో, తెగలవారీ వివరాలు ఇవ్వబడలేదు. మొత్తం కొండ తెగల జనాభా అంచనాలు కలిపి ఇవ్వబడ్డాయి.

| జిల్లా | జిల్లా మొత్తం జనాభాలో కొండజాతుల జనాభాశాతం |
|---|---|
| 2. విశాఖపట్నం | |
| ఏజన్సీ | 66.0 |
| మైదానాలు | 1.3 |
| 3. తూర్పుగోదావరి | |
| ఏజన్సీ | 52.4 |
| మైదానాలు | 0.5 |
| 4. పశ్చిమగోదావరి | |
| ఏజన్సీ | 24.5 |
| మైదానాలు | 0.5 |
| 5. కృష్ణా | 0.2 |
| 6. గుంటూరు | 0.5 |
| 7. నెల్లూరు | 0.2 |
| 8. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి ఏజన్సీప్రాంతపు సగటు | 56.0 |
| 9. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల మైదానప్రాంతసగటు | 1.3 |
| 10. కర్నూలు | 0.8 |
| 11. కడప | 0.1 |
| 12. అనంతపురం | 0.8 |
| 13. చిత్తూరు | 0.2 |

వీరి జీవితస్థితిగతులు చాల నికృష్టంగా ఉన్నాయి. మైదాన ప్రాంతాలనుంచి వెళ్ళిన వ్యాపారస్తులు, భూస్వాములు వీరిని విపరీతంగా దోచేస్తున్నారు.

1920_23 సం॥లో ఏజన్సీ ఏరియాల కమిషనర్‌గా ఉన్న యల్. టి. హారిస్ ఏజన్సీ ఏరియాల సంపదలనుగూర్చీ, అప్పటి ప్రజల జీవిత పరిస్థితులనుగూర్చి వ్రాసిన యీక్రింది వాక్యాలు కొండజాతి ప్రజలు ఏవిధంగా నిలువుదోపిడీ చెయ్యబడుచున్నది వ్యక్తంచేస్తాయి :

"వరి, రాగి, చెరకు, కాఫీ, పండ్లతోటలు, సూగెంజల పెంపకానికి తోడ్పడేభూమి వేల చదరపుమైళ్ళలో, ఏజన్సీప్రాంతంలో ఉంది. దీనికి తగిన వర్షాధారమూ, ప్రవాహముల నీటికి అడ్డుకట్టలువేసి సప్లయి చేయు వీళ్ళుకూడ కలవు. ఇదిగాక ఇంతవరకూ ఎట్టి ఆదాయాన్ని తీయ ప్రయత్నించని విలువైన అడవులుకూడ గలవు. ఇచ్చటలభించే ఇనుము, బొగ్గు, మైకా, మేంగనీసు, ప్లంబగో (Plumbogo), బంగారం మున్నగు ఖనిజాలుకూడ బయటికి త్రివ్వ ఎట్టి ప్రయత్నంకూడ చెయ్యలేదు. జల ప్రవాహంతో విద్యుత్తును అభివృద్ధిచేయ వసికివచ్చే చక్కటి జలపాతాలుకూడ యీ ప్రాంతంలో కలవు. మన కొండజాతి ప్రజలు నివసించే భూభాగంలోని సిరిసంపదలివి. కాని పైన పేర్కొన్న యల్. టి. హారిస్‌యే వారి ఆరోగ్య పరిస్థితులగూర్చి యిలా వ్రాశాడు "ఈ ప్రాంతంలోని ప్రధాన సమస్య మలేరియా. ఏజన్సీలోని పీఠభూమి పైభాగంలో నివసించే ప్రజలలో నూటికి 89 మందికి, క్రిందిభాగంలో నివసించే వారిలో నూటికి 90 మందికి ప్లీహపు జబ్బులు కలవు. ఈ జబ్బు మలేరియా మూలంగా ఏర్పడుతుంది. ఈ పరిస్థితి యీ ప్రాంతంలోని* మలేరియా తీవ్రతను సూచించుచుంది." (Pages 8-9,

# కొండజాతులు

భారత రాజ్యాంగంలో కొండజాతుల క్రింద నమోదు చేయబడిన తెగలలో చెంచు, కోయ, సవర, గోండ్, సోర (సవర), కొండదొరలు, కొండ రెడ్లు, మొదలగు తెగలవారు ఆంధ్ర జిల్లాలలో ఉన్నారు. ఇంతకాలం వరకూ కొండ జాతులుగా పరిగణించబడుతూ వచ్చిన లంబాడీ, ఎరుకల, ఏనాది తెగలను మినహాయించారు.

1951వ సంవత్సరపు జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రలో మొత్తంగా కొండతెగలుగా గుర్తించబడిన జనాభా, 50 లక్షలున్నది. జిల్లాలవారీ వివరాలు ఇలా ఉన్నాయి* :

| జిల్లా | జనాభా |
|---|---|
| 1. శ్రీకాకుళం | |
| ఏజన్సీ | 50,579 |
| మైదానాలు | 1,55,656 |
| 2. విశాఖపట్నం | |
| ఏజన్సీ | 1,18,790 |
| మైదానాలు | 25,246 |
| 3. తూర్పుగోదావరి | |
| ఏజన్సీ | 1,08,952 |
| మైదానాలు | 10,553 |
| 4. పశ్చిమగోదావరి | |
| ఏజన్సీ | 23,810 |
| మైదానాలు | 8,674 |
| 5. కృష్ణా | 2,779 |
| 6. గుంటూరు | 12,742 |
| 7. నెల్లూరు | 24,05 |
| 8. కర్నూలు | 10,442 |
| 9. కడప | 888 |
| 10. అనంతపురం | 11,463 |
| 11. చిత్తూరు | 3,977 |
| 12. బళ్ళారి (½) | 251 |
| మొత్తం | 5,49,007 |

ఈ తెగలకు శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి జిల్లాలలోని ఏజన్సీ అడవులు, గుంటూరు, కర్నూలు జిల్లాలలోని నల్లమల అడవులు ప్రధాన నివాస కేంద్రాలు.

| జిల్లా | జిల్లా మొత్తం జనాభాలో కొండజాతుల జనాభా శాతం |
|---|---|
| 1. శ్రీకాకుళం | |
| ఏజన్సీ | 93.4 |
| మైదానాలు | 6.6 |

* 1951వ సంవత్సరపు జనాభా లెక్కలలో, తెగలవారీ వివరాలు ఇవ్వబడలేదు. మొత్తం కొండ తెగల జనాభా అంకెలు కలిపి ఇవ్వబడ్డాయి.

| జిల్లా | జిల్లా మొత్తం జనాభాలో కొండజాతుల జనాభాశాతం |
|---|---|
| 2. విశాఖపట్నం | |
| ఏజన్సీ | 66.0 |
| మైదానాలు | 1.3 |
| 3. తూర్పుగోదావరి | |
| ఏజన్సీ | 52.4 |
| మైదానాలు | 0.5 |
| 4. పశ్చిమగోదావరి | |
| ఏజన్సీ | 24.5 |
| మైదానాలు | 0.5 |
| 5. కృష్ణా | 0.2 |
| 6. గుంటూరు | 0.5 |
| 7. నెల్లూరు | 0.2 |
| 8. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి ఏజన్సీప్రాంతపు సగటు | 56.0 |
| 9. శ్రీకాకుళం, విశాఖ, ఉభయగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాల మైదానప్రాంతసగటు | 1.3 |
| 10. కర్నూలు | 0.8 |
| 11. కడప | 0.1 |
| 12. అనంతపురం | 0.8 |
| 13. చిత్తూరు | 0.2 |

వీరి జీవితపరిస్థితిగతులు చాలా నికృష్టంగా ఉన్నాయి. మైదాన ప్రాంతాలనుండి వెళ్ళిన వ్యాపారస్థులు, భూస్వాములు వీరిని విపరీతంగా దోచేస్తున్నారు.

1920-23 సం॥లో ఏజన్సీ ఏరియాల కమిషనర్‌గా ఉన్న యల్. టి. హారిస్ ఏజన్సీ ఏరియాల సంపదలనుగూర్చి, అప్పటి ప్రజల జీవిత పరిస్థితులనుగూర్చి వ్రాసిన యీ క్రింది వాక్యాలు కొండజాతి ప్రజలు ఏవిధంగా నిలువుదోపిడీ చెయ్యబడుచున్నది వ్యక్తంచేస్తాయి :

"వరి, రాగి, చెరకు, కాఫీ, పండ్లతోటలు, నూనెగింజల పెంపకానికి తోడ్పడేభూమి వేల చదరపుమైళ్ళలో, ఏజన్సీప్రాంతంలో ఉంది. దీనికి తగిన వర్షాధారమూ, ప్రవాహముల నీటికి అడ్డుకట్టలువేసి సప్లయి చేయు వీళ్ళుకూడ కలవు. ఇదిగాక ఇంతవరకూ ఎట్టి ఆదాయాన్ని తీయ ప్రయత్నించని విలువైన అడవులుకూడ గలవు. ఇప్పుడు లభించే ఇనుము, బొగ్గు, మైకా, మేంగనీసు, ప్లంబగో (Plumbogo), బంగారం మున్నగు ఖనిజాలుకూడ బయటికి తీయ ఎట్టి ప్రయత్నంకూడ చెయ్యలేదు. జల ప్రవాహంతో విద్యుత్తును అభివృద్ధిచేయు పనికివచ్చే చక్కటి జలపాతాలుకూడ యీ ప్రాంతంలో కలవు. మన కొండజాతి ప్రజలు నివసించే భూభాగంలోని సిరిసంపదలివి. కాని పైన పేర్కొన్న యల్. టి. హారిస్‌యే వారి ఆరోగ్య పరిస్థితులగూర్చి యిట్లా వ్రాశాడు "ఈ ప్రాంతంలోని ప్రధాన సమస్య మలేరియా. ఏజన్సీలోని పీఠభూమి పైభాగంలో నివసించే ప్రజలలో నూటికి 89 మందికి, క్రిందిభాగంలో నివసించే వారిలో నూటికి 90 మందికి ప్లీహపు జబ్బులు కలవు. ఈ జబ్బు మలేరియా మూలంగా ఏర్పడుతుంది. ఈ పరిస్థితి యీ ప్రాంతంలోని మలేరియా తీవ్రతను సూచించుచున్నది." (Pages 8-9,

ఇచ్చినట్లు పేర్కొనబడింది. ముఠాదారు రైతులను బాధిస్తారు. వసూలు చేసిన శిస్తుకు రశీదులు ఇవ్వరు. నాగలికి రెండు రూపాయల చొప్పున నిర్బంధంగా వసూలు చేస్తారు. గ్రామంలో ఎవరికైనా పెండ్లి అయితే ముఠాదారు వారినుండి కట్నం వసూలుచేస్తాడు. ఈ కట్నం 5 నుండి 50 రూ॥ వరకూ ఉంటుంది. రాజ లాంఛనాలపేర కూరగాయలు వగైరా తీసుకొంటారు. "జట్టిగా పనిపేర, కూలియివ్వకుండా పనిచేయించుకొంటారు. రైతు కుటుంబంలోని ఆడ, మొగ సంవత్సరానికి వారంనుండి పదిరోజులవరకూ వెట్టిచాకిరి చెయ్యాలి. కొన్ని పర్యాయాలలో గంజి మాత్రం పోస్తారు. కూలి ఇవ్వటమనేదే లేదు.

"పైన ఇచ్చిన 'మామూళ్ళ' జాబితాకు కలపవలసినవి ఇంకా చాలా ఉన్నాయి." (పై గ్రంథమే-25 వ పేజీ)

ఈ వెట్టిచాకిరీ ప్రభుత్వ ఉద్యోగస్తులు, వడ్డీవ్యాపారస్తులు, కంట్రాక్టర్లు కూడ చేయించుకోవటం మామూలే. ఈ విషయంలో ప్రభుత్వ విచారణాకమిటీ తమ అభిప్రాయాన్ని యిలా వ్యక్తపరచింది: "కంట్రాక్టర్లు కొండ ప్రజలకు అప్పు పెట్టి, వ్యాపారస్తులు 'వెట్టి' చేయించుకొని బహు స్వల్ప ప్రతిఫలం ఇస్తున్నారు. ఇక ముఠాదార్లు తమ అజమాయిషీ ప్రాంతాలలో తమ హక్కుగా గుడిసెకు ఒక మనిషి చొప్పున 'వెట్టి' చేయించుకుంటున్నారు... ఈవిధమైన 'వెట్టి' "ప్రబలంగా నేవుంది". ఈ ముఠా పద్ధతిని తొలగిస్తే తప్ప యీ 'వెట్టి' పోదు.

"రెవిన్యూ ఉద్యోగస్తులకు, పోలీసులకు, ఫారెస్టు ఉద్యోగస్తులకుకూడ 'వెట్టి' చెయ్యాలని నిర్బంధం జరుగుతున్నదని కొండ ప్రజలే మాకు ఫిర్యాదులు చేశారు".

వివిధ చట్టాల ద్వారా ఏజన్సీ ప్రజలను సంరక్షిస్తున్నామని ప్రభుత్వం చెప్పుకున్నా, వారి యదార్థ పరిస్థితులింత హేయంగా ఉండగా, ఏట్టి సంరక్షణలు లేని నాన్-ఏజన్సీ ప్రజల స్థితి ఎంత హీనంగా ఉంటుందో దురూహ్యం. ఈ విషయాలను ప్రభుత్వ విచారణ కమిటీయే యీ క్రింది మాటలలో అంగీకరించింది.

"ఉన్న కొద్దిపాటి భూములు మైదాన ప్రాంతాలలోని షాహుకార్లకు, వ్యాపారస్తులకు ధారాదత్తం గావటం, నిత్యం వడ్డీవ్యాపారస్తుల పెత్తనం క్రింద బ్రతకటం, చిన్న ఉద్యోగస్తుల నిరంకుశత్వం క్రింద 'వెట్టి' చాకిరీ చేస్తూ జీవించడం మున్నగు సమస్యలు నాన్-ఏజన్సీ ప్రజలకు, ఏజన్సీ ప్రజలకన్న తీవ్రంగా ఉన్నాయి. ఇప్పుట ప్రభుత్వము వీరి సంరక్షణకు ఎట్టి చర్యలూ తీసుకొనకపోవుటచేత, కొండ ప్రజలను దోపిడీ చేయువారు ఇప్పుట ఏజన్సీ ప్రాంతాలలోకన్న మరింత హెచ్చుగా ఉండుటచేత పరిస్థితి మరింత తీవ్ర రూపం దాల్చింది.

"నాన్-ఏజన్సీ ప్రజలలోకెల్ల చెంచుల విషయంలోనే గతంలో ప్రభుత్వం శ్రద్ధ తీసుకోవటం జరిగింది. దీనికి కారణం చెంచులు ప్రభుత్వానికి చాలా ఇబ్బందులు కల్పించటమే......

"అయినా ప్రత్యేకించి చెంచుల అరణ్య నివాసాల (chenchu forest settlement) చూచిన ఇప్పటి పరిస్థితులపై సదభిప్రాయం ఏర్పడదు. స్త్రీలు, పురుషులూ చాలా దీనంగా కన్పిస్తారు.

స్వాస్థ్యం, పిల్లల పరిస్థితి మరింత హీనంగా ఉంటుంది. ఈ పరిస్థితులలో ఏదో తీవ్రమైన లోపం ఉండితీరాలనే అభిప్రాయం ప్రేక్షకునికి కల్గిస్తుంది." (Page 32). ఇక ఇతరుల విషయం ఎలా ఉండేదీ దురూహ్యం.

కొండజాతుల కిచ్చిన సంరక్షణ, తోడ్పాటుకూడ లేక నేరస్థుల జాతులుగా ప్రకటించిన ఏనాది, ఎరుకల మున్నగువారి జీవిత పరిస్థితు లేమిటి?

ప్రభుత్వ విచారణ కమిటీయే చిట్టగుంట (నెల్లూరుజిల్లా) ఎరుకల సెటిల్ మెంటులలోని జీవితాన్ని యిలా వర్ణించింది! "ఈ సెటిల్ మెంటు పరిస్థితులు కమిటీ సభ్యులకు నాజీ కాన్ సెన్ ట్రేషన్ క్యాంపులను గుర్తుకు తెచ్చాయి. పిల్లలను ప్రమాదకరమైన జంతువులవలె ముళ్ళ తీగలవెనుక పెంచటంమూడ హృదయ విదారకంగా ఉంది." (పై గ్రంథం పేజి 37.)

ఇక యీ వెనుకబడిన జాతుల విద్యా, ఆరోగ్యాభివృద్ధికి ఎట్టి అవకాశాలు లేవు.

ఏజన్సీ ఏరియాలలో కొండజాతిప్రజల భాషలను అభివృద్ధిపర్చ ప్రభుత్వం ఎట్టి చర్యలూ తీసుకోనుట లేదు. పైగా ప్రత్యేకభాష ఉన్న సవర, కోయ జాతులకుకూడ వారిభాషలో నేర్పు ఎట్టి చర్యలూ తీసుకోనటలేదు. దీని ఫలితంగా యీ జాతులకు పాఠశాలలు అగమ్యగోచరంగా తయారవుతున్నాయి. ఈ ప్రదేశంలోని మలేరియా జ్వర వ్యాప్తి మూలాన పాఠశాలలు సంవత్సరంలో అధికభాగం మూతవేయబడి ఉంటాయి. జ్వరపడిన ఉపాధ్యాయుని స్థానంలో యీ పాఠశాలలో వేరు వ్యక్తిని నియమించటమనేది జరగదు.

5 లక్షల పైబడి జనాభా వున్న ఏజన్సీప్రాంతం మొత్తంలో 3 వైద్యశాలలూ, 17 డిస్పెన్సరీలు మాత్రమే వున్నవి. పైగా యీ ప్రదేశం మలేరియా జ్వరమునకు కేంద్రమని గుర్తించిన యీ "సౌకర్యముల" విలువ గ్రహించవచ్చు. "2.3 డిస్పెన్సరీలు కావలసిన పరివారం లేక మూతబడి ఉండటమనేది ఎల్లప్పుడూ జరుగుతూనే ఉంటుంది. ఉపాధ్యాయులు లేక స్కూళ్ళు మూతబడినట్లే మలేరియా జ్వర ఉధృతకాలంలో యివి మూతబడతవి" అని పైన పేర్కొన్న విచారణకమిటీయే యీ విద్యా, వైద్య సౌకర్యాలపై తన అభిప్రాయాన్ని వెల్లడించింది.

ఈ నిక్కృష్టపరిస్థితులలో నేటికీ ఆంధ్ర దేశంలోని కొండప్రజలు నివసించటం జరుగుతున్నది. వీరిలోని ప్రధానజాతుల స్థితిగతులు క్రింద పరిశీలించబడ్డాయి.

## కోయలు

ఏజన్సీ ప్రాంతంలోని ప్రధాన తెగ కోయప్రజలు. పశ్చిమగోదావరిజిల్లా పోలవరం తాలూకా; తూర్పుగోదావరి జిల్లాలోని చోడవరం, ఎల్లవరం, భద్రాచలం, నూగూర్ తాలూకాలు కోయ ప్రజలు నివసించే ప్రదేశం. ఈ కోయజాతి ప్రజలు ఒరిస్సాలోని మల్కనగిరి తాలూకాలోనూ, నైజాం సంస్థానంలోని గోదావరి నదీప్రాంతపు కుడి, ఎడమలలో బస్తరుసంస్థానంవరకూ, దక్షిణమున ఖమ్మంమెట్టు వరకూకూడ విస్తరించి ఉన్నారు.

కోయజాతి ప్రజలు నివసించే యీ భూభాగం కొండలమయం. ఈ ప్రాంతంలో

సంవత్సరమునకు 50 అం॥ల వర్షమువరకూ కురుస్తుంది. కాని యీ వర్షం సంవత్సరములో మూడు మాసాలలోనే కురుస్తుంది. కనుక మెట్టపంటలు పండవు. వర్షాకాలంలో మాగాణిపంటలుమాత్రమే పండించ బడుతాయి.

1941 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రాంతంలో 95,633 మంది కోయ ప్రజలు ఉన్నారు. వీరు జిల్లావారీ యీ క్రిందివిధంగా ఉన్నారు.*

| | |
|---|---|
| తూర్పుగోదావరి ఏజన్సీ | 90,959 |
| తూర్పుగోదావరి మైదాన ప్రదేశంలో | 2,304 |
| పశ్చిమగోదావరిలోని మైదాన ప్రదేశాలలో | 1,717 |
| విశాఖపట్నం ఏజన్సీలో | 320 |
| విశాఖపట్నం మైదాన ప్రాంతాలలో | 394 |
| గుంటూరు జిల్లాలో | 39 |
| మొత్తం | 95,633 |

వడ్డీ వ్యాపారస్థులు వీరిని విపరీతంగా దోచుకొనుచుంటారు.

బ్రతుకుదెరువుకు వేరు ఆధారంలేక, అడవులలోని కొండ ప్రదేశాలలోని కొద్దిపాటి చదును భూములను చెట్లుకొట్టి, శుభ్రంచేసి వ్యవసాయం ప్రారంభిస్తారు. అక్కడక్కడా ఉండే నీటి వనరులక్రింద కొద్దిపాటి మాగాణికూడా చేస్తారు. కాని 1,2 సం॥లు కష్టించి భూములు సేద్యానికి వీలుగా తేగానే వీటిని అప్పులపేర ప్రక్క-

కోయ ప్రజలు కోయ భాషలో మాట్లాడుతారు. ఇది తెలుగు భాష నుండియే ఉత్పన్నమైనది. కొండప్రజలు యాసతో చాలా చోట్ల తెలుగు మాట్లాడుతారు. కోయలలోని దొరకోయలు తమ నిత్య వ్యవహారాల్ని తెలుగులోనే జరుపుకొంటారు. వీరికి కోయభాష రాదు. కాని వీరు మాట్లాడే తెలుగు చాలా యాసగా ఉంటుంది.

కోయప్రజల ప్రధాన వృత్తి వ్యవసాయం, అటవీ సంపదను ప్రోగుచేసుకొని అమ్మి జీవించటం. వీరి అనాగరిక స్థితిగతుల ఆధారం చేసుకొని ప్రక్కనుండే మైదాన ప్రాంతాల భూస్వాములు, వడ్డీవ్యాపారస్థులు దిగ మింగుతుంటారు. ఈ ప్రజల నికృష్ట జీవన పరిస్థితులనుండి విముక్తం చెయ్యడానికి ప్రభుత్వంకూడ తగిన చర్యలు తీసుకొనక పోవుటచేత, వీరు నిత్యం యీ మూలనుండి ఆ మూలకు తమ వ్యవసాయాలు మార్చవలసి వస్తుంది. వీరు బ్రతికేది రిజర్వు అడవులలో. ఆపుటనే వీరు తమ యీ కొండ వ్యవసాయం కొనసాగిస్తారు. కాని అటవీశాఖ ఉద్యోగులు వీరిని ఒక ప్రాంతంలో వ్యవసాయాన్ని అభివృద్ధి చేసుకొని, స్థిరనివాసం ఏర్పర్చుకొన నివ్వక ఒక మూలనుండి మరొక మూలకు తరుముతుంటారు. ఈ స్థిరత్వం

* 1951వ సంవత్సరపు జనాభా లెక్కలలో తెగలవారీ జనాభా లెక్కలు ఇవ్వబడలేదు. అందుచేత 1941 అంచనాలే స్వీకరించబడ్డాయి.

లేని వ్యవసాయాన్ని "పోడు" వ్యవసాయం అంటారు. సుమారు 4 వేల ఎకరాలు ప్రతి సంవత్సరం యీ రకమైన "పోడు" వ్యవసాయంక్రింద కోయ ప్రజలు నివసించే ప్రదేశంలో ఉంటుందని అంచనా వేయబడింది.

అడవులలోని ఫలసాయాన్ని పోగు చేయటం, అడవుల కొట్టు కంట్రాక్టర్ల వద్ద కూలీలుగా పని చెయ్యటం కూడ వీరి ప్రధాన వృత్తులలో ఒకటి. వీటితో పాటు వెదురు, తుంగ మున్నగునవి ప్రోగుచేసి అమ్ముకొనటం, బుట్టలు, చాపలు మున్నగునవి తయారుచేసి అమ్ముకొనటం కూడ వీరి వృత్తులలో ఒకటి. కోయ గ్రామాలలోని చుట్టుపట్లనున్న మైదాన ప్రాంతాలలోని వడ్డీ వ్యాపారులు, వ్యాపారస్థులు విపరీత వడ్డీలతో కొద్ది మొత్తాలు వీరికి అప్పులు పెట్టి— ఈ పద్ధతిలో వారు అడవులలో ప్రోగు చేసుకొనినవన్నీ చింతపండు, కుంకుడు కాయలు, తేనె, ఇప్పపువ్వు, వెదురు, తుంగ, బీడీఆకులు, విస్తరాకులు మున్నగునవి వారు చౌకగా కొంటారు. ఈ సరకులు యితర ప్రదేశాలకు ఎగుమతి చేసి యీ దళారులు మటుకు విపరీత లాభాలు తీస్తారు. కాని కష్టించే కోయలు మాత్రం అనారోగ్యంతోనూ, తిన తిండిలేక బ్రతుకు గడపవలసి వస్తుంది. చివరకు త్రాగే నీరు కూడ వీరికి కరువే!

కష్టించి అటవీ సంపదనంతటినీ బయటి ప్రజల అవసరాలకు అందించ కృషిచేసే యీ కోయలకు గోచిపాతలు మినహా, కట్టు గుడ్డకు నోచుకోని అతి దుర్భర పరిస్థితి వీరిది. కనుక తలకొక చిన్నగుడ్డ, మొలకు గోచీపాతం వీరికి వస్త్రాలు. వీరి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా వీరు కొనగల్గిన అత్యంత నాగరికమైన వస్తువులు, 20వ నెంబరు బట్ట మాత్రమే!

కోయల నిత్య ఆహారం గంజి, చెట్ల దుంపలు, వేళ్ళు మాత్రమే! వీటితో పాటు చింతవిత్తుల గంజికూడ ఎక్కువగా తాగుతుంటారు. వీటి ఫలితంగా కోయ ప్రజలు తరం తరానికీ క్షీణించటం, వారు గజ్జి కాళ్ళు కల్గి ఉండటం జరుగుతున్నది అని ప్రభుత్వ రిపోర్టులే అంగీకరిస్తున్నాయి. మద్యపాన నిషేధానికి ముందు కల్లు వారి ఆహారంలో ఒక ముఖ్యభాగంగా ఉండేది. సంవత్సరంలో నాల్గు మాసములు కల్లు, వెల్లకాయలపై బ్రతికటం మినహా మరి యే యితర ఆధారం లేదు. ఇట్టి స్థితిలో ప్రభుత్వం మద్యనిషేధాన్ని అమలు జరపటంవల్ల ఇదికూడా కరువైంది.

## సవరలు

శ్రీకాకుళంజిల్లాలోని పాలూరు, పార్వతీపురం, పాలకొండ తాలూకాలలో సవర జాతి ప్రజలు నివసిస్తున్నారు. ఏజన్సీ ప్రాంతంలోని మొత్తం సవర జనాభాలో మూడింట రెండువంతులు ఒక్క పాలకొండ తాలూకాలోనే ఉన్నారు. 1941 జనాభా లెక్కల ప్రకారం 14,696 మంది సవరలు మదరాష్ట్ర జనాభాలో కలరు. వీరిలో 12,842మంది ఏజన్సీ ప్రాంతంలోనూ, 1,842 మంది మైదాన ప్రాంతాలలోనూ నివసిస్తున్నారు. ఈ సవరలలో 25 రకముల పైబడి వర్గవిభేదాలున్నట్లు తెలుస్తున్నది.

కోయలకువలెనే సవరలకుకూడ వ్యవసాయం, అటవీసంపదను ప్రోగుచేసుకొని అమ్ముకొనటం ప్రధాన జీవన ఆధారాలు. వీరు నివసించే ప్రదేశంలో కోయల

ప్రదేశంకన్న ఎక్కువగా కొండలు,గుట్టలు కలవు. దీని ఫలితంగా వీరి "పోడు" వ్యవసాయం అధిక ప్రయాసతో కూడుకొని ఉంది. అయినా జీవనం కొరకు యీ రాతి భూములలో కొద్దికొద్ది భాగాలు చదునుచేసి, మళ్ళుకట్టి, నీళ్లు నిల్వచేసి మాగాణి వ్యవసాయం కొనసాగిస్తారు. కంట్రాక్టర్లు, వడ్డీవ్యాపారస్తుల దోపిడితో వీరూ రోజురోజుకూ నీరసించటం జరుగుతూంది.

సవరభాష ముండాజాతి భాషలకు సమీపమనీ, ఆర్య, ద్రవిడ భాషలతో ఎట్టి పోలికలు కలిగిలేదని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయం. లిపిలేని సవర భాషకు శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు లిపిని ఏర్పరచి, ఒక శబ్దార్థ చంద్రికను కూడ తయారుచేశారు.

## వాల్మీకులు

వీరు ఏజన్సీ ప్రాంతంలోని అన్ని ప్రాంతాలలోనూ కన్పడుతారు. 1931 జనాభా లెక్కల ప్రకారం వీరి జనాభా 4,289. 1941 జనాభా లెక్కలలో వీరి జనాభా వివరాలు ఉన్నట్లు కన్పించదు. వీరినే కొన్ని ప్రాంతాలలో 'కొండమాలలు' అని కూడ పిలుస్తారు. వీరిని మైదాన ప్రాంతాలలోనూ, ఏజన్సీలో కూడ అంటరాని వారిగా పరిగణిస్తారు. కొండజాతులు కూడ వీరిని అస్పృశ్యులుగానే పరిగణించి దూరంగా వుంచుతారు.

ఈ వాల్మీకులలో సుమారు 60–70 మంది వ్యవసాయంమీద, 20 మంది కూలీలుగాను, 5 మంది కల్లుగీత పనివారిగను జీవిస్తున్నారు. వీరిలో అత్యధికులు బుట్టలు, చాపలు తయారుచేయటం, సమీపపట్టణాలలో అమ్ముకొనటం వృత్తిగనవి కొనసాగిస్తున్నారు.

నిత్యజీవనంలో కోయ, సవర మున్నగు కొండ ప్రజలకన్న వీరి ఆర్థిక పరిస్థితులు మెరుగనీ, కొద్దిపాటి సొమ్ములలో వీరిలో కొందరు కొండజాతులకు వడ్డీకిచ్చి వారిని విపరీతంగా దోపిడీ చేస్తు ఉన్నారనీ ప్రభుత్వ విచారణా రిపోర్టులు చెబుతున్నాయి. వాల్మీకులు వాస్తవంగా కొండజాతి ప్రజలుకారనీ, మైదాన ప్రాంతాలనుండి ఇచ్చటకు వలసవచ్చిన వారు మాత్రమేననికూడా పై రిపోర్టులలో ఉదహరించబడింది.

## చెంచులు

నల్లమల అడవులు వీరి ప్రధాన నివాస కేంద్రం. నల్లమల అడవులలో కృష్ణానదికి అవతలప్రక్కన ఉండే నైజాం సంస్థాన భాగంలో కూడ వీరు నివసిస్తున్నారు. గోదావరీ నదీలోయలోని ఎగువ భాగాన్ని కోయలు నివాసస్థానంగా చేసుకొన్నట్లే, చెంచులు కృష్ణాలోయ ఎగువభాగాన్ని తమ నివాస కేంద్రంగా చేసుకొన్నారు.

1941 జనాభా లెక్కలప్రకారం రాష్ట్రంలో వీరి జనాభా 9,003. ఇందులో 5,878 మంది కర్నూలు జిల్లాలోనూ, 2,104 మంది గుంటూరు జిల్లాలోనూ, మిగిలిన 1,121 మంది కృష్ణా, విశాఖ, శ్రీకాకుళం, ఉభయ గోదావరులలో అచ్చటచ్చటా నివసిస్తున్నారు.

చెంచులకు వారి ప్రత్యేక భాష కలదు. కాని దానికి లిపి ఉన్నట్లు కన్పించదు. కొండప్రజల యాసతో వారు తెలుగునే మాట్లాడుతారు.

అడవులలో ప్రజా అవసరాలకు తోడ్పడేవాటినెల్ల పోగుచేసుకొని బయట

# బ్రాడ్‌కాస్టింగ్ - రేడియో

భారతదేశంలోని 25 రేడియో స్టేషన్లలో విజయవాడ స్టేషను ఒకటి. ఇది 1948వ సంవత్సరం డిశంబరు ఒకటవ తేదీన ప్రారంభించబడింది. దీని శక్తి కూడా చాల తక్కువ.

ఇంతవరకూ (1948) ఆంధ్రులకు ప్రత్యేక రేడియో కేంద్రం లేకపోవటం చేత, మదరాసు స్టేషను ప్రసారం చేసే తెలుగు కార్యక్రమాలే గతియైనాయి.

ఈ కేంద్రం 357.1 మీటర్లమీద (840 kc s) ప్రసారం చేస్తుంది. మొదటి ప్రసారం ఉదయం 6 గం. ల 55 ని. ల నుండి 8 గం. 15 ని. ల వరకూ, రెండవ ప్రసారం మధ్యాహ్నం 12 గం. 30 ని. ల నుండి 2 గం. 45 ని. వరకు, మూడవ ప్రసారం సాయంత్రం 4 గం.ల నుండి 4 గం. 30 ని. ల వరకు, నాలుగవ ప్రసారం సాయంత్రం 5 గం.ల 30 ని. ల నుండి రాత్రి 9 గం. 30 ని. ల వరకూ ఉంటుంది.

శని, ఆదివారములనాడు మాత్రం రెండవ ప్రసారం మధ్యాహ్నం ఒంటి గంట నుండి 2 గంటల వరకు మాత్రమే వుంటుంది.

ఈ స్టేషను మదరాసు నుండి నిత్యం అనేక కార్యక్రమాల 'రిలే' చేస్తుంది. ఢిల్లీ నుండి ప్రత్యేక కార్యక్రమాలను వారం వారం ఉండే "నేషనల్ ప్రోగ్రాము"లను రిలే చేస్తుంది.

270.3 మీటర్లు (1,110kc/s), 60.98 మీటర్లు (4,920 kc,s) మీద ప్రసారం చేసే మదరాసు (బి) కేంద్రం, నిత్యం కొన్ని తెలుగు ప్రోగ్రాములను ప్రసారం చేస్తున్నది. ఈ స్టేషనుకూడా అప్పుడప్పుడు విజయవాడ స్టేషను ప్రసారం చేసే కొన్ని ప్రోగ్రాములను 'రిలే' చేస్తుంది.

# రేడియోలు

1953 వ సంవత్సరం ఆగస్టు 31 వ తేదీకి ఆలిండియా రేడియోవారి అంచనాల ప్రకారం ఆంధ్రలో 28,301 రేడియో సెట్లున్నాయి. వీటి జిల్లాలవారీ వివరాలు ప్రక్క పేజీలోని పట్టీలో వివరించబడినవి.

| జిల్లా | రేడియోల సంఖ్య |
|---|---|
| 1. శ్రీకాకుళం } 2. విశాఖపట్నం } | 4,085 |
| 3. తూర్పుగోదావరి | 4,304 |
| 4. పశ్చిమగోదావరి | 2,942 |
| 5. కృష్ణా | 4,566 |
| 6. గుంటూరు | 5,364 |
| 7. నెల్లూరు | 1,785 |
| 8. కర్నూలు | 1,347 |
| 9. కడప | 1,004 |
| 10. అనంతపురం | 1,365 |
| 11. చిత్తూరు | 1,539 |
| 12. బళ్ళారి (1/3) | 630 |
| మొత్తం | 28,931 |

ఉన్న రేడియో సెట్లలో నూటికి 90 విద్యుత్ సప్లయి ఉన్న పట్టణ ప్రాంతాల లోనే ఉన్నాయి.

జనాభాలో ప్రతి 700 మందికి సగటున ఒక రేడియో ఉన్నట్లు తెలుస్తున్నది.

ఇది కాక, 869 కమ్యూనిటీ సెట్లు (గ్రామ లేక పట్టణ ప్రజల సమష్టి ఉపయోగం కింద ఉండేవి) ఉన్నాయి. వీటిలో 94 పట్టణ ప్రాంతాలలోను, 775 గ్రామీణ ప్రాంతాలలోను ఉన్నాయి.

# తంతి - తపాలా

ఆంధ్ర పోస్టలు సర్కిలు 1953 వ సంవత్సరం సెప్టెంబరులో ప్రారంభించబడింది. ఇంతకుపూర్వం ఈ ప్రాంతం అంతా చాలకాలంగా మదరాసు పోస్టలు సర్కిలులో భాగంగా ఉంటూ ఉండేది.

ప్రస్తుతం ఆంధ్ర పోస్టలు సర్కిలు పరిపాలనా సౌలభ్యంకోసం ఏడు పోస్టలు డివిజన్లుగాను, ఒక ఇంజినీరింగు డివిజన్‌గాను విభజించబడింది.

పోస్టలు డివిజనుల నిర్వహణకు, యేడుగురు పోస్టాఫీసు సూపరింటెండెంట్లు, ఇంజినీరింగు డివిజనుకు డివిజనల్ ఇంజినీరు (టెలిగ్రాఫ్సు) నియమించబడ్డారు. కొంతకాలంగా ఆంధ్ర ఇంజినీరింగు డివిజనులో కొంతభాగం హైదరాబాదు డివిజనల్ ఇంజినీరు (టెలిగ్రాఫ్సు) అదుపులో ఉండేది. ఇపుడు ఈ ప్రాంతంకూడా, ఆంధ్ర డివిజనల్ ఇంజినీరు అధీనంలోనికి తేబడింది.

## పోస్టాఫీసులు

1953 వ సంవత్సరం, మార్చి 31 వ తేదీకి పోస్టలు డిపార్టుమెంటు అంచనాల ప్రకారం రాష్ట్రంలో మొత్తం 3,838 పోస్టాఫీసులు (ఎక్స్పరిమెంటల్ పోస్టాఫీసులతోసహా) ఉన్నాయి. వీటిలో 359 పట్టణ ప్రాంతంలోను, 3,479 గ్రామీణ ప్రాంతంలోను ఉన్నాయి. ప్రక్క పేజీలోని మొదటి పట్టికలో వీటి వివరాలు ఇలా ఉన్నాయి:

1951 జనాభాలెక్కల ప్రకారం, జిల్లాలవారీగా పోస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసులు ప్రక్క పేజీలోని రెండవ పట్టికలో యివ్వబడ్డాయి*:

1953 వ సంవత్సరం మార్చి 31 వ తేదీనాటికి, ఆంధ్రజనాభాలో ప్రతి 5,341 మందికి, ప్రతి 16.5 చదరపు మైళ్ళకూ ఒక పోస్టాఫీసు ఉన్నది.

ప్రభుత్వం రెండువేల జనాభాకు తగ్గని ప్రతిగ్రామంలోను పోస్టాఫీసులు పెట్టాలని ఆశిస్తున్నది. ఈ పథకం ప్రకారమే 1947 ఆగస్టు మాసంనుండి 1953 వ సంవత్సరం మార్చి 31 వ తేదీనాటికి 2,096 పోస్టాఫీసులు తెరువబడ్డాయి. ఈ విధంగా తెరువబడ్డ ప్రతిపోస్టాఫీసుకు దాదాపు రు. 750 వరకు నష్టంవచ్చినా

* తాలూకాలవారీ వివరాలకు అధ్యాయం చివరి అనుబంధం చూడండి.

| వివరం | పట్టణ ప్రాంతంలో | గ్రామీణ ప్రాంతాలో | మొత్తం |
|---|---|---|---|
| టెలిగ్రాఫ్ సెక్షనులేని పోస్టాఫీసులు | | | |
| హెడ్డాఫీసులు | 4 | ... | 4 |
| సబ్ ఆఫీసులు | 97 | 18 | 115 |
| బ్రాంచి ఆఫీసులు | 72 | 2,509 | 2,581 |
| టెలిగ్రాఫ్ సెక్షనుతో ఉన్న పోస్టాఫీసులు | | | |
| హెడ్డాఫీసులు | 10 | ... | 10 |
| సబ్ ఆఫీసులు | 158 | 48 | 206 |
| బ్రాంచి ఆఫీసులు | ... | ... | ... |
| ఎక్స్పెరిమెంటల్ పోస్టాఫీసులు | 18 | 904 | 922 |
| మొత్తం | 359 | 3,479 | 3,838 |

1951 సం॥ లెక్కల ప్రకారం జిల్లావారీ పోస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసులు :

| జిల్లా | బ్రాంచి ఆఫీసులు | సబ్ ఆఫీసులు (టెలిగ్రాఫ్ సెక్షన్ లేనివి) | సబ్ ఆఫీసులు (టెలిగ్రాఫ్ సెక్షన్ ఉన్నవి) |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 245 | 5 | 21 |
| విశాఖపట్నం | 279 | 12 | 19 |
| తూర్పుగోదావరి | 410 | 34 | 25 |
| పశ్చిమగోదావరి | 288 | 19 | 17 |
| కృష్ణా | 270 | 29 | 18 |
| గుంటూరు | 532 | 35 | 24 |
| నెల్లూరు | 287 | 21 | 18 |
| కర్నూలు | 203 | 5 | 17 |
| కడప | 189 | 12 | 15 |
| అనంతపురం | 207 | 7 | 14 |
| చిత్తూరు | 270 | 14 | 18 |
| మొత్తం | 3,180 | 193 | 206 |

కేంద్రప్రభుత్వం ధరించ సిద్ధపడింది. 1953-54 సంవత్సరంలోను, తర్వాత రెండుసంవత్సరాలలోనూ, రెండువేలకు మించి జనాభా ఉండి, గ్రామానికిగ్రామం నాలుగుమైళ్ళదూరంలో ఉన్న ప్రతి నాలుగు గ్రామాలకు కలిపి ఒక పోస్టాఫీసును పెట్టాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

## టెలిగ్రాఫ్ ఆఫీసులు

1953వ సంవత్సరం మార్చి 31వ తేదీన నాలుగుడిపార్టుమెంటలు టెలిగ్రాఫ్ ఆఫీసులు, 216 పోస్టాఫీసులతోకలసిఉన్న టెలిగ్రాఫ్ ఆఫీసులు వున్నాయి. ఇంకా నెల్లూరుజిల్లా అల్లూరులోను, గుంటూరు జిల్లా ఉప్పుగుండూరులోను, కృష్ణాజిల్లా పామర్రులోను, తూర్పుగోదావరి జిల్లా వెట్లపాలెం, కొత్తపేట, నాగారం, పుల్లి తోట గ్రామాలలో మరిక్కొటెలిగ్రాఫ్ ఆఫీసులను ఏర్పాటుచేయ ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇదే సంవత్సరంలో భారతదేశంలో 3,600 టెలిగ్రాఫ్ ఆఫీసులున్నాయి. ఆంధ్రలో ఉన్న ఆఫీసులు భారతదేశంలోని మొత్తంఆఫీసులలో 6%.

సాలుకు వెయ్యిరూపాయలకు మించిన నష్టం రాకుండా ఉండేట్లయితే, ప్రతి తాలూకా కేంద్రంలోను, తాలూకా సబ్ డివిజనల్ కేంద్రంలోనుసాలుకు రు.500లకు మించి నష్టంరాని పక్షంలో ఐదుమైళ్ళ పరిసరాలలో యెటువంటి టెలిగ్రాఫ్ ఆఫీసులేని ఇతర ప్రాంతాలలోను టెలిగ్రాఫ్ ఆఫీసులు తెరవాలని ప్రభుత్వం నిశ్చయించింది.

ఆంధ్రలో ఉన్న నాలుగు డిపార్టుమెంటలు టెలిగ్రాఫ్ ఆఫీసులు కర్నూలు, విజయవాడ, కాకినాడ, విశాఖపట్నం నగరాలలో ఉన్నాయి. కర్నూలులో తాత్కాలిక రాజధాని అవసరాల రీత్యా నిమిత్తం మదరాసు, తదితర ముఖ్యనగరాలతో డైరెక్టు కనెక్షన్సు ఏర్పాటుచేశారు. విజయవాడ - మదరాసు, విశాఖపట్నం - కలకత్తా నగరాలమధ్య వేగంగా పనిచేసే టెలిప్రింటరు సర్వీసు (High speed teleprinter working) ఉన్నది. ఇటువంటి సర్వీసే, మదరాసు - విశాఖపట్నం, మదరాసు - కర్నూలు నగరాల మధ్య ఏర్పాటుచేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

నెలకు ఆంధ్రలోవున్న వివిధ టెలిగ్రాఫు ఆఫీసుల నుండి వెళ్ళే టెలిగ్రాములు, వచ్చే టెలిగ్రాముల వివరాలు ఈవిధంగా అంచనా వేయబడుతున్నాయి:

| | |
|---|---|
| బుక్ చేసి పంపబడిన టెలిగ్రాములు | 1,00,000 |
| ఇతర చోట్ల నుండి వచ్చిన టెలిగ్రాములు బట్వాడాచేయబడినవి | 97,000 |
| రిలేచేసిన టెలిగ్రాములు | 98,000 |
| డిపార్టుమెంటలు సర్వీసు సంబంధమైనవి | 30,000 |
| మొత్తం | 3,25,000 |

దాదాపు ఈ ట్రాఫిక్ భారతదేశ మొత్తం టెలిగ్రాఫ్ ట్రాఫిక్‌లో అరవ వంతు (1/6) ఉంటుంది.

ఆంధ్రలో 1953 వ సంవత్సరం, మార్చి 31 వ తేదీనాటికి ఉన్న టెలిగ్రాఫ్ లైనుల వివరాలు యిలా ఉన్నాయి :

| వివరం | టెలిగ్రాఫ్ డిపార్టుమెంటువి (మైళ్ళలో) | ప్రభుత్వంచేత నిర్వహించబడుతున్న ఇతరుల లైనులు (మైళ్ళలో) |
|---|---|---|
| లైనులు | 6,449 | ... |
| వైర్లు | 44,588 | ... |
| కేబుల్సు | 173 | 0.02 |
| కేబులు కండక్టరు | 8,658 | 1.82 |

## టెలిఫోనులు

ఆంధ్రలో 1953 వ సంవత్సరం మార్చి 31 వ తేదీన 24 టెలిఫోను ఎక్స్చేంజీలు, వీటి కింద 3,381 ఫోనులు ఉన్నాయి. వాటి వివరాలు :

| ఎక్స్ఛేంజి | టెలిఫోనులు |
|---|---|
| 1. కాకినాడ | 204 |
| 2. రాజమండ్రి | 193 |
| 3. విజయనగరం | 185 |
| 4. బొబ్బిలి | 37 |
| 5. శ్రీకాకుళం | 27 |
| 6. విజయవాడ | 551 |
| 7. గుంటూరు | 304 |
| 8. తెనాలి | 113 |
| 9. మచిలీపట్నం (బందరు) | 137 |
| 10. నరసరావుపేట | 32 |
| 11. ఏలూరు | 89 |
| 12. గూడూరు | 43 |
| 13. నెల్లూరు | 120 |
| 14. ఆదోని | 102 |
| 15. అనంతపురం | 44 |
| 16. కడప | 67 |
| 17. చిత్తూరు | 77 |
| 18. గుంతకల్లు | 37 |
| 19. కర్నూలు | 233 |
| 20. నంద్యాల | 71 |
| 21. పాకాల | 19 |
| 22. తిరుపతి | 26 |
| 23. విశాఖపట్నం | 563 |
| 24. అనకాపల్లి | 107 |
| మొత్తం | 3,381 |

నోటు : బళ్ళారి టెలిఫోను ఎక్స్ఛేంజి, ఆంధ్ర డివిజనల్ ఇంజనీరు సర్కిలులోనే ఉంది. కాని ఈ ప్రాంతం మైసూరులో ఉన్నది కనుక ఇచ్చట వదలివేయబడింది.

1952-53వ సంవత్సరంలో భారత దేశంలో మొత్తం రెండులక్షల టెలిఫోను లున్నట్లు అంచనా వేయబడింది. భారత దేశంలోని టెలిఫోనులతో పోల్చితే నూటికి 1.6 టెలిఫోనులు మాత్రమే (1953 లో) ఆంధ్రలో ఉన్నాయి. ప్రతివెయ్యిమంది జనాభాకు, అమెరికాలో 250, బ్రిటన్‌లో 95, చైనాలో 6 టెలిఫోనులు ఉన్నాయి. కాని ఆంధ్రలో ప్రతి ఆరు వేలమంది జనాభాకు ఒక్క ఫోను మాత్రమే ఉన్నది.

భీమవరం, ప్రొద్దుటూరు, పాలకొల్లు, తాడేపల్లిగూడెం, నరసాపురం, గుడివాడ లలో టెలిఫోను ఎక్స్ఛేంజీలను ప్రారంభించాలనే యోచన ఉన్నది. అంతేకాక, టెలిఫోనులకు డిమాండు అధికంగా ఉండటంచేత, ప్రస్తుతం రాష్ట్రంలో ఉన్న టెలిఫోనుల సంఖ్యను పెంచేందుకు అనువుగా కొన్ని ముఖ్య ఎక్స్ఛేంజీల 'కెపాసిటీ'ని ఈవిధంగా పెంచాలని అధికారులు ఆలోచిస్తున్నారు:

| | |
|---|---|
| అనకాపల్లి | 150 |
| విజయవాడ | 700 |
| కర్నూలు | 500 |
| విజయనగరం | 400 |
| రాజమండ్రి | 300 |
| కాకినాడ | 400 |
| విశాఖపట్నం | 600 |

"స్వంత టెలిఫోను సిస్టం" (Own Your Telephone System) ఒక్క నెల్లూరు జిల్లా గూడూరులో తప్ప మరెచ్చటా పనిచేయుటంలేదు. 1952-53వ సంవత్సరంలో ప్రారంభించబడిన తిరుపతి ఎక్స్ఛేంజి ఈ సిస్టంకిందే - అచ్చట టెలిఫోను కనెక్షను కోరేవారు, ఎక్స్ఛేంజి నిర్మాణానికి అయేఖర్చు ప్రభుత్వానికి ఋణంగా ఇచ్చే పద్ధతిపైన ప్రారంభించ బడింది.

రాష్ట్రంలో 86 పబ్లిక్ కాల్ ఆఫీసులు (Public Call Offices) ఉన్నాయి. వీటిలో టెలిఫోను ఎక్స్ఛేంజి లేని ఈ దిగువ ప్రదేశాలలో పబ్లిక్ కాల్ ఆఫీసులు (1953వ సంవత్సరం, మార్చి 31వ తేదీన) ఉన్నాయి:

గుత్తి, తాడిపత్రి, ధర్మవరం, కదిరి, హిందూపురం, ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, ఆముదాలవలస, సాలూరు, పార్వతీపురం, పిఠాపురం, సామర్లకోట, అనపర్తి, గుని, రామచంద్రపురం, గొల్లప్రోలు, యెలమంచిలి, చోడవరం, భీమునిపట్నం, నాపడా, బాపట్ల, చీరాల, మంగళగిరి, దుగ్గిరాల, పొన్నూరు, ఒంగోలు, కావలి, గన్నవరం, గుడివాడ, భీమవరం, వినుకొండ.

కావలసిన వైరు, టెలిఫోనులు తదితర అవసర పరికరాలకు ఇతరదేశాలపై ఆధార పడటంవల్ల దేశంలో టెలిఫోనుల సంఖ్య డిమాండు ఉన్నా త్వరిత గతిని పెరగటం లేదు.

ఈ కొరతను తీర్చే ఉద్దేశ్యంతోనే, ప్రభుత్వం బెంగుళూరులో టెలిఫోనులు, సామానులు తయారుచేసే ఫ్యాక్టరీ నొకదానిని ప్రారంభించింది. కేబుల్సు చేసే ఫ్యాక్టరీ నొకదానిని ప్రారంభించాలని కేంద్రప్రభుత్వం యోచిస్తున్నది.

# అనుబంధం

## 1951 వ సం॥ జనాభా లెక్కల ప్రకారం ఉన్న పోస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసులు

| జిల్లా, తాలూకా | బ్రాంచి పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షను లేని సబ్ పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షను ఉన్న సబ్ పోస్టాఫీసులు |
|---|---|---|---|
| 1. శ్రీకాకుళం జిల్లా | 245 | 5 | 21 |
| ఇచ్ఛాపురం తాలూకా | 11 | ... | 1 |
| టెక్కలి ,, | 17 | 2 | 4 |
| సోంపేట ,, | 10 | ... | 3 |
| పాతపట్నం ,, | 16 | ... | ... |
| పార్వతీపురం ,, | 17 | 1 | 2 |
| పాలకొండ ,, | 29 | ... | 3 |
| సాలూరు ,, | 13 | ... | 1 |
| బొబ్బిలి ,, | 42 | ... | 1 |
| శ్రీకాకుళం ,, | 28 | 1 | 3 |
| నరసన్నపేట ,, | 20 | 1 | 1 |
| చీపురుపల్లి ,, | 42 | ... | 2 |
| 2. విశాఖపట్నం జిల్లా | 279 | 12 | 19 |
| గూడెం తాలూకా | 5 | ... | 1 |
| శృంగవరపుకోట ,, | 26 | 1 | 2 |
| వీరవల్లి ,, | 42 | 1 | 1 |
| గోలుగొండ ,, | 34 | 1 | 1 |
| విజయనగరం ,, | 39 | 2 | 5 |
| భీమునిపట్నం ,, | 41 | ... | 2 |
| విశాఖపట్నం ,, | 24 | 6 | 4 |
| అనకాపల్లి ,, | 25 | ... | 2 |
| సర్వసిద్ధి ,, | 43 | 1 | 1 |

| జిల్లా, తాలూకా | | బ్రాంచి పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ లేని సబ్ పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ ఉన్న సబ్ పోస్టాఫీసులు |
|---|---|---|---|---|
| 3. తూర్పుగోదావరి జిల్లా | | 410 | 34♦ | 25* |
| నూగూరు | తాలూకా | 4 | ... | 2 |
| భద్రాచలం | ,, | 8 | ... | 3 |
| రంపచోడవరం | ,, | 4 | ... | ... |
| యెల్లవరం | ,, | 4 | ... | ... |
| రాజమండ్రి | ,, | 46 | 11 | 3 |
| పెద్దాపురం | ,, | 54 | 2 | 2 |
| పిఠాపురం,, | ,, | 22 | 2 | 2 |
| తుని | ,, | 24 | ... | ... |
| రామచంద్రపురం | ,, | 65 | 4 | 4 |
| కాకినాడ | ,, | 51 | 8♦ | 5* |
| రాజోలు | ,, | 72 | 5 | 1 |
| అమలాపురం | ,, | 56 | 2 | 3 |
| 4. పశ్చిమగోదావరిజిల్లా | | 288 | 19 | 17 |
| పోలవరం | తాలూకా | 11 | ... | 2 |
| చింతలపూడి | ,, | 15 | ... | 1 |
| కొవ్వూరు | ,, | 42 | 2 | 2 |
| ఏలూరు | ,, | 31 | 8 | 2 |
| తాడేపల్లిగూడెం | ,, | 42 | 1 | 2 |
| భీమవరం | ,, | 44 | 4 | 2 |
| తణుకు | ,, | 49 | 3 | 3 |
| నరసపూరు | ,, | 54 | 1 | 3 |

♦ ఇందులో ఒకటి టెలిగ్రాఫ్ సెక్షను లేని హెడ్ ఆఫీసు

* కాకినాడలోని డిపార్టుమెంటలు టెలిగ్రాఫ్ ఆఫీసు చేర్చబడింది

| జిల్లా, తాలూకా | బ్రాంచి పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ లేని సబ్ పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ ఉన్న సబ్ పోస్టాఫీసులు |
|---|---|---|---|
| 5. కృష్ణా జిల్లా | 270 | 29 | 18♦ |
| బందరు తాలూకా | 26 | 8 | 3* |
| విజయవాడ ,, | 39 | 16 | 4T |
| దివి ,, | 39 | 0 | 2 |
| గన్నవరం ,, | 41 | 1 | 2 |
| గుడివాడ ,, | 34 | 3 | 2 |
| కైకలూరు ,, | 19 | ... | 1 |
| నందిగామ ,, | 43 | 1 | 2 |
| నూజివీడు ,, | 13 | ... | 1 |
| తిరువూరు ,, | 16 | ... | 1 |
| 6. గుంటూరుజిల్లా | 532 | 35 | 24 |
| పల్నాడు తాలూకా | 49 | 2 | 3 |
| సత్తెనపల్లి ,, | 54 | 4 | 2 |
| గుంటూరు ,, | 66 | 8 | 5 |
| తెనాలి ,, | 69 | 5 | 4 |
| వినుకొండ ,, | 23 | ... | 1 |
| నరసారావుపేట ,, | 69 | 1 | 2 |
| బాపట్ల ,, | 86 | 7 | 4 |
| రేపల్లె ,, | 44 | 3 | 2 |
| ఒంగోలు ,, | 72 | 5 | 1 |
| 7. నెల్లూరుజిల్లా | 287 | 21 | 18 |
| దరిసి తాలూకా | 21 | 1 | 1 |
| పొదిలి ,, | 12 | ... | 1 |

♦ ఇందులో ఒకడిపార్టుమెంటలు టెలిగ్రాఫ్ ఆఫీసు, ఒకపోస్టు అండ్ టెలిగ్రాఫ్ హెడ్డాఫీసు చేరివున్నాయి.

* పోస్టు అండ్ టెలిగ్రాఫ్ హెడ్డాఫీసు ఒకటి చేరివున్నది.

T ఇందులో ఒకటి డిపార్టుమెంటల్ టెలిగ్రాఫ్ ఆఫీసు

| జిల్లా, తాలూకా | బ్రాంచి పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ లేని సబ్ పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ ఉన్న సబ్ పోస్టాఫీసులు |
|---|---|---|---|
| కనిగిరి తాలూకా | 30 | 1 | 1 |
| కందుకూరు ,, | 25 | 2 | 2 |
| ఉదయగిరి ,, | 23 | ... | 2 |
| కావలి ,, | 32 | 1 | 2 |
| ఆత్మకూరు ,, | 15 | 1 | 1 |
| కోవూరు ,, | 39 | 1 | 2 |
| రాపూరు ,, | 9 | 1 | 1 |
| నెల్లూరు ,, | 40 | 11 | 1 |
| గూడూరు ,, | 13 | 1 | 1 |
| వెంకటగిరి ,, | 11 | 1 | 1 |
| సూళ్లూరుపేట ,, | 17 | ... | 2 |
| 8. కర్నూలుజిల్లా | 203 | 5 | 17 |
| కర్నూలు తాలూకా | 27 | 2 | 3 |
| నందికొట్కూరు ,, | 18 | ... | 2 |
| మార్కాపురం ,, | 30 | 1 | 1 |
| పత్తికొండ ,, | 18 | ... | 1 |
| డోన్ ,, | 23 | ... | 2 |
| నంద్యాల ,, | 12 | 1 | 2 |
| కంభం ,, | 36 | 1 | 2 |
| బంగనపల్లి ,, | 6 | ... | 1 |
| కోయిలకుంట్ల ,, | 17 | ... | 2 |
| సిరివెళ్ళ ,, | 16 | ... | 1 |
| 9. కడపజిల్లా | 189 | 12 | 15* |
| జమ్మలమడుగు తాలూకా | 14 | 1 | 3 |
| ప్రొద్దుటూరు ,, | 25 | 2 | 1 |
| బద్వేలు ,, | 19 | ... | 1 |
| పులివెందుల ,, | 18 | 1 | 1 |
| కమలాపురం ,, | 12 | ... | 2 |

*ఇందులో ఒక పోస్టు అండ్ టెలిగ్రాఫ్ హెడ్ ఆఫీసు చేరియున్నది.

| జిల్లా, తాలూకా | | బ్రాంచి పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ లేని సబ్ పోస్టాఫీసులు | టెలిగ్రాఫ్ సెక్షన్ ఉన్న సబ్ పోస్టాఫీసులు |
|---|---|---|---|---|
| కడప | తాలూకా | 14 | 5 | 1* |
| సిద్ధవటం | ,, | 11 | 1 | 1 |
| రాజంపేట | ,, | 38 | 2 | 4 |
| రాయచోటి | ,, | 38 | ... | 1 |
| 10. అనంతపురం జిల్లా | | 207 | 7 | 14 |
| గుత్తి | తాలూకా | 24 | ... | 5 |
| తాడిపత్రి | ,, | 12 | ... | 1 |
| కల్యాణదుర్గం | ,, | 15 | ... | 1 |
| అనంతపురం | ,, | 15 | 4 | 2 |
| ధర్మవరం | ,, | 24 | ... | 1 |
| పెనుకొండ | ,, | 17 | ... | 1 |
| కదిరి | ,, | 40 | ... | 1 |
| మడకసిర | ,, | 30 | ... | 1 |
| హిందూపురం | ,, | 30 | 1 | 1 |
| 11. చిత్తూరు జిల్లా | | 270 | 14 | 18* |
| మదనపల్లి | తాలూకా | 29 | 3 | 2 |
| వాయల్పాడు | ,, | 48 | ... | 3 |
| చంద్రగిరి | ,, | 20 | 3 | 4 |
| కాళహస్తి | ,, | 18 | 1 | 1 |
| పుంగనూరు | ,, | 18 | ... | 1 |
| చిత్తూరు | ,, | 50 | 3 | 2* |
| పుత్తూరు | ,, | 34 | 2 | 2 |
| పలమనేరు | ,, | 16 | 1 | 2 |
| తిరుతని | ,, | 37 | 1 | 1 |

* ఇందులో ఒక పోస్టు అండ్ టెలిగ్రాఫ్ హెడ్ ఆఫీసు చేరియున్నది.

# ఆంధ్ర రాష్ట్ర చట్టం, 1953

## అధ్యాయం 1

### పీఠిక

1. సంక్షిప్త శీర్షిక – ప్రారంభము :

(1) ఈ చట్టము ఆంధ్రరాష్ట్ర చట్టము 1953, అని పిలువబడును.

(2) 43, 54, 58, 61, 62, 63, 64, 66, 69 సెక్షన్లు, ఈ మొదటి అధ్యాయమూ వెంటనే అమలులోనికి వచ్చును. చట్టమందలి మిగతా నిబంధనలు 1953 అక్టోబరు మొదటి తేదీనుంచి అమలులోనికి వచ్చును.

2. నిర్వచనములు :

ఈ చటములో సందర్భము మారినంతవరకు:

అ. 'నిర్ణీతదినము' అనగా 1953 అక్టోబరు ఒకటవ తేది.

ఆ. 'సూత్రము' అనగా రాజ్యాంగ సూత్రము.

ఇ. 'శాసనసభ నియోజకవర్గము', 'కౌన్సిలు నియోజకవర్గము, 'పార్లమెంటరీ నియోజకవర్గము' – వీటికి అర్థము, 1950 ప్రజాప్రాతినిధ్యచట్టము (1950 నాటి 43)లో వలెనే ఉండును.

ఈశాసనము నిర్ణీత దినమునకుముందు మద్రాసు, మైసూరు రాష్ట్రములలో లేక అందలి ఏ భాగములోనైనా అమల్లోవున్న అర్డినెన్సు, నిబంధన, ఉత్తరువు, ఉపనియమము, రూలు, స్కీము, శాసనాధికారంగల ఏ ఇతర ప్రకటనైనా 'శాసనము'గా పరిగణింప బడును.

ఉ. 'ఉత్తరువు' అనగా అధికార గెజెట్‌లో ప్రకటింపబడిన ఉత్తరువు.

ఊ. 'ప్రస్తుత సభ్యుడు' అనగా ఉభయసభలలోను, రాష్ట్ర శాసనసభలోను నిర్ణీతదినముకు సభ్యుడుగా ఉన్నవాడు.

ఋ. కలిపిన ప్రదేశము అనగా సెక్షన్ 4– సబ్ సెక్షన్ (1) ప్రకారం మైసూరు రాష్ట్రంలో కలపబడిన భూభాగం.

# అధ్యాయం - 2

## ఆంధ్రరాష్ట్ర నిర్మాణము - మద్రాసునుంచి మైసూరుకు కలుపు ప్రదేశము

3. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము :

(1) శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, అనంతపురం, కడప, చిత్తూరుజిల్లాలు, బళ్ళారిజిల్లా లోని ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలు, నిర్ణీతదినమున మద్రాసురాష్ట్రము నుండి వేరుపడి, 'ఏ' తరగతి రాష్ట్రముగా ఏర్పడి, ఆంధ్రరాష్ట్రమని వ్యవహరింప బడును.

(2) జిల్లాలపేర్లు, సరిహద్దుల మార్చుకొనుటకు రాష్ట్రప్రభుత్వ అధికారములకు భంగములేకుండా, ఆలూరు, ఆదోని తాలూకాలు కర్నూలుజిల్లాలో భాగములుగానూ, రాయదుర్గం తాలూకా అనంతపూరు జిల్లాలో భాగముగాను చేర్చబడును.

4. మద్రాసునుంచి మైసూరుకు కలుపు ప్రదేశము :

(1) ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాలు మినహా మిగతా బళ్ళారి జిల్లా అంతా, నిర్ణీతదినమునుంచి మద్రాసురాష్ట్రములో భాగముగాకాక, మైసూరు రాష్ట్రముకు కలపబడి, ఆ రాష్ట్ర భాగముగా నుండును.

(2) జిల్లాలపేర్లు, సరిహద్దులు మార్చుకొనుటకు రాష్ట్ర ప్రభుత్వ అధికారము నకు భంగములేకుండా, కలుపబడిన ప్రదేశము ప్రత్యేక జిల్లాగా ఉండి, బళ్ళారిజిల్లా అని వ్యవహరింపబడును.

5. రాజ్యాంగ మందలి మొదటి అనుబంధమునకు సవరణ :

అ. 'ఏ' తరగతిలో 1 నుంచి 9 గా నమోదు అయిన యెంట్రీలు (entries) 2 నుంచి 10 గా వరసక్రమంలో తిరిగి నమోదు చేయబడును. అలా తిరిగి నమోదు చేయబడిన 2వ యెంట్రీకి ముందు "1. ఆంధ్ర" అని చేర్చబడును.

ఆ. 'ఏ' తరగతిలో ఇచ్చిన రాష్ట్ర ప్రదేశ వివరణలో —

(1) అస్సాం రాష్ట్ర ప్రదేశ వివరణకు ముందుగా ఈ క్రింది వాక్యము చేర్చ బడును :

"సెక్షన్ 3, సబ్ సెక్షన్ (1) ఆంధ్రరాష్ట్ర చట్టము 1953 లో ఉదహరింప బడిన ప్రదేశములను ఆంధ్రరాష్ట్రము కలిగియుండును."

(2) చివరి పేరా తర్వాత ఈ క్రింది వాక్యము చేర్చబడును :

"కాని, సెక్షన్ 3 సబ్ సెక్షన్ (1), సెక్షన్ 4 సబ్ సెక్షన్ (1) ఆంధ్రరాష్ట్ర చట్టము 1953 లో ఉదహరింపబడిన ప్రదేశములు మద్రాసు రాష్ట్రములో ఉండవు,

ఇ. 'బి' తరగతిలో రాష్ట్ర ప్రదేశ వివరణ పేరా చివర ఈ క్రింది వాక్యము చేర్చబడును.

"సెక్షన్ 4, సబ్ సెక్షన్ (1) ఆంధ్రరాష్ట్ర చట్టము 1953 లో ఉదహరింపబడిన ప్రదేశము మైసూరు రాష్ట్రము కలిగియుండును.

# అధ్యాయము - 3

## శాసన సభలలో ప్రాతినిధ్యము - రాజ్యసభ

6 రాజ్యసభలో ప్రాతినిధ్యము :

రాజ్యసభలో మద్రాసు రాష్ట్రమునకున్న 27 స్థానాలు 18 కి తగ్గింపబడి, ఆంధ్రరాష్ట్రమునకు 12 స్థానాలు కేటాయించబడును.

7. రాజ్యాంగమండలి నాల్గవ అనుబంధమునకు సవరణ :

రాజ్యాంగమండలి నాల్గవ అనుబంధములో -

అ. మొదటి అనుబంధము యొక్క 'ఏ' తరగతిలో రాష్ట్రలవారికి ఇవ్వబడిన స్థానాల పట్టికలో -

(1) 1 నుంచి 9 వరకు నమోదు అయినవి క్రమములో 2 నుంచి 10 వరకు లెక్కించబడును.

(2) తిరిగి నమోదయిన 2 కు ముందు "1 ఆంధ్ర...12" అని చేర్చబడును.

(3) రెండవ కాలములో '27' - '145' సంఖ్యల బదులు క్రమములో '18' - '148' సంఖ్యలు చేర్చబడును.

ఆ. స్థానాల పట్టీచివర '204' సంఖ్యకు బదులు '207' చేర్చబడును.

8. ప్రస్తుత సభ్యుల విభజన :

రాజ్యసభలో ఆంధ్రరాష్ట్రానికి కేటాయించబడిన స్థానాలలో తొమ్మిదింటికీ, మద్రాసు రాష్ట్రం నుంచి రాజ్యసభకు ఎన్నికైన మొదటి అనుబంధము పార్టు 1 లో ఉదహరింపబడిన ప్రస్తుత సభ్యులు తొమ్మిదిమంది, ఆంధ్ర శాసనసభ్యులచే ఎన్నికైన వారుగా పరిగణింపబడెదరు.

అదే అనుబంధములో పార్టు 2 లో ఉదహరింపబడిన మిగతా 18 మంది రాజ్యసభలో మద్రాసురాష్ట్రము తరఫున ప్రాతినిధ్యము వహించెదరు.

9. ఖాళీ అయిన స్థానాలకు ఉప ఎన్నిక :

ఆంధ్రరాష్ట్రముకు రాజ్యసభలో కేటాయింపబడిన స్థానములలో నిర్ణీతదినముకు ఖాళీఉన్నవాటికి నిర్ణీతదినము తర్వాత త్వరలో ఉప ఎన్నికలు జరుపబడును.

10. సభ్యత్వకాలము :

(1) సబ్ సెక్షన్ (2) లో ఉదహరింపబడిన రీతిని కాక మొదటి అనుబంధము లోని సభ్యుల కాలపరిమితిలో మార్పు వుండదు. అనగా సదరు అనుబంధంలో ఉదహరించినట్లే ఉండును.

(2) సభ్యత్వకాలము—

అ. మొదటి అనుబంధములో పార్టు 1లో ఉదహరింపబడిన వరుస సంఖ్యలో 4, 5 ల సభ్యత్వ కాల పరిమితులలో ఎవరిగో ఒకరి కాలపరిమితి, 1958 ఏప్రియల్ 2వ తేదీతో ముగియునట్లు పెంచబడును.

ఆ. అదే అనుబంధములో పార్టు 2 లో ఉదహరింపబడిన వరుస సంఖ్యలలో 7 నుంచి 13 వరకు గల సభ్యుల కాల పరిమితులలో ఒకరి కాలపరిమితి 1954 ఏప్రియల్ 2వ తేదీతో ముగియునట్లు తగ్గించబడును.

(3) క్లాజు అ. సబ్ సెక్షన్ 2 లో కాలపరిమితి పెంచబడిన సభ్యుని నిర్ణయము, క్లాజు ఆ. సబ్ సెక్షన్ (2) లో కాలపరిమితి తగ్గించబడిన సభ్యుని నిర్ణయము, నిర్ణీతదినము తర్వాత రాజ్యసభ అధ్యక్షుని పర్యవేక్షణక్రింద చీటి వేసి జరుపబడును.

(4) సెక్షన్ 9 ప్రకారం ఆంధ్ర శాసనసభ్యులు ఎన్నుకొను ముగ్గురు ప్రతినిధుల కాలపరిమితి 1956 ఏప్రియల్ 2వ తేదీతో ముగియును.

## ప్రజా సభ

11. ప్రజాసభలో ప్రాతినిధ్యము :

(1) ప్రజాసభలో మద్రాసురాష్ట్రమున కున్న 75 స్థానాలు 46 కు తగ్గింపబడి, మైసూరురాష్ట్రమున కున్న 11 స్థానాలు 12 కు పెంచబడి, ఆంధ్రరాష్ట్రమునకు 28 స్థానాలు కేటాయించబడును.

(2) 1950 ప్రజా ప్రాతినిధ్య చట్టము (1950 నాటి 43) మొదటి అనుబంధములో—

అ. 'ఏ' తరగతి రాష్ట్రాలకు సంబంధించిన భాగములో

(1) 1 నుంచి 9 వరకు అయిన నమోదులు 2 నుంచి 10 వరకు క్రమములో లెక్కించబడి, 2 కు పైన

"1. ఆంధ్ర...28" అని చేర్చబడును.

(2) కాలము 2 లో మద్రాసుకు ఎదురుగా '46' అని చేర్చబడును.

ఆ. 'బి' తరగతి రాష్ట్రాలకు సంబంధించిన భాగములో కాలము 2 లో మైసూరుకు ఎదురుగా '12' చేర్చబడును.

**12. నియోజకవర్గ విభాగము :**

ప్రజాసభ అసెంబ్లీ నియోజకవర్గాల (మద్రాసు) ఉత్తరువు (1951), ప్రజాసభ అసెంబ్లీ నియోజకవర్గాల (మైసూరు) ఉత్తరువు (1951), ఇతర చట్టములు చేయబడు వరకు, రెండవ అనుబంధముయొక్క నియమములకు లోబడి వర్తించును.

**13. ప్రస్తుత సభ్యులు :**

ఒక నియోజకవర్గమునకు ప్రాతినిధ్యము వహించు ప్రస్తుత ప్రతి సభ్యుడూ, సెక్షన్ 12 ప్రకారం, ఆంధ్రరాష్ట్రమునకుగాని, మైసూరు రాష్ట్రమునకుగాని, సరిహద్దుల మార్పులతో సంబంధంలేకుండా మారితే, అలా మారిన నియోజకవర్గముచే ప్రజాసభకు ఎన్నుకోబడిన సభ్యుడుగా పరిగణింపబడును.

**14. మారిన పార్లమెంటరీ నియోజకవర్గాల ఓటర్ల జాబితాలు :**

సెక్షన్ 12 ప్రకారం మార్పులు జరిగిన పార్లమెంటరీ నియోజక వర్గమునకు నిర్ణీతదినము తర్వాత తిరిగి ఓటర్ల జాబితాలు తయారుచేయబడువరకు, నియోజకవర్గ మండలి మారిన ప్రదేశములలోని వాటితోసహా ఓటర్ల జాబితాలు అమలునందుండును.

## శాసనసభ

**15. శాసనసభలో స్థానాలు :**

(1) సాధారణ ఎన్నికలద్వారా వచ్చు మొత్తముస్థానాలు.

అ. ఆంధ్రశాసనసభలో 140.

ఆ. మద్రాసు శాసనసభలో 375 నుంచి 230 కు స్థానాలు తగ్గించబడును.

ఇ. మైసూరుశాసనసభలో 99 నుంచి 104కు స్థానాలు ఎక్కువ చేయబడును.

(2) 1950 ప్రజాప్రాతినిధ్యచట్టము (1950 నాటి 43) రెండవఅనుబంధములో—

అ. 'ఏ' తరగతి రాష్ట్రాలకు సంబంధించిన భాగములో

(1) 1 నుంచి 9 వరకు అయిన నెంబరులు 2 నుంచి 10 వరకు క్రమములో లెక్కించబడి 2 కు పైన 'ఆంధ్ర 140' అని చేర్చబడును.

(2) కాలము 2 లో మద్రాసుకు ఎదురుగా '230' చేర్చబడును.

ఆ. 'బి' తరగతి రాష్ట్రాలకు సంబంధించిన భాగములో కాలము 2 లో మైసూరుకు ఎదురుగా '104' చేర్చబడును.

**16. సభ్యులఏర్పాటు :**

(1) మద్రాసురాష్ట్ర శాసనసభలో ఒకనియోజక వర్గమునకు ప్రాతినిధ్యము వహించు ప్రస్తుతసభ్యుడు సెక్షను 12 ప్రకారం ఆంధ్రరాష్ట్రమునకుగాని, మైసూరు రాష్ట్రమునకుగాని, సరిహద్దు మార్పులలో సంబంధము లేకుండా మారిన, అలా ఆంధ్ర

రాష్ట్రమునకుగాని, మైసూరు రాష్ట్రమునకుగాని మారినసభ్యుడు ఆ రాష్ట్ర శాసన సభలో సభ్యుడుగా ఎంచబడి, మద్రాసు రాష్ట్ర సభలో సభ్యత్వము పోగొట్టు కొనును.

(2) సూత్రము 333 ప్రకారం మద్రాసుశాసనసభకు ఆంగ్లోఇండియన్ ప్రాతినిధ్యముకై నియమితుడైన సభ్యుడు రాష్ట్రప్రదేశములతో సంబంధములేకుండా, మద్రాసు రాష్ట్రశాసనసభయందే ఉండును.

17. శాసనసభకాలపరిమితి :

(1) సూత్రము 172 క్లాజు 1 ప్రకారం నిర్ణయించబడిన 5 సంవత్సరాల కాలపరిమితీ, ఆంధ్రశాసనసభ విషయంలో మద్రాసు శాసనసభ ప్రారంభమైన తేదీనే ఆంధ్రశాసనసభ ప్రారంభమైనట్లు పరిగణించబడును.

(2) మద్రాసు, మైసూరు రాష్ట్రశాసనసభలలో స్థానాలసంఖ్యలు మారినా సూత్రం 172 క్లాజు 1 ప్రకారం ఉన్న కాలపరిమితిలో ఎట్టిమార్పు ఉండదు.

18. మారిన శాసనసభ నియోజకవర్గాల ఓటర్లజాబితాలు :

సెక్షన్ 12 ప్రకారం మార్పులు జరిగిన శాసనసభ నియోజకవర్గమునకు నిశ్చిత దినము తర్వాత తిరిగి ఓటర్ల జాబితాలు తయారు చేయబడువరకు, నియోజకవర్గ మండలి అలా మారిన ప్రదేశములలోని వాటితో సహా ఓటర్ల జాబితాలు అమలునందుండును.

## కౌన్సిలు

19. మద్రాసు కౌన్సిలు :

మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో 51 స్థానాలలో

అ. సూత్రం 171, క్లాజు 3, సబ్ క్లాజులలో ఉదహరించినట్లు (అ), (ఆ), (ఇ)ల వోటర్లచేత ఎన్నుకోబడవలసిన సభ్యుల సంఖ్య వరుసగా 14, 4, 4.

ఆ. పై క్లాజులోని సబ్ క్లాజు (ఈ) లోని అంశముల ప్రకారం మద్రాసు శాసన సభా సభ్యులచే ఎన్నుకోబడవలసినవారి సంఖ్య 18.

ఇ. పై క్లాజులోని సబ్ క్లాజు (ఉ) లోని అంశముల ప్రకారం మద్రాసు గవర్నరుచే నియమించబడవలసిన సభ్యుల సంఖ్య 11.

1954 వ సంవత్సరం ఏప్రిల్ 21వ తేదీ నుంచి

అ. సూత్రం 171 క్లాజు (3) సబ్ క్లాజు (అ) లో ఉదహరించినట్లు వోటర్లచే ఎన్నుకోబడిన సభ్యులచే ఎన్నుకోబడవలసిన స్థానాల సంఖ్య 6 కు ఎక్కువ చేయబడును.

ఆ. ఈ సబ్ సెక్షనులోని క్లాజు (ఇ) లో ఉదహరించబడిన సభ్యులచే ఎన్నుకోబడవలసిన స్థానాల సంఖ్య 9 కి తగ్గింపబడును.

(2) సబ్ సెక్షను (1) లోని క్లాజు (అ) ప్రకారం కేటాయించబడిన రెండు అధిక స్థానాలు, మొదటి పర్యాయము నింపే నిమిత్తం, 1954 ఏప్రిల్ 20వ తేదీ నాడు మద్రాసు కౌన్సిలులో కాలపరిమితి ముగిసిన సభ్యుల స్థానాలుగా పరిగణింపబడును.

(3) 1950 ప్రజా ప్రాతినిధ్య చట్టం (1950 నాటి 43) మూడవ అనుబంధం అ. 'నిర్ణీత దినము' నుండి 1954 ఏప్రిల్ 21 వ తేదీవరకు ఈ క్రింది విధంగా సవరింపబడి యుండును :

మద్రాసుకు సంబంధించిన నమోదుకు బదులు ఈ క్రింది నమోదు చేర్చబడును:

3. మద్రాసు 51 14 4 4 18 11

ఆ. 1954 ఏప్రిల్ 21 నుండి ఈ క్రింది సవరణ చేయబడును :

మద్రాసుకు సంబంధించిన నమోదుకు బదులు ఈ క్రింది నమోదు చేర్చబడును :

3. మద్రాసు 51 14 6 4 18 9

20. మద్రాసు కౌన్సిల్ నియోజకవర్గాలు :

కౌన్సిల్ నియోజకవర్గాల (మద్రాసు) ఉత్తరువు (1951) ఇతర చట్టములు చేయబడువరకు మూడవ అనుబంధము యొక్క నియమములకు లోబడి వర్తించును.

1954 ఏప్రిల్ 21వ తేదీ నుండి పై ఉత్తరువు 2వ పేరాకు అనుబంధింపబడిన పట్టిక, అందులోనికాలం (3) లో "మద్రాసు పట్టభద్రుల నియోజకవర్గం" అనే నమోదుకు ఎదురుగా "6" అని చేర్చినట్లయితే నే పై పేరాలోని ఉత్తరువులు వర్తించును.

21. మద్రాసు కౌన్సిలు సభ్యులు, వారి కాలపరిమితి :

(1) నాలుగవ అనుబంధంలో పేర్కొన బడని మద్రాసు కౌన్సిలు ప్రస్తుత సభ్యులు, నిర్ణీత దినమున ఆ కౌన్సిల్ సభ్యత్వమును పోగొట్టుకొందురు.

(2) కౌన్సిలులోని దక్షిణ మద్రాసు (పట్టభద్రుల) నియోజకవర్గానికి, దక్షిణ మద్రాసు (ఉపాధ్యాయుల) నియోజక వర్గానికి చెందిన ప్రస్తుత సభ్యులు, నిర్ణీతదినము నుండి మద్రాసు (పట్టభద్రుల) నియోజక వర్గము నుండి, మద్రాసు (ఉపాధ్యాయుల) నియోజకవర్గము నుండి మద్రాసు కౌన్సిలుకు వరుసగా ఎన్నికైనట్లు ఎంచబడతారు.

(3) నిర్ణీతదినమునాటికి కౌన్సిల్ సభ్యత్వమును పోగొట్టుకొనని ప్రస్తుతసభ్యుల కాలపరిమితి నాలుగవ అనుబంధములో పేర్కొనబడిన నిబంధనల ప్రకారం నిర్ణయించబడును.

22. మైసూరు కౌన్సిల్ :

(1) కౌన్సిల్ నియోజకవర్గాల ఉత్తరువు (1951) ఇతర చట్టములు చేయబడు వరకు అయిదవ అనుబంధముయొక్క నియమములకు లోబడి వర్తించును.

(2) మైసూరుస్టేటుకు సంబంధించినంతవరకు పై ఉత్తరువు, సెక్షను 4, సబ్ సెక్షను (1) ప్రకారం ఆరాష్ట్రానికికలిసిన ప్రదేశానికికూడా వర్తించునదిగా ఎంచబడును.

(3) చితల్‌ద్రుగ్ (స్థానికఅధికారులు) నియోజక వర్గానికి మైసూరు కౌన్సిల్‌లో ప్రాతినిధ్యం వహించే ప్రస్తుత సభ్యులు, నిర్ణీతదినమునుండి చితల్‌ద్రుగ్ - బళ్లారి (స్థానిక అధికారులు) నియోజకవర్గమునుండి ఆ కౌన్సిల్‌కు ఎన్నుకొనబడిన వారుగా ఎంచబడుదురు.

(4) సబ్ సెక్షను (2) లోని అంశముల ననుసరించి సరిహద్దు మారిన, మైసూరు (పట్టభద్రుల) నియోజకవర్గానికిగాని, మైసూరు (ఉపాధ్యాయుల) నియోజకవర్గానికి గాని మైసూరు కౌన్సిల్‌లో ప్రాతినిధ్యం వహించేప్రస్తుత సభ్యులు నిర్ణీతదినము నుండి అలా మారిన నియోజకవర్గంనుండి ఆ కౌన్సిల్‌కు ఎన్నుకోబడినట్లు ఎంచబడును.

**23. మారిన కౌన్సిల్ నియోజకవర్గాల వోటర్ల జాబితాలు :**

నిర్ణీతదినము తర్వాత సాధ్యమైనంత త్వరలో మైసూరు (పట్టభద్రుల), మైసూరు (ఉపాధ్యాయుల) నియోజకవర్గాల వోటర్ల జాబితాలు సవరించబడును. 1950 ప్రజా ప్రాతినిధ్యచట్టం (1950 నాటి 43)లోని అంశములప్రకారము మైసూరు కౌన్సిల్‌కు చితల్‌ద్రుగ్-బళ్ళారి నియోజకవర్గానికి వోటర్ల జాబితా తయారు చేయ బడును. అలా సవరించబడిన లేదా తయారుచేయబడిన జాబితాలు ఆ చట్టంకింద చేయబడిన నిబంధనలప్రకారం అంతిమప్రకటన జరిగిన వెనువెంటనే అమలులోకి వస్తాయి.

## వివిధాంశములు

**24. షెడ్యూల్డు తెగతుల, షెడ్యూల్డు జాతుల ఉత్తరువుల సవరణ :**

1950 రాజ్యాంగ (షెడ్యూల్డు తెగతుల) ఉత్తరువు, 1950 రాజ్యాంగ (షెడ్యూల్డు జాతుల) ఉత్తరువు ఆరవ అనుబంధంయొక్క నియమములకు లోబడి వర్తించును.

**25. ఆంధ్ర శాసనసభ కార్యక్రమ నియమావళి :**

నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు శాసనసభకు సంబంధించి అమలులో ఉన్న కార్యక్రమం, నిర్వహణ నియమావళియే, ఆంధ్ర శాసనసభ స్వీకరించేసిన సవరణలు, అనుసరణలకు లోబడి సూత్రం 208 క్లాజు (1) కింద నియమావళి తయారుచేసేవరకు, ఆంధ్ర శాసనసభకు కూడా వర్తించును.

**26. 1950 నాటి 43 చట్టం సెక్షను 2కు సవరణ :**

1950 ప్రజాప్రాతినిధ్యచట్టం (1950 నాటి 43) సెక్షన్ (2), సెక్షను (2) సబ్ సెక్షను (1) గా తిరిగి సంఖ్యీకరించబడును. అదివిధంగా సంఖ్యీకరించిన పై సెక్షనుకు ఈ క్రింది సబ్ సెక్షన్ చేర్చబడును.

"(2) సెక్షను (6), సెక్షను (9), సెక్షను 11 క్రింద చేయబడిన ఉత్తరువుకీత్యా ఈచట్టం ఉదహరించబడినపుడు, సందర్భము కూడినంతవరకు, 1953 ఆంధ్రస్టేటుచట్టం

లోని సెక్షన్ 12, సెక్షను 20, సెక్షను 22 క్రింద సవరించబడిన ఉత్తరువును ఉదహరించినట్లే ఎంచబడును.

27. 1952 నాటి 81 చట్టం సెక్షను 9 కి సవరణ :

1952 నాటి 81 నియోజకవర్గ విభాగ కమీషన్ చట్టం సెక్షను 9 సబ్ సెక్షను (3) లో "పై చట్టములలో దేనిక్రిందనైనా చేయబడిన ఉత్తరువులు" అనే మాటలకు బదులు ఈ క్రింది మాటలు చేర్చబడును "1953 ఆంధ్రస్టేటు చట్టం, పైచట్టములలో దేనికిందనైనా చేయబడిన ఉత్తరువులు."

# అధ్యాయం - 4

## హైకోర్టులు

28. ఆంధ్రహైకోర్టు :

(1) 1956 జనవరి 1 నుండిగాని సబ్ సెక్షన్ (2) కింద నిర్ణయించబడిన తేదీ నుండిగాని ఆంధ్రస్టేటుకు ప్రత్యేక హైకోర్టు ఏర్పాటగును (ఇకముందు ఇది "ఆంధ్ర హైకోర్టు" అని పిలువబడును).

(2) ఆంధ్రస్టేటుకు ప్రత్యేక హైకోర్టు స్థాపించాలని అక్కడి శాసనసభ సిఫారసు చేస్తూ ఒక తీర్మానంచేసి దానిని అధ్యక్షునికి పంపితే, అధ్యక్షులు సబ్ సెక్షను 1 కింద్య 1956 జనవరి 1 వ తేదికి పూర్వమే హైకోర్టుస్థాపనకు తేదీని, అధికార గజెటులో ప్రకటనద్వారా నిర్ణయించవచ్చును.

(3) సబ్ సెక్షను (1) లో ఉదహరించబడిన తేదీగాని, సబ్ సెక్షన్ (2) క్రింద సబ్ సెక్షను (1) లో ఉదహరించబడిన తేదీకన్న ముందుగా తేదీ నిర్ణయింప బడిన అలా నిర్ణయింపబడిన తేదీగాని, ఇకనించి 'నిర్ణీతదినం' అని వాడబడును.

(4) నిర్ణీత దినమునకు ముందుగానే ఉత్తరువుద్వారా ఆంధ్ర స్టేటు గవర్నరు నిర్ణయించిన ప్రదేశములోనే ఆంధ్ర హైకోర్టు ప్రధానకార్యస్థానం ఉండును. అయితే ఆంధ్రశాసనసభ హైకోర్టు ప్రధానకార్యస్థానమునకు ఒక ప్రదేశమును సిఫారసుచేస్తూ తీర్మానముచేసినయెడల ఆ ప్రదేశమునే హైకోర్టు ప్రధాన కార్యస్థానముగా గవర్నరు నిర్ణయించవలెను.

29. ఆంధ్రహైకోర్టు న్యాయమూర్తులు :

(1) నిర్ణీతదినమునకు పూర్వము మదరాసు హైకోర్టు న్యాయమూర్తులలో అధ్యక్షుడు నిర్ణయించినవారు మదరాసు హైకోర్టు న్యాయమూర్తులుగా పదవులను కోలుపోయి, ఆంధ్రహైకోర్టు న్యాయమూర్తులగుదురు.

(2) సబ్ సెక్షను (1) ప్రకారం ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులైనవారు, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా నియమితులైనవారుతప్ప, తక్కినవారు ఆంధ్ర

హైకోర్టులో, మద్రాసు హైకోర్టులో వారివారి పదవుల ప్రయారిటీ ప్రకారమే ఉందురు.

(3) సబ్ సెక్షను (1) ప్రకారము ఆంధ్రహైకోర్టు న్యాయమూర్తిగా నియమితులైనవారు, మదరాసు హైకోర్టులోని ప్రధానన్యాయమూర్తిగాక మరొక న్యాయమూర్తి ఆంధ్రహైకోర్టు ప్రధానన్యాయమూర్తిగా నియమితులైనప్పుడు, రాజ్యాంగ రెండవ అనుబంధం పేరా 10, సబ్ పేరా (2) క్రింద నిర్ణీత దినమునకు పూర్వం పొందుతున్న ప్రత్యేక వేతనమును, ఆంధ్రహైకోర్టు న్యాయమూర్తిగా పనిచేసిన కాలమునకు, పొందుటకు అర్హత కలిగి ఉందురు.

30. ఆంధ్ర హైకోర్టు అధికారాలు :

ప్రస్తుతము ఆంధ్రస్టేటులో పొందుపర్చబడిన ప్రదేశాలకు ఒరిజినల్, అపిలేటు, తదితర అధికారాలకు నిర్ణీతదినమునకు అమలులోఉన్న చట్టము క్రింద మదరాసు హైకోర్టు ఆ ప్రదేశాలు, వాటిభాగాలపైన చలాయించే విధంగానే ఆంధ్రహైకోర్టు చలాయించవచ్చును.

31. అడ్వొకేట్లను చేర్చుకొను అధికారం వగైరా :

(1) నిర్ణీతదినమునకు పూర్వం అమలులోఉన్న న్యాయసూత్రముల క్రింద అడ్వొకేట్లను, అటార్నీలను అంగీకరించడానికి, తీసుకోడానికి, చేర్చుకోడానికి, తొలగించడానికి, సస్పెండుచేయడానికి, మద్రాసు హైకోర్టుకు ఉన్నఅధికారమే, ఆంధ్ర హైకోర్టు కలిగిఉండును.

(2) మద్రాసు హైకోర్టులో వాదించే హక్కులకు సంబంధించి నిర్ణీతదినమునకు పూర్వము అమలులోఉన్న నిబంధనలనుబట్టి ఆంధ్రహైకోర్టులో వాదించే హక్కులు నిర్ణయించబడును.

కాని ఈ సెక్షను ప్రకారం నిర్ణయింపబడిన అధికారాల చలామణిలో ఆంధ్ర హైకోర్టు చేసిన నియమం లేక ఆదేశానికి లోబడి, నిర్ణీతదినమునకు పూర్వము మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసుచేయుటకు, అధికారముగల అడ్వొకేటుగాని, పనిచేయుటకు అధికారముగల అటార్నీగాని ఆంధ్ర హైకోర్టులో ప్రాక్టీసుచేయుటకుగాని, పనిచేయుటకుగాని అధికారముగల అడ్వొకేటుగా, అటార్నీగా గుర్తింపబడుదురు.

32. ఆంధ్ర హైకోర్టులో ప్రాక్టీసు, ప్రొసీజరు :

ఈ అధ్యాయంలోని అంశములకు లోబడి మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు, ప్రొసీజరులకు సంబంధించి అమలులోఉన్న లా అవసరమైన మార్పులతో ఆంధ్ర హైకోర్టుకుకూడ వర్తించును. ఆ ప్రకారము ఆ హైకోర్టు ప్రాక్టీసు, ప్రొసీజరుకు సంబంధించి, నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టు అమలు జరిపే నియమాలు, ఉత్తరువులు లాంటివి చేయుటకు అధికారము కలిగి ఉండును.

కాని, నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు, ప్రొసీజరుకు సంబంధించిన నియమాలు, ఉత్తరువులు, ఆంధ్ర హైకోర్టు ఉత్తరువులద్వారా మార్పు వరకు లేదా తిరిగి సరికిరించేవరకు, సదరు ప్రాక్టీసు, ప్రొసీజరుకు సంబంధించినంతవరకు తగు మార్పులతో ఆంధ్ర హైకోర్టు చేసినట్లుగానే భావింపబడి, దానికి వర్తించును.

**33. ఆంధ్ర హైకోర్టు సీలు భద్రముచేయుట :**

మద్రాసు హైకోర్టు సీలును భద్రపరచే విషయమై నిర్ణీతదినమునకు పూర్వము అమలులోఉన్న లా తగు మార్పులతో ఆంధ్ర హైకోర్టు సీలును భద్రపరిచే విషయమై వర్తించును.

**34. రిట్లు తదితర వ్యవహారాలు :**

నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టు ఉపయోగించిన, జారీచేసిన, నిర్ణయించిన రిట్ల విధానం, తదితర వ్యవహారాలకు సంబంధించి అమలులోఉన్న లా తగు మార్పులతో ఆంధ్ర హైకోర్టు ఉపయోగించే, జారీచేసే, నిర్ణయించే రిట్ల విధానం, తదితర వ్యవహారాలకు వర్తించును.

**35. న్యాయమూర్తుల అధికారాలు :**

నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టులోని ప్రధాన న్యాయమూర్తి, సింగిలు న్యాయమూర్తులు, డివిజనుకోర్టు అధికారాలకు సంబంధించి అమలులో ఉన్న లా, ఆ అధికారాలను వినియోగించుటకు కావలసిన అన్ని విషయాలు ఆంధ్ర హైకోర్టుకు వర్తించును.

**36. హైకోర్టు విచారణ స్థానం :**

ఆంధ్ర హైకోర్టు న్యాయమూర్తులు, డివిజను కోర్టులు ప్రధాన కార్యస్థానంలోకాక వేరొక ప్రదేశంలో లేక ప్రదేశాలలో విచారణ జరుపుటకు ప్రధాన న్యాయమూర్తి, ఆంధ్ర గవర్నరు అనుమతితో నిర్ణయించవచ్చును.

**37. సుప్రీం కోర్టుకు అపీలు చేసుకొనే విధానం :**

నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టునుండి, ఆ కోర్టు న్యాయమూర్తులు డివిజను కోర్టులనుండి సుప్రీంకోర్టుకు అపీలు చేసుకొనుటకు అమలులోఉన్న లా తగు మార్పులతో ఆంధ్ర హైకోర్టుకుకూడా వర్తించును.

**38. మద్రాసు హైకోర్టునుంచి ఆంధ్ర హైకోర్టుకు విచారణ మార్పు :**

(1) నిర్ణీతదినమునుండి కింద విధించిన ప్రకారం మినహా మద్రాసు హైకోర్టుకు ఆంధ్ర రాష్ట్రంలో విచారణాధికారము కలిగి ఉండదు.

(2) నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టులో ఇంకా విచారణలోనే ఉన్న కేసులు ఆ కేసుకి ముందుగాని తర్వాతగాని ఆ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి చేత, వ్యాజ్య కారణము, తదితర పరిస్థితులనుబట్టి ఆంధ్ర హైకోర్టుచే విచారింపబడి

నిర్ణయించవలసినదిగా సర్టిఫై చేయబడినది. అలా సర్టిఫై అయిన వెంటనే ఆంధ్ర హైకోర్టుకు మార్చబడును.

(3) ఈ సెక్షనులోని సబ్ సెక్షనులు (1), (2) లో, 30వ సెక్షనులో ఏమి పొందుపర్చబడినప్పటికీ, క్రింద పొందుపరచబడినది గాక, అపీళ్ళు, సుప్రీం కోర్టుకు అపీలు చేసుకొనుటకు అనుమతితో సహా పెట్టుకొన్న దరఖాస్తులు, మద్రాసు హైకోర్టు జారీచేసిన ఉత్తరువుల సంబంధించి రిలీఫు పొందుటకు, పునర్విచారణ తదితర ప్రొసీడింగులకు దరఖాస్తు స్వీకరించుటకు, విచారణ చేయుటకు, పరిష్కరించుటకు సదరు ప్రొసీడింగులు నిర్ణీత దినానికి పూర్వమే దాఖలు చేయబడిన, మద్రాసు హైకోర్టుకే అధికారముండును. ఆంధ్ర హైకోర్టుకు ఆ అధికారముండదు.

కాని, మద్రాసు హైకోర్టులో స్వీకరించబడిన ప్రొసీడింగులు ఆంధ్రహైకోర్టుకు మార్చదగినవని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికి తోచిన వాటిని అతను మార్చుతూ ఉత్తరువు చేయవచ్చును. ఆ ప్రొసీడింగులు ఆ ప్రకారం మార్చబడును.

(4) మద్రాసు హైకోర్టు (అ) నిర్ణీత దినానికి పూర్వం సబ్ సెక్షను (2) ప్రకారం ఆంధ్ర హైకోర్టుకు మార్చబడిన ప్రొసీడింగులలో (ఆ) సబ్ సెక్షను (3) ప్రకారం మద్రాసు హైకోర్టు అధికారం అట్టే ఉంచుకొనిన ప్రొసీడింగులలో సకల విషయాలకు మద్రాసు హైకోర్టు ఉత్తరువులుగానే కాక ఆంధ్ర హైకోర్టు ఉత్తరువులుగా కూడా అమలులో వుండును.

39. రక్షణలు :

రాజ్యాంగంలోని నిబంధనలను ఆంధ్ర హైకోర్టుకు అనువర్తింప జేయడంలో ఈ అధ్యాయంలోని దేనీ అడ్డురాదు. హైకోర్టుకు సంబంధించి నిర్ణీత దినమునగాని, తర్వాతగాని శాసనసభచేగాని, అధికారం గల ఇతరులచేగాని చేయబడిన నిబంధనకు లోబడి ఈ అధ్యాయం అమలులోకి వచ్చును.

40. తాత్కాలిక నిబంధన :

(1) ఈ సెక్షనులోని నిబంధనలు మొదటి నిర్ణీత దినమునుండి, రెండవ నిర్ణీత దినమువరకు అమలులో ఉండును.

(2) మద్రాసు హైకోర్టు అధికారాలు ఆంధ్రరాష్ట్రమునకు కూడా వర్తించును. ఆ హైకోర్టు, రాష్ట్రములోని ప్రదేశాలకు సంబంధించినంతవరకు నిర్ణీతదినమునకు ముందుగల అధికారాలతో కలిగి ఉండును.

41. మైసూరులో కలిపిన ప్రదేశాలకు హైకోర్టు :

(1) క్రింద పొందుపరచినట్లుగా

అ. మైసూరు హైకోర్టు అధికారాలు నిర్ణీత దినము నుండి కలిపివేయబడిన ప్రదేశమునకంతకు వర్తించును.

ఆ. ఆనాటి నుండి మద్రాసు హైకోర్టుకు కలిపివేయబడిన ప్రదేశాలపై అధికార ముండదు.

(2) నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టులో ఇంకా విచారణలోనే ఉన్న కేసులు ఆ తేదీకి ముందు గాని, తర్వాతగాని ఆ హైకోర్టు ప్రధానన్యాయమూర్తి చేత వ్యాజ్యకారణము, తదితర పరిస్థితులను బట్టి మైసూరు హైకోర్టుచే విచారించబడి నిర్ణయించవలసినదిగా సర్టిఫై చేయబడినచో, అలా సర్టిఫైఅయిన వెనువెంటనే మైసూరు హైకోర్టుకు మార్చబడును.

(3) ఈ సెక్షనులోని సబ్‌సెక్షనులు (1), (2) లలో పొందుపర్చబడినప్పటికీ క్రింద పొందుపర్చబడినవి గాక అపీళ్ళు, సుప్రీంకోర్టుకు అపీలు చేసుకొనుటకు అనుమతిలో సహా పెట్టుకొన్న దరఖాస్తులు, మద్రాసు హైకోర్టు జారీచేసిన ఉత్తరువులకు సంబంధించి రివ్యూ పొందుటకు, పునర్విచారణ తదితర ప్రొసీడింగులకు దరఖాస్తులు స్వీకరించుటకు, విచారణచేయుటకు, పరిష్కరించుటకు సదరు ప్రొసీడింగులు నిర్ణీత దినానికి ముందు దాఖలుచేయబడిన మద్రాసు హైకోర్టుకే అధికారముండును. మైసూరు హైకోర్టుకు ఆ అధికారముండదు.

కాని, మద్రాసు హైకోర్టులో స్వీకరించబడిన ప్రొసీడింగులు మైసూరు హైకోర్టుకు మార్చతగినవని హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికి తోచినచో, వాటిని మార్చుటకు వారు ఉత్తరువులు చేయవచ్చును. ఆ ప్రొసీడింగులు ఆ ప్రకారము మార్చబడును.

(4) మద్రాసు హైకోర్టు (అ) నిర్ణీత దినానికి పూర్వం సబ్‌సెక్షను (2) ప్రకారము మైసూరుహైకోర్టుకు మార్చబడిన ప్రొసీడింగులలో (ఆ) సబ్‌సెక్షను (3) ప్రకారం మద్రాసు హైకోర్టు అధికారం అట్టే ఉంచుకొనిన ప్రొసీడింగులలో సకల విషయాలకు మద్రాసు హైకోర్టు ఉత్తర్వులుగానేగాక మైసూరు హైకోర్టు ఉత్తరువులుగాకూడా అమలులో ఉండును.

(5) నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు చేయుటకు అధికారముగల అడ్వొకేటుగాని, పనిచేయుటకు అధికారముగల అటార్నీగానీ సబ్‌సెక్షను (2) లేక సబ్‌సెక్షను (3) నిబంధనలక్రింద ఆ హైకోర్టునుంచి, మైసూరు హైకోర్టుకు మార్చబడిన ప్రొసీడింగులలో వాదించుటకు, పనిచేయుటకు అధికారమివ్వబడినవారు, ఆ ప్రొసీడింగులు మార్చబడగానే ఆ ప్రొసీడింగులకు సంబంధించి మైసూరు హైకోర్టులో ప్రాక్టీసుచేయుటకు, పనిచేయుటకు అధికారముగల అడ్వొకేట్లుగా, అటార్నీలుగా వాదించుటకు, పనిచేయుటకు అధికారము కలిగిఉందురు.

42. వ్యాఖ్య :

సెక్షను 38, 41 ప్రయోజనసిద్ధికొరకు

(అ) ప్రొసీడింగులపైన ఖర్చులతో సహా అన్ని వివాదగ్రస్తవిషయాలను పరిష్కరించేదాకా కోర్టులో ప్రొసీడింగులు ఇంకా విచారణలో ఉన్నట్లే ఎంచబడును.

అపీళ్ళు, సుప్రీంకోర్టుకు అపీలు చేసుకొనుటకు అనుమతితో సహా అపీలు దరఖాస్తులు, పునఃపరిశీలన దరఖాస్తులు, పునర్విచారణకు దరఖాస్తులు, రిట్లకు దరఖాస్తులు పై ప్రొసీడింగులలో పొందుపర్చబడి ఉండును.

ఆ. హైకోర్టును ఉదహరించడమనగా అందులోని న్యాయమూర్తినిగాని, డివిజను కోర్టునుగాని ఉదహరించినట్లుగా ఎంచబడును. కోర్టుగాని, న్యాయమూర్తిగాని చేసిన ఉత్తరువులు ఉదహరించడం ఆ కోర్టు లేక ఆ న్యాయమూర్తి చేసిన, ఇచ్చిన శిక్ష, తీర్పు, డిక్రీని ఉదహరించినట్లుగా ఎంచబడును.

# అధ్యాయం - 5

## ఆర్థిక నిబంధనలు

43. శాసనసభ మంజూరుచేసేలోపల ఖర్చుకు అధికారమిచ్చుట :

(1) నిర్ణీతదినమునకు పూర్వం ఎప్పుడైనాసరే ఆంధ్రరాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధినుంచి, మద్రాసు రాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధినుంచి, ఆంధ్ర శాసనసభగాని, మద్రాసు శాసనసభగాని మంజూరు చేసేలోపల నాలుగు మాసములకు మించని కాలమునకు అవసరమని తోచినట్లు ఖర్చుచేయుటకు మద్రాసు గవర్నరు అధికారమివ్వవచ్చును.

కాని నిర్ణీతదినమునకు తర్వాత ఆంధ్ర గవర్నరు అతనికి తోచినట్లు ఆంధ్ర రాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధినుంచి పై చెప్పిన నాలుగు మాసములకు మించని కాలమునకు ఖర్చుచేయుటకు అధికారమివ్వకున్ననే పైది చెల్లును.

(2) మైసూరు శాసనసభ మంజూరు చేసేలోపల మైసూరురాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధినుండి కలిపివేయబడిన ప్రదేశాలకు అయ్యేఖర్చు నిమిత్తం నిర్ణీతదినముతో ప్రారంభమయే నాలుగు మాసాలకు మించని కాలమునకు ఖర్చుచేయుటకు అధికారమివ్వవచ్చును.

44. మద్రాసు శాసనసభ నిర్ణయము :

1953-54 ఆర్థిక సంవత్సర భాగానికి అంచనావేయబడిన ఖర్చు నిమిత్తం సూత్రం 206 క్లాజు (1) సబ్ క్లాజు

అ. క్రింద మద్రాసు శాసనసభ యిచ్చిన గ్రాంటు, ఆ గ్రాంటు యివ్వబడిన ప్రయోజనసిద్ధికొరకు కన్సాలిడేటెడ్ నిధినుండి ధనము తీయుటకు అధికారమిస్తూ ఆ రాష్ట్ర శాసనసభచేసిన చట్టం, నిర్ణీతదినమునకు పూర్వం ఆ ఖర్చు గ్రాంటుచేయుటకు సూత్రం 203 నిబంధించినట్లు వోటింగు పూర్తికాకపోయినా, ఆ ఖర్చుకు సంబంధించి సూత్రం 204 లోని నిబంధనలప్రకారం చట్టం చేయబడకపోయినా పై గ్రాంటు యివ్వబడిన ప్రయోజనసిద్ధికొరకు, ఆ ఖర్చుకు సంబంధించి కన్సాలిడేటెడ్ నిధినుండి

ధనం తీయుటకు ఆ రోజు పూర్వంఅయిన ఖర్చు మంజూరు చేయుటకు తగిన అధికారం కలిగిఉండును.

**45. మద్రాసు అప్రాప్రియేషన్ చట్టం క్రింద అధికారం :**

1953_54 ఆర్థిక సంవత్సర భాగానికి ఖర్చునిమిత్తం రాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధినుంచి ధనముతీయుటకు ఆదినమునకు ముందు మద్రాసు శాసనసభ చేసిన ఏ చట్టమైనా నిర్ణీతదినము నుండి అమలులో ఉండదు.

**46. మద్రాసురాష్ట్ర జమాఖర్చులకు సంబంధించిన రిపోర్టులు :**

నిర్ణీతదినమునకు పూర్వపు కాలానికి సంబంధించిన మద్రాసురాష్ట్ర జమాఖర్చులపై ఆర్టికల్ 151, క్లాజు (2) లో నిర్దేశించినట్లు కంట్రోలరు, ఇండియా ఆడిటర్ జనరలు రిపోర్టులు ఆంధ్ర, మద్రాసు గవర్నరు లిరువురికీ అందజేయబడును. వారు వాటిని ఆ యా రాష్ట్రశాసనసభలముందుంచునట్లు చూతురు.

**47. ఆస్తి ఋణాల విభజన :**

(1) ఈ అధ్యాయంలోని ఇతర నిబంధనలకు లోబడి, నిర్ణీతదినమునకు పూర్వం మద్రాసురాష్ట్ర ఆస్తి, అప్పులు ఏడవ అనుబంధంలోని నిబంధనలప్రకారం ఆ రాష్ట్రమునకు ఆంధ్ర, మైసూరు రాష్ట్రములకు విభజింపబడును.

(2) ఆ విభజనకు సంబంధించిన వివాదాలు అధ్యక్షుని నిర్ణయానికి వదలివేయబడును. అధ్యక్షుని నిర్ణయమే అంతిమనిర్ణయం.

**48. కంట్రాక్టులు :**

రాష్ట్ర ప్రయోజన సిద్ధికొరకు ఆ రాష్ట్ర పరిపాలనాధికారాలు అమలుచేయుటకు మద్రాసురాష్ట్రం నిర్ణీతదినమునకు ముందు కంట్రాక్టు చేసి యున్నయెడల

అ. ఆనాటినుండి ఆ ప్రయోజనాలు

(1) ఆంధ్రరాష్ట్ర ప్రయోజనాలకొరకే మాత్రమే లేక

(2) కొంతవరకు ఆంధ్రరాష్ట్ర ప్రయోజనాలకొరకు, కొంతవరకు మైసూరు రాష్ట్ర ప్రయోజనాలకొరకే గాని నిర్ణీతదినము ప్రకారం ఏర్పడిన మద్రాసురాష్ట్ర ప్రయోజనాలకు కాకపోయిన, మద్రాసురాష్ట్రానికి బదులు ఆంధ్రరాష్ట్ర పరిపాలనాధికారాల అమలుకు చేయబడినదిగా ఎంచబడును.

ఆ. ఆనాటినుండి ఆ ప్రయోజనాలు మైసూరురాష్ట్రముకు మాత్రమే చెందిన వైన యెడల మద్రాసురాష్ట్రముకు బదులు ఆ రాష్ట్రపరిపాలనాధికారాల అమలుకు చేయబడినదిగా ఎంచబడును:

ఇ. ఇంకేపక్షములోనైనా మద్రాసురాష్ట్ర అధికారాలు అమలుచేయుటకు చేయబడినదిగా ఎంచబడును.

అటువంటి కంట్రాక్టుక్రింద సంక్రమించిన, సంక్రమించనున్న హక్కులు, బాధ్యతలు నిర్ణీతదినమునాడు మద్రాసురాష్ట్ర హక్కులు, బాధ్యతలుగాగానే ఆంధ్ర, మైసూరు, మద్రాసు రాష్ట్రముల హక్కులు, బాధ్యతలుగా ఎంచబడును.

(2) ఈ సెక్షను ప్రయోజనసిద్ధికొరకు ఏ కంట్రాక్టుక్రిందనైనా సంక్రమించినవి, సంక్రమించనున్నవిగా ఈ క్రిందివి ఎంచబడును:

అ. కంట్రాక్టుకు సంబంధించిన ప్రొసీడింగులలో ఏ కోర్టుగాని, ట్రిబ్యూనలు గాని చేసిన ఉత్తరువు లేక అవార్డును సంతృప్తిపరచే బాధ్యత.

ఆ. అటువంటి ప్రొసీడింగులలోగాని, ప్రొసీడింగులకు సంబంధించిగాని అయిన ఖర్చుల బాధ్యత.

(3) ఏదైనా ఇతర భాగాలలో పంచిపెట్టబడిన అప్పులు, గ్యారంటీలు, తదితర ఆర్థిక బాధ్యతలకు సంబంధించి నిర్ణీతమైన బాధ్యతలకు సంబంధించిన నిబంధనకు లోబడి ఈ సెక్షను వర్తించును. బ్యాంకు నిల్వలు, సెక్యూరిటీలు కంట్రాక్టు హక్కులకు సంబంధించినవైనా పై సెక్షనుక్రిందకు వచ్చును.

49. అయుక్త వ్యాజ్యముల బాధ్యత:

నిర్ణీతదినమునకు పూర్వం కంట్రాక్టు భంగముగాక యితరమైన దావా తప్పుకు సంబంధించిన బాధ్యతకు లోనైనయెడల ఆ బాధ్యత,

అ. వ్యాజ్య కారణము.

(1) ఆనాటినుండి ఆంధ్రరాష్ట్రము క్రిందకువచ్చే ప్రదేశాలలో మాత్రమే పుట్టిన

(2) ఆనాటినుండి ఆంధ్రరాష్ట్రంక్రిందకు వచ్చే ప్రదేశాలలో కొంతవరకు, కలిపి వేయబడిన ప్రదేశంలో కొంతవరకు పుట్టి ఆనాటినుండి మద్రాసురాష్ట్రముక్రింద ఉండే ప్రదేశాలలో కాకుండిన, ఆంధ్రరాష్ట్ర బాధ్యతగా ఎంచబడును.

ఆ. కలిపివేయబడిన ప్రదేశాలలో మాత్రమే వ్యాజ్య కారణము పుట్టిన ఆ బాధ్యత మైసూరు రాష్ట్ర బాధ్యతగా ఎంచబడును.

ఇ. ఇంకే పక్షములోనైనా ఆ బాధ్యత మద్రాసు రాష్ట్ర బాధ్యతగానే ఎంచబడును.

50. హామీ బాధ్యత:

నిర్ణీతదినమునకు పూర్వం, 1932 మద్రాసు కోపరేటివు సొసైటీల చట్టం (1932 నాటి 6వ మద్రాసు చట్టం)క్రింద రిజిస్టరు అయి నిర్ణీతదినమునాటికి ఆంధ్ర రాష్ట్రము క్రిందకువచ్చిన ప్రదేశాలలోగాని, ప్రదేశ భాగాలలోగాని పనిచేయుచుండిన కోపరేటివు సొసైటీ బాధ్యతకు సంబంధించి మద్రాసురాష్ట్రము హామీ బాధ్యత కలిగి ఉండిన, ఆనాటినుండి ఆ హామీకి సంబంధించిన మద్రాసు రాష్ట్రముయొక్క పై బాధ్యత ఆంధ్రరాష్ట్ర బాధ్యతగా యెంచబడును.

**51. కొన్ని సందర్భాలలో నిర్ణయాలు చేయుటకు, సర్దుబాటు చేయుటకు అధ్యక్షునికిగల అధికారాలు :**

ఏడవ షెడ్యూలులోని నిబంధనల ప్రకారం లేక సెక్షనులు 47-50 లలోని నిబంధనల ప్రకారం మద్రాసు, ఆంధ్ర, మైసూరులలో ఏ రాష్ట్రమయినా ఏ ఆస్తికైనా హక్కుదారైన లేక ఇతర లాభములు పొందిన, లేక ఏ బాధ్యతకైనా లోబడిన, దీనికి సంబంధించిన రాష్ట్రము నిర్ణీతదినమునుండి మూడుసంవత్సరములలోగా అధ్యక్షునకు తెలియజేసిన, ఆ ఆస్తిగాని, ఆ లాభముగాని తక్కిన రాష్ట్రములలో ఒకటికిగాని, రెంటికిగాని మార్పిడంగాని, పంచడంగాని, ఒకటిగాని, రెండుగాని రాష్ట్రములు ఆ బాధ్యతను భరించుట న్యాయము, సమ్మతము అని అధ్యక్షునకు తోచిన, వారు రాష్ట్రప్రభుత్వముతో సంప్రతించి, పై ఆస్తిగాని, లాభముగాని ఏ విధంగా పంచవలెనో లేక తక్కిన రాష్ట్రమునకుగాని రాష్ట్రములకుగాని బాధ్యతను భరించుట ప్రధాన విషయంచేస్తూ అధ్యక్షుడు ఉత్తరువుద్వారా నిర్ణయించును.

**52. రాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధిపై కొన్ని ఖర్చుల వసూలు :**

ఏడవ అనుబంధములోని పేరా 12 లేక పేరా 17 లలోని నిబంధనల ప్రకారం మద్రాసు, ఆంధ్ర, మైసూరు రాష్ట్రములలో ఒకదానికిగాని కేంద్ర ప్రభుత్వానికిగాని చెల్లించవలసిన మొత్తాలు, ఆ మొత్తాలు చెల్లించవలసిన రాష్ట్ర కన్సాలిడేటెడ్ నిధినుండి వసూలు చేయబడును.

# అధ్యాయం 6

## శాసన నిబంధనలు

**53. శాసనాల ప్రాదేశిక వ్యాప్తి :**

నిర్ణీతదినమునకు పూర్వము అమలులో ఉన్న శాసనము వ్యాపించిన, వర్తించిన ప్రదేశాలలో రెండవ అధ్యాయంలోని నిబంధనలు ఎలాంటి మార్పు తెచ్చినట్లు యెంచబడదు.

**54. శాసనాధికారం :**

నిర్ణీత దినమునకు ముందు ఆంధ్ర, మద్రాసు, మైసూరు రాష్ట్రాలకు సంబంధించి చేయబడిన శాసనము వర్తింపచేయుటకు 1954 ఎప్రిల్ 1కి పూర్వం తగుప్రభుత్వం ఉత్తరువు ద్వారా అవసరమైనట్లు, తగినట్లు శాసనమును పునరుద్ధరించుట లేక సవరించుట ద్వారా అనువర్తింపచేయవచ్చును లేక సవరణలు చేయవచ్చును. అధికారముగల శాసనసభ లేక ప్రభుత్వం దానిని మార్చుట, పునరుద్ధరించుట, సవరించుట చేయునంతవరకు అమలులో ఉండును.

వివరణ : ఈ సెక్షనులో 'తగు ప్రభుత్వం' అను మాటకు అర్థం రాజ్యాంగ ఏడవ అనుబంధానికి జతపర్చిన 1 వ జాబితాలోని విషయాలకు సంబంధించినట్లయితే కేంద్రప్రభుత్వమనీ, తక్కిన శాసనాలకు సంబంధించినంతవరకు సందర్భానుసారంగా ఆంధ్ర రాష్ట్రం, మద్రాసు రాష్ట్రం, మైసూరు రాష్ట్రం అని.

55. నిర్ణీతదినమునకు పూర్వం శాసనం అనువర్తింపచేయడానికి :

సెక్షను 54 క్రింద అధికారం మిన్నకపోయినా లేక తగినంత అధికారము లేకపోయినా ఏ కోర్టుఅయినా, ట్రిబ్యూనలుఅయినా, ఆశాసనమును ఆంధ్ర, మైసూరు, మద్రాసు రాష్ట్రాలలో మూలసూత్రాలకు భంగం లేకుండా, ఆయా కోర్టులముందున్న వ్యవహారాలకు అవసరమైన మార్పులతో వర్తింపచేయవచ్చును.

56. శాసనాధికార నిర్వహణకు అధికారులను వగైరా నిర్ణయించు అధికారం :

నిర్ణీతదినంవరకు అమలులోవున్న శాసనాలను నిర్ణీతదినంనుంచి, ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినంతవరకు గవర్నరు, కలిపివేయబడిన భూభాగానికి సంబంధించినంతవరకు రాజప్రముఖ్ అధికార గజెట్‌లో ప్రకటించబడిన అధికారి, వుద్యోగి, లేక వ్యక్తి గజెట్ ప్రకటన ప్రకారం శాసనాలను అమలుపరచు అధికారము కలిగియుండును; సదరు విధముగా అమలుపరచబడుతున్న శాసనాలు పూర్తిపటుత్వం కలిగివుండును.

57. మద్రాసు రాష్ట్రానికి సంబంధించిన దావాలు :

నిర్ణీతదినానికి ముందు ఏదైనా ఆస్తి, హక్కులు లేక బాధ్యతల (liabilities) సంబంధించిన దావాల్లో మద్రాసురాష్ట్రము పార్టీగా వుంటే, సదరు ఆస్తి, హక్కులు లేక బాధ్యతలు ఆంధ్ర, మద్రాసు, మైసూరు రాష్ట్రాలమధ్య పంపిణీలు జరిగాక, ఏ రాష్ట్ర భాగానికి వచ్చునో, ఆ రాష్ట్రం మద్రాసు రాష్ట్రానికి బదులు పార్టీగా చేర్చబడి లేక పార్టీగా సూచబడి దావాలు కొనసాగించబడును.

58. అమల్లోవున్న వ్యవహారములకు సంబంధించిన సూత్రాలు :

(1) నిర్ణీతదినానికి ముందు, ఏ కోర్టులో (హైకోర్టుమినహా) గాని, ట్రిబ్యూనల్లో గాని, అధికారి లేక ఆఫీసరువద్దగాని అమల్లోవున్న ప్రతి వ్యవహారం—

(అ) అప్పటివరకు మద్రాసులోగాని, కలిపివేయబడిన భూభాగంలోగాని, భాగంగా వుండి, నిర్ణీత దినాన ఆంధ్రరాష్ట్ర భూభాగంలో భాగమైన ప్రదేశానికి సంబంధించిన వ్యవహారాలను ఆంధ్రరాష్ట్రానికి చెందిన తత్సంబంధమైన కోర్టుకు, ట్రిబ్యూనల్‌కు, అధికారి లేక ఆఫీసరుకు మార్చబడును.

(ఆ) అప్పటివరకు మద్రాసు లేక ఆంధ్రరాష్ట్ర భూభాగంగా వుండి, నిర్ణీత దినాన మైసూరు రాష్ట్రానికి కలిపివేయబడిన భూభాగమైన ప్రదేశానికి సంబంధించిన వ్యవహారాలను, మైసూరురాష్ట్రానికి చెందిన తత్సంబంధమైన కోర్టుకు, ట్రిబ్యూనల్‌కు అధికారి లేక ఆఫీసరుకు మార్చబడును.

(2) 1వ సబ్ సెక్షన్ మీదుమరి ఏదైనా వ్యవహారం ఒక రాష్ట్రం నుంచి మరొక రాష్ట్రానికి మార్చవలెనా అన్న సమస్య వచ్చినప్పుడు ఆ సమస్య మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి నిర్ణయానికి వదలివేయబడును. ప్రధాన న్యాయమూర్తి నిర్ణయమే అంతిమ నిర్ణయం.

(3) ఈ సెక్షన్‌లో —

(అ) 'వ్యవహారాలు' అనగా సివిల్ క్రిమినల్ దావాలు లేక అప్పీళ్ళు

(ఆ) 'రాష్ట్రానికి చెందిన తత్సంబంధమైన కోర్టు, ట్రిబ్యూనల్, అధికారి లేక ఆఫీసరు' అనగా

(1) నిర్ణీత దినం తర్వాత ఆ వ్యవహారాలను ఏ కోర్టు, ట్రిబ్యూనల్, అధికారి లేక ఆఫీసరుముందు దాఖలు చేయబడునో అది.

(2) అనుమానం కలిగితే నిర్ణీత దినానికి ముందు మద్రాసు గవర్నరు, నిర్ణీత దినం తర్వాత గవర్నరు లేక రాజప్రముఖ్ నిర్ణయించిన కోర్టు, ట్రిబ్యూనల్, అధికారి లేక ఆఫీసరు.

# అధ్యాయం 7

## పరిపాలన, వివిధ నిబంధనలు

59. కొన్ని జైళ్ళను, తదితర సంస్థలను వుపయోగించు అధికారం, మరియు నిర్వహించుటకు నిబంధనలు :

(1) నిర్ణీతదినమునుంచి అయిదు సంవత్సరాలదాకా మద్రాసు, మైసూరు ప్రభుత్వాలు, 8వ షెడ్యూలు 1, 2 భాగాల్లో వివరించబడిన జైళ్ళకు, తదితర సంస్థలకు ఆంధ్రరాష్ట్రంలోని ఏకోర్టు అయినా ట్రిబ్యూనల్ అయినా, ఖైదీలను నిర్బంధంలో వుంచుటకు వుత్తర్వు చేసినచో సదరు జైళ్ళను, సంస్థలను ఆంధ్ర ప్రభుత్వంయొక్క వుపయోగంలో వుంచవలెను.

(2) 1వ సబ్ సెక్షన్‌లో నిర్దేశించు సమయంలో ఆంధ్రరాష్ట్రంలోని కోర్టు, ట్రిబ్యూనల్, లేక అధికారి 8వ షెడ్యూల్లో వివరించబడిన జైళ్ళకు, సంస్థలకు శిక్షించబడిన లేక నిర్బంధంలో వుంచుటకు ఆజ్ఞాపించబడిన వ్యక్తులను, తమ రాష్ట్ర ఇలాకాలో లేకపోయినా, సదరు జైళ్ళకు, సంస్థలకు పంపు అధికారం కలదు.

(3) 1వ సబ్ సెక్షన్‌లో నిర్వచించిన ప్రకారంగా 8వ షెడ్యూల్లోని జైళ్ళను, తదితర సంస్థలను ఏ నిబంధనలకు షరతులకు లోబడి ఆంధ్ర ప్రభుత్వము వుపయోగించుకోవలెనో, సదరు నిబంధనలు, షరతులు 1 జనవరి 1954 నాటికి ఆయా ప్రభుత్వాలు ఒప్పందం కుదుర్చుకోవాలి; అలా అనాటికి ఆయా ప్రభుత్వాలమధ్య

ఒప్పందం కుదరనిచో, సదరు నిబంధనలను, షరతులను ప్రెసిడెంటు ఉత్తర్వుద్వారా నిర్ణయించును.

60. కొన్ని రాష్ట్ర సంస్థల్లో, అమల్లో వున్న సౌకర్యాలను కొనసాగించుట :

మద్రాసు, మైసూరు ప్రభుత్వాలు, 9 వ షెడ్యూలు 1, 2, భాగాల్లో వివరించబడిన సంస్థల్లో 1 జనవరి 1954 నాటికి ఆంధ్ర ప్రభుత్వానికి, ఆంధ్ర ప్రజలకు ఆయా ప్రభుత్వాల మధ్య అంగీకృతమైన షరతులతో, అంగీకృతమైన గడువుమేర, అంగీకృత సౌకర్యాలను కలిగించాలి; అలా ఆనాటికి ఆయా ప్రభుత్వాలమధ్య అంగీకారం కుదరనిచో, ప్రెసిడెంటు వుత్తర్వుద్వారా నిర్ణయించును

61. పరిపాలనాశాఖ, పోలీసుశాఖలకు సంబంధించిన నిబంధనలు :

(1) నిర్ణీత దినానికి ముందు మద్రాసురాష్ట్రంలో వున్న భారతీయ పరిపాలనా శాఖ, భారతీయ పోలీసుశాఖల స్థానే, నిర్ణీతదినంనుంచి వొక్కొక్క శాఖ రెండుగా విభజించబడి, ఆంధ్ర ప్రభుత్వానికి ప్రతి శాఖలో ఒక భాగం, మద్రాసు ప్రభుత్వానికి తతిమ్మా భాగాలు కేటాయించబడును.

(2) ఆంధ్ర, మద్రాసురాష్ట్రాల మధ్య విభజింపబడిన ఆయా శాఖలకు, కేటాయించవలసిన ప్రత్యేకాధికారులను, వారి సంఖ్యను, ఏర్పాట్లను ప్రెసిడెంటు వుత్తర్వులద్వారా నిర్ణయించును.

(3) నిర్ణీత దినానికి ముందు మద్రాసు రాష్ట్రంలో ఉద్యోగంలో వుండి, నిర్ణీత దినాన 2వ సబ్ సెక్షన్ మింజావశ ఆంధ్రరాష్ట్రానికి కేటాయించబడిన ప్రతి వుద్యోగి—

(అ) నిర్ణీతదినానికిముందు మద్రాసు రాష్ట్రంలో భాగమైవుండి, నిర్ణీతదినాన ఆంధ్రరాష్ట్రంలో భాగమైన ఏప్రాంతంలో అయినా వుద్యోగం చేస్తూవుంటే, సదరు వుద్యోగి నిర్ణీతదినంనుంచి ఆంధ్ర ప్రభుత్వంచే నియమించబడినట్లే యెంచబడును.

(ఆ) అలా నిర్ణీతదినానికి ముందు ఆంధ్రరాష్ట్ర హద్దుల్లోపల వుద్యోగం నిర్వహిస్తూ వుండకుండావుంటే సదరు వుద్యోగి ఆంధ్రప్రభుత్వంచే రాష్ట్రానికి సంబంధించిన వ్యవహార నిర్వహణకు నియోగించబడవలెను.

62. ఇండియన్ సివిల్ సర్వీసు, ఇండియన్ పోలీసు, ఇండియన్ ఇంజనీర్ల సర్వీసు, ఇండియన్ ఫారెస్టు సర్వీసులకు సంబంధించిన నిబంధనలు :

(1) ఆంధ్ర, మద్రాసు రాష్ట్రాలమధ్య, ఇండియన్ సివిల్ సర్వీసు, ఇండియన్ పోలీసు, ఇండియన్ ఇంజనీర్ల సర్వీసు, ఇండియన్ ఫారెస్టు శాఖల్లోని ఆఫీసర్ల కేటాయింపును ప్రెసిడెంటు వుత్తర్వుద్వారా నిర్ణయించును.

(2) 1వ సబ్ సెక్షన్ ప్రకారం ఆంధ్ర రాష్ట్రానికి కేటాయించబడి, అంతకు పూర్వం నిర్ణీతదినానికి మద్రాసురాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాల్లో పనిచేసిన ప్రతి ఆఫీసరు

(ii) (5)వ సబ్ సెక్షను ప్రకారం పరిమిత కాలమునకు ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాల్లో పనిచేయుటకు ప్రెసిడెంటు ఉత్తర్వులద్వారా నియమింపబడిన ఆఫీసర్లు (వీరు ఈ సెక్షన్‌లో 'బదలాయించబడిన ఆఫీసర్లు' అని పిలవబడుదురు).

(5) ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాల్లో బదలాయించబడిన ఆఫీసర్లు పనిచేయుకాలం రెండేళ్ళు మాత్రం.

అయితే ఇలాంటి ఆఫీసర్లను రెండేళ్ళలోగా ఆంధ్ర ప్రభుత్వం తిరిగి మద్రాసు ప్రభుత్వానికి పంపివేయాలని అనుకుంటే, మద్రాసు ప్రభుత్వానికి, ఆ సంబంధించిన ఆఫీసరుకు మూడు నెలల నోటీసు యిచ్చి, ఆ ఆఫీసరును తిరిగి మద్రాసు ప్రభుత్వానికి పంపించివేయవచ్చును.

(6) ఒక ఆఫీసరు బదలాయించబడిన ఆఫీసరైందీ లేక కేటాయించబడిన ఆఫీసరైందీ కానిదీ, ఆంధ్రరాష్ట్రానికి అంతిమ నిర్ణయంగా కేటాయింపుకు ప్రెసిడెంటు అభిప్రాయంలో అతని అర్హతా వర్తింపల మీద ఆధారపడివుంటుంది.

(7) ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాల కోసం మద్రాసు రాష్ట్రం నుంచి బదలాయించబడిన ఆఫీసరు —

(అ) బదలాయింపు కాలంలో మద్రాసురాష్ట్రం సర్వీసులోనే వున్నట్టు ఆంధ్ర రాష్ట్రానికి సహాయా ప్రతినిధిగా వెళ్ళినట్టు పరిగణించబడును.

(ఆ) బదలాయింపు కాలంలో మద్రాసు రాష్ట్రంలో వుంటే ఏ ఏ వేతనాలకు అర్హుడో, అవే వేతనాలు కాక ప్రెసిడెంటు సాధారణ లేక ప్రత్యేక ఉత్తర్వుల ద్వారా నిర్ణయించిన అలవెన్సులు కూడా అర్హుడగును.

(8) బదలాయించబడిన ఆఫీసరు మద్రాసు ప్రభుత్వం అనుమతిలేనిదే బర్తరఫ్ చేయకూడదు; ఉద్యోగపు హోదా తగ్గించకూడదు; అలాంటి ఆంధ్ర ప్రభుత్వపు ప్రతిపాదనను మద్రాసు ప్రభుత్వం తిరస్కరిస్తే, (5)వ సబ్ సెక్షన్‌లో ఏమున్నప్పటికీ, ఆ ఆఫీసరును వెంటనే మద్రాసు ప్రభుత్వానికి పంపివేయవచ్చును.

(9) 7, 8 సబ్ సెక్షన్లకు లోబడి, బదలాయించబడిన ఆఫీసరు ఏయే ఉద్యోగ నిబంధనలతో (Conditions of Service) మద్రాసు రాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాల్లో పనిచేస్తున్నాడో అవే నిబంధనలు, ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాలకోసం బదలాయించబడిన కాలంలోకూడా వర్తించును.

(10) ఈ సెక్షన్‌లోని నిబంధనలు, 61, 62 సెక్షన్లలోని నిబంధనలు వర్తించిన వారికి వర్తించవు.

**64. ప్రెసిడెంటు అధికారాలు:**

61, 62, 63 సెక్షన్లలోని నిబంధనలను అమలుపరచుటకు, రాష్ట్రాలమధ్య సరిగ్గా సర్వీసుల పంపిణీ జరుగుటకు అవసరమైన ఉత్తర్వులను మద్రాసు, ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలకు ప్రెసిడెంటు జారీచేయవచ్చును.

# షెడ్యూలు 7

## [47 (1), 48 (3), 51, 53, 66 (1) సెక్షన్లకు సంబంధించిన నిబంధనలు]

మద్రాసు, ఆంధ్ర, మైసూరుల మధ్య కేటాయించవలసిన ఆస్తులు, అప్పులకు సంబంధించే నిబంధనలు :

1. (1) ఈ షెడ్యూల్‌లోని ఇతర నిబంధనలకు లోబడి యావత్ భూమి, అన్ని బిల్డింగులు, వస్తువులు, ఇతర సరకులు ఏ రాష్ట్రంలో వుండునో, ఆ రాష్ట్రం సొత్తుగానే పరిగణించబడును.

(2) ఈ పేరాలో 'భూమి' అనగా అన్నిరకాలైన స్థిరాస్తులూ, సదరు ఆస్తులవల్ల సంక్రమించే హక్కులూ.

'సరకులు' అనగా నాణ్యాలు, కరెన్సీనోట్లు కానివి.

2. (1) 1 జూలై 1953, నిర్ణీతదినాల మధ్య మద్రాసు ప్రభుత్వం చేసిన బర్జిత రుణాలు, మద్రాసు ఆంధ్రరాష్ట్రాల మధ్య ప్రెసిడెంటు నిర్ణయించిన నిష్పత్తిలో కేటాయించబడును.

(2) 1వ పేరాలోని నిబంధనలకు లోబడి మద్రాసుప్రభుత్వపు ట్రెజరీలలో, మద్రాసుప్రభుత్వం పేర రిజర్వు బ్యాంకులో నిల్వయున్న రొఖము నిర్ణీత దినానికి పూర్వమే మద్రాసు, ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలమధ్య 62½ : 36 : 1½ నిష్పత్తిలో పంచబడును.

అయితే పంపిణీకోసం ఒక ట్రెజరీ నిల్వలు మరొక ట్రెజరీకి మార్చబడవు. కాని నిర్ణీతదినాన రిజర్వు బ్యాంకులో మూడు రాష్ట్రాల ఖాతాల్లోని జమల సరిటాయింపు ద్వారా నిల్వలు పంపిణీ చేయబడును.

వ్యాఖ్య : ఈ పేరాలో 'ట్రెజరీ' అనగా సబ్ ట్రెజరీ అని కూడా గ్రహించవలెను.

3. ఏ తరగతికి చెందిన స్టోర్సు (Stores)లో అయినా విడుదలచేయని సరకు నిల్వవుంటే, ఆ నిల్వలను ఆయా రాష్ట్రాలు 1 ఏప్రిల్ 1953 నుంచి గత మూడు సంవత్సరాల్లో పంపిన ఇండెంట్ల దామాషాప్రకారం మద్రాసు, ఆంధ్ర, కలిపివేయబడిన ప్రదేశాల మధ్య పంచబడును. సదరు ఇండెంట్ల లెక్కింపులో మద్రాసు నగరంలో వున్న సెక్రటేరియట్ వివిధ ప్రభుత్వశాఖలతరఫున వచ్చిన ఇండెంట్లు లెక్కకురావు.

అయితే ఈ పేరా నిబంధన ప్రత్యేక కార్యకలాపాలకోసం అనగా ప్రత్యేక సంస్థలు, వర్కుషాపులు, ఎలక్ట్రికల్ కార్యాలకోసం, నిర్మాణంలో వున్న ప్రత్యేకమైన పనులకోసం నిల్వచేయబడిన స్టోర్సుకు వర్తించదు.

4. మద్రాసులోని గవర్నమెంటు ప్రెస్‌లోని అచ్చు యంత్రాల్లో కొంత వంతు వీలైనంతవరకు యంత్ర రూపేణా ముట్టచెప్పబడును. అది సాధ్యం కాని పక్షంలో ఆ యంత్రాల విలువను ప్రెస్ ఖాతాల్లో డిప్రిసియేషన్ కింద కొంత తగ్గించబడి వుంటే సదరు మొత్తం పోను మిగిలిన విలువ రొఖ రూపంలో సర్దుబాటు చేయబడును.

5. భూమి శిస్తులతో సహా బకాయిలు ఏరాష్ట్రానికి చెందినవో, ఆరాష్ట్రానికి సదరు శిస్తులు వసూలు చేసుకొనే హక్కు కలదు.

6. (1) నిర్ణీత దినానికి పూర్వం ఏదైనా స్థానిక పరిపాలనా సంస్థకు (బళ్ళారి జిల్లాబోర్డు మినహా) గాని, సొసైటీకిగాని, వ్యవసాయదారునికిగాని లేక మరో వ్యక్తికి గాని మద్రాసు రాష్ట్రం అప్పులను లేక అడ్వాన్సులను యిచ్చి వుంటే, సదరు అప్పులను, అడ్వాన్సులను సదరు స్థానిక పరిపాలనా సంస్థ, సొసైటీ, వ్యవసాయదారుడు లేక మరో వ్యక్తి నిర్ణీతదినాన ఏ రాష్ట్రప్రదేశమునకు చెందునో ఆ రాష్ట్రం రాబట్టుకొనే హక్కు కలిగివుండును.

(2) నిర్ణీత దినానికి పూర్వమే, బళ్ళారి జిల్లాబోర్డు మద్రాసురాష్ట్రానికి ఏదైనా అప్పులూ లేక అడ్వాన్సులూ ఇవ్వవలసివున్న యెడల సదరు అప్పులు లేక అడ్వాన్సుల్లో కొంత భాగం ఆదోని, ఆలూరు తాలూకాల లాభ నిమిత్తం, లేక రాయదుర్గంతాలూకా లాభనిమిత్తం, ఉపయోగపడివుంటే, సదరు విధంగా వుపయోగించబడిన మొత్తాలు కర్నూలు, అనంతపురం జిల్లాబోర్డులు ఆంధ్రరాష్ట్రానికి ఇవ్వవలసిన అప్పులుగానూ, మిగతా భాగం మైసూరురాష్ట్రానికి బళ్ళారి జిల్లాబోర్డు ఇవ్వవలసిన అప్పుగాను ఎంచబడును.

(3) మద్రాసురాష్ట్రం వెలుపల ఏవ్యక్తికైనా, పరం లేక సంస్థకైనా మద్రాసు రాష్ట్రం ఇచ్చిన అప్పులు లేక అడ్వాన్సులను రాబట్టుకొనే హక్కు ఆ రాష్ట్రానికే ఉంది. అయితే ఆ విధంగా రాబట్టిన అప్పులు లేక అడ్వాన్సులు మద్రాసు, ఆంధ్ర, మైసూరుల మధ్య $62\frac{3}{8} : 36 : 1\frac{5}{8}$ నిష్పత్తిలో పంచబడాలి.

7. రాష్ట్రాలవాటాకు రావలసిన ఆదాయపన్ను :

(1) యూనియన్ ఎక్సైజుపన్ను నిల్వల్లోనుంచి 1953–54 సంవత్సరానికి మద్రాసురాష్ట్ర వాటాకు రావలసిన నిల్వలు మద్రాసు, ఆంధ్ర, మైసూరుల మధ్య $62\frac{3}{8} : 36 : 1\frac{5}{8}$ నిష్పత్తిలో పంచబడాలి.

వ్యాఖ్య : 1953–54 సంవత్సరానికి కేంద్ర బడ్జెట్ అంచనాల ప్రకారం రాష్ట్రాల వాటాకు రావలసిన ఆదాయంపన్ను, యూనియన్ ఎక్సైజు పన్నుల్లో

నిర్ణీతదినానికి పూర్వంవున్న మదరాసు వాటాకు రావలసిన మొత్తంలో సగంమాత్రమే ఈ పేరాలో వుదహరించిన నిల్వలుగా తీసుకోబడును.

(2) రాష్ట్రాల వాటాకు రావలసిన ఆదాయం పన్ను, యూనియన్ ఎక్సైజ్ పన్నుల్లోనుంచి నిర్ణీతదినానికి పూర్వంవున్న మద్రాసు రాష్ట్ర వాటాకు రావలసిన మొత్తం, 1 ఏప్రిల్ 1954 నుంచి, మరోవిధంగా శాసనం చేయబడేవరకు, ప్రతి ఆర్థిక సంవత్సరం మద్రాసు, ఆంధ్ర, మైసూరులమధ్య $62\frac{5}{8} : 36 : 1\frac{3}{8}$ దామాషాలో పంచబడాలి.

8. నిర్ణీతదినానికి పూర్వం కేంద్ర రోడ్డు ఫండుకు మద్రాసురాష్ట్రంచే జమ కట్టబడిన మొత్తాలు, మద్రాసు, ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలమధ్య $62\frac{5}{8} : 36 : 1\frac{3}{8}$ దామాషాన కేటాయించబడాలి.

9. నిర్ణీతదినానికిపూర్వం, ది ట్రావెన్‌కూర్ ఫర్టిలైజర్స్ & కెమికల్స్ లిమిటెడ్, ది మద్రాస్ రేడియో అండ్ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్, ది మద్రాసు ఇండస్ట్రియల్ ఇన్‌వెస్టుమెంట్ కార్పొరేషన్ కంపెనీలలో మద్రాసు రాష్ట్రానికివున్న షేర్లు మద్రాసు, ఆంధ్ర, మైసూరుల మధ్య $62\frac{5}{8} : 36 : 1\frac{3}{8}$ దామాషాలో పంచబడాలి.

10. డిప్రిసియేషన్ రిజర్వుఫండునుంచి తీసిన పెట్టుబడుల భద్రతకోసం వుంచిన సెక్యూరిటీలు, ఏ సంస్థలకొరకు (undertakings) సదరు డిప్రిసియేషన్ రిజర్వుఫండు నిర్వహించబడినవో, ఆ సంస్థలువున్న రాష్ట్రమునకు సంక్రమించును.

11. 12వ పేరా నిబంధనలకు లోబడి, వాణిజ్య, పారిశ్రామిక సంస్థలకు సంబంధించిన ఆస్తులు, అప్పులు, సదరు సంస్థలు కలిపివేయబడిన ప్రదేశంలో వుంటే మైసూరురాష్ట్రానికి, ఆంధ్ర, మద్రాసు భూభాగాల్లోవుంటే, ఆయా రాష్ట్రాలకు సంక్రమించును.

12. (1) నిర్ణీత దినానికి పూర్వం గవర్నమెంటు సెక్యూరిటీలద్వారా ప్రజల నుంచి మద్రాసు ప్రభుత్వంచే వసూలుచేయబడిన ఋణాలు, నిర్ణీతదినంనుంచి, మద్రాసు ప్రభుత్వ ఋణాలుగానే పరిగణించబడును; కాని సదరు ఋణాల తీర్మానం నిమిత్తం ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలు తమతమ వాటాలను మద్రాసురాష్ట్రానికి జమకట్టవలెను. ఆయా రాష్ట్రాల వాటాలు నిర్ణయించే నిమిత్తం, సదరు ఋణాలు ఈ పేరా 2 వ సబ్ పేరాలో సూచించబడిన ఋణంగానే యెంచి, ఆంధ్ర, మైసూరు, మద్రాసుల మధ్య విభజింపబడినట్లు పరిగణించబడును. ఆ దామాషాన ఆంధ్ర, మైసూరుల వాటాలు నిర్ణయించబడును.

అయితే 2 వ పేరా, (1) వ సబ్‌పేరాలో వుదహరించబడిన పబ్లిక్ ఋణ తీర్మాన బాధ్యత, ఈసబ్ పేరా నిమిత్తం, 2వ పేరా (1)వ సబ్ పేరాలో సదరుఋణాల వల్ల వచ్చేభాగాలను (Proceeds) కేటాయించబడిన దామాషాలోనే ఆంధ్ర, మద్రాసుల మధ్య కేటాయించబడినట్లు పరిగణించవలెను.

వ్యాఖ్య : ఈ సబ్‌పేరాలో గవర్నమెంటు సెక్యూరిటీలు అనగా ఇండియన్ సెక్యూరిటీస్ యాక్టు (1920 నాటి 10వ చట్టం) 2వ సెక్షన్ (అ) క్లాజులో నిర్వచనం వీటికి వర్తించును.

(2) మద్రాసురాష్ట్రపు కరవలా పబ్లిక్ ఋణాలు అనగా నిర్ణీతదినానికి పూర్వం కేంద్రప్రభుత్వం రిజర్వుబ్యాంకు లేక మరేబ్యాంకువద్దఅయినా తెచ్చిన ఋణాలను, మద్రాసు, ఆంధ్ర, మైసూరు ప్రభుత్వాల మధ్య ఆయా ప్రభుత్వాలు నిర్ణీతదినంవరకు ఈ షెడ్యూలు 8వ పేరాలో ఉదహరించిన పద్ధతిలో సహా ప్రధానమైన నిర్మాణాల కోసం (Capital works), ఇతర పెట్టుబడులకోసం (Capital outlays) పెట్టిన ఖర్చుల మొత్తాల దామాషాలో కేటాయించబడును.

అయితే తాత్కాలిక రాజధానిలో, భవనాలు, రోడ్లు లేక ఇతర నిర్మాణాల నిమిత్తం నిర్ణీత దినానికి పూర్వం ఆంధ్రరాష్ట్రం కేంద్రంనుంచి పుచ్చుకున్న ఋణానికి పూర్తి బాధ్యత ఆంధ్ర ప్రభుత్వానిదే.

(3) ఈ పేరాలోని 2వ సబ్‌పేరా కేటాయింపుల నిర్ణయంకొరకు (బకింగ్ హామ్ కాల్వ, పెట్టుబడి లెక్కలు కలిగినటువంటి ఇతర భవనాలు మినహా) పెట్టుబడి లెక్కలు కలిగిన తక్కిన ఆస్తులపై ఖర్చుమాత్రమే లెక్కలోకి తీసుకోబడును.

అయితే 66వ సెక్షనులో వుదహరించిన తుంగభద్ర ప్రాజెక్టుకోసం చేయబడిన పబ్లిక్ ఋణాలు ఆయా రాష్ట్రాలమధ్య కుదిరిన ఒడంబడికప్రకారం కేటాయించబడును. అలా ఒడంబడిక నిర్ణీత దినంనుంచి రెండు సంవత్సరాల్లోపల కుదరని పక్షంలో, ప్రెసిడెంటు వుత్తర్వుద్వారా నిర్ణయించినప్రకారం కేటాయించబడును.

(4) పబ్లిక్ ఋణాల తీర్మానం నిమిత్తం, నిర్ణీత దినానికి పూర్వం ఏర్పరచబడిన సింకింగ్ ఫండు (Sinking Fund)లు మద్రాసురాష్ట్రంలోనే వుంటాయి. అయితే రాష్ట్రాల మధ్య అప్పుల కేటాయించేప్పుడు, సదరు సింకింగు ఫండు లెక్కలోకి తీసుకోబడును.

(5) ఆంధ్రరాష్ట్రం వారికి తక్కువ భవనాలు వచ్చినందున ముదరాగా ఈ పేరా 2వ సబ్ పేరా ప్రకారం ఆంధ్ర, మద్రాసుల మధ్య కేటాయించబడగా వచ్చిన ఋణాల తీర్మానంలో ఆంధ్ర వాటానుంచి 230.4 లక్షల రూపాయలు తగ్గించి, సదరు మొత్తం మద్రాసు వాటాకు కలపబడును.

13. సివిల్ డిపాజిట్టులు, లోకల్ ఫండు డిపాజిట్టులు, నిర్ణీతదినం తర్వాత ఏ రాష్ట్ర భూభాగంలో వుంటాయో ఆ రాష్ట్రానికే చెందును. సదరు డిపాజిట్టుల తీర్మానం కూడా ఆరాష్ట్రం బాధ్యతే.

14. జమీందారీ రద్దునిధి మద్రాసు, ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలమధ్య నిర్ణీత దినం తర్వాత ఆయా రాష్ట్రాల్లో చెల్లించవలసిన నష్టపరిహారాల దామాషాలో కేటాయించబడును.

15. నిర్ణీత దినానికి ముందు మద్రాసు రోడ్డు ఫండులో వాపసు చేయబడకుండా నిల్వ వున్న మొత్తాలు, నిర్ణీత దినం తర్వాత సదరు సొమ్మును తీసుకోవలసిన స్థానిక సంస్థలు ఏ రాష్ట్రానికి చెందునో, ఆ రాష్ట్రానికి కేటాయించబడును.

16. ప్రతి రాష్ట్రం, దానికి శాశ్వతంగా కేటాయించబడిన ప్రభుత్వోద్యోగుల ప్రావిడెంటు ఫండుకు సంబంధించిన అప్పులను స్వీకరించవలెను.

17. (1) ఈ పేరా 3వ సబ్ పేరాలో వుదహరించబడిన సర్దుబాట్లకు లోబడి నిర్ణీతదినానికి ముందు మద్రాసు రాష్ట్రంచే మంజూరు చేయబడిన పింఛనులు (Pensions) ఆయా రాష్ట్రాల ట్రెజరీల్లో, సబ్ ట్రెజరీల్లో చెల్లించబడవలెను.

(2) సదరు సర్దుబాట్లకు లోబడి, నిర్ణీతదినానికి పూర్వం మద్రాసు రాష్ట్రం కొలువులో వుండి రిటైరు అయిన, రిటైరు అయ్యేముందు సెలవులో వున్న వుద్యోగులకు నిర్ణీత దినానికి పూర్వం పింఛను బాపతు ఏమైనా బాకీవుంటే, సదరు సొమ్ము చెల్లించవలసిన బాధ్యత మద్రాసు రాష్ట్రానిదే.

(3) నిర్ణీత దినంతో ప్రారంభం అయ్యే 1953-54 ఆర్థిక సంవత్సరంలో దర్మిలా ప్రతి ఆర్థిక సంవత్సరంలో ప్రతి రాష్ట్రంలో ఈ పేరా 1, 2 సబ్ పేరాల్లో వుదహరించబడిన పింఛనుల నిమిత్తం చెల్లించిన మొత్తాలు లెక్కించబడును. సదరు సంవత్స

# ఆంధ్ర ప్రభుత్వం

ప్రథమ ఆంధ్ర గవర్నర్ :

శ్రీ చందులాల్ మాధవ్‌లాల్ త్రివేదీ, ఐ. సి. యస్.

అంతరంగిక కార్యదర్శి—శ్రీ డి. ఆర్. సుందరం, ఐ. ఎ. ఎస్.

సైనిక కార్యదర్శి—మేజర్ కె. బి. డి. యస్. సంధూగాక్

అంగరక్షకుడు—కెప్టెన్ ఆర్. డి. భగవాన్‌దాస్

సర్జన్—డాక్టర్ సి. టి. గిల్క్, యం. బి., బి. యస్.

## ఆంధ్ర మంత్రివర్గం

1. శ్రీ టంగుటూరి ప్రకాశం, ముఖ్యమంత్రి :
   హోం (పబ్లిక్ సర్వీసెస్‌తో సహా) పొలిటికల్, సమాచార, మహిళాసంక్షేమ శాఖలు.
2. శ్రీ నీలం సంజీవరెడ్డి, ఉపముఖ్యమంత్రి : హోం (పోలీసు, శాంతిభద్రతల రక్షణ, ప్రాసిక్యూషన్స్), శాసనసభ, ఎన్నికలు, పబ్లిక్ వర్క్స్, రవాణా శాఖలు.
3. శ్రీ తెన్నేటి విశ్వనాథం : ఆర్థిక, న్యాయశాఖలు, కోర్టులు, జైళ్ళు, షెడ్యూల్డు ప్రాంతాలు, దేవాదాయ ధర్మాదాయ శాఖలు.
4. శ్రీ ఒలుసు ప్రభాకరపట్టాభిరామారావు : పరిశ్రమలు, విద్య, ఎక్సైజు, వాణిజ్య పన్నులు, మద్యపాననిషేధం.
5. శ్రీ కడప కోటిరెడ్డి : రెవెన్యూ, ఆహారం, రిజిస్ట్రేషను శాఖలు.
6. శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి : స్థానిక పరిపాలన, వ్యవసాయము, అడవులు, పశుపోషణ, మత్స్యపరిశ్రమ శాఖలు.
7. శ్రీ దామోదరం సంజీవయ్య : ప్రజారోగ్యం, ప్లానింగు, కార్మిక, గ్రామాభ్యుదయ, హరిజనోద్ధరణ, సహకార శాఖలు, కమ్యూనిటీ ప్రాజెక్టులు.

## సెక్రటేరియట్

చీఫ్ సెక్రటరీ—శ్రీ ఓ. పుల్లారెడ్డి ఐ. సి. యస్.

(పోలీసు, శాంతిభద్రతల రక్షణ, సమాచారశాఖలు)

### హోం శాఖ

జాయింట్ సెక్రటరీ—శ్రీ పి. నరసింహం, ఐ. ఎ. యస్.
డిప్యూటీ సెక్రటరీలు—శ్రీ ఐ. జె. నాయుడు, ఐ. ఎ. యస్.
శ్రీ కె. వి. రాధాకృష్ణయ్య
శ్రీ జి. గోపాలకృష్ణనాయుడు
అండర్ సెక్రటరీ— శ్రీ. వి. ఆర్. కె. శాస్త్రి
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ యల్. శ్రీరాములు
శ్రీ డి. రఘురాం

### రెవెన్యూ శాఖ

(రెవెన్యూ, ఆహారం, వ్యవసాయం, ఎక్సైజు, మద్యపాన నిషేధం)

సెక్రటరీ—శ్రీ యం. టి. రాజు, ఐ. సి. యస్.
డిప్యూటీ సెక్రటరీ—శ్రీ కె. యస్. ప్రకాశరావు
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ పి. కృష్ణయ్యనాయుడు
శ్రీ జి. సత్యనారాయణ
శ్రీ యం. శ్రీరాములు
శ్రీ వి. రామారావు

### ఆర్థిక శాఖ

(ఆర్థిక, వాణిజ్యపు పన్నులు)

సెక్రటరీ—శ్రీ. వి. కె. రావు, ఐ. సి. యస్.
డిప్యూటీ సెక్రటరీ—శ్రీ టి. ఇ. వీరరాఘవాచారి
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ కె. అనురానందం
శ్రీ టి. ఇసాక్ ప్రభాకర్
ముస్తఫా అలీ బేగ్

### పబ్లిక్ వర్క్సు శాఖ

(పబ్లిక్ వర్క్సు, రవాణా)

సెక్రటరీ—శ్రీ కె. యస్. అనంతరామన్*
శ్రీ యస్. చక్రవర్తి ఐ. సి. యస్.
డిప్యూటీ సెక్రటరీ—శ్రీ వి. వెంకట్రాయుడు, ఐ. ఎ. యస్.
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ టి. పి. గోవిందరామనాయుడు
శ్రీ టి. రామకృష్ణ

---

* శ్రీ చక్రవర్తి సెలవుపైన వున్నందువల్ల వారి స్థానంలో శ్రీ కె. యస్. అనంతరామన్ గారు తాత్కాలికంగా నియమించబడ్డారు.

## అభివృద్ధి శాఖ

(అభివృద్ధి, గ్రామోద్ధరణ, కమ్యూనిటీ ప్రాజెక్టులు, ప్లానింగు)

సెక్రటరీ—శ్రీ ఆర్. ప్రసాద్, ఐ. సి. యస్.
డిప్యూటీ సెక్రటరీ—శ్రీ యస్. జి. అప్పారావునాయుడు
జాయింటు సెక్రటరీ—శ్రీ టి. ప్రభాకరరావునాయుడు
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ యల్. భక్తవత్సలం
శ్రీ కె. రమణారెడ్డి
శ్రీ టి. ఎ. శంకరయ్యచెట్టి

## స్థానిక స్వపరిపాలన

(విద్య, ఆరోగ్యం, స్థానిక స్వపరిపాలన)

సెక్రటరీ—శ్రీ యస్. ఆర్. కైవార్, ఐ. సి. యస్.
డిప్యూటీ సెక్రటరీలు—శ్రీ కె. సి. మాదప్ప, ఐ. ఎ. యస్.
శ్రీ జి. వి. వెంకటస్వామినాయుడు
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ డి. కామయ్య
శ్రీ ఇ. యల్. జనార్దనరావునాయుడు

## న్యాయ శాఖ

(కోర్టులు, జైళ్ళు)

సెక్రటరీ—శ్రీ వి. వి. హెచ్. నారాయణమూర్తి
డిప్యూటీ సెక్రటరీలు—శ్రీ వి. రామేశ్వరరావు
శ్రీ యం. కె. నారాయణస్వామి
అసిస్టెంటు సెక్రటరీలు—శ్రీ వి. ఏ. వెంకటాచలపతి
శ్రీ కె. జనగామారావు

## శాసనసభ

సెక్రటరీ—శ్రీ జి. వి. చౌదరి
డిప్యూటీ సెక్రటరీ—శ్రీ డి. సూర్యారావు

## రివెన్యూ బోర్డు

శ్రీ కె. యం. ఉన్నిథన్, ఐ. సి. యస్. (మొదటి సభ్యుడు)
శ్రీ యం. పి. పాయ్, ఐ. సి. యస్. (రెండవ సభ్యుడు)
శ్రీ కె. సుబ్బారావు (కార్యదర్శి)

## పబ్లిక్ సర్వీసెస్ కమిషను

శ్రీ సి. వివేకానందమూర్తి (ఛైర్మన్)
శ్రీ యం. ఏ. వెంకటరమణరావునాయుడు
శ్రీ జి. రామిరెడ్డి
శ్రీ యస్. ఆళవందార్ (కార్యదర్శి)

## శాఖాధిపతులు

1. శ్రీ యస్. వెంకటకృష్ణయ్యర్—ఛీఫ్ యింజనీర్-ఇరిగేషన్
2. శ్రీ కె. యం. ఫ్రెడరిక్—ఛీఫ్ యింజనీర్-హైవేస్ బిల్డింగ్స్, పి.డబ్లియు.డి.
3. శ్రీ బి. ఆర్. సోమయాజులు—ఛీఫ్ యింజనీర్-ఎలెక్ట్రిసిటీ
4. శ్రీ యం. కాంతిరాజ్—వ్యవసాయ, మత్స్యశాఖ డైరెక్టరు
5. మేజర్ టి. మురారి—పశుసంపదశాఖ డైరెక్టరు
6. డాక్టర్ డి. సుబ్బారావు—ఆరోగ్యశాఖ డైరెక్టరు

7. డాక్టర్ యం. వి. రమణమూర్తి—వైద్యశాఖ డైరక్టరు
8. డాక్టర్ డి. సదాశివరెడ్డి—విద్యాశాఖ డైరెక్టరు
9. శ్రీ యస్. ఎ. అయ్యంగార్—ట్రాన్స్‌పోర్టు కమీషనర్ - ఫైర్ ఇన్స్పెక్టర్ జనరల్
10. శ్రీ ఎ. వి. ఐ. వైద్యనాథన్—ఐ. సి. యస్. వాణిజ్య, పరిశ్రమలశాఖ డైరక్టర్
11. శ్రీ టి. ప్రభాకరరావునాయుడు — ఐ. ఎ. యస్. డైరక్టరు కమ్యూనిటీ ప్రాజెక్టులు, గ్రామాభ్యుదయం, హరిజనాభ్యుదయం
12. శ్రీ కె. సుబ్రహ్మణ్యంనాయుడు—సహకార సంఘాల రిజిస్ట్రారు
13. శ్రీ హెచ్. కృష్ణమూర్తి—ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషన్
14. శ్రీ ఎ. రాఘవరెడ్డి—ఇన్స్పెక్టర్ ఆఫ్ లోకల్ బోర్డ్సు, మున్సిపాలిటీస్
15. శ్రీ సి. ఆర్. రెడ్డి—లేబర్ కమీషనర్—చీఫ్ ఇన్స్పెక్టర్ ఆఫ్ ఫ్యాక్టరీస్
16. శ్రీ ఎన్. డి. సహాని—ఛీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్సు
17. శ్రీ వై. పిచ్చిరెడ్డి—రాయలసీమ డెవలప్‌మెంట్ కమీషనరు
18. యం. గౌస్ మొహిద్దీన్—ఐ. ఎ. యస్. డైరక్టర్ ఆఫ్ సెటిల్‌మెంట్సు
19. సయ్యద్ అహమ్మద్—ఐ. ఏ. యస్. సెక్రటరీ, సెంట్రల్ ట్రాఫిక్ బోర్డు
20. శ్రీ యస్. టి. ఎట్టి—స్టేట్ పోస్టు ఆఫీసరు
21. శ్రీ డి. నటరాజన్—ప్రభుత్వ ఆర్థిక సలహాదారు, అభివృద్ధిశాఖ కమీషనరు.
22. శ్రీ ఎ. సంగాసంచెట్టి—ఛైర్మన్, సేల్సుటాక్సు అపెలేట్ ట్రిబ్యునల్
22. శ్రీ డి. ఆర్. వెంకటేశ అయ్యర్—ట్రిబ్యునల్, డిసిప్లినరీ ప్రొసీడింగ్స్.
24. శ్రీ పి. కె. మోనప్ప—పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్.

# ఆంధ్రప్రభుత్వ కార్యాలయాలు

ఆంధ్రప్రభుత్వ కార్యాలయాలను వుంచడానికి కర్నూలులో తగిన వసతులు లేకపోవుట వలన అవి మద్రాసులోనే వుంచబడ్డాయి.

1. రెవిన్యూబోర్డు కార్యాలయం—ఖలీల్ గార్డన్సులోని "బుషిక్రియ" అనే భవనంలో - మౌంటురోడ్డు, మద్రాసు - 2 (టెలిఫోన్ నెం. 8308, 86710)

2. వ్యవసాయ, మత్స్యపరిశ్రమల శాఖడైరక్టరు కార్యాలయం—బుషిక్రియ భవనం, మౌంటురోడ్డు, మద్రాసు - 2 (ఫోన్ నెం. 86335, 85376)

3. పబ్లిక్ సర్వీస్ కమీషన్—8,31 ఎల్డామ్స్ రోడ్డు, తేనాంపేట, మద్రాసు 18.

4. వైద్యశాఖ డైరక్టరు— 10 స్టిరింగ్ రోడ్డు, నుంగంబాకం, మద్రాసు (ఫోన్ నెం. 86156)

5. ఆరోగ్యశాఖ డైరక్టరు—10 స్టెర్లింగ్ రోడ్డు, నుంగంబాకం, మద్రాసు (ఫోన్ 86156)

6. జైళ్ళ ఇన్స్పెక్టర్ జనరల్, ట్రాన్సుపోర్టు కమీషనర్—14 విక్టోరియా క్రిసెంటురోడ్డు, ఎగ్మూరు, మద్రాసు - 8 (ఫోన్ 86102)

7. ఛీఫ్ యింజనీర్ ఎలెక్ట్రిసిటీ—20 రట్లండ్ గేట్, నుంగంబాకం, మద్రాసు (ఫోన్ 86874)

8. ఇన్స్పెక్టర్ జనరల్ ఆఫ్ రిజిస్ట్రేషను,
9. రిజిస్ట్రార్ ఆఫ్ జాయింట్ స్టాక్ కంపెనీస్,
10. రిజిస్ట్రార్ ఆఫ్ ఫిరమ్స్
11. జనన, మరణ, వివాహాల రిజిస్ట్రారు కార్యాలయాలు

—12. ఎ. మార్షల్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు - 8

12. సహకార సంఘాల రిజిస్ట్రారు
13. కంట్రోలు వస్తువుల డైరెక్టరు కార్యాలయాలు

—48-1 ఎమ్మార్ బిల్డింగ్స్, రాయపేట హైరోడ్డు, మైలాపూరు, మద్రాసు-4. (ఫోన్ నెం. 88467)

14. వాణిజ్య, పరిశ్రమల శాఖ డైరెక్టరు—2, రాజబాహదూర్ పేట, త్యాగరాయ నగర్, మద్రాసు - 17.

15. ఇన్స్పెక్టర్ ఆఫ్ లోకల్ బోర్డ్సు, మునిసిపాలిటీలు

16. హిందూ దేవాలయ, ధర్మాలయాల కమీషనర్ కార్యాలయాలు - 141 మౌబ్రేస్ రోడ్డు, రాయపేట, మద్రాసు - 14 (ఫోన్ 85844)

17. లేబర్ కమీషనర్

18. ఛీఫ్ ఇన్స్పెక్టర్ ఆఫ్ ఫ్యాక్టరీస్ కార్యాలయాలు - 60 10 ఎడ్వర్డ్ ఇలియట్స్ రోడ్డు, రాయపేట, మద్రాసు - 14 (ఫోన్ 85644)

19. అమ్మకం పన్ను అప్పలేట్ ట్రిబ్యునల్ కార్యాలయం-20, ఆలివర్ రోడ్డు మైలాపూర్, మద్రాసు 4 (ఫోన్ 85852)

20. పశుసంపదశాఖ డైరెక్టరు కార్యాలయం—1 జక్రీన్ రోడ్డు, కాసామేజర్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు 8 (ఫోన్ 86244)

21. రేడియో ఇంజనీరు కార్యాలయం—53 పీటర్సు రోడ్డు, రాయపేట - మద్రాసు 14 (ఫోన్

22. చీఫ్ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్టు కార్యాలయం—19 A-నుంగంబాకం హైరోడ్డు మద్రాసు, (ఫోన 8296)

23. హరిజన, మహిళా సంక్షేమశాఖ డైరక్టరు కార్యాలయం—57 హాల్స రోడ్, ఎగ్మూరు, మద్రాసు 8 (ఫోన్ 8185)

24. విద్యాశాఖ డైరక్టరు కార్యాలయం—6 కాలేజి రోడ్డు, నుంగంబాకం, మద్రాసు (ఫోన్ 86092)

25. హైవేస డిప్యూటీ చీఫ్ ఇంజనీర్ కార్యాలయం—1½, నార్త్ బీచి రోడ్డు, మద్రాసు 1 (ఫోన్ 55664)

26. డిసిప్లినరి ప్రొసీడింగ్సు ట్రిబ్యునల్ కార్యాలయం—19 A-నుంగంబాకం హైరోడ్డు, మద్రాసు.

27. ఆంధ్ర అకౌంటెంట్ జనరల్ కార్యాలయం—ఎక్స్‌ప్రెస్ ఎస్టేట్సు-ఓల్డుకెల్లీ కాన్సరోడ్డు, మద్రాసు-2. పోలీసు ఇన్స్పెక్టరు జనరలు కార్యాలయం, ఇరిగేషను చీఫ్ ఇంజనీరు కార్యాలయం, హైవేస చీఫ్ ఇంజనీరు కార్యాలయం, ఆంధ్ర రాజధాని కర్నూలులోనే వున్నాయి. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వపు సెక్రెటేరియట్, ఆంధ్ర శాసనసభ, మంత్రుల నివాసాలు కర్నూలులోనే వున్నవి. ఆంధ్ర హైకోర్టు, టెలిగ్రాఫ్, టెలిఫోన్ సర్కిలు కార్యాలయంకూడా కర్నూలులోనే వున్నది.

# ఆంధ్రరాష్ట్ర బడ్జెట్

**1954-55** బడ్జెట్ అంచనాలను అనుసరించి ఆంధ్రరాష్ట్రపు ఆదాయం రూ 21 కోట్ల 2 లక్షల 81 వేలు. ఖర్చు రూ 24 కోట్ల 1 లక్షా 99 వేలు. 1954_55 సంవత్సరానికి ఆంధ్రరాష్ట్రం బడ్జెట్ లోటు షుమారు 3 కోట్లు.

1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం యేర్పడినతర్వాత 1953_54 సంవత్సరం ఉత్తరార్థభాగానికి బడ్జెట్ తయారుచేయబడింది. ఈ 6 నెలల బడ్జెట్‌లోను ఖర్చు రు. 12,34,17,000 అవుతుందని, ఆదాయం రు. 11,82,59,000 వస్తుందని అంచనా వేయబడింది. కాని నికరంగా అయిన ఖర్చులు, వచ్చిన ఆదాయాలు లెక్క అంచనాలను మించి ఖర్చు 57 లక్షల 65 వేలు పెరిగింది. ఆదాయం రూ 12 లక్షల 75 వేలు మాత్రమే అదనంగా పెరిగింది. 1953_54 ఉత్తరార్థం బడ్జెటులోటు నికరంగా రూ 96 లక్షలకు పైగా తేలింది. మొదటి అంచనాలను మించి లోటు రూ 44 లక్షల 90 వేలు పెరిగింది.

1954_55 సంవత్సరం బడ్జెట్‌లోటు రూ 3 కోట్లను పూడ్చడానికి కొత్త పన్నులు విధించబడుతున్నాయి. కొత్త పన్నులద్వారా 1 కోటి రూపాయిల లోటును పూడ్చడానికి వీలవుతుంది. నీటి తీరువా హెచ్చింపు, వ్యాపారపంటలపై పన్ను, అభివృద్ధిపన్ను ఆంధ్రప్రభుత్వం తలపెట్టిన కొత్తపన్నులు. ఈ పన్నులు ఏ రీతిని విధించబడేదీ ఆర్థికమంత్రి బడ్జెటు ప్రసంగంలో తెలియచేయలేదు. పన్నులకు సంబంధించిన బిల్లులు తరువాత ప్రవేశపెడ్తామన్నారు.

## జమా ఖర్చులు

ఆంధ్రలో ప్రభుత్వానికి 1954_55 వ సంవత్సరపు బడ్జెటు అంచనాలప్రకారం ఏఏపద్దులక్రింద ఎంతెంత ఆదాయం వస్తున్నదీ, యేయే పద్దులక్రింద ఎంతెంత ఖర్చు అవుతున్నదీ ప్రక్కపేజీలోని పట్టికలలో తెలియచేయబడ్డది.

ఆదాయం

| వరుస నెంబరు | పద్దు | ఆదాయం |
|---|---|---|
| 1. | ఎక్సైజు పన్నులలో కేంద్రంనుండి ఆంధ్రకు వచ్చేవాటా | 1,03,09,900 |
| 2. | ఆదాయపుపన్నులో ఆంధ్రకు వచ్చేవాటా | 3,23,85,600 |
| 3. | నీటి తీరువామినహా భూమిశిస్తు | 3,35,00,000 |
| 4. | నీటితీరువాక్రింది ఆదాయం | 1,43,50,000 |
| 5. | రాష్ట్రప్రభుత్వ ఎక్సైజుపన్నులు | 8,39,300 |
| 6. | స్టాంపులు | 1,87,23,700 |
| 7. | అడవులు | 39,91,000 |
| 8. | రిజిష్ట్రేషను | 30,54,000 |
| 9. | మోటారు పన్నులు | 1,42,33,600 |
| 10. | వినోదపన్నులు (32 లక్షలు), అమ్మకం పన్ను (రూ 3 కోట్ల 15 లక్షలు), పొగాకు పన్నులు (రూ 18 లక్షలు), విద్యుచ్ఛక్తి సప్లయికి పన్నులు (రూ 3,11,600), పెట్రోలుపైపన్ను (రూ 55 లక్షలు) | 4,23,11,600 |
| 11. | ఇరిగేషన్ (కాపిటల్ అక్కౌంట్లో ఉన్నవి) | 27,26,200 |
| 12. | ఇరిగేషన్ (కాపిటల్ అక్కౌంట్లో లేనివి) | 44,23,0[illegible] |
| 13. | వడ్డీలు | 9,61,700 |
| 14. | కోర్టుఫీజులు, న్యాయశాఖ ఫీజులు వగైరా | 30,67,800 |
| 15. | ఖైదీలు తయారుచేసే వస్తువుల అమ్మకం | 1,69,400 |
| 16. | పోలీసు | 5,58,500 |
| 17. | విద్యాశాఖ | 12,94,3000 |
| 18. | వైద్యశాఖ | 3,99,000 |
| 19. | ప్రజారోగ్యం | 1,91,800 |
| 20. | వ్యవసాయం | 42,56,700 |
| 21. | పశు సంరక్షణ | 2,02,000 |
| 22. | సహకారశాఖ | 32,42,900 |
| 23. | పరిశ్రమలు, సప్లైలు | 38,72,700 |
| 24. | పరీక్ష ఫీజులు వగైరా రుసుములు | 17,51,100 |

| వరుస నెంబరు | పద్దు | ఆదాయం |
|---|---|---|
| 25. | సివిల్ వర్క్సు | 38,06,100 |
| 26. | విద్యుత్ స్కీములపై ఆదాయం | 22,99,900 |
| 27. | ఉద్యోగాల పింఛను క్రింద | 1,74,400 |
| 28. | స్టేషనరీ ప్రింటింగు | 6,000 |
| 29. | ఇతరాలు | 42,35,900 |
| 30. | వెనుకబడ్డజాతుల అభివృద్ధి, పరిపాలన క్రింద కేంద్రం ఇచ్చే గ్రాంటు | 10,60,900 |
| 31. | కేంద్ర-రాష్ట్రం లావాదేవీలు | 12,600 |
| 32. | అసాధారణ ఆదాయం | 1,22,18,500 |

## ఖర్చు

| వరుస నెంబరు | పద్దు | ఖర్చు |
|---|---|---|
| 1. | భూమిశిస్తు | 57,81,800 |
| 2. | ఎక్సైజు | 38,16,700 |
| 3. | స్టాంపులు | 11,32,600 |
| 4. | అటవీశాఖ | 27,48,600 |
| 5. | రిజిస్ట్రేషను | 16,43,600 |
| 6. | మోటరు బండ్లపై పన్నువసూలు శాఖ క్రింద | 29,25,400 |
| 7. | అమ్మకపు పన్ను, వినోదపు పన్ను వసూలు శాఖ | 52,82,600 |
| 8. | గవర్నరు, మంత్రులు, రాజధాని కార్యాలయ ఉద్యోగుల జీతాలు | 47,09,100 |
| 9. | శాసనసభ, ఎన్నికలు | 18,61,600 |
| 10. | జిల్లాల పరిపాలన వగైరా | 2,72,38,500 |
| 11. | కోర్టులు - న్యాయశాఖ | 61,82,800 |
| 12. | జైళ్ళు | 14,08,400 |
| 13. | పోలీసు | 2,63,23,200 |
| 14. | విద్యాశాఖ | 4,30,44,900 |
| 15. | వైద్యశాఖ | 1,01,46,100 |

| వరుస నెంబరు | పద్దు | ఖర్చు |
|---|---|---|
| 16. | ప్రజారోగ్యం | 57,88,800 |
| 17. | వ్యవసాయం, మత్స్యశాఖలు | 75,79,400 |
| 18. | పశుసంక్షేమశాఖ | 24,18,400 |
| 19. | సహకారశాఖ | 56,20,000 |
| 20. | పరిశ్రమలు | 52,10,300 |
| 21. | హరిజనోద్ధరణ | 56,21,000 |
| 22. | కార్మికులు, ఫ్యాక్టరీలు | 6,49,000 |
| 23. | సివిల్ వర్కులు (భవనాలు ద్వారా) | 2,93,84,100 |
| 24. | సివిల్ వర్కులు (ఎస్టాబ్లిష్‌మెంట్లు పరికరాలు) | 68,33,500 |
| 25. | సివిల్ వర్కులు (మరమ్మత్తులు, రిలీఫ్ పనులు) | 39,51,000 |
| 26. | విద్యుచ్ఛక్తి | 1,99,09,200 |
| 27. | కరవు నివారణ పనులు | 15,06,000 |
| 28. | పెన్షను | 82,07,000 |
| 29. | స్టేషనరీ ప్రింటింగు | 17,48,900 |
| 30. | ఇతరాలు (మిసిలేనియస్) | 20,71,700 |
| 31. | కమ్యూనిటీ ప్రాజెక్టులు | 36,15,200 |
| 32. | జమీందారులకు నష్ట పరిహారం | 20,00,000 |
| 33. | ఇరిగేషను | 2,75,84,200 |
| 34. | ఇరిగేషను శాఖలో పెట్టుబడి ఖర్చులు | 3,34,99,600 |
| 35. | సివిల్ వర్కులపై పెట్టుబడి ఖర్చులు | 1,02,36,800 |
| 36. | పరిశ్రమలపై పెట్టుబడి ఖర్చులు | 8,89,100 |
| 37. | విద్యుచ్ఛక్తి స్కీములపై పెట్టుబడి ఖర్చులు | 8,10,59,700 |
| 38. | పెన్షన చెల్లింపు | 7,40,000 |
| 39. | ప్రభుత్వ వాణిజ్య పథకాలపై పెట్టుబడి | 6,04,20,300 |
| 40. | ప్రభుత్వం యిచ్చిన అప్పులు వగైరా | 2,03,49,800 |

## ప్రభుత్వయంత్రంమీాద ఖర్చు

ప్రభుత్వం వివిధ శాఖలక్రింద ఖర్చు పెడుతున్న మొత్తం షుమారు రు 24 కోట్ల 2 లక్షలు. దానిలో విద్యక్రింద 17.9%, పోలీసుశాఖక్రింద 10.9%, వ్యవసాయ శాఖ క్రింద 3.1%, నీటిపారుదలక్రింద 25%, ప్రజారోగ్యంక్రింద 2.3%, పరిశ్రమలక్రింద 2.2% ఖర్చుపెడుతున్నది.

ప్రభుత్వం చేస్తున్న ఖర్చులలో చాల భాగం ప్రభుత్వ యంత్రంక్రిందనే ఖర్చు అవుతున్నది. పోలీసు, జైళ్ళు, న్యాయ శాఖలక్రింద, గవర్నరు, మంత్రులు, రాజధాని కార్యాలయాల (హెడ్ క్వార్టర్సు) క్రింద, జిల్లాపరిపాలనక్రింద కలిపి రు. 6,58,62,600 ఖర్చు అవుతున్నది. జిల్లా పరిపాలన క్రింద కేటాయించబడ్డ ఖర్చులో అధికాదాయోత్పత్తి స్కీముల క్రింద, అభివృద్ధి ప్రణాళికలు వగైరాల క్రింద రు. 57.41 లక్షలు ఖర్చుఅవుతున్నది. ఈ ఖర్చును మినహాయించితే పైన తెల్పబడ్డ నాలుగు శాఖలక్రింద రు. 6 కోట్ల 1 లక్ష 21 వేలు అవుతుంది.

ఇదికాక ఇతర శాఖలలో ఉద్యోగుల జీతాలు, అలవెన్సులు, ఎస్టాబ్లిష్‌మెంట్సు క్రింద రూ. 4 కోట్ల 33 లక్షల 70 వేలు ఖర్చు అవుతున్నది.

అంటే అన్ని శాఖలలోనూకలిపి ఉద్యోగుల జీతాలు, అలవెన్సులు, ఆఫీసుఖర్చుల క్రింద రు. 10 కోట్ల 34 లక్షల 91 వేలు ఖర్చు అవుతున్నదన్నమాట. మొత్తం ఖర్చులో ప్రభుత్వ యంత్రం మీాదే 49% ఖర్చు అవుతున్నది.

కొన్ని శాఖలలో వాటి క్రింద కేటాయించిన మొత్తంలో ప్రభుత్వ యంత్రం మీాద సగం కంటె యెక్కువగా ఖర్చు అవుతున్నది. అటవీశాఖ క్రింద అయ్యే ఖర్చు 64.7%, పశు సంక్షేమ శాఖలో 55.5% ప్రభుత్వ యంత్రం మీాదనే ఖర్చు అవుతున్నది. మరికొన్ని శాఖలలో ఆయా శాఖలకు కేటాయించిన మొత్తాలలో ప్రభుత్వ యంత్రం మీాద ఖర్చు ఎంత అవుతున్నదీ క్రింద చూపబడింది:

| | |
|---|---|
| వైద్యశాఖ | 43.80% |
| ప్రజారోగ్యం | 25.40% |
| వ్యవసాయం | 33.80% |
| సహకారం | 43.95% |
| హరిజనోద్ధరణ | 28.60% |

కార్మికులు, ఫ్యాక్టరీల పద్దు క్రింద అయ్యే ఖర్చు దాదాపు అంతా ప్రభుత్వ యంత్రం మీాదనే అవుతున్నది.

## గవర్నరు మీాద ఖర్చు

ఆంధ్ర గవర్నరు జీతం సంవత్సరానికి 15 వేలు తగ్గించుకొన్నప్పటికీ గవర్నరు క్రింద సంవత్సరానికి రు. 4,26,000 ఖర్చు అవుతున్నది. గవర్నరుక్రిందఅయ్యేఖర్చులో ప్రధానమైన పద్దులుక్రింద యివ్వబడ్డవి:

| | |
|---|---|
| గవర్నరు జీతం | 51,000 |
| రాజభవన్ అతిథుల వినోదాలు వగైరాలు | 12,000 |
| గవర్నర్ సెక్రెటేరియట్ | 57,700 |
| మిలిటరీ కార్యదర్శి సిబ్బంది | 76,100 |
| రాజభవనం అలంకరణాలు, మరమ్మత్తులు | 93,800 |
| గవర్నరు కారు, యితర ఎస్టాబ్లిష్‌మెంట్సు | 42,000 |
| గవర్నరు పర్యటన | 83,000 |
| గవర్నరు దానాలు | 8,800 |

ఏడుగురు మంత్రుల జీతాలు వగైరాల క్రింద రూ. 2,93,800 ఖర్చు అవుతున్నది. మంత్రులక్రింద, గవర్నరుక్రింద కలిపి రూ. 7 లక్షల 20 వేల 7 వందలు ఖర్చు అవుతున్నది.

ఈ మొత్తం 1954-55 బడ్జెట్ లో రాష్ట్రంలోని చెరువు మరమ్మత్తులక్రింద కేటాయించిన మొత్తంకంటె (రూ. 7,01,100) రూ. 19 వేల 6 వందలు ఎక్కువ. కైరవాణితిప్ప ప్రాజెక్టుమీద యీ సంII బడ్జెట్ లో ఖర్చుపెడుతున్న దానికంటె రూ. 2 లక్షల 20 వేలు ఎక్కువ. రాష్ట్రంలో కరువునివారణ స్కీములక్రింద పెడుతున్న ఖర్చులో (15 లక్షల 60 వేలు) సగం. ఈ మొత్తం రాష్ట్రంలో హరిజనుల పేటలలో బావులు త్రవ్వటం, మరమ్మత్తులు వగైరా అభివృద్ధి కార్యక్రమాలక్రింద పెడుతున్న ఖర్చుకు సరిసమం.

రాష్ట్రంలోని వెనుకబడిన జాతులైన సుగాలీలకు, చెంచాదుల అభివృద్ధికి 1954-55 బడ్జెట్ కేటాయించిన మొత్తం రూ 74,700. ఇది రాజభవనం అలంకరణలకు, మరమ్మత్తులకు కేటాయించిన మొత్తం (రూ 93,800) కంటె రూ 19,700 తక్కువ. రాష్ట్రంలోని ఆది ద్రావిడుల యిళ్ళ స్థలాల సేకరణకై పెడుతున్న ఖర్చుకంటె (రూ 3 లక్షల 60 వేలు) ఒక్క గవర్నరుమీదనే రూ 66 వేల 9 వందలు ఎక్కువ ఖర్చు పెట్టబడుతున్నది.

## విద్యాశాఖక్రింద ఖర్చు

విద్యాశాఖక్రింద 1954-55 బడ్జెట్ లో రూ 4 కోట్ల 30 లక్షల 44 వేల 9 వందలు కేటాయించబడింది. విద్యాశాఖలో జీతాలు వగైరాలక్రింద రూ 59 లక్షల 30 వేలు ఖర్చుపెట్టబడుతున్నది. వివిధ విద్యాసంస్థలకు యిచ్చే గ్రాంట్లక్రింద రూ 3,40 లక్షల 84 వేలు ఖర్చు పెట్టబడుతున్నది. స్కాలరుషిప్పులు వగైరాల క్రింద రూ 22 లక్షల 3 వేలు ఖర్చు అవుతున్నది. విద్యాశాఖ క్రింద ఖర్చు యీ క్రింది విధంగా పెట్టబడుతున్నది:

| | |
|---|---|
| యూనివర్సిటీ విద్య | 27,19,300 |
| సెకండరీ విద్య | 41,67,600 |
| ప్రాథమిక విద్య | 2,43,04,900 |
| జనరల్ | 28,62,200 |
| స్పెషల్ | 19,68,600 |
| అభివృద్ధి పథకాలక్రింద | 61,94,400 |
| పరీక్షలక్రింద | 5,78,000 |
| టెకనికల్ క్రింద | 2,50,000 |
| మొత్తం | 4,30,45,000 |

తిరుపతిలో నూతనంగా శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయాన్ని స్థాపించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఇందులో మూడు రకాల సబ్జెక్టులలో కోర్సులు ప్రారంభించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ యూనివర్సిటీకి రాయలసీమ నాలుగు జిల్లాలలోని కాలేజీలు, నెల్లూరుజిల్లాలోని కాలేజీలు అనుబంధింపబడతాయి.

శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయ స్థాపనకు 1954-55 బడ్జెట్ లో రూ 50 లక్షలు కేటాయించబడింది. ఆంధ్ర విశ్వ విద్యాలయ అభివృద్ధికి రూ 20 లక్షలు కేటాయించబడింది.

విద్యాభివృద్ధి పథకాలలో నిర్బంధ ప్రాథమిక విద్యా విధానం క్రింద రూ 15 లక్షల 87 వేల 2 వంద

కేటాయించబడింది. ఇది నిరుడు బడ్జెటులో కేటాయించబడ్డదానికంటె రూ 4 లక్షలకుపైగా తక్కువ. పోలీసు శాఖక్రింద పెట్టే ఖర్చులో ప్రత్యేకసాయుధ పోలీసుదళాల క్రిందనే రూ 25 లక్షలు కేటాయించబడ్డది. నిర్బంధ ప్రాథమిక విద్యమీదకంటె రూ 9 లక్షలకు పైగా ప్రత్యేక సాయుధదళాలక్రింద ఖర్చు పెట్టబడుతున్నది. 1960 నాటికి 14 సం॥ల లోపు పిల్లలందరికీ ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య నేర్పాలని భారత రాజ్యాంగం నిర్దేశించుచున్నది.

బడ్జెట్‌లో జమీందారుల నష్టపరిహారం క్రింద రూ 20 లక్షలు, కరువునివారణ కార్యక్రమాలక్రింద రూ 15 లక్షలు కేటాయించబడ్డది. సాంకేతిక విద్యాసంస్థలక్రింద రూ. 6 లక్షలు, ఖాదీపరిశ్రమలకు రూ. 7,50 వేలు కేటాయించబడింది.

## ఇరిగేషను ప్రణాళికలు

ఇరిగేషను ప్రణాళికలక్రింద 54-55 బడ్జెట్‌లో రూ 3 కోట్ల 36 లక్షల 26 వేల 4 వందలు కేటాయించబడ్డది. ఈఖర్చులో ఏఏ ప్రణాళికక్రింద ఎంతఖర్చు చేయబడుతున్నదీ క్రింది పట్టికలో వివరించబడింది. ఇరిగేషను ప్రణాళికల క్రింద ప్రభుత్వం షుమారు రూ. 6 కోట్ల 11 లక్షలు ఖర్చు చేస్తున్నది. ఇది మొత్తం బడ్జెట్ ఖర్చులో షుమారు 25%.

| ప్రణాళిక | రూపాయలు |
|---|---|
| తుంగభద్ర ప్రాజెక్టు | 1,50,400 |
| కృష్ణారోడ్ రెగ్యులేటర్ బ్రిడ్జి | 81,50,000 |
| ఎగువపెన్నారు ప్రాజెక్టు | 30,29,800 |
| గాళ్ళపాడు ప్రాజెక్టు | 20,70,100 |
| స్వర్ణముఖి ప్రాజెక్టు | 5,03,700 |
| భైరవానితిప్ప ప్రాజెక్టు | 5,00,000 |
| [illegible] ప్రాజెక్టు | 4,48,300 |
| [illegible] ప్రాజెక్టు | 18,96,000 |
| చెరువులు | 7,01,100 |
| మొత్తం | 3,23,03,400 |

విద్యుత్ ప్రణాళికలక్రింద ఖర్చు

| | |
|---|---|
| మాచ్‌ఖండ్ ప్రాజెక్టు | 1,88,93,100 |
| తుంగభద్ర ప్రాజెక్టు | 1,92,70,800 |
| చిత్తూరు డిస్ట్రిక్ట్ స్కీము | 6,24,600 |
| నెల్లూరు డిస్ట్రిక్ట్ స్కీము | 20,90,800 |
| మొత్తం | 4,08,79,300 |

| జిల్లా బోర్డు | జిల్లాబోర్డులు నడుపుతున్న ప్రాథమిక పాఠశాలలు | రాష్ట్రంలో నడుపబడుతున్న ప్రాథమిక పాఠశాలల మొత్తం |
|---|---|---|
| శ్రీకాకుళం | 354 | 1,702 |
| విశాఖపట్నం | 546 | 1,057 |
| తూర్పుగోదావరి | 762 | 1,803 |
| పశ్చిమగోదావరి | 605 | 1,553 |
| కృష్ణా | 589 | 1,770 |
| గుంటూరు | 608 | 2,566 |
| నెల్లూరు | 563 | 1,470 |
| కర్నూలు | 635 | 1,199 |
| కడప | 481 | 1,058 |
| అనంతపురం | 547 | 833 |
| చిత్తూరు | 629 | 1,115 |
| మొత్తం | 6,519 | 16,1[illegible]6 |

నూటికి 64 పాఠశాలలను జిల్లాబోర్డులే నడుపుతున్నాయి. వీటి వివరాలు క్రింది పట్టికలో పొందుపరచబడ్డాయి :

| జిల్లాబోర్డు | జిల్లాబోర్డులు నడుపుతున్న సెకండరీ విద్యాలయాలు | రాష్ట్రంలో నడుపబడుతున్న మొత్తం సెకండరీ విద్యాలయాలు |
|---|---|---|
| 1. శ్రీకాకుళం | 25 | 28 |
| 2. విశాఖపట్నం | 8 | 24 |
| 3. తూర్పుగోదావరి | 31 | 57 |
| 4. పశ్చిమగోదావరి | 34 | 53 |
| 5. కృష్ణా | 56 | 77 |
| 6. గుంటూరు | 71 | 111 |
| 7. నెల్లూరు | 27 | 46 |
| 8. కర్నూలు | 17 | 28 |
| 9. కడప | 20 | 28 |
| 10. అనంతపురం | 15 | 25 |
| 11. చిత్తూరు | 24 | 36 |
| మొత్తం | 328 | 513 |

నోటు: పైపట్టికలోని రెండవకాలంలోని వివరాలు 1950.51 వ సంవత్సరం లోకల్ ఎడ్మినిస్ట్రేషన్ రిపోర్టునుండి, 3 వ కాలంలోని వివరాలు 1950-51వ సంవత్సరపు విద్యాశాఖా రిపోర్టునుండి కూర్చబడ్డాయి.

వివిధ జిల్లాబోర్డులు అజమాయిషీ చేసే రోడ్ల పొడవులో కొంతమేరకు రోడ్ల ప్రక్కన చెట్లు పెంచబడుతున్నాయి. శ్రీకాకుళం, తూర్పుగోదావరి జిల్లాలు తాము అజమాయిషీ చేసే రోడ్లు అన్నింటి ప్రక్క చెట్లు పెంచుతున్నాయి. విశాఖపట్నం జిల్లాబోర్డు తానుఅజమాయిషీచేసే రోడ్డు పొడవులో నూటికి 97 పాళ్ళు, కడప జిల్లాబోర్డు నూటికి 84 పాళ్ళు రోడ్ల ప్రక్కన చెట్లు పెంచుతున్నాయి.

గుంటూరు, నెల్లూరు, అనంతపురం జిల్లాలు చాల తక్కువ మేరకు (తాము అజమాయిషీ చేసే రోడ్ల పొడవులో నూటికి 10-13 పాళ్ళు మాత్రమే) చెట్లను పెంచుతున్నాయి.

లోకలు ఎడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంటు అంచనాల ప్రకారం 1950-51 వ సంవత్సరంలో వివిధ జిల్లా బోర్డులు, తాము అజమాయిషీ చేస్తున్న రోడ్ల ప్రక్కన ఎన్ని మైళ్ళ మేరకు చెట్లను పెంచుతున్నవీ, ఆ చెట్ల మీద ఎంత ఆదాయం వస్తున్నదీ, ఈ చెట్లను పెంచటానికి జిల్లాబోర్డులు ఎంత ఖర్చు చేస్తున్నవీ, ఇత్యాది వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో ఇవ్వబడ్డాయి.

1950-51 వ సంవత్సరంలో వివిధ జిల్లాబోర్డులు జిల్లా జనాభాలో ప్రతి మనిషి, కొక్కింటికి ఎంత పన్ను వసూలు చేశాయో, దిగువ పట్టిక వివరిస్తుంది:

| జిల్లా | జనాభాలో మనిషి 1కి వసూలు చేయబడిన జిల్లాబోర్డు పన్నులు (రూపాయలు) |
|---|---|
| శ్రీకాకుళం | 0- 7-10 |
| విశాఖపట్నం | 0-13- 3 |
| తూర్పుగోదావరి | 1- 2- 9 |
| పశ్చిమగోదావరి | 1- 1- 5 |
| కృష్ణా | 1-12-11 |
| గుంటూరు | 0- 9- 9 |
| నెల్లూరు | 0- 7- 9 |
| కర్నూలు | 0- 8- 1 |
| కడప | 0- 6- 7 |
| అనంతపురం | 0-12- 8 |
| చిత్తూరు | 0- 4- 4 |

జనాభాలో మనిషి ఒకటికి వసూలు చేయబడే పన్ను కృష్ణా జిల్లాలో అధికం (రు. 1-12-11). చిత్తూరు జిల్లా బోర్డు ఇతర బోర్డు లన్నింటికంటె తక్కువపన్ను వసూలు చేస్తున్నది.

రాష్ట్రంలో ఒక్క గుంటూరు జిల్లా బోర్డు తప్ప మరే జిల్లాబోర్డు రైళ్ళను నడపటంలేదు. ఈ జిల్లాబోర్డు తెనాలి-రేపల్లె రైలుమీద రైళ్ళను నడుపుతున్నది. ఈ రైలు పొడవు 21.41 మైళ్ళు. 1950-51 వ సంవత్సరానికి దీనిమీద పెట్టిన పెట్టుబడి, లోకలు ఎడ్మినిస్ట్రేషన్ డిపార్టుమెంటు అంచనాల ప్రకారం రు. 15,98 వేలు. ఈ సంవత్సరంలో

| జిల్లా పేరు | నూరు చదరపు మైళ్లకు మొత్తం రోడ్డు (మైళ్ళు) | మొత్తం రోడ్డులో పక్కా రోడ్డు శాతం | ఒక మైలు మొత్తం రోడ్డుకు జనాభా (సంఖ్య) | వెయ్యి వాహనాలకు పక్కా రోడ్డు (సంఖ్య) | మొత్తం రోడ్డు మైలుకు వాహనాలు | సగటున రోడ్డు మైలుకు 18 ఖర్చు | | పక్కా రోడ్డు మైలుకు 18 ఖర్చు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | రు. | అ. | రు. | అ. |
| శ్రీకాకుళం | 323 | 100.0 | 800 | 1,628 | 203.5 | 2 | 8 | 2 | 8 |
| విశాఖపట్నం | 385 | 97.0 | 3,949 | 1,141 | 28.8 | 9 | 15 | 10 | 4 |
| తూర్పుగోదావరి | 929 | 100.0 | 3,190 | 1,362 | 42.6 | 3 | 7 | 3 | 7 |
| పశ్చిమగోదావరి | 222 | 37.8 | 1,686 | 1,110 | 65.8 | 2 | 4 | 7 | 9 |
| కృష్ణా | 112 | 13.2 | 1,622 | 14,365 | 885.6 | 1 | 15 | 14 | 8 |
| గుంటూరు | 184 | 22.1 | 13,253 | 4,696 | 35.4 | 15 | 15 | 72 | 0 |
| నెల్లూరు | 105 | 13.9 | 638 | 3,077 | 482.0 | 0 | 14 | 6 | 1 |
| కర్నూలు | 121 | 20.6 | 946 | 100 | 10.5 | 1 | 10 | 7 | 13 |
| కడప | 470 | 84.2 | 1,424 | ... | ... | 2 | 9 | 3 | 3 |
| అనంతపురం | 74 | 10.7 | 6,621 | 3,708 | 56.0 | 9 | 9 | 89 | 8 |
| చిత్తూరు | 314 | 33.2 | 4,714 | 13,325 | 282.0 | 4 | 15 | 14 | 15 |

నోటు : జిల్లాబోర్డు అజమాయిషీ కింద ఉన్న 'మొత్తం రోడ్డు' జిల్లాలో ఉన్న మొత్తం రోడ్డు కాదు. ఈ పట్టికలో ఎప్పుడు మొత్తం రోడ్డు అని వచ్చినా, జిల్లాబోర్డు అజమాయిషీ చేయబడుతున్న మొత్తం రోడ్డు అని భావించాలి.

| మునిసిపాలిటీ | 1939 - '40 | | 1943 - '44 | | 1947 - 48 | |
|---|---|---|---|---|---|---|
| | ఆదాయం (రూపాయలు) | వ్యయం (రూపాయలు) | ఆదాయం (రూపాయలు) | వ్యయం (రూపాయలు) | ఆదాయం (రూపాయలు) | వ్యయం (రూపాయలు) |
| కాకినాడ | 5,75,079 | 5,41,275 | 4,80,967 | 5,26,816 | 8,48,176 | 8,40,467 |
| గుంటూరు | 4,20,116 | 3,37,879 | 6,60,952 | 6,72,072 | 11,46,430 | 8,68,349 |
| రాజమండ్రి | 6,72,818 | 6,28,413 | 4,93,797 | 5,59,322 | 9,05,946 | 9,39,240 |
| బెజవాడ | 11,90,023 | 11,45,628 | 10,93,598 | 10,36,126 | 21,18,953 | 18,67,156 |
| నెల్లూరు | 4,35,353 | 4,29,315 | 4,49,414 | 4,16,853 | 8,66,609 | 7,67,952 |
| విశాఖపట్నం | 4,07,640 | 4,40,961 | 7,01,577 | 6,01,532 | 8,73,917 | 9,63,775 |
| మచిలీపట్నం | 3,92,257 | 3,85,033 | 4,60,798 | 4,59,987 | 7,77,249 | 8,81,496 |
| విజయనగరం | ... | ... | 4,17,628 | 4,30,360 | 6,74,401 | ... |
| ఏలూరు | ... | ... | 4,08,515 | 4,26,412 | 6,74,378 | 6,02,056 |

ఈ రోడ్ల వివరాలు :

| | | |
|---|---|---|
| సిమెంటురోడ్లు | 5 మై॥ | 3 ఫ॥ |
| తారురోడ్లు | 7 ,, | 1 ,, |
| కంకరరోడ్లు | 16 ,, | 5 ,, |
| మామూలురోడ్లు | 42 ,, | 6 ,, |

మునిసిపలు లిమిట్సులో సుమారు 13,456 ఇండ్లు ఉన్నాయి. వీటిలో 9,081 కి మాత్రమే మరుగుదొడ్లు ఉన్నాయి.

మునిసిపాలిటీ 30 పబ్లిక్ మరుగుదొడ్లను కట్టింది. వీటిలో 11 సెప్టిక్ టాంకుదొడ్లు.

## మచిలీపట్నం మునిసిపాలిటీ

1866 వ సంవత్సరం నవంబరులో మునిసిపాలిటీగా గుర్తించబడింది.

ప్రస్తుతం శ్రీ క. నరసింహారావు ఛైర్మన్, జనాబ్ బషీర్ అహమ్మద్ కమీషనర్.

కౌన్సిలులో కాంగ్రెసువారు 15, కమ్యూనిస్టులు ముగ్గురు, స్వతంత్రులు 12, ప్రజా సోషలిస్టులు 2.

1953–54వ సంవత్సర బడ్జెట్ అంచనాల ప్రకారం మొత్తం ఆదాయం రు. 12,31,398, వ్యయం రు. 12,87,858.

18 ప్రాథమిక పాఠశాలలు, ఒక సెకండరీ పాఠశాల మునిసిపాలిటీచేత నిర్వహించబడుతున్నాయి.

మునిసిపాలిటీకింద ఉన్న రోడ్ల వివరాలు :

| | |
|---|---|
| సిమెంటురోడ్లు | 6 ఫ. |
| కంకరరోడ్లు | 38 మై. |
| మట్టిరోడ్లు | 58 మై. |

మునిసిపలు లిమిట్సులో ఉన్న ఇండ్లు (1952–53) 9,977, మునిసిపల్ ఎలక్ట్రిక్ కనెక్షను 1,624.

## నెల్లూరు మునిసిపాలిటీ

నెల్లూరు 1885వ సంవత్సరం ఏప్రిల్ ఒకటవ తేదీన మునిసిపాలిటీగా గుర్తించబడింది. శ్రీ ఇ. స్కాట్‌ను ప్రభుత్వం మొందటి ఛైర్మన్‌గా నియమించింది. మొందటి కమీషనర్ శ్రీ క. రామచంద్రరావు.

ప్రస్తుతపు ఛైర్మన్ శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి, కమీషనర్ శ్రీ సి. అప్పిరెడ్డి.

కౌన్సిలు సభ్యులలో 27 మంది స్వతంత్రులు, ఐదుగురు ప్రజా ఐక్యసంఘటన సభ్యులు.

24 ప్రాథమిక పాఠశాలలు, 4 మాధ్యమిక పాఠశాలలు, ఒక సెకండరీ పాఠశాల, 3 ఆయుర్వేద వైద్యశాలలు, ఒక మాతా శిశు సంరక్షణా కేంద్రం ఈ మునిసిపాలిటీచేత నడుపబడుతున్నాయి.

మొత్తం 43 మైళ్ళ రోడ్లు, మునిసిపాలిటీ అధీనంలో ఉన్నాయి. వీటి వివరాలు :

| | | |
|---|---|---|
| సిమెంటురోడ్లు | 2 మై. | 5 ఫ. |
| తారురోడ్లు | 14 ,, | 5 ,, |
| ఇతరరోడ్లు | 25 ,, | 7 ,, |

మునిసిపలు లిమిట్సులో ఉన్న ఇండ్లు 12,259; వీధి విద్యుత్ దీపాలు 1,103.

## నంద్యాల మునిసిపాలిటీ

1899 వ సంవత్సరంలో నంద్యాల మునిసిపాలిటీగా గుర్తించబడింది. మొదటి ఛైర్‌మన్ శ్రీ కె. నరసింగరావు, కమీషనర్ శ్రీ యస్. ఆర్. సంబంధంపిళ్ళె.

ప్రస్తుతపు ఛైర్‌మన్ శ్రీ హెచ్. సేతుమాధవరావు; కమీషనర్ శ్రీ సీతారామస్వామి.

కౌన్సిలులో సభ్యులు: 14 మంది ఛైర్‌మన్ పార్టీవారు, 10 మంది ప్రతిపక్షంవారు.

1953-54 బడ్జెట్ అంచనాల ప్రకారం అన్నిరకాల ఆదాయం రు. 4,19,557, వ్యయం రు. 3,55,401.

ఒక సెకండరీ పాఠశాల, ఒక హైయరు ఎలిమెంటరీ పాఠశాల, 12 ప్రాథమిక పాఠశాలలు మునిసిపాలిటీచేత నడుపబడుతున్నాయి.

మునిసిపాలిటీ అజమాయిషీలో ఉన్న రోడ్ల వివరాలు :

| | |
|---|---|
| సిమెంటు రోడ్లు<br>తారు ,, | 1 మై. 3. ఫ. |
| కంకర రోడ్లు | 12 మై. 7 ఫ. |

మునిసిపలు లిమిట్సులో ఉన్న ఇండ్ల సంఖ్య 6,784. మునిసిపల్ విద్యుత్ కనెక్షన్లు 656.

## అనంతపురం మునిసిపాలిటీ

1869 వ సంవత్సరంలో అనంతపురం మునిసిపాలిటీగా గుర్తించబడింది. మొదటి ఛైర్‌మన్ శ్రీ పి. ఆదిమూర్తిరావు; కమిషనర్ కీ|| శే|| బి. లక్ష్మణపిళ్ళె.

ప్రస్తుతపు ఛైర్‌మన్ శ్రీ మేడా సుబ్బయ్యచెట్టి, కమిషనర్ శ్రీ కె. నరసింహమూర్తి.

కౌన్సిలులో 12 మంది ఛైర్‌మన్‌పార్టీవారు, 12 మంది ప్రతిపక్షంవారు సభ్యులుగా ఉన్నారు. ప్రతిపక్షంలో ముగ్గురు కమ్యూనిస్టు సభ్యులున్నారు.

1953-54 వ సంవత్సర బడ్జెట్ అంచనాల ప్రకారం ఆదాయం రు. 4,51,275, వ్యయం రు. 4,19,840.

ఒక సెకండరీ పాఠశాల, రెండు మాధ్యమిక పాఠశాలలు, పదిప్రాథమిక పాఠశాలలు మునిసిపాలిటీచేత నడుపబడుతున్నాయి.

మునిసిపాలిటీలో క్రిందఉన్న రోడ్ల వివరాలు :

| | |
|---|---|
| సిమెంటురోడ్లు | 4 ఫ. |
| తారురోడ్లు | 2 మై. 5 ,, |
| కంకరరోడ్లు | 7 ,, 7 ,, |
| మట్టిరోడ్లు | 13 ,, 7 ,, |

మునిసిపలు లిమిట్సులో ఉన్న ఇండ్లు 4,576, వీధివిద్యుద్దీపాలు 335.

## హిందుపూరు మునిసిపాలిటీ

1920వ సంవత్సరం మే మాసంలో హిందుపూరు మునిసిపాలిటీగా గుర్తించబడింది. మొదటి ఛైర్మన్ శ్రీ కాశీ శ్రీనివాసరావు, కమీషనర్ శ్రీ కృష్ణ స్వామిరావు.

ప్రస్తుతపు ఛైర్మన్ జనాబ్ బి. అబ్దుల్ వహీద్‌సాహెబ్, కమీషనర్ శ్రీ యస్. పి. రంగనాయకులునాయుడు.

మునిసిపాలిటీ చేత నిర్వహించబడు తున్న రోడ్ల వివరాలు :

| | |
|---|---|
| సిమెంటురోడ్లు | 3 ఫ. |
| తారు రోడ్లు | 7 ఫ. |
| కంకర రోడ్లు | 4 మై. 3 ఫ. |

317 వీధి దివ్యదీపాలు మునిసిపలు లిమిట్సులో ఉన్నాయి.

# పంచాయితీ బోర్డులు

1951 వ సంవత్సరం ఏప్రిల్ ఒకటవ తేదీకి మేజరు పంచాయితీలు 179, మైనరు పంచాయితీలు 3,445 – మొత్తం పంచాయితీలు అన్నీ కలిసి 3,624 ఉన్నాయి (ఇందులో ఆలూరు, ఆదోని, రాయదుర్గం తాలూకాల వివరాలు లేవు).

జిల్లాలవారీ మేజరు, మైనరు పంచాయితీల సంఖ్య దిగువ పట్టికలో వివరించబడింది:

| జిల్లా | మేజరు పంచాయితీలు | మైనరు పంచాయితీలు | మొత్తం |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 12 | 155 | 167 |
| విశాఖపట్నం | 8 | 206 | 214 |
| తూర్పుగోదావరి | 25 | 377 | 402 |
| పశ్చిమగోదావరి | 21 | 416 | 437 |
| కృష్ణా | 18 | 214 | 232 |
| గుంటూరు | 31 | 745 | 776 |
| నెల్లూరు | 10 | 405 | 415 |
| కర్నూలు | 14 | 209 | 223 |
| కడప | 11 | 132 | 143 |
| అనంతపురం | 13 | 196 | 209 |
| చిత్తూరు | 16 | 390 | 406 |
| మొత్తం | 179 | 3,445 | 3,624 |

1950-51 వ సంవత్సరంలో వివిధ జిల్లాలలో మేజరు పంచాయితీ లన్నింటిలో ఉన్న మొత్తంఇండ్లు, సగటున ప్రతి ఇంటికి పడుతున్న ఇంటిపన్ను వివరాలు దిగువపట్టికలో వివరించబడ్డాయి :

| జిల్లా | ఇండ్లు | సగటున ఇంటిపన్ను రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| శ్రీకాకుళం | 32,235 | 3 | 14 | 8 |
| విశాఖపట్నం | 11,620 | 4 | 8 | 0 |
| తూర్పుగోదావరి | 34,210 | 4 | 15 | 0 |
| పశ్చిమగోదావరి | 33,385 | 4 | 11 | 9 |
| కృష్ణా | 29,633 | 3 | 15 | 3 |
| గుంటూరు | 45,282 | 3 | 6 | 11 |
| నెల్లూరు | 24,221 | 5 | 7 | 1 |
| కర్నూలు | 29,907 | 3 | 9 | 9 |
| కడప | 18,814 | 5 | 3 | 0 |
| అనంతపురం | 25,486 | 3 | 10 | 3 |
| చిత్తూరు | 28,823 | 4 | 0 | 0 |

జిల్లాలోని మేజరు పంచాయితీలలో సగటున మనిషి ఒక్కింటికి ఎంత పన్ను వసూలు చేయబడుతున్నదో దిగువ పట్టికలో వివరించబడింది :

| జిల్లా | మనిషి 1 కి వసూలు చేయబడుతున్న పంచాయితీ పన్ను రు. | అ. | పై. |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 1 | 4 | 3 |
| విశాఖపట్నం | 1 | 3 | 0 |
| తూర్పుగోదావరి | | ... | |
| పశ్చిమగోదావరి | 2 | 9 | 0 |
| కృష్ణా | 1 | 6 | 2 |
| గుంటూరు | 2 | 4 | 0 |

| జిల్లా | మనిషి 1 కి వసూలు చేయబడుతున్న పంచాయితీ పన్ను రు. | అ. | పై. |
|---|---|---|---|
| నెల్లూరు | 1 | 12 | 6 |
| కర్నూలు | 2 | 4 | 6 |
| కడప | 2 | 3 | 0 |
| అనంతపురం | 2 | 5 | 7 |
| చిత్తూరు | 2 | 10 | 8 |

# జనరల్ ఎన్నికలు

భారతదేశంలో మొట్ట మొదటిసారి వయోజన ఓటింగు పద్ధతిపై జనరలు ఎన్నికలు 1951-52 వ సంవత్సరంలో జరిగాయి. దేశంలో వివిధ రాష్ట్రాల నుండి 3,280 మంది సభ్యులు వివిధరాష్ట్ర శాసనసభలకు, 489 మంది సభ్యులు ప్రజా సభకు (పార్లమెంటుకు) ఎన్నుకోబడ్డారు.

పార్లమెంటు సభ్యుల ఎన్నికల్లో సుమారు 10,60,00,000 మంది ఓటర్లు రాష్ట్ర శాసనసభా సభ్యుల ఎన్నికలలో సుమారు 10,40,00,000 మంది ఓటర్లు పాల్గొన్నారు.

మదరాసు రాష్ట్రంలో నేటి ఆంధ్ర రాష్ట్రం అప్పుడు ఒక భాగంగా ఉండేది. మొత్తం మదరాసు రాష్ట్రానికి నిర్ణయించిన శాసనసభా నియోజకవర్గాలు 375, పార్లమెంటు నియోజకవర్గాలు 75.

1946వ సంవత్సరంలో పరిమిత ఓటింగుతో జరిగిన ఎన్నికలలో ఆంధ్రప్రాంతం నుంచి ఒక్క కమ్యూనిస్టు సభ్యుడు మాత్రమే ఎన్నికయినాడు. కాని, 1952 జనరలు ఎన్నికలలో 41 మంది కమ్యూనిస్టు సభ్యులు శాసనసభకు ఎన్నికైనారు. మామూలుగా మెజారిటీ పార్టీగా వస్తున్న కాంగ్రెసుకు ఈసారి 40 స్థానాలు మాత్రమే వచ్చాయి

ఈ జనరలు ఎన్నికలలో కాంగ్రెసు, కృషీకార్ లోక్ పార్టీల ప్రముఖులు మాజీమంత్రులు చిత్తుచేయబడ్డారు. ఉదాహరణకు కల్లూరి చంద్రమౌళి, బెజవాడ గోపాలరెడ్డి, మొసలికంటి తిరుమలరావు, కళా వెంకటరావు, అల్లూరి సత్యనారాయణరాజు, లోక్ పార్టీ వ్యవస్థాపకులు గోగినేని రంగనాయకులు (యన్. జి. రంగా) ఇత్యాది ప్రముఖులలో అధికులు కమ్యూనిస్టు సభ్యులచేత ఓడించబడ్డారు.

ఆంధ్ర ప్రాంతాలలోని 140 స్థానాలలో 1952 జనరల్ ఎన్నికలలో వివిధ పార్టీలు, పోటీచేసినసీట్లు, గెలిచిన సీట్లు, ఆయాపార్టీలకు పోలయిన ఓట్ల వివరాలు ఈ ప్రక్క పేజీలోనిపట్టికలో వివరించబడ్డాయి.

అధ్యాయం చివరిపట్టికలో, జిల్లాలవారీ సీట్ల వివరాలు, వాటికి పోటీచేసిన వివిధ పార్టీల, సభ్యుల వివరాలు ఇవ్వబడ్డాయి.

ఎన్నికల అనంతరం, అనేక పార్టీల సభ్యులు (కమ్యూనిస్టులుతప్ప) ఒకపార్టీని వదలి మరొక పార్టీలో చేరటంవల్ల, జనరలు ఎన్నికలు సమాప్తమయిన నాటికి నేటికి పార్టీల బలాబలాలలో తేడా ఉన్నది.

---

నోటు: 1953 ఉపఎన్నికలలో రామచంద్రపురం సీటు కమ్యూనిస్టుపార్టీకి, పుత్తూరుసీటు కాంగ్రెసుకు వచ్చాయి.

| పార్టీ | పోటీ చేసిన స్థానాలు | గెలిచిన స్థానాలు | పోలయిన ఓట్లు |
|---|---|---|---|
| కమ్యూనిస్టులు | 67 | 41 | 14,52,516 |
| కాంగ్రెసు | 136 | 40 | 21,84,423 |
| ప్రజాపార్టీ | 82 | 20 | 10,73,013 |
| లోక్ పార్టీ | 63 | 15 | 6,49,623 |
| సోషలిస్టులు | 55 | 6 | 4,35,546 |
| స్వతంత్రులు | 110 | 17 | 13,51,474 |
| ఇతరులు | 15 | 1 | 1,17,227 |

ఆంధ్ర ప్రాంతంనుండి 27 మంది సభ్యులు పార్లమెంటుకు ఎన్నుకోబడ్డారు. వీరిలో 7 గురు కాంగ్రెసువారు, పదిమంది కమ్యూనిస్టులు, నలుగురు ప్రజాసోషలిస్టులు, ఆరుగురు స్వతంత్రులు.

రాజ్యసభకు (Council of States) 13 మంది ఎన్నుకోబడ్డారు. వీరిలో ఐదుగురు కమ్యూనిస్టులు' నలుగురు కాంగ్రెసువారు, ఇద్దరు ప్రజాసోషలిస్టులు, ఇద్దరు లోక్ పార్టీ వారు.

1953 వ సంవత్సరం అక్టోబరు ఒకటవ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించిన తర్వాత, ఆంధ్రప్రాంతంనుంచి ఎన్నికయిన 141 మంది శాసన సభ్యులతో ఆంధ్ర శాసనసభ ఏర్పాటు చేయబడింది. ఈ శాసనసభలో కమ్యూనిస్టుపార్టీ మెజారిటీ పార్టీ (Single biggest party).

శాసనసభ స్పీకరు శ్రీ నల్లపాటి వెంకటరామయ్య.

డిప్యూటీ స్పీకరు శ్రీ పసల సూర్యచంద్రరావు.

ప్రతిపక్షనాయకుడు శ్రీ తరిమెల నాగిరెడ్డి.

# 1952 జనరల్ ఎన్నికలలో పోటీచేసిన అభ్యర్థులు, పోలయిన ఓట్లు (1)

| జిల్లా పేరు | జిల్లాలోని సీట్లు | కమ్యూనిస్టుపార్టీ | | | కాంగ్రెసు | | | కె. యం. పి | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | పోటీ చేసిన వారు | గెల్చినవారు | పోలయిన ఓట్లు | పోటీ చేసిన సంఖ్య | గెల్చిన సంఖ్య | పోలయిన ఓట్లు | పోటీ చేసిన సంఖ్య | గెల్చిన సంఖ్య | పోలయిన ఓట్లు |
| శ్రీకాకుళం | 15 | 3 | ... | 33,467 | 14 | 5 | 2,03,544 | 2 | ... | 10,298 |
| విశాఖపట్నం | 14 | 3 | 2 | 35,769 | 12 | ... | 1,09,934 | 6 | 1 | 35,951 |
| తూర్పుగోదావరి | 16 | 8 | 6 | 2,41,898 | 13 | 4 | 3,17,909 | 15 | 4 | 3,03,926 |
| పశ్చిమగోదావరి | 12 | 7 | 5 | 1,93,228 | 12 | 2 | 2,17,636 | 12 | 5 | 2,42,046 |
| కృష్ణా | 12 | 11 | 10 | 3,92,240 | 12 | 2 | 2,10,061 | 4 | ... | 24,862 |
| గుంటూరు | 18 | 13 | 10 | 2,89,543 | 18 | 3 | 2,25,571 | 15 | 3 | 1,25,923 |
| నెల్లూరు | 13 | 8 | 3 | 98,870 | 13 | 5 | 2,00,448 | 6 | 2 | 77,671 |
| కర్నూలు | 8 | 1 | 1 | 25,263 | 8 | 3 | 1,20,097 | 2 | ... | 8,252 |
| అనంతపురం | 9 | 2 | 1 | 44,908 | ... | 4 | 1,44,005 | 8 | 2 | 96,477 |
| కడప | 9 | 4 | 2 | 67,181 | 8 | 3 | 1,27,258 | 5 | 2 | 83,393 |
| చిత్తూరు | 12 | 4 | 1 | 21,853 | 11 | 7 | 2,19,968 | 7 | 1 | 64,213 |
| బళ్ళారి | 3 | 1 | ... | 8,291 | 3 | 2 | 77,692 | ... | ... | ... |
| మొత్తం | 141 | 63 | 41 | 14,52,516 | 136 | 40 | 21,84,423 | 82 | 20 | 10,73,013 |

## 1952 జనరల్ ఎన్నికలలో పోటీచేసిన అభ్యర్థులు, పోలయిన ఓట్లు (2)

| జిల్లా పేరు | కె. యల్. పి. | | | సోషలిస్టులు | | | స్వతంత్రులు | | | ఇతరులు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పోటీచేసినవారి సంఖ్య | గెల్చినవారి సంఖ్య | పోలయిన ఓట్లు | పోటీచేసినవారి సంఖ్య | గెల్చినవారి సంఖ్య | పోలయిన ఓట్లు | పోటీచేసినవారి సంఖ్య | గెల్చినవారి సంఖ్య | పోలయిన ఓట్లు | పోటీచేసినవారి సంఖ్య | గెల్చినవారి సంఖ్య | పోలయిన ఓట్లు |
| శ్రీకాకుళం | 15 | 6 | 1,65,659 | 7 | 1 | 65,099 | 14 | 3 | 1,84,681 | ... | ... | ... |
| విశాఖపట్నం | 7 | 5 | 84,432 | 8 | 4 | 1,20,600 | 10 | 2 | 1,00,443 | ... | ... | ... |
| తూర్పుగోదావరి | 8 | 1 | 50,269 | 8 | ... | 43,817 | 8 | ... | 44,293 | 2 | 1 | 73,093 |
| పశ్చిమగోదావరి | ... | ... | ... | 7 | ... | 45,059 | 10 | ... | 65,511 | ... | ... | ... |
| కృష్ణా | 4 | ... | 26,179 | 6 | ... | 10,849 | 10 | ... | 1,66,392 | 3 | ... | 11,766 |
| గుంటూరు | 15 | ... | 1,44,041 | 2 | ... | 11,567 | 15 | 2 | 1,62,087 | 2 | ... | 2,285 |
| నెల్లూరు | 2 | ... | 24,780 | 4 | ... | 12,940 | 11 | 3 | 1,88,209 | 1 | ... | 9,546 |
| కర్నూలు | 5 | 1 | 41,539 | 5 | 1 | 61,846 | 6 | 2 | 1,42,434 | 1 | ... | 22,623 |
| అనంతపురం | 2 | ... | 2,167 | 1 | ... | 8,380 | 8 | 2 | 1,19,945 | 4 | ... | 12,278 |
| కడప | 1 | ... | 16,148 | 3 | ... | 33,461 | 7 | 1 | 71,491 | 1 | ... | 4,060 |
| చిత్తూరు | 4 | 2 | 74,409 | 2 | ... | 8,435 | 8 | 1 | 21,186 | 1 | ... | 1,576 |
| బళ్ళారి | ... | ... | ... | 2 | ... | 13,493 | 3 | 1 | 86,802 | ... | ... | ... |
| మొత్తం | 63 | 15 | 6,49,623 | 55 | 6 | 4,35,546 | 110 | 17 | 13,51,474 | 15 | 1 | 1,12,277 |

నోటు: ఇతరులలో షెడ్యూల్డుకాస్టుస ఫెడరేషన్, ముస్లింలీగ్, ఫార్వర్డుబ్లాకు, హిందూమహాసభ, రామరాజ్యపరిషత్తు మొదలైన పార్టీలున్నాయి.

# ఆంధ్ర శాసనసభ్యులు

### అల్లూరి వెంకటరామరాజు
### (కమ్యూనిస్టు)

నియో : రాజోలు (జనరల్), తూర్పు గోదావరిజిల్లా. వయస్సు 35. 1939 లో కాంగ్రెసును వదలి కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1943 నుండి రైతుసంఘ నిర్మాణంలో పనిచేస్తున్నారు. తూర్పుగోదావరిజిల్లా రైతుసంఘ అధ్యక్షులు. ప్రకాశం అర్డినెన్సు రోజులలో డిటైన్ చేయబడ్డారు. 1948 నుండి 1½ సంవత్సరం అజ్ఞాతవాసం. రెండేళ్ళు డిటెన్షను.

### అడ్డుసుమిల్లి సుబ్రహ్మణ్యం
### (కాంగ్రెసు)

నియో : కైకలూరు, కృష్ణాజిల్లా. పెద్ద భూస్వామి. ఇటీవలనే కాంగ్రెసులో చేరారు.

### ఆసి నీలాద్రిరావురెడ్డి
### (స్వతంత్ర)

నియో : ఇచ్ఛాపురం, శ్రీకాకుళం జిల్లా. వయస్సు 60. జిల్లాఫారెస్టు ఆఫీసరుగా పించను పుచ్చుకున్నారు. లోక్ పార్టీ అభ్యర్థిగ గెలుపొంది రాజధాని సమస్యపై అభిప్రాయ భేదాలువచ్చి లోక్ పార్టీ నుండి వైదొలగారు.

### ఆలపాటి వెంకట్రామయ్య
### (కాంగ్రెసు)

నియో : తెనాలి, గుంటూరుజిల్లా. చాలకాలం వీరు గుంటూరు జిల్లా కాంగ్రెసు అధ్యక్షులుగా పనిచేశారు.

### కొల్లా వెంకయ్య
### (కమ్యూనిస్టు)

నియో : పొన్నూరు, గుంటూరుజిల్లా. వయస్సు 42. పట్టభద్రులు. 1936–41వరకు గుంటూరుజిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1937 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1940 నుండి 47 వరకు గుంటూజిల్లా రైతుసంఘానికి అధ్యక్షులుగా పనిచేశారు. 1947–51 మధ్య ఆంధ్రరాష్ట్ర రైతుసంఘానికి కార్యదర్శిగా పనిచేశారు. 1951 నుండి గుంటూరు జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

### కోలా సుబ్బారెడ్డి
### (కమ్యూనిస్టు)

నియో : పల్నాడు, గుంటూరుజిల్లా. జనవం 1918. 1941 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 42 అగస్టు ఉద్యమ సందర్భంలో 2 సం॥ పాటు డిటెయిన్ చేయబడ్డారు. 1949 లో తిరిగి అజ్ఞాతవాసంలోఉండగాఅరెస్టుచేయబడి51అక్టో

బరులో విడుదలచేయబడ్డారు. 1953వరకు పల్నాడు తాలూకా కమ్యూనిస్టుకమిటీ కార్యదర్శిగా పని చేశారు.

### కరణం రంగారావు
### (కమ్యూనిస్టు)

నియో : చిలకలూరిపేట, గుంటూరు జిల్లా. వయస్సు 33 సం. 1937-42 సం|| లలో కమ్యూనిస్టు పార్టీతో సంబంధం యేర్పడింది. 1939-42 లో యుద్ధ వ్యతిరేకోద్యమంలోపాల్గొన్నారు. 48 లో నర్సారావుపేట తాలూకా కమ్యూనిస్టుకమిటీ కార్యవర్గానికి ఎన్నుకోబడ్డారు. చిలకలూరిపేట ఐ. యల్. టి.డి. పొగాకు కార్మికుల సమ్మెలో ప్రముఖపాత్ర నిర్వహించారు. 49 సెప్టెంబరులో వీరిపై మోపబడిన కుట్రకేసులు, శాసనసభకు ఎన్నుకోబడ్డ అనంతరం రద్దు చేయబడ్డాయి.

### కసుకుర్తి మాలకొండయ్య
### (కమ్యూనిస్టు)

నియో : ఒంగోలు (రిజర్వుడు), గుంటూరుజిల్లా. వయస్సు 29 సం. 1942 లో కమ్యూనిస్టుపార్టీలో చేశారు. వ్యవసాయకూలీ ఉద్యమంలో పని చేస్తున్నారు. ప్రస్తుతం గుంటూరుజిల్లా వ్యవసాయకూలీ సంఘ ఉపాధ్యక్షులు.

### కూనిసెట్టి వెంకటనారాయణదొర
### (కాంగ్రెసు)

నియో : సాలూరు, శ్రీకాకుళంజిల్లా. జననం 1907. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ, జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగా పనిచేశారు. 38 నుండి 42 వరకు విశాఖ జిల్లాబోర్డు సభ్యులు. లోక్‌పార్టీ అభ్యర్థిగా శాసనసభకు ఎన్నికై, పార్టీకి రాజీనామా ఇచ్చి కాంగ్రెసులో కలిశారు.

### కావలి నారాయణ
### (లోక్‌పార్టీ)

నియో : శ్రీకాకుళం (రిజర్వుడు). వయస్సు 54 సం. 1930 లో కాంగ్రెసులో చేరారు. క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలోను, శిరిపురం ఎస్టేటు పన్నుల నిరాకరణోద్యమంలోను అరెస్టు అయ్యారు. శ్రీకాకుళం జిల్లా బోర్డు సభ్యుడుగా పనిచేశారు.

### కొల్లి వెంకట కూర్మినాయుడు
### (ప్రజాసోషలిస్టు)

నియో : బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా. వయస్సు 48 సం. 46-52 వరకు శ్రీకాకుళంజిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా పని చేశారు. ఎన్నికలముందు కాంగ్రెసునుండి విడిపోయి సోషలిస్టు అభ్యర్థిగా ఎన్నికలలో పోటీచేశారు.

### కిల్లి అప్పలనాయుడు
### (లోక్‌పార్టీ)

నియో: శ్రీకాకుళం (జనరల్). వయస్సు 41 సం. 1920 సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. 'క్విట్ ఇండియా' ఉద్యమకాలంలో మూడేండ్లు డిటెన్ చేయబడ్డారు. 40-41 జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు. శ్రీకాకుళం సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకు అధ్యక్షులు. లోక్ పార్టీ కార్యవర్గ సభ్యులు.

### కంకిపాటి వీరన్నపడాల్
(లోక్‌పార్టీ)

నియో : గోలుగొండ (రిజర్వుడు - కొండజాతులు) విశాఖజిల్లా. జననం 1906. కంట్రాక్టు వ్యాపారం చేస్తారు. 1946లో శాసన సభకు కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ లేకుండా ఎన్నికోబడ్డారు.

### కిల్లాడ రామమూర్తి
(స్వతంత్ర)

నియో : గోలుగొండ (జనరల్), విశాఖజిల్లా. వయస్సు 60 సం. 1932 నుండి జిల్లాబోర్డుల రద్దువరకు జిల్లాబోర్డు సభ్యుడు. లోక్ పార్టీ అభ్యర్థిగా గెలుపొందారు. ఇప్పుడు శాసనసభలో రొక్కం లక్ష్మీనరసింహంగారి గ్రూపులో ఉంటున్నారు.

### కలిగొట్ల సూర్యనారాయణ
(కాంగ్రెసు)

నియో : భీమునిపట్నం, విశాఖజిల్లా. వయస్సు 55 సం. 1932నుండి కాంగ్రెసు సభ్యులుగా వుంటున్నారు.

### కాకర్లపూడి విజయరాఘవ సత్యనారాయణ పద్మనాభరాజు
(సోషలిస్టు)

నియో : అలమండ, విశాఖపట్నం జిల్లా. వయస్సు 28సం.1948లో సోషలిస్టు పార్టీలో చేరారు. శృంగవరపుకోట తాలూకా సోషలిస్టుపార్టీ కార్యదర్శి.

### కందర్ప వెంకట రామేశం
(స్వతంత్ర)

నియో : చోడవరం, విశాఖజిల్లా. వయస్సు 58 సం. బి. ఏ., బి. యల్., 1922నుండి 42వరకు చోడవరంతాలూకా కాంగ్రెసు అధ్యక్షులు. ఎన్నికలకు ముందు కాంగ్రెసును వదలి లోక్‌పార్టీ అభ్యర్థిగా ఎన్నికలలో పోటీచేసి గెలుపొందారు. రాజధాని సమస్యపై లోక్ పార్టీ నిర్ణయానికి వ్యతిరేకంగా ఓటు చేయడంవలన పార్టీ నుండి తొలగించబడ్డారు.

### కోడుగంటి గోవిందరావు
(కమ్యూనిస్టు)

నియో : అనకాపల్లి, విశాఖపట్నం జిల్లా. వయస్సు 30 సం|| బి యే. చదివారు. 'క్విట్ ఇండియా' ఉద్యమకాలంలో విజయనగరం కాలేజీ విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించినందుకు జైలుకు పంపబడ్డారు. 1943 నుండి జిల్లాకమ్యూనిస్టుకమిటీ సభ్యులు. ఉత్తర విశాఖ కరువునివారణ కార్యక్రమంలో విశేషకృషిచేశారు. రాష్ట్రరైతు సంఘ సహాయ కార్యదర్శి. తుమ్మపాల పంచదారఫ్యాక్టరీకార్మికసంఘాధ్యక్షులు. 1950 లో అజ్ఞాతవాసంలో అరెస్టయి 51 వరకు కడలూరుజైలులో డిటెన్యూగా ఉన్నారు.

### కారం బాపన్నదొర
(ప్రజాపార్టీ)

నియో : భద్రాచలం (రిజర్వుడు - కొండజాతుల), తూర్పుగోదావరిజిల్లా. జననం 1915 ఏప్రిల్ 10. ప్రభుత్వ కొండ

జాతుల సలహాసంఘ సభ్యులు. గ్రామ మున్సబు.

## కొరపాటి పట్టాభిరామయ్య

నియో : రామచంద్రపురం, తూర్పు గోదావరిజిల్లా. 1936 లో కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో చేరారు. 1939 రాయి వెల్లూరు జైలునుండి తప్పించుకపోయారు. 1948 లో కైకలూరు జైలునుండి తప్పించుకపోయారు. 1950 వరకు కమ్యూనిస్టు పార్టీలో ఉన్నారు. ఈ ఉపఎన్నికలో కమ్యూనిస్టుపార్టీ వీరిని బలపరచి, కమ్యూనిస్టు ఎన్నికల చిహ్నాన్నిచ్చింది.

## కాట్రగడ్డ రాజగోపాలరావు (కమ్యూనిస్టు)

నియో : గుడివాడ (జనరల్), కృష్ణా జిల్లా. జననం 1918 మే 22. సంస్కృతంలో ఆంధ్ర విశ్వవిద్యాలయ "విద్యాప్రవీణ" పట్టం పుచ్చుకున్నారు. ఇంగ్లీషు, హిందీ భాషలలో పరిచయమున్నది.

1930-31 కాంగ్రెసు సత్యాగ్రహోద్యమంలో వలంటీరుగా రాజకీయ జీవితం ప్రారంభించారు. కృష్ణాజిల్లా విద్యార్థి, యువజనోద్యమ నిర్మాతలలో ఒకరు. కృష్ణాజిల్లా విద్యార్థి సంఘానికి కార్యదర్శి పదవికి ఎన్నికయినవారిలో మొదటివారు. విద్యార్థిగా ఉంటూనే తూర్పు కృష్ణా కాంగ్రెసు కార్యవర్గంలోనూ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘంలోను సభ్యులుగా ఉన్నారు. 1937 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1943-45 కృష్ణా జిల్లా రైతుసంఘానికి ప్రధాన కార్యదర్శి.

1947 జూన్ 17 న విజయవాడనుండి "ప్రజాశక్తి" పత్రికను ప్రారంభించారు. (1949 లో ప్రభుత్వం దానిని నిషేధించింది) 1940 లో "స్వతంత్రభారత్" అనే రహస్య కమ్యూనిస్టు పత్రికను అచ్చువేస్తున్నారని పోలీసులు కేసు పెట్టారు.

1947 జనవరిలో ప్రకాశం ఆర్డినెన్సు క్రింద డిటెయిన్ చేయబడి ఆగస్టు 15 న విడుదలయినారు. తిరిగి 1948 జనవరిలో డిటెయిన్ చేయబడి 1951 ఆగస్టులో విడుదలైనారు. ప్రస్తుతం విశాలాంధ్ర దినపత్రిక, విశాలాంధ్ర ప్రచురణాలయాల నిర్వాహకులుగా ఉంటున్నారు.

## కోవి రామయ్యచౌదరి (ప్రజాపార్టీ)

నియో : ఉదయగిరి, నెల్లూరుజిల్లా. వయస్సు 29 సం. కాంగ్రెసులో ప్రాథమిక సభ్యులుగా చేరారు. ఎన్నికలలో ప్రజాపార్టీ అభ్యర్థిగా పోటీచేసి మాజీ ఆర్థికమంత్రి, ప్రస్తుత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులైన బెజవాడ గోపాలరెడ్డిగారిని ఓడించారు.

## కమతం షణ్ముగం (కాంగ్రెసు)

నియో : కందుకూరు (రిజర్వుడు) నెల్లూరుజిల్లా. వయస్సు 53 సం. 1920 సహాయ నిరాకరణోద్యమములోను, 1940 వ్యక్తి సత్యాగ్రహంలోను పాల్గొని, జైలుకు వెళ్ళారు. 1937 నుండి ఇప్పటి వరకు వరుసగా కందుకూరు నియోజక వర్గాన్నుండి శాసనసభ్యులుగా ఎన్నుకోబడుతున్నారు. శాసనసభ కాంగ్రెసు పార్టీ కార్యదర్శులలో ఒకరు.

### కొట్రికె వెంకటశెట్టి
(స్వతంత్ర)

నియో: ద్రోణాచలం, కర్నూలుజిల్లా. వయస్సు 40. పెద్ద మిల్లు యజమాని.

### కుందా రామయ్య
(ప్రజాపార్టీ)

నియో: జమ్మలమడుగు, కడపజిల్లా. వయస్సు 30 సం. ప్రజాపార్టీ అభ్యర్థిగా ఎన్నికైనప్పటికీ ప్రస్తుతం శాసనసభలో స్వతంత్రులవలె వ్యవహరిస్తున్నారు.

### కడప కోటిరెడ్డి
(కాంగ్రెసు)

నియో: కడప. జననం 1887. బారిస్టరు. కాంగ్రెసులో చాలకాలంగా పని చేస్తున్నారు. 1926-30 మదరాసు ఎగువ సభలో స్వరాజ్యపార్టీ ఉపనాయకులు. 1937 నుండి వీరు వరుసతప్పకుండా శాసన సభకు ఎన్నికవుతున్నారు. 1946 ప్రకాశం మంత్రివర్గంలో మద్యనిషేధశాఖ, దేవాదాయ ధర్మాదాయ శాఖా మంత్రి. ప్రస్తుత మంత్రివర్గంలో రివెన్యూ మంత్రి.

### కందుల బాలనారాయణరెడ్డి
(కాంగ్రెసు)

వీరు ప్రొద్దుటూరు (కడపజిల్లా) నియోజకవర్గం నుండి ఎన్నికయినారు.

### కాసెట్టి శ్రీనివాసులు
(ప్రజాపార్టీ)

నియో: ధర్మవరం, అనంతపురంజిల్లా. వయస్సు 35 సం. ధర్మవరంలో ఒక చేనేత సిల్కు ఫ్యాక్టరీ, బెంగుళూరులో నాలుగు సిల్కు ఫ్యాక్టరీలు, ఒక సినిమా హాలు వీరి కున్నాయి.

### కె. వి. వేమారెడ్డి
(కాంగ్రెసు)

నియో: కదిరి, అనంతపురంజిల్లా. వయస్సు 46 సం. బి. ఏ., బి. యల్., రాయలసీమ మహాజనసభ ఉపాధ్యక్షులు.

### కె. శాంతప్ప
(కాంగ్రెసు)

నియో: కల్యాణదుర్గం (రిజర్వుడు), అనంతపురం జిల్లా. వయస్సు 55 సం. చాలకాలం జిల్లాబోర్డు సభ్యులుగా ఉన్నారు.

### కిడాంబి వరదాచారి
(కాంగ్రెసు)

నియో: తిరుత్తని (చిత్తూరు జిల్లా). వయస్సు 63 సం. సైమను కమిషన్ బహిష్కరణోద్యమంలో పాల్గొన్నారు. 1934 నుండి 44 వరకూ చిత్తూరు జిల్లా కాంగ్రెసుకమిటీ కార్యదర్శిగా ఉన్నారు. చిత్తూరు జిల్లా న్యాయవాది సంఘ అధ్యక్షులు. 1937 లో కాళహస్తి-చంద్రగిరి నియోజకవర్గాన్నుండి శాసన సభకు ఎన్నికయినారు.

### కట్టా ఆదికేశవులు నాయుడు
(కాంగ్రెసు)

నియో: చంద్రగిరి, (చిత్తూరు జిల్లా). చంద్రగిరి భూమి తనఖా బ్యాంకు అధ్యక్షులు.

### ఖండవల్లి కృష్ణారావు
(స్వతంత్ర)

నియో: నెల్లూరు (పట్టణం). జననం 1902 జనవరి 22. పట్టభద్రులు.

1937 నుండి 53 వరకు మద్రాసురాష్ట్ర నాన్ అఫీషియల్ కో-ఆపరేటివ్ ఎంప్లాయీస్ యూనియన్ అధ్యక్షులు. 1940లో నెల్లూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర సహకార మహాసభ కార్యదర్శి. కొంతకాలం నెల్లూరుజిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి. 1947 నుండి కమ్యూనిస్టుపార్టీ నుండి విరమించుకున్నారు. సోవియట్ మిత్రమండలి నెల్లూరుశాఖ కార్యదర్శి. వీరు ప్రమాదకరమైన వ్యక్తి అని 1949 లో క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ 151 సెక్షను క్రింద మద్రాసు ప్రభుత్వం వీరిపై కేసు పెట్టింది. అనేకసార్లు జైలులో నిర్బంధించబడ్డారు.

## గంట్లాన సూర్యనారాయణ
(సోషలిస్టు)

నియో: విజయనగరం(రిజర్వుడు), విశాఖపట్నంజిల్లా. వయస్సు 36 సం. 1936లో నిమ్న జాతుల ఫెడరేషనులోచేరి పనిచేస్తూ 1948 లో సోషలిస్టుపార్టీలో చేరారు.

## గంజి నాగేశ్వరరావు
(కమ్యూనిస్టు)

నియో: రాజోలు (రిజర్వుడు), తూర్పు గోదావరి జిల్లా. వయస్సు 30 సం. 1940 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు.

జిల్లా వ్యవసాయకూలీఉద్యమ నిర్మాతలలో ఒకరు. అనేక సమ్మెలకు నాయకత్వం వహించారు. 1948 జూలై లో అరెస్టు చేయబడి, డిటెయిన్ చేయబడి 1951 ఏప్రిల్‌లో విడుదలయ్యారు.

## గంజి రామారావు
(కమ్యూనిస్టు)

నియో: గుడివాడ (రిజర్వుడు), కృష్ణాజిల్లా. జననం 1918 జూలై. బి. ఎ. విద్యార్థి దశలో వెనుకబడిన జాతుల హాస్టలులోని అస్పృశ్యతకు వ్యతిరేకంగా సమ్మెనడిపినందుకు హాస్టలునుండి వెళ్ళగొట్టబడ్డారు. 1946 లో గుడివాడ యస్. జి. వో. ల సమ్మెను నడిపారు. ప్రస్తుతం కృష్ణాజిల్లా వ్యవసాయకూలీ సంఘ కార్యదర్శిగా పని చేస్తున్నారు.

## గుంటూరు బాపనయ్య
(కమ్యూనిస్టు)

నియో: దివి (రిజర్వుడు), కృష్ణాజిల్లా. జననం 1919. 1940 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కూలీ ఉద్యమ నిర్మాతలలో ఒకరు. 1941 లో కృష్ణాజిల్లా వ్యవసాయకూలీసంఘ కార్యదర్శి. 1945 నుండి రాష్ట్ర వ్యవసాయకూలీ సంఘ ప్రధాన కార్యదర్శి. 1948 జనవరినుండి 1951 ఆఖరువరకు డిటెన్షనులో వున్నారు.

## గుండాబత్తుల ఆంజనేయులు
(కమ్యూనిస్టు)

నియో: బందరు. వయస్సు 35 సం. 1936 లో కాంగ్రెసులో చేరారు. తాలూకా కాంగ్రెసు కార్యవర్గసభ్యులు. 1943 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1943 నుండి రైతు యువజనోద్యమాలలో పనిచేస్తున్నారు. 1943 నుండి బందరు తాలూకా రైతుసంఘ అధ్యక్షులు. 1944 లో బంటుమిల్లిలో కౌలుదారు ఉద్యమాన్ని నడిపారు. 1948 ఫిబ్రవరి

నుండి 51 వరకు అజ్ఞాతవాసంలో ఉన్నారు.

### గంగా చినకొండయ్య
### (స్వతంత్ర)

నియో : ఆత్మకూరు, నెల్లూరుజిల్లా. 1936 నుండి 1950 వరకు కమ్యూనిస్టు పార్టీలో పనిచేశారు. ఆరుసార్లు అరెస్టు చేయబడి 2½ సం॥లు డిటెన్షనులోను, 1½ సం॥లు సాధారణ ఖైదీగను వున్నారు. కారల్ మార్క్సు, మనదేశం-మనభూమి, 'భగ్నహృదయాలు' వీరి రచనలు.

### గారపాటి సత్యనారాయణ
### (కమ్యూనిస్టు)

నియో : ఏలూరు, పశ్చిమ గోదావరి జిల్లా. వయస్సు 43 సం. అనేక కాంగ్రెసు ఉద్యమాలలో పాల్గొన్నారు. రాజమండ్రి జైల్లో లాహోరు కుట్రకేసు ఖైదీలతో పరిచయ మేర్పడి వామపక్ష రాజకీయాలవైపు మొగ్గారు. 1935-36లో జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శి. 36-37 జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శి. 1933 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఏలూరులో కార్మిక సంఘాలను నిర్మించారు. మొత్తం 8½ సం॥లు జైలులో గడిపారు. 1948 జూన్ నుండి ఎన్నికల వరకు డిటెన్షనులో వున్నారు.

### గోరికపూడి జోసెఫ్
### (కమ్యూనిస్టు)

నియో : అమృతలూరు (జనరల్), గుంటూరుజిల్లా. వయస్సు 28 సం. వ్యవసాయకూలీ కుటుంబంలో పుట్టారు. వ్యవసాయకూలీ ఉద్యమ నిర్మాణంలో తీవ్ర కృషి సల్పారు. 1947 గాజులలంక జమీందారీ వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. 1949 నుండి 50 మార్చి వరకు రహస్యజీవితం. అరెస్టుచేసాక పోలీసులు వీరిని రహస్యాలు బైటపెట్టమని విపరీతమైన హింసాకాండకు గురిచేసారు.

### గోనివారిపల్లె శివశంకరరెడ్డి
### (కాంగ్రెసు)

నియో : హిందూపురం, అనంతపురం జిల్లా. వయస్సు 32 సం. 1942 లో కాంగ్రెసులో చేరారు. జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులు.

### జి. నాగభూషణం
### (కాంగ్రెసు)

నియో : రాయదుర్గం, అనంతపురం జిల్లా. ఆంధ్ర శాసనసభ డిప్యూటీ స్పీకరు ఎన్నికలలో ప్రభుత్వపక్ష అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోయారు.

### గౌతు లచ్చన్న
### (లోక్‌పార్టీ)

నియో : సోంపేట, శ్రీకాకుళంజిల్లా. జననం 1909. 1930 ఉప్పుసత్యాగ్రహంలో జైలుకెళ్ళారు. 1933 లో రైతు రక్షణ యాత్రలో పాల్గొన్నారు. అప్పటినుండి రంగాగారికి రాజకీయ శిష్యులు. 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1946-50 లో ఆంధ్ర కాంగ్రెసుకు సహాయకార్యదర్శి. జనరలు ఎన్నికల ముందు రంగాగారితోపాటు కాంగ్రెసును వదలి లోక్‌పార్టీ స్థాపించారు.

ఆంధ్ర మంత్రివర్గంలో కొద్దిరోజులపాటు వ్యవసాయ మంత్రిగా ఉన్నారు.

### గుజ్జుల యల్లమందారెడ్డి
(కమ్యూనిస్టు)

నియో : కనిగిరి, నెల్లూరు జిల్లా. వయస్సు 31 సం. కొంతకాలం నెల్లూరు జిల్లా విద్యార్థి ఫెడరేషన్ అధ్యక్షులు. జమీందారుల అధికపన్నులకు వ్యతిరేకంగా పోరాటాలు నడిపారు. వీరితో పోటీచేసిన అభ్యర్థులందరూ ధరావతుల కోల్పోయారు.

### చిట్టూరి ఇంద్రయ్య
(కాంగ్రెసు)

నియో : తణుకు, పశ్చిమగోదావరి జిల్లా. జననం 1900 డిసెంబరు. కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొని చదువు విరమించారు. పెద్ద భూస్వామి. 1928 తీగెల కేసులో జైలు శిక్ష అనుభవించారు. ఎన్నికలలో ప్రజాపార్టీ అభ్యర్థిగ గెలుపొంది, కాంగ్రెసుపార్టీలో చేరారు.

### చిట్టూరి ప్రభాకరచౌదరి
(కమ్యూనిస్టు)

నియో : రాజమండ్రి, తూ.గో.జిల్లా. వయస్సు 31 సం. 1942 జనవరిలో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. రాజమండ్రిలో అనేక కార్మిక సంఘాలను స్థాపించారు. రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కార్యవర్గ సభ్యులు. 1948 డిసెంబరులో రాజమండ్రి సబ్ జైలునుండి పారిపోయారు. 1950 మార్చివరకు రహస్య జీవితం. తరువాత కడలూరులో డిటెన్యూ. ఎన్నికలకు ముందు విడుదల చేయబడ్డారు.

### చిత్తజల్లు వెంకటకృష్ణారావు
(కమ్యూనిస్టు)

నియో : కాకినాడ (జనరల్), తూర్పు గోదావరిజిల్లా. జననం 1912. 1934 లో లండన్‌లో జరిగిన సామ్రాజ్యవ్యతిరేక సభలో భారత విద్యార్థి ప్రతినిధిగా పాల్గొన్నారు. 1939 లో భారత కమ్యూనిస్టుపార్టీలో చేరారు. కొన్నాళ్ళు ఆంధ్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు. ప్రస్తుతం కాకినాడ మునిసిపలు ఛైర్ మన్. ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనెట్ సభ్యులు.

### చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాదమూర్తిరాజు
(కాంగ్రెసు)

నియో : తాడేపల్లిగూడెం. పశ్చిమ గోదావరిజిల్లా. వయస్సు 34 సం. ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. పెద్ద భూస్వామి.

### చల్లా సుబ్బారాయుడు
(ప్రజాపార్టీ)

నియో : తాడిపత్రి, అనంతపురం జిల్లా. వయస్సు 36 సం. 1938-41 మధ్య జిల్లాబోర్డు సభ్యులు. 1950 లో కాంగ్రెసునుండి వైదొలిగారు. ప్రజాపార్టీ అభ్యర్థిగా ఎన్నికై ప్రస్తుతం 'స్వతంత్రు'లుగా వ్యవహరిస్తున్నారు.

### చంద్రపుల్లారెడ్డి
(కమ్యూనిస్టు)

నియో : నందికొట్కూరు, కర్నూలు జిల్లా. ఇంజనీరింగుకోర్సు చదువుతున్న కాలంలో అన్నామలై విద్యార్థులపై జరిగిన కాల్పులకు నిరసనగా సమ్మె నడిపి

వందుకు కాలేజీనుండి వెళ్ళగొట్టబడ్డారు. జిల్లా విద్యార్థి ఉద్యమనిర్మాత. 1950లో డిటెయిన్ చేయబడి 1951 సెప్టెంబరులో విడుదలయ్యారు. కర్నూలుజిల్లా రైతుసంఘాధ్యక్షులు. శాసనసభలో మంచి వక్తగా పేరుపొందారు.

## చంద్ర రామలింగయ్య

## (కమ్యూనిస్టు)

నియో : దివి (జనరల్), కృష్ణాజిల్లా. వయస్సు40సం॥ యం.ఎ.,బి.యల్., కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చదువుతుండగా కమ్యూనిస్టులతో పరిచయమేర్పడింది. కృష్ణాజిల్లా దివితాలూకా రైతు ఉద్యమ నిర్మాణంలో కృషి చేశారు. కృష్ణా జిల్లా రైతు సంఘాధ్యక్షులు. 1948 లో డిటైన్ చేయబడి ఎన్నికలకు ముందే విడుదల చేయబడ్డారు.

## టంగుటూరు ప్రకాశం

## (కాంగ్రెసు)

నియో : శృంగవరపుకోట, విశాఖపట్నంజిల్లా. బారిస్టరు. సైమను కమిషన్ బహిష్కరణలో పాల్గొన్నారు. అనేక సంవత్సరాలు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకు అధ్యక్షులు; ఎ. ఐ. సి. సి. సభ్యులు. 'స్వరాజ్య' అనే ఇంగ్లీషు దినపత్రికను నడిపారు.1936లో రాజాజీమంత్రివర్గంలో రెవెన్యూ మంత్రిగా పనిచేశారు. ఈ కాలంలోనే జమీందారీ విచారణకమిటీ అధ్యక్షులుగా నివేదిక తయారుచేశారు. 1947 లో 11 నెలలు ముఖ్యమంత్రిగా పనిచేశారు. 1950 లో వీరు రంగాగారితో సహా కాంగ్రెసునుండి విడిపోయి కె.ఎం.పి. పార్టీ పెట్టారు. ఎన్నికలముందు ప్రకాశంగారు ఈ పార్టీనుండి విడిపోయి ప్రజా పార్టీ పెట్టారు. ఎన్నికల అనంతరం ఏర్పడిన ఐక్యసంఘటనకు నాయకులుగా ఎన్నికై రాజాజీ మంత్రివర్గ నిర్మాణానంతరం దానిలోనుంచి విడిపోయారు. తరువాత ప్రజాపార్టీనుండి విడిపోయి కాంగ్రెసుతో కలిసి తాము ముఖ్యమంత్రిగా ప్రథమాంధ్ర ప్రభుత్వ మంత్రివర్గం నిర్మించారు.

## టి. లక్ష్మీనారాయణరెడ్డి

## (స్వతంత్ర)

నియో : పెనుకొండ, అనంతపురం జిల్లా. జననం 1916 మార్చి 3వ తేదీ. 1949 వరకూ కాంగ్రెసులో ఉన్నారు. ఆంధ్ర శాసనసభలో అభ్యుదయ స్వతంత్రుల గ్రూపుకు చెందినవారు. భారత - చైనా మిత్రమండలి ఆంధ్రశాఖకు అధ్యక్షులు. 1950 నుండి శాంతి ఉద్యమంలో కృషిచేస్తున్నారు.

## టి. మల్లయ్య

## (కాంగ్రెసు)

వీరు ఆదోని (రిజర్వుడు) నియోజకవర్గం నుండి ఎన్నికయినారు.

## తమ్మిన పోతరాజు

## (కమ్యూనిస్టు)

నియో : విజయవాడ పట్టణం. వయస్సు 41 సం. విదేశీవస్త్ర బహిష్కరణోద్యమంలో వలంటీరుగా పాల్గొన్నారు. 1940 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. విజయవాడలో అనేక కార్మిక పోరాటాలకు నాయకత్వం వహించారు. కొంతకాలం నగరకమ్యూనిస్టుపార్టీ కార్య

దర్శి. 1948 నుండి 1951 ఆఖరువరకూ వెల్లూరుజైలో డిటెన్యూగా ఉన్నారు.

## తమ్మా కోటమ్మరెడ్డి
(కాంగ్రెసు)

నియో : ప్రత్తిపాడు, గుంటూరుజిల్లా. ఆంధ్ర శాసనసభకు ఎన్నికయిన ఏకైక స్త్రీ సభ్యురాలు.

## తంబళ్ళపల్లి నారపరెడ్డి వెంకట సుబ్బారెడ్డి
(కాంగ్రెసు)

నియో : పుట్టు, చిత్తూరు జిల్లా.

## తాడ్డె చిన్న అచ్చన్ననాయుడు
(కాంగ్రెసు)

నియో : చీపురుపల్లి, శ్రీకాకుళం జిల్లా. వయస్సు 64 సం. స్వతంత్ర అభ్యర్థిగా గెలుపొంది కాంగ్రెసులో చేరారు. గర్భాం మాంగనీసు గనుల యజమాని. 1924నుండి యిప్పటివరకు గర్భాం పంచాయితీబోర్డు అధ్యక్షులు.

## తోట రామస్వామి
(కాంగ్రెసు)

నియో : పెద్దాపురం, తూర్పుగోదావరి జిల్లా. వయస్సు 47. పట్టభద్రులు. సెంట్రల్ సుగరు కేన్ కమిటీ సభ్యులు. సామర్లకోట చెరకు ఉత్పత్తిదార్ల సంఘ అధ్యక్షులు.

## తెన్నేటి విశ్వనాథం
(ప్రజాపార్టీ)

నియో: విశాఖపట్నం. జననం 1895. న్యాయవాద వృత్తిని వదలి జాతీయోద్యమంలో ప్రవేశించారు. విశాఖపట్నం జిల్లా కాంగ్రెసు కమిటీకి చాలాకాలం అధ్యక్షులు. 1937లో మద్రాసు శాసన సభా సభ్యులు. రాజగోపాలాచారి మంత్రి వర్గంలో రివెన్యూమంత్రి ప్రకాశంగారికి పార్లమెంటరీ కార్యదర్శిగా పనిచేశారు. 1946 లో ప్రకాశం మంత్రివర్గకాలంలో ఛీఫ్ పార్లమెంటరీ కార్యదర్శిగా పని చేశారు.

ఐక్యసంఘటనఉన్న కాలంలో ఎసెంబ్లీలో కొంతకాలం ప్రతిపక్షనాయకులుగా ఉన్నారు. ఆంధ్రరాష్ట్ర విభజనా సందర్భంలో త్రిసభ్యసంఘంలో సభ్యులు. నేటి ఆంధ్ర మంత్రివర్గంలో ఆర్థికమంత్రి.

## తరిమెల నాగిరెడ్డి
(కమ్యూనిస్టు)

నియో : అనంతపురం. వయస్సు 36 సం. పట్టభద్రులు. కాశీ విశ్వవిద్యాలయంలో చదువుతూండగానే అతివాద రాజకీయ శక్తులతో పరిచయం ఏర్పడింది. మంచి వక్త. చురుకైన విద్యార్థి ఉద్యమ కార్యకర్తగా స్వల్పకాలంలో అభివృద్ధయినారు. కాశీ విశ్వ విద్యాలయ విద్యార్థి సంఘానికి ఎన్నికయిన దక్షిణ దేశములలో ప్రథములు. 1939 లో (విద్యార్థి దశలో) అభ్యంతరకరమైన కరపత్రం ప్రచురించాడనే నేరారోపణపై, సంవత్సరం కారాగారవాస శిక్ష విధించబడ్డారు. అనంతపురంజిల్లా ప్రజా ఉద్యమ నిర్మాణంలో ప్రముఖపాత్ర వహించారు. 1948 నుండి 1951 ఆఖరు వరకు అజ్ఞాతవాసం. జైలులో ఉండే నీలం సంజీవరెడ్డిగారిని 12 వేల ఓట్ల మెజారిటీతో ఓడించి శాసనసభకు ఎన్ని

కయినారు. మదరాసు శాసనసభలో కమ్యూనిస్టుపార్టీ నాయకులు. ఆంధ్ర శాసనసభలో పార్టీ నాయకులు. ప్రతిపక్షనాయకులుగా వ్యవహరిస్తున్నారు. ఆంధ్ర విశ్వ విద్యాలయ సెనేటు సభ్యులు. ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ సెక్రటేరియట్ సభ్యులు.

## దంతులూరి నారాయణరాజు

(కాంగ్రెసు)

నియో: ఉండి, పశ్చిమ గోదావరి జిల్లా. చాలాకాలంనుండి కాంగ్రెసులో వుంటున్నారు.

## దండమూడి దశరథరామయ్య

(కాంగ్రెసు)

నియో: రాపూరు, నెల్లూరుజిల్లా. వయస్సు 39 సం.

## ద్వారంపూడి బసివిరెడ్డి

(ప్రజాపార్టీ)

నియో: పెనుగొండ, పశ్చిమగోదావరి జిల్లా. 1933 లో తాలూకాబోర్డు ఉపాధ్యక్షులు. 1937 నుండి మారుటేరు పంచాయితీ అధ్యక్షులు.

## దర్శి లక్ష్మయ్య

(కమ్యూనిస్టు)

నియో: మంగళగిరి, గుంటూరుజిల్లా. వయస్సు 50 సం. ఉప్పుసత్యాగ్రహం రోజులనుండీ జాతీయోద్యమాలలో పాల్గొన్నారు. 1929 లో కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో చేరారు. 1938 లో కాంగ్రెసు అభ్యర్థిగ జిల్లాబోర్డుకు ఎన్నికైనారు. 1943 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. ప్రస్తుతం పెదకూరపాడు పంచాయితీబోర్డు అధ్యక్షులు.

## దామోదరం సంజీవయ్య

(కాంగ్రెసు)

నియో: కర్నూలు (రిజర్వుడు). వయస్సు 31 సం. కాంగ్రెసు తరఫున రాజ్యాంగసభకు ఎన్నుకోబడ్డారు. గత ఎన్నికలలో కర్నూలుపట్టణం రిజర్వుడు నియోజకవర్గంనుండి ఎన్నికై రాజగోపాలాచారి మంత్రివర్గంలో సహకార, గృహనిర్మాణశాఖల మంత్రిగా వున్నారు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడ్డాక అభివృద్ధిశాఖా మంత్రిగా నియమించబడ్డారు.

## డి. రామబ్రహ్మం

(కాంగ్రెసు)

నియో: పలమనేరు, చిత్తూరుజిల్లా. 1935 నుండి కాంగ్రెసువాదిగా వుంటున్నారు. చిత్తూరు జిల్లాబోర్డు సభ్యులు.

## దొడ్డా సీతారామయ్య

(కమ్యూనిస్టు)

నియో: మదనపల్లి, చిత్తూరు జిల్లా. పట్టభద్రులు. 1927లో సైమన్ కమిషన్ రాకకు వ్యతిరేకంగా మదనపల్లి కాలేజిలో సమ్మె నడిపారు. 1935 నుండి 38 వరకు కాంగ్రెసులో అతివాదిగా ఉన్నారు. 1940 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. చిత్తూరుజిల్లా కమ్యూనిస్టుకమిటీ కార్యదర్శిగా పనిచేశారు. 1949 లో ఇంటర్నమెంటు ఆర్డరు ధిక్కరించారనే ఆరోపణపై శిక్షవిధించబడ్డది. 22 మంది ఖైదీల మరణానికి కారణమైన సేలంజైలు కాల్పులలో వీరికి ప్రమాదకరమైన గాయాలు తగిలాయి.

నల్లమోతు చెంచురామానాయుడు

(కాంగ్రెసు)

నియో : కందుకూరు, నెల్లూరుజిల్లా. వయస్సు 39. 1946 నుండి జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులు.

నల్లపాటి వెంకట్రామయ్య

(ప్రజాపార్టీ)

నియో : నరసారావుపేట, గుంటూరు జిల్లా. జననం 1901 మార్చి. 1930 లో నర్సారావుపేట మునిసిపలు చైర్మన్‌గా ఎన్నుకోబడ్డారు. 1930-31 లో ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యులు. 1932 లోను, 1938 నుండి 42 వరకు జిల్లా బోర్డు సభ్యులు. ఆంధ్రశాసనసభ యేర్పడ్డాక శాసనసభ స్పీకరుగా ఎన్నుకోబడ్డారు.

నడింపల్లి

వెంకట లక్ష్మీనరసింహారావు

(ప్రజాసోషలిస్టు)

నియో : గుంటూరు పట్టణం. బారిస్టరు. కాంగ్రెసు ఉద్యమంలో పనిచేసి అనేకసార్లు జైలుకు వెళ్ళారు. గుంటూరు మున్సిపల్ ఛైర్మన్‌గా చాలకాలం పని చేశారు.

నడింపల్లి రామభద్రరాజు

(ప్రజాపార్టీ)

నియో : అమలాపురం (జనరల్), తూర్పుగోదావరిజిల్లా. ప్రజా, సోషలిస్టు

పార్టీలు కలిసివున్నప్పుడు ప్రజాసోషలిస్టు పార్టీలోనూ, ఆంధ్రలో ఈ రెండుపార్టీలకు తెగతెంపులయ్యాక ప్రజాపార్టీలోనూ వుంటున్నారు. కళా వెంకట్రావుగారిని ఓడించి శాసనసభ్యులయ్యారు.

## నీరుకొండ వెంకటరామారావు
(లోక్ పార్టీ)

నియో : బూరుగుపూడి, తూర్పు గోదావరిజిల్లా. జననం 1914 మార్చి 23. న్యాయవాదిపట్టం పుచ్చుకున్నారు. 1930 లో నాల్గవఫారం చదువుతూండగా సత్యాగ్రహం చేసి 1½ సం॥లు జైలుశిక్ష అనుభవించారు. 1932 శాసనోల్లంఘనోద్యమంలోను, 'క్విట్ ఇండియా' ఉద్యమంలోను పాల్గొన్నారు. 1947-48 లో జిల్లా కాంగ్రెసుకమిటీ కార్యదర్శి. 1951 ఏప్రిల్ లో రంగాగారితోపాటు కాంగ్రెసు నుండి రాజీనామా చేసి లోక్ పార్టీ అభ్యర్థిగ ఎన్నికలలో పోటీచేసి గెలుపొందారు. శాసనసభలో లోక్ పార్టీ నాయకులు.

## నర్రెడ్డి శివరామిరెడ్డి
(కమ్యూనిస్టు)

నియో : కమలాపురం, కడపజిల్లా. వయస్సు 34 సంవత్సరాలు. న్యాయశాస్త్రంలో పట్టభద్రులు. 1947లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1948-1951 మధ్యకాలంలో అజ్ఞాతవాసం.

## నీలం సంజీవరెడ్డి
(కాంగ్రెసు)

నియో : కాళహస్తి, చిత్తూరుజిల్లా. జననం 1913 మే 13. 1938-40 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు. 1946 ఎన్నికలలో శాసనసభకు ఎన్నుకోబడ్డారు. 1949 ఏప్రిల్ నుండి 1951 ఏప్రిల్ వరకూ మదరాసు మంత్రివర్గంలో మద్య నిషేధ మంత్రిగా ఉన్నారు. 1951 ఏప్రిల్ లో ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికైనారు. బై ఎలెక్షనులో శాసనసభకుఎన్నికయినారు. ప్రస్తుత మంత్రివర్గంలో ఉపముఖ్యమంత్రి.

## యస్. వెంకటరామయ్య
(లోక్ పార్టీ)

నియో : మార్కాపురం, కర్నూలు జిల్లా. జననం 1909 జూన్ 19. గ్లాస్గోలో చదివారు. ప్రస్తుతం వుయ్యూరు పంచదార ఫ్యాక్టరీలో ఛీఫ్ కెమిస్టుగా పని చేస్తున్నారు.

## పసల సూర్యచంద్రరావు
(ప్రజాసోషలిస్టు)

నియో : అలంపురం, పశ్చిమగోదావరి జిల్లా. జననం 1909 జూన్ 24. ఆంధ్ర శాసనసభ డెప్యూటీ స్పీకరు. నాట్యకళాభిమానులు. ఆంధ్ర నాట్యకళా పరిషత్తు ప్రధాన కార్యదర్శి. 1951 లో కాంగ్రెసు పార్టీనుండి వైదొలగి ప్రజా పార్టీ లో చేరారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులు.

## నాయకంటి శంకరరెడ్డి
(కాంగ్రెసు)

నియో : కర్నూలు (జనరల్). బి. ఎ., బి. యల్., చాలకాలం నుండి కాంగ్రెసులో వుంటూ అనేక పదవులు నిర్వహించారు. మద్రాసు ప్రభుత్వంలో స్థానిక స్వపరిపాలనా శాఖామంత్రిగా పనిచేశారు.

### పడాల సత్యనారాయణరెడ్డి
(కాంగ్రెసు)

నియో: అనపర్తి, తూ. గో. జిల్లా. వయస్సు 42 సం. 1936లో కాంగ్రెసులో చేరారు. 1939 నుండి కొలను కుదురు పంచాయితీబోర్డు అధ్యక్షులు. రామచంద్రపురం సెంట్రల్ బ్యాంకు డైరక్టరు.

### పడాల శ్యామసుందరరావు
(కమ్యూనిస్టు)

నియో: నర్సాపురం (రిజర్వుడు), పశ్చిమగోదావరిజిల్లా. పశ్చిమగోదావరి జిల్లాలో వ్యవసాయకూలీ ఉద్యమ నిర్మాణంలో తీవ్ర కృషిసల్పారు.

### పప్పల బాపునాయుడు
(లోక్‌పార్టీ)

నియో: యలమంచిలి, విశాఖపట్నం జిల్లా. వయస్సు 42. 1930 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. యలమంచిలి సహకారసంఘ అధ్యక్షులు.

### పాల వెంకటసుబ్బయ్య
(కాంగ్రెసు)

నియో: రాజంపేట (రిజర్వుడు), కడపజిల్లా. చాలకాలంగా కాంగ్రెసులో పనిచేస్తున్నారు.

### పాలవలస సంగంనాయుడు
(కాంగ్రెసు)

నియో: పాలకొండ, శ్రీకాకుళంజిల్లా. వయస్సు 40 సం. 1937 నుండి కాంగ్రెసులో పనిచేస్తున్నారు. 1950-51 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగను, ఎ. ఐ. సి. సి. సభ్యులుగను వున్నారు.

### పొదిలేటి వెంకటస్వామిరెడ్డి
(కాంగ్రెసు)

నియో: వెంకటగిరి, నెల్లూరుజిల్లా. వయస్సు 34. కాంగ్రెసులో పనిచేస్తున్నారు. వెంకటగిరి తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు. 1946 నుండి 53 వరకు రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు.

### పిడతల రంగారెడ్డి
(కాంగ్రెసు)

నియో: కంభం, కర్నూలుజిల్లా. జననం 1917 సెప్టెంబరు. కొత్తపట్నం రాజకీయ పాఠశాలలో అరెస్టు చేయబడ్డారు. 1936 లో కాంగ్రెసులో ప్రవేశించారు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని ఒక సం|| జైలుశిక్ష అనుభవించారు. క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో మూడు సంవత్సరాలు డిటెన్షనులో ఉంచబడ్డారు. 1950-52 మధ్య రాజ్యాంగ నిర్మాణసభ సభ్యులు. ప్రస్తుతం ఆంధ్ర ప్రభుత్వ విప్.

### పిన్నమనేని రామచంద్రరావు
(కమ్యూనిస్టు)

నియో: కొవ్వూరు (జనరల్), పశ్చిమగోదావరి జిల్లా. జననం 1917 ఆగస్టు 13. 1939 నుండి 45 వరకు కాంగ్రెసులో వున్నారు. అనేక కాంగ్రెస్ ఉద్యమాలలో జైలుకెళ్ళారు. ఆలీపురం జైలులో కమ్యూనిస్టుల పరిచయం వల్ల కమ్యూనిస్టు పార్టీలో చేరారు. విడుదల తరువాత జిల్లా రైతుసంఘ సహాయ

కార్యదర్శిగా ఉన్నారు. 1949 లో అరెస్టు చేయబడి 50 మే వరకు కడలూరులో డిటెయిన్ చేయబడ్డారు.

### పీసపాటి పుండరీకాక్షాచార్యులు
(లోక్ పార్టీ)

నియో : హరాంజరం, శ్రీకాకుళం జిల్లా. కాంగ్రెసు నుండి వైదొలగేవరకు శ్రీకాకుళం జిల్లా కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా వుండేవారు.

### పిల్లలమర్రి వెంకటేశ్వర్లు
(కమ్యూనిస్టు)

నియో : జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా. శాసనసభకు ఎన్నికయిన మొట్టమొదటి ఆంధ్ర కమ్యూనిస్టు. వయస్సు 40 సం. కాంగ్రెసులో చేరి సైమను బహిష్కరణోద్యమంలో పాల్గొన్నారు. తర్వాత కమ్యూనిస్టుపార్టీలో చేరారు. ఆంధ్ర కార్మికోద్యమ నిర్మాతలలో ఒకరు. రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు మొదటి అధ్యక్షులు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు రెండేండ్ల శిక్ష అనుభవించారు. 1946 జనరల్ ఎన్నికలలో పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాల కార్మిక నియోజకవర్గం నుండి ఎన్నికయినారు. 1948 లో డిటెయిన్ చేయబడి ఎన్నికల ముందు విడుదలయ్యారు. ప్రస్తుతం ఆంధ్ర శాసనసభ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి.

### పులుపుల వెంకట శివయ్య
(కమ్యూనిస్టు)

నియో : వినుకొండ, గుంటూరుజిల్లా. బి. ఎస్‌సి. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చదువుకనే రోజుల్లోనే మార్క్సిస్టులతో పరిచయం కలిగింది. సోషలిస్టు యువజన సంఘంలో చేరారు. విద్యార్థి దశలోనే (1930) శాసనోల్లంఘనోద్యమంలో చేరి అరెస్టయినారు. 1934 లో చదువు వదలి గుంటూరుజిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి పూనుకున్నారు. గుంటూరులో లేబర్ ప్రొటెక్షన్ లీగ్ పెట్టి ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి బీజాలు నాటారు. 1935-40 మధ్య విద్యార్థులలో సోషలిజాన్ని గూర్చి ప్రచారంచేసి, అనేకమంది కార్యకర్తలను తయారుచేశారు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకు 1940లో 21మాసాలు శిక్షవిధించబడ్డారు. 1941 మేలో అళ్యారి జైలు నుండి తప్పించుకున్నారు. 1943 సెప్టెంబరులో తిరిగి అరెస్టు చేయబడ్డారు. 1948 నుండి 51 జూన్ వరకూ అజ్ఞాతవాసం. 1952 ఎన్నికలలో వీరితో పోటీచేసిన వారంతా డిపాజిట్లు కోల్పోయారు. (కవులు - రచయితలు ప్రకరణంలో మరి కొన్ని వివరాలు)

### పూసపాటి విజయరామ గజపతిరాజు
(ప్రజాసోషలిస్టు)

నియో : విజయనగరం (జనరల్) విశాఖపట్నంజిల్లా. జమీందారు. ఆంధ్ర శాసనసభలో ప్రజా సోషలిస్టుపార్టీ నాయకుడు. ఆంధ్ర ప్రజాసోషలిస్టుపార్టీ కార్యదర్శి.

### పెల్లేటి గోపాలకృష్ణారెడ్డి
(కాంగ్రెసు)

నియో : గూడూరు, నెల్లూరుజిల్లా. వయస్సు 36 సం. మైకాగని యజమాని,

పెద్దభూస్వామి. గత పది సం||ల నుండి కాంగ్రెసులో వుంటున్నారు.

## పెదిరెడ్డి తిమ్మారెడ్డి

నియో : పీలేరు, చిత్తూరుజిల్లా. ఆంధ్ర కాంగ్రెసు కార్యదర్శిగా కొంతకాలం పని చేశారు. రంగాగారితోపాటు కాంగ్రెసు నుండి వైదొలగి లోక్ పార్టీలో చేరారు. మంత్రివర్గంలో చేరబోయేముందే లోక్ పార్టీతో తెగతెంపులు చేసుకున్నారు.

## పంజాం నరసింహారెడ్డి

(కమ్యూనిస్టు)

నియో : రాజంపేట, కడపజిల్లా. విద్యార్థిగానే కాంగ్రెసు రాజకీయాలలో ప్రవేశించారు. సమ్మెలు నడిపిన కారణాన కాలేజీ అధికారుల ఆగ్రహానికిగురై చదువుమానవలసి వచ్చింది. కమ్యూనిస్టు పార్టీలోచేరి రైతుసంఘాలు స్థాపించారు.

## ప్రగడ కోటయ్య

(ప్రజాపార్టీ)

నియో : చీరాల, గుంటూరుజిల్లా. జననం 1915 జూలై 26. 1945-51 వరకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. అఖిలభారత చేనేత కాంగ్రెస్ కార్యదర్శి. అఖిలభారత కుటీరపరిశ్రమల సంఘ కార్యదర్శి. 1951 ఏప్రిల్ లో చేనేత కార్మికుల సత్యాగ్రహానికి నాయకత్వం వహించారు. హైపవర్ చేనేత సంఘ సభ్యులు.

## పి. చిన్నమ్మరెడ్డి

(స్వతంత్ర)

నియో: చిత్తూరు (జనరల్). మద్య నిషేధానికి ముందు అబ్కారీ కంట్రాక్టరు. రెండుసార్లు చిత్తూరుతాలూకాబోర్డు ఉపాధ్యక్షులుగాను, నాలుగుసార్లు చిత్తూరు జిల్లాబోర్డు సభ్యులుగానుఎన్నుకోబడ్డారు.

## పేట రామారావు

(కమ్యూనిస్టు)

నియో : తిరువూరు, కృష్ణాజిల్లా. వయస్సు 35 సం. 1938 లో జరిగిన విజయవాడ హిందూహైస్కూలు విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించారు. 1939 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. తరువాత తిరువూరుతాలూకా కమ్యూనిస్టు పార్టీ నిర్మాతగా వున్నారు. 1948 అక్టోబరులో డిటైన్ చేయబడ్డారు. 1952 జనరల్ ఎన్నికలలో తనతండ్రి పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులైన పేట బాపయ్యగారితో పోటీచేసి గెలుపొందారు.

## పోతుల గున్నయ్య

(కాంగ్రెసు)

నియో : చీపురుపల్లి, శ్రీకాకుళం జిల్లా. వయస్సు. 40 సం. 1936 నుండి కాంగ్రెసులో పనిచేస్తున్నారు. పార్వతీపురం తాలూకా కాంగ్రెసు కమిటీ సభ్యులు. 1947 నుండి 50 వరకు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులు.

## బత్తిన రామకృష్ణారెడ్డి

(ప్రజాపార్టీ)

నియో : కావలి, నెల్లూరు జిల్లా. వయస్సు 48 సం. 1921 సహాయ నిరాకరణోద్యమంలో స్కూలుకు స్వస్తి చెప్పారు. 1930 లో ఉప్పుసత్యాగ్రహం చేసిజైలుకెళ్ళారు. 1942లో వీరిస్వగ్రామ

మైన అల్లూరు స్టేషను తగలబెట్టబడ్డ కేసులో మూడుసం॥లు డిటెయిన్ చేయబడ్డారు. 1945 లో విడుదలైన తరువాత 48 వరకు రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గ సభ్యులుగా వున్నారు. శాసనసభ ప్రజాపార్టీ కార్యదర్శి. 'ప్రజారాజ్యం' పత్రిక సంపాదకులు.

### బస్వారెడ్డి శంకరయ్య
### (కమ్యూనిస్టు)

నియో : కోవూరు, నెల్లూరుజిల్లా. జననం 1914 సం. 1930లో జాతీయోద్యమంలో అడుగుపెట్టారు. నెల్లూరుజిల్లా కాంగ్రెసు కమిటీ సహాయకార్యదర్శిగానూ, రాష్ట్రకాంగ్రెసు సభ్యులుగాను కొంతకాలం పనిచేశారు. తర్వాత కాంగ్రెసు రాజకీయాలు నచ్చక కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1940 యుద్ధవ్యతిరేక ప్రచారం చేసినందుకు డిటెయిన్ చేయబడ్డారు. 1938-45 మధ్యకాలంలో నెల్లూరు జిల్లా రైతుసంఘ కార్యదర్శి. 1948 లో రాజమండ్రి జైలునుండి పారిపోయి 1950 వరకూ అజ్ఞాతవాసం. 1947 నుండి ఇప్పటి వరకూ నెల్లూరుజిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా పనిచేస్తున్నారు.

### బాడాల కృష్ణమూర్తిరావు
### (కాంగ్రెసు)

నియో : పుంగనూరు, చిత్తూరుజిల్లా. వయస్సు 33 సం. 1942 ఆగస్టులో అరెస్టుచేయబడి 3 నెలలు శిక్ష అనుభవించారు. 1945-46 లో జిల్లా కాంగ్రెసు కార్యకర్తల సంఘ కార్యదర్శిగా పనిచేశారు. 1947-50 జిల్లాకాంగ్రెసుకమిటీ సభ్యులు. పుంగనూరుతాలూకా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు. రాష్ట్ర కిసాన్ కాంగ్రెసు సహాయ కార్యదర్శి.

### భూపతిరాజు సుబ్బతాతరాజు
### (ప్రజాపార్టీ)

నియో : భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా. వయస్సు 46 సం. 1921 సహాయ నిరాకరణోద్యమంలో విద్యార్థిగా పాల్గొన్నారు. అనేక కాంగ్రెసు ఉద్యమాల్లో జైలుకెళ్ళారు. 46లో విడుదలైనతరువాత జిల్లాబోర్డు సభ్యులుగా ఎన్నికోబడ్డారు. జిల్లా కాంగ్రెసు, రాష్ట్ర కాంగ్రెసు సభ్యులు. పొట్టి శ్రీరాములుగారి మరణానంతరం శాసన సభ్యత్వానికి రాజీనామా యిచ్చి తిరిగి ఎన్నికోబడ్డారు.

### భూపతిరాజు లక్ష్మినరసింహరాజు
### (కమ్యూనిస్టు)

నియో : నర్సాపురం, పశ్చిమగోదావరిజిల్లా. 1930లోనే జాతీయోద్యమంలో ప్రవేశించి 1936 లోపలే 1½ సం॥లు జైలులో గడిపారు. 1938 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. అప్పటినుండి నాలుగుసార్లు డిటెన్యూగా కొనిపోబడ్డారు. 6½ సం॥లు జైలు శిక్ష అనుభవించారు. మున్నటివరకు రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా వున్న శ్రీ అల్లూరి సత్యనారాయణరాజును జనరల్ ఎన్నికలలో ఓడించారు. జిల్లా రైతు సంఘ అధ్యక్షులు. జిన్నూరు పంచాయితీ బోర్డు అధ్యక్షులు.

### బొప్పరాజు వెంకట సుదర్శనవర్మ
### (కాంగ్రెసు)

నియో : పుత్తూరు, చిత్తూరుజిల్లా. జననం 1908 జూన్ 6. 1935 లో

చిత్తూరు జిల్లాబోర్డుకు కాంగ్రెసు అభ్యర్థిగా ఎన్నుకోబడ్డారు. వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని ఆరునెలలు జైలు శిక్ష అనుభవించారు. చిత్తూరు జిల్లా కాంగ్రెసుకమిటీకి కొంతకాలం సహాయ కార్యదర్శిగా వున్నారు.

### బొజ్జా అప్పలస్వామి
(షె. ఫె)

నియో: అమలాపురం (రిజర్వుడు), తూర్పుగోదావరిజిల్లా. వయస్సు 35 సం. 1946 లో ఆంధ్రషెడ్యూల్డు కాస్టు ఫెడరేషనులో చేరి రాష్ట్ర కార్యవర్గంలో సభ్యుడుగాను, తాలూకా షెడ్యూల్డు కాస్టు ఫెడరేషను అధ్యక్షులుగాను వుంటున్నారు.

### భోజంకి గంగయ్యనాయుడు
(లోక్‌పార్టీ)

నియో: మాడుగుల, విశాఖపట్నం జిల్లా. వయస్సు46 సం. బి.ఎ.,బి.యల్., 45నుండి 51వరకు జిల్లాకాంగ్రెసు కార్యవర్గసభ్యులు.కొంతకాలంరాష్ట్రకాంగ్రెసు సభ్యులు. కాంగ్రెసునుండి 51 లో రాజీనామా నిచ్చి లోక్‌పార్టీలో చేరి జిల్లా లోక్‌పార్టీ కార్యదర్శిగా వుంటున్నారు.

### బలుసు ప్రభాకర పట్టాభి రామారావు
(కాంగ్రెసు)

నియో: పామర్రు, తూర్పుగోదావరి జిల్లా. జననం 1911 డిసెంబరు 30. న్యాయశాస్త్రంలో పట్టభద్రులు.

మద్రాసు మంత్రివర్గంలో గ్రామాభ్యుదయశాఖా మంత్రిగా ఉన్నారు. ఆంధ్ర మంత్రివర్గంలో పరిశ్రమలు, విద్య, మద్యనిషేధశాఖల మంత్రిగా ఉన్నారు.

### మల్లుసుబ్బారెడ్డి
(స్వతంత్ర)

నియో: నంద్యాల, కర్నూలుజిల్లా. జననం 1909 జనవరి 9. న్యాయశాస్త్రంలో పట్టభద్రులు. 1941 లో వ్యక్తిసత్యాగ్రహంలోను, క్విట్ ఇండియా ఉద్యమంలోను పాల్గొన్నారు. 1949 నుండి 53 వరకు జిల్లాబోర్డు సభ్యులు. 1952 లో కాంగ్రెసునుండి రాజీనామా నిచ్చారు. ఇప్పుడు శాసనసభ రాయలసీమ స్వతంత్రుల పార్టీలో వున్నారు.

## మళ్ళపూడి రాజేశ్వరరావు
(కాంగ్రెసు)

నియో: కొవ్వూరు (రిజర్వుడు), పశ్చిమ గోదావరిజిల్లా. జననం 1925 జూలై 16. న్యాయశాస్త్రంలో పట్టభద్రులు.

1947 నుండి ఆంధ్రరాష్ట్ర చర్మకార సంఘ కార్యదర్శిగా వుంటున్నారు. ప్రభుత్వ హరిజన సంక్షేమసంఘ సభ్యులు. వీరు 1952 జనరల్ ఎన్నికలలో ప్రజా పార్టీ అభ్యర్థిగ గెలుపొంది తరువాత కాంగ్రెసులో చేరారు.

## మాదాల నారాయణస్వామి
(కమ్యూనిస్టు)

నియో: ఒంగోలు (జనరల్), గుంటూరుజిల్లా. పట్టభద్రులు. విద్యార్థిగానే రాజకీయాలలో ప్రవేశించారు. 1943 నుండి పూర్తికాలాన్ని కమ్యూనిస్టు పార్టీనిర్మాణానికి వినియోగించుతున్నారు. 1948 నుండి 3½ సంll లు అజ్ఞాతవాసంలో వున్నారు.

## మళ్ళపూడి వీరభద్రం
(కమ్యూనిస్టు)

నియో: పరవద, విశాఖపట్నంజిల్లా. వయస్సు 35 సం. విద్యార్థిగానే జాతీయోద్యమంలో ప్రవేశించారు. 1936-38 మధ్యకాలంలో అమలాపురం తాలూకాలో కాంగ్రెసులో పనిచేశారు. 1938లో ఉద్యోగరీత్యా విశాఖపట్నంవెళ్ళి అప్పటి నుండి ఆ జిల్లాలోనే పనిచేస్తున్నారు. 1940 లో ఇండియా రక్షణచట్టంకింద అరెస్టు చేయబడి 1942 లో విడుదలయ్యారు. విశాఖపట్నం సింధియా కార్మికులలోను, చిట్టివలస జూట్ మిల్లు కార్మికులలోను పనిచేశారు. ఆంధ్రరాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఉపాధ్యక్షులు. 1948 ఫిబ్రవరినుండి 1951 సెప్టెంబరువరకూ అజ్ఞాతవాసం.

## మేకా రంగయ్యప్పారావు
(కాంగ్రెసు)

నియో: నూజివీడు, కృష్ణాజిల్లా. వయస్సు 39 సం. ఆంధ్ర నాటక కళాపరిషత్తుకు అధ్యక్షులు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటుసభ్యులు. పెద్దజమీందారు.

## మోటూరు హనుమంతరావు
(కమ్యూనిస్టు)

నియో: రేపల్లె, గుంటూరు జిల్లా. ఆంధ్ర విద్యార్థి వుద్యమానికి అంకురార్పణ చేసిన గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాల విద్యార్థుల చరిత్రాత్మక సమ్మెలో ప్రముఖపాత్ర వహించారు. 1940 లో యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తున్నారని చెప్పి ప్రభుత్వం ఆయనపై వారంటు జారీచేసింది. అందుచేత 2½ సంవత్సరాలు అజ్ఞాతవాసంలో వుంటూ ప్రజా ఉద్యమ నిర్మాణంలో పాల్గొన్నారు. 1943-48 మధ్య గుంటూరు జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి పదవి నిర్వహించారు. 1948 లో రాష్ట్రకమిటీ సభ్యులుగాఎన్నికయినారు. 1949 మేలో డిటెయిన్ చేయబడి ఎన్నికలముందు విడుదలైనారు. మాజీ మంత్రి చంద్రమౌళిని ఎన్నికలలో ఓడించారు. ప్రస్తుతం ఆంధ్రకమ్యూనిస్టుకమిటీ సెక్రెటేరియట్ సభ్యులు. భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ

సభ్యులు. ఆంధ్ర శాసనసభలో ప్రతిపక్ష ఉపనాయకులు. "విశాలాంధ్ర" దిన పత్రికా సంపాదకవర్గ అధ్యక్షులు. మంచి వక్త.

### మొటపర్తి కోనేరావు
### (కమ్యూనిస్టు)

నియో: చింతలపూడి, పశ్చిమగోదావరి జిల్లా. వయస్సు 32 సం. 1941 నుండి కమ్యూనిస్టుపార్టీలో పని చేస్తున్నారు. ఏలూరు తాలూకా రైతుసంఘాధ్యక్షులు. 1949 లో డిటెయిన్ చేయబడ్డారు.

### మైనేని లక్ష్మణస్వామి
### (కమ్యూనిస్టు)

నియో: కంకిపాడు, కృష్ణా జిల్లా. జననం 1922. చదువుకునే రోజులలో విద్యార్థి వుద్యమంలో పనిచేసారు. 1941 డిసెంబరు నుండి కమ్యూనిస్టుపార్టీలో పనిచేస్తున్నారు. ప్రకాశం అడ్డెన్సు రోజులలోను, 1948 ఫిబ్రవరి నుండి నవంబరు వరకు రహస్య జీవితం గడిపారు. 1948 నవంబరులో అరెస్టు చేయబడి 1951 నవంబరు వరకు డిటెన్షన్‌లో వుంచబడ్డారు.

### యం. దొరైకన్ను
### (కాంగ్రెసు)

నియో: తిరుత్తని (రిజర్వుడు), చిత్తూరు జిల్లా. జననం 1908. 1930 లో కాంగ్రెసులో ప్రవేశించారు. 1937 నుండి రాష్ట్ర విభజన వరకు మద్రాసు శాసనసభలో సభ్యులుగా వున్నారు. రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. జిల్లా కాంగ్రెసు కమిటీకి, జిల్లా హరిజన సేవకసంఘానికి 1937నుండి సహాయ కార్యదర్శిగా వుంటున్నారు. తిరుపతి దేవస్థానం ట్రస్టుకమిటీ సభ్యులు.

### మండవ బాపయ్య చౌదరి
### (స్వతంత్ర)

నియో: బెల్లంకొండ, గుంటూరుజిల్లా. జననం 1921 సెప్టెంబరు 5. న్యాయశాస్త్ర పట్టభద్రులు. ఎన్నికలలో వీరిని కమ్యూనిస్టుపార్టీ బలపరిచింది.

### మడంగి పెంటన్ననాయుడు
### (స్వతంత్ర)

నియో: పాతపట్నం, శ్రీకాకుళం జిల్లా.

### యం. వి. సుబ్బారెడ్డి
### (సోషలిస్టు)

నియో: కోయిలకుంట్ల, కర్నూలుజిల్లా. జననం 1919. కళాశాలలో విద్యాభ్యాసం చేస్తున్న రోజులలో క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. 1943 లో గాంధీజీ నిరసనవ్రత సందర్భంలో బహిరంగసభ జరిపి లాఠీచార్జికి గురిఅయ్యారు. ఆరునెలలు శిక్ష అనుభవించారు. 1948లో సోషలిస్టు పార్టీలో చేరారు. కర్నూలు జిల్లా సోషలిస్టు పార్టీ కార్యదర్శిగా ఎన్నికయినారు.

### యెల్లేపెద్ది వెంకటకృష్ణారావుగారు
### (ప్రజాపార్టీ)

నియో: భద్రాచలం (జనరల్), తూర్పుగోదావరి జిల్లా. వయస్సు 49 సం. పట్టభద్రులు. 1936 ఏప్రిల్ నుండి 51 సెప్టెంబరు వరకు ఏజెన్సీ జిల్లాబోర్డు సభ్యులు.

రావు వెంకట జగ్గారావు
(కమ్యూనిస్టు)

నియో : పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా. వయస్సు 46. కొంతకాలం పిఠాపురం తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోను తరువాత కమ్యూనిస్టుపార్టీలోను చేరారు. 1948 మేడే సందర్భంలో అరెస్టుచేయబడి జైలులో నిర్బంధించబడ్డారు. రెండేళ్ళు డిటెన్షనులో వుండి ఎన్నికలకు ముందు విడుదలయ్యారు.

రొక్కం లక్ష్మీనరసింహందొర
(స్వతంత్ర)

నియో : టెక్కలి, శ్రీకాకుళంజిల్లా. వయస్సు 54 సం. శ్రీకాకుళంలో ప్రముఖ న్యాయవాది. శ్రీకాకుళం కాలేజీ సలహా సంఘ సభ్యులు. శాసనసభలో స్వతంత్రుల పార్టీ నాయకుడు.

ఆర్. సిద్దన్న గౌడ్
(ప్రజాసోషలిస్టు)

నియో : మడకశిర, అనంతపురంజిల్లా. చాలకాలం మడకశిర తాలూకాబోర్డు అధ్యక్షులుగా పనిచేశారు. సహకారోద్యమంలో చాలకాలంనుండి పనిచేస్తున్నారు.

లుకలాపు లక్ష్మణదాసు
(కాంగ్రెసు)

నియో : పాతపట్నం (జనరల్), శ్రీకాకుళంజిల్లా. వయస్సు 36 సం.

విద్యార్థి దశలోనే కాంగ్రెసులో చేరారు. జిల్లా కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులుగాను, రాష్ట్రకాంగ్రెసు సహాయ కార్యదర్శిగాను కొంతకాలం పనిచేశారు. శ్రీకాకుళం కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు ఉపాధ్యక్షులు. శాసనసభా కాంగ్రెస్‌పార్టీ విప్.

నడిమాని చిదానందం
(స్వతంత్ర)

నియో : బద్వేలు, కడప జిల్లా. వయస్సు 50 సం. 1922 నుండి 52 వరకు కాంగ్రెసులో వున్నారు. 1938 లో అనంతపురం జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా వున్నారు. కొంతకాలం జిల్లా బోర్డుల తరపున ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్‌లో సభ్యులు. రాయలసీమ డెవలప్‌మెంటు బోర్డు సభ్యులు.

పత్సవాయి వెంకటకృష్ణంరాజు బహద్దరు (కాంగ్రెసు)

నియో : తుని, తూర్పుగోదావరిజిల్లా. వయస్సు 52 సం. 1920 నుండి తాలూకా బోర్డులు రద్దు అయ్యేవరకు తునితాలూకా బోర్డు అధ్యక్షులు. 1935 నుండి 49 వరకు తుని పంచాయితీబోర్డు అధ్యక్షులు. 1932 లో పీపుల్సుపార్టీలో చేరారు. 1937 నుండి కాంగ్రెసులో వుంటున్నారు.

వేములపల్లి శ్రీకృష్ణ
(కమ్యూనిస్టు)

నియో : బాపట్ల, గుంటూరుజిల్లా. వయస్సు 36 సం. పట్టభద్రులు. విద్యార్థి వుద్యమంలో ప్రముఖపాత్ర వహించారు 1939 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. కొంతకాలం జిల్లా కమ్యూనిస్టుకమిటీ కార్యదర్శిగా వున్నారు. ప్రకాశం అద్దె సెన్సు కాలంలో ఆరునెలలు, 1948నుండి 50 చివరివరకు అజ్ఞాతవాసంలోఉన్నారు. (ఇతర వివరాలకు కవులు - రచయితలు అధ్యాయం చూడండి.)

## వాసిరెడ్డి రామారావు
(కమ్యూనిస్టు)

నియో: కంచికచర్ల, కృష్ణాజిల్లా. పట్టభద్రులు. కళాశాలలో చదువుతూ విద్యార్థి ఉద్యమంలో పాల్గొన్నారు. 1941 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. నందిగామతాలూకా ప్రజావుద్యమ నిర్మాణంలో ప్రధాన పాత్ర వహించారు. ముక్త్యాల జమీందారుకు వ్యతిరేకంగా రైతులు సాగించిన పోరాటాలకు నాయకత్వం వహించి నడిపారు. అనేక వ్యవసాయకూలీ పోరాటాలను నడిపారు. ప్రభుత్వ నిర్బంధ విధానంవలన 1948 నుండి అజ్ఞాతవాసంలో వుండవలసి వచ్చింది. 1952 ఎన్నికలలో శ్రీ కాకాని వెంకటరత్నంగారిని ఓడించారు.

## వైరిచర్ల చంద్ర చూడామణిదేవ్
(కాంగ్రెసు)

నియో: కురుప్పాం, శ్రీకాకుళంజిల్లా. కురుపాం రాజా.

## వై. ఆదినారాయణరెడ్డి
(ప్రజాపార్టీ)

నియో: రాయచోటి, కడపజిల్లా. శాసనసభలో కొంతకాలం స్వతంత్ర ప్రజాపార్టీ నాయకులుగా పనిచేసారు. ఇప్పుడు ఈ పార్టీ రద్దుచేయబడింది. వారిప్పుడు స్వతంత్ర ప్రజాపార్టీ సభ్యులుగానే వున్నారు.

## వావిలాల గోపాలకృష్ణయ్య
(స్వతంత్ర)

నియో: సత్తెనపల్లి, గుంటూరుజిల్లా. తిలక్ మరణసందర్భంలో సత్తెనపల్లిలో జరిగిన విద్యార్థుల సానుభూతి సమ్మెకు నాయకత్వం వహించారు. కాంగ్రెసులో అనేకపదవుల నిర్వహించారు. అనేక సార్లు జైలుకువెళ్ళారు. 1945–51 మధ్య ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ ఉపాధ్యక్షులు. 1948 వరకూ కమ్యూనిస్టుపార్టీలో పనిచేశారు. 'సహకారం' పత్రికా సంపాదకులుగాపనిచేశారు.

## సాకా వెంకట్రావు
(కమ్యూనిస్టు)

నియో: కాకినాడ(రిజర్వుడు), తూర్పుగోదావరిజిల్లా. వయస్సు35సంవత్సరాలు. 1940 నుండి వ్యవసాయకూలీ సంఘాల నిర్మాణానికి కృషిచేస్తూ 1942లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. జిల్లావ్యవసాయ కూలీసంఘ కార్యదర్శిగా పనిచేశారు. 1942 లో 5 సం॥లు జైలుశిక్ష అనుభవించారు. 1948 ఏప్రిల్ నుండి 49 జనవరి వరకు అజ్ఞాతవాసం. 1949 జనవరి నుండి 1951 ఆగస్టువరకు డిటెన్షనులో వుంచబడ్డారు.

## సానికొమ్ము కాసిరెడ్డి
(కమ్యూనిస్టు)

నియో: దర్శి, నెల్లూరు జిల్లా. వయస్సు 29 సం. 1942 నుండి కమ్యూనిష్టుపార్టీతో సంబంధాలు పెట్టుకుని రైతు, కూలీ సంఘాల నిర్మాణానికి కృషి చేశారు. 1948 లో పొదిలి తాలూకాలో వెంకటగిరి జమీందారు అధికారిస్తులకు, పుల్లరులకు వ్యతిరేకంగా పోరాటాలు నడిపారు. స్వగ్రామమైన నాగంపల్లెలో రైతులను సమీకరించి నిర్బంధ ధాన్యసేకరణను వ్యతిరేకించినందుకు 1½ సం॥

క్షైలుశిక్ష అనుభవించారు. చెలువుతట్టున వున్న భూములను వ్యవసాయకూలీలకు, బీదరైతులకు యిప్పించడానికి వింజమూరులో పోరాటాన్ని నడిపిసాధించారు. 1948 నుండి ఎన్నికలవరకూ అజ్ఞాతవాసం.

## సాగి సూర్యనారాయణరాజు

(స్వతంత్ర)

నియో: పాయికారావుపేట, విశాఖపట్నంజిల్లా. జననం 1903. సహాయ నిరాకరణోద్యమంలోచేరి చదువు మానివేశారు. 42 వరకు కాంగ్రెసులో ఉన్నారు.

## సందా నారాయణప్ప

(కాంగ్రెసు)

నియో: కళ్యాణదుర్గం, అనంతపురం జిల్లా. వయస్సు 40 సం. 1946 నుండి కాంగ్రెసులో పనిచేస్తున్నారు. ఉరవకొండ పంచాయితీబోర్డు అధ్యక్షులుగాను, హరిజన హాస్టలు మేనేజరుగాను కొద్దికాలం పనిచేశారు.

## యస్. శృంగారం

(స్వతంత్ర)

నియో: చిత్తూరు (రిజర్వుడు). జనరల్ ఎన్నికలలో లోక్‌పార్టీ అభ్యర్థిగ ఎన్నికై ఆంధ్ర శాసనసభ యేర్పడ్డాక లోక్‌పార్టీనుండి వైదొలగి స్వతంత్రులుగ వుంటున్నారు.

## స్వర్ణ వేమయ్య

(షె. ఫె.)

నియో: నెల్లూరు. జననం 1919. కొంతకాలం రివెన్యూ ఇనస్పెక్టరుగా పనిచేసి, ఉద్యోగానికి రాజీనామా నిచ్చారు.

## హనుమంతు సత్యనారాయణదొర

(కాంగ్రెసు)

నియో: నరసన్నపేట, శ్రీకాకుళం జిల్లా. 1942-46 మధ్యన శ్రీకాకుళం జిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగా పనిచేశారు. శ్రీకాకుళం కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు డైరెక్టరు.

## హెచ్. రామలింగారెడ్డి

(స్వతంత్ర)

నియో: ఆదోని, కర్నూలుజిల్లా. వయస్సు 40 సం. బి.ఎ.,యల్.యల్.బి. కాంగ్రెసులో చేరి జాతీయోద్యమంలో పాల్గొంటూ వచ్చారు. 1949 లో బళ్ళారి జిల్లాబోర్డు సభ్యులుగా ఎన్నికయినారు.

# పార్లమెంటులో ఆంధ్రసభ్యులు

## [ ప్రజా సభ ]

### వరహాగిరి వెంకటగిరి
### (కాంగ్రెసు - పాతపట్నం)

1894 ఆగస్టు 4న జననం బారిస్టరు. రెండు సార్లు అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. ఏడేళ్ళు భారత రైల్వే మెన్సు ఫెడరేషన్ అధ్యక్షులుగా పని చేశారు. 1937_39 మద్రాసులో కార్మిక శాఖామంత్రి. 1946 లో మద్రాసులో మరల ఒక సంవత్సరంపాటు కార్మిక శాఖామంత్రి.1947_51 మధ్యసింహళంలో భారత హైకమీషనర్. 1952 మే నుండి భారతప్రభుత్వంలో కార్మికశాఖమంత్రి.

### బొడ్డేపల్లి రాజగోపాలరావు
### (స్వతంత్ర - శ్రీకాకుళం)

1924 జనవరి 23న జననం. 1950 నుండి ఆముదాలవలస పంచాయితీబోర్డు అధ్యక్షుడు. 1951 నుండి శ్రీకాకుళం జిల్లాబోర్డు సభ్యుడు.

### నూతక్కి రామశేషయ్య
### (స్వతంత్ర - పార్వతీపురం)

బి. ఎ., బి. యల్. 1929_30 లో బెజవాడ తాలూకా బోర్డు అధ్యక్షులు. కొన్నాళ్ళు జయపూర్ ఎస్టేట్ అసిస్టెంటు దివాన్‌గా పనిచేశారు.

### కందాల సుబ్రహ్మణ్యం
### (ప్ర.సో. - విజయనగరం)

1920 ఆగస్టు 17న జననం. యల్.యల్.బి. ప్యాసయ్యారు.1944_45 బెల్గాం సిటీ విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి. 1947_51 విశాఖజిల్లా సోషలిస్టు పార్టీ కార్యదర్శి. 1951_52 ఆంధ్ర సోషలిస్టుపార్టీ కార్యదర్శి.

### డాక్టర్ లంక సుందరం
### (స్వతంత్ర - విశాఖపట్టణం)

యమ్. ఎ., పి. హెచ్. డి. 1905 లో బందరులో జననం. కొన్నాళ్ళు ఆంధ్ర విశ్వ విద్యాలయంలో ప్రొఫెసర్. ఆర్థిక శాస్త్రవేత్త. పత్రికారచయిత, గ్రంథకర్త, అనేక సాంఘిక, కార్మిక సంస్థలలో పని చేశారు. విదేశాల్లో పర్యటించారు. "కామర్స్ అండ్ ఇండస్ట్రీ" పత్రికా (ఢిల్లీ) వ్యవస్థాపకుడు, సంపాదకుడు.

### గాము మల్లుదొర
### (స్వతంత్ర - విశాఖపట్టణం)

కొండజాతుల నియోజకవర్గం. జననం 1900. అల్లూరి సీతారామరాజు సహచరుడు. 1921_24 రంపపితూరీ ఉద్యమ సందర్భంలో మరణశిక్ష విధించబడి, ఆ తరువాత అది యావజ్జీవ శిక్షగా మార్చబడింది. 13½ సంవత్సరాలు జైలుశిక్ష

అనుభవించారు. ఆ తరువాత మరొక 3½ సంవత్సరాలు విశాఖపట్నంలో ఇంటరన్ చేయబడ్డారు.

### కడియాల గోపాలరావు
### (కమ్యూనిస్టు - గుడివాడ)

జననం 1912. 1930_38 వరకూ కాంగ్రెసులో పనిచేశారు. కృష్ణాజిల్లాలో యువజన సంఘాలను నిర్మించారు. చాల కాలం కృష్ణాజిల్లా కమ్యూనిస్టుకమిటీ కార్యదర్శిగా ఉన్నారు. 1943_46 లో ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ అధ్యక్షులు. 1948_52 వరకూ కొన్నాళ్ళు అజ్ఞాత వాసం, మరికొన్నాళ్ళు డిటెన్షన్. మరల 1952 నుండి ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ అధ్యక్షులుగా పనిచేస్తున్నారు.

### కానేటి మోహనరావు
### (కమ్యూనిస్టు - రాజమండ్రి)

ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ సంఘ అధ్యక్షుడు. 1939 లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. తూర్పుగోదావరిజిల్లా, రాజోలు తాలూకాలో జరిగిన అనేక రైతుకూలీ పోరాటాల్లో పాల్గొన్నారు. 1942_45మధ్య జైలులో కఠినశిక్ష అనుభవించారు. జిల్లా వ్యవసాయకూలీ ఉద్యమ నిర్మాత. గత జనరల్ ఎన్నికల్లో పార్లమెంటుకు, రాష్ట్ర శాసనసభకూ పోటీచేసి రెండు స్థానాల్లోనూ గెలుపొందారు.

### కొండ్రు సుబ్బారావు
### (కమ్యూనిస్టు - ఏలూరు)

పశ్చిమగోదావరి జిల్లాలో హరిజన సంఘాల్లోనూ, వ్యవసాయకూలీ సంఘాల్లోనూ పనిచేశారు. జిల్లా వ్యవసాయకూలీ సంఘ అధ్యక్షుడు, జిల్లా కమ్యూనిస్టు కమిటీ సభ్యుడు.

### డాక్టర్ చెలికాని రామారావు
### (కమ్యూనిస్టు - కాకినాడ)

వైద్యవిద్యలోపట్టభద్రులు. 1920_40 వరకు కాంగ్రెసులో పనిచేశారు. ఆ తరవాత కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1948_52 వరకూ డిటెన్షన్‌లో ఉన్నారు.

### నల్లా రెడ్డినాయుడు
### (ప్ర. సో. - రాజమండ్రి)

జననం 1917 జనవరి. అమలాపురం, మద్రాసు క్రైస్తవకళాశాల, పూనా లాకాలేజీలో విద్యాభ్యాసం. అడ్వకేట్.

### బి. యస్. మూర్తి
### (ప్ర. సో. - ఏలూరు)

బి. ఏ., బి. యిడి., 1907 లో జననం. 1937_39 వరకూ, ఆ తరువాత 46_47 లోనూ మద్రాసుప్రభుత్వంలో కార్మిక, పరిశ్రమలశాఖ పార్లమెంటరీ కార్యదర్శి. 1940_49 వరకూ ఆంధ్రరాష్ట్ర హరిజన సేవాసంఘ అధ్యక్షుడు. 1941_42లో కాంగ్రెసువాదిగా జైలుశిక్ష అనుభవించారు. ప్రకాశంగారితోపాటు కాంగ్రెసును వదలి ప్రజాసోషలిస్టుపార్టీలో చేరారు.

### సనకా బుచ్చికోటయ్య
### (కమ్యూనిస్టు - బందరు)

1919 ఆగస్టులో జననం. కృష్ణాజిల్లా దివితాలూకా ప్రముఖకమ్యూనిస్టు కార్యకర్త. ప్రభుత్వనిర్బంధ విధానం ఫలితంగా 1948 మార్చినుండి డిసెంబరువరకు రహస్యంగా పనిచేశారు. 1948లో అరెస్టు

చేయబడి 1951 జూలై వరకూ డిటెన్షన్‌లో ఉన్నారు.

### హరీంద్రనాథ చటోపాధ్యాయ
(స్వతంత్ర - విజయవాడ)

కమ్యూనిస్టుపార్టీ మద్దతుతో ఎన్నికైనారు. జననం 1898 ఏప్రిల్ 2. కవి. గాయకుడు. సుమారు పాతికగ్రంథాలువ్రాశారు. సాహిత్యంతోపాటు నాటకాలు, సంగీతం, చిత్రకళ, నాట్యకళలలో పరిచయ మున్నది.

### కొత్త రఘురామయ్య
(కాంగ్రెసు - తెనాలి)

బారిస్టరు. జననం 1912 ఆగస్టు 6. 1951 వరకు మద్రాసుప్రభుత్వ లీగల్ డిపార్టుమెంటులో ఉద్యోగి. జనరల్ ఎన్నికలముందు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి కాంగ్రెసులో చేరారు.

### యస్. వి. యల్. నరసింహం
(స్వతంత్ర - గుంటూరు)

బి. ఏ., బి. యల్., 1911 మే 24 న జననం. సత్యాగ్రహ ఉద్యమంలో జైలు శిక్ష అనుభవించారు. 1930 లో గుంటూరు విద్యార్థి యూనియన్ కార్యదర్శి. 1942_43 లో గుంటూరు బార్ ఎసోసియేషన్ కార్యదర్శి. 1951 వరకూ కాంగ్రెసుసభ్యుడు.

### చాపలమడుగు రామయ్యచౌదరి
(స్వతంత్ర - నరసారావుపేట)

బి.యె., బి. యల్. 1912 లో జననం.

### పిసుపాటి వెంకట రాఘవయ్య
(కమ్యూనిస్టు - ఒంగోలు)

1919లో జననం. యువజనసంఘాల్లో రైతుసంఘాల్లో పనిచేశారు.

### మంగళగిరి నానాదాస్
(స్వతంత్ర - ఒంగోలు)

బి. ఏ. ఆనర్సు. వ్యవసాయ కూలీ కుటుంబంలో 1921 జూలై 1 న జననం. మద్రాసు ప్రభుత్వ ఫ్యాక్టరీల డిపార్టుమెంటు అసిస్టెంటు లేబర్ ఇన్‌స్పెక్టర్ (1948_51.)

### బెజవాడ రామచంద్రారెడ్డి
(స్వతంత్ర - నెల్లూరు)

బి. ఏ., 1894 నవంబరు 24న జననం; వ్యవసాయం, మైకా వ్యాపారం. జస్టిస్ పార్టీ ప్రముఖులలో ఒకరు. 1930_37 మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షుడు. ప్రభుత్వంనియమించిన అనేక సంఘాలలో సభ్యుడుగా పనిచేశారు. అనేక వ్యాపార సంస్థల్లో డైరెక్టర్‌గా ఉన్నారు.

### రాయసం శేషగిరిరావు
(స్వతంత్ర - నంద్యాల)

బి. ఏ. బి. యల్. 1909 జూలై 13 న జననం. అడ్వొకేట్.

### పైడి లక్ష్మయ్య
(కాంగ్రెసు - అనంతపురం)

బి. యె., బి. యల్., 1904 లో జననం. 1942_46 అనంతపురం జిల్లాబోర్డు అధ్యక్షుడు. 1947 లో కాంగ్రెసులో చేరారు.

### కె. ఎస్. రాఘవాచారి
### (ప్ర. సో. – పెనుకొండ)

1891 లో జననం. పబ్లిక్ ప్రాసిక్యూటరు (1947–50).

### వై. ఈశ్వరరెడ్డి
### (కమ్యూనిస్టు – కడప)

ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ ఉపాధ్యక్షులు. 1915 లో జననం. 1937 లో కాంగ్రెసులో చేరారు. 1941 లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని జైలు శిక్ష అనుభవించారు. 1945 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1948 నుండి జనరల్ ఎన్నికల ముందువరకూ అజ్ఞాతవాసంలో ఉండి పనిచేశారు. 1944 నుండి కడపజిల్లా రైతుసంఘ అధ్యక్షుడు.

### టి. ఎన్. విశ్వనాథరెడ్డి
### (కాంగ్రెసు – చిత్తూరు)

బి. యే., బి. యుసి. ఆనర్సు, (వ్యవసాయం). మద్రాసు చెఱకు ఉత్పత్తిదార్ల సంఘ కార్యవర్గంలో ఆరు సంవత్సరాలపాటు సభ్యుడు.

### డాక్టరు ఎమ్. వి. గంగాధరశివ
### (కాంగ్రెసు–చిత్తూరు)

వైద్యవృత్తి, రాయలసీమ జిల్లాల నిమ్నజాతుల సంఘాధ్యక్షుడు (1928–35). మద్రాసు లెజిస్లేటివు కౌన్సిలు సభ్యుడు (1926–30).

### అనంతశయనం అయ్యంగారు
### (కాంగ్రెసు – తిరుపతి)

ప్రజాసభ డిప్యూటీ స్పీకరు. 1891లో జననం. 1935 నుండి కేంద్ర శాసనసభలో సభ్యుడు.



# [ రా జ్య స భ ]

## పుచ్చలపల్లి సుందరయ్య
### (కమ్యూనిస్టు)

నెల్లూరుజిల్లాలో ధనిక రైతు కుటుంబంలో 1913 లో జననం. పదునాలుగో ఏటనే రాజకీయోద్యమంలో ప్రవేశం. మద్రాసులో విద్యనభ్యసించుతూ తోటి విద్యార్థులతో "సోదరసమితి" స్థాపన. సైమన్‌కమీషన్ వ్యతిరేక ప్రదర్శనాల్లో పాల్గొన్నారు. 1930 లో మద్రాసులో జరిగిన పెద్దవిద్యార్థి ఊరేగింపుకు నాయకత్వం వహించారు. చదువుకు స్వస్తిచెప్పి 1930 లోనే పశ్చిమగోదావరిజిల్లా సత్యాగ్రహ శిబిరంలో చేరారు. అరెస్టు. రెండేండ్లశిక్ష. బాలుడవడంవలన బోర్‌స్టల్ స్కూలుకుపంపారు.

1932 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. తన ఆస్తి నంతటినీ తెగనమ్మి ప్రజాఉద్యమ నిర్మాణానికి ఖర్చుపెట్టి, ఆంధ్రలో మహోన్నత త్యాగ సాంప్రదాయాన్ని నెలకొల్పారు. 1934 లో ఆంధ్రలో కమ్యూనిస్టుపార్టీని స్థాపించారు. రాష్ట్ర సోషలిస్టుపార్టీ కార్యదర్శిగా, రాష్ట్ర, అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా పనిచేశారు. రెండో ప్రపంచ యుద్ధం ఆరంభంకావడంతో అజ్ఞాతవాసానికివెళ్ళి మరల 1942 లో కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తొలగిన తరువాత బయటకువచ్చారు. 1946లో "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే పుస్తకం ప్రచురించి విశాలాంధ్ర ఉద్యమానికి పునాదులువేశారు. 1947 నుండి మరల రహస్యజీవితం. తెలంగాణా మహోజ్వల రైతాంగ పోరాటానికి నాయకత్వం వహించి నడిపారు. అజ్ఞాతవాసంలో ఉండగానే రాజ్యసభకు ఎన్నుకోబడ్డారు.

దక్షిణభారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ స్థాపకులు. అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ ఏర్పడినప్పటినుండి నేటివరకూ ఆపార్టీ కేంద్రకమిటీ సభ్యులు.

ప్రస్తుతం పార్లమెంటులో కమ్యూనిస్టుపార్టీ నాయకులుగా,భారతకమ్యూనిస్టుపార్టీ పోలిట్ బ్యూరో సభ్యులుగా పనిచేస్తున్నారు.

## మాకినేని బసవపున్నయ్య
### (కమ్యూనిస్టు)

ఆంధ్రలో విద్యార్థి ఉద్యమ నిర్మాతల్లో ఒకరు. ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మొదటి ప్రధాన కార్యదర్శి. 1937 లో కమ్యూనిస్టుపార్టీలో ప్రవేశం. కొన్నాళ్ళు గుంటూరుజిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి. 1943 నుండి రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యవర్గ సభ్యుడు. 1948 నుండి 1952 లో రాజ్యసభకు ఎన్నుకోబడేవరకూ రహస్య జీవితం. 1948 లో పార్టీ కలకత్తా మహాసభలో కేంద్రకమిటీ సభ్యుడుగా ఎన్నికయ్యారు.

ప్రస్తుతం పార్టీ కేంద్రకమిటీ సభ్యుడుగా, రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యవర్గ సభ్యుడుగా పనిచేస్తున్నారు. మంచి వక్త.

### సంమూరి ప్రసాదరావు
(కమ్యూనిస్టు)

కాశీలో చదువుతుండగా మార్క్సిజంతో పరిచయం ఏర్పడింది. 1936 నుండి ఆంధ్ర రైతుఉద్యమంలో పనిచేస్తున్నారు. అనేక రైతు పోరాటాల్లో పాల్గొన్న ఫలితంగా పలుసార్లు జైలుశిక్ష అనుభవించారు. 1943 నుండి 47 వరకూ ఆంధ్ర రైతుసంఘం ప్రధాన కార్యదర్శి. 1948లో అరెస్టుకాబడినప్పుడు సబ్ జైలు నుండి తప్పించుకుని 1952 లో వారంటు రద్దయ్యే వరకూ రహస్యంగా ఉండి పనిచేశారు. అజ్ఞాతవాసంలో ఉన్నప్పుడు తెలంగాణా పోరాటాల్లో పాల్గొన్నారు. 1953 లో అఖిలభారత కిసాన్‌సభ ప్రధాన కార్యదర్శిగా ఎన్నికయినారు. 1954 మార్చిలో రాజ్యసభకు ఎన్నికయినారు.

### గోగినేని రంగనాయకులు
(లోక్‌పార్టీ)

జననం 1900. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ పట్టభద్రుడు. మద్రాసు పచ్చయప్ప కళాశాలలో ఆచార్యుడు (1927-30). 1935 నుండి 1952 వరకూ కేంద్ర శాసనసభ్యుడు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు (1947-51). 1951 లో ముఠా తగాదాలమూలంగా కాంగ్రెసునుండి వైదొలగి కృషిక్‌లోక్ పార్టీనిస్థాపించారు.

### కొమ్మారెడ్డి సూర్యనారాయణ
(ప్ర. సో.)

కొంతకాలం పశ్చిమగోదావరిజిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు. జనరల్ ఎన్నికల ముందు కాంగ్రెసునుండి వైదొలగి ప్రజాపార్టీలో చేరారు. ప్రస్తుతం ప్రజా సోషలిస్టుపార్టీ ఆంధ్రశాఖ అధ్యక్షుడు.

### కె. యల్. నరసింహం
(కమ్యూనిస్టు)

విద్యార్థిదశలోనే కమ్యూనిస్టు ఉద్యమంతో పరిచయం. 1935 నుండి రైల్వే కార్మికోద్యమంలో కృషి. 1940-42 వేలూరు జైలులో డిటెన్షన్. 1948వరకూ యమ్. యస్. యమ్. రైల్వే కార్మిక సంఘ ప్రధాన కార్యదర్శి. మరల 1948 లో అరెస్టు. 52 వరకు డిటెన్షన్. విడుదలైనతరువాత తీవ్రనిర్బంధవిధాన ఫలితంగా ఛిన్నాభిన్నమైన ఆంధ్ర కార్మికోద్యమాన్ని పునర్నిర్మించడానికి పూనుకొన్నారు. ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్ర ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు అధ్యక్షుడుగా, రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యవర్గసభ్యుడుగా పని చేస్తున్నారు.

### శివలెంక శంభుప్రసాద్
(కాంగ్రెసు)

1911 లో జననం. ఆంధ్ర పత్రిక స్థాపకులు కీ. శే. నాగేశ్వరరావుగారి అల్లుడు. 1938 లో పంతులుగారి మరణానంతరం ఆంధ్ర దినపత్రిక, ఆంధ్ర వారపత్రిక, భారతి పత్రికలను నిర్వహిస్తున్నారు.

### జె. వి. కె. వల్లభరావు
(కమ్యూనిస్టు)

విద్యార్థిగా ఉన్నప్పటినుండీ కమ్యూనిస్టు ఉద్యమంతో సంబంధంవుంది. ఆంధ్ర విశ్వ విద్యాలయంలో బి. యే. (ఆనర్సు) ప్రథమ తరగతిలో

ప్యాసయ్యారు. ఆ తరువాత కమ్యూనిస్టు పార్టీలో పనిచేస్తూ చిట్టివలసలో బలమైన కార్మికోద్యమాన్ని నిర్మించారు. ఆంధ్రరాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఉపాధ్యక్షుడు. విశాఖ జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యవర్గ సభ్యుడు. 1954 లో రాజ్యసభకు ఎన్నుకోబడ్డారు. మంచి వక్త.

### పైడా వెంకటనారాయణ
### (ప్ర. సో.)

కాంగ్రెసులో చాల కాలంగా పని చేశారు. కొన్నాళ్ళు కాకినాడ మునిసిపల్ ఛైర్మన్. ప్రకాశంగారితో పాటు కాంగ్రెసును విడచి ప్రజా సోషలిస్టుపార్టీలో చేరారు.

### అల్లూరి సత్యనారాయణరాజు
### (కాంగ్రెసు)

కమ్యూనిస్టుపార్టీని విడిచి 1946 లో కాంగ్రెసు అభ్యర్థిగానిలబడి శాసనసభకు ఎన్నుకోబడ్డారు. ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు కార్యదర్శి (1951-53).

### ఎ. బలరామరెడ్డి
### (కాంగ్రెసు)

నీలం సంజీవరెడ్డిగారు శాసన సభ్యుడుగా ఎన్నిక కావడంకోసం తన శాసన సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. ఆ తరువాత రాజ్యసభకు ఎన్నికయ్యారు.

### వి. వి. రమణ
### (లోక్‌పార్టీ)

విశాఖజిల్లా లోక్‌పార్టీ కార్యకర్త. 1953 నవంబరులో రాజ్యసభకు ఎన్నికయ్యారు.

### గాలీ సాహెబు
### (కాంగ్రెసు)

గుంటూరుజిల్లాలో చాల కాలంగా కాంగ్రెసు కార్యకర్త. జాతీయోద్యమంలో జైలుశిక్ష అనుభవించారు. 1954 మార్చిలో రాజ్యసభకు ఎన్నుకోబడ్డారు.

### మోటూరి సత్యనారాయణ —
### (నామినేటెడ్)

జననం కృష్ణాజిల్లా. చాలా కాలం నుండి దక్షిణభారతంలో హిందీ భాషా వ్యాప్తికికృషిసలుపుతున్నారు. రాజ్యాంగ సభలో కాంగ్రెసు తరఫున సభ్యులుగా ఉన్నారు. 1954 లో రాజ్యసభకు నామినేట్ చేయబడ్డారు.

# సంక్షిప్త సమాచారం

## కేంద్రప్రభుత్వం

1953వ సంవత్సరం అక్టోబరు 31వ తేదీనాటికి కేంద్రప్రభుత్వ మంత్రివర్గం :

అధ్యక్షులు :
డా॥ రాజేంద్రప్రసాద్

ఉపాధ్యక్షులు :
డా॥ రాధాకృష్ణన్

ప్రధానమంత్రి :
పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

### మంత్రులు

విదేశాంగశాఖ :
పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

రక్షణశాఖ :
పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

మిలిటరీశాఖ :
*శ్రీ మహావీర్ త్యాగి

ఆర్థికశాఖ :
శ్రీ సి. డి. దేశ్‌ముఖ్

ప్లానింగు, ఇరిగేషన్, పవరు :
శ్రీ గుల్జరీలాల్ నందా

దేశ వ్యవహారాలశాఖ :
డా॥ కె. యన్. కట్జూ

వాణిజ్య వ్యాపారాలు, పరిశ్రమలు :
శ్రీ టి. టి. కృష్ణమాచారి

వాణిజ్య వ్యాపారాలు :
శ్రీ డి. పి.* కర్మార్కర్*

తంతి తపాల :
శ్రీ జగజీవన్‌రామ్

రైల్వేలు, రవాణా :
శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి

ఆహారశాఖ :
రఫీ అహమద్ కిద్వాయ్

వ్యవసాయం :
*డా. పంజాబ్‌రావు దేశముఖ్

విద్య, సహజసంపదలు, శాస్త్రీయ పరిశోధన :
మౌలానా అబుల్ కలాం ఆజాద్

ఆరోగ్యశాఖ :
శ్రీమతి రాజకుమారీ అమృతకౌర్

'లా' శాఖ :
శ్రీ సి. సి. బిశ్వాస్

కార్మికశాఖ :
శ్రీ వి. వి. గిరి

ఉత్పత్తిశాఖ :
శ్రీ కె. సి. రెడ్డి

నిర్మాణం, సప్లయిశాఖలు :
సర్దార్ స్వరణ్‌సింగ్

పునరావాసశాఖ :
*శ్రీ అజిత్ ప్రసాద్ జైన్

సమాచారశాఖ, బ్రాడ్‌కాస్టింగ్ :
డా॥ బి. వి. కేస్కర్

పార్లమెంటరీ వ్యవహారాలు :
శ్రీ సత్యనారాయణ సిన్హా

---

* క్యాబినెట్ ర్యాంకు మంత్రులుకారు.

## ఉపమంత్రులు

విదేశాంగశాఖ :
శ్రీ అనిల్ కుమార్ చాందా

రక్షణశాఖ :
శ్రీ సతీష్‌చంద్ర
సర్దార్ యస్. యస్. మజీథియా

ఆర్థికశాఖ :
శ్రీ యం. సి. షా,
శ్రీ యే. సి. గుహా

ఇరిగేషన్, పవరుశాఖ :
శ్రీ జె. యస్. యల్. హాథీ

తంతి, తపాలశాఖ :
శ్రీ రాజబహాదూర్

రవాణాశాఖ :
శ్రీ ఒ. వి. అలగేశన్

వ్యవసాయశాఖ :
శ్రీ యం. వి. కృష్ణప్ప

విద్య, సహజసంపదలు,
శాస్త్రీయ పరిశోధన శాఖ :
శ్రీ కె. డి. మాళవ్యా

ఆరోగ్యశాఖ :
శ్రీమతి యం. చంద్రశేఖరం

కార్మికశాఖ :
అబీద్ ఆలీ

పునరావాసశాఖ :
శ్రీ కె. జి.

## పార్లమెంటు

స్పీకరు :
శ్రీ జి. వి. మావ్లంకర్

డిప్యూటీ స్పీకరు :
శ్రీ అనంతశయనం అయ్యంగార్

సెక్రటరీ :
శ్రీ యం. యన్. కౌల్

## రాజ్యసభ

ఛైర్‌మన్ :
డా॥ రాధాకృష్ణన్

డిప్యూటీ ఛైర్‌మన్ :
శ్రీ యస్. వి. కృష్ణమూర్తిరావు

సెక్రటరీ :
యస్. యన్ ముఖర్జీ

# కొన్ని ముఖ్యపట్టణాల జనాభా

| పట్టణం | జనాభా |
|---|---|
| **బొంబాయి రాష్ట్రం** | |
| బొంబాయి | 28,40,011 |
| అహమ్మదాబాదు | 7,88,310 |
| పూనా | 4,85,426 |
| షోలాపూరు | 2,66,009 |
| సూరత్ | 2,22,884 |
| **పశ్చిమ బెంగాల్** | |
| కలకత్తా | 25,49,790 |
| హౌరా | 4,43,207 |

| పట్టణం | జనాభా |
|---|---|
| **మద్రాసు** | |
| మద్రాసు | 14,29,985 |
| మధుర | 3,61,954 |
| సేలం | 2,02,312 |
| కోయంబత్తూరు | 1,94,555 |
| **ఆంధ్ర** | |
| విజయవాడ | 1,60,831 |
| గుంటూరు | 1,23,829 |
| విశాఖపట్నం | 1,07,815 |
| రాజమండ్రి | 1,05,300 |

| పట్టణం | జనాభా |
|---|---|
| **ఉత్తరప్రదేశ్** | |
| కాన్పూరు | 7,04,536 |
| లక్నో | 4,97,594 |
| ఆగ్రా | 3,75,994 |
| కాశీ (బెనారెస్) | 3,57,175 |
| అలహాబాదు | 3,33,362 |
| మీరట్ | 2,40,860 |
| **మధ్యప్రదేశ్** | |
| నాగపూర్ | 4,49,441 |
| జబల్‌పూర్ | 2,07,511 |
| **తూర్పు పంజాబ్** | |
| అమృతసర్ | 3,20,465 |
| జలంధర్ | 1,68,816 |
| లూధియానా | 1,48,931 |
| **బీహార్** | |
| పాట్నా | 2,82,057 |
| జంషెడ్‌పూర్ | 2,19,377 |
| గయ | 1,34,120 |
| **ఒరిస్సా** | |
| కటక్ | 1,02,091 |
| **హైదరాబాదు** | |
| హైదరాబాదు | 10,85,074 |
| వరంగల్ | 1,30,080 |
| **మైసూరు** | |
| బెంగుళూరు | 7,76,170 |
| మైసూరు | 2,44,334 |
| కోలారు | 1,59,158 |

| పట్టణం | జనాభా |
|---|---|
| **తిరువాన్కూరు-కొచ్చిన్** | |
| తిరువాన్కూరు | 1,85,151 |
| ఆలెప్పీ | 1,15,930 |
| **మధ్యభారత్** | |
| ఇందూరు | 3,08,158 |
| గ్వాలియరు | 2,40,397 |
| ఉజ్జైన్ | 1,29,959 |
| **రాజస్థాన్** | |
| జైపూరు | 2,91,183 |
| జోధ్‌పూరు | 1,74,061 |
| **సౌరాష్ట్ర** | |
| భావనగర్ | 1,37,340 |
| రాజకోట | 1,31,535 |
| **ఢిల్లీ** | |
| ఢిల్లీ | 9,14,634 |
| కొత్త ఢిల్లీ | 2,79,063 |
| **అజ్మీర్** | |
| అజ్మీర్ | 1,96,731 |
| **మణిపూర్** | |
| ఇంఫాల్ | 1,31,264 |

భారతదేశంలో లక్షకు మించి జనాభా ఉన్న పట్టణాల మొత్తం జనాభా 1951 జనాభా లెక్కల ప్రకారం 2,40,85,169. మొత్తం భారతదేశ జనాభాలో, ఈ పట్టణాలజనాభా నూటికి 6.75 పాళ్ళు.

### 1951 జనాభా లెక్కలప్రకారం వివిధ రాష్ట్రాల జనాభా, వైశాల్యం వివరాలు :

| రాష్ట్రం | వైశాల్యం చ. మైళ్ళలో | జనాభా (వేలలో) | జనసమ్మర్దం చ. మైలుకు | రాజధానీనగరం | రాష్ట్రం* లోని పట్టణాలు | పట్టణజనాభా♦ (వేలలో) | గ్రామీణ జనాభా (వేలలో) |
|---|---|---|---|---|---|---|---|
| 1. 'ఎ' తరగతి రాష్ట్రాలు | | | | | | | |
| ఉత్తరప్రదేశ్ | 1,13,409 | 6,32,16 | 557 | లక్నో | 16 | 86,26 | 5,45,90 |
| బీహార్ | 70,330 | 4,02,26 | 572 | పాట్నా | 5 | 27,05 | 3,75,21 |
| బొంబాయి | 1,11,434 | 3,59,56 | 323 | బొంబాయి | 8 | 1,11,70 | 2,47,86 |
| మద్రాసు | 60,189 | 3,57,34 | 594 | మద్రాసు | 9 | 78,29 | 2,79,08 |
| పశ్చిమ బెంగాలు | 30,775 | 2,48,10 | 806 | కలకత్తా | 6 | 61,53 | 1,86,57 |
| మధ్యప్రదేశ్ | 1,30,272 | 2,12,48 | 163 | నాగపూర్ | 2 | 28,77 | 1,83,70 |
| ఆంధ్ర | 63,417 | 2,05,08 | 323 | కర్నూలు | 5 | 33,57 | 1,79,24 |
| ఒరిస్సా | 60,136 | 1,46,46 | 244 | కటక్ | 1 | 5,94 | 1,40,52 |
| పంజాబు | 37,378 | 1,26,41 | 338 | సిమ్లా | 3 | 24,01 | 1,02,40 |
| అస్సాము | 85,012 | 90,44 | 106 | షిల్లాంగ్ | 0 | 4,14 | 86,30 |
| మొత్తం | 7,66,536 | 27,88,03 | 363 | | 55 | 4,61,26 | 23,26,78 |

* లక్షజనాభాకు మించిన పట్టణాలు

♦ పట్టణాల జనాభా, ఐదువేల జనాభా కలిగిన చోట్ల జనాభాకలిసి

| రాష్ట్రం | వైశాల్యం చ. మైళ్ళలో | జనాభా (వేలలో) | జనసమ్మర్దం చ. మైలుకు | రాజధానీనగరం | రాష్ట్రంలోని పట్టణాలు | పట్టణజనాభా (వేలలో) | గ్రామీణ జనాభా (వేలలో) |
|---|---|---|---|---|---|---|---|
| **2. 'బి' తరగతి రాష్ట్రాలు** | | | | | | | |
| హైదరాబాదు | 82,168 | 1,86,55 | 227 | హైదరాబాదు | 2 | 34,76 | 1,51,79 |
| రాజస్థాన్ | 1,30,207 | 1,52,91 | 117 | జయపూర్ | 3 | 26,49 | 1,26,42 |
| మైసూరు | 33,673 | 98,49 | 293 | బెంగుళూరు | 3 | 21,79 | 76,70 |
| తిరువాన్కూరు-కొచ్చిన్ | 9,144 | 92,81 | 1,015 | త్రివేంద్రం | 2 | 14,88 | 77,92 |
| మధ్యభారత్ | 46,478 | 79,54 | 171 | గ్వాలియర్, ఇండూరు | 3 | 14,41 | 65,13 |
| జమ్మూ-కాశ్మీర్ • | 92,780 | ... | ... | శ్రీనగర్ | 0 | ... | ... |
| సౌరాష్ట్ర | 21,451 | 41,37 | 193 | రాజకోట | 3 | 13,93 | 27,44 |
| పెప్సు | 10,078 | 34,94 | 347 | పాటియాలా | 0 | 6,66 | 28,28 |
| మొత్తం | 4,21,795 | 6,78,87 | 161 | | 16 | 1,32,92 | 5,53,68 |

• 1951 జనాభా లెక్కలు తీయబడలేదు. తాజాఅంచనాల ప్రకారం జనాభా 44,10,000.

| రాష్ట్రం | వైశాల్యం చ. మైళ్ళలో | జనాభా (వేలలో) | జనసమ్మర్దం చ. మైలుకు | రాజధానీ నగరం | రాష్ట్రంలోని పట్టణాలు | పట్టణజనాభా (వేలలో) | గ్రామీణ జనాభా (వేలలో) |
|---|---|---|---|---|---|---|---|
| **3.** 'సి' తరగతి రాష్ట్రాలు | | | | | | | |
| వింధ్యప్రదేశ్ | 23,603 | 35,75 | 151 | రీవా | 0 | 3,06 | 32,69 |
| ఢిల్లీ | 578 | 17,44 | 3,017 | ఢిల్లీ | 2 | 14,37 | 3,07 |
| హిమాచల ప్రదేశ్ | 10,451 | 9,83 | 94 | సిమ్లా | 0 | 41 | 9,42 |
| భోపాల్ | 6,878 | 8,36 | 122 | భోపాల్ | 0 | 1,36 | 7,00 |
| అజ్మీర్ | 2,417 | 6,93 | 265 | అజ్మీర్ | 1 | 2,98 | 3,96 |
| త్రిపుర | 4,032 | 6,39 | 158 | అగర్తలా | 0 | 43 | 5,96 |
| మణిపూర్ | 8,628 | 5,78 | 67 | మణిపూర్ | 1 | 3 | 5,75 |
| కచ్ | 16,724 | 5,68 | 34 | భూజ్ | 0 | 1,44 | 4,54 |
| కూర్గు | 1,586 | 2,29 | 145 | కూర్గు | 0 | 16 | 2,13 |
| బిలాస్‌పూర్ | 453 | 1,26 | 278 | బిలాస్‌పూర్ | 0 | 4 | 1,22 |
| మొత్తం | 73,350 | 99,71 | 132 | | 4 | 23,98 | 75,74 |
| **4.** 'డి' తరగతి ప్రాంతాలు | | | | | | | |
| అండమాన్ ద్వీపాలు | 3,215 | 37 | 10 | పోర్ట్ బ్లెయర్ | 0 | 8 | 23 |
| సిక్కిం | 2,744 | 1,31 | 50 | | 0 | 3 | 1,35 |
| మొత్తం | 5,959 | 1,68 | 28 | | 0 | 11 | 1,58 |
| భారత రిపబ్లిక్ | 12,69,640 | 35,68,29 | 281 | క్రొత్తఢిల్లీ | 75 | 6,18,25 | 29,50,04 |

# చారిత్రక ప్రదేశాలు - పుణ్యక్షేత్రాలు

[ఆంధ్ర దేశంలో చారిత్రికంగాను, పౌరాణికంగాను ముఖ్యమైన స్థలాల ప్రాముఖ్యత క్లుప్తంగా దిగువ వివరించబడింది. ఆయా ముఖ్యప్రదేశాలనుగూర్చి జిల్లాలవారిగా వివరించబడ్డది. చిన్నచిన్న ప్రదేశాలను వదలివేసి అతిప్రాముఖ్యము అనుకున్న ప్రదేశాలనుగూర్చి మాత్రమే వివరించబడింది —సంపాదకుడు]

## శ్రీకాకుళం జిల్లా

### శాలిహుండాం

శ్రీకాకుళానికి షుమారు 40 మైళ్ళ దూరంలో వంశధారా నదిమీదనున్న ప్రాచీన బౌద్ధారామం. దీన్ని 'కిటహారామం' అని పిలుస్తారు. ఇక్కడ కొన్ని బౌద్ధస్తూపాలున్నవి. శాలిహుండాం కొండకు "కూర్మాద్రి" అనిపేరు. ఇక్కడనే వంశధార అవతలిఒడ్డున 'వనితామండలం' అనే చారిత్రిక ప్రదేశం వున్నది. (వివరాలకు చూ: పేజీ 144)

### దంతపురం

ఇది కళింగదేశాన్ని దీర్ఘకాలం పరిపాలించిన గాంగవంశపురాజుల రాజధాని. దీని ప్రస్తుత నామం దంతవక్త్రునికోట. ప్రాచీన శిధిలాలనేకం కనబడతాయి. శ్రీకాకుళంస్టేషనుకు సమీపంలో వుంది.

### బొబ్బిలి

శ్రీకాకుళంజిల్లాలో ప్రధానకేంద్రం. ఫ్రెంచి సామ్రాజ్యవాదులు, విజయనగరం రాజులు కలిసి బొబ్బిలిపై 1757 జనవరి 24 న దాడిచేసినప్పుడు యిక్కడ ఘోరయుద్ధం జరిగింది. ఇదే బొబ్బిలి యుద్ధంగా ప్రసిద్ధికెక్కింది. వెలమవీరుల పౌరుష సాహసాలగూర్చి రసవత్తరమైన గాథలు నేటికీ ప్రచారంలోవున్నవి. బొబ్బిలియుద్ధంలో శిధిలమైనకోట బొబ్బిలి పడమరగా పైపునవున్నది. యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన బొబ్బిలిరాజా రంగారావు స్మారకచిహ్నంగా రంగారావు చావడి నిలచివున్నది. (వివరాలకు చూ. పేజీ 149)

### కళింగపట్నం

ప్రాచీనకాలంనుండి ప్రసిద్ధిగాంచిన ఓడరేవు.

### పాండవుల పంచ

పాలకొండ తాలూకా నీలయ్యవలస గ్రామంలో ఉన్న ఒక చారిత్రిక విశేషం.

### శ్రీకూర్మం

వైష్ణవదేవాలయం. 12 వ శతాబ్దం నాటిది. శ్రీకాకుళానికి 15 మైళ్ళ

కూరంలో ఉన్నది. శ్రీ కాకుళానికి శ్రీ కూర్మానికి బస్సు సర్వీసు ఉన్నది. భారతదేశంలో కూర్మావతారంలో ఉన్న దేవుడి ఆలయం ఇక్కడతప్ప మరెక్కడా లేదు.

### అరసవిల్లి

శ్రీకాకుళానికి రెండుమైళ్ళదూరంలో శ్రీ కూర్మం వెళ్ళే త్రోవలో ఉన్నది. ఇక్కడ ఆంధ్రలోని ఏకైక సూర్యనారాయణస్వామి దేవాలయం ఉన్నది. ఇది ప్రాచీనకాలము నాటిది.

### ముఖలింగం

శ్రీకాకుళంనుండి 35 మైళ్ళదూరంలో వంశధారనది ఒడ్డున ముఖలింగ మహాక్షేత్రముున్నది. ఇది గొప్పశైవక్షేత్రము. దాన్ని పదిహేనువందల సంవత్సరాలక్రిందట కళింగ గాంగవంశస్థులు నిర్మించారు. ఈ దేవాలయంపైన ప్రాచీన శిల్పకళ దర్శనీయంగా వుంటుంది. మధూకేశ్వరస్వామి, భీమేశ్వరస్వామి, సోమేశ్వరస్వామి దేవాలయాలున్నవి. ఏడవశతాబ్దంవరకు ముఖలింగం రాజధానిగా వుంటూవచ్చింది. ఇక్కడనేక జైన, బౌద్ధవిగ్రహాలు గొరికాయి. ముఖలింగం ప్రాచీన నామం కళింగనగరం.

(వివరాలకు చూ. పేజీ 145.)

## విశాఖపట్నం జిల్లా

### బొజ్జన్నకొండ

అనకాపల్లికి ఒకటిన్నర మైలుదూరంలో నున్న 'శంకరం' అనే గ్రామంలోని కొండనే బొజ్జన్నకొండ అని పిలుస్తారు. ఇది చిన్నకొండల సముదాయం. ఇక్కడ బౌద్ధ గుహాలయం వుంది. కొన్ని కొండ శిఖరాలు బౌద్ధస్తూపాల ఆకారాల్లో చెక్కబడ్డవి. అనేక బౌద్ధ విగ్రహాలున్నవి.

### రామతీర్థం

విజయనగరం తాలూకాలోని బౌద్ధ, జైనమత క్షేత్రం. దీన్ని 'ఆరామతీర్థం' అనికూడ అంటారు. ఇక్కడ చిన్న చిన్న బౌద్ధస్తూపాలు, ఆరామాలు కొన్ని చెల్లాచెదురుగా కనబడతవి. "బోడికొండ" మీద, "దుర్గకొండ"మీద జైన శిథిలాలు వున్నవి. చాళుక్య విమలాదిత్యుని కాలపు శాసనం ఒకటి వుంది.

### భీమునిపట్నం

17 వ శతాబ్దంలో డచ్చివారు, ఇంగ్లీషువారు ఈ రేవువద్ద వ్యాపారం ప్రారంభించారు. డచ్చివారి ఫ్యాక్టరీ శిథిలాలు కనబడతాయి. "కోటకిల్ల" అనేచోట పూర్వం డచ్చివారి కోట ఉండేది. ఒకెండ భూములనేవి డచ్చివారి చాకిరేవులు. భీమునిపట్నం మైనరు రేవు.

### సింహాచలం

ప్రసిద్ధిచెందిన పుణ్యక్షేత్రం. పదకొండవ శతాబ్దంనాటినుండి ఖ్యాతి పొందింది. విశాఖపట్నానికి పదిమైళ్ళ దూరంలో ఉన్నది. హిరణ్యకశ్యపుని చంపడానికి శ్రీ మహావిష్ణువు నృసింహావతారం ఎత్తాడని పురాణగాథ వున్నది.

ఈ నృసింహస్వామి దేవాలయం యిక్కడ వున్నది. చైత్రమాసంలో పెద్దఉత్సవాలు జరుగుతాయి. ఈ దేవాలయం శిల్పకళకు ప్రసిద్ధికెక్కింది. దేవాలయంలో కృష్ణ దేవరాయల కాలంనాటి శాసనాలున్నాయి. (వివరాలకు చూ: పేజీ 172)

## తూర్పు గోదావరి జిల్లా

### ద్రాక్షారామం

దీనికి దక్షిణ కాశీ అనికూడా పేరు. రెండువేల సంవత్సరాలనుండి ప్రసిద్ధి పొందిన శైవక్షేత్రం. పంచారామములలో ఒకటి. ఇచ్చటఉన్న దైవం భీమేశ్వరుడు. దక్షుడు నివసించిన స్థలమగుటచేత దక్షారామం అనికూడా అంటారు. ద్రాక్షారామం పవిత్ర స్థలమగుటచేత ఆంధ్ర దేశాన్ని యేలిన రాజు లనేకమంది యీ దేవాలయానికి దానధర్మాలుచేసిశాసనాలు వేయించారు. ఈ ఆలయ ప్రాకారాలు, మంటపాలు క్రీ. శ. పదవ శతాబ్దంలో నిర్మించబడ్డవి. భీమేశ్వరాలయానికి ఎదురుగావున్న చెరువును 'సప్త సాగరమని', ఇందులో స్నానంచేస్తే గోదావరి ఉపనదులు ఏడింటిలోనూ స్నానం చేసినంత పుణ్యమని భక్తులు చెబుతారు. ద్రాక్షారామం రాజమండ్రి - కోటిపల్లి బస్సు మార్గంలో వున్నది.

### భద్రాచలం

ఇక్కడ ప్రసిద్ధిపొందిన రామాలయం వుంది. శ్రీరామనవమికి బ్రహ్మాండమైన ఉత్సవాలుజరుగుతాయి. రావణాసురునిచే అపహరించబడ్డ సీతనువెదకుతూ రాముడు ఇక్కడికి వచ్చాడనీ, అప్పుడు ఇక్కడ భద్రుడనే సిద్ధుడు రాముడిచేత ముక్తి పొందాడనీ చెబుతారు. భద్రుడువున్న కొండ గనుక భద్రాచలమని పేరువచ్చింది. 18 వ శతాబ్దంలో గోల్కొండ నవాబుల క్రింద తహశీల్దారుగ పనిచేసిన కంచర్ల గోపన్న, నవాబు బొక్కసంలోనుండి కొన్ని లక్షలు ఖర్చుచేసి దేవాలయాన్ని కట్టించాడనీ, నవాబు గోపన్నను ఖైదులో పెట్టగా రామలక్ష్మణులు ప్రత్యక్షమై నవాబుకు డబ్బు చెల్లించి, గోపన్నను ఖైదునుంచి విడిపించారని ఒక కథ ప్రచారంలో వుంది. శ్రీరామనవమికి జరిగే ఉత్సవాల ఖర్చులలో కొంత భాగాన్ని నైజాం నవాబు ఇప్పటికీ భరిస్తున్నాడు. భద్రాచలం ఏజెన్సీ ప్రాంతంలో వుంది. రాజమండ్రి నుండి పడవలో వెళ్ళవచ్చు.

### రామఘట్టాలు

రాముడు రావణుడిని చంపినందువల్ల వచ్చిన పాప పరిహారార్థం శ్రీరాముడు శివాలయాన్ని కట్టించాడని పురాణగాథ, ఇక్కడ ఒక రాతి పలకపై చెక్కబడ్డ పాదముద్రలను రామ పాదాలని చెబుతారు. మాఘమాసం ఆదివారాలలో ఇక్కడ భక్తులు స్నానాలు చేస్తారు.

### ర్యాలి

అమలాపురం తాలూకాలో వుంది. కళా సంపదకు ప్రసిద్ధికెక్కిన జగన్మోహినీ విగ్రహం ఇచ్చట వుంది. ఈ విగ్రహం ముందు నుండి చూస్తే మోహినిగాను, వెనుకనుండి చూస్తే విష్ణువుగాను కనబడుతుంది. అమృతాన్ని పంచడంలో రాక్షసులను మోసం చేయడానికి విష్ణువు

జగన్మోహినీ వేషం ధరించాడట. ఇక్కడ జగన్నాథ కేశవస్వామి ఆలయం వున్నది.

### కోటిపల్లి

ఇక్కడ శివరాత్రికి గొప్ప ఉత్సవాలు జరుగుతాయి. పన్నెండేళ్ళకొకసారి పుష్కరాలు జరుగుతాయి. ఇక్కడ చేసిన మంచిపని ఒకటైనప్పటికీ ఇతర చోట్ల కోటి పుణ్యకార్యాలు చేసినంత ఫలం గనుక దీనికి కోటిపల్లి అని పేరు వచ్చింది. రాజమండ్రి, కాకినాడల నుండి కోటిపల్లికి బస్సులు వున్నాయి

### అన్నవరం

ఇక్కడి సత్యనారాయణస్వామిని సేవించినచో సంతానంలేనివారికి సంతానం కలుగుతుందని ఒక నమ్మకముంది. పెద్దాపురానికి 25 మైళ్ళ దూరంలో వుంది. పెద్దాపురంలో పాండవుల మెట్ట అని ఒక కొండ వుంది.

### కోరంగి

ఇక్కడ ఆత్రేయ సాగర సంగమము వుందని చెప్పి సప్తసాగర యాత్రికులు ఇక్కడికి వస్తారు. కోరంగికి ప్రక్కనున్న మసకపల్లిలోనే రాముడు మాయాలేడి రూపంలో నున్న మారీచుని సంహరించినట్లు పురాణగాథ.

### పిఠాపురం

ఇక్కడ కుక్కుటేశ్వరాలయం వుంది. ఆలయం ముందున్న కొలనుకు 'పాదగయ' అని పేరు. ఇక్కడ శివరాత్రికి పెద్ద ఉత్సవాలు జరుగుతాయి.

### సామర్లకోట

మొదటి చాళుక్య భీమరాజు క్రీ. శ. పదవ శతాబ్దంలో ఇక్కడ భీమేశ్వరాలయాన్ని నిర్మించాడు. భీమేశ్వరాలయం నిర్మించబడ్డ ప్రాంతాన్ని మొదట్లో దాన్ని నిర్మించిన రాజు పేరిట చాళుక్యభీమవరమని అనేవారు. తరువాత ఇది సామర్లకోటలో కలిసిపోయింది. ఇది పంచారామాలలో ఒకటి.

### రాజమండ్రి

ఇక్కడ గోదావరిని 'అఖండగౌతమి' అనే పవిత్ర నామంతో పిలుస్తారు. కోటిలింగాలున్నవి. వీటిని రాజరాజ నరేంద్రుడు ప్రతిష్ఠాపించాడట. ఇదిరాజరాజ నరేంద్రుని రాజధాని.

### అంతర్వేది

రాజోలుతాలూకాలోనిది. వసిష్ఠానదీ ముఖద్వారంలో వుంది. వసిష్ఠుని కోర్కెననుసరించి రక్తవిలోచనుడనే రాక్షసుని విష్ణువు యిక్కడనే చంపాడట. సప్తసాగరయాత్రా స్థలాల్లో ఒకటి. ప్రతి సంవత్సరం మాఘమాసంలో లక్ష్మీనరసింహస్వామికి ఉత్సవాలు జరుగుతాయి.

### సర్పవరం

తక్షకుడు పరీక్షిత్తును కాటువేసి చంపిన ఫలం అయినందున దీనికి సర్పవరం అనే పేరు వచ్చిందని పురాణగాథ. ఇక్కడ నారదగుండం అనే దానిలో నారదుడు మునిగి స్త్రీరూపం దాల్చాడని, ముక్తిగుండంలో మునిగి తిరిగి పురుష రూపం దాల్చాడని చెప్పుకుంటారు. దీన్ని నారద క్షేత్రం అని కూడ అంటారు. కాకినాడకు 4 మైళ్ళ దూరంలోవుంది.

### యానాం

ఫ్రెంచివారి కాలనీ. 1750 లో ఇక్కడ ఫ్రెంచివారు ఒక ఫ్యాక్టరీ నెల

కొల్పారు. తరువాత ఇంగ్లీషువారి మధ్య, ఫ్రెంచివారి మధ్య యుద్ధాలు వచ్చినప్పు డల్లా చేతులుమారుతూ 1815 లో ఫ్రెంచి వారికి ధారాదత్తం చేయబడింది. ఇది ఓడ రేవు. భారతదేశంలోని ఫ్రెంచివలసలన్నీ భారతదేశంలో విలీనంకావాలని 1954 మార్చిలో ఉద్యమం ప్రారంభమైంది.

## కాకినాడ

ఇది జిల్లా కార్యస్థానం. మైనరు ఓడ రేవు. కోరంగి, ఇంజరం రేవులు మెరకవేసి పాడైపోయాకనే కాకినాడ రేవు ప్రాముఖ్యంలోకి వచ్చింది. ఇంగ్లీషువాళ్ళు ఇక్కడ పీచుపరిశ్రమ నెలకొల్పారు. కాకినాడలోని జగన్నాధపురం అనే పేటలో 1628 లో డచ్చివారు ఒక టంక శాలను, ఒక ఫ్యాక్టరీని నెలకొల్పారు. ఇప్పుడు ఇవి అన్నీ శిథిలమై పోయాయి. జగన్నాధపురంలో కొన్ని డచ్చి సమాధులు కనబడతాయి.

## ఆదుర్రు

రాజోలుతాలూకాలోని గ్రామం. ఇచ్చట క్రీ. శ. రెండవ, మూడవ శతాబ్దాలనాటి బౌద్ధస్తూపాలు, కొన్ని నాణాలు, మట్టిపాత్రలు దొరికాయి.

# పశ్చిమగోదావరి జిల్లా

## గుంటుపల్లి

ఏలూరు తాలూకాలోని గ్రామం. ఇక్కడ క్రీ. పూ. 3వ శతాబ్దంనాటి బౌద్ధగుహాలయం, సంఘారామం వున్నది. హీనయానానికి చెందిన బౌద్ధారామం, కామవరపుకోటకు ఆరుమైళ్ళ దూరంలో వుంది. కామవరపుకోటకు ఏలూరుకు బస్సు లున్నవి.

## వేంగీనగరం

శాలంకాయనవంశపురాజుల కాలం నాటి గొప్ప విద్యాపీఠం. రాజధాని. ఏలూరు సమీపంలో వున్నది. ఇక్కడ చిత్రరథస్వామి దేవాలయం ఉన్నది. ఈ దేవాలయ శిథిలాలు నేటికీ కనబడతాయి. వేంగీనగరం పేరు పెదవేగి, చినవేగి అని రెండు గ్రామాలుగ మిగిలివున్నది.

## ద్వారకాతిరుమల

ఇక్కడ కొండమీద శ్రీ వెంకటేశ్వర స్వామి ఆలయం వుంది. దీన్ని చిన్న తిరుపతి అని పిలుస్తారు. ఏలూరు-భీమడోలు-ద్వారకాతిరుమల బస్సుమార్గం ఇక్కడనే అంతమవుతుంది.

## పాలకొల్లు

పంచారామాల్లో ఒకటి. దీన్ని క్షీరారామ మంటారు. నర్సాపురం తాలూకాలోనిది. భీమవరం - నర్సాపురం రైలు మార్గంలోవుంది.

## పెనుగొండ

ఇక్కడ కన్యకాపరమేశ్వరీ ఆలయం వుంది. వైశ్యులకు గొప్ప పుణ్యక్షేత్రం. తణుకుతాలూకాలో నిడదవోలు-నర్సాపురం బస్సుమార్గంలో వుంది.

## కృష్ణా జిల్లా

### శ్రీ కాకుళం

శాలివాహనుల ప్రథమ రాజధాని. విజయవాడకు 20 మైళ్ళదూరంలో దివి తాలూకాలో వున్నది. ఇక్కడ శాతవాహన రాజులు నిర్మించిన ఆంధ్రవిష్ణువు దేవాలయంవుంది. ఈ దేవుడికి మేనెల మొదటివారంలో కళ్యాణోత్సవాలు జరుగుతాయి. ఈ దేవాలయాన్ని సందర్శించాకనే శ్రీకృష్ణదేవరాయలకు 'ఆముక్తమాల్యద' వ్రాయాలన్న సంకల్పం కల్గిందట.

### కొండపల్లి

14 వ శతాబ్దంలో కొండవీటి రెడ్డి రాజులు యిక్కడొక రక్షణ దుర్గాన్ని నిర్మించారు. గోల్కొండనవాబు పరిపాలన క్రింద కొండపల్లి ఒక సర్కారుకి కార్యస్థానం. ప్రసిద్ధి పొందిన బొమ్మల పరిశ్రమకు కేంద్రం. బెజవాడ - హైద్రాబాదు రైలుమార్గంలో ఉన్నది.

### ఘంటసాల

దివితాలూకాలోఉంది. తూర్పు చాళుక్యుల కాలంలో ఇది ఒక ఓడరేవు. ప్రాచీనకాలపు బౌద్ధస్తూపాలు, రోమను నాణాలు బయటపడ్డాయి. ఘంటసాలలోని కాలభైరవ సరస్వతీ విగ్రహం, నరసింహస్వామి విగ్రహం శిల్పానికి యెన్నదగ్గది. (వివరాలకు చూ. పేజీ 236.)

### విజయవాడ

ఆంధ్రదేశ రాజకీయ కేంద్రం. పెద్ద రహదారులు కూడలి. విజయవాడ రైల్వే ప్లాటుఫారం ప్రపంచంలోని పొడవైన రైల్వేప్లాటుఫారాల్లో ఆరవది.

విజయవాడ పూర్వం జైన, శైవమతాలకు కేంద్రం. ఇంద్రకీలాద్రి కొండపై కనకదుర్గగుడి, మల్లికార్జునస్వామి ఆలయం వున్నవి. శివరాత్రి కృష్ణస్నానాలకు వేల కొలది భక్తులు ప్రతిసంవత్సరం వస్తూంటారు.

### మోపిదేవి

దివి తాలూకాలో ఉంది. ఇక్కడ జనవరి 24 న సుబ్బారాయుడు షష్టి ఉత్సవం జరుగుతుంది.

### హంసలదీవి

దివితాలూకాలో ఉంది. ఇక్కడ మాఘ పౌర్ణమికి (ఫిబ్రవరి 15) వేణుగోపాలస్వామి కల్యాణ సప్తాహం జరుగుతుంది.

### చిలకలపూడి

బందరు పట్టణంలోని భాగంగావున్నది. ఇక్కడ ఆషాఢ శుద్ధ ఏకాదశికి, కార్తీక శుద్ధ ఏకాదశికి ఐదేసి రోజులపాటు పాండురంగస్వామి మహోత్సవాలు జరుగుతాయి.

### మంగినపూడి

బందరు సమీపంలో వున్నది. ఇక్కడ ఫిబ్రవరి మొదటి తేదీన సముద్రస్నానాలు చేస్తారు.

### ఆకిరిపల్లి

నూజివీడు తాలూకాలో నూజివీడు–బెజవాడ బస్సు వెళ్ళే మార్గంలో ఉన్నది. ఇక్కడ రథసప్తమికి ఉత్సవాలు జరుగుతాయి.

### కళ్ళేపల్లి

ఇక్కడ శివరాత్రికి నాగేశ్వరాలయంలో ఉత్సవాలు జరుగుతాయి.

## గుంటూరు జిల్లా

### అమరావతి

ప్రాచీనాంధ్ర రాజధానీ నగరం. మొదటి ప్రాచీనాంధ్ర విశ్వవిద్యాలయం నిలచిల్లిన ప్రదేశం. ప్రఖ్యాత బౌద్ధారామం. క్రీ. పూ. రెండవ శతాబ్దం నాడు నిర్మించబడ్డది. శాతవాహన ఆంధ్రుల కళాశిల్పానికి మహోన్నత శిఖరం. ఇక్కడి కళా సంపదలోని చాల భాగం విదేశాలకు తరలించబడింది.

ఇక్కడ అమరేశ్వరుని దేవాలయం ఉంది. పంచారామాలలో ఒకటి. గుంటూరుకు 20 మైళ్ళ దూరంలో వుంది. గుంటూరునుండి అమరావతికి బస్సువున్నది. (వివరాలకు పేజీ : 256)

### నాగార్జునకొండ

సుప్రసిద్ధ బౌద్ధాచార్యుడు నాగార్జునుడు నివసించిన ప్రదేశం. పెద్ద బౌద్ధక్షేత్రం. ఇది అమరావతికంటె పెద్ద బౌద్ధారామం. ఇక్కడ క్రీ. శ. మూడు నాల్గవ శతాబ్దాల నాటి మూడు సంఘారామాలు, ఆరు చైత్యాలయాలు, అనేక స్తూపాలు బయటపడ్డవి. ఇక్కడి కళా నిక్షేపా

ల్లోని చాల భాగం ఢిల్లీలోని పురా వస్తు ప్రదర్శనాలయానికి, విదేశాలకు తరలించ బడ్డవి. నాగార్జునకొండలో ఉన్నవి చాల తక్కువ. ఇక్కడ త్రవ్వితే మరికొన్ని చారిత్రిక విశేషాలు బయట పడవచ్చును. నాగార్జునకొండ బెజవాడ-మాచెర్ల రైలు మార్గంలో మాచర్ల నుండి పదిహేను మైళ్ళ దూరం వుంది. (వివరాలకు చూ. పేజీ. 257).

### ఉండవల్లి

గుంటూరు తాలూకాలోని గ్రామం. విజయవాడకు మూడు మైళ్ళ దూరంలో వుంది. ఇప్పుడు నాలుగు అంతస్తుల బౌద్ధ గుహాలయం ఉంది. రెండవ అంతస్తులో నృసింహస్వామి విగ్రహమున్నది. మూడవ అంతస్తులో తూర్పు చాళుక్యులు నిర్మించిన అనంతశయనాలయ మున్నది. ఇందులోని విగ్రహం 17 అడుగుల పొడవున్నది.

### కార్యమపూడి

దీనిని ఇపుడు కారెంపూడి అని పిలుస్తారు. పల్నాడు తాలూకాలో ఉన్నది. మనం వీరగాథలుగా చెప్పుకొనే పల్నాటి యుద్ధం జరిగింది యీ గ్రామంలోనే. వీరయువకుడుగా ప్రఖ్యాతిగాంచిన బాల చంద్రుడు ఇచ్చటివాడే.

ఈ యుద్ధంలో మరణించిన యుద్ధ వీరుల చిహ్నంగా కారెంపూడిలో వీరుల గుళ్ళు నిర్మించబడ్డాయి. ఇక్కడ ప్రతి సంవత్సరం జరిగే వుత్సవాలలో, వీర్లను, వారి ఆయుధాలను ఊరేగిస్తారు. బ్రహ్మ నాయుడు, నాయకురాలు వేసిన కోడి పందాలకు చిహ్నంగా కోడి పందాలు వేస్తుంటారు. కారెంపూడి గురజాలకు పదిమైళ్ళ దూరంలో వుంది. గురజాల, బందరు-మాచర్ల రైలుమార్గంలో వుంది.

### కొండవీడు

నర్సారావుపేట తాలూకాలో వుంది. రెడ్డిరాజులరాజధాని. కుమారగిరి కట్టించిన సుందరమైన గృహరాజుల మేడ శిథిలమై నేడు "గుర్రాల మేడ" అని పిలువబడు తున్నది.

### భట్టిప్రోలు

ఇక్కడ బౌద్ధస్తూపాలు దొరికాయి. రేపల్లె తాలూకాలో వుంది.

### గోలి

ఇక్కడ ప్రాచీన బౌద్ధ స్తూపాలు బయటపడ్డవి.

### కోటప్పకొండ

శైవ క్షేత్రము. ఇక్కడికోటేశ్వరాలయంలో శివరాత్రికి ప్రతి సంవత్సరం గొప్ప వుత్సవాలు జరుగుతాయి. భక్తులు బండ్లమీద ప్రభలు కట్టుకుని మొక్కుబడ్లు తీర్చుకోడానికివస్తారు. నర్సారావుపేటకు 8 మైళ్ళదూరంలో వుంది.

### మంగళగిరి

గుంటూరు-బెజవాడ రైలుమార్గంలోని స్టేషను. ఇక్కడి పానకాలరాయుడికి ప్రతి సంవత్సరం ఫాల్గుణ పౌర్ణమికి పెద్ద వుత్సవాలు జరుగుతాయి. కొండదిగువ నరసింహస్వామి ఆలయం వుంది.

### పొన్నూరు

భావనారాయణస్వామి ఆలయంలో వైశాఖ శుద్ధ పౌర్ణమికి గొప్ప ఉత్సవాలు జరుగుతాయి.

## నెల్లూరు జిల్లా

### నెల్లూరు

దీనికి పూర్వం విక్రమసింహపురమని పేరుండేది. విక్రమసింహపురి చోడులకు నెల్లూరురాజధాని. నెల్లూరులో పెన్నానది ఒడ్డున రంగనాయకిస్వామి దేవాలయం వుంది. తిక్కన సోమయాజి తాను రచించిన మహాభారతాన్ని యిక్కడి హరిహరనాథునికి అంకిత మిచ్చాడు.

### శ్రీహరికోట

ఆదిమనివాసులైన ఏనాదుల మాతృస్థానము. ఒక చిన్న ద్వీపం.

### ఉదయగిరి

ఇక్కడ విజయనగరరాజుల కాలపు కోటశిధిలాలు చూడవచ్చు. ఉదయగిరి, విజయనగరరాజుల రాజ్యంలోని ఉత్తర భాగానికి కార్యస్థానము.

### భైరవకోన

ఉదయగిరి తాలూకాలోని గ్రామం. ఉదయగిరికి 24 మైళ్ళ దూరంలో వుంది. ఇక్కడ క్రీ. శ. 7వ శతాబ్దం నాటి గుహాలయాలు, విగ్రహాలు ఉన్నవి. ఇది కాలాముఖ శైవమఠం.

### నరసింహుల కొండ

ఇక్కడ నరసింహస్వామి ఆలయం వుంది. నెల్లూరు సమీపంలోనే వుంది.

## కర్నూలు జిల్లా

### కర్నూలు

ఆంధ్రరాష్ట్రానికి రాజధాని. ఇక్కడ 15వ శతాబ్దంలో విజయనగరరాజులు నిర్మించినకోట శిథిలమైంది. కొండారెడ్డి బురుజు కోట శిథిలమవగా మిగిలినబురుజు. కర్నూలులో యిప్పుడు కోట అనిపిలువబడే ప్రాంతాన్ని పూర్వం కోటప్రాకారాలు ఆవరించి వుండేవి. బీజాపుర సుల్తానులచే కర్నూలుకు గవర్నరుగా నియమించబడ్డ వాహెబ్‌ఖాన్ తాను బ్రతికి వుండగానే గోరీని నిర్మించుకున్నాడు. ఈ గోరీని గుమ్మట్ అంటారు. హంద్రీనది ఒడ్డునవుంది. వాహెబ్‌ఖాన్ కట్టించిన మసీదు, కమానులు నిలచివున్నవి.

### శ్రీశైలం

సుప్రసిద్ధ శైవక్షేత్రం. మల్లికార్జునస్వామి ఆలయం, దాని ప్రక్కనే పార్వతి ఆలయం, వెనుక భ్రమరాంబాలయం వున్నవి. శ్రీశైలంలో తొమ్మిది ఆలయా లున్నవి. శ్రీశైల క్షేత్రంలో శివుడికి రెండు పెళ్ళిళ్ళు జరుగుతాయి. రుద్రమదేవి మంటపం, కృష్ణదేవరాయల మంటపం, శివాజీమంటపం మొదలైన మంటపా లనేకం కనిపిస్తాయి. శ్రీశైల ఆలయం శృంగేరీ మఠపీఠానికి చెందినది. నందికొట్కూరు తాలూకాలో వుంది. ఇక్కడ శివరాత్రికి బ్రహ్మాండమైన ఉత్సవాలు జరుగుతాయి. వేలాది యాత్రికులు వస్తారు. కర్నూలునుండి మార్గా-

పురం వెళ్ళాలి. అక్కడనుండి కొండలు దాటుకుంటూ శ్రీశైలం వెళ్ళాలి. ప్రయాసతో కూడుకున్న ప్రయాణం.

### అ హో బి లం

నరసింహస్వామి దేవాలయం ఉంది. ఇక్కడి పీఠాధిపతులు మూలపురుషుడైన శ్రీనివాసాచార్యుడికి నరసింహస్వామి కలలో కనబడి సన్యాసాశ్రమ మిచ్చాడట. సిరివెళ్ళ తాలూకాలో రుద్రవరం అనే గ్రామానికి అహోబిలందగ్గరగా వున్నది.

### మ హా నం ది

ఇక్కడ మహానంది ఆలయం వుంది. శివరాత్రికి ఉత్సవాలు జరుగుతాయి. ఆలయం అడవులలో వుంది.

### కొలుట్ల చెన్న కేశవ ఆలయం

కర్నూలు నుండి బళ్ళారికి పోయే మార్గంలో 5 మైళ్ళ దూరాన ఒక కొండ మీద వున్నది. కౌండిన్య మహా ముని ఇక్కడ తపస్సు చేశాడని ప్రతీతి.

## క డ ప జి ల్లా

### గం డి కో ట

ఇక్కడ విజయనగరరాజులనాటికోట, దేవాలయం ఉన్నవి. ఇక్కడ పెన్నానది ఎత్తయిన గండిగుండ ప్రవహించడంవలన, ఒక కోట ఉండటం వలన 'గండికోట' అనే పేరు వచ్చింది.

### ఒం టి మి ట్ట

సిద్దవటం తాలూకాలో ఉంది. ఇక్కడ కోదండరామస్వామి ఆలయం కలదు. ఏప్రిల్‌లో రథోత్సవం, శ్రీరామ నవమికి తెప్ప ఉత్సవం జరుగుతాయి.

### క మ లా పు రం

కమలాపురం స్టేషను దగ్గర నున్న దర్గాలో ఫాల్గుణ మాసంలో 15 రోజుల పాటు ఉర్సు జరుగుతుంది. ఈ ఉత్సవాలలో హిందువులు, ముస్లిములు పాల్గొంటారు.

### పు ష్ప గి రి

కడప తాలూకాలో ఉంది. ఇక్కడి చెన్నకేశవస్వామికి చైత్రబహుళ త్రయోదశి నుండి వైశాఖశుద్ధ సప్తమివరకు (మార్చి-ఏప్రిల్) 10 రోజులపాటు ఉత్సవాలు జరుగుతాయి.

### సో మి రె డ్డి ప ల్లి

బద్వేలు తాలూకా కందిమల్లయ్యపల్లి మఠం ఆరాధన ఉత్సవాలు సోమిరెడ్డి పల్లెలో చైత్రపౌర్ణమిముందు ఐదురోజుల పాటు, వైశాఖ పౌర్ణమి తరువాత మూడు రోజులపాటు జరుగుతాయి.

### కందిమల్లయ్యపల్లి

ఇక్కడ పోతులూరి వీరబ్రహ్మం మఠం ఉన్నది.

### రా య చో టి

ఇక్కడి వీరభద్రాలయంలో ఫిబ్రవరి నెలలో వారంరోజులపాటు రథోత్సవాలు జరుగుతాయి.

# అనంతపురం జిల్లా

## గుత్తి

తాలూకా కార్యస్థానం. గుత్తిలో మురారిరావు అనే మహారాష్ట్ర సేనాని కట్టిన కోటవుంది. ఇది 18 వ శతాబ్దంలో నిర్మించబడింది. మురారిరావు హైదరాలీలకు గుత్తికోటవద్ద యుద్ధం జరిగింది. గుత్తికోటకు నీటిసప్లయిని బంద్ చేసి హైదరాలీ మురారిరావును ఓడించాడు (వివరాలకు పేజీ 344). బొంబాయి - మద్రాసు రైలు మార్గంలో గుత్తి స్టేషను వుంది.

## పెనుకొండ

ఇక్కడ విజయనగర రాజులు నిర్మించిన కోటవుంది. తళ్ళికోట యుద్ధంలో విజయనగర రాజులు ఓడిపోయినప్పుడు తిరుమలరాయలు, సదాశివరాయలు పెనుకొండకు పారిపోయివచ్చి కొంతకాలం రాజ్యంచేశారు. ఇప్పుడీకోట శిధిలాలు కనబడతాయి. పెనుకొండ రైలుస్టేషనుకు ఎదురుగా యీ శిధిలాలు వున్నవి. పెనుకొండ గుంతకల్లు - బెంగుళూరు రైలు మార్గంలో వుంది.

పెనుకొండ విజయనగర రాజుల వేసవి మకాం. ఇచ్చటి గగనమహాలు కృష్ణదేవరాయలు నిర్మించిన వసంతభవనం. ఒక్క కర్రముక్క లేకుండా పూర్తిగా ఇటుకలతో నిర్మించబడింది. గగనమహలు ప్రక్కనే రామాలయం, శివాలయం ఉన్నవి. రామాలయం గోడలపై రామాయణ గాథలు శిల్పరూపంలో రమణీయముగ చెక్కబడ్డవి.

(వివరాలకు చూ. పేజీ 342)

## లేపాక్షి

హిందూపురం స్టేషనుకు తొమ్మిదిమైళ్ళ దూరంలోనున్న ప్రఖ్యాత ఆంధ్ర కళాక్షేత్రం. పుణ్యక్షేత్రం కూడాను. ఇక్కడి వీరభద్రేశ్వరాలయంపై చెక్కబడ్డ శిల్ప చిత్రాలు విజయనగర రాజ్యంలో విలసిల్లిన కళా నైపుణ్యానికి తార్కాణాలు. వీరభద్రేశ్వరాలయాన్నే లేపాక్షి దేవాలయం అని పిలుస్తారు. లేపాక్షి దేవాలయ మహామంటపంలోని పై కప్పుమీద రామాయణ, మహాభారత గాథలు అద్భుతమైన రంగులలో ఎంతో మనోహరంగా చిత్రించబడ్డవి. మహామంటపం 66 స్తంభాలతో నిర్మింపబడ్డది. దేవాలయంముందు 15 అడుగుల ఎత్తుగల నందీశ్వరుని విగ్రహమున్నది. (వివరాలకు : పేజీ 341)

## తాడిపత్రి

తాలూకా కార్యస్థానం. ఇక్కడ 16 వ శతాబ్దంలో నిర్మించబడ్డ చింతలరాయస్వామి దేవాలయంవుంది. దేవాలయం గోడలమీద రామాయణ మహాభారత గాథలు చెక్కబడ్డవి. 40 స్తంభాల మంటపం వుంది. పెన్నానది గట్టున రామలింగేశ్వరాలయం వుంది.

## కదిరి

తాలూకా కార్యస్థానం. ఇక్కడ పల్లవులు నిర్మించిన నృసింహస్వామి దేవాలయం ఉంది. కదిరి ఆంధ్రులకు, కన్నడిగులకు పుణ్యక్షేత్రం. ఆలయం వెనుక భృగు తీర్థమనే కొలనువుంది. ప్రతి సంవత్సరమూ ఫాల్గుణమాసంలో (మార్చి) నరసింహ

స్వామి రథోత్సవాలు 15 రోజులపాటు జరుగుతాయి. ప్రాచీనకాలంనుండి యీ దేవాలయంలోకి హరిజనులకు ప్రవేశ మివ్వబడుతున్నది.

### కటారుపల్లె

కదిరి తాలూకా. ఇక్కడ యోగి వేమన సమాధివుంది.

## చిత్తూరు జిల్లా

### చంద్రగిరి

విజయనగరరాజుల వంశానికి చెందిన శ్రీరంగరాయలకు చంద్రగిరి రాజధాని. చంద్రగిరిలోని కోటను క్రీ. శ. 1000లో ఇమ్మడి నరసింహుడనే రాజుకట్టించాడు. విజయనగరంరాజులు యీ కోటను కట్టుదిట్టం చేశారు. ఈ కోట నేడు శిధిలావస్థలో ఉన్నది. చంద్రగిరితాలూకా కార్యస్థానం ఇచ్చట వున్నది.

### తిరుపతి

దక్షిణదేశంలో ప్రసిద్ధిపొందిన పుణ్యక్షేత్రం. వెంకటేశ్వరస్వామి, గోవిందరాజస్వామి, రామస్వామి దేవాలయాలున్నవి. వెంకటేశ్వరస్వామికి బంగారు రేకులతో కప్పబడ్డ విమానం, అసంఖ్యాకమైన బంగారునగలు ఉన్నవి. ప్రతి సంవత్సరం ఇక్కడ జరిగేరథోత్సవాలకు, బ్రహ్మోత్సవాలకు అన్ని రాష్ట్రాలనుండి లక్షలకొలదీ భక్తులు వెళ్ళి మొక్కులు చెల్లించుకుంటారు. ఇక్కడనే 'స్వామి పుష్కరిణి' అనే పవిత్రమైన కోనేరున్నది. (వివరాలకు చూ. పేజీ 358)

### కాళహస్తి

ఇది శైవక్షేత్రం. పంచలింగాలలో వాయులింగం యిక్కడ వున్నదని చెబుతారు. మహాశివరాత్రికి పదిరోజులపాటు కాళహస్తీశ్వరునికి పెద్ద ఉత్సవాలు జరుగుతాయి. కాళహస్తీశ్వరాలయానికి దక్షిణపువైపున బ్రహ్మాలయం వుంది. దేశంలో ఇక్కడ తప్పితే బ్రహ్మకు ఆలయం మరెక్కడా లేదు. అగస్త్యుడు తపస్సుచేసి భూలోకానికి తెచ్చాడని చెప్పుకునే సువర్ణముఖి కాళహస్తీశ్వరాలయానికిదగ్గరలోనే ప్రవహిస్తోంది.

# లీగల్ సమాచారం

## మరణ సుంకాలు

## (ఆక్టు 34 ఆఫ్ 1953)

కూర్పు : శ్రీ యర్రబళ్ల శ్రీరామమూర్తి

ఈ చట్టం 15-10-53 నుంచి అమలులోకి వచ్చింది. జమ్మూ-కాశ్మీర్ మినహా యావత్ భారతదేశానికీ ఈ చట్టం వర్తిస్తుంది. అన్ని రాష్ట్రాల్లోనుగల స్థిరచరాస్తులపై పన్ను విధించవచ్చును. అయితే 1వ షెడ్యూల్లో పేర్కొన్న రాష్ట్రాల్లోని - (1) బొంబాయి, (2) మధ్యప్రదేశ్, (3) ఒరిస్సా, (4) పంజాబ్, (5) ఉత్తరప్రదేశ్, (6) హైదరాబాద్, (7) మధ్యభారత్, (8) రాజస్థాన్, (9) సౌరాష్ట్ర, (10) అన్ని పార్టు సి రాష్ట్రాలు-వ్యవసాయ భూములమీద మరణ సుంకాలు విధించవచ్చు. ఇతర దేశాలలోని స్థిరాస్తులకు ఈచట్టం వర్తించదు. కాని ఇండియాలో స్థిరనివాసం యేర్పరచుకొన్న వారి విదేశాలలోని చరాస్తులపై పన్ను విధించవచ్చు.

మరణ సుంకాలు, ఒకవ్యక్తి మరణానంతరం అతని ఆస్తులు వారసులకు సంక్రమించినప్పుడే విధించబడతాయి. మరణసమయంలో చేతులుమారే ఆస్తులు, పెట్టుబడి విలువలను అనుసరించి పన్ను మారుతూ వుంటుంది. 'ఆస్తులు' అనే పదం చట్టంలో నిర్వచింపబడలేదు. కాని ఏఏ తరగతులు 'ఆస్తులు' గా పరిగణించబడతాయో వివరించబడ్డాయి. ఈ క్రిందపేర్కొనబడినవి చట్టంప్రకారం ఆస్తులుగా పరిగణించ బడుతున్నాయి.

1. స్థిరచరాస్తులపై హక్కులు
2. సదరుహక్కుల అమ్మకంద్వారా సంక్రమించే సొత్తు
3. నగదు లేక పెట్టుబడులు
4. ఒకరూపంనుంచి మరొకరూపంలోకి మార్చబడిన ఆస్తులు
5. వడ్డీలద్వారా రావలసిన ఆదాయం
6. డిక్రీబాకీలు
7. తాను ఇవ్వవలసిన, తనకు రావలసిన రుణాలు
8. నగదు రూపంలోకి మార్చదగిన మరేహక్కులైనాసరే

9. మృతునితోపాటు రద్దుఅయ్యే అప్పులూ, హక్కులూ, ఇవికాక వారసులకు సంక్రమించని కొన్ని ఆస్తులుకూడా 'తదనంతర సంక్రమణ' ఆస్తులపట్టికలో చేర్చబడ్డాయి. అవి ఇవి:

1. మృతునికి జీవితకాలపు హక్కులుగల ఆస్తులు. మితాక్షర మరుమకతాయం, అలియసంతానం న్యాయసమ్మతి ప్రకారం జాయింటుకుటుంబంలో మృతునికిగల హక్కులుకూడా యిందులో చేర్చబడ్డాయి. కాని, జాయింటు హిందూకుటుంబంలో

భాగస్థుడైన ఒకవ్యక్తి 18 ఏళ్ళలోపు చనిపోతే పన్ను విధించబడదు. కాని చనిపోయిన వానికి మితాక్షరన్యాయం వర్తించే పక్షంలో కుటుంబంలో అతనికంటె పెద్దవాడు మరొకడు వారసుడు లేప్పుడు అతను 18 ఏళ్ళలోపుగా చనిపోయినప్పటికీ పన్ను విధించబడును.

2. చనిపోతానవే వుద్దేశంతో ఇచ్చేదానాలు వగైరా.

3. చనిపోయినవాడు అమ్ముకోడానికి హక్కులుగల ఆస్తులు.

4. మరణించేముందు 6 నెలలనుంచి రెండేళ్ళలోపల మృతుడుచేసిన దానాలు. అయితే మృతుడు మామూలుగా వివాహాలకు ఖర్చుపెట్టవలసి వుండి, తత్సందర్భంగా రు 5000/- వరకు చేసిన దానానికి ఈచట్టం వర్తించదు.

5. ధర్మసంస్థలకైతే ఆరునెలలకు లోబడి, ఇతరులకైతే రెండు సంవత్సరాలకు లోబడి అమ్మిన ఆస్తులు లేక హక్కు అమ్మకాలు.

6. జీవితకాలం హక్కులు, హక్కులు వుంచిని, మరణానంతరం ఇతరులకు సంక్రమించేట్టు మృతునిచే వ్రాయబడిన ఆస్తులు.

7. మృతుడు జాయింటుగా ఇతరులతో కలసి కొన్న ఆస్తులు.

8. ఇన్సూరెన్సు సొమ్ము (ఇతరులకు వ్రాసి యిచ్చినది కూడా).

9. మృతునిచే కొనబడిన లేక యితర విధంగా ఏర్పాటుచేయబడిన వార్షికాలు.

10. అయిదుగురికి మించకుండా అధికారం నిర్వహించే కంపెనీలో భాగం వుండి, దానిని అమ్ముకున్నప్పటికీ, అతనికి ఆ కంపెనీ ద్వారా మరణించే ముందు మూడేళ్ళ కాలంలో లభించే ఆదాయం.

ఈ క్రింది ఆస్తులు మరణ సుంకం నుండి మినహాయించబడ్డాయి.

1. కేవలం మృతుడు మరొకని ఆస్తిపై పెత్తనంచేస్తున్నప్పుడు, పెత్తందారుగా దానాలు పట్టినప్పుడు మరణ సుంకం వుండదు.

2. మృతుడు ధర్మకర్తగావున్న ఆస్తులు: మృతుడు ధర్మం చేసిన ఆస్తికి తానే ధర్మకర్తగా వుంటే అట్టి ధర్మం తాను మరణించడానికి ముందు ఐదేళ్ళలోపు చేసి వుండాలి. లేక తాను మరొకనితో కలిసి ధర్మకర్తగావుంటే, అట్టి ఆస్తి రెండేళ్ళ ముందు ధర్మం చేసినదై వుండాలి.

3. మృతునిపేర రాయబడి, మృతుని హక్కుభుక్తాల్లోకి రాని ఆస్తి.

4. మృతునికి జీవితకాలపు హక్కులు మాత్రమే గల ఆస్తి.

5. ఒక ఆస్తిపై భార్యాభర్తలకు పరస్పరం ఏర్పాటుచేసుకొన్న ప్రకారం జీవితకాలపు హక్కులు కలిగి, ఒకరుపోగా రెండవ వారికి సంక్రమించిన ఆస్తి.

6. మృతునికి పూర్తి క్రయధనం చెల్లించుకొన్న ఆస్తులు.

7. మృతుడు దానమిచ్చిన ఆస్తులు అయితే సదరు దానం ధర్మ సంస్థలకైతే ఆరు నెలలకు ముందు, ఇతరులకైతే రెండేళ్ళకు ముందు బేషరతుగా యిచ్చినవై వుండాలి. అంతేకాకుండా సదరు ఆస్తులు పరిగ్రహీతకు వెంటనే భుక్తమై దాత అధీనంలో లేకుండా వుండాలి. (రహస్యపు ఏర్పాట్లు ఏమిన్నీ వుండకూడదు)

8. అమ్మకానికి కాకుండా స్వోపయోగార్థం అట్టిపెట్టుకొన్న పుస్తకాలు.

9. దుస్తులు ఖరీదుగల రాళ్ళతో కుట్టబడినవై వుండరాదు.

10. ఇంటి వాడకానికి కావలసిన సామాన్లు, వ్యవసాయ పనిముట్లు వగైరా.

11. ప్రభుత్వంకోసం నిర్దేశించబడిన చిత్తరువులు, డ్రాయింగులూ మొదలైనవి.

12. డ్రాయింగులూ, వ్రాత ప్రతులూ, మృతుని కుటుంబంలో అట్టిపెట్టుకొని, రెవిన్యూబోర్డువారి అనుమతితో విడుదల చేయబడేవి.

పైన వుదహరించబడినవి కాక :

1. మృతుని కర్మలకు అయ్యే ఖర్చులకింద రు. 1000/-

2. వాస్తవంగా మృతుడు చెల్లించవలసిన రుణాలు, మృతుడు చెల్లించవలసిన పన్నులు ఏవైనా వుంటే అవి మృతుని రుణాల క్రిందనే పరిగణించబడును.

3. రు. 5000/- మించని స్త్రీ ధనాలు.

4. మొత్తం ఆస్తుల విలువలో 5% మించకుండా విదేశాల్లో మృతునికిగల ఆస్తుల నిర్వహణ ఖర్చు.

5. చనిపోవడానికి ఆరునెలలకు ముందు ధర్మ సంస్థలకైతే రు. 2,500/-వరకు, ఇతరంలో రెండేళ్ళకు పూర్వం మొత్తం రు. 1500/-వరకు చేసిన దానాలు.

6. మరణసుంకం చెల్లింపుకోసం, ప్రభుత్వానికి వ్రాసి యిచ్చిన ఇన్సూరెన్సు పాలసీలు (రు. 50,000/-వరకు)

7. రు. 5000/- మించని ఇన్సూరెన్సు పాలసీలు.

8. మృతునిపై ఆధారపడివున్న బంధు స్త్రీల పెళ్ళిళ్ళకోసం లేక జీవనంకోసం ప్రత్యేకంగా చేసిన ఇన్సూరెన్సులు, రు. 5,000/- మించకుండా పన్నునుంచి మినహాయించబడతాయి.

ఒకే కుటుంబంలో వెంటవెంటనే మరణాలు సంభవిస్తే పన్ను తగ్గింపుకు చట్టంలో ఏర్పాటు చేయబడింది.

ఒక యజమాని చనిపోయిన 1 సంవత్సరంలో మరో యజమాని చనిపోతే మాటికి 50%, రెండవయేట చనిపోతే 40%, మూడవయేట చనిపోతే 30%, నాల్గవ యేట చనిపోతే 20%, అయిదవయేట చనిపోతే 10% పన్ను తగ్గించబడుతుంది. మూడునెలల్లో ఎంతమంది మరణించినా ఒకే మరణంగా యెంచబడును. భర్త చనిపోయిన యేడేళ్ళలోపుగా హిందూ స్త్రీ చనిపోయే పక్షంలో అవిడకుగల ఆస్తి హక్కులుకూడా పన్నునుంచి మినహాయిస్తారు.

మొత్తం ఆస్తులు అన్నీ కలిపి విలువకట్టి, మినహాయింపులు పోగా మిగిలిన ఆస్తులపై చెల్లించవలసిన మరణసుంకాల రేట్లు ఇవి :

| | | | | మితాక్షర, మరుమ కత్తాయం, అలియ సంతానం లా ప్రకారం జాయింటు కుటుంబ ఆస్తులకు | ఇతర ఆస్తులకు |
|---|---|---|---|---|---|
| 1. | మొదటి | రు. 50,000-- | పైన | సుంకంలేదు | సుంకంలేదు |
| 2. | తర్వాత | రు. 50,000-- | ,, | 5% | ,, |
| 3. | ,, | రు. 50,000-- | ,, | 7½% | 7½% |
| 4. | ,, | రు. 50,000-- | ,, | 10% | 10% |
| 5. | ,, | రు. 1,00,000-- | ,, | 12½% | 12½% |
| 6. | ,, | రు. 2,00,000-- | ,, | 15% | 15% |
| 7. | ,, | రు. 5,00,000-- | ,, | 20% | 20% |
| 8. | ,, | రు. 10,00,000-- | ,, | 25% | 25% |
| 9. | ,, | రు. 10,00,000-- | ,, | 30% | 30% |
| 10. | ,, | రు. 20,00,000-- | ,, | 35% | 35% |
| 11. | మిగతా మొత్తాలమీద | | | 40% | 40% |

మృతునికి కంపెనీలలోగల వాటాలపైన—

మొదటి రు. 5,000-- సుంకంలేదు.

తర్వాత రు. 5,000--లకు మించిన అన్ని మొత్తాలమీద 7½%

# ఆదాయంపన్ను

[1922 లో జారీచేయబడిన 11 వ చట్టం]

ఆదాయంపన్ను అంటే, అందరూ అనుకున్నట్లే, వ్యక్తులు ఆర్జించే ఆదాయం మీద వేయబడేపన్ను. చట్టంలో 'ఆదాయంపన్ను' నిర్వచించబడలేదు. ఆర్థిక సంవత్సరంలో (Assesment year) యేయే ఆర్జనలు ఆదాయంకిందకు వస్తాయో వివరించబడ్డాయి. స్థూలదృష్టికి కనుపించే ఆదాయంకాక, ఈ దిగువపేర్కొనబడ్డ అయిటంలు కూడా ఆదాయంకింద లెక్కకట్టబడుతున్నాయి :

1. అగ్రిమెంటు ప్రకారం జీతగానికిగాను యజమాని జీతంలో మినహాయించకుండా కట్టుతున్నపన్ను.

2. ఉచితంగా యివ్వబడిన ఇంటి అద్దెవిలువ.

3. పన్నుదారు ఆక్రమణలో లేక స్వంత ఇంటి అద్దె విలువ.

4. పన్ను చార్జ్ చేయబడిన కంపెనీ డివిడెండ్లు, ఆదాయంపన్ను విధించేందుకు ఆదాయం ఈ దిగువ విధంగా విభజించ బడింది.

## ఎ. జీతాలు

ఒక ఆర్థిక సంవత్సరంలో ఒకవ్యక్తికివచ్చే పూర్తిజీతంమీద ఆదాయంపన్ను వేయ బడుతుంది. ఇదికాక అతనికిగాను యజమాని చెల్లిస్తున్న ఆదాయంపన్ను, వుచితంగా యజమానిచే యివ్వబడిన ఇంటిఅద్దె విలువ అతని ఆదాయంగానే పరిగణించ బడుతుంది. సామాన్యంగా జీతంలో 10% ఇంటిఅద్దెకింద లెక్కకట్ట బడుతుంది.

తగ్గింపులు : తనబాధ్యతల నిర్వహణలో ఖర్చుచేయబడిన ఖర్చులు వగైరాలు జీతంవల్ల వచ్చే ఆదాయంలోనుంచి తగ్గించి పన్ను వేయబడుతుంది.

## బి. సెక్యూరిటీలమీద వచ్చేవడ్డీ

కేంద్ర లేక రాష్ట్ర ప్రభుత్వ సెక్యూరిటీలు, లిమిటెడ్ కంపెనీ సెక్యూరిటీల మీద వచ్చేవడ్డీలు.

తగ్గింపులు : 1. వడ్డీవసూలుకగాను బ్యాంకులకు చెల్లించవలసిన కమీషన్.

2. సెక్యూరిటీబాండ్లు కొనుబడి నిమిత్తం చేయబడిన ఋణాలపై చెల్లించవలసిన వడ్డీ సదరు మొత్తంలోనుంచి మినహాయించి పన్ను చార్జ్ చేయబడుతుంది.

3. ఆస్తి : పన్నుదారుకు వున్న యావదాస్తులమీద (వ్యవసాయ భూములు మినహాయించి) వచ్చేరాబడిమీద పన్ను చెల్లించవలసి వుంటుంది.

తగ్గింపులు : 1. అద్దె విలువలో ½ కు మించకుండా ⅛ వరకు మున్సిపల్ పన్ను.

2. ఇంటి అద్దె విలువలో మరామ్మత్తు కింద ⅙ వంతు

3. ఆస్తి బీమాక్రింద చెల్లించబడిన ప్రీమియంలు.

4. ఆస్తిమీద వున్న బాకీలు వగైరాలకు చెల్లించవలసిన వడ్డీలు.

5. నేల అద్దె

6. భూమి శిస్తు

7. ఇల్లు ఖాళీగావున్న కాలంలో వచ్చే దామాషా రాబడి.

8. వసూలుకాని బకాయి అద్దెలు తగ్గించగా వచ్చిన ఆస్తి ఆదాయంమీద పన్ను వేయబడుతుంది.

అయితే ఈ దిగువ వుదహరించబడిన స్థిరాస్తులమీద ఆదాయం పన్ను అసలే వుండదు.

(a) వ్యవసాయపు భూములకు ఆనుకొని వుండి, వ్యవసాయపు పనులకోసం వినియోగించబడుతూవున్న భవనాలు.

(b) పన్నుదారు స్వంత వ్యాపారంకోసం వినియోగించబడుతూవున్న ఆస్తి.

(c) 1 ఏప్రిల్ 1946 నుంచి 31 మార్చి 56 మధ్య కట్టబడిన యిండ్లకు – ఇల్లు కట్టబడినది మొదలు రెండు ఇండ్లవరకు పన్ను లేదు.

4. వ్యాపారవృత్తి : వ్యాపారంలో వచ్చే ––లమీద, లాయరు, డాక్టరు వగైరాలాంటి వృత్తులవల్లవచ్చే రాబడిమీద పన్ను విధించబడుతుంది.

తగ్గింపులు :

1. అగ్నిభీమా వగైరాలకు కట్టబడిన ప్రీమియంలు
2. భవనాలు, యంత్రాలు, ఫర్నీచరు వగైరాలకు
3. అయిన మరామత్తుఖర్చులు
4. పెట్టుబడి వడ్డీ.
5. వ్యాపారానికిగాను తెచ్చిన రుణాలమీద చెల్లించవలసిన వడ్డీలు
6. పనివారలకు చెల్లించిన కమీషనులు, బోనస్‌లు
7. పారుబాకీలు
8. వ్యాపారంలో పనిచేస్తున్న ఎద్దులు వగైరాలు చనిపోతే వాటి నామాషా విలువ.
9. కొన్ని కొన్ని వాటిల్లో అరుగుదల తరుగుదలలు

వగైరాలను తగ్గించగా వచ్చిన రాబడిమీద ఆదాయపుపన్ను వేయబడుతుంది.

5. ఇతర రాబడులు : పైన పేర్కొనబడిన నాలుగురకాల రాబడులుకాక ఇతరత్రా వచ్చే రాబడులన్నీ దీనిక్రిందకు వస్తాయి. ఉదాహరణకు : ఖాళీస్థలాలవల్ల వచ్చే అద్దెలు, పేటెంట్లు అమ్మకం సొమ్ము, రాయల్టీగా వచ్చే రాబడి వగైరాలు.

తగ్గింపులు :

1. రాబడికోసం అయ్యే ప్రయాణపు ఖర్చులు.
2. ఇందుకోసం అప్పులు తెస్తే, అందుకు అయ్యే వడ్డీలు.
3. యంత్రాలు వగైరా అద్దెకిస్తే, అరుగుదల తరుగుదలలు.

వివిధరకాల రాబడులమీద ఇచ్చే తగ్గింపులు పోను, శేషించిన మొత్తం ఆదాయంమీద మరికొన్ని 'మినహాయింపులు' యివ్వబడుతున్నాయి.

1. ఆర్జిత ఆదాయం తగ్గింపు : (Earned Income Relief) పన్నుదారు కష్టపడి వ్యాపారం, జీతాలు, వృత్తి, యితర విధాల సంపాదించినందుకుగాని, అతని ఆదాయం మొత్తంనుంచి రు. 4000/-లకు మించకుండా 20% వర్తక పన్ను లేకుండా మినహాయించబడుతుంది.

2. ధర్మసంస్థలకు ఇచ్చే ఆర్థిక సహాయం : ఆదాయం పన్ను చట్టంలో గుర్తించబడిన ధర్మసంస్థలకు, విద్యాసంస్థలకు యిచ్చిన ధనసహాయం, ఆదాయంపన్ను నుంచి తగ్గించబడుతుంది. సదరు సహాయం రు. 250/-లకు తగ్గకుండా, పన్నుదారు ఆదాయంలో 20%కు మించకుండా చేయవచ్చు.

3. భీమా పాలసీలు : పన్నుదారు కట్టుతూన్న భీమా పాలసీ ప్రీమియంలుకూడా ఆదాయం పన్నునుంచి మినహాయించబడతాయి. ఆ తగ్గింపు అయినా పన్నుదారు ఆదాయంలో $\frac{1}{6}$ వంతుకు, మొత్తం రు. 6,000/-లకు మించకుండా అంగీకరించబడుతుంది. ఇదే తగ్గింపు అవిభక్తకుటుంబానికి అయితే కట్టింపు యివ్వబడుతుంది.

4. కొత్తగా నిర్మించబడిన పారిశ్రామిక సంస్థల ఆదాయం : 1 ఏప్రిల్ 1948 నుంచి ఆరుసంవత్సరాలలోపు నిర్మించబడి, సరుకులను వుత్పత్తి చేస్తున్న పారిశ్రామిక సంస్థల ఆదాయం నుంచి 6% వరకు పన్నులేకుండా ప్రత్యేకంగా మినహాయించబడింది.

ఈ పైన చెప్పిన మినహాయింపులన్నీ వ్యక్తులకు, హిందూ అవిభక్తకుటుంబాలకు రిజిష్టర్ కాని ఫరంలకు, జాయింటు వ్యాపారాలకు వర్తిస్తాయి.

ఈ తగ్గింపులన్నీ పోగా వచ్చిన రాబడి మొత్తంమీద చెల్లించవలసిన ఆదాయం పన్నురేట్లు యివి :

| ఆదాయం పన్ను | రేట్లు | సర్ ఛార్జి |
|---|---|---|
| 1. మొదటి రు. 1,500 లు మీద | పన్ను లేదు | లేదు ప్రక్కకాలం రేటుకు |
| 2. తర్వాత రు. 3,500 లు మీద | రూ. 9 పైసలు చొ॥ | $\frac{1}{20}$ వంతు |
| 3. ,, రు. 5,000 లు మీద | అణా తొమ్మిదిపైసలు | ,, |
| 4. ,, రు. 5,000 లు మీద | మూడు అణాలు | ,, |
| 5. మిగతా మొత్తాల మీద | నాలుగు అణాలు | ,, |

పరా : అవిభక్త హిందూ కుటుంబాలకు రు. 14,400 లు, ఇతర్రా రు. 7,200 లు లోపు రాబడిమీద సదరు సర్ ఛార్జి వుండదు

## సూపర్ టాక్స్

| | రేట్లు | సర్ ఛార్జి |
|---|---|---|
| 1. మొదటి రు. 25,000 లు మీద | లేదు | లేదు |
| 2. తర్వాత రు. 15,000 లు మీద | రూపాయకు మూడణాలు | ప్రక్క కాలంలో రేటుకు 1/20 వంతు |
| 3. " రు. 15,000 లు మీద | నాలుగు అణాలు | " |
| 4. " రు. 15,000 లు మీద | ఆరణాలు | " |
| 5. " రు. 15,000 లు మీద | ఏడణాలు | " |
| 6. " రు. 15,000 లు మీద | ఏడణాలన్నర | " |
| 7. " రు. 50,000 లు మీద | ఎనిమిదణాలు | " |
| 8. " మిగతా మొత్తాల మీద | ఎనిమిదణాలన్నర | " |

షరా: వ్యక్తిగత ఆదాయం రు. 4,200 ల లోపు, హిందూ అవిభక్త కుటుంబ ఆదాయం రు. 8,400 ల లోపు అయితే ఆదాయం పన్ను అసలే కట్టనవసరంలేదు.

### లిమిటెడ్ కంపెనీలు కట్టవలసిన పన్ను

ఆదాయం పన్ను: ప్రతి రూపాయకు పావలా చొప్పున పన్నుకట్టాలి. కంపెనీ లకు ఏ విధమైన తగ్గింపులూ లేవు.

సర్ ఛార్జి: ఆదాయం పన్నుమీద 5% సర్ ఛార్జీ క్రింద చెల్లించాలి. ఇదికాక కంపెనీలు కార్పొరేషనుటాక్సు కూడా కట్టాలి. ఆదాయం హెచ్చినకొద్దీ కార్పొరేషన్ టాక్సు కూడా హెచ్చుతుంది.

# ఇండియన్ స్టాంపు ఆక్టు

(1899 లో జారీకాబడిన 2వ కేంద్ర చట్టం)

(1922 లో జారీకాబడిన 6వ మద్రాసు చట్టంచే సవరించబడింది)

| దస్తావేజు స్వభావం | స్టాంపు డ్యూటీ |
|---|---|
| 1. దత్తత దస్తావేజు (adoption deed)<br>(a) స్వీకారం (b) అధికారం (c) అంగీకారం | 22—8—0 |
| 2. ఖరారు నామాలు | 1—8—0 |

| దస్తావేజు స్వభావం | స్టాంపు డ్యూటి | | |
|---|---|---|---|
| | ఒకటే రాయబడితే | సెట్టుకు రెండుగా రాయబడితే | సెట్టుకు మూడుగా రాయబడితే |
| 3. హక్కు పత్రాలు, తనఖా ఖరారు నామా (Agreement relating to deposit of title deeds) | | | |
| (a) బాకీ అడిగినప్పుడుగాని (on demand) మూడు నెలల అనంతరం ఇచ్చే ఏర్పాటుతో అయితే | | | |
| బాకీ మొత్తం రు 200 మించకపోతే | 0- 9-0 | 0- 6-0 | 0- 3-0 |
| బాకీ మొత్తం రు 200 మించి రు 400 మించకపోతే | 1- 2-0 | 0- 9-0 | 0- 6-0 |
| ,, 400 ,, 600 ,, | 1-11-0 | 0 15-0 | 0- 9-0 |
| ,, 600 ,, 800 ,, | 2- 4-0 | 1. 2-0 | 0-12-0 |
| ,, 800 ,, 1,000 ,, | 2-13-0 | 1- 8-0 | 0-15-0 |
| ,, 1,000 ,, 1,200 ., | 3- 6-0 | 1-11-0 | 1- 2-0 |
| ,, 1,200 ,, 1,600 ,, | 4- 8 0 | 2- 4-0 | 1- 8-0 |
| ,, 1,600 ,, 2,500 ,, | 6-12-0 | 3- 6-0 | 2- 4-0 |
| ,, 2,500 ,, 5,000 ,, | 13- 8-0 | 6-12-0 | 4- 8-0 |
| ,, 5,000 ,, 7,500 ,, | 20- 4-0 | 10- 2-0 | 6-12-0 |
| ,, 7,500 ,, 10,000 ,, | 27- 0-0 | 13- 8-0 | 9- 0-0 |
| ,, 10,000 ,, 15,000 ,, | 40- 8-0 | 20- 4-0 | 13- 8-0 |
| ,, 15,000 ,, 20,000 ,, | 54- 0-0 | 27- 0-0 | 18- 0-0 |
| ,, 20,000 ,, 25,000 ,, | 67- 8-0 | 33-12-0 | 22- 8-0 |
| ,, 25,000 ,, 30,000 ,, | 81- 0-0 | 40- 8-0 | 27- 0-0 |
| ,, 30,000 పైన ప్రతి 10,000 కు లేక అందలి భాగానికి | 27- 0-0 | 13- 8-0 | 9- 0-0 |

(b) బాకీ మొత్తం మూడు నెలల్లోపే తీర్మానించే వరకు అవుతే పైనచెప్పిన రేట్లలో సగం చెల్లించాలి.

4. (a) తనఖాలు: అస్వాధీనపు తనఖా అయితే తనఖా మొత్తానికి:

| | |
|---|---|
| మొత్తం తనఖా రు 10 మించినపుడు | 0- 6-0 |
| ,, రు 10 లకు మించి 50 మించనప్పుడు | 0-12-0 |
| ,, 50 ,, 100 ,, | 1- 8-0 |
| ,, 200 ,, 300 ,, | 4- 8-0 |
| ,, 300 ,, 400 ,, | 6- 0-0 |

| దస్తావేజు స్వభావం | | | | | స్టాంపు డ్యూటీ |
|---|---|---|---|---|---|
| మొత్తం తనఖా | 400 లకు | మించి | 500 | మించనప్పుడు | 7-8-0 |
| ,, | 500 | ,, | 600 | ,, | 9-0-0 |
| ,, | 600 | ,, | 700 | ,, | 10-8-0 |
| ,, | 700 | ,, | 800 | ,, | 12-0-0 |
| ,, | 800 | ,, | 900 | ,, | 13-8-0 |
| ,, | 900 | ,, | 1000 | ,, | 15-0-0 |
| ,, 1000 మించినప్పుడు ప్రతి 500 లకు అందలి విభాగానికి | | | | | 7-8-0 |
| (b) స్వాధీనపు తనఖా అవుతే తనఖా మొత్తానికి మొత్తం తనఖా రు 50 లు మించనపుడు | | | | | 1-8-0 |
| మొత్తం బాకీ | 50 రూ. | మించి | 100 రూ. | మించనప్పుడు | రు. 3-0-0 |
| ,, | 100 | ,, | 200 | ,, | 6-0-0 |
| ,, | 200 | ,, | 300 | ,, | 9-0-0 |
| ,, | 300 | ,, | 400 | ,, | 12-0-0 |
| ,, | 400 | ,, | 500 | ,, | 15-0-0 |
| ,, | 500 | ,, | 600 | ,, | 18-0-0 |
| ,, | 600 | ,, | 700 | ,, | 21-0-0 |
| ,, | 700 | ,, | 800 | ,, | 24-0-0 |
| ,, | 800 | ,, | 900 | ,, | 27-0-0 |
| ,, | 900 | ,, | 1000 | ,, | 30-0-0 |
| వేయి రూపాయిలకు మించినప్పుడు ప్రతి రు. 500 లకు అందలి భాగానికి | | | | | 15- 0-0 |
| (c) స్వాధీనపు తనఖా (Usufructuary Mortagge) | | | | | పై మాదిరిగా స్టాంపు పెట్టవలెను. |
| (d) ఆస్తి అమ్మకం షరతుతో పెట్టబడిన తనఖా (Mortgage by Conditional Sale) | | | | | డిటో |
| (e) 1. తనఖామీద తనఖా పెట్టవలసివస్తే (Further change on Mortgage): రెండవ తనఖాకూడా మొదటి తనఖావలె అస్వాధీనపు తనఖా అయితే అదనంగా యివ్వబడిన మొత్తంమీద | | | | | అస్వాధీనపు తనఖా మాదిరి |

| దస్తావేజు స్వభావం | స్టాంపు డ్యూటీ |
|---|---|
| 2. పూర్వపు తనఖా, అదనం తనఖా రెండున్నూ స్వాధీనపు తనఖాలైతే అదనం తనఖా మొత్తంమీద | స్వాధీనపు తనఖా మాదిరి |
| 3. దర్మిలా తనఖా స్వాధీనపు తనఖా అయి, మొదటిది అస్వాధీనపు తనఖా అయితే | రెండు తనఖాల మొత్తం మీద పైమాదిరిగా లెక్కకట్టగా తేలిన మొత్తంలోని, మొదటితనఖాకు వుంచబడిన స్టాంపును మినహాయించవలెను. |
| 4. A తనఖాసొత్తు తిరిగి వొప్పగించుకొనేందుకు వాపసు దస్తావేజు (Reconveyance deed of Mortgaged Property) : | |
| (a) స్వాధీనపు తాకట్టు రు. 1000 కు మించని యెడల వాపసు దస్తావేజులో చేయబడిన ప్రతిఫలం మీద | 4 (b) స్వాధీనపు తనఖా మాదిరి |
| (b) మిగతా ఏ ఇతర సంగతిలోనైనా | 30-0-0 |
| 5. పంట తనఖా (Mortgage of crop) | |
| (a) మూడు నెలల్లో బాకీతీర్చే షరతులో బాకీ మొత్తం రు 200 కు మించనిచో | 0-4-0 |
| బాకీ మొత్తం రు. 200 మించినచో ప్రతి రు. 200 లకు అందలి భాగాలకు | 0-4-0 |
| (c) 18 నెలల్లోగా బాకీ తీర్చే యెడల బాకీ మొత్తం రు. 100కు మించనిచో | 0-6-0 |
| (d) బాకీ మొత్తం రు. 100 కు మించినచో ప్రతి రు. 100 కు అందలి భాగాలకు | 0-6-0 |
| 6. దాన పత్రాలు (Gifts deeds) దానం చేయబడిన మొత్తం ఆసి విలువ మీద | నెం. 4(b) స్వాధీనపు తనఖా మాదిరి |
| 7. కవుల్లు (Leases) వ్యవసాయమునకు సంబంధించినవి | |
| (a) ఏకసాలీ కవుల్కు - మక్తా ఎంత అయినా సరే | స్టాంపు లేదు |

| దస్తావేజు స్వభావం | స్టాంపు డ్యూటీ |
|---|---|
| (b) కవులును గురించి ఒక ఖరారునామా రాసుకొని సదరు ఖరారునామాకు, కవులుకు ఎంత స్టాంపు పెట్టవలయునో అంత స్టాంపుమీద ఖరారునామా వ్రాసుకుని, సదరు ఖరారునామాప్రకారం దర్శిలా కవులు వ్రాసుకున్నయెడల సదరు కవులుకు | 1_8_0 |
| (c) పైన చెప్పబడిన కవుళ్ళుకాక మిగతా ఏలాంటి కవుళ్ళకయినా...... | |
| 1. కవులు కాలపరిమితి ఒక సంIIగాని అంతకు తక్కువ గాని అయితే మక్తాకాలానికి అయ్యే సొమ్ముమీద | 4 a అస్వాధీనపుతనఖా మాదిరి. |
| 2. 1 సం. మించి 5 సం. మించని కవుళ్ళకు 1 సం. దామాషా మక్తా సొమ్ముమీద | డిటో |
| 3. 5 సం. మించి 10 సం. మించని కవుళ్ళకు 1 సం. దామాషా మక్తాసొమ్ముమీద | 4b స్వాధీనపు తనఖా మాదిరి. |
| 4. 10 సం. మించి 20 సం. మించని కవుళ్ళకు 1 సం. దామాషా మక్తాసొమ్ముకు రెట్టింపుమీద | డిటో |
| 5. 20 సం. కవుళ్ళకు దామాషా మక్తాసొమ్ముకు మూడురెట్ల మొత్తంమీద | డిటో |
| 6. 30 సం. మించి 100 సం. మించనప్పుడు దామాషా మక్తాసొమ్ముకు నాలుగు రెట్లమీద | డిటో |
| 7.a కౌలువిడుదలలు (Surrender of Leases) అసలు కౌలు రు 15 మించని స్టాంపుమీద రాయబడివుంటే | అసలుకౌలుకు స్టాంపు యెంతో అంత |
| అసలు కౌలు రు 15 మించిన స్టాంపుమీదరాయబడి వుంటే | 15_0_0 |
| అసలు కౌలుకు స్టాంపే లేకుండావుంటే... | స్టాంపు అవసరంలేదు. |
| 7.b కౌలు మార్పు (Transfer of Lease) అసలు కౌలుకు స్టాంపే లేకుండావుంటే | ట్రాన్స్‌ఫర్‌కుస్టాంపు అవసరంలేదు. |
| కౌలు ఎంత ప్రతిఫలానికి ట్రాన్స్‌ఫర్ చేయబడుతున్నదో అంత ప్రతిఫలంమీద | 4b – స్వాధీనపు తనఖా మాదిరి |
| 8. పంపిణీ దస్తావేజులు (Partition deeds) (a) రెండు సమానవాటాలైతే ఒకభాగం విలువమీద | 4 a అస్వాధీనపు తనఖామాదిరి |

| దస్తావేజు స్వభావం | స్టాంపు డ్యూటీ |
|---|---|
| (b) రెండు అసమానమైన వాటాలైతే, చిన్నవాటా విలువమీద | డిటో |
| (c) రెండుకన్నా యెక్కువ వాటాలైతే, పెద్దవాటా మినహాయించి, మిగతా చిన్నవాటాల మొత్తం విలువమీద | డిటో |
| 9. భాగ వ్యాపారపుదస్తావేజులు (Partnership deed) | |
| (a) పెట్టుబడి రు 500 లకు మించనిచో | 10- 0-0 |
| (b) పెట్టుబడి రు 500 లకు మించినచో | 40- 0-0 |
| సదరు భాగ వ్యాపారపు రద్దు దస్తావేజుకు | 20- 0-0 |
| 10. హక్కు విడుదల దస్తావేజులు (Release deeds) (1)సామాన్యంగామనోవర్తి (2)వారసత్వం (3)భాగం (4) జీవితకాలం హక్కు (5) పట్టావగైరాహక్కులు వదలుకొన్నట్లు రాయబడే దస్తావేజులకు— హక్కు వదలుకొన్న ఆస్తివిలువ లేక ప్రతిఫలం రు. 1000 లకు మించకుండా ఉంటే ఆ మొత్తంమీద | నెం 4 a అస్వాధీనపు తనఖా మాదిరి |
| రు. 1000 లకు మించి ఎంతఅయినాసరే | 15- 0-0 |
| 11. (a) సెటిల్‌మెంటు దస్తావేజులు అయితే ఆస్తి కిమ్మత్తుమీద | నెం. 4a మాదిరి |
| (b) సెటిల్‌మెంటు రద్దుకు— ఆస్తి మొత్తం విలువమీద | పై మాదిరిగానే రు. 30 మించి స్టాంపు పెట్ట నక్కరలేదు. |
| 12. ప్రామసరీ నోటు అడిగినపుడు (On demand) చెల్లించేలాగున రు. 250 మించినపుడు | 0- 1-0 |
| 250 మించి రు 1000 మించనపుడు | 0- 2-0 |
| రు 1000 మించినపుడు ఎంత అయినాసరే | 0 4-0 |
| 13. రసీదులు (Receipts) రు 20 మించిన సొమ్ము పుచ్చుకొని యిచ్చినరసీదులకు | 0- 1-0 |
| 14. వీలునామా ఒకరి మరణానంతరం జరుగవలసిన ఏర్పాటులను గురించి వ్రాయబడిన దస్తావేజు వీలునామా | స్టాంపు లేదు |
| 15. బాకీదారున్నూ రుణదాతలున్నూ చేసుకొను ఒప్పందం | 22- 8-0 |

| దస్తావేజు స్వభావం | స్టాంపు డ్యూటీ |
|---|---|
| 16. A కన్వేయన్స్ రేట్లు (విక్రయ దస్తావేజుల వగైరాలమీద) | 4 b మాదిరిగా |
| 16. B జామీను బాండు | |
| (a) జామీను మొత్తం స్థిరాస్తితో నిమిత్తం లేకుండా, రు 1,000 మించనిచో సదరు మొత్తానికి | 4 a అస్వాధీనపు తనఖా మాదిరి |
| (b) జామీను మొత్తం రు. 1000 కన్న మించినచో ఎంత మొత్తమైనను సరే | 15-0-0 |
| (c) స్థిరాస్తి జామీనుమీద ఎంత మొత్తం నిలబడుతుందో అంత మొత్తంమీద | 4 a మాదిరి |
| (d) వ్యవసాయదారుల ఋణ చట్టాలనుబట్టి బాకీదారులుగాని, వారి జామీనుదారులుగాని వ్రాసి యిచ్చు జామీను బాండుకు | స్టాంపు లేదు |

# రైతు ఋణ నివారణ చట్టం

(1938 లో జారీకాబడిన 4 వ చట్టం)

ఉన్న అప్పులను తగ్గించి, భావి అప్పులమీద తగ్గింపువడ్డీరేటు అమలుపరచి, తద్వారా రైతుకు ఋణభారం నుంచి రక్షణ కల్పించే నిమిత్తం యీ చట్టం (The Madras Agricultural Dept. Rules & Act, 1938) అమల్లోకి తేబడింది.

ఈ చట్టం రైతులకు మాత్రమే వర్తిస్తుంది. రైతు అనగా

(a) రాష్ట్రంలోవున్న ఏదైనా వ్యవసాయపు లేక తోటల భూముల్లో అమ్మకం హక్కు (Saleable Interest) గల వ్యక్తి. (సదరు భూమి మ్యునిసిపాలిటీ లేక కంటోన్మెంటు సరిహద్దుల్లో వుండరాదు. గవర్నమెంటు వారివల్ల లేక స్తుతో వుచితంగా మంజూరు చేయబడినదై వుండరాదు.)

(b) మద్రాసు ఎస్టేట్సు ల్యాండు ఆక్టు 1908 ప్రకారం భూస్వామ్యదు (Land holder) క్రింద రైతుగా వుంటూ, సదరు భూమిమీద హక్కు కలిగియున్న వ్యక్తి.

(c) మలబార్ టెనెన్సీయాక్టు 1929 ప్రకారం అలాంటిభూముల్లో హక్కులు గల వ్యక్తి.

(d) పైన a, b, c క్లాజుల్లో వుదహరించబడిన భూముల్లో గాలు హక్కులు గల వ్యక్తి.

అయితే దిగువ వుదహరించిన వ్యక్తులు, రైతులుగా పరిగణించబడరు.

(a) 31 మార్చి 1938 తో అంతమయ్యే ఆర్థికసంవత్సరంతో కలిపి రెండు సంవత్సరాలు ఆదాయంపన్ను కట్టిన వ్యక్తి.

(b) 1 అక్టోబరు 1937 కు ముందు 1937 తో కలుపుకొని వరుసగా నాలుగు అర్థసంవత్సరాలకు, రు 600 ఆదాయం (వ్యవసాయ ఆదాయం మినహా) మీద వృత్తి పన్ను ప్రతి అర్థసంవత్సరానికి కట్టిన వ్యక్తి.

(c) 1 అక్టోబరు 1937 కు ముందు 1937 తో కలుపుకొని వరుసగా నాలుగు అర్థసంవత్సరాలకు వ్యవసాయపు మినహా ఆస్తి లేక యింటిపన్ను కట్టిన వ్యక్తి.

(d) రు 500 మించిన పేష్కను కట్టే ఎస్టేటుకు హక్కుదారుడు లేక రు 100 మించి క్విట్ రెంటు, జోడీ కట్టబడి లేక హామపు చెల్లిస్తున్న వ్యక్తి.

పై నిర్వచనం ప్రకారం 'రైతు' అయిన వ్యక్తి ఋణాలు విధిగా చట్ట నిబంధనల ప్రకారం తగ్గించబడతాయి. అయితే 13 A. సెక్షన్ ప్రకారం B. C. వ్యక్తులు కూడా రైతులుగానే పరిగణించబడాలి.

1 అక్టోబరు 1932 కు పూర్వం చేయబడిన ఋణాలు తగ్గింపుకు సంబంధించిన నిబంధనలు.

1. 1 అక్టోబరు 1937 నాటికి, తీర్మానం చేయవలసిన వడ్డీ యావత్తు తీర్మానం చేయబడినట్టే పరిగణించబడును. అసలు మొత్తంనుంచి ఏమైనా సొమ్ము చెల్లించవలసి వుంటే, సదరు మొత్తం చెల్లించిన పక్షంలో బాకీ పూర్తిగా తీర్మానం చేయబడినట్టు యెంచబడును.

2. బాకీదారుడు పెట్టుబడిదారుని వద్దనుంచి తెచ్చిన అసలుకు రెట్టింపు మొత్తం చెల్లించివుంటే, బాకీ పూర్తి పరిష్కారం అయినట్టే.

3. అసలు ఫాయిదాలకుగాని వడ్డీ లేక అసలు పరిష్కారం నిమిత్తం చెల్లించబడిన సొమ్ము, అప్పు తెచ్చిన అసలుకు రెట్టింపుకు తగ్గితే, సదరు కురదలా మొత్తం లేక అసలుకింద యివ్వవలసిన కురదాలల్లో ఏ మొత్తం తక్కువైతే, ఆ మొత్తం చెల్లిస్తే, బాకీ పూర్తి పరిష్కారం అయినట్టుగానే భావించబడును.

4. ఏ పెట్టుబడిదారుడు అయినా, ఈ చట్టం అమల్లోకి రాకపూర్వం 1, 2, 3 క్లాజుల ప్రకారం కన్న ఎక్కువ మొత్తం వసూలు చేసివున్నట్టయితే సదరు మొత్తం బాకీదారునకు వాపసు చేయనక్కరలేదు.

1 అక్టోబరు 1932 న గాని, దర్మిలాగాని చేయబడిన అప్పుతగ్గింపుకు వర్తించే నిబంధనలు—

పై తేదీలగాయతు ఈచట్టం అమలులోకి వచ్చేవరకు ఉభయపార్టీలు అంగీకరించిన వడ్డీరేటు నూటికి సంవత్సరానికి రు 5 చొప్పున వడ్డీరేటుల్లో ఏ వడ్డీరేటు తక్కువైతే ఆవడ్డీరేటు చొప్పున వడ్డీకట్టబడును. ఈలోగా బాకీదారు వడ్డీకింద కొంతసొమ్ము చెల్లించి ఉంటే సదరుసొమ్ముపోను కురదలావడ్డీసొమ్ము మాత్రమే చెల్లించవలెను.

2. ఏ పెట్టుబడిదారుడైనా ఈ ఆక్టు ప్రకారం అసలు రావలసిన దానికన్న ఎక్కువ వసూలుచేసి ఉంటే సదరు మొత్తం వాపసు చేయనవసరంలేదు.

ఇదికాక స్వాధీనపు తనఖా తగ్గింపులకు (Usufructuary Mortgages) చట్టంలో వీలుకలిపించబడిందికూడా.

రైతుచేసిన ఋణాలను రాబట్టుకోడానికి చేయబడిన దావాల్లో వడ్డీరేటు 5¼% గరిష్టరేటుకు మించి నిర్ణయించబడరాదు. ఒక్కదావాల్లోనేకాదు; ఆఖరికి కోర్టు అమ్మకం, ప్రొసీడింగుల్లో, బాకీ డిక్రీఅయ్యాక కూడా వడ్డీ తగ్గింపుకు బాకీదారు కోర్టువారిని కోరవచ్చు. ఈ నిబంధలకు మించిన వడ్డీ రేటును కోర్టువారు అవస్యం తగ్గించాలి.

అయితే, బాకీదారు రైతు అయినప్పటికీ ఈ దిగువ వుదహరించిన బాకీలకు, ఈ చట్ట నిబంధనలు వర్తించవు.

(a) రాష్ట్ర ప్రభుత్వానికి చెల్లించవలసిన రెవిన్యూ, పన్ను సెస్సులు లేక బాకీలు వగైరా.

(b) కేంద్ర ప్రభుత్వానికి చెల్లించవలసిన రెవిన్యూ, పన్ను సెస్సులు లేక బాకీలు వగైరా.

(c) స్థానిక అధికార సంస్థలకు (Local bodies) చెల్లించవలసిన పన్ను, పన్నులు లేక బాకీలు వగైరా.

(d) మ్యునిసిపాలిటీ లేక కంటోన్మెంటు సరిహద్దుల్లో వున్న ఇండ్లను సెక్యూరిటీగా వుంచి తెచ్చుకొన్న బాకీలు.

(e) మద్రాసు కో-ఆపరేటివ్ సొసైటీస్ ఆక్టు 1932 ప్రకారం రిజిష్టరైన కో-ఆపరేటివ్ సొసైటీలనుంచి (ల్యాండు మార్టిగేజ్ బ్యాంకులతో సహా) తెచ్చిన బాకీలు.

(f) విశ్వాసభంగం (Breach of trust) మూలకంగా యేర్పడిన బాధ్యతలు.

(g) కోర్టు డిక్రీద్వారా లేక మరేవిధంగానైనాసరే, ఏర్పడిన మనోవర్తికి సంబంధించిన బాధ్యతలు.

(h) 1 అక్టోబరు 1937 కు ఒక స్త్రీకి యివ్వవలసిన బాకీలు. అయితే ఆనాటికి ఆమె వుంచుకొన్న ఆస్తి, రావలసిన బాకీలతో సహా రు. 6000 లకు మించరాదు. ఆమెకవున్న ఆస్తి విలువ కట్టడం నిమిత్తం, ఆమె వుంటున్న ఇల్లు, ఇంట్లోవున్న ఫర్నిచర్, ధరిస్తున్న దుస్తులు, నగలు వగైరా లెక్కలలోకి తీసుకోబడవు.

(i) వ్యవసాయకూలీలుగాని, వ్యవసాయ సంబంధంగాగాని యివ్వవలసిన కూలీ మొత్తాలు.

# వ్యవసాయ ఋణాలు

నేటి సామాజికస్థితిగతులలో అప్పు తెచ్చుకోకపోతే, అత్యధిక సంఖ్యాక బీదరైతాంగానికి, కౌలుదార్లకూ రోజు గడవదు. కాడిసాగదు. వేళ్ళమీద లెక్కపెట్టదగినంత మంది భూస్వాములు ఒకవేళ అప్పుతెచ్చినా, పొలం కొనేందుకో, ట్రాక్టరు కొనేందుకో తెస్తారు. తర్వాత సులభంగా తీర్చగలుగుతారు. పేదరైతాంగం ముఖ్యంగా లోటు కుటుంబ బడ్జెట్టును పూడ్చుకోడానికి, వ్యవసాయ ఖర్చులకు – ఎరువులు కొనేందుకు తదితర ఖర్చులకు – వినియోగిస్తారు. వీరు తెచ్చిన అప్పులకు హద్దులేకుండా పెరిగి వడ్డీనే తీర్చలేకపోతున్నారు.

ఈ విధంగా మదరాసురాష్ట్రంలో (అవిభాజ్య) మొత్తం ఎంత రైతుల అప్పులున్నాయో విచారించే నిమిత్తం 1895–1946 సంవత్సరాలమధ్య కాలంలో ఐదుసార్లు ప్రయత్నం జరిగింది.

1895 లో విచారణ జరిపిన సర్ ఫ్రెడరిక్ నికల్సన్ మొత్తం అప్పు రు 45 కోట్లుగా అంచనావేశాడు. 1930 వ సంవత్సరంలో విచారణజరిపిన మదరాసు రాష్ట్ర బ్యాంకింగ్ విచారణకమిటీ దానిని రు 150 కోట్లుగా అంచనా వేసింది. 1930 లో డాక్టరు పి. జె. థామస్ ఇది రు 200 కోట్లకు పెరిగిందని అంచనా వేశాడు. 1935 వ సంవత్సరంలో విచారణ జరిపిన డబ్లు. ఆర్. యస్. సత్యనాథన్ కూడ దీనిని రు 200 కోట్లుగా అంచనావేశాడు.

ఈవిచారణ తర్వాతనే మదరాసు ప్రభుత్వం రైతు ఋణ విమోచనచట్టం (1936) (Madras Debt Concilia-tion Act), మద్రాసు వ్యవసాయదార్ల అప్పు తగ్గింపుచట్టం (1938) (Madras Agriculturists Debt relief Act, (1938) తయారుచేయబడి అమలుపరచబడ్డాయి.

1946 వ సంవత్సరంలో విచారణ జరిపిన డాక్టరు బి. వి. నారాయణస్వామి నాయుడు అప్పు ఇంతకు పూర్వమున్న దానికన్న, ఈ విచారణకాలానికి తగ్గిందని అంచనా వేస్తూనే, మొత్తం 218 కోట్లుగా తేల్చాడు. మొత్తం అప్పులో ఐదింట నాలుగుపాళ్ళు (80%) మధ్యతరగతి పేద రైతాంగం తలపైనున్నదని, యుద్ధకాలంలో వ్యవసాయోత్పత్తుల ధరల పెరుగుదల భూస్వాములకు, ధనిక రైతులకు అప్పులు తీర్చుకొనే అవకాశం ఇచ్చింది. కాని వీరికి ఎట్టిమేలు చేకూరలేదని, కౌలుదార్లు, భూములులేని వ్యవసాయ కూలీల అప్పులు ఇంకా పెరిగాయని స్పష్టంగా వ్రాశారు. అందుచేత ఏమైనా అప్పు తగ్గిపోయిందంటే అది పూర్తిగా భూస్వాములు, ధనిక రైతులదే.

ఈ విధంగా పెరుగుతున్న వడ్డీ వ్యాపారస్తుల అప్పులు తీర్చలేక, రైతాంగం చివరకు తమ భూములను కూడా ఋణదాతకు ధారపోయవలసి వస్తున్నది.

ఇట్టి పరిస్థితి నుండి బీద రైతాంగాన్ని ఆదుకోవాలనే ఉద్దేశ్యంతోనే, భూమి తనఖా బ్యాంకులు, అగ్రికల్చరల్ క్రెడిట్ సొసైటీలు ప్రారంభించబడ్డాయి.

1925 వ సంవత్సరం అక్టోబరు 3వ తేదీన, కృష్ణాజిల్లాగుడ్లవల్లేరులో ఆంధ్రుల

మొట్టమొదటి భూమి తనఖా బ్యాంకు ప్రారంభించబడింది. తర్వాత 1928వ సంవత్సరం మే మాసంలో తూర్పు గోదావరిజిల్లా ఆలమూరులో రెండవ భూమి తనఖా బ్యాంకు ప్రారంభించబడింది. 1928లో కృష్ణాజిల్లా వద్ద మన్నాడ గ్రామంలో మూడో బ్యాంకు ప్రారంభించబడింది.

మొదట ప్రారంభించబడిన బ్యాంకులు అప్పులు ఇవ్వడానికి కావలసిన నిధుల సేకరణకు, డిబెంచర్లు 'ఫ్లోట్' చేసేవి. కాని వీటి వ్యక్తిగత కృషి ఫలించక పోవటంచేత, మదరాసు రాష్ట్రంలోని కొన్ని భూమి తనఖా బ్యాంకుల అనుబంధింపచేసి (Federated) మదరాసు కోపరేటివు భూమి తనఖా బ్యాంకుగా 1929వ సంవత్సరంలో ఏర్పరిచారు. ఈ బ్యాంకుద్వారా డిబెంచర్లను ఫ్లోట్ చేసి, వచ్చిన ధనాన్ని, సాధారణ భూమి తనఖా బ్యాంకులద్వారా అప్పులుగా ఇస్తుండేవారు.

ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంలో మదరాసు రాష్ట్ర కోపరేటివు భూమి తనఖా బ్యాంకునుండి, ఆంధ్రకు చట్టరీత్యా వచ్చే భాగంతో, 1953వ సంవత్సరం, సెప్టెంబరు ఐదవ తేదీన "ఆంధ్ర కోపరేటివు కేంద్ర భూమి తనఖా బ్యాంకు" ప్రారంభించబడింది. ఈ బ్యాంకు వాటాకు వచ్చినఆస్తి, అప్పులు ప్రక్కపేజీలోనిపట్టికలో ఈవిధంగా ఉన్నాయి:

రాష్ట్రంలో ఇవ్వబడుతున్న అప్పులలో చాల భాగం, పాత అప్పుల తీర్చటానికే వినియోగపడుతున్నట్లు ఆంధ్ర భూమి తనఖా బ్యాంకు కార్యదర్శి శ్రీ దత్తాత్రేయులుగారు అంచనావేశారు.

బ్యాంకు చిరునామా:

ఆంధ్ర కోపరేటివు సెంట్రలు ల్యాండ్ మార్టిగేజి బ్యాంకు లిమిటెడ్ నెం. 110,111 ఆర్మీనియన్ వీధి, జార్జిటౌను, మద్రాసు—1

1952వ సంవత్సరం జూన్ మాసాంతానికి ఆంధ్రలో 55భూమితనఖాబ్యాంకులు, ఉన్నాయి. వీటి మొత్తం చెల్లించిన మూలధనం (Paid-up capital) రు. 16.32 లక్షలు, రిజర్వు రు. 3.47 లక్షలు. వీటి మొత్తం వ్యాపారం (Working Capital) రు. 227.78 లక్షలు. ఈ బ్యాంకులు కేంద్ర భూమి తనఖా బ్యాంకుకు ఇవ్వవలసిన బాకీ రు 206.67 లక్షలు. ఇది, ఇచ్చిన అప్పులు మొత్తం రు. 37.76 లక్షలు, 1952వ సంవత్సరం జూన్ 30వ తేదీనాటికి, ఈ బ్యాంకు మెంబర్లనుండి రావలసిన అప్పులు 207.24 లక్షలు, మెంబర్ల ఓవర్ డ్యూ (Over due) రు. 2.86 లక్షలు, దీనిమీద రావలసినవడ్డీ రు. 48వేలు. మొత్తం బ్యాంకులలో 37 బ్యాంకులు మొత్తం రు. 64. వేలు లాభం సంపాదించాయి. 15 బ్యాంకులకు మొత్తం రు. 14 వేలు నష్టం వచ్చింది.

## అగ్రికల్చరల్ క్రెడిట్ కోపరేటివులు

1951—52వ సంవత్సరాంతానికి రాష్ట్రంలో 6,420 క్రెడిట్ కోపరేటివులున్నాయి.

ఈ సొసైటీల సభ్యత్వం 5.56 లక్షలు. వీటి మొత్తం చెల్లించిన షేర్ల ధనం రు 73.66 లక్షలు. రిజర్వులు, ఇతర

| అప్పులు | | | ఆస్తులు | | |
|---|---|---|---|---|---|
| 1. షేరుధనం | రు. | 10,80,700 | 1. ప్రైమరీ బ్యాంకులకు ఇచ్చినఅప్పులు | రు. | 2,48,98,494 |
| 2. రిజర్వుఫండు ఇతర నిధులు | రు. | 15,03,175 | 2. సింకింగుఫండు | రు. | 66,75,795 |
| 3. డిబెంచర్లు | రు. | 2,76,94,000 | 3. ఇతర పెట్టుబడులు | రు. | 24,10,325 |
| 4. డిపాజిట్లు, ప్రభుత్వం వద్ద తెచ్చిన అప్పులు | రు. | 30,49,972 | | | |
| 5. ఇతర అప్పులు | రు. | 6,56,767 | | | |
| మొత్తం | రు. | 3,39,84,614 | మొత్తం | రు. | 3,39,84,614 |

నిధులు రు 57.36. వీటిమొత్తం వర్కింగ్ కాపిటల్ రు 578.23 లక్షలు. 1951-52, సంవత్సరంలో ఇవి ఇచ్చిన అప్పులు 337.33 లక్షలు. సభ్యులనుండి రావలసిన అప్పులు రు. 449.93 లక్షలు. 1951-52 ఆఖరుకు ఈ సొసైటీలు చెల్లించవలసిన అప్పులు రు. 429.22 లక్షలు. ఈసొసైటీలలో సభ్యులచేత వేయబడిన డిపాజిట్లు రు. 9.48 లక్షలు. సభ్యులుకానివారు వేసిన డిపాజిట్లు రు. 8.06 లక్షలు.

## ప్రభుత్వ ఋణాలు

ప్రభుత్వం అగ్రికల్చరిస్టు లోన్సు ఆక్టు, లాండ్ ఇంప్రూవ్‌మెంట్సు లోన్సు ఆక్టుల ప్రకారం, తక్కావి ఋణాల నిస్తున్నది. 1950-51 వ సంవత్సరంలో ఆంధ్రజిల్లాల్లో రు. 131 లక్షలు తక్కావి ఋణాలుగా ఇవ్వబడ్డాయి. వెల్ సబ్సిడీ స్కీముక్రింద రు. 23.56 లక్షలు 4½% వడ్డీరేటుకు అప్పులుగా ఇవ్వబడ్డాయి.

ప్రభుత్వం ప్రస్తుతం ఇస్తున్న అప్పులు రైతు అవసరాలదృష్ట్యా నామమాత్రమే! దీనికితోడు, ఈ అప్పులకోసం రైతు దరఖాస్తులు పెట్టుకోవలసిన విధానం, అధికారుల అలక్ష్య వైఖరి (Red-tapism), అవినీతి ఇత్యాది విషయాలు, ఈ అప్పులకై రైతులు ప్రయత్నించకుండా చేయుటానికే తోడ్పడుతున్నాయి.

ఉన్న భూమి తనఖా బ్యాంకులు, కోపరేటివు క్రెడిట్ సొసైటీలు నేటి రైతు అవసరాలదృష్ట్యా చాల తక్కువే! వీటిలో అత్యధిక భాగం, స్వార్థపరులైన గ్రామ పెత్తందార్లు, రాజకీయపక్షులవారి చేతిలో చిక్కటంవల్ల, అప్పులు తీసుకోడానికి ఎవరు అర్హులో వారికి లభించడం లేదు. అందువల్ల ఈ ఉత్తమాశయాలతో ప్రారంభించబడ్డ ఈ బ్యాంకులు, సొసైటీలు బాధితులకు సాయపడవలసినంతగా సాయపడటంలేదు.

రెండువందల తులాలకు మించిన బరువు వున్నవి అంగీకరించబడవు.

## సర్టిఫికెట్ ఆఫ్ పోస్టింగ్

మనం పంపిన బంట్రోతు ఉత్తరం పోస్టుచేశాడా లేదా అని తెలుసుకొనేందుకు ఈ పద్ధతి ననుసరించవచ్చు. పోస్టు చేసిన ప్రతి మూడు లేక అంతకు తక్కువ ఉత్తరాలకు అర్థణా.

## లేట్ ఫీజు

కవర్లు, కార్డులు, బుక్ పాకెట్లకు పోస్టాఫీసులో అయితే అర్థణా. ఆర్. యం. యస్. లో అయితే అణా.

## పార్సిళ్ళు

వెయ్యితులాలు లేక 12½ సేర్ల బరువు వరకు మాత్రమే అంగీకరించబడతాయి. ప్రతి 40 తులాలు, అంతకుతక్కువ ఉన్న పార్సెలుకు ఎనిమిదణాలు అవుతుంది. 440 తులాల బరువుకు మించిన పార్సిళ్ళు విధిగా రిజిష్టరుచేయాలి. పార్సెళ్ళు 3½ అడుగుల పొడవుకు, లేక ఆరడుగుల చుట్టుకొలతకు మించి ఉండరాదు.

పోస్టలు నిబంధనలు నిషేధించిన పదార్థాలేవీ వీటిలో పంపరాదు. పార్సెలు ఎవరికైతే పంపుతున్నారో వారికి ఒక్క ఉత్తరం మాత్రమే పెట్టవచ్చు. అట్లుకాక రెండు ఉత్తరాలు పెట్టినట్లయితే, ఆ ఉత్తరం పోస్టులో పంపితే ఎంత విలువగల స్టాంపులు అంటించాల్సి ఉంటుందో అంతకు రెట్టింపు డబ్బును, ఆ పార్సెలు బట్వాడా చేయుటకే వారి నుండి వసూలుచేస్తారు. పార్సెలుబట్వాడా కాక, పంపినవారికి తిరిగివచ్చేటట్లయితే, ఆ పార్సెలు పంపినప్పుడు అంటించిన పోస్టుబిళ్ళల ఖరీదులో సగంవసూలు చేస్తారు.

## రిజిస్ట్రేషను

కార్డు, కవరు, బుక్ పాకెట్ రిజిష్టరు చేయవచ్చు. పైవి వాటిబరువుతో నిమిత్తం లేకుండా ఆరణాలు పోస్టుబిళ్ళలనంటించవలసి ఉంటుంది.

తిరుగురసీదు కావలసిన అణా అదనం.

## ఇన్సూరు

ఇన్సూరుచేసి పంపబడే వస్తువులు నష్టపడితే వాటిఖరీదును పోస్టలు డిపార్టుమెంటువారు ఆనష్టపడిన వారికి పరిహారం ఇస్తారు. ఐదువేల రూపాయిల విలువకు మించిన పార్సెళ్ళు ఇత్యాదులు ఇన్సూరుకు అంగీకరించబడవు.

ఇన్సూరు చేయబడిన వాటి విలువ వందరూపాయలకు మించకపోతే ఆరణాలు, తరువాత ప్రతివందరూపాయలకు మూడణాల చొప్పున అదనం అవుతుంది. ఇన్సూరు చేయబడిన కవరు, పార్సెలు వీటికి బరువుప్రకారం వేయబడిన, స్టాంపులతో నిమిత్తంలేకుండా పైతూరేటువ ఖర్చు భరించాలి.

రు. 25 లకు మించిన ప్రతి వి. పి. పి.ని విధిగా ఇన్సూరుచేయాలి. పార్సెలు లేక కవర్లలో నాణెములు, బంగారం, ప్లాటినం విలువయినరాళ్ళు, నగలు, రూపాయలు నోట్లు, ఇతర బంగారు వెండి సామానులు పంపబడుతున్న ప్రతికవరును, లేక పార్సెలును విధిగా ఇన్సూరుచేయాలి.

రిజిష్టరు కవర్లు, వి. పి. పార్సిళ్ళు కూడా ఇన్సూరు చేయబడతాయి.

## వి. పి. పి లు

వీటిని విధిగా రిజిస్టరు చేయాలి. ఉత్తరాలు, పాకెట్లు, వార్తాపత్రికలను వి.పి.పి. లుగా పంపవచ్చు. కాని, వి. పి. పంపిన వారికివచ్చే మొత్తం వెయ్యి రూపాయలకు మించకూడదు. ఇంతకు మించిన వి. పి. పి. లు అంగీకరించబడవు. వి.పి.పి. రు. 25 కు మించని యెడల అయ్యే ఛార్జీలు, ఆ పంపబడే కవరు, పార్సెలు, పాకెట్టు బరువుకు వేయవలసిన పోస్టు బిళ్ళలు కాక, రిజిస్ట్రేషనుఫీజు అరణాలు. ఇన్సూరు చేయబడితే పోస్టింగు ఫీజు అణా, ఇన్సూరురేటు ప్రకారం ఛార్జీ. వి. పి. పి. విలువ రు. 25 కు మించితే పంపబడే కవరు, పాకెట్టు, పార్సెలు బరువుకు వేయవలసిన పోస్టుబిళ్ళలు కాక, రిజిస్ట్రేషను ఫీజు అరణాలు, పోస్టింగు ఫీజు రెండణాలు, విలువనుబట్టి ఇన్సూరు ఫీజు చెల్లించవలసి వుంటుంది. కనీసం పంపబడే వి. పి. పి. విలువకు తగ్గకుండా ఇన్సూరు చెయ్యాలి.

## మనియార్డర్లు

ఆరువందల రూపాయలకు మించిన మనియార్డర్లు అంగీకరించబడవు. పోస్టలు అధికార్లు, అవసరమని తలచినచో, మనియార్డరును చెల్లించనీయకుండా ఆపవచ్చు.

| రేట్లు : | రు. అ. పై. |
|---|---|
| రు. 5 కు | 0—2—0 |
| రు. 5 లకు మించి, పది రూపాయల లోపు | 0—3—0 |
| రు. 10 కి పైన రు. 15 కు లోపు | 0—4—0 |
| రు. 15 కు పైన రు. 25, [illegible] లోపు | 0—6—0 |

ప్రతి రు. 25 లకు అరణాలు, ఆపైన మిగిలిన మొత్తాలకు పై విభాగాల ప్రకారం కమిషన్ వసూలు చేయబడుతుంది.

## టెలిగ్రాఫ్ మనియార్డర్లు

మామూలు మనియార్డరు రేట్ల ప్రకారం పంపబడే మొత్తానికి అయ్యే కమిషన్ కాక, టెలిగ్రాఫ్ ఛార్జీలు రెండణాలు అదనంగా అవుతాయి. ఇటువంటి మనియార్డర్లలో అణా చిల్లర ఉండకూడదు.

## పోస్టలు ఆర్డర్లు

ఎనిమిదణాల నుండి, పది రూపాయల విలువగలిగిన పోస్టలుఆర్డర్లు పోస్టాఫీసులలో అమ్మబడతాయి. ఇది మనియార్డర్లు కాక డబ్బు పంపే రెండో మార్గం.

ఎవరైనా మనకు పోస్టలుఆర్డరు పంపితే దాన్ని ఏ హెడ్-లేక సబ్ పోస్టాఫీసులో చూపినా డబ్బిస్తారు. పోస్టలు ఆర్డరు తీసుకున్న ఆరు నెలలు దాటినతర్వాత డబ్బు తీసితే అణా కమిషన్ వసూలు చేయబడుతుంది. తీసికొన్ననాటిని సంవత్సరంలోపల మార్చుకోకపోతే, అది చెల్లవు.

## పోస్టు బాక్సులు

పోస్టుబాక్సులు, 'బ్యాగులు' అద్దెకిచ్చే అవకాశమున్న పోస్టాఫీసులలో, కిందిరేట్ల ప్రకారం పోస్టుబాక్సు, లేక 'పోస్టు బ్యాగు' అద్దెకు తీసుకోవచ్చు.

| | |
|---|---|
| సంవత్సరానికి | రు. 12 |
| మూడు నెలలకు | రు. 4 |

## సేవింగ్సు బ్యాంకు

పోస్టాఫీసులలో రెండు రూపాయల నుంచి రు. 15,000, దాకా అకౌంట్ ప్రారంభ

క్రింద అయితే రు. 30,000 లు దాచుకోవచ్చు.

వారానికి ఒక్కసారిమాత్రమే డబ్బు తీసుకోవచ్చు. ఏ ఆఫీసులో అయితే ఎక్కౌంటు ఉన్నదో ఆ ఆఫీసులోడబ్బు ఇవ్వబడుతుంది. ఇతర పోస్టాఫీసులలో ఇవ్వబడదు.

### విదేశాలకు పోస్టేజి

ఏడెన్, సిలోన్, నేపాల్, పాకిస్థాన్, పోర్చుగీసు ఇండియాలకు మామూలుగా దేశంలోఉన్న రేట్లప్రకారం చార్జీ అవుతుంది.

బర్మా, పరిషియా సింధు శాఖ ప్రాంతాలలోని బ్రిటిష్ పి. ఓ. ఏజన్సీలకు అదనపురేట్లు. (దిగువ ఉదహరించిన రేట్లన్నీ సీ మెయిలు రేట్లు)

### కార్డులు

అన్నిదేశాలకు బేడార్ధణా, రిప్లయి కార్డు ఐదణాలు.

### కవర్లు

ఒక ఔన్సు బరువు (2½ తులాలు)కు మించనియెడల పావలా, తర్వాత ప్రతి ఔన్సు, లేక అంతకు తక్కువ బరువుకు బేడార్ధణా.

### అచ్చుకాగితాలు

ప్రతి రెండుఔన్సులకు లేక అంతకు లేక తక్కువబరువుకు అణా.

రిజిష్టరయిన వార్తాపత్రికలకు రెండు ఔన్సులు లేదా అంతకు తక్కువబరువుకు అణా.

### వ్యాపార పత్రాలు

మొదటి 8 ఔన్సులకు పావలా, తరువాత ప్రతిరెండు ఔన్సులకు అణా.

విదేశాలకు పంపబడే అన్ని కవర్లు, కార్డులు, పార్సిళ్ళు ఇత్యాదులకు రిజిస్ట్రేషను ఫీజు ఆరణాలే.

### విమానటపా

(1954 ఏప్రిల్ మాసాంతానికి ఉన్న రేట్లు)

దిగువ వుదహరించిన దేశాలకు పంపే పోస్టుకార్డుఖరీదు ఆరణాలు. అరఔన్సు, అంతకు తక్కువ బరువున్న కవరుకు రు. 0-14-0 అవుతుంది. తర్వాత ఎన్ని అరఔన్సులు బరువుంటే అన్ని 14 అణాలు అవుతుంది. ఉత్తరాలు కాకుండా ఉండే అచ్చుకాగితాలు, వార్తాపత్రికలు, కేటలాగులు, ఇత్యాదులు బుక్ పోస్టులో పంపవచ్చు. వీటికి రిజిస్ట్రేషనుఫీజు ప్రతి అరఔన్సు బరువుకు ఐదణాలు అవుతుంది. పైవి రిజిస్టరు పోస్టులో పంపవచ్చు. రిజిస్ట్రేషనుఫీజు ఆరణాలు.

ఎయిర్ లెటరు అర్ధరూపాయి. దానిని మన ఇన్ లెటరువలె వ్రాయాలి. అందులో ఏమీ పెట్టకూడదు. ఇది రిజిస్ట్రేషనుకు అంగీకరించబడదు.

దేశాలు: ఆల్బేనియా, ఆస్ట్రియా, బెల్జియం, బల్గేరియా, జెకోస్లావేకియా, డెన్మార్కు, ఐర్లండు, ఫిన్లండ్, ఫ్రాన్సు, జర్మనీ, యునైటెడ్ కింగ్ డమ్, (బ్రిటన్), గ్రీసు, హాలెండు, హంగరీ, ఇటలీ, లక్జెంబర్గు, నార్వే, పోలెండు, పోర్చుగల్, రొమేనియా, స్పెయిన్, స్వీడెన్, స్విట్జర్లండ్, సోవియట్ యూనియన్, యుగోస్లావియా.

దిగువ ఉదహరించిన దేశాలకు పోస్టుకార్డు ఆరణాలు. కవరుకు ప్రతి అరఔన్సుకు పది అణాలచొప్పున అవుతుంది, రిజిష్ట్రేషను ఆరణాలు.

అచ్చు కాగితాలకు (ఉత్తరాలు కాకుండా) ప్రతి అరఔన్సుకు పావలా చొప్పున అవుతుంది. ఎయిర్ లెటరు అర్థ రూపాయి అవుతుంది.

దేశాలు: ఏడెన్, ఈజిప్టు, చైనా, ఇండో చైనా, ఇండోనీషియా, ఇరాన్, ఇరాక్, జపాన్, జోర్డాన్, కొరియా, లెబనాన్, మలయా, న్యూగినీ, ఉత్తర బోర్నియో, పాలస్తీనా, ఫిలిప్పైన్సు, సౌదీ అరేబియా, సిరియా, సింగపూరు, సయాం, థాయిలెండు, టర్కీ.

బర్మా, ఆఫ్ఘనిస్తాన్ దేశాలకు, కవరుకు ప్రతిఅర[illegible]

కాగితాల

మొదటిఅ

ప్రతి అ

వుకు చేద

ఎయిర్ లెటరు పదణాలు.

దిగువ ఉదహరించిన దేశాలకు కవరుకు ప్రతి అర ఔన్సు బరువుకు రు 1-2-0, అచ్చుకాగితాలకు (ఉత్తరాలు కాకుండా) ప్రతి అర ఔన్సుకు ఆరణాలు, కార్డు అర్థ రూపాయి, ఎయిర్ లెటర్ పదణాలు అవుతుంది.

దేశాలు: ఆస్ట్రేలియా, న్యూజిలెండు, యూనియన్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా.

దిగువ ఉదహరించిన దేశాలకు కవరుకు ప్రతి అర ఔన్సుకు రు 1-8-0, అచ్చు కాగితాలకు (ఉత్తరాలు కాకుండా) ప్రతి అర ఔన్సుకు అర్థరూపాయి, కార్డుకు పదణాలు, ఎయిరు లెటరుకు ముప్పావలా అవుతుంది.

దేశాలు: కెనడా, క్యూబా, జమైకా, మెక్సికో, పనామా, ట్రినిడాడ్, యునైటెడ్ స్టేట్సు ఆఫ్ అమెరికా, దక్షిణ అమెరికాలోని అన్ని దేశాలు.

## రేడియో లైసెన్సులు

రేడియో సెట్లు అమ్మేవారు, దిగుమతి చేసేవారు "డైరక్టరు జనరల్ ఆఫ్ పోస్ట్సు అండు టెలిగ్రాఫ్సు, న్యూ ఢిల్లీ" నుండి లైసెన్సులు పొందాలి.

రేడియో సెట్లు ఉంచుకొనేవారుకూడా పోస్టలు డిపార్టుమెంటు వారినుండి లైసెన్సు పొందాలి. లైసెన్సులు, ప్రతి హెడ్, సబ్ పోస్టాఫీసులలో ఇవ్వబడతాయి.

[illegible]

సెటుకు రు 3-0-0. కమ్యూనిటీ సెటకు రు 10-0-0. విమానంలో కాని, నౌకలలో, కార్లలో వాడబడే సెట్టుకు 15-0-0. ఈ లైసెన్సులు మామూలుగా పోస్టాఫీసుల నుండి కాక, డైరెక్టరు జనరల్ ఆఫ్ పోస్ట్సు అండ్ టెలిగ్రాఫ్సు, న్యూఢిల్లీ నుండి పొందాలి.

రేడియో ప్రసారాన్ని మరొక గదిలో వినబడడానికి, లేక హోటలు, హాస్టలు లోని వివిధ గదులలో వినిపించడానికి వీలుగా లౌడ్ స్పీకర్లు అమర్చవచ్చు. ఈ విధంగా ఒక రేడియోకు ఒక లౌడ్ స్పీకరు ఉపయోగించిన "ఎక్స్టెన్షను యల్ బ్రాడ్ కాస్టింగు రిసీవరు లైసెన్సు" పొందటానికి రు. 50 లు అవుతుంది. తర్వాత అదే రేడియో క్రింద పనిచేసే ప్రతి స్పీకరుకు పదిరూపాయల చొప్పున చెల్లించాలి.

లైసెన్సులు నిర్ణీత కాల పరిమితి (ప్రతి సంవత్సరం జనవరిలో) లోగా పొందక పోయినవారు శిక్షించ బడతారు. రేడియో సెట్టు చెడిపోయి వాడకపోయినా ఫీజు చెల్లించవలసిందే.

### తంతి - (టెలిగ్రాంలు)

ఆర్డినరీ (సాధారణ) టెలిగ్రాములకు, మొదటి ఎనిమిది మాటలకు 12 అణాలు, తరువాతి ప్రతిమాటకు అణా చొప్పున చెల్లించాలి.

ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాములకు మొదటి 8 మాటలకు రూపాయిన్నర, తరువాత ప్రతి మాటకు బేడా చొప్పున చెల్లించాలి.

### పాకిస్థాన్, సిలోన్‌లకు

పాకిస్థాన్‌కు పంపే ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాములలో మొదటి 8 మాటలకు రు. 2-12-0 లు, తరువాతి ప్రతిమాటకు పావలా, సాధారణ టెలిగ్రాములకు మొదటి ఎనిమిది మాటలకు. రు 1-6-0 లు, తరువాతి ప్రతిమాటకు రెండణాలు.

సిలోన్‌కు పంపే ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాములలో మొదటి 8 మాటలకు రు. 2—8—0, తరువాతి ప్రతి మాటకు మూడణాలు, సాధారణ టెలిగ్రాములకు మొదటి 8 మాటలకు రు. 1—4—0 తరువాతి ప్రతిమాటకు రెండణాలు.

### రిప్లయి పెయిడ్ టెలిగ్రాములు

మనం పంపిన టెలిగ్రాములకు సమాధానం టెలిగ్రాము ద్వారా మనకు పంపటానికి అయ్యే ఖర్చు మనం ముందుగానే చెల్లించవచ్చు. ఈ విధంగా చెల్లించే మొత్తం, మొదటి ఎనిమిది మాటలకు అయ్యే టెలిగ్రాఫ్ చార్జీకన్న తక్కువగా ఉండరాదు.

### ట్రంక్‌కాల్ రేట్లు

ఆఫీసులు పనిచేసే రోజుల్లో

| | |
|---|---|
| ఉదయం 8 గంటల నుండి రాత్రి 9 గంటల వరకు | పూర్తి రేటు |
| రాత్రి 9 గంటలనుండి అర్ధరాత్రివరకు, ఉదయంఆరు గంటలనుండి8గంటలవరకు | అర్ధ రేటు |
| అర్ధరాత్రి నుండి ఉదయం ఆరు గంటల వరకు | మూడవ వంతు రేటు |

ఆదివారాలలో, టెలిగ్రాఫ్ ఆఫీసుల ఇతరశలవు దినాల్లో

| | |
|---|---|
| అర్ధరాత్రి నుండి ఉదయం ఆరు గంటల వరకు | మూడవ వంతు రేటు |
| ఉదయం 6 గంటల నుండి అర్ధరాత్రి వరకు | అర్ధ రేటు |



## విదేశీ కరెన్సీ మారకం (1953, అక్టోబరు 31 నాటికి ఉన్న రేట్ల ప్రకారం)

| దేశం | కరెన్సీ | పౌను స్టెర్లింగు | ఇండియా రూపాయలు | పాకిస్తాన్ రూపాయలు | హాంగ్ కాంగ్ డాలర్లు | అమెరికా డాలర్లు | కెనడా డాలర్లు |
|---|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (6) | (8) |
| యునైటెడ్ కింగ్‌డమ్ | పౌండు | 1.000 | 13.330 | 9.260 | 16.000 | 2.80 | 2.780 |
| ఇండియా | రూపాయి | 0.075 | 1.000 | 0.695 | 1.200 | 0.210 | 0.208 |
| పాకిస్తాన్ | రూపాయి | 0.108 | 1.444 | 1.000 | 1.733 | 0.303 | 0.300 |
| హాంగ్‌కాంగ్ | డాలరు | 0.062 | 0.833 | 0.579 | 1.000 | 0.175 | 0.173 |
| అమెరికా (U S A) | డాలరు | 0.357 | 4.759 | 3.307 | 5.712 | 1.000 | 0.992 |
| కెనడా | డాలరు | 0.338 | 4.503 | 3.128 | 5.406 | 0.946 | 1.000 |
| బ్రెజిల్ | క్రుజేరో | 0.019 | 0.257 | 0.178 | 0.308 | 0.054 | 0.053 |
| జపాన్ | యెన్ | 0.001 | 0.013 | 0.009 | 0.016 | 0.003 | 0.003 |
| సోవియట్ యూనియన్ | రూబులు | 0.089 | 1.186 | 0.827 | 1.424 | 0.249 | 0.247 |
| స్విట్జర్లండు | ఫ్రాంక్ | 0.082 | 1.093 | 0.756 | 1.312 | 0.230 | 0.228 |
| బెల్జియం | ఫ్రాంక్ | 0.007 | 0.093 | 0.066 | 0.112 | 0.020 | 0.020 |
| ఫ్రాన్సు | ఫ్రాంకు | 0.001 | 0.013 | 0.009 | 0.016 | 0.003 | 0.003 |

| దేశం | కరన్సీ | జపాన్ యెన్ (9) | సోవియట్ రూబులు (10) | స్విస్ ఫ్రాంకు (11) | బెల్జియన్ ఫ్రాంకు (12) | ఫ్రాన్సు ఫ్రాంకు (13) |
|---|---|---|---|---|---|---|
| యునైటెడ్ కింగ్డం | పౌండ్ | 1008.000 | 11.200 | 12.245 | 140.000 | 980.000 |
| ఇండియా | రూపాయి | 75.600 | 0.840 | 0.918 | 10.500 | 73.520 |
| పాకిస్తాన్ | రూపాయి | 109.200 | 1.210 | 11.322 | 15.120 | 105.830 |
| హాంకాంగ్ | డాలరు | 63.000 | 0.700 | 0.765 | 8.750 | 61.250 |
| అమెరికా | డాలరు | 360.000 | 4.000 | 4.373 | 50.000 | 350.000 |
| కెనడా | డాలరు | 340.550 | 3.784 | 4.137 | 47.300 | 331.100 |
| బ్రెజిల్ | క్రుజీరో | 19.420 | 0.216 | 0.236 | 2.698 | 18.883 |
| జపాన్ | యెన్ | 1.000 | 0.011 | 0.012 | 0.139 | 0.970 |
| సోవియట్ యూనియన్ | రూబులు | 89.712 | 1.000 | 1.093 | 12.500 | 87.500 |
| స్విట్జర్లాండు | ఫ్రాంకు | 82.656 | 0.915 | 1.000 | 11.433 | 80.033 |
| బెల్జియం | ఫ్రాంకు | 7.056 | 0.080 | 0.087 | 1.000 | 7.000 |
| ఫ్రాన్సు | ఫ్రాంకు | 1.028 | 0.011 | 0.012 | 0.143 | 1.000 |

## తూకాలు - కొలతలు

10 మిల్లీమీటర్లు = 1 సెంటీమీటరు
10 సెంటీమీటర్లు = 1 డెసీమీటరు
10 డెసీమీటర్లు = 1 మీటరు
10 మీటర్లు = 1 డెకామీటరు
10 డెకామీటర్లు = 1 హెక్టామీటరు
10 హెక్టామీటర్లు = 1 కిలోమీటరు

సెంటీమీటర్లు × 0.3937 = అంగుళాలు
మీటర్లు × 1.0936 = గజాలు
కిలోమీటర్లు × 0.6214 = మైళ్ళు.

100 చదరపు మీటర్లు = 1 చదరపు సెంటీమీటరు
100 చదరపు సెంటీమీటర్లు = 1 చదరపు డెసీమీటరు
100 చదరపు డెసీమీటర్లు = 1 చదరపు మీటరు
100 చదరపు మీటర్లు = 1 ఎర్ (are)
100 ఎర్లు (ares) = 1 హెక్టరు
100 హెక్టర్లు = 1 చదరపు కిలోమీటరు

చదరపు కిలోమీటర్లు × 1.1960 = చదరపు గజాలు
హెక్టర్లు × 2.4711 = ఎకరాలు
చదరపు కిలోమీటర్లు × 0.3861 = చదరపు మైళ్ళు

### క్యూబిక్ కొలతలు

1000 క్యూబిక్ సెంటీమీటర్లు = 1 క్యూబిక్ డెసీమీటరు
1000 క్యూబిక్ డెసీమీటర్లు = 1 క్యూబిక్ మీటరు
10 మిల్లీలిటర్లు = 1 సెంటీలిటరు
10 సెంటీలిటర్లు = 2 డెసీలిటరు
10 డెసీలిటర్లు = 1 లిటరు
10 లిటర్లు = 1 డెకాలిటరు
10 డెకాలిటర్లు = 1 హెక్టోలిటరు
10 హెక్టోలిటర్లు = 1 కిలోలిటరు

లీటర్లు × 61.02 = క్యూబిక్ అంగుళాలు
లీటర్లు × 0.220 = ఇంపీరియల్ గ్యాలన్
హెక్టోలీటర్లు × 2.750 = ఇంపీరియల్ బుషెల్
హెక్టోలీటర్లు × 0.629 = బారెల్

బరువులు

| | | |
|---|---|---|
| 10 మిల్లీగ్రాములు | = | 1 సెంటీగ్రాము |
| 100 సెంటీగ్రాములు | = | 1 గ్రాము |
| 1000 గ్రాములు | = | 1 కిలోగ్రాము |
| 100 కిలోగ్రాములు | = | 1 క్వింటాల్ |
| 10 క్వింటాళ్ళు | = | 1 మెట్రిక్ టన్ను |

గ్రాములు × 0.0353 = ఔన్సులు
కిలోగ్రాములు × 2.2046 = పౌనులు
మెట్రిక్ టన్నులు × 1.1023 = షార్టుటన్నులు
మెట్రిక్ టన్నులు × 0.9842 = లాంగ్‌టన్నులు

## కొలతలు

| | | |
|---|---|---|
| 12 అంగుళాలు | = | 1 అడుగు |
| 3 అడుగులు | = | 1 గజము |
| 5½ గజాలు | = | 1 పోలు (Rod) |
| 4 పోలులు | = | 1 గొలుసు |
| 10 గొలుసులు | = | 1 ఫర్లాంగు |
| 8 ఫర్లాంగులు | = | 1 మైలు |

అంగుళాలు × 2.540 = సెంటీమీటర్లు
గజాలు × 0.9144 = మీటర్లు
మైళ్ళు × 1.609 = కిలోమీటర్లు

## చదరపు కొలతలు - వైశాల్యపు కొలతలు

| | | |
|---|---|---|
| 144 చ. అం. లు | = | 1 చ. అడుగు |
| 9 చ. అ. లు | = | 1 చ. గజము |
| 30¼ చ. గజాలు | = | 1 చ. రాడ్ (Rod) |
| 40 చ. రాడ్‌లు | = | 1 రూడ్ |
| 4 రూడ్‌లు | = | 1 ఎకరం |
| 640 ఎకరాలు | = | 1 చ. మైలు |

చ. గజము × 0.8361 = చ. మీటర్లు
ఎకరాలు × 0.4047 = హెక్టర్లు
చ. మైళ్ళు × 2.590 = చ. కిలోమీటర్లు

## క్యూబిక్ కొలతలు

| | | |
|---|---|---|
| 1728 క్యూబిక్ అం. లు | = | 1 క్యూబిక్ అడుగు |
| 27 క్యూబిక్ అడుగులు | = | 1 క్యూబిక్ గజం |
| 4 గిల్సు | = | 1 పింట్ |

2 పింట్లు = 1 క్వార్టు
4 క్వార్టులు = 1 గ్యాలను
2 గ్యాలన్లు = 1 పెక్
4 పెక్కులు = 1 బుషెల్
8 బుషెల్సు = 1 క్వార్టరు

క్యూబిక్ అడుగులు × 28.32 = లిటర్లు
ఇంపీరియల్ గ్యాలన్లు × 4.543 = లిటర్లు
ఇంపీరియల్ బుషెల్ × 0.3636 = హెక్టోలిటర్లు
బారెల్ × 1.58 = హెక్టోలిటర్లు

## బరువులు

16 డ్రాములు = 1 ఔన్సు
16 ఔన్సులు = 1 పౌను
28 పౌనులు = 1 క్వార్టరు
4 క్వార్టర్లు = 1 హండ్రెడ్ వెయిట్
20 హండ్రెడ్ వెయిట్లు = 1 టన్ను

ఔన్సులు × 28. 35 = గ్రాములు
పౌనులు × 0.4536 = కిలోగ్రాములు
షార్టు టన్ను × 0.9070 = మెట్రిక్ టన్ను
లాంగ్ టన్ను × 1.016 = మెట్రిక్ టన్ను

## నాటికల్ కొలతలు

6 అడుగులు = 1 ఫాథం
$2\frac{1}{2}$ ఫాథంలు = 1 గొలుసు
112 ఫాథంలు = 1 మోకు చుట్ట (One coil of Rope)
40 గొలుసులు = 1 కేబుల్ పొడవు (సుమారు)
10 కేబుల్సు = 1 నాటికల్ మైలు
6080 అడుగులు = 1 నాటికల్ మైలు

ఫాథమ్సు × 2.00 = గజాలు
సముద్రపు గొలుసులు (Sea chains) × 1.10 = పోల్సు
సముద్రపు గొలుసులు × 4.40 = నేల గొలుసులు (Land chains)
కేబుల్సు × 1.085 = ఫర్లాంగులు
సముద్రపు మైలు (Sea Mile) × 0.8684 = నేల మైళ్ళు (Land Miles)
సెంటిగ్రేడ్ × $\frac{9}{5}$ + 32 = ఫారన్‌హీట్

ఫారన్‌హీట్ × 32 + $\frac{5}{9}$ = సెంటీగ్రేడ్
వాలు × 6.075 = గ్రాములు
తులాలు × 2.43 = ఔన్సులు
సేర్లు × 0.486 = పౌనులు
మణుగులు × 1.361 = హండ్రెడ్ వెయిట్
ఖండీస్ × 1.361 = టన్నులు

## కొన్ని సరుకుల తూకాలు

| సరుకు | ఇంపీరియల్ బుషెల్ | అమెరికా బుషెల్ |
|---|---|---|
| గోధుమ | 60 పౌనులు | 60 పౌనులు |
| రై | 56 ,, | 56 ,, |
| మొక్కజొన్న | 56 ,, | 56 ,, |
| అవిసగింజలు | 52 ,, | 56 ,, |
| బార్లీ | 50 ,, | 48 ,, |
| ఓట్లు | 39 ,, | 32 ,, |
| | ఇంపీరియల్ గాలన్లు | అమెరికా గాలన్లు |
| పెట్రోలు | [illegible] బారెల్ | [illegible] బారెల్ |

# కొన్ని ముఖ్యదేశాల వైశాల్యం, జనాభా

| దేశం | వైశాల్యం చ. మై. | జనాభా |
|---|---|---|
| అర్జెంటైనా | 10,79,965 | 1,71,96,000 (1950) |
| ఆస్ట్రేలియా | 29,74,581 | 82,00,000 (1950) |
| బ్రెజిల్ | 32,90,000 | 5,07,00,000 (1951) |
| కెనడా | 36,94,863 | 1,38,45,000 (1950) |
| చైనా | 34,06,488 | 48,36,87,000 (1950) |
| ఈజిప్టు | 3,86,110 | 2,04,39,000 (1950) |
| స్పెయిన్ | 1,96,607 | 2,82,86,500 (1950) |
| యునైటెడ్ స్టేట్సు (USA) | 30,36,000 | 15,06,97,400 (1950) |
| ఫ్రాన్సు | 2,12,659 | 4,25,00,000 (1951) |

| దేశం | వైశాల్యం చ. మై. | జనాభా |
|---|---|---|
| బ్రిటన్ | 36,30,550 | 5,02,10,500 (1951) |
| భారతదేశం | 12,69,640 | 35,68,29,000 (1951) |
| ఇండోనేషియా | ... | 7,88,00,000 (1950) |
| ఇరాన్ | 6,28,000 | 17,71,500 (1950) |
| ఇటలీ | 1,16,000 | 4,67,37,704 (1951) |
| జపాన్ | 1,50,000 | 8,31,99,600 (1950) |
| మెక్సికో | 7,68,800 | 2,55,64,200 (1950) |
| పాకిస్తాన్ | ... | 7,56,87,000 (1951) |
| పోలెండు | 1,30,000 | 2,47,62,000 (1950) |
| దక్షిణాఫ్రికా యూనియన్ | 4,72,550 | 1,26,46,400 (1951) |
| సోవియట్ యూనియన్ | 85,00,000 | 20,13,00,000 (1945) |

# ప్రపంచంలోకెల్ల పెద్దవి

## పెద్ద నదులు

| నది | దేశం | పొడవు (మైళ్లలో) |
|---|---|---|
| మిసిసిపీ | అమెరికా (U. S. A.) | 4,223 |
| నైల్ | సూడాన్ | 3,974 |
| అమెజాన్ | బ్రెజిల్ | 3,602 |
| ఓబ్ | సోవియట్ యూనియన్ | 3,291 |
| యాంగ్ టిసీ | చైనా | 3,229 |
| మిస్సౌరీ | అమెరికా (U. S A.) | 2,950 |
| కాంగో | బెల్జియన్ కాంగో | 2,919 |
| లీనా | సోవియట్ యూనియన్ | 2,857 |
| మెకంజీ | కెనడా | 2,857 |
| అమూర్ | సోవియట్ యూనియన్ | 2,782 |
| హొయాంగ్ హో | చైనా | 2,714 |
| మీకాంగ్ | ఇండో చైనా | 2,606 |
| సెంట్ లారెంట్ | కెనడా | 2,360 |
| వోల్గా | సోవియట్ యూనియన్ | 2,236 |

## పెద్ద కాలువలు

| | | |
|---|---|---|
| స్టాలిన్ కాలువ | సోవియట్ యూనియన్ | 141 |
| సూయెజ్ కాలువ | ఈజిప్ట్ | 100 |
| ఆల్బర్టు కెనాల్ | బెల్జియం | 82 |
| మాస్కో - వోల్గా కాలువ | సోవియట్ యూనియన్ | 79 |
| వోల్గా - డాన్ కాలువ | ,, | 63 |

## ప్రపంచంలోకెల్లా ఎత్తయిన భవనాలు

| | | |
|---|---|---|
| ఎంపైర్ స్టేట్ బిల్డింగు, న్యూయార్కు | అడుగులు. | 1,241 |
| క్రిస్లరు బిల్డింగు, న్యూయార్కు | ,, | 1,046 |
| ఐఫిల్ టవర్ పారిస్ | ,, | 984 |
| విజ్ఞానసౌధ, యూనివర్సిటీ, మాస్కో | ,, | 820 |
| ష్వేడాగన్ పగోడా, రంగూన్ | ,, | 556 |
| చియాప్స్ పిరమిడ్డు, ఈజిప్ట్ | ,, | 479 |
| కొలోన్ కెథడ్రల్ | ,, | 467 |

## పొడవైన రైలుమార్గాలు

| | |
|---|---|
| కేప్ టౌన్ నుండి కైరోకు | 5,900 మై. |
| మాస్కో - పెకింగ్ రైలుమార్గం | 5,620 ,, |
| ట్రాన్స్ సైబీరియన్ రైల్వే, చెల్యాబిన్స్కు నుండి వ్లాడివాస్టక్ కు | 4,037 ,, |
| నదరన్ పసిఫిక్ రైల్వే, న్యూయార్కు నుండి లాస్ ఏంజెల్సుకు | 3,881 ,, |
| కెనడియన్ పసిఫిక్ రైల్వే, హాలీఫాక్సు నుండి వాన్కోవరకు | 3,743 ,, |
| ఎచ్సన్-టూపోకా అండ్ సాంటా-ఫే-రైల్వే న్యూయార్కు నుండి లాస్ ఏంజెల్సుకు | 3,688 ,, |
| ఆస్ట్రేలియన్ కోస్టు రైల్వే, పోర్టు అగస్టా నుండి పెర్తుకు | 3,478 ,, |
| ఓరియంట్ ఎక్స్ప్రెస్, పారిస్ నుండి ఇస్తాన్బుల్ కు | 1,925 ,, |
| బాగ్దాద్-కాయిరా-బాగ్దాద్-బస్సోకీ రైల్వే | 1,465 ,, |

## ఎవరెస్టు శిఖరారోహణ

హిమాలయ పర్వత శిఖరాలలోకెల్ల ఎత్తయినది ఎవరెస్టు శిఖరం. ఎత్తు 29,141 అడుగులు.

ఈ శిఖరాన్ని ఎక్కడానికి 1921 నుండి ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1953 లో మాత్రమే ఇది జయించబడింది.

1921 నుండి, దీన్ని ఎక్కడానికి జరిగిన ప్రయత్నాల వివరాలు :

• 1921 లో, లెఫ్టినెంట్ కలనల్ హోవర్డు బురీ అనే బ్రిటిష్ పర్వతారోహకుని నాయకత్వాన బయలుదేరిన జట్టు 23,000 అడుగులవరకు మాత్రమే వెళ్ళగలిగింది.

• 1922 లో బ్రిగేడియర్ ఛార్లెస్ జి. బ్రూస్ (బ్రిటిష్) నాయకత్వాన ప్రయాణించిన జట్టు 27,300 అడుగుల వరకూ వెళ్ళగలిగింది. మొట్టమొదటిసారిగా ప్రాణవాయువు సాధనాలు (Oxygen apparatus) ఉపయోగించారు.

• 1924 లో లెఫ్టినెంట్ కలనల్ నార్టన్ (బ్రిటిషు) నాయకత్వాన బయలుదేరిన జట్టు 28,100 అడుగులవరకూ ఎక్కింది. ఈ జట్టులోని సభ్యులు మాలరీ, ఇర్వినులు ప్రమాదానికిగురై చనిపోయారు.

• 1933 లో హ్యూరట్లెడ్జి (బ్రిటిషు) నాయకత్వాన బయలుదేరిన జట్టు 28,100 అడుగులు ఎక్కి, వాతావరణం అనుకూలంగా లేకపోవటంచేత ప్రయత్నం విరమించుకోవలసి వచ్చింది.

• 1936 లో మరొకసారి వీరి నాయకత్వాన బయలుదేరిన జట్టు 23 వేల అడుగుల వరకే వెళ్ళగలిగింది. వాతావరణం సరిగా లేకపోవటంచేత ప్రయత్నం విరమించుకొన్నారు.

1938 లో హెచ్. డబ్ల్యు. టిల్‌మన్ (బ్రిటిషు) నాయకత్వాన బయలు దేరిన జట్టు 27,300 అడుగులవరకు ఎక్కగలిగింది.

1952 లో ఆర్. ఎడ్వర్డ్ లెంబ్ దూనెంటు (స్విస్) నాయకత్వాన బయలు దేరినజట్టు 28,215 అడుగులవరకూ వెళ్ళి వర్షాలవల్ల, వాతావరణం సరిగా లేక పోవటంవల్ల తిరిగి రావలసివచ్చింది.

1952 లో (చలి కాలంలో) ఆర్. గాబ్రియేల్ షెవలీ (స్విస్) నాయకత్వాన బయలుదేరిన జట్టు, వాతావరణం సరిగాలేకపోవటంచేత 26,575 అడుగులు వెళ్ళినవారు ప్రయత్నం విరమించి వెను దిరగవలసి వచ్చింది.

1953 లో కలనల్ జాన్ హంట్ (బ్రిటిషు) నాయకత్వాన బయలుదేరిన జట్టు శిఖరారోహణలో విజయం సాధించింది. ఈ జట్టు సభ్యులైన టెన్‌సింగు (నేపాలీ) హిలరీలు మే 29వ తేదీన శిఖర అగ్రాగాన్ని చేరగలిగారు.

## ఇతర హిమాలయ శిఖరాలు

ఇతర హిమాలయ పర్వత శిఖరాల ఎక్కడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి. కొన్ని శిఖరాలు జయించబడ్డాయి.

28,250 అడుగుల ఎత్తున్న గాడ్విన్ ఆస్టిన్ శిఖరాన్ని ఎక్కడానికి 1938, 1939, 1953 సం॥లలో ప్రయత్నాలు జరిగాయి. కాని సాధ్యంకాలేదు.

28,146 అడుగులు ఎత్తున్న కాంచన గంగ శిఖరారోహణకు 1905, 1929, 1930, 1931 సం॥లలో ప్రయత్నాలు జరిగాయి. ఎవరూ కృతకృత్యులు కాలేదు.

ధౌళగిరిశిఖరం 26,810 అడుగులు. ఎక్కడానికి ప్రయత్నం 1953 లో జరిగింది. కాని, ఇది జయించబడలేదు.

26,600 అడుగుల ఎత్తున్న నాంగ పర్బత్‌ను, ఇదివరలో నాలుగుసార్లు ప్రయత్నించిన డాక్టరు కె. హెర్లిగ్‌కోఫర్ 1953 లో జయించగలిగాడు.

25,645 అడుగుల ఎత్తున్న నందదేవి 1936 లోను, 25,447 అడుగుల ఎత్తున్న "కామెట్" 1931 లోను, 25,230 అడుగుల ఎత్తున్న "టించ్‌మిర్" 1951 లోను, 23,360 అడుగుల ఎత్తున్న 'త్రిశూల్' 1907 లోను జయించబడ్డాయి.



# తెలంగాణా

రచన:

యస్. వి. కె. ప్రసాద్

ఎ. అనంతరెడ్డి

తాలూకాలు; తిరువాతి పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలు కలిసి ఉన్నది. దక్షిణాన ఆంధ్ర రాష్ట్రంతో కలిసి ఉన్నది.

తెలంగాణా 9 జిల్లాల వైశాల్యం 40,088.50 చదరపు మైళ్ళు. (ఈ 9 జిల్లాలకు బయటవున్న తెలుగు ప్రాంతం కలిపితే తెలంగాణా వైశాల్యం షుమారు 44,000 చ॥ మైళ్ళ వరకుంటుంది) హైదరాబాదు స్టేటు మొత్తం వైశాల్యం 82,698 చదరపు మైళ్ళు. ఈ వైశాల్యం ప్రస్తుత ఆంధ్ర రాష్ట్ర వైశాల్యంతో కలిపి చూస్తే 1,07,325.98 చదరపు మైళ్ళు అవుతుంది. అనగా ప్రస్తుత బొంబాయి రాష్ట్రాని కన్నా, విస్తీర్ణంలో 4,108.2 చదరపు మైళ్ళు తక్కువే. ఆంధ్ర రాష్ట్రంతో కలిసివున్న మద్రాసు రాష్ట్ర వైశాల్యం కన్నా 20,464.2 చదరపు మైళ్ళు తక్కువే అందుకని, ముందు ఏర్పడబోయే విశాలాంధ్ర చాలా విశాలంగా ఉండటం చేత పరిపాలనా సౌలభ్యం ఉండదు. కాబట్టి ఆంధ్ర, తెలంగాణా రాష్ట్రాలు కావాలనే వారి వాదన ఎక్కడా నిలవజాలవు.



# జ నా భా

**1951** జనాభా లెక్కల ప్రకారం తెలంగాణా తొమ్మిది జిల్లాల జనాభా 1,01,07,773. ప్రక్క పేజీలోని పట్టికలో జిల్లాలవారీ జనాభా వివరాలు పొందు పరచబడ్డాయి :

స్టేట్‌లోని మిగతా జనాభాకంటె తెలంగాణా జనాభా 15,59,838 ఎక్కువ. నూతన ఆంధ్రరాష్ట్ర జనాభాతో కలిసి మొత్తం 3,13,89,127. ఈ జనాభా మొత్తం, బొంబాయిరాష్ట్ర జనాభా కన్నా 45,66,873 తక్కువ.

జిల్లాలవారి జనాభా పోల్చి చూస్తే, అన్ని జిల్లాలలో కంటె కరీంనగరం జిల్లాలో జనాభా అధికంగా ఉంది. అన్నిటికన్నా ఖమ్మం జిల్లా జనాభా తక్కువ.

తెలంగాణాలో ప్రతి చదరపుమైలుకు సగటున 284.7 మంది నివసిస్తున్నారు. హైదరాబాదు జిల్లా జన సాంద్రత (Density) చదరపు మైలుకు 917. తెలంగాణాలోని మరే జిల్లాలోను ఇంత జనసాంద్రత లేదు. ఆదిలాబాదు జిల్లాలో జనసాంద్రత 123. ఇతర అన్ని జిల్లాలలోకంటె తక్కువ.

తెలంగాణాలో 51,09,604 మంది పురుషులు, 49,99,169 మంది స్త్రీలు వున్నారు. మొత్తంపైన స్త్రీలకన్నా పురుషులు ఎక్కువగానే వున్నా, నిజామాబాదు జిల్లాలో 8,030 మంది స్త్రీలే పురుషులకన్నా ఎక్కువగా వున్నారు. మహబూబునగరం, ఆదిలాబాదు, మెదక్, కరీంనగరం జిల్లాలలోని కొన్ని తాలూకాలలోకూడా పురుషుల కంటే స్త్రీలే ఎక్కువగా వున్నారు.

జనాభాలో 79,60,933 మంది గ్రామ వాసులు, 21,46,840 మంది పట్టణ వాసులు. అయితే ఈ పట్టణ జనాభాలో సగానికి సగం [10,85,722] ఒక్క హైదరాబాదు నగరంలోనే ఉన్నారు.

తెలంగాణాలో 1951 వ సంవత్సర జనాభా లెక్కల ప్రకారం మొత్తం 10,909 గ్రామాలు, 240 పట్టణాలు ఉన్నాయి. దిగువ పట్టికలో, వివిధ జిల్లాలలో, వివిధ తరగతుల జనాభా గల గ్రామాలు, పట్టణాలు ఎన్ని ఉన్నదీ 999 వ పేజీలో వివరించబడింది :

1000 వ పేజీలోని పట్టికలో కొన్ని ముఖ్య పట్టణాల జనాభా వివరాలు ఇవ్వ బడ్డాయి :

| జిల్లా | విస్తీర్ణము చ|| మైళ్లలో | మొత్తం జనాభా | పురుషులు | స్త్రీలు | గ్రామీణ జనాభా | పట్టణ జనాభా | మొత్తం జనాభాలో పట్టణజనాభా శాతం |
|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | 1,648.10 | 15,11,336 | 7,60,730 | 7,50,606 | 3,56,134 | 11,55,202 | 76.4 |
| కరీంనగరం | 4,493.84 | 14,28,168 | 7,21,768 | 7,07,400 | 13,00,018 | 1,28,150 | 8.9 |
| వరంగల్లు | 5,105.27 | 13,25,984 | 6,78,801 | 6,47,183 | 11,35,028 | 1,90,956 | 14.8 |
| నల్లగొండ | 5,385.71 | 12,52,810 | 6,44,144 | 6,08,666 | 11,49,575 | 1,03,235 | 8.1 |
| మహబూబు నగరం | 5,749.80 | 11,86,496 | 5,94,239 | 5,92,257 | 10,70,974 | 1,15,522 | 9.7 |
| మెదకు | 3,409.10 | 10,27,293 | 5,16,388 | 5,10,905 | 9,40,231 | 87,062 | 8.5 |
| నిజామాబాదు | 2,957.60 | 7,73,158 | 3,82,563 | 3,90,595 | 6,39,796 | 1,33,362 | 17.2 |
| ఆదిలాబాదు | 7,358.70 | 9,02,522 | 4,51,882 | 4,50,640 | 7,89,417 | 1,13,105 | 12.5 |
| ఖమ్మం | 3,982.45 | 7,00,006 | 3,59,089 | 3,40,917 | 5,79,760 | 1,20,246 | 17.1 |
| తెలంగాణా మొత్తం | 40,088.50 | 1,01,07,773 | 51,09,604 | 49,99,169 | 79,60,933 | 21,46,840 | 21.2 |
| స్టేటు మొత్తం | 82,168.3 | 1,86,55,108 | 94,31,062 | 92,24,046 | 1,51,78,949 | 34,76,159 | 18.6 |

మూలం : హైదరాబాదు స్టేటు స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు 1952-53

నోటు : తాలూకాలవారీ జనాభా వివరాలకు అధ్యాయం చివరి పటాలు చూడండి.

| జిల్లా | గ్రామాలు | | | | | | పట్టణాలు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 500 కు తక్కువ జనాభా | 500-1,000 | 1,000 - 2,000 | 2,000 - 5,000 | 5,000 కు మించి | మొత్తం గ్రామాలు | 5,000 కు తక్కువ | 5,000 - 10,000 | 10,000 - 20,000 | 20,000 కు మించి | మొత్తం పట్టణాలు |
| హైదరాబాదు | 224 | 149 | 83 | 29 | ... | 485 | 14 | 5 | 1 | 1 | 21 |
| మహబూబునగరం | 457 | 398 | 274 | 104 | ... | 1,233 | 4 | 8 | ... | 2 | 14 |
| ఆదిలాబాదు | 1,244 | 355 | 174 | 22 | 1 | 1,796 | 5 | 4 | 4 | ... | 13 |
| నిజామాబాదు | 314 | 201 | 183 | 56 | ... | 754 | 1 | 6 | 1 | 2 | 10 |
| మెదకు | 422 | 366 | 245 | 79 | 1 | 1,113 | 4 | 3 | 3 | ... | 10 |
| కరీంనగరం | 255 | 305 | 402 | 201 | 2 | 1,165 | 3 | 8 | 2 | 2 | 15 |
| వరంగల్లు+ఖమ్మం | 214 | 271 | 350 | 171 | 7 | 1,013 | 3 | 6 | 2 | 3 | 14 |
| నల్లగొండ | 273 | 403 | 395 | 173 | • 1 | 1,245 | 3 | 7 | 3 | 1 | 14 |
| తెలంగాణా మొత్తం | 3,403 | 2,448 | 2,106 | 835 | 12 | 8,804 | 37 | 47 | 16 | 11 | 111 |
| స్టేటు మొత్తం | 9,136 | 5,959 | 3,543 | 1,252 | 19 | 19,909 | 70 | 108 | 40 | 22 | 240 |

| నగరం లేక పట్టణాలు | జనాభా | |
|---|---|---|
| | 1941 | 1951 |
| **హైదరాబాదు జిల్లా** | | |
| 1. హైదరాబాదు | 7,39,159 | 10,85,722 |
| 2. మల్కాజిగిరి (సికింద్రాబాదు) | ... | 12,376 |
| **మహబూబు నగరజిల్లా** | | |
| 3. మహబూబునగరం | 16,462 | 23,827 |
| 4. నారాయణపేట | 16,396 | 20,707 |
| **ఆదిలాబాదు జిల్లా** | | |
| 5. నిర్మల | 14,499 | 17,947 |
| 6. ఆదిలాబాదు | 11,128 | 17,196 |
| 7. బెల్లంపల్లి | 6,294 | 15,874 |
| 8. కొత్తపేట | 3,243 | 14,265 |
| **నిజామాబాదుజిల్లా** | | |
| 9. నిజామాబాదు | 32,741 | 55,195 |
| 10. బోధన | 19,443 | 22,491 |
| 11. ఆర్మూరు | 8,683 | 11,630 |
| **మెదకు జిల్లా** | | |
| 12. సిద్దిపేట | 12,865 | 18,109 |
| 13. మెదక | 7,565 | 14,934 |
| 14. సదాశివపేట | 6,158 | 10,763 |
| **కరీంనగరం జిల్లా** | | |
| 15. కరీంనగరం | 17,437 | 23,896 |
| 16. జగిత్యాల | 16,294 | 21,046 |
| 17. పెద్దపల్లి | 10,731 | 11,518 |
| 18. సిరిసిల్ల | 6,836 | 10,260 |
| **వరంగల్లు జిల్లా** | | |
| 19. వరంగల్లు | 92,808 | 1,33,130 |
| 20. మహబూబాబాదు | 7,463 | 11,569 |
| 21. జనగామ | 7,036 | 11,258 |

| నగరం లేక పట్టణం పేరు | జనాభా 1941 | జనాభా 1951 |
|---|---|---|
| ఖమ్మం జిల్లా | | |
| 22. కొత్తగూడెం | 10,484 | 50,195 |
| 23. ఖమ్మం | 18,982 | 28,251 |
| 24. ఇల్లెందు | 15,907 | 13,929 |
| నల్లగొండ జిల్లా | | |
| 25. నల్లగొండ | 12,674 | 22,183 |
| 26. భువనగిరి | 12,170 | 15,877 |
| 27. సూర్యాపేట | 7,381 | 12,443 |

తెలంగాణా జనాభాలో 60,75,002 మంది వ్యవసాయం మీద జీవిస్తున్నారు. వీరు మొత్తం జనాభాలో నూటికి 62.1 మంది. వ్యవసాయేతర వృత్తులపై జీవించే వారు 40,32,771 మంది. వీరు మొత్తం జనాభాలో నూటికి 37.9 మంది. మొదటి వారి, వివిధ వృత్తులపై జీవించే వారి సంఖ్య ప్రత్యేకంగా పట్టికలో ఇవ్వబడింది:

వ్యవసాయంపై జీవించే వారిలో మొత్తంగాగాని, ప్రధానంగాగాని స్వంత భూమి గలవారు (Cultivators of land wholly or mainly owned and their dependents) 35,37,943; మొత్తంగాగాని, ప్రధానంగాగాని భూమిలేని వ్యవసాయదార్లు (Cultivators of land wholly or mainly unowned and their dependents) 8,88,935; వ్యవసాయ కూలీలు (Cultivating labourers) 14, 27, 566; స్వంతంగా తమ భూముల సాగుచేయని శిస్తు పుచ్చుకొనేవారు (Non cultivating owners of land; Agricultural rent receivers and their dependents) 1,20, 545.

1003 వ పేజీలోని పట్టిక 1951వ సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం వివిధ జిల్లాలలోని వ్యవసాయ జనాభా వివరాలను తెలియజేస్తుంది:

వ్యవసాయేతర వృత్తులపై జీవించే వారిలో వ్యవసాయేతర ఉత్పత్తులపై జీవించే వారు, వారిపై ఆధారపడినవారు 18,62,959 మంది. వ్యాపారంపై జీవించేవారు, వారిపై ఆధారపడినవారు 5,86,625 మంది. రవాణాపై జీవించేవారు, వారిపై ఆధారపడినవారు 1,70,062. ఇతర ఉద్యోగాలపై జీవించేవారు, వారిపై ఆధారపడిన వారు 14,13,125 మంది.

జిల్లాలవారీ యీ తరగతులవారు ఎందరున్నారో 1004 వ పేజీలోని పట్టిక వివరిస్తుంది:

తెలంగాణా జనాభాలో చదువుకున్న జనాభా వివరాల లెక్కలివి. మొత్తం చదువువచ్చినవారి సంఖ్య 9,72,208 మాత్రమే. ఇక్కడ ఒక విషయం గమనించాలి. 1951 జనాభా

| జిల్లా | మొత్తంగాగాని, ప్రధానభాగంగాని స్వంతభూమి వుండి వ్యవసాయం చేసేవారు | | పూర్తిగాని లేక ప్రధాన భాగంగాని భూమి లేని వ్యవసాయదారులు | | వ్యవసాయ కూలీలు | | స్వంత భూములను కౌలుకిచ్చేవారు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం |
| హైద్రాబాదు | 1,07,739 | 7.1 | 72,670 | 4.8 | 69,139 | 4.6 | 7,913 | 0.5 |
| మహబూబునగరం | 4,35,607 | 36.7 | 1,65,537 | 13.9 | 2,09,782 | 17.7 | 24,058 | 2.0 |
| ఆదిలాబాదు | 3,06,059 | 33.9 | 1,25,842 | 13.9 | 1,98,336 | 22.0 | 9,913 | 1.1 |
| నిజామాబాదు | 3,82,792 | 49.5 | 25,443 | 3.3 | 1,06,476 | 13.8 | 11,497 | 1.5 |
| మెదకు | 5,52,823 | 53.8 | 86,798 | 8.4 | 1,22,799 | 12.0 | 21,676 | 2.1 |
| కరీంనగరం | 5,59,530 | 35.4 | 77,379 | 4.9 | 2,71,663 | 17.2 | 14,739 | 0.9 |
| వరంగల్లు } ఖమ్మం } | 5,56,471 | 35.2 | 1,78,931 | 11.3 | 2,80,056 | 17.7 | 17,241 | 1.1 |
| నల్లగొండ | 6,36,922 | 41.3 | 1,56,335 | 10.1 | 2,69,315 | 17.4 | 13,518 | 0.9 |
| తెలంగాణా మొత్తం | 35,37,943 | ... | 8,88,935 | ... | 14,27,566 | ... | 1,20,545 | ... |
| స్టేటు మొత్తం | 76,87,627 | 41.2 | 13,77,934 | 7.4 | 31,99,773 | 17.2 | 4,49,490 | 2.4 |

| జిల్లా | వ్యవసాయేతర ఉత్పత్తి | | వ్యాపారం | | రవాణా | | ఇతర ఉద్యోగాలు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం | జనాభా | మొత్తం తెలంగాణా జనాభాలో ఎంత శాతం |
| హైదరాబాదు | 2,86,604 | 19.0 | 2,42,743 | 16.1 | 1,00,244 | 6.6 | 6,24,284 | 41.3 |
| మహబూబునగరం | 1,87,240 | 15.8 | 55,259 | 4.7 | 6,875 | 0.6 | 1,02,138 | 8.6 |
| ఆదిలాబాదు | 1,33,136 | 14.8 | 24,195 | 2.7 | 11,766 | 1.3 | 93,275 | 10.3 |
| నిజామాబాదు | 1,26,030 | 16.3 | 36,770 | 4.7 | 9,255 | 1.2 | 74,892 | 9.7 |
| మెదకు | 1,19,942 | 11.7 | 45,210 | 4.4 | 5,285 | 0.5 | 72,760 | 7.1 |
| కరీంనగరం | 4,31,962 | 27.3 | 51,134 | 3.2 | 5,763 | 0.4 | 1,69,497 | 10.1 |
| వరంగల్లు / ఖమ్మం | 3,02,283 | 19.1 | 64,871 | 4.1 | 23,241 | 1.5 | 1,58,232 | 10.0 |
| నల్లగొండ | 2,75,762 | 17.9 | 66,443 | 4.3 | 7,633 | 0.5 | 1,18,047 | 7.6 |
| తెలంగాణా మొత్తం | 18,62,959 | 15.8 | 5,86,625 | 4.9 | 1,70,062 | 1.4 | 14,13,125 | 11.7 |
| స్టేటు మొత్తం | 25,25,501 | 13.5 | 9,54,516 | 5.1 | 2,43,192 | 1.3 | 22,17,075 | 11.9 |

ప్రక్క పేజీలోని పట్టికలో జిల్లాలవారీ వివిధ జాతులవారు ఎందరున్నదీ వివరించ బడింది.

తెలంగాణాలో 1951 జనాభా లెక్కల ప్రకారం 80 లక్షలమంది ప్రజల మాతృభాష తెలుగు. వీరి తర్వాత ఉరుదు మాతృభాషగా గలవారి సంఖ్య అధికం. వీరు 10,79,823 మంది ఉన్నారు. వీరిలో 5,31,560మంది హైదరాబాదునగరంలోనే ఉన్నారు. 2,76,530 మంది మాతృభాష మరాఠీ; 48,128 మంది భాష కన్నడం. జిల్లాలవారీ, వివిధ మాతృభాషల జనాభా ఎంతఉన్నదీ 1007, 1008 వ పేజీలలోని పట్టికలలో వివరించబడింది :

1951 జనాభా లెక్కల సేకరణ సందర్భంలో లెక్కలు సేకరించేవారికి, మాతృభాషతోపాటు ఆయా స్వాయుడు తన రోజువారీ జీవితంలో గాని, లేక యింటి వద్ద మాట్లాడే రెండవ ఉపభాషనుకూడా రికార్డు చేయాలని తాకీదు లివ్వబడ్డాయి. ఈ లెక్కలనుబట్టి మొత్తం సంస్థానంలో వున్న 89,21,524 మంది తెలుగు ప్రజలలో 5,08,930 మంది యితర భాషలను రెండవభాషగా మాట్లాడుతారని తేలింది. ఈ రెండవభాషగా మాట్లాడే వారిలో 2,64,144 మంది ఉరుదును, 1,19,272 మంది కన్నడమును, 80,939 మందిమరాఠీని, 35,823 మంది హిందీని మాట్లాడే వారున్నారు. మిగతావారు యితర 30 భాషలు మాట్లాడతారు. అలాగే మరాఠీ మాతృభాషగల 45,41,982 మందిలో 3,08,358 మంది యితర భాషలను రెండవ భాషగా మాట్లాడుతారు. ఉరుదూ మరాఠీ మాతృభాషగల 1,23,288 మంది తెలుగును రెండవభాషగా వాడుతారు. స్థానంలోని 21,59,214 మంది ఉరుదు మతృభాషగల వారిలో 3,99,436 మంది; 19,61,901 కన్నడిగులలో 1,11,494 మంది; హిందీ మాతృభాషగా గల 1,33,733 మందిలో 14,391 మంది తెలుగును రెండవ భాషగా తమ దినజీవితంలో వాడుతారు.

సంస్థానంలోవున్న మొత్తం తెలుగు జనాభా 1921 - 1931 నాటికన్నా తగ్గింది. 1921, 1931లో 48.2% వుంటే 1951లో 47.8% మాత్రమే వుంది. ఉరుదూ మాతృభాషగాగలజనాభామాత్రం పెరిగింది. 1931లో 10.4% వుంటే 1951లో 11.6% వరకు పెరిగింది.

తెలంగాణాలో 15,89,676 మంది షెడ్యూల్డు తరగతులవారు, 1,47,696 మంది హరిజనులు, మరియు షెడ్యూల్డు తెగల (Scheduled tribes) వారు 2,99,104మంది వున్నారు. ఈ షెడ్యూల్డు తెగలలోకి భిల్లులు, చెంచులు, గోండులు, కొండరెడ్లు, కోయలు, కోలాంవారు వస్తారు. వీరు అత్యధికంగా ఆదిలాబాదు, వరంగల్లు అడవులలో నివసిస్తారు.

ఒక తెలంగాణాలోనే ఒక జిల్లానుండి మరొక జిల్లాకు తరలిపోయిన జనాభాన్ని, తెలంగాణాలోకి భారతదేశ యితర రాష్ట్రాలనుండి, ప్రపంచంలోని వివిధ భాగాలనుండి వచ్చిన జనాభానుచూదాం. తెలంగాణాలోని ఒక జిల్లానుండి మరొక జిల్లాకు వచ్చినవారుగానీ, స్టేటులోని యితర ప్రాంతాలనుండి వచ్చినవారుగాని 5,90,385 మంది వున్నారు. ఇతర రాష్ట్రాలనుండి 1,94,859 మంది, ఆసియా ఖండంనుండి, 6,809 మంది, యూరోపు నుండి 376 మంది, ఆఫ్రికానుండి 76మంది,

| జిల్లా | మొత్తం జనాభా | హిందువులు | సిక్కులు | జైనులు | బౌద్ధులు | ముస్లిములు | క్రైస్తవులు | ఆటవికులు | ఇతరులు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | 15,11,336 | 9,46,988 | 2,619 | 2,104 | 42 | 5,23,286 | 34,729 | ... | 1,568 |
| మహబూబ్‌నగరం | 11,86,496 | 10,79,852 | 76 | 35 | ... | 99,717 | 6,795 | ... | 21 |
| ఆదిలాబాదు | 9,02,522 | 8,08,887 | 299 | 226 | ... | 58,135 | 10,428 | 24,503 | 44 |
| నిజామాబాదు | 7,73,158 | 6,76,670 | 416 | 202 | ... | 81,736 | 14,087 | ... | 47 |
| మెదకు | 10,27,293 | 8,96,926 | 206 | 197 | 31 | 97,876 | 32,053 | ... | 4 |
| కరీంనగరం | 15,81,667 | 14,86,786 | 590 | 8 | ... | 72,953 | 21,304 | ... | 17 |
| వరంగల్లు } ఖమ్మం | 15,81,326 | 14,18,762 | 444 | 151 | 1 | 99,691 | 62,049 | ... | 228 |
| నల్గొండ | 15,43,975 | 14,34,760 | 101 | 23 | 23 | 72,818 | 36,229 | ... | 21 |
| మొత్తం | 1,01,07,773 | 87,47,631 | 4,751 | 2,946 | 97 | 11,06,212 | 2,07,674 | 24,503 | 1,950 |

| జిల్లా | మొత్తం జనాభా | తెలుగు (1) | ఉరుదు (2) | మరాఠీ (3) | కన్నడ (4) | హిందీ (5) | లంబాడీ (6) |
|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | 15,11,336 | 8,01,377 | 5,31,560 | 34,256 | 13,120 | 45,739 | 8,574 |
| మహబూబునగరం | 11,86,496 | 9,92,709 | 99,191 | 5,506 | 21,844 | 1,723 | 58,887 |
| ఆదిలాబాదు | 9,02,522 | 5,08,133 | 55,449 | 1,86,028 | 996 | 3,965 | 35,518 |
| నిజామాబాదు | 7,73,158 | 6,34,735 | 80,777 | 15,174 | 9,183 | 1,567 | 23,871 |
| మెదకు | 10,27,293 | 9,01,596 | 96,942 | 4,395 | 1,833 | 1,304 | 16,762 |
| కరీంనగరం | 15,81,667 | 14,83,674 | 62,290 | 15,080 | 317 | 1,150 | 12,044 |
| వరంగల్లు ఖమ్మం | 15,81,326 | 12,94,837 | 87,971 | 11,755 | 518 | 7,410 | 1,34,420 |
| నల్లగొండ | 15,43,975 | 13,81,079 | 65,643 | 4,336 | 317 | 2,635 | 84,268 |
| తెలంగాణా మొత్తం | 1,01,07,773 | 79,98,140 | 10,79,823 | 2,76,530 | 48,128 | 65,493 | 3,74,344 |
| స్టేటు మొత్తం | ... | 89,21,524 | 21,59,214 | 45,41,982 | 19,61,901 | 1,33,733 | 5,53,412 |
| స్టేటు మొత్తం జనాభాలో శాతం | ... | 47.82 | 11.57 | 24.35 | 10.52 | 0.72 | 2.97 |

| జిల్లా | కోయ (7) | గోండు (8) | మరాఠీ (9) | గుజరాతీ (10) | ఎరుకల (11) | కొలామి (12) | ఇతర (13) |
|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | ... | ... | 7,661 | 9,019 | 2,169 | ... | 57,851 |
| మహబూబ్‌నగరం | ... | ... | 298 | 207 | 4,795 | ... | 51,336 |
| ఆదిలాబాదు | 2,975 | 90,204 | 1,036 | 1,022 | 281 | 8,325 | 8,590 |
| నిజామాబాదు | 15 | 5 | 991 | 1,440 | 912 | ... | 5,488 |
| మెదకు | ... | ... | 193 | 66 | 1,958 | ... | 12,244 |
| కరీంనగరం | ... | 382 | 283 | 79 | 3,283 | ... | 3,085 |
| వరంగలు ఖమ్మం | 30,711 | ... | 575 | 697 | 5,709 | ... | 6,723 |
| నల్లగొండ | ... | ... | 138 | 51 | 3,415 | ... | 2,093 |
| తెలంగాణా మొత్తం | 33,701 | 90,591 | 11,175 | 12,581 | 22,522 | 8,325 | 1,47,410 |
| [illegible] | ... | ... | ... | ... | ... | ... | ... |
| [illegible] | ... | ... | ... | ... | ... | ... | ... |

### 1941 ఆదిలాబాదు జిల్లా, తాలూకాల మాతృభాషల వారీ జనాభా

| తాలూకాపేరు | భాషలు | | | | | మొత్తం అక్షరాస్యులు | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|---|
| | తెలుగు | మరాఠీ | ఉర్దు | కన్నడ | ఇతరభాషలు | | |
| ఆదిలాబాదు | 54,111 | 21,129 | 9,610 | 1,362 | 11,683 | 5,559 | 93,250 |
| రాజూరా | 41,608 | 11,252 | 2,620 | 1,909 | 18,143 | 3,656 | 75,532 |
| సిర్పూరు | 61,759 | 12,767 | 5,858 | ... | 3,013 | 3,043 | 83,397 |
| చెన్నూరు | 62,970 | 12,792 | 5,916 | ... | 2,733 | 3,813 | 84,411 |
| లక్సెట్టిపేట | 67,898 | 14,053 | 3,313 | 700 | 7,339 | 4,848 | 93,303 |
| ఆసిఫాబాదు | 34,669 | 22,591 | 4,549 | 1,208 | 12,255 | 3,698 | 75,272 |
| ఉట్నూరు | 3,956 | 1,102 | 1,129 | 546 | 17,389 | 1,227 | 24,122 |
| ఖానాపూరు (ఎల్లడప) | 15,728 | 2,846 | 1,966 | 470 | 3,461 | 1,056 | 24,411 |
| నిర్మల | 76,067 | 15,851 | 12,847 | 4,005 | 4,553 | 6,687 | 1,13,323 |
| బోత్ | 37,310 | 9,920 | 5,051 | ... | 17,960 | 3,198 | 70,241 |
| కిన్వట్ | 34,207 | 15,281 | 6,600 | 484 | 25,143 | 4,450 | 81,715 |
| మొత్తం | 4,90,283 | 1,39,584 | 59,399 | 10,684 | 1,23,672 | 41,230 | 8,23,622 |
| 1951 లెక్కల జనాభా లెక్కల ప్రకారం | 5,08,133 | 1,86,028 | 55,449 | 996 | 1,51,916 | 51,162 | 9,02,522 |

# 1941 రాయచూరుజిల్లా, తాలూకాల, మాతృభాషలవారీ జనాభా

| తాలూకా పేరు | భాషలు | | | | | మొత్తం అక్షరాస్యులు | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|---|
| | తెలుగుభాష మాట్లాడేవారు | కన్నడభాష మాట్లాడేవారు | మరాఠీభాష మాట్లాడేవారు | ఉరుదుభాష మాట్లాడేవారు | ఇతరభాషలు మాట్లాడేవారు | | |
| రాయచూరు | 58,018 | 65,601 | 3,477 | 23,713 | 3,492 | 13,474 | 1,54,301 |
| దేవదుర్గ | 4,733 | 72,374 | 1,248 | 7,469 | 1,993 | 7,411 | 87,817 |
| మాన్వి | 4,040 | 77,577 | 1,154 | 10,185 | 1,057 | 8,279 | 94,013 |
| లింగ్సుగూరు | 11,850 | 74,158 | 1,558 | 12,009 | 4,034 | 9,937 | 1,03,609 |
| సింధనూరు | 8,897 | 61,977 | 1,237 | 6,775 | 1,159 | 7,647 | 80,045 |
| కుష్టగి | 11,220 | 79,312 | 1,206 | 16,749 | 2,416 | 10,164 | 1,10,908 |
| గంగావతి | 1,455 | 57,606 | 363 | 8,791 | 1,894 | 8,081 | 70,109 |
| (అ) కొప్పల్ | 12,445 | 69,362 | 879 | 10,185 | 903 | 9,335 | 93,774 |
| (అ) ఎల్బర్గా | 11,116 | 65,386 | 352 | 5,433 | 1,171 | 10,023 | 83,458 |
| అలంపూరు | 25,066 | 2,896 | 213 | 5,820 | 312 | 2,345 | 34,307 |
| గద్వాల | 94,690 | 23,517 | 914 | 8,771 | 1,726 | 6,783 | 1,29,618 |
| మొత్తం | 2,43,530 | 6,49,771 | 12,601 | 1,15,900 | 20,157 | 93,479 | 10,41,959 |
| 1951 లెక్కల ప్రకారం | 2,80,273 | 7,23,173 | 7,227 | 1,11,270 | 30,044 | 1,10,390 | 11,51,987 |

## 1941 గుల్బర్గాజిల్లాలోని తాలూకాల మాతృభాషలవారీ జనాభా

| తాలూకాపేరు | భాషలు | | | | | మొత్తం అక్షరాస్యులు | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|---|
| | తెలుగు | కన్నడ | మరాఠీ | ఉరుదు | ఇతర భాషలు | | |
| 1. గుల్బర్గా | 5,375 | 1,11,457 | 61,532 | 59,114 | 8,714 | 26,972 | 2,46,192 |
| 2. ఖండాల్ | 668 | 584 | ... | 196 | 118 | 103 | 1,566 |
| 3. షాబాదు | 666 | 21,668 | 851 | 9,227 | 3,059 | 3,056 | 35,47 1 |
| 4. ఆలందు | 364 | 23,632 | 15,875 | 12,142 | 1,006 | 4,393 | 53,019 |
| 5. చింతాపూరు | 4,339 | 24,932 | 2,371 | 5,969 | 4,275 | 3,066 | 41,886 |
| 6. కళ్యాణి | 3,625 | 15,601 | 15,420 | 11,173 | 1,979 | 3,902 | 47,798 |
| 7. చించోలి | 20,625 | 15,798 | 31,950 | 14,925 | 7,504 | 7,472 | 90,802 |
| 8. కొడంగల్లు | 1,01,657 | 1,610 | 3,113 | 11,018 | 7,006 | 8,401 | 1,24,404 |
| 9. లోసగి | 5,443 | 1,126 | 9,268 | 3,547 | 12 | 1,448 | 19,396 |
| 10. తాండూరు | 12,114 | 1,896 | 14,840 | 11,928 | 1,084 | 4,141 | 41,863 |
| 11. సెడం | 31,677 | 25,930 | 4,606 | 13,465 | 2,625 | 4,961 | 78,303 |

| తాలూకా పేరు | తెలుగు | కన్నడ | మరాఠీ | ఉర్దూ | ఇతర భాషలు | మొత్తం అక్షరాస్యులు | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|---|
| | భాషలు | | | | | | |
| 12. చిత్తాపూర్ | 4,987 | 11,105 | 3,029 | 6,861 | 3,405 | 2,320 | 29,327 |
| 13. జహీరాబాదు | 8,794 | 10,345 | 1,609 | 6,091 | 1,112 | 2,618 | 27,952 |
| 14. యాదగిరి | 5,272 | 9,212 | 69,466 | 18,025 | 7,893 | 9,212 | 1,37,277 |
| 15. షాపూర్ | 1,295 | 83,428 | 8,316 | 14,324 | 3,021 | 7,211 | 1,10,384 |
| 16. అఫ్జల్‌పూర్ | 471 | 25,901 | 2,235 | 6,953 | 1,053 | 2,866 | 36,613 |
| 17. షోరాపూర్ | 1,753 | 84,666 | 5,502 | 11,501 | 4,162 | 8,546 | 1,07,584 |
| 18. అందోలా (జేవర్గి) | 648 | 60,582 | 8,028 | 12,262 | 699 | 5,981 | 82,219 |
| మొత్తం | 2,41,062 | 5,89,727 | 1,93,817 | 2,28,721 | 58,728 | 1,06,669 | 13,12,055 |
| 1951 గుల్బర్గా జిల్లా జనాభా లెక్కలు | 2,98,519 | 7,97,527 | 44,435 | 2,32,702 | 75,761 | 1,21,609 | 14,48,944 |

## నాందేడు జిల్లాలోని ముధోలు తాలూకా మాతృభాషలవారీ జనాభా

| తాలూకా | భాషలు | | | | | మొత్తం అక్షరాస్యులు | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|---|
| | తెలుగు | మరాఠీ | ఉరుదు | కన్నడ | ఇతరభాషలు | | |
| ముధోలు తాలూకా (1941) | 69,940 | 37,001 | 24,080 | 9,250 | 7,458 | 8,169 | 1,47,729 |
| మొత్తం జిల్లా జనాభా (1941) | 1,24,519 | 4,90,744 | 1,01,182 | 42,553 | 44,117 | 49,414 | 8,03,115 |
| నాందేడు జిల్లా జనాభా (1951) | 1,37,222 | 6,21,914 | 1,14,862 | 39,145 | 36,793 | 74,881 | 9,49,936 |

## 1941, 51 బీదరు జిల్లా భాషలవారీ జనాభా

| సంవత్సరం | భాషలు | | | | | మొత్తం జనాభా |
|---|---|---|---|---|---|---|
| | తెలుగు జనాభా | కన్నడ జనాభా | మరాఠీ జనాభా | ఉరుదు జనాభా | ఇతర భాషల జనాభా | |
| 1941 జనాభా లెక్కల ప్రకారం | 1,51,882 | 2,98,220 | 3,58,463 | 1,82,301 | 15,502 | 10,06,368 |
| 1951 జనాభా లెక్కల ప్రకారం | 1,70,827 | 3,25,334 | 4,57,177 | 1,90,938 | 28,426 | 11,72,702 |

# తెలంగాణా జిల్లాలు - తాలూకాలు - జనాభా

| జిల్లా - తాలూకాలు | జనాభా |
|---|---|
| **హైదరాబాదు జిల్లా** | **15,11,334** |
| 1. పడమటి హైదరాబాదు | 11,66,860 |
| 2. తూర్పు హైదరాబాదు | 83,775 |
| 3. షాహబాదు | 77,775 |
| 4. మేడిచల్ | 78,851 |
| 5. ఇబ్రహీంపట్నం | 1,04,075 |
| **మహబూబు నగరం జిల్లా** | **11,86,496** |
| 1. మహబూబునగరం | 1,52,751 |
| 2. వనపర్తి | 1,21,496 |
| 3. ఆత్మకూరు | 98,330 |
| 4. మక్తాలు | 1,34,769 |
| 5. పరిగి | 98,458 |
| 6. షాదునగరు | 1,17,738 |
| 7. కల్వకుర్తి | 1,52,159 |
| 8. అచ్చంపేట | 71,664 |
| 9. నాగరకర్నూలు | 1,37,377 |
| 10. కొల్లాపూరు | 1,01,759 |
| **ఆదిలాబాదు జిల్లా** | **9,02,522** |
| 1. ఆదిలాబాదు | 1,01,611 |
| 2. వుట్నూరు | 34,404 |
| 3. ఖానాపురం | 43,366 |
| 4. నిర్మల | 1,21,029 |
| 5. బోథ్ | 72,372 |
| 6. కిన్వట్ | 73,118 |
| 7. రాజూరా | 75,357 |
| 8. సిరిపురం | 1,04,091 |
| 9. చెన్నూరు | 86,117 |
| 10. లక్సెట్టిపేట | 98,812 |
| 11. ఆసిఫాబాదు | 92,245 |
| **నిజామాబాదు జిల్లా** | **7,73,158** |
| 1. నిజామాబాదు | 1,69,717 |
| 2. కామారెడ్డి | 1,36,298 |
| 3. ఎల్లారెడ్డి | 71,339 |
| 4. బన్సువాడ | 86,801 |
| 5. బోధన్ | 1,26,096 |
| 6. ఆర్మూరు | 1,82,907 |
| **మెదకు జిల్లా** | **10,27,293** |
| 1. సంగారెడ్డి | 1,46,242 |
| 2. వికారాబాదు | 1,22,826 |
| 3. అందోల్ | 1,53,037 |
| 4. మెదకు | 1,52,501 |
| 5. సిద్దిపేట | 2,09,473 |
| 6. గజవెల్లి | 1,39,253 |
| 7. నర్సాపురం | 1,03,961 |
| **కరీంనగరం జిల్లా** | **15,81,667** |
| 1. కరీంనగరం | 3,02,172 |
| 2. సిరిసిల్ల | 2,28,847 |
| 3. మెటపల్లి | 1,20,635 |
| 4. జగత్యాల | 2,03,865 |
| 5. సుల్తానాబాదు | 2,43,802 |
| 6. మంథని | 86,846 |
| 7. హుజూరాబాదు | 2,42,001 |

| జిల్లా - తాలూకాలు | జనాభా |
|---|---|
| వరంగల్లు జిల్లా | 11,72,485 |
| 1. వరంగల్లు | 4,72,307 |
| 2. పాకాల్ | 1,06,753 |
| 3. ములుగు | 66,292 |
| 4. మహబూబాబాద్ | 2,35,968 |
| 5. జనగామ | 2,91,165 |
| ఖమ్మం జిల్లా | 7,00,896 |
| 1. బూర్గంపాడు | 43,590 |
| 2. పాల్వంచ | 1,31,310 |
| 3. మధిర | 1,70,661 |
| 4. ఎల్లందు | 1,19,367 |
| 5. ఖమ్మం | 2,35,968 |
| నల్లగొండ జిల్లా | 12,90,161 |
| 1. నల్లగొండ | 2,56,153 |
| 2. మిర్యాలగూడెం | 1,28,224 |
| 3. దేవరకొండ | 1,63,442 |
| 4. రామన్నపేట | 1,70,990 |
| 5. భువనగిరి | 1,86,464 |
| 6. సూర్యాపేట | 2,21,804 |
| 7. హుజూరునగరు | 1,25,811 |



# నైసర్గిక స్వరూపం

తెలంగాణా, తక్కిన ఆంధ్రదేశంతో పాటు దక్కన్ పీఠభూమిలో భాగం. తెలంగాణాలో దీని సగాసరి ఎత్తు (సముద్ర మట్టమునుండి) సుమారు 1,200 అడుగులు ఉంటుంది. మొత్తం దక్కన్ పీఠభూమిలో వలె వాయువ్యంనుంచి ఆగ్నేయదిశకు వంగిఉంటుంది. అందు చేత నీటిపారుదల, నదుల ప్రవాహం కూడా ఇట్లే ఉంటుంది.

హైదరాబాదు స్టేట్‌లోని మరాఠ్వాడా, కర్ణాటక ప్రాంతాలుకూడా దక్కను పీఠభూమిలోని భాగాలే అయినా, భూమి పరిస్థితి నాన్ననుసరించి ఏర్పడిన నైసర్గిక పరిస్థితులు మొదలగు వాటినిబట్టి తెలంగాణా, స్టేట్‌లోని ఇతర భాగంతో వేరుగా ఉండి, తక్కిన ఆంధ్రదేశంతో పోలికలు కలిగి ఉన్నది.

దీన్ని గురించి ఉస్మానియా యూనివర్సిటీలో భూగోళశాస్త్ర శాఖ అధ్యక్షులగు సయ్యద్ అహమ్మద్ గారిట్లు వ్రాశారు: "భూగర్భస్థితి, జాతుల దృష్టితో స్టేట్ (హైదరాబాదు) విశిష్టతగల దాదాపు సరిసమానమగు రెండు పెద్ద భాగాలుగా విభజించబడి ఉన్నది. మంజీర, గోదావరి నదులు ఈ రెంటినీ వేరుపరుస్తున్నవి. దక్షిణాన తుంగభద్ర కృష్ణసంగమమగు చోటనుండి, ఉత్తరాన మంజీర గోదావరిలో సంగమమయ్యే చోటికి ఒక గీత గీస్తే, ఈ రెండు భాగాలుగా విభజించగలం. దీనికి ఉత్తర, పడమరలనున్న ప్రాంతం అగ్నిపర్వతాల ద్వారా ఏర్పడింది (Trappnean Region). ఈశాన్య ప్రాంతం నల్లరాళ్లు, సున్నపురాళ్ళతో కూడుకున్నది (Granite And Calcarious). దీనితో సమానంగానే జాతుల విభజనకూడ ఏర్పడియున్నది. అగ్నిపర్వతాల ద్వారా నిర్మితమైన ప్రాంతంలో మరాఠీ, కన్నడ ప్రజలు, నల్లరాయి ప్రాంతంలో తెలుగు ప్రజలు వున్నారు. మొదటిభాగమైన నల్ల భూమిలో ప్రధానంగా గోధుమ, ప్రత్తి పండుతాయి. నల్లరాయి ప్రాంతమగు తెలంగాణా, చెరువులతోగల వరిప్రాంతం. ఈ రెండు ప్రాంతాలమధ్య భేదం చాల స్పష్టంగా ఉన్నది. అగ్నిపర్వత సంబంధమైన, లేక నల్లరేగడి ప్రాంతం బాగా పెరిగిన వృక్షకోటితో, ఎత్తైన రాళ్ళతో, వరుసలుగావున్న పర్వతాలతోవున్న చాల ఫలవంతమైన భూమి. ఇది తేమను ఎక్కువ కాలం నిలుపగలదు.

"నల్లనున్నపురాయి ప్రాంతంలో, కొండలపై చెట్లు చేమలు ఉండవు. కాని మైదానాలలో మట్టుకు వివిధరకాల గుబురువృక్షాలు విరివిగా ఉన్నాయి. గుండ్రని శిఖరాలుగలగుట్టలు, బ్రహ్మాండమైన రాతిగుండ్లతో (Boulders) నిండి

నిద్రాణచ్ఛాయల కలిగిస్తాయి. నల్లరాళ్ళ నుండి ఏర్పడిన నేల ఇసుకతో కూడి ఉండి తేమను నిలుపలేదు. అందుచేత ఎండలకాలంలో ఈ ప్రాంతంలోని నదులు ఎండిపోతవి. దీనివల్ల నీళ్ళను పదిల పరిచే చెర్లు (చెరువులు) అవసరం. వీటితో తెలంగాణా అంతా నిండి ఉన్నది."

— హైదరాబాద్ ప్రభుత్వం ప్రకటించే "సేటి హైదరాబాద్" పత్రిక ఫిబ్రవరి 1954.

ఇదే భూపరిస్థితి, నైసర్గిక పరిస్థితులు, కొద్దిగా తేడాలతో కోస్తా ఆంధ్ర జిల్లాలలో మెట్ట ప్రాంత ప్రారంభంవరకూ, రాయలసీమలో కూడా వ్యాపించి ఉన్నవి.

విశాలాంధ్ర మొత్తంమీద చూస్తే, తెలంగాణాలోనే కొంతవరకు ఎత్తయిన పర్వతాలున్నాయి. పడమటి కనుమలలో భాగమైన సహ్యాద్రివరుస తూర్పుగా వ్యాపించి ఆదిలాబాదు జిల్లాలో అంతమవుతుంది. దీన్ని నిర్మల గుట్టలంటారు. ఇవి ఇచ్చట మూడువరుసలుగా పడమరా, తూర్పునా సుమారు 80 మైళ్ళు వ్యాపించి వున్నవి. వెడల్పు 35 - 40 మైళ్ళుంటుంది. దీన్నుంచి రెండు చిన్న శాఖలు చీలి ఆగ్నేయదిశగా పోయినవి. ఇందులో ఒకటి కరీంనగరం జిల్లాలోనికి పోయిన రాఖీ గుట్టలు; రెండవది వరంగల్లు జిల్లాలోకి వ్యాపించిన కందికట్ల గుట్టలవరుస. పడమటి కనుమలలో ఇంకొక భాగమైన బాలాఘాటు పర్వత వరుసనుండి వేరుపడి ఆగ్నేయ దిశగా వ్యాపించిన శాఖ హైదరాబాదు, మహబూబు నగరం వరకు వచ్చింది. వీటిలో భాగమే హైదరాబాదు జిల్లాలోని రాచకొండ గుట్టలు. ఇవికూడ కొంతవరకు దిట్టమయిన గుట్టలే.

తూర్పు కనుమలకు సంబంధించిన గుట్టలవరుస గోదావరి లోయకిరువైపులా వ్యాపించి ఉన్నది. గోదావరి వీటిని తొలచి సాగుతూ కొన్నిచోట్ల 200 - 300 గజాల మార్గం గుండానే ప్రవహిస్తున్నది. మహబూబు నగరం జిల్లాలోగల నల్లమల గుట్టల వరుస (అమ్రాబాదు గుట్టలని పేరు.) కూడ తూర్పుకనుమలో భాగమే. ఇవి తెలంగాణాలో ప్రారంభమై రాయలసీమలోనికి వ్యాపించి ఉన్నవి. కృష్ణానది ఇచ్చట వీటిగుండా ప్రవహిస్తుంది.

ఈ ప్రధాన పర్వత, గుట్టల వరుసలు గాక, తెలంగాణా అంతటా అనేక చిన్న గుట్టలు వ్యాపించి ఉన్నవి. వీటిలో అనేక వాగులు, ఒయ్యాలు బయలుదేరి ప్రవహిస్తూ తెలంగాణాలో నిర్మించబడిన చెరువులకు నీటిని సప్లయి చేస్తవి.

తెలంగాణాలో అంత ముఖ్యమయిన పర్వత శ్రేణులు లేకపోయినా, యావదాంధ్ర దేశానికి జీవనదులయిన కృష్ణా, గోదావరీ మహానదులు తెలంగాణాలో చాలాభాగం ప్రవహిస్తూ, ఇచ్చట కలిసే ఉపనదులతో ఇట్టి మహానదుల స్వరూపాన్ని వహిస్తున్నవి. ఈ రెండు మహానదులు తెలంగాణాను రెండు నదీ ప్రాంతాలు (River Basins) గా విభజించి ఇచ్చట ప్రజల జీవితంపై ప్రభావం కలిగించాయి. ఈ రెండు మహానదుల లోయలగుండానే ప్రాచీనాంధ్రులు మొదట తెలంగాణాకు, తర్వాత ఇతర ప్రాంతాలకు వ్యాపించి అభివృద్ధి అయి, ఇప్పటి ఆంధ్రజాతిగా పరిణామం చెందారు. తెలంగాణాలో ప్రవహించే

ఇతర చిన్న నదులన్నీ ఈ రెండు నదుల లోనే కలుస్తున్నవి.

## గోదావరి

ఇది పశ్చిమ కనుమల్లో బొంబాయి రాష్ట్రంలో పుట్టినా, తెలంగాణా సరిహద్దుల్లో అనేకముఖ్యనదులు కలిసేదాకా చిన్నదిగానే ఉండి పోయింది. దీంతో కలసిన మొదటి ముఖ్యఉపనది మంజీర. ఇది మరాఠ్వాడాలోని బీడు జిల్లాలో బాలాఘాటు పర్వతాలలో పుట్టి, ఆగ్నేయంగా ఉస్మానాబాదు (మరాఠ్వాడా), మెదక్ (తెలంగాణా)లో ప్రవహించి మెదకులో సంగారెడ్డివద్ద ఉత్తరంగా తిరిగి, నిజామాబాదు జిల్లాలో ప్రవహించి గోదావరిలో కలుస్తుంది. దీని పొడుగు 400 మైళ్ళు. నిజాంసాగరు ప్రాజెక్టు దీని పైనే నిజామాబాదు జిల్లాలో కట్టబడింది. తర్వాత కలిసే నది ప్రాణహిత. మధ్య ప్రదేశ్‌లోని విదర్భలో పుట్టి, తెలంగాణాకు ఉత్తర సరిహద్దుగా ప్రవహించే పెన్గంగ, ఈశాన్యంగా వచ్చిన వార్ధా, పెయిన్ గంగలతో కలిసి ప్రాణహితగా ఏర్పడి, ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరుకు తూర్పున 12 మైళ్ళలో కాళేశ్వరం అనే పుణ్యక్షేత్రం వద్ద గోదావరిలో కలుస్తుంది.

ఇంతవరకు తెలంగాణాలో చాల భాగం పడమరనుంచి తూర్పుకు ప్రవహించిన గోదావరి, ఇచ్చటనుంచి ఆగ్నేయంగా పోతుంది. తర్వాత కరీంనగరం జిల్లాలో పుట్టి, 40 మైళ్ళ తూర్పుగా ప్రవహించిన మానేరునది గోదావరిలో కలుస్తుంది. అటు ఎడమవైపు దక్షిణ బస్తరునుండి ఇంద్రావతి, శబరి నదులు కలుస్తున్నవి. శబరితో కలిశాక, తూర్పు కనుమలగుండా ప్రవహిస్తుంది. ఇచ్చట వీటిని పాపి కొండలంటారు. ఇచ్చట ఇది 200-300 గ|| మాత్రమే వెడల్పుగల్గి, ఇరువైపుల 2000-3000 అడుగుల ఎత్తుగల రాతి ప్రాంగాలమధ్యన ప్రవహించి పోలవరంవద్ద మైదానంలో ప్రవేశిస్తున్నది.

గోదావరినదిలో ప్రవహించే నీటిలో ప్రధాన భాగం, పై ముఖ్య ఉపనదుల ద్వారానే వస్తున్నది. దీనికి ప్రధాన వర్షాధారం ఆగ్నేయ ఋతు పవనాలు.

## కృష్ణానది

ఇది బొంబాయి రాష్ట్రములోని పశ్చిమ కనుమల్లో పుట్టి, తెలంగాణా సరిహద్దగు రాయచూరు జిల్లాలో ప్రవేశించేవరకు లోతయిన మార్గముద్వారా ప్రవహిస్తుంది. ఇచ్చటి భీమా, తుంగభద్రా నదుల సంగమ ప్రదేశాలు నేగడి భూములు. ఇందులో భీమా, కృష్ణా సంగమం, కర్ణాటక(హైద్రాబాద్)లోనికీ; తుంగభద్రా, కృష్ణ సంగమం మధ్యనున్న ప్రాంతం తెలంగాణా లోనికీ వస్తుంది. ఈ ప్రాంతంలోనే ఇది 3 మైళ్ళలో 400 అడుగులు క్రిందకు దిగటంద్వారా జలదుర్గ జలపాతం ఏర్పడింది.

కృష్ణలో ప్రవహించే నీటిలో ముఖ్య భాగం పడమటి కనుమల్లోనుంచే వస్తుంది. భీమా, తుంగభద్రల ద్వారా చాల నీరు వస్తుంది. ఈ తుంగభద్రా నదిపైనే హైద్రాబాదు, ఆంధ్ర ప్రభుత్వాలు జాయంటుగా కడుతున్న తుంగభద్ర ప్రాజెక్టు ఉన్నది. తర్వాత తెలంగాణా నుంచి వచ్చి కలిసే ముఖ్య ఉపనదులు: దిండి, ముస్సి, మునేరు, పాలేరు. దిండి, మహబూబ్‌నగరం జిల్లాలో పుట్టి నల్లగొండ

జిల్లాలో కృష్ణలో పడుతుంది. దేవరకొండ తాలూకాలో (నల్లగొండ జిల్లా) దీనిపై ఒక ప్రాజెక్టు కట్టబడింది. మూసీ, అనంతగిరి గుట్టల్లో పుట్టి హైద్రాబాదు, నల్లగొండ జిల్లాలగుండా పారి కృష్ణలో (వజీరాబాద్ వద్ద) పడుతున్నది. దీని పొడుగు షుమారు 150 మైళ్ళు. హైద్రాబాదు నగరం ఈనదిగట్టునే ఉన్నది. మున్నేరు, పాఖాల చెరువులో పుట్టి, వరంగల్లు జిల్లాగుండా ప్రవహించి, ఆంధ్రరాష్ట్రంలోని కృష్ణా జిల్లాలో కృష్ణానదిలో కలుస్తున్నది.

తుంగభద్రా నదితో కలిసాక మరల కృష్ణానది గుట్టలు, సొరంగాలమధ్య షుమారు 180 మైళ్ళ వరకు ప్రవహించి, పులిచింతల వద్ద తెలంగాణాతో సంబంధం వీడి, ఆంధ్ర రాష్ట్రంలో ప్రవేశించిన చోటనుండి మైదాన ప్రాంతంలో ప్రవహిస్తున్నది. కృష్ణానది షుమారు 200 మైళ్ళు తెలంగాణాను, ఆంధ్ర కోస్తా రాయలసీమ జిల్లాలను కలుపుతూ ప్రవహించింది. కర్నూలు నుంచి సముద్రంలో పడేవరకున్న ఈ ప్రాంతం అంతా దిగువ కృష్ణానదీప్రాంతం (Lower Krishna Basin). కృష్ణానది ఆధారంగా సమిష్టి అభివృద్ధికి ఇది వీలుగా ఉన్నది.

## చెరువులు – తటాకాలు

తెలంగాణా అంతా గుట్టలు, కొండలతో (చిన్నవే అయినా) నిండివున్నది. అందుచే అనేక వాగులు, ఒర్రెలు పుట్టి ప్రవహిస్తున్నవి. మెట్టప్రాంతాల నుండి వర్షపునీరు ఒకచోట కూడేందుకు వీలుగా కూడ అసంఖ్యాక ప్రదేశాలున్నవి. వీటి ఆధారంగా, అనాదినుండి తెలంగాణాలో తరివ్యవసాయంకోసం ఏర్పడిన వేలకొలది చెరువులు, తటాకాలు ఎచ్చటచూచినా కనిపిస్తూ, తెలంగాణాకొక ప్రత్యేక అందాన్ని కల్గిస్తున్నవి. వీటిలో కొన్ని చాలా పెద్దవిగావుండి, వందలసంవత్సరాలనుండి సహజ కొలనులవలె ఏర్పడివున్నవి. పాఖాల, రామప్ప, లక్నవరం చెర్వులు, గండిపేట చెరువు, హుస్సేను సాగరు, హిమాయత్ సాగరు మొదలగునవి ఇటువంటివే. ఈమధ్య ఏర్పడిన నిజాంసాగర్, పోచారం, పాలేరు, వైరా చెరువులు గూడ ఇదే తరగతులలోనికొస్తవి.

## వృక్ష సంతతి

అడవులు, వర్షం ఎక్కువగా పడే ప్రాంతమగు తెలంగాణా తూర్పు ప్రాంతంలో ఉన్నవి. వీటిలో టేకు, యిప్ప, చంద్ర, నల్లమద్ది, వెదురువాసం సమృద్ధిగా వుంటవి. గుబుర్లతో గూడిన అడవి ప్రాంతం తక్కువ వర్షంపడే నైరుతీ ప్రాంతంలో వున్నది. దీనినే అమ్రాబాదు అడవులు అంటారు. పచ్చికబయళ్ళు చాల విశాలప్రాంతంలో ఉన్నాయి.

# వర్షపాతం

(తెలంగాణాకు వర్షం ప్రధానంగా ఆగ్నేయ ఋతుపవనాలద్వారా వస్తుంది. తూర్పు భాగంలో ఈశాన్య ఋతుపవనాలవల్లకూడ కొంత వర్షంపడుతుంది. మరాఠ్వాడా, కర్నాటక ప్రాంతాలలో కంటె తెలంగాణాలో వర్షపాతం కొంత వరకు హెచ్చు. తెలంగాణాలోకూడా గోదావరీనది నానుకొని అడవులుగల వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలలో వర్షం ఎక్కువ. మహబూబ్‌నగర్‌జిల్లా, నల్లగొండజిల్లా, కరీంనగరు జిల్లాలలో వర్షం తక్కువ. ప్రక్క పేజీలలోని పట్టికలో వివిధ జిల్లాల వర్షపాతం వివరాలు ఇవ్వబడ్డాయి:)

## 1940—41 నుండి 1949—50 వరకు తెలంగాణా యొక్క సాంవత్సరిక వర్షపాతం

| జిల్లా | 1940-41 | 1941-42 | 1942-43 | 1943-44 | 1944-45 | 1945-46 | 1946-47 | 1947-48 | 1948-49 | 1949-50 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదిలాబాదు | 48.91 | 28.43 | 44.64 | 41.93 | 41.07 | 51.69 | 41.72 | 37.56 | 39.94 | 53.50 |
| హైదరాబాదు | 19.70 | 22.04 | 28.40 | 33.76 | 32.39 | 33.91 | 24.20 | 40.12 | 28.49 | 24.86 |
| కరీంనగరం | 34.22 | 22.55 | 37.89 | 40.94 | 37.31 | 35.55 | 36.53 | 40.28 | 40.36 | 37.32 |
| మహబూబునగరం | 29.62 | 18.41 | 18.96 | 33.67 | 28.26 | 29.49 | 26.61 | 39.92 | 25.65 | 33.66 |
| మెదకు | 30.35 | 23.09 | 35.43 | 36.87 | 26.37 | 39.01 | 28.40 | 39.59 | 39.16 | 37.65 |
| నల్గొండ | 23.12 | 20.65 | 24.13 | 33.09 | 28.42 | 31.36 | 25.33 | 36.81 | 21.32 | -28.12 |
| నిజామాబాదు | 38.05 | 30.28 | 48.53 | 42.58 | 32.56 | 41.29 | 32.34 | 40.13 | 41.83 | 45.14 |
| వరంగల్లు | 42.06 | 27.64 | 38.53 | 36.96 | 33.54 | 38.87 | 36.63 | 41.70 | 31.80 | 41.17 |

మూలం: గ్రామీణ ఆర్థిక విచారణ

# నదులు - ప్రాజెక్టులు

నైసర్గిక పరిస్థితుల గురించి తెలుసుకున్నదాన్ని బట్టి, తెలంగాణాలోని భూమి ఇసుకతో కూడుకొని, నీరు త్వరగా ఇంకిపోయేదిగా ఉండుటచే, నీటి వనరుల ఏర్పరచి, వీటి ఆధారంగా వ్యవసాయంచేసే పద్ధతి ఇచ్చట అనాది నుంచి ఏర్పడివున్నది.

నల్లగొండ జిల్లాలో పనిగిరి గుట్టల దగ్గర, ఈ మధ్య పురావస్తుశాఖవారిచే పైకి తీయబడిన 30 శిధిల పట్టణాలు, వాటి చుట్టూ ఉన్న అనేక నీటి రిజర్వాయర్లు బట్టి, నీటి పొదుపుల విషయంలో తెలంగాణపు పురాతన ఇంజనీర్లు చూపిన శ్రద్ధ, వారి తెలివితేటలు తెలుస్తవి. వెనకటి నీటి వనరులు అనేకం శిధిలమైపోయినా, 12,13 శతాబ్దాలనాటివి కూడా ఇంకా కొన్ని ఉన్నవి. పాఖాల్, రామప్ప, లఖ్నవరం, ఘనపురం చెర్వులు, ఆనకట్టలు ఈ కాలానికి చెందినట్లు శాసనాలు ఉన్నవి. పాఖాల్ చెరువు దట్టమయిన అడవి మధ్య ఉన్నది. ఎంతో సుందరమయినది. ఇది 1230 లో నిర్మింపబడినదని శాసనం ఉన్నది. వరంగల్లు గణపతి రాజుల క్రింద జాగాల ముమ్మిడి అనే సేనానాయకుడు దీనిని నిర్మించి, తన తమ్ముడగు నల్ల గణప పేరిడినారట. ఈ తటాకానికి 4,300 అడుగుల మట్టికట్ట ఉంది. 9,000 యక రాలు సాగుచేయగలము. ఇది వరంగలుకు తూర్పుగా 32 మైళ్ళలో ఉంది.

వరంగల్లుకు ఈశాన్యంగాగల రామప్ప తటాకం చాల ప్రఖ్యాతి వహించింది. దీన్ని 1213 లో రుద్రసేనా నాయకుడు కట్టించినట్లు శాసనం ఉన్నది. ఇచ్చటనే ప్రఖ్యాతి వహించిన రామప్ప దేవాలయం ఉంది. దీనికి 2000 అ. కట్ట ఉన్నది. 5,164 యకరాలు సాగు అవుతుంది.

వరంగల్లుకు 50 మైళ్ళ దూరాన ఉన్న లఖ్నవరం చెరువుకూడ, పై రామప్ప చెరువు కాలంలో కట్టిందే. మూడు కొండ లోయల పూడ్చి ఒకి కట్టనే 2,000 అ. వరకు సహజ కట్టగా ఏర్పరచి ఈ చెర్వు నిర్మించబడింది. దీని క్రింద 4,300 యకరాలు సాగవుతుంది.

ఇట్టి చరిత్రాత్మక చెరువు లెన్నో తెలంగాణా అంతటా ఉన్నవి. నల్లగొండ జిల్లాలో మూసీనదిపై కట్టిన 18 ఆనకట్టలు, వెనుకటి నిర్మాణాల గురించి మనకు తెల్పుతవి.

13వ శతాబ్దపు ఆఖరులో ప్రారంభమయిన ముస్లింరాజుల పరిపాలనలోకూడ నీటి వనరులు నిర్మించబడినవి. వీటిలో ముఖ్యమైనవి : 16 వ శతాబ్దంలో నిర్మించిన హుస్సేనుసాగరు (హైద్రాబాదు - సికింద్రాబాదు మధ్య), 1790 లో నిర్మించిన మీర్ ఆలం చెరువు.

# ఇంతవరకున్న తరిసేద్యం - దానిస్థితి

## చెరువులు - బావులు

ప్రస్తుతం తెలంగాణాలో అన్ని రూపాల్లో సాగవుతున్న తరి భూమి (Irrigated area) 11,88,772 యకరాలు. దీనిలో అత్యధిక భాగం చెరువులు, బావుల క్రింద సాగవుతున్నది. ప్రక్క పేజీలో ఇవ్వబడిన పట్టిక దీనిని స్పష్టీకరించుతుంది.

కాని యిదంతా స్వయంగా సేద్యం అవుతుందనుకోవడానికి వీలులేదు. చెరువులు, బావులు వర్షంపై ఆధారపడటమే గాక అత్యధికం చెడిపోయిన స్థితిలో వున్నవి.

పైనిచ్చిన జిల్లాలేగాక, కర్నాటక జిల్లాలతో కలసివున్న తాలూకాలుగూడ కలిపితే, మొత్తం తెలంగాణాలో షుమారు 28,000 చెరువులున్నవి. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 1953-54 లో వీటిలో షుమారు 2,04,123 యకరాలు ఆయకట్టుగల 3,523 చెరువులు కట్టలు తెగివున్నవి. ప్రభుత్వపు లెక్కలలోకి రానివెన్నో ఉన్నవి. వరంగల్లు జిల్లాలో చేతుపల్లి పెద్దచెరువు, కరీంనగరం జిల్లాలో ఎల్లమ్మ చెరువు, తీయఘనపూర్ చెరువు మొదలైనవి.

బావుల క్రింద గూడ 2,95,265 యు|| తరి సాగవుతున్నది. కాని, ఇవి సరయిన స్థితిలోలేక, చెరువులు ఎండి అవసరమైనప్పుడు నీరు ఎండిపోతున్నది. వీటిని లోతు చేయగలశక్తి అత్యధిక రైతాంగానికిలేదు.

ప్రస్తుతం ఈ రెండు (చెరువులు), బావులు వర్షంమీద ఆధారపడి ఉన్నవి. బావులనుండి నీరు తోడుటకు పశువులపై పూర్తిగా ఆధారపడుతున్నారు. పెద్ద ప్రాజెక్టుల నిర్మాణం జరిగితే, వీటిద్వారా బయలుదేరే కాలువలు అనేక పెద్ద చెరువులకు నీటిని సప్లయి చేస్తవి. బావులను లోతుకు త్రవ్వి, విద్యుచ్ఛక్తిద్వారా నీటిని తోడగలిగితే, తెలంగాణా అంతా సశ్యశ్యామల మవుతుంది.

# ఇప్పుడున్న ప్రాజెక్టులు

20వ శతాబ్దపు ప్రారంభంలో వచ్చిన భీకర క్షామం మరల రాకుండా చేయాలని 1902లో హైద్రాబాదువచ్చిన భారత ఇరిగేషన్ కమిషన్, కొన్ని ముఖ్య ప్రాజెక్టుల నిర్మాణం గావించాలని సూచించింది. 1908లో మూసీ వరదలు వేల ప్రజల ప్రాణాలు బలిగొన్నతరువాత, సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారి సలహా ప్రకారం కొన్ని ప్రాజెక్టులు కట్టాలని నిర్ణయించబడింది. వీటన్నిటి ప్లానులు వేయుటలో, నిర్మించుటలో ప్రఖ్యాతి హైద్రాబాదు ఇంజనీరు, కీర్తిశేషులగు నవాబ్ అలీ నవాజుజంగు చాల ముఖ్యపాత్ర నిర్వహించారు.

ఈస్కీము ప్రకారం ఇంతవరకు తెలంగాణాలో నిర్మించినవి నిజాంసాగరు, ఉస్మాన్‌సాగరు, హిమాయత్ సాగరు; పోలారం, వైరా, పాలేరు ప్రాజెక్టులు; దిండి, చంద్రసాగర్, మూసీ, కోయిల్‌సాగర్ ప్రాజెక్టులు ముఖ్యమయినవి.

## తెలంగాణాలో తరీ (మాగాణి) భూములు 1952–53 (ఎకరాలలో)

| జిల్లా పేరు | ప్రభుత్వ కాలువల క్రింద సాగైనది | ప్రైవేటు కాలువల క్రింద సాగైనది | చెరువుల క్రింద సాగైనది | కాలువల ద్వారా చెరువుల క్రింద సాగైనది | బావుల క్రింద సాగైనది | ఇతర మార్గాల క్రింద సాగైనది | మొత్తం | ఒకసారి కంటె ఎక్కువ సాగైనది | మొత్తం సాగైన భూమి (Gross) |
|---|---|---|---|---|---|---|---|---|---|
| హైద్రాబాదు | 5,574 | 506 | 7,941 | 437 | 30,907 | 1,583 | 46,948 | 1,302 | 48,250 |
| మహబూబ్‌నగరం | 6,699 | 882 | 87,775 | 2,722 | 36,067 | 2,652 | 1,36,797 | 7,057 | 1,43,854 |
| ఆదిలాబాదు | 9,939 | 26 | 27,436 | 59 | 700 | 753 | 38,913 | 4,216 | 43,124 |
| నిజామాబాదు | 1,33,374 | 63 | 93,872 | 1,431 | 15,973 | 3,495 | 2,48,208 | 6,109 | 2,54,317 |
| మెదక్ | 11,654 | 136 | 1,07,186 | 1,098 | 28,985 | 2,687 | 1,51,746 | 8,998 | 1,60,744 |
| కరీంనగరం | 16,050 | 2,202 | 60,500 | 541 | 70,700 | 6,218 | 1,56,211 | 14,698 | 1,70,909 |
| వరంగల్లు ఖమ్మం } | 6,160 | 80 | 1,24,179 | 1,918 | 38,478 | 766 | 1,71,581 | 5,870 | 1,77,451 |
| నల్లగొండ | 20,754 | 626 | 56,051 | 1,161 | 64,088 | 2,357 | 1,45,037 | 45,081 | 1,90,118 |
| తెలంగాణా మొత్తం } | 2,10,204 | 4,521 | 5,64,940 | 9,367 | 2,85,898 | 20,511 | 10,95,441 | 93,331 | 11,88,772 |
| మొత్తం స్టేటు | 2,14,492 | 5,402 | 5,98,588 | 13,086 | 5,79,667 | 26,431 | 14,37,666 | 1,30,087 | 15,67,753 |

మూలం: హైదరాబాదు స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్ (1952–53)

## నిజాంసాగరు

గోదావరి ఉపనదియగు మంజీరపై నిజామాబాదు జిల్లాలో ఇది 1924 లో ప్రారంభించబడి, 1932 లో పూర్తిచేయబడింది. దీనికి 3 కోట్ల 83 లక్షల రూపాయల ఖర్చు అయింది. 2,75,000 యకరాలు, ఆయకట్టు క్రిందికి తీసుకిరా నిర్ణయించబడింది. కాని, ఇంతవరకు 1,60,000 యకరాలలో మాత్రమే కాస్తు (సాగు) అగుచున్నది.

ఈ ప్రాజెక్టుద్వారా చెఱుకు పంట అభివృద్ధి చెందింది. దీని ఆధారంగా భారతదేశంలోని పెద్ద చక్కెర (పంచదార) ఫ్యాక్టరీలలో ఒకటయిన బోధన్ చక్కెరు ఫ్యాక్టరీ ఏర్పడింది. దీనికై 20,000 యకరాలలో చెరుకుపండించబడు చున్నది.

## ఉస్మానుసాగరు - హిమాయతు సాగరు

మొదటిది గండిపేట చెరువు, ఇది 1912 లో హైదరాబాదుకు 14 మైళ్ళ దూరంలోను, రెండోది 1920 లోను, వరదల ప్రమాదం నివారించుటకు కట్టబడినవి. ఈరెండూ హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలకు మంచినీటి సప్లయి చేస్తున్నవి.

## పోచారం ప్రాజెక్టు

మంజీరానది పాయ అగు ఆలేరునదిపై 1930 లో దీన్ని కట్టారు. 27 లక్షలు ఖర్చు అయింది. 13,000 యకరాలు సాగు అవుతున్నది.

## వైరా ప్రాజెక్టు

ఖమ్మం జిల్లాలో మధిర తాలూకాలో కట్టబడింది. రూ. 3 లక్షలు ఖర్చు అయింది.

## పాలేరు ప్రాజెక్టు

కృష్ణా ఉపనది పాలేరుపై ఖమ్మం తాలూకాలో ఈ ప్రాజెక్టు కట్టబడింది. రూ. 25 లక్షలు ఖర్చు అయింది. 18,000 యకరాలు ఆయకట్టుక్రింద ఉన్నది.

## దిండి ప్రాజెక్టు

కృష్ణానది ఉపనది దిండిపై, నల్లగొండ జిల్లాలోని దేవరకొండ తాలూకాలో, చుట్టుప్రక్కలగల కరువుప్రాంతంను అభివృద్ధి చేయుటకిది కట్టబడింది. 39,000 యకరాలు ఆయకట్టుక్రింద చేర్చబడింది.

## చంద్రసాగరు ప్రాజెక్టు

అదే జిల్లాలో దిండిలో కలసే చంద్రవాగుపై, దిండి ప్రాజెక్టుకు 10 మైళ్ళు క్రింద యిది కట్టబడింది. దీనిక్రింద ఆయకట్టు 3,000 యకరాలు.

## మానేరు ప్రాజెక్టు

కరీంనగరం జిల్లాలో మానేరు నదిపై ఇది కట్టబడింది. 1944 లో ప్రారంభించి 1951లో పూర్తిచేశారు. 97 లక్షల రూపాయలు ఖర్చు అయింది. 17,000 యకరాలు ఆయకట్టుక్రింద చేర్చారు.

## కోయిల్ సాగర్ ప్రాజెక్టు

కృష్ణానది ఉపనది యగు పెద్దవాగుపై మహబూబు నగరం తాలూకా (అదే జిల్లా)లో 1949లో ఈ ప్రాజెక్టు ప్రారంభించబడింది. దీని ఖర్చు 47 లక్షలు. 10,000 యకరాలు ఆయకట్టులోని కొస్తుంది.

## తుంగభద్రా ప్రాజెక్టు

కరువు ప్రాంతాలగు ఆంధ్రరాష్ట్రంలోని రాయలసీమ, హైదరాబాదు, కర్నాటకలోని రాయచూరు జిల్లాల కుపయో

గార్గమై ఇది ఉద్దేశింపబడింది. రాయచూరు జిల్లాలో ఉన్న తెలంగాణాకు చెందిన అలంపూరు తాలూకాకు కూడా ఇది కొంతవరకు ఉపయోగిస్తుంది.

దీనిలో తయారయే విద్యుచ్ఛక్తి హైదరాబాదు దాకా వస్తుంది.

కాని, దీని నిర్మాణ విషయమై ప్లానులు తయారుచేయుటలో వెనుకటి మద్రాసు, హైదరాబాదు, మైసూరు ప్రభుత్వాలు 50 సం॥లు కీచులాడాయి. చివరకు ఇది 1946లో ప్రారంభించబడింది. ఇప్పటికి డాము కట్టడం పూర్తయింది. కాలువల త్రవ్వటమింకా పూర్తికాలేదు. పూర్తి అయ్యాక, హైదరాబాదు స్టేటులో 8 లక్షల 68 వేల యకరాలు సాగవుతుంది.

దీని క్రింద నిర్మించబడుతున్న హైదరాబాదు ఎలక్ట్రిక్ స్కీము క్రింద లక్ష కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారవుతుంది. ఇది మహబూబునగరం జిల్లా, హైదరాబాదు నగరాలకు కూడ ఉపయోగిస్తుంది.

రాజోలిబండ ఆనకట్ట

రాయచూరుజిల్లాలో, తుంగభద్రా డాముకు 20 మైళ్ళ దిగువన రాజోలిబండ అనే గ్రామంవద్ద తుంగభద్రానదికి ఆనకట్ట కట్టబడుతున్నది. దీనిక్రింద 79,000 ఎకరాలు సాగవుతుందని అంచనా. అలంపూరు తాలూకాదాకా దీని కాలువ వస్తుంది. ఇది 1947 లో ప్రారంభించబడింది. మొత్తం రూ. 4,15,00,000 ఖర్చు అవుతుందని అంచనా.

# కృష్ణా, గోదావరి లోయల అభివృద్ధి చేసే ప్రాజెక్టులు

తెలంగాణా 9 జిల్లాల మొత్తం వైశాల్యం 40,000 చదరపు మైళ్ళు. దీనిలో సేద్యానికి యోగ్యమయిన భూమి 1,74,42,500 య॥ కాని, 1952 - 53లో సేద్యమయిన మొత్తం 93,89,500 యకరాలు మాత్రమే. దీనిలో అన్నివిధాల తరిసేద్య మగుచున్నది 11,88,772 యకరాలలో మాత్రమే. ఇక ప్రాజెక్టులు మొ॥ వాటిద్వారా (గ్యారంటీ) ఖచ్చితంగా నీటి పారుదలవున్నది 2,10,204 య॥లలో మాత్రమే. ఇది ఆంధ్ర రాష్ట్రంలో మొత్తం సాగయ్యే భూమిలో (Total Irrigated area) $\frac{1}{11}$ వ వంతు మాత్రమే! ఇదిగాక, తరిసాగయే దంతా పూర్తిగా వర్షంపై ఆధారపడి ఉన్నది. అందుచే తరిసేద్యం, మొత్తంమీద చూస్తే అభివృద్ధి చాలాతక్కువ. అందుకు క్రమంగా చెరువులక్రింద సాగు, వ్యక్తుల కాలువల క్రింద సాగు క్షీణించటం కూడ జరిగింది. ఈ క్రింది లెక్కలు దీన్ని స్పష్టపరుస్తుంది. (దీనిలో ఇవ్వబడిన లెక్కలు స్టేట్ అంతటికి సంబంధించినవయినా తరి వ్యవసాయంలో అత్యధికభాగం తెలంగాణాలోనే ఉన్నది కనుక ప్రక్కపేజీలోని పట్టికలోని సంఖ్యలు తెలంగాణాకే ప్రధానంగా వర్తిస్తవి.)

దీన్నిబట్టి ఈ క్రిందివిషయాలు తేలుతున్నవి.

(1) వ్యక్తుల సొంత కాలువలక్రింద సాగయేభూమి 17,000 నుండి 13,000కు 10 సంవత్సరాలలో తగ్గింది.

(2) చెరువులక్రింద సాగయే భూమి కూడ 9,74,000 యకరాల నుండి

## 1940-1941 నుండి 1949-1950 వరకు
## తరీ సేద్యమైన భూమి (వేల ఎకరాలలో)

| సంవత్సరం | నీటి వల్ల పారకయింది | | | | ఇతరం | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| | ప్రభుత్వ కాలువలు | వ్యక్తుల కాలువలు | చెరువులు | బావులు | | |
| 1940-41 | 49 | 17 | 974 | 378 | 45 | 1,463 |
| 1941-42 | 41 | 12 | 800 | 340 | 20 | 1,213 |
| 1942-43 | 44 | 3 | 843 | 354 | 60 | 1,304 |
| 1943-44 | 49 | 5 | 876 | 365 | 83 | 1,378 |
| 1944-45 | 46 | 7 | 855 | 356 | 65 | 1,329 |
| 1945-46 | 66 | 11 | 909 | 378 | 71 | 1,435 |
| 1946-47 | 67 | 14 | 847 | 418 | 67 | 1,413 |
| 1947-48 | 144 | 9 | 700 | 428 | 48 | 1,329 |
| 1948-49 | 155 | 11 | 708 | 419 | 48 | 1,341 |
| 1949-50 | 173 | 13 | 834 | 418 | 50 | 1,488 |
| | | సరాసరిగాతం | | | | |
| 1949-50 | 12% | 1% | 56% | 28% | 3% | 100% |

(మూలం: గ్రామీణ ఆర్థిక విచారణ)

8,34,000 లకు అంటే 1,40,000 తగ్గింది. చెరువుల మరమ్మతులకై పెద్ద యెత్తున స్కీములు అమలుచేస్తున్నామంటున్నప్పుడే ఇదంతా జరిగింది.

(3) బావుల క్రింద 40,000 య॥, ప్రభుత్వ కాలువల క్రింద 1,24,000 యకరాలు మాత్రం పెరిగింది. అందుచే నీటిని నిలువచేసే పెద్ద ప్రాజెక్టుల ద్వారానే ఈ సమస్య పరిష్కారమవుతుంది. తెలంగాణా హెచ్చుతగ్గులుగా ఉండుటచేత, పెద్ద ప్రాజెక్టులు గూడ అందుబాటులేని ప్రదేశాలుండుటచేత బావులపై గూడ కొంతవరకు ఆధారపడవలసి ఉంటుంది. వీటిని లోతుగా త్రవ్వి, విద్యుచ్ఛక్తి ద్వారా నీరు పారించితే, చాల విశాల ప్రాంతం సస్యశ్యామలమవుతుంది.

కృష్ణా, గోదావరీ నదులలో ప్రవహిస్తూ నేడు ఊరకనే పోతున్న నీటిని ఉపయోగించటం ద్వారానే తెలంగాణా, దానితో యావదాంధ్ర దేశపు అభివృద్ధి ఆధారపడి ఉన్నది. కృష్ణానదిలో ప్రవహించే నీటిలో, ఇప్పుడు ఆంధ్రలో ఉపయోగిస్తున్నదిపోను, హైద్రాబాదుకు

28,000 కోట్ల ఘన అడుగుల నీరు (మొత్తంలో 28%) ప్రత్యేకించారు. అట్లే గోదావరి నీటిలో 49,400 కోట్ల ఘన అడుగుల నీరు (మొత్తం లో 26%) ప్రత్యేకించారు. ఇట్లే కృష్ణనుంచి ఆంధ్ర రాష్ట్రానికి 47,000 కోట్ల ఘన అడుగుల నీటిని (మొత్తంలో 47%), గోదావరినుంచి 89,300 కోట్ల ఘన అడుగుల నీటిని (మొత్తంలో 47%) పంచారు. హైదరాబాదు భాగానికొచ్చిన పై నీటిని ఇంతవరకు దాదాపు ఏమాత్రం ఉపయోగించుకొనలేదు. హైదరాబాదులో కర్నాటక, మరాఠ్వాడా ప్రాంతాల కుపయోగపడే కొన్ని ప్రాజెక్టుల. కవసరమయిన నీటిని తీరుపరచినా, అధిక భాగం తెలంగాణాలో ప్రాజెక్టుల నిర్మాణానికి ఉపయోగిస్తుంది. అంటే ఈ రెండు నదులలోని నీటిలో అత్యధిక భాగం తెలంగాణా, ఆంధ్రరాష్ట్రాల అభివృద్ధికి ఉపయోగించవచ్చునన్నమాట.

కాని కృష్ణా,గోదావరీనదీలోయలలోని ఈ ప్రజల అభివృద్ధిదృష్ట్యా అవసరమైన ఈ నదులపై ప్రాజెక్టుల నిర్మాణ పథకాలను, చాలాకాలం వరకు సమగ్రంగా పరిశీలించి, ప్లానులను తయారు చేయలేదు. అచ్చటచ్చట తీసుకోదలచుకొన్న తుంగభద్రలాంటి ప్రాజెక్టులుగూడ 50 సం॥లుగా వివిధ ప్రభుత్వాలమధ్య కీచులాటలో వెనుకపడ్డాయి. ఇట్లే నందికొండ ప్రాజెక్టు విషయంలోగూడా జరుగుతున్నది.

తెలంగాణావైపునుంచి, హైదరాబాదు ప్రభుత్వం ఈ ప్రాజెక్టుల గురించి కొంతవరకు విచారణ జరిపింది. ఇందులకొక ప్రధాన కారణం యుద్ధకాలంలోను, యుద్ధానంతర కాలంలోను హైదరాబాదు సంస్థానంపై బ్రిటిషు సామ్రాజ్యవాదులకు గల ప్రత్యేక ఆశలే.

గత 3-4 సంవత్సరాలలో ఈపథకాల విచారణ కొనసాగించబడింది. సుమారు సేటు మొత్తానికి రు. 214 కోట్లతో 15 సంవత్సరాలలో కట్టగల వివిధ పెద్ద, మధ్యరకపు, చిన్న ప్రాజెక్టుల గురించిన పథకం తయారు చేయబడింది. ఇది పూర్తిఅయితే మొత్తం 60 లక్షల యకరాలు సాగులోనికి వస్తుందని, యిట్లు వ్యవసాయ యోగ్యమగు భూమిలో 17% భూమి అదనంగా సాగుక్రింద కొస్తుందని ప్రభుత్వ అంచనా.

## కృష్ణాలోయ ప్రాజెక్టుల పథకాలు

కృష్ణాలోయలో ఇప్పుడు కడుతున్న తుంగభద్ర, రాజోలిబండ ప్రాజెక్టులు గాక, హైదరాబాదుకు కృష్ణ నీటిలో ఇచ్చిన 28,000 కోట్ల ఘన అడుగుల నీటిలో ప్రక్క పేజీలోని పట్టికలో యివ్వబడిన ప్రాజెక్టులు కట్టాలని ప్లాను తయారు చేయబడింది.

### నందికొండ

తెలంగాణాకు ఎక్కువగా ఉపయోగించే కృష్ణా ప్రాజెక్టులలో యిది ముఖ్యమైనది.

దీన్నిగురించి హైదరాబాద్, మద్రాసు ప్రభుత్వాలు 1950లో జాయింటుగా పరిశోధనలు జరిపాయి. వీటిఫలితంగా

| ప్రాజెక్టు : | ఉపయోగించే నీరు : | |
|---|---|---|
| 1. ఎగువ కృష్ణా (కర్నాటక ప్రాంతం) | 8,000 | కోట్ల ఘనఅడుగులు |
| 2. భీమా ,, | 3,000 | ,, |
| 3. తుంగభద్రా ప్రాజెక్టుక్రింద కావలసింది | 2,000 | ,, |
| 4. నందికొండ, లేక దిగువ కృష్ణా (తెలంగాణా) | 12,500 | ,, |
| 5. మధ్యతరగతి చిన్న ప్రాజెక్టులు | 2,000 | ,, |
| మొత్తం | 28,000 | ,, |

ఈ ప్రాజెక్టు యిటు తెలంగాణాలో, అటు ఆంధ్రరాష్ట్రంలో షుమారు 70 లక్షల యకరాల కుపయోగిస్తుందని తేలింది. తూర్పుగా గోదావరీ కాలువవరకు, దక్షిణంగా పెన్నానదివరకు దీనినుండి నీటిని తీసుకపోవచ్చని, ఈ కాలువలద్వారా ప్రయాణ సౌకర్యాలు కలిగించవచ్చని తేలింది. నదిలో నీరింత ప్రాంతానికి చాలకపోవచ్చనికూడ తేలింది. తర్వాత మద్రాసు ప్రభుత్వం దీన్ని వదలివేసి, కృష్ణా-పెన్నారు ప్రాజెక్టుపై కేంద్రీకరించుటచే, హైద్రాబాద్ ప్రభుత్వం తెలంగాణాకు మాత్రమే నుపయోగించే స్కీము నుతయారుచేసింది. దీని ప్రకారం 325 అ॥ డాము కట్టుతారు. దీన్నించి బయలుదేరే కాలువ పాపటపల్లి రైల్వేస్టేషను దగ్గర మున్నేరుపై కట్టే డాములో కలిసి, అచ్చట నుంచి నందిగామ తాలూకా (కృష్ణాజిల్లా)లోని కొల్లేరువరకు పోతుంది. దీని క్రింద నల్లగొండ, ఖమ్మం జిల్లాలలో 9,87,000 యకరాలు, నందిగామ తాలూకాలో 2,93,000 యకరాలు సాగవుతుందని అంచనా. తెలంగాణాలోని 9,87,000 అయినా పూర్తిగా వరిపంటగాక, ఖుష్కీ (మెట్ట) పంటలు వేయాలని ప్రతిపాదించారు.

దీనిపై ప్రాజెక్టు పూర్తి అయ్యేసరికి 2,10,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని గూడ తయారుచేయవచ్చు.

కృష్ణా-పెన్నారు ప్రాజెక్టువల్ల కృష్ణా లోయ ప్రజలకు నష్టం జరుగుతుందని జరిగిన ఆందోళన ఫలితంగా వేయబడిన ఖోస్లాకమిటీ దీన్ని త్రోసివేసింది. హైద్రాబాదు, ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వాలు జాయింటుగా 590 అ. ఎత్తుగల డాముతో నందికొండ ప్రాజెక్టు నిర్మించాలని నిర్ణయించాయి. 590 అ. ఎత్తుగల డాము కడితేనేగాని ఆంధ్రరాష్ట్రంలో తగి సౌకర్యాలు అవసరమయిన విశాలమైన ప్రాంతాని కుపయోగించదు. అంతకంటె తక్కువ ఎత్తున్నా తమకు సరిపోతుందని, హైద్రాబాదు ప్రభుత్వం యీ ఎత్తును తగ్గించాలని వాదనలు చేస్తున్నది. ఆంధ్ర ప్రజలందరి సమిష్టిప్రయోజనాలదృష్టితో పరిష్కరించుటకు కీచులాటలు ఆటంకంగా తయారయినవి.

ఇట్లే కృష్ణపై కట్టే సిద్దేశ్వరం, పులిచింతల ప్రాజెక్టుల విషయంలో గూడ హైద్రాబాదు ప్రభుత్వం చిక్కులు కల్గిస్తున్నది. వీటివల్ల తెలంగాణా వైపు నేల మునిగిపోతుందని హైద్రాబాదు ప్రభుత్వ వాదన.

# గోదావరీలోయ ప్రాజెక్టు పథకం

దీన్ని గురించి పరిశోధన రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రారంభమైంది. గోదావరీలోయలో దొరికే బొగ్గు, దగ్గరనే దక్షిణబస్తరులో దొరికే మంచి ఇనుమును, గోదావరి నుంచి తయారయ్యే విద్యుచ్ఛక్తి ఆధారంగా యీ ప్రాంతాన్ని అభివృద్ధి చేయాలని, ఇచ్చటి నుంచి విశాఖపట్నం రైలు వేయాలని, దీని ఆధారంగా హైదరాబాదు సంస్థానంలో నటి స్థానాన్ని ఏర్పాటు చేసుకోవాలని బ్రిటిషు సామ్రాజ్యవాదులు ప్లానులు వేశారు.

ఈస్కీములకు తర్వాత వచ్చిన మార్పుల ననుసరించి మార్పులు చేసి, హైదరాబాదు ప్రభుత్వం కొనసాగిస్తామని ప్రకటించింది.

ఇది బహుముఖ ప్రాజెక్టు (Multi Purpose Project). సేద్యం, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పారిశ్రామిక అభివృద్ధి, రాకపోక సౌకర్యాల అభివృద్ధి చేయాలని దీని ఆశయం. దీనివల్ల తెలంగాణాకే కాక, అటు బస్తరు, ఇటు ఆంధ్ర రాష్ట్రానికి కూడ ఉపయోగిస్తుందని అంచనా.

ఈస్కీము నిర్మించే కట్టడాలు పెంటలకుడి నాందేడు సరిహద్దులు మొదలు కొని నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగరు జిల్లాలలో వ్యాపిస్తవి. ఈపథకం ప్రకారం, గోదావరిపై రెండు పెద్ద డాములు కడతారు. వీటిలో మొదటిది కావలిగూడెం రిజర్వాయరు. ఇది నాందేడ్, ఆదిలాబాదుజిల్లాల సరిహద్దుల్లో ప్రధానంగా ముధోల్ తాలూకాలో వుంది. రెండోది కిష్టాపురం రిజర్వాయరు. ఇది నిర్మలకు పడమర ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలలో ఉంటుంది. కిష్టాపురం డాముకి క్రింద ఆనకట్ట (Pick-up Dam) నుంచి ఇరువైపులా కాలువలు పోతవి. వీటిలో కలుపబడిన, కడెం, మానేరు నదులపై ఇంకో రెండు డాములు నిర్మించ బడుతవి. మొత్తం నాలుగు డాములలో 30,000కోట్ల ఘ.అ. నీరు నిల్వచేయ బడుతుంది.

ఉత్తరప్రకాలువ 121 మైళ్ళుంటుంది. ఇది కడెం డాముగుండా తూర్పుగా పోతుంది. దక్షిణప్రకాలువ మానేరు డాముగుండా పోయి, వరంగల్లుజిల్లాదాకా వ్యాపిస్తుంది. దీని మొత్తం పొడుగు 166 మైళ్ళు. ఈ ప్రాజెక్టు క్రింద కాలువల ద్వారా, నాందేడు నుంచి వరంగల్లు క్రిందిదాకా రాకపోక సౌకర్యాలు ఏర్పడుతవి.

ఈ ప్రాజెక్టు ఆయకట్టు క్రిందికి ప్రాంతాలొస్తవి: ఆదిలాబాద్ జిల్లాలో గోదావరి వద్దున వున్న అన్ని తాలూకాల్లో కొంతభాగం; లక్సెట్టిపేట, చెన్నూరు తాలూకాల్లో ఎక్కువగా; ఆసిఫాబాద్ తాలూకాలో కూడా కొంత; నిజామాబాద్ జిల్లాలో ఆర్మూర్ తాలూకా లోని ఈశాన్యభాగం పూర్తిగా; కరీంనగరం జిల్లాలోని జగిత్యాల, హుజూరాబాద్, సుల్తానాబాద్, మంథని తాలూకాల్లో అత్యధికం; సిరిసిల్లా, కరీంనగరం, తాలూకాల్లో కొంత భాగం, వరంగల్లు జిల్లాలోని పరకాల, ములుగు తాలూకాల్లో; పాఖాల్, మానుకోట, వరంగల్లు తాలూకాల్లో కొంత భాగం.

ఈ ప్రాంతంలో ఈప్రాజెక్టు క్రింద మొత్తం 20 లక్షల యకరాలు సాగులోని

కొస్తుంది. దీనిలో 11,59,000 యకరాల్లో వరిపంట; 5 లక్షల యకరాల్లో నీళ్లతో ఖుష్కీ పంటలు; మిగతాది అడవులు, గడ్డి మొ॥గునవి పెంచబడును. అంటే మొత్తం 16,60,000 యకరాల్లో వరి, యితర ఖుష్కీ పంటలు సాగవుతవి.

ఈ ప్రాజెక్టు క్రింద విద్యుచ్ఛక్తి కూడ చాల ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది. నదిపైన, వివిధ కాలువలపైన మొత్తం పది ప్రదేశాలలో హైడ్రో ఎలక్ట్రిక్ స్కీములను ఏర్పాటుచేయవచ్చు. వీటన్నిటి ద్వారా 1,75,000 కిలోవాట్లు విద్యుత్తు తయారవుతుంది. దగ్గరనే ఎక్కువగా దొరకు బొగ్గు ఆధారంగా రామగుండం వద్ద 1,50,000 కిలోవాట్లు థర్మల్ పవరు ఉత్పత్తి చేయబడుతుంది. ఇట్లు హైడ్రో, థర్మల్ స్టేషన్లు మొత్తం 3,25,000 కిలోవాట్ల ఎలక్ట్రిసిటీని తయారుచేస్తవి.

గోదావరి నదీలోయలో ఎక్కువగా నున్న సహజ సంపద నభివృద్ధి చేయుటకై రామగుండం చుట్టుప్రక్కల యిప్పుడే ఉన్న బొగ్గు, సిర్‌సిల్క్, పేపరు మొదలగు పరిశ్రమల ఆధారంగా, ఇతర పరిశ్రమల అభివృద్ధి చేయుటకై, రామగుండం వద్ద పెద్ద పారిశ్రామిక నగరాన్ని నిర్మించాలని ప్లానులో ఒకభాగం. ఇచ్చట సిమెంటు, ఆయిలు, వనస్పతి, సిరామిక్స్, టెక్స్‌టయిల్స్, రేయన్, కాల్షియం కార్బైట్, ఆల్కహాల్, ప్లాస్టిక్స్ మొదలగు పరిశ్రమలేగాక; దగ్గరనే దక్షిణ బస్తరులో విస్తారంగాఉన్న మంచి ఇనుము ఆధారంగా పెద్ద ఉక్కు పరిశ్రమనుగూడ నిర్మించవచ్చునని అంచనా.

ఈ ప్రాజెక్టుకు సంబంధించిన డాములు, కాలువలు, విద్యుచ్ఛక్తి నిర్మాణాలకు మొత్తం 69 కోట్ల 29 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

ఈ బహుముఖ స్కీమును వివిధ దశల్లో నిర్మించాలని నిర్ణయించారు. మొదటి దశకు సంబంధించిన కొన్ని భాగాలపై పని ప్రారంభమయినట్లు ప్రభుత్వం ప్రకటించింది. ఇదే గోదావరి ఉత్తర కాలువ ప్రాజెక్టు. కడెం నది గోదావరిలో కలిసేముందు, కడెంనదిపై పెద్దూరు అనే గ్రామంవద్ద డాము కట్టుచున్నారు. గోదావరిపై కట్టే ఆనకట్ట నుంచి నీరువచ్చి, కడెంలోవచ్చే దానితో కలుస్తుంది. ఈ మొత్తం నీటి ఆధారంగా 2,27,000 యకరాలుతరీసాగుకు, 1,24,000 యకరాలు అడవి, పచ్చిక బయళ్ళకు నీరు పెట్టాలని ప్లాను. డామునుంచి బయలుదేరే ప్రధాన కాలువ 79 మైళ్ళు. అదిఅచ్చటినుండి మూడుగా-చీలి తూర్పుకి, దక్షిణానికి, ఆగ్నేయానికి పోతుంది. దీని ఖర్చు రు. 9,72,00,000 గా అంచనా వేయబడింది. కాని డబ్బు లేకపోవుటచే పనేమీ ముందుకు సాగటం లేదు. దీనికి ప్రధాన ఆధారమైన గోదావరి ఆనకట్టగురించి ఏమీ చేయటంలేదు. రామగుండంవద్ద ప్రారంభించిన 37,500 కిలోవాట్ల థర్మల్‌స్టేషన్ పరిస్థితిగూడ ఇట్లేఉన్నది.

## గోదావరీ నదిపై ఇతర ప్రాజెక్టులు

పైన వివరించినవే గాక, ముఖ్యంగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తికి వినియోగించే పెద్ద డాములను పెన్నంగమీద, గోదావరిపై ఇంచంపల్లివద్ద కట్టవచ్చునని హైదరాబాదు ప్రభుత్వ పరిశోధనల వల్ల తేలింది. వీటిని గురించిన వివరాలింకా బయటకు రాలేదు.

### దేవనూరు ప్రాజెక్టు

నిజాం సాగరుకు పైన మంజీరానదిపై ఒకడామునుకట్టి 40,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయటం; హైదరాబాద్, సికింద్రాబాదు నగరాలకుముందు అవసరమయ్యే నీళ్ళ వసతి చేకూర్చటం; కొంత భూమిని తరి సేద్యంక్రిందకు తీసుకురావటం ఈ స్కీములోని ప్రధాన భాగాలు.

### ముస్సీ ప్రాజెక్టు

ఇది సూర్యాపేట తాలూకాలో ముస్సీనదిపై కట్టాలని ప్లాను. దీనికి ఖర్చు 1,14 లక్షలవుతుంది. 38'000 యకరాలు సాగులోనికొస్తుంది.

## మధ్యరకపు ప్రాజెక్టులు

స్టేటులో నిర్మించటానికి వీలున్న మధ్యరకపు (Midium size Projects) ప్రాజెక్టుల గురించి పరిశీలన జరిగినమీదట, 45 ప్రాజెక్టుల పరిశీలన పూర్తి అయిందని, వీటి నిర్మాణానికి అగు ఖర్చు 19 కోట్ల 98 లక్షల రూపాయలని, వీటి ద్వారా 5,22,000 ఎకరాల భూమి సాగవుతుందని ప్రభుత్వపు అంచనా. వీటిలో అత్యధిక భాగం తెలంగాణాలోనివే. వీటిలో రు. 2కోట్ల 13 లక్షలతో నిర్మించగల 5 ప్రాజెక్టులనే పంచవర్ష ప్రణాళికలో చేర్చారు.

వివిధ వైపులనుంచి జరిపిన పరిశోధనల ద్వారానిర్మించదగిన మధ్యరకపు ప్రాజెక్టులెన్నో బయటకొచ్చాయి. వీటి సంఖ్య, ఇతర వివరాలు దిగువ పట్టికలో వివరించబడ్డాయి.

| ప్రాజెక్టు పేరు | స్థలము | సాగయ్యే ఎకరములు | ఖర్చు (లక్షల రూపాయల్లో) |
|---|---|---|---|
| 1. మూసేరు | ఖమ్మం | 50,000 | 125.00 |
| 2. కాలికోట | మధిర | 5,700 | 13.00 |
| 3. లక్నవరం | ములుగు | 7,370 | 22.00 |
| 4. ఆకేరు | ఖమ్మం | 14,950 | 54.00 |
| 5. హాలియా | మిర్యాలగూడెం | 14,307 | 38.02 |
| 6. పెద్దవాగు | దేవరకొండ | 1,635 | 19.05 |
| 7. పెగడిమర్రి | " | 5,500 | 12.52 |
| 8. అడివిదేవులపల్లి | మిర్యాలగూడెం | 3,300 | 9.50 |
| 9. మోరుచరిచ | పర్కాలం | 9,200 | 27.50 |
| 10. బావలిపల్లి | నిర్మల | 10,200 | 34.50 |
| 11. కుందమర్రి | లక్సెట్టిపేట | 6,400 | 19.20 |
| 12. నల్లవాగు | నిజామాబాదు | 4,000 | 12.00 |

| ప్రాజెక్టు పేరు | స్థలము | సాగయ్యే ఎకరాలు | ఖర్చు (లక్షల రూపాయలలో) |
|---|---|---|---|
| 13. కాపాల్ వాగు | ఆర్ మూర్ | 6,600 | 28.65 |
| 14. చింతలూర్ వాగు | ” | 3,400 | 18.10 |
| 15. నూలమర్రి | చించోలి | 20,000 | 175.00 |
| 16. మూసీ | సూర్యాపేట | 35,000 | 103.00 |
| 17. సుద్దవాగు | నిర్మల | 18,400 | 157.75 |
| 18. లంకాసాగర్ | మధిర | 2,960 | 19.44 |
| 19. ఎద్దులవాగు | ” | 3,500 | 15.44 |
| 20. చింతల చెరువు | ” | 3,525 | 9.59 |
| 21. బేతంపూడి | యలందు | 1,642 | 4.30 |
| 22. కోనారెడ్డి చెరువు | వరంగల్లు | 1,200 | 3.50 |
| 23. గారాగం ప్రాజెక్టు | మహబూబాబాద | 3,000 | 12.75 |
| 24. పాలచెరువు | మధిర | 600 | 1.00 |
| 25. కిన్నెరసాని | పాల్వంచ | 39,460 | 65.11 |
| 26. కైపేరు | ” | 5,890 | 9.72 |
| 27. పెద్దవాగు | ” | 9,900 | 16.35 |
| 28. నల్లవాగు | ” | 9,080 | 14.49 |
| 29. కట్టలేరు | మధిర | 1,500 | 4.50 |
| 30. భీమనపల్లి | దేవరకొండ | 1,860 | 8.93 |
| 31. లేములేరు | హుజూర్ నగరం | 3,000 | 10.56 |
| 32. పాలేరు | నల్లగొండ | 1,300 | 2.08 |
| 33. గుడ్డిబాదిబంద | ” | 750 | 1.29 |
| 34. బుడాలవాగు | సుల్తానాబాక్ | 1,150 | 3.89 |
| 35. మానేరుశాఖ | కరీంనగరం | 2,200 | 6.60 |
| 36. సోలివాగు | ” | 4,100 | 10.00 |
| 37. జనిగలవాగు (జగదేవిపేట) | ” | 2,000 | 6.00 |
| 38. హుస్సేనిమియావాగు | ” | 3,000 | 9.00 |
| 39. కేశవపట్టణవాగు | ” | 2,140 | 4.02 |
| 40. పెద్దవాగు | ” | 3,950 | 10.00 |
| 41. పెద్దవాగుశాఖ | ” | 2,340 | 6.00 |
| 42 మొహాదిమడ | ” | 11,250 | 30.00 |
| 43. పెద్దవాగుశాఖ(చిన్నమీదుపల్లి) | ” | 2,920 | 8.00 |
| 44. ముల్లవాగు | ” | 3,100 | 10.00 |

ఒకటి: కృష్ణా, గోదావరుల సంగమం నుంచి విజయవాడ వరకున్న దిగువ కృష్ణా ప్రాంతపు అభివృద్ధికై ప్రధానంగా సిద్ధేశ్వరం, నందికొండ, పులిచింతల ప్రాజెక్టులు కట్టాలి. ఇందులకై కృష్ణలోని నీటిని ఉపయోగించుటలో, విద్యుచ్ఛక్తి ఉత్పత్తి విషయంలో, ఈ ప్రాజెక్టుల నిర్మాణం విషయంలో అత్యంత సన్నిహిత సమన్వయం ఉండాలి.

రెండు: గోదావరి నీటి ఉపయోగం గురించి భోస్లాకమిటీ అంత లోయకుపోక పోయినా, ఈ రిపోర్టునుబట్టి కొన్ని విషయాలు స్పష్టమయినవి. కృష్ణా డెల్టా అయినా, గోదావరి నీటిక్రింద సాగుచేయాలని, కృష్ణనీరును మద్రాసుకు, దక్షిణంకు తీసుకపోవలెననే ప్లానులు ప్రస్తుతానికి విరమించబడినవి. కొంతవరకైనా ఇందుల కవకాశమున్నదేమో పరీక్షించాలని మట్టుకు భోస్లాకమిటీ సూచించింది.

అందుచే గోదావరి నీటిని, గోదావరి లోయలోని తెలంగాణా, ఆంధ్రరాష్ట్ర ప్రజల సమిష్టి ప్రయోజనాల కనుకూలంగా ఉపయోగించే విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి. ఇప్పుడు ధవళేశ్వరంవద్ద ఉపయోగిస్తున్న నీరుగాక, ఇంకా ఆంధ్రరాష్ట్ర వాటాకొచ్చిన 89,300 కోట్ల ఘనఅడుగులనీటిని సద్వినియోగంచేసే సమస్య వస్తున్నది.

ఇప్పటి నీటిపంపకం ప్రకారం హైదరాబాద్ భాగానికి వచ్చిన గోదావరీ నీటి వినియోగంకోసం, "గోదావరీ లోయ ప్రాజెక్టు" స్కీము తయారుచేయబడింది. ఈస్కీముక్రింద తెలంగాణా ప్రాంతంలో నిర్మించబడే ప్రాజెక్టుల ద్వారా 30,000 కోట్ల ఘనఅడుగుల నీటిని మాత్రమే ఉపయోగించుచున్నారు. సుమారు 11 లక్షల యకరాలు మాత్రమే పూర్తిగా తరిసాగులోనికి వస్తుంది. దీనివల్ల హైద్రాబాదు భాగానికొచ్చిన 49,400 కోట్ల ఘ. అ. నీటిలో మరాఠ్వాడాలో గోదావరిపై కట్టిన, కట్టవలసిన ప్రాజెక్టుల కవసరమైనదిపోను, ఈమాత్రము నీరు తెలంగాణ కుపయోగార్థం మిగులుచున్నది. ఈ ప్రాజెక్టు ప్రాంతం వరకు గోదావరిలో 60,000 కోట్ల ఘ. అ. నీరు వస్తున్నది. అందుచే ఈ గోదావరీ ప్రాజెక్టులలో, ఇంకా ఎక్కువ నీరు నిలువచేసి తెలంగాణా జిల్లాల్లో ఎక్కువగా తరీవ్యవసాయం చేయవచ్చు. ఆంధ్రరాష్ట్రపు భాగానికొచ్చిన గోదావరీ నీరు, అచ్చట గోదావరీ లోయ ప్రాంత మగు ఉభయగోదావరీ విశాఖ జిల్లాలు ఎంతవరకు ఉపయోగించుకొనుటకు వీలుం

---

టుందో జాగ్రత్తగా పరిశీలించి, మిగతా నీటిని తెలంగాణాలో పై గోదావరీలోయ ప్రాజెక్టు క్రింద ఉపయోగించుకొనే అవకాశాన్ని పరీక్షించాలి.

అట్లే ఇంద్రావతి, గోదావరిలో కలిసే చోటకు కొద్దిగా దిగువలో ఇంచంపల్లి వద్దను, భూపాలపట్నందగ్గర ఇంద్రావతి వద్దను, గోదావరిలో శబరి కలిసేచోటికి 15 మైళ్ళు ఎగువన శబరిపైనను కట్టుటకు వీలున్న రిజర్వాయర్లు, ఇరిగేషను స్కీముల గురించికూడ మొత్తం విశాలాంధ్ర ప్రజల ప్రయోజనాల దృష్టితో పరిశీలించాలి. ఇవింకా పరిశోధన దశలోనే ఉన్నవి.

## కృష్ణా, గోదావరీ లోయ ప్రాజెక్టులు- విశాలాంధ్ర ప్రజల సమస్య

పైన వివరించిన ప్రాజెక్టులను ముఖ్యంగా కృష్ణా గోదావరీ నదులపై నిర్మించితే, తెలంగాణాలో చాలా పెద్ద భాగం తరి సేద్యం క్రిందకు వస్తుంది. ఈ ప్రాజెక్టుల ద్వారా ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి ద్వారా, బావుల నుండి నీరు సులభంగా తీసి, ప్రాజెక్టుల నీరు అందని చోట్ల గూడ తరిసేద్యాన్ని చక్కగా సాగించవచ్చు. పరిశ్రమలు అభివృద్ధి నొందుతవి. అట్లే అటు ఆంధ్రరాష్ట్రం లోని ప్రజలందరి అభివృద్ధిగూడ యీ రెండు నదులపై సమిష్టిగా నిర్మించే ప్రాజెక్టులపైన ప్రధానంగా ఆధారపడి వున్నది.



# వ్యవసాయం

**1951** జనాభా లెక్కల ప్రకారం, తెలంగాణా మొత్తం జనాభా 1,01,07,773 లో గ్రామీణ జనాభా 79,60,933; పట్టణ జనాభా 21,46,840. అంటే మొత్తం జనాభాలో 78.8%, గ్రామాల్లో వుండి వ్యవసాయం, దానికి దగ్గర సంబంధంగల ఇతర వృత్తులపైన జీవిస్తున్నారన్నమాట. ఆంధ్రరాష్ట్రంలోని ప్రజల్లోగూడా నూటికి 80.4 మంది గ్రామవాసులే.

వీటినిబట్టి ఆంధ్రరాష్ట్రంతోపాటు తెలంగాణాగూడా వ్యవసాయ దేశమన్నది స్పష్టమౌతుంది. అందుచే ఈ గ్రామీణ ప్రజల స్థితిగతుల పరిశీలించటమంటే, తెలంగాణా ప్రజల పరిస్థితుల తెలిసికోవడమే.

1951 లో భారత ప్రభుత్వ వ్యవసాయ శాఖవారు వ్యవసాయ కూలీల కూలీ నిర్ణయం కొరకు జరిపిన పరిశీలనను బట్టి, గ్రామీణ జనాభాయొక్క వివిధ వృత్తి విభాగంగా వున్నది:

ఈ క్రింద ఇచ్చిన సంఖ్యలు మొత్తం హైద్రాబాదు స్టేటుకి సంబంధించినవైనా

| వృత్తులు | మొత్తం కుటుంబాల సంఖ్యలో నూటికి ఎన్ని కుటుంబాలు |
|---|---|
| భూకామందులు | 41.9 |
| కౌలుదారులు | 4.4 |
| వ్యవసాయ కూలీలు<br>భూమి వున్నవారు: 12.3<br>భూమి లేనివారు: 20.8 | 33.1 |
| వ్యవసాయంపైన జీవించే మొత్తం కుటుంబాలు | 79.4 |
| వ్యవసాయేతర కూలీలు | 8.2 |
| చేనేత మొదలగు ఇతర వృత్తులవారు | 5.1 |
| వ్యాపారస్తులు | 2.3 |
| ఇతరులు | 4.4 |
| మొత్తం వ్యవసాయేతర కుటుంబాలు | 20.6 |

ఇది తెలంగాణాపరిస్థితులనుకూడ తెలుపుతది.

1949-50 లలో కేశవఅయ్యంగారు హైదరబాదు ప్రభుత్వం తరఫున జరిపిన 'గ్రామ ఆర్థికపరిస్థితుల విచారణ'ను బట్టి తెల్పిన సంఖ్యలు కొంతభిన్నంగా వున్నవి. కేశవ అయ్యంగారు ఇచ్చిన వృత్తుల సంఖ్యలివి:

గ్రామపట్టణ జనాభా కల్సియున్న సంఖ్యతో పోల్చి, జనాభాలెక్కల్లో వ్యవసాయంపై ఆధారపడే వారిని గురించి ఇచ్చింది 68.2% (స్త్రీపురుష మొత్తం). ఇది గూడ పైవాదనకే బలమిస్తున్నది.

[illegible] లోపల, తెలంగాణాలోగూడ గ్రామీణ

| వృత్తులు | మొత్తం కుటుంబాలలో నూటికి ఎన్ని కుటుంబాలు |
|---|---|
| పూర్తిగా లేక, ప్రధానంగా వ్యవసాయం పైనే ఆధారపడే కుటుంబాలు | 64.4 |
| వ్యవసాయేతర వృత్తి ప్రధానంగాను, వ్యవసాయ వృత్తి రెండోదిగాను వున్న కుటుంబాలు | 10.0 |
| వ్యవసాయేతర వృత్తియే కలవారు | 25.6 |

దీనిబట్టి, నూటికి 64.4 కుటుంబాలు ప్రధానంగా వ్యవసాయంపైన, నూటికి 35.6 కుటుంబాలు వ్యవసాయేతర వృత్తుల పైన ఆధారపడుతున్నాయని తేలుతుంది. ఈ తేడా వచ్చుటకు కారణాలు ఇవి: (1) వ్యవసాయ వృత్తి రెండోదిగావున్న దన్న కుటుంబాల గురించి తప్పుగా లెక్కించి వుంటారు. (2) 1949-50 తర్వాత గ్రామాలలోని చేతిపరిశ్రమలు, ముఖ్యంగా చేనేతవృత్తి దెబ్బతిన్నది.

అందుకే భారతప్రభుత్వం జనాభా లెక్కలే చాలావరకు సరైనవనుకోవచ్చు. జనాభాలో నూటికి 79 పైగా వ్యవసాయంపైనే ఆధారపడుతున్నారన్నది స్పష్టమవుతుంది. గత 2-3 సంవత్సరాలలో ఇది ఇంకా ఎక్కువ అయివుంటుంది. చేనేత, తెలంగాణా గ్రామాల్లో ఒక ముఖ్య చేతిపరిశ్రమ. ఇది ఈ కాలంలో పూర్తిగా దెబ్బతిని పోయింది. దీనిపై పని చేసేవారిలో అత్యధికులు తప్పక వ్యవసాయానికి సంబంధించిన వృత్తులపైనే ఆధారపడుతున్నారు.

# భూస్వామ్య విధానం

తెలంగాణా గ్రామీణ ప్రజల పరిస్థితిని సరిగా అర్థం చేసుకోవాలంటే, ఇప్పటి వున్న భూస్వామ్య విధానం, భూమి శిస్తు విధానం గురించి క్లుప్తంగా తెలుసుకోనుట అవసరం.

దీన్ని గురించి "తెలంగాణా రైతు సమస్య" అనే గ్రంథంలోనుంచి ఈ క్రింది భాగాలను ఉదహరిస్తున్నాము :

## దివానీ లేక ఖాల్సా, జాగీరు, సర్ఫఖాస్ ప్రాంతాలు

పోలీసు చర్యకు పూర్వం, అటుతర్వాత కొంతకాలంవరకు హైదరాబాదు సంస్థానం మూడు రకాల ప్రాంతాలుగా (భూమి శిస్తు విధానం, భూస్వామ్య పద్ధతి రీత్యా) విభజింపబడి వుండెడిది. ఈ మూడు ప్రాంతాలు ఏవంటే : (1) దివానీ లేక ఖాల్సా ప్రాంతం. (ఈ ప్రాంతం దాదాపు రయితువారీ ప్రాంతాల రైతువారీ ప్రాంతం మాదిరిది.) (2) జాగీరు ప్రాంతం. (3) సర్ఫఖాస్ ప్రాంతం. (నైజాం నవాబు స్వంత ఆస్తిగా పరిగణింపబడిన ప్రాంతం.)

ప్రాంతాలవారీగా పై వాటి వైశాల్యం దివానీప్రాంతం 3 కోట్ల ఎకరాలకు పైగా వుంటుంది. దీని తరువాత పెద్ద ప్రాంతం జాగీరు ప్రాంతం. దీని వైశాల్యం 1½ కోట్ల ఎకరాలకు-అంటే దాదాపు ఖాల్సాలో సగభాగంపైగా వుంటుంది. సర్ఫఖాస్ దాదాపు 55 లక్షల ఎకరాలు - అంటే దాదాపు ఖాల్సాలో ఆరవవంతువుంటుంది.

జనాభా వారీగా చూస్తేమాత్రం కొంత తేడా కన్పించుతుంది. దివానీ ప్రాంతం దాదాపు నూటికి 60 వంతులే వున్నప్పటికీ, జనాభాలో నూటికి 75 వంతులుంది. జాగీరు సర్ఫఖాస్ ప్రాంతాలలో మాత్రం నూటికి 25 వంతులు మాత్రమేవుంది. వైశాల్యం చూస్తే ఈ రెండు ప్రాంతాలలో, మొత్తం సంస్థానం వైశాల్యంలో నూటికి 40 వంతుల వరకూ వుంది. అయినా జనాభా ఆ దామాషాలో లేదు. ఇది గమనించాల్సినవిషయం. హైద్రాబాదు సంస్థానమే అసలు ఫ్యూడలు దోపిడీకి పెట్టింది పేరు. అందులోనూ జాగీరు సర్ఫఖాస్ ప్రాంతంలో, ప్రజలు మరీ ఫ్యూడల్ దోపిడీకి గురి అయి వుండడంవలననే అప్పటి జనాభా ఆ దోపిడీకి తట్టుకోలేక పొట్టచేత బట్టుకొని గాప్రాంతాలు వలస పోతున్నారు. అందుచేతనే ఆ ప్రాంతాల విస్తీర్ణానికి తగిన విధంగా జనాభా పెంపొందలేదు.

సంస్థానంలో మొత్తం గ్రామాలసంఖ్య 22,457. ఇందులో దివానీ లేక ఖాల్సా గ్రామాలు 13,961. అంటే సంస్థానం మొత్తం గ్రామాలలో నూటికి 62 వంతులున్నవన్నమాట. జాగీరుగ్రామాలు 6,535 అంటే మొత్తం గ్రామాలలో నూటికి 29 వంతులు. సర్ఫఖాస్ గ్రామాల సంఖ్య 1,961. అంటే నూటికి 9 వంతులు. (9%)

తెలంగాణాలో మొత్తం గ్రామాల సంఖ్య 10,167. ఇందులో దివానీ ప్రాంతంలోని గ్రామాలు 6,891. అంటే మొత్తం తెలంగాణా గ్రామాలలో నూటికి 66 వంతులు ఖాల్సా గ్రామాలు అన్నమాట. జాగీరు, సర్ఫఖాస్ గ్రామాలు మొత్తం 3,276. అంటే నూటికి 32 వంతులన్నమాట.

"మరాట్వాడా, కన్నడ ప్రాంతాలలో

మొత్తం గ్రామాల సంఖ్య 12,290. ఈ ప్రాంతాలలో మొత్తం ఖాల్సా గ్రామాలు 7,070. అంటే నూటికి 57 వంతులు అన్న మాట. అంటే తెలంగాణా ప్రాంతం కన్నా ఖాల్సా గ్రామాలు తక్కువ అన్న మాట. జాగీరు, సర్ఫ్‌ఖాస్ గ్రామాల సంఖ్య ఎక్కువ అన్న మాట.

"తెలంగాణాలో జిల్లాలవారీగా యీ మూడు ప్రాంతాల లెక్కలు ఈ క్రింద యివ్వబడుతున్నాయి :—

గ్రామాలలో దాదాపు సగభాగం అంటే నూటికి 49½ వంతులు తెలంగాణా జిల్లాలలో వున్నాయి. అంటే దివానీ ప్రాంతం తెలంగాణాలో సగం, మరాట్వాడా, కన్నడ ప్రాంతాలలో సగం వుందన్న మాట. కాని జాగీరు, సర్ఫ్‌ఖాస్ గ్రామాల విషయం మాత్రం అలా లేదు. మొత్తం సంస్థాన గ్రామాలలో జాగీరు గ్రామాలు నూటికి 29 వంతులున్నాయి. అయితే సంస్థానంలో సగభాగంగా వున్న తెలంగాణాలో

| జిల్లా పేరు | దివానీ లేక ఖాల్సా గ్రామాల మొత్తం | జాగీరు గ్రామాలు | సర్ఫ్‌ఖాస్ గ్రామాలు | జిల్లాలోని లేక ప్రాంతంలోని గ్రామాలసంఖ్య. |
|---|---|---|---|---|
| వరంగల్ | 1,117 | 291 | 4 | 1,472 |
| నల్లగొండ | 1,002 | 239 | 15 | 1,256 |
| కరీంనగరు | 978 | 224 | 25 | 1,227 |
| మెదక్ | 551 | 364 | 13 | 928 |
| మహబూబ్ నగర్ | 698 | 718 | 15 | 1,431 |
| హైదరాబాదు | 83 | 303 | 573 | 959 |
| నిజామాబాదు | 521 | 229 | 1 | 751 |
| ఆదిలాబాదు | 1,881 | 262 | ...... | 2,143 |
| మొత్తం తెలంగాణా | 6,891 (49½%) | 2,630 (40%) | 646 (36%) | 10,167 (44½%) |
| మరాట్వాడా | 4,892 (35½%) | 1,435 (22%) | 713 (35%) | 7,040 (31½%) |
| కన్నడప్రాంతం | 2,178 (15%) | 2,470 (38%) | 602 (29%) | 5,250 (24%) |
| మొత్తం సంస్థానం | 13,961 (62%) | 6,535 (29%) | 1,961 (9%) | 22,457 (100) |

పైన తెల్పిన పట్టికవల్ల తేలేదేమిటి ? సంస్థాన మొత్తం గ్రామాలలో దివానీ గ్రామాలు నూటికి 62 వంతులు. ఈ దివానీ

మొత్తం జాగీరు గ్రామాలలో నూటికి 5 వంతులు మాత్రం లేవు. నూటికి 40 వంతు- మాత్రమే వున్నాయి. మిగిలిన 60 వంతు

గ్రామాలు మరాట్వాడా, కన్నడప్రాంతాలలో వున్నాయి. అంటే మరాట్వాడా, కన్నడ ప్రాంతాలలో తెలంగాణా కంటే జాగీరు ప్రాంతం అధికంగా వుందన్నమాట. అంటే నూటికి 20 వంతులు అధికంగా వుందన్నమాట. అదేవిధంగా సర్ఫెఖాస్ ప్రాంతంగూడ. మొత్తం సంస్థానంలో వున్న సర్ఫెఖాస్ గ్రామాలలో నూటికి 36 వంతులు మాత్రమే తెలంగాణాలో వున్నాయి. తతిమ్మా 64 వంతులు మరాట్వాడా, కన్నడప్రాంతాలలో వున్నాయి. ఈ లెక్కలనుబట్టి తేలేదేమంటే మరాట్వాడా, కన్నడప్రాంతాలలో తెలంగాణా ప్రాంతంలోకంటే ఫ్యూడలు భూస్వామ్య పద్ధతి బలహీనంగా వుండడం చెప్పవాదన అవుతుంది. అప్పటికూడ ఫ్యూడలు భూసంబంధాలు బలంగానే వున్నాయి. అయితే దీనిఅర్థం తెలంగాణాలో ఫ్యూడలు దోపిడీ సంబంధాలు బలహీనంగా వున్నాయని ఏమాత్రంకాదు.

పోలీసు చర్యానంతరం పైన తెల్పిన మూడురకాలప్రాంతాలుఒకేరకం ప్రాంతం క్రిందకు అంటే దివానీప్రాంతం క్రిందకు మార్చబడ్డాయి. జాగీరు, సర్ఫెఖాస్ ప్రాంతాలు ఖాల్సాప్రాంతంలో లీనం చేయబడ్డాయి. 1949 మార్చి నెలలో సర్ఫెఖాస్ ప్రాంతం రద్దుగావించబడి దివానీ ప్రాంతంలో లీనం చేయబడింది. అదే విధంగా 1949 సెప్టెంబరు మాసంలో జాగీరుప్రాంతం అంతా రద్దుచేయబడి దివానీ ప్రాంతంగా మార్చబడింది. ఈ మార్పుల ఫలితంగా నేడు సంస్థానం అంతటా ఒకేరకమైన పద్ధతి అనగా రైతువారీ పద్ధతి అమలులో వుంది.

అయితే జాగీర్లు సర్ఫెఖాస్ ప్రాంతాలు రద్దు చేయబడి ఖాల్సా ప్రాంతములో లీనం చేసినప్పటికీ వెనుకటి పరిపాలనా ఫలితంగా రైతులు తమహక్కులను కోల్పోవడం జరిగింది. ముఖ్యముగా జాగీరు భూములను రైతాంగానికి దక్కనీయకుండాజాగీరుదారీవర్గం విశ్వప్రయత్నం చేసింది. ఇప్పుడుగూడ యింకా ప్రయత్నిస్తోంది. 1356 వ ఫసలీ (1946 సం.) లో జారీచేయబడిన జాగీరుదారీ ప్రాంతాలలోని పట్టాదారు హక్కుల గూర్చిన ప్రభుత్వ నియమాలు, ఉత్తర్వులు ఆచరణలో బుట్టదాఖలుచేయడంగాని, లేక నామమాత్రంగా అమలు జరపడంగాని జరిగింది. కాంగ్రెసు ప్రభుత్వం వచ్చాకగూడ జాగీరు రైతుల హక్కులను గూర్చి శ్రద్ధ తీసుకోలేదు.

సంస్థానంలో వివిధరకాల భూ సంబంధాలు – భూమిపై ఉన్న యాజమాన్యపు హక్కులు

సర్ఫెఖాస్, జాగీరు ప్రాంతాలను ఖాల్సా ప్రాంతాలలో కలిపివేయకముందు సంస్థానం భూసంబంధాలరీత్యా మూడు ప్రధాన భాగాలుగా విభజింపబడి వుండేది. అవి యేమంటే :

1. ఖాల్సా లేక దివానీ ప్రాంతం. యూనియన్ ఆంధ్ర జిల్లాలలో రైతువారీ ప్రాంతాన్ని యిది పోలివుంటుంది. ఖాల్సా ప్రాంతంలో యితర పరిపాలనతోపాటు శిస్తు వసూలుకూడ సంస్థాన ప్రభుత్వోద్యోగులే నేరుగా చేస్తూ వుంటారు.

2. సర్ఫెఖాస్ ప్రాంతం : ఇది నైజాం నవాబు స్వంత ఖర్చులకై ప్రత్యేకించబడిన భాగం. పూర్వం నైజాం ప్రభువుల స్వంత

రెవిన్యూ ఉద్యోగులు శిస్తు వసూలు గావించేవారు. వీరిలో కొందరు సంస్థాన ప్రభుత్వానికి పన్ను (పేష్కష్ లాంటిది) చెల్లించేవారు; కొందరు ఏమీ చెల్లించేవారు కాదు.

ఈ ప్రాంతాలలో పరిస్థితులు చాల దారుణంగా వుండేవి. అనేక అక్రమ పన్నులు వసూలుచేయడం, నిర్బంధ వెట్టి చాకిరీలు చేయించడం నిత్యకృత్యంగా వుండేది. ఇటీవల వెట్టిచాకిరీ చేయించడం, అక్రమపన్ను వసూళ్లు గావించడం నిషేధిస్తూ సంస్థానంలో చట్టం గావించేవరకూ ఇవి యథేచ్ఛగా సాగుతూనే వుండెను. ప్రభుత్వం గావించిన చట్టాలు చాల జాగీర్లలోనూ, సంస్థానంలోనూ యిటీవల కాలందాకా అమలు జరుగలేదు. యూనియన్ ప్రాంతానికి, బ్రిటిషు సంస్థానాలకు యెంత తేడా వుంటుందో భూస్వాములకు, ఈ ప్రాంతాలకు అంత తేడా వుండెడిది. కొన్ని జాగీర్లకు, పాయిగాలకు ప్రత్యేక కోర్టులు, పోలీసు సిబ్బంది, సైన్యంకూడ వుండెడివంటే ఇక ప్రజల స్థితి ఎంత అధ్వాన్నంగా వుండెనో చెప్పడానికి వీలులేదు. భూస్వామ్య వ్యవస్థల నుండి యిటీవల వరకూ ఈ ప్రాంతాలలో దాదాపు యే మార్పులు లేనట్లే చెప్పాలి. దాదాపు రైతులందరూ కౌలు దార్లుగా బ్రతుకుతూ పడివుండేవారు. ఈ ప్రాంతంలో ముఖ్యమైన వాటినిగూర్చి క్లుప్తంగా తెలుసుకుందాం.

"(అ) పాయిగాలు: పూర్వం నిజాం ప్రభుత్వమునకు యుద్ధములందు సహాయము చేయుటకై కొంత సైన్యమును ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంచుటకు కొందరేర్పాటు చేయబడిరి. ఆవిధంగా ఏర్పాటు చేయబడిన ప్రతివాడూ, తాను సిద్ధంచేసే సైన్యం ఖర్చునంతా తానే భరించుకోవాలి. ఇందుకోసం వాళ్ళకు నైజాం ప్రభువు కొన్ని జాగీరులు ఉచితంగా యిచ్చివేశాడు. అట్టి జాగీర్లనే పాయిగా లందురు. ఈ సంస్థానంలోని పాయిగాలు యితర సంస్థానాలలోనివాటి కంటె పెద్దవి. ఈ పాయిగాలు మహమ్మదీయులకే ఇవ్వబడెను. హిందువులకు ఇవ్వబడలేదు. వీటిలోకూడ నవాబుగారి బంధువర్గంకు చెందినవారికే యివ్వబడెను.

"(ఆ) జాగీరులు: పూర్వం ప్రభుభక్తి చూపినందున, లేక గొప్ప ఉద్యోగములు చేసినందున లేక యుద్ధములో ప్రాణాలిచ్చి ప్రభుభక్తితో పోరాడినందున, లేక మత విషయాలలో గురువులు అయినందున హిందూరాజులు, అసఫ్జాహి మహమ్మదీయ ప్రభువులు అనేకులకు జాగీరులను యిచ్చియున్నారు. అట్టివానిలో పెద్ద పెద్దవాటిని సంస్థానములనియూ, చిన్నవాటిని జాగీరులు అనియు చెప్పెదరు.

జాగీరులనగా ప్రభువులచేతనివ్వబడిన ఈనాములలో అనేక భేదాలు కలవు. మక్తాలనీ, యీనాములనీ, అగ్రహారములనీ వివిధ రకాలుగా వుండెను.

"(ఇ) మక్తాలు, బంజర్లు: అసఫ్జాహి ప్రాంతంలో భూమిని సాగుచేయించి, గ్రామాలు నిర్మించి, భూమిని సాగులోనికి తెచ్చినందుకు ఆ గ్రామాలు ప్రభుత్వం అలా కృషి చేసిన వారికి యిచ్చింది. వీనినే మక్తాలందురు. వీనిలో అనేక భేదాలున్నాయి.

"(ఈ) అగ్రహారాలు: హిందూరాజులు, జాగీరుదార్లు తమ గురువులైన బ్రాహ్మణులకు యిచ్చిన గ్రామాలనే అగ్రహారాలు అందురు.

"(ఉ) దేశముఖ్ దార్లు: వీరినే దేశముఖు, దేశపాండ్య లందురు. ఇప్పుడు వీరికి

తీసుకొంటున్న ప్రభుత్వోద్యోగులు పన్ను వసూలు చేస్తున్నారు. పూర్వం ఇలాగాక దేశపాండ్యాలు, దేశముఖులు పన్నులు వసూలుచేసి అందులో కొంత భాగాన్ని మాత్రం ప్రభుత్వానికి చెల్లించుతూ వుండే వారు. తతిమ్మా భాగాన్ని తామే వుంచు కొనేవారు. మొదటి సాలారుజంగు కాలంలో యీ పద్ధతి (దేశముఖు, దేశ పాండ్యాలు పన్ను వసూలు చేసే పద్ధతి) రద్దు చేయబడి ప్రస్తుతం అమలులో వున్న శిస్తు వసూలు పద్ధతి ప్రవేశపెట్టబడింది. పన్నులో 100 కి కొంత వేసుకొని, దానిలో నుండి వారి వారి హోదాల ననుసరించి డబ్బు యివ్వబడుతోంది. దీనినే రుసుములు అంటారు. దేశముఖులలోకూడ చాల మంది పేదవారు వున్నారు. వీరు రైతులవలె జీవితం సాగిస్తూ వుంటారు. దేశముఖు, దేశ పాండ్యాలలో కొందరు వేల యక రాల స్వంత భూమికలవారున్నారు. వార్లు పన్ను వసూలు చేసే రోజుల్లో సారవంతమైన భూమిని అనేక మాయోపాయాలు, దౌర్జన్యాలద్వారా ఆక్రమించుకున్నారు. పన్ను వసూలు గావించే హక్కు పోగొట్టుకున్నా గ్రామాల్లో యిలాంటి దేశముఖుల పెత్తనం చాలాచోట్ల అలాగేవుంది. ఇప్పుడు వీరితో పాటు కొంతమంది వతనదారులు కూడా చాలా భూములు సంపాదించి, ఇట్టిదోపిడీ పద్ధతులను అవలంబించుతున్నారు. వీరంతా గ్రామ ప్రజలను అనేకవిధాల పీడించుతు ంటారు. వీరు గ్రామాలలో ప్రస్తుతం అభి వృద్ధికి పెద్ద ఆటంకం.

పైన, తెల్పిన దోపిడీ సంస్థలలో జాగీరు లను, పాయిగాలను, మఖ్తాలను రద్దుగావిస్తూ హైద్రాబాదు ప్రభుత్వం 1948 లోఒక శాసనాన్ని గావించింది. దాని ప్రకారం నేడు ఆ ప్రాంతాలు ప్రత్యేకంగా లేవు. ఖాల్సా ప్రాంతంలో కలిపివేయబడి అవి జాగీరు అడ్మినిష్ట్రేటర్లు అనే ప్రత్యేక ప్రభుత్వో ద్యోగుల ద్వారా పరిపాలించబడుతు న్నాయి. మరికొన్ని పూర్తిగా జిల్లా రెవెన్యూ పరిపాలనక్రిందకు తేబడ్డాయి. ఖాల్సా ప్రాంతాలలో వున్న అన్ని భూమి పట్టాలు, శిస్తువసూలు పద్ధతి ఈ ప్రాంతా లకు నేడు వర్తించుతాయి.

ఈ ప్రాంతాలను ప్రత్యేకంగా తీసుకుని వాట్లో ఇంతవరకూ అమలుజరుపుతుంటూ వచ్చిన భూమి పట్టాలు గూర్చి, తత్ఫలి తంగా ఏర్పడిన భూమి సంబంధాలగూర్చి స్పష్టంగా తెలుసుకుందాం.

## భూమి శిస్తు విధానం

1907 కు పూర్వం, ప్రభుత్వం రైతుల నుండి నేరుగా పన్నులు వసూలు చేసే పద్ధతి ఖాల్సా గ్రామాలలో కూడా లేదు. శిస్తు వసూలు హక్కును ప్రతి సంవత్సరం లేక కొన్ని సంవత్సరాల కొక పర్యాయం హర్రాజు (వేలం) చేస్తుండేది. ఈ హర్రా జులో పాట పాడి తీసుకున్న వారు రైతులపై దౌర్జన్యం గావించి, వీలున్నంత వరకు ఎక్కువగా శిస్తు వసూలు చేసే వారు. దానిలో నుంచి ప్రభుత్వానికి కట్ట వలసినది ఇచ్చి, మిగతాది తమ జేబులు నింపుకునేవారు. ఇక జాగీరు గ్రామాల్లో పరిస్థితి ఇంతకంటె అధ్వాన్నంగా వుండేది.

1907 లో ల్యాండు రెవెన్యూ చట్టం [మాల్గుజారీ చట్టం] అమల్లోకి తీసుక రాబడింది. దీని ఆధారంగా ఖాల్సా గ్రామా

లలో బందోబస్తు చేసి, ఈ చట్టం అమల్లోకి వచ్చేనాటికి భూ ఖామందులుగా వున్నవారి భూముల తరములబట్టి భూమి శిస్తు రేట్లు నిర్ణయించబడినవి.

ఈ బందోబస్తు ప్రకారం తరీ, ఖుష్కి రేట్లు నిర్ణయించబడినవి. తరీ పన్ను విధానం చాల చిక్కులతో కూడుకొని వున్నది. రైతునుంచి ఏయే పద్ధతుల్లో డబ్బు లాగుటకు వీలుందా అనే పద్ధతిపై ఈ తరీ పన్ను విధానమున్నది. రేట్లు కూడ చాల హెచ్చు. అందుకనే చాలకాలం నుంచి తరీ పన్ను విధానంలో మార్పు తేవాలని ఆందోళన జరుగుతూ వచ్చింది. 1949 వరకు పట్టాభూములలో వుండే ఫలవృక్షాలపై కూడ రైతుకు హక్కులేదు.

1907 రివెన్యూ చట్టం ప్రకారం బందోబస్తు చేశాక కూడ, వెనుకటి పద్ధతిలో క్రొత్తగా మార్పువస్తా, రైతాంగంపై శిస్తు భారం తగ్గుటకు తోడ్పలేదు. కారణం, ఇట్లు విధించిన రేట్లు – ముఖ్యంగా తరీ రేట్లు; వెనుక చెల్లించే రేట్లకంటె తక్కువ ఏమీలేవు. ధాన్యంరూపంలో చెల్లించేశిస్తు ధనరూపంలో చెల్లించేసరికి, డబ్బు ఎక్కువ చలామణిలో లేని ఆ సమయంలో చాల కష్టాలు ఏర్పడినవి. శిస్తు కట్టలేనిచో ఆస్తి వేలం వేయటం వచ్చేసరికి, శిస్తుకట్టలేని రైతులు భూములను పోగొట్టుకోవాల్సి వచ్చేది.

ఇక జాగీరు ప్రాంతంలో ఈ మాత్రపు మార్పుకూడా అమల్లోకి రాలేదు. ఇటీవలి వరకూ జాగీరు రైతులు దాదాపు కౌలుదార్లుగానే వున్నారు. 1945 లోనే జాగీరు గ్రామాల్లో సర్వే, సెటిల్‌మెంటు తప్పనిసరిగా జరగాలని శాసించటం జరిగింది. ఇప్పటికీ సుమారు వేయి గ్రామాల్లో బందోబస్తు జరగాల్సి వున్నది. అందుచే జాగీర్లలో జాగీరుదార్లు వీలున్నన్ని రకాల పన్నులు వసూలుచేసి రైతులను దోపిడీ చేసేవారు.

## వ్యవసాయ తరగతుల పరిస్థితి

పైన వివరించిన భూస్వామ్య విధానం, వ్యవసాయంపై ఆధారపడివున్న ప్రజల పరిస్థితుల్లో, ముఖ్యంగా వ్యవసాయ కూలీలపై ఎట్టి ప్రభావాన్ని కలుగజేసింది చూడాలి.

### కౌలుదార్ల సంఖ్య పెరుగుదల

గత 50-60 సంవత్సరాల్లో ఒకవైపున కౌలుదార్ల సంఖ్య, ఇంకొకవైపున స్వయంగా వ్యవసాయం చేయని భూస్వాముల సంఖ్య పెరిగిందని ప్రభుత్వ అధికార్లే చెప్పారు. అంటే రైతుల భూమి ఈ భూస్వాముల చేతుల్లోకిపోయి, వారు కౌలుదార్లయినారన్నమాట.

రైతులనుంచి భూములు కాజేయటానికి భూస్వాములు అవలంబించిన పద్ధతుల్లో కొన్నిటిని 1949 లో ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల కమిటీయే ఇట్లు వివరించింది.

“జాగీరుదార్లు, మక్తేదార్లు వసూలాలకే జమాబంది కాగితాలను తమ ఇష్టంవచ్చినట్లు వ్రాయించి, వెనుకటినుంచి వున్న అనేక రైతులను సెటిల్‌మెంటు కాగితాల్లో కౌలుదార్లుగా వ్రాయించారు...,

మెంటువారు 1914 పరిపాలనా రిపోర్టులోకూడ ఇట్లు పేర్కొన్నారు :

"ఈ లెక్కలు సూచిస్తున్న రెండు ముఖ్య పాఠాలివి : మొదటిది, వివిధ కారణాలవల్ల, భూమిపై ఒత్తిడి ఎక్కువగుచున్నది. రెండవది, భూమిపై యాజమాన్యపు హక్కును, దాన్నుండి వచ్చే లాభాలను బట్టి కొన్ని తీసుకొనే భూస్వాములు గుటుకాయ స్వాహా చేస్తున్నారు."

[అదే రిపోర్టు పేజీ 31]

1937 లో, రెవెన్యూ డిపార్టుమెంటు జరిపిన విచారణ ఫలితంగా దివానీ ప్రాంతం లోని వ్యవసాయం చేయబడుచున్న భూమిలో మూడవ వంతు వడ్డీ వ్యాపారస్తులు, షావుకార్ల చేతుల్లోకి పోయిందని, ఇందువల్ల రైతుల ఋణభారం కూడ పెరిగిందని మంత్రివర్గానికి తెలిసింది. దాన్ని బట్టి రెవెన్యూ డిపార్టుమెంటు కార్యదర్శి అయిన యస్. యం. బరూచా అధ్యక్షతన టెనెన్సీ కమిటీని ప్రభుత్వం నియమించింది.

ఈ కమిటీ విచారణ ఆధారంగా సంస్థానంలో భూఖామందులలో చూస్తే 100 కి 40 మంది కౌలుదార్లుగా వున్నారని, కౌలుదార్లు తెలంగాణాలోకంటే మరాట్వాడాలో ఎక్కువగా వున్నారని తెలిపింది. 1928-29 లలో ప్రొఫెసర్ కేశవయ్యంగారు జరిపిన విచారణకూడ ఇదే విషయాన్ని స్పష్టపరిచింది.

## వ్యవసాయ కౌళ్లు

మొత్తం వ్యవసాయం చేస్తున్న భూమిలో కౌళ్ళకిచ్చిన భూమి శాతం.

| జిల్లా | ఖుష్కీలో | తరీలో | బాగాతులో (తోటలలో) |
|---|---|---|---|
| మహబూబునగరం | 30.2 | 15.0 | 24.3 |
| నిజామాబాదు | 21.7 | 7.5 | — |
| నాందేడు | 82.7 | 75.9 | 42.9 |
| వరంగల్లు | 26.6 | 24.8 | 17.5 |
| ఔరంగాబాదు | 25.8 | — | 20.3 |
| రాయచూరు | 15.2 | 17.7 | 7.3 |

(మూలం : వ్యవసాయ సంస్కరణల కమిటీ రిపోర్టు పేజీ 34)

1930 తరువాత రైతులు తమ భూములను పోగొట్టుకొని కౌలుదార్లు అవుతూ వున్నారని జనాభా లెక్కలలో యిచ్చిన వివరాలనుబట్టి స్పష్టమవుతున్నది. 1921-31 లలో కౌళ్లు ప్రోగుచేసే భూస్వాములు 100కి 82 గుణం పెరిగారని, 1931-'41 సంఖ్యలతో పోలిస్తే వీరి సంఖ్య 100 కి 38 దాకా పెరిగిందని, మొత్తం సేద్యం చేసేవారిలో కౌలుదార్లు 100 కి 85 గా వున్నారని జనాభా లెక్కల కమిషనరు వ్యాఖ్యానించాడు.

1943 నుంచి 1946 దాకా ఇదే స్థితిలో

వున్నదని వ్యవసాయ సంస్కరణల కమిటీ వివరించింది. ప్రభుత్వపరిపాలనా రిపోర్టుల్లో యిచ్చిన సంఖ్యలు క్రింది యివ్వబడినవి.

| వివరాలు | 1943 | 1944 | 1945 | 1946 |
|---|---|---|---|---|
| పట్టేదార్లు, హిస్సేదార్లు, షిక్మీదార్లు మొత్తం సంఖ్య | 16,82,596 | 17,97,872 | 18,74,083 | 19,13,540 |
| కౌలుదార్లు, సబ్ టెనెన్ట్సు | 4,23,970 | 4,66,104 | 4,95,697 | 4,90,154 |
| పట్టేదార్లు, హిస్సేదార్లు, షిక్మీదార్ల మొత్తంలో కౌలుదార్ల సంఖ్యాశాతం | 25.19% | 25.92% | 25.45% | 25.61% |

( మూలం : వ్యవసాయ సంస్కరణల కమిటీ రిపోర్టు పేజీ 38.)

వెనుక టెనెన్సీ కమిటీలో కౌలుదార్లు 100 కి 40 ఉండగా, పై రిపోర్టులలో తగ్గటాన్ని గురించి, ఈ కమిటీ రిపోర్టు యీ విధంగా వ్రాసింది:

"కౌలుదార్ల సంఖ్య తగ్గినట్లు కన్పిస్తున్నది. లెక్కల్లోనేగాని, యథార్థం కాదని మా విచారణ నిర్ధారణ చేసింది. 1934 లో టెనెన్సీ కమిటీ సంస్థానంలోని కౌలుదార్ల సమస్యను గురించి విచారణ ప్రారంభించినప్పటినుండి, పూర్వం నుండివున్న కౌలుదార్లను తొలగించి, భూములు లేకుండా చేయాలనే స్పష్టమైన దృక్పథం భూస్వాములలో ఏర్పడింది. ఇట్టి సూచనలనుబట్టి వచ్చే ఖామాస్త(చట్టం) ప్రకారం ఎట్టిహక్కులు రాకుండా చేయాలని వీరి ఆశయం. హైదరాబాద్ ఆసామీ షిక్మీచట్టం వచ్చాకకూడ ఈ ధోరణేవుంది. ఈ చట్టంక్రింద రైతులకుగల హక్కుల గురించి వారికేమీ తెలియకపోవుటచే ఇది ఇంకా బలపడింది. భూమి స్వంత సాగుకిందనే వున్నదని చూపించుటకు భూస్వాములీ దశలో చాల ప్రయత్నించారు. అందుచే టెనెన్సీ కమిటీ రిపోర్టు తర్వాత కౌలుదార్ల సంఖ్య తగ్గిందని లెక్కలు సూచిస్తే, భూస్వాములు వ్యవసాయం చేయుటకై భూములు తీసుకుంటున్నారనిగాని, కౌలుదార్ల సమస్య సులభమైందనుటగాని నిజం గాదు."

(అదే రిపోర్టు—38-39 పేజీలు)

కౌలుదార్ల పెరుగుదల మరట్వాడాలో ఉన్నంత తెలంగాణాలో లేదన్న విషయానికి మరీ ఎక్కువ ప్రాముఖ్యత ఇవ్వరాదు. మరట్వాడాలో కంటె తెలంగాణాలో భూస్వాములు తరీ భూమిని ఎక్కువగా సొంతంగా సేద్యంచేసేఅలవాటున్నది. అయినా ఖుష్కీ భూములనుప్రధానంగా కౌళ్లకిచ్చారు. కాని లెక్కల్లో మటుకు ఇట్టి భూస్వాములంతా సొంత సేద్యం చేసేవారుగా లెక్కించబడి వుంటారు. అంతే

గాక ఆక్రమించిన భూముల్లో పెద్దభాగం తెలంగాణాలో పడావు భూములుగా వుంచారు. ఇందులకు కారణం కౌలుదార్ల పేదరికమేగాక, పైన వివరించినట్లు వారికి ఖబ్జాహక్కు (occupation right) వస్తుందనే భూస్వాముల భయంగూడా.

## భూమి కేంద్రీకరణ

ఇట్లు ఒకవైపు కౌళ్లు ప్రోగుచేసుకునే భూస్వాముల్నూ, కౌలుదార్ల సంఖ్య పెరిగితే రెండోవైపు స్టేటులో ముఖ్యంగా తెలంగాణాలో వ్యవసాయం క్రిందవున్న భూమి క్రమంగా కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరించబడిందని 1052—56 పేజీలలోఇచ్చిన పట్టికలలోని ప్రభుత్వ లెక్కలే స్పష్టం చేస్తున్నవి.

ఈ టేబుల్సులో ఇవ్వబడిన సంఖ్యలను క్లుప్తీకరించాలంటే తెలంగాణాలో భూ వర్గీకరణనుగురించి ఈ క్రింది వివరాలు తేలుతవి:

సంస్థానంలో సాగయ్యే భూమి 2,73,98,546 ఎకరాలు మాత్రమే. అందుచే 127.27 లక్షల ఎకరాల భూమి పడావుగా పడి వున్నది.

అంటే నూటికి 25 వంతులు పడావుగా పడివున్నదన్నమాట. ఇక తెలంగాణాలో ఇతర ప్రాంతాలకంటె ఎక్కువ పడావు వున్నది. తెలంగాణా జిల్లాలలో దాదాపు 80.053 లక్షల ఎకరాలు పడావుగావుంది. ఇది మొత్తం పడావు భూమిలో నూటికి

| ఎన్ని ఎకరాల వరకు | భూస్వాముల సంఖ్య | మొత్తం భూ ఖామందుల శాతం. | వారి క్రింద వున్న భూమి | మొత్తం భూమిలో శాతం. |
|---|---|---|---|---|
| 15 ఎకరాల వరకు | 2,88,154 | 63.7 | 15,54,407 | 13.5 |
| 15 నుంచి 50 వరకు | 1,18,619 | 26.3 | 30,71,214 | 27.3 |
| 150 పైన | 10,131 | 2.2 | 37,40,330 | 33.2 |
| 200 యకరాలపైన | 6,012 | 1.3 | 29,99,410 | 26.7 |

ఈ భూమి కేంద్రీకరణను ఇంకొకవైపు నుంచిగూడ పరీక్షించాలె. గత 10-12 సంవత్సరాలలో స్టేటులో, ముఖ్యంగా తెలంగాణాలో పడావా భూములు విపరీతంగా పెరిగాయి.

మొత్తం సంస్థాన వైశాల్యంలో ఆక్రమిత భూమి నూటికి 64½ వంతులు. కాని నేడు ఇదంతా సాగుబడిలోలేదు. మొత్తం 63.3 వంతులు. ఇంత భూమి పడావుగా ఎవరి చేతుల్లో వుంది అంటే, పెద్ద పెద్ద భూస్వాములచేతుల్లోనే. ఇంతభూమి ఇట్లా పడావుగా వుండడానికి ప్రధాన కారణం తెలంగాణాలో సాగుచున్న ఫ్యూడలు దోపిడీ విధానంవల్ల వ్యవసాయంచేసే శక్తి రైతాంగంలో నశించిపోవటమే.

## 1953 సంగరం పట్టేదారులు, వారిక్రింద వున్న భూమి (1)

| జిల్లా పేరు | 1-5 ఎకరాల వరకు | | 5-10 ఎకరాల వరకు | | 10-15 ఎకరాల వరకు | |
|---|---|---|---|---|---|---|
| | పట్టేదారుల సంఖ్య | వారిక్రింద వున్న భూమిఎకరాల్లో | పట్టేదారులు | వారిక్రింద వున్న భూమి | పట్టేదారులు | వారిక్రింద వున్న భూమి |
| హైదరాబాదు ... | 4,789 | 14,367 | 2,165 | 15,155 | 1,498 | 19,474 |
| మహబూబ్‌నగరం ... | 15,486 | 46,458 | 8,971 | 62,797 | 7,441 | 96,738 |
| ఆదిలాబాదు ... | 20,346 | 61,038 | 10,528 | 73,696 | 8,584 | 1,11,592 |
| నిజామాబాదు ... | 25,527 | 76,581 | 7,635 | 53,445 | 4,712 | 61,256 |
| మెదకు ... | 20,693 | 62,079 | 7,178 | 50,246 | 4,183 | 54,379 |
| కరీంనగరం ... | 34,825 | 1,04,475 | 14,332 | 1,00,324 | 9,022 | 1,17,286 |
| వరంగల్లు + ఖమ్మం ... | 24,103 | 72,309 | 9,049 | 63,343 | 5,550 | 72,150 |
| నల్లగొండ ... | 20,429 | 61,287 | 11,734 | 82,138 | 9,373 | 1,21,849 |
| తెలంగాణా మొత్తం | 1,66,198 | 4,98,594 | 71,592 | 5,01,144 | 50,368 | 6,54,719 |
| స్టేటు మొత్తం | 2,13,515 | 6,40,645 | 1,24,381 | 8,70,667 | 1,07,036 | 13,91,468 |

## 1953 సం॥రం పట్టాదారులు, వారిక్రింద వున్నభూమి (2)

| జిల్లా పేరు | 15-20 ఎకరాల వరకు | | 20-25 ఎకరాల వరకు | | 25-50 ఎకరాల వరకు | |
|---|---|---|---|---|---|---|
| | పట్టాదారులు | వారిక్రింద వున్న భూమి | పట్టాదారులు | వారిక్రింద వున్న భూమి | పట్టాదారులు | వారిక్రింద వున్న భూమి |
| హైదరాబాదు ... | 1,083 | 18,411 | 920 | 20,240 | 14,94 | 52,290 |
| మహబూబ్‌నగరం ... | 6,412 | 1,09,004 | 4,636 | 1,01,992 | 8,866 | 3,10,310 |
| ఆదిలాబాదు ... | 7,850 | 1,33,450 | 4,883 | 1,07,426 | 8,195 | 2,86,825 |
| నిజామాబాదు ... | 3,430 | 58,310 | 2,905 | 63,910 | 5,039 | 1,76,365 |
| మెదకు ... | 2,821 | 47,957 | 1,983 | 43,626 | 3,057 | 1,06,995 |
| కరీంనగరం ... | 6,616 | 1,12,472 | 5,238 | 1,15,236 | 6,773 | 2,37,055 |
| వరంగల్లు+ఖమ్మం ... | 4,281 | 72,777 | 2,923 | 64,306 | 5,021 | 1,75,735 |
| నల్లగొండ ... | 7,633 | 1,29,761 | 5,578 | 1,22,716 | 11,487 | 4,02,045 |
| తెలంగాణా మొత్తం ... | 40,126 | 5,82,142 | 29,066 | 6,39,452 | 49,982 | 17,47,620 |
| స్టేటు మొత్తం ... | 96,543 | 16,41,231 | 84,101 | 18,50,222 | 1,61,646 | 56,57,610 |

## 1953 సంll రం పట్టాదారులు, వారిక్రింద వున్నభూమి (3)

| జిల్లా పేరు | | 50-100 ఎకరాల వరకు | | 100-150 ఎకరాల వరకు | | 150-200 ఎకరాల వరకు | |
|---|---|---|---|---|---|---|---|
| | | పట్టాదారులు | వారిక్రింద వున్న భూమి | పట్టాదారులు | వారిక్రింద వున్న భూమి | పట్టాదారులు | వారిక్రింద వున్న భూమి |
| హైదరాబాదు | ... | 920 | 69,600 | 380 | 47,500 | 174 | 31,826 |
| మహబూబు నగరం | ... | 4,779 | 8,58,425 | 1,895 | 1,74,375 | 566 | 1,01,880 |
| ఆదిలాబాదు | ... | 3,822 | 2,86,650 | 1,095 | 1,36,875 | 720 | 1,31,400 |
| నిజామాబాదు | ... | 2,476 | 1,85,700 | 716 | 89,500 | 235 | 42,800 |
| మెదకు | ... | 534 | 40,050 | 927 | 1,15,875 | 264 | 47,520 |
| కరీంనగరం | ... | 4,763 | 3,57,225 | 1,642 | 2,05,250 | 710 | 1,27,800 |
| వరంగల్లు+ఖమ్మం | ... | 2,841 | 2,13,075 | 913 | 1,14,125 | 512 | 92,160 |
| నల్లగొండ | ... | 6,412 | 4,80,900 | 1,953 | 2,44,125 | 928 | 1,67,040 |
| తెలంగాణా మొత్తం | ... | 26,547 | 19,91,625 | 9,021 | 11,27,625 | 4,119 | 7,40,926 |
| స్టేటు మొత్తం | ... | 89,029 | 66,77,175 | 29,113 | 36,39,125 | 18,036 | 23,46,480 |

## 1953 సం॥రం పట్టేదారులు, వారిక్రింద వున్నభూమి (4)

| జిల్లా పేరు | 200-250 ఎకరాల వరకు | | 250-500 ఎకరాల వరకు | | 500-1000 ఎకరాల వరకు | |
|---|---|---|---|---|---|---|
| | పట్టేదారులు | ఎకరాలు | పట్టేదారులు | ఎకరాలు | పట్టేదారులు | ఎకరాలు |
| హైదరాబాదు ... | 84 | 18,900 | 102 | 38,760 | 32 | 24,000 |
| మహాబూబ్‌నగరం ... | 323 | 72,675 | 322 | 1,22,360 | 98 | 73,500 |
| ఆదిలాబాదు ... | 458 | 1,01,800 | 421 | 1,59,980 | 345 | 2,58,750 |
| నిజామాబాదు ... | 115 | 25,875 | 144 | 54,720 | 28 | 21,000 |
| మెదకు ... | 103 | 23,175 | 87 | 33,060 | 33 | 24,750 |
| కరీంనగరం ... | 364 | 81,900 | 393 | 1,49,340 | 114 | 85,500 |
| వరంగల్లు + ఖమ్మం ... | 292 | 65,700 | 341 | 1,29,580 | 139 | 1,04,250 |
| నల్లగొండ ... | 599 | 1,34,775 | 507 | 1,92,660 | 144 | 1,08,000 |
| తెలంగాణా మొత్తం ... | 2,338 | 5,24,800 | 2,317 | 8,80,460 | 933 | 6,99,750 |
| స్టేటు మొత్తం ... | 8,011 | 18,02,475 | 4,974 | 18,90,120 | 1,509 | 11,31,750 |

1953 సం॥రం పట్టాదారులు, వారిక్రింద వున్నభూమి (5)

| జిల్లా పేరు | 1000-2500 ఎకరాల వరకు | | 2500-5000 ఎకరాల వరకు | | 5000 ఎకరాలకు మించి | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టాదారులు | ఎకరాలు | పట్టాదారులు | ఎకరాలు | పట్టాదారులు | ఎకరాలు | పట్టాదారులు | ఎకరాలు |
| హైదరాబాదు | 7 | 12,600 | — | ... | — | ... | 13,656 | 3,82,617 |
| మహబూబ్‌నగరం | 19 | 34,200 | 6 | 23,800 | 1 | 6,000 | 59,321 | 16,93,509 |
| ఆదిలాబాదు | 127 | 2,28,600 | 14 | 53,200 | 4 | 24,000 | 66,402 | 21,55,282 |
| నిజామాబాదు | 7 | 12,600 | 1 | 8,800 | 1 | 6,000 | 11,308 | 3,15,420 |
| మెదకు | 23 | 41,400 | 3 | 11,400 | 1 | 6,000 | 41,890 | 7,08,512 |
| కరీంనగరం | 53 | 95,400 | 6 | 22,800 | — | ... | 84,851 | 19,12,063 |
| వరంగల్లు + ఖమ్మం | 77 | 1,38,600 | 10 | 38,000 | 1 | 6,000 | 56,053 | 14,22,110 |
| నల్లగొండ | 56 | 1,00,800 | 8 | 30,400 | ... | ... | 76,841 | 23,78,490 |
| తెలంగాణా మొత్తం | 369 | 6,64,200 | 48 | 1,83,400 | 8 | 48,000 | 4,10,322 | 1,09,68,003 |
| స్టేటు మొత్తం | 444 | 7,99,200 | 49 | 1,86,200 | 11 | 66,000 | 9,83,452 | 3,05,89,409 |

(మూలం : 1953 హైదరాబాదు కవులుదారీ చట్టంపై సెలక్టుకమిటీ రిపోర్టు వివరం)

ఇట్లు భూమిలో అధికభాగం కొద్ది మంది చేతుల్లో కేంద్రీకరింపబడటం, రైతాంగం క్షీణింపడంవల్ల, పెద్ద మొత్తం సాయంచేసే సగటు సాగు భూమిక్రమంగా తగ్గిపోతూ వచ్చింది. ఇది 1058వ పేజీలోని టేబుల్ నుబట్టి స్పష్టమవుతుంది.

8 ఎకరాల, 56 సెంట్లకు తగ్గింది. అంటే దాదాపు నూటికి 37 వంతులు తగ్గిందన్న మాట. మరాఠ్వాడాలోకూడ ఈ మార్పు క్రింద వుండే సగటు సాగుభూమి విస్తీర్ణం జిల్లాల వారీగా క్రింద ఇవ్వబడింది:

| జిల్లా పేరు | సాగుదారులక్రిందవుండే సగటు భూమి విస్తీర్ణం (ఎకరాలు) | | | | | |
|---|---|---|---|---|---|---|
| | తరి | | ఖుష్కీ | | బాగాతు | |
| | ఎకరాలు | గుంటలు | ఎకరాలు | గుంటలు | ఎకరాలు | గుంటలు |
| వరంగల్ | 2 | 13 | 10 | 15 | 0 | 3 |
| నల్లగొండ | 1 | 17½ | 13 | 29½ | 0 | 2 |
| కరీంనగర్ | 1 | 16 | 7 | 21 | 0 | 7 |
| మహబూబ్ నగర్ | 2 | 12 | 13 | 34 | 0 | 4 |
| ఆదిలాబాద్ | 1 | 07 | 10 | 16 | 0 | 1 |
| హైద్రాబాద్ | 1 | 20 | 14 | 39 | 0 | 14 |
| మెదక్ | 1 | 13 | 5 | 07 | 0 | 02½ |
| నిజామాబాద్ | 1 | 13 | 2 | 34 | 0 | 02 |
| తెలంగాణా ప్రాంతం సగటు | 1 | 26 | 9 | 22 | 0 | 04½ |
| మరాఠ్వాడప్రాంతం సగటు | 0 | 10½ | 24 | 9 | 0 | 25 |
| కన్నడ ప్రాంతం సగటు | 0 | 3 | 18 | 00 | 0 | 7½ |
| సంస్థాన సగటు | 1 | 3½ | 14 | 02 | 0 | 8 |

("హైద్రాబాదు గ్రామీణ ఆర్థిక విచారణ" అన్న ఇంగ్లీషు గ్రంథంనుండి. పేజీ 72.)

1914–'15 లో తెలంగాణాలో భూఖామందుకుండే సగటు తరీసాగుభూమి ఒక ఎకరం 86 సెంట్లు వుంటే 1945–'46కు అది ఎకరం 17 సెంట్లకు పడిపోయింది. సగటు ఖుష్కీ సాగుభూమి 1914–'15లో 14 ఎకరాల 8 సెంట్లుంటే, 1945–'46 లో

ఇట్లు సగటు సాగుబడి భూమి తగ్గటం రైతుల క్రిందవున్న భూమికూడ చిన్న చిన్న ముక్కలు కావడం తెలంగాణాలో మరీ ఎక్కువ అని ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల కమిటీ రిపోర్టులో పేర్కొనబడింది.

| సంవత్సరం | తెలంగాణా ప్రాంతం భూ ఖామందులకుండే సగటు సాగు భూమి (ఎకరాలలో) | | | మరాఠ్వాడా ప్రాంతం భూ ఖామందులకుండే సగటు సాగు భూమి (ఎకరాలలో) | | | కన్నడ ప్రాంతం భూ ఖామందులకుండే సగటు సాగు భూమి (ఎకరాలలో) | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | తరి | ఖుష్కి | బాగాత్ | తరి | ఖుష్కి | బాగాత్ | తరి | ఖుష్కి | బాగాత్ |
| | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. | ఎ. సెం. |
| 1914—15 | 1-86 | 14- 8 | ... | 0-66 | 25-63 | ... | ... | ... | ... |
| 1933—34 | 1-58 | 12-51 | ... | 0-50 | 21-85 | ... | ... | ... | ... |
| 1935—36 | 1-59 | 12-26 | ... | 0-41 | 21-15 | ... | ... | ... | ... |
| 1939—40 | 1-56 | 11-85 | ... | 0-46 | 10-19 | ... | ... | ... | ... |
| 1940—41 | ... | 10-78 | ... | ... | 18-39 | ... | ... | ... | ... |
| 1945—46 | 1-17 | 8-56 | ... | 0-35 | 15-48 | ... | ... | ... | ... |

(హైదరాబాదు వ్యవసాయసంస్కరణల విచారణకమిటీ నివేదిక అనుబంధం 'ఎ' నుండి)

## వ్యవసాయ కూలీల పరిస్థితి

తెలంగాణా రైతాంగపు పరిస్థితి ఇట్లు చితికిపోతే దీనిలో భాగంగా వ్యవసాయ కూలీల పరిస్థితికూడ చెడిపోయింది. 1949-50 లలో భారత ప్రభుత్వం జరిపిన వ్యవసాయకూలీ విచారణలో ఈ విషయం స్పష్టమైంది.

ముందు ఇప్పటనున్న వ్యవసాయకూలీ సంఖ్యను తెలిసికొనటం అవసరం. ఒక సంవత్సరంలో యథార్థంగా పనిచేసిన దినాల్లో, సగంపైన వ్యవసాయ కూలీగా పనిచేసిన వారిని వ్యవసాయ కూలీలుగా పరిగణించాలని భారతప్రభుత్వ విచారణలో నిర్ణయించారు. దీని ఆధారంగా 1949-50 లలో హైదరాబాదు స్టేటులో గ్రామాలలో నివసించే కుటుంబాలలో 100 కి 33.1 కుటుంబాలు వ్యవసాయ కూలీలని ఈ విచారణలో తేలింది. వీరిలోకూడా 100 కి 20.8 రు భూమి పూర్తిగా లేని వారని, 100 కి 12.3 రు కొంత భూమి వున్న వారని తేలింది. నూటికి 33.1గా వున్న ఈ వ్యవసాయకూలీ కుటుంబాల సంఖ్య ఇతర అనేక రాష్ట్రాలకంటె హెచ్చుగా వుంది. 1949-50 ల తరువాత రైతులు పెద్ద ఎత్తున భూములనుండి తొలగించబడటం, గ్రామాలలోని చేతిపరిశ్రమలు దెబ్బతినటంవల్ల ఈ సంఖ్య ఇంకా పెరిగి ఉండవచ్చు.

ఇక వీరి జీవన పరిస్థితి చూద్దాం:

**పాలేర్లు:** పై విచారణ ప్రకారం, అన్ని విధాల యిచ్చేవి కలుపగా, తెలంగాణాలో సంవత్సరానికి వీరికిచ్చే జీతం రు. 180 నుంచి 240 వరకుంటుంది. ఇదే మరాఠ్వాడాలో రు. 400 వరకున్నది. తెలంగాణాలో ఎక్కువ సంఖ్యలోవున్న స్థితి దీన్నిబట్టి తెలుస్తుంది.

**దిన కూలీలు:** ఈ విచారణ ఫలితంగా తెలంగాణాలో మరాఠ్వాడాలో ఇస్తున్న రోజుకూలీ అసలు తక్కువగా ఉండటమే గాక, మరాఠ్వాడా కంటె తెలంగాణాలో తక్కువ వున్నది.

**జీవిత పరిమాణం:** 1938 - 39, 1949-50లలో గల చిల్లర ధరలనుజీతాలతో పోల్చిచూస్తే తేలేదిది: ముఖ్యంగా ధాన్యాలు, పప్పుల ధరల ఇండెక్సు నంబర్లు 365.7, 461.1 మధ్యవుంటే, దున్నటానికి, నాట్లకు, కోతలకు, పురుషులు సంపాదించే జీతాల ఇండెక్సు, వరుసక్రమంగా 345.3, 366.7 331.4 మాత్రమే వుంది. అంటే గత 10 సంవత్సరాలలో జీతాలకంటె ధర లెక్కువ పెరిగాయన్నది స్పష్టం. అందుచే వ్యవసాయ కూలీల జీవిత పరిమాణం ఇంకాపడిపోయింది.

## రైతాంగపు పేదరికం - అప్పుల పెరుగుదల

పైపరిస్థితులవల్ల తెలంగాణా రైతాంగం రోజు రోజుకు పేదరికంలో మునిగి అప్పులకు గురికావటం, వ్యవసాయ వుత్పత్తి, పశుసంపద మొదలగునవి క్షీణించటం జరిగింది.

1907 నుంచి స్టేటులో ప్రారంభమైన సెటిల్‌మెంటు సందర్భంలోనే రైతులకు అప్పు పెరుగుతున్న సూచనలు కన్పిం

చాయి. 1928-'29 లలో ప్రొఫెసర్ కేశవయ్యంగారు జరిపిన విచారణ ఫలితంగా, ఒక్క ఔరంగాబాదు జిల్లాలోనే అప్పటికి ముందు 25 సం॥ లలో వ్యవసాయం చేస్తున్న భూమిలో 100 కి 30 వంతులు అప్పులు మొదలగు వాటి మూలంగా మార్వాడీ సాహుకార్ల చేతుల్లోనికి పోయిందని వ్రాశారు. దీన్ననుసరించే అప్పుల పరిష్కారానికి 1933 లో ఒక చట్టం చేయబడింది. అదే సంవత్సరంలో రెవెన్యూ డిపార్టుమెంటు కార్యదర్శి బరూచాను ఈ విషయం విచారించుటకు నియమించారు. ఆ విచారణ ఫలితాలివి :-

వ్యవసాయ ప్రజల మొత్తం అప్పు - రు. 64½ కోట్లు.

అప్పున్న ప్రతి పట్టాదారునకున్న అప్పు. రు 390-13-0.

మొత్తం పట్టాదార్లందరి దృష్టిలో - ఒక్కొక్కరికున్న అప్పు : రు 187-8-0

అప్పున్న ప్రతి కుటుంబంపై ఉన్న నష్టభారం రు 73. ప్రతి ఎకరంపై శిస్తు రేటుకంటే 6 రెట్లు అప్పుభారం వుంది.

ప్రతి మనిషికి రు. 30 అప్పున్నది.

మరాఠ్వాడా కర్నాటకలలో, తెలంగాణాకంటె రెట్టింపు అప్పున్నది.

యుద్ధకాలంలో వున్న వ్యవసాయ వస్తువుల అధిక ధరలవల్ల గూడా క్రింది తరగతుల అప్పు తగ్గలేదని, పై వర్గాలకే ఇది లాభించిందని ప్రొఫెసర్ కేశవ అయ్యంగారు తమ 1949-50 ఆర్థిక విచారణ రిపోర్టులో వ్రాశారు. పేద ప్రజలపై ఇది పెరిగిందని ఆయన ఇచ్చిన లెక్కలనుబట్టి తేలింది.

పై పరిస్థితులనుబట్టి, పశు సంపదకూడా క్షీణించింది. ముఖ్యంగా 1940-45 లలో పెద్ద మార్పు కన్పిస్తున్నది. అందుచే వ్యవసాయ అవసరాలకొరకు కావలసిన పశుసంపదకూడ లేకుండా పోయిందని ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల రిపోర్టులో వ్రాసింది. క్రింద ఇవ్వబడిన టేబుల్ ప్రకారం 1935 లో సాగయిన ప్రతి 100 ఎకరాలకు 15.3 పనిచేసే పశువులు, ప్రతి వ్యవసాయదారునికి 2.4 పశువులుంటే; 1945 కల్లా ఈ సంఖ్యలు 14.7 పశువులు, 1.7 పశువులకు తగ్గిపోయాయి.

### వ్యవసాయం చెయ్యబడిన భూమినిబట్టి పనిచేసే పశువుల పంపకం
### (దివానీ ప్రాంతం వరకే)

| సం. | పనిచేసే మొత్తం పశువుల సంఖ్య | వ్యవసాయం చేసిన మొత్తం ఎకరాలు | వ్యవసాయకుల సంఖ్య | పనిచేసే పశువుల సరాసరి సంఖ్య: ప్రతి వ్యవసాయకునికి | సాగైన ప్రతి 100 ఎకరాలకు |
|---|---|---|---|---|---|
| 1945 | 30,05,264 | 2,64,75,362 | 23,49,506 | 1.7 | 14.7 |
| 1940 | 32,97,630 | 2,70,54,142 | 18,41,316 | 1.8 | 13.2 |
| 1935 | 44,93,986 | 2,93,58,095 | 18,41,316 | 2.4 | 15.3 |

(మూలం : వ్యవసాయ సంస్కరణల రిపోర్టు 89 పేజీ)

నీటిపారుదల సౌకర్యాలు చూస్తే, భారతదేశ సరాసరి సంఖ్యలతో పోలిస్తే చాల తక్కువ. స్టేటులో 100 కి 7 ఎకరాలు మాత్రమే వివిధరూపాల్లో తరీ సేద్యంక్రిందవున్నది. కాని దీనిలో అత్యధికభాగం చెర్లు, బావులక్రిందయే సాగు. ఇది పూర్తిగా వర్షంపై ఆధారపడటమేగాక 3,523 చెర్లు చెడిపోయివున్నవి. వాటిక్రిందగల 2,04,000 ఎకరాలు పడావుగా పడివున్నది. బావులు గూడ రైతులు పెట్టుబడిపెట్టి లోతుగా త్రవ్వించలేకపోవుటచేత వర్షం తక్కువైనప్పుడు నీరుండదు. ఇక ఆధునిక వ్యవసాయపనిముట్లు, రసాయినిక ఎరువుల వుపయోగంలో తెలంగాణా చాలా వెనుకబడివున్నది.

వీటన్నిటివల్ల తెలంగాణాలో స్టేటు మొత్తంమీద వ్యవసాయఉత్పత్తి చాల వెనుకబడివుంది. ఆహార, వ్యాపార పంటల ఉత్పత్తి భారతదేశ సగటుపంటకంటె తక్కువ. ఒక్క వరిపంటలోనే హైద్రాబాదుది కొద్దిగా హెచ్చుగా వున్నదని దిగువ అంచనాలు తెలియచేస్తున్నాయి:

వరిపంటలోగూడ వివిధ సంవత్సరాల్లో చాలా తేడా కన్పిస్తున్నది. కారణం పూర్తిగా వర్షంపై ఆధారపడటం, చెర్లు సులభంగా కట్టలు చెడిపోవటంవల్ల ఆహార అధికోత్పత్తికోసం ప్రభుత్వం పెద్ద కార్యక్రమాలు సాగిస్తున్న ఈ సమయంలోనే ఆహారపంటలు పండేభూమే తగ్గిపోయింది. (గ్రామీణ-ఆర్థిక విచారణలు - పేజీ 228)

అందుచే తెలంగాణాలో ప్రస్తుతం ఉత్పత్తి అయ్యే మొత్తం ధాన్యం, అర్ధాకలితో తెలంగాణా ప్రజలుంటున్న ప్రస్తుత స్థితిలో గూడ చాలదు. తెలంగాణా కొరత ప్రాంతం - ముఖ్యంగా వడ్ల విషయంలో. ఆంధ్రరాష్ట్రంనుంచి బియ్యం తెలంగాణాకు వెనుకటినుంచీ దిగుమతి అవుతుండేవి.

## కవులుదార్లను తొలగించి, భూములమ్ముకునేందులకు స్వంతకమతాలు పెట్టేందులకు భూస్వాముల ప్రయత్నం

1943_46 లలో కౌలుదార్ల సంఖ్య తగ్గినట్లు కన్పించినా, భూస్వాములు,

### హైద్రాబాదులో- భారతదేశంలో ఎకరం 1 కి పండే పంట (పౌనులలో)
[ 1936– '40 ల సరాసరి ]

| | వేరుశనగ | ప్రత్తి | సజ్జ | జొన్న | వరి | గోధుమ |
|---|---|---|---|---|---|---|
| హైద్రాబాద్ | 708 | 62 | 134 | 343 | 809 | 302 |
| ఇండియా | 803 | 92 | 334 | 429 | 785 | 660 |

అంతేగాక, యుద్ధానికిపూర్వపు స్థితితో పోలిస్తే ఒక్క వరివిషయంలోతప్ప, ముఖ్య గట్టిధాన్యాలన్నిటి ఉత్పత్తి పడిపోయింది.

కౌలుదార్లకు కౌలుదార్ల చట్టం క్రింద హక్కు కలుగకుండుటకే వారిని తొలగించి, తామే సాగుచేస్తున్నట్లు చూపిం

చటం తప్ప వేరుకాదని ప్రభుత్వ వ్యవసాయ సంస్కరణల రిపోర్టు వ్రాసిందని వెనుక చూశాం.

1946 నుంచి తెలంగాణాలో రైతులు తమకున్న భూములను రక్షించుకొనుటకు, అక్రమంగా తీసుకున్న భూములను తిరిగి తీసుకొనుటకు పోరాటం ప్రారంభించారు. 1948 లో ఇది సాయుధ పోరాటంగా పరిణమించింది. జమీందార్ల వద్దనున్న అదనపు భూములన్నీ రైతాంగం పంచుకోవటం జరిగింది. ఇట్లు సుమారు 10లక్షల ఎకరాలను రైతాంగం పంచుకున్నది. పోలీసు యాక్షను తరువాతకూడా రైతులు తాము సాధించుకున్న భూమిని నిలుపుకొనుటకు అనేక త్యాగాలు చేసి పోరాడారు.

వీటి ఫలితంగా హైదరాబాదు ప్రభుత్వం భూమిసమస్యను గురించి కొన్ని ముఖ్య చర్యలు తీసుకోవలసి వచ్చింది. దాంట్లో మొదటిది జాగీర్లు, సర్ఫేఖాసుల రద్దు చేయటం. రెండోది 1950 రక్షిత కౌలుదారీచట్టం. నైజాం నవాబుకి సంవత్సరానికి ఒకకోటి రూపాయలు, జాగీరుదార్లకు 18 కోట్ల రూపాయలు నష్టపరిహారంగా యిచ్చి వీటిని రద్దు చేశారు. రక్షిత కౌలుదార్ల చట్టమును ప్రకటించుటకు పూర్వం తెలంగాణాలో వ్యవసాయ సమస్యనుగూర్చి విచారించి చేయాల్సిన మార్పుల సూచించమని వ్యవసాయ సంస్కరణల కమిటీని 1949 జూనులో అప్పటి మిలిటరీ ప్రభుత్వం నియమించింది.

భూసమస్యను ఏ విధంగా పరిష్కారం చేయాలనే సమస్య ఈ కమిటీ రిపోర్టులో చర్చింపబడింది. ఈ సందర్భంలో తెలంగాణాలో పెద్ద భూస్వాముల ప్రతినిధి సంస్థ అగు "వ్యవసాయకుల సంఘం" చెప్పింది తెలుసుకొనుట అవసరం.

"సాగు చేయని భూస్వామ్యవిధానం (Absentee Land-lordism) వ్యవసాయానికి ప్రధాన బలహీనత. ఇది ఉత్పత్తిని తగ్గించుతూ, భూస్వామి - కౌలుదారు మధ్య కలహాన్ని కల్పించింది......ఎక్కువ కౌళ్ళు, కౌలు భూములు స్థిరంగా లేకపోవటంవల్ల ఉత్పత్తిని స్పష్టంగా నష్టపరుస్తున్నా, అసలు సమస్య ఇదిగాదు. అసలు సమస్య భూమి తనదనే భావం లేకపోవటం. ఈ భావం కలిగియుండుట కౌలుదారు గట్టిగా పనిచేయుట కాధారము. భూమిపై యాజమాన్య పుహక్కును కౌలుదారుకివ్వని ఏ సంస్కరణగూడ భూమిలో పంట సభివృద్ధి చేయదు. సక్రమ నష్టపరిహారాన్ని ఇస్తూ, కౌలుదారీ విధానాన్ని తొలగించే శాసనం వెంటనే చేయాలె. రైతుల్లో అసంతృప్తి తీవ్రంగా వున్న ఈ రోజుల్లో కౌలు విధానాన్ని ఏ రూపంలో వుంచినా, రాజకీయంలో శక్తులు వర్గకలహాన్ని రెచ్చగొట్టుట కుపయోగిస్తున్నారు."

(వ్యవసాయ సంస్కరణల - రిపోర్టు 115 పేజి)

కౌలు విధానానికి, సాగుచేయని భూస్వామిక విధానం మూలమనీ, సంఘాభివృద్ధి, వ్యవసాయాభివృద్ధి దృష్టిలో యీ మూలకారణాన్ని తొలగించాలని; ఈసాగు చేయని భూస్వామిక విధానాన్ని, కౌలు విధానాన్ని తొలగించి, భూమిపై హక్కుదారు, వ్యవసాయంచేసేది ఒకరే అయి

వుండునట్లు చేయుట ఇక చేయాల్సిన వ్యవసాయ సంస్కరణల ఆశయంగా వుండాలనీ ఈ కమిటీ నిర్ణయించింది.

దీనినిబట్టి ఇక కౌలుపద్ధతిద్వారా రైతులను దోపిడీ చేయుట సాధ్యంకాదని, కౌలు భూములపై ఏదోవిధంగా డబ్బు రాబట్టుకోడం, సాధ్యమైనంతభూమి స్వంత వ్యవసాయంక్రింద పెట్టుకోవాలని భూస్వామికవర్గం, ప్రభుత్వం అభిప్రాయాని కొచ్చాయని స్పష్టం.

1950 లోని రక్షిత కౌలుదారీచట్టం ఈ దృక్పథంనుంచే చేయబడింది.

ఈ చట్టంక్రింద మొత్తం స్టేటులోని వివిధ జిల్లాలలో రక్షిత కౌలుదార్లుగా ప్రకటించబడినవారిసంఖ్య అధ్యాయం చివర ఇవ్వబడిన 'కౌలుదార్లనుగూర్చి తెల్పిన లెక్కల' టేబులులో ఇవ్వబడింది.

యథార్థంగా కౌలుదార్లుగావున్న అనేక వేలమంది, ముఖ్యంగా తెలంగాణాలో రక్షిత కౌలుదార్లుగా గుర్తించబడలేదు. అయినప్పటికీ, 1940 నుంచి ఎంతోమంది కౌలుదార్లనుతొలగించి భూములపడావుగా వుంచినాగూడా, ఈ టేబుల్ చూపించిన ప్రకారమే మొత్తం కౌలుదార్లు, వారి క్రిందనున్న భూమి చాల పెద్ద సంఖ్యలో వున్నట్లు స్పష్టమవుతుంది.

రక్షిత కౌలుదార్లు తమ భూములను కొనుక్కునేటట్లుచేసి, వారిని భూఖామందులుగాచేసి, ఇట్లు కౌలుదారు విధానాన్నే 1953 కల్లా రద్దుచేస్తాం అన్న ప్రభుత్వ ప్రకటన ఏమైంది? 1950 కౌలుదారీచట్టం అమలులోనికి వచ్చినప్పటినుంచి ఇప్పటివరకు కౌలుదార్లు '52 ఆఖరుకు కొన్న భూమి 55-109 ఎకరాలుమాత్రమేనని ప్రభుత్వమే అంగీకరించింది. కాని కౌలుదార్లను వారిభూములనుండి లేవగొట్టడంఅమ్ముకోవడం కొరకు, జనరల్ ఎన్నికలు జరిగాక ఇంకా తీవ్రంగా ప్రయత్నంజరిగింది. ప్రతి భూస్వామి ఉంచుకోగల గరిష్ఠ భూమిని గురించి, ప్రభుత్వం పెట్టబోతున్న పరిమితి దృష్టితోగూడ భూస్వాములు ఒక వైపున బినామీ పట్టాలు సృష్టిస్తూ, ఇంకొకవైపు పై కార్యక్రమం సాగించారు. కౌలుదార్లు పెద్ద సంఖ్యలో భూములు పోగొట్టుకున్నారు. భూస్వాములు స్వంత వ్యవసాయాలను అభివృద్ధిచేయుటపై గూడ కేంద్రీకరించారు.

ఇట్లు కౌలుదార్ల చేతులనుండి భూమి పోయి, వారిస్థితి చెడిపోవటం, ఇంకొకవైపు భూమి అమ్మకాలద్వారా వచ్చిన డబ్బుతో సొంత కమతాలుపెట్టే ధోరణి కొంత అభివృద్ధిఅయింది. ఈ అమ్మకాలను గురించి లెక్కలు ఏమాత్రంలేవు. అట్లే భూస్వాములు సొంత వ్యవసాయాలను పెంపొందించుట గురించి భోగట్టాగూడ లేదు. కాని ఈకాలంలో తెలంగాణాలో ఆయిలు ఇంజన్లు, పంపులు 10,000 దాకా పెరిగాయి. అందుచే కౌలుదారీ పద్ధతి ఇంకా చాల బలంగావున్నా, కొత్తగా అభివృద్ధి అగుచున్న ఈ పరిస్థితులను గూడ సరిగా తెలుసుకొని అంచనావేయుట చాల అవసరము.

# 1951-52 లలో వివిధరకాల కౌలుదార్లనుగురించిన లెక్కలు (1)

| జిల్లా పేరు | సంవత్సరంలో సేద్యం చేసిన మొత్తం భూమి | సంయుక్త ఆసామీ శిఖ్మీ సహితంగా రక్షిత కౌలుదార్ల సంఖ్య | వారు సేద్యం చేసిన భూమి ఎకరాలలో | 1950 కౌలుదారీ చట్టం క్రింద రక్షిత కౌలుదార్లు | వారు సేద్యంచేసిన భూమి ఎకరాలలో | 1950 కౌలుదారీ చట్టం సెక్షన్ 37 క్రింద కౌలు హక్కు సర్టిఫికేట్లు పొందినవారు | వారు సేద్యంచేసిన భూమి ఎకరాలలో | మొత్తం రక్షిత కౌలుదార్లు |
|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | 8,77,344 | 5,652 | 91,808 | 6,320 | 97,496 | 4 | 97 | 11,976 |
| మెదకు | 9,40,848 | 19,806 | 1,01,393 | 24,621 | 1,20,828 | 20 | 224 | 44,447 |
| మహబూబ్‌నగరు | 16,44,914 | 16,164 | 2,04,338 | 35,408 | 4,34,703 | ... | ... | 51,600 |
| నిజామాబాదు | 5,40,876 | 8,514 | 18,251 | 18,042 | 39,828 | 47 | 495 | 26,591 |
| నల్లగొండ | 20,29,715 | 20,095 | 2,08,958 | 13,248 | 1,50,016 | 217 | 1,944 | 33,560 |
| కరీంనగరు | 12,37,988 | 16,606 | 74,195 | 20,487 | 84,612 | ... | ... | 37,093 |
| వరంగల్లు | 6,76,122 | 13,561 | 91,535 | 11,855 | 58,830 | 120 | 2,578 | 25,536 |
| ఖమ్మం | 8,18,748 | 11,724 | 1,07,348 | 13,840 | 93,184 | 250 | 1,829 | 25,475 |
| ఆదిలాబాదు | 14,25,279 | 20,598 | 16,801 | 49,978 | 4,08,486 | ... | ... | 49,978 |
| తెలంగాణా మొత్తం | 96,91,334 | 1,32,720 | 9,14,117 | 1,93,799 | 14,87,983 | 658 | 7,167 | 3,06,256 |
| మొత్తం స్టేటు | 2,78,14,740 | 1,73,091 | 14,55,725 | 4,65,835 | 67,94,546 | 1,109 | 17,365 | 6,16,363 |

1951-52 లలో [illegible] (2)

| జిల్లా పేరు | మొత్తం రక్షిత కౌలుదారీ క్రింద ఉన్న భూమి ఎకరాలలో | సక్రమం చేయబడిన భూమిలో రక్షిత కౌలుదారీ క్రింద ఉన్న భూమి శాతం | రక్షిత కౌలుదారులు సాధారణ కౌలుదారుల సంఖ్య | వారు సక్రమం చేసిన భూమి ఎకరాలలో | చట్టవిరుద్ధంగా తొలగించిన కౌలుదారుల సంఖ్య | వారి ఆధీనంలో ఉన్న భూమి | స్వచ్ఛందంగా వదిలివేసిన కౌలుదారుల సంఖ్య | వారి ఆధీనంలో ఉన్న భూమి |
|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | 1,87,936 | 49% | 3,661 | 41,262 | 11,311 | 1,92,001 | 2,766 | 84,164 |
| మెదకు | 1,70,186 | 18% | 17,109 | 71,388 | 27,154 | 1,47,111 | 26,431 | 41,760 |
| మహబూబ్‌నగరు | 6,39,041 | 39% | 5 | 56 | 31,812 | 4,14,542 | 19,794 | 2,24,555 |
| నిజామాబాదు | 57,715 | 11% | 2,421 | 24,478 | 14,449 | 39,282 | 13,356 | 13,338 |
| నల్లగొండ | 3,59,026 | 18% | 4,321 | 11,816 | 28,479 | 3,23,675 | 9,402 | 1,26689 |
| కరీంనగరు | 1,58,807 | 13% | 5 | 5 | 23,430 | 1,13,644 | 14,006 | 45,168 |
| వరంగల్లు | 1,52,945 | 23% | 1 | 3 | 17,662 | 1,25,092 | 7,409 | 27,858 |
| ఖమ్మం | 1,63,051 | 20% | 1,988 | 22,535 | 16,749 | 1,46,463 | 8,826 | 43,272 |
| ఆదిలాబాదు | 4,08,486 | 29% | ... | ... | 34,122 | 2,72,335 | 13,740 | 1,36,157 |
| తెలంగాణా మొత్తం | 22,97,193 | ... | 29,511 | 1,71,548 | 2,05,168 | 17,74,145 | 1,15,730 | 6,94,951 |
| మొత్తం స్టేటు | 67,32,332 | ... | 94,256 | 35,55,830 | 3,07,726 | 32,46,226 | 3,32,795 | 51,56,781 |

మూలం : "నేటి హైదరాబాదు", సెప్టెంబరు, 1958.

# తెలంగాణా జిల్లాలవారీగా భూమి ఉపయోగం (1)

| జిల్లా పేరు | గ్రామ పత్రాల ప్రకారం మొత్తం భౌగోళిక విస్తీర్ణం | అడవులు | బంజరు, సాగుకు పనికిరాని భూములు | వ్యవసాయేతర పనులకు ఉపయోగించిన భూమి | సాగుకు పనికివచ్చే బంజరు భూమి |
|---|---|---|---|---|---|
| హైదరాబాదు ... | 10,54,575 | 91,206 | 1,07,520 | 66,472 | 45,628 |
| మహబూబ్‌నగరం ... | 38,74,175 | 7,75,789 | 2,87,392 | 1,24,593 | 96,195 |
| ఆదిలాబాదు ... | 41,84,679 | 10,74,789 | 7,72,709 | 1,37,287 | 1,65,249 |
| నిజామాబాదు ... | 17,60,461 | 2,89,935 | 2,62,401 | 1,57,148 | 89,598 |
| మెదకు ... | 21,67,031 | 1,97,383 | 2,30,853 | 1,34,323 | 95,218 |
| కరీంనగరు ... | 33,16,976 | 7,49,557 | 2,33,243 | 1,98,631 | 1,02,414 |
| వరంగల్లు + ఖమ్మం ... | 44,31,561 | 12,20,967 | 42,8,252 | 2,11,387 | 3,01,010 |
| నల్లగొండ ... | 39,40,478 | 2,39,316 | 3,26,037 | 1,84,790 | 1,21,372 |
| తెలంగాణా మొత్తం ... | 2,47,29,936 | 46,38,942 | 26,48,407 | 12,14,631 | 10,16,669 |
| స్టేటు మొత్తం ... | 5,07,95,142 | 51,58,001 | 34,23,186 | 18,98,686 | 15,34,857 |

## తెలంగాణా జిల్లాలవారీగా భూమి ఉపయోగం (2)

| జిల్లా పేరు | పర్మనెంటు కంచెలు (బీడులు) | పలురకాల వృక్షాల క్రింద | ప్రస్తుతం ఖాళీగా వున్న భూములు | ఇతరంగా పాడుబడివున్న భూములు | సేద్యంచేసే మొత్తం భూమి |
|---|---|---|---|---|---|
| హైదరాబాదు ... | 1,08,724 | 17,418 | 2,03,284 | 80,787 | 3,33,591 |
| మహబూబ్‌నగరం ... | 1,76,609 | 23,830 | 5,32,100 | 1,32,000 | 17,25,667 |
| ఆదిలాబాదు ... | 1,73,268 | 10,316 | 2,39,915 | 2,02,881 | 14,08,265 |
| నిజామాబాదు ... | 1,15,492 | 16,760 | 53,782 | 1,06,535 | 6,68,815 |
| మెదకు ... | 1,83,251 | 32,756 | 2,44,380 | 1,00,178 | 9,48,699 |
| కరీంనగరు ... | 1,67,680 | 26,783 | 4,51,459 | 1,40,746 | 12,46,463 |
| వరంగల్లు + ఖమ్మం ... | 3,08,344 | 38,406 | 4,17,433 | 2,21,811 | 12,83,951 |
| నల్లగొండ ... | 3,77,536 | 18,506 | 6,88,505 | 2,10,608 | 17,74,078 |
| తెలంగాణా మొత్తం ... | 16,10,904 | 1,84,775 | 28,30,858 | 11,95,491 | 93,89,529 |
| స్టేటు మొత్తం ... | 27,03,684 | 2,77,403 | 54,19,658 | 29,91,171 | 2,73,98,546 |

(అంకెలు గ్రామలెక్కలనుబట్టి తయారుచేసినవి. అందుచే ఇండియా సర్వేలెక్కలకు దీనికి 20 లక్షలు తేడావుంది.)

(మూలం: "హైదరాబాద్ స్టేటు స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు" 1952-53)

# ఆహార పంటలు

తెలంగాణాలో 66,73,292 ఎకరాలలో ఆహార పంటలు పండించబడుతున్నాయని 1952 - 53 సంవత్సర ప్రభుత్వ లెక్కల ప్రకారం తేలుతున్నది. అయితే, ఈ లెక్కలు వాస్తవికంగా మాత్రం లేవని చెప్పవచ్చు. వేరే లెక్కలు లేనికారణంగా వీటిపైననే ఆధారపడుతున్నాం. తెలంగాణాలో ప్రధాన ఆహార ధాన్యాలలో వరితోపాటు జొన్న, సజ్జ, మొక్కజొన్న మొదలగునవి కలవు. ఈ ఆహారపంటలలో - సాగుఅయ్యే ఎకరాలను చూచినా గానీ, పంటను చూచినాగానీ- జొన్నదే ప్రథమ స్థానం. వరి రెండవస్థానం ఆక్రమించుతుంది.

ఆహారధాన్యాల విషయంలో తెలంగాణా ప్రస్తుతం గల అవసరాలు తీర్చుకో లేని స్థితిలో వుంది. అయితే సాగుకు లాయకైన భూమి విస్తీర్ణాన్నిబట్టి వున్న నదీ జలాలను సద్వినియోగ పర్చుకుంటే తెలంగాణా ఆహారధాన్యాల విషయంలో స్వయంసమృద్ధి చెందగలదు.

పంటలవారీ వివరాలను పరిశీలిద్దాం. తెలంగాణాలో ప్రస్తుతం జొన్న ప్రధాన పంట. సాలుకు 28.32 లక్షల ఎకరాలలో 3,83,235 టన్నులు పండించబడుచున్నది. తెలంగాణాలోకెల్లా ఆదిలాబాదులో హెచ్చుగా పండించబడుచున్నది. జొన్న పంటలో వరంగల్లు, ఖమ్మంజిల్లాలు రెండవ స్థానం ఆక్రమించుతాయి. ఇక్కడ అడవుల నానుకొనివున్న నల్లరేగడి ప్రాంతాలలో ఈ పంట బాగా పండుతుంది. తెలంగాణాలో పండే జొన్నపంట రెండు రకాలుగా వుంటుంది. ఒకటి జూన్ నెలలో వర్షాలు ప్రారంభంకాగానే వేసే ఎర్ర జొన్న, రెండవది శీతాకాలంలో వేసే పచ్చజొన్న. ఎర్రజొన్నకు పడమటి వర్షాలు, పచ్చజొన్నకు తూర్పు వర్షాలు, శీతాకాలపు మంచు కావలసిన తేమను సప్లయి చేస్తాయి. స్టేటు మొత్తం లెక్కల ప్రకారం, జొన్న ఎకరాకు సగటున 306.4 పౌనులు పండుతుంది.

తర్వాత ముఖ్యమైన ఆహారపంట వరి. ఈ వరిపంట సాలుకు 11,88,772 ఎకరాలలో 2,86,810 టన్నులు పండుతుంది. తెలంగాణాలోకెల్లా వరంగల్లు, నిజామాబాదు, కరీంనగరం, మెదకు జిల్లాల్లో వరి అధికంగా పండించబడుతున్నది. అయితే 1952-'53 లో నిజామాబాదు, మెదకులలో ఎక్కువ పండింది. ఈ రెండు జిల్లాల్లో 3.64 లక్షల ఎకరాలలో 1,06,736 టన్నుల ధాన్యం పండించబడుచున్నది. నిజామాబాదులోని నిజాంసాగర్ ప్రాజెక్టు క్రింద మెదకులోని చెరువుల, బావులక్రింద ఈ పంట పండింది.

తెలంగాణాలో హైద్రాబాదు, ఆదిలాబాదు జిల్లాలలో వరి చాలా తక్కువగా

పండుతుంది. తెలంగాణాలో 1939-'53 వరకు ఎకరానికి సగటున 706 పౌనులు వరి ధాన్యం పండింది.

తెలంగాణాలో వరిసాగు సగానికి సగం చెరువుల ద్వారానే సేద్యం అవుతున్నది. బావులద్వారా 2,85,898 ఎకరాలు, ప్రభుత్వ కాలువలద్వారా 2,10,204 ఎకరాలు అగుచున్నది. మిగతా సేద్యం స్వంత కాలువలద్వారా, నీటి పంపులద్వారా అగుచున్నది. తెలంగాణాలో బావులకు, నదులకు నీటిపంపులు ఉపయోగించటం "పోలీసు యాక్షను" తర్వాతనే ప్రారంభమైంది. 1952-'53 లెక్కల ప్రకారం తెలంగాణాలో నీటి పంపులద్వారా 9,367 ఎకరాలు సేద్యం అయింది.

ఇక్కడ నదీప్రాజెక్టులక్రింద పెద్ద పెద్ద చెరువులక్రింద, బావులక్రింద సాధారణంగా రెండు వరిపంటలు పండిస్తారు. వర్షాలు బాగా కురిసిన సంవత్సరం బావులక్రింద మూడు పంటలుకూడా పండిస్తారు. రెండవ పంట పండే భూమి 93,331 ఎకరాలు వుంది.

హైదరాబాదు ప్రభుత్వం అధికోత్పత్తి "ఉద్యమం", "కృత్రిమ ఎరువులు," మరింకెన్నో "ఉద్యమాలు" సాగించినా వరి పంట ఉత్పత్తి 1945-'46 ఉత్పత్తికన్నా తక్కువగానే వుంది. 1945 - '46 లో మొత్తం పంట 4,79,562టన్నులు పండితే, ఉత్పత్తి పెరిగిందని చెప్పే 1951-'52 లో 4,36,197 టన్నులే పండింది. పైన యిచ్చిన లెక్కల ప్రకారం 1952-53 లో మరీ తగ్గి 2,86,810 టన్నులకే దిగింది.

తెలంగాణాలో పండే పంటలో కొద్ది భాగం స్టేటులోనికి మరఠ్వాడా, కన్నడ ప్రాంతాలకు పోయినా, యుద్ధానికిపూర్వం తెలంగాణాకు ఆంధ్రనుండి బియ్యం దిగుమతి జరిగేదని వ్యవసాయశాఖ అధికారుల ద్వారా తెలియవస్తున్నది. ఇప్పుడుకూడా దిగుమతి దిగ్బంధాలు తొలగిపోతే ప్రస్తుతం మద్రాసుప్రాంతానికి ఎగుమతి అయ్యేబియ్యం తెలంగాణాలోకి తరలివస్తాయి.

తెలంగాణాలోని యితర ప్రధాన ఆహార ధాన్యాలలో సజ్జ, మొక్కజొన్న ముఖ్యం. సజ్జ 4,47,020 ఎకరాలలో 33,295 టన్నులు, మొక్కజొన్న 4,06,336 ఎకరాలలో 51,422 టన్నులు పండించబడుచున్నది. సజ్జపంట అత్యధికంగా నల్లగొండ జిల్లాలో (21,990 టన్నులు), మొక్కజొన్న మెదకు, కరీంనగరం జిల్లాలలో పండించబడుతున్నది.

తెలంగాణాలో గోధుమపంట చాలా తక్కువ. 12,315 ఎకరాలలో 1,133 టన్నులు పండుతుంది. ఇందులో 764 టన్నులు ఒక ఆదిలాబాదు జిల్లాలోనే పండుతుంది. నల్లగొండ, వరంగల్లు, ఖమ్మం, హైదరాబాదు జిల్లాలలో నామకహాతప్ప పండదనే చెప్పవచ్చు.

తెలంగాణాలో పై ఆహార పంటలతో పాటు జొన్నలు, రాగులు, వరిగెలక్రింద 4,67,172 ఎకరాలు సాగుచేయబడి 42,801 టన్నులు పండుతాయి. ఈ పంటలు అధికంగా కర్నూలు సరిహద్దును ఆనుకొనివున్న మహబూబ్ నగరంలో అధికంగా పండుతాయి.

ఆహార ధాన్యాలలో ముఖ్యభాగమైన పప్పుధాన్యాలు తెలంగాణాలో 14,29,988 ఎకరాలలో 1,07,359 టన్నులు పండు

తాయి. పప్పుధాన్యాలలో పెసలు అధికంగా పండుతాయి. మొత్తం పప్పుధాన్యాలలో మూడవ వంతుకన్నా అధికంగా పండుతాయి. తరువాత ఉలవలు, కందులు, శనగలు పండుతాయి.

పెసలు 5,45,262 ఎకరాలలో 31,532 టన్నులు పండించబడుతాయి. ఆంధ్రలో 36,490 టన్నులు పండుతాయి. తెలంగాణాలో వరంగల్లు, ఖమ్మం, కరీంనగరం జిల్లాలలో అధికంగా పెసలు పండుతాయి. హైదరాబాదు జిల్లాలో పెసరపంట చాలా తక్కువ. మొత్తం స్టేటు పెసర పంటలో తెలంగాణాలో సగానికి కాస్త తక్కువగా పండుతుంది. పెసర వర్షాకాలం ఆరంభం జూన్ నెలలోనే వేసి, పంట చేరుకున్నాక, దానిఅడుగులో పచ్చజొన్న వేస్తారు.

ఉలవలు 3,67,367 ఎకరాలలో 23,397 టన్నులు పండుతాయి. ఈ మొత్తంపంటలో సగానికిపైగా [12,434 టన్నులు] మహబూబునగరం జిల్లాలో పండుతాయి. ఈ పంట అటు ఆంధ్రతో పోల్చిచూసినా, యిటు స్టేట్ మొత్తం పంటతో పోల్చి చూచినా సగానికి తక్కువే.

కందులు 1,63,828 ఎకరాలలో 20,006 టన్నులు పండుతాయి. ఆదిలాబాదు జిల్లాలో కంది పంట అధికంగా పండుతుంది. ఆంధ్రతో పోల్చి చూచినప్పుడు దాదాపు సమానంగాను, స్టేటు మొత్తం పంటతో పోల్చిచూస్తే 6 వ వంతు పండుతుంది.

శనగలు 16,778 టన్నులు పండుతాయి. ఇందులో దాదాపు సగం ఒక్క మెదకు జిల్లాలోనే పండుతాయి. ఈపంట ఆంధ్ర పంటతో సమానంగానూ, స్టేటు మొత్తం పంటలో 6 వ వంతు వుంది.

పైన పేర్కొన్న పప్పు ధాన్యాలే గాక, మినుములు వగైరా యితర పప్పు ధాన్యాలు కూడా 15,646 టన్నులు పండుతాయి.

తెలంగాణాలో మొత్తం ఆహారధాన్యాలక్రింద 66,73,292 ఎకరాలు సాగుచేయబడి 9,06,055 టన్నుల ధాన్యం పండుతుంది.

నోటు : జిల్లాలవారి పంటల వివరాలు అధ్యాయం చివరపట్టికలలో ఇవ్వబడ్డాయి.

# 1952-'53 సం॥రం తెలంగాణా జిల్లాలవారీగా ప్రధాన ఆహారధాన్యాల సేద్యం, పంట (1)

| జిల్లా పేరు | వరి * | | జొన్న | | సజ్జలు | | గోధుమ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) |
| హైదరాబాద్ | 36,168 | 10,684 | 81,593 | 12,056 | 16,772 | 1,021 | 163 | 7 |
| మహబూబ్‌నగరం | 1,42,378 | 38,709 | 4,62,635 | 54,768 | 87,855 | 7,440 | 621 | 28 |
| ఆదిలాబాదు | 70,604 | 14,641 | 5,43,782 | 1,01,015 | 2,147 | 214 | 6,509 | 764 |
| నిజామాబాదు | 2,05,909 | 55,879 | 1,24,887 | 11,175 | 78 | 5 | 2,056 | 96 |
| మెదకు | 1,58,358 | 50,857 | 2,20,938 | 29,961 | 8,137 | 226 | 2,086 | 184 |
| కరీంనగరం | 1,35,309 | 31,887 | 3,30,823 | 49,144 | 1,032 | 62 | 635 | 43 |
| వరంగల్ + ఖమ్మం | 1,55,224 | 44,680 | 5,37,882 | 81,487 | 30,064 | 2,337 | 149 | 8 |
| నల్లగొండ | 1,74,591 | 39,473 | 5,29,430 | 43,629 | 3,05,935 | 21,990 | 96 | 3 |
| తెలంగాణా మొత్తం | 10,78,541 | 2,86,810 | 28,31,920 | 3,83,235 | 4,47,020 | 33,295 | 12,315 | 1,133 |

* 1952-'53 లో వర్షాభావంవల్ల వరిపంట తగ్గిపోయింది. బాగా వరిపండే జిల్లాలుకూడా తారుమారైనవి.

## 1952-'53 సం॥రం తెలంగాణా జిల్లాలవారీగా ప్రధాన ఆహార ధాన్యాల సేద్యం, పంట (2)

| జిల్లా పేరు | మొక్క జొన్న | | ఇతర ఆహార ధాన్యాలు | | మొత్తం ఎకరాలు | మొత్తం పంట (టన్నులు) |
|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) | | |
| హైద్రాబాదు ... | 18,232 | 1,637 | 15,272 | 1,660 | 1,63,200 | 27,065 |
| మహబూబునగరం ... | 55 | 4 | 2,33,688 | 20,369 | 9,27,232 | 1,21,318 |
| ఆదిలాబాదు ... | 87,329 | 3,976 | 4,652 | 502 | 6,64,973 | 1,21,112 |
| నిజామాబాదు ... | 48,784 | 8,289 | 32,830 | 4,558 | 4,14,544 | 80,002 |
| మెదకు ... | 92,324 | 17,124 | 89,365 | 9,168 | 5,66,208 | 1,07,520 |
| కరీంనగరం ... | 1,50,870 | 15,938 | 7,482 | 644 | 6,26,151 | 97,718 |
| వరంగల్లు + ఖమ్మం ... | 53,309 | 3,764 | 15,281 | 1,026 | 7,91,909 | 1,33,302 |
| నల్లగొండ ... | 10,438 | 690 | 68,602 | 4,874 | 10,89,087 | 1,10,659 |
| తెలంగాణా మొత్తం ... | 4,06,836 | 51,422 | 4,67,172 | 42,801 | 52,43,304 | 7,98,696 |

(మూలం : హైదరాబాదు స్టేట్ స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు.)

# 1952-'53 సం॥రం తెలంగాణా జిల్లాల్లో పప్పుధాన్యాలక్రింద సేద్యపు భూమి విస్తీర్ణము - పంట (1)

| జిల్లా పేరు | శనగలు | | కంది | | పెసర | |
|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) |
| హైదరాబాదు ... | 8,491 | 1,737 | 5,401 | 507 | 2,686 | 182 |
| మహబూబ్‌నగరం ... | 12,782 | 1,316 | 25,486 | 2,440 | 9,504 | 303 |
| ఆదిలాబాదు ... | 13,499 | 979 | 53,805 | 8,711 | 85,478 | 5,598 |
| నిజామాబాదు ... | 30,498 | 2,869 | 3,619 | 262 | 25,039 | 1,483 |
| మెదకు ... | 49,243 | 7,537 | 11,667 | 1,118 | 18,880 | 1,552 |
| కరీంనగరం ... | 19,245 | 769 | 19,414 | 1,424 | 1,44,248 | 7,568 |
| వరంగల్లు+ఖమ్మం ... | 8,942 | 891 | 18,724 | 1,016 | 1,73,260 | 9,707 |
| నల్లగొండ ... | 7,613 | 680 | 25,712 | 4,528 | 86,167 | 5,149 |
| తెలంగాణా మొత్తం ... | 1,50,313 | 16,778 | 1,63,828 | 20,006 | 5,45,262 | 31,532 |
| స్టేటు మొత్తం ... | 7,99,543 | 98,738 | 10,25,806 | 1,22,197 | 11,33,538 | 74,909 |

## 1952-'53 సం॥ర తెలంగాణా జిల్లాలలో పప్పుధాన్యాలక్రింద సేద్యపుభూమి విస్తీర్ణము-పంట (2)

| జిల్లా పేరు | పులవలు | | ఇతర పప్పు ధాన్యాలు | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) | ఎకరాలు | పంట (టన్నులు) |
| హైదరాబాదు ... | 7,737 | 549 | 1,349 | 117 | 25,664 | 3,092 |
| మహబూబ్‌నగరం ... | 1,72,885 | 12,434 | 20,153 | 1,069 | 2,40,808 | 17,562 |
| ఆదిలాబాదు ... | 32,013 | 1,499 | 49,098 | 3,698 | 2,33,893 | 20,480 |
| నిజామాబాదు ... | 16,194 | 1,128 | 38,416 | 2,625 | 1,13,766 | 8,367 |
| మెదకు ... | 17,844 | 1,484 | 49,472 | 3,841 | 1,47,106 | 15,532 |
| కరీంనగరం ... | 29,271 | 609 | 28,884 | 3,114 | 2,41,062 | 13,479 |
| వరంగల్లు + ఖమ్మం ... | 27,179 | 1,436 | 10,520 | 752 | 2,38,625 | 13,802 |
| నల్లగొండ ... | 64,244 | 4,258 | 5,328 | 430 | 1,89,064 | 15,045 |
| తెలంగాణా మొత్తం ... | 3,67,367 | 23,397 | 2,03,220 | 15,646 | 14,29,988 | 1,07,359 |
| స్టేటు మొత్తం ... | 10,59,250 | 60,362 | 7,99,724 | 64,587 | 48,17,861 | 4,20,793 |

మూలం : హైద్రాబాద్ స్టేట్ స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు 1952-53.

# వ్యాపార పంటలు

భారతదేశ వ్యాపారపంటల ఉత్పత్తిలో ఆంధ్రదేశంతోపాటు తెలంగాణా కూడా ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నది. 1952-53వ సంవత్సరంలో మొత్తం 38,273 బేళ్ళ పత్తి, 4,09,283 టన్నుల యితర వ్యాపార పంటలు పండించ బడ్డాయి. ఈ సంవత్సరం వ్యాపారపంటలు పండించబడిన భూవిస్తీర్ణం, మొత్తం పంట భూమిలో మూడవ వంతు.

తెలంగాణాలో పండే వ్యాపార పంటలలో ఆముదాలు, వేరుశనగ మొదలైన నూనెగింజలు, చెరకు, పత్తి, ఇత్యాది పంటలు ముఖ్యమైనవి.

1952-'53 వ సంవత్సరంలో 7,60,661 ఎకరాలలో 50,225 టన్నుల ఆముదాలు పండించబడ్డాయి. స్టేటు వ్యాపారపంట లలో ఇది ముఖ్యమైనది. 1951-52 వ సంవత్సర లెక్కల ప్రకారం మొత్తం భారత దేశంలో ఆముదపుపంట పండించబడిన భూ విస్తీర్ణంతో పోల్చితే, స్టేట్‌లో ఈ పంట పండించబడిన భూ విస్తీర్ణం 63% ఉన్నది. స్టేట్ ఆముదపు పంట (1951-52) 53,347 టన్నులలో, తెలంగాణాలోనే నూటికి 98 పాళ్ళు (50,225 టన్నులు) పండించ బడుతున్నది.

1952-'53 వ సంవత్సరపు మొత్తం పంటలో 22,747 టన్నులు ఒక్క నల్లగొండ జిల్లాలోనే పండించబడ్డాయి. మహబూబ్‌నగరు ఆముదపు పంటలో రెండవ స్థానాన్ని ఆక్రమిస్తున్నది. 1951-'52 వ సంవత్సర అంచనాల ప్రకారం, నల్లగొండ, మహబూబ్‌నగరు జిల్లాలలో ఈ పంట పండించబడిన మొత్తం భూమి విస్తీర్ణం, పంట, ఆ సంవత్సరం తెలంగాణాలో ఈ పంట పండించబడిన మొత్తం భూమి విస్తీర్ణం, పంటల్లో వరుసగా 75%, 78% ఉన్నది.

అచ్చటచ్చట ఉన్న పురాతన పద్ధతులతో నూనెతీసే మిల్లులు తప్ప, ఇంత పెద్దపంటను ఉపయోగించే మిల్లులు లేనందు వల్ల ఈ పంటలో అధికభాగం ఎగుమతి అవుతున్నది. వీటి ఎగుమతి వల్ల వ్యవసాయాని కుపయోగించే ఎరువులుకూడా గిరాకీ అయిపోతున్నవి.

1951-'52వ సంవత్సర లెక్కల ప్రకారం స్టేట్‌లో వేరుశనగ పండించబడిన భూ విస్తీర్ణం, భారతదేశంలో ఈ పంట పండించబడిన భూ విస్తీర్ణంలో నూటికి 17.6పాళ్లు, స్టేట్ మొత్తం పంటభూమిలో 7.8 పాళ్లు మొత్తం ఆహారేతర పంటలు పండించబడుతున్న భూమిలో 22.5పాళ్ళు ఉన్నది.

వేరుశనగ 1952-53 వ సంవత్సరంలో 6,52,142 ఎకరాలలో సాగుచేయబడి 1,33,568 టన్నులు పండించబడుతోంది. ఆంధ్ర వేరుశనగపంటలో ఇది ఇంచుమించు

8 వ వంతు; స్టేటుపంటలో 4 వ వంతు. వేరుశనగ తెలంగాణాలో అధికంగా మహబూబునగరంలో పండుతుంది. మొత్తం తెలంగాణా పంటలో మూడువంతులు మహబూబు నగరంలోనే పండుతుంది. హైద్రాబాద్ జిల్లాలో మరీ తక్కువగా పండుతుంది. ఈ పంటకూడా అధిక భాగం ఎగుమతి చేయబడుతుంది. ఈ ఎగుమతి ఆంధ్రకు కూడా జరుగుచున్నది.

ఆవాలు 49,699 ఎకరాల్లో 3,329 టన్నులు, నువ్వులు (Seasamum) 5,85,658 యెకరాల్లో 39,067 టన్నులు, యితర నూనెగింజలు 1,13,776 ఎకరాల్లో 7,140 టన్నులు పండుతాయి. ఈ పంటలను కూడా ఎగుమతి చేయటం జరుగుచున్నది.

1952-'53 లెక్కల ప్రకారం తెలంగాణాలో 3,12,736 ఎకరాలలో 38,273 బేళ్ళ పత్తి పండించబడినది. ఆంధ్ర పత్తి పంటతో పోల్చినప్పుడు ఇక్కడి పంట యించుమించు సగానికి కొద్దిగా హెచ్చుగా వుంది. మొత్తం స్టేటు ఉత్పత్తిలో ఎనిమిదవ వంతు తెలంగాణాలో పండుతుంది.

తెలంగాణా పత్తి పంటలో ఒక్క ఆదిలాబాదులోనే 34,119 బేళ్ళ పత్తి పండుతున్నది. హైదరాబాదు జిల్లాలో పత్తిపంట బొత్తిగా లేదని చెప్పవచ్చు. బట్టల మిల్లుగల వరంగల్, ఖమ్మంలలో పత్తిపంట 86 బేళ్ళు మాత్రమే. ఆదిలాబాదులో పండే పత్తిలో అధిక భాగము మధ్యప్రదేశ్, బొంబాయి బట్టల మిల్లులకు ఎగుమతి చేయబడుచున్నది. తెలంగాణాలో కరీంనగరుజిల్లా పత్తి పంటలో రెండవస్థానం ఆక్రమించుచున్నది.

చెరకు 49,778 ఎకరాలలో 1,19,287 టన్నులు పండుచున్నది. ఇది మొత్తం స్టేటులో చెరకు పండించబడుతున్న భూమిలో సగానికి పైబడివుంది. మొత్తం స్టేటు చెరకు ఉత్పత్తితో పోల్చితే 1.74 లక్షల టన్నులలో 1.19 లక్షల టన్నులు తెలంగాణాలోనే పండుతుంది. ఇందులో 1.11 లక్షల టన్నులు ఒక్క నిజామాబాదు జిల్లాలోనే పండుచున్నది. నిజామాబాదులోని బోధన్ చక్కెర ఫ్యాక్టరీ భారతదేశ చక్కెర ఫ్యాక్టరీలలో కెల్ల పెద్దది. 1951 - 52 లెక్కలప్రకారం 25 వేల టన్నుల పంచదార తయారైంది. ఇప్పటికొనుగోలుశక్తినిబట్టి స్టేటు మొత్తం అవసరాలు తీర్చటానికి 30 వేల టన్నులు సరిపోతుందని అంచనా. చెరకు ఉత్పత్తిలో నిజామాబాదు తరువాత మెదకు జిల్లా రెండవ స్థానం ఆక్రమించుతుంది. నల్లగొండ, వరంగల్లు, కరీంనగరములలో ఈ పంట నామమాత్రమే అని చెప్పవచ్చు.

తెలంగాణా వ్యాపార పంటల్లో ఉల్లిపాయ 12,613 ఎకరాలలో సేద్యం చేయబడి 32,844 టన్నుల పంట పండుచున్నది. స్టేటు మొత్తం పంటలో సగానికిపైగా తెలంగాణాలో పండుతుంది. ఆంధ్రరాష్ట్రి ఉల్లిపంటలో 4 వ వంతు పండుతున్నది. హైద్రాబాద్ జిల్లాలో ఉల్లిపంట తెలంగాణా మిగతా అన్ని జిల్లాలకంటె అధికంగా అనగా యించుమించు సగం పంట పండుచున్నది. మెదకులో మొత్తం తెలంగాణా పంటలో 4 వ వంతు పండుచున్నది.

మిరపవరుగు (మిర్చి) 1,31,687 ఎకరాలలో 10,288 టన్నులు పండుచున్నది. ఇది మెదకు, మహబూబునగరములలో అధికంగా పండుచున్నది. తెలంగాణాలో

మిరపతోటలు రెండురకాలు. ఒకటి నల్లరేగడి లేని ప్రాంతాల్లో నీరుతోటలువేస్తారు. రెండు రేగడిప్రాంతాల్లో మైరుతోటలు. ఆంధ్ర మిరప పంటలో యిక్కడి పంట 8 వ వంతు మాత్రమే. ఎకరానికి ఉత్పత్తి కూడా ఆంధ్రలోని ఉత్పత్తిలో 8వ వంతే. మొత్తం స్టేట్ మిరప పంటలో కూడా సగానికి తక్కువే.

ఇతర వ్యాపార పంటల్లో చిన్న ఉల్లిపాయలు 4,855 ఎకరాలలో 6,320 టన్నులు, పసుపు 3,839 ఎకరాలలో 1,718 టన్నులు పండుచున్నది. చిన్న ఉల్లిపాయలు పంటలో సగానికి సగం ఒక్క మహబూబునగరం, మెదకు, కరీంనగరముల లోనే పండుతుంది. పసుపు పంట మూడు వంతులు ఒక్క నిజామాబాదు జిల్లాలోనే పండుచున్నది. హైదరాబాదు, నల్లగొండ జిల్లాల్లో యించుమించు పంటలేదని చెప్పవచ్చు.

నోటు :- అధ్యాయం చివర జిల్లాల వారీపంటల వివరాలు ఇవ్వబడ్డాయి.

## 1952–'53 సం॥రం తెలంగాణా జిల్లాల్లో నూనెగింజల పంట వివరాలు (1)

| జిల్లా పేరు | వేరుశనగ | | ఆముదాలు | | ఆవాలు | |
|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | పంట (టన్నులలో) | ఎకరాలు | పంట (టన్నులలో) | ఎకరాలు | పంట (టన్నులలో) |
| హైదరాబాదు ... | 1,822 | 508 | 86,218 | 4,510 | 1,776 | 148 |
| మహబూబ్‌నగరం ... | 2,09,960 | 43,520 | 2,43,016 | 17,359 | 2,025 | 86 |
| ఆదిలాబాదు ... | 17,767 | 4,625 | 15,479 | 11,123 | 21,615 | 1,505 |
| నిజామాబాదు ... | 22,253 | 6,606 | 3,042 | 131 | 5,568 | 271 |
| మెదకు ... | 19,124 | 4,844 | 27,359 | 1,698 | 18,678 | 1,317 |
| కరీంనగరు ... | 1,06,092 | 23,516 | 24,684 | 1,803 | 34 | 2 |
| వరంగల్లు ... | 1,52,923 | 22,301 | 12,946 | 854 | ... | ... |
| నల్లగొండ ... | 1,22,201 | 27,648 | 3,47,917 | 22,747 | 3 | ... |
| తెలంగాణా మొత్తం ... | 6,52,142 | 1,33,568 | 7,60,661 | 50,225 | 49,699 | 3,329 |
| స్టేటు మొత్తం ... | 22,17,173 | 4,40,990 | 8,07,904 | 52,347 | 3,72,703 | 26,473 |

## 1952-53 సం॥రం తెలంగాణా జిల్లాల్లో నూనెగింజల పంటవివరాలు (2)

| జిల్లా పేరు | నువ్వులు | | ఇతర నూనె గింజలు | | మొత్తం నూనె గింజలు | |
|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | పంట (టన్నులలో) | ఎకరాలు | పంట (టన్నులలో) | ఎకరాలు | పంట (టన్నులలో) |
| హైదరాబాదు ... | 6,388 | 354 | 12,769 | 944 | 1,08,973 | 6,464 |
| మహబూబ్‌నగరం ... | 26,255 | 840 | 18,569 | 1,082 | 4,99,825 | 62,887 |
| ఆదిలాబాదు ... | 1,48,472 | 12,065 | 12,196 | 629 | 2,15,529 | 19,947 |
| నిజామాబాదు ... | 31,550 | 2,027 | 10,199 | 614 | 72,612 | 9,649 |
| మెదకు ... | 33,463 | 1,846 | 51,830 | 3,402 | 1,50,454 | 13,107 |
| కరీంనగరం ... | 2,23,886 | 18,621 | 3,988 | 224 | 3,58,684 | 44,166 |
| వరంగల్లు ... | 44,497 | 2,482 | 2,111 | 105 | 2,12,477 | 25,742 |
| నల్లగొండ ... | 21,147 | 832 | 2,114 | 140 | 4,93,382 | 51,367 |
| తెలంగాణా మొత్తం ... | 5,35,658 | 39,067 | 1,13,776 | 7,140 | 21,11,936 | 2,33,329 |
| స్టేటు మొత్తం ... | 7,41,386 | 51,414 | 10,61,948 | 62,188 | 52,01,114 | 6,33,362 |

మూలం : హైదరాబాదు స్టేటు స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్టు 1952-1953.

## 1952–'53 సం॥రం తెలంగాణాజిల్లాల ఇతర వ్యాపారపంటల వివరాలు (1)

| జిల్లా పేరు | పత్తి | | చెరకు | | పొగాకు | |
|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | ఉత్పత్తి బేళ్ళలో * | ఎకరాలు | టన్నులలో | ఎకరాలు | ఉత్పత్తి టన్నులలో |
| హైదరాబాదు ... | ... | ... | 88 | 154 | 1,327 | 287 |
| మహబూబ్ నగరం ... | 1,468 | 98 | 284 | 263 | 1,900 | 349 |
| ఆదిలాబాదు ... | 2,69,958 | 34,119 | 147 | 164 | 944 | 188 |
| నిజామాబాదు ... | 8,926 | 693 | 45,671 | 1,11,883 | 369 | 71 |
| మెదకు ... | 5,013 | 577 | 3,565 | 6,744 | 4,224 | 1,058 |
| కరీంనగరు ... | 17,399 | 2,118 | 17 | 24 | 1,402 | 360 |
| వరంగల్లు ... | 1,278 | 86 | 3 | 3 | 7,190 | 1,880 |
| నల్లగొండ ... | 8,694 | 582 | 3 | 2 | 6,785 | 1,309 |
| తెలంగాణా మొత్తం ... | 3,12,736 | 38,273 | 49,778 | 1,19,237 | 24,161 | 5,502 |
| స్టేటు మొత్తం ... | 28,56,423 | 3,16,300 | 89,888 | 1,73,966 | 45,827 | 8,469 |

* ప్రతి బేలుకు 392 పౌనులు.

## 1952–'53 సం॥రం తెలంగాణా జిల్లాల ఇతరవ్యాపారపంటల వివరాలు (2)

| జిల్లా పేరు | ఉల్లిపాయ | | మిరప వరుగు (మిర్చి) | | చిన్న ఉల్లిపాయలు | | పసుపు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఎకరాలు | ఉత్పత్తి టన్నులలో | ఎకరాలు | ఉత్పత్తి టన్నులలో | ఎకరాలు | ఉత్పత్తి టన్నులలో | ఎకరాలు | ఉత్పత్తి టన్నులలో |
| హైదరాబాదు ... | 5,392 | 14,041 | 6,313 | 493 | 717 | 933 | 5 | 2 |
| మహబూబ్‌నగరం ... | 1,870 | 4,869 | 25,635 | 2,003 | 1,076 | 1,401 | 336 | 150 |
| ఆదిలాబాదు ... | 147 | 383 | 12,178 | 952 | 171 | 223 | 282 | 126 |
| నిజామాబాదు ... | 502 | 1,307 | 10,884 | 850 | 657 | 855 | 2,331 | 1,041 |
| మెదకు ... | 2,740 | 7,135 | 27,026 | 2,111 | 859 | 1,118 | 531 | 237 |
| కరీంనగరం ... | 589 | 1,534 | 14,820 | 1,158 | 808 | 1,052 | 301 | 134 |
| వరంగల్లు ... | 791 | 2,060 | 13,579 | 1,061 | 432 | 562 | 52 | 23 |
| నల్లగొండ ... | 582 | 1,515 | 21,252 | 1,660 | 135 | 176 | 1 | ... |
| తెలంగాణా మొత్తం ... | 12,613 | 32,844 | 1,31,687 | 10,288 | 4,855 | 6,320 | 3,839 | 1,718 |
| స్టేటు మొత్తం ... | 21,519 | 56,036 | 3,04,031 | 26,318 | 7,144 | 9,300 | 7,171 | 3,201 |

(మూలం : హైద్రాబాద్ స్టేటు స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు 1952-1953.)

# అడవులు

తెలంగాణాలో అడవులు నదీలోయ ప్రాంతాల్లో, కొండ కనుమలున్న ప్రాంతాల్లోనే ప్రధానంగా వున్నాయి. ఆదిలాబాదులో పైన గంగా, గోదావరీ నదులమధ్య సహ్యాద్రీ పర్వత కనుమల కిరు వైపులదట్టమైన అడవులు కలవు. కరీంనగరంలో రాఖీ కొండలకనుమల ప్రాంతంలో, వరంగల్లు, ఖమ్మంలలో కందికల్లు కొండ కనుమల ప్రాంతంలో, గోదావరీతీరాన, మహబూబు నగరం, నల్లగొండల్లో, కృష్ణానదీ తీరాన, హైదరాబాదు జిల్లాలో రాచ కొండ కనుమల ప్రాంతంలోను, మెదకు జిల్లాలో బాలాఘాటు పర్వత కనుమల ప్రాంతంలోను అడవులున్నాయి.

తెలంగాణాలో వున్న ఈ అడవి ప్రాంతాలన్నీ ఒకేరకమైనవికావు. ఆదిలాబాదు, కరీంనగరం, వరంగల్లు, ఖమ్మం, మహబూబునగరం అడవులలో కొంత భాగం దట్టమైన అడవులు. మిగతావి అంతపెద్దవికావు. నల్లగొండ జిల్లాలోని కృష్ణానదివొడ్డుగట్ల ప్రాంతంలో, మెదకు జిల్లా వికారాబాదు ప్రాంతంలో చిట్టడవు లున్నాయి.

ఘనమైన ఈ అడవులలో టేకు, నల్ల మద్ది, వెదురుకర్ర, ఏపెకర్ర, గంధపుచెట్లు, విప్పచెట్లు వున్నాయి. ఇక యితర చెట్లలో తునికిచెట్లు, వంటచెరుకు, రోజువుడ్డు, సంద్రచెట్లు, సాటీనంచెట్లు, చందనం చెట్లు, తుమ్మ వగైరా వున్నాయి.

చిన్న అడవులలో వంటచెరకుకు ఉపయోగపడేకర్ర, వంటబొగ్గుకు ఉపయోగపడే కర్ర, సీతాఫలచెట్లు, పనసచెట్లు, గడ్డి వగైరా దొరుకుతుంది.

ఈకర్రతోపాటు బీడీలకు ఉపయోగపడే తునికిఆకు చెట్లు, లక్క తయారు చేసేందు కుపయోగించు చెట్లు, కాచు తయారుచేసేందు కుపయోగించు చెట్లు, చిరింజిసప్పు, వైద్యానికి ఉపయోగించే ఆకు, మూలికలు విస్తారంగా ఉన్నాయి.

ఈ ఆటవిక సంపదలో కర్రతోపాటు వివిధరకాలజంతువులు కూడా వున్నాయి. దట్టమైన ఆదిలాబాదు, వరంగల్లు అడవులలో, సింహాలు, పెద్దపులులు, ఎలుగొడ్లు, అడవిగుర్రాలు,దుప్పులు,జింకలువున్నాయి. చిట్టడవులలో ఎక్కువగా ఎలుగొడ్లు, అడవిగుర్రాలు, పందులు, నెమళ్లు, జింకలు వగైరా ఉన్నాయి.

1952-53, సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలంగాణాలో 46,38,942 ఎకరాలలో అడవులు వున్నాయి. మొత్తం స్టేటులో అడవుల క్రిందవున్న విస్తీర్ణంలో తెలంగాణాలోని అడవుల విస్తీర్ణం 90.02 శాతం వున్నది.

1952-53 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలంగాణా అడవులపై ప్రభుత్వానికి రు. 1,01,85,898 ల ఆదాయం వస్తున్నది. ఇది మొత్తం స్టేటు అడవులపై వచ్చే ఆదాయంలో 92%.

రిజర్వు అడవిక్రింద 5,378.52 చ॥ మైళ్ళు, రక్షిత అడవుల క్రింద 1,441.80 చ॥ మైళ్ళు, హద్దులు గీసిన Demarcated అడవులక్రింద 1,747.88 చ॥ మైళ్లు. ఇక ముందు రిజర్వు ఫారెస్టుగా చేయబూను కున్న అడవులక్రింద 3,199.53 చ॥ మైళ్ళు సాధారణ అడవుల క్రింద 1,01,8.26 చదరపు మైళ్లు వున్నది.*

1952 - 53 సంవత్సరపు లెక్కల ప్రకారం ప్రభుత్వానికి మొత్తంగా వచ్చిన 90.16 లక్షల ఆదాయంలో ప్రభుత్వ ఏజెన్సీల ద్వారా అమ్మిన కర్ర, బొగ్గు, లక్క, గడ్డి, యితర అడవి సంపదపైన రు. 82.61 లక్షలు. ప్రయివేటు కాంట్రాక్టర్ల ద్వారా అమ్మిన బొగ్గు, వంటచెరకు, బీడీల తునికిఆకు, గడ్డి వగైరాపై వచ్చిన ఆదాయం 3.54 లక్షలు, ఏపెకర్ర అమ్మకం యితర కర్రను పోకుండా స్వాధీనపర్చుకున్న దానిపై 2.26 లక్షలు, జరిమానాలు పన్నుల ద్వారా వచ్చిన ఆదాయం 1.88 లక్షలు, ప్రభుత్వేతర అడవులపై వచ్చిన ఆదాయం 12 వేలు వున్నది.

తెలంగాణాలో ఆటవికఅభివృద్ధిగురించి ప్రభుత్వం నిజాం సాగర్ ప్రాజెక్టు క్రింద, నల్లగొండ జిల్లాలోని డిండి ప్రాజెక్టుక్రింద, మెదకు జిల్లాలో మానేరు ప్రాజెక్టు క్రింద, మహబూబునగరం జిల్లాలో చంద్రసాగరు ప్రాజెక్టుక్రింద అభివృద్ధి ప్లానులు తలపెట్టింది. ఈ ప్రాంతాల్లో మంచిరకం అడవి చెట్ల నర్సరీ క్షేత్రాలు పెంచటం, అడవులు పెంచటం, వగైరా ఈ ప్లాను ఉద్దేశ్యం. అయితే ప్రస్తుతం ఒక్క నిజాం సాగరు ప్రాజెక్టు క్రిందనే ఈ ప్రణాళిక అమలు జరుగుచున్నది.

మెదకు, వరంగల్లు, నిర్మలు, నిజామాబాద్ అడవి డివిజన్లలో లక్కను తయారుచేయుట కుపయోగించు చెట్లు పెంచటానికి, మంచె ర్యాల, పాల్వంచ అడవులలోవున్న సంద్ర చెట్లనుండి కాచును తయారు చేయుట కుపయోగించు చెట్లు పెంచటానికి ప్రణాళికలు తయారు చేయబడినాయి. ఈ ప్రణాళికలు పంచవర్ష ప్రణాళిక క్రింద ప్రభుత్వం ఆటవికశాఖపైఖర్చుచేసే మొత్తం రు.21.43 లక్షలనుండి అమలు జరుపబడుతాయి. సిరిపూరులో తయారు చేయబడే కాగితం, నిర్మలులోని ఆటవస్తువులు ఇతర ఫర్నిచరుకు కావలసిన వెదురు, కొయ్య తెలంగాణా అడవులలోనే లభ్యమవుతున్నది. బీడీలకు కావలసిన తునికాకు, సారికికాసేందుకు ఉపయోగించే విప్పపువ్వు, బొగ్గు, వంటచెరకు వగైరా ఈ అడవులవల్ల లభిస్తాయి. ప్రక్కనవున్న ఆంధ్రదేశానికి వెదురుకర్ర, వంటచెరుకు, యితర ముఖ్య కర్రసామాను ప్రధానంగా ఎగుమతి చేయబడు చున్నవి.

1951-52 సం॥రం ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రధాన అడవి ఉత్పత్తి 15,49,787 ఘన అడుగుల కర్ర, 25,08,165 ఘన అడుగుల వంటచెరుకు అని అంచనా వేయబడింది.

దీనిపై రు. 49,52,760 ఆదాయము వచ్చింది.

---

* ఆయాతరగతుల క్రిందవున్న అడవుల లెక్క తెలంగాణాకు ప్రత్యేకంగా లభించకున్నా, ఇవి స్టేటులో ప్రధానంగా తెలంగాణాలోనే వున్నందున మొత్తం స్టేటు లెక్కలు అంచనాకొరకు యిస్తున్నాం.

★

# పశుసంపద

హైదరాబాదు మొత్తం పశుసంపద 1951 లెక్కల ప్రకారం 4,18,20,158 వుంది. ఇందులో తెలంగాణా పశుసంపద దాదాపు సగం వుంటుందని పై లెక్కలే తెల్పుచున్నాయి. అయితే ఈ పశుసంపదలో 3 సంవత్సరాలకు మించిన ఎద్దులు, ఆవులు, దున్నలు, గేదెలసంఖ్య 46,69,332. తెలంగాణా పశుసంపద జాగానే వున్నా ఆదిలాబాదు, కరీంనగరు తూర్పు ప్రాంతాలలోని మాన్వీజాతి తప్ప, మిగతాదంతా నాణ్యంలో హీనరకమేనని చెప్పవచ్చు.

మొత్తం స్టేటులో 3 సంవత్సరాలకు పైబడిన ఎద్దులు, ఆవులు, దున్నలు, గేదెలలో తెలంగాణాలో సగానికి సగం వున్నవి. తెలంగాణాలో సాగుఅయ్యే ప్రతి ఎకరానికి ఈ పశువులను పంచితే రెండు ఎకరాలకు ఒకటి చొప్పున వస్తాయి.

తెలంగాణాలోని ఎద్దులు ఆంధ్ర ఎద్దులతో తూగవు. చాలా కురచగానూ, బలహీనంగానూ వుంటాయి. మంచి విత్తనం కోడెలు లేనికారణంగా రోజురోజు ఎద్దుల జాతి హీనస్థితికి దిగజారిపోతున్నది. హిమాయతుసాగరం వ్యవసాయక్షేత్రం, నిజాం సాగర్ కమ్యూనిటీ ప్రాజెక్టువద్ద, కరీంనగరం, వరంగల్లులలో వ్యవసాయశాఖవారు పశువుల ప్రత్యేక ఆస్పత్రులు స్థాపించటమేగాక, మంచిరకం కోడెలనుకూడా పెంచుచున్నారు. కరీంనగరం, నల్లగొండ జిల్లాలలో ఎద్దుల సంఖ్య హెచ్చుగా వుంది. ఎద్దుల సంఖ్య 18,68,868.

ఆవులసంపద తెలంగాణాలో 14,97,694 కాని ఈ ఆవులనుండి పాలు, వెన్న తీయటం చాలా తక్కువ. పెద్దపెద్ద జమీందారులు తమకున్న పెద్దపెద్ద భూఖండాలలో వందల ఎకరాలు బీళ్ళు అట్టి పెట్టి పశువుల ఎరువుకొరకు ప్రధానంగా ఆవులమందలను పెంచేవారు. అయితే యిప్పుడు ఆ పరిస్థితిలేదు. కాని తెలంగాణాలో నిరుపేదరికంవల్ల పేదరైతులలో ఎక్కువగా, ముఖ్యంగా లంబాడీలు ఆవులను వ్యవసాయ పనులకు, నాగటికి, మోటలకు ఉపయోగించుతారు. ఈరకంగా తెలంగాణాలో నాగటికి ఉపయోగించే ఆవులసంఖ్య 1,05,702 వుంది. 1085-1086 పేజీలలోని పట్టికలు జిల్లాలవారీ వివరాలు తెలుపుతాయి :

పశుసంపదలో దున్నపోతులు 3,88,978 వున్నాయి. ఇందులో 3 వ వంతు ఒక్క నల్లగొండజిల్లాలోనే వున్నాయి. ఈ దున్నపోతులను భూస్వాములు మాగాణీసేద్యానికి, మోటలకు ఉపయోగిస్తారు. పేదరైతాంగం ఎద్దులను కొనజాలక తక్కువ ధరకల దున్నపోతులతో వ్యవసాయం సాగిస్తారు. మొత్తం స్టేటులోని 4,58

# తెలంగాణాలో ఉన్న ఆవులు, ఎద్దుల వివరాలు

| జిల్లా పేరు | 3 సంవత్సరాలకు పైబడ్డ ఎద్దులు | | | 3 సంవత్సరాలకు పైబడ్డ ఆవులు | | |
|---|---|---|---|---|---|---|
| | ఆబోతులు | ఇతర ఎద్దులు | మొత్తం | నాగటికి ఉపయోగించే ఆవులు | ఇతర ఆవులు | మొత్తం |
| హైదరాబాదు ... | 1,208 | 90,208 | 91,416 | 939 | 51,142 | 52,081 |
| మహబూబునగరం ... | 3,822 | 2,64,152 | 2,67,974 | 9,192 | 2,25,191 | 2,34,383 |
| ఆదిలాబాదు ... | 1,461 | 2,24,914 | 2,26,375 | 1,810 | 2,04,422 | 2,06,232 |
| నిజామాబాదు ... | 1,363 | 1,45,899 | 1,47,262 | 865 | 98,474 | 99,339 |
| మెదకు ... | 3,028 | 2,14,355 | 2,17,383 | 2,377 | 1,45,939 | 1,48,316 |
| కరీంనగరం ... | 1,160 | 3,23,500 | 3,24,660 | 3,783 | 2,00,126 | 2,03,909 |
| వరంగల్లు+ఖమ్మం ... | 1,600 | 2,70,058 | 2,71,658 | 30,830 | 2,40,705 | 2,71,535 |
| నల్లగొండ ... | 1,572 | 3,20,578 | 3,22,150 | 47,906 | 2,25,993 | 2,73,899 |
| తెలంగాణా మొత్తం ... | 15,204 | 18,53,664 | 18,68,868 | 1,05,702 | 13,91,992 | 14,97,694 |
| స్టేటు మొత్తం ... | 40,430 | 36,77,324 | 37,17,754 | 1,11,259 | 27,01,387 | 28,12,646 |

మూలం : హైదరాబాద్ స్టేట్ స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్ 1952-'53.

తెలంగాణాలో 1951 లో సేద్యం అయిన భూమి ప్రతి 1000 ఎకరాలకు వున్న నాగలి పశువులు, నాగళ్ళు, బండ్లు.

| జిల్లా పేరు | | మొత్తం నాగటి పశువుల సంఖ్య | సేద్యంఅయిన ప్రతి 1000 ఎకరాలకు పశుసంఖ్య | మొత్తం నాగళ్ళసంఖ్య | సేద్యం అయిన ప్రతి 1000 ఎకరాలకు నాగళ్లసంఖ్య | మొత్తం బండ్లసంఖ్య | సేద్యంఅయిన ప్రతి 1000 ఎకరాలకు బండ్లసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | ... | 1,07,583 | 321 | 41,567 | 124 | 11,562 | 35 |
| మహబూబ్‌నగరం | ... | 3,12,911 | 180 | 1,41,307 | 82 | 36,698 | 21 |
| ఆదిలాబాదు | ... | 2,29,986 | 163 | 93,112 | 66 | 66,882 | 47 |
| నిజామాబాదు | ... | 1,63,384 | 240 | 82,859 | 122 | 56,518 | 83 |
| మెదకు | ... | 2,53,590 | 263 | 1,12,400 | 117 | 30,823 | 32 |
| కరీంనగరం | ... | 3,69,585 | 291 | 1,50,844 | 119 | 69,252 | 54 |
| వరంగల్లు+ఖమ్మం | ... | 3,30,193 | 255 | 1,62,005 | 125 | 51,103 | 40 |
| నల్లగొండ | ... | 4,18,000 | 228 | 2,03,121 | 111 | 36,981 | 20 |
| తెలంగాణా మొత్తం | ... | 21,85,282 | 1,941 | 9,87,215 | 866 | 3,59,819 | ... |
| స్టేటు మొత్తం | ... | 40,24,945 | 145 | 14,03,790 | 51 | 6,25,194 | 28 |

మూలం : హైద్రాబాద్ స్టేటు స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు 1952-53.

లక్షల దున్నపోతులలో 8.83 లక్షలు తెలంగాణాలోనే వున్నాయి.

3 సంవత్సరాలకు పైబడిన గేదెలు 6,18,797 వున్నాయి. ఇందులో 7,513 గేదెలను నాగటికి ఉపయోగించుతారు. తెలంగాణాలో పాలు, నెయ్యి ఆంధ్రతో పోల్చిచూస్తే చాలాతక్కువే. ఆంధ్రనుండి నెయ్యి యిక్కడకు దిగుమతి అవుతుంది. వీటి వివరాలు 1088 వ పేజీలోని పట్టికలో పొందుపరచబడ్డాయి :

తెలంగాణాలోని 31,01,768 గొర్రెలు, 13,81,029 మేకలు వున్నట్లు 1951 పశు సంపద లెక్కలవల్ల తెలియుచున్నది.

గొర్రెలసంఖ్య మహబూబునగరం, కరీంనగరం, నల్లగొండలలో హెచ్చు. మహబూబునగరంలో గొర్రెలకున్నితో కంబళ్లు విస్తారంగా తయారవుతాయి. నల్లగొండ జిల్లాలో మేకలసంఖ్య అధికంగావుంది. తెలంగాణా కుటీరపరిశ్రమల్లో కంబళ్ళపరిశ్రమ, తోళ్ళుఊనే పరిశ్రమలుకూడా మహబూబునగరం, మెదకులలో వున్నాయి.

పైన పేర్కొన్న పశుసంపదే కాక 3 సంవత్సరాలకు లోబడిన ఆవులు, ఎద్దులు స్టేటు మొత్తంలో 26,89,580 వున్నాయి. అదేమాదిరిగా 3 సంవత్సరాలకు లోబడిన దున్నకుర్రలు, గేదెలు 9,16,014 వున్నాయి. ఇవిగాక, గుర్రాలు, పందులు, 89,951 కోళ్ళు, బాతులు 32,01,832 వున్నట్లు 1951 లెక్కలనుబట్టి తెలియవచ్చింది. ఈ కోళ్ళ లెక్క సరైనది కాజాలదు. కారణం, వీటి లెక్కలు సేకరించడానికి వెళ్లిన ఉద్యోగులు కోళ్ళను తినేసే అలవాటు పడ్డారు. ఫలితంగా గ్రామస్తులు తమవద్ద కోస్ళు లేవనో, లేక ఒకటి రెండు వున్నాయనో చెప్పేవారు.

## తెలంగాణాలోని దున్నలు, గేదెలు, గొఱ్ఱెలు, మేకల వివరాలు (1961)

| జిల్లా పేరు | దున్నపుర్రెలు 3 సంవత్సరాలకు పైబడి | | | 3 సంవత్సరాలకు పైబడిన గేదెలు | | | గొఱ్ఱెలు | మేకలు |
|---|---|---|---|---|---|---|---|---|
| | పోతులు | ఇతర పుర్రెలు | మొత్తం | నాగలికి ఉపయోగించేవి | ఇతర గేదెలు | మొత్తం | | |
| హైదరాబాదు ... | 711 | 19,223 | 19,934 | 392 | 38,589 | 38,981 | 1,61,805 | 88,8[illegible] |
| మహబూబు నగరం ... | 914 | 52,789 | 53,703 | 925 | 68,303 | 69,228 | 5,28,224 | 2,14,7[illegible] |
| ఆదిలాబాదు ... | 1,550 | 10,741 | 12,291 | 449 | 56,783 | 57,232 | 1,00,806 | 1,29,2[illegible] |
| నిజామాబాదు ... | 330 | 22,937 | 23,267 | 407 | 47,213 | 47,620 | 2,83,980 | 86,0[illegible] |
| మెదకు ... | 480 | 43,113 | 43,593 | 661 | 54,758 | 55,419 | 4,01,447 | 1,59,6[illegible] |
| కరీంనగరం ... | 636 | 54,917 | 55,553 | 585 | 88,947 | 89,532 | 6,33,834 | 1,78,5[illegible] |
| వరంగల్లు+ఖమ్మం ... | 1,344 | 68,457 | 69,801 | 1,349 | 1,35,631 | 1,36,980 | 3,88,442 | 2,02,7[illegible] |
| నల్లగొండ ... | 556 | 1,05,275 | 1,05,831 | 2,745 | 1,21,060 | 1,23,805 | 6,54,230 | 3,21,2[illegible] |
| తెలంగాణా మొత్తం | 6,521 | 3,77,452 | 3,83,973 | 7,513 | 6,11,284 | 6,18,797 | 31,01,768 | 13,81,0[illegible] |
| స్టేటు మొత్తం ... | 12,199 | 4,41,180 | 4,53,379 | 11,563 | 11,38,380 | 11,52,943 | 43,00,410 | 26,06,6[illegible] |

మూలం : హైదరాబాద్ స్టేటు స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్టు 1952-'53.

# మత్స్య పరిశ్రమ

తెలంగాణాలో చేపల సంపద స్టేటు లోని మిగతా ప్రాంతాలకన్నా అధికం గానే వున్నది. తెలంగాణా ఉత్తర దక్షిణ ప్రాంతాలనుండి ప్రవహించే గోదావరి కృష్ణా నదులే కాక, తెలంగాణాలో విస్తారంగా వున్న పెద్ద, చిన్న చెరువులు నిజాంసాగర్, ఉస్మాన్ సాగర్, హుస్సేన్ సాగర్, హిమాయతుసాగర్, లఖ్నవరం, రామప్పచెరువులు; మహబూబునగరంలోని చెరువులలో చేపలసంపద వున్నది. అయితే నీటిల్లో నదుల జలాధారం కల చెరువులు, రిజర్వాయర్లు తప్ప మిగతా చెరువులు సామాన్యంగా ప్రతి సంవత్సరం, లేక వర్షాభావం వున్న సంవత్సరాలలో ఎండిపోతాయి. అందుకని ఈలాంటి చిన్న చెరువులలో చేపల సంపదను ప్రత్యేకంగా పెంచటమనేది జరగదు. ఎల్లప్పుడూ నీరువుండే పెద్ద చెరువులలో, రిజర్వాయర్లలో మంచి రకం చేపలను పెంచటానికి, ప్రస్తుతం చాలా లోటుగావున్న చేపల సంపదను పెంచి, దీనిని కూడా ఆహారంలో ఒక భాగంగా చేయటానికి ప్రభుత్వ మత్స్య శాఖవారు ప్రయత్నించుచున్నట్లు తెలియు చున్నది. పంచవర్ష ప్రణాళిక క్రింద తెలంగాణాలో చేపల సంపదను పెంచటానికి 11 లక్షల రూపాయలు ఖర్చుచేయనున్నారు.

ఇంతవరకు కరీంనగరం, మహబూబునగరం, మెదకు, నిజామాబాదు, హైదరాబాదు జిల్లాలలో చేపల పరిశ్రమ అభివృద్ధి క్రింద దాదాపు ఒక లక్ష ఖర్చుచేయబడింది. నల్లగొండ, వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలలో కూడా ఈ సంపద అభివృద్ధి కొరకు చర్యలు తీసుకుంటారని తెలుస్తున్నది.

1951-'52 సం. ప్రభుత్వ లెక్కల ప్రకారం ప్రభుత్వానికి మత్స్యశాఖనుండి మొత్తం స్టేటులో రు. 1,53,000 ఆదాయం వచ్చింది. స్టేటు మిగతా భాగాలలో ఒక్క నాందేడు జిల్లాలోతప్ప మరెక్కడా ఈ సంపద చెప్పుకోదగినంతగా లేదని చెప్పవచ్చు.

ప్రభుత్వ మత్స్యశాఖవారు నీటి వనరులలో చేపలను వేటాడే అధికారాలను అన్నిటిని, మిగతా శాఖలనుండి తమ క్రిందికి తీసుకుంటున్నారు. ఇంతవరకు నదులలో, చెరువులలో చేపలను పట్టేందుకు బెస్తవారికి కౌలుపద్ధతిపై యిచ్చేవారు. పెద్ద పెద్ద సాగరాలను బెస్తకులంవారికి వేలం వేసేవారు. కాని మత్స్యశాఖవారు ఈ పద్ధతిలో మార్పులు తీసుకురావటానికి ఆలోచిస్తున్నారు. బెస్తవారి సహకార సంస్థలను ఏర్పాటుచేసి ఆ సంస్థలకు మాత్రమే చెరువులు, నదులు చేపలు పట్టటానికి కౌళ్ళకు యిస్తారట.

ప్రభుత్వ మత్స్యశాఖవారు ఈ సంపదకు సంబంధించిన కొన్ని పరిశోధనలు కూడా చేస్తున్నారు. ఏనీటిలో ఎలాంటి చేపలు బాగా అభివృద్ధి అవుతే అలాంటి వాటిని పెంచటం, మంచిరకం విత్తనపు చేపలను (Seedlings) పెంచటం, మంచి ఆహార పదార్థాలను యిచ్చే చేపలను పెంచటం ఈ పరిశోధనల్లో ఒక భాగం.

హైదరాబాదు నగరంలో హుస్సేను సాగర్ చెర్వుక్రింద ఒక చేపల క్షేత్రాన్ని [FISH FARM] ఏర్పాటు చేశారు.



# ఖనిజసంపద

తెలంగాణాకూడ, ఆంధ్ర కోస్తా జిల్లాలు, రాయలసీమతోపాటు దక్కనుపీఠ భూమిలో భాగం. దక్కను పీఠభూమి, భూమియొక్క చాలపురాతన భాగాల్లో ఒకటి. అందుచేత పైకి అందుబాటులో వున్న ఖనిజాలెన్నో కొట్టుకుపోయినవి. అయినా మంచి ఖనిజసంపద విస్తారంగా గల ప్రాంతాలుకూడా వున్నవి. దక్కను పీఠభూమిలోకూడ తెలంగాణాలోని భూభాగం ప్రత్యేకతరగతికి చెందినది. భూమియొక్క అన్నిటికంటె పురాతన కాలానికి సంబంధించిన భాగం ఇది. దీన్నే ఆర్చెయిన్ గ్నీసిక్ కాంప్లెక్సు (Archain Gneissio Complex) అంటారు. ఆంధ్ర రాష్ట్రంలోని భూభాగం (డెల్టాప్రాంతం తప్ప) కూడ ఇదే తరగతికి చెందినదే. కాని ఆంధ్రరాష్ట్రప్రాంతం మరీ సముద్రమునకు దగ్గరగా వుండుటచే నదులపారుడు మొదలగువాటివల్ల పైభాగంఎక్కువగాకొట్టుకుపోయింది. అందుచే ఆంధ్రరాష్ట్రంలోకంటె తెలంగాణాలో ఎక్కువ ఖనిజ సంపద ఉన్నది.

పైహద్దుల్లోకూడ తెలంగాణాలో ఖనిజ సంపద అపారంగా వుంది. హైద్రాబాదు స్టేటులోకూడ తెలంగాణాలోనే ఖనిజ సంపద చాల ఎక్కువగా ఉంది.

**ఇనుము :**— తెలంగాణాలో అనేక ప్రాంతాలలో శుద్ధి చేయని ఇనుము విస్తారంగా లభిస్తున్నది. అభివృద్ధిచెందిన రాతి కాలపు పరికరములకు ఇనుప చిట్టెము ఉండడమును బట్టి యీ రాష్ట్రములో ఆ యుగమునుంచే ముతక లోహము వాడుకలో నున్నట్లుగా తెలుస్తున్నది.

ప్రపంచ ప్రసిద్ధమైన డెమాస్కస్ కత్తులు తయారు చేయబడునట్టి ఉక్కుకొరకై పారశీక వర్తకులు కోన సముద్రమునకు వచ్చెడివారని 1933 లో వాయనీ అను నతను వ్రాసినాడు. ఈ ఉక్కును "ఇండియాఉక్కు" అనేవారు. ఇది మధ్య యుగపు ప్రపంచానికంతటికీ బాగా పరిచయమైనది. కోన సముద్రం ఉక్కును తయారుచేయడానికి నిజామాబాదు జిల్లాలోని తాడపాల్లి గ్రామపు తురక రాళ్ళను విస్తారంగా ఉపయోగించే వారు. భారతదేశంలో రాతియుగపు నాగరికత యూరపు ఖండమువలె కంచు, రాగి యుగములతో నిమిత్తం లేకుండా నేరుగా ఇనుపయుగమునకు పరివర్తన చెందింది. ఇందుకు ముఖ్య కారణం భారత దేశంలో రాగి, తగరము అరుదుగా లభించడమే.

ధార్వార్ సమశిఖమను ముడిలోహము హెమెటైట్ లేక మెగ్నెటైట్ క్వార్ట్జ మొదలైన రాళ్ళతో కూడివుంటుంది. ఇటువంటి ముడి ఇనుము గనులు ఆదిలాబాదు జిల్లాలోను, యెలగడప, లక్నెట్టి

పేట తాలూకాలలోను, కరీం నగర్ జిల్లాలోని జగిత్యాల తాలూకాలోను, ఇల్లెందులో సింగరేణికాలరీలవద్దను వున్నవి. సింగరేణి కాలరీస్ ప్రాంతములో 150 నుంచి 850 అడుగులఎత్తున 8 మైళ్ళదాకా వ్యాపించి ఉన్న గుట్టల్లో మంచి ఇనుము రాగల ముడి యినుము వున్నదని 'బ్రూస్ ఫుటా' అనే అతడు పరిశోధించి నిర్ణయించాడు.

ఈ ప్రాంతములో దాదాపు 4 కోట్ల టన్నుల ముడి ఇనుము దొరుకుతుందని అంచనా వేయబడింది. ద్వీప కల్పపు మిశ్రమశైలి రాళ్ళలో డిముయినుము కలిసి వుంటుంది. కాని ఆ రాళ్ళకు ఆర్థికంగా విలువలేదు. షోలాపూర్ తాలూకాలోని భీమా సరణి సున్నపురాళ్ళలో అయిరన్ పైరైట్ రూపంలో ముడి ఇనుము ఉంటుంది. ఆదిలాబాదు జిల్లా సిర్పూరు తాలూకాలోని చిక్యాల భూగర్భంలో హెమెటైట్ రాళ్ళు ఉన్నవి. పూర్వం ఇనుము పోతపనివారలు దీనిని ఉపయోగించేవారు. దక్కన్ ట్రాప్‌లాటరైట్సు రాళ్ళలోకూడా ఇనుము ఉంటుంది. బీదరు, వికారాబాదు ప్రాంతాలలోను, ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలలో మరికొన్ని ప్రాంతాలలోను లాటరైటు పొరలున్నవి. బీదరు లాటరైటు పొర దాదాపు 28 మైళ్ళ పొడవు, 22 మైళ్ళ వెడల్పు ఉంటుంది.

తెలంగాణాలో బొగ్గు, జలవిద్యుచ్ఛక్తి విస్తారంగా వున్న గోదావరి లోయకు తూర్పున దగ్గరలోనే దక్షిణ బస్తరులో అతివిలువగల ఇనుమును ఉత్పత్తి చేయగల ప్రదేశాలున్నవి.

తెలంగాణాలో హైగ్రేడు బొగ్గు లేకపోయినా దీనిని కార్బనైజేషన్ పద్ధతి ద్వారా కోకింగుబొగ్గు తయారు చేయవచ్చు. అంతకంటె ముఖ్యం తెలంగాణా నుండి ప్రవహిస్తున్న మహానదుల ఆధారంగా జల విద్యుచ్ఛక్తిని తీసి, దీనితో ఈ ముడి ఇనుమును ఉపయోగించవచ్చు. సంవత్సరానికి ఒక లక్ష టన్నుల ఉక్కు ఉత్పత్తి చేయగల ఫ్యాక్టరీని వెంటనే ప్రారంభించవచ్చునని డాక్టరు - హొరేనా అను నిపుణుడు సూచించారు.

## వజ్రములు

ఫ్రాన్సు దేశపు నగలవర్తకుడు ట్రావెర్నియర్ ఈ రాష్ట్రంలోని వజ్రముల గనులను గూర్చి "ప్రయాణ విశేషములు" అను తన పుస్తకములో వ్రాసియున్నాడు. ఇతడు దౌలతాబాదునుంచి గోలకొండ, హైదరాబాదులమీదుగా మచిలీపట్నం ప్రయాణము చేసినాడు. ప్రాచీన హిందూరాజుల కాలంలోను, కుతుబ్‌షాహీ వంశపురాజుల కాలంలోను గోలకొండ వజ్రముల వ్యాపారమునకు ప్రపంచ ప్రసిద్ధమైనది. అయితే చాలమంది అనుకుంటున్నట్లుగా ఇక్కడ ఎప్పుడూ వజ్రములు దొరకలేదు. నిజంగా వజ్రములు దొరికింది రాష్ట్రానికి దక్షిణదిశలో కృష్ణానదీ తీరాన మాత్రమే. అయితే గోలకొండ రాజధాని నగరం కాబట్టీ, ఖజానా కేంద్రము కాబట్టీ, వజ్రములను ముక్కలుగా కోసి అమ్మునట్టి కేంద్రము కాబట్టి వజ్రముల పరిశ్రమకు గోలకొండకే పేరు వచ్చి ఉండవచ్చును. వజ్రముల వ్యాపారస్తులు, కోతపనివారు, మెరుగు పనివారు నివసించిన ప్రదేశము ఇప్పటికిని కార్వాన్ అను పేరుతో వ్యవహరింపబడు

చున్నది. గోలకొండ కోటఉన్న ప్రదేశ మంతా పూర్తిగా నల్లరాతిభూమి.

పూర్ణాసరణికి చెందిన బంగనపల్లి రాతి సమూహంలో వజ్రములు దొరుకుతాయి. కృష్ణానదీ తీరానవుండు గులకరాళ్ళలో కూడా వజ్రపురాళ్ళు ఉంటాయి. మన రాష్ట్రంలో కృష్ణానదికి, బెజవాడకు సమీపమునవున్నట్టి పరిటాల గ్రామప్రాంతంలో దొరికిన వజ్రములు శ్రేష్ఠతరమైనవి. వీటికి మంచి పేరుకూడా వచ్చినది. భారత దేశంలో లభించిన ఉత్తమమైన వజ్రములలో కొన్ని కృష్ణానది లోయలోనే దొరికినవి.

చరిత్ర ప్రసిద్ధమైన హోప్, కోహినూరు, పిట్, రీజెంటు, నిజాం మున్నగు పేర్లుగల వజ్రములు ఈ రాష్ట్రంలోని గనులలోనే దొరికినవని చెప్తారు.

ఇటీవలి కాలంలో వజ్రముల గనులు త్రవ్వుటకు లైసెన్సులు పొందిన కంపెనీలలో ఒక్క హైద్రాబాద్ దక్కన్ కంపెనీమాత్రమే క్రమబద్ధంగా పరిటాల గనులు త్రవ్వి 2085 కేరట్ల తూకంగల 3444 రాళ్ళను తీయగలిగింది. ఇప్పటికీ రాయచూరు, మహబూబునగరు జిల్లాలలో అప్పుడప్పుడూ వజ్రములు దొరుకుతుంటాయి. రాయచూరువద్ద దొరికిన ఆరు వజ్రములను 1940 లో వేలంవేయగా రూ. 22,792 లకు అమ్ముడు పోయినవి. 39.40 కేరట్ల తూకంగల ఒక్క వజ్రమునకే రూ. 21,000 లు వచ్చినవి. భారతదేశపు వజ్రముల అసలు స్థావరము ఇంతవరకు కనుగొనబడలేదు.

బొగ్గు

తెలంగాణాయొక్క తూర్పు, ఈశాన్య భాగములలో గోండ్వానాసరణి చట్టు రాళ్ళున్నవి. ఈ రాళ్ళు వార్ధా లోయ మొదలుకొని గోదావరి లోయమీదుగా ఆంధ్రరాష్ట్ర సరిహద్దులవరకు మొత్తం దాదాపు 3800 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో ఉన్నవి. అయితే అసలు బొగ్గు లభించే స్థావరములు అప్పుడప్పుడు మాత్రమే ఉన్నవి. ఆదిలాబాదు, కరీంనగరు, వరంగల్లు జిల్లాలలో అక్కడక్కడ బొగ్గుప్రాంతాలున్నట్లు రుజువైనది. సర్ సి. యస్. ఫాక్సు అను పాశ్చాత్య శాస్త్రజ్ఞుడు చెప్పినట్లుగా భారతదేశంలోకల్లా పెద్ద బొగ్గుగని రాష్ట్రంలోనే ఉన్నదంటే సందేహమేమాత్రంలేదు.

మొట్టమొదట ఈరాష్ట్రంలో 1887లో ఇండియా జియాలజికల్ సర్వేశాఖకు చెందిన డబ్ల్యు. కింగ్ అనునాతడు ఇల్లెందు ప్రాంతంలో బొగ్గు ఉన్నట్లుగా కనుక్కున్నాడు. ప్రధానమైన బొగ్గుపొరకు అతని పేరే పెట్టబడింది. ఆ పొరను "కింగ్ సీమ్" అంటారు. ఇల్లెందు ప్రాంతంలో 1889 నుంచి బొగ్గుతీయబడుచున్నది. 1941 లో ఈ గని మూసివేయబడింది. దాదాపు 10 మైళ్ళ పొడవు 2 లేక 3 మైళ్ళ వెడల్పుగల ఈ ప్రాంతంలో మొత్తం 3 కోట్ల టన్నుల బొగ్గు తీయబడింది. ఈ బొగ్గు కడు శ్రేష్ఠమైనది. దీనిని రైలు ఇంజనులకు, మిల్లులకు ఉపయోగించుతారు. కింగ్ సీమ్ పొర సగటున 7 అడుగుల మందముగా ఉన్నది. దీనిపై మరొక పొర ఉన్నది. దానిని దరోసరి పొర అంటారు. అది కింగ్ సీమ్ కంటె ఎక్కువ

మందమైనది. కాని దాని బొగ్గుమాత్రం అంత శ్రేష్ఠమైనది కాదు. అందులో కొంతమాత్రమే మంచి బొగ్గు ఉన్నది. అది ఇప్పుడు సింగరేణివద్ద తీయబడుచున్నది.

అనేక ప్రాంతాలలో బొగ్గు ఉన్నట్లు తెలిసినప్పటికీ, నాలుగుచోట్ల మాత్రమే బొగ్గు త్రవ్వి తీయబడుచున్నది. వానిలో అన్నిటికంటె పెద్దది కొత్తగూడెం బొగ్గు గని. దీనిలో 1938 లో త్రవ్వకము ప్రారంభించబడింది. 1952 వరకల్లా ఈ గని నుంచి 876,500 టన్నుల బొగ్గు తీయబడింది. ఈ ప్రాంతంలో దాదాపు 8 కోట్ల టన్నుల బొగ్గు ఉన్నట్లు అంచనా వేయబడింది. కొత్తగూడెం తరువాత ముఖ్యంగా చెప్పుకోదగినది తాండూరు బొగ్గుగని. ఇది ఆదిలాబాదు జిల్లాలో బెల్లంపల్లి రైలు స్టేషను సమీపంలో ఉన్నది. ఈ గని 1927 లో ప్రారంభించబడింది. దీనినుంచి సాలీనా 800,000 టన్నుల బొగ్గు తీయబడుతున్నది. సాస్టి కాలరీలలో 1916 నుంచి బొగ్గు తీయబడుతున్నది. అయినప్పటికిని గనులవరకు రైలుమార్గం లేకపోవుట చేత ఇది పెద్ద గనిగా రూపొందలేకపోయింది. సాస్టినుంచి బల్లార్షాకు బొగ్గు చేరవేత వార్ధానదికి అడ్డముగా త్రాటిమార్గం గుండా జరుగుతుంది. ఈ గనినుంచి నెలకు దాదాపు 5000 టన్నుల బొగ్గు తీయబడుతుంది.

కింగ్ సీమ్ పొరను త్రవ్వన తరువాత 1941 లో సింగరేణి లేక ఇల్లందు బొగ్గు గని మూసివేయబడింది. కింగ్ సీమ్ పొరపై ఉన్నట్టి దళసరి పొరను తీయడానికి పెద్ద ప్రయత్నాలు జరుగలేదు. ఐతే ఆపొరలో చాలా బొగ్గు వున్నది. ఇప్పుడీ గని త్రవ్వకము తిరిగి ప్రారంభించ బడుతున్నది. దళసరి పొర పేరు "క్వీన్ సీమ్" అని పెట్టబడింది.

గోదావరికి దక్షిణమున వున్న రామగుండం స్టేషను ప్రాంతములో దాదాపు 8 కోట్ల 50 లక్షల టన్నులబొగ్గు వుంటుందని అంచనా వేయబడింది.ఐతే రాష్ట్రంలో బొగ్గు వుంటుందని చెప్పబడుతున్న ప్రాంతాలన్నీ క్షుణ్ణంగా పరీక్షింప బడలేదు. మొత్తంమీద ఈ రాష్ట్రంలో 100 కోట్ల టన్నులబొగ్గు దొరకగలదని అంచనా వేయబడింది. ప్రస్తుతం యీరాష్ట్రపు బొగ్గు గనులలో ప్రతిదినము సగటున 16,000 మంది వ్యక్తులు పనిచేస్తున్నారు.

రాష్ట్ర ఖనిజ పరిశ్రమలలోకెల్ల బొగ్గు గనులు ప్రధానమైనవి. తెలంగాణాలో ప్రతియేటా 12½ లక్షలటన్నుల బొగ్గు తీయబడుతుంది. ఇందులోనుంచి సగానికి పైగా దక్షిణభారతంలోని రైళ్ళకు, విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రాలకు, ఇతర పరిశ్రమలకు, సరఫరా చేయబడుతుంది. హైదరాబాదు దక్షిణాన బొగ్గు గనులు లేవు: కాబట్టి ఇచ్చటి బొగ్గుకు సైసర్గికంగా మంచి ప్రాధాన్యత వున్నది. ఈ బొగ్గు స్థానిక అవసరములను తీర్చడమే గాక దక్షిణభారతంలో విరివిగా అమ్ముడు పోతున్నది. అయితే ఇది కోకింగ్ బొగ్గు గాదు. కనుక ఖనిజ పరిశ్రమలకు వుపయోగపడదు. ఐతే కార్బనైజేషన్ యొక్క ఆధునిక పద్ధతులద్వారా తైలము, ఇతర పదార్థములు యీ బొగ్గునుంచి ఉత్పత్తి చేయుటకు అవకాశములు గలవు,

## 1948 నుంచి 1952 వరకు ఉత్పత్తిచేయబడిన బొగ్గు, దానివిలువను తెలుపు పట్టిక

| సంవత్సరం | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ॥లలో | పనిచేసిన వ్యక్తుల సంఖ్య |
|---|---|---|---|
| 1948 | 10,69,537 | 2,17,57,945 | 16,303 |
| 1949 | 10,92,486 | 2,51,85,811 | 16,693 |
| 1950 | 12,13,803 | 2,63,88,247 | 16,825 |
| 1951 | 12,69,240 | 2,70,00,382 | 16,606 |
| 1952 | 14,34,194 | 3,05,86,549 | 16,132 |
| ఐదేండ్ల మొత్తం | 60,79,210 | 13,09,18,934 | |

### రాగి.

గద్వాల సంస్థానములోను, మహబూబ్‌నగర్ జిల్లా మక్తల్ తాలూకాలోను పాతరాగి గనులున్నవి. నల్లగొండ జిల్లాలోని చింత్రియాలలోను, కొత్తగూడెం బొగ్గుగనులకు సమీపాన వున్న పాల్వంచ సంస్థానములోని యెల్లచేలువద్దను పాతరాగి గనులు విస్తారంగా కన్పించినవి. రాష్ట్రములో కనుగొనబడిన లోహ ఖనిజములలో రాగి, సీసము కూడా వున్నవి. నల్లగొండ జిల్లాలో రాగి గనులను త్రవ్వడానికి చాలా కంపెనీలు ప్రయత్నించినవి. అయితే వాటి ప్రయత్నాలు ఫలప్రదం కాలేదు. భూగర్భములో చాలా లోతు త్రవ్వితేనేగాని రాగి దొరకదు. కనుక పెద్ద ప్రయత్నం చేసి లోతుగా త్రవ్వకములు జరిగితేనేగాని రాగి గనులు పడవు. ముఖ్యంగా పాల్వంచ తాలూకాలోని ఎల్లచేలు వద్ద లాభకరమైన గనులు పడవచ్చు, పూర్వకాలపు పాత గనుల వద్ద నేటికిని కనిపించు చిట్టెములనుబట్టి ఆ ప్రదేశములలో పూర్వం రాగి త్రవ్వి తీయబడినట్లు విదితమవుచున్నది.

### సీసం

ఈ రాష్ట్రంలో నల్లరాళ్ళ చారలలో సీసము వుంటుంది. ఖనిజ ప్రాశస్త్యరీత్యా యీ చారలంత వుత్తమమైనవి కావు. నల్లగొండ జిల్లాలోని చింతకుంట, పెద్దఅడిశెలపల్లి, మల్లాపల్లి ప్రాంతాలలో సీసపు రాళ్ళు కన్పిస్తాయి. మిర్యాలగూడెం తాలూకాలోని నడికొండ గుట్టలో సీసపు రాయి పొరలున్నవి. దేవరకొండవద్ద 35 అడుగుల లోతున సీసము దొరికే సూచనలు కన్పించినవి. కాని త్రవ్వి చూడగా ఖనిజము బాగా లేకపోవుటచేత ఆ ప్రయత్నం విరమింపబడినది.

### క్రోమైట్

వరంగల్లు జిల్లాలో భీమపురంవద్ద కొట్టెల గట్టుపైనను, మధిర తాలూకాలోని వెందుకూరు, నిడుంపూరు గ్రామాల ప్రాంతాలలోను యీ ఖనిజము కన్పిస్తుంది. మధిర

రైలు స్టేషనుకు దక్షిణమున ఉన్న ప్రాంతంలో యీ ఖనిజముకొరకు త్రవ్వకములు జరిగినవి. దాదాపు 25 టన్నుల ముడి ఖనిజము తీయబడింది.

## అగ్నిశిల (Pyrites)

ఈ ఖనిజము భీమా, కృష్ణానదీలోయల్లో సున్నపు రాతిలో వుంటుంది. ధార్వార్ సరణిరాళ్ళలో కూడా యిది చెదురు వాటుగా వుంటూంది. తాండూరు, కొత్తగూడెం, సాస్తీబొగ్గు గనుల పొరలలో యీ ఖనిజం కన్పిస్తుంది. బొగ్గు పొరలలోపల దాదా అరఅంగుళము మొదలుకొని అంగుళం మందంవరకు యిది వుంటుంది. అగ్నిశిలలను స్క్రీనింగు బెల్టులనుంచి చేతితోనే ఏరి తీయవచ్చును. కాని ఆ విధంగా నెలకు 30 టన్నుల కంటె ఎక్కువ ఖనిజము దొరకదు.

## అభ్రకము (Mica)

ఈ ఖనిజము వరంగల్లు జిల్లా మధిర తాలూకాలోని కప్పలబందం, చేతుపల్లి గ్రామ ప్రాంతాలలో లభిస్తుంది. దీని బ్లాకుల కనిష్ఠ పరిమాణం 2"×2" అంగుళములుంటుంది. కాని కొన్ని కొన్ని చోట్ల యింకా పెద్ద బ్లాకులుకూడా వుండడం కద్దు. ఈ అభ్రకం ఘుస్రంగానే ఉంటుంది. కాని ఇది రేకులు రేకులుగా విడబడదు. హైదరాబాదు డక్కన్ కంపెనీ పూర్వం మధిర తాలూకాలోని కల్లూరు మైకా ప్రాంతమును తడిపి నానబెట్టింది. ఈ ప్రాంతంలో తిరిగి 1944లో పని ప్రారంభింపబడింది. ఈ ప్రాంతంలో నెల్లూరులో వలెనే కెంపు అభ్రకం ఉత్పత్తి అవుతుంది. దీనిని మైకా నైట్, మైకాడైట్, లూబ్రికాంట్ పరిశ్రమలకు ఉపయోగించవచ్చును:

ఇటీవల పాల్వంచలోని ఒక బావిలో ఫ్లోగోపైట్ అను మరొక తరహా అభ్రకము కనుగొనబడింది. దీని అత్తడము 6 మొదలు 8 అంగుళముల వరకు మందముగా ఉన్నది.

1950 నుంచి 1952 వరకు ఉత్పత్తి చేయుబడిన అభ్రకముయొక్క పరిమాణము, దాని విలువ వివరాలు

| సంవత్సరం | ఉత్పత్తి పౌనులలో | విలువ రూ. లలో |
|---|---|---|
| 1950 | 1,000 | 750 |
| 1951 | 24,049 | 5,258 |
| 1952 | 600 | 160 |
| మూడేండ్ల మొత్తము. | 25,649 | 6,168 |

## గ్రాఫైట్

దీనిని నల్లసీసమని అంటారు. ఇది సహజసిద్ధమైన బొగ్గు రకాలలో ఒకటి. ఇది వరంగల్లు జిల్లాలో తూర్పుప్రాంతమైన పాల్వంచ సంస్థానంలో ఉన్నది. అయితే దానిలో ఎక్కువగా మట్టి, సున్న ఇసుక కలిసి ఉంటాయి. గోదావరికి సమీపమున ఉన్న కొవ్వూరు గౌతమీ మైనింగువర్క్సు వారు సాలీనా 50 మొదలు 100 టన్నుల వరకు ఉత్పత్తిచేస్తున్నారు. అయితే

ఆ ప్రాంతమునకు రైళ్ళుగాని, రోడ్లుగాని లేవు. అంతా అడవిప్రాంతము. త్రవ్వితీసిన సరుకును గోదావరిలో పడవలపై కొవ్వూరుకు చేరవేస్తారు. అక్కడ అది పరిశుద్ధి చేయబడి విక్రయించబడుతుంది. పరిశ్రమలకు గ్రాఫైట్ ఎంతగానో ఉపకరిస్తుంది. ఎవరైనా ఉత్సాహవంతులు పూనుకొని భారీయెత్తున త్రవ్వకము జరిపి గ్రాఫైట్ తీసినట్లయితే దానిని బూర్గంపాడునుంచి రోడ్డు మార్గంగుండా కొత్తగూడెమునకు తేవచ్చును. కొత్తగూడెంలో విద్యుచ్ఛక్తి, ఇతరవసతులున్నవి గనుక అక్కడ పెన్సిళ్లు, క్రూసిబుల్సు, ఎలక్ట్రోడ్సు మొదలైనవి తయారుచేయుటకు ఒక ఫ్యాక్టరీని స్థాపించవచ్చును. ఈ ప్రాంతాలలో దొరికే గ్రాఫైటు శ్రేష్ఠమైనది కాకపోయినప్పటికీ దానిని కడిగి, తేర్చి నాణ్యముగా చేయవచ్చును.

1952 లో గ్రాఫైటు మొత్తం ఉత్పత్తి 39 టన్నులు మాత్రమే. దీని వెల సుమారు రూ. 3,900 లు ఉంటుంది.

## బ ల ప పు రా యి

## (Talc or Steatite)

రాయచూరు జిల్లాలోని ధార్వార్ శిలలలో బలపపురాయి దొరుకుతుంది. లింగుసూగూరు తాలూకాలోను, పరంపూరు వద్దను ఇది లభిస్తుంది. స్థానికంగా అవి పలకలపైవ్రాసే బలపాలుగాను, జామెంట్రీ నమూనాల కొరకు, సిరాబుడ్ల తయారీ కొరకు ఉపయోగించబడుతాయి. ఇల్లెందు తాలూకాలోవంటి బలపపురాళ్ళే నల్లగొండ జిల్లా మిర్యాలగూడెం తాలూకాలోను ఉన్నవి. అవి రాతివస్తువుల తయారీకొరకు వినియోగించబడుతాయి.

ఇంగ్లీషులో టాల్కం అనబడే బలపపురాయి రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో అచ్చటచ్చటా లభిస్తుంది. దీనిని స్థానికంగా "బలపము" అని అంటారు. ఇది వరంగల్లు జిల్లాలోని వామనపల్లిలోను, కరీంనగర్ జిల్లాలోని మైతల్లిలోను, మక్తల్ తాలూకాలోను దొరకుతుంది. గుల్బర్గాజిల్లా, సేడంతాలూకాలోని మల్లాపల్లిలో ఒక శిల అంతా పూర్తిగా బలపపురాతితో కూడిఉన్నది. సిర్పూరు పేపరుమిల్లు కంపెనీవారు తమ రసాయనికోపయోగములకొరకై కరీంనగర్, నిజామాబాదుజిల్లాలలో బలపపురాయి త్రవ్వి తీస్తున్నారు. ఇది అతినున్ననిరాయి. చూడడానికి ఇది మెరుగుగా అందంగా కనిపిస్తుంది.

ఈ ఖనిజము పొడిరూపంలో ఉన్నట్లయితే ఫ్రెంచిచాక్ అనబడుతుంది. ఇది అనేక పరిశ్రమలకు చాలా ఉపయోగకరమైనది. బొమ్మలకు, బలపాలకు, స్విచ్ బోర్డులకు, కెమికల్ టాంకులకు, పాలిషులు, ఫిల్లర్లు, ఫేస్‌పౌడర్లు, సబ్బుల తయారీకొరకు ఇది ఉపయోగించబడుతుంది.

### 1948 నుంచి 1952 వరకు ఉత్పత్తి అయినబలపపురాయిపరిమాణము, దాని విలువ.

| సంవత్సరం | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ॥లలో |
|---|---|---|
| 1948 | 25.2 | 9,072 |
| 1949 | 87 | 8,085 |
| 1950 | 90 | 11,700 |
| 1951 | 140 | 15,211 |
| 1952 | 205 | 22,889 |
| ఐదేండ్ల మొత్తం | 547.2 | 66,867 |

## కావిరాయి (Ochres)

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో కావిరాయి లభిస్తుంది. కుష్టగి ప్రాంతంలో ఎరుపు, పసుపుపచ్చ, ధూమ్ర వర్ణముగల కావిరాళ్ళు, జేగురుమన్ను లభిస్తాయి. మట్టి గోడలకు, చెక్కతో చేయబడిన నిర్మాణములకు ఈ రాళ్ళరంగు పూసెదరు.

వివిధ రంగుల జేగురుమన్ను తురక రాళ్ళనుంచి తీయబడుతుంది. వికారాబాదు స్టేషనుకు ఒక మైలు దూరముననున్న నవాబు ఫకర్ యార్జంగు బహదూర్ గారి కాంపౌండులో ఏడు రంగుల జేగురుమన్ను రాళ్ళు లభిస్తాయి. ఇవి విస్తారంగా దొరుకుతాయి; కాబట్టి వీటిని రంగుల పరిశ్రమకు ఉపయోగిస్తారు. ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు కాలేజీ సెంట్రల్ కెమికల్ లేబొరేటరీ, ఉస్మానియా టెక్నికల్ కెమిస్ట్రీ లేబొరేటరీ మున్నగు రాష్ట్రీయ సంస్థలు ఈ మన్నును, రాళ్ళను ఉపయోగించి తీరుతీరుల రంగులను తయారు చేస్తున్నవి.

వికారాబాదుకు సమీపమున ఉన్న ఒక గుట్టపై 9 అంగుళములు మొదలుకొని 18 అంగుళముల మందముగల కావిరాయి ఉన్నది. ఎర్ర కావిరాయితో మెత్తని నారింజ, పసుపుపచ్చరంగు మన్నుకూడా మిశ్రితమై వుంటుంది. పై పొరలు నీలం, బూడిద, ఎరుపు, లేత తెల్ల సుద్దవలె వుంటాయి. తిమ్మారెడ్డిపల్లి గుట్ట, పెదగుట్ట, జాజాగుట్టలపై జేగురుమన్ను, కావిరాయి విస్తారంగా లభిస్తాయి. వికారాబాదు ప్రాంతంనుంచి దాదాపు 50 వేల టన్నుల ఎర్ర జేగురుమన్ను తీయవచ్చును. దీనిని రంగులకు, వార్నిషులకు, నూనె పరిశుద్ధి పనికి, ఇతర రంగు పరిశ్రమలకు ఉపయోగించ వచ్చును.

అందోలు తాలూకాలో 5 మొదలు 15 అంగుళముల మందము గల జేగురు మన్ను కొన్ని మైళ్ళ దూరము వరకు కలదని తెలుస్తున్నది.

ఇట్టిదే గుల్బర్గా తాలూకాలోని చీతాపూరువద్దకూడా కలదు. ఇది పెయింట్లకు, పూత రంగులకు వుపయోగపడుతుంది. జేగురుమన్ను రాళ్ళు, ఉస్మానాబాదు, బీదరు జిల్లాలలోకూడా వున్నవి.

## శిలాస్ఫటికము (Quartz)

హైదరాబాదు సమీపమున అనేక విధములు శిలాస్ఫటికములుగలవు; ఇవి గాజు తయారీకి వినియోగపడతాయి. వానిలో కొన్ని ఈ క్రింద వివరించబడినవి.

1. హైదరాబాదు సంగారెడ్డిపేట రోడ్డుపై 12 మైళ్ళ 4 వ ఫర్లాంగురాయి వద్ద దాదాపు 20 అడుగులఎత్తు, 84 అడుగుల వెడల్పు, 2 మైళ్ళ పొడవున పెద్ద శిలాస్ఫటికముగలదు. ఇది గాజు పరిశ్రమకు వుపయోగకరమైనది.

2. తిమ్మాపూరు స్టేషనుకు తూర్పున 4 మైళ్ళ దూరమున ఉన్న అమీన్‌పేట వద్ద శిలాస్ఫటికపు గట్లు కలవు.

3. అన్నిటికంటె పెద్ద శిలాస్ఫటికపు గట్టు షాద్‌నగర్ రైలుస్టేషనుకు పడమరగా 8 మైళ్ళ దూరముననున్నది. ఈగట్టు 600 అడుగుల వెడల్పు, 10 అడుగుల ఎత్తు ఉన్నది.

4. కూకట్‌పల్లి, మేడ్చల్, మహబూబాద్; వికారాబాద్, మొయినగిద్ద తాలూకాలలో చిన్న చిన్న గట్లు కలవు.

5. విశ్వవిద్యాలయానికి 12 మైళ్ళ దూరంలోవున్న టిప్పూఖాన్ వంతెనవద్ద పరిశుద్ధ శిలాస్ఫటికము గట్టు కలదు.

శిలాస్ఫటికము ఉపరిభాగమున కొంచె మగా మచ్చలు ఉండటంతప్ప లోపలి భాగమంతా మిక్కిలి పరిశుద్ధమైనది. దీనిలో నూటికి 99 పాళ్ళు వాలుకాశిల ఉంటుంది.

## 1949 నుంచి 1952 వరకు శిలాస్ఫటికపు ఉత్పత్తి, దాని విలువ తెలుపు పట్టిక

| సంవత్సరము | ఉత్పత్తి టన్నులలో | విలువ రూపాయలలో |
|---|---|---|
| 1949 | 2,375 | 5,586 |
| 1950 | 616 | 1,275 |
| 1951 | 1,618 | 22,100 |
| 1952 | 1,965 | 8,225 |
| నాలుగేండ్ల మొత్తం | 6,574 | 37,186 |

## చంద్రకాంతము

మహబూబ్‌నగరు, నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో చంద్రకాంతము లున్నవి.

నగరమునకు 6 మైళ్ళ దూరమున హిమాయత్‌సాగర్ రోడ్డుపై శ్రేష్ఠమైన చంద్రకాంతము లున్నవి. వోర్గో క్లేజు చంద్రకాంతము హుజూర్‌నగర్, నల్లగొండ, మహబూబ్‌నగర్, మక్తల్, పాల్వంచ, గోలకొండకు ఉత్తరభాగం మొదలగు ప్రాంతాలలో లభిస్తున్నది.

తెల్లచంద్రకాంతం కల్వకుర్తితాలూకా లోను, వరంగలుజిల్లాలోను లభిస్తుంది. పాల్వంచలోను, ఉస్మానియా విశ్వ విద్యాలయ ప్రాంతంలోను బూడిదరంగు చంద్రకాంతాలుంటాయి. చంద్రకాంతాలు చాలా విలువైనవి. ఇవి పింగాణీసామానుల తయారీకొరకు, గ్లేజు,ఎనామెల్ సామానుల తయారీకొరకు ఉపయోగించబడతాయి.

## కావ్‌లిన్ (Kaolin)

రెండురకముల తెల్లబంకమట్టికి "కావ్‌లిన్" అనుపదము ఉపయోగించబడుతుంది. ఒకటి శిథిలమైన చంద్రకాంతము. రెండవది మన్నికగా, నాణ్యంగా ఉండే తెల్లబంక మన్ను. మొదటిది కొంచెం ప్లాస్టిక్ తర హాగా ఉంటుంది. ఇందులో శిలాస్ఫటికం, అభ్రకం, చంద్రకాంతంకూడ కలసి ఉం టాయి. కాబట్టి ఇది స్వచ్ఛంగా ఉండదు. ఈ మిశ్రమపదార్థములను తొలగించవలె నంటే ఉతుకుడు విధానం అవలంబించ వలెను. పరిశ్రమలో ఆవిధంగా ఉత్పత్తి చేయబడిన వస్తువు చైనాక్లే అనబడుతుంది.

నల్లగొండజిల్లాలో కృష్ణానదీ తీరానగల చింత్రియాలవద్ద సున్నపురాళ్ళతో కలిసిన చైనాక్లే ఉన్నది. ఇచట ఉన్న పొర 2 మొదలు 5 అడుగుల మందము, 20 అడుగుల లోతున ఉన్నది. దీనినుంచి 35,000 టన్నుల చైనాక్లే లభించగలదని అంచనావేయబడినది. ఇది ధవళతరముగా నుండి, ఇంగ్లీషు కావ్‌లిన్‌తో పోల్చదగి ఉన్నది. దీనిని పింగాణీపరిశ్రమకు ఉప యోగించెదరు.

ఆసిఫాబాదు, రాజూరా తాలూకాల లోని గోండ్వానా శ్రేణులలో ఫైర్‌క్లేలు ఉన్నవి. ఆసిఫాబాదు స్టేషనుకు 4 మైళ్ళ దూరంలో పచగాంవద్ద ఉన్న క్లే గని 8 ఎకరముల ప్రాంతంలో దాదాపు ఆరు అడుగుల మందమున ఉన్నది. దీనిలో 80,000 టన్నులు లభించగలదని అంచనా వేయబడింది.

వికారాబాదు, బీదరు ప్రాంతాలలో పసుపుపచ్చ, ఎరుపు, గోధుమరంగులలో వివిధ రకముల బంకమట్టి లభిస్తుంది. దీనిని రంగులకు, నూనె పరిశుద్ధికి ఉపయోగించ వచ్చును.

చించోలీ తాలూకాలో గింగుర్తివద్ద ఫుల్లర్స్ ఏర్, వైట్ కాల్ కేరస్ పౌడరు గని ఒకటి వున్నది. ఈ గనిలో ఈ ఖనిజము ఒక్కొక్కటి 4,000 టన్నుల వరకు లభించగలదని అంచనా వేయబడింది.

## 1948 నుంచి 1952 వరకు రాష్ట్రంలో లభించిన బంకమన్ను, దానియొక్క విలువ వివరాలు

| సంవత్సరము | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ॥లలో |
|---|---|---|
| 1948 | 2,349 | 31,118 |
| 1949 | 1,872 | 18,720 |
| 1950 | 2,215 | 30,392 |
| 1951 | 2,460 | 38,940 |
| 1952 | 1,957 | 20,565 |
| మొత్తం | 10,853 | 1,39,730 |

## విలువైన రాళ్ళు

తెలంగాణాలో నీలమణి, చాల్సెడోనీ, ఓపల్, జాస్పర్, అగేట్ మున్నగు విలువైన రాళ్ళు లభించుతాయి. ఈ ప్రాంతం గుండా ప్రవహించే నదులలో రత్న వైఢూర్యాల పరిశ్రమకు పనికివచ్చే అమూల్యమైన రాళ్ళు అనేక విధములైనవి లభించ వచ్చును.

ఇల్లెందు తాలూకాలోను, బీబీనగర్ స్టేషను వద్దను శ్రేష్టమైన నీలమణి రాళ్ళు కన్పించినవి. ఇటీవల ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన భూమిలో త్రవ్వకములు జరుగుచుండగా కొన్ని నీలమణి రాళ్లు బయటపడినవి. ఇవి సర్. సి. వి. రామన్‌గారు సంపాదించిన నీలమణులను, భూగర్భశాస్త్ర శాఖాధిపతి లెఫ్టినెంటు యస్. యం. అహమదుద్దీన్ సంపాదించి ఆశాఖలో పరీక్షింపబడిన నీలమణులను పోలి ఉన్నవి.

నీలమణిరాయి ధూమ్రవర్ణము, ఊదా రంగు సమ్మిశ్రితమై వుంటుంది. రంగు విషయంలో మినహా ఇతర విధాలచూస్తే దీనికీ శిలాస్ఫటికానికీ భేదం వుండదు. దీనిని ఇంగ్లీషులో "ఎమిథిస్టు" అంటారు.

చాల్సెడోనీకూడా ఒకవిధమైన శిలాస్ఫటికమే. అయితే ఇది నునుపుగా కాంతివంతంగా ఉంటుంది. ఆసియా మైనరులో కీదేనియా అను ప్రాంతంలోని ప్రాచీన నగరమైన చాల్సెడాన్ పేరునుంచి దీనికీపేరు వచ్చినదంటారు. ఆ నగరమునకు సమీప ప్రాంతాలలోనే ఈ రాయి మొదట దొరికినది. వీనిలో బూడిదరంగు రాయి బలార్షా ప్రాంతంలోను, స్టాలాక్టిక్ రకం రాయి సింగరేణి బొగ్గుగనులలోను దొరుకుతుంది.

జాస్పర్ అనబడు పచ్చరాయిలో అన్నివిధముల మిశ్రమములు ఉంటాయి. ఇది పేరుకు పచ్చరాయిగాని తెలుపు, ఎరుపు, నలుపు మొదలగు వివిధ రంగులలో ఇది ఉంటుంది. పసుపుపచ్చ, గోధుమ, ఎరుపురంగుల రాళ్ళు పెద్ద గోదావరంలో లభిస్తాయి.

అగేట్ అనునది మరియొక దినుసురాయి. ఇది వివిధ రంగుల పొరలుగా ఉంటుంది. ఈ పొరలు అతి సున్నితంగా తెలుపు, గోధుమరంగు, నీలం, ఇంకా ఇతర ఛాయ.

లలో, కొన్ని చక్కగాను, మరికొన్ని కంకర టింకర చారలలోను ఉంటాయి. గోదావరి, కృష్ణా నదీ లోయలనుంచి తీరు తీరుల అగేట్లు సేకరించబడినవి. ఇవి వివిధ ఛాయలు, రంగులతో కూడి ఉన్నవి. ఆదిలాబాదు జిల్లాలోని రాజూరాలోను, గుల్బర్గా జిల్లాలోని సెడంలోను బాండెడ్ ఎగేట్ ఎక్కువగా లభిస్తుంది. భారత దేశంలో ఇది ఎక్కువగా దక్కన్ పీఠ భూమి తరహాకు చెందిన లావా ఉన్న భూగర్భంలో ఉంటుంది.

## కెంపురాయి

మధిర తాలూకాలోని గరీబ్ పేట ప్రాంతంలో కెంపురాళ్ళు దొరుకుతాయి. ఈ ప్రాంతపు కెంపులు, రత్నముల పరిశ్రమకొరకు ఉపయోగించబడుతాయి. ఈ రాళ్ళలో కియానైటు చారలుకూడా కలిసి ఉంటాయి.

తెలంగాణాలోని మరికొన్ని ప్రాంతాలలో కెంపురాయి ఒక ఖనిజ రూపంలో రాళ్ళలో ఉంటుంది. ఇల్లెందు, ఖమ్మం, కినిగిరి కొండలగుండా ప్రవహించు నదులలో కెంపురాయి లభిస్తుంది. హైద్రాబాదు, దక్కన్ కంపెనీ కొంతకాలం ఖమ్మం ప్రాంతంలో త్రవ్వకములు జరిపి దాదాపు 8 లక్షల పౌనుల రాళ్ళను తీయగలిగింది.

1952 లో కెంపురాళ్ళ మొత్తం ఉత్పత్తి 30 టన్నులు. ఈ సరుకు విలువ రూ 1800 లు ఉంటుంది.

## కొరివిందము

దీనిని కొరివిందము లేక కురివింజిరాయి అందురు; ఖమ్మం, మధిర తాలూకాలలో పొలాలలోను, వాగులలోను, ఎర్ర కురివింజ రాళ్లు లభిస్తాయి. ఒకప్పుడు రంగాపురం దగ్గర ప్రాంతం యీ రాళ్ళ కొరకై త్రవ్వ బడింది. దాదాపు 2500 టన్నులరాళ్లు ఇక్కడ త్రవ్వి తీయవచ్చునని అంచనా వేయబడినది. మిర్యాలగూడెం తాలూకాలో ఇది రాతి చట్టుల నదీ గర్భాలలో ఉంటుంది. వర్షాలు పడిన తర్వాత తొలి కారులో పొలాలు దున్నునప్పుడు ఈ రాయి పైకి తేలుతూ వుంటుంది. దీనియొక్క ప్రాముఖ్యము గ్రామస్తులకు తెలుసు. దీనిని వారు సేకరించి నల్లగొండ, సూర్యాపేట, దేవరకొండ, కల్వకుర్తి తాలూకాల మార్కెట్లలో విక్రయించుతారు. రాతి చెక్కడము, పాలిష్ పరిశ్రమలలో పనిచేసేవారికి ఇది అవసరమై ఉంటుంది. అయితే అమూల్యమే. ఎక్కువ తేజోవంతంగా కన్పించే కొరివిందములు ఇంతవరకు లభించలేదు.

## స్టారోలైట్

ఇల్లెందు తాలూకాలో పిరంపల్లి లచ్చగూడెం ప్రాంతాలలో స్టారోలైట్ స్ఫటికములు లభిస్తాయి. అయితే దీని పరిమాణం చాలా తక్కువగా ఉన్నది. కాబట్టి దీనికి వ్యాపార ప్రాముఖ్యం లేదు.

## భవన నిర్మాణాల రాళ్ళు

తెలంగాణాలో పక్కా భవన నిర్మాణముల కొరకు ఉపయోగపడే రాళ్లు విస్తారంగా ఉన్నవి. ఈ రాళ్లు చాలా దృఢమైనవి. మన్నిక కలవి, అందమైనవి. ఈ రాష్ట్రంలో కన్పించు చారిత్రిక దుర్గములు, దేవాలయములు, మసీదులు, రాజసౌధములు, ఇతర అనేక ప్రభుత్వ కార్యాలయముల నిర్మాణములే ఇందుకు తార్కాణం.

తెలంగాణాలో లభించే భవన నిర్మాణ

ముల కుపయోగపడు రాళ్లను ఈ క్రింది తరహాలుగా విభజింప వచ్చును.

## నల్ల రాళ్ళు

పెద్దపెద్ద కట్టడాలకు, అలంకార సహితమైన నిర్మాణాలకు ఉపయోగపడే వివిధ తీరుల నల్లరాళ్లు లభించుతాయి. దేవాలయములలో 30 మొదలు 40 అడుగుల పెద్ద దిమ్మెలు, స్థంభములు మనకు కన్పించుతాయి.

హైద్రాబాదు నగరమునకు సమీపాన ఉన్న యితర క్వారీలలోనున్న భవన నిర్మాణముల కుపయోగపడు ఉత్తమమైన రాళ్లు లభించినవి. ఆర్ట్సు కాలేజీ, సైన్సు కాలేజీ, నిజాంసాగర్ ప్రాజెక్టు, ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్, అలీసాగర్ మున్నగు చెరువులకు స్థానికపు నల్లరాళ్లే ఉపయోగించబడినవి. హైద్రాబాదుకు పశ్చిమమున ఉన్న నల్లరాళ్ళు బొంబాయి ఓడరేవు నిర్మాణానికి ఉపయోగపడినవి. ఈ రాళ్ళు అబర్డీన్ నల్లరాళ్ళ కంటె శ్రేష్ఠమైనవని ప్రశంసించబడినవి. ఈ రాయిని సులభంగా నునుపు పెట్టవచ్చు. ఈరాయి ఎంతగా నునుపు తేలుతుందో ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆర్ట్సు కాలేజీ భవన ప్రాంగణంలో చూడవచ్చును.

## సున్నపు రాళ్ళు

తెలంగాణాలో సున్నపు రాళ్ళ శ్రేణులు మూడు ప్రధానమైనవి వున్నవి. ఈరాయి సిమెంటు, ఇనుము కరగి పోత, రాసాయనిక పరిశ్రమలకు వుపయోగించ వచ్చును. సున్నపురాతి శ్రేణులు క్రింది విధంగా వున్నవి :-

### (అ) వరంగల్లు జిల్లా

దక్షిణాన మధిర తాలూకాలో ఎఱ్ఱుపాలెంనుంచి బొమ్మకల్లువరకు ఖమ్మంమెట్టుకు తూర్పున శేట్టపల్లి, మండితోక ప్రాంతాలలోను, ఇల్లెందు తాలూకా ప్రాంతంలోను ఒకశ్రేణి వున్నది.

(ఆ) రెండవశ్రేణి కృష్ణలోయ ప్రాంతంలో ఉన్నది. కర్నూలు సరణి సున్నపురాయి ఆలంపూరు తాలూకాలోను, జటప్రోలు సంస్థానములోను, కొత్తాపూరువరకు ఉన్నది. పల్నాటి సున్నపురాతిశ్రేణి మిర్యాలగూడెం తాలూకాలోని అడివిదేవులపల్లిదాకావచ్చి, అక్కడనుంచి వహీదాబాదు గుండా హుజూర్‌నగరు తాలూకాలో విస్తరించి జగ్గయ్యపేటవరకు పోయినది. ఈ రాయి పరిమాణంకూడా పెద్దగా ఉండి, వివిధ రంగులుగా ఉంటుంది. ఈ శ్రేణిలో ఎంత తీసినా తరగనంతరాయి ఉన్నది.

### (ఇ) ఆదిలాబాదు జిల్లా

ఈశాన్యభాగమున ఆదిలాబాదు జిల్లాలో పెనుగంగ వార్థా నదీలోయల ప్రాంతంలో ఉన్నది. నలుపు, బూడిద మొదలగు రంగులరాళ్ళవల్ల వివిధ తీరుల అలంకరణకు ఉపయోగం కలుగుతుంది. ఇండ్లలో నేలకు, లోకట్టు కప్పులకు సున్నపురాయి విస్తారంగా ఉపయోగించబడుతుంది.

జిల్లాలలో వివిధ రంగుల సున్నపురాళ్ళు లభించుతాయి. ఆదిలాబాదుకు ఉత్తరమున గోధుమరంగు సున్నపురాయి లభిస్తుంది. మహబూబ్‌నగరు జిల్లాలో ఫరూకాబాదుకు దక్షిణమున పొరలు పొరలుగా ఉండే ఎరుపురంగు సున్నపు

రాయి దొరుకుతుంది. సెడం, కొండగల్, చించోలీ తాలూకాలలో నల్ల సున్నపు రాయి లభిస్తుంది. నల్లగొండ జిల్లా మిర్యాల గూడెం తాలూకాలోని వజీరాబాదు ప్రాంతంలో బహుళ రంగుల సున్నపు రాళ్ళు దొరుకుతాయి. కృష్ణానది కవతల ఆంధ్రలో లభించే వివిధరంగుల సున్నపు రాళ్ళతో పేపరు వెయిట్లు, టాబ్లెట్లు, టేబల్‌టాప్సు మొదలగు తీరుతీరుల వస్తువులు తయారు చేయబడి విక్రయమునకు పెట్టబడుతున్నవి.

తెలంగాణాలోని ప్రతి సున్నపురాయి గనిలో డెండ్రిక్ ఇంప్రెషన్ యం. యస్. ఓ. 2. కన్పిస్తుంది. కాని స్పష్టమైన ఇంప్రెషన్లు వాడి, చాందా సున్నపు రాళ్లలో కన్పిస్తాయి.

### *1948 నుంచి 1952 వరకు ఉత్పత్తి చేయబడిన సున్నపురాయి దాని విలువ

| సంవత్సరం | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ॥లలో |
|---|---|---|
| 1948 | 3,07,765 | 5,32,677 |
| 1949 | 3,61,468 | 22,62,426 |
| 1950 | 4,45,257 | 30,34,956 |
| 1951 | 4,79,481 | 33,06,664 |
| 1952 | 4,70,935 | 21,13,794 |
| మొత్తం | 20,64,851 | 128,50,517 |

### పాలరాయి

రాళ్లన్నింటిలో పాలరాయి శ్రేష్ఠతరమైనది. ఇది మధిర, ఇల్లెందు తాలూకాలలో లభిస్తుంది. కొన్ని కొన్ని చోట్ల మంచి పసందయినరాయి దొరుకుతుంది. మరి కొన్ని చోట్ల బూడిదరంగు,నలుపు, పసుపు పచ్చరంగులరాయి లభిస్తుంది. వీనిలో కొన్నింటికి మెరుగుపెట్టినట్లయితే ఎంతో అందంగా కన్పించగలవు. ఈ ప్రాంతంలో చాల పాలరాయి లభించవచ్చు. మొండితోక, జగ్గపల్లి ప్రాంతాలలో ఇది త్రవ్వి తీయబడుతున్నది. మొండితోకలో లభించు రాయి అలంకరణల కొరకు, జగ్గపల్లిలో లభించురాయి సున్నము కొరకు పనికి వస్తుంది.

### 1950 నుంచి 1952 వరకు రాష్ట్రంలోని పాలరాయి ఉత్పత్తి, దాని విలువ

| సంవత్సరం | ఉత్పత్తి టన్నులలో | విలువ రూ॥లలో |
|---|---|---|
| 1950 | 66 | 3,300 |
| 1951 | 99 | 3,614 |
| 1952 | 44 | 1,760 |
| మొత్తం | 209 | 8,674 |

ఇచ్చట ప్రపంచంలోకెల్ల ఉత్తమమైన రాయి లభిస్తుంది. ఇక్కడ లభించు నల్ల రాళ్ళు అతి దృఢముగానుండును. ఇచట సున్నపురాయి విస్తారముగా లభిస్తుంది. వివిధ రంగుల పాలరాళ్ళు ఇక్కడ లభిస్తాయి. ఇవేగాక పలకరాళ్ళు, మొదలగునవి కూడా ఇచట దొరుకుతాయి.

ఇచట అసలైన పలకరాళ్ళు దొరకవు. అయితే నల్లగొండ జిల్లాలో వజీరాబాదు వద్ద కృష్ణా, మూసీనదుల సంగమస్థలమునకు దాదాపు ఒక మైలు దూరంలో పొట్టి

*నోటు : ఈ లెక్కలు హైదరాబాదు అంతటికి సంబంధించినవి.

రాళ్ళు కనబడతాయి. ఈ రాళ్ళను పలకలుగా కోసి నేలమీద పరచుటకు, మేజా బల్లలపై వేయుటకు, ఇంటి కప్పులకు, వ్రాత బోర్డులకు, బడితరగతి బోర్డులకు ఉపయోగించవచ్చును.

ఇల్లెందు తాలూకాలో కొన్నిచోట్ల మంచి పలకరాళ్ళు దొరుకుతాయి. వీనిని పల్చని పొరలుగా కోయవచ్చును. ఇవి నునుపుగాకూడా ఉంటాయి.

తెలంగాణాలో అన్ని ప్రాంతాలలోను రెండవ రకపు సున్నపురాయి విరివిగా లభిస్తుంది. దీనిని కాల్చి సున్నముచేసి భవన నిర్మాణ పనులకు ఉపయోగించవచ్చును. దిండి ప్రాజెక్టు నిర్మాణములో జడ్చర్ల-దేవరకొండ రోడ్డుపై కల్వకుర్తికి తూర్పున 8 మైళ్ళ దూరంలోవున్న జూపల్లి సమీపంలో దొరుకుచున్న సున్నపురాయి ఉపయోగింపబడుచున్నది. గిరికోటపల్లికి దక్షిణమున ఒక మైలు దూరంలో ఒక బావిలో దాదాపు 40 అంగుళాల మందంగల సున్నపురాయి పొర కన్పించింది. ఇటువంటిరాయి వరంగల్లు, నల్లగొండ జిల్లాలలోకూడా ఉన్నది.

ఆదిలాబాదు జిల్లాలోని రాజూరా, చిన్నూరు, ఇంకా యితర తాలూకాలలో ఇనుము లేనట్టి యిసుకరాయి దొరుకుతుంది. ఈ రాయి బరాకార్, కాంతి సరణులకు చెందినది. ఈ జిల్లాలో తీరుతీరుల ఇసుకరాళ్ళు లభిస్తాయి. 1952 లో ఈ రాయి 68,719 టన్నులు ఉత్పత్తి అయింది. దీని విలువ దాదాపు రూ. 1,68,584 లు. వుంటుంది.

## నాపరాళ్ళు, తురకరాయి

దక్కన్ నాపరాయి ఎక్కడైతే దొరుకుతుందో అక్కడ అది భవన నిర్మాణములకు వుపయోగింపబడుతున్నది. బసాల్ట్, ఫార్ఫైటిక్ రాళ్ళు అలంకరణలకు పనికివస్తాయి. ముఖ్యంగా ఎర్రవి వుత్తమమైన అలంకరణకు పనికివస్తాయి.

వికారాబాదు-బీదరు పీఠభూమిలోని తురకరాళ్ళను ఇటుకరాళ్ళ పరిమాణంలో ముక్కలుగాకోసి భవన నిర్మాణ కార్యములకు వుపయోగిస్తారు. ఆరాళ్ళు రంగులకు కూడా వుపయోగింపబడుతాయి. 1952 సంవత్సరములో 11,29,608 టన్నుల భవన నిర్మాణపు రాయి తీయబడినట్లు, దాని విలువ దాదాపు రూ. 21,37,874 లని సంఖ్యలు తెలుపుతున్నవి.

తెలంగాణాలో వున్న ఈ అపార ఖనిజ సంపదను వుపయోగించుకొంటే తెలంగాణా ప్రజలకేకాక యావదాంధ్ర ప్రజలకు అవసరమయిన పరిశ్రమలను నిర్మించుకోవచ్చు.



నోటు :- ఉస్మానియా యూనివర్సిటీ భూగర్భ శాస్త్రశాఖ అధ్యక్షుల వ్యాస ఆధారంతో ఈ అధ్యాయం వ్రాయబడింది.

# పరిశ్రమలు

విశాలాంధ్రలోని ఇతర ప్రాంతాలలో కంటె ఖనిజసంపద తెలంగాణాలోనే ఎక్కువగా ఉంది. పరిశ్రమల అభివృద్ధికి ఎక్కువ అవకాశాలు ఉన్నవి. పరిశ్రమాభివృద్ధికి మూలమగు బొగ్గు, జల, థర్మల్ విద్యుచ్ఛక్తిఉత్పత్తిఅవకాశాలు అపారంగా ఉన్నవి. ఇచ్చటగల బొగ్గు సహాయంతో ఉక్కుపరిశ్రమ అభివృద్ధి చేయుటకు అవసరమైన ముడి ఇనుము తగినంత తెలంగాణాలోనేగాక, ముఖ్యంగా తెలంగాణా నాను కొనివున్న గోదావరి అవతల దక్షిణ బస్తరులోఉన్నది. న్యూస్ ప్రింటు (కాగితం)కు అవసరమైన ముడివస్తువులు తెలంగాణా అడవుల్లో దొరుకుతవి. ఇట్లే ఇతర ముఖ్య పరిశ్రమల అభివృద్ధి కెన్నో అవకాశాలు ఉన్నవి.

అయినా పారిశ్రామికంగా తెలంగాణా ఎంతో వెనుకబడిఉంది. ఉన్న అవకాశాల దృష్టితోచూస్తే భారత దేశంలోని ఇతర ప్రాంతాలకంటె కూడ వెనుకబడి ఉంది.

కాని విశాలాంధ్ర ఇతర ప్రాంతాలలో ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్రంతో పోలిస్తే తెలంగాణా పరిశ్రమల విషయంలో కొంత ముందున్నదని చెప్పవచ్చు. ఇచ్చట గల ప్రత్యేక ఖనిజ సంపదయేగాక నైజాం బ్రిటిషు పాలక వర్గాల పాలసీకూడా ఇందులకు కారణం. హైదరాబాదు స్టేటులోను, భారత దేశమంతటా, జాతీయ ఉద్యమానికి వ్యతిరేకంగా తమ కంటిపెట్టుకుని ఉండే "ముస్లింపాలక వర్గా"న్ని సృష్టించాలనే పాలసీతో, తమతో పోటీపడని కొద్ది పరిశ్రమలను అభివృద్ధి చేయుడంలో నైజాం-బ్రిటిష్ పాలకులు, స్థానికముస్లింపెట్టుబడిదార్లకు ప్రధానంగా సాయంచేశారు.

ఈ ఆశయంతోటే ఇతరచోట్ల పరిశ్రమలులేని సమయంలో- 1929 లోనే-ఇండస్ట్రియల్ ఫండ్ ఒక కోటి రూపాయల మూలధనంతో ప్రారంభించబడింది. ఇది ఇప్పుడు రు. 4 కోట్ల 98 లక్షలకు పెరిగింది.

ఇది 22 జాయింటుస్టాక్ కంపెనీలకు రు. 10 కోట్ల 91 లక్షల రూపాయలు (Face value) షేర్లరూపంలో పెట్టుబడి పెట్టింది. జాయింట్ స్టాక్ కంపెనీలకు, వ్యక్తులకు రు. 16 కోట్లు అప్పుగాకూడా ఇచ్చింది. పైవిధంగా పెట్టుబడిన కంపెనీలలో ఈ క్రింది పదకొండు ముఖ్యపరిశ్రమలను స్థాపించడానికి తోడ్పడి, వీటి మేనేజింగు ఏజంటుగా పనిచేస్తున్నది.

1. అజంజాహీ టెక్స్టయిలుమిల్లు (వరంగల్లు)
2. ఉస్మాన్‌షాహీ టెక్స్టయిలుమిల్లు (నాందేడ్)
3. ప్రాగా టూల్స్ కార్పొరేషను (హైద్రాబాదు)

4. సింగరేణి కాలరీస్ (కొత్తగూడెం, ఇల్లెందు, బెల్లంపల్లి)
5. నైజాం షుగర్ ఫ్యాక్టరీ (బోధన్)
6. హైద్రాబాదు గోల్డు మైన్స్ (హట్టీ కర్నాటక).
7. ప్రభుత్వ పవర్ ఆల్కహాల్ ఫ్యాక్టరీ (బోధన్).
8. ఆస్‌బెస్టాస్ సిమెంటు ప్రోడక్ట్సు (హైద్రాబాద్)
9. శాన్ గ్లాస్‌వర్క్సు (హైద్రాబాదు)
10. సిర్పూర్ పేపరుమిల్సు (సిర్పూర్)
11. సిర్ సిల్కు కంపెనీ (సిర్పూర్)

పై వాటిలో ప్రభుత్వ పవర్ ఆల్కహాల్ ఫ్యాక్టరీ పూర్తిగా దీనిదే. ఇట్లు మొత్తం 44 కంపెనీల్లో వివిధ రూపాల్లో ఈ సంస్థ పెట్టుబడి పెట్టింది. వీటిలో పైవి గాక తక్కువవి ప్రయివేటు వ్యక్తుల స్వాధీనంలో ఉన్నవి. సంవత్సరమునకు లక్ష రూపాయలు పారిశ్రామిక స్కాలర్‌షిప్పులపై ఖర్చుచేయబడుచున్నవి.

హైద్రాబాదు సిటీలో ముషీరాబాద్ అనే ప్రాంతంలో 'ఇండస్ట్రియల్ ఏరియా' (పారిశ్రామిక కేంద్రం)ను నిర్మించాలని 186 ఎకరాల భూమిని కొని, వివిధ కంపెనీలకు కౌలుకిచ్చింది.

హైద్రాబాదు స్టేటు బ్యాంకు కూడ ఇచ్చటి పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడింది.

పోలీసు యాక్షను తర్వాత ఏర్పడిన ప్రభుత్వం ఇండస్ట్రియల్ ట్రస్టు ఫండు ద్వారా పెట్టుబడి పెట్టిన డబ్బును తిరిగి రాబట్టుకోవటం, దీని మేనేజిమెంటు క్రింద ఉన్న ముఖ్య పరిశ్రమలను ఇతర ప్రాంతాల పెద్ద పెట్టుబడిదార్లకు అమ్మివేయటం ఒక పాలసీగా అనుసరిస్తున్నది. సిర్ సిల్కు ఫ్యాక్టరీ, సిర్పూర్ పేపరుమిల్లు ఇట్లు అమ్మివేయబడినవి.

అయినా ప్రస్తుతం తెలంగాణాలో ఇప్పుడున్న ముఖ్యపరిశ్రమలన్నీ ఈవిధంగా ఇండస్ట్రియల్ ట్రస్టుఫండుద్వారా అభివృద్ధి చేయబడినవే!

నేడు తెలంగాణాలో ఉన్న వివిధ ముఖ్యపరిశ్రమల వివరాలు దిగువ వివరించబడ్డాయి.

## బొగ్గు

తెలంగాణాలో కొత్తగూడెం, ఇల్లెందు (ఖమ్మంజిల్లా), బెల్లంపల్లి, సాస్తి (ఆదిలాబాదుజిల్లా)లలో బొగ్గు త్రవ్వబడుతున్నది. దీనిలో ఎక్కువభాగం సింగరేణికాలరీస్ కంపెనీ, కొత్తగూడెం, ఇల్లెందు, బెల్లంపల్లి గనులలో తీయబడుతున్నది. ఈ కంపెనీని బ్రిటిష్ పెట్టుబడిదార్లు 1921 వ సంవత్సరంలో రు. 68 లక్షల పెట్టుబడితో ప్రారంభించారు. ప్రస్తుతం దీనికి రు. 211 లక్షల రిజర్వుధనమున్నది.

రెండవయుద్ధకాలంలో బొగ్గుఉత్పత్తి ఎక్కువచేయటానికి కావలసిన అవసరమయిన అదనపు పెట్టుబడి పెట్టుటకై ప్రభుత్వం దీని వాటాలలో 100 కి 87 వంతుల వాటాలను కొన్నది. దీని మేనేజిమెంటుకూడ ఇండస్ట్రియల్ ట్రస్టు ఫండుకు యివ్వబడింది.

ప్రారంభంలో యిల్లెందులో బొగ్గు త్రవ్వబడింది. అప్పటునుంచి బొగ్గురావటం తగ్గగా, దగ్గరగా వున్న కొత్తగూడెంలో బొగ్గుగనులను తెరచారు. ప్రస్తుతం ఇచ్చటనే, తెలంగాణాలో ఉత్పత్తి అయ్యే బొగ్గు అధికభాగం త్రవ్వబడుచున్నది.

కొత్తగూడెం, బెల్లంపల్లి యిల్లెండులలో త్రవ్వేబొగ్గు 1948 లో 10 లక్షల టన్నుల నుండి, 1952 లో 18½ లక్షల టన్నుల వరకు పెరిగింది. 1957 వ సంవత్సరానికి 20 లక్షల టన్నుల వుత్పత్తిని పెంచాలని ప్రభుత్వ ప్లాను. పై మూడుచోట్ల కలసి 15,000 పైన కార్మికులు పనిచేస్తున్నారు.

పెన్నంగవద్ద, దానిక్రింద, షాస్టీ కాల రీస్ద్వారా హైద్రాబాద్వైపు త్రవ్వే బొగ్గు చాలాకొద్ది.

తెలంగాణాలో తీయబడుతున్న బొగ్గు ప్రస్తుతం అది వున్నరూపంలో లోహ పరిశ్రమకు వుపయోగించే స్థితిలో లేదు. ఆవిరిని (Steam) తయారుచేయుటకై ప్రధానంగా ఉపయోగిస్తుంది. కాని లోహ పరిశ్రమలకు ఉపయోగించేందులకై దీన్ని కోకింగ్ కోల్గా సులభంగా తయారుచేసే పద్ధతులుకూడ ఈ మధ్య కని పెట్టబడినవి.

ఇప్పుటు ఉత్పత్తి అవుతున్న బొగ్గులో నూటికి 25 పాళ్ళు తెలంగాణా, స్టేట్ లోని ఇతర ప్రాంతాలలో వినియోగించ బడుతున్నది. తక్కినది దక్షిణ భారత దేశపు రైల్వేలు, ఇతర పరిశ్రమలకు ఉప యోగించబడుతున్నది. దక్షిణ భారత దేశంలో బొగ్గు అవసరాలు ప్రధానంగా తెలంగాణాలో త్రవ్వబడుతున్నదాని ద్వారానే తీర్చబడుతున్నవి.

# టెక్స్టయిలు పరిశ్రమ

తెలంగాణాలోని ఆదిలాబాదు జిల్లాను ముఖ్యంగా మరాఠ్వాడాలో పండేప త్తిలో కొంత భాగాన్ని ఉపయోగించేందుకు తెలంగాణాలో మూడు టెక్స్టయిలు మిల్లులు (బట్టల మిల్లులు) నిర్మించబడ్డాయి.

## హైదరాబాదు స్పిన్నింగు అండ్ వీవింగ్మిల్లు – హైద్రాబాదు

ఇది హైద్రాబాదు స్టేట్లో ప్రారం భించబడిన మొదటి గుడ్డల మిల్లు. 1874 వ సంవత్సరంలో ప్రారంభించబడింది. దీని మూలధనం రు 8,16,666. 1952 వ సంవత్స రంలో 1659 మంది కార్మికులు పని చేస్తు న్నారు. రు 50,84,000 విలువగల గుడ్డ ఉత్పత్తి చేయబడింది.

దీనిలోని యంత్రాలు చాలపాతవి. లాభాలు రావటంలేదనే సాకుతో యజ మానులు దీని నీమధ్య మూసివేశారు.

## 2. అజంజాహి మిల్సు, వరంగల్లు

ఇది 1931 లో 18 లక్షలరూపాయల పెట్టుబడితో ప్రారంభించబడింది. విపరీత లాభాలు రావటంవల్ల దీని పెట్టుబడిని 1946 లో ఒకసారి, 1950 లో రెండోసారి రెట్టింపుకు పెంచారు. ప్రస్తుతం దీనికి చెల్లిం చిన మూలధనం రు. 71,45,000 (హాలీ), 1954 లో దీనిలో 36,136 కదుర్ళు, 750 మగ్గాలు ఉన్నవి. 1952 లో రు. 1,67,54,000 (హాలీ) విలువగలగుడ్డ ఉత్పత్తిచేయబడింది. దీనిలో షుమారు 3,400 మంది కార్మికులు పనిచేస్తున్నారు.

## 3. డి. బి. ఆర్. మిల్సు, హైద్రాబాద్

ఇది 1929 లో స్థాపించబడింది. దీనికి చెల్లించిన మూలధనం రు. 20,98,600. దీనిలో 1500ల మంది కార్మికులు పని చేస్తు

న్నారు. దీని సాంవత్సరిక ఉత్పత్తి రు. 72 లక్షల విలువగల బట్ట.

పై మూడు బట్టల మిల్లులలో ప్రధానంగా ముతకబట్ట తయారవుతున్నది.

### 4. రెయన్ ఫ్యాక్టరీ
### ( కృత్రిమ పట్టు )

భారతదేశంలోనే దొరికే ముడివస్తువులతోనే కొత్త పద్ధతులపై ఆర్టిఫిషియల్ సిల్కును (కృత్రిమపట్టు) తయారు చేసే మిల్లులను, తయారుచేసే కొత్త పద్ధతులపై దీని నిర్మాణాన్ని 1946 లో అప్పాటు స్టేటులో ప్రధాన పెట్టుబడిదారు మీర్ లాయక్అలీ విదేశ పెట్టుబడి దార్లతో కలసి రెండుకోట్ల మూల ధనంతో ప్రారంభించారు. (ఇది యింకా నిర్మాణంలోనే వుంది). సంవత్సరానికి 50,000 పౌనులు రెయన్ గుడ్డ తయారుచేయగల ఆర్టిఫిషియల్ సిల్కు నూలును తయారు చేయాలని నిర్మాతల సంకల్పం. 1949 లో యిది ఇండస్ట్రియల్ ట్రస్టు ఫండుక్రింద, కొచ్చిన తర్వాత ప్రభుత్వం 4 కోట్ల 31 లక్షల పెట్టుబడి పెట్టింది. కొద్దికాలంలో నిర్మాణం పూర్తి అవుతుంది. దీన్ని పూర్తి చేయడానికి, నడపడానికి కావలసిన పెట్టుబడి లేదనే కారణంతో స్థానిక ప్రజా సంస్థలూ, పెట్టుబడిదార్లూ వ్యతిరేకిస్తున్నా, మేనేజింగ్ ఏజన్సీని టీటాగ్రాబదర్సుకు 1952 లో అప్పగించారు.

### 5. హాయిజరీమిల్సు.

హైద్రాబాద్ నగరంలో షైన్ హాయిజరీ మిల్సు, హైదరాబాద్ హాయిజరీ అనే రెండు ఫ్యాక్టరీలున్నాయి. ఇవి బనీన్లు, అండర్‌వేర్లు మొదలగునవి తయారు చేస్తున్నాయి. మొదటి దానిలో 8½ లక్షల విలువగల వాటాలను ఇండస్ట్రియల్ ట్రస్ట్ ఫండ్ కొన్నది. 8½ లక్షలపైన అప్పిచ్చింది. రెండూ కలిపి 1952 లో నాలుగున్నర లక్షలరూపాయల విలువగల సరుకు నుత్పత్తి చేశాయి.

## పంచదార పరిశ్రమ

నిజామాబాదు జిల్లాలోని బోధన్‌వద్ద గల నిజాం షుగర్ ఫ్యాక్టరీ అంత పెద్దది భారతదేశంలో ఇంకెక్కడా లేదు. ఇండస్ట్రియల్ ట్రస్టుఫండు సహాయంతో యిది 1937 లో పూర్తిచేయబడింది. అప్పుడు దాని మూలధనం రు. 35 లక్షలు. రోజుకు 1500 టన్నుల చెరుకు నుపయోగించేది. దీని పెట్టుబడి యిప్పుడు రు. 1 కోటి, 28 లక్షలకు (షేర్) పెంచబడింది. దినానికి యిప్పుడు 3,500 టన్నుల చెరుకును (Crushing capacity) ఉపయోగిస్తుంది. దీనికిపుడు రు. 1 కోటి 20 లక్షల రిజర్వు ధనం ఉన్నది. ఫ్యాక్టరీ అవసరాల్లో సగం చెరుకును సప్లయిచేసే 18,000 యకరాల స్వంత తరీభూమి ఈ ఫ్యాక్టరీకి ఉంది. పనిచేసే మొత్తం కార్మికులసంఖ్య 15,000. దీనిలో పంచదార (షుక్కర్) ఉత్పత్తి 1950 లో 19,685 టన్నులు, 1951 లో 28,984 టన్నులు, 1952 లో 38,685 టన్నులు.

దీని పెట్టుబడిలో 100 కి 72 వంతులు ఇండస్ట్రియల్ ట్రస్టుఫండుద్వారా ప్రభుత్వానిదే. దీని మేనేజింగు ఏజెన్సీ ఇండస్ట్రియల్ ట్రస్టుఫండు తరఫున, వెనుక మీర్

లాయకలీకి సంబంధించిన హైదరాబాదు కన్‌స్ట్రక్షన్ కంపెనీచేతుల్లో ఉంది.

### కాగితపు పరిశ్రమ

భారత దేశంలోని ముఖ్య పేపరు మిల్లులలో ఒకటైన సిర్‌పూర్ పేపరుమిల్లు 1939లో స్థాపించబడింది. కాగితం తయారు చేయుటకవసరమైన వస్తువులున్న ఆదిలాబాదు జిల్లాలోని అడవి మధ్యలోనున్నది. 1942-48 ల మధ్య దీనికి రు 118 లక్షలు లాభం వచ్చింది. 1953 లో యిది సంవత్సరానికి ఆరువేల టన్నుల కాగితాన్ని ఉత్పత్తి చేసింది. న్యూస్ ప్రింటును కూడా ఉత్పత్తి చేయుటకు ఇప్పుడు అవకాశాలున్నవి. ఇప్పుడు జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమం పూర్తికాగానే సంవత్సరానికి 18,000 టన్నుల కాగితం తయారు అవుతుంది.

ప్రధాన పెట్టుబడి ప్రభుత్వానిదేఅయినా యిది మొదట మీర్‌లాయకలీకి చెందిన హైదరాబాద్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ మేనేజింగ్ ఏజన్సీక్రింద వుండేది. 1949 లో యిండస్ట్రియల్ ట్రస్టుఫండ్ దీన్ని తనక్రిందకు తీసుకున్నది. సుమారు రు120 లక్షలు దీనిలో అదనంగా పెట్టుబడిపెట్టి ఇంకొక రు67లక్షలు అప్పు కూడా యిచ్చింది. కాని 1953 లో ప్రభుత్వం దీన్ని బిర్లా బ్రదర్సు కప్పగించింది.

### ఇంజనీరింగ్ పరిశ్రమ

కొద్ది స్కేలుపై పనిసాగే అనేక ఫౌండ్రీలు, ప్రభుత్వ పి. డబ్ల్యు. డి. వర్కు-షాపులుగాక యీక్రిందివి యింజనీరింగ్ పరిశ్రమల తరగతిక్రిందకు వస్తవి :

#### (1) రైల్వే వర్కు-షాప్, రన్నింగ్ షెడ్సు

నిజాం యస్. యస్. రైల్వేగా ఉన్నప్పుడు సికింద్రాబాదులో ప్రత్యేక రైల్వే వర్కు-షాపు నిర్మించబడింది. సెంట్రల్ రైల్వేలో కలిపివతర్వాత, దీన్ని కొంతవరకు తగ్గించినా, ఇప్పటికే సికింద్రాబాద్ డివిజన్ కుపయోగించే విధంగా ఈ వర్కు-షాప్ పనిచేస్తున్నది. దీనిలో షుమారు 2,500 మంది కార్మికులు పని చేస్తున్నారు. రైల్వే ఇంజన్లు బాగుచేయటం, పెట్టెల బాడీలు కట్టడం, మొదలగుపనులు ప్రధానంగా జరుగుచున్నవి. దీనితోపాటు సికింద్రాబాదులో పెద్ద రన్నింగు షెడ్డు ఉన్నది. ఇక్కడ ఇంజన్లకు తాత్కాలిక రిపేర్లు చేస్తారు. దీనిలో షుమారు 800 మంది కార్మికులు పని చేస్తున్నారు. ఇట్టిదే తక్కువ స్థాయిలో, ఖాజీపేటలోకూడ ఒకటి వున్నది.

#### (2) ఆర్. టి. డి. వర్కు-షాపులు

హైదరాబాదు రోడ్డు రవాణాశాఖకు (ఆర్. టి. డి.) సంబంధించిన బస్సులకు అవసరమైన రిపేర్లు, నిర్మాణాలు సాగించుటకై హైదరాబాదులోని ముషీరాబాద్‌లో ఒక పెద్ద వర్కు-షాప్ వున్నది. దీనితోపాటు, తాత్కాలిక రిపేర్స్ చేసేందులకై హైదరాబాదులోని సిటీ డిపో, ఖాజీపేట, కరీంనగర్, కొత్తగూడెం, ఖమ్మంమెట్టు, నిజామాబాద్ మొదలగుచోట్లగల డిపోల్లో చిన్న వర్కు-షాపులున్నవి.

#### 3. ప్రాగాటూల్స్ కార్పొరేషన్, హైదరాబాదు

ఇది చిన్నదే అయినా భారతదేశంలోని మెషిన్ టూల్సు (యంత్రసామానులు) తయారుచేసే ముఖ్యఫ్యాక్టరీలలో ఒకటి. ఇది 1946 లో 69 లక్షల రూపాయాల

పెట్టుబడితో ప్రారంభమైంది. ఆధునిక మిషనరీ గల ఒక మెకానికల్ వర్క్‌షాపు, వర్క్సుయిన్‌స్పెక్షన్ శాఖలువున్నవి. వీటి సహాయంతో వెర్నియర్ క్లిప్పర్సు, పిబ్లాక్సు, ట్రైస్క్వేర్సు, మాస్టరుస్క్వేర్సు యాంగిల్ ప్లేట్సు, సైన్‌బార్సు, స్టాండర్డు టేపర్ గేజస్ మొదలగు 'మెజరింగు', 'మార్కింగు యిన్‌స్ట్రుమెంట్లు', మిల్లింగ్ కట్టర్లు, రీమర్సు, టాప్ అండ్ డైస్, మిల్లింగ్ ఆర్‌బర్సు, గ్రైండింగ్ అండ్ లాథీ సెంటర్సు, లాథీ యాడెప్సు మొదలగు మిషన్‌టూల్సు తయారుచేస్తున్నారు. ఈమధ్య క్రొత్తరకపు లాథీఛక్సు, డ్రిల్లింగుమెషిన్లు, షేపర్సు, యం. డి. లాథీలు, పి. సైప్రుడిలిన్సు, హారిసన్ లాథీలు చేస్తున్నారు.

భారతదేశంలోనే మొదటిసారిగా, మిల్లింగ్ మెషిన్ల పూర్తి యూనిట్సును తయారుచేసే కార్యక్రమము ఈ మధ్యనే ప్రారంభమయింది. 1952 లో దీనిలో 16 లక్షల 18 వేల రూపాయల (ఐ. జి.) విలువగల వస్తువులు తయారయినవి.

దీన్ని ప్రస్తుతం నిర్వహిస్తున్నది యిండస్ట్రియల్ ట్రస్టుఫండ్. చాల విలువగల మెషిన్‌టూల్సు చేయడానికి అవకాశాలున్నా, తగిన ఆర్డర్లు లేక, ఈ ఫ్యాక్టరీ పరిస్థితి ప్రమాదకరంగా తయారయింది.

## (4) హైద్రాబాద్ ఆల్విన్ మెటల్ వర్క్సు

1924 లో రు 61 లక్షలు పెట్టుబడితో ప్రారంభించబడింది. 1948 లో దీనిలో 1100 మంది కార్మికులు పని చేస్తున్నారు. ప్రభుత్వానికి 80 లక్షల విలువగల వాటాలు దీనిలో వున్నవి. షీట్ మెటల్, ట్యూబ్యులర్ ఫర్నిచర్ చేయుట కవసరమైన మెషినరీ దీనిలో వుంది. ఇనుప పెట్టెలు, బ్యాంకింగ్‌కు అవుసరమైన "స్ట్రాంగ్‌రూమ్ ఎక్విప్‌మెంటు" యిది తయారు చేస్తుంది. బస్సుల బాడీలు కట్టే పెద్ద వర్క్‌షాప్ కూడా వున్నది. రిఫ్రిజిరేటర్లు తయారు చేసేందుకై నిర్మాణం జరుగుతున్నది. 1952 లో రు 30 లక్షల 81 వేల విలువగల సరుకు తయారైంది.

కాని మార్కెటు డిమాండు తగ్గి దీని లోని కార్మికులు చాలమంది తగ్గించ బడినారు.

## 5. హైద్రాబాద్ ఐరన్ అండ్ స్టీల్ వర్క్సు

అజామాబాద్ (కరీంనగరు జిల్లా) 1932 లో రు 4 లక్షల పెట్టుబడితో ప్రారంభించబడింది. ఆయిల్ ఎక్స్‌పెల్లర్లు, రిఫైనరీ ప్లాంట్లు, సెక్యూరిటీ ఎక్విప్‌మెంట్సు, పైపులు, యితర కాస్టింగ్సు, పెట్టమహోల్సు, వ్యవసాయ పరికరాలు, మొదలగు వాటిని తయారుచేయుటలో కొంతవరకు ప్రత్యేక నిపుణత సంపాదించింది. 1952 లో రు 2 లక్షల 68 వేల విలువగల సరుకును ఉత్పత్తిచేసింది.

భారత దేశంలోని ఇతర ప్రాంతాల లోవలె, తెలంగాణాలోని ఈ అన్ని యింజనీరింగుప్లాంట్సులోకూడ, ఆర్డర్లు లేక ఉత్పత్తి తగ్గించటం, కార్మికులు నిరుద్యోగులవటం జరుగు చున్నది.

# రాసాయనిక మందుల పరిశ్రమ

పరిశ్రమల అభివృద్ధికి అత్యవసరమగు రసాయన వస్తువులు చాలకొద్దిగనే ఉత్పత్తి అగుచున్నవి.

## హైద్రాబాద్ కెమికల్ అండ్ ఫెర్టిలైజర్సు, బెల్లంపల్లి

1942 లో 29 లక్షల రూపాయల పెట్టుబడితో ప్రారంభించబడింది. వీటిలో 15 లక్షల రూపాయల షేర్లను ప్రభుత్వం కొన్నది. సల్ఫ్యూరిక్ ఆసిడ్, ఆలమ్, సూపర్ ఫాస్ఫేటు, మిక్సెడ్ ఫెర్టిలైజర్సు మొదలగునవి ఉత్పత్తి చేయబడు చున్నవి. ముందు సూపర్ పాస్ఫేట్లు, మిక్సెడ్ ఫెర్టిలైజర్ల వుత్పత్తి ఎక్కువ చేస్తాం అని ప్రకటించారు. ఈ ఫ్యాక్టరీ సంవత్సరానికి రు 40 లక్షల విలువగల సరకును తయారు చేస్తున్నది.

## (2) హైద్రాబాదు కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్సు, అజామాబాద్ (కరీంనగర్ జిల్లా)

ఇది 1942 లో 10 లక్షల పెట్టుబడితో ప్రారంభించబడింది. ఇండస్ట్రియల్ ట్రస్టు ఫండు 2 లక్షల రూపాయల షేర్లు కొన్నది. 1952 లో రు. 9 లక్షల విలువగల సరుకును ఉత్పత్తిచేసింది.

## 3. బయోకెమికల్ అండ్ సింథటిక్ ప్రోడక్ట్సు

సనత్‌నగర్ (హైద్రాబాద్) యిది 1942 లో రు. 14 లక్షల పెట్టుబడితో ప్రారంభించబడింది. ఇండస్ట్రియల్ ట్రస్ట్‌ఫండ్ దీనిలో రు. 85,000 ల విలువగల షేర్లు కొన్నది. రు. 4 లక్షల 34 వేలు అప్పు యిచ్చింది. లివర్ ఎక్స్ట్రాక్ట్సు, ఫార్మస్యూటికల్ ఫైన్ సింథటిక్ కెమికల్సు మొదలగు బైలాజికల్ వస్తువులు తయారుచేయుటకై యిది పూనుకున్నది. నిర్వహించడానికి కావలసిన డబ్బులేక 1953 లో యిది మూసివేయబడింది.

## ఆల్కహాల్ పరిశ్రమ

బోధన్ దగ్గర ప్రభుత్వ ఆల్కహాల్ ఫ్యాక్టరీ 1941 లో ప్రారంభించబడింది. సంవత్సరానికి 5 లక్షల గ్యాలన్ల ఆల్కహాలు తయారౌతున్నది. ఇప్పుడు పంచదార ఫ్యాక్టరీ వుత్పత్తిని పెంచుచుండుటచే సంవత్సరానికి 10 లక్షల గ్యాలన్ల ఆల్కహాలు తయారుచేయుటకు వీలుగా ఈ ఫ్యాక్టరీ ఉత్పత్తిశక్తిని పెంచుతున్నారు. రేయన్ ఫ్యాక్టరీ ప్రారంభమయ్యాక, ఉత్పత్తి అయ్యే ఆల్కహాలుతో ఎసిటిక్ ఆసిడ్, ఎసిటిక్ యాన్‌హైడ్రైడ్, ఎసిటోన్‌లు తయారు చేయబడుతవి.

ఆల్కహాలును తయారుచేయునపుడు విడుదలయే కార్బను డయాక్సైడ్‌ను, సోడాసిలిండర్లలో నింపుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి.

## లామినేటెడ్ షీట్ల పరిశ్రమ (మడతరేకులు)

1947 లో రు. 8 లక్షల 88 వేల పెట్టుబడితో హైద్రాబాద్ లామినేటెడ్ షీట్సు కంపెనీ-హైద్రాబాదులో ప్రారంభించబడింది. ఇండస్ట్రియల్ ట్రస్టుఫండు రు. 3 లక్షల 84 వేల విలువగల వాటాలు కొన్నది. ఇది భారతదేశంలోనే లామి

లోని మహబూబాబాద్‌లో వున్నది. తెలంగాణాలో వున్నవి సిమెంటుతో తయారయ్యే వస్తువుల వుత్పత్తి ఫ్యాక్టరీలే.

### 1. ఆస్‌బెస్టాస్ సిమెంటు ప్రాడక్ట్స

సనత్‌నగర్ (హైద్రాబాద్) 1940లో రు 22 లక్షల 47 వేల మూలధనంతో ప్రారంభింపబడింది. ప్రభుత్వం నాటికి 51 వంతుల పెట్టుబడి పెట్టింది. ప్రస్తుతం యిది యిండస్ట్రియల్ ట్రస్ట్‌ఫండ్ మేనేజ్‌మెంటుక్రింద వున్నది.

### 2. ఇండియన్ హ్యూంపైప్ కంపెనీ

అజామాబాద్‌లో 1933 లో స్థాపింపబడింది. స్టేటులో దీనికి 6 శాఖలున్నాయి. సాలీనా 13 లక్షల విలువగల సరుకు ఉత్పత్తి చేస్తున్నాయి.

### అగ్గిపుల్లల పరిశ్రమ

హైద్రాబాద్‌లోగల 22 ఫ్యాక్టరీల్లో అత్యధిక భాగం తెలంగాణాలో ముఖ్యంగా హైద్రాబాద్‌లో వున్నవి. వీటిలో మూడు కోటలోని మహబూబియా మాచ్ ఫ్యాక్టరీ, హైద్రాబాద్‌లోని విమ్కో మాచ్ ఫ్యాక్టరీ, ఆసఫియా మాచ్ ఫ్యాక్టరీ, మాయిత్ మాచ ఫ్యాక్టరీలు పెద్దవి. వీటిలో రెండువేల మంది కార్మికులు పనిచేస్తున్నారు. వీటిలో రోజుకు సగటున 100 గ్రోసుల అగ్గిపెట్టెలు తయారగుచున్నవి.

కాని స్థానిక అడవులనుండి సరైన కర్ర దొరకనందున, మార్కెటు చిక్కులవలన ఈ ఫ్యాక్టరీలకు కొంతకష్టం కల్గింది.

### వనస్పతి ఫ్యాక్టరీ

తెలంగాణాలో వేరుశనగ, ఆముదాలు, అవిశెలు విస్తారంగా వుత్పత్తి అవుతవి. కాని, వీటి విస్తృతంగా నూనె తీయుటకు, యితర వస్తువులను తీయుటకు అవసరమైన ఫ్యాక్టరీలు లేవు. స్టేటు వుత్పత్తిలో 100కి 40 వంతులు ఎగుమతి అగుచున్నది. కొద్దినూనె మరలు, ఎక్కువగా పశువులచే లాగే గానుగుల ద్వారా నూనె తీయబడుచున్నది.

సికింద్రాబాదు దగ్గరలో వున్న హైద్రాబాదు వెజిటబుల్స్ ప్రాడక్ట్స కంపెనీలోనే వనస్పతి తయారు చేయబడుతున్నది. దీనిలో వేరుశనగ నూనె వాడబడుతుంది. ఇది 1939 లో రు 28 లక్షల 48 వేల మూలధనంతో స్థాపింపబడింది. ఇండస్ట్రియల్ ట్రస్టు ఫండు దీనికి 15 లక్షలు సహాయము అప్పిచ్చినా, అనేక యిబ్బందులవల్ల యిది ప్రస్తుతం పని చేయుటలేదు.



గ్రామంలో కూడా చేనేత మగ్గం లేకుండా లేదని చెప్పవచ్చు. 1951 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం మొత్తం స్టేటులో 1,81,649 మగ్గాలుండగా, ఒక్క తెలంగాణాలోనే 89,224 మగ్గాలున్నాయి.

వివిధజిల్లాలలోని మగ్గాల వివరాలు ఇలా ఉన్నాయి:

| జిల్లా పేరు | చేతి మగ్గాల సంఖ్య |
|---|---|
| హైదరాబాదు | 1,795 |
| మహబూబునగరం | 14,791 |
| ఆదిలాబాదు | 3,257 |
| నిజామాబాదు | 6,836 |
| మెదకు | 12,750 |
| కరీంనగరం | 23,348 |
| వరంగల్లు+ఖమ్మం | 9,032 |
| నల్లగొండ | 17,415 |
| తెలంగాణా మొత్తం | 89,224 |
| స్టేటు మొత్తం | 1,81,649 |

అయితే ప్రభుత్వం జిల్లావారీగా పత్తి నూలు మగ్గాలను, సిల్కు నూలు మగ్గాలను వేరువేరుగా చూపెట్టలేదు. పైన చూపిన మొత్తం మగ్గాలలో 115,115 పత్తి నూలు మగ్గాలున్నాయి. పై ప్రభుత్వ లెక్కల ప్రకారమే పత్తినూలు మగ్గాలలో ప్రతి మగ్గానికి యిద్దరికన్నా పైబడి పారిశ్రామికు లున్నట్లు కనబడుతున్నది. అనగా తెలంగాణాలో పత్తినూలు మగ్గాలపైగానీ, సిల్కు ఉన్ని నూలు మగ్గాలపైగానీ, దాదాపు 1,00,000 మంది పారిశ్రామికులు పని చేస్తున్నారనవచ్చు.

ప్రత్తిచేనేత వస్త్రాలలో కరీంనగరం జిల్లాలోని హాశ్మతీపేట, మెదకు జిల్లాలోని దుబ్బాక గ్రామాల "శ్యామసుందర చీరలు" చాలా పేరుపొందినవి. అలాగే నల్లగొండ జిల్లాలోని ఆలేరు, మెదకు జిల్లాలోని జోగిపేట, మహబూబునగరం జిల్లాలోని నారాయణపేట "ఫ్యాన్సీ చీరలు" చాలా ప్రఖ్యాతి చెందినవి. ముతక గుడ్డలలో మెదకు జిల్లాలోని లచ్చిపేట వస్త్రాలు బాగుంటాయి. రుమాళ్ళు, లుంగీలు నిజామాబాదు, నల్లగొండ, మహబూబునగరం, హైదరాబాదు జిల్లాల ప్రధాన ఉత్పత్తి. మొత్తం స్టేటులో సంవత్సరానికి 14 కోట్ల రూపాయల విలువగల గుడ్డ తయారు అగుచున్నది.

ఈ వస్త్రాలు ప్రస్తుతం బర్మా, సింహళం, జావా, సుమిత్రా, మలయా, ఇండోనీషియా, ఆస్ట్రేలియా, న్యూజిలెండ్, ఇరాన్, ఈజిప్టు, దక్షిణాఫ్రికాలకు ఎగుమతి చేయబడుతున్నాయి.

అయితే ప్రభుత్వం 1.49 లక్షల చేనేత పారిశ్రామికులు మాత్రమే వున్నట్లు అంగీకరిస్తూవుంది. కాని వీరికి నూలు సప్లయి చేసే సమస్య వచ్చేసరికి 79 వేల కూపన్లపై వచ్చే నూలునే 1.49 లక్షల పారిశ్రామికులకు సప్లయి చేస్తున్నది. ఈ పద్ధతినైననే ప్రభుత్వం 1.49 లక్షల మందిని అంగీకరించింది. ప్రభుత్వం చూపే ఈ మగ్గాల సంఖ్యకూడా దాదాపు సగమే వున్నదని చెప్పవచ్చు.

తెలంగాణాలో జిల్లావారీగా ఈ పరిశ్రమను చూచినప్పుడు కరీంనగరంలో ఈ మగ్గాలు అధికంగా వున్నాయి. నల్లగొండ రెండవస్థానం ఆక్రమించుచున్నది. హైదరాబాదు నగరాన్ని మినహాయించితే,

బాదులో ఈ మగ్గాలు చాలా తక్కువగా ఉన్నాయని చెప్పవచ్చు. ఈ మగ్గాలలో నూటికి 80 ఫ్లయిషటిల్ మగ్గాలు, మిగతావి చేతి మగ్గాలు. ఈ మగ్గాలలో నూటికి 15 ముతక, 75 మధ్యరకం, మిగతా 10 నాణ్యపు గుడ్డలు నేస్తాయి. గత యుద్ధ కాలంలో ఈ పరిశ్రమ ఎంతగ డిఫెన్సుకై నగా తయారైంది. కాని యుద్ధానంతరం తిరిగి ఈ పరిశ్రమ సంక్షోభంలో పడింది. చేనేత పారిశ్రామికుడు తనకు కావలసిన నూలు వర్తకుల ద్వారా ఎక్కువ ధరకు కొని, సరైన మార్కెటు సౌకర్యాలు, ధన సహాయం లేనందున తనకు తక్కువకే చౌకగా అమ్మివేస్తాడు. పురాతన పరికరాలతోటే తయారు చేయడంవల్ల పోటీలో గిట్టుబాటుకాక దివాలాలు ఎత్తుతున్నారు.

## ఉన్ని, సిల్కు పరిశ్రమలు

హైదరాబాదు మొత్తం సంస్థానంలో 16,534 ఉన్ని, సిల్కు మగ్గాలున్నాయి. ఈ మగ్గాలపై 37,919 మంది పారిశ్రామికులు పనిచేయుచున్నారు. ఉన్ని మగ్గాలలో అత్యధికభాగం తెలంగాణాలోని వరంగల్లు, కరీంనగరం, మహబూబునగరం, నిజామాబాదులలో ఉన్నాయి. సిల్కు మగ్గాలు ఎక్కువగా మెదకుజిల్లా సంగారెడ్డి, మరాఠ్వాడాలో, ఔరంగాబాదులో ఉన్నాయి.

సంస్థానంలో తయారయ్యే మొత్తం 75 లక్షల పౌనుల ఉన్నిలో 38 లక్షల పౌనులు ఎగుమతి చేయబడుచున్నది. మిగతా ఉన్నితో కంబళ్ళు, తివాచీలు వగైరా తయారుచేయబడుతాయి. ఇందులో 38,000 మంది పనిచేస్తున్నారు. మొత్తం తయారు చేయబడే 7,50,000 కంబళ్ళలో ప్రతిసంవత్సరం నూటికి 25 ఎగుమతి చేయబడుతాయి. ఈ కంబళ్ళు అధికంగా వరంగల్లు, కరీంనగరం, నిజామాబాదు, మహబూబునగరంలలో తయారవుతాయి.

టస్సారు సిల్కు పరిశ్రమ స్టేటులో చాలా పురాతనమైన పరిశ్రమ. ఈ పరిశ్రమను వ్యవసాయదారులు ప్రధానవృత్తిగానూ, లేక వృత్తిలో భాగంగానూ పెట్టుకోటానికి అవకాశాలున్నాయి. ప్రస్తుతం మెదకు, నిజామాబాదు జిల్లాలలో మల్బెర్రి వృక్షాలను పెంచి, సిల్కు పురుగులను పెంచి సిల్కుదారం తీయటం జరుగుచున్నది. ఆముదపు ఆకుపైకూడా సిల్కు పురుగులను పెంచవచ్చు.

ప్రస్తుతం మెదకు జిల్లాలో మాచేపు ప్రాజెక్టుక్రింద ప్రభుత్వం ఒక సిల్కు క్షేత్రం ప్రారంభించింది. ఇక్కడ 4800 పౌనుల ముడిసిల్కు ప్రతిసంవత్సరం తయారుచేయబడుచున్నది. ఇక్కడ మల్బెర్రిచెట్ల అంట్లు, మెటికలుకూడా అమ్మబడుతాయి.

మెదకుజిల్లా సంగారెడ్డి కార్ఖానాలో సిల్కు వస్త్రాలు తయారుచేయబడుచున్నాయి. వరంగల్లు, నిజామాబాదు, సికింద్రాబాదు లైన్లలోకూడా సిల్కు వస్త్రాలు నేసే పని ప్రారంభమైంది. వరంగల్లుజిల్లా అశోకనగర్ అనేచోట కోయప్రజలకు శిక్షణమివ్వటానికి సమాజసేవాసంస్థవారి సహకారంతో పరిశ్రమల శాఖ ఒక సిల్కు క్షేత్రం నడుపుతున్నారు.

సిల్కు చీరలు, వస్త్రాలు మెదకుజిల్లా సంగారెడ్డి కార్ఖానాలో, మహబూబునగరంజిల్లా నారాయణపేటలో, రాయచూరుజిల్లా గద్వాలలో, నిజామాబాదుజిల్లా ఆర్మూరుతాలూకాలో తయారుచేయ

బడుచున్నాయి. టస్సారుమఫ్లర్లు, చొక్కా-గుడ్డలు, కోటింగులు, వరంగల్లుజిల్లా హసన్‌పర్తిలో, ఆదిలాబాదుజిల్లా చెన్నూరులో, కరీంనగరం జిల్లాలోని మహాదేవపురంలో తయారు చేయబడుచున్నాయి.

## తోళ్ల పరిశ్రమ

హైదరాబాదుస్టేటు తోళ్ల ఉత్పత్తిలో ఉన్నత స్థానం ఆక్రమించుచున్నది. స్టేటు మొత్తంలో 95 తోళ్లు ఊనే కేంద్రాలున్నాయి. వీటిలో 25,000 మంది హరిజనులకు పని దొరుకుతున్నది. ఈ పరిశ్రమకు కావలసిన ముడి పదార్థాలలో ఒక రాసాయనిక పదార్థాలు మినహా మిగతా వన్నీ ఇక్కడే లభించుతాయి. అందుకని ఈ పరిశ్రమ శ్రద్ధ వహించుతే అభివృద్ధి అయ్యే అవకాశాలున్నాయి. అయినా యిక్కడ అయ్యే మొత్తం ఉత్పత్తిలో అధిక భాగం ముడివస్తువు రూపంలో, సగం తయారైన వస్తువు రూపంలో, వూనిన తోళ్ల రూపంలో మద్రాసు రాష్ట్రానికి ఎగుమతి అవుతుంది. మొత్తం ఉత్పత్తి విలువ 547 లక్షలు. ఈ ఉత్పత్తిలో 1/3 వ వంతు మాత్రమే స్థానికంగా ఉపయోగించుతారు.

తోళ్ళకేంద్రాల సహకార సంఘాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఇంతవరకు వున్నవి గాక, క్రొత్తగా నల్లగొండజిల్లా సరిల్లి గ్రామంలో షెడ్యూల్డుకాస్టు ట్రస్టుఫండు ధనంతో ప్రభుత్వం తోళ్లు వూనే సహకారసంస్థ నెలకొల్పింది. తోళ్ల పరిశ్రమ తెలంగాణాలో ఎక్కువగా వరంగల్లులో కేంద్రీకరింపబడి వున్నది.

తోళ్ళు చెడిపోకుండా చూడడానికి రాసాయనిక మందులుగల యూనిట్లు మహబూబునగరంలో, హైదరాబాదు జిల్లాలో మెదకుజిల్లా పటంచెరువు, హైదరాబాదు నగరంలోని ముశీరాబాదులో సంచారక యూనిట్లు, మహబూబునగరం, సిద్దిపేటలో మోడలు తర్ఫీదు యూనిట్లు పనిచేస్తున్నాయి.

## గుండీల పరిశ్రమ

హైదరాబాదు నగరంలో "దక్కన్ బటన్ ఫ్యాక్టరీ" 1916 లో స్థాపించబడి 1946 వరకు బాగా అభివృద్ధి చెందినది. ఇది కాక ఈ కాలంలో చిన్నచిన్నవి వివిధ బస్తీలలో షుమారు వంద ఫ్యాక్టరీలు పని ప్రారంభించాయి. 1946 లో రు 170 లక్షల విలువచేసే 10 లక్షల గ్రోసుల గుండీలు తయారు చేయబడ్డాయి. అప్పుడు 10,000 మంది కార్మికులు పనిచేసేవారు. ఈ గుండీలు భారత దేశంలోనే గాక, విదేశాలకుకూడా ఎగుమతి చేయబడేవి.

కాని విదేశ చౌక గుండీల విపరీత దిగుమతివల్ల, వివిధ పన్నులవల్ల ఈ పరిశ్రమ సంక్షోభంలో పడింది. ఇప్పుడు 1400 మంది కార్మికులు పనిచేస్తున్న 25 గుండీల ఫ్యాక్టరీలు మాత్రమే పని చేస్తున్నాయి. వీటిలో 7½ లక్షల విలువచేసే 75 వేల గ్రోసుల గుండీలు మాత్రమే తయారవుతున్నాయి. వీటికి కావలసిన ముడి సరకులు, యిత్తడి, రాగిరేకులు, తీగలు, జర్మను సిల్వరు, బంగారం, వెండి, పుస్కా, యినుపరేకులు, లక్క, కొమ్ము ఎముకలు వగైరా.

## బీడీల పరిశ్రమ

స్టేటులోవున్న 190 బీడీ ఫ్యాక్టరీలలో అత్యధికంగా తెలంగాణాలోనే వున్నాయి.

గట్టికాగితం, కార్డుబోర్డు, బ్లాటింగు పేపరు, రంగుకాగితం, ఆహ్వానకార్డులు వగైరా వున్నాయి.

## చెరకుపానకం గానుగలు

స్టేటులో బాగా చెరకుపండించే ప్రాంతాలు తెలంగాణాలో నిజామాబాదు, కర్నాటకలో బీదరు, స్టేటులోవున్న మొత్తం చెరుకుపానకంతీసే గానుగల్లో పైరెండుజిల్లాల్లోనే నూటికి 58 వున్నాయి. ఈ పానకంతో బెల్లం తయారు చేయబడుతున్నది.

తెలంగాణాలో మొత్తం 5481 గానుగలు వున్నాయి. నిజామాబాదులో ఈ గానుగలు చాలా ఎక్కువగా వున్నాయి. తరువాత మెదకు జిల్లాలో వున్నాయి. మొత్తం స్టేటులోవున్న గానుగల్లో తెలంగాణాలో సగానికి పైగా వున్నాయి.

## నూనె గానుగలు

తెలంగాణాలో నూనెగింజలు, ఆముదాలు, వేరుశెనగ, నువ్వులు బాగా పండుతాయి. అయినా ఇక్కడ నూనె తయారుచేసే పెద్ద మిల్లులు ఎక్కువలేవు. పండే పంటలో అధికభాగం ఎగుమతి చేయబడుతుంది.

పురాతన నాటు గానుగలు దాదాపు అన్ని జిల్లాలలో వున్నాయి. నూనెగింజలు అధికంగా పండే నల్లగొండ, మహబూబు నగరంలో ఈ గానుగలు తక్కువే.

తెలంగాణాలో ఈ గానుగల మొత్తం సంఖ్య 3,217. ఇందులో ఎక్కువగా ఆదిలాబాదు, కరీం నగరంలలో వున్నాయి.



# విద్యుచ్ఛక్తి

విద్యుచ్ఛక్తి విషయంలో తెలంగాణాలో ఎంత ఎక్కువ అవకాశాలున్నవో నేడంత వెనుకబడి వున్నది. జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తికి ఉన్న అపార అవకాశాలను ఇంతవరకు ఏ మాత్రం ఉపయోగించక పోవటమేగాక, స్టీములోను, డీజిల్ ఇంజన్లతోను తయారుచేసే విద్యుచ్ఛక్తి ఉపయోగం అతి స్వల్పంగావుంది. హైదరాబాదు ప్రభుత్వం ప్రకటించిన లెక్కల ప్రకారం 1952-53లో తెలంగాణాలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి 5,88,89,616 యూనిట్లు. మొత్తం స్టేట్ ఉత్పత్తి 6,07,68,804 యూనిట్లు. వీటి వివరాలు 1121వ పేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి.

ప్రస్తుతం హైదరాబాదు స్టేటు అంతటావున్న విద్యుదుత్పాదక కేంద్రాల శక్తి 55,000 కిలో వాట్లు. దీనిలో అధిక భాగం తెలంగాణాలో వున్నది.

పై సంఖ్యలనుబట్టి చూస్తే, ఒక్క హైదరాబాదు నగరంతప్ప ఎక్కువగా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే కేంద్రాలులేవు. ఈ ఒక్క హైదరాబాదు కేంద్రమే తెలంగాణాలో ఉత్పత్తి అయ్యేదాంట్లో 94%పైగా తయారు చేస్తున్నది.

1951-52 లో సమిష్టి మద్రాసు రాష్ట్రంలో మనిషి ఒక్కింటికి సగటున తయారు 26 యూనిట్లు, ఆంధ్రలో 2.7 యూనిట్లు ఉత్పత్తి చేయబడుతూ ఉంటే తెలంగాణాలో 5.2 యూనిట్లు ఉత్పత్తి చేయబడుతున్నది.

ఉత్పత్తి అగుచున్నదాంట్లో, ఒక హైదరాబాదులో తప్ప, పరిశ్రమల కుపయోగించేది లేదనే చెప్పవచ్చు. (వరంగల్లులో ఆజంజాహిమిల్లు, కొత్తగూడెం, బెల్లంపల్లి బొగ్గు గనులలో, బోధన్ షుగర్ ఫ్యాక్టరీలో తమ సొంత విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేసుకుంటున్నారు.)

తెలంగాణాలో బావులనుండి నీరు తోడుటకు విద్యుచ్ఛక్తి ఎంతో ఉపయోగిస్తుంది. కాని దీనికి విద్యుచ్ఛక్తిని ప్రస్తుతం ఏమీ ఉపయోగించుటలేదు.

## విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేయ వీలున్న స్కీములు

తెలంగాణానుండి ప్రవహించు కృష్ణా, గోదావరి మహానదులు వీటి ఉపనదుల ఆధారంగా, ప్రక్కనున్న ఆంధ్రరాష్ట్రంతో కలిసి జాయింటుగా జల విద్యుచ్ఛక్తిని చాల పెద్ద ఎత్తున ఉత్పత్తి చేయుటకు అవకాశాలున్నవి. ఇట్లే తెలంగాణాలో చాలా విస్తారంగా ఉన్న బొగ్గు ఆధారంగా థర్మల్ విద్యుచ్ఛక్తిని ఎక్కువగా తయారు చేయవచ్చును.

| నగరము | వినియోగదారుల సంఖ్య | 1952 లో ఉత్పత్తి (యూనిట్లలో) |
|---|---|---|
| 1. హైద్రాబాద్ | 19,690 | 5,04,54,055 |
| 2. సికిందరాబాదు | 6,314 | ... |
| 3. నిజామాబాదు జిల్లా విద్యుచ్ఛక్తిప్రణాళికలు | 798 | |
| 4. నారాయణపేట | 359 | 24,18,000 |
| 5. వరంగల్లు | 1,457 | |
| 6. ఎల్లందు | 258 | |
| 7. కరీంనగరు, ఆజమాబాద్ థర్మల్ విద్యుచ్ఛక్తి ప్రణాళికలు | 367 | 3,04,057 |
| 8. రామగుండం థర్మల్ పవర్ ప్రణాళికలు | 131 | 2,18,554 |
| 9. ఖమ్మం | 136 | ... |
| తెలంగాణా మొత్తం | 29,510 | 5,33,89,666 |
| స్టేటు మొత్తం | 34,812 | * 6,07,63,814 కిలోవాట్లు |

ఇంతవరకు సేకరించబడిన సమాచారాన్ని బట్టి, తయారు చేయబడిన ఈ క్రింది స్కీములను నిర్వహించ వీలున్నదని, తద్వారా సుమారు పది లక్షల కిలోవాట్ల విద్యుత్ ను ఉత్పత్తి చేయవచ్చుని అంచనా వేయబడింది. వివరాలు ప్రక్క పేజీలోని పట్టికలో యివ్వబడ్డాయి.

### గోదావరిలోయ అభివృద్ధిస్కీము

దీనిక్రింద తటీసాగు, ప్రాజెక్టుల నిర్మాణానికి సంబంధించిన వివరాలు 'నీటి వనరులు, వనరులు, ప్రాజెక్టులు' శీర్షిక క్రింద ఇవ్వబడినవి. దీనిక్రింద జల విద్యుచ్ఛక్తి కూడ ఎక్కువగా ఉత్పత్తి అవుతుంది. 11 ప్రదేశాల్లో ఈ ప్రాజెక్టుక్రింద విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే కేంద్రాలు నిర్మించవచ్చు.

(1) కాలకూటెం రిజర్వాయరు వద్ద 45,000 కిలోవాట్లు.

(2) ఉత్తరపుటొడ్డు కాలువపై వాల్గా

* స్టేటు మొత్తం ఉత్పత్తిగా చూపబడిన విద్యుచ్ఛక్తిలో ప్రభుత్వం ఉత్పత్తిచేసినది, యితరులవద్ద కొన్నది 52,61,951 కిలోవాట్లు కలిసివున్నది.

ను ఒకటిగా ఎంచబడుచున్నది. దీనిక్రింద 2 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారవుతుంది.

2. పైన్‌గంగా నదిపై నిర్మించే ప్రాజెక్టు క్రింద 80,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారవుతుంది.

తెలంగాణా, ఆంధ్ర ప్రజలు గోదావరి నదిని మొత్తం ఆంధ్ర జాతియ సమిష్టి ప్రయోజనాల దృష్టితో ఉపయోగించుకొనేందుకు పరిశోధించుతే, ఇంకా చాల జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి స్కీములను తయారు చేయవచ్చు.

## కృష్ణానదిపై ప్రాజెక్టులు

కృష్ణానదిపై దిగువ గోదావరిలోయ, దిగువ కృష్ణా, భీమానదుల ప్రాజెక్టులద్వారా విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. ఇవి ప్రధానంగా కర్ణాటక ప్రాంతం (హైద్రాబాద్ స్టేట్) లోనివి.

దిగువ కృష్ణాలోయలో తెలంగాణాకు అనుకొనియున్న ప్రాంతంలో పరిశోధనలు జరిపింది. నందికొండ ప్రాజెక్టుకు మాత్రమే. అది కూడ, హైద్రాబాదు ప్రభుత్వం కట్టదలచిన చిన్నదాము నిర్మాణ దృష్టితోనే. దీని నుండే 2,10,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయబడుతుందని అంచనా. కాని అటు ఆంధ్ర రాష్ట్రానికి కూడ ఉపయోగపడునట్లు 590 అడుగుల ఎత్తుగల దాము కట్టి ఎక్కువ నీటిని నిలువ చేసినట్లయితే ఇంకా ఎక్కువ విద్యుచ్ఛక్తి తయారు కావచ్చు.

పరిశోధనలు జరుపవలసిన ప్రాంతాలింకా వున్నవి.

## తుంగభద్రానదిపై ప్రాజెక్టులు

తుంగభద్రా ఇర్రిగేషన్ స్కీము క్రింద మొత్తం లక్ష కిలోవాట్లపైన విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయబడగలదని అంచనాలు.

ప్రారంభంలో తుంగభద్రా ప్రాజెక్టు డాం వద్ద నెం. 1 పవర్ స్టేషన్ నిర్మిస్తున్నారు. ఇది 87,500 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది. ఇది పూర్తి అయ్యాక, దీన్నుంచి విద్యుచ్ఛక్తి రాయచూరు జిల్లా (ప్రధాన భాగం కర్ణాటక) లోని ప్రాంతాలకేగాక, తెలంగాణాలోని నారాయణపేట, హైదరాబాదులకు కూడ సప్లయి చేయబడుతుంది. ఈ పవర్‌స్టేషన్ తర్వాత కాలువపై దిగువన 10 మైళ్ళలో 60 అడుగుల ఎత్తునుండి నీళ్ళుపడే ప్రదేశం శివపురం అనే చోట వున్నది. ఇక్కడ 30,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి తయారవుతుంది. శివపురంకి దిగువ, తిమ్మాపురంవద్ద నీళ్ళపడే రిజర్వాయరు క్రింద 10,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చు. ఇంకా పైన ప్రధాన కాలువల అదనంగా ఉండే నీటిని తుంగభద్రా లోనికి కలుపుతూ త్రవ్వబడే కాలువ మొగలో 190 అడుగుల ఎత్తునుంచి నీరు పడుతుంది. ఇచ్చట నీరు ఉధృతంగా పారే కాలంలో 50,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. ఇద్రా అనే మరొకచోట 10 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది.

ఈ స్కీములో డాం వద్ద 87,500 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి కేంద్రాన్ని మట్టుకు పంచవర్ష ప్రణాళికలో చేర్చి నిర్మించ బూనుకున్నామని ప్రభుత్వం ప్రకటించింది.

## నిజాంసాగర్ విద్యుచ్ఛక్తి స్కీము

తరి సేద్యంకై కట్టబడిన నిజాంసాగరు రిజర్వాయరు (చెరువు) ప్రధాన కాలువ

లోనికి నీరుపోయేచోట జల విద్యుచ్ఛక్తి కేంద్రం నిర్మించబడుచున్నది. దీన్నుండి 15,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. స్థానికంగా కొద్దిగానే ఉపయోగించబడుతుంది. ఎక్కువ భాగం హైద్రాబాదు నగరానికి తీసుకు వచ్చుటకై తీగలు వేయబడుచున్నవి.

## దేవనూరు స్కీము

నిజాం సాగరుకు పైన మంజీరానది పెద్దవంపు తిరుగుతుంది. ఇచ్చట దేవనూరు గ్రామంవద్ద ఒకడామ కట్టి, దీన్నుంచి నీటిని సరాసరి నిజాంసాగరు చెరువులో పడేటట్లు చేస్తే 375 అడుగుల నీటి దిగుడు ఏర్పడుతుంది. 1200 క్యూసెక్ల నీరు నిరంతరం పారుతుంది. ఈ కాలువపై రెండు చోట్ల పవరు స్టేషన్లు కడితే మొత్తం 40,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతుంది. అంతేగాక, ఈ డాములోని నీరు వల్ల నిజాంసాగరు జల విద్యుచ్ఛక్తి స్కీముపై రెట్టింపు విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయవచ్చు.

ఈ రిజర్వాయరులోని నీటి ద్వారా నిజాంసాగరు క్రింద సేద్యం అయ్యే భూమిని పెంచవచ్చు. హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలకు ముందు కావలసిన అదనపు నీటిని ఇచ్చటినుండి సప్లయి చేయవచ్చును.

## థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి

ఇంతవరకు పైన వివరించినవన్నీ జల విద్యుచ్ఛక్తి స్కీములు (Hydro-Electric Power Schemes) వీటితోపాటు తెలంగాణాలో విస్తారంగా లభ్యమవుతున్న బొగ్గు సహాయంతో థర్మల్ విద్యుచ్ఛక్తిని కూడ ఎక్కువగా తయారు చేయవచ్చును.

గోదావరి నదిపై కరీంనగరు జిల్లాలోని సుల్తాన్ఆబాద్ తాలూకాలో వున్న రామగుండం వద్ద ఇట్టి పెద్ద థర్మల్ పవర్ స్టేషను గోదావరి లోయ అభివృద్ధి పథకంలో భాగంగా నిర్మించాలని హైదరాబాదు ప్రభుత్వం నిశ్చయించింది. ఎండాకాలంలో నీరు తక్కువగా నున్నప్పుడు, వర్షాలులేని కాలాల్లో కొరతపడే జల విద్యుచ్ఛక్తిని పూర్తిచేయుటకు ప్రధానముగా ఈ స్కీము ఉద్దేశింపబడింది.

దీని చుట్టుప్రక్కల విస్తార ఖనిజసంపద, ఇతర సహజ సంపద వుండటం, దగ్గరనే బొగ్గు, సున్నపురాయి విస్తారంగా దొరకటం గోదావరినుంచి నీరు పుష్కలంగా దొరకటం వల్ల, థర్మలు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయుటకు చాల అనుకూలమైన పరిస్థితులున్నవని ఇంజనీర్ల అభిప్రాయం.

37,500 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తికై ఒక పవరు స్టేషను రామగుండం వద్ద ప్రభుత్వం నిర్మించ బూనుకున్నది. తర్వాత అవసరాలనుబట్టి 1,52,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయబడుతుంది.

## హైడ్రో థర్మల్ స్టేటు గ్రిండ్ సిస్టం

పైన వివరించిన హైడ్రో పవరు స్టేషన్లు ఈవరకే మొత్తం 7,85,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేస్తవి. అట్లే సూచించిన థర్మలు స్టేషన్లు 1,52,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి నుత్పత్తి చేయగలవు. చిన్న ప్రాజెక్టులపై ఉత్పత్తి అయ్యేది అటుంచి, ఈ పెద్ద హైడ్రో థర్మల్ పవరు స్టేషన్లనుంచి తెలంగాణాలో మొత్తం సుమారు 10 లక్షల కిలోవాట్ల విద్యుత్తు ఉత్పత్తిచేసే అవకాశం ఉంది.

ఇట్లు ఉత్పత్తి కాగల విద్యుచ్ఛక్తిని పంచుటకై హైడ్రో - థర్మల్ గ్రిండ్ సిస్టంను గురించి ఇంజనీర్లు ఒక ప్లాను తయారుచేశారు. ఇంతవరకు తయారు చేసిన ప్లాను ప్రకారం తుంగభద్ర ప్రాజెక్టుక్రింద ఉత్పత్తి అయే పవరు పంపకంకు సంబంధించినది ఒకభాగం. ఈ విద్యుచ్ఛక్తిలో 182 కిలోవాట్లను ఇటు రాయచూరు మీదుగా హైదరాబాదుకు, గుల్బర్గా మీదుగా మహబూబునగరుకు, పాపన్న పేటకు తీసుకపోవాలని ప్లాను. గోదావరి లోయ స్కీముక్రింద హైడ్రో పవరు స్కీములు, రామగుండం క్రింద థర్మల్ పవరు కలిపి,దీన్ని వరంగల్లు, హైద్రాబాదు, లకు తీసుకొనిపోవుటకు, ఇతర ప్రాంతాలకు పవరు సప్లయి చేయుట ఈ గ్రిండ్‌లో ఒక ప్రధాన భాగం. దేవనూరు స్కీము తయారు అయ్యాక, ఇది తుంగభద్రా సిస్టంతో, పాపన్నపేట మీదుగా కలుపబడుతుంది. హైదరాబాదు, సికిందరాబాదులలోని సిస్టం గూడ కలిపితే ఇది తెలంగాణాలో విశాల భాగాన్ని కలుపుతుంది.

## నిర్మాణంలోవున్న స్కీములు

ప్రభుత్వ ప్రకటనల ప్రకారమే ప్రస్తుతం నిర్మించబడుచున్నవి:

1. నిజాంసాగరుస్కీము — విద్యుచ్ఛక్తి ఉత్పత్తి : 15,000 కిలోవాట్లు.

2. తుంగభద్రడాముపై మొదటి పవరు హౌస్, దీని ఉత్పత్తి : 22,500 కిలోవాట్లు. ఈ స్కీము పంచవర్ష ప్రణాళికలో చేర్చబడింది.

3. హైద్రాబాదు థర్మలు పవరు స్టేషను అభివృద్ధి — వచ్చే అధికోత్పత్తి : 7,500 కిలోవాట్లు.

4. రామగుండం థర్మల్ స్టేషను నిర్మాణంలో ఒక భాగం - ఉత్పత్తిశక్తి : 37,500 కిలోవాట్లు. (కాని దీని నిర్మాణం చాలా కుంటుపడిపోయినట్లు తెలుస్తున్నది)

ప్రభుత్వ అంచనాల ప్రకారం ఇవన్నీ నిర్మించబడినపుడు కొత్తగా ఉత్పత్తి అయే విద్యుచ్ఛక్తి : 82,620 కిలోవాట్లు మాత్రమే.



# రహదారులు

తెలంగాణాలో రోడ్లు, రైళ్ళు ప్రధాన రహదారులు. మొత్తం స్టేటులోగానీ, తెలంగాణాలోగాని నీటికాలువ రహదారులు లేవు. ఆంధ్రలో వున్న మాదిరిగా తెలంగాణాలో యింతవరకు చెప్పుకోదగ్గ నదీ ప్రాజెక్టులు ఏమీలేని కారణంగా రహదారులుగా ఉపయోగపడే కాలువలు కూడా లేవు. తెలంగాణానుండి ప్రవహించే నదులు ఎత్తు పల్లాలనుండి ప్రవహించడం, తత్ఫలితంగా నదుల ప్రవాహం విపరీత పోకడలు కలిగి వుండటం మూలంగా నదులుకూడా రహదారులుగా ఉపయోగ పడకుండా పోవుచున్నాయి.

పై రెండు రహదారులు గాక విమాన యాన సర్వీసుకూడా తెలంగాణాలో వున్నది. హైద్రాబాదు నగరంలో వున్న విమాన కేంద్రం విమాన సర్వీసు కూడలి మద్రాసునుండి నాగపూరు, ఢిల్లీ, బొంబాయి, బెంగళూరునుండి బొంబాయి, నాగపూరు, ఢిల్లీ వెళ్ళే విమాన సర్వీసులు హైద్రాబాదు నగర బేగంపేట విమానాశ్రయంలో దిగుతాయి. ఈ విమాన కేంద్రం పైలటు ట్రైనింగు కేంద్రంగా కూడా ఉపయోగపడుచున్నది.

రైల్వే రహదారులను చూచినప్పుడు కూడా హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలే కాకుండా వరంగల్లు జిల్లాలోగల కాజీపేటకూడా రైల్వే కూడలి. తెలంగాణాలో బ్రాడ్‌గేజ్, మీటర్‌గేజ్ లైనులు రెండూ వున్నవి. బ్రాడ్‌గేజ్ లైను వాడి, వికారాబాదు మీదుగా హైద్రాబాదు, సికింద్రాబాదు వరకు, అక్కడినుండి కాజీపేట రైల్వే కూడలి వరకు పోతుంది. కాజీపేటనుండి యీ లైను రెండుగాచీలి ఒకటి ఉత్తరదిశన బల్లార్షా మీదుగా వర్ధా, నాగపూరు, ఢిల్లీ చేరుతుంది. రెండవలైను దక్షిణదిశగా వెళ్ళి విజయవాడ, మద్రాసు వరకు వెడుతుంది. కాజీపేటనుండి విజయవాడ వెళ్ళే బ్రాడ్‌గేజ్ లైను డోర్నకల్లువద్ద చీలి ఒక లైను కొత్తగూడెం బొగ్గుగనులకు, రెండవలైను భద్రాచలం రోడ్డుకు వెడుతుంది. తెలంగాణాలో ఈ బ్రాడ్‌గేజ్ లైను మెదకు జిల్లాలోని వికారాబాదు, హైద్రాబాదు జిల్లా, నల్లగొండ జిల్లాలోని భువనగిరి, రామన్నపేట తాలూకాలనుండి వరంగల్లు చేరుతుంది. ఉత్తరాన కరీంనగ్గరం, ఆదిలాబాదు, దక్షిణాన వరంగల్లు, ఖమ్మం జిల్లాలనుండి వెడుతుంది. తెలంగాణాలో ఈ బ్రాడ్‌గేజ్ మొత్తంపొడవు 528 మైళ్లు వున్నది. స్టేటు మొత్తం బ్రాడ్‌గేజ్ లైను పొడవులో 76.7% వుంది.

బ్రాడ్‌గేజ్ లైనుతోపాటు తెలంగాణా మిగతా జిల్లాలనుండి వెళ్ళే మీటర్‌గేజ్ లైనుకూడా వుంది. ఈ లైను హైద్రాబాదు నగరం, కాచీగూడెం, సికింద్రాబాదులనుండి ప్రారంభమై రెండుగాచీలుతుంది; ఒకలైను ఉత్తరదిశగా

మెదక్, నిజామాబాదు జిల్లాలనుండి మరాఠ్వాడాలోని నాందేడు, ఔరంగాబాదు మీదుగా మన్మాడ్ రైల్వేకూడలికి చేరుకుంటుంది. ఈ లైనుకు ఆదిలాబాదునుండి ఒకలైను వచ్చి నాందేడు జిల్లాలోని ముధుఖేడ్ స్టేషనువద్ద కలుస్తుంది. ఇక మీటర్ గేజ్ రెండవలైను సికింద్రాబాద్, కాచీగూడెం స్టేషనులనుండి దక్షిణదిశగా మహబూబునగరం మీదుగా ఆంధ్రలోని కర్నూలుచేరి, అక్కడినుండి ద్రోణాచలం వెళ్లుతుంది. తెలంగాణాలో ఈ మీటరు గేజ్ లైను మొత్తంపొడవు 330 మైళ్ళు. మొత్తం స్టేటులోని మీటరుగేజ్ లైను పొడవులో 44% వుంది. ఈ రకంగా తెలంగాణాలో నలువైపులా అన్ని జిల్లాల గుండా వెళ్ళే రైలు మార్గాలున్నాయి. ఈ రైలుమార్గం మొత్తంపొడవు స్టేటు మొత్తం రైలుమార్గాల పొడవులో 59.7% వున్నది.

తెలంగాణా అన్ని జిల్లాలలో ఈ రైలు మార్గాలున్నప్పటికీ నల్లగొండజిల్లాలో ఒకటి రెండు తాలూకాలకు తప్ప నల్లగొండ జిల్లా కేంద్రానికి రైలుమార్గంలేదు. ఈ కారణంచేతనే నల్లగొండజిల్లా భువనగిరి తప్ప వ్యాపారవిషయాలలో చాలా వెనుకబడివున్నది. నైజాంకాలంలో ఆంధ్రలోని పల్నాడు తాలూకా మాచెర్లనుండి నల్లగొండ మీదుగా భువనగిరి బ్రాడ్ గేజ్ లైనును కలిపే ఒకలైను వేయాలని ఆలోచనచేశారు. ఈ ఆలోచననే నందికొండ ప్రాజెక్టు నిర్మాణంతోపాటు ఆచరించబోతున్నామని లాల్ బహదుర్ శాస్త్రి (కేంద్ర రైల్వేల మంత్రి) మార్చినెల పార్లమెంటు సమావేశంలో అన్నారు. స్టేటు రైల్వేల పరిస్థితినిగురించి ఆయన యింకా యిలా అన్నారు:

"హైదరాబాదు రాష్ట్రంలో రైల్వే మార్గాలుచాలా తక్కువగా వున్నాయి. ఖనిజసంపద, గొప్ప అటవిక సంపదలతో తులతూగుచున్న ఆదిలాబాదు, వరంగల్లు, కరీంనగరం జిల్లాలు రైల్వే మార్గాల విషయంలో యిప్పటికీ వెనుకబడివున్నాయి... నందికొండ ప్రాజెక్టు నిర్మాణం తరువాత నల్లగొండలో రైల్వేలైను నిర్మించితే ఆ ప్రాంతాలు బాగా అభివృద్ధి అవుతాయి. అలాగే కరీంనగరంలో రామగుండం థర్మలు విద్యుచ్ఛక్తి నిర్మాణం తర్వాత అక్కడ ఏర్పడబోయే పెద్ద పెద్ద పరిశ్రమలకు ఆ ప్రాంతంలో రైల్వే లైనుల నిర్మాణం ఎంతో అవసరం."

(దక్కను క్రానికల్, మార్చి 14, 1954)

తెలంగాణాలో వున్న మొత్తం రైల్వే మార్గాల పొడవును చూచినపుడు ప్రతి 100 చ॥ మైళ్ల విస్తీర్ణానికి 2.1 మైళ్ల రైల్వే లైను ఉన్నది. భారత యూనియనులో ప్రతి 100 చ॥ మైళ్ల విస్తీర్ణానికి 2.5 మైళ్లు వున్నది.

ఈ రైల్వే రహదారులపై వచ్చే ఆదాయం లెక్కలు స్టేటు మొత్తానికి వున్నవి తప్ప ప్రాంతీయ ప్రాతిపదికపైలేవు. అయినా తెలంగాణాలోవున్న మొత్తం రైలు మార్గాల పొడవునుబట్టి అంచనా లెక్కలు తీయవచ్చు.

1950-51 సం॥ ప్రభుత్వ లెక్కలనుబట్టి స్టేటులోని రైల్వేలపై మొత్తం ఆదాయం (Gross Inoome) 654.24 లక్షల రూపాయలు వచ్చింది. ఇందులోనుండి ఖర్చులన్నీ పోను నికరాదాయం 171,18 లక్ష

ఉన్నది. మొత్తం ఆదాయం ప్రతి సంవత్సరం పెరిగిపోతున్నా నికరాదాయం మాత్రం తగ్గిపోతున్నది. ఈ॥ 1949-50 లో మొత్తం ఆదాయం 647.81 లక్షలుండగా 1950-51 లో 654.24 లక్షలున్నది. కాని నికరాదాయం 1949-50 సం॥లో 187.35 లక్షలుండగా, 1950-51 సం॥లో 171.13 లక్షలు వున్నది. అనగా 16.22 లక్షలు తగ్గిపోయింది. రైళ్ళలో ప్రయాణం చేసేవారి సంఖ్య మాత్రం పెరుగుతూనే వున్నది. 1949-50 సం॥లో మొత్తం ప్రయాణం చేసినవారిసంఖ్య 255.97 లక్షలుండగా, 1950-51 సం॥లో మొత్తం ప్రయాణం చేసినవారి సంఖ్య 265.12 లక్షలున్నది. అనగా 1949-50 సంవత్సరానికన్న 1950-51 సం॥ లో 9.15 లక్షల మంది అదనంగా ప్రయాణం చేసినా మొత్తం ఆదాయం పెరిగినా నికరాదాయం మాత్రం 16.22 లక్షలు తగ్గినట్లు చూపబడింది.

ఇక 1950-51 సం॥ ప్రభుత్వ రైల్వే మొత్తం ఆదాయం 654.24 లక్షలు అన్నప్పుడు, ప్రతి మైలుకు సంవత్సరానికి రు. 45,496-8-0 లు ఆదాయం వచ్చినట్లు తెలుచున్నది. దీనినిబట్టి తెలంగాణాలో వున్న మొత్తం 858 మైళ్ళ పొడవు రైలు మార్గంపై వచ్చిన ఆదాయం యించుమించు 390.36లక్షలని అంచనావేయవచ్చు. రైల్వేలన్నీ కేంద్రప్రభుత్వంక్రిందికి పెళ్ళినందున ఈ ఆదాయం కూడా కేంద్రానికే పెళ్ళుచున్నది.

ఇక రహదారుల్లో రెండవ ప్రధాన భాగం రోడ్డు రవాణాశాఖక్రింద వున్నది. రోడ్డు రవాణా రెండు విధాలుగా వున్నదని చెప్పవచ్చు. ఒకటి ప్రయాణీకులకు సంబంధించినది. రెండవది వస్తు సామాగ్రి రవాణాకు చెందినది. ప్రయాణ సౌకర్యాలకు సంబంధించినంతవరకు, అక్కడక్కడ పిల్లరూట్లమీదతప్ప,ప్రభుత్వ రోడ్డురవాణా శాఖవారే బస్సురూట్లు నన్నిటిపై గుత్తాధికారం కలిగివున్నారని చెప్పవచ్చు. వస్తు సామాగ్రి రవాణా మాత్రం ప్రయివేటు మోటారు ట్రక్కులద్వారా ఎక్కువగా సాగుచున్నది. రోడ్డు రవాణాశాఖవారు కూడా కొన్ని ట్రక్కులు, లారీలు నడుపుచున్నారు.

ఈ ప్రభుత్వ బస్సు సర్వీసు పద్ధతిని మొట్ట మొదటిసారిగా రైల్వే శాఖవారు 1932 సం॥లో 27 బస్సులతో ప్రవేశపెట్టారు. 1937 సం॥ నాటికే ఈ సర్వీసు శాఖ బాగా అభివృద్ధి చెందినది. 1937 నాటికే 318 బస్సులు 4,000 రూటుమైళ్లపై పని చేయసాగినవి. 1951 నాటికి ఈరూటు మైళ్లు 5,204 మైళ్ళవరకు పెరిగినాయి. అనగాఈ మైళ్ళను ఒకే లైనులో పెడితే భారతదేశంనుండి ఇంగ్లాండుకు చేరుతుంది

అయితే పోలీసు యాక్షను జరిగి రైల్వే శాఖ కేంద్రప్రభుత్వం క్రిందికి చీలిపోయిన తరువాత, ఈ రోడ్డు రవాణాశాఖను స్టేటు ప్రభుత్వం తన అధీనంలోకి తీసుకున్నది.

ప్రస్తుతం తెలంగాణాలో మొత్తం 3427 మైళ్ళపొడవు రోడ్లు వున్నాయి. ఇందులో 2,781 మైళ్లు కంకరరోడ్లే. సిమెంటు, తారురోడ్లు మాత్రం హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలవరకే పరిమితమై వున్నాయి. తెలంగాణాలోని ఈ మొత్తం రోడ్ల మైళ్ళపొడవు (1952) తదితర వివరాలు క్రింది పట్టికలో వివరించబడ్డాయి.

| జిల్లా పేరు | కంకరరోడ్డు | మట్టిరోడ్డు | సిమెంటురోడ్డు | తారురోడ్డు | మొత్తం పొడవు |
|---|---|---|---|---|---|
| | మైళ్ళు | మైళ్ళు | మైళ్ళు | మైళ్ళు | మైళ్ళు |
| హైదరాబాదు ... | 216 | 67 | 42 | 10 | 335 |
| మహబూబ్‌నగరం ... | 464 | 190 | ... | ... | 654 |
| ఆదిలాబాదు ... | 306 | ... | ... | ... | 306 |
| నిజామాబాదు ... | 387 | 19 | ... | ... | 406 |
| మెదకు ... | 337 | 11 | ... | ... | 348 |
| కరీంనగరం ... | 305 | 68 | ... | ... | 373 |
| వరంగల్లు + ఖమ్మం ... | 452 | 42 | 2 | ... | 496 |
| నల్లగొండ ... | 314 | 195 | ... | ... | 509 |
| తెలంగాణా మొత్తం | 2,781 | 592 | 46 | 10 | 3,427 |
| స్టేటు మొత్తం ... | 5,369 | 746 | 52 | 10 | 6,176 |
| మొత్తంస్టేటు పొడవులో తెలంగాణాశాతం | 51. 8% | 79. 3% | ... | ... | 55. %5 |

స్టేట్‌లోని మొత్తం రోడ్ల పొడవులో తెలంగాణాలోని రోడ్ల పొడవు 55.5% ఉన్నది. తెలంగాణాలో ప్రతి నూరు చ॥ మైళ్ళకు 8.4 మైళ్ళ రోడ్డు వున్నట్లు తేలుతున్నది.

క్రింది పట్టికలో ఈరోడ్లమీద 1952-53 సంవత్సరపు ప్రభుత్వ లెక్కల ప్రకారం ఎన్ని బస్సులు, లారీలు, బండ్లు యిత్యాదులు తిరుగుతున్నారో ప్రక్క పేజీలోని పట్టిక వివరిస్తుంది.

తెలంగాణా జిల్లాలలో ప్రభుత్వ రోడ్డు రవాణా శాఖ వారు నడిపే ప్రయాణ బస్సులు మొత్తం 1084 వున్నాయి. ఇందులో 881 హైద్రాబాదు, సికింద్రాబాద్ నగరాలలోనే వున్నాయి. ఇక మిగతా జిల్లాలలో చూచినప్పుడు నల్లగొండ, మహబూబు నగరం, నిజామాబాదులలో ఎక్కువగా వున్నాయి. ఈ జిల్లాలలో కేంద్ర రోడ్డు రవాణా శాఖ యొక్క ఉప శాఖలు ఏర్పడి పనిచేస్తున్నాయి. అయితే ఈ ఉపశాఖల క్రింద నడిచే బస్సులపై వచ్చే ఆదాయంమాత్రం ఎప్పటి కప్పుడు కేంద్ర శాఖకు పంపుతూనే వుండాలి.

1951 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం సర్వీసులోవున్న మొత్తం స్టేటు బస్సులలో 540.55 లక్షలమంది ప్రయాణంచేసినట్లు వున్నది. అనగా స్టేటుజనాభాకు దాదాపు 3 రెట్ల ప్రజలు ఈ బస్సులలో ప్రయాణం చేశారనవచ్చు.

అయితే ఈ ప్రయాణీకుల లెక్కలు ప్రాంతీయ ప్రాతిపదికపై లభ్యంకాలేదు. పై లెక్కల ప్రకారమే ఈ బస్సుసర్వీసుపై 272.51 లక్షల రూపాయలు మొత్తం ఆదాయము (Gross income) వచ్చింది. అయితే 213.37 లక్షలు వివిధ హారకాలక్రింద ఖర్చుఅయినట్లు, నికరాదాయం 59.14 లక్షలే అయినట్లు ప్రభుత్వ లెక్కలనుండి బోధపడుతున్నది. వచ్చిన మొత్తం ఆదాయాన్నిబట్టి ప్రతిమైలుకు యించుమించు 5,236 రూపాయల ఆదాయం వచ్చినట్లు తేలుచున్నది. తెలంగాణాలో 1951 సంవత్సరం ప్రభుత్వ లెక్కల ప్రకారమే 3016 మైళ్ళ పొడవు రోడ్లున్నాయి. అనగా తెలంగాణా ప్రాంతం ఆదాయం 157.93 లక్షలు వుండి వుంటుంది. అయితే వున్న రోడ్లన్నీ బస్సుసర్వీసుక్రింద రూటు మైళ్లే కాకపోవచ్చు. ఉదాహరణకు 1951 సంవత్సరంలో స్టేటు మొత్తంలో 5488 మైళ్ల రోడ్డు వుండగా బస్సుసర్వీసు క్రింద వున్న రూటు మైళ్లు 5204. ఆరకంగా తెలంగాణా రోడ్లపైవచ్చే మొత్తం ఆదాయాన్ని చూచినప్పుడు తెలంగాణాలోని ప్రతి ఒక్కరు సంవత్సరానికి బస్సు కిరాయిల క్రింద 1.6 రూపాయీలు చెల్లించుచున్నారని చెప్పవచ్చు.

రోడ్డు రవానాశాఖ ఆదాయం ప్రతి సంవత్సరం పెరుగుతూనేవున్నా, ప్రయాణీకుల బస్సుచార్జీలు మాత్రం తగ్గడంలేదు. మైలుకు అణాచొప్పున బస్సు చార్జీలు విధించడం ప్రయాణీకులపై విపరీత భారం వేయటమే. ఇంత విపరీత చార్జీలు మరెక్కడా లేవు.

ప్రభుత్వం నడిపే ఈ బస్సు సర్వీసులు, వాటి రూట్లు స్టేట్ వైశాల్యం దృష్ట్యా చాలా పరిమితంగానే వున్నాయని చెప్పక తప్పదు. రోడ్లుగానీ, బస్సులుగానీ మరీ ఎక్కువైతే జిల్లాలలో వున్న తాలూకా

| జిల్లా పేరు | 1951 లో ఎద్దుల బండ్లు | 1952-'53 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం మోటారు శకటాలు | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | ప్రభుత్వ ఆర్. టి. డి. బస్సులు | ట్రక్కులు అండ్ లారీలు | కిరాయి మోటారు కార్లు | స్వంత మోటారు కార్లు | మోటారు సైకిళ్ళు | మొత్తం మోటారు బండ్లు | కార్లు నడిపే లైసెన్సుల సంఖ్య |
| హైదరాబాదు | 13,569 | 881 | 1,742 | 196 | 5,504 | 2,010 | 10,333 | 14,389 |
| మహబూబ్‌నగరం | 39,729 | 52 | 83 | 7 | 182 | 38 | 362 | 571 |
| ఆదిలాబాదు | 64,322 | 1 | 57 | ... | 5 | 1 | 64 | 57 |
| నిజామాబాదు | 43,522 | 41 | 169 | 13 | 165 | 59 | 447 | 589 |
| మెదకు | 27,448 | 3 | 64 | 3 | 107 | 35 | 212 | 98 |
| కరీంనగరం | 72,670 | 16 | 67 | ... | 24 | 125 | 282 | 390 |
| * వరంగల్లు + ఖమ్మం | 55,805 | 31 | 157 | 22 | 201 | 36 | 447 | ... |
| నల్లగొండ | 42,441 | 59 | 62 | 2 | 87 | 19 | 229 | 443 |
| తెలంగాణా మొత్తం | 3,59,006 | 1,084 | 2,401 | 243 | 6,275 | 2,323 | 12,326 | 16,532 |
| స్టేటు మొత్తం | 6,60,086 | 1,467 | 3,195 | 383 | 7,183 | 2,555 | 14,783 | 19,204 |

* 1952-'53 లెక్కలు లభ్యం కానందున 1949-'50 లెక్కలే ఇవ్వబడ్డాయి.

కేంద్రాలను ఒక దానితో మరొకదానిని కలిపే అంతవరకే పరిమితమై వున్నాయి. ఆదిలాబాదు, కరీంనగరు జిల్లాలలో ఈ మాత్రంకూడా లేవు.

పైనచూపిన రోడ్లపై 1952–53 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం 3.59 లక్షల ఎద్దులబండ్లు, 1084 ఆర్. టి. డి. బస్సులు, 2401 ట్రక్కులు, లారీలు, 248 కిరాయి కార్లు, 6275 స్వంతకార్లు, 2328 మోటారు సైకిళ్ళు తిరిగినట్లు తేలింది. 1131 వ పేజీ లోని పట్టికలో వీటిజిల్లాలవారీ వివరాలు ఇవ్వబడ్డాయి.



# విద్య

తెలంగాణా విద్యా విషయాలలో చాలా వెనుకబడివున్నది. మొత్తం స్టేటుతో పోల్చి చూచినా తెలంగాణా ప్రాంతం వెనుకబడివున్నది. జనాభాలో నూటికి 9 మంది మాత్రమే అక్షరాస్యులు. జనాభాలో పురుషులు, స్త్రీలు దాదాపు సమానంగా వున్నా, అక్షరాస్యతలో మగవారు 15.1 శాతంవుంటే, స్త్రీలు 3 శాతం మాత్రమే ఉన్నారు. వ్యవసాయ వృత్తిగల వారి అక్షరాస్యతి 5.3 శాతం మాత్రమే. మిగతా వృత్తులవారి అక్షరాస్యత శాతం 17.5 వున్నది. అలాగే గ్రామీణ జనాభా కన్నా పట్టణ జనాభాలో అక్షరాస్యులు అధికంగా వున్నారు.

ప్రక్క పేజీలోని పట్టికలో, 1951 వ సంవత్సరం జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యుల జిల్లావారీ వివరాలు ఇవ్వబడ్డాయి.

ఒక కోటికి మించిన తెలంగాణా జనాభాలో 9,72,230 మంది మాత్రమే చదువుకున్నవారున్నారు. 1951 జనాభా లెక్కల సేకరణ సమయంలో మామూలుగా చదువను, వ్రాయను వచ్చినవారు లేక ఈ రెంటిలో ఏదో ఒకటి వచ్చినవారు మొదలుకొని నాల్గవ తరగతి చదువుకున్న వారివరకు "అక్షరాస్యులు"గా పరిగణించబడ్డారు. అంతకుపైబడి చదువుకున్న వారిని "ఉన్నతవిద్యలవారి" క్రింద లెక్కకట్టారు. ఈ విభజన ప్రకారం "అక్షరాస్యుల" సంఖ్య 8,18,701 వున్నది. సెకండరీ విద్యకు పైబడిన విద్యావంతులు ("ఉన్నత విద్యలవారు") 1,53,529 మంది మాత్రమే. అంటే వీరు, తెలంగాణాలోని మొత్తం అక్షరాస్యులలో దాదాపు నూటికి 15.7 మంది మాత్రమే ఉన్నారు. వీరిలో సగానికి పైగా ఒక్క హైద్రాబాదు జిల్లాలోనే ఉన్నారు. వీరిలో అధికులు తెలుగు మాతృభాష కానివారే!

1952-53 సంవత్సర ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలంగాణా 9 జిల్లాలలో అన్ని రకాల విద్యాలయాలుకలసి మొత్తం 5,190 ఉన్నాయి. ఇందులోవిద్యనభ్యసించే విద్యార్థుల సంఖ్య 4,91,048. అనగా జనాభాలో ఈ విద్యార్థుల సంఖ్య నూటికి 5 గురుకన్నా తక్కువే. ఈ సెకండరీ విద్యకాక తెలంగాణాలో మొత్తం 19 కళాశాలలున్నాయి. ఇందులో విద్య నభ్యసించేవారి సంఖ్య 1951-52 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం 10,203 అనగా జనాభాలో ఈ విద్యార్థుల సంఖ్య 0.09 శాతం మాత్రమే. మొత్తం కళాశాల విద్యార్థుల్లో విద్యార్థినుల సంఖ్య 1200 అనగా, నూటికి వీరు 11 మంది మాత్రమే.

మొత్తం తెలంగాణాలోవున్న 96 ఉన్నత పాఠశాలల్లో ఒక్క హైద్రాబాదు జిల్లాలోనే 62 ఉన్నాయి. మిగతా

| జిల్లా పేరు | గ్రామీణ జనాభా | | | పట్టణ జనాభా | | | మొత్తం జనాభా | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తం |
| హైదరాబాదు | 18,235 | 1,981 | 20,216 | 2,53,366 | 1,08,048 | 3,61,414 | 2,71,601 | 1,10,029 | 3,81,630 |
| మహబూబునగరం | 53,433 | 5,775 | 59,208 | 20,277 | 4,984 | 25,261 | 73,710 | 10,759 | 84,469 |
| ఆదిలాబాదు | 25,931 | 2,882 | 28,813 | 18,475 | 4,374 | 22,849 | 44,406 | 6,756 | 51,162 |
| నిజామాబాదు | 30,735 | 3,503 | 34,238 | 18,134 | 4,684 | 22,818 | 48,869 | 8,187 | 57,056 |
| మెదకు | 50,341 | 3,333 | 53,674 | 14,381 | 3,653 | 18,034 | 64,722 | 6,986 | 71,708 |
| కరీంనగరం | 62,651 | 4,724 | 67,375 | 22,819 | 6,535 | 29,354 | 85,470 | 11,259 | 96,729 |
| వరంగల్లు+ఖమ్మం | 57,036 | 8,287 | 65,323 | 51,482 | 14,492 | 65,974 | 1,08,518 | 22,779 | 1,31,297 |
| నల్లగొండ | 63,181 | 6,635 | 69,816 | 22,188 | 6,165 | 28,353 | 85,369 | 12,800 | 98,179 |
| తెలంగాణా మొత్తం | 3,61,543 | 36,620 | 3,98,163 | 4,21,122 | 1,52,935 | 5,74,057 | 7,82,666 | 1,89,555 | 9,72,230 |
| స్టేటు మొత్తం | 7,97,418 | 72,759 | 8,70,177 | 6,56,088 | 2,12,493 | 8,68,576 | 14,53,501 | 2,85,252 | 17,38,758 |

35,96,437 జనాభాగల 8 జిల్లాలలోని 59 తాలూకాలలో 34 ఉన్నత పాఠశాలలు మాత్రమే వున్నాయి. తెలంగాణాలోవున్న కళాశాలలను చూచినప్పుడు, వరంగల్లులో వున్న ఒక సెకండరీ గ్రేడు కళాశాలతప్ప మిగతా కళాశాలలన్నీ హైద్రాబాదు నగరంలోనేవున్నాయి. ఈ కళాశాలల్లో స్టేటులోని అన్ని ప్రాంతాల విద్యార్థులుంటారు. 1951 జనాభా లెక్కల ప్రకారం ఇంటరు మీడియేటువరకు చదువుకున్న వారి నుండి, గ్రాడ్యుయేట్లు, పోస్టు గ్రాడ్యుయేట్లు, వ్యవసాయ, పశువైద్య, కామర్సు, న్యాయవృత్తి, వైద్యం, యితర విద్యలు నేర్చుకున్న వారు, తెలంగాణాలో మొత్తం 33,625 మంది వుండగా, ఒక్క హైదరాబాదుజిల్లా, ముఖ్యంగా హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలోనే వీరు 23,636 మంది వున్నారు. అంటే మొత్తం తెలంగాణా వున్నత విద్యావంతుల్లో ఒక్క హైదరాబాదుజిల్లాలోనే నూటికి 70 మంది ఉన్నారు. తెలంగాణా జిల్లాలలో కళాశాలలు లేనికారణంగా, హైద్రాబాదు నగరానికివచ్చి చదువుకోగల స్తోమత తెలంగాణాలో వున్న ఆర్థిక వ్యవస్థనుబట్టి జాగీర్దార్ల, భూస్వాముల, వ్యాపారస్తుల బిడ్డలకేతప్ప, యితర వర్గాల ప్రజలకులేదు. కాంగ్రెసు పాలన ఏర్పడి 5 సంవత్సరాలు గడిచినా, తెలంగాణా జిల్లాలలో ఒక్క అదనపు కళాశాలనైనా నిర్మించకపోగా, వరంగల్లులోవున్న సెకండరీగ్రేడు కళాశాలను ఫస్టుగ్రేడ్ కళాశాలగాకూడా మార్చలేకపోయింది.

విద్యా విషయ్యాలలో జిల్లాలవారీగా చూచినప్పుడు వరంగల్లు, నల్లగొండ, కరీంనగరం, మహబూబునగరం జిల్లాలు మిగతా జిల్లాలకంటె ముందున్నాయి. విద్యావంతుల సంఖ్యలో ఈ జిల్లాలే ముందున్నాయి. ఆదిలాబాదుజిల్లా ఒక్క తెలంగాణాయే కాక మొత్తం స్టేటులో, వెనుకబడివున్నది.

కరీంనగరంజిల్లా 852 అన్ని రకాల విద్యాలయాలతో తెలంగాణాలో ప్రథమస్థానం ఆక్రమించుతుంది. కాని ఈ జిల్లాలోకూడా నూటికి యించుమించు 7 గురు మాత్రమే చదువుకున్న వారున్నారు. నల్లగొండ విద్యాలయాలలో రెండవస్థానం ఆక్రమించుచున్నది. మొత్తం 850 విద్యాలయాలున్నాయి. ఈ జిల్లాలో నూటికి చదువుకున్నవారి సంఖ్య దాదాపు 8 వున్నది. వరంగల్లు, ఖమ్మం జిల్లాలలో మొత్తం 867 పాఠశాలలున్నాయి. ఇక్కడ నూటికి 6 గురు చదువుకున్న వారున్నారు. మహబూబునగరంలో నూటికి 7 గురు చదువుకున్న వారున్నారు. ఇక విద్యా విషయంలో వెనుకబడివున్న 11 తాలూకాలు గల ఆదిలాబాదులో 399 పాఠశాలలు మాత్రమే వున్నాయి. ఇందులో 8 మాధ్యమిక పాఠశాలలు, 3 ఉన్నత పాఠశాలలు మాత్రమే వున్నాయి. ఆదిలాబాదు 9,02,522 మంది జనాభాలో చదువుకున్న వారి సంఖ్య 51,162 మాత్రమే. అనగా నూటికి దాదాపు 5 గురు మాత్రమే చదువుకున్న వారున్నారు.

# ప్రాథమికవిద్య

1952-53 సం॥ ప్రభుత్వలెక్కల ప్రకారం తెలంగాణాజిల్లాలలో 4,977 ప్రాథమిక పాఠశాలల్లో మొత్తం 3,71,096 మంది బాల, బాలికలు హాజరవుతున్నారు. ప్రక్క పేజీలోని పట్టికలో జిల్లాలవారీ ప్రాథమిక విద్యాలయాలు, వాటికి హాజరవుతున్న విద్యార్థులసంఖ్య, తదితర వివరాలు ఇవ్వబడ్డాయి.

1951-52వ సంవత్సరంలో పాఠశాలలకు హాజరవుతున్న విద్యార్థులకన్న 1952-53 వ సంవత్సరంలో 39 వేల మంది అధికంగా హాజరవుతున్నారు. హాజరవుతున్న మొత్తం బాలబాలికలలో, బాలురు షుమారు 3,31,096 మంది, బాలికలు షుమారు 40,000 మంది వున్నారు. ప్రాథమిక పాఠశాలల్లో విద్యనభ్యసించే బాలుర సంఖ్య మొత్తం తెలంగాణాలోని పురుషుల జనాభాలో షుమారు 6% మాత్రమే. అలాగే విద్య గడించే బాలికల సంఖ్య మొత్తం తెలంగాణా స్త్రీ జనాభాలో 0.8% మాత్రమే. అయితే ప్రభుత్వం చూపే యీ లెక్కలు స్కూళ్ళ యిన్‌స్పెక్టర్ల అంచనాలే గనుక, ఇవి ఖచ్చితమైన అంచనాలు కావు.

ప్రాథమిక విద్యాలయాలలో, నల్లగొండ, కరీంనగరం జిల్లాలు ముందున్నాయి. నల్లగొండలో 834 పాఠశాలల్లో 55,163 మంది విద్యార్థులు, కరీంనగరంలో 831 పాఠశాలల్లో 49,930 మంది విద్యార్థులున్నారు. అయినా నల్లగొండ జనాభాలో వీరి సంఖ్య నూటికి షుమారు 4.4, కరీంగరంజిల్లా జనాభాలో వీరిసంఖ్య నూటికి 3.4 మాత్రమే ఉన్నది.

ఆదిలాబాదు, మెదకు, నిజామాబాదు జిల్లాలు యితర జిల్లాలకంటే ప్రాథమిక విద్యా విషయాలలో వెనుకబడివున్నాయి. ఆదిలాబాదు జిల్లా జనాభాలో ప్రాథమికవిద్య నభ్యసించే వారిసంఖ్య నూటికి 2.5 మాత్రమే వుంది. నిజామాబాదుజిల్లా జనాభాలో వీరిసంఖ్య నూటికి 2.8 వున్నది. మెదకు జనాభాలో నూటికి 3.4 మంది వున్నారు.

ఆంధ్రలో మొత్తం 16,795 ప్రాథమిక పాఠశాలల్లో 15,05,946 మంది విద్యార్థులుంటే, తెలంగాణాలో మొత్తం 4,977 పాఠశాలల్లో 3,71,096 మంది విద్యార్థులున్నారు. అనగా తెలంగాణాలో ఆంధ్రలోఉన్న పాఠశాలల్లో యించుమించు 4 వ వంతు, చదువుతున్న విద్యార్థుల్లో 4 వ వంతుకన్నా తక్కువే వున్నారు. జిల్లాలవారీ జనాభాలో నూటికి ప్రాథమిక విద్య నభ్యసించేవారి సంఖ్య ఆంధ్రకన్నా తెలంగాణాలో చాలా తక్కువగా వుంది. తెలంగాణాలో నల్లగొండజిల్లా ప్రాథమిక విద్యాభ్యాసంలో ముందున్నది. ఆంధ్రలో పశ్చిమగోదావరిజిల్లా ముందున్నది. అయితే నల్లగొండలో మొత్తం జనాభాలో ప్రాథమిక విద్యాలయాలలో చదువుతున్న విద్యార్థులు నూటికి 4.4 మంది వుంటే, పశ్చిమ గోదావరిలో నూటికి 12.5 మంది వున్నారు. అలాగే ఆంధ్రకన్నా తెలంగాణాలో ప్రాథమికవిద్య నభ్యసించే బాలికలసంఖ్య చాలా తక్కువ. ఆంధ్రలో ప్రాథమిక పాఠశాలలలో చదువుతున్న విద్యార్థినులు మొత్తం 5,68,741 మంది వుండగా, తెలం

| జిల్లా పేరు | ప్రభుత్వ పాఠశాలలు | | ఎయిడెడ్ పాఠశాలలు | మొత్తం పాఠశాలలు | చదువుతున్న మొత్తం విద్యార్థి విద్యార్థినులు | 1952-53కు అంచనా వేసిన ఖర్చు (రూపాయిలలో) |
|---|---|---|---|---|---|---|
| | విద్యార్థులవి | విద్యార్థినులవి | | | | |
| హైదరాబాదు ... | 326 | 137 | 41 | 504 | 75,908 | 30,05,739 |
| మహబూబ్‌నగరం ... | 572 | 68 | 1 | 641 | 47,934 | 13,72,482 |
| ఆదిలాబాదు ... | 357 | 30 | 1 | 388 | 22,654 | 10,87,645 |
| నిజామాబాదు ... | 377 | 62 | 2 | 441 | 22,339 | 10,94,893 |
| మెదకు ... | 439 | 60 | ... | 499 | 34,814 | 10,55,454 |
| కరీంనగరం ... | 761 | 69 | 1 | 831 | 49,930 | 17,67,278 |
| వరంగల్లు ... | 753 | 73 | 13 | 839 | 62,354 | 31,42,648 |
| నల్లగొండ ... | 750 | 74 | 10 | 834 | 55,163 | 22,17,391 |
| తెలంగాణా మొత్తం ... | 4,335 | 573 | 69 | 4,977 | 3,71,096 | 1,47,43,530 |
| స్టేటు మొత్తం ... | 7,984 | 1,035 | 88 | 10,597 | 6,89,696 | 2,53,68,183 |

గాణాలో షుమారు 40,000మంది మాత్రమే వున్నారు.

ప్రాథమిక విద్యపై ఎయిడెడ్ పాఠశాలలతో సహా 1952-53 సం॥ ప్రభుత్వ అంచనా లెక్కల ప్రకారం మొత్తం 1,47,43,580 రూపాయీలు ఖర్చు అయ్యాయి. అనగా ప్రతి ప్రాథమిక పాఠశాలా విద్యార్థికి ప్రభుత్వం సంవత్సరానికి రూ॥ 39.7లు ఖర్చు చేస్తున్నది. 1952-53లో ప్రభుత్వ లెక్కల ప్రకారం మొత్తం స్టేటులో ప్రాథమిక పాఠశాలా విద్యార్థులనుండి 12 వేలు ప్రభుత్వం వసూలు చేసింది.

పైన ఉదహరించిన ప్రాథమిక పాఠశాలలు గాక, స్టేటులోని ప్రతి [illegible] 20 గ్రామాలతో కూడిన గ్రామ సముదాయాలలోనూ, హైదరాబాదు నగరంలో రెండు వార్డులలోనూ, సికిందరాబాదు నగరంలో కొంతభాగంలోను నిర్బంధ ప్రాథమిక విద్య ప్రవేశ పెట్టబడింది. అక్టోబరు, 1953 లో ఈ నిర్బంధ ప్రాథమిక విద్య గురించి ఒక చట్టం కూడా చేయబడింది. దీని ప్రకారం వరంగల్లు, ఖమ్మం జిల్లాలలో 13 ప్రాంతాలలోనూ, హైదరాబాదు జిల్లాలో 4 ప్రాంతాలలోనూ, మెదకులో 5 ప్రాంతాలలోనూ, హైదరాబాదు నగరంలో మునిసిపల్ ప్లాను నెం.2,3లలోనూ, నిజామాబాదులో 22 ప్రాంతాలలోనూ ఈ చట్టం అమలు జరుపబడుచున్నట్లు ప్రభుత్వ ప్రకటనలు తెలుపుతున్నాయి.

తెలంగాణాలోని ప్రాథమిక పాఠశాలల్లో మొత్తం 9,901 మంది ఉపాధ్యాయులు పనిచేస్తున్నారు. వీరిలో 8,476 మంది ఉపాధ్యాయులు, 1,425 మంది ఉపాధ్యాయినులు వున్నారు.

## సెకండరీ విద్య

1952-53 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం తెలంగాణా అన్ని జిల్లాలలోని మొత్తం 213 సెకండరీ పాఠశాలల్లో 1,19,947 మంది విద్యార్థులు విద్య నభ్యసించుచున్నారు. ఇందులో షుమారు 1,00,000 మంది విద్యార్థులు, 19,947 మంది విద్యార్థినులు వుంటారు. [స్టేటు మొత్తం సెకండరీ విద్యార్థినుల సంఖ్య 36,678]

తెలంగాణా మొత్తం జనాభాలో సెకండరీ విద్య నభ్యసించేవారి సంఖ్య నూటికి 1.1 మాత్రమే. మొత్తం జనాభాలోని స్త్రీ, పురుషులలో సెకండరీ విద్య నభ్యసించువారి శాతం పరిశీలించితే, ప్రతి 100 మంది పురుషులలో దాదాపు యిద్దరు [1.95%], మరియు ప్రతి 500 మంది స్త్రీలలో యిద్దరు మాత్రమే సెకండరీ విద్య నభ్యసించారు.

1948-49 సంవత్సరంనుండి 1952-53 సంవత్సరం నాటికి మొత్తం స్టేటులోని సెకండరీ విద్యాలయాల సంఖ్య పెరిగింది. 1948-49 సం॥లో 273 పాఠశాలలుండగా 1952-53 సం॥ నాటికి 386 పాఠశాలలున్నాయి. అలాగే విద్యార్థుల సంఖ్య కూడా పెరిగింది. తెలంగాణాలో యించుమించు 48 వేల మంది ప్రజలకు ఒక సెకండరీ పాఠశాల కలదు. కాని ఒక్క హైద్రాబాదు జిల్లాలోనే అనగా హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాల్లో 94 పాఠశాలలు; అనగా తెలంగాణాలోని మొత్తం పాఠ

శాలల్లో షుమారు సగానికి కొంచెం తక్కువగా వున్నాయి.

సెకండరీ విద్యలో హైదరాబాదు నగరంపోను మహబూబునగరం,కరీంనగరం, నల్లగొండ జిల్లాలు ముందున్నాయి. మెదకు ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలు వెనుకబడి వున్నాయి.

పైన పేర్కొన్న మొత్తం సెకండరీ పాఠశాలల్లో 60 ఎయిడెడ్ పాఠశాలలు వున్నాయి.

ఈ సెకండరీ విద్యపై 1952-53 సం॥ ప్రభుత్వలెక్కలప్రకారం రు 35,23,159లు ఖర్చు చేస్తున్నది.

అనగా ప్రభుత్వ, మరియు ప్రభుత్వేతర సెకండరీ పాఠశాలలలో విద్య నభ్యసించే ప్రతి విద్యార్థిపై రు 83.4 ఖర్చు చేయబడుతున్నది. ప్రభుత్వ సెకండరీ పాఠశాలల్లోని విద్యార్థిపై ప్రభుత్వం చేసే ఖర్చు ఈ క్రింది విధంగా వుంది :-

ప్రభుత్వ పాఠశాలలోని

| | | |
|---|---|---|
| | విద్యార్థిపై | 75.8 |
| ,, | విద్యార్థినిపై | 114.00 |

ప్రభుత్వేతర పాఠశాలలలోని విద్యార్థిపై ప్రభుత్వ ఖర్చు యీ విధంగా వుంది :-

| | |
|---|---|
| విద్యార్థిపై | 92.19 |
| విద్యార్థినిపై | 82.31 |

సెకండరీ పాఠశాలల విద్యార్థుల సగటు ఫీజు రేట్లు సంవత్సరానికి 9 వ తరగతి వరకు రు 14-0-0, స్కూలు ఫయినలు విద్యార్థికి సంవత్సరానికి రు 26-0-0 లు యిచ్చుకోవాల్సి వస్తున్నది. ఈ రకంగా విద్యార్థులనుండి వచ్చే ఆదాయం 1952-53 లో రు 3.73 లక్షలు, 1953-54 లో రు 4.30 లక్షలు వున్నట్లు 1954-55 ప్రభుత్వ బడ్జెటు లెక్కలు తెల్పుతున్నాయి.

ఈ సెకండరీ పాఠశాలల్లో పని చేస్తున్న మొత్తం 1,632 మంది ఉపాధ్యాయుల్లో 1,289 మంది మగవారు, 343 మంది స్త్రీలు. వీరిలో అధికభాగం కొత్తగా చేర్చుకున్న వారున్నందున, విద్యాబోధనా స్థాయిని పెంచేందుకు ప్రభుత్వం వివిధ ప్రదేశాలలో ఉపాధ్యాయుల శిక్షణకు కేంద్రాలను,ట్రయినింగు స్కూళ్లను ఏర్పాటు చేసింది. ఉన్నత పాఠశాలల్లో కూడ ఇలాంటిశిక్షణకు అవకాశాలుకల్పించబడ్డాయి. గృహ నిర్వాహణ శాస్త్రంలో ఉపాధ్యాయినులకు శిక్షణ యివ్వటానికి ఒక స్త్రీ శిక్షణ కళాశాల నిర్మించబడింది.

మొత్తం స్టేటులో హైదరాబాదు నగరంలో వున్న శిక్షణ కళాశాలలుకాక, ఉపాధ్యాయులకు శిక్షణయిచ్చే 10 శిక్షణ సంస్థ లున్నాయి. ఇందులో 7 ప్రభుత్వ ఆధీనంలో వున్నాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయంక్రిందవున్న శిక్షణ కళాశాల బి. ఎ., యం. ఎ., డిగ్రీలుకూడా యిస్తుంది. ప్రాంతీయ భాషలలో శిక్షణ యిచ్చే మరో ప్రభుత్వ శిక్షణకళాశాల వుంది. ఇందులో ఇంటరుమీడియెటు, స్కూల్ ఫయినల్ చదువుతున్న వారికి ఉపాధ్యాయ శిక్షణ యివ్వబడుతుంది. స్త్రీలకొరకు ప్రత్యేకించబడిన కేంద్ర శిక్షణ కళాశాలకూడా వుంది. ఈ శిక్షణ కేంద్రాలలో వరంగల్లులో వున్న ఒక్కటి మినహా, మిగతావి హైదరాబాదునగరం లోనే వున్నాయి.

# ఉన్నత విద్య

తెలంగాణాలో మొత్తం 13 కళాశాలలు (Arts & Science Colleges) మరియు 6 వృత్తికళాశాల లున్నాయి. ఇందులో హైదరాబాదు వివేకవర్ధనీ కళాశాల, బద్రుకా కామర్సుకళాశాల, ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధ సంస్థలుగాను, మిగతా 11 ఆర్ట్సు, సైన్సు కళాశాలలు, 6వృత్తికళాశాలలు విశ్వ విద్యాలయం యొక్క శాఖలుగాను వున్నాయి. ప్రక్క పేజిలోని పట్టికలో తెలంగాణాలో ఉన్న వివిధ కళాశాలలు, వాటిలో చదువుతున్న విద్యార్థుల వివరాలు ఇవ్వబడ్డాయి.

ఉన్న కళాశాలల్లో ఒక్క వరంగల్లులో వున్న సికింద్రాబాదు కళాశాల తప్ప, మిగతావన్నీ ఒక్క హైదరాబాదు, సికింద్రాబాదు నగరాల్లోనే కేంద్రీకరింపబడి వున్నాయి. ఈ నగరాల్లోని ఈ కళాశాలల్లో స్టేటులోని అన్ని ప్రాంతాలవారు విద్య నభ్యసించుతారు. హైదరాబాదు, సికిందరాబాదులలోనుండి చదివేవారిలో ఎక్కువమంది తెలుగు మాతృ భాషగా కలవారే! 5 మరాఠ్వాడాజిల్లాలలో 3 కళాశాలలు, కర్నాటక జిల్లాలలో ఒక కళాశాల వుంది.

తెలంగాణాలో వున్న 19 కళాశాలల్లో 1951-52 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం 10,203 మంది విద్యార్థులు విద్య నభ్యసించారు. ఇందులో విద్యార్థులు 9,004 మంది, విద్యార్థినులు 1,199 మంది వున్నారు 13 ఆర్ట్సు, సైన్సు కళాశాలల విద్యార్థుల సంఖ్య 7253, విద్యార్థినుల సంఖ్య 1,072. వృత్తి కళాశాలల విద్యార్థుల సంఖ్య. 1,751, విద్యార్థినుల సంఖ్య 127 ఉన్నది.

హైదరాబాదు నగరంలో ఉన్న ఆరు వృత్తి కళాశాలల్లో ఒకటి వ్యవసాయ కళాశాల, ఒకటి పశువైద్యశాల, ఒకటి ఇంజనీరింగు కళాశాల, ఒకటి ట్రెయినింగు కళాశాల, ఒకటి లా కళాశాల, ఒకటి వైద్య కళాశాల. వీటి వివరాలు 1142 వ పేజిలోని పట్టికలో వివరించబడ్డాయి.

వృత్తి విద్యా కళాశాలలపై 1952-53వ సంవత్సర విశ్వవిద్యాలయ బడ్జెట్ లెక్కల ప్రకారం రు 75,70,000 లు ఖర్చు చేయబడుతున్నది. ఈ కళాశాలల ద్వారా విశ్వవిద్యాలయానికి వచ్చే రాబడి రు 15,70,000 లు. ప్రభుత్వ గ్రాంటు రు 60,000 లు.

అయితే దీనికి కారణం లేకపోలేదు. నైజాం ముస్లిం ప్రజలనుండి పాలకవర్గాన్ని తయారుచేసే దృష్టితో, ఇతర భాషల వారిని ఉన్నత విద్యలో ముందుకు రాకుండా చేయుటకు ప్రయత్నించాడు. ఇందులకై యితర రాష్ట్రాలలోవలె ప్రయివేటు కళాశాలలు స్థాపించే అవకాశం లేకుండా చేశాడు. ప్రభుత్వమే హైదరాబాదు సిటీలో కాలేజీలలో అధిక భాగాన్ని కేంద్రీకరించింది. ఇందులో పరిపాలక వర్గాన్ని తయారుచేసే దృష్టితో కొంత వరకు ఎక్కువ ఖర్చుతో ఉన్నత విద్యను ఏర్పాటు చేసింది. ఇందులకై వుదారంగా గ్రాంటుల నిచ్చింది. పోలీసు యాక్షను తర్వాత గోపాలాచారి కమిటీ సూచనలనుబట్టి ఈ గ్రాంటుల్లో కొంత తగ్గించడం

| హైదరాబాదు నగరంలోవున్న కళాశాలల పేరు | చెప్పబడే కోర్సులు | 1951-'52 లో విద్యార్థులు | | |
|---|---|---|---|---|
| | | విద్యార్థులు | విద్యార్థినులు | మొత్తం |
| 1. ఆర్ట్సు మరియు కామర్సు విశ్వవిద్యాలయం | బి. ఎ.; యం. ఎ; పి. హెచ్.డి; బి. కాం. ఫ్రెంచి, జర్మనుభాష డిప్లమా | 885 | 69 | 954 |
| 2. సైన్సుకళాశాల | ఇ. యస్ సి; బి.యస్‌సి; ఎం.ఎస్‌సి., పి. హెచ్.డి. | 767 | 23 | 790 |
| 3. నిజాంకళాశాల | ఇ. ఎ; బి. ఎ; యం .ఎ; ఇ.యస్‌సి.; బి.యస్‌సి.; బి.కాం. | 1133 | 130 | 1263 |
| 4. స్త్రీల కళాశాల | ఇ.ఎ.;బి.ఎ.;ఇ.యస్.సి. బి.యస్‌సి. | ... | 825 | 825 |
| 5. సిటీయింటరు సైన్సుకళాశాల | ఇ. యస్ సి. | 908 | ... | 908 |
| 6. సైఫాబాదు యింటరు సైన్సుకళాశాల | ఇ. యస్ సి. | 552 | ... | 552 |
| 7. చాదర్‌ఘాటు ఇంటరు ఆర్ట్సుకళాశాల | ఇ. ఎ. | 839 | ... | 839 |
| 8. సికింద్రాబాదు మహబూబు కాలేజి | ఇ. ఎ; ఇ. యస్ సి. | 386 | 16 | 402 |
| 9. ఆర్ట్సు, కామర్సుకళాశాల, హైదరాబాదు | ఇ. ఎ: బి.ఎ; అండ్ బి.కాం. | 979 | 6 | 985 |
| 10. ఆర్ట్సు, కామర్సుకళాశాల సికింద్రాబాదు | | 157 | 3 | 160 |
| 11. ఇంటరు, ఆర్ట్సు, సైన్సు కళాశాల, వరంగల్లు | ఆర్ట్సు, సైన్సు | 375 | ... | 375 |
| **అనుబంధ కళాశాలలు** | | | | |
| 1. వివేకవర్థని కళాశాల హైదరాబాదు | ఇ.ఎ.;బి.ఎ.;ఇ.కాం.; బి. కాం. | 206 | ... | 206 |
| 2. బద్రుకా కామర్సు కళాశాల, హైదరాబాదు | ఇ. కాం.; బి. కాం.; ఇ. ఎ. | 66 | ... | 66 |
| 13 కళాశాలలు (మొత్తం) | | 7,253 | 1,072 | 8,325 |

# వృత్తికళాశాలలు

| హైదరాబాదు నగరంలోవున్న వృత్తి కళాశాలలు | చెప్పబడే కోర్సులు | 51 52 లో విద్యార్థులసంఖ్య | | |
|---|---|---|---|---|
| | | విద్యార్థులు | విద్యార్థినులు | మొత్తం |
| 1. వ్యవసాయ విశ్వవిద్యాలయ కళాశాల | బి. యస్ సి. (వ్యవసాయం) | 106 | ... | 106 |
| 2. పశుశాస్త్ర విశ్వవిద్యాలయ కళాశాల | బి.వి. యస్ సి. | 131 | ... | 131 |
| 3. ఇంజనీరింగు విశ్వవిద్యాలయ కళాశాల | బి.ఇ.సివిల్. బి.ఇ.మెక్. మరియు బి.ఇ.ఎలెక్ట్రిక్ | 495 | ... | 495 |
| 4. ట్రైనింగు విశ్వవిద్యాలయకళాశాల | బి. ఇడి.; యం. ఇడి. | 98 | 22 | 120 |
| 5. సైఫాబాదు లా కళాశాల | ఎల్.ఎల్.బి.;ఎల్.ఎల్.ఎం. | 588 | 5 | 593 |
| 6. వైద్య విశ్వవిద్యాలయ కళాశాల | యం. బి., బి. యస్. | 333 | 100 | 433 |
| మొత్తం | | 1751 | 127 | 1878 |

ఈ కళాశాలలన్నీ ఒక్క హైదరాబాదు నగరంలోనే ఉన్నవి. ఇతర తెలంగాణా జిల్లాలలో మరొక్కటికూడా లేదు.

జరిగింది. గ్రాంటు ఎక్కువగా వుండటానికి మరొక కారణంకూడా వుంది. ఇతర రాష్ట్రాల్లో ప్రభుత్వం నేరుగా నడుపుచున్న మెడికల్ కాలేజీలు యిక్కడ యూనివర్సిటీలో భాగంగా వున్నాయి. వీటికి యితరచోట్ల ప్రత్యేకంగా యిచ్చే గ్రాంట్లుకూడా యిక్కడ యూనివర్సిటీ గ్రాంటులో భాగంగా చూపెట్ట బడుతున్నది.

కళాశాలలలో చదువుకొనే ప్రతివిద్యార్థిపై ప్రభుత్వం ఇంచుమించు రు. 588 లు ఖర్చు చేస్తున్నది. వృత్తి కళాశాలలలో చదువుకునే విద్యార్థిపై ఖర్చునకు చూస్తే యింకా అధికంగా వుంది. సంవత్సరానికి వృత్తికళాశాలలో విద్య నభ్యసించే విద్యార్థిపై సగటున రు. 808 ఖర్చుచేస్తున్నది.

కాని ఈ ఖర్చు ప్రభుత్వం హైదరాబాదు వారి బిడ్డలపైననే చేస్తున్నది. ఎందుకనగా తెలంగాణా జిల్లాలలో కళాశాలలులేని కారణంగా హైదరాబాదు బిడ్డలుతప్ప మిగతా వారు వందలమైళ్ళువచ్చి హైదరాబాదు నగరంలో వుండి ఉన్నతవిద్య నభ్యసించటం సాధ్యంకానిపని. అందుకని కనీసం అభివృద్ధిచెందిన ప్రతిజిల్లాకొక కళాశాల నిర్మించడం, వరంగల్లులోవున్న కళాశాలను అభివృద్ధి పరచటం అత్యవసరం. కాని, దీనికి కావలసిన ప్రయత్నాలేవీ ప్రభుత్వం చేయడంలేదు.

### తెలంగాణాలో కో - ఎడ్యుకేషను

స్టేటులో పోలీసు యాక్షనుకు పూర్వం ఒక్క నిజాం కళాశాలలలో తప్ప మరెక్కడా కో - ఎడ్యుకేషను పద్ధతిలేదు. ప్రాథమిక పాఠశాలలలో మాత్రం ఈ పద్ధతి వుండేది. పోలీసు యాక్షను తరువాత దాదాపు అన్ని పాఠశాలలోనూ కో-ఎడ్యుకేషను పద్ధతిని క్రమ క్రమంగా ప్రవేశ పెట్టబూనుకున్నారు. ఈ కో-ఎడ్యుకేషన్ పద్ధతికి కొన్ని షరతులు కూడా విధించారు.

ప్రస్తుతమున్న ప్రాథమిక పాఠశాలలు క్లాసుల్లో బాలికల సంఖ్య సంతృప్తికరంగా వుంటేనే అంటగా కనీసం ప్రతిక్లాసులో 15 కన్నా తక్కువుండా బాలికలు వుంటేనే మనగలుగుతాయనీ, లేని తీరుకు వీటిని స్థానిక బాలుర పాఠశాలలతో విలీనం చేయడంగానీ, లేక ఈ పాఠశాలల్లోనే బాలురను చేర్చి ప్రతి క్లాసులో వుండాల్సిన 40 సంఖ్య పూర్తి చేయడంగానీ జరుగుతుంది. ఇకముందు ప్రత్యేక బాలికల ప్రాథమిక పాఠశాలలు ఏర్పాటు చేయ బడవు.

ప్రస్తుతం ప్రత్యేకంగావున్న బాలికల మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు [సెకండరీ పాఠశాలలు] యధాతథంగా వుంటాయి. 11 సంవత్సరాలు మించని బాలులవరకు బాలికల ప్రాథమిక లేక మాధ్యమిక పాఠశాలల్లో చేరవచ్చు. బాలికల తలిదండ్రులు వ్రాత పూర్వకంగా అంగీకరిస్తే, బాలికలను పురుషుల హయ్యరు సెకండరీ పాఠశాలల క్లాసుల్లో చేర్చుకోటానికి పాఠశాలల హెడ్ మాస్టర్లకు అధికారాలివ్వబడ్డాయి. బాలికల సంఖ్య బాగావుండి వాస్తవంగా అవసరం వున్నచోటే యికముందు బాలికల మాధ్యమిక పాఠశాలలు ఏర్పాటు చేయబడు తాయి. ఇప్పటికే బాలికల మాధ్యమిక పాఠశాల వుండి హైస్కూలు క్లాసులకు తగిన బాలికల సంఖ్య వుంటేనే బాలికలకు అంటి ప్రత్యేక క్లాసులు ఏర్పాటు చేయబడుతాయి.

ఒకే కళాశాలల్లో విద్య నభ్యసించుచున్న మొత్తం 1199 మంది విద్యార్థినుల్లో 825 గురు హైదరాబాదులోని ఒక్క స్త్రీ కళాశాలలో చదువుకునేవారే. మిగతా 374 గురిలో 127 మంది వైద్య, ఇంజనీరింగు కళాశాలలలో చదువుచున్నారు. మిగతా అన్ని కళాశాల్లో నిజాం కళాశాలలో తప్ప ఎక్కడా 70 కి మించిలేరు.

## సాంకేతిక, వృత్తి విద్యలు

సాంకేతిక, వృత్తి విద్యలు సెకండరీ పాఠశాలలనుండి కళాశాలలవరకు కూడా ప్రవేశపెట్టబడినాయి. ఈ విద్యల్లో ఉత్తీర్ణులైనవారికి డిప్లమాలు, డిగ్రీలుయిచ్చి, యితర డిగ్రీలతో సమానంగా పరిగణించు చున్నది.

తెలంగాణాలో, మొత్తం స్టేటులో కంటె ముందుగానే, సాంకేతిక విద్య 1809 సం॥ లో-వరంగల్లు జిల్లాలో-ప్రధమంగా పారిశ్రామిక పాఠశాల ఏర్పాటుతో ప్రారంభమైంది. ఇందులోవడ్రంగం, సిల్కునేత, జంపుఖానా నేత వస్త్రాలపనులు నేర్పబడేవి. 1915 లో స్టేటులో మరో 6 సాంకేతిక పాఠశాలలు నిర్మింపబడ్డాయి. 1922 లో నిర్మింపబడిన ఉస్మానియా కేంద్ర సాంకేతిక సంస్థయే ఈనాడు

ప్రభుత్వ సాంకేతిక కళాశాలగా మారింది. 1937 లో ఒక ప్రత్యేక సాంకేతిక, వృత్తి విద్యాశాఖ నిర్మించబడింది. ఈ శాఖక్రింద తరువాత 27 సాంకేతిక, వృత్తి విద్యాశాఖలు నిర్మించబడ్డాయి. విద్యార్థులను అచ్చంగా పుస్తకవిద్యవరకే పరిమితంకాకుండా చూచే దానికి, విశ్వవిద్యాలయంపై వత్తిడిని తగ్గించ డానికి 1956 వరకు ప్రతిజిల్లాలో పురుషులకు ఒక సాంకేతిక ఉన్నత పాఠశాల, బాలికలకొరకు వృత్తివిద్య బోధించే ఒక ఉన్నతపాఠశాల నిర్మించాలని ప్రభుత్వ ప్లాను. ఈ వచ్చే నూతన ఎకడమిక్ సంవత్సరారంభంనుండి విద్యార్థులకు 24 వృత్తులలో తర్ఫీదునిచ్చే కేంద్రక్రాఫ్టు సంస్థను ఏర్పాటుచేయబోతున్నారు.

## సాంకేతిక కళాశాలలు

హైదరాబాదునగరంలో సాంకేతిక, వృత్తివిద్యలశాఖ ఆధ్వర్యాన పనిచేస్తున్న రెండు కళాశాలలున్నాయి. ఇందులో ఒకటి ప్రభుత్వ సాంకేతిక కళాశాల. ఈ కళాశాలలో మెకానికల్, మరియు ఎలక్ట్రికల్ యింజనీరింగులో రెండు వేరువేరు 3 సంవత్సరాల కోర్సులు ఏర్పాటుచేయబడ్డాయి. ఇవి పోస్టు మెట్రిక్యులేషను కోర్సులు. ఇందులో వుత్తీర్ణులైనవారికి మెకానికల్ ఇంజనీరింగు డిప్లమా, ఎలక్ట్రికల్ యింజనీరింగు డిప్లమాలు యివ్వబడుతాయి. 1953-54 సంll లో 100 మంది విద్యార్థులు చేరారు.

. 1951 లో గృహనిర్వహణ శాస్త్రం (Domestic Science) ట్రెయినింగు కళాశాల ఏర్పాటు చేయబడింది. ఇందులో పంతులమ్మలకు బాలికాపాఠశాలలో డొమెస్టిక్ సైన్సు నిపుణత్వంతో చెప్పటకు శిక్షణసౌకర్యాలు కల్పించబడ్డాయి. ఈ కళాశాలల్లో పోస్టు మెట్రిక్యులేషను రెండుసంవత్సరాల కోర్సు పూర్తిచేశాక, గృహ నిర్వహణవిద్యలో (Domestic Science) డిప్లమా యివ్వబడుతుంది. మరో సంవత్సరం కోర్సు పూర్తిచేసినాక ఉపాధ్యాయినులకు గృహ నిర్వహణ విద్యలో ట్రయినింగు డిప్లమా యివ్వబడుతుంది. ఇందులో 30 మందికి మాత్రమే ఏర్పాట్లున్నాయి.

1945 లో ఒక కామర్సు విద్యాలయం ప్రారంభించబడింది. ఇందులో 2 సంవత్సరాల పోస్టుమెట్రికులేషనుకోర్సు పూర్తి చేసినాక, ప్రభుత్వ కమర్షియల్ డిప్లమా, ప్రభుత్వబ్యాంకింగు డిప్లమా యివ్వబడుతుంది. ప్రభుత్వ సెక్రెటేరియటు గుమాస్తాలకు యిందులో ప్రభుత్వ రోజువారీ వ్యవహారాల నిర్వహణలో శిక్షణ యివ్వబడుతుంది.

ప్రభుత్వ చిత్రకళా స్కూలులో 5 సంవత్సరాల పోస్టు మెట్రిక్యులేషను కోర్సు పూర్తి చేసినాక ఆర్కిటెక్చరులో నేషనల్ డిప్లమా యివ్వబడుతుంది. ఈ డిగ్రీ కొరకు అఖిలభారత సాంకేతిక విద్యా కౌన్సిలు నిర్ణయించిన కోర్సుయే నిర్ణయించబడింది.

విశ్వవిద్యాలయాల సంఖ్య పెంచమనీ, ప్రతి జిల్లాకు ఒక కళాశాల కావాలని ప్రజాందోళన జరుగుతున్న సమయంలో ప్రభుత్వం విద్యార్థులను ఉన్నత విద్యనుండి పెడమార్గాల పట్టించి, విశ్వవిద్యాలయంపై వత్తిడి తగ్గించి, ఉన్నత విద్యపై ప్రస్తుతం ఖర్చును తగ్గించటానికి కొత్త ప్లానులు వేస్తోంది. ఈ ప్లానుపైన ఉదహరించిన సాంకేతిక, వృత్తి కళాశాలలద్వారాకూడా

అర్థమవుతున్నది. ఇంతటితో ఆగకుండా హయ్యరు, సెకండరీ విద్యనుకూడా పెడ మార్గాలను పట్టించుచున్నది. సాంకేతిక ఉన్నత పాఠశాలలు నిర్మించుతోంది. ఈ పాఠశాలల కోర్సుల్లో భారత చరిత్ర, భూగోళం మూడవ భాషకు బదులు ఇంజనీరింగు సైన్సు, ఇంజనీరింగు డ్రాయింగు, లెక్కలు, జనరల్ సైన్సు, యింగ్లీషు వుంటుంది. ఆప్షనల్ పాఠాలలో కర్ర వర్కుషాపు ప్రాక్టీసు, ఇంజనీరింగు వర్కుషాపు ప్రాక్టీసు, ఎలక్ట్రికల్ వర్కుషాపు ప్రాక్టీసు వుంటాయి. వరంగల్లులో ఇలాంటి పాఠశాల ఒకటి ప్రారంభించబడింది. ఒక మోడలు సాంకేతిక ఉన్నత పాఠశాల-సికింద్రాబాదులో తెరువబడింది. ఇందులో 270 మందికి ఏర్పాట్లున్నవి. సెకండరీ విద్యా కమిషనువారుకూడా ఈ విద్యా విధానం యొక్క అవసరాన్ని నొక్కి చెప్పారు.

వ్యవసాయ స్కూళ్ళుకూడా ఏర్పాటు చేయబడ్డాయి. 1948 లో 75 ఎకరాల క్షేత్రంతో ఒక పాఠశాల ఏర్పాటు చేశారు. ఇందులో పోస్టు మాధ్యమిక విద్యార్థులు 2 సంవత్సరాల కోర్సులు చదివి ప్రభుత్వ సర్టిఫికెట్టు పొందుతారు. ఈసర్టిఫికెట్లు పొందినవారు వ్యవసాయ డిపార్టుమెంటులో అసిస్టెంటు ఫీల్డుమెన్‌గా చేరవచ్చు.

## చిత్రకళా, సంగీత, నృత్య విద్యలు

1940 లో ప్రభుత్వం కో-ఎడ్యుకేషన్ పద్ధతిపై ఒక స్కూల్ ఆఫ్ ఆర్ట్సు (డిప్లొమాకోర్సులు) ప్రారంభించింది.

1952 లో సంగీత, నృత్యకళాపాఠశాల ప్రారంభించబడింది. ఇందులో హిందూస్తానీ, కర్నాటక విభాగాలున్నవి. విద్యార్థులు వాద్య సంగీతంగానీ, పాట సంగీతంగానీ లేక నృత్యకళగానీ తర్ఫీదు పొందవచ్చు. కథకనృత్యం, భరతనాట్యం రెండూ నేర్పబడుతాయి.

1944, 1945 లో రెండు బాలికా ఉన్నతవృత్తిపాఠశాలలు సికింద్రాబాదు, హైదరాబాదులలో ప్రారంభించబడినాయి. వీటిల్లో గృహచర్యపాఠాలుగాక, ఎలిమెంటరీ సైన్సు, ప్రాథమికచికిత్స, తోటలు పెంచటం, గృహనర్సింగు వగైరా నేర్పబడుతాయి. ముందుముందు హెచ్. యస్. సి. పరీక్షలకు తయారుచేసేలాగు కోర్సులు మార్చబోతున్నారు. 1954-55 ఎకడమిక్ సంవత్సరంలో వరంగల్లుజిల్లాలో యిలాంటి పాఠశాల ప్రారంభించనున్నారు.

ఇవిగాక కరీంనగరంలో వ్యవసాయ-వృత్తిపాఠశాల ఒకటి నడుపబడుచున్నది. ఇందులోవ్యవసాయపద్ధతులేగాక వడ్రంగం, కంచరి పని వగైరాలు నేర్పబడుతాయి.

## శాస్త్రీయ, పారిశ్రామిక సెంట్రల్ లెబొరేటరీస్

హైదరాబాదుసంస్థానంలో ముఖ్యంగా తెలంగాణాలో వెజిటబుల్ నూనె, బొగ్గు, వివిధరకాలమట్టి (Clay) అటవికసంపదలు, వివిధరకాల విలువగల ఖనిజసంపదలలాంటి ముడిసరుకులు చాలా విస్తారంగావున్నాయి. ఇక్కడవున్న పరిశ్రమలకు ఈ ముడిపదార్థాలు బాగా ఉపయోగపడేందుకు పరిశోధనలు జరుపాలనీ, దీనికొరకు ఒకపరిశోధనా

శాల నిర్మించాలనీ ప్రభుత్వం 1944 లో సంకల్పించి ఆమోదించింది. 1949 లో ప్రభుత్వం ఒక స్కీము ఆమోదించింది. దీనికి సంబంధించిన భవననిర్మాణం నవంబరు 1949 లో ప్రారంభమయి, ఒకభాగం పూర్తిఅయింది. ఈ లెబొరేటరీ నిర్వహించే పరిశోధనలు:

1. హైదరాబాదుస్టేటు పారిశ్రామిక అభివృద్ధికి తోడ్పడడానికి, ప్రోత్సహించటానికి.

(అ) హైదరాబాదు సంస్థానంలో స్థానిక ముడిపదార్థాలు పరిశ్రమలకు ఉపయోగపడే అవకాశాలు వెతకటం.

(ఆ) ప్రస్తుతంవున్న పరిశ్రమలను విస్తృత పరచటం; కొత్త పరిశ్రమల ప్రారంభానికి ప్లానులు తయారు చేయటం, దీనికొరకు లెబొరేటరీలో పైలటు ప్లాంటు స్కేలుపై పరిశోధనా కార్యక్రమం సాగించటం.

2. ప్రస్తుతంవున్న, ముందు నిర్మించబోయే పరిశ్రమలకు కేంద్ర బాగా పరికరాలతో సమకూర్చబడిన శాస్త్రీయ పారిశ్రామిక పరిశోధనా లెబొరేటరీ నిర్మాణ సౌకర్యాలు కల్గించటం.

3. శాస్త్రీయ విషయాలలో వివిధ ప్రభుత్వ శాఖలకు, పరిశ్రమలకు సహాయం, సలహాలు అందించటం.

4. వివిధ ప్రభుత్వశాఖల, పరిశ్రమల కొరకు ఒక క్రమంలో పరిచ్ఛేదనా కార్యక్రమం ( Analytical Work ) కొనసాగించటం.

5. పారిశ్రామికుల్లో, ప్రజలలో పరిశ్రమల కొరకు జరిపే శాస్త్రీయ పరిశోధనల సత్ఫలితాలను కార్యాచరణలో చూపెట్టటం.

6. హైదరాబాదు సంస్థానంయొక్క పారిశ్రామిక ప్రోగ్రాంకొరకు పారిశ్రామిక కార్య విధానంలో, శాస్త్రీయ పరిశోధనలో తర్ఫీదు అయిన వారిని సప్లయి చేయటానికి ఒక కేంద్రాన్ని నిర్మించటం.

ఇది వాణిజ్య, పరిశ్రమల మంత్రిత్వ శాఖక్రింద అర్ధ అటానమస్ శాఖగా పని చేస్తుంది. దీనిలో 23 గ్గురు సైంటిఫిక్ ఆఫీసర్లు, 15 మంది పరిశోధనా సహాయకులు (Research Assistants) 8 గురు స్కీము వర్కర్సు, 6 గురు పి. హెచ్. డి. విద్యార్థులు మొత్తం 52 మంది పని చేస్తున్నారు.

## హైదరాబాదు ఇంజనీరింగు పరిశోధనా లెబొరేటరీ

ఈ లెబొరేటరీకి 1945 లో నిజాం అంగీకరించారు. ఈలెబొరేటరీ హిమాయతు సాగర్ చెరువుక్రింద నిర్మించబడింది. ఇరిగేషను, జలశక్తి, నీటి సప్లయి, బిల్డింగులు, రోడ్లు,ప్రజారోగ్యం,ఇంజనీరింగు, హైడ్రాలిక్, మిషనరీ గ్రామీణ పునరుద్ధరణ లాంటి సమస్యలపై పరిశోధనలు జరపటానికి ఈ లెబొరేటరీ ప్రారంభించబడింది. ఇలాంటి బహు ముఖ పరిశోధనలు గావించే లెబరేటరీ భారతదేశంలోకల్లా యిదొక్కటే.



# వైద్య సహాయం

వైద్యసహాయం, ఆరోగ్యసౌకర్యాల విషయంలో తెలంగాణా చాలా వెనుకబడి వుంది. ప్రజల జీవనప్రమాణం హీనస్థితిలో పడిన కారణంగా ఆరోగ్యాలు అడుగంటి పోయి, నానా రకాల ప్రమాదకరజబ్బులకు లోనై వేలకువేల ప్రజలు మృత్యువువాత పడుతున్నారు. ప్రభుత్వ రికార్డులలో మాత్రం "జ్వరం"వల్ల చనిపోతున్నారనేది కనబడుతోంది.

పరిస్థితి యిలావుండగా ప్రభుత్వం అటు ప్రజల ఆరోగ్యాన్ని కాపాడేబాధ్యతగానీ, యిటు వైద్యసౌకర్యాలనుకానీ పరిస్థితులకు తగినట్లుగా చేయటంలేదు. అందుకని ఎంతమంది చనిపోతున్నారనే సరైన లెక్కలుకూడా ప్రభుత్వం అట్టిపెట్టటం లేదు. 1951-52 సం॥ వైద్యశాఖవారి అందనా లెక్కలప్రకారం [గ్రామపోలీసు పటేలు చూపిన లెక్కల ఆధారంగా] మొత్తంస్టేటు జననసంఖ్య55,925 వుండగా, మొత్తం మరణాలసంఖ్య 72,906 వున్నది. ఈలెక్కలు సరైనవికావనీ, వైద్యశాఖడైరెక్టరే అంగీకరిస్తూ, వారిశాఖవారే, 7 వేలకు పైబడి రిజిస్టరు కాని మరణాల సంఖ్యను తెలుసుకున్నారని అన్నాడు. ఈ జనన మరణాల లెక్కలు వాస్తవికతకు అందని రీతిగా వున్నాయనవచ్చు. ప్రజల ఆరోగ్యస్థితి ఎలావున్నదీ ఒక్క క్షయ రోగుల సంఖ్యనుచూస్తే తెలుస్తుంది.

1952-53 సం॥ ప్రభుత్వ లెక్కల ప్రకారం 1,67,462 మంది క్షయరోగ ఆస్పత్రులలో చికిత్స పొందారు. అయితే యిందులో ఎంతమంది చనిపోయారనే లెక్కలు మాత్రం ఎక్కడా కనిపించవు. ఇందులో యిన్‌పేషెంట్లుగా చికిత్స పొందినవారు మాత్రం 1,42,792 మంది వున్నారు. అలాగే ఉస్మానియా జనరల్ ఆస్పత్రిలో 1952-53 సం॥లో తీవ్రమైన జబ్బులకు చికిత్స పొందినవారి సంఖ్య 10,60,080 వుంది. ఈ జబ్బులే కాకుండా కలరా, మశూచి వగైరా అంటు వ్యాధులకు లోనై 1951 52 లో 10,000 మంది చని పోయారు. అయితే ఈ లెక్కలు ప్రభుత్వ రికార్డులలో అందనాగా రికార్డు అయినవే. ఇంకా వేలమంది గ్రామసీమలలో రక్త విరోచనాలు, భేదులు, ఊపిరి తిత్తుల సంబంధమైన వ్యాధులు, మలేరియా, క్షయ, యితర అంటు వ్యాధులకు లోనై చనిపోయేవారు లేక పోలేదు.

ప్రజల జీవన ప్రమాణస్థాయి, వారు తీసుకునే ఆహారం న్యూట్రిషనుగురించి పరిశీలించుదాం. ప్రజారోగ్యశాఖ న్యూట్రిషను బ్యూరో సహాయక డైరెక్టరు, డాక్టరు యం. బి. దావెరుగారు "హైద్రాబాదు సంస్థానంలో ఆహారం, మరియు న్యూట్రిషను సర్వే" అనే శీర్షికతో మార్చి

1954, "నేటి హైదరాబాదు" అనే మాస పత్రికలో యిలా వ్రాశారు:

"....హైదరాబాదు సంస్థానం మూడు భాషా ప్రాంతాలుగా విభజింపబడి వున్నది. ఈ వేరు వేరు ప్రాంతాల ప్రజల సాంప్రదాయాలు ఆయా ప్రాంతాల్లో పండే పదార్థాలు, ఆహార ధాన్యాలపై బాగా ఆధారపడివుంటాయి. తెలంగాణావాసులు బాగా బియ్యం, మరాత్వాడా, కన్నడ ప్రజలు బాగా జొన్నలు తింటారు. హైదరాబాదు నగరవాసులు వివిధరకాల ఆహార సాంప్రదాయాలు కలవారు. అందుకని సంస్థాన ప్రజలను నాలుగు భాగాలుగా విభజించి, వారు తీసుకునే ఆహారంలో న్యూట్రీషను విలువను పరిశీలించటం జరిగింది.

"హైదరాబాదునగరంలో 590 కుటుంబాలు తీసుకునే ఆహారాన్ని పరిశీలించటం జరిగింది. 1939 లో మున్సిపల్ కార్మికుల కుటుంబాల ఆహారాన్ని, 1942 లో మధ్య తరగతి కుటుంబాల ఆహారాన్ని, 1950 లో వివిధప్రాంతాల్లో మరికొందరు తరగతుల వారిని పరిశీలించుట జరిగింది. మొదటి రెండు తరగతుల్లో యిప్పటికన్నా యింతకు క్రితం ఆహారంపై యిప్పటికన్నా ఎక్కువ ఖర్చు చేసేవారు. క్రితంలో తీసుకునే ఆహారంలో కాలరీలసంఖ్య, రాసాయనిక పదార్థం యిప్పటికన్నా ఎక్కువగా వుండేవి.

"తెలంగాణాలో కరీంనగరం, ఆదిలాబాదు, మహబూబునగరం, మెదకు, నల్లగొండ, నిజామాబాదు జిల్లాలో 2170 గ్రామీణకుటుంబాల, 63 పట్టణకుటుంబాల ఆహారపరిశీలన జరిగింది. ఈ పరిశీలన రెండుసార్లు 1943, 1951 లో జరిగింది,

"మొదటిపరిశీలనలో కరీంనగరంజిల్లా కుటుంబాలను 4 ఆర్థిక గ్రూపులుగా చేయటం జరిగింది. నిజామాబాదులో 6 గ్రూపులుగా చేయుటం జరిగింది. దీని ఫలితంగా కరీంనగరంలో ప్రతికుటుంబంలో 5.0 నుండి 5.6 సభ్యుల వరకు, నిజామాబాదులో 3.6 నుండి 7.1 సభ్యులున్నట్లు తేలింది. కరీంనగరం కుటుంబ నెలవారీ ఆదాయం 8 నుండి రు. 52 లు వుండగా, నిజామాబాదులో రు. 10-180 వరకు వున్నది. అందుకని కరీంనగరంకన్నా నిజామాబాదులో తీసుకునే ప్రతి ఆహార యూనిటుపై కుటుంబ ఆదాయం మించి వున్నది. నిజామాబాదులో ఎక్కువ కుటుంబాలు ముఖ్యంగా పేదకుటుంబాలు. మరే రియాజ్యకాలతో బాధపడుతున్నారు. అందుకని వీరి పనిదినాలు తగ్గిపోయి, ప్రతి మనిషి ఆదాయంతగ్గి ఆహారం తగ్గింది. రెండవ పరిశీలనలో కుటుంబ సభ్యుల సంఖ్య తగ్గింది. ఆదాయం, ఆహారంపై చేసే ఖర్చు కరీంనగరానికన్నా నిజామాబాదులో పెరిగింది. ప్రస్తుతం తెలంగాణా మిగతా జిల్లాల పరిస్థితి కరీంనగరం, నిజామాబాదు జిల్లాల మాదిరిగా వున్నది.

"ఈ పరిశీలన ఫలితంగా తక్కువ ఆదాయంగల కుటుంబాలు తినే ఆహారంలో కాలరీల సంఖ్య తక్కువగావుందని తేలింది. తినే తిండి పుష్కలంగా తిన్నా న్యూట్రీషను విలువలు చాలా తక్కువ. జొన్నలు, బియ్యం, సజ్జలు ప్రధాన ఆహారం. వీటిల్లో 80 శాతంకన్నా మించి

క్యాలరీలు వుంటాయి. క్యాలరీలు యింత ఎక్కువగా వుండటం, మిగతా న్యూట్రిషను పదార్థాలు తక్కువగా వుంటడం సరైన తిండిలక్షణంకాదు. జంతు సంబంధమైన ప్రోటీనులు, క్రొవ్వు, విటమిను ఎ, బి, క్యాల్షియం పదార్థాలు లోపించుతాయి. పై వర్గాలవారు క్రిందివర్గాలవారు తినే మాదిరిగా ధాన్యాలు తినరు. అయినా ప్రోటీనులు, విటమిన్ ఎ పదార్థాలుతప్ప అన్ని తరగతులవారి ఆహారం కనీసస్థాయి కన్నా లోపించే వున్నది."

[నేటి హైదరాబాదు-మార్చి 1954]

వరంగల్లు, యింకా యితరచోట్ల విద్యార్థుల న్యూట్రిషన్ సర్వే చేయటం జరిగింది. సర్వే చేయబడిన 9,210 మంది విద్యార్థుల్లో 3,253 మంది విద్యార్థులు తక్కువ న్యూట్రిషను జబ్బులతో వున్నట్లు తేలింది. వీరిలో ఎక్కువగా విటమిను "ఎ" మరియు "బి" తక్కువ అయి, వాటికి సంబంధించిన జబ్బులకు లోనవుచున్నారు. అంటే విద్యార్థుల్లోనే నూటికి దాదాపు 36% సరైన పోషణ లేక జబ్బులకు లోనవుచున్నారు. ఇక రెండు పూటలూ కూడా కనీస తిండిలేని గ్రామీణ ప్రజల ఆరోగ్యాలనుగురించి పట్టణాల్లో రోజంతా కష్టించి 12 ఔన్సుల రేషను తినేవారి ఆరోగ్యాలగురించి చెప్పనక్కరలేదు. ఇక సరైన న్యూట్రిషనుకు ప్రతి మనిషికి దినానికి కావలసిన 8 ఔన్సుల పప్పుదినుసులు, కూరగాయలు, పాలు వగైరా విషయాల్లో ఆలోచించ నక్కరలేదు. రెండుపూటలూ సరిగా గంజి దొరకని ప్రజానీకానికి ఇవన్నీ ఒక వేడుక.

ప్రభుత్వం ప్రజానీకానికి కనీస జీవనభృతి కల్పించలేక పోగా, వైద్య సౌకర్యాలు కూడా నామమాత్రంగానే కల్గించుచున్నదని చెప్పకతప్పదు. ప్రభుత్వంచూపే ఆస్పత్రులుగానీ, డిస్పెన్సరీలుగానీ, అవి వున్న స్థానిక ప్రజలకు తప్ప గ్రామీణ ప్రాంతపు జనాభాకు ఎంతమాత్రం ఉపయోగపడవు. ఈ ఆస్పత్రులు తెలంగాణాలో(హైదరాబాదు నగరంలోతప్ప) జిల్లాకొకటికంటె ఎక్కువలేవు. వాటిల్లో కూడా 8-10 మందికన్నా అదనంగా మంచాల ఏర్పాట్లులేవు. అంటే లక్షల కొలది జనాభాగల ఒక జిల్లా ఆస్పత్రిలో ఈ ఏర్పాటు నామమాత్రమే. ఈ ఆస్పత్రులలోకూడా తీవ్రజబ్బులకు కావలసిన మందులుగాని, యంత్ర పరికరాలుగానీ వుండవు. ప్రసూతి సౌకర్యాలు అన్ని జిల్లా ఆస్పత్రులలోనూ లేవు.

ఇక తాలూకా కొక్కటిచొప్పునవుండే డిస్పెన్సరీల [మందులు మాత్రమే యిచ్చే ఆస్పత్రి] పరిస్థితి మరీ అన్యాయం. సరైన మందులుండవు. గ్రామాలనుండి వచ్చే రోగులను చూచేవారుండరు. ఒకటి రెండు సంవత్సరాలనుండి పరిస్థితులు మరీ అధ్వాన్నంగా తయారైనాయి. డబ్బులు చెల్లించుకుంటేనేగాని చికిత్సపొందటానికి వీలుండదు. హైదరాబాదునగరంలోవున్న పెద్ద ఆస్పత్రులలో యిది మరీ నగ్నంగా తయారయి, రోగులనే మందులు తెచ్చుకొమ్మనే స్థితికిపోయింది. ఆస్పత్రులకు కనీసంగా సప్లయిచేయబడే మందులుకూడా రోగులకు ఉపయోగపడకుండా పోతున్నాయని నగర పత్రికలు ఘోషిస్తున్నాయి.

# వైద్యశాలలు - డాక్టర్లు

హైద్రాబాదు నగరంతో సహా మొత్తం తొమ్మిది తెలంగాణా జిల్లాలలోని 101 లక్షల జనాభాకు 104 సివిలు ఆసుపత్రులు, డిస్పెన్సరీలు ఉన్నాయి. వీటి జిల్లాలవారీ వివరాలు క్రింది పట్టికలో వివరించబడ్డాయి

జబ్బుల ఆస్పత్రి, ఒక మెంటల్ ఆస్పత్రి వున్నవి. క్షయ ఆస్పత్రి ఒకటి మెదకుజిల్లా వికారాబాదులో కూడా వున్నది. ఇవి కాక 9 జైలు ఆస్పత్రులు, డిస్పెన్సరీలు, 3 ప్రాజెక్టు ఆస్పత్రులు వున్నాయి. ఈ మొత్తం కలిసి 122 వున్నాయి. అనగా

| జిల్లా పేరు | ఆసుపత్రులు | | | డిస్పెన్సరీలు | | | |
|---|---|---|---|---|---|---|---|
| | జనరలు | జైలు | మొత్తం | జనరలు | ప్రాజెక్టులు | సబ్ జైల్సు | మొత్తం |
| హైదరాబాద్ | 7 | 2 | 9 | 18 | ... | ... | 18 |
| మహబూబ్‌నగరం | 1 | ... | 1 | 14 | 1 | 1 | 16 |
| ఆదిలాబాదు | 1 | ... | 1 | 12 | 1 | 1 | 14 |
| నిజామాబాదు | 1 | ... | 1 | 8 | ... | 1 | 9 |
| మెదకు | 1 | ... | 1 | 9 | ... | 1 | 10 |
| కరీంనగరం | 1 | ... | 1 | 9 | 1 | 1 | 11 |
| వరంగల్లు | 1 | 1 | 2 | 12 | ... | ... | 12 |
| నల్లగొండ | 1 | ... | 1 | 8 | ... | 1 | 9 |
| మొత్తం | 14 | 3 | 17 | 90 | 3 | 6 | 99 |

వీటిలో 25 ఆస్పత్రులు, డిస్పెన్సరీలు ఒక్క హైదరాబాదు నగరంలోనే వున్నాయి. ప్రస్తుతం నగరంలోని ఈ ఆస్పత్రులు మొత్తం స్టేటు జనాభాకు ఉపయోగపడుచున్నవి. తెలుగువారికన్నా యితరులకే ఎక్కువగా ఉపయోగపడుచున్నవని చెప్పవచ్చు. నగరంలో పైన పేర్కొన్నవిగాక 3 క్షయ ఆస్పత్రులుగానీ, క్లినికులుగానీ, ఒకటి నేత్ర, ముక్కు, చెవులు, గొంతు [Eye & E N. T]

తెలంగాణాలో సివిలు ఆస్పత్రులు దాదాపు ప్రతి 90,000 జనాభాకు ఒకటి వున్నది. అలాగే 252.1 చ॥ మైళ్ళకు ఒక ఆస్పత్రి వున్నదని చెప్పవచ్చు. కాని హైదరాబాదు నగరానికి చూచినట్లైతే 36,100 జనాభాకు ఒక ఆస్పత్రి వున్నది.

ఈ ఆస్పత్రులలో పనిచేసే మొత్తం డాక్టర్ల సంఖ్య 363. జిల్లాలవారీ డాక్టర్ల వివరాలు ప్రక్కపేజీలో ఇవ్వబడ్డాయి.

| జిల్లా పేరు | వైద్యం | | | ఆరోగ్యం | | | మొత్తం డాక్టర్ల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| | మొదటి తరగతి | రెండవ తరగతి | మొత్తం డాక్టర్లు | మొదటి తరగతి | రెండవ తరగతి | మొత్తం డాక్టర్లు | |
| హైదరాబాదు ... | 29 | 154 | 183 | 9 | 33 | 42 | 225 |
| మహబూబ్‌నగరం ... | 1 | 18 | 19 | ... | 2 | 2 | 21 |
| ఆదిలాబాదు ... | 1 | 18 | 19 | ... | 5 | 5 | 24 |
| నిజామాబాదు ... | 1 | 12 | 13 | ... | 3 | 3 | 16 |
| మెదకు ... | 1 | 12 | 13 | ... | 2 | 2 | 15 |
| కరీంనగరం ... | 1 | 13 | 14 | ... | 3 | 3 | 17 |
| వరంగల్ + ఖమ్మం ... | 1 | 23 | 24 | ... | 4 | 4 | 28 |
| నల్లగొండ ... | 1 | 12 | 13 | ... | 4 | 4 | 17 |
| తెలంగాణా మొత్తం | 36 | 262 | 298 | 9 | 56 | 65 | 363 |
| స్టేటు మొత్తం | 46 | 392 | 438 | 10 | 80 | 90 | 528 |

వీరిలో 298 మంది ఆస్పత్రులలో, డిస్పెన్సరీలలో పనిచేసేవారు. 65 మంది ప్రజారోగ్యశాఖక్రింద పనిచేసేవారు.

ఈ మొత్తం డాక్టర్లలో సివిల్ సర్జన్ హోదాగలవారు (Class 1) 45 మంది. మిగతావారు రెండవతరగతి డాక్టర్లు. అంటే తెలంగాణాలో ప్రతి 27,846 మందికి ఒక్క డాక్టరు వున్నాడు. అయితే ఈ మొత్తం డాక్టర్లలో ఒక్క హైదరాబాదు నగరంలోనే 38 గురు మొదటితరగతి డాక్టర్లు, 187 మంది రెండవతరగతివారు వున్నారు. అనగా నగరంలో ప్రతి 5134 మందికీ ఒక డాక్టరువున్నాడు.

ఆస్పత్రుల్లో పనిచేసే ఈ డాక్టర్లతో పాటు మొత్తం స్టేటులో 1951-52 సం॥ ప్రభుత్వలెక్కలప్రకారం 407గురు నర్సులు వున్నారు.

తెలంగాణాలోవున్న ఆస్పత్రులలో షుమారు 3,300 మంచాల ఏర్పాటువున్నది. ఇందులోనుండి ఉస్మానియా ఆస్పత్రిలో 909, విక్టోరియా జనానా (స్త్రీ) ఆస్పత్రిలో 500, క్షయఆస్పత్రిలో 400, పిచ్చిఆస్పత్రిలో 600, సరోజినీదేవి ఆస్పత్రిలో 150, నిలోఫర్ ప్రసూతి ఆస్పత్రిలో 250, గోలకొండ దవాఖానాలో 15 మంచాల ఏర్పాటు, జిల్లాఆస్పత్రుల్లో మిగతా మంచాలున్నాయి. అనగా 3063 మందికి ఒక్క మంచం ఏర్పాటువున్నది. మొత్తం స్టేటులో 5364 మంచాలకు ఏర్పాట్లు వున్నాయి.

# యూనానీ-ఆయుర్వేదం

తెలంగాణాలో పైన వివరించిన అల్లోపతీ ఆస్పత్రులు గాక, 49 యూనాని ఆస్పత్రులు, డిస్పెన్సరీలు, 24 ఆయుర్వేద ఆస్పత్రులు, డిస్పెన్సరీలు ప్రభుత్వ ధన సహాయంతో నడుపబడుచున్నాయి. వీటి జిల్లావారీ వివరాలు 1153 వ పేజీలో ఇవ్వబడ్డాయి.

వీటిలో 81 మంది యూనానీ డాక్టర్లు, 30 మంది ఆయుర్వేద డాక్టర్లు పనిచేస్తున్నారు. ఈ ఆసుపత్రులలో మూడవ వంతు హైదరాబాదు నగరంలోనే ఉన్నాయి. వీటిలో చికిత్సపొందినవారిల్లో సగానికిపైగా ఒక్క హైదరాబాదు నగరానికి చెందినవారే.

హైదరాబాదు ప్రభుత్వం 1952-53 సం॥ లెఖ్ఖల ప్రకారం వైద్య, ప్రజారోగ్య శాఖక్రింద మొత్తంరు.152.87 లక్షలు ఖర్చుచేసింది. ఇందులో రు.1 04.79 లక్షలు ఆస్పత్రుల, డిస్పెన్సరీల మందుల ఖర్చులకు; పిచ్చి ఆస్పత్రి, కుష్టురోగ ఆస్పత్రి వగైరాలకు; రు.41.88 లక్షలు వైద్య, ప్రజారోగ్య శాఖ ఎస్టాబ్లిషుమెంటు ఖర్చులకు, 6.20 లక్షలు మెడికలు కళాశాలకు ఖర్చు చేస్తున్నారు. అనగా మొత్తం స్టేటుకు వైద్య, ప్రజారోగ్యం శాఖక్రింద ప్రజల ఆరోగ్యం, చికిత్సకు సంబంధించినంతవరకు రు.146.67 లక్షలు మాత్రమే ఖర్చు చేయుచున్నది. అనగా ప్రతి ఒక్కరిపై సంవత్సరానికి రు. 0-11-2 లు ఖర్చు చేయుచున్నది.

| జిల్లా పేరు | యునాని — ఆస్పత్రులు, డిస్పెన్సరీల సంఖ్య | యునాని — డాక్టర్ల సంఖ్య | ఆయుర్వేదం — ఆస్పత్రులు, డిస్పెన్సరీల సంఖ్య | ఆయుర్వేదం — డాక్టర్ల సంఖ్య |
|---|---|---|---|---|
| హైదరాబాదు | 16 | 48 | 4 | 10 |
| మహబూబ్‌నగరం | 2 | 2 | 4 | 4 |
| ఆదిలాబాదు | 3 | 3 | 3 | 3 |
| నిజామాబాదు | 5 | 5 | 4 | 4 |
| మెదకు | 6 | 6 | 5 | 5 |
| కరీంనగరం | 10 | 10 | 4 | 4 |
| వరంగల్లు + ఖమ్మం | 4 | 4 | ... | ... |
| నల్లగొండ | 3 | 3 | ... | ... |
| తెలంగాణా మొత్తం | 49 | 81 | 24 | 30 |
| స్టేటు మొత్తం | 99 | 131 | 58 | 64 |

# హైదరాబాదు నగర ఆస్పత్రులు

1. ఉస్మానియా జనరల్ ఆస్పత్రి :- ఇది 63,247 చ॥ గ॥ ప్రాంతమును ఆక్రమించి వున్నది. 909 మంచాలున్నాయి.

2. విక్టోరియా స్త్రీల ఆస్పత్రి:- దీనిలో 500 మంచాలున్నాయి. ఇందులో సగం ప్రసూతి కేసులకొరకు ప్రత్యేకించబడ్డాయి. ఇందులో 31 మంది డాక్టర్లు, 49 మంది నర్సులు ఉన్నారు. ఈ ఆస్పత్రి మంత్రసానులకు శిక్షణా కేంద్రంగా ఉపకరిస్తున్నది.

3. క్షయ (ఎర్రంమా) ఆస్పత్రి :- 400 మంచాలున్నాయి. సముద్ర మట్టానికి 1719 అడుగుల ఎత్తున వుంది. ఇక్కడ వర్షపాతం సగటు 31 అంగుళాలు.

4. పిచ్చి ఆసుపత్రి [Mental Hospital]: ప్రస్తుతం 600 మంది చికిత్స పొందుచున్నారు. శాస్త్రీయ పద్ధతుల్లో చికిత్స జరుగుచున్నది. మానసిక రోగ నిపుణుని ఆధ్వర్యాన ఈ ఆసుపత్రి నడుస్తున్నది.

5. సరోజినీదేవి ఆసుపత్రి [Eye & E.N.T.]:- ఇది ఉస్మానియా ఆసుపత్రిలో భాగం. ప్రభుత్వంచేత సెంట్రలు మిలటరీ ఆసుపత్రి భవనానికి మార్చబడింది. ఇక్కడ

త్ర, ముక్కు, చెవి, గొంతు జబ్బులకు ప్రత్యేక చికిత్సలు జరుగుచున్నవి. 150 మంది చికిత్సకు ఏర్పాట్లున్నాయి. సంవత్సరానికి రు 2,05,000 లు ఖర్చు అవుచున్నవి.

**6. నిలోఫర్ ప్రసూతి ఆసుపత్రి:-** హైద్రాబాదు మహిళా, శిశు సహాయ సంస్థవారు నిర్మించారు. 80 లక్షల ఖర్చుతో ప్రసూతి కేసుల కొరకు 200 మంచములు, పిల్లల కొరకు 50 మంచాలు ఏర్పాటు చేయబడి నాయి. యునిసెఫ్ [Unisef] సహాయంతో యంత్రోపకరణాలు సప్లయి చేయబడ్డాయి. మంత్రసానులకు శిక్షణా కేంద్రంగాకూడా ఉపయోగపడుచున్నది.

**7. గోలకొండ అంటువ్యాధుల ఆసుపత్రి:-** ఇందులో దీర్ఘకాల అంటువ్యాధులకు చికిత్స జరుగుతుంది. 15 మంచాలున్నాయి. దీనిపై రు. 16,41,000 లు ఖర్చు అవుతున్నాయి.

జిల్లాలో మెదకు జిల్లా వికారాబాదు తాలూకాలోని అనంతగిరి కొండలపై ఒక క్షయ ఆస్పత్రి పనిచేస్తున్నది. కరీంనగరంలో కూడా ఒక ఎక్స్‌రే యంత్రం స్థాపించి క్షయరోగ చికిత్స జరుగుచున్నది. నిజామాబాదు జిల్లాలో డిచ్‌పల్లిలో ప్రభుత్వ సహాయంతో ఒక మిషనరీ కుష్టు ఆసుపత్రి పనిచేస్తున్నది. 400 మంది చికిత్స పొందుచున్నారు.

ప్రజారోగ్యశాఖ, భారత సాంఘిక సేవా సమితివారు, ప్రపంచ ఆరోగ్యసమితివారి ప్రత్యక్షసహాయం, ధనసహాయంతో వ్యాధుల నివారణా కార్యకలాపాలను, ఆరోగ్య ప్రచారక కార్యకలాపాలను సాగించుచున్నారు.

ప్రజారోగ్యశాఖ వైపునుండి మొత్తం స్టేటులో మూడు సంచార నేత్రచికిత్సా యూనిట్లు పనిచేస్తున్నాయి. ఇవి అక్కడక్కడ శిబిరాలువేసి గ్రామీణప్రజలకు నేత్రచికిత్స చేస్తున్నాయి. అలాగే [illegible] కేంద్రాలు, కలరాటీకాలు, గ్రామ పారిశుద్ధ్య కార్యక్రమాలు సాగిస్తున్నాయి. భారత సాంఘిక సేవాసమితి వారు [illegible] ఆరోగ్య కేంద్రాలు, ప్రసూతిసదుపాయాలు, నూతన ఆస్పత్రులను స్థాపించటం, కుటుంబ నియంత్రణ [illegible] సాగిస్తున్నారు. ప్రపంచ ఆరోగ్య సంస్థవారి సహకారం, యంత్రోపకరణాల విషయాలలో తోడ్పడుచున్నారు.



# కొండజాతులు

భారత రాజ్యాంగం క్రింద హైదరాబాద్ స్టేట్‌లో ఈ క్రిందివారు కొండ జాతుల ప్రజలుగా నమోదు చేయబడినారు.

1. ఆంధ్
2. భిల్
3. చెంచు, లేక చెంచువారు
4. గోండ్ (నాయక్‌పాడ్, రాజ్ గోండ్‌లతో సహా)
5. కొండరెడ్లు
6. కోలమ్స్ (మన్నెరువారులతో సహా)
7. కోయ (భైనికోయ, రాజ కోయలతో సహా)
8. ప్రధాన్
9. థోటి

వీరిలో ఆంధ్, భిల్లులు ప్రధానంగా మరాఠ్వాడాకు చెందిన జాతులు. తక్కిన వారు ప్రధానంగా తెలంగాణాలో నివసిస్తున్నవారు.

వీరిలో గోండులు ప్రధానులు. కొలములు, నాయక్, పోడులు ఆదిలాబాదు జిల్లాలో ప్రధానంగా గుట్టలు, అడవి ప్రదేశాలలోను, కోయలు వరంగల్లు జిల్లాలోని ములుగు, పాఖాల్ తాలూకాల్లో, ఖమ్మం జిల్లా యిల్లెందు, పాల్వంచ తాలూకాలలోను, కొండరెడ్లు ఇదే పాల్వంచ తాలూకాలో ఉన్నారు. వీరు ఆదిలాబాదు, వరంగల్లు జిల్లాలోగూడ ఉన్నారు. చెంచులు మహబూబ్ నగరంలోని అమ్రాబాద్ తాలూకాలోని అడవుల్లో వున్నారు.

1951 లెక్కల ప్రకారం తెలంగాణాలో నున్న వివిధ కొండజాతుల ప్రజల జనాభా 2,99,104.

మొత్తం స్టేటులో వీరి జనాభా 3,54,933. ప్రక్కనే ఉన్న పట్టికలో 1951 సంవత్సర జనాభా లెక్కల ప్రకారం వీరి జనాభా వివరాలు ఇవ్వబడ్డాయి.

దీన్నిబట్టి గూడ స్టేటులోని కొండజాతి ప్రజల్లో అత్యధికులు తెలంగాణాలోవున్నారని తెలుస్తుంది.

1951 జనాభా లెక్కలకు పూర్వం, కొండ జాతుల్లో ఎవర్ని చేర్చాలనేది స్పష్టంగా లేకపోవుటచే, వివిధ కొండజాతి ప్రజల జనాభా పెరుగుదల గురించి సరయిన వివరాలేవీ లేవు. అందుచే వీరిలో ఎవరు ఎంత పెరిగింది లేక క్షీణించింది తెలుసుకొనుట కష్టం.

## గోండులు

తెలంగాణాలో ఉన్న కొండజాతి ప్రజల్లో ముఖ్యులు గోండులు, కోయలు. గోండులు తెలంగాణాలో ఆదిలాబాదు జిల్లాలోనే ఉన్నారు. ఇప్పటుగూడ జిల్లా మధ్యలో ఉన్న పర్వతాలు, అడవులతో నిండిఉన్న ఉట్నూర్, ఆసిఫాబాదు,

| జిల్లా | పురుషులు | స్త్రీలు | మొత్తం |
|---|---|---|---|
| హైదరాబాదు | 76 | 65 | 141 |
| మహబూబ్‌నగరం | 2,379 | 2,348 | 4,727 |
| ఆదిలాబాదు | 83,576 | 83,365 | 1,66,941 |
| నిజామాబాదు | 3,465 | 3,643 | 7,108 |
| మెదకు | 30 | 49 | 79 |
| కరీంనగరం | 6,831 | 6,485 | 13,316 |
| వరంగల్లు | 54,317 | 52,220 | 1,06,537 |
| నల్లగొండ | 129 | 126 | 255 |
| తెలంగాణా మొత్తం | 1,50,803 | 1,48,301 | 2,99,104 |
| స్టేటు మొత్తం | 1,78,756 | 1,76,177 | 3,54,933 |

రాజూరా తాలూకాల్లో ఎక్కువగా ఉన్నారు. వీరి జన సంఖ్య 1951 జనాభా లెక్కల ప్రకారం 90,591.

గోండులకు ప్రత్యేక చారిత్రిక ప్రాముఖ్యత ఉన్నది. మహారాష్ట్రులు దక్కనులో పైకిరాక పూర్వమే, ఆదిలాబాదులోని ఉట్నూరులో మధ్య ప్రదేశంలోని చాందాలో గోండ్ రాజ్యాలు ఏర్పడినవి. ఈ సమయంలోనే చాందాలోని కోట, నిర్మల, ఆదిలాబాద్ రోడ్‌పైని వోడల్ వాక్రీకోట, మానిక్‌ఘర్ కోట కట్టబడినవి. చాలా కాలం గోండు రాజులు ఈ కోటలను పరిపాలన చేశారు. ప్రస్తుతం ఉట్నూరు రాజా అనబడే అతను వీరి వారసుడే. ఈ చరిత్రవల్లనే గోండ్లు రాజ గోండ్లనికూడ పిలవబడతారు.

గోండ్లు ఆదిలాబాదు జిల్లాలోనేగాక, ప్రక్కనున్న మధ్య ప్రదేశంలోగూడా ఉన్నారు. అచ్చట వీరి జన సంఖ్య 25 లక్షలు. ఉత్తర బస్తరులోగూడా గోండులున్నారు.

గోండులతో కలిసి మెలసి ఉన్న ఇతర కొండజాతుల వారున్నారు. వీరిలో ప్రధానులు అనబడేవారు గోండులకు వేను కటినుంచి ఉంటున్న గాయకులు, గోండులకు సంబంధించిన పురాణగాధలు, జానపదాలు, కథలు మొదలగు వాటిని వీరు ఒక వంశంనుంచి ఇంకొక వంశానికి అందిస్తూ వచ్చారు. గోండుల మత క్రియల సందర్భంలో వాయిద్యాలుమోగిస్తున్నారు.

ఇంకొకరు టాటిస్ జాతి. వీరుగూడ ప్రధానుల మాదిరి ఇంకొక గాయకబృందం.

కాని వీరు ప్రధానులకంటె సాంఘికంగా క్రింది స్థాయికి చెందిన వారు. వీరిద్దరు గోండుభాష మాట్లాడతారు.

గోండులతోపాటు కొలములు, నాయిక పాడ్లు అనేవారు కూడ ఉన్నారు. ఈ ఈ రెండు జాతులు గోండుల కంటె వెనుక బడినవారు. పోడు వ్యవసాయం చేస్తారు. వేరు భాషను మాట్లాడుతారు. నాయక్ పాడులు, గోండులకంటె ఉన్నతస్థానం కలవారమంటారు.

గోండులు చాలకాలం నుంచి యితర కొండజాతుల వారికంటె బాగా వ్యవసాయం చేసేవారు. రేగడినేలలు వదిలి వేసివా ఇతర భూములపై బలం ఉన్నంత వరకు వ్యవసాయం చేసి, ఇంకొక చోటికి మారేవారు. అందుచే వర్షాకాలంలోనే వీరి వ్యవసాయ ముండేది. ఉట్నూరు, చాందా రాజ్యాలున్నప్పుడు వీరి ఆర్థిక స్థితి గూడ ఇప్పటి కంటె మంచిగా ఉండేదని గోండ్లు చెప్పుతారు. వెనుకటి కాలంలో వేయి పశువుల వరకూ కల గోండ్లు ఉండేవారని, యిప్పుడు 50 ఉంటే మహా భాగ్యమని, ముసలివారు చెప్పేవారని నైజాం ప్రభుత్వం నియమించిన జర్మన్ అధికారి హైమెన్ డ్రాఫ్ వ్రాశాడు. అందుచేతనే ప్రధానులు మొదలగువారిని ఇతర పనులకై పోషించే స్థితిలో ఉన్నారు. ఇతర చేతి పనులు చేసేవారు. వ్యాపారులు గూడ ముఖ్య కేంద్రాలయిన ఆసిఫాబాద్ (వెనుకటి పేరు జన్గాం) వంటిచోట్ల ఉండేవారు.

గోండులకొక ప్రత్యేక భాష, సంస్కృతి గూడ ఉంది. ఇప్పుడు గూడ గోండుభాష మాట్లాడతారు. దీంతోపాటు తెలుగు ప్రజలతో సంబంధం ఉన్నచోట, తెలుగు, మరాఠీ మాట్లాడతారు. గోండులు ఉపయోగించే ప్రత్యేక సూర్యాయన సంవత్సర మున్నది. ప్రత్యేక మత సంబంధమైన అల వాట్లు ఉన్నవి.

ఆదిలాబాద్ తాలూకాలో, కసలాపురం అనేచోట గోండుల పెద్దజాతర ప్రతి సంవత్సరం జరుగుతుంది. నాగశేషుని వీరు ఇచట పూజిస్తారు.

వెనుక ఆదిలాబాదుజిల్లా అంతటా గోండులే ఉండేవారు. కాని, మంచిర్యాల నుండి ఉత్తరం రాజురాకు, పడమట నిర్మల నుంచి ఆదిలాబాదుకు రాకపోకల సౌకర్యాలు ఏర్పాడ్డాక పెద్దమార్పు వచ్చింది. నిర్మల మంచిర్యాల రోడ్డు నిర్మాణం దీన్నింకా ముందుకు తీసుకుపోయింది. ఈ మార్గాలగుండా దక్షిణం కరీంనగరం మొ॥ జిల్లాలనుంచి అధికంగా ముందున్న ప్రజలువచ్చి నివాసమేర్పచుకో మొదలిడినారు. అట్లే ఉత్తరాన మధ్యప్రదేశ్ నుంచి గూడ పెన్నంగదాటి మహారాష్ట్ర రైతులు ప్రవేశించారు. క్రమంగా బయలు ప్రాంతంలో గోండుల భూములన్నీ భూస్వాములు, సాహుకార్ల చేతుల్లోనికి పోయినవి. వారచ్చట పూర్తిగా వ్యావసాయకులై పోయారు. బయలు ప్రాంతంలో భూములు పోయేకొద్ది, ఆదిలాబాద్ జిల్లా మధ్యఉన్న గుట్టల ప్రాంతంలోనికి పోయి నివాసమేర్పచుకొన్నారు. అచ్చటగూడ భూస్వాములు ప్రభుత్వాధికార్ల సహాయంతో వీర్ని కవులుదార్లుగా చేశారు,

# కోయలు

కోయలు వరంగల్లు, ఖమ్మం, కరీంనగరం, ఆదిలాబాదు జిల్లాలలో గోదావరినది కాను కొని ఉన్న ప్రాంతంలో ఉన్నారు. వీరిలో అత్యధికులు వరంగల్లు జిల్లాలోని ములుగు, పాఖాల్ తాలూకాల్లో ఖమ్మంజిల్లాలోని బూర్గంపాడు, పాల్వంచ, ఇల్లెందు తాలూకాలోను ఉన్నారు. తెలంగాణాను ఆనుకొని గోదావరి అవతల ప్రాంతమగు దక్షిణ బస్తరు, ఆంధ్రరాష్ట్రంలోని ఏజెన్సీ ప్రాంతం అంతటా కోయలే నివసి స్తున్నారు. అప్పటివారికీ, తెలంగాణా ప్రాంతంవారికీ దగ్గరి సంబంధాలున్నవి.

కోయల్లో అత్యధిక సంఖ్యాకులు తెలుగు మాట్లాడతారు. గోదావరినది కాను కొని ఉన్న కొంతమంది తెలుగు, గోండీ భాషల ప్రభావంచే ఏర్పడిన కోయభాష మాత్రమే మాట్లాడతారు. కోయల్లో రాచ కోయలనీ, భిన్నకోయలనీ విభజన ఉంది. తెలుగుమాత్రమే వచ్చే కోయలు తనను దొరల కోయలనీ పిలుచుకుంటారు. కోయ లకుపూజలు, పునస్కారములు జరిపేవారు పాటడు అనే పేరుతో కోయలతో కలసి ఉంటారు. కాని, వీరిది సాంఘికంగా కోయలకంటే క్రింది స్థానం. పాల్వంచ, బూర్గంపాడు తాలూకాల్లో కొండరెడ్లతో కలిసి కోయలున్నారు.

అడవుల్లో ఉండే కోయలు ఇప్పటికీ, ఒకచోటనుండి, ఇంకొకచోటకు పోతూ వ్యవసాయం చేసుకుంటారు. బయలు ప్రాంతాల్లో ఉన్నవారు స్థిరనివాసమేర్ప రచుకొన్నారు. కాని, వీరి భూములు చాలా వరకు యితరుల చేతుల్లోనికి పోయి నవి. బయటి నుంచి వచ్చిన కంట్రాక్టర్ల క్రింద కలపకొట్టటం మొదలగు పనులు చేస్తుంటారు.

రెండు సంవత్సరాల కొకసారి వరంగల్లు జిల్లాలోని ములుగు తాలూకాలో మేడారం అనేచోట పెద్ద కోయజాతర జరుగుతుంది. కోయలుండే ప్రాంతమంతటినుండి ప్రజలొ స్తారు. సమ్మక్క, సారలమ్మ అనే తల్లి, కూతుళ్లను ఇక్కడ కొలుస్తారు.

# కొండరెడ్లు

కొండరెడ్లు ప్రధానంగా పాల్వంచ తాలూకా (ఖమ్మంజిల్లా) లో ఉన్నారు. వీరు కోయలకంటె వెనుకబడి ఉన్నారని హైమెన్‌డ్రాఫ్ వ్రాశాడు. వీరు తెలుగు మాత్రమే మాట్లాడతారు. అత్యధికులకు గోండీ, కోయభాషలు తెలియవు.

కొద్ది కాలం క్రితం వరకు కొండరెడ్లు పోడు వ్యవసాయం, అడవిపండ్లు, దుంపలు పోగుచేయటం, బల్లెమ్ముతో వేటాడటం వీటిపైనే తిండికి ఆధారపడేవారు. వీరి పోడు వ్యవసాయ పద్ధతులు కోయలు, గోండ్లకంటెగూడ వెనుకబడి ఉన్నవి. వెనుక వీరు పశువుల నుపయోగించేవారు కాదు. తర్వాత మార్పువచ్చింది.

గత 50 సంవత్సరాలలో గోదావరి నానుకొని ఉన్నవారి జీవిత పరిస్థితిలో పెద్ద మార్పు వచ్చింది. క్రమంగా వీరు అడవికూలీలయిపోయారు, కలప ఎగుమతి

చేసే బయలు ప్రాంతపు వర్తకుల (ముఖ్యముగా రాజమండ్రి వారు) క్రింద కలప కొట్టి ఎగుమతిచేసే పనిలో పాల్గొంటున్నారు. ఇట్లు వీరు వ్యవసాయం చేసే దశ నుండి అడవి కూలీలుగా మారిపోయారు. ఉన్న భూములుగూడ పోగొట్టుకున్నారు.

ఇట్లు వర్తకుల, భూస్వాముల దోపిడీ ఎక్కువగుటచే, గోదావరి దాటి పాపి కొండల కవతల తూర్పుగోదావరిజిల్లాలోని తమ జాతివారున్న చోటికి చాలమంది వలస గూడ పోయారు.

# చెంచులు

చెంచులు మహబూబ్ నగరం జిల్లాలోని అచ్చంపేట (అమ్రాబాద్) తాలూకాలో గల నల్లమల గుట్టల ప్రాంతంలో ప్రధానంగా నివసిస్తారు. 1941 జనాభా లెక్కల ప్రకారం హైద్రాబాద్ స్టేటులోని చెంచు జనాభా అయిన 3,865గురిలో 3,280మంది మహబూబ్ నగరం జిల్లాలోనే ఉన్నారు. కాని, ఈ సంఖ్య చాలా తక్కువ. అడవులు, కొండలలో ఉండే వారిని అడవి చేయాలని పిలుస్తారు.

ఈ గుట్టలలోని చెంచులకు 1940 వరకు వ్యవసాయం చేయటం తెలియదు. ఇప్పటి కయినా, ఇండ్లవద్ద చిన్న చిన్న తోటల్లో ఇనపకడ్డీలతో నేలను త్రవ్వి, మొక్కజొన్న సాగుకు, కొన్ని సార్లు జొన్న మొదలగునవి కొద్దిగా పండిస్తారు. కాని, చెంచుల ప్రధాన జీవితాధారం అడవుల్లో దొరికే తేనె, మైనం చిరాంజీ మొదలగు అడవి పదార్థాలు సేకరించటమే. అడవుల్లో దొరికే వివిధరకాల గడ్డలను వీరు ఎక్కువగా తింటారు.

చెంచులు యింత వెనుకబడి వుండి, దూరంగా అడవుల్లో ఉంటున్నా, వీరికి ప్రత్యేక భాష లేదు. తెలుగుభాషే మాట్లాడుతారు. గ్రామాల దగ్గరగా వున్నా తమ నివాసాలు వేరుగా ఉంచుకుంటారు. కాని యిట్టిచోట్ల నెమ్మదిగా వీరిలో మార్పులు వస్తున్నవి.

# లంబాడీలు

లంబాడీలనే బంజారాలని కూడ పిలుస్తారు. భారత దేశ మంతా వీరున్నా, హైద్రాబాదులో ముఖ్యంగా తెలంగాణాలో వీరి సంఖ్య ఎక్కువగా వుంది. ఇవట్నిగూడ వరంగల్లు, నల్లగొండ జిల్లాలలో ఎక్కువగా వున్నారు. ఒక్క వరంగల్లుజిల్లాలోనే 85,000మందిఉన్నారు.

వీరు వెనుక ఒక చోటనుండి, ఇంకో చోటికి వ్యాపార సరుకులు మోసేవారు. ఈ అవసరం పోయాక స్థిరనివాసాలు ఏర్పరచుకున్నారు. పురుషులిచ్చటి తెలుగుప్రజల గుడ్డల మాదిరే కట్టుకున్నా, స్త్రీలు తమ ప్రత్యేక దుస్తుల, నగల ధరిస్తారు. తమ ప్రత్యేక తండాలలో నివసిస్తారు. తెలంగాణాలో అచ్చటచ్చట గ్రామాల్లోగూడా ఉంటున్నారు. తమ భాషను నిల్పుకున్నారిప్పటివరకు. మంచి పశువుల పెంచుటలో నిపుణులు, తెలం

గాణాలో, వీరు పెంచే అస్సాబాద్ పశువులకు ప్రత్యేకత వున్నది. వీరిప్పుడు వ్యవసాయం గూడ చేస్తున్నారు.

వరంగల్లు జిల్లాలో తొర్రూరుచుట్టూ వీరు చాలామంది ఉండుటచే ఇచ్చట 1947 లో లంబాడీల అభివృద్ధి కేంద్రాన్ని ప్రభుత్వం పెట్టింది. ఇచ్చట ఒక టీచర్ల ట్రయినింగ్ స్కూలుగూడ పెట్టబడింది. చుట్టుప్రక్కల 12 ప్రాథమిక స్కూళ్లు ఏర్పరచ బడినవి. మానుకోట దగ్గరగా ఒక ఉపకేంద్రం ఏర్పరచబడింది.

## కొండజాతి ప్రజల జీవన పరిస్థితి

తెలంగాణాలో విశాల ప్రాంతంలో నివసిస్తున్న ఈ వివిధ కొండజాతి ప్రజల జీవిత పరిస్థితి క్రమంగా చాల అధ్వాన్న దశకు వస్తున్నది. ఒకవైపు బయట నుంచి వచ్చే భూస్వాములు, సాహుకార్లు, వ్యాపారుల దోపిడి, ఇంకొకవైపు ప్రభుత్వ పటేలు, పట్వారీ, ఫారెస్టు అధికార్ల జులుం క్రింద వీరి జీవితం క్షీణించి పోతున్నది. ప్రభుత్వ రికార్డులే కొంత జాతి ప్రజల్లో అందరికంటె, కొంత మైనున్న గోండుల స్థితిగురించి, నైజాం ప్రభుత్వం నియమించిన ప్రత్యేకాధికారి హైమెన్ డార్ఫ్ 1945 లో వ్రాసినది చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

జిల్లాను అభివృద్ధిచేసి, ప్రభుత్వాదాయం పెంచాలని, కొత్తవారొచ్చి వుండుటకు ప్రభుత్వం ప్రోత్సహించింది. వారుచేసుకో గల భూమికి ఉచితంగా పట్టాలుఇచ్చింది. గోండురాజుక్రింద అంతవరకున్న మక్తా, జాగీర్లను ప్రభుత్వం వశపరచుకోవడం వల్ల ఇంతవరకు తమ పూర్వులు రాజులభూముల సేద్యం చేస్తున్న గోండులు కొత్తగా భూములు సంపాదించాల్సి వచ్చింది ... కొత్తగా వచ్చినవారు మంచి భూమినుండి వెళ్లగొడితే, ఇంకొకచోటుకు పోయి మామూలుగా వ్యవసాయంచేసేవారు. కాని అడవుల రక్షణ ప్రవేశ పెట్టేసరికి తమ భూమిని రక్షించుకొనుటకు గోండ్లకు సమస్య అయింది. పట్టాహక్కులేనిచిక్కును తెల్సుకో ప్రారంభించారు. పట్టా హక్కులున్నవారుగూడ వడ్డీ వ్యాపారస్తులకు పోగొట్టుకున్నారు...

"రాకపోక సౌకర్యాల పేరిట, ఇట్లు వ్యవసాయంచేయని వారికిగూడా లాభసాటిగా తయారుకావడంతో రాజులా, ఆదిలాబాదు, ఆసిఫాబాద్, నిర్మలలోని ముస్లింలు, బ్రాహ్మణులు, కోమట్లు గ్రామాలుగ్రామాలే సంపాదించి వ్యాపార పద్ధతులపై పనిచేయటం సాగించారు. ఇట్లు బయలు ప్రదేశంలో చాలా గ్రామాలను వ్యవసాయం చేయని భూస్వాములు సంపాదించారు. వీరు వ్యవసాయం బాగాచేసేవారిని తమగ్రామాలలో ఉంచాలని నిర్ణయించారు. అందుచే ఎక్కువ అనుభవం గలిగి, ఎక్కువ కవుళ్ళు యివ్వగలిగే అడవిజాతులు కానివారి దిగుమతిని ప్రోత్సహించారు. ఇట్లు వ్యవసాయ పద్ధతుల్లో వెనుకబడిన గోండు కవులు దార్లను తొలగించారు. ఈమార్పు ఇప్పటికీ సాగుతూనేవుంది. ప్రభుత్వ పరిపాలన, వ్యాపార కేంద్రాల చుట్టుప్రక్కల అడవి జాతులవారిబదులు ఇతర కులాలవారు ఆక్రమించారు. ఆసిఫాబాదు లోయలో ఆసిఫా

బాద్‌వద్ద ప్రస్తుతం చాలా గ్రామాలు ఇతర ప్రాంతాలవారిపై పోయాయి. ఇక్కడ కొత్త మోటార్ రోడ్లప్రక్కలగల గ్రామాలు గూడ...

ప్రభుత్వం క్రిందవున్న గ్రామాలకంటే, భూస్వాముల క్రింది గ్రామాల్లో కొండ జాతి ప్రజలస్థితి అధ్వాన్నంగా ఉండుటచే భూస్వామి ఒక గ్రామాన్ని ఆక్రమించగానే చాలామంది గోండ్లు దీన్ని వదలి, ఇంకొక చోట సిపాయిజమాబందిపై భూమి సంపాదించేవారు. కాని, ఇచ్చట వీరు భూమిని బాగుచేయగానే, వ్యవసాయంచేయని పట్టాదార్లకు దీన్ని పోగొట్టుకొనే ప్రమాదం వెంటనే ఏర్పడేది....

"కొద్ది వంశాలకు పూర్వం తమవైన భూములను బయటవారు ఆక్రమించటంపై బయలు ప్రాంతంలోని గోండులు ఏంచేస్తున్నారు? ఇతరులున్న గ్రామాలలో తమ అస్వతంత్ర స్థితికి కొందరు చేయునదిలేక అంగీకరిస్తున్నారు. కాని, ఇది ఒకేసారి చేయరు. ఒకటి, రెండుసార్లు కొత్తచోటకు పోయి, ప్రతిసారి సిపాయి జమాబంది పద్ధతిపై కొంతకాలం వ్యవసాయం చేశాక బయటివారు ఆక్రమించుకొన్నాక ఇట్లు అయ్యేవారు. ఇతరులు కొండలలోనికి పోయారు.

"గోండులింకా తమ భూమినుండి వెళ్ళగొట్టబడకుండా ఉన్న ప్రాంతం కొండలప్రాంతంమట్టుకే వీటికిదారి లోతైన కనుమలగుండా బండ్ల బాటలు మాత్రమే ఉన్నవి."

(హైమెన్‌డ్రాఫ్ వ్రాసిన ట్రయిబల్ హైద్రాబాద్ అనే పుస్తకంలో పేజీలు 66-81 ల నుండి.)

ఇదేపుస్తకంలో పటేలు, పట్వారీలు, ఫారెస్టు అధికారులు, గోండులను ఎట్లు దోచుకొనేది, ఫారెస్టు నియమాలు వీరి జీవితాన్నెట్లు విచ్ఛిన్నంచేసింది హైమెన్‌డ్రాఫ్ వివరించాడు.

కోయలు, కొండరెడ్లు ఉన్న ప్రాంతమగు గోదావరి ఒడ్డున ఫారెస్టు అధికారులు వీరిని ఎట్లు దోపిడీ చేస్తున్నదిగూడా హైమెన్‌డ్రాఫ్ వివరించాడు. (10-11 పేజీలు) ప్రక్కనేఉన్న అప్పటి మద్రాసు రాష్ట్రంలోని తూర్పుగోదావరి ఏజెన్సీ ప్రదేశంలో పరిస్థితి చాలా బాగా ఉన్నదని యితడు వ్రాశాడంటే, తెలంగాణాపై వున్న వారిస్థితి ఎంత అధ్వాన్నంగావుందో ఊహించుకోవచ్చు.

అడవుల కొట్టించి కలప అమ్మే వర్తకులు, ఫారెస్టు ప్రభుత్వ అధికార్లతోకలసి, అచ్చట నిజమైన పరిపాలకులుగా అయి, కోయలు, కొండరెడ్లను అమానుష దోపిడీ, హింసలకు గురి చేస్తున్నారని గూడ హైమెన్‌డ్రాఫ్ వ్రాశాడు. (17-25 పేజీలో) ఈ వర్తకులు కొండజాతి ప్రజలను తమ వ్యక్తిగత ఆస్తిగా పరిగణించి, అణచి ఉంచుటకై, వీరిలో కొందర్ని చంపటం గూడ పరిపాటయిందని చెప్పాడు. "ఈ ప్రాంతంలో వర్తకులే ప్రధాన అధికారులు అయి, యధార్థంగా పరిపాలన సాగిస్తున్నారు. తమ యజమానుల అధికారాన్ని అడ్డేది ఏదీలేదని, ప్రభుత్వ అధికార్లుగూడ వీరి కోర్కెల ప్రకారం ప్రవర్తిస్తారని, కోయలు, కొండరెడ్లు గట్టిగా నమ్ముతారు" అని హైమెన్‌డ్రాఫ్ వ్రాశాడు.

# కొండజాతి ప్రజలు: ప్రభుత్వం

1940 లో ఆదిలాబాద్ జిల్లాలో గోండులు తిరుగుబాటు చేసేదాకా ప్రభుత్వం ఈ దోపిడీని యథావిధిగా సాగిస్తూనే వచ్చింది. తమ భూములు పోతున్నందులకు విసిగి, వేసారి ఆసిఫాబాద్ తాలూకాలోని, బాబిచెరీ అనే గ్రామంలోని కుమార భీముడు అనే యువకుని నాయకత్వాన 1940 లో తమ భూముల రక్షణకు నిలబడ్డారు. వీరిని అణచుటకు, ప్రభుత్వ పోలీసుపోగా ప్రతిఘటించారు. ప్రభుత్వపోలీసు భీమును, ఇతర గోండులను చాలామందిని కాల్చిచంపి అణచివేసింది. కాని, ఈ ప్రతిఘటనతో భయపడి నైజాం ప్రభుత్వం కదలి, కొండజాతుల ప్రత్యేక అధికారి (Tribal special officer) గా జర్మన్ బారన్ హెమెన్‌డ్రాఫ్‌ను నియమించింది. ఆదిలాబాద్ గుట్టల ప్రాంతంలో కొండజాతికి చెందిన వారికి కొత్తపట్టాలు యివ్వరాదని నిషేధించింది. కొండజాతి వారికే, ఒక్కొక్కరికి 25 యకరాలవరకు భూమిని ఉచితంగా యిస్తామని ప్రకటించింది. గోండీ భాషలో విద్య నేర్పుటకై, మార్లవాయి అనేచోట గోండీభాష బోధించే టీచర్ల ట్రయినింగు కేంద్రాన్ని స్థాపించింది.

గోండీ భాషకు లిపి లేకపోవుటచే, నాగరిలిపి ఉపయోగించబడింది. తరువాత తెలుగుభాష మాట్లాడే గోండులకొరకు, ఆసిఫాబాద్ దగ్గర గిన్నెధారి అనేచోట 1948 లో ఇంకొక ట్రయినింగు స్కూలును పెట్టారు.

వీటి ఫలితంగా ఆదిలాబాద్ జిల్లాలో గల 532 కొండజాతివారి గ్రామాల్లో (నిర్మల చెన్నూరు తాలూకాలుగాక) 76 గుండి పంతులతో 69 స్కూళ్లు పెట్టాంఅని ప్రభుత్వం చెప్పుచున్నది. 1944 క్రీ॥ 1,30,000 ఎకరాలు పట్టాగా యివ్వబడిందని ప్రభుత్వ ప్రకటన. పరిస్థితులనుబట్టి పట్టాగుల మార్పుగల భూస్వాముల వారికందగా ప్రభుత్వఅధికార్లు ఉన్నప్పుడు ఈభూమిఅంతా కొండ జాతివారిక్రింద వున్నదనుకొనరాదు. వారి పేరిట ఇతరులు ఎందరో భూములు సంపాదించి కొండజాతివారికి చెందకుండా చేశారు.

తర్వాత మర్లవాయి ట్రైనింగు కేంద్రాన్ని గ్రామ పునర్నిర్మాణ సెంటరుగా మార్చి, దానిక్రింద సహకార సంఘాల ద్వారా అప్పులివ్వటం, వైద్యసహాయం మొదలగునవి చేస్తాంఅని ప్రభుత్వస్కీము. కాని, ఈ వైద్యసహాయంకోసం ఒక్క హెల్తు ఇనస్పెక్టర్ను మాత్రమే పెట్టామని ప్రభుత్వమే చెప్పుచున్నది. (ట్రైబల్స్, ట్రైబలు వెల్ ఫేరు-హైద్రాబాదు అనే పుస్తకం, 23 వ పేజీలో)

1946 దాకా కోయప్రాంతం గురించి, హెమెన్‌డ్రాఫ్ పర్యటనతప్ప ఏమీ జరుగ లేదు. 1946 లో ట్రైబలుప్రాంతం రెగ్యులేషన్ (Tribal Arias Regulation) ప్రకటించినా, 1949లో ట్రైబలు ప్రాంతపు రెగ్యులేషన్ వచ్చేదాకా పైది అమల్లోకే రాలేదని పైపుస్తకంలోనే వ్రాశారు. (41వ పేజీలో) అంటే 1948-49 లలో కోయ ప్రజలు, తెలంగాణా రైతాంగంతో కలసి, పోరాటం ప్రారంభించేవరకు ఏమీ జరుగ లేదన్నది స్పష్టం.

## పోలీసు యాక్షను తర్వాత

1946 లో తెలంగాణా రైతులు వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా, భూమికోసం ప్రారంభించిన పోరాటం 1949-50 లలో వరంగల్, కరీంనగరం, మహబూబ్‌నగరం అడవులలోని, కొండజాతి ప్రజల్లోనికి కూడా వ్యాపించింది. తాము పోగొట్టు కొన్న భూములు తిరిగి సంపాదించటానికి కంట్రాక్టర్లు, జంగ్లాత్ కాలుదార్ల, (ఫారెస్టు ఉద్యోగుల) దురాగతాల తొలగించుటకు, తమ పంచాయతీల ద్వారా తమ సమస్యల పరిష్కరించుకొనుటకు తెలంగాణాలోని కొండజాతిప్రజలు తమ సంఘాలు నిర్మించు కొని, మైదాన ప్రాంతం నుండి తమ అడ వుల్లో కొచ్చిన తెలంగాణా ప్రజాసంఘం ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టుపార్టీ నాయ కత్వాన పోరాడారు. 1949 లో కోయలు ఈ ప్రజాసంస్థలలో చేరారు. 1950 కల్లా ఆదిలాబాద్ గోండులు, అమ్రాబాద్ చెంచులు, లంబాడీలు కలిశారు.

అప్పుడు తెలంగాణాలో పరిపాలన చేస్తున్న వెల్లోడీ ప్రభుత్వం కదలింది. ప్రభుత్వ ప్రకటన ప్రకారమే "మద్రాను, ఒరిస్సాలలోని ఏజెన్సీ ప్రాంతాలు, అస్సా ములో ప్రత్యేక ప్రాంతాలలోవలె కొండ జాతి వారిని ప్రత్యేకంగా చూడాల్సిన అవసరం ఉన్నదని గుర్తించి, 1950 లో ట్రైబలు ఏరియాలరెగ్యులేషన్‌సు అమల్లో పెట్టారు. దీని క్రింద ట్రైబలు ప్రాంతా లకై ప్రత్యేక నియమాలు నిర్ణయించి ప్రక టించారు. వీటి ప్రకారం ఏవీ ప్రాంతాలు ట్రైబలు ప్రాంతాలో ప్రకటించారు. ఈ ట్రైబలు ఏరియాల రోజుల్లో కలెక్టరు ఏజెంటు అధికారాలను, సోషల్ సర్వీసు ఆఫీసరు అసిస్టెంటు ఏజెంటుఅధికారాలను చలాయిస్తారు. ఈకొండజాతివారినిగురించిన సివిలు, క్రిమినలు, రెవిన్యూ విషయాల్లో పై ఏజెంటు, అసిస్టెంటు ఏజెంట్లకు విశేష అధికారాలు యివ్వబడినవి. ట్రైబలు, పంచాయితీలకు ఖానూన్ రీత్యా అధికారం యివ్వబడింది.

కాని, ఈచర్యలద్వారాకూడకొండజాతి ప్రజలనుఅడవుల్లోనికితీసుకురాలేకపోయారు అందుచే చిన్న చిన్న గ్రామాల్లో ఉండే వారికి సరైన సౌకర్యాలు కలుగజేయలేమని వీటిని పెద్ద గ్రామాలుగా మార్చాలనే సాకుతో, మిలటరీ రక్షణక్రింద తెలంగా ణాలోని వివిధ కొండజాతి ప్రాంతాల్లో కొండజాతి ప్రజలను కేంద్రీకరించ ప్రారం భించారు. ఇది ముఖ్యంగా వరంగల్లు జిల్లాలోను, మహబూబ్‌నగరు జిల్లాలోని అమ్రాబాద్ ప్రాంతంలోను అమల్లో పెట్ట బడింది. కోయప్రజలు తమగ్రామాలు వదిలిరా నిరాకరించితే, వేలకొలది గ్రామాలు తగుల పెట్టబడినట్లు 1952 లో వరంగల్లు జిల్లాలో పర్యటించిన పి. డి. యఫ్. విచారణ కమిటీవారు ప్రకటించారు. దీని కంతకు 'కొండజాతుల పునరుద్ధరణ' అనే పేరిడబడింది.

ప్రభుత్వ ప్రకటన ప్రకారం ఇట్టి కేంద్రీ కరణ గ్రామాలను ములుగుతాలూకాలో తాడువాయి, చిన్నబోయపల్లి, రామన్న గూడెం, శివాపురం, పాల్వాయి, పస్ర, జకార్యరంలలోను, పాఖాల్ తాలూకాలో అశోక్‌నగర్, వల్లభ్‌నగర్, (సర్వాపురం వద్ద) కాకతీయపురం (వట్టివాగువద్ద) బాపూనగర్ (అమీనాబాద్‌వద్ద) లోను, యెల్లెందుతాలూకాలో 9, పాల్వంచ తాలూకాలో 7, బూర్గంపాడుప్రాంతంలో 2 నిర్మించారు.

ఈ పునరుద్ధరణ పేరిట ఈ కేంద్రాలలో లక్షల రూపాయిలు ఖర్చుచేయటం జరిగింది. అసలు జర్గింది మట్టుకు వేరు. 1950-51 లలో ఈ కేంద్రాలలో, మిలటరీ దౌర్జన్యాలకు, రోగాలకు గురియై తిండిలేక షుమారు 10 వేల కోయ, కొండ రెడ్డిప్రజలు చనిపోయారని ఈ ప్రాంతాలన్నీ తిర్గి పరిశీలించిన పి.డి.యఫ్. కమిటీ ప్రకటించింది.

జనరల్ ఎన్నికల తర్వాత, కాంగ్రెసు ప్రభుత్వం, కొండజాతి ప్రజలు, హరిజనులు మొదలగు వెనుకబడిన ప్రజల అభివృద్ధి కొరకు కృషిచేయుటకని 'సోషల్ సర్వీసు డిపార్టుమెంటును' ప్రత్యేకంగా ఏర్పరచి దానికొక మంత్రిని గూడ నియమించారు. ఈ డిపార్టుమెంటు క్రింద కొండజాతి ప్రజలకోసమంటూ వివిధ స్కీములపై లక్షలు ఖర్చు పెడుతున్నారు. ప్రభుత్వము అమలు జరుపుతున్నామన్న ప్రణాళిక లివి :

1. గిరిజనులు వెల్‌ఫేర్ స్కీము— ఆదిలాబాద్ : ఇది ఆదిలాబాద్ జిల్లాలోని గోండులకోసం నడుపబడుచున్నది.

2. అమ్రాబాద్ గ్రామాభివృద్ధిస్కీము మహబూబ్ నగరంలోని మన్నమారువద్ద (Amarabad Rural Welfare Scheme) అమ్రాబాద్ గుట్టల్లోని చెంచులు, యితర కొండజాతివారి అభివృద్ధికోసం ఇది.

3. కోయుల అభివృద్ధి స్కీము — (Koya Welfare Scheme) యెల్లెందు, పాల్వంచ, బూర్గంపాడు, (ఖమ్మం, వరంగల్లు జిల్లా).

4. కోయ ప్రజల పునరుద్ధరణ ప్రణాళిక (Tribal Reclamation Scheme) — వరంగల్లుజిల్లా : దీనిక్రింద 28 పునరుద్ధరణ కేంద్రాలుస్థాపించామని ప్రభుత్వప్రకటనలు. కోయలకు సంబంధించిన స్కీములకిందే పాఖాల్, లఖ్నవరం, రామప్పచెర్వుక్రింద కోయలకు 5,500 య. తరీ, 7000 య. ఖుష్కీ భూమినిచ్చి, 1650మంది కోయలను 'పునరుద్ధరించాలని' 1950లో హైద్రాబాదు ప్రభుత్వం నిర్ణయించింది. దీనికోసం 13 లక్షల రూపాయలు మంజూరయినవి. వీని నుండి ఈ మూడు చెర్వులక్రింద 630 కోయ కుటుంబాలకు రూ. 8,30,000 తక్కావీ అప్పులుగాను, రు.1,33,700 వసతులకోసం వెచ్చింప బడినవట.

5. గోదావరీ లోయ అభివృద్ధి ప్రణాళిక (Godavary valley Rural-welfare Scheme) గోదావరి లోయలో ఉన్న కోయ, కొండరెడ్డి ప్రజలు, అడవి కూలీలు సహకార సంఘంగా ఏర్పడి, కలప కొట్టటం మొదలగు పనులు చేయుటకిది ఉద్దేశింపబడింది.

6. చెంచుల పునరుద్ధరణ ప్రణాళిక - మహబూబ్‌నగర్.

7. బంజారాల అభివృద్ధి ప్రణాళిక-వరంగల్ జిల్లా, తొరూరుకిది కేంద్రంగా పని చేస్తుంది.

8. లంబాడీ అభివృద్ధిస్కీము – నల్లగొండజిల్లా : కొన్ని కేంద్రాలలో లంబాడీలను కేంద్రీకరించి వారి నభివృద్ధిచేయుటకీస్కీము ఉద్దేశింపబడింది.

వివిధ స్కీముల క్రింద 1951-52 లో రు. 3,40,804 లు ఖర్చు పెట్టినట్లు ప్రభుత్వం ప్రకటించింది. స్టేటులో కొండజాతి ప్రజల అభివృద్ధికై ప్రతి సంవత్సరం భారత ప్రభుత్వం యిస్తున్న 2 లక్షల రూపాయిలు దీనిలో చేర్చబడినవి. ఇదిగాక, స్టేటు ప్రభుత్వం రు. 2,47,000 సోషల్ సర్వీసు డిపార్టుమెంటు కేడరుపై

ఖర్చుపెట్టింది. అంటే కొండజాతి ప్రజలందరి అభివృద్ధికై ఖర్చు పెట్టినదాంట్లో షుమారు సగం ఈ కేడరుపైనే ఖర్చుచేశారన్నమాట. (హైద్రాబాద్ పరిపాలనా రిపోర్టు 1951-52, 20వ పేజీ)

ఇక ప్రజలపై వెచ్చించామన్న డబ్బునుంచి ఈ ప్రణాళికల ద్వారా సాధించిన ఫలితాలు ఏమిటో చూద్దాం.

భూమివసతికల్పించటం:- గోండులకు కావలసిన భూమి యిస్తామని, కోయలకు ప్రతి కుటుంబానికి 5 ఎ॥ లు యిస్తామని ప్రభుత్వం ప్రకటించింది. రిజర్వు ఫారెస్టుల్లోగూడ, కొండజాతి ప్రజల అవసరాలను పాటించకుండా అడవిహద్దులు ఏర్పరచిన చోట మార్చి, భూమి యిస్తామని, వెనుక కొండజాతివారి క్రింద ఉండి, రిజర్వు ఫారెస్టులో చేర్చబడిన భూమి కూడ తిరిగి యిప్పిస్తాం అని ప్రభుత్వం ప్రకటించింది. (ట్రైబ్సు, ట్రైబల్ వెల్ఫేర్ -హైద్రాబాదు, 21వ పేజీ) దున్నే ఎద్దుల కొనుక్కొనుటకు తక్కావీ అప్పులు యిస్తామన్నది.

కాని, 1951-52 రిపోర్టు ప్రకారం, ఈ సంవత్సరంలో 5,149 ఎ॥ మాత్రం యిచ్చారు. రు 2, 619 విలువగల దున్నే ఎద్దులు మాత్రమే సప్లయి చేశారు.

విద్య:- ఆదిలాబాద్ జిల్లాలో కొండ జాతివార ప్రాంతంలో 2 ట్రయినింగు పాఠశాలలు (1949 లో 69 స్కూళ్ళు) వరంగల్లు, ఖమ్మం జిల్లాలలో రెండు ట్రయినింగుస్కూళ్ళు, 29 ప్రాథమిక పాఠశాలలు, గోదావరిలోను, గ్రామఅభివృద్ధిస్కీముక్రింద 3 స్కూళ్లు బంజార్, లంబాడీల అభివృద్ధి స్కీములక్రింద 17 పిల్లల స్కూళ్లు, 4 వయోజన విద్యాకేంద్రాలున్నవి. (హైదరాబాద్ ప్రభుత్వ డిపార్టుమెంటుల పని విధాన వివరాలు—19 52-53, పేజీలు 79-81)

3 లక్షలున్న తెలంగాణా కొండజాతి ప్రజలకీ విద్యాసౌకర్యాలు !

## ఆరోగ్యం - మందుల వసతి

వరంగల్లు జిల్లాలో చలనవైద్యదశాలు రెండున్నవి. (Mobile units) ప్రతిదానికొక హెల్తు ఇన్‌స్పెక్టరున్నాడు. ఈరెండింటా కలసి 1951-52 లో 7,893 రోగులకు సహాయం చేశారట. గోదావరీ లోయ స్కీముక్రింద హెల్తు ఇన్‌స్పెక్టర్లు 1523 రోగులకు మన్ననూరులోని వైద్యశాల 2,059గురికి, ఆదిలాబాద్ జిల్లాలో 1631గురికి చికిత్సచేశారట. ఈ లెక్కలు యధార్థమనుకున్నా, అతిప్రమాదకర జబ్బులతో కొండజాతి ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు బాధపడుతుంటే, మొత్తం ఒక సంవత్సరంలో చికిత్సచేసిన రోగులసంఖ్య షుమారు 15 వేలు మాత్రమే.

## సహకార సంస్థలు

ఆదిలాబాద్ జిల్లాలోని మర్లవాయి, మాణిక్యపురం, కేసలాపురం, కేశవపట్టణంలోవున్న గ్రామ సహకార బ్యాంకులు అన్నిరకాల సహకార సంస్థలుగా (Multi purpose societies) గా మార్చబడినవి. వరంగల్లు జిల్లాలో యనికారం, సుదిమల్ల, పట్వారీ గూడెంలవద్ద, ఆదిలాబాద్ జిల్లాలో జల్వాత్రి, జాపల్ల, గన్నెధరీలలోను, కొత్తగా 5 సంఘాలు పెట్టబడినవి. ఇదివరకున్న కొయ్యాడ, మాణిక్యాపురం సంఘాలు అడవిని గుత్తకు తీసుకొని 1951-52 లో రూ 3,50,000 లాభం తీసినదట.

## పునరుద్ధరణ కేంద్రాలు

తెలంగాణా రైతు పోరాటంలో పాల్గొంటున్న కోయలను దాన్నుండి దూరంచేయటానికై వరంగల్లు జిల్లాలో మొత్తం 98 పునరుద్ధరణ కేంద్రాలను ఏర్పరచారు. ఇవి ములుగులో 4, పాఖాల్‌లో 2, యెల్లెందులో 35, బూర్గంపాడులో 11, పాల్వంచలో 44 ఉన్నవి.

## పంచాయతీల ద్వారా తీర్పులు

1949 ట్రైబలు ఏరియాల రెగ్యులేషన్ ద్వారా సోషల్ సర్వీసు అధికార్లకిచ్చిన క్రిమినలు, సివిలు, రెవెన్యూ అధికారాల క్రింద 1951-52 వరకు మొత్తం 407 కేసులే వచ్చాయట. ఇక వీటిలో 291 మాత్రమే పరిష్కారమైనవి. వీటిలో, ఆసిఫాబాద్‌లో 288 కేసులొస్తే 99 పరిష్కారమైనవి. యెల్లెందులో 39 వస్తే 31 పరిష్కారమైనవి. దీన్నిబట్టి కేసుల పరిష్కారం ఎంత నెమ్మదిగా నడుస్తున్నదీ తెలుస్తుంది. పంచాయతీలెట్లు పనిచేస్తున్నదీ తెలియదు.

పై విషయాలు చూస్తే ఒక్క విషయం స్పష్టమవుతుంది. ఇంతకాలం అమానుషంగా దోపిడీ చేయబడుతున్న తెలంగాణా కొండజాతి ప్రజలు, తెలంగాణా రైతులతో చేతులు కలిపి, తనపై సాగే జులుంకు వ్యతిరేకంగా కదిలేసరికి ప్రభుత్వం వీరి నుద్ధరించుటకు లక్షల రూపాయల ఖర్చుతో, వివిధ స్కీములను ప్రకటిస్తున్నది. కాని, వీటివల్ల ఈ కొండజాతి ప్రజలకు కలుగుచున్న లాభం అత్యల్పం. కొండజాతి ప్రజలు సంఘటితపడి, తాము పోరాడి సాధించుకొన్న ఈ హక్కులను ఉపయోగించుకోగల్గితే ఇవి వారికేమయినా ఉపయోగిస్తవి.



# షెడ్యూల్డు తరగతి ప్రజలు

భారత రాజ్యాంగం క్రింద హైద్రాబాదు స్టేటులో, ఈ క్రింది కులాల వారు వెనుకబడిన కులాలవారుగా (Scheduled-classes) నమోదు చేయబడినారు :

1. అనాముకులు, 2. ఆరె (మాల), 3. అర్వమాల, 4. దోడ (బుడ్గ) జంగం, 5. బింద్ల, 6. బ్యాగార, 7. చల్వాడి, 8. చంబార్, 9. ఢక్కల్ (డొక్కల్ వారు), 10. ఢోర్, 11. యల్లమల్వార్ (యల్లమ్మలవాండ్లు), 12. హోలియా, 13. హోలియాదస్సారి, 14. కొలుపుల వాండ్లు, 15. మాదిగ, 16. మాహార్, 17. మాల, 18. మాలదాసరి, 19. మాల హన్నాయి, 20. మాలజంగం, 21. మాల మాస్టి, 22. మాలసాలె (నెట్కాని), 23. మాలసన్యాసి, 24. మంగ్, 25. మంగ్ గారుడి, 26. మన్నె, 27. మాసేటి, 28. మెహతర్, 29. మితఅయ్యవార్, 30. మోచి, 31. సామగర, 32. సింధోళ్లు (చిందోళ్లు).

తెలంగాణా, మరఠ్వాడా, కర్నాటక లలో వివిధ పేర్లతో ఉన్న వెనుకబడ్డ కులాల వారుంటారు. అవన్నీ పైన యివ్వ బడినవి.

ఇంతకుముందు హైద్రాబాద్ స్టేటులో వెనుకబడిన కులాలవారిని గురించి స్థిరమైన నిర్ణయంలేక, జనాభా లెక్కలలో ఒకసారి కొన్ని కులాలు చేర్చటం, ఇంకొక సారి ఇంకా కొందర్ని చేర్చటం జర్గింది. అయినా వీరు తెలంగాణా జనాభాసంఖ్య ఆక్రమిస్తున్న ముఖ్యస్థానం స్పష్టంగా తెలుస్తుంది. 1951 జనాభా లెక్కల ప్రకారం కూడ వీరు తెలంగాణాలో 17,37,572 మంది ఉన్నారు. (స్టేటు మొత్తంమీద 30,88,843 మంది ఉన్నారు) తెలంగాణా మొత్తం జనాభాలో వీరు 17.1% ఉన్నారు. (స్టేటు మొత్తంమీద 16.56% ఉన్నారు.)

వీరిలో అత్యధికసంఖ్యాకులు వ్యవసాయంపై ఆధారపడే వారే. కాని, భూమిలేని వ్యవసాయ కూలీలే అత్యధికులు. వీరిలో అత్యధికులు సాంఘికంగా అంటరాని వారగుటచే వీటన్నిటిని అవకాశంగా తీసుకొని, తెలంగాణాలో బలంగా ఉన్న ఫ్యూడల్ వర్గాలు వీరిని అమానుషంగా దోపిడీ చేసేవారు. నిర్బంధంగా వెట్టి తీసుకోవచ్చునని, వెనుక ప్రభుత్వ ఖానూన్ (చట్టం) ఉండేది. వీరందరిచే వెట్టిచాకిరీ చేయించుకోటం, కూలి యిచ్చినా, నామకః యివ్వటమే జరిగేది.

అందుచే తెలంగాణా జాతీయఉద్యమాన్ని ప్రారంభించి, అభివృద్ధి చేసిన ఆంధ్ర మహాసభ తన పుట్టుకనుంచి, వెట్టిచాకిరీ నిర్మూలనకై ఆందోళన చేసింది. చివరకు నైజాం ప్రభుత్వం 1930 ప్రాంతంలో కొన్ని మినహాయింపులతో వెట్టి చాకిరీని నిషేధించింది. ప్రజాతంత్ర ఉద్యమం అభి

వృద్ధి చెందినకొద్దీ, స్టేటులోని పాలకవర్గం ఈ వెనుకబడిన కులాలను తనకు సహాయంగా చేసుకోవాలని ప్రయత్నించింది.

ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంస్థ, వీరిని ఇస్లాం మతంలో కలుపుకొని, వెట్టిలేకుండా చేయటంద్వారా వీరి బలాన్ని సంపాదించాలని ఇట్లు కొద్దిగాఉన్న ముస్లిం జనాభాను పెంచాలని ప్రయత్నించింది. కాని, ఇది జయప్రదము కాలేదు. 1940 నుంచి ఊపకలు తీసుకుంటూ తెలంగాణాలో ముందుకుసాగిన ప్రజాఉద్యమాన్ని అరికట్టుటకు స్టేటుపాలకవర్గం ఇంకొక ఎత్తుగడ వేసింది. తమ కనుకూల నాయకత్వంక్రింది డిప్రెస్‌డు క్లాసెస్ సంఘ నిర్మాణాన్ని ప్రోత్సహించి, వానిద్వారా కొనిని ప్రత్యేక సదుపాయాలు కల్గించి, వీరిని తమ వైపుకు లాక్కొ ప్రయత్నించింది. తెలంగాణా పోరాటం అత్యంత ఉన్నతదశలో ఉన్నప్పుడు షెడ్యూల్డు కాస్టుట్రస్టుఫండు ఈ విధంగా 1948 లో ప్రారంభింపబడింది. ఒక కోటిరూపాయీలు ఈ హరిజన ప్రజల అభివృద్ధికని ప్రత్యేకించారు.

పోలీసు యాక్షను తర్వాతగూడ, ఈ దృక్పథంతో, హరిజనులను ప్రజాతంత్ర ఉద్యమాన్నుండి దూరంచేయుటకు ప్రభుత్వం కొన్ని చర్యలు తీసుకొన్నది. వీటిలో ముఖ్యమైన వివి :

1. 1948 లో చేసిన వెట్టిచాకిరీ నిషేధ రెగ్యులేషన్-దీనిప్రకారం-వెట్టి పూర్తిగా నిషేధింపబడినది.

2. హైదరాబాద్ హరిజన దేవాలయ ప్రవేశ రెగ్యులేషన్ - 1948 - దీనిప్రకారం అన్ని దేవాలయాలలోనికి, ఇతరపవిత్రస్థలాల లోనికి, ఇతరులవలె హరిజనులకు గూడ ప్రవేశహక్కు గుర్తింపబడింది. దీన్ని అడ్డుపడచేవారిని 6 నెలలవరకు శిక్షింపవచ్చు. ప్రభుత్వంనుంచిడబ్బు, లేక భూమిని పొందదలచిన దేవాలయాధికారి, ఇట్టి శిక్షకు లోనైతే, వీటిని తీసివేయవచ్చు.

3. హరిజనుల సాంఘిక అక్రమాలను తొలగించే రెగ్యులేషన్ - 1948 దీని ప్రకారం, హరిజనులపైఉన్న వివిధ రకాల సాంఘిక ఆటంకాలు నిషేధింపబడినవి.

4. 1950 లో నెం. 48 ప్రభుత్వ ఉత్తర్వు ప్రకారం, హరిజనుల ఇండ్ల వసతికై అనుకూలమైన స్థలాలు యివ్వాలని రివెన్యూ అధికారులకు తెల్పబడింది.

5. 1951 లో కంచె భూములను ఉచితంగా హరిజనులు సేద్యం చేసుకొనుటకివ్వాలని నిర్ణయించబడింది.

6. హరిజనులకై బావులు త్రవ్వుటకు, రాత్రి పాఠశాలలు నడుపుటకు, చేతి పరిశ్రమలు సాగించుటకై ఆర్థిక సహాయం ప్రభుత్వం యిస్తామని ప్రకటించారు.

7. హరిజనుల విద్యాభివృద్ధివిషయంలో 1948 లో స్థాపించబడిన షెడ్యూల్డు కాస్టు ట్రస్టు ఫండునుంచి ప్రధానంగా ఖర్చుపెట్టబడుచున్నది. చదువుకొంటున్న ప్రతి హరిజన విద్యార్థికి గూడ, దీని క్రింద ఆర్థిక సహాయం దొరుకుతుంది. స్కూలు ఫీజుల విషయంలో స్కాలరు షిప్పులు, హాస్టల్సును కొనసాగింపటం ద్వారా ప్రధానంగా సహాయం చేయబడుచున్నది.

ఈ పనులకై ఇంతవరకు ఫండు నుండి షుమారు 55 లక్షలపై ఖర్చు అయింది.

# పంచవర్ష ప్రణాళిక

పంచవర్ష ప్రణాళిక (1951 - '56) క్రింద హైదరాబాదు స్టేటు అంతటికీ రు42,50,83,000లు ఖర్చు చేయాలని మొదట నిర్ణయించబడింది. కాని తర్వాత ఈ ప్లాను పూర్తి చేయడానికి ఈ అంచనాలు చాలవనీ, మరొక మూడు కోట్లు సొమ్ము కావలసి ఉంటుందని, 1953 లో ప్లాను సవరించారు. దీని ప్రకారం, స్టేటు ప్లాను క్రింద రు. 45,52,83,000 లు ఖర్చవుతుందని అంచనా వేశారు.

దీనిలో తెలంగాణా ప్రాంతంలో దాదాపు 20 కోట్లు ఖర్చు చేయాలని నిర్ణయించబడింది. * ప్రక్క పేజీలోని పట్టికలో, ఏయే పద్దు క్రింద ఎంత ఖర్చు చేయ నిర్ణయించిందీ వివరించబడింది :

తెలంగాణా ప్రణాళికలో నీటివసతుల ప్రాజెక్టులకు ప్రాధాన్యత యివ్వబడింది. ఈ ప్రాజెక్టులపై 589.63 లక్షలు ఖర్చు అవుతాయని అంచనా. ఈ ప్రాజెక్టులలో ఆదిలాబాదులో గోదావరిపై నిర్మించబోయే కడెం ప్రాజెక్టు, తుంగభద్ర దిగువ ఆనకట్ట (రాజోలి బండ ప్రాజెక్టు), నల్లగొండలో భీమనపెల్లివాగు ప్రాజెక్టు, మహబూబ్‌నగరం జిల్లాలో కోయిల్ సాగర్ ప్రాజెక్టు, నల్లసాగర్ ప్రాజెక్టులు ఉన్నాయి. ఈ ప్రాజెక్టులతో పాటు విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులుకూడా వున్నాయి. కరీంనగరంలో ఈ ప్రాజెక్టులకొరకు 152.30 లక్షలు ఖర్చు చేయబడతాయి.

పంచవర్ష ప్రణాళికలో రెండవ ప్రాధాన్యత వ్యవసాయం, గ్రామాభివృద్ధికి యివ్వబడింది. దీనికొరకు తెలంగాణాలో రు. 346.40 లక్షలు ఖర్చు చేయబడతాయి. వ్యవసాయాభివృద్ధి, గ్రామాభివృద్ధికొరకు అదనపుభూములను సాగులోకి తేవటం, వ్యవసాయాన్ని నవీనపద్ధతుల్లో నడపటానికి మేలురకం విత్తనాలు, ఎరువులు, ఇనుప నాగళ్ళు, నీళ్ళపంపులు సప్లయిచేయటం జరుగుతుంది. పశుసంపదను పెంచటం, పశువైద్యశాలలు నిర్మించటం, కొత్తగా అడవులను పెంచటం ఈ ప్లానులో ఒక భాగం. వ్యవసాయాభివృద్ధికి, వ్యవసాయదారులకు, సహకారసంస్థల రూపంలో భూ తనఖా బ్యాంకులద్వారా దీర్ఘకాల అప్పులివ్వడం, వ్యవసాయసహకారసంస్థల ద్వారా (Aca) వ్యవసాయపరికరాలు సప్లయి చేయటం, ఆహారకొరతను తీర్చటానికి చేపలను పెంచటం ఈ ప్లానులోని ముఖ్యాంశాలు.

పంచవర్ష ప్రణాళికలో, చేనేత, ఉన్ని, సిల్కు, జరీ నేత పరిశ్రమలు, బొల్లంతయారీ మొదలగు కుటీరపరిశ్రమల అభివృద్ధికి రు. 24,84,180 లు ఖర్చు చేయబడతాయి.

* జిల్లాలవారీ, వివిధ పద్దుల క్రింద ఎంతెంత ఖర్చు చేయదలచిందీ అధ్యాయం చివరనున్న పట్టికలో వివరించబడింది.

| ప్రణాళికలు | | మొత్తం స్టేటుకు (లక్షల రూ.లలో) | * తెలంగాణాకు (లక్షల రూ. లలో) |
|---|---|---|---|
| వ్యవసాయాభివృద్ధి | ... | 346.41 | 346.40 |
| పశువైద్యం, పశుపోషణ | ... | 51.30 | 26.07 |
| అడవుల అభివృద్ధి | ... | 21.43 | 4.68 |
| సహకారోద్యమం | ... | 35.31 | 18.96 |
| మత్స్యసంపద | ... | 8.56 | 7.39 |
| నీటివసరుల ప్రాజెక్టులు | ... | 2,463.00 | 589.63 |
| విద్యుచ్ఛక్తి ప్రణాళికలు | ... | 234.00 | 152.30 |
| కుటీర పరిశ్రమలు | ... | 25.72 | 24.84 |
| పెద్ద పరిశ్రమలు | ... | 268.71 | 258.75 |
| రోడ్డురవాణాలు | ... | 128.57 | 44.23 |
| విద్య | ... | 264.11 | 130.92 |
| వైద్యం | ... | 117.64 | 61.75 |
| ప్రజారోగ్యం | ... | 286.07 | 253.29 |
| | | 4,250.83 | ... |
| అదనంగా కేటాయించిన సొమ్ము | ... | 302.00 | ... |
| మొత్తం | ... | 4,552.83 | 1,920.21 |

ఈ పరిశ్రమలకు పారిశ్రామిక సహకార సంస్థలద్వారా ముడిసరుకులు, యంత్ర సామాగ్రి సప్లయి చేయటం, తయారైన వస్తువులకు మార్కెటు ఏర్పాట్లు చేయటం, అప్పుల రూపంగా, యితర విధంగా ధన సహాయం చేయటం జరుగుతుంది. పెద్ద పరిశ్రమలు వరంగల్లు, ఖమ్మం జిల్లాలలో వున్న బట్టల, బొగ్గు పరిశ్రమలకు, హైదరాబాదు నగరంలోవున్న బట్టల, సిగరెట్లు, గాజు పరిశ్రమలకు, ఆదిలాబాదులో వున్న కాగితం పరిశ్రమల అభివృద్ధికి రు. 258.75 లక్షలు ఖర్చు చేయబడుతాయి.

తెలంగాణాలోవున్న రోడ్లను బాగు పర్చటానికి, కొత్తరోడ్లు వేయటానికి రూ. 44.23 లక్షలు వెచ్చించబడతాయి.

సామాజిక కార్యక్రమాలక్రింద తెలంగాణాలో రు. 345.96 లక్షలు ఖర్చు చేయబడుతాయి. ఈ సామాజిక కార్యక్రమాలలో సాధారణ విద్య, సాంకేతిక వృత్తివిద్య అభివృద్ధి, అదనపు వైద్య సౌకర్యాలు,

* స్టేటుప్లానుకు కేటాయించిన మొత్తాన్ని 1958 లో రు. 455.88 లక్షలకు పెంచిన తర్వాతనే తెలంగాణాకు ఈ మొత్తాలు కేటాయించబడ్డాయి.

ప్రజారోగ్యం, గృహవసతి మున్నగునవి వున్నాయి. విద్యాభివృద్ధి ప్రణాళికలో ప్రతి 500 జనాభాగల గ్రామంలో ఒకరు లేక యిద్దరు టీచర్లతో వున్న ప్రాథమిక స్కూళ్లు ఏర్పాటు చేయాలనీ, 500 ల జనాభాకు లోబడివున్న గ్రామాలలో 'స్వచ్ఛంద సహాయక' స్కూళ్ళు తెరువాలనీ, 5,000 జనాభాగానీ, అంతకుమించిగానీ వున్న గ్రామాలలోను, ప్రతితాలూకాలోను మాధ్యమిక పాఠశాలలు తెరవాలని, ప్రస్తుతం మాధ్యమిక పాఠశాలలు వున్న చోట ఉన్నత పాఠశాలలు తెరవాలనీ, తెలంగాణా అన్ని జిల్లాలలో 20 గ్రామాలతో కూడిన గ్రామ సముదాయాలలో నిర్బంధ ప్రాథమికవిద్య ప్రవేశ పెట్టాలనీ ప్లాను సూచించుచున్నది.

వైద్య సౌకర్యం ఎక్కువ చేయుటకు గాను ప్రతి తాలూకాలో ఒక ఆస్పత్రి నిర్మించాలనీ, అక్కడక్కడ డిస్పెన్సరీలు తెరువాలనీ ధనసహాయమిచ్చి ఆయుర్వేద వైద్యశాలలు తెరిపించాలనీ,సంచార నేత్ర వైద్యశాలలు ప్రవేశపెట్టాలనీ ఈ ప్లాను సూచించుచున్నది. అంతేగాకుండా గ్రామ ప్రజలకు వారివారి గ్రామాలలోనే మందులు సరఫరా చేయటానికి మందుల పెట్టెలు సప్లయి చేయాలని, శిశుపోషణ కేంద్రాలు స్థాపించాలని ప్లానులో ఉదహరించబడింది. అంటు వ్యాధుల నివారణకు మొత్తం స్టేటులో 10 క్వారెంటైన్ ఆస్పత్రులు స్థాపించాలనీ, క్షయరోగాన్ని అరికట్టటానికి హైద్రాబాదునగరంలో 16 వైద్యశాలలు స్థాపించాలనీ, హైద్రాబాదునగరంలో 250 మంచాలతో మాతాశిశు సంరక్షణాలయాలు స్థాపించాలనీ, చర్మవ్యాధుల నివారణకు 100 మంచాలతో మరో ఆస్పత్రి నిర్మించాలనీ ప్లాను సూచిస్తున్నది. కార్మికుల గృహవసతికొరకు హైద్రాబాదు నగరానికి రు. 1,50,00,000 లు వరంగల్లు, ఖమ్మం జిల్లాలకు రు. 42,00,000 లు, నిజామాబాదుకు రు. 6,00,000 లు కేటాయించబడింది.

వెనుకబడిన తరగతుల అభివృద్ధికి కోటి రూపాయల మూలధనంతో షెడ్యూల్డు కాస్టు ట్రస్టుఫండు ఉన్నది. 25 లక్షల మూలధనంతో రూరల్ వెల్ఫేర్ ట్రస్టు ఫండు స్థాపించబడింది.

పంచవర్ష ప్రణాళికతోపాటు తెలంగాణాలో నిజామాబాదు ప్రాజెక్టు ప్రాంతంలో, ములుగు ప్రాజెక్టు ప్రాంతంలో కమ్యూనిటీ ప్రాజెక్టు కేంద్రం, అభివృద్ధి బ్లాకు కేంద్రం స్థాపించారు. నిజామాబాదు కమ్యూనిటీ ప్రాజెక్టుక్రింద రు 62,75,632 లు, ములుగు బ్లాకుక్రింద 20,98,843 రూపాయీలు ఖర్చు చేయబడుతాయి. నిజామాబాదులో కమ్యూనిటీ ప్రాజెక్టుక్రింద బాన్సువాడా, బోధను తాలూకాలలోని మొత్తం 158 గ్రామాలున్నాయి. ఈ గ్రామాల మొత్తంజనాభా 1,37,350. ఈ ప్రాజెక్టుక్రింద 2,55,486 ఎకరాలు వుంది. ములుగుబ్లాకు (లక్నవరం బ్లాకు) క్రింద 41,364 జనాభాగల 85 గ్రామాలున్నాయి. 40,000 ఎకరాల భూమి వుంది. ఈ బ్లాకు అభివృద్ధిద్వారా 15,000 ఎకరాల భూమి (బంజరును) ని సాగులోకి తేవాలని నిర్ణయించబడింది.

ఈ కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్య కలాపాలు దాదాపు పైన వివరించిన పంచవర్ష ప్రణాళికక్రింద సూచించిన కార్య కలాపాలే. అయితే ఈ ప్రాజెక్టుల ఖర్చులో

విదేశ కరెన్సీ ఖర్చులు అమెరికా సాంకేతిక సహకార ఒప్పందంద్వారా వచ్చిన ఫండు నుండి యివ్వబడుతాయి. ఆర్థికంగా స్వయం పోషకంగా వుండే ప్రాజెక్టుల నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వంనుండి, స్వయం పోషకంగా లేని ప్రాజెక్టుల ఖర్చులలో కేంద్రం 75 వంతులు, రాష్ట్ర ప్రభుత్వం 25 వంతులు భరిస్తాయి. ప్రాజెక్టుల నిర్మాణం జరిగిన మూడుసంవత్సరాల తర్వాత ఆ ప్రాజెక్టు మొత్తంఖర్చు రాష్ట్రప్రభుత్వమే భరించవలసి ఉంటుంది.

ఈప్రణాళిక గతమూడుసంవత్సరాలుగా అమలు జరుపబడుతున్నట్లుగా కనపడుతున్నా ఫలితంమాత్రం శూన్యం. అనేక కొత్త ప్రాజెక్టులు ప్రారంభించటంవల్ల, పరిశ్రమలను అభివృద్ధిచేయటంవల్ల అసంఖ్యాకులకు పని దొరికి నిరుద్యోగ సమస్య కొంతవరకయినా పరిష్కరింపబడి ఉండవలసింది. కాని, రోజులు గడిచేకొలదీ మూతబడే ఫ్యాక్టరీలసంఖ్య, నిరుద్యోగుల సంఖ్య విపరీతంగా పెరుగుతున్నది. ఉదాహరణకు, ఉస్మానియాబట్టలమిల్లులో గత ఆరుమాసాలలోనే 600 మంది కార్మికులు తొలగించబడ్డారు. ఔరంగాబాద్ బట్టల మిల్లులో పనివారిసంఖ్య 2,100 నుండి 700 లకు తగ్గించబడింది. షహబాద్ సిమెంటుఫ్యాక్టరీలో 1,500 మంది కార్మికులు రిట్రెంచి చేయబడ్డారు. ఐదు పంచదారమిల్లులలో పనిచేసే కార్మికుల సంఖ్య 2,700నుండి1,900కు తగ్గించబడింది. సింగరేణి బొగ్గుగనులలో పనిచేసే 21,000 మంది కార్మికులలో 6,000 మంది ఉద్యోగాలు కోల్పోయారు. మొత్తం పనిచేస్తున్న 1,200 ఆయిల్ఎక్స్‌పెల్లర్లలో ఇప్పుడు 600 మాత్రమే పనిచేస్తున్నాయి. వీటిలో పనిచేసే 15,000 మంది కార్మికులలో 7,000 మంది నిరుద్యోగు లయ్యారు.

ఇక ప్రాజెక్టుల విషయం. తుంగభద్ర ప్రాజెక్టుడాము తయారైనా, కాలువల త్రవ్వకం పూర్తికాలేదు. ప్లాను ప్రకారం త్రవ్వబడినంతవరకయినా కాలువలు సాగుదలకు వినియోగ పడటంలేదు.

[illegible] ప్లాను అమలు పరచబడుతూంటే, ప్లాను నిర్వాహణకు కేటాయించిన సొమ్ముచాలడం లేదు. ప్రణాళిక అమలు జరిగిన రెండు సంవత్సరాలలోనే ఎనిమిదికోట్ల రూపాయలు లోటు వచ్చింది. ఈ లోటు పూడ్చడానికి కేంద్ర ప్రభుత్వం సిద్ధంగాలేదు. కనుక, పన్నుల రూపంలో ప్రభుత్వం ప్రజలనుండి వసూలు చేయనెంచింది.

ఈ విధంగా ప్రణాళిక అమలు పరచటంవల్ల ప్రజలకు కలిగిన 'మేలు' పన్నుల భారం పెరగటం. అంతేకాని దీనివల్ల ప్రజల కొనుగోలుశక్తి హెచ్చటంగాని, నిరుద్యోగసమస్య పరిష్కారంగాని జరుగదు. దేశమంతటా ఈ ప్లాను విఫలమైనట్లే తెలంగాణాలో కూడా విఫలమైనదనే అభిప్రాయం రైతులు, కార్మికులు, మధ్యతరగతి ప్రజలలో వ్యాపించింది.



## పంచవర్ష ప్రణాళిక (1951-'56) క్రింద ఖర్చుకు వివిధ తెలంగాణా జిల్లాలకు కేటాయించబడిన సొమ్ము (1)

| జిల్లా పేరు | | వ్యవసాయం | పశువైద్యము మరియు పశుపోషణ | డైరీ మరియు పాల సప్లయి | అటవిక శాఖ (అడవులు) | సహకార సంస్థలు | చేపల పరిశ్రమ | మేజరు, మైనరు ఇరిగేషను ప్రాజెక్టులు |
|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు (నగరం) | ... | 2,54,80,100 | 1,91,000 | 1,71,000 | ... | 1,52,240 | 2,890 | ... |
| మెదకు | ... | 8,76,900 | 1,99,477 | ... | 10,715 | 3,38,450 | ... | 15,30,000 (చి) |
| నల్లగొండ | ... | 11,36,200 | 2,35,214 | ... | 10,715 | 1,71,990 | ... | 31,41,000 (చి) |
| హైదరాబాదు జిల్లా | ... | 4,05,400 | 1,63,100 | ... | 3,61,146 | 3,73,466 | ... | 10,61,000 (చి) |
| కరీంనగరం | ... | 11,36,200 | 2,35,214 | ... | 10,715 | 1,71,990 | 3,77,796 | 31,41,000 (చి) |
| వరంగల్లు+ఖమ్మం | ... | 14,26,900 | 7,60,025 | ... | 10,715 | 1,76,750 | ... | 28,51,000 (చి) |
| నిజామాబాదు | ... | 29,02,800 | 1,62,861 | ... | 21,480 | 1,22,790 | ... | 13,10,000 (చి) |
| ఆదిలాబాదు | ... | 3,11,800 | 2,17,800 | ... | 32,145 | 1,32,300 | ... | 3,58,00,000(మేజరు) 8,48,000(చిన్న) |
| మహబూబునగరం | ... | 9,63,800 | 2,71,271 | ... | 10,715 | 2,61,680 | 3,58,519 | 92,81,000 |
| మొత్తం | ... | 3,46,40,100 | 24,35,962 | 1,71,000 | 4,68,296 | 18,96,650 | 7,39,205 | 5,89,63,000 |

## పంచవర్ష ప్రణాళిక (1951–'56) క్రింద ఖర్చుకు, వివిధ తెలంగాణా జిల్లాలకు కేటాయించబడిన సొమ్ము (2)

| జిల్లా పేరు | విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు | కుటీర పరిశ్రమలు | ఇతర పరిశ్రమలు | సాధారణ విద్య | సాంకేతిక, వృత్తి విద్యలు | వైద్యం | ప్రజారోగ్యం, గృహవసతి |
|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదు | ... | 2,308,465 | 17,04,000 | ... | 22,41,055 | 13,24,056 | * 1,50,00,000 |
| మెదకు | ... | ... | ... | 16,03,700 | ... | 385,113 | 3,99,893 |
| నల్లగొండ | ... | ... | ... | 18,57,300 | 51,824 | 7,76,827 | 4,29,101 |
| హైదరాబాదు జిల్లా | ... | ... | ... | 9,37,900 | ... | 13,20,088 | 25,64,456 |
| కరీంనగరం | 1,52,30,000 | ... | ... | 14,50,500 | 51,824 | 7,76,827 | 4,29,101 |
| వరంగల్లు+ఖమ్మం | ... | 1,75,715 | 96,00,000 | 8,55,100 | 69,758 | 7,75,802 | 5,92,634 |
| | | | | | | | * 42,00,000 |
| నిజామాబాదు | ... | ... | ... | 7,19,000 | 1,20,151 | 1,37,275 | 2,98,984 |
| | | | | | | | * 6,00,000 |
| ఆదిలాబాదు | ... | ... | 1,45,71,000 | 16,30,100 | ... | 2,07,214 | 3,39,223 |
| మహబూబ్‌నగరం | ... | ... | ... | 15,08,700 | ... | 4,71,884 | 4,80,928 |
| మొత్తం | 1,52,30,000 | 24,84,180 | 2,58,75,000 | 1,05,57,300 | 25,34,612 | 61,75,036 | 2,53,29,310 |

* కార్మికులకు గృహవసతి.

# చారిత్రక చిహ్నాలు

నేడు విశాలాంధ్రమని వ్యవహరించబడు దేశమునకంతకును తెలింగదేశమని వాడుకలో వుండెడిది. తెలింగ దేశమనే పేరు నుండి తెలంగాణాకు మారిన పరిణామం గురించి శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "తెలంగాణా చరిత్ర" అను వ్యాసంలో యిలా వ్రాశారు :

"......ముసల్మానులు, చరిత్రకారులు దీనిని తిలింగ్ అనియే వ్యవహరించిరి. శాసనములలోకూడా దీనికి తెలింగమనియే పేరు. ఈ దేశమునకు తెలింగదేశమని, తెలింగాణెమని వ్యవహార నామములు. ఆణెము, దేశము అనునవి పర్యాయ పదాలు. జన వ్యవహారములో ఆణెము అణమయి తెలింగాణ మయినది. తెలింగాణమే కాల క్రమమున, లోక వ్యవహారమున తెలింగాణా తెలంగాణాగా మారినది. క్రీ. శ. 1766 లో ఉత్తర సర్కారులను, సముద్ర తీరస్థ ఆంధ్ర దేశమును, 1800 సం॥లలో రాయల సీమను ఆసఫ్‌జాహీ వంశజుడైన నిజాం అలీఖాన్ అను నిజాముల్ ముల్కు బ్రిటిషు వారికిచ్చివేసినప్పటినుండీ తెలుగు దేశము నిజాం పరిపాలితదేశమని, బ్రిటిషు పరిపాలిత దేశమని రెండు విభాగములై......తెలుగు వారు రెండు చీలికలైరి. నాటినుండి నిజాం పాలనక్రింద నుండిన తెనుగు దేశమునకే తెలంగాణా అను పేరు రూఢమయినది."

తెలంగాణములోవున్న అన్ని జిల్లాల ప్రస్తుత పేర్లు ఆదినుండి ఆరకంగా లేవు. ముస్లిం సుల్తానులు కొన్ని జిల్లాల పేర్లు మార్చి తురక పేర్లు తగిలించారు. ఉ॥ ఆదిలాబాదుకు సిరిపురం, తాండూరనీ, నిజామాబాదుకు ఇందూరనీ, కరీంనగరమునకు వెలిగందల అనీ, మహబూబు నగరమునకు పాలమూరు అనీ పూర్వపు పేర్లున్నట్లు శ్రీ సోమశేఖరశర్మగారు పై వ్యాసంలో వ్రాశారు.

తెలంగాణా చారిత్రక చిహ్నముల గురించి వ్రాసేముందు తెలంగాణా చరిత్ర సంక్షిప్తంగా చూడాల్సివుంది.

"భరత ఖండములోని అతి పురాతనమైన జాతులవారిలో ఆంధ్రులొకరు. దక్షిణా పథమనబడు దక్కనులో వెలసిన మొట్ట మొదటి గొప్పరాజ్యం ఆంధ్రులది. ఆంధ్ర రాజ్యము నేలిన ధరణీశ్వరులు ముప్పదిమంది. వీరందరూ కలిసి మొత్తంమీద 450 సంవత్సరములు ఆంధ్ర భూమిని పరిపాలించారు. ఈ ముప్పదిమందినుండి ఏ పది మందివి మాత్రమో శాసనములు దొరికినవి. ఇంచుమించుగా క్రీస్తుశకం 220 ప్రాంతంవరకు ఆంధ్రశాతవాహనులు రాజ్యముచేసిరనిచెప్పవలసియుండును. ఈ శాతవాహనులు బౌద్ధ మతముపట్ల అధిక ఆదరాభిమానములు చూపిరి. ఈ కాలమునాటి పురావస్తు పరి

నాయకత్వమున ఢిల్లీ సుల్తానులకు వ్యతిరేకంగా రహస్య కార్యకలాపాలు ప్రారంభించారు. ఈ కృషి ఫలితంగా క్రీ. శ. 1325-26 లో సముద్ర తీరస్థాంధ్రము స్వతంత్రమయి దీనికి గోదావరితీరాన భద్రాచలం తాలూకాలోని రేకపల్లి ప్రోలనేనికి రాజధాని అయింది. క్రీ. శ. 1335-1336 లో ప్రోలయ నాయకుని పితృవ్య పుత్రుడు ముసునూరి కాపయనాయకుడు ఓరుగల్లును జయించి తిరిగి ఆంధ్ర హిందూ రాజ్యమును మరల స్థాపించెను.

"ఓరుగల్లు స్వతంత్రమైన కాలంలోనే దక్షిణాన బుక్క హరిహరులు సుల్తానులకు వ్యతిరేకంగా తిరుగుబాటుచేసి తుంగభద్రా తీరాన వున్న విజయనగరమును రాజధాని చేసుకొనిరి. తర్వాత ఆంధ్రదేశము ఓరుగల్లు, పద్మవెలమసింగమనేడు స్థాపించిన రాజుకొండ, ప్రోలయ వేమారెడ్డి స్థాపించిన తీరస్థాంధ్ర రాజ్యము కొండవీడు, దక్షిణమున విజయనగరములు కలిసినవి. కాని వీరిలో వున్న పరస్పర కలహములను ఉపయోగించుకొని 1347 లో అల్లావుద్దీన్ హసన్‌గంగూ బహమనీ రాజుకొండతప్ప, మిగతా ప్రాంతాల నాక్రమించుకొన్నాడు. రాజుకొండ వెలమరాజులు 1369 లో తిరిగి ఓరుగల్లును ఆక్రమించుకొన్నారు. తిరిగి క్రీ. శ. 1422 లో అహమ్మదుషా కాలంలో వెలమరాజులు ఓరుగల్లు, రాజుకొండను కోల్పోయిరి; అయినా దేవరకొండ దుర్గాధిపతులు 1482 నాటివరకు సుల్తానులలో పోరాడుచునే వుండిరి. 1483 నాటికి తెలంగాణా అంతయు బహమనీ సుల్తానుల అధీనంలోకి వచ్చినది.

## భా గ్య న గ ర ము

"క్రీ. శ. 1482 - 1518 కాలంలో తెలంగాణాకు సుల్తాను ఖులీకుతుబుల్ ముల్కు అధిపతిగా నున్నాడు. బహమనీ రాజా మహమూదుకాలం [1482-1518] లోనే బహమనీరాజ్యం విచ్ఛిన్నం అయి బేరారు, అహమ్మదునగర్, బిజాపూరు, బీదరు, గోలకొండ అనే అయిదు స్వతంత్ర ముస్లిం రాజ్యాలు ఏర్పడినాయి. గోల్కొండ తెలంగాణాకు రాజధాని. దీనిని పాలించిన వారికి కుతుబ్‌షాహీలని పేరు. క్రీ. శ. 1565 లో తళ్లికోటవద్ద విజయనగరంరాజు అళియరామరాయలకు మిగతా సుల్తానులందరికి మధ్య గొప్ప సంగ్రామం జరిగి విజయనగర సామ్రాజ్యం విధ్వంసమయినది.

"క్రీ. శ. 1589 లో గోలకొండసుల్తాను మహమ్మదు ఖులీ గోలకొండకోటకు సమీపాన కట్టించిన భాగ్యనగరమే నేటి హైదరాబాదు. ఆ సుల్తానే తరువాత భాగ్యనగరముపేరు మార్చి, తన కొడుకు హైదరుపేర హైదరాబాదు అని పెట్టెను. ఈ ముస్లిం బహమనీ సుల్తానులలో చివరివాడైన అబుల్ హసన్ కుతుబుషా [1672-1687] కాలంలోనే ఢిల్లీ సుల్తాను ఔరంగజేబు క్రీ. శ. 1685 లో గోల్కొండపై దాడిచేసి రెండేండ్లు ముట్టడి తరువాత 1687 లో స్వాధీనపరచుకొనెను.

"ఔరంగజేబు దక్కను దేశాన్నంతా ఆక్రమించుకున్నాక పరిపాలనా సౌలభ్యం కోసం బేరారు, ఖాన్‌దేశ్, ఔరంగాబాదు, బీదరు (బెదరకోట), బిజాపూరు, హైదరాబాదు అను అయిదు సుబాలుగా చేయబడినది. హైదరాబాదు సూబాలోనే తెలుగు దేశమంతా కలిసినది. ఈ దక్కనుకు

ఔరంగజేబు తన మూడవ కొడుకును అధిపతిగా చేసెను. ఔరంగజేబు మరణానంతరం యితడు స్వాతంత్ర్యం ప్రకటించినందున, ఈతని సోదరుడు ఢిల్లీ సుల్తాను ఈతనిపై దండెత్తి 1709 లో ఓడించెను. తర్వాత దక్కను పరిపాలన సయ్యదు హుస్సేన్ అలీ చేతిలోకి వచ్చెను. ఢిల్లీలో ఈ సయ్యదు సోదరులకు వ్యతిరేకంగా ఒక వర్గం బయలుదేరింది. దానికి చిన్ కిలీచ్ ఖాను నాయకుడు. ఇతనికి అసఫ్ జా అనియు, నిజాముల్ ముల్కు అనియు బిరుదములు. చివరికి సయ్యదు సోదరులు హతులైనాక, ఢిల్లీ సుల్తాను నిజాముల్ ముల్కును దక్కను రాజ్యమునకు అధిపతిగా నియమించెను. ఈతడు హైదరాబాదును రాజధాని గావించుకొని, ఆనాటి నుండి [1724] స్వతంత్రుడై పాలించుచుండెను.

"నిజాముల్ ముల్కు క్రీ. శ. 1724 నుండి 1748 వరకు పరిపాలించెను. తరువాత ఇంగ్లీషువారు, ఫ్రెంచివారు ఈ దేశములో రాజ్యము సంపాదించుటకు యిక్కడి సుల్తానులమధ్య కలహాలు కలిగించిరి. క్రీ.శ. 1761 లో ఫ్రెంచివారు నియమించిన సలాబత్ జంగు హతుడయినాక ఇంగ్లీషు వారి సహాయంతో నిజాం అలీఖాన్ నవాబు అయినాడు. ఈతడే క్రీ. శ. 1766 లో ఉత్తర సర్కారులను, క్రీ. శ. 1800 లలో రాయలసీమను బ్రిటీషువారికొసగి, తెలుగు దేశమును రెండు ముక్కలుగా చేసెను. ఈ రాయలసీమ ప్రాంతాన్ని దత్తమండలమని పిలిచెదరు. ఉత్తర సర్కారులు, రాయలసీమ బ్రిటీషు పాలనలోకి పోగా, మిగిలిన ఆంధ్రదేశం నిజాముల్ ముల్కు క్రిందనే వుండిపోయినది. అప్పటినుండే హైదరాబాదు రాజ్యంలోని ఆంధ్రదేశ భాగము తెలంగాణా యను పేరుతో వ్యవహరింపబడుచున్నది."

[సుజాత-తెలంగాణా సంచిక-శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారి "తెలంగాణా చరిత్ర"నుండి సంక్షిప్త భాగం.]

## చారిత్రక స్థలాలు : నిర్మాణాలు

ఇంతకుముందు మనము దక్కను దేశము, ముఖ్యముగా తెలంగాణాదేశం ఆయా కాలాలలో చారిత్రకంగా పరిణామము నొందిన రీతిని పరిశీలించాం. వివిధ వంశజులైన రాజులు వేరువేరు మతాలను, కళలను పోషించారు. అభివృద్ధి పరచారు. అందు కొరకు తెలంగాణాలో ఈ చారిత్రక, వస్తు శిల్పచిహ్నాలు నేడు పురాతన నగరాలరూపంలో శిథిలావస్థలోవున్న కోటల రూపంలో, దేవాలయాలు, స్థూపాల రూపంలో, మట్టివస్తువుల రూపంలో లభించుతాయి.

తెలంగాణా ప్రాచీన శిల్పకళ గురించి శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు (M. A., P H. D) గారు ఈవిధముగా వ్రాశారు:

"'శిలాయుగ'మని పేరు గాంచిన చరిత్ర కందరాని చాలా ప్రాచీన కాలము నుండియుకూడా తెలంగాణమునందు శిల్పము, చిత్రకళయు గాన్పించుచున్నవి. శిలాయుగమునాటి నాగరికత, సంస్కృతి

ఎక్కువగ తెలంగాణమునందును, దక్కను నందలి కొన్ని యుత్తర ప్రాంతములందును మాత్రమే గాన్పించుచున్నవి. కాబట్టి మానవుని సృష్టికిని, నాగరికతా ప్రథమ పాఠకులకును ప్రథమ రంగభూమి యీ ప్రాంతమేనని నిర్ణయించుటకు కూడా తగినంత ఆధారము లేకపోలేదు."

ఇక వివరాల్లోకి వెళ్ళకుండా తెలంగాణాలో గల ఆయా జిల్లాలలోని చారిత్రక చిహ్నముల గురించి పరిశీలించుదాం.

# 1. హైదరాబాదు జిల్లా

గోలకొండకోట : హైదరాబాదు నగరమునకు సుమారు 5 మైళ్ళు పశ్చిమమున కలదు. దీనిని మొదట కాకతీయరాజులే క్రీ. శ. 1346 లో కట్టినారు. తరువాత మహమ్మదు షా బహమనీ సుల్తానుకు హస్తగతమయినది. ఈతరు ఈ కోటను తరువాత వృద్ధి చేసినారు. అబుల్ హసన్ కుతుబుషాహీ కాలంలో ఔరంగజేబు 1685 లో ఈ కోటను ముట్టడించి రెండు సంవత్సరాల తర్వాత ఆక్రమించుకొనెను. తర్వాత ఈ కోట ఒక చారిత్రక చిహ్నంగా మాత్రమే వుండి పోయినది.

400 అడుగుల ఎత్తుగల నల్లరాతి కొండపై నిర్మించబడినది. ఈ కోటగోడ పెద్దరాళ్ళతో కట్టబడినది. ఈ కోట గోడపై 87 బురుజులు, 8 ద్వారాలు కలవు. కోటబురుజులపై రాజకుటుంబాలకు చెందిన శిలా శాసనములు చెక్కబడివున్నవి. 1864 సం॥కి పూర్వపు గోలకొండ చరిత్ర యింతవరకు సరిగా లభించడంలేదు.

## చార్ మినార్

చార్‌మినార్ అనగా నాలుగు గోపురములు కలది అని అర్థం. ఇది క్రీ. శ. 1591 లో మహమ్మదు కులీకుతుబుషా చేత నిర్మించబడినది. ఇది సున్నము, నల్లరాతితో సమకోణ చతుర్భుజముగా, ప్రాక్పశ్చిమ, ఉత్తర దక్షిణాభిముఖాలుగా నున్న నాలుగు కమానులపై అతి సుందరముగా నిర్మించబడినది. దీని గోపురముల ఎత్తు 180 అడుగులు. ఆ కాలములో విపరీతంగా నష్టము కలిగించుచున్న ప్లేగు వ్యాధిని పారద్రోలిన శుభసూచకముగా కట్టబడిందని కొందరు, రాజభవనాల నడిమంటపము ముంగిట సింహద్వారముగా నిర్మింపబడి యుండునని మరికొందరు అభిప్రాయ పడుతున్నారు. ఇది హైదరాబాదు నగరంలో ఉన్నది.

## మక్కామసీదు

ఇది 1614 లో అవర కుతుబుషాచేత ప్రారంభింపబడి, ఔరంగజేబుచేత పూర్తి చేయబడింది. దీనిపొడవు 225 అడుగులు, వెడల్పు 180 అడుగులు, మరియు 75 అడుగులు ఎత్తు. దీనికి 8 లక్షల రూ. లు ఖర్చు చేయబడినట్లు చెప్పబడుతున్నది.

## ఫలకునూమాభవనము

1897 సం॥ లో వికారుల్ ఉమరా నవాబు కట్టించాడు. ఈ భవన నిర్మాణం గ్రీకు కట్టడములను పోలివున్నది. ఇందులో వున్న సున్నపు చిత్రాలలో, 7డీ అనే మిక్కిలి విలువగల రాతితో అలంకరించబడివున్నది. ఆనాటి ఆసఫ్‌జాహి వంశజుడు దీనిని కొని రాజభవనంగా చేసుకొన్నాడు.

ప్రస్తుతం ఈ భవనం భారత ప్రభుత్వ అధ్యక్షునికీ, ప్రధాన మంత్రికి మాత్రమే ఉపయోగపడుతున్నది.

### మైసారం

హైదరాబాదు నగరానికి 10 మైళ్ళ దూరంలో వున్నది. ఇక్కడ ఎన్నియో శిథిలములైన శిల్పములు వున్నవి. గోలకొండ పతనానంతరం ఔరంగజేబు నాశనము గావించిన హిందూ దేవాలయ శిథిలములే ఈ రూపమున పడియున్నవని భావింపబడుచున్నది.

## 2. మహబూబునగరం జిల్లా

### కోయిలకొండ దుర్గము

కోయిలకొండ దుర్గము శాలివాహన కాలమునాటి నిర్మితము. ఈ దుర్గము ఒక కొండపైన నిర్మించబడినది. అత్యున్నత శిఖరం 800 అడుగులుంటుంది. ఇక్కడ తెలుగులో వ్రాయబడిన శాసనము కలదు. దానిపై "శుభం భూయాత్, కలియుగ కాలమానం నాలుగులక్షల ముప్పదివేల సంవత్సరాలు. శుభమగుగాక. శాలివాహన శకం 1472 సం॥ వైభవోజ్జ్వల మహోదయాగ సాధారణనామ సంవత్సర మాఘమాస, శుక్లపక్ష పంచమి తిథి, సోమవారం" అని వ్రాయబడివున్నది. ఇది మహబూబు నగరానికి 14 మైళ్ళ దూరాన వున్నది.

### పానగల్లు దుర్గము

ఇది నాగర కర్నూలు తాలూకాలో కలదు. ఈ దుర్గము 1½ మైళ్ళ పొడవు, 1 మైలు వెడల్పు కలదు. ఈ కోటకు ఏడు బురుజులు, ఒకటిలో నొకటి ఏడు ప్రాకారాలు కలవు. మధ్యన కేంద్రం దుర్భేద్యముగా వున్నది. ఈకోట మూలమున ఇది గొప్ప రణభూమిగా పేర్వెకెను. ఓరుగల్లు, విజయనగరం సేనలు కలిసి బహామనీసుల్తాను ఫిరోజుషాహాను ఇక్కడే ఓడించాయి. తరువాత క్రీ. శ. 1518 ప్రాంతములో విజయనగర సేనలకు సుల్తాను మహమ్మదు ఖులీకుతుబుషాహాకు ఇక్కడే ఘోరమైన యుద్ధం జరిగినది. మహమ్మదీయ యుగములో కృష్ణదేవరాయలనాయకత్వమున విజయనగరము అఖండ విజయం గాంచి రాజులకు "యవనరాజ్య స్థాపనాచార్య" అను బిరుదము తెచ్చుటకు ఈ రణము కారణమాయెనని శ్రీ డాక్టరు వేలూరి వెంకటరమణయ్యగారు చర్చించి వివరపర్చారు. నవాబ్ నైజాంఅలీఖానుకాదా క్రీ. శ. 1786 నుండి సుమారు 3 సంవత్సరములు ఇక్కడ నివసించెను.

### జడిచర్ల దేవత

ఇక్కడి హిందూదేవతప్రతిమ 10 నుండి 12 వ శతాబ్దం వరకటి సాంప్రదాయానికి చెందినది. ఇక్కడ కొన్ని శాసనపాదాలు చెక్కబడివున్నాయి. మహబూబునగరానికి 12 మైళ్ళదూరాన జడిచర్ల రైల్వేస్టేషనుకలదు.

మహబూబు నగరంజిల్లా అమరాబాదు తాలూకాలో వరంగల్లు కాకతీయరాజు ప్రతాపరుద్రుడు నిర్మించిన "ప్రతాపరుద్ర కోట", అమరాబాదు తాలూకాలోని కృష్ణానది ఒడ్డునవున్న చంద్రగుప్త గ్రామం, ప్రతాపరుద్రుని కాలంనాటి చిహ్నాలు ఉన్నాయి. ఈ తాలూకాలోనే ఒకపర్వత శిఖరంపై మహేశ్వర దేవాలయం కలదు. దైవ దర్శనానికి 900 మెట్లు ఎక్కాలి.

# 3. నల్లగొండ జిల్లా

## పణిగిరి బౌద్ధ శిల్పములు

సూర్యాపేట తాలూకాలోగల పణిగిరి గ్రామంలో జరిగిన త్రవ్వకములవలన మొదటిశతాబ్దమునకు చెందిన బౌద్ధ నిర్మాణములు బయటపడినవి. ఇవి సాంచీ, అమరావతి, బౌద్ధ నిర్మాణములను, ఒక బౌద్ధశిల్పము గ్రీకు శిల్ప సాంప్రదాయాన్ని, ఒక రాతి విగ్రహము మొదటి శతాబ్ద సాంప్రదాయాన్ని పోలివున్నవి.

## నల్లగొండ ఏక శిలాస్థంభము

ఇక్కడ పాతవున్న 41 అడుగుల ఏక శిలా రాతి స్థంభము పురాతన దక్కను రాతి శిల్పములకు తార్కాణము. ఇక్కడ ఆ కాలపుదే ఒక నీలపురాతి కొండపై ఒక కోట కలదు.

## పానగల్లు దేవాలయము

కాకతీయరాజు అయిన ఉదయాదిత్యుడు నిర్మించిన 66 స్తంభములుగల పంచేశ్వర దేవాలయము గలదు. ఈ దేవాలయ చెక్కడములు శిల్పకళా కౌశలమునకు చక్కని మచ్చుతునక. స్థంభములపై రామాయణ, మహాభారత కథలు చెక్కబడినవి. పానగల్లు నల్లగొండకు ఉత్తరమున రెండు మైళ్ళ దూరంలోనున్నది. ఇక్కడ కాకతీయ కాలానికి సంబంధించిన పెద్ద చెర్వుకూడా కలదు. దీనిని 1551 లో నాల్గవ ఖుతుబ్‌షాహా బాగుచేయించినట్లు ముస్లిం చరిత్రకారులు వ్రాస్తున్నారు.

## పిల్లలమర్రి నరసింహాదేవాలయం

సూర్యాపేటకు 8 మైళ్ళ దూరంలో గల పిల్లలమర్రి గ్రామంలో మూడు దేవాలయాలు గలవు. ఇందులో ఒకటి నరసింహా దేవాలయం. రెండు శివాలయాలు కలవు. ఈ దేవాలయాల స్థంభాలపై 1195 సం॥కి చెందిన శాసనాలు చెక్కబడి వున్నాయి. కాకతీయ రుద్రదేవుని పాలనకాలంలో రేచర్ల రామిరెడ్డి ఈ మూడు దేవాలయాలను కట్టించినట్లుగా శాసనములు తెల్పుచున్నవి. ఈ దేవాలయాలు నున్నటి నల్లరాళ్ళతో, అందమైన శిల్పకళా కౌశలముతో నిర్మించబడినవి.

## కొలనుపాక

భువనగిరి తాలూకాలో కొలనుపాక ఒక చిన్నగ్రామం. దీనిని 1100 సంవత్సరంలో చాళుక్యరాజు ప్రతినిధులు పాలించిరి. ఇది జైనమత కేంద్రం.

## దేవరకొండ దుర్గము

కాకతీయ రాజుల తర్వాత పరిపాలించిన వెలమరాజులు 14 వ శతాబ్దిలో రాజకొండను, దేవరకొండను రాజధానులుగా చేసుకున్నప్పుడు కట్టిన దుర్గము.

## నాగులపాడు దేవాలయాలు

సూర్యాపేటకు 15 మైళ్ళ దూరములో గల నాగులపాడు గ్రామంలో మధ్యయుగాలనాటి అతిసుందర శిల్పకళను ప్రదర్శించే రెండు దేవాలయాలు శిథిలావస్థలో నున్నాయి. ఇవి 1258 లో కాకతీయరాజు గణపతిదేవుడు నిర్మించినవి.

# 4. మెదకు జిల్లా

### కొండాపురం

మెదకు జిల్లాలోగల కొండాపురమను గ్రామం శాతవాహనుల కాలంలో ఒక విశాల నగరము. ఈ కాలములోనే యిక్కడ బౌద్ధ మతము బాగా అభివృద్ధి గాంచెను. ఈ మధ్యనే యిక్కడ జరిగిన త్రవ్వకముల లోని మట్టి ప్రతిమలు చాలా దృఢమైనవి. ప్రఖ్యాతి ఆంధ్ర రాజులైన గౌతమీపుత్ర, శాతకర్ణి, రెండవ వాసిష్టీపుత్ర, పులుమాయి కాలంనాటికి చెందిన చైత్య గుంటపముల నగరము. స్థూపములు, మఠాలు మున్నగు వని భూగర్భమున దాగియున్నట్లు ఇటీవల పురాతత్వ పరిశోధనలు నిరూపి స్తున్నవి.

### పటంచెర్వు

హైదరాబాదు-షోలాపూరు రోడ్డుపై హైదరాబాదుకు 19 మైళ్ళ దూరమునందు ఉంది. ఇది 7-8 శతాబ్దంలో బాగా అభివృద్ధి చెందిన జైనమతానికి కేంద్రం. తర్వాత వచ్చిన రాజవంశీకులు జైనమతాన్ని వదలి, వైష్ణవ శివమతాలు పుచ్చుకొని ఈ జైన మతాన్ని నాశనం గావించారు. ఈ మధ్యన జరిగిన త్రవ్వకాల ఫలితంగా ఈ విషయం ద్యోతకమవుతున్నది. ఈ త్రవ్వకాలలో బ్రాహ్మణ మందిరాల క్రింద శిథిలావస్థలో వున్న జైన మత నిర్మాత మహావీరుని విగ్రహాలు బయట పడినవి. కొన్ని హిందూ విగ్రహాలు కూడా బయటకొచ్చాయి. వెనుకటి రాజభవనాల చిహ్నాలు కూడా ఇక్కడ కనబడును.

### మెదకు

మెదకు పట్టణములో ఒక కొండపై వరంగల్లు చేరిన కాకతీయరాజులు నిర్మించిన కోట కొంత శిథిలావస్థలో నున్నది. నేనున్న కోటభాగము సుమారు 16 వ శతాబ్దమునాటిదని తోచుట వలన, బహుశః పాతకోటను నాశనము చేసి 16 వ శతాబ్దమున నేనున్న కోటను నిర్మించినారని తోచుచున్నదని శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారి భావన. అంతేగాక ఈ కోటపై రెండు శాసనముల కలోపముండుట వల్లకూడా ఈకోటను వరంగల్లు కాకతీయ రాజులే నిర్మించారని భావించబడుచున్నది. ఈ కోటకు రెండు ప్రహారీలు. ఒకటి కొండశిఖరముపై, రెండవది కొండ అడుగున వున్నది.

ఇక్కడ ఈ కోటయేగాక మొదటి ప్రపంచ మహాసంగ్రామంలో నిర్మింపబడిన ఒక పెద్ద ప్రొటెస్టెంటు చర్చికూడా కలదు.

# 5. నిజామాబాదు

### బోధన

బోధన 10 వ శతాబ్దంలో చాళుక్య రాజవంశీకుల ముఖ్యపట్టణముగా వుండెనని ఒక వాదన. ఇక్కడవున్న దేవాలయాలపై కన్నడ శాసనములు చెక్కబడి వున్నవి. దేవాలయములతో పాటు యిక్కడ రెండు మసీదులు కూడా కలవు. ఒక మసీదు మహమ్మదు తుగలకు, రెండవది ఔరంగజేబు నిర్మించినట్లు వాటిపైగల చెక్కడములద్వారా తెలుస్తున్నది.

### కోలాసపురం

ఈ గ్రామం బోధనుకు దక్షిణాన 14 మైళ్ళ దూరానకలదు. ఇక్కడ ప్రసిద్ధి కెక్కిన కోట ఎన్నియో యుద్ధాలకు రంగస్థలమై, ఎన్నియో ముట్టడులను తట్టుకొన్నది. ఇది వరంగల్లు కాకతీయ రాజుల బలమైన కేంద్రముగా నుండెను. 1328 సం|| లో మహమ్మదు తుగలక్ దీనిని ఆక్రమించుకొన్నట్లు ముస్లిం చరిత్రకారులు చెప్పుదురు.

### నిజామాబాదు

అసలు నిజామాబాదునందు నేడు జైలుఖానా వున్నది. ఇది యిందూరు కోటయని ప్రసిద్ధిచెందిన ఒక పెద్ద దేవాలయ భాగము. ఈ దేవాలయమును, దీనికి అనతిదూరమునగల తటాకమును రఘునాథదాసు అనునతడు కట్టించెనని ప్రతీతి.

## 6. ఆదిలాబాదు

### మహూరు

మహూరు ప్రస్తుతం కిన్వటు తాలూకాకు 30 మైళ్ళ దూరానవున్న ఒక చిన్న గ్రామం. ఒక కాలములో ఇది దక్కను మహమ్మదీయ రాజులకు ప్రాంతీయ రాజధానిగా నుండెను. ఇక్కడ కొంత దూరములో మహూరు దుర్గముకూడా కలదు. దీనికి బీరారు, దక్కను చరిత్రలో చాలా పాత్ర వున్నదని చెప్పబడుచున్నది. ప్రాంతీయ తిరుగుబాట్లను అణచడానికి వచ్చినప్పుడు ఫిరోజుషాహా బహమనీ ఇక్కడ నెలరోజులు మకాం చేసినట్లు ముస్లిం చరిత్రకారులు చెప్పుచున్నారు. ఇక్కడవున్న పురాతన దేవాలయాలు, మసీదులను బట్టి చారిత్రిక ప్రదేశంగా ఎంచబడుచున్నది.

### మాక్కుడు

ఆదిలాబాదు తాలూకాలో మక్కుడు ప్రదేశంలో ఒక పర్వతదుర్గము కలదు. ఈ దుర్గమునకల మసీదునుబట్టి ఈ దుర్గము చాలా ప్రాచీనమైనదని తోచుచున్నది. మక్కుడు కొండ దిగువభాగమున పాండో శివా అను పేరుగల దేవాలయము కలదు. ఇందులోవున్న రెండు విశాలమైన గదులలో ఒకదానిలో మరొక దేవాలయము నిర్మించబడివున్నది. కొండ పైభాగమున ఒక ప్రాచీన దేవాలయము కలదు. ఈ ఆలయము 180 చ|| అడుగుల వెడల్పు, 54 అడుగుల ఎత్తును కలదు. ప్రస్తుత మిది 400 మంది గోసాయిల ఆధీనమందు కలదు.

### తిముర్ని

నిర్మల తాలూకాకు 10 మైళ్ళ దూరానగల తిముర్ని గ్రామంలో హజరత్ గోరీలను పోలిన లతుఫుల్లాషా దర్గా వున్నది.

### నిర్మల

ఆదిలాబాదు జిల్లాలోగల నిర్మల తాలూకా చారిత్రిక ప్రాముఖ్యంగల ప్రదేశం. 18 వ శతాబ్దపు ఉత్తరార్థ భాగంలో మీర్జా ఇబ్రహీం బేగ్ జఫ్రుద్దౌలా స్వాధీన పర్చుకొనేంతవరకు ఇది వెలమరాజుల పరిపాలన క్రింద వున్నది. ఇక్కడే చిన్న కొండల క్రింది అడుగు భాగాలలో ఫ్రెంచి ఇంజనీర్లు నిర్మించిన కోటగోడలున్నాయి.

# 7. కరీంనగరం జిల్లా

### ఎల్గందల కోట

ఎల్గందల అనే గ్రామం చాలా చారిత్రక ప్రాముఖ్యత కలది. ఒకప్పుడు యిది వెలిగందల అనే తెలుగు పేరుతో ముఖ్య పట్టణంగా వున్న పురాతన నగరం. ఇక్కడ వున్న కోట చాలా పురాతనమైనది. కాకతీయ రాజులే మొదట దీనిని నిర్మించిరి. కాని తరువాత ఈ కోట 1754 సం॥లో జఫ్రద్ దౌలా చేత పునర్నిర్మించబడినది. ఈ కోటలోగల మసీదు శిఖరాన్ని కదిలించుతే ఊగుతుంది. ఎల్గందల కరీంనగరానికి 8 మైళ్ళదూరంలో గలదు.

### నంగ్నూరు

ఈ గ్రామం కరీంనగరానికి 6 మైళ్ళ దూరమున కలదు. ఇక్కడ నల్లని పాలరాతితో అతి సుందరమైన శిల్పకళను ఒలికించే దేవాలయాలు కలవు. దేవాలయపు స్తంభాలు చిత్ర విచిత్ర చెక్కడాలతో అమర్చబడినాయి. ఇక్కడ శిథిలమైన వైష్ణవాలయానికి చెందిన గరుడ స్తంభమొకటి కలదు. తెలుగు, కన్నడ భాషలలో చెక్కబడిన పెద్ద శిలాశాసనం నంగ్నూరు నుండి త్రవ్వి తీసుకురాబడినది. ఇక్కడి దేవాలయాలు కాకతీయరాజు రుద్రదేవు కాలపు నాటివి.

### హుజూరాబాదు

వరంగల్లుకు 18 మైళ్ళపైనున్న తాలూకా కేంద్రం. ఇక్కడ ఎన్నియో చరిత్రకు పూర్వం నాటి సమాధులు బయటపడినవి. దీనికి దగ్గరే రెండు దేవాలయాలు, రెండు కోటలు కలవు. ఈ కోట కాకతీయ రాజుల కాలపుది.

### మహాదేవపురం

పెద్దపల్లి రైల్వేస్టేషనుకు 54 మైళ్ళ దూరములోవున్న తాలూకా కేంద్రం. ఇక్కడ ప్రతాప రుద్రదేవుని కాలంనాటి కోట ఒకటి కలదు. దీనికి 12 మైళ్ళ దూరములో ఔరంగజేబు కాలంనాటి మసీదు కలదు.

కరీంనగరం జిల్లాలో పైన ఉదహరించినవిగాక బాజగూరు, మలంగూరు, ప్రతాపగిరి కోటలు, గుహలు, కాకటూర్లు, ధర్మపురి, వేములవాడల యందుగల దేవాలయాలు, వాటి శిల్పకళ వెనుకటి చరిత్రను జ్ఞాపకం చేస్తాయి.

# 8. వరంగల్లు

వరంగల్లు కాకతీయరాజుల కాలంలో ఓరుగల్లు పేరుతో తెలుగురాజుల రాజధాని నగరంగా ప్రసిద్ధిగాంచినది. ఓరుగల్లు అనే పేరు ఒరక్కల్లు ఏకశిలా కొండనుండి వచ్చినది. వరంగల్లు, హన్మకొండ, మరాఠ్వాడా ప్రాంతములందలి ప్రాచీనవాస్తు శిల్ప విశేషములుగా జగద్విఖ్యాతములు. ఇక్కడ 1168 సం॥లో ప్రతాపరుద్రుడు నిర్మించిన వెయ్యి స్తంభాలదేవాలయం, గణపతిదేవుడు, రుద్రమదేవి నిర్మించినవరంగల్లు చారిత్రాత్మక కోట, రుద్రమదేవుని కాలంలో నిర్మింపబడిన రామప్ప, పాఖాల తటాకములు చారిత్రాత్మకములైనవి.

### హన్మకొండ

వరంగల్లు నిర్మాణం జరుగకముందు హన్మకొండ తెలుగురాజ్య రాజధానిగా

వున్నదని కొందరు, హన్మకొండ ప్రభుత్వ వ్యవహార కేంద్రంగా వుండి, వరంగల్లు అభేద్యమైన కోటతో రక్షణ వ్యవహార కేంద్రంగావుండెనని మరికొందరు భావించుచున్నారు. హన్మకొండ ఒక గోడ ఆవరణలో నిర్మించబడినది. వెయ్యిస్థంభాల జైన దేవాలయం యిక్కడే నిర్మించబడినది. ఇక్కడికి 15 మైళ్ళ దూరానగల మోపవరం కొండనుండి పూర్వం ముడియినుము దొరికేదనీ, ఇక్కడ డెమాస్కస్ యినుపకత్తులు తయారయ్యేవని వాడుక.

## వెయ్యిస్తంభాల దేవాలయం

హన్మకొండ సమీపంలోనే గణపతి దేవుడు 1162 లో నిర్మించిన వెయ్యిస్తంభాల దేవాలయము కలదు. ఇది మొత్తంలో హిందూ శిల్పకళను చిత్రించే సాటిలేని దేవాలయం. ఇది మూడు అడుగులు ఎత్తైన అడుగుపైన నిర్మించబడింది. ఒక దేవాలయం మూడు విగ్రహాలు, ఒక మంటపంగలది. మొదటి ప్రతాపరుద్రుని చేత నిర్మించబడినది. తరువాత నిర్మింపబడిన శివాలయం, స్తంభాలుగల మంటపం మొదటి దేవాలయం ప్రక్కనే నిర్మించబడినాయి. మొదటి ఆలయంలో 300 స్తంభాలు, మిగతావి రెండవ ఆలయంలో వున్నాయి. పై మూడు విగ్రహాలు శివుడు, విష్ణువు, సూర్యుడని తెలిపే సంస్కృతి చెక్కడ స్తంభమొకటి ఈ దేవాలయ ప్రాకారంలో వున్నది. ఈ దేవాలయం తూర్పునుండి పడమరకు 102 అడుగులు; ఉత్తరంనుండి దక్షిణమునకు 88 అడుగులు వున్నది. చుట్టూ 10 అడుగుల వెడల్పు పునాదిగోడపై నిర్మింపబడివున్నది.



## వరంగల్లు దుర్గము

కాకతీయ రాజవంశజుల చారిత్రిక చిహ్నాలలో ఓరుగల్లు దుర్గమొకటి. ఇది హన్మకొండకు 5 మైళ్ళ దూరమున, కాజీపేటకు 10 మైళ్ళ దూరమున కలదు. ఈ దుర్గ నిర్మాణాన్ని కాకతీయరాజు గణపతి దేవుడు 1199 సం॥లో ప్రారంభించగా, ఆయన కూతురు రుద్రమదేవి 1261 సం॥లో పూర్తిచేసినది. ఈ దుర్గానికి రెండు గోడలున్నాయి. వెలుపలిగోడ మట్టితో, లోపలి గోడ రాతితో నిర్మించబడి వున్నది. వెలుపలి గోడను ఆవరించి ఒక కందకము కూడా వున్నది. వరంగల్లుకు దూరాన మూడవ గోడకూడా వున్నట్లు చిహ్నాలు ఉన్నాయి. ఈ కోటకున్న నాలుగు ద్వారాల్లో ఉత్తర దక్షిణ ద్వారాలు మూసివేయబడి మిగతా రెండే ఉపయోగింపబడుతున్నాయి. ప్రతిద్వారానికి యిరుప్రక్కల రాతి సింహాలున్నాయి. ఈ కోట గోడలోపలి భాగంనుండి గోడకు గ్యాలరీ మోస్తరు మెట్లు కట్టబడి వున్నాయి.

## రామప్ప దేవాలయం

వరంగల్లుకు 30 మైళ్ళ దూరములో పాలెంపేట గ్రామంలో రామప్పచెరువు కలదు. ఇక్కడ ఉత్తమ శిల్పకళతో నిర్మింపబడిన దేవాలయాలుకూడా కలవు. ఈ దేవాలయాలు హన్మకొండ దేవాలయాలను పోలివున్నవి. వీటిని గణపతి దేవుడు రుద్రమదేవి కాలంలోనే (1204) నిర్మించిరి. ఈ దేవాలయాలలో రామప్ప చెరువొడ్డునున్న రామప్ప దేవాలయం ప్రధానమైనది. దక్కను మధ్యయుగ దేవాలయ శిల్పకళలో యిది తలమానికము వంటిదని ఉగ్గడించబడింది.

## పాఖాల తటాకము

ఇది కాజీపేటనుండి 36 మైళ్ళ దూరములో కలదు. దీనిని కాకతీయరాజులు నిర్మించిరి. ఈ తటాకం కట్టపై తెలుగు, సంస్కృతం లిపిలో చెక్కడాలున్నాయి. కాకతీయరాజుల రాజ చిహ్నమైన సూర్య చంద్రులతో కూడిన గణేశుని విగ్రహము కూడా కలదు. దీని కట్ట పొడవు 2000 గజములు, ఎత్తు 75 అడుగులు, మరియు వెడల్పు 150 అడుగులు. దీని జలావరణ 20 చ॥ మైళ్ళు.

## ఖమ్మం దుర్గము

ఇక్కడ వరంగల్లు రాజులు నిర్మించిన దుర్గము కలదు. అయితే ఈ దుర్గము 1525 లో మొదటి ఖులీ కుతుబు షాహ హస్తగతమైనట్లు ముస్లిం చరిత్రకారులు వ్రాస్తున్నారు.

## భద్రాచలం దేవాలయం

భద్రాచలం దేవాలయం భారత దేశంలోని ప్రసిద్ధ యాత్రా స్థలములలో నొకటి. ఇది ఆంధ్రరాష్ట్రంలో గోదావరి నదీ తీరాన నున్నది. అయితే దేవాలయప్రాంతం హైదరాబాదు రాష్ట్రానికి చెందివున్నది. హైదరాబాదువైపునుండి వెళ్ళేయాత్రికులు "భద్రాచలం రోడ్డు" రైల్వే స్టేషనులో దిగి వెళ్ళుతారు. ఈ దేవాలయం అబుల్ హసన్ తానేషాహు (1654-1687) ముఖ్య మంత్రియగు అక్కన్న అల్లుడైన గోపన్న రామదాసు చేతనిర్మించబడింది. ఇది శ్రీరాముని దేవాలయం. ప్రతి సంవత్సరం. శ్రీరామ నవమిరోజున ఉత్సవాలు జరుగుతాయి.

దేవాలయం హైదరాబాదు రాష్ట్రంలోనే వున్నా, ఆంధ్ర ప్రభుత్వ అధీనంలో వున్నది. హైదరాబాదు ప్రభుత్వం దీనిపై ప్రతి సంవత్సరం 30 వేల రూపాయీలు ఖర్చు చేస్తుంది.

# రాయచూరు

## అలంపురం

అలంపురంలోని శిల్పకళాఖండాలలో ప్రత్యేకమైనది నటరాజ ప్రతిమ. దక్షిణ వారణాసిగా ప్రసిద్ధిచెందిన అలంపురం పురావస్తు ప్రధానప్రదేశ మవడమేగాక, హిందూమత సంస్కృతులకు కేంద్రస్థానము కూడా.

రాయచూరుజిల్లాయందు తెలంగాణాకు సంబంధించినవి కొప్పళ్, జలదుర్గ్, షాహాపురం, దేవదుర్గ్, యాద్గీర్, ముద్గలు, మల్లయాబాదు, ఆనెగొంది, అలంపురం కోటలు కర్నాటక ప్రాంతమునకు చెందినవైనప్పటికీ సహచర్యమువలన తెలంగాణా చరిత్రకు సన్నిహితసంబంధం కలదు.

అలంపురంనందలి చాళుక్య దేవాలయం, ఆనెగొందిలోని కట్టడములు, గంగావతి యందలి జైనదేవాలయములు, మాన్వీ యందలి మూడు దేవాలయములు తెలంగాణమునకు చెందినవే.

[మూలం : 'నేటి హైదరాబాదు - ఫిబ్రవరి 1954, సుజాత తెలంగాణా సంచిక 15 ఆగస్టు 1951].

# తెలంగాణా

# సాంస్కృతిక పునరుజ్జీవనం

ఒకప్పుడు యావదాంధ్రానికి త్రిలింగ దేశము, తెలంగాణము అని వుండిన పేరు నేడు హైదరాబాదు రాష్ట్రంలోని తెలుగు జిల్లాలకు మాత్రమే నిలిచిపోయింది. అతి ప్రాచీన చరిత్రకు రంగస్థలమయిన యీ తెలంగాణా ప్రాంతము తెలుగు భాషకు, తెలుగు సంస్కృతికి అనేక విధాల తోడ్పడుతూనే వచ్చింది.

ఈ ప్రాంతాన్ని పాలించిన తూర్పు చాళుక్యుల కాలంనుండి తెలుగు భాషకు ఒక స్థానము యేర్పడ్డది. అప్పటినుండి దిన దినాభివృద్ధిని పొందింది. తూర్పు చాళుక్యులలో ఒకడైన చాళుక్య భీముడు కొరవిలో స్థాపించిన శాసనాన్ని పరిశీలించినట్లయితే అందులో సలక్షణమైన తెలుగు వచనం కనబడుతుంది. చాళుక్య భీముడు క్రీ॥ శ॥ 888 నుండి 918 వరకు హనుమకొండ ప్రాంతాన్ని పాలించాడు. అనగా నన్నయ భారత రచనా కాలమునకు సుమారు నూటేండ్లకు పూర్వంనుంచే తెలంగాణా ప్రాంతంలో తెలుగుభాషకు ఒక స్థానముయేర్పడి, అభివృద్ధి పొందుతూ వచ్చినదన్న మాట.

పోతన, పండితారాధ్యుడు, పిల్లలమర్రి పినవీరభద్రుడు, గోపన్న, అప్పయార్యుడు, కాకపల్లి మల్లిఖార్జునుడు, ఏకామ్రనాథుడు మొదలగు మహాకవులు ఈ ప్రాంతమువారే. ఈ మహా కవులు తమ రచనలతో తెలుగు సాహిత్యానికి పరిపుష్టిని కలిగించారు. భాగవతము, భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము, ద్విపదలో వ్రాయబడ్డ హరిశ్చంద్ర, అచ్చ తెనుగులో వ్రాయబడిన యయాతిచరిత్రము, రసార్ణవ సుధాకరము, మొదలగు ఉద్గ్రంథాలను తెలుగు సాహిత్యానికి సమర్పించారు. ఇటువంటి ఉత్తమ గ్రంథాలను తెలుగు సాహిత్యానికి సమర్పించిన తెలంగాణాకు మహోజ్వలమైన ఉత్తమ సంప్రదాయాలనేకం వున్నవి. తన కావ్యకన్యకను కూళలైన రాజులకిచ్చి తద్వారా లభించే పడుపు కూటికి ఆశించనని చాటాడు మహాకవి పోతన. ప్రజలకు సన్నిహితమైన ద్విపద రూపంలో మొట్టమొదటి గ్రంథాన్ని రచించినది కూడా తెలంగాణా కవే.

ఈ విధంగా కొంతకాలం మహోజ్వలంగా ప్రకాశించిన తెలుగువాఙ్మయము, తదితర లలితకళలు కాలక్రమేణా యీ ప్రాంతంలో వచ్చిన రాజకీయ మార్పుల ఫలితంగా అతి హీనస్థితికి వచ్చాయి. బ్రిటిషువారు తమ అస్తిత్వాన్ని సుస్థిరం చేసుకొనేందుకు అవలంబించిన విధానం మూలముగా తెలంగాణాకు నిజాము

రాచరిక నిరంకుశపరిపాలన ప్రాప్తించింది. బ్రిటిషు సామ్రాజ్య వాదులకు నమ్మిన బంటు అయిన నిజాము అభివృద్ధి నిరోధకమయిన తన పరిపాలనను కాపాడుకొనేందుకు ప్రజలనురాజకీయంగా అణచి ఉంచుటయే గాక, సాంస్కృతికంగాకూడా తీవ్రంగా అణచివేస్తూ వచ్చాడు. తెలుగుభాషకు, తెలుగువారి సాంస్కృతిక జీవనానికి యేవిధమయిన ప్రోత్సాహము యివ్వకపోవటము అటుంచి, చివరికి సారస్వత విషయికమయిన సభలు జరుపుకోవాలన్నా ప్రభుత్వ అనుమతిని పొందవలసిన నిర్బంధ పరిస్థితులలో ప్రజలు తమ జీవితం గడుపవలసివచ్చింది. చివరికి ఇన్ని అవరోధాలనూదాటి, ఏదైనా సారస్వత సభలు జరుపుకున్నా, ప్రభుత్వము గుండాలను వాటిపైకి ఉసికొల్పి, విచ్ఛిన్నం చేస్తూ వచ్చేది. అటువంటి భయంకర నిర్బంధ విధానంలో ప్రజలు తమ మాతృభాష అయిన తెలుగును స్వేచ్ఛగా వాడుకునే అవకాశాలుకూడ లేకుండా, అనేక అవరోధాలు కల్పించబడుతూ వచ్చాయి.

కాని జీవభాష అయిన ప్రజల భాష, ప్రజల సంస్కృతి యెట్టి నిర్బంధాలలో కూడా నశించవని తెలంగాణా ప్రజలు తమ వీరోచితమైన పోరాటంద్వారా ప్రపంచానికి చాటారు. సారస్వత సభలను కూడా జరుపుకొనే వీలులేని పరిస్థితియేర్పడి ప్రజల మాతృభాషనే నాశనంచేయ తలపెట్టిన ప్రభుత్వ సంకల్పాన్ని ఓడించేందుకు ఆంధ్ర భాషాభిమానము, విద్యాసక్తి ప్రజలలో కలిగించటమే వారిలో చైతన్యాన్ని కల్పించుటకు మార్గమయింది. అందువల్ల తెలంగాణాలో సాంస్కృతిక పునరుజ్జీవనానికేగాక, రాజకీయచైతన్యానికికూడ గ్రంథాలయోద్యమమే పునాది అయింది.

తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవనానికి కీ॥ శే॥ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు గారే పునాదివేశారని చెప్పవచ్చును. 1901 లో వీరి కృషివల్లనే హైదరాబాదు నగరంలో కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం 1904 లో హనుమకొండలోని రాజరాజనరేంద్ర భాషానిలయం స్థాపించబడ్డాయి. శ్రీ లక్ష్మణరావుగారు ప్రారంభించిన యీ ఉద్యమం శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, తదితరుల సహాయంతో తెలంగాణా నలుమూలలా ప్రాకింది. తెలంగాణా జిల్లాలలో అనేక చోట్ల గ్రంథాలయాలు స్థాపించబడ్డాయి. తర్వాత శ్రీ లక్ష్మణరావుగారు 1907 లో హైదరాబాదు నగరంలో విజ్ఞానచంద్రికా గ్రంథమాలను స్థాపించి, ప్రజలకు విజ్ఞాన విషయికమయిన గ్రంథాలను అందజేయ సమకట్టారు. ఈ గ్రంథమాల మొట్టమొదటి ప్రచురణలయిన శ్రీ లక్ష్మణరాయ విరచిత హిందూ మహాయుగము, మహమ్మదీయ మహాయుగము, కీ॥ శే॥ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర హైదరాబాదు నగరంనుండే వెలువర్చబడ్డాయి.

కాని, 1908 లో ఈ గ్రంథమాల కార్యస్థానము హైదరాబాదు నుండి మద్రాసుకు మార్చబడినది. అటు తర్వాత శ్రీ లక్ష్మణరావుగారు చూపిన మార్గాన్ని అనుసరిస్తూ, శ్రీ మాడపాటి హనుమంతరావుగారు ఊరూరా గ్రంథాలయాలు స్థాపిస్తూ, గ్రంథాలయ సమావేశాలద్వారా ప్రజలలో చైతన్యాన్ని కలుగజేసి మాతృభాషాభిమానాన్ని, విద్యాశక్తిని పురికొల్పారు. ఈవిధంగా చైతన్యాన్ని పొందిన యువకులే తర్వాత రాజకీయ రంగంలోకి కూడావచ్చారు.

## గ్రంథమాలలు

గ్రంథాలయోద్యమంతో చైతన్యం పొందిన అనేకులు ప్రజలకు విజ్ఞానం కలిగించి, జాతి పురోభివృద్ధికి తోడ్పడుటకై గ్రంథమాలలను ప్రారంభించి అతిసమర్థతతో నిర్వహించారు. ఇనుగుర్తివారి విజ్ఞానప్రచారిణీ గ్రంథమాల, లింబాద్రిరెడ్డిగారి విజ్ఞాన గ్రంథమాల, గార్లనుండి చిలుకూరి శ్రీరాములుగారిచే నడుపబడిన వెంకటేశ్వరగ్రంథమాల, వరంగల్లులోని కాకతీయ గ్రంథమాల, శ్రీ మామునూరి నాగభూషణరావుగారి సంపాదకత్వమున నడిచిన సారస్వత చంద్రికా గ్రంథమాల ఇటువంటివాటిలో పేర్కొనదగినవి. కేవలము సారస్వత గ్రంథాలనే ప్రకటిస్తూ, సారస్వతసేవచేసినవి చందూరుసందలి సాహితీ మేఖల, శ్రీ పొట్లపల్లి రామారావుగారి తెలంగాణా గ్రంథమాల. శ్రీ గుండవరము హనుమంతరావుగారిచే నడుపబడిన ఆంధ్రకేసరి గ్రంథమాల, శ్రీ కె. సి. గుప్తగారి అణా గ్రంథమాల, శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామిగారి దేశోద్ధారక గ్రంథమాలలు రాజకీయ గ్రంథాలనేకం ప్రకటించాయి. ఈ గ్రంథమాలలలో కొన్ని మాత్రమే నేటికిని సజీవంగా ఉన్నాయి. సికింద్రాబాదులో ఈ మధ్యనే స్థాపితమైన రాజశ్రీ కళాపీఠమువారుకూడా అనేక ఉత్తమ సాహిత్య గ్రంథాలను ప్రకటించారు. 1948 లో శ్రీ మాడపాటి హనుమంతరావుగారు ఆంధ్ర చంద్రికా గ్రంథమాలను స్థాపించి శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారి "ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము," ఆదిరాజు వీరభద్రరావుగారి "ప్రాచీనాంధ్ర నగరములు" మొదలైనగ్రంథాలను ప్రకటించుతున్నారు. సారస్వత సంస్థలై నేడు తెలంగాణా ప్రజలలో సాహిత్యాభిలాషను కలిగిస్తున్న ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘం, సాధనసమితి సాహిత్య సంబంధమయిన గ్రంథాలను ప్రకటిస్తున్నాయి. అందులో సారస్వత పరిషత్తువారు ప్రకటించిన శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"ను ముఖ్యంగా పేర్కొనవలసియున్నది.

## ఆంధ్ర విద్యాసంస్థలు

జాతి పునరుజ్జీవనానికి ప్రజలలో మాతృభాషాభిమానము, విద్యాశక్తి కలిగించటమే గాక, తెలుగు బాలబాలికలకు బాల్యం నుండికూడా మాతృభాషలో శిక్షణ నివ్వటము యెంతయినా అవసరమని తలంపబడ్డది. నిరంకుశ రాచరిక ప్రభుత్వం తెలుగు బాలబాలికలకు వారి మాతృభాషలో శిక్షణ నివ్వటానికి ఏమాత్రము సహాయపడలేదు. పైగా అటువంటి ప్రయత్నాలను అనేక విధాల ఆటంకపరుస్తూ వచ్చింది. అందువల్ల తెలంగాణాలోని ప్రజలు తమకుతామై అటువంటి సంస్థలను స్థాపించుకొనుటకు పూనుకోవలసివచ్చింది.

హైదరాబాదు నగరంలో శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, కీ॥ శే॥ కొండా వెంకటరామారెడ్డి, కీ॥ శే॥ ఎస్. ఆ. రావు మొదలగువారి కృషిచేత యిటువంటి సంస్థలు కొన్ని దాదాపు ముప్పది

సంవత్సరాలక్రితం యేర్పడి కృషిచేస్తున్నాయి. నారాయణగుడా బాలికోన్నత పాఠశాల అలాంటివాటిలో ఒకటి. 1921 లో యిది స్థాపింపబడి నేడు ఒక మహాసంస్థగా రూపొంది పనిచేస్తున్నది. మహారాజ్ గంజ్ లోని సావిత్రీ కన్యా పాఠశాల, మంషీర్ గంజ్ లోని గజానన ఆంధ్ర బాలికా పాఠశాల, ఢీల్కా-నా లోని సరస్వతీ బాలికాపాఠశాల, ఆంధ్ర విద్యాభివర్ధినీ బాలుర పాఠశాల యిటువంటి సంస్థలే.

ఇవిగాక వరంగల్లులో ఆంధ్రవిద్యాభివర్థిని పాఠశాల, ఖమ్మంమెట్టులో ఆంధ్రబాలికా పాఠశాల, నల్లగొండలో ఆంధ్రబాలికా పాఠశాల, సూర్యాపేటలో వైదికాంధ్రబాలికా పాఠశాల, జగ్త్యాలలో ఆంధ్రబాలికా పాఠశాల ఉత్సాహవంతులగు తెలుగు వారిచే నడుపబడుతూ వచ్చినవి. ఈ విద్యా సంస్థలు తెలుగు బాల బాలికలలో జాతీయచైతన్యమును కలుగ జేయుటకు యెంతగానో తోడ్పడినవి. తెలుగు ప్రజలు గావించిన యిటువంటి కృషి ఫలించి, నేడు తెలుగు బాలబాలికలకు ప్రాథమిక విద్యకూడా మాతృభాషలోనే గరుపబడుచున్నది.

## తెలుగు పత్రికలు

తెలంగాణాలోని తెలుగు ప్రజలలో చైతన్యం కలిగించడానికి గ్రంథాలయాలు, గ్రంథమాలలు, విద్యాసంస్థలతో పాటు పత్రికలు కూడా అనేకం అతికష్టమైన వాతావరణంలో పుట్టి పనిచేస్తూ వచ్చాయి. సారస్వత సమావేశాలకే హక్కు-లేని వాతావరణంలో పత్రికలు వెలువడి పనిచేయటం యెంత కష్టతరమైన విషయమో వేరే చెప్ప నవసరంలేదు. అందులోను ప్రెస్సులు సరియైనవి లేని పరిస్థితులలో పత్రికలు నడుపుట మరీ దుస్తరము. ప్రభుత్వ మెన్నో హామీలను సంపాదకుల నుండి వ్రాతమూలకంగా పొందినతర్వాత వారికి అనుమతిని యిస్తూవుండేది.

తెలంగాణా నుంచి వెలువడిన మొట్టమొదటి తెలుగు పత్రిక "హితబోధిని". అది 1913 లో శ్రీ శ్రీనివాసశర్మగారి సంపాదకత్వంలో మహబూబు నగరము నుండి వెలువడ్డది. కాని అది సంవత్సరం కంటే యెక్కు-వ నడువలేదు.

తర్వాత 1920 లో వరంగల్లుజిల్లా ఇనుగుర్తినుండి "తెనుగు పత్రిక," నల్లగొండ నుండి "నీలగిరి" అను రెండు వారపత్రికలు వెలువడ్డాయి. "తెలుగు పత్రిక"ను శ్రీ వద్దిరాజు సీతారామచంద్రరావుగారు, వారి సోదరులు శ్రీ రాఘవరంగారావుగారు కలసి నడిపేవారు. "నీలగిరి" పత్రికకు శ్రీ॥ శే॥ నరసింహారావుగారు సంపాదకత్వం వహించారు. అటుతర్వాత 1925 లో శ్రీ మాడపాటి హనుమంతరావుగారిచే "ఆంధ్రజన సంఘం" అను పత్రిక, శ్రీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వంలో "గోలకొండ వారపత్రిక" కూడా స్థాపించబడ్డాయి. ఇది ప్రారంభమయిన సంవత్సరానికే "తెనుగు పత్రిక", "నీలగిరి" పత్రికలు ఆగిపోయినవి. "ఆంధ్రజనసంఘం"తో ప్రారంభమయిన ఆంధ్రోద్యమానికి గోలకొండ పత్రిక దోహదమిస్తూ వచ్చింది. అందువల్ల అది సుస్థాపితమైపోయింది.

1927 "సుజాత" అను సారస్వత మాస పత్రిక శ్రీ పి. ఎస్. శర్మగారి సంపాదకత్వంలో ప్రారంభమయి ఉత్తమమయిన సారస్వతకృషి చేసింది. అది కొంత కాలానికి ఆగిపోయిన తర్వాత సికింద్రాబాదునుండి "తెలుగుతల్లి", "విభూతి" అను మాసపత్రికలు, "దివ్యవాణి" అను వారపత్రిక, హైద్రాబాదునుండి "ఆంధ్ర కేసరి", "ఆంధ్రాభ్యుదయము" అను పత్రికలు నడిచాయి.

తెలంగాణాలో తెలుగు దిన పత్రికను స్థాపించటానికి 1940 మొదలు అనేకులు కృషి చేశారు. చివరికి 1945 "తెలంగాణ పత్రికకు","మీజాన్" అను అరబ్బీ పేరుతో మరొక దిన పత్రికకు అనుమతి యివ్వబడ్డది. "మీజాన్" తెలుగు దినపత్రిక కీ॥ శే॥ అడివి బాపిరాజుగారి సంపాదకత్వంలోను, "తెలంగాణ పత్రిక" కీ॥ శే॥ బుక్కపట్టణం రామానుజాచారిగారి సంపాదకత్వంలోను వెలువడి సుమారు రెండు సంవత్సరాల పాటు నడిచి తిరిగి ఆగిపోయినవి. అర్ధవార పత్రికగా అంతవరకు నడుస్తూ వుండిన గోలకొండ పత్రిక గూడా శ్రీ వరోత్తము రెడ్డిగారి కృషివల్ల దినపత్రికగా మారింది. "గోలకొండ పత్రిక" నేడు తెలంగాణా లోని ఏకైక దినపత్రికగా నడుస్తూఉన్నది.

1947 లో శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారి సంపాదకత్వంలో "శోభ" అను సారస్వత మాసపత్రిక కొంత కాలం వరకు నడిచి ఆగిపోయింది. పోలీసుచర్యానంతరం వచ్చిన ప్రజా చైతన్యపు వెల్లువతో పాటు అనేక పత్రికలు ప్రారంభమయ్యాయి. సుజాత, ప్రగతి, భాగ్యనగర్, పద్మశాలి, జనశక్తి,ప్రజాశక్తి, ప్రజాయుగం, మేధావి, జయభారత్, తెలుగుదేశం, కాకతీయ, చిత్ర విచిత్ర, సుదర్శన్ అను పత్రికలు ప్రారంభమయాయి, పోయినవి.

సర్వత్ర వ్యాపించిన ఆర్థిక మాంద్యంవల్ల అనేక పత్రికలు ఆగిపోవుట తటస్థించింది. చివరకి నేడు తెలంగాణా అంతటికి "గోలకొండ" దినపత్రిక, "తెలుగుదేశం," "నేత" అను వారపత్రికలు మాత్రం మిగిలాయి.

## సాంస్కృతిక సంస్థలు

గ్రంథాలయోద్యమంతో ప్రారంభమయిన సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమం కొంతకాలం వరకు సరియైన నిర్మాణ రూపాన్ని పొందలేదు. అనేకమంది ఉత్సాహవంతులు వ్యక్తిగతంగానే సాంస్కృతిక పునరుజ్జీవనానికి పాటుపడుతూ వచ్చారు. 1925 ప్రాంతంలో శ్రీ మాడపాటి హనుమంతరావుగారు "నిజాము రాష్ట్రి ఆంధ్రజన సంఘాన్ని యేర్పరచి యీ ఉద్యమాన్ని నిర్మాణ స్వరూపంలోకి తీసుకొని రావటానికి ప్రథమ ప్రయత్నం చేశారు. ఈవిధంగా తెలుగు ప్రజల సాంస్కృతికోద్యమాన్ని నిర్మాణ స్వరూపానికి తీసుకొని రావటానికి జరిగిన ప్రయత్నమే చివరకు నిజాము రాష్ట్రాంధ్రమహాసభగా రూపొందింది. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంతో ప్రారంభమయిన ఆంధ్ర మహాసభ ఒక మహాసంస్థగా తయారై, తెలంగాణా ప్రజలను తామనుభవిస్తున్న రాచరిక నిర్బంధవిధానంనుండి విముక్తి

లయ్యేందుకు సమీకరించేబాధ్యతను వహించింది. దాని విధులు విస్తృతమయ్యాయి. తెలంగాణా ప్రజల జీవితానికి సంబంధించిన అన్ని విషయాలలోను శ్రద్ధతీసుకొంటూ నిరంకుశ పరిపాలకులతో పోరాడవలసి వచ్చింది. కేవలము సాంస్కృతిక విషయాలపైననే శ్రద్ధవహించుటకు వీలులేకపోయింది. అట్టి పరిస్థితులలో ప్రత్యేకంగా సాంస్కృతిక విషయాలపైననే శ్రద్ధవహించగల సంస్థ ఆవశ్యకత యేర్పడింది.

1942 లో నిజాం ప్రభుత్వం తెలంగాణాలో తెలుగు భాషకు నామరూపాలు లేకుండాచేసి, తెలుగు ప్రజలను సగా అణచి వేయుటకు బలమైన ప్రయత్నాలను తలపెట్టింది. ఉర్దూభాషను బోధనా భాషగా తెలుగు ప్రజలపైన రుద్దుటకు పూనుకొన్నది. తమ యీ ప్రయత్నాలకు తెలుగు ప్రజలు ఆటంకంగా లేకన్నట్లు యితర ప్రపంచాన్ని మభ్యపెట్టేందుకు, బూటకపు సాంస్కృతిక సంస్థలను సృష్టించి వాటికి డబ్బు గుప్పటం మొదలు పెట్టింది.

అటువంటి పరిస్థితులలో తెలంగాణా ప్రజలు తమ మాతృభాషా వినాశనానికి జరుగుతున్న ప్రయత్నాలను గుర్తించి పోరాడటానికి సంసిద్ధులయ్యారు. ప్రభుత్వపు కుయత్నాలను భగ్నంచేసి, తెలంగాణా ప్రజల్లో తెలుగు భాషా ప్రచారాన్ని గావించి, దేశం నాలుమూలల్లో ఒకరికొకరికి సంబంధాలు లేకుండా ఉండిపోయిన రచయితలనందరినీ సమీకరించేందుకు శ్రీ భాస్కరభట్ల కృష్ణారావు, శ్రీ బూర్గుల రంగనాథరావుగార్ల వంటి యువకులచేత నిజాంరాష్ట్రాంధ్ర సారస్వత పరిషత్తు స్థాపించబడ్డది. శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, డా॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు, శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు, డా॥ శే॥ బుక్కపట్టణం రామానుజాచార్యులుగారు, శ్రీ లోకనంది శంకర నారాయణగారు, మొదలైన పెద్దల అండతో యిది బలమైన సంస్థగా రూపొందింది. తెలంగాణా జిల్లాలలో అనేక ప్రాంతాలలో శాఖలు స్థాపింపబడ్డాయి. తెలుగు భాషాప్రచారం విరివిగా గావించి, తెలుగు ప్రజలలో జాతీయ చైతన్యం కలిగింపబడ్డది. ప్రభుత్వం అణచి వేయడానికి ప్రయత్నిస్తున్న తెలుగు భాషలో సారస్వత పరిషత్తే పరీక్షలు నడుపుట ప్రారంభించింది. తెలంగాణా ప్రజలు వేనకువేలుగా యీ పరీక్షల్లో పాల్గొనసాగారు. ప్రభుత్వ నిర్బంధవిధానానికి తెలుగుభాష నాశనం కాకపోగా, ప్రజలే తమకు తామై భాషాభివృద్ధికి యీ విధంగా కృషిసలుపుతూవుంటే ప్రభుత్వానికి కండ్లుకుట్టాయి. ముస్లిం మతోన్మాదులైన గూండాలను రెచ్చగొట్టి, సారస్వత పరిషత్తు సమావేశాలపైకి ఉసిగొల్పసాగింది. అటువంటి నిర్బంధ పరిస్థితుల ననుసరిస్తూ, ప్రభుత్వము తెలుగుభాషోద్ధరణను అరికట్టుటకు ప్రయత్నించింది. సారస్వత పరిషత్తు కార్యకర్తలు గ్రామాలకు పోకుండా ఆటంకపరుస్తూ వచ్చింది. చివరికి రజాకార్లు విజృంభించిన కాలంలో పరిషత్తు కార్యకర్తలపైన వారంట్లుకూడా జారీచేయబడ్డాయి. కార్యదర్శిపైన గూండాలుపడి దౌర్జన్యాన్ని జరిపారు. అటువంటి పరిస్థితుల్లో పరిషత్తు పనిచేయుటే అసాధ్యమైపోయింది. సాంస్కృతిక రంగంలోకూడా తెలంగాణాప్రజలు యిట్టి పరిస్థితులలో వీరోచితమైన పోరాటాన్ని కొనసాగించవలసి వచ్చింది.

పోలీసుచర్యానంతరం యీ సంస్థ తిరిగి రంగంలోకి ప్రవేశించి, ద్విగుణీకృతో త్సాహంతో పనిచేయసాగింది. ఈ సంస్థ తరఫున 110 మంది కార్యకర్తలు వయోజన విద్యాబోధనలో శిక్షణ పొంది పని చేస్తున్నారు. గ్రామాలలో 98 వయోజన పాఠశాలలు ప్రారంభింపబడి విజయ వంతంగా నడుపబడుతూ వున్నవి. 292 పరిషత్తుశాఖలు గ్రామాలలో యేర్పాటు చేయబడ్డాయి.

ఈ సంస్థ తరఫున ఒక ప్రతినిధి వర్గము విద్యాశాఖాధికారులతో సంప్రతింపులుజరిపి హైస్కూళ్లలోను, కాలేజీలలోను తెలుగు భాషకు ఉచితమైన స్థానం కలిగింప బడేందుకు కృషి చేసింది. దీని ఫలితంగానే హైస్కూళ్ళలో విద్యాబోధన ప్రాంతీయ భాషలలో జరుపుటకు ప్రభుత్వం ఒప్పు కొన్నది. అంతవరకు ప్రభుత్వ కళాశాలల్లో అసలు ప్రాంతీయ భాషలకు స్థానము వుండేది కాదు. సారస్వత పరిషత్తు కృషివల్ల కళాశాలల్లోగూడా తెలుగుభాషను ప్రవేశ పెట్టుటకు అంగీకరింపబడింది.

ప్రజల కండగా నిలుస్తూ, వారికి జరిగిన అన్యాయాల నెదుర్కొంటూ వచ్చిన సుసాంప్రదాయం కలిగి ఉన్న సారస్వత పరిషత్తు నేటికిగూడా అప్రమత్తతతో ప్రజల హక్కులను కాపాడుతూ వున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని హిందీ విశ్వ విద్యాలయంగా మార్చి, తెలుగు ప్రజ లకు అన్యాయం చేయసమకట్టిన కేంద్ర ప్రభుత్వ ప్రయత్నానికి వ్యతిరేకంగా సార స్వత పరిషత్తు ఆందోళనను నడుపుతున్నది. తెలంగాణాలోని ప్రముఖులను సమీకరించి కేంద్ర ప్రభుత్వ కుయత్నాలను కొనసాగ నివ్వకుండా కృషి చేస్తున్నది.

రాజకీయంగా యేర్పర్చబడిన కృత్రిమ సరిహద్దులను తొలగించి తెలుగు ప్రజల నందరినీ యేకం చేయాలన్నది యీ సంస్థ యొక్క ప్రధానాశయం. ఆ వుద్దేశ్యం తోనే అలంపూరులో 1953 లో జరిగిన యీ సంస్థ వార్షికోత్సవంలో అఖిలాంధ్ర కళాపరిషత్తు శ్రీగంగం శ్రీనివాసరావు గారి అధ్యక్షతను స్థాపింపబడ్డది.

ప్రస్తుతం యీ సంస్థకు అధ్యక్షులు శ్రీ నూకల నరోత్తమరెడ్డిగారు, శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, శ్రీ పులిజాల హను మంతరావుగారు, శ్రీ గడియారము రామ కృష్ణశర్మగారల కృషివల్ల ఆంధ్ర సారస్వత పరిషత్తు నేటి అత్యున్నతస్థితికి వచ్చింది.

ఆంధ్ర సారస్వత పరిషత్తులో మొదటి నుండి పనిచేస్తూ వచ్చిన శ్రీ దాశరధి కృష్ణమాచార్యులు, శ్రీ దేవులపల్లి రామా నుజరావుగారు, శ్రీ సి. నారాయణరెడ్డి గారలచే 1951 లో కేవలము సాహితీ రంగంలో పనిచేయుటకు తెలంగాణా రచ యితలసంఘం స్థాపింపబడ్డది. శ్రీ దాశరధి దీనికి అధ్యక్షులు. ఈ సంఘం తరఫున తెలంగాణాలోని అనేక ప్రాంతాలలో శాఖ లేర్పడి యువకులైన రచయితలకు ప్రోత్సాహం కలిగింపబడుతున్నది. "ఉదయ ఘంటలు" మొదలైన కవిత్వ సంపుటాలు తెలంగాణా రచయితలసంఘం తరఫున ప్రకటింపబడ్డాయి.

1939 లో శ్రీ బూర్గుల రంగనాథరావు, శ్రీ వెల్లూరి కేశవస్వామి మొదలైన యువ రచయితలచేత సాధన సమితి ప్రారంభించ బడి, నేటికిగూడా సజీవంగా సాహిత్య రంగంలో పనిచేస్తున్నది. సాధనసమితి "ప్రత్యూష" అను తెలంగాణా కవుల కవిత్వ సంపుటిని, "సాధన" అను తెలం

గాణా కథకుల కథా సంపుటి, మరికొన్ని సాహిత్య గ్రంథాలను ప్రకటించింది.

ఇవిగాక విజ్ఞానాభివర్ధనీ పరిషత్తు, వైతాళిక సమితి, ఆంధ్రవాఙ్మయ సేవా సమితి, వరంగల్లులోని కాకతీయ కళా సమితి, సికింద్రాబాదులోని రాజశ్రీ కళా పీఠము, నవ్యకళా సమితి, ఆంధ్రాభ్యుదయ కళా సమితి, విజయ కళా సమితి మొదలైన సంస్థలు సాహితీరంగంలోను, నాట్యకళ, చిత్రకళారంగాలలోను కృషి చేస్తూ వున్నవి.

# పరిశోధనలు

తెలంగాణాలో చారిత్రపరిశోధనలు కీ. శే. లక్ష్మణరావుగారి కాలంనుంచి జరుగుతునే వున్నవి. లక్ష్మణరాయ పరిశోధకమండలి యేర్పడి తెలంగాణాలోని అనేక శాసనాలను పరిశోధించి, ఆంధ్రుల చరిత్రకు ఎంతో సామాగ్రిని చేకూర్చింది. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి "ప్రాచీనాంధ్రనగరములు", శ్రీ దూపాటి వెంకటరమణాచార్యులుగారి "చారిత్రకవ్యాసాలు," శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి "ఆంధ్రుల సాంఘికచరిత్ర", శ్రీ గడియారం రామకృష్ణశర్మగారి "అలంపూరు శాసనములు" అటువంటి గ్రంథాలలో కొన్ని.

# కవులు - కథకులు

కీ॥ శే॥ లక్ష్మణరావుగారిచేత ప్రారంభింపబడిన తెలంగాణా సాహిత్య పునరుజ్జీవనోద్యమాన్ని అప్పటి యువకులైన శ్రీ మాడపాటి హనుమంతరావుగారు, కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు, తమ అవిరామ కృషిచేత ముందుకు తీసుకొనిపోసాగారు. శ్రీ మాడపాటి హనుమంతరావుగారు సుమారు నలభై సంవత్సరాలకు పూర్వం కథానికా రచనను ప్రారంభించి "కృష్ణాపత్రిక"లో వరుసగా అనాడే పదమూడు కథలను ప్రకటించారు. ప్రేమ్‌చంద్ రచనలు అనేకం తెలుగులోకి అనువదించారు. బంకించంద్రఛటర్జీ వ్రాసిన "ఆనందమఠం", శ్రీ చింతామణిరావు వైద్య వ్రాసిన "ఎపిక్ ఇండియా"లకు ఆంధ్రానువాదాలు, "గారిబాల్డి జీవిత చరిత్ర" రచించారు. ఇవిగాక తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రనుగూడా వ్రాసి తాము స్థాపించిన ఆంధ్రచంద్రికా గ్రంథమాలద్వారా ప్రకటించారు. ఈ సమయములోనే కీ॥ శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు గోలకొండ పత్రికను స్థాపించి, యువక రచయితలను ప్రోత్సహిస్తూ, సాహిత్యోద్యమానికి పాటుపడసాగారు. శ్రీ రెడ్డిగారు బహుభాషాకోవిదులు. ఆంధ్రుల సాంఘిక చరిత్ర, రామాయణ విశేషములు, హిందువుల పండుగలు, హైందవ ధర్మవీరులు, 'మొగలాయి కథలు' గ్రంథాలయోద్యమమూ, ప్రాథమిక స్వత్వములు మొదలైన అనేక గ్రంథాలను వ్రాసి ప్రకటించారు. వందలాది వ్యాసాలు వ్రాసి తెలంగాణాలోని యువకులకు ఒక ఒరవడిని పెట్టారు.

ఈవిధంగా వీరు చూపినమార్గాన్ని అనేకమంది యువకులు పయనం సాగించి,

అభివృద్ధి నిరోధకపు రాచరిక పరిపాలనక్రింద అధోగతిపట్టిన తెలుగు వాఙ్మయాన్ని పునరుద్ధరించటానికి పూనుకొన్నారు. సాహిత్యపు అన్ని శాఖలలోను కృషిసలిపి, తెలుగు భాషామతల్లికి అలంకరణాలు చేకూర్చారు. ఈవిధంగా సాహిత్యోద్యమానికి దోహద మిచ్చిన కొందరిని ప్రత్యేకంగా పేర్కొన వలసియున్నది.

### శ్రీ దాశరథికృష్ణమాచార్యులుగారు

జననం 1927, మానుకోట తాలూకా, గూడూరులో. ఆంధ్ర,సంస్కృత భాషల్లో పాండిత్యం సంపాదించుకొని, అలంకార వ్యాకరణ శాస్త్రాలు చదువుకొన్న యువక విప్లవకవి. వీరు వయసులో చిన్నలయినా నేటి తెలంగాణా యువకవులందరికీ ఆదర్శంగా వున్నారు. తెలంగాణా స్వాతంత్ర్యసమరంలో జైలుశిక్ష ననుభవించిన కవులలో ఒకరు. తమ కవితద్వారా సామ్యవాద భావాలను ప్రజలలో వెదజల్లుతున్నారు. తెలంగాణారచయితల సంఘం స్థాపించి, దానికి అధ్యక్షులుగా వుంటూ తెలంగాణా యువకరచయితలను సమీకరిస్తున్నారు. అగ్నిధార, రుద్రవీణ వీరి ముద్రిత ఖండకావ్యాలు. అముద్రితమైన ఖండకావ్యాలెన్నో వున్నాయి.

### శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు

జననం 1916,వరంగల్ జిల్లా బొల్లికుంట. తెలంగాణా సాహిత్యోద్యమాన్ని నడుపుతున్న వారిలో అగ్రగణ్యులు. జీవితమంతా భాషాసేవకే వినియోగిస్తున్నారు. "శోభ" అను సారస్వతమాసపత్రికను స్థాపించి కొంత కాలం నడిపారు. గోలకొండ దినపత్రిక సహాయ సంపాదకులుగా కొంతకాలం పని చేశారు. తెలంగాణా సాహిత్య విమర్శకులలో ప్రప్రథమంగా పేర్కొనవలసిన వారు. తెలంగాణాలోని ప్రధాన సాంస్కృతిక సంస్థఅయిన ఆంధ్ర సారస్వత పరిషత్తుకు నాయకత్వం వహించి అత్యున్నత స్థితికి తెచ్చారు. అధ్యక్షులుగా కూడా పని చేశారు. విశాలాంధ్ర సంస్థాపనకు కృషి సల్పుతున్న వారిలో ఒకరు. నవ్యకవితా నీరాజనము, నవనీతము అను సాహిత్య విమర్శక గ్రంథాలు, పచ్చతోరణము అను ఖండ కావ్యము వీరి ముద్రిత గ్రంథాలు. ఏకవీర అముద్రిత గ్రంథం.

### శ్రీ కాళోజీ నారాయణరావుగారు

జననం 1914. వరంగల్ వాస్తవ్యులు. తెలంగాణా ప్రజల ఆదరాభిమానాలను మూటగొన్న కవులలో ఒకరు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని జైలు శిక్ష ననుభవించారు. పార్టీ దృక్పథం లేకుండా, నిర్భయంగా అక్రమాలను తమ కవితతో యెదుర్కొంటారు. "నల్లగొండలో నాజీ శక్తుల నగ్ననృత్యం మింకెన్నాళ్ళు" అన్న వీరిగేయం తెలంగాణావాసుల హృదయాలలో నేటికిగూడా ప్రతిధ్వనిస్తుంది. వ్యంగ్యం వీరి కవితలోని ప్రత్యేకత. "నాగొడవ" అను ఖండకావ్యము, కాళోజీ కథలు, నా భారతదేశ యాత్ర అనువాదం వీరి ముద్రిత కావ్యాలు. పరమాత్ముని ఆత్మకథ వీరి అముద్రిత గ్రంథం.

### శ్రీ పొట్లపల్లి. రామారావుగారు

జననం 1920. వరంగల్ జిల్లా తాటికాయల వాస్తవ్యులు. సామ్యవాద భావాలను విస్తరింపజేయుటానికి తమ గేయాలను, కథలను, నాటకాలను వినియోగిస్తారు. తెలంగాణా స్వాతంత్ర్యోద్యమంలో జైలు

శిక్షను పొందారు. నిరంకుశప్రభుత్వానికి వ్యతిరేకంగా తెలంగాణాప్రజలు జరిపిన పోరాటాన్ని చిత్రిస్తూ అనేక రచనలు చేశారు. జైలు అను కథలసంపుటిని ప్రకటించారు. అముద్రితమైన ఖండ కావ్యాలు, కథలు, వ్యాసాలు అనేకం.

### శ్రీ భాస్కరభట్ల కృష్ణారావుగారు

జననం 1918, బుద్వేలు. తెలంగాణా సాహిత్య పునరుజ్జీవనోద్యమానికి పునాదులు వేసిన వారిలో వీరొకరు. ఆంధ్రసారస్వత పరిషత్తును స్థాపించినవారిలో ఒకరు. కథానికా రచనలో ప్రత్యేకంగా కృషి జరిపి తెలంగాణా యువకులకు ఒరవడిపెట్టారు. ప్రపంచ సాహిత్యంలో వస్తున్న నవ్యరీతులను ఆమూలాగ్రం ఆకళించుకొని చక్కని విమర్శనాదృష్టిని అలవర్చుకొన్న తెలంగాణా యువకులు. ప్రస్తుతం అఖిల భారతరేడియో, హైదరాబాద్ కేంద్రంలో పని చేస్తున్నారు.

### శ్రీ బూర్గుల రంగనాధరావుగారు

జననం 1917, హైదరాబాదు. ఆంధ్ర సారస్వతపరిషత్తు సంస్థాపకుల్లో వీరుకూడా ఒకరు. ఆంధ్రకేసరి గ్రంథమాల, ఆంధ్ర కేసరి మాస పత్రికలను స్థాపించుటలో సహాయపడి సాహిత్యకృషి చేశారు. తెలంగాణాలోని సాహిత్య సంస్థలలో ఒకటయిన సాధనసమితిని స్థాపించి, దాని ద్వారా అనేకమంది యువ రచయితలను పైకితెస్తూ అనేక గ్రంథాలను ప్రకటింప చేశారు. చక్కనికథలు వ్రాస్తారు. వాహ్యాళి అను వీరి కథల సంపుటి ప్రకటితమయింది.

### శ్రీ బాగి నారాయణమూర్తిగారు

జననం 1912. సంగీతంలోను, నాటకాలలో వేషధారణలోను ప్రవేశంవుంది. చక్కని గేయాలు, కథలు, నాటికాలు వ్రాస్తారు. సాధన సమితి కార్యదర్శిగా పనిచేస్తున్నారు. పరీక్ష చదువు అను వీరి నాటకం ముద్రితమయింది. జయగంట, రుధిరరేఖలు, పద్మంకథలు, ఖండకావ్యాలు ఇంకా అముద్రితాలు.

### శ్రీ వానమామలై వరదాచార్యులుగారు

జననం 1912, తెలంగాణాలో ప్రతిభావంతులైన కవులలో వీరుముఖ్యులు. సలక్షణమైన కవిత్వం వ్రాస్తారు. వ్యాధిగ్రస్తులైన వీరి సహాయార్థం తెలంగాణాలో ప్రత్యేకనిధి వసూలు చేయబడుతున్నదంటే అక్కడి యువక రచయితల హృదయాలను వీరు ఎంతగా చూరగొన్నారో తెలియగలదు. అముద్రితమైయున్న వీరి పోతన కావ్యం ప్రఖ్యాతి గాంచింది. మణిమాల వీరి ముద్రిత ఖండకావ్యం. దాగురింతలు, వైశాలిని, మౌక్తికమాల, వ్యాసావళి వీరి అముద్రిత గ్రంథాలు.

### శ్రీ పులిజాల హనుమంతరావుగారు

జననం 1919, నల్లగొండజిల్లా చందూరు. చందూరులోని సాహితీ మేఖల స్థాపకుల్లో ముఖ్యులు. సాహితీ మేఖలద్వారా అనేక ఉత్తమ సాహిత్య గ్రంథాలను ప్రకటింప చేశారు. చక్కని కవిత్వం వ్రాస్తారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రధాన కార్యదర్శిగా తెలంగాణా సారస్వతోద్యమానికి ఎంతగానో దోహదమిచ్చారు.

### శ్రీ గడియారం రామకృష్ణశర్మగారు

జననం 1919, అలంపురం వాస్తవ్యులు. "సుజాత" అను సారస్వత మాసపత్రికకు సంపాదకులు. చారిత్రక పరిశోధకులుగా పేరన్నికగన్నారు. కవిత్వం వ్రాస్తారు.

ఆలంపూరు శిథిలములు అను చారిత్రక పరిశోధక గ్రంథాన్ని ప్రకటించారు. చంద్రహాస, ఆంధ్రకవులయానందము, చాటుపద్యాలు, అలంపూరు శిలాశాసనములు, తైలంగసంస్కృతీ వీరి అముద్రిత గ్రంథాలు.

## శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు

జననం 1908. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెనుగు శాఖాధిపతులుగా పనిచేస్తున్నారు. సంస్కృతాంధ్ర భాషలలోనేగాక, ఇంగ్లీషులో కూడా మంచి వైదుష్యంవున్నది. వీరి "ఆంధ్రులచరిత్ర-సంస్కృతి", "ఆంధ్ర సాహిత్య చరిత్ర" విశిష్టతగల గ్రంథాలు.

## శ్రీ సి. నారాయణరెడ్డిగారు

జననం 1931, కరీంనగరంజిల్లా, హను మాజీపేట. తెలంగాణా యువకుల్లో శ్రీ దాశరథిగారితర్వాత వీరికున్నంత పలుకుబడి మరెవ్వరికీలేదు. ఉస్మానియా విశ్వ విద్యాలయంలో ఎమ్. ఎ. చదువుతున్నారు. చిన్నవయస్సులోనే కవిత్వరచనలో ఒక విశిష్టతను అలవర్చుకొన్నారు. తెలంగాణా రచయితలసంఘం ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తున్నారు. "నవ్వనిపువ్వు" అను గేయనాటికలు, "జలపాతం" అను ఖండకావ్యము ప్రకటితమైనాయి.

## శ్రీ నెల్లూరి కేశవస్వామిగారు

జననం 1920. హైద్రాబాదు తెలంగాణాలోని ఉత్తమ కథకుల్లో వీరొకరు. వీరి కథలనేకం "భారతి" మొదలగు పత్రికల్లో ప్రకటితమయ్యాయి. సాధనసమితి నిర్వాహకుల్లో ముఖ్యులు. ప్రేమ్‌చంద్ కథలు అనువదించి ప్రకటించారు.

## శ్రీ వెల్దుర్తి మాణిక్యారావుగారు

జననం 1918. బాలసాహిత్యంలో వీరు ప్రత్యేకంగా కృషిజరిపారు. గ్రామీణ భాషలో గ్రామస్థులకు అర్థమయ్యేటట్లు చక్కని కథలను వ్రాస్తారు. మహారాష్ట్రీ, ఉర్దూ, కన్నడ భాషలలో ప్రవేశంవున్నది. దయ్యాలపన్నడ (గ్రామ్యభాషలో టాల్‌స్టాయ్ నాటికకు అనువాదము), రైతు, దయానందుని జీవితము, రాజ్యాంగసంస్కరణలు, ఖాదీ వీరి ముద్రితగ్రంథాలు. బాలగేయాలు, హసీనా (కావ్యఖండిక), శ్రవ్యనాటికలు, కథానికలు అముద్రితంగా వున్నాయి.

## శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు

తెలంగాణా రచయిత్రులలో అగ్రగణ్యురాలు. కథానికా రచనలో ప్రత్యేక కృషి సల్పుతున్నారు. "పంకజ బహుమానం", "జాతి రత్నాలు" వీరి ముద్రిత గ్రంథాలు. అనేక నాటికలు, కథానికలు హైద్రాబాదు రేడియో కేంద్రం నుండి ప్రసారితమైనాయి. "బాలవీరులు", నాటికలు ముద్రణ కావలసి యున్నవి.

## శ్రీమతి నందగిరి ఇందిరాదేవిగారు

జననం 1919, వరంగల్లు. పట్టభద్రురాలు. తెలంగాణాలో కథానికా రచనకు పునాది వేసినవారిలో వీరుఒకరు. దాదాపు పదిహేను సంవత్సరాలనుండి గృహలక్ష్మి, చిత్రగుప్త, ప్రజామిత్ర, చిత్రాంగి, కాగడా, తెలుగుతల్లి, వినోదిని మొదలగు పత్రికలలో తమ కథలను ప్రకటిస్తూ వచ్చారు. స్త్రీల దృక్కోణంనుంచి కథలను వ్రాయటమే వీరిలోని ప్రత్యేకత. తెలంగాణా మహిళా ఉద్యమంలో ప్రధాన పాత్ర వహించారు. తూప్రాన్‌లో జరిగిన

# ప్రభుత్వం

రాజప్రముఖ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రస్తుత మంత్రివర్గంలో 4 గురు తెలంగాణావారు, ముగ్గురు మరాఠ్వాడావారు, ఒక్కరు కర్ణాటకులు మంత్రులుగా ఉన్నారు. ఉప మంత్రులలో 4 గురు తెలంగాణావారు, ముగ్గురు కర్ణాటకులు, ఒకరు మరాఠ్వాడావారు.

## మంత్రివర్గం

| మంత్రి | వీరు నిర్వహించే శాఖ-లేక శాఖలు |
|---|---|
| 1. శ్రీ బూర్గుల రామకృష్ణరావు (ముఖ్య మంత్రి) | 1. జనరల్ అడ్మినిస్ట్రేషను<br>2. రెవిన్యూ (రెవిన్యూ శాఖలోని 2, 3, 4, 10, 12 16, 27 అంశాలు) |
| 1. (అ) శ్రీ శంకర దేవ్ డిప్యూటీమంత్రి (ముఖ్య మంత్రిశాఖ) | 3. సమాచారశాఖ<br>4. సాంఘిక సేవాశాఖ |
| 2. శ్రీ దిగంబర్ రావు గోవిందరావు బిందు (హోంశాఖా మంత్రి) | 1. హోంశాఖ (న్యాయశాఖతో సహా)<br>2. పునరావాస శాఖ |
| 2. (అ) శ్రీ శ్రీనివాసరావు అఖైలీకరు (డిప్యూటీ మంత్రి) | |
| 3. శ్రీ కొండా వెంకటరంగారెడ్డి (రెవిన్యూ మంత్రి) | 1. ఎక్సైజు శాఖ<br>2. అటవీ శాఖ<br>3. కస్టమ్సు శాఖ<br>4. రెవిన్యూ (ముఖ్యమంత్రికి లేనిభాగాలు) |
| 3. (అ) పల్లెర్ల హనుమంతరావు (డిప్యూటీ మంత్రి) | |

| మంత్రి | వీరు నిర్వహించే శాఖ లేక శాఖలు |
|---|---|
| 4. శ్రీ డా॥ మర్రి చెన్నారెడ్డి (సప్లయిశాఖా మంత్రి) | 1. వ్యవసాయ, సప్లయి శాఖలు<br>2. అభివృద్ధి, ప్లానింగుశాఖ |
| 4. (అ) శ్రీ అరిగె రామస్వామి (డిప్యూటీ మంత్రి) | |
| 5. శ్రీ వినాయక్ రావు కోరాట్కర్ విద్యాలంకార్ (ఆర్థికశాఖా మంత్రి) | 1. ఫైనాన్సుశాఖ<br>2. Statistics (గణాంక శాఖ)<br>3. పరిశ్రమలు, వాణిజ్యం |
| 5. (అ) విరూపాక్షప్ప (డిప్యూటీ మంత్రి) | |
| 6. శ్రీ గోపాల్ సుబ్బకృష్ణ మేల్కోటే (పరిశ్రమల మంత్రి) | |
| 6. (అ) శ్రీ యం.యస్. రాజలింగం (డిప్యూటీ మంత్రి) | 1. కార్మికశాఖ<br>2. పబ్లిక్ వర్క్సు శాఖ |
| 7. శ్రీ మెహదీ నవాజ్ జంగ్ (ఆరోగ్యశాఖా మంత్రి) | 1. ప్రజారోగ్యం, వైద్యశాఖ<br>2. గ్రామోద్ధరణ |
| 7. (అ) భగవంతరావు గాధే (డిప్యూటీ మంత్రి) | 3. సహకారశాఖ<br>4. పశువైద్య శాఖ |
| 8. శ్రీ గోపాల్ రావు ఎక్బోటే (విద్యాశాఖా మంత్రి) | 1. విద్యాశాఖ<br>2. స్థానిక స్వపరిపాలనా శాఖ<br>3. పార్లమెంటరీ వ్యవహార శాఖ |
| 8. (అ) శ్రీమతి సంగం లక్ష్మీబాయి (డిప్యూటీ విద్యామంత్రిణి) | |

# సెక్రటేరియటు

| పేరు | శాఖ |
|---|---|
| 1. క. శ్రీనివాసన్ B.Sc., I.A.S., | 1. ప్రధాన కార్యదర్శి (సెక్రటరీ) |
| 2. సలాహుద్దీన్ మహమ్మదు యూనసు (Oxon), B.C.L., Bar-at-Law | 2. న్యాయశాఖా కార్యదర్శి |
| 3. యల్. యస్. గుప్త B. Sc., I. A. S., | 3. విద్యాశాఖా కార్యదర్శి |
| 4. సయ్యదు నక్విబిల్గ్రామి B. Eng (Sheffield) I. A. S., | 4. వ్యాపార, పరిశ్రమలశాఖా కార్యదర్శి |
| 5. సి. దామోదర్ రెడ్డి B. A. (Hons) (Bombay) A. S. A. A., I. A. S., | 5. ఫైనాన్సుశాఖా కార్యదర్శి |
| 6. మహమ్మదు అబ్దుల్లా B. A. H. C. S., | 6. రెవెన్యూశాఖా కార్యదర్శి |
| 7. జగజీవన్ చంద్ | 7. సప్లయిశాఖా కార్యదర్శి |
| 8. చంద్రకాంతరావుగోడ్సే B. A. H. C. S., | 8. హోంశాఖా కార్యదర్శి |
| 9. రాయి రామ్‌లాల్ B. A. L. L. B., I. A. S., | 9. పబ్లిక్ వర్క్సు, ఆరోగ్యశాఖా కార్యదర్శి |
| 10. మీర్జా నజఫ్ అలీఖాన్ B. A. (Leeds) I. A. S., | స్థానిక పరిపాలనాశాఖా కార్యదర్శి |

## సహాయ కార్యదర్శులు

| | |
|---|---|
| 1. మీర్ సజ్జాద్ అలీ B. A., (Madras) H. C. S., | ఆర్థికశాఖా సహాయ కార్యదర్శి |
| 2. సయ్యద్ అబ్దుల్ లతీఫ్ రజ్వీ M.A., L. L. B (Alig) B.Sc., (Econ) London I. A. S., | కార్మిక శాఖా సహాయ కార్యదర్శి |

# రెవెన్యూ బోర్డు

1. శ్రీ పి. వి. సుబ్బారావు M. A., — సీనియరు మెంబరు
2. శ్రీ గులాం హైదర్ I. A. S., — 1. మెంబరు
3. శ్రీ నాగేంద్రబహాదూర్ I.A.S., — 2. మెంబరు
4. శ్రీ డి. రామచంద్రరావు I.A.S. — 3. మెంబరు

హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి : శ్రీ లక్ష్మీశంకర్ మిశ్రా

అడ్వకేట్ జనరల్ : శ్రీ వి. రాజారాం అయ్యర్

యం. ఏ. ఆనర్సు, బి. యల్.

# శాసనసభ

**జ**నరలు ఎన్నికలలో, (1951-52) మొత్తం హైదరాబాదు స్టేట్ నుండి 175 మంది శాసనసభకు ఎన్నికోబడ్డారు. వీరిలో 97 మంది తెలంగాణా నుండి, మిగిలినవారు మరాఠ్వాడా, కర్ణాటక ప్రాంతాలనుండి ఎన్నికైనారు.

ఈ శాసనసభ్యులలో 37 మంది పీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంటువారు, 44 మంది కాంగ్రెసువారు, 11 మంది సోషలిస్టులు, ఇద్దరు స్వతంత్రులు, ముగ్గురు నిమ్నజాతుల ఫెడరేషనువారు తెలంగాణా ప్రాంతమునుండి ఎన్నుకోబడినారు.

తర్వాత కొన్ని కారణాలవల్ల ఉప ఎన్నికలు జరగటం, కొందరు ఒక పార్టీని వదలి మరొక పార్టీలో చేరడంవల్ల, స్టేటు శాసనసభలో ప్రస్తుతం (1954 మార్చి) పార్టీల బలాబలాలు ఇలా ఉన్నాయి:

కాంగ్రెసు 98; పీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంట్ 38, యునైటెడ్ పీపుల్సుపార్టీ 35; స్వతంత్రులు 2, నిమ్నజాతుల ఫెడరేషన్ 2.

శాసనసభా స్పీకరు శ్రీ కాశీనాథ వైద్య (కాంగ్రెసు); శ్రీ పాంపన గౌడ సకరప్ప (స్వతంత్ర) డిప్యూటీ స్పీకరు; శ్రీ బూర్గుల రామకృష్ణారావు కాంగ్రెసు పార్టీ నాయకుడు. శ్రీ వి. డి. దేశపాండే (ఫ్రంట్) ప్రతిపక్ష నాయకుడు. శ్రీ శరణ్ గౌడ యునైటెడ్ పీపుల్సు పార్టీ నాయకుడు.

## శాసన సభ్యులు

**ఆనందరావు జోగనపల్లి (ఫ్రంట్)** జననం 1928. విద్య: యస్. యస్. ఓ. విద్యార్థి ఉద్యమంలో పనిచేశారు. 1950లో ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టంక్రింద అయిదు నెలలు డిటెయిన్ చేయబడ్డారు. పౌర హక్కుల సంరక్షక సంఘం, శాంతి సంఘ కార్యవర్గాలలో సభ్యులు. నియో; సిరిసిల్ల.

**అనంతరామారావు కె. (ఫ్రంట్)** లా చదివి ప్రాక్టీసు పెట్టారు. అనేక రాజకీయ కేసులలో ఉచితంగా వాదించారు. నాలుగు నెలలు జైలు శిక్ష అనుభవించారు. నియో: దేవరకొండ.

**అనంతరెడ్డి (సోషలిస్టు)** జననం 1924. 7 సెప్టెంబరు. విద్య: బి.ఏ., యల్. యల్. బి. విద్యార్థి ఉద్యమంలో పనిచేశారు. 1949 నుండి సోషలిస్టు పార్టీలో పనిచేస్తున్నారు. నియో: కొల్కొండ.

---

నోటు:—[ఫ్రంట్ = పీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంట్, షె. ఫె. = షెడ్యూల్డ్ కాస్ట్సు ఫెడరేషన్, నియో = నియోజకవర్గం]

అనంత రామచంద్రారెడ్డి (ఫ్రంట్) జననం : 1906 నవంబరు 5. కాంగ్రెసు సత్యాగ్రహంలో పాల్గొని 1937 లో జైలు కెళ్లారు. 1945 లో మహబూబ్‌నగర్ జిల్లా ఆంధ్రమహాసభ కార్యదర్శిగా పనిచేశారు. నియో : కొల్లాపూర్.

అబ్దుర్ రహమాన్ (ఫ్రంట్) జననం : 1921. విద్య: యల్. యల్. బి. పీపుల్సు డెమాక్రటిక్ పార్టీ కార్యవర్గ సభ్యులు. హైద్రాబాద్ ఉర్దూ సంఘ అధ్యక్షులు. మొదట్లో కాంగ్రెసు రాజకీయాలవైపు మొగ్గారు. కమ్యూనిస్టులు, ఇతర ప్రజాసేవకులపై నిజాం ప్రభుత్వం బనాయించిన అనేక కేసులలో అఖిలభారత తెలంగాణా డిఫెన్సు కమిటీ తరఫున వాదించారు. హైద్రాబాద్ పీపుల్సు డిఫెన్సు కమిటీ సభ్యులు. నియో: మలక్‌పేట, హైద్రాబాద్.

ఉప్పుల మల్చూరు (ఫ్రంటు) వ్యవసాయకూలీ కుటుంబంలో పుట్టారు. ఆంధ్రమహాసభలో పనిచేశారు. పోలీసు చర్య అనంతరం జైలుశిక్ష అనుభవించారు. విడుదల తరువాత పీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంట్‌లో చేరి పనిచేస్తున్నారు. నియో : నూర్యాపేట (రిజర్వుడు)

కాశీనాథరావు వైద్యా (కాంగ్రెసు) జననం; 1890 మార్చి 9. విద్య : యం. ఎ., యల్. యల్. బి., హైదరాబాదు శాసనసభ స్పీకరు. హైద్రాబాద్ రాష్ట్రంలో కాంగ్రెసు ఉద్యమ నిర్మాతలలో ఒకరు. 1942 'క్విట్ ఇండియా' ఉద్యమ సందర్భంలో స్టేట్ డిఫెన్సు కమిటీనుండి రాజీనామా చేశారు. 1950 నుండి 1952 వరకు రాజ్యాంగసభ సభ్యులు. నియో: బేగం బజారు (హైద్రాబాద్)

కాశీరాం గంగీ మరాస్కోలే (కాంగ్రెసు). వయస్సు; 28. పటేలు, పట్వారీ ఉద్యోగాలు చేశారు. నియో: అసీఫాబాద్ (రిజర్వుడు).

కేశవరెడ్డి కటంగ్రు (కాంగ్రెసు) జననం: 1899 జనవరి 15. తెలుగు, ఉర్దూ చదువుకున్నారు. నియో: పరకాల, కరీంనగరుజిల్లా.

కట్టా రామిరెడ్డి (ఫ్రంట్) జననం: 1920 జూన్ 30. న్యాయశాస్త్రంలో 'డిప్లొమా' పొందారు. 1945 నుండి ప్రాక్టీసు చేస్తున్నారు. ప్రతాపరుద్ర ఆంధ్ర భాషా నిలయానికి నాలుగు సం॥లు అధ్యక్షులుగా పనిచేశారు. 1947–48 లో "క్విట్ కోర్టు" ఉద్యమంలో చేరారు. తెలంగాణా డిఫెన్సు కమిటీ సభ్యులు. నియో: నల్లగొండ (జనరల్).

కృష్ణయ్య బుగ్గవటి (ఫ్రంట్) జననం : 1925 ఆగస్టు 10. ఖమ్మం కిసాన్ సభ అధ్యక్షులు. నియో: ఖమ్మం (జనరల్).

కమలాదేవి ఆరుట్ల (ఫ్రంట్) జననం : 1922. మెట్రిక్యులేషన్ వరకూ చదివారు. 1942 – '44 హైద్రాబాద్ మహిళా సంఘ ప్రధాన కార్యదర్శినిగా పనిచేశారు. నల్లగొండజిల్లా ఆంధ్ర మహాసభ కార్యవర్గ సభ్యురాలు. 1946 నుండి 49 వరకు అజ్ఞాతవాసం. అజ్ఞాత వాసంలో వుంటూ, రజాకారు దురంతాలకు వ్యతిరేకంగా స్త్రీలను సంఘటిత పరచారు.

1949-51 జైలు శిక్ష. నియో : ఆలేరు నల్గొండజిల్లా.

**గంగారాం (సోషలిస్టు)** వీరు సోషలిస్టుపార్టీలో పనిచేస్తున్నారు. నియో: నిర్మల్ (రిజర్వుడు) ఆదిలాబాద్ జిల్లా.

**గంగుల భీమయ్య (కాంగ్రెసు)** జననం : 1920 మార్చి 12. కొంతకాలం తాలూకా కాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శిలుగా పనిచేశారు. నియో : మెట్లపల్లి, కరీంనగరంజిల్లా.

**గౌతమ్ యం. బి. (కాంగ్రెసు)** జననం : 1913 ఆగస్టు 22. బి. ఎ. వరకు చదివారు. హైదరాబాదు స్టేట్ ఆది హిందూ ఇండిపెండెంటులీగ్ అధ్యక్షులు. నియో : ఇబ్రహీంపట్నం (రిజర్వుడు).

**గోపాల్ రావు ఏక్బోటే (కాంగ్రెసు)** జననం : 1912 జూన్ 1. యల్. యల్. బి. ఫస్టుక్లాసులో ఫస్టున ప్యాసయ్యారు. హైదరాబాద్ న్యాయవాదుల సంఘ కార్యదర్శి. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు కమిటీ సభ్యులు. నియో: చాదర్ ఘాట్, హైదరాబాద్.

**గోపాల్ రావు జి. (ఫ్రంట్)** జననం : 1919. మెట్రిక్యులేషను వరకు చదివారు. మహబూబ్‌నగరం జిల్లాలో ఆంధ్రమహాసభను నిర్మించారు. 1939 లో స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహ తొమ్మిదవ డిక్టేటర్. హైదరాబాద్ స్టేట్ కమ్యూనిస్టుపార్టీ, ఆఫీసు కార్యదర్శిగా పనిచేస్తున్నారు. నియో: పాఖాల.

**గోపి గంగారెడ్డి (సోషలిస్టు)** జననం: 1915 జనవరి 15. కొంతకాలం కాంగ్రెసులో పనిచేశాక, సోషలిస్టు పార్టీలో చేరారు. నియో: నిర్మల్ (జనరల్) ఆదిలాబాదుజిల్లా.

**గుండవరపు హనుమంతరావు (ఫ్రంట్)** జననం : 1920. 1935-38 'ఆంధ్రకేసరి' పత్రికా సంపాదకులుగా పనిచేశారు. ప్రస్తుతం కార్మికోద్యమంలో పనిచేస్తున్నారు. కాజీపేట రైల్వే కార్మిక సంఘ ఉపాధ్యక్షులు. నైజాం స్టేట్ రైల్వే కార్మికుల కేంద్రసంఘ సభ్యులు. హైదరాబాదు, సికింద్రాబాదు ఆంధ్ర మహాసభ సహాయ కార్యదర్శి.

1947 లో అరెస్టుచేయబడి రెండున్నర నెలలు డిటెన్షనులో వుంచబడ్డారు. నియో: ములుగు, (వరంగల్ జిల్లా).

**గురవారెడ్డి ఎ. (ఫ్రంట్)** యం. ఎ. వరకు చదివారు. ప్రభుత్వ దమననీతికి నిరసనగా ఉస్మానియా యూనివర్సిటీలో గణితశాస్త్రాచార్య పదవికి రాజీనామా నిచ్చారు. పోలీసుచర్య అనంతరం అరెస్టుచేయబడి 1951 వరకు నిర్బంధంలో ఉంచబడ్డారు. నియో : సిద్దిపేట, మెదకు జిల్లా.

**చంద్రారెడ్డి, బి. ఎం. (పి. ఫ.)** జననం : 1904 ఆగస్టు 14. మెట్రిక్యులేషన్ వరకూ చదివారు. 1927 నుండి 1948 వరకు పి. డబ్ల్యు. డి. శాఖలో ఉద్యోగం చేశారు. నియో : మహబూబాబాద్ (రిజర్వుడు), వరంగల్లు జిల్లా.

**చెన్నారెడ్డి, డాక్టర్ (కాంగ్రెసు)** జననం : 1919 జనవరి. యం. బి. బి. యస్. పట్టా పొందారు. 1947 సెప్టెంబరు నుండి నవంబరువరకు జైలుశిక్ష అనుభవించారు. కాంగ్రెసులోని గ్రూపులన్నీ కలిశా

నరసింగరావు (కాంగ్రెసు) జననం 1896 మార్చి 17. లా చదివారు. 1947 లో నిషేధింపబడిన 'రయత్' పత్రికా సంపాదకులుగా పనిచేశారు. 1938 - 42 హైదరాబాదు లెజిస్లేటివు కౌన్సిల్ సభ్యులు. నియో : కల్వకుర్తి.

పాపిరెడ్డి (ఫ్రంట్) నియో: ఇబ్రాహీంపట్నం (జనరల్)

పొన్నమనేని నారాయణరావు (కాంగ్రెసు) జననం : 1903, జులై 11. న్యాయవాది వృత్తి చేస్తున్నారు. తాలూకా కాంగ్రెసుకమిటీ కార్యదర్శి. నియో : హుజూరాబాద్ (జనరల్)

పెండెం వాసుదేవు (ఫ్రంట్) జననం: 1919 జనవరి. ఆయుర్వేద వైద్యులు. 1940 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. భువనగిరి తాలూకాలో ఆంధ్రమహాసభను, కమ్యూనిస్టుపార్టీని నిర్మించారు. 1947 లో అరెస్టు చేయబడ్డారు. పోలీసు వర్యావంతరం విడుదలై 1948 మార్చిలో తిరిగి అరెస్టు చేయబడి 1950లో విడుదలయ్యారు. తెలంగాణా డిఫెన్సు కమిటీ కార్యదర్శి. నియో : గద్వేలు (మెదకుజిల్లా).

బద్దం మల్లారెడ్డి (ఫ్రంట్) జననం: 1918. ఆంధ్రమహాసభలో పనిచేశారు. రజాకారు వ్యతిరేకోద్యమంలో పాల్గొన్నారు. నియో : జగిత్యాల (జనరల్).

బసప్ప (కాంగ్రెసు) జననం: 1922 నవంబరు 4. నియో : మక్తాల్-ఆత్మకూరు (రిజర్వుడు).

బొమ్మగాని ధర్మభిక్షం (ఫ్రంట్) ట్రేడ్ యూనియన్, రైతుఉద్యమాలలోను, ఆంధ్రమహాసభలోను పనిచేశారు. రజాకారు వ్యతిరేకోద్యమంలో పాల్గొన్నారు. నియో : సూర్యాపేట (జనరల్)

బ్రహ్మారెడ్డి (కాంగ్రెసు) జననం: 1915. నాగర్ - కర్నూలు తాలూకా కాంగ్రెసు కమిటీ ఉపాధ్యక్షులు. నియో: నాగర్- కర్నూలు (జనరల్).

బుచ్చయ్య, యం. (సోషలిస్టు) జననం: 1922. హైదరాబాద్ కెమికల్స్ అండ్ ఫెర్టిలైజర్స్ లిమిటెడ్‌లో కార్మిక సంఘాన్ని నిర్మించారు. ఆదిలాబాద్ జిల్లా గీత పనివారల సంఘ ఉపాధ్యక్షులు. నియో: సిర్పురం.

బుట్టి రాజారాం (షె. ఫె.) జననం: 1911 మే 2. నియో: జగిత్యాల (రిజర్వుడు).

మఖ్దూం మొహియుద్దీన్ (ఫ్రంట్) జననం 1910. యం. ఎ. పట్టభద్రులు. ఉర్దూ భాషలో కవి, రచయిత. మంచివక్త. 1940-43 సిటీ కాలేజీలో ఉపన్యాసకులుగా పనిచేశారు. 1943లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. హైదరాబాదు కార్మికోద్యమ నిర్మాతలలో ఒకరు. చాల కాలంగా అఖిల హైదరాబాదు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు. ప్రస్తుతం ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్యలో భారత ప్రతినిధి. నియో : హుజూర్ నగర్.

మసూమా బేగమ్ (కాంగ్రెసు) జననం 1902. అఖిల భారత మహిళా సంఘ ఉపాధ్యక్షురాలు. నియో : షా అలీ బండ, హైదరాబాదు.

మెహదీ నవాబ్ జంగ్ బహదూర్ (కాంగ్రెసు) జననం : 1894 మే 23. హైదరాబాదు ప్రభుత్వంలో అనేక ఉన్నతోద్యోగాలు నిర్వహించారు. ప్రస్తుత మంత్రివర్గంలో ఆరోగ్యశాఖా మంత్రిగా ఉన్నారు. నియో : సోమాజిగుడా.

మేల్కోటే డా॥ జి. యస్. (కాంగ్రెసు) జననం: 1901 సెప్టెంబరు18. యం. బి. బి. యస్. పట్టా పొందారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. కర్నాటక కాంగ్రెసు కార్యవర్గసభ్యులు. 1947-48 లో హైదరాబాదు స్టేట్ కార్యవర్గసభ్యులు. ప్రస్తుత మంత్రివర్గంలో పారిశ్రామికశాఖామంత్రి. నియో : హనిషేరాబాద్.

మీర్జాషకూర్ బేగ్ (కాంగ్రెసు) బి.ఎ.,యల్.యల్.బి. పట్టాలు పొందారు. నియో : హసన్‌పర్తి.

మహమద్ దాలేర్ హుస్సేన్ (కాంగ్రెసు) జననం : 1910 నవంబరు. నిజామాబాద్ నియోజకవర్గంనుండి ఎన్నికయినారు.

ముదిగంటికొండలరెడ్డి(స్వతంత్ర) జననం : 1911 అక్టోబరు 5. సంస్కృతం, హిందీ, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో పరిచయముంది. వితంతు వివాహాలను గూర్చి ప్రచారం చేశారు. 1947-48 లో డిటెయిన్ చేయబడ్డారు. వేదమత ప్రచారకులు. నియో : కూనారం.

ముత్యాలరావు జె. బి. (కాంగ్రెసు) జననం : 1921 ఆగస్టు 15. బోలారం టౌన్ కాంగ్రెసు అధ్యక్షులు. అఖిల హైదరాబాద్ దళిత జాతి సంఘం అధ్యక్షులు. నియో : సికిందరాబాదు.

ముత్తయ్య యల్. (ఫ్రంటు) జననం : 1922 డిసెంబరు 10. 1944 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. 1945 లో సుల్తానాబాద్ తాలూకా ఆంధ్ర మహాసభ కార్యదర్శి. నియో : పెద్దపల్లి.

రాజరెడ్డి ఎ. (ఫ్రంట్) న్యాయశాస్త్ర పట్టభద్రులు; నియో: సుల్తానాబాద్.

రాజలింగం యం. యస్. (కాంగ్రెసు) జననం: 1919. బి.యస్‌సి., పట్టా పొందారు. 1943లో వరంగల్లులో సుభాను కుటీర పరిశ్రమలు స్థాపించారు. కాంగ్రెసులో పనిచేసి అనేకసార్లు జైలుకు వెళ్ళారు. నియో: వరంగల్లు.

రాజమల్లు కోదాటి (సోషలిస్టు) జననం : 1924. మెట్రిక్యులేషను వరకూ చదివారు. తాండూరు ముల్కీసభ కార్యదర్శి. నియో: లక్సెట్టిపేట్ను (రిజర్వుడు).

రాజమణిదేవి జె.ఎం. (పి.ఫ్రె.) జననం 1920 ఫిబ్రవరి 23. లాహోరు విశ్వవిద్యాలయంలో సిద్ధాంత విశారద చదివారు. హైదరాబాదు నిమ్నజాతుల ఫెడరేషన్ స్త్రీలశాఖ అధ్యక్షురాలు. వితంతు వివాహాలు చేయించారు. నియో : సిరిసిల్ల (రిజర్వుడు).

రాజారాం జి. (సోషలిస్టు) జననం : 1924 ఆగస్టు 27. బి. కాం. పట్టా పొందారు. పోలీసుచర్య తరువాత కాంగ్రెసును వదలిపెట్టి సోషలిస్టుపార్టీలో

చేరారు. జైలుశిక్ష అనుభవించారు. హైద్రాబాద్ శాసనసభ సోషలిస్టుపార్టీ నాయకులు. నియో : ఆర్మూరు.

రామారావు వి. (కాంగ్రెసు) జననం : 1918 సెప్టెంబరు 11. మెట్రిక్యులేషను వరకూ చదివారు. దళితసంఘ వ్యవస్థాపకులలో ఒకరు. నియో : కామారెడ్డి (రిజర్వుడు).

రామారెడ్డి జి. (కాంగ్రెసు) జననం 1914. లా డిప్లొమా పొందారు. మెదకు జిల్లా ఆంధ్రమహాసభ కార్యదర్శి. రజాకారు వ్యతిరేక ఉద్యమ గొడవలలో అరెస్టు చేయబడి 13 నెలలు కారాగార శిక్ష అనుభవించారు. నియో : నర్సాపూర్.

రామకృష్ణరావు బూర్గుల (కాంగ్రెసు) వయస్సు సుమారు 55. బి. ఏ., ఎల్. ఎల్. బి. పట్టా పొందారు. స్టేట్ కాంగ్రెసు స్థాపకుల్లో ఒకరు. 'క్విట్ ఇండియా' ఉద్యమంలో జైలుకు వెళ్లారు. 1947 లో సత్యాగ్రహం చేసి 18 నెలలు జైలులో వున్నారు. వెల్లోడి మంత్రి వర్గంలో (1950-52) రెవిన్యూ, విద్యా శాఖా మంత్రిగా పని చేశారు. ప్రస్తుత మంత్రి వర్గంలో ప్రధాన మంత్రిగా పని చేస్తున్నారు. నియో : షాద్‌నగర్.

రామకృష్ణరావు కె. (స్వతంత్ర) వీరు వేంనూరు నియోజకవర్గం నుండి ఎన్నికైనారు.

రామనాథం సర్వదేవ భొట్ల (ఫ్రంటు) జననం : 1914 అక్టోబరు 28. నాగపూర్‌లో బి.యెస్. చదువుతూ కమ్యూనిస్టుపార్టీలో చేరారు. ఖమ్మం, వరంగల్లులలో ఆంధ్రమహాసభను నిర్మించారు. కార్మికోద్యమంలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్నారు. సింగరేణి బొగ్గుగని కార్మికసంఘానికి, వరంగల్లు తోళ్ళపనివారల సంఘానికి కార్యదర్శి. అఖిల హైద్రాబాదు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఉపాధ్యక్షులు. నియో : హనుమకొండ.

రామస్వామి అరిగె (కాంగ్రెసు) జననం : 1895. హైదరాబాదు నిమ్న జాతుల ఫెడరేషనుకు మూలసంస్థ అయిన ఆది హిందూమహాసభ సంస్థాపక అధ్యక్షులు. హైద్రాబాద్ ప్రదేశకాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు. 1950-52 లో రాజ్యాంగసభ సభ్యులు. నియో : వికారాబాద్ (రిజర్వుడు).

రామస్వామి, డి. (కాంగ్రెసు) జననం: 1926 ఆగస్టు 8. 1949 లో అఖిల హైద్రాబాదు విద్యార్థి ఫెడరేషన్ అధ్యక్షులుగా పని చేశారు. హైద్రాబాదు నిమ్నజాతుల విద్యాసంఘ గౌరవ కార్యదర్శి. నియో : నాగర్‌కర్నూలు.

రామచంద్రారెడ్డి, కె. (ఫ్రంట్) జననం : 1924 అక్టోబరు 7. ఆంధ్ర మహాసభ నిర్మాణంకొరకు కృషిచేశారు. నల్లగొండ జిల్లాలో రైతుసంఘాలు స్థాపించారు. 1942 లో అరెస్టు చేయబడ్డారు. రామన్నపేటలో రజాకారు ముష్కర పరిపాలనకు వ్యతిరేకంగా రైతులను సమీకరించారు. పోలీసు చర్యానంతరం అరెస్టు చేయబడ్డారు. నియో: రామన్నపేట.

రామలింగం గోకా (కాంగ్రెసు) జననం: 1921 అక్టోబరు 18. 1942 లో 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొ

న్నారు. నల్లగొండ జిల్లాబోర్డు సభ్యులు. నియో : భువనగిరి.

రెంటాల బాల గురుమూర్తి (ఫ్రంట్) జననం: 1924 జూలై 10. ఆంధ్ర మహాసభలో పనిచేశారు. నియో: ఖమ్మం (రిజర్వుడు).

లక్ష్మణ్ కొండా (కాంగ్రెసు) వయస్సు 37. 'లా' డిప్లొమా పొందారు. హైద్రాబాదు పద్మశాలీసంఘ అధ్యక్షులు. అఖిలభారత చేనేతసంఘ సభ్యుడు. నియో: ఆసిఫాబాద్.

లక్ష్మయ్య పెరికే (ఫ్రంటు) జననం: 1916 జూన్ 16. ఆర్య సమాజ కార్యకర్త. కొంతకాలం కాంగ్రెసులో పని చేశారు. నల్లగొండ మున్సిపల్ కౌన్సిలు సభ్యులు. నియో : నల్లగొండ (రిజర్వుడు).

లక్ష్మణకుమార్ (కాంగ్రెసు) జననం: 1924 అక్టోబరు 13. దళితజన కళ సంరక్షక సంఘం అధ్యక్షులు. నియో : ఆందోల్ (రిజర్వుడు).

లక్ష్మీబాయి సంగం (కాంగ్రెసు) జననం: 1911. సైమన్ కమీషను బహిష్కరణోద్యమంలో పాల్గొన్నారు. నియో: బన్సవాడ.

లక్ష్మీనరసింహారెడ్డి ఆరుట్ల (ఫ్రంట్) జననం: 1908. 'లా' చదివారు. 1936-37 లో నల్లగొండ జిల్లాలో జాగీర్దారీ వ్యతిరేక పోరాటాలు నడిపారు. 1939 లో స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహంలో 3 వ దళం డిక్టేటరు. అఖిల హైద్రాబాద్ రైతు సంఘ కార్యదర్శి. ఆంధ్ర మహాసభ ఉపాధ్యక్షులు. 1940 లో కమ్యూనిస్టుపార్టీలో చేరారు. నియో: వేంసూరు.

వెంకటరామారావు (ఫ్రంట్) జననం: 1920 మే 6. పోలీసు చర్యకు ముందు కాంగ్రెసు కార్యకర్తలలో ఒకరు. ప్రోగ్రెసివ్ గ్రూప్ సంస్థాపకులు. కరీంనగరు జిల్లా పీపుల్సు డెమాక్రాటిక్ ఫ్రంట్ కార్యవర్గ సభ్యుడు. నియో. కరీంనగరము.

వెంకటరామారావు కాంచనపల్లి (ఫ్రంట్) జననం : 1921 మే 30. న్యాయవాది పట్టా పుచ్చుకొన్నారు. విద్యార్థి సమ్మేలకు, వందేమాతరం సమ్మేలకు నాయకత్వంవహించారు. మదరాసులో తెలంగాణా ఆంధ్రమహాసభ ప్రచారకశాఖ కార్యదర్శిగా వుంటున్న రోజులలో, పోలీసులు యీయనను అరెస్టుచేసి వెల్లూరు, కడలూరు, వరంగల్లు జైళ్ళలోను, జాల్నా కాన్‌సెంట్రేషన్ క్యాంపులోను నిర్బంధించారు. నియో : చిన్నకొండూరు.

వరకాంతం గోపాలరెడ్డి (కాంగ్రెసు) జననం : 1907 డిసెంబరు 19. ప్లీడరుపట్టా పొందారు. అత్రాఫ్‌బల్దా జిల్లా కాంగ్రెసు అధ్యక్ష, కార్యదర్శి, కోశాధికారి పదవులు నిర్వహించారు. నియో : మేడిచల్.

వీరాస్వామి కె. ఆర్. జననం 1919 డిసెంబరు 28. యం. ఏ. పట్టా పుచ్చుకొన్నారు. హైద్రాబాదులో వెనుకబడిన జాతుల సంఘాన్ని స్థాపించారు. నియో : కల్వకుర్తి (రిజర్వుడు).

వెంకయ్య కె. (ఫ్రంటు) జననం: 1902. 1932 లో ఆంధ్రమహాసభలో చేరారు. హరిజన సేవకులు. నియో : మధిర.

వెంకట రాజేశ్వర జోషీ (కాంగ్రెసు) జననం: 1910 ఫిబ్రవరి 10. తెలుగు పండితులు. 1930 లో ఆంధ్ర మహాసభలో చేరారు. 1942 లో మెదకు జిల్లా ఆంధ్రమహాసభ కార్యదర్శి. స్టేట్ కాంగ్రెసు స్టాండింగు కమిటీ సభ్యులు. నియో : ఆందోల్ (జనరల్).

వెంకటరామారావు కె. (కాంగ్రెసు) జననం : 1914. బి. ఎ., యల్. యల్. బి. పట్టా పొందారు. 1938-39 లో నల్లగొండజిల్లా ఆంధ్ర మహాసభ కార్యదర్శి. ఆంధ్ర కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. నియో: పెద్దమునగాల.

వెంకటరంగారెడ్డి: జననం: 1891 డిసెంబరు 10. లా పట్టా పుచ్చుకున్నారు. 1936-37 నుండి 38-39 వరకు హైదరాబాదు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు. ప్రస్తుతం మంత్రివర్గంలో రెవిన్యూమంత్రి. నియో: షాబాద్.

వెంకటేశం, జి. (సోషలిస్టు) జననం: 1924. దాపురీ వర్క్సుషాపులో ఫోర్మన్. 1947 లో ప్రాగాటూల్స్ కార్పొరేషను కార్మికుల 45 రోజుల సమ్మెకు నాయకత్వం వహించి నడిపారు. తర్వాత ఉద్యోగంనుంచి తొలగించబడ్డారు. నియో. హుజూరాబాద్ (రిజర్వుడు).

వెంకటేశ్వరరావు (కాంగ్రెసు) జననం: 1921. న్యాయవాదిపట్టా పొందారు. మొదటినుండీ కాంగ్రెసులో పనిచేశారు, మెదకు తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు. జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యులు. నియో : మెదకు.

విఠల్‌రెడ్డి జి. (కాంగ్రెసు) జననం : 1922 అక్టోబరు. ప్లీడరుపట్టా పొందారు. సంస్కరణల వ్యతిరేకోద్యమంలో పాల్గొని డిటెయిన్ చేయబడ్డారు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు. నియో : కామారెడ్డి (జనరల్).

షహాజహానీబేగమ్ (కాంగ్రెసు) వయస్సు సుమారు 40 : సీనియర్ కేంబ్రిడ్జి చదివారు. హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషను సభ్యురాలు. అఖిలభారత సంఘసేవాసమితి సభ్యురాలు. నియో : పర్గి (మహబూబ్‌నగరం జిల్లా).

శాంతాబాయి (కాంగ్రెసు) జననం : 1919. హైదరాబాదు, సుల్తాన్ బజారులోని గాంధీ మెమోరియల్ హాస్పిటలు స్థాపకురాలు. హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ సభ్యురాలు. నియో : మక్తాల్ - ఆత్మకూర్ (జనరల్)

శాస్త్రి యస్. యల్. (కాంగ్రెసు) జననం: 1901 అక్టోబరు. ఇంగ్లీషు, సంస్కృతం, మరాఠీ, హిందీ, తెలుగు భాషలతో పరిచయమున్నది. 1920 నుండి కాంగ్రెసు ఆధ్వర్యాన ప్రారంభించబడ్డ ఉద్యమాలలో పాల్గొన్నారు. రజాకారు ఉద్యమం రోజులలో ఆంధ్ర రాష్ట్రానికి వలసపోయి, పోలీసుచర్యఅనంతరం స్టేట్‌కు తిరిగి వచ్చారు. నిజామాబాద్ మున్సిపల్ కౌన్సిలర్. నియో: బోధన్.

శ్రీరాములు గులుకోట (సోషలిస్టు) జననం : 1919 అక్టోబరు 10. 'లా'

చదువుతూ ఆంధ్రమహాసభలో ప్రవేశించి చదువుకు స్వస్తిచెప్పారు. మంథెనతాలూకా కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేశారు. 1949 లో సోషలిస్టుపార్టీలో చేరారు. నియో : మంథెన.

శ్రీహరి గుండావారు (కాంగ్రెసు) జననం : 1917 నవంబరు 4. ప్లీడరుపట్టా పుచ్చుకున్నారు. చదువు మానివేసి వందే మాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. ప్రస్తుతం స్టేట్ కాంగ్రెసులో సభ్యులు. నియో: కిన్వాత్.

శ్రీనివాసరావు(సోషలిస్టు) మెట్రిక్యు లేషన్ వరకూ చదివారు. వందేమాతరం సమ్మెలో పాల్గొన్నారు. రజాకారు వ్యతి రేకోద్యమంలో పాల్గొన్నారు. నియో: డిచ్ పల్లి.

శ్రీనివాసరావు కన్నెకంటి(ఫ్రంట్) జననం: 1915 నవంబరు 6. మొదట కాం గ్రెసులో పనిచేసి, తర్వాత కమ్యూనిస్టు పార్టీలో చేరారు. మహబూబాబాదుపీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంట్ కార్యదర్శి. నియో : మహబూబాబాద్.

సయ్యద్ అక్తార్ హుస్సేన్ (ఫ్రంట్) జననం : 1916. యం. ఎ. పట్టా పుచ్చుకున్నారు. 1944-52 'పయాం' దినపత్రికా సంపాదకులు, యజమా నులు. 1949 లో నాలుగునెలలు జైలుశిక్ష, 'అవామ్' దినపత్రిక మేనేజింగ్ ఎడిటర్. పీపుల్సు డెమాక్రటిక్ ఫ్రంట్ ఉపా ధ్యక్షులు. హైద్రాబాదు శాంతిసంఘ అధ్య క్షులు. నియో : జనగాం (నల్లగొండజిల్లా).

సయ్యద్ హసన్ (ఫ్రంట్) జననం: 1925 సెప్టెంబరు 27. పట్టభద్రులు. చదువుకునే రోజులలో విద్యార్థి ఫెడరేషన్‌లో పనిచేశారు. నియో : హైద్రాబాద్‌నగరం.

సింగిరెడ్డి వెంకటరెడ్డి (ఫ్రంట్) జననం : 1916. కాంగ్రెసులో 5 సం॥ పనిచేశారు. తరువాత పీపుల్సుడెమాక్రాటిక్ ఫ్రంట్‌లో చేరారు. నియో: నర్సాపూర్.

సూరే విశ్వనాధరావు (సోష లిస్టు) జననం: 1923 జులై 20. హెల్తు ఇన్‌స్పెక్టరు కోర్సు చదివారు. ఒక సం వత్సరం కాంగ్రెసులో పనిచేశారు సోష లిస్టుపార్టీలో చేరారు. 1950 నుండి ఆదిలాబాద్‌జిల్లా కిసాన్ పంచాయత్ అధ్యక్షులు. నియో: లక్సెట్టిపేట (జనరల్).

హనుమంతరావు, పి. (కాం గ్రెసు) జననం: 1909 మార్చి. 'లా' చదివారు. ప్రాక్టీసు మానేసి 1946 లో సత్యాగ్రహం చేశారు. రెండుసార్లు జైలుకు వెళ్ళారు. పోలీసు యాక్షన్ తరువాత విడుదల చేయబడ్డారు. మహ బూబ్‌నగరంజిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు. నియో: మహబూబ్‌నగరము.

# పార్లమెంటు సభ్యులు

అచ్చాలు, సుంకం వీరి అభ్యర్థిత్వాన్ని కమ్యూనిస్టుపార్టీ బలపరచింది. నల్లగొండ (రిజర్వుడు) నియోజకవర్గంనుండి ఎన్నికయినారు.

అహమ్మద్ మొహియుద్దీన్ (కాంగ్రెసు) జననం: 1898. పట్టభద్రులు. నిజామ్ కళాశాలలో అర్థశాస్త్రోపన్యాసకులుగా పని చేశారు. సెంట్రల్ ప్లానింగ్ కమీషన్‌లో సభ్యులు. నివాసం: హైదరాబాద్‌నగరం.

ఇబెనీజర్, యస్. ఎ. డా॥ (కాంగ్రెసు) జననం: 1899 నవంబరు 18. వైద్య విద్య నభ్యసించారు. క్రైస్తవ విద్యార్థి సమాజానికి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. నివాసం: వికారాబాద్.

కృష్ణన్, యం. ఆర్. (పి. ఫ్.) జననం: 1924. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నారు. అఖిలభారత మెడికల్‌స్టూడెంట్సు ఫెడరేషన్ మాజీ కార్యదర్శి. హైదరాబాదు శాఖకు కార్యదర్శి. నివాసం: కరీంనగరం(కిజయ్యారు).

జనార్ధనరెడ్డి ఇ. (కాంగ్రెసు) జననం: 1917 ఏప్రిల్ 25. బి. ఎ. వరకు చదువుకున్నారు. 1938 వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్నారు. 1940 నుండి కాంగ్రెసులో పని చేస్తున్నారు. నివాసం: మహబూబ్‌నగరం.

శ్రీ జయసూర్య నాయుడు ముత్యాల (ఫ్రంట్) డా॥ శ్రీమతి సరోజినీనాయుడు కుమారుడు. జననం: 1899 సెప్టెంబరు 26. దేశ, విదేశ వైద్య పట్టాలుపొందారు. నివాసం: మెదకు.

నారాయణరెడ్డి, రావి (ఫ్రంట్) జననం: అత్రాఫ్‌బల్దాజిల్లా బొల్లేపల్లిలో. కాంగ్రెసు సత్యాగ్రహంలో పాల్గొన్నారు. తెలంగాణా ఆంధ్ర మహాసభ నిర్మాతలలో ఒకరు. మూడుసార్లు ఆంధ్ర మహాసభ అధ్యక్షులుగా ఎన్నికయినారు. రజాకారు వ్యతిరేకోద్యమానికి నాయకత్వం వహించిన అగ్రనాయకులలో ఒకరు. ఇప్పుడు భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సభ్యులు. నల్లగొండ (జనరల్) నియోజకవర్గంనుండి పార్లమెంటుకు ఎన్నికయినారు. దేశంలో మరేసభ్యునికీ, వీరికి పోలయినన్ని ఓట్లు పోలు గాలేదు.

ప్రసాద్ వీరమాచనేని (ఫ్రంట్) ఆంధ్ర యువజనోద్యమంలో విశేషకృషి చేశారు. 1946 లో తెలంగాణాలో ప్రారంభమైన రజాకారు వ్యతిరేకోద్యమంలో పనిచేస్తూ, ప్రజాభిమానాన్ని చూరగొన్నారు. 1951 లో వరంగల్లుజిల్లా కమిటీ కార్యదర్శిగా ఎన్నికయినారు. 1954 మార్చిలో రాజ్యసభకు ఎన్నికయినారు.

శ్రీ మాధవరెడ్డి, సి. (సోషలిస్టు) జననం: 1924. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.ఎ. చదివారు. ప్రభుత్వోద్యోగానికి రాజీనామాపెట్టి సోషలిస్టు పార్టీలో చేరారు. హైదరాబాద్ స్టేట్ సోషలిస్టుపార్టీ కార్యవర్గ సభ్యులు.

యల్లారెడ్డి బద్దం (ఫ్రంట్) తెలంగాణా ఆంధ్రమహాసభ నిర్మాతలలో ఒకరు. అనేక సంవత్సరాలు కార్యదర్శిగాను, అధ్యక్షులుగానుపని చేశారు. రజాకారు వ్యతిరేకోద్యమం నడిపిన అగ్రనాయకులలో ఒకరు. ఇప్పుడు తెలంగాణా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా పని చేస్తున్నారు. కరీంనగరం (జనరల్) నియోజకవర్గంనుండి పార్లమెంటుకు ఎన్నికయినారు.

శ్రీ రాఘవరావు పెండ్యాల (ఫ్రంట్) జననం : 1917. 1938 లో స్టేట్ కాంగ్రెసు సత్యాగ్రహంలో ఒక దళానికి నాయకత్వం వహించారు. పదున్నర సం॥ల జైలుశిక్ష, తరువాత ఆంధ్రమహాసభలో పనిచేశారు. రజాకారు వ్యతిరేకోద్యమంలో ప్రముఖపాత్ర వహించారు. 1951 లో అరెస్టయ్యారు. నియో : వరంగల్లు.

రామస్వామి, —— (కాంగ్రెసు) జననం : 1902 డిశంబరు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసు స్థాపకులు, అధ్యక్షులు. హైదరాబాదు జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు స్థాపకులు.

రాజబహదూర్ గౌడ్ (ఫ్రంట్) తెలంగాణా అగ్రనాయకులలో ఒకరు. మంచివక్త. వైద్య విద్యలో పట్టభద్రులు. మొదట డెమొక్రటిక్ యూత్ లీగ్‌లో పనిచేస్తూ క్రమంగా కమ్యూనిస్టు పార్టీవైపు ఆకర్షింపబడ్డారు. హైదరాబాదు ట్రేడ్‌యూనియన్ ఉద్యమ నిర్మాతలలో ఒకరు. అఖిల హైదరాబాదు ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు వీరు కార్యదర్శి. తెలంగాణా ఉద్యమ కాలంలో అరెస్టు చేయబడి రాజ్యసభకు ఎన్నికయినతర్వాత విడుదల చేయబడ్డారు. తెలంగాణా కమ్యూనిస్టు కమిటీ సెక్రటేరియట్ సభ్యులు.

శ్రీ విఠల్‌రావు టి. బి. (ఫ్రంట్) జననం : 1915 ఆగస్టు 15. 1943 నుండి 49 వరకు నైజాం స్టేట్ రైల్వే ఉద్యోగుల సంఘ హైదరాబాద్ శాఖకు ఆర్గనైజింగు కార్యదర్శిగా పనిచేశారు. 1949 లో అరెస్టు చేయబడి 1951 లో విడుదలచేయబడ్డారు. నియో : ఖమ్మం.

శ్రీ సాదత్ అలీఖాన్ (కాంగ్రెసు) జననం : 1916 సెప్టెంబరు. ఆంగ్లభాషలోను, ఉర్దూలోను కవిత్వం చేస్తారు. నియో : ఇబ్రహీంపట్నం.

హరిశ్చంద్ర హెడా (కాంగ్రెసు) జననం: 1912 అక్టోబరు 14. బి. ఎ., యల్. యల్. బి. పట్టాను పొందారు. 1930 సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 1942 లో డిటెయిన్ చేయబడ్డారు. 1950-52 మధ్య పార్లమెంటు సభ్యులు. నియో: నిజామాబాద్.

1954 మార్చిలో రాజ్యసభకు జరిగిన ఎన్నికలలో శ్రీయుతులు రఘు జాగీర్దార్ (కాంగ్రెసు), అక్బర్ అలీఖాన్ (కాంగ్రెసు) నరసింగరావు (యునైటెడ్ పీపుల్సుపార్టీ) గార్లు గెలుపొందారు.



# పి. నరసింహారావు, యం. గోపాలకృష్ణరావు

కమీషన్ ఏజంట్లు :

చోటాలాల్ బిల్డింగు : 418, కల్బాదేవిరోడ్ : బొంబాయి-2



తంతి : 'SAIBHAKTA' టెలిఫోన్ : 2598

అనేక సంవత్సరాలుగా అందరి ఖాతాదారుల మన్ననలపొంది వ్యాపార సంస్థ. అన్ని మిల్లుల బట్టలు, సిల్కులు, ప్రింటు చీరలు మొదలైె అన్నిరకముల ఫ్యాన్సీ రకములు, సరసమైన ధరలకు ఆంధ్రదేశంలో అన్నిముఖ్య కేంద్రాలలోని వ్యాపారస్తులకు సప్లయిచేయు కమీష దారులు.

బొంబాయిలో మీకు నమ్మకముగా, సమర్థంగా, ఎటువం వ్యాపార విషయములోనైనను సంప్రతించుటకు మాకు వ్రాయండి.

# D. NARASIMHA RAO, M. GOPALAKRISHNA RAO

*Commission Agents :*

**2ND FLOOR, CHHOTALAL BUILDING,**

**418, Kalbadevi Road, BOMBAY-2.**

అన్ని రకముల

# ప్రింటింగు

# బైండింగు

# పనులకు



# సాహితీ ప్రెస్

ఈశ్వరరావుస్ట్రీట్, గవర్నరుపేట,

**విజయవాడ-2**

# నటన

# తండ్రులూ -

# కొడుకులూ

మొ॥ ఉత్తమ గ్రంధాలకు

# సాహితీ పబ్లికేషన్సు

ఈశ్వరరావుస్ట్రీట్, గవర్నరుపేట

**విజయవాడ-2**